సత్యమేవ జయతే

# సాక్షి


'స్వచ్ఛమైన రక్షిత జలాలను అందిస్తేనే గోండు, చెంచు, ఆదివాసి గిరిజనులు ఆరోగ్యంగా ఉంటారు.'

WWW.SAKSHI.COM

పేజీలు: 14+4+16 వెల: ₹ 5.00

సంపుటి: 10
సంచిక: 253

సోమవారం 4-12-2017

SIMULTANEOUSLY PRINTED AT KADAPA | VIJAYAWADA | HYDERABAD | BANGALORE | CHENNAI | DELHI | MUMBAI | ANANTAPUR | GUNTUR | KHAMMAM | KARIMNAGAR | KURNOOL | MAHABOOBNAGAR | MANGALAGIRI | NALGONDA | NELLORE | NIZAMABAD | ONGOLE | RAJAHMUNDRY | SRIKAKULAM | TADEPALLI GUDEM | TIRUPATHI | VISAKHAPATNAM | WARANGAL

## కేంద్ర బడ్జెట్ ఫిబ్రవరి 1న



జనవరి 30న ఉభయ సభల్ని ఉద్దేశించి రాష్ట్రపతి ప్రసంగం
జీఎస్టీ అనంతరం తొలి బడ్జెట్ కావడంతో ఆసక్తి
ఎన్డీఏ ప్రభుత్వానికి ఇదే చివరి పూర్తిస్థాయి బడ్జెట్

8లో



## కోహ్లి 'డబుల్' సిక్సర్

శ్రీలంకపై వరుసగా రెండో డబుల్ సెంచరీ
కెప్టెన్‌గా ఆరో ద్విశతకం

- స్పోర్ట్స్‌లో..

## సూపర్ మూన్



ఇజ్రాయెల్‌లోని నెతన్యాలో ఆదివారం కనిపించిన 'సూపర్ మూన్'. ఈ ఏడాది ఒకే సారి సంభవించిన ఈ దృగ్విషయం ప్రపంచ వ్యాప్తంగా పలు దేశాల్లో కనువిందు చేసింది. ఈ సమయంలో భూమికి సమీపంగా రావడం వల్ల చంద్రుడి పరిమాణం 7%, ప్రకాశించే గుణం 15% పెరుగుతాయి. అయితే ఈ మార్పులను నేరుగా మన కంటితో గమనించలేం.

# రైతన్న కోసం.. వైఎస్సార్ బీమా

### రైతులతో ముఖాముఖిలో ప్రతిపక్ష నేత వైఎస్ జగన్ హామీ


రైతులతో ముఖాముఖిలో అభివాదం చేస్తున్న ప్రతిపక్ష నేత వైఎస్ జగన్

- ఆత్మహత్యలు చేసుకున్న రైతు కుటుంబాలకు అండగా..
- తక్షణమే రూ.5 లక్షల ఆర్థిక సహాయం
- అప్పులిచ్చినవారు ఆ కుటుంబాలను పీడించకుండా చట్టం
- రూ.3వేల కోట్లతో ధరల స్థిరీకరణ నిధి
- రూ.4వేల కోట్లతో వైపరీత్యాల సహాయ నిధి
- ప్రతిఏటా మేలో రైతు భరోసా కింద రూ.12,500
- కల్తీవిత్తనాలు, కల్తీ పురుగుమందుల నిరోధానికి చట్టం
- హెరిటేజ్ లాభాలపైనే దళారీ సీఎం చంద్రబాబు దృష్టి
- పోలవరం పూర్తి చేస్తేనే రాయలసీమకు మేలుజరిగేది
- కర్నూలు జిల్లాలో పూర్తయిన ప్రజాసంకల్పయాత్ర

ప్రజా సంకల్పం నుంచి సాక్షి ప్రత్యేక ప్రతినిధి: వైఎస్సార్ కాంగ్రెస్ పార్టీ అధికారంలోకి వచ్చిన తర్వాత రైతుల కోసం ప్రత్యేక బీమా పథకాన్ని ప్రవేశపెడతామని ప్రతిపక్ష నేత వైఎస్ జగన్‌మోహన్ రెడ్డి ప్రకటించారు. ఆత్మహత్య చేసుకున్న రైతుల కుటుంబాలకు ఈ పథకం కింద తక్షణమే రూ 5 లక్షలు ఆర్థిక సహాయం అందేలా ఈ బీమా పథకాన్ని రూపకల్పన చేస్తామన్నారు. ప్రజా సంకల్ప పాదయాత్రలో భాగంగా ఆదివారం ఆయన కర్నూలు జిల్లా పత్తికొండ నియోజకవర్గంలో పర్యటిస్తూ తుగ్గలి మండలం ఎర్రగుడి శివారులో రైతులతో జరిగిన ముఖాముఖిలో పాల్గొన్నారు. కర్నూలు, అనంతపురం జిల్లాల నుంచి భారీగా తరలివచ్చిన రైతులు మెడలో ఆకుపచ్చ కండువాలను ధరించి హాజరయ్యారు. ఈ సందర్భంగా ఓ రైతు అడిగిన

మిగతా 2వ పేజీలో ▶

## జననేతకు బ్రహ్మరథం

అడుగులో అడుగేసిన లక్షలాది మంది
కర్నూలు జిల్లాలో ప్రజా సంకల్ప యాత్ర విజయవంతం

- ప్రతిపక్ష నేతకు అడుగడుగునా సమస్యలు నివేదించిన ప్రజలు
- సావధానంగా విన్న జగన్.. సమస్యల పరిష్కారానికి హామీ
- 18 రోజుల్లో 263 కిలోమీటర్లు సాగిన పాదయాత్ర
- 7 నియోజకవర్గాలు, 14 మండలాలు, 66 గ్రామాల్లో జనంతో మమేకం

6లో



### పార్టీ ఎన్నికల్లోనూ
## రిగ్గింగేనా?

- ఏఐసీసీ అధ్యక్ష పదవికి రాహుల్ ఎన్నికపై మోదీ ఎద్దేవా
- కులమతాల మధ్య చిచ్చుపెట్టేది కాంగ్రెస్సే
- బుల్లెట్ రైలు ఇష్టం లేకుంటే ఎద్దులబండిపై తిరగొచ్చు
- రాహుల్‌ను ఆ పార్టీ నేతలే బహిష్కరించారు
- గుజరాత్ ఎన్నికల సభల్లో ప్రధానమంత్రి విసుర్లు

8లో



8లో

## ఆలస్యమైంది.. మన్నించండి!

ఓ కేసు విచారణ ఆలస్యం కావడంతో కక్షిదారుకు సుప్రీంకోర్టు క్షమాపణ



### పోలవరంపై విచారణ జరిపితే
## బాబు జైలుకే

- 'మీట్ ది ప్రెస్'లో మాజీ ఎంపీ ఉండవల్లి అరుణ్‌కుమార్
- చంద్రబాబు ప్రభుత్వ అవినీతే పోలవరం ప్రాజెక్టుకు శాపం
- పేపర్లో ఒకలా, వెబ్‌సైట్‌లో మరోలా టెండర్ వివరాలిచ్చారు
- కమిషన్ చైర్మన్ నివేదిక లేకుండా కాపు రిజర్వేషన్లపై నిర్ణయం చెల్లదు

5లో

### మహేంద్ర తనయకు
## ఒకే టెండర్

షెడ్యూళ్ల దాఖలుకు నేడే తుది గడువు

- ఓ మంత్రి హెచ్చరికలతో ఒకే ఒక టెండర్ దాఖలు
- శ్రీకాకుళం జిల్లాలో కీలక మంత్రితో చేతులు కలిపిన అధికార పార్టీ ఎంపీ
- ఎత్తిపోతలలో నజరానాగా రూ.50 కోట్లు ఇచ్చే ఒప్పందం

7లో

## అమ్మ కాదు.. రాతి బొమ్మ

ప్రియుడి మోజులో పడి నాలుగేళ్ల చిన్నారిని కాలుతున్న పెనంపై కూర్చోబెట్టిన తల్లి

- తీవ్రంగా గాయపడిన పాప.. ప్రమాదవశాత్తూ కాలిందంటూ తల్లి బుకాయింపు
- పోలీసులు పాపను బుజ్జగించి ఆరా తీయడంతో వెలుగుచూసిన దారుణం
- మరో ఘటనలో రెండో భార్య కూతురిపై మారుతండ్రి అఘాయిత్యం
- హైదరాబాద్‌లో వెలుగులోకి ఘటనలు

7లో


తీవ్రగాయాలతో చిన్నారి రూప




## ఇదం జగత్



నెక్స్ట్ ఏఐసీసీ ప్రెసిడెంట్ అవుతారో లేదో అడగండి సార్!!

# నీట్‌గా నొక్కేస్తున్నారు!

### విలువైన ప్రభుత్వ స్థలాలు 'నిషేధిత' జాబితాలో మాయం

- పక్కాగా పీవోబీ జాబితా గుర్తించాలని 2015లో హైకోర్టు ఆదేశం
- ఇప్పటికీ పట్టించుకోని రాష్ట్ర ప్రభుత్వం
- ఇదే అదనుగా కోట్ల విలువైన భూములను అమ్ముకుంటున్న 'పెద్దలు'
- మరోవైపు సర్కారు ఖాతాలోనే ప్రైవేటు భూములు
- రెవెన్యూ అధికారుల తప్పులతో లబోదిబోమంటున్న హక్కుదారులు
- అవసరానికి సొంత ఆస్తులను అమ్ముకోలేక తీవ్ర ఇబ్బందులు



సాక్షి, అమరావతి: ప్రభుత్వ నిర్లక్ష్యం, రెవెన్యూ అధికారుల నిర్వాకం వల్ల రాష్ట్రవ్యాప్తంగా అత్యంత విలువైన ప్రభుత్వ భూములు ప్రైవేట్ వ్యక్తుల చేతుల్లోకి వెళ్లిపోతున్నాయి. ప్రభుత్వ అవసరాల కోసం సేకరించిన భూమిని రికార్డుల్లో మార్చక పోవడంతో నిషేధిత ఆస్తులను కొంతమంది నీట్‌గా కాజేస్తున్నారు. క్రయ విక్రయ లావాదేవీలకు వీలులేని భూములు, స్థలాలు నిషేధిత ఆస్తుల (ప్రొహిబిటెడ్ ఆర్డర్ బుక్ – పీవోబీ) జాబితా నుంచి మాయమవడం దీనికి కారణం. తిరుపతి, విశాఖపట్నం, కర్నూలు, నెల్లూరు, గుంటూరు లాంటి నగరాల్లో వందల కోట్ల విలువైన ప్రభుత్వ భూములు, వివిధ జిల్లాల్లోని గ్రామాల్లో రెవెన్యూ, గ్రామకంఠాలు, దేవాదాయ, మఠాల ఆస్తులు, చెరువులు చేతులు మారిపోతున్నాయి. పీవోబీ జాబితాను పక్కాగా రూపొందించి రిజిస్ట్రేషన్ శాఖకు అందించాలని హైకోర్టు ఆదేశించిన గడువు దాటి ఏడాదిన్నర అయినా

మిగతా 7వ పేజీలో ▶










ఆదివారం కర్నూలు జిల్లా ఎర్రగుడి శివారులో రైతులతో ముఖాముఖిలో ప్రసంగిస్తున్న ప్రతిపక్షనేత వైఎస్ జగన్‌మోహన్ రెడ్డి. పక్క చిత్రంలో పార్టీ రైతు విభాగం అధ్యక్షుడు నాగిరెడ్డి, పీఏసీ చైర్మన్ బుగ్గన రాజేంద్రనాథ్‌రెడ్డి, ఎమ్మెల్సీ గంగుల ప్రభాకర్‌రెడ్డి, పార్టీ నేతలు శిల్పా మోహన్ రెడ్డి, అనంత వెంకట్రామిరెడ్డి, ఎమ్మెల్యేలు జయరాములు, గౌరు చరితా రెడ్డి, ఎమ్మెల్సీ గోపాల్‌రెడ్డి, పార్టీ నేతలు బీవై రామయ్య, శిల్పా చక్రపాణిరెడ్డి, తోపుదుర్తి భాస్కర్‌రెడ్డి, ఎమ్మెల్యే సాయిప్రసాద్‌రెడ్డి, మాజీ ఎమ్మెల్యే రామిరెడ్డి, ఎమ్మెల్యే ఐజయ్య తదితరులు

# రైతన్న కోసం.. వైఎస్సార్ బీమా

▶ మొదటి పేజీ తరువాయి

ప్రశ్నకు జగన్ సమాధానమిస్తూ... ''వైఎస్సార్ కాంగ్రెస్ పార్టీ అధికారంలోకి వచ్చిన తరువాత ఎక్కడైనా ఒక రైతు ఆత్మహత్య చేసుకుంటే ఆ కుటుంబానికి నేరుగా రూ.5 లక్షలు ప్రభుత్వ సహాయంగా బీమా పథకం కింద అందజేస్తాం'' అని జగన్ వివరించారు. ఆయన ఇంకేమన్నారంటే..

## అప్పులిచ్చినవారు పీడించకుండా చట్టం

''రైతుల కోసం మనందరి ప్రభుత్వం తీసుకువచ్చే బీమా పథకం ప్రస్తుతం టీడీపీ ప్రభుత్వం అమలు చేస్తున్న చంద్రన్న బీమా పథకంలాంటిది కాదిది. ప్రస్తుతం అమలులో ఉన్న బీమా పథకం ప్రకారం ప్రభుత్వం ఇచ్చే రూ.5 లక్షలు బాధితుడి కుటుంబానికి ఇవ్వడం లేదు. అందులోంచి రూ.1.50 లక్షలను మరణించిన రైతు చేసిన అప్పులు చెల్లించడానికి స్థానిక డీఎస్‌పీకి ఇస్తారు. మిగతా రూ.3.50 లక్షలు మొత్తాన్ని కూడా చేతికి ఇవ్వడం లేదు. ఆ మొత్తాన్ని బ్యాంకులో తహశీల్దారు, మరణించిన కుటుంబం ఉమ్మడి ఖాతాలో డిపాజిట్ చేస్తున్నారు. ఆ మొత్తం నుంచి ప్రతి ఏటా వచ్చే రూ.35 వేలు వడ్డీని ఆ కుటుంబానికి ఇస్తున్నారు. ఇలా పదేళ్లు ఇస్తారు. ఇక ఆ రైతు కుటుంబానికి ప్రభుత్వం చేసిన మేలేమిటి..? వారికి అందిన సాయం ఏమిటి..? కానీ మనందరి ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తరువాత ఎక్కడైనా ఒక రైతు ఆత్మహత్య చేసుకుంటే అప్పుల వారెవరూ కూడా వచ్చి ఆ కుటుంబాన్ని పీడించే పరిస్థితి లేకుండా చేస్తానని భరోసా ఇస్తున్నాను. ఆమేరకు పకడ్బందీగా చట్టాన్ని తీసుకువస్తాం. ఆ కుటుంబానికి చెందాల్సిన రూ.5 లక్షలు వారి చేతికి అందజేస్తాం. దాంతో ఆ కుటుంబం నిలదొక్కుకుని జీవనం సాగించే అవకాశం ఉంది. అప్పుల బాధ తాళలేక మరణించిన రైతు ఆత్మ పైనుంచి చూస్తున్నప్పుడు తన కుటుంబాన్ని అప్పుల వాళ్లు వేధిస్తుంటే ఘోషిస్తుంది కదా..! నేను ఆ పరిస్థితి లేకుండా చేస్తా. అప్పుల వారెవ్వరూ ఆ కుటుంబం వైపు తలెత్తి చూసే పరిస్థితి లేకుండా చట్టాన్ని తెస్తాం.

## చంద్రబాబు చెబుతున్న అభివృద్ధి అంతా డొల్ల

రాష్ట్ర అభివృద్ధి విషయంలో ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు పూర్తిగా వాస్తవాలను వక్రీకరిస్తున్నారు. చెప్పిన అబద్ధాలనే మళ్లీ మళ్లీ చెబుతూ వాటిని నిజాలుగా నమ్మించే విధంగా గోబెల్స్ ప్రచారం చేస్తున్నారు. రాష్ట్రంలో జీడీపీ, జీఎస్‌డీపీ విషయంలో అన్నీ అబద్ధాలే చెబుతున్నారు. తప్పులు చేస్తూ అబద్ధాలు చెబుతూ వాటిని కప్పిపుచ్చుకునేందుకు మళ్లీ మరిన్ని అబద్ధాలు చెబుతూ ప్రజలను మోసం చేస్తున్నారు. ఎన్నికలకు ముందు రూ.87,612 కోట్లుగా ఉన్న రైతుల రుణాలను బేషరతుగా మాఫీ చేస్తానని రైతులకు హామీ ఇచ్చి వారిని మోసగించారు. బ్యాంకుల్లో బంగారం ఇంటికి తెప్పిస్తానని చెప్పి మాట తప్పారు. రైతులందరినీ ఒక్కసారి ఆలోచించమని విజ్ఞప్తి చేస్తున్నాం... ఈ నాలుగేళ్ల పాలనలో మీకేమైనా ఒక్క మేలైనా జరిగిందా..? మీ పరిస్థితులు ఏమైనా బాగుపడ్డాయా అని ప్రశ్నిస్తున్నా. రుణాలు రద్దు చేయకపోవడం వల్ల చంద్రబాబు పాలనలో రైతులు అప్పుల కోసం బ్యాంకుల గడప తొక్కలేని పరిస్థితులు తలెత్తాయి. రుణాల మాఫీ మాట దేవుడెరుగు, ఆయన ఇచ్చిన మొత్తం రుణంపై వడ్డీలకే సరిపోలేదు. ప్రతి ఏటా వ్యవసాయ రంగానికి ఇన్ని కోట్ల రుణం మంజూరు చేయాలని బ్యాంకులకు లక్ష్యాలు ఉంటాయి. ఈ నాలుగేళ్లలో నిర్దేశిత లక్ష్యాల కన్నా తక్కువగా రుణాలు బ్యాంకులు ఇస్తున్నాయి.. దీని వల్ల పంటల విస్తీర్ణం రాష్ట్రంలో తగ్గిపోయింది. ఉత్పత్తి తగ్గింది. వాస్తవం ఇలా ఉంటే ముఖ్యమంత్రి పూర్తిగా వక్రీకరిస్తూ వ్యవసాయ రంగంలో 14 శాతం అభివృద్ధి సాధించినట్లు చెప్పుకుంటున్నారు. మన రాష్ట్రం 12 శాతం మేరకు జీడీపీ, జీఎస్‌డీపీతో అగ్రగామిగా ఉందని చెబుతున్నారు. 2022 నాటికి దేశంలోనే నెంబర్ వన్ చేస్తానని, 2029 నాటికి ప్రపంచంలోనే నంబర్‌వన్ చేస్తానని 2050 నాటికి ఇంకా ఏమేమో సాధిస్తానని చెప్పుకుంటున్నారు. అభివృద్ధి చెందిన దేశాలైన అమెరికా, యూకే, ఫ్రాన్స్, యూరప్ దేశాల జీడీపీ రేటు 3 శాతంగా ఉంది. పొరుగునే ఉన్న చైనా వృద్ధి రేటు 6.5 శాతంగా ఉంది. మన దేశం సాధించిన అభివృద్ధి రేటు 7.2 శాతంగా ఉంది. మరి మన రాష్ట్రంలో నిజంగా 12 శాతం వృద్ధి రేటు ఉంటే ఇక నంబర్ వన్ కావడానికి 2029 వరకు ఆగాల్సిన అవసరం ఏముందని చంద్రబాబుని ప్రశ్నిస్తున్నా... ఇప్పటికే ఏపీ నెంబర్‌వన్ అయిపోయినట్లే కదా..! ఇవన్నీ చూస్తుంటే చంద్రబాబుకు ఇంగిత జ్ఞానం లేదనడానికి నిదర్శనం వేరేమైనా ఉందా...



చెరువు తండా వద్ద లంబాడీ మహిళతో కలసి నృత్యం చేస్తున్న వైఎస్ జగన్

## కేబినెట్ పెడతారు కానీ కరువు మండలాలపై నిర్ణయం తీసుకోరు

రాయలసీమ జిల్లాల్లో వర్షాభావ పరిస్థితులు నెలకొన్నాయి. రాయలసీమ మొత్తం మీద ఈ ఏడాది ఆగస్టు 9వ తేది దాకా పరిశీలిస్తే 22 శాతం సాధారణ వర్షపాతం కంటే తక్కువగా ఉంది. రేపు (సోమవారం) నేను వెళ్లబోయే అనంతపురం జిల్లాలో అయితే 32 శాతం వర్షపాతం తక్కువగా ఉంది. కానీ చంద్రబాబు పట్టించుకోరు. రాష్ట్ర మంత్రి వర్గ సమావేశాలు పెడతారు కానీ, కరువు మండలాల ప్రకటనపై మాత్రం నిర్ణయం తీసుకోరు. ఇన్‌పుట్ సబ్సిడీలు కూడా ఎగ్గొట్టే కార్యక్రమం చేస్తుంటారు. పైగా ఏ పంటకూ గిట్టుబాటు ధర ఉండదు. కంది, మినుము, పత్తి, పెసర, మిర్చి చివరకు పేరుమోసిన కర్నూలు సోనామసూరీకి కూడా ధర లేదు. ముఖ్యమంత్రి స్వయంగా తానే దళారులతో కుమ్మక్కయి పోయి రైతులకు అన్యాయం చేస్తున్నారు. రైతులను దళారీలకు అమ్మేస్తున్నారు. చంద్రబాబు యాజమాన్యంలోని హెరిటేజ్ షాపులు ప్రతి నియోజకవర్గంలోనూ ఉన్నాయి. తనకు ఎక్కువ లాభాలు రావాలి కాబట్టి దళారులు, తాను ఒక్కటై రైతుల నుంచి తక్కువ ధరలకు పప్పులు, ధాన్యం, కూరగాయలు కొనుగోలు చేస్తారు. వాటిని ప్యాకింగ్ చేసి తన హెరిటేజ్‌లో ఎక్కువ ధరలకు అమ్ముతారు. రైతుల నుంచి కేజీ రూ.5కు కొనుగోలు చేసిన టమాటాలను హెరిటేజ్‌లో రూ.50 చొప్పున అమ్ముతున్నారు. నాలుగేళ్లుగా ఇదే జరుగుతోంది. అందుకే చంద్రబాబు ముఖ్యమంత్రి అయ్యాక రైతులకు నిజంగా మేలు జరిగిందా? కీడు జరిగిందా? అనేది ఆలోచించాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

## పోలవరం పూర్తి చేస్తే...

పట్టిసీమలో ఓ చెంబు నీళ్లు పోసి రాయలసీమకు మేలు జరిగిందని చంద్రబాబు చెబుతున్నారు. ఎలా మేలు జరిగిందని నేను ప్రశ్నిస్తున్నా. రాయలసీమకు ప్రయోజనం జరిగేది పోలవరం ప్రాజెక్టును పూర్తి చేసినప్పుడే. వాస్తవానికి పోలవరం నుంచి కృష్ణానదికి కలుపుతూ కాలువల నిర్మాణం చేసింది వైఎస్ రాజశేఖరరెడ్డి కాదా అని ప్రశ్నిస్తున్నా. చంద్రబాబు పోలవరం పూర్తి చేసి ఉంటే ఒక్క చెంబు కాదు ఒక చెరువు నీళ్లే ఏకంగా కృష్ణానదిలోకి పోసి ఉండవచ్చు. పట్టిసీమలో నీళ్లు పోసి ప్రకాశం బ్యారేజీ ద్వారా 50 టీఎంసీల నీటిని సముద్రంలో వదిలివేస్తున్నారు. పులిచింతల ప్రాజెక్టులో 45 టీఎంసీల నీరు అందుబాటులోకి రావడం లేదు. మన అందరి ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తరువాత వ్యవసాయానికి రోజూ 9 గంటల పాటు విద్యుత్ సరఫరా చేస్తాం. ప్రతి రైతుకూ ఏటా మే నెలలో రూ.12,500 రైతు భరోసా కింద (మొత్తం రూ.50 వేలు) ఇస్తాం. మార్కెట్‌లో దళారీల ప్రమేయం లేకుండా చేసేందుకు రూ.3వేల కోట్లతో ధరల స్థిరీకరణ నిధిని ఏర్పాటు చేస్తాం. ధరల స్థిరీకరణ నిధి నిర్వహణకు సంబంధించిన బాధ్యతలను రాష్ట్ర పార్టీ రైతు విభాగం అధ్యక్షుడు నాగిరెడ్డికి అప్పగిస్తాం. ప్రతి పంటకు ముందే గిట్టుబాటు ధరను ప్రకటిస్తాం. ఆ తర్వాత కచ్చితంగా ఆ ధరలకే వాటిని కొనుగోలు చేసేలా చేస్తాం. దీనికి తోడుగా రూ.2వేల కోట్లతో ప్రకృతి వైపరీత్యాల సహాయ నిధిని ఏర్పాటు చేస్తాం. దానికి తోడుగా కేంద్ర ప్రభుత్వం ఇచ్చే మరో రూ.2వేల కోట్లను జత చేసి మొత్తం రూ.4వేల కోట్ల నిధిని నిర్వహిస్తాం. రాష్ట్రంలో సాగునీటి అవసరాలు తీరేలా పెండింగ్‌లో ఉన్న ప్రాజెక్టులన్నీ పూర్తి చేస్తాం.

## కల్తీ విత్తనాలు, మందులను అరికట్టడానికి సమగ్ర చట్టం

రాష్ట్రంలో రైతులకు తీవ్రంగా నష్టం కలిగిస్తున్న కల్తీ విత్తనాలు, కల్తీ పురుగు మందుల నిరోధానికి వైఎస్సార్ కాంగ్రెస్‌పార్టీ అధికారంలోకి వచ్చిన తరువాత సమగ్రమైన చట్టం తెస్తామని ప్రతిపక్ష నేత వైఎస్ జగన్‌మోహన్‌రెడ్డి ప్రకటించారు. వ్యవసాయాన్ని సంక్షోభంలోకి నెట్టివేసే ఇలాంటి చర్యలు అరికడతామని అన్నారు. ఆళ్లగడ్డకు చెందిన రామకృష్ణ అనే రైతు తమ నియోజకవర్గంలో కల్తీ విత్తనాల సరఫరా ఫలితంగా సుమారు 600 ఎకరాల్లో పంట నష్టపోయిందని, దీనిపై వ్యవసాయ శాఖ అధికారులు విచారణ జరపాల్సి ఉన్నా, మంత్రి అడ్డుకుంటున్నారని రైతు సమ్మేళనంలో జగన్ దృష్టికి తెచ్చారు. ''కల్తీ విత్తనాలు, కల్తీ పురుగు మందులు రాష్ట్రంలో చంద్రబాబు పాలనలో యథేచ్ఛగా సరఫరా అవుతున్నాయి. అయినా పట్టించుకోవడం లేదు. రైతులు ఫిర్యాదు చేస్తే కేసులు నమోదు చేయరు. కేసులు నమోదు అయినా దర్యాప్తు జరగడం లేదు. ఈ కల్తీ విత్తనాల వ్యవహారంలో సాక్షాత్తు శాసన సభ స్పీకర్ పేరే వినిపిస్తోంది. ఈ ఫిర్యాదులు మంత్రి వద్దకు వెళితే అవి బుట్టదాఖలవుతున్నాయి. కూపీ లాగితే మంత్రి ప్రత్తిపాటి పుల్లారావు, మరో మంత్రి లోకేశ్ ప్రమేయం కూడా ఉందని అంటున్నారు. రైతుల జీవితాలను సంక్షోభంలోకి నెట్టేస్తున్న ఈ రెండింటినీ పూర్తిగా కట్టడి చేయడానికి ఒక పక్కా పద్ధతిని అమలు చేసేందుకు సమగ్రమైన చట్టాన్ని తెస్తాం'' అని జగన్ పేర్కొన్నారు.

### శ్రీశైలంలో 855 అడుగుల మేర నీరు ఉంచాలి



రాయలసీమకు నీళ్లు రావాలంటే శ్రీశైలం రిజర్వాయర్‌లో ఖచ్చితంగా 855 అడుగుల మేరకు నీటి నిల్వలు ఉండేలా ప్రయత్నించాలి. కేసీ కెనాల్ కింద 3 కిలోమీటర్ల మేరకు దివంగత నేత వైఎస్ రాజశేఖరరెడ్డి లైనింగ్ వేయించారు. అప్పట్లో 3వేల క్యూసెక్కులు నీరు పారేది. ఇప్పుడు 1500 క్యూసెక్కులకు మించి రావడం కష్టంగా ఉంది. – అప్పిరెడ్డి, రైతు

### హంద్రీ-నీవా నీళ్లు వస్తే వైఎస్ ఫొటో ఇళ్లల్లో పెట్టుకుంటాం



హంద్రీ-నీవా నుంచి నీళ్లు వస్తే వైఎస్సార్ ఫొటోను ఇళ్లల్లో పెట్టుకుంటాం. ఆయన మాదిరే జగన్‌ను కూడా మా గుండెల్లో పెట్టుకుంటాం. వైఎస్సార్ పంచెకట్టుతో రైతుల గుండెల్లో గూడు కట్టుకున్నారు. అలాగే కొన్ని సందర్భాల్లోనైనా మీరూ పంచె కట్టుకోవాలి. (పంచెకట్టు సూచనపై జగన్ నవ్వుతూ కొద్దిగా వయసు పెరిగిన తర్వాత కట్టుకుంటానని అన్నారు.) – సుభాష్‌రెడ్డి, రైతు

### నెల నుంచి మంచినీళ్లు తాగలేని పరిస్థితి



తుంగభద్ర నీటిని పై నుంచి ఎత్తుకుపోతున్నారు. కర్నూలులో మేం నెల రోజుల నుంచి నీళ్లు తాగలేని పరిస్థితి. సమ్మర్ స్టోరేజి ట్యాంకు లేకపోవడమే ఇందుకు కారణం. వరదలప్పుడు మాత్రమే కేసీ కెనాల్‌కు నీళ్లు వస్తున్నాయి. తుంగభద్ర నుంచి ఆత్మకూరు వరకూ సమాంతర కాలువ తవ్వాలి. వరదనీటిని ఆ ప్రాంతంలో చెరువులకు మళ్లిస్తే సస్యశ్యామలమవుతుంది. – శివనాగిరెడ్డి, రైతు

### మా అమ్మ రుణం మాఫీ కాలేదు



మా తల్లిపేరుపై ఉన్న రూ.60 వేల రుణం ఇంత వరకూ మాఫీ కాలేదు. మీమీదే నమ్మకం పెట్టుకున్నాం. మీరు ముఖ్యమంత్రి అయ్యాక మాకు సాయ పడాలి. – వెంకటప్ప, రైతు

## శాడిస్ట్ వరుడు రాజేష్ సస్పెన్షన్

**చిత్తూరు ఎడ్యుకేషన్:** కట్టుకున్న భార్యను తొలిరాత్రే చిత్రహింసలకు గురిచేసిన చిత్తూరు జిల్లా గంగాధరనెల్లూరు మండలం మోతరంగనపల్లికి చెందిన ఉపాధ్యాయుడు రాజేష్‌ను ఉద్యోగం నుంచి సస్పెండ్ చేసినట్లు డీఈవో పాండురంగస్వామి ఆదివారం విలేకరుల సమావేశంలో తెలిపారు. పోలీస్‌స్టేషన్ నుంచి వచ్చిన ఎఫ్ఐఆర్ ఆధారంగా నిందితుడిని సస్పెండ్ చేస్తూ ఉత్తర్వులు జారీ చేశామన్నారు. ఈ మేరకు రాజేష్ పనిచేస్తున్న కుప్పం నియోజకవర్గంలోని వి.కోట మండలం అదినేపల్లి ప్రాథమిక పాఠశాలకు ఉత్తర్వులు పంపామని డీఈఓ చెప్పారు. కాగా, రాజేష్‌ను ఆదివారం అరెస్టు చేసి రిమాండ్‌కు తరలించినట్లు సీఐ చంద్రశేఖర్ తెలిపారు. బాధితురాలు శైలజ తల్లిదండ్రులు ఇచ్చిన ఫిర్యాదు మేరకు నిందితుడిపై ఐపీసీ 307, 420, 324 సెక్షన్ల కింద కేసు నమోదు చేశామన్నారు. శైలజను మెరుగైన చికిత్స నిమిత్తం చిత్తూరు ప్రభుత్వాస్పత్రి నుంచి తిరుపతి స్విమ్స్‌కు తరలించినట్లు చెప్పారు.

## ఉద్యోగం రాలేదని ఉసురు తీసుకున్న ఇంజనీరు

**కొత్తవలస (విజయనగరం):** ఉద్యోగం రాలేదని విజయనగరం జిల్లా కొత్తవలసలో ఆదివారం ఒక ఇంజనీరు ప్రాణాలు తీసుకున్నాడు. ఏడాదిగా ఖాళీగా ఉంటున్న అతడు ఆత్మన్యూనతతో ఉరేసుకుని ఆత్మహత్య చేసుకున్నాడు. కొత్తవలస హెచ్‌సీ ఎ.రహమాన్ తెలిపిన వివరాల ప్రకారం.. స్థానిక రాజీవ్‌నగర్ కాలనీలో నివసిస్తున్న జి.వెంకట చిరంజీవి (22) బీటెక్ పూర్తిచేశాడు. ఎన్ని ప్రయత్నాలు చేసినా ఏడాదిగా ఉద్యోగం రాలేదు. ఈ విషయమై ఆవేదన చెందుతున్న అతడు ఇంట్లో ఎవరూ లేని సమయంలో సూసైడ్ నోట్ రాసి ఫ్యాన్‌కు ఉరేసుకున్నాడు. తన చావుకు ఎవరూ కారణం కాదని సూసైడ్ నోట్‌లో పేర్కొన్నాడు. అందొచ్చిన కుమారుడు ఆత్మహత్య చేసుకోవడంతో తల్లిదండ్రులు కన్నీరుమున్నీరుగా విలపిస్తున్నారు.

**ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము**
**జలవనరుల శాఖ**
**పర్యవేక్షక ఇంజనీరు వారి కార్యాలయము**
**యన్.టి.ఆర్.తెలుగు గంగ పథకము, కడప.**
**ఇ ప్రొక్యూర్మెంట్ టెండర్ నోటీసు నెం. 3/2017-18, తేది : 28-11-2017**

పనిపేరు : కడప జిల్లా - మైదుకూరు మండలము - తెలుగు గంగ ప్రాజెక్ట్ ప్రధాన కాలువు కి.మీ 136.057 నుండి తువ్వపల్లి చెరువుకు పీడరు చానల్ త్రవ్వకము మరియు క్రాస్ మేసనరి, క్రాస్ డ్రైనేజి పనులు నిర్మించుట గురించి (మిగులు పని). 1) పని అంచనా విలువు : 5,35,59,194/-, 2) EMD : 5,35,592/- 3) పని పూర్తి చేయవలసిన కాలం : 12 నెలలు, 4) కాంట్రాక్టు తరగతి : క్లాసు-1 కాంట్రాక్టర్ (సివిల్) ఆపైన, 5) టెండరు నకలు అంతర్జాలము ద్వారా లభ్యమగు తేది : 04.12.2017న ఉదయము గం॥ 11.30 ల నుండి., 18.12.2017న సాయంత్రము గం॥ 2.00 ల వరకు. 6) టెండరు నకలు అంతర్జాలము ద్వారా స్వీకరించు చివరి తేది : 18.12.2017న సాయంత్రము గం॥ 2.30 ల వరకు. 7) టెక్నికల్ బిడ్ తెరుచు తేది మరియు సమయం : 19.12.2017న సాయంత్రము 3.00 గంటలకు. 8) ప్రైస్ బిడ్ తెరుచు తేది మరియు సమయం : 28.12.2017న ఉదయం 11.00 గంటలకు. 9) టెండర్లు ఆహ్వానించు అధికారిని పేరు మరియు అడ్రసు : శ్రీమతి ఓ.శారద, M.Tech., పర్యవేక్షక ఇంజనీరు, యన్.టి.ఆర్. తెలుగు గంగ పథకము, కడప.
గమనిక : టెండరు తేదిలలో మార్పులు, చేర్పులు మరియు సవరణలు వగైరాలు www.apeprocurement.gov.in అను website నందు చూడగలరు.
Sd/- ఓ.శారద, పర్యవేక్షక ఇంజనీరు,
యన్.టి.ఆర్. తెలుగు గంగ పథకము, కడప.

# కొంటే... ప్రైవేటు విద్యుత్తే కొనాలి!

### ప్రైవేట్ విద్యుత్‌పై సర్కారు మక్కువ

- మరో 4,630 మిలియన్ యూనిట్ల కొనుగోలుకు సిద్ధం
- ఏపీఈఆర్‌సీకి సమర్పించిన ఏఆర్ఆర్‌లో డిస్కంల స్పష్టీకరణ
- ఇందులో పవన విద్యుత్‌దే సింహభాగం
- ఏమాత్రం అవసరం లేకపోయినా కొనుగోలు
- బహిరంగ మార్కెట్లో లాభానికి అమ్ముతామంటున్న వైనం
- ఎవరు కొంటారో చెప్పని విద్యుత్ సంస్థలు

**సాక్షి, అమరావతి:** ఏమాత్రం అవసరం లేకపోయినా ప్రైవేటు విద్యుత్ కొనుగోలుపై రాష్ట్ర ప్రభుత్వం మక్కువ చూపుతోంది. తాజాగా మరో 4,630 మిలియన్ యూనిట్ల విద్యుత్ కొనుగోలుకు సిద్ధమైంది. ఈ మేరకు విద్యుత్ నియంత్రణ మండలి(ఏపీఈఆర్‌సీ)కి తాజాగా సమర్పించిన వార్షిక ఆదాయ అవసర నివేదిక(ఏఆర్ఆర్)లో ఏపీ విద్యుత్ పంపిణీ సంస్థలు ప్రతిపాదించాయి. కొనుగోలు చేసే విద్యుత్‌లో సింహ భాగం ప్రైవేటు పవన విద్యుత్ ఉండడం గమనార్హం. 2017–18 సంవత్సరంలో ఏపీఈఆర్‌సీ నాలుగువేల మిలియన్ యూనిట్ల మేరకు పవన విద్యుత్ కొనుగోలుకు అనుమతించడం తెలిసిందే. ఈ నేపథ్యంలో 2018–19లో పవన విద్యుత్ కొనుగోలును ఏకంగా 7,809 మిలియన్ యూనిట్లకు పెంచేందుకు అనుమతించాలంటూ తమ ప్రతిపాదనల్లో డిస్కమ్‌లు కోరాయి. నిజానికిది మిగులు విద్యుత్‌గా అవి పేర్కొంటూ.. ఇందులో 3,100 మిలియన్ యూనిట్లను, యూనిట్ 56 పైసల లాభంతో బహిరంగ మార్కెట్లో విక్రయిస్తామని ఏపీఈఆర్‌సీకి తెలిపాయి. అయితే ప్రైవేటు పవన విద్యుత్ ఉత్పత్తిదారులతో ప్రభుత్వ పెద్దల లాలూచీ వల్లే భారీ ఎత్తున విద్యుత్ కొనుగోలుకు సిద్ధపడినట్లు తెలుస్తోంది.

### కొనాల్సిన అవసరముందా?

వాస్తవానికి రాష్ట్రంలో 2018–19 సంవత్సరానికి 61,543 మిలియన్ యూనిట్ల మేర విద్యుత్ డిమాండ్ ఉంటుందని విద్యుత్ పంపిణీ సంస్థలు అంచనా వేశాయి. గతేడాది ఇదే తరహాలో 59 వేల మిలియన్ యూనిట్లుగా అంచనా వేశారు. అయితే 57 వేల మిలియన్ యూనిట్లకు మించి విద్యుత్ వినియోగం జరగలేదు. రాష్ట్రంలో విద్యుత్ టారిఫ్ ఎక్కువగా ఉండటం, బహిరంగమార్కెట్లో చౌకగా లభించడంతో కొన్ని పరిశ్రమలు బయట విద్యుత్ కొనుగోలు చేశాయి. దీంతో ఏపీ డిస్కమ్‌ల అంచనాలన్నీ తారుమారయ్యాయి. గత అనుభవాన్ని పరిగణలోనికి తీసుకుంటే రాష్ట్ర విద్యుత్ డిమాండ్‌ను ఏపీ జెన్‌కో పరిధిలోని థర్మల్, జల విద్యుత్ కేంద్రాలు చేరుకునే అవకాశముంది. నెల్లూరు జిల్లా దామోదరం సంజీవయ్య థర్మల్ విద్యుత్ కేంద్రం(కృష్ణపట్నం), నార్ల తాతారావు థర్మల్ విద్యుత్ కేంద్రం(ఎన్‌టీటీపీ), రాయలసీమ థర్మల్ విద్యుత్ కేంద్రం(ఆర్టీపీపీ) నుంచి ఏడాదికి దాదాపు 42 వేల మిలియన్ యూనిట్ల విద్యుత్ ఉత్పత్తికి వీలుంది. ఇతర జలవిద్యుత్ కేంద్రాల నుంచి మరో 9 వేల మిలియన్ యూనిట్ల మేరకు ఉత్పత్తి చేయవచ్చు. కేంద్రం నుంచి అందే వాటా, గ్యాస్ ఆధారిత ప్లాంట్లనుంచి వచ్చే విద్యుత్‌ను కలుపుకుంటే రాష్ట్రంలో ఉన్న డిమాండ్‌కు సరిపోను విద్యుత్ లభిస్తుంది. ప్రైవేటు విద్యుత్ కొనుగోలు చేయకుండా కేవలం జెన్‌కో ప్లాంట్ల నుంచే పూర్తిస్థాయి ఉత్పత్తి జరిగితే విద్యుత్ యూనిట్ ధర కూడా రూ.4లోపే ఉండే వీలుంది. ఈ అవకాశం ఉన్నప్పటికీ ప్రభుత్వం తమ అనుయాయులకోసం ప్రైవేటు విద్యుత్‌ను ప్రోత్సహిస్తోంది. ఈ లెక్కన 2018–19లో రాష్ట్రంలో విద్యుత్ లభ్యత 66,173 మిలియన్ యూనిట్లు ఉంటుందని డిస్కమ్‌లు తేల్చిచెప్పాయి. అయితే అవసరం 59 వేల మిలియన్ యూనిట్లు ఉండే వీలుంది. అలాంటప్పుడు మిగిలిన 7,173 మిలియన్ యూనిట్లు ఏం చేస్తారనే దానికి ప్రభుత్వం వద్ద సమాధానం లేదు. దీనికోసం గడచిన మూడేళ్లుగా ఏపీ జెన్‌కో ప్లాంట్లలో ఉత్పత్తిని గణనీయంగా నిలిపేస్తుండడం గమనార్హం.

### కొనేదెవరో?

ఇదిలా ఉంటే.. వచ్చే ఏడాది(2018–19) దాదాపు 4,630 మిలియన్ యూనిట్ల మేరకు మిగులు విద్యుత్ ఉంటుందనేది డిస్కమ్‌ల అంచనా. ఇందులో 3,100 మిలియన్ యూనిట్లను యూనిట్ 56 పైసలు చొప్పున లాభానికి అమ్ముతామని ఏఆర్ఆర్‌లో డిస్కమ్‌లు పేర్కొనడం విశేషం. ప్రస్తుతం రాష్ట్రంలో విద్యుత్ వినియోగదారులకు చేరే విద్యుత్ యూనిట్‌కు రూ.6.14 అవుతుంది. దీనిపై సగటు రాబడి యూనిట్‌కు రూ.4.67 మాత్రమే. అంటే యూనిట్‌పై రూ.1.46 నష్టం వస్తోంది. అదే సమయంలో ఉత్పత్తి వ్యయానికి మరో 56 పైసలు కలిపి అమ్మితే విద్యుత్ యూనిట్ ధర రూ.6.70 ఉండే వీలుంది. నిజానికి బహిరంగ మార్కెట్లో యూనిట్ విద్యుత్ నాన్ పీక్ అవర్స్‌లో యూనిట్ రూ.2 లోపే లభిస్తోంది. పీక్ అవర్స్‌లో రూ.2.75కు దొరుకుతుంది. ఇలాంటి పరిస్థితుల్లో ఏపీ జెన్‌కో 3,100 మిలియన్ యూనిట్లను అంత ఎక్కువ ధరకు ఎవరికి విక్రయిస్తుంది? కొనుగోలు చేసేందుకు ఎవరు ముందుకొస్తారనేది సమాధానం లేని ప్రశ్న. అసలు ప్రైవేటు పవన విద్యుత్‌ను యూనిట్ రూ.5.25 చొప్పున కొనుగోలు చేయాల్సిన అవసరం ఏమిటనేది విద్యుత్‌రంగ నిపుణుల ప్రశ్న. ఇప్పటికే దీనిపై ఏపీఈఆర్‌సీకి కుప్పతెప్పలుగా ఫిర్యాదులొచ్చినా ప్రభుత్వం వెనక్కు తగ్గలేదు. ప్రైవేటు పవన విద్యుత్ ఉత్పత్తిదారులతో లాలూచీపడటం వల్లే ఈ తరహాలో పవన విద్యుత్‌ను ప్రోత్సహిస్తున్నారనే విమర్శలొస్తున్నాయి.

**25వ రోజు**

03-12-2017, ఆదివారం
బసినేపల్లి, అనంతపురం జిల్లా.




### నేను రైతునని అన్నదాత గర్వంగా చెప్పకునే రోజులు రావాలి

ఈ రోజు పత్తికొండ నియోజకవర్గం ఎర్రగుడిలో రైతు సదస్సు జరిగింది. వ్యవసాయ రంగాన్ని లాభసాటిగా తీర్చిదిద్దేందుకు అవసరమైన ఆలోచనలను మరింత విస్తృతం చేసుకోవడానికి రైతులు ఈ సదస్సు నిర్వహించారు. సుదీర్ఘ కాలంగా రైతు సమస్యలపై పనిచేస్తూ, వివిధ రైతు సంఘాల నాయకులుగా ఉన్న ముఖ్యులు ఈ సమావేశంలో పాల్గొన్నారు. విత్తనం నాటే దగ్గర్నుంచి, తన ఉత్పత్తిని మార్కెట్లో అమ్మే వరకూ.. వివిధ దశల్లో రైతు ప్రయోజనాలు ఏ విధంగా కాపాడాలనే అంశంపై ప్రధానంగా చర్చ జరిగింది. వ్యవసాయ రంగంపై ఆలోచనలను సుసంపన్నం చేసే అనేక సలహాలు, సూచనలు ఈ సదస్సులో చర్చకు వచ్చాయి. అందుకుగాను వారికి ధన్యవాదాలు.

ఈ రోజు రాష్ట్రంలో నెలకొన్న వ్యవసాయ సంక్షోభం వల్ల రైతులు విపరీతమైన ఆందోళనతో దిక్కుతోచని స్థితిలో ఉన్నారు. ఈ పరిస్థితిని మార్చేందుకు నా దగ్గర స్పష్టమైన ఆలోచనలు, కార్యాచరణ ప్రణాళికా ఉన్నాయి.. రైతుల సమస్యలు భూమి టైటిల్ నుంచే మొదలవుతాయి. అందువల్ల మన వ్యవసాయ భూములకు టైటిల్ సమస్యలు రాకుండా చేసేందుకు, రైతుల భూములన్నిటికీ స్పష్టమైన టైటిల్స్ ఇస్తాము. వ్యవసాయానికి అవసరమైన విద్యుత్తు, సాగునీరు, సకాలంలో వ్యవసాయ రుణాలు, నాణ్యమైన విత్తనాలు, కల్తీ లేని ఎరువులు, క్రిమి సంహారక మందులు, వ్యవసాయానికి అయ్యే ఖర్చు తగ్గించడం కోసం రైతు భరోసా పథకం, వ్యవసాయ శాస్త్రవేత్తల నుంచి సకాలంలో తగు సూచనలు, పండిన పంటలకు గిట్టుబాటు ధరలు, పంటను నిల్వ చేయడానికి గిడ్డంగి సౌకర్యాలు, దురదృష్టవశాత్తు ప్రకృతి వైపరీత్యాల వల్ల పంట నష్టం జరిగితే రైతులకు ఇన్‌పుట్ సబ్సిడీ, చివరిగా పండిన పంటకూ గిట్టుబాటు ధర, అనువైన చోట వ్యవసాయానుబంధ పరిశ్రమలు స్థాపించి రైతుకు మరింత లబ్ధి చేకూర్చడం. మన ప్రభుత్వం తీసుకునే ఈ చర్యల వల్ల రైతుల జీవితాలు బాగుపడతాయి. పల్లెలు అభివృద్ధి పథంలో పయనిస్తాయి. రాష్ట్రానికి ఆహార భద్రత లభిస్తుంది.

ఈ రోజు రైతు గర్వంగా నేను రైతునని చెప్పుకునే పరిస్థితి లేదు. రైతుల పిల్లలు ఉన్నత చదువులు చదివిన తర్వాత ఒక వేళ ఉద్యోగం రాకపోయినా, అదొక ఉపద్రవంలా భావించకుండా నేను వ్యవసాయం చేయగలను.. పది మందికి ఉపాధి కల్పించగలనని ఆలోచించే స్థాయికి వ్యవసాయాన్ని తీసుకురావాలి. ఇంకా చెప్పాలంటే ఒక సాఫ్ట్‌వేర్ ఇంజనీర్, బ్యాంకర్, డాక్టర్లు తమ వృత్తుల గురించి ఎంత గొప్పగా చెప్పుకుంటారో.. రైతు కూడా తన వృత్తి గురించి అంతే గొప్పగా చెప్పుకునే రోజులు రావాలి. ఉన్నత విద్యావంతులు వ్యవసాయాన్ని ఒక పూర్తిస్థాయి వృత్తిగా చేపట్టే స్థాయికి వ్యవసాయాభివృద్ధి జరగాలి.

ఈ రోజుతో కర్నూలు జిల్లాలో ప్రజాసంకల్ప యాత్ర ముగిసింది. మొత్తం 18 రోజులు, ఏడు నియోజకవర్గాల్లోని 14 మండలాలు తిరిగాము. ఈ జిల్లా ప్రజలు చూపిన ప్రేమ, ఆప్యాయతలు నేను మరిచిపోలేను. వారి ప్రేమకు నేను సర్వదా రుణపడి ఉంటాను. అందుకే.. ఈ పాదయాత్ర సమయంలో నా దృష్టికి వచ్చిన సమస్యలను పరిష్కరించడం మన ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన వెంటనే చేయాల్సిన ప్రథమ కర్తవ్యంగా భావిస్తాను.

వైయస్. జగన్.

మీకు సాక్షి దినపత్రిక అందడంలో ఏమైనా ఇబ్బందులున్నా లేక సాక్షి బదులుగా ఇతర దినపత్రికలు వేస్తున్న యెడల టోల్ ఫ్రీ నెంబర్‌కు ఉ. 7.00 గం.ల నుండి రా. 8.00 గం.ల లోపు తెలుపగలరు. వెంటనే తగు చర్యలు తీసుకోబడును.
టోల్ ఫ్రీ నం: 1800 270 1083

# టీ-20 వరల్డ్‌కప్ గెలవడమే లక్ష్యం

**భారత మహిళా క్రికెట్ జట్టు కెప్టెన్ మిథాలీరాజ్**



**సాక్షి, తిరుమల:** వచ్చే ఏడాది జరగనున్న టీ–20 వరల్డ్‌కప్ గెలవడమే లక్ష్యంగా ఆడుతున్నామని భారత మహిళా క్రికెట్ జట్టు కెప్టెన్ మిథాలీరాజ్ అన్నారు. వన్డే మ్యాచ్‌ల కంటే టీ–20 చాలా కష్టమైందని, దీని కోసం మరింత బాగా ఆడాల్సిన అవసరం ఉందన్నారు. ఆదివారం వేకువజామున ఆమె తిరుమల శ్రీవారి ఆలయానికి విచ్చేశారు. అనంతరం సుప్రభాత సేవలో స్వామివారిని దర్శించుకున్నారు. ఈ సందర్భంగా మిథాలీరాజ్ మీడియాతో మాట్లాడుతూ.. మహిళా క్రికెట్ జట్టుకు స్వామి ఆశీస్సులు ఇవ్వాలని ప్రార్థించామన్నారు. అంతకుముందు ఆలయ అధికారులు మిథాలీరాజ్‌కు ప్రత్యేక దర్శనం కల్పించి లడ్డూ, ప్రసాదాలు అందజేశారు.

# విశ్వంజీ ఆశీస్సులు అందుకున్న హైకోర్టు జడ్జి



విశ్వంజీ ఆశీస్సులు అందుకుంటున్న జడ్జి

**చినకోండ్రుపాడు (ప్రత్తిపాడు):** గుంటూరు జిల్లా ప్రత్తిపాడు మండలం చినకోండ్రుపాడులోని విశ్వనగర్‌లో ఆదివారం జరిగిన దత్త జయంతి మహోత్సవాల్లో హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ శంకరనారాయణ పాల్గొన్నారు. విశ్వగురు పీఠాధిపతి విశ్వయోగి విశ్వంజీని కలసి ఆయన ఆశీస్సులు అందుకున్నారు. అనంతరం విశ్వనగర్‌లో జరిగిన పూజా కార్యక్రమాలను తిలకించారు.

# మరో ప్రాణం తీసిన డ్రంకెన్ డ్రైవ్

- హైదరాబాద్‌లో ఘోర రోడ్డు ప్రమాదం
- పార్క్ చేసిన స్కోడాను ఢీ కొట్టిన ఎకో స్పోర్ట్
- బీటెక్ విద్యార్థి దుర్మరణం



ప్రమాదంలో నుజ్జునుజ్జయిన కారు

**హైదరాబాద్:** మద్యం మత్తు.. మితిమీరిన వేగం.. వెరసి ఓ బీటెక్ విద్యార్థి దుర్మరణం పాలయ్యాడు. మరో ముగ్గురు ఇంజనీరింగ్ విద్యార్థులు గాయాలపాలయ్యారు. శనివారం అర్ధరాత్రి హైదరాబాద్ జూబ్లీహిల్స్‌లో ఘోర రోడ్డు ప్రమాదం జరిగింది. సాయి జతిన్ వర్మ (21), సాయి కార్తీక్, ఎం.రోహన్, నిఖిల్‌లు శనివారం రాత్రి కార్తీక్‌కు చెందిన ఫోర్డ్ ఎకో స్పోర్ట్ కారులో పార్క్ హయత్ హోటల్‌లో స్నేహితుడి సోదరికి సంబంధించిన ఓ వేడుకలో పాల్గొన్నారు. అక్కడ మద్యం తాగిన వీరు రాత్రి 12.30 గంటలకు తిరుగు పయనమయ్యారు. కార్తీక్ కారు డ్రైవ్ చేస్తుండగా.. పక్క సీటులో జతిన్, వెనుక రోహన్, నిఖిల్ కూర్చున్నారు. మితి మీరిన వేగంతో వాహనం నడుపుతున్న కార్తీక్.. తెలంగాణ రాష్ట్ర మహిళా ఆర్థిక సహకార సంస్థ కార్యాలయం వద్ద రోడ్డు పక్కన పార్క్ చేసి ఉన్న స్కోడా కారును బలంగా ఢీ కొట్టాడు. దీంతో వారి వాహనం గాల్లోకి లేచి మూడు పల్టీలు కొట్టింది. జతిన్ అక్కడికక్కడే కన్నుమూశాడు. నిఖిల్‌కు తీవ్రగాయాలు కాగా.. మిగిలిన ఇద్దరికీ స్వల్ప గాయాలయ్యాయి. క్షతగాత్రుల్ని పోలీసులు అపోలో ఆస్పత్రికి తరలించారు. కారు నడిపిన కార్తీక్ మద్యం సేవించినట్లు గుర్తించారు.

## డ్రంకన్ డ్రైవ్‌లో చిక్కి 'కామెడీ'



కారు కింద నక్కిన నవీన్

జూబ్లీహిల్స్ ట్రాఫిక్ పోలీసులు శనివారం నిర్వహించిన డ్రంకన్ డ్రైవ్ తనిఖీల్లో చిక్కిన హాస్య నటుడు నవీన్ తప్పించుకునేందుకు అనేక ప్రయత్నాలు చేశాడు. మీడియా సిబ్బంది ఆ దృశ్యాలను చిత్రీకరించడానికి ప్రయత్నించగా, కారు దిగి పరుగులు తీశాడు. ఆ వెనుకే ఉన్న మరో కారు కింద దాక్కునేందుకు ప్రయత్నించాడు. పారిపోతున్నాడని భావించిన పోలీసులు అతడిని వెంబడించి పట్టుకోవడంతో పాటు వాహనం సీజ్ చేశారు. అరగంటపాటు ఈ హైడ్రామా నడిచింది.

# మృత్యుబావి..!



ప్రమాదానికి కారణమైన బావి

## రెండు నిండు ప్రాణాలు బలిగొన్న బావి నీరు

**సాక్షిప్రతినిధి, విజయనగరం:** విజయనగరం జిల్లా గుర్ల మండలం కెల్ల గ్రామంలో ఉన్న ఓ బావిలోని నీరు విషపూరితమై ఇద్దరు రైతు కూలీల ప్రాణాలు తీసింది. మరో ఇద్దరి పరిస్థితి విషమంగా ఉంది. ఇంకో 10 మంది అస్వస్థతతో ఆస్పత్రిలో చేరారు. గ్రామానికి చెందిన సుమారు 22 మంది రైతు కూలీలు శనివారం ఉదయమే పొలం పనికి వెళ్లారు. మధ్యాహ్నం భోజన సమయంలో పొలంలో ఉన్న బావి నీటిని తాగారు. తర్వాత పని చేస్తుండగా నామాల సోమి నాయుడు, బడారిపేట గ్రామానికి చెందిన నక్క ఆదినారాయణ, కోరాడ శ్రీను, కడగల అప్పల నాయుడు కడుపు నొప్పి భరించలేకున్నామంటూ కూర్చున్నారు. భూమి యజమాని రాజు తక్షణమే వారిని గుర్ల పీహెచ్‌సీకి, అక్కడ నుంచి విజయనగరం మహరాజా ఆస్పత్రికి తరలించారు. రాత్రి 9 గంటల సమయంలో సోమి నాయుడు, ఆదినారాయణ మృతి చెందారు. మిగిలిన ఇద్దరినీ విజయ నగరం పట్టణంలోని ఓ ప్రైవేటు ఆస్పత్రికి తరలించారు. ఆదివారం ఉదయం మరో 10 మంది రైతులు అస్వస్థతకు గురై విజయనగరంలోని ఓ ప్రైవేటు ఆస్పత్రిలో చేరారు. బావిలోని నీరు పొలానికి వాడే పురుగుల మందుతో కలుషితం కావడం వల్లే ఇలా జరిగిందని ఎస్పీ పాలరాజు నిర్ధారించారు.







Paytm Payments Bank

కొన్నిసార్లు దేశాన్ని మార్చే బాధ్యత
ఏదో ఒక తరం భుజాలపై వస్తుంది.
ఇప్పుడు మన వంతు.

గౌరవనీయ ఆర్థిక మంత్రి, శ్రీ అరుణ్ జైట్లీ పేటీఎం పేమెంట్స్ బ్యాంక్‌ని
2017, నవంబర్ 28న న్యూఢిల్లీలో జాతికి అంకితం చేశారు



ఎడమ నుండి కుడి వైపుకు: విజయ్ శేఖర్ శర్మ - స్థాపితులు మరియు సీఈఓ, పేటీఎం; దిలీప్ ఆస్బే - సీఈఓ, ఎన్‌పీసీఐ;
శ్రీ అరుణ్ జైట్లీ - గౌరవనీయ ఆర్థిక మంత్రి, భారత ప్రభుత్వం;
రేణు సత్తి - ఎండీ మరియు సీఈఓ, పేటీఎం పేమెంట్స్ బ్యాంక్; పీవీ భాస్కర్ - మాజీ ఈడీ, ఆర్‌బీఐ, డైరెక్టర్ -పేటీఎం పేమెంట్స్ బ్యాంక్

ఈరోజే పేటీఎం యాప్ డౌన్‌లోడ్ చేయండి మరియు మీ సేవింగ్స్ ఖాతా తెరవండి.
ఆధునిక బ్యాంకింగ్ అనుభవం పొందండి!

జీరో బ్యాలెన్స్ అకౌంట్ – కనీస బ్యాలెన్స్ అవసరం లేదు
ఆకర్షణీయమైన వడ్డీ పొందండి – సేవింగ్స్ ఖాతాలో 4% మరియు లింక్డ్ స్వీప్ అవుట్ FDపై 7% వరకు పొందండి
ప్లాటినం RuPay డెబిట్ కార్డ్ ఉచితం – ఏదైనా ATM నుండి నగదు తీసుకోవచ్చు
నగదు పంపించడానికి ఎటువంటి ఛార్జీలు లేవు – IMPS, UPI, NEFT మరియు RTGSపై ఎటువంటి ఛార్జీలు లేవు

• ఈవెంట్

### ఉస్మానియాలో వంద కలాలు గళాలు

నూరేళ్ల ఉస్మానియా యూనివర్సిటీ సందర్భంలో– 'వంద కలాలు, గళాలు' కార్యక్రమం డిసెంబర్ 5న ఉదయం 10 గంటలకు ఓయూ ఆర్ట్స్ కాలేజీలోని రూమ్ నం.57లో జరగనుంది. కేవీ రమణాచారి, నందిని సిధారెడ్డి, ఎస్వీ సత్యనారాయణ, అల్లం నారాయణ, అయాచితం శ్రీధర్, కోవెల సుప్రసన్నాచార్య, కె.కె.రంగనాథాచార్యులు, వరవరరావు, ముదిగంటి సుజాతారెడ్డి, అంపశయ్య నవీన్, గద్దర్, ఎల్లూరి శివారెడ్డి లాంటి ఉస్మానియా పూర్వ విద్యార్థులైన అక్షరాలా వంద మంది కవులు పాల్గొనడం ఈ ఉత్సవ ప్రత్యేకత. అధ్యక్షత: సూర్యాధనంజయ్. స్వాగతం: సిహెచ్ గోపాల్‌రెడ్డి, ప్రొ.రవీందర్. నిర్వహణ: ఓయూ సాహిత్య వేదిక. ఫోన్: 9885937740

### తెలంగాణ... పదాలు ఆవిష్కరణ

డాక్టర్ నలిమెల భాస్కర్ వ్యాస సంపుటి 'తెలంగాణ భాష దేశ్య పదాలు' ఆవిష్కరణ డిసెంబర్ 9న ఉదయం 10 గంటలకు కరీంనగర్ ఫిలిమ్ భవన్‌లో జరగనుంది. నిర్వహణ: సాహితీ సోపతి. ఎన్.గోపి, నగునూరి శేఖర్, అన్నవరం దేవేందర్, ఎం.నారాయణశర్మ, బూర్ల వేంకటేశ్వర్లు పాల్గొంటారు.

### బి.సి.లిటరరీ ఫెస్టివల్

బి.సి.లిటరరీ ఫెస్టివల్ డిసెంబర్ 10న ఉదయం 9 నుండి రాత్రి 9 వరకు హన్మకొండలోని హోటల్ అశోకలో జరగనుంది. ఐదు సెషన్లుగా జరిగే ఈ కార్యక్రమంలో బీసీవాదం చర్చ, కవిసమ్మేళనం లాంటి కార్యక్రమాలుంటాయి. బి.సి.రైటర్స్ వింగ్ అవార్డుల్ని కాలువ మల్లయ్య, కె.మురళీమనోహర్, జూలూరి గౌరీశంకర్, జి.లక్ష్మీనరసయ్య, బండ రామలీలకు ప్రదానం చేస్తారు.

• ప్రపంచ తెలుగు మహాసభలు

# పెద్దన్న తెలియాలి సోమన్న మరుగునపడొద్దు

**కవిత్రయం తెలియకుండా, అల్లసాని పెద్దన తెలియకుండా తెలంగాణవాళ్లు ఉండాలని తాను అనుకోవడం లేదనీ; అలాగని పాల్కురికి సోమన్న మరుగునపడకూడదనీ దేశపతి శ్రీనివాస్ అంటున్నారు. డిసెంబర్ 15–19 వరకు హైదరాబాద్‌లో జరగనున్న ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా మహాసభల కోర్ కమిటీ సభ్యుడు, తెలంగాణ ముఖ్యమంత్రి కార్యాలయంలో ఓఎస్‌డీగా ఉన్న దేశపతితో సాక్షి సాహిత్యం ప్రతినిధి జరిపిన ప్రత్యేక సంభాషణ:**



ఫొటో: జి.అమర్

**ఎడ్మినిస్ట్రేషన్ మీలోని సృజనకారుడిని ఇబ్బంది పెట్టడం లేదా?**

ఇబ్బంది పెడుతోంది. హద్దులు ఏర్పడతాయి; మనదైన స్పేస్ తగ్గిపోతుంది. సృజనకు అవసరమైన ఉత్ప్రేరణ తగ్గిపోతుంది. అయినా ఏదో ఒక మేరకు సాహిత్యకారులతో సంభాషణలో ఉండటం వల్ల నా సృజనను సజీవంగా కాపాడుకోవడానికి ప్రయత్నిస్తున్నా.

**ఏ క్రియేటివ్ ప్రాసెస్ నడుస్తోంది మీలో ఇప్పుడు?**

తెలంగాణ సాహిత్య మూర్తులు జగజ్జేయమానంగా వెలుగొందాలంటే ప్రపంచ తెలుగు మహాసభలను నిర్వహించాలని తెలంగాణ ముఖ్యమంత్రి కేసీఆర్ ప్రకటించాక, తెలంగాణ సాహిత్య వైభవం సాక్షాత్కరించేలా పాటలు రాయడం మొదలుపెట్టాను. ఉదాహరణకు(పాడి వినిపించారు), 'మన తెలంగాణము తెలుగు మాగాణము/ పలుకులమ్మ ఎద పంచిన భాషా పీయూషము/ చరితకు తొలి తెలుగందము జినవల్లభు కందము/ పంపకవిలో ప్రతిఫలించె తెలుగన్నడ బంధము/ నన్నయ కన్నా మున్నే ఉన్నదిచట ఛందము/ మల్లియరేచన చల్లిన మరుమల్లెల గంధము'. మనకు రాజకీయ నాయకుల హోర్డింగులు పెట్టడమే తెలుసు. కానీ సాహిత్యమూర్తులను హైదరాబాద్ అంతటా హోర్డింగుల్లో నిలిపితే వారి ప్రశస్తి, భాష కోసం వారు చేసిన కృషి ఫోకస్ అవుతాయి. వారి కోసం రాస్తున్న పంక్తులే ఒక సృజనకారుడిగా నా లోపల ఇప్పుడు సుడులు తిరుగుతున్నాయి.

**ఎవరెవరి పేర్లతో తోరణాలు నిలపాలన్న ఎంపిక పూర్తయ్యిందా?**

హాలుడి నుంచి ఆధునిక వైతాళికుల వరకు ఇప్పటికి 63 మంది తోరణాలు డిజైన్ చేయడం పూర్తయ్యింది. ఇంకా ఈ సంఖ్య వంద వరకు పెరిగే అవకాశం ఉంది.

**పంక్తులు, పాటలు రాయడానికి వాళ్లను ఎంతమేరకు మీలోపలికి తీసుకున్నారు?**

ఒక కవిని ఆయన భాషలోనే, ఆయన హృదయంతోనే, ఆయన దృక్పథంతోనే, ఆయన భావుకతతోనే చెప్పాలని ప్రయత్నం చేస్తున్నా. ఉదాహరణకు రామదాసును తలుచుకోగానే భద్రాద్రి ఆలయం, కీర్తనలు స్ఫురణకొస్తాయి. కానీ ఆయన తెలుగులో భజనగీత సృజనకు ఆద్యుడు. త్యాగరాజుకు కూడా ప్రేరణగా నిలిచినవాడు. అందుకే, 'తేనెలొలుకు తెలుగులోన/ భజనగీత సృజనమునకు/ ఆద్యుడైన రామదాసు/ భక్త శ్రేష్ఠుడు... రాగరాజు త్యాగరాజు/ వినయమొప్ప వినుతించిన/ విబుధవరుడు రామదాసు/ వందనీయుడు' అన్నాను.

**కోర్ కమిటీ సభ్యుడిగా ఈ మహాసభలు ఏం సాధించగలవని మీరు భావిస్తున్నారు?**

ఒకటి: ఇన్నాళ్లూ తెలంగాణ భాష మీద దాడి జరిగింది. ఉపేక్ష భావం, చిన్నచూపు ఉండినాయి. ఏ భాషైనా గానీ అక్కడి భౌతిక చారిత్రక రాజకీయ ఆర్థిక పరిస్థితుల వల్ల రూపొందుతుంది. భాష అనేది జ్ఞాపకాల నిధి. అది ఇద్దరు వ్యక్తులు కేవలం భావాలు పంచుకొనే సాధనం మాత్రమే కాదు. భాషలో అక్కడి మట్టి వాసన, వారి స్మృతులు, సాంస్కృతిక వాతావరణం అన్నీ ఉంటాయి. తెలంగాణ ప్రజల్లో తమ భాష పట్ల ఒక ఔన్నత్య భావన ఈ మహాసభలు ఏర్పరచగలవు. రెండు: తెలుగు భాషలో ఏమాత్రం అభినివేశం లేని పిల్లల తరం రావడం ఇప్పటి విషాదం. వీరికి మాతృభాష పట్ల ఒక విశాల దృష్టి ఏర్పడుతుంది. తెలుగుకు చరిత్ర, విస్తృతి, వైశిష్ట్యం ఉన్నాయి; కవులకూ భాషావేత్తలకూ సమాజంలో గౌరవం ఉంది, అని వారికి తెలుస్తుంది. మూడు: ఆధునిక అవసరాలకు తెలుగును ఎలా విస్తరించాలో చేయాల్సిన ఆలోచనకు ఈ సభలు ఒక ప్రేరణ ఇవ్వొచ్చు.

**తెలంగాణలో జరుగుతున్న మహాసభల్లో ఆంధ్రప్రదేశ్ వైతాళికుల తోరణాలు నిలబెట్టడాన్ని ఎలా చూస్తున్నారు?**

ఇంతకాలం ఏం జరిగిందంటే– తెలుగు సాహిత్య చరిత్రలో తెలంగాణ సాహిత్యం విస్మరణకు గురైంది. తెలుగు సాహిత్య సంపూర్ణ దర్శనం జరగాలంటే ఈ నేల మీద జరిగిన కృషి కూడా అందులో చేరాలి. కవిత్రయం తెలియకుండా, అల్లసాని పెద్దన తెలియకుండా తెలంగాణవాళ్లు ఉండాలని నేను అనుకోవడం లేదు. అలాగని పాల్కురికి సోమన్న మరుగునపడకూడదు. పద్యానికి జాషువా అద్దిన మానవతా పరిమళాన్ని ఎలా విస్మరించగలం! ఆ తప్పు ఇప్పుడు మనం చేయకూడదు. అందుకే, తెలుగు సాహిత్యంలో మైలురాళ్లు అనదగిన ఆంధ్ర వైతాళికులకూ తోరణాలు కడుతున్నాం.

**ప్రత్యేక రాష్ట్ర ఉద్యమకాలంలో తెలుగు అంటేనే ఒక కానిమాటగా చూసిన ధోరణి ఉండింది. ఇప్పుడు అదే తెలుగు సభల్ని తెలంగాణ ప్రభుత్వం నిర్వహించడాన్ని ఎలా చూడాలి?**

ఉద్యమకాలంలో కొన్ని అతివ్యాప్తులుంటాయి. తెలుగంటే వాళ్లది, తెలంగాణ భాష అంటే మనది అనే ఒక వాదన ఉండింది. తెలుగు తల్లి అనే భావన గతంలో ఆంధ్రప్రదేశ్ నైసర్గిక స్వరూపంతో ముడిపడినదిగా చూపబడింది. నిజానికి అది భాషా స్వరూపం. అందుకే రాష్ట్రం విడిపోయాక భౌతిక వాస్తవం పలుచనబడి, తెలుగు తల్లి అనే భావన తటస్థత పొందింది. ఆ ప్రతీకతో ఇప్పుడు తెలంగాణకు నిమిత్తం లేదు. తెలంగాణలో అందమైన తెలుగు మాట్లాడుతారు. తెలుగు భాషా సాహిత్యాలకు ఇది పుట్టినిల్లు. బీజప్రాయం నుంచి శాఖోపశాఖలుగా తెలుగు విస్తరించిన నేల ఇది. తెలంగాణ నుడికారం, సామెతలు, శబ్దజాలం వీటన్నింటికీ పట్టంకట్టాల్సిన సమయం వచ్చింది.

**ఐదు నుంచి పదేళ్ల తర్వాత తెలుగు భవిష్యత్ చిత్రం ఎలా వుండబోతోందని మీ ఊహ?**

ఛానళ్ల తరం, ఐటీ తరం, అమెరికా తల్లిదండ్రుల తరం, నలభై అంటే ఇంగ్లీషులో ఎంత అనే తరం వచ్చాయి. వీరికి తెలుగులోని మౌలికాంశాలు తెలియదు. అయినప్పటికీ ఒక భాషగా తెలుగు అంతరించిపోతుంది, ఉండకుండా పోతుంది అన్నైతే నేను అనుకోవడం లేదు. గ్రామాల్లో ఏ నాట్లు వేసే స్త్రీ, ఏ కలుపుతీసే స్త్రీ ముందర నిలబడి దోసిలి పట్టినా భాషా భిక్ష పెడుతుంది. అయితే, కోర్టులో సాక్షి తెలుగులో చెబితే దాన్ని ఇంగ్లీషులో అనువాదం చేసి నమోదు చేస్తారు. అలా వుండకూడదు. పరిపాలనకూ, వ్యవహారానికీ మొత్తంగా తెలుగును ఉపయోగించే రోజులు రావాలి. అదేదో సెంటిమెంటుగా కాదు, ప్రజల అవసరం కోసం తెలుగును ఉపయోగించాలి. దానికోసం నా స్థాయిలో నేను కృషి చేస్తాను.

**కేసీఆర్‌ను దగ్గరినుంచి చూసినవాడిగా– తెలుగుకు తనను తాను ఒక ఛాంపియన్‌గా నిలబెట్టుకోవాలన్న తాపత్రయం ఏమైనా ఆయనలో కనబడిందా?**

లేదు. ఆయన పద్యాన్ని ప్రేమించినవారు. రాజకీయ ఉపన్యాసాలకు కూడా సాహిత్య పరిమళం అద్దినవారు. ఎన్నో సభల్లో– 'ఆరంభించరు నీచమానవులు' అంటూ భర్తృహరి సుభాషితం చెప్పారు. మొన్న (ఉప రాష్ట్రపతి) వెంకయ్యనాయుడు అభినందన సభలో కూడా 'చదువది ఎంత కలిగిన' పద్యం చెప్పారు. తెలంగాణలో ప్రకాశితమైన ఉద్యమ సాహిత్యం, జానపద సాహిత్యం గుర్తింపునొందాయి. కానీ శిష్ట సాహిత్యం, ఇతర సాహిత్య ప్రక్రియల మీద ఇంకా చర్చ జరగవలసేవుంది. తెలంగాణ భాషను తెలుగు భాషాభిమానులందరూ ప్రేమించాలి అనేది ఆయన ఉద్దేశం. ఆంధ్రప్రదేశ్‌లో కూడా ఆయనంటే సద్భావన, ప్రశంసే ఉన్నాయి. కాబట్టి కొత్త కీర్తి కోసం అయితే ఈ మహాసభల్ని ఆయన తలపెట్టలేదు.

## వైతాళికులకు వ్యాఖ్యానాంజలి

ప్రపంచ మహాసభల సందర్భంగా హైదరాబాద్ నగరమంతటా తెలుగు శోభ కనబడేలా ఏర్పాట్లు జరుగుతున్నాయి. అందులో భాగంగా నిలబెడుతున్న సుమారు నూరుమంది సాహిత్య వైతాళికుల తోరణాలు ప్రత్యేక ఆకర్షణగా నిలుస్తున్నాయి. ఆ తోరణాలకు ఇలా అక్షరహారాలు వేస్తున్నారు దేశపతి.

తొలి తెలుగు కవితకు
అడుగుజాడైనాడు
**పాల్కురికి సోమన్న**
ప్రగతి బాటైనాడు



శాసనాల రహస్యాలు
శోధించిన తపస్వి
**బి.ఎన్.శాస్త్రి**
గొప్ప సాహితీ యశస్వి



తెలంగాణ చరిత్రను
శోధించిన మహనీయుడు
**ఆదిరాజు వీరభద్రరావు**
మనకు నిత్యస్మరణీయుడు



సంఘసంస్కరణలో
తొలివేకువ కిరణం
**భాగ్యరెడ్డి వర్మంటే**
ఒక అక్షర జ్వలనం



తెలంగాణ పత్రికారంగ
వైతాళికులు
ఓరుగల్లు బిడ్డలు,
**ఒద్దిరాజు సోదరులు**



ఉప్పొంగిన కెరటాలు
ఉద్యమాగ్ని బావుటాలు
**సుద్దాల హనుమంతు**
రగిలించిన గీతాలు



తొలి సాంఘిక చరితను
రచించిన మహనీయుడు
**సురవరం ప్రతాపరెడ్డి**
సదా వందనీయుడు



కార్మిక రాజ్యం కోసం
కలమెత్తిన ధీరుడు
**మహాకవి శ్రీశ్రీ**
మరో ప్రపంచ సూర్యుడు



తెలుగు భాష పరిమళాలు
దిశలను వెదజల్ల
రామకథను రచించినది
**కవయిత్రి మొల్ల**



తెలంగాణ నుడికారం
గుబాళించు సరళి
**పాకాల యశోదారెడ్డి**
కథాకథన శైలి



మహాభారత రచనకు
దిద్దినాడు శ్రీకారం
**నన్నయ భట్టారకుడు**
తెలుగు కవితా ప్రాకారం



ప్రబంధ కవితా రీతిని
పండించిన మనీషి
**అల్లసాని పెద్దన తెలుగు**
కవితకు బంగరు నగిషీ



## మధ్యలో పోయిన కొన్ని పేజీలు

నీ మరణానంతరం
యాభై ఏళ్ళ క్రితం నువ్వు రాసిన చిన్నకావ్యం కాపీ ఒకటి
పాత చెక్కపెట్టెలో నుండి బయటికి తీసాం
తమ్ముడు, దుమ్ము సాలెగూటిపట్టు తుడిచి పెట్టి
టేబుల్ మీద పెట్టాడు, మేమందరం కలిసి పరిశీలించటానికి.

అకస్మాత్తుగా గాలి వీచి
పలచటి అట్టను ఎత్తి పారేసింది,
మన చిన్నప్పుడు మంచం అంచున వేలాడుతున్న దుప్పటిని
నువ్వు ఎత్తి పారేసినట్టుగా.
మనం అందరం మంచం క్రింద దాక్కున్న తరువాత,
నువ్వు అనేవాడివి ''ఈసారి నువ్వు నన్ను వెతుకుతావు,''–– అని.

మేం మొదటి పేజీలు కొన్ని చదివాం,
చూసాం, అభిమన్యుడిలా మిసమిసలాడే పదిహేడు, పద్దెనిమిది
ఏళ్ళ కుర్రాడొకడు
దూకుతున్నాడు వద్దు, లోతు తెలియని పొంగే నదిలోకి;

మిగిలిన కొన్నిపేజీలలో ఉంది
వడ్డున నిలబడి, ఊళ్ళో జనం ఎదురుచూస్తూ ఉన్నారు,
'తను వడ్డుకి తిరిగివస్తాడు,' అని.
నది అవతలి వడ్డున కూలిపోయిన గుడి
ఎండలో ఎండుతున్న దేవుణ్ణి పెట్టుకుని.

మధ్యలో కొన్ని పేజీలు లేవు.
మేము అనుకున్నాం,
'ఆ కానిని పేజీలూ దొరక్కపోయినా కూడా
పోయేది యేమీ లేదు,'అని.
కాని, చెల్లెలు కోపం ఆపుకోలేక
మరో గదిలోకి లేచి వెళ్ళేటప్పుడు,
మేం తనకి ఏమి చెప్పి ఎలా సముదాయించి
తిరిగి తీసుకొని రాగలం?

ఏమిటి?
నువ్వు ఇప్పటికీ అదే నమ్మకంతో ఉన్నావు కదా?
ఎవరి పెన్సిల్ వాళ్ళే చెక్కుకోవాలన్నమాట,
పని ఒకటే కావచ్చు; కాని ఎవరి పద్ధతి వాళ్ళది
అది వ్యక్తిగతం, అది రహస్యం.
నీ స్వంత పద్ధతి ఆ పోయిన పేజీల్లో రాసి ఉందని
అనుకొంటున్నాం.
ఐనా, నువ్వు మాత్రం తిరిగిరావు ఇంకెప్పుడూ.

**ఒరియా మూలం:** సౌభాగ్య కుమార మిశ్ర
**తెలుగు అనుసృజన:** వేలూరి వేంకటేశ్వర రావు, వెనిగళ్ళ బాలకృష్ణ రావు

*(సౌభాగ్య కుమార మిశ్ర సుప్రసిద్ధ ఆధునిక ఒరియా కవి. 'మధ్యలో పోయిన కొన్ని పేజీలు,' కవిత ''ద్వాసుపర్ణా,'' అనే ఖండకావ్యం లోనిది. ఈ ఖండకావ్యానికి 1986లో కేంద్ర సాహిత్య ఎకాడమీ పురస్కారం లభించింది. ద్వాసుపర్ణా తెలుగు అనుసృజనల సంకలనం ఈ నెలలో ప్రచురించబడుతుంది.)*

• విమర్శ

## తీతువగొంతును తియ్యగజేసింది

వాగ్గేయకారునిగా గోరటి వెంకన్న విశిష్టతకు ప్రధాన కారణాలలో వస్తు వైవిధ్యం ఒకటి. వస్తువు దృష్ట్యా వెంకన్న గేయాలను– విప్లవోద్యమ గేయాలు, దళిత చైతన్య గేయాలు, ప్రపంచీకరణ నిరసన గేయాలు, స్మృతి గేయాలు, వర్ణనాత్మక గేయాలు... మొదలైన విధంగా విభజించుకోవచ్చు.

సంత, వాన, కొంగ, నల్లతుమ్మ, సంచారం, జలచక్రం, వేకువహాయి, రాత్రి, వెన్నెల, అడవి మొదలైన గేయాలు వర్ణనాత్మకమైనవి. 'వర్ణనాత్మకమైనవి' అంటే 'ఏకవస్తు వర్ణన' ప్రధానమైనవని ఇక్కడ నా ఉద్దేశం.

'వాన' పాటలో వర్షరుతు ఆరంభంలోని అందమైన పల్లె దృశ్యాలు ప్రత్యక్షంగా, శ్రమజీవుల ఆనందం పరోక్షంగా వర్ణింపబడినాయి. ఈ పాటకు ప్రాణి లక్షణారోహణ సౌందర్యాన్ని సమకూర్చింది.

*''గద్దగూటిలోని గడ్డిని తడిపింది*
*గువ్వగూటి గులకరాళ్లను జరిపింది*
*తీతువగొంతును తియ్యగజేసింది*
*పరికిపిట్ట ముక్కు పాసిని కడిగింది*
*ఎద్దు మూపురాన్ని ముద్దాడి మురిసింది*
*ముల్లుగర్ర వొల్లు సల్లగ జేసింది''*

– ఉత్ప్రేక్షా వాచకాలు లేకుండా, నిర్ధారణ వాక్యాలలోనే వర్ణన ఆసాంతం సాగింది. కాని, ఇవన్నీ అందమైన ఉత్ప్రేక్షలే. 'ముల్లుగర్ర వొల్లు సల్లగ జెయ్యడం', 'ఎగిరె దట్టీలకు వెండి మెరుపులద్దడం' లాంటి వాక్యాలు వెంకన్న పరిశీలనాసక్తినీ, పరిశీలనాశక్తినీ పట్టిస్తాయి. వెంకన్న చాలా పాటలలో ఎక్కడో ఒకచోట ఆధ్యాత్మిక అంశాల ప్రస్తావనలు ఉంటాయి. ఈ పాటలోని 'తులశమ్మ దీపం', 'సాధుల సమాధులు', 'సూఫీ దర్గా'ల ప్రస్తావనలు అలాంటివే.

'తాను రాకముందె తూనీగలను లేపి, తన పాటకే తాను దరువేసి ఆడింది'– తూనీగలు ఎగిరి తిరుగుతూ ఉండటం, వర్షాగమన సంకేతమన్న భావనను తెలుపుతుంది. గానం చేస్తూ, తన గానానికి తానే వాద్య సహకారాన్ని సమకూర్చుకొంటూ నాట్యం చేస్తున్న నర్తకిగా వర్షాన్ని వర్ణించడం విశేషం. సుందరమైన దృశ్యభావచిత్రాల ద్వారా, అంతటా పేరుకున్న ధూళీ, మలినాలూ, వర్షం వల్ల తొలగిపోయి ఒక వినిర్మల కాంతిని సమకూర్చుకోవడమూ, మనుషులతోపాటు సర్వప్రాణులూ ఆనందంలో తేలియాడడమూ సూచింపబడినాయి. వర్షం చేసే వివిధానేక ప్రక్షాళన క్రియలను అందమైన ఊహలతో జోడించి 'లఘు చలనచిత్రాలు'గా తీర్చిదిద్దడం ఈ గీతంలోని ప్రత్యేకత.

**(పెన్నా శివరామకృష్ణ 'గోరటి వెంకన్న కవితాపరామర్శ' పుస్తకంలోంచి...)**



**గోరటి వెంకన్న కవితాపరామర్శ**
**రచన: పెన్నా శివరామకృష్ణ**
**పేజీలు: 128; వెల: 80**
**ప్రతులకు: ప్రధాన పుస్తక కేంద్రాలు. రచయిత ఫోన్: 9440437200**

• అనువాదం

## సమకాలీన కొంకణి కథలు

తమ అస్తిత్వం మొత్తాన్నీ కంపెనీ పేరుతో ముడివేసుకుని తమను తాము దానికి సమర్పించుకునే ఉద్యోగులుంటారు. అదే వారి జీవితానికి కేంద్రం. కానీ ఎన్నాళ్లు? విరమణ అనేది ఒకటి ఉంటుంది... 'వయసు మీరటం వల్ల ఎవరికీ అవసరం లేనట్టు' అనిపించే బాధ! వయసును అంగీకరించడానికి సిద్ధంగా ఉండని మనసు. ఈ స్థితిని సున్నితంగా చెప్పే కథ 'ఋతుసంక్రమణం'.

మూడేళ్ల తర్వాత పుట్టింటికి వస్తున్న కొడుకు కోసం అతడికి నచ్చే రొయ్యలు, పీతలతో వంట ఏర్పాట్లు చేయిస్తుంది తల్లి. ఆమెకు కళ్లకు మసకలు. చెవులు అంతంత మాత్రం. కొడుకు వచ్చాడు. పూటైనా ఉండకుండా ఐదు వందల కిలోమీటర్ల దూరంలో ఇంకెవరినో కలవాలని హడావుడిగా వెళ్లిపోయాడు. 'నువ్వు ఎలా ఉన్నావు? ఆరోగ్యం ఎలా ఉంది? మందులు వేసుకుంటున్నావా?'– ఏమైనా అడిగాడా? అడిగినా వినపళ్లేదా? లోపల ఎక్కడో గుచ్చే కథ 'రెండు ధృవాలు'.

గోకులదాసు ప్రభు ప్రసిద్ధ కొంకణి కథకుడు. మలయాళ భాషా సాహిత్యాలను అధ్యయనం చేసినవారు. మలయాళ సాహిత్యాన్ని కొంకణిలోకి అనువదించినవారు. ప్రభు కథల సంపుటిని రంగనాథ రామచంద్రరావు తెలుగులోకి తెచ్చారు. ఇందులో 12 కథలున్నాయి. సాధారణ ఇతివృత్తాలనే హృద్యంగా చెప్పడం ప్రభు శైలిగా తోస్తుంది.

❖ సాహిత్యం డెస్క్



ఋతుసంక్రమణం; కొంకణి మూలం: గోకులదాస ప్రభు; తెలుగు: రంగనాథ రామచంద్రరావు; పేజీలు: 116; వెల: 80; ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, జి.ఎస్.ఐ. పోస్టు, బండ్లగూడ(నాగోల్), హైదరాబాద్–68. ఫోన్: 24224453

• చదువరుల శీర్షిక

## నాకు నచ్చిన ఐదు పుస్తకాలు



**అన్నంరాజు వేణుగోపాల శ్రీనివాసమూర్తి**
9989792549

**శేషప్రశ్న**
**(శరత్‌చంద్ర ఛటర్జీ)**

శరత్ బెంగాలీ నవలకు బొల్లిముంత శివరామకృష్ణ తెలుగు అనువాదం శేషప్రశ్న. తుప్పుపట్టిన సంప్రదాయ ధోరణులను, వ్యక్తి హితానికి ఉపయోగపడని విధానాలను కమల ఖండించే పద్ధతి గొప్పగా ఉంటుంది. సంఘసేవలో చురుకుగా పాల్గొంటూ కమల మన్ననలు కూడా చూరగొన్న రాజేంద్ర ఆలయం తగలబడి పోతున్నప్పుడు అందులో విగ్రహాన్ని కాపాడాలని ప్రయత్నించి తాను ఆహుతైపోతాడు. అక్కడున్న వారందరూ రాజేంద్ర త్యాగాన్ని కీర్తిస్తుంటే కమల మాత్రం మౌనంగా ఉండిపోతుంది. చివరికి అంటుంది: 'అజ్ఞానం ఎప్పుడూ బలి కోరుతుంది'. ఎప్పటిలాగే ఆమె ఆలోచనాతీరు అందరికీ శేషప్రశ్నే అవుతుంది.

**జీవితాదర్శం (చలం)**

జీవితాదర్శం, శాంతి. దానికి అడ్డుగా ఉండే ఏ ఐశ్వర్యం గానీ, శృంగారం గానీ, మరేదైనా గానీ జీవితానికి చాలా విరోధం, అంటాడిందులో చలం. లాలస పాత్ర కడు రమణీయంగా వర్ణించబడింది. ఇందులోని మరో గొప్ప పాత్ర, దేశికాచారి. విడువలేని బంధం వద్దంటాడు. స్వేచ్ఛలో ఉన్న శాంతి, ప్రశాంతి మరెందులోనూ ఉండదనీ, దానికోసం ప్రయత్నిస్తూ సాగిపోవడమే జీవితమనీ ఈ నవల బోధిస్తుంది.

**పాకుడురాళ్లు (రావూరి భరద్వాజ)**

ఒక సాధారణ యువతి గొప్ప సినీనటిగా ఎదిగిన క్రమంలో ఆమె జీవనయానంలోని స్థితిగతులు అత్యంత కరుణ రసాత్మకంగా చిత్రీకరించబడ్డ గ్రంథరాజం ఇది. జ్ఞానపీఠ అవార్డుకు నోచుకొని తెలుగు బావుటాను ఎగురవేసిన ఈ నవలలోని మంజరి పాత్ర ఉత్థాన పతనాలను చదువుతుంటే జీవితం పట్ల ఒక చిత్రమైన సానుభూతితో కూడిన అవగాహన ఏర్పడుతుంది. హర్ష విషాదాల నడుమ సాగిపోయే జీవన చిత్రం– చివరికి మిగిలేదేమీ లేదనే సత్యంతో పాటు పాఠకులను ఒక ద్వంద్వాతీత స్థితికి తీసుకువెడుతుంది. 'ప్రేమించకబడకపోవడం కంటే దుఃఖం, దారిద్ర్యం ఏముంది?' అని మంజరి ప్రశ్నిస్తున్నట్లనిపిస్తుంది.

**ఒక యోగి ఆత్మకథ**
**(పరమహంస యోగానంద)**

'మనసుకు, ఆత్మకు ఉన్న కిటికీలను తెరిచే పుస్తకం'గా కీర్తింపబడిన ఈ పరమహంస యోగానంద ఆత్మకథ జిజ్ఞాసువులందరూ చదవాల్సిన ఆధ్యాత్మిక పరిమళాల గ్రంథం. చదువినకొద్దీ వశపరుచుకునే మహత్తర పుస్తకం. ఈ అసాధారణమైన కథ మనలో నిద్రాణమైవున్న జ్ఞానతృష్ణను మేలుకొల్పుతుంది.

**మోరీతో మంగళవారాలు (మిచ్ ఆల్బం)**

మిచ్ ఆల్బం ఆంగ్లరచన ట్యూజ్‌డేస్ విత్ మోరీకి ఇది తెలుగు అనువాదం. అనువాదకులు డాక్టర్ పద్మిని, ప్రొఫెసర్ నరసింహారావు. జీవించడం తెలియాలంటే మరణించడం ఎలాగో తెలియాలని తెలుసుకున్న మానవతావాది మోరీ. ఈ అద్భుత గురువుకు ఆత్మీయ విద్యార్థి మిచ్ ఆల్బం. గురువుతో అర్థవంతంగా పంచుకున్న మంగళవారాల గాథలను మిచ్ కరుణరసాత్మకంగా చిత్రించిన తీరు అమోఘం! 'జీవితానికి అర్థం తెలుసుకోవడానికి మార్గం, ఇతరుల్ని ప్రేమించడానికి అంకితమవడం' అనే వినూత్న సందేశాన్నిచ్చిన ఈ పుస్తకం మళ్లీ మళ్లీ చదివింపజేస్తుంది.

### గ్రహం అనుగ్రహం

శ్రీ హేవిళంబి నామ సంవత్సరం, దక్షిణాయనం, హేమంత ఋతువు, మార్గశిర మాసం. తిథి బ.పాడ్యమి రా.7.55 వరకు, తదుపరి విదియ. నక్షత్రం రోహిణి ఉ.8.33 వరకు, తదుపరి మృగశిర. వర్జ్యం ప.1.45 నుంచి 3.14 వరకు. దుర్ముహూర్తం ప.12.11 నుంచి 12.55 వరకు, తదుపరి ప.2.22 నుంచి 3.07 వరకు. అమృత ఘడియలు ఉ.7.01 నుంచి8.44 వరకు.

**సూర్యోదయం** : 6.19
**సూర్యాస్తమయం** : 5.21
**రాహుకాలం** : ఉ.7.30 నుంచి 9.00 వరకు
**యమగండం** : ఉ.10.30 నుంచి 12.00 వరకు

### నమాజ్ వేళలు

| | |
|---|---|
| ఫజర్ | 5.15 |
| జొహర్ | 12.06 |
| అసర్ | 4.05 |
| మగ్రీబ్ | 5.41 |
| ఇషా | 6.58 |


మీకు సాక్షి దినపత్రిక అందడంలో ఏమైనా ఇబ్బందులున్నా లేక సాక్షి బదులుగా ఇతర దినపత్రికలు వేస్తున్న యెడల టోల్ ఫ్రీ నెంబర్‌కు ఉ. 7.00 గం.ల నుండి రా. 8.00 గం.ల లోపు తెలుపగలరు. వెంటనే తగు చర్యలు తీసుకోబడును. టోల్ ఫ్రీ నం: 1800 270 1083

# పోలవరంపై విచారణ జరిపితే చంద్రబాబు జైలుకే

## 'మీట్ ది ప్రెస్'లో మాజీ ఎంపీ ఉండవల్లి అరుణ్‌కుమార్

**సాక్షి, అమరావతిబ్యూరో:** 'రాష్ట్రానికి జీవనాడి వంటి పోలవరం ప్రాజెక్టుకు చంద్రబాబు ప్రభుత్వ అవినీతే శాపంగా మారింది. టెండర్ల ప్రక్రియ కంటే ముందే కాంట్రాక్టరును నిర్ణయించేస్తున్నారు. పేపర్లలో టెండరు ప్రకటనకు వెబ్‌సైట్‌లో పెట్టిన వివరాలకు పొంతన ఉండటం లేదు. పోలవరం ప్రాజెక్టు విషయంలో చంద్రబాబు ప్రభుత్వ వ్యవహారాలను కేంద్రం రికార్డు చేస్తోంది. నిర్మాణంలో జరుగుతున్న అవినీతిపై విచారణ జరిపితే చంద్రబాబు, మంత్రులు జైలుకు వెళ్లాల్సి ఉంటుంది. బీజేపీ కూడా అదే విషయాన్ని స్పష్టం చేసింది. ప్రాజెక్టుపై కేంద్రానికి వ్యతిరేకంగా రాద్ధాంతం చేయాలని చూస్తే సీఎం, మంత్రులతోసహా అందరూ జైలుకు వెళ్తారు జాగ్రత్త అని ఆ పార్టీ అధికార ప్రతినిధి హెచ్చరించడమే ఇందుకు నిదర్శనం' అని మాజీ ఎంపీ ఉండవల్లి అరుణ్ కుమార్ అన్నారు. విజయవాడలో ఆదివారం నిర్వహించిన 'మీట్ ది ప్రెస్' కార్యక్రమంలో పోలవరం ప్రాజెక్టు, కాపుల రిజర్వేషన్ అంశాలపై ఆయన ప్రధానంగా మాట్లాడారు. వివరాలు ఆయన మాటల్లోనే..

**అవినీతి కోసమే ప్రాజెక్టు తీసుకున్నారు**

పోలవరం ప్రాజెక్టుకు దివంగత ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖరరెడ్డి అన్ని అనుమతులు సాధించారు. 35 శాతం పనులు పూర్తి చేశారు కూడా. జాతీయ ప్రాజెక్టు అయిన పోలవరాన్ని చంద్రబాబు ప్రభుత్వ తామే కడతామని తీసుకోవడం పొరపాటు. అవినీతి కోసమే ఇలా చేశారు. 2015 జనవరిలో రాష్ట్ర ప్రభుత్వం ప్రాజెక్టు తీసుకుంటే ఆ ఏడాది జూలై నాటికి కేవలం 3 శాతం పనులు మాత్రమే పూర్తయ్యాయని అప్పటి గోదావరి అథారిటీ సీఈవోగా ఉన్న ప్రస్తుత రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి దినేష్‌కుమార్ నివేదిక ఇచ్చారు. ఇప్పటికీ పరిస్థితిలో పెద్దగా మార్పేమీ లేదు. వైఎస్ హయాంలో చేసిన పనులు, పట్టిసీమ, పురుషోత్తపట్నం పనులు కలిపి తాము 58 శాతం పనులు చేశామని చంద్రబాబు ప్రభుత్వం ప్రజలను తప్పుదారి పట్టిస్తోంది.



విలేకర్లతో మాట్లాడుతున్న ఉండవల్లి అరుణ్‌కుమార్

**ఎత్తిపోతలతో పోలవరం నిర్వీర్యం**

పోలవరం ప్రాజెక్టును నీరుగారుస్తూ చంద్రబాబు ప్రభుత్వం పట్టిసీమ, పురుషోత్తపట్నం ప్రాజెక్టులను చేపట్టింది. ఎత్తిపోతల పథకాలైన పట్టిసీమ కోసం రూ. 1,600 కోట్లు, పురుషోత్తపట్నం కోసం రూ. 1,800 కోట్లు రాష్ట్రం వెచ్చించింది. ఆ నిధులే పోలవరం ప్రాజెక్టు కోసం ఖర్చు చేసి ఉంటే ఈ పాటికి ప్రాజెక్టు పనులు మూడొంతులు పూర్తయేవి. పట్టిసీమ నిర్మించారు కదా పోలవరం ప్రాజెక్టు ఎందుకని ఒడిశా ప్రశ్నించింది. అవినీతి కోసమే పట్టిసీమ ప్రాజెక్టు చేపట్టారని కేంద్రం కూడా భావిస్తున్నట్లుగానే ఉంది. కానీ పోలవరం ప్రాజెక్టుపై కేంద్రం కొర్రీలకు వైఎస్సార్‌సీపీ కారణమని తప్పుడు ప్రచారం చేయడం విడ్డూరం.

**పేపర్లో ఒకటి ఈ-ప్రొక్యూర్‌మెంట్‌లో మరొకటా?**

పోలవరం కాంట్రాక్టు కోసం నవంబర్ 22న పత్రికల్లో ప్రకటన ఇచ్చి పూర్తి వివరాల కోసం వెబ్‌సైట్ చూడమన్నారు. కొన్ని రోజుల గడిచాక వెబ్‌సైట్‌లోకి వివరాలు అప్‌లోడ్ చేశారు. పత్రికల్లో ఇచ్చిన వివరాలకు, ఈ-ప్రొక్యూర్‌మెంట్‌లో వివరాలకు వ్యత్యాసం ఉంది. టెండర్ల దాఖలుకు 45 రోజులు గడువని పత్రికల్లో పేర్కొంటే.. ఈ ప్రొక్యూర్‌మెంట్‌లో కేవలం మూడు వారాలే గడువు ఇచ్చారు. పత్రికల్లో రూ.1,300 కోట్లు టెండరు అన్నారు. ఈ-ప్రొక్యూర్‌మెంట్‌లో దానిని రూ. 1,400 కోట్లకు పెంచారు. అంతా ఉత్తుత్తి టెండరే అని తెల్సిపోతోంది. ముందే కాంట్రాక్టరును నిర్ణయించేశారు. అందుకే కేంద్రం టెండరు ప్రక్రియను నిలిపివేయాలని ఆదేశించింది. రాష్ట్ర ప్రభుత్వ అవినీతి, అసంబద్ధ విధానాల వల్ల రాష్ట్రం అప్పులు ఊబిలోకి కూరుకుపోతోంది. 2014 నాటికి రూ. 96 వేల కోట్లు ఉన్న అప్పులు 2017 నాటికి రూ. 2.16 లక్షల కోట్లకు పెరిగాయి.

### చైర్మన్ నివేదిక లేకుండానే కాపులకు రిజర్వేషనా?

కాపుల రిజర్వేషన్ అంశంలో చంద్రబాబు ప్రభుత్వ వైఖరి అసంబద్ధంగా ఉంది. న్యాయమూర్తి హోదా ఉన్న కమిషన్ చైర్మన్ మంజునాథ్ నివేదిక ఇవ్వకుండానే అసెంబ్లీలో బిల్లు ఎలా ప్రవేశపెడతారు? వైఎస్సార్‌సీపీ ఎమ్మెల్యేలు, ఎంపీలను కొనుగోలు చేసినట్లు కమిషన్ నివేదికలను కూడా చేసేయొచ్చు అని చంద్రబాబు భావిస్తున్నట్లున్నారు. 2014 నుంచి అన్ని కమిటీలు, కమిషన్ల విషయంలో చంద్రబాబు ఇలానే అడ్డగోలుగా వ్యవహరిస్తున్నారు. గోదావరి పుష్కరాల్లో తొక్కిసలాట విషయంలో సోమయాజుల కమిషన్ నోటీసులు ఇస్తే ప్రభుత్వం కనీసం సమాధానమే చెప్పలేదు. రాజధాని ఎంపికలో శివరామకృష్ణన్ కమిటీ నివేదికను పక్కనపడేశారు. వడ్డీ వ్యాపారుల ఆగడాలను అరికట్టడానికి కేఎస్ అప్పారావు కమిటీని నియమించారు. ఆయన ఆ బాధ్యతలు స్వీకరించలేదు. మరో కమిటీ వేయకుండానే తమ ఇష్టానుసారంగా అసెంబ్లీలో బిల్లు పెట్టారు. చంద్రబాబు నియంతలా వ్యవహరిస్తున్నారు. ప్రజలు అన్నీ గమనిస్తున్నారు. సాధారణ ఎన్నికల్లో డబ్బు ప్రభావం ఉండదు. మహా మహా నియంతలే కాలగర్భంలో కలసిపోయారని ఆయన గుర్తుంచుకోవాలి.

# వ్యవసాయ పరికరాల పంపిణీలో అక్రమాలు

- ఆన్‌లైన్‌లో కనిపించని పంపిణీ సంస్థలు, పరికరాల వివరాలు
- చక్రం తిప్పుతున్న మండల వ్యవసాయ అధికారులు
- రైతులకు దక్కని నాణ్యమైన పరికరాలు

**సాక్షి, అమరావతి:** రాష్ట్రంలో రైతులకు రాయితీపై అందజేసే వ్యవసాయ పరికరాల పంపిణీలో అక్రమాలు చోటుచేసుకుంటున్నాయి. ఆన్‌లైన్ విధానాన్ని ఆలంబనగా చేసుకుని వ్యవసాయశాఖ అధికారులు, పంపిణీ సంస్థలవారు కుమ్మక్కై రైతులను నిలువుదోపిడీ చేస్తున్నారు. పంపిణీ సంస్థలు, పరికరాల వివరాలు, వాటి ధరలు, రాయితీ తదితర వివరాలు వ్యవసాయశాఖ, ఆగ్రోస్ వెబ్‌సైట్‌లలో కనిపించకుండా చేస్తున్నారు. కొద్దిగా చదువుకున్న రైతులు తమకు అవసరమైన పరికరాలను కొనుగోలు చేసేందుకు 'మీ సేవ' కేంద్రాల్లో దరఖాస్తు చేసుకుంటుంటే, మిగతా రైతులు ఆన్‌లైన్‌లో దరఖాస్తు చేసుకునే విధానం తెలియక మండల వ్యవసాయశాఖ అధికారులను సంప్రదిస్తున్నారు. ఆ అధికారులు అప్పటికే కొన్ని పంపిణీ, పరికరాల తయారీ సంస్థలతో లోపాయికారీ ఒప్పందం చేసుకుని ఉండటంతో రైతు అభిప్రాయంతో నిమిత్తం లేకుండా తమకు అనుకూలమైన పంపిణీ సంస్థలు, పరికరాలకు దరఖాస్తు చేయిస్తున్నారు. ఫలితంగా మండల వ్యవసాయ అధికారులకు పర్సంటేజీలు అధికంగా ఇచ్చే సంస్థల పరికరాలే అమ్ముడుపోతున్నాయి. కాగా, మొత్తం రూ.220 కోట్ల విలువైన పరికరాల పంపిణీకి వ్యవసాయ శాఖ రైతులనుంచి ఆన్‌లైన్‌లో దరఖాస్తులు ఆహ్వానిస్తే ఇప్పటివరకు రూ.50 కోట్ల విలువైన పరికరాలకోసం రైతులు దరఖాస్తు చేసుకున్నారు.

**వెబ్‌సైట్‌లలో కనిపించని వివరాలు..**

రాష్ట్ర వ్యవసాయశాఖ ఏటా రూ.500 కోట్ల నుంచి రూ.700 కోట్ల విలువైన వ్యవసాయ పరికరాల్ని రైతులకు రాయితీపై సరఫరా చేస్తోంది. ట్రాక్టర్లు, ఆయిల్ ఇంజన్లు, వాటర్ పంపులు, తైవాన్ స్ప్రేయర్లు, చాప్‌కట్టర్స్, స్ప్రింక్లర్లు, వరికోత, నూర్పిడి యంత్రాలు వంటి పరికరాలపై 30 నుంచి 50% వరకు ప్రభుత్వం రాయితీ ఇస్తోంది. రాష్ట్ర వ్యవసాయశాఖ జూన్, జూలై నెలల్లోనే పరికరాల పంపిణీ సంస్థల్ని ఖరారుచేసి రైతుల నుంచి ఆన్‌లైన్‌లో దరఖాస్తులు ఆహ్వానించాల్సి ఉండగా.. ఈసారి నవంబర్ నుంచి గానీ ఈ ప్రక్రియను చేపట్టలేదు. ఇప్పటికే ఖరీఫ్ సీజన్ పూర్తవడంతో కొందరు రైతులు వాటి కొనుగోలుకు ఆసక్తి చూపట్లేదు. మిగతా రైతులు తమకు అవసరమైన పరికరాలకోసం వ్యవసాయశాఖ, ఆగ్రోస్ సంస్థల వివరాలకోసం వెబ్‌సైట్‌లను పరిశీలిస్తున్నారు. అయితే వాటిల్లో పరికరాలు, పంపిణీ సంస్థల వివరాలు కనిపించట్లేదు. ఆ పరికరాల పంపిణీకి ఎన్ని సంస్థలకు అనుమతిచ్చిందీ, వాటి రేట్లు.. రాయితీ లాంటి వివరాలు కనిపించట్లేదు. దీంతో రైతులు తప్పనిసరై వ్యవసాయశాఖ అధికారుల్ని సంప్రదించి.. వారు సూచించిన సంస్థల పరికరాలకే దరఖాస్తు చేసుకోవాల్సి వస్తోంది. దీనివల్ల నాణ్యమైన పరికరాలు రైతులకు అందుబాటులోకి రాని పరిస్థితి నెలకొంది.

# శ్రీవారిని దర్శించుకున్న మద్రాస్ హైకోర్టు సీజే

## హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ నాగార్జునరెడ్డి కూడా



శ్రీవారి ఆలయం వద్ద కుటుంబ సభ్యులతో జస్టిస్ ఇందిరా బెనర్జీ, జస్టిస్ నాగార్జునరెడ్డి

**సాక్షి, తిరుమల/నెల్లూరు (బృందావనం):** మద్రాస్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ ఇందిరాబెనర్జీ, తెలుగు రాష్ట్రాల ఉమ్మడి హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ సి.వి.నాగార్జునరెడ్డి ఆదివారం తిరుమల శ్రీవారిని దర్శించుకున్నారు. ఉదయం నైవేద్య విరామ సమయంలో వారు కుటుంబ సభ్యులతో కలసి వేర్వేరుగా ఆలయానికి విచ్చేశారు. తర్వాత వారు శ్రీవారిని, వకుళమాతను దర్శించుకుని హుండీలో కానుకలు సమర్పించారు. అనంతరం రంగనాయకుల మండపంలో జస్టిస్ ఇందిరాబెనర్జీ, జస్టిస్ నాగార్జునరెడ్డికి వేదపండితులు ఆశీర్వచనం చేయగా డెప్యూటీ ఈవో హరీంద్రనాథ్ లడ్డూ, ప్రసాదాలు అందజేశారు. వారి వెంట చిత్తూరు జిల్లా జడ్జి దుర్గారావు, ప్రోటోకాల్ జడ్జి సన్యాసినాయుడు ఉన్నారు. కాగా, నెల్లూరు రంగనాయకులపేటలోని శ్రీదేవి, భూదేవి సమేత తల్పగిరి రంగ నాథస్వామిని కూడా హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ నాగార్జునరెడ్డి దంపతులు దర్శించుకున్నారు.

# కాశీలో శారదాపీఠం శాఖ ప్రారంభం

## పాల్గొన్న స్వరూపానందేంద్ర సరస్వతి



కాశీలో శారదాపీఠం శాఖ ప్రారంభోత్సవంలో స్వరూపానందేంద్ర

**పెందుర్తి:** పవిత్ర గంగానదీ తీరం సమీపంలోని కాశీ (వారణాసి)లో నూతనంగా నిర్మించిన శారదాపీఠం శాఖను విశాఖ శ్రీశారదా పీఠాధిపతి స్వరూపానందేంద్ర సరస్వతి మహాస్వామీ చేతుల మీదుగా ఆదివారం ప్రారంభించారు. ముందుగా గంగానదీ స్నానమాచరించి కాశీ విశ్వేశ్వరుడు, విశాలాక్షి, అన్నపూర్ణాదేవి దేవాలయాలను సందర్శించి దేవతామూర్తులను దర్శించుకున్నారు. అనంతరం శారదాపీఠం శాఖలోకి పీఠం మర్యాదలతో స్వామీజీని ప్రతినిధులు, వేదపండితులు ఆహ్వానించారు. శాస్త్రోక్తంగా పీఠం భవనాన్ని ప్రారంభించారు. స్వామీజీ అనుగ్రహభాషణ చేస్తూ కాశీ క్షేత్రంలో నివసించే దండి స్వాములకు వారానికికోసారి యతిభిక్ష (అన్నదానం) ఏర్పాటు చేయాలని పీఠం ప్రతినిధులకు సూచించారు. దత్త జయంతి సందర్భంగా పీఠంలో అన్నదాన కార్యక్రమాన్ని స్వామీజీ చేతుల మీదుగా ప్రారంభించారు. దండిస్వాములకు భిక్ష పెట్టి దక్షిణలు అందజేశారు. కార్యక్రమంలో ఉత్తర పీఠాధిపతి బాలస్వామి, ధర్మాధికారి జి.కామేశ్వరశర్మ, ఆస్థాన పండితుడు కృష్ణశర్మ, శారదాపీఠం ట్రస్టీ రొబ్బి శ్రీనివాస్, కాశీ శారదాపీఠం శాఖ భవనం మేనేజర్ పి.కిశోర్‌కుమార్ తదితరులు పాల్గొన్నారు.

# పార్టీ కార్యక్రమాలను ప్రజల్లోకి తీసుకుపోవాలి

## వైఎస్ జగన్ రాజకీయ కార్యదర్శి సజ్జల రామకృష్ణారెడ్డి



వైఎస్‌ఆర్‌సీపీ ఎంపీ, ఎమ్మెల్యేలతో మాట్లాడుతున్న సజ్జల రామకృష్ణారెడ్డి

**కడప కార్పొరేషన్:** వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ నిర్వహిస్తున్న కార్యక్రమాలను విస్తృతంగా ప్రజల్లోకి తీసుకుపోవాలని వైఎస్ జగన్ రాజకీయ కార్యదర్శి సజ్జల రామకృష్ణారెడ్డి సూచించారు. ఆదివారం వైఎస్సార్ జిల్లా కడపలోని వైఎస్‌ఆర్‌సీపీ కార్యాలయంలో ఎంపీ వైఎస్ అవినాష్‌రెడ్డి, ఎమ్మెల్సీ, ఎమ్మెల్యేలతో నిర్వహించిన సమావేశంలో పార్టీ కార్యక్రమాలైన వైఎస్‌ఆర్ కుటుంబం, గడప గడపకు వైఎస్‌ఆర్ కాంగ్రెస్, రచ్చబండ, పల్లెనిద్ర వంటి కార్యక్రమాల అమలుపై సమీక్షించారు. వీటిని మరింత మెరుగ్గా నిర్వహించడానికి సలహాలు, సూచనలు స్వీకరించారు. ఈ కార్యక్రమంలో కడప, రాజంపేట పార్లమెంటు నియోజకవర్గాల పార్టీ జిల్లా అధ్యక్షులు కొత్తమద్ది సురేష్‌బాబు, ఆకేపాటి అమర్‌నాథ్ రెడ్డి, ఎమ్మెల్సీ డీసీ గోవిందరెడ్డి, ఎమ్మెల్యేలు శెట్టిపల్లె రఘురామిరెడ్డి, పి. రవీంద్రనాథ్‌రెడ్డి, కొరుముట్ల శ్రీనివాసులు, ఎస్‌బి అంజద్‌బాషా, జమ్మలమడుగు, బద్వేల్ సమన్వయకర్తలు డాక్టర్ సుధీర్‌రెడ్డి, డాక్టర్ వెంకటసుబ్బయ్య, పార్టీ రాష్ట్ర కార్యదర్శి దేవిరెడ్డి శివశంకర్‌రెడ్డి, నగర అధ్యక్షుడు పులి సునీల్‌కుమార్ పాల్గొన్నారు.

# అధికారంతో అడ్డంకులు సృష్టిస్తున్నారు

- ఏ నాయకుడిపైనా వాడని స్థాయిలో కార్యనిర్వాహక, న్యాయ, శాసన వ్యవస్థలను జగన్‌పై ప్రయోగించారు
- ఎన్ని విధాలుగా వేధించినా ఆయన చేపట్టిన సుదీర్ఘ ప్రయాణం ఆగబోదు
- విశాఖలో పార్టీ రాజకీయ శిక్షణ తరగతుల ప్రారంభంలో విజయసాయిరెడ్డి
- రాష్ట్రంలో తొలిసారిగా విశాఖ నుంచే శ్రీకారం వారంపాటు కొనసాగనున్న శిక్షణ శిబిరం





పార్టీ శిక్షణ తరగతుల ప్రారంభ కార్యక్రమంలో మాట్లాడుతున్న విజయసాయిరెడ్డి. చిత్రంలో పార్టీనేతలు ఉమ్మారెడ్డి, చెవిరెడ్డి, ధర్మాన తదితరులు

**సాక్షి, విశాఖపట్నం/గాజువాక:** మహానేత వైఎస్సార్ మరణించిన 2009 సెప్టెంబర్ 2 నుంచి ఇప్పటివరకు వైఎస్సార్ కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడు వైఎస్ జగన్‌మోహన్‌రెడ్డి వేస్తున్న ప్రతి అడుగుకూ అధికారం, రాజకీయమనే ఆయుధాలతో అడ్డంకులు సృష్టిస్తున్నారని ఆ పార్టీ జాతీయ ప్రధాన కార్యదర్శి, రాజ్యసభ సభ్యుడు వి.విజయసాయిరెడ్డి అన్నారు. దేశంలో అత్యంత శక్తివంతమైన కార్యనిర్వాహక వ్యవస్థను, న్యాయవ్యవస్థను, శాసన వ్యవస్థను ఇతర ఏ రాజకీయ నాయకుడిపైనా వాడని, వాడకూడని స్థాయిలో జగన్‌మోహన్‌రెడ్డిపై ఉపయోగించారన్నారు. ఆయన్ను రాజకీయంగా, భౌతికంగా నేలకూల్చాలన్న ఉద్దేశంతో దుష్టచర్యకు పూనుకున్నారన్నారు. ఎన్ని విధాలుగా వేధించినా జగన్‌మోహన్‌రెడ్డి ప్రారంభించిన ఈ సుదీర్ఘ ప్రయాణం ఆగబోదని ఆయన స్పష్టం చేశారు. స్థానిక గ్రీన్‌సిటీ ఫంక్షన్ హాల్‌లో ఆదివారం ప్రారంభమైన వైఎస్సార్‌సీపీ పోలింగ్‌బూత్ స్థాయి పార్టీ శ్రేణుల శిక్షణ శిబిరంలో ఆయన ప్రసంగించారు. తాను వైఎస్ కుటుంబంతో 35 ఏళ్లపాటు ప్రయాణం చేశానన్నారు. ఈ ప్రయాణం తనకెంతో సంతృప్తినిచ్చిందని, గర్వంగానూ ఉందని తెలిపారు. తమపై 22 కేసులు పెట్టి వేధించారని తెలిపారు. అయినప్పటికీ ప్రజాప్రయోజనాలకోసం, రాష్ట్ర ప్రయోజనాలకోసమే పోరాడామని, ఎవరిముందూ తలదించలేదని, ఇకపైనా తల దించబోమని స్పష్టం చేశారు. ఒక్కసారి అవకాశమిస్తే 30 ఏళ్లపాటు ప్రజలే ఎన్నుకొనేలా గొప్ప పాలన అందించే సత్తా ఉన్న నాయకుడు వైఎస్ జగన్ అని పేర్కొన్నారు.

**విశాఖ నుంచి శ్రీకారం:** వైఎస్సార్‌సీపీ విశాఖ జిల్లా రాజకీయ శిక్షణా తరగతులు ఆదివారం ఉత్సాహపూరిత వాతావరణంలో ప్రారంభమయ్యాయి. వైఎస్సార్‌సీపీ ఆవిర్భావం తరువాత రాష్ట్రంలోనే తొలిసారిగా విశాఖలో ఏర్పాటు చేసిన ఈ కార్యక్రమానికి నిర్దేశిత నియోజకవర్గాల నుంచి పోలింగ్‌బూత్ కన్వీనర్లు, మండల కన్వీనర్లు, వార్డుల అధ్యక్షులు, ప్రతినిధులు భారీసంఖ్యలో హాజరయ్యారు. ఏడురోజులపాటు కొనసాగనున్న ఈ తరగతుల్లో విశాఖ, అనకాపల్లి పార్లమెంట్ నియోజకవర్గాలకు సంబంధించి రోజుకు రెండు అసెంబ్లీ సెగ్మెంట్లకు చెందిన బూత్ కమిటీల కన్వీనర్లకు రెండు హాళ్లలో శిక్షణనిస్తున్నారు. తొలిరోజు పార్టీ జెండా ఆవిష్కరణ, దివంగత సీఎం వైఎస్సార్‌కు నివాళులర్పించాక మాజీమంత్రి ధర్మాన ప్రసాదరావు జ్యోతి ప్రజ్వలనతో కార్యక్రమాన్ని ప్రారంభించారు. శిక్షణా శిబిరం విశిష్టతను విజయసాయిరెడ్డి, శిక్షణా శిబిర పాఠ్యాంశాలను శాసనమండలిలో ప్రతిపక్ష నేత ఉమ్మారెడ్డి వెంకటేశ్వర్లు వివరించారు.

**నాలుగు ప్రధానాంశాలపై శిక్షణ**

-మొదటి అంశంగా.. పార్టీ ఆవిర్భావం గురించి వివరించారు.
-రెండో అంశంగా.. బూత్, మండల కమిటీ కన్వీనర్లతోపాటు పార్టీ క్షేత్రస్థాయి కార్యకర్తలు, కిందినుంచి పైస్థాయి శ్రేణులు ఎన్నికలకు ముందు, ఎన్నికల రోజు, ఆ తర్వాత కౌంటింగ్ వరకు నిర్వహించాల్సిన బాధ్యతల్ని బోధించారు.
-మూడో అంశంగా.. స్థానిక సంస్థలు, స్థానిక ప్రభుత్వాలు, పంచాయతీరాజ్ వ్యవస్థ గురించి, దీనిని టీడీపీ ప్రభుత్వం జన్మభూమి కమిటీల పేరుతో ఎలా నీరుగారుస్తోంది? తదితర అంశాలు, వాటికి నివారణోపాయాలపై బోధన సాగింది.
-నాలుగో అంశంగా... వ్యక్తిత్వ వికాసాన్ని వివరించారు.

# ఓయూలో విద్యార్థి ఆత్మహత్య

**సాక్షి, హైదరాబాద్:** ఒత్తిడి తట్టుకోలేక ఉస్మానియా విశ్వవిద్యాలయంలో విద్యార్థి ఆత్మహత్య చేసుకున్నాడు. ఓయూ వసతి గృహంలోని బాత్‌రూమ్‌లో ఉరేసుకుని ఎంఎస్సీ ఫిజిక్స్ ఫస్ట్ ఇయర్‌కు చెందిన మురళి బలవన్మరణానికి పాల్పడ్డాడు. తాను చదవలేకపోతున్నానని, పరీక్షల ఒత్తిడి తట్టుకోలేక ఆత్మహత్యకు పాల్పడుతున్నట్లు రాసి ఉన్న ఓ సూసైడ్ నోట్‌ను పోలీసులు స్వాధీనం చేసుకున్నారు. ఇది ముమ్మాటికి ప్రభుత్వ హత్యేనంటూ విద్యార్థి సంఘాల ఆందోళనతో వర్సిటీ ప్రాంగణం ఉద్రిక్తంగా మారింది.

**షూ లేస్.. ప్లాస్టిక్ తాడు:** సిద్దిపేట జిల్లా జగదేవ్‌పూర్ మండలం దౌలాపూర్‌కు చెందిన ఈరమైన మల్లేశం, లక్ష్మి దంపతులకు ఇద్దరు కుమారులు, కుమార్తె. చిన్నప్పుడే తండ్రి చనిపోవడంతో తల్లి లక్ష్మి కూలి పని చేసి రెండో కుమారుడు మురళిని చదివించింది. 2017 -18లో సైన్స్ కాలేజీలో ఎంఎస్సీ ఫిజిక్స్ ఫస్టియర్‌లో అడ్మిషన్ పొందాడు. క్యాంపస్‌లోని మానేరు హాస్టల్ రూం నంబర్ 159లో వసతి పొందుతున్నాడు. ఆదివారంఉదయం విద్యార్థులు స్నానాల గదిని తెరిచి చూడగా షూ లేస్, దుస్తులు ఆరేసుకునే ప్లాస్టిక్ తాడుతో ఉరేసుకుని మురళి విగత జీవిగా కనిపించాడు. దీంతో విద్యార్థులు ప్రభుత్వానికి వ్యతిరేకంగా నినాదాలు చేశారు. నేడు ఓయూ బంద్‌కు విద్యార్థి సంఘాలు పిలుపునిచ్చాయి.

# పలువురు తెలుగు వారికి జాతీయ దివ్యాంగ పురస్కారాలు

## ఢిల్లీలో ప్రదానం చేసిన రాష్ట్రపతి రామ్‌నాథ్ కోవింద్



రాష్ట్రపతి నుంచి అవార్డు అందుకుంటున్న జ్యోత్స్న ఫణిజ

**సాక్షి, న్యూఢిల్లీ/కైకలూరు:** తెలుగు రాష్ట్రాలకు చెందిన పలువురు వ్యక్తులకు, సంస్థలకు జాతీయ దివ్యాంగ పురస్కారాలు దక్కాయి. దివ్యాంగుల దినోత్సవాన్ని పురస్కరించుకొని వారి సాధికారత కోసం పనిచేస్తున్న సంస్థలకు, వ్యక్తులకు కేంద్ర సామాజిక న్యాయ మంత్రిత్వ శాఖ అవార్డులను ప్రదానం చేసింది. రాష్ట్రపతి రామ్‌నాథ్ కోవింద్ ఆదివారం ఢిల్లీలో జరిగిన కార్యక్రమంలో అవార్డులు అందజేశారు. చూపులేకపోయినా 25 ఏళ్లకే పీహెచ్‌డీ సాధించడంతోపాటు 'సిరామిక్ ఈవెనింగ్' శీర్షికన రచించిన కవితా సంపుటికి గాను కృష్ణా జిల్లా కైకలూరుకు చెందిన జ్యోత్స్న ఫణిజకు అవార్డు దక్కింది. వ్యక్తిగత వృత్తిలో రాణింపునకు గుర్తింపుగా చిత్తూరు జిల్లా కొంగారెడ్డిపల్లికి చెందిన కేవీ శిరీష, కరీంనగర్ జిల్లా చిర్తకుంటకు చెందిన సాయి కృష్ణలకు అవార్డులు దక్కాయి. దివ్యాంగులకు అనువైన పరిసరాల ఏర్పాటు విభాగంలో శ్రీకాకుళం సర్వ శిక్షా అభియాన్ జిల్లా ప్రాజెక్టు ఆఫీసుకు అవార్డు దక్కింది. దివ్యాంగులకు ఉద్యోగ కల్పనకు తోడ్పడుతున్న హైదరాబాద్‌కు చెందిన యూత్ ఫర్ జాబ్స్ ఫౌండేషన్‌కు, అలాగే సికింద్రాబాద్‌కు చెందిన 'దేవ్నార్ ఫౌండేషన్ ఫర్ ద బ్లైండ్' సంస్థలకు అవార్డులు దక్కాయి. రోల్ మోడల్ అవార్డుల విభాగంలో సికింద్రాబాద్‌కు చెందిన కె.శేషగిరిరావు, అదిలాబాద్‌కు చెందిన ఆకుల రోహిత్‌లు అవార్డులు అందుకున్నారు. అలాగే దివ్యాంగుల జీవిత కాలాన్ని పెంచేలా వారికి అవసరమైన ఉత్పత్తులను అందుబాటు ధరల్లో తేవడంపై జరిపిన పరిశోధనలకుగానూ హైదరాబాద్‌కు చెందిన బిశ్వజిత్ రాయ్, ఆశ దాస్, విజయ్‌కుమార్ అలిషాలకు అవార్డులు దక్కాయి. దివ్యాంగుల సంక్షేమ అవార్డును ఈ ఏడాదికిగానూ మెడ్ ఇండియా వ్యవస్థాపకుడు పద్మశ్రీ డా.టీఎస్ చంద్రశేఖర్ అందుకున్నారు.

# 'కాపు రిజర్వేషన్ బిల్లు కేంద్రానికి పంపించాం'

**శ్రీకాకుళం పాతబస్టాండ్:** కాపులను వెనుకబడిన కులాల(బీసీ) జాబితాలో చేరుస్తూ రాష్ట్ర శాసనసభ ఆమోదం తెలిపిన బిల్లును కేంద్రానికి పంపించామని మంత్రి కిమిడి కళావెంకటరావు తెలిపారు. ఆదివారం శ్రీకాకుళంలోని ఆర్ అండ్ బీ వసతి గృహంలో ఆయన విలేకరులతో మాట్లాడారు. రిజర్వేషన్లు 50 శాతానికి మించిపోవడంతో ఈ బిల్లుకు కేంద్ర ఆమోదం తప్పనిసరని, అందుకే పంపించామని వివరించారు. కాపులను బీసీ ఎఫ్ కేటగిరీలో చేర్చి 5% రిజర్వేషన్లు కల్పించామని, దీని వల్ల ప్రస్తుతమున్న బీసీలకు ఎలాంటి అన్యాయం జరగదని చెప్పారు. ఉమ్మడి రాష్ట్రంలో బీసీల జాబితాలో ఉన్న 27 కులాలను తెలంగాణ ప్రభుత్వం ఓసీల జాబితాలో చేర్చిందని, దీనిపై మాట్లాడని ఆర్.కృష్ణయ్య, ఏపీలో బీసీలకు అన్యాయం జరిగిందని అనడం విచారకరమన్నారు.

## భవిష్యత్‌లో విద్యుత్ కార్లదే హవా

### ఓఎన్‌జీసీ డైరెక్టర్ వేద్ ప్రకాశ్ మహావర్

**రాజమహేంద్రవరం రూరల్:** విద్యుత్ కార్ల ఆవిర్భావంతో ప్రపంచంలో ఆయిల్, గ్యాస్ అవసరాలు తగ్గుతాయని, భవిష్యత్తులో విద్యుత్ కార్ల వినియోగం పెరుగుతుందని ఓఎన్‌జీసీ డైరెక్టర్ (ఆన్‌షోర్) వేద్ ప్రకాశ్ మహావర్ అభిప్రాయపడ్డారు. ఆయిల్ పరిశ్రమపై రెండు రోజుల సాంకేతిక సదస్సును ఓఎన్‌జీసీ రాజమహేంద్రవరం అసెట్ బేస్ కాంప్లెక్స్‌లో ఆదివారం మహావర్ ప్రారంభించి మాట్లాడారు. సాంకేతిక పరిజ్ఞానాన్ని ఓఎన్‌జీసీ అందిపుచ్చుకొని ఆయిల్, గ్యాస్ ఉత్పత్తులను పెంచాలన్నారు. నిరంతర పరిశోధనల మూలంగా దేశంలోని పలు ప్రాంతాల్లో హైడ్రోకార్బన్లను గుర్తించగలుగుతున్నామని, వీటి నుంచి సాంకేతిక పరిజ్ఞానంతో వృథా కాకుండా గ్యాస్, ఆయిల్ వెలికి తీస్తున్నామన్నారు. సదస్సుకు 16 అంతర్జాతీయ పరిశ్రమల ప్రతినిధులు హాజరయ్యారు.

# సహజీవనమని చెప్పి చంపేశాడు

## ప్రియుడి చేతిలో గర్భిణి దారుణహత్య



పోలీసుల అదుపులో షేక్ రషీద్



రమీజాబి (ఫైల్)

**డోన్ టౌన్:** తమ దుకాణంలో పనిచేసే యువతిని ప్రేమిస్తున్నానని ఓ యువకుడు నమ్మించి గర్భవతిని చేశాడు. కలిసి జీవిద్దామని చెప్పి తీసుకెళ్లి దారుణంగా చంపేశాడు. కర్నూలు జిల్లా డోన్ మండలం ఎర్రగుంట్ల గ్రామశివారులో ఈ హత్య చోటుచేసుకుంది. పోలీసుల కథనం మేరకు వివరాలిలా ఉన్నాయి. డోన్‌లోని కొండపేటకు చెందిన లక్ష్మీదేవి, మల్లేష్ దంపతుల కుమార్తె రమిజాబి అలియాస్ రంజని (20)కి ఐదేళ్ల క్రితం పెళ్లి అయింది. ఓ కుమారుడు పుట్టాక రెండేళ్ల క్రితం భార్యాభర్తల మధ్య విభేదాల కారణంగా విడాకులు తీసుకున్నారు. తర్వాత రమిజాబి బతుకుదెరువు కోసం ఓ వస్త్ర దుకాణంలో ఉద్యోగంలో చేరింది. షాపు యజమాని కుమారుడైన షేక్ రషీద్ అలియాస్ సిద్దు (22) ఆమెను ప్రేమ పేరుతో లోబర్చుకున్నాడు. పెళ్లి చేసుకున్నట్లు దండలు కూడా మార్చుకున్నారు. ఈ నేపథ్యంలో గర్భం దాల్చిన ఆమె పెళ్లి చేసుకోవాలని రషీద్‌పై ఒత్తిడి తీసుకొచ్చింది. ఇద్దరం కలిసి నంద్యాలలో కాపురం పెడదామని నమ్మబలికిన అతను గత నెల 20వ తేదీ ఆమెను ఎర్రగుంట్ల గ్రామం వద్ద అటవీ ప్రాంతానికి తీసుకెళ్లి చున్నీతో గొంతు బిగించి చంపేశాడు.

**తల్లి ఫిర్యాదుతో వెలుగులోకి:** వారమైనా తన కూతురు నుంచి ఎలాంటి సమాచారం లేకపోవడంతో రమిజాబి తల్లి లక్ష్మీదేవి గత మంగళవారం పోలీసులకు ఫిర్యాదు చేసింది. స్థానిక పోలీసులు పట్టించుకోకపోవడంతో ఎస్పీని కలిసింది. ఆయన ఆదేశాల మేరకు రంగంలోకి దిగిన పోలీసులు నిందితుడైన షేక్ రషీద్‌ను విచారించడంతో విషయం బయటపడింది. సీఐ శ్రీనివాసులు గౌడ్ ఆదివారం మృతదేహాన్ని వెలికి తీయించి శవపరీక్షలు నిర్వహించారు. తర్వాత మృతదేహాన్ని బంధువులకు అప్పగించారు. నిందితునిపై కేసు నమోదు చేసినట్లు సీఐ శ్రీనివాసులు గౌడ్ తెలిపారు. రమిజాబి మృతితో ఆమె కుమారుడు నాలుగేళ్ల అఖిల్ అనాథగా మారాడు.

## చర్లపల్లి జైలు అధికారిపై ఖైదీ దాడి!

**హైదరాబాద్:** చర్లపల్లి కేంద్ర కారాగార డిప్యూటీ సూపరింటెండెంట్ చింతల దశరథంపై ఓ ఖైదీ దాడికి పాల్పడ్డ సంఘటన ఆలస్యంగా వెలుగులోకి వచ్చింది. దాడిలో గాయపడి చెయ్యి విరిగిన జైలు అధికారి ప్రస్తుతం ఆసుపత్రిలో చికిత్స పొందుతున్నారు. కాగా దాడి జరగలేదని పెనుగులాట మాత్రమే జరిగిందని జైలు పర్యవేక్షణాధికారి భాస్కర్ అన్నారు. అసదుద్దీన్ ఒవైసీపై దాడి కేసులో పదేళ్ల జైలు శిక్షపడిన మహ్మద్ పహిల్వాన్ అనుచరుడు అహ్మద్‌బీన్ సాద్ జైల్‌లోని స్వర్ణముఖి బ్యారక్‌లో ఉంటున్నాడు. ముందస్తు సమాచారంతో జైలు అధికారులు అతనిని తనిఖీ చేయగా సెల్‌ఫోన్ వినియోగిస్తున్నట్లు గుర్తించారు. దానిని స్వాధీనం చేసుకునే క్రమంలో అహ్మద్‌బీన్ దశరథంపై దాడికి పాల్పడ్డాడు.


ఇండియన్ రెన్యూవబుల్ ఎనర్జీ డెవలప్‌మెంట్ ఏజెన్సీ లిమిటెడ్
(భారత ప్రభుత్వ ఎంటర్‌ప్రైజెస్)
IREDA

**స్వాధీనం నోటీసు**
**నియమం-8 (1) క్రింద**

2002, స్క్యూరిటైజేషన్ మరియు రీకన్‌స్ట్రక్షన్ ఆఫ్ ఫైనాన్షియల్ అస్సెట్స్ అండ్ ఎన్‌ఫోర్స్‌మెంట్ సెక్యూరిటీ ఇంటరెస్ట్ చట్టం (ఎస్‌ఏఆర్‌ఎఫ్‌ఏఈఎస్‌ఐ చట్టం) క్రింద ఈ క్రింద సంతకం చేసిన వారు ఇండియన్ రెన్యూవబుల్ ఎనర్జీ డెవలప్‌మెంట్ ఏజెన్సీ లిమిటెడ్ (ఐఆర్‌ఈడీఏ), న్యూఢిల్లీ యొక్క అధీకృత అధికారి మరియు 2002 సెక్యూరిటీ ఇంటరెస్ట్ (ఎన్‌ఫోర్స్‌మెంట్) నియమాల నియమం 9తో గల సెక్షన్ 13 (2) క్రింద ఇవ్వబడిన అధికారం అమలు చేస్తూ, ప్రాజెక్ట్ నం. 1743 కోసం నోటీసులో చెప్పిన సొమ్ము రూ.27,98,77,567 (ఇరవై ఏడు కోట్ల తొంభై ఎనిమిది లక్షల డెబ్బై ఏడు వేల అయిదువందల అరవై ఏడు రూపాయలు మాత్రమే) తిరిగి చెల్లించాల్సిందిగా ఋణ గ్రహీత ఎం/ఎస్ శారదాంబికా పవర్ ప్లాంట్ ప్రైవేట్ లిమిటెడ్‌కి 10-11-2015 తేదీకి చెందిన డిమాండ్ నోటీసు జారీ చేసారు. ఇది తదుపరి వడ్డీ, చెల్లింపు నష్టాలు మరియు 01-07-2015 నుండి చెప్పబడిన నోటీసు అందుకున్న తేదీ నుండి 60 రోజుల లోగా నగదు కోసం విక్రయించడం వరకు ఉన్న ఖర్చు 30-06-2015 వరకు లెక్కించబడింది మరియు ఋణ గ్రహీత సొమ్ము తిరిగి చెల్లించడంలో విఫలమవడంతో ఈ క్రింది ఆస్తుల అధీనాన్ని ఈ క్రింది విధంగా సంతకం చేసిన వారిచే తీసుకోబడ్డాయని ఋణగ్రహీతకి మరియు సాధారణ ప్రజానీకానికి నోటీసు ఇవ్వబడింది.

**స్థిరచరాస్తుల వర్ణన:**

| ఋణగ్రహీత పేరు | ఆస్తి వర్ణన | డిమాండ్ నోటీసు తేదీ | అధీనంలోకి తీసుకున్న తేదీ | డిమాండ్ నోటీసులో సొమ్ము |
|---|---|---|---|---|
| ఎం/ఎస్ శారదాంబికా పవర్ ప్లాంట్ ప్రైవేట్ లిమిటెడ్ | శ్రీ బి గోవింద రాజులు, అనుసంగిక హామీ వివరాలు: అన్ని భాగాలు మరియు అంతర్భాగాల యొక్క వ్యవసాయేతర భూమి ఖచ్చితమైన విధానంలో కొలవబడే 0.67 ఎకరాలు, సర్వే క్రమ సంఖ్య 31/2పి (ఏసీ 0.53 సెంట్లు) మరియు 32/5 (ఏసీ 0.14 సెంట్లు) కలిగి పెద్దపాడు గ్రామం, శ్రీకాకుళం జిల్లాలో, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఉంది. ఈ భూమి ఈ క్రింది విధంగా సరిహద్దుల్ని కలిగి ఉంది. తూర్పు: ఆర్‌టీఓ కార్యాలయానికి దారితీసే తాడెంవలస రోడ్డు; దక్షిణం: శ్రీ కె రాములుకి చెందిన భూమి; పశ్చిమం: ప్రస్తుతమున్న యజమానికి చెందిన భూమి; ఉత్తరం: శ్రీమతి సుజాతకి చెందిన భూమి. అన్ని భవంతులు, నిర్మాణాలు, కట్టడాలు, మొదలైన వాటితో కలిపి. నిర్మితమైనవి / ఏర్పాటైనవి మరియు / నిర్మించబడేవి / ఏర్పాటైనవి, ఏర్పాటైన ఫిక్చర్స్ మరియు ఫిట్టింగ్స్ / ఇన్‌స్టాల్ చేయబడినవి లేదా ఏర్పాటయ్యేవి / అటు పిమ్మట ఇన్‌స్టాల్ అయినవి, భూమికి జత చేయబడినవి లేదా భూమికి జత చేయబడిన దేనికైనా కట్టబడినవి మరియు అటు పిమ్మట ప్రస్తుతం మరియు భవిష్యత్తులో అక్కడ ఉండే ప్రతి భాగంతో కలిపి. | 10.11.2015 | 28.11.2017 | రూ.27,98,77,567 (ఇరవై ఏడు కోట్ల తొంభై ఎనిమిది లక్షల డెబ్బై ఏడు వేల ఐదు వందల అరవై ఏడు రూపాయలు మాత్రమే) 01-07-2015 నుండి తదుపరి వడ్డీ, చెల్లింపు నష్టాలు మరియు ఖర్చుల నుండి నగదు కోసం విక్రయించబడేంత వరకు అనగా 30-06-2015 వరకు లెక్కించబడింది |

ఆస్తితో క్రయవిక్రయాలు చేయవద్దని మరియు ఆస్తితో చేసే ఏవైనా క్రయవిక్రయాలు వల్ల ఇండియన్ రెన్యూవబుల్ ఎనర్జీ డెవలప్‌మెంట్ ఏజెన్సీ లిమిటెడ్ (ఐఆర్‌ఈడీఏ) న్యూఢిల్లీచే వాటి సంబంధిత బకాయిలు మరియు వడ్డీ వసూలుచేయబడటానికి లోబడి ఉందని మరియు ఇది అనధికారం మరియు చట్టవిరుద్ధమని మరియు దీనికి సివిల్ మరియు క్రిమినల్ చర్యలకు బాధ్యులు కావల్సి ఉంటుందని ప్రత్యేకించి ఋణగ్రహీత మరియు సాధారణ ప్రజలకు హెచ్చరించడమైనది.

సంతకం/-
ఎస్‌ఎల్ బర్మన్
అధీకృత అధికారి, ఐఆర్‌ఈడీఏ
మొబైల్:9910170025 ఈ-మెయిల్: slburman@ireda.in

# అన్నా.. జగనన్నా..



ఎర్రగుడిలో లారీపై నుంచి యువత కేరింతలు



ఎర్రగుడిలో లారీపై నుంచి జగన్‌తో కరచాలనం చేయడానికి ఉత్సాహం చూపుతున్న యువకులు



ప్రజా సంకల్ప యాత్ర నుంచి సాక్షి ప్రత్యేక ప్రతినిధి: వైఎస్సార్‌సీపీ అధినేత, ప్రతిపక్ష నాయకుడు వైఎస్ జగన్‌మోహన్‌రెడ్డి ప్రజా సంకల్ప యాత్ర 25వ రోజు ఆదివారం అడుగడుగునా ప్రజల ఆత్మీయత, అభిమాన జన సంద్రం నడుమ సాగింది. జన నేతను స్వయంగా కలవాలని, తమ సమస్యలు చెప్పుకోవాలని భారీ సంఖ్యలో జనం తరలి వచ్చారు. మదనంతపురం క్రాస్ మొదలు అనంతపురం జిల్లా సరిహద్దు అయిన బసినేపల్లి వరకు పాదయాత్ర సాగిన ప్రాంతంలో రోడ్డుపై జనం కిక్కిరిశారు. లారీలు, బస్సులపైకి ఎక్కి జననేతకు అభివాదం చేశారు. అన్ని అర్హతలు ఉన్నప్పటికీ పింఛన్లు రావడం లేదని కొందరు, రేషన్ కార్డులు మంజూరు చేయలేదని మరికొందరు, ఉద్యోగ, ఉపాధి అవకాశాలు లేక ఉన్న ఊరును వదిలి వెళ్లాల్సి వస్తోందని ఇంకొందరు జగన్‌కు విన్నవించారు.

## ప్రజాసంకల్ప యాత్ర 25వ రోజు

ఇప్పటి వరకు నడిచిన దూరం **356.8 కి.మీ**

25వ రోజు నడిచిన దూరం **10.6 కి.మీ**

**ప్రారంభం:** ఉ. 8.30 గం.లకు మదనంతపురం క్రాస్

**ముగింపు:** సా. 5.40 గం.లకు బసినేపల్లి (గుంతకల్లు నియోజకవర్గం, అనంతపురం జిల్లా )

**ముఖ్యాంశాలు:**
- ఎర్రగుడి సమీపంలో రైతులతో ముఖాముఖి
- అడుగడుగునా జనం ఘనస్వాగతం

### నేటి పాదయాత్ర షెడ్యూల్

**ప్రారంభం:** ఉ. 8.00 గం.లకు, బసినేపల్లి

**ముఖ్యాంశాలు:**
- బసినేపల్లి, గుత్తి రైల్వేస్టేషన్ వద్ద జెండా ఆవిష్కరణ
- గుత్తి గాంధీచౌక్‌లో సభ

### • సీఎంను కలిసినా ప్చ్..

'అయ్యా.. మాకున్న ఐదెకరాల పొలం అమ్ముకుని వైద్యం చేయించినా మా కుమారుడు పురుషోత్తంకు కిడ్నీ వ్యాధి నయం కాలేదు.. ముఖ్యమంత్రి చంద్రబాబు ఇచ్చిన సిఫార్సులేఖతో కలెక్టర్‌ను కలిస్తే ఆయన కసురుకుని వెనక్కి పంపారు'.. అంటూ తుగ్గలి మండలం గుడిసె గుప్పరాళ్ల గ్రామానికి చెందిన నారాయణ, అంజనమ్మ దంపతులు జగన్ ఎదుట ఆవేదన వ్యక్తంచేశారు. వారు ఆదివారం ప్రజా సంకల్ప యాత్రలో జగన్‌ను కలిసి తమ గోడు వెళ్లబోసుకున్నారు. 'మా కుమారుడి వైద్యం కోసం పొలం అమ్ముకుని నిరుపేదలయ్యాం.. మాకు మరో నలుగురు కుమార్తెలు కూడా ఉన్నారు'.. అని వాపోయారు.

### • స్కాలర్‌షిప్ ఇవ్వడం లేదన్నా..

'మా పిల్లలకు గతంలో ఆమ్‌ఆద్మీ బీమా యోజన స్కాలర్‌షిప్‌లు ఇచ్చేవారు.. చంద్రబాబు వచ్చినప్పటి నుంచి అవి కూడా తీసేశారు. దీంతో పిల్లల్ని చదివించడం భారమవుతోంది'.. అంటూ పగిడిరాయికి చెందిన అను గ్రూపు లీడర్ వెంకటలక్ష్మి జగన్ ఎదుట ఆవేదన వ్యక్తంచేశారు. వారి సమస్యలపై జగన్ స్పందిస్తూ.. ఏడాదిలో ప్రజాప్రభుత్వం వస్తుందని, సమస్యలన్నీ తీరిపోతాయని, పొదుపు రుణాలు ఎంత మొత్తంలో ఉన్నా బ్యాంకులతో సంబంధం లేకుండా ఆ మొత్తం డబ్బును నాలుగు విడతల్లో మీ చేతికే ఇస్తామని పునరుద్ఘాటించారు.

### • రూ.4 లక్షలే ఇచ్చి.. 5 లక్షలకు వడ్డీ వసూలు..

'బ్యాంకులో డ్వాక్రా రుణం కింద రూ.ఐదు లక్షలు మంజూరు చేసి లక్ష డిపాజిట్ కింద ఉంచుకుని.. నాలుగు లక్షలే చేతికిచ్చారు.. అదేంటని అడిగితే తీసుకుంటే తీసుకోండి లేకుంటే లేదంటూ బ్యాంకర్లు నిర్లక్ష్యంగా మాట్లాడుతున్నారు'.. అంటూ పగిడిరాయికి చెందిన శ్రీలక్ష్మి గ్రూపు లీడర్ బాలమ్మ ఆవేదన వ్యక్తంచేశారు. ప్రజాసంకల్ప యాత్రలో ఆదివారం జగన్‌ను కలిసి తమ కష్టాలు చెప్పుకొన్నారు. చేతికివ్వని ఆ లక్ష రూపాయలకు కూడా మూడేళ్లుగా వడ్డీ కట్టించుకుంటున్నారని వాపోయారు. పలుచోట్ల డ్వాక్రా సంఘాల లీడర్లు జగన్‌ను కలిసి ఇదే సమస్యను వివరించారు. పొదుపు మహిళలకు పసుపు–కుంకుమ పేరుతో ఒక్కొక్కరికీ రూ.10 వేలు ఇస్తామని చెప్పి అనేకమందికి సొమ్ములు చెల్లించలేదని ఆవేదన వ్యక్తంచేశారు.

# జననేతకు బ్రహ్మరథం

## కర్నూలు జిల్లాలో ముగిసిన ప్రజాసంకల్ప యాత్ర

అవ్వాతాతల దీవెనలు.. అక్కాచెల్లెళ్ల మంగళహారతులు.. యువత కేరింతలు.. అలసిన పాదాలకు ఊరూరా ముద్దబంతుల పాన్పులు.. అన్నొస్తున్నాడు.. అంటూ పిల్లాపాపలు మొదలు అన్ని వర్గాల ప్రజలు జననేతకు బ్రహ్మరథం పట్టారు. పాదయాత్ర సాగిన రహదారికి ఇరువైపులా కిలోమీటర్ల దూరం నుంచి జనం భారీగా తరలి వచ్చారు. దారిపొడవునా జనమే జనం.. మిద్దెలు, మేడలు కిక్కిరిసిపోయాయి. కేరింతలతో యువత.. మా రాజన్న బిడ్డే అంటూ అవ్వా తాతలు, అడిగో అన్న అంటూ అక్కా చెల్లెళ్లు జగన్ వద్దకు వెళ్లి కరచాలనం చేయడానికి పోటీపడ్డారు. కూలీలు, రైతులు పనులు మానేసి మరీ గంటల తరబడి తమ అభిమాన నేత కోసం వేచి చూసి ఆత్మీయతను చాటుకున్నారు. చిరునవ్వుతో మాట కలుపుతూ.. కరచాలనం చేస్తూ.. అందరికీ అండగా ఉంటానని భరోసా కల్పిస్తూ జగన్ ముందుకు సాగారు.



పత్తికొండలో అశేష జనవాహినిని ఉద్దేశించి ప్రసంగిస్తున్న ప్రతిపక్ష నేత వైఎస్ జగన్

సాక్షి ప్రతినిధి, కర్నూలు

వైఎస్సార్ కాంగ్రెస్‌పార్టీ అధినేత వైఎస్ జగన్‌మోహన్‌రెడ్డి చేపట్టిన ప్రజా సంకల్ప యాత్రకు కర్నూలు జిల్లాలో అడుగడుగునా జనం నీరాజనం పలికారు. అధికార తెలుగుదేశం ప్రభుత్వం చేస్తున్న అరాచకాలను, అవినీతిని ఎదుర్కొనేందుకు కదనరంగమై జగన్‌తో పాటు లక్షలాది అడుగులు ముందుకు సాగాయి. ప్రతిచోటా ప్రజలు స్వచ్ఛందంగా ముందుకు వచ్చి సమస్యలను నివేదించారు. ప్రజలు చెప్పే సమస్యలను జగన్ సావధానంగా వింటూ... వారికి ధైర్యం చెబుతూ ముందుకు సాగారు. జిల్లాలో నవంబరు 14వ తేదీ మొదలైన పాదయాత్ర డిసెంబరు 3వ తేదీ వరకూ సాగింది. మొత్తం 18 రోజుల పాటు సాగిన పాదయాత్రలో జిల్లాలోని 7 నియోజకవర్గాలు, 14 మండలాల్లోని 66 గ్రామాల్లో మొత్తం 263 కిలోమీటర్ల మేర జగన్ పాదయాత్ర చేశారు. వైఎస్సార్ జిల్లా నుంచి కర్నూలు జిల్లాలోకి చాగలమర్రి మండలం వద్ద పాదయాత్ర ప్రవేశించింది. చాగలమర్రి మండలం గొడిగనూరు గ్రామం వద్ద పాదయాత్ర 100 కిలోమీటర్లను పూర్తి చేసుకుంది. ఈ సందర్భంగా పూలతో ముగ్గులు వేసి ప్రజలు స్వాగతం పలికారు. 200 కిలోమీటర్ల పాదయాత్ర బేతంచర్ల మండంలోని ముద్దవరం గ్రామం వద్ద పూర్తి అయ్యింది. ఇందుకు గుర్తుగా మొక్కను నాటి నీరు పోశారు. ఎమ్మిగనూరు నియోజకవర్గంలోని గోనెగండ్ల మండలం బి.అగ్రహారం వద్ద 300 కిలోమీటర్ల యాత్ర పూర్తయింది. ఈ సందర్భంగా జగన్ మొక్కను నాటారు.



హుస్సేనాపురం శివార్లలో మహిళా సదస్సులో మాట్లాడుతున్న వైఎస్ జగన్

### ఆ కూడళ్లు.. జన సంద్రాలే..

బేతంచర్ల, వెల్దుర్తి, కోడుమూరులో సాగిన పాదయాత్ర సందర్భంగా ఆ పక్కనే వెళ్తున్న లారీలు, ఆర్టీసీ బస్సులో ప్రయాణికులంతా కేరింతలు కొట్టారు. కిటికీల్లోంచి చేతులు, తలలూ బయటపెట్టి 'అన్నా...' అంటూ కేకలేశారు. జగన్ వారితో కరచాలనం చేస్తూ ముందుకు సాగారు. కోడుమూరులో బండెనక బండికట్టి రైతులు ఘన స్వాగతం పలికారు. చుట్టుపక్కల ప్రాంతాల నుంచి ట్రాక్టర్‌లో మహిళలు కిక్కిరిసి కూర్చొని మరీ అభిమాన నేతను చూసేందుకు వచ్చారు. జగన్‌ను చూడ్డంతోనే ఒక్కసారిగా ఆనందంతో ఊగిపోయారు. కరచాలనం కోసం అక్కడి నుంచి పోటీపడ్డారు. పత్తికొండ నియోజకవర్గంలో సాగిన యాత్రలో వృద్ధులు.. ఇతరుల సాయంతో జగన్‌ను చూసేందుకు తరలి వచ్చారు. పత్తికొండ మొదలు.. బసినేపల్లి వరకు రహదారులన్నీ బంతి పూలతో పచ్చగా మారాయనడం అతిశయోక్తి కాదు. గ్రామ గ్రామాన జనం స్వచ్ఛందంగా ఆత్మీయ స్వాగతం పలికారు.

### అన్ని వర్గాలకు చేరువ...

ప్రజా సంకల్ప పాదయాత్ర సందర్భంగా వివిధ వర్గాల ప్రజల సమస్యలను తెలుసుకునేందుకు వారితో ముఖాముఖితో పాటు సదస్సులను నిర్వహించారు. ప్రధానంగా మహిళలు, బీసీలు, రైతులు, ఉపాధి కూలీలు, క్వారీ కార్మికులతో ముఖాముఖి నిర్వహించారు. ఈ సందర్భంగా గిట్టుబాటు ధర లేదని, రుణమాఫీ కాలేదని, ప్రాజెక్టులు పూర్తి చేయడం లేదని, నీరు ఇవ్వడం లేదని రైతులు జగన్ దృష్టికి తీసుకువచ్చారు. అదేవిధంగా టీడీపీ బీసీలను కేవలం ఓటు బ్యాంకుగా చూస్తోందని పలు బీసీ సంఘాల నేతలు మండిపడ్డారు. నాలుగు నెలలుగా కూలి డబ్బులు ఇవ్వలేదని ఉపాధి కూలీలు జగన్‌కు తమ గోడు వెళ్లబోసుకున్నారు. ఈ సమస్యలకు పరిష్కారాలు చూపడంతో పాటు అధికారంలోకి వస్తే ఏం చేస్తామనే అంశాన్ని కూడా జగన్ వారికి వివరిస్తూ ముందుకు కదిలారు. నవంబర్ 14న చాగలమర్రిలోని ముత్యాలపాడు బస్టాండ్‌లో, 15న ఆళ్లగడ్డలో సభకు జనం భారీగా తరలివచ్చారు. 19న బనగానపల్లెలో, 21న బేతంచెర్ల బస్టాండ్ సర్కిల్‌లో జరిగిన సభలు ఇసుక వేస్తే రాలనంతగా జనసంద్రంగా మారాయి. 28వ తేదీన గోనెగండ్లలో, 30న ఆస్పరి మండలంలోని బిల్లేకల్‌లో, డిసెంబరు 1వ తేదీన పత్తికొండలో నిర్వహించిన సభలకు జనం పోటెత్తారు. ఈ సభల్లో జగన్ ప్రసంగం అన్ని వర్గాల వారిని ఆకట్టుకుంది. నవంబర్ 14న చాగలమర్రి మండలం గొడిగనూరులో, 15న పెద్దకోట కందుకూరు, 21న బేతంచర్ల మండలం కొలుములపల్లి, 22న ముద్దవరం, పెండేకల్ గ్రామాలు, 26న కృష్ణగిరి మండలం ఎర్రగుడి, వెంకటగిరి గ్రామాలు, 27న కోడుమూరు మండలం వర్కూరు ఎస్సీ కాలనీలో, 30న ఆస్పరి మండలం కైరుప్పల గ్రామాల్లో వైఎస్సార్ కాంగ్రెస్ పార్టీ జెండాలను జగన్ ఆవిష్కరించారు.

### అనేక సమస్యలు.. పరిష్కారాలు..

పాదయాత్ర సందర్భంగా జగన్ ముందు అనేక మంది పలు సమస్యలను ప్రస్తావించారు. ప్రధానంగా పింఛన్లు రావడం లేదని, ఇళ్లు లేవని, రేషన్‌కార్డులు లేవని పేర్కొన్నారు. పంటలకు గిట్టుబాటు ధర లేదని, రుణమాఫీ కాలేదని, ఇన్‌పుట్ సబ్సిడీ రాలేదని, నకిలీ విత్తనాలు వస్తున్నాయని రైతులు నివేదించారు. తమ రుణాలు మాఫీ కాలేదని, బ్యాంకులు అప్పులు కట్టాలని ఒత్తిళ్లు తెస్తున్నాయని డ్వాక్రా మహిళలు వాపోయారు. సాగునీటి ప్రాజెక్టులు చేపట్టాలని రైతులు విన్నవించారు. ఈ సందర్భంగా జగన్ పలు హామీలు ఇచ్చారు. అధికారంలోకి వచ్చాక హంద్రీ–నీవా నుంచి దద్దనాల చెరువుకు నీరందిస్తామని, విద్యుత్ చార్జీలు, రాయల్టీ పెంపు వల్ల మూతపడ్డ క్వారీ పరిశ్రమలను ఆదుకోవడంతో పాటు వీధిన పడ్డ కార్మికుల కుటుంబాలకు అండగా నిలుస్తామని పేర్కొన్నారు. నాపరాయి పరిశ్రమకు విద్యుత్ చార్జీలు తగ్గిస్తామని స్పష్టం చేశారు. డోన్‌ను మోడల్ నియోజకవర్గంగా తీర్చిదిద్దుతామని, గుండ్రేవుల ప్రాజెక్టును నిర్మించేందుకు చర్యలు చేపడతామని చెప్పారు. పంటలకు గిట్టుబాటు ధర కల్పిస్తామని, ప్రతీ రైతుకు పెట్టుబడి కింద ఏటా రూ.12,500 అందజేస్తామని ప్రకటించారు. దివ్యాంగులకు ఏకంగా రూ.3 వేల పింఛను ఇస్తామని స్పష్టం చేశారు. మొత్తం మీద జిల్లాలో ఎన్నో ఏళ్లుగా పెండింగ్‌లో ఉన్న గుండ్రేవులతో పాటు రాజోలి, జొలదరసి రిజర్వాయర్లను నిర్మిస్తామని పేర్కొన్నారు. ఉద్యోగులకు ఇబ్బందిగా మారిన కాంట్రిబ్యూటరీ పెన్షన్ విధానాన్ని (సీపీసీ)ని రద్దు చేస్తానని స్పష్టీకరించారు. ఈ నేపథ్యంలో జిల్లాలోని ప్రజలు తిరిగి రాజన్న రాజ్యం కోసం జగన్ వెంట నడిచేందుకు సిద్ధంగా ఉన్నామని, ఈ జిల్లా ఎన్నటికీ వైఎస్సార్ కాంగ్రెస్ పార్టీకి పెట్టని కోట అని చాటిచెప్పడానికి సిద్ధమని స్పష్టీకరించారు.



కోడుమూరులో అశేష ప్రజానీకానికి అభివాదం చేస్తున్న జననేత

### అడుగులో అడుగేసిన లక్షలాది జనం



జగన్‌ను చూడగానే బాలాపురం క్రాస్‌రోడ్డులో అభివాదం చేస్తున్న జనం



వెల్దుర్తి సభలో ప్రసంగిస్తున్న ప్రతిపక్ష నేత వైఎస్ జగన్



గోనెగండ్ల మండలం గంజిహళ్లిలో వైఎస్ జగన్‌మోహన్ రెడ్డిని చూడడానికి తరలివచ్చి మిద్దెలు ఎక్కిన అక్కచెల్లెమ్మలు



పుప్పలదొడ్డిలో జగన్‌ను చూడడానికి వచ్చిన జనం



కృష్ణగిరిలో గ్రామస్తులతో ముఖాముఖి కార్యక్రమంలో మాట్లాడుతున్న వైఎస్ జగన్‌మోహన్‌రెడ్డి



బనగానపల్లెలో అశేష జనవాహిని మధ్య పాదయాత్ర సాగిస్తున్న వైఎస్ జగన్



కైరవాడి - గాజుల దిన్నె క్రాస్ వద్ద సాగుతున్న జగన్ పాదయాత్ర

# నీట్‌గా నొక్కేస్తున్నారు!

▶ మొదటి పేజీ తరువాయి

ప్రభుత్వం పట్టించుకోవడం లేదు. దీంతో అధికార పార్టీ నాయకులు సూత్రధారులుగా, దళారులు పాత్రధారులుగా ప్రభుత్వ భూములను అమ్మేసుకుని వేలకోట్లు దండుకుంటున్నారు.

## కోర్టు ఆదేశం ఇదీ..

''ప్రభుత్వ, అసైన్డ్ భూములను క్రోడీకరించి కలెక్టర్లు నిషేధిత ఆస్తుల జాబితా(పీవోబీ) కింద చేర్చాలి. దేవాదాయ, వక్ఫ్ ఆస్తులను ఆ శాఖల కమిషనర్లు క్రోడీకరించి సమగ్రమైన జాబితాను రూపొందించాలి. వ్యవసాయ, పట్టణ గరిష్ట భూ పరిమితి చట్టం కింద స్వాధీనం చేసుకున్న భూముల వివరాలను ఆర్డీవో స్థాయి అధికారి ధ్రువీకరించి రిజిస్ట్రేషన్ అధికారులకు సమర్పించాలి. ప్రజావసరాలకోసం సేకరించిన, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు ఆసక్తి ఉన్న ఆస్తులను రిజిస్ట్రేషన్ చట్టంలోని 22(ఎ)ఇ కింద కలెక్టర్లు నోటిఫై చేయాలి. ఈ మొత్తం ప్రక్రియ 2016 మార్చి నెలాఖరులోగా పూర్తి చేయాలి. కలెక్టర్లు, వక్ఫ్, దేవాదాయ శాఖ కమిషనర్లు, ఆర్డీవో/ ఉన్నత స్థాయి అధికారులు పంపిన పీవోబీ జాబితాలోని ఆస్తులను ఎట్టి పరిస్థితుల్లోనూ క్రయ విక్రయ రిజిస్ట్రేషన్లు చేయరాదు. కొత్తగా రూపొందించిన జాబితాలో లేని ఆస్తులను నిరభ్యంతరంగా రిజిస్ట్రేషన్ చేయాల్సిందే.'' అని 2015లో హైకోర్టు ఆదేశాలిచ్చింది. అయితే ఈ గడువు దాటి ఏడాదిన్నర గడిచినా చాలా ప్రాంతాల్లోని జాబితా రిజిస్ట్రేషన్ శాఖకు రాలేదు. అక్కడక్కడా వచ్చిన వివరాల జాబితాలు కూడా తప్పుల తడకగా ఉన్నాయి.

## మోసం జరుగుతున్న తీరు ఇలా..!

రాష్ట్రంలో వైఎస్సార్, కర్నూలు, నెల్లూరు తదితర జిల్లాల్లో డంపింగ్ యార్డులు, ఇతర అవసరాల కోసం ప్రైవేటు వ్యక్తుల నుంచి మున్సిపాలిటీలు కొనుగోలు చేసిన భూములు ఇప్పటికీ వెబ్‌ల్యాండ్‌లోనూ, రెవెన్యూ రికార్డుల్లోనూ అమ్మిన వారి పేరిటే ఉన్నాయి. దీన్ని అదునుగా తీసుకున్న కొందరు వీటిని మళ్లీ కొనుగోలుకు పెడుతున్నారు. వీటిని కొన్నవారు దారుణంగా మోసపోతున్నారు. అధికార యంత్రాంగం పీఓబీ జాబితాలు ఇవ్వనందున చాలా జిల్లాల్లో ప్రభుత్వ భూములు ప్రైవేటు వ్యక్తుల పేర్లతో రిజిస్ట్రేషన్లు జరిగిపోయాయి. ఇటీవల తిరుపతి రెవెన్యూ డివిజన్‌లో ప్రభుత్వానికి చెందిన భూముల రిజిస్ట్రేషన్ కోసం ఏడు డాక్యుమెంట్లు వచ్చాయి. అలాగే విశాఖ జిల్లాలోనూ కొన్ని డాక్యుమెంట్లు వచ్చాయి. అవి ప్రభుత్వ భూములంటూ సబ్ రిజిస్ట్రార్లు రిజిస్ట్రేషన్లు చేయకుండా తిరస్కరించారు. దీంతో తమ రిజిస్ట్రేషన్లను సబ్ రిజిస్ట్రార్లు తిరస్కరించారంటూ వారు హైకోర్టుకు వెళ్లారు. ''జిల్లా అధికార యంత్రాంగం ఇచ్చిన పీఓబీ జాబితాలో లేని సర్వే నంబర్లకు సంబంధించిన ఆస్తులను రిజిస్ట్రేషన్ చేయాల్సిందే. ఒకవేళ అధికారులు పీఓబీ జాబితా ఇవ్వకపోయినా అవి ఆ జాబితాలో లేనట్లు పరిగణించి రిజిస్ట్రేషన్ చేయండి' అని హైకోర్టు ఆదేశించింది. దీంతో ఏమి చేయాలో మార్గనిర్దేశం చేయాలంటూ ఆయా సబ్ రిజిస్ట్రార్లు జిల్లా రిజిస్ట్రారును కోరారు. జిల్లా రిజిస్ట్రారు ఐజీ అభిప్రాయం కోసం పంపించారు. ఇంతలోనే కోర్టు ఉత్తర్వులను కూడా అమలు చేయలేదంటూ ప్రైవేటు వ్యక్తులు చిత్తూరు జిల్లాలోని ఇద్దరు సబ్ రిజిస్ట్రార్లపై కేసులు పెట్టారు.



నిషేధిత భూముల జాబితాలో చేర్చిన వట్టిచెరుకూరు గ్రామ ఏరియల్ వ్యూ



నిషేధిత భూముల జాబితాలో చేర్చిన క్రోసూరు కొండకింది గ్రామ ఏరియల్ వ్యూ

## పీఓబీలో ప్రైవేటు భూములు, స్థలాలు...

ఒక వైపు ప్రభుత్వ భూములను ప్రైవేటు వ్యక్తులు కైంకర్యం చేసుకుంటుంటే మరోవైపు ప్రైవేటు భూములు, స్థలాలు రికార్డుల్లో ప్రభుత్వ ఖాతాలో ఉండటంవల్ల వాస్తవ హక్కుదారులు తీవ్ర అవస్థలు ఎదుర్కొంటున్నారు. రెవెన్యూ అధికారులు చేసిన తప్పులు ప్రజలకు తిప్పలు తెచ్చి పెడుతున్నాయి. పీవోబీలో ఉన్న తమ ఆస్తులను అత్యవసరమై అమ్ముకోదలచిన హక్కుదారులు అల్లాడుతున్నారు. తిరుపతి పట్టణాభివృద్ధి సంస్థ(తుడా), విశాఖపట్నం నగరాభివృద్ధి సంస్థ(వుడా) గతంలో ప్లాట్లు వేసి ప్రజలకు స్థలాలను విక్రయించింది. ఇప్పటికీ వీటిలో చాలా ప్లాట్లు పీఓబీ జాబితాలో ఉండటం గమనార్హం. ఇలాంటి పరిస్థితే విజయవాడ, గుంటూరు నగరాల్లోనూ ఉంది.

## తప్పుల సవరణ దరఖాస్తులు చెత్తబుట్టలోకి..

తప్పుల సవరణ/ మ్యుటేషన్ కోసం హక్కుదారులు చేసిన దరఖాస్తులను అధికారులు కొర్రీలు వేసి చెత్తబుట్టలో పడేస్తున్నారు. వైఎస్సార్ జిల్లా కూచివారిపల్లెకు చెందిన సురేష్ నాయుడుకు పదెకరాల పొలం వంశపారంపర్యంగా వచ్చింది. అందులో అయిదెకరాలు వెబ్‌ల్యాండ్‌లో ప్రభుత్వ భూమి కింద ఉంది. అది పూర్వీకుల నుంచి తనకు సంక్రమించిన పట్టా భూమి అయినందున ప్రభుత్వ భూమి అనే పదాన్ని తొలగించి వంశపారంపర్యం కింద నమోదు చేసి నిషేధిత ఆస్తుల జాబితా నుంచి తొలగించాలని మీసేవ ద్వారా దరఖాస్తు చేసుకున్నారు. ఆధారాలు లేవంటూ అధికారులు దీనిని తిరస్కరించి చెత్తబుట్టలో పడేశారు. చిత్తూరు జిల్లా చంద్రగిరి మండలం పెరుమాళ్లపల్లికి చెందిన నారాయణరెడ్డికి వారసత్వంగా వచ్చిన పట్టా భూమి కూడా ఇలాగే ప్రభుత్వ భూమి జాబితాలో ఉంది. తప్పు సవరణ కోసం ఆయన చేసిన దరఖాస్తు గురించి అధికారులు పట్టించుకోలేదు.

### ఊర్లకు ఊర్లు మొత్తం
## నిషేధిత జాబితాలోకి..

గుంటూరు జిల్లా క్రోసూరు గ్రామ పంచాయతీ పరిధిలో ఉన్న కొండ కింద ఊరు అనే గ్రామంలో అనేక దశాబ్దాలుగా సుమారు 2 వేల కుటుంబాలు ఇల్లు నిర్మించుకుని జీవిస్తున్నాయి. గ్రామంలో 594–ఏ2 సర్వే నంబరులో 485.24 ఎకరాల భూమి ఉంది. ఇదే సర్వే నెంబరులో గ్రామ కంఠం భూమి సుమారు 40 ఎకరాల వరకు ఉంది. అయితే 2016లో రెవెన్యూ అధికారులు ఈ మొత్తం భూములను నిషేధిత భూముల జాబితాలో చేర్చడంతో గ్రామస్థులకు కష్టాలు మొదలయ్యాయి. అప్పటి నుంచి రిజిస్ట్రేషన్‌లు నిలిచిపోయాయి. ఆడపిల్లల పెళ్లిళ్లకు అమ్ముదామన్నా, బ్యాంకుల్లో తాకట్టు పెట్టి రుణం తెచ్చుకోవాలన్నా వీల్లేకుండా పోవడంతో ఇబ్బందులు పడుతున్నారు. అదేవిధంగా వట్టిచెరుకూరు గ్రామంలో సైతం 241 సర్వే నెంబరులో 112 ఎకరాల చెరువు భూమి ఉంది. ఇందులో 26 ఎకరాల్లో గ్రామ కంఠం భూముల్లో 400 కుటుంబాలు గృహాలు నిర్మించుకుని నివాసం ఉంటున్నారు. ఈ సర్వే నెంబరును సైతం నిషేధిత భూముల జాబితాలో చూపడంతో రిజిస్ట్రేషన్ కార్యాలయంలో రెడ్ మార్క్ పడి రిజిస్ట్రేషన్ నిలిచిపోయాయి. ఎంత మంది అధికారుల దృష్టికి తీసుకెళ్లినా ఫలితం మాత్రం కనిపించడం లేదు.

# విమానాశ్రయంలో 19 బుల్లెట్లు లభ్యం..

**శంషాబాద్:** అమెరికాకు వెళ్తున్న ఓ ఎన్ఆర్ఐ లగేజీలో 19 బుల్లెట్లు లభ్యమయ్యాయి. ఘటన శంషాబాద్ విమానాశ్రయంలో ఆదివారం జరిగింది. హైదరాబాద్‌కు చెందిన ఓట్కూరి నితిన్‌రెడ్డి అమెరికాలో స్థిరపడ్డాడు. ఖతార్ ఎయిర్‌లైన్స్‌కు చెందిన విమానంలో అమెరికాలోని బోస్టన్‌కు వెళ్లేందుకు ఆది వారం ఎయిర్‌పోర్టుకు వచ్చాడు. ఎయిర్‌లైన్స్ అధికారుల తనిఖీల్లో 30.06 ఎం ఎం కలిగిన 19 బుల్లెట్లు బయటపడ్డాయి. అధికారుల ఫిర్యాదు మేరకు బుల్లెట్లు స్వాధీనం చేసుకుని కేసు దర్యాప్తు చేస్తున్నట్లు ఆర్‌జీఐఏ ఎస్సై రమేశ్ నాయక్ తెలిపారు. ఈ బుల్లెట్లకు నితిన్‌రెడ్డికి అమెరికాలో లైసెన్స్ ఉన్నట్లు సమాచారం.

# అమ్మ కాదు..రాతి బొమ్మ

### ప్రియుడి మోజులో పడి నాలుగేళ్ల చిన్నారిని కాలుతున్న పెనంపై కూర్చోబెట్టిన తల్లి

**హైదరాబాద్: 'కంటేనే అమ్మ అని అంటే ఎలా.. కడుపు తీపి లేని అమ్మ బొమ్మే కదా.. రాతి బొమ్మే కదా..!'**

అమ్మతనాన్ని, పేగుబంధాన్ని దారపుపోగులా తెంపేసే తల్లి తల్లే కాదంటూ ఓ సినీకవి పడ్డ ఆవేదన ఇదీ! తన అక్రమ సంబంధానికి అడ్డొస్తుందన్న కారణంతో కన్నబిడ్డను రాచిరంపాన పెట్టిన అలాంటి ఓ 'రాతి బొమ్మ' కర్కశత్వం వెలుగు చూసింది. ప్రియుడి మోజులో పడి అభంశుభం తెలియని నాలుగేళ్ల చిన్నారిని కాలుతున్న పెనంపై కూర్చోబెట్టింది. చిగురాటులాంటి పాప పెనంపై విలవిల్లాడిపోతున్నా ఆమె గుండె కరగలేదు. చివరికి ప్రియుడితో కలిసి పాపను వదిలించుకోవాలని చూసి పోలీసులకు చిక్కింది. మరో ఘటనలో 12 ఏళ్ల బాలికపై మారుతండ్రి పశువులా ప్రవర్తించాడు. ఈ రెండు ఉదంతాలు ఆదివారం హైదరాబాద్‌లోని ఎస్సార్ నగర్, బంజారాహిల్స్ పరిధిలో వెలుగులోకి వచ్చాయి.



కన్నతల్లి లలిత



మారుతండ్రి ప్రకాశ్

**ప్రియుడు చెప్పాడని..**

శ్రీకాకుళం జిల్లా ఇచ్ఛాపురానికి చెందిన లలితకు గతంలోనే వివాహమైంది. నాలుగేళ్ల కూతురు రూప ఉంది. ఇదే జిల్లాకు చెందిన వివాహితుడు ప్రకాశ్‌కు ముగ్గురు సంతానం. వీరిద్దరి మధ్య ఏర్పడిన పరిచయం వివాహేతర సంబంధానికి దారి తీసింది. దీంతో కొన్నాళ్ల క్రితం ఇరువురూ హైదరాబాద్‌కు పారిపోయి వచ్చారు. ప్రకాశ్ తన భార్యపిల్లల్ని అక్కడి వదిలి రాగా... లలిత మాత్రం తన బిడ్డ రూపను వెంట తెచ్చుకుంది. వీరిద్దరూ ఎస్సార్‌నగర్‌లో ఉన్న వెస్ట్ శ్రీనివాస్‌నగర్‌లోని పద్మావతి బాయ్స్ హాస్టల్‌లో పనులకు చేరారు. నిర్వాహకులతో తాము భార్యభర్తలమని, తమ వెంట ఉన్నది కన్న బిడ్డని నమ్మబలికారు. హాస్టల్‌లో లలిత వంట మనిషిగా పనిచేస్తుండగా.. ప్రకాశ్ వాచ్‌మెన్‌గా పనిచేస్తున్నాడు. హాస్టల్ లో ఉన్న ఓ చిన్న గదిలో ఇద్దరూ నివాసం ఉంటున్నారు. తాను తన భార్యతోపాటు పిల్లల్ని వదిలేసి వచ్చానని, నీవు కూడా రూపను వదిలించుకోవాలని కొన్ని రోజులుగా లలితపై ప్రకాశ్ ఒత్తిడి తెస్తున్నాడు. మొదట్లో వారించినా కొన్ని రోజుల తర్వాత.. తన అక్రమ సంబంధానికి అడ్డుగా ఉన్న బిడ్డను వదిలించుకోవాలని భావించింది లలిత. నేరుగా వదిలేస్తే ఇబ్బందని భావించిన లలిత, ప్రకాశ్‌లు.. బాలిక భయభ్రాంతులకు గురయ్యేలా చిత్రహింసలు పెట్టాలని భావించారు. ఈ క్రమంలోనే లలిత రెండ్రోజుల క్రితం మండుతున్న పొయ్యిపై ఉన్న పెనంపై చిన్నారిని కూర్చోబెట్టింది. బాలిక కాళ్లతోపాటు సున్నిత భాగాల్లో తీవ్రంగా కాలిన గాయాలయ్యాయి. కంటికి రెప్పలా కాపాడుకోవాల్సిన అమ్మే ఇలా అమానుషంగా ప్రవర్తిస్తుంటే ఎవరికి చెప్పుకోవాలో తెలియక ఆ పాపా విలవిల్లాడింది. గాయాలేంటని అడిగిన వారితో.. ప్రమాదవశాత్తు కాలిందని చెప్పి నమ్మించింది. చివరకు బాలికను పూర్తిగా వదిలించుకోవాలనే ఉద్దేశంతో ప్రకాశ్‌తో కలసి పథకం వేసింది. శనివారం రాత్రి వీరిద్దరూ చిన్నారిని తీసుకుని నాంపల్లిలోని భరోసా కేంద్రానికి చేరుకున్నారు. అక్కడున్న సిబ్బందితో తమకు కాలిన గాయాలతో ఉన్న ఓ చిన్నారి దొరికిందని, అనాథగా భావించి అప్పగించడానికి తెచ్చామని చెప్పారు. అక్కడి సిబ్బంది చైల్డ్‌లైన్ విభాగానికి సమాచారమిచ్చారు. ఆ విభాగం ఉన్నది గోపాలపురం ఠాణా పరిధిలో కావడంతో అక్కడకు పంపారు. చైల్డ్‌లైన్ అధికారులు వచ్చేలోపు గోపాలపురం పోలీసులు చిన్నారిని బుజ్జగించి మెల్లిగా వివరాలు ఆరా తీసే ప్రయత్నం చేశారు. దీంతో కన్నీరుమున్నీరైన ఆ పాపా తాను అనాథను కాదని, లలిత తన తల్లి అని చెప్పి రోదించింది. ఆమే తనను పెనంపై కూర్చోపెట్టడంతోనే గాయాలయ్యాయని చెప్పింది. దీంతో షాక్‌కు గురైన పోలీసులు... చిన్నారిని వదిలించుకోవడానికి లలిత, ప్రకాశ్ నాటకం ఆడినట్లు గుర్తించారు. ఇద్దరినీ అదుపులోకి తీసుకుని చిన్నారితో సహా ఎస్సార్‌నగర్ పోలీస్‌స్టేషన్‌కు తరలించారు. విషయం తెలుసుకున్న చైల్డ్‌లైన్ అధికారి ఠాణాకు వచ్చి ఫిర్యాదు చేశారు. లలిత, ప్రకాశ్‌లపై పోలీసులు కేసు నమోదు చేసుకుని అదుపులోకి తీసుకున్నారు. బాలికను యూసుఫ్‌గూడలోని శిశువిహార్‌కు తరలించి వైద్య చికిత్స చేయిస్తున్నారు. అక్కడి అధికారులే బాలిక సంరక్షణ బాధ్యతలు చేపట్టారని, అవసరమైతే అదనపు వైద్య సేవలు అందిస్తారని పోలీసులు చెప్పారు. నిందితులపై హత్యాయత్నం కేసు నమోదు చేయాలని బాలల హక్కుల సంఘం గౌరవాధ్యక్షుడు అచ్యుతరావు డిమాండ్ చేశారు.



కాలుతున్న పెనంపై కూర్చోబెట్టడంతో చిన్నారి కాలికి గాయమైన దృశ్యం

### వావి వరుసలు మరిచి..

వావి వరసలు మర్చిన ఓ సవతి తండ్రి.. కూతురిపై లైంగిక వేధింపులకు పాల్పడ్డాడు. బంజారాహిల్స్ పోలీస్‌స్టేషన్ పరిధిలో ఆదివారం ఈ దారుణం వెలుగులోకి వచ్చింది. యూసుఫ్‌గూడ సమీపంలోని ఎల్ఎన్ నగర్‌లో నివాసం ఉంటున్న వ్యక్తి కూరగాయల వ్యాపారం నిర్వహిస్తుంటాడు. భార్య ఉండగానే మరో మహిళను పెళ్లి చేసుకున్నాడు. రెండో భార్య కూతురు (12)పై కొంతకాలంగా కన్నేశాడు. తరుచూ ఆ చిన్నారితో అసభ్యకరంగా ప్రవర్తిస్తుండడంతోపాటు లైంగిక వేధింపులకు పాల్పడుతూ నరకం చూపుతున్నాడు. తల్లితో పాటు ఎవరూ పట్టించుకోకపోవడంతో దిక్కుతోచని చిన్నారి చుట్టుపక్కల వారికి తన గోడు చెప్పుకుంది. దీంతో ఓ గుర్తు తెలియని వ్యక్తి షీ–టీమ్స్‌కు సమాచారం అందించారు. రంగంలోకి దిగిన షీ–టీమ్స్ సిబ్బంది బాలికను సవతి తండ్రి బారి నుంచి రక్షించి చైల్డ్‌లైన్ సిబ్బందికి అప్పగించారు. బాలికను చైల్డ్‌లైన్ అధికారులు బంజారాహిల్స్ పోలీస్ స్టేషన్‌కు తీసుకువచ్చి జరిగిన ఘాతుకంపై ఫిర్యాదు చేశారు. చిన్నారి వద్ద వాంగ్మూలం తీసుకున్న పోలీసులు.. ఆమెను బాలికల పునరావాస కేంద్రానికి తరలించారు. బాలిక సవతి తండ్రిపై కేసు నమోదు చేశారు.

### ఏపీ అభ్యర్థులకు
# ఢిల్లీ కోచింగ్ సెంటర్ల ఝలక్!

- బీసీ విద్యార్థులకు ట్యూషన్ ఫీజు చెల్లించని రాష్ట్ర ప్రభుత్వం
- శిక్షణ తరగతులకు అనుమతించని కేంద్రాలు

**సాక్షి, అమరావతి:** రాష్ట్ర ప్రభుత్వ నిర్వాకం కారణంగా ఢిల్లీలో పోటీ పరీక్షలకు కోచింగ్ తీసుకుంటున్న విద్యార్థులు రోడ్డునపడ్డారు. ఏపీ ప్రభుత్వం ఇవ్వాల్సిన ట్యూషన్ ఫీజులు సకాలంలో ఇవ్వనందున కోచింగ్ సెంటర్లు విద్యార్థులను వీధుల్లో నిలబెట్టాయి. ఎన్టీఆర్ విద్యోన్నతి పథకం కింద ఎస్సీ, ఎస్టీ, బీసీ, మైనార్టీ, ఈబీసీ, కాపు కులాలకు చెందిన నాలుగు వేల మంది విద్యార్థులకు పోటీ పరీక్షల నిమిత్తం ఉచిత శిక్షణ ఇప్పించే కార్యక్రమాన్ని ప్రభుత్వం చేపట్టింది. జూలైలో శిక్షణ ప్రారంభం కావాల్సి ఉండగా ప్రభుత్వ నిర్లక్ష్యం కారణంగా మూడు నెలలు ఆలస్యమైంది. నెల రోజుల క్రితం శిక్షణ సంస్థలకు ఆయా సంక్షేమ శాఖలు అలాట్‌మెంట్ లెటర్లు పంపించాయి. అన్ని శాఖలు నేరుగా శిక్షణ సంస్థలకు డబ్బులు ఇస్తుండగా బీసీ సంక్షేమ శాఖ మాత్రం విద్యార్థుల అకౌంట్లలో వేయాలని నిర్ణయించింది. ఈ మేరకు కోచింగ్ సెంటర్లకు ఆదేశాల కాపీలు పంపించారు. ఈ విధానం కింద అయితే కోచింగ్ సక్రమంగా ఉంటేనే విద్యార్థులు ఆయా సెంటర్లకు ఫీజులు ఇస్తారని, లేదంటే కోచింగ్ సెంటర్‌ను మార్చుకునే వీలు కూడా విద్యార్థికి ఉంటుందని అధికారుల భావన. అయితే, మూడు నెలలకు ఒకసారి విద్యార్థి అకౌంట్‌కు డబ్బులు ఇచ్చేందుకు బీసీ సంక్షేమ శాఖ నిర్ణయం తీసుకోవడంతో ఢిల్లీలోని కోచింగ్ సెంటర్లు అభ్యంతరం తెలిపాయి. ముందుగా ఈ విషయం తమకు చెప్పలేదని, ఇప్పుడు ఈ నిబంధనలు ఏమిటనేది వాటి వాదన. 15 రోజుల్లో ట్యూషన్ ఫీజు ఇస్తామని ముందు చెప్పారని, అయినా ఇంతవరకు ఇవ్వకపోవడంతో ఢిల్లీలోని కోచింగ్ సెంటర్లు బీసీ విద్యార్థులను అనుమతించలేదు.

**మిగిలిన శాఖలదీ ఇదే దారి**

ఇదిలా ఉంటే.. మిగిలిన సంక్షేమ శాఖలు కూడా ఇంకా కొన్ని కోచింగ్ సెంటర్లకు నిధులు విడుదల చేయలేదు. ఢిల్లీతో పాటు బెంగళూరు, హైదరాబాద్‌లలోనూ కోచింగ్ సెంటర్లు ఉన్నాయి. కానీ, హైదరాబాద్‌లోని కోచింగ్ సెంటర్లలోనే ఎక్కువమంది విద్యార్థులు శిక్షణ పొందుతున్నారు. 300మంది మైనార్టీ విద్యార్థులకు ఇప్పటివరకు కోచింగ్ సెంటర్ల అలాట్‌మెంట్ జరగలేదు. ఇలా ప్రతి విషయంలోనూ ఈ పథకం అమలులో రాష్ట్ర ప్రభుత్వం విఫలమవుతూ వస్తోంది.

ఇదిలా ఉంటే.. కాపు కార్పొరేషన్ ద్వారా విద్యోన్నతి పథకం కింద కోచింగ్ ఇప్పించే విషయంలో గతంలో పనిచేసిన ఎండీ అవినీతికి పాల్పడినట్లు ఆరోపణలు వెల్లువెత్తాయి. దీంతో ఆయనను మాతృశాఖకు సరెండర్ చేశారు. అలాగే, కాపు కార్పొరేషన్‌లోనూ అవినీతి జరగడంతో మిగిలిన సంక్షేమ శాఖలు నిధులు విడుదల చేసే విషయంలో ఆచీతూచీ అడుగులు వేస్తున్నట్లు సమాచారం.

# దక్షిణ కొరియా బయల్దేరిన చంద్రబాబు

- ఢిల్లీలో కేంద్ర మంత్రులను కలవకుండానే విదేశాలకు పయనం
- పోలవరంపై ప్రధానిని కలుస్తానని ప్రకటించిన ముఖ్యమంత్రి
- చంద్రబాబుకు దొరకని మోదీ అపాయింట్‌మెంట్?

**సాక్షి, అమరావతి:** ముఖ్యమంత్రి చంద్రబాబు మూడురోజుల పర్యటన నిమిత్తం ఆదివారం దక్షిణ కొరియా బయలుదేరి వెళ్లారు. బుధవారం వరకూ ఆయన అక్కడ పర్యటిస్తారు. హైదరాబాద్ నుంచి ఢిల్లీ వెళ్లిన ఆయన కేంద్ర మంత్రులు గడ్కారీ, అరుణ్‌జైట్లీలను కలవాలని భావించినా సాధ్యం కాకపోవటంతో దక్షిణకొరియా పయనమైనట్లు సమాచారం. ముందు నిర్ణయించిన షెడ్యూల్ ప్రకారం చంద్రబాబు కేంద్ర మంత్రులను కలవాల్సి ఉన్నా వారి అపాయింట్‌మెంట్ దొరకలేదని తెలుస్తోంది. పోలవరం ప్రాజెక్టు టెండర్ల రద్దుతో వివాదం నెలకొన్న నేపథ్యంలో రెండు మూడు రోజుల్లో ప్రధానమంత్రిని కలుస్తానని చంద్రబాబు అసెంబ్లీలో ప్రకటించారు. అయితే ప్రధానిని కలవకుండా దక్షిణ కొరియా పర్యటనకు వెళ్లటంతో అపాయింట్‌మెంట్ దొరకలేదని స్పష్టమవుతోంది. బూసన్ సిటీలో చంద్రబాబు పర్యటిస్తారు. ఆయన వెంట మంత్రులు యనమల రామకృష్ణుడు, అమర్‌నాథరెడ్డి, ప్రభుత్వ సలహాదారు పరకాల ప్రభాకర్, సీఎంవో ముఖ్య కార్యదర్శి జి.సాయిప్రసాద్, పరిశ్రమలశాఖ కార్యదర్శి సాల్మన్ ఆరోఖ్యరాజ్, ఈడీబీ సీఈవో జాస్తి కృష్ణకిశోర్, ఏపీఐఐసీ ఎండీ అహ్మద్ బాబు ఉన్నారు.

**బీసీలను సముదాయించండి**

కాపు రిజర్వేషన్ల వల్ల బీసీల్లో అసంతృప్తి పెరగకుండా చూడాలని, వారిని సముదాయించాలని ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు టీడీపీ ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీలు, ప్రజాప్రతినిధులకు సూచించారు. ఆదివారం హైదరాబాద్ నుంచి టీడీపీ నేతలతో టెలీకాన్ఫరెన్స్‌లో మాట్లాడారు. కాపు రిజర్వేషన్ల వల్ల బీసీ సంఘాల ఆందోళనలు చేయకుండా చూడాలని కోరారు. కాపు రిజర్వేషన్లు, బీసీ సంఘాల ఆందోళన, మంజునాథ్ కమిషన్ వివాదంపై నాయకులకు పలు సూచనలు చేశారు. బీసీల రిజర్వేషన్లలో కోత పెట్టేది లేదని, తెలుగుదేశం హయాంలోనే బీసీలు అభివృద్ధి చెందారని ప్రచారం చేయాలన్నారు. ఓట్ల కోసం రిజర్వేషన్లు ఇవ్వలేదని కాపులకు చెప్పాలన్నారు. కాపు సామాజికవర్గం చాలాకాలం నుంచి చేస్తున్న డిమాండ్‌ను నెరవేర్చామన్నారు. నిబంధనల ప్రకారమే కాపు రిజర్వేషన్ల బిల్లును సభలో పెట్టామని, బీసీ కమిషన్‌లో మెజార్టీ సభ్యులు ఇచ్చిన నివేదిక ఆధారంగా కాపు రిజర్వేషన్లపై నిర్ణయం తీసుకున్నామన్నారు. జిల్లాల్లో జరుగుతున్న పరిణామాలను ఎప్పటికప్పుడూ గమనిస్తూ అందుకనుగుణంగా స్పందించాలని సూచించారు. పార్టీలోని బీసీలు, కాపులను సమన్వయం చేసుకోవాలని కళా వెంకట్రావు, అచ్చెన్నాయుడులకు సూచించారు.

# వాయుగుండంగా మారనున్న అల్పపీడనం

**సాక్షి, విశాఖపట్నం:** దక్షిణ అండమాన్ సముద్రంలో సుమత్రా దీవులకు ఆనుకుని కొనసాగుతున్న అల్పపీడనం ఆదివారం ఆగ్నేయ బంగాళాఖాతంలోకి ప్రవేశించింది. ఇది సోమవారం నాటికి ఆ ప్రాంతంలో వాయుగుండంగా మారనుంది. దీనికి అనుబంధంగా సముద్రమట్టానికి 5.8 కిలోమీటర్ల ఎత్తులో ఉపరితల ఆవర్తనం ఆవరించి ఉంది. దీని ప్రభావంతో రానున్న రెండు రోజుల్లో వాయుగుండం తీవ్ర వాయుగుండంగా బలపడనుందని ఐఎండీ ఆదివారం రాత్రి నివేదికలో పేర్కొంది. అనంతరం ఇది మూడు, నాలుగు రోజుల పాటు ఉత్తర తమిళనాడు, దక్షిణ కోస్తాంధ్రల వైపు కదులుతుందని వివరించింది. ఫలితంగా సోమ, మంగళ వారాల్లో రాష్ట్రంలో అక్కడక్కడ తేలికపాటి జల్లులు గాని, వర్షం గాని కురిసే అవకాశం ఉందని తెలిపింది. ఈ నెల 6న కొన్నిచోట్ల, 7 నుంచి కోస్తాలో పలుచోట్ల విస్తారంగా వర్షాలు కురుస్తాయని వెల్లడించింది.

## నమోదు చేసుకున్న వాహనాలకే రవాణా పర్మిట్లు

**సాక్షి, అమరావతి:** అక్రమ రవాణా కట్టడికి గనుల శాఖ కసరత్తు చేస్తోంది. తమ శాఖ వద్ద నమోదు చేసుకున్న వాహనాలకే ఖనిజ రవాణా పర్మిట్లు జారీ చేయాలని, జీపీఎస్ ద్వారా నిరంతరం వాటిని పర్యవేక్షించాలని నిర్ణయించింది. కొందరు గ్రానైట్ లీజుదారులు ఒక ట్రిప్పుకు రవాణా(ట్రాన్సిట్) పర్మిట్ తీసుకొని.. అదే పర్మిట్‌తో మూడు ట్రిప్పులు నడుపుతున్నారు. కానీ రికార్డులో ఒక పర్మిట్‌పై.. ఒక లారీ గ్రానైట్ మాత్రమే తరలించినట్లు నమోదవుతోంది. దీంతో రెండు లారీల(ట్రిప్పుల) గ్రానైట్‌కు సీనరేజి రావడం లేదు. అదే సమయంలో జీఎస్టీ కూడా ఎగవేస్తున్నారు. ఈ తరహా మోసాలకు చెక్ పెట్టేందుకు జీపీఎస్ ఉపయోగించాలని భూగర్భ గనుల శాఖ నిర్ణయించింది. తమ శాఖ వద్ద రిజిస్టర్ చేసుకున్న వాహనాలకే ఖనిజ రవాణా పర్మిట్లు ఇవ్వాలని నిర్ణయం తీసుకుంది. రిజిస్ట్రేషన్ చేసుకున్న వెంటనే ఆ వాహనానికి జీపీఎస్ పరికరం అమర్చుతారు. ఆ వాహనం ఏ సమయంలో ఎక్కడ్నుంచి బయలుదేరింది? తదితర సమాచారమంతా గనుల శాఖ కార్యాలయంలోని కంప్యూటర్ స్క్రీన్‌పై కనిపిస్తుంటుంది. దీనివల్ల ఒకే పర్మిట్‌తో రెండు లోడ్‌ల ఖనిజాన్ని తరలించడానికి ఏమాత్రం వీలు కాదు. ఈ విధానం త్వరలో అమల్లోకి వస్తుందని ఆ శాఖ అధికారులు తెలిపారు.

## ఏనుగుల దాడిలో మరో రైతు మృతి

**డి.హీరేహాళ్:** గజరాజుల దాడితో 'అనంత'లో మరో రైతన్న కన్నుమూశాడు. శుక్రవారం కణేకల్లు మండలానికి చెందిన మల్లప్పపై దాడిచేసి చంపేసిన ఏనుగులు... ఆదివారం డి.హీ రేహాళ్ మండలం మురడి గ్రామానికి చెందిన గొల్ల హేమాకాంత్ అలియాస్ చిప్పగిరి స్వామి (52)ని తొక్కి చంపేశాయి. శుక్రవారం కణేకల్లు మండలంలో సంచరించిన ఏనుగులు ఆదివారం తెల్లవారుజామున డి.హీరేహాళ్ మండలంలోని ఎం.హనుమాపురం, మురడి గ్రామాల మీదుగా ఉలికల్లు చెరువుకు చేరుకు న్నాయి. మురడిలో పొలాలపై వెళుతున్న ఏనుగులను చూసి స్థానికులు కేకలు వేయడంతో పరుగు తీశాయి. తన పొలం వద్ద ఏనుగులు సంచరిస్తున్నాయని తెలిసి అటుగా వెళ్లిన హేమాకాంత్ ఏనుగుల కంటబడ్డాడు. రెచ్చిపోయిన ఏనుగులు అతన్ని తొక్కి చంపి సమీపంలోని అటవీ ప్రాంతంలోకి వెళ్లిపోయాయి. హేమాకాంత్ బంధువులు సంఘటనా స్థలానికి వెళ్లి చూడగా అప్పటికే అతను నిర్జీవంగా పడి ఉన్నాడు. మృతదేహాన్ని రాయదుర్గం ప్రభుత్వాస్పత్రికి తరలిం చారు. విషయం తెలుసుకున్న జేసీ రమామణి, జిల్లా అటవీ శాఖాధికారి చంద్రశేఖర్, ఆర్డీఓ రామక్రిష్ణారెడ్డి కుప్రా ప్రభుత్వాస్పత్రికి వెళ్లి హేమాకాంత్ మృతికి సంతాపం తెలిపారు. రైతు కుటుంబానికి అటవీ శాఖ తరఫున రూ.5 లక్షలు, చంద్రన్న బీమా కింద మరో రూ.5 లక్షల పరిహారం అందిస్తామని డీఎఫ్ఓ తెలిపారు.



మృతుడు హేమాకాంత్

# మహేంద్ర తనయకు ఒకటే టెండర్

- షెడ్యూళ్ల దాఖలుకు నేడే తుది గడువు..
- ఓ మంత్రి హెచ్చరికలతో ముందుకు రాని సంస్థలు
- శ్రీకాకుళం జిల్లాలో కీలక మంత్రితో చేతులు కలిపిన అధికార పార్టీ ఎంపీ
- ఎత్తిపోతలలో నజరానాగా రూ.50 కోట్లు ఇచ్చే ఒప్పందం
- జూలై 7న రూ.106.75 కోట్లతో టెండర్లు పిలిచిన ఏపీఎస్ఐడీసీ
- మంత్రి ఒత్తిడితో చివరి నిమిషంలో టెండర్ నోటిఫికేషన్ రద్దు



రూ. 106.75 కోట్ల అంచనా వ్యయంతో బొంతు–సార్వకోట–కోతూరు ఎత్తిపోతలకు జూలై 7న జారీ చేసిన నోటిఫికేషన్



అంచనా వ్యయాన్ని రూ. 120.72 కోట్లకు పెంచేసి గత నెల 20న రెండోసారి జారీ చేసిన టెండర్ నోటిఫికేషన్

**సాక్షి, అమరావతి:** శ్రీకాకుళం జిల్లాలో 10 వేల ఎకరాల పైగా సాగు నీరు అందించే మహేంద్ర తనయ ఎత్తిపోతల పథకంపై కన్నేసిన ఓ మంత్రివర్యుడు, అధి కార పార్టీలో కాంట్రాక్టర్‌గా పనిచేస్తూ ముఖ్యనేత కోటరీలో చక్రం తిప్పుతున్న ఓ ఎంపీ చేతులు కలపటంతో టెండర్లకు రెక్కలొచ్చాయి. అధికారులపై ఒత్తిడి తెచ్చి రూ.106.75 కోట్లతో గత జూలై 7న జారీ చేసిన టెండర్ నోటిఫికేషన్‌ను చివరి నిమిషంలో రద్దు చేయించారు. అంచనా వ్యయం రూ.120.72 కోట్లకు పెంచేలా చక్రం తిప్పారు. నాలుగు నెలల్లోనే అంచనా వ్యయం రూ. 13.67 కోట్లు పెంచేశారు. ఎంపీకి చెందిన సంస్థకే పనులు దక్కేలా గత నెల 20న మరో టెండర్ నోటిఫికేషన్ జారీ చేయించారు.

**టెండర్లకు నేడే తుది గడువు**

ఎత్తిపోతల పథకంలో అలైన్‌మెంట్ మార్చటం ద్వారా రూ.37 కోట్లకు పైగా మిగుల్చుకునే ఎత్తుగడ పన్నారు. పెంచిన అంచనా వ్యయం, అలైన్‌మెంట్ మార్చడం వల్ల మిగిలే రూ.50.67 కోట్లను మంత్రికి నజరానాగా ఇచ్చేలా ఎంపీతో ఒప్పం దం చేసుకున్నారు. షెడ్యూలు దాఖలుకు నేడు తుది గడువు కాగా ఇప్పటివరకూ ఒకే ఒక టెండర్ దాఖలు కావటంలోనే అసలు ఆంతర్యం బోధ పడుతోంది. అమాత్యుడి హెచ్చరికలతో మరే సంస్థా షెడ్యూల్ దాఖ లు చేయటానికి ముందుకు రాలేదు. 4.99 శాతం అదన పు ధరలకు షెడ్యూలు దాఖలు చేసిన ఎంపీ సంస్థకే పను లు కట్టబెట్టడానికి రంగం సిద్ధం చేశారు. ఈ అక్రమాలకు శ్రీకాకుళం జిల్లాలో బొంతు– సార్వకోట–కోతూరు ఎత్తిపోతల పథకం వేదికగా మారింది.

**అంచనాలు పెంచేందుకు టెండర్ రద్దు**

శ్రీకాకుళం జిల్లా సార్వకోట మండలంలో మహేంద్ర తనయ నది నుంచి 1.464 టీఎంసీల నీటిని ఎత్తిపోసి 11,700 ఎకరాలకు నీళ్లందించడానికి రూ.180.22 కోట్లతో బొంతు–సార్వకోట–కోతూరు ఎత్తిపోతలను మంజూరు చేస్తూ 2016 నవంబర్ 23న ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. ఆ ఉత్తర్వుల్లోనే 2017–18 బడ్జెట్లో సరిపడా నిధులు కేటాయిస్తేనే ఆ పథకాన్ని చేపట్టాలని షరతు విధించింది. బడ్జెట్లో ఈ పథకానికి ఒక్క పైసా కూడా నిధులు కేటాయించకున్నా శ్రీకాకుళం జిల్లాకు చెందిన కీలకమంత్రి ఒత్తిడితో పనుల అంతర్గత అంచనా విలువ(ఐబీఎం) రూ.106.75 కోట్లుగా నిర్ణయించి టెండర్ నోటిఫికేషన్ జారీ చేశారు. దీనిపై కన్నేసిన ముఖ్యనేత కోటరీలోని ఎంపీ సదరు మంత్రితో అవగాహనకు కుదుర్చుకుని అంచనా వ్యయం పెంచటం ద్వారా భారీఎత్తున మిగుల్చుకునే వ్యూహం రచించారు. చివరి నిమిషంలో ఆంధ్రప్రదేశ్ నీటిపారుదల అభివృద్ధి సంస్థ(ఏపీఎస్ఐడీసీ) అధికారులపై ఒత్తిడి తెచ్చి టెండర్లు రద్దు చేయించారు. వాస్తవానికి ఈ ఎత్తిపోతల వ్యయం రూ. 65 కోట్ల నుంచి రూ.70 కోట్లకు మించదని నిపుణులు చెబుతున్నారు.

**రాయితీల్లో మర్మమేమిటో!**

మొదటిసారి జారీ చేసిన టెండర్ నోటిఫికేషన్‌లోని పనుల అలైన్‌మెంట్‌ను పూర్తిగా మార్చేయాలని అధికారులపై ఒత్తిడి తెచ్చారు. అంచనా వ్యయం పెంచేయాలని ఆదేశించారు. దీంతో అలైన్‌మెంట్ పూర్తిగా మార్చేసిన అధికారులు అంతర్గత అంచనా విలువను రూ.120.72 కోట్లకు పెంచేస్తూ గత నెల 20న టెండర్ నోటిఫికేషన్ జారీ చేశారు. ఇతరులెవరూ షెడ్యూలు దాఖలు చేయకుండా కీలక మంత్రి బెదిరింపులకు దిగారు. తనను కాదని ఎవరైనా దక్కించుకున్నా పనులు చేయనివ్వని హుంకరించారు. దాంతో ఎంపీ, ఆయన బినామీ సంస్థలు మినహా మరే సంస్థా షెడ్యూలు దాఖలు చేయలేదు. సుమారు 4.99 శాతం అదనపు ధరలకు షెడ్యూళ్లు దాఖలు చేసిన ఎంపీ సంస్థకే ఆ పనులు దక్కనున్నాయి.

**పనులు పూర్తయ్యాక పన్నులు రీయింబర్స్!**

సాగునీటి ప్రాజెక్టు పనుల్లో వినియోగించే వస్తువులపై జీఎస్టీ (గతంలో వ్యాట్), సెంట్రల్ ఎక్సైజ్ సుంకం, సీనరేజీ ఛార్జీలను కాంట్రాక్టరే భరించాలి. వీటిన్నింటినీ పరిగణనలోకి తీసుకునే ప్రాజెక్టు అంచనా వ్యయాన్ని రూపొందిస్తారు. కానీ ఈ ఎత్తిపోతల పథకంలో వినియోగించే పీఎస్‌వీ, ఆర్‌సీసీ, పీవీసీ పైపులు, వాల్వ్‌లపై విధించే పన్ను రూ.8.81 కోట్లు, సెంట్రల్ ఎక్సైజ్ డ్యూటీ రూపంలో విధించి రూ.7.11 కోట్లు వెరసి 15.92 కోట్లను పనులు పూర్తయిన తర్వాత రీయింబర్స్ చేస్తామంటూ టెండర్లలోనే నిబంధన పెట్టడంపై అధికారవర్గాలు విస్మయం వ్యక్తం చేస్తున్నారు.



**దివ్యాంగుల పరుగు**

అంతర్జాతీయ దివ్యాంగుల దినోత్సవం సందర్భంగా ఆదివారం ఉత్తరప్రదేశ్‌లోని మొరాదాబాద్‌లో దివ్యాంగులకు క్రీడా పోటీలు నిర్వహించారు. ఈ సందర్భంగా పరుగు పందెంలో పోటీ పడుతున్న దివ్యాంగులు

# ఫిబ్రవరి 1న కేంద్ర బడ్జెట్!

**జనవరి 30న ఉభయ సభల్ని ఉద్దేశించి రాష్ట్రపతి ప్రసంగం ● జీఎస్టీ అనంతరం తొలి బడ్జెట్ కావడంతో ఆసక్తి ● ఎన్డీఏకు ఇదే చివరి పూర్తిస్థాయి బడ్జెట్**

**న్యూఢిల్లీ:** వస్తు, సేవల పన్ను (జీఎస్టీ) అమలు అనంతరం తొలిసారి కేంద్ర బడ్జెట్‌ను వచ్చే ఏడాది ఫిబ్రవరి 1న ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీ ప్రవేశపెట్టే అవకాశముంది. ప్రస్తుత ఎన్డీఏ ప్రభుత్వానికి ఇదే చివరి పూర్తి స్థాయి బడ్జెట్ కావడంతో కొత్త ప్రజాకర్షక పథకాలు, ఆదాయపు పన్ను రేట్లలో మార్పులపై సర్వత్రా ఆసక్తి నెలకొంది. పార్లమెంట్ ఉభయ సభల సంయుక్త సమావేశాన్ని ఉద్దేశించి జనవరి 30న రాష్ట్రపతి రామ్ నాథ్ కోవింద్ ప్రసంగంతో బడ్జెట్ సమావేశాలు ప్రారంభమవుతాయని కేంద్ర ప్రభుత్వ అధికారి ఒకరు వెల్లడించారు. ఆర్థిక సర్వేను జనవరి 31న ప్రవేశపెట్టవచ్చని, ఆ తర్వాతి రోజు ఆర్థిక మంత్రి జైట్లీ బడ్జెట్‌ను సమర్పిస్తారని ఆయన చెప్పారు. బ్రిటిష్ కాలం నాటి సంప్రదాయాన్ని పక్కన పెట్టి ఈ ఏడాది నుంచి ఫిబ్రవరి 1నే కేంద్ర బడ్జెట్‌ను ప్రవేశపెడుతున్న సంగతి తెలిసిందే. కొత్త ఆర్థిక సంవత్సరం ప్రారంభ తేదీ ఏప్రిల్ 1 నాటికి బడ్జెట్ ప్రతిపాదనలు అమల్లోకి వచ్చేలా కేంద్ర బడ్జెట్ సమర్పణను నెల రోజులు ముందుకు జరిపారు. దాదాపు శతాబ్దం పాటు కొనసాగిన రైల్వే బడ్జెట్‌ను.. ఈ ఏడాది నుంచి సాధారణ బడ్జెట్‌లో విలీనం చేశారు.

**కొత్త పథకాలు ప్రవేశపెట్టే అవకాశం**

2019 సాధారణ ఎన్నికలకు ముందు బీజేపీ నేతృత్వంలోని ఎన్డీఏ ప్రభుత్వానికి 2018–19 కేంద్ర బడ్జెట్ చివరి పూర్తి స్థాయి బడ్జెట్. ఇంతవరకూ అనుసరిస్తున్న సంప్రదాయం ప్రకారం ఎన్నికల సంవత్సరంలో పూర్తి స్థాయి బడ్జెట్ సమర్పణ ఉండదు. ప్రభుత్వ ఖర్చుల కోసం ఓటాన్ అకౌంట్‌ను ప్రవేశపెడతారు. అనంతరం అధికారంలోకి వచ్చిన కొత్త ప్రభుత్వం పూర్తిస్థాయి బడ్జెట్‌ను ప్రవేశపెడుతుంది. ఈ నేపథ్యంలో 2018–19 బడ్జెట్‌లో పలు కొత్త పథకాల ప్రకటనలు ఉండవచ్చని అంచనా వేస్తున్నారు.

**వేర్వేరుగా రాబడి లెక్కలు**

జీఎస్టీ అమల్లోకి వచ్చాక ఇదే తొలి బడ్జెట్ కావడం మరొక కీలకాంశం. ఎక్సైజ్, సేవా పన్నుల్ని జీఎస్టీలో కలపడంతో.. రాబోయే బడ్జెట్ సమర్పణలో అనేక మార్పులు చేర్పులు ఉండవచ్చని భావిస్తున్నారు. ఈ ఏడాది ఏప్రిల్–జూన్ మధ్యలో ఎక్సైజ్, కస్టమ్స్, సేవా పన్నుల ద్వారా వచ్చిన ఆదాయాన్ని, జూలై–మార్చి మధ్య జీఎస్టీ, కస్టమ్స్ పన్నుల నుంచి వచ్చిన ఆదాయాన్ని వేర్వేరుగా పొందుపర్చవచ్చని సమాచారం. వ్యక్తిగత ఆదాయ పన్ను, కార్పొరేట్, కస్టమ్స్ పన్నుల్లో మార్పుల ప్రతిపాదనలు, కొత్త ప్రభుత్వ పథకాలు, కార్యక్రమాల ప్రకటనలు మాత్రమే రాబోయే బడ్జెట్‌లో కీలకం కానున్నాయి.

**జనవరి 5 వరకూ శీతాకాల సమావేశాలే..**

శీతాకాల సమావేశాలు, బడ్జెట్ సమావేశాలకు మధ్య నెల రోజులు కూడా సమయం లేకపోవడంతో బడ్జెట్ కసరత్తుపై ఉత్కంఠ ఏర్పడింది. శీతాకాల సమావేశాలు డిసెంబర్ 15న ప్రారంభమై వచ్చే ఏడాది జనవరి 5తో ముగియనున్నాయి. 1976లో కూడా జనవరిలోనే శీతాకాల సమావేశాలు జరిగినా అప్పుడు ఫిబ్రవరి చివరి రోజున బడ్జెట్ సమర్పణతో రెండింటికి మధ్య నెలకుపైగా సమయముందని ఉన్నతాధికారి ఒకరు తెలిపారు.



## 2020 నాటికి బీఎస్-4 రిజిస్ట్రేషన్లు బంద్



**న్యూఢిల్లీ:** దేశంలో కాలుష్య ఉద్గారాలను నియంత్రించడంలో భాగంగా కేంద్రం కీలక నిర్ణయం తీసుకుంది. భారత్ స్టేజ్ (బీఎస్)–4 ప్రమాణాలతో దేశంలో తయారయ్యే వాహనాల రిజిస్ట్రేషన్‌ను 2020, జూన్ 30 నాటికి నిలిపివేస్తామని కేంద్రం తెలిపింది. 2020, ఏప్రిల్ 1 వరకు తయారైన వాహనాలన్నింటికీ ఈ నిషేధం వర్తిస్తుందని వెల్లడించింది. ఈ మేరకు మోటార్ వాహనాల చట్టంలో మార్పులు చేపట్టేందుకు ముసాయిదా నోటిఫికేషన్‌ను విడుదల చేసింది. ప్రస్తుతం బీఎస్–4 ప్రమాణాల నుంచి 2020 నాటికి ఏకంగా బీఎస్–6 ప్రమాణాలను అందుకోవాలని కేంద్రం ఇంతకుముందు నిర్ణయం తీసుకున్న సంగతి తెలిసిందే. తాజాగా తీసుకొచ్చిన ముసాయిదాపై ప్రజలు, సంబంధిత వర్గాలు తమ అభిప్రాయాలను డిసెంబర్ 20లోగా తెలియజేయాలని కేంద్రం సూచించింది.

## ఆధార్‌తో లింక్ కాని పాన్‌కార్డుల రద్దు!

**న్యూఢిల్లీ:** పాన్ కార్డును ఆధార్‌తో అనుసంధానం చేయడంపై సుప్రీం కోర్టు ప్రభుత్వానికి అనుకూలంగా తీర్పునిస్తే వీటి అనుసంధానానికి 3 నుంచి 6 నెలల గడువిస్తామని కేంద్రానికి చెందిన ఉన్నతాధికారి ఒకరు తెలిపారు. ఈ గడువు అనంతరం ఆధార్‌తో లింక్ చేయని పాన్ కార్డులన్నింటినీ రద్దు చేస్తామని మీడియాకు వెల్లడించారు. దేశవ్యాప్తంగా ప్రస్తుతం 33 కోట్ల పాన్ కార్డులు ఉంటే..13.28 కోట్ల మంది తమ పాన్ కార్డుల్ని ఆధార్‌తో అనుసంధానం చేసుకున్నారని తెలిపారు.

## 2018 ఎన్నికల్లో పోటీ చేస్తా: సయీద్



**లాహోర్:** పాకిస్తాన్‌లో 2018లో జరిగే సార్వత్రిక ఎన్నికల్లో పోటీ చేస్తానని 2008 ముంబై ఉగ్రదాడుల సూత్రధారి, జమాత్ ఉద్ దవా(జేయూడీ) చీఫ్ హఫీజ్ సయీద్ ప్రకటించాడు. మిల్లీ ముస్లిం లీగ్(ఎంఎంఎల్) పార్టీ తరఫున పోటీ చేయనున్నట్లు వెల్లడించాడు. ఆదివారం మీడియాతో మాట్లాడుతూ.. 'ఏరకమైన ఇబ్బందులు ఎదురైనా నేను కశ్మీరీలకు మద్దతు ఇస్తూనే ఉంటానని భారత్‌కు స్పష్టం చేస్తున్నా. కశ్మీరీలకు మద్దతుగా మాట్లాడుతున్న నా గొంతు నొక్కడానికి భారత్ ప్రయత్నిస్తోంది' అని సయీద్ వెల్లడించాడు. అంతర్జాతీయ కుట్రలో భాగంగానే తనను పాక్‌లో, హురియత్ నేతల్ని భారత్‌లో నిర్బంధించారని ఆరోపించాడు.

## చికిత్సకు రూ.50 లక్షలు అవుతుందన్నారు!

**న్యూఢిల్లీ:** తన శిశువుకు ఆస్పత్రిలో చికిత్స అందించడానికి రూ.50 లక్షలు ఖర్చు అవుతుందని మాక్స్ సూపర్‌స్పెషాలిటీ ఆస్పత్రి చెప్పినట్లు తండ్రి ఆశిష్ పోలీసులకు ఫిర్యాదు చేశారు. నొప్పులు రావడంతో తన భార్య వర్ష(20)ను నవంబర్ 27న మాక్స్ ఆస్పత్రికి తీసుకెళ్లామని కడుపులోని ఇద్దరు శిశువులు బతికే అవకాశాలు 10 నుంచి 15 శాతం మాత్రమే ఉన్నట్లు తొలుత వైద్యులు తెలిపారన్నారు. రూ.35వేల విలువచేసే మూడు ఇంజెక్షన్లు ఇస్తే చిన్నారులు బతికే అవకాశం 30 శాతం ఉంటుందని వైద్యులు తనతో చెప్పారన్నారు. ఇంతలో ఒక శిశువు మరణించగా, మరో శిశువుకు ప్రాణాపాయం తప్పేవరకు ఆస్పత్రిలో చికిత్స అందించడానికి రూ.50 లక్షలు ఖర్చవుతుందని వైద్యులు చెప్పినట్లు ఆయన వెల్లడించారు. ఈ విషయమై తాను కుటుంబ సభ్యులతో చర్చిస్తుండగానే రెండో చిన్నారి కూడా చనిపోయినట్లు వైద్యులు చెప్పారని పేర్కొన్నారు. ఆస్పత్రి సిబ్బంది శిశువుల మృతదేహాలను పాలిథిన్ సంచిలో తల్లిదండ్రులకు అప్పగించగా, వారిని ఖననం చేసే సమయంలో ఒకరు ప్రాణాలతో ఉన్నట్లు గుర్తించడంతో వెంటనే మరో ఆస్పత్రికి తరలించిన సంగతి తెలిసిందే.

## దేశవ్యాప్తంగా పెరిగిన 'మానవ' రవాణా



**న్యూఢిల్లీ:** దేశవ్యాప్తంగా 2016లో 8వేలకు పైగా మానవ అక్రమ రవాణా కేసులు నమోదైనట్లు నేషనల్ క్రైమ్ రికార్డ్స్ బ్యూరో తెలిపింది. సగటున రోజుకు 63 మందిని పోలీసులు రక్షించినట్లు పేర్కొంది. ఈ ఘటనల్లో 182 మంది విదేశీయులతో సహా 23వేల మంది బాధితులను రక్షించినట్లు వెల్లడించింది. ఈ కేసుల్లో 58 శాతం మంది బాధితులు 18 ఏళ్లలోపు వారే కావటం గమనార్హం. వీటిల్లో 3,579 కేసుల(44శాతం)తో పశ్చిమ బెంగాల్ మొదటి స్థానంలో నిలవగా, రాజస్తాన్(1,422 కేసులు), గుజరాత్(548), మహారాష్ట్ర(517), తమిళనాడు(434) తర్వాతి స్థానాల్లో నిలిచాయి.

## 'నవోదయ'కు 27లక్షల దరఖాస్తులు

**న్యూఢిల్లీ:** దేశవ్యాప్తంగా ఉన్న నవోదయ విద్యాలయాల్లో ప్రవేశాల కోసం 27లక్షల మంది దరఖాస్తు చేసుకున్నారని కేంద్ర మానవ వనరుల అభివృద్ధి శాఖ మంత్రి ప్రకాశ్ జవదేకర్ తెలిపారు. ఆరో తరగతిలో ప్రవేశాలకు వచ్చే ఏడాది ఫిబ్రవరి 10వ తేదీన జరిగే రాత పరీక్షకు గత ఏడాది కంటే 5లక్షల మంది ఎక్కువగా దరఖాస్తు చేసుకున్నారన్నారు. ఈ పరీక్షకు ఇంతమంది దరఖాస్తు చేసుకోవటం ఇదే ప్రథమమని చెప్పారు. మొత్తం 601 జిల్లాల్లోని 623 పాఠశాలల్లో ఉన్న 45,000 సీట్లను ఈ ప్రవేశ పరీక్ష ద్వారా భర్తీ చేస్తారని తెలిపారు.

## చలికి ఉత్తరాది గజగజ

**న్యూఢిల్లీ:** ఉత్తర భారతాన్ని చలి వణికిస్తోంది. జమ్మూకశ్మీర్‌లోని శ్రీనగర్‌లో ఉష్ణోగ్రత మైనస్ 2 డిగ్రీల సెల్సియస్‌గా నమోదు కాగా, గుల్మార్గ్‌లో మైనస్ 2 డిగ్రీలు, కుప్వారాలో మైనస్ 2.4 డిగ్రీల సెల్సియస్ ఉష్ణోగ్రత రికార్డు అయ్యాయి. లేహ్‌లో కనిష్టంగా మైనస్ 8.6 డిగ్రీల సెల్సియస్ ఉష్ణోగ్రత నమోదైంది. ఢిల్లీలో కనిష్ట ఉష్ణోగ్రత 8 డిగ్రీలుగా నమోదైంది. పంజాబ్‌లోని ఆదమ్‌పూర్‌లో 4.9 డిగ్రీలు, హరియాణాలోని హిస్సార్‌లో 5.6 డిగ్రీల ఉష్ణోగ్రతలు నమోదయ్యాయి.



ఆదివారం సూరత్‌లో జ్ఞాన్‌జ్యోతి విద్యాలయకు చెందిన 3 వేల మంది విద్యార్థులు ఒకేసారి శీర్షాసనాలు వేసి గిన్నిస్ రికార్డు నెలకొల్పిన దృశ్యం

# పార్టీ ఎన్నికల్లోనూ రిగ్గింగేనా?

- ఏఐసీసీ అధ్యక్ష పదవికి రాహుల్ ఎన్నికపై మోదీ ఎద్దేవా
- కులమతాల మధ్య చిచ్చుపెట్టేది కాంగ్రెసే
- బుల్లెట్ రైలు ఇష్టం లేకుంటే ఎద్దులబండిపై తిరగొచ్చు
- రాహుల్‌ను ఆ పార్టీ నేతలే బహిష్కరించారు
- గుజరాత్ ఎన్నికల సభల్లో ప్రధానమంత్రి విసుర్లు



సురేంద్రనగర్ ర్యాలీలో మోదీకి గొడుగు బహూకరణ

**భరూచ్/సురేంద్రనగర్:** కాంగ్రెస్ పార్టీ అధ్యక్ష పదవికి త్వరలో జరగనున్న ఎన్నికను ఒక ప్రహసనంగా ప్రధానమంత్రి నరేంద్ర మోదీ అభివర్ణించారు. ఎన్నిక జరగకమునుపే ఫలితం వెల్లడయిందని, ఏఐసీసీకి రాహుల్‌గాంధీయే అధ్యక్షుడవుతారని అందరికీ తెలిసిపోయిందన్నారు. దీనిని బట్టి సంస్థాగత ఎన్నికల్లోనూ ఆ పార్టీ నేతలు రిగ్గింగ్‌కు పాల్పడ్డారని వెల్లడయిందని వ్యాఖ్యానించారు. ఎన్నికల ప్రచారంలో భాగంగా ఆదివారం సురేంద్రనగర్, భరూచ్‌లలో జరిగిన ర్యాలీల్లో ఆయన ప్రసంగించారు. పార్టీలోనే ప్రజాస్వామ్యం లేనప్పుడు దేశాన్ని ఎలా కాపాడగలుగుతారని కాంగ్రెస్‌ను ఆయన ప్రశ్నించారు. కాంగ్రెస్ నేతలకు రిగ్గింగ్ ఆనవాయితీగా మారిందన్నారు. ముందుగా ఆ పార్టీలోనే ప్రజాస్వామ్యయుతంగా ఎన్నికలు నిర్వహించాలని సూచించారు. జవహర్‌లాల్ నెహ్రూ కంటే సర్దార్ వల్లభ్ భాయ్ పటేల్‌కే అప్పటి పార్టీ సమావేశంలో ఎక్కువ ఓట్లు వచ్చినా, కాంగ్రెస్ నేతలు రిగ్గింగ్‌కు పాల్పడి నెహ్రూను ప్రధానిగా ఎన్నుకున్నారన్నారు. మొరార్జీ దేశాయ్ విషయంలోనూ ఇదే జరిగిందన్నారు. కాంగ్రెస్ నేత షెహజాద్ పూనావాలా కూడా పార్టీ అంతర్గత ఎన్నికల తీరును తప్పుబట్టారని మోదీ ఈ సందర్భంగా ప్రస్తావించారు. కాంగ్రెస్ నాయకులు తమ యువనేతను గద్దెపైన కూర్చోబెట్టేందుకు నియంతృత్వ పోకడలకు పోతున్నారని ఆరోపించారు.

**సమాజాన్ని విభజించాలని చూస్తోంది**

కులాలు, మతాల ప్రాతిపదికన కాంగ్రెస్ పార్టీ సమాజాన్ని విభజించాలని చూస్తోందని ప్రధానమంత్రి మోదీ విరుచుకుపడ్డారు. అన్నదమ్ములమధ్య, ధనిక పేద, వర్గాల ప్రజలకు, గ్రామీణ, పట్టణ ప్రాంతాల వారికి, అక్షరాస్యులు, నిరక్షరాస్యులకు మధ్య విభేదాలు సృష్టించేందుకు కాంగ్రెస్ ప్రయత్నిస్తోందని ఆరోపించారు. ఇందుకోసం ఆయా కులాల నాయకులు హార్దిక్‌పటేల్, జిగ్నేష్ మెవానీ, అల్పేశ్ ఠాకూర్ వంటి వారితో ఒప్పందాలు చేసుకుంటోందని విమర్శించారు.

**వాళ్లు చేయలేని పనిని మేం చేశాం..**

బుల్లెట్ ట్రైన్ ప్రాజెక్టుపై కాంగ్రెస్ నేతల విమర్శలను ప్రస్తావిస్తూ. వారు చేయలేని పనిని తాము చేస్తున్నందుకు కాంగ్రెస్‌కు మంటగా ఉందన్నారు. మాజీ ప్రధాని మన్మోహన్‌సింగ్ చౌకబారు విమర్శలకు చేస్తున్నారని అన్నారు. బుల్లెట్ ట్రైన్‌లో ప్రయాణించటం వారికి ఇష్టం లేకుంటే ఎద్దుల బండ్లపై తిరగొచ్చునని ఎద్దేవాచేశారు.

**జాతీయతే మనల్ని సాయపడేలా చేస్తుంది: మోదీ**

**అహ్మదాబాద్:** జాతీయత భావమే తనకు, తన ప్రభుత్వానికి ప్రోత్సాహకంగా ఉంటూ, క్రైస్తవులు సహా వివిధ వర్గాల ప్రజలకు సాయపడేలా చేసిందని ప్రధానమంత్రి నరేంద్రమోదీ తెలిపారు. ఆదివారం ఆయన శ్రీ స్వామి నారాయణ్ గురుకుల్ విశ్వ విద్యాప్రతిష్టానమ్ ఆస్పత్రి ఆవరణలో జరిగిన కార్యక్రమంలో మాట్లాడారు. గాంధీనగర్ ఆర్చిబిషప్ థామస్ మెక్‌వాన్ గత నెలలో క్రైస్తవులకు రాసిన లేఖను ప్రస్తావించారు. జాతీయవాద శక్తుల నుంచి దేశాన్ని కాపాడాలంటూ ప్రార్థన చేయాలని క్రైస్తవులను ఆ లేఖలో కోరటం తనను ఎంతో ఉత్తేజితుడిని చేసిందన్నారు. ఆ లేఖ ప్రతి భారతీయుడికి మార్గదర్శిగా పనిచేస్తుందన్నారు.

## 2,124 మంది జాలర్లు సురక్షితం

**సాక్షి, చెన్నై:** తమిళనాడు, కేరళల్లో ఓక్కి ప్రళయంతో సముద్రంలో గల్లంతైన జాలర్లలో 2,124 మంది సురక్షితంగా ఉన్నట్లు అధికార వర్గాలు ప్రకటించాయి. తీవ్ర వరదకు గురైన కన్యాకుమారి ప్రజల్ని రక్షణ శాఖ మంత్రి నిర్మలా సీతారామన్ ఆదివారం పరామర్శించారు. తమిళనాడు డిప్యూటీ సీఎం పన్నీరు సెల్వం, మంత్రులు తంగమణి, జయకుమార్, ఉదయకుమార్ అక్కడే ఉండి సహాయక చర్యల్ని పర్యవేక్షిస్తున్నారు. డీఎంకే కార్య నిర్వాహక అధ్యక్షుడు ఎంకే స్టాలిన్ కూడా కన్యాకుమారి వెళ్లి బాధితులను ఓదార్చారు. గల్లంతైన పడవలు, అందులోని జాలర్ల జాడను పసిగట్టేందుకు అదనంగా హెలికాప్టర్లు, విమానాలు, నౌకలను రంగంలోకి దింపారు. కులచల్‌కు చెందిన 34 మందిని కోస్ట్ గార్డ్ సిబ్బంది రక్షించారు. 129 పడవలు, 1,247 మంది జాలర్లు లక్షదీవులు, మినికో, కర్ణాటక, ముంబై సముద్రతీరాల్లో సురక్షితంగా ఉన్నట్లు గుర్తించారు. కన్యాకుమారిలో ఇప్పటివరకు ఎనిమిది మృతదేహాలు బయటపడ్డాయని, 73 మందిని రక్షించినట్టు జిల్లా కలెక్టర్ సజన్ సింగ్ ఆర్ చౌహాన్ తెలిపారు. అధికారులు తమవారి సమాచారం ఇవ్వట్లేదని కన్యాకుమారిలో జాలర్ల కుటుంబాలు ఆందోళనలకు దిగారు.



ఓక్కి బాధితులకు సీతారామన్ పరామర్శ

## నేడే రాహుల్ నామినేషన్

**బలపరచనున్న సోనియా గాంధీ, మన్మోహన్‌లు**



**న్యూఢిల్లీ:** కాంగ్రెస్ అధ్యక్ష పదవికి ఆ పార్టీ ఉపాధ్యక్షుడు రాహుల్ గాంధీ సోమవారం నామినేషన్ దాఖలు చేయనున్నారు. ఈ కార్యక్రమానికి ఆయన తల్లి, ఏఐసీసీ అధినేత్రి సోనియాగాంధీ, మాజీ ప్రధానమంత్రి మన్మోహన్‌సింగ్ తదితర సీనియర్ నేతలు హాజరవుతారు. నామినేషన్ల దాఖలుకు ఈనెల 4వ తేదీ ఆఖరు కాగా ఇప్పటి వరకు ఎవరూ నామినేషన్ వేయలేదని పార్టీ కేంద్ర ఎన్నికల అథారిటీ చైర్మన్ ముళ్లపల్లి రామచంద్రన్ తెలిపారు. రాహుల్ నాలుగుసెట్ల నామినేషన్ పత్రాలను దాఖలు చేయనున్నారని, సీనియర్ నేతలైన సోనియాగాంధీ, మన్మోహన్‌సింగ్, గులాంనబీ ఆజాద్, ఏకే ఆంటోనీ, అహ్మద్ పటేల్‌తోపాటు పార్టీ ముఖ్యమంత్రులు బలపరుస్తారని రామచంద్రన్ తెలిపారు. దాదాపు 90 నామినేషన్ పత్రాలను ఆయా రాష్ట్రాల పార్టీ కార్యాలయాలకు పంపించామని, ఇప్పటి వరకు ఒక్కరు కూడా నామినేషన్ వేయలేదని వివరించారు. ఆఖరి రోజైన సోమవారం ఆయా రాష్ట్రాల ప్రతినిధులంతా అక్బర్ రోడ్డులోని పార్టీ ప్రధాన కార్యాలయానికి చేరుకుంటారని, రాహుల్‌ను బలపరుస్తూ 75 వరకు నామినేషన్ పత్రాలు దాఖలు చేస్తారని తెలిపారు. అధ్యక్ష పదవికి రాహుల్ గాంధీ ఎన్నికపై వస్తున్న విమర్శలకు పార్టీ అధికార ప్రతినిధి సుస్మితా దేవ్ స్పందించారు. ఈ ఎన్నికను కేంద్ర ఎన్నికల సంఘం పర్యవేక్షిస్తుందని చెప్పారు.

**మహిళలకు భద్రత కరువు: రాహుల్**

గుజరాత్‌లో మహిళలకు భద్రత కరువైందని రాహుల్‌గాంధీ ట్వీటర్‌లో ఆరోపించారు. 'రోజుకో ప్రశ్న'లో భాగంగా గుజరాత్‌లో మహిళలపై నేరాలు పెరిగిన విషయాన్ని ప్రస్తావించారు. మహిళలకు భద్రత కల్పిస్తామని ప్రధాని ఇచ్చిన హామీలు బుట్టదాఖలయ్యాయని అన్నారు.

## 'చాబహార్'ను ప్రారంభించిన ఇరాన్

**భారత ఆర్థిక సాయంతో పోర్టు నిర్మాణం ● హాజరైన కేంద్ర మంత్రి పొన్ రాధాకృష్ణన్**

**న్యూఢిల్లీ:** భారత ఆర్థిక సాయంతో ఇరాన్‌లో నిర్మించిన చాబహార్ నౌకాశ్రయం మొదటి దశను ఇరాన్ అధ్యక్షుడు హసన్ రౌహానీ ఆదివారం ప్రారంభించారు. ఈ వ్యూహాత్మక పోర్టు అందుబాటులోకి వస్తే పాకిస్తాన్‌తో సంబంధం లేకుండా ఇరాన్, భారత్, అఫ్గానిస్థాన్ మధ్య రవాణాకు వీలుకలుగుతుంది. ఈ పోర్టు వల్ల ఇరాన్, భారత్, అఫ్గాన్‌లకు ఎక్కువ ప్రయోజనం చేకూరనుంది. ఇరాన్‌లోని సిస్టాన్–బలూచిస్తాన్ ప్రావిన్స్‌లో నిర్మించిన ఈ పోర్టును భారతదేశంలోని పశ్చిమ తీరంలో ఉన్న నౌకాశ్రయాలతో సులువుగా అనుసంధానం చేయవచ్చు. అలాగే చైనా పెట్టుబడులతో పాకిస్తాన్‌లో నిర్మించిన గ్వాదర్ పోర్టుకు ఇది కౌంటర్‌గా కూడా ఉపయోగపడనుంది. చాబహార్ ప్రారంభోత్సవంలో షిప్పింగ్ శాఖ సహాయ మంత్రి పొన్ రాధాకృష్ణన్ హాజరయ్యారు. అలాగే భారత్–ఇరాన్–అఫ్గాన్ మంత్రుల స్థాయి సమావేశం చాబహార్‌లో జరిగింది. పోర్టులు, రోడ్, రైల్ సహా అనుసంధానికి సంబంధించిన మౌలిక వసతుల అభివృద్ధికి కట్టుబడి ఉండాలని నిర్ణయించారు.



చాబహార్ పోర్టు తొలి దశ ప్రారంభ కార్యక్రమంలో ఇరాన్ అధ్యక్షుడు హసన్ రౌహానీ

## ఆలస్యమైంది.. మన్నించండి!

**కక్షిదారుకు సుప్రీంకోర్టు క్షమాపణ**



**న్యూఢిల్లీ:** ఓ కేసుకు సంబంధించి నేర విచారణ ప్రారంభించడంలో ఆలస్యమైనందుకు.. కక్షిదారుకు సుప్రీంకోర్టు క్షమాపణ కోరింది. ఈ కేసుకు సంబంధించి హైకోర్టు న్యాయమూర్తి రెండు పరస్పర విరుద్ధమైన ఉత్తర్వుల వల్ల 13 ఏళ్ల ఆలస్యమైందని కోర్టు పేర్కొంది. సోదరులు తన దుకాణాన్ని స్వాధీనం చేసుకున్నారని, న్యాయం చేయాలని కోరుతూ 2004లో ఉత్తరాఖండ్‌లోని రూర్కీకి చెందిన శ్యామ్ లత.. హరిద్వార్ ఎస్ఎస్‌పీకి ఫిర్యాదు చేశారు. ఆమె సోదరులపై క్రిమినల్ కేసు నమోదైంది. తమను అడ్డుకోకుండా చర్యలు తీసుకోవాలని కోరుతూ ఆ సోదరులు సివిల్ సూట్ దాఖలు చేశారు. ఈ రెండు కేసులను ఏకకాలంలో విచారణ జరిపిన ఉత్తరాఖండ్ హైకోర్టు.. 2006లో ఒకే తేదీన రెండు వేర్వేరు తీర్పులిచ్చింది. అవి పరస్పర విరుద్ధంగా ఉండడంతో కేసు అటు తిరిగి.. ఇటు తిరిగి 2009లో సుప్రీంకోర్టుకు చేరింది. ఈ నేపథ్యంలో పిటిషన్‌పై విచారణ జరిపిన జస్టిస్ ఆర్‌కే అగర్వాల్, జస్టిస్ సంజయ్ కిషన్ కౌల్‌ల ధర్మాసనం.. 'గందరగోళం వల్ల దశాబ్దం పైగా ఆలస్యమైంది. క్షమించండి' అని కోరింది. హైకోర్టు మొదటి ఉత్తర్వుల ప్రకారం దర్యాప్తు కొనసాగించవచ్చని స్పష్టం చేసింది.

# ముస్లింలపై దృష్టి పెట్టరా!

గుజరాత్ అసెంబ్లీ ఎన్నికల్లో ఈసారి ముస్లింల గురించి ఏ రాజకీయపక్షం పెద్దగా మాట్లాడడం లేదు. అయితే హిందువులను తనవైపు తిప్పుకున్న బీజేపీని ఓడించాలంటే మెజారిటీ వర్గాన్ని ఆకర్షించాలనే 'తెలివి' కాంగ్రెస్ నేత రాహుల్‌గాంధీకి వచ్చినట్టు కనిపిస్తోంది. హిందువులను కులాల వారీగానూ, మూకుమ్మడిగానూ కాంగ్రెస్ వైపు తిప్పుకోవడానికి ఆయన దేవాలయాలను సందర్శిస్తున్నారు. గుజరాత్‌లో ఆయన ఏ మసీదును దర్శించలేదు. ముస్లింలు పెద్ద సంఖ్యలో నివసించే ప్రాంతాలకు వెళ్లినప్పుడు కూడా రాహుల్ వారు ధరించే తెల్ల టోపీ (స్కల్ క్యాప్) ఈసారి పెట్టుకోలేదు. ''ముస్లింలు ఎలాగూ కాంగ్రెస్‌కు ఓటేస్తారు. మసీదుల్లోకి వెళ్లడం, ముస్లిం టోపీలు ధరించడం వల్ల హిందువుల ఓట్లు పడవేమో'' అనే భావన వల్ల రాహుల్ ఇలా అతి జాగ్రత్తగా ప్రచారం చేస్తున్నట్లు తెలుస్తోంది.

**తగ్గుతున్న ముస్లింల ప్రాతినిధ్యం!**

గుజరాత్‌లో 9 శాతం జనాభాగా ఉన్న ముస్లింలకు అసెంబ్లీలో అత్యధిక ప్రాతినిధ్యం 1980లో లభించింది. అప్పుడు 18 మంది ముస్లింలు పోటీచేయగా 12 మంది విజయం సాధించారు. అప్పటి నుంచి శాసనసభలో వారి ప్రాతినిధ్యం తగ్గిపోతూ వచ్చింది. 1985లో ఈ సంఖ్య 8కి పడిపోయింది. 2012 ఎన్నికల్లో కేవలం ఇద్దరే ముస్లింలు ఎన్నికయ్యారు. రాహుల్, ఇతర కాంగ్రెస్ నేతలు ముస్లింలపై తగినంత దృష్టి పెట్టకపోవడానికి హిందువుల ఓట్లు దూరమవుతాయనే భయం ఒక్కటే కారణం కాదు. 2007 అసెంబ్లీ ఎన్నికల నుంచి ముస్లిం ఓట్లు హస్తం గుర్తుకు పడడం తగ్గిపోవడం కూడా కాంగ్రెస్ ప్రచార ధోరణిలో మార్పునకు మరో కారణమని తెలుస్తోంది. ఈ నెల 9, 14 తేదీల్లో జరిగే ఎన్నికల్లో ముస్లింలలో 49 శాతం మంది కాంగ్రెస్‌కు ఓటేయవచ్చని, 27 శాతం బీజేపీవైపు మొగ్గు చూపిస్తారని తాజాగా సీఎస్‌డీఎస్ సర్వే అంచనావేసింది.

**బీజేపీ శత్రువేం కాదు!**

2009 నియోజకవర్గాల పునర్విభజన ఫలితంగా అహ్మదాబాద్, దాని పొరుగున ఉన్న ముస్లిం ప్రాబల్య ప్రాంతాలు ఇతర అసెంబ్లీ స్థానాల్లో చేరిపోయాయి. అంటే ఏ ఒక్క నియోజకవర్గంలోనూ ఫలితాన్ని శాసించే స్థితిలో ముస్లింలు లేకుండాపోయారు. ఈ పరిణామం కూడా ముస్లిం ఓటుపై రాజకీయ పక్షాలకు 'శ్రద్ధ' తగ్గడానికి మరో కారణం. రాష్ట్రంలో వ్యాపారవర్గాలైన బోహ్రా, మెమన్, ఖోజా ముస్లింలలో చాలా మంది మారిన పరిస్థితులకు అనుగుణంగా బీజేపీ తమ శాశ్వత శత్రువు కాదనే రీతిలో వ్యవహరిస్తున్నారు. అభివృద్ధి మందగమనంతో ఆర్థిక సమస్యలనే ఎన్నికల ప్రచారాంశాలుగా చేయడంలో కాంగ్రెస్ సఫలమైంది. దీంతో గెలుపు ధీమా తగ్గిన బీజేపీ ముస్లింల వైపు కూడా కొద్దిగా కన్నేసినట్టు కనిపిస్తోంది.

– సాక్షి నాలెడ్జ్ సెంటర్

**గుజరాత్‌లో హిందూ ఓట్లపైనే పార్టీల గురి**



## నేవల్ డాక్‌యార్డ్ అప్రెంటీస్ స్కూల్‌లో 274 ఖాళీలు




విశాఖపట్నంలోని నేవల్ డాక్‌యార్డ్ అప్రెంటీస్ స్కూల్‌లో 274 అప్రెంటీస్ ఖాళీల భర్తీకి దరఖాస్తులు కోరుతూ ప్రకటన వెలువడింది. పదోతరగతి/ తత్సమాన విద్యతోపాటు సంబంధిత ట్రేడ్ విభాగంలో ఐటీఐ ఉత్తీర్ణులై ఉండాలి. అప్రెంటీస్‌షిప్ వెబ్‌సైట్ ద్వారా ఆన్‌లైన్‌లో దరఖాస్తు చేసుకోవాలి. దరఖాస్తు హార్డ్ కాపీలను గడువులోగా పంపాలి. ఆన్‌లైన్ దరఖాస్తుకు చివరి తేదీ డిసెంబర్ 5, 2017. వయస్సు, శారీరక ప్రమాణాలు, ట్రేడ్‌ల వారీ ఖాళీలు తదితర పూర్తి వివరాలకు **www.indiannavy.nic.in/content/naval-dockyard-visakhapatnam#content** వెబ్‌సైట్ లింక్‌లోని నోటిఫికేషన్‌లో చూడొచ్చు.

# ఐటీ జాబ్స్

## స్కిల్ డవలప్‌మెంట్

**ఐటీ రంగం కొలువుల్లో భారీ కోతలు.. టాప్ కంపెనీల్లో సైతం.. ఉద్యోగులకు ఉద్వాసన! కొత్త నియామకాల్లోనూ ఆచితూచి వ్యవహరిస్తున్న కంపెనీలు- ఇటీవల కాలంలో... ఇలాంటి విశ్లేషణ సర్వసాధారణంగా మారింది!! వాస్తవానికి ప్రస్తుత పరిస్థితుల్లో ఐటీ రంగంలో కొత్తగా జాబ్ ఆఫర్ పొందడం, ఉన్న ఉద్యోగం కాపాడుకోవడం అంత తేలిక కాదనే అభిప్రాయం సర్వత్రా వ్యక్తమవుతోంది. మరోవైపు ఐటీ కంపెనీల్లో కొలువు కొట్టాలంటే.. విభిన్న నైపుణ్యాలు ఉండాలంటున్న నిపుణులు..! ఈ నేపథ్యంలో..ఐటీ రంగంలో తాజా పరిస్థితి.. భవిష్యత్తు అంచనాలు.. అందుకోవాల్సిన నైపుణ్యాలపై విశ్లేషణ...**



'వచ్చే మూడేళ్లలో ఐటీ రంగంలో ఏటా 1.75 లక్షల నుంచి 2 లక్షల ఉద్యోగాల్లో కోత' – హెడ్ హంటర్స్ సర్వే.

'2021 నాటికి ఐటీ రంగంలో లోస్కిల్డ్ కేటగిరీలో 7.5 లక్షల ఉద్యోగాల కోత. అదే సమయంలో హై స్కిల్డ్ కోణంలో కొత్తగా మూడు లక్షల ఉద్యోగాల కల్పన' – హెచ్‌ఎఫ్‌ఎస్ సర్వే అంచనా.

'కంపెనీలు ఆటోమేషన్, ఆర్టిఫిషియల్ ఇంటెలిజెన్స్ వైపు మొగ్గు చూపుతున్న కారణంగా రానున్న నాలుగేళ్లలో ఐటీ వర్క్‌ఫోర్స్‌లో దాదాపు 50 శాతం కోత' – మెకిన్సే నివేదిక.

- ఐటీ రంగంలో ప్రస్తుత పరిస్థితులు, ముఖ్యంగా హైరింగ్ ట్రెండ్స్‌పై పలు సర్వే సంస్థలు వ్యక్తం చేస్తున్న విషయాలివి. కానీ.. నాస్‌కామ్, కేంద్ర ఐటీ శాఖలు మాత్రం.. ఐటీ నియామకాల విషయంలో ఆందోళన చెందాల్సిన అవసరం లేదని.. భారత ఐటీ పరిశ్రమ భేషుగ్గా ముందుకు సాగుతోందని.. 2025 నాటికి ఈ రంగంలో 25 లక్షల నుంచి 30 లక్షల ఉద్యోగాల కల్పన ఖాయం అని ఘంటాపథంగా చెబుతున్నాయి.

### సమస్య ఎక్కడ?



- నాస్‌కామ్ ఏదైనా చెబితే అది.. కంపెనీలకు, అభ్యర్థులకు ఒక భరోసా! కానీ.. వాస్తవంగా మాత్రం ఇటీవల కాలంలో ఇందుకు భిన్నమైన పరిస్థితి కనిపిస్తోంది. పలు కంపెనీలు చిన్నపాటి హెచ్చరిక కూడా లేకుండా.. వేల మందిని తొలగిస్తున్న వైనం. మరి నాస్‌కామ్ అంచనాలకు.. కంపెనీలు అనుసరిస్తున్న వైఖరికి మధ్య వ్యత్యాసం ఎక్కడ? అనేది ప్రశ్న. కొత్త స్కిల్స్, లేటెస్ట్ డిజిటల్ టెక్నాలజీస్ లేమి కారణంగానే ఉద్యోగులకు పింక్ స్లిప్‌లు ఇస్తున్నట్లు సంస్థలు చెబుతున్నాయి. కొత్త నియామకాల విషయంలోనూ లేటెస్ట్ టెక్నాలజీపై పట్టు ఉన్నవారికే ప్రాధాన్యం ఇస్తున్నట్లు పేర్కొంటున్నాయి.

### ఎలా ముందడుగు వేయాలి?

ఇలాంటి పరిస్థితుల్లో.. ఐటీ రంగంలో కొలువు కోరుకునే అభ్యర్థులు ఎలా ముందడుగు వేయాలనే ప్రశ్నకు వినిపిస్తున్న సమాధానం ఒక్కటే..! అది 'ఔత్సాహికులు కొత్త నైపుణ్యాలు అందిపుచ్చుకోవాలి. సంస్థల దృక్కోణంలో ఆలోచించి.. లేటెస్ట్ టెక్నాలజీని ఔపోసన పట్టాలి.

### ఆ టెక్నాలజీ ఏంటో చూద్దాం...

**వర్చువల్ రియాలిటీ:** ఐటీ రంగంలో ఇప్పుడు విస్తృతంగా వినిపిస్తున్న మాట.. వర్చువల్ రియాలిటీ. ఇది 3-డి టెక్నాలజీకి ఆధునిక నామంగా పేర్కొనొచ్చు. ఒక ప్రొడక్ట్ లేదా సర్వీస్‌ను భౌతికంగా ఎలాంటి పరికరాలు వినియోగించకుండానే.. కేవలం విజువలైజేషన్ ఆధారంగా కంప్యూటర్ సహాయంతో డిజైన్ చేయడం.. ఆ డిజైన్‌కు అనుగుణంగా ప్రొడక్ట్ రూపకల్పనలో అనుసరించాల్సిన విధానాలపై అవగాహన ఏర్పరచుకోవడమే వర్చువల్ రియాలిటీ.

#### ఆగ్‌మెంటెడ్ రియాలిటీ

ఒకవైపు సంప్రదాయ విధానాలను, మరోవైపు డిజిటల్ టెక్నాలజీలను సమన్వయం చేసుకుంటూ.. వినియోగదారులకు ఉపయోగపడే రీతిలో 3-డి ఆధారిత ప్రొడక్ట్‌లను లేదా సర్వీసులను రూపొందించే విధానం.. ఆగ్‌మెంటెడ్ రియాలిటీ. ప్రస్తుతం మనం తరచుగా వింటున్న జీపీఎస్(గ్లోబల్ పొజిషనింగ్ సిస్టమ్) ఆగ్‌మెంటెడ్ రియాలిటీ విధానంలో రూపొందినదే.



#### ఆర్టిఫిషియల్ ఇంటెలిజెన్స్

ఆర్టిఫిషియల్ ఇంటెలిజెన్స్.. భవిష్యత్ అంతా ఈ టెక్నాలజీ చుట్టూనే తిరుగుతుందని అంచనా. ఈ విధానంలో ఎలాంటి మానవ ప్రమేయం లేకుండా.. కంప్యూటర్ ప్రోగ్రామింగ్ ఆధారంగా ఒక ప్రొడక్ట్ లేదా సర్వీస్‌ను రూపొందించి ఎండ్ యూజర్‌కు అందించడం. ఈ విధానంపై అవగాహన పొందాలంటే.. అప్లికేషన్ నైపుణ్యాలు, అనలిటికల్ థింకింగ్ వంటి స్కిల్స్ అవసరం.

#### మెషిన్ లెర్నింగ్

ఐటీ రంగంలో డిజిటల్ టెక్నాలజీ బాటలో ప్రాచుర్యం పొందుతున్న మరో టెక్నాలజీ.. మెషిన్ లెర్నింగ్. ఒక రకంగా ఇది ఆర్టిఫిషియల్ ఇంటెలిజెన్స్‌లో అంతర్భాగంగా పేర్కొనొచ్చు. ఇన్-పుట్ డేటా ఆధారంగా అల్గారిథమ్స్ రూపొందించడం.. గణాంకాల విశ్లేషణ ఆధారంగా నిర్దిష్టమైన ఔట్-పుట్‌ను ఆవిష్కరించడం.. మెషిన్ లెర్నింగ్ ద్వారా లభించే ప్రధాన నైపుణ్యం. ఇప్పుడు ఇది కూడా ఐటీ కంపెనీల కార్యకలాపాల్లో కీలకంగా మారింది.

#### రోబోటిక్స్

కోర్‌మాన్యుఫ్యాక్చరింగ్ నుంచి సాఫ్ట్‌వేర్ సంస్థల వరకూ.. ఇప్పుడు తప్పనిసరిగా మారుతోంది.. రోబోటిక్స్. రోబోను రూపొందించడం.. అది నిర్వర్తించాల్సిన విధులకు సంబంధించిన ప్రోగ్రామింగ్ కోడ్‌ను రాయడం.. అప్లికేషన్ టూల్స్‌ను తయారుచేయడం, కమాండ్స్ రూపొందించడం వంటివి రోబోటిక్స్ నైపుణ్యాలు.

### శిక్షణ ఎలా?

కంపెనీలకు కొత్త నియామకాల పరంగా కీలకంగా మారు తున్న ఈ టెక్నాలజీల్లో శిక్షణ పొందడానికి ఇప్పుడు ఎన్నో మార్గాలు అందుబాటులో ఉన్నాయి. పలు ప్రముఖ సాఫ్ట్‌వే ర్ సంస్థలు తమ సొంత ఆన్‌లైన్ ప్లాట్‌ఫామ్స్ ద్వారా శిక్షణనిస్తున్నాయి. అదే విధంగా కొన్ని కంపెనీలు ఇప్పటికే తమ ఉద్యోగులకు ఈ నైపుణ్యాలు అందించేందుకు ప్రత్యేక శిక్షణ తరగతులు నిర్వహిస్తున్నాయి.

### నాస్‌కామ్ రంగంలోకి

విద్యార్థులు, నిరుద్యోగులు, ఉద్యోగులకు... ఇలా ప్రతి ఒక్కరికీ కొత్త టెక్నాలజీపై అవగాహన తప్పనిసరైన నేపథ్యంలో నాస్‌కామ్ కూడా రంగంలోకి దిగింది. పలు ఐటీ సంస్థలతో కలిసి ఉమ్మడిగా నూతన టెక్నాలజీల్లో శిక్షణ కార్యకలాపాలు నిర్వహించేందుకు ఏర్పాట్లు చేస్తోంది. అంతేకాకుండా కళాశాలల స్థాయిలో ఈ నైపుణ్యాలపై అవగాహన కల్పించేలా చర్యలు చేపడుతోంది. ప్రస్తుతం టియర్-1 నగరాలపై దృష్టి పెట్టిన నాస్‌కామ్.. త్వరలో ద్వితీయ, తృతీయ శ్రేణి నగరాలు, ఇన్‌స్టిట్యూట్‌లలో బీటెక్ విద్యార్థుల కోసం ఈ తరహా శిక్షణ కార్యకలాపాలు చేపట్టేందుకు సన్నాహాలు చేస్తోంది.

### వాస్తవ దృక్పథంతో ఆలోచించాలి

ప్రస్తుతం బీటెక్‌లో చేరిన విద్యార్థులు, ఉద్యోగాన్వే షణలో ఉన్న అభ్యర్థులు వాస్తవ దృక్పథంతో ఆలోచిం చి ముంద డుగు వేయాలి. కేవలం క్లాస్ రూం లెర్నింగ్‌కు పరిమితం కాకుండా.. కొత్త టెక్నాలజీలను అంది పుచ్చుకునేందుకు కృషిచేయాలి. అందుకు అవసరమైన శిక్షణ కార్యక్రమాల్లో పాల్గొంచుకోవాలి. విద్యార్థులకు ఇప్పుడు పలు ఆన్‌లైన్ లెర్నింగ్ ప్లాట్‌ఫామ్స్ అందుబాటులోకి వచ్చాయి. వాటిని సద్వినియోగం చేసుకోవడం ద్వారా ఐటీ కంపెనీలకు అవసరమవు తున్న కొత్త నైపుణ్యాలపై అవగాహన పెంచుకోవాలి.

– డాక్టర్. సంధ్య చింతల, ఈడీ-నాస్‌కామ్ సెక్టార్ స్కిల్ కౌన్సిల్

## బులెటిన్ బోర్డ్

### ఇంజనీర్స్ ఇండియా లిమిటెడ్‌లో 16 ఖాళీలు

ఇంజనీర్స్ ఇండియా లిమిటెడ్(ఈఐఎల్)లో 16 ఖాళీల భర్తీకి దరఖాస్తులు కోరుతూ ప్రకటన వెలువడింది.
- **పోస్టు పేరు-ఖాళీలు:** మేనేజర్-4; సీనియర్ ఇంజనీర్-1; సీనియర్ ఆఫీసర్-3; జూనియర్ హిందీ ట్రాన్స్‌లేటర్-5; హిందీ టైపిస్ట్-3.
- **విభాగాలు:** కంపెనీ సెక్రటేరియట్, టౌన్ ప్లానర్, నేవల్ ఆర్కిటెక్చర్, మైనింగ్, ఎన్విరాన్‌మెంట్, లీగల్, రాజ్యభాష.
- **వేతనశ్రేణి:** మేనేజర్-రూ.36,600- 62,000; సీనియర్ ఇంజనీర్/ సీనియర్ ఆఫీసర్- రూ.29,100- రూ.54,500; జూనియర్ హిందీ ట్రాన్స్‌లేటర్- రూ.13,800- రూ.38,500; హిందీ టైపిస్ట్- రూ.11,900- రూ.32,000.
- **అర్హతలు:** సంబంధిత పోస్టులు, విభాగాలను అనుసరించి గ్రాడ్యుయేషన్ (కామర్స్)+ కంపెనీ సెక్రెటరీ/ బీఈ/ బీటెక్/ బీఎస్సీ (ఇంజనీరింగ్)/ బీఆర్క్/పీజీ/ లా డిగ్రీ/ మాస్టర్ డిగ్రీ+టాన్స్‌లేషన్ సర్టిఫికెట్/ డిప్లొమా/ ఏదైనా డిగ్రీ+టైపింగ్. అలాగే నిబంధనల మేర మార్కుల శాతం, ఉద్యోగానుభవం ఉండాలి.
- **వయస్సు:** హిందీ టైపిస్ట్, జూనియర్ హిందీ ట్రాన్స్‌లేటర్‌కు 30 ఏళ్లు, సీనియర్ ఆఫీసర్, సీనియర్ ఇంజనీర్‌కు 32 ఏళ్లు, మేనేజర్‌కు 40 ఏళ్లు మించకూడదు. రిజర్వేషన్లు వర్తిస్తాయి.
- **ఎంపిక:** జూనియర్ హిందీ ట్రాన్స్‌లేటర్, హిందీ టైపిస్ట్‌కు స్కిల్ టెస్ట్, మిగిలిన పోస్టులకు ఇంటర్వ్యూ. **దరఖాస్తు విధానం:** ఆన్‌లైన్.
- **చివరి తేదీ:** డిసెంబర్ 18, 2017.
- **వెబ్‌సైట్:** www.engineersindia.com

### బెల్ ఘజియాబాద్‌లో 18 ఖాళీలు

ఉత్తరప్రదేశ్‌లోని ఘజియాబాద్‌లో ఉన్న భారత్ ఎలక్ట్రానిక్స్ లిమిటెడ్ (బీఈఎల్:బెల్).. 18 ఖాళీల భర్తీకి దరఖాస్తులు కోరుతోంది.
- **పోస్టు పేరు:** డిప్యూటీ ఇంజనీర్
- **మొత్తం ఖాళీలు:** 18(జనరల్-6+ ఓబీసీ-7+ ఎస్సీ-4+ ఎస్టీ-1).
- **విభాగం:** ఎలక్ట్రానిక్స్
- **వేతనశ్రేణి:** రూ.40,000- రూ.1,40,000+ ఇతర అలవెన్సులు.
- **అర్హతలు:** ఎలక్ట్రానిక్స్/ ఎలక్ట్రానిక్స్ అండ్ కమ్యూనికేషన్/ కమ్యూనికేషన్/ ఎలక్ట్రానిక్స్ అండ్ కమ్యూనికేషన్/ టెలికమ్యూనికేషన్ విభాగంలో బీఈ/ బీటెక్/ బీఎస్సీ(ఇంజనీరింగ్/ ఏఎంఐఈ ప్రథమ శ్రేణి ఉత్తీర్ణత (ఎస్సీ/ ఎస్టీ/ దివ్యాంగ అభ్యర్థులకు పాస్ మార్కులు చాలు). అలాగే సంబంధిత రంగంలో కనీసం మూడేళ్ల ఉద్యోగానుభవం.
- **వయస్సు:** 2017, నవంబర్ 1 నాటికి 28 ఏళ్లు మించకూడదు. రిజర్వేషన్ కేటగిరీల అభ్యర్థులకు సడలింపు ఉంటుంది.
- **ఎంపిక:** రాతపరీక్ష, ఇంటర్వ్యూ.
- **దరఖాస్తు రుసుము:** రూ.500; ఎస్సీ/ ఎస్టీ/ దివ్యాంగ అభ్యర్థులకు ఫీజు లేదు. **దరఖాస్తు విధానం:** ఆఫ్‌లైన్.
- **దరఖాస్తు చేరడానికి చివరి తేదీ:** డిసెంబర్ 23, 2017.
- **వెబ్‌సైట్:** **www.bel-india.com**

### ఎయిర్ ఇండియా ఎంఆర్‌ఓలో 12 పోస్టులు

నాగ్‌పూర్‌లోని ఎయిర్ ఇండియా మెయింటెనెన్స్ రిపెయిర్ అండ్ ఓవర్‌హాల్(ఎయిర్ ఇండియా ఎంఆర్ఓ).. 12 పోస్టుల భర్తీకి దరఖాస్తులు కోరుతోంది. ఇది ఎయిర్ ఇండియా ఇంజనీరింగ్ సర్వీసెస్ లిమిటెడ్(ఏఐఈఎస్ఎల్) అనుబంధ సంస్థ.
- **పోస్టు పేరు:** ట్రేడ్స్‌మ్యాన్/ బెంచ్‌ఫిట్టర్.
- **వేతనం:** రూ.15,000 (ఏడాది శిక్షణలో); రూ.17,680 (ఉద్యోగంలో నియమితులయ్యాక).
- **మొత్తం ఖాళీలు:** 12 (జనరల్-8+ ఓబీసీ-3+ ఎస్సీ-1).
- **అర్హతలు:** ఫిట్టర్ ట్రేడ్‌లో ఐటీఐ (ఎన్‌సీటీవీటీ)తో పాటు సంబంధిత ట్రేడ్/ఎయిర్‌క్రాఫ్ట్ స్ట్రక్చరల్ రిపెయిర్‌లో కనీసం ఏడాది ఉద్యోగానుభవం. ఎయిర్‌బస్/బోయింగ్ ఫ్లీట్‌లో ఉద్యోగానుభవం ఉన్నవారికి ప్రాధాన్యం.
- **వయస్సు:** 2017, నవంబర్ 1 నాటికి 45 ఏళ్లు మించకూడదు. రిజర్వేషన్లు వర్తిస్తాయి. **ఎంపిక:** ట్రేడ్ టెస్ట్.
- **దరఖాస్తు రుసుము:** రూ.500; ఎస్సీ/ఎస్టీ/మాజీ సైనికోద్యోగ కేటగిరీలకు ఫీజు లేదు. **దరఖాస్తు విధానం:** ఆఫ్‌లైన్.
- **దరఖాస్తు చేరడానికి చివరి తేదీ:** డిసెంబర్ 20, 2017.
- **వెబ్‌సైట్:** www.aiesl.airindia.in

### కొచిన్ షిప్‌యార్డ్ లిమిటెడ్‌లో 15 ఖాళీలు

కేరళలోని కొచిలో ఉన్న కొచ్చిన్ షిప్‌యార్డ్ లిమిటెడ్(సీఎస్ఎల్).. కాంట్రాక్టు పద్ధతిలో 15 ఖాళీల భర్తీకి దరఖాస్తులు కోరుతోంది.
- **పోస్టు పేరు:** సేఫ్టీ అసిస్టెంట్
- **మొత్తం ఖాళీలు:** 15 (అన్‌రిజర్వ్‌డ్-10+ ఓబీసీ-4+ ఎస్సీ-1). **వేతనం:** రూ.18,400. అదనపు గంటలు పనిచేస్తే నెలకు మరో రూ.4,500 ఇస్తారు.
- **అర్హతలు:** ఎస్ఎస్ఎల్‌సీ/పదోతరగతితోపాటు ఇండస్ట్రియల్ సేఫ్టీలో ఏడాది డిప్లొమా/సర్టిఫికెట్ ఉండాలి. అలాగే ఏదైనా ప్రభుత్వ రంగ కంపెనీలోని సేఫ్టీ విభాగంలో కనీసం ఏడాది శిక్షణ అనుభవం ఉండాలి.
- **వయస్సు:** 2017, డిసెంబర్ 10 నాటికి 30 ఏళ్లు మించకూడదు. రిజర్వేషన్లు వర్తిస్తాయి. **ఎంపిక:** ప్రాక్టికల్ టెస్ట్.
- **దరఖాస్తు రుసుము:** రూ.100; ఎస్సీ/ఎస్టీ/ అభ్యర్థులకు ఫీజు లేదు.
- **దరఖాస్తు విధానం:** ఆన్‌లైన్‌లో దరఖాస్తు చేసుకోవాలి. దరఖాస్తు హార్డ్‌కాపీకి సంబంధిత ధ్రువపత్రాల నకళ్లు తదితర అవసరమైన వాటిని జతచేసి నిర్దేశిత చిరునామాకు గడువులోగా పంపాలి.
- **ఆన్‌లైన్ దరఖాస్తుకు చివరి తేదీ:** డిసెంబర్ 10, 2017.
- **దరఖాస్తు హార్డ్‌కాపీలు చేరడానికి చివరి తేదీ:** డిసెంబర్ 15, 2017.
- **వెబ్‌సైట్:** **www.cochinshipyard.com**

### సీఎస్ఎంసీఆర్ఐలో 8 జేఆర్ఎఫ్/పీఏ-II పోస్టులు

సెంట్రల్ సాల్ట్ అండ్ మెరైన్ కెమికల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ (సీఎస్ఎంసీఆర్ఐ).. 8 జేఆర్ఎఫ్/ పీఏ-II ఖాళీల భర్తీకి దరఖాస్తులు కోరుతోంది.
- **పోస్టు పేరు:** జూనియర్ రీసెర్చ్ ఫెలో(జేఆర్ఎఫ్)/ పీఏ-II
- **ఫెలోషిప్:** రూ.25,000.
- **అర్హతలు:** జేఆర్ఎఫ్‌కు కనీసం 55శాతం మార్కులతో ఎంఎస్సీ(కెమిస్ట్రీ)తోపాటు నెట్(ఎల్ఎస్)/గేట్ ఉత్తీర్ణత; పీఏ-II కు కనీసం 55శాతం మార్కులతో ఎంఎస్సీ(కెమిస్ట్రీ).
- **వయస్సు:** ఇంటర్వ్యూ తేదీ నాటికి జేఆర్ఎఫ్‌కు 28 ఏళ్లు, పీఏ-II కు 30 ఏళ్లు మించకూడదు. రిజర్వేషన్లు వర్తిస్తాయి.
- **ఎంపిక:** వాకిన్ ఇంటర్వ్యూ.
- **వాకిన్ ఇంటర్వ్యూ తేదీ:** డిసెంబర్ 20, 2017.
- **దరఖాస్తు విధానం:** rkureshy@csmcri.res.in లేదా ankush@csmcri.res.in ఈ మెయిల్‌కు దరఖాస్తు పంపాలి. అనంతరం సంబంధిత ధ్రువపత్రాలతో వాకిన్ ఇంటర్వ్యూకు హాజరుకావాలి.
- **చివరి తేదీ:** డిసెంబర్ 20, 2017.
- **వెబ్‌సైట్:** **www.csmcri.org**

# 15th Finance Commission formed

## COMPETITIVE GUIDANCE CURRENT AFFAIRS

### International

- **Aung San Suu Kyi stripped of 'Freedom of Oxford' honour**

Aung San Suu Kyi has been stripped of the "Freedom of Oxford" award by the city's council, over her failure to speak out on abuses against Myanmar's Rohingya. In a unanimous decision on 27th November, Oxford City Council voted to strip the Burmese State Counsellor of the award she received in 1997 and collected personally in 2012, after 15 years under house arrest.

### National

- **Narendra Modi inaugurates Hyderabad Metro**

Indian Prime Minister Narendra Modi, on 28th November, inaugurated Hyderabad Metro Rail project, touted as the world's largest public-private partnership (PPP) in the sector. The stretch of 30 kilometres with 24 metro stations was opened for commercial operations 29th November onwards. The Hyderabad Metro is a 72-km long elevated rail line and the largest ever undertaken by engineering major Larsen & Toubro (L&T).

- **48th International Film Festival of India concludes in Goa**

The 48th International Film Festival of India (IFFI) came to an end at Panaji in Goa on 28th November.Amitabh Bachchan was honoured with the Indian film personality of 2017 award. Other awards….

- Canadian filmmaker Atom Egoyan- The Lifetime achievement award
- The best film award- 120 Beats per Minute (French Movie, directed by Robin Campillo)
- The best director award- Chinese director Vivian Qu for Angels Wear White
- Special Jury Award- Take-off




(Malayalam movie)
- Best Actor (Female)- Parvathy (Take-off, movie)
- Best Actor (Male)-Nahuel Perez Biscayart (for his performance in 120-beats per minute)
- The Best Debut Feature Film Director - Kiro Russo for Spanish film Dark Skull
- The ICFT-UNESCO Gandhi Medal-Marathi movie Kshitij-A Horizon directed by Manoj Kadam

### Bilateral

- **India, Russia agreed to tackle terrorism**

India and Russia, on 27th November, agreed to help each other in combating terrorism. The two strategic partners asserted that there were no good or bad terrorists and the menace should be fought jointly. Indian and Russian representatives also signed a joint action plan for countering the threat posed by narcotics.

- **India, Singapore agree to enhance security cooperation**

India and Singapore have agreed to further deepen security cooperation to collectively tackle the threat of terrorism. On regional security, both countries reaffirmed the importance of maintaining maritime freedom of navigation and trade consistent with international law.

### Economy

- **15th Finance Commission formed**

Former Expenditure and Revenue Secretary NK Singh will chair the Fifteenth Finance Commission. The panel, which is a statutory body under Article 280(1) of the Constitution, will prescribe the formula for devolution of taxes between the Centre and States for five years commencing on April 1, 2020. Former Economic Affairs Secretary Shaktikanta Das and adjunct professor of Georgetown University Anoop Singh will be its full- time members. Chairman of Bandhan Bank Ashok Lahiri and NITI-Aayog member Ramesh Chand will be part-time members. IAS officer Arvind Mehta will be the Secretary to the Commission.

- **Standard & Poor Maintains Status Quo On India's Sovereign Rating**

S&P Global Ratings on 24th November kept India's sovereign rating unchanged at 'BBB-' with stable outlook, citing vulnerabilities stemming from low per capita income and high government debt balances strong GDP growth.

- **Global Entrepreneurship Summit in Hyderabad**
- **Dates:** November 28, 29th, 30th
- **Venue:** Hyderabad
- **Theme:** Women First, Prosperity for All

Indian Prime Minister Narendra Modi on 28th November gave a clarion call to global Entrepreneurs to invest and take part in the Indian growth story. He addressed the 8th Global Entrepreneurship Summit after formally inaugurated the three-day event along with US President Donald Trump's advisor and daughter Ivanka Trump. The summit witnessed nearly 2000 delegates from over 140 countries including 500 investors.

- **FDI up 17 pc during April-Sept this fiscal**

Foreign direct investment (FDI) in the country increased by 17 per cent to USD 25.35 billion during April-September fiscal. According to the department of industrial policy and promotion…
- The FDI equity during the current FY 2017–18,up to September surged by 17 per cent to USD 25.35 billion from USD 21.62 billion in the year-ago period.

### Sports

- **Ashwin breaks Lillee's record**

India off-spinner Ravichandran Ashwin became the fastest bowler to reach the milestone of 300 Test wickets in his 54th match, breaking Dennis Lillee's record during India's win over Sri Lanka in the second Test.

- **Sports awards**

India's sports honours was held in Mumbai, Kidambi Srikanth has bagged the Sportsman of the Year award, PV Sindhu has bagged Sportswoman of the Year.

- **Team Sport Category Awards**
- Ravichandran Ashwin- Sportsman of the Year
- Mithali Raj- Sportswoman of the Year
- Team of the Year- The Indian Women's Cricket Team

### Persons in News

- **Emmerson Mnangagwa:** Emmerson Mnangagwa was sworn in as Zimbabwe's President on 24th November.
- **Snehlata Shrivastava:** Senior IAS officer Snehlata Shrivastava has been appointed as new Secretary-General of Lok Sabha. She will be the first woman Secretary-General of Lok Sabha.

Rajendra Sharma
Current Affairs Faculty, Hyderabad



## స్టాక్ మార్కెట్లు (శుక్రవారం ముగింపు)

**దేశీ సూచీలు**

| సూచీ | మార్పు | ముగింపు |
|---|---|---|
| సెన్సెక్స్ | 316 ▼ | 32,833 |
| నిఫ్టీ | 105 ▼ | 10,122 |

మరిన్ని వార్తలు, స్టాక్ అప్‌డేట్స్ కోసం... www.sakshibusiness.com చూడండి

**విదేశీ సూచీలు**

| సూచీ | ముగింపు | మార్పు |
|---|---|---|
| నాస్‌డాక్ | 6,848 | ▼ 26 |
| డోజోన్స్ | 24,532 | ▼ 41 |
| ఎఫ్‌టీఎస్‌ఈ 100 | 7,297 | ▼ 29 |
| డాక్స్ | 12,863 | ▼ 160 |
| షాంఘై | 3,318 | ▲ 1 |
| నికాయ్ | 22,819 | ▲ 94 |

● అమెరికా ● బ్రిటన్ ● జర్మనీ ● చైనా ● జపాన్

## ఫారెక్స్ రేట్లు రూ. లలో

| | కరెన్సీ | | కొనుగోలు | అమ్మకం |
|---|---|---|---|---|
| $ | యూఎస్ డాలర్ | థామస్‌కుక్ | 58.66 | 68.01 |
| £ | బ్రిటన్ పౌండ్ | థామస్‌కుక్ | 79.35 | 92.02 |
| € | యూరో | థామస్‌కుక్ | 69.82 | 80.98 |
| ¥ | జపాన్ ఎన్ (100) | థామస్‌కుక్ | 52.12 | 60.43 |
| AUS | ఆస్ట్రేలియా డాలర్ | థామస్‌కుక్ | 44.34 | 51.30 |
| SS | సింగపూర్ డాలర్ | థామస్‌కుక్ | 43.50 | 51.53 |
| SAR | సౌదీ రియాల్ | థామస్‌కుక్ | 15.59 | 18.49 |
| UAE D | యూఏఈ దిర్హామ్ | థామస్‌కుక్ | 15.96 | 18.66 |
| ¥ | చైనా యువాన్ | థామస్‌కుక్ | 6.89 | 11.18 |

# ఉద్యోగం లేని జీతం..!

- మ్యూచ్‌వల్ ఫండ్స్‌లో పెట్టుబడులతో ఆ అవకాశం
- డివిడెండ్ ఆప్షన్ ఎంచుకుంటే నిరంతర ఆదాయం
- ఎస్‌డబ్ల్యూపీ ఎంచుకుంటే కోరినంత ఆదాయం
- సిప్ ఇన్వెస్ట్‌మెంట్లకూ ఎస్‌డబ్ల్యూపీ మంచిదే!!



కొందరికి ఉద్యోగాలుంటాయి... జీతాలొస్తాయి. కొందరికి వ్యాపారాలుంటాయి... ఆదాయం వస్తుంది. రిటైరైన వారిలో కొందరికి పింఛన్ ఉంటుంది. కొందరైతే ఇంటద్దెల వంటి స్థిరాదాయాన్ని ఏర్పాటు చేసుకుంటారు. ఇలా ప్రతి ఒక్కరికీ ఏదో ఒక నిరంతర ఆదాయ మార్గం ఉండి తీరాలి. మన దగ్గర ఎన్ని ఆస్తులున్నా... వాటిపై నిరంతరం ఆదాయం వస్తేనే జీవనం సాఫీగా గడిచిపోతుంది. మరి పై విభాగాల్లోకి రానివారు ఏం చేయాలి? తమ దగ్గర కొంత డబ్బులుండి వాటిపై నిరంతరం చక్కని ఆదాయం పొందాలనుకునేవారికి మార్గమేంటి? ఈ ప్రశ్నలకు సమాధానమే మ్యూచ్‌వల్ ఫండ్స్.

**ఈక్విటీ ఫండ్స్ అయినా, డెట్ ఫండ్స్ అయినా వాటి నుంచి నిరంతరం ఎంతో కొంత ఆదాయం రావాలంటే అందుకు డివిడెండ్ ఆప్షన్, సిస్టమ్యాటిక్ విత్‌డ్రాయెల్ ప్లాన్ (ఎస్‌డబ్ల్యూపీ) అని రెండు అవకాశాలున్నాయి. వీటిలోనూ డివిడెండ్ ఆప్షన్ కంటే ఎస్‌డబ్ల్యూపీ ఆప్షన్ లాభదాయకమైనదని చెప్పొచ్చు. అదెలాగో చూద్దాం...**

*- సాక్షి, బిజినెస్ విభాగం*

### డివిడెండ్ పద్ధతి...

మ్యూచ్‌వల్ ఫండ్స్‌లో పెట్టుబడి పెట్టిన వారు డివిడెండ్ ఆప్షన్ ఎంచుకుంటే ఆ ఫండ్‌పై వచ్చే రాబడిని నెల, మూడు నెలలు, ఆరునెలలు లేదా వార్షిక పద్ధతిన ఫండ్ సంస్థలు డివిడెండ్ రూపంలో అందజేస్తుంటాయి. అయితే, 2013 జూన్ 1 నుంచి డివిడెండ్ పంపిణీపై పన్ను అమల్లోకి వచ్చింది. దీంతో డివిడెండ్ ఆప్షన్ ఎంచుకున్న వారికి వచ్చే రాబడి తగ్గిపోయింది. ఫండ్స్‌లోనే మంత్లీ ఇన్‌కమ్ ప్లాన్స్ (ఎంఐపీ), డెట్ ఫండ్స్ ద్వారా వచ్చే డివిడెండ్ పల్చబడిపోయింది. దీంతో ఇవి కొంత మేర ఆదరణ కోల్పోయాయనే చెప్పాలి. అయితే, క్రమానుగత పెట్టుబడుల ఉపసంహరణ (ఎస్‌డబ్ల్యూపీ) ప్లాన్‌ను ఎంచుకోవడం వల్ల క్రమానుగతంగా ఆదాయం పొందడంతోపాటు, మెరుగైన రాబడులకు అవకాశం ఉంటుంది.

### బ్యాంక్‌లో వేస్తే...

పెట్టుబడుల నుంచి నిర్ణీత మొత్తాన్ని, క్రమం తప్పకుండా నిర్ణీత కాల వ్యవధి వరకు వెనక్కి తీసుకునేందుకు దాదాపు అన్ని ఫండ్ హౌస్‌లు వీలు కల్పిస్తున్నాయి. ఎంపిక చేసుకున్న నిర్ణీత తేదీ రోజున ఇన్వెస్టర్ల పేరిట ఉన్న యూనిట్లను విక్రయించడం ద్వారా ఫండ్స్ సంస్థలు చెల్లింపులు జరుపుతాయి. బ్యాంక్ ఫిక్స్‌డ్ డిపాజిట్లతో పోల్చితే ఫండ్స్ ఎస్‌డబ్ల్యూపీలు కొంత మెరుగైన రాబడులను అందించే అవకాశాలున్నాయి. ఉదాహరణకు విశ్వనాథ్ వయసు 50 సంవత్సరాలు. తను ఓ 20 ఏళ్ల పాటు నిరంతరం నెలకు రూ.40,000 చొప్పున ఆదాయం కావాలనుకున్నాడు. తన దగ్గర ఉన్న రూ.40 లక్షలను బ్యాంకులో గనక వేస్తే వడ్డీ 6 శాతం చొప్పున చూసుకున్నా... నెలకు రూ.24,000 మించి రాదు. మరి 40వేలు రావాలంటే ఎలా? ఒకవేళ బ్యాంకులో వేసి... ఆ డబ్బుల్లోంచి నెలకు రూ.40వేల చొప్పున విత్‌డ్రా చేసుకుంటే... తొమ్మిది సంవత్సరాల్లో ఆ 40 లక్షలూ అయిపోతాయి. దానికి కలిసే వడ్డీ చాలా తక్కువుంటుంది కనక మహా అయితే మరో ఏడాది అదనంగా రావచ్చు.

### మ్యూచ్‌వల్ ఫండ్ ఎస్‌డబ్ల్యూపీ అయితే..

అదే గనక మ్యూచ్‌వల్ ఫండ్స్‌లో ఎస్‌డబ్ల్యూపీ ఆప్షన్ ఎంచుకుని ఆ 40 లక్షలనూ ఇన్వెస్ట్ చేస్తే...! ప్రస్తుతం మ్యూచ్‌వల్ ఫండ్స్‌లో ఎలా చూసినా ఏడాదికి 12 శాతం వరకూ వడ్డీ వస్తోంది. ఒక్కో ఏడాది 9 శాతం వచ్చినా... మార్కెట్లు బాగున్న సంవత్సరాల్లో 18–20 శాతం కూడా వస్తోంది. అందుకే పదేళ్లు చూసుకుంటే సగటున 12–13 శాతం వస్తోంది. ఫండ్స్‌లో ఈ 40 లక్షల విలువ ఎప్పటికప్పుడు పెరుగుతూనే ఉంటుంది. దాన్లోంచి నెలకు రూ.40 వేల విలువైన యూనిట్లను ఫండ్స్ సంస్థ నిర్ణీత తేదీన విక్రయించి ఆ సొమ్మును మన ఖాతాలో వేస్తుంటుంది. విత్‌డ్రా అయిపోగా మిగిలిన సొమ్ము మార్కెట్లోనే ఉంటుంది కనక వాటిపై వచ్చే రాబడులు దానికి కలుస్తూ ఉంటాయి. ఈ లెక్కన చూసుకుంటే 20 ఏళ్లు కాకపోయినా 15 సంవత్సరాలకు పైనే నెలకు రూ.40వేల చొప్పున వచ్చే అవకాశం ఉంటుంది. అయితే ఇక్కడొక విషయం గుర్తుంచుకోవాలి. ఈక్విటీ ఆప్షన్ ఎంచుకునే మ్యూచ్‌వల్ ఫండ్స్‌లో రిస్క్ ఉంటుంది. అదే డెట్ ఆప్షన్ ఎంచుకుంటే ఆ ఫండ్లు ప్రభుత్వ బాండ్లలోనే పెట్టుబడి పెడతాయి కనక రిస్క్ తక్కువ. దానిపై వచ్చే రాబడి కూడా తక్కువే ఉంటుంది. కాకపోతే బ్యాంకుతో పోలిస్తే కాస్త ఎక్కువే గిట్టుబాటు అవుతుందన్నది వాస్తవం.

### ఇన్వెస్ట్‌మెంట్లకూ ఎస్‌డబ్ల్యూపీ!!



మ్యూచ్‌వల్ ఫండ్లలో ఇన్వెస్ట్ చేయాలనుకునే చాలా మంది తమ దగ్గర పెద్ద మొత్తంలో డబ్బులుంటే ఒకేసారి ఇన్వెస్ట్ చేస్తుంటారు. వారు ఇన్వెస్ట్ చేసిన తర్వాత మార్కెట్లు గనక భారీగా కరెక్షన్‌కు లోనైతే... మళ్లీ పెరిగి వారి సొమ్ము లాభాల్లోకి రావటానికి కాస్త సమయం పడుతుంది. అదే సిప్‌లో ఇన్వెస్ట్ చేసిన వారికి ఈ ఇబ్బంది ఉండదు. అందుకే తమ దగ్గరున్న మొత్తాన్ని డెట్ ఫండ్లలో ఏకమొత్తంగా ఇన్వెస్ట్ చేసి... దాన్లోంచి నెల వారీగా క్రమానుగతంగా కొంత మొత్తాన్ని విత్‌డ్రా చేసుకునే ఆప్షన్ ఎంచుకోవాలి. అలా విత్‌డ్రా చేసుకున్న మొత్తాన్ని నెలవారీ సిప్‌లో ఈక్విటీ ఫండ్స్‌లో పెట్టుబడి పెడితే రిస్క్ లేకుండా అధికాదాయం ఆర్జించవచ్చన్నది నిపుణుల సలహా.

### ఎవరికి అనువైనది?

నగదు అవసరాలు, పన్ను ప్రయోజనం ఆధారంగా డివిడెండ్ లేదా ఎస్‌డబ్ల్యూపీల్లో ఏ ఆప్షన్ ఎంచుకోవాలన్నది ఆధారపడి ఉంటుంది. ఇన్వెస్టర్లు అందుకున్న డివిడెండ్లపై పన్ను చెల్లించాల్సిన అవసరం ఉండదు. కానీ, నాన్ ఈక్విటీ పెట్టుబడులకు డివిడెండ్ పంపిణీ పన్ను 28.84 శాతం వర్తిస్తుంది. దీన్ని మ్యూచువల్ ఫండ్స్ సంస్థలే చెల్లిస్తాయి. పరోక్షంగా దీన్ని ఇన్వెస్టర్లు భరించాల్సిందే. ఇక, ఎస్‌డబ్ల్యూపీ ఆప్షన్‌లో ఇన్వెస్టర్లు ప్రతీ ఉపసంహరణ మొత్తం విక్రయంగా పరిగణింపబడుతుంది. నిర్ణీత మొత్తం చెల్లించేందుకు గాను మ్యూచువల్ ఫండ్స్ సంస్థలు యూనిట్లను విక్రయిస్తాయి గనుక. పెట్టుబడి పెట్టిన తర్వాత మూడేళ్లలోపు ఉపసంహరించుకుంటే ఆ మొత్తంలో రాబడిని స్వల్పకాలిక మూలధన లాభంగా పరిగణించడం జరుగుతుంది. దీనిపై క్యాపిటల్ గెయిన్స్ పన్ను చెల్లించాల్సి వస్తుంది. ఈ ఆదాయాన్ని తమ మొత్తం ఆదాయానికి కలిపి దానిపై పన్ను చెల్లించాలి. మూడేళ్ల తర్వాత ఉపసంహరించుకుంటే లాభాలపై దీర్ఘకాలిక క్యాపిటల్ గెయిన్స్ ట్యాక్స్ పడుతుంది. అయితే, ద్రవ్యోల్బణ ప్రయోజనం పొందడం ద్వారా చెల్లించాల్సిన పన్ను తగ్గుతుంది. ఈక్విటీ ఫండ్స్‌కు స్వల్పకాలం అంటే ఏడాది. ఆ లోపు విక్రయిస్తేనే పన్ను చెల్లించాల్సి ఉంటుంది. ఏడాది దాటితే పన్ను ఉండదు. డివిడెండ్ పే ఆప్షన్‌లో ఎంత మేర డివిడెండ్ చెల్లిస్తారన్నది సంబంధిత పథకంలో మిగులు నిధులపైనే ఆధారపడి ఉంటుంది. అందులోనూ ఫండ్ మేనేజర్ విచక్షణ కూడా ఇందులో కీలకం అవుతుంది. పైగా డివిడెండ్ ఎంత మొత్తం, ఏ తేదీన వస్తుందన్నది ఇన్వెస్టర్ల అవసరాలకు అనుగుణంగా ఉండదు. కానీ, ఎస్‌డబ్ల్యూపీ అలా కాదు. ఇన్వెస్టర్లు నిర్ణీత మొత్తాన్ని నిర్దేశిత సమయానికి అందుకోవచ్చు. రాబడులతో సంబంధం ఉండదు. ఫండ్ మేనేజర్ విచక్షణతోనూ పనిలేదు. కొన్ని ఈక్విటీ ఫండ్స్‌లో మాత్రం క్రమానుగతంగా, స్థిరమైన డివిడెండ్ చెల్లింపు ఆప్షన్ ఉంది. ఈక్విటీ ఫండ్స్‌కు డివిడెండ్ పంపిణీ పన్ను లేదు గనుక వీటిని ఎంచుకోవచ్చు. డెట్ ఫండ్స్‌లో పన్ను ఉంటుంది కనుక లాభదాయకంగా ఉండదు. ఈ అంశాలను విశ్లేషించి చూస్తే క్రమానుగత ఆదాయం కోసం డివిడెండ్ ఆప్షన్ కంటే గ్రోత్ స్కీమ్‌లో ఎస్‌డబ్ల్యూపీని ఎంచుకోవడం లాభదాయకంగా ఉంటుంది. అయితే, తమ రిస్క్, ఎంత కాలం పెట్టుబడులు కొనసాగిస్తారు, ఆశిస్తున్న రాబడులు తదితర అంశాల ఆధారంగా ఈక్విటీ మ్యూచువల్ ఫండ్ పథకం ఎంపిక ఉండాలి.




# స్థిర శ్రేణిలో బంగారం!

- 1,260–1,300 డాలర్ల మధ్య ఊగిసలాట
- మూడు నెలల నుంచీ ఇదే పరిస్థితి
- సమీప కాలంలోనూ ఇదే ధోరణి అంటున్న విశ్లేషకులు

అమెరికా ఫెడరల్ వడ్డీరేట్ల (ప్రస్తుతం 1–1.25 శాతం) పెంపుపై సందేహాలు... 95 – 92.50 మధ్య శ్రేణిలో డాలర్ ఇండెక్స్ కదలికలు... మధ్యలో కొంత ఒడిదుడుకులకు గురయినా ఈక్విటీ మార్కెట్ల బులిష్ ధోరణి... ఉత్తరకొరియా ఉద్రిక్తతల యథాతథ వాతావరణం... వంటి అంశాలు పసిడిని స్థిర శ్రేణిలో ఉంచుతున్నాయి. గడచిన మూడు నెలల నుంచీ దాదాపు ఇదే పరిస్థితి కొనసాగుతోంది. సమీప భవిష్యత్తులోనూ ఇదే ధోరణి కొనసాగుతుందని, పసిడి కదలికలు 1,260–1,310 డాలర్ల మధ్య ఉంటాయని విశ్లేషకులు పేర్కొంటున్నారు. డిసెంబర్ 1వ తేదీతో ముగిసిన వారంలో పసిడి అంతర్జాతీయ న్యూయార్క్ కమోడిటీ ఎక్స్ఛేంజ్ నైమెక్స్‌లో ధర ఔన్స్ (31.1గ్రా)కు 8 డాలర్లు తగ్గి 1,280 డాలర్ల వద్ద ముగిసింది. పసిడి అంతకుముందు వారం 10 డాలర్లు తగ్గింది. ప్రస్తుతం 40 డాలర్ల శ్రేణిలో పసిడి కన్సాలిడేట్ అవుతోందని టెక్నికల్ అనలిస్టులు చెబుతున్నారు. 1,250 డాలర్ల స్థాయి లోపునకు పడిపోయేంత వరకూ పసిడి ఫండమెంటల్స్ పటిష్టంగానే ఉన్నట్లు భావించవచ్చనేది నిపుణుల అంచనా. అమెరికా ఆర్థిక అనిశ్చిత పరిస్థితులు, ఉత్తర కొరియా సహా ప్రపంచంలో కొన్ని ప్రాంతాల్లో ఉద్రిక్త వాతావరణం పసిడిది బులిష్ ధోరణే అన్న అంచనాలకు బలాన్నిస్తాయని వారు చెబుతున్నారు. పన్నులకు సంబంధించి అమెరికా తీసుకునే చర్యలు పసిడి కదలికలను నిర్దేశించే అంశాల్లో ముఖ్యమైనవి. 1,310 డాలర్లు, 1,325 డాలర్లు పసిడికి కీలకమని, ఈ నిరోధాన్ని దాటితే తిరిగి పుత్తడి పూర్తిస్థాయిలో బులిష్ జోన్‌లోకి వచ్చినట్లేనని వారు పేర్కొంటున్నారు.



### దేశంలోనూ వెనుకంజే...

అంతర్జాతీయ ఫ్యూచర్స్ మార్కెట్ ప్రభావం దేశీ ఫ్యూచర్స్ మార్కెట్‌పైనా కనబడింది. మల్టీ కమోడిటీ ఎక్స్ఛేంజ్– ఎంసీఎక్స్‌లో వారంలో పసిడి ధర వరుసగా రెండవ వారమూ తగ్గింది. వారంలో రూ.171 తగ్గి రూ.29,209కి చేరింది. ఇక ముంబై స్పాట్ మార్కెట్‌లో వారం వారీగా ధర రూ 190 తగ్గింది. 99.9 స్వచ్ఛత రూ.190 తగ్గి రూ. 29,400 వద్ద ముగియగా, 99.5 స్వచ్ఛత ధర సైతం అదే స్థాయిలో పడిపోయి రూ.29,250కి పడింది. ఇక వెండి ధర కేజీకి రూ. 1,265 పడిపోయి రూ. 38,070 వద్ద ముగిసింది. ఇక డాలర్ మారకంలో రూపాయి విలువ అంతర్జాతీయ మార్కెట్‌లో వారంలో ఐదు పైసలు బలపడి 64.55 నుంచి 64.50కు చేరింది.

# పర్సనల్ లోనే కానీ.. ఫ్లెక్సిబుల్

**నెలనెలా వడ్డీ మాత్రమే కట్టే వీలు**
**ఆఖర్లోనే అసలు కట్టే వెసులుబాటు**
**కావాలనుకుంటే టర్మ్ లోన్ కింద మార్చుకోవచ్చు**
**ముందస్తు చెల్లింపులు చేసినా చార్జీలుండవు**

**ఆశీష్ సప్రా**



కన్స్యూమర్ బిజినెస్
బజాజ్ ఫైనాన్స్

**చాలా సందర్భాల్లో ఆదుకునేవి వ్యక్తిగత రుణాలే. ఇంటి రిపేరు, పెళ్లి ఖర్చులు... ఇలా అవసరం ఏదైనా పర్సనల్ లోన్ ఉపయోగపడుతుంది. వినియోగదారుల అవసరాలకు అనుగుణంగా బ్యాంకులు, ఆర్థిక సంస్థలు పర్సనల్ లోన్స్‌కి కొన్ని అదనపు అంశాలను జోడిస్తున్నాయి. అసలు, వడ్డీ కలిపి ప్రతి నెలా ఈఎంఐ రూపంలో చెల్లించే విధానంతో పాటు ప్రతి నెలా కేవలం వడ్డీ మాత్రమే కడుతూ చివర్లోనే అసలు మొత్తాన్ని కట్టేలా ప్రత్యేక ఫీచర్‌తో ఫ్లెక్సిబుల్ పర్సనల్ లోన్స్ కూడా అందుబాటులోకి వచ్చాయి. రుణ మొత్తం ఎంత మంజూరైనా కూడా కావాల్సినంతే విత్‌డ్రా చేసుకుని, దానికి మాత్రమే వడ్డీ కట్టే వెసులుబాటు కూడా ఉంటుంది ఈ ఫ్లెక్సిబుల్ పర్సనల్ లోన్ విధానంలో. ఇక ఈ లోన్‌కి సంబంధించి అసలు మొత్తాన్ని ఆఖర్లోనే కట్టాల్సి ఉన్నా... ఒకవేళ ఏకారణం వల్లనైనా అంతా ఒకేసారి కట్టలేమనుకున్న పక్షంలో రుణగ్రహీత కావాలనుకుంటే దీన్ని టర్మ్ లోన్ కింద మార్చుకునే వెసులుబాటు కూడా ఉంటోంది. వ్యక్తిగత రుణం, ఫ్లెక్సిబుల్ ఫీచర్‌తో పర్సనల్ లోన్ తీరుతెన్నులు ఇలా ఉంటాయి..**



### పర్సనల్ లోన్ అయితే...

- నిర్దిష్ట మొత్తాన్ని రుణంగా తీసుకోవచ్చు. మొత్తం రుణంపై వడ్డీ కట్టాల్సి వస్తుంది.
- తర్వాత తర్వాత పెద్దగా ఆర్థిక అవసరాల్లేకుండా.. ఒకేసారి పెద్ద మొత్తంలో తీసుకోదల్చుకునే వారికి ఇది అనుకూలం.
- దరఖాస్తు ప్రక్రియ సులభం. ఆన్‌లైన్‌లోనే దరఖాస్తు చేసుకోవచ్చు. దరఖాస్తుతో పాటు చిరునామా ధృవీకరణ పత్రం, శాలరీ స్లిప్స్, బ్యాంక్ స్టేట్‌మెంట్స్ మొదలైనవి కూడా ఆన్‌లైన్‌లోనే దాఖలు చేయొచ్చు.
- పర్సనల్ లోన్‌కి పాక్షికంగా కూడా ముందస్తుగానే చెల్లింపులు చేయొచ్చు. అయితే, ఇందుకు కొన్ని చార్జీలుంటాయి.
- రుణమొత్తంపై రుణగ్రహీత స్థిరమైన వడ్డీ రేటు కట్టాలి. నెలవారీ కట్టే వాయిదాల్లో (ఈఎంఐ) కొంత భాగం అసలుతో పాటు కొంత భాగం వడ్డీ కూడా ఉంటుంది.

### ఫ్లెక్సిబుల్ పర్సనల్ లోన్ అయితే...

- ఆర్థిక అవసరాన్ని బట్టి విడతలవారీగా కావాల్సినంత మొత్తాన్ని విత్‌డ్రా చేసుకోవచ్చు.
- లోన్ అకౌంట్ నుంచి చేసే విత్‌డ్రాయల్స్, కట్టే డిపాజిట్‌ల సంఖ్యపై పరిమితి ఏమీ ఉండదు.
- జారీ అయిన మొత్తం రుణంపై కాకుండా.. ఉపయోగించుకున్న మొత్తంపైనే రుణగ్రహీత వడ్డీ కట్టాల్సి ఉంటుంది.
- ఫ్లెక్సిబుల్ పర్సనల్ లోన్ ముందస్తు చెల్లింపు సులభతరంగానే ఉంటుంది. ఎటువంటి చార్జీలు ఉండవు.
- తీసుకున్న మొత్తాన్ని ప్రీ–పే చేసే వెసులుబాటుతో పాటు, అలా కట్టేసిన ప్రీపెయిడ్ అమౌంటునూ దరఖాస్తు ప్రక్రియలాంటి బాదరబందీ లేకుండా మళ్లీ ఉపయోగించుకోవచ్చు.
- ఈఎంఐల కింద వడ్డీ మాత్రమే కడతారు కనక ఆదాయాన్ని కాస్త మెరుగ్గా నిర్వహించుకోవచ్చు.
- ఒకవేళ అసలు, వడ్డీ కలిపి ఈఎంఐల కింద కట్టేయాలనుకున్న పక్షంలో ఫ్లెక్సిబుల్ పర్సనల్ లోన్‌ని ఎప్పుడైనా పూర్తి స్థాయి టర్మ్ లోన్ కింద మార్చుకునే వీలుంది.

**చూశారుగా.. వ్యక్తిగత రుణానికి, ఫ్లెక్సిబుల్ ఫీచర్ ఉన్న పర్సనల్ లోన్‌కి మధ్య వ్యత్యాసాలు. పర్సనల్ లోన్ తీసుకోవాలనుకునేటప్పుడు.. ఆర్థిక అవసరాలను బట్టి తగిన విధానాన్ని ఎంచుకోండి**



"జీవితంలో ఒడిదుడుకులుంటేనే బతుకు విలువ తెలుస్తుంది."
– రతన్ టాటా, టాటా సన్స్ మాజీ ఛైర్మన్.

## పొదుపు-మదుపు



# మీ బ్యాంకు ఖాతాకు నామినీ ఎవరు?



- నామినేషన్ అన్ని వేళలా అక్కరకు రాదు
- ఖాతాదారుడు మరణించిన సందర్భాల్లోనే ఉపయోగం
- తీవ్ర అస్వస్థతపాలైతే ఖాతాలో డబ్బు తీసుకోలేరు
- ఈ పరిస్థితుల్లో జాయింట్ ఖాతాయే పరిష్కారం
- పవర్ ఆఫ్ అటార్నీ కూడా పరిశీలించొచ్చు

**ఆర్థిక లావాదేవీలన్నింటికీ కీలకం బ్యాంకు ఖాతాయే. మ్యూచువల్ ఫండ్స్‌ను సిప్ చేయాలన్నా, స్టాక్స్‌లో పెట్టుబడులు పెట్టాలన్నా, బిల్లులు చెల్లించాలన్నా... ఇంకా బీమా ప్రీమియం, ఈఎంఐలు... వచ్చే ఆదాయానికి, వెళ్లే ఖర్చులకు బ్యాంకు ఖాతాయే కీలకం. కానీ, దురదృష్టవశాత్తూ ఖాతాదారుడికి ఏదైనా జరిగితే పరిస్థితేంటి? బోంబే హైకోర్టు ముందుకు ఈ మధ్యే ఓ పిటిషన్ వచ్చింది. 63 ఏళ్ల మహిళ తన భర్త అపస్మారక స్థితికి చేరుకోవడంతో చికిత్సకయ్యే ఖర్చులను అతడి బ్యాంకు ఖాతా నుంచి చెల్లించబోయింది. నిబంధనలు అడ్డుతగిలాయి. దీంతో తనను గార్డియన్‌గా నియమించాలని కోరుతూ ఆమె కోర్టును ఆశ్రయించాల్సి వచ్చింది. కొన్ని సందర్భాల్లో నియంత్రణలు మంచివే. కానీ, అన్నివేళలా కాదు. కాబట్టి బ్యాంకు ఖాతా నిర్వహించటమెలా? మీ ఖాతాపై మీ కుటుంబ సభ్యులకు అవాంతరాల్లేని అధికారం ఇవ్వడం ఎలా? అనే వివరాలు తెలియజేసేదే ఈ కథనం...**

### తప్పిపోయిన వారి ఖాతాలు...

ఓ వ్యక్తి అదృశ్యం అయిపోతే అతని ఖాతా పరిస్థితి ఏంటన్న ప్రశ్న తలెత్తుతుంది. ఇలాంటి సందర్భాల్లో అదృశ్యం అయిన తేదీ నుంచి ఏడు సంవత్సరాల వరకు సంబంధిత వ్యక్తి ఆచూకీ లభించకుంటేనే ఆ ఖాతాకు సంబంధించి సెటిల్‌మెంట్ ప్రక్రియ మొదలవుతుంది. అప్పుడు నామినీ లేదా వారసులు ఖాతాదారుడు మరణించి ఉండొచ్చన్న సందేహాన్ని కోర్టు ముందు వ్యక్తం చేయవచ్చు. అలాగే, ఇలా అదృశ్యమైన కేసుల్లో ఖాతాల సెటిల్‌మెంట్లను న్యాయ సలహా మేరకు పరిశీలించాలని ఆర్‌బీఐ బ్యాంకులకు సూచించింది. కనుక అదృశ్యమైన వారి ఖాతాలకు సంబంధించి క్లెయిమ్స్ ప్రక్రియ బ్యాంకుకు, బ్యాంకుకు మధ్య భిన్నంగా ఉండొచ్చు.

### నామినేషన్ తప్పనిసరి...

బ్యాంకులో ఖాతా ప్రారంభంలోనే నామినేషన్‌ను నమోదు చేయడం మర్చిపోవద్దు. ఖాతాదారుడు మరణించిన సందర్భాల్లో ఖాతాకు సంబంధించిన క్లెయిమ్‌లను సులభతరం చేస్తుంది. నిజానికి నామినీగా ఉండేవారు చట్ట బద్ధమైన వారసులే కానక్కర్లేదు. వేర్వేరు కావచ్చు. నామినీ ఎవరినీ పేర్కొనకపోతే ఖాతాలో ఉన్న నగదు, ఫైనల్ సెటిల్‌మెంట్‌కు వారసులే అర్హులవుతారని ఫెడరల్ బ్యాంకు డిజిటల్ బ్యాంకింగ్ హెడ్ కేప బాబు తెలియజేశారు. ఒకరి పేరును ఖాతాకు నామినీగా ఇచ్చి ఉంటే, ఆ తర్వాత ఎప్పుడు అవసరమైతే అప్పుడు, ఎన్ని సార్లయినా నామినీని మార్చుకునే అవకాశం ఉంటుంది. కానీ, ఖాతాదారుడు లేదా లాకర్ యజమాని జీవించి ఉండి, కోమాలోకి వెళ్లడం లేదా ప్రమాదంలో తీవ్రంగా గాయపడి అచేతనంగా మారితే ఏంటి పరిస్థితి...? ఇటువంటి సందర్భాల్లో బ్యాంకు నామినీకి ఖాతాపై అధికారం ఇవ్వదు. ఈ నేపథ్యంలో జాయింట్ అకౌంట్ ఒక్కటే పరిష్కారం. ఈ జాయింట్ అకౌంట్‌లోనూ (ఇద్దరు లేదా ముగ్గురు ఉమ్మడిగా ప్రారంభించే ఖాతా) పలు వర్గీకరణాలున్నాయి.



### ఇద్దరూ లేదా ఏ ఒక్కరైనా...

'ఐదర్ ఆర్ సర్వైవర్' అని పేర్కొనే ఈ ఖాతాను ఖాతాదారులు ఇద్దరూ నిర్వహించుకోవచ్చు. ఇద్దరికీ సంపూర్ణ హక్కులు ఉంటాయి. ఏ లావాదేవీకి సంబంధించినదైనా ఇద్దరూ కలిసి సంతకాలు పెట్టాల్సిన అవసరం లేదు. జాయింట్ ఖాతా అయినప్పటికీ ఎవరికి అవసరమైనప్పుడు వారు లావాదేవీలు నిర్వహించుకోవచ్చు. కనుక భార్యా, భర్తలు ఉమ్మడిగా ఈ ఖాతాను కలిగి ఉండడం లాభదాయకం.

### జాయింటు ఖాతా అవసరమా...?

జాయింట్ ఖాతాకు పలు ప్రయోజనాలున్నాయి. ఇద్దరు ఖాతాదారులూ ఖాతాను అవసరమైనప్పుడు నిర్వహించుకోవచ్చు. దంపతులు అయితే వారు తమ ఆర్థిక లావాదేవీలను ఒకే ఖాతా నుంచి సులభంగా సమీక్షించుకోవచ్చు. ఐదర్ ఆర్ సర్వైవర్ ఖాతాకు నామినేషన్ ఇచ్చి ఉన్నప్పటికీ, ఖాతాదారుడు మరణిస్తే రెండో ఖాతాదారుడికే అధికారం లభిస్తుంది కానీ, నామినీకి కాదు. ఇద్దరు ఖాతాదారులు మరణించిన తర్వాతే నామినీ అవసరం వస్తుంది.




### తొలి ఖాతాదారు తరవాతే...

ఫార్మర్ ఆర్ సర్వైవర్... అని పేర్కొనే ఈ ఖాతా కూడా ఉమ్మడి ఖాతానే అయినప్పటికీ ఖాతాను మొదటి ఖాతాదారుడే (ఫార్మర్) నిర్వహించేందుకు అనుమతి ఉంటుంది. కాల వ్యవధికి ముందే డిపాజిట్ మొత్తాన్ని చెల్లించేటట్టు అయితే ఇద్దరి సంతకాలూ అవసరం అవుతాయి. ఒక వేళ ఖాతాదారుడికి ఏదైనా జరిగితే అప్పుడు సర్వైవర్ లేదా రెండో ఖాతాదారుడు ఆ ఖాతాపై అధికారం పొందుతారు. అయితే, ఈ విధంగా ఖాతా నిర్వహణకు అనుమతి పొందేందుకు ఖాతాదారుడి మరణ ధ్రువీకరణ పత్రాన్ని సమర్పించాల్సి ఉంటుంది. రెండో ఖాతాదారుడు ఖాతాపై అధికారాన్ని రెండు రకాల పరిస్థితులో పొందొచ్చు. మొదటి ఖాతాదారుడు మరణించినప్పుడు లేదా ఇద్దరు ఖాతాదారులు కలసి దరఖాస్తు ఇచ్చిన సందర్భంలో. మొదటి ఖాతాదారుడు జీవించి ఉండగా, రెండో ఖాతాదారుడికి అధికారికం ఇచ్చే చట్టబద్ధమైన హక్కు బ్యాంకుకు లేదు. ఈ సందర్భాల్లో కోర్టు నుంచి డిక్రీ పొందాల్సి ఉంటుంది'' అని ఫెడరల్ బ్యాంకుకు చెందిన కేపీ బాబు వివరించారు.

### ఖాతాదారుడు నిర్వహించలేని పరిస్థితుల్లో...



ఆర్‌బీఐ నిబంధనల ప్రకారం ఖాతాదారుడు అనారోగ్యం కారణంగా చెక్కుపై సంతకం చేయలేని, బ్యాంకు శాఖకు వచ్చి నగదు విత్‌డ్రా చేసుకోలేని శారీరక అచేతన పరిస్థితుల్లో ఉంటే... చెక్కు లేదా విత్‌డ్రాయల్ ఫామ్‌పై వేలిముద్రను వేయవచ్చు. కాకపోతే బ్యాంకుకు తెలిసిన ఇద్దరు సాక్షులు దీన్ని ధ్రువీకరించాల్సి ఉంటుంది. ఇందులో ఒకరు బ్యాంకు ఉద్యోగి అయి ఉండాలి. అలాగే, శారీరకంగా కదల్లేని పరిస్థితుల్లో బ్యాంకుకు రాలేని, వేలి ముద్ర వేయలేని పరిస్థితి ఉంటే అతని తరపున ఎవరైనా తమ వేలి ముద్రలను చేయవచ్చు. కాకపోతే దీన్ని ఇద్దరు సాక్షులు ధ్రువీకరించాలి. వారిలో ఒకరు బ్యాంకు ఉద్యోగి అయి ఉండడం తప్పనిసరి.

### ప్రత్యామ్నాయ మార్గమిదీ...



జాయింట్ ఖాతా విషయంలో ఐదర్ ఆర్ సర్వైవర్ ఎంచుకోవచ్చని 'లాడర్ 7' ఫైనాన్షియల్ అడ్వైజర్స్ వ్యవస్థాపకులు సురేష్ సెడగోపన్ సూచించారు. అలాగే, పవర్ ఆఫ్ అటార్నీ (పీవోఏ) కూడా పరిశీలించొచ్చన్నారు. పీవోఏ అన్నది ఓ వ్యక్తి తరపున కొన్ని రకాల చర్యలు నిర్వహించేందుకు ఓ వ్యక్తికి అధికారాలను చట్టబద్ధంగా ఇవ్వడం. స్థిర, చరాస్తులకూ ఇది వర్తిస్తుంది. కనుక ప్రతి ఒక్కరూ తమ ఆర్థిక వ్యవహారాలకు సంబంధించి ముందుచూపుతో నామినేషన్ లేదా పీవోఏ ఇవ్వడం ద్వారా జాగ్రత్తలు తీసుకోవడం మంచిది. అలాగే, అన్ని పత్రాలను ఒకచోట అందుబాటులో ఉంచడం అవసరం.

---

### • యాప్‌కీ కహానీ...

## బైక్ దేఖో..

BikeDekho
10 Lac+ Users

దేశంలో హీరో, హోండా, బజాజ్, రాయల్ ఎన్‌ఫీల్డ్, యమహా, సుజుకీ, టీవీఎస్ వంటి పలు వాహన కంపెనీలున్నాయి. ఇవి చాలా రకాల మోడళ్లను మార్కెట్‌లోకి తీసుకువస్తుంటాయి. ఇన్ని మోడళ్లలో మనకు నచ్చిన బైక్/స్కూటర్‌ను ఎంపిక చేసుకోవడం కొంత కష్టమే. ఒక వాహనాన్ని కొనుగోలు చేసేటప్పుడు ఎన్నో రకాల అంశాలను పరిగణనలోకి తీసుకుంటాం. ఒక్కొక్కసారి మనకు కావాల్సిన ప్రత్యేకతలు ఒకటి కంటే ఎక్కువ మోడళ్లలో ఉండొచ్చు. అప్పుడు ఎలా? ఆ వాహనాలను ఒకదానితో మరొకదాన్ని పోల్చిచూసి ఏది నచ్చితే దాన్ని చివరకు తీసుకుంటాం. టూవీలర్లకు సంబంధించిన వివరాలను తెలుసుకునేందుకు, వాటిని ఒకదానితో మరొకదాన్ని పోల్చి చూసుకోవడానికి 'బైక్‌దేఖో' యాప్ మార్కెట్‌లో అందుబాటులో ఉంది. దీన్ని గూగుల్ ప్లేస్టోర్ నుంచి ఉచితంగా డౌన్‌లోడ్ చేసుకోవచ్చు.

### ప్రత్యేకతలు

- మార్కెట్‌లో అందుబాటులో ఉన్న ద్విచక్ర వాహనాల వివరాలను, ప్రత్యేకతలను తెలుసుకోవచ్చు.
- టూవీలర్ల ఎక్స్‌షోరూమ్ ధర, ఆన్ రోడ్ ధర ఎంతుందో చూడొచ్చు.
- రివ్యూలు, రేటింగ్ సాయంతో బైక్ గురించి ఒక అంచనాకు రావచ్చు.
- సెర్చ్ ఆప్షన్ అందుబాటులో ఉంది.
- ధర, పాపులారిటీ, బ్రాండ్, ఇంజిన్ వంటి తదితర అంశాల ప్రాతిపదికన వాహనాలను జల్లెడ పట్టొచ్చు.
- బైక్/స్కూటర్‌లను ఒకదానితో మరొకదాన్ని పోల్చి చూసుకోవచ్చు.
- టూవీలర్లకు సంబంధించిన అప్‌డేట్స్ పొందొచ్చు.




---

## స్టాక్స్ వ్యూ

### ఓల్టాస్ — కొనొచ్చు




**బ్రోకరేజ్ సంస్థ:** ఎడిల్‌వీజ్ ఫైనాన్షియల్ సర్వీసెస్
**ప్రస్తుత ధర:** రూ.617 **టార్గెట్ ధర:** రూ.700

**ఎందుకంటే..?:** టాటా గ్రూప్‌కు చెందిన ఓల్టాస్.. ఏసీలకు సంబంధించి అగ్ర శ్రేణి కంపెనీ. హీటింగ్, వెంటిలేషన్, ఎయిర్ కండీషనింగ్, రిఫ్రిజిరేషన్, క్లైమేట్ కంట్రోల్, ఎలక్ట్రో మెకానికల్ ప్రాజెక్టులు, టెక్స్‌టైల్ మెషినరీ, మెషీన్ టూల్స్, మైనింగ్, కన్‌స్ట్రక్షన్, మెటీరియల్ హ్యాండ్లింగ్, వాటర్ మేనేజ్‌మెంట్, బిల్డింగ్ మేనేజ్‌మెంట్ సిస్టమ్స్, పొల్యూషన్ కంట్రోల్, కెమికల్స్ రంగాల్లో ఇంజనీరింగ్ సొల్యూషన్లనందిస్తోంది. ఎమ్ఎన్‌సీల నుంచి భారీగా పోటీ ఉన్నా, ఏసీల మార్కెట్లో అగ్రస్థానం ఈ కంపెనీదే. ఓల్టాస్–గెలాక్సీస్ పేరుతో ఎక్స్‌క్లూజివ్ ఓల్టాస్ షోరూమ్‌ను వంద వరకూ ఏర్పాటు చేయనుంది. ఇతర కంపెనీలతో చేపట్టిన జాయింట్ వెంచర్ వ్యాపారాల్లో చెప్పుకోదగ్గ మార్కెట్ వాటాను సాధించాలని కంపెనీ లక్ష్యంగా పెట్టుకుంది. మధ్య ఆదాయ వర్గాలపై దృష్టి కేంద్రీకరించిన ఈ కంపెనీ... ఆ స్థాయి వినియోగదారుల కోసం ఏసీలతో పాటు ఫ్రిజ్‌లు, వాషింగ్ మెషీన్లను అందబాటులోకి తేనుంది. టర్కీకి చెందిన ఆర్సెలిక్‌తో జాయింట్ వెంచర్‌ను ఏర్పాటు చేసి, ఫ్రిజ్‌లు, వాషింగ్ మెషీన్లు, మైక్రో వేవ్ ఓవెన్ల వంటి వైట్ గూడ్స్‌ను కూడా అందుబాటులోకి తెస్తోంది. డైరెక్ట్ కూల్ ఫ్రిజ్‌లను ఏడాదిన్నర లోగా మార్కెట్లోకి తేవాలని యోచిస్తోంది. అప్పటిలోగా వీటిని దిగుమతి చేసుకొని విక్రయించాలనేది కంపెనీ ఆలోచన. ఓల్టాస్–బేకో బ్రాండ్ కింద అందించే ఈ ఫ్రిజ్‌ల ద్వారా 10 శాతం మార్కెట్ వాటా సాధించడం కంపెనీ లక్ష్యం. మూడేళ్లలో ఫ్రీక్యాష్ ఫ్లోస్ 35 శాతం, ఈపీఎస్ 18 శాతం చొప్పున చక్రగతిన వృద్ధి చెందగలవని అంచనా. ఫ్రిజ్‌లు, వాషింగ్ మెషీన్ల వంటి వైట్ గూడ్స్ మార్కెట్ ఏడాదికి 15 శాతం చొప్పున పెరిగే అవకాశాలుండటం కంపెనీకి కలసివచ్చే అంశం. అయితే ఏసీల అమ్మకాలు పడిపోయే అవకాశం ఉండటం, వినియోగదారుల విచక్షణాత్మక వ్యయాలు తగ్గే ఛాన్సుండటం ప్రతికూలాంశాలు.

### క్యాపిటల్ ఫస్ట్ — కొనొచ్చు




**బ్రోకరేజ్ సంస్థ:** మోతిలాల్ ఓస్వాల్ సెక్యూరిటీస్
**ప్రస్తుత ధర:** రూ.695 **టార్గెట్ ధర:** రూ.925

**ఎందుకంటే..?:** వినియోగదారుల వస్తువుల ఫైనాన్స్ విషయంలో అగ్రస్థానంలో ఉన్న బజాజ్ ఫైనాన్స్ తర్వాతి స్థానం ఈ కంపెనీదే. ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో కంపెనీ నిర్వహణ ఆస్తులు 23–25 శాతం పెరగగలవని యాజమాన్యం అంచనా వేస్తోంది. కానీ 30 శాతానికి పెరుగుతాయనేది మోతీలాల్ ఓస్వాల్ అంచనా. టూవీలర్ రుణాలు 30 శాతం, కన్సూమర్ డ్యూరబుల్ రుణాలు 50 శాతం చొప్పున వృద్ధి చెందాయి. గత ఆర్థిక సంవత్సరంలో 12 శాతంగా ఉన్న రిటర్న్ ఆన్ ఈక్విటీ(ఆర్‌ఓఈ) ఈ ఆర్థిక సంవత్సరంలో 16–17 శాతానికి పెంచుకోవాలని కంపెనీ లక్ష్యంగా పెట్టుకుంది. 2019–20 ఆర్థిక సంవత్సరానికల్లా ఆర్‌ఓఈ 20 శాతానికి పెరగగలదని అంచనా. (ఏడాది నుంచి ఏడాదిన్నర కాలంలో ఈ కంపెనీ మూలధన నిధులు సమీకరించే అవకాశాలున్నాయి. అయితే ఆర్‌ఓఈ మదింపులో ఈ నిధులను పరిగణనలోకి తీసుకోలేదు) ఈ కంపెనీ ఇచ్చే రుణాల్లో గతంలో ఆస్తుల తనఖాగా ఇచ్చే రుణాలే అధికంగా ఉండేవి. ఇప్పుడు వాటిని తగ్గించుకొని మార్జిన్లు అధికంగా ఉండే కన్సూమర్ డ్యూరబుల్స్, టూవీలర్లకు రుణాలిస్తోంది. వీటిల్లో ఫీజు ఆదాయం కూడా అధికంగా ఉంటుంది. అందుబాటు ధరల గృహాలకు రుణాలివ్వడం, సెకండ్‌హ్యాండ్ వాహనాల కొనుగోళ్లకు కూడా రుణాలివ్వడం వంటి కొత్త వెంచర్లలోకి ప్రవేశించింది. ఈ కొత్త వెంచర్లలో 1–2 ఏళ్లలోనే బ్రేక్–ఈవెన్‌కు రాగలదన్న అంచనాలున్నాయి. ఇప్పటివరకూ 52 శాతంగా ఉన్న బ్యాంక్‌ల నుంచి నిధుల సమీకరణను ఈ ఆర్థిక సంవత్సరం చివరినాటికి 45 శాతానికి తగ్గించుకోవాలని కంపెనీ యోచిస్తోంది. ఫలితంగా మార్జిన్లు మెరుగుపడతాయి. గత ఐదేళ్లుగా మొండి బకాయలు 1–1.5 శాతం రేంజ్‌లోనే ఉన్నాయి. మూడేళ్లలో కన్సూమర్ డ్యూరబుల్స్ రుణాలు 43 శాతం, టూవీలర్ రుణాలు 28 శాతం చొప్పున చక్రగతిన వృద్ధి చెందుతాయని అంచనా.

**గమనిక:** ఈ కాలమ్‌లో షేర్లపై ఇచ్చిన సలహాలు, సూచనలు, వివిధ బ్రోకరేజి సంస్థలు వ్యక్తం చేసిన అభిప్రాయాలు మాత్రమే.

---

## గతవారం బిజినెస్

### నెట్ 'స్వేచ్ఛ'కే ట్రాయ్ సై!




ఇంటర్నెట్ సేవలను అందించడంలో వివక్షను సహించేది లేదని ట్రాయ్ కుండబద్దలుకొట్టింది. నెట్ న్యూట్రాలిటీకే తమ మద్దతు అని తేల్చిచెప్పింది. ఇంటర్నెట్ సర్వీసు ప్రొవైడర్లు, టెలికం కంపెనీలు సహా ఈ రంగంలోని ఏ సంస్థలైనా సరే కొన్ని యాప్‌లు, వెబ్‌సైట్‌లను ఎలాంటి నెట్‌చార్జీలు లేకుండా ఉచితంగా అందించడం, అదే విధంగా మరికొన్ని వెబ్‌సైట్లు, యాప్‌లను విస్మరించడం.. అడ్డుకోవడం వంటి చర్యలను నిషేధించాలని సూచించింది.

### ఎయిరిండియా సీఎండీగా ప్రదీప్ సింగ్

విమానయాన సంస్థ 'ఎయిరిండియా' సీఎండీగా ప్రదీప్ సింగ్ ఖరోలా నియమితులయ్యారు. ప్రస్తుత ఎయిరిండియా సీఎండీ రాజీవ్ బన్సాల్ నుంచి ఈయన బాధ్యతలు స్వీకరించనున్నారు.

### ఆటోమొబైల్స్



- బీఎండబ్ల్యూ మోటొరాడ్ ఇండియా తాజాగా 'బీఎండబ్ల్యూ కే 1600 బీ' అనే బ్యాగర్ బైక్‌ను మార్కెట్‌లోకి తీసుకువచ్చింది. దీని ధర రూ.29 లక్షలు (ఎక్స్‌షోరూమ్ ఇండియా).
- జపాన్‌కు చెందిన 'కవాసకి మోటార్స్'.. 'వెర్సిస్‌ఎక్స్ 300' బైక్‌ను మార్కెట్‌లోకి తీసుకువచ్చింది. దీని ధర రూ.4.6 లక్షలు (ఎక్స్‌షోరూమ్ ముంబై/ఢిల్లీ).
- చైనా మొబైల్ హ్యాండ్‌సెట్స్ తయారీ కంపెనీ 'షావోమి' అందుబాటు ధరలో 'రెడ్‌మి 5ఏ' స్మార్ట్‌ఫోన్‌ను మార్కెట్‌లోకి తీసుకువచ్చింది. దీని ప్రారంభ ధర రూ.4,999.
- శాంసంగ్ రెండు వేరబుల్ ప్రొడక్ట్‌ను మార్కెట్‌లోకి తీసుకువచ్చింది. 'గేర్ ఫిట్ 2 ప్రొ' , 'గేర్ స్పోర్ట్' అనే వీటి ధర వరుసగా రూ.13,590గా, రూ.22,990గా ఉంది.

### ఆర్‌కామ్‌కు మరిన్ని చిక్కులు..

భారీ రుణభారంతో కుదేలైన ఆర్‌కామ్‌ను మరిన్ని చిక్కుముడులు చుట్టుముడుతున్నాయి. చైనా డెవలప్‌మెంట్ బ్యాంక్ ఆధ్వర్యంలో చైనా బ్యాంక్‌లు.. నేషనల్ కంపెనీ లా ట్రిబ్యునల్ (ఎన్‌సీఎల్‌టీ)లో ఆర్‌కామ్‌కు వ్యతిరేకంగా ఇన్‌సాల్వెన్సీ అండ్ బ్యాంక్రప్సీ కోడ్ (ఐబీసీ) కింద పిటిషన్ వేశాయని సమాచారం. చైనా డెవలప్‌మెంట్ బ్యాంక్‌కు ఆర్‌కామ్ బకాయిలు రూ.9,000 కోట్లుగా ఉన్నాయని, ఆర్‌కామ్ మొత్తం రుణభారంలో చైనా బ్యాంక్‌ల వాటా 45 శాతంగా ఉండొచ్చని అంచనా.

### సిప్..సిప్.. హుర్రే..!




మ్యూచువల్ ఫండ్స్‌లో మదుపు చేయడానికి రిటైల్ ఇన్వెస్టర్లు సిప్ విధానానికే ప్రాధాన్యమిస్తున్నారు. ఈ ఏడాది అక్టోబర్‌లో రిటైల్ ఇన్వెస్టర్లు సిప్‌ల ద్వారా ఫండ్స్‌లో రూ.5,600 కోట్లకుపైగా పెట్టుబడులు పెట్టారని యాంఫీ తెలిపింది. వార్షిక ప్రాతిపదికన ఈ మొత్తంలో 64 శాతం వృద్ధి నమోదయ్యిందని పేర్కొంది.

### అక్టోబర్‌లో 'మౌలిక' వృద్ధి 4.7 శాతం



ఎనిమిది కీలక మౌలిక పరిశ్రమ రంగాల పనితీరు అక్టోబర్‌లో మందగించింది. ఉత్పాదకత వృద్ధి రేటు 4.7%గా నమోదైంది. క్రితం ఏడాది ఇదే నెలలో వృద్ధి 7.1%గా ఉంది. ప్రధానంగా సిమెంట్, స్టీల్, రిఫైనరీ ఉత్పత్తుల పేలవ పనితీరు మౌలిక రంగం మందగమనానికి ప్రధాన కారణంగా నిలిచింది. మరోవైపు, సెప్టెంబర్ నెల వృద్ధి రేటును పరిశ్రమల శాఖ 5.2% నుంచి తాజాగా 4.7 శాతానికి సవరించింది.

### పెరిగిన ద్రవ్యలోటు




ద్రవ్యలోటు ఈ ఆర్థిక సంవత్సరం తొలి ఏడు నెలల కాలానికి బడ్జెట్ అంచనాల్లో 96.1 శాతానికి చేరుకున్నట్లు కంట్రోలర్ జనరల్ ఆఫ్ అకౌంట్స్ (సీజీఏ) గణాంకాలు వెల్లడించాయి. ఆదాయం తక్కువగా రావడం, వ్యయం పెరగడం వల్ల ద్రవ్యలోటు పెరిగింది.

### పీఎఫ్‌సీ గ్రీన్ బాండ్ లిస్టింగ్




ప్రభుత్వ రంగంలోని పవర్ ఫైనాన్స్ కార్పొరేషన్ (పీఎఫ్‌సీ) తన తొలి అంతర్జాతీయ గ్రీన్ బాండ్‌ను లండన్ స్టాక్ ఎక్స్ఛేంజ్‌లో 'న్యూ ఇంటర్నేషనల్ సెక్యూరిటీస్ మార్కెట్ (ఐఎస్ఎం)లో లిస్ట్ చేసింది. 10 ఏళ్ల కాల వ్యవధి కలిగిన ఈ గ్రీన్ బాండ్‌పై 3.75 శాతం సెమీ వార్షిక కూపన్ రేటును చెల్లించనుంది. 400 మిలియన్ డాలర్లు సమీకరించగా ఈ నిధులను దేశవ్యాప్తంగా పునరుత్పాదక ఇంధన ప్రాజెక్టులను ప్రోత్సహించేందుకు, ప్రభుత్వం లక్ష్యమైన 2022 నాటికి 175 గిగావాట్ సామర్థ్య లక్ష్యాన్ని చేరుకునేందుకు ఉపకరిస్తుందని పీఎఫ్‌సీ చైర్మన్ రాజీవ్ శర్మ చెప్పారు.

### 'వృద్ధి' మళ్లీ పట్టాలపైకి...!



గాడితప్పిన దేశ ఆర్థిక వ్యవస్థ మళ్లీ పుంజుకుంటున్నట్లు సంకేతాలొచ్చాయి. పెద్ద నోట్ల రద్దు, వస్తుసేవల పన్ను (జీఎస్‌టీ) ప్రతికూల ప్రభావాలు తొలగిపోతున్నాయన్న ధోరణికి అద్దంపడుతూ సానుకూల జీడీపీ గణాంకాలు వెలువడ్డాయి. ఈ ఆర్థిక సంవత్సరం రెండో త్రైమాసికంలో (2017–18 జూలై–సెప్టెంబర్, క్యూ2) స్థూల దేశీయోత్పత్తి (జీడీపీ) వృద్ధి రేటు 6.3 శాతంగా నమోదైంది. క్రితం ఏడాది ఇదే కాలంలో వృద్ధి రేటు 7.5 శాతంగా ఉంది. కాగా వృద్ధి రేటు గడిచిన ఐదు త్రైమాసికాలుగా దిగజారుతూ వచ్చింది.

### పెట్రోల్ బంకులు భారీగా పెరిగాయ్..

దేశంలో పెట్రోల్ బంకుల సంఖ్య వేగంగా పెరుగుతోంది. గత ఆరేళ్లలో (2011–2017) వీటి సంఖ్యలో 45% వృద్ధి నమోదయ్యింది. దీన్ని ప్రపంచంలోనే గరిష్ట వృద్ధిగా భావించొచ్చు. భారత్‌లో అక్టోబర్ చివరి నాటికి పెట్రోల్ బంకుల సంఖ్య 60,799గా ఉంది. 2011లో వీటి సంఖ్య 41,947. 2011–2017 మధ్యకాలంలో బంకుల సంఖ్య 18,852 మేర పెరిగింది. అమెరికా, చైనా తర్వాత భారత్‌లోనే పెట్రోల్ బంకులు ఎక్కువగా ఉన్నాయి.

### డీల్స్..



- ఎస్సార్ గ్లోబల్ కంపెనీ తన బీపీఓ విభాగం 'ఏజీస్'ను సింగపూర్‌కు చెందిన ఇన్వెస్ట్‌మెంట్ కంపెనీ క్యాపిటల్ స్క్వేర్ పార్ట్‌నర్స్ (సీఎస్‌పీ)కి విక్రయించింది. ఈ డీల్ విలువ రూ.2,000 కోట్లు (30 కోట్ల డాలర్లు).
- బీఎస్–6 నిబంధనలకు అనుగుణంగా ఉండే డీజిల్ ఇంజిన్ల తయారీ నిమిత్తం జపాన్‌కు చెందిన హినో కంపెనీతో ఈ ఒప్పందం కుదుర్చుకున్నట్లు అశోక్ లేలాండ్ తెలిపింది.
- సూక్ష్మరుణ సంస్థ స్వాధార్ ఫిన్‌సర్వ్‌లో ఆర్‌బీఎల్ బ్యాంకు తన వాటాను 60.48 శాతానికి పెంచుకుంది.
- రిలయన్స్ కమ్యూనికేషన్స్ కంపెనీ తన డీటీహెచ్ విభాగం 'రిలయన్స్ బిగ్ టీవీ' (ఆర్‌బీటీవీ) విక్రయానికి పాంటెల్ టెక్నాలజీస్, వీకాన్ మీడియాతో ఒప్పందం కుదుర్చుకుంది.
- లార్సెన్ అండ్ టుబ్రో (ఎల్ అండ్ టీ), శాంసంగ్ సీ అండ్ టీ కార్పొరేషన్ ఆఫ్ దక్షిణకొరియా సంయుక్త భాగస్వామ్యంతో రూపొందిన కన్సార్షియం తాజాగా బంగ్లాదేశ్‌లో 250 మిలియన్ డాలర్ల పవర్ ప్లాంటు కాంట్రాక్ట్‌ను గెలుచుకుంది.
- ప్రభుత్వ రంగ ఎల్‌ఐసీ తాజాగా బ్యాంక్ ఆఫ్ బరోడాలో (బీఓబీ) గత రెండు నెలల కాలంలో 2.06 శాతం వాటాను విక్రయించింది. దీని విలువ దాదాపు రూ.734.92 కోట్లు ఉండొచ్చు. దీంతో బీఓబీలో ఎల్‌ఐసీ వాటా 5.19 శాతానికి తగ్గింది.
- వాహన తయారీ కంపెనీ మహీంద్రా అండ్ మహీంద్రా (ఎం అండ్ ఎం) తాజాగా జపాన్‌కు చెందిన రెనెసస్ ఎలక్ట్రానిక్స్ సంస్థతో వ్యూహాత్మక భాగస్వామ్యం కుదుర్చుకుంది. దీనివల్ల మహీంద్రా 'ఈ రేసింగ్ ఫార్ములా' టీమ్‌కి... రెనెసస్ అధికారిక టెక్నాలజీ భాగస్వామిగా వ్యవహరిస్తుంది. ఒప్పందంలో భాగంగా ఇరు సంస్థలు ఎలక్ట్రిక్ రేసింగ్ అండ్ రోడ్ కార్లపై ప్రధానంగా దృష్టి కేంద్రీకరించనున్నాయి.
- టాటా స్టీల్ కొనుగోలుకు తెరతీసింది. భువనేశ్వర్ పవర్ ప్రైవేటు లిమిటెడ్ (బీపీపీఎల్) కంపెనీలో 74 శాతం వాటాను రూ.255 కోట్లు చెల్లించడం ద్వారా జేఎల్ పవర్ వెంచర్స్ నుంచి కొనుగోలు చేయనుంది.
- ఎస్కార్ట్స్ కంపెనీ ప్రమోటర్లలో ఒకటైన ఎస్కార్ట్స్ బెనిఫిట్ అండ్ వెల్ఫేర్ ట్రస్ట్.. ఎస్కార్ట్స్ కంపెనీలో 2.94 శాతం వాటాను విక్రయించింది.

### ఐపీఓ కాలమ్




- శ్రేయీ ఎక్విప్‌మెంట్ ఫైనాన్స్ కంపెనీ ఐపీఓకు రానుంది. శ్రేయీ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ ఫైనాన్స్‌కు అనుబంధంగా కార్యకలాపాలు నిర్వహిస్తున్న ఈ కంపెనీ ఐపీఓ పత్రాలను సెబీకి సమర్పించింది.
- ఫ్యూచర్ గ్రూప్‌నకు చెందిన లాజిస్టిక్స్ కంపెనీ ఫ్యూచర్ సప్లై చెయిన్ సొల్యూషన్స్ ఐపీఓ ధరల శ్రేణి రూ.660–664గా ఉంది. ఈ నెల 6న ప్రారంభమై 8న ముగిసే ఈ ఐపీఓ ద్వారా సంస్థ రూ.650 కోట్లు సమీకరిస్తుంది.
- హెచ్‌డీఎఫ్‌సీ మ్యూచువల్ ఫండ్ సంస్థ, హెచ్‌డీఎఫ్‌సీ ఏఎంసీ త్వరలో ఐపీఓకు రానుంది. ఈ ఐపీఓకు హెచ్‌డీఎఫ్‌సీ కంపెనీ డైరెక్టర్ల బోర్డు ఆమోదం తెలిపింది.
- రిలయన్స్ జనరల్ ఇన్సూరెన్స్ కంపెనీ ఐపీఓకు సెబీ ఆమోదం తెలిపింది.



బొమ్మ-బొరుసు

"నువ్వు ఏ పని చేస్తున్నావనే దాని కన్నా ఆ పనిని ఎలా చేస్తున్నావన్నదే ముఖ్యం."
– ఆది గోద్రెజ్, గోద్రెజ్ గ్రూప్ ఛైర్మన్



# ఈసారీ ఎక్కడి రేట్లు అక్కడే..!

- పాలసీ రేట్లలో మార్పులు ఉండకపోవచ్చు...
- విశ్లేషకులు, బ్యాంకర్ల అభిప్రాయం..
- 5–6 తేదీల్లో ఆర్‌బీఐ పరపతి విధాన సమీక్ష

**న్యూఢిల్లీ:** రిజర్వ్ బ్యాంక్(ఆర్‌బీఐ) కీలక పాలసీ రేట్లు వరుసగా రెండోసారి కూడా ఎలాంటి మార్పులూ ఉండకపోవచ్చని విశ్లేషకులు, బ్యాంకర్లు అభిప్రాయపడుతున్నారు. ప్రధానంగా జూలై–సెప్టెంబర్ త్రైమాసికంలో స్థూల దేశీయోత్పత్తి(జీడీపీ)వృద్ధి రేటు పుంజుకున్న నేపథ్యంలో ఇప్పుడు ద్రవ్యోల్బణం నియంత్రణపై అధికంగా దృష్టిపెట్టే అవకాశం ఉందనేది వారి అంచనా. అయిదు త్రైమాసికాల తర్వాత మళ్లీ వృద్ధి మెరుగుదల కారణంగా ఆర్‌బీఐపై రేట్ల తగ్గింపు ఒత్తిడి తగ్గిందని నిపుణులు పేర్కొంటున్నారు. మరోపక్క, పారిశ్రామిక వర్గాలు మాత్రం ఆర్థిక వ్యవస్థలోసానుకూల సెంటిమెంట్‌ను పెంపొందించాలంటే రేట్ల కోత తప్పనిసరి అని డిమాండ్ చేస్తున్నారు. దేశ సార్వభౌమ రేటింగ్‌ను మూడీస్ పెంచిన(అప్‌గ్రేడ్) తరుణంలో దీనికి జతగా ఆర్‌బీఐ కూడా రేట్లను తగ్గిస్తే.. ఆర్థిక వ్యవస్థ పునరుత్తేజానికి మరింత చేయూతనిచ్చినట్లు అవుతుందని వారు అభిప్రాయపడుతున్నారు.

ఆర్‌బీఐ గవర్నర్ ఉర్జిత్ పటేల్ నేతృత్వంలోని ఆరుగురు సభ్యుల పరపతి విధాన కమిటీ(ఎంపీసీ) ఈ నెల 5–6 తేదీల్లో పాలసీ సమీక్షను నిర్వహించనుంది. కమిటీ నిర్ణయాన్ని 6న(బుధవారం) ఉర్జిత్ పటేల్ ప్రకటిస్తారు. ఈ ఆర్థిక సంవత్సరంలో(2017–18)లో ఇది అయిదో ద్వైమాసిక పాలసీ సమీక్ష. అక్టోబర్ సమీక్షలో కూడా ద్రవ్యోల్బణం పెరుగుదల భయాలున్నాయంటూ ఆర్‌బీఐ పాలసీ రేట్లలో కీలక పాలసీ రేట్లను యథాతథంగా కొనసాగించిన సంగతి తెలిసిందే. మరోపక్క, ఈ ఏడాది వృద్ధి రేటు అంచనాలను 7.3 శాతం నుంచి 6.7 శాతానికి తగ్గించింది కూడా. చివరిసారిగా ఆర్‌బీఐ రెపో రేటు(ఆర్‌బీఐ బ్యాంకులకు ఇచ్చే స్వల్పకాలిక రుణాలపై వసూలు చేసే వడ్డీరేటు)ను పావు శాతం తగ్గించి 6 శాతానికి చేర్చింది. ఇది ఆరేళ్ల కనిష్ట స్థాయి. అయితే, చట్టబద్ధ ద్రవ్య



నిష్పత్తి(ఎస్ఎల్ఆర్– బ్యాంకులు తమ డిపాజిట్లలో తప్పనిసరిగా ప్రభుత్వ బాండ్లలో ఉంచాల్సిన నిధుల పరిమాణం)ని మాత్రం అర శాతం తగ్గింపుతో... 20 శాతం నుంచి 19.5 శాతానికి చేర్చింది. దీనివల్ల బ్యాంకులకు మరిన్ని నిధులు అందుబాటులోకి వచ్చేలా చేసింది. ఇక రివర్స్ రెపో రేటు (బ్యాంకులు ఆర్‌బీఐ వద్దఉంచే నిధులపై పొందే వడ్డీరేటు) ప్రస్తుతం 5.75 శాతంగా కొనసాగుతోంది. నగదు నిల్వల నిష్పత్తి(సీఆర్ఆర్– బ్యాంకులు తమ డిపాజిట్ నిధుల్లో ఆర్‌బీఐ వద్ద కచ్చితంగా ఉంచాల్సిన నిధుల పరిమాణం. వీటిపై బ్యాంకులకు ఎలాంటి వడ్డీ లభించదు) 4 శాతం వద్ద ఉంది.

## ఎవరేమంటున్నారు...

రానున్న నెలల్లో ద్రవ్యోల్బణం మరింత పెరిగే అవకాశం ఉందని.. దీనివల్ల ఈసారి పాలసీలో వడ్డీరేట్ల కోతకు ఎలాంటి ఆస్కారం లేదని మెజారిటీ బ్యాంకర్లు అంచనావేస్తున్నారు.'యథాతథ స్థితిని ఆర్‌బీఐ కొనసాగించవచ్చు. వ్యవస్థలో ద్రవ్యసరఫరా(లిక్విడిటీ) చాలా తక్కువగా ఉంది. డిపాజిట్ రేట్లు పెరుగుతున్నాయి. అదేవిధంగా ద్రవ్యోల్బణం పెరుగుదల రిస్కులూ పొంచిఉండటమే దీనికి ప్రధాన కారణం' అని యూనియన్‌బ్యాంక్ ఎండీ, సీఈఓ జి. రాజ్‌కిరణ్ రాయ్ పేర్కొన్నారు. అక్టోబర్‌లో రిటైల్ ద్రవ్యోల్బణం 7 నెలల గరిష్టానికి (3.58%), టోకు ధరల ద్రవ్యోల్బణం ఆరు నెలల గరిష్టానికి(3.59%) ఎగబాకిన విషయం విదితమే.

### 4 శాతం పైకి రిటైల్ ద్రవ్యోల్బణం: నోమురా

వస్తు–సేవల పన్ను(జీఎస్‌టీ)అమలు తర్వాత ఉత్పత్తి ధరలు కొద్దిగా తగ్గినప్పటికీ... ముడివస్తువుల ధరల ఒత్తిళ్లు పెరిగాయి. దీంతోపాటు అధిక ఆహార ద్రవ్యోల్బణం కారణంగా రిటైల్ ద్రవ్యోల్బణం.. నవంబర్‌లో ఆర్‌బీఐ లక్ష్యిత 4%కి మించి ఎగసే అవకాశం ఉందని అంతర్జాతీయ ఫైనాన్షియల్ సేవల దిగ్గజం నోమురా అభిప్రాయపడింది. 'ఈ పరిస్థితుల్లో ఆర్‌బీఐ కఠిన విధానాన్ని ఎంచుకోవచ్చు. పాలసీ రేట్లలో ఎలాంటి మార్పులకూ ఆస్కారం లేదు' అని తాజా నివేదికలో పేర్కొంది.

### రేట్ల కోతకు మంచి అవకాశం ఇది: ఫిక్కీ

ఆర్థిక వ్యవస్థలో విశ్వాస స్థాయిలను మరింతగా పెంపొందించేందుకు ఇదే మంచి తరుణమని.. రేట్ల కోతతో ఆర్‌బీఐ తోడ్పాటునందించాలని పారిశ్రామిక మండలి ఫిక్కీ ప్రెసిడెంట్ పంకజ్ పటేల్ వ్యాఖ్యానించారు. పెద్ద నోట్ల రద్దు(డీమోనిటైజేషన్), జీఎస్‌టీ అమలు తర్వాత తొలి త్రైమాసికంలో జీడీపీ వృద్ధి రేటు ఒక్కసారిగా మూడేళ్ల కనిష్టానికి(5.7 శాతం) పడిపోయిన సంగతి తెలిసిందే. అయితే, జీఎస్‌టీకి వ్యాపారవర్గాలు నెమ్మదిగా అలవాటుపడుతుండటంతో రెండో త్రైమాసికంలో వృద్ధి మళ్లీ 6.3 శాతానికి పుంజుకోవడంతో రికవరీ ఆశలకు బలం చేకూరుతోంది.

### రేట్లు మారవు: ఇక్రా

'రానున్న నెలల్లో రిటైల్ ద్రవ్యోల్బణం మరింత పెరిగే అవకాశం ఉంది. ఈ తరుణంలో ద్రవ్యోల్బణం ఆందోళనలను పరిగణనలోకి తీసుకుంటూ ఆర్‌బీఐ పాలసీ కమిటీ రెపో రేటును యథాతథంగానే కొనసాగిస్తుందని భావిస్తున్నాం' అని రేటింగ్ ఏజెన్సీ ఇక్రా అభిప్రాయపడింది.

---

మీడియా, వినోద రంగాల్లో

## ఉద్యోగాల వరద!

రానున్న ఐదేళ్లలో 7–8 లక్షల ఉద్యోగాలు: సీఐఐ అంచనా



**న్యూఢిల్లీ:** మీడియా, వినోద రంగాలు యువతకు ఆశాకిరణంగా మారనున్నాయి. ఈ రంగాలు ఏటా 11–12% స్థాయిలో వృద్ధి చెందుతూ రానున్న ఐదేళ్లలో ఏకంగా 7–8 లక్షల మందికి ఉపాధి కల్పించనున్నాయని సీఐఐ–బీసీజీ నివేదిక పేర్కొంది. గ్రామీణ ప్రాంతాల్లో డిమాండ్ పెరుగుతూ ఉండటం, డిజిటల్‌గా కనెక్ట్ అయ్యే వినియోగదారులు పెరుగుతుండటం వినియోగాన్ని పెంచే అంశాలుగా పేర్కొంది. ఇందుకు అనుగుణంగా మీడియా అండ్ ఎంటర్‌టైన్‌మెంట్ పరిశ్రమ భిన్నమైన ఉద్యోగులతో సన్నద్ధం కావాల్సిన అవసరం ఉందని అభిప్రాయపడింది. ఏటా 1.4–1.6 లక్షల మంది శిక్షణ పొందిన వారి అవసరం ఐదేళ్ల పాటు ఉంటుందని అంచనా వేస్తున్నట్టు తెలిపింది. ''డిజిటల్ ప్లాట్‌ఫామ్స్ అన్నవి ఓ వ్యాపకంలా మారాయి. ఇంతకుముందెన్నడూ లేని స్థాయిలో అవకాశాలున్నాయి. ముఖ్యంగా క్రియేటర్లు, స్టోరీ టెల్లర్, టెక్నాలజీ ప్రొవైడర్లకు అధిక అవకాశాలున్నాయి'' అని సీఐఐ డైరెక్టర్‌జనరల్ చంద్రజిత్ బెనర్జీ పేర్కొన్నారు.

## ద్రవ్యోల్బణం మున్ముందు పైకే!

మోర్గాన్ స్టాన్లీ, యూబీఎస్ అంచనా

**న్యూఢిల్లీ:** వినియోగ ధరల ఆధారిత ద్రవ్యోల్బణం (సీపీఐ) రానున్న నెలల్లో పెరిగే అవకాశాలున్నాయని ప్రముఖ అంతర్జాతీయ సంస్థలు అంచనా వేస్తున్నాయి. ఇంటి అద్దె అలవెన్స్, వేతన సవరణ కమిషన్ సంబంధిత పెంపులు ద్రవ్యోల్బణ ఒత్తిళ్లను పెంచేవేనని మోర్గాన్ స్టాన్లీ అంటోంది. ఈ అంశాల ప్రభావానికి తోడు ఈ ఏడాది మొదట్లో ఆహార ధరలు



కనిష్ట స్థాయికి చేరిన నేపథ్యంలో సీపీఐ ద్రవ్యోల్బణం 2018 జూన్ క్వార్టర్ నాటికి 5.3 శాతానికి చేరుతుందని, అదే ఏడాది చివరికి 4.4 శాతానికి దిగొస్తుందన్న అంచనాను వ్యక్తం చేసింది. మరో అంతర్జాతీయ సంస్థ యూబీఎస్ సైతం ఇదే తరహా అభిప్రాయాలు తెలిపింది. రానున్న కాలంలో ద్రవ్యోల్బణం పెరుగుతుందని అంచనా వేస్తున్నట్టు పేర్కొంది.

### కోడిగుడ్లు (హోల్‌సేల్ -నెక్ /100కు రూ.లలో) 04-12-2017

| | |
|---|---|
| విశాఖ | 385–00 |
| చిత్తూరు | 428–00 |
| వరంగల్ | 410–00 |
| ముంబై | 455–00 |
| చెన్నై | 435–00 |
| విజయవాడ | 385–00 |
| గోదావరి | 385–00 |
| నమక్కల్ | 425–00 |
| 03-12-2017 ఫామ్ ధర... | |
| హైదరాబాద్ | 410–00 |
| రిటైల్ (ఒక గుడ్డుకు) | 4.70 |
| బెంగళూరు | 435–00 |
| కోల్‌కతా | 425–00 |
| ఢిల్లీ | -- |

---

# ట్రెండ్‌కు ఆర్‌బీఐ నిర్దేశం..!

- 6న ఎంపీసీ నిర్ణయాల వెల్లడి
- ఇన్వెస్టర్ల సెంటిమెంట్‌పై గుజరాత్ ఎన్నికల ప్రభావం
- చమురు ధరల సెగతో అప్రమత్తత
- ఈ వారం మార్కెట్ గమనంపై విశ్లేషకుల అంచనాలు



**న్యూఢిల్లీ:** వడ్డీరేట్లపై ఆర్‌బీఐ తీసుకునే నిర్ణయం ఈ వారం మార్కెట్‌కు కీలకం కానున్నదని నిపుణులంటున్నారు. సెప్టెంబర్ త్రైమాసికానికి సంబంధించి ప్రభుత్వం విడుదల చేసిన జీడీపీ గణాంకాలు ఆశాజనకంగానే ఉన్నప్పటికీ ఇన్వెస్టర్లను మాత్రం మెప్పించలేకపోయాయి. ఈ నేపథ్యంలో 5, 6వ తేదీల్లో జరిగే ఆర్‌బీఐ మోనిటరీ పాలసీ కమిటీపైనే అందరి ఆసక్తి కేంద్రీకృతమై ఉంది. అలాగే, ప్రపంచ మార్కెట్ల పోకడ, విదేశీ, దేశీ ఇన్వెస్టర్ల పెట్టుబడుల సరళి, అంతర్జాతీయ మార్కెట్లో ముడి చమురు ధరల కదలికలు, డాలర్‌తో రూపాయి మారకం తదితర అంశాలు ఈ వారం మార్కెట్‌పై ప్రభావం చూపుతాయని విశ్లేషకులు అంచనా వేస్తున్నారు. గత వారంలో బీఎస్ఈ సెన్సెక్స్ 846 పాయింట్లు నష్టపోయి 32,833 పాయింట్ల వద్ద, ఎన్ఎస్ఈ నిఫ్టీ 268 పాయింట్లు నష్టపోయి 10,122 పాయింట్ల వద్ద ముగిశాయి. ఈ వారంలో జరిగే ఆర్‌బీఐ పాలసీ భేటీ కీలకమైనదని, యథాతథ స్థితినే మార్కెట్ అంచనా వేస్తున్నట్టు జియోజిత్ ఫైనాన్షియల్ సర్వీసెస్ రీసెర్చ్ హెడ్ వినోద్ నాయర్ తెలిపారు. గుజరాత్, హిమాచల్ ప్రదేశ్ రాష్ట్రాల్లో జరిగే ఎన్నికలు సైతం ఇన్వెస్టర్ల సెంటిమెంట్‌పై ప్రభావం చూపే అంశంగా పేర్కొన్నారు. గుజరాత్ ఎన్నికల పోలింగ్‌పై మార్కెట్ ఎంతో ఆత్రుతగా వేచి ఉందని శామ్కో సెక్యూరిటీస్ సీఈవో జిమీత్‌మోదీ తెలిపారు. గుజరాత్‌లో ఈ నెల 9, 14వ తేదీల్లో ఎన్నికలు జరగనున్నాయి. క్యూ2 జీడీపీ గణాంకాలను గమనిస్తే డీమోనిటైజేషన్, జీఎస్టీ ప్రభావాలు ముగిసినట్టేనని తెలుస్తోందని, సమీప భవిష్యత్తులో ఆర్థికరంగం పుంజుకుంటుందన్న అంచనాలను నాయర్ వ్యక్తం చేశారు. ప్రస్తుత ఆర్థిక సంవత్సరం ఏప్రిల్–జూన్ క్వార్టర్లో జీడీపీ మూడేళ్ల కనిష్ఠ స్థాయి 5.7%కి పడిపోగా, జూలై–సెప్టెంబర్ క్వార్టర్లో తిరిగి 6.3%కి పుంజుకుంది. అయినప్పటికీ ద్రవ్యలోటు, పెరుగుతున్న చమురు ధరల నేపథ్యంలో ఇన్వెస్టర్లు అప్రమత్తతతో వ్యవహరించొచ్చని నాయర్ అభిప్రాయపడ్డారు. ఒకవేళ అమెరికా ఫెడ్ వడ్డీ రేట్లను పెంచితే అది సెంటిమెంట్‌ను దెబ్బతీస్తుందని జిమీత్‌మోదీ అన్నారు.

**ఆర్‌బీఐ ఎంపీసీ భేటీ**

ఆర్‌బీఐ మానిటరీ పాలసీ కమిటీ(ఎంపీసీ) ఈ నెల 5న ప్రారంభమై 6న ముగుస్తుంది. 6వ తేదీ మధ్యాహ్నం 2.30 గంటలకు ఆర్‌బీఐ తన నిర్ణయాలను వెల్లడిస్తుంది. గత అక్టోబర్ నాటి పాలసీలో రేట్లను యథాతథంగా కొనసాగించిన విషయం విదితమే. మార్కెట్ ఎకనామిక్స్ సంస్థ నవంబర్ నెల భారత తయారీ రంగ పర్చేజింగ్ మేనేజర్స్ ఇండెక్స్ (పీఎంఐ) గణాంకాలను 5న వెల్లడించనున్నది.

### ఈ వారంలో రెండు ఐపీఓలు



ఈ వారంలో రెండు కంపెనీలు ఐపీఓ ద్వారా నిధులు సమీకరించనున్నాయి. షాల్బీ మల్టీ స్పెషాల్టీ హాస్పిటల్ చెయిన్ ఐపీఓ (ఇనీషియల్ పబ్లిక్ ఆఫర్) మంగళవారం (ఈ నెల 5న) ప్రారంభమై 7న ముగుస్తుంది. రూ.245–248 ప్రైస్‌బాండ్‌తో ఉన్న ఈ ఐపీఓ ద్వారా ఈ కంపెనీ సుమారుగా రూ. 500 కోట్లు సమీకరిస్తుందని అంచనా. కనీసం 60 షేర్లకు దరఖాస్తు చేయాలి. ఈ షేర్లు ఈ నెల మూడో వారంలో స్టాక్ మార్కెట్లో లిస్టయ్యే అవకాశాలున్నాయి. ఈ ఐపీఓలో భాగంగా రూ.480 కోట్ల విలువైన తాజా షేర్లతో పాటు ఆఫర్ ఫర్ సేల్ విధానంలో పది లక్షల షేర్లను జారీ చేస్తున్నారు. ఇక ఫ్యూచర్ గ్రూప్‌కు చెందిన లాజిస్టిక్స్ కంపెనీ ఫ్యూచర్ సప్లై చెయిన్ సొల్యూషన్ ఐపీఓ ఈ నెల 6న(బుధవారం) ప్రారంభమై ఈ నెల 8న ముగుస్తుంది. రూ.660–664 ప్రైస్‌బాండ్ ఉన్న ఈ ఐపీఓ ద్వారా ఈ కంపెనీ రూ.650 కోట్లు సమీకరిస్తుందని అంచనా. కనీసం 22 షేర్లకు దరఖాస్తు చేయాలి. ఈ నెల 15న ఈ షేర్లు స్టాక్ మార్కెట్లో లిస్టయ్యే అవకాశాలున్నాయి.

### నవంబర్‌లో ఎఫ్‌పీఐల పెట్టుబడులు రూ. 19,728 కోట్లు

**న్యూఢిల్లీ:** విదేశీ పోర్ట్‌ఫోలియో ఇన్వెస్టర్ల (ఎఫ్‌పీఐ) పెట్టుబడుల ప్రవాహం కొనసాగుతూనే ఉంది. నవంబర్‌లో రూ.19,728 కోట్ల మేర పెట్టుబడులు దేశీ స్టాక్ మార్కెట్లలోకి తరలి వచ్చాయి. 8 నెలల్లోనే ఇదే గరిష్ఠం. ప్రపంచ బ్యాంకు సులభతర సూచీలో మన దేశ స్థానం గణనీయంగా మెరుగుపడడం, ప్రభుత్వరంగ బ్యాంకులకు నిధుల సాయం ఇందుకు తోడ్పడ్డాయి. ఇదే కాలంలో ఎఫ్‌పీఐలు డెట్ మార్కెట్లో పెట్టిన పెట్టుబడులు రూ.530 కోట్లు.

### గత వారం హీరోలు

| స్టాక్స్ | 1 ముగింపు | 24 ముగింపు | మార్పు(%) |
|---|---|---|---|
| శ్రీరామ్ ట్రాన్స్‌పోర్ట్.ఫై | 1,327 | 1,240 | 7 |
| బాష్ | 19,986 | 18,970 | 5 |
| మదర్‌సన్ సుమి | 358 | 346 | 4 |
| నెస్లె | 7,704 | 7,510 | 3 |
| పిరమల్ ఎంటర్‌ప్రైజెస్ | 2,728 | 2,661 | 3 |
| క్రాంప్టన్ గ్రీవ్స్ | 268 | 263 | 2 |
| టాటా గ్లోబల్ బేవరేజ్ | 283 | 279 | 2 |
| ఎన్ఎండీసీ | 129 | 127 | 2 |
| మారుతీ సుజుకీ | 8,608 | 8,488 | 1 |
| అశోక్ లేలాండ్ | 120 | 118 | 1 |

### ఎందుకు పెరిగాయంటే...

పలు మార్గాల్లో నిధుల సమీకరణను పరిశీలిస్తున్నట్టు శ్రీరామ్ ట్రాన్స్‌పోర్ట్ ఫైనాన్స్ ప్రకటించడం, సీడీ ఈక్విరీసెర్చ్ సంస్థ ఈ స్టాక్‌కు రూ.1,475 టార్గెట్ ఇవ్వడం పెరుగుదలకు దారితీసింది. బాష్ కౌంటర్లో బ్లాక్ డీల్స్ చోటు చేసుకోవడంతో ఈ స్టాక్‌లాభపడింది. అనలిస్టుల కొనుగోలు సిఫారసులు, బ్లాక్ డీల్స్‌తో మదర్సన్‌సుమి సిస్టమ్స్ పెరిగింది. నెస్లె ఇండియా పట్ల విశ్లేషకులు సానుకూలతలు వ్యక్తం చేయడంతో ఈ షేరు పెరిగింది.

### గత వారం జీరోలు

| స్టాక్స్ | 1 ముగింపు | 24 ముగింపు | మార్పు(%) |
|---|---|---|---|
| పీఎన్‌బీ | 171 | 186 | -8 |
| కెనరా బ్యాంక్ | 363 | 390 | -7 |
| గ్లెన్‌మార్క్ ఫార్మా | 555 | 593 | -6 |
| హిందాల్కో | 236 | 252 | -6 |
| పవర్ ఫైనాన్స్ కార్ప్ | 119 | 127 | -6 |
| వేదాంతా | 287 | 306 | -6 |
| టాటా మోటార్స్ | 399 | 425 | -6 |
| ఎస్‌బీఐ | 313 | 332 | -6 |
| అరబిందో ఫార్మా | 672 | 715 | -6 |
| ఆర్ఈసీ | 154 | 163 | -6 |

### ఎందుకు తగ్గాయంటే...

పీఎన్‌బీ హౌసింగ్ ఫైనాన్స్‌లో వాటా విక్రయం ద్వారా పంజాబ్ నేషనల్ బ్యాంకు రూ.1,324 కోట్లు సమీకరించడం ఆ స్టాక్‌పై ప్రతికూల ప్రభావం చూపించింది. అలాగే, తన అనుబంధ కంపెనీల్లో వాటాల విక్రయం యోచన చేస్తుండడంతో కెనరా బ్యాంకు స్టాక్ కూడా నష్టపోయింది. గ్లెన్‌మార్క్ ఫార్మా బడ్డి యూనిట్‌పై యూఎస్ఎఫ్‌డీఏ పలు అభ్యంతరాలు వ్యక్తం చేయడంతో ఆ స్టాక్ కుదేలైంది.

## సెన్సెక్స్ కీలక మద్దతు 32,684

మార్కెట్ పంచాంగం

అంతర్జాతీయంగా అమెరికా రికార్డ్ బ్రేకింగ్ ర్యాలీ కొనసాగుతుండగా, భారత్‌తో సహా ఇతర వర్ధమాన దేశాల మార్కెట్లు గతవారం అమ్మకాల ఒత్తిడికి లోనయ్యాయి. అమెరికా ఆర్థికవ్యవస్థ పటిష్టంగా కోలుకుంటున్న డేటా వెలువడుతున్న నేపథ్యంలో అక్కడి కేంద్ర బ్యాంక్ ఫెడరల్ రిజర్వ్ డిసెంబర్ రెండో వారంలో జరిపే సమీక్షా సమావేశంలో మరోదఫా వడ్డీ రేట్లు పెంచవచ్చన్న అంచనాలు కొనసాగుతున్నాయి. ఇందుకు తోడు నాటకీయంగా పెరుగుతున్న చమురు ధరలు... ఈక్విటీ ర్యాలీకి బ్రేక్ వేయొచ్చన్న అంచనాలు విశ్లేషకుల నుంచి వెలువడుతున్నాయి. ఈ నేపథ్యంలో చైనా మార్కెట్ వారంరోజుల క్రితం హఠాత్ పతనాన్ని (ఒకే రోజు 2.5 శాతం) చవిచూసింది. క్రితం వారం ఇండియా, హాంకాంగ్, బ్రెజిల్, తైవాన్ మార్కెట్లు పెద్ద క్షీణతల్ని నమోదుచేసాయి. రానున్న ఒకటి, రెండు వారాల్లో ప్రపంచ మార్కెట్లో ట్రెండ్ మార్పునకు ఇది సంకేతం కావొచ్చని, ఇన్వెస్టర్లు జాగ్రత్త వహించడం మంచిదని విశ్లేషకులు సూచిస్తున్నారు. ఇక సూచీల సాంకేతికాంశాల విషయానికొస్తే...

### సెన్సెక్స్ సాంకేతికాంశాలు...




డిసెంబర్ 1తో ముగిసిన వారంలో బీఎస్ఈ సెన్సెక్స్ 33,770 పాయింట్ల గరిష్టస్థాయివరకూ పెరిగిన తర్వాత... వారంలో చివరి రెండు రోజులూ అమ్మకాల ఒత్తిడికి లోనై 32,798 పాయింట్లస్థాయికి పతనమయ్యింది. చివరకు అంత క్రితం వారంతో పోలిస్తే, 846 పాయింట్ల భారీనష్టంతో 32,833 పాయింట్ల వద్ద ముగిసింది. ఈ వారం డౌన్‌ట్రెండ్ కొనసాగితే 32,684 పాయింట్ల వద్ద కీలకమైన మద్దతు లభిస్తున్నది. ఇదే కనిష్టస్థాయి నుంచి నవంబర్ 15న సెన్సెక్స్ బౌన్స్‌కావడంతో ఈ స్థాయి వద్ద లభించబోయే మద్దతు కీలకం. ఈ స్థాయిని కోల్పోతే 32,145 పాయింట్ల వద్ద మరో ముఖ్యమైన మద్దతు లభిస్తున్నది. ఇది సెప్టెంబర్ 28నాటి కనిష్టస్థాయి అయిన 31,081 పాయింట్ల నుంచి నవంబర్ 7నాటి రికార్డు గరిష్టస్థాయి 33,866 పాయింట్ల వరకూ జరిగిన ర్యాలీకి 61.8 శాతం రిట్రేస్‌మెంట్ స్థాయి. ఈ స్థాయిని సైతం వదులుకుంటే 31,770–31,560 పాయింట్ల శ్రేణి మధ్య సెన్సెక్స్‌కు తాత్కాలిక మద్దతు లభించవచ్చు. ఈ వారం తొలి స్థాయిని పరిరక్షించుకోగలిగితే 33,110 నిరోధస్థాయివరకూ సెన్సెక్స్ పెరగవచ్చు. ఈ పైన ముగిస్తే 33,300 పాయింట్లస్థాయిని అందుకోవొచ్చు. ఆపైన 33,570 వరకూ పెరిగే అవకాశం ఉంటుంది.

### నిఫ్టీ సమీప మద్దతు 10,094..




ఎన్ఎస్ఈ నిఫ్టీ క్రమేపీ 10,410 పాయింట్ల వరకూ ర్యాలీ జరిపి, నవంబర్ డెరివేటివ్ సిరీస్ చివరిరోజున, డిసెంబర్ సిరీస్ తొలిరోజున నాటకీయంగా భారీ పతనాల్ని నమోదుచేసింది. చివరకు అంతక్రితం వారంతో పోలిస్తే, 268 పాయింట్ల నష్టంతో 10,122 పాయింట్ల వద్ద ముగిసింది. ఈ సోమవారం మార్కెట్ క్షీణిస్తే నవంబర్ 15 నాటి కనిష్టస్థాయిన అయిన 10,094 పాయింట్ల వద్ద తక్షణ మద్దతు లభిస్తున్నది. ఈ మద్దతుస్థాయిని కోల్పోతే 9,993 పాయింట్ల వరకూ పడిపోయే ప్రమాదం ఉంటుంది. ఈ స్థాయిని సైతం భారీ ట్రేడింగ్ పరిమాణంతో వదులుకుంటే రానున్న వారాల్లో సెప్టెంబర్ 28 నాటి కనిష్టస్థాయి అయిన 9,687 పాయింట్ల వరకూ పతనం కొనసాగవచ్చు. సమీప భవిష్యత్తులో 9,993 పాయింట్ల దిగువన ముగిస్తే 9,950–9,850 పాయింట్ల శ్రేణి మధ్య తాత్కాలిక మద్దతు లభించవచ్చు. ఈ వారం తొలి మద్దతుస్థాయిని కాపాడుకోగలిగితే 10,210 పాయింట్ల వరకూ రిలీఫ్ ర్యాలీ జరిగే అవకాశం ఉంటుంది. ఈ స్థాయిపైన ముగిస్తే 10,275 పాయింట్ల వరకూ పెరగవచ్చు. అటుపైన క్రమేపీ 10,345 పాయింట్ల వరకూ బౌన్స్ అయ్యే చాన్స్ ఉంటుంది.

– పి. సత్యప్రసాద్

---

# చక్రవడ్డీ ప్రయోజనాలు ఫండ్స్‌లో లభిస్తాయా?




ధీరేంద్ర కుమార్
సీఈవో, వ్యాల్యూ రీసెర్చ్

**నేను గత కొన్నేళ్లుగా ఒక ఈక్విటీ మ్యూచువల్ ఫండ్‌లో సిప్ విధానంలో ఇన్వెస్ట్ చేస్తున్నాను. కానీ ఈ ఫండ్ పనితీరు అంచనాలకు అనుగుణంగా లేదు. ఈ ఫండ్ నుంచి ఇన్వెస్ట్‌మెంట్స్‌ను పూర్తిగా వెనక్కి తీసుకొని వేరే ఫండ్‌లోకి మారుద్దామనుకుంటున్నాను. ఇలా ఒకేసారి ఒక ఫండ్ నుంచి మరో ఫండ్‌లోకి ఇన్వెస్ట్‌మెంట్స్‌ను మార్చుకోవచ్చా ? పన్ను బాధ్యత ఏమైనా ఉంటుందా ?**

–విజయ్, విశాఖపట్టణం

ఒక ఈక్విటీ ఫండ్‌లో మీరు ఇప్పటిదాకా ఇన్వెస్ట్ చేసిన ఇన్వెస్ట్‌మెంట్స్ అన్నింటినీ ఒకేసారి వెనక్కి తీసుకొని వేరే ఫండ్‌లోకి ఇన్వెస్ట్ చేయడంలో ఎలాంటి ఇబ్బంది లేదు. ఈక్విటీ ఫండ్స్‌లో ఇన్వెస్ట్ చేయడానికి సిస్టమేటిక్ ఇన్వెస్ట్‌మెంట్ ప్లాన్(సిప్) విధానమే సరైనది. సాధారణంగా ఈక్విటీ ఫండ్స్ దీర్ఘకాలంలో మంచి రాబడులే ఇస్తాయి. కేవలం 3,4 సంవత్సరాల పనితీరును ఆధారంగా చేసుకొని వేరే ఫండ్‌లోకి ఇన్వెస్ట్‌మెంట్స్‌ను మార్చాలనుకోవడం సరికాదు. కాదు, కూడదు ఫండ్‌ను మార్చాలనేది మీ నిర్ణయమైతే, మీరు.. కొన్ని విషయాలను పరిగణనలోకి తీసుకోవాలి. ఎగ్జిట్ లోడ్ వర్తిస్తుందేమో అన్న విషయాన్ని చెక్ చేసుకోవాలి. మీ సిప్‌లకు ఎగ్జిట్ లోడ్ వర్తించే కాలం ముగిసిన తర్వాతే వేరే ఫండ్‌లోకి ఇన్వెస్ట్‌మెంట్స్‌ను బదిలీ చేసుకుంటే ఎగ్జిట్ లోడ్ వ్యయాలు తగ్గుతాయి. ఇక ఒక ఫండ్ నుంచి వేరే ఫండ్‌లోకి మారడమంటే ఒక ఫండ్ నుంచి పెట్టుబడులను ఉపసంహరించుకొని, వేరే కొత్త ఫండ్‌లో ఇన్వెస్ట్‌చేయడంగా పరిగణిస్తారు. అందుకని మీ పాత ఫండ్ ఇన్వెస్ట్‌మెంట్స్‌పై స్వల్పకాలిక మూలధన లాభాల పన్ను వర్తిస్తుందేమో ఒక సారి చెక్ చేయండి. అలా వర్తించే పక్షంలో స్వల్పకాలిక మూలధన లాభాల పన్ను భారం పడని కాలం వరకూ వేచి చూసి, ఆ తర్వాత వేరే ఫండ్‌లోకి మీ ఇన్వెస్ట్‌మెంట్స్‌ను మార్చుకోండి.

**ఫిక్స్‌డ్ డిపాజిట్లలో చక్రవడ్డీ ప్రయోజనాలు లభిస్తాయి. అలాంటి ప్రయోజనం మ్యూచువల్ ఫండ్స్‌లో ఇన్వెస్ట్ చేస్తే లభిస్తుందా ?**

–మేరీ, సికింద్రాబాద్

చక్రవడ్డీ ప్రయోజనాలు మ్యూచువల్ ఫండ్స్‌లో లభిస్తాయి. మ్యూచువల్ ఫండ్స్‌కు సంబంధించి గ్రోత్ ప్లాన్‌లు ఈ తరహావే అని చెప్పవచ్చు. అయితే వీటిని ఫిక్స్‌డ్ డిపాజిట్లుగా పరిగణించడానికి లేదు. ఎందుకంటే, ఫిక్స్‌డ్ డిపాజిట్లలో ఎంత కాలం ఇన్వెస్ట్ చేస్తే, ఎంత మొత్తం రాబడి వస్తుందో ముందే తెలుస్తుంది. మ్యూచువల్ ఫండ్స్‌లో ఇన్వెస్ట్ చేస్తే ఇంత మొత్తాల్లో రాబడులు వస్తాయని గ్యారంటీగా చెప్పలేము. అయితే అంతకు మించిన లాభాలు వచ్చాయని చరిత్ర చెబుతోంది. గత 20 ఏళ్లలో బీఎస్ఈ సెన్సెక్స్ 17–18 శాతం చొప్పున వృద్ధి సాధించింది. ఇది డిపాజిట్ రేట్‌కన్నా దాదాపు రెట్టింపు. కొన్ని మ్యూచువల్ ఫండ్స్ ఏడాదికి 20–22 శాతం చక్రగతి రాబడులను కూడా ఇచ్చాయి.

**నేను దీర్ఘకాలం పాటు మ్యూచువల్ ఫండ్స్‌లో ఇన్వెస్ట్ చేద్దామనుకుంటున్నాను. కొన్ని బ్యాలన్స్‌డ్ ఫండ్స్‌ను షార్ట్‌లిస్ట్ చేశాను. ఇటీవలే కంపెనీ నుంచి రూ. లక్ష వరకూ బోనస్ వచ్చింది. ఈ మొత్తాన్ని ఒకేసారి ఇన్వెస్ట్ చేయమంటారా ? ఈ మొత్తాన్ని బ్యాంక్‌లో డిపాజిట్ చేసి నెలకు కొంత మొత్తం చొప్పున సిస్టమేటిక్ ఇన్వెస్ట్‌మెంట్ ప్లాన్(సిప్) విధానంలో ఇన్వెస్ట్ చేయమంటారా ?**

–సందీప్, విజయవాడ

ఈక్విటీ గానీ, బ్యాలన్స్‌డ్ మ్యూచువల్ ఫండ్స్‌లో కానీ ఇన్వెస్ట్ చేయాలనుకున్నప్పుడు సిప్ విధానమే శ్రేయస్కరం. మీ దగ్గర ఇన్వెస్ట్ చేయడానికి పెద్ద మొత్తంలో డబ్బులు ఉన్నప్పుడు. ముందుగా మీరు షార్ట్ టర్మ్ డెట్ ఫండ్‌లో ఆ మొత్తాన్ని ఇన్వెస్ట్ చేయండి. ఆ తర్వాత ఒక మంచి బ్యాలన్స్‌డ్ ఫండ్‌ను ఎంచుకోండి. ఈ షార్ట్ టర్మ్ డెట్ ఫండ్ నుంచి సిస్టమేటిక్ ట్రాన్స్‌ఫర్ ప్లాన్(ఎస్‌టీపీ) ద్వారా మీ ఇన్వెస్ట్‌మెంట్స్‌ను బ్యాలన్స్‌డ్ ఫండ్‌కు మార్చుకోండి. ఇలా చేస్తే, మీరు బ్యాలన్స్‌డ్ ఫండ్‌లో ఇన్వెస్ట్ చేయడానికి ముందు మీరు బ్యాంక్‌లో ఉంచే దానికన్నా అధికంగానే షార్ట్ టర్మ్‌డెట్ ఫండ్ ద్వారా రాబడులు పొందవచ్చు. బ్యాలన్స్‌డ్ ఫండ్‌లో ఇన్వెస్ట్ చేయడాన్ని కనీసం ఏడాది, ఏడాదిన్నర కొనసాగించండి. ఈ కాలంలో మ్యూచువల్ ఫండ్స్ ఇన్వెస్ట్‌మెంట్స్‌పై మీకు తగిన అవగాహన వస్తుంది. మ్యూచువల్ ఫండ్స్ ఇన్వెస్ట్‌మెంట్స్‌పై తగిన అవగాహన వచ్చిన తర్వాత ఒకటి లేదా రెండు ఈక్విటీ మ్యూచువల్ ఫండ్స్‌ను ఎంచుకొని సిప్ విధానంలో ఆ ఫండ్స్‌లో ఇన్వెస్ట్‌మెంట్స్ కొనసాగించండి. రిటైర్మెంట్ నిధి ఏర్పాటు, సొంత ఇంటిని సమకూర్చుకోవడం, పిల్లల ఉన్నత చదువులు తదితర దీర్ఘకాలిక ఆర్థిక లక్ష్యాల సాధన కోసం ఈక్విటీ మ్యూచువల్ ఫండ్స్ మంచి సాధనాలు.

**నేను గతంలో బ్యాంక్‌లో ఫిక్స్‌డ్ డిపాజిట్ చేసిన మొత్తం మరో రెండు, మూడు నెలల్లో మెచ్యూర్ అవుతుంది. ఈ మొత్తాన్ని మ్యూచువల్ ఫండ్స్‌లో ఇన్వెస్ట్ చేద్దామనుకుంటున్నాను. కనీసం ఎనిమిదేళ్ల పాటు ఇన్వెస్ట్ చేయాలనుకుంటున్నాను. ఈ విషయమై తగిన సలహా ఇవ్వండి ?**

–రియాజ్, హైదరాబాద్

ఎనిమిదేళ్ల పాటు ఇన్వెస్ట్ చేయడమంటే దీర్ఘకాలం కిందే లెక్క. ఇంత ఎక్కువ కాలం ఇన్వెస్ట్‌మెంట్స్‌పై మంచి రాబడులు పొందాలంటే ఉన్న కొన్ని రాబడి సాధనాల్లో ఈక్విటీ మ్యూచువల్ ఫండ్స్‌లో ఇన్వెస్ట్ చేయడం ఒక మార్గం. మీరు మ్యూచువల్ ఫండ్స్ ఇన్వెస్ట్‌మెంట్స్‌కు కొత్త కాబట్టి, ముందుగా 2 లేదా 3 బ్యాలన్స్‌డ్ ఫండ్స్ ఎంచుకోండి. మీరు పన్ను బ్రాకెట్లో ఉంటే, ఈక్విటీ లింక్ సేవింగ్స్ స్కీమ్స్(ఈఎల్ఎస్ఎస్)ల్లో ఇన్వెస్ట్ చేయండి. ఫలితంగా సెక్షన్ 80సీ కింద మీకు రూ. లక్షన్నర వరకూ పన్ను మినహాయింపులు లభిస్తాయి.

సాక్షి స్పోర్ట్స్
సోమవారం 4-12-2017

# 'డబుల్' సిక్సర్...

## విరాట్ మరో డబుల్ సెంచరీ

- వరుసగా రెండో మ్యాచ్‌లోనూ ద్విశతకం
- భారత్ 536/7 డిక్లేర్డ్ • శ్రీలంక 131/3
- మూడో టెస్టుపై భారత్ ఆధిపత్యం



కోహ్లి డబుల్ సెంచరీ, రోహిత్ సమయోచిత ఇన్నింగ్స్, షమీ, ఇషాంత్ అద్భుత బౌలింగ్, లంకను ఆదుకున్న మాథ్యూస్... ఇవీ మైదానంలో చివరి టెస్టు రెండో రోజు ఆటలో విశేషాలు. అయితే ఆటలో అరటి పండులా మ్యాచ్‌పై ఢిల్లీ కాలుష్యం దెబ్బ... ముఖానికి మాస్క్‌లతో బరిలోకి దిగిన శ్రీలంక క్రికెటర్లు... కనీసం 11 మంది మైదానంలో లేక చివరకు సహాయక సిబ్బందిని సన్నద్ధం చేయడం... వాద ప్రతివాదాలు, భారత ఆటగాళ్ల అసహనం, బయట నుంచి లంకపై అభిమానుల ఆగ్రహం, అంపైర్ల జోక్యం, తీవ్రమైన చర్చోపచర్చలు... ఇదీ ఫిరోజ్ షా కోట్లాలో రెండో రోజు పరిస్థితి.

భారత టెస్టు క్రికెట్ చరిత్రలో 1932 నుంచి 2015 మధ్య 83 ఏళ్ల కాలంలో కేవలం నలుగురు భారత కెప్టెన్లు మాత్రమే ఒక్కో డబుల్ సెంచరీ సాధించగలిగారు. కానీ విరాట్ కోహ్లి మాత్రం నాయకుడిగా ముందుండి నడిపించడం అంటే ఏమిటో పదే పదే చూపిస్తూ వస్తున్నాడు. ఇప్పుడు అదే కోవలో అతను ఏకంగా ఆరో డబుల్ సెంచరీని బాది ఓవరాల్‌గా బ్రియాన్ లారా లాంటి దిగ్గజాన్ని దాటి అత్యధిక డబుల్ సెంచరీలు సాధించిన ఏకైక కెప్టెన్‌గా నిలిచాడు. కోహ్లి జోరు మొదలైన గత 17 నెలల కాలంలో అంతర్జాతీయ క్రికెట్‌లో మరే కెప్టెన్ కూడా డబుల్ సెంచరీ నమోదు చేయలేకపోవడం విరాట్ ఘనతను రెట్టింపు చేస్తోంది.

**న్యూఢిల్లీ:** శ్రీలంకతో జరుగుతున్న చివరి టెస్టులోనూ భారత్ ఆధిపత్యానికి ఎక్కడా లోటు రాలేదు. మ్యాచ్ రెండో రోజు వేగంగా పరుగులు సాధించిన భారత జట్టు, తర్వాత లంక బ్యాటింగ్‌ను దెబ్బ తీసి టెస్టుపై పట్టు బిగించింది. ఆదివారం ఆట ముగిసే సమయానికి శ్రీలంక తమ తొలి ఇన్నింగ్స్‌లో 3 వికెట్ల నష్టానికి 131 పరుగులు చేసింది. ఏంజెలో మాథ్యూస్ (118 బంతుల్లో 57 బ్యాటింగ్; 8 ఫోర్లు, 2 సిక్సర్లు), చండిమాల్ (25 బ్యాటింగ్) క్రీజ్‌లో ఉన్నారు. అంతకుముందు ఓవర్‌నైట్ స్కోరు 371/4తో ఆట కొనసాగించిన భారత్ తమ తొలి ఇన్నింగ్స్‌ను 7 వికెట్ల నష్టానికి 536 పరుగుల వద్ద డిక్లేర్ చేసింది. విరాట్ కోహ్లి (287 బంతుల్లో 243; 25 ఫోర్లు) డబుల్ సెంచరీని పూర్తి చేసుకోగా, రోహిత్ శర్మ (102 బంతుల్లో 65; 7 ఫోర్లు, 2 సిక్సర్లు) రాణించాడు. లంక బౌలర్లలో సందకన్‌కు 4 వికెట్లు దక్కాయి. ప్రస్తుతం లంక మరో 405 పరుగులు వెనుకబడి ఉంది.

**కొనసాగిన జోరు...**

తొలి రోజు ఆటలో ప్రదర్శించిన దూకుడును భారత్ ఆదివారం కూడా కొనసాగించింది. ఆరంభంలో స్పిన్నర్లు వేసిన తొలి ఆరు ఓవర్లలో రోహిత్ రెండు ఫోర్లు, సిక్సర్‌తో ధాటిని ప్రదర్శించగా, ఆ తర్వాత పేస్ బౌలింగ్‌లో కోహ్లి జోరు మొదలైంది. లక్మల్, గమగే వేసిన తర్వాతి ఆరు ఓవర్లలో వీరిద్దరు 32 పరుగులు రాబట్టారు. 195 పరుగుల వద్ద పెరీరా ఓవర్లో కోహ్లి ఎల్బీడబ్ల్యూ అవుట్ కోసం శ్రీలంక రివ్యూ చేసింది. అయితే బంతి బ్యాట్‌కు తగిలిందని తేలడంతో విరాట్‌కు సమస్య రాలేదు. కొద్ది సేపటికే లక్మల్ బౌలింగ్‌లో డీప్ మిడ్‌వికెట్ దిశగా ఆడి రెండు పరుగులు తీసిన భారత కెప్టెన్... 238 బంతుల్లో డబుల్ సెంచరీని పూర్తి చేసుకున్నాడు. మరోవైపు పెరీరా బంతిని భారీ సిక్సర్ బాది రోహిత్ అర్ధసెంచరీని అందుకున్నాడు. అయితే సందకన్ ఓవర్లో రెండు ఫోర్లు కొట్టిన తర్వాత అదే ఓవర్లో రోహిత్ వెనుదిరగడంతో 135 పరుగుల ఐదో వికెట్ భాగస్వామ్యానికి తెర పడింది.

**కోహ్లి బ్యాడ్‌లక్...**

లంచ్ బ్రేక్ తర్వాత ఫోర్‌తో కోహ్లి టెస్టుల్లో తన అత్యధిక స్కోరు (235)ను అధిగమించాడు. అయితే ఇదే సమయంలో 'కాలుష్య విరామాలు' భారత జట్టు లయను దెబ్బ తీశాయి. మొదట గమగే బౌలింగ్‌లో అశ్విన్ (4) వెనుదిరగగా... ఆ తర్వాత మరో విరామంలో కోహ్లి తన వికెట్ ఇచ్చుకున్నాడు. సందకన్ బౌలింగ్‌లో లోపలికి దూసుకొచ్చిన బంతిని ఫ్లిక్ చేయడంలో విరాట్ విఫలమయ్యాడు. దాంతో బంతి ప్యాడ్లకు తగలడంతో అంపైర్ అవుట్‌గా నిర్ధారించారు. కోహ్లి రివ్యూ చేసినా లాభం లేకపోయింది. అప్పటి వరకు ఏమాత్రం శ్రమ లేకుండా అలవోకగా పరుగులు సాధిస్తున్న కోహ్లి సునాయాసంగా ట్రిపుల్ సెంచరీ సాధిస్తాడని అనిపించింది. అయితే దురదృష్టవశాత్తూ ఆ అవకాశం చేజారింది. మరికొద్ది సేపటికే లంక ఫీల్డింగ్ ఇబ్బందిని గమనించిన కోహ్లి... భారత ఇన్నింగ్స్‌ను డిక్లేర్ చేసేందుకు సిద్ధమైపోయాడు.

**తొలి బంతికే...**

కొండలాంటి స్కోరు ముందుండగా బరిలోకి దిగిన శ్రీలంకకు తొలి బంతికే షాక్ తగిలింది. షమీ వేసిన చక్కటి బంతికే కరుణరత్నే (0) కీపర్‌కు క్యాచ్ ఇచ్చాడు. కొద్దిసేపటికే ధనంజయ డి సిల్వా (1)ను ఇషాంత్ అవుట్ చేశాడు. అయితే సమరవిక్రమ స్థానంలో రెండో ఓపెనర్‌గా వచ్చిన దిల్‌రువాన్ పెరీరా (54 బంతుల్లో 42; 9 ఫోర్లు) కొన్ని చక్కటి షాట్లు ఆడాడు. పెరీరా 16 పరుగుల వద్ద ఉన్నప్పుడు లైఫ్ లభించింది. షమీ వేసిన బంతిని పెరీరా స్లిప్‌లోకి ఆడగా మొదటి స్లిప్‌లో పుజారాకు చక్కటి అవకాశం ఉండగా...రెండో స్లిప్ నుంచి పుజారాకు అడ్డంగా వచ్చిన ధావన్ దానిని పట్టుకోలేక వదిలేశాడు. బంతి మైదానంలో ఉన్న హెల్మెట్‌కు కూడా తగలడంతో లంకకు ఐదు పెనాల్టీ పరుగులు లభించాయి. ఆ వెంటనే ఇషాంత్ బౌలింగ్‌లో మాథ్యూస్ (6 పరుగుల వద్ద) ఇచ్చిన సునాయాస క్యాచ్‌ను స్లిప్‌లో కోహ్లి వదిలేయగా... ఇషాంత్ తర్వాతి ఓవర్లోనే మాథ్యూస్ మూడు బౌండరీలు బాది చిరునవ్వులు చిందించాడు! చివరకు పెరీరాను జడేజా ఎల్బీగా అవుట్ చేయడంతో 61 పరుగుల మూడో వికెట్ భాగస్వామ్యం ముగిసింది. ఆ తర్వాత అశ్విన్ ఓవర్లో వరుసగా రెండు సిక్సర్లు కొట్టి మాథ్యూస్ తన హాఫ్ సెంచరీని పూర్తి చేసుకున్నాడు. భారత బౌలర్లు ఎంతగా ప్రయత్నించినా మరో వికెట్ తీయలేకపోయారు.

**స్కోరు వివరాలు**

**భారత్ తొలి ఇన్నింగ్స్:** విజయ్ (సి) డిక్‌వెలా (బి) సందకన్ 155; ధావన్ (సి) లక్మల్ (బి) పెరీరా 23; పుజారా (సి) సమరవిక్రమ (బి) గమగే 23; కోహ్లి (ఎల్బీ) (బి) సందకన్ 243; రహానే (స్టంప్డ్) డిక్‌వెలా (బి) సందకన్ 1; రోహిత్ (సి) డిక్‌వెలా (బి) సందకన్ 65; అశ్విన్ (సి) పెరీరా (బి) గమగే 4; సాహా (నాటౌట్) 9; జడేజా (నాటౌట్) 5; ఎక్స్‌ట్రాలు 8; **మొత్తం (127.5 ఓవర్లలో 7 వికెట్లకు డిక్లేర్డ్) 536.**

**వికెట్ల పతనం:** 1–42; 2–78; 3–361; 4–365; 5–500; 6–519; 7–523.

**బౌలింగ్:** లక్మల్ 21.2–2–80–0; గమగే 25.3–7–95–2; పెరీరా 31.1–0–145–1; సందకన్ 33.5–1–167–4; డి సిల్వా 16–0–48–0.

**శ్రీలంక తొలి ఇన్నింగ్స్:** కరుణరత్నే (సి) సాహా (బి) షమీ 0; పెరీరా (ఎల్బీ) (బి) జడేజా 42; డి సిల్వా (ఎల్బీ) (బి) ఇషాంత్ 1; మాథ్యూస్ (బ్యాటింగ్) 57; చండిమాల్ (బ్యాటింగ్) 25; ఎక్స్‌ట్రాలు 6; **మొత్తం (44.3 ఓవర్లలో 3 వికెట్లకు) 131.**

**వికెట్ల పతనం:** 1–0; 2–14; 3–75.

**బౌలింగ్:** షమీ 11–3–30–1; ఇషాంత్ 10–4–44–1; జడేజా 14.3–6–24–1; అశ్విన్ 9–3–28–0.

**6** కోహ్లి కెరీర్‌లో ఇది ఆరో డబుల్ సెంచరీ. కెప్టెన్‌గా ఆరు డబుల్ సెంచరీలు నమోదు చేసిన తొలి ఆటగాడిగా అతను వెస్టిండీస్ దిగ్గజం బ్రియాన్ లారా (5 డబుల్ సెంచరీలు)ను అధిగమించాడు. భారత్ తరఫున అత్యధిక (6) డబుల్ సెంచరీలు సాధించిన సచిన్ టెండూల్కర్, వీరేంద్ర సెహ్వాగ్ రికార్డును కూడా కోహ్లి సమం చేశాడు.

**6** టెస్టుల్లో వరుసగా రెండు డబుల్ సెంచరీలు సాధించిన ఆరో ప్లేయర్‌గా కోహ్లి గుర్తింపు పొందాడు. గతంలో వాలీ హామండ్ (ఇంగ్లండ్; 1928, 1933లో) రెండుసార్లు ఈ ఘనత సాధించగా... డాన్ బ్రాడ్‌మన్ (ఆస్ట్రేలియా–1934లో), వినోద్ కాంబ్లీ (భారత్–1993లో), కుమార సంగక్కర (శ్రీలంక–2007లో), మైకేల్ క్లార్క్ (ఆస్ట్రేలియా–2012లో) ఒక్కోసారి ఇలా చేశారు.

**2** వినూ మన్కడ్ (1955) తర్వాత ఒకే సిరీస్‌లో రెండు డబుల్ సెంచరీలు చేసిన భారత బ్యాట్స్‌మన్‌గా కోహ్లి నిలిచాడు. విరాట్ వరుసగా రెండేళ్ల పాటు మూడేసి ద్విశతకాలు సాధించడం విశేషం.



## పొమ్మనలేక 'పొగ మంచు'...

రెండో రోజు ఆట... లంచ్ సమయానికి భారత్ స్కోరు సరిగ్గా 500 పరుగులకు చేరింది. 225 పరుగులతో ఆడుతున్న కోహ్లిని ఆపడం లంక తరం కావడం లేదు. విరామం తర్వాత మరింత వేగంగా పరుగులు, కోహ్లి 'ట్రిపుల్' కూడా ఖాయం అనిపించింది!

లంచ్ విరామం తర్వాత మైదానంలో చూస్తే క్రికెట్ చరిత్రలో ఎన్నడూ కనిపించని దృశ్యం ఒకటి అక్కడ సాక్షాత్కరించింది. పొగమంచుతో ఎదురవుతున్న తీవ్ర ఇబ్బంది నుంచి తప్పించుకునేందుకు అంటూ సగం మంది శ్రీలంక క్రికెటర్లు ముఖానికి మాస్క్‌లతో బరిలోకి దిగారు. అయితే అది అక్కడితో ఆగిపోలేదు. కొద్ది సేపటికే పేసర్ గమగే తనకు శ్వాస తీసుకోవడంలో ఇబ్బందిగా ఉందంటూ బౌలింగ్ ఆపేశాడు. చివరకు 17 నిమిషాల తర్వాత ఆట కొనసాగింది. తన తర్వాతి ఓవర్లో కూడా గమగే ఇలాగే బాధ పడి మైదానం వీడటంతో లక్మల్ ఆ ఓవర్ పూర్తి చేశాడు. అప్పటికే అంపైర్లతో శ్రీలంక ఆటగాళ్ల చర్చలు, వాదనలు కొనసాగుతూనే ఉన్నాయి. ఇదంతా కోహ్లిలో అసహనాన్ని పెంచింది. అతను ఆగ్రహంగా తన బ్యాట్ కూడా విసిరేశాడు! ఏకాగ్రత కోల్పోయిన కోహ్లి తర్వాతి ఓవర్లోనే అవుటయ్యాడు. అనంతరం లక్మల్ తన బౌలింగ్‌లో ఐదు బంతులు వేసి తన వల్ల కాదంటూ బయటకు వెళ్లిపోవడంతో పెరీరా ఓవర్ పూర్తి చేశాడు. ఈ సమయంలో భారత కోచ్ రవిశాస్త్రి, లంక మేనేజర్ గురుసిన్హా కూడా ఫీల్డ్‌లోకి వచ్చి అంపైర్లతో మాట్లాడారు. రిఫరీ డేవిడ్ బూన్ పెవిలియన్‌లో డాక్టర్ సలహా తీసుకోవడం కూడా కనిపించింది! మరో ఐదు బంతుల తర్వాత కూడా లంక మళ్లీ ఇదే సమస్యతో బ్రేక్ ఇచ్చింది. ఆ సమయంలో మైదానంలో లంక ఫీల్డర్లు 10 మందే ఉన్నారు. 'ఆరోగ్యవంతులైనవారు' సరిపడా లేరంటూ లంక తమ ట్రైనర్ నిక్ లీ, ఫీల్డింగ్ కోచ్ అబెయ్‌విక్రమకు కూడా టీమ్ జెర్సీలు వేయించి సిద్ధంగా నిలబెట్టింది! ఇదంతా కోహ్లిలో సహజంగానే ఆగ్రహాన్ని పెంచింది. లంక ఫీల్డింగ్ చేసే పరిస్థితిలో లేదన్నట్లుగా భావించిన అతను వెంటనే డ్రెస్సింగ్ రూమ్ నుంచి సైగ చేస్తూ మన బ్యాట్స్‌మెన్‌ను పిలిచి ఇన్నింగ్స్ డిక్లేర్ చేసేశాడు!

> మైదానంలో కాలుష్యం డ్రామా!
> భారత్ బలవంతపు డిక్లరేషన్

ఆ సమయంలో డిక్‌వెలా, సందకన్ నవ్వుతూ ప్రదర్శించిన హావభావాలు వారు ఇదంతా కావాలని చేసినట్లుగా అనిపించడంతో లంకపై తీవ్ర విమర్శలు వచ్చాయి. సెహ్వాగ్ అయితే 'తమ వైఫల్యంతో ముఖం చూపించలేక మాస్క్‌లు వేసుకున్నారని, వారి నటనకు ఆస్కార్ ఇవ్వవచ్చంటూ' వ్యాఖ్యలు చేశాడు. తొలి రోజు అంతా బాగానే ఉంది కదా అని, మైదానంలో 20 వేల మందికి లేని సమస్య లంక ఆటగాళ్లకేనా అంటూ, బ్యాటింగ్ చేసేందుకు మాస్క్‌లు లేకుండానే వచ్చారు కదా అంటూ అంతా విరుచుకుపడ్డారు. అయితే శ్రీలంక ఉద్దేశపూర్వకంగా ఇలా చేసిందని కూడా కచ్చితంగా చెప్పలేం. ఢిల్లీలో కాలుష్యం ప్రస్తుతం ప్రమాదకర స్థాయిలో ఉందనేది వాస్తవం. అక్కడే ఉండేవారు అలవాటు పడిపోవచ్చేమో గానీ బయటి నుంచి వచ్చిన వారికి సమస్య ఎదురవడం సహజం. పైగా శారీరక శ్రమతో కూడిన ఆటలో 'బ్రీతింగ్' సమస్య రావడం వారిని మరింత ఇబ్బంది పెట్టి ఉండవచ్చు. ఎయిర్ క్వాలిటీ ఇండెక్స్ ప్రకారం మ్యాచ్ జరుగుతున్న కోట్లా మైదానం పరిధిలో కూడా ప్రమాదకర స్థాయిలో కాలుష్యం ఉంది. లంక క్రికెటర్లు ధనంజయ, లక్మల్ వాంతి చేసుకున్న సంగతి రిఫరీ డేవిడ్ బూన్‌కు కూడా తెలుసు.

ఈ మ్యాచ్‌లో కోహ్లి ఒక దశలో వెన్ను నొప్పితో ఇబ్బంది పడ్డాడు. ఫిజియో వచ్చి మైదానంలో చికిత్స అందిస్తున్న సమయంలో భారత రిజర్వ్ బౌలర్ కుల్దీప్ యాదవ్ కూడా ముఖానికి మాస్క్‌తోనే రావడం గమనించాల్సిన విషయం. గత ఏడాది పొగ మంచుతో ఆటగాళ్లకు శ్వాస పరంగా ఇబ్బందులు ఎదురవుతున్నాయనే కారణంగానే ఢిల్లీలో బెంగాల్, గుజరాత్... హైదరాబాద్, త్రిపుర మ్యాచ్‌లను రద్దు చేశారు.

## మార్ష్ సెంచరీ: ఆసీస్ భారీ స్కోరు


షాన్ మార్ష్

**అడిలైడ్:** ప్రతిష్టాత్మక యాషెస్ సిరీస్ రెండో టెస్టులో అతిథ్య ఆస్ట్రేలియా జట్టు మెరుగైన స్థితిలో నిలిచింది. షాన్ మార్ష్ (126 నాటౌట్; 15 ఫోర్లు, ఒక సిక్స్) అద్భుత సెంచరీతో 442/8 వద్ద తొలి ఇన్నింగ్స్ డిక్లేర్ చేసిన ఆసీస్... అనంతరం ఇంగ్లండ్ ఓపెనర్ స్టోన్‌మన్ వికెట్ పడగొట్టి శుభారంభం చేసింది. 9.1 ఓవర్లో 29/1 స్కోరు వద్ద వర్షం ప్రారంభం కావడంతో రెండో రోజు ఆట నిలిచిపోయింది. ఆట ముగిసే సమయానికి కుక్ (11 బ్యాటింగ్), విన్స్ (0 బ్యాటింగ్) క్రీజులో ఉన్నారు. అంతకుముందు ఓవర్‌నైట్ స్కోరు 209/4తో రెండో రోజు ఇన్నింగ్స్ కొనసాగించిన ఆసీస్‌కు ఆదిలోనే ఎదురుదెబ్బ తగిలింది. తొలి ఓవర్ మూడో బంతికే హ్యాండ్స్‌కోంబ్ (36) అవుటయ్యాడు. అనంతరం పైన్ (57; 6 ఫోర్లు, ఒక సిక్స్)తో కలిసి షాన్ మార్ష్ ఇన్నింగ్స్‌ను ముందుకు నడిపించాడు. అర్ధసెంచరీ తర్వాత పైన్ అవుటైనా లోయర్ ఆర్డర్ సాయంతో మార్ష్ సెంచరీ పూర్తి చేసుకున్నాడు. చివర్లో కమిన్స్ (44; 7 ఫోర్లు) ఆకట్టుకున్నాడు. కమిన్స్ నిష్క్రమించిన కొద్దిసేపటికే కెప్టెన్ స్మిత్ ఇన్నింగ్స్ డిక్లేర్ చేశాడు.

## పోరాడుతున్న విండీస్

**రెండో ఇన్నింగ్స్‌లో 214/2**


బ్లండెల్

**వెల్లింగ్టన్:** ఇన్నింగ్స్ ఓటమి నుంచి తప్పించుకోవడానికి వెస్టిండీస్ పోరాడుతోంది. 386 పరుగులతో వెనుకబడి రెండో ఇన్నింగ్స్ ప్రారంభించిన వెస్టిండీస్ మూడో రోజు ఆట ముగిసే సమయానికి 66 ఓవర్లలో 2 వికెట్లకు 214 పరుగులు చేసింది. ఓపెనర్ క్రెయిగ్ బ్రాత్‌వైట్ (79 బ్యాటింగ్; 7 ఫోర్లు, ఒక సిక్స్), హోప్ (21 బ్యాటింగ్; 4 ఫోర్లు) క్రీజులో ఉన్నారు. అంతకుముందు ఓవర్‌నైట్ స్కోరు 447/9తో తొలి ఇన్నింగ్స్ కొనసాగించిన న్యూజిలాండ్ జట్టు 9 వికెట్లకు 520 పరుగుల వద్ద డిక్లేర్ చేసింది. తొలి టెస్ట్ ఆడుతున్న టామ్ బ్లండెల్ (107 నాటౌట్; 13 ఫోర్లు ఒక సిక్స్) సెంచరీ చేయడం విశేషం.

## బిహార్ 1007

**ఇన్నింగ్స్ 870 పరుగులతో అరుణాచల్ ప్రదేశ్‌పై విజయం**

**పట్నా:** విజయ్ మర్చంట్ ట్రోఫీ అండర్–16 టోర్నమెంట్‌లో బిహార్ జట్టు తొలి ఇన్నింగ్స్‌లో 1007 పరుగులు చేసింది. అరుణాచల్ ప్రదేశ్‌పై ఇన్నింగ్స్ 870 పరుగుల భారీ తేడాతో ఘన విజయాన్ని సాధించింది. 961/6 ఓవర్‌నైట్ స్కోరుతో మూడో రోజు ఆట కొనసాగించిన బిహార్ మరో 46 పరుగులు చేసి 159.1 ఓవర్లలో 1007/7 స్కోరు వద్ద ఇన్నింగ్స్‌ను డిక్లేర్ చేసింది. బిన్నీ (358; 36 ఫోర్లు) అవుట్ కాగానే ఇన్నింగ్స్‌ను ముగించింది. తర్వాత రెండో ఇన్నింగ్స్ ఆడిన అరుణాచల్ ప్రదేశ్ 54 పరుగులకే కుప్పకూలింది. ఆరుగురు బ్యాట్స్‌మెన్ డకౌట్ అయ్యారు. తొలి ఇన్నింగ్స్‌లో అరుణాచల్ ప్రదేశ్ 83 పరుగులకే ఆలౌటైంది.

## కెప్టెన్‌గా పృథ్వీ షా

**అండర్-19 ప్రపంచకప్‌కు భారత జట్టు ఎంపిక**
**జనవరి 13 నుంచి న్యూజిలాండ్‌లో మెగా టోర్నీ**



**న్యూఢిల్లీ:** ముంబై యువ సంచలనం పృథ్వీ షా యువ భారత జట్టుకు సారథ్యం వహించనున్నాడు. ఐసీసీ అండర్–19 ప్రపంచకప్‌లో పాల్గొనే భారత జట్టును ఆదివారం బీసీసీఐ జూనియర్ సెలక్షన్ కమిటీ ప్రకటించింది. వచ్చే ఏడాది జరిగే ఈ అండర్–19 టోర్నీకి న్యూజిలాండ్ ఆతిథ్యమివ్వనుంది. జనవరి 13 నుంచి ఫిబ్రవరి 3 వరకు మ్యాచ్‌లు జరుగుతాయి. అయితే ఈ టీమ్‌లో హైదరాబాద్, ఆంధ్రప్రదేశ్ ఆటగాళ్లెవరికీ చోటు దక్కకపోవడం గమనార్హం. క్రితంసారి ఈ మెగా టోర్నీలో రన్నరప్ అయిన భారత్ మూడు సార్లు (1988, 2002, 2010) విజేతగా నిలిచింది.

**భారత అండర్–19 జట్టు:** పృథ్వీ షా (కెప్టెన్), శుభ్‌మాన్ గిల్ (వైస్ కెప్టెన్), మన్‌జోత్ కల్రా, హిమాన్షు రాణా, అభిషేక్ శర్మ, రియాన్ పరాగ్, ఆర్యన్ జుయల్, హార్విక్ దేశాయ్ (వీళ్లిద్దరు వికెట్ కీపర్లు), శివమ్ మావి, కమలేశ్ నాగర్‌కోటి, ఇషాన్ పొరెల్, అర్ష్‌దీప్ సింగ్, అనుకూల్ రాయ్, శివా సింగ్, పంకజ్ యాదవ్. స్టాండ్‌బైలు: ఓం భోస్లే, రాహుల్ చహర్, నినద్ రథ్వా, ఉర్విల్ పటేల్, ఆదిత్య థాకరే.

## విజేత రుత్విక శివాని



**ముంబై:** టాటా ఓపెన్ ఇండియా ఇంటర్నేషనల్ చాలెంజ్ బ్యాడ్మింటన్ టోర్నమెంట్‌లో హైదరాబాద్ అమ్మాయి గద్దె రుత్విక శివాని విజేతగా నిలిచింది. ఆదివారం జరిగిన మహిళల సింగిల్స్ ఫైనల్లో ఎనిమిదో సీడ్ రుత్విక 21–12, 23–21తో రియా ముఖర్జీ (భారత్)పై గెలిచింది. పుల్లెల గోపీచంద్ అకాడమీలో శిక్షణ పొందుతున్న 20 ఏళ్ల రుత్విక రెండో గేమ్‌లో ఒకదశలో 17–20తో మూడు గేమ్ పాయింట్లను కాచుకుంది. ఆ తర్వాత వరుసగా మూడు పాయింట్లు గెలిచిన రుత్విక 20–20తో స్కోరును సమం చేసింది. అనంతరం ఇద్దరూ చెరో పాయింట్ గెలవడంతో స్కోరు 21–21తో సమమైంది. ఈ దశలో రుత్విక వరుసగా రెండు పాయింట్లు గెలిచి విజయాన్ని ఖాయం చేసుకుంది. టాటా ఓపెన్‌ను రుత్విక నెగ్గడం ఇది రెండోసారి. 2014లో తొలిసారి ఆమె ఈ టోర్నీలో విజేతగా నిలిచింది. మరోవైపు పురుషుల సింగిల్స్ ఫైనల్లో లక్ష్య సేన్ (భారత్) 21–15, 14–21, 19–21తో సితికామ్ థమాసిన్ (థాయ్‌లాండ్) చేతిలో ఓడిపోయి రన్నరప్‌గా నిలిచాడు.

## దీపికకు కాంస్యం



**బ్యాంకాక్:** ఇండోర్ ఆర్చరీ వరల్డ్ కప్ స్టేజ్–2 టోర్నమెంట్‌లో భారత ఆర్చర్ దీపిక కుమారి కాంస్య పతకాన్ని సాధించింది. ఆదివారం జరిగిన మహిళల రికర్వ్ వ్యక్తిగత విభాగం కాంస్య పతక పోరులో దీపిక 7–3తో సయానా సిరెమ్‌పిలోవా (రష్యా)పై గెలిచింది.

# వెంకన్న ఆలయంలో కార్తీక దీపకాంతులు

**సాక్షి, తిరుమల:** తమిళ కార్తీక పౌర్ణమి సందర్భంగా ఆదివారం తిరుమలలో కార్తీక దీపోత్సవాన్ని టీటీడీ వేడుకగా నిర్వహించింది. సంధ్యా సమయంలో 100 కొత్త మూకుళ్లలో నేతి వత్తులతో దీపాలు వెలిగించి ఆనంద నిలయంలో అర్చకులు ప్రదక్షిణ చేశారు. తర్వాత శ్రీవారికి హారతి సమర్పించారు. గర్భాలయంలోని అఖండం, కులశేఖరపడి, రాములవారి మేడ, ద్వారపాలకుల నుంచి మహద్వారం వరకు అన్ని ప్రాంతాల్లోనూ నేతి మూకుళ్లలో దీపాలు వెలిగించారు. ఆలయ నాలుగు మాడ వీధుల్లో ప్రదక్షిణ చేశారు. పుష్కరిణి, భూ వరాహస్వామి ఆలయం, ఆంజనేయస్వామి ఆలయం వద్ద నేతి దీపాలు వెలిగించారు. దీపకాంతుల్లో శ్రీవారి ఆలయం దేదీప్యమానంగా దర్శనమిచ్చింది. ఆలయం వెలుపల భక్తులు వేలాది దీపాలు వెలిగించి మొక్కులు చెల్లించుకున్నారు. కార్యక్రమంలో టీటీడీ ఈఓ అనిల్‌కుమార్ సింఘాల్, జేఈవో కేఎస్ శ్రీనివాసరాజు, సీవీఎస్‌వో రవికృష్ణ తదితరులు పాల్గొన్నారు.

**ఆలయానికి విద్యుత్ ధగధగలు**

తమిళ కార్తీక పౌర్ణమి సందర్భంగా ఆదివారం తిరుమల ఆలయానికి విద్యుత్ అలంకరణలు చేపట్టారు. ఆలయ మహద్వార గోపురం, ప్రాకారంతో పాటు ఆలయంలోని ధ్వజస్తంభం, వెండివాకిలి గోపురాన్ని సుందరంగా అలంకరించారు. విద్యుత్ అలంకరణలు భక్తులను విశేషంగా ఆకట్టుకున్నాయి.



కార్తీక దీపోత్సవాన్ని పురస్కరించుకుని ఆలయం వద్ద దీపాలతో ఊరేగింపుగా వెలుతున్న అర్చకులు

### ఎక్కువ లడ్డూలు అడగటం వల్లే
## ధరలు పెంచాం: జేఈవో

**సాక్షి, తిరుమల:** తిరుమలకు వచ్చే భక్తులు ఎక్కువ మోతాదులో లడ్డూలు కోరుతున్నారని.. అందుకే వాటిని మాత్రమే అధిక ధరలకు విక్రయించనున్నట్లు జేఈఓ శ్రీనివాసరాజు చెప్పారు. ఆదివారం సాయంత్రం ఆయన తిరుమలలో మీడియాతో మాట్లాడారు. రూ.100 ధరతో ఉన్న పెద్ద లడ్డూను రూ.200కి, రూ.25 ధరతో కూడిన వడను రూ.100కి, రూ.25 లడ్డూను రూ.50కి, ఆలయంలో ఉచితంగా అందజేసే ఉచిత లడ్డూను రూ.7 ధరతో సరఫరా చేయాలని నిర్ణయించినట్లు చెప్పారు. టీటీడీ నిర్వహిస్తున్న శ్రీనివాస కల్యాణాలతో పాటు ధార్మిక సంస్థలు నిర్వహించే కార్యక్రమాలకు మాత్రమే పరిమితి సంఖ్యలో లడ్డూలు, వడలు సరఫరా చేసేవారమని చెప్పారు. తిరుమల ఆలయ నాలుగు మాడ వీధుల్లో 1.8 లక్షల మందికి భక్తులు గ్యాలరీల్లో కూర్చుని వాహన సేవల్ని వీక్షించే అవకాశముందని జేఈఓ శ్రీనివాసరాజు వెల్లడించారు.

### ఫిరాయింపుదారులపై
## ఈసీ చర్యలు తీసుకోవాలి: జేపీ

**చిలకలూరిపేట:** పార్టీలు ఫిరాయించే ఎమ్మెల్యేలు, ఎంపీలపై చర్యలు తీసుకొనే అధికారం ఎన్నికల సంఘాని (ఈసీ)కి ఉండాలని లోక్‌సత్తా వ్యవస్థాపక అధ్యక్షుడు జయప్రకాశ్ నారాయణ అభిప్రాయపడ్డారు. సురాజ్య యాత్రలో భాగంగా ఆదివారం చిలకలూరిపేటకు వచ్చిన ఆయన విలేకరులతో మాట్లాడారు. స్పీకర్లుగా నియమితులయ్యేవారు కూడా ఏదో ఒక పార్టీకి చెందిన వారు కావడంతోనే ఫిరాయింపు చట్టాలు సక్రమంగా అమలు కావట్లేదన్నారు. రాజకీయ పంచాయితీల కారణంగా పోలవరం ప్రాజెక్టు నిలిచిపోయే పరిస్థితి ఏర్పడకూడదని తెలిపారు. నాణ్యమైన విద్య, అందరికీ మెరుగైన వైద్యం, యువతకు ఉద్యోగ, ఉపాధి అవకాశాలు, లాభసాటి వ్యవసాయం అందుబాటులోకి వచ్చినప్పుడే సురాజ్యం సాధ్యమవుతుందన్నారు.







# పోలవరానికి 7న వైఎస్సార్‌సీపీ బస్సుయాత్ర

- ప్రాజెక్టును సందర్శించనున్న పార్టీ ప్రజాప్రతినిధులు, సీనియర్ నేతలు
- హోదా తెస్తామంటే తక్షణం రాజీనామాలకు సిద్ధమన్న ఎంపీలు

**నెల్లూరు (సెంట్రల్):** రాష్ట్రానికి జీవనాడి అయిన పోలవరం ప్రాజెక్టు విషయంలో సీఎం చంద్రబాబు చేస్తున్న మోసాన్ని ప్రజలకు తెలియజేయడానికి వైఎస్సార్‌సీపీ ఈనెల 7న పోలవరానికి బస్సుయాత్ర చేపట్టింది. అమరావతిలోని పార్టీ రాష్ట్ర కార్యాలయం నుంచి ఆరోజు ఉదయం 10 గంటలకు బస్సు బయల్దేరుతుంది. పార్టీ అధినేత వైఎస్ జగన్‌మోహన్‌రెడ్డి ఆదేశాల మేరకు నెల్లూరు జిల్లా పార్టీ కార్యాలయంలో నేతలు ఈ విషయాన్ని వెల్లడించారు. ఎంపీలు, ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీలు, సీనియర్ నేతలు ప్రాజెక్టును సందర్శిస్తారని వివరించారు. కేంద్రాన్ని ఒప్పించి, రాష్ట్ర ప్రభుత్వం మెడలు వంచి పోలవరం పూర్తి చేయడానికి పార్టీ కార్యాచరణ రూపొందిస్తుందని తెలిపారు. కాగా, ఇదే విషయాన్ని పార్టీ కేంద్ర కార్యాలయం ఆదివారం ఓ ప్రకటనలో తెలిపింది.

**10వ తేదీ తర్వాత ఢిల్లీకి: ఎంపీ వైవీ సుబ్బారెడ్డి**

ప్రత్యేక హోదాను తాకట్టుపెట్టి.. ప్రత్యేక ప్యాకేజీకి ఒప్పుకొని పోలవరం పూర్తి చేస్తామన్న ముఖ్యమంత్రి చంద్రబాబు వ్యాఖ్యలు ఇప్పుడు ఏమయ్యాయని ఒంగోలు ఎంపీ, నెల్లూరు జిల్లా ఇన్‌చార్జ్ వైవీ సుబ్బారెడ్డి ప్రశ్నించారు. నెల్లూరులోని వైఎస్సార్ సీపీ జిల్లా కార్యాలయంలో జిల్లాలోని పార్టీ కార్యక్రమాలపై ఎంపీలు మేకపాటి రాజమోహన్‌రెడ్డి, వెలగపల్లి వరప్రసాదరావు, ఎమ్మెల్యేలు, నియోజకవర్గ సమన్వయకర్తలతో కలసి వైవీ సుబ్బారెడ్డి ఆదివారం సమావేశం నిర్వహించారు. అనంతరం విలేకరులతో మాట్లాడారు. 2018 కల్లా పోలవరం ప్రాజెక్ట్ పూర్తి చేస్తామన్న చంద్రబాబు ప్రజలకు సమాధానం చెప్పాలన్నారు. 10వ తేదీ తరువాత కేంద్రంపై ఒత్తిడి తెచ్చేందుకు ఢిల్లీకి వెళ్తామని తెలిపారు.



సమావేశంలో మాట్లాడుతున్న ఎంపీ వైవీ సుబ్బారెడ్డి. పక్కన ఎంపీలు మేకపాటి, వరప్రసాదరావు, ఎమ్మెల్యేలు కాకాణి, రామిరెడ్డి, కోటంరెడ్డి, కిలివేటి, అనిల్‌కుమార్, మాజీ ఎమ్మెల్యే మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి

**పోలవరంపై నుంచి దృష్టి మళ్లించడానికే: ఎంపీ మేకపాటి**

రాష్ట్రంలో చంద్రబాబు తీరును చూసి కేంద్ర ప్రభుత్వం పోలవరంపై తన వైఖరి ప్రకటించిందని, అది చంద్రబాబుకు చెంపపెట్టుగా ఉండటంతో దానిపై నుంచి ప్రజల దృష్టి మళ్లించడానికే కాపు రిజర్వేషన్ పల్లవి అందుకున్నారని నెల్లూరు ఎంపీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి అన్నారు. ఈ మూడున్నరేళ్లలో చంద్రబాబు చేసింది అబివృద్ధి కాదని, రూ.లక్షా 20 వేలకోట్లు అప్పులు మాత్రమేనని చెప్పారు. పోలవరం పూర్తిచేస్తామన్న చంద్రబాబు పురుషోత్తపట్నం ఎందుకు నిర్మిస్తున్నారని ప్రశ్నించారు.

**పోర్టును అడ్డుకున్న చంద్రబాబు: ఎంపీ వరప్రసాద్**

నెల్లూరు జిల్లాలో దుగరాజపట్నం పోర్టు నిర్మించకుండా చంద్రబాబు అడ్డుకుంటున్నారని తిరుపతి ఎంపీ వెలగపల్లి వరప్రసాదరావు ఆరోపించారు. గాలేరునగరి ప్రాజెక్ట్‌ను కూడా కావాలనే పూర్తి చేయడంలేదన్నారు. ఈ ప్రాజెక్ట్‌ను దివంగత ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖరరెడ్డి మొదలుపెట్టారనే కారణంతోనే ఈ విధంగా చేస్తున్నారని విమర్శించారు.

**హోదా తెస్తానంటే రాజీనామాలు చేస్తాం**

తమ ఎంపీ పదవులకు రాజీనామాలు చేస్తేనే రాష్ట్రానికి ప్రత్యేక హోదా వస్తుందని చంద్రబాబు భావిస్తే తక్షణమే రాజీనామాలు చేయడానికి సిద్ధంగా ఉన్నామని ఎంపీలు వైవీ సుబ్బారెడ్డి, మేకపాటి రాజమోహన్‌రెడ్డి, వెలగపల్లి వరప్రసాదరావు స్పష్టం చేశారు. ప్రజల సంక్షేమం కోసం పదవులు త్యాగం చేయడానికి వెనుకాడబోమన్నారు. సమావేశంలో వైఎస్సార్ సీపీ నెల్లూరు పార్లమెంటరీ జిల్లా అధ్యక్షుడు, సర్వేపల్లి ఎమ్మెల్యే కాకాణి గోవర్ధన్‌రెడ్డి, తిరుపతి పార్లమెంటరీ జిల్లా అధ్యక్షుడు, సూళ్లూరుపేట ఎమ్మెల్యే కిలివేటి సంజీవయ్య, ఎమ్మెల్యేలు పి.అనిల్‌కుమార్ యాదవ్, కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి, రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి, మాజీ ఎమ్మెల్యే మేకపాటి చంద్రశేఖర్‌రెడ్డి, గూడూరు నియోజకవర్గ సమన్వయకర్త మేరిగ మురళీధర్ పాల్గొన్నారు.

## శింగరకొండలో జస్టిస్ శివశంకర్ పూజలు



లక్ష్మీనరసింహస్వామి దేవాలయంలో ఆశీర్వాదం తీసుకుంటున్న హైకోర్టు జడ్జి

**శింగరకొండ (అద్దంకి రూరల్):** హైకోర్టు న్యాయమూర్తి, జిల్లా పోర్టు పోలియో జడ్జి జస్టిస్ బి.శివశంకర్ ఆదివారం ప్రకాశం జిల్లాలోని శింగరకొండ లక్ష్మీ నరసింహస్వామి ఆలయంలో ప్రత్యేక పూజలు చేశారు. ఆయన స్వామివారిని దర్శించుకుని, ప్రసన్నాంజనేయస్వామి ఆలయంలో పూజలు చేశారు. జస్టిస్‌కు అర్చకులు ఆశీర్వచనం చేసి తీర్థ, ప్రసాదాలు అందజేశారు. ఆయన వెంట మొదటి అదనపు జిల్లా జడ్జి ఆర్‌జే విశ్వనాథం, జిల్లా న్యాయసేవాధికార సంస్థ కార్యదర్శి రాజావెంకట్రాది, ఫ్యామిలీ కోర్టు జడ్జి రాజగోపాల్, సీనియర్ సివిల్ జడ్జి శరత్‌బాబు, అద్దంకి సీనియర్ సివిల్ జడ్జి సుజాత, అడిషనల్ జూనియర్ సివిల్ జడ్జి సురేశ్‌బాబు, బార్ అసోసియేషన్ అధ్యక్షుడు రామకృష్ణ, సెక్రటరీ శానం నాగేశ్వరరావు తదితరులు ఉన్నారు.

## కోయంబత్తూరులో 'అమ్మ'కు విగ్రహం



అన్నాదురై, ఎంజీఆర్, జయలలిత విగ్రహాలు

**సాక్షి, చెన్నై:** తమిళనాడు దివంగత ముఖ్యమంత్రి జయలలితకు కోయంబత్తూరులో ఆదివారం తొలి విగ్రహం ఏర్పాటైంది. ఈ విగ్రహాన్ని నగరాభివృద్ధి శాఖ మంత్రి ఎస్పీ వేలుమణి ఏర్పాటు చేయించారు. 'అమ్మ' మరణించి ఏడాది కావస్తున్నా, ఇంతవరకు అధికారికంగా ఎక్కడా ఆమెకు విగ్రహాలను ప్రభుత్వం ఏర్పాటు చేయలేదు. మెరీనా తీరంలో స్మారక మందిరం నిర్మాణం తర్వాత విగ్రహాలు ఏర్పాటు చేయాలని నిర్ణయించారు. ఆదివారం కోయంబత్తూరులో ఎంజీఆర్ శతజయంతి ఉత్సవాలు కోలాహలంగా జరిగాయి. ఇందుకోసం మంత్రి భారీ ఎత్తున ఏర్పాట్లు చేయించారు. కోయంబత్తూరు– అవినాశి మార్గంలో శనివారం సాయంత్రం వరకు దివంగత సీఎం అన్నాదురై విగ్రహం మాత్రమే అక్కడ ఉండగా, ఆదివారం ఉదయాన్నే అన్నాదురై విగ్రహం పక్కనే ఎంజీఆర్, జయలలిత నిలువెత్తు విగ్రహాలు ఏర్పాటు చేశారు. అలాగే ఆ పరిసర ప్రాంతాన్ని సుందరంగా తీర్చిదిద్దడంతో అక్కడి ప్రజలు ఆశ్చర్యం వ్యక్తం చేశారు. సాయంత్రం జరిగిన వేడుకలో ఈ నిలువెత్తు విగ్రహాన్ని ముఖ్యమంత్రి పళనిస్వామి ఆవిష్కరించారు. ఈ మూడు కాంస్య విగ్రహాలు ఒకే ఎత్తులో, ఒకే వర్ణంతో, ఒకే బరువుతో ఏర్పాటు చేయడం విశేషం. అయితే, నిబంధనల్ని ఉల్లంఘించి రాత్రికి రాత్రే ఇక్కడ విగ్రహం ఏర్పాటు వివాదానికి దారి తీసింది.

## మంజునాథ కమిషన్ నివేదికను బహిర్గతం చేయాలి

### ముదిరాజ్ సంఘం రాష్ట్ర అధ్యక్షుడు చప్పిడి కృష్ణమోహన్

**గాంధీనగర్ (విజయవాడ సెంట్రల్):** కాపులను బీసీల్లో చేరుస్తూ రాష్ట్ర ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం సరికాదని ముదిరాజ్ సంఘం రాష్ట్ర అధ్యక్షుడు చప్పిడి కృష్ణమోహన్ అన్నారు. మంజునాథ కమిషన్ నివేదికను బహిర్గతం చేయాలని డిమాండ్ చేశారు. విజయవాడ ప్రెస్‌క్లబ్‌లో ఆదివారం ఆయన విలేకరులతో మాట్లాడారు. కేవలం కాపులకు ఇచ్చిన హామీనే నెరవేర్చడం వెనుక స్వార్థ ప్రయోజనాలున్నాయన్నారు. ముదిరాజ్‌లను ఎస్టీ జాబితాలో చేర్చుతామని చంద్రబాబు ఇచ్చిన హామీ ఏమైందని ప్రశ్నించారు. తక్షణమే ముదిరాజ్ కార్పొరేషన్ ఏర్పాటు చేసి రూ.వెయ్యి కోట్లు కేటాయించాలన్నారు. కాపులను బీసీల్లో చేర్చడాన్ని వ్యతిరేకిస్తూ రాష్ట్ర వ్యాప్తంగా ఆందోళన చేపడతామన్నారు.




## ఫాతిమా విద్యార్థులకు ప్రభుత్వం మళ్లీ మోసం

### వెల్ఫేర్ పార్టీ ఆఫ్ ఇండియా మండిపాటు

**సాక్షి, అమరావతి:** ఫాతిమా వైద్య కళాశాలలో చేరి మోసపోయిన వంద మంది వైద్య విద్యార్థులను ప్రభుత్వం మళ్లీ మోసగించిందని వెల్ఫేర్ పార్టీ ఆఫ్ ఇండియా అధ్యక్షుడు షబ్బీర్ అహ్మద్ ఆదివారం ఓ ప్రకటనలో మండిపడ్డారు. వారిని ఢిల్లీకి పంపించామని చెప్పి అక్కడ ఏపీభవన్‌లో కూర్చోబెట్టడం వెనుక ఆంతర్యమేమిటని ప్రశ్నించారు. విద్యార్థుల కోచింగ్‌కు డబ్బులిస్తామని సీఎం చెప్పడం హాస్యాస్పదంగా ఉందన్నారు. లక్షలాది రూపాయలు యాజమాన్యానికి చెల్లించి వీధుల్లో తిరుగుతున్న విద్యార్థుల బాధలు సర్కారు పట్టించుకోకపోగా, ధర్నాలు తనకు కొత్తేమీ కాదంటూ సీఎం బెదిరించడం దారుణమన్నారు. కనీసం యాజమాన్యం నుంచి డబ్బులు తిరిగి ఇప్పించలేకపోవడం సర్కారు వైఫల్యం కాదా అని ప్రశ్నించారు. దీనిపై ప్రతిపక్ష నేత వైఎస్ జగన్‌మోహన్‌రెడ్డి కేంద్రానికి లేఖ రాయడాన్ని హర్షిస్తున్నామని, ఈ విషయంపై జనసేన అధ్యక్షుడు పవన్‌కల్యాణ్ ఎందుకు స్పందించడం లేదని ప్రశ్నించారు.

## విశ్వబ్రాహ్మణులు ఆర్థికంగా రాణించాలి

### ఏపీ విశ్వబ్రాహ్మణ కోఆపరేటివ్ కార్పొరేషన్ చైర్మన్ కనకాచారి

**సాక్షి, అమరావతి:** విశ్వబ్రాహ్మణులు ఆర్థికంగా రాణించాలని ఆంధ్రప్రదేశ్ విశ్వబ్రాహ్మణ కో ఆపరేటివ్ కార్పొరేషన్ చైర్మన్ సింహాద్రి కనకాచారి పిలుపునిచ్చారు. ఆదివారం విజయవాడలోని కామాక్షి విశ్వబ్రాహ్మణ కల్యాణ మండపంలో విశ్వబ్రాహ్మణ సంఘం రాష్ట్ర సమావేశం జరిగింది. దీనికి కనకాచార్యులు అధ్యక్షత వహించారు. ఆయన మాట్లాడుతూ రాజకీయ, ఆర్థిక, సామాజిక రంగాల్లో విశ్వబ్రాహ్మణులు ముందడుగు వేయాలన్నారు. రాష్ట్రంలో సుమారు 20 లక్షల మంది ఉన్న విశ్వబ్రాహ్మణులకు ఇప్పటివరకు పెద్ద గుర్తింపు లేదన్నారు.

## '10న బీసీ సంఘాల ఆధ్వర్యంలో రాష్ట్ర బంద్'

**సూర్యారావుపేట (విజయవాడ సెంట్రల్):** కాపులను బీసీ జాబితాలో చేరుస్తూ మంత్రివర్గం తీసుకున్న నిర్ణయానికి నిరసనగా బీసీ సంఘాల ఆధ్వర్యంలో రాష్ట్ర వ్యాప్తంగా ఈ నెల 6న ప్రభుత్వ దిష్టి బొమ్మ దహనం చేస్తామని, అలాగే 10న రాష్ట్ర బంద్ నిర్వహించనున్నట్లు ఆంధ్రప్రదేశ్ బీసీ సంఘం చైర్మన్ డేరంగుల ఉదయకిరణ్ తెలిపారు. ఈ మేరకు ఆదివారం ప్రకటన విడుదల చేశారు.

### కాపులను బీసీల్లో చేర్చడంపై
## న్యాయపోరాటం

**గాంధీనగర్ (విజయవాడ సెంట్రల్):** కాపులను బీసీల్లో చేరుస్తూ ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం వల్ల బీసీలకు తీవ్ర అన్యాయం జరుగుతుందని జాతీయ అత్యంత వెనుకబడిన తరగతుల కమిటీ నాయకులు ఊ.సాంబశివరావు అన్నారు. దీనిపై న్యాయపోరాటం చేస్తామని చెప్పారు. విజయవాడ గాంధీనగర్‌లోని ప్రెస్‌క్లబ్‌లో ఆదివారం ఆయన విలేకరులతో మాట్లాడారు. కాపులు అన్ని రంగాల్లో అభివృద్ధి చెందారని, కేవలం రాజకీయ లబ్ధి కోసమే చంద్రబాబు వారిని బీసీల్లో చేర్చారన్నారు. ఇప్పటికైనా బీసీ నేతలు మేలుకోవాలని, తెలంగాణ టీడీపీ ఎమ్మెల్యే ఆర్.కృష్ణయ్య వెంటనే తన పదవికి రాజీనామా చేయాలన్నారు. సమావేశంలో కమిటీ నాయకులు చక్రవర్తి, దేవళ్ల మల్లిఖార్జునరావు, చంద్రశేఖర్ తదితరులు పాల్గొన్నారు.

### 'వియర్డ్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్'
## బాధితులకు న్యాయం చేయండి

### ప్రధానికి బాధితుడు సురేష్ వినతి

**సాక్షి, న్యూఢిల్లీ:** భారీగా వడ్డీ ఆశ చూపి ఒంగోలులో 'వియర్డ్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ లిమిటెడ్' అనే సంస్థ పెద్ద మొత్తంలో ప్రజల నుంచి డబ్బు వసూలు చేసి బోర్డు తిప్పేసింది. దీంతో తామంతా మోసపోయామని సంస్థ తరఫున ఏజెంట్‌గా పనిచేసిన సురేష్ వాపోయాడు. ఈ మేరకు ఢిల్లీలో ఆదివారం ఆయన మీడియాతో మాట్లాడుతూ.. తమ సొమ్మును తిరిగి ఇప్పించాలని ప్రధాని మోదీకి విజ్ఞప్తి చేశారు. అలహాబాద్ కేంద్రంగా నడిచే సదరు సంస్థ రెండేళ్ల క్రితం అధిక వడ్డీల ఆశ చూపడంతో ఒంగోలు ప్రజలు పెద్ద మొత్తంలో డబ్బులు చెల్లించారని, అలాగే తాను ఏజెంటుగా మారి తన సొంత డబ్బు రూ.6 లక్షలతో పాటు ప్రజల నుంచి రూ.24 లక్షలు వసూలు చేసి సంస్థకు చెల్లించానని చెప్పారు.

### 6న రేష్మి ఠాకూర్‌కు మహానటి
## సావిత్రి సేవా పురస్కారం

**విజయవాడ కల్చరల్:** మిస్ ఇండియా 2016 రన్నరప్ ఉభయ తెలుగు రాష్ట్రాలకు చెందిన రేష్మి ఠాకూర్‌కు 2017 మహానటి సావిత్రి సేవా పురస్కార ప్రదానం చేస్తునట్లు సావిత్రి కళాపీఠం వ్యవస్థాపకురాలు పరుచూరి విజయలక్ష్మి, గౌరవ అధ్యక్షుడు ప్రభల శ్రీనివాస్ తెలిపారు. ఆదివారం సంస్థ కార్యాలయంలో విజయలక్ష్మి విలేకరులతో మాట్లాడుతూ 6న తుమ్మలపల్లి కళాక్షేత్రంలో పురస్కారం ప్రదానం చేస్తున్నామన్నారు. రేష్మిఠాకూర్ మిస్ ఏపీ 2014 గానూ 2016 మిస్ ఏసియా ఇంటర్ నేషనల్‌గానూ ఎన్నికయ్యారని, సేవల రంగలోనూ ఆమె ముందున్నారని తెలిపారు. ఆమె సేవలు గుర్తించి మహానటి సావిత్రి సేవా పురస్కారం ఇస్తున్నామన్నారు. గౌరవ అధ్యక్షుడు ప్రభల శ్రీనివాస్ మాట్లాడుతూ తెలుగు సినీ రంగంలోని మహనీయుల స్ఫూర్తితో వివిధ రంగాలకు చెందిన 82 మంది కళాకారులను సత్కరిస్తున్నామన్నారు.




Published and Printed by K.Ramachandra Murthy, Editorial Director on behalf of Jagati Publications Limited, Published at Jagati Publications Limited, Survey No. 310, Tadigotla Village, Chintakommadinne Mandal, YSR Kadapa District. 516 003 and Printed at Jagati Publications Limited, Survey No. 310, Tadigotla Village, Chintakommadinne Mandal, YSR Kadapa District. 516 003 EDITOR: V. Murali, Phone No. 08562-200076, 77 RNI Regn No. APTEL/2008/23796.

సాక్షి
ఫ్యామిలీ
వైఎస్‌ఆర్ జిల్లా
సోమవారం, 4-12-2017



## గుండె కోసే మిస్ వరల్డ్

**బా**లీవుడ్ జీవులు ఎప్పుడూ పెద్ద వలను పట్టుకొని ఉంటారు... ఎవరు దొరుకుతారా పట్టేద్దామా అని. మిస్ యూనివర్స్, మిస్ వరల్డ్ పోటీల మీద వాళ్లు రెండు, నాలుగు, లేదంటే ఎన్ని వీలైతే అన్ని కళ్లు వేసి ఉంటారు. అక్కడ ఎవరైనా మన ఇండియన్స్ మెరిస్తే సిల్వర్ స్క్రీన్ మీద గోల్డెన్ కెరీర్ ఆఫర్ చేస్తుంటారు. గతంలో ఐశ్వర్యారాయ్, సుస్మితా సేన్, ప్రియాంకా చోప్రాలను అలాగే వాళ్లు వలేసి పట్టారు. ఇప్పుడు తాజాగా మిస్ వరల్డ్ మానుషి చిల్లర్ కోసం నెట్ రెడీ చేస్తుంటే ఆమె మాత్రం 'ఆ..ఆ... ఆగండాగండి' అని చేయి అడ్డం చూపుతోంది. అద్భుతమైన అందం మానుషి సొంతం. ఆ చిర్నవ్వుకే కొన్ని కోట్ల మంది అలా పడి ఉండే అవకాశం ఉంది. బాలీవుడ్‌లో లెగ్ పెడితే ఇండస్ట్రీ షేక్ అవడం ఖాయం. కాని ఆమె మాత్రం 'ముందు నా మెడిసిన్ పూర్తి చేయనివ్వండి' అంటోంది. మానుషి కుటుంబం ఉండటం ఢిల్లీలోనే అయినా తను మాత్రం హర్యానాలోని సోనెపట్‌లో మెడిసిన్ చేస్తోంది. కార్డియాలజిస్ట్ కావడం అనేది తన కల. అంటే ఆమెను చూసి ఎంత మంది తమ గుండెను లయ తప్పించుకుంటారో అంతమంది ఆమె చేయి తగిలి గుండెను సెట్‌రైట్ చేయించుకుంటారన్న మాట. మిస్ వరల్డ్ అయితే నా సేవా కార్యక్రమాల ద్వారా ప్రజలకు మేలు చేస్తాను. డాక్టర్‌గా ఉండి నా వైద్యంతో మేలు చేస్తాను అంటోంది మానుషి చిల్లర్. ఈ మాటలు ఎన్నిరోజులలో చూడాలి. ఏ కరణ్ జోహారో, ఏ రణ్‌వీర్ సింగో పెద్ద ఆఫర్, మంచి రోల్ ఆఫర్ చేసి ఆమెను లాగకుండా ఉంటారా అనేది మిలియన్ డాలర్ల క్వశ్చన్. ఏమో... మన సురేశ్‌బాబు భారీ అడ్వాన్స్ ఇచ్చి వెంకటేశ్ పక్కన బుక్ చేయవచ్చు కూడా. కత్రీనా కైఫ్‌ను బుక్ చేయలేదూ?

## ఎర్నాకుళం అమ్మ

**ఒ**క సినిమా నటికి మేకప్‌కు మించిన కవచం ఉండదు. జీవితంలో ఎన్ని అప్ అండ్ డౌన్స్ వచ్చినా, ఎన్ని కష్టసుఖాలు చూసినా, ఎన్ని ట్విస్ట్‌ల గుండా జర్నీ సాగినా ఫైనల్లీ మళ్లీ కొత్త జీవితం సాగించాలంటే మేకప్‌కు మించిన ఆయుధమూ ఉండదు. లిజీ గుర్తుందా? ఎయిటీస్‌లో స్క్రీన్ మీద ఒక వెలుగు వెలిగిన టాప్ స్టార్. 'మగాడు'లో రాజశేఖర్ పక్కన, '21వ శతాబ్దం'లో సుమన్ పక్కన చాలా హిట్స్ కొట్టింది. తమిళ, తెలుగు, మలయాళ భాషల్లో ఎన్నో సినిమాలు చేసిన లిజీ దర్శకుడు ప్రియదర్శన్‌ను వివాహం చేసుకుని సినిమాలకు గుడ్‌బై కొట్టింది. 24 ఏళ్ల పాటు కాపురం చేశాక ఇటీవలే విడాకులు తీసుకుంది. కూతురు లావణ్య హీరోయిన్‌గా అఖిల్ నటిస్తున్న 'హలో'లో తన అదృష్టాన్ని పరీక్షించుకోనుంది. కొడుకు అమెరికాలో చదువుకుంటున్నాడు. చెన్నైలో స్థిరపడ్డ లిజీ మళ్లీ కొత్త జీవితం కోసం ముఖానికి మేకప్ వేసుకుంది. అదీ మన తెలుగు సినిమాతోనే. పవన్ కల్యాణ్, త్రివిక్రమ్ నిర్మాతలుగా వ్యవహరిస్తున్న నితిన్ సినిమాలో లిజీ హీరోయిన్‌కు తల్లిగా నటిస్తోంది. 'న్యూయార్క్‌లో మొదటిసారిగా ఈ షూట్‌లో పాల్గొన్నాను. చాలా నెర్వస్‌గా అనిపించింది. ఆ తర్వాత మామూలైపోయింది. నాది ఈ సినిమాలో మంచి పాత్ర' అని లిజీ అంది. అమ్మ పాత్రలు చేసేవాళ్లు రొటీన్ అయినప్పుడల్లా కొత్త అమ్మను ఇండస్ట్రీ పుట్టిస్తుంటుంది. ఈ కొత్త అమ్మతో మరికొన్ని మంచి పాత్రలు మెరుస్తాయని ఆశిద్దాం.



## నాన్ యార్ తెరియమా

**'నా**న్ యార్ తెరియమా' అంటే 'నేనెవరో తెలుసా?' అని అర్థం. తమిళ సినిమాల్లో హీరోలు యూజ్‌వల్‌గా ఇలాంటి డైలాగ్‌తోనే ఎంట్రీ కొడుతుంటారు. ఇప్పుడు సన్నీ లియోన్ కూడా తమిళంలో ఇలాంటి డైలాగ్‌తోనే ఎంట్రీ కొట్టబోతోంది. తాజా వార్త ఏమిటంటే సన్నీ లియోన్ ఫస్ట్ టైమ్ ఒక తమిళ–మలయాళ సినిమాలో లీడ్ రోల్ చేయడానికి అంగీకరించింది అని. ఇటీవలే 'యాహూ సెర్చ్'లో సన్నీ లియోన్ నంబర్ వన్‌గా నిలిచింది. అంటే అనుష్క శర్మ, ఆలియా భట్... ఇటువంటి వాళ్లను కాదని నెట్ జీవులు సన్నీ లియోన్‌నే ఎక్కువ సెర్చ్ చేస్తున్నారన్న మాట. సన్నీ ట్రాక్ రికార్డ్‌ను బట్టి ఈ రికార్డ్ ఇప్పుడప్పుడే తుడిచిపెట్టుకుపోయేలా లేదు. మన తెలుగులో 'గరుడవేగ'లో 'డియ్యో డియ్యో డిసక డిసక' అని ఒక ఊపు ఊపిన సన్నీ అందరి కళ్లు తన మీద పడేలా చేసుకుంది. ఇప్పుడు తమిళ, మలయాళం మాస్‌ను కూడా ఎట్రాక్ట్ చేసిందంటే సౌత్‌కు మరో నమిత దొరికేసినట్టే. వాంగో సన్నీ లియోన్.



సమర్పణ: నూరు దడవై

## మేని మెరుపు కోసం...



క్యారట్‌లో ఉండే ఎ విటమిన్ చర్మానికి కూడా మేలు చేస్తుంది. క్యారట్ తింటే కంటికి, ప్యాక్ వేసుకుంటే ఒంటికి మేలు చేస్తుంది. క్యారట్ గుజ్జు రాసుకుంటే ముఖం కాంతివంతమవుతుంది. చర్మం ఆరోగ్యంగా ఉండాలంటే క్యారట్ జ్యూస్‌లో శనగపిండి కలిపి ముఖానికి, మెడకు, చేతులకు పట్టించి మసాజ్ చేయాలి.




*చివురిస్తున్న బేబీ హల్దార్ కొత్త జీవితం! అక్షరాలతో రంగు నింపుకుంటోంది. ఆ ఆలోచనల జీవం పోసిన మాస్టారు, ప్రొఫెసర్ ప్రబోధ్‌కుమార్‌తో కథాచర్చలో బేబీ హల్దార్.*

# కథ చెప్పిన విజేత

''ఎ లైఫ్ లెస్ ఆర్డినరీ'' పుస్తకాన్ని బేబీ హల్దార్ చేతిలో పెట్టి.. ''ఆటోగ్రాఫ్'' ప్లీజ్ అన్నాడు ప్రొఫెసర్ ప్రబోధ్ కుమార్. సిగ్గుపడుతూ.. ఆ పుస్తకం మొదటి పేజీలో సంతకం చేసిచ్చింది బేబీ హల్దార్. ఆమె ఆ ప్రొఫెసర్ ఇంట్లో పనిమనిషి. ఆ ప్రొఫెసర్.. మున్షీ ప్రేమ్‌చంద్ మనవడు! తన సంరక్షకురాలిగా వచ్చిన బేబీ హల్దార్ .. ఈ రోజు రచయిత కావడానికి ప్రోత్సాహం అందించిన మనిషి! ఆ కథే.. బేబీ హల్దార్ బయోగ్రఫీ..ఎ లైఫ్ లెస్ ఆర్డినరీ!!

**కశ్మీర్ నుంచి దుర్గాపూర్ వయా ముర్షిదాబాద్**

బేబీ పుట్టింది కశ్మీర్‌లో. గుండ్రటి మొహం, సొట్ట బుగ్గలతో పొత్తిళ్లలో హాయిగా నిద్రపోతున్న ఆ పాపాయిని చూసుకుని ''చందమామా'' అంటూ మురిసిపోయింది బేబీ తల్లి. సారా కంపు గప్పున కొట్టడంతో ఆ సంబరం క్షణంలో విషాదం అయింది. ఆ తాగుబోతు బేబీ తండ్రి. ఆయనొక ఎక్స్ సర్వీస్‌మన్. ఆర్మీలోంచి బయటకు వచ్చాక డ్రైవర్‌గా స్థిరపడ్డాడు. అప్పుడే తాగుడికి బానిసయ్యాడు. పని చేసి డబ్బులు తేవడం కంటే తాగొచ్చి భార్యను కొట్టడమే పనిగా పెట్టుకున్నాడు. పెళ్లయి, బిడ్డ పుట్టిన నాలుగేళ్ల వరకూ ఆ తల్లి భరించింది భర్తను. ఆపై వల్లకాక ఆ చంటిపిల్లను తండ్రి దగ్గరే ముర్షిదాబాద్‌లో వదిలేసి ఆమె వెళ్లిపోయింది. అతను ఊరుకోలేదు. పిల్లను సాకాలనే వంకతో రెండో పెళ్లి చేసుకున్నాడు. భర్త తాగుడుకు ఆమె విసిగిపోయి కోపమంతా బేబీ మీద తీసేది. అలా సవతి తల్లి చెడ్డది అన్న పేరును ఆమే మోసింది. చిన్నప్పటి నుంచి బేబీకి చదువంటే ఇష్టం. కాని ఆరు వరకే చదివించి మానిపించారు పెద్దవాళ్లు. ఇంటి పనుల్లో సవతి తల్లికి సాయపడుతూ.. సమయం దొరికినప్పుడు స్నేహితులతో ఆడుకుంటూ కాలంగడిపింది బేబీ. చదువు తర్వాత బేబీకి ఇష్టమైన వ్యాపకం.. ఆటలు! లేడిలా పరిగెత్తుతుంది. జంపింగ్‌లోనూ అదే మెరుపు వేగం చూపిస్తుంది. ఆ నైపుణ్యాన్ని ఎవరూ కనిపెట్టలేదు కాని పన్నెండేళ్లకు ఈడొచ్చిందని పెళ్లి చేసి అత్తారిల్లయిన దుర్గాపూర్ పంపారు.

**కల కోసం...**

అత్తారింట్లో పని పెద్ద భారమనిపించలేదు బేబీకి. కాపురమే కష్టం అనిపించింది. చాలా సార్లు చదువు.. ఆటలు గుర్తొకొచ్చి ఏడిచేది. యేడిదికల్లా కొత్త బాధ్యత పుట్టింది ఆమెకు బిడ్డ రూపంలో. ఆ తర్వాత మూడేళ్లలో మరో ఇద్దరు బిడ్డలతో పదహారేళ్లకే ముగ్గురు పిల్లల తల్లి అయింది. తన తల్లికి ఎదురైన హింసే బేబీకీ ఎదురైంది భర్త దగ్గర్నుంచి. తాగొచ్చి కొట్టేవాడు. అతని సంపాదన అతనికే సరిపోయేది కాదు. దాంతో బేబీ ఇళ్లల్లో పనిచేసి ఆర్థికభారాన్నీ మోసింది. ఆమెకు ఒకటే కల.. తన పిల్లలు చదువుకోవాలని. రోజురోజుకి పెరుగుతున్న భర్త హింస.. తమను బతకనివ్వదని తెలిసి ఒక రోజు ఢిల్లీ రైలెక్కింది పిల్లలను (సుబోధ్, తపస్, ప్రియ)తీసుకొని. అప్పటికి ఆమె వయసు పాతికేళ్లు!

**పనిమనిషి..**

ఢిల్లీలో మధ్యతరగతి, ఎగువ మధ్యతరగతి ఇళ్లల్లో పని వెదుక్కుంది. ఇంటి యజమానుల ఆగడాలను భరించింది. ఆ తర్వాత గుర్‌గావ్‌లోని ఓ ఇంట్లో రోజంతా ఉండిపోయే పనిమనిషి కావాలని పొరుగింటామె చెప్పింది బేబీకి. ఒక్క ఇల్లే చూసుకుంటే తన ఇల్లు గడుస్తుందా? సందేహాన్నే బయటపెట్టింది బేబీ. ''ఉన్నవాళ్లే. జీతం బాగానే ఉంటుంది. అవుట్‌హౌజ్‌లో ఉండొచ్చట'' చెప్పింది పక్కింటామె. మరో ఆలోచన చేయకుండా గుర్‌గావ్ వెళ్లింది బేబీ. ఆ ప్రొఫెసరే ప్రబోధ్ కుమార్. ఆమె జీవితం ఊహించని మలుపు తిరిగింది అక్కడే.

**దిద్దుకున్న బాట..**

ఎప్పటిలాగే ఆ రోజూ పుస్తకాల అల్మారాలు దులిపే పనిపెట్టుకుంది బేబీ. ఆ పని అంటే ఆమెకు చాలా ఇష్టం. దులిపే పేరుతో నచ్చిన పుస్తకాలను వచ్చీరాని చదువుతో అర్థంచేసుకునే ప్రయత్నం చేస్తుంది. అసలు ప్రొఫెసర్ ఇంటికి వచ్చాక ఆమె సంతోషంగా ఉండడానికి కారణం.. ఆ పుస్తకాలే! స్టూల్ ఎక్కి కిందటి వారం చదవాలనుకున్న పుస్తకం తీసి పేజీలు తిప్పు తోంది.. ఓ చేతిలో దుమ్ముతుడిచే గుడ్డను పట్టుకొని. ఏదో పనిమీద అటుగా వెళ్తున్న ప్రొఫెసర్ కంట్లో పడిందా దృశ్యం. ఆశ్చర్యపోయాడు. ''బేబీ.. నీకు చదువొచ్చా?'' అడిగాడు అదే ఆశ్చర్యంతో. ఆ మాట వినపడనంత ఏకాగ్రత ఆమెకు ఆ పుస్తకంలో. దగ్గరకు వచ్చి స్టూల్‌ను కదిపాడు ప్రొఫెసర్. ఒక్కసారిగా ఈ లోకంలోకి వచ్చిపడింది బేబీ. ''మాస్టారూ'' అంటూ కంగారు, భయం కలగలిసిన భావంతో పుస్తకం అల్మారాలో పెట్టేసి చటుక్కున స్టూల్ దిగింది.

ఆప్యాయంగా తల మీద చేయి వేసి.. ''నీకు చదువొచ్చా...'' అని అడిగాడు.

''ఆరు వరకే చదివాను మాస్టారూ.. కాని ఇష్టం'' చెప్పింది బేబీ.

ఓ పెన్ను, నోట్ బుక్ ఇచ్చి ఆమె జీవిత కథను రాయమని చెప్పాడు ప్రబోధ్ కుమార్. 20 ఏళ్ల తర్వాత పెన్ను, బుక్ పట్టుకున్న ఆమె చేతులు వణకడం మొదలుపెట్టాయి. ధైర్యం చెప్పాడు ప్రొఫెసర్. తొలుత చాలా తప్పులు రాసింది. తన పేరు స్పెల్లింగ్‌తో సహా! సరిదిద్దాడు ప్రబోధ్. నోట్‌బుక్ మార్జిన్ నుంచి ప్రారంభమైన ఆమె రాతను కరెక్ట్ చేశాడు ఆయన. అలా ఆమె రాసినదాన్ని రోజూ చూసేవాడు, పొరపాట్లు దిద్దేవాడు. అంతేకాదు బెంగాలీ(ఆమె బెంగాలీ), ఇంగ్లిష్ పుస్తకాలను ఇచ్చేవాడు చదవమని. ఫలితంగా.. వచ్చిందే ''ఎ లైఫ్ లెస్ ఆర్డినరీ''! బేబీని ప్రొఫెసర్ రాయమని చెప్పిన ఆమె జీవితకథ! మార్కెట్లో సంచలనం సృష్టించింది. ''ఇది బేబీ జీవితమే కాదు.. మన దేశంలోని చాలామంది ఒంటరి స్త్రీల, ఒంటరి తల్లుల కథ.. ఎందరో పనిమనుషుల వ్యథ.. మన సమాజంలో స్త్రీల మీద సాగుతున్న జులూమ్‌కు అద్దంపట్టిన రచన'' అంటూ బేబీ రాసిన పుస్తకం మీద సమీక్షలు వచ్చాయి. ''ఒంటరి ప్రయాణం చాలా కష్టం. ముఖ్యంగా నాలాంటి మహిళలకు. ఊరొదిలి వెళ్లిపోతున్నప్పుడు చాలామంది చాలా మాటలన్నారు నన్ను. అవేవీ వినిపించుకోలేదు. నా పిల్లలకు చదువు చెప్పించాలి, వాళ్లకు మంచి భవిష్యత్తునివ్వాలనే ఆశ తప్ప నాకింకే ఆలోచనా లేకుండింది. నా పుస్తకం చదివిన ఒకావిడ.. ''నా కథ కూడా నీలాంటి కథే '' అని ఫోన్ చేసి చెప్పినప్పుడు ముందు ఏడుపొచ్చింది. తర్వాత సంతోషమనిపించింది. మన దేశంలో నాలా ఇల్లు వదిలివెళ్లిన ఆడవాళ్లు చాలామంది ఉన్నారు. కాని వాళ్లందరికీ నాకు దొరికిన సపోర్ట్ దొరక్కపోయుండొచ్చు. నాలా మాట్లాడలేకపోవచ్చు. అలాంటి వాళ్లందరికీ నేను, నా పుస్తకం స్ఫూర్తినివ్వగలిగితే.. వాళ్లలో కొంతైనా ఆత్మవిశ్వాసాన్ని నింపగలిగితే నా జన్మ ధన్యమైనట్టే!'' అంటుంది 44 ఏళ్ల బేబీ హల్దార్. ఆమె ప్రయాణం ఆగలేదు. రెండో పుస్తకం మొదలుపెట్టింది. రాయడాన్ని కొనసాగించాలని కోరుకుంటోంది.

''ఎ లైఫ్ లెస్ ఆర్డినరీ'ని ప్రముఖ బాలీవుడ్ ఫిల్మ్‌మేకర్ ప్రకాష్ ఝా సినిమా తీయనున్నట్టు, ఈ పుస్తకాన్ని ఒరియా, తమిళ్, తెలుగులో అనువదించనున్నట్టూ వార్తలు వినిపిస్తున్నాయి.

– శరాది

### తాత.. మనవడు

మున్షీ ప్రేమ్‌చంద్.. ఆధునిక హిందీ, ఉర్దూ సాహిత్య కృషీవలుడు. సేవాసదన్, వర్‌దాన్, రంగ్‌భూమి, నిర్మల, ప్రేమాశ్రం, గబన్, కర్మభూమి ఆయన రచనల్లో కొన్ని మాత్రమే. మున్షీ అనేది సాహిత్యప్రియులు ఆయనకు గౌరవంగా ఇచ్చిన బిరుదు! మున్షీ ప్రేమ్‌చంద్ సాహిత్యం ద్వారా సమాజానికి సేవ చేస్తే ఆయన మనవడు ప్రొఫెసర్ ప్రబోధ్‌కుమార్ తనింట్లో పనిమనిషిని రచయిత్రిగా నిలిపి తాత స్ఫూర్తిని చాటాడు.



తన పుస్తకాలతో బేబీ హల్దార్

### చెట్టు నీడ

## మనసులో వేసుకోండి



**ఒ**క రైతు విత్తనాలు చల్లాడు. చల్లుతున్నప్పుడు చెల్లాచెదురై దారి పక్కన పడిన విత్తనాలను పక్షులొచ్చి తినేశాయి. రాతి నేలపై పడిన విత్తనాలు మొలకెత్తినప్పటికీ వాటి వేళ్లకు తేమ అందక చనిపోయాయి. ముళ్ల పొదల్లో పడిన విత్తనాలు మొక్కలయ్యాయి కానీ, పొదలు కప్పివేయడంతో సూర్యరశ్మి అందక అవీ అంతరించాయి. సారవంతమైన నేలలో పడిన విత్తనాలు మాత్రమే ఏపుగా ఎదిగి, మంచి దిగుబడిని ఇచ్చాయి. ఈ కథ బైబిలులోనిది. మంచిమాటను విత్తనంతో, మానవ వివేకాన్ని సారవంతమైన నేలతో పోల్చారు జీసస్ క్రైస్ట్. ఒక మంచి మాట మన మనసులో పడి, దాని ఫలాలు మన ద్వారా సమాజానికి అందాలంటే అనేక అడ్డంకులు ఉంటాయి. బయటి అడ్డంకులు కొన్ని, లోపలి అడ్డంకులు కొన్ని. బయటి అడ్డంకులు.. మనలోని విత్తనాలను తినేసే పక్షులు. లోపలి అడ్డంకులు.. మనలోనే మనకు ఎదురు తిరిగే శక్తులు. అశ్రద్ధ, అలక్ష్యం, అవివేకం, సోమరితనం, అసహనం, తొందరపాటు.. ఇవీ ఆ శక్తులు. బయటి శక్తుల్ని, లోపలి శక్తుల్ని ఎదుర్కొని, మనం వినిన, మనం చూసిన మంచిని మనసుకు ఎక్కించుకుంటే.. సారవంతమైన భూమిలో పడి సమృద్ధిగా పండిన పంటలా.. మన ఆలోచనలు పుష్పిస్తాయి. ఫలిస్తాయి. మానవ జీవితాన్ని సుఖశాంతులతో సుభిక్షం చేస్తాయి. రేపు 'వరల్డ్ సాయిల్ డే'. నేల తల్లి దినోత్సవం. మంచి ఆలోచనలకు మనమొక సారవంతమైన నేలగా మారాలని తీర్మానించుకోడానికి ఇదొక మంచి సందర్భం.

### ఇంటిప్స్



- కీర దోస, బీర కాయలు కొన్ని చేదుగా ఉంటాయి. చెక్కు తీసే ముందే వాటిని మధ్యలోకి విరిస్తే చేదుబారవు.
- తేనె స్వచ్ఛత తెలియాలంటే, ఒక కప్పు నీటిలో ఒక స్పూన్ తేనె వేయాలి. నీటిలో కరగకుండా అడుగుకు చేరితే అది మంచి తేనె.
- ఉప్పు నీటికోసం నీళ్లు మరిగిన తర్వాత ఉప్పు కలపాలి. ముందే ఉప్పు వేస్తే మరగడానికి ఎక్కువ సమయం పడుతుంది.
- వెల్లుల్లి పొట్టు త్వరగా రావాలంటే నీటిలో నానబెట్టాలి.
- అప్పడాలను పాలిథిన్ కవర్‌లో పెట్టి పప్పులు, బియ్యం డబ్బాలో పెడితే విరిగి పోకుండా ఉంటాయి.
- కూరల్లో ఉప్పు ఎక్కువైతే కొబ్బరి పొడి లేదా గసాల పొడి చల్లాలి. అలాగే కొబ్బరి ముక్కలను కూరలో వేసి పదిహేను నిమిషాల తర్వాత తీసివేయాలి. ఎక్కువైన ఉప్పుని కొబ్బరి ముక్క పీల్చుకుంటుంది.

## లవ్ డాక్టర్ — నన్నడగొద్దు ప్లీజ్


ప్రియదర్శిని రామ్
లవ్ డాక్టర్

హాయ్ భయ్యా! నేను డిగ్రీ పూర్తి చేశాను. గ్రూప్స్‌కి చదువుతున్నా. తన పేరు ఆర్. నా చిన్నప్పటి క్లాస్ మేట్. బిటెక్ చేసి జాబ్ చేస్తోంది. మంచి అమ్మాయి. అందరితో ఫ్రీగా మాట్లాడుతుంది. కానీ వాళ్ల ఇంట్లో వాళ్లకి మాత్రం తనంటే ఇష్టం ఉండదు. తను ఏం చేసినా తిడతారు. ఇప్పుడు పెళ్లి చేసి పంపేద్దాం అనుకుంటున్నారు. అయితే లవ్ ప్రపోజ్ చేసినప్పుడే ‘‘నేను నిన్ను పెళ్లి చేసుకుంటా’’ అని చెప్పా. ఒప్పుకుంది. జాబ్ రాగానే చేసుకుందాం అని ధైర్యం కూడా చెప్పింది. రోజులు మారాయి. ఇంట్లో పెళ్లి ఫిక్స్ చేశారు. అదేంటి అంటే ఇంట్లో ఒప్పుకోరు అంటుంది. ‘‘నువ్వు ఫ్రెండ్‌లానే ఉండు, నేను నీతో రోజు మాట్లాడతా, నీకు దూరంగా మాత్రం ఉండను, నాకు అన్నీ నువ్వే అంటోంది.’’ ‘‘అయితే పెళ్లి చేసుకుందాం నాకు జాబ్ లేకపోయినా.. ఏదో ఒకటి చేసుకుంటూ బతుకుదాం’’ అంటే వద్దంటోంది. పెళ్లిగానీ జరిగితే నీకు దూరంగా బతకలేను, చచ్చిపోతా అంటోంది. ‘‘నువ్వెందుకు చావడం? నేనే చస్తా’’ అంటే.. ‘‘వద్దు నా కోసం నీ లైఫ్ స్పాయిల్ చేసుకోవద్దు’’ అంటోంది. ఏం చెయ్యాలి భయ్యా?? అసలు ఈ అమ్మాయి ఏం చెయ్యాలనుకుంటుందో నాకేం అర్థం కావడం లేదు.

\- శ్రీధర్

ఇద్దరూ బతకాలి అనుకోవాలి..!

ఎప్పుడూ ‘‘చస్తాం..! చద్దాం..!!’’ అంటూ ఉంటే ప్రేమను అవమానించినట్టే...!!

అమ్మాయి దొరకలేదని కొట్టుకునే బదులు....

*‘ఏంటి సార్ ఈ సోది? మీరు కొంచెం ఓల్డ్ అయిపోయినట్టున్నారు. యంగ్‌గా అసలు మాట్లాడ్డం లేదు. ఇలా అయితే ‘‘లవ్ డాక్టర్’’ కాదు.. ‘‘లవ్ తాత’’ అని పిలుస్తారు!! సార్... సే సంథింగ్ యంగ్!!’*

అమ్మాయి దొరకలేదు అని కొట్టుకునే బదులు.. అందమైన ప్రేమను చవిచూశానని.. ఆ మధురమైన ఎక్స్‌పీరియన్స్ లైఫ్ లాంగ్ ఎంజాయ్ చెయ్యాలి! కానీ, అమ్మాయి దొరకలేదని డల్ అయిపోతే ప్రేమ డొల్ల అయిపోతుంది.

*‘ఇప్పుడు ఏం చెయ్యాలి సార్ శ్రీధర్?!’*

అమ్మాయి ఆలోచనను గౌరవించాలి. పెళ్లి చేసుకుందాం రా అంటూ ప్రెషర్ పెట్టకూడదు. అమ్మాయి స్వేచ్ఛగా ఆలోచించే స్పేస్ ఇవ్వాలి. అమ్మాయి నిర్ణయాన్ని గౌరవించాలి. డోంట్ వర్రీ... నువ్వు ఏ నిర్ణయం తీసుకున్నా నేనూ, నా ప్రేమ నీకు తోడుగా ఉంటాయని చెప్పాలి. ఒకవేళ వేరే సంబంధం చేసుకుంటే.. మళ్లీ నాకు ఫోన్ చెయొద్దని చెప్పాలి. నువ్వు సుఖంగా ఉంటే చాలు.. నేను క్షేమంగా ఉంటానని’’ నీ ప్రేమ గొప్పతనాన్ని చాటి చెప్పుకోవాలి. యు షుడ్ బి హియర్ హీరో!

*‘శ్రీధర్ గుండె నలిగిపోయింది. ప్రేమ.. పెళ్లిగా మారలేదని ముడుచుకుపోయింది. కానీ, ఇప్పుడు మీ మంచి అడ్వైజ్‌తో మళ్లీ శ్రీధర్ గుండె పువ్వులా వికసించి ప్రేమ పరిమళాన్ని విరజల్లుద్ది. గొప్ప మనస్సు ఉన్న గొప్ప ప్రేమికుడిగా మనమందరం శ్రీధర్‌కి లైఫ్‌లో బెస్ట్ విషెస్ ఇద్దాం. ఆల్ ది బెస్ట్!!*

**ప్రేమ, ఆకర్షణ, టీనేజ్ అనుబంధాల్లోని అయోమయం మిమ్మల్ని గందరగోళపరుస్తుంటే ప్లీజ్ ఈ అడ్రస్‌కు మాత్రం అస్సలు రాయకండి. లవ్ డాక్టర్, సాక్షి ఫ్యామిలీ, సాక్షి టవర్స్, రోడ్ నంబరు 1, బంజారాహిల్స్, హైదరాబాద్-34.**
lovedoctorram@sakshi.com

# మా స్మార్ట్ మమ్మీ!!



సమ్‌సారం
సంసారంలో సినిమా

**ఆ**ఫీసులో ఆ రోజెందుకో కొంచెం సీరియస్‌గా ఉంది వాతావరణం. బాయ్ తెచ్చిచ్చిన కాఫీ చప్పరిస్తూ, బాస్ మాటలను అందరం శ్రద్ధగా వింటున్నాం. ఇంతలో మీటింగ్‌కి ముందే పీకనొక్కేసి జేబులోకి తోసేసిన ఫోన్ నుంచి వైబ్రేషన్లు మొదలయ్యాయి. నిశ్శబ్దంగా ఉన్న ఆ ఏసీ ఛాంబర్‌లో నా ఫోన్ శబ్దాలు అసహనం కలిగిస్తున్నాయందరికీ! అదృష్టవశాత్తూ అదే సమయంలో బాస్‌కి కూడా ఫోన్ రావడంతో అదే అదనుగా మెల్లగా ఫోన్ బయటకు తీసి, కాల్ చేసింది ఎవరా అని చూశా. అమ్మ... అప్పటికే నాలుగైదు మిస్డ్ కాల్స్ ఉన్నాయందులో. ఎవరి ఫోన్ అయినా ఇగ్నోర్ చేయొచ్చు కానీ, అమ్మ ఫోన్‌కి రెస్పాండ్ ఇవ్వకపోయానంటే మాత్రం తిప్పలు తప్పవు. గతంలో ఇలాగే నేను ఫోన్ తియ్యకపోయేసరికి ఆమె కంగారుగా మా ఆఫీసులో తనకు తెలిసిన అందరికీ ఫోన్లు చేసేసింది. ఆఖరికి ఆఫీసులో మా బాస్ తర్వాత బాస్ అంతటి వాణ్నీ వదిలిపెట్టలేదు. దాంతో నేను మెల్లగా రీడయల్ చేశా. గభాల్న ఆన్సర్ చేసి, ‘‘ఎక్కడున్నావ్... ఎన్నిసార్లు చేసినా, లిఫ్ట్ చేయకపోతుంటే టెన్షన్ వచ్చింది’’ అంటూ నిష్ఠూరాలు పోయింది.

‘‘ఇక్కడే చచ్చాన్లే... ఇంతకీ ఏంటో చెప్పు’’ అన్నా కొంచెం విసుగ్గా.

కొద్ది నిశ్శబ్దం తర్వాత ‘‘ఏం లేదులే... పొద్దుటు నించీ వైఫై రావట్లేదు... ఏం తోచక చస్తున్నాననుకో’’ అంది.

నాకు ఒళ్లు మండుకొచ్చింది. ‘‘ఇందుకా ఇన్నిసార్లు ఫోన్ చేసింది... ఏమైందో ఏంటో అని భయపడి చచ్చాననుకో’’అంటూ విసుగ్గా ఫోన్ పెట్టేశా.

‘‘నేను కాసేపటిలో వచ్చేస్తాను కానీ, ఈలోగా మీరు అయిడియాలు రాసుంచండి’’ అని చెప్పి హడావిడిగా ఎక్కడికో వెళ్లిపోయారు బాస్.

టైమ్ దొరికింది కదా... ఆగుతానా నేను... బయటికి రాగానే తిరిగి అమ్మకి ఫోన్ చేసి, ‘‘ఏంటమ్మా! రోజూ నేనా టైమ్‌లో మీటింగ్‌లో ఉంటానని తెలిసి కూడా అవతలేదో సీరియస్ మ్యాటరున్నట్లు అన్నిసార్లు ఫోన్ చేశావ్. భయమేసింది’’ అన్నాను.

‘‘నాకు ఇంక కాలక్షేపం ఏముంది... ఆ ఫోన్ చూసుకోవడం తప్ప. అదీ పాపం... ఆ పిచ్చోడు కొనివ్వబట్టి కానీ, నాతో మాట్లాడేదెవరు, నా మొహం చూసేవారెవరు... పొద్దుగూకులూ ఆ గదిలో ఒక్కదాన్నే పడుండటం తప్ప. మీ ఆవిడగానీ, నీ సంతానం గానీ నాతో మాట్లాడతారా ఏమన్నానా? ఇవ్వాళ్ల కూడా నువ్వటెళ్లగానే మీ ఆవిడ కూడా పిల్లల్ని తీసుకుని బయల్దేరింది ‘అక్కా వాళ్ల ఇంటికి వెళ్తొస్తా’ నంటూ... అసలు పొరపాటు చేశాలే. నువ్వు నాకు ఆ జియో సిమ్ ఇస్తానన్నప్పుడు తీసుకోనుంటే బాగుండేది.. కరెంట్ పోగానే నెట్టు ఆగిపోకుండా ఉండేది’’ అమ్మ వాక్ప్రవాహం ఆగడం లేదు. నిజమే కదా అనిపించి నాకు జాలేసింది. ‘‘సర్లే... ఆ సీపీయూ పక్కనే నల్లటి డబ్బాలాంటిది ఉంటుంది కదా... దానికి రెండు స్విచ్చులుంటాయి.. అవి ఆన్లో ఉన్నాయో లేదో చూసుకుంటూ ఉండాలెప్పుడూ...’’ అంటూ డైరెక్షన్లిచ్చి తిరిగి నా పనిలో మునిగిపోయా.

అసలు మా ఇంట్లో కరెంట్ పోయినా, నెట్ రాకపోయినా ముందుగా ఇబ్బంది పడేది అమ్మ, ఆ తర్వాత మూడున్నరేళ్ల మా చిన్నదీ. పొద్దుగూకులూ ఫోన్‌తోనే దాని ఆటలన్నీ. పెద్దదానికేమో సిస్టమ్ ఆపరేట్ చెయ్యడం వచ్చు. యూట్యూబ్ పెట్టుకుని గేమ్సూ అవీ చూసేస్తుంటుంది. మా ఆవిడకేమో పని ధ్యాస, ఇల్లు సర్దుడూ తప్ప ఎవరితోనూ పెద్దగా మాట్లాడదు. పాపం! అమ్మకేమో మొదటి నుంచీ నలుగురిలో ఉండటం, కబుర్లు చెప్పడం అలవాటు కాబట్టి మాటల కోసం మొహం వాచిపోయి ఉంటుంది. నేను కాస్త ఖాళీగా కనిపిస్తే చాలు... పక్కన కూచుని కబుర్లు చెబుతుంటుంది. నాక్కూడా ఈ మధ్య ఆమెతో గడిపేందుకు సరిగా తీరిక దొరకడం లేదు. దాంతో ఆమెకి ఫోనే ప్రపంచంగా మారిపోయింది. పాపం! నిజానికి ఈ వాట్సప్పులూ, ఫేస్బుక్కులూ మొన్నటి దాకా ఆమెకూ తెలీదు. ఈ మధ్యనే తన చిన్ననాటి స్నేహితుల మూలంగా తనూ ‘స్మార్ట్’అయిపోయింది. ఎప్పుడో యాభై ఏళ్ల క్రితం అమ్మతో కలిసి చదువుకున్న స్కూల్‌మేటొకాయన ఫేస్‌బుక్‌లో నా ఫొటోతోబాటూ ఉన్న అమ్మ ఫొటోలు చూసి గుర్తుపట్టి నా ద్వారా అమ్మను కాంటాక్ట్ చేశాడు. తర్వాత ఆమెను బతిమాలీ బామాలీ అందరూ కలిసి ఆమెను పూర్వవిద్యార్థి సమ్మేళనానికి తీసుకెళ్లారు. వాళ్లలో ప్రభుత్వంలో పెద్ద ఆఫీసర్‌గా పని చేసి రిటైరైన ఒకాయన వద్దు వద్దంటున్నా వినకుండా ఆమెకు ఒక స్మార్ట్‌ఫోన్ కొనిచ్చాడు. అంతటితో ఆగకుండా ఆ ఫోన్‌లో వాట్సప్పూ, ఫేస్బుక్కూ ఇన్‌స్టాల్ చేసి, వాటిని ఆపరేట్ చేయడం ఎలాగో నేర్పించాడు... స్వతహాగా తెలివిగల మా అమ్మ అన్నిటినీ రకారకా నేర్చేసుకుని, తన పాత నొక్కుడు ఫోన్ పక్కన పడేసి,స్మార్ట్ మదర్ అయిపోయింది. తొందరలోనే తను మా అందరికన్నా బిజీ అయిపోయింది ఫేస్‌బుక్కూ, వాట్సప్పులలో.

వాటి పుణ్యమా అని ఇప్పుడు నాకు ఫోన్ చేయడం, మా పెద్దదానితో ‘తిండి తినకపోతే చిక్కిపోతావ్, అది తినూ, ఇది తినూ అని సతాయించడం... పొద్దుగూకులూ ఆ సిస్టమ్ చూడ్డమేనా, హోమ్ వర్క్ చేసుకునేదేమైనా ఉందా’’ అంటూ గొడవ పడటం మానేసింది. పైపెచ్చు మా చిన్నదెప్పుడైనా ఏడుస్తుంటే పిలిచి, దగ్గర కూచోబెట్టుకుని తన ఫోన్‌లోని వీడియోలూ, ఫొటోలూ చూపిస్తూ, మాక్కొంచెం ఊరట కనిపించింది. ఇదేదో బాగానే ఉందిలే అనుకున్నాం నేనూ అక్కా వాళ్లూ. నేను మా ఆఫీసులోని వాళ్లకీ, తెలిసిన వాళ్లకీ కూడా ‘‘మా అమ్మ వాట్సప్పు వాడుతుంది తెలుసా’’ అని గర్వంగా చెప్పుకోవడం మొదలు పెట్టాను.

అయితే, త్వరలోనే మాకు ‘స్మార్ట్’ సమస్యలూ మొదలయ్యాయి. ఫోన్‌లో తెలుగు కీ బోర్డ్ పెట్టుకుని నాకూ, మా అక్కా వాళ్లకూ, పిన్నీ వాళ్లకీ, తనకు ఆ ఫోన్ కొనిచ్చినాయనకీ ఎడాపెడా మెసేజీలు చేయడం... ఏదో హడావుడిలో ఉండి రిప్లై ఇవ్వకపోతే ‘‘చూసి కూడా రిప్లై ఇవ్వలేదే’’ అని నిష్ఠూరాలు పోవడం మొదలు పెట్టింది. ఫేస్‌బుక్‌లోనేమో తను వయసులో ఉన్నప్పటి ఫొటోని ప్రొఫైల్ పిక్‌గా పెట్టుకుంది. దాంతో ఆమె యంగ్ అనుకుని కొందరు ఆకతాయిలు ‘‘హాయ్... యూ ఆర్ సో స్వీట్’’అంటూ మెసేజీలు, చాటింగ్‌లు చేయడం మొదలు పెట్టారు. అవి మా దగ్గరకు తీసుకొచ్చి చూపించి నవ్వుకోవడం, కొంచెం వికటిస్తే తనలో తనే భయపడ్డం... గ్యాలరీలో ఫొటోలు చూసుకుంటుంటే పొరపాటుగా ఎవరికో వెళ్లాయి, వాటిని డిలీట్ చేయడం ఎలా అని కంగారు పడటం... పక్కరూమ్‌లో ఉన్న నాకు కూడా ‘‘ఏంటీ అట్లా ఉన్నావ్... ఆఫీస్‌లో ఎవరన్నా ఏమైనా అన్నారా... లేకపోతే మీ ఆవిడేమైనా పుట్టింటికెళ్తానంటోందా’’ అని వాట్సప్ చేయడం... లేదంటే ‘ఒకసారి టొచ్చిపో’ అని మెసేజీలివ్వడం... గ్యాలరీలో ఎప్పటినుంచో ఉన్న ఫొటోలు పొరపాటుగా డిలీటయిపోయాయి. ఎలా వస్తాయి అని అడగడం... ఫోన్ మెమరీ ఫుల్లయిపోయిందనీ, నెట్టు రావడం లేదనీ, వైఫై ఆన్ చేయడం మర్చిపోయి, డేటా ఆన్ చేసేసరికి బ్యాలన్సంతా అయిపోయిందని బాధపడటం... ఇలాగన్న మాట.

అసలు అంతకుముందు సన్‌డే సప్లిమెంట్లలో తెలుగు పదకేళీలు పూర్తిచేయడమంటే అమ్మకు ఇష్టమని ఆమెకోసం ఆదివారం నాడు నాలుగైదు పేపర్లు వేయించేవాణ్ణి... ఇప్పుడు వైఫై పెట్టించాల్సొచ్చింది!!

మొన్నామధ్య రోడ్డు బాగు చేస్తుండే సరికి కేబుల్ వైర్లు తెగిపోయి, రెండు మూడురోజులపాటు నెట్ సరిగా పని చేయలేదు. కరెంట్ కూడా వస్తూ పోతూ ఉంది. దాంతో చేసేదేం లేక ఎప్పటెప్పటివో సన్‌డే సప్లిమెంట్లు ముందేసుకుని కూచుని పజిల్స్ పూర్తి చేస్తూ... మధ్యమధ్యలో తెలియని పదాల కోసం ఫోన్లు చేసి మాట్లాడుతూ కనిపించింది. అయితే ఆ సంబరం ఎన్నాళ్లుంటుంది... కేబుల్ వైర్లు కలవకుండా ఉంటాయా? కరెంటు రాకుండా ఉంటుందా? సిస్టమ్ పని చేయకుండా ఉంటుందా?

అదిగో... మళ్లీ ఫోన్ రింగవుతోంది. అమ్మే చేస్తోంది.. బహుశా మళ్లీ వైఫై పని చేయడం లేదేమో!

\- డి.వి.ఆర్.భాస్కర్

### సినిమాలో సంసారం



## అప్‌డేట్ అవ్వండే!

**ఒ**క్కసారి.. పైన ఫొటోలో ఉన్న బామ్మగారిని చూడండి. ఫోన్‌లో ఎవరితోనో మాట్లాడుతున్నారు. ఈ వయసులో ఇంకెవరితో మాట్లాడతారు? మనవరాళ్లు, మనవళ్ల గురించి కొడుకు, కూతురితో డిస్కస్ చేస్తున్నారని తప్పులో కాలేయకండి.

ఇంటర్‌నెట్ స్పీడ్ పెంచమని కంప్లైట్ చేస్తున్నారామె. మాములు బామ్మ కాదండీ బాబు. అప్‌డేటేడ్ బామ్మగారు. అంతేనా.. ఆమెని ఎవరైనా బామ్మ అంటే ఊరుకోరు.

‘కాల్ మీ బేబీ. బేబీ షామిలి’ అంటారు. ఇప్పుడు అర్థమైందిగా ఎంత అప్‌డేటెడ్ బామ్మగారో.

‘అప్ డేట్ అవ్వండే. గంటల తరబడి అద్దం ముందు నిలబడి మిమ్మల్ని మీరు చూసుకోవడం కాదు... మిమ్మల్ని పదిమందీ చూసేలా తయారవ్వండి’ అని మనుమరాళ్లను ఊదరగొడుతుంటుంది. మోడరన్ బామ్మగా రోహిణీహట్టంగడి నటించిన ఈ సీన్ ఎన్టీఆర్, సమంత నటించిన ‘రామయ్యా.. వస్తావయ్యా’ సినిమాలోనిది.

ప్రతి సంసారంలోనూ కొన్ని ఇబ్బందులుంటాయి. అప్పటికవి పెద్దవే. ఎలాగోలా గట్టెక్కుతాం. వాటివల్లనే సంసారం బలపడుతుంది. ఆ అనుభవంతో చిన్న, పెద్ద ఇబ్బందులను దాటుకుని హాయిగా జీవించడం నేర్చుకుంటాం. కొంతకాలం తర్వాత వెనక్కి తిరిగి చూసుకుంటే అదసలు సంకటమే కాదనిపిస్తుంది, పొట్ట చెక్కలయ్యేలా నవ్వొస్తుంది కూడా. అలాంటి సరదా సంఘటనలను అక్షరాలతో కళ్లకు కట్టండి. సాక్షి పాఠకులతో పంచుకోండి.
ఈ మెయిల్: samsaaram2017@gmail.com

## ఈ వారం YouTube హిట్స్



## నన్ను ప్రేమిస్తున్నానని చెప్పు

**డెమీ లొవాటో : టెల్ మీ యు లవ్ మీ**
**నిడివి : 6 ని. 47 సె., హిట్స్ : 1,23,18,780**

లవ్ బ్రేక్ అయినప్పుడు ఎవరు ఎక్కువ బాధపడతారు? అమ్మాయా? అబ్బాయా? లవ్ బ్రేక్ అయ్యాక, మళ్లీ దగ్గర కావాలని ఎవరు ఎక్కువ ఆరాటపడతారు? అబ్బాయా? అమ్మాయా? డెమీ లొవాటో కొత్త వీడియో ట్రాక్‌లో మాత్రం ‘టెల్ మీ యు లవ్ మీ’ అని అమ్మాయే అంటుంది. ‘నన్ను ప్రేమిస్తున్నానని చెప్పు.. నన్ను ప్రేమిస్తున్నానని చెప్పు..’ అని వాడిని మనసులోనే వెయ్యిసార్లు వేడుకుంటుంది. అది వాడికెలా తెలుస్తుంది? లవ్‌లో ఉన్నప్పుడే ఆమెను తెలుసుకోలేకపోయాడు. లవ్ బ్రేక్ అయ్యాక తెలుసుకుంటాడా? అసలు బ్రేక్ అవడానికే కారణమే వాడు కదా! వీడియోలో మీకు కనిపించే ఆ ‘వాడు’ జెస్సీ విలియమ్స్. సాంగ్ వెంటనే స్టార్ అవదు. కొన్ని సీన్లు ఉంటాయి. ‘కపుల్-వై’ ఈవెంట్స్, ప్రపోజల్, మేక్-అవుట్ సెషన్స్, లాస్ట్‌లో లవర్స్ ఫైటింగ్. ఆ ఫైటింగ్ ఎందుకవుతుందంటే.. మధ్యలోకి ఎరిక్ అనేవాడు వచ్చేస్తాడు. డైరెక్టుగా రాడు. ఆ అమ్మాయి ఫోన్‌లోకి వచ్చేస్తాడు. ‘హూ ఈజ్ హీ?’ అంటాడు జెస్సీ. నా బెస్ట్ ఫ్రెండ్ అంటుంది. అని అక్కడితో ఆగదు, ‘జెలస్ ఫీల్ అవుతున్నావా?’ అంటుంది. జెస్సీకి కోపం వస్తుంది. లవర్స్‌గా ఉన్నప్పుడే మూడో వ్యక్తి ఎంట్రీ ఇస్తే మండిపోతుందే, పెళ్లి ఫిక్స్ అయి, భార్యాభర్తల్లా ఉంటున్నప్పుడు ఎంటర్ అయితే మనసు దహించుకుపోదా? ముహూర్తం రోజు వస్తుంది. పాస్టర్ పెళ్లి జరిపిస్తాడు. కానీ జెస్సీ మూడీగా ఉంటాడు. మెల్లిగా లొవాటో దగ్గరకు వెళ్లి, ఆమె తన వేలికి తొడిగిన ఉంగరాన్ని తీసి, ఆమె చేతిలో పెట్టి వెళ్లిపోతాడు. లొవాటో గుండె బద్ధలైపోతోంది. లొవాటో 25 ఏళ్ల అందమైన అమెరికన్ గాయని. ఇక జెస్సీ హాలీవుడ్ యాక్టర్. చక్కటి జంట. వాళ్ల బ్రేకప్ అవడం ఏమో కానీ.. మన మనసుకు బాధగా అనిపిస్తుంది.. ఒక రిలేషన్ పాడైపోవడం.

## సూర్యా గ్యాంగ్‌లో శివగామి




**తాన సెరన్‌ద కూట్టమ్ : ట్రైలర్**
**నిడివి : 1ని. 14 సె. హిట్స్ : 59,85,968**

**సూ**ర్య కొత్త మూవీ ‘తాన సెరన్‌ద కూట్టమ్’ ట్రైలర్.. సౌత్‌ని చిందులు వేయిస్తోంది. యోగ్యులు అక్కడే ఉంటారు. అయోగ్యులు ఎక్కడికో పోతారు.. అంటూ ట్రైలర్ మొదలవుతుంది. లేనివాళ్లను దోచుకుని ఉన్నవాళ్లయిపోయిన పెద్ద మనుషుల్ని దోచుకునే హీరో.. ఇందులో సూర్య. అతడికో గ్రూప్ ఉంటుంది. ఆ గ్రూప్‌లో రమ్యకృష్ణ, సత్యన్ శివకుమార్ (త్రీ ఇడియట్స్‌లో సెలెన్సర్) ఉంటారు. ‘మన మనసు మంచిదైతే, మంచి మనసుతో మనం ఏదైనా పని చేస్తే.. ’ అంటూ ట్రైలర్ చివర్లో సూర్య ఏదో చెప్పబోతుంటే రమ్యకృష్ణ దగ్గుతుంది. దాన్ని బట్టి ఇదేదో మంచి పని చేయబోతున్న దొంగల ముఠా అనే డౌట్ వస్తుంది. సంక్రాంతికి గానీ అసలు కథేమిటో తెలీదు. జనవరి 12న పిక్చర్ రిలీజ్. హీరోయిన్ కీర్తి సురేశ్. ట్రైలర్‌లో ఒక చోట చార్మినార్ కూడా కనిపిస్తుంది. అంటే.. ఇది తెలుగులోకి కూడా రీమేక్ అవుతోందన్నమాట! మాట కాదు. నిజమే. తెలుగులో ‘గ్యాంగ్’ అని పేరు పెట్టారు. ‘తాన సెరన్‌ద కూట్టమ్’ అన్నా కూడా అర్థం అదే.. ‘సొంత ముఠా’ అని.





## గట్టి పిల్లే.. కాస్త ఎమోషనల్ అయింది

**సెలెనా గోమెజ్ టియర్‌ఫుల్లీ యాక్సెప్ట్స్**
**నిడివి : 2 ని. 21 సె., హిట్స్ : 34,32,541**

‘బిల్‌బోర్డ్’ యు.ఎస్.లో పెద్ద పేరున్న ఎంటర్‌టైన్‌మెంట్ మేగజైన్. ఆ పత్రిక ఏటా రకరకాల కేటగిరీలలో ‘బిల్‌బోర్డ్ మ్యూజిక్’ అవార్డులు ప్రకటిస్తుంటుంది. ఈ ఏడాది అమెరికన్ సింగర్, నటి సెలెనా గోమెజ్ ఎంపిక అయ్యారు! రెండు రోజుల క్రితం ‘బిల్ బోర్డ్ ఉమన్ ఆఫ్ ది ఇయర్’ అవార్డు అందుకుంటూ స్టేజ్ మీద ఉబికి ఉబికి వస్తున్న కన్నీళ్లను ఆపుకోడానికి చాలా ప్రయత్నించారు సెలెనా. ‘యాక్సెప్టెన్స్ స్పీచ్’లో ఆమె ఎంతో ఉద్వేగంతో ప్రసంగించారు. ఈ అవార్డు తనకు రావలసింది కాదు, ఫ్రాన్సియా రైజియాకు రావలసింది అన్నారు! ఫ్రాన్సియా ఆమె కన్నా నాలుగేళ్లు పెద్ద స్నేహితురాలు. అమెరికన్ నటి. ఈ రెండింటినీ మించి, సెలెనాకు ప్రాణదాత! అవును. గత అక్టోబర్‌లో సెలెనాకు కిడ్నీ ట్రాన్స్‌ప్లాంటేషన్ జరిగింది. ఆమెకు కిడ్నీ ఇచ్చింది ఫ్రాన్సియానే. తనెంతో అదృష్టవంతురాలిననీ, తన కన్నా పెద్దవాళ్లైన స్త్రీలందరినీ మనస్ఫూర్తిగా రెస్పెక్ట్ చేస్తున్నాననీ అన్నారు సెలెనా. ఆ అమ్మాయి మాట్లాడుతున్నప్పుడు ఆమె గుండె నిబ్బరానికి మనమూ ఎమోషనల్‌గా ఫీలైపోతాం. కన్నీళ్లను పక్కన పెట్టి చూస్తే ఎంత మెచ్యూర్డ్‌గా ఉందీ పిల్ల!

## కుర్రాడికి ఎంత కష్టమొచ్చిందీ!




**లవ్, సైమన్ : ట్రైలర్**
**నిడివి : 1 ని. 51 సె. హిట్స్ : 27,01,971**

**సృ**ష్టిలోంచి ప్రేమను మైనస్ చేసేస్తే, ఏమీ మిగలదు. శూన్యం తప్ప. సృష్టి విరుద్ధమైన ప్రేమను బయటికి చెప్పుకుంటే చుట్టూ ఒక్కరూ మిగలరు. మనోవేదన తప్ప. సైమన్ స్ప్రియర్ 17 ఏళ్ల కుర్రవాడు. ఆన్‌లైన్‌లో ఒక అబ్బాయిని ప్రేమిస్తాడు. అంటే ‘గే’! ఆ విషయాన్ని ఎవరికీ చెప్పుకోలేడు. తప్పు చేస్తున్నానన్న ఫీలింగ్ సతమతం చేస్తుంటూంది. అయినా తన లవ్‌ని కొనసాగిస్తూంటాడు. ఆ ఆన్‌లైన్ లవర్.. సైమన్ క్లాస్‌మేటే. అయితే ఆ క్లాస్‌మేట్ ఎవరో మాత్రం సైమన్‌కి నేరుగా తెలీదు. కానీ గాఢంగా ప్రేమిస్తుంటాడు. సైమన్ ఎవరో గే లవర్‌తో చాట్ చేస్తున్నాడని కొందరికి తెలిసి అతడిని బ్లాక్ మెయిల్ చెయ్యడం ప్రారంభిస్తారు. బ్లాక్ మెయిల్స్ నుంచి, లవ్ మెయిల్స్ నుంచి బయట పడే ప్రయత్నాలు చేస్తుంటాడు సైమన్. వీడియోలో సైమన్‌ని చూస్తే జాలేస్తుంది! ఏంట్రా నాయనా ఈ పిల్లాడికి ఇంత కష్టం అనిపిస్తుంది. లవ్‌ని అర్థం చేసుకోవడం కష్టం. ‘గే’ లవ్ అర్థం కావడం ఇంకా కష్టం. ఈ కష్టమంతా మైల్డ్ హాలీవుడ్ కామెడీ డ్రామాగా వచ్చే ఏడాది మార్చి 16న విడుదల అవుతోంది.

### టెక్ ఫ్యామిలీ

# స్మార్ట్ బానిసత్వం

**స్మా**ర్ట్‌ఫోన్‌లు అందుబాటులోకి వచ్చి ఈ ఏడాదితో పదేళ్లు పూర్తయ్యాయి. ఈ ‘స్మార్ట్’ దశాబ్దంలో మనుషుల్లో చాలా మార్పులే వచ్చాయి. అవసరం ఉన్నా, లేకున్నా స్మార్ట్‌ఫోన్‌లకు గంటల తరబడి అతుక్కుపోతున్న మనుషులు సాటి మనుషులతో మాత్రం అంటీ ముట్టనట్టుగా ఉంటున్నారు. ప్రతి అవసరానికీ స్మార్ట్‌ఫోన్లపై ఆధారపడటం ఈ దశాబ్ద కాలంలో బాగా పెరిగింది. ఆకలేస్తే ఆహారం ఆర్డర్ చేయడానికి, ఆరోగ్యం బాగులేకపోతే డాక్టర్ల అపాయింట్‌మెంట్ కోసం, పరిచితులతో అపరిచితులతో కాలక్షేపం కబుర్లు చెప్పుకోవడానికి, షాపింగ్ చేయడానికి... ఇలా నానా అవసరాలకు, చాలా అనవసరాలకు స్మార్ట్‌ఫోన్‌లకు అతుక్కుపోయే వారి సంఖ్య ఈ దశాబ్దకాలంలో గణనీయంగా పెరిగింది. స్మార్ట్‌ఫోన్‌ల వాడకం చాలామందికి వ్యసనంగా మారిందని, ఇలాంటి వాళ్లు ఎంతసేపూ స్మార్ట్‌ఫోన్‌ల తోడిదే లోకంగా గడిపేస్తూ, పక్కనే ఉన్న మనుషులను పట్టించుకోని స్థితిలో ఉంటున్నారని, ఈ పరిస్థితి నుంచి బయటపడకపోతే తీవ్రమైన మానసిక సమస్యల్లో చిక్కుకుంటారని మానసిక శాస్త్ర నిపుణులు హెచ్చరికలు చేస్తున్నా, ‘స్మార్ట్’తరం మనుషుల్లో ఎలాంటి మార్పు కనిపించడం లేదు. పొద్దున లేచీ లేవగానే వెంటనే స్మార్ట్‌ఫోన్‌ను తరచి చూడనిదే పక్క దిగని వారి సంఖ్య 62 శాతం ఉంటే, వారం రోజుల పాటు మనుషులకు దూరంగా ఉండమంటే ఉండగలం గాని, స్మార్ట్‌ఫోన్‌లకు దూరంగా ఉండటం తమ వల్ల కాదంటున్న వారి సంఖ్య 45 శాతం ఉన్నట్లు మొబైల్ ఫోన్‌ల తయారీ సంస్థ ‘మోటొరోలా’ నిర్వహించిన సర్వేలో తేలింది. ‘స్మార్ట్’ వ్యసనానికి ఈ గణాంకాలను మించిన నిదర్శనాలింకేముంటాయి?


● స్మార్ట్ ఫోన్‌కు ముందు కుటుంబాలు ఇలా...


● స్మార్ట్ ఫోన్ వచ్చాక

## కాసుకో సుడోకు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 9 | | | 2 | | | 6 | | 8 |
| 6 | | | 1 | 7 | | | 3 | |
| | 3 | | | | 9 | | 7 | 2 |
| | | 8 | 7 | 6 | | | | 3 |
| 3 | | 4 | 9 | | 2 | 7 | | 6 |
| 7 | | | | 1 | 3 | 8 | | |
| 2 | 9 | | 3 | | | | 8 | |
| | 8 | | | 9 | 7 | | | 1 |
| 4 | | 7 | | | 6 | | | 5 |

**నిబంధనలు:** ప్రతి వరుసలో 1 నుంచి 9 అంకెలు నింపండి (అడ్డంగా,నిలువుగా). ఒక వరుసలో ఒక అంకెను ఒకసారి మాత్రమే వాడాలి. ప్రతి 3X3 చదరం లోనూ 1 నుంచి 9 అంకెలు రావాలి.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 3 | 9 | 6 | 7 | 1 | 2 | 4 | 5 | 8 |
| 5 | 1 | 2 | 8 | 4 | 6 | 3 | 9 | 7 |
| 8 | 4 | 7 | 9 | 3 | 5 | 1 | 6 | 2 |
| 4 | 2 | 8 | 6 | 9 | 1 | 7 | 3 | 5 |
| 6 | 3 | 9 | 2 | 5 | 7 | 8 | 1 | 4 |
| 7 | 5 | 1 | 3 | 8 | 4 | 6 | 2 | 9 |
| 2 | 7 | 3 | 4 | 6 | 9 | 5 | 8 | 1 |
| 9 | 6 | 5 | 1 | 7 | 8 | 2 | 4 | 3 |
| 1 | 8 | 4 | 5 | 2 | 3 | 9 | 7 | 6 |

నిన్నటి జవాబు

మీకు సాక్షి దినపత్రిక అందడంలో ఏమైనా ఇబ్బందులున్నా లేక సాక్షి బదులుగా ఇతర దినపత్రికలు వేస్తున్న యెడల టోల్ ఫ్రీ నెంబర్‌కు ఉ. 7.00 గం.ల నుండి రా. 8.00 గం.ల లోపు తెలుపగలరు. వెంటనే తగు చర్యలు తీసుకోబడును.
టోల్ ఫ్రీ నం: 1800 270 1083

పరి పరిశోధన

## వెల్లుల్లితో సూపర్‌బగ్స్‌కు చెక్



దాదాపుగా అందరి వంటిళ్లలో విరివిగా వాడే వెల్లుల్లిలో యాంటీబాక్టీరియల్ లక్షణాలు ఉన్న సంగతి తెలిసిందే. అయితే, యాంటీ బయోటిక్స్‌కు లొంగని సూపర్‌బగ్స్‌ను కూడా వెల్లుల్లితో సమర్థంగా అరికట్టవచ్చని ఒక తాజా పరిశోధనలో తేలింది. వెల్లుల్లిలో ఉండే ‘అజోనే’ అనే రసాయనం ఎలాంటి మొండిరకం బ్యాక్టీరియాలనైనా ఇట్టే నాశనం చేయగలదని డానిష్ శాస్త్రవేత్తల ప్రయోగాల్లో తేలింది. యాంటీబయోటిక్స్‌ను తట్టుకుని మరీ మనుషుల శరీరంలోని కణజాలానికి అంటిపెట్టుకుని ఉండే బ్యాక్టీరియా డీఎన్ఏను వెల్లుల్లిలోని ‘అజోనే’ అనే రసాయనం నాశనం చేయగలుగుతోందని తమ ప్రయోగాల్లో తేలినట్లు కోపెన్‌హాగెన్ వర్సిటీకి చెందిన ప్రొఫెసర్ టిమ్ హామ్ జాకబ్సన్ వెల్లడించారు. మొండి బ్యాక్టీరియా కారణంగా ఇన్ఫెక్షన్లు సోకిన వారికి యాంటీ బయోటిక్స్‌తో పాటు వెల్లుల్లి నుంచి సేకరించిన ‘అజోనే’తో తయారు చేసిన ఔషధాలను వాడినట్లయితే ప్రాణాంతక పరిస్థితుల నుంచి బయటపడవచ్చని కోపెన్‌హాగెన్ శాస్త్రవేత్తలు వివరిస్తున్నారు.

## అపర దుర్వాసులకు ఆయువు తక్కువ!

‘తన కోపమె తన శత్రువు... తన శాంతమె తనకు రక్ష...’ అని సుమతీ శతకకారుడు ఏనాడో చిలక్కు చెప్పినట్లు చెప్పాడు. ప్రతి చిన్న కారణానికీ భగ్గున మండిపడే అపర దుర్వాసులు ఆ నీతిని ఏమాత్రం



పట్టించుకోకుండా నిత్యం ఎదుటివారి మీద ధుమధుమ లాడుతూనే ఉంటారు. చీటికి మాటికి చిర్రుబుర్రులాడే కోపాల్రావులు ఇకపై ఇతరులపై కోపించే ముందు కాస్త ఆలోచించి, కోపానికి కళ్లాలు వేయడం మంచిది. ఎందుకంటే, తరచుగా కోప తాపాలకు గురయ్యేవారు త్వరగానే బాల్చీ తన్నేసే ప్రమాదం ఉందని అమెరికన్ శాస్త్రవేత్తలు హెచ్చరిస్తున్నారు. ప్రస్తుతం 25–40 ఏళ్ల వయసులో ఉన్నవారు తమ కోపాన్ని అదుపులో ఉంచుకోలేకపోతే, వాళ్లు మరో 35 ఏళ్లకు మించి బతికే అవకాశాలు ఉండవని అయోవా స్టేట్ వర్సిటీ శాస్త్రవేత్తలు చెబుతున్నారు. ఎవరికైనా కోపం వచ్చినప్పుడు మెదడు నుంచి ‘అడ్రినలిన్’ విడుదలవుతుంది. ‘అడ్రినలిన్’ విడుదల ఎంత తక్కువగా ఉంటే అంత క్షేమం. చీటికి మాటికి కోపంతో మండిపడే వారిలో తరచుగా అడ్రినలిన్ విడుదలవుతుంది. ఇలా తరచు విడుదలయ్యే అడ్రినలిన్ డీఎన్ఏను దెబ్బతీసి, ‘మల్టిపుల్ స్క్లెరోసిస్’ సహా పలు ప్రాణాంతక దీర్ఘకాలిక వ్యాధులకు దారితీస్తుందని శాస్త్రవేత్తలు వివరిస్తున్నారు.

## చికెన్ సూప్‌తో జలుబు తగ్గుతుందట!



బాగా జలుబు చేసినప్పుడు వేడి వేడి చికెన్‌సూప్‌ను చప్పరిస్తూ అలా కాసేపు తాగితే జలుబు తగ్గుతుందనేది చాలా కాలం నుంచి ఉన్న నమ్మకం. అయితే కాస్త ఘాటుగా ఉన్న వేడి వేడి చికెన్‌సూప్‌ను అలా ఆస్వాదించడం వల్ల జలుబు తగ్గిన అనుభూతితో కాస్త ఉపశమనం కలుగుతుంది కానీ... అది వాస్తవం కాదని కొందరంటారు. కానీ చికెన్‌సూప్ జలుబును తగ్గించడమే కాదు... దాని సువాసనలో ఉండే యాంటీ–ఇన్‌ఫ్లమేటరీ ఏజెంట్స్ వల్ల చాలా ప్రయోజనాలు ఒనగూరుతాయని చెబుతున్నారు యూనివర్సిటీ ఆఫ్ నెబ్రాస్కాకు చెందిన అధ్యయనవేత్త. ఇప్పుడిది కేవలం చిట్కా వైద్యం కాదనీ... దీనికి సశాస్త్రీయ ఆధారాలున్నాయని పేర్కొంటున్నారు డాక్టర్ స్టీఫెన్ రెనార్డ్ అనే అక్కడి వైద్యపరిశోధకుడు. బామ్మ చేసే సూప్ అంటూ ‘గ్రాండ్ మా సూప్’ అని పిలిచే ఇందులో ఇన్ఫెక్షన్స్ తో పోరాడే గుణాలున్నట్లు తాను గుర్తించానని చెబుతున్నారాయన, చికెన్ సువాసన (అరోమా)తో సైనసైటిస్ తగ్గుతుందనీ, శ్వాసకోశవ్యవస్థ పైభాగంలో ఏదో అడ్డుకున్నట్లుగా ఉండి గాలి ఆడనట్లుగా ఉండే ఫీలింగ్ కూడా తగ్గుతుందని చెబుతున్నాడు పరిశోధకుడు.

## చేపలు తినండి... మంచి కంటిచూపు పొందండి

చేపలు బాగా తినడం వల్ల వయసు పెరుగుతున్న కొద్దీ వచ్చే మాలెక్యులార్ డిజనరేషన్ అనే కంటిజబ్బు కారణంగా వచ్చే అంధత్వాన్ని నివారించవచ్చని అంటున్నారు అమెరికన్ సైంటిస్టులు. చేపల్లో



పుష్కలంగా ఉండే ఒమెగా– 3 ఫ్యాటీ యాసిడ్స్ ఈ జబ్బును నివారించి, కంటిచూపును పదిలంగా ఉంచుతుందని అమెరికా పరిశోధకులు పేర్కొంటున్నారు. చేపల్లో ఒమెగా –3 ఫ్యాటీ యాసిడ్ అనే పోషకం ఎక్కువగా లభ్యమవుతుంది. అయితే సాల్మన్, సార్డిన్, మ్యాకరెల్స్ చేపల్లో ఇది మరీ ఎక్కువ. లూసియానా స్టేట్ యూనివర్సిటీకి చెందిన అధ్యయనవేత్తల బృందంలోని కీలక సభ్యుడు ప్రొఫెసర్ నికోలాస్ బాజాన్ ఈ పరిశోధన ఫలితాలను వెల్లడించారు. ఈ పరిశోధన వివరాలన్నీ సెల్యులార్ మాలెక్యులార్ న్యూరోబయాలజీ అనే జర్నల్‌లో ప్రచురితమయ్యాయి.

## ఇలాగైతే కాలేయవ్యాధులు గుండెజబ్బులను మించుతాయి!



మన సమాజంలో ఉన్న మద్యం దురలవాటుతో పాటు ఇటీవలి ఆధునిక జీవనశైలిలో బాగా విస్తృతమైన స్థూలకాయాన్ని నియంత్రించుకోక పోతే కాలేయ వ్యాధులు పెరిగి వాటితో మరణాలూ తప్పవని హెచ్చరిస్తున్నారు పరిశోధకులు. మద్యపానం, అదేపనిగా బరువు పెరగడాన్ని మనమే ప్రయత్నపూర్వకంగా నియంత్రించుకోకపోతే ప్రస్తుతం అగ్రస్థానంలో ఉన్న గుండెజబ్బుల మరణాల సంఖ్యను కాలేయవ్యాధితో కలిగే మరణాలు అధిగమిస్తాయని హెచ్చరిస్తున్నారు యూనివర్సిటీ ఆఫ్ సౌథాంప్టన్ పరిశోధకులు. ఈ అధ్యయనంలో పాలుపంచుకున్న ప్రొఫెసర్ నిక్ షెరాన్ అనే అధ్యయనవేత్త మాట్లాడుతూ ‘‘ఇప్పటివరకూ ఈ మరణాలు మధ్యవయసు వారి నుంచి క్రమంగా తగ్గుతూ తాజాగా చిన్న వయసులోనే చాలా మంది గుండెజబ్బులతో అకస్మాత్తుగా కన్నుమూయడం వరకు వచ్చింది. అయితే పెరుగుతున్న మద్యం దురలవాటు, బాగా బరువు పెరుగుతూండటం కారణాలతో 2020 నాటికి ఇలా చిన్నవయసులోనే మరణించేవారి సంఖ్య కాలేయవ్యాధిగ్రస్తుల్లోనే ఎక్కువగా ఉంటుంది’’ అంటూ హెచ్చరిస్తున్నారు. ఇటీవలే ఈ అధ్యయన ఫలితాలు ప్రముఖ మెడికల్ జర్నల్ ‘ద లాన్సెట్’లో ప్రచురితమయ్యాయి.

# ఏప్రిల్ వార్... వెనక్కి తగ్గేదెవరు?

వేసవి రావడానికి ఇంకా టైమ్ ఉంది. కానీ హీట్ ఇప్పుడే మొదలైంది. వేడి మొదలైంది వెదర్‌లో కాదు. బాక్సాఫీస్ బరిలో. ఆల్రెడీ ఏప్రిల్‌లో పోటీ పడేందుకు నాగార్జున, మహేశ్‌బాబు, అల్లు అర్జున్, కంగనా రనౌత్‌ల సినిమాలు రెడీ అవుతున్నాయి. ‘మేం ముందే రిలీజ్ డేట్ ఎనౌన్స్ చేశాం.. మహేశ్‌బాబు సినిమా వెనక్కి తగ్గితే’ బాగుంటుంది అని అల్లు అర్జున్ కాంపౌండ్ అనుకుంటోంది. ఇంకా ఈ విషయమే సెటిల్ కాలేదు. ఈలోపు రజనీకాంత్ ‘రోబో 2.0’ లైన్లోకొచ్చింది. ఈ సినిమాను ఏప్రిల్ బరిలో దించనున్నట్లు లైకా ప్రొడక్షన్స్ సంస్థ అధికారికంగా ఎనౌన్స్ చేసింది. దాదాపు 400 కోట్ల భారీ బడ్జెట్‌తో రూపొందిన ఈ సినిమాతో వేరే సినిమాలు ‘ఢీ’ కొంటాయా? వెనక్కి తగ్గుతాయా? అన్నది ఇండస్ట్రీలో ఇప్పుడు హాట్ టాపిక్.



● నాగార్జున ● మహేశ్‌బాబు ● అల్లు అర్జున్

### డైలమాలో పడేసిన ‘2.0’

రజనీకాంత్ హీరోగా శంకర్ దర్శకత్వంలో ‘2.0’ చిత్రాన్ని స్టార్ట్ చేసి చాలా కాలం అయ్యింది. ఈ ఏడాది దీపావళికి రిలీజ్ అవుతుందని అందరూ అనుకున్నారు. వచ్చే జనవరి 25న రిలీజ్ అన్నారు. అయితే ఆదివారం ఏప్రిల్‌లో రిలీజ్ అని రాజు మహాలింగం పేర్కొన్నారు. వాస్తవానికి జనవరిలో ఈ సినిమా వచ్చే చాన్స్ లేదని ‘2.0’లో విలన్‌గా నటించిన అక్షయ్‌కుమార్ తాను హీరోగా నటించిన హిందీ చిత్రం ‘ప్యాడ్ మ్యాన్’ రిలీజ్ జనవరి 26న అని ఎనౌన్స్ చేసినప్పుడే అర్థమైంది. దీంతో ‘2.0’ సినిమా పోస్ట్‌పోన్ అయ్యిందన్న ఊహాగానాలు ఊపందుకున్నాయి. తమిళ సంవత్సరం స్టార్ట్ అయ్యే ఏప్రిల్ 13న 2.0 ను రిలీజ్ చేస్తారని కొందరు అనుకున్నారు. ట్రేడ్ అనలిస్ట్ తరణ్ ఆదర్శ్ ‘2.0’ ఏప్రిల్ 27న రిలీజ్ అని చేసిన ట్వీట్‌ను రిట్వీట్ చేశారు రాజ మహాలింగం. సో.. ఈ సినిమా ఏప్రిల్ 27న ఖాయం



● రజనీకాంత్

అంటున్నాయి కోలీవుడ్ సినీ వర్గాలు. తరణ్ ఆదర్శ్ ట్వీట్‌ను ట్యాగ్ చేస్తూ ‘‘బాహుబలి’ టీమ్ తరపున ‘2.0’ టీమ్‌కు ఆల్ ది బెస్ట్’’ అని భల్లాలదేవుడు.. అదేనండీ రానా ట్వీట్ చేయడం విశేషం. ‘బాహుబలి’ ఈ ఏడాది ఏప్రిల్ 28న విడుదలైన విషయం గుర్తుండే ఉంటుంది. ఏది ఏమైనా ‘2.0’ని ఏప్రిల్‌లో రిలీజ్ చేస్తామని ప్రకటించడంతో మిగతా చిత్రాలు డైలమాలో పడ్డాయి.

### భరత్ చెప్పినట్లు చేస్తాడా?

అక్టోబర్ 26న తెలుగు ఇండస్ట్రీలో మహేశ్ వర్సెస్ బన్నీ అని ఒకటే చర్చ. ఎందుకంటే మహేశ్ బాబు హీరోగా కొరటాల శివ దర్శకత్వంలో రూపొందుతున్న సినిమా (‘భరత్ అనే నేను’ టైటిల్ పరిశీలనలో ఉంది) ను ఏప్రిల్ 27న రిలీజ్ చేయనున్నట్లు ఈ చిత్రనిర్మాణ సంస్థ డీవీవీ ఎంటర్‌టైన్‌మెంట్ అధికారికంగా ప్రకటించింది. దాంతో అల్లు అర్జున్‌తో ‘నా పేరు సూర్య నా ఇల్లు ఇండియా’ సినిమా నిర్మాతల్లో ఒకరైన ‘బన్నీ’ వాసు ఒక సినిమా ప్రెస్‌మీట్‌లో అసహనం వ్యక్తం చేసిన విషయం గుర్తుండే ఉంటుంది. ‘‘రిలీజ్ డేట్ ముందే మేం ప్రకటించాం. ఒకే తేదీన రెండు సినిమాలు విడుదల కావడం సరి కాదు. మాతో దానయ్యగారు ఒక్క మాట అయినా చెప్పి ఉండాల్సింది’’ అని ‘బన్నీ’ వాసు అన్నారు.

అయితే ఫైవ్ డేస్ బ్యాక్ మహేశ్ సినిమాను ఏప్రిల్ 27నే రిలీజ్ చేయనున్నట్లు డీవీవీ ఎంటర్‌టైన్‌మెంట్ సంస్థ సినిమా షెడ్యూల్స్‌తో కూడిన ఓ పోస్టర్‌ను ట్విట్టర్‌లో రిలీజ్ చేసింది. అప్పుడు అందరూ మహేశ్ వర్సెస్ బన్నీ ఫిక్స్ అనుకున్నారు. అయితే ఆ రోజే రిలీజ్ డేట్ లేని మరో పోస్టర్ ఆన్‌లైన్‌లో కనిపించింది.

సో.. బాక్సాఫీసు వద్ద బన్నీ వర్సెస్ మహేశ్ లేనట్లేనా? ఇద్దరు సినిమాల నిర్మాతలు ఓ అండర్‌స్టాండింగ్ వచ్చారని ఫిల్మ్‌నగర్ టాక్.

### రేసుగుర్రంలా దూసుకెళ్తాడా?

అల్లు అర్జున్ హీరోగా వక్కంతం వంశీ దర్శకత్వంలో రూపొందుతున్న సినిమా ‘నా పేరు సూర్య నా ఇల్లు ఇండియా’. రామలక్ష్మి క్రియేషన్స్ పతాకంపై నాగబాబు సమర్పణలో లగడపాటి శిరీష శ్రీధర్ నిర్మిస్తున్నారు. ‘బన్నీ’ వాసు సహ నిర్మాత. ప్రజెంట్ ఈ సినిమా షూటింగ్ గోవాలో జరుగుతోంది. ఈ సినిమాను ఈ ఏడాది జూన్‌లో స్టార్ట్ చేశారు. సెట్స్‌పైకి వెళ్లిన వెంటనే ఏప్రిల్ 27న తమ సినిమాను రిలీజ్ చేయనున్నట్లు ప్రకటించారు. అయితే ‘2.0’ సడన్‌గా సీన్లోకొస్తుందని నిర్మాతలు ఊహించలేదు. మరి.. ఇప్పుడు ‘నా పేరు సూర్య ఆ ఇల్లు ఇండియా’ కూడా రిలీజ్ డేట్ మార్చుకోవాలా? మహేశ్‌బాబు సినిమా రిలీజ్ ఎప్పుడు? అనే చర్చ జరుగుతోంది.

### వీర వనిత వెనక్కి తగ్గాలా?

వీర వనిత రాణీ లక్ష్మీభాయ్ జీవితం ఆధారంగా క్రిష్ దర్శకత్వంలో కంగనా రనౌత్ టైటిల్ రోల్‌లో రూపొందుతున్న సినిమా ‘మణికర్ణిక’. ఆల్మోస్ట్ 60 పర్సెంట్ కంప్లీట్ అయ్యింది. అసలు ఏప్రిల్ బరిలో సినిమాను నిలిపింది ఫస్ట్ ఈ టీమ్‌నే. మే నెలలో



● కంగనా రనౌత్

వారాణాసిలో జరిగిన ప్రోగ్రామ్‌లో ‘మణికర్ణిక’ అధికారిక పోస్టర్‌ను లాంచ్ చేశారు. ఆ పోస్టర్‌పై ఈ సినిమా రిలీజ్ తేదీ ఏప్రిల్ 27 అని ఉంది. మరి.. మణికర్ణిక వెనక్కి తగ్గుతారా? అన్న ప్రశ్నకు చిత్ర బృందం దగ్గరే సమాధానం ఉంది. జీ స్టూడియోస్, కమల్‌జైన్, నిశాంత్ ఈ సినిమాను నిర్మిస్తోన్నారు.

### వర్మ మనసు మార్చుకుంటారా?

నాగార్జున హీరోగా రామ్‌గోపాల్ వర్మ దర్శకత్వంలో ఓ సినిమా మొదలైంది. ‘శివ’ వంటి ట్రెండ్ సెట్టర్ మూవీ ఇచ్చిన కాంబినేషన్ కావడంతో తాజా సినిమాపై బోలెడన్ని అంచనాలు నెలకొన్నాయి. ‘‘నవంబర్‌లో షూటింగ్‌ను స్టార్ట్ చేసి ఫిబ్రవరి కల్లా ఫినిష్ చేసి, ఏప్రిల్‌లో విడుదల చేస్తాం. ఆ తర్వాతే ఎన్టీఆర్ బయోపిక్ స్టార్ట్ చేస్తా’’ అని ఫేస్‌బుక్‌లో పేర్కొన్నారు వర్మ. ఇక్కడ గమనించాల్సిన విషయం ఏంటంటే.. ఈ సినిమా రిలీజ్ ఏప్రిల్‌లోనే. ఏప్రిల్ 20న ఈ సినిమాను రిలీజ్ చేయబోతున్నట్లు ఊహాగానాలు నెలకొన్నాయి. వర్మ మైండ్‌సెట్ మారుతుందా? తెలుసుకోవాలంటే వెయిట్ చేయక తప్పదు. కంపెనీ పతాకంపై సుధీర్‌చంద్రతో కలిసి రామ్‌గోపాల్ వర్మ ఈ సినిమాను నిర్మిస్తున్నారు.

### సేమ్ సీన్!
### 2017 ఆగస్టు 11
### 2018 ఏప్రిల్ 27?

తేజ దర్శకత్వంలో రానా నటించిన ‘నేనే రాజు నేనే మంత్రి’, హను రాఘవపూడి దర్శకత్వంలో నితిన్ హీరోగా వచ్చిన ‘లై’, బెల్లంకొండ శ్రీనివాస్ నటించచన ‘జయజానకి నాయక’ చిత్రాలు ఈ ఏడాది ఆగస్టు 11న రిలీజ్ అయ్యాయి. రిలీజ్ డేట్స్‌లో తేడా లేకపోవడం వల్ల ఈ సినిమాల కలెక్షన్స్ దెబ్బతిన్నాయన్న గుసగుసలు ఫిల్మ్‌నగర్‌లో వినిపించాయి. మరి.. వచ్చే ఏడాది ఏప్రిల్ 27న సేమ్ సీన్ రిపీట్ అవుతుందా? ఇప్పటివరకు ‘2.0’, ‘నా పేరు సూర్య నా ఇల్లు ఇండియా’, ‘మణికర్ణిక’ సినిమాల రిలీజ్ డేట్స్‌ను 27నే ఫిక్స్ చేశారు. ‘బన్నీ’ వాసు, దానయ్య మాట్లాడుకోవడం వల్ల మహేశ్‌బాబు సినిమా రిలీజ్ డేట్ మారిందని టాక్. ఒకవేళ ‘2.0’ రిలీజ్ డేట్ ఏప్రిల్ 27 అయితే మిగతా మూడు సినిమాల సంగతేంటి? తేదీ మార్చుకుంటాయా? ఈ మూడు ఒకే తేదీన విడుదలవుతాయా? అన్నది తెలియాలంటే మరికొన్ని రోజులు ఆగక తప్పదు.

- డి.జి. భవాని
ముసిమి శివాంజనేయులు

### పోటీ పడకూడదని...



● డివివి దానయ్య

‘‘వచ్చే ఏప్రిల్, మే నెలల్లో మా సినిమాలు విడుదల చేయాలనుకున్న నిర్మాతలందరం మా మధ్య ఎలాంటి పోటీ ఉండకూడదని కలసి, కూర్చుని చర్చించుకుంటున్నాం. ఇలాంటి సమయంలో ‘2.0’ విడుదల తేదీని హఠాత్తుగా ప్రకటించడంతో అన్ని తెలుగు సినిమాలూ డైలమాలో పడ్డాయి. తెలుగు పరిశ్రమ ఎప్పుడూ ఇతర భాషల చిత్రాలను గౌరవించింది, ఆహ్వానించింది. అయితే ‘2.0’ లాంటి పెద్ద ప్రాజెక్ట్ రిలీజ్ డేట్ మారడం వల్ల తెలుగు నిర్మాతల మధ్య కన్‌ఫ్యూజన్ ఏర్పడింది. ఈ పరిస్థితుల్లో ట్రేడ్ బాడీస్ కలిసి ఒక నిర్ణయానికి రావాలి. సమస్యను పరిష్కరించడానికి కృషి చేయాలి’’ అని మహేశ్‌బాబు హీరోగా (‘భరత్ అనే నేను’) తాజా సినిమా నిర్మిస్తోన్న డీవీవీ ఎంటర్‌టైన్‌మెంట్స్ అధినేత డీవీవీ దానయ్య సోషల్ మీడియా ద్వారా పేర్కొన్నారు.

### నిర్మాతల మండలి దృష్టికి తీసుకెళతా



● బన్నీ వాసు

‘‘లైకా ప్రొడక్షన్స్ నిర్మించిన ‘2.0’ చిత్రాన్ని గౌరవిస్తున్నాం. కానీ, సినిమా రిలీజ్ డేట్స్ విషయంలో మీరు (‘2.0) నిర్మాతలు) చేస్తున్న మార్పులు ప్రాంతీయ చిత్రాలపై తీవ్రమైన ప్రభావం చూపుతుంది. ఆల్రెడీ రిలీజ్ డేట్స్ ఈ విషయంలో (‘నా పేరు సూర్య.. నా ఇల్లు ఇండియా’ – సహ నిర్మాత), డీవీవీ దానయ్య (మహేశ్‌బాబు ‘భరత్ అనే నేను’ నిర్మాత) ఒక అండర్‌స్టాండింగ్‌కి రావడానికి చర్చించుకుంటున్నాం. ఈ విషయాన్ని (‘2.0’ రిలీజ్) నేను ప్రొడ్యూసర్ కౌన్సిల్ దృష్టికి తీసుకెళ్లాలనుకుంటున్నా. తెలుగు రాష్ట్రాల ఎగ్జిబిటర్స్ అసోసియేషన్‌తో చర్చిస్తాం. మా రిలీజ్ డేట్స్ కమిట్‌మెంట్‌కు కట్టుబడి ఉండాలనుకుంటున్నాం. ఈ నిర్ణయం రాబోయే ప్రాంతీయ చిత్రాలకు హెల్ప్ అవుతుందని ఆశిస్తున్నాను’’ అని నిర్మాత బన్నీ వాసు సోషల్ మీడియాలో పేర్కొన్నారు.

## రెండోసారి



● తాప్సీ
ఆది పినిశెట్టి

‘గుండెల్లో గోదారి’ చిత్రంలో అలరించిన ఆది పినిశెట్టి–తాప్సీ మరోసారి జోడీ కడుతున్నారు. ‘లవర్స్’ ఫేమ్ హరి దర్శకత్వంలో కోన వెంకట్ సమర్పణలో ‘గీతాంజలి’ చిత్రనిర్మాత ఎంవీవీ సత్యనారాయణ ఈ సినిమా నిర్మించనున్నారు. విభిన్నమైన కథతో యాక్షన్ ఎంటర్‌టైనర్‌గా తెరకెక్కనున్న ఈ సినిమా ఈ నెల 21న ప్రారంభం కానుంది. హైదరాబాద్, విశాఖపట్నం, విజయవాడల నేపథ్యంలో రూపొందనున్న ఈ చిత్రంలో తాప్సీతో పాటు మరో ప్రముఖ కథానాయిక నటించనున్నారు. ‘సరైనోడు, నిన్ను కోరి’ వంటి చిత్రాల్లో వైవిధ్యమైన పాత్రల్లో మెప్పించిన ఆది ప్రస్తుతం ‘రంగస్థలం, అజ్ఞాతవాసి’ చిత్రాల్లో నటిస్తున్నారు. ఓ వైపు మంచి పాత్రల్లో నటిస్తూనే మరోవైపు కథానాయకుడిగానూ నటిస్తున్నారాయన. ‘వెన్నెల’ కిశోర్, శివాజీరాజా, తులసి, సాయిచంద్ తదితరులు కీలక పాత్రల్లో నటించనున్న ఈ చిత్రానికి స్క్రీన్‌ప్లే: కోన వెంకట్, కెమెరా: తోట రాజు (‘అర్జున్‌రెడ్డి’ ఫేమ్), సంగీతం: గోపీసుందర్.

## ఐయామ్ విత్ ‘మా’

మూవీ ఆర్టిస్ట్ అసోసియేషన్ (మా) 25వ వసంతంలోకి అడుగుపెట్టిన సందర్భంగా సిల్వర్ జూబ్లీ వేడుకలు ఘనంగా నిర్వహించేందుకు ‘మా’ నూతన కార్యవర్గం ప్లాన్ చేసింది. ఈ విశేషాలను మీడియాతో పంచుకున్నారు. ‘మా’ అధ్యక్షుడు శివాజీ రాజా మాట్లాడుతూ–‘‘24 ఏళ్ల కిందట చిరంజీవిగారు స్థాపించిన ‘మా’ 25 సంవత్సరంలోకి అడుగుపెట్టడం చాలా సంతోషంగా



● నరేశ్, బెనర్జీ, శ్రీకాంత్, శ్రీహరి, రాళ్లపల్లి, శివాజీరాజా, ఏడిద శ్రీరాం, సురేశ్

ఉంది. ఈ సందర్భంగా ‘ఐయామ్ విత్ మా’ నినాదంతో సిల్వర్ జూబ్లీ వేడుకలు ఘనంగా నిర్వహిస్తున్నాం. ఈ వేడుకలకు శుభ సూచికంగా ‘ఓల్డేజ్ హోమ్’ ఏర్పాటు చేయబోతున్నాం’’ అన్నారు. ‘‘ఓల్డేజ్ హోం, ‘మా’కు సొంత భవనం ఏర్పాటు దిశగా అడుగులు వేస్తున్నాం’’ అన్నారు ‘మా’ జనరల్ సెక్రటరీ నరేశ్. ఈ వేదికపై సీనియర్ నటుడు రాళ్లపల్లి, సీనియర్ పాత్రికేయులు గుడిపూడి శ్రీహరి, నటుడు శివ బాలాజీలను ‘మా’ తరపున సన్మానించారు.

## నానిగాడి ప్రేమకథ



● దుర్గాప్రసాద్

దుర్గాప్రసాద్ కథానాయకుడిగా నటిస్తూ మెట్రో ఫిలింస్ పతాకంపై నిర్మించిన చిత్రం ‘నానిగాడు’. సీపీరెడ్డి దర్శకుడు. సరిత కథానాయిక. యస్. లక్ష్మి, చింతా చాతుర్య సహ నిర్మాతలు. ‘‘లవ్, కామెడీ, యూత్‌ఫుల్ అండ్ ఫ్యామిలీ ఎంటర్‌టైనర్ చిత్రమిది. అంతా కొత్తవారే నటించారు’’ అని చిత్ర బృందం పేర్కొంది. ఈ చిత్రానికి చింతా శివకుమార్ రెడ్డి, చింతా మహేశ్‌రెడ్డి ఎగ్జిక్యూటివ్ నిర్మాతలుగా వ్యవహరించారు.

## కృష్ణకు ‘ఆట’ పురస్కారం



● కృష్ణ

సూపర్‌స్టార్ కృష్ణకు ‘ఆట’ (అమెరికన్ తెలుగు అసోసియేషన్) జీవన సాఫల్య పురస్కారం అందించనుంది. అమెరికాలో స్థిరపడిన తెలుగువారు ‘ఆట’ సంస్థ ఏర్పరచుకున్న విషయం తెలిసిందే. ప్రతి రెండేళ్లకు ఇండియా వచ్చి ‘ఆట వేడుకలు’ పేరుతో పలు సేవా కార్యక్రమాలు నిర్వహించే ఈ సంస్థ ఈ ఏడాది పలు అంశాలపై అవగాహన సదస్సులు, ఉచిత వైద్య శిబిరాలకు శ్రీకారం చుట్టింది. నవంబర్ 26న ప్రారంభమైన ఈ వేడుకలు ఈ నెల 23న ముగియనున్నాయి. ముగింపు రోజున కృష్ణకు ‘ఆట జీవన సాఫల్య పురస్కారం’ ప్రదానం చేయనున్నామని ‘ఆట’ ప్రస్తుత అధ్యక్షుడు కరుణాకర్ అసిరెడ్డి, కాబోయే అధ్యక్షుడు (ప్రెసిడెంట్ ఎలెక్ట్) పరమేష్ భీమిరెడ్డి తెలిపారు. ఆట చేపట్టబోయే కార్యక్రమాలను ‘ఆట’ గౌరవ సలహాదారు దర్శక–నిర్మాత తమ్మారెడ్డి భరద్వాజ, ‘ఆట’ ఓవర్‌సీస్ కో–ఆర్డినేటర్స్ లోహిత్, మధుసూధన్ కోదూరు, ‘ఆట’ ఫౌండర్ మెంబర్ డాక్టర్ రంగారావు, బోర్డు మెంబర్స్ అనిల్ బొద్దిరెడ్డి, భువనేశ్ బూజాల, డాక్టర్ సురేంద్రరెడ్డి తదితరులు పత్రికా ముఖంగా వివరించారు.

# హాలీవుడ్ స్పైస్




# సినిమా పండగ వచ్చేసిందోచ్!!

ఒకటి పక్కా మాస్ సినిమా.. ఇంకోటేమో క్లాస్ ఫ్యామిలీ డ్రామా.. మరో సినిమా ప్యూర్ కామెడీ.. ఇలా అన్నీ ఒక్కసారే వచ్చి పడితే ఎలా ఉంటుంది? సినిమా పండగ అయిపోదూ? అదే.. మన సంక్రాంతి, దసరా లాగే.. హాలీవుడ్‌కు అసలైన పండగ సీజన్ అంటే క్రిస్‌మస్. ఈ నెలంతా క్రిస్‌మస్ పండగ సెలబ్రేట్ చేసుకునేందుకు సినీ అభిమానులకు ఉన్న ఒక మంచి ఆప్షన్ సినిమా. క్రిస్‌మస్‌కు ముందు, ఆ తర్వాత న్యూ ఇయర్ వరకూ హాలీవుడ్ సినిమాల హడావిడి మామూలుగా ఉండదు. ఈ ఏడాది క్రిస్‌మస్ సినిమా పండగ జోరు ఇంకాస్త ఎక్కువే ఉంది. డిసెంబర్ 1 నుంచే ఈ హంగామా మొదలైపోయింది. 2017 క్రిస్‌మస్ సీజన్‌లో హాలీవుడ్‌ను కవ్విస్తోన్న సినిమాలు కొన్ని...

### ది షేప్ ఆఫ్ వాటర్

ఈ సీజన్లో రిలీజ్‌కు ముందే భారీ అంచనాలను మూటగట్టుకున్న సినిమా 'ది షేప్ ఆఫ్ వాటర్'. ఇప్పటికే పలు ఇంటర్నేషనల్ ఫిల్మ్ ఫెస్టివల్స్‌లో ప్రదర్శితమైన ఈ సినిమాకు సూపర్ రెస్పాన్స్ వచ్చింది. డిసెంబర్ 8న థియేటర్లకు రానున్న ఈ సినిమా కోసం అభిమానులు ఆసక్తిగా ఎదురు చూస్తున్నారు. గులెర్మొ డెల్‌టొరొ దర్శకత్వంలో తెరకెక్కిన ఈ రొమాంటిక్ డ్రామా యూఎస్‌లో ఇండియా కంటే వారం ముందే (డిసెంబర్ 1) విడుదలైంది.

### స్టార్ వార్స్ - ది లాస్ట్ జేడి

స్టార్ వార్స్ అభిమానులకు ఈ ఏడాది క్రిస్‌మస్ పండగ పదిరోజుల ముందే మొదలైపోతోంది. డిసెంబర్ 15న ప్రపంచవ్యాప్తంగా 'స్టార్‌వార్స్ – ది లాస్ట్ జేడీ' విడుదలవుతోంది. స్టార్ వార్స్ సీక్వెల్ ట్రయాలజీలో ఇది రెండో సినిమా. సాధారణంగానే స్టార్ వార్స్‌కు ఉన్న క్రేజ్ అంతా ఇంతా కాదు. అదీ పండగ సీజన్‌లో వస్తోందంటే ఇక చెప్పక్కర్లేదు. ఫస్ట్ వీకెండ్‌కే ఈ సినిమా 200 మిలియన్ డాలర్లు (దాదాపు రూ. 1250 కోట్లు) వసూలు చేయొచ్చని ట్రేడ్ అంచనా వేస్తోంది. ఇక సినిమా బాగుంటే, న్యూ ఇయర్ వరకూ కాసుల వర్షమే!! రియాన్ జాన్సన్ దర్శకత్వంలో ఈ సినిమా తెరకెక్కింది.

### జుమాంజి - వెల్‌కమ్ టు ది జంగిల్

పండగ సీజన్లో యాక్షన్ సినిమా అభిమానులకు పండగలా రాబోతోన్న సినిమా 'జుమాంజి'. 1995లో వచ్చిన 'జుమాంజి'కి ఇది సీక్వెల్. జేక్ కస్దాన్ దర్శకత్వం వహించారు. డ్వెయన్ జాన్సన్, జాక్ బ్లాక్, కెవిన్ హార్ట్ తదితర స్టార్స్ నటించిన ఈ సినిమా కోసం ఇండియన్ మూవీ ఫ్యాన్స్ కూడా బాగా ఎదురు చూస్తున్నారు. ట్రైలర్‌తో యాక్షన్ సినిమా అభిమానులకు కావాల్సిన అన్ని హంగులూ ఈ సినిమాలో ఉన్నాయని తెలియడంతో ఇక సినిమాకు క్రేజ్ అలా పెరుగుతూనే పోతోంది. డిసెంబర్ 20న అమెరికాలో విడుదలవుతోన్న ఈ సినిమా ఇండియాలో డిసెంబర్ 29న విడుదల కానుంది.










### పిచ్ పర్ఫెక్ట్ 3

'పిచ్ పర్ఫెక్ట్' ట్రయాలజీలో వస్తోన్న మూడో సినిమాయే 'పిచ్ పర్ఫెక్ట్ 3'. కామెడీ సినిమా అభిమానులకు ఈ సీజన్లో బెస్ట్ ఆప్షన్ ఈ సినిమా. అన్నా కెంద్రిక్, రెబెల్ విల్సన్, హైలీ స్టీన్‌ఫీల్డ్ తదితర భారీ తారాగణం నటించిన ఈ సినిమా ఔట్ అండ్ ఔట్ నవ్వులు పూయిస్తుందన్న నమ్మకాన్ని కలిగిస్తోంది. డిసెంబర్ 22న ఈ సినిమా ప్రపంచవ్యాప్తంగా విడుదలవుతోంది.

పైన చెప్పిన సినిమాలే కాకుండా హాలీవుడ్ సినీ అభిమానులు ఎంతో ప్రత్యేకంగా భావిస్తూ వచ్చిన రెండు సినిమాలు ఉన్నాయి. అందులో ఒకటి ప్రఖ్యాత దర్శకుడు స్పీల్‌బర్గ్ తెరకెక్కించిన 'ది పోస్ట్' అయితే, మరొకటి రొమాన్స్ జానర్ సినిమాల స్పెషలిస్ట్ ఉడీ అలెన్ తెరకెక్కించిన 'వండర్ వీల్'.










### వండర్ వీల్..

రొమాన్స్ జానర్లో పలు క్లాసిక్ సినిమాలను అందించిన ఉడీ అలెన్ తెరకెక్కించిన 'వండర్ వీల్' యూఎస్‌లో డిసెంబర్ 1నే విడుదలైంది. ఇండియన్ మార్కెట్లో ఈ సినిమా ఇంకా విడుదల కావాల్సి ఉంది. దర్శకుడి స్టైల్లో రొమాన్స్ జానర్లో ఓ మంచి సినిమాగా 'వండర్ వీల్'కు పేరొస్తోంది. కేట్ విన్‌స్లెట్ ప్రధాన పాత్రలో నటించడం ఈ సినిమాకు మేజర్ అట్రాక్షన్.

### ది పోస్ట్

స్పీల్‌బర్గ్ సినిమాల కోసం ప్రపంచమంతా ఎంతలా ఎదురు చూస్తుందో చెప్పక్కర్లేదు. అయితే ఆయన గత రెండు సినిమాలూ బాక్సాఫీస్ వద్ద పెద్దగా ఆడలేదు. దీంతో ఇప్పుడు ఆయన అభిమానుల ఆశలన్నీ 'ది పోస్ట్' పైనే ఉన్నాయి. ఈ సినిమాకు సూపర్‌స్టార్ టామ్ హ్యాంక్స్ హీరో కావడం కూడా అంచనాలను పెంచింది. హిస్టారికల్ పీరియడ్ డ్రామాగా తెరకెక్కిన ఈ సినిమాలో మెరిల్ స్ట్రీప్ రోల్ సినిమాకే హైలైట్‌గా ఉంటుందట. యూఎస్‌లో కొన్ని చోట్ల డిసెంబర్ 22నే ఈ సినిమా విడుదలవుతున్నా, పూర్తి స్థాయిలో మాత్రం 2018 జనవరి 12న విడుదల కానుంది. అంటే స్పీల్‌బర్గ్ ఇండియన్ అభిమానులకు 'ది పోస్ట్' చూడాలంటే ఎదురుచూపులు తప్పవు.

# ఇంతకంటే ఏం కోరుకోను?



బర్త్ డే సర్‌ప్రైజులు ఎవరికి ఇష్టం ఉండదు చెప్పండి. మనకైనా పాప్ గాయని బ్రిట్నీ స్పియర్స్‌కైనా ఒక్కటే. బ్రిట్నీ 36వ పుట్టినరోజుకి తన బాయ్ ఫ్రెండ్ సామ్ అస్గరి ఓ సర్‌ప్రైజ్ ఇచ్చాడు. తన గది నిండా కొవ్వొత్తుల వెలుగులతో, టేబుల్ అంతా కప్ కేక్స్‌తో, గులాబి రేకులను హృదయాకారంలా పరిచి, హ్యాపీ బర్త్‌డే బెలూన్‌తో డెకరేట్ చేశాడు. ఆ వీడియోను ఇన్‌స్టాగ్రామ్‌లో పోస్ట్ చేశాడు. "నా వన్ అండ్ వోన్లీ గర్ల్‌కి హ్యాపీ బర్త్‌డే. అందమైన అమ్మాయికి అసలు సిసలైన అర్థం చెప్పినందుకు, ముఖ్యంగా పూర్తి నాదానివే అయినందుకు థ్యాంక్యూ" అని కూడా పేర్కొన్నాడు సామ్. "ఇంతకంటే ఏం కోరుకోను" అని బ్రిట్నీ ఆనందం వ్యక్తం చేశారు. అన్నట్లు 36 ఏళ్ల బ్రిట్నీకి ఇప్పటికి రెండు పెళ్లిళ్లయ్యాయి. అవి పెటాకులయ్యాక మూడో పెళ్లి చేసుకోలేదు కానీ, సామ్ అస్గర్‌తో లవ్‌లో పడింది. బ్రిట్నీకన్నా సామ్ 13 ఏళ్లు చిన్నవాడు. అతని వయసు 23 ఏళ్లు. అయినా ప్రేమకు వయసుతో సంబంధం ఏముంటుందిలెండి? మనసులు కలవడం ముఖ్యం కదా.



● బ్రిట్నీ స్పియర్స్

# అభిమానం హద్దులు దాటితే!

సాధారణంగా అభిమానులు తమ అభిమాన తారలు సినిమాల్లో ఎలా కనిపిస్తారో అలా తయారవ్వడానికి ఇష్టపడతారు. కానీ, అభిమానం శ్రుతి మించితే? 'సహర్ టబర్' పరిస్థితి ఎదురయ్యే ప్రమాదం ఉంది. ప్రస్తుతం ఈ సహర్ టబర్ ఇంటర్నెట్ సంచలనం. ఇంతకీ సహర్ టబర్ ఎవరు? ఇరానీకి చెందిన ఈ అమ్మాయి హాలీవుడ్ హాట్ స్టార్ ఏంజెలీనా జోలీకి వీరాభిమాని. అభిమానం అంటే అంతా ఇంతా కాదు.. ఏకంగా తనలా మారిపోవాలనుకునేంత. అందుకే ఈవిడ సుమారు యాభైకి పైగా సర్జరీలు చేయించుకుంది. ప్రతి సర్జరీకి ఏంజెలినాలా అయిపోతానని కలలు కంది. అయితే చివరికి ఇలా మారిపోయింది. సహర్ గొప్ప అందగత్తె. ఏంజెలినా పిచ్చితో ఎలా తయారైందో ఇన్‌సెట్‌లో ఉన్న ఫొటోలో చూడొచ్చు. అందం పాడు చేసుకునేంత అభిమానం పనికి రాదేమో కదూ.



● సహర్ టబర్ సర్జరీలకు ముందు... తర్వాత..



● ఏంజెలీనా జోలీ

# సెక్స్ స్కాండల్‌వుడ్!!

సెక్స్ స్కాండల్‌వుడ్.. ఇప్పుడు హాలీవుడ్‌కు ఈ పేరు సరిగ్గా సరిపోతుంది. నిర్మాత హార్వీ వెయిన్‌స్టీన్ అరాచకాలు బయటపడ్డ రోజు నుంచి ప్రపంచవ్యాప్తంగా 'మీటూ..' అన్న ఉద్యమం ఏ స్థాయిలో జరుగుతోందో చెప్పక్కర్లేదు. క్యాస్టింగ్ కౌచ్ పేరుతో వెయిన్‌స్టీన్ తమపై చేసిన లైంగిక వేధింపుల గురించి ప్రపంచానికి తెలియజేస్తూ ఎంతో మంది గొంతు విప్పారు. ఈ సంఘటన జరిగి రెండు నెలలైనా ఇప్పటికీ మీటూ ఉద్యమం అలాగే ఉంది. అలాగే హాలీవుడ్‌లో ఈ లిస్ట్ వెయిన్‌స్టీన్ దగ్గరే ఆగిపోలేదు. అదలా రోజురోజుకూ పెరుగుతూ పోతోంది. స్టార్ హీరోలు, డైరెక్టర్లు ఎక్కడికెళ్లినా మీడియా అడుగుతోన్న ప్రశ్న ఒక్కటే.. ''సెక్స్ స్కాండల్స్ గురించి మీరేమంటారు?'' అని. చిత్రమేమిటంటే.. పలువురు స్టార్స్ కూడా లైంగిక వేధింపులకు పాల్పడ్డ వారి జాబితాలో ఉండడం. ఓలివర్ స్టోన్, సిల్వెస్టర్ స్టాలోన్, అల్ ఫ్రాంకెన్, గారిసన్ కిల్లర్, లూయిస్ సీకె, కెవిన్ స్పేసీ, చార్లీ షీన్.. ఇలా చాలా మంది స్టార్స్‌పై ఆరోపణలు వస్తున్నాయి. తమపై లైంగిక వేధింపులకు పాల్పడ్డ, పడుతున్న వారి గురించి హీరోయిన్స్ ధైర్యంగా బయటకొచ్చి చెబుతున్నారు. 'మీటూ..' హాలీవుడ్‌లో హీరోయిన్లకు ఓ కొత్త ఆయుధంలా తయారైంది.



● హార్వీ వెయిన్‌స్టీన్

### నాకేం ఆశ్చర్యం కలిగించలేదు!

ఈ సెక్స్ స్కాండల్స్ గురించి ప్రముఖ నటుడు టామ్ హ్యాంక్స్ మాట్లాడుతూ –''నాకేం ఆశ్చర్యంగా అనిపించడంలేదు. లైంగిక వేధింపులకు గురిచేసేవాళ్లు అన్ని చోట్లా ఉన్నారు. సినిమా అనే బిజినెస్‌ను ఒక గౌరవంగా భావించే వాళ్ల వల్ల ఏ నష్టమూ జరగదు. పవర్ కోసం, వేరే లాభాల కోసం సినిమాని ఆయుధంగా ఉపయోగించుకునేవాళ్లు ఉండడం వల్ల ఇలాంటివి జరుగుతున్నాయి. హాలీవుడ్ అంటే జస్ట్ సెక్స్ స్కాండల్స్ కాదు. మంచి విషయాలు కూడా చాలా ఉన్నాయి. చెడు పరంగా పరిస్థితులు తప్పకుండా మారతాయి'' అన్నారు.



● టామ్ హ్యాంక్స్

# సమ్మర్‌లో సూపర్ హీరోల హంగామా!

'స్పైడర్' సినిమాలోని 'బూమ్ బూమ్' పాట గుర్తుందిగా? 'గుర్తుంది సరే! హాలీవుడ్ సినిమా న్యూస్‌లోకి మహేశ్ ఎందుకొస్తాడు?' అనేగా మీ డౌట్! అక్కడే ఉంది అసలు విషయం. 'బూమ్ బూమ్...' పాటలో 'మార్వెల్ కామిక్సే వీణ్ని చూసినాక రాశారేమో!' అనే లైన్ గుర్తుందిగా? మార్వెల్ కామిక్స్ అంత పాపులర్ మరి! ఆ కామిక్స్ నుంచి పుట్టుకొచ్చిన సినిమాలూ అంతే! సూపర్ హీరోలంతా ఓ దగ్గర చేరి చేసే హంగామా నుంచి పుట్టిన 'అవెంజర్స్'కు మార్వెల్ కామిక్స్‌లో, సినిమాల్లో ఓ సెపరేట్ క్రేజ్ ఉంది. అవెంజర్స్ సిరీస్‌లో 'ది అవెంజర్స్' (2012) 'ది అవెంజర్స్ – ఏజ్ ఆఫ్ అల్ట్రాన్' (2015) సినిమాలకు సీక్వెల్‌గా 2018లో 'అవెంజర్స్ – ఇన్ఫినిటీ వార్' అనే సినిమా వస్తోంది. ట్రైలర్‌తో ఔట్ అండ్ ఔట్ యాక్షన్ సినిమా అన్న విషయం తెలుస్తూనే ఉంది. ఇటీవల విడుదలైన ఈ ట్రైలర్ 'అవెంజర్స్' అభిమానులను విపరీతంగా ఆకట్టుకుంటోంది. మే 4, 2018న సినిమా విడుదలవుతోంది. అంటే.. మనకు సరిగ్గా సమ్మర్ టైమ్. విశేషం ఏంటంటే ఈ చిత్రాన్ని మనమే ముందు చూడబోతున్నాం. ఎందుకంటే ఏప్రిల్ 27న ఇండియాలో ఈ సినిమా విడుదల కానుంది. ఆంథోని, జాయ్ రుస్సో దర్శకత్వంలో తెరకెక్కుతోన్న ఈ సినిమాను మార్వెల్ స్టూడియోస్ నిర్మిస్తోంది. రాబర్ట్ డౌనీ, జాష్ బ్రోలిన్, మార్క్ రఫాలో తదితర స్టార్ హీరోలు ఈ సినిమాలో నటిస్తున్నారు.









www.andhrajyothy.com

# ఆంధ్రజ్యోతి




సోమవారం | 4-12-2017 | పేజీలు: 18 + 20 | వెల: రూ. 5.00 | సంపుటి: 58 సంచిక: 229 | శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, హేమంతరుతువు, మార్గశిరమాసం, బహుళపక్షం; తిథి: పాడ్యమి సా. 5.30 తదుపరి విదియ; నక్షత్రం: మృగశిర తె. 3.20 తదుపరి ఆర్ద్ర; వర్జ్యం: ఉ. 11.15 నుంచి 12.39 వరకు; దుర్ముహూర్తం: మ. 12.28-1.12, మ. 2.40-3.24; అమృతఘడియలు: రా. 7.38-9.02; రాహుకాలం: ఉ. 7.30-9.00; సూర్యోదయం: 6.35; సూర్యాస్తమయం: 5.36 | విజయవాడ సిటీ

Vijayawada | Hyderabad | Mahaboobnagar | Tirupathi | Visakhapatnam | Anantapur | Karimnagar | Tadepalligudem | Warangal | Guntur | Kurnool | Nellore | Srikakulam | Kakinada | Khammam | Kadapa | Ongole | Nallagonda | Nizamabad | Bangalore and Chennai



# సహజీవనం నిజమే

## 1979లోనే అంగీకరించిన జయలలిత.. వివాహితుడైనందునే పెళ్లి చేసుకోలేకపోతున్నా

**ఆయనతో బంధాన్ని దాచిపెట్టాల్సిన పనిలేదు**

**స్టార్ అండ్ స్టైల్ ఆంగ్ల పత్రికకు స్వయంగా లేఖ**

**అమృత.. జయ, శోభన్‌బాబు దాంపత్య ఫలమేనా?**

**బిడ్డ ఉన్న మాట వాస్తవం.. జయ మేనత్త కూతురు లలిత**

చెన్నై, డిసెంబరు 3 (ఆంధ్రజ్యోతి): 'నిజం నిద్రపోదు - దాచినా దాగదు'.. ఈ మాటలు తమిళనాడు మాజీ ముఖ్యమంత్రి జయలలిత విషయంలో అక్షరసత్యాలు. తమిళ రాజకీయాల్లో నాటి నుంచి నేటి దాకా నేతల వ్యక్తిగత జీవితం, సామాజిక జీవితంపై బహిరంగ విమర్శలు రావటం సర్వసాధారణం. తమిళ ప్రజల 'అమ్మ'గా పేరు గడించిన జయ దీనికి మినహాయింపేమీ కాదు. మృతి చెంది ఏడాది అవుతున్నా ఆమె వ్యక్తిగత జీవితంపై రకరకాల కథనాలు వెలువడుతున్నాయి. తాజాగా బెంగళూరుకు చెందిన మంజుల అలియాస్ అమృత తానే

మిగతా 16వ పేజీలో...





## డేంజరస్ ఢిల్లీ
# డిక్లేర్డ్

17

ఢిల్లీ వాయుకాలుష్యం ఎంత డేంజర్ స్థాయిలకు చేరిందో యూరోపియన్ స్పేస్ ఏజెన్సీ ఉపగ్రహ చిత్రాలు.. ఢిల్లీలో జరుగుతున్న ఇండియా-శ్రీలంక టెస్ట్ మ్యాచ్ సాక్షిగా తేలింది. నవంబరు 10న రాజధాని నగరాన్ని కమ్ముకున్న కాలుష్య ఛాయలను ఈఎస్ఏ 'సెంటినల్ - 5పి' శాటిలైట్ చిత్రీకరించింది. శ్వాస తీసుకోవడం ఇబ్బందిగా ఉందంటూ లంక ఆటగాళ్ల ఫిర్యాదుతో ఆదివారం మ్యాచ్‌కు మూడుసార్లు అంతరాయం కలిగింది. ఆటగాళ్లు మాస్కులు ధరించి మ్యాచ్ ఆడారు. లక్మల్ ఒక ఓవర్‌లో 5 బంతులు వేసి.. శ్వాస ఆడటం లేదంటూ మైదానం వీడాడు! వారి వైఖరితో తీవ్ర అసహనానికి గురైన కోహ్లీ అసంతృప్తితో భారత ఇన్నింగ్స్‌ను డిక్లేర్ చేశాడు. స్టేడియంలోని 20 వేల మంది ప్రేక్షకులకు, భారత ఆటగాళ్లకు లేని వాయుకాలుష్యం బెడద లంక ఆటగాళ్లకు ఎలా ఉందంటూ విమర్శలు వ్యక్తమయ్యాయి.

## పాపికొండలకు మళ్లీ చలోచలో

**26 బోట్లకు అనుమతి** 5

## ఎంబీబీఎస్‌లో కొత్త సిలబస్

**ఇక కొత్త సబ్జెక్టులుగా** 18

**సెక్స్, ఎథిక్స్, ప్రొఫెషనలిజం**

# ఔటర్ హారం!

## రాష్ట్రంలో పలు నగరాలకు ఔటర్ రింగ్ రోడ్లు

**కర్నూలు, అనంత, కాకినాడకు ఔటర్‌తోపాటు ఇన్నర్ రింగ్‌లు**

**14 మున్సిపాలిటీలకు బైపాస్‌లు**

**3వేల కోట్లతో ఆర్అండ్‌బీ ప్రతిపాదన**

**సీమ నగరాలు, పట్టణాలకు మహర్దశ**

**ప్రజలకు ట్రాఫిక్ కష్టాల నుంచి ఊరట**

**వాయు, శబ్ద కాలుష్యం నుంచి విముక్తి**

**భూసేకరణ చిక్కుల నుంచీ ఊరట**

**ఆయా నగరాల్లో అభివృద్ధికి ఊతం**



కంటినిండా నిద్రపోదామంటే భారీ వాహనాల రొద. నిత్యం పదుల సంఖ్యలో ప్రాణాలను బలిగొనే రోడ్డు ప్రమాదాలు. ఈ పరిస్థితికి చెక్ పెట్టాలని రాష్ట్ర ప్రభుత్వం సంకల్పించింది. శరవేగంగా అభివృద్ధి చెందుతున్న పలు నగరాలకు ఔటర్ రింగు రోడ్లను ఏర్పాటు చేయాలని నిర్ణయించింది.

అమరావతి, డిసెంబరు 3 (ఆంధ్రజ్యోతి): జాతీయ రహదారుల వెంట ఉన్న నగరాలు, పట్టణాల్లో ఔటర్, ఇన్నర్ రింగు రోడ్డులను ఏర్పాటు చేయాలని నిర్ణయించారు. భారీ వాహనాలు, ఇతర రాష్ట్రాలకు చెందిన బండ్లు నగరాలు, పట్టణాల్లోకి రాకుండా.. బయటి నుంచే వెళ్లిపోయేలా ఔటర్ రింగ్ రోడ్డులను నిర్మించడంతోపాటు ఆయా నగరాలు, పట్టణాల ప్రజల పెరుగుతున్న అవసరాలకు అనుగుణంగా ఇన్నర్ రింగు రోడ్డులనూ నిర్మించనున్నారు. నగరాలు, పట్టణాల నుంచి వెళుతున్న జాతీయ రహదారులను విస్తరించడం సర్కారుకు కష్టతరమవుతోంది. భూసేకరణ ఖరీదైన ప్రక్రియ కావడంతోపాటు.. ఇళ్లు, దుకాణ సముదాయాలను కోల్పోతున్న ప్రజలకు పునరావాసం కల్పించడం సంక్లిష్టంగా మారుతోంది. ఈ నేపథ్యంలో నగరాలు, పట్టణాలకు ఔటర్ రింగ్ రోడ్లు ఉండాలని సర్కారు భావిస్తోంది. వీటి నిర్మాణంతో ఆయా ప్రాంతాల్లో ఆర్థికాభివృద్ధి, స్థిరాస్తి వ్యాపారం భారీగా పుంజుకుంటుందని, కొత్తగా పరిశ్రమలు, కంపెనీలు కూడా భారీగా తరలివచ్చే అవకాశం ఉంటుందని అంచనా వేస్తోంది. అందులో భాగంగా అనంతపురం, కర్నూలు, కడప, నెల్లూరు, కాకినాడ, తాపేశ్వరం, భీమవరం, తణుకు, కల్యాణదుర్గం, కుప్పం, మడకశిర, ద్రాక్షారామం తదితర వాటికి ఔటర్ రింగు రోడ్డును ప్రతిపాదించారు. వీటిలో కర్నూలు, అనంతపురం, కాకినాడ నగరాలకు ఇన్నర్ రింగు రోడ్డులనూ ప్రతిపాదించారు. ఇవేవీ లేని వాటికి బైపాస్ రోడ్డులను ప్రతిపాదించారు. అయితే ప్రతిపాదిత రోడ్లలో కొన్నింటికి కేంద్ర ప్రభుత్వ అనుమతులు, ఆర్థిక సాయం

మిగతా 5వ పేజీలో...



## దక్షిణ కొరియాలో సీఎం

నేటి నుంచి 3 రోజులు వరుస భేటీలు

పలు సంస్థలతో చర్చలు, ఎంవోయూలు

5

గుంటూరు జిల్లా కల్తీకి అడ్డాగా మారింది! కారానికి కల్తీ చెద పట్టింది! విత్తనాలకూ ఈ జాడ్యం సోకింది! ఇటీవలే ప్రాణాధారమైన మందులూ కల్తీయే అని తెలుసుకుని జనం నివ్వెరపోయారు! ఇప్పుడు ఈ జాబితాలో కండోమ్ కూడా చేరింది! నకిలీ కండోమ్‌ల తయారీకి కొన్ని ప్రాంతాలు కుటీర పరిశ్రమలుగా మారాయి!

# కండోమ్‌లూ నకిలీ!

## ప్రముఖ బ్రాండ్ల పేరుతో అమ్మకాలు

గుంటూరు జిల్లాలో జోరుగా నకిలీ దందా

కుటీర పరిశ్రమలుగా తయారీ కేంద్రాలు

చర్యలకు 'తీరిక' లేదంటున్న అధికారులు

గుంటూరు (సంగడిగుంట), డిసెంబరు3 : గుంటూరు జిల్లాలో ఏ వస్తువును చూసినా భయపడే రోజులివి. కల్తీతోపాటు నకిలీ వస్తువులు మార్కెట్‌ను ముంచెత్తడమే దీనికి కారణం. నకిలీ లేని వస్తువును చూపిస్తే ప్రత్యేకంగా బహుమతి ఇస్తామని ప్రకటించే పరిస్థితి నెలకొంది. ఈ జాబితాలో కండోమ్‌లు కూడా చేరడం మరింత ఆందోళనకు గురిచేస్తోంది. గుంటూరులోని ఆటోనగర్, నరసరావుపేటలోని శ్రీరామ్‌నగర్, కోట సెంటర్‌లలో నకిలీ కండోమ్‌ల తయారీ కుటీర పరిశ్రమల్లా చురుగ్గా ఉన్నట్లు సమాచారం. పది నుంచి 15 కుటుంబాలు ఈ పనిలోనే ఉన్నాయని తెలుస్తోంది. రెండు రకాలుగా నకిలీ కండోమ్‌లను మార్కెట్‌లోకి తీసుకొస్తున్నారు. వివిధ బ్రాండెడ్ కంపెనీల బాక్స్‌లపై సీల్స్ తీసేసి అందులో నకిలీ కండోమ్‌లు పెట్టి అమ్మేస్తున్నారు. కనీసం పది రూపాయలు కూడా విలువ చేయని కండోమ్‌లను రూ.200లకు అంటగడుతున్నారు. పరీక్షగా చూస్తేగానీ తెలియనంతగా

మిగతా 6వ పేజీలో...

# ఏం కొనలేం.. ఏం తినలేం

## ధరల మంటతో..సామాన్యులకు తంటా

కొండెక్కిన కోడిగుడ్డు..కన్నీళ్లు తెప్పిస్తున్న ఉల్లి

చింతపండు కిలో 180, మిరప కిలో 90

అందుబాటులో లేని పప్పులు, నూనెల రేట్లు

ఏం కొనేటట్టూ లేదు..ఏం తినేటట్టూ లేదు! సరుకుల రేట్లు చూస్తే సామాన్యుల గుండె గుభేల్ మంటోంది! కోయకుండానే ఉల్లి కన్నీళ్లు తెప్పిస్తుంటే...కోడిగుడ్డు ధర కొండెక్కింది! నెలనెలా పెరుగుతున్న ధరలతో సామాన్యుల నెల బడ్జెట్ తలకిందులవుతోంది. ఏ వస్తువును చూసినా రేట్లు పెరగడమే కానీ, తగ్గుతున్న దాఖలాలు కనిపించడం లేదు. శుభకార్యాలు లేకపోయినా నిత్యావసర వస్తువుల ధరలు ఎందుకు మండిపోతున్నాయో అర్థం కావడం లేదు.



అమరావతి, డిసెంబరు3(ఆంధ్రజ్యోతి): ఉల్లిపాయలు, చింతపండు, ఎండుమిర్చి, వేరుశనగ ధరలు ఆకాశాన్నంటుతున్నాయి. కోడిగుడ్లు, క్యారెట్ ధరలు అదరగొడుతున్నాయి. నెలరోజులుగా ఈ రెండింటి ధరలు అనూహ్యంగా పెరుగుతున్నాయి. గతనెలలో చింతపండు కిలో రూ.120 ఉండగా, పక్షం రోజుల్లో అమాంతం రూ.60 పెరిగింది. కిలో రూ.180 చెప్తున్నారు. ఉల్లిపాయలు హోల్‌సేల్‌లోనే కిలో రూ.60 ఉంది. రిటైల్‌లో రూ.70దాకా అమ్ముతున్నారు. ఎండు మిర్చి ధర కిలో రూ.90కి చేరింది. గత నెలలో

మిగతా 5వ పేజీలో...

## జీఎస్టీ ఆదాయంలో 100 కోట్లకు కోత!

**నవంబరులో వచ్చింది 600 కోట్లే**

**వ్యాపారుల వేచిచూసే ధోరణే కారణం**

16

**ఈ నల్లని ఇసుకలో...**



విశాఖ సమీపంలోని భీమిలి తీరంలో నలుపు రంగులో ఇసుక

# ఏపీలో బ్లాక్ బీచ్!

## భీమిలి వద్ద కనిపించే వింత

ఇలమనైట్, మెగ్నెట్ ఖనిజాలే కారణం

రాష్ట్రంలో ఇచ్ఛాపురం వరకు నిక్షేపాలు

టైటానియం తయారీలో వినియోగం

(విశాఖపట్నం - ఆంధ్రజ్యోతి)

మీరు చాలా బీచ్‌లు చూసే ఉంటారు! కొన్నిచోట్ల తీరంలో ఇసుక తెల్లగా మెరిసిపోతుంటుంది! మరికొన్ని చోట్ల బంగారు వర్ణంలో మురిపిస్తూంటుంది! కానీ... విశాఖ నగరానికి 30 కిలోమీటర్లదూరంలోని భీమిలి బీచ్ మాత్రం నల్లగా నిగనిగలాడుతూ ఉంటుంది! దానిని

మిగతా 2వ పేజీలో...

**దేవాదాయం.. దైవాధీనం**

# ఇన్‌చార్జిలే దిక్కు!

**పెద్ద ఆలయాలకు ఈవోల కొరత**

**ఒక్కరికే రెండు, మూడు బాధ్యతలు**

**కొన్నిచోట్ల ఏళ్లుగా ఇదే పరిస్థితి**

**కమిషనరేట్‌లోనూ ఖాళీలే**

అమరావతి, డిసెంబరు 3(ఆంధ్రజ్యోతి): రాష్ట్రంలో ఆలయాల నిర్వహణ వ్యవస్థ అస్తవ్యస్తంగా మారింది. కార్యనిర్వహణ అధికారులు(ఈవోలు) కొరత వల్ల ఒక్కొక్కరిపై రెండు మూడు బాధ్యతలు పెట్టడంతో పాలన గాడి తప్పుతోంది. ఈ పరిస్థితి వల్ల కొన్ని ఆలయాల్లో అసిస్టెంట్ కమిషనర్ చూడాల్సిన బాధ్యతలను కేవలం జూనియర్ అసిస్టెంట్‌తో నెట్టుకొస్తున్న పరిస్థితులు కనిపిస్తున్నాయి. దేవాదాయశాఖలో పదోన్నతులు లేకపోవడంతో పైస్థాయి అధికారుల కొరత వల్ల ఈ పరిస్థితి తలెత్తుతోంది. రాష్ట్రంలో ఎనిమిది ప్రధాన ఆలయాలున్నాయి. ఈ ఆలయాలకు జాయింట్ కమిషనర్ స్థాయి అధికారులు ఈవోలుగా ఉండాలి. కానీ కీలకమైన అన్నవరం ఆలయానికి గత ఆరు నెలలుగా ఈవో లేకుండా కేవలం అసిస్టెంట్ కమిషనర్ స్థాయి అధికారి ఇన్‌చార్జ్‌గా వ్యవహరిస్తున్నారు. మరో ప్రధాన ఆలయం శ్రీకాళహస్తి ఈవోగా ఉన్న ఆర్‌జేసీ కేడర్ అధికారికి దాంతోపాటు జోన్-2 ఆర్‌జేసీ బాధ్యతలను

మిగతా 6వ పేజీలో...

# మూడే 3 నిమిషాలు!

**దొంగ ఇంట్లో ఉండగానే పట్టివేత.. టెక్నాలజీలో సూపర్ పోలీస్**

**సాంకేతికతను అందిపుచ్చుకున్న కడప ఖాకీలు**

**విస్తృత వినియోగానికి డీజీపీ చొరవ.. పోలీస్ శాఖలో ఆర్టీజీ**



ఇంట్లో ప్రవేశించిన దొంగ ఇతడే

2

# నేటికల్లా వాయుగుండం

**బలపడి కోస్తా దిశగా.. తుఫాన్‌గా మార్పు?**

2











పరంజ్యోతి

# సత్య ధర్మానుష్ఠానమే లోకానికి రక్ష



భారతీయ సంస్కృతిలో విలువలకే పెద్దపీట. ఏ అంశాన్నైనా కథలతో జోడించి చెప్పడం ద్వారా హృదయాన్ని ఆకర్షించి రంజింపజేసే పద్ధతిని వేదాలు, ఇతి హాసాలు, కావ్యాలు.. ఇలా సర్వ భారతీయ సాహిత్యమూ అనుసరించింది. ఆ సాహిత్యం ప్రవచించిన విలువల్లో మొదటిది "సత్యం". ఇది లోకోపకారకమైన గొప్ప ధర్మం. దీన్ని గుర్తించిన ఆదికవి వాల్మీకి మహర్షి తన కావ్య కథానాయకుడైన శ్రీరామచంద్రుని మొదలు అన్ని ప్రధాన పాత్రలనూ సత్యం చుట్టే పరిభ్రమించేటట్టు చిత్రించాడు.

**'సత్యమేవేశ్వరో లోకే సత్యం పద్మాశ్రితాసదా**
**సత్యమూలాని సర్వాణి సత్యన్నాస్తి పరంపదమ్'**

.. అన్నాడు. ఈ ప్రపంచంలో సత్యమే ఈశ్వరుడు. సత్యమే సంపద. అంతెందుకు.. అన్నీ సత్యమూలాలే గనుక సత్యాన్ని మించిన మరో స్థాయి లేదంటూ..

**"సత్యమేక పదం బ్రహ్మ సత్యేధర్మ ప్రతిష్ఠితః**
**సత్యమేవాక్షయా వేదా స్సత్యేనైవావా ప్యతే పరమ్"**

..అని సత్య ప్రశస్తిని పేర్కొంటూ సకలధర్మాలకు మూలమైన సత్యమే అన్ని ధర్మాల్లోనూ నిండి ఉందన్నాడు. సత్యాన్ని నిత్యం తన ధర్మంగా భావించి విలువలు కాపాడిన నాయకుడే రాముడు కాబట్టి మారీచుని నోట "సాధుస్సత్య పరాక్రమః" అనిపించాడు. అంతేకాదు అంతటి రామచంద్రుని ముఖతః భరతుణ్ణి గురించి కూడా

**"ధర్మజ్ఞః సత్య సంధశ్చ ప్రజానంచ హితేరతః**
**యశస్వీ జ్ఞాన సంపన్నాః శుచిర్వశ్యం సమాధిమహే"**

అంటూ పేర్కొనడంలోనే ఉత్తమ వ్యక్తిత్వాన్ని కాపాడే గుణం 'సత్య'సంధత్వమేనని చెప్పినట్లయింది. పరిపాలన చేసే పాలకుడు సత్యాన్ని అనుష్ఠించినపుడే పాలితు సత్యధర్మాన్ని పాలిస్తారన్న నిజం అడుగడుగునా రామకథ మనకు అవగాహన చేసింది. 'రామ సత్యపరాక్రమం' అన్నా 'ధర్మజ్ఞో గురుభిర్దాంతః కృతజ్ఞత స్సత్యవాక్శుచిః' - అన్నా అన్ని చోట్లా 'సత్య' ధర్మానుష్ఠానమే ఈ లోకాన్ని రక్షించేదన్న సూచన కనిపిస్తుంది.

ఏ విలువలైనా జీవకోటి రక్షకాలే. దానికొరకే ధర్మానుష్ఠానం. అందుకే మనకు రాముని కథైనా, హరిశ్చంద్రుని కథైనా, మరే కథైనా చెప్పే ప్రయత్నం చేసింది మన సంస్కృతి. భారతం వంటి గ్రంథాల్లో కూడా రామాయణ స్ఫూర్తితో విదురనీతి. 'సత్యేన ధార్యతే పృథ్వీ' అని భూమండలమంతా సత్యం వల్లనే నిలుస్తున్నట్టు చెప్పింది. 'సత్యం' ఈ లోకంలో ప్రధాన ధర్మంగా నిలిస్తే, ప్రజలు సత్యాన్ని మరువకుండా సాధన చేస్తే మన బతుకుకు సార్థకత. అది మన జీవిత పరమార్థం. ఆ శక్తినిచ్చేవే మన వేదాలు, పురాణాలు, కావ్యాలు. ఎన్ని కష్టాలెదురైనా, ఎన్ని అడ్డంకులు వచ్చినా సత్యాన్ని వదలరాదన్న సంగతి మరువరాదు.

-గన్నమరాజు గిరిజామనోహరబాబు

## పాటల పారిజాతం.. ఘంటసాల



1922 - 1974

**తెలుగు పాటకు పర్యాయపదం ఘంటసాల.. ఆ'పాత'మధురాలైన ఎన్నో పాటలు ఆయన గళంలోనే పురుడు పోసుకున్నాయి. నాదానుభవం, రసానుభవాలను మేళవించి పాటకు కొత్త ఒరవడి దిద్దిన ఘంటసాల వేంకటేశ్వరరావు తెలుగువారి హృదయాల్లో గాన గంధర్వుడిగా స్థానం సంపాదించుకున్నారు.**

పదకవితా పితామహుడు అన్నమయ్య తర్వాత తిరుమల శ్రీవారి ఆలయంలో గీతాలను ఆలపించిన ఏకైక గాయకుడు ఘంటసాల. 'శేషశైలావాస శ్రీవేంకటేశా...' అంటూ శ్రీవారి సన్నిధిలో ఆయన పాడిన పాట అప్పటికీ, ఇప్పటికీ, ఎప్పటికీ సంగీతాభిమానులకు అద్భుత రసగుళికే. భక్తి గీతాలాపన చేసినా, ప్రణయగీతం అందుకున్నా ప్రేక్షకులను ఉర్రూతలూగించడం ఆయనకే సాధ్యం. సినీ సంగీత సామ్రాజ్యానికి చక్రవర్తి అయినా అత్యంత సాధారణంగా, నిరాడంబరంగా ఉండేవారు. ఒకసారి ఘంటసాల మద్రాసు వెళ్లడానికి విజయవాడ రైల్వేస్టేషన్‌లోని ఐదో నెంబరు ఫ్లాట్‌ఫాంపైకి వచ్చారు. మెయిల్ రావడం ఆలస్యం కావడంతో అటూఇటూ పచార్లు చేస్తున్నారు. అక్కడ ఉన్న ప్రయాణికుల్లో ఆయన్ను గుర్తించినవారు లేరు. అంతలో ఒక నడివయస్కురాలు పరిగెత్తుకుంటూ వచ్చి "ఏమి తపంబొనర్చి జన్మించినావయా.." అంటూ సాష్టాంగ నమస్కారం చేశారు. దీంతో ఒక్కసారిగా కలకలం మొదలైంది. అడుగో మన ఘంటసాల అంటూ గుమికూడిన జనం ఆయనకు అభినందన చందనాలు అద్దారు.

1922 డిసెంబరు 4న కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా చౌటపల్లిలో సూరయ్య, రత్తమ్మ దంపతులకు ఘంటసాల వేంకటేశ్వరరావు జన్మించారు. స్వతహాగా సంగీతకారుడైన తండ్రి పాడే పాటకు చిన్నారి వేంకటేశ్వరరావు నాట్యం చేసేవారు. అలా ఆయనకు బాల్యంలోనే సంగీత జ్ఞానం అబ్బింది. 11 ఏళ్ల వయసులోనే తండ్రి కన్నుమూయడంతో మేనమామ వద్ద పెరిగారు. సంగీతం మీద మక్కువతో ఇంట్లో చెప్పకుండా విజయనగరం వెళ్లి సంగీతాన్ని అభ్యసించారు. ఆ తరువాత సీనియర్ సముద్రాల వద్దకు చేరి, కొన్నాళ్లు ఆకాశవాణిలో పాడారు. ఘంటసాల పాటలను హెచ్‌ఎంవీలో పేకేటి శివరామ్ రికార్డు చేశారు.

### గుర్తుకొస్తున్నారు...

● నేడు ఘంటసాల వేంకటేశ్వరరావు జయంతి

ఏఎన్ఆర్ నటించిన సీతారామకల్యాణంలో అదనపు పాత్ర పోషించిన ఘంటసాల, రత్నమాల సినిమాలో కోరస్ పాడారు. ఆ తర్వాత ఎన్‌టీఆర్ నటించిన 'మనదేశం'తో సంగీత దర్శకుడయ్యారు. కీలుగుర్రం, లైలా మజ్ను తదితర చిత్రాలతో ప్రారంభించి దాదాపు అందరు హీరోల సినిమాలకు పాడారు. గుండమ్మ కథ, మాయాబజార్, లవకుశ వంటి ఎన్నో సినిమాలను తన గాత్రం ద్వారా తెలుగు సినీ రంగంలో ఆణిముత్యాలుగా నిలిపారు. అమెరికా, ఇంగ్లండ్, జర్మనీతో పాటు ఐక్యరాజ్య సమితి(యూఎన్)లోనూ పాడి శెహభాష్ అనిపించుకున్నారు. మహారాష్ట్ర బాణీలో ఉన్న తెలుగు సినిమా పాటకు ఆయన రాకతో అర్థమే మారిపోయింది. భావరంజితంగా లలిత సంగీతాన్ని పరవళ్లు తొక్కించారు. కల్యాణిరాగంలో ఆయన పాడిన పాటలకు శ్రోతలు మైమరచిపోయేవారు. పౌరాణికం, జానపదం, సాంఘికం ఇలా సినిమా ఏదైనా ఆయన పాటలు అజరామరంగా నిలిచాయి. తెలుగు సినీ సంగీతానికి ధ్రువతార, ఆరాధ్యదైవం, వైతాళికుడైన ఘంటసాల 1942లో స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొని జైలుకు కూడా వెళ్లారు. తన స్వరఝురిలో శ్రోతలను ఓలలాడించిన ఆయన్ను ప్రభుత్వం 'పద్మశ్రీ' అవార్డుతో సత్కరించింది. 1974 ఫిబ్రవరి 11న తన గానామృతాన్ని తెలుగు శ్రోతలకు వదిలి తిరిగిరాని లోకాలకు పయనమైపోయారు.

- విజయవాడ, ఆంధ్రజ్యోతి

# మూడే 3 నిమిషాలు!

- దొంగ ఇంట్లో ఉండగానే పట్టివేత
- టెక్నాలజీలో సూపర్ పోలీస్
- సాంకేతికత బాటలో కడప ఖాకీలు
- విస్తృత వినియోగానికి డీజీపీ చొరవ
- సీఎం ఆదేశాలకు అనుగుణంగా.. పోలీస్‌శాఖలో 'రియల్ టైమ్ గవర్నెన్స్'

అమరావతి, డిసెంబరు 3(ఆంధ్రజ్యోతి): 'పోలీసులు కనిపించకూడదు...పోలీసింగ్ మాత్రమే కనిపించాలి...రియల్ టైమ్ గవర్నెన్స్ కావాలి' అని ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు పదేపదే చెబుతన్న మాటలను ఏపీ పోలీసులు నిజం చేశారు. దొంగలుపడ్డ ఆర్నెల్లకు పోలీసులొస్తారు...అనే మాట నుంచి దొంగలుపడ్డ మూడు నిమిషాల్లోనే వస్తాం అని నిరూపిస్తున్నారు. బీరువా తాళాలు బద్దలు కొడుతుండగా ఇంటిని చుట్టుముట్టి దొంగను పట్టుకున్న కడప పోలీసుల పనితీరు రాష్ట్ర పోలీసు వర్గాల్లో పెద్ద చర్చనీయాంశమైంది. డీజీపీ సాంబశివరావు ప్రతిష్టాత్మకంగా తీసుకొని రాష్ట్ర వ్యాప్తంగా అమలు చేయించిన లాక్డ్ హౌస్ మానిటరింగ్ సిస్టమ్(ఎల్‌హెచ్ఎంఎస్) సాధించిన తొలివిజయం పట్ల ప్రజల్లోనూ హర్షం వ్యక్తమవుతోంది. ఏడాదిక్రితం అనంతపురంజిల్లా ఎస్పీ రాజశేఖర్‌బాబు(ప్రస్తుతం చిత్తూరుజిల్లా ఎస్పీ) దొంగతనాల నివారణకు టెక్నాలజీని వినియోగించాలని చేసిన ఆలోచనతో ఎల్‌హెచ్ఎంఎస్ పుట్టుకొచ్చింది. ఎవరైనా ఇల్లు వదిలి బయటికి వెళ్లాల్సివస్తే ఎల్‌హెచ్ఎంఎస్ యాప్ డౌన్‌లోడ్ చేసుకుని అందులో వివరాలు నమోదు చేస్తే చాలు. జిల్లా ఎస్పీ, కంట్రోల్ రూమ్‌తోపాటు స్థానిక



సీసీ కెమెరాలో చిక్కిన దొంగ

పోలీసులకు సమాచారం అందుతుంది. సంబంధిత పోలీసు స్టేషన్ నుంచి ఫోన్ వస్తుంది. ఇంటికి వచ్చి పోలీసులు ఎల్‌హెచ్ఎంఎస్ ఏర్పాటు చేస్తారు. ఆ తర్వాత ఇంట్లోకి ఎవరు ప్రవేశించినా పోలీసు కంట్రోల్ రూమ్‌లో అలారం మోగుతుంది. ఈ విధానం నచ్చిన ఎస్పీ రాజశేఖర్‌బాబు వేసవిలో ఎక్కువగా దొంగతనాలు జరిగే అనంతపురంలో బాగా ప్రచారం చేసి అమల్లోకి తీసుకొచ్చారు. దీంతో మంచి ఫలితాలు వస్తున్నాయని తెలుసుకున్న డీజీపీ సాంబశివరావు రాష్ట్రంలోని అన్ని పోలీసు యూనిట్లలో ఎల్‌హెచ్ఎంఎస్ అమలు చేయాలని ఆదేశించారు. రెండునెలల క్రితం కలెక్టర్ల సదస్సులో ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడుకు పోలీస్‌బాస్ దీనిపై వివరించారు. పోలీసులు టెక్నాలజీ అందిపుచ్చుకొంటున్నారని, అయితే రియల్ టైమ్ గవర్నెన్స్(ఘటన జరుగుతుండగా సకాలంలో చేరుకొని నివారించాలి) కావాలని సీఎం అన్నారు. సీసీ కెమెరాల్లో నేరం జరిగిన విధానం రికార్డయితే ఆ తర్వాత వెళ్లి బాధ్యులను అరెస్టు చేసి చట్టపరంగా శిక్షించే స్థాయికి వచ్చారని, అలాకాకుండా ఘటన జరగకుండా నివారించే పరిస్థితి రావాలన్నారు. అభివృద్ధి చెందిన దేశాల్లో సైతం పోలీసులు ఘటనా స్థలికి చేరుకోవాలంటే చాలా సమయం పడుతోందని, ఇది సాధ్యమయ్యే పనేనా? అని కొందరు పోలీసులు ఆశ్చర్యం వ్యక్తం చేశారు. అయితే సీఎం మాటలను సీరియస్‌గా తీసుకున్న డీజీపీ సాంబశివరావు అన్ని జిల్లాల ఎస్పీలను అప్రమత్తం చేశారు. ప్రజలతో గౌరవంగా మాట్లాడి వారి సొమ్ము దొంగల పాలు కాకుండా చూస్తే పోలీసుశాఖ ప్రతిష్ఠ పెరుగుతుందని, సీఎం ఆకాంక్ష కూడా నెరవేరుతుందని చెబుతూ వచ్చారు. దీంతో అన్ని జిల్లాల ఎస్పీలు ఎల్‌హెచ్ఎంఎస్ గురించి బాగా ప్రచారం చేశారు.

### ఇలా పట్టుకున్నారు!

నవంబర్ 14న కడపలో చిన్నచౌకు ప్రాంతానికి చెందిన మహేశ్ అనే వ్యక్తి కుటుంబంతో ఊరెళ్లాల్సి రావడంతో పోలీసులకు సమాచారం ఇచ్చాడు. డిసెంబరు 8 వరకూ తన ఇంట్లో ఎల్‌హెచ్ఎంఎస్ ఏర్పాటు చేయాలని కోరాడు. శుక్రవారం రాత్రి 2.10 గంటలకు ఇంటి తాళాలు బద్దలు కొట్టి దొంగ లోపలికి ప్రవేశించాడు. సైరన్ మోగడంతో మూడు నిమిషాల్లోనే ఆ ఇంటికి చేరుకున్న పోలీసులు లోపలఉన్న దొంగను పట్టుకున్నారు. టెక్నాలజీతో పట్టుకున్నారు.

## శైలజకు వేలూరు సీఎంసీలో చికిత్స

- భర్త దాడిలో గాయపడిన నవవధువు.. శాడిస్టు టీచర్ సస్పెన్షన్

చెన్నై, చిత్తూరు (విద్య), డిసెంబరు 3(ఆంధ్రజ్యోతి): శాడిస్ట్ భర్త చేతిలో తొలిరాత్రే దాడికి గురైన చిత్తూరు జిల్లా గంగాధర నెల్లూరుకు చెందిన నవ వధువు శైలజకు వేలూరులోని సీఎంసీ ఆస్పత్రిలో మెరుగైన చికిత్స అందిస్తున్నారు.



రాజేష్



శైలజ

ఆమె పరిస్థితి కాస్త ఆందోళనకరంగానే ఉండగా, కుటుంబీకులు, బంధువులు కన్నీరుమున్నీరవుతున్నారు. చిత్తూరు జిల్లా గంగాధర నెల్లూరుకు సమీపంలోని చిన్నతామరగుండ గ్రామానికి చెందిన శైలజ(22)కు, అదే జిల్లాలోని మోతకరంగన్నపల్లెకు చెందిన టీచర్ రాజేష్(24)తో ఈ నెల 1న వివాహం జరగగా, శనివారం శోభనం గదిలో రాజేష్ పైశాచికంగా ప్రవర్తించి ఆమెను తీవ్రంగా గాయపరచిన విషయం విదితమే.

### శాడిస్టు టీచర్ రాజేష్ సస్పెన్షన్

పెళ్లయిన తొలిరోజే భార్యను హింసించిన టీచరు రాజేష్‌ను కలెక్టర్ ఆదేశాల మేరకు సస్పెండ్ చేస్తున్నట్లు డీఈవో పాండురంగస్వామి ప్రకటించారు.

## కోలుకుంటున్న కన్నియాకుమారి

చెన్నై, డిసెంబరు 3 (ఆంధ్రజ్యోతి): 'ఒఖీ' తుఫాను తాకిడికి అతలాకులమైన తమిళనాడు రాష్ట్రంలోని కన్నియాకుమారి జిల్లా ఇప్పుడిప్పుడే కోలుకుంటోంది. నాలుగు రోజులపాటు కుండపోతగా కురిసిన భారీ వర్షాలకు ఈ జిల్లా తీవ్రంగా నష్టపోయింది. సుమారు లక్ష ఎకరాల్లో వరి పంట నీటమునిగింది. వాగులు, వంతెనలు, రహదారులు కొట్టుకుపోవడంతో వాహనాల రాకపోకలు పూర్తిగా స్తంభించాయి. ప్రస్తుతం ఇక్కడ వరద బాధితులకు పునరావాసం, రహదారుల మరమ్మతు, విద్యుత్ సరఫరా పునరుద్ధరణ వంటి పనులు జరుగుతున్నాయి. ఇక ఈ జిల్లా నుంచి సముద్రంలో చేపలవేటకు వెళ్లిన గల్లంతయిన 2వేల మంది జాలర్లలో 956మంది సురక్షితంగా తీరానికి చేరుకున్నారు. అయితే ఈ సంఖ్యపై ప్రభుత్వ వర్గాల నుంచి స్పష్టమైన సమాచారం లేదు. కన్నియాకుమారి, పరిసర తీర ప్రాంతాలకు చెందిన వీరందరూ ప్రస్తుతం కేరళ, మహారాష్ట్ర, కర్నాటక రాష్ట్రాల్లోని ఓడరేవుల్లో తలదాచుకుంటున్నారు. ఇక పడవలు నీట మునగటంతో 8మంది జాలర్లు దుర్మరణం చెందారు. గల్లంతయిన జాలర్ల కోసం 11 నౌకలతో గాలింపు చర్యలు కొనసాగిస్తున్నారు. తుపాను తాకిడికి గురైన కన్నియాకుమారి జిల్లాలో రక్షణశాఖ మంత్రి నిర్మలా సీతారామన్ ఆదివారం పర్యటించారు. సుశీంద్రం ప్రాంతంలో బాధితులను పరామర్శించారు. డిప్యూటీ సీఎం పన్నీర్‌సెల్వం, కలెక్టర్ సజ్జన్‌సింగ్, నేవీ ఉన్నతాధికారులతో ఆమె సమావేశమై, తుఫాను నష్టాలపై సమీక్షించారు. అంతకుముందు మంత్రి తన ట్విటర్‌లో.. సముద్రంలో గల్లంతయిన 1,154 మంది జాలర్లను కాపాడినట్లు పేర్కొన్నారు. కేరళ, కర్నాటక, మహారాష్ట్రలోని ఓడరేవుల వద్దకు వారిని చేర్చినట్లు తెలిపారు.

## రొయ్యకు తెల్లమచ్చ వైరస్

- 1.50 లక్షల ఎకరాల్లో సాగు నిలిపివేత
- ఆక్వా ఆదాయానికి గండి?

భీమవరం, డిసెంబరు 3: రాష్ట్రంలో రొయ్యల సాగు తీవ్రంగా దెబ్బతినే పరిస్థితి కనిపిస్తోంది. డబ్ల్యూఎస్ఎస్‌వీ(వైట్ స్పాట్ సిండ్రోమ్ వైరస్) వైరస్‌తో రొయ్య పిల్లలు సీడ్ దశలోనే చనిపోతున్నాయి. ఇది ప్రతికూల వాతావరణమని నిపుణులు చెబుతున్నారు. ఫలితగా రాష్ట్రంలో 1.50 లక్షల ఎకరాల్లో రొయ్యల సాగు నిలిచిపోయింది. దేశంలోనే అత్యధిక సాగు జరిగే పశ్చిమ గోదావరి జిల్లాలో 80 వేల ఎకరాలకు ఈ వైరస్ దెబ్బతో పెంపకం ఆగిపోయింది. అక్టోబరు, నవంబరు నెలలో వేసిన రొయ్య పిల్లలు 20 రోజుల్లో చనిపోవడంతో సాగు ప్రశ్నార్థకంగా మారింది. ఫలితంగా ప్రభుత్వానికి రానున్న 3 నెలల్లో రావలసిన వేల కోట్ల ఆదాయంపై తీవ్ర ప్రభావం చూపడం ఖాయంగా కనిపిస్తోంది. మొత్తం మీద ఒక్క రొయ్యల సాగే 2 లక్షల ఎకరాలకుపైగా ఉండగా, ప్రస్తుతం రాష్ట్రంలో 50 వేల ఎకరాలలోపు మాత్రమే రొయ్యలు బతికినట్లు గణాంకాలు చెబుతున్నాయి. కాగా, రైతులకు ఆదాయం తెస్తున్న రొయ్యలు వనమి. ఈ సీడ్‌ను ఎల్-వనమిగా పిలుస్తారు. ఇది అమెరికాలో బ్రూడర్ సీడ్ ద్వారా మనకు వచ్చింది. గతంలో ఈ సీడ్‌ను చైనా వినియోగించింది. వైరస్ కారణంగా వినియోగం ఆపేసింది. ఇలా నష్టపోయిన చైనా రొయ్య ఉత్పత్తిలో కాస్త వెనుకబడింది. ఈ దశలో ఎల్-వనమి వైరస్ ప్రభావం ఇప్పుడు మనపై పడింది.



## బొమ్మెను చూస్తే దిమ్మతిరుగుడే.. కిలో రూ.600

- కొర్రమీను కొరకొర
- మీసం మెలేస్తున్న రొయ్య
- భారీగా పెరిగిన చేపల ధరలు
- తగ్గిన సరఫరా.. పెరిగిన వినియోగం

హైదరాబాద్ సిటీ, డిసెంబర్ 3 (ఆంధ్రజ్యోతి): చేపల ధరలు వింటే భాగ్యనగరవాసుల ఒళ్లు జలదరిస్తోంది. కార్తికమాసంలో తగ్గిన ధరలు ఇప్పుడు కొండెక్కి కూర్చున్నాయి. దీంతో చేపల వైపు చూడ్డానికి నగరవాసులు సాహసించడం లేదు. తెలంగాణ జిల్లాల నుంచి నగరానికి వేసవి కాలంలోనే ఎక్కువ చేపలు దిగుమతి అవుతుంటాయి. మిగతా కాలాల్లో అధికంగా ఆంధ్రా నుంచే చేపలు, రొయ్యలు దిగుమతి అవుతాయి. అయితే, సరఫరా తగ్గడంతో ధరలు ఆకాశాన్నంటాయి. ముఖ్యంగా తెలంగాణ ప్రజానీకం అత్యంత ఇష్టంగా తినే బొమ్మె చేపల ధరలు ఆకాశాన్నంటుతున్నాయి. కార్తికమాసంలో బొమ్మె చేపలు ధరలు కిలో రూ.400 వరకు ధర పలికింది. అంతకు ముందు కూడా ఎప్పుడు రూ.400 నుంచి రూ.450 వరకు ధర పలికేది. అయితే, ప్రస్తుతం కిలో బొమ్మెల ధర కిలో మటన్ ధరను దాటి పోయింది. కిలో మటన్ ధర రూ.500 ఉండగా బొమ్మె చేపలు కిలో రూ.600 పలుకుతోంది. నగరంలో ప్రధాన చేపల మార్కెట్ అయిన రాంనగర్ మార్కెట్‌లో శనివారం కిలో బొమ్మె ధర రూ.600 పలికింది. శనివారం ఎక్కువ మంది మాంసాహారం ముట్టరు. అయినా, కిలో రూ.600 ధర పలికిందంటే ఆదివారం ధర తలుచుకుంటే గుండెలో దడ పుట్టడం ఖాయం. ఇక, జెల్లలు రూ.400, రవు చేపలు కిలో రూ.120 నుంచి రూ.140, చిన్న రొయ్యలు రూ.250, పెద్ద రొయ్యలు రూ.350 నుంచి రూ.400 వరకు పలుకుతోంది.

### బేరమాడితే అంతే..

చేపల మార్కెట్‌లో బేరం ఆడి అతి తక్కువకు కొనుగోలు చేస్తే మాత్రం అంతే. తక్కువ ధరకు ఇస్తున్నారని మనం కొనుగోలు చేస్తే మాత్రం తూకంలో వ్యాపారులు మోసం చేస్తున్నారు.

కిలోకు రూ.250 గ్రాముల దాకా తక్కువగా తూకం వేస్తున్నారు. వ్యాపారుల వద్ద రెండు రకాల తూకం రాళ్లు ఉంటాయి. మంచి ధర చెల్లించిన వారికి సరిగా తూకం వేసి, ధర తక్కువ చెల్లించే వారికి 750 గ్రాములు వచ్చే కిలో తూకం రాయితో తూకం వేసి ఇస్తారు. కొన్ని సార్లు ఎక్కువ ధర చెల్లించినా తక్కువ తూకం రాళ్లతో తూకం వేసి మోసం చేస్తున్నారు.

## ఏపీలో బ్లాక్ బీచ్!

(మొదటి పేజీ తరువాయి)

చూడగానే... తీరానికి బొగ్గు కొట్టుకొచ్చిందా? చమురు తట్టె తరలి వచ్చిందా? లేక... విశాఖ తీరం వెంబడి ఉన్న పరిశ్రమలు వదిలిన కాలుష్యమా? ఇలాంటి సందేహాలు అనేకం తలెత్తుతాయి! కానీ... ఇవేవీ నిజం కాదు! బాగా ఖరీదైన ఇలమనైట్, మొనజైట్ వంటి భారీ ఖనిజాల వల్లే తీరం ఇలా నలుపు రంగేసుకుంటుంది. మన దేశంలో తూర్పు, పశ్చిమ తీరాల్లో అనేకచోట్ల నల్లని ఇసుక కనిపిస్తుంది. ఈ ఖనిజాలు తీరంలోకి ఎలా చేరాయి? వాటికి ఉన్న ప్రాధాన్యమేమిటి?

### టైటానియం మూలం...

సముద్ర ఇసుక (బీచ్ శాండ్)లో ఇలమనైట్ ఆరు నుంచి ఏడు శాతం ఉంటుంది. ఇది నల్లగా మెరుస్తూ ఆకర్షణీయంగా కనిపిస్తుంది. దీనినే 'ఐరన్ టైటానియం ఆక్సైడ్' అని పిలుస్తారు. టైటానియం తయారీకి అవసరమైన ప్రధాన ముడి పదార్థం ఇలమనైట్. దీనిని భార ఖనిజం (హేవీ మెటల్)గా పిలుస్తారు. టైటానియం తయారీలో 80 శాతం ఇలమనైట్‌నే ఉపయోగిస్తారు. ఆ తర్వాత... మొనజైట్ (థోరియంతో కూడిన రేడియో ధార్మిక పదార్థం) కూడా వాడతారు. తూర్పుతీరంలో మన రాష్ట్రంలో భీమిలి నుంచి ఇచ్ఛాపురం వరకూ, పొరుగున ఒడిసా, తమిళనాడుల్లో కొన్నిచోట్ల ఇలమనైట్, మొనజైట్ వంటి ఖనిజాలు ఉన్నాయి.

### తూర్పు కనుముల నుంచి...

వాతావరణ ప్రభావానికి ప్రతి వస్తువు శైథిల్యం (వెదరింగ్) చెందడం సహజ పరిణామం. అదే విధంగా తూర్పు కనుమల్లోనూ అదే జరుగుతోంది. ఇక్కడి రాళ్లు వాతావరణ ప్రభావానికి లోనై... మొదట ముక్కలుగా... ఆ తర్వాత ఇసుకగా మారతాయి. అవి మరింత సూక్ష్మ రేణువులుగా నీటిలో కరుగుతాయి. ఆ క్రమంగా నదులతో పాటు సముద్రంలోకి వచ్చి చేరుతాయి. ఒక్కసారి బీచ్‌కు చేరిన భార ఖనిజాలు శాశ్వతంగా అలాగే ఉండిపోతాయి. సముద్రం కోతకు గురైతే మరోచోట డిపాజిట్ అవుతుంది తప్ప కరిగే ప్రసక్తే లేదు. నదులు సముద్రంలో కలిసేచోట ఎక్కువగా ఇటువంటి నల్లని ఇసుక కనిపిస్తుంది. భీమిలి వద్ద గోస్తనీ నది సముద్రంలో కలుస్తుంది.

### శ్రీకూర్మంలో ఇలమనైట్ వెలికతీత

బీచ్‌శాండ్ వ్యాపారం ప్రపంచవ్యాప్తంగా సాగుతోంది. బీచ్‌శాండ్‌లో ఇలమనైట్, ఇతర ఖనిజాల వెలికతీతతో ప్రభుత్వ ఖజానాకు భారీగా ఆదాయం వస్తోంది. మన రాష్ట్రంలో తొలిసారిగా శ్రీకాకుళం జిల్లా శ్రీకూర్మంలో ఇలమనైట్ ఖనిజం వెలికితీత మొదలుపెట్టారు.

### ఆర్థిక వ్యవస్థకు మేలు

ఇలమనైట్, మొనజైట్‌లు ఎంతో ఖరీదైనవి. దేశ ఆర్థిక వ్యవస్థకు ఎంతో మేలు చేస్తాయి. ముడిసరుకు కాకుండా ఫినిష్డ్ ఉత్పత్తులు విక్రయిస్తే మరింత లాభం. ఇటువంటి ఖనిజాలను ప్రభుత్వమే వెలికితీస్తే భారీగా ఆదాయం సమకూరుతుంది.

**- ఎం.జగన్నాథరావు, ఆంధ్ర విశ్వవిద్యాలయం జియాలజీ ఆచార్యుడు.**

## లోకం తీరు




మీరు ఎంత డబ్బు ఇచ్చినా మద్దతు ఇవ్వడం కుదరదు సాబ్..
ఈ సారి నేనే మీపై పోటీ చేస్తున్నా!!

### ఉష్ణోగ్రతలు

| కేంద్రం | కనిష్ఠం | గరిష్ఠం |
|---|---|---|
| విజయనగరం | 16.0 | 28.0 |
| హైదరాబాద్ | 17.0 | 29.2 |
| గుంటూరు | 17.0 | 33.0 |
| విశాఖపట్నం | 17.8 | 29.4 |
| కడప | 19.0 | 30.0 |
| అనంతపురం | 19.5 | 23.0 |
| కర్నూలు | 19.7 | 31.6 |
| శ్రీకాకుళం | 20.0 | 31.0 |
| ఒంగోలు | 20.8 | 32.7 |
| విజయవాడ | 22.3 | 30.6 |
| నెల్లూరు | 22.6 | 30.9 |
| చిత్తూరు | 23.2 | 29.5 |

## నేటికల్లా వాయుగుండం

విశాఖపట్నం, డిసెంబరు 3 (ఆంధ్రజ్యోతి): ఆగ్నేయ బంగాళాఖాతం, దక్షిణ అండమాన్ సముద్రంలో తీవ్ర అల్పపీడనం స్థిరంగా కొనసాగుతోంది. ఇది సోమవారం నాటికి బలపడి ఆగ్నేయ బంగాళాఖాతంలో ప్రవేశించి వాయుగుండంగా మారనుంది. తరువాత రెండు రోజుల్లో తీవ్ర వాయుగుండంగా మరింత బలపడనుందని వాతావరణ శాఖ తెలిపింది. ఈ క్రమంలో వచ్చే మూడు నుంచి నాలుగు రోజుల్లో ఉత్తర తమిళనాడు, దక్షిణ కోస్తా దిశగా రానుందని పేర్కొంది. తీవ్ర వాయుగుండం మధ్య బంగాళాఖాతంలో ప్రవేశించే సమయంలో తుఫాన్‌గా మారుతుందని కొందరు నిపుణులు అభిప్రాయపడుతున్నారు. ఆగ్నేయ బంగాళాఖాతంలో ఉన్న తీవ్ర అల్పపీడనం క్రమేపీ బలపడే క్రమంలో తుఫాన్‌గా మారుతుందని, దానిపేరు 'సాగర్'గా నామకరణం చేసినట్టు కూడా ప్రసార మాధ్యమాల్లో ప్రచారం జరుగుతోంది. ఒఖీ తుఫాన్ తరువాత వచ్చేదాని పేరు సాగర్. అందువల్ల ముందస్తు అంచనావేసి పేరు పెడుతున్నారని వాతావరణ నిపుణుడొకరు వ్యాఖ్యానించారు. ప్రస్తుతం ఉన్న అంచనా ప్రకారం ఆగ్నేయ బంగాళాఖాతంలో తీవ్ర అల్పపీడనం తీవ్ర వాయుగుండంగా మారనుంది. తరువాత కోస్తా దిశగా పయనిస్తుందని, దీంతో ఈనెల 7నుంచి మధ్య కోస్తా, ఉత్తర కోస్తా జిల్లాల్లో వర్షాలు ప్రారంభమవుతాయని అంచనా వేస్తున్నారు.

## గుజరాతీలు కులానికి ఓటేయరు



గుజరాతీలు కులం ఆధారంగా కాకుండా అభివృద్ధికే పట్టం కడతారు. గుజరాత్‌లో 150 సీట్లు గెల్చుకుంటాం. ప్రభుత్వంపై వ్యతిరేకతకు అవకాశమే లేదు. పాటీదార్ రిజర్వేషన్లు, ఇతర విషయాల్లో కాంగ్రెస్ అమలు చేయ వీలులేని హామీలు ఇస్తోంది.

- బీజేపీ అధ్యక్షుడు అమిత్‌షా

## గుండెకు రక్ష 'చీజ్'!



రోజూ 40 గ్రాముల చీజ్ తింటే గుండెపోటు ముప్పు తగ్గుతుందని చైనాకు చెందిన సూచో వర్సిటీ పరిశోధకులు చెబుతున్నారు. చీజ్‌లో చాలా విటమిన్స్, పోషకాలు, మాంసకృతులు ఉన్నాయని, ఇవి గుండెపోటు ముప్పును తగ్గిస్తాయని వారు తెలిపారు. యూరోపియన్ జర్నల్ ఆఫ్ న్యూట్రిషన్‌లో ఈ పరిశోధన వివరాలు ప్రచురించారు. చీజ్...మంచి కొవ్వును పెంచి చెడు కొవ్వును తగ్గించినట్లు పరిశోధనలో గుర్తించారట. ధమనుల్లో ఘనీభవించిన పదార్థాలను కరిగించడంలోనూ చీజ్ యాసిడ్‌గా పనిచేసిందని తెలిపారు.

## పళ్లు సరిగ్గా తోముకోకపోతే కేన్సరే!



మీరు రోజూ బ్రెష్ చేసుకుంటున్నారా? ఉదయం లేచిన వెంటనే పళ్లు తోముకుంటాం కాదా అని సరిపెట్టకండి! సరిగ్గా బ్రెష్ చేసుకోకపోవడంవల్ల కూడా అన్నవాహిక కేన్సర్ వస్తుందని 'కేన్సర్ రీసెర్చ్' అనే జర్నల్‌లో ప్రచురితమైన పరిశోధన తేల్చింది. అమెరికాలో దశాబ్దకాలంలో దాదాపు 1.22 లక్షల మందిపై పరిశోధన చేసి ఈ విషయం గుర్తించినట్లు అందులో తెలిపారు. రెండు రకాలైన బ్యాక్టీరియాల వల్ల పళ్ల మధ్య గమ్ డిసీజ్ వస్తోందని..అది నోటి ద్వారా లోపలికి వెళ్లి అన్నవాహిక కేన్సర్‌కు కారణం అవుతోందని ఆ పరిశోధనలో వివరించారు. దీనిని సకాలంలో గుర్తించకపోవడంతో మనిషి ఆయుర్ధాయం ఐదేళ్లు తగ్గిపోతోందని ఆందోళన వ్యక్తం చేశారు. ఇందులో 'టన్నెరెల్లా ఫొసిథియా' అనే బ్యాక్టీరియా పాత్రే 21 శాతం ఉందట.



## కాశీలో శారదాపీఠం శాఖ ప్రారంభం

పెందుర్తి, డిసెంబరు 3: కాశీలో శారదాపీఠం నూతన శాఖను పీఠాధిపతి స్వరూపానందేంద్ర సరస్వతి ప్రారంభించారు. ఈ సందర్భంగా దండిస్వాములకు స్వామీజీ చేతుల మీదుగా యతి భిక్ష చేశారు. అనంతరం ఆయన అనుగ్రహ భాషణ చేస్తూ, పీఠం శాఖ నిర్వాహకులు వారంలో ఒకసారి దండిస్వాములకు యతి భిక్ష చేయాలని సూచన చేశారు. కాశీ క్షేత్రంలో యతి భిక్ష పెడితే వెయ్యి మంది వేదపండితులకు అన్నదానం చేసిన పుణ్యఫలం లభిస్తుందన్నారు. శ్రీదత్త జయంతి సందర్భంగా పీఠం శాఖ నూతన కార్యాలయంలో నిర్వహించిన అన్నదాన కార్యక్రమాన్ని స్వామీజీ ప్రారంభించారు. ఈ కార్యక్రమంలో పీఠం ధర్మాధికారి కామేశ్వరశర్మ, ట్రస్టీ రొబ్బి శ్రీనివాస్ తదితరులు పాల్గొన్నారు.



## దుర్గమ్మకు కలశజ్యోతుల సమర్పణ

విజయవాడ, డిసెంబరు 3 (ఆంధ్రజ్యోతి): మార్గశిర పౌర్ణమిని పురస్కరించుకుని భవానీ దీక్షాపరులు దుర్గమ్మవారికి భక్తి ప్రపత్తులతో కలశజ్యోతులను సమర్పించారు. ఈ నెల 10నుంచి 14వ తేదీ వరకు దుర్గామల్లేశ్వరస్వామి దేవస్థానం భవానీ దీక్షల విరమణ కార్యక్రమాలను నిర్వహించనుంది. ఈ క్రమంలో ఆదివారం సత్యనారాయణపురంలోని శివరామకృష్ణక్షేత్రం నుంచి అమ్మవారి ఉత్సవమూర్తులను వెండి రథంపై ఊరేగించారు. వందల సంఖ్యలో భక్తులు కలశజ్యోతులతో భవానీ నామస్మరణతో ముందుకుసాగారు. అనంతరం ఇంద్రకీలాద్రి మహా మండపం వద్ద జ్యోతులను ఉంచి అమ్మవారిని దర్శించుకున్నారు. కలశజ్యోతి ఉత్సవాన్ని పురస్కరించుకుని ఆలయ అధికారులు ప్రత్యేక ఏర్పాట్లు చేశారు.

# ఏపీ వైపే రాష్ట్రాల చూపు

## సాంకేతిక వినియోగంలో ఏపీ టాప్

- తిరుపతి సైన్సు సెంటర్‌కు రూ.550 కోట్లు
- మరిన్ని విజ్ఞాన కేంద్రాల ఏర్పాటుకు ప్రతిపాదనలు
- మంత్రి శిద్ధా రాఘవరావు వెల్లడి
- ఒంగోలులో బాలల సైన్స్ కాంగ్రెస్ ప్రారంభం

ఒంగోలు విద్య, డిసెంబరు 3 : సాంకేతిక వినియోగం, తద్వారా అభివృద్ధిలో దేశంలోనే ఆంధ్రప్రదేశ్ అగ్రస్థానంలో ఉందని రాష్ట్ర అటవీ, పర్యావరణ, శాస్త్ర, సాంకేతిక శాఖ మంత్రి శిద్ధా రాఘవరావు తెలిపారు. ఈ విషయంలో అన్ని రాష్ట్రాలూ ఏపీ వైపే చూస్తున్నాయన్నారు. ప్రకాశం జిల్లా ఒంగోలులోని రైజ్ ఇంజనీరింగ్ కళాశాలలో ఆదివారం ఆయన 25వ రాష్ట్ర స్థాయి జాతీయ బాలల సైన్స్ కాంగ్రెస్ - 2017ను ప్రారంభించి మాట్లాడారు. పరిపాలనలో సాంకేతికతను జోడించి ముఖ్యమంత్రి చంద్రబాబు సత్ఫలితాలు సాధిస్తున్నారన్నారు. వరదలు, పిడుగుపాటు వంటి విపత్తులను ముందుగానే గుర్తించి అవసరమైన జాగ్రత్తలు తీసుకోవడంతోపాటు, ప్రజలను అప్రమత్తం చేసి ఆస్తి, ప్రాణ నష్టాన్ని తగ్గించగలుగుతున్నామని చెప్పారు. ఆన్‌లైన్ సేవలను ప్రజలు ఇంటి వద్ద నుంచే పొందే వెసులుబాటు కల్పించామన్నారు. ఉపాధ్యాయులు విద్యార్థులను పరిశోధనల వైపు ప్రోత్సహిస్తే భవిష్యత్తులో ఎన్నో నూతన ఆవిష్కరణలు చేయగలమన్నారు.



సైన్స్ కాంగ్రెస్‌ను జ్యోతి ప్రజ్వలన చేసి ప్రారంభిస్తున్న మంత్రి శిద్ధా

తిరుపతిలోని ప్రాంతీయ విజ్ఞాన కేంద్రానికి రూ. 550 కోట్లు మంజూరైనట్లు మంత్రి శిద్ధా రాఘవరావు తెలిపారు. రాజమండ్రికి రూ.25 కోట్లు, విశాపట్నానికి రూ.30 కోట్లు మంజూరు చేసినట్లు చెప్పారు. ఈ నిధులతో విజ్ఞాన కేంద్రాల అభివృద్ధి, 3డీ థియేటర్ల ఏర్పాటు తదితర కార్యక్రమాలు చేపడుతున్నట్లు తెలిపారు. రాష్ట్రంలోని అన్ని జిల్లాల్లో విజ్ఞాన కేంద్రాల అభివృద్ధికి అవసరమైన నిధులు కోరుతూ కేంద్రానికి సమగ్ర నివేదికను పంపుతున్నట్లు చెప్పారు.

**తిరుపతి కేంద్రానికి రూ. 550 కోట్లు**

జిల్లా స్థాయిలో విద్యార్థులను ప్రోత్సహించేందుకు విజ్ఞాన కేంద్రాల అభివృద్ధికి అవసరమైన మేరకు నిధులు సమకూర్చగలమని మంత్రి హామీ ఇచ్చారు. తొలుత ఆయన కళాశాల ప్రాంగణంలో మొక్కలు నాటారు. అనంతరం ఇస్రో, షార్ ఏర్పాటు చేసిన స్టాళ్లను సందర్శించారు. ప్రదర్శనలో ఉంచిన 134 బాలల సైన్స్ ప్రాజెక్టులు, 14 ఇన్‌స్పైర్ ప్రాజెక్టులను తిలకించారు. రాష్ట్ర శాస్త్ర, సాంకేతిక విద్యా మండలి కార్యదర్శి బి.వి.ఎ. కృష్ణమూర్తి అధ్యక్షతన జరిగిన కార్యక్రమంలో ఎమ్మెల్సీ కరణం బలరాం, ఎమ్మెల్యే దామచర్ల జనార్దన్, కలెక్టర్ వినయ్‌చంద్ తదితరులు పాల్గొన్నారు.

## రాష్ట్రంలో ప్రయోగాత్మకంగా ఇకో టాలెంట్ స్కూళ్లు

- శాస్త్ర, సాంకేతిక మండలి రాష్ట్ర కార్యదర్శి కృష్ణమూర్తి

ఒంగోలు విద్య: కేంద్ర ప్రభుత్వ ఆధీనంలోని శాస్త్ర సాంకేతిక విభాగం (డీఎస్టీ) ఆధ్వర్యంలో దేశంలోనే ప్రప్రథమంగా రాష్ట్రంలో ప్రయోగాత్మకంగా ఇకో టాలెంట్ స్కూళ్లు ప్రారంభిస్తున్నట్లు రాష్ట్ర శాస్త్ర, సాంకేతిక మండలి కార్యదర్శి కృష్ణమూర్తి తెలిపారు. రాష్ట్రస్థాయి జాతీయ బాలల సైన్సు కాంగ్రెస్‌లో పాల్గొనేందుకు ఆదివారం ఒంగోలు వచ్చిన వచ్చిన ఆయన 'ఆంధ్రజ్యోతి'తో మాట్లాడారు. విద్యార్థుల్లో సృజనాత్మకత, నైపుణ్యాన్ని పెంపొందించమే లక్ష్యంగా ఈ పాఠశాలలను ప్రారంభిస్తామన్నారు. ఇందుకు సంబంధించి పూర్తి విధివిధానాలు జనవరి నాటికి ఖరారవుతాయని చెప్పారు. ఈ పాఠశాలల్లో పర్యావరణ పరిరక్షణ ప్రధాన లక్ష్యంగా తీసుకుంటారన్నారు.





శ్రీవేంకటేశ్వర స్వామివారిని ఆదివారం ఇద్దరు న్యాయమూర్తులు దర్శించుకున్నారు. మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ ఇందిరాబెనర్జీ, తెలుగు రాష్ట్రాల హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ నాగార్జునరెడ్డి ఉదయం ప్రారంభ సమయంలో శ్రీవారి సేవలో పాల్గొన్నారు. వీరికి ఆలయ అధికారులు లడ్డూ ప్రసాదం, స్వామి, అమ్మవార్ల చిత్రపటం, 2018 సంవత్సరం క్యాలెండర్, డైరీలను బహూకరించారు. - తిరుమల

# కేకే రైల్వేలైన్ రెడీ



దెబ్బతిన్న పిల్లర్‌ను తొలగిస్తున్న కార్మికులు (ఫైల్ ఫొటో)

- చిమిడిపల్లి-బొర్రా స్టేషన్ల మధ్య వంతెన పునర్నిర్మాణం పూర్తి
- నేడు రైల్వే ఉన్నతాధికారుల పరిశీలన
- 9న ట్రయల్ రన్, సఫలమైతే 12 నుంచి రాకపోకల పునరుద్ధరణ
- 300 కోట్ల ఆదాయం కోల్పోయిన రైల్వే శాఖ
- 'ఆంధ్రజ్యోతి' గ్రౌండ్ రిపోర్ట్

అనంతగిరి (విశాఖ జిల్లా), డిసెంబరు 3: కొత్తవలస-కిరండోల్ మార్గంలో మరో పది రోజుల్లో రైళ్ల రాకపోకలు పునఃప్రారంభం కానున్నాయి. దాదాపు రెండు నెలల తరువాత పర్యాటకులు అద్దాల రైలులో ప్రయాణిస్తూ విశాఖ మన్యం అందాలను తిలకించే అవకాశం కలగనుంది. చిమిడిపల్లి-బొర్రా స్టేషన్‌ల మధ్య విప్పలవలస జలపాతం సమీపంలో బండరాళ్లు పడడంతో దెబ్బతిన్న వంతెన పిల్లర్ పునర్నిర్మాణం, ట్రాక్ పునరుద్ధరణ పనులు ఆదివారానికి పూర్తయ్యాయి. ఇంజనీరింగ్ బృందం సోమవారం పిల్లర్, ట్రాక్ పనులను పరిశీలిస్తుంది. అన్నీ సవ్యంగా ఉన్నాయని భావిస్తే 9న ట్రయల్ రన్ నిర్వహిస్తారు. అది కూడా ఓకే అయితే 12నుంచి పూర్తిస్థాయిలో రైళ్లు నడుపుతారని రైల్వే వర్గాల సమాచారం. విశాఖ మన్యంలోని ప్రకృతి అందాలను తిలకించడానికి విశాఖ నుంచి అరకుకు రైలులో ప్రయాణించడానికి పర్యాటకులు ఎంతో ఆసక్తి చూపుతుంటారు. కొండకోనలు,గుహలు, అడవుల్లో నుంచి రైలు ప్రయాణం వర్ణించలేని అనుభూతిని కలిగిస్తుంది. కానీ ఈ మార్గం (కేకే లైన్)లో ముడిఖనిజం రవాణా కోసం అధిక ప్రాధాన్యం ఇస్తూ, రోజుకు ఒక పాసింజర్ రైలు మాత్రమే నడుపుతున్నారు. దీంతో ఈ రైలుకు డిమాండ్ అధికం. ముఖ్యంగా దసరా నుంచి సంక్రాంతి వరకు 4 నెలల ముందుగానే రైలు టిక్కెట్లు రిజర్వు అయిపోతుంటాయి. ఈ ఏడాది ఏప్రిల్‌లో అద్దాల బోగీని ఈ రైలుకు జతచేశారు. దీనిలో ప్రయాణించిన వారు సరికొత్త అనుభూతికి లోనవుతుంటారు. కానీ అరకు అందాలను రైలులో ప్రయాణిస్తూ తిలకించాలనుకున్న పర్యాటకుల ఆశలను కొండరాయి చిదిమేసింది. గత అక్టోబర్ 6న విప్పలవలస జలపాతం సమీపంలో (32-33 టన్నెల్ మధ్య) పెద్ద బండరాయి పడడంతో వంతెనకు చెందిన ఒక భారీ పిల్లర్ ధ్వంసమైంది. దీంతో రైళ్ల రాకపోకలను నిలిపివేశారు. ముడి ఇనుము రవాణా ద్వారా రైల్వేశాఖకు అత్యధిక ఆదాయాన్ని సమకూర్చే కేకే లైన్‌లో రైళ్ల రాకపోకలు నిలిచిపోవడంతో.. అధికారులు యుద్ధ ప్రాతిపదికన పునరుద్ధరణ చర్యలు చేపట్టారు. దెబ్బతిన్న పిల్లర్‌ను తొలగించి, కొత్త పిల్లర్ నిర్మాణం చేపట్టారు. ఇందుకు రూ.4.5 కోట్లు ఖర్చు చేశారు.

### కత్తిమీద సాము

చిమిడిపల్లి-బొర్రా స్టేషన్ల మధ్య విప్పలవలస జలపాతం వద్ద రైల్వే ట్రాక్‌కి ఇరువైపులా గుహలున్నాయి. ఒకవైపు కొండ, దాని నుంచి జలపాతం.. మరో వైపు పెద్ద లోయ వున్నాయి. ఇక్కడికి వెళ్లడానికి కనీసం కాలిబాట కూడా లేదు. దీంతో వంతెన పునర్నిర్మాణ పనులు చేపట్టడం కత్తి మీద సాములా మారింది. పనులు చేపట్టడానికి అవసరమైన యంత్ర సామగ్రిని బీటీ ట్రైన్ ద్వారా ఇక్కడికి తీసుకువచ్చి, భారీ క్రేన్‌ల సాయంతో కిందకు దించాల్సి వచ్చింది. కూలీలను కూడా నిత్యం బీటీ ట్రైన్ ద్వారానే తీసుకువచ్చి, తీసుకెళ్లేవారు.

### రైల్వే ఆదాయానికి భారీగా గండి

రైల్వేకు అధిక ఆదాయాన్ని సమకూర్చే మార్గాల్లో కేకే లైన్ ఒకటి. బైడిదిల్లా నుంచి నిత్యం ఇనుప ఖనిజాన్ని విశాఖ పోర్టుకి తరలించి, ఇక్కడి నుంచి ఎగుమతి చేస్తుంటారు. రోజూ సగటున 10 ర్యాక్‌ల ముడిఖనిజం రవాణా అవుతుంటుంది. ఒక్కో ర్యాక్ ద్వారా రూ.50 లక్షల ఆదాయం వస్తుంది. సుమారు రెండు నెలలపాటు రూ.300 కోట్ల ఆదాయాన్ని రైల్వే కోల్పోయింది. ఏకైక పాసింజర్ రైలు ద్వారా వచ్చే ఆదాయం కొద్ది మొత్తమే అయినప్పటికీ, విశాఖ మన్యంలో పర్యటక రంగంపై ప్రభావం పడింది. హుద్‌హుద్ సమయంలో కేకే లైన్‌పై కొండచరియలు విరిగి పడ్డాయి. అంతటి విపత్కర పరిస్థితుల్లో కూడా 45 రోజుల్లో ట్రాక్‌ను పునరుద్ధరించారు. కానీ ఈసారి కేవలం ఒక బండరాయి పిల్లర్‌ను ధ్వంసం చేయడంతో రెండు నెలలకుపైగా రవాణా స్తంభించింది. కేకే లైన్‌లో ఇంత ఎక్కువ కాలం రైళ్లు నడవకపోవడం ఇదే తొలిసారని అధికారులు చెబుతున్నారు.

## ఎస్సీ వర్గీకరణకు టీడీపీ కట్టుబడి ఉంది: జవహర్

మండపేట, డిసెంబర్ 3: రాష్ట్రంలో ఎస్సీ వర్గీకరణకు టీడీపీ కట్టుబడి ఉందని ఎక్సైజ్‌శాఖా మంత్రి జవహర్ అన్నారు. తూర్పు గోదావరి జిల్లా మండపేటలో ఆదివారం జరిగిన మాదిగల ఆత్మీయ సమ్మేళన సభలో ఆయన మాట్లాడుతూ రాష్ట్రంలో తెలుగుదేశం పార్టీయే మాదిగలకు గుర్తింపునిచ్చిందన్నారు. మాదిగల రిజర్వేషన్ కల నెరవేరనుందని ఆయన అన్నారు.. కాపుల ఉద్యమం ఫలితంగా వారికి రిజర్వేషన్ వచ్చిన విషయాన్ని మంత్రి గుర్తు చేశారు. వన సమారాధనల వల్ల కుల సమస్యలు మాట్లాడుకునేందుకు వీలుకలుగుతుందన్నారు.

## రాష్ట్ర ప్రయోజనాల కోసం రాజీనామాలకు సిద్ధం

- వైసీపీ ఎంపీలు సుబ్బారెడ్డి, మేకపాటి, వరప్రసాద్

నెల్లూరు (బాలాజీనగర్), డిసెంబరు 3 : రాష్ట్ర ప్రయోజనాల కోసం అవసరమైతే రాజీనామాకు కూడా సిద్ధంగా ఉన్నామని వైసీపీ పార్లమెంటరీ సభ్యులు వై.వి. సుబ్బారెడ్డి, మేకపాటి రాజమోహన్‌రెడ్డి, వి.వరప్రసాద్ వెల్లడించారు. నెల్లూరులో ఆదివారం విలేకరులతో మాట్లాడారు. గతంలోనే ప్రత్యేక హోదా కోసం అవసరమైతే పార్టీ ఎంపీలు రాజీనామా చేస్తారని పార్టీ అధినేత వైఎస్ జగన్మోహన్‌రెడ్డి చెప్పారని, దీనికి తాము ఇప్పటికీ కట్టుబడి ఉన్నామని పేర్కొన్నారు.

## ఇసుకను ఎమ్మెల్యేలు పందికొక్కుల్లా బొక్కుతున్నారు

- బీజేపీ ఎమ్మెల్సీ సోము వీర్రాజు ధ్వజం

హిందూపురం టౌన్, డిసెంబరు 3: రాష్ట్రంలో ఇసుకను ఎమ్మెల్యేలు పందికొక్కుల్లా బొక్కుతున్నారని బీజేపీ ఎమ్మెల్సీ సోము వీర్రాజు ఆరోపించారు. అనంతపురం జిల్లా హిందూపురంలో ఆదివారం బీజేపీ ఓబీసీ మోర్చా ఆధ్వర్యంలో జరిగిన జిల్లా బీసీ చైతన్య మహాసభలో ఆయన మాట్లాడారు. రాష్ట్ర ప్రభుత్వం ఉన్న వనరులను సమకూర్చుకోలేక కేంద్రం డబ్బులు ఇవ్వలేదని పేర్కొంటుండటం బాధాకరమన్నారు. రాష్ట్రంలో చాలా మంది ఎమ్మెల్యేలు ఇసుకను అమ్ముకుంటున్నారని పరోక్షంగా అధికార పార్టీపై విరుచుకుపడ్డారు. ఇసుకను ప్రభుత్వమే ఇతర రాష్ట్రాలకు తరలిస్తే ఆదాయం వస్తుందన్నారు.

## గంగవరం పోర్టు సీనియర్ వైస్ ప్రెసిడెంట్ రాజారత్నం నాయుడు హఠాన్మరణం

సాగర్‌నగర్/గాజువాక టౌన్, డిసెంబర్ 3: గంగవరం పోర్టు సీనియర్ వైస్ ప్రెసిడెంట్, రిటైర్డ్ డీఐజీ రాజారత్నం నాయుడు ఆదివారం గుండెపోటుతో మృతి చెందారు. ఉదయం 11 గంటల సమయంలో ఆయనకు గుండె నొప్పి రావడంతో కుటుంబ సభ్యులు ఆస్పత్రికి తరలించారు. వైద్యులు పరీక్షించి అప్పటికే ఆయన మృతి చెందినట్టు ప్రకటించారు.












## మాయలేడి!

- ఐపీఎస్ అధికారిగా చలామణి
- సమస్య పరిష్కరిస్తానని లక్షలు వసూలు
- అనుమానంతో నిర్బంధించిన గ్రామస్థులు

ఏలూరుక్రైం, డిసెంబరు 3: మోసపోయి నిండా మునిగి ఉన్న వారిని ఆదుకుంటానని ఓదార్చి, సమస్య పరిష్కరిస్తానని కాసులు కొట్టేసిందో మాయలేడి. తానో ఐపీఎస్ అధికారినంటూ కలరింగ్ ఇచ్చి పోలీసు ఉద్యోగాలు ఇప్పిస్తానంటూ లక్షలాది రూపాయలు నొక్కేసింది. ఎప్పుడూ ఖరీదైన కార్లలో వచ్చి హడావుడి చేసే సదరు మహిళ ఓ యువకుడితో ద్విచక్రవాహనంపై రావడంతో బాధితులకు అనుమానం కలిగింది. గట్టిగా నిలదీయడంతో కిలేడీ బాగోతం వెలుగుచూసింది. పశ్చిమగోదావరి జిల్లాలో కొల్లేరు పరిరక్షణలో భాగంగా చేపల చెరువులను ధ్వంసం చేశారు. దీంతో చెరువులు కోల్పోయిన పలువురు వేరే ప్రాంతాలకు వెళ్లి ఉపాధి చూసుకోవాలని నిర్ణయించారు. ఏలూరు రూరల్ మండలం కోటేశ్వర దుర్గాపురం గ్రామానికి చెందిన పలువురు 2013లో ఒడిశా రాష్ట్రానికి వెళ్లారు. చేపల వ్యాపారి ఒకరు అక్కడ తక్కువ ధరలలో వ్యవసాయభూములు వస్తాయని చెప్పడంతో తమ పొలాలు, బంగారాన్ని అమ్మి అక్కడ భూములు కొనడానికి వెళ్లారు. అనుకున్న ప్రకారం ఎకరం 60 వేల రూపాయలు వంతున బేరం కుదుర్చుకున్నారు. అక్కడ ఆక్వాకల్చర్ అభివృద్ధికి ప్రభుత్వం 75 శాతం రాయితీ ఇస్తుందని తెలుసుకున్న వీరు అక్కడే జీవించాలని నిర్ణయించుకుని ఆ పొలం యజమానికి డబ్బు చెల్లించారు. రిజిస్ట్రేషన్ సమయంలో అతను అడ్డం తిరిగాడు. దీంతో ఏమి చేయాలో తెలియని బాధితులు చెక్కులను, ప్రాంసరీ నోట్లు రాయించుకున్నారు. చేతిలో ఉన్న బంగారం, పొలాలను అమ్ముకుని వెళ్లి ఒడిశాలో మోసపోయిన వీరి విషయం ఒక మహిళకు తెలిసింది. తాను ఐపీఎస్ అధికారినని, జిల్లాలో గతంలో పనిచేసిన కలెక్టర్ తన సోదరేనంటూ నమ్మబలికింది. తాను ఢిల్లీలో రిజర్వు పోలీసు విభాగంలో డీఐజీగా పనిచేస్తున్నానని చెప్పింది..

ఆమె వచ్చిన కారు, హడావుడి చూసి బాధితులు నిజమని నమ్మేశారు. అంతేకాకుండా తన బ్యాచ్‌మేట్స్‌లో ఒడిసాలో పనిచేస్తున్నారని, వారి ద్వారా మీ సొమ్ము వెనక్కి ఇప్పిస్తానని, తనకు 25 శాతం కమీషన్ ఇవ్వాలని ఆమె కోరింది. తమ సొమ్ములు ఇప్పిస్తే 30 శాతమైనా ఇస్తామని బాధితులు అంగీకారానికి వచ్చారు. కొద్ది రోజుల తరువాత ఖర్చుల నిమిత్తం ముందుగా కొంత సొమ్ము కావాలంటూ ఒక్కొక్కరి నుంచి 50 వేల రూపాయల వరకు వసూలు చేసింది. మళ్లీ ఖర్చుల నిమిత్తం అంటూ వచ్చి కొంత డబ్బు వసూలు చేసుకుని వెళ్లిపోయేది. అదేవిధంగా పోలీసు ఉద్యోగాల్లో చేరేందుకు సహాయం చేస్తానని చెప్పి యువకుల నుంచి కూడా డబ్బు భారీగా వసూలు చేసినట్లు బాధితులు చెబుతున్నారు. ఏడాది నుంచి గ్రామానికి రాని ఆ మహిళ ఆదివారం రాత్రి ఒక యువకుడితో కలిసి బుల్లెట్‌పై రావడంతో గ్రామస్థులు నివ్వెరపోయారు. ఎప్పుడూ ఖరీదైన కార్లలో హడావుడిగా వచ్చే ఆమె ద్విచక్రవాహనంపై రావడంతో అనుమానం కలిగింది. ఆ బుల్లెట్ కూడా గుడివాడకు చెందినదిగా గుర్తించారు. ఈ నేపథ్యంలో ఆమె డబ్బు అడగగానే అనుమానంతో నిలదీశారు. తాము ఇచ్చిన డబ్బు తిరిగివ్వాలని బాధితులు పట్టుబట్టారు. దీనిపై ఏలూరు రూరల్ పోలీసులకు సమాచారం ఇవ్వడంతో ఆదివారం రాత్రి వారు ఘటనా స్థలానికి చేరుకుని బాధితుల నుంచి ఫిర్యాదులను స్వీకరించారు. ఆమెను విచారిస్తున్నారు.

ప్రముఖ రచయిత్రి **రంగనాయకమ్మ** తన రచనల వెనుక విశేషాల గురించి, దృక్పథం గురించి **బొర్రా అరుణతో** చేసిన సంభాషణ.



# "మార్క్సిజాన్ని ప్రేమించే మనిషిని ద్వేషించే వాళ్ళా మార్క్సిస్టులు?"

**ఈ మధ్య కొంతమంది పరిశోధకులు మీ 'బలిపీఠం' నవల మార్క్సిస్టు భావజాలంతో ఉందంటున్నారు. అలా ఉందా?**

అప్పటికి, "మార్క్సిజం" అనేది తెలీదు. "కమ్యూనిజం" అనే మాట మాత్రమే. అది, "మంచిది" అన్నంత వరకే. అంత మాత్రాన అది మార్క్సిస్టు భావజాలం అవదు. మార్క్సిజంతో పరిచయం అయ్యాక, "కమ్యూనిజం వల్ల, సమాజ సమస్యలు తీరతాయనీ; సంఘ సంస్కరణల వల్ల, వ్యక్తుల సమస్యలు తీరవచ్చు గానీ, అంత కన్నా జరగదనీ; అభిప్రాయం ఏర్పడింది.

**'పేక మేడలు'లోని భానూ, ఆమె పసి కొడుకూ మరణానికీ, 'యజ్ఞం' కథలోని మరణానికీ, తేడా ఏమిటి?**

'పేక మేడలు'లో భాను ఆత్మహత్యనీ, 'యజ్ఞం'లో తండ్రే కొడుకుని నరకడాన్నీ, ఒకే రకంగా పోల్చి చూడడం, అర్థం లేని విషయం. ఆత్మహత్య తీవ్ర విరక్తితో గానీ, ఆ వ్యక్తికి అల్ప చైతన్య స్థాయిని బట్టి గానీ జరుగుతుంది. చంటి బిడ్డల్ని వదిలి తల్లి చావడం, ఆ బిడ్డకి హాని చెయ్యడమే - అని చెప్పడం అది. 'యజ్ఞం' కథలోది ఆత్మహత్య కాదు; హత్య! పైగా, బిడ్డ మీద ద్వేషం లేకుండా! కథ నిండా విప్లవం ధోరణి సాగుతూ. ఆ హత్య, ఎదటి పక్షం మీద జరిగితే అది వేరు. అసలు, అది, హత్యలు జరిగే సమస్య కాదు.

**మీ 'స్వీట్ హోమ్' నవలలోని విమల, పి. శ్రీదేవిగారి 'కాలాతీత వ్యక్తులు' నవలలోని ఇందిరా, కళ్యాణిలకు కొనసాగింపు - అని కొందరు విమర్శకుల అభిప్రాయం. దీనిపై మీ స్పందన?**

కాదు. 'కాలాతీత వ్యక్తులు' చదివాను గానీ, అది 'స్వీట్ హోమ్'కి ముందు కాదు. నేను వైజాగ్‌లో వున్న కాలంలో, 'మరుధ్వతి' అనే పాఠకురాలు, తన సంసారం గురించి అలా నవ్వుతూ చెప్పేది. నిజానికి, ఆ సంసారం అంత చక్కనిది కాదు. అయినా, ఆమె అలా చెప్పేది. 'స్వీట్ హోమ్' ప్రారంభానికి అదే కారణం. ఆ పేరుకి కారణం, ఇంకో పాఠకుడు. ఆయన రామకోటి. వైజాగులో లాయరు. "మీ స్వీట్ హోమ్ ఎలా వుంది?" అని రాశాడు. "అలా అనకండి! మాది స్వీట్ హోమ్ కాదు" అన్నాను. ఆ పేరుని మాత్రం ఒక నవలకి పెట్టాలనిపించింది. ఆ రెండూ కలిసి, అది ప్రారంభమైంది. ఆ తర్వాత, 3వ భాగం దాకా జరిగింది. కొందరు పాఠకులైతే దాన్ని ఇంకా రాయమంటారు. చాలా మంది ఆడవాళ్ళు, "మా ఆయనగారు బుచ్చిబాబు లాంటి వారే" అంటారు. వాళ్ళేం అంటున్నారో వాళ్ళకే తెలీదు.

**'పెళ్ళి తంతు' పట్ల మీకు ఎందుకంత వ్యతిరేకతా?**

అది 'తంతు' కాబట్టే. ఆ తంతు, లీగల్ (చట్టబద్ధ) తంతూ, మత పద్ధతులకూ కూడా. 'ఆస్తి'కి లీగల్ షరతు వుండవచ్చు గానీ, ఇద్దరు మనుషులు కలిసి బ్రతకడానికి లీగల్ తంతు ఏమిటి? ఇద్దరు మనుషుల స్నేహానికి మతబద్ధ తంతు గానీ, చట్టబద్ధ తంతు గానీ, వుంటుందా? కాకపోతే, ఇద్దరు మనుషులు, ఒక కుటుంబంగా, భార్యాభర్తలుగా బ్రతకడం, సమాజానికి తెలిసే విధంగా వుండాలి. దాన్ని 'రహస్యం' లేకుండా వుంచాలి. కానీ, ఆస్తి గోల వున్నప్పుడు, లీగల్ తంతులు అవసరం అవుతాయి.

**స్త్రీ ఆత్మ గౌరవానికే ప్రాధాన్యం ఇవ్వడానికి కారణం?**

నీకు తెలియకే ఈ ప్రశ్న అడిగావని నేను అనుకోను. ఏదైనా జవాబు వినాలని అడిగి వుంటావు. జవాబు ఏం వుంది? "ఆత్మ గౌరవం" అంటే, అవమానాల నించి విముక్తి అవడమే కదా? 'విముక్తి' కోసం, ఏం చేసుకోవాలో అది చేసుకోకపోతే, అవమానాలే భరిస్తూ వుండవచ్చని చెప్పుకోవాలా? నాకు తెలిసిన దంపతుల్ని చెప్పనా? ఇద్దరూ డబ్బు మనుషులు. అది సరే. అతను, ఆమెని లెంపకాయలు కొడతాడు. తగువు జరిగిన రోజున సినిమాకి బైల్దేరి, స్కూటర్ మీద ఆమెని ఎక్కమంటాడు. ఇస్త్రీ చీరతో ఎక్కేస్తుంది. అంతా సుఖ సంసారం! "నేను రాను" అనేసి ఆమె వెళ్ళకుండా వుంటే, అదీ ఆత్మ గౌరవం. "దానికి ప్రాధాన్యత ఎందుకు? సినిమాని పోగొట్టుకోవాలా? అంటారా మీరు?"

**మీ రచనలలో, స్త్రీకి సమాజ జీవితం ముఖ్యం - అనే భావన ఉంటుంది. కానీ, స్త్రీల సామాజిక, ఆర్థిక రంగాలలోని అనుభవాల చిత్రణ తక్కువగా ఉంది - అనేది ఒక అభిప్రాయం.**

'తక్కువ'గా కాదు; అసలు లేదేమో. నేను, బైటికి వెళ్ళి ఉద్యోగాలు చెయ్యలేదు. చిన్నతనం నించీ తెలిసిన వాళ్ళల్లో ఉద్యోగాలు చేసిన స్త్రీలు లేరు. తర్వాత రోజుల్లో అటువంటివి తెలిసినా, అటువంటి వాళ్ళు టీచర్లే. బైటి జీవితాల గురించి నాకు తెలిసింది తక్కువ కాబట్టే, అవి రాలేదు.

> "నాకు తెలిసిన దంపతుల్ని చెప్పనా? ఇద్దరూ డబ్బు మనుషులు. అది సరే. అతను, ఆమెని లెంపకాయలు కొడతాడు. తగువు జరిగిన రోజున సినిమాకి బైల్దేరి, స్కూటర్ మీద ఆమెని ఎక్కమంటాడు. ఇస్త్రీ చీరతో ఎక్కేస్తుంది. అంతా సుఖ సంసారం! "నేను రాను" అనేసి ఆమె వెళ్ళకుండా వుంటే, అదీ ఆత్మ గౌరవం."

**ప్రపంచీకరణ నేపథ్యంలో, నేటి స్త్రీ, బైటికి రాక తప్పడం లేదు. పురుషాధిక్యంవున్న రంగాలలో, నేటి స్త్రీ ఆత్మ గౌరవం ఎలా వుంది?**

"ప్రపంచీకరణ" అంటే, గతంలో కన్నా ప్రపంచం నిండా పెరిగిన "పెట్టుబడిదారీ సంబంధాలే". ఉద్యోగాలుచేసే మనుషులూ, అమ్మకాల సరుకులూ, సమాచారాలూ, ప్రపంచంలో ఒక మూల నించి ఇంకో మూలకు పోయే విధంగా మార్పులు జరగడమే. 'ప్రపంచీకరణ' అనే మాటకి అంతకన్నా గొప్ప అర్థం ఏమీ లేదు. "నేటి స్త్రీ బైటికి రాక తప్పడం లేదు" అన్నారు. అలా అనడంలో, స్త్రీలు బైటికి వచ్చి ఇబ్బందులు పడడం ఎందుకు- అనే తప్పు అర్థం వస్తుంది. స్త్రీ-పురుషుల మధ్య సమానత్వం ఏర్పడాలంటే, శ్రమల్లో కూడా ఇంటా బైటా సమానత్వం వుండాలి. శారీరక శ్రమల కుటుంబాల్లో స్త్రీలు, బానిసల కాలం నించే, బైటి పనులెన్నో చేస్తున్నారు. అనేక ఇబ్బందులూ పడుతున్నారు. ఆ ఇబ్బందులు లేకుండా చేసుకోవడమూ జరగాలి; శారీరక శ్రమల- మేధా శ్రమల శ్రమ విభజన కూడా సమానత్వ లక్షణంతో మారాలి. శ్రామిక వర్గం కళ్ళు తెరిస్తే, అన్నీ జరుగుతాయి.

**మీరు రచనలు మొదలుపెట్టినప్పటికీ ఇప్పటికీ తెలుగు సాహిత్యంలోని స్త్రీ పాత్రలో కనిపించిన ప్రధానమైన మార్పులు ఏమిటి?**

ఇప్పటి స్త్రీ పాత్రలు, ఉద్యోగాల పాత్రలు తరుచుగా కనపడుతున్నాయి. దానికి జీతాలు వస్తాయి. ఆ జీతాల్ని కుటుంబంలో సమానత్వంతో వాడుకునే దృష్టి కనపడదు. జీతంలో కొంత భాగం ఉమ్మడి కోసమూ; కొంత భాగం ఎవరి రహస్యం వారిదీ. సాహిత్యంలో కూడా ఈ ధోరణి వుంది.

**మిమ్మల్ని మీరు అభివర్ణించునేది మార్క్సిస్టుగానా, ఫెమినిస్టుగానా?**

"మార్క్సిజం" తెలిసినప్పటి నించీ, నేను మార్క్సిస్టుగానే వుండాలనుకుంటాను. ఆ భావాలతోనే రాయాలనీ, బ్రతకాలనీ అనుకుంటాను. "సమానత్వ భావాలు వుంటే, అది కేవలం ఫెమినిజం కోసమే కాదు; ప్రతీ కోణంలోనూ, ప్రతీ రంగంలోనూ సమానత్వం కావాలి. అలా అనుకునేటప్పుడు అది మార్క్సిజమే.

**మీరు మార్క్సిజం వైపు రాక ముందు రాసిన పుస్తకాలకు తర్వాత కాలంలో 'కొత్త ముందు మాటలు' రాయాల్సిన అవసరం ఏమిటి - ఒకప్పుడు అలా రాశానని అనుకోవచ్చుగా?**

అలా రాసిన వాటిలో కొన్ని పొరపాట్లో, తప్పులో వున్నాయని నాకు అర్థమైతే, వాటినే అలా వదిలేసి వుంచితే, వాటిని కొత్తగా చదివే పాఠకులు, ఆ పొరపాట్లని గ్రహించలేకపోతే, అవే మంచివి అనుకుంటారు. ప్రారంభంలో ఒక కథలో "రిక్షా వాణ్ణి" అని రాశాను. ఒక చెడ్డ పాత్ర అనే మాటలు కావు అవి. రచయిత్రి మాట్లాడేవే. అలా అనడం కాకుండా "రిక్షా అతన్ని - అన వచ్చు కదా?" అని కొత్త ముందు మాటలో రాసి, ఆ కథలో కూడా ఆ మాటని మార్చాను. అలా చెపితే, పాఠకులకు పొరపాట్లు తెలుస్తాయి.

**మీ స్త్రీ పాత్రల పరిణామానికీ మీ వ్యక్తిగత జీవితానికీ ఉన్న సంబంధం ఎలాంటిది?**

'పేక మేడల్లో' భాను, ఆత్మహత్య చేసుకోకుండా, బిడ్డతో సహా పుట్టింటికి వెళ్ళిపోవచ్చు. అలాంటి భర్త దొరకడం అంటే, తన జీవితమే వృధా అయిపోయినట్టుగా అనిపించింది భానుకు. నాకూ అంతే. కానీ నేను ఆత్మహత్య ఆలోచన ఎప్పుడూ చెయ్యలేదు. జానకి అయితే, మొదట్లో అమాయకురాలే గానీ, సాహిత్యం వల్ల కళ్ళు తెరవగలిగింది. నేనూ అంతే. నా తెగింపుకి నిజంగా ఆధారాలు చలంగారి "స్త్రీ", "బిడ్డల శిక్షణ" వంటివీ; అనేక విమర్శలతో వున్న ఆయన వ్యాసాలనూ. ఆయనలో ఎన్ని తప్పులున్నా, నా దృష్టి ఆ తప్పుల్ని వదిలివేస్తూ ఆత్మ గౌరవం వేపు వెళ్ళింది. చలం విమర్శల శక్తే, నన్ను మేల్కొల్పింది. ఆ తర్వాత అంతా మార్క్సిజమే.

**అలంకరణ విషయంలో మీరు ఫలానా రకంగా ఉండాలనే దానికి ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వడానికి కారణం?**

"అలంకరణ విషయం" ఫలానా రకంగా వుండాలి - అనే సంప్రదాయాలు ఆడవాళ్ళ కోసమే ఎందుకు ఉన్నాయి. నగలు, పట్టు బట్టలు, షోకులు, రంగులు - వీటిలో కొన్ని మగవాళ్ళకి కూడా వున్నా, ఆడవాళ్ళ అలంకరణే ఎక్కువ ప్రత్యేకంగా ఎందుకు వుంది? శుభ్రతా, పొదుపూ - ఇటువంటివి పట్టవు. "ఆడది అందంగా అలంకరించుకోవాలి" అనేది ఎందుకు వచ్చింది. దాన్ని వ్యతిరేకించవలిసిందే కదా?

**జుట్టు విరబోసుకోవడం, స్లీవ్‌లెస్ బ్లవుజ్‌లు ఈ రోజుల్లో సాధారణమైపోయాయి. ఇలాంటి స్త్రీలను మీరు దూరం పెడతారు. వారిలో ప్రగతిశీల, శ్రామిక దృక్పథం ఉన్నవారు కూడా ఉండవచ్చుగా?**

చంకలూ, రొమ్ములూ, తొడలూ, పిరుదులూ, భుజాలూ, వీపులూ - ఇవన్నీ బైట పెట్టుకుని తిరిగే వాళ్ళల్లో, ప్రగతిశీల, శ్రామిక దృక్పధాలు వున్నట్టా? శ్రామిక స్త్రీలు కూడా అలాగే నడిస్తే, వాళ్ళకి ఆ దృక్పథం లేనట్టే. తమ బలహీనతల్ని వదులుకోకుండా ఇటువంటి వాదనలు తీసుకొస్తారు.

**శ్రామిక వ్యతిరేక, అభ్యుదయ నిరోధక వ్యక్తులతో పేచీ శత్రు వైరుధ్యం అయితే.... మార్క్సిజాన్ని అంగీకరించే వారితో పేచీ మిత్ర వైరుధ్యం. మీరు రెంటికీ తేడా చూపించటంలేదనే విమర్శ ఉంది?**

మార్క్సిజాన్ని అంగీకరించేవారితో నాకు ఏ వైరుధ్యమూ వుండదు. చంకలూ, రొమ్ములూ, బైటపెట్టి, జుట్టు విరబోసి, నేను మార్క్సిజాన్ని అభిమానిస్తాను- అనే వ్యక్తిని, అది నిజం అని, నేను నమ్మను. మార్క్సిజాన్ని ప్రేమించే వాళ్ళు ఆ తప్పుడు భావాలతో వుండరు. మార్క్సిజం దాకా అక్కర లేదు. సాధారణ సంస్కారం వున్న వాళ్ళు కూడా అలా వుండరు. రక రకాల అందాల జబ్బులు అన్నీ పెట్టుబడిదారీ సరుకుల నించి పుట్టుకొస్తున్నవే. ఆ సరుకులు, "అందాల" పేర్లతో తయారవుతున్నాయి. అమ్మితే, వాళ్ళకి లాభం! కొంటే, వీళ్ళకి 'అందం'! ప్రచారాలు అవే. ఆడవాళ్ళూ, మొగవాళ్ళూ, లాగులతో తిరుగుతారు. జుట్టు విరబోతలూ, చేట లంతంత బొట్లూ, ఫేషన్ కళ్ళజోళ్ళూ. అవన్నీ పెట్టుబడిదారీ సరుకుల ప్రచారాలు! జుట్టు విరబోతల వాళ్ళు ఫేషన్ మారిందంటే గుళ్ళు చేయించేసుకుంటారు.

**తర్వాత కాలంలో పరామర్శించినప్పుడు మీ రచనల్లో మరింత కఠినంగా చెప్పి వుండాల్సిందనిపించినవి ఏమన్నా ఉన్నాయా?**

ప్రతీ దానిలోనూ, ప్రతీ చోటా అనిపిస్తుంది. "కఠినంగా చెప్పడం" అని ఎందుకు అనాలి దాన్ని? "ఇంకా బాగా చెప్పడం" అనాలి. ఒక పని చేసే వాళ్ళకి, "ఇంకా బాగా చెయ్యాలి" అనిపించదా? ఒక కూర వండినప్పుడే అలా అనిపిస్తుంది, "అయ్యో! ఇంకా బాగా చెయ్యాల్సింది" అని. కథని ఇంకా బాగా రాస్తే, అది కఠినమా? విమర్శ అయినా, కఠినమా? తర్కం తెలుసుకుని సంతోషించాలి.

**రంగనాయకమ్మ నాలుగుగోడల మధ్య కూచుని రాస్తుంది. పడక్కుర్చీ మేధావి. ఆచరణ లేదు - అనే విమర్శకి మీ జవాబు?**

దీనికి నేను కాదు; ఆ విమర్శని వినేవాళ్ళు చెప్పాలి. ఇతర రచయితలు ఎక్కడ కూర్చుని రాస్తారు? వాళ్ళకి నచ్చే రచయితలు నడిరోడ్డులో కూర్చుని రాస్తారా? అనో, ఏదో, ఇతరులు అడగాలి. 'కాపిటల్ పరిచయాన్ని' నాలుగు గోడల మధ్యే రాసింది. 'జానకి విముక్తి'నీ, 'అంధకారాన్ని' నాలుగు గోడల మధ్యే. 'విషవృక్షాన్ని' నాలుగు గోడల మధ్యే! ఇతర రచయితలు ఎక్కడ రాస్తారో ఒకసారి చెప్పండి!-అని మీరే అడిగితే మీకు జవాబు దొరుకుతుంది.

**మీరు మార్క్సిస్టులపై విమర్శలు చేయడం కొందరు 'స్వీయ చర్మ సంరక్షణ'గా భావిస్తున్నారు. దానిపై మీ స్పందన?**

"స్వీయ చర్మ రక్షణ" అంటే ఏమిటో మీకు తెలిసే అడిగారా? "నేను మార్క్సిస్టుని కాను సుమా!" అని పోలీసులకు చెప్పుకుని, నన్ను నేను రక్షించు కోవడానికే, విప్లవకారుల్ని విమర్శిస్తానట! ఈ వాగుడు నేను ఒక సందర్భంలో విన్నాను. కొడవటిగంటి కుటుంబరావు, "దెయ్యాలున్నాయి" అని, దెయ్యాలూ-ఆత్మలూ అంటూ రాసిన తత్వ శాస్త్రాన్ని 'విరసం' నెత్తిని పెట్టుకు మోస్తోందని నేను విమర్శించినప్పుడు, విరసం సమర్థకులు నన్ను ఆ మాట అన్నారు. ఆ దెయ్యాల శిష్యులు విప్లవకారులట! ఆ విప్లవకారుల్ని నేను ఎందుకు విమర్శిస్తున్నానంటే, పోలీసులు నన్ను గురించి, "ఈ మనిషి మార్క్సిజానికి వ్యతిరేకంలే" అనుకోవాలని, నేను అలాంటి విమర్శలు చేస్తానట! నా పద్ధతి, స్వీయ చర్మ రక్షణే అయితే, దెయ్యాల్ని పూజించే వాళ్ళది, ఏ విధానం అవుతుంది? దెయ్యాల్ని నమ్మేవాళ్ళని మార్క్సిస్టులని ఏ పోలీసు అయినా అనుకుంటాడా?- వాళ్ళ చర్మ రక్షణేనేమో అది! "నేను మార్క్సిజానికి వ్యతిరేకిని" అని చెప్పుకోడానికేనా ఫ్యూడల్ మత గ్రంథాల మీద విమర్శలు రాసింది? మార్క్సిజానికి వ్యతిరేకత తోనేనా "మార్క్స్ కాపిటల్‌కి పరిచయం" రాసింది? - మార్క్సిజాన్ని ప్రేమించే మనిషిని ద్వేషించే వాళ్ళా మార్క్సిస్టులు?

> మార్క్సిజాన్ని అంగీకరించేవారితో నాకు ఏ వైరుధ్యమూ వుండదు. చంకలూ, రొమ్ములూ, బైటపెట్టి, జుట్టు విరబోసి, నేను మార్క్సిజాన్ని అభిమానిస్తాను - అనే వ్యక్తిని, అది నిజం అని, నేను నమ్మను. మార్క్సిజాన్ని ప్రేమించే వాళ్ళు ఆ తప్పుడు భావాలతో వుండరు.

**మీ పాఠకులు, మీ పుస్తకాలు చదివి, మార్క్సిజాన్ని అంగీకరిస్తున్నట్టుగా మీరు భావిస్తారా?**

"మీ పాఠకులు" అనడం తప్పు. పుస్తకాలు చదివే వాళ్ళు, ఒకే రచయితవి చదవరు. అనేక మందివి చదువుతారు. ఆ చదివిన వాటిలో వారికి నచ్చినవే తీసుకుంటారు. నచ్చినా, ప్రతీ దాన్నీ ఆచరించడం కొందరు చెయ్యలేరు. ఆచరించాలని వున్నా, దానికి తగిన సదుపాయాలు వుండక పోవచ్చు. ఇద్దరు ముగ్గురు కలిసి, గ్రూపుగా చదువుకుంటూ, చర్చించుకుంటూ, ఒక అవగాహనకి వస్తే తప్ప, ఏ కొత్త విషయాన్నీ అర్థం చేసుకోలేరు. ప్రతీ రచయితకీ ఇది వర్తిస్తుంది. మార్క్స్, మహా తెలివైన రాతలు రాశారు. ఎందరు చదివారు? ఎందరు క్షుణ్ణంగా అర్థంచేసుకున్నారు? వాటిని ఎందరు ఆచరించారు? సంఘాల ద్వారా జరిగితే తప్ప అది జరగదు.

*బొర్రా అరుణ, 93955 32951*

---

**ఉస్మానియాలో వంద కలాలు, గళాలు**

నూరేళ్ళ ఉస్మానియా యూనివర్సిటీ సందర్భంగా 'వంద కలాలు, గళాలు' సమావేశమై స్మృతులను పంచుకునే కార్యక్రమం డిసెంబర్ 5 ఉ.10గం.లకు రూమ్ నెం.57, ఆర్ట్స్ కాలేజీ, ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాద్‌నందు జరుగుతుంది. స్వాగతోపన్యాసం సి.హెచ్.గోపాల్‌రెడ్డి, అధ్యక్షత సూర్యా. ధనంజయ్. సమావేశంలో కేవీ రమణాచారి, నందిని సిధారెడ్డి, ఎస్వీ సత్యనారాయణ, అల్లం నారాయణ, అయాచితం శ్రీధర్‌తో పాటు తెలుగు సాహిత్య, సాంస్కృతిక రంగాల్ని మలుపు తిప్పిన వందమంది రచయితలు, కళాకారులు పాల్గొంటారు.

**- ఓయూ సాహిత్య వేదిక**

**ఫ్రీవెర్స్ ఫ్రంట్ బహుమతులు**

నలభై ఆరేళ్ళుగా ప్రతి ఏటా ఉత్తమ వచన కవితా సంపుటికి అవార్డులిస్తున్న ఫ్రీవెర్స్ ఫ్రంట్ 2016 సంవత్సరానికి సి. భవానీదేవి ('ఇంతదూరం గడిచాక'), 2017 సంవత్సరానికి బాల సుధాకర్ మౌళి ('ఆకు కదలని చోట') కవితా సంపుటులకు బహుమతి ప్రకటించింది. అవార్డులను డిసెంబర్ 4 సా.6గం.లకు హైదరాబాద్, బషీర్‌బాగ్ లోని ప్రెస్ క్లబ్‌లో ఎన్. గోపి చేతుల మీదుగా అందజేస్తారు. దర్భశయనం శ్రీనివాసా చారి, శిఖామణి, ఎస్.రఘు, యాకూబ్ పాల్గొంటారు.

**- శీలా వీర్రాజు**

**విమలాశాంతి సాహిత్య పురస్కారాలు**

విమలాశాంతి సాహిత్య పురస్కార ప్రదానోత్సవంలో భాగంగా శాంతి రజనీకాంత్ స్మారక కథాపురస్కారం 2017ను చింతకింది శ్రీనివాసరావు ('కాన్పుల దిబ్బ')కు అందజేస్తున్నారు. ఈ సభ డిసెంబర్ 10 ఉ.10.30ని.లకు నూతన భవన సభా మందిరం, జిల్లా పరిషత్, అనంతపురంలో జరుగుతుంది. రాచపాళెం చంద్రశేఖరరెడ్డి, పూల నాగరాజు, దీర్ఘాసి విజయభాస్కర్, పొట్లూరి హరికృష్ణ, ఆర్.ఎం.ఉమా మహేశ్వరరావు, అట్టాడ అప్పల్నాయుడు, బండి నారాయణస్వామి, సడ్లపల్లి చిదంబరరెడ్డి తదితరులు పాల్గొంటారు.

**- శాంతి నారాయణ**

**ఇస్మాయిల్ కవిత్వ పురస్కార సభ**

ఇస్మాయిల్ కవిత్వ పురస్కారాన్ని బొల్లోజు బాబా స్వీకరిస్తారు. ఈ సభ డిసెంబర్ 10 సా.4.30ని.లకు రోటరీ సమావేశ మందిరం, కాకినాడ నందు జరుగుతుంది. అద్దేపల్లి జ్యోతి, దాట్ల దేవదానంరాజు, ఆకెళ్ళ రవి ప్రకాష్, శిఖామణి, వాడ్రేవు వీరలక్ష్మీదేవి పాల్గొంటారు.

**- ఇస్మాయిల్ మిత్రమండలి**

**కవిత విద్యా సాంస్కృతిక సంస్థ సాహిత్య పురస్కారాలు**

కవిత విద్యా సాంస్కృతిక సేవా సంస్థ అందజేస్తున్న సాహిత్య పురస్కారాలను డిసెంబర్ 10 ఆదివారం ఉదయం కడపలోని సి.పి. బ్రౌన్ భాషా పరిశోధన కేంద్రంలో జ్యోతి నండూరి, బిక్కి కృష్ణ (కవిత్వం); కె. ఆశాజ్యోతి, మూల మల్లికార్జునరెడ్డి (విమర్శ); ఆర్.ఎస్. హైమవతి, టి.ఎస్.ఎ. కృష్ణమూర్తి (నవల); సి.యమున, మూరిశెట్టి గోవింద్ (కథ)లు స్వీకరిస్తారు. ఫోన్: 91770 13845.

**- అలపర్తి పిచ్చయ్య చౌదరి**

**'తెలంగాణ భాష దేశ్య పదాలు' ఆవిష్కరణ**

నలిమెల భాస్కర్ రచన 'తెలంగాణ భాష దేశ్య పదాలు' వ్యాస సంపుటి ఆవిష్కరణ డిసెంబర్ 9. ఉ.10గం.లకు కరీంనగర్ ఫిలిమ్ భవన్‌లో జరుగుతుంది.

**- కూకట్ల తిరుపతి**

**బి.సి. రైటర్స్ వింగ్ పురస్కారాలు**

బి.సి. లిటరరీ ఫెస్టివల్ సందర్భంగా డిసెంబర్ 10 సా.7గం.లకు కాన్ఫరెన్స్ హాల్, అశోక హోటల్, హన్మకొండలో బి.సి. రైటర్స్ వింగ్ పురస్కారాలను కాలువ మల్లయ్య, కె. మురళీ మనోహర్, జూలూరి గౌరి శంకర్, జి. లక్ష్మీ నరసయ్య, బండ రామలీల స్వీకరిస్తారు.

**- అనంతోజు మోహన్ కృష్ణ**

---

# కవుల కార్యశాల సి.వి. కృష్ణారావు

"కావ్య సృష్టి చేయాలనుకున్న మనిషికి కొన్ని జీవిత విలువలు అమూల్యమై వుండి వాటితో ఎటువంటి రాజీపడకూడదు. కావ్య సృష్టి ఎంత ఉదాత్తమైనదో తను అంత ఉదాత్త భావాలు కలిగివుండాలి" అంటూ సి.వి. కృష్ణారావు గారు ఒక ఇంటర్వ్యూలో చెప్పడం కాదు-- ఆ ఆశయంతోనే-- 'వైతరణి', 'మాదీ మీ ఊరే', 'అవిశ్రాంతం', 'కిల్లారి', 'రాస్తూ రాస్తూ' అనే కవితా సంపుటాలు రాశారు.

సి.వి. కృష్ణారావు అనగానే 'నెలనెలా వెన్నెల' గుర్తుకు వస్తుంది. దాదాపు రెండు వందల సాహితీ సమావేశాలు ప్రతి నెలా నిర్వహించారు. ఇంచుమించుగా అన్నీ సి.వి.కె గారింట్లోనే జరిగేవి. నగ్నముని, కె.వి. సుబ్బారావు, కీశే పి.యస్. స్వామి, కీశే హరి చంద్రశేఖర్ ఒకరోజు కలిసినప్పుడు ప్రతి నెలా కలుసుకొని సాహిత్య చర్చలు జరుపుకోవాలని నిర్ణయించారు. అలా మొదలైనది క్రమక్రమంగా శేషేంద్ర, కె.కె., చేరా, డా. వీరభద్రయ్య, వడలి మందేశ్వరరావు, పొత్తూరిగార్ల ప్రోత్సాహంతో నిరంతరాయంగా కొనసాగుతూ వచ్చింది. దాదాపు 300మందికి పైగా సాహితీవేత్తలూ, కవులూ, విమర్శకులూ, శ్రోతలూ ఈ సమావేశాల్లో పాల్గొనేవారు. ప్రతి సభ్యుడూ తాను చదవటం, ఇతరులది వినటం, ప్రశాంత వాతావరణంలో చర్చించుకోవటం 'నెల నెలా వెన్నెల' విశిష్టత. ఈ సంస్థ కవులకి, విమర్శకులకి కార్యక్షేత్రంలా ఉపయోగపడింది. ఎందరో కవులు తమకి తాము సానపెట్టుకొని ఇవాళ పేరు పొందారు. అందుకే సి.వి. కృష్ణారావుగారిని సాహిత్యంలో 'వన్ మేన్ ఆర్మీ' అంటారు. తన కవిత్వం, తన ఉన్నతి కాకుండా తర్వాతి తరాన్ని తయారు చెయ్యాలన్న తపన, సాహితీ పరిజ్ఞానాన్ని పెంచాలన్న దీక్షగల సి.వి. కృష్ణారావు గారు కవితా రచనను నిజాయితీగా చేపట్టారు. తన గుండె చప్పుళ్ళను వినిపించటానికే, మానవత్వాన్నిపెంచటానికే కలం పట్టుకున్నారు. మొదటి కవితా సంపుటి పేరు 'వైతరణి' ప్రత్యేకమైన శీర్షిక. ఇది సంప్రదాయానికి సంబంధించినదైనా ఆధునికంగా వాడుకున్నారు. "ఒకసారి మా యింటికి వచ్చి 'ఇదిగో నీవు కోరిన కావ్యమ'ని చేతికందిచ్చాడు. ఈ కావ్యం కృష్ణారావు బిడ్డ మాత్రమే గాదు-- నా బిడ్డ కూడా" అన్నారు కుందుర్తి.

'వైతరణి' కావ్యం 1967 ప్రాంతంలో వెలువడింది. ఒకే కథా వస్తువుకి సంబంధించిన వివిధ భావ పరంపర ఈ కావ్యం. తన అనుభూతిని అందరి అనుభూతిగా మేళవించడం వచన కవితా మార్గం. దానిని కృష్ణారావు సాధించారు. కుందుర్తి అన్నట్టు వైతరణి కావ్యంలో భావలయ వుంది:

"ఒక్కొక్క నగరం దేహం మీద/ మానని రాచపుండులా/వేదన హృదయంలో ఒత్తిగిలక/ వెలికివచ్చిన ఒక చిహ్నంలా/ మూలకొక్క మురికిపేట/ వేలకొలది జనుల విషాద గాథ"

--అంటూ ప్రారంభమయ్యే 'వైతరణి' కావ్యం గురించి కవే ఇలా అంటున్నాడు: "వైతరణి ఒడ్డును విడజాలని హరిజనులు...", "గుడిశ ముందు మురికి గుంటల ఒడ్డున..." జీవించే వారి పట్ల ఆవేదన చెంది తనంతతానుగా కవిత్వం వెలువడింది. అయితే ఎల్లకాలం ఇలా ఉండదనీ "చీకటిలో వెలుతురు స్తంభం నాటి" కొత్త త్రోవలు తొక్కుతారనీ ఆశాభావం ప్రకటిస్తాడు కవి. పేదరికాన్ని ఎంత నర్మగర్భంగా చెప్తాడో చూడండి:



తొంభయ్యవ పడిలో కవిత్వ జ్ఞాపకాలు పొరలుపొరలుగా నెమరువేసుకుంటూ నా కవితా కుటుంబంలోని సభ్యులందరూ ఎంతో ఎదిగారనే ఆత్మవిశ్వాసంతో ఉన్నారు సి.వి. కృష్ణారావుగారు.

"ఎన్నాళ్ళో దాచిపెట్టిన వెచ్చాలు/ వంటకాలవుతున్నయి"

"అమ్మ ఎదలో ఆకలి దూరి/ మాతృస్తన్యం దొంగిలిస్తే"

--ఇటువంటి శైలి వచన కవితకు గాంభీర్యం సంతరించి పెట్టింది.

1926 జులై 3వ తేదీన నల్గొండ జిల్లా రేపూరులో పుట్టి గుంటూరు చదువు కోసం వెళ్ళి, కుందుర్తి, అనిశెట్టి, కరుణశ్రీ, పోలూరి ఆంజనేయులు బృందంలో చేరి బ్రాడీపేట రైల్వే సిగ్నల్ పాయింట్ వద్ద కవితా పఠనాలు, చర్చలు చేసేవారు. కృష్ణారావు గారిపై నయాగరా కవుల ప్రభావం కనిపిస్తుంది. మనస్సంచలనం కలిగించే వాక్యనిర్మాణం కవిత్వంగా నిర్వచించారు. 1969లో రాసిన 'మాదీ మీ ఊరే' నయాగరా కవి బెల్లంకొండ రామదాసుకి అంకితమిచ్చారు.

"తొలి దుక్కికి గట్టు వెంట/ పండిన పొలాల మంచె నీడ
గవ్వలు గుచ్చిన మొలత్రాడు/ ముఖ్యాభరణంగా ఎదిగిన
మీ ఊళ్ళో ఒకణ్ణి నేను"

--అంటూ పెత్తందార్ల కాఠిన్యాన్ని వ్యంగ్యంగా వెల్లడిస్తున్నప్పుడు మనం ఆర్ద్ర హృదయులవుతాం. చిన్నపిల్లవాడి దుర్భరమైన బాధను 'గళ్ళచొక్కా' కవితలో వర్ణించి బాధ కూడా రూపసహితమైనదే అనిపిస్తారు.

1991లో 'అవిశ్రాంతం' కావ్యం రాసి నాన్న, అమ్మ, భార్యలకు అంకితమిచ్చారు. కృష్ణారావు గారు రాజకీయాలపైనా చురకలు వేశారు. అమానవీయతకీ కుహనా రాజకీయానికీ అవినాభావ సంబంధం వుంది కదా! రూపకాలంకారంతో వ్యంగ్య వైభవంతో రాసిన ఈ పంక్తులు అందుకు ఉదాహరణలు: "అక్కడ డాం సైటులో సిమెంటును ఇసుక మింగేసింది/ ఇక్కడ బార్ బిల్లు భర్తీ అయింది/ వాళ్ళు కూర్చున్న సోఫాలు మాట్లాడుతయి/ ఒకరికొకరు వినపడకుండా రహస్యాలు/ ఎవడి తద్దినానికో దర్భలుపేన్తారు/ గారెల ఖర్చు భర్తీ అవుతుంది"

--వచన కవితా రూపం శక్తివంతమనటానికి ఇది గొప్ప నిదర్శనం. కృష్ణారావు గారి అభివ్యక్తి అప్పటికి నవీనమేననటానికి చూడండి:

"నేడు మనిషి ఉజ్వల భవిష్య/దధ్యాయానికి మకుటాన్ననుకోవటం లేదు
తిండిబోతు కంచం అంచున/ జారిన అన్నంమెతుకుననుకుంటున్నాడు".

'రాస్తూ రాస్తూ' కవితం సంపుటిలో కూడా బడుగు జీవులే వస్తువు. వర్ణ వ్యవస్థపై వేలెత్తి చూపిస్తారు ఇలా:

"నాలుగు కోళ్ళు తన్ని/ పడుకున్నారు నలుగురు
కిందికి తోశారు కనిష్ఠుణ్ణి/ మంచానికే వాడు బరువని".

కృష్ణారావుగారు స్త్రీల దుస్థితి, వేదనలపై కూడా కలం దువ్వారు. నల్లగొండ జిల్లా చిలకుర్తిలో ఒక స్త్రీని వివస్త్ర చేసి ఊళ్ళో తిప్పిన వార్త చూసి ఖిన్నుడై 'రక్షా బంధం' రాశారు: "తలవంచిన తల్లుల మానం కోసం వచ్చా/ మెడ వాల్చిన బలిపశువుల కోసం వచ్చా/ దప్పిక తీర్చని కన్నీళ్ళ కోసం వచ్చా/ అశక్తులైన అందరి అండ కోసం వచ్చా/ రక్షాబంధం కోసం వచ్చా" అంటాడు కవి. బాధ కవిత్వానికి పర్యాయపదమైతే సి.వి కవిత ఉత్తమ కవిత్వం. తొంభయ్యవ పడిలో కవిత్వ జ్ఞాపకాలు పొరలుపొరలుగా నెమరువేసుకుంటూ నా కవితా కుటుంబంలోని సభ్యులందరూ ఎంతో ఎదిగారనే ఆత్మవిశ్వాసంతో ఉన్నారాయన. శతమానంభవతి అందాం!

**■ ద్వా.నా. శాస్త్రి**
98492 93376

---

# పాసంగం

కొత్త కొత్త ఆలోచనల తార్కిక మెరుపులు
తవ్వి తీస్తున్న చరిత్ర శకలాలు
మేళవిస్తే సరికొత్త ఇతిహాస నిర్మాణం
కలానికే కొత్త జవ పట్టువట్టింది

శ్రమ సంవేదన, విశ్రమ మాంత్రికతల నడక
వేరు వేరు విరుద్ధ జీవన రేఖలు
వేల ఏండ్లుగా సాగుతున్న పటాటోపం

తాళ పత్రాల్లో దాగిన అచ్చులు హల్లులే గాదు
మట్టి గడ్డల మౌన భాష ఒడిసి పట్టి
అక్షరాలకు జవ అందిస్తేనే మాయావిచ్చిన్నం

సుఖ దుక్కాలు, ఆస్తులు అంతస్తులు ఐశ్వర్యాలు
తరతరాలుగా వస్తున్న వర్ణపంకిల వారసత్వాలు

చలామణి లోనున్న సౌఖ్యాలు చెదిరిపోయి
చరిత్రకెక్కని చలన సూత్రాలు మెరుస్తున్న కాలం

పాసంగం అసమానత వల్లనే నొప్పితీవ్రత
కాలం బరువెక్కి భుజం మార్చుకుంటంది
మౌఖిక వాస్తవికత లిఖిత పుస్తకమైంది.

**■ అన్నవరం దేవేందర్**
94407 63479





## జాలితి చేసిన చిత్రం

ఇది ఓ మత్స్యకారుని విన్యాసం. చేపల వేట కోసం వల విసురుతూ గిసిన చిత్రం. కృష్ణాజిల్లా అవనిగడ్డ రోడ్డులో సమీపంలోని పెద్దపులిపాక కాలువలో ఆదివారం కనిపించిందీ దృశ్యం

### జగన్ అవుట్ ఆఫ్

# కవరేజ్ ఏరియా!

- తన విధానాలను సమీక్షించుకోవాలి: డొక్కా



గుంటూరు, డిసెంబరు 3(ఆంధ్రజ్యోతి): "ప్రతిపక్ష నేత జగన్ పొలిటికల్ ఏరియా నుంచి అవుట్ ఆఫ్ కవరేజ్‌లో ఉన్నారు. ఎన్ని పాదయాత్రలు చేసినా అసెంబ్లీకి రావాల్సిందే కదా. అలాంటిది అసలు శాసనసభకే రాననడం సరిదిద్దుకోలేని తప్పిదం" అని శాసనమండలి విప్ డొక్కా మాణిక్యవరప్రసాద్ అన్నారు. రాజ్యాంగానికి లోబడి వ్యవస్థలు పని చేస్తాయే తప్ప జగన్ కోరుకుంటున్నట్లు నడుచుకోవన్నారు. ఎంపీలు, ఎమ్మెల్యేలు పార్టీలు మారడం ఇటీవల కాలంలో సహజమైపోయిందన్నారు. జగన్ ఇప్పటికైనా తన విధానాలను పునఃసమీక్షించుకోకపోతే పార్లమెంటరీ వ్యవస్థకు దూరమైపోతారని అన్నారు. 1970లలో తరిమెల నాగిరెడ్డి అసెంబ్లీలో సుదీర్ఘ ప్రసంగం చేసి రాజీనామా చేసి వెళ్లిపోయి ప్రత్యామ్నాయ వేదికను ఏర్పాటు చేసుకొని పోరాడారు. అలాంటిది ఏమైనా ఉందేమో జగన్ ప్రజలకు తెలియజేయాలని కోరారు. 2019 వరకు పాదయాత్ర చేసినా జగన్ సీఎం కాలేడని, 2024 వరకు మరో పాదయాత్ర చేయాలేమోనని ఎద్దేవా చేశారు. సీఎం చంద్రబాబు కాపుల కోసం బీసీలకు నష్టం జరగకుండా రిజర్వేషన్ల కోటాను పెంచి వ్యూహాత్మకంగా వ్యవహరించారని, బీసీలు కూడా సీఎం నిర్ణయాన్ని సానుకూల కోణంలో చూస్తున్నారని చెప్పారు.

# వైసీపీకి మరో షాక్!

- పార్టీకి చిత్తూరు జెడ్పీ మాజీ చైర్మన్ సుబ్రమణ్యం రెడ్డి గుడ్‌బై

కుప్పం, డిసెంబరు 3: చిత్తూరు జెడ్పీ మాజీ చైర్మన్ ఎం.సుబ్రమణ్యం రెడ్డి వైసీపీకి రాజీనామా చేశారు. తన సొంత నియోజకవర్గమైన కుప్పంలో ఆదివారం ఆయన అనుచరులతో సమావేశమై తన నిర్ణయాన్ని ప్రకటించారు. పార్టీ అధినేత జగన్‌కు రాసిన రాజీనామా లేఖ వివరాలను వెల్లడించారు. వైఎస్ మృతితో ఆయన కుమారుడైన జగన్‌కు అండగా నిలబడాలని భావించి జెడ్పీ చైర్మన్ పదవిని సైతం త్యాగం చేసి మరీ వైసీపీలో చేరానని ఆయన చెప్పారు. 2014 ఎన్నికల్లో కుప్పం నియోజకవర్గ ఎమ్మెల్యే టికెట్ ఇస్తానని చెప్పి, చివరకు బీసీ వ్యక్తిని తీసుకొచ్చి నిలబెట్టినా పార్టీ కోసం మనస్ఫూర్తిగా పనిచేశానన్నారు. అయినా తాను, తన అనుచరులు ఎన్నికల్లో పనిచేయలేదని నిందలు వేయడం ఎంతో బాధించిందని ఆవేదన వ్యక్తం చేశారు. 2019 ఎన్నికల దాకా నియోజకవర్గంలోనే అడుగు పెట్టకూడదని తనకు ఆంక్షలు పెట్టడం ఎలా సమంజసమని ప్రశ్నించారు. తన అనుచరులు పలుమార్లు కుప్పం నియోజకవర్గంలో పార్టీలో నెలకొన్న అస్తవ్యస్థ పరిస్థితిని గురించి చెప్పడానికి ప్రయత్నిస్తే ఎమ్మెల్యే పెద్దిరెడ్డి రామచంద్రారెడ్డితో మాట్లాడమని పంపారన్నారు. ఆయన ఏనాడూ ఏ విషయమూ మాట్లాడక పోగా తనకు కనీసం ఆహ్వానం కూడా లేకుండా కుప్పం నియోజకవర్గంలో పర్యటించడం బాధ కలిగించిందన్నారు. నిరంతరం తనకు, తన అనుచరులకు ఎదురవుతున్న అవమానాలు భరించలేక విధిలేని పరిస్థితుల్లో పార్టీకి రాజీనామా చేస్తున్నట్లు సుబ్రమణ్యంరెడ్డి ప్రకటించారు.

## దక్షిణ కొరియాకు చేరుకున్న సీఎం బృందం

- పలు సంస్థల ప్రతినిధులతో సమావేశం.. బిజీబిజీ



దక్షిణకొరియాలో చంద్రబాబు

అమరావతి, డిసెంబర్ 3(ఆంధ్రజ్యోతి): రాష్ట్రానికి పెట్టుబడులు ఆకర్షించేందుకు బయలుదేరిన సీఎం చంద్రబాబు బృందం రిపబ్లిక్ ఆఫ్ కొరియాకు ఆదివారం రాత్రికి చేరుకుంది. ఆదివారం మధ్యాహ్నం 1 గంటకు హైదరాబాద్ నుంచి బయలుదేరి ఢిల్లీ మీదుగా దక్షిణ కొరియాకు వెళ్లారు. సోమ, మంగళ, బుధవారాల్లో సీఎం బృందం దక్షిణ కొరియాలోని సియోల్, బూసన్ నగరాల్లో పర్యటించి అక్కడ కియో మోటార్స్ హెడ్‌క్వార్టర్స్ సందర్శిస్తుంది. అక్కడ జరిగే బిజినెస్ సెమినార్‌లో పాల్గొంటుంది. ఈ పర్యటన ముగించుకుని 7న తిరిగి వస్తారు.

### తొలిరోజు పర్యటన వివరాలు

- భారత కాలమానం ప్రకారం సోమవారం వేకువ జామున 2.20 గంటలకు సియోల్ విమానాశ్రయానికి చేరుకుంటారు.
- 5.45 గంటల నుంచి కార్యక్రమాలు ప్రారంభమవుతాయి. తొలుత భారత రాయబారి విక్రమం దొరైస్వామితో భేటీ అవుతారు
- 6.15కి కియా అనుబంధ సంస్థల ప్రతినిధులతో భేటీ
- 6.50కి దాసన్ నెట్‌వర్క్ చైర్మన్ నామ్ మెయిన్ వూతో సమావేశం.
- 7 గంటలకు జుసంగ్ ఇంజనీరింగ్ సీఈవో వాన్గ్ చుల్‌జుతో సమావేశం.
- 8.30కి లట్టే కార్పొరేషన్ సీఈవో వాన్గ కాగ్ జుతో సమావేశం ఉంటుంది.

## నేతల్ని సమన్వయం చేసుకోండి

- రిజర్వేషన్‌పై పరిణామాలు గమనించండి
- పార్టీ నాయకులకు చంద్రబాబు సూచన

అమరావతి, డిసెంబరు 3(ఆంధ్రజ్యోతి): కాపు రిజర్వేషన్ల విషయంలో పార్టీ నాయకుల్ని సమన్వయం చేసుకోవాలని మంత్రులు కళా వెంకట్రావు, అచ్చెన్నాయుడు, ఎమ్మెల్సీ టీడీ జనార్ధన్‌లను సీఎం చంద్రబాబు ఆదేశించారు. ఈ మేరకు వారికి బాధ్యత అప్పగించారు. కొరియా పర్యటనలో ఉన్న సీఎం పార్టీ ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీలతో టెలికాన్ఫరెన్స్ నిర్వహించారు. కాపు రిజర్వేషన్లు, బీసీ సంఘాల ఆందోళన, మంజునాథ వివాదంపై నేతలకు పలు సూచనలు చేశారు. బీసీ కమిషన్‌లోని మెజారిటీ సభ్యులు ఇచ్చిన నివేదిక ఆధారంగా కాపు రిజర్వేషన్లపై నిర్ణయం తీసుకున్నామన్నారు. తొలినుంచీ చెబుతున్నట్లుగా బీసీలకు వారి కోటాలో కోత పెట్టలేదన్నారు. దీనిపై జిల్లాల్లో జరుగుతున్న పరిణామాలను జాగ్రత్తగా పరిశీలించాలని సూచించారు. కొన్ని పార్టీలు రాజకీయ లబ్ధికోసం కులాలను రెచ్చగొడుతున్నాయని, టీడీపీ బీసీలనుగానీ, కాపులనుగానీ ఎప్పుడూ ఓటుబ్యాంకుగా చూడలేదని చెప్పారు. కాగా బీసీ సంక్షేమ సంఘం అధ్యక్షుడు ఆర్. కృష్ణయ్య చేస్తున్న పొర్శలను ప్రస్థావిస్తూ.. తెలంగాణలో 54 బీసీ కులాల నుంచి 17 కులాలను తొలగించారని, దానిపై మాట్లాడకుండా ఏపీలోని నిర్ణయాలపై విమర్శలు చేయడం ఏంటని ఓ మంత్రి వ్యాఖ్యానించారు.

### కాపులకు రిజర్వేషన్ కల్పిస్తే తప్పా!

- తెలంగాణలో 27 కులాలను బీసీ జాబితా నుంచి తీసేసారు
- కృష్ణయ్య ఎందుకు స్పందించలేదు: కళా వెంకట్రావు

శ్రీకాకుళం, డిసెంబరు 3(ఆంధ్రజ్యోతి): "తెలంగాణలో 27 కులాలను బీసీ జాబితాలో తొలగించారు. అయినా.. జాతీయ బీసీ నాయకుని హోదాలో ఆర్. కృష్ణయ్య కనీసం స్పందించలేదు. ఎందుకు స్పందించలేదు" అని టీడీపీ రాష్ట్ర అధ్యక్షుడు, మంత్రి కిమిడి కళావెంకట్రావు ప్రశ్నించారు. శ్రీకాకుళంలో ఆదివారం ఆయన మీడియాతో మాట్లాడుతూ.. 'పాదయాత్రలో ఇచ్చిన హామీ ప్రకారం సీఎం చంద్రబాబు కాపులకు 5% రిజర్వేషన్ కల్పిస్తే.. బీసీలకు అన్యాయం జరిగిపోతోందంటూ కృష్ణయ్య ప్రశ్నిస్తున్నారు. వాస్తవంగా ఇప్పుడున్న బీసీ జాబితాలో ఉన్నవారికి ఏ విధమైన నష్టం వాటిల్లదు. కాపులకు బీసీ-ఎఫ్ కేటగిరీలో 5% రిజర్వేషన్ కల్పిస్తూ అసెంబ్లీలో బిల్లు పాస్‌చేశాం. ఈ బిల్లును గవర్నర్ ద్వారా రాష్ట్రపతికి పంపుతున్నాం. బీసీలు ఆందోళన చేయనక్కర్లేదు. కొత్తగా కాపులకు అవకాశం లభించింది. కొంతమంది ఈ అంశాన్ని రాజకీయ లబ్ధి కోసం వాడుకోవాలని చూస్తున్నారు. అలాగే.. లబ్ధి పొందనున్న కాపులు కూడా అతి సంతోషాలకు పోకుండా సంయమనం పాటించాలి' అని మంత్రి స్పష్టం చేశారు. ఇప్పటికే రిజర్వేషన్‌పై బిల్లు పాస్ చేయడంపై కాపు ఉద్యమనేత ముద్రగడ పద్మనాభం కూడా స్వాగతించారని మంత్రి పేర్కొన్నారు. రాష్ట్ర విభజన బిల్లులోనే అసెంబ్లీ సీట్లు పెంపు అంశం ఉందని, కచ్చితంగా రాబోయే ఎన్నికల నాటికే అది కూడా అమలయ్యే అవకాశముందని మంత్రి అన్నారు.

### పోలవరం కోసం కేంద్రంపై ఒత్తిడి తెద్దాం: జేపీ



చర్చా కార్యక్రమంలో జయప్రకాశ్ నారాయణ

చిలకలూరిపేట, డిసెంబరు 3: జాతికి ఉపయోగపడే పోలవరం నిర్మాణం ఆగకూడదని, సత్వరం పూర్తి చేసుకోవలసిన అవసరం ఉందని, దీనికి అన్ని రాజకీయ పార్టీలు ఐక్యంగా ముందుకు సాగాలని లోక్‌సత్తా వ్యవస్థాపక అధ్యక్షుడు జయప్రకాష్ నారాయణ అన్నారు. లోక్‌సత్తా సురాజ్య యాత్రలో భాగంగా ఆదివారం ఆయన గుంటూరుజిల్లా చిలకలూరిపేటలో పర్యటించారు. మీడియాతో మాట్లాడుతూ.. పోలవరం నిర్మాణ పనులు నిలిచిపోకుండా కేంద్రంపై అన్ని పార్టీలు ఒత్తిడి తీసుకురావలసిన అవసరం ఉన్నదన్నారు. యాత్రలో భాగంగా పట్టణంలో 'హక్కుగా పౌరసేవలు-సుపరిపాలన' అనే అంశంపై చర్చ నిర్వహించారు. మానుకొండవారిపాలెం గ్రామ పరిధిలోని పత్తి పంటలను ఆయన పరిశీలించి రైతులతో మాట్లాడారు. స్థానిక ఎస్సీ హాస్టల్‌ను సందర్శించి విద్యా ప్రమాణాలు, చదువులకు సంబంధించి పలు సూచనలు చేశారు. ప్రభుత్వ ఆసుపత్రిని సందర్శించి సమస్యలను తెలుసుకున్నారు.

# నగరాలకు ఔటర్ హారం!

(మొదటి పేజీ తరువాయి)

అవసరం ఉన్నట్లు తెలిసింది. వీటిలో కొన్నింటిని పబ్లిక్ ప్రైవేట్ పార్టనర్‌షిప్(పీపీపీ), బిల్డ్ ఆపరేట్ ట్రాన్సిట్ (బీఓటీ) పద్ధతుల్లో నిర్మించనున్నారు. రాష్ట్ర ప్రభుత్వ నిధులతోపాటు కోర్‌నెట్ ప్లాన్ కింద కూడా కొన్ని రహదారుల నిర్మాణం చేపట్టనున్నారు. ప్రతిపాదిత రహదారుల నిర్మాణానికి కనీసం రూ.3 వేల కోట్లపైనే అవసరం ఉంటుందని అంచనా వేశారు. ఒక్క కర్నూలు జిల్లాలోని ఔటర్, ఇన్నర్ రింగు రోడ్డు నిర్మాణ ఖర్చే రూ.791 కోట్లు ఉంటుందని అంచనా. ఇటీవల ఆర్అండ్‌బీ మంత్రి అయ్యన్నపాత్రుడు ఈ ప్రతిపాదనలపై ఉన్నతస్థాయి సమీక్ష చేశారు.

### సీమ నగరాలకు మహర్దశ

అభివృద్ధిపరంగా వెనుకబడి ఉన్న రాయలసీమలోని కర్నూలు, అనంతపురం నగరాలకు ఔటర్, ఇన్నర్ రింగు రోడ్డులను ఏర్పాటు చేయాలని నిర్ణయించారు. వీటితో పాటు కాకినాడ నగరంలోనూ ఔటర్, ఇన్నర్ రింగు రోడ్డులను నిర్మించనున్నారు. కర్నూలు నగరం, దాని చుట్టుపక్కల ప్రాంతాల అభివృద్ధిని దృష్టిలో పెట్టుకొని 45 కి.మీ పరిధిలో ఔటర్ రింగ్‌రోడ్డును ప్రతిపాదించారు. రూ.405 కోట్లతో నాలుగు వరసల ఔటర్‌ను నిర్మించాలని నిర్ణయించారు. దీనికి ఇంకా పరిపాలనా పరమైన అనుమతులు ఇవ్వాల్సి ఉంది. రూ.386 కోట్లతో కర్నూలు సిటీలో 30 కిలోమీటర్ల మేర ఇన్నర్ రింగ్ రోడ్డు నిర్మించాలని కూడా ప్రతిపాదించారు. ఒక్క కర్నూలు జిల్లాల్లోనే రూ.791 కోట్లతో రహదారి నిర్మాణ ప్రతిపాదనలు చేయడం విశేషం. ఈ రెండు ప్రాజెక్టులు కర్నూలు రూపురేఖలు మార్చనున్నాయని అధికారవర్గాలు చెబుతున్నాయి. అనంతపురం-అమరావతిని కలిపే రహదారి నిర్మాణం పూర్తయిన తర్వాత ఈ రెండు ప్రాజెక్టులు కార్యరూపం దాలిస్తే కర్నూలు మరింత వేగంగా అభివృద్ధి చెందుతుందని చెబుతున్నారు. అనంతపురం నగరానికి 27 కిలోమీటర్ల మేర ఔటర్ రింగు రోడ్డును నిర్మించాలన్న ప్రతిపాదనకు సర్కారు ఆమోదం తెలిపింది. దీన్ని పబ్లిక్-ప్రైవేటు భాగస్వామ్యం(పీపీపీ) పద్ధతిలో నిర్మించాలని నిర్ణయించారు. ఎల్అండ్‌టీ సంస్థకు సాంకేతిక సాధ్యాసాధ్యాల అధ్యయన బాధ్యతలు అప్పగించారు. వీటితో పాటు కాకినాడ నగరానికీ ఔటర్, ఇన్నర్ రింగు రోడ్డు ఏర్పడనుంది. వీటితోపాటు అనంతపురం జిల్లాల్లోని కదిరి పట్టణానికి భారీ ఔటర్ రింగ్ రోడ్డును ప్రతిపాదించారు. అనంతపురం జిల్లాలో అత్యంత వెనుక బడ్డ ప్రాంతమైన మడకశిర ప్రాంతానికి కూడా రింగ్ రోడ్డును ప్రతిపాదించారు. తూర్పుగోదావరి జిల్లాల్లో ప్రముఖ పుణ్యక్షేత్రమైన ద్రాక్షారామం చుట్టూ 9 కిలోమీటర్ల మేర ఔటర్ రింగు రోడ్డు నిర్మించాలని నిర్ణయించారు. రూ.26.30 కోట్లతో ఈ ప్రాజెక్టును చేపట్టాలని ఆర్అండ్‌బీ సర్కారుకు ప్రతిపాదించింది. చిత్తూరు జిల్లాలోని కుప్పం పట్టణానికి ఔటర్ రింగ్ రోడ్డును ప్రతిపాదించారు.

**అభివృద్ధి రహదారులు: అయ్యన్న**

'జాతీయ, రాష్ట్ర రహదారులున్న నగరాలు, పట్టణాలు, గ్రామాల్లో విపరీతంగా శబ్ధ, వాయు కాలుష్యం పెరిగిపోతోంది. వీటిని అధిగమించడంతోపాటు ప్రజల ట్రాఫిక్ కష్టాలను తొలగించేందుకు, అభివృద్ధిని శరవేగంగా పరుగులు పెట్టించేందుకు రహదారుల నిర్మాణం అవశ్యం. అందుకే పలు చోట్ల ఔటర్, ఇన్నర్ రింగు రోడ్లతోపాటు బైపాస్ రహదారులనూ నిర్మించాలని ప్రతిపాదించాం. వీటి నిర్మాణానికి సుమారు రూ.3వేల కోట్లు అవసరమవుతుందని అంచనా' అని ఆర్అండ్‌బీ మంత్రి అయ్యన్న పాత్రుడు అభిప్రాయపడ్డారు.

### పలు పట్టణాలు.. గ్రామాలకు బైపాస్ రోడ్లు

పుత్తూరు-సత్యవేడు రోడ్డు మీదున్న ఉత్తుకోటై పట్టణానికి రూ.24 కోట్లతో, సత్యవేడు పట్టణానికి రూ.66 కోట్లతో బైపాస్ రోడ్డును ప్రతిపాదించారు. అనంతపురం-రాయదుర్గం-కళ్యాణదుర్గం రోడ్డు మీదున్న రాయదుర్గం పట్టణానికి రూ.45 కోట్లతో, తాడిపత్రి నియోజకవర్గంలోని పెద్దపప్పూర్‌కు బైపాస్‌ను నిర్మించాలంటూ ఆర్అండ్‌బీ సర్కారుకు ప్రతిపాదించింది. కర్నూలు జిల్లా గుడివేముల గ్రామానికి, బనగానపల్లికి బైపాస్‌ను ప్రతిపాదించారు. ప్రకాశం జిల్లా పామూరు-సీఎస్ పురం రోడ్డుపై బైపాస్‌ను సూచించారు. తూర్పుగోదావరి జిల్లాలో ద్వారపూడి-యానాం రోడ్డుపై తాపేశ్వరం బైపాస్, ఏడీబీ రోడ్డును కలుపుతూ కాకినాడ బైపాస్, తణుకు-భీమవరం రోడ్డుపై వేల్పూరు బైపాస్, ద్వారపూడి-యానాం మీదుగా రామచంద్రాపురానికి రూ.13 కోట్లతో బైపాస్ ప్రతిపాదించారు. మండపేట, కపిలేశ్వరం రోడ్డు నుంచి ద్వారపూడి, యానాం రోడ్డుని కలుపుతూ మండపేట పట్టణానికి, ఏవీ నగరం గ్రామానికి బైపాస్ రోడ్లను ప్రతిపాదించారు. ఈ రోడ్ల విలువ రూ.18 కోట్లపైనే ఉన్నట్లు తెలిసింది.

### మరో ఏడు రోడ్లపై అధ్యయనం

కర్నూలు, కడప, అనంతపురం, నెల్లూరు జిల్లాల్లో కొత్తగా ఏడు రహదారి ప్రాజెక్టులు చేపట్టాలని ఆర్అండ్‌బీ నిర్ణయించింది. వీటిని ప్రత్యేక కారిడార్ ప్రాజెక్టులుగా పిలుస్తున్నారు. ఆ ప్రాజెక్టులు ఇవీ.. గూడూరు-రాజంపేట రోడ్డు, కల్వగుంట-నేంద్రగుంట రోడ్డు, చాగలమర్రి-రాయచోటి, అనంతపురం రింగ్ రోడ్డు, పులివెందుల-దామాజీపల్లి (కడప-అనంతపురం), సోమందేపల్లి-తూముకుంట రోడ్డు(అనంతపురం), కదిరి రింగ్ రోడ్డు.

### ఏం కొనలేం..

# ఏం తినలేం

(మొదటి పేజీ తరువాయి)

రూ.60 ఉన్న ధర ఒక్కసారిగా కిలోకి రూ.30 పెరిగింది. వేరుశనగలు గింజ సైజును బట్టి ధరలు పలుకుతున్నాయి. గింజ లావుగా ఉంటే కిలో రూ.120ఉండగా, రెండో రకం రూ.105చెప్తున్నారు. వేయించిన శనగపప్పు ధర కిలో రూ.100కు తగ్గడం లేదు. వేరుశెనగ నూనె కిలో రూ.104 అంటున్నారు. సన్‌ఫ్లవర్ ఆయిల్ కిలో రూ.88 వరకు ఉండగా, పామాయిల్ రూ.76 చెప్తున్నారు. ఎండుకొబ్బరి కిలో రూ.200కు చేరింది. కందిపప్పు కిలో రూ.70, మినపగుళ్ల రూ.80, పొట్టుతీయని మినపప్పు రూ.68 పలుకుతున్నాయి. బెల్లం కిలో రూ.60 ఉండగా, శెనగపిండి రూ.88 చెప్తున్నారు. గోధుమపిండి, మైదాపిండి రూ.34 ఉండగా, ఇడ్లీ రవ్వ రూ.32, బొంబాయి రవ్వ రూ.34, గోధుమ రవ్వ రూ.36 ఉన్నాయి. అల్లం రూ.60, చిన్న ఉల్లిపాయలు రూ.80 వరకు ఉన్నాయి. కూరగాయల్లో క్యారెట్ ధర తగ్గడం లేదు. కిలో రూ.80పైనే అంటున్నారు. బీట్రూట్ రూ.50, ములక్కాయలు ఒక్కొక్కటీ రూ.20 చెప్తున్నారు. టమాటా కిలో రూ.30నుంచి రూ.40వరకు అమ్ముతున్నారు. కూరగాయలు కిలో రూ.30 లోపు ఉన్నాయి. కోడిగుడ్డు రూ.6 చొప్పున అమ్ముతున్నారు.

### పెరుగుదలకు కారణాలివే!

ఉత్పత్తి, వినియోగం మధ్య వ్యత్యాసం మార్కెట్‌పై తీవ్ర ప్రభావం చూపుతోంది. ఉదాహరణకు రాయలసీమలో ఉల్లి పంట దెబ్బతినడంతో డిమాండ్ పెరిగిందంటున్నారు. అయితే గత నెలలో ఉల్లి సాగు ప్రారంభమైంది. ప్రస్తుతం సాగులో ఉన్న ఉల్లిపాయలు మార్కెట్‌లోకి వచ్చేందుకు మరో నెలపైనే పడుతుంది. పైగా ఇతర దేశాల నుంచి ఉల్లి ఎగుమతి ఆర్డర్ల డిమాండ్ ఉండడంతో ధరలు తగ్గే అవకాశాలు లేవంటున్నారు వ్యాపారులు. ఈ ఏడాది చింతపండు తక్కువగా వస్తోంది. వేసవిలో తీసిన చింతపండు నిల్వలు తగ్గడంతో ధరలు పెరుగుతున్నట్లు వ్యాపారులు చెప్తున్నారు. మిర్చి ఎగుమతి ఆర్డర్ల వల్ల కొనుగోళ్లు పెరిగి, ధరలు పైకి చూస్తున్నాయి. గత ఏడాది పండించిన మిర్చిని కోల్డ్‌స్టోరేజీల్లో నిల్వ చేసిన రైతులు ప్రస్తుతం ధర రావడంతో అమ్ముకుంటున్నారు.

### ట్రాన్‌స్ట్రాయ్ లేఖ

# రాసినంతనే..!

- టెండర్లు నిలిపేయాలన్న కేంద్ర జలవనరుల శాఖ

న్యూఢిల్లీ, డిసెంబరు 3(ఆంధ్రజ్యోతి): రాష్ట్ర ప్రభుత్వం ప్రతిష్ఠాత్మకంగా భావిస్తున్న పోలవరం ప్రాజెక్టును వీలైనంత వేగంగా పూర్తి చేసేందుకు సహకరించాల్సిన కేంద్ర జలవనరుల శాఖ, కాంట్రాక్టర్ చేసిన ఫిర్యాదుకు స్పందించి కీలకమైన టెండర్లను ఆపేయాలని తాఖీదు పంపడం చర్చనీయాంశంగా మారింది. పోలవరం ప్రాజెక్టుకు సంబంధించి స్పిల్ వే, స్పిల్ చానల్ తదితర పనులకు సంబంధించి తనకు తెలియకుండా టెండర్లు పిలవడం విచారకరమంటూ ప్రధాన కాంట్రాక్టు సంస్థ ట్రాన్‌స్ట్రాయ్ నవంబరు 21న కేంద్ర జలవనరుల శాఖ కార్యదర్శి అమర్జిత్ సింగ్‌కు ఓ లేఖ రాసింది. ఈ- మెయిల్ ద్వారా దీన్ని పంపింది. తమకు తెలియకుండా టెండర్లు పిలవడమంటే ఒప్పందంలోని 60(సి) క్లాజు కింద తమను తప్పించడమేనని ట్రాన్‌స్ట్రాయ్ పేర్కొంది. తమకు సెప్టెంబరు 15న నోటీసు ఇచ్చిన తర్వాత పోలవరం నిర్మాణంలో జాప్యానికి కారణాలను వివరించామని, అసలు తమకు నోటీసు ఇచ్చేందుకు సూపరిండెంట్ ఇంజనీరుకు చట్టపరమైన హక్కే లేదని ఆ ఫిర్యాదులో పేర్కొంది. ఒప్పందం కుదిరిన 40 నెలల తర్వాత 2016లో తమకు భూమి అప్పగించారని, అనుబంధ ఒప్పందాన్ని పూర్తి చేయడంలో కూడా ఆలస్యం జరిగిందని ట్రాన్‌స్ట్రాయ్ పేర్కొంది. ఈ మెయిల్ అందిన తక్షణమే, రాష్ట్ర ప్రభుత్వం నుంచి సమాచారం కోరకుండా కేంద్రం టెండర్లు నిలిపివేయాలంటూ ఆదేశాలు ఇచ్చేసింది. పోలవరం పనుల్లో జాప్యాన్ని నివారించి, పనుల్లో వేగం పెంచేందుకు కాంట్రాక్టర్‌ను తప్పించాలని రాష్ట్ర ప్రభుత్వం కోరుతున్న తరుణంలో సదరు కాంట్రాక్టర్ పంపిన ఓ మెయిల్ కే కేంద్రం స్పందించడం ఏమిటని రాష్ట్ర జలవనరుల శాఖ అధికారులు ప్రశ్నిస్తున్నారు.

### పట్టిసీమ నుంచి రాయలసీమకు

# నీళ్లెలా ఇస్తారు..?

- రైతులను చంద్రబాబు మోసగిస్తున్నారు
- ఎర్రగుడి రైతు ఆత్మీయ సమ్మేళనంలో జగన్



రైతు సదస్సులో ప్రసంగిస్తున్న జగన్

కర్నూలు, డిసెంబరు 3(ఆంధ్రజ్యోతి): 'పట్టిసీమ ఎక్కడుంది..? రాయలసీమ ఎక్కడుంది..? ఆ ప్రాజెక్టు నుంచి రాయలసీమ సస్యశ్యామలం చేస్తామంటే ఎవరైనా నమ్ముతారా..? గోబెల్స్ ప్రచారంతో చంద్రబాబు రైతులను మోసం చేస్తున్నారు' అని ప్రతిపక్షనేత వైఎస్ జగన్ ఆరోపించారు. ప్రజా సంకల్ప యాత్రలో భాగంగా ఆదివారం కర్నూలు జిల్లా పత్తికొండ నియోజకవర్గంలో ఆయన పాదయాత్ర కొనసాగించారు. తుగ్గలి మండలం మదనంతపురం క్రాస్ దగ్గర ఏర్పాటు చేసిన శిబిరం నుంచి ఉదయం 8.30 గంటలకు నడక మొదలు పెట్టి అనంతపురం జిల్లాలో అడుగుపెట్టారు. ఎర్రగుడి దగ్గర ఏర్పాటు చేసిన రైతు ఆత్మీయ సమ్మేళనంలో జగన్ ప్రసంగించారు. పట్టిసీమకు, రాయలసీమకు లింకుపెట్టి రైతులను చంద్రబాబు దగా చేస్తున్నారని ఆరోపించారు. 'గోదావరి, కృష్ణా నదులకు ఒకేసారి వరదలు వస్తాయి. పట్టిసీమలో గోదావరి జలాలు ఎత్తిపోసి ప్రకాశం బ్యారేజీ దగ్గర 50 టీఎంసీలు సముద్రంలో వదులుతున్నారు' అని విమర్శించారు. తాము అధికారంలోకి వస్తే గాలేరు నగరి, హంద్రీవా, తెలుగుగంగతో పాటు అసంపూర్తి ప్రాజెక్టులను పూర్తిచేసి రైతన్నకు అండగా ఉంటామన్నారు. ఖరీఫ్ ముందుగానే మద్దతు ధర ప్రకటిస్తామని, గిట్టుబాటు ధర అందించేందుకు రూ.3 వేల కోట్లతో ధరల స్థిరీకరణ నిధిని ఏర్పాటు చేస్తామని వివరించారు. ప్రకృతి విపత్తుల నుంచి రైతులను ఆదుకోవడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కలిసి రూ.4వేల కోట్లతో విపత్తు నిధి ఏర్పాటు చేస్తామన్నారు. 'దేశంలో ఏ రాష్ట్రంలోనూ 7.2 శాతానికి మించి వృద్ధిరేటు లేదు. ఏపీలో మాత్రం 12శాతం ఉందని, వ్యవసాయ రంగం 14శాతం అభివృద్ధి చెందిందని సీఎం చెబుతున్నారు. అదే నిజమైతే ప్రపంచంలోనే మనం అగ్రస్థానంలో ఉంటాం. ఇది నమ్మశక్యమా?' అని జగన్ ప్రశ్నించారు. నకిలీ విత్తనాలు, కల్తీ మందుల తయారీలో సాక్షాత్తు స్పీకర్ పేరు వినిపిస్తోందని, అందుకే కేసు నమోదు కావడం లేదని ఆరోపించారు. పత్తి కొనుగోళ్లలో అక్రమాలు జరుగుతున్నాయని, ఈ వ్యవహారంలో మంత్రులు ప్రత్తిపాటి పుల్లారావు, లోకేశ్ ప్రమేయం ఉందని ఆయన ఆరోపించారు. కాగా, సోమవారం ఉదయం గుత్తి మండలం బసినేపల్లి నుంచి అనంతపురం జిల్లాలో జగన్ పాదయాత్ర ప్రారంభిస్తారు.

# పాపికొండలకు మళ్లీ చలో చలో



దేవీపట్నంవద్ద గోదావరిలో పర్యాటక బోటు

- 26 బోట్లకు అధికారుల అనుమతి

రాజమహేంద్రవరం, డిసెంబరు 3 (ఆంధ్రజ్యోతి): గోదావరి నదిలో పాపికొండలు అందాలు వీక్షించేందుకు బోటు షికారు మళ్లీ ఆరంభమైంది. కృష్ణానదిలో బోటు బోల్తా పడిన తర్వాత గోదావరిలోనూ బోటింగ్ నిలిపివేశారు. ఇటీవల ప్రభుత్వం పలు నిబంధనలతో ఒక జీవో జారీ చేసింది. వాటిలో కొన్ని అమలు చేస్తూ అధికారులు పోలవరం నుంచి 13 బోట్లకు, పోచవరం నుంచి 13 బోట్లకు అనుమతి ఇచ్చారు. వాస్తవానికి పోలవరం, పురుషోత్తపట్నం నుంచి 24 ప్రైవేట్ బోట్లు, రెండు టూరిజం బోట్లు తిరిగేవి. వాటిని ఇటీవల రెవెన్యూ, పోలీస్, ఫైర్, ఇరిగేషన్ అధికారులు పరిశీలించారు. అందులో 13 బోట్లకు అనుమతిచ్చారు. పోచవరం నుంచి 34 బోట్ల వరకూ తిరిగేవి. అందులో 13 బోట్లకు అనుమతిచ్చారు. రాజమహేంద్రవరం నుంచి పాపికొండలకు నేరుగా నాలుగు లాంచీలు వెళ్లేవి. ఇక్కడినుంచి బోట్లకు అనుమతిలేదు. రాజమహేంద్రవరం నుంచి పాపికొండలకు వెళ్లే మార్గంలో గోదావరి లోతు తక్కువగా ఉందనే కారణంతో బోట్లకు అనుమతి ఇవ్వడంలేదు. వాస్తవానికి జూలై నుంచి అక్టోబరు వరకూ రాజమహేంద్రవరం నుంచి నేరుగా పాపికొండలకు బోట్లు నడిపే అవకాశం ఉంది. ఈ ఏడాదైతే ఇప్పటికీ గోదావరిలో నీరుబాగానే ఉంది. గోదావరిలో ఇంకా దేవీపట్నం, కొండమొదలు, గండిపోచమ్మగుడి తదితర ప్రాంతాలకు కూడా సర్వీసు బోట్లు ఉన్నాయి. పాపికొండల విహారానికి రోజూ అధికారికంగా దాదాపు 3వేలమంది పర్యాటకులు వస్తారు.

## బాల్యవివాహాన్ని
# ఆపిన యాప్

పట్నా, డిసెంబరు 3: బాల్య వివాహం అనే చెరలో చిక్కుకోకుండా 13 ఏళ్ల బాలికను ఒక యాప్ కాపాడింది. పట్నాకు చెందిన జెండర్ అలయన్స్ అనే స్వచ్ఛంద సంస్థ గత సెప్టెంబరులో 'బంధన్ టాడ్' పేరుతో ఓ మొబైల్ యాప్‌ను రూపొందించింది. బాల్య వివాహాలు, వరకట్న వేధింపులు, గృహహింస, లింగ వివక్షకు గురయ్యే బాధితులు ఈ యాప్ ద్వారా ఫిర్యాదు చేయొచ్చు. ఈ నేపథ్యంలో తల్లిదండ్రులు తనకు బలవంతంగా పెళ్లి జరిపిస్తున్నారంటూ 13 ఏళ్ల బాలిక 'బంధన్ టాడ్'లో మెసేజ్ పెట్టింది. ఫిర్యాదు స్వీకరించిన జెండర్ అలయన్స్ ప్రతినిధులు పట్నా పోలీసుల సహకారంతో బలవంతపు పెళ్లి నుంచి బాలికను రక్షించారు.

# కండోమ్‌లూ నకిలీ!

(మొదటి పేజీ తరువాయి)

అక్రమార్కులు జాగ్రత్తలు తీసుకోవడం గమనార్హం. బ్రాండ్ అయితే దానిపై తయారీ, గడువు ముగిసే తేదీలు ఉంటాయి. కొనుగోలుదారులు అవేమీ చూడకుండా దుకాణదారు ఇచ్చిందే తడవుగా జేబులో పెట్టుకుని వెళ్లిపోతూ. ఎయిడ్స్ వంటి భయంకర రోగాల బారిన పడుతున్నారు. ఈ ఆతృతనే క్యాష్ చేసుకుంటున్నారు నకిలీరాయుళ్లు.

### కేరళ నుంచి రసాయనాలు!

గడువు తీరిన ప్యాకెట్లపై తేదీలను స్పిరిట్ సాయంతో చెరిపేసి, రబ్బర్ స్టాంపులతో కొత్త తేదీలు వేసి అమ్మేస్తున్నారు. కేరళ నుంచి ప్రత్యేక రసాయనాలు తెప్పిస్తున్నట్లు తెలుస్తోంది. ఇలాంటి కండోమ్‌లను వాడటంవల్ల అవి చినిగిపోయి వ్యాధులు సంక్రమించే ప్రమాదం ఉందని డాక్టర్లు హెచ్చరిస్తున్నారు. నిబంధనల ప్రకారం ప్యాకెట్లపై ఎటువంటి రెచ్చగొట్టే ప్రకటనలు ఉండకూడదు. స్థానికంగా తయారవుతున్న కండోమ్స్‌పై రెచ్చగొట్టే చిత్రాలు కూడా అతికిస్తున్నారు.

### కమీషన్ ఎక్కువ!

కండోమ్స్ తయారు చేసే సంస్థలు జాతీయ ఎయిడ్స్ కంట్రోల్ సంస్థ సూచించిన నిబంధనలు పాటించాలి. ఈ నకిలీ కండోమ్‌ల తయారీలో అవేమీ ఉండవు. పైగా తయారీదారులే సొంతంగా మార్కెట్ చేసుకుంటున్నారు. వీటిని ఎక్కువగా వినియోగించే లాడ్జీలు, వ్యభిచార ప్రాంతాల్లో అందుబాటులో ఉంచుతున్నారు. రేటు తక్కువని చీకటి బేరం చేస్తూ అంటగట్టేస్తున్నారు. ఇంకొందరైతే దుకాణదారులతో రహస్య ఒప్పందాలు చేసుకుంటున్నారు. 60 శాతం డిస్కౌంట్, వెంటనే నగదు ఇవ్వాలనే ఒప్పందంపై లావాదేవీలు సాగుతున్నాయి. గుంటూరు, కృష్ణాజిల్లాలకు ఎక్కువగా నకిలీ కండోమ్‌లను సరఫరా చేస్తున్నారు.

### అధికారుల అలసత్వం!

వీటిపై ఎవరూ ఫిర్యాదు చేయకపోవడంతో అధికారులు చర్యలు తీసుకోవడానికి వెనుకాడుతున్నారు. దీనిపై జిల్లా వైద్యశాఖాధికారులను కదిలిస్తే మాత్రం...తాము ప్రస్తుతం నకిలీ మందుల కేసులో బిజీగా ఉన్నామని అవి కొలిక్కి రాగానే దృష్టి పెడతామని తాపీగా బదులిస్తున్నారు.






## ›› సాగరం తీరంలో నేవీ సాహస విన్యాసాలు

ఓ వైపు యుద్ధ విమానాలు.. మరోవైపు నౌకా విన్యాసాలు.. వెరసి ఆదివారం సాయంత్రం విశాఖ సాగరతీరంలో యుద్ధ వాతావరణం కనిపించింది. నేవీ దినోత్సవంలో భాగంగా రిహార్సల్స్ చివరి రోజున కనిపించిన దృశ్యాలతో సందర్శకులు అమితానందం చెందారు. సముద్రంలో వాటర్ బాంబ్ పేలుడు, పారాచ్యూట్ విన్యాసాలు, యుద్ధ ట్యాంకర్ల మోహరింపు, హైస్పీడ్ బోట్లలో వచ్చిన మార్కోలు శత్రుస్థావరాలపై దాడులు చేయడం, హెలికాప్టర్లు, యుద్ధ విమానాలు, నేవీ ట్యాంకర్లు, హైస్పీడ్ బోట్లతో సిబ్బంది చేసిన విన్యాసాలు ఆకట్టుకున్నాయి. అనంతరం నేవీ బ్యాండ్ ఆలపించిన గీతాలు అలరించాయి. ఆదివారం కావడంతో మధ్యాహ్నం మూడు గంటలకు సాగరతీరం జనసంద్రంగా మారింది. - విశాఖపట్నం, ఆంధ్రజ్యోతి

# వందేళ్లలో మూడోసారే!

- ›› కేరళకు తుఫాన్లు చాలా అరుదు
- ›› ఓఖీ తాకకపోయినా తీవ్ర విలయం
- ›› భారత వాతావరణ శాఖ ముందుగా హెచ్చరించలేదని కేరళ ఆరోపణలు

విశాఖపట్నం, డిసెంబరు 3(ఆంధ్రజ్యోతి): వ్యవసాయ రంగానికి ఊతమిచ్చే నైరుతి రుతుపవనాలు తొలుత కేరళలోనే ప్రవేశిస్తాయి. అటువంటి ఈ రాష్ట్రానికి తుఫాన్‌లు మాత్రం అరుదుగా వస్తుంటాయి. గడిచిన వందేళ్లలో కేవలం మూడు తుఫాన్‌లు మాత్రమే కేరళను తాకడం విశేషం. ఇక్కడ నైరుతి సీజన్‌లో అప్పుడప్పుడు, ఈశాన్య రుతుపవనాల సీజన్‌లో భారీ నుంచి అతి భారీవర్షాలు కురుస్తుంటాయి తప్ప తుఫాన్లు ఏర్పడటం ఎప్పుడో గానీ జరగదు. తాజాగా ఓఖీ తుఫాను కేరళను తాకకపోయినా సమీపం నుంచి వెళ్లి తీవ్ర విలయం సృష్టించింది. తుఫాన్‌లు అనగానే ముందుగా గుర్తొచ్చేది తూర్పు తీరంలోని ఏపీ, ఒడిశా, పశ్చిమబెంగాల్, తమిళనాడు రాష్ట్రాలే. తూర్పుతీరంతో పోల్చితే పశ్చిమ తీరంలో తుఫాన్‌లు చాలా తక్కువగా సంభవిస్తుంటాయి. భారత వాతావరణశాఖ పరిశోధనా విభాగం నివేదిక ప్రకారం 1891 నుంచి 2002 వరకు కేవలం మూడు తుఫాన్‌లు మాత్రమే కేరళను తాకినట్లు వెల్లడవుతోంది. నైరుతి రుతుపవనాలు కేరళలో ప్రవేశించినా సమయంలో అరేబియా సముద్రంలో తుఫాన్‌లు ఏర్పడినా అవి ఒమన్ తీరం దిశగా పయనిస్తాయి. అంతకు మించితే గుజరాత్ తీరం దిశగా వెళతాయి తప్ప కేరళను తాకే అవకాశం ఉండదు. ఎప్పుడైనా బంగాళాఖాతంలో తుఫాన్‌లు ఏర్పడి తమిళనాడు వద్ద తీరం దాటితే బలహీనపడి కేరళ మీదుగా అరేబియా సముద్రంలో ప్రవేశించి తిరిగి అక్కడ బలపడతాయి. లేదా శ్రీలంక సమీపంలో తుఫాన్ తీరం దాటితే కేమరూన్ మీదుగా కేరళను తాకేందుకు అవకాశాలు కూడా తక్కువగానే ఉంటాయని నిపుణులు వ్యాఖ్యానిస్తున్నారు. గడచిన వందేళ్లలో కేరళను తాకిన మూడు తుఫాన్‌లు ఇలాగే వచ్చాయా అనే దానిపై పాత రికార్డులు పరిశీలన చేయాలని అంటున్నారు. ఈ రాష్ట్రానికి తుఫాన్‌ల తీవ్రత తక్కువ కాబట్టి తీరప్రాంతం ఎక్కువగా ఉన్నా తిరువనంతపురంలో వాతావరణ కేంద్రం ఉంది గానీ తుఫాన్ హెచ్చరిక కేంద్రం లేదని వాతావరణ నిపుణుడు ఆర్.మురళీకృష్ణ తెలిపారు. కొచ్చిన్‌లో రాడార్ కేంద్రం ఉందని గుర్తుచేశారు. నైరుతి రుతుపవనాల సీజన్‌లో కుంభవృష్టి వర్షాలు కురుస్తాయి తప్ప తుఫాన్‌ల బీభత్సం ఉండదన్నారు. ఓఖీ విషయంలో బంగాళాఖాతం నుంచి అరేబియా వైపుగా తుఫాన్ పయనించే క్రమంలో తీవ్రమైన పెనుగాలులు వీచి తీవ్రనష్టం సంభవించి ఉంటుందని ఆయన అభిప్రాయం వ్యక్తం చేశారు.

### తుఫాను హెచ్చరికలపై ఆరోపణలు

నవంబరు, డిసెంబరు నెలల్లో కేరళకు పర్యాటకులు, అయ్యప్ప భక్తుల తాకిడి ఎక్కువ. ఈ సమయంలో కేరళకు అతి సమీపంలో పయనించిన ఓఖీ తుఫాన్ ప్రభావంతో అనేక ప్రాంతాలు తీవ్ర విలయానికి గురయ్యాయని నిపుణులు తెలిపారు. ఇది దాదాపు రోజంతా కేరళకు సమీపంగానే పయనించడంతో పెనుగాలులతో కుంభవృష్టి కురిసింది. తుఫాన్ ప్రభావం తీవ్రంగా ఉంటుందని వాతావరణ శాఖ ముందుగా హెచ్చరించలేదని కేరళ ప్రభుత్వంలో కొందరు ఆరోపిస్తున్నారు. అయితే వాయుగుండం శ్రీలంకను దాటే క్రమంలోనే తమిళనాడు, కేరళ ప్రభుత్వాలను అప్రమత్తం చేస్తూ నవంబరు 29నుంచే హెచ్చరిక బులెటిన్‌లు జారీ చేసిందని భారత వాతావరణ శాఖ అధికారి ఒకరు తెలిపారు. తుఫాన్ ఎదుర్కొనే క్రమంలో అంతగా అప్రమత్తంగా లేకపోవడంతో కేరళలో తీవ్ర విధ్వంసం ఏర్పడింది.




కేరళకు అతి సమీపంగా ఓఖీ తుఫాన్ పయనం



తొలగించిన కణితిని చూపుతున్న వైద్య బృందం

## 18 కిలోల కణితి తొలగింపు

- ›› పాలమూరు ప్రభుత్వాస్పత్రిలో అరుదైన శస్త్ర చికిత్స

మహబూబ్‌నగర్ (వైద్యవిభాగం), నల్లగొండ అర్బన్, డిసెంబరు 3: పాలమూరు ప్రభుత్వాస్పత్రి వైద్యులు ఓ మహిళ కడుపులోంచి 18 కిలోల కణితిని తొలగించి ఆమెకు పునర్జన్మను ప్రసాదించారు. జిల్లా కేంద్రంలోని వేపూరిగేరి కాలనీ వాసి వెంకటమ్మ ఆర్నెళ్లుగా కడుపు నొప్పితో బాధపడుతోంది. నెల రోజులుగా నొప్పితోపాటు కడుపు ఉబ్బడం ప్రారంభమయింది. మూడ్రోజుల కిత్రం జనరల్ ఆస్పత్రిలో చేరిన వెంకటమ్మను పరీక్షించిన వైద్యులు 'ఒవేరియన్ సిస్టిక్ అడినోమా'గా గుర్తించారు. ఆదివారం, శస్త్ర చికిత్స చేసి దాదాపు 18 కిలోల కణితితోపాటు 24 లీటర్ల నీటిని మహిళ కడుపులోంచి తొలగించారు. ప్రస్తుతం వెంకటమ్మ ఆరోగ్యం నిలకడగా ఉన్నదని వైద్యులు తెలిపారు. నల్లగొండ జిల్లా కేంద్రంలోని సురక్ష ఆస్పత్రిలో, ఇస్రత్ అనే మహిళ గర్భసంచి నుండి 20కి పైగా కణితులను శస్త్రచికిత్స చేసి వైద్యులు తొలగించారు.

# వైసీపీలో అంతా ఆత్మవంచనే!

- ›› జగన్‌లో ఆత్మపరిశీలన లేదు
- ›› 22 మంది ఎమ్మెల్యేలు పార్టీ వీడినా ఆయనలో మాత్రం మార్పు లేదు
- ›› ఆయనకు నచ్చచెప్పగలిగే వారే లేరు
- ›› స్క్రిప్టు ప్రకారమే టీడీపీపై విమర్శలు
- ›› జగన్ నన్ను వ్యక్తిగతంగా దూషించారు
- ›› ఆత్మాభిమానం దెబ్బతినడంతోనే పార్టీ మారా




**'ఓపెన్ హార్ట్ విత్ ఆర్కే'లో పాడేరు ఎమ్మెల్యే గిడ్డి ఈశ్వరి**

వైసీపీ నుంచి 22 మంది ఎమ్మెల్యేలు వెళ్లిపోయిన తర్వాత కూడా ఆ పార్టీ అధినేత జగన్ కనీసం ఆత్మపరిశీలన చేసుకోలేదని పాడేరు ఎమ్మెల్యే గిడ్డి ఈశ్వరి వ్యాఖ్యానించారు. ఆ పార్టీలో ఆయనకు నచ్చ చెప్పగలిగినవారే లేరని, ఎమ్మెల్యేల అభిప్రాయాలకు అక్కడ వీసమెత్తు విలువ లేదన్నారు. అసెంబ్లీ సమావేశాలకు హాజరు కావాలని చాలా మందికి ఉన్నా జగన్ మాటకు ఎదురు చెప్పలేక మౌనంగా ఉండిపోయారన్నారు. అధికారపక్షాన్ని దూషించాలంటే ముందే స్క్రిప్టు సిద్ధంగా ఉంటుందని స్పష్టం చేశారు. తాను కూడా స్క్రిప్టు ప్రకారమే చంద్రబాబును తిట్టానని స్పష్టం చేశారు. సీఎం కాకుండానే సీఎంనని జగన్ చెప్పుకుంటున్నప్పుడు ప్రజల కోసం కష్టపడే తాను మంత్రి పదవి ఆశించడంలో తప్పేమిటని ప్రశ్నించారు. గిరిజన మహిళా ఎమ్మెల్యేనని కూడా చూడకుండా జగన్ తనను దూషించడం వల్లే పార్టీ మారాల్సి వచ్చిందంటున్న పాడేరు ఎమ్మెల్యే గిడ్డి ఈశ్వరితో 'ఏబీఎన్-ఆంధ్రజ్యోతి' ఎండీ వేమూరి రాధాకృష్ణ 'ఓపెన్‌హార్ట్ విత్ ఆర్కే'లోని ముఖ్యాంశాలు..

**నమస్కారం ఈశ్వరి గారు.. ఏపీ అంతటా ఇప్పుడు మీ పేరే వినిపిస్తోంది?**

నమస్కారం సార్. ఏ వ్యక్తికైనా ఆత్మాభిమానం దెబ్బ తింటే కష్టం. నేను టీచర్‌గా చేశాను. మా నాన్న అప్పలనాయుడు మాజీ ఎమ్మెల్యే. ఏదైనా ఒక మాటకు కట్టుబడి ఉండేవాళ్లం. జగన్ మాట తప్పడం వల్ల ఈ పరిస్థితి వచ్చింది. గిరిజన మహిళా ఎమ్మెల్యే అని కూడా చూడకుండా నన్ను వ్యక్తిగతంగా దూషించడం వల్లే ఇదంతా.

**జగన్ మిమ్మల్ని తిట్టారా?**

అవునండి. అరకు ఎమ్మెల్యే సర్వేశ్వరరావు బయటకు వెళ్లిన తర్వాత అక్కడ బాధ్యతలు నాకు అప్పగించారు. అరకు ఎంపీ నియోజకవర్గం బాధ్యతలు కూడా నన్నే చూడమన్నారు. దీంతో నేను వాల్మీకి తెగ నుంచి శెట్టి ఫల్గుణ అనే బ్యాంకు ఉద్యోగిని తీసుకెళ్లి జగన్‌కు పరిచయం చేశాను. జగన్ సూచనతో ఏడేళ్ల సర్వీసు ఉండగానే ఉద్యోగాన్ని, లక్షన్నర జీతాన్ని వదిలేసి వచ్చి.. లక్షలు ఖర్చు పెట్టి పార్టీ తరపున ఫల్గుణ పనులు చేసుకుంటున్నారు. అక్టోబరు 12న హైదరాబాద్‌లో జరిగిన పార్టీ సమావేశంలో జగన్ కూడా మీరే అక్కడ అభ్యర్థి అని ఫల్గుణకు చెప్పారు. ఆ తర్వాత కుంబా రవిని పార్టీలో చేర్చుకునేందుకు సిద్ధపడ్డారు. రవి విషయం తెలుసుకునేందుకు నేను జగన్ పీఏ కేఎన్‌ఆర్‌కు ఫోన్ చేస్తే జగన్ లండన్ వెళ్లారని చెప్పారు. ఆ వెంటనే విజయసాయిరెడ్డికి ఫోన్ చేస్తే ఆయన.. రవి వస్తే మీకేంటి సంబంధం అంటూ ఎదురు ప్రశ్నించారు. రవి విషయంలో జగన్ నిర్ణయం తీసేసుకున్నారని చెప్పారు. అయినా సరే పట్టు వీడకుండా జగన్ లండన్ నుంచి వచ్చిన తర్వాత ఇడుపులపాయ వెళ్లి, అపాయింట్‌మెంట్ దొరక్కపోయినా బలవంతంగా టెంట్ దగ్గరకు వెళ్లి కలిశాం. 'అన్నా మమ్మల్ని అన్యాయం చేయకండి. మిమ్మల్నే నమ్ముకుని ఉన్నాం' అని జగన్‌తో చెప్పుకొన్నాం. దానికి జగన్ తీవ్రంగా స్పందించారు. నీకు సంబంధం లేని విషయంలో ఎందుకు జోక్యం చేసుకుంటున్నావు అని కటువుగా మాట్లాడారు. రవి అరకు ఎమ్మెల్యే అయితే, నీకేంటి నష్టం అంటూ అడిగారు. అనవసర విషయాల్లో నువ్వు జోక్యం చేసుకోవద్దు. సోది మాటలు మాట్లాడొద్దు. నీ పని నువ్వు చూసుకో అని తెగేసి చెప్పారు. పంచాయతీ చేయొద్దు అంటూ కసురుకుని విసురుగా వెళ్లిపోయారు. మహిళగా నేను ఎంతో కష్టపడి పని చేస్తే నాకిచ్చిన గౌరవం ఇదా అని చాలా బాధేసింది. దాన్ని తలచుకుంటే ఇప్పటికీ ఏడుపొస్తుంది.

**వైసీపీలో జగన్‌కు నచ్చచెప్పగలిగిన వాళ్లు ఉన్నారా?**

ఎవ్వరూ లేరు. నిర్ణయాలన్నీ ఆయనే తీసుకుంటారు. అభిప్రాయాలు చెప్పమంటారు. చెప్పిన వాటిని పట్టించుకోరు. వైసీపీ ఎమ్మెల్యేల్లో చాలామందికి అసెంబ్లీకి వెళ్లాలని ఉంది. అయితే ఇద్దరు ముగ్గురు మాత్రమే అసెంబ్లీకి వెళ్దామని చెప్పాం. జగన్ లేకుండా సభలో మాకు మైకులిస్తారన్న నమ్మకం లేదు. అందుకే తొలిరోజు అసెంబ్లీకి వెళ్లి ధర్నా చేసి వద్దామని రోజా సహా మేమంతా అనుకున్నాం. అయితే, ఆయన ఒక తీర్మానం చేసిన తర్వాత ఇంకేమీ మాట్లాడలేకపోయాం. పార్టీ సమావేశాలలో అసలు చర్చలంటూ ఏం జరగవు.

**ఫల్గుణ ఇప్పుడు మిమ్మల్ని తిడుతున్నారు?**

స్క్రిప్టు ఇచ్చి మాట్లాడిస్తారు కదండి.

**మీరు కూడా అలాగేనా?**

కొన్ని అంతేనండి. కొన్ని స్క్రిప్టులన్నీ అలాగే ఉంటాయి. అది ఒప్పుకొంటాను. నిజానికి చంద్రబాబును అంత దగ్గరగా ఎప్పుడూ చూడలేదండి. అధికారపక్షం వైపు చూడకూడదన్న ఆంక్షలు వైసీపీలో ఉన్నాయి. ఎమ్మెల్యేలు ఎవ్వరూ మంత్రుల వద్దకు వెళ్లి మాట్లాడకూడదు. ఇప్పుడున్న రాజకీయాలలో ఒకరిపై మరొకరు దుమ్మెత్తి పోసుకోవడమే ఉంది.

**వెళ్లిన ఎమ్మెల్యేలంతా జగన్‌ను తిట్టి వెళ్లిపోయారు కదా? మీరెప్పుడైనా ఆత్మపరిశీలన చేసుకున్నారా?**

లేదండి. అలా ఎప్పుడూ ఆలోచించలేదు. ఆ పని చేయలేకపోయాం. మా సంగతి సరే. 22 మంది తనను వీడి వెళ్లిపోతుంటే ఒక నాయకుడిగా ఆయన ఆత్మపరిశీలన చేసుకోవాలి. అది జగన్‌లో లేదు. అలా ఆత్మపరిశీలన చేసుకుని ఉంటే ఈ పరిస్థితి ఉండేది కాదు. అక్కడంతా ఆత్మవంచనే.

**మీ పేరిట బయటకు వచ్చిన సంభాషణల వీడియో గురించి ఏమిటి?**

ఒక నిర్ణయం తీసుకునే సందర్భంలో రాజకీయ నేతగా అందరినీ సంప్రదించాలి. అలాంటి సందర్భంలో కార్యకర్తలతో ఒక ఇంటిలో సమావేశం అయ్యాం. మనకు రెండో ఆప్షన్ లేదు కాబట్టి అధికార పార్టీలోకి వెళ్దామని కోరాను. అలా వెళ్తే మరింతగా అభివృద్ధి పనులు తెచ్చుకోవచ్చని చెప్పాను. నా కేడర్‌కు అలా చెప్పుకోవడంలో తప్పేం ఉంది. ఇక మంత్రి పదవి విషయానికొస్తే.. వైసీపీ ప్లీనరీలోనే ఈశ్వరి కాబోయే మంత్రి అని విజయసాయి రెడ్డి ప్రకటించారు. ప్రభుత్వం రాకముందే ఆయన అలా అన్నారంటే నా కష్టాన్ని చూసే కదా. జగన్ సీఎం కావడం కోసమే కాదా పార్టీ పెట్టారు. సీఎం కాకుండానే నేనే సీఎం అని చెప్పుకొంటున్నప్పుడు మాకూ ఆశలు ఉంటాయి కదా.

**బాక్సైట్ తవ్వకాలకు అనుమతి ఇచ్చింది వైఎస్ కదా. ఇప్పుడెందుకు ఇంత వ్యతిరేకత?**

ఆ రోజున నేను రాజకీయాల్లో లేను. ఇప్పుడు చంద్రబాబు మాత్రం హామీ ఇచ్చారు. మీ ప్రయోజనాలను దెబ్బతీసేలా ఏ పనీ చేయనంటూ చెప్పారు. బాక్సైట్ తవ్వకాలు వల్ల గిరిజన జాతి మనుగడే పోతుంది.

**మీ రాజకీయ గురువు గోవిందు ఎలా పరిచయం?**

గోవిందు మాస్టారి వాళ్ల ఫ్యామిలీ మొత్తం టీడీపీ. వాళ్లది నాన్ ట్రైబల్. మాస్టారు, నేను కొలిగ్స్. ఏపీటీఎఫ్‌లోకి తీసుకొచ్చి నన్ను రాష్ట్ర లీడర్‌ని చేసింది గోవిందు మాస్టారే. పసుపులేటి బాలరాజు నన్ను సస్పెండ్ చేయించినప్పుడు ఆయన్ని ఎదుర్కోవాలని తీసుకున్న నా నిర్ణయాన్ని బలపరిచింది మాస్టారే.

**నంద్యాల, కాకినాడ ఎన్నికల తర్వాత వైసీపీ ఎమ్మెల్యేల్లో పరిస్థితి ఏమిటి?**

అందరిలో భయం పట్టుకుంది. నంద్యాల గురించి కాదు కానీ.. కాకినాడ ఫలితం తర్వాత మాత్రం అందరిలో ఆందోళన మొదలైంది. కాపు ఉద్యమం ఉధృతంగా ఉన్న సమయంలో వైసీపీ విజయం ఏకపక్షం అనుకుంటే ఆ ఎన్నికలలో టీడీపీ సాధించిన ఘన విజయంతో మాలో అంతర్మథనం మొదలైంది.



**చంద్రబాబుపై చేసిన విమర్శలతో మీలో ఎలాంటి సంఘర్షణ లేదా?**

టీడీపీలో చేరే నవంబరు 26వ తేదీ రాత్రి వరకూ మానసికంగా ఎంతో సంఘర్షణ పడ్డాను. 27వతేదీ విజయవాడ వచ్చాను. సీఎం క్యాంపు కార్యాలయానికి వెళ్లాను. అప్పటికే అక్కడ విశాఖ ప్రాంత మంత్రులు, ఎమ్మెల్యేలు పలువురు స్థానిక నేతలు ఉన్నారు. నేను వెళ్లగానే ఆయన... అమ్మా అందరూ పరిచయమే కదా అని అడిగారు. కలిసి పనిచేసుకుందామన్నారు. వైసీపీలో ఉన్నంత కాలం దొరకనిది అదే. సీఎం చూపించిన ఆదరణ చూసి ఎంతో ఆనందపడ్డాను.

**పార్టీలోకి రావాలంటూ మిమ్మల్ని టీడీపీ వాళ్లు కలిశారా? డబ్బులు ఆఫర్ చేశారా?**

లేదండి. నెల రోజుల పాటు తీవ్రంగా మధనపడిన తర్వాత నా అంతట నేను తీసుకున్న నిర్ణయం. టీడీపీ నుంచి నన్ను ఎవరూ సంప్రదించలేదు. నేనే స్వయంగా ఆ పార్టీ వారిని కలిసి నా ఆసక్తిని చెప్పాను. టీడీపీ వాళ్లు నాకు పైసా కూడా ఆఫర్ చేయలేదు. చంద్రబాబు నుంచి తీసుకున్న హామీ బాక్సైట్ గురించి మాత్రమే. మంత్రి పదవి గురించి కూడా హామీ ఇవ్వలేదండి. అయితే, చంద్రబాబు నా కష్టాన్ని చూసి ఇస్తారని అనుకుంటున్నాను.

**పార్టీ మారొద్దని భారతి మీకు కాల్ చేశారా?**

ఫోన్ చేశారు కానీ.. నేను అప్పుడు మాట్లాడలేదు. ఆ తర్వాత భారతీ మాట్లాడలేదు. జగన్ కూడా మాట్లాడలేదు. చివరకు రోజాతో నేను ఎంతో సన్నిహితంగా ఉండేదాన్ని. రోజా కనీసం ఫోన్ చేసి కూడా పలకరించలేదు. పైగా ఇప్పుడు రోజా కూడా టీచర్‌ను జగన్ ఎమ్మెల్యే చేశారంటూ మాట్లాడుతున్నారు. అది బాధనిపిస్తోంది. నేను రోజా అంత సెలబ్రిటీ కాకపోయినా.. మా ప్రాంతంలో నాకంటూ గుర్తింపు ఉంది. అలాగే ఆమెను నేను ఒక సోదరిగానే భావించాను. అలాంటిది ఆమె కూడా ఇప్పుడు విమర్శలు చేస్తున్నారు.

# ఇన్‌చార్జిలే దిక్కు!

(మొదటి పేజీ తరువాయి)

అప్పగించారు. జోన్-2 పరిధిలోకి ఏడు జిల్లాలు వస్తాయి. దీంతో ఆలయం కంటే ఏడు జిల్లాల బాధ్యతలే ఎక్కువగా ఉంటాయి. సింహాచలం ఈవోకు దాంతో పాటు మానసాస్ ట్రస్టు బాధ్యతలు ఇన్‌చార్జ్‌గా అప్పగించారు. 4500 ఎకరాల భూములు ఉన్న మానసాస్ ట్రస్టుకు రెగ్యులర్ ఈవో లేకుండా ఇన్‌చార్జ్‌తో నెట్టుకురావడం గమనార్హం. అలాగే శ్రీకాకుళం జిల్లా అసిస్టెంట్ కమిషనర్.. అరసవెల్లి, శ్రీకూర్మం ఆలయాలకు ఈవోగా బాధ్యతలను ఒకే అధికారికి అప్పగించారు. అదీ సూపరింటెండెంట్ స్థాయి అధికారికి. విజయనగరం జిల్లా అసిస్టెంట్ కమిషనర్‌కు రామతీర్థం ఆలయం బాధ్యతలను ఇన్‌చార్జ్‌గా అప్పగించారు. విజయనగరంలోని పైడితల్లి ఆలయానికి అసిస్టెంట్ కమిషనర్ స్థాయి అధికారి ఈవోగా ఉండాల్సిన నేపథ్యంలో గ్రేడ్-1 ఈవో ద్వారా గత నాలుగున్నరేళ్లుగా నడిపిస్తున్నారు. కాగా ఆ ఈవో విశాఖపట్నంలో మరో ఆలయానికి ఈవోగా రెగ్యులర్ బాధ్యతల్లో ఉన్నారు. అనకాపల్లిలోని నూకాంబికా ఆలయానికి ఈవోగా ఉన్న అధికారినే విశాఖపట్నం జిల్లాకు ఇన్‌చార్జ్ అసిస్టెంట్ కమిషనర్ బాధ్యతలు అప్పగించారు. తూర్పుగోదావరి జిల్లా అసిస్టెంట్ కమిషనర్‌కు ఆ జిల్లాతో పాటు పశ్చిమగోదావరి, కృష్ణా జిల్లాలకు కలిపి డిప్యూటీ కమిషనర్ బాధ్యతలు అప్పగించారు. అసిస్టెంట్ కమిషనర్ స్థాయి ఈవోలు ఉండాల్సిన ఐనవల్లి, అంతర్వేది ఆలయాలను గ్రేడ్-1 ఈవోతోనే నిర్వహిస్తున్నారు. పశ్చిమగోదావరి జిల్లాలోని మావుళ్లమ్మతల్లి ఆలయానికి ఏసీ కేడర్ ఈవో ఉండాల్సిన స్థానంలో ఐదేళ్లుగా గ్రేడ్-1 ఈవోనే ఉన్నారు. గుంటూరు జిల్లా తెనాలిలో వైకుంఠపురం ఆలయం ఈవోకు అదే జిల్లాలోని కోటప్పకొండ ఈవో బాధ్యతలు ఇన్‌చార్జ్‌గా అప్పగించారు. మూడేళ్లుగా ఈ ఆలయంలో ఇన్‌చార్జ్ పాలనే నడుస్తోంది. ప్రకాశం జిల్లాలోని మాలకొండ ఆలయ ఈవోకు కర్నూలు జిల్లాలోని మహానంది ఆలయ ఈవో బాధ్యతలు అప్పగించారు. కాకినాడ జీవీవోగా ఉన్న అధికారే కృష్ణాజిల్లాలోని తిరుమలగిరి ఆలయ బాధ్యతలు చూస్తున్నారు. కర్నూలు అసిస్టెంట్ కమిషనర్‌కు కర్నూలు జీవీవో బాధ్యతలు అదనంగా ఇచ్చారు. కడప జిల్లా అసిస్టెంట్ కమిషనర్‌గా గ్రేడ్-1 స్థాయి అధికారి మూడేళ్లుగా బాధ్యతలు నిర్వహిస్తున్నారు.

ఇక కమిషనరేట్‌లోనూ ఇదే పరిస్థితి నెలకొంది. గత రెండు నెలలకుపైగా కమిషనరేట్‌లో డిప్యూటీ కమిషనర్ సెలవులో ఉన్నా ఇన్‌చార్జి లేరు. అలాగే అదనపు కమిషనర్ సెలవు పెట్టగా కృష్ణాజిల్లా పెనుగంచిప్రోలు ఆలయం ఈవోకు ఏడీసీ బాధ్యతలు అప్పగించారు. ఆయన రెండు కీలక బాధ్యతలను చూడాల్సిన పరిస్థితి ఏర్పడింది. ముఖ్యంగా ఈవోల కొరత వల్ల ఆలయాల్లో పాలన గాడి తప్పుతోందని విమర్శలు పెరుగుతున్నాయి. రెండు ఆలయాలకు ఈవోలుగా ఉన్న అధికారులు ఒక్కదానిపైనే దృష్టి కేంద్రీకరిస్తున్నారు. దీంతో కిందిస్థాయి యంత్రాంగమే వాటి బాధ్యతలను చూస్తున్నారు. దీనివల్ల పాలనాపరమైన విషయాల్లోనూ జాప్యం జరుగుతోంది. కొన్నిసార్లు ఉత్సవాల సమయంలో అత్యవసరంగా చేపట్టాల్సిన పనులు ఎక్కడిక్కడ ఆగిపోతున్నాయి. అలాగే ఇన్‌చార్జ్‌లు ఉంటున్న పలు ఆలయాల్లో అవినీతి ఎక్కువగా జరుగుతోందనే ఆరోపణలున్నాయి. ప్రభుత్వం పదోన్నతుల విషయంలో జాప్యం చేయడం వల్ల ఈ సమస్య తలెత్తుతోంది. కాగా తాజాగా రాష్ట్రంలో మరో రెండు పెద్ద ఆలయాలకు ఈవోలను నియమించాల్సిన అవసరం ఏర్పడనుంది. ప్రస్తుతం విజయవాడ కనకదుర్గ, శ్రీశైలం మల్లికార్జున స్వామి ఆలయాలకు ఐఏఎస్ అధికారులు ఈవోలుగా ఉన్నారు. కానీ, నాలుగు రోజుల కిందట వారి ప్రత్యేక అధికారాలను కత్తిరిస్తూ ప్రభుత్వం ఉత్తర్వులు జారీచేసింది. దీంతో అన్ని ఆలయాల ఈవోల తరహాలోనే వారూ ఇకపై అన్ని పనులకూ దేవాదాయ శాఖ అనుమతి పొందాల్సి ఉంటుంది. ఆ ఆలయాలకు ఇక ఐఏఎస్ స్థాయి అధికారులను ఉంచబోరనే ప్రచారం జరుగుతోంది. స్వతంత్రంగా అధికారాలు లేనప్పుడు ఉండాల్సిన అవసరం లేదనే భావన సహజంగానే ఐఏఎస్ అధికారుల్లో ఉంటుంది. వారిని అక్కడినుంచి బదిలీ చేస్తే ఆ రెండు ఆలయాలకు జాయింట్ కమిషనర్ స్థాయి అధికారులను ఈవోలుగా నియమించాలి. ఇప్పటికే అధికారుల కొరతతో ఉన్న దేవాదాయశాఖ వీరిని ఎలా భర్తీ చేస్తుందనే విషయం ఆసక్తికరంగా మారింది.

ఆంధ్రజ్యోతి
నవ్య
కుటుంబ కదంబం

◆ సృజన



# ప్రయోగాల 'స్టోరీ టెల్లర్'!

**ఆమె కథ చెబుతుంటే దృశ్యం మన కళ్ల ముందు కదలాడినట్టే ఉంటుంది. రాత్రిపూట నాన్న చెప్పే కథలు వింటూ... వివిధ సంస్కృతులు, కళలు, వైవిధ్యమైన జీవనశైలి పట్ల ఉన్న ఆసక్తిని ఆకళింపచేసుకుంటూ పెరిగిన దీపా కిరణ్ ఎనిమిదేళ్లకే స్టోరీ టెల్లర్ అవ్వాలని తన డైరీలో రాసుకున్నారట! కళలను, స్టోరీ టెల్లింగ్‌ను విడదీసి చూడలేనని ఈ గ్లోబల్ స్టోరీ టెల్లర్ ఈ కళకు సామాజిక బాధ్యతను ముడిపెట్టి అనేక ప్రయోగాలు చేస్తున్నారు. కథలు చెప్పే కళ ఎలా అబ్బిందో ఆమె మాటల్లోనే ..**

నా దగ్గరకు ఒకరోజు ఒక చిన్నారి వచ్చింది. 'మీతో ఒక విషయం చెప్పాలి ఆంటీ' అంది. ఆ చిన్నారి చెప్పిన విషయం నన్ను విస్మయానికి గురి చేసింది. ఆ పాప చెప్పిన విషయం ఏమిటో తెలుసా... తనపై ఒక వ్యక్తి లైంగికంగా దుశ్చర్యలకు పాల్పడుతున్నాడని!! ఇంత సీరియస్ విషయాన్ని ఆ చిన్నారి తన అమ్మానాన్నలకు చెప్పలేదు. నా దగ్గరకు వచ్చి మరీ చెప్పింది...!! ఎందుకో తెలుసా.. ఆ పాపకు నా మీద విశ్వాసం, నమ్మకం కలిగింది కనుక. నాపై ఇంత నమ్మకాన్ని ఆ చిన్నారిలో కలిగించింది ఏమిటో తెలుసా? నా స్టోరీ టెల్లింగ్ కళే!!

❖❖❖

ప్రతిష్ఠాత్మక స్కూలులో ఒక పిల్లాడు చదువుతున్నాడు. వాడి స్కూలు చుట్టూ రాళ్లు, గుట్టలు, కొండలు...! అవంటే ఆ పిల్లాడికి ఇష్టం లేదు. అందుకే అక్కడఆడుకునే వాడు కాదు. ఒకరోజు నేను రాక్స్ మధ్య వాటి గురించే పిల్లలకు ఒక స్టోరీ చెప్పాను. అక్కడికి ఆ బాలుడిని కూడా తల్లి తీసుకువచ్చింది. కొండలూ, రాళ్ల గురించి నేను చెప్పిన కథను ఆ పిల్లాడు బాగా ఎంజాయ్ చేశాడు. ఆ మర్నాడు స్నేహితులతో కలిసి తన స్కూలు సమీపంలోని కొండలు, గుట్టల మధ్య ఆడుకోవడానికి వెళ్లాడు. నేను చెప్పిన కథలోని పర్యావరణ సందేశం ఆ చిన్నారికి నచ్చింది.

❖❖❖

ఇవి దీపాకిరణ్ చెప్పిన కొన్ని సంఘటనలు. చిన్నారులపై స్టోరీ టెల్లింగ్ ప్రభావం ఎంత శక్తివంతంగా ఉంటుందనే దానికి ఇవి కొన్ని మచ్చుతునకలు.

### అందరినీ ఆకట్టుకునేలా...

దీపా కిరణ్ స్టోరీ టెల్లింగ్‌లో మాటల పొందిక, సౌందర్యం, చమక్కులతోపాటు నాట్యం, గానం, చిత్రలేఖనం, నాటకం వంటి లలితకళల మేళవింపు ఉంటుంది. వీటన్నింటి సమ్మిళితంతో దీప కథను చెబుతుంటే చిన్నారులు ఆమె వంక కళ్లప్పగించి చూస్తూ కథలో లీనమైపోతారు. ఆమె కథలు చెప్పే తీరులో 'పెర్ఫార్మెన్స్ ఆర్ట్' ప్రతిఫలిస్తుంది. కథలకు అనుగుణంగా అంతర్లీనంగా నర్మగర్భమైన సూచనలూ వాటిల్లో ఉంటాయి. సామాజిక సమస్యల మీద సైతం 'స్పందనలు, సందేశాలు' ఆమె స్టోరీ టెల్లింగ్‌లో తళుక్కుమంటాయి. వన్నె తగ్గని మాటల 'పసితనం' ఆమె కథల్లో కనిపిస్తుంది. దీప కథలు చెప్పే విధానం ఆకట్టుకునేలా ఉండడానికి ఆమెలోని బహుముఖాలు కూడా ఒక కారణమే. ఆమె భరతనాట్య కళాకారిణి. గాయకురాలు, భాషావేత్త, బహు భాషల్లో ప్రవేశంతోపాటు ఎడ్యుకేషనిస్టు, వాయిస్‌ఓవర్ ఆర్టిస్టు కూడా. అలాగే చిన్నతనం నుంచి రచనలు చేసే అలవాటు కూడా దీపకు ఉంది. మంచి పుస్తక ప్రేమికురాలు. ఇవన్నీ ఆమె స్టోరీ టెల్లింగ్ కళా ప్రతిభను సానబెట్టాయి. అందుకే సంగీతం, నృత్యం, డ్రాయింగ్స్, డ్రామా అన్నింటి కలబోతగా 'స్టోరీ టెల్లింగ్ ఉండాలి. మధ్యమధ్యలో శ్రోతలతో మాట్లాడుతూ...అందులో వారినీ భాగస్వాములు చేస్తూ కథను ఆకర్షణీయంగా కొనసాగించాలి' అంటారు దీప.

### కథలంటే అంత ప్రేమేంటీ...

అసలు స్టోరీ టెల్లింగ్ వైపు దీప దృష్టి ఎలా మళ్లింది? ఇదే ప్రశ్న ఆమెను అడిగితే 'కథల పట్ల ప్రేమ నా మనసులో ఎలా నాటుకుపోయిందో చెప్పడం కష్టమే. నాకు ఎనిమిదేళ్ల ప్రాయంలో నా డైరీలో 'ఏదో ఒకరోజు నేను స్టోరీ టెల్లర్‌ను కావాలి' అని రాసుకున్నాను. ఆ తర్వాత దాన్ని మర్చిపోయాను కూడా. కానీ నా జీవితం అటువైపే మళ్లడం విచిత్రం. అది కూడా అనుకోని మలుపులు తిరిగే అందమైన 'కథ' లాంటిదే. జీవితంలోని ప్రతి మలుపు, ఘటన, మాట, పాట, అనుబంధాలు, సంస్కృతి, కళలు, పరిసరాలు, కష్టాలు, కన్నీళ్లు, ఆశలు, లక్ష్యాలు అన్నింట్లోనూ అద్భుతమైన కథలు దాగున్నాయి. వాటిని గుండెతో ఒడిసి పట్టుకోవాలి. సరళమైన మాటల్లో పొదగాలి. పెర్ఫార్మెన్స్‌తో కథను చెప్పాలి' అంటారామె.



బాల్యం నుంచీ దీప జీవితం బహుళ సంస్కృతుల మధ్యలో, వివిధ భాషలవారి మధ్య గడిచింది. తండ్రి ఉద్యోగరీత్యా వివిధ ప్రాంతాల్లో తిరుగుతుండడం వల్ల పలు ప్రాంతాల ప్రజల జీవనశైలి తెలుసుకోగలిగారు. దీప చదివింది లిటరేచర్. వాళ్ల ఇంటి నిండా పుస్తకాలే. దీప నాన్న పుస్తక అభిమాని. ఆయన నుంచే పుస్తకాలు చదివే లక్షణం దీపకు అలవడింది. ఏ కొద్ది సమయం దొరికినా చాలు పుస్తకాలు పట్టుకుని కూర్చుంటారామె. దాంతో భాషపై పట్టు, పద వైవిధ్యంతోపాటు, పదసౌందర్యాలను బాగా వంటబట్టించుకున్నారు. వివిధ రచయితల రచనలు ఆమె ఆలోచనా పరిధిని విస్తృతపరిచాయి. వరల్డ్ సినిమాలు, నాటకాలు, నృత్యప్రదర్శనలకు వెళ్లేవారు. అలాంటి సృజనాత్మక వాతావరణం మధ్యన పెరగడం వల్లే నేడు దీప గ్లోబల్ స్టోరీ టెల్లర్‌గా ఎదిగారు. దీప గురించి చెప్పాల్సిన మరో ఆసక్తికరమైన విషయం ఏమిటంటే సాధారణంగా అమ్మలు పిల్లలకు రాత్రిపూట కథలు చెబుతూ నిద్రపుచ్చుతారు. కానీ దీప విషయంలో ఇది రివర్స్ అయింది. దీప నాన్నగారు ప్రతి రోజు రాత్రి ఆమెకి కథలు చెప్పేవారట. 'మా అమ్మ భవానీకి కళలు, వివిధ సంస్కృతులంటే ఇష్టం. చాలా సెన్సిబుల్ వ్యక్తి. నేను కళలు నేర్చుకోవడంలో, వివిధ సంస్కృతులను వంటబట్టించుకోవడంలో ఆమే నాకు స్ఫూర్తి. నాన్న బాలసుబ్రమణ్యన్ నాకెన్నో సృజనాత్మక ఐడియాలు ఇచ్చేవారు' అని తను పెరిగిన వాతావరణాన్ని దీప చెప్పుకొచ్చారు.

### జానపద కథలు ఎక్కువ చెప్తా...

కథల పుస్తకాల గురించి మాట్లాడుతూ 'ఇప్పటిలా మా చిన్నప్పుడు కథల పుస్తకాలు ఉండేవి కావు. నేను ఎక్కువగా పాశ్చాత్య సాహిత్యం చదివాను. అమర చిత్ర కథ, ట్వింకిల్, కామిక్స్, రస్కిన్‌బాండ్ పుస్తకాలు, రష్యన్ పిల్లల సాహిత్యాన్ని బాగా చదివాను. హిందూ యంగ్ వరల్డ్ నుంచి ఫిక్షన్, నాన్‌ఫిక్షన్ రచనలు చదివాను. నాకు చదవడం అంటే ఎంత పిచ్చి అంటే ఏ పుస్తకం లేకపోతే డిక్షనరీనైనా చదివేసేదాన్ని. పిల్లలకు కథలు చెప్పేటప్పుడు నేను తెలుసుకున్న పదసంపద ఎంతో ఉపయోగపడేది. దీనివల్ల పిల్లలకు క్లిష్టమైన కథను కూడా సింపుల్‌గా చెప్పగలగడం నేర్చుకున్నా' అన్నారు.

చిన్నపిల్లలకు సులభంగా అర్థమయ్యేందుకు జంతువుల, మేజికల్ థీమ్స్‌తో ఉన్న కథలు... సీనియర్ సిటిజన్స్‌కు కాంప్లెక్స్ స్టోరీలు, మైండ్‌కు చాలెంజింగ్‌గా ఉండేవి... అడల్ట్స్‌కు రిఫ్లెక్టివ్ స్టోరీలు దీప చెప్తుంటారు. శ్రోతలు ఎవరన్న దాన్ని బట్టి కథ 'ట్రీట్‌మెంట్' ఉంటుందంటారామె. దీనిపై మాట్లాడుతూ 'నా అభిప్రాయం ప్రకారం కథంటే 'వే ఆఫ్ లైఫ్...' అంటే మన జీవిత విధానాన్ని చెప్పేది. జీవితంలోని ఎన్నో అంతర్లీనమైన, సంక్లిష్టమైన విషయాలను తెలిపేది. ప్రధానంగా జానపద కథలు ఎక్కువ చెప్తుంటాను. అవంటే నాకు చాలా ఇష్టం. అవి జనం నుంచి పుట్టిన కథలు. వారి వివేకాన్ని, జ్ఞానాన్ని అవి చాటుతాయి. జీవితం మనం అనుకున్నట్టు ఉండదు. ఏ క్షణంలో ఏదైనా జరగొచ్చు. పైగా జానపద కథలు నీతి సలహాలు ఇవ్వవు. జీవిత గమనాన్ని చెపుతూ అంతర్లీనంగా జీవించడమెలాగో చెప్తాయి. జీవితం ఎలా ఉంటే అలానే ఈ కథలు ఆవిష్కరిస్తాయి. జీవితంలోంచి పుట్టుకొచ్చిన సామెతలు వీటిల్లో ఉంటాయి. వాటిని నా స్టోరీ టెల్లింగ్‌లో ఉపయోగిస్తుంటాను. సూఫీ కాన్సెప్టును కూడా కథల్లో వాడతాను. మీరా, కబీర్ గీతాలను పాడుతూ కథా వర్ణన చేస్తాను. ఇవి కాకుండా సాహిత్య సంబంధమైనవి, పర్యావరణ సంబంధమైనవి, పక్షులు, వన్యప్రాణుల సంబంధమైనవి, నీరు, రాళ్ల వంటి ఎకాలజీకి సంబంధించిన అంశాలపై కూడా కథలు చెపుతాను. స్టోరీ టెల్లింగ్‌లో స్త్రీలు, పిల్లల సమస్యలపై సామాజిక కోణంలోంచి కూడా పరోక్షంగా తెలియజెబుతుంటాను' అన్నారామె.

కథలు చెప్పడం గురించి చెబుతూ 'స్టోరీ టెల్లింగ్‌ను చిన్నా, పెద్ద ఫన్‌లా ఆస్వాదిస్తారు. ఇటీవల స్కాట్‌లాండ్ కథోత్సవంలో భారత్ తరపున నేనొక్కదాన్నే పాల్గొనే అవకాశం దక్కింది. అతి పురాతన కాలం నుంచీ క్రమం తప్పకుండా అక్కడ ఈ అద్భుతమైన కథోత్సవం జరుగుతోంది. అలాంటి దాంట్లో పాల్గొనడం నా అదృష్టంగా భావిస్తున్నాను. పదకొండు రోజులు జరిగిన ఉత్సవంలో ఎనిమిది ప్రదర్శనలు ఇచ్చాను. గతంలో కూడా ఇరాన్, ఆస్ట్రియా, నార్వే, థాయ్‌లాండ్ వంటి పలు దేశాల్లో కథోత్సవాల్లో పాల్గొన్నాను. నాకు స్టోరీ టెల్లింగ్ అంటే ఎంత ఇష్టమంటే.... బేబీకి టాయ్ ఇచ్చినంత' అన్నారు.

● నవ్య డెస్క్



ఫోటో: నర్సింహ

### దీప గురించి మరికొంత...

- ▲ అంతర్జాతీయంగా పేరొందిన ప్రొఫెషనల్ స్టోరీ టెల్లర్.
- ▲ 'స్టోరీ ఆర్ట్స్ ఫౌండేషన్ ఆఫ్ ఇండియా' స్థాపకురాలు.
- ▲ న్యూట్రిషన్ అండ్ క్లినికల్ డయటిక్స్‌లో బ్యాచిలర్.
- ▲ నాన్-ఎకడమిక్స్‌లో భరతనాట్యం కోర్సు చేశారు.
- ▲ భారత్‌లోని పలు స్కూళ్లల్లో శిక్షణా కార్యక్రమాలు ఇచ్చారు.
- ▲ ఆస్ట్రియా, గ్రీస్, స్కాట్‌లాండ్, ఇరాన్‌లలో స్టోరీ టెల్లింగ్ ఉత్సవాలకు వెళ్లిన తొలి భారతీయురాలు.





# మనసు విప్పి మాట్లాడండి!

టీనేజ్ పిల్లలు కొన్ని సమస్యలను ఎవరికీ చెప్పుకోలేక సతమతమవు తుంటారు. అయితే ఏ విషయమైనా పేరెంట్స్‌తో షేర్ చేసుకోవడమే బెటర్ ఆప్షన్.

### ధైర్యంగా మాట్లాడండి!

- వ్యక్తిగత విషయాల గురించి తల్లిదండ్రులతో మాట్లాడాలంటే మొహమాటంగా ఉండొచ్చు. మీ వయసులో తల్లిదండ్రులు కూడా అలాగే ఇబ్బంది పడి ఉంటారు. మిమ్మల్ని అర్థం చేసుకుంటారు. ధైర్యంగా చెప్పండి.
- సమస్య చిన్నదైనా, పెద్దదైనా తల్లిదండ్రులు దాన్ని పరిష్కరించగలుగుతారు. తల్లిదండ్రులు బెంగపెట్టుకుంటారని సమస్యను దాచొద్దు.
- కొంతమంది పిల్లలు కాలమే సమస్యను పరిష్కరిస్తుందని భావించి తల్లిదండ్రులను సంప్రదించరు. సమస్యను నాన్చటం పరిష్కారం కాదని గుర్తించాలి. తల్లి దండ్రులకు తెలిస్తే బాధ్యత తీసుకుంటారు. దానివల్ల పిల్లలపై ఒత్తిడి తగ్గుతుంది.

### ఎవరితో మాట్లాడాలో నిర్ణయించుకోండి!

- అమ్మతోనా, నాన్నతోనా లేక ఇద్దరితోనూ మాట్లాడాలా తేల్చుకోండి. లేదా తాతయ్య, అన్న, అక్క ఎవరితో ముందుగా మాట్లాడాలో నిర్ణయించుకోండి.
- వాకింగ్ చేసేటప్పుడు, వంట గదిలో, లేదా కారులో వెళుతున్నప్పుడు.. ఇలా మాట్లాడేందుకు అనువైన సందర్భం ఎంపిక చేసుకోండి. పిచ్చాపాటీ మాట్లాడుతూ విషయానికి రండి.

### విపులంగా చెప్పండి!

- సమస్య గురించి చెప్పగలిగినన్ని వివరాలు చెప్పండి. మీ ఆలోచనలు, ఇబ్బందులు, మీరేం కోరుకుంటున్నారు అనేదాన్ని స్పష్టంగా చెప్పండి.
- మీ గత చరిత్రను బట్టి మీరు చెప్పేదాన్ని తల్లిదండ్రులు విశ్వసిస్తారు. మీరు గతంలో నిజాలు దాచినా, అబద్దాలు చెప్పినా నమ్మటం కష్టమవుతుంది.
- మీరు చెప్పినదానికి అంగీకరించకపోతే తల్లిదండ్రులతో విబేధించవద్దు. వారి వైపు నుంచి ఆలోచించండి. అలాగే వాదించటం, ఏడ్వడం చేయకూడదు. నెమ్మదిగా మాట్లాడండి. దానివల్ల వారు సమస్యను అర్థం చేసుకుంటారు.
- తల్లిదండ్రులు అందుబాటులో లేకపోతే మీరు ఆప్తుడిగా భావించిన టీచర్, బంధువు, కౌన్సిలర్‌ను కలవండి.

# పది నిమిషాలు.. కనుపాపలు పదిలం!



స్మార్ట్‌ఫోన్‌లు, ట్యాబ్‌లు, టీవీ, కంప్యూటర్ లాంటి ఎలక్ట్రానిక్స్ వస్తువుల వాడకంతో కళ్లు స్ట్రెయిన్ అవుతాయి. ఈ ఇబ్బంది నుంచి కళ్లను కాపాడుకునేందుకు రోజూ పది నిమిషాలు ఈ చిట్కాలు పాటిస్తే చాలు.

- రెండు అరచేతులను బాగా రుద్ది, వేడి పుట్టగానే కళ్లపై ఉంచితే ఒత్తిడి తగ్గుతుంది. కంప్యూటర్‌పై పనిచేశాక కళ్లను నీటితో కడగాలి. దీనివల్ల కంటిలో తేమ తగ్గదు. చాలావరకు కంటి సమస్యలు నివారించవచ్చు.
- పోషకాహారలోపం కంటి ఆరోగ్యాన్ని దెబ్బతీస్తుంది. చేపలు, తాజా ఆకుకూరలు, పండ్లు, కూరగాయలను ఆహారంలో భాగం చేసుకోవాలి. దీనివల్ల కళ్లు పొడిబారటం తగ్గుతుంది.
- కంప్యూటర్లపై నిరంతరం పనిచేసేవారు తరచూ రెప్పవేయటం వల్ల అలసట తగ్గి, కళ్లకు ఊరట కలుగుతుంది.

◆ వినూత్నం

**మహిళలు బ్యాండ్ వాయిస్తూ కనిపిస్తున్న ఈ ఫోటో ఎంతో ఆసక్తిగా ఉంది కదూ.. వీరంతా పాట్నాలోని దీబ్రా గ్రామానికి చెందిన వారు . 'నారీ గుంజన్ సంగం మహిళా బ్యాండ్'గా ఏర్పడి బీహార్ గ్రామాల్లో సంచలనం సృష్టిస్తున్నారు. బీహార్‌లో తొలి మహిళా బ్యాండ్ ఇది.**



# వాళ్ల దరువు.. అదరహో!

ఈ బ్యాండులో మొత్తం పదిమంది స్త్రీలు ఉన్నారు. వీరంతా దళితులే. దీబ్రాలో ఉదయం కోడి కూత వినిపించినా, వినిపించకపోయినా ఈ బ్యాండ్ మహిళలు చేసే డ్రమ్స్ సాధన మటుకు ఊరంతా ప్రతిధ్వనిస్తుంది. ఈ బ్యాండ్ తమ ఉనికిని చాటుకోవడానికి ఎన్నో సామాజిక అవరోధాలను దాటాల్సివచ్చింది. తమకు వచ్చిన కళనే తమ ఆదాయమార్గంగా మలచుకుంది. కులాధిపత్యం ఎక్కువగా ఉండే బీహార్ రాష్ట్రంలో ఇలాంటి ఒక పరిణామం చోటుచేసుకోవడం విశేషమే.

ఈ మహిళా బ్యాండ్‌లోని వాళ్లంత ఒకటిన్నర ఏడాది పాటు డ్రమ్స్‌తో తీవ్ర సాధన చేశారు. ఈరోజు అక్కడ ఈ బ్యాండు లేని వివాహాలే లేవంటే అతిశయోక్తి కాదు. ఈ క్రెడిట్ అంతా పద్మశ్రీ గ్రహీత, సామాజిక సేవకురాలు సుధా వర్గీస్‌కే చెందుతుందంటున్నారు మ్యూజిక్ బ్యాండులోని వారంతా. మహిళాచైతన్యం కోసం వర్గీస్ బీహార్‌లో 'నారీ గుంజన్ సంస్థ'ను స్థాపించారు. 'సుధా వర్గీస్ ప్రోత్సాహమే లేకపోతే ఈ రోజు మేం కూలీలుగానే జీవితాల్ని వెళ్లబుచ్చుతుండేవాళ్లం' అని మ్యూజిక్ బ్యాండ్‌లోని కళాకారిణి సబిత అంది. 2014 చివరి నాటికి ఈ మహిళా మ్యూజిక్ బ్యాండ్ శిక్షణ పూర్తిచేసుకుని రంగంలోకి దిగింది. ప్రారంభంలో బ్యాండ్‌లోని ఒక్కొక్క మహిళకు రోజుకు 500 రూపాయలు వచ్చేవి. తర్వాత ఆ మొత్తం 1000 రూపాయల నుంచి 1200 రూపాయలకు పెరిగింది.

నేడు బ్యాండులోని మహిళలంతా తమ కాళ్ల మీద తాము నిలబడ్డారంటే అందుకోసం తెరవెనుక వారు పడ్డ కష్టం కూడా ఎక్కువే. గ్రామంలో తమకంటూ ఒక ఉనికిని సృష్టించుకోవడానికి ఇంటా, బయటా వాళ్లెంతో పోరాడాల్సి వచ్చింది. 'బ్యాండులో చేరుతామని, డ్రమ్స్ నేర్చుకోవాలనుకుంటున్నామని చెప్పినపుడు గ్రామస్థులు మమ్మల్ని నిరుత్సాహపరిచారు. చివరకు మా భర్తలు కూడా అందులో చేరొద్దంటూ వారించారు' అని బృందం నాయకురాలు సబిత చెప్పింది. అయితే



ఇవన్నీ వాళ్ల ప్రారంభంలో ఎదుర్కొన్న సమస్యలు. ఎప్పుడైతే ఈ కళలో తమ సామర్థ్యాన్ని చాటి, ఇంటికి డబ్బు తేవడం మొదలెట్టారో మెల్లగా భర్తలు, పిల్లలు వారి పనిని అభినందించడం మొదలెట్టారు. 'మేం సాధించిన విజయం చూసి ఇంట్లో వాళ్లు ఇప్పుడు ఎంతో గర్వపడుతున్నారు' అని ఆ బృందంలోని పంచమ్ అంది. ఇంటా, బయటా చాలామంది ఇది మగవాళ్లు చేసే పని అని అడ్డుచెప్పారు. కానీ అవేమీ పట్టించుకోలేదు వీళ్లు. విశేషం ఏమిటంటే 20 ఏళ్ల నుంచి 60 ఏళ్ల మహిళలు కూడా ఈ బ్యాండులో సభ్యులుగా ఉన్నారు.



మనం ఆండ్రాయిడ్, ఐఫోన్లలో అన్ని రకాల పనులూ చేసుకోగలుగుతున్నాం అనుకుంటున్నాం గానీ వాస్తవానికి మనకు తెలియకుండానే మనపై చాలా పరిమితులు విధించబడి ఉన్నాయి. వేల రూపాయలు పెట్టి ఫోన్ కొన్నది మనమే అయినా సెక్యూరిటీ కారణాల వల్ల మన ఫోన్‌ని పూర్తి స్థాయిలో కస్టమైజ్ చేసుకోవడానికి వీలుపడదు. ఆ కారణం చేతనే ఫోన్‌తో పాటు వచ్చిన యాప్స్‌ని తొలగించడానికి కష్టమవుతోంది. కంపెనీలవాళ్లు ఇచ్చిన ఆండ్రాయిడ్ వెర్షన్‌తోనే సరిపెట్టుకోవలసి వస్తోంది. ఈ పరిమితులన్నీ తొలగించుకుని ఫోన్‌ని మన కంట్రోల్ లోకి తీసుకోవడమే ఆండ్రాయిడ్ ఫోన్ల పరిభాషలో రూటింగ్ అంటారు. దాదాపు ఇదే మాదిరి పనిని ఐఫోన్ల విషయంలో 'జైల్‌బ్రేకింగ్' అని పిలుస్తారు.

# రూటింగ్‌తో అదనపు శక్తి

### రూటింగ్ అంటే?

### చెత్త యాప్స్‌కి చెక్

### అప్‌డేట్లు రావట్లేదా?

### ఫోన్ ఓవర్‌క్లాకింగ్

### రూట్ చేయడం ఎలా?



### ఎందుకు డిసేబుల్ చేస్తారు?

### పూర్తి స్థాయి బ్యాకప్‌లు



• నల్లమోతు శ్రీధర్
fb.com/nallamothusridhar

# నిన్నటికీ ఈ రోజుకి తేడా ఉంటే చాలు

సింగర్స్ స్పెషల్



కొద్ది రోజుల క్రితం 'మాషప్' అనేది యూ ట్యూబ్‌లో ట్రెండింగ్‌లో ఉంది. ఇప్పుడు 'అకపెలా' వీడియోలు ఇంటర్‌నెట్‌లో సంచలనం సృష్టిస్తున్నాయి. ఇటీవల 'అందాలలో అహో మహోదయం'తోపాటు పలు పాటలు సంగీత ప్రియుల మదిని దోచేశాయి. ఆ వీడియోల క్రియేటర్ అనుదీప్ దేవరకొండ. ఆయనను పలకరిస్తే తన సంగీత ప్రయాణం గురించి ఇలా చెప్పుకొచ్చారు.

లోనే 'ఖాకీ'లో రెండు పాటలు పాడా. శేఖర్ చంద్ర, సునీల్ కశ్యప్, జె.బి వంటి సంగీత దర్శకుల దగ్గరా పనిచేశా. 'బాహుబలి'లో పచ్చ బొట్టు పాటకు ఓ వెర్షన్ నా చేత పాడించారు. నా వాయిస్ సూట్ కాలేదేమో! ఆ పాట మిస్ అయ్యా.

### నమ్మకం తక్కువేమో!

### గుర్తింపు తెచ్చిన పాటలు

### ఇష్టపడుతున్నారా ఉన్నారు...

### కోరస్‌తో ప్రారంభించా...

### 'అకపెలా'తో గుర్తింపు

• అలపాటి మధు

## టెక్ సందేహాలు

### క్లీనింగ్ యాప్స్‌తో ఉపయోగం ఉంటుందా?

- వెంకటేష్, రాజమండ్రి



### మ్యూజిక్‌లో ఏది బెటర్?

- దుర్గాప్రసాద్, విజయవాడ



### ఆ సైట్లకు అడ్డుకట్ట వేయవచ్చా?

- విమల, నందికొట్కూరు





### కోడింగ్

### స్టోరేజ్ కోసం..



### వీడియో డౌన్‌లోడ్ కోసం..!

తెలుసా!



### నయా ఫోన్

# అందుబాటులో రెడ్‌మి 5ఎ



### నయా యాప్

# గూగుల్ నుంచి డాటల్లీ



### నయా గ్యాడ్జెట్

# ఇంటికి స్మార్ట్ 'కీ'



## డైలీ సుడోకు - 38

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 8 | | | 9 | 7 | | 5 | | |
| | | | | 2 | | | | |
| | 7 | | | | 5 | | | 3 |
| 2 | | 5 | | 8 | | 9 | | |
| | | 3 | | | | 6 | | |
| | | 4 | | 3 | | 2 | | 7 |
| 4 | | | 3 | | | | 1 | |
| | | | | 1 | | | | |
| | | 1 | | 9 | 4 | | | 8 |

### ఎలా పూరించాలి?

ప్రతి బాక్స్‌లోనూ 9 గళ్లు ఉంటాయి.

నిలువుగానూ, అడ్డంగానూ

సుడోకు- 37 సమాధానం

### ఈజీ టెక్



# ఎక్కడున్నా వైఫై!

### నయా ఫీచర్

# వాట్సప్‌లో కొత్తగా..!



























# '2.0'... వేసవికే!


రజనీకాంత్

'రోబో' సీక్వెల్‌గా రూపొందుతోన్న '2.0' వేసవికి విడుదల కానుంది. రజనీకాంత్ హీరోగా శంకర్ దర్శకత్వంలో తెరకెక్కుతోన్న చిత్రమిది. దాదాపు రూ.450కోట్ల వ్యయంతో లైకా ప్రొడక్షన్స్ నిర్మిస్తోంది. ఎమీ జాక్సన్ నాయిక. అక్షయ్‌కుమార్ విలన్‌గా నటిస్తున్నారు. తెలుగు, తమిళ్, హిందీలో రూపొందుతోంది. ప్రస్తుతం నిర్మాణానంతర కార్యక్రమాలు జరుగుతున్నాయని, చిత్రాన్ని 2018 ఏప్రిల్‌లో విడుదల చేయడానికి సన్నాహాలు చేస్తున్నామనీ లైకా ప్రొడక్షన్స్ క్రియేటివ్ హెడ్ రాజు మహాలింగం చెప్పారు. రెహమాన్ సంగీతాన్ని సమకూర్చిన ఈ సినిమాకు సమర్పణ: సుభాష్ కరణ్



## కృష్ణకు 'ఆటా' జీవన సాఫల్యం

సూపర్‌స్టార్ కృష్ణకు 'ఆటా' (అమెరికన్ తెలుగు అసోసియేషన్) ఆధ్వర్యంలో ఈ నెల 23న జీవన సాఫల్య పురస్కారాన్ని ప్రదానం చెయ్యనున్నామని 'ఆటా' అధ్యక్షుడు కరుణాకర్ అసిరెడ్డి, కాబోయే అధ్యక్షుడు పరమేశ్ భీమిరెడ్డి తెలిపారు. మాతృభూమి రుణం తీర్చుకొనేందుకు రెండేళ్లకోసారి ఇండియాలో 'ఆటా' వేడుకలు నిర్వహిస్తున్నామని వారు తెలిపారు.


సన్నీలియోన్

## కల నెరవేరుతోంది

'కరెంట్ తీగలో టీచర్‌గా, 'గరుడవేగలో 'డియోడియో' పాటతో అలరించింది సన్నీలియోన్. తొలిసారి తెలుగు సినిమాలో ప్రధాన పాత్ర పోషించబోతోంది. యుద్ధం నేపథ్యంలో రూపొందనున్న ఓ చారిత్రాత్మక చిత్రానికి సన్నీ సైన్ చేసింది. నవదీప్, నాజర్ ఇందులో కీలక పాత్రధారులు. తమిళ దర్శకుడు వడి వుడయన్ దర్శకత్వం వహిస్తారు. స్టీవ్స్ కార్నర్ పతాకంపై పోన్స్ స్టిఫెన్ తెలుగు, తమిళ, మలయాళ, హిందీ భాషల్లో నిర్మించనున్నారు. ఓ ప్రముఖ ట్రైనర్ నేతృత్వంలో సన్నీ కత్తి యుద్ధం, గుర్రపు స్వారీ, యుద్ధ కళలను నేర్చుకోనుందట. "ఈ సినిమా కోసం సన్నీ 150 రోజులు కాల్షీట్లు ఇచ్చింది. 70 నిమిషాలు గ్రాఫిక్స్ ఉన్న ఈ చిత్రానికి 'బాహుబలి', '2.0' చిత్రాలకు పని చేసిన గ్రాఫిక్స్ సంస్థలు పని చేయబోతున్నాయి. ఫిబ్రవరిలో షూటింగ్ మొదలవుతుంది. త్వరలో టైటిల్ వెల్లడిస్తాం" అని నిర్మాత తెలిపారు. "యాక్షన్ సినిమాల్లో నటించాలన్నది నా కల. అది ఈ సినిమాతో నెరవేరుతుంది. ఇలాంటి కథ కోసం చాలాకాలంగా ఎదురుచూస్తున్నా" అని సన్నీలియోన్ తెలిపారు.


తాప్సీ

## అది దిద్దుకోలేని తప్పు

- లిజీ



"వరుస సినిమాలతో బిజీగా ఉన్న నేను 22 ఏళ్లప్పుడు పరిశ్రమ నుంచి వెళ్లిపోవడమన్నది సరిదిద్దుకోలేని తప్పు. ఇప్పుడు ఆ క్షణాలు రావు. కానీ ఆ అనుభవంతో సెకండ్ ఇన్నింగ్స్‌ని జాగ్రత్తగా ప్లాన్ చేసుకుంటాను. తెలుగు చిత్రాలతో నా అనుబంధం చాలా గొప్పది" అని అన్నారు లిజీ. ఆమె మలయాళ దర్శకుడు ప్రియదర్శన్‌ను వివాహం చేసుకుని విడిపోయిన సంగతి తెలిసిందే. అయితే తాజాగా పవన్‌కల్యాణ్, త్రివిక్రమ్ నిర్మాతలుగా నితిన్ హీరోగా తెరకెక్కుతోన్న చిత్రంలో ఓ కీలక పాత్రలో నటిస్తున్నారు లిజీ. దీని గురించి ఆమె మాట్లాడుతూ "పాతికేళ్ల తర్వాత కెమెరాముందుకు వచ్చాను. న్యూయార్క్‌లో తొలి షెడ్యూల్ చేస్తున్నప్పుడు కాస్త థ్రిల్లింగ్‌గా, భయంగా అనిపించింది. నేను నటించిన ఎనిమిది తెలుగు సినిమాల్లో ఆరు హిట్ అయ్యాయి. అప్పుడు టాలీవుడ్‌ని వదిలినందుకు బాధపడ్డాను. కానీ ఇక వరుసగా మంచి పాత్రల్లో నటిస్తాను" అని అన్నారు.

## కొంచెం యాక్షన్.. కొంచెం వినోదం...

ఆది పినిశెట్టి, తాప్సీ జంటగా హైదరాబాద్, విశాఖపట్నం, విజయవాడ నేపథ్యంలో ఓ యాక్షన్ ఎంటర్‌టైనర్ రూపొందనుంది. ఈ నెల 21న ఈ చిత్రం ప్రారంభం కానుంది. కోన వెంకట్ సమర్పణలో ఎం.వి.వి. సినిమా, కోన ఫిల్మ్ కార్పొరేషన్ నిర్మిస్తున్నాయి. ఎం.వి.వి.సత్యనారాయణ నిర్మాత. 'లవర్స్' ఫేమ్ హరి దర్శకుడు. వెన్నెల కిశోర్, శివాజీరాజా, తులసి, సాయిచంద్ కీలక పాత్రధారులు.


ఆది పినిశెట్టి

## ప్రియురాలి కోసం పోరాటం


సీరత్, అల్లు శిరీష్, సురభి

అల్లు శిరీశ్, సురభి, సీరత్ కపూర్ కీలక పాత్ర ధారులుగా వి.ఐ.ఆనంద్ దర్శకత్వం వహిస్తున్న చిత్రం 'ఒక్క క్షణం'. లక్ష్మీనరసింహా ఎంటర్‌టైన్‌మెంట్స్ పతాకంపై చక్రీ చిగురుపాటి నిర్మిస్తున్నారు. ఆదివారం అల్లు శిరీశ్ టీజర్‌ను విడుదల చేశారు. ఆయన మాట్లాడుతూ "ఉత్కంఠగా సాగే కథకు లవ్, రొమాన్స్, ఎంటర్‌టైన్‌మెంట్‌ను జోడించి ఆనంద్ చక్కగా తెరకెక్కించారు. టీజర్ శాంపిల్ మాత్రమే. సినిమాలో ఇంకా సస్పెన్స్ ఉంది. మణిశర్మగారి సంగీతం ప్లస్ అవుతుంది. దర్శకుడి మార్క్ చూపించే సినిమా ఇది" అని తెలిపారు. ఆనంద్ మాట్లాడుతూ "గతేడాది నవంబర్‌లో హీరోకి, నిర్మాతకు ఈ కథ చెప్పా. నన్ను నమ్మి నాతో ట్రావెల్ చేశారు. జీవా అనే పాత్ర పండించానికి శిరీశ్ తనకు మించిన ఎఫర్ట్ పెట్టాడు" అని చెప్పారు. "సినిమా చూస్తున్నప్పుడు ఒక్క క్షణం మిస్ అయినా తర్వాత ఏం జరుగుతుందో అన్న ఉత్కంఠ ప్రేక్షకుల్ని వెంటాడుతుంది" అని అబ్బూరి రవి తెలిపారు. "నటిగా నాకు చాలా కొత్త పాత్ర ఇది" అని సురభి, చేసింది చిన్న పాత్రే అయినా ముఖ్యమైన పాత్ర అని సీరత్ కపూర్ వెల్లడించారు. త్వరలో సినిమాను విడుదల చేస్తామని చక్రీ అన్నారు.

## 'ఐయామ్ విత్ మా' నినాదంతో...

మూవీ ఆర్టిస్ట్ అసోసియేషన్ 25వ వసంతంలోకి అడుగుపెట్టిన సందర్భంగా సిల్వర్ జూబ్లీ వేడుకను ఘనంగా నిర్వహించేందుకు 'మా' నూతన కార్యవర్గం ప్లాన్ చేస్తోంది. ఈ సందర్భంగా శనివారం ఫిల్మ్‌నగర్ కల్చరల్‌సెంటర్‌లో ఏర్పాటు చేసిన కార్యక్రమంలో దీనికి సంబంధించిన వివరాలను 'మా' సభ్యులు వెల్లడించారు. అదే వేదికపై సీనియర్ నటుడు రాళ్లపల్లి, సీనియర్ జర్నలిస్ట్ గుడిపూడి శ్రీహరిను సత్కరించారు. 'మా' అధ్యక్షుడు శివాజీరాజా మాట్లాడుతూ ' 'మా' 25 వసంతంలోకి అడుగుపెట్టడం సంతోషంగా ఉంది. 'ఐయామ్ విత్ మా' నినాదంతో సిల్వర్‌జూబ్లీ వేడుకలు నిర్వహించనున్నాం. చిరంజీవి, నాగార్జున, బాలకృష్ణ, వెంకటేశ్‌ను అడగ్గానే ఈ వేడుకకు రావడానికి అంగీకరించారు. మహేశ్, రాంచరణ్, తారక్ కూడా సపోర్ట్ అందిస్తామన్నారు. వృద్ధ కళాకారుల కోసం గోల్డేజ్‌హోమ్ ఏర్పాటు చేస్తున్నాం. తెలంగాణా రాష్ట్రంలో జరిగే తెలుగు మహాసభలకు 'మా' తరపున పూర్తి మద్దతు అందిస్తాం" అని తెలిపారు. ఈ నెల 10న కృష్ణ, కృష్ణంరాజుగారి ఆధ్వర్యంలో కర్టెన్ రైజర్ కార్యక్రమం జరగనుంది" అని జనరల్ సెక్రటరీ నరేశ్ చెప్పారు.


శ్రీకాంత్, గుడిపూడి, రాళ్లపల్లి, శివాజీరాజా



విజయ్ అంటోని హీరోగా నటించిన 'ఇంద్రసేన' సక్సెస్ మీట్ హైదరాబాద్‌లో ఆదివారం జరిగింది. ఈ కార్యక్రమంలో నిర్మాత నీలం కృష్ణారెడ్డి, విజయ్ ఆంటోని, నాయిక మహిమ, రచయిత భాష్యశ్రీ పాల్గొన్నారు.

## ముద్ర వేయాలనుకున్నా



ప్రయాణాల్లో ఉన్నప్పుడు ఒక్కొక్కరికీ ఒక్కో విషయం గుర్తుకొస్తుంటుంది. నాకు మాత్రం సినిమా వైపు నేను వేసిన తొలి అడుగులు మదిలో మెదులుతుంటాయి అని అన్నారు కాజల్. ఆమె ప్రస్తుతం కల్యాణ్‌రామ్ సరసన 'ఎం.ఎల్.ఎ', తమిళ్‌లో రమేశ్ అరవింద్ దర్శకత్వంలో 'ప్యారిస్ ప్యారిస్', నాని సమర్పిస్తున్న 'అ!'లో నటిస్తున్నారు. కాజల్ మాట్లాడుతూ "నా కుటుంబ సభ్యులు ఎవరూ సినిమా రంగంలో లేరు. కానీ నా తర్వాతి తరాల వారికి నేను మార్గదర్శిని కావాలనుకున్నా. అందుకే ఎలాగైనా వెండితెరమీద నాదైన ముద్ర ఉండేలా చూడాలని అనుకున్నా. నా ఆశకు, ఆశయానికీ తగ్గట్టు అన్నీ అంశాలు కలిసొచ్చాయి. అడపాదడపా నా ఖాతాలో ఫ్లాప్‌లు పడ్డప్పటికీ పరిశ్రమ వాటిని పట్టించుకోకుండా నన్ను ప్రోత్సహించింది" అని చెప్పారు.

## ఈ సారి 6.5 శాతం వృద్ధి: పనగడియా

న్యూఢిల్లీ: ప్రస్తుత ఆర్థిక సంవత్సరంలో (2017-18) దేశ వృద్ధి రేటు 6.5 శాతం లేదా అంతకన్నా ఎగువనే నమోదుకావచ్చని నీతి ఆయోగ్ మాజీ వైస్ చైర్మన్ అరవింద్ పనగడియా అంచనా వేస్తున్నారు. జిఎస్‌టి అమలుతో మొదటి త్రైమాసికంలో (ఏప్రిల్-జూన్) వృద్ధి రేటు మూడేళ్ల కనిష్ఠ స్థాయి 5.7 శాతానికి క్షీణించినప్పటికీ.. రెండో త్రైమాసికంలో (జూలై-సెప్టెంబర్) తిరిగి 6.3 శాతానికి పుంజుకుంది. మళ్లీ ఆర్థిక వ్యవస్థ పునరుద్ధరణ బాటలో పయనిస్తున్నదని పనగడియా అన్నారు. వచ్చే ఆర్థిక సంవత్సరంలో (2018-19) జిడిపి 8శాతానికి చేరుకోవచ్చని గోల్డ్‌మన్ శాచ్ తాజా నివేదికలో అంచనా వేసిందని ఈ సందర్భంగా ఆయన ప్రస్తావించారు. గత మూడేళ్లుగా దేశ స్థూల ఆర్థికాంశాలు స్థిరంగానే ఉన్నాయన్నారు.

# కావాలంటే మొత్తం అమ్మేసుకోండి

- లాభదాయక క్షేత్రాల విక్రయం మాత్రం వద్దు
- 18 శాతం వాటా విక్రయిస్తే రూ.41,000 కోట్లు ఖాయం
- ప్రైవేటు కంపెనీలకు కట్టబెట్టే ప్రయత్నాలపై ఓఎన్‌జిసి అధికారుల నిరసన గళం

న్యూఢిల్లీ: ప్రభుత్వ రంగంలోని ఓఎన్‌జిసి, ఆయిల్ ఇండియా లిమిటెడ్ (ఓఐఎల్)కు చెందిన కొన్ని చమురు, గ్యాస్ క్షేత్రాల్లో మెజారిటీ వాటాను ప్రైవేట్ రంగానికి కట్టబెట్టే ప్రయత్నాలపై ఓఎన్‌జిసి ఉన్నతాధికారులు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. దొడ్డిదారిన ఓఎన్‌జిసి ఆస్తులను ప్రైవేట్ కంపెనీలకు కట్టబెట్టే బదులు కంపెనీ మొత్తాన్ని ప్రైవేట్ కంపెనీలకు అప్పగించడం మంచిదని స్పష్టం చేస్తున్నారు. ప్రస్తుతం ఓఎన్‌జిసి ఈక్విటీలో ప్రభుత్వానికి 68.07 శాతం వాటా ఉంది. ఇందులో 18 శాతం వాటా అమ్మినా ప్రస్తుత మార్కెట్ ధర ప్రకారం ప్రభుత్వ ఖాతాకు రూ.41,000 కోట్లకుపైగా సమకూరవచ్చని అంటున్నారు.

### భారీ నిక్షేపాలు

ఉత్పత్తి పెంచే పేరుతో ప్రైవేట్ కంపెనీలకు కట్టబెట్టేందుకు డైరెక్టరేట్ జనరల్ ఆఫ్ హైడ్రోకార్బన్స్ (డిజిహెచ్) ఇప్పటికే ఓఎన్‌జిసికి చెందిన 11, ఆయిల్ ఇండియాకు చెంది న నాలుగు క్షేత్రాలను గుర్తించింది. ఈ 15 క్షేత్రాల్లో 79.12 కోట్ల టన్నుల ముడి చమురు, 333.46 బిలియన్ క్యూబిక్ మీటర్ల గ్యాస్ నిక్షేపాలు ఉన్నట్టు అంచనా. వేలంలో అత్యధిక ధర కోట్ చేసే కంపెనీలకు ఈ క్షేత్రాల్లో 60 శాతం వాటా ఇవ్వాలని కేంద్ర పెట్రోలియం మంత్రిత్వ శాఖ నిర్ణయించింది. 'ఓఎన్‌జిసి అత్యంత లాభాల్లో ఉన్న ప్రభుత్వ రంగ సంస్థ. కంపెనీ సమర్థవంతంగా పని చేయడం లేదనుకుంటే పూర్తిగా ప్రైవేటీకరించాలి. అంతే తప్ప ఈ పద్ధతిలో ముందుకెళితే ఓఎన్‌జిసికి ఎయిర్ ఇండియా గతే పడుతుంది' అని పేరు చెప్పేందుకు ఇష్టపడని ఒక ఉన్నతాధికారి చెప్పారు. ప్రపంచ చమురు, గ్యాస్ నిక్షేపాల్లో 0.3 శాతం మాత్రమే మన దేశంలో ఉన్నా, ప్రపంచ ఉత్పత్తిలో మన వాటా 0.6 శాతం ఉత్పత్తి చేస్తున్న విషయాన్ని ఓఎన్‌జిసి అధికారులు గుర్తు చేస్తున్నారు.

### ఇదీ ప్రైవేట్ చరిత్ర

ప్రైవేట్ కంపెనీలకు ఇస్తే ఉత్పత్తి పెరుగుతుందనే వాదననీ ఓఎన్‌జిసి ఉన్నతాధికారులు తోసిపుచ్చుతున్నారు. అలా అయితే ఎపి తీరంలో రిలయన్స్ ఇండస్ట్రీస్ నిర్వహణలోని కెజి బేసిన్ పరిస్థితి ఏమిటని ఒక ఉన్నతాధికారి ప్రశ్నించారు. ఇక్కడ ఒప్పందంలో చెప్పిన దాంట్లో రిలయన్స్ కంపెనీ పదో వంతు మాత్రమే గ్యాస్ ఉత్పత్తి చేస్తున్న విషయాన్ని గుర్తు చేశారు. పశ్చిమ తీరంలోని పన్నా, ముక్త, తపతి క్షేత్రాల్లోనూ ఉత్పత్తి పెంచడంలో బహుళ జాతి ఆయిల్ కంపెనీలే బొక్క బోర్లా పడిన విషయాన్నీ గుర్తు చేశాయి. ఎంతో కాలంగా ఉత్పత్తి చేస్తున్నా ఓఎన్‌జిసి తన 11 క్షేత్రాల్లో మంచి ఉత్పత్తినే కొనసాగిస్తోందని చెప్పారు.

# మార్చికల్లా 8 పిఎస్‌బిల మూలధన సేకరణ

న్యూఢిల్లీ: వచ్చే ఏడాది మార్చికల్లా మార్కెట్ నుంచి మూలధన నిధులు సేకరించాలని 8 ప్రభుత్వ రంగ బ్యాంకులు (పిఎస్‌బి) నిర్ణయించుకున్నాయి. పిఎస్‌బిలకు కేంద్రం ప్రకటించిన రూ.2.11 లక్షల కోట్ల మూలధనం కేటాయింపు ప్రణాళికలో భాగంగానే బ్యాంకులు మార్కెట్ నుంచి ఈ నిధులను సమీకరించనున్నట్లు తెలుస్తున్నది. ఇప్పటికే కొన్ని బ్యాంకులు ఆర్థిక శాఖ నుంచి అనుమతి పొందగా.. మరికొన్నింటికి ఇంకా గ్రీన్‌సిగ్నల్ లభించాల్సి ఉంది. ఈ బ్యాంకులు ప్రైవేట్ ప్లేస్‌మెంట్ లేదా రైట్స్ ఇష్యూ ద్వారా మూలధన నిధులను సేకరించనున్నాయి. చాలావరకు బ్యాంకులు నిధుల సేకరణకు క్వాలిఫైడ్ ఇన్‌స్టిట్యూషనల్ ప్లేస్‌మెంట్ (క్యుఐపి)ను ఎంచుకోవాలనుకుంటున్నట్లు అధికారిక వర్గాల ద్వారా తెలిసింది. అన్నింటికంటే ముందుగా పంజాబ్ నేషనల్ బ్యాంక్ (పిఎన్‌బి) మార్కెట్ నుంచి రూ.5,000 కోట్లు సేకరించవచ్చని వారు తెలిపారు.

బ్యాంక్ ఆఫ్ బరోడా, బ్యాంక్ ఆఫ్ ఇండియా, యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, అలహాబాద్ బ్యాంక్, ఆంధ్రా బ్యాంక్ కూడా షేర్ల విక్రయం ద్వారా మూలధన నిధులు సేకరించేందుకు సమాయత్తమవుతున్నది. మొండిబకాయిల సంక్షోభం నుంచి గట్టెక్కించేందుకు పిఎస్‌బిలకు రెండేళ్లలో రూ.2.11 లక్షల కోట్ల మూలధన నిధులు కేటాయించనున్నట్లు కేంద్ర ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీ అక్టోబర్‌లో ప్రకటించారు. అందులో రూ.1.35 లక్షల కోట్లను రీక్యాపిటలైజేషన్ బాండ్ల జారీ ద్వారా సమకూర్చనుండగా.. మరో రూ.58,000 కోట్లను పిఎస్‌బిలు ప్రభుత్వ వాటాను మార్కెట్లో విక్రయించడం ద్వారా సేకరించనున్నాయి.

### మీడియా, ఎంటర్‌టైన్‌మెంట్ రంగంలో

# 5 ఏళ్లలో 8 లక్షల ఉద్యోగాలు

- సిఐఐ-సిబిజి నివేదిక అంచనా

న్యూఢిల్లీ : రానున్న కాలంలో దేశీయ మీడియా, ఎంటర్‌టైన్‌మెంట్ రంగం 11-12 శాతం వృద్ధిని సాధించే అవకాశం ఉందని, ఈ రంగం వచ్చే ఐదేళ్ల కాలంలో అదనంగా ఏడు నుంచి ఎనిమిది లక్షల ఉద్యోగాలు కల్పించే ఆస్కారం ఉందని సిఐఐ-బిసిజి నివేదిక పేర్కొంది. గ్రామీణ ప్రాంతాల నుంచి డిమాండ్ పెరుగుతున్న కారణంగా మీడియా వినియోగం క్రమంగా పెరుగుతోందని తెలిపింది.

ఎక్కువ మంది ఇంటర్నెట్‌ను వాడుతున్న నేపథ్యంలో అభిరుచులకు అనుగుణంగా కంటెంట్‌ను అందజేసే ధోరణి పెరుగుతోందని వెల్లడించింది. వినియోగదారుల డిమాండ్ మేరకు వ్యాపార నమూనాల్లో మార్పులు చోటు చేసుకుంటున్నాయని, ఇందుకు అనుగుణంగా పరిశ్రమ పూర్తిగా విభిన్నమైన సిబ్బందిని నియమించుకోవాల్సిన అవసరం ఉంటుందని తెలిపింది. ఈ నేపథ్యంలో వచ్చే ఐదేళ్ల పాటు ఏటా 1,40,000-1,60,000 లక్షల మంది శిక్షణ పొందిన వారి అవసరం ఉంటుందని పేర్కొంది.

ఫలితంగా మంచి నైపుణ్యం, టాలెంట్ ఉన్న వారికి డిమాండ్ ఉంటుందని తెలిపింది. వృద్ధిని పెంచుకోవడానికి గాను మార్పునకు అనుగుణంగా మీడియా, ఎంటర్‌టైన్‌మెంట్ సంస్థలు తమ వ్యూహాలను మార్చుకోవాల్సిన అవసరం ఉంటుందని పేర్కొంది.

# మళ్లీ యథాతథమే!

**ఈసారీ వడ్డీరేట్లలో మార్పులుండకపోవచ్చు.. ఈ నెల 5, 6న తేదీల్లో ఆర్‌బిఐ ఎంపిసి సమావేశం**

న్యూఢిల్లీ: ప్రస్తుత ఆర్థిక సంవత్సరపు ఐదో ద్వైమాసిక ద్రవ్యపరపతి విధాన సమీక్షలో ఆర్‌బిఐ వడ్డీరేట్లను యథాతథంగా కొనసాగించేందుకే అవకాశాలెక్కువని విశ్లేషకులంటున్నారు. సెప్టెంబర్‌తో ముగిసిన త్రైమాసికంలో దేశ వృద్ధిరేటు పుంజుకున్న నేపథ్యంలో ఆర్‌బిఐ ద్రవ్యోల్బణాన్ని కట్టడి చేసేందుకే ప్రాధాన్యమివ్వవచ్చు. అయితే, మూడీస్ రేటింగ్ పెంపుతోపాటు జిడిపి పునరుద్ధరణతో నెలకొన్న సానుకూలతను మరింత పెంచాలంటే కీలక వడ్డీరేట్లను తగ్గించాల్సిన అవసరం ఉందని పారిశ్రామిక వర్గాలు డిమాండ్ చేస్తున్నాయి. ఈనెల 5, 6 తేదీల్లో ఆర్‌బిఐ గవర్నర్ ఉర్జిత్ పటేల్ అధ్యక్షతన మానిటరీ పాలసీ కమిటీ (ఎంపిసి) సమావేశం కానుంది. వడ్డీరేట్లతోపాటు ద్రవ్యవిధానంపై జరగబోయే ఈ సమీక్ష సమావేశ నిర్ణయాలను ఆరో తేదీ మధ్యాహ్నం ప్రకటిస్తారు. మున్ముందు నెలల్లో ద్రవ్యోల్బణం మరింత పెరగవచ్చన్న భయాలతో అక్టోబరులో జరిగిన ద్వైమాసిక ద్రవ్యపరపతి సమీక్షలో సెంట్రల్ బ్యాంక్ వడ్డీరేట్లను యథాతథంగా కొనసాగించింది. అంతేకాదు, ప్రస్తుత ఆర్థిక సంవత్సరానికి వృద్ధి అంచనాను 6.7 శాతానికి కుదించింది. ఆగస్టులో జరిగిన పరపతి సమీక్షలో మాత్రం ఆర్‌బిఐ వడ్డీరేట్లను 0.25 శాతం తగ్గించింది. దాంతో బ్యాంకులకు ప్రామాణికమైన రీపర్చేజింగ్ (రెపో) రేటు ఆరేళ్ల కనిష్ఠ స్థాయి 6 శాతానికి తగ్గింది.



### ద్రవ్యోల్బణమే అసలు నిరోధం

ఆర్‌బిఐ వరుసగా రెండోసారి వడ్డీరేట్లను యథాతథంగానే కొనసాగించవచ్చని బ్యాంకర్లు, ఆర్థిక విశ్లేషకులు భావిస్తున్నారు. ఎందుకంటే, మున్ముందు నెలల్లో ధరాఘాతం తీవ్రత మరింత పెరిగేందుకే అవకాశాలున్నాయని వారంటున్నారు. ఈ నేపథ్యంలో ఆర్‌బిఐకి వడ్డీరేట్లను తగ్గించేందుకు వెసులుబాటు లభించకపోవచ్చని వారంటున్నారు. "ఈసారీ వడ్డీరేట్లు యథాతథమే.ప్రస్తుతం ఆర్థిక వ్యవస్థలో ద్రవ్య లభ్యత చాలా తక్కువగా ఉంది. డిపాజిట్ రేట్లు మళ్లీ ఎగువముఖం పట్టాయి. పైగా ద్రవ్యోల్బణం కూడా మరింత పెరగవచ్చన్న ఆందోళనలు వ్యక్తమవుతున్నాయి" అని యూనియన్ బ్యాంక్ ఎండి, సిఇఒ జి రాజ్‌కిరణ్ రాయ్ పేర్కొన్నారు.

జిఎస్‌టి రేట్ల సవరణతో వస్తు ఉత్పత్తుల ధరలు కాస్త తగ్గుముఖం పట్టినప్పటికీ కంపెనీలకు అవసరమయ్యే ముడి సరుకు వ్యయం పెరిగింది. ఇందుకుతోడు గరిష్ఠ స్థాయి ఆహార ధరల కారణంగా నవంబర్ నెలకు రిటైల్ ద్రవ్యోల్బణం ఆర్‌బిఐ నియంత్రణ లక్ష్యమైన 4 శాతం ఎగువకు చేరుకోవచ్చని జపాన్ బ్రోకరేజీ సంస్థ నోమురా అభిప్రాయపడింది. "ఈసారి సమీక్షలోనూ ఆర్‌బీఐ వడ్డీరేట్ల విషయంలో కఠినంగానే వ్యవహరించవచ్చు. ఈ ఆర్థిక సంవత్సరం చివరివరకు రేట్లను యథాతథంగానే కొనసాగించవచ్చు" అని తాజా నివేదికలో పేర్కొంది. అక్టోబర్‌లో టోకు ధరల ద్రవ్యోల్బణం ఆరు నెలల గరిష్ఠ స్థాయి 3.59 శాతానికి ఎగబాకగా.. రిటైల్ ధరల ఆధారిత ద్రవ్యోల్బణం ఏడు నెలల గరిష్ఠమైన 3.58 శాతానికి చేరుకుంది.

### ఇదే సరైన సమయం

వాణిజ్య మండళ్లు మాత్రం వడ్డీరేట్లను మరింత తగ్గించేందుకు ఇదే మంచి తరుణమని అంటున్నాయి. వ్యాపార నిర్వహణకు అనుకూల దేశాల జాబితాలో భారత్ టాప్-100లోకి చేరుకోవడంతో పాటు మూడీస్ రేటింగ్ పెంచడం, ప్రభుత్వ రంగ బ్యాంకులకు రూ.2.11 లక్షల కోట్ల మూలధన నిధుల కేటాయింపు ప్రకటనతో పెట్టుబడిదారుల్లో మన ఆర్థిక వ్యవస్థపై విశ్వాసం పెరిగిందన్నాయి. "ఇన్వెస్టర్లలో భారత ఆర్థిక వ్యవస్థపై విశ్వాసాన్ని మరింత పెంచేందుకు ఇదే మంచి అవకాశం. వడ్డీరేట్లను తగ్గించడం ద్వారా సెంటిమెంట్‌ను మెరుగుపర్చేందుకు ఇదే సరైన సమయం" అని ఫిక్కీ ప్రెసిడెంట్ పంకజ్ పటేల్ అభిప్రాయపడ్డారు.

### ధరలు పైపైకే!

మున్ముందు నెలల్లో రిటైల్ ధరల ఆధారిత ద్రవ్యోల్బణం మరింత ఎగబాకవచ్చని విశ్లేషకులు హెచ్చరిస్తున్నారు. ఆర్థిక వ్యవస్థ మళ్లీ పునరుద్ధరణబాటలో పయనిస్తుడటం, ఏడో వేతన సంఘం సిఫారసుల్లో మరిన్ని అమలులోకిరావడం ధరల పెరుగుదలకు కారణం కానున్నాయని వారంటున్నారు. పెద్ద నోట్ల రద్దుతో వస్తు వినిమయ డిమాండ్ బలహీనపడటంతో ఈ ఏడాది తొలి అర్ధభాగం వరకు అదుపులోనే ఉన్న ద్రవ్యోల్బణం క్రమంగా ఎగబాకుతూ వచ్చింది. నవంబర్‌లో నాలుగు శాతం ఎగువకు చేరుకోవచ్చని అంచనా. ఈ ఏడాది మొదటి అర్ధభాగంలో ఆహార ధరలు తగ్గుముఖం పట్టిన ఫలితంగా వచ్చే ఏడాది బేస్ ఎఫెక్ట్ ప్రభావంతో ద్రవ్యోల్బణం క్రమంగా ఎగబాకుతూ జూన్‌కల్లా 5.3 శాతానికి చేరుకోవచ్చని అంతర్జాతీయ ఆర్థిక సేవల దిగ్గజం మోర్గాన్ స్టాన్లీ అంచనా వేస్తున్నది. అయితే, 2018 చివరికల్లా మళ్లీ 4.4 శాతానికి జారుకోవచ్చని నివేదికలో పేర్కొంది. ఈ ఏడాదిలో బ్రెంట్ రకం ముడిచమురు సరాసరి ధర 60 డాలర్ల స్థాయిలో ఉంటే ద్రవ్యోల్బణం పెరిగినప్పటికీ వడ్డీరేట్లపై ప్రభావం చూపకపోవచ్చని, కానీ 70-75 డాలర్లకు చేరితే మాత్రం ఆర్‌బిఐ వడ్డీరేట్లను మళ్లీ పెంచాల్సిన పరిస్థితి ఏర్పడవచ్చని యుబిఎస్ అభిప్రాయపడింది. నవంబర్‌లో రిటైల్ ద్రవ్యోల్బణం 4.2-4.4 శాతంగా, టోకు ద్రవ్యోల్బణం 3.6-3.7 శాతంగా ఉండవచ్చని డన్ అండ్ బ్రాడ్‌స్ట్రీట్ (డి అండ్ బి) అంచనా వేస్తున్నది.

# బేరిష్ మొగ్గుతో ఆటుపోట్లు

**డిసెంబరు 4-8 తేదీల మధ్య వారానికి**



డా. భువనగిరి అమర్‌నాథ్ శాస్త్రి

**గత వారం నిఫ్టీ :** 10122 (-268)

నిఫ్టీ గత వారం 10109 నుంచి 10410 మధ్యన కదలాడి 268 పాయింట్ల నష్టంతో వారం కనిష్ఠ స్థాయికి చేరువలో 10122 పాయింట్ల వద్ద ముగిసింది. ప్రధానంగా గురు, శుక్రవారాల్లో 100 పాయింట్లకు పైగా నష్టాలతో నెగెటివ్ ధోరణిలో క్లోజయింది.

- ఇప్పుడు స్వల్పకాలిక, దీర్ఘకాలిక దృక్పథాలు రెండింటిలోనూ తటస్థ స్థితి ఏర్పడింది. 10400 కన్నా పైన ముగిసినప్పుడే బుల్లిష్ అవుతుంది.
- 20, 50, 100, 200 రోజుల చలన సగటు స్థాయిలు 10297, 10183, 10064, 9678 వద్ద ఉన్నాయి. ఇవి నిరోధ, మద్దతు స్థాయిలుగా నిలుస్తాయి.
- ప్రస్తుతం నిఫ్టీ అన్ని డిఎంఏల కన్నా పైన ట్రేడవుతోంది. నిఫ్టీ 200 డిఎంఏ కన్నా పైన ఉండడం 50 డిఎంఏ 200 డిఎంఏ కన్నా పైకి రావడం (గోల్డెన్ క్రాస్) దీర్ఘకాలిక ట్రెండ్ బుల్లిష్‌గా ఉందనేందుకు సంకేతం.

**వారానికి బ్రేకౌట్ స్థాయి :** 10400

**బ్రేక్‌డౌన్ స్థాయి :** 10200
**నిరోధ స్థాయిలు :** 10260, 10330 (10190 పైన బుల్లిష్)
**మద్దతు స్థాయిలు :** 10075, 10000 (10050 దిగువన బేరిష్)

### ఇన్వెస్టర్లకు సూచన

వారం ప్రారంభ స్థాయి అత్యంత కీలకం. ఇండెక్స్ గత వారం ప్రారంభ స్థాయి కన్నా పైన ట్రేడవుతూ ఉంటే లాంగ్ పొజిషన్లను పరిశీలించవచ్చు.

**ఆస్ట్రో గైడ్**

### ద్వితీయార్ధం నిస్తేజం (సోమవారానికి)

**తిథి:** మార్గశిర శుద్ధ త్రయోదశి **నక్షత్రం:** మృగశిర

ఆశ్లేష, జ్యేష్ఠ, రేవతి నక్షత్ర జాతకులు, మిథున, తుల రాశుల వారు అప్రమత్తంగా ఉండాలి.

**ట్రెండ్ మార్పు వేళలు : 11.33**

**ధోరణి :** గ్రహగతులను బట్టి నిలకడగా ప్రారంభమై 12.50 వరకు అదే ధోరణిలో ట్రేడవుతూ ఆ తర్వాత 2.30 వరకు నిస్తేజంగా మారి తదుపరి నిలకడ ధోరణిని ప్రదర్శించే ఆస్కారం ఉంది.

### ట్రేడింగ్ వ్యూహం..

నిఫ్టీ ఫ్యూచర్స్ ఒంటి గంట సమయానికి ప్రారంభ స్థాయి/సగటు (ఎటిపి) కన్నా దిగువన ట్రేడవుతుంటే తగు స్టాప్‌లాస్‌తో షార్ట్ పొజిషన్లు తీసుకుని 2.30 సమయానికి క్లోజ్ చేసుకోవాలి లేదంటే ముగింపు సమయానికి క్లోజ్ చేసుకోవాలి.

ఇంట్రాడే ట్రేడింగ్‌కు ప్రారంభ స్థాయి కీలకం. అంతకన్నా దిగువన మాత్రమే షార్ట్ పొజిషన్లు శ్రేయస్కరం.

**నిరోధ స్థాయిలు :** 10160, 10195
**మద్దతు స్థాయిలు :** 10080, 10045

**గమనిక :** ఇది పూర్తిగా ఆస్ట్రోటెక్నికల్ అంశాల ఆధారంగా ఇచ్చిన సూచన. మార్కెట్ వాస్తవిక కదలికల ఆధారంగా నిర్ణయాలు తీసుకోవాలి.

### గ్రహగతులివే..

- వృషభంలోని మృగశిర పాదం 1 నుంచి ఆశ్లేష పాదం 4 మధ్యలో చంద్ర సంచారం
- వృశ్చికంలోని జ్యేష్ఠ పాదం 1-2 మధ్యలో రవి సంచారం
- ధనుస్సులోని మూల పాదం 1-2 మధ్యలో తిరోగమన స్థితిలో బుధ సంచారం
- వృశ్చికంలోని అనూరాధ పాదం 2-4 మధ్యలో శుక్ర సంచారం
- కన్యలోని చిత్త పాదం 3 నుంచి తులలోని చిత్త పాదం 4 మధ్యలో కుజ సంచారం
- ధనుస్సులోని మూల పాదం 2లో వృషభ నవాంశలో శని సంచారం
- తులలోని స్వాతి పాదం 4లో మీన నవాంశలో బృహస్పతి సంచారం
- మకరంలో రాహువు, కర్కాటకంలో కేతువు సింహ, కుంభ నవాంశల్లో సంచారం

నవంబరు 27-30 తేదీల మధ్య కాలంలో చంద్రుడు శతభిషం, రేవతి మధ్యన సంచరించిన సమయంలో ఏర్పడిన పరిధి 10410-10211. గత వారంలో దిగువ పరిధి కన్నా దిగజారి 10109 పాయింట్ల కనిష్ఠ స్థాయిని నమోదు చేసినందువల్ల 10010 వరకు (మొదటి టార్గెట్) దిగజారే ఆస్కారం ఉంది. క్షీణత మరీ ఎక్కువగా ఉంటే 9810 వరకు కూడా దిగజారవచ్చు.

# ఇ-కామర్స్‌లో అగ్రస్థానంపై పేటీఎం కన్ను

- 250 కోట్ల డాలర్ల పెట్టుబడులు

న్యూఢిల్లీ : వచ్చే 3-5 ఏళ్ల కాలంలో దేశీయ ఇ-కామర్స్ రంగంలో అగ్రస్థానాన్ని చేరుకోవాలన్న లక్ష్యంతో ఉన్నట్టు పేటీఎం వ్యవస్థాపకుడు విజయ్ శేఖర్ శర్మ తెలిపారు. పోటీ సంస్థలైన ఫ్లిప్‌కార్ట్, అమెజాన్‌లను అధిగమించేందుకుగాను రానున్న 250 కోట్ల డాలర్ల పెట్టుబడులు పెట్టనున్నట్టు ఆయన చెప్పారు. దేశీయ ఇ-కామర్స్ మార్కెట్లో వాటాను పెంచుకునేందుకు ఫ్లిప్‌కార్ట్, అమెజాన్‌లు పెద్ద ఎత్తున పెట్టుబడులు పెడుతున్న విషయం తెలిసిందే. ఈ నేపథ్యంలోవీటికి పోటీగా పేటీఎం రంగంలోకి దిగుతోంది. ఇ-కామర్స్ రంగంలో అగ్రస్థాయికి చేరుకునేందుకు 'పేటీఎం మాల్' దోహదపడుతుందని శర్మ చెప్పారు. 200-250 కోట్ల డాలర్ల పెట్టుబడులు పేటీఎం వృద్ధికి సరిపోతాయని, ఇంతకు మించి అవసరం ఉండదని ఆయన తెలిపారు. వచ్చే ఏడాది జనవరి నుంచి మార్చి వరకు నిధుల సమీకరణ ప్రక్రియను ప్రారంభిస్తామని చెప్పారు. తాము పెట్టుబడులు సమీకరించే ప్రక్రియను ప్రారంభించనేలేదని, అయితే ఇప్పటికే తమ సంస్థలో పెట్టుబడులను పెట్టేందుకు చాలా మంది ఇన్వెస్టర్లు ఆసక్తి వ్యక్తం చేస్తున్నారన్నారు.

**రిటైల్ (ఒక గుడ్డు) ధర రూ. 4.70 — నెక్ (100 గుడ్లు)**

| | | | |
|---|---|---|---|
| హైదరాబాద్ | 410.00 | చిత్తూరు | 428.00 |
| వరంగల్ | 410.00 | చెన్నై | 435.00 |
| విజయవాడ | 385.00 | నమక్కల్ | 425.00 |
| గోదావరి | 385.00 | బెంగళూరు | 435.00 |
| విశాఖపట్నం | 385.00 | ముంబై | 455.00 |

**ఫామ్‌గేట్ ధర (కిలో) రూ. — వెన్‌కాబ్ బ్రాయిలర్ చికెన్**

| | | | |
|---|---|---|---|
| హైదరాబాద్ | 76.00 | విజయవాడ | 76.00 |
| కరీంనగర్ | 78.00 | గుంటూరు | 77.00 |
| వరంగల్ | 76.00 | ఒంగోలు | 78.00 |
| మహబూబ్‌నగర్ | 76.00 | చిత్తూరు | 70.00 |
| కర్నూలు | 76.00 | నెల్లూరు | 80.00 |
| విశాఖపట్నం | 74.00 | అనంతపురం | 77.00 |
| గోదావరి | 75.00 | | |

# స్వల్పకాలిక కరెక్షన్



వి. సుందర్ రాజా



**టెక్ వ్యూ**

నిఫ్టీ గత వారం నిరోధ స్థాయి 10400 వరకు వెళ్లి అధోముఖ ధోరణిలో పడింది. గురువారం మద్దతు స్థాయి 10350 కన్నా దిగజారి కరెక్షన్ ధోరణిలో ప్రవేశించి చివరికి వారం కనిష్ఠ స్థాయిలో క్లోజయింది. టెక్నికల్‌గా మార్కెట్ స్వల్పకాలిక కరెక్షన్‌లో ప్రవేశించింది. వీక్లీ చార్టుల్లో కూడా దిగువకు రివర్సల్ బార్ పాటర్న్ ఏర్పడడం బలహీనత సంకేతం. నెలవారీ చార్టుల్లో కనిపించిన ఓవర్‌బాస్ స్థితిని కూడా సద్దుబాటు చేసుకుంటున్నట్టు కనిపిస్తోంది. 10500 వద్ద ఇప్పుడు బలమైన నిరోధం, డబుల్ టాప్ అవరోధం ఏర్పడింది. ఇది ఇప్పుడు బలమైన స్వల్పకాలిక అవరోధంగా మారినందు వల్ల బుల్లిష్ ధోరణిలోకి ప్రవేశించేందుకు మరికొంత సమయం పట్టవచ్చు. గత కొద్ది ట్రేడింగ్ సెషన్లుగా 400 పాయింట్ల వరకు నష్టపోయిన నిఫ్టీ ప్రస్తుతం మద్దతు స్థాయి 10080కి సమీపంలోకి వచ్చింది. వీక్లీ చార్టుల్లో ప్రధాన బాటమ్ ఇదే.

**సోమవారం స్థాయిలివే...**
**నిరోధం: 10160, 10210**
**మద్దతు: 10080, 10000**

### బుల్లిష్ స్థాయిలు

ట్రెండ్‌లో సానుకూలత కోసం ఇండెక్స్ దిగువ మద్దతు స్థాయిల్లో కన్సాలిడేట్ కావాలి. రికవరీ బాట పట్టినట్టయితే నిరోధ స్థాయి 10200 వద్ద కన్సాలిడేట్ కావాలి. ఆ పైన పటిష్ఠంగా క్లోజయినప్పుడే మరింత అప్‌ట్రెండ్ ఉంటుంది. ప్రధాన నిరోధం 10300. ఇదే స్వల్పకాలిక ట్రెండ్ నిర్ణయ స్థాయికావడం వల్ల కనీసం రెండు రోజుల పాటు ఆ స్థాయి కన్నా పైన నిలదొక్కుకున్నప్పుడే స్వల్పకాలిక అప్‌ట్రెండ్ ఏర్పడుతుంది.

### బేరిష్ స్థాయిలు

ప్రధాన మద్దతు స్థాయి 10080. నవంబరు 15వ తేదీన వీక్లీ చార్టుల్లో ఏర్పడిన బాటమ్ ఇదే. అంతకన్నా దిగువన క్లోజయితే మరింత కరెక్షన్‌లో పడుతుంది. ప్రధాన మద్దతు స్థాయి 9950. ఇదే మధ్యకాలిక మద్దతు స్థాయి. తదుపరి దిశకు ముందు ఇక్కడ కన్సాలిడేషన్ ఉండవచ్చు. ఇక్కడ కూడా విఫలమైతే స్వల్పకాలిక బలహీనతలో పడుతుంది.

**బ్యాంక్ నిఫ్టీ :** ఈ ఇండెక్స్ కొద్ది సెషన్లుగా 800 పాయింట్ల మేరకు నష్టపోయి ప్రస్తుతం ప్రధాన మద్దతు స్థాయి 25000 కన్నా స్వల్పంగా పైన నిలిచింది. నిరోధ స్థాయి 25300. ఆ పైన బలంగా క్లోజయినప్పుడే స్వల్పకాలిక అప్‌ట్రెండ్‌లో ప్రవేశిస్తుంది. 25000 కన్నా దిగజారితే స్వల్పకాలిక కరెక్షన్ మరింతగా కొనసాగుతుంది.

**స్వల్పకాలిక వ్యూహం :** స్పష్టమైన మద్దతు కనిపించే వరకు లేదా ప్రధాన మద్దతు స్థాయి 10000 కన్నా పైన కన్సాలిడేట్ అయ్యే వరకు స్వల్పకాలిక ట్రేడర్లు స్వల్పకాలిక బై పొజిషన్లకు దూరంగా ఉండడం మంచిది.

**పాటర్న్ :** నిఫ్టీ ప్రస్తుతం "ఏటవాలుగా ఎగువకు కనిపిస్తున్న సపోర్ట్ ట్రెండ్‌లైన్" కన్నా స్వల్పంగా పైన ఉంది. ఇక్కడ విఫలమైతే డౌన్‌ట్రెండ్ మరింతగా ఉంటుంది. 9950 వద్ద "అడ్డంగా కనిపిస్తున్న మేజర్ సపోర్ట్ ట్రెండ్ లైన్" వద్ద రికవరీకి ఆస్కారం ఉంది. గత వారంలో మార్కెట్ 20, 50 డిఎంఏల కన్నా దిగజారింది. 10000 వద్ద 100 డిఎంఏ ఉంది. ఇండెక్స్ ప్రస్తుతం "ఏటవాలుగా కనిపిస్తున్న రెసిస్టెన్స్ ట్రెండ్‌లైన్" కన్నా చాలా దిగువకు రావడం అప్‌ట్రెండ్ కోసం మరింత సమయం పడుతుందనేందుకు సంకేతం.

**టైమ్ :** ఈ సూచిక ప్రకారం తదుపరి మైనర్ రివర్సల్ మంగళవారం ఉండవచ్చు.

■ వి.సుందర్ రాజా,
www.sundartrends.in

# ఆర్‌బిఐ పాలసీతోనే దిశ

**"ఈ వారం అంతా మార్కెట్‌ని ప్రభావితం చేసే సంఘటనలే చోటు చేసుకోనున్నాయి. వాటిలో అత్యంత ప్రధానమైనది ఆర్‌బిఐ ప్రకటించనున్న ద్రవ్యపరపతి విధానం."**

ఈ వారం చోటుచేసుకోనున్న రాజకీయ పరిణామాల్లో కీలకం గుజరాత్ అసెంబ్లీ ఎన్నికలు. ఇవే రానున్న కాలంలో మార్కెట్ దిశకు కీలకం కానున్నాయి. ఇక స్వల్పకాలికంగా ఆర్‌బిఐ ద్రవ్యవిధాన సమీక్ష మార్కెట్‌కు దిశను నిర్దేశిస్తుంది. వచ్చే మంగళ, బుధవారాల్లో ఆర్‌బిఐ సారథ్యంలోని ద్రవ్యవిధాన కమిటీ సమావేశం కానుంది. ఆర్‌బిఐ నిర్ణయం ఆధారంగా వడ్డీ రేటు ప్రభావానికిలోనయ్యే బ్యాంకింగ్, ఆటో, రియల్టీ విభాగాల షేర్ల కదలికలు ఆధారపడి ఉంటాయి. బుధవారంనాడు వడ్డీరేట్లపై ఎంపిసి వైఖరిని ఆర్‌బిఐ ప్రకటిస్తుంది. అక్టోబరు నాలుగో తేదీన జరిగిన సమావేశంలో వర్తమాన స్థూల ఆర్థికాంశాలను దృష్టిలో పెట్టుకుని వడ్డీ రేట్ల విషయంలో ఆర్‌బిఐ తటస్థ వైఖరిని ప్రదర్శించింది.

### టెక్నికల్స్ ఇవే..

నిఫ్టీ బాగా దిగజారి 10100 పాయింట్ల వరకు పడిపోయి కనిష్ఠ స్థాయిల్లో క్లోజయింది. డెయిలీ చార్టు విశ్లేషణ ప్రకారం నిఫ్టీకి హెడ్ అండ్ షోల్డర్ పాటర్న్ ఏర్పాటైంది. బేరిష్ మొగ్గుకి కీలకమైన నెక్‌లైన్‌ను బ్రేక్ చేసింది. దీన్ని బట్టి మరో 300-350 పాయింట్ల వరకు కూడా ఈ క్షీణత కొనసాగవచ్చు. గతంలోని "హయ్యర్ టాప్, హయ్యర్ బాటమ్" స్ట్రక్చర్ 10095 వద్ద ఉండడాన్ని బట్టి సెప్టెంబరు కనిష్ఠ స్థాయి 9687 నుంచి తదుపరి కనిష్ఠ స్థాయి 10085కి వచ్చింది. దిగువన చాలా మద్దతు స్థాయిలున్నాయి.

- ప్రస్తుత సీరీస్‌కి గరిష్ఠ ఓపెన్ ఇంటరెస్ట్ 10500సిఇ, 10000 పిఇ వద్ద ఉన్నాయి. బ్యాంక్ నిఫ్టీకి 26000 సిఇ, 25000 పిఇ వద్ద ఉన్నాయి.

### గణాంకాలు...

- మార్కెట్ ఎకనామిక్స్ నవంబరు నెలకు సేవల రంగం పిఎంఐని మంగళవారం ప్రకటించనుంది.
- అమెరికాలో నవంబరు నెలకు తయారీయేతర రంగాల పిఎంఐని కూడా మంగళవారం నాడే ప్రకటించనున్నారు. అలాగే నవంబరు నెల వ్యవసాయేతర రంగాల ఉపాధి గణాంకాలను బుధవారం ప్రకటించనున్నారు. వ్యవసాయేతర విభాగాల్లో వేతనాల గణాంకాలు శుక్రవారం ప్రకటిస్తారు.
- జపాన్‌లో క్యు3 జిడిపి గణాంకాలు గురువారం వెలువడనున్నాయి.



విజయ్ సింఘానియా
డైరెక్టర్, ట్రేడ్‌స్మార్ట్ ఆన్‌లైన్

**మార్కెట్ నాడి**

ఆంధ్రజ్యోతి

# బిజినెస్ ప్లస్







**కట్న కానుకలు ఎలా ఉన్నా ఈ రోజుల్లో పెళ్లిళ్ల ఖర్చులు చుక్కలంటుతున్నాయి. దురదృష్టవశాత్తు ఏవైనా అవాంతరాలు ఏర్పడి పెళ్లి ఆగిపోయినా లేదా పెళ్లిళ్ల సమయం లో ఏవైనా ప్రమాదాలు జరిగినా ఆ నష్టాలు తట్టుకోవడం కష్టం. అయితే బీమా కంపెనీలు వెడ్డింగ్ ఇన్సూరెన్స్ పాలసీ తీసుకుంటే ఇలాంటి నష్టాలకూ మాది పూచీ అంటున్నాయి. ఈ వెడ్డింగ్ పాలసీల విశేషాలు ఏమిటో బ్యాంక్‌బజార్ సిఇఒ అదిల్ షెట్టి ఆంధ్రజ్యోతి 'బిజినెస్ ప్లస్' పాఠకులకు వివరిస్తున్నారు..**



# పెళ్లికి బీమా
# పెద్దలకు భరోసా

పెళ్లంటే నూరేళ్ల పంట. అందుకే ఆర్థిక స్థోమత ఉన్నా లేకపోయినా చాలా కుటుంబాలు, తమ పిల్లల పెళ్లిళ్లు ధూంధాంగా చేస్తుంటాయి. పొదుపు చేసిన డబ్బుల్లో ఎక్కువ భాగం చిరకాలం గుర్తుండిపోయేలా ఇందుకోసమే ఖర్చు చేసే కుటుంబాలు ఎక్కువే. పెళ్లి వేడుకలు కొద్ది రోజులే జరిగినా అందుకు చాలా రోజుల నుంచే ప్రిపేర్ కావాలి. ఇందులో ఏ చిన్న పొరపాటు జరిగినా, ప్రమాదం జరిగినా చేసిన ఖర్చులన్నీ బూడిదలో పోసిన పన్నీరే. ఇక ఏ కారణం చేతనైనా పెళ్లి రద్దయినా, వాయిదా పడినా కొన్ని కుటుంబాలకు ఆ నష్టం భరించడం తలకు మించిన భారమవుతుంది. వెడ్డింగ్ ఇన్సూరెన్స్ పాలసీ తీసుకోవడం ద్వారా ఈ నష్టం నుంచి చాలా వరకు బయట పడొచ్చు. అదెలాగంటే...

### వెడ్డింగ్ ఇన్సూరెన్స్

పెళ్లిళ్ల సమయంలో తలెత్తే రిస్కులను దృష్టిలో ఉంచుకుని బీమా కంపెనీలు ప్రత్యేక పాలసీలు తీసుకొచ్చాయి. ఏ కారణం చేతనైనా పెళ్లి రద్దయినా, వాయిదా పడినా లేదా ప్రమాదాలతో ఆర్థిక నష్టం సంభవించినా ఈ పాలసీ ద్వారా ఆ నష్టం భర్తీ చేసుకోవచ్చు.

### కవరయ్యే నష్టాలు

ఏయే నష్టాలకు వెడ్డింగ్ బీమా కవరేజీ లభిస్తుందనేది ఆయా బీమా కంపెనీల పాలసీలను బట్టి ఉంటుంది. అయితే పాలసీలు ఎన్ని ఉన్నా కవరయ్యే చాలా విషయాలు దాదాపు ఒకే విధంగా ఉంటాయి. పెళ్లి మండపం బుకింగ్, అలంకరణ, కేటరింగ్ సేవలు, ఆహారం, హోటల్, గెస్ట్ హౌజ్ బుకింగ్ చార్జీలు, వీడియోగ్రఫీ, మ్యూజిక్ లేదా డిజె ఫీజు, ఫ్లోరిస్టుల చార్జీలు, రవాణా ఖర్చులు, ట్రైన్, విమాన టిక్కెట్ల బుకింగ్ ఖర్చులుకు వెడ్డింగ్ ఇన్సూరెన్స్ పాలసీ కింద కవరేజీ లభిస్తుంది. కొన్ని బీమా కంపెనీలు పెళ్లిళ్ల సమయంలో జరిగే దొంగతనం, దోపిడి, అగ్ని ప్రమాదాలు, పెళ్లిళ్ల వాయిదా లేదా రద్దు, మనుషులకు తగిలే గాయాలు, ఆస్తులు లేదా డెకరేషన్‌కు జరిగే నష్టాలకూ బీమా పూచి ఇస్తున్నాయి. వర్షాలు, వరదల వంటి ప్రత్యేక పరిస్థితుల్లో ఏర్పడే నష్టాలకూ వెడ్డింగ్ పాలసీ కింద బీమా రక్షణ తీసుకోవచ్చు.

### కవరేజీ లేనివి ఏమిటంటే..

ఒక్కోసారి వధూవరుల కుటుంబాల మధ్య వివాదాలు, విభేదాల వల్ల పెళ్లిళ్లు ఆలస్యం కావచ్చు. లేదా రద్దు కావచ్చు. ఇలాంటి కారణాలతో ఏర్పడే నష్టాలు వెడ్డింగ్ బీమా నుంచి రక్షణ లభించదు. వర్షాకాలంలో కురిసే వర్షాలతో నష్టం ఏర్పడినా ఇదే పరిస్థితి. అలాగే ఉగ్రవాదుల దాడులు, ఆందోళనలు, రవాణా వ్యవస్థ నిలిచి పోవడం, ఎయిర్‌పోర్టులో ఆలస్యంగా రిపోర్టు చేయడం, తమంతట తాము చేసుకునే గాయాలకు, భూకంపాలు, వరదలు, బీమా వర్తించే వ్యక్తులు చేసే నేరాల వల్ల ఏర్పడే నష్టాలకూ వెడ్డింగ్ ఇన్సూరెన్స్ కింద ఎలాంటి నష్టపరిహారం లభించదు. ఉద్దేశపూర్వక చర్యలు, సాధారణంగా ఆస్తులకు ఏర్పడే అరుగుదల, తరుగుదలకూ ఈ బీమా కింద కవరేజీ పొందడం వీలవదు. అయితే కొన్ని బీమా కంపెనీలు వెడ్డింగ్ ఇన్సూరెన్స్ కింద భూకంపాలు, వరదలు, ఉగ్రవాద చర్యలతో ఏర్పడే నష్టాలకూ కవరేజీ ఇస్తున్నాయి. పాలసీ తీసుకునే ముందే ఈ విషయం ధ్రువీకరించుకోవడం మంచిది.

### పాలసీ తీసుకోవాలా? వద్దా?

ఈ రోజుల్లో పెళ్లంటే అత్యంత ఖర్చుతో కూడుకున్న వ్యవహారం. దాంతోపాటు అనేక రిస్కులు, అనిశ్చితులుంటాయి. ఈ విషయాలను దృష్టిలో ఉంచుకుంటే వెడ్డింగ్ పాలసీ తీసుకోవడమే మంచిది. ఇలా తీసుకోవడం వల్ల ఏ కారణం చేతనైనా పెళ్ళిళ్ల సమయంలో ఏదైనా ఆర్థిక నష్టం జరిగితే బీమా పాలసీ ఆదుకుంటుంది. ఇంతకు ముందు పెద్ద పెద్ద సంపన్నులు ఈ పాలసీలు తీసుకునేవారు. ఇపుడు అన్ని అన్ని వర్గాల ప్రజలు వెడ్డింగ్ పాలసీల వైపు మొగ్గు చూపుతున్నారు.

## గుర్తుంచుకోవాల్సిన విషయాలు

- వెడ్డింగ్ బీమా పాలసీ ప్రీమియం.. పెళ్లి జరిగే ప్రదేశం, బీమా మొత్తం, ఎంత కాలానికి కవరేజీ కావాలి? పెళ్లి ఖర్చు వంటి అంశాలపై ఆధారపడి ఉంటుంది.
- పాలసీ తీసుకునే ముందే కవరయ్యే నష్టాలు, కవర్ కాని నష్టాలను పాలసీ డాక్యుమెంట్ పూర్తిగా చదివి తెలుసుకోవాలి.
- పెళ్లి ఖర్చులు, బిల్లుల ఖర్చులు పక్కాగా డాక్యుమెంట్ చేయాలి.
- ఆస్తులు, నగలకు ఇంతకు ముందే బీమా పాలసీ తీసుకుని ఉంటే వెడ్డింగ్ పాలసీలో వాటిని చేర్చకూడదు. దీనివల్ల ప్రీమియం తగ్గించుకోవచ్చు.
- వెడ్డింగ్ ఇన్సూరెన్స్ పాలసీ కింద థర్డ్ పార్టీ కవరేజీ కూడా తీసుకోవచ్చు. ఇక్కడ థర్డ్ పార్టీ అంటే పాలసీ తీసుకున్న వారితో పాటు ఇతరులు ఎవరైనా కావచ్చు. అంటే పెళ్లిళ్ల సమయంలో ఫుడ్ పాయిజనింగ్‌తో ఎవరికైనా ఏదైనా ప్రాణాపాయం జరిగినా కవరేజీ లభిస్తుంది.

# ఆధార్ లింక్ చేయకపోతే... ఇక అంతే

**అధార్ లింక్ చేశారా లేదా ? లేదంటే బ్యాంకులో ఇబ్బందులు తప్పవు. బీమా చెల్లింపులు నిలిపివేస్తారు. ఐటి రిటర్నులు ఆమోదించరు. మొబైల్ కనెక్షన్ ఆగిపోతుంది. పెన్షన్లు, సబ్సిడీలు అందవు. మ్యూచువల్ ఫండ్ పెట్టుబడులు వెనక్కిరావు.. బాబోయ్ .. ఆధార్ లింక్ చేయడం మరిస్తే అంతే సంగతులు. ఆధార్‌తో లింక్ చేయాల్సినవేమిటో మరోసారి 'బి ప్లస్' పాఠకుల కోసం...**

### ఆదాయ పన్ను రిటర్న్‌ల కోసం



పాన్ నంబర్లను ఆధార్ నంబర్‌తో అనుసంధానం చేస్తేనే ఈ ఏడాది జూలై 1 తర్వాత సమర్పించిన ఐటి రిటర్న్‌లను ఆమోదిస్తామని ప్రభుత్వం ఇంతకు ముందు నోటిఫై చేసింది. రిటర్న్‌ల ఫైలింగ్ గడువు అగస్టు 5 వరకు పొడిగించినా చాలా మంది తమ పాన్ నంబర్‌ను ఆధార్ నంబరుతో లింక్ చేయలేకపోయారు. స్పెల్లింగ్, ఇతర తప్పులతో పాన్, ఆధార్ నంబర్లు మ్యాచ్ కాకపోవడం ఇందుకు ప్రధాన కారణం. దీంతో ఇలాంటి వ్యక్తులు ఈ డిసెంబరు 31లోగా పూర్తి చేయాలని ప్రభుత్వం స్పష్టం చేసింది. లింక్ చేయకపోతే ఐటి రిటర్న్‌లను పరిశీలించరు. వార్షిక ఆదాయం రూ.2.5 లక్షల లోపు ఉండి, రిటర్న్‌లు ఫైల్ చేయాల్సిన అవసరం లేని వారికీ మాత్రం ప్రస్తుతానికి ఈ నిబంధన వర్తించదు.

### బ్యాంకులు, బీమా సంస్థలకు ఆధార్ వివరాలు



బ్యాంకు ఖాతాలు, క్రెడిట్ కార్డులు, బీమా పాలసీలు, ఈక్విటీ, మ్యూచువల్ ఫండ్స్, చిన్న పొదుపు పథకాల్లో పెట్టుబడుల కోసం ఆధార్ నంబర్ తప్పనిసరి. ఇప్పటికే వీటిల్లో పెట్టుబడులు ఉన్న వ్యక్తులు కూడా డిసెంబరు 31 లోపు ఈ పెట్టుబడులు నిర్వహించే సంస్థలకు తమ ఆధార్ నంబరు ఇచ్చి లింకప్ చేసుకోవాలి. అలాగే బ్యాంకులు, హౌజింగ్ ఫైనాన్స్ కంపెనీలు, ఎన్‌బిఎఫ్‌సిల నుంచి తీసుకున్న రుణాలకూ ఆధార్ నంబర్ సమర్పించాలి. డిసెంబరు 31లోగా తమ ఆధార్ నంబర్ సమర్పించకపోతే, అది సమర్పించే వరకు వారి ఖాతా నిర్వహణ ఆగిపోతుంది.



### టెలికాం సేవల కోసం

ఇప్పటికే ఉన్న మొబైల్ ఖాతాదారుల వివరాలు సరిగా ఉన్నాయో లేదో వచ్చే ఏడాది ఫిబ్రవరి 6లోగా 'ఆధార్' ఆధారిత ఇ-కెవైసి ద్వారా మళ్లీ సరిచూసుకోవాలని సుప్రీం కోర్టు ఈ సంవత్సరం ఫిబ్రవరిలోనే టెలికాం కంపెనీలను ఆదేశించింది. అలాగే కొత్త సిమ్ కార్డులకూ ఆధార్ నంబర్‌ను తప్పనిసరి చేసింది. టెలికాం శాఖ (డాట్) కూడా ఈ ఏడాది మార్చిలో ఇందుకు సంబంధించి ఒక నోటిఫికేషన్ విడుదల చేసింది. 2018 ఫిబ్రవరి 6లోగా తమ ఆధార్ వివరాలు సమర్పించని వ్యక్తుల మొబైల్ కనెక్షన్లు గల్లంతయ్యే అవకాశం ఉన్నట్టు హెచ్చరించింది.



### సామాజిక భద్రతా పథకాలు

ప్రభుత్వాలు అందించే సామాజిక భద్రతా పథకాల ప్రయోజనాలు అందుకునే వ్యక్తులూ ఈ నెలాఖరులోగా తమ ఆధార్ నంబర్ వివరాలు సమర్పించాలి. నిజానికి ఈ సంవత్సరం సెప్టెంబరు 30తోనే ఈ గడువు ముగిసింది. కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాలు అందించే పించన్లు, ప్రజా పంపిణీ వ్యవస్థ ద్వారా చౌకగా పంపిణీ చేసే బియ్యం, గోధుమల వంటి తిండి గింజలకూ ఆధార్ తప్పనిసరి. సబ్సిడీ వంట గ్యాస్, కేంద్ర మానవ వనరుల మంత్రిత్వ శాఖ అందించే ఉపకార వేతనాలు అందుకోవాలన్నా మీ ఆధార్ కార్డు వివరాలను లింకప్ చేయాలి. లేకపోతే సమస్యలు తప్పవు.

### ఆధార్ లింక్ చేయడానికి గడువు తేదీలు

| | |
|---|---|
| పాన్ | 2017 డిసెంబరు 31 |
| బ్యాంక్ | 2017 డిసెంబరు 31 |
| మ్యూచువల్ ఫండ్స్/ స్టాక్స్ | 2017 డిసెంబరు 31 |
| బీమా పాలసీలు | 2017 డిసెంబరు 31 |
| పోస్టాఫీసు పథకాలు | 2017 డిసెంబరు 31 |
| మొబైల్ నెంబర్ | 2018 ఫిబ్రవరి 28 |
| సామాజిక సంక్షేమ పథకాలు - ఎల్‌పిపి, పెన్షన్ | 2018 మార్చి 31 |



# టాటా మెటాలిక్స్




ఫౌండ్రీ గ్రేడ్ పిగ్ ఐరన్, డక్టైల్ ఐరన్ పైపుల తయారీలో దేశంలో అగ్రగామి కంపెనీ టాటా మెటాలిక్స్. ఏటా 3 లక్షల టన్నుల పిగ్ ఐరన్, 2 లక్షల టన్నుల డక్ట్ ఐరన్ పైపుల ఉత్పత్తి సామర్థ్యాన్ని కలిగి ఉంది. 1990లో టాటా గ్రూప్ నెలకొల్పిన ఈ కంపెనీ 1994లో ఉత్పత్తిని ప్రారంభించింది. ఆటోమొబైల్, వ్యవసాయం, ఇంజనీరింగ్, విద్యుదుత్పత్తి రంగాలకు అవసరమైన సల్ఫర్, ఫాస్పరస్ తక్కువ మోతాదులో ఉండే పిగ్ ఐరన్‌ను తయారు చేయటంతో ప్రపంచ స్థాయి ప్రమాణాలను కలిగి ఉంది. ప్రపంచంలో తొలిసారిగా బ్రాండెడ్ పిగ్ ఐరన్‌ను ప్రవేశపెట్టింది. టాటా ఇఫీ అనే బ్రాండ్‌తో దీన్ని తీసుకువచ్చింది. పిగ్ ఐరన్ ఉత్పత్తిలో వినియోగించే కోక్, కోకింగ్ కోల్ ధరలు పెరిగిన నేపథ్యంలో స్థూల లాభ మార్జిన్లపై కాస్త ప్రభావం పడినప్పటికీ పిగ్ ఐరన్ ధరల పెంపుతో ఆ భారాన్ని తగ్గించుకోగలిగింది. ఈ ఏడాది తొలి త్రైమాసికంలో టన్నుకు రూ.700 ఉన్న పిగ్ ఐరన్ ధర రెండో త్రైమాసికం ముగిసే నాటికి రూ.2,700 లకు పెరిగింది. దీంతో పిగ్ ఐరన్ వాల్యూమ్స్ కూడా పెరిగాయి.

డిఐ పైపుల తయారీ కోసం జపాన్‌కు చెందిన కుబోటాతో 2009లో జాయింట్ వెంచర్ ఒప్పందాన్ని కుదుర్చుకుంది. ఈ జాయింట్ వెంచర్‌లో జపాన్ సంస్థకు ఉన్న చిన్న వాటాను కూడా కొనుగోలు చేసి వ్యాపారాన్ని మరింత వేగంగా విస్తరించింది. వచ్చే ఎనిమిది నెలల పాటు నిరంతరంగా సరఫరా చేయాల్సినంతగా ఆర్డర్ బుక్ ఉంది. దీనికి తోడు కేంద్రం చేపట్టిన స్మార్ట్ సిటీస్, అమృత్ పథకాలతో మౌలిక సదుపాయాల అభివృద్ధికి ప్రాధాన్యత లభించనుంది. సప్లయ్ ప్రాజెక్టులు, ఇతర ఇన్‌ఫ్రా ప్రాజెక్టుల నుంచి డిఐ పైపులకు డిమాండ్ పెరగనుంది. వచ్చే ఐదేళ్ల పాటు డిఐ పైపులకు డిమాండ్ ఏటా 12 శాతం చొప్పున పెరగనుందని అంచనా. వచ్చే ఆర్థిక సంవత్సరంలో పిగ్ ఐరన్ సామర్థ్య విస్తరణ కోసం రూ.500 కోట్లతో ప్రణాళికలను సిద్ధం చేసింది. దీనికి తోడు ముడి సరుకుల ధరల ఒడిదుడుకుల నేపథ్యంలో ఒకేసారి సంవత్సరానికి అవసరమైన మొత్తం ముడి సరుకుల్లో 40 శాతం ఒకేసారి సమీకరించుకునేందుకు గాను వాటాదారుల అనుమతిని కూడా పొందింది.



### టెక్నికల్స్

గత వారం కంపెనీ షేరు కొత్త గరిష్ఠ స్థాయిలో ముగిసింది. 2015, మే నెలలో వచ్చిన టెక్నికల్ బ్రేకౌట్‌తో భారీగా కేవలం రెండు నెలల కాలంలోనే రూ.138 నుంచి రూ.512కు పెరిగింది. ఆ తర్వాత వచ్చిన 28 వారాల కన్సాలిడేషన్ బ్రేకౌట్ జరిగి రూ.379 నుంచి రూ.725 పెరిగింది. గత 21 వారాలుగా రెండు కప్ ప్యాట్రన్లు ఏర్పడ్డాయి. ఈ రెండు స్టేజ్ 1 బిలో ఏర్పడ్డాయి. బ్రేకౌట్ రూ.819 స్థాయిని అధిగమించటం ద్వారా జరిగింది. స్వల్ప, దీర్ఘకాలిక మూవింగ్ యావరేజ్‌లకు ఎగువనే ట్రేడవుతూ ఉంది. విలియం ఓ నీల్ మెథడాలజీ ప్రకారం ప్రైస్ స్ట్రెంత్ గరిష్ఠంగా 85గా ఉంది. ఆర్‌ఎస్‌ఐలో సుదీర్ఘ ట్రయాంగిల్ బ్రేకౌట్ కూడా గత వారమే జరిగింది. మిగిలన మూమెంటమ్ ఇండికేటర్లన్నీ బుల్లిష్ ధోరణిని సూచిస్తున్నాయి. ఈ షేరును రూ.819 నుంచి రూ.860 మధ్య అక్యుములేట్ చేయవచ్చు. టెక్నికల్ స్టాప్‌లాస్ రూ.710. స్వల్పకాలిక లక్ష్యం రూ.982. దీర్ఘకాలిక లక్ష్యం రూ.1,238 నుంచి రూ.1,416 వరకు ఉంది.

### ఫండమెంటల్స్

ప్రస్తుత ఆర్థిక సంవత్సరం రెండో త్రైమాసికంలో రాబడులు రూ.254.34 కోట్ల నుంచి రూ.340 కోట్లకు పెరిగింది. మొత్తం రాబడిలో 62 శాతం పిగ్ ఐరన్ డివిజన్ నుంచి వస్తుండగా మిగతా 38 శాతం డిఐ పైపుల డివిజన్ నుంచి వస్తోంది. స్థూల లాభం రూ.17.71 కోట్ల నుంచి 57.15 కోట్లకు చేరుకుంది. కాగా నికర లాభం రూ.11.28 కోట్ల నుంచి రూ.33.55 కోట్లకు వృద్ధి చెందింది. ఇపిఎస్ రూ.4.46 నుంచి రూ.13.27కు పెరిగింది. నికర లాభ మార్జిన్ 4.44 శాతం నుంచి 7.45 శాతానికి మెరుగుపడింది. రిటర్న్ ఆన్ ఈక్విటీ (ఆర్ఒఇ) అత్యంత గరిష్ఠంగా 56 శాతం మేర ఉంది. దీంతో సంస్థాగత ఇన్వెస్టర్ల (డిఐఐ) వాటా గత ఏడాది కాలంలో భారీగా పెరిగింది. 2016, సెప్టెంబరు నాటికి 3.68 శాతంగా ఉన్న డిఐఐ ల వాటా ఈ ఏడాది సెప్టెంబరు నాటికి 12.08 శాతానికి చేరుకుంది. ఇందులో మదుపు చేసిన ఎఫ్‌పిఐ/ఎఫ్ఐఐల సంఖ్య 3 నుంచి 50కి పెరిగింది. మొత్తం 17 మ్యూచువల్ ఫండ్ సంస్థలు ఇందులో మదుపు చేశాయి. ప్రముఖ ఇన్వెస్టర్ డాలీ ఖన్నాకు ఇందులో 1.09 శాతం వాటా ఉంది. దీంతో అక్యుములేషన్ రేటింగ్ క్యాన్ స్లిమ్ మెథడాలజీ ప్రకారం ఎ ప్లస్‌గా ఉంది.

**టి బ్రహ్మాచారి**
హెడ్, అసోసియేషన్ ఆఫ్ టెక్నికల్ మార్కెట్ ఎనలిస్ట్, హైదరాబాద్ చాప్టర్, tbchary@gmail.com

**గమనిక :** ఈ శీర్షికలో అందించే రికమండేషన్ల ఆధారంగా జరిపే లావాదేవీలకు ఇన్వెస్టర్లదే పూర్తి బాధ్యత. వారి లాభనష్టాలకు ఆంధ్రజ్యోతి పత్రిక, కాలమిస్ట్ ఎలాంటి బాధ్యత వహించరు. లావాదేవీలు చేపట్టే ముందు మీ వ్యక్తిగత ఇన్వెస్ట్‌మెంట్ అడ్వైజర్ సలహా తీసుకోండి.

## ఎగుమతుల
# రిఫండ్స్ ఎలా పొందాలి ?



గొండాల రాంబాబు




జిఎస్‌టికి సంబంధించి ఒక సరఫరాదారుడు వేరే దేశానికి ఎగుమతి చేసే సరఫరాలు లేదా ప్రత్యేక ఆర్థిక మండలికి చేసే సరఫరాలను ఒకే విధంగా నిర్వచించటం జరిగిందని, ఇలాంటి సరఫరాలను జీరో రేటెడ్ సరఫరాలని తెలుసుకున్నాం. ఇప్పుడు జీరో రేటెడ్ సరఫరాలకు సంబంధించి రిఫండ్ ఎలా తీసుకోవాలో తెలుసుకుందాం.

విదేశాలకు ఏదేనీ వస్తువులను (గూడ్స్) ఎగుమతి చేసే వారు.. వీరు ఐజిఎస్‌టి చెల్లించి ఎగుమతి చేసి ఆ తర్వాత ఆ మొత్తాన్ని రిఫండ్ చేసుకోవచ్చు. ఈ విషయాన్ని ఇన్వాయిస్ మీద తప్పక ముద్రించాలి. అలాగే ఎగుమతి జరిగిన తర్వాత విడిగా రిఫండ్ కోసం దరఖాస్తు చేయనవసరం లేదు. ఎగుమతి సమయంలో ఇచ్చే షిప్పింగ్ బిల్లు అనేది దరఖాస్తు కింద భావించటం జరుగుతుంది. అయితే వీరు తప్పనిసరిగా ఎక్స్‌పోర్ట్ మానిఫెస్ అనేది ఫైల్ చేయాలి.

జిఎస్‌టిఆర్ 3బి దాఖలు చేయాలి. అలాగే జిఎస్‌టిఆర్ 1 అనే రిటర్న్ ఫైల్ చేయాలి. జిఎస్‌టిఆర్ 1 అందుబాటులో లేకుంటే ఆన్‌లైన్‌లో లభించే టేబుల్ 6ఎ నింపాలి. దీని ద్వారా రిఫండ్ అనేది నేరుగా బ్యాంక్ ఖాతాలోకి పంపబడుతుంది. ఇది గూడ్స్ అంటే వస్తువులకు సంబంధించి ఎగుమతి చేసినప్పుడు మాత్రమే వర్తిస్తుంది. ఒకవేళ ఇతర దేశాలకు సాఫ్ట్‌వేర్ లేదా ఇతర సేవలను పంపినా లేదా స్పెషల్ ఎకనామిక్ జోన్లకు వస్తువులు లేదా సేవలు పంపినా, వీటికి సంబంధించి చెల్లించిన ఐజిఎస్‌టి ని రిఫండ్ పొందాలంటే ఆర్ఎఫ్‌డి-01 ఎ అనే దరఖాస్తును నింపి ఇవ్వాల్సి ఉంటుంది.

వాస్తవానికి జిఎస్‌టిలో అన్ని రకాల కార్యకలాపాలు ఆన్‌లైన్‌లోనే నిర్వహించాల్సి ఉన్నప్పటికీ, తగిన సదుపాయం అందుబాటులోకి రావటానికి సమయం తీసుకుంటుంది. కాబట్టి ఎగుమతిదారులకు, వ్యాపారస్తులకు రిఫండ్ సరైన సమయంలో ఇవ్వటానికి వీలుగా ఈ సదుపాయాన్ని కల్పించటం జరిగింది. దరఖాస్తుదారుడు ఈ విధమైన దరఖాస్తు ఇవ్వటంతో పాటు కొన్ని ముఖ్యమైన నిర్ధారిత పత్రాలను జత చేయాలి. వీటిల్లో ముఖ్యమైనవి.

- ఇన్వాయిస్
- సేవలకు సంబంధించిన సరఫరా అయితే దానికి సంబంధించిన విలువ మొత్తం సరఫరాదారుడు పొందినట్లు రుజువు
- సెజ్‌కు చేసిన సరఫరా అయితే ఆయా వస్తు సేవలు గ్రహీత పొందినట్లు ఆ సెజ్ అధికారి ఇచ్చే ధ్రువీకరణ పత్రం
- దీంతోపాటుగా గ్రహీత తాను ఇన్‌పుట్ టాక్స్ క్రెడిట్ తీసుకోలేదని ఇచ్చే హామీ పత్రం మొదలైనవి జత చేయాలి.

వాస్తవానికి జీరో రేటెడ్ సరఫరాలు చేయటానికి ఐజిఎస్‌టి కట్టాల్సిన అవసరం లేదు. లెటర్ ఆఫ్ అండర్‌టేకింగ్ ఇవ్వటం ద్వారా టాక్స్ కట్టకుండా పంపవచ్చు. అయినప్పటికీ ఐజిఎస్‌టి క్రెడిట్ ఎక్కువ ఉన్నవారు, ఈ సదుపాయాన్ని ఉపయోగించుకుని టాక్స్.. ఐజిఎస్‌టి క్రెడిట్ ద్వారా చెల్లించి తిరిగి రిఫండ్ తీసుకోవటం ద్వారా వారి బుక్స్‌లో ఉన్న క్రెడిట్.. నగదులోకి మార్చుకోవచ్చు.

జిఎస్‌టికి సంబంధించిన వీడియోలను https://goo.gl/bzX8s1 ద్వారా వీక్షించవచ్చు.

**గమనిక :** ఈ వ్యాసాల ద్వారా ఇస్తున్న సమాచారం కేవలం అవగాహన కోసం మాత్రమే. పాఠకులు ఏదైనా నిర్ణయం తీసుకునే ముందు సంబంధిత చట్టాలు/నిబంధనలను కూలంకషంగా పరిశీలించాలి.

# బ్యాంకే దివాలా తీస్తే?

**కంచే చేను మేస్తే..? భద్రంగా ఉంటుందని సొమ్ము దాచుకున్న బ్యాంకే దివాలా తీస్తే..?? అప్పుడు మీ పరిస్థితి ఎలా ఉంటుందో ఒకసారి ఆలోచించుకోండి. కేంద్ర ప్రభుత్వం ప్రతిపాదించిన ఓ బిల్లు మీ ఖాతాలోని సొమ్ముకు ప్రస్తుతమున్న భద్రత కూడా కరువయ్యేలా చేయనుందని హెచ్చరిస్తున్నారు.**



ప్రస్తుతం మీ ఖాతాలోని సొమ్ములో లక్ష రూపాయల వరకు బ్యాంక్ బీమా కవరేజీ కల్పిస్తుంది. ఒక వేళ బ్యాంక్ దివాలా తీసినా రూ.లక్ష వరకైతే తిరిగి చేతికొస్తుంది. అంతకు మించి జమ చేసిన సొమ్ముకు మాత్రం ఎలాంటి భద్రత ఉండదు. అయితే, కేంద్ర ప్రభుత్వం ప్రతిపాదించిన ఫైనాన్షియల్ రిజొల్యూషన్ అండ్ డిపాజిట్ ఇన్సూరెన్స్ (ఎఫ్ఆర్‌డిఐ) బిల్లుపై కొందరు విశ్లేషకులు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. ఈ బిల్లు గనుక చట్టంగా మారితే బ్యాంక్ ఖాతాల్లోని సొమ్ముకు ఇప్పుడున్న భద్రత కూడా లేకుండా పోతుందని వారు హెచ్చరిస్తున్నారు. ఎందుకంటే, దివాలా తీసిన బ్యాంకు డిపాజిటర్ల సొమ్ముతో కొంత నష్టాలను పూడ్చుకునేందుకు ఎఫ్ఆర్‌డిఐ బిల్లులోని 'బెయిల్ ఇన్' ప్రొవిజన్ వీలుకల్పిస్తుంది. అయితే, బ్యాంకర్లు మాత్రం ఈ బిల్లు విషయంలో ఖాతాదారులు ఆందోళన చెందాల్సిన అవసరం లేదని అంటున్నారు.

### మీ ఖాతాలో డబ్బు సంగతేంటి? దడ పుట్టిస్తున్న కేంద్రం బిల్లు

ఎఫ్ఆర్‌డిఐ బిల్లు అమలులోకి వచ్చినా ప్రస్తుతం లక్ష రూపాయల వరకు డిపాజిట్‌పై కల్పిస్తున్న బీమా కవరేజీ సౌకర్యం యథాతథంగానే కొనసాగుతుందంటున్నారు. ప్రస్తుత నిబంధనల ప్రకారంగానూ బ్యాంక్ దివాలా తీసిన పక్షంలో పొదుపు ఖాతాదారులకు పూర్తి సొమ్ము తిరిగి చేతికి రాదని ప్రభుత్వ రంగ బ్యాంక్ ఉన్నతాధికారి ఒకరు స్పష్టం చేశారు. బ్యాంకులతోపాటు ఆర్థిక సేవల రంగానికి చెందిన ఇతర సంస్థల దివాలా పరిష్కారం కోసం కేంద్రం ఎఫ్‌డిఆర్ఐ బిల్లును ప్రతిపాదించింది. ప్రస్తుతం ఈ బిల్లును పార్లమెంటరీ స్థాయీ సంఘం సమీక్షిస్తున్నది. కమిటీ ఓకే చెబితే కేంద్రం ఈ బిల్లును శీతాకాల సమావేశాల్లో పార్లమెంట్‌లో ప్రవేశపెట్టనుంది.



## మొగల్తూరు కోటపై

మొగల్తూరు వంశీయులు నివసించిన కేతకీ మహల్. కొంతకాలం కిందట చాలా భాగం తొలగించారు.

# ఎగరేసిన పోరు పాట

మొగల్తూరు కోటతో గజపతులు వియ్యం అందారు. మొఘలాయిలు కానుకలు ఇచ్చి స్నేహం నెరిపారు. ఫ్రెంచి పాలకులు స్థానిక ఆచారాలను గౌరవించి, నడుచుకొన్నారు. చివరిగా వచ్చిన ఈస్టిండియా కంపెనీ కూడా ఇవన్నీ చేసింది. కానీ..

మొగల్తూరు....ఏలూరు సర్కార్‌లో భాగం. 800 చదరపు మైళ్ల పరిధిలో, 300 గ్రామాలతో విస్తరించింది. రెండు బండ్లు పక్కపక్కన పోగలిగినంత విశాలంగా మొగల్తూరు కోట ప్రహరీ ఉండేదట! గోల్కొండ నవాబులకు పర్ధారి చేసిన జల్లిగడల గంగరాజు ఈ సంస్థానం వ్యవస్థాపకుడు. రాజా కలిదిండి తిరుపతిరాజు హయాంలో (1750-1791).. మొగల్తూరు రాజకీయ, భౌగోళిక చరిత్ర కుదుపులకు గురయింది. ఆయన పగ్గాలు చేపట్టేనాటికి ఈ ప్రాంతం ఫ్రెంచి యేలుబడిలో ఉంది. స్థానిక సంస్కృతిని గౌరవిస్తూనే, విస్తరణకు ఫ్రెంచి పాలకులు ప్రయత్నించారు. ఈస్టిండియా కంపెనీ ఇక్కడ పాగా వేసే ప్రయత్నంలో ఉంది. తిరుపతి రాజు సాయంతో 1758లో జరిగిన యుద్ధంలో ఫ్రెంచి సేనలను కంపెనీ ఓడించింది. మరో ఇరవై ఏళ్లలోనే మొగల్తూరుని తన గుప్పిట్లోకి తెచ్చుకొంది. తనకు ఎంతో సాయంచేసిన తిరుపతిరాజును కంపెనీ సామంతుని స్థాయికి తెచ్చింది. 93 వేలు కౌలు చెల్లించే ఒప్పందంపై తిరుపతిరాజుకు పాలనా హక్కులు ఇచ్చింది. ఆతర్వాత కౌలు సరిగా చెల్లించడం లేదనే సాకుతో ఆయనను తొలగించి.. సంస్థానాన్ని ఆక్రమించేసింది. తనకు సహకరిస్తారన్న నమ్మకంతో, భూపయ్యరాజు, వెంకట్రామ రాజు అనే ఇద్దరికి మొగల్తూరును లీజుకు ఇచ్చింది. వీరు కూడా లీజు సరిగా చెల్లించడం లేదనే అభియోగం మోపి చెన్నైలో బంధించింది. అక్కడినుంచి వారిద్దరూ తప్పించుకోవడంతో, మొగల్తూరు తిరుగుబాటుకు నాందిప్రస్తావన జరిగింది.

### జైలు నుంచి జనంలోకి..

భూపయ్యరాజు, వెంకట్రామరాజు మొగల్తూరు వచ్చేసరికే.. ఊళ్లు చాలావరకు ఖాళీ అయిపోయాయి. కంపెనీ సేనల దాడులతో వారి కుటుంబాలు చెల్లాచెదురయ్యాయి. ఎక్కువమంది నైజాం సంస్థానంలో తల దాచుకొన్నారు. భూపయ్య, వెంకట్రామరాజు గ్రామం గ్రామం తిరుగుతూ యువకులను సాయుధ తిరుగుబాటుకు కూడగడుతున్నారని కంపెనీ ప్రతినిధులకు తెలిసింది. రక్షణ వ్యవస్థని పటిష్టం చేశారు. అయినా 1795లో భూపయ్య నేతృత్వంలో రెండు వేల మంది తిరగబడ్డారు. నైజాం సరిహద్దులోని యర్నగూడెం, అత్తిలి గ్రామాలను పోరాట స్థావరంగా చేసుకొన్నారు. మొగల్తూరు కోట దాకా చొచ్చుకొచ్చారు. కలెక్టర్ గేంబియర్ ఆదేశాలతో భూపయ్య దళాన్ని కంపెనీ సేనలు ఎదుర్కొన్నాయి. మూడు గంటలు పోరాడినా భూపయ్యను నిలువరించలేకపోయాయి. దీంతో కలెక్టర్ తెల్లజెండా ఎగరేశాడు. భూపయ్య డిమాండ్లను కంపెనీకి తెలియజేస్తానని రాజీకొచ్చాడు. విజయగర్వంతో భూపయ్య దళం భద్రాచలం వైపు సాగిపోయింది. ఆ తరువాత కొద్ది రోజులకే భూపయ్య అనారోగ్యంతో చనిపోయాడు. సంధి సమయంలో ఇచ్చిన హామీలను కంపెనీ బుట్టదాఖలు చేసింది. దీంతో, భూపయ్య అనుచరుడు కలిదిండి తిమ్మరాజు మరోసారి కోటపై దాడికి ప్రయత్నించారు. ఉండి వద్ద జరిగిన పోరాటంలో సిపాయిని, ఠానేదారుడిని తిమ్మరాజు దళం చంపేసింది. ఇటువైపూ చాలామంది గాయపడ్డారు. భద్రాచలంలో తలదాచుకొన్న తిమ్మరాజును కంపెనీ సేనలకు స్థానిక జమిందారు పట్టించాడు. తిమ్మరాజుసహా మరో ముగ్గురినీ మచిలీపట్నంలో ఖైదు చేశారు. అక్కడ తిమ్మరాజు మరణంతో, మొగల్తూరు తిరుగుబాటూ అస్తమించింది.

**యుద్ధభూమి**

**పేరుకు పలు చరిత్రలు...**

కటక్ ప్రభువు ప్రతాపరుద్ర గణపతి.. పూసపాటి రెండో రాచిరాజును తన అల్లుడిగా చేసుకొన్నాడు. మొగల్తూరును ఆయనకు అరణం కింద ఇచ్చాడు. అయితే కలిదిండివారికి మొఘల్ పాదుషాలు ఈ ప్రాంతాన్ని దానం చేయడం వల్ల, మొగల్తూరు అనే పేరు వచ్చిందంటారు. ఇక్కడ మొగలిపువ్వులు ఎక్కువగా ఉన్నందునే ఈ పేరు వచ్చిందని కొందరు చెబుతారు.

- భీమవరం

# లెక్క తప్పుతోంది!

## రాష్ట్రంలో అటకెక్కిన 'ఈ-ఔషధి'.. ఆస్పత్రుల్లో మందుల లభ్యతపై ప్రభుత్వానికి అందని సమాచారం

- అందుబాటులో లేని ఇంటర్నెట్
- పీహెచ్‌సీ, సీడీఎస్ కనెక్టివిటీ కట్
- పడకేస్తున్న ఆరోగ్యశాఖ పథకాలు




అమరావతి, డిసెంబరు 3(ఆంధ్రజ్యోతి): రాష్ట్రంలో ఆరోగ్యశాఖ పథకాలు ఒక్కొక్కటిగా పడకేస్తున్నాయి. కొత్తగా ఏ పథకాన్ని ప్రారంభించినా మొదట్లో కొద్దిరోజులు హడావిడి చేయడం, తర్వాత వదిలేయడం అధికారులకు మామూలైంది. దీంతో ఎక్కడ చూసినా లోపాలే తప్ప ఫలితాలు మాత్రం కనిపించడం లేదు. కొన్ని పథకాల అమలులో ఉద్యోగుల చేతి చమురు కూడా వదులుతోంది. ఇలాంటి వాటిలో 'ఈ-ఔషధి' అగ్రస్థానంలో ఉంది. ప్రభుత్వాస్పత్రుల్లో రోగులకు అందించే మందులు దుర్వినియోగం కాకుండా సక్రమమైన లెక్కల కోసం ప్రారంభించిన ఈ పథకాన్ని అధికారులు అటకెక్కించారు. దీంతో రాష్ట్రంలో మందుల లెక్క తప్పుతోంది. ఎక్కడ, ఎన్ని మందులు వాడారు... ఎందరు రోగులకు వాటిని అందించారనే దానిపై సమాచారం ప్రభుత్వం వద్ద ఉండటం లేదు. అర్బన్ ప్రాంతాల్లో పరిస్థితి అంతంత మాత్రంగా ఉన్నా రూరల్, ఏజెన్సీ ప్రాంతాల్లో పథకం అమలు దారుణంగా ఉంది.

### పథకం అమలు ఇలా...

గతంలో రోగులకు అందించే మందుల కంటే బయటకు తరలిపోయే వాటి శాతమే అధికంగా ఉండేది. దీనికి అడ్డుకట్ట వేసేందుకు ప్రభుత్వం రెండేళ్ల క్రితం 'ఈ-ఔషధి'ని ప్రారంభించింది. పీహెచ్‌సీల నుంచి డీఎంఈ ఆస్పత్రి వరకూ ప్రతిచోటా దీన్ని ఉపయోగించాలని నిబంధన విధించింది. దీనివల్ల ఆస్పత్రిలో ఎన్ని మందులు న్నాయి, ఎంతమంది రోగులకు అందించారనే దానిపై సీడీఎస్ (సెంట్రల్ డ్రగ్ స్టోర్)కు ఎప్పటికప్పుడు సమాచారం తెలుస్తుంది. దాని ఆధారంగా ఏ ఆస్పత్రికి ఏ రకం మందులు అవసరమో గుర్తించి సిద్ధం చేస్తారు. ఆస్పత్రిలో మందులు అయిపోయిన వెంటనే, మెడికల్ ఆఫీసర్ ఇండెంట్ మేరకు అప్పటికే సిద్ధం చేసుకున్న మందులను అధికారులు సదరు ఆస్పత్రికి తరలిస్తారు. అయితే ప్రస్తుతం ఈ విధానం ఎక్కడా అమలు కాకపోవడంతో ఆస్పత్రుల నుంచి సీడీఎస్‌కు సమాచారం ఉండటం లేదు. ఈ ఏడాది సీజనల్ వ్యాధులు విజృంభించిన సమయంలో చాలాచోట్ల మందులకు, కిట్లకు తీవ్ర కొరత ఏర్పడటానికి ఈ-ఔషధి మూలనపడటమే కారణమని వైద్యులు కూడా చెబుతున్నారు.

### ఫార్మసిస్టుల జేబులు గుల్ల

ఈ-ఔషధి ప్రారంభించిన తొలి రోజుల్లో కలెక్టర్లు దీనిపై ప్రత్యేక దృష్టి పెట్టేవారు. ఆతర్వాత ఆరోగ్యశాఖ అధికారులే పట్టించుకోకపోవడంతో కలెక్టర్లు కూడా దీని ఊసెత్తడం లేదు. ఇక చాలాచోట్ల నెట్ కనెక్షన్ సమస్యగా మారింది. కొన్నిచోట్ల ఇంటర్నెట్‌కు డబ్బులు చెల్లించకపోవడంతో సేవలు నిలిపివేశారు. రూరల్, ఏజెన్సీ ప్రాంతాల్లో సిగ్నల్స్ సరిగ్గా లేక ఈ-ఔషధి నమోదు చేయడం ఇబ్బందిగా మారింది. దీంతో చాలా చోట్ల ఫార్మసిస్టులే దీన్ని పక్కన పడేశారు. మరికొందరు సొంత డబ్బుతో ఇంటర్నెట్ సెంటర్లకు వెళ్లి వివరాలు నమోదు చేస్తున్నారు.

**అర్బన్‌లోనూ అంతంత మాత్రమే..**

పట్టణాల్లోని డీఎంఈ ఆస్పత్రుల్లోనూ ఈ-ఔషధి అమలు అంతంత మాత్రంగానే ఉంది. విజయవాడ ప్రభుత్వాస్పత్రిలో రోజూ సుమారు 2వేల మంది రోగులకు మందులు అందించాల్సి ఉంటుంది. దీనికోసం ప్రత్యేకంగా నలుగురు డేటా ఎంట్రీ ఆపరేటర్లను కూడా నియమించారు. అయితే వారిని ఉన్నతాధికారులు ఇతర పనులకు ఉపయోగిస్తున్నారు. దీంతో ఇక్కడ రోగులకు మందులు ఇస్తున్నా వివరాలు పూర్తిగా నమోదు చేయలేని పరిస్థితి ఉంది.

# డాక్టర్ల కమీషన్ల దందా!

- ఐటీ దాడులతో వెలుగులోకి..
- 100 కోట్లకుపైగా అక్రమార్జన గుర్తింపు

బెంగళూరు, డిసెంబరు 3(ఆంధ్రజ్యోతి): బెంగళూరులో జరిగిన ఐటీ దాడుల్లో వెలుగుచూసిన దందాను పరిశీలిస్తే డాక్టర్లలో దోపిడీ రోగం ఏ స్థాయిలో ఉందో అర్థం చేసుకోవచ్చు! అక్రమ సంపాదన లెక్కకడదామని వెళ్లిన ఐటీ అధికారులు, అక్కడ కమీషన్ దందా నడుస్తోందని తెలుసుకుని నివ్వెరపోయారు. ఇదేదో స్కామ్‌లా ఉందని అధికారులు అనుమానిస్తున్నారు. మూడురోజుల క్రితం బెంగళూరులో రెండు సంతాన సఫల్య కేంద్రాలు, 5 డయాగ్నస్టిక్స్ ల్యాబ్‌లపై ఐటీ అధికారులు దాడి జరిపిన విషయం తెలిసిందే. ఈ దాడుల్లో రూ.102.40 కోట్ల రూపాయలకుపైగా బినామీ సంపదతోపాటు విదేశాలలో సీక్రెట్ లాకర్‌లను గుర్తించారు. 3.5 కేజీల బంగారు వజ్రాభరణాలు, విదేశీ కరెన్సీ, విదేశీ బ్యాంకులలో ఖాతాల వివరాలను గుర్తించారు.

### రూ.200 కోట్ల కమీషన్!

ఒక ల్యాబ్...డాక్టర్లకు కమీషన్ రూపంలో రూ.200 కోట్లు చెల్లించినట్టు తేలింది. ప్రముఖ వైద్యుడు డాక్టర్ కామినీరావుకు సంబంధించిన మిలన ఆసుపత్రితోపాటు 2 ఐవీఎఫ్ క్లినిక్‌లు, 5 మెడికల్ డయాగ్నస్టిక్ సెంటర్‌లలో జరిపిన సోదాల్లో ఈ వివరాలు బయటపడ్డాయి. డాక్టర్లు రోగులను క్లినికల్ ల్యాబ్‌లకు సిఫారసు చేసేందుకు ప్రతిఫలంగా తగినంత కమీషన్ ముట్టచెప్పుతున్నట్లు ఐటీ అధికారులు గుర్తించారు. ఎంఆర్ఐకు 35 శాతం, సిటీస్కాన్‌కు 20 శాతం చొప్పున నగదు లేదా చెక్కుల రూపంలో కమీషన్ పంపిణీ అయినట్లు సమాచారం. ఇలా రెండువారాలకోసారి డాక్టర్లకు కమీషన్ అందుతోంది. ఈ విషయంలో రసీదులు చాలా కీలక పాత్ర పోషిస్తున్నాయి. వీటికి లెక్కాపత్రం ఉండదు. పైగా లెక్కల్లోకి రాదు. ఒకవేళ కమీషన్‌లో తేడా వస్తే డాక్టర్లు కోప్పడిన సంఘటనలూ ఉన్నట్లు బయటపడింది. కాగా, గత ఏడాది నవంబరులో పెద్దనోట్ల రద్దు అమలయ్యాక, అప్పట్లో బ్లాక్‌ను వైట్‌గా మార్చుకునేందుకు భారీస్థాయిలో సదరు ల్యాబ్‌లు, క్లినిక్‌లు, ఐవీఎఫ్ కేంద్రాలు మందులను కొనుగోలు చేశాయి. వీటిపై అనుమానం రావడంతో ఐటీ అధికారులు దాడులు జరిపారు. ఆ సందర్భంగానే కమీషన్ల సంగతి బయటకొచ్చింది.



చనిపోయిన సముద్రపు చేప

# కాటేస్తున్న కాలుష్యం!

- సముద్ర జీవాల మృత్యువాత
- తీరానికి కొట్టుకొస్తున్న చేపలు, తాబేళ్లు

విశాఖపట్నం, డిసెంబరు 3(ఆంధ్రజ్యోతి): విశాఖ తీరానికి గడచిన వారం రోజులుగా సముద్ర జీవాల కళేబరాలు కొట్టుకొస్తున్నాయి.ప్రధానంగా తాబేళ్లు, పలు రకాల చేపలు మృత్యువాత పడుతున్నాయి. ఇందుకు కారణాలను అన్వేషించేందుకు నిపుణులు రంగంలోకి దిగారు. గ్లోబల్ వామింగ్, తుపాన్‌ల తీవ్రత, ఉపరితల ఉష్ణోగ్రతలు, పారిశ్రామిక కంపెనీలు వ్యర్థాలను విచ్చలవిడిగా విడిచిపెట్టడం, మందుల పరిశ్రమలు తమ వ్యర్థ జలాలను సముద్రంలో విడిచిపెడుతుండటం వంటి కారణాలతోపాటు నగరాలు, పట్టణాల నుంచి మురుగునీరు శుద్ధి చేయకుండా సముద్రంలోకి వదిలివేస్తున్నారు. సముద్రంలో ముడిచమురు రవాణా సమయంలో లీక్ అవుతుంటుంది. కార్గో, పాసింజర్ నౌకల నుంచి ప్లాస్టిక్, ఇతర వస్తువులు పారేస్తుంటారు. ఇటువంటి చర్యలు సముద్ర జీవులపై ప్రభావం చూపుతున్నాయి.

### ఇది గుడ్లు పెట్టే సీజన్!

ప్రస్తుతం తాబేళ్లు గుడ్లు పెట్టే సీజన్. ఈ సీజన్‌లో తాబేళ్లు మత్స్యకారుల వలలు లేదా ట్రాలర్ల ధాటికి గాయపడుతుంటాయని సముద్ర అధ్యయన శాస్త్రవేత్తలు విశ్లేషిస్తున్నారు. తాబేళ్లు సముద్రం అడుగున చల్లని నీటిలో అతి తక్కువ ఉష్ణోగ్రతల మధ్య జీవిస్తాయి. అయితే బంగాళాఖాతంలో వరుసగా అల్పపీడనాలు సంభవించడంతో సముద్ర వాతావరణంలో మార్పులు వస్తున్నాయి. తక్కువ ఉష్ణోగ్రతల మధ్య జీవించే జీవాలు ఉపరితలంపైకి వచ్చేసరికి ఎక్కువ ఉష్ణోగ్రతలను తట్టుకునే అవకాశం ఉండదని ఏయూ జువాలజీ ప్రొఫెసర్ డీఈ బాబు తెలిపారు. తీరం దిశగా వచ్చే తాబేళ్లు వాతావరణ మార్పులు, ట్రాలర్ల ధాటికి గురవుతుంటాయని సముద్ర అధ్యయన నిపుణుడు భాస్కరరావు పేర్కొన్నారు. విశాఖ పరిసరాల్లో సముద్ర జీవాల మృత్యువాతపై అధ్యయనం చేస్తామని జాతీయ సముద్ర అధ్యయన విజ్ఞాన సంస్థ సైంటిస్టు ఇన్‌చార్జి జీపీఎస్ మూర్తి తెలిపారు.



# పాఠశాల ప్రహరీలకు ఉపాధి నిధులు

అమరావతి, డిసెంబరు 3 (ఆంధ్రజ్యోతి): ఉపాధి హామీ పథకం ద్వారా గ్రామాల్లో పాఠశాలలకు ప్రహరీలు నిర్మించుకునేందుకు కేంద్ర గ్రామీణాభివృద్ధిశాఖ అవకాశం కల్పించింది. రాష్ట్రంలోని ప్రాథమిక పాఠశాలల్లో ఎక్కువగా ప్రహరీలు లేక పశువులు, పందులు, కుక్కలు సంచరిస్తుండటంతో విద్యార్థులు ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. సర్వశిక్ష అభియాన్ ద్వారా పాఠశాల భవనాల నిర్మాణానికి నిధులిస్తున్నారే గానీ...ప్రహరీలకు అవకాశం ఇవ్వలేదు. దీంతో రాష్ట్ర వ్యాప్తంగా గ్రామీణ ప్రాంతాల్లో అనేక పాఠశాలలకు ప్రహరీలు లేవు. దీంతో గత ఏడాది ప్రారంభంలో రాష్ట్రంలో గ్రామీణాభివృద్ధిశాఖ ఉపాధి హామీ పథకం ద్వారా బయోఫెన్సింగ్‌కు శ్రీకారం చుట్టింది. పాఠశాలల్లో నర్సరీలు ఏర్పాటుచేసి ఆ పాఠశాలలకు చుట్టూ గోరింటాకు తదితర మొక్కలు పెంచడం ద్వారా ప్రహరీల అవసరాలను తీర్చాలని నిర్ణయించారు. అయితే అవి అనుకున్నమేర సత్ఫలితాలివ్వలేదు. దీంతో జాతీయ గ్రామీణ ఉపాధి హామీ చట్టంలో సవరణల ద్వారా పాఠశాల ప్రహరీలతో పాటు ఆటస్థలాల అభివృద్ధి, సంప్రదాయ నీటి వనరుల పునరుద్ధరణ చేపట్టనున్నారు.

# జలవనరులశాఖలో పదోన్నతుల జాతర

అమరావతి, డిసెంబరు 3 (ఆంధ్రజ్యోతి): జల వనరుల శాఖలో ఇంజనీరింగ్ అధికారుల పదోన్నతుల జాతర కొనసాగుతోంది. మూడు దశాబ్దాల తర్వాత సుప్రీంకోర్టు ఆదేశాల మేరకు డీపీసీని నిర్వహించిన జల వనరులశాఖ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్లకు చీఫ్ ఇంజనీర్లుగా పదోన్నతి కల్పించింది. అలాగే అసిస్టెంట్ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్లకు ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్లుగా పదోన్నతి కల్పించింది. శనివారం ఇలా 51 మందికి పదోన్నతి కల్పిస్తూ ఉత్తర్వులు జారీ చేసింది. సోమవారం ఏఈలు, డీఈఈలకు పదోన్నతి కల్పించేందుకు సిద్ధమవుతోంది.



చితాభస్మంతో మహారుద్రాభిషేకం నిర్వహిస్తున్న స్వామి

# మృతదేహాలకు మాలి!

**ఒకే ఒక్కడు**

- అనాథలా చనిపోయినవారికి కుమారుడిలా అంత్యక్రియలు.. గంగమ్మలో అస్థికల నిమజ్జనం
- 40వేల మందికి కర్మ కాండలు
- 23 ఏళ్లుగా గుంటూరు కేంద్రంగా స్వామి జ్ఞాన ప్రసన్న సేవలు

గుంటూరు (సంగడిగుంట), డిసెంబరు 3: నా అన్నవాళ్లు లేకుండా జీవించడం కష్టం. అనాథలా చనిపోవాల్సి రావడం మరింత కష్టం. అలాంటి చావు తమకొద్దని ప్రతి ఒక్కరూ కోరుకొంటారు. భిక్షకులు, సంతానం లేని తల్లిదండ్రుల నుంచి అన్ని ఉండీ, అందరూ ఉండీ..అనాథలుగా మిగిలిపోయేవారిదాకా, ముందు జాగ్రత్త పడుతుంటారు. తాము చస్తే అంత్యక్రియలు జరపడానికి జాగా, ఖర్చులకు డబ్బులు వదిలేసిపోతున్నారు. ఇంత చేసినా, సొంత వారసులు చేసినట్టు.. మరణానంతర కర్మకాండలు శ్రద్ధగా జరుగుతాయో లేదోనన్న బెంగ మాత్రం వారిని వదిలిపెట్టదు. అలాంటి వారి బెంగను సొంత కుమారుడిలా తీర్చుతున్నారు స్వామి జ్ఞాన ప్రసన్న. గుంటూరుకు చెందిన స్వామి.. 23 ఏళ్లుగా మృతదేహాల మధ్యనే జీవితం గడుపుతున్నారు. అనాథ మృతదేహం ఉందన్న సమాచారం తెలుసుకున్న క్షణాల్లోనే అక్కడకు వెళ్లి, సొంత ఖర్చులతో అంత్యక్రియలు పూర్తిచేస్తారు. ఇంతవరకు 40 వేల అనాథ మృతదేహాలకు స్వామి జ్ఞాన ప్రసన్న శాస్త్రోక్తంగా అంత్యక్రియలు జరిపించారు.

### ఆ తృప్తే నడిపించింది..

ఆయనకు అప్పుడు 24 ఏళ్లు. దారిన పోతుంటే ఓ అనాథ మృతదేహం రోడ్డు పక్కన పడి ఉంది. కుళ్లిపోయిన స్థితిలో ఉన్న ఆ మృతదేహాన్ని చూడగానే ఆయన మనసు వికలం అయింది. తానే పూనుకొని అంత్యక్రియలు పూర్తి చేశాడు. అక్కడి నుంచి ఆయన జీవితంలో పెద్ద మార్పు వచ్చింది. ఏ మృతదేహమూ అనాథలా మిగిలిపోరాదని నిర్ణయించుకొన్నారు. అలా ఇంగ్లిష్ ఎంఏ చేసి, గుంటూరులో ఉద్యోగం చేసుకొంటున్న చంద్రశేఖర్ అనే విశాఖ యువకుడు.. స్వామి జ్ఞాన ప్రసన్నగా మారారు. గుంటూరు చుట్టుగుంట ప్రాంతంలో 1994లో అమ్మ చారిటబుల్ ట్రస్ట్ ఏర్పాటు చేశారు. అప్పటికే ఆయనకు పెళ్లి అయింది. జీవిక కోసం గుంటూరు నగరంలో టైపిస్టుగా పనిచేస్తున్నారు.

### శాస్త్రోక్తంగా..

ట్రస్ట్ ఆధ్వర్యంలో శాస్త్రోక్తంగా అంత్యక్రియలు నిర్వహిస్తారు. మృతదేహంపై అభిషేకించిన రుద్రాక్షలు ఉంచుతారు. విభూతి రాసి నోట్లో గంగా తీర్థం పోసి అంత్యక్రియలు నిర్వహిస్తారు. చితా భస్మాన్ని చిన్న కుండల్లో భద్రపరుస్తారు. కాశీ వెళ్లి గంగలో అస్తికలను నిమజ్జనం చేస్తారు. చితా భస్మంలో కొంత గంగలో కలుపుతాడు. కార్తీక మాసంలో శివ లింగ ప్రతిష్ఠ చేసి మిగతా చితాభస్మంతో పూజ చేస్తారు. ఈ విషయంలో ఆయనకు భార్య విజయ అండదండలు పుష్కలంగా ఉన్నాయి. ఆయన లేని సమయాల్లో తానే అంత్యక్రియలు నిర్వహిస్తారు.

**కుటుంబ సభ్యులున్నా ఇలా జరగదు**

'నాకు వివాహమైన 20 ఏళ్లకే భర్త వదిలి పోయాడు. రైలు ప్రమాదంలో గాయపడి గత ఏడాది జీజీహెచ్‌లో చేరాడు. పోలీసులు నాకు కబురు పెడితే వెళ్లాను. అప్పటికే చనిపోయాడు. ఆయనను తీసుకొచ్చి, అంత్యక్రియలు జరిపే స్థోమత నాకు లేదు. ఈ విషయం తెలిసి, అమ్మ ట్రస్ట్ నిర్వాహకులు నన్ను కలిశారు. వారి సాయంతో నా భర్త అంత్యక్రియలు పూర్తి చేయగలిగాను. నిజంగా మాకు కొడుకులు, కుటుంబ సభ్యులు ఉన్నా.. ఇంత పద్ధతిగా కర్మకాండలు జరిపించేవారు కాదనిపిస్తోంది.

- యశోధర



గుంటూరులో అంత్యక్రియలు నిర్వహించే ప్రదేశం

# జలమార్గం.. రైట్ రైట్

- ముక్త్యాల టు ప్రకాశం బ్యారేజీ...
- 82 కి.మీ మేర కాలువ పనులు
- 7 అడుగుల లోతున నిర్మాణం
- 2 భాగాలుగా, 2 కంపెనీలకు...
- 18 నెలల్లో పూర్తికి డెడ్‌లైను
- త్వరలోనే పనులు ప్రారంభం

విజయవాడ, డిసెంబరు 3 (ఆంధ్రజ్యోతి): కాలువల మీద ప్రయాణానికి అడుగులు పడుతున్నాయి. రద్దీ జీవితంలో కాస్తంత హాయిని, మరింత చల్లదనాన్ని ఆస్వాదించేందుకు వడివడిగా ఏర్పాట్లు జరుగుతున్నాయి. అటు రహదారులు మోస్తున్న రవాణా 'బరువు'బాధ్యతలనూ, ఇటు రోడ్డు, ట్రాక్‌ల మీద కిక్కిరిసిపోతున్న ప్రయాణికులనూ జలమార్గం పట్టించడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సిద్ధమవుతున్నాయి. జలరవాణా పనులు త్వరలో ప్రారంభం కానున్నాయి. ముక్త్యాల నుంచి ప్రకాశం బ్యారేజి వరకు కృష్ణా నదిలో పడవల రాకపోకలకు కాలువ పనులకు శ్రీకారం చుడుతున్నారు. దాదాపు 82 కిలోమీటర్ల మేర ఈ పనులు జరుగుతాయి. నిజానికి, కృష్ణా నదిలో వరద ఉన్నా, లేకపోయినా ఏడాది పొడవున నదీ భూగర్భం నుంచి ఉండే నీటి ఊటతో పాయలలో నీటి నిల్వలు ఉంటాయి. ఈ నీటి మట్టం అక్కడ ఉండే ఊటను బట్టి రెండు నుంచి అయిదారు అడుగుల వరకు ఉంటుంది. ఏడాది పొడవున జల రవాణా జరగాలంటే కనీస నీటి మట్టం 7 అడుగులు ఉండాలి. దీని కోసమే నదిలోని జలరవాణా మార్గంలో అడుగున 45 మీటర్లు, పైన 70 మీటర్ల వెడల్పు ఉండేలా కాల్వను నిర్మిస్తున్నారు. కాల్వ లోతు ఏడు అడుగులు ఉంటుంది. జలరవాణా మార్గాన్ని రెండు భాగాలుగా విభజించి రెండు కంపెనీలకు అప్పగించారు. 18 నెలల వ్యవధిలో ఈ కంపెనీలు తమ పనిని పూర్తి చేయాల్సి ఉంటుంది.

### ప్రైవేటు బస్సుల తరహాలోనే....

జలరవాణా మార్గం నిర్వహణ బాధ్యతలు ఇన్‌ల్యాండ్ వాటర్ వేస్ అథారిటీ చూస్తుంది. ఈ మార్గంలో ట్రాఫిక్ నిర్వహణ కూడా ఆ సంస్థే చేపడుతుంది. జల రవాణా మార్గాన్ని అభివృద్ధి చేసిన తరువాత ప్రైవేటు ఆపరేటర్లకు సరుకు, పాసింజర్ల రవాణాకు అవకాశం కల్పిస్తారు. రోడ్డు మీద తిరగటానికి ప్రైవేటు బస్సులు పన్ను చెల్లించినట్టు జల రవాణాకూ పన్ను చెల్లించాల్సి ఉంటుంది.

**ఉభయతారకం**

జలరవాణా మార్గం అటు సరుకు సరఫరా ఇటు ప్రయాణికుల రవాణాకు అనువుగా ఉండే విధంగా రూపొందిస్తున్నారు. ముక్త్యాల, హరిశ్చంద్రపురం, ఇబ్రహీంపట్నం, ప్రకాశం బ్యారేజీ వద్ద టెర్మినల్ పాయింట్లు ఉంటాయి. వీటిని సరుకు లోడింగ్, అన్‌లోడింగ్ కోసం ఉపయోగిస్తారు. సరుకు రవాణా కోసం తిరిగే పడవలను బార్జ్ లని పిలుస్తారు. ఒక్కో బార్జ్ 1000 టన్నుల వరకు తీసుకెళ్లగలదు. దీని వల్ల రోడ్ ట్రాఫిక్ గణనీయంగా తగ్గే అవకాశాలు ఉంటాయి. ప్యాసింజర్లను ఎక్కించుకునే నౌకలను క్రూయిజ్ లు అంటారు. వీటిలో పాసింజర్లు ఎక్కి, దిగడానికి వీలుగా వేదాద్రి, అమరావతి, భవానిపురం, దుర్గాఘాట్ వద్ద టెర్మినల్స్ ఏర్పాటు చేస్తున్నారు.

**పనులు ఇలా..**

ముక్త్యాల - అచ్చంపేట, అచ్చంపేట - హరిశ్చంద్రపురం మధ్య ఉన్న జలమార్గాలలో డ్రెడ్జింగ్ ద్వారా ఇసుక మేటలు తొలగించి నీటి ప్రవాహానికి ఆటంకాలు లేకుండా చేస్తారు. ముక్త్యాల నుంచి ఇస్తేపల్లి వరకు పాయ ఉంది. ఈ పాయనే హరిశ్చంద్రపురం వరకు వెడల్పు చేసి లోతు తీస్తారు. పులిచింతల నుంచి నీటి విడుదల ఉన్నా, లేకపోయినా జలరవాణాకు ఇబ్బంది లేదు. నదిలోని పాయల అడుగున ఉండే జల ఊటలలో ఊరే జలం రవాణాకు సరిపోతుందని అధికారులు చెబుతున్నారు. సాధారణంగా వేసవిలో నదిలో కూడా జల ఊట తగ్గుతుంది. అయితే, మేటలు తొలగిస్తే ఊట సహజంగా పెరుగుతుందని ఇరిగేషన్ అధికారులు చెబుతున్నారు. పులిచింతల దిగువన ఉన్న మునేరు, పాలేరు, కట్టలేరులతో పాటు చిన్న చిన్న వాగులు, వంకల నుంచి వచ్చే నీరు నేరుగా నదిలోకి చేరడం వలన పాయల కింద ఉండే ఊట పెరుగుతుంది.

## వెయిటేజీ ఇలా..

- పీఎస్‌యూలు తుది జాబితాను ఖరారు చేసే క్రమంలో మూడు అంశాలకు వెయిటేజీ ఇస్తున్నాయి. అవి... గేట్ స్కోర్, గ్రూప్ డిస్కషన్ / గ్రూప్ టాస్క్, పర్సనల్ ఇంటర్వ్యూ. మొత్తం వంద మార్కులకు వెయిటేజీలో... అధిక శాతం పీఎస్‌యూలు గేట్‌స్కోర్‌కు 75 శాతం వెయిటేజీ; గ్రూప్ డిస్కషన్/గ్రూప్ టాస్క్‌లకు గరిష్ఠంగా 10 శాతం, ఇంటర్వ్యూకు 15 శాతం చొప్పున వెయిటేజీ కల్పిస్తున్నాయి.
- మరికొన్ని పీఎస్‌యూలు గేట్ స్కోర్‌కు 60 నుంచి 65 శాతం వెయిటేజీ ఇస్తూ.. మిగతా మొత్తాన్ని గ్రూప్ డిస్కషన్, పర్సనల్ ఇంటర్వ్యూలకు కేటాయిస్తున్నాయి. అయితే ఈ అంశంలో ఒక్కో పీఎస్‌యూ ఒక్కో విధానాన్ని అనుసరిస్తుంది. ఉదాహరణకు పవర్‌గ్రిడ్‌ను తీసుకుంటే గేట్ మార్కులకు 85 శాతం, గ్రూప్ డిస్కషన్‌కు 3 శాతం, ఇంటర్వ్యూకు 12 శాతం వెయిటేజీ ఇస్తుంది.
- చివరగా అభ్యర్థులు గేట్ స్కోర్, గ్రూప్ డిస్కషన్ / గ్రూప్ టాస్క్, పర్సనల్ ఇంటర్వ్యూ దశల్లో చూపిన ప్రతిభ ఆధారంగా వెయిటేజీని లెక్కిస్తారు. వెయిటేజీలో మంచి మార్కులు సాధించిన వారికి తుది జాబితాలో చోటు లభిస్తుంది.

కెరీర్ గైడ్

# ఇంజనీరింగ్ రత్నాలు



**గేట్ (గ్రాడ్యుయేట్ ఆప్టిట్యూడ్ టెస్ట్ ఇన్ ఇంజనీరింగ్)... ఒకప్పుడు ఇంజనీరింగ్‌లో పోస్ట్ గ్రాడ్యుయేషన్ కోర్సుల్లో చేరడానికి మాత్రమే ఉపయోగపడేది. కానీ ప్రస్తుతం ప్రభుత్వ రంగ సంస్థలు (పీఎస్‌యూ) గ్రాడ్యుయేట్ ఇంజనీర్స్, ట్రైనీ ఇంజనీర్స్ కొలువుల భర్తీ కోసం గేట్ స్కోర్‌ను ప్రామాణికంగా తీసుకుంటున్నాయి. దీంతో గేట్ రాసే అభ్యర్థుల దృష్టి పీఎస్‌యూల వైపు మళ్లింది. ఆకర్షణీయమైన జీతం, ప్రైవేట్ రంగంతో పోల్చితే సుస్థిరమైన కెరీర్‌కు హామీనిచ్చే పీఎస్‌యూల్లో ఉద్యోగాలకు ఇంజనీరింగ్ గ్రాడ్యుయేట్లలో మంచి ఆదరణ నెలకొంది. ఈ నేపథ్యంలో గేట్ స్కోర్ ద్వారా పీఎస్‌యూలు చేపట్టే నియామక ప్రక్రియ తీరు, అందుకు ఏవిధంగా సిద్ధం కావాలి, కటాఫ్స్ తదితర అంశాలపై విశ్లేషణ.**

గేట్ స్కోర్ ఆధారంగా పీఎస్‌యూలు ఉద్యోగులను నియమించుకునే పద్ధతి 2012 నుంచి ప్రారంభమైంది. దీంతో ఈ పరీక్ష పీఎస్‌యూ ఉద్యోగాలకు గేట్‌వేగా మారింది. ఫలితంగా గేట్‌కు ఒక్కసారిగా విపరీతమైన ఆదరణ పెరిగింది. ఆదేవిధంగా గేట్ పరీక్షకు హాజరవుతున్న వారి సంఖ్య కూడా ఏటా పెరుగుతూనే ఉంది. గేట్ - 2018 పరీక్ష కోసం దాదాపుగా పది లక్షల మంది అభ్యర్థులు రిజిస్ట్రేషన్ చేసుకున్నారు.

### 50 పీఎస్‌యూలు.. లక్షల్లో వేతనాలు

- దేశంలోని పీఎస్‌యూలను మినీ రత్న (బీఈఎంఎల్, బీఎస్ఎన్ఎల్, ఓఎన్‌జీసీ విదేశ్ వంటి సంస్థలు), మహారత్న (ఎన్‌టీపీసీ, కోల్ ఇండియా, గెయిల్, బీహెచ్‌ఈఎల్, ఓఎన్‌జీసీ వంటి సంస్థలు), నవరత్న (పవర్‌గ్రిడ్, హెచ్‌పీసీఎల్, వైజాగ్ స్టీల్, బీపీసీఎల్ వంటి సంస్థలు) అనే కేటగిరీలుగా విభజించారు. గేట్ స్కోర్ ద్వారా రిక్రూట్ చేసుకుంటున్న పీఎస్‌యూల సంఖ్య ఏటా పెరుగుతూనే ఉంది. గేట్ - 2018 ద్వారా దాదాపుగా 50 పీఎస్‌యూలు ఉద్యోగాల భర్తీకి సన్నాహాలు ప్రారంభించాయి. బీహెచ్‌ఈఎల్, గెయిల్, ఎన్‌హెచ్‌పీసీ, బీఎస్ఎన్ఎల్, డీఎంఆర్‌సీ ఈ జాబితాలో ప్రముఖమైనవి.
- మరో ముఖ్యమైన అంశం... పీఎస్‌యూలు భారీ సంఖ్యలో ఉద్యోగులను నియమించుకుంటున్నాయి. ఉదాహరణకు బీఎస్ఎన్ఎల్ ఈ ఏడాది (2017) గేట్ స్కోర్ ఆధారంగా రికార్డ్ స్థాయిలో 2,510 మందిని రిక్రూట్ చేసుకుంది. ఎంపికైన వారికి ఏడాదిపాటు ట్రెయినీగా శిక్షణ ఇస్తుంది. ఈ సమయంలో దాదాపు డెబ్భై వేల రూపాయల వరకు వేతనంగా పొందవచ్చు. విజయవంతంగా శిక్షణ పూర్తిచేసుకున్నవారికి అన్ని ప్రోత్సాహకాలూ కలుపుకొని ఏడాదికి రూ.12 లక్షల నుంచి 15 లక్షలను వేతనంగా పీఎస్‌యూలు చెల్లిస్తున్నాయి.

### గేట్-2017 కటాఫ్స్

| సంస్థ | బ్రాంచ్ | కటాఫ్ (జనరల్) |
|---|---|---|
| హెచ్ఏఎల్ | మేనేజ్‌మెంట్ ట్రైనీ (సివిల్) | 52.72 |
| హెచ్ఏఎల్ | డిజైన్ ట్రైనీ | 41.38 |
| హెచ్ఏఎల్ | టెక్నికల్ ట్రైనీ | 46.2 |
| ఎన్‌టీపీసీ | ఎలక్ట్రికల్ | 62.84 |
| ఎన్‌టీపీసీ | మెకానికల్ | 81.02 |
| ఎన్‌టీపీసీ | సివిల్ | 82.43 |
| ఎన్‌టీపీసీ | ఎలక్ట్రానిక్స్ | 65.95 |
| ఎన్‌టీపీసీ | ఇన్‌స్ట్రుమెంటేషన్ | 72.35 |
| బీఈఎంఎల్ | మెకానికల్ | 78.34 |
| బీఈఎంఎల్ | ఎలక్ట్రికల్ | 58.46 |
| బీఈఎంఎల్ | మెటలర్జీ | 50.01 |
| పవర్‌గ్రిడ్ | ఎలక్ట్రానిక్స్ | 69.17 |
| పవర్‌గ్రిడ్ | కంప్యూటర్ సైన్స్ | 68.53 |
| పవర్‌గ్రిడ్ | సివిల్ | 81.66 |
| పవర్‌గ్రిడ్ | ఎలక్ట్రికల్ | 63.18 |

### ఆసక్తి ఉన్న వారినే...

గేట్ స్కోర్ సాధారణంగా మూడేళ్లపాటు చెల్లుబాటు అవుతుంది. అయితే ఇది కేవలం ఇంజనీరింగ్ పోస్ట్ గ్రాడ్యుయేషన్ కోర్సుల్లో ప్రవేశానికి మాత్రమే ఉపయోగపడుతుంది. పీఎస్‌యూలకు ఏడాది / రెండేళ్లు... నియమాకాలు చేపట్టే సంస్థ నిబంధనలను బట్టి చెల్లుబాటులో ఉంటుంది. గేట్ - 2018 కోసం దరఖాస్తు చేసుకున్న వారు 2018లో పీఎస్‌యూలు చేపట్టే నియామక ప్రక్రియకు హాజరు కావచ్చు. ఆసక్తి ఉన్న అభ్యర్థులు గేట్ అడ్మిట్ కార్డ్ ఆధారంగా వాటికి దరఖాస్తు చేసుకోవాలి. గేట్ దరఖాస్తు సమయంలోనే అభ్యర్థులు తమకు పీఎస్‌యూ ఉద్యోగాలకు ఆసక్తి ఉందో లేదో తెలియజేయాలి. పీఎస్‌యూల్లో జాబ్‌కు ఆసక్తి ఉందని పేర్కొన్న అభ్యర్థుల స్కోర్‌ను మాత్రమే ఎంపిక ప్రక్రియకు పరిగణనలోకి తీసుకుంటాయి. పీఎస్‌యూ కొలువు కోరుకునే వారు గేట్ ప్రిపరేషన్‌తోపాటు సమాంతరంగా పీఎస్‌యూల ఎంపిక ప్రక్రియపైనా స్పష్టత ఏర్పరచుకోవాలి. పోటీ తీవ్రంగా ఉంటుంది. కాబట్టి గేట్‌లో మంచి స్కోర్ చేయడానికి ప్రయత్నించాలి.

### మూడు దశలుగా...

గేట్ స్కోర్ ద్వారా ఉద్యోగాలను భర్తీ చేసే ప్రక్రియలో పీఎస్‌యూలు మూడు దశలను అనుసరిస్తాయి. మొదటి దశలో గేట్ స్కోర్ ఆధారంగా అభ్యర్థులను షార్ట్‌లిస్ట్ చేస్తాయి. దీని ద్వారా తరవాతి దశలో రెండంచెల విధానాన్ని పాటిస్తాయి. అవి.. గ్రూప్ డిస్కషన్, పర్సనల్ ఇంటర్వ్యూ. మరికొన్ని సంస్థలు గ్రూప్ డిస్కషన్‌తోపాటు గ్రూప్ టాస్క్ అనే మరో ప్రత్యేక ఎంపిక ప్రక్రియను కూడా నిర్వహిస్తున్నాయి.


TRT(DSC) TM EM
SGT, SA (All Sub.), TPT, PET
Daily Test
Weekly Grand Test
అడ్మిషన్లు జరుగుతున్నవి
RAMAIAH Competitive Coaching Centre
Cell:8885555202


### గ్రూప్ డిస్కషన్ / గ్రూప్ టాస్క్

గ్రూప్ డిస్కషన్‌లో ఐదు నుంచి పది మంది అభ్యర్థులను ఒక బృందంగా ఏర్పరచి వారికి ఏదైనా ఒక అంశం ఇచ్చి చర్చించమని అడుగుతారు. ఇందుకు ఇటీవల వార్తల్లో నిలిచిన (కరెంట్ అఫైర్స్) సంఘటనలు / వ్యక్తులు వంటి వాటి ఆధారంగా నాలుగు అంశాలను ఇస్తారు. వాటిల్లో మెజారిటీ అభ్యర్థుల నిర్ణయం మేరకు ఒక అంశాన్ని ఎంచుకోవాలి. ఈ ప్రక్రియ మొత్తం అరగంట నుంచి గంట వ్యవధిలో ఉంటుంది. ఒక్కో అభ్యర్థికి సగటున అయిదు నిమిషాలు సమయం లభించే అవకాశముంది.

**గ్రూప్ టాస్క్:** ఇందులో ఏదైనా ఒక వాస్తవిక సమస్యను ఇస్తారు. అభ్యర్థులను బృందంగా ఏర్పాటు చేసి దానికి పరిష్కారం చూపమని అడుగుతారు. అభ్యర్థులు చదివిన బ్రాంచ్ / గేట్ పరీక్షకు హాజరైన బ్రాంచ్‌ను బట్టి ఇలాంటి టాస్క్‌లను కేటాయిస్తారు.

### ఇంటర్వ్యూ

ఇంటర్వ్యూలో వ్యక్తిగత నేపథ్యంతోపాటు సాంకేతిక నైపుణ్యాన్ని పరీక్షించే విధంగా ప్రశ్నలు ఎదురవుతాయి. సాంకేతిక నైపుణ్యాన్ని పరీక్షించడానికి బీటెక్‌లో చేసిన ప్రాజెక్ట్ వర్క్స్, ఇంటర్న్‌షిప్స్, సంబంధిత బ్రాంచ్‌లోని నూతన ఆవిష్కరణలపై అవగాహనను పరిశీలించడానికి ప్రాధాన్యం ఇస్తారు. నియామక ప్రక్రియ కూడా పీఎస్‌యూలను బట్టి మారుతూ ఉంటుంది. ఉదాహరణకు బీఎస్ఎన్ఎల్ కేవలం గేట్ స్కోర్ ఆధారంగానే టెలికాం ఆఫీసర్ పోస్టులను భర్తీ చేసింది.

### విడుదలైన నోటిఫికేషన్లు

- సంస్థ: **టిహెచ్‌డిసి**
  దరఖాస్తు తేదీ: జనవరి 5 - 31, 2018
  బ్రాంచ్‌లు: మెకానికల్, మెకానికల్ ఆటోమేషన్, ఎలక్ట్రికల్, ఈఈఈ, పవర్ సిస్టమ్స్ అండ్ హై ఓల్టేజీ, పవర్ ఇంజనీరింగ్, సివిల్.
  వెబ్‌సైట్: thdc.gov.in
- సంస్థ: **బిపిసిఎల్**
  దరఖాస్తు తేదీ: జనవరి 5 - ఫిబ్రవరి 2, 2018
  బ్రాంచ్‌లు: మెకానికల్
  వెబ్‌సైట్: www.bharatpetroleum.com
- సంస్థ: **పవర్‌గ్రిడ్**
  దరఖాస్తు తేదీ: జనవరి 5-31, 2018
  బ్రాంచ్‌లు: ఎలక్ట్రికల్, ఈసిఈ, సివిల్, కంప్యూటర్ సైన్స్, ఐటీ
  వెబ్‌సైట్: www.powergridindia.com
- సంస్థ: **ఎన్ఎల్‌సీ**
  దరఖాస్తు తేదీ: జనవరి 6-27, 2018
  బ్రాంచ్‌లు: మెకానికల్, ఈఈఈ, ఈసిఈ, సివిల్, ఇన్‌స్ట్రుమెంటేషన్, ఎలక్ట్రానిక్స్ ఇన్‌స్ట్రుమెంటేషన్, ఇన్‌స్ట్రుమెంటేషన్ అండ్ కంట్రోల్, కంప్యూటర్ సైన్స్, ఐటీ, మైనింగ్
  వెబ్‌సైట్: www.nlcindia.com
- సంస్థ: **ఎన్‌టీపీసీ**
  దరఖాస్తు తేదీ: జనవరి 10-31, 2018
  బ్రాంచ్‌లు: మెకానికల్, ప్రొడక్షన్, ఇండస్ట్రీయల్, థర్మల్, మెకానికల్ - ఆటోమేషన్, పవర్, ఎలక్ట్రికల్, ఈఈఈ, ఇన్‌స్ట్రుమెంటేషన్ అండ్ కంట్రోల్, పవర్ సిస్టమ్ అండ్ హై ఓల్టేజీ, పవర్ ఎలక్ట్రానిక్స్, మైనింగ్, ఈసీఈ, ఎలక్ట్రానిక్స్ అండ్ పవర్, ఎలక్ట్రానిక్స్ అండ్ ఇన్‌స్ట్రుమెంటేషన్.
  వెబ్‌సైట్: www.ntpc.co.in
- సంస్థ: **ఎండీఎల్**
  దరఖాస్తు తేదీ: జనవరి 8 - ఫిబ్రవరి 7, 2018
  బ్రాంచ్‌లు: మెకానికల్, మెకానికల్ అండ్ ప్రొడక్షన్, మెకానికల్ అండ్ ఇండస్ట్రీయల్, ప్రొడక్షన్ అండ్ మేనేజ్‌మెంట్, ప్రొడక్షన్, ప్రొడక్షన్ అండ్ ఇండస్ట్రీయల్, ఎలక్ట్రికల్, ఈఈఈ, ఎలక్ట్రికల్ అండ్ ఇన్‌స్ట్రుమెంటేషన్.
  వెబ్‌సైట్: www.mazdock.com
- సంస్థ: **ఐఓసీఎల్**
  దరఖాస్తు తేదీ: జనవరి 5 - ఫిబ్రవరి 4, 2017
  బ్రాంచ్‌లు: కెమికల్, పెట్రోకెమికల్, సివిల్, కంప్యూటర్స్, ఐటీ, ఎలక్ట్రికల్, ఈఈఈ, ఈసిఈ, ఎలక్ట్రానిక్స్ అండ్ టెలికమ్యూనికేషన్స్, ఇన్‌స్ట్రుమెంటేషన్, ఎలక్ట్రానిక్స్ అండ్ ఇన్‌స్ట్రుమెంటేషన్, మెకానికల్.
  వెబ్‌సైట్: www.iocl.com
- సంస్థ: **బిహెచ్‌ఈఎల్**
  దరఖాస్తు తేదీ: జనవరి 9 - ఫిబ్రవరి 3, 2018
  బ్రాంచ్‌లు: ఇండస్ట్రియల్ ప్రొడక్షన్, మెకానికల్ ప్రొడక్షన్, మెకనోట్రిక్స్, ప్రొడక్షన్ టెక్నాలజీ మాన్యుఫాక్చరింగ్, మాన్యుఫాక్చరింగ్ ప్రాసెస్ అండ్ ఆటోమేషన్, పవర్ ప్లాంట్ ప్రొడక్షన్, పవర్, ఈఈఈ, ఇన్‌స్ట్రుమెంటేషన్ అండ్ కంట్రోల్.
  వెబ్‌సైట్: careers.bhel.in

### త్వరలో దరఖాస్తు ప్రక్రియ ప్రారంభించనున్న సంస్థలు

సెయిల్, గెయిల్, హెచ్ఏఎల్, బీఈఎంఎల్, ఆయిల్ ఇండియా, బీబీఎన్ఎల్, టాటా పవర్, ఓఎన్‌జీసీ, డీఆర్‌డీవో, పీఎస్‌పీసీఎల్, హర్యానా పవర్, ఎన్ఎఫ్ఎల్, ఎంఈసీఎల్, ఎన్‌హెచ్ఏఐ, ఎన్‌పీసీఐఎల్, డీఎంఆర్‌సీ, ఐపీఆర్, పీఎస్‌టీసీఎల్, ఎన్‌బీసీసీ, ఎన్‌హెచ్‌పీసీ, క్రిభ్కో, ముంబై రైల్ వికాస్, ఇర్కాన్, కోల్ ఇండియా, కెఆర్‌సీఎల్, నాల్కో, ఓపీజీసీ, రైల్ వికాస్ నిగమ్, బిఎన్‌పీఎం.

---

పోటీ పరీక్షల ప్రత్యేకం

ఎకానమీ

# సామాజిక గతిశీలత.. ప్రాంతీయ అసమానతలు

**భారతదేశంలో విభిన్న జాతులు, మతాలు, తెగలు ఉండడం, వారు వేర్వేరు ప్రాంతాల్లో నివసించడంతో సామాజిక సాంస్కృతిక, ఆర్థిక, రాజకీయ అంశాల రీత్యా కొన్ని ప్రాంతాలు అభివృద్ధి చెందగా కొన్ని ప్రాంతాలు వెనకబడి ఉన్నాయి. వీటి మధ్య గల అసమానతలనే ప్రాంతీయ అసమానతలు అంటారు.**



### ప్రాంతీయ అసమానతలకు కారణాలు

- **భౌగోళికాంశాలు:** ప్రాంతీయ అసమానతలకు అనేక కారణాలున్నా వాటిలో ముఖ్యమైనవి భౌగోళికాంశాలు. అంటే భౌగోళికంగా కొన్ని ప్రాంతాలు ఇతర ప్రాంతాలతో సంఘటితమై ఉండకపోవడం. ఉదాహరణ: హిమాలయ పర్వత సరిహద్దు ప్రాంతాలైన జమ్ము, కశ్మీర్, ఉత్తర - తూర్పు పర్వత ప్రాంత ద్వీపాలు (అండమాన్, నికోబార్ దీవులు). ఇవి వెనుకబడి ఉండడానికి కారణం సహజసిద్ధ భౌగోళిక అంశాలేనని చెప్పొచ్చు.

### చారిత్రక అంశాలు

- స్వాతంత్ర్యానికి ముందు అవస్థాపన, మార్కెటింగ్, వాణిజ్యపరంగా అనుకూలంగా ఉన్న బొంబాయి, కలకత్తా, మద్రాసు మొదలైన నౌకాతీర నగరాలు ఆంగ్లేయ వ్యవస్థాపకుల పెట్టుబడులతో పారిశ్రామికంగా అభివృద్ధి చెందాయి.
- మహారాష్ట్ర, గుజరాత్, బెంగాల్ రాష్ట్రాలు వృద్ధి సాధించినా, మిగిలిన రాష్ట్రాలు వెనక ఉండడానికి ప్రధాన కారణం ఆంగ్లేయులు పెట్టుబడుల్లో చూపించిన ప్రాంతీయ వివక్షతే.
- ఆంగ్లేయులు అమలు చేసిన వ్యవసాయ విధానం గ్రామీణ పేదరికాన్ని పెంచింది. వ్యవసాయ రంగంలో మధ్యవర్తులను ప్రవేశపెట్టి కౌలుదారీ సమస్యలను పెంచారు. దీంతో వ్యవసాయాభివృద్ధి కుంటుపడింది. నీటి పారుదల సౌకర్యాల విస్తరణ, తోటల ప్రాంతాల్లో పెట్టుబడులు, అవస్థాపన అభివృద్ధిలో అన్ని ప్రాంతాలకు సమాన ప్రాతినిధ్యం ఇవ్వాలి.

### సహజ వనరులు

- సహజ వనరులు అన్ని ప్రాంతాల్లో లభించవు. అవి దొరికే ప్రాంతాల్లో పెట్టుబడుల కారణంగా వ్యత్యాసాలు పెరిగి అసమానతలు పెరిగాయి. ప్రాంతీయాభివృద్ధిని ప్రభావితం చేసే మరో అంశం వాతావరణం.

### ప్రభుత్వ విధానం

- 1951 తరవాత ప్రభుత్వం, పరిశ్రమల క్రమబద్ధీకరణ, నియంత్రణ చట్టాలు చేసి పారిశ్రామికీకరణం ద్వారా ప్రాంతీయ అసమానతలను తగ్గించవచ్చని భావించినా ప్రణాళికల్లో ఈ అంశానికి తగిన ప్రాధాన్యమివ్వలేదు. ప్రణాళికా వ్యయం కేటాయింపుల్లో కూడా వెనకబడిన ప్రాంతాలకు సరైన ప్రాతినిధ్యం లభించలేదు. అభివృద్ధి చెందిన రాష్ట్రాల్లో హెచ్చు స్థాయిలో పెట్టుబడులు సమకూరడం, వెనకబడిన రాష్ట్రాల్లో పెట్టుబడులు లభించకపోవడం, లభించిన పెట్టుబడులను కొన్ని ప్రాంతాల్లో అభిలషణీయంగా వినియోగించకపోవడం వల్ల ప్రాంతీయ అసమానతలు మరింత పెరిగాయి.

### కేంద్ర విత్త సంస్థల సహాయం

- కేంద్ర విత్త సంస్థలు, కేంద్ర బ్యాంక్ (ఆర్‌బిఐ), భారతీయ పారిశ్రామికాభివృద్ధి బ్యాంక్ (ఐడిబిఐ), జీవిత బీమా సంస్థ (ఎల్ఐసి), సాధారణ బీమా సంస్థ (జిఐసి)లు కొన్ని రాష్ట్రాలకు విత్త సహాయాన్ని అందించాయి. అందులో 67 శాతం అభివృద్ధి చెందిన రాష్ట్రాలకు, 21 శాతం వెనుకబడిన రాష్ట్రాలకు లభించింది. వెనుకబడిన రాష్ట్రాలన్నింటిలో అభివృద్ధి చెందిన మహారాష్ట్ర వాటా 21 శాతం. వెనకబడిన మూడు రాష్ట్రాలైన అస్సాం, బీహార్, ఒరిస్సాల వాటా 4 శాతం కంటే తక్కువగా ఉంది.

### రాష్ట్ర విత్త సంస్థల సహాయం

- రాష్ట్ర విత్త సంస్థల మొత్తం విత్త సహాయం రూ.20,896 కోట్లలో అభివృద్ధి చెందిన రాష్ట్రాల వాటా 70 శాతం కాగా వెనకబడిన రాష్ట్రాల వాటా 27 శాతంగా ఉంది. అస్సాం తదితర రాష్ట్రాల వాటా కేవలం 0.5 శాతం.
- అభివృద్ధి చెందిన రాష్ట్రాల్లో తలసరి ప్రణాళికా వ్యయం దేశ సగటు కంటే ఎక్కువగా ఉంది. పంజాబ్, హర్యానా రాష్ట్రాల్లో తలసరి ప్రణాళికా వ్యయం దేశ సగటు కంటే రెట్టింపు. కర్ణాటక, కేరళ, ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల్లో మధ్యస్థంగా ఉంది.
- బీహార్, ఉత్తరప్రదేశ్, మధ్య ప్రదేశ్, ఒరిస్సా రాష్ట్రాల తలసరి ప్రణాళికా వ్యయం దేశ సగటు కంటే తక్కువ.
- అభివృద్ధి చెందిన ముంబాయి, అహ్మదాబాద్, ఢిల్లీ, కలకత్తా, బెంగళూరు నగరాల్లో పరిశ్రమలు కేంద్రీకృతమై జనసాంద్రత పెరిగింది.

### హరిత విప్లవం

- హరిత విప్లవం అనే పదాన్ని మొదటగా ఉపయోగించింది విలియం గాడ్. ఫాదర్ ఆఫ్ గ్రీన్ రివల్యూషన్‌గా నార్మగ్ బోర్లాగ్‌ను పేర్కొంటారు. ఫాదర్ ఆఫ్ గ్రీన్ రివల్యూషన్ ఇన్ ఇండియాగా గుర్తింపు పొందింది ఎం.ఎస్. స్వామినాథన్
- జనాభా పరిమాణం, వృద్ధి రేటు ఎక్కువగా ఉన్న మనదేశంలో 1960 దశకం మధ్య కాలంలో ప్రవేశ పెట్టిన నూతన వ్యవసాయ విధానం, గ్రామీణ వ్యవస్థాపక అభివృద్ధికి భారీ పెట్టుబడులను తెచ్చింది. ఆధునిక ఉత్పత్తి పద్ధతులు, నీటి పారుదల సౌకర్యం అభివృద్ధి, సాంద్ర వ్యవసాయం, వ్యవసాయ ఉత్పత్తిని గణనీయంగా పెంచింది.
- నీటి వనరులు పుష్కలంగా లభించే పంజాబ్, హర్యానా, ఉత్తరప్రదేశ్ రాష్ట్రాల్లోని కొన్ని ప్రాంతాల్లో ప్రవేశపెట్టిన హరిత విప్లవం అప్పటికే మెరుగ్గా ఉన్న అక్కడి రైతుల ఆర్థిక స్థితిగతులను భారీగా పెంచి వారిని మరింత ధనవంతులను చేసింది.
- గ్రామీణ ప్రాంతాల్లో అధిక భాగం నీటి వసతి లేని భూములు, కరవు ప్రాంతాలు, అనుత్పాదక కమతాలు, వ్యవసాయేతర వృత్తులు వంటివి హరిత విప్లవం పరిధిలోకి రాకపోవడంతో ప్రాంతీయ ఆర్థిక అసమానతలు పెరిగాయి.
- సాంద్ర వ్యవసాయ ప్రాంతాల కార్యక్రమం వంటి వాటిని పరిమిత ప్రాంతాల్లోనే అమలు చేయడంతో సంతులన ప్రాంతీయాభివృద్ధి జరగలేదు.

**- లక్ష్మీజ్యోతి ఆర్. అల్లె**

---

## జాబ్ కార్నర్

### షా ఇన్‌స్టిట్యూట్

కోల్‌కతాలోని షా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ న్యూక్లియర్ ఫిజిక్స్- టెక్నికల్ అండ్ అడ్మినిస్ట్రేటివ్ పోస్టుల భర్తీకి దరఖాస్తులు కోరుతోంది.

- ఖాళీలు: 21
- పోస్టులు: టెక్నికల్ (ఇంజనీర్ 10, సైంటిఫిక్ అసిస్టెంట్ 6, టెక్నీషియన్ 3), అడ్మినిస్ట్రేటివ్ (ఎల్‌డిసి 2)
- దరఖాస్తుకు ఆఖరు తేదీ: డిసెంబరు 29
- వెబ్‌సైట్: www.saha.ac.in

### రికవరీ ట్రిబ్యునల్

మినిస్ట్రీ ఆఫ్ ఫైనాన్స్ ఆధ్వర్యంలోని డెబిట్స్ రికవరీ ట్రిబ్యునల్ - కింది పోస్టుల భర్తీకి దరఖాస్తులు కోరుతోంది

- ఖాళీలు: 10
- పోస్టులు: సెక్షన్ ఆఫీసర్ 1, రికవరీ ఇన్‌స్పెక్టర్ 1, అసిస్టెంట్ 1, అకౌంట్స్ అసిస్టెంట్ 1, స్టెనోగ్రాఫర్ 3, లోయర్ డివిజన్ క్లర్క్ 3
- అర్హత: గుర్తింపు పొందిన యూనివర్సిటీ నుంచి డిగ్రీ ఉత్తీర్ణులై ఉండాలి. నిర్దేశించిన మేర అనుభవం ఉండాలి.
- దరఖాస్తుకు ఆఖరు తేదీ: 2018 జనవరి 2
- చిరునామా: The Registrar/ Secretary, Debt Recovery Tribunal 1 Kolkata, Jeevan Sudha Building, 9th Floor, 42 C, Jawaharlal Nehru Road, Kolkata- 700071

### ఎయిర్ ఇండియా

ఎయిర్ ఇండియా ఇంజనీరింగ్ సర్వీసెస్ లిమిటెడ్ - ట్రేడ్స్‌మన్/ బెంచ్ ఫిట్టర్ పోస్టుల భర్తీకి దరఖాస్తులు కోరుతోంది.

- ఖాళీలు: 12
- అర్హత: ఫిట్టర్ ట్రేడ్‌లో ఎన్‌సివిటి/ ఐటిఐ సర్టిఫికెట్ పొంది ఉండాలి. ఎయిర్ బస్/ బోయింగ్ విమానాల్లో ఎయిర్ క్రాఫ్ట్ స్ట్రక్చరల్ రిపేర్/ ఎయిర్ క్రాఫ్ట్ మెయింటెనెన్స్‌కు సంబంధించి అనుభవం ఉన్నవారికి ప్రాధాన్యం ఉంటుంది.
- స్టయిపెండ్: శిక్షణ సమయంలో నెలకు రూ.15,000, శిక్షణ తర్వాత రూ. 17,680 చెల్లిస్తారు.
- దరఖాస్తుకు ఆఖరు తేదీ: డిసెంబరు 20
- వెబ్‌సైట్: www.airindia.in

ఆంధ్రజ్యోతి

అనేక

విజయవాడ • సోమవారం 4 డిసెంబరు 2017



## స్పాంజీలే మన పూర్వీకులు..!



మనుషులు, ఇతర జంతువులకు అత్యంత పూర్వీకులు స్పాంజీలేనంటున్నారు శాస్త్రవేత్తలు. ఇదివరకు చేసిన జన్యు విశ్లేషణలో మానవులు స్పాంజీల నుంచి జనించారా..? కోంబ్ జెల్లీల నుంచి జనించారా అన్న విషయమై సందిగ్ధత నెలకొన్న విషయం తెలిసిందే. ఈ నేపథ్యంలో 2015-2017 వరకు వెలువడిన అన్ని జన్యు అధ్యయనాలను యూకేలోని బ్రిస్టల్ వర్సిటీ అధ్యాయకులు లోతుగా విశ్లేషించారు. కోంబ్ జెల్లీల కంటే స్పాంజీలే మానవుల అత్యంత పూర్వీకులని ఈ విశ్లేషణలో తాము ప్రాథమికంగా ఓ అభిప్రాయానికి వచ్చినట్టు అధ్యాయకులు వెల్లడించారు.

# జ్వాలా రహస్యం

- వందల ఏళ్లుగా వెలిగే నవ జ్వాలలు
- హిమాచల్‌ప్రదేశ్‌లోని జ్వాలాజీ ఆలయ మిస్టరీ

నూనె పోయకుండా దీపం వెలుగుతుందా? ఒకటి కాదు.. రెండు కాదు.. వందల ఏళ్లపాటు జ్వాజ్వల్యమానంగా వెలుగుతుందా? అంటే.. వెలుగుతోంది. హిమాచల్‌ప్రదేశ్‌లోని జ్వాలాజీ ఆలయంలో తొమ్మిది జ్యోతులు అలా వెలుగుతున్నాయి. ఏమిటా విచిత్రం? వాటి రహస్యమేంటి?



## ని-దర్శనం

Nidarshanam

ప్రమిదలో నూనె అయిపోగానే దీపం కొండెక్కుతుంది. కొడిగట్టేటప్పుడే కాస్తంత నూనె పోస్తే మళ్లీ దేదీప్యమానంగా వెలుగుతుంది. కానీ.. హిమాచల్‌ప్రదేశ్‌లోని కాంగ్రాలో ఉన్న జ్వాలాజీ ఆలయంలో మాత్రం ఎలాంటి నూనె, నెయ్యి పోయకుండానే తొమ్మిది జ్వాలలు నిరంతరాయంగా జ్వలిస్తూ ఉంటాయి. ఆ ఆలయంలో ఎలాంటి విగ్రహమూ ఉండదు. అయితే, స్థానికులు ప్రధాన జ్వాలను సతీదేవి ఖండితాంగం(నాలుక)గా.. ఈ ఆలయాన్ని 51 శక్తిపీఠాల్లో అమ్మవారి నాలుక పడిన చోటుగా.. అమ్మవారిని 'మా మహాకాళి'గా, 'జ్వాలాజీ'గా భావించి పూజిస్తారు. మిగిలిన 8 జ్వాలలను.. సరస్వతి, అన్నపూర్ణ, మహాలక్ష్మి, హింగుళ, చండి, వింధ్యవాసిని, అంబిక, అంజన మాతలుగా ఆరాధిస్తారు.

### జ్వాల ఎలా?

ఇంతకీ ఆ జ్వాలలు ఎలా మండుతున్నాయి? ఇన్నాళ్లుగా ఎవరూ ఛేదించలేకపోయిన మిస్టరీ ఇది. ఆ ప్రాంతంలో ఉండే సహజవాయువు వల్ల వెలుగుతున్నాయని కొందరి వాదన. నెహ్రూ ప్రధానిగా ఉన్నప్పుడు ఓ జియాలజిస్టుల బృందం ఈ మిస్టరీని ఛేదించే ప్రయత్నం చేసింది. కానీ.. సహజవాయువు ఉన్న ఆధారాలేవీ దొరకక వట్టిచేతులతో వెనుదిరిగింది. అక్బర్ చక్రవర్తి కూడా ఈ జ్వాల రహస్యాన్ని కనుగొనే ప్రయత్నం చేశాడని.. ఇనప మూకుడుతో మూసి ఆక్సిజన్ అందకుండా చేసి ఆరుతుందో లేదో పరిశీలించాడని, జ్వాల పైకి నీళ్లు పారించాడని.. ఆ ప్రయత్నాలన్నీ విఫలం కావడంతో అమ్మవారికి బంగారు గొడుగు సమర్పించి వెళ్లిపోయాడని స్థానికులు చెబుతారు.





*అమ్మాయి రోడ్డుపై వెళ్తుంటే చాలు.. కుర్రాళ్లు రెచ్చిపోతారు. హే బేబీ..హే సెక్సీ అంటూ వెంటపడతారు. ఆమెను అడ్డుకుని అసభ్య చేష్టలతో అల్లరి పెడతారు. కొంతమంది అత్యాచారాలకూ తెగబడ్తారు. దేశమేదైనా వేధింపులు ఒక్కటే! ప్రాంతమేదైనా మహిళలపై లైంగిక హింస కామనే! 'మన సమాజంలో మహిళలపై లైంగిక వేధింపులు భాగం. బహిరంగ ప్రదేశాల్లో అవి మరీ ఎక్కువ' అని ఐక్యరాజ్య సమితి నివేదిక పేర్కొంది. లండన్, ముంబై, వాషింగ్టన్.. నగరాలు, సంస్కృతులు వేరైనా మహిళలు ఎదుర్కొంటున్న సమస్య ఒక్కటే. ప్రపంచవ్యాప్తంగా 35% మహిళలు లైంగిక హింసను ఎదుర్కొంటున్నారని 'యుఎన్ విమెన్' రిపోర్టు తెలిపింది.*



# హే బేబీ.. హే సెక్సీ..



## బహిరంగ ప్రదేశాల్లో మహిళలపై వేధింపులు

- దేశంలో 44% మహిళలు రోడ్లపై భద్రంగా లేరు
- 79శాతం మందిపై లైంగిక వేధింపులు
- అమెరికా, యూకే, ఆస్ట్రేలియా కూడా అతీతం కాదు
- ఆఫ్రికాలో రేప్ సర్వ సాధారణం: 'యూఎన్ విమెన్' నివేదిక

దక్షిణాసియా దేశాల్లో వీధులు, రోడ్లు, పార్కులు, బస్టాండులు, రైల్వే స్టేషన్లు, సినిమా హాళ్లు.. ఇలా బహిరంగ ప్రదేశాలను మగాళ్లు తమ సొత్తుగా భావిస్తారు. మహిళలను వేధించడానికి అడ్డాగా మార్చుకుంటారు. భారత్‌లో మహిళలు బయటకు రావాలంటేనే భయపడాల్సిన పరిస్థితి ఉంది. 2012లో ఢిల్లీలో నిర్భయకాండ తర్వాత బహిరంగప్రదేశాల్లో మహిళలు ఎదుర్కొంటున్న వేధింపుల గురించి భారత్‌లో చర్చ జరిగింది. బహిరంగ ప్రదేశాల్లో వెకిలి చేష్టలు, ఆకలి చూపులతో 44%మంది మహిళలు నిత్యం నరకం అనుభవిస్తున్నారని యూఎన్ విమెన్ నివేదిక తెలిపింది. ఆ నివేదిక ప్రకారం.. బంగ్లాదేశ్‌లో 84% మహిళలు పబ్లిక్ ప్లేసెస్‌లో నిత్యం అవమానాలు ఎదుర్కొంటున్నారు. భారత్, పాకిస్థాన్, బంగ్లాదేశ్‌ల్లో లింగవివక్ష దారుణంగా ఉంది. పనిచేయని భర్తలు కష్టపడి సంపాదించే భార్యలను తిట్టి, కొట్టి వేధిస్తున్నారు. మిడిల్ ఈస్ట్‌లో 37% అరబ్ మహిళలు ఏదోక రూపంలో లైంగిక హింసను అనుభవిస్తున్నారు. 22 అరబ్ దేశాల్లో మహిళలపై వేధింపులు, అత్యాచారాలు సర్వసాధారణం. 8 అరబ్ దేశాల్లో రేపిస్టులు బాధితులను పెళ్లి చేసుకుని నేరం నుంచి తప్పించుకుంటున్నారు. అటు ఈజిప్టులో 99% మహిళలు వేధింపులు ఎదుర్కొంటున్నారు. ఇక ఆఫ్రికా విషయానికొస్తే, టాంజానియాలో 50%, ఇథియోపియాలో 71% మంది మహిళలు భర్తలనుంచి హింసను ఎదుర్కొంటున్నారు. నైజీరియాలో 43%కు పైగా బాల్యవివాహాలే. దక్షిణాఫ్రికాలో 80% మంది మహిళలు శారీరకంగా, మానసికంగా చిత్రవధ అనుభవిస్తున్నారు. మూడేళ్ల క్రితం దక్షిణాఫ్రికాలోనే 53 వేల రేప్ కేసులు నమోదయ్యాయంటే పరిస్థితి ఎంత దారుణంగా ఉందో తెలుస్తోంది. ఇక జింబాబ్వేలో లైంగిక హింసపై ఫిర్యాదు చేస్తే మరిన్ని వేధింపులు ఎదుర్కోవాల్సిన పరిస్థితి!

### లాటిన్ అమెరికాలో..

లాటిన్ అమెరికాలో కూడా దాదాపు ఆసియాలోని పరిస్థితులు కనిపిస్తాయి. మహిళలను తిట్టడం, కొట్టడం సమాజంలో సర్వసాధారణం. బ్రెజిల్‌లో అయితే ఏకంగా పోలీసులే తమను వేధిస్తున్నారని 84శాతం మహిళలు ఫిర్యాదు చేశారు. ఇక మెక్సికోలో మహిళలపై హింస అంతా ఇంతా కాదు. ప్రతి పదిమందిలో తొమ్మిదిమంది లైంగిక హింసను ఎదుర్కొంటున్నారు. మెక్సికో నగరంలో 96శాతం మంది మహిళలు బహిరంగ ప్రదేశాల్లో మృగాళ్ల నుంచి సమస్యలు ఎదుర్కొంటున్నారు. ఆస్ట్రేలియా కూడా ఇందుకు మినహాయింపు కాదు. దేశంలోని 87శాతం మహిళలు వీధుల్లో ఏదోక రూపంలో వేధింపులు ఎదుర్కొంటున్నారు. సమాజంలో తరతరాల వివక్ష, మగాడు గొప్పవాడు అనుకునే దురహంకారం, పేదరికం, బాల్య వివాహాలు.. ఇలా అనేక కారణాలతో ప్రపంచవ్యాప్తంగా మహిళలు ఇంటా బయట నలిగిపోతున్నారని యుఎన్ రిపోర్టు పేర్కొంది. ముఖ్యంగా బహిరంగ ప్రదేశాల్లో, పనిచేసే చోట మహిళలు నిత్యం నరకం అనుభవిస్తున్నారని ఆందోళన వ్యక్తం చేసింది.



### ఉత్తర అమెరికాలో రేప్ కామన్

అగ్ర రాజ్యంలోనూ మహిళలు భద్రంగా లేరు. ఉత్తర అమెరికాలో ప్రతి నలుగురిలో ఒక మహిళ లైంగిక హింసను ఎదుర్కొంటోంది. రేప్ సర్వసాధారణంగా మారింది. అమెరికాలో 65% మంది మహిళలు రోడ్లపై అసభ్య చేష్టలను భరిస్తున్నారు. కెనడాలో 80% మహిళలు ఇళ్లలో లైంగిక దాడిని ఎదుర్కొంటున్నారు. వారిలో 2%కు మించి పోలీసులకు ఫిర్యాదు చేయడం లేదు. యూరోపియన్ యూనియన్‌లోని 28 సభ్య దేశాల్లో మహిళలు శారీరకంగా, మానసికంగా వేధింపులకు గురవుతున్నారు. డెన్మార్క్‌లో 52% మహిళలు లైంగిక హింసను ఎదుర్కొంటున్నారు. యూకేలో 64% మంది మహిళలు లైంగిక వేధింపులు ఎదుర్కొంటున్నారు. లండన్‌లో 35% మహిళలను పురుషులు బలవంతంగా తాకుతున్నారు.

### అంకెల్లో..

**35%** ప్రపంచవ్యాప్తంగా లైంగిక హింస ఎదుర్కొంటున్న మహిళల శాతం

**12 కోట్లు** బలవంతంగా లైంగిక చర్యకు గురవుతున్న అమ్మాయిలు

**75 కోట్లు** 18 సంవత్సరాలు రాకుండానే పెళ్లి అవుతున్న యువతులు

**79%** దేశంలో లైంగిక వేధింపులకు గురవుతున్న మహిళల శాతం

**99%** ఈజిప్టులో లైంగిక వేధింపుల బాధిత మహిళల శాతం

**65%** అమెరికాలో నడిరోడ్డుపైనే వేధింపులకు గురవుతున్న మహిళల శాతం

**84%** బ్రెజిల్‌లో పోలీసుల నుంచి వేధింపులు ఎదుర్కొంటున్న మహిళల శాతం

**64%** ఫిజీలో జీవిత భాగస్వామి నుంచి వేధింపులు ఎదుర్కొంటున్న మహిళల శాతం

*ఉత్తర అమెరికాలో ప్రతి నలుగురిలో ఒకరిపై లైంగిక దాడులు సాధారణం*

# ఒక సబ్‌మెరైన్.. 20 వార్‌హెడ్స్



- రష్యా విధ్వంసకర 'ప్రిన్స్ వ్లాదిమిర్'
- 9300 కి.మీ. పరిధిలో ఏ నగరమైనా స్మాష్
- అమెరికాకు సవాల్ విసురుతున్న రష్యా సబ్‌మెరైన్

మాస్కో, డిసెంబరు 3: రష్యా అమ్ములపొదిలో మరో మహాస్త్రం చేరింది. విధ్వంసకర 'ప్రిన్స్ వ్లాదిమిర్' సబ్‌మెరైన్‌ను రష్యా ఆవిష్కరించింది. ఒకేసారి 20 న్యూక్లియర్ వార్‌హెడ్స్‌తో విరుచుకుపడే సామర్థ్యం ఈ జలాంతర్గామి సొంతం! అంతేకాదు దాదాపు 9300 కిలోమీటర్ల పరిధిలో ఏ నగరాన్నైనా నాశనం చేయగలదు. సముద్రంలో 400 మీటర్ల లోతున శత్రుదేశాల రాడార్లకు చిక్కకుండా దూసుకెళ్లే ఈ సబ్‌మెరైన్‌ను రష్యా ఆవిష్కరించింది. 2012లో నిర్మాణం మొదలైన ఈ సబ్‌మెరైన్.. మరో ఏడాదిలో రష్యన్ నేవీకి పూర్తిస్థాయిలో అందుబాటులోకి వస్తుంది. రష్యాలో అత్యాధునిక బాలిస్టిక్ మిస్సైల్ సబ్‌మెరైన్‌గా నిలవనుంది. ఇంతవరకూ రష్యా దగ్గరున్న బొరేయ్ క్లాస్ సబ్‌మెరైన్లలో 16 మిస్సైల్ ట్యూబ్‌లు మాత్రమే ఉన్నాయి. ఇటీవల రష్యా ఆవిష్కరించిన బొరేయ్-ఏ క్లాస్ జలాంతర్గామిలో 20 లాంచర్లు ఉన్నాయి. అమెరికాకు చెందిన ఒహియో- క్లాస్ సబ్‌మెరైన్ల పరిధి 7800 కి.మీ. మాత్రమే! అయితే రష్యా 'ప్రిన్స్ వ్లాదిమిర్' రేంజ్ అంతకంటే ఎక్కువ.

### హిరోషిమా అణుబాంబు కంటే పదింతల శక్తి

ఒకేసారి 20 న్యూక్లియర్ వార్‌హెడ్స్ లాంచ్ చేసే సబ్‌మెరైన్‌తో రష్యా సంతృప్తి చెందడం లేదు. 2025నాటికి ఇంతకంటే పవర్‌ఫుల్ సబ్‌మెరైన్‌లను సిద్ధం చేస్తోంది. ఒకేసారి 96 నుంచి 200 వార్‌హెడ్స్‌తో వినాశనం సృష్టించగల ఎనిమిది బొరేయ్ క్లాస్ జలాంతర్గాములను నిర్మిస్తోంది. అంతేకాదు ఒక్కో వార్‌హెడ్ 100 నుంచి 150 కిలోటన్నుల సామర్థ్యం కల్గివుంటుందని రష్యా మీడియా వర్గాలంటున్నాయి. అంటే ఒక్కో వార్‌హెడ్.. హిరోషిమాపై దాడిలో వాడిన అణుబాంబు కంటే పదింతలు శక్తివంతమైనది!



### చైనా హైస్పీడ్ సబ్‌మెరైన్స్

అటు చైనా కూడా సైలెంట్‌గా మారణహోమం సృష్టించే అత్యాధునిక హైస్పీడ్ సబ్‌మెరైన్‌ను అభివృద్ధి చేసింది. అయస్కాంత చోదక వ్యవస్థతో పనిచేసే శబ్దం చేయని న్యూక్లియర్ సబ్‌మెరైన్‌ను.. చైనా షిప్‌బిల్డింగ్ ఇండస్ట్రీ కార్పొరేషన్ ఇటీవల పరీక్షించింది. ఇది పూర్తిస్థాయిలో విజయవంతమైతే అమెరికాసహా పాశ్చాత్య నౌకాదళాలకు తాము సవాల్ విసరడం ఖాయమని చైనా ధీమా వ్యక్తం చేస్తోంది. అంతేకాదు, క్షిపణులతో విరుచుకుపడం తోబాటు నీటిలో కూడా పోరాడగల్గిన.. సముద్రంలో పాక్షికంగా మునిగే యుద్ధనౌకలను కూడా చైనా తయారుచేస్తోంది.





## చత్తీస్‌గఢ్ సీఎం మూఢనమ్మకాలపై విమర్శలు

### 19 కార్లు.. అన్నింటికీ లక్కీ నెంబర్లు

రాయ్‌పూర్, డిసెంబరు 3: చత్తీస్‌గఢ్ సీఎం రమణ్‌సింగ్‌ను మరో వివాదం చుట్టుముట్టింది. ఇటీవల ఆయన తన కాన్వాయ్ కోసం 19 అత్యాధునిక మిత్సుబిషి పజెరో కార్లను కొనుగోలు చేశారు. వాటన్నింటి రిజిస్ట్రేషన్ నెంబర్లలో చివరి అంకెలు 004గా ఉన్నాయి. అయితే 19 విక్టరీ సింబల్‌ను సూచిస్తుందని, అందుకే ఆయన 19 కార్లను కొన్నారని విపక్షాలు విమర్శలు గుప్పించాయి. రాబోయే అసెంబ్లీ ఎన్నికల నేపథ్యంలో జ్యోతిష్యుడి సలహా ఆ మేరకే అన్ని కార్లకు లక్కీ నెంబర్ (004)ను కేటాయించారని, ఆయన అంధవిశ్వాసాలను ప్రోత్సహిస్తున్నారని మండిపడ్డాయి. అయితే తాను మూఢనమ్మకాలకు వ్యతిరేకమని, ఆ నెంబర్లు రవాణాశాఖ వారే కేటాయించారని రమణ్‌సింగ్ వివరణ ఇచ్చారు. గిరిజన ప్రాంతాల్లోని కొండమార్గాల్లో ప్రయాణిచించేందుకు మిత్సుబిషి కార్లు ఎంతో అనువుగా, సౌకర్యవంతగా ఉంటాయని.. అందుకే వాటిని కొనుగోలు చేసినట్లు బీజేపీ నేతలు చెప్పారు.

## కొడుకు కోసం త్రీడీ చేయి

- ఫలించిన ఓ తండ్రి ప్రయత్నం

బ్రిటన్‌లో బెన్‌ర్యాన్‌కు రెండేళ్ల క్రితం సూర్యగ్రహణం రోజు ముద్దులొలుకుతూ సోల్ పుట్టాడు. బిడ్డ ఎడమచేతి దగ్గర రక్తం గడ్డకట్టుకుపోవడంతో డాక్టర్లు తొలగించారు. సోల్‌కు డాక్టర్లు కృత్రిమ చేతిని అమర్చినా కదలిక ఉండేది కాదు. దీంతో సైకాలజీ టీచర్ అయిన బెన్ కొడుకు కోసం వస్తువులను పట్టుకోవడం, వాటిని కదిలించే విధంగా ఓ త్రీడీ ప్రింటెడ్ చేతిని డిజైన్ చేశాడు. ఆ త్రీడీ చేతితో పిల్లాడు వస్తువులను పట్టుకుంటున్నాడు. దీంతో అతడు అవయవ మార్పిడికి సంబంధించిన సేవలు మొదలుపెట్టాడు బెన్! 160 కుటుంబాలు తమ పిల్లల కోసం కూడా త్రీడీ ప్రింటెడ్ అవయవాల ఆర్డర్ ఇచ్చారు.





## 'ఆన్‌లైన్' రేప్..

### బరితెగించిన మానవ మృగం

### పదేళ్ల జైలుశిక్ష విధించిన స్వీడిష్ కోర్టు



స్టాక్‌హోం, డిసెంబరు 3: మృగాళ్లు ఇంటర్నెట్‌లోనూ రెచ్చిపోతున్నారు.వెబ్‌కామ్‌ల ముందు శాడిజం ప్రదర్శిస్తూ అమ్మాయిలను బెదిరించి లైంగిక నిర్బంధానికి పాల్పడుతున్నారు. స్వీడన్‌లో ఇలాంటి దారుణంపై తీవ్రంగా స్పందించిన స్వీడన్ కోర్టు జోర్న్ సామ్‌స్ట్రోమ్ అనే ఆన్‌లైన్ రేపిస్టుకు పదేళ్ల జైలుశిక్ష విధించింది. ఆన్‌లైన్‌లో లైంగిక నేరాలకు పాల్పడిన వ్యక్తిని రేపిస్ట్‌గా తేల్చి జైలు శిక్ష విధించడం స్వీడన్‌లో ఇదే తొలిసారి! కెనడా, బ్రిటన్, అమెరికాలకు చెందిన టీనేజర్లను సామ్‌స్ట్రోమ్ బెదిరించేవాడు. వెబ్‌కామ్‌లో తన ముందు సెక్స్ చేయకుంటే మీ తల్లిదండ్రులను చంపేస్తానని భయపెట్టేవాడు. ఇలా 2015 నుంచి 2017 మధ్య కాలంలో 27 నేరాలకు పాల్పడ్డాడు.



# నమ్మండి... ఇది తాగునీటి కాల్వ!



నమ్మండి. ఇది తాగునీటి కాలువే. ఒకటీ రెండు కాదు. ఏకంగా 60 గ్రామాల దాహార్తి తీర్చేది ఈ జలమే. ఆ ఊర్లన్నింటిలోని పొలాలకు సాగు నీరందించే కాల్వ కూడా ఇదే. చెత్తాచెదారం... గుర్రపు డెక్క.. కర్రనాచు... పశుకళేబరాలు... వ్యర్థాలతో కంపు కొడుతున్న ఈ నీరే ఆ గ్రామాల ప్రజలకు గొంతు తడిపేది. పశ్చిమగోదావరి జిల్లా కాళ్ళ మండలంలో వెంకయ్యవయ్యేరు పంటకాలువ ఇది. కాలుష్యకాసారంగా మారిన ఈ కాలువ గురించి పట్టించుకునే తీరిక ప్రజాప్రతినిధులకూ లేదు. అధికారులకూ లేదు. ఏలూరుపాడు లాకులు, వియర్ వద్ద కాలువ దుస్థితి ఇది. ఎగువలో ఆకివీడు, ఉండి, కాళ్ళ మండలాలతో పాటు కృష్ణా జిల్లాలోని పలు గ్రామాలకు కూడా ఈ కాలువ ద్వారానే సాగు, తాగునీటి అవసరాలు తీరుతున్నాయి.

- తాడేపల్లిగూడెం

# గ్రామాలకు ఎల్ఈడీ వెలుగులు

- వీధి దీపాల ఏర్పాటుకు రన్‌రేట్ మెకానిజం
- యుద్ధ ప్రాతిపదికన మూడో వైరు ఏర్పాటు
- ప్రతి సర్పంచ్ బాధ్యత తీసుకోవాలి: లోకేశ్
- పల్లె సీమల్లో చంద్రన్న కాంతిపై టెలికాన్ఫరెన్స్



అమరావతి, డిసెంబరు 3 (ఆంధ్రజ్యోతి): ప్రతి గ్రామంలో ఎల్ఈడీ వెలుగులు నింపేందుకు సర్పంచులు వ్యక్తిగతంగా బాధ్యత వహించాలని పంచాయతీరాజ్, గ్రామీణాభివృద్ధిశాఖ మంత్రి నారా లోకేశ్ ఆదేశించారు. ఆదివారం ఆయన 'పల్లె సీమల్లో చంద్రన్న కాంతి' కార్యక్రమంపై అధికారులతో టెలికాన్ఫరెన్స్ నిర్వహించారు. పల్లెల్లో ఎల్ఈడీ వీధి దీపాల ఏర్పాటుకు రన్‌రేట్ మెకానిజం ఆవశ్యకమని లోకేశ్ చెప్పారు. ప్రస్తుతం గ్రామాల్లో ఎన్ని ఎల్ఈడీ వీధి దీపాలున్నాయి?, ఎన్ని కొత్తగా వేశారు? సమయం వారీగా, గ్రామాల వారీగా, కరెంట్ స్తంభాల వారీగా ఏర్పాటుచేసే సంస్థల ప్రతిభను మెరుగుపరచడానికి రన్‌రేట్ మెకానిజం దోహదపడుతుందన్నారు. ఎల్ఈడీ బల్బుల కార్యక్రమంలో ప్రధానమైన మూడో వైర్ ఏర్పాటును యుద్ధ ప్రాతిపదికన పూర్తి చేయాలని విద్యుత్‌శాఖను కోరారు. గ్రామీణ వికాసానికి ప్రభుత్వం గ్రామాల్లో, గిరిజన ప్రాంతాల్లో పెద్దఎత్తున మౌలిక సదుపాయాల ప్రాజెక్టులు చేపట్టిందని, సిమెంట్‌రోడ్లు నిర్మిస్తోందని వివరించారు. కొత్త వీధిదీపాలు, కొత్త సిమెంట్ రోడ్లతో గ్రామాలు కొత్త శోభను సంతరించుకుంటాయని చెప్పారు. సీఎం డ్యాష్‌బోర్డుకు పంచాయతీరాజ్ డ్యాష్‌బోర్డును అనుసంధానించి ఎప్పటికప్పుడు ఈ కార్యక్రమ తీరుపై తాజా సమాచారం అందించాలని ఆదేశించారు. పంచాయతీరాజ్, గ్రామీణాభివృద్ధి శాఖ ముఖ్యకార్యదర్శి జవహర్‌రెడ్డి మాట్లాడుతూ మూడో వైరు ఏర్పాటు ఏయే ప్రాంతాల్లో ఎంత అవసరమో మీసేవ కేంద్రాల్లో రిజిస్టర్ చేసుకోవాలని పంచాయతీ కార్యదర్శులను ఆదేశించామన్నారు. పంచాయతీరాజ్, ఏపీసీడ్‌కో, ఇంధనశాఖ సమన్వయంతో పనిచేసి వీధిదీపాల ఏర్పాటుకు వారం ముందే మూడో వైరు వేయాలని ఆదేశించారు. సమన్వయం చేసుకోవడానికి జిల్లా స్థాయి బృందాలను నియమించాలని, నోడల్ ఆఫీసర్లతో కలిసి పనిచేయాలని కోరారు. సీసీఎంఎస్, డ్యాష్‌బోర్డు నిత్య పర్యవేక్షణలో వీధిదీపాలు ఒకేసారి వెలగడం, ఒకేసారి ఆరిపోయేలా చూడాలన్నారు. డిసెంబరు 1 నుంచి 15 దాకా రోజుకు వెయ్యి ఎల్ఈడీ బల్బులు అమర్చాలని ఈఈసీఎల్ లక్ష్యంగా పెట్టుకుందని, ఆ తర్వాత రోజుకు 6 వేల లైట్లు ఏర్పాటు చేస్తారన్నారు. ఎల్ఈడీ వీధి దీపాల సరఫరాకు ఈఈఎస్ఎల్ ఒక సమగ్ర ప్రణాళికతో ముందుకు రావాలని మంత్రి లోకేశ్ సూచించారు. మండల స్థాయిలో విద్యుత్ సమస్యలు తలెత్తి ఎల్ఈడీ లైట్లు సరిగ్గా పనిచేయని పక్షంలో ఆటోమేటిక్‌గా సరిచేసే విధానం ఉండాలన్నారు. మూడో వైరు లేని ప్రాంతాల్లో ఆ వైరును బిగించేలా డిస్కంలను ఇప్పటికే మంత్రి కళావెంకట్రావు ఆదేశించారని అధికారులు తెలిపారు. టెలికాన్ఫరెన్స్‌లో ఇంధనశాఖ అధికారులు అజయ్‌జైన్, విజయానంద్, దినేశ్ పరచూరి, హెచ్‌వై దొర, పంచాయతీరాజ్ కమిషనర్ రామాంజనేయులు, నెడ్‌క్యాప్ అధికారి వీసీ కమలాకర్‌బాబు, పంచాయతీరాజ్ నోడల్ అధికారి పరదేశికుమార్, ఈఈఎస్ఎల్ ప్రతినిధి శశికాంత్ పాల్గొన్నారు.

# జీఎస్టీ ఆదాయంలో 100 కోట్లకు కోత!

- నవంబరులో వచ్చింది 600 కోట్లే
- వ్యాపారుల వేచిచూసే ధోరణే కారణం

అమరావతి, డిసెంబరు 3(ఆంధ్రజ్యోతి): అసలే అంతంత మాత్రంగా నడుస్తున్న రాష్ట్ర ఆర్థిక శాఖకు జీఎస్టీ ఆదాయం రూపంలో మరో దెబ్బపడింది. నవంబరుకుగాను రూ.100 కోట్లకుపైగా జీఎస్టీ ఆదాయం తగ్గిపోయింది. అక్టోబరులో రూ.701 కోట్లు రాగా, నవంబరులో రూ.600 కోట్ల ఆదాయం మాత్రమే వచ్చింది. అయితే, రాష్ట్రంలోనే కాకుండా దేశవ్యాప్తంగా ఇదే తగ్గుదల నమోదైందని అధికారులు పేర్కొన్నారు. నవంబరులో కేంద్ర జీఎస్టీ ఆదాయం రూ.84,000 కోట్లకు మాత్రమే పరిమితమైందని చెప్పారు. అక్టోబరులో జీఎస్టీ ద్వారా కేంద్రానికి రూ.92,150 కోట్ల ఆదాయం వచ్చింది. గువాహటి సమావేశంలో జీఎస్టీ మండలి 170కి పైగా వస్తువుల ధరలు తగ్గించినప్పటికీ ఆ ప్రభావం మార్కెట్లపై ప్రతిఫలించలేదు. ముఖ్యంగా ట్రేడర్లు వేచిచూసే ధోరణి అవలంబిస్తున్నారని, ఈ కారణంతోనే ఆదాయం తగ్గి ఉంటుందని అధికారులు భావిస్తున్నారు. మరికొంతకాలం వేచిచూస్తే ప్రస్తుత జీఎస్టీ చట్టానికి కేంద్రం మరిన్ని సవరణలు చేపట్టే అవకాశాలున్నాయని వాణిజ్య వర్గాలు భావిస్తున్నట్టు పేర్కొన్నారు. ట్రేడర్లు అమ్మకాలు ప్రోత్సహిస్తే రాష్ట్ర జీఎస్టీ ఆదాయం పెరగుతుందన్నారు. జీఎస్టీలోని 12, 18% శ్లాబులను విలీనం చేస్తారంటూ వార్తలు వస్తున్న నేపథ్యంలో అది జరిగాక పూర్తిస్థాయిలో వ్యాపారాలు కొనసాగించాలనే ఉద్దేశంతో ట్రేడర్లు ఉన్నారని అధికారులు భావిస్తున్నారు. మరో రెండు నెలల వరకు ఆ అంశంపై మండలి సమావేశమయ్యే అవకాశం లేదని చెప్పారు. ఈ నేపథ్యంలో ట్రేడర్లు తమ పంథా మార్చుకోకపోతే డిసెంబరు, జనవరి నెలల్లో కూడా రాష్ట్ర జీఎస్టీ ఆదాయం తగ్గే అవకాశాలున్నాయని చెబుతున్నారు. జనవరి నెలాఖరులో జీఎస్టీ మండలి మరోసారి సమావేశమయ్యే అవకాశం ఉందని తెలిపారు. మరోపక్క, ఐజీఎస్టీ మాత్రం ప్రతి నెలా పెరుగుతోంది. జీఎస్టీ అమల్లోకి వచ్చిన కొత్తల్లో దానిపై సరైన అవగాహన లేక అమ్మకాలు సరిగా జరగలేదని, రానురాను జీఎస్టీలో పలు సవరణలు వచ్చాక అమ్మకాలు పెరగాయని పేర్కొన్నారు. ఐజీఎస్టీ గణాంకాలు ఇంకా చేపట్టలేదని సమాచారం.

## ఒక్క ఇల్లూ

# ప్రారంభం కాలేదు

### అడుగుపడని బీఎల్‌సీ, పీఎంఏవై పథకాలు.. బీఎల్‌సీ-1.02లక్షలు, పీఎంఏవై-48వేల ఇళ్లు

- లబ్ధిదారుల ఎంపిక వద్దే ప్రక్రియ
- మూడో త్రైమాసికం ముగుస్తున్నా అదే పరిస్థితి
- లబ్ధిదారుల ఎంపికలో ఎమ్మెల్యేల అలసత్వం

అమరావతి, డిసెంబరు 3(ఆంధ్రజ్యోతి): పక్కా ఇళ్ల నిర్మాణాలను వేగవంతం చేసిన ప్రభుత్వం... కొన్ని పథకాల విషయంలో అడుగు ముందుకు వేయలేకపోతోంది. భారీగా ఇళ్ల కేటాయింపులు చేసినా వాటిని సద్వినియోగం చేసుకోవడంలో విఫలమవుతోంది. అనేక కారణాలతో బీఎల్‌సీ, పీఎంఏవై ఇళ్ల పథకాలు ముందుకు సాగడం లేదు. ఈ ఆర్థిక సంవత్సరంలో మూడో త్రైమాసికం చివరి నెల వచ్చినా కేటాయించిన ఇళ్లలో ఒక్క ఇల్లు కూడా ప్రారంభం కాలేదు. రాష్ట్రం నిర్మిస్తున్న ఇళ్లతో పాటు కేంద్రం సహకారంతో కొన్ని పథకాలు చేపట్టింది. అందులో బెనిఫిషియరీ లెడ్ కన్‌స్ట్రక్షన్(బీఎల్‌సీ), ప్రధాన మంత్రి ఆవాస్ యోజన(పీఎంఏవై) పథకాలకు కేంద్రం ఏటా ఇళ్లు మంజూరు చేస్తోంది. కేంద్రం ఇచ్చే నిధులకు మరికొంత కలిపి రాష్ట్రం ఎన్టీఆర్ ఇళ్ల కింద ఈ నిర్మాణాలు చేపడుతోంది. ఇందులో భాగంగా ప్రస్తుత ఆర్థిక సంవత్సరం 2017-18లో బీఎల్‌సీకి 1,02,977, పీఎంఏవైకి 48,058 ఇళ్లు రాష్ట్రానికి కేటాయించారు. కానీ ఇప్పటి వరకూ ఒక్కటంటే ఒక్క ఇంటికీ పునాది పడలేదు. పీఎంఏవైలో 13వేల మంది లబ్ధిదారులను ఎంపికచేయగా... బీఎల్‌సీకి ఇంతవరకూ ఒక్క లబ్ధిదారున్ని కూడా ఎంపిక చేయకపోవడం గమనార్హం. రకరకాల కారణాలతో ఈ పథకాలు ప్రారంభదశలోనే ఆగిపోతున్నాయని అధికారులు అంటున్నారు.



బీఎల్‌సీలో స్థలాలున్న పేదలు దొరకడం కష్టమైతే, పీఎంఏవైకి కేంద్రం నిబంధనలు అడ్డుగా మారాయని అంటున్నారు. బీఎల్‌సీలో స్థలాల కొరత ఒక కారణమైతే టౌన్‌ప్లానింగ్ కఠిన నిబంధనలూ దానికి తోడయ్యాయి. ఈ విషయాన్ని అధికారులు ఇటీవల సీఎం దృష్టికి తీసుకెళ్లగా దాని నుంచి మినహాయింపునిచ్చారు. అయినా పథకంలో ఎలాంటి పురోగతీ కనిపించడం లేదు. మరోవైపు పీఎంఏవై పథకంలో నిబంధనలు అడ్డుగా ఉన్నా కొన్ని చోట్ల లబ్ధిదారులు సానుకూలంగానే ఉన్నా గృహనిర్మాణశాఖ అధికారులు పట్టించుకోవడం లేదనే విమర్శలు వస్తున్నాయి. పీఎంఏవై(గ్రామీణ్) ఇళ్లను గ్రామాల్లో చేపడుతున్నారు. ప్రస్తుతం గ్రామీణ ప్రాంతాల్లో రాష్ట్రవ్యాప్తంగా 21లక్షల ఇళ్ల డిమాండ్ ఉంది. అయినా కేంద్రం నుంచి వచ్చిన ఇళ్లనూ పట్టించుకోకపోవడం గమనార్హం.

లబ్ధిదారుల ఎంపికలోనూ జాప్యం తీవ్రంగా జరుగుతోంది. ఈ విషయంలో ఎమ్మెల్యేల అలసత్వంగా స్పష్టంగా కనిపిస్తోంది. ఇళ్ల నిర్మాణ పథకం ప్రారంభించిన కొత్తలో కేటాయింపులు చాల్లేదని ఎమ్మెల్యేలు లబ్ధిదారుల ఎంపికను పట్టించుకోలేదు. ఆ తర్వాత 2018-19కి కూడా కలిపి రెండేళ్లకు సంబంధించిన ఇళ్లను ఒకేసారి ప్రభుత్వం మంజూరుచేసింది. వాటితో పాటు కేంద్రం ఇళ్లూ ఉన్నాయి. అయినా లబ్ధిదారులను ఎంపికచేయడంలో ఎమ్మెల్యేలు అలసత్వం ప్రదర్శిస్తున్నారు. పీఎంఏవై ఇళ్లకు విశాఖపట్నం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, కర్నూలు తప్ప మిగిలిన జిల్లాల్లో ఒక్క లబ్ధిదారుడినీ ఎంపికచేయలేదు. ఒకట్రెండు జిల్లాల్లో కేంద్రం నిబంధనలకు అనుగుణంగా ఉన్న లబ్ధిదారులు లేరని చెబుతున్నా, అర్హులు ఉన్నచోట కూడా నాయకులు పట్టించుకోవడం లేదు. అలాగని అధికారులే లబ్ధిదారుల్ని ఎంపికచేస్తామంటే దానికి ఎమ్మెల్యేలు ఒప్పుకోవడం లేదు. దీంతో ఈ పథకం మరింత నత్తనడకన సాగుతోంది. ఈ పథకాల్లో జాప్యం వల్ల అంతిమంగా 2019 నాటికి పూర్తి చేయాలని పెట్టుకున్న లక్ష్యంపై ప్రభావం చూపుతోంది. గ్రామీణ గృహనిర్మాణశాఖ ఆధ్వర్యంలో 2019 నాటికి మొత్తం 12,97,950 ఇళ్లు పూర్తిచేయాలని లక్ష్యంగా పెట్టుకున్నారు. ఎన్టీఆర్ హౌసింగ్ పథకం కొంత వేగంగా జరుగుతున్నప్పటికీ బీఎల్‌సీ, పీఎంఏవై పథకాలు నత్తనడకన సాగుతున్నాయి. ఈ రెండు పథకాలకు వచ్చే ఆర్థిక సంవత్సరంలో కేంద్రం నుంచి మరికొన్ని ఇళ్లు మంజూరవుతాయి. ప్రస్తుత ఆర్థిక సంవత్సరానివే ప్రారంభించకపోతే వచ్చే ఏడాది ఇళ్లు ఎప్పుడు చేస్తారనే ప్రశ్న ఉత్పన్నమవుతోంది.



విజయనగరం జిల్లా పూసపాటిరేగ మండలంలో నిలిచిపోయిన ఇళ్ల నిర్మాణాలు

# ప్రీ ఫ్యాబ్రిక్ ఇళ్లకు బ్రేక్!

- 'కొంప'ముంచిన కొత్త ప్రయోగం... హుద్‌హుద్ బాధితులకు శాపం
- విజయనగరంలో ఆగిన ఇళ్లు... శ్రీకాకుళంలో పూర్తయిన నిర్మాణాలు

విజయనగరం, డిసెంబరు 3 (ఆంధ్రజ్యోతి): కొత్తగా వచ్చిన సాంకేతిక పరిజ్ఞానంతో ఇళ్ల నిర్మాణాలు చేపట్టాలన్న ప్రతిపాదన తుఫాను బాధితులను నిలువునా ముంచేసింది. ప్రీ ఫ్యాబ్రిక్ విధానం పేరుతో నిర్మించ తలపెట్టిన ఇళ్ల నిర్మాణాలు మధ్యలోనే నిలిచి పోయాయి. హుద్‌హుద్ తుపాను బీభత్సానికి రెండేళ్లు గడిచిపోయాయి. ఆ సమయంలో నష్టపోయిన ఒక్కో ఇంటికి ప్రభుత్వం రూ.4.80లక్షలు చొప్పున మంజూరు చేసింది. విజయనగరం జిల్లాకు 1,500 ఇళ్లను రూ.72కోట్లు వ్యయంతో నిర్మించేందుకు నిధులు కేటాయించింది. తీర గ్రామాలైన భోగాపురం, పూసపాటిరేగ, డెంకాడ, గంట్యాడ, జామి, విజయనగరం మండలాల్లో తుఫాను బాధితుల ఇళ్ల నిర్మాణాలు చేపట్టారు. ఇందులో గాజులరేగ, లంకాపట్నం, జామి, డెంకాడలో నిర్మాణాలు పూర్తయినా మిగిలినచోట్ల ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్న చందాన నిలిచిపోయాయి.

పూసపాటిరేగ మండలంలో జీ ప్లస్ టూ విధానంలో నిర్మించాల్సిన 224 ఇళ్లకు శ్లాబులు పూర్తిచేసి మిగిలిన పనులను చేపట్టకుండా విడిచిపెట్టారు. భోగాపురం మండలంలో 172 నిర్మాణాలు ప్రారంభమే కాలేదు. సముద్ర తీర మండలాలైన ఈ రెండుచోట్ల ఇళ్ల నిర్మాణాల విషయంలో గృహ నిర్మాణ విభాగం పూర్తిగా విఫలమైంది. దీనిపై మంత్రులు, జిల్లా అధికార యంత్రాంగం దృష్టి సారించడం లేదు. గంట్యాడ మండలానికి కేటాయించిన 52 ఇళ్లకు శ్లాబులు వేసి విడిచిపెట్టారు. పెంట్రశ్రీరాంపురంలో నిర్మాణాలే ప్రారంభం కాలేదు. హుద్‌హుద్ ప్రభావం విశాఖ, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలోనే అధికంగా ఉంది. శ్రీకాకుళం జిల్లా కేంద్రంలో ప్రతిపాదించిన ప్రీ ఫ్యాబ్రిక్ ఇళ్ల నిర్మాణాలు పూర్తి చేశారు. ఇక్కడి జిల్లా పరిషత్ సమీపంలోని నీళ్ల ట్యాంక్ వద్ద ఉన్న డంపింగ్ యార్డు స్థలంలో ఇవి ప్రారంభోత్సవానికి సిద్ధమవుతున్నాయి.

## పంచాయతీరాజ్ పునర్వ్యవస్థీకరణపై హర్షం

అమరావతి, డిసెంబరు 3 (ఆంధ్రజ్యోతి): ఆంధ్రప్రదేశ్ పంచాయతీరాజ్, గ్రామీణాభివృద్ధి శాఖల పునర్వ్యవస్థీకరణను స్వాగతిస్తున్నామని ఏపీ పంచాయతీరాజ్, గ్రామీణాభివృద్ధిశాఖ ఉద్యోగుల సంఘం రాష్ట్ర అధ్యక్షులు కేఎస్ వరప్రసాద్ ఒక ప్రకటనలో తెలిపారు. ఆదివారం పంచాయతీరాజ్ కమిషనరేట్ కార్యాలయంలో గౌరవాధ్యక్షులు పరదేశీకుమార్ అధ్యక్షతన సంఘం సభ్యులు సమావేశమయ్యారు. గ్రామీణాభివృద్ధికి అడ్డంకిగా ఉన్న సంస్థాగత లోపాలను సరిదిద్దేందుకు సీఎం చంద్రబాబు, పంచాయతీరాజ్‌శాఖ మంత్రి లోకేశ్ చర్యలు తీసుకోవడంపై హర్షం వ్యక్తం చేశారు. సమావేశంలో సంఘం కార్యదర్శి వై.బ్రహ్మయ్య, పలువురు ఏడీ, డీడీ, జేడీ, ఎంపీడీవోలు పాల్గొన్నారు.

## విశ్వబ్రాహ్మణులు రాజకీయంగా ఎదగాలి

- ఫెడరేషన్ చైర్మన్ కనకాచార్యులు పిలుపు

అమరావతి, డిసెంబరు 3 (ఆంధ్రజ్యోతి): విశ్వబ్రాహ్మణులు రాజకీయగా, ఆర్థికంగా, సామాజికంగా ఎదగాలని ఏపీ విశ్వబ్రాహ్మణ ఫెడరేషన్ చైర్మన్ కనకాచార్యులు సూచించారు. ఆదివారం విజయవాడలోని చిట్టినగర్ కామాక్షి విశ్వబ్రాహ్మణ కల్యాణ మండపంలో విశ్వబ్రాహ్మణ నాయకుల సమావేశం నిర్వహించారు. అన్ని జిల్లాల నాయకులు కమిటీలు ఏర్పాటుచేసుకుని 20 లక్షల మంది విశ్వబ్రాహ్మణుల సంక్షేమంపై ప్రణాళికలు తయారుచేసుకోవాలని కోరారు. ఈ కార్యక్రమంలో అన్ని జిల్లాల విశ్వబ్రాహ్మణ సంఘాల నేతలు పాల్గొన్నారు.

# సహజీవనం నిజమే

(మొదటి పేజీ తరువాయి)

జయ కుమార్తెనంటూ ప్రకటించి కలకలం రేపారు. డీఎన్ఏ పరీక్షలకు కూడా సిద్ధమని ఏకంగా సుప్రీంకోర్టునే ఆశ్రయించారు. సుప్రీంకోర్టు ఆమె పిటిషన్‌ను తోసిపుచ్చి కర్ణాటక హైకోర్టులో తేల్చుకోవాలని సూచించింది. సుప్రీంకోర్టులో అమృత దాఖలు చేసిన పిటిషన్ ప్రకారం.. 1980 ఆగస్టు 14న జయలలిత, అమృతకు జన్మనిచ్చారు. తన పెంపుడు తల్లి శైలజ 2015లో మరణించిందని, తండ్రి ఈ ఏడాది మార్చి 20న మృతి చెందాడని, జయలలిత బతికున్నప్పుడు కుమార్తెనని ప్రకటించుకుంటే ఆమె కీర్తి ప్రతిష్ఠలు దిగజారుతాయని ఆ రహస్యాన్ని దాచి పెట్టానని అమృత తెలిపారు. కర్ణాటక హైకోర్టులో పిటిషన్ వేయడానికి ఆమె సిద్ధమవుతున్నారు. జయకు బిడ్డ ఉన్న మాట వాస్తవమేనని ఆమె మేనత్త కూతురు లలిత కూడా ఇటీవల వెల్లడించారు. దివంగత తెలుగు సినీ నటుడు శోభన్‌బాబు, జయలలిత దాంపత్య ఫలితంగానే తాను జన్మించానని అమృత చెబుతున్న నేపథ్యంలో జయ, శోభన్‌బాబు మధ్య బంధం మరోసారి చర్చనీయాంశమైంది. నిజంగా జయలలిత, శోభన్‌బాబు కొంతకాలం సహజీవనం చేశారా? అసలు వారి నడుమ ఉన్న సంబంధం ఏమిటి? 80వ దశకం నాటి సినీ ప్రియుల నుంచి నేటి తరం సినీజీవుల వరకు ప్రతి ఒక్కరిలో ఆసక్తి రేపే ప్రశ్నలు ఇవి..!!



శోభన్‌బాబుకు భోజనం వడ్డిస్తున్న జయలలిత

### ఉవ్వెత్తున ఎగిసిన కెరటం!

తమిళనాటే కాదు దక్షిణభారత చలనచిత్ర రంగంలో తిరుగులేని నాయకిగా ఓ వెలుగు వెలిగారు జయలలిత. తమిళ వెండి తెర వేల్పు ఎంజీఆర్‌తో కలిసి ఆమె చేసిన తొలి చిత్రం 'ఆయిరత్తిల్ ఒరువన్'తో ఆమె కెరీర్ ఉవ్వెత్తున ఎగసింది. పదేళ్లలో తమిళ, తెలుగు, కన్నడ, హిందీసహా పలు భాషల్లో వందకుపైగా చిత్రాలలో నటించి సంచలనం సృష్టించారు. దక్షిణాది హీరోలు జయలలితతో నటించేందుకు పోటీ పడేవారు. ఇక తమిళనాట ఎంజీఆర్-జయలలిత జంటకు ప్రేక్షకులు బ్రహ్మరథం పట్టారు. ఎంజీఆర్‌తో కలిసి ఆమె 28 సినిమాలలో నటించారు. అయితే 'పట్టికాట్టు పొన్నయ్య' అనే చిత్రంలో నటిస్తున్నప్పుడు ఈ జంట మధ్య మనస్పర్థలు వచ్చాయి. దీనికి కారణం ఎంజీఆర్ డ్రీమ్ ప్రాజెక్టు 'ఉలగం సుట్రుం వాలిబన్' చిత్రంలో ఎంజీఆర్ జయను హీరోయిన్‌గా ఎంపిక చేయకపోవటమే. ఎంజీఆర్ ఆ చిత్రంలో కొత్త తారలు లత, మంజుల, చంద్రకళను ఎంపిక చేశారు. ఇది జయకు కంటగింపుగా మారింది. అదే సమయంలో 1971లో ఆమె తల్లి మృతి చెందారు. 1973లో ఎంజీఆర్‌కు జయ దూరంగా జరిగారు. ఆ తర్వాత జయ వ్యక్తిగత జీవితం పలు మలుపులు తిరిగింది. ఎంజీఆర్‌కి దూరమైన తర్వాత జయకు సినీ అవకాశాలు తగ్గుముఖం పట్టాయి. ఆమె నూరవ చిత్రం 'తిరుమాంగళ్యం' తర్వాత కేవలం మూడు చిత్రాలలో నటించారు. 1975లో ఉన్నట్టుండి సినిమాలకు గుడ్‌బై చెబుతున్నట్లు ప్రకటించారు. సినిమాలలో నటించడం మాని ఒంటరిగా గడిపేవారు.

### మా నడుమ గాఢమైన బంధం ఉంది!

అలాంటి తరుణంలో హీరో శోభన్‌బాబుతో జయ సన్నిహితంగా ఉంటున్నారంటూ పత్రికలలో కథనాలు వెలువడ్డాయి. తెలుగులో ఎన్టీఆర్, ఏఎన్నార్ తర్వాత కుటుంబ కథా చిత్రాల్లో నటిస్తూ మహిళలు మెచ్చిన నటుడిగా పేరుగడించిన శోభన్‌బాబుతో జయ అంతకు ముందే కొన్ని చిత్రాలలో జంటగా నటించినా అప్పట్లో వారి మధ్య అంతగా సంబంధాలు లేవు. ఎంజీఆర్‌కు దూరమైన తర్వాతే ఆమె హీరో శోభన్‌బాబుకు చేరువయ్యారు. 1979లో 'స్టార్ అండ్ స్టైల్' అనే ఆంగ్ల పత్రికలో వీరిరువురి రహస్య దాంపత్యంపై వార్త ప్రచురితమైంది. ఆ వార్తకు స్పందిస్తూ జయ ఆ పత్రికకు ఘాటైన లేఖ రాశారు. అందులో ఆ పత్రికా విలేకరి అయోమయంలో ఉన్నట్లు అనిపిస్తోందని, శోభన్‌బాబుతో తాను ఏడేళ్లపాటు 'గోయింగ్ స్టడీ' గాఢమైన అనుబంధం కలిగి ఉన్నానని, ఈ బంధం తన జీవితాంతం కొనసాగాలనే కోరుకుంటున్నానని, ఆయన వివాహితుడైనందున తనను పెళ్లి చేసుకోలేకపోతున్నారని కుండబద్దలు కొట్టినట్లు వివరించారు. శోభన్‌బాబును వివాహం చేసుకోలేకపోతున్నందున జీవితాంతం తాను 'జయలలిత జయరామ్' (జయరామ్ ఆమె తండ్రి)గా కొనసాగాలనుకుంటున్నానని తెలిపారు. తమ మధ్య బంధాన్ని తానెన్నడూ దాచిపెట్టలేదని, సినిమాలలో మునుపటిలా నటిస్తుంటే ఇమేజ్ కోసం దాచి పెట్టి ఉండేదానినని కూడా వివరించారు. తమిళ వారపత్రిక 'కుముదం' జయ ఆంగ్ల పత్రికకు రాసిన ఉత్తరాన్ని తమిళంలో అనువదించి అప్పట్లో ప్రచురించింది. మళ్లీ జయ ఆ తమిళ పత్రిక విలేకరిని తన వద్దకు పిలిపించుకుని శోభన్‌బాబుతో తనకున్న బంధం చాలా పవిత్రమైనదని చెప్పారు. అంతటితో ఆగకుండా 'తాళి కడితేనే భార్యాభర్తల బంధం ఉన్నట్లు అర్థమా, ఏ యువతీ పెళ్లయినవాడిని ఉద్దేశపూరితంగా ప్రేమించదు. తనకు అండగా నిలిచే వ్యక్తి కావాలనే కోరుకుంటుంది. ఊహించని విధంగా ఆయనతో మైత్రీబంధం కాస్త పవిత్రబంధంగా మారింది. ఇందులో ఆయనను తప్పుపట్టాల్సిన పనిలేదు. నేనాయనను కలుసుకునేటప్పటికే ఆయన వివాహితుడు. భార్యకు విడాకులిప్పించి ఇద్దరూ పెళ్లి చేసుకోవచ్చు కదా అని అందరూ అడుగుతున్నారు. అది చాలా తప్పు. ఏ నేరమూ చేయని 'ఆమె'ను ఎందుకు మేం నిరాకరించాలి? పైగా ఆమె అనారోగ్యంతో ఉన్నారు. వారికి ముగ్గురు కుమార్తెలు, ఓ కుమారుడు. నా వల్ల వారి జీవితానికి ఎలాంటి నష్టం కలుగకూడదనే ఈ గాఢమైన బంధం గురించి మౌనంగా ఉన్నాను' అని జయ వివరించారు. ఈ సంఘటనల తర్వాతే జయ, శోభన్‌బాబుల రహస్య జీవనం లోకానికి బహిర్గతమైంది.

### ఎంజీఆర్ జోక్యంతో ముగిసిన బంధం!

చాలాకాలం కొనసాగిన జయ, శోభన్ బంధం ఎంజీఆర్ జోక్యంతో ముగిసిపోయిందని అప్పట్లో పత్రికల్లో పెద్ద ఎత్తున కథనాలు ప్రచురితమయ్యాయి. 1982లో మళ్లీ ఎంజీఆర్‌కు జయ చేరువయ్యారు. తిరిగొచ్చిన జయకు ఎంజీఆర్ రాజకీయంగా మంచి ప్రాధాన్యం కల్పించారు. రాజకీయాల్లో బిజీగా మారటంతో శోభన్‌బాబు ఆమె జ్ఞాపకాల నుంచి శాశ్వతంగా దూరమైపోయారు. జయ రాజకీయాల్లో ఎదుగుతున్నప్పుడు శోభన్‌బాబుతో ఆమె బంధం గురించి 1989లో డీఎంకే పార్టీ పత్రిక మురసొలి నాలుగుపేజీల కథనాన్ని ఫొటోలతో సహా ప్రచురించింది. ఆ ఫొటోలు ఇరువురినీ దంపతులుగా తలపించే రీతిలో ఉన్నాయి. పోయెస్‌గార్డెన్‌లో శోభన్‌బాబుకు జయలలిత భోజనం వడ్డిస్తుండటం, ఇంటి గోడపై ఉన్న తన ఫొటోలను శోభన్‌బాబుకు చూపుతుండటం, తన ప్రత్యేక గదిలో శోభన్‌తో కబుర్లాడుతుండటం, ఇంటి నుండి బయలుదేరుతున్న ఆయనకు బాల్కనీపై నిలిచి టాటా చెబుతుండటం వంటి దృశాలతో ఉన్న ఆ ఫొటోలు అప్పట్లో సంచలనం రేపాయి. ఈ కథనంపై అప్పట్లో జయ కాస్త కుదుపునకు గురయ్యారు. కానీ ఆమె అధికార పీఠాన్ని అధిష్ఠించిన తర్వాత అవన్నీ తెరమరుగైపోయాయి. పాతపడిన ఆ సంగతులన్నీ జయ మృతి తర్వాత మళ్లీ వెలుగులోకి వస్తున్నాయి. సామాన్యులకు అంతుచిక్కని ఆమె వ్యక్తిగత జీవితాన్ని ఆసరాగా తీసుకొని తామే ఆమె వారసులమంటూ పలువురు తెరపైకి వచ్చారు. అసలు జయకు వారసులు ఉన్నారా? అమృత.. జయ, శోభన్ దాంపత్య ఫలమేనా? ఈ ప్రశ్నలకు కాలమే సమాధానం చెప్పాలి..!



రజియా(ఫైల్)



పోలీసుల అదుపులో నిందితుడు రషీద్

# నిండు గర్భిణి హత్య

- అడవిలోనే పూడ్చిపెట్టిన ప్రియుడు
- పెళ్లి చేసుకుంటానని తీసుకెళ్లి ఘాతుకం

డోన్, డిసెంబరు 3 : ప్రేమిస్తున్నానంటూ మాయ మాటలతో గర్భవతిని చేశాడు. పెళ్లి ప్రస్తావన తెచ్చేసరికి అటవీప్రాంతంలోకి తీసుకెళ్లి చంపి, అక్కడే పాతిపెట్టేశాడు. కర్నూలు జిల్లా డోన్‌లో ఆదివారం ఈ ఘటన వెలుగుచూసింది. పోలీసులు తెలిపిన వివరాల ప్రకారం.. డోన్ పట్టణంలోని కొండపేటకు చెందిన మల్లేష్, లక్ష్మీదేవి దంపతులు రంజాన్ మాసంలో కుమార్తె పుట్టడంతో షేక్ రజియా(19) అని పేరు పెట్టుకున్నారు. మల్లేష్ చనిపోవడంతో లక్ష్మీదేవి కుమార్తెను పెంచి, 12 ఏళ్ల వయసులోనే కొండపేటకు చెందిన చిన్నికి ఇచ్చి వివాహం చేసింది. వారికి ఐదేళ్ల కుమారుడు నిఖిల్ ఉన్నాడు. అయితే రజియా నాలుగేళ్ల క్రితం చిన్ని నుంచి విడిపోయి తల్లి వద్ద ఉంటూ ఓ గార్మెంట్ షాపులో పనిచేస్తోంది. ఆ దుకాణ యజమాని తమ్ముడు షేక్ రషీద్ అలియాస్ సిద్దు డిగ్రీ చదువుతున్నాడు. అన్న లేని సమయంలో షాపు వద్దకు వచ్చి వ్యాపారం చూసుకునేవాడు. రజియాను పెళ్లి చేసుకుంటానని నమ్మించి గర్భవతిని చేశాడు. పెళ్లి చేసుకోవాలని ఒత్తిడి చేయడంతో ఆమెను అంతమొందించేందుకు ప్లాన్ వేశాడు. నంద్యాలకు వెళ్లి పెళ్లి చేసుకుందామని నమ్మించి గత నెల 20న బస్సులో తీసుకెళ్లాడు. ఆరు కిలోమీటర్ల దూరంలోని ఎర్రగుంట్ల రోడ్డులో బస్సు దిగారు. వెనుక కారులో తన తల్లిదండ్రులు వస్తున్నారని, వారితోపాటు వెళ్దామని నమ్మించాడు. రోడ్డు పక్కనే ఉంటే ఎవరికైనా అనుమానం వస్తుందంటూ అటవీ ప్రాంతంలోకి తీసుకెళ్లాడు. అక్కడకు మరో ఇద్దరితో కలిసి రజియా మెడకు చున్నీ బిగించి హత్య చేశాడు. ఒక రోజు ముందే అక్కడ తీసి ఉంచిన గొయ్యిలో ఆమెను పూడ్చిపెట్టారు. కుమార్తె జాడ తెలియకపోవడంతో లక్ష్మీదేవి పోలీసుస్టేషన్‌లో ఫిర్యాదు చేశారు. దీంతో రషీద్ పోలీసులకు ఆదివారం లొంగిపోయాడు.

## మహిళా ప్రజాప్రతినిధులకు శిక్షణ

- ప్రతి జిల్లా నుంచి కనీసం 50 మందికి

అమరావతి, డిసెంబరు 3 (ఆంధ్రజ్యోతి): స్థానికసంస్థల మహిళా ప్రతినిధులకు కేంద్ర మహిళా శిశు సంక్షేమశాఖ శిక్షణ ఇవ్వనుంది. నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పబ్లిక్ కోఆపరేషన్ అండ్ చైల్డ్ డెవలప్‌మెంట్ సంస్థ ద్వారా మహిళా సర్పంచ్‌లు, మండలాధ్యక్షులు, జిల్లా పరిషత్ సభ్యులు, చైర్మన్లకు శిక్షణ ఇవ్వనున్నారు. మాస్టర్ ట్రైనర్లకు శిక్షణ కార్యక్రమాన్ని ఇటీవలే కేంద్ర మహిళా శిశు సంక్షేమశాఖ మంత్రి మేనకాగాంధీ ప్రారంభించారు. వచ్చే మార్చి నాటికి దేశంలో 20 వేల మంది స్థానికసంస్థల మహిళా ప్రజాప్రతినిధులకు శిక్షణ ఇవ్వాలని లక్ష్యంగా పెట్టుకున్నారు. ప్రతి జిల్లాలో కనీసం 50 మందికి శిక్షణ ఇవ్వనున్నారు. మహిళా సర్పంచుల బాధ్యతలను వారి భర్తలు నిర్వహిస్తున్నారని ప్రభుత్వం గుర్తించింది. మహిళా ప్రజాప్రతినిధులు వారి బాధ్యతలను గుర్తెరిగి సొంతంగా పాలన సాగించేందుకు వారిలో సామర్థ్యాన్ని పెంచేందుకు మహిళా శిశు సంక్షేమశాఖ మొట్టమొదట సారిగా శిక్షణ కార్యక్రమాన్ని చేపట్టింది. సరళతరమైన ఇంజనీరింగ్ నైపుణ్యం, విద్య, ఫైనాన్స్ విషయాల్లో వీరికి శిక్షణ ఇస్తారు. మహిళా ప్రతినిధులకు శిక్షణ ద్వారా గ్రామ పాలనలో మెరుగైన ఫలితాలొస్తాయని భావిస్తున్నారు. వారిలో చైతన్యం కలిగించిన మాస్టర్ ట్రైనర్లకు అవార్డులను ఇవ్వనున్నారు.

## అండర్-19 వరల్డ్‌కప్ కెప్టెన్‌గా పృథ్వీ షా

**న్యూఢిల్లీ:** ముంబై యువ సంచలనం పృథ్వీ షా.. వచ్చే ఏడాది జరగనున్న అండర్-19 వరల్డ్‌కప్‌లో భారత జట్టుకు సారథ్యం వహించనున్నాడు. జనవరి 13 నుంచి ఫిబ్రవరి 3 వరకు న్యూజిలాండ్‌లో వరల్డ్‌కప్ జరగనుంది. 15 మంది సభ్యుల భారత అండర్-19 జట్టును జూనియర్ సెలెక్షన్ కమిటీ సభ్యులు ఆదివారమిక్కడ ఎంపిక చేశారు. పంజాబ్ బ్యాట్స్‌మన్ శుభ్‌మన్ గిల్‌కు వైస్ కెప్టెన్సీని కట్టబెట్టారు. హార్విక్ దేశాయ్‌ను వికెట్ కీపర్‌గాను అతడికి బ్యాకప్‌గా ఆర్యన్‌ను సెలెక్టర్లు ఎంపిక చేశారు. అదనంగా ఐదుగురు ఆటగాళ్లు.. ఓం భోస్లే, రాహుల్ చాహర్, నినాద్ రథ్వా, ఉర్విల్ పటేల్, ఆదిత్య థాకరేను స్టాండ్ బై జాబితాలో చేర్చారు. న్యూజిలాండ్ బయల్దేరే ముందు ఈ నెల 8 నుంచి 22 వరకు బెంగళూరులో సన్నాహక శిబిరాన్ని నిర్వహిస్తారు.

# ఢిల్లీ మార్క్(స్క్) కాలుష్యం



- మూడో టెస్ట్‌కు అంతరాయం
- ముగ్గురికి వాంతులు : లంక కోచ్

**న్యూఢిల్లీ:** మూడో టెస్ట్‌కు కాలుష్యం సెగ తగిలింది. వాయు కాలుష్యం కారణంగా శ్వాస తీసుకునేందుకు ఇబ్బందిగా ఉందని రెండో రోజైన ఆదివారం లంక మూడుసార్లు మ్యాచ్‌కు అంతరాయం కలిగించింది. 123వ ఓవర్‌లో మూడు బంతులు వేశాక పేసర్ గమగె మొదట శ్వాస విషయంలో అంపైర్లకు ఫిర్యాదు చేశాడు. దీంతో మ్యాచ్ 17 నిమిషాల పాటు ఆగింది. ఈ సమయంలో ఇరు జట్ల కెప్టెన్లు చాందిమల్, కోహ్లీలతో అంపైర్లు చర్చించారు. గాలిలో నాణ్యత తగ్గడంతో ఆడేందుకు ఇబ్బందిగా ఉందని, మైదానం వీడతామని చాందిమల్ అంపైర్లకు తెలిపాడు. అయితే మ్యాచ్ రిఫరీ డేవిడ్ బూన్ డాక్టర్లతో సంప్రదించిన అనంతరం వారిని ఒప్పించాడు. దీంతో టెస్టు క్రికెట్ చరిత్రలోనే తొలిసారిగా ఆటగాళ్లు ముఖానికి మాస్కులు ధరించి ఆడారు. అయితే ఆ తర్వాత బంతికే గమగే అశ్విన్ వికెట్ తీశాడు. కొద్దిసేపటికే కోహ్లీ కూడా అవుటైన తర్వాత 127వ ఓవర్‌లో మరోసారి ఆట ఆగింది. ఈసారి లక్మల్ తన ఐదో బంతిని వేసిన అనంతరం శ్వాస విషయంలో ఇబ్బందిపడుతూ మైదానం వీడాడు. ఈసారి అంపైర్లు లంక మేనేజర్ గురుసిన్హాను పిలిపించారు. అటు భారత కోచ్ రవిశాస్త్రి కూడా అంపైర్లతో మాట్లాడాడు. లక్మల్ వేయాల్సిన చివరి బంతిని పెరీరా వేశాడు. ఆ తర్వాత ఓవర్‌ను సందకన్ ఐదు బంతులు వేశాక మ్యాచ్‌ను పది మందితోనే ఎలా ఆడాలంటూ చాందిమల్ అభ్యంతరం తెలుపుతూ అడ్డు చెప్పాడు. లంక కోచ్ నిక్ పోథస్ అంపైర్లతో మాట్లాడుతుండగా పెవిలియన్‌లో భారత కెప్టెన్ కోహ్లీ తీవ్ర అసంతృప్తితో కనిపించాడు. 'మేం బౌలింగ్ చేస్తాం.. ఎలాంటి సమస్య లేదు' అని సంజ్ఞ చేస్తూ ఆటగాళ్లను వెనక్కి రమ్మంటూ తమ ఇన్నింగ్స్‌ను డిక్లేర్ చేశాడు. పెవిలియన్‌కు వస్తున్నప్పుడు లంక ఆటగాళ్లను ప్రేక్షకులు 'లూజర్స్.. లూజర్స్' అంటూ గేలి చేశారు. మరోవైపు తమ ముగ్గురు ఆటగాళ్లు డ్రెస్సింగ్ రూమ్‌లో వాంతులు చేసుకున్నట్టు లంక కోచ్ పోథస్ తెలిపాడు. అయితే కాలుష్యం గురించి ఇంతగా వాదించిన లంక కెప్టెన్ చాందిమల్, మాథ్యూస్ బ్యాటింగ్ చేస్తున్నప్పుడు మాత్రం ముఖానికి మాస్కులు ధరించకపోవడం గమనార్హం.

**'20 వేల మందికి లేని ఇబ్బంది...':** వాయు కాలుష్యంతో స్టేడియంలో ఉన్న 20 వేల మంది ప్రేక్షకులతో పాటు భారత ఆటగాళ్లకు ఎలాంటి ఇబ్బంది కలగపోయినా లంక జట్టు ప్రవర్తన మాత్రం ఆశ్చర్యంగా ఉందని బీసీసీఐ తాత్కాలిక అధ్యక్షుడు సీకే ఖన్నా అన్నాడు ఈ విషయంలో శ్రీలంక క్రికెట్ బోర్డుకు లేఖ రాయాలని డీడీసీఏ కార్యదర్శికి సూచిస్తానని చెప్పాడు.




# విజేత రుత్విక శివాని

- పురుషుల రన్నరప్‌గా లక్ష్య సేన్
- టాటా ఓపెన్ బ్యాడ్మింటన్

**ముంబై:** వర్ధమాన షట్లర్ రుత్విక శివాని.. టాటా ఓపెన్ ఇండియా ఇంటర్నేషనల్ బ్యాడ్మింటన్ టైటిల్ సొంతం చేసుకుంది. కాగా, పురుషుల సింగిల్స్‌లో ఆరో సీడ్ లక్ష్యసేన్‌కు థాయ్ షట్లర్ షాకిచ్చాడు. ఆదివారం జరిగిన మహిళల సింగిల్స్ ఫైనల్లో రుత్విక శివాని 21-12, 23-21తో రియా ముఖర్జీని వరుస గేమ్‌ల్లో ఓడించి విజేతగా నిలిచింది. 40 నిమిషాలు పాటు జరిగిన పోరులో శివాని పూర్తి ఆధిపత్యం ప్రదర్శించింది. మొదటి గేమ్ ఆరంభంలో ఇద్దరు హోరాహోరీగా పోరాడడంతో ఆధిక్యం చేతులు మారుతూ 10-10 వద్ద స్కోరు సమమైంది. అయితే రుత్విక వరుసగా ఏడు పాయింట్లు సాధించి తొలి గేమ్‌ను 21-12తో తన ఖాతాలో వేసుకుంది. ఇక రెండో గేమ్‌లో చివరి వరకు పోటీ ఎదురైనా శివాని 23-21తో మ్యాచ్‌ను కైవసం చేసుకుంది. పురుషుల సింగిల్స్‌లో లక్ష్యసేన్ రన్నరప్‌తో సరిపెట్టుకున్నాడు. ఫైనల్లో లక్ష్యసేన్ 21-15, 14-21, 19-21తో సిత్తికోమ్ థమసిన్ చేతిలో పోరాడి ఓడాడు.

# మార్ష్ అజేయ శతకం

- ఆసీస్ 442/8 డిక్లేర్డ్
- ఇంగ్లండ్ 29/1

**అడిలైడ్:** షాన్ మార్ష్ (126 నాటౌట్) అజేయ శతకంతో చెలరేగడంతో ఇంగ్లండ్‌తో జరుగుతున్న యాషెష్ డే/నైట్ టెస్ట్‌లో ఆస్ట్రేలియా 442/8 పరుగుల వద్ద తొలి ఇన్నింగ్స్‌ను డిక్లేర్ చేసింది. 209/4 వద్ద రెండో రోజు ఆదివారం ఆటను ఆరంభించిన ఆసీస్.. పరుగులేమీ చేయకుండానే ఓవర్‌నైట్ బ్యాట్స్‌మన్ హ్యాండ్స్‌కోంబ్ (36) వికెట్‌ను కోల్పోయింది. బ్రాడ్ బౌలింగ్‌లో హ్యాండ్స్‌కోంబ్ వికెట్ల ముందు దొరికిపోయాడు. మరో ఓవర్‌నైట్ బ్యాట్స్‌మన్ మార్ష్‌కు జతకలసిన పైనీ (57) ఇన్నింగ్స్‌ను చక్కదిద్దే బాధ్యతలు తీసుకున్నాడు. వీరిద్దరూ మరో వికెట్ కోల్పోకుండా నెమ్మదిగా స్కోరు బోర్డును నడిపించారు. ఈ క్రమంలో మార్ష్ కెరీర్‌లో ఐదో సెంచరీ నమోదు చేసి తన ఎంపికపై వస్తోన్న విమర్శలకు సమాధానం చెప్పాడు. మార్ష్, పైనీలు ఆరో వికెట్‌కు 85 పరుగుల భాగస్వామ్యం జత చేశారు. ఓవర్టన్ (3/105)కు మూడు వికెట్లు దక్కగా.. బ్రాడ్ రెండు వికెట్లు పడగొట్టాడు. అనంతరం తొలి ఇన్నింగ్స్‌ను ఆరంభించిన ఇంగ్లండ్.. వర్షం కారణంగా ఆటనిలిపి వేసే సమయానికి వికెట్ నష్టానికి 29 పరుగులు చేసింది. ఓపెనర్ స్టోన్‌మన్ (18) స్టార్క్ బౌలింగ్‌లో ఎల్బీగా వెనుదిరిగాడు. కుక్ (11 బ్యాటింగ్), పరుగులేమీ చేయకుండా విన్సీ క్రీజులో ఉన్నారు.



## శ్రీవారి సేవలో మిథాలీ

**తిరుమల:** టీ20 వరల్డ్‌కప్ చాలెంజింగ్‌గా ఉంటుందని భారత్ మహిళా క్రికెట్ కెప్టెన్ మిథాలీ రాజ్ పేర్కొంది. ఆదివారం వేకువ జామున శ్రీవారి సుప్రభాత సేవలో ఆమె కుటుంబ సమేతంగా పాల్గొంది. ఆలయ అధికారులు ఆమెకు ప్రత్యేక దర్శన ఏర్పాట్లు చేసి, లడ్డూ, ప్రసాదాలను అందజేశారు. అనంతరం ఆమె మీడియాతో మాట్లాడి ంది. ఒలింపిక్స్‌లో టీ20 క్రికెట్‌ను చేర్చాలనే అంశంపై బీసీసీఐ నిర్ణయం తీసుకుంటుందని, వచ్చే ఏడాది జరిగే టీ 20 వరల్డ్ కప్ మ్యాచ్‌లకు పక్కా ప్రణాళికతో సిద్ధమవుతామని తెలిపింది. అలాగే జనవరిలో భారత మహిళల జట్టు దక్షిణాఫ్రికాలో పర్యటిస్తుందని తెలిపింది.

## శ్రీజేష్‌పై క్రమశిక్షణ చర్య ?

**భువనేశ్వర్:** భారత గోల్‌కీపర్ పీఆర్ శ్రీజేష్‌పై హాకీ ఇండియా (హెచ్ఐ) క్రమశిక్షణ చర్యలు తీసుకొనే అవకాశాలు కనిపిస్తున్నాయి. ఇందుకు కారణం.. టీమిండియా కెప్టెన్ విరాట్ కోహ్లీ 'సెలెబ్రిటీ క్లాసికో 2017' పేరిట అక్టోబరు 15న నిర్వహించిన ఫుట్‌బాల్ మ్యాచ్‌లో పాల్గొనడమే. సెలెబ్రిటీలు, క్రీడాకారులు తలపడిన ఆ మ్యాచ్‌లో 29 ఏళ్ల శ్రీజేష్ గోల్‌కీపర్‌గా వ్యవహరించాడు. ఏప్రిల్‌లో జరిగిన సుల్తాన్ అజ్లాన్ షా కప్ సందర్భంగా గాయపడిన శ్రీజేష్ దాని నుంచి కోలుకుంటున్న దశలో ఫుట్‌బాల్ మ్యాచ్‌లో పాల్గొనడాన్ని హాకీ ఇండియా తీవ్రంగా పరిగణిస్తోంది.

## పోరాడుతున్న వెస్టిండీస్

**వెల్లింగ్టన్:** కివీస్‌తో తొలి టెస్ట్ రెండో ఇన్నింగ్స్‌లో వెస్టిండీస్ బ్యాటింగ్ గాడిన పడింది. తొలి ఇన్నింగ్స్‌లో 134 పరుగులకే చేతులెత్తేసిన ఆ జట్టు రెండో ఇన్నింగ్స్‌లో పోరాడుతోంది. ఓపెనర్ బ్రాత్‌వైట్ (79 బ్యాటింగ్), హెట్‌మైర్ (66) హాఫ్ సెంచరీలు చేయడంతో రెండో ఇన్నింగ్స్‌లో ఆదివారం, మూడోరోజు ఆటముగిసే సరికి వెస్టిండీస్ రెండు వికెట్లకు 214 పరుగులు చేసింది. అయితే కివీస్ తొలి ఇన్నింగ్స్ స్కోరుకు ఇంకా 172 పరుగులు వెనుకంజలోనే ఉంది. ఇంకా ఎనిమిది వికెట్లు చేతిలో ఉండడంతో ఇన్నింగ్స్ ఓటమిని తప్పించుకుంటుందా అన్నది చూడాలి. అంతకు ముందు ఓవర్‌నైట్ స్కోరు 447/9తో మొదటి ఇన్నింగ్స్ కొనసాగించిన న్యూజిలాండ్ మరో 82 పరుగులు జోడించి 529/9తో డిక్లేర్ చేసింది. దాంతో ఆ జట్టు 386 పరుగుల భారీ తొలి ఇన్నింగ్స్ ఆధిక్యం కూడగట్టుకుంది.

### విరాట్ కోహ్లీ ద్విశతకాలు

| పరుగులు | ప్రత్యర్థి | వేదిక | ఎప్పుడు |
|---|---|---|---|
| 200 | వెస్టిండీస్ | నార్త్ సౌండ్ | 2016 |
| 211 | న్యూజిలాండ్ | ఇండోర్ | 2016 |
| 235 | ఇంగ్లండ్ | ముంబై | 2016 |
| 204 | బంగ్లాదేశ్ | హైదరాబాద్ | 2017 |
| 213 | శ్రీలంక | నాగ్‌పూర్ | 2017 |
| 243 | శ్రీలంక | న్యూఢిల్లీ | 2017 |

# ద్వి'రాట్' సిక్సర్

అసలే భీకరమైన ఫామ్‌లో ఉన్నాడు కోహ్లీ.. పైగా ఆడుతున్నది సొంత గడ్డ ఢిల్లీలో.. అప్పటికే సెంచరీ కొట్టేశాడు.. ఎదురుగా పసలేని లంక బౌలింగ్.. 'ద్వి'రాట పర్వం కొనసాగించేందుకు ఇంకేం కావాలి..! అందుకే.. పరుగుల రుచి మరిగిన పులిలా.. విరాట్ చెలరేగిపోయాడు..! ఫిరోజ్ షా కోట్లలో శాసించే ఆటతో ప్రత్యర్థి బౌలింగ్‌ను ఉతికి ఆరేశాడు..! అలవోకగా.. అనాయాసంగా... వరుసగా రెండోది.. కెరీర్‌లో ఆరో డబుల్ సెంచరీ బాదేసి రికార్డు బద్దలుకొట్టాడు...! రోహిత్ శర్మ సమయోచిత ఇన్నింగ్స్ తోడుగా.. జట్టుకు 500 పైచిలుకు భారీ స్కోరు అందించాడు..! వాయు కాలుష్యంతో ఇబ్బంది పడ్డ లంకేయులు.. పదేపదే ఆటను అడ్డుకుని ఏకాగ్రతను దెబ్బతీయకుంటే విరాట్ ట్రిపుల్ సెంచరీ సాధించేవాడేమో! అయినా.. క్రీజులో ఉన్నంతసేపూ ప్రత్యర్థులకు ఊపిరి ఆడనివ్వకుండా చేసిన ఈ ఢిల్లీ డైనమైట్ తన క్లాసిక్ బ్యాటింగ్‌తో అభిమానులను మురిపించాడు..! ఇక, కాలుష్యంతో ఊపిరి ఆడడం లేదంటూ ఫీల్డింగ్‌లో మాస్కులు ధరించిన పర్యాటక ఆటగాళ్లు.. బ్యాటింగ్‌కు వచ్చినప్పుడు మాత్రం ఎలాంటి ఫిర్యాదు చేయలేదు..! కానీ, తొలి బంతికే వికెట్ తీసిన షమి వారికి షాకివ్వగా.. అతనితో పాటు ఇషాంత్ కూడా పదునైన బంతులతో హడలెత్తించడంతో 131/3 స్కోరుతో లంక ఎదురీదుతోంది..!



కోహ్లీ (287 బంతుల్లో 25 ఫోర్లతో 243)

- కెప్టెన్‌గా ఆరో డబుల్ సెంచరీతో కోహ్లీ రికార్డు
- భారత్ తొలి ఇన్నింగ్స్ 536/7 డిక్లేర్డ్; లంక 131/3
- వాయు కాలుష్యంతో లంకేయుల ఇబ్బంది
- మూడుసార్లు ఆటను అడ్డుకున్న పర్యాటక జట్టు

**ఢిల్లీ:** శ్రీలంకతో మూడో, ఆఖరి టెస్టులో వరుసగా రెండో రోజూ భారత్‌దే పూర్తి ఆధిపత్యం. కెప్టెన్ విరాట్ కోహ్లీ (287 బంతుల్లో 25 ఫోర్లతో 243) కెరీర్ బెస్ట్ స్కోరుకు తోడు రోహిత్ శర్మ (102 బంతుల్లో 7 ఫోర్లు, 2 సిక్సర్లతో 65) సత్తా చాటడంతో టీమిండియా 536/7 పరుగుల భారీ స్కోరు వద్ద మొదటి ఇన్నింగ్స్‌ను డిక్లేర్ చేసింది. లంచ్ తర్వాత లంక ఆటగాళ్లు ఆటను నిలిపి వేయాలంటూ పదే పదే అంపైర్లను కోరడంతో చిర్రెత్తుకొచ్చిన కోహ్లీ అనూహ్యంగా ఇన్నింగ్స్‌ను డిక్లేర్ చేశారు. అనంతరం బ్యాటింగ్‌కు వచ్చిన లంక ఆట చివరకు తొలి ఇన్నింగ్స్‌లో మూడు వికెట్ల నష్టానికి 131 పరుగులతో నిలిచింది. ఏంజెలో మాథ్యూస్ (57 బ్యాటింగ్), దినేశ్ చాందిమల్ (25 బ్యాటింగ్) క్రీజులో ఉన్నారు. ఆతిథ్య బౌలర్లలో షమి, ఇషాంత్, జడేజా తలో వికెట్ తీశారు. భారత స్కోరుకు లంక ఇంకా 405 పరుగుల దూరంలో ఉంది. ఫాలోఆన్ తప్పించుకోవాలన్నా మరో 205 పరుగులు చేయాలి. గాయం కారణంగా ఓపెనర్ సమరవిక్రమ బ్యాటింగ్ చేస్తాడో లేదో తెలియని పరిస్థితి. దాంతో, మాథ్యూస్, చాందిమల్ ఎంతసేపు పోరాడుతారన్న దానిపైనే లంక భవితవ్యం ఆధారపడి ఉంది.

### కోహ్లీ రికార్డు డబుల్..

ఆదివారం అనూహ్య పరిణామాలు చోటు చేసుకున్నా.. భారత సారథి విరాట్ ఆట హైలైట్‌గా నిలిచింది. ఓవర్‌నైట్ స్కోరు 371/4తో భారత్ ఆట కొనసాగించగా.. కోహ్లీ, రోహిత్ స్వేచ్ఛగా బ్యాటింగ్ చేశారు. కొత్త బంతితో లంక పేసర్లు ఏ మాత్రం ప్రభావం చూపలేకపోవడంతో ఇద్దరూ అలవోకగా బౌండ్రీలు కొట్టారు. వీరి ముందు స్పిన్నర్లు కూడా తేలిపోయారు. గమగె వేసిన బంతిని డీప్ మిడ్ వికెట్ మీదుగా పుల్ చేసి డబుల్ తీసిన కోహ్లీ 238 బంతుల్లో ద్విశతకం పూర్తి చేసుకున్నాడు. సందకన్ బౌలింగ్‌లో లాఫ్టెడ్ షాట్‌తో సిక్సర్ కొట్టిన రోహిత్.. పెరీర ఓవర్లో మరో సిక్సర్‌తో హాఫ్ సెంచరీ మార్కు దాటాడు. వీరిద్దరి ధాటికి తొలి సెషన్‌లోనే 129 పరుగులు రాబట్టిన భారత్ 500/5 స్కోరుతో లంచ్‌కు వెళ్లింది. విరామం నుంచి వచ్చిన వెంటనే.. సందకన్ బౌలింగ్‌లో కీపర్‌కు క్యాచ్ ఇచ్చిన రోహిత్ వెనుదిరిగాడు. అయినా కోహ్లీ ధాటిని కొనసాగించగా.. 123వ ఓవర్లో మూడో బంతి వేసిన తర్వాత పేసర్ గమగె ఒక్కసారిగా బౌలింగ్ ఆపాడు. ఆ వెంటనే శ్వాస తీసుకోవడం కష్టంగా ఉందంటూ కెప్టెన్ చాందిమల్ ఫీల్డ్ అంపైర్లకు ఫిర్యాదు చేయడంతో మ్యాచ్‌కు తొలిసారి అంతరాయం కలిగింది. అంపైర్లు సర్దిచెప్పి ఆటను కొనసాగించగా అప్పటికే ఏకాగ్రత కోల్పోయిన అశ్విన్ (4)... గమగె వేసిన తర్వాతి బంతికే అవుటయ్యాడు. కాసేపటికే మరోసారి ఆట నిలవడంతో లయ తప్పిన కోహ్లీ.. సందకన్ బౌలింగ్‌లో వికెట్ల ముందు దొరికిపోయాడు. మూడోసారి సబ్‌స్టిట్యూట్ ఫీల్డర్ కావాలని లంకేయులు పేచి పెట్టడంతో కోహ్లీ ఇన్నింగ్స్‌ను డిక్లేర్ చేశాడు.



డిక్లరేషన్‌ను ప్రకటిస్తూ...

### చేజేతులా రెండు క్యాచ్‌లు..

ఫీల్డింగ్ చేసేందుకు నిరాకరించిన లంక.. భారత ఇన్నింగ్స్ ముగియగానే ఏమీ మాట్లాకుండా బ్యాటింగ్‌కు రాగా.. తొలి బంతికే కరుణరత్నె (0)ను అవుట్ చేసిన షమి ప్రత్యర్థికి షాకిచ్చాడు. ఆరో ఓవర్లో అతను ధనంజయ డిసిల్వ (1)ను ఇషాంత్ ఎల్బీగా అవుట్ చేయడంతో లంక 14/2తో టీ బ్రేక్‌కు వెళ్లింది. టీ తర్వాత స్లిప్‌లో వెంటవెంటనే భారత్ రెండు క్యాచ్‌లు జారవిడించింది. తొలుత షమి బౌలింగ్‌లో దిల్‌రువాన్ పెరీర (42) క్యాచ్‌ను ధవన్, ఇషాంత్ ఓవర్లో మాథ్యూస్ క్యాచ్‌ను కోహ్లీ వది లేశారు. అప్పటికి అతని స్కోరు 16, 6 స్కోర్లతో నిలిచిన పెరీర, మాథ్యూస్ ఈ అవకాశాలను సద్వినియోగం చేసుకొని రెండో వికెట్‌కు 61 పరుగులు జోడించాడు. 19వ ఓవర్లో పెరీరను జడేజాను అవుట్ చేసినా.. మాథ్యూస్, చాందిమల్ మరో వికెట్ పడకుండా రోజు ముగించారు. మొత్తానికి భారత్ రెండు క్యాచ్‌లు జారవిడవడం లంకకు కలిసొచ్చింది.

### పుజారా స్ఫూర్తితో ...

అలవోకగా డబుల్ సెంచరీలు బాదేస్తూ.. ఎన్నో రికార్డులు బద్దలు కొడుతున్న కెప్టెన్ విరాట్ కోహ్లీ.. తాను ఇలా భారీ ఇన్నింగ్స్‌లు ఆడేందుకు మిస్టర్ డిపెండబుల్ చటేశ్వర్ పుజారా స్ఫూర్తి అని అంటున్నాడు. ఢిల్లీలో రెండో రోజు ఆట ముగిసిన తర్వాత పుజారాతో కలిసి మాట్లాడిన విరాట్.. ఆరో డబుల్ సెంచరీ చేయడం గొప్ప అనుభూతిని ఇచ్చిందని చెప్పాడు. 'నా మైండ్‌సెట్ ఎప్పుడూ భారీ సెంచరీలు చేయాలని ఉంటుంది. కెరీర్ ఆరంభంలో నువ్వు (పుజారాను చూస్తూ) అలాంటి సెంచరీలు ఎన్నో చేశావు. వాటిని చూసి నేను ఎంతో నేర్చుకున్నా. సుదీర్ఘ సమయం ఏకాగ్రతను కాపాడుకోవడం ఎలానో గ్రహించా. పుజారా ఆడే సుదీర్ఘ ఇన్నింగ్స్‌లు, అతని ఏకాగ్రత స్థాయి చూసి మేమంతా ఎన్నో విషయాలు నేర్చుకున్నాం' అన్నాడు.

**భారత్ తొలి ఇన్నింగ్స్:** విజయ్ (స్టంప్డ్) డిక్‌వెలా (బి) సందకన్ 155; ధవన్ (సి) లక్మల్ (బి) పెరీర 23; పుజారా (సి) సమరవిక్రమ (బి) గమగె 23; కోహ్లీ (ఎల్బీ) సందకన్ 243; రహానె (స్టంప్డ్) డిక్‌వెలా (బి) సందకన్ 1; రోహిత్ (సి) డిక్‌వెలా (బి) సందకన్ 65, అశ్విన్ (సి) పెరీర (బి) గమగె 4, సాహా (నాటౌట్) 9, జడేజా (నాటౌట్) 5; **ఎక్స్‌ట్రాలు 8; మొత్తం: 127.5 ఓవర్లలో 536/7 డిక్లేర్డ్; వికెట్ల పతనం:** 1-42, 2-78, 3-361, 4-365, 5-500, 6-519, 7-523; **బౌలింగ్:** లక్మల్ 21.2-2-80-0, గమగె 25.3-7-95-2, పెరీర 31.1-0-145-1, సందకన్ 33.5-1-167-4, డిసిల్వ 16-0-48-0.

**శ్రీలంక తొలి ఇన్నింగ్స్:** కరుణరత్నె (సి) సాహా (బి) షమి 0, పెరీర (ఎల్బీ) జడేజా 42, డిసిల్వ (ఎల్బీ) ఇషాంత్ 1, మాథ్యూస్ (నాటౌట్) 57, చాందిమల్ (నాటౌట్) 25; **ఎక్స్‌ట్రాలు: 6; మొత్తం: 44.3 ఓవర్లలో 131/3; వికెట్ల పతనం:** 1-0, 2-14, 3-75; **బౌలింగ్:** షమి 11-3-30-1, ఇషాంత్ 10-4-44-1, జడేజా 14.3-6-24-1, అశ్విన్ 9-3-28-0.

**1** అత్యధిక డబుల్ సెంచరీలు సాధించిన కెప్టెన్ విరాట్ కోహ్లీ. సారథిగా కేవలం 50 ఇన్నింగ్స్‌ల్లోనే ఈ ఫీట్ సాధించాడు. లారా ఐదు డబుల్ సెంచరీ (85 ఇన్నింగ్స్)ల రికార్డును అధిగమించాడు.

టెస్టుల్లో అత్యధిక వ్యక్తిగత స్కోరు (243) సాధించిన భారత కెప్టెన్ కోహ్లీ.

**2** వరుస ఇన్నింగ్స్‌ల్లో రెండు డబుల్ సెంచరీలు సాధించిన భారత రెండో బ్యాట్స్‌మన్ కోహ్లీ. అంతకుముందు వినోద్ కాంబ్లీ (1993లో) ఈ ఘనత సాధించాడు. ఓవరాల్‌గా విరాట్ ఆరో బ్యాట్స్‌మన్.

ఓ సిరీస్‌లో రెండు డబుల్ సెంచరీలు సాధించిన భారత రెండో బ్యాట్స్‌మన్‌గా కోహ్లీ. గతంలో వినూ మన్కడ్ (కివీస్‌పై 1955/56లో) ఈ ఫీట్ సాధించాడు.

**3** ఈ ఏడాది కోహ్లీ డబుల్ సెంచరీల సంఖ్య. వరుసగా రెండేళ్లు మూడేసి డబుల్స్ బాదిన ఏకైక క్రికెటర్‌గా రికార్డు నెలకొల్పాడు.

**6** టెస్టుల్లో కోహ్లీ డబుల్ సెంచరీల సంఖ్య. ఇవన్నీ ఏడాదిన్నర కాలంలోనే సాధించడం విశేషం. సచిన్, సెహ్వాగ్‌లు కూడా ఆరేసి ద్వి శతకాలు సాధించారు.

**560** ఈ సిరీస్‌లో ఇప్పటిదాకా కోహ్లీ చేసిన పరుగులు. మూడు టెస్టుల సిరీస్‌లో భారత్ తరఫున అత్యధిక పరుగులు చేసిన బ్యాట్స్‌మన్ అతనే. తద్వారా సెహ్వాగ్ (542)ను దాటాడు.



## హేమంత చంద్రుడు

శరదృతువులో చందమామ అందాల గురించి కవులు ఎంతగానో వర్ణించారు! అయితే ఇది హేమంతమైనా.. శరత్చంద్రుడిని మించి అందమొలికించు పున్నమి చంద్రుడు ఆదివారంనాడు ఆకాశంలో కనువిందు చేశాడు. సాధారణం కంటే 40% ఎక్కువ వెన్నెల వెలుగులీనుతూ.. ఎప్పటికన్నా ఏడు శాతం పెద్దగా కనిపించాడు. వణికించే డిసెంబరులో మొదటి పౌర్ణమి కావడంతో 'సూపర్ కోల్డ్ మూన్'గా వ్యవహరిస్తున్న భారీ చంద్రుడు.. ఇదుగో హైదరాబాద్‌లోని హుస్సేన్ సాగర్‌లో ఇలా బుద్ధుడి నేపథ్యంలో అందరికీ కనువిందు చేశాడు.

# చచ్చిపోదామని పోతుంటే..

## దంపతుల ప్రాణాలు నిలిపిన 'తనిఖీ'

- రెస్టారెంట్ బిజినెస్‌లో తీవ్ర నష్టాలు
- మనోవ్యథతో ఆత్మహత్య యోచన
- పోలీసులకు బ్యాగులో లభ్యమైన సూసైడ్‌నోట్
- భార్యాభర్తలకు కౌన్సెలింగ్.. బంధువులకు అప్పగింత

ములుగు (జయశంకర్ జిల్లా), డిసెంబరు 3: అది జయశంకర్ జిల్లా ములుగు శివారులోని డీఎల్‌ఆర్ ఫంక్షన్ హాల్. ఆదివారం ఉదయం సీఐ సాయి రమణ ఆధ్వర్యంలో పోలీసులు అక్కడ వాహనాల తనిఖీ చేపట్టారు. ఈ క్రమంలో ఏటూరునాగారం నుంచి హన్మకొండవైపు ఓ దంపతులు వెళుతున్న కారును పోలీసులు ఆపారు. వారి వద్ద ఉన్న వస్తువులను సీఐ తనిఖీ చేశారు! ఈ తనిఖీలే ఆ భార్యాభర్తల నిండు ప్రాణాలను నిలిపాయి. వారి 11 నెలల బిడ్డ అనాథ కాకుండా కాపాడాయి. ఆ దంపతులు.. తూర్పుగోదావరి జిల్లా రాజమండ్రికి చెందిన రవీంద్ర, ఆయన భార్య శ్వేత. ఆమె బ్యాగులో సీఐకి దంపతులు సంతకాలు చేసివున్న ఓ లేఖ లభించింది. చదివితే అది సూసైడ్‌నోట్ అని తేలింది! రవీంద్ర, శ్వేత దంపతులు రాజమండ్రిలో ఓ రెస్టారెంట్‌ను నడుపుతున్నారు. తీవ్ర నష్టాలు రావడంతో అప్పులు పెరిగిపోయాయి. తీవ్ర మనోవేదనకు గురైన రవీంద్ర, శ్వేత ఆత్మహత్య చేసుకోవాలనుకున్నారు. తమ కుమార్తెను బంధువుల వద్ద వదిలేసి, కారులో సుదూర ప్రాంతానికి వెళ్లి ప్రాణాలు తీసుకోవాలనుకున్నారు. అనూహ్యంగా పోలీసులకు చిక్కడంతో ఇద్దరి ప్రాణాలు నిలిచాయి. సీఐ ఎదుట వారు తమ కష్టాలను వెళ్లబోసుకున్నారు. వారిని స్టేషన్‌కు తరలించిన సీఐ.. ఇద్దరికీ కౌన్సెలింగ్ ఇచ్చారు. బతికి జీవితాన్ని గెలవాలని, ఏ సమస్యకూ ఆత్మహత్య పరిష్కారం కాదని వారికి చెప్పారు. అనంతరం భద్రాచలంలోని బంధువులకు ఫోన్‌చేసి ఇద్దరినీ అప్పగించారు.



దంపతుల వద్ద లభించిన సూసైడ్‌నోట్

# కాలుతున్న పెనమ్మీద కూతురును కూర్చోబెట్టింది



- ప్రియుడి మోజులో ఓ తల్లి దాష్టీకం
- తీవ్ర గాయాలతో పాప కేకలు.. కనికరించని దుర్మార్గం
- ఇరుగుపొరుగు ఆరా.. ప్రమాదంలో గాయాలయ్యాయని అబద్ధం

బేగంపేట/హైదరాబాద్, డిసెంబరు 3: వచ్చీరాని ముద్దు ముద్దు మాటలు.. చూడగానే ఎత్తుకొని ముద్దు చేయాలనిపించే నాలుగేళ్ల చిన్నారి తను! కానీ ఆ తల్లి ఎంత నిర్దయురాలో కదా! కన్నపేగు అనే కనికరం కూడా లేకుండా ఆ పాపను స్టౌ మీద భగ భగలాడుతున్న దోశ పెనమ్మీద కూర్చోబెట్టింది. కాలిన గాయాలతో చిన్నారి రోదిస్తున్నా ఆ తల్లి హృదయం కరగలేదు. ఇదంతా ఆమె తన ప్రియుడి మోజులో కళ్లుమూసుకుపోయి ఒడిగట్టిన దారుణం!! ఈ ఘటనలో చిన్నారి పిరుదులు, అరికాళ్లు సహా ఇతర శరీరభాగాలకు తీవ్ర గాయాలయ్యాయి. ఈ హృదయ విదారకమైన ఘటన హైదరాబాద్ ఎస్సార్‌నగర్ పోలీస్‌స్టేషన్ పరిధిలోని వెస్ట్ శ్రీనివాస్‌నగర్ కాలనీలో చోటు చేసుకుంది. శ్రీకాకుళం జిల్లా ఇచ్ఛాపురానికి చెందిన లలిత మహాపాత్రోకు అదే ప్రాంతానికి చెందిన గుల్‌తో వివాహమైంది. ఈ దంపతులకు పాప రూప ఉంది. అయితే పాప పుట్టిన తర్వాత భర్త గుల్‌ను వదిలేసి అదే ప్రాంతానికి చెందిన ప్రకాశ్‌తో లలిత సహజీవనం చేస్తోంది. ఉపాధి కోసం వీరు కొద్ది రోజుల క్రితం నగరానికి వచ్చారు. అమీర్‌పేట ప్రాంతంలోని వెస్ట్ శ్రీనివాసనగర్ కాలనీలోని పద్మావతి బాయ్స్ హాస్టల్‌లో భార్యాభర్తలమని చెప్పి పనికి కుదిరారు. చిన్నారి రూప వీరితోనే ఉంటోంది. అయితే, తమ బంధానికి చిన్నారి అడ్డుగా ఉంటోందంటూ లలితకు ప్రకాశ్ తరచూ వేధిస్తున్నాడు. ఈ క్రమంలో రూపను తల్లి చిత్రహింసలకు గురిచేస్తోంది. మూడు రోజుల క్రితం స్టౌపై కాలుతున్న పెనమ్మీద చిన్నారిని కూర్చోబెట్టింది. బాధతో చిన్నారి గుక్కపెట్టి రోదిస్తున్నా.. కదలకుండా చేతులతో గట్టిగా పట్టుకుంది. అనంతరం పాపను అదే పెనమ్మీద నిల్చోబెట్టింది. పాప కేకలు విని చుట్టు పక్కలవారు రావడంతో చిన్నారికి ప్రమాదం జరిగిందని, ఆస్పత్రికి తీసుకెళుతున్నానంటూ బయటకు వెళ్లింది. అనంతరం సికింద్రాబాద్‌లోని గోపాలపురం పోలీస్‌స్టేషన్‌కు వెళ్లి, సికింద్రాబాద్ రైల్వే స్టేషన్‌లో తనకు పాప దొరికిందని, గాయాలతో ఉండడంతో ఇక్కడికి తీసుకువచ్చానంటూ పోలీసులను నమ్మించే ప్రయత్నం చేసింది. అనుమానించిన పోలీసులు గట్టిగా ప్రశ్నించే సరికి తాను చేసిన ఘోరమంతా చెప్పేసింది. కేసు నమోదు చేసుకున్న పోలీసులు ఈ కేసును ఎస్సార్‌నగర్ పోలీస్‌స్టేషన్‌కు బదిలీ చేశారు. గాయపడిన చిన్నారిని యూసుఫ్‌గూడలోని స్టేట్‌హోంకు తరలించారు. స్టేట్‌హోంలో రూపకు చిన్న పిల్లల వైద్యుల ద్వారా అధికారులు చికిత్స అందిస్తున్నారు. కన్న కూతురిని కాల్చి చిత్రహింసలకు గురి చేసిన తల్లి లలిత మహాపాత్రో తోపాటు ఆమెకు సహకరించిన ప్రియుడు ప్రకాశ్‌ను అరెస్ట్ చేసి రిమాండ్‌కు తరలించినట్టు ఎస్సార్‌నగర్ సీఐ వహీదుద్దీన్ తెలిపారు.



కాలిన చిన్నారి కాళ్లు

# టికెట్ రాయితీ వద్దన్న సీనియర్ సిటిజన్లు

## 3 నెలల్లో 9 లక్షల మంది సమ్మతి.. రైల్వేకు రూ.40 కోట్లు ఆదా

న్యూఢిల్లీ, డిసెంబరు 3 : రైల్వే అందిస్తున్న టికెట్ రాయితీని 9 లక్షల మందికిపైగా సీనియర్ సిటిజన్లు స్వచ్ఛందంగా వదులుకున్నారు. అదీ గత మూడునెలల్లోనే! రైల్వే ప్రవేశపెట్టిన 'గివ్ అప్' పథకం కింద రాయితీని తోసిపుచ్చుతూ తమ సమ్మతిని తెలియజేశారు. దీంతో రైల్వేకు రూ.40 కోట్లకు పైగా మొత్తం ఆదా అయింది. టికెట్లలో 50 శాతం రాయితీని వినియోగించుకోవాలా? వద్దా? అన్న ఆప్షన్‌ను సీనియర్ సిటిజన్లకు ఇస్తూ నిరుడు ఈ పథకాన్ని ప్రవేశపెట్టారు. సీనియర్ సిటిజన్ కేటగిరీ కింద అందిస్తున్న రాయితీ కారణంగా రూ.1300 కోట్లు భారం పడుతుండగా.. దానిని తగ్గించుకోవాలనే లక్ష్యంతో రైల్వే ఈ పథకాన్ని చేపట్టింది. రైలు చార్జీల్లో 43 శాతం మేర రైల్వే భరిస్తోంది. సబ్సిడీల కారణంగా ఏటా రూ.30 వేల కోట్ల నష్టాన్ని రైల్వే చవిచూస్తోంది. టికెట్ అమ్మకాల ద్వారా సమకూరే ఆదాయంలో 57 శాతమే రైల్వేకు చేరుతోంది.

# నేడు రాహుల్ నామినేషన్

## ఏఐసీసీ 16వ అధ్యక్షుడిగా ఎంపిక లాంఛనమే



న్యూఢిల్లీ, డిసెంబరు 3: కాంగ్రెస్ పార్టీ నూతన అధ్యక్షుడిగా రాహుల్‌గాంధీ పగ్గాలు చేపట్టేందుకు రంగం సిద్ధమైంది. ఈ మేరకు రాహుల్‌గాంధీ ఏఐసీసీ అధ్యక్ష పదవికి సోమవారం నామినేషన్ దాఖలు చేయనున్నారు. పార్టీ నూతన అధ్యక్షులుగా రాహుల్‌గాంధీ పేరును ప్రస్తుత అధ్యక్షురాలు సోనియాగాంధీతో పాటు మాజీ ప్రధాని మన్మోహన్‌సింగ్ ప్రతిపాదించనున్నట్లు తెలుస్తోంది. షెడ్యూల్ ప్రకారం సోమవారం మధ్యాహ్నం 3గంటలకు నామినేషన్ ప్రక్రియ ముగియనుంది కాంగ్రెస్ అధ్యక్ష పదవికి ఇప్పటివరకు ఒక్క నామినేషన్ కూడా దాఖలు కాలేదు. రాహుల్ ఒక్కరే నామినేషన్ దాఖలు చేసినట్లైతే సోమవారమే ఆయనను అధ్యక్షుడిగా ప్రకటించే అవకాశం ఉంది. కాంగ్రెస్ అధ్యక్ష ఎన్నికల షెడ్యూల్ ప్రకారం ఈనెల 17న పోలింగ్, 19న కౌంటింగ్ జరగనుంది. కాంగ్రెస్ పార్టీ అధ్యక్ష పదవికి నామినేషన్ వేసేందుకు రాహుల్ సిద్ధమైన వేళ తెలుగు రాష్ట్రాల నుంచి పార్టీ నాయకులు ఉత్తమ్‌కుమార్ రెడ్డి, రఘువీరారెడ్డి, జైపాల్‌రెడ్డి, వీహెచ్, పొన్నాల, బట్టి విక్రమార్క, సిట్టింగ్ రాజ్యసభ, లోక్‌సభ సభ్యులు కలిపి దాదాపు 18 మంది నాయకులు ఢిల్లీకి వచ్చారు.

### మహిళలకు భద్రతేది మోదీజీ..?

బీజేపీ పాలనలో గుజరాత్‌లో మహిళలకు రక్షణ లేకుండా పోయిందని రాహుల్‌గాంధీ ఆరోపించారు. గుజరాత్‌లోని పరిస్థితిపై ట్విటర్‌లో మోదీకి రోజుకో ప్రశ్న వేస్తున్న రాహుల్... ఆదివారం మహిళల భద్రతపై ప్రశ్నించారు. 'గుజరాత్‌లో మహిళలు దోపిడీకి గురవుతున్నారు తప్ప... వారికి భద్రత లేదు.' అని ఆరోపించారు. ఆయా రంగాల్లో గుజరాత్ మహిళల స్థితిగతులను తెలిపే గణాంకాలను కూడా రాహుల్ ప్రస్తావించారు. 'మహిళల అక్రమ రవాణాలో గుజరాత్ మూడో స్థానంలో ఎందుకుంది? యాసిడ్ దాడుల్లో ఐదో స్థానం, మైనర్లపై అత్యాచారాల్లో పదో స్థానంలో ఎందుకుంది? బాలికా విద్యలో గుజరాత్ 20వ స్థానంలో ఉండడం వాస్తవం కాదా? 2001-11 మధ్య కాలంలో మహిళా అక్షరాస్యత రేటు 70.3% నుంచి 57.8 శాతానికి పడిపోవడం నిజం కాదా? ప్రసవ సమయంలో గుజరాత్‌లో ఎక్కువ మంది తల్లులు మరణిస్తున్నది వాస్తవమేగా..?' అని రాహుల్ ప్రశ్నలు సంధించారు. కాగా, రాహుల్ ఆరోపణలను కాంగ్రెస్ ప్రదర్శిస్తున్న 'ఫ్యూడల్ ఫాంటసీ'గా కేంద్ర మంత్రి ముఖ్తార్ అబ్బాస్ నఖ్వీ అభివర్ణించారు.

# ఎద్దుల బండిలో వెళ్లండి!

## బుల్లెట్ రైలు వ్యతిరేకులకు మోదీ చురక



సురేంద్రనగర్ ఎన్నికల ర్యాలీలో ప్రసంగిస్తున్న ప్రధాని మోదీ

- కేవలం గుడ్డిగా వ్యతిరేకిస్తున్నారు
- కుల, మతాలను రెచ్చగొడుతున్నారు..
- వాళ్ల నైజమేంటో యూపీ ప్రజలకు తెలుసు
- అందుకే 'స్థానికం'గా కాంగ్రెస్‌ను తుడిచిపెట్టారు
- గుజరాత్ అభివృద్ధే మా ఏకైక లక్ష్యం
- బుల్లెట్ ట్రైన్‌తో స్థానికంగా ఉపాధి: మోదీ

భారుచ్, డిసెంబరు 3: కాంగ్రెస్ అభివృద్ధి నిరోధక పార్టీ అని, ప్రజలను కులాలు, మతాలవారీగా విభజించి చిచ్చుపెడుతోందని ప్రధాని మోదీ విమర్శించారు. గుజరాత్‌లోని భారుచ్, సురేంద్రనగర్, రాజ్‌కోట్ జిల్లాల్లో ఆదివారం ఎన్నికల ప్రచారం నిర్వహించిన ఆయన... పలు అంశాలను ప్రస్తావిస్తూ కాంగ్రెస్‌పై నిప్పులు చెరిగారు. 'అన్నింటినీ వ్యతిరేకించడమే కాంగ్రెస్ రాజకీయం. గుజరాత్‌లో చేపడుతున్న బుల్లెట్ ట్రైన్‌ను కూడా ఇలాగే గుడ్డిగా వ్యతిరేకిస్తున్నారు. బుల్లెట్ ట్రైన్ వద్దనుకొనే వాళ్లు... ఎద్దుల బండిలో వెళ్లండి' అని వ్యాఖ్యానించారు. బుల్లెట్ ట్రైన్‌తో కలిగే ఉపయోగాలను ఈ సందర్భంగా మోదీ వివరించారు. 'ఈ ప్రాజెక్టు వల్ల భారుచ్ జిల్లాకు, ఈ ప్రాంతానికి ఎంత ప్రయోజనం కలుగుతుందో తెలుసా? సిమెంటు, ఉక్కు, ఇతరత్రా ముడిసరుకులు, కార్మికులు ఎక్కడ నుంచి వస్తారు? భారత్ నుంచి కాదా? వీరిని ఉపయోగించుకునేది... జపాన్. అంటే... ఇది పెద్ద ఒప్పందం కాదా?' అని ప్రశ్నించారు. ఈ ప్రాజెక్టు కోసం కాంగ్రెస్ చొరవ తీసుకోదని, తాము చేపడుతుంటే ఓర్వలేక పోతున్నారని మోదీ విమర్శించారు. కులాలు, మతాల పేరుతో సమాజాన్ని విభజించి ప్రజల మధ్య అడ్డుగోడలు నిర్మిస్తోందని ఆరోపించారు. రొట్టె కోసం రెండు పిల్లులు కొట్టుకొంటుంటే... తీర్పు చెప్తానంటూ ఆ రొట్టెను కోతి తినేసినట్లు... సమాజంలో ఘర్షణల ద్వారా ప్రయోజనం పొందాలని కాంగ్రెస్ చూస్తోందని మోదీ విమర్శించారు. దశాబ్దాలపాటు కాంగ్రెస్ నైజాన్ని తెలుసుకున్నారు కాబట్టే తాజాగా జరిగిన స్థానిక సంస్థల ఎన్నికల్లో ఉత్తరప్రదేశ్ ప్రజలు ఆ పార్టీని భూస్థాపితం చేశారని ప్రధాని వ్యాఖ్యానించారు. ఊసరవెల్లి మాదిరిగా రంగులు మార్చిన కాంగ్రెస్ నైజం గుజరాతీలకు కూడా బాగానే తెలుసని అన్నారు. 'రాష్ట్రంలో మా ప్రభుత్వం రాకముందు భారుచ్ జిల్లాలో శాంతిభద్రతలు క్షీణించి తరచూ కర్ఫ్యూలు విధించే విషయం మీకు గుర్తుండే ఉంటుంది' అని మోదీ అన్నారు. కానీ రాష్ట్ర అభివృద్ధే తమ ఏకైక లక్ష్యమని మోదీ చెప్పారు. 2019 నాటికి పూర్తి కానున్న 'ఐక్యతా విగ్రహం' వల్ల భారుచ్ ప్రాంతంలో పర్యాటక రంగం అభివృద్ధి చెంది స్థానికంగా ఉపాధి లభిస్తుందన్నారు. 'నెత్తిన మట్టి కుండలు పెట్టుకుని నీళ్ల కోసం గతంలో కిలోమీటర్ల దూరం వెళ్లిన విషయం వాస్తవం కాదా? నీళ్ల కోసం లోతైన బావులు తవ్వుకోవాల్సిన పరిస్థితి నాడు ఉండేది కాదా? నర్మదా సరోవర్ ప్రాజెక్టుతో ఈ పరిస్థితి మారిన విషయం నిజమా... కాదా అని నా అక్కాచెల్లెళ్లను అడుతున్నా' అని సురేంద్రనగర్‌లో జరిగిన సభలో మోదీ అన్నారు.

### కాంగ్రెస్‌ది రిగ్గింగ్ చరిత్ర

పార్టీలో ప్రజాస్వామ్యం లేని కాంగ్రెస్... అసహనం గురించి మాట్లాడుతోందని మోదీ అన్నారు. 'పార్టీ అధ్యక్షునిగా రాహుల్‌ను నియమించడానికి సంస్థాగత ఎన్నికల్లో రిగ్గింగ్ జరుగుతోందని ఆరోపించిన కాంగ్రెస్ నేత షెహజాద్ పూనవల్లాను అన్ని వాట్సప్ గ్రూపుల నుంచి ఎందుకు తొలగించారు? అంతర్గతంగా ప్రజాస్వామ్యం లేని మీరు... దేశంలో ప్రజాస్వామ్యం గురించి మాట్లాడతారా? స్థానిక ఎన్నికల్లోనూ రిగ్గింగ్ చేసిన చరిత్ర కాంగ్రెస్‌ది. నాడు ప్రధానిగా ఎవరుండాలనే అంశంపై నెహ్రూ కంటే పటేల్‌కే మెజార్టీ వచ్చినా రిగ్గింగ్ చేసి నెహ్రూను ప్రధానిని చేశారు. పటేల్‌కే కాదు... మొరార్జీ దేశాయ్‌కి కూడా ఇలాగే జరిగింది' అన్నారు. కాంగ్రెస్‌ది వారసత్వ రాజకీయమని ఆరోపించారు.

# పాక్ ఎన్నికల్లోకి ఉగ్రవాది సయీద్

## 2018 ఎన్నికల్లో పోటీ

లాహోర్, డిసెంబరు 3 : ముంబైపై 2008లో జరిగిన ఉగ్రవాదుల దాడి సూత్రధారి హఫీజ్ సయీద్ పాకిస్థాన్‌లో 2018 సార్వత్రిక ఎన్నికల్లో పోటీ చేయనున్నట్టు ప్రకటించాడు. శనివారం చౌబుర్జీలోని జమాత్-ఉద్-దవా ప్రధానకార్యాలయంలో సయీద్ కొంతమంది కాలమిస్టులతో మాట్లాడుతూ వచ్చే ఏడాది జరిగే ఎన్నికల్లో మిల్లీ ముస్లిం లీగ్(ఎంఎంఎల్) పోటీ చేయనుందని చెప్పాడు. అతను ఇటీవల స్థాపించిన ఎంఎంఎల్ పార్టీని ఇంకా పాక్ ఎన్నికల కమిషన్‌లో నమోదు చేయలేదు. అంతర్జాతీయ ఉగ్రవాద సంస్థ లష్కరే తాయిబాకు అనుబంధ సంస్థే జమాత్-ఉద్-దవా. ఈ ఏడాది జనవరి నుంచి గృహనిర్బంధంలో ఉన్న సయీద్‌ను పాకిస్థాన్ గతనెల 24న విడుదల చేయడంతో విమర్శలు వెల్లువెత్తాయి. 2014లో జమాత్-ఉద్-దవాను అంతర్జాతీయ ఉగ్రవాద సంస్థగా అమెరికా నిర్ధారించింది. అలాగే సయీద్ తలపై లక్ష కోట్ల డాలర్ల రివార్డు ప్రకటించింది. ఐక్యరాజ్యసమితి ప్రకటించిన ఉగ్రవాదుల జాబితాలోనూ సయీద్ పేరు ఉంది. ఆ జాబితా నుంచి తన పేరు తొలగించాలని కోరుతూ సయీద్ తాజాగా పిటిషన్ కూడా దాఖలు చేశాడు. ముంబై పేలుళ్లు జరిగిన వెంటనే గృహ నిర్బాంధానికి గురైన సయీద్ 2009లో పాకిస్థాన్‌లోని కోర్టు జోక్యంతో విడుదలయ్యాడు.

# యూపీలో స్వతంత్రుల హవా!

## 42 శాతం ఓట్లు వాళ్ల సొంతమే.. బీజేపీకి వచ్చింది 30 శాతమే

- అన్ని పార్టీలూ ఉనికి చాటాయి
- గణాంకాల్లో కనిపించని ఘన విజయం

న్యూఢిల్లీ, డిసెంబరు 3: ఉత్తరప్రదేశ్ పట్టణ స్థానిక సంస్థల ఎన్నికల్లో భారతీయ జనతా పార్టీ నిజంగానే ఘన విజయం సాధించిందా? ఇప్పుడు దేశమంతా జరుగుతున్న చర్చ ఇది. మూడు ప్రధాన పార్టీల గణాంకాలు చూస్తే అవుననే అంటారు. కానీ, స్వతంత్ర అభ్యర్థులు గెలుచుకున్న సీట్లు చూస్తే ఇండిపెండెంట్లే అసలు విజేతలని తెలుస్తుంది. వారి తర్వాతే బీజేపీ, ఎస్పీ, బీఎస్పీలని స్పష్టమవుతుంది. మొత్తం పదహారు మున్సిపల్ కార్పొరేషన్ల ఫలితాలు వెలువడగా 14 బీజేపీ గెలుచుకుంది. అయితే, కార్పొరేషన్ ఎన్నికల్లో పోలయిన ఓట్లు 35 లక్షలే. 1300 మంది కార్పొరేటర్లలో 596 మంది బీజేపీ నుంచి గెలిచారు. బీజేపీ నగరాల్లో బలంగా ఉండే పార్టీ కాబట్టి అక్కడ గెలుస్తుందనే అందరూ భావించారు. మరి మూడున్నర కోట్ల మంది ఓటేసిన మున్సిపాలిటీలు, నగర పంచాయతీల సంగతేంటని విశ్లేషకులు ప్రశ్నిస్తున్నారు. రెండున్నర కోట్ల మంది ఓట్లేసిన 438 నగర పంచాయతీల్లో 42 శాతం(182 ఛైర్మన్ పదవులు) స్వతంత్రులు గెలుచుకున్నారు. బీజేపీ వంద స్థానాలతో దూరంలో ఉంది. 5261 మంది వార్డు సభ్యుల్లో బీజేపీ తరఫున గెలిచింది 917 మందే. కోటి మందికి పైగా ఓట్లేసిన 198 మున్సిపాలిటీల్లో బీజేపీకి 70, ఎస్పీకి 45 దక్కగా, స్వతంత్రులూ పోటాపోటీగా 43 గెలుచుకున్నారు. మున్సిపాలిటీలు, నగర పంచాయతీల్లో కలిసి 7229 మంది వార్డు సభ్యులు స్వతంత్రులే. మొత్తం 652 ఛైర్మన్ పదవుల్లో కేవలం 184 బీజేపీ సొంతమయ్యాయి. బీజేపీకి సగటున 30 శాతం ఓట్లే లభించాయి. ఇది ఘన విజయం అవుతుందా? అని విశ్లేషకులు ప్రశ్నిస్తున్నారు. స్వతంత్రులకు మొత్తం 225 ఛైర్మన్ పదవులు సొంతమయ్యాయి. ఈ ఎన్నికల్లో మొత్తం మీద 52 శాతం పోలింగ్ నమోదు అయ్యింది. నాలుగు కోట్ల మంది ఓటేశారు.



**కార్పొరేషన్లు (35 లక్షల ఓట్లు)**

| పార్టీ | గెలిచినవి |
|---|---|
| బీజేపీ | 14 |
| బీఎస్పీ | 2 |
| **మొత్తం** | **16** |

**నగర పంచాయతీలు (2.65 కోట్ల ఓట్లు)**

| పార్టీ | గెలిచినవి |
|---|---|
| స్వతంత్రులు | 182 |
| బీజేపీ | 100 |
| ఎస్పీ | 83 |
| బీఎస్పీ | 45 |
| కాంగ్రెస్ | 17 |
| ఆప్ | 2 |
| చిన్న పార్టీలు | 9 |
| **మొత్తం** | **438** |

**మున్సిపాలిటీలు (కోటి ఓట్లు)**

| పార్టీ | గెలిచినవి |
|---|---|
| బీజేపీ | 70 |
| ఎస్పీ | 45 |
| స్వతంత్రులు | 43 |
| బీఎస్పీ | 29 |
| కాంగ్రెస్ | 9 |
| చిన్న పార్టీలు | 2 |
| **మొత్తం** | **198** |

# ఎంబీబీఎస్‌లో కొత్త సిలబస్

విజయవాడ, డిసెంబరు 3(ఆంధ్రజ్యోతి): ఎంబీబీఎస్ సిలబస్‌లో వచ్చే ఏడాది నుంచి కొత్త అంశాలు చేరనున్నాయి. ఈ విషయాన్ని మెడికల్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా ఛైర్మన్ జయశ్రీ టీ మెహతా ప్రకటించారు. 2018 అకడమిక్ ఇయర్ నుంచి కొత్త సిలబస్ అమలులోకి రానున్నది. ప్రధానంగా సెక్స్, జనరల్ సెన్సిటివిటీ, మెంటల్ స్ట్రెస్, ఎథిక్స్. ప్రొఫెషనలిజం వంటివి కొత్త అంశాలుగా ఉండనున్నాయి. సిలబస్‌లో ఇంకా ఏయే అంశాలు ఉండాలన్నదానిపై ఫ్యాకల్టీ, శాస్త్రవేత్తలు, విద్యావేత్తలు, సమాజంలోని వివిధ వర్గాల నుంచి సేకరించిన అభిప్రాయాల మేరకు కొత్త వాటిని చేరుస్తారు. గ్రాడ్యుయేట్ మెడికల్ ఎడ్యుకేషన్ రెగ్యులేషన్లను మార్చేందుకు రెండేళ్లుగా ఎంసీఐ ప్రయత్నిస్తోంది.

## ఫిబ్రవరి 1 నుంచి బడ్జెట్ సమావేశాలు

న్యూఢిల్లీ, డిసెంబరు 3: కేంద్ర బడ్జెట్‌ను ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీ వచ్చే ఏడాది ఫిబ్రవరి 1న ప్రవేశ పెడతారు. జీఎస్టీ అమలు తర్వాత ప్రవేశ పెట్టనున్న తొలి బడ్జెట్ ఇది. పూర్తి స్థాయి బడ్జెట్‌ను ప్రవేశ పెట్టడం మోదీ సర్కారుకు ఇదే చివరి సారి. రాష్ట్రపతి కోవింద్ చేసే ప్రసంగంతో బడ్జెట్ సమావేశాలు జనవరి 30న ప్రారంభమవుతాయి.









Printed and Published by Koganti Venkata Seshagiri Rao on behalf of Aamoda Publications Pvt. Ltd., Printed and Published at Aamoda Press, Andhra Jyothi Buildings, Survey No: 70/1 & 2, Vedurupavuluru Village, Mustabad Gramapanchayathi, Gannavaram Mandal, Krishna District, PIN : 521 107
Editor : K. Srinivas, RNI No:3470/1960, Managing Director : Vemuri Radha Krishna, Founder : K.L.N. Prasad.




తెలుగు జాతీయ దినపత్రిక
# వార్త
21 Glorious years




epaper.vaartha.com WWW.VAARTHA.COM విజయవాడ fb.com/vaartha

PUBLISHED FROM VIJAYAWADA, HYDERABAD, VISAKHAPATNAM, RAJAHMUNDRY, KADAPA, NIZAMABAD, ONGOLE, WARANGAL, TIRUPATHI, ANANTAPUR, KURNOOL, KARIMNAGAR, MAHABUBNAGAR, KHAMMAM, NELLORE, NALGONDA, GUNTUR, TADEPALLIGUDEM,SRIKAKULAM

4-12-2017 సోమవారం సంపుటి :23 సంచిక : 303 పేజీలు :12 వెల : 5.00



# విపక్షాల పోల 'రణం'

- మెత్తబడ్డ బిజెపి నేతలు
- ఒడిశాతోపాటు తెలంగాణ అభ్యంతరం
- నిపుణుల కమిటీ నివేదిక తమ నివేదికే అంటున్న ప్రభుత్వం
- కమిటీల ఏర్పాటుతో ప్రాజెక్టు నిర్మాణానికి శాపం
- అఖిలపక్షం ఏర్పాటుకు ప్రతిపక్షాల డిమాండ్

**అమరావతి,డిసెంబర్3,ప్రభాతవార్త ప్రధాన ప్రతినిధి:** పోలవరం ప్రాజెక్టు నిర్మాణంలో జాప్యం జరిగే కొద్ది తెలుగుదేశం, బిజేపిల మధ్య ఆగాధం ఏర్పడుతున్న నేపధ్యంలో ప్రతిపక్షాలైన వైసీపీ,కాంగ్రెస్,ఉభయ కమ్యూనిస్టుల నేతల జోక్యం పెరిగి కేంద్ర,రాష్ట్ర ప్రభుత్వాల ప్రతిష్ట దిగజారే తరుణంలో రాష్ట్ర బిజెపి నేతలు మెత్తపడినట్లు తెలుస్తోంది. రాష్ట్ర ప్రభుత్వం పోలవరం ప్రాజెక్టు నిర్మాణం 2019లోపే పూర్తి చేయాలనే దృక్పధంతో కేంద్రంకు ప్రతిపని చెప్పే చేస్తున్నట్లు అధికారులు అంటున్నారు. పనిలోపనిగా పోలవరానికి పొరుగున ఉన్న ఒడిశా, తెలంగాణ రాష్ట్రాలనేతలు పోలవరం నిర్మిస్తే జలవనరులు తమ ప్రాంతాలకు రావని ప్రాజెక్టు నిర్మాణం పనులపై అభ్యంతరాలు వ్యక్తంచేస్తున్నాయి. రాష్ట్ర విభజన చట్టాన్ని అమలు చేస్తామని ఒక పక్క చెప్పుకొంటూ కేంద్రం రోజుకోక కమిటీని వేస్తూ పోలవరంకు పంపి పనులను వేగవంతం చేయకుండా అడ్డుకొంటుందని అధికార పార్టీ నేతలు ఆరోపిస్తున్నారు. రాష్ట్ర ప్రభుత్వ నేతృత్వంలో ప్రాజెక్టు పనులు జరుగుతున్న కేంద్ర ప్రభుత్వ ఆధ్వర్యంలో పీపీఎ (పోలవరం ప్రాజెక్టు అథారిటి)ని ఏర్పాటుచేసింది.

ఈ అథారిటీ రాష్ట్ర ప్రభుత్వంతో సమన్వయంతో పనిచేయకుండా కేంద్రానికి నివేదికలు ఇవ్వడం, కేంద్రప్రభుత్వం రోజుకోక కమిటీని ప్రాజెక్టుకు పంపి తనిఖీలు చేస్తోంది. ఇప్పటివరకు పార్లమెంటరీ కమిటీ, సీడబ్ల్యూసి, కెజీబివో, పీపీవో, ఎన్‌హెచ్‌పీసీ,నాయక్ రాకపోకలు,స్వయంగా కేంద్ర జలవనరుల శాఖ మంత్రి నితిన్ గడ్కరీ తనిఖీ చేసివెళ్లి ప్రాజెక్టు పనులపై సంతృప్తి వ్యక్తం చేశారు. గత అక్టోబర్ 23న సిన్హా కమిటీ ఏర్పాటుచేసి పోలవరంను సందర్శించాలని కేంద్రంఆదేశించినా ఇంతవరకుఆకమిటీ రాలేదు. ఈలోపు ప్రస్తుత కాంట్రాక్టర్ ట్రాన్స్ ట్రాయ్ సంస్థ నిర్మాణపు పనులు జాప్యం చేస్తున్నారని రాష్ట్ర ప్రభుత్వం కేంద్రానికి ఫిర్యాదు చేస్తూ విభజన చట్టం 60'సి'ని తెరపైకి తెచ్చి తామే రూ.1,395కోట్లకు ప్రత్యామ్నాయంగా కొత్త కాంట్రాక్టర్ ద్వారా పనులకు టెండర్ పిలిచారు. దీంతో కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వం తీసుకొన్న నిర్ణయాన్ని వ్యతిరేకిస్తున్నా నవంబర్ 16న ఎట్టకేలకు టెండరు పిలిచారు. దీంతో కేంద్రం ఒక అడుగు ముందుకేసి జలవనరుల శాఖ కేంద్ర కార్యదర్శి అమర్‌జిత్‌సింగ్‌చే ఇప్పటివరకు ప్రాజెక్టు నిర్మాణంలో చేపట్టిన పనుల వివరాలు, ఖర్చుచేసిన నిధులు, పునరావాసం, పంటల నష్టపరిహారంపై రాష్ట్ర ప్రభుత్వానికి నాలుగు రోజుల ముందు లేఖ రాశారు. ఈ లేఖ సమయంలో కేంద్రమంత్రి నితిన్ గడ్కరీ విదేశాల్లో ఉన్నారు. దీంతో ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు తీవ్ర మనస్థాపానికి గురై ఈ ప్రాజెక్టు నిర్మాణం రాష్ట్ర బిజేపి నేతలు,కాంట్రాక్టర్ కేంద్రంకు చెప్పెమాటలు వినిరాద్ధాంతం చేస్తున్నారని పరోక్షంగా అసెంబ్లీ సమావేశాల్లో ఆరోపించారు. నిర్మాణం ఆపేయమంటే ఆపేస్తానని, కొత్తగా పిలిచిన టెండర్ నిలుపుదల చేసి కేంద్రమే ప్రాజెక్టు నిర్మాణం చేపడతామంటే తమకు అభ్యంతరం లేదని ముఖ్యమంత్రి బాబు సంచలన ప్రకటన చేశారు. తొలినుంచి కేంద్ర హైకమాండ్ రాష్ట్రంలో బిజేపిని బలోపేతం చేయాలని యోచిస్తూ అధికారంపై ఆశలు పెటుకొన్నారు. అయితే తెదేపాకి మిత్రపక్షమైన బిజేపి అగ్రనేతలే సాధ్యంకాదని గ్రహించారు. ప్రస్తుతం ఈ ప్రాజెక్టు నిర్మాణంలో కేంద్రమే పనులు చేపట్టడానికి ముందుకొస్తే ఆ ప్రాజెక్టు ఎలాగూ సకాలంలో నిర్మాణం పూర్తికాదని నేపంతో చంద్రబాబు ప్రభుత్వం నెత్తిన పాలుపోసిన పుణ్యమా అనే చందంగా మారింది. ఒక పక్క నిపుణులు పర్యటిస్తూ ప్రభుత్వచర్యలపై కితాబ్ ఇస్తున్నారు. అయితే ఈ ప్రాజెక్టు నిర్మాణానికి కీలకమైన కాఫర్ ఎగువ, దిగువ డ్యాం, స్పిల్‌వే,చానల్‌లు ప్రధానం. వాటిని పూర్తిచేయాలంటే కొత్త కాంట్రాక్టర్ ఎంపికకు టెండర్లు పిలిచారు. అయితే ప్రాజెక్టు నిర్మాణంలో జాప్యం జరిగే కొద్ది ఒక ఏడాదిలో మూడు పర్యాయాలు అంచనాలు మార్చారు. ప్రస్తుతం పిలిచిన రూ.1,395 కోట్లకు అప్‌లోడ్ చేయడానికి కేవలం 18రోజులు గడువు ఇచ్చారు. మామూలుగా 45రోజులు గడువు ఉండాలి. అప్‌లోడ్ చేసే సమయానికి సదరు టెండర్‌ను రూ.1,483కోట్లకు పెంచారు. దీంతో కేంద్రంకు రాష్ట్ర బిజేపి నేతల ఫిర్యాదులు వెల్లివిరిసాయి. కేంద్రంకాంట్రాక్టర్‌ను మార్పు చేయ కుండా సబ్ కాంట్రాక్టు ఇవ్వాలని ≫2

'ఇంటింటికీ తెలుగుదేశం'తో

# ప్రజల్లోకి వెళ్లండి

## కాపులతో బిసీలకు నష్టం ఉండదని తెలియజేయండి

## జనవరి నుంచి జనాల మధ్యకు

## సర్వేలు ఆధారంగా గెలుపు గుర్రాలకే టిక్కెట్లు

## మంత్రులు, ఎమ్మెల్యేలతో సిఎం చంద్రబాబు



**అమరావతి,డిసెంబర్3,ప్రభాతవార్త ప్రధానప్రతినిధి :** ఎన్నికలువచ్చేలోపు ప్రతి మంత్రి, ఎంపి, ఎమ్మెల్యే, ఎమ్మెల్సీలు ఇంటింటికీ తెలుగుదేశం కార్యక్రమం ద్వారా ప్రతి ఇంటికి వెళ్ళి ప్రజలతో మమేకం కావాలని ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ఆదేశించారు. కాపులను బిసీల్లో చేర్చే వ్యవహారంలో బిసీలకు అన్యాయం జరగదని కాపులకు రాజకీయ రిజర్వేషన్లు ఉండవని బిసీల్లో చైతన్యం తీసుకొని రావాలని కోరడంతో పాటు వాల్మీకి,బోయలను ఎస్టీల్లో చేర్చితే ప్రస్తుతం ఉన్న ఎస్టీలకు కూడా అన్యాయం జరగదని ఎస్టీ కాలనీల్లో ఇంటింటా పర్యటించి ప్రజల్లోకి తీసుకెళ్ళాలని కోరారు. జనవరి జన్మభూమి కార్యక్రమంతోపాటు మిగిలిన రోజుల్లో ప్రజలతో తాను మమేకం అవుతానని ప్రజాప్రతినిధులంతా ప్రజలతో మమేకమై ప్రజలకు సేవచేస్తూ ప్రతి ఒక్కరి సంక్షేమం కోరుతూ ప్రజల్లో మంచి పేరు వచ్చేనేతలకే పార్టీ టిక్కెట్ ఇస్తామని ప్రతినేత పనితీరుపై సర్వే చేసి నంతరమే అధిష్టానం సంబంధిత నేతను బరిలో దింపే నిర్ణయం తీసుకుంటుందని కుండబద్దలు కొట్టినట్లు చెప్పినట్లు తెలిసింది. ముఖ్యంగా తాను జనవరి నుంచి ప్రతి నియోజకవర్గ ంలోని అన్ని ప్రాంతాల్లో పర్యటిస్తానని,వచ్చే ఎన్నికల్లో గెలిచే వారికే పార్టీ టిక్కెట్లు దక్కుతాయని,వెన్నుపోటుదారులు, ఫిరాయింపుదారులను క్షమించే ప్రసక్తేలేదని పార్లమెంట్ ≫2



మంచులో లైట్లు వేసుకుని నడుపుతున్న వాహనదారులు

# వణకుతున్న మన్యం

## ఇళ్లకే పరిమితమవుతున్న గిరిజనులు

## కుంపటితో కాలం వెళ్లదీస్తున్న పర్యాటకులు

**(విశాఖపట్నం) అనంతగిరి రూరల్, డిసెంబర్ 3,ప్రభాతవార్త:** విశాఖ మన్యంలో గత రెండు వారాలుగా చలిపులి తీవ్రం కావడంతో మన్యంవాసులు ప్రతినిత్యం గజగజలాడుతూ చలిలో కాలం వెల్లదీయాల్సిన పరిస్థితి నెలకొంది. సాయంకాలం మూడున్నర మొదలు కొని ఉదయం 11గంటల వరకు చలిపులి గట్టిగా ఉండడంతో ఇక్కడ గిరిజనులు తెల్లవార్లు రగ్గులు, దుప్పటి, శాలువాలు కప్పుకోవడమే కాకుండా స్వెటర్లు, మంకీ టోపిలు వేసుకుని తిరగాల్సిన పరిస్థితి ఏర్పడింది. అయితే ఈ ప్రాంతంలో బొర్రా, అనంతగిరి, అరకు పర్యాటక ప్రాంతాలు కావడంతో ఇక్కడ అందాన్ని ప్రకృతి ప్రేమికులను కట్టిపడేస్తుందని ఒక వైపు చెప్పుకుంటుంటే మరో వైపు ఇక్కడ వచ్చిన పర్యాటకులకు చలిపులి తీవ్రంగా ఇబ్బంది పెడుతుంది. చలి ఎక్కువగా ఉండడం వలన పర్యాటకులు వారు ఉండే లాడ్జిల్లో, రెస్టారెంట్లలో చలిమంట కాచుకుని రాత్రి పగలు తేడా లేకుండా గడుపుతున్నారు. రెండు ≫2

# ఇక పల్లెల్లో ఎల్ఇడి వీధిదీపాలు



## దశలవారీగా 35లక్షల దీపాల ఏర్పాటుకు ప్రభుత్వం సన్నద్ధం

## వేగవంతానికి రన్‌గేట్ మెకానిజం

## టెలికాన్ఫరెన్స్‌లో మంత్రి నారా లోకేష్

**అమరావతి, డిసెంబర్3 ప్రభాతవార్త:** పట్టణ ప్రాంతాల్లో ఎల్ఇడి వీధి దీపాల ఏర్పాటు కార్య క్రమాన్ని రాష్ట్ర ప్రభుత్వం విజయవంతంగా అమలు చేసింది. ఇక ఈ పథకం ఫలాలను గ్రామీణ ప్రాంతాలకు అందజేయాలని లక్ష్యంతో ఎల్ఇడి వీధిదీపాల ఏర్పాటు ప్రభుత్వం సమాయత్తమవుతోంది. రాష్ట్రంలోని 110 పురపాలక పట్టణాలు, నగర పాలక సంస్థలు ఎల్ఇడి విద్యుత్తు దీపాల ఏర్పాటు వల్ల 133మిలియన్ యూనిట్లు విద్యుత్తు ఆదాతో రూ.86కోట్ల ఆర్థిక లబ్ది పొందాయి. పల్లెల్లో ఎల్ఇడి వీధి దాపాల వేగవంతమైన రీతిలో ఏర్పాటు చేయడానికి రన్ రేట్ మెకానిజం ఎంతైనాఆవశ్యమని పంచాయితీ రాజ్‌శాఖ మంత్రి నారా లోకేష్ స్పష్టం చేశారు. ప్రస్తుతం గ్రామాలలో ఎన్ని ఎల్ఇడి వీధి దీపాలున్నాయి?ఎన్నికొత్తగావేశారు? సమయం వారీగా, గ్రామాల వారీగా, కరెంటు స్తంభాల వారీగా ఏర్పాటు చేసే సంస్థల ప్రతిభను మెరుగుపర్చ డానికి రన్‌వేట్ మెకానిజం దోహదపడుతుందని లోకేష్ అన్నారు. ఆదివారం ఆయన అధికారు లతో నిర్వహించిన టెలికాన్ఫరెన్స్‌లో మాట్లా డుతూ ప్రధానమైన మూడోవైర్ (థర్డ్‌వైర్) ఏర్పాటును యుద్ధప్రాతిపదికన పూర్తి చేయాలని ఇంధనశాఖను కోరారు. ఎల్ఇడి వీధి దీపాలను అమర్చడం ద్వారా గ్రామీణ ప్రజల జీవన ప్రమాణాలు మెరుగుపరచాలన్నదే ముఖ్యమంత్రి ధ్యేయమని మంత్రి లోకేష్ అన్నారు. రాష్ట్ర ఆర్థికాభివృద్ధిలో గ్రామీణాభివృద్ధి కీలకపాత్ర అన్నారు. గ్రామీణవికాసానికి ప్రభుత్వం గ్రామాలలో, గిరిజన గ్రామాల్లో పెద్ద ఎత్తున మౌలికసదుపాయాల ప్రాజెక్టులకు చేపట్టిందని, సిమెంట్ రోడ్లు నిర్మిస్తోందని వివరించారు. గ్రామీణ ప్రాంతాల్లో పర్యావరణ పరిరక్షణకు, సాంఘిక, ఆర్థిక ప్రయోజనాల కోసం ఎల్ఇడి వీధిదీపాలు దోహదపడతాయని లోకేష్ అన్నారు. కొత్త వీధిదీపాలతో, కొత్త సిమెంట్ రోడ్లతో గ్రామాలు కొత్త శోభన సంతరించుకుంటాయని చెప్పారు. కేంద్రీయ నియంత్రిత, సమన్వయ వ్యవస్థలో ప్రపంచస్థాయి సాంకేతిక తను తీసుకు రావాలని, గ్రామాలలో ఎల్ఇడి కార్యక్రమానికి ఇదెంతో దోహదపడుతుందని అన్నారు. ఈ కార్యక్రమాన్ని సిఎం డ్యాష్ బోర్డు, తన డ్యాష్ బోర్డుతో అనుసంధానించి ఎప్పటికప్పుడు పని తీరు వివరాల తాజా సమాచార అంచనాకు సహకరించాలన్నారు.

సీఎం కోర్ డ్యాష్ బోర్డులో, మంత్రి డ్యాస్ బోర్డులో ఎన్ని దీపాలు వెలిగితే అంత మేర పని జరిగినట్లు నిర్ధారణకు వస్తారని చెప్పారు. పంచాయతీ రాజ్‌శాఖ ముఖ్యకార్యదర్శి జవహర్‌రెడ్డి మాట్లాడుతూ మూడో వైరు ఏర్పాటు ఏప ప్రాంతంలో ఎంత అవసరమో మీ సేవ కేంద్రాల్లో రిజిస్టర్ చేసుకోవాలని, తద్వారా యుద్ధప్రాతిపదికన మూడో వైరు ఏర్పాటులో డిస్కంలకు సహకరించాలని అధికా ≫2



# భూమికి దగ్గరగా 'వెన్నెల రాజు'

## సుమారు 16వేల మైళ్లు దగ్గరగా వచ్చిన చంద్రుడు

**న్యూఢిల్లీ,డిసెంబరు3,ప్రభాతవార్త:** ఆదివారం ఆకాశంలో అద్భుత చిత్రం కనిపించింది. వెన్నెలరేడు నిండు కుండలాగా 7నుండి 15 శాతం ఎక్కువ వెలుగుతో కనిపించాడు. భూమి నుండి చంద్రుడు 238,900 మైళ్ల దూరంలో ఉంటాడు. ఆదివారంరోజా 222, 761 మైళ్ల దూరంలోనే వెలుగులు విరజిమ్మాడు. భూమికి దగ్గరగా వచ్చే చంద్రుడిని సూపర్‌మూన్‌గా చెబుతారు.

# అయోమయంలో 'కమలం'

## ఒక్కడికే పరిమితం అయిన ఉత్తరాంధ్ర

## అధ్యక్షుడి మౌనంలో అర్థమేమిటి?

## నైరాశ్యంలో కేడర్



**మల్లవరపు శ్రీనివాసరావు విశాఖపట్నం**

ఉభయ రాష్ట్రాలువిడిపోయిన సమయంలో కాంగ్రెస్ పార్టీదే తప్పిదం అంటూ అందరూ భావించారు. దీంతో అప్పటి ఎన్నికల్లో పూర్తిగా కాంగ్రెస్ పార్టీ కనుమరుగైంది. కేంద్రంలో భారతీయ జనతాపార్టీ పగ్గాలు చేపట్టిన అనంతరం ప్రధాని నరేంద్ర మోదీ తీసుకున్న అనేక నిర్ణయాలు దేశ దిశానిర్ధేశాన్ని పూర్తిగా మార్చేస్తాయని అందరూ భావించారు. ఆ నేపధ్యంలోనే కాంగ్రెస్ పార్టీలో నైరాశ్యంతో ఉన్న ముఖ్యనేతలు కొందరు వైసీపీ, టిడిపి బిజేపీ పార్టీల్లోకి వలస వచ్చారు. వైసీపీ స్వయం కృతాపరాధంతో కొంతమంది నేతలను చేజార్చుకుంది. భారతీయ జనతాపార్టీ ఏపీలో తమదైన సత్తాను చాటుకోవచ్చుని భావించింది. వెంకయ్యానాయుడు కేంద్రమంత్రిగా ఉన్న సమయంలో ఎక్కువ దృష్టిని ఏపీలో కేంద్రీకరించారన్నది కాదనలేని వాస్తవం. ఆ సమయంలో ఎపిలో ఆయన ఇచ్చిన హామీలను అన్నో ఇన్నో నెరవేర్చుకున్నారు. ఎపికి ప్రత్యేక హోదా విషయంలో కేంద్ర అధిష్టానం సూచనల మేరకు వెంకయ్యానాయుడుకు అప్పట్లో నోరు మొదపలేని పరిస్థితి. దీంతో భారతీయ జనతాపార్టీలో నైరాస్యం చోటుచేసుకోవడం అంచెలంచెలుగా ప్రారంభమైంది. వెంకయ్యనాయుడు ఉపరాష్ట్రపతిలో వెళ్ళిపోయిన నాటినుంచి కేంద్ర పదవి మీద ప్రస్తుత రాష్ట్ర పార్టీ అధ్యక్షుడు, విశాఖ ఎంపి కంభం పాటి హారిబాబు దృష్టి మరిలింది. కేంద్ర ఆలోచనలు ఏవిధంగా ఉన్నాయో ఏమోగాని ఆ సమయంలో అమిత్‌షా సూచనల మేరకు పార్టీ అధ్యక్షునిగానే కొనసాగించే విధంగా నిర్ణయం తీసుకున్నారు.

దీంతో కంభంపాటి హరిబాబు పూర్తిగా ఢీల్లీకే పరిమితం అయ్యారన్న ఆరోపణలు వినిపిస్తున్నాయి. విశాఖ పార్లమెంట్ నియోజకవర్గానికి ఆయన ప్రాతినిధ్యం వహిస్తుండడంతో అప్పుడప్పుడు విశాఖలో కనిపిస్తున్నారు తప్ప రాష్ట్రంలోని పార్టీ పరిస్థితిపై దృష్టి సారించడం లేదన్న ఆరోపణలు ఉన్నాయి. ఈ విషయాన్ని ఆపార్టీ క్యాడరే స్పష్టం చేసో ్తంది. వాస్తవానికి ఉత్తరాంధ్ర జిల్లాలో ఏపీ తరపున మాట్లాడే వ్యక్తుల్లో ఒకే ఒక్కరు కనిపిస్తున్నారు. ప్రధానంగా ఆయన విశాఖలో నార్త్ నియోజకవర్గం ఎమ్మెల్యే కావడం, ఆ పార్టీ శాసనసభా పక్ష నేత కావడంతో అడపాదడపా ఆయనమాత్రమే అధికార తెలుగుదేశం పార్టీని ఇరుకున పెడుతున్నారు. ఆయన వద్దకు వచ్చిన కార్యకర్తలను సాదరంగానే ఆహ్వానించి వారికి చేయాల్సిన పనులను చేసి పెడుతున్నారన్న పేరును సంపాదించుకున్నారు. ముఖ్యంగా విశాఖ జిల్లాలో ఎక్కడ ఏ అక్రమాలు జరిగినా మరే ఇతర ప్రభుత్వ శాఖలో తప్పులు జరిగినా ఆయన మాత్రమే ప్రశ్నిస్తున్నారు. విశాఖ ఎంపిగా రాష్ట్ర పార్టీ అధ్యక్షుడిగా కొనసాగుతున్న కంభంపాటి హారిబాబు వాయిస్ ఎక్కడా వినిపించకపోవడంతో భవిష్యత్‌లో బిజేపీ ఎంత మేరకు ఏపీలో మనుగడ కొనసాగించగలుగుతుందనే ప్రశ్న. మరీ ముఖ్యంగా ఉత్తరాంధ్ర జిల్లాలో ఎక్కడా కేంద్ర ప్రభుత్వం చేపడుతున్న కార్యక్రమాలను, అభివృద్ధిసంక్షేమ పథకాలను ≫2

## వాల్మీకి, బోయలను ఎస్టీల్లో చేర్చడంపై

# అసెంబ్లీలో తీర్మానం

**అమరావతి, డిసెంబర్3 ప్రభాతవార్త:** వాల్మీకి, బోయలను ఎస్టీల్లో చేరుస్తూ ప్రభుత్వం నిర్ణయం తీసుకుంది. ఈ మేరకు ప్రభుత్వం శనివారం అసెంబ్లీలో బిల్లును ప్రవేశపెట్టింది. ఈ సందర్భంగా ముఖ్యమంత్రి చంద్రబాబు మాట్లాడుతూ ఎన్నో రాష్ట్రాల్లో వాల్మీకి,బోయలు ఎస్టీ జాబితాలో ఉన్నారని, దశాబ్దాల డిమాండ్‌కు తాము మద్దతు ప్రకటిస్తున్నామని అన్నారు. షెడ్యూల్ తెగలకు ఇబ్బంది లేకుండా రిజర్వేషన్లు అమలు చేయాలని కేంద్రాన్ని కోరుతున్నట్లు తెలిపారు.

ఎన్నికల మానిఫెస్టోల్లో చెప్పిన విధంగా వాల్మీకి, బోయలను షెడ్యుల్ తెగలోకి చేర్చాలని చెప్పారు. వాల్మీకి, బోయల సంస్కృతి, వెనుకబాటుతనం, ఆర్థిక పరిస్థితులు, అనేక అధ్యయన కమిటీలు, కమీషన్‌లు వీరిపై చేసిన సిఫారసులను పరిగణలోకి తీసుకుని వారిని షెడ్యూల్ తెగల ≫2



# ప్రజల్లోకి వెళ్లండి

సభ్యులు, ఎమ్మెల్యేలు,ఎమ్మెల్సీలు,టిక్కెట్ ఆశించేవారు ప్రజల మధ్య ఉండాలని ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు స్పష్టంచేశారు.శనివారం సచివాలయంలో తెదేపా శాసన పక్ష సమావేశంలో ముఖ్యమంత్రి బాబు తేల్చిచెప్పారు.ఒకవేళ నియోజకవర్గాల పునర్విభజనలో నియోజకవర్గాలు పెరిగినా,పెరగక పోయినా పార్టీని అంటిపెట్టుకునేవారికే పెద్దపీట వేస్తామని,పార్టీలోనికి కొత్తగా చేరిన నేతలకు తగిన న్యాయం చేస్తామని రాజకీయాల్లో జూనియర్, సీనియర్ అని వ్యవహరించకుండా పార్టీకోసం పనిచేసే ప్రతిఒక్కరికి గుర్తింపు ఉంటుందని ఆయన స్పష్టం చేశారు.

అలాగే ప్రభుత్వంలో క్యాబినెట్ హోదా చైర్మన్లు,ఎమ్మెల్సీలు, రాజ్య సభ స్థానాలు దక్కినవారు వచ్చే ఎన్నికల్లో అభ్యర్థి ఎవరైనా సహకరించాలని వారికి వెన్నుపోటు పొడవడం కానీ,ఫిరాయింపు చేస్తే ఎంతటి వారినైనా క్షమించే ప్రసక్తే లేదని అలా వ్యవహారిస్తే పార్టీకే కాకుండా సదరు నేతలకు రాజకీయ భవిష్యత్ ఉండదన్నారు.ప్రస్తుతం కొనసాగుతున్న సిట్టింగ్ ఎమ్మెల్యేలకే టిక్కెట్లు అని నిర్ణయం చేయరాదని ప్రజలకు,పార్టీ కార్యకర్తలకు అందుబాటులో ఉంటూ ప్రజలతో మమేకమై అభివృద్ధి,సంక్షేమ పథకాలను ప్రజలకు అందుబాటులోనికి తీసుకెళ్లాలని పిలుపు నిచ్చారు. పార్టీ టిక్కెట్ల విషయంలో అధినాధ పార్టీ అన్ని కోణాలను ఆలోచించి టిక్కెట్ ఇస్తామన్నారు.

పార్టీనేతలు వారి కుటుంబ సభ్యులు చట్టబద్ధంగా వ్యాపారాలు, పరిశ్రమలు, కాంట్రాక్టు పనులను చేపట్టవచ్చని ప్రతి ప్రజాప్రతినిధి తమ కుటుంబ సభ్యులతో గడుపుతూ పార్టీని బలోపేతం చేస్తూ ప్రజలకు సేవ చేయవచ్చని పేర్కొన్నారు.రాష్ట్ర విభజనతో తెలుగు ప్రజలకు కష్టాలొచ్చాయి.ఆ కష్టాలను అధిగమించడానికి ప్రతి ఒక్కరూ కృషి చేయాలన్నారు.అన్నింటా పనిచేయాలన్న కష్టతరమేనని ప్రతి ఒక్కరూ కష్టపడి పనిచేయాలని కోరారు.రాష్ట్రం ఆర్థిక కష్టాల్లో ఉన్న మూడు న్నరేళ్ళుగా సంక్షేమ పథకాలను,అభివృద్ధి పనులను నిరాటంకంగా అమలు చేస్తూ ప్రజల్లో స్థానం సంపాదించామని అదే తరహాలో ప్రతి ఒక్కరూ కృషి చేయాలని స్పష్టం చేశారు.రాష్ట్రంలో 28ప్రాజెక్టులను పూర్తిచేసి ఎన్నికల్లో ప్రజల ముందుకు వెళ్ళాలని నేతలందరికీ గుర్తుచేశారు.ప్రతిపక్షనేత వైఎస్ జగన్మోహనరెడ్డి చేస్తున్న పాదయాత్రలకు జనాలు రావడం లేదని నిర్లక్ష్యం చేయకుండా వారి ఆరోపణలకు ధీటుగా సమాధానం చెప్పాలని సూచించారు.

ఇంటింటికి తెలుగుదేశం కార్యక్రమాన్ని ప్రతి ఇంటికి తీసుకెళ్ళి వారితో మాట్లాడి వారి సమస్యలను,వారి అభిప్రాయాలను సేకరించి పార్టీ ఇచ్చిన సాంకేతిక ట్యాబ్ ల ద్వారా పార్టీ కార్యాలయానికి పంపాలని,పార్టీ అధిష్ఠానం ఆదేశాలను తూ.చా.తప్పక పాటించాలని కోరారు. ప్రజా సమస్యలను, వారిచ్చే అర్జీలను సంబంధిత అధికార్ల దృష్టికి తీసుకెళ్లాలని జనవరిలో జరిగే జన్మభూమి కార్యక్రమంలో వాటిని పరిష్కరించాలని పేర్కొన్నారు. జన్మభూమి కార్యక్రమంలో 2.5లక్షల ఎన్టీఆర్ గృహాలను ప్రారంభించామని, వ్యక్తిగత మరుగుదొడ్లకి ప్రాముఖ్యత ఇవ్వాలని, రేషన్ కార్డులు,ఫించన్లు పంపిణీల్లో అధికప్రాముఖ్యత ఇవ్వాలని స్పష్టంచేశారు. ముఖ్యంగా మహిళా రైతుల విషయంలో జాగ్రత్తగా వ్యవహరించాలని కోరారు.

ఇక పోలవరం ప్రాజెక్టు విషయంలో నిపుణులు, అధికారులు, మేధావులతో ఆలోచిస్తున్నామని కేంద్రం ప్రాజెక్టు నిర్మాణ విషయంలో అనుకూలంగా చర్యలుంటాయని ఆశాభావాన్ని వ్యక్తం చేశారు.ఈలోపు పార్టీ నేతలు తొందరపడి మీడియాకు ఎక్కరాదని ఏ ఒక్కరూ నోరుమెదపరాదని ప్రత్యేకించి హితబోధ చేశారని తెలుస్తోంది.బిజెపి మిత్రపక్షమైనందున ప్రతి ఒక్కరు సహనంతో ఉండాలని అలా అని ప్రతి విషయాన్ని భరించలేమని చివరి నిమిషం వరకు పోలవరం నిర్మాణంపై పోరాటం కొనసాగిస్తామని, నేతలు తమ మనసులోని మాటను తన దృష్టికి తెచ్చారని కొంత ఓపిక అవసరమన్నారు.ఇకపోతే పోలవరం ప్రశ్నార్థకమైతే నేతలంతా నియోజక వర్గాలకు వెళ్ళి ప్రజలతో మమేకమై 2019ఎన్నికలను గుర్తుపెట్టుకొని ప్రతి ఒక్కరు కృషిచేయాలని కోరారు.

# పోల'రణం'

ఆదేశించిన రాష్ట్ర ప్రభుత్వం సమ్మతించకుండా టెండర్లను పిలవడంతో కేంద్రమంత్రి గడ్కరీతో విభేదాలు తలెత్తినట్లు తెలుస్తోంది.దీన్ని ఆశగా చేసుకున్న రా ష్ట్ర బిజెపి నేతలు బాబు అసెంబ్లీలో చేసిన ప్రకటనపై తలా ఒకమాట మాట్లాడుతూ ఆ ప్రాజెక్టు నిర్మాణ పనులను కేంద్రంకు అప్పగిస్తే సకాలంలో నిర్మిస్తామని ప్రకటన చేశారు.ప్రతిగా అధికార తెలుగుదేశం నేతలు తామేమీ బిజెపి నేతలకు తీసిపోమనే విధంగా తారా స్థాయిలో ధ్వజమెత్తారు.

బాబు గతనెల 30న అసెంబ్లీలో చేసిన ప్రకటనతో బిజెపితో బంధం తెగె విధంగానే ప్రసంగం కొనసాగింది.అప్పటికే అసెంబ్లీలో ఉన్న శాసన బిజెపి పక్షనేత విష్ణుకుమార్ రాజు,ఎమ్మెల్యేలు వీర్రాజు,మాధవ్ లు కేంద్రం అడిగిన వాటికి రాష్ట్ర ప్రభుత్వ ం లెక్కలు,వాస్తవాలు చెబితే సరిపోతుంది కదా అని ప్రశ్నించారు.అంతే కాకుండా రాష్ట్ర అధికారులు సీఎంకు తప్పుడు సలహాలు ఇస్తున్నారని నెటి వేశారు.అప్పటికే బిజెపి నేతలు రాష్ట్రవ్యాప్తంగా రాష్ట్ర ప్రభుత్వంపై తారాస్థాయిలో విమర్శలు సంధిస్తున్నారు.తెదేపా నేతలు తీవ్రస్థాయిలో స్పందించారు.అనంతరం సీఎం జోక్యం చేసుకొని పోలవరం ప్రాజెక్టు నిర్మాణంలో కేంద్రం,బిజెపి నేతలపై నోరు విప్పరాదని ఆదేశించారు.దీంతో రాష్ట్ర బిజెపీనేతలు మెత్తబడ్డారు. వైఎస్సార్సీపీ, కాంగ్రెస్, ఉభయ కమ్యూనిస్టు నేతలు పోలవరం ప్రాజెక్టు నిర్మాణంపై కేంద్ర,రాష్ట్ర ప్రభుత్వ నిర్ణయాలపై దుమ్మెత్తి పోశారు.ఈ ఆరోపణలు కేంద్ర పెద్దలకు చేరడంతో టిడిపి, బిజెపిల మధ్య చిచ్చురగులుతున్నట్లు ప్రజల్లోకి సంకేతాలు అందుతాయని ఇరుపక్షాలు ప్రాజెక్టు నిర్మాణంపై నోరుమెదపడం లేదు.ప్రతిపక్షాలు మాత్రం అఖిలపక్షంను రాష్ట్ర ప్రభుత్వం ఏర్పాటుచేస్తే తాము కేంద్రంతో అమీతుమీ తెల్చుకుంటామని రాజకీయంగా సీఎం బాబు వారి సూచనలను పెద్దగా పట్టించుకోలేదు.ఇదిలా ఉండగా రాష్ట్ర విభజన చట్టంలో భాగంగా 2017లో ఏప్రియల్లో పోలవరం ప్రాజెక్టు అధారిటిని కేంద్రం ఏర్పాటుచేసి ప్రాజెక్టు నిర్మాణ పనులను వేగవంతం చేస్తూ ఇక్కడి పరిస్థితులను ఎప్పటికప్పుడు కేంద్రంకు నివేదిక ఇవ్వాల్సి ఉంది.పీపీఏ,రాష్ట్ర ప్రభుత్వ సమన్వయంతో పనులను చేపట్టాల్సి ఉండగా వీరిలో సమన్వయ లోపంతో కేంద్రంకు పీపీఏ ఇచ్చే నివేదికలతో కేంద్రంకు రాష్ట్ర ప్రభుత్వంపై అనుమానం తీసుకొచ్చి పెట్టింది. భూసేకరణ, సహాయ,పునరావాసాలకు 2013లెక్కల ప్రకారం ప్రస్తుతం నిర్వాసితులు ఒప్పుకోవడం లేదు.ఇప్పటి లెక్కల ప్రకారం రూ.30,200కోట్లకు పైబడి నిర్వాసితులకు చెల్లించాల్సి ఉంది. ప్రాజెక్టు నిర్మాణానికి కూడా రూ.28వేల కోట్లు అవసరమని అంచనాలు తేలాయి.కేంద్రం ఎంతసేపు 2013 గణాంకాలనే తెరపైకి తెస్తోంది.విభజన చట్టం మేరకు ప్రాజెక్టు నిర్మాణం పరిహారం మొత్తం పూర్తిగా కేంద్రం భరించాల్సి ఉంది.

ఇప్పటివరకు కేంద్రం రూ.3,000నుంచి రూ.4,000ల లోపే విడుదల చేయగా రాష్ట్రం రూ.10వేలకోట్లకు పైబడి ఖర్చు చేసింది.అయితే కేవలం రాజకీయ కోణంలో కేంద్రం ఆలోచించి రోజుకొక పేచీపెడుతూ ప్రాజెక్టు నిర్మాణానికి అవాంతరాలు సృష్టిస్తోందనే ఆరోపణలున్నాయి.కేంద్రం జాప్యంతో ఒడిశా, తెలంగాణ ప్రభుత్వాలు కూడా ప్రాజెక్టు నిర్మాణంలో అభ్యంతరాలు వ్యక్తం చేస్తున్నాయి.ప్రాజెక్టు నిర్మాణం ఆలస్యమైన,కేంద్రం టేకోవర్ చేసినా రాష్ట్ర ప్రభుత్వానికే పరిస్థితులు అనుకూలిస్తాయి.దీంతో బిజెపి నేతలు 2019ఎన్నికల్లో ప్రజల ముందుకు రాలేమని సమాలోచన చేస్తున్నారు.ప్రతిపక్షాల రణంతో ప్రాజెక్టు నిర్మాణానికి చిక్కులు వీడతాయని ఆశిద్దాం.

# అయోమయంలో 'కమలం'

ప్రజల చెంతకు తీసుకువెళ్ళే నాధుడే కరువయ్యారు. ముఖ్యంగా విశాఖ జిల్లాలో నాయకులు ఒక్క కార్యక్రమం చేసిన పాపాన పోలేదు. దీంతో అత్యుత్సాహంగా బిజేపీలో చేరిన నాయకులు, కార్యకర్తలు ప్రస్తుతం ఎరి చూపులు చూస్తున్నారు. తమ భవిష్యత్ ఏమిటని వారిలో వారు మదనపడుతున్నారు. ఇదే పరిస్థితి ఏపీలోని అన్ని జిల్లాల్లోనూ నెలకొని ఉంది. రాష్ట్రంలో బీజేపీ మిత్రపక్షంగా ఉన్న అధికార తెలుగుదేశం పార్టీ కూడా బీజేపీ నాయకులకు ప్రాధాన్యతను ఇవ్వక పోవడంతో మరింత నైరాశ్యంలో ఉన్న ఆ పార్టీ క్యాడర్ ప్రస్తుతం వైసీపీ వైపు దృష్టి సారిస్తున్నారు. వాస్తవానికి వైఎస్ఆర్ కా ంగ్రెస్ పార్టీలో ఎమ్మెల్యే స్థాయి నాయకులు అధికార తెలుగుదేశం పార్టీలోకి వెళ్తున్నారు తప్ప ఆ పార్టీకి చెందిన క్యాడర్ చెక్కుచెదర లేదని తెలుస్తో ంది. ఈ నేపథ్యంలో బీజేపీలో మనుగడ సాగించలేని కొంతమంది నేతలు రాష్ట్ర వ్యాప్తంగా వైసీపీలోకి వలస వెళ్లే ఎమ్మెల్యే టికెట్లు వచ్చే అవకాశం ఉందని భావిస్తున్నట్లు తెలుస్తోంది. దీనికి ముఖ్యకారణం రాష్ట్ర అధ్యక్షునిగా కొనసాగుతున్న కంభంపాటి హరిబాబు ఇటీవల కాలంలో పార్టీ సమావేశాలు ఏర్పాటుచేసిన దాఖలాలు లేవు. అదీ కూడా విశాఖ జిల్లాలో కార్యకర్తల మంచీ చెడును ఆలోచించే పరిస్థితుల్లో ఆయన లేరన్న ఆరోపణలు ఉన్నాయి. ఇదిలా ఉండగా రాష్ట్ర బిజేపీ పార్టీలో ఇప్పటికే రెండు వర్గాలుగా విడిపోయిన నేతల తీరుతోనే పార్టీ పరిస్థితి నానాటి క్షీణిస్తోందన్న ఆరోపణలు లేకపోలేదు. రాష్ట్రంలో అధికారంలో ఉన్న టీడీపీతో ఒక వర్గం చెలిమి కొనసాగిస్తుంటే ఏచిన్న తప్పు కనిపించినా దాన్ని భూతద్దంలో చూపుతూ టీడీపీ ప్రభుత్వాన్ని ఇరుకున పెట్టేవిధంగా మాటల తూటాలను పేలుస్తున్న మరో వర్గం వచ్చే 2019 ఎన్నికల నాటికి వైసీపీని బిజేపీలో విలీనం చేయించడం, లేదా ఆ పార్టీతో కలిసి ఎన్నికల బరిలో నిలిచే విధంగా రాజకీయాలు నెరపడంలో తీవ్రంగా శ్రమిస్తున్నారు. కంభంపాటి హరిబాబు వెంకయ్య నాయుడు వర్గంగా ముద్ర వేస్తూ కొన్ని జిల్లాల్లో సామాజిక వర్గాల వారీగా పార్టీ క్యాడర్ విడిపోయిన దాఖలాలు ఉన్నాయి. దీంతో పార్టీ కార్యక్రమాల్లో చురుగ్గా పాల్గొనేందుకు ఇరువర్గాలు ఉత్సాహం చూపించడం లేదు. ముందు అమిత్ షా రెండు వర్గాలను ఒకతాటిపైకి తీసుకురావల్సి ప్రయత్నం మొదలు పెట్టాల్సిన ఆవశ్యకత ఉంది. ఇక విశాఖ జిల్లా పరిస్థితి ఇలా ఉంటే రాష్ట్రంలోని ఇతర జిల్లాల పరిస్థితి ఏవిధంగాఉంటుందనేది చెప్పకనే తెలు స్తోంది. ఉభయ రాష్ట్రాల్లో తమదైన ముద్ర వేసుకోవాలని తీవ్ర ప్రయత్నాలు చేస్తున్న ఆ పార్టీ జాతీయ అధ్యక్షుడు అమిత్ షా దృష్టికి ఏపీలోని పార్టీ పరిస్థితిపై తాజాగా ఒనివేదిక వెళ్లినట్టు తెలుస్తోంది.

**వారం - వర్జ్యం**
4-12-2017 సోమవారం
హేవళంబి నామ సంవత్సరం దక్షిణాయనం
మార్గశిరమాసం కృష్ణపక్షం
పాడ్యమి రా. 8.06
రోహిణి ఉ. 8.42
రా. ఉ. 7.30-9.00
వ. మ. 1.57-3.27

# వైభవంగా దుర్గమ్మకు కలశజ్యోతి ఉత్సవం

## పలు రాష్ట్రాలనుండి తరలి వచ్చిన భవానీలు, ఎరుపెక్కిన బెజవాడ

## గండ్రదీపాలతో వెలుగులీనిన నగరం

**విజయవాడ (ఇంద్రకీలాద్రి), డిసెంబర్ 3, ప్రభాతవార్త:** ఏటా ఆనవాయితీగా నిర్వహించే కలశజ్యోతుల ఉత్స వం వైభవంగా జరిగింది. ఆలయ ఇఓ, చైర్మన్, ట్రస్టుబోర్డు సభ్యులు ఆదివారం పాల్గొని ముందుండి ఈ కార్యక్రమాన్ని నడిపించారు. మార్గశిరమాసం శుద్ధ పౌర్ణమి, ఆదివారం సాయంత్రం 5 గంటలకు సత్యనారాయణపురం శ్రీ శివరామానామ కృష్ణక్షేత్రం వద్ద ప్రారంభమయింది. నగరంనుండే కాకుండా, ఉభయ తెలుగు రాష్ట్రాలనుండి తరలివచ్చిన భవానీలు తెచ్చిన గండ్రదీపాలతో నగరం వెలుగులీనింది. జై భవానీ, జైజై భవానీ అంటూ శివరామకృష్ణ క్షేత్రం నుండి కలశజ్యోతుల ఉత్స వం ప్రారంభమైంది. అంతకుముందు శ్రీ కనకదుర్గ, గంగా సమేత మల్లేశ్వర స్వామివార్లను పల్లకీలో వుంచి శివరామకృష్ణ క్షేత్రానికి తీసుకొచ్చారు. అక్కడ ఉభయ దేవాలయాలకు చెందిన అర్చక స్వాములు ప్రత్యేక పూజలు నిర్వహించారు. ఈ పూజా కార్యక్రమాల్లో ఆలయ ఇఓ, చైర్మన్, ధర్మకర్తలు పాల్గొన్నారు. అక్కడినుండి అమ్మవారి పల్లకీని ఊరేగింపుగా సత్యనారాయణపురం, గాంధీనగరం, పాత ప్రభుత్వాసుపత్రి, కెనాల్‌రోడ్డు మీదుగా అర్జున వీధిలోకి ప్రవేశించి అక్కడి నుండి మహామండపంలో ఏర్పాటు చేసిన ప్రత్యేక వేదికపై గండ్రదీపాలను వుంచారు. ఈఊరేగింపులో టక్కు, టమార, గజకర్ణ, గోకర్ణ, భూత, బేతాళ, గణాల వేషాలతో భక్తులు ప్రదర్శనలిచ్చారు. దారిపొడవునా నగరంలోని అమ్మవారి భక్తులు దుర్గమ్మకు జేజేలు పలికారు. పలు మహిళా భక్త బృందాలవారు కోలాట ప్రదర్శనలతో అమ్మవారికి తమ నీరాజనాల ర్పించారు. అమ్మవారికి అయ్యవార్లకు మహామండపం వద్ద ప్రత్యేక పూజలు నిర్వహించారు. అనంతరం భక్త జనాలను అమ్మవారి దర్శనానికి ఆలయాధికారులు అనుమతించారు. భవానీల రాకతో ఒక్కసారి నగరమంతా ఎరుపెక్కింది. వేర్వేరు ప్రాంతాలనుండి తరలి వచ్చిన భక్తులు అర్ధరాత్రి దాటినా భవానీలు అమ్మవారి గుడికి గండ్రదీపాలు తీసుకొస్తూనే వున్నారు. అమ్మవారికి జరిగిన ఈ కలశజ్యోతి ఉత్స వంతో నగరమంతా పులకించింది.



గండ్రదీపాలతో అమ్మవారి ముందుగా నడుస్తున్న భవానీలు

# తీర్మానం

జాబితాలో త్వరగా చేర్చాలని కేంద్రాన్ని కోరుతూ ఏపీ అసెంబ్లీ ఏకగ్రీవంగా తీర్మానం చేస్తున్నట్లు చంద్రబాబు తెలిపారు.

**ఈ బిల్లుతో వాల్మీకి, బోయలకు మరో పండుగ:మంత్రి కాల్వ**

ఈ బిల్లుతో దశాబ్దాల దోపిడికి గురైన ఓ సామాజిక వర్గంలో సరికొత్త ఆశలను ముఖ్యమంత్రి చంద్రబాబు కల్పించారన్నారు. వాల్మీకి, బోయలకు మహర్షి వాల్మీకి జయంతి ఓ పెద్ద పండుగని, ఈ బిల్లుతో మరో పండుగను ఆ వర్గాలకు సభ అందిస్తోందని ఆయన అన్నారు. వాల్మీకి, బోయలను చేర్చడం వల్ల గిరిజనులకు ఎలాంటి నష్టం వాటిల్లదని భరోసా ఇచ్చారు.

# వణకుతున్న మన్యం

వారాల నుండి చలి తీవ్రత అధికంగా ఉండడంతో అరకు, బొర్రా పర్యటించిన పర్యాటకులు ఇక్కడ కట్టెలు ఎక్కడ దొరుకుతాయని, బొగ్గులు దొరికితే కుటుంబ సమేతంగా తెల్లవార్లు జాగారం చేస్తు చలిని ఆశ్వాదిస్తున్నారు. మరో వైపు కెకెలైన్లో రైలు రాకపోకలు లేకపోవడంతో ఇక్కడకు వచ్చిన పర్యాటకులు తిరిగి తమ గమ్యస్థానాలకు చేరుకోలేక ఇక్కడ రూములు దొరక్క రోడ్లపైనే గడపాల్సి న దుస్థితి ఏర్పడింది. దీన్ని ఆసరాగా తీసుకున్న రెస్టారెంట్, లాడ్జిల యాజమాన్యం ఒక్కసారిగి రూముల ధరలు అధికంగా పెంచి పర్యాటకుల జేబులకు చిల్లు కొడుతున్నారు. ఈ ప్రాంతానికి పర్యటనకు వచ్చిన పర్యాటకులు బెంబెలెత్తిపోతున్నారు. తాము తీసుకొచ్చిన సొమ్ము అంతా ఖర్చు అవు తుంటే తిరిగి వెళ్లెందుకు చార్జీలకు కూడా లేక బంధువులకు, స్నేహితులకు ఫోన్లుచేసి బ్యాం కుల్లో సొమ్ము డిపాజిట్ చేయించినా ఏటిఎంలు పని చేయకపోవడంతో డబ్బులు డ్రా చేస్తున్న అవి విత్‌డ్రా అయినట్లు చూపిస్తు చేతికి డబ్బులు లేక పోవడంతో నరకయాతన పడవలసి వస్తుందని పర్యాటకులు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. దీంతో ఈ ప్రాంతంలో ఉన్న బ్యాంకు అధికారులతో ఉన్నతాధికారులు సంప్రదించి పర్యాటకులకు ఇబ్బందులు కలగకుండా చర్యలు తీసుకోవాల్సి న బాధ్యత ఎంతైనా ఉందని పర్యాటకులు అభిప్రాయపడుతున్నారు.

**SINGAM KUIL BLUE SUNDAY**
Draw No:129 DrawDate on:03/12/17

SINGAM SERIES
1st Prize Rs.50,000/- 954839
2nd Prize Rs.7,000/- 40484
3rd Prize Rs.3,500/-
02796 20718 22122 24956 60787
64878 74317 84246 89064 97364
4th Prize Rs.200/-
0873 2390 3323 3866 4005 4228 4816
6663 7969 9777
5th Prize Rs.100/-
0906 3050 3956 4189 5913 6439 6634
6725 7092 8943
6th Prize Rs.50/-
0077 1932 3887 5020 6446 8056 9225
0088 2107 3974 5123 6474 8074 9254
0354 2137 4033 5150 6688 8208 9511
0427 2163 4104 5162 7197 8405 9535
0505 2173 4157 5181 7417 8635 9579
0569 2397 4177 5470 7546 8657 9624
0614 2457 4183 5513 7576 8671 9645
0649 2820 4232 5639 7592 8689 9678
0947 2833 4296 5732 7621 8720 9738
1049 2990 4341 6163 7705 8775 9868
1176 3036 4345 6237 7770 8964
1420 3272 4358 6251 7931 9136
1525 3364 4359 6294 7961 9161
1654 3420 4844 6386 8041 9195
1775 3709 4966 6400 8055 9204

KUIL SERIES
1st Prize Rs.50,000/- 778221
2nd Prize Rs.7,000/- 35889
3rd Prize Rs.3,500/-
14733 27781 37510 39757 40663
78087 80760 84306 91664 96429
4th Prize Rs.200/-
0887 1306 1394 2451 3509 5813 5968
6016 7062 9826
5th Prize Rs.100/-
1897 3286 3965 4406 5037 6894 7033
8454 8816 9513
6th Prize Rs.50/-
0073 1435 2649 4605 5615 7149 8981
0145 1501 3079 4758 5625 7693 8995
0353 1528 3174 4789 5699 7798 9255
0372 1760 3292 4801 5774 7848 9272
0420 1838 3382 5066 5824 8096 9314
0442 1950 3505 5166 5837 8158 9403
0706 2041 3608 5196 6013 8173 9520
0725 2182 3613 5243 6020 8553 9560
0768 2331 3693 5285 6493 8563 9588
0794 2350 3719 5315 6521 8641 9827
0872 2424 3815 5360 6751 8675
1007 2442 4446 5479 6786 8772
1012 2458 4460 5515 6806 8830
1143 2602 4523 5581 6906 8945
1264 2646 4596 5592 7044 8980

**ROSA DEER SILVER SUNDAY**
Draw No:129 DrawDate on:03/12/17

ROSA SERIES
1st Prize Rs.50,000/- 196300
2nd Prize Rs.7,000/- 87134
3rd Prize Rs.3,500/-
26777 31159 33219 38354 40937
52816 54096 62212 64269 71236
4th Prize Rs.200/-
0029 0876 1075 1509 1909 3805 5080
5633 8587 9014
5th Prize Rs.100/-
0728 1105 2189 2317 2717 4843 5804
7086 7817 8518
6th Prize Rs.50/-
0076 1972 3241 4427 5818 7376 9031
0089 2113 3319 4505 5975 7599 9054
0109 2131 3329 4532 6034 7602 9152
0188 2164 3451 4687 6241 7640 9183
0389 2334 3802 4740 6361 7654 9214
0487 2519 3826 4841 6539 7722 9412
0632 2562 3862 4888 6624 8111 9779
0881 2679 3881 5167 6822 8117 9799
0892 2723 4028 5198 6976 8444 9813
1169 2792 4109 5419 7082 8585 9869
1231 2919 4160 5536 7108 8722
1292 2975 4227 5567 7115 8784
1745 3047 4231 5646 7174 8952
1869 3146 4301 5711 7260 8970
1965 3195 4382 5735 7306 8990

DEER SERIES
1st Prize Rs.50,000/- 415385
2nd Prize Rs.7,000/- 83075
3rd Prize Rs.3,500/-
09659 33620 44718 53372 58991
63298 72552 74563 76097 97089
4th Prize Rs.200/-
2138 3596 4706 5336 6347 6611 7684
8819 8858 9376
5th Prize Rs.100/-
0963 1180 2205 3192 4253 4340 5896
7031 8483 9367
6th Prize Rs.50/-
0233 1743 3472 4976 6665 8105 8899
0292 1752 3477 5097 6838 8109 8958
0428 1903 3686 5185 6907 8205 9112
0596 2403 3768 5289 7017 8300 9178
0692 2704 3772 5411 7139 8379 9336
0775 2755 3970 5545 7425 8496 9352
0782 2785 3982 5671 7649 8599 9675
0821 2921 4019 5693 7668 8613 9817
0975 3061 4190 5743 7818 8636 9837
1067 3078 4469 5800 7858 8678 9862
1337 3282 4511 5974 7884 8717
1398 3290 4531 6180 7894 8745
1483 3300 4615 6272 7897 8758
1579 3301 4800 6366 8038 8788
1621 3377 4829 6411 8091 8806

**THANGAM NALLANERAM EFFORT SUNDAY**
Draw No:129 DrawDate on:03/12/17

THANGAM SERIES
1st Prize Rs.50,000/- 774890
2nd Prize Rs.7,000/- 45256
3rd Prize Rs.3,500/-
02875 16192 19572 28907 44343
73853 81707 86370 91189 95343
4th Prize Rs.200/-
0038 0286 0377 0796 1772 2596 5094
5174 5203 7311
5th Prize Rs.100/-
1010 1691 2004 3763 4065 4139 5007
6246 7574 9008
6th Prize Rs.50/-
0084 2259 3491 5039 6002 8267 9022
0167 2320 3547 5075 6011 8348 9043
0536 2324 3680 5108 6079 8371 9055
0571 2459 3843 5241 6302 8476 9226
0689 2469 3851 5267 6495 8578 9470
0733 2733 3865 5327 6640 8595 9550
0935 2757 3999 5359 7045 8677 9558
0966 2801 4057 5404 7239 8714 9603
1118 2942 4184 5483 7677 8843 9740
1276 3000 4309 5617 7936 8884 9751
1358 3082 4323 5631 7952 8888
1562 3173 4484 5634 8027 8902
1922 3196 4492 5765 8029 8905
1983 3395 4703 5795 8051 8953
2074 3399 4778 5950 8218 8993

NALLANERAM SERIES
1st prize Rs.10,000/- N 860899
2nd Prize Rs.7,000/- 89377
3rd Prize Rs.3,500/-
02325 06247 08053 12995 30897
38784 39596 49751 56278 63803
4th Prize Rs.200/-
0508 1263 1619 1685 2913 4945 8373
8853 9119 9182
5th Prize Rs.100/-
0317 0322 1179 2821 2963 3255 6250
6288 8292 8741
6th Prize Rs.50/-
0059 0941 2797 4828 6203 7247 8723
0078 0992 2894 4905 6318 7279 8785
0128 1110 2923 5002 6418 7359 8930
0222 1134 3051 5040 6497 7377 9094
0319 1152 3172 5171 6622 7535 9394
0386 1305 3244 5299 6677 7852 9441
0462 1310 3248 5371 6703 7913 9496
0512 1313 3485 5395 6908 7921 9621
0550 1363 3609 5636 6928 8171 9889
0615 1495 3784 5652 6953 8189 9993
0642 1517 3900 5748 7035 8468
0717 1727 4542 5768 7077 8521
0750 1895 4561 5931 7107 8591
0859 1975 4621 5985 7127 8604
0863 2487 4697 6112 7145 8701

**KUMARAN VISHNU THUNDER SUNDAY**
Draw No:129 DrawDate on:03/12/17

KUMARAN SERIES
1st prize Rs.10,000/- K 640906
2nd Prize Rs.7,000/- 27252
3rd Prize Rs.3,500/-
29049 38472 41968 44157 48241
68635 73850 80189 86782 90151
4th Prize Rs.200/-
0745 2569 2698 3434 3859 6821 6994
8421 8767 9834
5th Prize Rs.100/-
0636 1163 2285 3068 3200 5855 6487
7270 7349 9920
6th Prize Rs.50/-
0098 2093 3158 4745 6409 8254 9408
0288 2102 3305 4783 6514 8262 9415
0506 2197 3502 4802 6516 8383 9491
0539 2338 3526 4845 6648 8441 9495
0558 2363 3537 5375 6701 8544 9526
0723 2492 3641 5448 6837 8550 9547
0922 2500 3735 5553 6949 8570 9668
1055 2549 3967 5657 7300 8572 9689
1479 2741 4082 5714 7424 8791 9741
1594 2813 4168 5740 7566 8815 9772
1613 2848 4229 5830 7583 9060
1637 2879 4457 6106 7971 9157
1920 2928 4472 6341 8006 9242
1930 2981 4517 6364 8164 9303
2043 3142 4671 6376 8176 9327

VISHNU SERIES
1st prize Rs.10,000/- V 589306
2nd Prize Rs.7,000/- 19240
3rd Prize Rs.3,500/-
01519 17834 21636 41330 42963
51062 64106 73384 79327 81257
4th Prize Rs.200/-
1166 2200 2218 2311 4573 7214 7618
9239 9473 9734
5th Prize Rs.100/-
0412 0748 3644 3781 6265 6813 6990
6996 7928 8068
6th Prize Rs.50/-
0107 1938 3059 4608 6154 7422 9210
0545 1974 3136 4732 6220 7450 9472
0701 1990 3148 4941 6222 7666 9557
0707 2194 3495 5012 6358 7686 9571
0877 2223 3605 5281 6486 7761 9583
0965 2480 3715 5334 6517 7836 9848
0984 2481 3995 5397 6600 8364 9918
1333 2508 4006 5465 6770 8580 9922
1349 2536 4080 5471 6798 8583 9926
1404 2802 4097 5517 6809 8622 9970
1524 2825 4217 5524 6868 8646
1555 2884 4334 5599 7063 8734
1761 2895 4470 5601 7173 8880
1834 2899 4480 5653 7241 9120
1842 2935 4551 5894 7382 9167

# చిరంజీవి అభిమానుల సేవలు స్ఫూర్తి దాయకం

## మంత్రి మాణిక్యాలరావు

## మిలటరీ మాధవరంలో ఘనంగా అమర జవాన్లకు వందనం

## సైనిక సంక్షేమ నిధికి రూ.కోటి : రమణం స్వామినాయుడు వెల్లడి

**తాడేపల్లిగూడెం,డిశంబర్ 3 ప్రభాతవార్త:** సేవా భావంతో మెగాస్టార్ పద్మశ్రీ రాజ్యసభ సభ్యుడు చిరంజీవి (కొణిదల శివప్రసాద్) అభిమానులు దేశవ్యాప్తంగా చేస్తున్న సేవా కార్యక్రమాలు స్ఫూర్తిగా నిలుస్తాయని రాష్ట్ర దేవాదాయ శాఖ మంత్రి పైడికొండల మాణిక్యాలరావు ప్రశంసించారు. ఆదివారం పశ్చిమగోదావరి జిల్లా తాడేపల్లిగూడెం రూరల్‌మండం మిలటరీ మాధవరంలో అఖిల భారత చిరంజీవి యువత,పవర్‌స్టార్ పవన్ కళ్యాణ్ అభిమానులు, జనసేన నాయకులు సోమలంక శేషు,పుల్లా బాబీ,సజ్జా సుబ్రహ్మణ్యం(సుబ్బు) ఆధ్వర్యంలో అమర జవాన్ల వందనోత్స వాన్ని ఘనంగా నిర్వహించారు. సైనిక కుటుంబాల సంక్షేమార్థం నూతనంగా సైనిక అమరవీరుల కుటుంబాలకు చెందే విధంగా కేంద్ర సైనిక సంక్షేమ నిధికి నిధులు చేరేటట్టు చిరంజీవి యువత ఆధ్వర్యంలో ఒక వినూత్న కార్యక్రమానికి చిరంజీవి యువత శ్రీకారం చుట్టింది.చిరంజీవి యువత జాతీయ అధ్యక్షుడు రవణం స్వామినాయుడు ఈ సందర్భంగా ఏర్పాటు చేసిన సమావేశానికి అధ్యక్ష వహించారు. ముఖ్యఅతిథిగా పాల్గొన్న మంత్రి మాణిక్యాలరావు మాట్లాడుతూ సినిమా హిట్,ఫ్లాఫ్ అని తేడాలేకుంతడా అభిమానులమంటూ బ్యానర్లు కట్టి తమ తమ హీరోల కోసం తమ వీరాభిమాన్ని చాటుకుంటామని,అయితే దీనికి భిన్నంగా చిరంజీవి అభిమానులు సేవా కార్యక్రమాలతో ముందున్నారన్నారు.గతంలో బ్లడ్‌బ్యాంక్,ఐ బ్యాంక్‌ల ద్వారా ఎంతో మందికి ప్రాణదానం,నేత్ర దానం చేశారన్నారు. ప్రస్తుతం దేశం కోసం ప్రాణాలు అర్పిస్తున్న వీరజవాన్ల సంక్షేమంపై దృష్టి పెట్టడం కేంద్ర సైనిక సంక్షేమనిధికి తమ వంతు సహకారం అందించడం అభినందనీయమన్నారు.సేవా కార్యక్రమాల్లో చిరంజీవి అభిమానులు ప్రపంచ వ్యాప్తంగా పేరు తెచ్చుకున్నారన్నారు. అఖిల భారత చిరంజీవి యువత అధ్యక్షుడు రవణం స్వామినాయుడు మాట్లాడుతూ కేంద్ర సైనిక సంక్షేమ నిధికి త్వరలోనే కోటి రూపాయలు విరాళం అందజేనున్నట్లు సభికుల హర్షధ్వనాల మధ్య ప్రకటించారు. ఈ కార్యక్రమాన్ని మరింత ముందుకు తీసుకువెళ్ళేందుకు ఐ బ్యాంక్,బ్లడ్ బ్యాంక్ తరహాలో సంక్షేమ నిధికి సంబంధించి కార్యాచరణ ప్రణాళిక రూపొందిస్తున్నామన్నారు.మిలటరీ మాధవరలో అమర వీరుల స్థూపం వద్ద మాజీ,ప్రస్తుత సైనిక ఉద్యోగులు,టిబిఆర్ విద్యాసంస్థల విద్యార్థులు,చిరంజీవి,పవన్ కళ్యాణ్ అభిమానులు సైనిక అమరవీరుల సేవలను స్మరించుకున్నారు.యుద్ధ సేవా పథకం,నౌ సేవా పథక గ్రహీత కమాండర్ చినవెర్రియ్య(రిటైర్డ్ ఇండియన్ నేవీ)ని మంత్రి మాణిక్యాలరావు సమక్షంలో చిరంజీవి యువత ఘనంగా సత్కరించింది.ఇదే ప్రాంతానికి చెందిన యుద్ధ వీరుల కుటుంబాల ప్రతినిధులు పది మంది మహిళలను ఘనంగా సత్కరించారు.ఈ కార్యక్రమంలో గ్రామ ఎక్స్ సర్వీస్ మెన్ అసోసియేషన్ అధ్యక్షుడు ప్రత్తి రామకృష్ణ,చిరంజీవి యువత రాష్ట్ర అధ్యక్షుడు కటకం రామకృష్ణ,జిల్లా అధ్యక్షుడు ఉండవల్లి రమేష్ నాయుడు,చిరంజీవి అభిమాన సంఘ మహిళా నాయకురాలు మల్లిపూడి కనకదుర్గాదేవి,రౌతు సోమరాజు,బొలిశెట్టి రాజేష్,ఆకుల శ్రీరాములు విద్యాసంస్థల చైర్మన్ ఆకుల విజయబాబు, పలువురు ప్రముఖులు, నాయకులు పాల్గొన్నారు.

# నేడు తెలంగాణలో టీ జాక్ 'కొలువులకై కొట్లాట' సభ

**హైదరాబాద్, డిసెంబర్ 3, ప్రభాతవార్త :** రాష్ట్రంలో ఖాళీగా ఉన్న పోస్టులను భర్తీ చేసి నిరుద్యోగ యువతకు ఉపాధి కల్పించాలన్న డిమాండ్‌తో తెలంగాణ పొలిటికల్ జేఏసి సోమవారం నిర్వహించనున్న కొలువుల కొట్లాట సభకు అంతా సిద్ధమైంది. ఈ సభ గత నెలలోనే నిర్వహించాల్సి ఉండగా, ప్రభుత్వం అనుమతి ఇవ్వక పోవడంతో పలుమార్లు వాయిదా పడింది. దీంతో జేఏసీ హైకోర్టుకు వెళ్లి అనుమతి తెచ్చుకుంది. రాష్ట్రంలోని వివిధ ప్రభుత్వ విభాగాలలో లక్షలాదిగా ఖాళీలు ఉన్నప్పటికీ వాటిని భర్తీ చేయకుండా ప్రభుత్వం నిరుద్యోగులు, యువతను ఇబ్బందికి గురి చేస్తున్నదని టీ జేఏసీ ఆరోపిస్తున్నది. ఇందులో భాగంగానే ఖాళీల భర్తీని వెంటనే చేపట్టాలన్న డిమాండ్‌తో కొలువుల కొట్లాట సభను నిర్వహిస్తున్నది. మధ్యాహ్నం 1 నుంచి 6 గంటల వరకు సభను నిర్వహించనున్నారు. సభ నిర్వహణను ప్రతిష్టాత్మకంగా తీసుకున్న జేఏసి నేతలు ఇప్పటికే ఇందుకు సంబంధించిన ఏర్పాట్లన్నీ పూర్తి చేశారు. సాంస్కృతిక కార్యక్రమాలను సైతం ఏర్పాటు చేశారు.

హైదరాబాద్ శివార్లలోని సరూర్‌నగర్ స్టేడియంలో నిర్వహించనున్న ఈ సభకు శ్రీకాంతాచారి వేదికగా నామకరణం చేశారు. యువత, నిరుద్యోగులను భారీ ఎత్తున సమీకరించేందుకు టీ జేఏసీ చైర్మన్ ప్రొ.కోదండరాం ఇప్పటికే పలు జిల్లాలలో పర్యటించి పెద్ద ఎత్తున ప్రచారం చేశారు. ముఖ్యంగా ఉస్మానియా, కాకతీయ విశ్వవిద్యాలయాలతో పాటు రాజధాని హైదరాబాద్, వరంగల్, సూర్యాపేట, కరీంనగర్, ఖమ్మం, సిద్దిపేట తదితర పట్టణాలలోని కళాశాలలు, కోచింగ్ సెంటర్లు లక్ష్యంగా ప్రచారం నిర్వహించారు.

# ఎల్ఇడి వీధిదీపాలు

రులకు ఆదేశించారు. గ్రామాలలో ఎల్ఇడి వీధి దీపాల ఏర్పాటులో మూడోవైరు కీలకమని, దీని ఏర్పాటు ముందుగానే సమస్యలను పరిష్కరించుకోవాలని, లైవ్ క్లియర్ సమస్యలు పంచాయితీరాజ్, ఏపీసీడ్‌కో, ఇంధనశాఖ సమ న్వయంతో పనిచేసి విధిదీపాల ఏర్పాటుకు వారం ముందే మూడో వైరు వేయాలని, ఒకేసారి ఎల్ఇడి వీధిదీపాల ఏర్పాటు కోసం సంస్థకు సహకరిం చాలని మంత్రి కోరారు. సమన్వయం చేసుకోవటానికి జిల్లా స్థాయి బృందాలను నియమించాలని, గ్రామాలలో దీపాలను అమర్చే సమయంలో నోడల్ ఆఫీసర్లతో కలసి పనిచేయాలని ఆయన ఆదేశించారు. సిపిఎంఎస్, డ్యాష్‌బోర్డు నిత్య పర్యవేక్షణలో వీధిదీపాలు ఒకేసారి వెలగటం, ఒకేసారి మలిగిపోయే విధంగా చూడాలన్నారు. డిసెంబర్ 1నుంచి 15దాకా రోజుకు 1000ఎల్ఇడి బల్బులను అమర్చటాన్ని ఇఇసిఎల్ లక్ష్యంగా పెట్టుకుందని, ఆ తరువాత రోజుకు 6000లైట్లు ఏర్పాటు చేస్తారన్నారు.ఎల్ఇడి వీధి దీపాల సరఫరాకు ఇఇఎస్ఎల్ ఒక సమగ్ర ప్రణాళికతో ముందుకు రావాలని మంత్రి లోకేష్ సూచించారు.వాస్తవంగా వెండర్స్ ఎన్ని దీపాలు సరఫరా చేయగలుగుతున్నారు అనే అంశాన్ని దృష్టిలో ఉంచుకోవాలని చెప్పారు. మండల స్థాయిలో విద్యుత్తు సమస్యలు తలెత్తి ఎల్ఇడి లైట్లు సరిగ్గా పనిచేయాలని పక్షంలో ఆటోమేటిగ్గా సరిచేసే విధానంగా ఉండాలన్నారు. ఎల్ఇడి విద్యుత్తు దీపాలు నిర్దేశిత సమయాల్లో వాటంతట అవే వెలిగి, అవే మలిగిపోయేలా ఉండేందుకు పరిశీలించాలని, సీసీఎంస్ బాక్సులతో విద్యుత్తు ఆదా ఎలా చేస్తున్నారో అలాగే ఆటోమేటిగ్గా వీధి దీపాలు ఆన్, ఆఫ్ అయ్యేలా చూడాలని కోరారు.మూడో వైరులేని ప్రాంతాల్లో ఆ వైరును బిగించే పనులను త్వరితగతిన చేపట్టాలన్న మంత్రి ఆదేశాలకు, ఇంధనశాఖ, ఐఅండ్, సీఆర్‌డియే ముఖ్యకార్యదర్శి అజయ్‌జైన్, ఏపీ ట్రాన్స్‌కో సీఎండీ విజయానంద్ స్పందిస్తూ ఇప్పటికే ఇంధన మంత్రి ఇందుకు సంబంధించి డిస్కంలను ఆదేశించారని చెప్పారు. ఈ టెలికాన్ఫరెన్స్‌లో ఏపీ ట్రాన్స్‌కో జేఎండీ దినేష్ పరుచూరి, ఏపీ ఇపిడిసిఎల్ సీఎండీ హెచ్‌వై దొర, పంచాయితీరాజ్ కమిషనర్ బి రామాంజనేయులు, నెడ్‌క్యాప్ విసి కమలాకర్ బాబు, పంచాయితీరాజ్ నోడల్ అధికారి పరదేశి కుమార్ తదితరులు పాల్గొన్నారు.

## ఉద్యమకారుల ఆకాంక్షను చాటేందుకే

# కొలువులకై కొట్లాట

### సభను అడ్డుకునే ప్రయత్నం చేస్తున్న ప్రభుత్వం,పోలీసులు: కోదండరామ్

**హైదరాబాద్ (ఎల్‌బినగర్), డిసెంబరు 3 ప్రభాతవార్త:** ఉద్యమకారుల ఆకాంక్షకు అనుగుణంగా తెలంగాణ ఉండాలని చాటిచెప్పే ప్రయత్నమే కొలువులకై కొట్లాట అని టిజెఏసి ఛైర్మన్ ప్రొఫెసర్ కోదండరామ్ పేర్కొన్నారు. కొలువులకై కొట్లాట బహిరంగ సభను రంగారెడ్డిజిల్లా సరూర్‌నగర్ ఇండోర్ స్టేడియంలో సోమవారం నిర్వహించనున్న సందర్భంగా కోదండరాం ఆదివారం సరూర్‌నగర్ ఇండోర్‌స్టేడియంలోని స్థలాన్ని, వేదికను, ఇతర ఏర్పాట్లను పరిశీలించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ అమరుల త్యాగాలతోనే తెలంగాణ వచ్చిందని ఉద్యమకారుల త్యాగాలను గుర్తుచేస్తూ వారి ఆకాంక్షలకు అనుగుణంగానే కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నామన్నారు. ఈ ప్రాంతంలోనే తనువు చాలించిన శ్రీకాంతచారిని గుర్తుచేస్తూ శ్రీకాంతాచారి వేదికను ఏర్పాటు చేశామని, తెలంగాణ అమరవీరుల ప్రాంగణంగా నామకరణం చేశామన్నారు. నీళ్లు, నిధులు, నియామకాల విషయంలో ప్రభుత్వం నిర్లక్ష్యంగా వ్యవహరిస్తుందని ప్రభుత్వంపై వత్తిడి తీసుకువచ్చి నియామకాలను సాధించుకునేందుకే కొలువులకై కొట్లాట సభను నిర్వహిస్తున్నామన్నారు. లక్ష్యాన్ని సాధించుకునేందుకు అందరం కలిసికట్టుగా ఒకే వేదిక నుంచి ఉద్యమించాలని ప్రభుత్వ మెడలు వంచేందుకు సంఘటితంగా నిలబడి నిలదిద్దామని పిలుపునిచ్చారు. కొలువులకై కొట్లాట గురించి సమాజంలో చర్చ జరుగుతుందన్నారు. సభకు ఉద్దేగా అనుమతి రాలేదని, ప్రభుత్వంపై కొట్లాడి తీసుకొచ్చామని, ఎట్లాగైనా ఆపాలని, అడ్డుకోవాలని ప్రభుత్వం ఆలోచన చేసే కోర్టు జోక్యం చేసుకుని సభకు అనుమతిచ్చిందన్నారు. లేకలేక అనుమతి దొరికిన సభను సద్వినియోగం చేసుకునేందుకు ప్రతిఒక్కరూ సంఘటితంగా కదలిరావాలని కోరారు. సభలో పోలీసులు, ప్రభుత్వం ఆటంకం కలిగించే ప్రయత్నం కూడా చేయవచ్చుని, ఎవ్వరు రెచ్చగొట్టే ప్రయత్నం చేసినా రెచ్చిపోకుండా శాంతియుతంగా సభను జరుపుకుందామన్నారు. కోర్టు మనపై నమ్మకంతో అనుమతి ఇచ్చిందని ఆ నమ్మకాన్ని నిలుపుకునే విధంగా సభను సజావుగా జరుపుకుందామన్నారు. సభకు వచ్చే వారిని దృష్టిలో పెట్టుకుని అన్నివసతులు కల్పిస్తున్నామన్నారు. యువత పెద్దఎత్తున్న హాజరై కార్యక్రమాన్ని విజయవంతం చేయాలని కోరారు. తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన తరువాత ఎంతో ఆశతో ఉద్యోగాలు వస్తాయని భావించారని ఇప్పుడు వారి ఆశలు అడిఆశలయ్యాయన్నారు. ఈ కార్యక్రమంలో జెఏసి కన్వీనర్ కె.రఘు, అధికార ప్రతినిధి, జి.వెంకటరెడ్డి, జిల్లా అధ్యక్షుడు వి.చలమరెడ్డి, నాయకులు పల్లెవినయ్ కుమార్, కెవి రంగారెడ్డి, దేశపాక శ్రీను, నాగరాజు, రతన్‌రావు, ఎం.లింగస్వామి, కొత్తరవి, ధారసత్యం, శ్యాంసుందర్, నర్సింహ్మారెడ్డి, నరేష్ రెడ్డి తదితరులు పాల్గొన్నారు.


ఆదివారం సరూర్‌నగర్ ఇండోర్ స్టేడియంలో వేదికను పరిశీలిస్తున్న కోదండరామ్

### 'ఎల్‌ఐసి పాలసీ దారులకు ఆధార్‌లింక్ అవసరం లేదు'

**హైదరాబాద్, డిసెంబరు3, ప్రభాతవార్త:** ఎల్‌ఐసీ పాలసీదారులు ఆధార్ అనుసంధానంతో చేసుకోవాలని ఇటీవల సెల్‌ఫోన్లకు ఎస్ఎంఎస్‌ల ద్వారా సమాచారం అందుతోంది. ఈ సందేశాలను నమ్మవద్దని ఎల్‌ఐసీ సంస్థ ప్రకటించింది. ఈ మేరకు సంస్థ ప్రతినిధులు ఇటు వంటి వాటిపట్ల అప్రమత్తతతో ఉండాలని, వాటిని ఏ మాత్రం నమ్మవద్దని సంస్థ ప్రతినిధులు ప్రటకనను జారీ చేశారు. ఇటీవల ఎల్ఐసీ లోగోతో కూడిన ఓ సందేశం విస్తృతంగా సోషల్ మీడియాలో ప్రచారం జరుగుతోంది. త మ పాలసీకి ఆధార్‌తో అనుసంధానం చేసుకోవాలనుకునే వారు అందులో ఉన్న నెంబర్‌కు ఎస్ఎంఎస్ పంపాలన్నది దాని సారాంశం. ఈ నేపథ్యంలో ఎల్ఐసీ తమ ఖాతాదారుల సొమ్ముకు భద్రత కల్పించాలనే ఉద్దేశ్యంతో ఈ ప్రకటనను జారీ చేశారు. సోషల్ మీడియాలో వస్తున్న ప్రచారాలను నమ్మవద్దని స్పష్టం చేశారు. అలాంటి సందేశాలేవి ఎల్ఐసీ సంస్థ ద్వారా జారీ చేయలేదన్నారు. ఎస్ఎంఎస్ ద్వారా ఆధార్‌ను అనుసంధానం చేసుకునే సదుపా యమేదీ ప్రస్తుతానికి కల్పించలేదన్నారు. ఒకవేళ ఆ సదుపాయాన్ని కల్పించినట్లయితే ఆ వివరాలను తమ వైబ్‌సైట్‌లో పొందుపరుస్తామని చెప్పారు. మీ వ్యక్తిగత వివరాలు పంచుకోవాల్సిన వచ్చినప్పుడు ముందుగా స్థానిక ఎల్ఐసీ కార్యాలయాన్ని సంప్రదించాలని సూచించారు. పాలసీ నెంబర్లు ఆధార్‌తో అనుసంధానం చేయాలని ఇది వరకే ఐఆర్‌డీఏ ఆయా భీమా కంపెనీలకు సూచించిందన్నారు. మనీలాడరింగ్ నిరోధానికి ఆర్థిక సేవలైన పాన్‌కార్డు, భీ మా పాలసీలకూ ఆధార్‌ను అనుసంధానం తప్పనిసరి చేస్తూ కేంద్రం కూడా జూన్‌లో ఆదేశాలిచ్చింది. అయితే ఎల్ఐసీ చెప్పినట్లుగా ఎస్ఎంఎస్ రూపంలో అనుసంధానం చేసుకునే అవకాశమేది లేదని సంస్థ ప్రతినిధులు స్పష్టం చేశారు.


బోడుప్పల్‌లో అత్తవారింటి ముందు సంగీత చేస్తున్న ఆందోళనకు మద్దతు ప్రకటించిన మహిళలు

## సంగీత ఆందోళనకు మహిళల మద్దతు

**బోడుప్పల్, డిసెంబరు 3 ప్రభాతవార్త :** బోడుప్పల్‌లోని తన అత్తవారింటి ముందు సంగీత తన రెండేళ్ల కూతురుతోపాటు చేస్తున్న ఆందోళన 15రోజులకు చేరింది. 15వ రోజు ఆందోళనకు పలువురు మహిళలు మద్దతుప్రకటించారు. సంగీతను కలిసి ఆమెకు న్యాయం జరిగే వరకు పోరాటం చేస్తామని ప్రకటించారు.

# తెలంగాణ అస్తిత్వభావన, చరిత్ర నిర్మితమవ్వాలి

## తెలంగాణ సాహిత్య వికాసంపై సభలో డా. నందిని సిధారెడ్డి

**హైదరాబాద్ (నాంపల్లి), డిసెంబరు 3 ప్రభాతవార్త :** తెలంగాణ అస్థిత్వ భావన, చరిత్ర నిర్మితమవ్వాల్సిన అవసరం ఎంతైనా ఉందని తెలంగాణ సాహిత్య అకాడమీ అధ్యక్షుడు డా. నందిని సిధారెడ్డి అన్నారు. తెలంగాణలో సాహిత్యం ప్రతి శతాబ్దంలోనూ ఉధృతంగా, ఉన్నతంగా, ప్రజల సాహిత్యంగా వచ్చిందని, ఆ వైభవాన్ని ప్రపంచానికి సాక్షాధారాలతో నిరూపించబోతున్నామని ఆయన అన్నారు. తెలంగాణ రచయితల సంఘం ఆధ్వర్యంలో ఆదివారం ఉదయం నుండి సాయంత్రం వరకు నాంపల్లి పబ్లిక్ గార్డెన్స్ వద్దనున్న పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంలోని డా. నందమూరి తారక రామారావు కళామందిరంలో 'తెలంగాణ సాహిత్య వికాసం' అనే విషయంపై సభ జరిగింది. తెలంగాణ రచయితల సంఘం (తెరసం) అధ్యక్షుడు డా. నాళేశ్వరం శంకరం సభాధ్యక్షతన జరిగిన ఈ సభకు డా. నందిని సిధారెడ్డి ముఖ్యఅతిథిగా విచ్చేసి మాట్లాడుతూ తెలంగాణలో సృజనాత్మకత, పరిశోధన రెండూ సమాంతరంగా జరగాల్సిన అవసరముందని, పరిశోధనలు మరింతగా జరగాలని కవులకు, రచయితలకు పిలుపునిచ్చారు. మనభాష వివక్షతకు గురైందని తెలుగు వాళ్లందరం సమానమే అన్న భావన తమకూ ఉందని, అయితే అందరం సమానంగా సమానం అని తెలియజెప్పాల్సిన అవసరం ఉందన్నారు. యుగాలవారీగా చెప్పబడిన తెలుగు సాహిత్య చరిత్రలో శితకవుల యుగంలో తప్పా ఎక్కడా తెలంగాణకు ప్రాధాన్యత లేదన్నారు. ఆ వివక్షను సరిచేసే బాధ్యతను తెలంగాణ రచయితల సంఘం స్వీకరించడం అభినందనీయమని అన్నారు. అందుకే తెలంగాణ సాహిత్య వికాసం పేరిట అన్ని సాహిత్య ప్రక్రియల ఆరిభావ వికాసాలపై సదస్సు నిర్వహించడం విశేషమన్నారు. చందాల కేశవదాసు వంటి నాటకకర్త, కొమర్రాజు లక్ష్మణరావు వంటి భాషవేత్తలు మొదలైన ఎందరో ప్రముఖులు తెలంగాణ రాష్ట్రమేర్పడిన తర్వాతే వెలుగులోకి వచ్చారన్నారు. ప్రతీ సంవత్సరం తెలంగాణ తెలుగు ప్రపంచ మహాసభలను నిర్వహిస్తామని సిధారెడ్డి ప్రకటించారు. ఈ ప్రారంభ సభలో గౌరవ అతిథులుగా సీనియర్ సంపాదకులు కె. రామచంద్రమూర్తి, కట్టా శేఖర్‌రెడ్డి, మీడియా అకాడమీ ఆఫ్ తెలంగాణ అల్లం నారాయణలు,


ఆదివారం జరిగినసభలో మాట్లాడుతున్న డా. నందిని సిధారెడ్డి, వేదికపై ఇతర అతిథులు

ఆత్మీయ అతిథులుగా సిఎం ఓఎస్‌డి దేశపతి శ్రీనివాస్, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షుడు ఆచార్య ఎస్.వి. సత్యనారాయణ, భాషా సాంస్కృతికశాఖ సంచాలకుడు మామిడి హరికృష్ణ, సమావేశ కర్తగా ఘనపురం దేవేందర్ తదితరులు పాల్గొన్నారు. ముందుగా తెరసం ప్రధాన కార్యదర్శి డా. వి. శంకర్ కార్యదర్శి నివేదిక అందించారు. తెరసం అధ్యక్షుడు డా. నాగేశ్వరం శంకరం అధ్యక్షోపన్యాసం చేస్తూ తమది ప్రజల సాహిత్య సంఘమని, అన్ని సాహిత్యాల, కళాకారుల, కథకుల, రచయితల, యువతకు చేదోడువాదోడుగా ఉంటామన్నారు. ప్రపంచ తెలుగు మహాసభలను పురస్కరించుకొని తెలంగాణ వికాసం పేరున ఈ సమావేశం నిర్వహిస్తున్నామని, తెలంగాణ ఉచ్చారణ భాషను సజీవంగా కాపాడుకోవాలన్నదే తమధ్యేయమన్నారు. సభలో సీనియర్ సంపాదకుడు డా. కె.శ్రీనివాస్ కీలకోపన్యాసం చేస్తూ తెలంగాణ సాహిత్యం అన్ని పార్శ్వాల నుంచి వస్తేనే తప్ప సమగ్రత కాదని, తెలంగాణ తన గురించి తాను వ్రాసుకొని పరిశోధించాల్సిన అవసరం ఎంతైనా ఉందని స్పష్టం చేశారు. ఇక్కడ కథా సాహిత్య కొరత ఉందని అన్నారు. తెలుగుభాష, తెలంగాణ భాష వేరుకాదని, కానీ ప్రాంతీయ, కులాలనుబట్టి భాషలో కొంతమార్పు అనివార్యంగా ఉండొచ్చన్నారు. భాషా పోషణ ముఖ్యం కాదు, దాన్ని రేపటి అవసరాలకు ఎలా అభివృద్ధి చేస్తామన్నదే ముఖ్యమన్నారు. భాషను ఆధునిక భాషగా మార్చుకోవాలని చెప్పారు. వచన రచనల ఉధృతి ఎక్కువగా పెరగాలని, తద్వారా తెలంగాణ చరిత్ర, సంస్కృతి సులభంగా వ్యాప్తమవుతుందని చెప్పారు. చరిత్ర అనేక కోణాలుగా ఆవిష్కరించాలని ఆయన పిలుపునిచ్చారు. అందుబాటులో ఉన్న చరిత్రలో తెలంగాణ చరిత్రను వేరుచేయాలని, వివక్షకు గురైన దానిని వెలికితీసి అంతా క్రోడీకరించి వస్పష్టమైన చరిత్రను ప్రజలముందుకు తేవాలని శ్రీనివాస్ అన్నారు. మొదట తెలంగాణ పదకోశం రూపొందించాలని ఆయన సూచించారు. తెలుగు తెలంగాణ ఒకటేనని, కానీ వాటిరూపాలు వేరుగా ఉన్నాయని, వాటి స్పష్టత తీసుకురావాలని చెప్పారు. ఈ నేపథ్యంలో గ్రంథాలయాలు కీలకపాత్ర వహించాలని ఆయన కోరారు. తెలంగాణ ఐటి హబ్‌తో సమన్వయం చేసి తెలుగుభాషను గూగుల్ ద్వారా అర్థవంతంగా అంతర్జాతీయస్థాయిలో వినియోగించుకునే దిశగా అడుగులు వేయాలన్నారు. తెలుగు నిఘంటువుల నుండి తెలంగాణ పదాలను వేరుచేసి ఇంకా తెలంగాణ సమాజంలో ప్రకాశిస్తున్న తెలంగాణ పదాలను జోడించి ప్రత్యేక నిఘంటువులు రూపొందించాలని ఆయన సూచించారు. అల్లం నారాయణ మాట్లాడుతూ తెలంగాణ రాష్ట్రంలో క్రియాత్మక కృషిచేయాలని సూచించారు. తెలంగాణ భాషతోపాటు సాహిత్య వికాసం గురించి కూడా మాట్లాడుకోవాలి. అస్థిత్వ ఉద్యమాలకు మన పండుగలు తోడ్పడ్డాయని, మలిదశ ఉద్యమంలో కూడా మంచి సాహిత్యమొచ్చిందని అన్నారు. ఆకాలంలో వెలుగులోకి వచ్చిన ప్రశ్నలకు సమాధానాలు ఇప్పుడు సాధించాలన్నారు. 500 సంవత్సరాల ముస్లింల పాలనతో ఉన్న తెలంగాణ భాష జీవం కోల్పోలేదని, ఆ స్ఫూర్తిని కొనసాగించాలని ఆయన సూచించారు. పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షుడు ఆచార్య ఎస్.వి.సత్యనారాయణ మాట్లాడుతూ అభ్యుదయ రచయితల సంఘం చేయలేని పనులను తెలంగాణ రచయితల సంఘం తక్కువ కాలంలోనే సాధించిందని అభినందించారు. దిగంబర కవులలో చివరివాడిగా నిలిచిన జ్వాలాముఖి, చెరబండరాజు, నిఖిలేశ్వర్‌లు తెలుగు బిడ్డలేనని గుర్తుచేశారు. ఆంధ్రాలో భావకవిత్వం అలరారితే తెలంగాణలో అనుభవ కవిత్వం ఆకలి కవిత్వం వచ్చిందన్నారు. అక్కడా ఊహల్లో మరోప్రపంచం కోరుకుంటే ఇక్కడ సజీవ పోరాటాలు, ఉద్యమాలు పుట్టి సాకారమయ్యాయని అన్నారు. దళిత కవిత్వం, విప్లవకవిత్వం, స్త్రీవాద కవిత్వం, బడుగు బలహీనవర్గాల, మైనారిటీ కవితలు తెలంగాణలోనే పుట్టాయన్నారు. సాహిత్యం, సాంస్కృతిక ఉద్యమాలు ఇక్కడ ప్రజల ఆకాంక్షలుగా వర్ధిల్లుతున్నాయని, రాజకీయ, సామాజికరంగాలను ప్రభావితం చేస్తున్నాయని ఎస్వీ వివరించారు. డా. కె. రామచంద్రమూర్తి ప్రసంగిస్తూ తెలంగాణలో నిరంతరం కవిత్వం పరవళ్లు తొక్కుతుందని, కథాసాహిత్యం, నవల, నాటకం తదితర ప్రక్రియల ప్రభావాత్మకంగా వస్తున్నాయని అభినందించారు. తెలంగాణ కవిత్వానికి చక్కని మార్గదర్శకం లభిస్తుందని, భవిష్యత్తులోనూ సాహిత్య తెలంగాణ వైభవం మరింత గొప్పగా వర్ధిల్లుతుందని ఆయన అన్నారు. అనంతరం జరిగిన రెండవ సభలో తడి కవితాసంపుటి, అక్షరశిల్పి వేముగంటి, జానకీ రాఘవీయం-జనని శతకం, సంబురం, ఎ మిడ్ డ్రీం ఆఫ్ డిసర్ట్ తెలుగు నుండి ఆంగ్లంలోకి అనువాదం, నడుస్తున్న తోవ పొంటి కవితా సంపుటిల ఆవిష్కరణలు జరిగాయి. మూడవ సభలో తెలంగాణ సాహిత్యం-వివిధ ప్రక్రియల ఆవిర్భావ వికాసాలు, నాలుగవ సభలో కవి సమ్మేళనంలు ఘనంగా జరిగాయి.


బోడుప్పల్ ఆర్ఎస్ఎస్ కాలనీలో మోహరించిన పోలీసులు

## బోడుప్పల్‌లో పోలీస్ బందోబస్తు

**బోడుప్పల్, డిసెంబరు3 ప్రభాతవార్త :** వేద పాఠశాల విషయంలో తలెత్తిన వివాదంలో బోడుప్పల్‌లో ఆదివారం ఎలాంటి అవాంఛనీయ సంఘటనలు జరుగకుండా పోలీసులు గట్టి బందోబస్తు ఏర్పాటు చేశారు. సభలు, సమావేశాలు, ర్యాలీలను నిషేధిస్తూ పోలీసులు ఆదివారం బోడుప్పల్‌లో 144వ సెక్షన్ విధించిన విషయం తెలిసిందే. ఇందుకు అనుగుణంగా సుమారు 150 మందికి పైగా పోలీసులను మోహరించారు. బోడుప్పల్ మల్లన్న గుడి నుండి వేద పాఠశాల ఉన్న ఆర్ఎస్ఎస్ కాలనీ వరకు పూర్తిగా పోలీసులను మోహరించారు. మల్కాజిగిరి ఎసిపి గోనె సందీప్‌రావు, మేడిపల్లి సిఐ కె.జగన్నాథ్‌రెడ్డిల ఆధ్వర్యంలో బందోబస్తు ఏర్పాటు చేశారు. మల్కాజిగిరి ఎసిపి పరిధిలోని సిఐలు ఈ బందోబస్తులో పాల్గొన్నారు. బోడుప్పల్ ఆర్ఎస్ఎస్ కాలనీలోకి రావడానికి ప్రయత్నించిన సుమారు 15 మంది భాగ్యనగర హిందూ వాహిని కార్యకర్తలను అదుపులోకి తీసుకొని మేడిపల్లి పోలీస్‌స్టేషన్‌కు తరలించారు.

## కాలయాపన వైఫల్యాన్ని కప్పిపుచ్చుకోవడానికే సిఎం కెసిఆర్ బిసి మంత్రం: జీవన్‌రెడ్డి

**ప్రభాతవార్త ప్రతినిధి-జగిత్యాల:** టిఆర్ఎస్ ప్రభుత్వం అధికారం చేపట్టి 42 మాసాలు కావస్తున్న బలహీనవర్గాల సంక్షేమాన్ని విస్మరించి సిఎం కెసిఆర్ నేడు తను చేసిన తప్పులను కప్పిపుచ్చుకోవడానికే బిసి మంత్రం పాడుతు న్నాడని సిఎల్‌పి ఉపనేత, జగిత్యాల ఎమ్మెల్యే జీవన్‌రెడ్డి ముఖ్య మంత్రి కెసిఆర్‌పై మండిప డ్డాడు. జగిత్యాల జిల్లాలో ఆదివారం ఆయన నివాసంలో విలేకరుల సమావేశం నిర్వహించారు. ఈ సందర్భంగా ఎమ్మెల్యే జీవన్‌రెడ్డి మాట్లాడుతూ తెలంగాణ రాష్ట్రం ఏర్పడి 42 మాసాలు కావస్తుందని 4 సార్లు రాష్ట్ర బడ్జెట్‌ని ప్రభుత్వం రూపొం దించిందన్నారు. అప్పటి నుండి ఇప్పటి వరకు బలహీనవర్గాల సంక్షేమం కోసం ఒక్కరూపాయి కేటాయిం చలేదని ఇప్పుడు ప్రభుత్వం చేపట్టి 42 మాసాల అనంతరం బలహీనవర్గాల సంక్షేమం గుర్తుకు రావడం ఇప్పటికైనా సంతోషం అన్నారు. నాలుగు ఆర్థిక సంవత్సరాల్లో బలహీనవర్గాలకు సంబందించి స్వయం ఉపాది కల్పన నిరుద్యోగ యువతకు 2016-17, 2017-18 రెండు ఆర్థిక సంవత్సరాలకు సంబందించి స్వయం ఉపాది కల్పన కార్యక్రమం లక్ష్యమే లేదన్నారు. సుమారు 70 శతం పంట దిగుబడి తగ్గిపోయిందని అవసరం అనుకుంటే సిఎం కెసిఆర్ రైతు సమన్వయ సమితి సభ్యులతో గ్రామాల్లో సమాచారం తెప్పించుకోవాలని పేర్కొన్నారు. కార్యక్రమంలో మండల కాంగ్రెస్ పార్టీ అధ్యక్షులు కొలువూరి దామోదర్‌రావు, మున్సిపల్ కౌన్సిలర్ కోర్టు శ్రీను, కాంగ్రెస్ నాయకులు తాటిపత్రి దేవేందర్‌రెడ్డి, జీవన్, నెహాల్, రియాజ్ తదితరులు పాల్గొన్నారు.


ఆదివారం జగిత్యాలలో మీడియా సమావేశంలో మాట్లాడుతున్న జీవన్‌రెడ్డి

## డ్రగ్స్ రాకెట్‌ను మించిపోతున్న గంజాయి మాఫియా

### తెలుగు రాష్ట్రాల్లో పలు జిల్లాలలో వేల ఎకరాల్లో సాగు

### కోట్లాది రూపాయల పెట్టుబడులు పెడుతున్న స్మగ్లర్లు

**హైదరాబాద్, డిసెంబరు 3, ప్రభాతవార్త:** తెలుగు రాష్ట్రాలలో గంజాయి మాఫియా డ్రగ్స్ రాకెట్‌ను మించి పోతోంది. హైదరాబాద్‌లో ఆరు నెలల క్రితం వెలుగు చూ సిన డ్రగ్స్ స్కాం ఓవైపు అబ్కారీ శాఖతో పాటు పోలీసు శాఖను కుదిపేయగా ఇప్పుడు గంజాయి మాఫియా అదే స్థాయిలో ప్రభుత్వ వ్యవస్థలను సవాల్ చేసే స్థాయి కి ఎదిగింది. మాదకద్రవ్యాలు ఇతర దేశాల నుంచి రవాణా అవుతుండగా గంజాయి పంట తెలుగు రాష్ట్రాలలోని పలు జిల్లాలలో వేల ఎకరాల్లో సాగవుతున్నా సర్కారీ విభాగాలు దీనిపై ఉక్కుపాదం మోపడంలో పూర్తిగా సఫలీకృతం కాలేక పోవడం గమనార్హం. డ్రగ్స్ మాఫియా ఇటీవల కాలంలో వేళ్లూనుకున్నా దశాబ్దాలుగా తెలుగు రాష్ట్రాలను జాడ్యంలా పీడిస్తున్న గంజాయి మాఫియా వేలాది మంది జీవితాలను బలిగొందని చెప్పాలి. గంజాయి సాగును అరికట్టడంలో మొదట ఉమ్మడి ఎపి సర్కారు ఆ తరువాత తెలంగాణ, ఎపి ప్రభుత్వాలు పూర్తిగా విఫలమయ్యాయని విమర్శలున్నాయి. స్మగ్లర్ల పెట్టుబడితో ఎలాంటి చీడల బెడద లేకుండా దండిగా లాభాలు తెచ్చిపె డుతున్న గంజాయి సాగు ఇప్పుడు రెండు రాష్ట్రాలలోని పలు జిల్లాలలో వేలాది మంది రైతులకు కాసులు కురిపిస్తుండడం విశేషం. నిన్నమొన్నటి వరకు గ్రా మీణ ప్రాంతాలు, కొన్ని పట్టణాలకే గంజాయి మాఫియా కార్యకలాపాలు వుండగా నేడు కాలేజిలను కమ్మేస్తుండడం విశేషం. గంజాయి సాగును పూర్తిగా నివారించే అంశంలో సర్కారీ విభాగాలకు చిత్తశుద్ధి లేకపోవడం, అడపాదడపా జరుగుతున్న దాడులతో తూతూ మంత్రం కేసులు మినహా కఠిన చర్యలు లేక పోవడంతో స్మగ్లర్లు ఆడింది ఆట పాడింది పాటగా కొనసాగుతోంది.

కేంద్ర నార్కోటిక్ బ్యూరో గణాంకాల ప్రకారం దేశంలోని 15 రాష్ట్రాల్లో గంజాయి సాగు ఏయేటికాయేడు పెరుగుతూనే వుంది. ఈశాన్యా రాష్ట్రాల్లో గంజాయి సాగు ఎక్కువగా వుండగా దక్షిణాది రాష్ట్రాల వరకు వచ్చే సరికి తమిళనాడుతో పాటు తెలుగు రాష్ట్రాల వాటా ఎక్కువగా వుందని ఆ గణాంకాలు తేటతెల్లం చేశాయి. తెలుగు రాష్ట్రాల్లో గంజాయి సాగు ఈ నాటికి కాకున్నా ఇటీవల కాలంలో ఇది మరింత పెరగడం, యువత దీనికి ఆకర్షితులవుతుండడం ఆందోళన కలిగించే అంశంగా చెప్పాలి . ముంబాయి అండర్ వరల్డ్ మాఫియాకు చెందిన డాన్‌లతో పాటు అదే ప్రాంతానికి చెందిన డ్రగ్స్ మాఫియా నేరగాళ్లు తెలుగు రాష్ట్రాల్లో గంజాయి సాగును ఎక్కువగా ప్రోత్సహిస్తున్న విషయం చాలా కాలం క్రితమే వెలుగు చూసింది. గంజాయి సాగుకు అనువైన అనేక మారుమూల ప్రాంతాలు, అటవీ ప్రాంతాలు, దట్టమైన అడవులు వున్న ఏజెన్సీ ప్రాంతాలు, పోలీసులు, అబ్కారీ, రెవెన్యూ శాఖల అధికారులు సులభంగా వెళ్లలేని గ్రామాలు తెలుగు రాష్ట్రాల్లో వందల సంఖ్యలో వుండడం స్మగ్లర్లకు బాగా కలిసి వస్తుంది. ఈ ఒక్క కారణంతోనే స్మగ్లర్లు ఆయా ప్రాంతాలలోని రైతులను మచ్చిక చేసుకుని డబ్బులు ఆశ చూపుతూ వేలాది ఎకరాల్లో గంజాయిని సాగు చేయిస్తున్నారని నార్కోటిక్ బ్యూరో తేల్చింది. తెలంగాణ వరకు వస్తే పూర్వపు వరంగల్, మెదక్, రంగారెడ్డి, కరీంనగర్ జిల్లాలు, ఎపి వరకు వస్తే ఉభయ గోదావరి జిల్లాలతో పాటు విశాఖపట్నం, శ్రీకాకుళం, విజయనగరం జిల్లాలలో గంజాయి సాగు ఎక్కువగా వుందని అబ్కారీ శాఖల వార్షిక నివేదికల్లో చాలా కాలం క్రితమే తేలింది. తెలుగు రాష్ట్రాల్లో గంజాయి సాగుకు సంబంధించి అటు కేంద్రం, ఇటు రాష్ట్రాల వద్ద ఇంత పక్కాగా లెక్కలు వున్నా దీని నివారణకు పగడ్బందీ వ్యూహం లేక పోవడం పెద్ద మైనస్ పాయింట్ కాగా సరిగ్గా ఈ అంశమే స్మగ్లర్ల పాలిట వరంగా మారిందని నిపుణులు అంటున్నారు. గంజాయి సాగు అంటే వరిపంట సాగులా వుండదనే విషయం కూడా అధికారులకు తెలిసిందే. గంజాయి పంట సాగు చేయాలంటే మొదట స్మగ్లర్లు రావాలి. వారికి స్థానిక గంజాయి స్మగ్లర్లు, ఇతర నేరగాళ్ల కలవాలి. ఆ తరువాత ఎన్ని ఎకరాల్లో సాగు చేయాలనే దానిపై ఒక నిర్ణయానికి వస్తారు. దాని తరువాత ఎక్కడ సాగు చేయాలనే దానిపై తుది నిర్ణయం తీసుకుని ఆయా ప్రాంతాలలోని రైతులను ఒప్పించి వారికి పెట్టుబడులతో పాటు నాణ్యమైన విత్తనాలు, ముందుగానే లాభాలను ఇచ్చేస్తారు. దీని తరువాత ఐదారు నెలలకు గంజాయి పంట ఏపుగా పెరిగి చేతికి వస్తుంది. ఈ లోపు స్మగ్లర్లు ఐదారుసార్లు వచ్చి పంట ఏ విధంగా సాగవుతుందో చూస్తారు. ఒకవేళ పంట ఏపుగా పెరగకుంటే ఎరువులు వాడతారు. ఇందుకు కావాల్సిన పెట్టుబడులు కూడా స్మగ్లర్లే సమకూరుస్తారు. ఇదంతా జరిగిన తరువాత గంజాయి పంటను కోయడం మరో ఎత్తుగా చెప్పాలి. గంజాయి పంట చూడడానికి జనుము పంటలాగా వుంటు ంది. జనుము పంటను కూడా కోసిన తరువాత నెల నుంచి రెండు నెలల పాటు ఎండలో ఆరపెడతారు. గంజాయి పంటను కూడా ఇలాగే ఎండలో ఆర పెట్టాల్సి వుంటుంది. ఇలా ఆరపెట్టిన గంజాయి పంటను స్మగ్లర్లు పొలంలోనే గ్రేడింగ్ చేస్తారు. దీని ద్వారా దేనికి ఎంత ధర అనేది వారు నిర్ణయిస్తారు. గంజాయి స్మగ్లింగ్‌లో రవాణా కీలకంగా వుంటుంది. పొలం నుంచి గంజాయిని మొదట సమీపంలోని బస్ లేదా రైల్వే స్టేషన్లకు తరలించి అక్కడి నుంచి పలు వస్తువుల మధ్య వుంచి కావాల్సిన ప్రాంతాలకు తరలిస్తుంటారు. ఈ క్రమంలోనే చాలాసార్లు బస్, రైల్వే స్టేషన్ల వద్ద ప్రత్యేక తనిఖీల సమయంలో అనేక సార్లు గంజాయి పట్టుబడిన ఉదంతాలున్నాయి. ఇలా స్మగ్లర్లు గంజాయిని పొలం నుంచి అనేక మార్గాల్లో దేశంలోని ఏ ప్రాంతానికైనా సురక్షితంగా రవాణా చేయగలుగుతున్నారని చెప్పాలి. ఈ క్రమంలోనే స్మగ్లర్లు రెవెన్యూ, పోలీసు, అబ్కారీ విభాగాలకు దండిగా మామూళ్లు ఇస్తున్నారనే అభియోగాలున్నాయి. ఈ నేపథ్యంలోనే ఈ మూడు విభాగాల అధికారులు గంజాయి పంట సాగుచేస్తున్న పొలాల జోలికి వెళ్లడం లేదని, ఒకవేళ వెళ్లినా తూతూ మంత్రంగా దాడులు చేస్తూ నాంకే వాస్తేగా కేసు లు నమోదు చేస్తున్నారనే విమర్శలుకూడా వున్నాయి. ఇలా మూడు సర్కారీ విభాగాలు సహకరిస్తుండడం వల్లే స్మగ్లర్లు గంజాయిని ఏకంగా బస్సులు, రైళ్లు, లారీలు ఇతర వాహనాల్లో అతిసులభంగా రవాణా చేయగలుతున్నారనే ఆరోపణలున్నాయి.

**కాలేజీలను కమ్మేస్తున్న గంజాయి...మత్తులో జోగుతున్న విద్యార్థులు**
**నిందితులకు కానరాని కఠిన శిక్షలు...గంజాయి సాగుదారులపై కాగితాలకే పరిమితమైన పిడి అమలు**

ఇక తాజా అంశానికి వస్తే ఇటీవల కాలంలో అనేక కాలేజీలు గంజాయి మత్తులో జోగుతున్న ఘటనలు వరుసగా వెలుగు చూస్తున్నాయి. దేశంలోనే పేరొందిన వరంగల్ ప్రాంతీయ ఇంజనీరింగ్ కాలేజీలో అనేక మంది విద్యార్థులు, పూర్వ విద్యార్థులు గంజాయి సేవిస్తూ లేదా తమ వెంట వుంచుకుంటూ పోలీసులకు దొరికిపోయిన ఉదంతాలు ఇటీవల కాలంలో అనేకం జరిగాయి. వారం రోజుల క్రితం ఏకంగా పది మంది విద్యార్థులు గంజాయితో పట్టుబడడం సంచలనం రేపింది. ఆరు నెలల వ్యవధిలో ఈ కాలేజికి చెందిన 30మంది విద్యార్థులు గంజాయితో దొరికిపోవడాన్ని పరి శీలిస్తే గంజాయి మాఫియా కాలేజిలను ఏ విధంగా టార్గెట్ చేస్తుందో అర్థం చేసుకోవచ్చు. ఒక్క వరంగల్ ప్రాంతీయ ఇంజనీరింగ్ కాలేజియే కాదు రాష్ట్రంలోని అనేక కాలేజీలకు చెందిన విద్యార్థులు ఇటీవల కాలంలో గంజాయి సేవిస్తూ లేదా స్మగ్లింగ్ చేస్తూ దొరికిపోయిన ఉదంతాలు వున్నాయి. ఇదంతా ఒక ఎత్తయితే గంజాయి స్మగ్లింగ్‌కు పాల్పడుతున్న వారు, వీటిని అమ్ముతున్న వారిపై కఠిన చర్యలు తీసుకోవడంలో తెలుగు రాష్ట్రాలు విఫలమయ్యాయనే విమర్శలు ఎక్కువగా వున్నాయి. తెలుగు రాష్ట్రాల్లోని అనేక జిల్లాలు ఇప్పటికీ గంజాయి పంటకు కేరాఫ్‌గా మారాయని నార్కోటిక్ బ్యూరో లెక్కలు చెబుతున్నా అబ్బే....అలాంటిదేమీ లేదని ఇక్కడి సర్కారీ విభాగాలు అంటుండడం మరో విశేషం. ఇతర రాష్ట్రాల్లో పట్టుబడుతున్న అనేక మంది స్మగ్లర్లు తాము కొంటున్న గంజాయి తెలుగు రాష్ట్రాలలోనే సాగవుందదని చెబుతున్న విషయాన్ని నార్కోటిక్ బ్యూరో ఇక్కడి సర్కారీ విభాగాలకు పలుమార్లు చెప్పడం గమనార్హం. తెలంగాణలో సంచలనం రేపిన డ్రగ్స్ మాఫియా గురించి తెలిసిందే. ప్రముఖులతో పాటు అనేక మంది సెలబ్రటీలు సైతం ఇందులో ఇరుక్కోవ డం విదితమే. డ్రగ్స్ మాఫియాపై సర్కారు కఠిన చర్యలు తీసుకుంటున్న తరుణంలో గంజాయి స్మగ్లర్ల భరతం కూడా పట్టాల్సిన అవసరం ఎంతైనా వుంది.గంజాయి స్మగ్లింగ్‌కు పాల్పడుతున్న వారిపై వీటిని అమ్మే వారిపై కఠిన చర్యలు తీసుకోవడంతో పాటు నార్కోటిక్ బ్యూరో నిబంధనల ప్రకారం పట్టుబడిన వారికి బెయిలు రాకుండా చేసి, ఏడాదిలోపు విచారణ పూర్తిచేసి పదేళ్ల వరకు జైలు శిక్షలు పడేలా చేయాల్సిన అవసరం వుంది. గంజాయి స్మగ్లిం గ్‌కు పాల్పడుతున్న వారు చాలా పోలీసులు లేదా అబ్కారీ అధి కారులకు పట్టుబడిన సమయంలో చాలా సులభంగా బెయిలు పొందుతూ తప్పించుకుంటున్నారు.

ఇదే సమయంలో కాగితాలకే పరిమితమైన మరో అంశం గంజాయి సాగుదారులపై పిడిఅమలు. గంజాయి సాగుచేస్తున్న వారు కూడా సులభంగా బెయిలు పొం దుతూ మళ్లీ అదేనేరం చేస్తున్నా ఇప్పుడున్న సాదాసీదాచట్టలా వల్ల పోలీసు, అబ్కారీ శాఖ ఏమీ చేయలేక పోతున్నాయి. వీరిపై పిడి అమలు చేసి ఏడాదిపాటు జైల్లో వుంచితే మరోసారి నేరంచేసేందుకు భయపడే వీలుంది. డ్రగ్స్‌మాఫియా కేవలం సంపన్న వర్గాల వారికే పరిమితం కాగా గంజాయి బీద,మధ్యతరగతి వర్గాల జీవితాలను నాశనం చేస్తున్న మాఫియాపై తెలుగు రాష్ట్రాలు ఉక్కుపాదం మోపాల్సిన అవసరం ఉంది.

వార్త

ఎవరితోనైనా స్నేహం చేయడం సులభమే. కానీ ఎక్కువ కాలం నిలుపుకో గలగడమే కష్టమైన విషయం.

-కార్డినల్ న్యూమాన్

# రహదారి భద్రతకు 'సుప్రీం' దారి

దేశంలో అంతకంతకు పెరిగిపోతున్న రోడ్డు ప్రమాదాల నివారణకు గురువారం సుప్రీంకోర్టు ఇరవైవరకు మార్గదర్శకసూత్రాలను జారీ చేసింది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వీటిని కచ్చితంగా అమలు చేయాలంటూ జస్టిస్ మదన్ బి లోకూర్, జస్టిస్ దీపక్ గుప్తాలతో కూడిన ధర్మాసనం ఈ తీర్పు ఇచ్చింది. కోయంబత్తూరుకు చెందిన ఒక డాక్టర్ దాఖలు చేసిన ప్రజాప్రయోజన వ్యాజ్యాన్ని విచారించిన ధర్మాసనం ఈ ఉత్తర్వును జారీ చేసింది. వచ్చే ఏడాది జనవరి 31లోపు దేశంలోని అన్ని రాష్ట్రప్రభుత్వాలు రహదారి భద్రతా విధానాన్ని రూపొందించాలని భద్రత మండళ్లను లీడ్ ఏజెన్సీలను ఏర్పాటు చేయాలని కూడా ఆ ఉత్తర్వులో పేర్కొంది. భద్రత నిధి ఏర్పాటుతోపాటు భద్రత కార్యాచరణ ప్రణాళికను రూపొందించాలని స్పష్టంచేసింది. అన్నిటి కంటే ముఖ్యంగా వచ్చే ఏడాది ఏప్రిల్ నాటికి అన్ని రాష్ట్రాల విద్యా మండళ్ల రహదారి భద్రతను పాఠ్యాంశంగా చేర్చాలని సూచించింది. ఇక మద్యంవిక్రయాల విషయంలో సుప్రీంకోర్టు ఇచ్చిన తీర్పును తప్పనిసరిగా అమలు చేయాలని కేంద్ర ప్రభుత్వం ప్రతి మూడు నెలలకు ఒకసారి రాష్ట్రాలకు దీనిపై స్పష్టమైన సూచనలు పంపాలని కూడా ఆదేశించింది. రహదారులలో ప్రమాదాలు జరిగే ప్రాంతాలను గుర్తించి వాటిని నివారించేందుకు ఇంజినీరింగ్ నైపుణ్యాన్ని ఉపయోగించి తొలగించాలంటూ మొత్తం ఇరవైవరకు సూచనలను చేసింది.

వాస్తవంగా రహదారులు దేశాభ్యుదయానికి ప్రతిరూపాలైనప్పటికీ రక్తసిక్తం అవుతూనే ఉన్నాయి. ఇంటి నుంచి బయటకు వెళ్లిన వ్యక్తి క్షేమంగా ఇంటికి వచ్చే గ్యారంటీ లేని అభద్రతా భావం రోజురోజుకు పెరిగిపోతున్నది. తెలుగు రాష్ట్రాల్లో ప్రతి రోజూ సగటున యాభై మంది మరణిస్తుండగా వందమందికిపైగా క్షతగాత్రులవుతున్నారు. వీరిలో కొందరు శాశ్వత వికలాంగులు అవుతున్నారు. ఎన్నో జాగ్రత్తలు తీసుకున్నామని ప్రభుత్వం చెప్పున్నా, నిబంధనలను మరింత పటిష్ఠం చేసినట్టు ప్రకటిస్తున్నా ప్రమాదాలసంఖ్య అంతకంతకు పెరిగిపోతున్నది. గత ఐదేళ్లలో రోడ్డు ప్రమాదాల్లో దాదాపు డెబ్భై వేలకుమందికిపైగా తెలుగురాష్ట్రాల్లో మరణించినట్లు అధికార రికార్డులే వెల్లడిస్తున్నాయి. ఇక క్షతగాత్రులైనవారు, అందులో అంగవికల వైకల్యం పొందిన వారి సంఖ్య లక్షల్లోఉంటుంది. అభివృద్ధికి సోపానాలైనా రోడ్లే మృత్యు మార్గాలై మానవాళిని కబళిస్తుంటే ఈ ప్రమాదాలను నివారించలేమా? ఇందుకు ఎవరు బాధ్యులు? లోపం ఎక్కడ ఉన్నదనే ప్రశ్నలు అందరికీ తెలిసినా ఆ కోణంలో చర్యలు తీసుకోలేకపోతున్నామనేది నిర్వివాదం. ఈ ప్రమాదాల నివారణకు అప్పుడప్పుడు ప్రయత్నాలు జరిగాయి. అధ్యయనాలు జరిగాయి. కారణాలు ఏమిటి? కారకులు ఎవరనే విషయంలో ఎంతో మంది నిపుణులు అధ్యయనం చేసి నివేదికలు రూపొందించారు. ఆ నివేదికలన్నీ అటకెక్కించారు. ఎవరైనా ముఖ్యులు చనిపోయినప్పుడు కానీ, పెద్దసంఖ్యలో పేద ప్రజలు కూలీ నాలి జనాలు రహదారి ప్రమాదాలకు గురై మరణించినప్పుడు రోడ్డు ప్రమాదాల గురించి చర్చించడం, చర్యలు తీసుకుంటున్నట్లు ప్రకటనలు ఇవ్వడం ఆనవాయితీగా మారిపోయింది. డ్రైవింగ్ లైసెన్సు జారీ చేసినప్పుడు అన్ని పరీక్షలు సమర్థవంతంగా నిర్వహించిన తర్వాతనే లైసెన్సు మంజూరు చేయాలని, అలాగే మద్యం సేవించి వాహనం నడిపే పట్టుబడితే లైసెన్సు రద్దు చేసే విషయం పరిశీలించాలని, ఇందుకోసం మార్పులు తేవాలని లాంటి సూచనలు ఎన్నో గతంలో వచ్చాయి. కానీ అవేమీ పట్టించుకున్న దాఖలాలు లేవు. ప్రమాదాలకు ముఖ్య కారణమైన మద్యం గురించి కూడా పాలకులు పట్టించుకోకపోగా పెంచిపోషిస్తున్నారు. దేశంలో జరుగుతున్న ప్రమాదాలలో చోదకుల నిర్లక్ష్యం వల్లనే తొంభై శాతంపైగా జరుగుతున్నాయని నిపుణుల అధ్యయనంలో తేలింది. డ్రైవర్లు మద్యం సేవించి వాహనాలు నడుపుతుండడంవల్లనే కూడా ప్రమాదాలు పెరిగిపోతున్నాయి. ఇంత జరుగుతున్నా మద్యం షాపులు రహదారుల్లో పెట్టి అమ్మేందుకు ప్రభుత్వం కూడా ప్రోత్సహించడం దురదృష్టకరం. ఇటీవల జాతీయ రహదారుల్లో మద్యం షాపులు ఉండరాదనే సుప్రీంకోర్టు ఆదేశాల మేరకు షాపులను అక్కడి నుంచి తరలిస్తామనుకుంటే ఏకంగా రహదారి స్థాయినే తగ్గించి యథావిధిగా కొనసాగిస్తున్నారు. ఈ ఉత్తర్వులతో జాతీయ రహదారులను కాస్తా రాష్ట్ర రహదారుల స్థాయికి తగ్గించారు.

ఇక ప్రమాదాలను తగ్గించేందుకు ఉమ్మడి ఆంధ్రప్రదేశ్లో ఒక సీనియర్ పోలీసు అధికారి నేతృత్వంలో రోడ్డు సేఫ్టీ అథారిటీని ఏనాడో ఏర్పాటు చేశారు. కానీ ఆ విభాగానికి కావలసిన వసతులు గురించి పట్టించుకోకపోవడం అటుంచి పనిష్మెంట్ కింద ఒక సీనియర్ పోలీసు అధికారిని నియమిస్తున్నారనే అభిప్రాయం క్రమంగా బలపడిపోయింది. ప్రభుత్వానికి ఆదాయాన్ని పెంచుకోవడంపైన ఉన్నంత శ్రద్ధ, ఆసక్తి ప్రమాదాలను నివారించడంలో చూపించలేకపోతున్నది. ఫలితంగా నిత్యం రహదారులు రక్తసిక్తమై అనేక కుటుంబాలు ఆత్మీయులను కోల్పోయి తల్లడిల్లుతున్నాయి. వేలాది మంది అంగవైకల్యంతో జీవచ్ఛవాలుగా బతుకులు వెళ్లదీస్తున్నారు. కుటుంబ యజమాని చనిపోతే ఆ కుటుంబం మొత్తం పరిస్థితి ఎలా ఉంటుందో ఊహించుకోవచ్చు. చేతికి అందివచ్చిన పిల్లలను కోల్పోయిన తల్లిదండ్రుల గర్భశోకం, తల్లిదండ్రులను కోల్పోయి అనాథలుగా మారిన పిల్లల పరిస్థితి అత్యంతహృదయవిదారకం. తాజాగా సుప్రీంకోర్టు ఇచ్చిన ఆదేశాలను త్రికరణశుద్ధిగా అమలు చేసేందుకు అటు కేంద్ర ప్రభుత్వం, అటు రాష్ట్ర ప్రభుత్వాలు కృషి చేయాలి.

"ఉగ్రవాదులెవరినీ భారత్ మతకోణంలో చూడదు. శాంతి, మానవాళి సంక్షేమమే మన సిద్ధాంతాలు."



ఉపరాష్ట్రపతి వెంకయ్యనాయుడు

"ప్రజాస్వామ్యంలో ప్రధాని కార్యాలయమో, అధ్యక్షుడి కార్యాలయమో ముఖ్యమైనది కాదు. ఒరాజకీయ పార్టీకి మద్దతు తెలిపి ఏ సిద్ధాంతాన్ని ప్రోత్సహిస్తున్నారని తనను తానే ప్రశ్నించుకుని పౌరుడే కీలకం."



అమెరికా మాజీ అధ్యక్షుడు బరాక్ ఒబామా

## ప్రజావాక్కు

### రహదారులపై మద్యం దుకాణాలా?

జాతీయ రహదారులు మొదలు కొని గ్రామీణ రహదారుల వరకు అన్ని రహదారుల పక్కన మద్యం దుకాణాలు తొలగించాలి. ఈ మద్యం దుకాణాల మూలంగా ఎంతో మంది వాహనదారులు మార్గమధ్యంలో ఈ షాపుల వద్ద వాహనాలు ఆపి, మద్యం సేవించి వాహనాలను నడుపుతున్నారు. ఫలితంగా ప్రమాదాలు పెరుగుతున్నాయి. ఈ మందుబాబుల వల్ల అమాయకుల బలి అవుతున్నారు. అందుకే రహదారుల వద్ద నున్న మద్యం దుకాణాలను తొలగించాలి. అలాగే చిన్న, పెద్ద రహదారులపై డ్రంక్ అండ్ డ్రైవ్ చేసే వారిని తనిఖీ చేసే పట్టుకోవాలి. వారిని కఠినంగా శిక్షించాలి.

● సరికొండ శ్రీనివాసరాజు, వనస్థలిపురం

### ప్రభుత్వ స్పందన అవసరం

మంచుకొండలు, లోయలు, పచ్చని ప్రకృతి దృశ్యాలలో అలరారుతూ దేశంలోనే మంచి పర్యాటకకేంద్రంగా అభివృద్ధి చెందుతున్న విశాఖ ఏజెన్సీ ప్రాంతం గంజాయి సాగులో దేశంలో మొదటి మూడు స్థానాల్లో ఉండడం నిఘా వర్గాల ఆందోళన కలిగిస్తోంది. నిరక్షరాస్యత, వెనుకబాటుతనం, ఇత్యాది కారణాల వలన గిరిజనులు, గ్రామీణులు గంజాయి స్మగ్లర్ల ఉచ్చులో తమ వ్యాపారాలవృద్ధికి వినియోగించుకుంటున్నారన్న వార్తలు ఆందోళన కలిగిస్తున్నాయి. ఏజెన్సీ ప్రాంతంలో పెద్దఎత్తున గంజాయి స్మగ్లింగ్ జరుగుతోందన్న వార్తలపై ప్రభుత్వం తక్షణం స్పందించాలి.

● సి.ప్రతాప్, శ్రీకాకుళం

### పెరుగుతున్న పెండింగ్ కేసులు

దేశంలో వివిధ కోర్టుల్లో దాదాపు మూడు కోట్ల కేసులు పెండింగ్లో ఉన్నాయన్న కేంద్ర న్యాయశాఖ నివేదిక న్యాయ వ్యవస్థ ఎంతటి సత్వరంగా నడుస్తోందో ఇట్టే అర్థమవుతోంది. కోర్టుల సంఖ్య, న్యాయమూర్తుల నియామకం, ఫాస్ట్ట్రాక్ కోర్టుల ఏర్పాటు ఇత్యాది చర్యలు చేపట్టాలని దశాబ్దాలుగా డిమాండ్లు వస్తున్నాయి. అయితే ఈ కేసుల్లో 46 శాతం దాకా కేసులు ప్రభుత్వంలోని వివిధ శాఖల మధ్య తలెత్తే వివాదాలకు సంబంధించినవి కావడం ప్రభుత్వంలో సమన్వయ లోపం స్పష్టంగా అర్థమవుతోంది. వివిధ విభాగాలు, మంత్రిత్వ శాఖల మధ్య తలెత్తే వివాదాలను పరిష్కరించుకునేందుకు కోర్టును ఆశ్రయించే బదులు మధ్యవర్తిత్వం, ట్రిబ్యునల్, రాజీమార్గం, రెకన్సిలియేషన్ వంటి మార్గాల ద్వారా పరిష్కరించుకోవాలని న్యాయ మంత్రిత్వ శాఖ ప్రతిపాదించడం హర్షణీయం.

● ఎం.కనకదుర్గ, తెనాలి, గుంటూరుజిల్లా

### ఆడపిల్లలను కాపాడుకుందాం

అమ్మ స్వరూపం అయిన స్త్రీ మూర్తికి ఈ అవనిపై పుట్టినప్పటి నుండే ఎన్నో కష్టాలు. తాను ఓ స్త్రీ అని ఆలోచించక తమ పిల్లలను ఎన్నో కష్టాల పాలు చేస్తున్నారు. కడుపులో ఉన్నది ఆడపిల్ల అని భయపడి భ్రూణహత్యలకు పాల్పడుతున్నారు. కొందరు పుట్టిన శిశువు ఆడపిల్ల అని తెలిస్తే ఎక్కడో వదిలేస్తున్నారు. చదువు విషయంలో కొడుకుకిస్తున్న ప్రాధాన్యతను కూతుళ్లకివ్వడంలేదు. ఆడపిల్లలపై వివక్ష పెరుగుతోంది. బాలికలు మొదలుకొని మహిళల వరకు లైంగిక వేధింపులు, అత్యాచారాలకు గురవుతున్నా ప్రభుత్వాలు నిమ్మకు నీరెత్తినట్టు వ్యవహరిస్తున్నాయి. తల్లి స్వరూపమైన బాలికలను కాపాడుకోవడం సమాజంలో అందరి బాధ్యత.

● ఎం.కమలబేబి, హైదరాబాద్

### ప్రజలను పట్టించుకోని ప్రజాప్రతినిధులు

ప్రజాప్రతినిధులు ప్రజలకు ఏమాత్రం ఉపయోగపడని అంశాలకు ప్రాధాన్యత ఇస్తూ ప్రజా సమస్యల గురించి పట్టించుకోవడం లేదు. ప్రజలను పూర్తిగా విస్మరిస్తూ తమ వ్యక్తిగత ప్రతిష్ఠను పెంచుకునే పనిలో నిమగ్నమై ఉంటున్నారు. మరికొందరు చాలా వీక్గా ప్రవర్తిస్తు రాజకీయాలను అందరు అసహ్యించుకునేలా చేస్తున్నారు. సమాజానికి ఏదో మేలు చేస్తారని, తమకేదో మంచి జరుగుతుందని ప్రజలు ఎంతో ఆశలతో వీరిని తమ ప్రతినిధులుగా చట్టసభలకు ఎన్నుకుంటుంటే ఏ మాత్రం బాధ్యతలేకుండా ప్రవర్తిస్తున్నారు. తమకు ఓటు వేసి గెలిపించినవారికి నిరాశనిస్పృహలను కానుకగా అందిస్తున్నారు.

● కె.రామకృష్ణ, నల్గొండ

### వ్యవస్థ పనితీరు మెరుగుపడాలి

సమాచార హక్కు చట్టం అమలులోకి వచ్చి పన్నెండు సంవత్సరాలవుతున్నా ఆ వ్యవస్థ పనితీరు ఇంకా మెరుగుపడలేదు. వివిధ ప్రభుత్వ శాఖల్లో అధికారుల అలసత్వం, సహాయనిరాకరణ వంటివి సమాచారం అడిగే అర్జీదారులను ఇబ్బంది పెడుతూనే ఉన్నాయి. సమాచారం ఇచ్చే అధికారులు కావాలనే కాలయాపన చేస్తున్నారు. తప్పించుకునే మార్గాల గురించి ఆలోచిస్తున్నారు. దీంతో చాలా మంది అర్జీదారులు అర్జీలు ఇవ్వడానికి ముందుకు రావడం లేదు. సమాచార కమిషన్లో వేలాదిగా ఫిర్యాదులు, రెండో అప్పీళ్లు పేరుకుపోయి ఉండటమే ఇందుకు నిదర్శనం.

● ఎన్.రాధాకృష్ణ, వనస్థలిపురం

### అసాంఘిక చర్యలకు అడ్డాలు ఆశ్రమాలు

ఒకప్పుడు పవిత్రమైన మనసుతో భక్తులు చేసే భజనలు, ధ్యానాలు, ఆధ్యాత్మిక ప్రవచనాలు ప్రశాంత వాతావరణంలో ఎంతో ఆహ్లాదకరంగా ఉండేవి ఆశ్రమాలు. ఇప్పుడేమో అసాంఘిక కార్యకలాపాలకు అడ్డాలుగా మారిపోయాయి. ఆశ్రమాల్లో ఉండే బాబాలు అమాయకుల భక్తి విశ్వాసాలను ఆసరా చేసుకుని పేట్రేగిపోతున్నారు. నేరాలు చేస్తున్నారు. ఆశ్రమానికి వచ్చే భక్తులను మోసం చేస్తున్నారు. యువతులపై అత్యాచారాలు చేస్తున్నారు. ఇలాంటి బాబాల మోసాల బారినపడకుండా ప్రజలు అప్రమత్తంగా ఉండాలి.

● ఎం.శ్రీనివాస్, హైదరాబాద్

ఎడిట్ పేజీకి... ఆర్థిక, సామాజిక, రాజకీయ పరిణామాలకు సంబంధించిన విశ్లేషణాత్మక వ్యాసాలు పంపగోరుతాం. ఈ కింది ఈ మెయిల్ చిరునామాకు పంపగలరు. e-mail : editpage@vaartha.com

# నిరుద్యోగ విస్ఫోటానికి విరుగుడేది?

ఈదర శ్రీనివాసరెడ్డి

ప్రపంచంలోనే అత్యధిక యువజనాభా కలిగిన దేశం అని గొప్పలుచెప్పుకోవడం తప్ప యువతకు ఉపాధి కల్పనలో ఘోరంగా విఫలమవుతున్నామని మన ప్రభుత్వాలు గుర్తించలేకపోతున్నాయి. ఏ దేశాభివృద్ధికైనా ఉద్యోగితతో కూడిన ఆర్థిక వృద్ధే మూలం. కాని గత కొంత కాలంగా దేశ ఆర్థిక పరిస్థితి శరవేగంగా పరుగులు పెడుతోందని జిడిపి లెక్కలు చెపుతుండగా, ఉద్యోగ కల్పన విషయంలోమాత్రం అంతే వేగంగా వెనక్కి పరుగెడుతోందనేది ఎక్కువమంది అభిప్రాయం. అధికారంలోకి రావటానికి నేటి ప్రభుత్వాలు లక్షల్లో ఉద్యోగాలు కల్పిస్తామని ఎన్నికలప్పుడు ఊకదంపుడు ఉపన్యాసాలిస్తూ నిరుద్యోగులనందరిని ఆశల పల్లకిలోకి ఊరేగించడం ఈ పరిస్థితికి ఒక కారణమైతే గత మూడు సంవత్సరాలుగా ప్రభుత్వ శాఖల్లో అధికారికంగా ఏర్పడిన ఖాళీలను కూడా నింపటానికి ఎటువంటి నియామకాలు జరపకపోవడం మరోకారణం. ఇటీవల నిర్వహించిన జాతీయ సర్వే లెక్కల ప్రకారం ఉద్యోగ కల్పనా శాతం తగ్గుముఖం పట్టిందనే చెప్పాలి. నిర్మాణరంగం వంటి ఒకటి రెండు రంగాల్లో కొంత మేర ఉద్యోగిత పెరుగుదల కనిపించినా మొత్తం మీద అనుకున్నంత వేగం పుంజుకోలేదు. రోడ్లు, విద్యుత్, విద్య వంటి రంగాల్లో మౌలిక సదుపాయాల కల్పనకు భారీఎత్తున పెట్టుబడులు పెట్టగలిగితే అదే స్థాయిలో ఉద్యోగాలను కూడా కల్పించవచ్చు. కాని ఈ రంగాలలో పెట్టినంత పెట్టుబడులను ఆకర్షించలేకపోవడం విచారకరం.

ఐక్యరాజ్యసమితి అనుబంధ సంస్థ అంతర్జాతీయ కార్మిక సంస్థ 2017 నివేదిక ప్రకారం భారతదేశంలో ఉద్యోగ కల్పన మందగించి అనుకున్నంత వేగంగా అమలు జరగడం లేదని వెల్లడించింది. 2016లో 17.7 మిలియన్ నిరుద్యోగులుండగా, 2017 నాటికి 17.8మిలియన్ మంది నిరుద్యోగులుగా మిగిలారు. 2018 నాటికి ఇది 18 మిలియన్ చేరుకుంటుందని అంచనా. దేశ జనాభాలో ఇది 3.4 శాతంగా నమోదైంది. అంతర్జాతీయంగా కూడా నిరుద్యోగిత రేటు క్రమేణా పెరుగుతూ వస్తోందన్న విషయం సర్వత్రా కలవరానికి గురిచేస్తుంది. 2016లో 5.7శాతం ఉన్న నిరుద్యోగిత, 2017 నాటికి ఇది 5.8 శాతంగా నమోదైంది. ఈ పరిణామాలకి ముఖ్య కారణం అభివృద్ధి చెందుతున్న దేశాల్లోలేబర్ మార్కెట్లు క్షీణించడమే. ఈ దేశాల్లో ప్రతి ఇద్దరు కార్మికుల్లో ఒకరు హానికంమైన పరిస్థితుల్లో తమ జీవనం గడుపుతున్నారు. అభివృద్ధిచెందిన దేశాల్లో మాత్రం నిరుద్యోగిత శాతం తగ్గుముఖం పట్టిందని చెప్పవచ్చు. 2016లో6.3 శాతం ఉన్న నిరుద్యోగిత, 2017 నాటికి ఈ దేశాలలో స్వల్పంగా తగ్గుముఖం పట్టి 6.2శాతంగా నిలిచింది. దక్షిణాసియా ప్రాంతంలో ఉద్యోగ కల్పనలో భారతదేశానిదే ముఖ్యపాత్ర. 13.5 మిలియన్ కొత్త ఉద్యోగాలను 2016లో కల్పించాలని లక్ష్యంగా పెట్టుకున్నా అది నెరవేరలేదనిచెప్పాలి. అదే సమయంలో మన దేశంకన్నా అత్యధిక జనాభా గల చైనా గడచిన ఐదేళ్లలో ఆరున్నర కోట్ల ఉద్యోగాలను కల్పించగలిగింది. చైనాలో ఉపాధిరంగం స్థిరమైన అభివృద్ధిని నమోదు చేస్తోంది. ప్రతి ఏడాది పట్టణ ప్రాంతాల్లో 1.50 కోట్ల ఉద్యోగాలను సృష్టించగలిగే సామర్థ్యం చైనాకుందని బీజింగ్లోని డాన్లింక్స్ స్కూల్ ఆఫ్ఎకనామిక్స్ అండ్ మేనేజ్మెంట్ ప్రొ॥ హెవెయిడా తెలిపారు. చైనాలో ఉద్యోగుల సంఖ్య 77.6 కోట్లకు చేరింది. చైనా పట్టణ ప్రాంతాల్లో 3.95 శాతం నిరుద్యోగిత నమోదైంది. అంతకు ముందు ఏడాదితో పోలిస్తే ఇది 0.09 శాతం తక్కువ. 2008లో అంతర్జాతీయ ఆర్థికసంక్షోభం ఏర్పడిన నాటి నుంచి ఇది అత్యంత తక్కువ. మనదేశం కూడా ఉద్యోగ కల్పనలో చైనాలాంటి అతిపెద్ద జనాభా గల దేశంతో పోటీపడాలంటే తక్షణం కొన్ని ఉపశమన చర్యలు తీసుకోవాల్సిన సమయం ఆసన్నమైంది. ఇప్పటి వరకు పరిశ్రమలకు ఇస్తున్న రాయితీలు ఉత్పత్తి ఆధారిత పెట్టుబడి విధానాలను ప్రోత్సహించేవిగా ఉన్నాయి. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు బడ్జెట్లో కేటాయించిన రాయితీలు, ప్రోత్సాహకాలు పరిశ్రమల్లో పెట్టుబడులు, పరపతి, పన్నులు తదితరఅంశాల చుట్టూ పరిభ్రమిస్తుంటాయి కాని ఏనాడు పరిశ్రమలు ఎంత మందికి ఉపాధి కల్పిస్తోంది అనే అంశాన్ని మాత్రం లెక్కలోకి తీసుకోవట్లేదు. దేశ జిడిపిలో ఐదు శాతం మేర ఉండే ఈ రాయితీల వల్ల పరిశ్రమల యజమానులు లాభాలు పొందుతున్నారు కాని, ఏ మాత్రం కొత్తగా ఉపాధి కల్పన మాత్రం ఏర్పాటు చేయలేకపోతున్నారు. ఈ రాయితీలు, ప్రోత్సాహకాలతో పరిశ్రమలలో యంత్రాలు పెరుగుతున్నాయి. పరిశ్రమల యూనిట్లు పెరుగుతున్నాయి. కాని పనివారు పెరగడం లేదు. కొంత మంది పారిశ్రామికవేత్తలు ఉన్నతస్థాయి అధికారులకు ఎక్కువ వేతనాలిచ్చి మిగిలిన వారిని పట్టించుకోకపోవడం లేదా ఉన్నవారికన్నా ఎక్కువ మంది ఉన్నట్లు జీతాల బిల్లుల్లో చూపడం వంటి తప్పుడు మార్గాలు తొక్కే ప్రమాదం లేకపోలేదు. వీటిని అరికట్టడానికి పరిశ్రమల్లో పనివారికి బయోమెట్రిక్ విధానం అమలుపరచడం, ప్రతిస్థాయిలో ఎంత మంది ఉండాలో నిర్ణయించి దానికి అనుగుణంగానే రాయితీలు ప్రకటించాలి.

స్టార్టప్ ఇండియా, స్కిల్ ఇండియా అంటూ ఊదర గొట్టడం తప్ప ఈ ప్రణాళికలు వాటి లక్ష్యాలను చేరుకోవడంలో విఫలమయ్యాయి. 2022 నాటికి 300 మిలియన్ ఉద్యోగార్థులకు నైపుణ్యాభివృద్ధికి ప్రణాళికలు రూపొందించినా ఆచరణలో మాత్రం బాగా వెనుకబడ్డాం. 2017 నాటికి మూడు మిలియన్ యువతకు మాత్రమే సంప్రదాయ వృత్తి శిక్షణ నిచ్చారు. వీరిలో కేవలం పది శాతం మంది మాత్రమే ఉద్యోగాలు పొందగలిగారు. ఈ సంప్రదాయ వృత్తిశిక్షణ కూడా మొత్తం శ్రామికుల్లో కేవలం ఐదు శాతం మందికి మాత్రమే ఇవ్వడం జరిగింది. ఇకనైన ఇటువంటి మొక్కుబడి శిక్షణా కార్యక్రమాలు అమలుపరచాలి. జర్మనీలో వ్యాపార సంస్థలే తమకు అవసరమైన నైపుణ్యాలకు శిక్షణనిచ్చే సంస్థలను నెలకొల్పి, శిక్షణ అనంతరం వారికి ఉద్యోగ అవకాశం కల్పిస్తున్నాయి. ఈ శిక్షణా కార్యక్రమాలకు పెద్దఎత్తున నిధులు సమకూర్చి విజయవంతంగా శిక్షణా కార్యక్రమాలు నిర్వహిస్తూ ప్రపంచానికే ఆదర్శంగా నిలుస్తున్నారు జర్మనీవ్యాపారవేత్తలు. ఎక్కడైనా సరే ఉద్యోగాలను కల్పించలేని వృత్తిశిక్షణా కార్యక్రమాలు విఫలమవ్వటం తప్ప ఎటువంటి ఫలితాలు ఇవ్వవు అనే సత్యాన్ని మన ప్రభుత్వ అధికారులు గుర్తించాలి. వ్యవసాయం రానురాను దండగగా మారడంతో ఈ రంగంవైపు ఎవ్వరూ ఉత్సాహం చూపడం లేదు. వ్యవసాయాన్నే నమ్ముకుని జీవిస్తున్న కుటుంబాలలోని యువత కూడా ఈ రంగాన్ని వదిలి వేరే రంగాలవైపు దృష్టి సారిస్తున్నారు. కాని జనాభాపరంగా వృత్తిపరంగావైవిధ్యమైన కార్మికశక్తినిదృష్టిలో పెట్టుకుంటే కొంతకాలం పాటు ఉపాధి కల్పనకు వ్యవసాయంపై ఆధారపడక తప్పదు. ఈరంగంలో ఉపాధిని పెంచాలన్నా, ఇటువైపు నిరుద్యోగ యువతను ఆకర్షించాలన్న వ్యవసాయానికి గిట్టుబాటు ధరలు కల్పించి ఈరంగంలోని వేతనాలను కూడా పెంచాల్సిన అవసరం ఉంది. మరోపక్క వ్యవసాయ అనుబంధ పరిశ్రమలు, పాడి పరిశ్రమ, పళ్లు, కూరగాయలు, చేపలు, కోళ్లపరిశ్రమల్లో ఉద్యోగ అవకాశాలు ఎక్కువగాఉన్నాయి. ఈరంగాలలో ఎక్కువమంది కార్మికులకు ఉపాధిదొరికే అవకాశం ఉంది. అయితే ఈ రంగాలను మరింత లాభదాయకంగా మలచగలిగితే మరింత మందికి ఉపాధి కల్పించవచ్చు. ఈ రంగాలలో సరుకునిల్వ చేసుకోవడానికి సరిపడినన్ని కోల్డ్ స్టోరేజి సంస్థలు లేకపోవడంతో తక్కువ ధరలకు తమ సరుకును అమ్ముకుంటున్నారు సాగుదారులు. సరైన మార్కెటింగ్ సదుపాయాలు కూడా అందు బాటులో లేకపోవడంవల్ల కూడా సకాలంలో తమ సరుకును సరైనధరలకు అమ్ముకోలేకపోతున్నారు. ఇటువంటి మౌలిక సదుపాయాలను ఈ రంగంలో అభివృద్ధి చేస్తే లాభాలు పెరిగి మరింతమందికి ఉపాధినివ్వటానికి అవకాశం ఏర్పడుతుంది. వ్యవసాయరంగం నేటికి దళారుల చేతుల్లో చిక్కుకుని విలవిల్లాడుతోంది. దీనికి ముఖ్యకారణం వ్యవసాయ మార్కెట్లు నేటికీ ఎటువంటి సంస్కరణలు నోచుకోకుండా దళారీవ్యవస్థ గుప్పెట్లోనే ఇప్పటికి చిక్కుకుని ఉండటం. దళారుల ప్రమేయం లేకుండా పొలాల నుండి నేరుగా బజార్లకు రైతులు తమ పంటను తరలించే సదుపాయాలు మన ప్రభుత్వాలు సమకూర్చగలిగితే వ్యవసాయం వల్ల రైతులు లాభపడే పరిస్థితులు ఏర్పడతాయి. మనదేశంలో ఎక్కువ మంది రైతులు చిన్న చిన్న కమతాలనే సాగు చేస్తున్నారు. వీటి వల్ల పెట్టుబడి పెరిగి, ఉత్పత్తి తగ్గి నష్టాలను చవిచూస్తున్నారు. ఈ నష్టాలను అరికట్టాలంటే సహకార వ్యవసాయ విధానాన్ని ప్రోత్సహించాలి. వ్యవసాయాన్ని కూడా పరిశ్రమగా గుర్తించి రైతు సమూహాలను వ్యవసాయ కంపెనీలుగా తీర్చిదిద్దాలి. కనీసం సరుకు అమ్మేటప్పుడైనా వారినందరిని ఒక తాటిపైకి తెచ్చి సహకార మార్కెటింగ్ విధానాన్ని అమలుపరిస్తే తప్పక ఈ రంగం లాభాల బాటపడు తుంది. దీనికి ఉదాహరణే అమూల్ సంస్థ. చిన్నచిన్న ఉత్పత్తి దారుల నుంచి సరుకును సేకరించి సహకార మార్కెటింగ్, పంపిణీ విధానం ద్వారా అధిక లాభాలు పొందగలుగుతోంది ఈ సంస్థ. ఇదేవిధానాన్ని వ్యవసాయ అనుబంధ సంస్థలన్నిటిలో దేశ వ్యాప్తంగా అమలు పరచగలిగితే ఈ రంగాల్లో మరింత మందికి ఉపాధికల్పించవచ్చు. భవిష్యత్తులో ఉద్యోగులలో నాణ్యతను మెరుగుపరచడం, మరింత నాణ్యతగల ఉద్యోగులను సమకూర్చుకోవడం, వ్యవస్థాపకతను ప్రోత్సహించడం, కార్మికుల హక్కులు, ప్రయోజనాలకు రక్షణ కల్పించడం వంటి వాటిని సమర్థవంతంగా అమలుపరిస్తే మంచిది. లేదా అనాలోచిత నిర్ణయాలతో ఇదే విధంగా ఉపాధి కల్పనల విషయంలో నిర్లక్ష్యధోరణితో వ్యవహరిస్తే ఏదో ఒక రోజు యువత నిరాశ నిస్పృహలు పెద్ద విస్ఫోటనంగా మారి సమాజాన్నే చిన్నాభిన్నం చేస్తాయి. ❐

(రచయిత: ప్రిన్సిపాల్ ఆచార్యనాగార్జున విశ్వవిద్యాలయం)

# బాలల జీవితం బాధల భరితం

పి.వి.ఆర్.మూర్తి

దేశంలో వివిధ రాష్ట్రాల్లో ఏటా 50 వేలమంది మహిళలు, పిల్లలు అదృశ్యమవుతున్నారు. వీరిలో నేపాల్ బాలికలే ఎక్కువగా ఉంటున్నారు. వివిధ చోట్ల వ్యభిచార గృహాల్లో నేపాల్ బాలికల సంఖ్య 2లక్షల వరకు ఉంటుందని నివేదికలు చెబుతన్నాయి. దేశంలోని 678 జిల్లాల్లో 409 జిల్లాలు పసివాళ్లకు మనుగడ సాధించలేనిదుస్థితిలో ఉంటున్నాయి. ఒడిశా, బీహార్, పశ్చిమబెంగాల్, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల్లో పిల్లల అదృశ్యం ఎక్కువగా ఉంటోంది. అపహరణకు గురవుతున్న ఆడపిల్లలు చాలా వరకు వ్యభిచార గృహాలకు చేరుతున్నారు. అక్కడ వారు నరకం చూస్తున్నారు. వారు తమమాట వినేవరకు తమకు లొంగుబాటు అయ్యేవరకు మంచినీళ్లు కూడా ఇవ్వకుండా నిర్బంధిస్తున్నారని ఇటీవల కొన్ని సంఘటనలు బయటపడ్డాయి. వ్యభిచార నిర్వాహకులు ఈ బాలి కలచే వ్యభిచారం చేయించడంతో ఆగడం లేదు. బాలల చిత్రాలు తీస్తున్నారు. అక్షరజ్ఞానానికి నోచుకోని బాలలు, ఓనమాలు దిద్ది అక్షరాలు నేర్చుకొనే దశలోనే మధ్యలో అర్ధం తరంగా పాఠశాలకు వెళ్లడం మానేసిన బాలలు పుష్టికరమైన ఆహారానికి నోచుకోని బాలలు, ముక్కుపచ్చలారక ముందే మూడుముళ్లు వేయించుకోడానికి సిద్ధమవుతున్న పసిమొగ్గలు, తల్లిదండ్రులతో బాటు పనిలో చేరిన బాలకార్మికులు బాలల అక్రమ రవాణా, లైంగిక నేరాలు- ఇలా వివిధ కోణాల్లో బాలల పరిస్థితిని కేంద్ర మహిళా శిశు సంక్షేమ శాఖ తన నివేదికలో వెల్లడించింది.

దేశంలోని ఏ జిల్లాలో పిల్లలకు ఎలాంటి ప్రమాదాలు పొంచి ఉన్నాయో స్పష్టంచేసింది. ఒడిశా, బీహార్ పశ్చిమబెంగాల్ ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాల్లో పిల్లల అదృశ్యం, అపహరణ ఎక్కువగా ఉంటోందని, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్, ఛత్తీస్గడ్ రాష్ట్రాల్లో పౌష్టికాహార లోపం తీవ్రంగా ఉందని నివేదికవెల్లడించింది. పిల్లల అపహరణ, అదృశ్యం కేసులు ఎక్కువ శాతంలో ఉన్నా పాలక వర్గాలు వారిని పట్టుకుని కన్నవారికి అప్పగించడంలో ఎలాంటి శ్రద్ధచూపడం లేదు. ఈ సమస్య అంతర్జాతీయంగా 'హేగ్ సదస్సులోనూ చర్చకు వచ్చింది. అయినా ప్రభుత్వాలు నిమ్మకునీరెత్తినట్టు వ్యవహరిస్తున్నాయి. పోలీసులు కూడా చూసీచూడనట్టు వ్యవహరిస్తున్నారు. ఎందుకంటే పిల్లల కిడ్నాప్ ముఠాల వెనుక రాజకీయ నేతల అండదండలుంటున్నాయన్న ఆరోపణలు వస్తున్నాయి. అందువల్ల ఈ కేసులు చాలా వరకు నమోదుకావడం లేదు. నమోదయినా సీరియస్గా దర్యాప్తు చేపట్టడంలేదు. కేంద్రప్రభుత్వంకావచ్చు. రాష్ట్ర ప్రభుత్వం కావచ్చు నివేదికలు వెల్లడించితే బాధ్యత తీరినట్టుకాదు. చిత్తశుద్ధితో ఈ సాలెగూడు గుట్టును బట్టబయలు చేసి నేరస్థులకు అరదండాలు వేయిస్తేకాని ఈసమస్య కొంతలో కొంతవరకైనా పరిష్కారం కాదు. ఇక బాలల చదువుల సంగతి, ఆరోగ్యం, సంక్షేమం తదితర అంశాలను పరిశీలిస్తే14ఏళ్ల వయస్సువచ్చేవరకు ఉచితంగా, తప్పని సరిగా చదువునేర్పించాలన్న విద్యాహక్కుచట్టం ప్రభుత్వ నిర్వాకం వల్ల నీరుగారిపోయింది. యునిసెఫ్ నివేదికను పరిశీలిస్తే నివారించదగిన వ్యాధులైనప్పటికీ ఏటా ఈ వ్యాధులబారినపడి దేశంలో2లక్షల మంది ప్రాణాలు కోల్పోతున్నారంటే బాలల ఆరోగ్యంపై ప్రభుత్వానికి ఏమాత్రం శ్రద్ధ ఉందోతెలుస్తుంది. వీరిలో 47శాతం మరణాలు మశూచి, ధనుర్వాతం, వంటి వ్యాధులవల్లనే సంభవిస్తు న్నాయి. ఉత్తరప్రదేశ్, రాజస్థాన్, పశ్చిమబెంగాల్, అస్సాంరాష్ట్రాల్లో ఈ మరణాలు ఎక్కువశాతం ఉంటున్నాయి.

### వీధి బాలలపై సర్వే

నగరంలో వీధుల్లో గడుపుతున్న అనాధ బాలలు ఎంత మంది ఉన్నారన్న కోణంలో ప్రభుత్వేతర సేవాసంస్థ సర్వేప్రారంభించింది. మొత్తం 150మున్సిపల్వార్డుల్లోఇంతవరకు 11మున్సిపల్ వార్డుల్లో సర్వే చేయగా దాదాపు 2423 మంది పిల్లలు జాబితాలోకి వచ్చారు. అయితే వీధి బాలలు మొత్తం 20వేల వరకు ఉండవచ్చని అంచనా వేస్తున్నారు. పిల్లలసంక్షేమ కమిటీ, విద్యావిభాగం, మహిళా సంక్షేమ అభివృద్ధి విభాగాలతో ఈసర్వేలో పాలు పంచుకుంటున్నారు. దీంతోపాటుగా ఇటువంటి సర్వేను పాట్నా లో నిర్వహించారు. ఈ కార్యక్రమం రాష్ట్ర కో ఆర్డినేటర్ల్ ఈ సర్వే గురించి ప్రస్తావిస్తూ తాము కార్పొరేటర్లు, స్థానిక ఎన్జిఓలు, హాకర్ల అసోసియేషన్ సహకారంతో కొన్ని ముఖ్యమైన ప్రాంతాలను గుర్తించామని చెప్పారు. ఒక నిర్దిష్ట ప్రశ్నావళితో తమ సభ్యులు నగరంలోని మొత్తం 150 వార్డుల్లో సర్వే నిర్వహిస్తారని చెప్పారు. లైంగిక హింస, వారికి ఎక్కడ నుంచి ఆదాయం వస్తోంది, ఎలా ఆ ఆదాయాన్ని ఖర్చుచేస్తున్నారు. ఆరోగ్యపరిస్థితి, ఎన్నిసార్లువారు తమ స్థావరాలు మార్చారు. తదితర అంశాలతో ఈ ప్రశ్నావళి ఉంటుందనితెలిపారు. ఇదే సమయంలో అనాథబాలలను రక్షించడానికి వారిని జిల్లా పిల్లల సంరక్షణ అధికారికి అప్పగిస్తామని ఫీల్డు కో ఆర్డినేటర్ చెప్పారు. ❐

# రిజర్వేషన్ల విధానంలో సమీక్ష అవసరం

పచ్చల రాజేష్

ఇది చలికాలం కాదు. ఎన్ని'కల' కాలం. గుజరాత్లో ఎన్నికల ప్రచారం వేడెక్కుతుంది. కర్ణాటక గంట త్వరలోనే మ్రోగబోతుంది. దేశంలో ఇక వరుస ఎన్నికలు జరుగబోతున్నాయి. దీనితో ఎన్నికలతో ఎప్పుడూ ముడిపడి ఉండే రిజర్వేషన్లచర్చ మళ్లీ తారాస్థాయికి చేరుకుంటుంది. బాధాకరమైన విషయమేమింటే రాజకీయ నాయకుల 'సామాజిక బాధ్యతలు'ఎన్నికల హామీలైపోవడమే. 70ఏళ్ల స్వాతంత్ర్యానికి అర్థం ఇంకా రిజర్వేషన్ల వివాదమే అయితే భారతదేశం ఇక ఎప్పటికీ అభివృద్ధి చెందుతూ ఉండే దేశమే. బడుగు బలహీన వర్గాల అభ్యున్నతి కోసం ఉద్దేశించబడ్డ రిజర్వేషన్లు ఇప్పుడు అగ్రవర్ణాలుగా పరిగణించబడుతున్న ప్రజల సమస్యలు తీర్చగలవు అనే భావన వారిలో కలిగేదాకా, వ్యవస్థలోని మార్పుకోసం పాలకులు ప్రయత్నం చేయలేదంటే ఇదినొప్పింపక తానొవ్వక తప్పించుకు తిరుగువాడు ధన్యుడు' అన్న చందానే ఉంది. రిజర్వేషన్ అంశం కేంద్ర పరిధిలోనిది. కానీ రాష్ట్రాల అసెంబ్లీల పరిమిత అధికారాన్ని ప్రజలకు వివరించని ప్రాంతీయ నాయకులు తమ ద్వారానే అన్నీ సాధ్యం అంటూ హామీలిచ్చేసి తీరా కేంద్రంలో ఆ పని చేయించలేకపోతున్నారు. కేంద్రం కూడా ఈ ప్రకటనలు చూసినప్పుడు సాధ్యాసాధ్యాలపై వారించదు. వారికి కావల్సింది మద్దతు పలికే ఎంపీలు మాత్రమే. వీరిపద్ధతి ఎలా ఉంటుందంటే 'ప్రభుత్వాలు నడవాలంటే ప్రజల సమస్యలు నడవాల్సిందే' అన్న ధోరణిలో దేశమంతా రిజర్వేషన్ పోరాటాలు హింసాత్మకంగా మారుతున్నాయి. రాజస్థాన్లో గుజ్జర్లు, గుజరాత్లోపటేళ్లు, హర్యానా జాట్లు ఎలాంటి విధ్వంసం సృష్టించారో, ఆంధ్రాలో కాపుల రిజర్వేషన్ అంశం ఎటు వంటి చర్యలదాకా దారితీసిందో, మహారాష్ట్రలో మరాటాలు రిజర్వేషన్ కోసం ఎలా ముందుకొచ్చారోఅందరికీ తెలిసిందే. వీరు నిర్వహించే ఆందోళనల్లో ప్రాణనష్టం కూడా జరిగిందంటే ఏస్థాయిలో విధ్వంసం జరుగుతుందో ఊహించుకోవచ్చు. వీటన్నిటికి హామీలిచ్చిన రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాలదే బాధ్యత. అయితే రాజకీయ ప్రయోజనం లేని అంశాన్ని ముట్టుకోవడానికి ఏమాత్రం ఇష్టపడని ప్రభుత్వాలు దాటవేత ధోరణి ప్రదర్శిస్తున్నాయి. ఉదాహరణకు ఎస్సీవర్గీకరణ అంశం తమకు ఇబ్బంది కలిగిస్తుందేమోనన్న భ్రమ లో హామీ ఇచ్చి కూడా చంద్రబాబు కిక్కురుమనకుండా కూర్చుంటే, 100 రోజుల్లో వర్గీకరణ అన్న బిజెపి మాకేంటి అనే లెక్కల్లో ఉండిపోయింది. ఇక కాపుల రిజర్వేషన్ అంశం కోసం ప్రభుత్వం వీలున్న ప్రతి అవకాశాన్ని పరిశీలిస్తుంటే కేంద్రంలోని బిజెపి మాత్రం కాపుల రిజర్వేషన అంశం పరిష్కారమైతే ఇక్కడ మరలా ప్రస్తుత అధికార పార్టీనే గెలుపొందడంతోసహా దేశంలో రిజర్వేషన్లు అడుగుతున్న అగ్రవర్ణాలున్న రాష్ట్రాలన్నీ తమ మీద పడతాయి అని ఎటూ తేల్చుకోలేని పరిస్థితిలో ఉన్నారు. చివరకు ప్రధాని సొంత రాష్ట్రం గుజరాత్లో ఉద్భవించిన పటేళ్ల సమస్య పరిష్కారం కోసం ప్రభుత్వం కనీసం ప్రయత్నించకపోవడానికి కారణం సమస్యలు ఎప్పటి నుండో ఉన్నాయి కాబట్టి యథాతథంగా ఉన్న వాటిని కొనసాగిస్తూ రాజకీయ లబ్ధి పొందాలని మాత్రమే. ఇక మరోపక్క కేసిఆర్ ముస్లిం, ఎస్టీ రిజర్వేషన్ కోసం ఢిల్లీలో దీక్ష చేస్తాననడంతో చర్చ రిజర్వేషన్లపై అధికారాలు రాష్ట్రాలకు బదిలీ చేయాలనే అంశంవైపు మళ్లింది. ముస్లింలకు ఎస్టీలకు రిజర్వేషన్లు పెంపు తీర్మానం ఒక కోణంలో, దానితోపాటు ఎస్టీల బిల్లు కూడా ఒకే తీర్మానంలో ఉన్నాయి అనే సాంకేతిక కోణంతో పెంపు తీర్మానానికి గంట కట్టి మళ్లీ రాష్ట్రం మెడలో వేసింది కేంద్రం.

తెలుగు రాష్ట్రాలలో ఉన్న సమస్యల సంగతి అలా ఉంచితే ప్రజల జీవనం విద్యా, ఉద్యోగ అవకాశాలపై ప్రభావం చూపే రిజర్వేషన్ అంశాల పరిష్కారానికి పూనుకోకుండా ఉత్పన్నమయ్యే రాజకీయ సమస్యలను తమకు అనుకూలంగా మార్చుకోవడానికి కేంద్ర అధికార పార్టీ వేచి చూస్తుంది. పటేళ్ల సంగతి తేలకుండానే గుజరాత్ ఎన్నికలకు వెళ్తుంది. ఇప్పుడు మహా అయితే కాంగ్రెస్ హయాంలో తేలకుండా పోయిన గుజ్జర్ల అంశంలా పటేళ్ల అంశం, జాట్ల అంశం, కాపుల అంశం, మరాటాల అంశం తేలకుండా పోతుంది. కానీ పార్టీలకు ఢోకాలేదుగా. ఎందుకంటేఏ అంశాల ప్రాతిపదికన ఆయా రాష్ట్రాల్లో హామీలిచ్చి గెలిచారో, అప్పుడు వీరు ఎటువంటి విమర్శలు చేసారో ఇప్పుడు అటువంటి విమర్శలే ప్రస్తుత ప్రతిపక్షాలు గుప్పిస్తాయి. కానీ అంశం మాత్రం అలానే ఉంటుంది. అగ్గిరగులుతూనే ఉంటుంది. మండల్ కమిషన్ సమయంలో జరిగిన ఉదంతాలు సమూహాల మధ్య పునరావృతం అవుతూనే ఉంటాయి. అన్ని రాష్ట్రాల్లో ప్రతిస్థానిక ప్రభుత్వం 50 శాతం రిజర్వేషన్ దాటితే ఒప్పుకునేది లేదు అన్న సుప్రీంకోర్టు తీర్పుకి ప్రత్యామ్నాయాలు వెతకడానికి ,దేశమంతా అగ్రవర్ణాలకు రిజర్వేషన్ ఇవ్వడానికి చూపించే శ్రద్ధ, ఇప్పటికే అమలవుతూ, అమలు విధానం మారాలి అనే బాధిత సంఘాల డిమాండ్పై ఎందుకు ఉండదు అనేది ప్రశ్న. దేశంలో ఎస్సీల జనాభా గణనీయంగా ఉన్న ప్రతి రాష్ట్రంలో పంజాబ్, హర్యానాలు బీహార్ మొదలుకుంటే ఆంధ్రప్రదేశ్, తెలంగాణా, తమిళనాడు, కేరళ, కర్ణాటక దాకా ఎస్సీలకు ఉద్దేశించబడ్డ రిజర్వేషన్లో కేవలం ఒకటి రెండు కులాలు మాత్రమే లబ్ధి పొందుతున్నాయి అనేది జగమెరిగిన సత్యం.

ప్రతి రాష్ట్రంలో నివేదికలు ఇవేబట్టబయలు చేస్తున్నాయి. ఇందులో ఎస్సీ రిజర్వేషన్ల లబ్ధి పొందిన వారు ఒక ఉమ్మడి విధానంలోనే ఒకటి రెండు కులాలే రిజర్వేషన్ వినియోగించుకుంటూ కాలం సాగుతున్నప్పుడు దళిత జాతుల్లోనే అంతరాలు రాకుండా ఎలా ఉంటాయి? అందుకే వారి మధ్య అవకాశాల సమాన విభజన జనాభా ప్రాతిపదికన జరగాలి. అది జరిగిన అనంతరం ఇక సంపన్న శ్రేణివైపు దశల వారీగా అడుగులు పడాలి. ఇది దేశంలో రిజర్వేషన్ అనుభవిస్తున్న ప్రతి ఒక్కరికీ వర్తించాలి. ఒక కోటీశ్వరు డైన అగ్రవర్ణ సమాజ విద్యార్థికి, కటిక పేదవాడికిపోటీ ఎంత దారుణమో, ఒకే జాతిలో ఉంటూ ఉన్నత ఉద్యోగం ఉన్న దళితుని బిడ్డకి, తినడానికి తిండి కట్టుకోవడానికి బట్ట లేని నిరుపేద దళి తుని బిడ్డకి పోటీ కూడా అంతే దారుణం. కొందరు దీనిని రిజర్వే షన్లు ఎత్తేయడానికి కుట్ర అంటారు. కానీ మార్పు లేకుండా మూస ధోరణిలో సమాజం నడవడం, దానికి మద్దతు తెలపడమే కుట్ర. రిజర్వేషన్లకు ఎన్ని సంపన్న శ్రేణులు పెట్టినా అప్పుడే తీసేసే అవకాశం లేదు. ఎందుకంటే రిజర్వేషన్ల తమదాక చేరని దళిత జాతులు ఈ దేశంలో లెక్కకు మిక్కిలి. చాలా మంది వర్గీకరణ అనగానే కేవలం రెండు శాతం మాత్రమే రిజర్వేషన్లతో లబ్ధి, రిజర్వేషన్లు నిర్వీర్యం అయ్యాయి. ఉద్యోగ నియామకాలు లేవు అంటారు. నిర్వీర్యం అయ్యుంటే వర్గీకరిస్తే ఏమిటి లేకుంటే ఏమిటి అన్నప్పుడు వారి నుండి సమాధానం ఉండదు. ఎందుకంటే ఉద్యో గ నియామకాలు ఎన్నుకున్న ప్రభుత్వాల విధానాల మీద ఆధారపడి ఉంటాయి. అవి శాశ్వతం కాదు. సామాజికంగా విద్యాపరంగా వెనుకబడ్డ వారికి ఉద్దేశించబడ్డ రిజర్వేషన్లు నిజంగా టార్గెట్ చేసిన వారికి అందుతున్నాయా అంటే అందడం లేదనే చెప్పాలి. దేశమంతా ఎస్సీల వర్గీకరణ అంశం ఎంత బలంగా ఉందో అందరికీ తెలిసిందే. కాంగ్రెస్ ఈ విషయంలో దేశ దళితులందరినీ ఊరించి ఉసూరుమనిపించింది. ఇప్పుడు బిజెపి కూడా అలాగే చేస్తుందా అనే అనుమానాలు లేకపోలేదు. అంతేకాక ఎస్టీలలోప్రత్యేకించి తెలుగు రాష్ట్రాల్లో పరిస్థితి కూడా ఇట్టే అంచనా వేయవచ్చు. ❐

# కాపుల రిజర్వేషన్‌పై కేంద్రం కరుణించేనా?

## 50శాతం మించితే 9వ షెడ్యూల్ పైనే ఆశలు

## ఆగమేఘాలమీద మంజునాథ్ నివేదిక

## కాపుల 8.7శాతం జనాభాకే 5శాతం - 52శాతం బిసీలకు 29శాతమేనా!

## జనసేన పార్టీతో ముందస్తు వ్యూహమా?

## ముద్రగడ ఉద్యమానికి బ్రేకుల కోసమేనా?

**అమరావతి,డిసెంబరు3,ప్రభాతవార్త ప్రధాన ప్రతినిధి :** ఎన్నికల మేనిఫెస్టు అంటూ కాపులను బిసీ ఎఫ్'లో చేర్చుతూ రిజర్వేషన్‌ను అసెంబ్లీ,మండలి ఆమోదముద్రవేసినంత మాత్రాన రిజర్వేషన్లు రావనేది జగమెరిగిన సత్యం. ఇందిరా సాహ్నీ యూనియన్ ఆఫ్ ఇండియా కేసులో 1992 సుప్రీంకోర్టు 50శాతానికి మించి ఏ రాష్ట్రం రిజర్వేషన్లను అమలు చేయరాదని తీర్పు నిచ్చింది. ప్రస్తుత తీర్మానం ప్రకారం 55శాతం రిజర్వేషన్లు మించాయి. అయితే న్యాయపరమైన చిక్కులుండడంతో 9వ షెడ్యూల్‌లో చేర్చి రాజ్యాంగ పరంగా కేంద్రం చొరవ తీసుకొని పార్లమెంట్ బిల్లుపెట్టి తీర్మానించాల్సి ఉందేను. మరో 15రోజుల్లో జస్టిస్ మంజునాథ కమిషన్ నివేదిక ఇస్తామని ప్రకటించి, శనివారం సాయంత్రంకు ఆ నివేదికను ప్రభుత్వానికి పంపారు. జనసేన పార్టీ 2019 ఎన్నికల బరిలో దిగుతున్న తరుణంలో కాపుల రిజర్వేషన్‌పై ప్రభుత్వం రెండు అడుగులు ముందు కేసింది. అలాగే కాపుల ఉద్యమనేత ముద్రగడ పద్మనాభం ఈనెల 6న ఉద్యమాన్ని తీవ్రతరం చేస్తానని ప్రకటించడంతో ఉద్యమానికి అడ్డుకట్ట వేయడానికి ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు కాపులను బిసీల్లో చేర్చడానికి అసెంబ్లీలో ప్రవేశపెటి ఏకగ్రీవంగా ఆమోదించారు. అలాగే బిసీ జనాభా ప్రాతిపదిక ప్రకారం రిజర్వేషన్లు లేవని, బిసీ నేతలు గగ్గోలు పెడుతుండగా కేవలం కాపులు 50లక్షలపైబడి ఉండగా వారికి 5శాతం రిజర్వేషన్లు కల్పించడానికి అసెంబ్లీలో ఆమోదముద్ర వేశారు. 139కులాలు కలిగి జనాభాలో 52శాతం రిజర్వేషన్లు డిమాండ్ చేస్తూ తాత్కాలికంగా తన ఉద్యమానికి ఫుల్‌స్టాప్ పెట్టారు. 2019ఎన్నికల్లో కాపు సమాజిక వర్గానికి చెందిన జనసేన నేత పవన్ కల్యాణ్ ప్రజల ముందు కొస్తుండడంతో తెలుగుదేశం ముందస్తుగా కాపులను బిసీల్లో చేర్చేందుకు అసెంబ్లీ,మండలిలో ఆమోదముద్ర వేశారు. అయితే బిసీ సంఘాల్లో ప్రభుత్వంపై భిన్న స్వరాలతో కొంత మందినేతలు తమకు రిజర్వేషన్ల శాతాన్ని పెంచాలని మరి కొంతమంది నేతలు కాపులను బిసీల్లోనికి చేర్చరాదని మరీ పట్టుపడుతున్నారు. 50శాతం పైబడి రిజర్వేషన్లు చేరుకోగా 9వ షెడ్యూల్‌లో చేర్చాలంటే కేంద్రం దయాదాక్షిణ్యాలపై రాష్ట్రం ఆశలు పెట్టుకొంది. ఇక బిసీ సంక్షేమ సంఘ జాతీయ అధ్యక్షులు, రాష్ట్ర అధ్యక్షులు ఆర్.కృష్ణయ్య, కేశాని శంకర్రావులు ప్రభుత్వంపై ఒత్తిడి తీసుకొని వచ్చి కాపులకు రిజర్వేషన్‌ను ఉపసంహారించుకోవాలని లేని పక్షంలో పెద్దఎత్తున ఆందోళన చేపడడం తోపాటు న్యాయపరంగా పోరాటం చేస్తామని ప్రకటించారు. దీంతో తెలుగుదేశం పార్టీనేతలు సమాలోచనలో పడ్డారు. వాస్తవంగా తొలినుంచి బిసీ ఓటర్లలో అధికశాతం తెదేపా వైపే ఉన్నారు. ప్రస్తుతం ప్రభుత్వం తీసుకొన్న కాపులను బిసీల్లో చేర్చే వ్యవహారాన్ని బిసీ మేధావులు, యువత తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు. ప్రస్తుతం కాపులను బిసీల్లో చేర్చుతుండడంతో 34శాతంకు చేరనున్నది. రిజర్వేషన్లను పరిశీలిస్తే బిసీ 'ఏ'కి 7శాతం, 'బి'గ్రూప్‌కు 10శాతం, 'సి'గ్రూపుకు 1శాతం, 'డి'గ్రూపుకు 7శాతం,'ఈ'గ్రూపుకు 4శాతం, తాజాగా 'ఎఫ్'గ్రూప్‌కు 5శాతం కేటాయిసున్నారు. అయితే రాజ్యాంగ పరంగా రిజర్వేషన్లు 55 శాతం మించకూడదు బిసీలతోపాటు ఎస్సీ 15శాతం, ఎస్టీలు 6శాతం కలుపుకుంటే 55శాతంకు చేరింది. ఈ తరుణంలో పార్లమెంట్‌లో ఆమోదం పొంది రాజ్యాంగపరంగా సవరణచేసి చట్టబద్దత కల్పించాలని అయితే కేంద్రం ఎటువంటి నిర్ణయం తీసుకొంటుందోనని అందరిలో అనుమానాలున్నాయి. ఈ వ్యవహారాన్ని 9షెడ్యూల్‌లో తూ.చ.తప్పక ప్రవేశపెట్టి కేంద్రం ఆమోదముద్ర వేయాల్సిఉందేను. ముఖ్యంగా కాపు ఉద్యమనేత ముద్రగడ పద్మనాభం ఉద్యమానికి బ్రేకలు వేయడంతోపాటు ఆయనకు వైసీపీతో ఉన్న సంబంధాలతోను పవన్‌కల్యాణ్ 2019 ఎన్నికల్లో బిరలో దిగుతున్న తరుణంలో సీఎం చంద్రబాబు నాయుడు ఈ నిర్ణయం తీసుకొన్నట్లు తెలుస్తోంది. అయితే అసెంబ్లీ సమావేశలను వైసీపీ బహిష్కరించడంతో సమావేశంలో ఏకగ్రీవంగా ఆమోదముద్రవేశారు. మిత్రపక్షమైన భాజపా నేతలు శాసనసభ పక్షనేత విష్ణుకుమార్‌రాజు, ఎమ్మెల్సీలు సోము వీర్రాజు, మాధవ్‌లు మాత్రం ప్రభుత్వం కాపులను బిసీలజాబితాలో చేర్చడంపై స్వాగతిస్తున్నామని 9వ షెడ్యూల్‌లో ప్రవేశపెడితే అక్కడనుంచి కేంద్రం తీసుకొనే నిర్ణయంపై ఆధారపడి ఉంటుందని పేర్కొన్నారు. జనాభాపై ప్రజా సాధికార సర్వే ప్రకారమే కాపులను రిజర్వేషన్ కల్పించామని సీఎం చంద్రబాబు నాయుడు అంటుండగా బీసీ నేతలు ఆమేరకు తమకు రిజర్వేషన్ ద్వారా ఉద్యోగ, విద్యవరకే నని అంటున్నారని భవిష్యత్‌లో రాజకీయంగా కూడా రిజర్వేషన్లు వర్తిస్తాయని అంటున్నారు. గతంలో కాంగ్రెస్ హాయాంలో అప్పటి ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ముస్లింలకు 4శాతం రిజర్వేషన్ తీసుకొని వచ్చి వారికి రాజకీయంగా 34శాతం రిజర్వేషన్లు కల్పించి బిసీలకు అన్యాయం చేశారనే ఆరోపణలున్నాయి. ప్రస్తుతం బాబు కాపులకు విద్యా, ఉద్యోగాలకు మాత్రమే రిజర్వేషన్లు అంటున్నారని తీరా వారికి రిజర్వేషన్లు అమల్లోనికి వస్తే ముస్లింల విషయంలో జరిగిందే జరుగుతుందని బిసీ నేతలు అంటున్నారు. దీంతో బిసీ నేతలు కాపుల బిసీ రిజర్వేషన్లను తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు. ఇదిలా ఉండగా కాపులకు బిసి రిజర్వేషన్ కల్పించడానికి ప్రభుత్వం జస్టిస్ మంజునాథ్ కమిటిని నియామకంచేసి ముగ్గురి సభ్యులను ఆ కమిషన్ చేర్చివారు రాష్ట్రవ్యాప్తంగా పర్యటించి అన్ని వర్గాల ప్రజాభిప్రాయాలను సేకరించారు. ఈ కమిషన్ 22నెలలపాటు సర్వేలు చేసి నివేదికను తయారు చేసి కమిషన్ ఛైర్మన్ ప్రభుత్వానికి పంపే పనిలో ఉండగా ఆ కమీషన్ సభ్యులు 15రోజుల క్రితమే ప్రభుత్వానికి ఇచ్చిన నివేదిక ఆధారంగా శనివారం అసెంబ్లీలో ప్రవేశపెట్టి ఆమోదం పొందారు. అయితే జస్టిస్ మంజునాథ్ మాత్రం తనకు ఆ నివేదికతో సంబంధం లేదని ప్రకటించడంతో ప్రభుత్వం ఇరకాటంలో పడినట్లు అన్పిస్తోంది. అయితే ఇంతవరకు జస్టిస్ మంజునాథ్ నివేదిక ప్రభుత్వానికి అందలేదు. అయినా శనివారం పాయంత్రంకు ఎట్టకేలకు మంజునాథ్ నివేదిక ఇవ్వగా అప్పటికే సభ్యులు ఇచ్చిన నివేదికలతో ఆమోదముద్రేశారు. దీంతో కాపునేతలు ఒక పక్క పండుగ తరహాలో ఉత్సవాలు చేసుకోగా, మరోపక్క బిసీ నేతలు నిరసనలతో రోడ్డెక్కారు. ఇదిలా ఉండగా 1992మండలి తీర్పులో 50శాతం రిజర్వేషన్లు ఇందిరా సాహ్నీ కేసులో సుప్రీంకోర్టు తీర్పు నిచ్చింది. గతంలో ఒడిశా, మహారాష్ట్ర, హరియానా, రాజస్థాన్ రాష్ట్రాల్లో వివిధ కులాలకు చెందినవారు రిజర్వేషన్లపై తారాస్థాయిలో ఉద్యమం చేపట్టినా సంబంధిత రాష్ట్రాల్లో 50శాతం గరిష్ట రిజర్వేషన్లు మించకుండా ఉద్యమాలను తిప్పికొట్టారు. ఈ తరుణంలో కాపుల రిజర్వేషన్‌ను 9వ షెడ్యూల్లో చేర్చని పక్షంలో సుప్రీంకోర్టు కెళితే కాపులకు ప్రతికూలంగా తీర్పు వస్తుందని మేధావులంటున్నారు. మొత్తంమీద రాష్ట్ర ప్రభుత్వం రిజర్వేషన్ అమలులో కేంద్రంపై ఆధారపడక తప్పదు. 2019ఎన్నికలను దృష్టిలో పెట్టుకొని రాష్ర ంలో భాజపా బలపడాలనే ఆలోచనలో ఉంది. ఈ రిజర్వేషన్‌కు చట్టబద్దత కల్పిస్తే తెలుగుదేశం పార్టీకి అనుకూలత ఉంటుందనే వాదన లేకపోలేదు. ఈ పరిస్థితుల్లో కేంద్రం నిర్ణయంపైనే కాపుల రిజర్వేషన్ భవిత ఆధారపడి ఉందని చెప్పవచ్చును.



ఆదివారం మంత్రి కాలవ శ్రీనివాసును అభినందిస్తున్న వాల్మీకి సంఘాల ప్రతినిధులు

# వాల్మీకులను, బోయలను ఎస్‌టిల్లో చేర్చేందుకు కేంద్రపై ఒత్తిడి తెస్తాం

## ఆంధ్రలో 50శాతం కంటే రిజర్వేషన్లు పెంచే అవకాశాలున్నాయి: మంత్రి కాలవ శ్రీనివాసులు

**అనంతపురం, డిసెంబరు 3 ప్రభాతవార్త ప్రతినిధి:** ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో వాల్మీకీలను, బోయలను ఎస్‌టిల్లో చేర్చే విషయంలో కేంద్రంపై వత్తిడి తీసుకొస్తామని రాష్ట్ర సమాచార పౌర సంబంధాలు, గ్రామీణ గృహ నిర్మాణ శాఖ మంత్రి కాలవ శ్రీనివాసులు తెలిపారు. అనంతపురం నగరంలోని కోవూరునగర్‌లోని మంత్రి స్వగృహంలో వాల్మీకి సంఘాల ప్రతినిధులు ఘనంగా మంత్రికి సత్కరించడంతో పాటు సంబరాలు జరుపుకున్నారు. ఈసందర్భంగా మంత్రి విలేకరులతో మాట్లాడుతూ రాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు వాల్మీకిలు, బోయల స్థితి గతులను దృష్టిలో వుంచుకుని ఇచ్చిన హామీ మేరకు చర్యలు తీసుకున్నారన్నారు. 1961 నుండి పలు కమిటీలు సూచనలు చేసినా గత పాలక ప్రభుత్వాలు బోయలు, వాల్మీకిలను ఎస్‌టిల్లో చేర్చే విషయంలో చర్యలు తీసుకోలేదన్నారు, సిఎం చంద్రబాబు నాయుడు ప్రత్యేక చొరవ తీసుకుని ఆంధ్రా యూనివర్శిటీ ప్రొఫెసర్ సత్యపాల్‌సింగ్ కమిటీ వేసి 11 నెలల్లో సమగ్ర నివేదిక తెప్పించుకుని ఎస్‌సి, ఎస్‌టి కమిషన్‌కు నివేదిక పంపారన్నారు. ఆకమిటీ సూచనలు కూడా తీసుకుని వాల్మీకులు, బోయలను ఎస్‌టిల్లో చేరుస్తూ శాసన సభలో ప్రభుత్వం తీర్మా నం చేసిందని, 60ఏళ్ల కల నిజమయ్యిందని ఆయన అభిప్రాయపడ్డారు. ఈహామీ నెరవేర్చే విషయంలో రాజకీయంగా ఇబ్బందులు వున్నప్పటికి శాస్త్రీయంగా, చట్టబద్ధంగా సమగ్ర సర్వే చేసి చర్యలు తీసుకు న్నామన్నారు. వాల్మీకులు, బోయలు మరోసారి పండుగ చేసుకున్నట్లయ్యిందన్నారు. సుప్రీంకోర్టు 50 శాతం కంటే రిజర్వేషన్లు మించరాదని గతంలో సూచనలు చేసిందని ఆయన గుర్తు చేశారు. అయితే చంద్రబాబు ప్రభుత్వం స్మార్ట్‌పోల్స్ సర్వే ద్వారా రాష్ట్రంలో బిసిలు 49 శాతం వున్నా రని, ఎస్‌సి, ఎస్ టిలు కూడా ఎక్కువగా వున్నారని తేలిందన్నారు. తద్వారా ఆంధ్రప్రదేశ్‌లో 50శాతం కంటే ఎక్కువగా రిజర్వేషన్లు పెంచేందుకు అవకాశాలు వున్నాయని మంత్రి అభిప్రాయపడ్డారు. ఈప్రభుత్వ నిర్ణయం ద్వారా గిరిజనులకు ఏమాత్రం అన్యాయం జరుగదని సిఎం స్పష్టం చేసినట్లు ఆయన తెలిపారు. మంత్రి నివాసంలో జరిగిన సంబరాల్లో జడ్‌పి ఛైర్మన్ పూల నాగరాజు, అనంత పురం మార్కెట్‌యార్డు ఛైర్మన్ ఆదినారాయణ, ఇతర వాల్మీకి నాయకులు సాకే నరేష్, ఆదినారాయణ తదితరులు పాల్గొన్నారు.

# రైతులను నట్టేట ముంచిన చంద్రబాబు

## రుణ మాఫీ ఓ బూటకం - మా ప్రభుత్వం వస్తే ముందే సేద్యం ఖర్చులకు జమ: జగన్

**కర్నూలు, డిసెంబరు 3, ప్రభాతవార్త ప్రతినిధి:** రైతులకు రుణ మాఫీ ఓ బూటకమని, రుణ మాఫీ పేరుతో రైతులంత అప్పుల్లో కూరుకొని పోయాలని రైతులంత దీంతో నట్టేట మునిగారని ప్రతిపక్షనేత, వైసిపి అధినేత వైఎస్ జగన్ చంద్రబాబుపై నిప్పులు చెరగారు. ఆదివారం మండలం పరిధిలోని యర్రగుడిలో ప్రజా సంకల్పయాత్ర సందర్భంగా రైతు సదస్సు నిర్వహించారు. ఈ సందర్భంగా ఏర్పాటు చేసిన రైతు సదస్సులో జగన్ మాట్లాడుతూ ఎన్నికల ముందు చంద్రబాబు నాయుడు రైతులకు పూర్తిగా ఒకే సారి రుణ మాఫీ చేస్తారని తన మెనిఫెస్టులో పెట్టారని, అయితే ప్రభుత్వం ఏర్పడి ముఖ్యమంత్రి అయిన తరువాత రైతుల రుణమాఫీని కుదించి దశల వారిగా రుణ మాఫీ చేయడం విచారకరమన్నారు. రుణ మాఫీ ఇస్తున్నారని సంతోషంగ ఉన్న రైతులు ధశల వారిగా రుణ మాఫీ చేస్తానని ప్రకటించడంతో రైతులు దిక్కుతోచని పరిస్థితిలో ఉన్నారన్నారు. గత నాలుగేల్లకు సక్రమంగ వర్షాలు పడక అరకొరగా పంటలు పండించిన రైతులకు గిట్టుబాటు ధరలు లేక పోవడంతో తీవ్రి ఇబ్బందులు ఉదుర్కోంటున్నారని ఆయన తమ అందోలనను వ్యక్తం చేసారు. పత్తికొండ నియోజకవర్గంలో ప్రధాన పంట అయిన టమోట పంటను రైతులు పండిస్తే గిట్టు బాటు ధరలు లేక టమోటాలను రోడ్డుపైనే పదవేయవలసిప పరిస్థితి ఏర్పడిందన్నారు. ప్రస్తుత ముఖ్యంత్రి మూడు సార్లు ముఖ్యమంత్రి హోదాలో పత్తికొండకు వచ్చి టమోట జ్యూస్‌ఫ్యాక్టరిని ఏర్పాటు చేస్తానని మూడు సార్లు హామి ఇచ్చిన.. ఇంత వరకు పత్తికొండ జ్యూస్‌ఫ్యాక్టరి కాదకదా కనీసం కోల్డు స్టోరేజి ని ఏర్పాటు చేయలేదన్నారు. వెనుక పడిన పత్తికొండ అన్ని రంగాలలో వెనుకున్నప్పటికి చంద్రబాబు సర్కారు పట్టించుకోక పోవడం విచారకరమన్నారు. తమ ప్రభుత్వం అధికారంలోకి రాగనే ఖరీఫ్‌కు మందే రైతులకు రు.15 వేలు అందిస్తానన్నారు. అప్పులున్నాయని రైతులు ఆత్మహత్యలకు పాల్పడవద్దని ఆయనరైతులను వేడుకున్నారు. ఈ కార్యక్రమంలో వైసిపి పత్తికొండ ఇంచార్జి చెరుకులపాడు శ్రీదేవి, సర్పంచు లక్ష్మిదేవి, శాసన సభ్యులు గుమ్మనూరుజయరాం, బుగ్గన రాజేంద్రప్రసాదు, సాయి ప్రసాదు రెడ్డి, ఐజయ్య, యంయల్‌సి గంగల ప్రభాకరరెడ్డి, శిల్పా చక్రపాణి రెడ్డి, తుగ్గలి ప్రతాపరెడ్డి, ప్రహల్లాదరెడ్డి, పాటిల్ జగన్నాథరెడ్డి, జగన్మోహన్‌రెడ్డి, తుగ్గలి మోహాన రెడ్డి, శ్రీరంగడు, జిట్టా నగేషు యాదవ్, ఒరుగంటి వెంకటేశ్వరరెడ్డి, రాచపాటి అను మంతు, అట్లా గోపాల్‌రెడ్డి, తేరప్ప, గుత్తి దేవరాజు, బొందిమదుగుల రమేషు, వివిధ ప్రాంతాలకు చెందిన రైతులు, సర్పంచులు తదితరులు పాల్గొన్నారు.



ఆదివారం కర్నూలు జిల్లా యర్రగుడిలో జరిగిన రైతు సదస్సులో మాట్లాడుతున్న జగన్



ఆదివారం ఢిల్లీలో రాష్ట్రపతి రామ్‌నాథ్ కోవింద్ నుంచి జాతీయఅవార్డు అందుకుంటున్న శ్రీకాకుళం జిల్లా కలెక్టర్ ధనుంజయరెడ్డి

# శ్రీకాకుళం జిల్లాకు జాతీయ అవార్డు

**శ్రీకాకుళం జిల్లా ప్రతినిధి, డిసెంబరు 3 ప్రభాతవార్త:** రాష్ట్రపతిచే జాతీయ అవార్డు అందుకున్న జిల్లా కలెక్టర్ దేశంలో సర్వశిక్షా అభియాన్ అధ్వర్యంలో నడుస్తున్న వికలాంగుల మౌలిక వసతుల కల్పనలో రెండు పాఠశాలకు జాతీయ అవార్డు లభించింది. అందులో ఆంధ్రప్రదేశ్ తరుపున శ్రీకాకుళం జిల్లాకు, మధ్యప్రదేశ్ తరుపున జబల్‌పూర్‌కు అవార్డు దక్కింది. రాష్ట్రపతి రామ్‌నాథ్ కోవింద్ ఆదివారం జిలా కలెక్టర్ ధనుంజయరెడ్డికి ఢిల్లీలో జాతీయ అవార్డును బహూకరించారు. ప్రతిస్టాత్మకమైన ఈ అవార్డు దక్కడంలో జిల్లా కలెక్టర్ ధనుంజయరెడ్డి జిల్లాలో గల దివ్యాంగుల పిల్లలకు ర్యాంపులు నిర్మాణం చేయడంలో విప్లవాత్మకమైన ప్రగతిని కనబరిచారు. సర్వశిక్షా అభియాన్‌లో వివిధ పాఠశాలలో 6700 మంది దివ్యాంగుల పిల్లలు విద్యను అభ్యసిస్తున్నారు. వీరందరికి విద్యాబోధనతో పాటు మౌలిక సదుపాయాలు కల్పించుటలో జిల్లా కలెక్టర్ ఎంతో కృషి చేశారు. సర్వశిక్షా అభియాన్‌కు ఛైర్మన్‌గా జిల్లాకు దక్కడం ప్రత్యేక గుర్తింపును సంతరించుకుంది.

# తైవాన్ యూనివర్సిటీతో మిట్స్ ఒప్పందం



తైవాన్ యూనివర్శిటి ప్రతినిధులతో ఒప్పందం కుదుర్చుకొన్న మిట్స్ ప్రతినిధులు

**మదనపల్లె, డిసెంబరు 3 ప్రభాతవార్త :** చిత్తూరుజిల్లా మదనపల్లెకు సమీపంలోనే మిట్స్ ఇంజనీరింగ్ కళాశాల తైవాన్‌లోని న్యూతైపిసిటి లోని మింగ్‌చి యూనివర్శిటి ఆఫ్ టెక్నాలతో అవగాహన ఒప్పందం కుదుర్చుకొన్నట్లు మిట్స్ కళాశాల ప్రిన్సిపాల్ డాక్టర్ సి.యువరాజ్ తెలిపారు. అధ్యాపకులు, విద్యార్థులకు ఉమ్మడి పరిశోధన, శిక్షణా కార్యక్రమాల ద్వారా అభివృద్ధి చేయడంలో ఈ రెండు సంస్థలు అంగీకారం కుదుర్చుకొన్నట్లు ఆయన తెలిపారు. రెగ్యులర్ అధ్యాపకులు, విద్యార్థి ఎక్స్చేంజ్‌లు కూడా ఉంటాయని అధనంగా ఈ రెండు సంస్థలు నూతన విద్యాకార్యక్రమాలు రూపొందిచడంలో సంయుక్తంగా అంతర్జాతీయ పరిశోధనా సమావేశాలు, సెమినార్‌లు సింపోజియన్లు నిర్వహించడంలో సహకరిస్తాయని ఆయన తెలిపారు. తైవాన్ భారతదేశం యొక్క అతిపెద్ద భాగస్వామంలో ఒకటిగా ఉందని సెమి కండక్టర్ పాబ్లికేషన్ మొబైల్, ఎలక్ట్రానిక్ రంగాల మౌళిక సదుపాయాల, వైద్యపరికరాల తయారీలో నైపుణ్యానికి ప్రసిద్ది చెందిందని ప్రిన్సిపాల్ తెలిపారు. ఈఒప్పందంతో మిట్స్ నుంచి విద్యార్థులు తైవాన్‌కు వెళ్ళి పరిశోదనా, ఇంటర్న్‌షిప్‌లపై పని చేస్తారని తరువాత పూర్తి నిధులతో స్కాలర్ షిప్‌లతోతైవాన్‌లో ఉన్నత విద్యను అభ్యసించడానికి మిట్స్ విద్యార్థులు అవకాశం లభించిందని ఆయన పేర్కొన్నారు. విద్యార్థులకు పారిశ్రామిక ఎక్స్‌పెంజర్లను కల్పించడానికి అవకాశాలు కల్పిస్తూ మిట్స్ ద్వారా పాఠ్యప్రణాళికలలో ప్రాజెక్టులు పూర్తి సెమిస్టర్ ఇంటర్న్‌సిప్ మొదలైన వాటికోసం విస్తృత పరిధిన ఈ ఒప్పందంలో కుదుర్చుకొన్నారని ఆయన తెలిపారు. మిట్స్ కళాశాలో అంతర్జాతీయంగా గుర్తింపు పొందిన పరిశోదన, విద్యాసంస్థగా అభివృద్ధి చేయడానికి సమాజానికి అవసరమయ్యే పరిశోధనలు, పారిశ్రామిక ప్రపంచంలో అవసరాలు తీర్చడానికి మిట్స్ యొక్క దృష్టిని మరింత పెంచేందుకు ఇదే సువర్ణ అవకాశమని ఆయన తెలిపారు. ఆ యూనివర్శిటి ఆఫ్ టెక్నాలజీలో జరిగిన ఈ ఒప్పందంలో యూనివర్శిటి ప్రతినిధులు, మిట్స్ కళాశాల వైస్ ప్రిన్సిపాల్ డాక్టర్ బి.రామ్‌కుమార్, డీన అడ్మినిస్ట్రేషన్ డాక్టర్ శ్రీమంతుబసు, మెకా నికల్ ప్రొపెసర్ డాక్టర్ అతుల్‌దాస్ పాల్గొన్నారు.

# వక్ఫ్‌బోర్డు భూములను ప్రభుత్వం కాపాడాలి

**గుంటూరు,డిసెంబరు3,ప్రభాతవార్త:** వక్ఫ్‌బోర్డు భూములు కబ్జాలకు గురవుతున్నా రాష్ట్ర ప్రభుత్వం వాటిని నివారించేందుకు ఎలాంటి చర్యలు తీసుకోవడంలేదని ముస్లీం వెల్‌ఫేర్ అసోసియేషన్ రాష్ట్ర అధ్యక్షుడు షేక్ రఫీ ఆగ్రహం వ్యక్తం చేశారు. ముస్లీం వెల్‌ఫేర్ అసోసియేషన్ విశాఖపట్టణం జిల్లా కమిటి ఆధ్వర్యంలో ఆదివారం నిర్వహించిన సమావేశంలో ఆయన మాట్లాడారు. కబ్జాలకు గురౌతున్న వక్ఫ్‌బోర్డు భూములు పరిరక్షించుకోవాల్సిన బాధ్యత ప్రతిఒక్క ముస్లీం సోదరునిపై ఉందని తెలియజేశారు. ముస్లీం మైనార్టీలందరూ వారి సంక్షేమం కోసం పార్టీలకు అతీతంగా ఐకమత్యంతో పోరాడాలని సూచించారు. విద్య, ఆర్థిక, సామాజిక, రాజకీయంగా ముస్లీంలు వెనుకబడి ఉన్నారని ఆవేదన వ్యక్తం చేశారు.

ముస్లీంల సంక్షేమం కొరకు రాష్ట్ర ప్రభుత్వం సబ్‌ప్లాన్ ఏర్పాటుచేసి బడ్జెట్ ద్వారా అధిక నిధులు కేటాయించాలని కోరారు. ముస్లీం వెల్‌పేర్ అసోసియేషన్ రాష్ట్ర వ్యాప్తంగా ముస్లీంలకు అన్ని విధాలుగా అండగా ఉంటూ వారి సంక్షేమం కోసమే పాటుపడుతుందని తెలిపారు. ప్రభుత్వం ముస్లీంల పట్ల చిన్నచూపు చూడటంతో ఇటువంటి దుశ్చర్యలు జరుగుతున్నాయని, ప్రభుత్వం ఇకనైనా మేలుకొని వక్ఫ్‌బోర్డు భూములు కబ్జాకు గురికాకుండా తగు చర్యలు తీసుకోవాలని కోరారు.

షేక్ ఆదం షఫీ, అక్బర్, అహ్మదుల్లాఖాన్, ఫరూక్, అహ్మద్, బాబు, రజాక్, జిలాని, ఇషాక్, మీరాసారహంతుల్లా, హారూన్, మీర్‌సాదికుల్లా, అహ్మద్‌భాషా, బురనీ భాషా, అబీదా, అహ్మద్‌అలీ, ఇక్బాల్, తదితర ముస్లీం నాయకులు పాల్గొన్నారు.

# గ్రీన్‌సిటి క్లబ్‌హౌస్‌లో వైఎస్సార్సీ రాజకీయ శిక్షణ తరగతులు

**(విశాఖపట్నం) గాజువాక, డిసెంబరు 3, ప్రభాతవార్త:** వైఎస్సార్సీ అధిష్టానం ఏర్పాటు చేసిన రాజకీయ శిక్షణా తరగుతులు 59వ వార్డు గ్రీన్‌సిటి క్లబ్‌హౌస్‌లో ఆదివారం సీనియర్ నాయకులు రాష్ట్ర ముఖ్య కార్యదర్శుల నడుమ ప్రారంభం అయ్యాయి. విశాఖ, అనకాపల్లి పార్లమెంట్ పరిధిల నుంచి నర్సీపట్నం డివిజన్ నుంచి రాష్ట్ర, జిల్లా, వార్డులు, మండలాలు, బూత్‌డివిజన్ల నుంచి కమిటీలు రాజకీయ శిక్షణా తరగతులకు హాజరయ్యారు. విశాల ప్రాంగణంలో వేలాదిమంది నాయకులకు చక్కని వేదికగా క్లబ్ హౌస్‌లో ఏర్పాటు చేశారు. వైకాపా ఆద్వర్యంలో బూత్ కమిటి రాజకీయ శిక్షణాతరగతులను అతిథులుగా పాల్గొన్న రాజ్యసభసభ్యుడు, వైసిపి ప్రధాన కార్యదర్శి విజయసాయిరెడ్డి, ఎంఎల్‌సి ఉపనాయకుడు ఉమ్మారెడ్డి వెంకటేశ్వర్లు, ధర్మాన ప్రసాదరావు, చెవిరెడ్డి భాస్కరరెడ్డి తదితరులు పాల్గొన్నారు. తొలుత అతిథుల నడుమ శిక్షణా శిబిర ప్రాంగణంలో వైకాపా జెండాను ఆవిష్కరించారు. అనంతరం శిక్షణా తరగతులను ఎమ్మెల్సీ ఉపనాయకుడు రాష్ట్ర ప్రధానకార్యదర్శి ఉమ్మారెడ్డి వెంకటేశ్వర్లు జ్యోతి ప్రజల్వన చేసి ప్రారంభించారు. అనంతరం అతిథులుగా పాల్గొని శిక్షణ తరగతులను నిర్వహించడానకి వచ్చిన పార్టీ ముఖ్యనాయకులు దర్మాన ప్రసాదరావు, చెవిరెడ్డి భాస్కరరెడ్డిలు పార్టీ శ్రేణులకు పరిచయం చేసుకున్నారు. అనంతరం శిక్షణా తరగతులను నిర్వహించారు. వైకాపాకు జిల్లాలో ఇంత భారీగా శిక్షణాతరగతులకు రావడాన్ని అతిథులు ఆనందానికి అవదులు లేకుండా పోయాయి. గ్రీన్‌సిటి క్లబ్ హౌస్‌లో 9గంటలకు ప్రారంభం అయిన శిక్షణా తరగతుల్లో పలు అంశాలను అతిథులు వివరించారు. రెవెన్యూ , ఆర్‌అండ్‌బి, పంచాయి తీరాజ్, ఎంపిడివో, తహాశీల్దార్, కలెక్టరేట్, ఆర్డీవో, ఆసుపత్రులు, పోలీసుస్టే షన్లలో సమస్యలను అధికారుల దృష్టికి తీసుకు వెళ్లడం, ఆర్టీయాక్టును పెట్టి సమస్యలకు పరిష్కారం చూపేందుకు అధికారులను కలవడం ఎలా అనేఅంశాన్ని పార్టీశ్రేణులకు శిక్షణ ఇచ్చారు. చెరువులు, కొండలు ప్రభుత్వ భూములు పోటోలను తీసి సంబంధిత అధికారులను వాట్సాప్ ద్వారా పంపించాలన్నారు. అక్రమాలను అరికట్టడానికి వైకాపాశ్రేణులు సైనికుల్లా పనిచేయాలని పిలుపు నిచ్చారు. దీనికి సంభందించిన పుస్తకాలను పంపిణీ చేశారు. అనంతరం కొనసాగిన శిక్షణాతరగతుల్లో వైకాపా ముఖ్యనాయకులు, రాష్ట్ర ప్రధాన కార్యదర్శులు విజయసాయిరెడ్డి, ఉమ్మారెడ్డి వెంకటేశ్వర్లు, ధర్మాన ప్రసాదరావు, చెవిరెడ్డి భాస్కరరావులు మాట్లాడారు. వచ్చే ఎన్నికల్లో బూత్‌కమిటీ సభ్యులందరూ కీలక పాత్ర పోషించాలని పిలుపు నిచ్చారు. ప్రతి ఇంటికి వెళ్లి వారి సమస్యలు తెలుసుకుని పరిష్కరించడానికి కృషి చేయాలన్నారు. వైకాపా అధినేత జగన్‌రెడ్డి ప్రవేశపెట్టనున్న నవరత్నాల పథకాలను ఇంటింటికి వెళ్లి వివరించాలన్నారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చేస్తున్నప్రజావ్యతిరేక విధానాలను ప్రజలకు వివరించాలని తెలిపారు. ప్రభుత్వ అక్రమాలను వెలుగుతీయడానికి ప్రతి కార్యకర్త సైనికుడులా ముం దుకు వెళ్లాన్నారు. టిడిపి కార్యకర్తలు, నాయకులు, మంత్రులు, ముఖ్యమంత్రి చేస్తున్న భూదందాలను, కబ్జాలను ప్రజలలోకి తీసుకు వెళ్లాలన్నారు. బడుగు, బలహీనవర్గాల కోసం ప్రవేశపెట్టిన ఎస్సీ, ఎస్టీ సబ్‌ప్లాన్ కోట్లాది రూపా యలు పక్కదారి పడ్డాయని వాటిపై సమాచారం హక్కు చట్టం ద్వారా తెలు సుకుని సంభందిత అధికారులను నిలదీయా లన్నారు. ప్రజలకు ఎన్నికల ముందు టిడిపి ఇచ్చిన హామీలను ఎంతవరకు నెరవేర్చారో, ప్రభుత్వ వైఫ ల్యాలను ప్రజలకు తెలియపరచడానికి కార్యకర్తలు కృషి చేయాలన్నారు. పార్లమెంట్ అధ్యక్షుడు తైనాల విజయ్‌కుమార్ అధ్యక్షతన జరిగిన ఈశిక్షణాతరగతలకు దరా ్మన ప్రసాదరావు, చెవిరెడ్డి భాస్కరరావు, తైలాన విజయ్‌కుమార్, జిల్లా అధ్యక్షుడు మళ్ల విజయ్‌ప్రసాద్, అనకాపల్లి పార్లమెంట్ అధ్యక్షుడు గుడివాడ అమర్‌నాథ్, తిప్పల గురుమూర్తిరెడ్డి, గొల్ల బాబూరావు, కరణం ధర్మశ్రీ, పెదిరెడ్ల ఈశ్వరరావు, కల్వావాలీ, కోలాగురువులు, వై.మస్తాన ప్ప, డివిరమణ, తిప్పల వంశీరెడ్డి, జీలకర్రనాగేంద్ర, మార్డుపూడి పరదేశి, ఉరుకూటి అప్పారావు, కేబుల్‌మూర్తి, పూర్ణానందశర్మ, రాజ్‌కుమార్‌ఆచార్య, పల్లాచిన తల్లి, యువశ్రీ, కల్పన, శ్రీనివాస్‌గౌడ్, పసుపలేటిఉషారాణి, గరికినగౌరి, షౌకత్‌ఆలీ, రామారావు, డిపిఆర్‌చంద్, సత్తిరామకృష్ణారెడ్డి, దేవన్‌రెడ్డి, రెడ్డిజగన్నాథం, ఉరుకూటి చందు, పల్లా పెంటారావు, వైవికుమార్, మదీనాభాషా, అప్పారావుయాదవ్ జిల్లా నలుమూలలనుంచి ముఖ్యనాయకులు, కార్యకర్తలు, బూత్‌కమిటి ప్రతినిధులు పాల్గొన్నారు.



శిక్షణా తరగుతుల వేదిక వద్ద వైఎస్సార్సీ జెండాను ఆవిష్కరిస్తున్న రాష్ట్రప్రధాన కార్యదర్శి ధర్మాన, ఉమ్మారెడ్డి, విజయసాయిరెడ్డి తదితరులు

# 'భూ కబ్జా బాగోతం'లో ఎవరినీ వదలద్దు

## ప్రక్షాళన పారదర్శకంగా సాగాలని ప్రభుత్వ ఆదేశం

## భూఆక్రమణలను ఉక్కుపాదంతో అణిచేయాలన్న ఉన్నతాధికారులు

## 'వార్త'కు స్పందన

అశ్వారావుపేట, డిసెంబర్ 3 ప్రభాతవార్త: నూరుగొడ్లు తిన్న రాబందుకి ఒక్కటే గాలివాటు అనేది పాత సామెత. తెలంగాణా సర్కారు తీసుకున్న భూప్రక్షాళణతో ఆనాదిగా పాతుకు పోయిన అవినీతి భాగోతాలెన్నో ఇప్పుడు ప్రజాకోర్టుముందు తలదించుకు నిలబడుతున్నాయి. ఈ తాజా నిర్ణయంతో చెలరేగిన గాలులకు కబ్జా కోర్లు కొట్టుకుపోయే పరిస్థితులు అనివార్యమవు తున్నాయి. ఎప్పుడో ఒనాడు అక్రమాలనేవి బయటపడకతప్పదు. ఎందుకంటే అవి సక్రమమై నవి కాదు కనుక. అశ్వారావుపేటలో దశాబ్దాలుగా సాగిన భూదందాలు ఇకముందు సాగబోవనే సంకేతాలని చిత్తశుద్ధిగల స్థానిక రెవెన్యూ యంత్రాంగమే సమాజానికందిస్తున్నది. ఈ క్రమంలో భాగంగానే అశ్వారావుపేటలోని ఆంధ్రా పార్లమెంటు సభ్యుల వారి స్వాధీనంలో ఉన్న ప్రభుత్వ భూముల వ్యవహారం ఇప్పుడు రాష్ట్రవ్యాప్తంగా చర్చకు దారితీసింది. ఈ దురాక్రమణకు సంబంధించి ఆదివారం ప్రభాతవార్త ప్రముఖంగా వెల్లడించడంతో, ప్రభుత్వంలో కదలిక వచ్చినట్లు అత్యంత వశ్వసనీయవర్గాల ద్వారా తెలిసింది. ముఖ్యమంత్రి కార్యాలయం నుంచే పైరవీలు సాగిస్తారంటూ జరిగిన ప్రచారాన్ని ఉన్నతస్థాయి ప్రభుత్వ వర్గాలు చాలా సీరియస్‌గా తీసుకున్నట్లు వెల్లడవుతున్నది. ప్రభుత్వ భూములను అక్రమ మార్గంలో సొంతం చేసుకుని అనుభ విస్తున్న వ్యక్తులు లేదా వ్యవస్థలు, ఏ స్థాయిలో ఉన్నా వదలిపెట్టవద్దని, పాలనాపరమైన చర్యలు చేపట్టాలని, స్థానిక రెవెన్యూ విధుల్లో ఎలాంటి జోక్యం చేసుకోబోమని హైద్రాబాద్ నుంచి ఇక్కడికి చాలా స్పష్టమైన ఆదేశాలందినట్లు తెలిసింది. రాష్ట్రంలోని రెవెన్యూ వ్యవస్థని గాడిలో పెట్టేందుకు ఎప్పుడైతే ముఖ్యమంత్రి ఈ ప్రక్షాళణ చేపట్టారో, అప్పటినుంచే ఈ పెద్దలు జాగ్రత్త పడట ం మొద లెట్టినట్లు కనిపిస్తున్నది. ప్రభుత్వ భూముల్లోని ఖరీదైన సాగు భూముల యాజమాన్య హక్కులు ఒక వ్యక్తినుంచి మరొకరికి మారడమనేది జరగదు. అందుకు చాలా అధికారిక ప్రక్రియ జరగాలి. కానీ ఈ రాజకీయ పెద్దల స్వాధీనంలో ఉన్నవన్నీ నిబంధనలకు విరుద్ధంగానే ఉన్నాయనే విషయాన్ని రెవెన్యూ వారే ధృవీకరించి, సదరు ఎంపికి షోకాజ్ నోటీసులు జారీచేశారు. అసలు ఈ సర్కారీ భూముల్లోకి మీరెలా వచ్చారో చెప్పమని, తహ శీల్దార్ తన నోటీస్‌లో అడిగి రోజులు గడిచి పోతున్నా, ఇప్పటిదాకా సరయిన సమాధానం చెప్ప దానికి ఎంపి ఎందుకు జాప్యం చేస్తున్నారో తెలియాల్సి ఉన్నది. పైగా తనమీద ఆయన గరం గరంగా ఉన్నారంటూ ఒక ఉన్నతాధికారి ప్రభాతవార్తవద్ద వ్యాఖ్యానించారు. నిజంగా ఆ రాజకీయ ప్రముఖుని వద్ద ఏతప్పూ లేనప్పుడు, తనకు షోకాజ్ నోటీసిస్తే గరంగరంగా ఉండాల్సిన అవసరం ఏముంది? ఇదిగో తనవద్ద ఈ ఆధారాలున్నాయి, తానేమీ తప్పుచేయలేదని ఆయన ఇప్పటికే చెప్పి ఉండవచ్చుకదా. గ్రీన్‌బెల్ట్ కింద ఎలినేషన్‌ద్వారా వచ్చింది కేవలం 28 ఎకరాలయితే, మరి ఈ సిండికేట్ వద్ద ప్రస్తుతమున్న ఎస్టేట్లు కేవలం ఈ 28 ఎకరాల్లోనే ఉన్నవా అంటే, ఒక్కసారి ఇక్కడికి వచ్చి చూస్తే వందలాది ఎకరాలను కబ్జా చేసినట్లు కనపడిపోతుంది. కబ్జా అనే పదాన్ని ఎందుకు వాడాల్సి వచ్చిందంటే, ఇప్పటికే తహశీల్దార్ నోటీస్ ఇచ్చారుకాబట్టి. అదీకాక ఇవన్నీ ప్రభుత్వ భూములు. ఇందులో ఇతర రాష్ట్రాలనుంచి వచ్చిన వలస శ్రీమంతులకు భూమిలేని నిరుపేద కోటాలో ఎసైన్డ్ భూములు దక్కే అవకాశమేలేదు. మరి ఈ పరిస్థితుల్లో ఈ భూములన్నీ కబ్జా కాక రాజమార్గంలో రాజావారికి సంక్రమించినవి ఎలా అవుతాయి ?

**రెగ్యులరైజేషన్ కోసం నానా తంటాలు ??**

ఇదిలా ఉంటే, ప్రభాతవార్త ఈ వ్యవహారాన్ని బహిర్గతం చేసిన నేపథ్యంలో సదరు పెద్దల పరిస్థితి కుడితిలో పడ్డ ఎలుకల మాదిరి తయారైనట్లు వెల్లడవుతున్నది. ఏం చేస్తే బయటపడతామా అంటూ మల్లగుల్లాలు పడుతున్నారని సమాచారం. తమకు ఎలాగూ ఇక్కడ పరిశ్రమలున్నాయి కాబట్టి, తమ కబ్జాలో ఉన్న భూములన్నింటినీ 'ఇండస్ట్రీస్ కోటాలో ఎలినేషన్ పద్ధతి' కింద, ఏదోఒకటి చేసి చేతుల్లో అధికారముంది కాబట్టి క్రమబద్ధీకరించుకునేందుకు మాయోపాయాలు పన్నుతున్నట్లు ప్రచారం జరుగుతున్నది. ఒకవేళ ఈ మార్గంలో ప్రభుత్వం లాలూచీ పడితే మాత్రం ప్రజల్లో అభాసుపాలు కాక తప్పదు. ఎందుకంటే పరిశ్రమలు పెట్టి దశాబ్ధాలకాలం గడిచిపోయింది. ఆ పరిశ్రమల సామర్థ్యానికి తగ్గట్లుగా కాలుష్యనియంత్రణ పరిధిలో ఎన్ని ఎకరాల భూమి కావాలో అంతా ఎలినేట్ చేసేశారు. ఒక పరిశ్రమ పెడితే వందలాది ఎకరాల ప్రభుత్వ భూమిని నామమాత్రపు ప్రభుత్వ ధరకు ఏవిధంగా కట్టబెడతారనే ప్రశ్నలకు పాలకులు సమాధానం చెప్పాల్సి ఉంటుంది. ఈ భూముల విలువ ప్రస్తుత మార్కెట్‌లో ఎకరా రూ.30లక్షలన్నా తన్నుకుపోతారు. మరి ఈ పరిస్థితుల్లో రాజకీయ అధికారం దండిగా ఉన్న వారికి తక్కువ ధరలకు ఖరీదైన భూముల్ని కట్టబెట్టి ప్రభుత్వ తప్పుచేయదనే అందరూ విశ్వసిస్తున్నారు. అదీకాక ఇన్నేళ్ళపాటు అక్రమంగా అనుభవించి, తీరా అక్రమాలను ప్రభుత్వమే వెలికితీసే సందర్భం రాగానే, వాటికి చట్టబద్ధత కల్పించడమంటే అంతకన్నా దుర్మార్గం మరోటుండదుకదా.



ఆదివారం హైదరాబాద్‌లో శ్రీకాంతచారి చిత్రపటం వద్ద నివాళులు అర్పిస్తున్న స్పీకర్ మధుసూదనచారి

# ఘనంగా శ్రీకాంతచారి వర్ధంతి

**హైదరాబాద్ (సైఫాబాద్), డిసెంబరు 3, ప్రభాతవార్త:** తెలంగాణ మలిదశ ఉద్యమంలో తొలి అమరుడు శ్రీకాంతచారి 8వ వర్ధంతి కార్యక్రమం ఆదివారం ఉదయం గన్‌పార్క్‌లో ఘనంగా జరిగింది. రాష్ట్ర శాసన సభ స్పీకర్ మధుసూధనాచారి, శాసన మండలి ఛైర్మన్ కె.స్వామిగౌడ్, ఎమ్మెల్యే వి.శ్రీనివాస్‌గౌడ్, ఎంబిసి ఛైర్మన్ తాడూరి శ్రీనివాస్, రాష్ట్ర మహాత్మా జ్యోతిరావ్‌పూలే జయంతి ఉత్సవాల కమిటి ఛైర్మన్ కుందారం గణేషాచారి, తెలంగాణ బిసి సంక్షేమ సంఘం అధ్యక్షుడు జాజుల శ్రీనివాస్‌గౌడ్ తదితరులు శ్రీకాంతచారి చిత్రపటానికి పూలమాలలు వేసి ఘనంగా నివాళులు అర్పించారు. ఈ సందర్భంగా మధుసూధనచారి మాట్లాడుతూ తెలంగాణ రాష్ట్రం కోసం శ్రీకాంతచారి ప్రాణాలను అర్పించారని, ప్రొఫెసర్ జయశంకర్ తన జీవితాన్ని త్యాగం చేశారని కొనియాడారు.తెలంగాణకోసం అమరులైన త్యాగమూర్తుల సేవలు మరువలేనివని ఆయన ప్రసంసించారు. ఎక్కువగా తెలంగాణ ఉద్యమంలో బిసిలు పాల్గొన్నారని, నేడు బిసి సంక్షేమం కోసం ముఖ్యమంత్రి ప్రత్యేకంగా బిసి ప్రజాప్రతినిధులతో సమావేశాన్ని ఏర్పాటు చేశారని ఆయన ఈ సందర్భంగా గుర్తు చేశారు. కుందారం గణేషాచారి మాట్లాడుతూ తెలంగాణ కోసం ఆత్మబలిదానం చేసుకున్న శ్రీకాంతచారి విగ్రహాన్ని ట్యాంక్‌బండ్‌పైన ఏర్పాటు చేయాలని, ఒక జిల్లాకు ఆయన పేరును పెట్టాలని, శ్రీకాంతచారి తల్లికిగాని, తండ్రికి గాని తల్లికిగాని నామినేటేడ్ పదవిని ఇవ్వాలని, అలాగే జయశంకర్ పేరును కాళేశ్వరం ప్రాజెక్టుకు పెట్టాలని కోరారు. విశ్వబ్రాహ్మణలకు పది ఎకరాల భూమిని, పది కోట్లతో భవనాన్ని నిర్మించాలని, తెలంగాణ కోసం అత్యధికంగా ఉద్యమించిన విశ్వబ్రాహ్మణులను అన్ని రంగాలలో ప్రభత్వం అదుకోవాలని ఆయన డిమాండ్ చేశారు. జాతీయ విశ్వబ్రాహ్మణ (విశ్వకర్మ) అధ్య క్షుడు పులిగిళ్ళ రంగాచారి మాట్లాడుతూ విశ్వబ్రాహ్మణుల సంక్షేమానికి ప్రభుత్వం తక్షణమే నిధులు కేటాయిం చాలని, అన్ని రంగాలలో అదుకోవాలని డిమాండ్ చేశారు. లేని పక్షంలో లక్షలాది మంది విశ్వబ్రాహ్మణులు రోడ్డు మీదకు వచ్చి ఉద్యమాన్ని చేపడతారని ఆయన హెచ్చరించారు. విశ్వబ్రాహ్మణ ఫెడరేషన్‌కు ప్రభుత్వం 200 కేటాయిస్తున్నామని ప్రకటన చేసి 9 నెలలు గడిచిందని, ఇంతవరకు ఒక్క రూపాయి కూడా కేటాయించలేదని, తమను మోసం చేస్తున్నదని ఆయన ధ్వజమెత్తారు. ఈ కార్యక్రమంలో విశ్వబ్రాహ్మణ సంఘం నాయకులు నేరేళ్ళ గురుచరణం, ఉపేంద్రచారి, నర్సింహచారి, మనోజ్ తదితరులు పాల్గొన్నారు.

# దివ్యాంగుల సర్వతోముఖాభివృద్ధితోనే బంగారు తెలంగాణ

## డిప్యూటీ సిఎం మహమూద్‌అలీ

## 'సమాన అవకాశాలు, సంపూర్ణ సాధికారత' నినాదంతో

## వైభవంగా అంతర్జాతీయ వికలాంగుల దినోత్సవం

## మామిడిపల్లిలో 10 ఎకరాల్లో దివ్యాంగులకు ప్రత్యేక ఐటి పార్కు



ఆదివారం హైదరాబాద్‌లో జరిగిన అంతర్జాతీయ వికలాంగుల దినోత్సవంలో మాట్లాడుతున్న డిప్యూటీ సిఎం మహమూద్ అలీ. చిత్రంలో మంత్రి తుమ్మల, సినీ నటి జీవిత తదితరులు

**హైదరాబాద్ (రవీంద్రభారతి), డిసెంబరు 3, ప్రభాతవార్త:** ముఖ్యమంత్రి కెసిఆర్ నాయకత్వంలోని తెలంగాణ రాష్ట్రప్రభుత్వం దివ్యాంగులకు ఎన్నో సంక్షేమ పథకాలను ప్రవేశపెట్టి వారిని అన్నివిధాలా ఆదుకోవడమే ధ్యేయంగా పని చేస్తుందని, దివ్యాంగుల సర్వతోముఖాభివృద్ధితోనే బంగారు తెలంగాణ సాకారమవుతుందని తాము భావిస్తున్నామని తెలంగాణ రాష్ట్ర ఉపముఖ్యమంత్రి మమ్మద్ మహమూద్‌అలీ తెలిపారు. 'సమాన అవకాశాలు, సంపూర్ణ సాధికారత' ఈ సంవత్సర నినాదంతో అంతర్జాతీయ వికలాంగుల దినోత్సవాన్ని తెలంగాణ రాష్ట్ర వికలాంగులు మరియు వయోవృద్ధుల సంక్షేమశాఖ ఆదివారం ఉదయం రవీంద్రభారతిలోని ప్రధాన కళామందిరంలో ఘనంగా నిర్వహించింది. ఈ కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా విచ్చేసిన మహ్మూద్‌అలీ మాట్లాడుతూ బంగారు తెలంగాణ నిర్మాణంలో వికలాంగుల సమస్యల పరిష్కారం ఒక ముఖ్యాంశమన్నారు. మీరు వికలాంగులు కాదు, విభిన్న ప్రతిభావంతులని కొనియాడారు. వికలాంగులకు క్రితంలో ఉన్న రిజర్వేషన్లను 3 నుండి 4 శాతానికి పెంచడం జరిగిందని, అయితే దానిని 6శాతానికి పెంచే విషయంలో ముఖ్యమంత్రి కెసిఆర్‌తో చర్చిస్తామని అన్నారు. రాష్ట్రంలో నిర్మిస్తున్న డబుల్ బెడ్‌రూం ఇళ్లలో 5శాతం వికలాంగులకు కేటాయించి ఉచితంగా ఇవ్వడం, ఉచిత కరెంటు, ఉచిత మంచినీటి కనెక్షన్లులతోపాటు ఎన్నో సౌకర్యాలు, సంక్షేమ పథకాలను అందించడం జరుగుతుందన్నారు. మీ సమస్యలను పరిష్కరించడానికి తాము ఎల్లవేళలా అందుబాటులో ఉంటామని, ఎప్పుడైనా కలిసి వాటిని పరిష్కరించుకోవచ్చునని హామీనిచ్చారు. ఈ కార్యక్రమంలో మహిళా శిశుసంక్షేమ, వికలాంగుల మరియు వయోవృద్ధుల సంక్షేమశాఖ, రోడ్డు భవనాల శాఖ మంత్రి తుమ్మల నాగేశ్వరరావు, ఎస్సీ కార్పొరేషన్ ఛైర్మన్ పిడమర్తి రవి, వికలాంగుల కార్పొరేషన్ ఛైర్మన్ డా. వాసుదేవరెడ్డి, హైదరాబాద్ మెట్రోరైల్ ఎండి ఎన్‌విఎస్.రెడ్డి, మహిళా శిశుసంక్షేమ, వికలాంగుల మరియు వయోవృద్ధుల సంక్షేమశాఖ ప్రభుత్వ కార్యదర్శి జగదీశ్వర్, డైరెక్టర్ శైలజ, సినీనటి జీవిత తదితరులు గౌరవ అతిథులుగా పాల్గొన్నారు. ఈ సందర్భంగా తుమ్మల నాగేశ్వర రావు మాట్లాడుతూ తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం వికలాంగులకు సాంఘిక, ఆర్థిక, విద్యా, ఉద్యోగరంగాలతోపాటు వారి సమ్మిళిత సుస్థిర అభివృద్ధికై అనేక సంక్షేమ కార్యక్రమాలను చేపట్టడం జరిగిందని, వికలాంగుల హక్కుల పరిరక్షణ, సమాన అవకాశాలు, సంపూర్ణ భాగస్వా మ్యం, ఆత్మగౌరవం, సాధికారతే తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ లక్ష్యమన్నారు. అందుకే ప్రభుత్వం కావాల్సినంత బడ్జెట్‌లో కేటాయింపులు చేయడం జరిగిందని, అవసరమైతే ఇంకెంతైనా అందించడానికి సిద్ధంగా ఉందని, దివ్యాంగులకు అన్ని వసతులు, సౌకర్యాలు, నిధులు కేటాయించి వారు స్వశక్తితో ఎదిగి సాధికారత సాధించడమే ధ్యేయంగా పని చేస్తున్నామన్నారు. తదనుగుణంగా ముఖ్యమంత్రి కెసిఆర్ దివ్యాంగులకు ప్రపంచంలోనే మొట్టమొదటిగా ప్రత్యేక ఐటి పార్కు నిర్మించి అర్హులైన దివ్యాంగులకు ఐటిరంగంలో అద్భుతమైన ఉద్యోగ ఉపాధి అవకాశాలు కల్పించాలని తలపెట్టారన్నారు. దివ్యాంగుల సమస్యలు, డిమాండ్ల పరిష్కార దిశగానే ప్రభుత్వం పయనిస్తుందని స్పష్టం చేశారు. హైదరాబాద్ మెట్రోరైల్ ఎండి ఎన్‌విఎస్.రెడ్డి మాట్లాడుతూ ప్రపంచంలోనే మొట్టమొదటిసారిగా ప్రభుత్వ, ప్రైవేట్ భాగస్వామ్యంతో చేపట్టి నిర్మిస్తున్న హైదరాబాద్ మెట్రోరైల్ తొలివిడతగా గతనెల 28న భారత ప్రధాని నరేంద్రమోడి చేతులమీదుగా ప్రారంభింపజేసిన మెట్రోరైల్‌లో మొదటిరోజే 2లక్షలమంది ప్రయాణించడం ప్రపంచ రికార్డు అన్నారు. మెట్రోరైల్ స్టేషన్లలో దివ్యాంగులకు వీల్‌ఛైర్స్, లిఫ్టులు, బ్రెయిలీ లిపితో సంకేతాలు తదితర సౌకర్యాలు కల్పించామని అన్నారు. ఈ సందర్భంగా సంగమేశ్వర హెల్త్‌ఎయిడ్స్, సర్జికల్ ఏజెన్సీస్ అత్యాధునిక సాంకేతిక పరిజ్ఞానంతో తేలికపాటి కృత్రిమ అవయవాలను ప్రభుత్వం ఎంపికచేసిన 6గురికి అందజేశారు. అంతేకాక సాధికారత సాధించిన వైకల్యాలున్న వ్యక్తులకు అతిథుల చేతులమీదుగా వివిధ కేటగిరీలలో 'బెస్ట్ రోల్‌మోడల్స్, బెస్ట్ సెల్ఫ్ ఎంప్లాయిడ్, బెస్ట్ ఎంప్లాయి, బెస్ట్ ఇండివిడ్యువల్, బెస్ట్ సోషల్ వర్కర్, బెస్ట్ ఎంప్లాయర్, బెస్ట్ ప్లేస్‌మెంట్ ఆఫీసర్, బెస్ట్ ఇన్‌స్టిట్యూషన్ తదితర అవార్డులను మొత్తం 25మందికి, త్రీవీలర్ ఛైర్స్, వీల్‌ఛైర్స్, లాప్‌టాప్‌లు, 4జి స్మార్ట్‌ఫోన్లను ప్రదానం చేశారు. ఈ సందర్భంగా జరిగిన వివిధ సాంస్కృతిక ప్రదర్శనలు ఆహుతులను ఎంతగానో రంజింపజేశాయి.

# పేదలను విస్మరించి ఇవాంకకు కోట్లు కుమ్మరించారు

# అబద్ధాల కోరు పిరికిపంద కెసిఆర్:

## సిపిఐ జాతీయ కార్యదర్శి సురవరం సుధాకర్‌రెడ్డి



ఆదివారం కరీంనగర్‌లో మాట్లాడుతున్న సుధాకర్‌రెడ్డి

**కరీంనగర్, డిసెంబర్ 3, ప్రభాతవార్త ప్రతినిధి:** పేదల కడుపునింపే ప్రణాళికలు అమలుపర్చడంలో విఫలమైన టిఆర్‌ఎస్ ప్రభుత్వం ఇవాంక పర్యటనలో కోట్లు కుమ్మరించి ఏమి సాధించారని ఎన్నికల హామీలు నేరవేర్చడంలో సిఎం కేసిఆర్ ఆసక్తి ఎందుకు చూపడంలేదని సిపిఐ జాతీయ కార్యదర్శి సురవరం సుధాకర్‌రెడ్డి నిప్పులు చేరిగారు. ఆదివారం సాయంత్రం సిపిఐ పోరుబాట బహిరంగ సభలో విశిష్ట అతిథిగా ఆయన మాట్లాడుతూ బిచ్చగాల్లను తరలించారు. దుకాణాలు బంద్‌చేయించారు. ప్రజలు నడవకూడదని ఆకాంక్షలు విదించారు. ఇవాంక ట్రంప్ పర్యటన ద్వారా ఏమి సాధించారని ప్రశ్నించారు. అడవిలో మీటింగ్ పెట్టుకోవచ్చుకదా అని దుయ్యబడ్డారు. పేదల ద్వారా పన్నుల రుపేనా కోట్లాది రూపాయలు పసూలుచేస్తు విలాసవంతమైన కార్యక్రమాలకు వెచ్చిస్తున్నారని ఆరోపించారు. సిఎం కేసిఆర్ అబద్ధాకోరు పిరికి పందగా అభివర్ణించారు. ధర్నాలు, నిరసనలు చేస్తామంటే బయపడి ఉచ్చపోసుకుంటున్నాడని ఎద్దేవచేశారు. నల్లతిప్పితే మంచినీరు వస్తుందని లేకుంటే ఓట్లు అడగనని అన్నకేసిఆర్ కొత్తగా ఎక్కడ నల్లలు తిప్పావని ప్రశ్నించారు. మూడున్నర యెండ్ల కాలంలో పేదలకు డబుల్‌బెడ్‌రూంలు కట్టియలేని సిఎం తనకు మాత్రం 65 గదులతో బ్రహ్మండమైన గడిలాంటి ప్రగతి భవన్ నిర్మించుకున్నాడని ఎందుకకి తాస్సారం అని ప్రశ్నించారు. రాష్ట్రంలో 85 లక్షల ఎకలరాల సాగుభూమి ఉంటే ప్రస్తుతం 33,70,517 సాగు చేస్తున్నారని నీరు ఇతర మౌళిక వసతులు కొరవడి 33లక్షల ఎకరాల్లో సాగు తగ్గిపోయిందని ప్రజలకు ఆహార కోరత ఏర్పడి బతుకలేని పరిస్థితులు దాపురించాయని అన్నారు. గిట్టుబాటు ధరలు లేక తెలంగాణ ప్రభుత్వం వచ్చాక రైతులు 2లక్షల కోట్లు నష్టపోయారని ఆత్మహత్యలు చేసుకుంటుండగా ప్రభుత్వం మాత్రం ఆనారోగ్యమంటు తప్పుదాని పట్టిస్తుందని అన్నారు. వ్యవసాయ కార్మికులకు వేతనం అందటంలేదు. సామాజిక బద్రత కోరవడించి వీటిమీద ద్యాసలేని సిఎం కేసిఆర్ మున్సిపల్ కార్మికులు సకాలంలో వేతనాలు ఇవ్వకుంటే సమ్మెజరుగుతుండగా ఇవాంక ట్రంప్‌కు మాత్రం వజ్రాలు, బంగారు ఆభరణాలు, వెండి నగిసీలు, బంగారు చీరెలు, ఇవ్వడం ఎందుకని ప్రశ్నించారు. దళితున్ని సిఎం చేస్తానని ప్రకటించి సిగ్గులేకుండా సిఎం పదవీ చేపట్టి ఎన్నికల మ్యానిఫ్యోటో సిర ఆరకముందే అంక్షలు చేరపైకి తెచ్చారని మండిపడ్డారు. తెలంగాణ ఉద్యమంలో ఇందిరాపార్క్, టాంక్‌బండ్‌పై నినరనలు చేయలేదా అని ప్రశ్నించారు.

# రుణమాఫీపై రైతులకు మేలు జరిగే వరకు పోరాటం: పిసిసి చీఫ్ ఉత్తమ్

## బ్యాలట్ పేపర్‌తోనే ఎన్నికలు నిర్వహించాలి, రైతులకు కనీస మద్దతు ధర ప్రకటించాలి

## ఓటర్ల నమోదుపై మర్రి నేతృత్వంలో కమిటీ, 9న ఘనంగా సోనియా జన్మదినోత్సవం

## 50వేల మంది సోషల్ మీడియా కోఆర్డినేటర్ల నియామకం,ముఖ్యనేతల సమావేశంలో పిసిసి



ఆదివారం గాంధీభవన్‌లో ముఖ్య నేతలతో సమావేశమైన పిసిసి చీఫ్ ఉత్తమ్‌కుమార్‌రెడ్డి

**హైదరాబాద్, డిసెంబరు 3 ప్రభాతవార్త:** రైతు రుణమాఫీ విషయంలో వడ్డీ మాఫీకాకుండా రైతులకు నష్టం జరిగిందని, కాంగ్రెస్ పార్టీ ప్రశ్నించడంతో ప్రభుత్వం దిగివచ్చి జిల్లాల్లో సమాచారం సేకరిస్తుందని పార్టీ శ్రేణులు కలెక్టర్లను కలిసి సమగ్ర సమాచారం అందించాలని టిపిసిసి అధ్యక్షులు ఉత్తమ్‌కుమార్‌రెడ్డి పిలుపునిచ్చారు. ఆదివారం గాంధీభవన్‌లో ఉత్తమ్ ఆధ్వర్యంలో డిసిసి అధ్యక్షులు, టిపిసిసి ముఖ్యనేతలతో సమావేశం జరిగింది. ఈ సమావేశంలో పలు కీలక నిర్ణయాలు తీసుకున్నారు. ఈ సందర్భంగా ఉత్తమ్ మాట్లాడుతూ రుణమాఫీ అంశంపై అసెంబ్లీలో చర్చ జరిగినపుడు తానే వడ్డీ భారం పడిందని లేవనెత్తానని, సిఎం కెసిఆర్ సమాచారం ఇస్తే రుణ మాఫీ చేస్తానని చెప్పారని తెలిపారు. అనం తరం కాంగ్రెస్ పక్షాన అసెంబ్లీ స్పీకర్‌కు ఇచ్చిన సమాచారాన్ని సిఎం కార్యాలయానికి పంపితే వారు వ్యవసాయశాఖ మంత్రి ద్వారా జిల్లా వ్యవసాయ అధికారులకు పంపించారని అన్నారు. అందువల్ల కాంగ్రెస్ పక్షాన జిల్లా వ్యవసాయ అధికారులను కలిసి సమగ్ర సమాచారం అందిం చాలని సూచించారు. దీనికి సంబంధించిన ప్రొ ఫార్మను రైతులకు అందించి సమాచారాన్ని నింపి ప్రభుత్వా నికి నివేధించాలని ఆయన ఆదేశించారు. మార్కెట్‌లలో వ్యవసాయ పంటలకు గిట్టుబాటు ధరలు రావం లేదని, కాంగ్రెస్ నాయకులు మార్కె ట్లను సందర్శించి రైతులతో చర్చించాలని, సిసిఐ అధికారులు పత్తికొనుగోలు చేయడం లేదని, మొక్కజొన్నలు మార్క్‌ఫెడ్ కొనుగోలు చేయడం లేదని, పంటలను విక్రయిస్తున్న రైతులకు గిట్టుబాటు ధరలు రావడం లేదని తెలిపారు. ఒకవేళ విక్రయించినా నగదు చెల్లింపుల్లో ఆలస్యం జరుగుతోందని చెప్పారు. రైతుల సమస్యలపై లోతుగా అధ్యయనం చేసి నాయకులు వారికి అండగగా పోరాటాలు చేయాలని పిలుపునిచ్చారు. ఈ సమావేశంలో పిఏసి ఛైర్మన్ గీతారెడ్డి, ఎమ్మె ల్యేలు రాంమోహన్‌రెడ్డి, పద్మావతిరెడ్డి, వంశీ చంద్‌రెడ్డి, కా ంగ్రెస్ నేతలు సబితా ఇంద్రారెడ్డి, మల్లు రవి, కునుకుల జనార్ధన్‌రెడ్డి , కిసాన్ కా ంగ్రెస్ ఛైర్మన్ కోదండరెడ్డి, మర్రి శశిధర్‌రెడ్డి, టిపిసిసి ప్రధాన కార్యదర్శి దాసోజు శ్రవణ్ హాజరైయ్యారు.

# పేదల జీవితాలతో చెలగాటమాడుతున్న ఔషద కంపెనీలు

## - హుజూరాబాద్‌లో వెలుగులోకి వచ్చిన ఔషద బాధితుడి ఉదందం

## - అనారోగ్యానికి గురై బాధపడుతున్న యువకుడు



ఔషద ప్రయోగ బాధితుడు దేవిప్రసాద్ బాధితుని తల్లి అండాళు

**హుజూరాబాద్ రూరల్, డిసెంబర్ 3 ప్రభాతవార్త:** పేదల జీవితాలతో చెలగాటమాడుతున్న ఔషద కంపెనీలలో ప్రయోగాల వలలో చిక్కున యువకుల సంఘటనలు వెలుగులోకి వస్తున్నాయి. కరీంనగర్ జిల్లా జమ్మికుంట మండలానికి చెందిన నాగరాజు ఔషద ప్రయోగాలకు గురైన మృతి చెందిన సంఘటనను మరువకముందే, ఇదే మండలానికి చెందిన అశోక్‌కుమార్, సురేష్ ఔషద ప్రయోగాల వలలో చిక్కి అస్వస్థతకు గురై చికిత్స పొందుతున్నారు. ఈ సంఘటనలకు మరిచిపోకముందే ఆదివారం హుజూరాబాద్ పట్టణంలోని మామిండ్లవాడకు చెందిన యువకుడు దేవిప్రసాద్ ఔషద బాధితుడి ఉదాందం వెలుగులోకి వచ్చింది. వివరాలిలా ఉన్నాయి....హుజూరాబాద్ పట్టణంలోని మామిండ్లవాడకు చెందిన ఎర్రం దేవిప్రసాద్ (30) నిరుపేద కుటుంబానికి చెందిన యువకుడు. రాజమొగిలి, అండాళు దంపతులకు ఏకైక కుమారుడు. తండ్రి మతిస్థిమితలం లేని వాడు కావడంతో తల్లి అండాళు ఇంటింటికి తిరుగుతూ ఇడ్లీ అమ్ముకొని జీవించేది. పదవ తరగతి పాసైన తర్వాత సోదరి వివాహం తర్వాత కుటుంబ భారాన్ని మోయనడానికి ఏదో ఒక పని చేయాలనే ఆలోచనతో ఉన్న దేవిప్రసాద్ హైదరాబాద్‌లోని తన బంధువు నిరంజన్ చెప్పడంతో ఔషద ప్రయోగానికి అంగీకరించాడు. 2006లో డాక్టర్ రెడ్డిస్ ల్యాబ్‌లో ఐదు సార్లు మియాపూర్‌లోని ఆక్సీస్ ల్యాబ్‌లో 15 సార్లు, తర్నాకలోని మరోక ల్యాబ్‌లో ఆరుసార్లు ఔషద ప్రయోగం తనపై జరిపించుకొని వారిచ్చిన డబ్బును తీసుకొని కుటుంబాన్ని పోషించుకునేవాడు. 2010లో ఫిట్స్ వచ్చేది కాళ్ళు, చేతులు, కొట్టుకొని పళ్ళు కొరుంకుంటు, రక్తం కక్కుతు ఎక్కడ పడితే అక్కడ పడిపోయేవాడు. నిరుపేద అయిన తల్లి అండాళు కొడుకుకు ఏమైందో తెలియక తెలిసిన వైద్యం చేయించేది. మతిస్థిమితం లేక ఎక్కడేక్కడికో తిరిగేవాడు. ఆరోగ్యం బాగుండకపోవడంతో 2013లో కరీంనగర్‌లో శివరామ, ప్రశాంతి ఆస్పత్రిలో చికిత్సలు నిర్వహించుకున్నాడు. ప్రైవేటు ఆస్పత్రుల్లో చికిత్స చేయించు కోవడానికి డబ్బులు సరిపోక పోవడంతో వరంగల్ ఎంజీఎంలో చికిత్స పొందుతూ నేటికి మందులు వాడు తున్నాడు. ఔషద ప్రయోగం వల్ల తనకు ఈ వ్యాధి వచ్చిందని ఆవేదనతో దేవిప్రసాద్ తెలుపుతున్నాడు. ఇన్నాళ్లు ఈ విషయం ఎవరికి చెప్పాలో తెలియక మదనపడే వాడినని చెప్పాడు. హైదరాబాద్‌లోని తన బంధువు రఘు ఇటీవలనే మృతి చెందాడని, అతడు కూడా ఔషద ప్రయోగం చేయించుకున్నాడని తెలిపారు. ప్రస్తుతం అనారోగ్యంతో బాధపడుతున్న తనకు ఎవరు ఉద్యోగం ఇవ్వడం లేదని, కుటుంబం పోషించు కోవడానికి పాపాడాలు తయారు చేసి అమ్ముకుంటూ జీవిస్తున్నాని ఆవేదనతో బాధితుడు దేవిప్రసాద్ తెలిపాడు.

**నా కుమారుడిని కాపాడండి : తల్లి అండాళు**

పట్నంతో మందుల కంపెనీ వాళ్ళు నా కొడుకుకు గోలీలు ఇచ్చే వళ్ళని, దీంతో ఫిట్స్ వచ్చేదని, మతిస్థిమితం లేక తిరిగే వాడని, చికిత్స చేయించుకోవడానికి డబ్బు లేక బాధపడుతున్నామని ప్రభుత్వం నా కొడుకు వైద్యం కోసం డబ్బులు ఇచ్చి కాపాడాలని బాధితుడు దేవిప్రసాద్ తల్లి అండాళు వేడుకుంటుంది.

# పేదల ఇంట్లో గ్యాస్ మంటలు పెట్టిన కేంద్రం

## రంగారెడ్డి జిల్లా మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు మల్లేశ్వరీరెడ్డి

**హైదరాబాద్, డిసెంబరు 3 ప్రభాతవార్త:** కేంద్రంలో భారతీయ జనతాపార్టీ అధికారంలోకి వచ్చాక గ్యాస్ ధరలు పెంచి పేదల ఇళ్లలో మంటలు పెట్టారని రంగారెడ్డి జిల్లా మహిళా కాంగ్రెస్ అధ్యక్షురాలు మల్లేశ్వరీరెడ్డి విమర్శించారు. మూడున్నర ఏళ్లలో గ్యాస్ ధరలు 500రూపాయలకు పైగా పెంచి పేదలకు వంట గ్యాస్‌ను దూరం చేశారని ఆరోపించారు.మహిళా కాంగ్రెస్ ఆధ్వర్యంలో పెద్ద ఎత్తున నిరసన కార్యక్రమాలు, కట్టెలతో వంట వార్పు కార్యక్రమాలు నిర్వహించి ప్రభుత్వ ప్రజావ్యతిరేక విధానాలను ఎండగట్టామని చెప్పారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రజా వ్యతిరేక విధానాలకు పాల్పడుతున్నాయని విమర్శించారు. రాష్ట్ర మంత్రి వర్గంలో కనీసం మహిళామంత్రికి స్థానం లేదని, మహిళా కమీషన్‌ను నియమించలేదన్నారు. అంతర్జాతీయ మహిళా వేదికలు నిర్వహిస్తున్నా రాష్ట్ర ప్రభుత్వం మహిళలకు సముచిత స్థానం కల్పించడం లేదని విమర్శించారు. మహిళలపై నేరాలు పెరుగుతున్నా అదుపు చేయలేకపోతోందని, మహిళల పట్ల ప్రభుత్వం ఉదాసీనంగా వ్యవహరిస్తోందన్నారు. రాబోయే రోజుల్లో మహిళా పోరాటాలను మరింత విస్తరించి ప్రభుత్వంపై ఒత్తిడి తెస్తా

# అందుబాటులో పత్తి కొనుగోలు కేంద్రాలు

**హైదరాబాద్, డిసెంబరు 3, ప్రభాతవార్త:** పత్తి రైతులకు ఎటువంటి ఇబ్బందులూ రాకుండా తెలంగాణ ప్రభుత్వం అవసరమైన చర్యలు చేపట్టింది. పత్తి కొనుగోలు కేంద్రాలు రైతులకు అందుబాటులో ఉండే విధంగా రాష్ట్రవ్యాప్తంగా 200 కేంద్రాలను ఏర్పాటు చేసినట్లు అధికారవర్గాలు వెల్లడిస్తున్నాయి. పత్తి కొనుగోలు కేంద్రాల్లో రైతులకు లభించే మద్దతు ధరలు, ఇబ్బందులు, సమస్యలను గూర్చి ప్రతీ వారం సమీక్షలు నిర్వహించాలని నిర్ణయించారు. పత్తి దిగుబడి, మార్కెట్‌లో ప్రస్తుతం ఉన్న ధర రైతులను ఆదు కునేలా చర్యలు చేపట్టారు. రాష్ట్రవ్యాప్తంగా ప్రత్తికి ధరలు రాకపోవడంతో మార్కెటింగ్ సీజను ముగిసేంతవరకూ జాయింట్ కలెక్టర్లు నిరంతరం పర్యవేక్షించాలని ప్రభుత్వం స్పష్టమైన ఆదేశాలు జారీ చేసినట్లు అధికారులు వెల్లడించారు. జిల్లా జాయింట్ కలెక్టర్లు వ్యవసాయ మార్కెటింగ్ అధికారులతో కలిసి నిరంతరం పత్తి కొనుగోలు కేంద్రాలను సందర్శించి కొనుగోళ్లను ఎప్పటికప్పుడు సమీక్షించనున్నారు. ఇందుకు అనుగుణంగా పత్తిలో తేమ శాతం 12 లోపుగా ఉండేటట్లు రైతుల్లో అవగాహన కల్పించే ఏర్పాట్లు చేస్తున్నారు. అలాగే జిన్నింగ్ మిల్లుల వద్ద రైతులపై అదనపు ఛార్జీల భారం లేకుండా ఫ్లెక్సీలను ఏర్పాటు చేయనున్నారు. అంతేకాకుండా వాటి ఫిర్యాదుల పరిష్కారానికి గాను ఒక నెంబర్‌ను కూడా కేటాయించి, దానిపై రైతుల్లో ప్రచారం చేయనున్నారు. ఇప్పటివరకూ నోటిఫై చేయని ప్రాంతాల్లో జిన్నింగ్ మిలుల్లను నోటిఫై చేయనున్నారు.

# చీలికలొస్తే బతుకు ఛిద్రమే

**ఆధునికకాలంలో పెళ్లిలు ఎంత ఆర్భాటంగా జరుగుతున్నాయో, అందే వేగంగా దంపతులు విడిపోతున్నారు. నేటి రోజుల్ని యాంత్రిక యుగంగా చెప్పుకుంటున్నాం. మనుషుల మధ్య బంధాలు కూడా అంతే యాంత్రికంగా అయిపోతున్నాయని వాపోతున్న వారిని చాలామందినే చూస్తున్నాం. తల్లిదండ్రులు, పిల్లల మధ్య ఆస్తి తగాదాలు కోర్టుల వరకు వెళ్ళటం కూడా ఇప్పుడు ఏమాత్రం విచిత్రం కాదు. అనుబంధాల మధ్య చీలికలు ఎంతగా వచ్చినా కొన్ని బంధాలు కలకాలం నిలుపుకోవాల్సినవి ఉంటాయి. వాటిని నిలబెట్టుకోవటం, అంతకంటే ముఖ్యంగా ఈ విభేదాల మధ్య మనసు నలిగిపోకుండా కాపాడుకోవటం తప్పనిసరి-**

దంపతుల మధ్య లేదా కుటుంబ సభ్యుల మధ్య లేదా దగ్గరివారితో మనస్పర్థలు వచ్చినపుడు వారితో వ్యవహరించడం చాలా కష్టమైన విషయంగా ఉంటుంది. వారి మీదున్న ప్రేమాప్యాయతలు, వారితో పెనవేసుకున్న భావోద్వేగాలు మరింత ఇరుకున పెడుతుంటాయి. రకరకాల భావాలు ముప్పిరిగొని ఉక్కిరిబిక్కిరి చేస్తుంటాయి. ఇటువంటపుడు ఎలా ప్రవర్తించాలి అనేది పెద్ద సమస్యగా కనబడుతుంది.

అవతలి వారి పట్ల కోపతాపాల్ని ప్రదర్శించాలనీ ఉంటుంది. అదే సమయంలో వారు తమని అర్థం చేసుకుని పూర్వపు బంధం తిరిగి చక్కగా కొనసాగాలనే ఆశా ఉంటుంది. ఇలాంటి సందర్భాల్లో ఎవరి వ్యక్తిత్వం వారు నిలబెట్టుకుంటూ ప్రవర్తించడం కష్టసాధ్యమైన విషయమవుతుంది. అవతలి వారిపై అనవసరపు కోపతాపాలు ప్రదర్శించకుండా, తాము లేనిపోని అపరాధ భావనకు గురికాకుండానూ ఉండాలంటే...

◆ ఏ కారణం వల్ల మీ బంధం విచ్ఛిన్నమైనా అందులో మీ పాత్ర ఎంతవరకు ఉందో దానిని అవతలివారికి వివరించండి.

మీ తప్పొప్పుల గురించి మరీ ఎక్కువ వివరణ ఇవ్వాల్సిన అవసరం లేదు. అది పరోక్షంగా పూర్తి తప్పుని మీమీద వేసుకున్నట్టు అవుతుంది.

◆ మాట్లాడుతున్నపుడు అవతలి వ్యక్తి కళ్లలోకి నేరుగా చూడండి. తలవంచుకోవటం, కళ్లు పక్కకు తిప్పుకోవటం వంటివి చేయకండి. మీ మాటతీరుని కూడా సరిచూసుకోండి. మరీ పెద్దగా లేదా మరీ చిన్నగానూ మాట్లాడకండి.



◆ పరస్పర సంభాషణల్లో వ్యక్తిగత దూషణలకు తావివ్వకండి. ఆయా సందర్భాల్లో మీకు నచ్చని అవతలివారి ప్రవర్తన గురించి మాత్రమే మాట్లాడండి.

◆ ఇక, మీపట్ల వారి అనుచిత ప్రవర్తనని చెప్పాల్సి వచ్చినపుడు పదిసార్లు నువ్విలా చేసావు. ఇలా చేసావు అంటూ- 'నువ్వు' అనే పదాన్ని ఎక్కువసార్లు ఉపయోగించకండి. అప్పుడు వారి తప్పుల్ని పదేపదే ఎత్తి చూపినట్టు తీవ్రంగా విమర్శించినట్టు అవుతుంది. అలాకాకుండా ఆయా సందర్భాల్లో మీరు ఎదుర్కొన్న బాధలమీద మీ మానసిక వేదన మీద మీ దృష్టిని ఉంచండి. 'ఆ సందర్భంలో నేనింత బాధపడ్డాను. ఆ మాటలు నన్నింత బాధించాయి'...ఇలా సాగాలి.

అంటే ఇదంతా అవతలివారిమీద ద్వేషంతోనో, పగతోనో అంటున్నది కాదు, మీరు ఎదుర్కొన్న అసౌకర్యాన్ని చెప్పడం మాత్రమే అని అర్థమవ్వాలి.

◆ ఆప్తులతో మీకెంత ఎడబాటు వచ్చినా వారిపట్ల మీరు నిర్వర్తించాల్సిన బాధ్యతల్లో మాత్రం తేడా రానివ్వకండి. ఇతర బంధువుల ద్వారానో, స్నేహితులద్వారానో ఆ బాధ్యతలు నిర్వర్తించండి.

◆ ఇరువురి మధ్య బంధాన్ని పునరుద్ధరించే సందర్భాల్లో ఉన్నతంగా ప్రవర్తించండి. మన్నించడం ముఖ్యం ఆయా సంఘటనల వెనుక కారణం ఎవరైనా మీ దృక్పథంలో సానుకూల వైఖరి ఉండాలి.

◆ మిమ్మల్ని ఎంతగా బాధించినా ఆయా వ్యక్తుల మీద వ్యక్తిగతద్వేషాన్ని పెంచుకోకండి. మిమ్మల్ని బాధించిన సంఘటనలు అప్పటి వారి ప్రవర్తనని మాత్రమే ఖండించండి. వ్యక్తుల్ని, వారి పనుల్ని వేరు చేసి చూడటం అలవాటు చేసుకోండి.



◆ మిమ్మల్ని వారు నిందించారని బాధపడే ముందు ఒక విషయం గమనించండి. కొన్ని విషయాలకు మిమ్మల్ని బాధ్యుల్ని చేసినట్టే, కొన్ని అననుకూల సందర్భాల్ని తామూ ఎదుర్కొన్నట్టు వారు ప్రకటిస్తున్నారు.

◆ ఈ మనస్పర్థలు అడ్డుపెట్టుకుని ఎప్పటెప్పటివో తప్పొప్పులు తవ్వాలని ప్రయత్నించకండి. ఇది పలచబడుతున్న బంధాన్ని పూర్తిగా తెంపుతుంది. ఆ సందర్భాన్ని, సంఘటనల్ని మాత్రమే ఎత్తిచూపండి.

◆ మిమ్మల్ని ఇతరులు నిందిస్తున్నారు అంటే అందుకు కారణాలు ఏమిటి అనేది నిష్పక్షపాతంగా పరిశీలించండి. అవి ఇది వరకటి మీ ప్రవర్తనకు సమాధానాలే అయితే ఇక అక్కడితో మీరు స్పందిం చకుండా ఆగిపోండి. మళ్లీ మీ నుంచి ప్రతిస్పందన ఉంటే విరోధానికి కొత్త విత్తనాలు చల్లినట్టే.

ఏ బంధం కలకాలం నిలవాలన్నా ఒకరి నొకరు అర్థం చేసుకోవటం ఎంత ముఖ్యమో క్షమా గుణం అంతకంటే ముఖ్యమని గ్రహించాలి.

ఎందుకంటే చిన్నచిన్న అలకలు, కోపాలనుంచి పెద్ద స్థాయి మానసిక అగాథాల వరకు- ఇవన్నీ అన్ని బంధాల్లోనూ అత్యంత సహజం. వాటిని అలా కొనసాగించడమే పూర్తి అసహజం. ❒

## ఆఫీసుకు హుందాగా..



**మీరు ఉద్యోగస్తురాలా! అయితే మరి మీరు ఎలాంటి దుస్తులు వేసుకుంటున్నారు. అఫిషియల్ లుక్‌కు సింపుల్‌గా కనిపించడమే అన్నిటికంటే ఉత్తమమైన పద్ధతి. అయితే సింపుల్‌గా ఉన్నంత మాత్రాన సరిపోదు. మీరు చక్కగా కనిపించడం కూడా అవసరం. మీకు అఫిషియల్ లుక్ అందించే కొన్ని సులభమైన పద్ధతులివిగో...**

◆ ఆఫీస్ వేర్ కొరకు మహిళల దగ్గర ఎన్నో ఆప్షన్స్ ఉంటాయి. సంప్రదాయమైన చీర లేదా సల్వార్ కుర్తా, వెస్టర్న్ స్కర్ట్, ప్యాంట్, షర్ట్ చాలా మంచి లుక్‌ని ఇస్తాయి. మీకు ఉన్న అవకాశాన్ని బట్టి మీరు అఫీషియల్ లుక్ కోసం వీటిలో దేనినైనా ధరించవచ్చు. ఆధునిక సాంప్రదాయబద్ధమైన దుస్తులు ఏ స్టయిల్‌వి అయినా సరే అవి సాదాసీదాగా, హుందాగా ఉండేలా చూసుకోవాలి. చీరలు, డ్రెస్సులు నూలు, సిల్క్ లేదా ఖద్దరుని ధరిస్తే బాగుంటుంది. మోడరన్ స్కర్టులు, ప్యాంటు షర్టులు మంచి బ్రాండ్, ఫ్యాబ్రిక్ లేదా రెడీమేడ్‌వి మాత్రమే తీసుకోవాలి.

◆ చీరలు, సల్వార్ సూట్‌లు హెవీవర్క్ ఉన్నవి, జరీ ఉన్నవి, గేరా ఉన్నవి తీసుకోకూడదు. వీటితో పాటు రెండు నుండి నాలుగు పల్చని గాజులు లేదా ఒక లావుపాటి గాజు కానీ ధరించాలి.

◆ స్కర్టు, ప్లాంట్లతో టీషర్టు వేసుకోకుండా ఉండడం మంచిది. ఆఫీసుకు వెళ్లడానికి షర్టు బాగుంటుంది.

◆ ప్లేయిన్, లైన్ ప్యాటర్న్లు రెండూ ఉపయోగించవచ్చు. కాని పువ్వులు, ఆకుల డిజైన్లు ఉన్నవి ధరించకూడదు. అలాగే మెరిసే రంగులను ఎంచుకోకూడదు.

◆ స్త్రీల కార్పొరేట్ ప్యాంటు ఎక్కువ టైట్‌గా ఉండకూడదు. ప్యాంట్ డ్రాప్ మిడ్ పాయింట్ నుండి బాటం వరకే ఉండాలి. పల్చని స్లిమ్ ఫిటింగ్ కోటు నడుము మీద సరిగ్గా ఫిట్ ఐతేనే స్మార్ట్‌లుక్ వస్తుంది. ప్రొఫెషనల్ లుక్ కోసం లో-కట్ స్కర్ట్ కింద కైమిసోల్ ధరించాలి. స్కర్ట్ కింద స్టాకింగ్స్ ధరించాలంటే సౌకర్యంగా ఉండే, చక్కగా ఫిట్ అయ్యేవే ధరించాలి. పాతవి, వదులైన స్టాకింగ్స్ వాడకూడదు.

◆ స్కర్టు లేదా ప్యాంటుతో బ్లేజర్ వేసుకోవడానికి మీరు ఇష్టపడితే అన్ని రంగుల ప్యాంట్లు, షర్టులకు నప్పే చార్‌కోల్, గ్రే, క్రీం, టోన్, బ్లూ తదితర రంగుల బ్లేజర్లను ఎంపిక చేసుకోవాలి. పసుపు, ఎరుపు, ఆకుపచ్చ, నీలం, గులాబీ లాంటి మెరిసే రంగుల దుస్తులు మీకు ఇష్టమైతే బ్లేజర్ లేదా తెలుపు రంగు షర్టు కింద స్పెగటీ లేదా అలాంటిదే మీకు నచ్చిన రంగుల్లో పల్చని లైనింగ్‌ను ధరించాలి.

◆ దుస్తులు ఏవైనా సరే వాటితో పాటు డీసెంట్ మేకప్ ఉండాలి. బ్రౌన్ పింక్, బ్రౌన్, రస్ట్ లేదా ఇతర న్యూట్రల్ కలర్ లిప్‌స్టిక్, షాడోలను ఉపయోగించాలి. ఇవి అన్ని రకాల డ్రస్సులకు, అన్ని వయసుల వారికి నప్పుతాయి. ❒

## రొయ్యల మామిడి కూర

**కావలసినవి:** రొయ్యలు-అరకిలో, పచ్చిమామిడికాయలు(చిన్నవి)-రెండు
టమాటాలు-రెండు, ఉల్లిపాయలు-మూడు
వెల్లుల్లి తురుము-రెండు టీస్పూన్లు, అల్లం తురుము-ఒక టీస్పూన్
ఆవాలు- అరటీస్పూన్, కారం-ఒక టీస్పూన్
పసుపు-అర టీస్పూన్, ధనియాలపొడి-అర టీస్పూన్
కరివేపాకు-15రెబ్బలు, పచ్చిమిర్చి-ఆరు, మెంతులు-పావు టీస్పూన్
మంచినీళ్లు-అరలీటరు

**తయారుచేసే విధానం:** రొయ్యల్ని శుభ్రం చేసి కడగాలి. మామిడికాయల్ని తొక్కతీసి చిన్నముక్కలుగా కోయాలి. బాణలిలో నూనె వేసి కాగాక ఆవాలు, మెంతులు, అల్లం, వెల్లుల్లి తురుము వేసి వేయించాలి. తరువాత ఉల్లి, పచ్చిమిర్చి ముక్కలు వేసి వేయించాలి. కరివేపాకు, టమాట ముక్కలు కూడా వేసి మెత్తగా అయ్యే వరకూ ఉడికించాలి. తరువాత మామిడికాయ ముక్కలు, ధనియాల పొడి, కారం, పసుపు వేసి ఉడికించాలి. మసాలా వాసన వస్తుండగా రొయ్యలు వేసి ఓ నిముషం వేయించాలి. ❒



## వార్తాఫలం

**మేషం:** వివాహాది సుఖప్రాప్తి, విందులు వినోదాల్లో పాల్గొంటారు. అయినా మీకున్న మనో ధైర్యంతో జయిస్తారు. రుణాలు చేస్తారు. తలపెట్టిన పనులను సకాలంలో పూర్తి చేస్తారు.

**వృషభం:** శారీరక మానసిక శ్రమలు ఉండును. యత్నకార్యసిద్ధి. సామాన్య సంతోషాలను అనుభవిస్తారు. ధనలాభాలను పొందుతారు. అనుకున్నది సాధించలేక పోవుట మిమ్మల్ని బాధిస్తుంది. వృత్తివ్యాపారాల్లో ధనలాభాలను పొందుతారు.

**మిథునం:** అనుకున్నది సాధించలేకపోవుట మిమ్మల్ని బాధిస్తుంది. దుస్సంఘటనలకు అవకాశం. డబ్బును వృథా చేస్తారు. వ్యాపారంలో లాభాలను పొందుతారు. కుటుంబ అనుబంధాలకు ప్రాధాన్యతనిస్తారు.

**కర్కాటకం:** వ్యాపారంలో ధనలాభాలు, ప్రశంసలు పట్ల ఆసక్తి చూపిస్తారు. ఉద్యోగాభివృద్ధిని పొందుతారు. ధననష్టం ఉన్నప్పటికీ సామాన్య ధనలాభాలుంటాయి. మనోధైర్యంతో ఉంటారు.

**సింహం:** శుభకార్య ప్రాప్తి. వృత్తియందు సంతోష లాభాలు. వ్యాపార-వృత్తిలో సామాన్య విజయాలను పొందుతారు. విందులు వినోదాల్లో పాల్గొంటారు. గురుభక్తి, విజయావకాశాలను పొందుతారు.

**కన్య:** శుభకార్య ప్రాప్తి, వృత్తియందు సంతోషలాభాలు. చేపట్టిన పనులు విజయవంతంగా పూర్తి చేస్తారు. సంతానా భివృద్ధి. ఎంతోకాలంగా ఇబ్బంది పెడుతున్న సమస్యల నుంచి విముక్తి లభిస్తుంది.

**తుల:** వ్యాపార లాభాలు, ఋణాలు తీర్చుట. కొన్ని సమస్యలకు అవకాశం. మీకున్న మనోబలంతో సమస్యల్ని జయిస్తారు. వ్యాపారం పెద్దగా సాగదు. కొంతవరకు లాభాలు కూడా ఉంటాయి.

**వృశ్చికం:** ఆరోగ్యసమస్యలకు అవకాశం. దూరదేశ ప్రయాణాలు చేస్తారు. చికాకు పరిచే అవకాశం. సమస్యలకు అవకాశం. దూరదేశ ప్రయాణాలు చేస్తారు. ఉన్నత విద్య కోసం చేస్తున్న ప్రయత్నాలు ఫలిస్తాయి.

**ధనుస్సు:** ధన నష్టాలకు అవకాశం. వ్యాపారంలో కొన్ని ఇబ్బందులకు అవకాశం. విజయాలను పొందుతారు. రుణయోగం, సంతానం గురించి చర్చలు చేస్తారు. బంధుమిత్ర సమాగమం.

**మకరం:** వృత్తియందు సామాన్య విజయాలను పొందుతారు. ధనప్రాప్తి యోగం. కుటుంబ సౌఖ్యములు. ధనవ్యయం చేస్తారు. వ్యాపారంలో లాభాలను పొందుతారు. మీలోని భావోద్వేగాలను అదుపులో వుంచుకోవడం మంచిది.

**కుంభం:** స్త్రీలకు మానసిక అనారోగ్యములు వచ్చును. ధనలాభాలను పొందుతారు. దేశసంచార యోగములు. మనోవ్యథ, చికాకులకు అవకాశం. వ్యాపారం పెద్దగా సాగదు. మీకున్న దానగుణం వల్ల అనేకులు మేలు పొందుతారు.

**మీనం:** బంధుమిత్రులతో ఆనందంగా గడుపుతారు. కొన్ని ఆరోగ్య సమస్యలకు అవకాశం. కార్యసాధన, మనోల్లాసములు. మీపై ఉన్నతాధికారులు కోపపడవచ్చు.

**- పాలకుర్తి సంతోష శర్మ,** విజయపురి కాలనీ, హైదరాబాద్

## బిడ్డ ఎదుగుదలలో లోపాలు



**డా॥కె. ఉమాదేవి, తిరుపతి**

**సెతరే లేదా క్రాట్జిన్ సిండ్రోమ్:** వీరిలో క్రేనియల్ సూచర్స్ త్వరగా అతుక్కోవడం, పై పెదవి సాగదీసినట్లుండడం, చేతి వేళ్ళు కాలిలోని 4,5 వేళ్ళు ఒక దానితో ఒకటి అతుక్కొని వుండడం, బాహ్యచెవి లోపాలు, చెవుడు వుంటుంది.

**పాన్‌సైనోస్టోసిస్:** సూచర్స్ త్వరగా కలిసిపోవడం ఎగుడు దిగుడుగా తల భాగం, ముఖం వికృతిగా ఒక పక్కలాగే నట్లుంటుంది.

ఇలా పుట్టుకతో వచ్చే అబ్‌నార్మల్‌గా పుట్టే శిశువుల్లో ఎదుగుదల లోపాలు, కన్ను, చెలి లోపాలు, పిట్స్, నిస్సత్తువ, బిహేవియర్ లోపాలు, బుద్ధి మాంద్యం, అంగవైకల్యం, చావు రావడం వుంటుంది.

**చికిత్స:** తల ఆకృతిలో అబ్‌నార్మల్‌గా వుండే తలకు హెల్మెట్ కాప్ ని శిశువు తలకు బిగిస్తారు. రోజు లేదా వారానికి లేదా 15 రోజులకు ఒకసారి, అడ్జస్ట్ చేయడం, రెగ్యులర్‌గా తలకు బిగించడం మంచిది. ఈవిధంగా ఐదారు నెలలు లేదా సంవత్సం వరకు చేయడం ఇన్ఫెక్షన్స్ చేరకుండా మంచి పోషకాహారం ఇస్తూ ఉంటే చాలా వరకు సత్ఫలితాలుంటాయి.

**ఇవే గాకుండా అబ్‌నార్మల్‌గా ఉండే తల ఆకృతులు:**

**మాక్రోసెఫలే:** ఉండవలసిన పరిమాణం కన్నా తల పెద్దదిగా వుంటే దాన్ని మాక్రోసెఫలే అంటారు. ఇది హైడ్రోసెఫలిలే సబ్ డ్యురల్ హేమటోమా, రికెట ్, ఆభాగంద్రోప్లాసియా వంటి వ్యాధుల్లోను, పాగె ట్స్ డీసీజ్, బ్రేయిన్ ట్యుమార్స్‌లోను ఉంటుంది.

**అనన్ సెఫలే:** క్రేనియమ్ చిన్నదిగా ఉంటుంది. దీనివల్ల తల మెదడు చిన్నదిగా అబ్‌నార్మల్‌గా వుంటుంది. జేనిటిక్ సమస్య వల్ల ప్రతి వెయ్యిమందిలో ఒకరికి ఇలా జరగవచ్చు. 2/3 వంతు ఆడపిల్లలోనే ఇది ఎక్కువగా కన్పిస్తుంది.

**స్టెనోసెఫలే:** సూచర్స్ ప్రిమెచ్యూర్‌గా క్లోజ్ కావడం వల్ల తల ఆకృతిలో హెచ్చు తగ్గులుండి తల వికారంగా ఉంటుంది. ఇది బ్రెయిన్, నరాలు, కండ్లు దెబ్బతిన్న శిశువులో వుంటుంది.

**క్రేనియోటేబ్స్:** తలలోని ఎముకలు పల్చగా సుతిమెత్తగా ఉంటాయి. ఇది టేబుల్ టెన్నిస్ బాల్‌ను వత్తినట్లుగా తల ఉంటుంది. ఇది రికేట్స్, నెలలు నిండకుండా పుట్టేవారిలో సైడ్రోసెఫలస్, ఆస్టియోజెనిసిస్ ఇంఫర్‌ఫక్టా, పుట్టుకతో వచ్చే సిఫిలిస్ వల్ల ఏర్పడుతుంది



**హాట్ క్రాస్ ఒక స్కల్ :** ఈ వ్యాధిలో పుర్రె ఎముకలు మెత్తగా ఉంటాయి. తర్వాత ఫ్రాంటల్, పరైటల్ బోన్స్ అబ్‌నార్మల్‌గా గట్టిగా, అందంగా ఉబ్బుగా తయారవుతాయి. అందువల్ల అవి ఎత్తుగా తయారవడంతో పుర్రె ఒక బాక్స్‌లాగా ఉంటుంది. ఎత్తైన భాగాలు, సన్నటి గుంతలతో తల హెచ్చు తగ్గులుగా ఉంటుంది.

**గ్లోబుల్యార్ స్కల్:** ఇది మైడ్రోకెఫలిస్‌లో వుంటుంది శరీరం కన్నా తల పరిమాణం అధికంగా (76 సెం.మి) ఉంటుంది. తలలోని సరిబ్రోస్పెనల్ ద్రవం అధికంగా వుంటుంది. ప్రతి 2,000 మందిలో ఒక్కరికి ఇలా వుంటుంది. ఇది పుట్టుకతోనే లేదా బ్రేయిన్‌లో రక్త స్రావం, మెనింజైటిస్, టి.బి ఇతర జన్యు సంబంధ కారణాల వల్లను రావచ్చు.

**హైపర్ టెలోరిజమ్:** పుర్రెలోని రెండు కళ్ళ మధ్య దూరం అబ్‌నార్మల్‌గా ఎక్కువగా ఉంటుంది. ముక్కుపై భాగం వెడల్పుగా ఉంటుంది. ఇది స్ఫినాయిడ్ బోన్ అధీకంగా డెవలప్ కావడం వల్ల ఇది ఏర్పడుతుంది,

**లాక్యునర్ స్కల్:** స్కల్‌వాల్ట్‌లో గుంతలుగుంతలుగా హెచ్చు తగ్గులుగాఉంటుంది. ఇది మెనింగోసీల్‌లో ఈ రకం తల ఉంటుంది.

**ఫ్రాంటిల్ బోసింగ్:** నుదురు చిన్నదిగా ఉండి తలపై నుండి జారినట్లు ఉండటం ఇది రికెట్స్‌లోనే కాక క్రానిక్ హీమోలైటిక్ అనేమియా సికెల్ సెల్ డిసీజ్, థాలసేమియాలో ఈ రకం తల ఉంటుంది. ❒



## కానుక

❂ ఫ్యాన్ రెక్కలకు లేదా ఎయిర్‌కూలర్, ఎయిర్ కండిషనర్‌లకు సెంటు చల్లిన రిబ్బనులు కడితే గాలితో పాటు సెంటు సువాసనలని కూడా మనం ఆస్వాదించవచ్చు.

❂ ఖాళీ అయిన సెంటు సీసాలను బట్టల బీరువాలో పడేస్తే బట్టలకు సువానన తగులుతుంది.

❂ కారులో సెంటు కలిగిన పాలిథిన్ పేకెట్లని కార్లో వేలాడగడితే ప్రయాణం హాయిగా ఉంటుంది. ❂ నెయ్యి తాజాగా ఉండాలంటే దానిలో చిన్న బెల్లం ముక్క వేయాలి. కాఫీపొడి, టీ, పంచదార, పప్పులులాంటి దినుసులన్నీ ట్రాన్స్‌పరెంట్ డబ్బాల్లో పోసుకుని ఉంచితే కనబడు తుంటుంది. కాబట్టి తీసుకోవడం తేలిక.

## విదుర గీత

ఆధ్యాత్మికం

యుద్ధ సన్నాహాలు జరుగుతున్న సమయంలో ధృతరాష్ట్రుడు ఆందోళన చెంది పాండవులకడకు సంజయుని పంపాడు రాయబారం చేయటానికి. సంజయుడు వెళ్లి పాండవులతోను, వారితో నున్న శ్రీకృష్ణ పరమాత్మను కలిశాడు. ఎన్నెన్నో విషయాలు ధర్మరాజుకు చెప్పి రాజ్యభాగము దుర్యోధనుడు ఇవ్వకపోయినా సరే యుద్ధప్రయత్నం మానుకోవాలంటూ "అప్రాజ్ఞుండు, అధార్మికుండును యుద్ధంబులందు విజయం బొందుటయు ప్రజ్ఞావంతుడును బోధశాలియు మహాధార్మికుండును పరాజయం బొందుటయుకూడ ఒక్కప్పుడు కలుగుచుండును. ఎప్పుడును ధర్మమే జయించునను నిశ్చయము లేదు కదా? నీవెప్పుడును తొందరపాటుననేని పాపకార్యం బాచరించి యెఱుగవు. అట్లయ్యు ఇప్పుడు ప్రజ్ఞావిరుద్ధంబగు కర్మమాచ రింపనేల సమకట్టెదవు?" అని అంటాడు. ఈ మాటల వల్ల సంజయునకున్న ప్రభుభక్తి తెలుస్తుంది గానీ సంజయుడు అనదగిన మాటలా ఇవి అని సందేహం రాకమానదు. దానికి తగ్గట్టే జవాబు ఇచ్చాడు ధర్మరాజు. కృష్ణుని వైపు చూపిస్తూ "ఈతడు ఎల్ల కర్మంబుల నిశ్చయంబెఱిగినవాడు. మాకు ప్రియుడు, సాదుతముండగు వాసుదేవునానతినే నెన్నడు అతిక్రమింపజాలను" అంటాడు. శ్రీకృష్ణుడు సంజయునికి చాతుర్వర్ణ్యాల ధర్మాలను వివరించి 'శాంతి శాంతి' అని పలుమార్లు బోధించు నీవు శాంతినే కోరెదనేని రాజులకు యుద్ధములందు ధర్మతంత్రము గలదో, యుద్ధభావములందు ధర్మతంత్రము గలదో నీవే వచిం పుము. నీవేది చెప్పిన దానిని మేము అంగీకరింతుము" అంటాడు. అంతేకాదు. "సుయోధనుండు క్రోధరూపం బగు మహావృక్షము. దానికి కర్ణుడు స్కందము. దానికి శాఖ శకుని, దుశ్శాసనుడు పువ్వులును, పండ్లును, మొదలు ధృతరాష్ట్రుండునై యున్నారు. యుధిష్టిరుడు ధర్మమయ మహాతరువు, దాని స్కంధమర్జునుడు, శాఖ భీమసేనుడు, మాద్రీ తనయులు పూలు, పండ్లును, మొదలు నేనును, వేదంబులును, బ్రాహ్మణులమునై యున్నాము" అంటూ పాండవులు శుశ్రూష చేయడానికీ సిద్ధమే, యుద్ధం చేయడానికీ సిద్ధమే. వారు యుద్ధము నందు ఆరితేరిన మహావీరులు" అని ధృతరాష్ట్రునకు వాస్తవాన్ని తెలియచేసి, తగు నిర్ణయాన్ని తీసుకోమని చెప్పు అంటాడు. ధర్మరాజు తమకు కుశస్థలము, వృక్షస్థలము మాకంది, వారణావతరము అను నాలుగూళ్లతో పాటు తనకు ఇష్టము వచ్చిన ఇంకొక ఊరుని దుర్యోధనుడు ఇస్తే తృప్తిపడి ఉంటామని ధృతరాష్ట్రునకు చెప్పవలిసిందిగా సంజయునకు చెబుతాడు. చివరగా "నేను శాంతికి సమర్థుడనెట్లో అట్లే యుద్ధమునకు సమర్థుడనే" అని చెప్పమంటాడు.

సంజయుడు హస్తినాపురానికి చేరి సరాసరి ధృతరాష్ట్రుని మందిరానికే వెళ్లి విషయాలనన్నిటినీ వివరిస్తాడు. పాండవుల తోడ విరోధము మంచిది కాదంటాడు. కృష్ణసారథ్యమున అర్జునుడు కురుకులాన్నంతా అగ్ని కదా వనాన్నంతా కాల్చి వేసినట్టు కాల్చివేస్తాడని హెచ్చరించి వెళ్లిపోతాడు. ధృతరాష్ట్రునకు నిద్రపట్టదు. విపరీతమైన మానసిక ఆందోళనకు గురవుతాడు. విదురుని కొరకు దూతను పంపుతాడు.

విదురుడు రాగానే విషయాన్నంతా వివరించి, యుద్ధాన్ని గూర్చిన భయాన్ని వెలిబుచ్చుతాడు. తన భయాందోళనలు పోయి మనశ్శాంతి లభించాలంటే తాను ఏమిచేయాలో చెప్పవలసిందిగా విదురుని కోరతాడు. అప్పుడు విదురుడు ధృతరాష్ట్రునకు చెప్పిన విషయాలను విదురగీత అని విదురనీతి అని పెద్దలు అంటారు. అందులో నేటికీ, ఏనాటికైనా ఉపయోగపడే అద్భుతవిషయాలు ఎన్నెన్నో! వాటిని తెలుసుకొందాం. నిందిత కార్యములను విసర్జించుట, ఆస్తికత్వము, తన్ను అడగనిదే పరార్థంబున వాగ్వ్యయము గావింపకుండుట పండితుని ముఖ్యధర్మాలు. పండితులు దుర్లభ వస్తువులకు ఆశింపరు. నశించిన దానికి వగవరు.

ఎంతటి ఆపదలందును మోహావిష్టులు కారు. హితులను ఎప్పుడూ కోపింపరు. తమకు సన్మానం జరిగితే పొంగిపోరు, అవమానం కలిగితే క్రుంగిపోరు. గొప్పధనం, విద్య ఐశ్వర్యము కలిగి గర్వరహితుడై చరిస్తారు. శాస్త్రాలను అధ్యయనము చేయక గర్వించువారు, దరిద్రులై గొప్ప కోరికలు కలవారు, కర్మ చేయకయే ఫలములను కోరువారు మూఢులు. మిత్రుల పట్ల కపట వృత్తి కలవారు మూఢులు. బలవంతులతో వైరము గలవారు, దుష్టకర్మలు చేయువారు, వెంటనే చేయవలసిన పనులను వాయిదా వేయువారు, పిలువకయే చొఱబడువారు, అడుగకయే పెక్కు మాటలు చెప్పువారు, అకారణంబుగా కోపించువారు, లుబ్ధుని ధనాశచే సేవించువారు, ఇతరులకు పెట్టక భుజించువారు, భృత్యులను పంచక తామే సంపదను అనుభవించువారు మూఢులు. వెలది, జూదంబు, వేట, పలుకు, ప్రల్లదనము, మద్యపానము, దండపారుష్యము, దుర్వ్యయము అనునవి వ్యసనాలు. వీటికి బానిస కానివాడే వివేకి.

**- రాచమడుగు శ్రీనివాసులు**



ఇన్‌స్టాగ్రామ్ పిక్చర్: నిధి అగర్వాల్



# ఏప్రిల్‌లో 2.0

సూపర్‌స్టార్ రజనీకాంత్ గ్రేట్ డైరెక్టర్ శంకర్ కాంబినేషన్‌లో వచ్చిన రోబో ప్రపంచవ్యాప్తంగా సంచలనం సృష్టంచింది మళ్లీ అదే కాంబినేషన్‌లో రోబో చిత్రానికి సీక్వెల్‌గా రూపొందుతున్న 2.0 చిత్రంపై భారీ అంచనాలు ఉన్నాయి.. ఇండియన్ సినిమాలోనే రూ.450 కోట్ల రూపాయల భారీ బడ్జెట్‌తో, హైటెక్నికల్ వాల్యూస్‌తో హాలీవుడ్ స్థాయిలో లైకా ప్రొడక్షన్స్ సంస్థ ఈచిత్రాన్ని నిర్మిస్తోంది.. ఈచిత్రంలో బాలీవుడ్ స్టార్ హీరో అక్షయ్‌కుమార్ విలన్‌గా, ఓ విభిన్న మైన పాత్ర పోషిస్తుండగా, అమీజాక్సన్ హీరోయిన్‌గా నటిస్తోంది.. తెలుగు, తమిళ, హిందీ భాసల్లో రూపొందుతున్న ఈచిత్రం షూటింగ్ పూర్తిచేసుకుంది.. ఈచిత్రాన్ని వచ్చే ఏడాది ఏప్రిల్ లో ప్రపంచ వ్యాప్తంగా విడుదల చేసేందుకు సన్నాహాలు చేస్తున్నామని లైకా ప్రొడక్షన్స్ క్రియేటివ్ హెడ్ రాజు మహాలింగం తెలిపారు.




మరిన్ని సినిమా వార్తలకు
vaartha.com
క్లిక్ చేయండి

# సూపర్‌స్టార్‌కు 'ఆటా' జీవన సాఫల్య పురస్కారం



అమెరికాలో స్థిరపడిన తెలుగుప్రజలు 26 ఏళ్ల క్రితం స్థాపించుకున్న సంస్థ ఆటా (అమెరికన్ తెలుగు అసోసియేషన్) రెండేళ్లకోసం ఇండియా వచ్చి ఆట వేడుకలు పేరుతో పలు కార్యక్రమాలు నిర్వహిస్తోంది.. ఈ పర్యాయం కూడ నవంబర్ 26 నుంచి నిరాటకంగా ఉచిత వైద్యశిబిరాలు వంటివి నిర్వహిస్తోంది. కాగా డిసెంబర్ 23న ఉదయం 5కె రన్‌తో మొదలయ్యేముగింపు కార్యక్రమం నిర్వహించ బోతోంది.. సాయంత్రం సూపర్‌స్టార్ కృష్ణకు ఆటా జీవన సాఫల్య పురస్కారం ప్రదానం చేయున్నారు. ఈమేరకు ప్రస్తుత అధ్యక్షుడు కరుణాకర్‌రెడ్డి, కాబోయే అధ్యక్షుడు (ప్రెసిడెంట్ ఎలక్ట్) పరమేష్ భీమిరెడ్డి తెలిపారు.. కార్యక్రమంలో ఆటా గౌరవ సలహాదారు నిర్మాత తమ్మారెడ్డి భరధ్వాజ, లోహిత్, మధుసూధన్ కోడూరు, డాక్టర్ రంగారావు తదితరులు పాల్గొన్నారు.

# ఒక్క క్షణం.. టీజర్ రిలీజ్



అల్లు శిరీష్, సురభి, సీరత్‌కపూర్ కీలకపాత్రల్లో నటించిన సినిమా ఒక్క క్షణం.. విఐ ఆనంద్ దర్శకత్వం వహిస్తున్నారు.. లక్ష్మీ నరసింహా ఎంటర్‌టైన్మెంట్స్ పతాకంపై రూపొందుతోంది.. చక్రి చిగురుపాటి నిర్మిస్తున్నారు.. ఆదివారం ప్రసాద్ ల్యాబ్ ప్రివ్యూ థియేటర్‌లో ఈసినిమా టీజర్‌ను విడుదల చేశారు. హీరో శిరీష్ మాట్లాడారు.. ఉత్కంఠగా సాగే కథ అన్నారు. లవ్, రొమాన్స్, ఎంటర్‌టైన్‌మెంట్స్‌తో సాగుతుందన్నారు. ఆనంద్ చక్కగా తెరకెక్కించారన్నారు.. మణిశర్మగారి సంగీతం ప్లస్ పాయింట్ అవుతుందన్నారు.. దర్శకుడు ఆనంద్ మాట్లాడుతూ, గత ఏడాది నవంబర్‌లోనే ఈ కథను నిర్మాత, హీరోకి తెలిపానన్నారు.. కార్యక్రమంలో అబ్బూరి రవి, సీరత్‌కపూర్, నిర్మాత చక్రి తదితరులు మాట్లాడారు.

# ఇంద్రసేన సక్సెస్ మీట్



విజయ్ ఆంథోనీ హీరోగా నీలం లక్ష్మి సమర్పణలో నీలం కృష్ణారెడ్డి నిరి్మంచిన చిత్రం ఇంద్రసే.. జి.శ్రీనివాసన్ దర్శకుడు.. బ్రదర్ సెంటిమెంట్‌తో విజయ్ ఆంథోనీ ద్విపాత్రాభినయంతో నటించి ఇంద్రసేన గత వారాంతంలో విడుదలై ప్రేక్షకాదరణ పొందింది.. ప్రసాద్ ల్యాబ్స్‌లో ఈచిత్రం సక్సెస్ మీట్‌ను చిత్రం యూనిట్ ఏర్పాటుచేసింద.ఇ విజయ్ ఆంథోనీ మాట్లాడుతూ, తెలుగు ప్రేక్షకులు కొత్తదనాన్ని ఎప్పటికపుడు ఎంరేజ్ చేస్తారని, ఇంద్రసేనతో మరోసారి నిరూపించారన్నారు. తెలుగుతోపాటు, తమిళంలోనూ ఈచిత్రంప్రేక్షకాదరణ బాగుందన్నారు.. నిర్మాత కృష్ణారెడ్డి మాట్లాడుతూ, మా బ్యానర్ ఎన్‌కెఆర్ ఫిలింస్‌లో ఇంద్రసేన హ్యాట్రిక్ హిట్‌గా నిలిచిందనా న్నరు.. కార్యక్రమంలో రచయిత భాష్యశ్రీ, హీరోయిన్ మహిమ తదితరులు మాట్లాడారు.

# ఆది పినిశెట్టి, తాప్సీ జంటగా



కోన వెంకట్ సమర్పణలో గీతాంజలి చిత్రాన్ని నిర్మించిన ఎంవివి సినిమా , కోన ఫిల్మ్ కార్పొరేషన్ సంస్థలు సంయుక్తంగా ఒక విభిన్నమైన కథతో నిర్మిస్తున్న చిత్రం డిసెంబర్ 21న ప్రారంభం కానుంది. ఆది పినిశెట్టి హీరోగా తెరకెక్కుతున్న ఈచిత్రంలో కథానాయికగా తాప్సీ నటించనుండగా, మరో ప్రముఖ కథానాయిక కూడ ఈ చిత్రంలో నటించనుంది.. ఆది పినిశెట్టి తాప్సీ వైవిధ్యమైన పాత్రల్లో నటించనున్న ఈ యాక్షన్ ఎంటర్‌టైనర్ హైదరాబాద్, విశాఖ, విజయవాడల నేపథ్యంలో రూపొందనుంది.. వెన్నెల కిషోర్, శివాజీరాజా, తులసి, సాయిచంద్‌లు కీలకపాత్రలు పోషిస్తున్న ఈచిత్రానికి లవర్స్ ఫేం హరి దర్శకత్వం

# స్టార్ క్రికెటర్‌తో వెండితెర తార

సినీ తారలకు కోట్లల్లో అభిమానులుంటారు. వాళ్లు ఎక్కడైనా కన్పిస్తే ఒక ఫొటో దిగుదామని ఎంతోమంది ఎదురు చూస్తుంటారు.. ముఖ్యంగా క్రికెటర్లను సినీతారలు చాలా అభిమానిస్తారు.. వాళ్లు కలిసినపుడు వీళ్లు ఫ్యాన్స్ అయిపోతుంటారు.. . సీనియర్ నటి రమ్యకృష్ణ సైతం ఇలాగే ఫ్యాన్ మూమెంట్‌ను ఆస్వాదించింది.. ఓ జాతీయ టివి ఛానల్ ప్రతి ఏడాది వివిధ రంగాలకు చెందిన ప్రతిభావంతులకుఅవార్డులిస్తుంది.. ఈ ఏడాది ఎంటర్‌టైన్‌మెంట్ రంగంలో రమ్యకృష్ణకు అవార్డు దక్కగా, కోహ్లీ ఓవరాల్‌గా ఇండియన్ ఆఫ్ ద ఇయర్ అవార్డుకు ఎంపికయ్యారు.. ఢిల్లీలో జరగిన ఈ అవార్డుల వేడుక కు రమ్యతోపాటు కోహ్లీ కూడ హాజరయ్యారు. ఈసందర్భంగా కోహ్లీతో కలిసి ఫొటో దిగిన రమ్య ..దాన్ని సోషల్ మీడియాలో అభిమానులతో పంచుకుంది.. విరాట్ కోహ్లీ మంచి వ్యక్తి అని, అతడిని కలుసుకోవటం తనకు చాలా సంతోషంగా ఉందని రమ్యకృష్ణ తెలిపింది. ఈ ఫొటో ప్రస్తుతం సోషల్ మీడియాలో వైరల్ అవుతోంది.





# హీరోయిన్‌గా తెలుగు చిత్రం

మోస్ పాపులర్ హాలీవుడ్ లేడీ సన్నీలియోన్ తొలిసారిగా తెలుగులో హీరోయిన్‌గా ఒక సినిమా సైన్ చేసింది.. కమర్షియల్ చిత్రాలకు పెట్టింది పేరైన విసి వడివుడయన్ దర్శకత్వంలో స్లీప్స్ కార్నర్ పతాకంపై పోన్స్ స్టిఫెన్ ఈచిత్రాన్ని నిర్మిస్తున్నారు. సౌత్ ఇండియన్ కల్చర్స్ బ్యాక్‌డ్రాప్‌లో రూపొందుతున్న ఈ చారిత్రాత్మక యుద్ధ నేపథ్య చిత్రంలో సన్నీలియోన్ కథానాయికగా నటించనుంది.. నవదీప్, నాజర్‌లు ఈచిత్రంలో కీలకపాత్రలు పోషించనున్నారు. విశేషం ఏమిటంటే ఈచిత్రం కోసం సన్నీలియోన్ కత్తియుద్ధం, గుర్రపుస్వారీ, కొన్ని యుద్ధ కళలను నేర్చుకోనున్నారు.. ఎపికి చెందిన ఒక ప్రముఖ ట్రైనర ఈ కళలను ముంబైలో సన్నీలియోన్‌కు శిక్షణ ఇవ్వనున్నారు.. భారీ బడ్జెట్‌తో రూపుదిద్దుకోనున్న ఈచిత్రానికి సన్నీలియోన్ ఏకంగా 150 రోజుల కాలీషట్లును ఇవ్వటం బట్టి సినిమాపై ఆమెకున్న నమ్మకం తెలుసో్తంది.. సన్నీ మాట్లాడుతూ, యాక్షన్ స్వీకెన్స్‌లో యాక్ట్ చేయాలన్నది నా కల.. అది ఈసనిమాతో నెరవేరుతున్నందుకు ఆనందంగా ఉందని పేర్కొంది.. 2018 ఫిబ్రవరి నుంచి రెగ్యులర్ షూటింగ్ ప్రారంభమవ్వనున్న ఈచిత్రం ప్రీప్రొడక్షన్ వర్క్ , సెట్ వర్క్ ప్రసస్తుతం జరుగుతోంది.

# గుజరాత్ ఎన్నికలు, ఆర్‌బిఐ సమీక్ష కీలకం

## ఈ వారం మార్కెట్‌పై నిపుణుల అంచనా



**ముంబయి, డిసెంబరు3:** వరుసగా ఎనిమిది రోజుల పాటు లాభాల బాటలో సాగిన దేశీయ స్టాక్ మార్కెట్లు గత వారం దారుణంగా పతనమయ్యాయి. గత వారం మార్కెట్లలో బేర్ ఆపరేటర్ల పట్టు బలంగా కొనసాగింది. అయితే వచ్చే వారం ఇదే తీరు కొనసాగుతుందా లేక మళ్లీ మార్కెట్లు లాభాల బాట పడతాయా అనేది ప్రశ్నార్థకంగా మారింది. అంతర్జాతీయ రేటింగ్ సంస్థ భారత రేటింగ్‌ను పెంచడం, అలాగే ప్రపంచ బ్యాంకు ఈజ్ ఆఫ్ డూయింగ్ బిజినెస్ సూచీలో మనదేశం ఒకేసారి 30 ర్యాంకులు ఎగబాకడం లాంటి ఘటనలతో మార్కెట్లలో నెలకొన్న ఉత్సాహం అంతా ఆవిరైపోయి ఇప్పుడవి వాస్తవ ఫండమెంటల్స్ స్థాయికి చేరుకున్నాయని నిపుణులు అంటున్నారు. ఇప్పుడు మార్కెట్లలో పెరిగిపోతున్న ఆర్థికలోటు, లిక్విడిటీ ఆందోళనలే ప్రధాన అంశాలుగా ఉంటున్నాయి. ఈ కారణంగానే గత వారం ట్రేడింగ్ చివరిరోజైన శుక్రవారం సెన్సెక్స్ 316 పాయింట్లు పతనమై, 32,833 పాయింట్ల స్థాయికి చేరుకోగా, జాతీయ స్టాక్ ఎక్స్ఛేంజ్ సూచీ సైతం 100 పాయింట్లకు పైగా నష్టపోయి 10,122 పాయింట్ల దిగువన ముగిసింది. ఈ నేపథ్యంలో వచ్చే వారం మార్కెట్ల గతిని నిర్ణయించే అంశాలు ఏమిటనే విషయమే ప్రధానంగా చర్చ నడుస్తోంది. అన్నింటికన్నా ముఖ్యంగా మంగళ, బుధవారాల్లో రిజర్వు బ్యాంకు జరిపే ద్రవ్య పరపతి విధానం సమీక్షపైనే అందరి దృష్టి ఉంది. ఈ ఆర్థిక సంవత్సరానికి ఆర్‌బిఐ జరుపుతున్న అయిదవ ద్వైమాసిక ద్రవ్య పరపతి విధానం సమీక్షా సమావేశం ఇది. అయితే ఈసారి కూడా ఆర్‌బిఐ కీలక వడ్డీ రేట్లలో ఎలాంటి మార్పులు చేయకపోవచ్చని విశ్లేషకులు భావిస్తున్నారు. అయితే వచ్చే ఏడాది ప్రారంభం నుంచి రిజర్వు బ్యాంకు కీలక వడ్డీరేట్లను పెంచడం ప్రారంభిచవచ్చని ఎందుకంటే ఆర్థికవృద్ధి రేటు తిరిగి పుంజుకుంటుండం, మరోవైపు ముడి చమురు ధరలు, ఇతర సరుకుల ధరలు పెరుగుతున్న కారణంగా ద్రవ్యోల్బణం సైతం పెరిగే అవకాశం ఉందని గోల్డ్‌మాన్ శాక్స్, మోర్గాన్ స్టాన్లీ లాంటి అంతర్జాతీయ పెట్టుబడుల బ్యాంకులు అంచనా వేస్తున్నాయి. ఈ ఆర్థిక సంవత్సరం రెండో త్రైమాసికంలో దేశ ఆర్థికవృద్ధి అంతకు ముందు త్రైమాసికంలో ఉండిన 5.7 శాతం నుంచి 6.3 శాతానికి పెరగడం తెలిసిందే. మరోవైపు ఐటీ దిగ్గజం ఇన్ఫోసిస్ కొత్త సిఎండీగా సలీల్ ఫరేఖ్‌ను ఎంపిక చేస్తున్నట్లు ఆ సంస్థ ప్రకటించడం మార్కెట్లపై కీలక ప్రభావం చూపించనుంది. సిఈవోగా విశాల్ సిక్కా హటాత్తుగా నిష్క్రమించినప్పటి నుంచి ఇన్ఫోసిస్ కార్పొరేట్ ప్రపంచంలోనూ, అలాగే మీడియాలోనూ ఓ ప్రధాన చర్చనీయాంశంగా మారిన సంగతి తెలిసిందే. సోమవారం ట్రేడింగ్ తిరిగి ప్రారంభమైన తర్వాత ఈ పరిణామం ఆ కంపెనీ స్టాక్‌పై ఉండే అవకాశం ఉంది. మరోవైపు వచ్చే వారం చివర్లో గుజరాత్ అసెంబ్లీ ఎన్నికల తొలి విడత పోలింగ్ జరగనుంది. ఈ ఎన్నికలు ప్రధాని నరేంద్ర మోడీకి, ఆయన పార్టీ బిజెపికీ అత్యంత ప్రతిష్టాత్మకంగా మారిన విషయం తెలిసిందే. ఈ నేపథ్యంలో మదుపరులు దీర్ఘకాలిక పరిణామాలను దృష్టిలో పెట్టుకొని ఈ నెల 18న ఫలితాలు వెలువడే వరకు ఆచితూచి వ్యవహరించే అవకాశాలే ఎక్కువగా కనిపిస్తున్నాయి. మరోవైపు డిబెంచర్లు, షేర్ వారెంట్లు ప్రమోటర్లకు విక్రయించడం ద్వారా రూ.11, 250 కోట్ల నిధులను సమకూర్చుకోవడానికి రియల్ ఎస్టేట్ సంస్థ డిఎల్ఎఫ్ రూపొందించిన ప్రణాళికకు కంపెనీ బోర్డు ఆమోదం తెలిపింది. అలాగే పబ్లిక్ ఇష్యూ లేదా ప్రైవేట్ ప్లేస్‌మెంట్ల ద్వారా 17.30 లక్షల షేర్లను విక్రయిస్తామని కూడా ఆ సంస్థ శుక్రవారం మార్కెట్ రెగ్యులేటర్ సెబీకి తెలియజేసింది. మరోవైపు టాటా స్టీల్, జెఎల్ పవర్ వెంచర్స్ నుంచి ఒరిస్సాలోని భుబనేశ్వర్ పవర్‌లో 74 శాతం వాటాను రూ.255 కోట్లకు కొనుగోలు చేయనున్నట్లు వార్తలు వచ్చాయి. అలాగే తన యూరోపియన్ లైటింగ్ వ్యాపారంలో మిగిలిఉన్న 20 శాతం వాటాను చైనాకు చెందిన ఫీలో అకోస్టిక్స్‌కు రూ.260 కోట్ల రూపాయలకు విక్రయించడం పూర్తి చేసినట్లు హావెల్స్ ఇండియా శుక్రవారం ప్రకటించింది. ఈ మూడు పరిణామాలు కూడా వచ్చే వారం మార్కెట్లను కొంతవరకు ప్రభావితం చేసే అవకాశం ఉంది. ఇక మంగళవారం నవంబరు నెలలో సేవల రంగం పనితీరుపై నిర్వహించే నెలవారీ సర్వే ఫలితాలు వెల్లడి కానున్నాయి. అక్టోబరు నెలలో ఈ రంగం గత నెలల్లో ఎన్నడూ లేనంత వేగంగా వృద్ధి చెందింది. వీటన్నింటితో పాటు అంతర్జాతీయ పరిణామాలు కూడా ముఖ్యంగా అమెరికా పన్ను చట్టాల ప్రక్షాళనకు సంబంధించిన బిల్లుకు అమెరికా సెనేట్ ఆమోదం తెలపడం, అలాగే ముడి చమురు ధరల ప్రభావం వచ్చే మార్కెట్లపై ప్రభావం చూపించనున్నాయి. ఏది ఏమైనప్పటికీ మార్కెట్లను ప్రభావితం చేసే కీలక పరిణామాలు కనుచూపు మేరలో కనిపించడం లేదు, కాబట్టి వచ్చే వారమంతా భారీ ఆటుపోట్లు కానీ పెంపులు కానీ ఉండవని నిపుణులు అంటున్నారు.



## ఐఐటిలలో క్యాంపస్ రిక్రూట్‌మెంట్ల జోరు

**హైదరాబాద్,డిసెంబరు 3:** దేశంలోని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ(ఐఐటి)లలోని గ్రాడ్యుయేట్లను ఉద్యోగాల్లో నియమించుకునేందుకు దేశ విదేశీ కంపెనీలు క్యూ కట్టాయి. దీంతో అన్ని ఐఐటిలలో క్యాంపస్ రిక్రూట్‌మెంట్ల హడావుడి మొదలైంది. ఐఐటి హైదరాబాద్‌లో ఆదివారంనుంచి తొలి విడత ప్లేస్‌మెంట్ల ప్రక్రియ మొదలవుతోంది. ఈ నెల 22న ఈ ప్రక్రియ ముగియనుంది. ఇందులో దాదాపు 85 కంపెనీలు పాల్గొంటున్నాయి. వీటిలో అంతర్జాతీయ,బహుళ జాతి కంపెనీలు కూడా ఉన్నాయి.రెండో విడత క్యాంపస్ ప్లేస్‌మెంట్లు జనవరి మొదటి వారంలో మొదలు కానున్నాయి. గత ఆర్థిక సంవత్సరంలో మొదటి విడత క్యాంపస్ రిక్రూట్‌మెంట్ల కోసం 70 కంపెనీలు ఐఐటి హైదరాబాద్‌కు వచ్చాయి.

మొత్తంగా పలు విడతల్లో 130 దాకా కంపెనీలు వచ్చాయి. ఈ సారి తొలి విడతలోనే 85 వరకు కంపెనీలు పాల్గొంటుండడం ఐఐటి హైదరాబాద్ క్యాంపస్‌కున్న ప్రాధాన్యతను స్పష్టం చేస్తోంది.ఆర్ అండ్‌డి, ఐటి/కంప్యూటర్ సైన్స్,ఐటి ఎనేబుల్డ్ సర్వీసెస్, ఇ-కామర్స్, ఆటోమేషన్/యాన్సిలరీస్, హాస్పిటల్స్/ హెల్త్‌కేర్, డిజైన్, ఫైనాన్స్, కన్సల్టింగ్ వంటి విభిన్న రంగాల్లోని విద్యార్థులను నియమించుకోవడానికి కంపెనీలు ఆసక్తి చూపిస్తున్నాయి.2017-18 సంవత్సరానికి గాను క్యాంపస్ ప్లేస్‌మెంట్‌లో పాల్గొనేందుకు 424 మంది నమోదు చేసుకున్నట్లు ఐఐటి హైదరాబాద్ తెలియజేసింది. ఈసారి ఐఐటి హైదరాబాద్‌కు వస్తున్న సంస్థల్లో ఇస్రోతో పాటు అంతర్జాతీయ సంస్థలయిన యాహూ, ఎస్ ఎంఎస్ డేటా టెక్, మైక్రోసాఫ్ట్, గోల్డ్‌మన్ శాచ్, క్వాల్‌కామ్, డిఇ షా అండ్‌కో ఉన్నాయి. నాలుగు స్టార్టప్ కంపెనీలు కూడా వస్తున్నాయి.

ఐఐటి హైదరాబాద్‌లో2017-18 సంవత్సరంలో ప్రీ ప్లేస్‌మెంట్ ఆఫర్లు(పిపిఓ) చెప్పుకోదగ్గ స్థాయిలో పెరిగాయి.గత ఏడాదిలో 18 మంది విద్యార్థులకు పిపిఓలు అందగా, ఈసారి వీటి సంఖ్య 47కు చేరుకుంది. మరోవైపు మద్రాసు ఐఐటిలో మొదలైన ప్లేస్‌మెంట్ సీజన్‌లో తొలి రోజు కంపెనీలు 195 జాబ్ ఆఫర్లు ఇచ్చాయి.

## వెన్‌కాబ్ ధరలు

Mobile No. 9849219870

| (రూ. కిలోకు) | (Rs. Per Kg) | |
|---|---|---|
| ఫామ్‌గేట్ | (Farmgate) | 70 |
| డ్రెస్స్‌డ్ | (Dressed) | 84 |
| విత్ స్కిన్ | (with skin) | 118 |
| స్కిన్‌లెస్ | (Skinless) | 139 |

## గుడ్ల ధరలు

Ph:040-23234068

| నెక్ రేట్లు (4 - 12 - 2017) | | NECC RATES |
|---|---|---|
| వందకు, రూ.లలో | | Rs.per 100 eggs |
| హైదరాబాద్ | 500 | Hyderabad |
| (రిటైల్ ధర రూ.5.60 | | (Retail Price Rs.5.60) |
| విజయవాడ | 480 | Vijayawada |
| గోదావరి | 480 | Godavari |
| విశాఖపట్నం | 480 | Visakha |
| వరంగల్ | 500 | Warangal |
| చిత్తూరు | 513 | Chittoor |
| చెన్నై | 520 | Chennai |
| ముంబయి | 547 | Mumbai |
| న్యూఢిల్లీ | 510 | New Delhi |
| కోల్‌కతా | 498 | Kolkata |
| బెంగళూరు | 520 | Bangalore |
| నమక్కల్ | 505 | Namakkal |

## బులియన్ ధరలు

| | 3 న ముగింపు | క్రితం ముగింపు |
|---|---|---|
| **ఢిల్లీ** | | |
| 24 క్యారెట్లు (10గ్రా)99.9 | 29840 | 29870 |
| 22 క్యారెట్లు (10గ్రా)99.5 | 27960 | 27990 |
| వెండి .999 (కేజి) | 41262 | 41847 |
| **ముంబయి** | | |
| 24 క్యారెట్లు (10గ్రా)99.9 | 29856 | 29890 |
| 22 క్యారెట్లు (10గ్రా)99.5 | 27940 | 28010 |
| వెండి .999 (కేజి) | 41244 | 41835 |
| **చెన్నయ్** | | |
| 24 క్యారెట్లు10(గ్రా) | 29840 | 29910 |
| 22 క్యారెట్లు | 27960 | 28030 |
| వెండి బార్ (కేజి) | 41238 | 41866 |
| **హైదరాబాద్** | | |
| 24 క్యారెట్లు (10గ్రా) | 29870 | 29940 |
| 22 క్యారెట్లు (10గ్రా) | 27990 | 28060 |
| వెండి (కేజి) | 41265 | 41872 |
| **విజయవాడ** | | |
| 24 క్యారెట్లు (10గ్రా)99.9 | 29840 | 29910 |
| 22 క్యారెట్లు (10గ్రా)99.5 | 27960 | 28030 |
| వెండి .999 (కేజి) | 41262 | 41847 |
| **విశాఖపట్నం** | | |
| 24 క్యారెట్లు10(గ్రా) | 29910 | 29910 |
| 22 క్యారెట్లు | 28030 | 28030 |
| వెండి బార్ (కేజి) | 41847 | 41847 |

# అరకొర పంట పండినా.. అమ్ముకునేందుకు అష్టకష్టాలు

### దళారులు చెప్పిందే వేదం.. లేదంటే నాణ్యతలేని కాయలంటూ వెనక్కి

### ప్రభుత్వ మద్ధతుధరపై రైతన్నల కినుక..!

### 29 నుంచి కొనుగోలంటూ.. నేటికీ స్పష్టత కొరవడిన వైనం



కల్లాల్లో తూకాలకు సంచుల్లో నింపిన వేరుశెనగకాయలు

**రాప్తాడు, డిసెంబరు 3 ప్రభాతవార్త:** "దేశానికి అన్నం పెట్టే రైతన్న" నేడు పుట్టెడు కష్టాలు ఎదుర్కొంటున్నాడు. ప్రభుత్వాలు, పాలకులు మారుతున్నా రైతన్నల తలరాతలు మారలేదు. 20ఏళ్ల క్రితం అన్నదాత ఇంట్లో ధాన్యం రాశులతో కళకళలాడేవి. పదిమందికి అన్నంపెట్టే రైతన్న ప్రస్తుతం దేహీ అంటూ పాలకులను అడుక్కోవాల్సిన పరిస్థితి దాపురించింది. వ్యవసాయానికి పెద్దపీట వేస్తామంటూ ఊదరగొట్టే పాలకులు అధికారంలోకి వచ్చిన తర్వాత పట్టించుకునే నాథుడే కరువయ్యారని రైతులు ఆవేదన వ్యక్తంచేస్తున్నారు. కాడెద్దులతో దుక్కి దున్ని విత్తువిత్తినా పంట చేతికొచ్చే వరకు సవాలక్ష కష్టాలు వెన్నాడుతున్నాయి. అనంతపురం జిల్లా కరువుకు నిలయంగా పేరుగాంచింది. నిర్ణీత సమయంలో సరైన వర్షాలు రాక 17ఏళ్ల నుంచి రైతన్నలు అప్పులఊబిలో కూరుకుపోతున్నారు. ఒకే పంటకు అలవాటుపడిన కరువు జిల్లా రైతు నష్టమొచ్చినా.. లాభమొచ్చినా వేరుశెనగ పంటను నమ్ముకుని సాగు చేస్తున్నారు. అప్పోసప్పో చేసి వేరుశెనగ విత్తనాలు భూమిలో పోస్తే దేవుడు పంట రూపంలో కుటుంబాలను బయటకెయ్యలేకపోతాడా అనే చిన్ని అశతో పంటను సాగుచేస్తున్నారు. మరోసారి వరుణుడు అప్పుడప్పుడు మొదట్లో అశలు రేపినా.. తర్వాత మొహం చాటేస్తాడు. దీంతో పంటలు పండక సరైన దిగుబడి రాక అత్మహత్యలే శరణ్యమంటూ మరోసారి దిగాలు చెందుతాడు. ఈ ఏడాది ముందస్తు వర్షాలు కొన్ని మండలాల్లో ముందస్తు వర్షాలు కురువడంతో ఓ మోస్తరు గా.. మరికొన్ని మండలాల్లో వర్షాలు కురవకపోవడంతో వేసిన పంటకు సరిపడా ఉత్పత్తిరాకపోవడం బాధాకరం. ఈ ఏడాది జిల్లావ్యాప్తంగా 3,98,598హెక్టార్లలో వేరుశెనగ సాగు చేశారు. పంటచేతికొచ్చేముందుగా వర్షాలు కురవడంతో 70శాతం పంట చేతికి రావడంతో వరుణదేవుడు తమను గట్టెక్కించాడని రైతన్న మోము నిరాశగానే మిగులుతోంది.

**దళారుల ప్రవేశంతో రైతన్నల పరిస్థితి ఆగమ్యగోచరం**

అష్టకష్టాలు పడి ఎకరాకు రూ.30వేలు చొప్పున పెట్టుబడి పెట్టి నూర్పిడి చేసుకున్న పంటను కల్లాల్లో కాయలను నిల్వ చేసుకున్నారు. కాయలు కొనుగోలు చేయడానికి దళారులు రంగ ప్రవేశం చేశారు. 45కేజీల చొప్పున బస్తాకు రూ.1600-1700 వరకు కొనుగోలు చేసేందుకు గ్రామీణ ప్రాంతాల్లోకే వస్తున్నారు. దీనికితోడు తూకాల్లో భారీ మోసాలకు పాల్పడుతూ రైతులను నిలువునా దోచేస్తున్నారు. 50కేజీల బస్తాలో కాయలు నింపి కంప్యూటర్ స్కేల్‌తో తూకాలు వేస్తూ తమదైన శైలిలో అధికంగా కాయలు తూగేలా ముందుగానే అమర్చుకున్నట్లు తెలుస్తోంది. ఇలా రైతులను ఏదో ఒకరకంగా దళారులు మోసం చేస్తున్నారు. ఈ ఏడాది వేరుశెనగ కాయలను ప్రభుత్వం క్వింటాలు ధరను రూ.4450లు కొనుగోలు చేసేలా జిల్లాలో 16కేంద్రాలను ఏర్పాటుచేస్తామని ప్రకటించింది. నవంబరు 21వ తేదీ నుంచి కొనుగోలు చేస్తామని ప్రకటిస్తూ వాయిదాలు వేస్తూ రైతులను అనేక ఇబ్బందులకు గురిచేస్తోంది. గతనెల 29 నుంచి తప్పక కేంద్రాలను ప్రారంభిస్తామని చెప్పడంతో రైతులు ఆయా కేంద్రాల్లో రిజిస్ట్రేషన్ చేయించుకున్నారు. 29న కొంతమంది వేరుశెనగకాయలు తీసుకొనిపోతే అయిల్‌ఫెడ్ అధికారులు కొనుగోలు చేయలేమని ప్రభుత్వం నుంచి ఆదేశాలు రాలేదని చెప్పడంతో దిక్కుతోచని స్థితిలో రైతులు ఉన్నారు. జిల్లావ్యాప్తంగా 2500మందికి పైగా రైతులకు తేదీలు, టోకన్లు ఇచ్చారు. అయితే ఇప్పుడు మరో 20రోజులు సమయం పడుతుందని అనడంతో రైతులు ఆందోళన వ్యక్తంచేస్తున్నారు. ఆరుగాల కష్టపడి అష్టకష్టాలు పడి పంట పండిస్తే అమ్ముకునేందుకు ఇన్ని కష్టాలు పడాల్సివస్తోందని రైతులు వాపోతున్నారు. వేరుశెనగ కాయలు వెంటనే కొనుగోలు చేసేలా అయిల్‌ఫెడ్‌కు ఆదేశాలు ఇవ్వాలని రైతులు కోరుతున్నారు. అప్పోసప్పోచేసి వ్యవసాయం చేసిన రైతులు నెలలకొద్దీ నిల్వ పెట్టుకొనే స్థితిలేక రైతులు ఆందోళన వ్యక్తంచేస్తున్నారు. కాయలను మార్కెట్‌కు తరలించుకు వస్తే వాటితో నిద్రాగారాలు చేయాల్సిన దుస్థితి నెలకొనడం దారుణమని రైతులు వాపోతున్నారు. ఇప్పటికైనా ప్రజాప్రతినిధులు, అధికారులు స్పందించి తక్షణమే వేరుశెనగకాయలు కొనుగోలు చేసి రైతును కష్టాల నుంచి గట్టెక్కించాలని కోరుతున్నారు.

**ఎలాంటి నిబంధనలు లేకుండా కొనుగోలు చేయాలి**

పంటలు పండించి మార్కెట్‌కు తరలించిన రైతుల వేరుశెనగ కాయలను అమ్ముకునేందుకు ఎలాంటి నిబంధనలు లేకుండా షరతులు సడలించాలి. రైతులు పొలం సాగుచేసినట్లు తహసీల్దార్‌తో సర్టిఫికెట్ తీసుకురావాలని నిబంధనలు పెట్టడం విరమించుకోవాలి. ఆఫీసుల చుట్టూ తిరగలేక తక్కువ ధరకు ప్రైవేటు వ్యాపారులకు అమ్ముకోవాల్సిన పరిస్థితి నెలకొంది. తక్షణమే నిబంధనలు సడలించి కనీసం క్వింటాలుకు రూ.5వేలు ధర నిర్ణయించి వెంటనే కొనుగోలు చేయాలి. రైతు పండించిన పంటకు సర్టిఫికెట్ తీసుకురావాలని చెప్పడం రైతును అవమానించినట్లే. . ఆర్.చంద్రశేఖర్‌రెడ్డి, రైతు సంఘం జిల్లా ప్రధాన కార్యదర్శి

# ఈ ఏడాది 6.5% వృద్ధిరేటు

### -పనగరియా అంచనా



**న్యూఢిల్లీ, డిసెంబరు3:** ఈ ఆర్థిక సంవత్సరంలో దేశ ఆర్థిక వ్యవస్థ 6.5 శాతానికి పైగా వృద్ధి చెందవచ్చని ప్రముఖ ఆర్థికవేత్త, నీతి ఆయోగ్ మాజీ ఉపాధ్యక్షుడు అరవింద్ పనగరియా అభిప్రాయ పడ్డారు. స్థూల ఆర్థిక సూచీలు గత మూడు సంవత్సరాలుగా నిలకడగా ఉన్నాయని, కరెంటు ఖాతా లోటు 1 శాతం దరిదాపుల్లోనే ఉం దని , ద్రవ్యోల్బణం సైతం అదుపులోనే ఉందని ఆయన అన్నారు. ఈ ఏడాది జూలై 1 నుంచి జిఎస్‌టి అమలుకు సంబంధించి ఆందోళనల కార ణంగా వృద్ధిరేటు తొలి త్రైమాసికంలో 5.7 శాతా నికి తగ్గినప్పటికీ, రాబోయే రోజుల్లో వృద్ధిరేటు పుంజుకునే అవకాశాలే ఎక్కువగానే ఉన్నాయని 2017-18 ఆర్థిక సంవత్సరంలో వృద్ధిరేటు 6.5 శాతానికి లేదా ఇంకా ఎక్కువకే చేరుకునే అవకాశాలు ఉన్నాయని ఆయన ఒక ఇంటర్వ్యూలో చెప్పారు. అంతేకాదు 2018-19 ఆర్థిక సంవత్సరంలో దేశ ఆర్థిక వృద్ధి 8 శాతానికి చేరుకోవచ్చని గోల్డ్‌మన్ శాక్స్ ఇటీవల విడుదల చేసిన నివేదిక వెల్లడించిన విషయాన్ని కూడా పనగరియా గుర్తు చేశారు. కాగా ఆర్థిక వృద్ధిని వేగవంతం చేయడానికి ప్రభుత్వం ద్రవ్యలోటు లక్ష్యాన్ని సడలించే అవకాశం ఉందా అని అడుగగా ఈ దశలో ఆర్థిక స్థిరీకరణ సాధించిన గణనీయమైన పురోగతిని చేజారిపోయేలా ఆర్థిక మంత్రి, ప్రధాన మంత్రి అనుమతిస్తారని వ్యక్తిగతంగా తాను భావించడం లేదని పనగరియా అన్నారు. వచ్చే ఏడాది ఫిబ్రవరిలో సమర్పించే చివరి బడ్జెట్‌లో మోడీ ప్రభుత్వం ప్రజాకర్షక పథకాలకు పెద్దపీట వేస్తుందా అని ప్రశ్నించగా ఏకకాల ప్రోత్సాహకాలు, అలాగే దీర్ఘకాలిక కార్యక్రమాలు లాంటి ప్రజాకర్షక పథకాలు జాతి ప్రయోజనాలను దెబ్బతీస్తాయని ఒకసారి ప్రకటించిన తర్వాత వాటిని ఉపసంహరించుకోవడం రాజకీయంగా విసుగుతో కూడుకొని ఉంటాయని ఆయన అన్నారు. జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకాన్ని 200 వెనుకబడిన జిల్లాల నుంచి అన్ని జిల్లాలకు విస్తరించడం, 2009 పార్లమెంట్ ఎన్నికలకు ముందు ప్రభుత్వ ఉద్యోగులకు వేతనాలు పెంచడం, అలాగే భూసేకరణ చట్టం, ఆహార భద్రతా చట్టం లాంటి ప్రజాకర్షక చట్టాలను ఆమోదించడం లాంటివన్నీ కూడా దీర్ఘకాలంలో ఆర్థిక వ్యవస్థను దెబ్బతీసేవేనని పనగరియా అన్నారు. దీని కన్నా కూడా తమిళనాడులో రాజకీయ పార్టీలు ప్రకటించే ఉచిత తాయిలాలలాంటివి తక్కువ ప్రమాదకరమని ఎందుకంటే అవి ఒకసారి మాత్రమే ప్రకటించేవని ఆయన అన్నారు.

# 2025 నాటికి దేశంలో లక్ష స్టార్టప్‌లు

**జైపూర్, డిసెంబరు3:** రాబోయే ఏడెనిమిదేళ్లలో భారతదేశంలో లక్ష స్టార్టప్ కంపెనీలు ఉంటాయని ఈ కంపెనీలు 3.25 మిలియన్ల మందికి ఉపాధి కల్పిం చడమే కాకుండా విలువ పరంగా 500 బిలియన్ డాలర్ల సంపదను సృష్టిస్తాయని మణిపాల్ గ్లోబల్ ఎడ్యుకేషన్ ఛైర్మన్ టివి మోహన్‌దాస్ పాయ్ ఆదివారం అన్నారు. ఈ స్టార్టప్‌లు భవిష్యత్తులో దేశం ఎదుర్కోబోయే సమస్యలను పరిష్కరిస్తాయని కూడా ఆయన అన్నారు. '2025 నాటికి దేశ వ్యాప్తంగా లక్ష స్టార్టప్‌లు ఉంటాయని నేను భావిస్తున్నాను, అవి 500 బిలియన్ డాలర్ల విలువను, మదుపరులకు బోలెడంత డబ్బును అందిస్తాయి. అంతేకాకుండా 3.25 మిలియన్ల మందికి ఉపాధి కల్పిస్తాయి కూడా' అని ఇక్కడ జరుగుతోన్న రాజస్థాన్ డిజి ఫెస్ట్ సందర్భంగా మీడియాతో మాట్లాడుతూ పాయ్ అన్నారు. ప్రస్తుతం దేశంలో 32 వేల స్టార్టప్‌లు ఉండగా ప్రతిఏటా 7వేల చొప్పున కంపెనీలు వస్తున్నాయి. యువకులు టెక్నాలజీని ఉపయోగించి అత్యంత క్లిష్టమైన సమస్యలను పరిష్కరిస్తున్నారని, యువకులు సృష్టించే నూతన ఆవిష్కరణలు దేశాన్ని మార్చివేస్తాయని తాను భావిస్తున్నానని పాయ్ అన్నారు. ఇప్పటికే దీని ప్రభావం విద్య, వైద్యం, ఈ కామర్స్ లాంటి రంగాలలో చాలా స్పష్టంగా కనపడుతోందని కూడా పాయ్ అన్నారు.

# కీలక వడ్డీరేట్లు యథాతథం

### రేపటి ఆర్‌బిఐ సమావేశంపై నిపుణుల అంచనా




**ముంబయి, డిసెంబరు3:** ఈ నెల 5,6 తేదీల్లో జరగనున్న ద్వైమాసిక ద్రవ్య పరపతి విధానం సమీక్షలో రిజర్వు బ్యాంకు కీలక వడ్డీ రేట్లలో ఎటువంటి మార్పులు చేయకపోవచ్చని నిపుణులు భావిస్తున్నారు. దాదాపు ఐదు త్రైమాసికాల తర్వాత జిడిపి వృద్ధి రేటు సెప్టెంబరు త్రైమాసికంలో తిరిగి పుంజుకున్న నేపథ్యంలో ఆర్‌బిఐ ద్రవ్యోల్బణాన్ని అదుపు చేయడానికే ఎక్కువ దృష్టి పెట్టవచ్చని వారు అంటున్నారు. అయితే అంతర్జాతీయ రేటింగ్ సంస్థ మూడీస్ భారతదేశ సావరిన్ రేటింగ్‌ను పెండం, అలాగే జిడిపి వృద్ధిరేటు తిరిగి పుంజుకున్న నేపథ్యంలో నెలకొన్న సానుకూల సెంటిమెంట్‌ను మరింత బలోపేతం చేయడానికి వడ్డీరేట్లను తగ్గించాలని దేశీయ పరిశ్రమ వర్గాలు డిమాండ్ చేస్తున్నాయి. ఆర్‌బిఐ గవర్నర్ ఉర్జిత్ పటేల్ నేతృత్వంలో ద్రవ్య విధానం కమిటీ ఈ నెల 5,6 తేదీల్లో ద్వైమాసిక ద్రవ్య విధానం సమీక్ష జరపనున్నది. గత అక్టోబరులో జరిపిన సమీక్ష సమావేశంలో ఆర్‌బిఐ కీలక వడ్డీరేట్లలో ఎలాంటి మార్పు చేయకపోవడం తెలిసిందే. వడ్డీరేట్లను తగ్గిస్తే ద్రవ్యోల్బణం పెరిగిపోతుందన్న అనుమానాలు వ్యక్తం చేసిన ఆర్‌బిఐ పరిశ్రమ వర్గాల నుంచి ఎంత ఒత్తిడి వచ్చినప్పటికీ వడ్డీ రేట్లలో ఎలాంటి మార్పులు చేయలేదు. అయితే ఆగస్టులో మాత్రం రెపోరేటును పావు శాతం మేర తగ్గించింది. రాబోయే నెలల్లో ద్రవ్యోల్బణం పెరిగే అవకాశాలు ఉన్నందున రెపోరేటులో ఆర్‌బిఐ ఎలాంటి మార్పులు చేయకపోవచ్చని బ్యాంకింగ్ వర్గాలు సైతం అభిప్రాయపడుతున్నాయి. జిఎస్‌టి రేట్లు తగ్గించడం వల్ల ఉత్పత్తుల ధరలు తగ్గినప్పటికీ ముడి సరుకుల వ్యయం మాత్రం అలాగే ఉందని, దీనికి తోడు ఆహార ద్రవ్యోల్బణం కారణంగా రిటైల్ ద్రవ్యోల్బణం కూడా నవంబరు నెల తర్వాత ఆర్‌బిఐ లక్ష్యంగా పెట్టుకున్న నాలుగు శాతం కన్నా కాస్త ఎక్కువే ఉండవచ్చని అంతర్జాతీయ ఫైనాన్స్ సేవల సంస్థ నోమురా అభిప్రాయపడింది. ఈ నేపథ్యంలో 2018 సంవత్సరంలో కూడా కీలక వడ్డీరేట్లలో ఎలాంటి మార్పులు ఉండకపోచ్చని ఆ సంస్థ ఒక నివేదికలో పేర్కొంది. అయితే ఈజ్ ఆఫ్ డూయింగ్ బిజినెస్ ర్యాంకింగ్‌లో వృద్ధి, భారత సావరిన్ రేటింగ్‌ను మూడీస్ పెంచడం, ప్రభుత్వ రంగ బ్యాంకులకు భారీ ఎత్తున నిధులు సమకూర్చడం లాంటి సానుకూల అంశాల కారణంగా మార్కెట్‌ను సెంటిమెంట్‌కు మరింత ఊతమిచ్చేందుకు ఇదే సరైన అవకాశమని ఫిక్కీ అధ్యక్షుడు పంకజ్ పటేల్ ఒక ప్రకటనలో అభిప్రాయపడ్డారు.

# భారత్‌కు మాల్యా అప్పగింత కేసు విచారణ నేడు ప్రారంభం

**లండన్, డిసెంబరు3:** బ్యాంకులకు భారీ ఎత్తున రుణాల ఎగవేత ఆరోపణలను ఎదుర్కొంటూ ప్రస్తుతం లండన్‌లో తలదాచుకున్న మద్యం వ్యాపారి విజయ్ మాల్యాను భారత్‌కు అప్పగించాలన్న కేసు విచారణ సోమవారం లండన్‌లోని వెస్ట్‌మినిస్టర్స్ కోర్టులో ప్రారంభం కానున్నది. మోసం, మనీ లాండరింగ్ ఆరోపణలపై ఈ ఏడాది ప్రారంభంలో స్కాట్లాండ్ యార్డ్ పోలీసులు మాల్యాను అరెస్టు చేయగా ఆయన బెయిలుపై విడుదలైన సంగతి తెలిసిందే. మాల్యా భారత్‌లో వివిధ బ్యాంకుల నుంచి ప్రస్తుతం మూతపడిన తన కింగ్‌ఫిషర్ ఎయిర్‌లైన్స్ కోసం రూ.9వేల కోట్ల రూపాయలకు పైగా అప్పులు తీసుకున్నా వాటిని చెల్లించలేదు. దీనిపై ఆ బ్యాంకులు ఆయనపై పలు కేసులు నమోదు చేశాయి కూడా.

సోమవారం ప్రారంభమయ్యే విచారణలో మొదట ఇరుపక్షాల వాదనలు విన్న తర్వాత విమానయాన రంగంలో నిపుణుడైన డాక్టర్ బి. హంఫ్రీ సాక్షి రూపంలో ప్రకటనను చేయనున్నారు. ఇంతకు ముందు బ్రిటన్ కోర్టు విజయ్ మాల్యాను భారత్‌కు అప్పగించే కేసు తుది విచారణ తేదీని డిసెంబరు 4గా ఖరారు చేసిన విషయం తెలిసిందే. వచ్చే ఏడాది ప్రారంభంలో ఈ కేసులో తీర్పు వెలువడవచ్చని భావిస్తున్నారు.

# పాన్-ఆధార్ లింక్ గడువు పెంచేందుకు రెడీ




**న్యూఢిల్లీ, డిసెంబరు 3:** ఆధార్ తప్పనిసరి చేయడానికి సుప్రీంకోర్టుగనుక అంగీకరిస్తే పాన్-ఆధార్ అనుసంధానం గడువును పెంచడానికి సిద్ధంగా ఉన్నామని ప్రభుత్వ అధికారులు తెలిపారు.పాన్-ఆధార్ అనుసంధానంకోసం అవసరమైతే మూడునుంచి ఆరు నెలల పాటు అదనపు గడువు ఇచ్చేందుకు సిద్ధంగా ఉన్నట్లు ఓ సీనియర్ అధికారి చెప్పారు. ప్రస్తుతం పాన్-ఆధార్ అనుసంధానానికి ఆదాయం పన్ను శాఖ డిసెంబర్ 30 వరకు గడువు ఇచ్చింది.ఈ గడువు మరికొన్ని రోజుల్లో ముగియనుండడంతో మరోసారి గడువును వచ్చే ఏడాది మార్చి 31 వరకు పొడిగించడానికి సిద్ధంగా ఉన్నట్లు ప్రభుత్వం సంకేతాలు ఇచ్చింది.దేశంలో 35 కోట్ల మంది పాన్‌కార్డులున్న వారుండగా నవంబర్ వరకు 13.28 కోట్ల మంది పాన్ కార్డును ఆధార్‌తో అనుసంధానం చేసుకున్నారు.నకిలీ పాన్ కార్డులను నిరోధించేందుకే ఈ ఆధార్ అనుపంధానాన్ని తీసుకు వచ్చినట్లు అధికారులు తెలిపారు. ఒక వేళ నిర్ణీత గడువు లోగా ఆధార్ అనుసంధానం చేసుకోకపోతే పాన్‌ను రద్దు చేయనున్నారు.నకిలీ పాన్ కార్డులు దేశ ఆర్థిక వ్యవస్థకు చాలా ప్రమాదకరం. వాటితో బ్యాంకు ఖాతాలు తెరిచి లావాదేవీలు జరుపుతున్నారు. దీన్ని నియంత్రించేందుకు ఈ చర్యలు తీసుకొంటున్నాం అని అధికారులు వెల్లడించారు.



ఆదివారం అంతర్జాతీయ వికలాంగుల దినోత్సవం సందర్భంగా న్యూఢిల్లీలో ఓ అంధ బాలికకు సర్టిఫికెట్ బహూకరిస్తున్న రాష్ట్రపతి రామ్‌నాథ్ కోవింద్

# సమాజాన్ని చీల్చడమే కాంగ్రెస్ నైజం

## గుజరాత్ ఎన్నికల సభల్లో మోడీ ధ్వజం



**బరూచ్, డిసెంబరు3:** గుజరాత్ ఎన్నికల ప్రచారంలో భాగంగా ఆదివారం ప్రధాని నరేంద్ర మోడీ కాంగ్రెస్ పార్టీపై తన విమర్శలకు మరింత పదును పెట్టారు. ఆ పార్టీ కులం, మతం ఆధారంగా సమాజాన్ని చీల్చడానికి ప్రయత్నిస్తోందంటూ దుయ్యబట్టారు. అన్నదమ్ముల మధ్య అడ్డుగోడలు సృష్టించడానికి ప్రయత్నిస్తోందంటూ మోడీ విమర్శించారు. ఈ నెల 9న తొలి విడత పోలింగ్ జరగనున్న ప్రాంతంలో బరూచ్, సురే ంద్ర నగర్, రాజ్‌కోట్ జిల్లాల్లో జరిగిన వివిధ సభల్లో ప్రసంగించిన ప్రధాని 'కాంగ్రెస్ పార్టీ ఎలాంటిదో గుజరాత్ ప్రజలకు బాగా తెలుసు. అది రంగులు మార్చే ఊసరవెల్లి లాంటిది. అన్నదమ్ముల మధ్య గోడలు సృష్టిస్తోందంటూ మండిపడ్డారు. అంతేకాదు ఒక కులం వారు మరో కులం వారితోనూ మరో మతం వారు మరో మతం వాళ్లతోనూ పోట్లాడేలాగా చేస్తోంది. కొట్లాటలో మీరు చనిపోయినా దానికి పర్వాలేదు. అది మాత్రం 'మలాయ్' (మీగడ) తింటుంది' అని ప్రధాని అన్నారు.

**బుల్లెట్ రైలు వద్దంటే.. ఎద్దుల బండి ఎక్కండి:** బుల్లెట్ రైలు ప్రాజెక్టు వల్ల సామాన్యులకు ఎలాంటి ప్రయోజనం లేదని కాంగ్రెస్ పార్టీ చేస్తున్న విమర్శలను తిప్పికొట్టారు. గతంలో కాంగ్రెస్ ప్రభుత్వం ఈ ప్రాజెక్టును తీసుకురావడానికి ప్రయత్నించి, విఫలమైందని అందుకు ఇప్పుడు విమర్శలకు దిగుతోందని ఆయన అన్నారు. 'బుల్లెట్ రైలు ప్రాజెక్టును వ్యతిరేకించేవారు కావాలంటే ఎద్దుల బండి మీద ప్రయాణించవచ్చు. మేము ఏమి అనుకోము' అని ప్రధాని అన్నారు. ముంబయి-అహమ్మదాబాద్ హైస్పీడ్ రైలు కారిడార్‌ను జపాన్ ఇంటర్నేషనల్ కో ఆపరేషన్ ఏజెన్సీ ఆర్థిక సహాయంతో నిర్మించనున్నారు. దీనివల్ల గుజరాత్‌లో భారీగా ఉద్యోగవకాశాలు వస్తాయని ప్రధాని అన్నారు. 'ఎంతమందికి ఉద్యోగ అవకాశాలు వస్తాయో ఒక్కసారి ఆలోచించండి. బుల్లెట్ రైలు ప్రాజెక్టు నిర్మాణానికి అవసరమైన ఇంజనీరింగ్ నిపుణులు, కార్మికులు, పరికరాలు ఎక్కడ నుంచి వస్తాయి? మన దేశం నుంచి కాదా? [illegible] అని కాదంటారా'? అని మోడీ ప్రశ్నించారు. 'ఎన్డీయే ప్రభుత్వం అతి తక్కువ ధరకే ఈ ప్రాజెక్టును నిర్మిస్తోంది. అది కాంగ్రెస్‌కు నచ్చడం లేదు. [illegible]' ఆయన విమర్శించారు. గాంధీ కుటుంబం గుజరాత్ అభివృద్ధి కోసం ఏం చేసిందో చెప్పాల్సిందిగా మోడీ ప్రశ్నించారు.

# అణుయుద్ధం కోసం అమెరికా తహతహ

## ఉత్తరకొరియా అధికార పత్రిక రొడాంగ్

**ప్యాంగ్యాంగ్, డిసెంబరు3:** అమెరికా, దక్షిణ కొరియా సంయుక్తంగా సైనిక విన్యాసాలు చేపట్టనుండటంపై ఉత్తర కొరియా తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేసింది. ఇటువంటి రెచ్చగొట్టే చర్యలు చేసి అమెరికా అణు యుద్ధం కోసం అడుక్కొంటోందని మండిపడింది. క్షిపణి ప్రయోగాలు చేయడం ఆపకపోతే యుద్ధానికి దిగవలసి ఉంటుందని వైట్ హౌస్ జాతీయ భద్రతా సలహాదారు హెచ్‌ఆర్. మెక్‌మాస్టర్ ఉత్తర కొరియాకు హెచ్చ రిక చేసిన మరుసటి రోజే ఆ దేశం



ఈ వ్యాఖ్యలు చేయడం గమనార్హం. అమెరికా-దక్షిణ కొరియా సైన్యం సంయుక్త విన్యాసాలపై ఉత్తర కొరియా అధికార పార్టీ పత్రిక రొడాంగ్ ప్రత్యేక కథనాన్ని ప్రచురించింది. 'డెమోక్రటిక్ పీపుల్స్ రిపబ్లిక్ ఆఫ్ కొరియా (డీపీఆర్‌కె)ను రెచ్చగొడితే ఏ క్షణానైనా అణు యుద్ధానికి దిగే అవకాశం ఉంది. డీపీఆర్‌కెను లక్ష్యంగా చేసుకొని అమెరికాఐ దక్షిణ కొరియా వినా ్యసాలు చేపట్టి వారి వినాశనాన్ని వారే కొనితెచ్చుకుంటున్నారు. రెచ్చగొట్టే చర్యలతో ట్రంప్ ప్రభుత్వం అణుయుద్ధం కావాలని అడుక్కొంటోంది' అని ఉత్తర కొరియా తన కథనంలో పేర్కొంది. ఉత్తర కొరియాతో యుద్ధం చేయవలసి వచ్చే పరిస్థితులు రోజురోజుకి ఎక్కువగా కనిపిస్తున్నాయని వైట్‌హౌస్ జాతీయ భద్రతా సలహాదారు మెక్ మాస్టర్ శనివారం వ్యాఖ్యలు చేశారు. దాదాపు రెండు నెలల విరామం తర్వాత ఉత్తర కొరియా బుధ వారం హాస్వంగ్-15 క్షిపణిని ప్రయోగించిన విషయం తెలిసిందే. ఈ క్షిపణి ప్రయోగాన్ని అమెరికా అధ్య క్షుడు డొనాల్డ్ ట్రంప్‌తో పాటు దక్షిణ కొరియా, జపాన్, రష్యా దేశాలు తీవ్రంగా ఖండించాయి. ఇది ఇలాఉండగా ఉత్తరకొరియాపై మరిన్ని ఆంక్షలు విధించాలని అమెరికా ఇతర దేశాల సహకారం కోరు తుండగా, దీనిపై ఆగ్రహించిన ఉత్తరకొరియా క్షిపణిని ప్రయోగించిన సంగతి తెలిసిందే.

# గుజరాత్‌లో మహిళాభ్యుదయం శూన్యం..

# ఎందుకో చెప్పండి మోడీజీ?



ఐదవ ప్రశ్న సంధించిన రాహుల్

అక్రమ రవాణ, యాసిడ్ దాడి, మాన భంగంలలోనే ముందంజ

గుజరాత్‌లో మహిళా భద్రత ఎండమావి

**న్యూఢిల్లీ,డిసెబరు3,ప్రభాతవార్త:** గుజరాత్ అసెంబ్లీ ఎన్నికల ప్రచారంలో విమర్శ, ప్రతివిమర్శల పర్వంతో జోరుగా సాగుతోంది. డిసెంబరు 9న మొదటిదశ పోలింగ్ జరగనున్న గుజరాత్‌లో అన్ని రాజకీయ పక్షాలు ప్రచారాన్న హోరెత్తిస్తున్నాయి. రోజుకో ప్రశ్నతో కేంద్ర ప్రభుత్వాన్ని, బిజెపిని, మోడీని నిలదీస్తున్న కాంగ్రెస్ ఉపాద క్షుడు రాహుల్‌గాంధీ ఆదివారం ఐదవ ప్రశ్నను సంధించారు. గుజరాత్ రాష్ట్రంలో మహిళలకు భద్రత లేదు, నిరక్షరాస్యత శాతం ఎక్కువ, పౌష్టికాహారం లోపం ఎక్కువ.. ఇలా ఎందుకో చెప్పగలరా మోడీజీ? అని టిట ్వర్‌లో ప్రశ్నించారు. 2001-11 మధ్యకాలంలో గుజరాత్ మహిళల అక్రమ రవాణాలో 3వస్థానం, యాసిడ్ దాడులలో 5వ స్థానం,మానభంగంలో 10 స్థానం,బాలికలల విద్యలో 20 స్థానంలో నిలిచిందని.. ఇలా ఎందుకో ప్రజలకు చెప్పాలని మోడీని ప్రశ్నించారు. గత దశాబ్దకాలంలో మహిళల అక్షరాస్యత శాతం 70.3 నుండి 57.8 శాతానికి పడిపోయిందని, ప్రసవ మరణాలు గణనీయంగా 85శాతం మేరకు పెరిగాయని ఆరోపించారు. గుజరాత్‌ను వ్యాపార కూడలిగా మార్చాలన్న తపన తప్ప ప్రజల బాగోగులు పట్టించుకొనే నాథుడే లేడని రాహుల్ వివర్శించారు. అంగన్‌వాడి,ఆశా వర ్కర్లు .. ఇలా ఎవరిని ఏదడిగినా తమ దయనీయమైన స్థితిని చెబుతున్నారని అన్నారు. రాష్ట్రంలో మహిళలు,రైతులు,ఉద్యోగులు,విద్యార్థులు.. ఇలా అన్ని వర్గాల ప్రజలను ప్రజాసా ్వమ్య పద్ధతిలో సమానంగా చూస్తూ కాంగ్రెస్ సుపరిపాలనను ప్రజలకు అందిస్తుందన్నారు. ఇప్పటికే కేంద్ర మైనారిటీ శాఖ మంత్రి రాహుల్ ట్విట్టర్ ప్రశ్నలకు స్పందిస్తూ.. బైంగన్(వంకాయ)కి బర్గర్‌కి, ఉల్లిపాయకు పిజ్జాకు, కేక్‌కు బనానాకు.. తేడా తెలీని వాళ్ల ప్రశ్నలు ఇలాగే ఉంటాయని ఘాటుగా విమరి ్శంచారు. దానిక కాంగ్రెస్ అధికార ప్రతినిధి సుస్మితాదేవ్ ప్రతిస్పందిస్తూ... రాహుల్ రోజుకో ప్రశ్న వేస్తున్నా బిజెపి నుండి ఉన్నత స్థాయి నాయకులు స్పందించటంలేదని దీన్ని బట్టి వారి తీరేమిటో ప్రజలకు అర్థమవుతోందని అన్నారు. దశాబ్దాలకాలంగా సమాధానాలు లేని విధంగా గుజరాత్‌లో పాలన ఉందని..ఈ ఎన్నికలలో బిజెపికి ఓటమి తప్పదని అన్నారు.

# ఉగ్రవాదంపై పాక్ పోరాడటం లేదు

## అమెరికా అసంతృప్తి



**వాషింగ్టన్, డిసెంబరు3:** ఉగ్రవాదంపై పోరాడటంలో పాకిస్థాన్ నిర్లక్ష్యంగా వ్యవహరిస్తోందని అమెరికా అసంతృప్తిని వ్యక్తం చేసింది. తాలిబన్లు, అఫ్ఘనిస్థాన్‌లో ఉగ్రవాదాన్ని పెంచుతున్న హక్కానీ నెట్‌వర్క్‌ను నాశనం చేసేందుకు పాక్ చెప్పుకోదగ్గ చర్యలేవీ తీసుకోవడం లేదని వైట్‌హౌస్ సీనియర్ అధికారి ఒకరు తెలిపారు. ఉగ్రవాదులపై పోరాడటంలో పాక్ వైఖరి పట్ల అమెరికా అసంతృప్తిగా ఉందని ఆయన అన్నారు. ముంబయి పేలుళ్ల సూత్రధారి, జమాత్ ఉద్ దవా (జేయూడీ) హాఫీజ్ సయీద్‌ను విడుదల చేయడాన్ని అమెరికా వ్యతిరేకిస్తున్నట్లు తెలిపారు. సయీద్ విడుదలను ఆపకుండా పాక్ ప్రభుత్వం వెనుకడుగు వేసిందన్నారు. 'ఐదేళ్ల పాటు హక్కానీ ఉగ్రవాదుల చెరలో ఉన్న కెనడియన్-అమెరికన్ దంపతులను రక్షించేందుకు పాక్ సహకరించింది. వాళ్లు సురక్షితంగా విడుదల కావడం చాలా ఆనందంగా ఉంది. కానీ ఈ ఘటన ద్వారా ఉగ్రవాదులకు పాక్ వ్యతిరేకమని కచ్చితంగా చెప్పలేను. తాలిబన్, హక్కానీ నెట్‌వర్క్‌పై పాక్ తగిన చర్యలు తీసుకుంటుందని ఇప్పటికీ ఎదురుచూస్తున్నాం. కానీ పాక్ తీరు సంతృప్తికరంగాలేదు. ఆ దేశ వైఖరిలో ఎటువంటి మార్పులు రాలేదు. మార్పు రావడానికి కొంత సమయం పడుతుంది. అందుకోసం మేము ఎదురుచూస్తునే ఉన్నాం. పాక్ చర్యలను చాలా దగ్గరగా పరిశీలిస్తున్నాం. మరికొంతకాలం వేచిచూస్తాం. అయినప్పటికీ ఎటువంటి మార్పు రాకపోతే పాక్‌పై తగిన చర్యలు తీసుకోవాల్సి వస్తుంది. ఆ దేశంపై సరికొత్త విధానాలను అమలు చేయాల్సి వస్తుంది' అని వైట్‌హౌస్ అధికారి హెచ్చరించారు. అలాగే ఆగస్టులో అమెరికా అధ్యక్షుడు డొనాల్డ్ ట్రంప్ ప్రకటించిన దక్షిణాసియా వ్యూహంలో భాగంగా పాకిస్థాన్ సహకరిస్తున్నట్లు తాను చెప్పలేనన్నారు.

# ప్రమాదకరంగా ఓక్కీ తఫాను

**పనాజీ(గోవా),డిసెంబరు3,ప్రభాతవార్త:** తమిళనాడు, కేరళ,లక్ష్యద్వీప్‌లలో భాయానక వాతావరణాన్ని సృష్టిస్తున్న ఓక్కీ తఫాను చిన్న రాష్ట్రమైన గోవాలో వ్యాపారాలను తీవ్రంగా దెబ్బతీస్తోంది.పర్యాటక రాష్ట్రంగా పేరొందిన గోవా ఈ తుఫాను ధటికి హోటళ్లు ఖాళీ అవుతున్నాయి. ఇప్పటికే ఈ తుఫాను ధాటికి మృతుల సంఖ్య ఒక్క కేరళలోనే 19కు పెరిగింది.500 కోట్ల మేరకు ఆస్థి నష్టం వాటిల్లినట్లు సమాచారం. మృతులు, ఆస్థినష్టం మరింత పెరగవచ్చని సమాచారం. ఆదివారం నాటికి తీర ప్రాంతం రాష్ట్రాలకు చెందిని ఏడు వందలమందికి పైగా జాలర్లను నౌకాదళ సిబ్బంది రక్షించారు.మరో వందమంది సముద్రంలో చిక్కుకొని ఉండవచ్చని భావిస్తున్నారు. కడపటి వార్తలు అందేనాటికి ఓకీ ్చ అరేబియా సముద్రానికి తూర్పుదిశగా దక్షిణాన ఆగ్నేయంలో కేంద్రీకృతమై ఉనందని సమాచారం. రాబోయే 24గంటలలో ఉత్తర-వాయువ్య దిశగా ప్రయాణించే అవకాశముందని భారత వాతావరణ శాఖ పేర్కొంది. దీ నవ ప్రభావంల వల్ల గంటకు 12కిలోమీటర్ల వేగంతో ఈదురు గాలులు వీస్తాయని, ముంబాయికి 1070 కిలోమీటర్ల దూరంలో ప్రయాణించి రాబోయే 72 గంటలలో గుజరాత్‌వద్ద తీరం దాటే అవకాశం ఉందని తెలిపింది. కేరళలో ఇప్పటివరకూ 74 ఇళ్లు ధ్వంసమయ్యాయి. 6581 మందిని సురక్షిత ప్రాంతాలకు తరలించారు. రాబోయే 48 గంటలలో తమిళనాడు,కేరళా తీరప్రాంతాలలో భారీ వర్ష సూచన ఉందని వాతావరణశాఖ తెలిపింది. నేవీ, సైనిక దళాలు అప్రమత్తంగా పహారా కాస్తున్నాయని అధికారులు తెలిపారు.

**మరోవాయుగుండం :** దక్షిణ అండమాన్ తీర ప్రాంతంలో మరో వాయుగుండం ఏర్పడింది. ఇది రబోయే 48 గంటలలో మరింత బలపడి తుఫానుగా మారే అవకాశముందని వాతావరణ శాఖ అధికారులు తెలిపారు.

కేరళలో 19కి పెరిగిన మృతుల సంఖ్య

700 జాలర్లను రక్షించిన నౌకాదళం

72గంటలలో గుజరాత్‌లో తీరం దాటే అవకాశం

# దక్షిణ కొరియాలో పడవ బోల్తా

## 13 మంది మృతి, ఇద్దరు గల్లంతు



గల్లంతయిన వారి కోసం గాలింపు జరుపుతున్న కోస్ట్‌గార్డ్ సిబ్బంది

**సియోల్, డిసెంబరు3:** దక్షిణ కొరియాలో ఆదివారం ఓ పడవ ప్రమాదం చోటుచేసుకుంది. ఈ ప్రమాదంలో 13 మంది మృతి చెందగా, మరో ఇద్దరు గల్లంతయ్యారు. సియోన్‌చాంగ్-1 అనే పడవ 20 మంది ప్రయాణికులు, ఇద్దరు నావికులతో కలిసి సముద్రయాన పర్యటన కోసం ఇంచియాన్ పోర్టు నుంచి బయలుదేరిన పడవ కొన్ని నిమిషాల వ్యవధిలోనే 336 టన్నుల బరువైన పెట్రోలియం ట్యాంకర్‌ను ఉదయం ఆరు గంటల ప్రాంతంలో ఢీకొట్ిటంది. దీనితో ప్రమాదం చోటు చేసుకంది. 13 మంది మృతి చెందగా, ఏడుగురు వ్యక్తులు ఆసుపత్రిలో చికిత్స పొందుతున్నారని అధికారి ఒకరు తెలిపారు. బోట్ కెప్టెన్‌తో పాటు మరో వ్యక్తి గల్లంతైనట్లు కోస్ట్‌గార్డ్ అధికారులు తెలిపారు. గల్లంతయినవారి కోసం ఐదు విమానాలతో గాలింపు చర్యలు కొనసాగుతున్నాయని కూడా వారు తెలిపారు. అయితే పడవలో ప్రయాణిస్తున్న వారు లైఫ్‌జాకెట్లు ధరించినప్పటకీ శరీర ఉష్ణోగ్రతలు పడిపోవడం మూలంగా చనిపోయారని అధికారులు వెల్లడించారు. 2014లో ఒక ఫెర్రి ప్రమాదం చోటుచేసుకోగా ఇందులో 300 మందికి పైగా తమ ప్రాణాలు కోల్పోయారు. వీరిలో చాలా మంది చిన్నపిల్లలే కావడం విశేషం. 2015లో కూడా ఇటువంటి ఘటనే ఒకటి జరిగింది. ఇందులో 15 మంది ప్రాణాలు కోల్పోయారు. మళ్లీ మూడేళ్ల తర్వాత ఈ సంవత్సరం ఈ ప్రమాదం చోటుచేసుకుంది.

# ప్రభుత్వంపై సర్జికల్ దాడులు చేయండి



హామీలు నెరవేర్చనప్పుడు రైతుకు అడిగే హక్కు ఉంది

రైతులకు హితవు చెప్పిన యశ్వంత్ సిన్హా

కనీస మద్దతు ధర పెంచాల్సిదే

**అకోలా(మహారాష్ట్ర),డిసెంబరు3,ప్రభాతవార్త:** అదును దొరికితే మోడీపై విమర్శలను సంధించే కేంద్ర మాజీ ఆర్థికమంత్రి యశ్వంత్ సిన్హా తాజాగా ఆదివారం మహారాష్ట్రలోని అకోలాలో రైతు సదస ్సలో సొంత పార్టీపై విమర్శలు చేసారు. ప్రజల అభీష్టాన్ని నెరవేర్చలేదని అనిపించినపుడు రైతులు బిజెపిపై సర్జి ్కల్ దాడులు చేయవచ్చని వ్యాఖ్యానించారు. పత్తి,సోయాబీన్,వరి రైతులు సంయుక్తంగా నిర్వహించిన ర్యాలీలో పాల్గొని ప్రసంగించారు. కనీసమద్దత్తు ధరను పెంచుతామని వాగ్దానంచేసి అధికారంలోకి వచ్చిన బిజెపి ఆ మాటనే మరి ్చపోయిందని స్వంత పార్టీనే విమర్శించారు. 2014లో గుజరాత్‌లో చాయ్ పే చర్చ (టీమీద చర్చ).. జరిగిందని రైతు సంక్షేమాన్ని విస్మరించింది అని భావించే రైతులు మోడీ సర్కారుపై ఓటు హక్కుతో సర్జికల్‌దాడికి దిగవచ్చని అన్నారు.గుజరాత్ ఎన్నికల కోసం పార్లమెంటు సమావేశాలను వాయిదా వేయటం తగదన్నారు.వ్యవసాయోత్పత్తుల ధరలు ఇటీవల పడిపోవటానికి నోట్లరద్దు ప్రత్యక్ష కారణమని సొంత పార్టీని విమర్శిచారు. భారీసంఖ్యలో రైతులు పాల్గొటారని ఆశించిన సదస్సు నిర్వాకులు వందల సంఖ్యలో రైతులు హాజరవటంతో సభపై అసంతృప్తిని వ్యక్తంచేసారు. ఎకరాకి 50వేలు కనీస మద్దత్తు ధరను ప్రకటించాలని కేంద్ర ప్రభుత్వాన్ని డిమాండ్‌చేసారు. రైతుల ఆరోగ్యాన్ని దృష్టిలో ఉంచుకొని కృషి సంజీవినీ పథకాన్ని తక్షణం అమలుచేయాలని డిమాండ్ చేశారు.

# ఎన్నికల్లో పోటీ చేయనున్న హాఫీజ్

## 2018 సాధారణ ఎన్నికలే లక్ష్యం!



**ఇస్లామాబాద్,డిసెంబరు3:** అంతర్జాతీయ ఉగ్రవాది, 2008 ముంబయి పేలుళ్ల సూత్రధారి హాఫీజ్ సయీద్ పాకిస్థాన్ ఎన్నికల్లో పోటీ చేయనున్నారు. నవంబరు 24న గృహ నిర్బంధం నుంచి విడుదలైన సంగతి తెలిసిందే. శనివారం తాను 2018 సాధారణ ఎన్నికల్లో పోటీ చేయనున్నట్లు హాఫీజ్ వెల్లడించారు. మిలి ముస్లిం లీగ్ (ఎంఎంఎల్) పార్టీ తరపున తాను పోటీ చేయనున్నట్లు ప్రకటించారు. అయితే ఏ నియోజకవర్గం నుంచి అన్నది మాత్రం వెల్ల డించలేదు. ఆగస్టులో జమాత్ ఉద్ దవా (జేయూడీ) ఎంఎంఎల్ పార్టీని స్థాపించి సైఫుల్లా ఖలీద్‌ని పార్టీ అధ్యక్షుడిగా ప్రకటించింది. అయితే పాకిస్థాన్ ఎన్నికల సంఘం దానిని అధికారికంగా గుర్తించలేదు. ఎన్నికల సంఘం పార్టీని గుర్తించక పోయినా ఎంఎంఎల్ పార్టీ అభ్యర్థిగానే ఎన్నికల్లో పోటీ చేసా ్తనని హాఫీజ్ చెప్పారు. పాకిస్థాన్‌ను ఎంఎంఎల్ నిజమైన ఇస్లామిక్ దేశంగా మారుస్తుందని అప్పట్లో ఖలీద్ ప్రకటించారు. ఉగ్రవాద వ్యతిరేక చట్టం కింద జనవరి 31న హాఫీజ్‌ని పాకిస్థాన్ గృహ నిర్బంధం చేసింది. ఆ తర్వాత ఇటీవల కోర్టు ఆదేశంతో విడుదల చేసింది. హాఫీజ్ విడుదల అవడంపై అమెరికా తీవ్ర ఆందోళన వ్యక్తం చేసింది. అతడు చేసిన నేరాలను పరిగణలోకి తీసుకొని మళ్లీ అరెస్టుచేయాలని పాక్‌కు సూచించింది. అలాగే ఫ్రాన్స్ కూడా సయీద్ విడుదలపై తన ఆందోళనను పాక్‌కు వ్యక్తం చేసింది. ఇది ఇలా ఉండగా తనపై ఉన్న అంతర్జాతీయ ఉగ్రవాది అన్న ముద్రను తొలగించాలని హాఫీజ్ ఐక్యరాజ్య సమితిని గత వారం ఆశ్రయించాడు.

# రైల్వేశాఖ పిలుపునకు అనూహ్య స్పందన

## రాయితీని వదులుకున్న 9 లక్షల మంది వృద్ధులు



**న్యూఢిల్లీ, డిసెంబరు3:** వృద్ధులకు కల్పిస్తున్న రాయితీలను వదులుకోవాలంటూ రైల్వేశాఖ ఇచ్చిన పిలుపునకు అనూహ్యస్పందన లభించింది. ఏడాది వ్యవధిలో 9,39,000 మంది వృద్ధులు తమ సబ్సిడీలను వదులుకున్నట్లు రైల్వేశాఖ తెలిపింది. 2016 జూలై 22 నుంచి ఈ ఏడాది అక్టోబరు 22 వరకు వృద్ధులు రాయితీలు వదులుకోవడం వల్ల రైల్వేశాఖకు రూ.40 కోట్లు ఆదా అయిందని ఆ శాఖ పేర్కొంది. అంతకు ముందు సంవత్సరం ఇదే కాలంలో కేవలం 4,63,000 మంది వృద్ధులు మాత్రమే తమ సబ్సిడీలను స్వచ్ఛంగా వదులుకున్నట్లు వెల్లడించింది. రైల్వే శాఖ ప్రయాణికుల నుంచి తనకు అయ్యే వ్యయంలో కేవలం 57శాతం మాత్రమే వసూలు చేస్తోందని ఆ వర్గాలు వెల్లడించాయి. 60 ఏళ్లకు పైబడిన వారికి కల్పిస్తున్న వివిధ రకాల రాయితీల వల్ల రైల్వే శాఖపై ఏటా రూ.1300 కోట్ల భారం పడుతుండగా వీటిని తగ్గించుకునేందుకు రాయితీలను స్వచ్ఛంగా వదులుకునేందుకు ముందుకు రావాలని రైల్వే శాఖ గతంలో పిలుపునిచ్చింది.



# శ్రీనగర్ పోలీసుస్టేషన్‌పై గ్రైనేడ్ దాడి

**శ్రీనగర్,డిసెంబరు3,ప్రభాతవార్త:** ఉత్తరకాశ్మీర్‌లోని హన్ద్వారా ప్రాంతంలోని ఓ పోలీసు స్టేషన్‌పై ఉగ్రవాదులు గ్రైనేడ్లతో దాడిచేసారు. ఈ దాడిలో పోలీసులు ఎవ్వరూ గాయపడలేదని, ఎలాంటి నష్టం వాటిల్లలేదని పోలీసులు తెలిపారు. ఏ ఉగ్రవాది గ్రూప్ ఈ దాడికి పాల్పడినది తెలియరాలేదు. పోలీసులు, ఆర్మీ జవాన్లు పరిసర ప్రాంతాలలో విస్తృతంగా తనిఖీలు గాలింపు చర్యలను చేపట్టారు.

# సమస్యల వలయంలో ఏపి సచివాలయం

## మొరాయిస్తున్న లిఫ్టులు, చినుకు పడితే చిత్తడే, అకారణంగా మోగుతున్న అలారం

**హైదరాబాద్, డిసెంబర్ 3, ప్రభాతవార్త:** కోట్ల రూపాయలు ఖర్చు చేసి నిర్మించిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర తాత్కాలిక సచివాలయం తరచూ వార్తల్లోకి ఎక్కుతోంది. రాష్ట్ర సచివాలయం సమస్యలను నిలయంగా తయారవుతోంది. సచివాలయంలో పనిచేయాలంటే ఉద్యోగులు అమ్మో అనే పరిస్థితి ఏర్పడింది. పనిచేయని లిఫ్టులు, అకారణంగా తరచూ మోగుతున్న అలారాలు, చినుకు పడితే చాలు పలు బ్లాక్‌లో నీరు వంటివాటితో సచివాలయ ఉద్యోగులు పలు ఇబ్బందులకు గురవుతుండడం సర్వత్రా చర్చనీయాంశమైంది. అంతేకాకుండా ఏదైనా ప్రమాదం జరిగితే ఉద్యోగులు బయటకు వెళ్లేందుకు సరైన మార్గాలు లేవని ఆందోళన చెందుతున్నారు. తక్కువ వ్యవధిలోనే సచివాలయాన్ని కట్టేశామని, అత్యాధునిక హంగులు పొందుపరిచామని చెబుతున్న ప్రభుత్వ పెద్దలు భద్రత, సమస్యల విషయంలో పట్టించుకున్న దాఖలాలు కనిపించడం లేదనే విమర్శలు వెల్లువెత్తుతు న్నాయి. సచివాలయ నిర్మాణంలో ఆధునిక టెక్నాలజీని ఉపయోగించామని చెబుతున్నా తరచూ భద్రతా లోపాలు తలెత్తడంతో అభద్రతా భావంతో పనిచేయాల్సి వస్తోందనే అభిప్రాయం పలువురు ఉద్యోగుల్లో వ్యక్తమవుతోంది. సచివాలయంలో ముఖ్యమైన భద్రత విషయమై ఏర్పాటు చేసిన ఎమెర్జెన్సీ అలారమ్ సిస్టం సరిగా పనిచేయకపోవడంతో వాటి పనితీరు ప్రశ్నార్థకంగా తయరైంది. మరోపక్క సచివాలయంలో వర్షం వస్తే నీరు లీకు అవుతున్నట్లు పలువురు వెల్లడిస్తున్నారు.

హైదరాబాద్ నుండి పరిపాలనను అమరావతికి తరలించాలనే ఉద్దేశ్యంతో సచివాలయాన్ని హడావిడీగా నిర్మింపచేశారు. నిర్మాణ సమయంలో ఆధునిక టెక్నాలజీని ఉపయోగించామని పదే పదే ప్రభుత్వం చెబుతున్నా వాస్తవ పరిస్థితులు అందుకు భిన్నంగా ఉన్నాయని ఉద్యోగ వర్గాలు అంటున్నాయి. ముఖ్యమంత్రితోపాటు, రెండు వేల మంది ఉద్యోగులు, 40 యంది ఐఏఎస్ అధికారులు, 25 మంది మంత్రులు పరిపాలన సాగించే సచివాలయంలో తరచూ సమస్యలు రావడంతో భవనాల నాణ్యత, భద్రత విషయంలో అనుమానాలు తలెత్తుతున్నాయి. నిర్మాణంలో నాసిరకం టెక్నాలజీని వినియోగించారనే ఆరోపణలు కూడా చోటు చేసుకుంటున్నాయి. సేఫ్టీ, ఎమర్జెన్సీ అలారమ్ సిస్టమ్‌లో తరచూ సాంకేతిక సమస్యలు తలెత్తుతుండడంతో అలారం అనవసరంగా మోగుతుండడంతో ఉద్యోగులు కలవరపాటుకు గురవుతున్నారు. ఉద్యోగులు విధి నిర్వహణలో నిమగ్నమై ఉన్న సమయంలో ఒక్కసారిగా ఎమర్జెన్సీ అలారమ్ మోగడంతో ఏ ఉపద్రవం వచ్చిందోనన్న భయంతో వారంతా తమ తమ గదుల నుండి బయటకు పరుగులు పెట్టాల్సిన దుస్థితి ఏర్పడుతోంది. ఈవిధంగా ఏడాది కాలంలో పలుమార్లు ఎమర్జెన్సీ అలారమ్ మోగడంతో ఉద్యోగులు బయటకు పరుగులు తీయడం, తర్వాత అది సాంకేతిక లోపంతో మోగినట్లు గుర్తించడం సర్వసాధరణమైపోయింది. అలారమ్ మోగిన ప్రతీసారీ ఉద్యోగులు తమ బ్లాక్‌లను వదలి బయటకు పరుగులెత్తడం, తనిఖీలు చేసిన తదుపరి ఎటువంటి ప్రమాదం వాటిల్ల లేదని, కేవలం సాంకేతిక సమస్యలతో అనవసరంగా మోగుతున్నట్లు బయటపడడంతో ఉద్యోగులందరూ ఊపిరి పీల్చుకోవడం అలవాటైపోయింది. అయితే నిజంగా ఏదైనా ప్రమాదం వాటిల్లి ఎమర్జెన్సీ అలారమ్ మోగితే అప్పుడు పరిస్థితి ఏమిటనేది ఆందోళనకరంగా తయారైంది. నిజంగా ఏదైనా ప్రమాదం సంభవించి ఎమర్జెన్సీ అలారమ్ మోగినా సాంకేతిక సమస్యతోనే మోగిందని ఉద్యోగులు భావించి తమ తమ బ్లాక్టుల్లోనే ఉంటే పరిస్థితి ఏవిధంగా ఉంటుందోనన్నది ఉద్యోగవర్గాల్లో చర్చ జరుగుతోంది. అలాగే తరచూ లిఫ్టులు పనిచేయకపోవడంతో ఉద్యోగులకు మెట్ల దారే గతవుతున్నాయి. అంతేకాకుండా సచివాలయంలో ప్రతీ బ్లాక్‌ను అనుసంధానం చేస్తూ నిర్మించిన రెండు మార్గాలు భద్రతా కారణాలతో పోలీసులు వాటిని మూసివేశారు. దీంతో అలారమ్ ఎమర్జెన్సీ అలారమ్ మోగినప్పుడు ఉద్యోగులంతా ఒకే మార్గం నుంచి బయటకు ఒక్కసారిగా తోసుకు రావడంతో ఆ సమయాల్లో తొక్కిసలాట జరుగుతున్నట్లు చెబుతున్నారు. నాన్నా పులి అన్న కథలా తయారై ప్రమాదం ముంచుకొస్తుందనే భయాందోళనలు సైతం వ్యక్తమవుతున్నాయి. రాజధాని అమరావతి శాశ్వత నిర్మాణాలు పూర్తయ్యేంత వరకూ రాష్ట్ర ప్రజలకు పరిపాలనా పరమైన సేవలందించేందుకు వీలుగా తాత్కాలిక సచివాలయాన్ని నిర్మించారు. ఈ సచివాలయం ఆరు నెలల్లో పూర్తి చేశారు. తాత్కాలిక సచివాలయం నుండి పాలన ప్రారంభించిన కొత్తలోనే వర్షాల కారణంగా ప్రముఖుల ఛాంబర్‌లోకి నీళ్లు రావడం అప్పట్లో వివా దాస్పదమైంది. మంత్రులు దేవినేని ఉమా మహేశ్వరావు, గంటా శ్రీనివాసరావు ఛాంబర్‌లోకి నీరు చేరడంతో నాణ్యతపై విమర్శలు వెల్లువెత్తాయి. నాల్గవ బ్లాక్‌లోని రెవెన్యూ, స్టాంప్స్ అండ్ రిజిస్ట్రేషన్స్ ఛాంబర్లలో ఏకంగా సీలింగ్ కింద పడిపోయింది. అదేవిధంగా జల వనరుల కార్యాలయంలో కూడా వర్షపు నీరు చేరింది. ఇక్కడ కూడా సీలింగ్ రూఫ్ ప్లేట్లు ఊడి పోయాయి. వర్షపు నీటిని సిబ్బందితో ఎత్తిపోయించారు. వీటిపై పెద్ద ఎత్తున విమర్శలు రావడంతో ప్రభుత్వం వాటిని సరిచేయించింది. అయినా ఇప్పటికీ తరచూ సమస్యలు తలెత్తుతుండడంతో అభద్రతాభావంతో పనిచేయాల్సి వస్తోందని పలువురు ఉద్యోగులు ఆందోళన చెందుతున్నారు.



ఆదివారం హైరాబాద్‌లోని ఎన్టీఆర్ స్టేడియంలో అయ్యప్ప స్వామి మహాపడి పూజా దృశ్యం

# ఘనంగా అయ్యప్ప స్వామి మహావైభవ పడిపూజ

**హైదరాబాద్(కవాడిగూడ), డిసెంబరు 3 ప్రభాతవార్త:** అయ్యప్ప దివ్యక్షేత్రం శబరిమల మన కళ్లెదుటే ప్రత్యక్షమయ్యింది. లక్షలాది మంది అయ్యప్ప భక్తుల శరణుఘోషలతో ఎన్టీఆర్ స్టేడియం మార్మోగిపోయింది. 108 పడులతో నభూతో న భవిష్యత్‌గా జ్యోతి స్వరూపుడు అయ్యప్పస్వామి మహావైభవ పడిపూజతో భాగ్యనగరంలో అద్భుతఘట్టం ఆవిష్కృతమయ్యింది. గిన్నిస్ రికార్డు, లింకాబుక్‌ఆఫ్ రికార్డు, ఇండియన్ బుక్‌ఆఫ్ రికారుతో పాటు మొత్తం 12 రికార్డులను అయ్యప్పస్వామి మహా వైభవ పడిపూజ సొంతం చేసుకొని ఆధ్యాత్మిక చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగ్గ సరికొత్త అధ్యాయానికి శ్రీకారం చుట్టింది.

శబరిమల అయ్యప్ప సేవా సమాజం తెలంగాణ రాష్ట్ర విభాగం ఆధ్వర్యంలో నగరంలోని ఎన్టీఆర్ స్టేడియంలో ఆదివారం సాయంత్రం అయ్యప్ప స్వామి మహావైభవ పడిపూజ మహాగణపతి పూజతో ప్రారంభమై కన్నుల పండువగా సాగింది. అనంతరం సుబ్రహ్మణ్యస్వామి పూజ, అయ్యప్ప స్వామి సహస్ర నామావళి పూజలు స్వాములను భక్తిపారవశ్యంలో ముంచెత్తాయి. శరణుఘోష, భజన కార్యక్రమాలు అందరినీ భక్తిపారవశ్యంలో ఓలలాడించాయి. తర్వాత పడిపూజ, మంత్రపుష్పం, అయ్యప్ప పంచరత్నమాల, హరివాసనంతో కార్యక్రమం ఘనంగా ముగిసింది.

ఈ కార్యక్రమంలో కాకినాడ శ్రీపీఠం అధిపతి పరిపూర్ణానంద స్వామి ముఖ్య అతిథిగా పాల్గొని అనుగ్రహభాషణం చేశారు. అయ్యప్పదీక్ష చాలాగొప్పదని, కుల, మత, ప్రాంత, వర్ణ, వర్గాలకు అతీతంగా ప్రతి ఒక్కరూ మాలవేసుకుంటారన్నారు. మాలవేసుకున్న వ్యక్తిలోనే అయ్యప్ప కొలువై ఉంటాడని, మాలదారణ చేసిన వ్యక్తిలోనే అయ్యప్పను దర్శించుకొనే శక్తి ఉందన్నారు. అయ్యప్ప దీక్ష గొప్ప సంస్కారాన్ని ప్రసాదిస్తుందన్నారు. హిందూ దేవాలయాల్లో పూర్వికులు పెట్టిన ఆచారాలను ఇతర మతస్తులు ప్రశ్నిస్తే హిందూ సమాజం ఊరుకోదన్నారు. ఇతర మతస్తులు వారి మతాల్లోని లోపాలను ముందు సరిదిద్దుకోవాలని, మాదేవాలయాల జోలికి వచ్చి మాట్లిడితే తేడా వస్తుందని చెప్పారు. అయ్యప్ప విషయంలో కోర్టులు చెప్పినా వినేదిలేదన్నారు. హిందువుల పండుగలపై ఆంక్షలు విధించడం ఏ ప్రభుత్వానికి తగదన్నారు. కేరళ, కర్నాటక, తమిళనాడు, ఆంధ్ర తదితర ప్రాంతాల నుంచి స్వాములందరిని ఒక్క వేదికపైకిత ఈసుకువచ్చి శబరిమల అయ్యప్ప సేవాసమాజం తెలంగాణ విభాగం చరిత్ర సృష్టించిందన్నారు. మనదేశంలో మనం దీక్ష చేపడితే ఆంక్షలా, మక్కాకు, జెరూసెలేంకు వెళ్ళే వారికి రాయితీలు కల్పించే ఇరు రాష్ట్రాల ప్రభుత్వాలు అయ్యప్ప దీక్ష చేపట్టి శబరిమలైకి వెళ్ళే వారికి ఏమి రాయితీలు కల్పిస్తున్నాయని ప్రశ్నించారు. ఇరురాష్ట్రాల నుంచి శబరిమలకు వెళ్ళి ఒక్కి తుఫానులో చిక్కుకున్న స్వాములకోసం ప్రభుత్వాలు ఏమిచేశాయో చెప్పాలని నిలదీశారు. ప్రభుత్వాలు చిత్తశుద్దితో ఆలోచించి ఇప్పటికైనా అక్కడ చిక్కుకున్న వారిని సురక్షితంగా తీసుకువచ్చే ప్రయత్నం చేయాలని సూచించారు. ప్రతి హిందువు మరో హిందువుకు బంధువుగా అండగా నిలవాలన్నారు. సంవత్సరం పొడవునా 12 నెలలపాటు హిందూ ధర్మం జ్యోతిగా వెలగాలన్నారు.



ఆదివారం ఖమ్మంలో కంచె ఐలయ్యను అరెస్ట్ చేస్తున్న పోలీసులు

# ఖమ్మంలో కంచె ఐలయ్య అరెస్ట్

## తీవ్రంగా ఖండించిన ప్రజాస్వామికవాదులు

**ఖమ్మం, డిసెంబర్ 3, ప్రభాతవార్త:** సామాజికతత్వవేత్త ప్రొఫెసర్ కంచె ఐలయ్యను ఆదివారం ఖమ్మంలో పోలీసులు అరెస్ట్ చేశారు. ఇటీవల కంచె ఐలయ్య ఒక వర్గంపై రచించిన పుస్తకానికి వ్యతిరేకంగా ఆ వర్గం ఆందోళనలు చేస్తాయనే భావనతో ముందస్తుగా పోలీసులు కంచె ఐలయ్యను అదుపులోకి తీసుకున్నారు. తెలంగాణ గొర్రెల, మేకల పెంపకందారుల సంఘం రాష్ట్ర మహాసభలు ఖమ్మంలో రెండు రోజుల పాటు జరగనున్నాయి. ఈ కార్యక్రమానికి ఆయన ముఖ్య అతిథిగా హాజరు కావాల్సి ఉంది. ఆదివారం పెవిలియన్ గ్రౌండ్‌లో జరిగే తెలంగాణ గొర్రెలు, మేకల పెంపకందారుల బహిరంగ సభలో ఆయన పాల్గొని ప్రసంగించాల్సి ఉండగా, సభకు ముందే ఆయన సీపీఎం కార్యాలయానికి చేరుకున్నారు. ఎటువంటి ఆందోళన కార్యక్రమాలు జరగకుండా ఉండేందుకు పోలీసులు పెద్ద ఎత్తున సీపీఎం కారా ్యలయానికి చేరుకున్నారు. డీసీపీ సురేష్‌కుమార్, ఖమ్మం ఏసీపీ గణేష్ నేతృత్వంలో పోలీస్ బలగాలు సీపీఎం కార్యాలయానికి భారీగా చేరుకొని కంచె ఐలయ్యను బలవంతంగా వాహనంలోకి ఎక్కించారు. ఈ క్రమంలో సీపీఎం, ప్రజా సంఘాలు, విద్యార్థులు, ప్రజాస్వామికవాదులు పెద్ద ఎత్తున చేరుకొని కంచె ఐలయ్యను అరెస్ట్ చేయకుండా అడ్డుకునే ప్రయత్నం చేశారు. ఈ క్రమంలో పోలీసులకు, ఆందోళనకారులకు మధ్య కొంత వాగ్వివాదం, తోపులాట చోటు చేసుకుంది. పోలీసులు వాహనంలో కంచె ఐలయ్యను బలవంతంగా అరెస్ట్ చేసి కూసుమంచి పోలీస్ స్టేషన్‌కు తరలించారు. అక్కడి నుంచి ఆయనను హైదరాబాద్‌కు పంపించారు. కంచె ఐలయ్య అరెస్ట్‌ను ప్రజాస్వామికవాదులు తీవ్రంగా ఖండించారు. తెలంగాణ గొర్రెల, మేకల పెంపకందారుల రాష్ట్ర సంఘం తీవ్రంగా ఖండించింది. ఏసీపీ గణేష్ ఉద్దేశపూర్వకంగా ఒక వర్గానికి కొమ్ముకాసే విధంగా వ్యవహరిస్తూ తమ సభను అప్రజాస్వామికంగా అడ్డుకుంటున్నారని పోలీసులు తమ విధులను సక్రమంగా నిర్వర్తించాలే కాని దళితుడు అనే కారణాలు చూపుతూ ఆర్యవైశ్యులకు కొమ్ముకాసే విధంగా వ్యవహరించడం సరైందని కాదని తీవ్రంగా ఆరోపించారు. యాదవులు, కురమ మనోభావాలను గాయపరిచే విధంగా ఏసీపీ వ్యవహరించడం సరైన పద్ధతి కాదన్నారు. దీనిని ప్రజాస్వామికవాదులు తీవ్రంగా ఖండించాలని ఖమ్మంలో జరుగుతున్న మహాసభలను నిరసన సభలుగా పరిగణిస్తున్నామని ఆయన తెలిపారు.



ఆదివారం శ్రీవారి సన్నిధిలో వ్యాసరాజమఠాధిపతి శ్రీ విద్యాశ్రీషతీర్థులస్వామి

# లోకం సుభిక్షంగా ఉండాలి

## వ్యాసరాజమఠాధిపతి శ్రీవిద్యాశ్రీషతీర్థులస్వామి

**తిరుమల,డిసెంబర్ 3 ప్రభాతవార్త:** కలియుగప్రత్యక్షదైవం తిరుమల శ్రీవారి కరుణాకటాక్షాలతో లోకంసుభిక్షంగా వుండాలని స్వామివారిని ప్రార్థించినట్లు వ్యాసరాజమఠాధిపతి శ్రీశ్రీ విద్యాశ్రీషతీర్థులస్వామీజి తెలిపారు. శ్రీవారి ఆశీస్సులతో దేశప్రజలు సుఖసంతోషాలతో వుండాలని ఆకాంక్షించారు. శ్రీవారి దర్శనార్థం ఆదివారం ఉదయం తిరుమలకు చేరుకున్న స్వామి,శిష్యులకు టిటిడి ఇవో అనిల్‌కుమార్‌సింఘాల్, ఆలయ డిప్యూటీ ఇవో కోదండరామారావు ,అర్చకులు ఆలయమర్యాదలతో ఇస్తికఫాల్‌తో స్వాగతం పలికారు. మహద్వారం నుంచి ఆలయంలోనికి చేరుకున్న స్వామివారు శ్రీవారిని ర్శించుకున్నారు.రంగనాయకుల మండపంలో వేదపండితులు వేదాశీర్వచనం చేశారు. టిటిడి ఇవో అనిలఖకుమార్‌సింఘాల్, ఆలయ డిప్యూటీ ఇవో కోదండరామారావు, పోటుపేష్కార్ అశోక్‌కుమార్, ఆలయపేష్కార్ రమేశ్,పారుపత్తేదార్‌రామచంద్ర, బొక్కసం ఇన్‌ఛార్జి గురురాజారావు స్వామివారి తీర్థప్రసాదాలు,శ్రీవారి చిత్రపటాన్ని బహుకరించారు.

# దమ్ముంటే సీమలో నీటి ప్రాజెక్టులు పూర్తి చేయించండి

## - దేశంలో తొలిసారి మోదీ వలనే బిసిలకు న్యాయం:

## అనంత జిల్లా మహాసభలో బిజెపి ఎమ్మెల్సీ సోము వీర్రాజు

### బిజెపి ఒబిసి మహాసభ సక్సెస్



ఆదివారం హిందూపురంలో

**హిందూపురం, డిసెంబర్ 3 ప్రభాతవార్త:** పోలవరం ప్రాజెక్టుకు కేంద్రంలోని బిజేపీ అడ్డుకుంటోందని ఆరోపణలు చేస్తున్న రాయలసీమ నాయకులు మీ ప్రాంతానికి ఏమీ చేయకుండా దద్దమ్మలుగా మిగిలారని, దమ్ముంటే హంద్రీనీవా, గాలేరు నగరి, తెలుగుగంగ నీటి ప్రాజెక్టులను పూర్తి చేయించాలని భారతీయ జనతాపార్టీ రాష్ట్ర ముఖ్యనేత, ఎమ్మెల్సీ సోము వీర్రాజు సవాల్ చేశారు. ఆ పార్టీ ఓబీసీ జిల్లా మహాసభ హిందూపురంలో ఆదివారం నిర్వహించారు. ఓబీసీ మోర్చ జిల్లా అధ్యక్షులు అమర్‌దేవేంద్ర ఆధ్వర్యంలో జరిగిన కార్యక్రమంలో రాష్ట్ర ఫైనాన్స్ కమిటీ చైర్మన్ ఎంఎస్ పార్థసారధి, ఓబీసీ మోర్చ రాష్ట్ర అధ్యక్షులు మధుసూదన్, పార్టీ రాష్ట్ర అధికార ప్రతినిధి పాకా సత్యనారాయణ, జిల్లా అధ్యక్షులు ఆంకాల్‌రెడ్డితో పాటు స్థానిక బిజేపీ నాయకులు మేడికుర్తి హరి, మజ్దుర్‌మోర్చ నాయకులు టికె బాబు, పట్టణ బిజేపీ అధ్యక్షులు ఆదర్శ్, రమేష్‌రెడ్డి, పార్థసారధి, వరప్రసాద్, శివకుమార్ మొదలగు వారు హాజరయ్యారు. వీర్రాజు మాట్లాడుతూ టీడీపీ ఎంపీ జెసి దివాకర్‌రెడ్డి పోలవరంపై మాట్లాడిన తీరును తప్పుపట్టారు. 2019లోపు ప్రాజెక్టును కేంద్రం సహకారంతో పూర్తి చేయడం జరుగుతుందన్నారు. రాయలసీమలో ఏదైనా నీటి ప్రాజెక్టులు, కాలువ సమస్యలు ఎప్పుడైనా సీఎంతో చర్చించి సాధించారా అని నిలదీశారు. సీమలో నాయకులు కాసులకు కక్కుర్తి పడి కాంట్రాక్టు పనులు దోచుకుంటూ ప్రజలకు ఏమీ చేయకుండా దద్దమ్మలుగా మిగిలారని తీవ్రంగా విమర్శించారు.

# ఇకపై ధర చెల్లిస్తే ధార్మిక కార్యక్రమాలకు శ్రీవారి అదనపు లడ్డూ

**తిరుమల, డిసెంబరు3 ప్రభాతవార్త:** ధార్మిక కార్యక్రమాలకు అదనంగా అందించే లడ్డూ ప్రసాదాలు ఇకపై టిటిడి ప్రతిపాదించిన రుసుంతో పొందాల్సి ఉంటుందని తిరుమల జెఈవో శ్రీనివాసరాజు తెలిపారు. ఆదివారం మీడియాతో మాట్లాడుతూ ఇప్పటి వరకు శ్రీనివాస కల్యాణాలు,ఇతర ధారి ్మక కార్యక్రమాలకు అందించే లడ్డూ, వడలను సాధారణ ధరకే అందిస్తున్నటు తెలిపారు. అయితే ఇకపై రూ.100కు పెద్ద లడ్డూలు 10, సాధారణ చిన్న లడ్డూలు రూ.25 చొప్పున 200, వడలు రూ.25 చొప్పున 10, చిన్న లడ్డూలు రూ. 3.50 ధరతో 1000 అందిస్తామన్నారు. భక్తుల అభ్యర్థన మేరకు ప్రసాదాల ధరలను సవరించినట్లు ఆయన తెలిపారు.ఇకపై అదనంగా శ్రీవారి ప్రసాదాలు కావలసిన ధార్మిక కార్యక్రమాల నిర్వకులు సవరించి ధరలను చెల్లించి పొందవచ్చని వివరించారు. అదనపు లడ్డూల ధరలు ఈ విధంగా ఉన్నాయి. పెద్ద లడ్డూ ఒకటి రూ.200, చిన్న వడ ఒకటి రూ.100, సాధారణ చిన్న లడ్డూ ఒకటి రూ.50, మిని లడ్డూ ఒకటి రూ.7 లు చెల్లించాల్సి ఉంటుంది. శ్రీవారి దర్శనానికి వచ్చే భక్తులకు అందించే లడ్డూ ప్రసాదాలలో ఎలాంటి మార్పు లేదని ఆయన స్పష్టం చేశారు.

# నేటి నుండి అనంతలో వైఎస్ జగన్ ప్రజా సంకల్ప యాత్ర

## సన్నాహాల్లో వైఎస్సార్సీ నేతలు



ప్రజా సంకల్ప యాత్రకు సన్నాహాలు చేస్తున్న వైఎస్సార్సీ నేతలు

**అనంతపురం, డిసెంబర్ 3 ప్రభాతవార్త ప్రతినిధి:** రాష్ట్ర ప్రతిపక్ష నాయకుడు, వైసివి అధినేత వైఎస్ జగన్మోహన్ రెడ్డి ప్రజా సమస్యల కోసం చేపట్టిన ప్రజా సంకల్పయాత్ర సోమవారం నుండి అనంతపురం జిల్లాలో ప్రారంభం కానుంది. జిల్లాలో 8 శాసనసభ నియోజకవర్గాల్లో దాదాపు 10 నుండి 15 రోజుల పాటు జరిగే పాదయాత్ర విజయవంతం చేసేందుకు వైసిసి నాయకులు సన్నాహాలు చేస్తున్నారు. ప్రజల కష్టనష్టాలు, రైతులు, కూలీలు, ఇతర వర్గాల సమస్యల కోసం జగన్ పాదయాత్ర చేపట్టాడని సోమవారం నుండి అనంతపురం జిల్లాలోని గుంతకల్లు నియోజకవర్గం గుత్తి మండలం ప్రారంభం అవుతుందని తెలిపారు.కరవు కాటకాలకు గురవుతున్న అనంతపురం జిల్లాలో ప్రజా సమస్యలు పరిష్కారం కోసం వజ్ర సంకల్పంతో ప్రజల ముందుకు వస్తున్న వైఎస్ జగన్ పాదయాత్రను విజయవంతం చేయాలని వైసిపి అనంతపురం పార్లమెంటరీ కన్వీనర్ అనంత వెంకట్రామిరెడ్డి విజ్ఞప్తి చేశారు. పార్టీ కార్యాలయం వద్ద జరిగిన విలేఖరుల సమావేశంలో ఆయన మాట్లాడుతూ ఎన్నికల్లో ఇచ్చిన హామీలను చంద్రబాబు ప్రభుత్వం తుంగలో తొక్కిందని, ప్రజా సమస్యలను గాలికి వదిలేసిందని ఆయన ధ్వజమెత్తారు. పోలీసు, రెవెన్యూ ఏకపక్షంగా వ్యవహరిస్తున్న చంద్రబాబు ప్రభుత్వం నిమ్మకు నీరెత్తినట్లు వ్యవహరిస్తోందన్నారు. టిడిపి నేతల ప్రోద్బలంతో దౌర్జన్యాలు పెరిగిపోయాయని ఆయన ఆరోపించారు. ప్రజల కష్టాలు తెలుసుకునేందుకే వైఎస్ జగన్ ప్రజా సంకల్ప యాత్ర చేపట్టారని, అన్ని వర్గాల ప్రజలు యాత్రలో పాల్గొని విజయవంతం చేయాలని ఆయన విజ్ఞప్తి చేశారు.

# మంత్రి కాలువ ఇంటిని ముట్టడించేందుకు యత్నించిన గిరిజనులు

## - పోలీసులు, గిరిజనులకు మధ్య తోపులాట

## - సమస్య తీవ్రం కాకుండా చర్యలు తీసుకున్న టూటౌన్ ఎస్ఐ



మంతి కాలువ ఇంటిని ముట్టడించిన ఆందోళనకారులు

**అనంతపురం, డిసెంబర్ 3 ప్రభాతవార్త ప్రతినిధి:** వాల్మీకులను, బోయలను ఎస్టీల్లోకి మార్చుతూ శాసనసభ తీర్మాణం చేయడంలో మంత్రి కాలవ శ్రీనివాసులు కీలకంగా వ్యవహరించారు. ఈనేపథ్యంలో కోవూరు నగర్‌లోని మంత్రి కాలవ ఇంటిలో వివిధ వాల్మీకి సంఘాలు సంబరాల్లో మునిగి పోతుండగా, ఈనిర్ణయం ద్వారా తమకు అన్యాయం జరిగే అవకాశం వుందని గిరిజన విద్యార్థి సంక్షేమ సంఘం ఆధ్వర్యంలో భారీ ఎత్తున గిరిజనులు ఆదివారం మంత్రి ఇంటిని ముట్టడించేందుకు యత్నించారు. గిరిజన విద్యార్థి సంక్షేమ సంఘం రాష్ట్ర అధ్యక్షుడు శివశంకర్‌నాయక్, ఇతర నాయకులు మల్లికార్జున నాయక్, పోతులయ్య, కేశవనాయక్, ధనంజయనాయక్‌ల ఆధ్వర్యంలో గిరిజనులు మంత్రి ఇంటిని ముట్టడించేందుకు యత్నించారు. గిరిజన జాబితాలో వాల్మీకిలను, బోయలను చేర్చేందుకు అసెంబ్లీలో తీర్మాణం చేయడాన్ని నిరసిస్తూ వీరు ముట్టడి కార్యక్రమంలో పాల్గొన్నారు. అయితే మంత్రి ఇంటి దగ్గరికి రాకుండా, సమస్య తీవ్రత కాకుండా టూటౌన్ ఎస్ఐ శ్రీరామ్ నాయకత్వంలో పోలీసులు సమయస్ఫూర్తితో వ్యవహరించి వారిని అడ్డుకున్నారు. దీంతో గిరిజనులకు, పోలీసులకు మధ్య కొద్దిసేపు తోపులాట జరిగింది. ఉద్రిక్త పరిస్థితులు నెలకొనడంతో అదనంగా పోలీసులు వచ్చి సమస్య సద్దుమణిగేలా చేశారు. ఈసందర్భంగా గిరిజన విద్యార్థి సంక్షేమ సంఘం నాయకులు శివశంకర్‌నాయక్ తదితరులు మాట్లాడుతూ రాష్ట్రంలో ఆర్థికంగా, రాజకీయంగా గిరిజనులు వెనుకబడి వున్నారని, బోయలను, వాల్మీకిలను ఎస్‌టి జాబితాలో చేరిస్తే మరింత నష్టపోతారని ఆందోళన వ్యక్తం చేశారు. ప్రభుత్వ నిర్ణయం ద్వారా ఎస్‌టి జాబితాలో వచ్చే అవకాశాలన్ని వాల్మీకులే చేజిక్కించుకుంటారని, తద్వారా గిరిజనులు మరింత పేదలవుతారన్నారు. ఇప్పటికే ఎస్‌సి, ఎస్‌టిలపై జరిగే దాడుల్లో ఎక్కువ శాతం మంది వాల్మీకులే వున్నారని, ఎన్నికల సమయంలో చిచ్చు పెట్టేందుకే చంద్రబాబు ప్రభుత్వం ఇలాంటి చర్యలకు ఒడిగడ్తోందని ఆరోపించారు.

# ఏడుకొండల్లో పెరిగిన వారాంతపు రద్దీ

**తిరుమల,డిసెంబర్ 3 ప్రభాతవార్త:** కలియుగవైకుంఠం తిరుమలలో వారాంతపురోజైన ఆదివారం భక్తుల రదీ బాగా పెరిగింది. ఇటు వరుసగా శని,ఆదివారం సెలవు రావడంతో తిరుమలలో భక్తులరదీ విపరీతంగా వుంది.సాయంత్రానికి ఈ రద్దీ పెరగడంతో వైకుంఠం-1లోని 10కంపార్టుమెంట్లు, వైకుంఠం2లోని 31కంపార్టుమెంట్లుభక్తులతో నిండిపోయి స్వామివారి దర్శనానికి 12గంటలు కేటాయిస్తున్నారు. ఆదివారం సాయంత్రం 6గంటలకు 37,478మంది భక్తులకు శ్రీవారి దర్శనం కల్పించారు. రాత్రివరకు 56వేలమందికి దర్శన భాగ్యం కల్పించారు. సర్వదర్శనం భక్తులు ఒక్కోభక్తునికి 4లడ్డూలు, దివ్యదర్శనం భక్తులు ఒక్కోభక్తుడు 5లడ్డూలు అందుకునేలా టోకెన్లు జారీచేశారు. శ్రీవారి హుండీ ఆదాయం 2.46కోట్లు రూపాయలు చేకూరింది.

# కలియుగవైకుంఠంలో వైభవంగా దీపోత్సవం

**తిరుమల,డిసెంబర్ 3 ప్రభాతవార్త:** కలియుగవైకుంఠం తిరుమలలో కార్తీకపౌర్ణమి సందర్భంగా ఆదివారం రాత్రి కార్తీకదీపోత్సవం వైభవంగా,పవిత్రంగా వెలిగించారు.టిటిడి ఈ వేడుకలను ఘనంగా నిర్వహించింది. కార్తీకపౌర్ణమిరోజు శ్రీనివాసుడు సాయంకాల కైంకర్యాలు,నివేదనలు పూర్తయిన తరువాత దీపోత్సవం కన్నులపండువగా జరపబడింది. శ్రీవారి ఆలయంలోని యోగనరసింహస్వామి ఆలయంపక్కన వున్న పరిమలపు అరవద్ద 100 కొత్తమూకుళ్లలో నేతివత్తులతో దీపాలను వెలిగించారు. తదుపరి వీటిని ఛత్రచామర,మంగళవాయిద్యాలతో ఊరేగింపుగా విమాన ప్రదక్షిణం చేస్తూ ఆనందనిలయంలో శ్రీవారికి హారతి ఇచ్చారు. ఆ తరువాత వరుసగా గర్భాలయంలో బ్రహ్మఅఖండం, కులశేఖరపడి, రాములవారిమేడ,బంగారువాకిలి, ద్వారపాలకులు,గరుడాళ్వారు,వరదరాజస్వామిసన్నిధి, వకుళమాత,బంగారుబావి,కల్యాణమండపం,సభఅర, తాళ్లపాకఅర,భాష్యకారులసన్నిధి ఇలా పలుచోట్లతో బాటు స్వామివారి పుష్కరిణి వద్ద సుమారుగా 100నేతి జ్యోతులను వెలిగించారు. ఈదీపపు వెలుగుల్లో శ్రీవారి ఆలయం శోభాయమానంగా వెలుగొందింది.కాంతులీనింది. ఈ కార్యక్రమంలో టిటిడి ఇవో అనిల్‌కుమార్‌సింఘాల్,తిరుమల జెఇవో కెఎస్ శ్రీనివాసరాజు,శ్రీవారి ఆలయ ప్రధాన అర్చకులు రమణదీక్షితులు, అర్చకులు, ఆలయ ఓఎస్‌డి డాలరుశేషాద్రి ,శ్రీవారి ఆలయ డిప్యూటీ ఇవో కోదండరామారావు, రిసెప్షన్ డిప్యూటీ ఇవో పి.హరీంద్రనాథ్, ఓఎస్‌డి లక్ష్మీనారాయణయాదవ,ఆలయపేష్కార్ శెల్వం,విఎస్‌వో రవీంద్రారెడ్డి తదితరులు పాల్గొన్నారు

# సంస్థ ప్రతిష్టపెంచేలా విధులు నిర్వహించండి

## కల్యాణకట్ట క్షురకులతో టిటిడి జెఇఒ శ్రీనివాసరాజు

**తిరుమ,డిసెంబర్ 3 ప్రభాతవార్త:** తిరుమలలో శ్రీవారి దర్శనానికి విచ్చేసే భక్తులు మొక్కుబడుల్లో తలనీలాలు సమర్పించడం ఆనవాయితీఅని, భక్తులకు సేవాభావంతో,నిజాయితీతో సేవలందించాలని తిరుమల జెఇవో కెఎస్ శ్రీనివాసరాజు తెలిపారు. టిటిడి ప్రతిష్టపెంచేలా క్షురకులు విధులు నిర్వహించాలని సూచించారు. తిరుమలలో కల్యాణకట్టలో పనిచేస్తున్న క్షురకులకు సేవా,నిజాయితీ,అ ంకితభావ సేవలు గురించి సమావేశం నిర్వహించారు. ఈ సందర్భంగా జెఇవో శ్రీనివాసరాజు మాట్లాడుతూ ఇటీవల కొందరు క్షురకులపై అవినీతి ఆరోపణలు వచ్చాయని,అయితే వారందరూ మళ్లీ తప్పులను తెలుసుకుని నిజాయితీతో పనిచేస్తామని చెప్పడంతో వారిని 2018 జనవరి నుంచి విధుల్లోకి తీసుకుంటున్నట్లు తెలిపారు. ఇవో అనిల్‌కుమార్‌సింఘాల్ ఆదేశాలతో క్షురకులకు తగిన న్యాయంచేస్తామని అన్నారు. తిరుమలలో క్షురకులు అవినీతికి పాల్పడకుండా సేవలందించాలని కోరారు. ఈ సమావేశంలో టిటిడి సివిఎస్‌వో ఆకేరవికృష్ణ, విజివో రవీంద్రారెడ్డి, డిప్యూటీ ఇవో వెంకటయ్య తదితరులు పాల్గొన్నారు.

# విరాట్ వీరవిహారం



## 405 రన్స్ లోటుతో శ్రీలంక
## ఆరో ద్విశతకం చేసిన కోహ్లీ
### నాటకీయంగా భారత్ తొలి ఇన్నింగ్స్ డిక్లేర్డ్

**ప్రభాతవార్త స్పోర్ట్స్ ప్రతినిధి:** లోకల్ బాయ్ విరాట్ కోహ్లీ వీర విహారానికి ఫిరోజ్ షా కోట్లా పులకరించింది. అతడి అద్వితీయ ద్విశతకానికి అభిమానులు పరవశించిపోయారు. దానికి తోడు మురిపించే కవర్‌డ్రైవ్‌లు...ముద్దొచ్చే స్ట్రెయిట్ డ్రైవ్‌లు...సొగసైన కట్‌షాట్లు మురిపించారు. ప్రత్యర్థులను భయపెట్టారు. విరాట్ జోరుకు రోహిత్ శర్మ అర్థశతకం తోడవ్వడంతో శ్రీలంకతో తొలి ఇన్నింగ్స్‌లో టీమిండియా భారీ స్కోరు సాధించింది. 536/7వద్ద ఇన్నింగ్స్ డిక్లేర్ చేసింది. తర్వాత బ్యాటింగ్‌కు దిగిన శ్రీలంక రెండో రోజు ఆట ముగిసే సరికి 44.3 ఓవర్లకు 131/3తో నిలిచింది. ఏంజెలో మాథ్యూస్ (118 బంతుల్లో 8ఫోర్లు, రెండు సిక్సర్లతో 57 పరుగులు), దినేశ్ చండీమాల్ (81బంతుల్లో 3ఫోర్లతో 25 పరుగులు) క్రీజులో ఉన్నారు. ఆ జట్టు 405 పరుగుల భారీ లోటుతో ఉంది. ఇన్నింగ్స్ తొలి బంతికే మహ్మద్ షమీ శ్రీలంక ఓపెనర్ దిముత కరుణరత్నె (0)ను డకౌట్ చేశాడు. జట్టు స్కోరు 14 వద్ద ధనుంజయ డిసిల్వ (1)ను ఇషాంత్ ఎల్బీ చేశాడు. కాసేపు నిలిచి అర్థశతకానికి చేరువైన దిల్రువాన్ పెరీరా (54 బంతుల్లో 9ఫోర్లతో 42 పరుగులు)ను 18.4వ బంతికి రవీంద్ర జడేజా వికెట్ల ముందు దొరకబుచ్చుకున్నాడు. అప్పటిస్కోరు75. భారత ఫీల్డర్లు దాదాపు రెండు క్యాచ్‌లు మిస్ చేశారు.

**ద్విశతకంతో కదం తొక్కిన కోహ్లీ....**
ఓవర్‌నైట్ స్కోరు 371/4తో రెండో రోజు బ్యాటింగ్ ఆరంభించిన కోహ్లీ (287బంతుల్లో 25ఫోర్లతో 243 పరుగులు) కదం తొక్కాడు. సారథిగా ఆరో ద్విశతకం బాదేశాడు. బ్రియన్ లారా (5)ను దాటేసి చరిత్రలో ఒక్కడిగా నిలిచాడు. ఆటగాడిగా సచిన్ (6 ద్విశతకాలు), సెహ్వాగ్ (6)ను సమం చేశాడు. రోహిత్ శర్మ (102బంతుల్లో 7ఫోర్లు, రెండు సిక్సర్లతో 65 పరుగులు)తో కలిసి ఐదో వికెట్‌కు 135 పరుగుల భాగస్వామ్యం నెలకొల్పాడు. హార్డ్‌హిట్టర్ రోహిత్ భారీ సిక్సర్లు, బౌండరీలు బాదుతూ కెరీర్‌లో ఎనిమిదో అర్థశతకం నమోదు చేశాడు. జట్టు స్కోరు 500 వద్ద రోహిత్‌ను ఔట్ చేయడం ద్వారా ఈ జోడీని సందకన్ విడదీశాడు. వాయు కాలుష్యం పేరుతో లంకేయులు ఆటకు పదే పదే అంతరాయం కలిగించడంతో అశ్విన్ (4) 122.4వ బంతికి ఔటయ్యాడు. అప్పుడు స్కోరు 519 పరుగులు. త్రిశతకం చేస్తాడని ఆశించిన కోహ్లీ దాంతో లయ కోల్పోయాడు. సందకన్ వేసిన 125.3వ బంతికి ఎల్‌బి అయ్యాడు. కోహ్లీ ఈ మ్యాచ్‌లో తన అత్యధిక వ్యక్తిగత స్కోరు 235ను అధిగమించాడు.

**నాటకీయంగా డిక్లేర్డ్....**
శ్రీలంక ఆటగాళ్ల నాటకాలు అన్నీ ఇన్నీ కాదు. ఓ వైపు విరాట్ కోహ్లీ డబుల్ సెంచరీతో మంచి ఊపుమీదున్నారు. మరో వైపు భారత స్కోరు 600కి పైగా చేరేలా ఉంది. వారి బౌలర్లు ఏమాత్రం ప్రభావం చూపలేకపోతున్నారు. ఈ క్రమంలో లంక ఆటగాళ్లకి గాలి కాలుష్యం సాకు దొరికింది. గాల్లో నాణ్యత కరువైందని ఊపిరి తీసుకునేందుకు ఇబ్బంది పడ్డ లంకేయులు పదే పదే మ్యాచ్‌కు అంతరాయం కలిగించారు. ఆటను నిలిపివేయాలని అంపైర్లను కోరారు. చివరికి సబ్‌స్టిట్యూట్ ఫీల్డర్లు లేకపోవడంతో శ్రీలంక మేనేజర్ కోచ్‌వచ్చి అంపైర్లతో చర్చించారు. ఆటగాళ్లతో పాటు జట్టు ఫిజియో కోచ్ ఇలా అందరూ రంగంలోకిదిగి తొలుత మ్యాచ్‌ను ఆపేశారు. ఆతర్వాత మళ్లీ అంతరాయాలు. ముఖానికి మాస్కులు వేసుకుని మరీ ఆడారు. ఈ నాటకీయ పరిణామాల మధ్య కోహ్లీ, అశ్విన్ పెవిలియన్‌కు చేరారు.అయినా లంక ఆటగాళ్ల వేషాలు ఆగలేదు.లంక క్రికెటర్లు పదేపదే ఆడేందుకు అయిష్టం ప్రదర్శిస్తుండటంతో టీమిండియా కోచ్ రవిశాస్త్రి అంపైర్లతో మాట్లాడారు. లంకేయులు ఫీల్డింగ్ చేసేందుకు ఇబ్బంది పడితే మేం ఫీల్డింగ్ చేస్తామంటూ కోహ్లీ ఆగ్రహించాడు. 127.5 ఓవర్లకు జట్టు స్కోరు 536/7 వద్ద తొలి ఇన్నింగ్స్‌ను డ్రెస్సింగ్ రూమ్ నుంచి డిక్లేర్ చేశాడు. అప్పటికి వృద్ధిమాన్ సాహా (19 బంతుల్లో ఒక ఫోర్‌తో 9పరుగులు), రవిచంద్రన్ అశ్విన్ (4బంతుల్లో ఒక ఫోర్‌తో 5 పరుగులు) బ్యాటింగ్ చేస్తున్నారు. పెవిలియన్ నుంచి క్రీజులో ఉన్న అశ్విన్‌కు, సాహాకు సైగ చేశాడు కోహ్లీ. వచ్చేయండి...మనం బౌలింగ్ చేద్దాం అంటూ సంజ్ఞల ద్వారా తెలిపాడు. దీంతో లంక ఆటగాళ్లు తెగ సంబరబడిపోయారు.

## కోహ్లీ తప్పిదంతో చెలరేగిన మాథ్యూస్



**నాగ్‌పూర్:** ఎంత గొప్ప ఆటగాడైనా ఒక్కోసారి తప్పులు చేయడం సాధారణం. కానీ ఆ తప్పిదాన్ని అవతల జట్టు సద్వినియోగం చేసుకుంటేనే నష్టం వాటిల్లుతుంది. ఇప్పుడు ఢిల్లీ టెస్టులోనూ అదే జరిగింది. శ్రీలంకతో జరుగుతున్న మూడో టెస్టు తొలి ఇన్నింగ్స్‌కు భారత్ 536/7 వద్ద డిక్లేర్ చేసిన సంగతి తెలిసిందే. గాలి కాలుష్యం కారణంతో నాటకీయ పరిణామాల మధ్య ఇన్నింగ్స్‌ను డిక్లేర్ చేసిన కోహ్లీ... లంకకు బ్యాటింగ్ అప్పగించాడు. అయితే ఇన్నింగ్స్ తొలి బంతికే లంక తన తొలి వికెట్‌ను కరుణరత్నె రూపంలో కోల్పోయింది. ఆ తర్వాత 14 పరుగుల వద్ద డిసిల్వా వికెట్‌ను కూడా చేజార్చుకుంది. శ్రీలంక బ్యాట్స్‌మెన్ ఎక్కడా అవకాశం ఇవ్వకుండా భారత బౌలర్లు కట్టుదిట్టంగా బౌలింగ్ చేస్తున్నారు. ఇలాంటి పరిసితుల్లో భారత్ రెండు క్యాచ్‌లను చేజార్చుకుంది. టీ విరామం తరువాత షమీ వేసిన ఓవర్‌లో దిల్రువన్ పెరేరా ఇచ్చిన క్యాచ్‌ను సెకండ్ స్లిప్‌లో ఉన్న శిఖర్ ధావన్ చేజార్చాడు. ఆ బంతి కాస్త కీపర్ వెనకాల ఉన్న హెల్మెట్ తగలడంతో ఫెనాల్టీ కింద లంకకు 5 పరుగులు కూడా దక్కాయి. అప్పటికి పెరేరా 16 పరుగుల వద్ద ఉన్నాడు. ఆ తర్వాత అతను 42 పరుగులు సాధించి జడేజా బౌలింగ్‌లో ఔటయ్యాడు. ఇక రెండో తప్పిదం కెప్టెన్ విరాట్ కోహ్లీది. శ్రీలంక జట్టు స్కోరు 33/2 వద్ద ఇషాంత్ బౌలింగ్‌లో ఏంజెలా మాథ్యూస్ ఇచ్చిన క్యాచ్‌ను సెకండ్ స్లిప్‌లో ఉన్న కోహ్లీ వదిలేశాడు. ఈ అవకాశాన్ని అందిపుచ్చుకున్న మాథ్యూస్ అర్థ శతకంతో జట్టును ఆదుకున్నాడు. ఒకవేళ ఇండియా ఈ రెండు క్యాచ్‌లను పట్టి ఉంటే గనుక శ్రీలంక కథ మరోలా ఉండేది. మొత్తానికి రెండో రోజు ఆట ముగిసే సమయానికి శ్రీలంక మూడు వికెట్ల నష్టానికి 131 పరుగులు చేసింది. మాథ్యూస్ (57), చండీమాల్ (25) క్రీజులో ఉన్నారు.

## బ్రాడ్‌మాన్ రికార్డును బ్రేక్ చేసిన కోహ్లీ

**న్యూఢిల్లీ:** టెస్టుల్లో కోహ్లీ శ్రీలంకతో జరుగుతున్న మూడో టెస్టులో చేశాడు. తద్వారా భారత్ తరుపున అత్యధిక డబుల్ సెంచరీలు చేసిన సచిన్, సెహ్వాగ్ సరసన విరాట్ నిలిచాడు. గత ఏడాది ప్రారంభం వరకు ఒక్క ద్విశతకం కూడా కోహ్లీ నమోదు చేయలేదు. కానీ 2016 జూలైలో వెస్టిండీస్ పర్యటన మొదలు...లంకతో సొంత గడ్డ మీద సిరీస్ ముగిసే లోపు 499 రోజుల్లో విరాట్ 6 డబుల్ సెంచరీలు బాదేశాడు. ఇంత తక్కువ వ్యవధిలో ఇన్ని డబుల్ సెంచరీలు బాదిన ఏకైక క్రికెటర్ కోహ్లీ మాత్రమే. టెస్టు క్రికెట్‌లో ఎన్నో రికార్డులను నెలకొల్పిన ఆసీస్ దిగ్గజం డాన్ బ్రాడ్‌మ్యాన్ రికార్డును కూడా కోహ్లీ బ్రేక్ చేశాడు.ఏడాదిన్నరలోపే కోహ్లీ ఆరు డబుల్ సెంచరీలు బాదగా....డాన్ బ్రాడ్ మ్యాన్‌కు తొలి ఆరు ద్విశతకాలు సాధించడానికి 581 రోజులు పట్టింది.విండీస్ టూర్‌కు ముందు టెస్టుల్లో కోహ్లీ సగటు 44 ఉండేది. ఈ ఆది వారం అది 54 దాటింది. సమకాలీన క్రికెట్‌లో స్మిత్ మాత్రమే టెస్టు యావరేజీ విషయంలో కోహ్లీ కంటే ముందున్నాడు. అన్నట్టూ మరోవిషయం. వినోద్ కాంబ్లీతర్వాత వరుసగా రెండు డబుల్ సెంచరీలు బాదిన భారత క్రికెటర్ కోహ్లీ మాత్రమే.

## ఇఎంఐ కట్టలేక కారును దాచేశా : పాండ్యా



**న్యూఢిల్లీ:** స్టార్ ఆల్‌రౌండర్ హార్థిక్ పాండ్యా ఇప్పుడు టీం ఇండియాలో కీలక ఆటగాడు. ఐపిఎల్‌లోనూ విలువైన ఆటగాడిగా కొనసాగుతున్నాడు. దేశంలోని ఎన్నో ప్రముఖ బాండ్లు అతనితో వాణిజ్య ఒప్పందాలు చేసుకోవడానికి ఆరాడపడుతున్నాయి. కానీ ఈ స్థాయి పాండ్యాకు అంత సులభంగా ఏమీ దక్కలేదు. సామాన్య క్రికెటర్‌గా ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొన్న పాండ్యా... కృషి , పట్టుదలతో అత్యుత్తమ ఆల్‌రౌండర్‌గా ఎదిగాడు. ఐపిఎల్ ద్వారా వచ్చిన అవకాశాన్ని అందిపుచ్చుకొని టీం ఇండియాలో కీలక ఆటగాడయ్యాడు. అయితే ఐపిఎల్‌లో అవకాశం రాకముందు ఆర్థికంగా చాలా ఇబ్బందులు పడ్డానని పాండ్యా చెప్పాడు. ఇష్టంగా కొనుక్కున్న కారు ఈఎంఐ కట్టలేక, దాన్ని వదులుకోలేక దాచేశానని చెప్పుకొచ్చాడు. గౌరవ్ కపూర్ హోస్ట్ చేస్తున్న బ్రేక్‌ఫాస్ట్ విత్ ఛాంపియన్స్ షోలో పాల్గొన్న పాండ్యా తన జీవితంలో అనేక విషయాలను పంచుకున్నాడు.
మూడేళ్ల పాటు నేను చాలా కష్టాలు పడ్డాను. మేం రూ.5 నుంచి రూ.10 కూడా జాగ్రత్తగా దాచుకున్న రోజులున్నాయి. నాకు బాగా గుర్తు ఐపిఎల్‌లో తొలిసారి రూ.70వేలు అందుకున్నాను. ఈ డబ్బుతో చాలా కాలం బతికేయొచ్చు అనిపించింది. ఎందుకంటే అంతకుముందు మూడేళ్లు మేం పడిన ఇబ్బందులు అలాంటివి. రెండేళ్లు కారు ఈఎంఐ కట్టలేకపోయాం. కారును వదులుకోవడం ఇష్టంలే దాచేశాం. ఆ మూడేళ్లలో మేం సంపాదించిన దానితో కొత్తవి కొనడానికి బదులు కారు ఈఎంఐ కోసమే కూడబెట్టేవాళ్లం. ఆ సమయంలో తిండికి, కారు ఈఎంఐకి ఉంటే చాలు అనుకునేవాళ్లమని పాండ్యా తన పాత జీవితాన్ని గుర్తు చేసుకున్నాడు. క్రికెట్ అంటే అమితమైన ఇష్టం. తమలో ఉన్న ప్రతిభతోనే ఈస్థాయికి చేరుకున్నామని, క్రికెట్‌లో ఎదగడానికి ఎవరి సాయం, సానుభూతి పొందడానికి తన అన్న క్రునాల్ పాండ్యా ఇష్టపడేవాడు కాదని పాండ్యా వెల్లడించాడు. అప్పుడు క్రునాల్‌కు 19 ఏళ్లు, నాకు 17. ఎవరి సానుభూతి మాకు అవసరం లేదని నాన్నకు చెప్పాం. మమ్మల్ని జట్టులోకి తీసుకోమని ఎవరినీ అడొగొద్దని చెప్పాం. ఎంపికైతే మా సొంతం ప్రతిభతోనే...అలాకాకపోతే వద్దు. మూడేళ్లు అలాగే ఉండిపోయాం.
మొత్తానికి దేవుడు కరుణించాడు. నేను ఐపిఎల్‌లో చేరిన తొలి ఏడాదే టైటిల్‌ను కైవసం చేసుకున్నాం. నాకు రూ.50లక్షల చెక్ అందింది. ఐపిఎల్ నుంచే ఒక కారు కూడా లభించింది. అలాగే నేను ఓ కొత్త కారును కొన్నాను. మూడు నెలల వ్యవధిలోనే మా జీవితాలే మారిపోయాయి. డబ్బుల కోసం తీవ్ర ఇబ్బంది పడిన నేను...రూ.50 నుంచి రూ.60లక్షలు సంపాదించానని పాండ్యా గర్వంగాచెప్పాడు.

## హాకీ ప్రపంచ లీగ్ ఫైనల్స్ టోర్నీలో చేజేతులా ఓడిన భారత్




**న్యూఢిల్లీ:** భువనేశ్వర్ వేదికగా జరుగుతున్న హాకీ ప్రపంచ లీగ్ ఫైనల్ టోర్నీలో ఆతిథ్య భారత్ రెండో మ్యాచ్‌లో అభిమానులను నిరాశ పరిచింది. తొలి మ్యాచ్‌లో ఆస్ట్రేలియాను కంగారెత్తించిన భారత్...ఇంగ్లాండ్‌తో జరిగిన మ్యాచ్‌లో చేజేతులా ఓటమి పాలైంది. కనీసం డ్రాగా ముగించాల్సిన మ్యాచ్‌ను భారత్ చేజార్చుకుంది. దీంతో మ్యాచ్‌ను 2-3తేడాతో ఓడిపోయి పూల్-బిలో నాలుగో స్థానంలో కొనసాగుతోంది. భారత్ తరుపున ఆకాశ్‌దీప్ (47ని), రూపిందర్‌పాల్ (50ని)గోల్స్ చేశారు. మరోవైపు ఇంగ్లాండ్ జట్టులో సామ్ వార్డ్ (43ని, 57ని) డబుల్ గోల్స్‌తో విజృంభించగా, చివర్లో డేవిడ్ గుడ్‌ఫీల్డ్ (25ని) మరో గోల్ చేశాడు. టోర్నీలో భాగంగా సోమవారం చివరి మ్యాచ్‌లో భారత్ జర్మనీతో తలపడనుంది. మ్యాచ్ ప్రారంభం నుంచే ఇరు జట్లు హోరాహోరీగా తలపడటంతో తొలి క్వార్టర్‌లో ఎలాంటి గోల్ నమోదు కాలేదు. ఇక రెండో క్వార్టర్‌లో భారత్ స్ట్రైకర్లు ఎస్‌వి సునీల్, మణ్‌దీప్ సింగ్ తమకు అందివచ్చిన పాస్‌లను గోల్స్‌గా మలువలేకపోయారు. అదే సమయంలో ఇంగ్లాండ్ భారత డిఫెన్స్‌పై ఒత్తిడి పెంచి ఫలితం రాబట్టింది. రెండో క్వార్టర్ 25వ నిమిషంలో దక్కిన ఫెనాల్టీ కార్నర్‌ను గుడ్‌ఫీల్డ్ చేయడంతో ఇంగ్లాండ్ 1-0 ఆధిక్యంలో వెళ్లింది. ఆ తర్వాత 43వ నిమిషంలో ల్యూక్ టేలర్ లాంగ్ పాస్‌ను హర్మన్‌ప్రీత్ సింగ్ సరిగ్గా నిలువరించలేకపోయాడు. దీనిని అనుకూలంగా మలుచుకున్న సామ్ వార్డ్ గోల్ చేయడంతో ఇంగ్లాండ్ 2-0 ఆధిక్యంలోకి వెళ్లింది. ఆ తర్వాత భారత్‌కు వెంటవెంటనే రెండు ఫెనాల్టీ కార్నర్లు దక్కినప్పటికీ గోల్స్‌గా మలచడంతో విఫలమ య్యారు. ఈ సమయంలో మూడు నిమిషాల వ్యవధిలో ఆకాశ్‌దీప్ సింగ్ (47ని), రూపిందర్ పాల్ (50ని)గోల్స్‌చేసి ఆధిక్యాన్ని 2-2 సమం చేశారు.
ఇక 2-2తో మ్యాచ్ డ్రా దిశగా సాగు తున్న సమయంలో డిఫెండర్ల ఏమరుపాటు కారణంగా 57వ నిమిషంలో సామ్ వార్డ్ రెండో గోల్ చేయడంతో మ్యాచ్ ఇంగ్లాండ్ కైవసమైంది. ఇదే గ్రూప్‌లో జర్మనీ, ఆస్ట్రేలియా జట్ల మధ్య జరిగిన మ్యాచ్ 2-2తో డ్రాగా ముగిసింది. పూల్-ఏలో జరిగిన రెండు మ్యాచ్‌ల్లో బెల్జియం 3-2తో అర్జెంటీనాపై, స్పెయిన్ 3-2తో నెదర్లాండ్స్‌పై విజయం సాధించాయి.

## లారాను దాటేసిన కోహ్లీ

**న్యూఢిల్లీ:** శ్రీలంకతో జరుగుతున్న టెస్టు సిరీస్‌లో టీం ఇండియా కెప్టెన్ విరాట్ కోహ్లీ రికార్డుల మోత మోగిస్తున్నాడు. రెండో టెస్టు తొలి ఇన్నింగ్స్‌లో 213 పరుగులు సాధించిన కోహ్లీ...మూడో టెస్టులోనూ డబుల్ సెంచరీ బాదేశాడు. ఢిల్లీలోని ఫిరోజ్ షా కోట్ల వేదికగా జరుగుతున్న మూడో టెస్టు తొలి ఇన్నింగ్స్‌ల కేవలం 238 బంతుల్లోనే డబుల్ సెంచరీ పూర్తి చేశాడు. టెస్టు కెరీర్‌లో కోహ్లీకి ఇది ఆరో డబుల్ సెంచరీ. ఈ ఏడాది మూడోది. 2016 వరకు టెస్టుల్లో ఒక్క డబుల్ సెంచరీ కూడా సాధించని కోహ్లీ...ఈ రెండేళ్లలోనే ఆరు ద్విశతకాలు బాదడం విశేషం. మొత్తానికి బ్యాట్స్‌మెన్ దూకుడుతో తొలి ఇన్నింగ్స్‌లో భారత్ భారీ స్కోరు దిశగా దూసుకుపోతోంది. 371/4 ఓవర్‌నైట్ స్కోరుతో రెండో రోజు ఆట ఆరంభించిన భారత్...మరో వికెట్ పడకుండా జాగ్రత్త పడింది. తొలిరోజు అద్భుత ఆటతీరుతో ఆకట్టుకున్న కెప్టెన్ కోహ్లీ...రెండో రోజూ అదే దూకుడును కొనసాగించాడు. అతనికి రోహిత్ శర్మ చక్కటి సహకారాన్ని అందిస్తున్నాడు.
మొత్తానికి 110 ఓవర్లు ముగిసే సరికి భారత్ 4 వికెట్ల నష్టానికి 459 పరుగులు చేసింది. భారత్ భారీ స్కోరు సాధించి బౌలింగ్‌లోనూ రాణిస్తే లంక మరో పరాజయనాకి సిద్ధమైనట్లే. ప్రస్తుతం కోహ్లీ (243బంతుల్లో 21 ఫోర్లతో 207 పరుగులు), రోహిత్ శర్మ (78 బంతుల్లో 5ఫోర్లు, ఒక సిక్సర్‌తో 41 పరుగులు) తో ఆడుతున్నారు. కెప్టెన్‌గా అత్యధిక సెంచరీ (6) సాధించిన ఆటగాడిగా కోహ్లీ రికార్డుకెక్కాడు.
వెస్టిండీస్ దిగ్గజం బ్రియాన్ లారా (5) రెండో స్థానంలో ఉన్నాడు. అలాగే భారత్ తరుపున అత్యధిక డబుల్ సెంచరీలు సాధించిన మూడో ఆటగాడిగా కోహ్లీ నిలిచాడు. ఇంతకుముందు సచిన్, సెహ్వాగ్ చెరో ఆరు డబుల్ సెంచరీలు సాధించారు.

## విరాట్ కోహ్లీతో నటి రమ్యకృష్ణ



**హైదరాబాద్:** న్యూఢిల్లీలో ఇటీవల సిఎన్‌ఎన్-ఐబిఎన్ ఇండియన్ ఆఫ్ ద ఇయర్ 2017 అవార్డుల కార్యక్రమం ఘనంగా జరిగింది. ఈ కార్యక్రమానికి కేంద్ర ఆర్థికశాఖ మంత్రి అరుణ్ జైట్లీతో పాటు పలు రంగాలకు చెందిన అనేకమంది ప్రముఖులు హాజరైన సంగతి తెలిసిందే. ఈ కార్యక్రమంలో నటి రమ్యకృష్ణ, టీమిండియా కెప్టెన్ విరాట్ కోహ్లీలు కూడా సందడి చేశారు. బాహుబలి సినిమాలోని శివగామి పాత్రకు రమ్యకృష్ణకు, ఇండియన్ ఆఫ్ ది ఇయర్‌గా కోహ్లీలు అవార్డులు అందుకున్నారు. ఈ వేదికపై కోహ్లీతో కలిసి దిగిన ఫోటోను రమ్యకృష్ణ తన ట్విట్టర్‌లో పోస్ట్ చేశారు. విరాట్ చాలా మంచి వ్యక్తి. ఆయన్ను కలుసుకోవడం చాలా సంతోషంగా ఉందని రమ్యకృష్ణ తన ట్విట్టర్‌లో ట్వీట్ చేశారు. ప్రస్తుతం సోషల్ మీడియాలో ఈ ఫోటో వైరల్ అయ్యింది. ప్రస్తుతం రమ్యకృష్ణ తెలుగులో హలో చిత్రంతో పాటు తమిళంలో సూర్య హీరోగా తాన సేరందకూటం అనే సినిమాలో నటిస్తున్నారు.

## సూపర్ సిరీస్ విజేత సృజన



**హైదరాబాద్:** అఖిల భారత టెన్నిస్ సంఘం (ఐటా) సూపర్ సిరీస్ టెన్నిస్ టోర్నమెంట్‌లో హైదరాబాద్ అమ్మాయి సృజన రాయరాల అండర్ 14 బాలికల విభాగంలో టైటిల్‌ను సాధించింది. కోల్‌కతాలో జరిగిన ఫైనల్లో సృజన 6-3, 6-2తో ప్రేరణ కోయిరాలపై విజయం సాధించింది. అండర్ 19 బాలికల ఫైనల్లో సృజన 2-6, 5-7తో సిహెచ్ రితుజ చేతిలో పరాజయం పాలైంది.

## టెన్నిస్ టోర్నమెంట్ విజేత ఎవి కాలేజీ

**హైదరాబాద్:** ఉస్మానియా యూనివర్సిటీ ఇంటర్ కాలేజీ టేబుల్ టెన్నిస్ (టిటి) టోర్నమెంట్‌లో ఆంధ్ర విశ్వ విద్యాలయ (ఎవి) కాలేజీ జట్టు విజేతగానిలిచింది. సెయింట్ జోసెఫ్ కాలేజీ వేదికగా జరిగిన టైటిల్ పోరులో ఎవికాలేజీ 3-0తో ఎంవిఎస్‌ఆర్ ఇంజనీరింగ్ కాలేజీ జట్టుపై గెలుపొందింది. మూడో స్థానంకోసం జరిగిన పోరులో బద్రుకా కాలేజీ (కాచిగూడ) 3-1తో సెయింట్ జోసెఫ్ డిగ్రీ కాలేజీని ఓడించింది. అంతకుముందు జరిగిన సెమీఫైనల్ మ్యాచ్‌ల్లో ఎవి కాలేజీ 3-0తో బద్రుకాపై, ఎంవిఎస్‌ఆర్ 3-2తో సెయింట్ జోసెఫ్ కాలేజీపై విజయం సాధించాయి.

## క్రీడలు మానసిక ఉల్లాసానికి దోహదం
### ఎకెఎన్‌యు అంతర్‌జిల్లాల ఫుట్‌బాల్ టోర్నమెంట్‌లో జెడ్పీచైర్మన్ ముళ్ళపూడి బాపిరాజు



**దేవరపల్లి,డిసెంబరు 3(ప్రభాతవార్త):** క్రీడలు మానసిక ఉల్లాసానికి శరీర దృఢత్వానికి ఎంతో దోహద పడతాయని పశ్చిమగోదావరి జిల్లా పరిషత్ చైర్మన్ ముళ్ళపూడి బాపిరాజు అన్నారు.మండల కేంద్రం దేవరపల్లిలో అంబటి సత్యనారాయణ జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాలలో బిహెచ్‌విఆర్ అండ్ విఎల్‌ఎం డిగ్రీ అండ్ పిజీ కళాశాలల ఆధ్వర్యంలో రాజమహేంద్రవరం ఆదికవి నన్నయ్య యూనివర్శిటీ అంతర్‌జిల్లాల ఫుట్‌బాల్ టోర్నమెంటు ముగింపు సమావేశం ఆదివారం సాయంత్రం జరిగింది.ఈ కార్యక్రమంలో ముఖ్యఅతిథిగా పాల్గొన్న జెడ్పీ చైర్మన్ బాపిరాజు మాట్లాడుతూ క్రీడాకారులు గెలుపు ఓటమిలను సమానంగా తీసుకుని జీవితంలో ఉన్నత స్థాయికి ఎదగాలని,రాష్ట్రంలో తెలుగుదేశం ప్రభుత్వం ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు క్రీడలకు ఎంతో ప్రాధాన్యత ఇస్తున్నారని అన్నారు.ఈ ఫుట్‌బాల్ టోర్నమెంట్ నిర్వహించిన బిహెచ్‌ఎస్‌ఆర్ అండ్ విఎల్‌ఎం డిగ్రీ అండ్ పీజీ కళాశాలలచైర్మన్ సువర్ణరాజును ఆయన అభినందించారు. కళాశాలకు తమవంతు సహాయ సహకారాలను అందిస్తామని అన్నారు. కళాశాలల చైర్మన్ డి సువర్ణరాజు మట్లాడుతూ క్రీడాకారులకు తమ కళాశాల ఫీజు రాయితీతో అనేక సౌకర్యాలు కల్పించడం జరుగుతుందన్నారు.ఈ ఫుట్‌బాల్ టోర్నమెంట్‌లో కాకినాడ ఆదిత్య కళాశాల ప్రథమ స్థానం,దేవరపల్లి బిహెచ్‌ఎస్‌ఆర్ అండ్ విఎల్‌ఎం డిగ్రీ అండ్ పీజీ కళాశాల ద్వితీయ స్థానం,రాజమండ్రి ప్రభుత్వ కళాశాల తృతీయ స్థానం,రాజమండ్రి ఎస్‌కెవిటి కళాశాల నాల్గవ స్థానం సాధించారు.వారికి జెడ్పీ చైర్మన్ బాపిరాజు బహుమతులు అందజేశారు. అనంతరం కళాశాల చైర్మన్ డి సువర్ణరాజు జెడ్పీచైర్మన్ బాపిరాజును ఘనంగా సత్కరించి, జ్ఞాపికను అందజేశారు. అలాగే పలువురు ప్రజాప్రతినిధులకు జ్ఞాపికలు అందజేశారు.ఈకార్యక్రమంలో జెడ్పీటీసీ సుధారాణి,మండల టిడిపి అధ్యక్షులు కొయ్యలమూడి చినబాబు,మాజీ అధ్యక్షులు సుంకర దుర్గారావు,మాజీ ఎఎంసి చైర్మన్ మురళీఅజిత్ కుమార్,టిడిపినాయకులు అనిశెట్టి ప్రభాకరరావు,ముమ్మిడి సత్యనారాయణ, ఎకెఎన్‌యు స్పోర్ట్స్ కార్యదర్శి సత్యనారాయణ తదితరులు పాల్గొన్నారు.

Printed and Published by Gireesh Sanghi, CMD and Managing Editor on behalf of AGA Publications Ltd., at D.No. 396, Lower Tankbund, Hyderabad - 500 080 Phone : 2764 4999. Fax: 040-27642512, RNI No. 62142/95, Editor : *Damerla Sai Baba, *Responsible for selection of News under the PRB Act. Regd.: No.HSD/337/15-17 **Air Surcharge:** Delhi : 40 Ps.




# ఆంధ్రభూమి




సంపుటి: 29 • సంచిక: 184 | విజయవాడ సిటీ | హైదరాబాద్, విశాఖపట్నం, విజయవాడ, రాజమహేంద్రవరం, అనంతపురం, కరీంనగర్, నెల్లూరు | www.andhrabhoomi.net | సోమవారం 4 డిసెంబర్, 2017 | 20 పేజీలు | ధర: ₹3.00

# 'దేశం'లో బీసీ సెగ!

## కాపులకు కోటాపై భగ్గుమన్న బలహీన వర్గాలు

- సచివులను తాకుతున్న వేడి
- వివరించడంలో మంత్రులు, నేతల వైఫల్యం
- సొంత ఎమ్మెల్యే కృష్ణయ్య తిరుగుబాటు

**ఆంధ్రభూమి ప్రత్యేక ప్రతినిధి**

అమరావతి, డిసెంబర్ 3: తెలుగుదేశం పార్టీకి పునాదిరాళ్లయిన బీసీలు భగ్గుమంటున్నారు. కాపులకు ఐదు శాతం రిజర్వేషన్ కల్పిస్తూ తెలుగుదేశం ప్రభుత్వం తీసుకున్న నిర్ణయంపై బీసీ వర్గాలు రోడ్డెక్కుతున్నాయి. స్వయంగా అధికార పార్టీకి చెందిన తెలంగాణ ఎమ్మెల్యే, బీసీ సంక్షేమ సంఘం అధ్యక్షుడు ఆర్ కృష్ణయ్య తిరుగుబాటు బావుటా ఎగురవేయడం, రిజర్వేషన్ ప్రకటించిన రోజునే రాష్ట్రంలో బీసీలు రోడ్డెక్కడం పార్టీకి తలనొప్పిలా మారింది. కాపులకు రిజర్వేషన్లు ఇచ్చినా దానివల్ల బీసీలకు ఎలాంటి నష్టం ఉండదని ముఖ్యమంత్రి, పార్టీ అధినేత చంద్రబాబు నాయుడు తొలి నుంచీ చెబుతున్నారు. ప్రధానంగా బీసీలు భయపడుతున్నట్లు కాపులకు రాజకీయ రిజర్వేషన్లు ఉండవన్న దానిపై బాబు చాలా కాలం నుంచీ స్పష్టత ఇస్తూ వస్తున్నారు. అయితే, దాన్ని అటు బీసీ మంత్రులు గానీ, ఇటు పార్టీ బీసీ నేతలు గానీ తమ వర్గాలకు వివరించకపోవడంతో ఇప్పుడు చిక్కులు వచ్చిపడుతున్నట్లు బీసీల ఆందోళనలు స్పష్టం చేస్తున్నాయి. తాజా పరిణామాలతో అటు బీసీ మంత్రులు, ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీలు, నియోజకవర్గ ఇన్చార్జిలుగా ఉన్న నేతలు చిక్కుల్లో పడ్డారు. కాపులకు రిజర్వేషన్ కల్పిస్తూ శాసనసభ తీర్మానించిన రోజు కాపుప్రతినిధులంతా బాబుకు మిఠాయిలు తినిపించడం, కాపు నేతలు సంబరాలు చేసుకోవడం, సీఎం ఫ్లెక్సీలకు పాలాభిషేకం చేయడం వంటి ఆనందోత్సాహాలు బీసీ వర్గాలను మరింత రెచ్చగొట్టినట్టయింది. ఈ క్రమంలో కేబినెట్‌లో ఉన్న బీసీ మంత్రులు, ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీలు, ఎంపీలు తమ స్వార్థ రాజకీయ ప్రయోజనాల కోసం కాపు రిజర్వేషన్‌ను అడ్డుకోనందుకే కాపులు రిజర్వేషన్ సాధించుకోగలిగారని, తమ జాతి నేతల వైఫల్యమే దానికి కారణమన్న ఆగ్రహం బీసీ సంఘాల్లో రగులుకుంది. నిజానికి కాపు మంత్రులు, ప్రజాప్రతినిధులంతా మొదటి నుంచీ రిజర్వేషన్‌పై కలసికట్టుగా ఉంటూ వ్యూహాత్మకంగా సర్కారుపై ఒత్తిడి చేస్తుంటే, తమ జాతి నేతలంతా ఐకమత్యం లేక తమ వారసులకు ప్రాజెక్టులు సంపాదించుకోవడం, పదవులు పొందడం, కాపాడుకునే పనిలో ఉన్నారన్న ఆగ్రహం చాలాకాలం నుంచీ బీసీల్లో బహిరంగంగానే వ్యక్తమవుతోంది. రిజర్వేషన్ ప్రభావం మిగిలిన జిల్లాల కంటే ఉభయ గోదావరి జిల్లాల్లోనే ఎక్కువగా కనిపిస్తోంది. దశాబ్దాల నుంచి బీసీ (శెట్టిబలిజ), కాపుల కులవైరం నేపథ్యంలో ఇప్పుడు కాపులను కూడా తమ జాబితాలో చేర్చడాన్ని ఆ రెండు జిల్లాల్లో అధికంగా ఉన్న శెట్టిబలిజలు జీర్ణించుకోలేకపోతున్నారు. రిజర్వేషన్ ప్రకటించిన రోజు రోడ్డెక్కి దిష్టిబొమ్మలు దగ్ధం చేసిన బీసీ వర్గాల్లో శెట్టిబలిజలే ముందువరసలో ఉండటం గమనార్హం. ఆ వర్గానికి ప్రాతినిధ్యం వహిస్తోన్న మంత్రి పీతాని సత్యనారాయణ విదేశాల్లో ఉండగా, కాపు రిజర్వేషన్లకు తన పార్టీ మద్దతు ఇస్తున్నప్పటికీ పార్టీ నిర్ణయాన్ని సైతం ధిక్కరించిన ఎమ్మెల్సీ, మాజీ మంత్రి పిల్లి సుభాష్ చంద్రబోస్ రిజర్వేషన్‌కు వ్యతిరేకంగా రోడ్డెక్కడాన్ని చూస్తే.. దీనిపై బీసీలు ఏ స్థాయిలో భగ్గుమంటున్నారో స్పష్టమవుతోంది. గోదావరి జిల్లాల్లో మెజారిటీగా ఉన్న శెట్టిబలిజలు టీడీపీకి సంప్రదాయ మద్దతుదారులుగా ఉన్న విషయం తెలిసిందే. ఇప్పుడు - మిగతా 7వ పేజీలో

# సంబరాలొద్దు

- ఎవరికీ ఇబ్బంది కలిగించొద్దు
- రిజర్వేషన్‌పై కాపు నేతలకు బాబు సూచన
- బీసీలకు నష్టం లేకుండానే కోటా
- టెలీకాన్ఫరెన్స్‌లో ముఖ్యమంత్రి వివరణ



**ఆంధ్రభూమి ప్రత్యేక ప్రతినిధి**

అమరావతి, డిసెంబర్ 3: 'కాపు రిజర్వేషన్లను ఓకే చేసి కేంద్రానికి పంపించాం. దాన్ని సాధించుకుందాం. ఈలోపు సంబరాలు చేసుకుని మరొకరికి ఇబ్బంది కలిగించవద్దు. బీసీల వ్యవహారంపై ఆయా వర్గాలకు నచ్చచెప్పి వివరించే బాధ్యతను మంత్రులు తీసుకోవాలి. మనం సమాజంలో వెనుకబడిన కులాలందరి పక్షాన ఉన్నాం. అన్ని కులాలు పేదరికం నుంచి బయటపడాలన్నదే మన సిద్ధాంతం. బీసీలు మన పార్టీకి పునాదిరాళ్లు. వారికి నచ్చచెప్పి వాస్తవాలు వివరించే బాధ్యత మీరే తీసుకోవాలి' అని ముఖ్యమంత్రి, టీడీపీ అధినేత చంద్రబాబు నాయుడు బీసీ మంత్రులను ఆదేశించారు. ఆదివారం - మిగతా 7వ పేజీలో



ఊపిరాడక లంకేయులులికిపడగ
బ్యాటు ఝళిపించు విరాట్పురుషుడగుచు
ఆట ఆగాగి సాగినా ఆడె కోహ్లి
బద్దలయ్యె రికార్డుల సుద్దులన్ని!

**టెస్టుల్లో కెప్టెన్‌గా అత్యధిక డబుల్ సెంచరీలు సాధించిన ఆటగాళ్ల జాబితాలో బ్రియాన్ లారా రికార్డును అధిగమించిన టీమిండియా కెప్టెన్ విరాట్ కోహ్లి. శ్రీలంకపై రెండో టెస్టులో డబుల్ సెంచరీతో రాణించిన అతను చివరి, మూడో టెస్టులోనూ డబుల్ సెంచరీ సాధించి ప్రపంచ రికార్డును నెలకొల్పాడు**

వివరాలు 8వ పేజీలో



## రిగ్గింగ్ వారికి రివాజు

కాంగ్రెస్ సంస్థాగత ఎన్నికలపై మోదీ వ్యంగ్యాస్త్రాలు

- 5వ పేజీలో

**ఘనగామా**




**ఒకటి కొంటే.. మరోటి ఫ్రీ! అంటే గిదేనేమో సార్!!**

# పోలవరంపై విచారణ జరిపితే అందరూ జైలుకే!

- నిజాలను సీఎం ప్రజలతో పంచుకోవాలి
- పోలవరంపై ఉండవల్లి సంచలన వ్యాఖ్యలు
- కాపు కోటాకు చట్టబద్ధత లేదని ప్రకటన



**ఆంధ్రభూమి బ్యూరో**

విజయవాడ, డిసెంబర్ 3: పోలవరం ప్రాజెక్టు టెండర్లు, సబ్ కాంట్రాక్టుల ప్రహసనంపై కేంద్రం విచారణ జరిపిస్తే ముఖ్యమంత్రి చంద్రబాబు సహా తెలుగుదేశం నేతలంతా జైలుకు వెళ్లడం ఖాయమని మాజీ ఎంపీ ఉండవల్లి అరుణ్‌కుమార్ సంచలన వ్యాఖ్యలు చేశారు. ఆదివారం విజయవాడ ప్రెస్‌క్లబ్‌లో పోలవరంపై ఆయన విలేఖరులతో మాట్లాడారు. పోలవరం ప్రాజెక్టు నిర్మిస్తే 800 టీఎంసీలు వాడుకున్నా ఎవరూ అడిగేవారు ఉండరని, ఇది ఆఖరి పాయింట్ కావడమే అందుకు కారణమన్నారు. శ్రీరాంసాగర్ తరువాత గ్రావిటీ ద్వారా నీరు తీసుకునే వీలు పోలవరం దగ్గరే ఉందని వైఎస్ రాజశేఖరరెడ్డి చెప్పారని గుర్తుచేశారు. 2005లోనే పోలవరం టెండర్లు పిలిచి ఒక్కో అనుమతిని వైఎస్ సాధించారన్నారు. పక్క రాష్ట్రాల అభ్యంతరాలపై కూడా నష్ట నివారణ చర్యలు తీసుకుంటామని ఆయన హామీ ఇచ్చారన్నారు. 2014లో పోలవరాన్ని జాతీయ ప్రాజెక్టుగా కేంద్రం ప్రకటించిందని, విభజన చట్టంలో పెట్టిన పోలవరాన్ని తాము నిర్మిస్తామని రాష్ట్రం ఎందుకు పట్టుబట్టిందని అరుణ్‌కుమార్ ప్రశ్నించారు. 2014 నాటి అంచనాల ప్రకారమే కేంద్రం నిధులు ఇస్తుందని ఆనాడే నీతి ఆయోగ్ చెబితే ముఖ్యమంత్రి ఎందుకు అంగీకరించారని నిలదీశారు. కేంద్రం నుంచి వచ్చిన లేఖలో అమర్‌జిత్ సింగ్ టెండర్లు నిలిపివేయమని సూచించారని, ఇ-ప్రొక్యూర్‌మెంట్ చేయాల్సిన ప్రభుత్వం రాష్ట్ర వెబ్‌సైట్‌లో ఆలస్యంగా ఎందుకు వివరాలు పెట్టిందని ఆ లేఖలో అభ్యంతరాలు తెలిపారన్నారు. పేపర్ నోటిఫికేషన్‌లో రూ. 1300 కోట్లని చూపి, వెబ్‌సైట్‌లో సుమారు రూ. 1400 కోట్లు వ్యయమౌతుందని పెట్టారని, ఇది కేవలం కాంట్రాక్ట్ కమీషన్ల - మిగతా 7వ పేజీలో

# మోసాలు, అబద్ధాలే!

## బాబు పాలనపై జగన్ ధ్వజం

### పట్టం కడితే మద్య నిషేధమే

### ప్రజాసంకల్ప యాత్రలో హామీ

ఆదోని, డిసెంబర్ 3 : రాష్ట్ర ప్రజలను మోసం చేస్తూ అబద్ధాలతో మభ్యపెడుతూ ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు పాలన సాగిస్తున్నారని వైకాపా అధినేత వైఎస్ జగన్మోహన్‌రెడ్డి తీవ్రస్థాయిలో విమర్శించారు. వైకాపా అధికారంలోకి వస్తే మద్య నిషేధాన్ని 3 దశల్లో చేస్తామని స్పష్టం చేశారు. ప్రజాసంకల్ప యాత్రలో భాగంగా ఆదివారం జగన్ ఆదోని డివిజన్‌లోని జి.ఎర్రగుడి గ్రామంలో నిర్వహించిన రైతు ఆత్మీయసభలో పాల్గొన్నారు. ఈ సందర్భంగా మాట్లాడుతూ సీఎం చంద్రబాబు దళారీ వ్యవస్థను ప్రోత్సహిస్తూ రైతులను దళారులకు అప్పజెప్పారని ధ్వజమెత్తారు. చంద్రబాబు హయాంలో రైతులకు ఒక్క ఏడాదైనా గిట్టుబాటు ధర కల్పించారా అని ప్రశ్నించారు. ప్రతి పెండింగ్ ప్రాజెక్టు లంచాలమయంగా మారిపోయిందని ఆరోపించారు. వైకాపా అధికారంలోకి వస్తే పెండింగ్ ప్రాజెక్టులన్నీ పూర్తి చేస్తామన్నారు. చంద్రబాబు చివరకు రాష్ట్రం వృద్ధి రేటును 12శాతంగా చూపుతూ ప్రజలను మాయమాటలతో మోసం చేస్తున్నారన్నారు. నిజంగా వృద్ధి 12శాతం ఉంటే ఏపీ యూరప్ దేశాల కంటే అగ్రస్థానంలో ఉన్నట్లే అన్నారు. చంద్రబాబుకు మనస్సాక్షి ఉంటే ఈ విషయంపై ఆత్మ పరిశీలన చేసుకోవాలని హితవు పలికారు. పులిచింతల ప్రాజెక్టు సమస్యను పరిష్కరించకపోవడం వల్ల రాష్ట్రం 45 టీఎంసీల నీటిని కోల్పోయే పరిస్థితి ఏర్పడిందన్నారు. రాయలసీమలోని కర్నూలు, కడప, అనంతపురం, చిత్తూరు జిల్లాల్లో 22శాతం వర్షం లోటు ఉందన్నారు. సీఎం చంద్రబాబు ఆధ్వర్యంలో ప్రతిసారి మంత్రి వర్గ సమావేశం నిర్వహిస్తున్నారని, అయితే వారు అందులో కరవు పరిస్థితులపై చర్చించడం లేదని మండిపడ్డారు. దీనికి తోడు కరవు ప్రాంతాలను ప్రకటించకపోవడం వల్ల రాయలసీమ ప్రాంతంలోని రైతులు తీవ్రంగా నష్టపోతున్నారన్నారు. నాగార్జునసాగర్ కుడి కాలువ కింద 140 టీఎంసీల నీరు ఉన్నా రైతులు పంటలు వేసుకోలేని పరిస్థితి ఉందన్నారు. ఎడమ కాలువ ద్వారా తెలంగాణ రైతులు పంటలు పండిస్తున్నారని స్పష్టం చేశారు. ప్రాజెక్టు కాంట్రాక్టర్లను కమీషన్లకు వినియోగించుకుంటున్నారని ఆరోపించారు. పట్టిసీమ బదులుగా పోలవరం నిర్మాణం పూర్తి చేసి ఉంటే గోదావరి జలాలు కృష్ణాకు మళ్లించే అవకాశం ఉండేదన్నారు. పట్టిసీమ వల్ల ఎలాంటి ప్రయోజనం లేదని, ఆ నీరు వృథాగా కృష్ణబ్యారేజీ గుండా సముద్రంలో కలుస్తున్నాయన్నారు. అయినా సీఎం చంద్రబాబు నిజాలు చెప్పకుండా ప్రజలను మోసం చేయడం సరికాదని విమర్శించారు.



**ఆదోని డివిజన్‌లోని ఎర్రగుడి గ్రామంలో జరిగిన రైతు ఆత్మీయ సభలో మాట్లాడుతున్న వైఎస్ జగన్**

# మహిళలూ బహుపరాక్!

- **అయినవాళ్లే.. కాలయముళ్లు!**
- **29 రాష్ట్రాలు, 7 కేంద్ర పాలిత ప్రాంతాల్లో 38,947 అత్యాచార కేసులు నమోదు**
- **34650 మందిని తెలిసినవారే..**
- **950 మందిని సమీప బంధువులే..**
- **572 మంది మహిళలపై కుటుంబ సభ్యుల అఘాయిత్యం**
- **1976 మంది మహిళలు బంధువుల బాధితులు**



**ఆంధ్రభూమి బ్యూరో**

హైదరాబాద్, డిసెంబర్ 3: వివాహిత మహిళలు, యువతుల అమాయకత్వం వారి మాన ప్రాణాలపైకి వస్తోంది. అయినవాళ్లంటూ చేరదీసి అత్యాచారానికి ఒడిగడుతున్నారు. నమ్ముకొని ఆశ్రయిస్తే.. అయినవాళ్లే కాటేస్తున్నారు.. రేపిస్టులంతా తెలిసినవారే కావడం విస్మయాన్ని కలిగిస్తోంది. మహిళలు తెలిసిన వాళ్లని, కుటుంబ మిత్రులని, స్నేహంగా ఉన్నారని చనువిచ్చారో..లైంగిక వేధింపులు, అత్యాచారాలకు గురికాక తప్పడం లేదు. కాబట్టి మహిళలూ ఎంతో జాగరూకతతో మెదలండి. మగాళ్ల క్రూరత్వానికి బలికావద్దు..అప్రమత్తతతో ఉండాలని ఎన్‌సీఆర్‌బీ సూచిస్తోంది. 2016లో మహిళలపై జరిగిన అత్యాచారాలపై జాతీయ నేర గణాంక సంస్థ(ఎన్‌సీఆర్‌బీ) తాజాగా విడుదల చేసిన నివేదిక వివరాలిలావున్నాయి. దేశంలోని 29 రాష్ట్రాలు, 7 కేంద్ర పాలిత ప్రాంతాల్లో మొత్తం 38,947 అత్యాచార కేసులు నమోదయ్యాయి. మహిళలపై అత్యాచారాల్లో 4882 కేసులతో మధ్యప్రదేశ్ అగ్రస్థానంలో ఉంది. 4816 కేసులతో ఉత్తరప్రదేశ్ రెండో స్థానంలో ఉంది.

ఆంధ్రప్రదేశ్‌లో 994 అత్యాచారం కేసుల్లో 994 కేసులు తెలిసినావారే - మిగతా 7వ పేజీలో



# 19 మందికి రివర్షన్లు

ఆంధ్రభూమి బ్యూరో

రాజమహేంద్రవరం, డిసెంబర్ 3: జలవనరుల శాఖలో తాజా ఉత్తర్వులు కలకలం సృష్టిస్తున్నాయి. తాజాగా రాష్ట్ర వ్యాప్తంగా 19 మంది ఎస్ఈ లకు రివర్షన్లు ఇచ్చారు. ఈ మేరకు శనివారం జీవో నెంబర్ 67, 70, 72, 73 మేరకు ఉత్తర్వులు వెలువడ్డాయి. పదోన్నతుల్లో భాగంగా ధవళేశ్వరం సర్కిల్ ఎస్ఈగా ఏలేరు ఇరిగేషన్ డిఈఈ, ధవళేశ్వరం హెడ్ వర్క్సు ఇన్‌చార్జి ఈఈగా పని చేస్తున్న కృష్ణారావుకు ఎస్ఈగా పదోన్నతి లభించింది. సెక్రటరీ శశిభూషణ్‌కుమార్ శనివారం ధవళేశ్వరం సర్కిల్ ఎస్ఈగా నియమిస్తూ ఉత్తర్వులు జారీ చేశారు. ఈ మేరకు ఆదివారం ఉదయం 11 గంటలల 13 నిముషాలకు కృష్ణారావు ధవళేశ్వరం ఇరిగేషన్ సర్కిల్ ఎస్ఈగా పదవీ బాధ్యతలు తీసుకున్నారు. జీవో నెంబర్ 67, జీఓ నెంబర్ 70 పేరుతో 2వ తేదీన ఉత్తర్వులు వెలువడ్డాయి. ఇదిలావుండగా ఇఎన్‌సీలు కూడా నిన్న మొన్నటి వరకు డీఈఈ స్కేల్‌లోనే జీతాలు తీసుకున్నారు. కార్యనిర్వాహక ఇంజనీర్ల నుంచి పర్యవేక్షక ఇంజనీర్లు, చీఫ్ ఇంజనీర్లు అంతా డీఈఈ స్కేల్‌లోనే పని చేశారు. ఇప్పటి వరకు డీఈఈ వరకే క్రమబద్ధీకరణ జరిగింది. జూనియర్లు పదోన్నతులు తెచ్చుకుని పెత్తనం చెలాయించారు. ఈ తరహా వారందరూ ఇపుడు డైవర్షన్ పొందారు. ప్యానల్ సంవత్సరాల మేరకు పదోన్నతులు కల్పించారు. ఈ మేరకు కేటగిరీల వారీగా సిఈలుగాను, ఎస్ఈలుగానూ, ఈఈలుగా అర్హులైనవారికి ఆయా పోస్టులు ఇస్తున్నారు. పోలవరం ఎల్ఎంసి ఎస్ఈ, క్వాలిటీ కంట్రోల్ సీఈగా బాధ్యతలు నిర్వహించిన ఎస్ సుగుణాకరరావు, ఇప్పటి వరకు ధవళేశ్వరం ఎస్ఈగా పని చేసిన బి రాంబాబును ప్రభుత్వానికి రిపోర్టు చేయాల్సిందిగా జల వనరుల శాఖ సెక్రటరీ శశిభూషణ్‌కుమార్ ఉత్తర్వులు జారీ చేశారు. జీవో నెంబర్ 67, జీ వో నెంబర్ 72, జీవో నెంబర్ 73 ప్రకారం రాష్ట్రంలో మొత్తం 19 మంది ఇంజనీర్లకు రివర్షన్ ఇచ్చారు. ఏలూరులో ఈ ఈగా పని చేసిన బీఎస్ సాయి శ్రీనివాస్‌కు ఎస్ఈ పదోన్నతి లభించింది. ఆయనను పోలవరం ఎల్ఎంసీ ఎస్ఈగా నియమించారు. ధవళేశ్వరం సర్కిల్ పరిధిలో సీతానగరం సబ్ డివిజన్‌లో డీఈఈగా పని చేస్తున్న పుల్లారావుకు ఎస్ఈగా పదోన్నతిపై విజయవాడలో పోస్టింగ్ ఇచ్చారు. పోలవరం ఎల్ఎంసి డీఈఈ, ఇన్‌ఛార్జి ఈఈగా పని చేస్తున్న ఎం శ్రీనివాసరెడ్డి ఎస్ఈగా పదోన్నతిపై నంధ్యాలకు బదిలీ చేశారు. ప్రస్తుతం ఇన్‌ఛార్జి బాధ్యతల్లో వున్న వారు తక్షణం ఆయా స్థానాల నుంచి రిలీవ్ కావాలని, ఆయా స్థానాల్లో పదోన్నతులు లభించిన వారు బాధ్యతలు స్వీకరించాలని ఉత్తర్వులు వెలువడ్డాయి.

## జలవనరుల శాఖలో కలకలం

# తెలంగాణకు ప్రతిష్ఠాత్మకం తెలుగు మహాసభలు

★ విస్తృతంగా ఏర్పాట్లు

ఆంధ్రభూమి బ్యూరో

హైదరాబాద్, డిసెంబర్ 3: ప్రపంచ తెలుగు మహాసభలకు హైదరాబాద్ ముస్తాబవుతోంది. సమైక్య ఆంధ్రప్రదేశ్ విభజన తర్వాత ఉభయ తెలుగు రాష్ట్ర ప్రభుత్వాలు తెలుగు భాష, సంస్కృతి, సంప్రదాయాల పరిరక్షణ, అభివృద్ధి కోసం పాటుపడుతున్నాయి. తెలంగాణ ప్రభుత్వం ఒక అడుగు ముందుకు వేసి ప్రపంచ తెలుగు మహాసభలను 2017 డిసెంబర్ 15 నుండి 19 వరకు నిర్వహిస్తోంది. ఈ సభలను ప్రభుత్వం ఒక సవాల్‌గా స్వీకరించి భారీ ఏర్పాట్లు చేస్తోంది. తెలంగాణ ప్రభుత్వం, తెలంగాణ సాహిత్య అకాడమీ సంయుక్తంగా ప్రతిష్టాత్మకమైన ప్రపంచ తెలుగు మహాసభలను నిర్వహిస్తున్నాయి. ముఖ్యమంత్రి కె.చంద్రశేఖరరావు ప్రత్యేకంగా ఈ అంశంపై ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటున్నారు. సిఎం తరచూ సమావేశాలు నిర్వహిస్తూ, ఏర్పాట్లను పర్యవేక్షిస్తున్నారు. మహాసభలను భారత ఉపరాష్ట్రపతి ఎం. వెంకయ్యానాయుడు ప్రారంభిస్తారని, ముగింపు సభలకు రాష్ట్రపతి రామ్‌నాథ్ కోవింద్ హాజరవుతారని నిర్వహకులు ప్రకటించారు. మహాసభల సందర్భంగా ప్రత్యేక సంచికలను ఆవిష్కరిస్తున్నారు. మహాసభల తరపున ఒక సంచిక, తెలంగాణ మాసపత్రిక తరపున మరొక సంచిక వెలువడుతున్నాయి. తెలంగాణ సాహిత్య అకాడమీ తరపున 100 పుస్తకాలను ఆవిష్కరించేందుకు ఏర్పాట్లు జరుగుతున్నాయి. సభలకు హాజరయ్యే అతిథులు, ప్రతినిధులకు వసతి, రవాణా కోసం ప్రత్యేక ఏర్పాట్లు జరుగుతున్నాయి. ఈ సభలకోసం 50 కోట్ల రూపాయలు కేటాయించారు. ప్రపంచ తెలుగు మహాసభల సన్నాహక సమావేశాలను ఇప్పటికే అమెరికా తదితర దేశాలతో పాటు భారత్‌లోని చెన్నై, బెంగుళూరు, ఢిల్లీ, ముంబై తదితర నగరాల్లో నిర్వహించారు. జిల్లాల్లో కూడా సన్నాహక సమావేశాలు, ర్యాలీలు నిర్వహిస్తున్నారు. సమావేశాల నిర్వహణ కోసం నాలుగు కమిటీలను వేశారు.

# చట్టబద్ధంగానే రిజర్వేషన్లు



- జస్టిస్ మంజునాథ వ్యాఖ్యలు అర్థరహితం
- మెజార్టీ సభ్యుల నివేదికే అనుకూలం
- కేంద్రంపైనా మాకు నమ్మకముంది
- న్యాయ శాఖ మంత్రి కొల్లు రవీంద్ర

ఆంధ్రభూమి బ్యూరో

మచిలీపట్నం, డిసెంబర్ 3: రాష్ట్రంలో ఆర్థికంగా, సామాజికంగా వెనుకబడిన కాపులకు ఐదు శాతం రిజర్వేషన్లను చట్టబద్ధంగానే కల్పించామని రాష్ట్ర న్యాయ, క్రీడలు, యువజన సంక్షేమ శాఖ మంత్రి కొల్లు రవీంద్ర అన్నారు. శాసనసభ, మండలి తీర్మానాలను కేంద్రం గౌరవించి రిజర్వేషన్లను రాజ్యాంగం తొమ్మిదో షెడ్యూలులో చేర్చేందుకు సానుకూలంగా స్పందిస్తుందనే ఆశాభావం వ్యక్తం చేశారు. కృష్ణా జిల్లా మచిలీపట్నంలోని రోడ్లు, భవనాల శాఖ అతిథి గృహంలో ఆదివారం ఆయన విలేఖరుల సమావేశంలో మాట్లాడారు. జస్టిస్ మంజునాథ కమిషన్ సభ్యుల నివేదికపై అడ్వకేట్ జనరల్, న్యాయ శాఖ కార్యదర్శితో పాటు న్యాయ నిపుణులతో కూలంకషంగా చర్చించిన తర్వాతే కాపులను బీసీ(ఎఫ్)గా గుర్తించి 5 శాతం రిజర్వేషన్లు ప్రకటించినట్లు మంత్రి రవీంద్ర చెప్పారు. కాపు రిజర్వేషన్ల అంశంపై జరుగుతున్న దుష్ప్రచారాన్ని ఆయన కొట్టిపారేశారు. ఎన్నికల్లో ఇచ్చిన హామీ మేరకు ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు కాపుల స్థితిగతులపై మంజునాథ కమిషన్‌తో అధ్యయనం చేయించి అందిన నివేదిక ప్రకారం 5 శాతం రిజర్వేషన్లు కల్పించేందుకు మంత్రి మండలితో పాటు శాసనసభలో ఏకగ్రీవంగా తీర్మానించినట్లు చెప్పారు. రిజర్వేషన్ల ప్రకటనపై జస్టిస్ మంజునాథ కమిషన్ చైర్మన్ మంజునాథ చేసిన వ్యాఖ్యలు అర్థరహితమని మంత్రి ఖండించారు. ఆయన కమిటీలో సీనియర్ మాత్రమేనని, ఆయన నివేదికతో తమకు పనిలేదని స్పష్టం చేశారు. ప్రభుత్వానికి నివేదిక అందించడంలో మంజునాథ తాత్సారం చేశారన్నారు. నలుగురు సభ్యులతో కూడిన కమిషన్‌లో ముగ్గురు సభ్యులు నాలుగు నుండి ఐదు శాతం వరకు రిజర్వేషన్లకు అనుకూలంగా ఇచ్చిన నివేదిక ఆధారంగానే ప్రభుత్వం 5 శాతం రిజర్వేషన్లు ప్రకటించిందన్నారు. చట్టబద్ధత లేదని మంజునాథ వ్యాఖ్యలు చేయడం సరికాదని, ఆయన వ్యాఖ్యలను పరిగణనలోకి తీసుకోవల్సిన అవసరమూ లేదని మంత్రి కొట్టిపారేశారు. కాపులకు 5 శాతం రిజర్వేషన్లు ఇచ్చే విషయంలో కేంద్రం కూడా సానుకూలంగా స్పందిస్తుందన్న ఆశాభావం వ్యక్తం చేశారు. తమిళనాడులో 50 శాతానికి మించి రిజర్వేషన్ల అమలుకు గతంలో కేంద్రం ఆమోదం తెలిపిందని గుర్తు చేశారు. ఆంధ్రప్రదేశ్‌లో కూడా ప్రస్తుతం ఉన్న 50 శాతం రిజర్వేషన్లకు అదనంగా కాపులకు ఇచ్చిన 5 శాతం అమలుకు కేంద్రం అంగీకారం తెలిపే అవకాశాలు మెండుగా ఉన్నాయన్నారు. దీనిపై ప్రతిపక్షాలు రాద్ధాంతం చేసి కాపులను పక్కదారి పట్టించే ప్రయత్నం చేస్తున్నాయని మంత్రి రవీంద్ర ఆగ్రహం వ్యక్తం చేశారు.

# రబ్బరు వేలిముద్రలు వచ్చేశాయ్!

- దళారుల సరికొత్త దందా
- కర్ణాటక నుంచి సరఫరా
- ఒక్కో రబ్బరు స్టాంప్ రూ. 10వేలు
- సర్కారు ఎత్తులకు పైఎత్తులు
- ఏదోలా నిధులు కాజేయటమే లక్ష్యం
- ట్రెజరీ అధికారులు అప్రమత్తమైతేనే అక్రమాలకు బ్రేక్

ఆంధ్రభూమి బ్యూరో

విజయవాడ, డిసెంబర్ 3: కొండ నాలుకకు మందేస్తే ఉన్న నాలుక ఊడినట్లు పెన్షన్ల పంపిణీలో అవకతవకలు, అక్రమాలను నిరోధించడానికి ప్రభుత్వం తీసుకొచ్చిన బయోమెట్రిక్ విధానానికి మసిపూసి మారేడుకాయ చేసి, తమ అక్రమాలను నిరాటంకంగా కొనసాగించేందుకు దళారులు సన్నద్ధమవుతున్నారు. ట్రెజరీ శాఖ ఉన్నతాధికారుల ఉదాశీనత కూడా ఇందుకు ఊతమిస్తోంది. ఫోర్జరీ సంతకాలతో రాష్ట్రవ్యాప్తంగా వివిధ ట్రెజరీ కార్యాలయాల్లో గడచిన ఏడాది కాలంగా దాదాపు వంద కోట్ల రూపాయల మేర నిధులు స్వాహా అయితే నేటికీ బాధ్యులైన ఏ ఒక్క అధికారి, సిబ్బందిపై చర్యలు తీసుకున్న దాఖలాలు లేవు. ఏళ్ల తరబడి ఒకే కార్యాలయంలో, ఒకే సీటులో పాతుకుపోయిన అక్రమార్కులు దళారులతో కుమ్మక్కయి పెన్షన్ సొమ్మును ఏవిధంగా దోచుకోవచ్చో చేసి చూపిస్తున్నారనే ఆరోపణలు ఇంకా వినిపిస్తూనే ఉన్నాయి. అయితే ఆలస్యంగా కళ్లు తెరిచిన ట్రెజరీ శాఖ తొలిసారిగా పెన్షన్‌దారులకు బయోమెట్రిక్ విధానాన్ని తెరపైకి తెచ్చింది. రాష్ట్రవ్యాప్తంగా దాదాపు 8 లక్షల మందికి పైగా ప్రభుత్వ పెన్షన్‌దారులందరూ మార్చి మాసాంతంలోగా తమ వేలిముద్రలు, తమ వివరాలు సబ్ ట్రెజరీ కార్యాలయాల్లో నమోదు చేయించుకోవాలనే ఆదేశాలు జారీ అయ్యాయి. గతంలో పెన్షన్‌దారు ప్రతి ఏటా విధిగా ట్రెజరీ కార్యాలయానికి వచ్చి తాను జీవించి ఉన్నట్లుగా సర్టిఫికెట్ అందించేవారు. సుదూర ప్రాంతాల్లో నివసించే పెన్షనర్లు రాలేరనే ఉద్దేశ్యంతో ఏడాదికోసారి గెజిటెడ్ అధికారి సంతకంతో లైఫ్ సర్టిఫికెట్ పోస్టులో పంపితే సరిపోయేలా నిబంధనలు మార్చారు. దీంతో అనేక మంది పెన్షన్‌దారులైన తమ కుటుంబ సభ్యులు ఎవరైనా మరణిస్తే ఆ సమాచారాన్ని దాచిపెట్టి ప్రతి ఏటా ఫోర్జరీ డాక్యుమెంట్లు పంపుతూ పెన్షన్ సొమ్మును ఏటీఎంల ద్వారా స్వాహా చేస్తున్న వైనాలూ వెలుగులోకి వచ్చాయి. దీన్ని గుర్తించిన ట్రెజరీ అధికారులు తొలిసారి తమ కార్యాలయానికి వచ్చి వేలిముద్రలు ఇచ్చి వెళ్లాలంటూ తిరిగి నిబంధన విధించారు. ఇదిలావుంటే, కర్నాటకలో కొందరు వేలిముద్రలను స్కాన్ చేసి వాటితో రబ్బరు ముద్రలు తయారుచేసి మన రాష్ట్రానికి పంపుతున్నట్లు తెలిసింది. ఇలా ఒక్కో రబ్బర్ స్టాంపును రూ.10 వేలకు విక్రయిస్తున్నారని సమాచారం. ఈ రబ్బరు స్టాంప్‌తో సమీప మీ సేవ కేంద్రం నుంచి వేలిముద్రలను ఆన్‌లైన్‌లో నేరుగా ట్రెజరీ కార్యాలయాలకు పంపించవచ్చని, దీన్ని ఎలాంటి పరిస్థితుల్లోనూ అనుమానించే ఆస్కారం లేదని దళారులు భావిస్తున్నారు. అందుకే పూర్వంలా ఏడాదికోసారి పెన్షన్‌దారు స్వయంగా కార్యాలయాలకు వచ్చి లైఫ్ సర్టిఫికెట్లు అందించటం ద్వారానే ఇలాంటి అక్రమాలను నివారించవచ్చని రిటైర్డ్ ట్రెజరీ అధికారులు చెబుతున్నారు. అయితే బయోమెట్రిక్ విధానం కూడా కొందరు పెన్షన్‌దారులకు శరాఘాతంగా మారింది. సుదూర ప్రాంతాల్లో ఉన్న వృద్ధ పెన్షన్‌దారులు పడుతూ లేస్తూ వచ్చి వేలిముద్రలు ఇవ్వబోతే చేతివేళ్లు అరిగిపోయి స్కాన్ కావటం లేదు. పోనీ ఐరిస్ తీసుకోమంటే తమకు ఆదేశాలు లేవని, మరోసారి వచ్చి వెళ్లండంటూ ట్రెజరీ అధికారులు తిరిగి పంపుతున్నారు. దీంతో వేలిముద్రలు వేయటానికి ఒకటికి పదిసార్లు తిరుగుతూ వృద్ధ పెన్షన్‌దారుల కాళ్లు అరిగిపోతున్నాయి. హైటెక్ ప్రభుత్వమే ఈ సమస్యలకు తగిన పరిష్కార మార్గం చూపాలని పెన్షన్‌దారులు కోరుతున్నారు.

# పోస్టాఫీస్ పాస్‌పోర్టు కేంద్రాలకు విశేష ఆదరణ

★ విశాఖ ప్రాంతీయ కార్యాలయంపై తగ్గిన ఒత్తిడి

విశాఖపట్నం, డిసెంబర్ 3: పాస్‌పోర్టు జారీలో ఎటువంటి జాప్యం లేకుండా చేయడం కోసం, అవినీతి, అక్రమాలకు తావు లేకుండా పారదర్శకతతో కూడిన సేవలందించేందుకు వీలుగా కేంద్రం ఇటీవల పోస్టాఫీస్ పాస్‌పోర్టు సేవా కేంద్రాలను ప్రవేశపెట్టింది. వీటికి విశేష ఆదరణ లభిస్తోంది. ఏపీలో పోస్టాఫీస్‌ల ద్వారా పాస్‌పోర్టుల జారీ కార్యక్రమాన్ని వేగవంతం చేయాలనే లక్ష్యంతో చిత్తూరు, నెల్లూరు, కర్నూలు, గుంటూరు జిల్లాలకు సంబంధించి పోస్టాఫీస్ పాస్‌పోర్టు సేవా కేంద్రాలను ఏర్పాటు చేశారు. ప్రతీ రోజు ఈ కేంద్రాల నుంచి వంద దరఖాస్తులు మాత్రమే స్వీకరించాలన్న పరిమితి ఉండేది. అయితే, అభ్యర్థుల నుంచి వస్తున్న ఆదరణను దృష్టిలో పెట్టుకుని, వీటి సంఖ్యను 250కు పెంచడంతో ఆనందం వ్యక్తమవుతోంది. దీంతో విదేశాలకు వెళ్ళే అభ్యర్థులకు పాస్‌పోర్టును సులభంగా పొందే అవకాశం ఎక్కువగా లభిస్తోంది. యుఎస్ఏ, కువైట్, సౌదీ అరేబియాలకు వెళ్ళే విద్యావేత్తలు, సాఫ్ట్‌వేర్ ఇంజనీర్లు, పారిశ్రామికవేత్తలు, వైద్యుల సంఖ్య పెరుగుతోంది. గతంలో ఏపీలో పలు జిల్లాల నుంచి విశాఖపట్నంలో ఉన్న ప్రాంతీయ పాస్‌పోర్టు కేంద్రానికి, పాస్‌పోర్టు సేవా కేంద్రం(పిఎస్‌కె)కు తరలివచ్చి దరఖాస్తు చేసుకోవడం అభ్యర్థులకు సమస్యగా మారేది. దీంతో కొంతమంది దళారులు అభ్యర్థుల నుంచి సొమ్ము చేసుకునే సంఘటనలపై ఫిర్యాదులు వెల్లువెత్తేవి. దీంతో అన్ని వర్గాల ప్రజల నుంచి సేవా కేంద్రాలను పెంచాలనే వినతులు కేంద్రానికి వెళ్ళాయి. వీటన్నింటినీ దృష్టిలోపెట్టుకున్న కేంద్ర విదేశాంగ మంత్రిత్వ శాఖ పాస్‌పోర్టు మంజూరును సులభతరం చేసింది. ఇందులో భాగంగానే పోస్టాఫీస్‌ల ద్వారా పాస్‌పోర్టు సేవలను అందివ్వాలని నిర్ణయించింది. ఏపీలో ప్రయోగాత్మకంగా కొన్ని జిల్లాలకు సంబంధించి పోస్టాఫీస్‌ల్లో కేంద్రాలను తెరిచింది. ఫలితంగా విశాఖపట్నం పాస్‌పోర్టు ప్రాంతీయ కార్యాలయంపై వత్తిడి తగ్గింది. అయితే, పోస్టాఫీస్ పాస్‌పోర్టు సేవా కేంద్రాల ద్వారా అభ్యర్థులు కేవలం దరఖాస్తు చేసుకోవాల్సి ఉంటుంది. ఇవి మళ్ళీ ఇక్కడి ప్రాంతీయ కార్యాలయానికే వస్తాయి. ఈ విధంగా వచ్చిన వాటిని పరిశీలించి అన్ని పత్రాలు సవ్యంగా ఉన్న తరువాతనే పోలీసు విచారణ జరిపిన మీదట పాస్‌పోర్టు తయారీ, దీనిని జారీ చేస్తారు. ఈ విధంగా ప్రతిరోజు స్పీడ్ పోస్టు ద్వారా జారీ అయ్యేవి రెండు నుంచి మూడు వేల వరకు ఉంటాయని కార్యాలయ వర్గాలు పేర్కొంటున్నాయి. విశాఖలో మాదిరి ఏపీ రాజధాని అమరావతిలో మరో పాస్‌పోర్టు ప్రాంతీయ కార్యాలయాన్ని ఏర్పాటు చేస్తే ఎనిమిది జిల్లాలకు చెందిన అభ్యర్థులకు మరింత సులభంగా పాస్‌పోర్టును పొందే అవకాశం లభిస్తుంది. కాగా, పరిపాలనపరమైన సౌలభ్యం కోసం ఎనిమిది జిల్లాలకు సంబంధించిన ప్రత్యేక విభాగం ఇక్కడి ప్రాంతీయ కార్యాలయంలో ప్రత్యేకంగా ఏర్పాటు చేశారు. దీంతో పాస్‌పోర్టులు జారీ ప్రక్రియను వేగవంతం చేసినట్టు అయ్యింది.

# పందికొక్కుల్లా దోచుకుంటున్న ఎమ్మెల్యేలు

- బీజేపీ ఎమ్మెల్సీ సోము వీర్రాజు ధ్వజం
- అవినీతి నిర్మూలనకే పోలవరం టెండర్లపై కేంద్రం సూచనలు చేసిందని స్పష్టీకరణ




బీసీ చైతన్య మహాసభలో మాట్లాడుతున్న ఎమ్మెల్సీ సోము వీర్రాజు

హిందూపురం, డిసెంబర్ 3: పోలవరం ప్రాజెక్టు నిర్మాణంలో ఏమాత్రం అవినీతికి అవకాశం కల్పించకుండా టెండర్లను 45 రోజుల పాటు ఆన్‌లైన్‌లో ఉంచాలని కేంద్ర ప్రభుత్వం సూచించగా టీడీపీ ప్రజాప్రతినిధులు అర్థం, పర్థం లేకుండా ప్రధాని మోదీని విమర్శించడం సిగ్గుచేటని భారతీయ జనతా పార్టీ శాసనమండలి సభ్యుడు సోము వీర్రాజు ధ్వజమెత్తారు. అనంతపురం జిల్లా హిందూపురం పట్టణంలో ఆదివారం నిర్వహించిన 'బీసీ చైతన్య మహాసభ'లో ఆయన మాట్లాడుతూ రాష్ట్ర ప్రభుత్వ తీరుపై నిప్పులు చెరిగారు. రాయలసీమ ప్రాంతానికి చెందిన ప్రజాప్రతినిధులకు దమ్ము, ధైర్యం ఉంటే తొలుత హంద్రీ-నీవా, గాలేరు నగరి, తెలుగు గంగ వంటి పెండింగ్‌లో ఉన్న సాగునీటి ప్రాజెక్టులను పూర్తి చేయించేందుకు పోరాటం చేయాలన్నారు. కేంద్ర ప్రభుత్వ సహకారం లేకపోతే పట్టిసీమ అనతికాలంలో పూర్తయ్యేదా అని ప్రశ్నించారు. పోలవరం ప్రాజెక్టు పనులు ఇప్పటికే 60 శాతం పూర్తయ్యాయని టీడీపీ ప్రజాప్రతినిధులు, అధికారులు పేర్కొన్నారని గుర్తుచేశారు. పోలవరం ప్రాజెక్టు నిర్మాణంలో నిబంధనలు పాటించాలని కేంద్ర ప్రభుత్వం సూచించగా టీడీపీ ప్రజాప్రతినిధులు మాత్రం కేంద్ర ప్రభుత్వం సహకరించడం లేదని, ప్రధాని మోదీ రాష్ట్రాలను కబళిస్తున్నారంటూ వ్యాఖ్యలు చేయడం ఎంతవరకూ సబబని ప్రశ్నించారు. ముఖ్యమంత్రి దగ్గర మోకాళ్లు ఒడ్డి, కండువాలు మార్చుకున్న వారు ప్రధాని మోదీని ఉద్దేశించి మాట్లాడటం విడ్డూరంగా ఉందన్నారు. ఇసుక అక్రమ రవాణాలో ఎమ్మెల్యేలే పందికొక్కుల్లా ప్రజాధనాన్ని దుర్వినియోగం చేస్తున్నారని మండిపడ్డారు.

ఇసుక రవాణాపై రాష్ట్ర ప్రభుత్వం నిబంధనలను గాలికి వదిలి ప్రభుత్వ ఆదాయానికి గండి కొడుతుందన్నారు. బీసీ వర్గానికి చెందిన మోదీని ప్రధానిని చేసిన ఘనత బీజేపీకి ఉందన్నారు. అయితే తమ ప్రాంతానికి చెందిన ఓబీసీ రాష్ట్ర మంత్రికి కనీసం అధికారులను బదిలీ చేసే హక్కు కూడా లేకపోవడం దారుణమన్నారు. బీజేపీ కేంద్ర మంత్రి పదవులను బీసీలకు కట్టబెట్టి పాలన విషయంలో నిజాయితీగా పని చేసేలా పూర్తిస్థాయిలో స్వేచ్ఛ కల్పిస్తోందన్నారు.

# సబ్ సెంటర్ల స్థాయిలో రాష్ట్రంలో టెలీ మెడిసిన్!

★ సర్కారు ప్రతిపాదన

★ సర్వీస్ ప్రొవైడర్ల కోసమేనని విమర్శలు

ఆంధ్రభూమి బ్యూరో

విజయవాడ, డిసెంబర్ 3: సబ్ సెంటర్ల స్థాయిలో టెలీ మెడిసిన్‌ను అందుబాటులోకి తెచ్చేందుకు రాష్ట్ర ప్రభుత్వం రంగం సిద్ధం చేస్తోంది. అయితే గ్రామీణ ప్రాంతాల్లో సాధారణ వైద్యసేవలే అంతంతమాత్రంగా అందుతున్న నేపథ్యంలో దీనివల్ల ప్రభుత్వ ఖజనాపై అదనపు భారం తప్ప, ప్రజలకు పెద్దగా ఒరిగేదేమీ ఉండదనే విమర్శలు వినిపిస్తున్నాయి. కొద్ది నెలల క్రితం 'ముఖ్యమంత్రి ఆరోగ్య కేంద్రాలు' పేరుతో 222 కేంద్రాలను ప్రభుత్వం ప్రారంభించింది. వాటి పనితీరు చూసి చాలాచోట్ల రోగులు పెద్దగా ఆసక్తి చూపటం లేదు. దీంతో ఆయా కేంద్రాల్లో ఔట్ పేషెంట్ల శాతం తక్కువగా ఉంటోంది. స్పెషలిస్టు సేవలను టెలీ మెడిసిన్ విధానం ద్వారా ఈ కేంద్రాల్లో ప్రభుత్వం అందుబాటులోకి తెచ్చింది. ఏ స్పెషలిస్టు ఎప్పుడు అందుబాటులో వుంటారో తెలియని పరిస్థితి నెలకొంది. స్పెషలిస్టులతో మాట్లాడేందుకు కొన్ని గంటలు, రోజుల పాటు వేచి ఉండాల్సి రావడం వంటి కారణాలతో టెలీ మెడిసిన్ తరహా స్పెషలిస్టుల సేవలకు ఆదరణ అంతంతమాత్రంగా ఉంటోంది. దీనికితోడు నెట్‌వర్క్, వీడియో కాన్ఫరెన్స్, తదితర సౌకర్యాలు సరిగా లేకపోవడంతో స్పెషలిస్టుతో మాట్లాడటం రోగుల సహనాన్ని పరీక్షిస్తోంది. ఇప్పటికే ప్రారంభించిన టెలీ మెడిసిన్ తరహా వైద్యసేవలు అర్బన్ ప్రాంతాల్లోనే అంతంతమాత్రంగా ఉంటున్న నేపథ్యంలో సబ్ సెంటర్ల స్థాయిలో ప్రారంభిస్తామన్న వైద్య శాఖ మంత్రి కామినేని శ్రీనివాస్ ప్రకటన విమర్శలకు తావిస్తోంది. పీహెచ్‌సీల పరిధిలో సబ్ సెంటర్లు ఉంటాయి. అక్కడ కూడా టెలీ మెడిసిన్ సేవలు అందుబాటులోకి తేవాలనే లక్ష్యం మంచిదే అయినా, అమల్లో ఎంతవరకూ ప్రజలకు మేలు చేస్తుందన్నది సందేహమే. ఇప్పటికే గ్రామీణ, గిరిజన ప్రాంతాల్లో వైద్యులు స్థానికంగా ఉండటం లేదన్నది బహిరంగ రహస్యమే. ఉన్న వైద్య వ్యవస్థను పటిష్ఠం చేయకుండా కొత్తగా సేవలు ప్రారంభించడం కొందరు సర్వీస్ ప్రొవైడర్లను పోషించడానికేననే విమర్శలు వినిపిస్తున్నాయి. అయినప్పటికీ ప్రభుత్వం ఇప్పటికే టెండర్లను ఆహ్వానించింది.

# ఆయిల్ మాఫియా లీడర్‌ను కాపాడే యత్నం!

- అధికార పార్టీ నేతల విశ్వప్రయత్నాలు
- పోలీసుల తీరుపై సర్వత్రా విమర్శలు
- నిరాహార దీక్షకు బీజేపీ నేత సన్నద్ధం

ఆంధ్రభూమి బ్యూరో

కాకినాడ, డిసెంబర్ 3: కాకినాడ పోర్టు పరిసర ప్రాంతాల్లో ఆయిల్ మాఫియాను నడిపిస్తోన్న ప్రధాన నిందితులను రక్షించేందుకు అధికార టీడీపీకి చెందిన నేతలు విశ్వప్రయత్నాలు సాగిస్తున్నట్టు తెలుస్తోంది. ఇటీవల కాకినాడలో వెలుగుచూసిన ఆయిల్ చోరీకి సంబంధించి పాత నేరస్థులు పావులుగా మారగా, పెద్దలుగా చలామణీ అవుతున్న కీలక నేరస్థులు తెర వెనుక వత్తిళ్ళతో బయట పడేందుకు విశ్వప్రయత్నాలు సాగిస్తున్నట్టు సమాచారం! ఈ పరిణామానికి భారతీయ జనతా పార్టీ నేతలు తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు. కీలక నిందితులను రక్షించేందుకు టీడీపీ నేతలు ప్రయత్నిస్తుండటం, పోలీసులు ప్రేక్షక పాత్ర వహించడానికి నిరసనగా బీజేపీ జిల్లా అధ్యక్షుడు యెనిమిరెడ్డి మాలకొండయ్య కాకినాడలో ఈనెల 5వ తేదీ నుండి నిరాహార దీక్ష చేయనున్నట్టు ప్రకటించారు. కాకినాడ ఆయిల్ మాఫియాకు అధికార పార్టీ నాయకులకు మధ్య చాలా కాలంగా సత్సంబంధాలున్నట్టు ప్రచారం జరుగుతోంది. కాకినాడ పోర్టు పరిసరాల్లోని స్టోరేజ్ ట్యాంకులకు చెందిన పైపులైన్‌లకు మాఫియా కన్నం వేసి చోరీ చేస్తోంది. సుమారు రెండు సంవత్సరాలుగా ఈ దందా జరుగుతోంది. చమురు కంపెనీల ఫిర్యాదుల మేరకు ఎట్టకేలకు పోలీసులు రంగంలోకి దిగారు. నిఘాలో భాగంగా ఆయిల్ చోరీకి పాల్పడుతున్నారంటూ ఆరుగురు నిందితులను ఇటీవల పోలీసులు అరెస్టు చేశారు. అయితే స్థానిక ఎమ్మెల్యేకు ప్రధాన అనుచరుడిగా ఉన్న ఓ వ్యాపారి ఈ ఆయిల్ మాఫియాను నడిపిస్తున్నట్టు బయటకు వచ్చింది. సదరు నేతను ప్రస్తుతం రక్షించేందుకు అధికార పార్టీకి చెందిన ఇద్దరు నేతలు రంగంలోకి దిగినట్టు భోగట్టా! కేసు నుండి సదరు ప్రధాన నిందితుడిని తప్పించేందుకు వారు విశ్వప్రయత్నాలు సాగిస్తున్నట్టు సమాచారం! ప్రధాన నిందితుడైన సదరు టిడిపి నేత పార్టీలోని ఓ విభాగానికి జిల్లా అధ్యక్షుడిగా కూడా వ్యవహరిస్తుండటం గమనార్హం! సుమారు రెండు సంవత్సరాలుగా ఈ ఆయిల్ దందా సాగుతున్నట్టు పోలీసులు గుర్తించారు. కోట్ల రూపాయల విలువైన క్రూడ్, పామాయిల్స్‌ను మాఫియా ఇక్కడి నుండి చోరీ చేస్తోంది. క్రూడాయిల్‌ను నెల్లూరు, చీరాల మార్కెట్లకు తరలివెళ్తున్నట్టు తెలిసింది. పామాయిల్‌ను స్థానిక అధికార పార్టీ నేత ఆధ్వర్యంలో విక్రయిస్తున్నట్టు తెలుస్తోంది. గతంలో నెల్లూరులో జరిగిన ఆయిల్ మాఫియా దాడిలో తీవ్రంగా గాయపడిన ఓ పాత నేరస్థుడిని తాజాగా కాకినాడ పోలీసులు అరెస్టు చేశారు. అయితే సదరు చోరులు పామాయిల్‌ను టీడీపీకి చెందిన స్థానిక వ్యాపారికి విక్రయిస్తున్నట్టు అంగీకరించినప్పటికీ సదరు ప్రధాన నిందితుడిపై చర్యలకు పోలీసులు జంకడానికి వెనుక అధికార పార్టీ ముఖ్య నేతల వత్తిళ్ళే కారణమని తెలిసింది. ముఖ్యంగా ఇటీవల వెలుగుచూసిన ఆయిల్ మాఫియా దందాలో సదరు టీడీపీ నేతకు చెందిన ఆయిల్ ట్యాంకర్, పెద్ద ఎత్తున పామాయిల్‌ను పోలీసులు స్వాధీనం చేసుకున్నారు. అలాగే సదరు నేతకు చెందిన ధనలక్ష్మి ఆయిల్ కంపెనీ ప్రతినిధిని కూడా ముద్దాయిగా పేర్కొన్నప్పటికీ అరెస్టు చేయకపోవడం అనేక అనుమానాలకు తావిస్తోంది. కాగా ధనలక్ష్మి ఆయిల్ కంపెనీకి చెందిన టీడీపీ నేత కాకినాడ నగరంలోని శ్రీ బాలాత్రిపుర సుందరి ఆలయ పాలక మండలి ఛైర్మన్ కావడం దురదృష్టకరమని ఆ ఆలయ మాజీ ఛైర్మన్ జొన్నాడ చినబాబు ఆరోపించారు. ఆదివారం కాకినాడలో చినబాబు విలేఖరులతో మాట్లాడుతూ ఆలయంలో అమ్మవారి బంగారు చీరె, ఆభరణాలకు భద్రత లేదని ఆందోళన వ్యక్తం చేశారు. ఇదిలావుండగా ఆయిల్ మాఫియాను నడిపిస్తున్న అసలు నేరస్థులపై చర్యలు తీసుకోకుండా తాత్సారం వహించడాన్ని నిరసిస్తూ ఈనెల 5వ తేదీ నుండి కాకినాడలో నిరాహార దీక్ష చేపట్టనున్నట్టు భారతీయ జనతా పార్టీ తూర్పు గోదావరి జిల్లా అధ్యక్షుడు యెనిమిరెడ్డి మాలకొండయ్య స్పష్టం చేశారు. ఆయిల్ మాఫియా వెనుక అసలు నేరస్థులను శిక్షించేవరకు ఆందోళన సాగిస్తామని, ఈ అక్రమాన్ని ప్రధాని నరేంద్రమోదీ దృష్టికి తీసుకువెళ్తామని ఆంధ్రభూమి ప్రతినిధికి చెప్పారు.

# రూ. 36,552 కోట్ల రబీ రుణాల పంపిణీ లక్ష్యం

- వ్యవసాయ మంత్రి చంద్రమోహన్‌రెడ్డి ఆదేశం
- బ్యాంకర్లతో కలెక్టర్ల విస్తృత సమావేశాలు

ఆంధ్రభూమి బ్యూరో

విజయవాడ, డిసెంబర్ 3: 2017-18 ఆర్థిక సంవత్సరంలో ఖరీఫ్ సీజన్ పూర్తికావస్తున్న నేపథ్యంలో ముందస్తుగానే రబీలో సాగుకు రైతులను సమాయత్తం చేసేందుకు రాష్ట్ర వ్యవసాయ శాఖ పరుగులు తీస్తోంది. నాట్లకు ముందే రైతుల చేతికి రుణాలు అందేలా చూడాలంటూ వ్యవసాయ శాఖ మంత్రి సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి 13 జిల్లాల కలెక్టర్లను ఇప్పటికే సన్నద్ధం చేయగా వారు బ్యాంకర్లతో తరచూ సమావేశాలు నిర్వహిస్తున్నారు. ప్రస్తుత రబీ కోసం పంట రుణాలుగా రూ. 24,370 కోట్లు, అనుబంధ రంగాలతో పాటు వ్యవసాయ కాలపరిమితి రుణాలు రూ. 12,182 కోట్లు వెరశి రూ. 36,552 కోట్లు రుణంగా సమకూర్చాలనేది ప్రభుత్వ లక్ష్యం. దాదాపు అన్ని జిల్లాల్లో కొద్దిరోజులుగా రుణాల మంజూరు ప్రక్రియ ప్రారంభమైంది. ఇందులో జిల్లాల వారీగా లక్ష్యాలు ఇలా ఉన్నాయి. అత్యధికంగా తూర్పు గోదావరి జిల్లాకు రూ. 4 వేల 824 కోట్ల 80లక్షలు, గుంటూరు జిల్లాకు రూ. 4వేల 764 కోట్ల 37లక్షలు, పశ్చిమ గోదావరి జిల్లాకు రూ. 4వేల 217 కోట్ల 36లక్షలు, ప్రకాశం జిల్లాకు రూ. 3వేల 753 కోట్లు, నెల్లూరు జిల్లాకు రూ. 3వేల 565 కోట్ల 55 లక్షలు, కృష్ణా జిల్లాకు రూ. 3వేల 561 కోట్లు, చిత్తూరు జిల్లాకు రూ. 2వేల 833 కోట్ల 8లక్షలు, కర్నూలు జిల్లాకు రూ. 2వేల 224 కోట్లు, వైఎస్సార్ కడప జిల్లాకు రూ. వెయ్యా 869 కోట్ల 10 లక్షలు, శ్రీకాకుళం జిల్లాకు రూ. వెయ్యా 523 కోట్ల 34 లక్షలు, విశాఖ జిల్లాకు రూ. వెయ్యా 289 కోట్ల 44 లక్షలు, అనంతపురం జిల్లాకు రూ. వెయ్యా 266 కోట్ల 69 లక్షలు, విజయనగరం జిల్లాకు రూ. 860 కోట్ల 15లక్షలు వచ్చే మార్చి మాసాంతానికి పంపిణీ జరిగేలా చూడాలంటూ కలెక్టర్లకు ఆదేశాలు జారీ చేశారు. ఇక ప్రస్తుత ఖరీఫ్ సీజన్‌లో రూ. 50వేల 918కోట్ల 63లక్షలు రుణాలుగా పంపిణీ చేయాలన్నది లక్ష్యం కాగా రూ. 47 వేల 751 కోట్ల 33 లక్షలు (93.78 శాతం) పంపిణీ జరిగింది. గత మూడేళ్లుగా ఖరీఫ్, రబీ సీజన్లలో రైతు రుణాల పంపిణీని పరిశీలిస్తే 2014-15లో మొత్తం లక్ష్యం రూ. 56వేల 019 కోట్ల 17లక్షలు కాగా, రూ. 39వేల 938 కోట్లు పంపిణీ జరిగింది. 2015-16లో లక్ష్యం రూ. 65వేల 272కోట్ల 26లక్షలు కాగా, దాన్ని అధిగమించి రూ. 75వేల 448కోట్ల, 10లక్షలు (115.59 శాతం) పంపిణీ జరిగింది. 2016-17లో లక్ష్యం రూ. 83వేల 03కోట్లు కాగా రూ. 78వేల 113కోట్లు (94.11 శాతం) పంపిణీ జరిగింది. 2014-15లో మాత్రం రుతుపవనాల జాప్యం వల్ల సాగుకు అనుకూలించక ఖరీఫ్ సీజన్‌లో చాలామంది రైతులు రుణాలు అందుకోలేకపోయారని అధికారులు వివరించారు.



తిరుమల శ్రీవారి ఆలయంలో కార్తీకదీప వైభవం

# కన్నుల పండువగా కార్తీక దీపోత్సవం

**ఆంధ్రభూమి బ్యూరో**

తిరుపతి, డిసెంబర్ 3: కార్తీక పౌర్ణమి పర్వదినాన్ని పురస్కరించుకుని శ్రీవారి ఆలయంలో ఆదివారం కార్తీక దీప మహోత్సవం కన్నుల పండువగా జరిగింది. కార్తీక పున్నమినాడు సా. 5 గంటల నుంచి రాత్రి 8 గంటల వరకు దీపోత్సవాన్ని భక్తిశ్రద్ధలతో నిర్వహించారు. ఈ సందర్భంగా ముందుగా ఆలయంలో ఉపాలయమైన యోగ నరసింహస్వామి ఆలయం పక్కనున్న పరిమళ అరవద్ద 100 కొత్త మూకుళ్లలో నేతి దీపాలు వెలిగించారు. వీటిని ఛత్ర చామర మంగళ వాయిద్యాలతో విమాన ప్రదక్షిణంగా స్వామి సన్నిధికి చేరుకుని స్వామివారికి హారతి పట్టారు. అనంతరం గర్భాలయం నుంచి మహాద్వారం వరకు ఆలయం వెలుపల ఉన్న బేడీ ఆంజనేయస్వామి ఆలయం, వరాహస్వామి ఆలయం, పుష్కరణి వద్ద మంగళవాయిద్యాల మధ్య దీపాలను వెలిగించారు. పౌర్ణమి నాడు వినీలాకాశంలో చంద్రబింబం వెలుతురులో భువిపై వెలిగిన కార్తీక దీపకాంతులు భక్తుల హృదయాలను జ్ఞానజ్యోతులను వెలిగించేలా సాగాయి. ఈ కార్యక్రమంలో ఈఓ ఏకె సింఘాల్, జేఈఓ శ్రీనివాసరాజు, ఆలయ డిప్యూటి ఈఓ కోదండరామారావు పాల్గొన్నారు.

# సూరత్ వద్ద తీరం దాటనున్న ఓఖీ

- దక్షిణ కోస్తాకు వాయుగుండం
- తమిళనాడు, దక్షిణ కోస్తాకు వర్ష సూచన

**ఆంధ్రభూమి బ్యూరో**

విశాఖపట్నం, డిసెంబర్ 3: తమిళనాడు, కేరళ రాష్ట్రాలను వణికిస్తున్న ఓకీ తుపాను ఈ నెల అయిదోతేదీన గుజరాత్ రాష్ట్రం సూరత్ వద్ద తీరాన్ని దాటనుందని విశాఖ తుపాను హెచ్చరికల కేంద్రం అధికారులు ఆదివారం రాత్రి తెలిపారు. ప్రస్తుతం లక్షద్వీప్‌లోని అమినీ దీవికి 480 కిలోమీటర్ల దూరంలో ఉన్న ఓకీ తుపాను పశ్చిమ వాయువ్య దిశగా పయనిస్తోందన్నారు. ఇది క్రమంగా బలహీన పడి తీరాన్ని దాటే సమయంలో వాయుగుండంగా మారుతుందన్నారు. ఆగ్నేయ బంగాళాఖాతం అండమాన్ తీరంలో ఏర్పడిన తీవ్ర అల్పపీడనం మరో 24 గంటల్లో వాయుగుండంగా బలపడనుందని తెలిపారు. దీని ప్రభావంతో దక్షిణ కోస్తా, ఉత్తర తమిళనాడుల్లో వర్షాలు కురిసే అవకాశాలున్నాయని వాతావరణ శాఖ పేర్కొంది.

# పల్లెల్లో ఇక 'వెలుగు' దివ్వెలు!

- గ్రామ వీధుల్లో ఎల్‌ఈడీ దీపాలు.. దశలవారీగా అన్ని గ్రామాలకు
- పనుల వేగానికి రన్ రేట్ మెకానిజం
- సీఎం, పంచాయతీరాజ్ డ్యాష్ బోర్డులతో అనుసంధానం
- అధికారులకు సర్పంచ్‌లు సహకరించాలి: మంత్రి లోకేష్

**ఆంధ్రభూమి ప్రత్యేక ప్రతినిధి**

అమరావతి, డిసెంబర్ 3: ఎల్‌ఈడీ వీధిదీపాల ఏర్పాటు కార్యక్రమాన్ని పట్టణ ప్రాంతాల్లో విజయవంతంగా అమలు చేసిన రాష్ట్ర ప్రభుత్వం ఇప్పుడు గ్రామాలకూ విస్తరింపజేయాలని నిర్ణయించింది. పట్టణ ప్రాంతాల్లో ఎల్‌ఈడీ వీధిదీపాల పథకం ద్వారా దేశంలో నెంబర్ వన్‌గా నిలిచిన రాష్ట్ర ప్రభుత్వం, ఇంధనం ఆదా ద్వారా ఆర్థిక లబ్ధితో ప్రజల జీవన ప్రమాణాల మెరుగుదలకు గ్రామీణ ప్రాంతాల్లోనూ ఎల్‌ఈడీ వీధిదీపాల ఏర్పాటుకు సిద్ధమౌతోంది. పల్లెల్లో ఎల్‌ఈడీ వీధి దీపాలు వేగవంతంగా ఏర్పాటు చేయడానికి రన్ రేట్ మెకానిజం అవసరమని పంచాయతీ రాజ్, ఐటీ శాఖల మంత్రి నారా లోకేష్ అధికారులకు సూచించారు. ప్రస్తుతం గ్రామాల్లో ఎన్ని ఎల్‌ఈడీ వీధిదీపాలున్నాయి? కొత్తగా ఎన్ని వేశారు? సమయం, గ్రామాలు, విద్యుత్ స్తంభాల వారీగా ఏర్పాటు చేసే సంస్థల ప్రతిభను మెరుగుపర్చడానికి ఇది దోహదపడుతుందని ఆయనన్నారు. ఆదివారం జరిగిన టెలికాన్ఫరెన్స్‌లో పంచాయతీరాజ్, గ్రామీణాభివృద్ధి శాఖ ముఖ్య కార్యదర్శి జవహర్ రెడ్డి, ఇంధన శాఖ, సీఆర్‌డీఏ ముఖ్య కార్యదర్శి అజయ్ జైన్, ఐటీ శాఖ ముఖ్య కార్యదర్శి విజయానంద్, ఏపీ ట్రాన్స్‌కో జేఎండీ, ఇన్‌ఛార్జి సీఎండీ దినేష్ పరుచూరి, ఏపీ ఈపీడీసీఎల్ సీఎండీ హెచ్‌వై దొర, పంచాయతీరాజ్ కమిషనర్ బీ రామాంజనేయులు, నెడ్‌క్యాప్ వీసీ కమలాకర్ బాబు, పంచాయతీరాజ్ నోడల్ అధికారి పరదేశి కుమార్, భారత ప్రభుత్వ సంస్థ ఈఈఎస్‌ఎల్ ప్రతినిధి శశికాంత్‌లతో మంత్రి లోకేష్ మాట్లాడారు. ఎల్‌ఈడీ బల్బుల కార్యక్రమంలో ప్రధానమైన మూడో వైర్ ఏర్పాటును యుద్ధప్రాతిపదికన పూర్తిచేయాలని ఆయన ఇంధన శాఖను కోరారు. ఎల్‌ఈడీ వీధిదీపాలు అమర్చడం ద్వారా గ్రామీణ ప్రజల జీవన ప్రమాణాలు మెరుగుపరచాలన్నదే ముఖ్యమంత్రి ధ్యేయమని, రాష్ట్ర ఆర్థికాభివృద్ధిలో గ్రామీణాభివృద్ధిది కీలకపాత్ర అని చెప్పారు. గ్రామీణ వికాసానికి ప్రభుత్వం పెద్దఎత్తున మౌలిక సదుపాయాల ప్రాజెక్టులను చేపట్టిందని, సిమెంటు రోడ్లు నిర్మిస్తోందన్నారు. గ్రామీణ ప్రాంతాల్లో పర్యావరణ పరిరక్షణ, సాంఘిక, ఆర్థిక ప్రయోజనాల కోసం ఎల్‌ఈడీ వీధిదీపాలు దోహదపడతాయన్నారు. కొత్త వీధిదీపాలు, కొత్త సిమెంట్ రోడ్లతో గ్రామాలు నూతన శోభను సంతరించుకుంటాయన్నారు. కేంద్రీయ నియంత్రిత, సమన్వయ వ్యవస్థలో ప్రపంచ స్థాయి సాంకేతికతను తీసుకురావాల్సిన అవసరం ఉందన్నారు. ఈ కార్యక్రమాన్ని సీఎం డ్యాష్‌బోర్డు, తన డ్యాష్‌బోర్డుతో అనుసంధానించి ఎప్పటికప్పుడు పనితీరు వివరాల తాజా సమాచార అంచనాకు సహకరించాలన్నారు. సీఎం కోర్ డ్యాష్ బోర్డులో, మంత్రి డ్యాష్ బోర్డులో ఎన్ని దీపాలు వెలిగితే అంతమేర పని జరిగినట్టు నిర్ధారణకు వస్తామన్నారు. డిసెంబర్ 1 ప్రారంభించి 15దాకా రోజుకు వెయ్యి ఎల్‌ఈడీ బల్బులు అమర్చటాన్ని ఈఈసీఎల్ లక్ష్యంగా పెట్టుకుందని, ఆ తరువాత రోజుకు 6వేల లైట్లు ఏర్పాటు చేస్తారని తెలిపారు. ఎల్‌ఈడీ వీధిదీపాల సరఫరాకు ఈఈఎస్‌ఎల్ ఒక సమగ్ర ప్రణాళికతో ముందుకు రావాలని సూచించారు. వాస్తవంగా విక్రేతలు ఎన్ని దీపాలు సరఫరా చేయగలుగుతున్నారనే అంశాన్ని దృష్టిలో ఉంచుకోవాలన్నారు. మండల స్థాయిలో విద్యుత్ సమస్యలు తలెత్తి ఎల్‌ఈడీ లైట్లు సరిగ్గా పనిచేయని పక్షంలో ఆటోమేటిగ్గా సరిచేసే విధానం ఉండాలన్నారు. ఈ విద్యుత్ దీపాలు నిర్దేశిత సమయాల్లో వాటంతటవే వెలిగి, అవే ఆగిపోయేలా ఉండేందుకు పరిశీలించాలని, సీసీఎంఎస్ బాక్సులతో విద్యుత్తు ఆదా ఎలా చేస్తున్నారో, అలాగే ఆటోమేటిగ్గా వీధిదీపాలు ఆన్, ఆఫ్ అయ్యేలా చూడాలని సూచించారు. మూడో వైరు లేని ప్రాంతంలో బిగించే పనులను త్వరితగతిన చేపట్టాలన్న మంత్రి లోకేష్ ఆదేశాలపై అజయ్ జైన్, విజయానంద్ స్పందిస్తూ ఇప్పటికే ఇంధన మంత్రి ఇందుకు సంబంధించి డిస్కంలను ఆదేశించారని తెలిపారు. జవహర్ రెడ్డి మాట్లాడుతూ మూడో వైరు ఏర్పాటుకు ఏపీ ప్రాంతంలో ఎంత అవసరమో మీ సేవ కేంద్రాల్లో నమోదు చేసుకోవాలని, తద్వారా యుద్ధప్రాతిపదికన మూడో వైరు ఏర్పాటులో డిస్కంలకు సహకరించాలని పంచాయతీరాజ్, గ్రామీణాభివృద్ధి కార్యదర్శులను ఆదేశించినట్టు వివరించారు.

# ధార్మిక కార్యక్రమాల్లో అదనపు లడ్డూ ధర పెంపు

**పెద్ద లడ్డూ రూ. 200, చిన్న లడ్డూ రూ.50, వడ రూ.100**

**ఆంధ్రభూమి బ్యూరో**

తిరుపతి, డిసెంబర్ 3: తిరుమల తిరుపతి దేవస్థానం సహకారంతో హిందూ ధర్మప్రచార పరిషత్ ఆధ్వర్యంలో నిర్వహించే ధార్మిక కార్యక్రమాల్లో టీటీడీ సాధారణ ధరకు విక్రయిస్తున్న లడ్డూలు అదనంగా కావాలని నిర్వాహకులు భావిస్తే, అందుకు అదనంగా డబ్బులు చెల్లించాల్సి ఉంటుందని జేఈఓ శ్రీనివాసరాజు వెల్లడించారు. ఆదివారం విలేఖరులతో మాట్లాడుతూ టీటీడీ ఇతర ప్రాంతాల్లో నిర్వహిస్తున్న శ్రీనివాసం కల్యాణం వంటి ధార్మిక కార్యక్రమాలకు పెద్ద లడ్డూలను ఒక్కొక్కటి రూ. 100 చొప్పున 10 లడ్డూలు, చిన్న లడ్డూలు రూ.25 చొప్పున 200, వడలు రూ.25 చొప్పున 10, మినీ లడ్డూలు రూ.3.50 పైసలు చొప్పున వెయ్యి సరఫరా చేస్తున్నట్లు చెప్పారు. ఈ కార్యక్రమాలకు భక్తులు పెద్దఎత్తున తరలివస్తున్నారని, ఈనేపథ్యంలో కార్యక్రమ నిర్వాహకుల నుంచి అదనపు లడ్డూలు సరఫరా చేయాలని వినతులు అందుతున్నాయన్నారు. ఈక్రమంలో అదనపు లడ్డూల ధరలను పెంచాలని నిర్ణయించామన్నారు. ఇందులో భాగంగా పెద్ద లడ్డూ ధరను ఒకటి రూ. 200లకు, చిన్నలడ్డూ రూ.50కి, వడ రూ. 100గా, మినీ లడ్డూ రూ.7గా అదనంగా చెల్లించి తీసుకోవాల్సి ఉంటుందన్నారు. అయితే శ్రీవారి దర్శనార్థం తిరుమలకు వచ్చే భక్తులకు అసలు ధరకే లడ్డూలు విక్రయిస్తున్నట్లు ఆయన స్పష్టం చేశారు.

# పోలవరంపై కార్యాచరణకు నేడు ఢిల్లీలో సమావేశం

**పీసీసీ చీఫ్ ఎన్.రఘువీరారెడ్డి**

మడకశిర, డిసెంబర్ 3 : పోలవరం ప్రాజెక్టు నిర్మాణంపై కార్యాచరణ రూపొందించేందుకు సోమవారం ఢిల్లీలో కాంగ్రెస్ పార్టీ రాజ్యసభ సభ్యులు కేవీపీ రామచంద్రరావు అధ్యక్షతన ప్రత్యేక సమావేశం నిర్వహించనున్నట్లు ప్రదేశ్ కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడు ఎన్.రఘువీరారెడ్డి తెలిపారు. రఘువీరా ఆదివారం అనంతపురం జిల్లా నీలకంఠాపురంలో విలేఖరులతో మాట్లాడారు. పోలవరం ప్రాజెక్టు పనులను కేంద్ర ప్రభుత్వం చేపట్టి 2018 నాటికి పూర్తిచేసే విధంగా కేంద్రంపై ఒత్తిడి తీసుకొస్తామన్నారు. సమావేశం అనంతరం కేంద్ర మంత్రి నితిన్ గడ్కరీని కలిసేందుకు కాంగ్రెస్‌పార్టీ నాయకులు ప్రయత్నాలు చేస్తామన్నారు. ఒకవేళ ఆయన తమకు అనుమతి ఇస్తే పోలవరం ప్రాజెక్టు నిర్మాణంపై చర్చిస్తామని, లేనిపక్షంలో అతడి ఇంటి ముందు పెద్దఎత్తున ధర్నా చేయడానికి సిద్ధమవుతున్నామన్నారు. పోలవరం ప్రాజెక్టు నిర్మాణం వ్యయం పూర్తిగా కేంద్రమే భరించి 2018 నాటికి పూర్తిచేసి రాష్ట్రానికి అప్పగించే విధంగా చర్యలు తీసుకోవాలని కోరారు.

# 7న పోలవరానికి వైకాపా బస్సుయాత్ర

**ఆంధ్రభూమి బ్యూరో**

హైదరాబాద్, డిసెంబర్ 3: ఈ నెల 7వ తేదీన పోలవరం ప్రాజెక్టుకు బస్సు యాత్ర చేపట్టాలని ఆ పార్టీ అధ్యక్షుడు వైఎస్ జగన్ ఆదేశించినట్లు ఆ పార్టీ వర్గాలు తెలిపాయి. పోలవరం ప్రాజెక్టు నిర్మాణాన్ని రాష్ట్ర ప్రభుత్వం ఒక పథకం ప్రకారం చేతులెత్తేస్తూ దానికి శాశ్వతంగా సమాధి కట్టేలా వ్యవహరిస్తున్న నేపథ్యంలో ఈ దుర్మార్గ వైఖరిని ప్రజలకు వెల్లడించేందుకు బస్సు యాత్ర చేపట్టాలని నిర్ణయించినట్లు పార్టీ తెలిపింది. ఈ నెల 7వ తేదీ ఉదయం అమరావతిలోని పార్టీ కార్యాలయం వద్దకు పార్టీ ఎంపిలు, ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీలు, పార్టీ సీనియర్ నేతలు చేరుకోవాలని తెలిపింది. అక్కడి నుంచి పోలవరం వరకు బస్సుల ద్వారా చేరుకోవడం జరుగుతుందని పేర్కొంది. కాంట్రాక్టర్ల నుంచి కమీషన్లు పిండుకునేందుకు పోలవరం ప్రాజెక్టును అడ్డంగా పెట్టుకుని వ్యవహారం నడిపారని, ఇప్పుడు వదిలేసేందుకు పన్నాగం పన్నారని తెలిపింది. పోలవరం ప్రాజెక్టును రక్షించుకునేందుకు, సత్వరం నిర్మించుకునేందుకు అన్ని రకాల ఒత్తిడి తీసుకువచ్చే విధంగా వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ కార్యాచరణ రూపొందించిందని అన్నారు.



రాష్ట్రపతి రామనాథ్ కోవింద్ నుంచి పురస్కారాన్ని అందుకుంటున్న కలెక్టర్ ధనంజయరెడ్డి

# శ్రీకాకుళం కలెక్టర్‌కు జాతీయ పురస్కారం

శ్రీకాకుళం(రూరల్), డిసెంబర్ 3: శ్రీకాకుళం జిల్లా కలెక్టర్ కె.ధనంజయరెడ్డి రాష్ట్రపతి రామ్‌నాథ్ కోవింద్ చేతుల మీదుగా జాతీయ పురస్కారాన్ని అందుకున్నారు. మినిస్ట్రీ ఆఫ్ సోషల్ జస్టిస్ అండ్ ఎంపవర్‌మెంట్ ఆధ్వర్యంలో న్యూఢిల్లీలో ఆదివారం నిర్వహించిన కార్యక్రమానికి జిల్లా నుంచి కలెక్టర్ హాజరయ్యారు. ప్రపంచ దివ్యాంగుల దినోత్సవం సందర్భంగా ఏర్పాటు చేసిన ఈ కార్యక్రమంలో శ్రీకాకుళం జిల్లాలో దివ్యాంగుల సంక్షేమానికి కలెక్టర్ చేసిన కృషిని అభినందిస్తూ జాతీయస్థాయిలో పురస్కారాన్ని ప్రకటించారు. కలెక్టర్ ఈ పురస్కారం అందుకోవడం పట్ల జిల్లా అధికారులు, ప్రజాప్రతినిధులు హర్షం వ్యక్తం చేశారు.

# శాడిస్ట్ భర్త రిమాండ్

- ఉద్యోగం నుండి సస్పెన్షన్

గంగాధరనెల్లూరు, డిసెంబర్ 3: చిత్తూరు జిల్లా గంగాధర నెల్లూరు మండల పరిధిలోని పెద్దదామరగుంట గ్రామంలో శోభనం రాత్రి నూతన వధువును పాశవికంగా గాయపర్చిన ఘటనలో భర్త రాజేష్ (26)ను అరెస్ట్ చేసి రిమాండుకు తరలించినట్లు సిఐ చంద్రశేఖర్ తెలిపారు. ఆదివారం స్థానిక పోలీస్‌స్టేషన్‌లో ఏర్పాటు చేసిన విలేఖర్ల సమావేశంలో ఆయన మాట్లాడుతూ నూతన వధువు తల్లిదండ్రుల ఫిర్యాదు మేరకు పలు సెక్షన్ల కింద నమోదు చేసి నిందితుడ్ని రిమాండ్‌కు తరలించినట్లు తెలిపారు. దీనిపై పూర్తిస్థాయిలో విచారణ చేపడతామని ఆయన పేర్కొన్నారు. నిందితుడు వి.కోట మండలంలో ప్రభుత్వ ఉపాధ్యాయుడిగా పని చేస్తున్నాడు. ఈనేపథ్యంలో అతనిపై కేసు నమోదు కావడంతో సస్పెండ్ చేసినట్లు జిల్లా విద్యాశాఖాధికారి పాండురంగస్వామి ప్రకటించారు. ఇదిలావుండగా శాడిస్టు భర్త చేతిలో గాయపడిన నవవధువు శైలజకు మెరుగైన చికిత్స అందించడం కోసం ఆదివారం తిరుపతి స్విమ్స్ ఆసుపత్రికి తరలించినట్లు ఆమె కుటుంబ సభ్యులు తెలిపారు. కంటి భాగంలో తీవ్ర గాయం కావడంతో ఆధునిక చికిత్స కోసం స్విమ్స్ తరలించినట్లు వారు తెలిపారు.

# కంచ ఐలయ్య అరెస్ట్

**గొర్రెలు, మేకల పెంపకందార్ల మహాసభకు వెళ్లకుండా అడ్డుకున్న పోలీసులు ● హైదరాబాద్‌కు తరలింపు**

**ఆంధ్రభూమి బ్యూరో**

ఖమ్మం, డిసెంబర్ 3: వివాదాస్పద రచయిత ప్రొఫెసర్ కంచ ఐలయ్యను ఖమ్మం పోలీసులు ఆదివారం అదుపులోకి తీసుకున్నారు. నగరంలో జరుగుతున్న గొర్రెలు, మేకల పెంపకందారుల సంఘం రాష్ట్ర మహాసభల్లో పాల్గొనేందుకు ఆదివారం రాత్రే ఐలయ్య ఖమ్మం చేరుకున్నారు. ఈ మహాసభకు అనుమతి ఉన్నప్పటికీ పాల్గొనేందుకు ఐలయ్యకు అనుమతి లేదని పోలీసులు ముందు నుంచే చెపుతూ వచ్చారు. ఆదివారం మహాసభల ప్రాంగణానికి వెళ్లేందుకు సీపీఎం కార్యాలయం నుంచి తన అనుచరులు, సీపీఎం కార్యకర్తలతో కలిసి రోడ్డుపైకి వచ్చిన ఐలయ్యను పోలీసులు వెంటనే అదుపులోకి తీసుకున్నారు. ఈసందర్భంగా సీపీఎం శ్రేణులు పోలీసులను అడ్డుకునే ప్రయత్నం చేయటంతో తోపులాట జరిగింది. నగర డిప్యూటీ పోలీస్ కమిషనర్, ఇద్దరు ఏసీపీలు, నలుగురు సీఐలతో పాటు పోలీసులు భారీగా సీపీఎం కార్యాలయం వద్దకు చేరుకొని పరిస్థితిని అదుపులోకి తెచ్చారు. ఐలయ్యను కూసుమంచి పోలీస్ స్టేషన్‌కు తరలించి, అక్కడి నుంచి హైదరాబాద్ పంపించారు. ఐలయ్యను తీసుకెళుతున్న పోలీస్ వాహనాన్ని అడ్డుకున్న సీపీఎం కార్యకర్తలను అరెస్టు చేసి స్థానిక పోలీస్ స్టేషన్లకు తరలించారు.



ఖమ్మంలో ఐలయ్యను అరెస్టు చేస్తున్న పోలీసులు

## ప్రభుత్వం భయపడుతోంది

**ఐలయ్య ధ్వజం**

తనవద్ద గన్ను లేదని, కేవలం పెన్ను మాత్రమే ఉందని, అయినా రాష్ట్ర ప్రభుత్వం తనను చూసి భయపడుతోందని ఐలయ్య వ్యాఖ్యానించారు. అరెస్టు సమయంలో ఆయన విలేఖరులతో మాట్లాడుతూ అందరికీ సమన్యాయం చేస్తామంటున్న ప్రభుత్వం అవకాశవాద ధోరణిని అవలంబిస్తోందన్నారు. వచ్చే ఎన్నికల్లో ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రచారం చేస్తానని, టీఆర్‌ఎస్ నేతల అంతుచూసే వరకు వదలనని హెచ్చరించారు. ఇదిలావుంటే, ఐలయ్య అరెస్టును నిరసిస్తూ సీపీఎం నేతలు ఆందోళనకు దిగారు. తమ సభలో పాల్గొనేందుకు వచ్చిన అతిథిని అడ్డుకునే ప్రయత్నం చేయడం దురదృష్టకరమని ఖండించారు. ప్రజాస్వామ్యంలో తమ సమస్యలు చెప్పుకునేందుకు ఏర్పాటు చేసుకునే సభలు, సమావేశాలపై రాష్ట్ర ప్రభుత్వం కావాలనే ఉక్కుపాదం మోపుతోందని, దీన్ని ప్రజల మద్దతుతో తిప్పికొడతామని సీపీఎం నేతలు హెచ్చరించారు.

# ఆగని ఏనుగుల బీభత్సం

**మరొకరి మృతి**

డీ.హీరేహాల్, డిసెంబర్ 3 : అనంతపురం జిల్లాలోని కర్నాటక సరిహద్దు మండలాల్లో గత పదిరోజుల నుంచి కర్నాటక నుంచి వచ్చిన రెండు మగ ఏనుగులు బీభత్సం సృష్టిస్తున్న విషయం తెలిసిందే. ఏనుగుల దాడిలో ఇప్పటికే జిల్లాలో ఒకరు మృతిచెందగా ఆదివారం డీ.హీరేహాల్ మండలం మురిడి గ్రామంలో రైతు గొల్ల ఏకాంతప్ప(45) మృతిచెందాడు. వివరాలు.. కణేకల్లు, డీ.హీరేహాల్ మండలాల్లో గత రెండు రోజుల నుంచి ఏనుగులు బీభత్సం సృష్టిస్తున్నాయి. ఆదివారం తెల్లవారుజామున రైతు ఏకాంతప్ప తన తోటలో సాగు చేసిన పంటకు కాపలా ఉండగా అకస్మాత్తుగా ఏనుగులు దాడి చేయగా అతడు మృతిచెందాడు. సమాచారం అందుకున్న డిఎఫ్ఓ చంద్రశేఖర్ సిబ్బందితో కలిసి ఉలికల్లు చెరువుకు చేరుకున్నారు. డ్రోన్ కెమెరాల సహాయంతో ఏనుగులు దాగి ఉన్న ప్రదేశాలను గుర్తిస్తున్నట్లు తెలిపారు. మంత్రి కాలవ శ్రీనివాసులు రైతు ఏకాంతప్ప ఇంటికి వెళ్లి కుటుంబ సభ్యులను పరామర్శించారు.

# దక్షిణ కొరియాకు బాబు

**నేడు ప్రముఖులతో భేటీలు**

**ఆంధ్రభూమి బ్యూరో**

విజయవాడ, డిసెంబర్ 3: ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు సోమవారం నుంచి దక్షిణ కొరియాలో విస్తృతంగా పర్యటించబోతున్నారు. భారత కాలమానం ప్రకారం సోమవారం తెల్లవారుజామున 2.20 గంటలకు ఆయన సియోల్ విమానాశ్రయానికి చేరుకోనున్నారు. తొలుత భారత రాయబారి విక్రమ్ దొరైస్వామితో భేటీ అవుతారు. 6.15 గంటలకు కియా అనుబంధ సంస్థల ప్రతినిధులతో సమావేశమవుతారు. 6.50 గంటలకు దాసన్ నెట్‌వర్క్ ఛైర్మన్ నామ్ మెయిన్ వూతో సమావేశమవుతారు. 7 గంటలకు జాసంగ్ ఇంజనీరింగ్ హెడ్ నోవాన్గ్ చుల్‌జు, ఇంటికా సీఈవో కిమిద్ హూన్‌తో సీఎం భేటీ అవుతారు. 8.30 గంటలకు లొట్టే కార్పొరేషన్ సీఈవో వార్గ్ కాగ్‌జుతో సమావేశమై రాజధానికి పెట్టుబడుల విషయమై ఆయన చర్చిస్తారు.



కర్నూలు జిల్లాలో పాదయాత్ర నిర్వహిస్తున్న జగన్

# కర్నూలు నుంచి 'అనంత'కు...

## కర్నూలు జిల్లాలో 19 రోజులు.. 272 కి.మీ. నడిచిన జగన్

**ఆంధ్రభూమి బ్యూరో**

కర్నూలు, డిసెంబర్ 3 : వైకాపా అధినేత జగన్ చేపట్టిన ప్రజాసంకల్ప యాత్ర ఆదివారం నాటితో కర్నూలు జిల్లాలో ముగిసింది. జగన్ రాత్రికి పత్తికొండ నియోజకవర్గంలోని అనంతపురం, కర్నూలు జిల్లాల సరిహద్దు గ్రామమైన చెరువుతండాలో బస చేశారు. కర్నూలు జిల్లాలో 19 రోజుల పాటు నడక సాగించిన ఆయన సుమారు 272 కి.మీ మేర ఆళ్లగడ్డ, బనగానపల్లె, డోన్, కోడుమూరు, ఆలూరు, ఎమ్మిగనూరు, పత్తికొండ నియోజకవర్గాల్లో పాదయాత్ర చేపట్టారు. కడప, కర్నూలు జిల్లాల్లో ప్రజాసంకల్ప యాత్ర ముగియడంతో అనంతపురం జిల్లాలో సోమవారం ఉదయం తొలి అడుగు వేయనున్నారు.

కడప జిల్లా ఇడుపులపాయలో నవంబర్ 6వ తేదీ ప్రారంభించిన పాదయాత్ర గత 28 రోజులుగా కొనసాగుతోంది. మధ్యలో 3 శుక్రవారాలు కోర్టుకు హాజరయ్యేందుకు వెళ్లిన జగన్ 25 రోజుల పాటు నిరాటంకంగా పాదయాత్ర కొనసాగించారు. సగటున రోజుకు 14.5 కి.మీ మేర నడుస్తూ కడప జిల్లాలో 8 రోజుల్లో ఒక శుక్రవారం మినహా 7 రోజుల్లో 93కి.మీ మేర పాదయాత్ర నిర్వహించి 9వ రోజు నవంబర్ 14వ తేదీ ఆళ్లగడ్డ నియోజకవర్గం చాగలమర్రి మండలంలో తొలిఅడుగు వేశారు. అక్కడి నుంచి గత 19 రోజుల్లో 2 శుక్రవారాలు మినహా 17 రోజుల పాటు జిల్లాలో 272కి.మీ నడిచి పత్తికొండ నియోజకవర్గం చెరువుతండాతో కర్నూలులో ముగించారు. చెరువుతండా గ్రామం నుంచి 1 కి.మీ మేర నడిచిన అనంతరం అనంతపురం జిల్లాలో ప్రవేశించనున్నారు. యాత్ర ప్రారంభమైన నాటి నుంచి జగన్ భారీగా హామీలు ఇస్తూ ప్రజలను ఆకట్టుకునే ప్రయత్నం చేశారు. కాగా జగన్ తన యాత్రలో ఒక్క రోజు మాత్రమే సీఎం చంద్రబాబుపై వ్యక్తిగత ఆరోపణలు చేశారు. చంద్రబాబు కుటుంబం నిర్వహిస్తున్న హెరిటేజ్ సంస్థలపై ఆయన ఆరోపణలు చేస్తూ చంద్రబాబు ఒక దళారీ అంటూ అభివర్ణించారు.

## నేటి నుంచి అనంతపురంలో 18 రోజులు.. 240 కి.మీ..

**ఆంధ్రభూమి బ్యూరో**

అనంతపురం, డిసెంబర్ 3: ప్రజా సమస్యలు తెలుసుకుంటూ, ప్రభుత్వం అవలంబిస్తున్న ప్రజా వ్యతిరేక విధానాలను ప్రజలకు వివరిస్తూ ప్రతిపక్ష నేత, వైకాపా అధ్యక్షుడు వైఎస్.జగన్‌మోహన్‌రెడ్డి చేపట్టిన ప్రజాసంకల్ప యాత్ర సోమవారం అనంతపురం జిల్లాలో ప్రవేశించనుంచి. వైఎస్‌ఆర్ కడప జిల్లా ఇడుపులపాయ నుంచి ప్రారంభమైన పాదయాత్ర ఆదివారం కర్నూలు జిల్లాలో ముగిసింది. జగన్ సోమవారం అనంతపురం జిల్లా గుంతకల్లు నియోజకవర్గం గుత్తి మండలంలోకి ప్రవేశించి పాదయాత్ర చేపట్టనున్నారు. జిల్లాలో మొత్తం 18 రోజుల పాటు 8 అసెంబ్లీ నియోజకవర్గాల్లో 240 కి.మీ దూరం నడవనున్నారు. జగన్ పాదయాత్ర సోమవారం ఉదయం 8.30 గంటలకు గుత్తి మండలంలోని బసినేపల్లితండా నుంచి ప్రారంభం కానుంది. బసినేపల్లిలో తొలుత జగన్ పార్టీ జెండాను ఆవిష్కరిస్తారు. అనంతరం పాదయాత్రగా గుత్తి ఆర్‌ఎస్‌కు చేరుకుంటారు. మధ్యాహ్నం 12 గంటలకు భోజన విరామం అనంతరం 3 గంటలకు పాదయాత్ర చేపడుతారు. సాయంత్రం 4 గంటలకు గుత్తి పట్టణంలోని గాంధీ సర్కిల్‌లో బహిరంగ సభ నిర్వహించి రాత్రికి గుత్తిలోనే బస చేస్తారు. ఇక ఈ నెల 10వ తేదీ ఉరవకొండ నియోజకవర్గంలో పాదయాత్ర, కూడేరులో బహిరంగ సభ నిర్వహిస్తారు. ఇదిలా ఉండగా జగన్ కాళ్లకు బొబ్బలెక్కినా వైద్యం తీసుకుంటున్నందున పాదయాత్ర సజావుగా సాగుతుందని, విరామం ఏదీ ఉండదని వైకాపా జిల్లా నేత, మాజీ ఎంపీ అనంత వెంకట్రామిరెడ్డి స్పష్టం చేశారు. ఇక పార్టీ అధినేతకు ఘనంగా స్వాగతం పలికేందుకు జిల్లా నేతలు, గుంతకల్లు నియోజకవర్గ నాయకులు, పెద్దఎత్తున అనంతపురం-కర్నూలు సరిహద్దుకు చేరుకున్నారు. జిల్లా అధ్యక్షుడు శంకర నారాయణ, ఎమ్మెల్యే వై.విశ్వేశ్వరరెడ్డి, మాజీ ఎంపీ అనంత వెంకట్రామిరెడ్డితో పాటు పలువురు పార్టీ సమన్వయకర్తలు ఇప్పటికే అక్కడికే తరలివెళ్లారు.

ఆంధ్రభూమి
జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ
సోమవారం, 4 డిసెంబర్ 2017

# ఒబామా వాచాలత్వం

సర్వమత సమానత్వం గురించి మన దేశానికి అమెరికా మాజీ అధ్యక్షుడు బరాక్ హుస్సేన్ ఒబామా పాఠాలు చెప్పడానికి యత్నించడం విచిత్రమైన పరిణామం. పదకవితా పితామహుడైన తాళ్లపాక అన్నమాచార్య రచించిన ఒక పాటలోని సారాంశం ఈ సందర్భంగా స్మరించదగిన సహజం. చీకటి ఉన్న చోట దీపం వెలిగించాలి కాని సూర్యుని వెలుగులు సభలోకి ఉన్నచోట కాగడా వెలిగించినందువల్ల ఫలమేమున్నది అన్నమయ్య గీతంలోని సారాంశం! ప్రపంచ ప్రజాస్వామ్య వ్యవస్థ గురించి దేశ విదేశాలలో ప్రచారం జరుగుతోంది. ప్రధానంగా అమెరికాలోను ఐరోపా దేశాలలోను ఈ ప్రచార ఆర్భాటం దశాబ్దులుగా కొనసాగుతోంది. ప్రజాస్వామ్య వ్యవస్థ మౌలిక స్వభావం సర్వమత సమభావం. సర్వమత సమభావం అనాదిగా హైందవ జాతీయ స్వభావం! ఈ సనాతన స్వభావానికి మన రాజ్యాంగం ధ్రువీకరణ మాత్రమే! రాజ్యాంగంలో "మనది సర్వమత సమభావ వ్యవస్థ" అని పేర్కొన్నందువల్ల మనది సర్వమత సమభావ వ్యవస్థ కాలేదు. అనాదిగా మనది, ఈ స్వజాతిది, సర్వమత సమభావ స్వభావం కాబట్టి ఈ సంగతిని మన రాజ్యాంగంలో పేర్కొన్నాము. ఏ దేశంలో నైన రాజ్యాంగ వ్యవస్థలు ఆయా దేశాల ప్రజల సమష్టి స్వభావానికి అనుగుణంగా మాత్రమే రూపొందుతూ ఉండడం చరిత్ర! 1947లో అఖండ భారత్‌లో యథాపూర్వంగా సర్వమత సమభావ వ్యవస్థ కొనసాగుతోంది. ఇందుకు కారణం అఖండ భారతంలో వలెనే 1947 తరువాత అవశేష భారత్‌లో కూడ ప్రజల సమష్టి స్వభావం 'సర్వమత సమభావం' కావడం. కానీ అఖండ భారత్ నుంచి విడిపోయిన పాకిస్తాన్‌లో సర్వమత సమభావ వ్యవస్థ ఏర్పడలేదు, ఏక మత రాజ్యాంగ వ్యవస్థ ఏర్పడింది. ఎందుకంటే భారత్ నుంచి విడిపోయిన నాటికి పాకిస్తాన్‌లోని ప్రజల సమష్టి స్వభావం మతోన్మాదం కావడం సమష్టి స్వభావానికి 'అపవాదం' - ఎక్సెప్షన్ - అతికొద్ది మందిలో ఉండవచ్చుగాక! కానీ ప్రజల సమష్టి స్వభావం - కలెక్టివ్ నేచర్ - ప్రతి దేశంలోను 'గతి'ని నిర్దేశిస్తూ ఉంది! ఏకమత రాజ్యాంగ వ్యవస్థ ఏర్పడడం ప్రజాస్వామ్య మౌలిక స్వభావానికి విరుద్ధం. పాకిస్తాన్‌లో మాత్రమేకాదు ప్రపంచంలోని అనేక దేశాలలో ఇప్పటికీ ఏకమత రాజ్యాంగ వ్యవస్థలు కొనసాగుతూ ఉన్నాయి. ఇస్లాం మత రాజ్యాంగాలు ఉన్న దేశాలు 'ఏక మత వ్యవస్థ' - థియోక్రాటిక్ స్టేట్ - లకు కొనసాగుతున్న నిదర్శనాలు. 'వాటికన్' క్రైస్తవ మత రాజ్యాంగమున్న దేశం! బరాక్ ఒబామా వంటి వారు ఆయా దేశాలకు వెళ్లి 'ఏకమత' అంధకారంలో 'సర్వమత సమభావ' జ్యోతులను వెలిగించాలి! సర్వమత సమానభావ కాంతి మండుతున్న భారతదేశంలో ఒబామా వంటివారు మళ్లీ అగ్గిపుల్లలను వెలిగించడం, సూర్యుడికి దివిటీతో దారి చూపించడం అతార్కికమైన అన్యాయమైన వ్యవహారం...

ఒబామా ఇలా అతార్కిక ప్రవర్తనకు ఒడిగట్టడానికి వెనుక పాశ్చాత్య దురహంకారం తొంగి చూస్తోంది, భారత దేశాన్ని అపఖ్యాతిపాలు చేయడానికై కొనసాగుతున్న అంతర్జాతీయ షడ్యంత్రం నక్కి ఉంది, నిక్కి నిక్కి చూస్తోంది... భారతదేశంలో ముస్లింలను పోషించాలని, వికసింప చేయాలని ఒబామా వాక్రుచ్చాడు. ఈ 'వాక్రుచ్చడ'నకు సమయం సందర్భం ఏమిటన్నదే అంతుపట్టని వ్యవహారం. భారతదేశం 'సహిష్ణుత'ను నిలబెట్టుకోవాలన్నది ఒబామా ఇచ్చిన మరో సందేశం. ఢిల్లీలో జరిగిన 'నాయకత్వ సదస్సు'లో పాల్గొనడానికి విచ్చేసిన ఒబామా సందేశాత్మక వ్యవహారం గురించి మాట్లాడడం మాని ఈ అసందర్భమైన వాచాలత్వాన్ని ప్రదర్శించడం ఆశ్చర్యకరం కాదు. మన దేశానికి వస్తున్న విదేశీ ప్రముఖులు మనకు ఇలాంటి ఉచిత సలహాలను ఇవ్వడం పరిపాటి అయిపోయింది! అల్పసంఖ్యలోని మతాల వారికి అధిక సంఖ్య మతస్థులతో సమానమైన హక్కులు, అవకాశాలు, అధికారాలు, ప్రోత్సాహకాలు లభిస్తున్న ఏకైక దేశం మనదేశం. ప్రపంచంలోని మరే దేశంలోను కూడా మన దేశంలోవలె సర్వసమగ్రమైన సర్వమత సమభావ వ్యవస్థ ఏర్పడ లేదు. కానీ ఒబామా "ముస్లింలకు ఏదో అన్యాయం జరిగిపోతున్నట్టు" ధ్వనించేలాగా మనకు సలహానివ్వడం మన ప్రభుత్వం తక్షణం "నోరు మూసుకోండి" అని ఒబామాకు చెప్పక పోవడం విచిత్రమైన వ్యవహారం, దేశంలోని ముస్లింలు 'మిలాద్ ఉన్ నబీ' పండుగను జరుపుకుంటున్న శుభ సమయంలో ఒబామా ఇలా అపస్వరాలను పలుకడం మన అంతర్గత వ్యవహారాలలో అక్రమ ప్రమేయానికి నిదర్శనం...

అఖండ భారత విభజన జరిగిన సమయంలో పశ్చిమ పాకిస్తాన్‌లో అల్పసంఖ్యలోని హిందువులు మొత్తం జనాభాలో ఇరవై మూడు శాతం. ప్రస్తుతం వీరి సంఖ్య పాకిస్తాన్ జనాభాలో ఒక శాతం కంటె తక్కువకు దిగజారింది. బంగ్లాదేశ్‌గా మారిన తూర్పు పాకిస్తాన్‌లో సైతం 'మైనారిటీ' హిందువుల సంఖ్య ముప్పయి ఒక్క శాతం నుంచి ఎనిమిది శాతానికి దిగజారిపోయింది! ఒబామా వంటివారు పాకిస్తాన్‌కు వెళ్లి సర్వమత సమభావం - సెక్యులరిజమ్ - గురించి, మత సహిష్ణుత - రిలీజియస్ టొలరెన్స్ - గురించి పాఠాలు చెప్పి రాగలరా? ఇస్లాం మత రాజ్యాంగ వ్యవస్థలున్న సౌదీ అరేబియా, ఇరాక్, ఇరాన్, సిరియా, ఖతార్ వంటి దేశాలలో సర్వమత సమభావ రాజ్యాంగ వ్యవస్థలను ఏర్పాటు చేయించగలరా?? అవశేష భారత అంతటా సర్వమత సమభావం - అనాదిగా అఖండ భారత్‌లో వలెనే - వికసిస్తోంది, పరిమళిస్తోంది. అందువల్లనే 1947లో అవశేష భారత్ జనాభాలో ఆరుశాతం ఉండిన ఇస్లాం మతస్తుల సంఖ్య 2011 నాటి లెక్కల ప్రకారం పదునాలుగు శాతానికి చేరింది! ముస్లింలు భారతదేశంలో హాయిగా జీవిస్తున్నారన్న వాస్తవానికి ఇది తిరుగులేని సాక్ష్యం! ఒబామా వంటి 'కుహనా' లౌకికవాదులకు 'నకిలీ' సర్వమత సమభావ వాదులకు ఇదంతా తెలుసు. కానీ 'మెతక'వారిని చూస్తే అందరికీ మొత్త బుద్ధి పుట్టడం. చైనాకు వెళ్లి ఇలాంటి పాఠాలను 'ఒబామా' చెప్పలేడు, చెబితే వెంటనే విమానమెక్కించి తరిమివేస్తారు!! మన దేశమంతటా సర్వమత సమభావం సంభావమై ఉంది. అందువల్లనే 'మైనారిటీలు' ఎవ్వరూ కూడ తరిమివేతకు గురికాలేదు. కానీ మన దేశంలో అనాదిగా భాగమై ఉన్న, భరతమాతకు 'తల' వంటిదైన 'కశ్మీర్ లోయ' ప్రాంతంలో మాత్రం సర్వమత సమభావం హతమైంది, గతమైంది. 1947 నాటికి 'లోయ'లో అల్పసంఖ్యాకులుగా మారిన హిందువులను జిహాదీలు 1990 నాటికి నిశ్శేషంగా నిర్మూలించారు! ఒబామాను 'కశ్మీర్'కు వెళ్లి 'హురియత్' వంటి జిహాదీ ముఠాలకు పాఠం చెప్పిరావల్సిందిగా మన ప్రభుత్వం సలహా ఇవ్వాలి...

ప్రపంచంలో అణచివేతకు తరిమివేతకు గురైన పారశీకులకు, యూదులకు ఆశ్రయమిచ్చిన జాతి హైందవ జాతి అని అమెరికాలోని చికాగోలో 1893లో వివేకానందుడు చెప్పివచ్చాడు. మసీదుల నుంచి 'నమాజ్'కు పిలుపు వచ్చిన సమయంలో ప్రధాని నరేంద్రమోదీ తన ప్రసంగాన్ని ఆపివేశాడు. ఒబామాకు చరిత్ర తెలియదా?? వర్తమాన దృశ్యం కనిపించడం లేదా??

# మన మహానగరాల సొగసు చూడతరమా!

ఆర్థికాభివృద్ధికి అనులోమానుపాతంగానే కాలుష్యం పెరుగుతుందని ఆర్థిక శాస్త్రం చెబుతుంది. దీనికి చక్కని ఉదాహరణ మన రాజధాని ఢిల్లీ నగరమే! గతంలో ఎన్నడు లేనంతగా, నవంబర్ మొదటి వారంలో గాలి కాలుష్యంతో ఊపిరి బిగపట్టుకోవాల్సి వచ్చింది. గల్ఫ్ నుంచి వచ్చే ధూళి కణాలు, పంట మిగుళ్ల కాల్చుట, స్థానిక పరిశ్రమలు, వాహనాలు విడుదల చేసే కారకాలు వెరసి గాలి కాలుష్యానికి కారణమని నిపుణులు నిగ్గుతేల్చారు. పరిశ్రమలు విడుదల చేసే సల్ఫర్ డయాక్సైడ్ (ఎస్‌ఒ2), నైట్రస్ ఆక్సైడ్ (ఎన్‌ఒఎక్స్)లు కలిసి సూక్ష్మాతి సూక్ష్మమైన పదార్థ కణాలుగా (పిఎమ్) అనగా మిల్లీమీటర్‌లో వెయ్యవవంతు (2.5ఎం/జి) మారి ప్రతి క్యూబిక్ మీటర్ వాయువులో 500కు చేరుకుంటే ప్రమాద హెచ్చరికగా గుర్తిస్తారు. నవంబర్ 7న మామూలు స్థాయికన్నా 9 రెట్లు పెరిగి 537కు, 8న 640 అతి ప్రమాద స్థాయికి చేరుకోవటంతో ఢిల్లీ నగర వాసులు ఊపిరి పీల్చుకోలేని స్థితి ఏర్పడింది. గత సంవత్సరం కూడా దాదాపు ఇదే పరిస్థితి. దేశంలోని మిగతా నగరాలు ఈ స్థాయికి చేరుకోకున్నా, ఇలాంటి ప్రమాద ఘంటికల్ని పసిగడుతూనే వున్నాయి.

వాయు కాలుష్యం ద్వారా కలిగే ఆరోగ్య దుష్ఫలితాలు 1990లో దేశంలో మూడో స్థానంలో వుంటే, నేడు రెండో స్థానానికి చేరుకుంది. సెంటర్ ఫర్ సైన్స్ అండ్ ఎన్విరాన్‌మెంటల్ (సిఎస్‌ఇ) విశ్లేషణ ప్రకారమే, ఈ వాయు కాలుష్యం రక్తప్రసరణ, శ్వాసకోశ వ్యవస్థపై తీవ్ర ప్రభావాన్ని చూపడమేకాక, క్యాన్సర్ మహమ్మరిని ప్రేరేపిస్తుందని తెలిపింది. 1990లో 13వ స్థానంలో వున్న రక్తప్రసరణ సంబంధిత వ్యాధులు ప్రస్తుతం 3వ స్థానానికి, 5వ స్థానంలో ఉన్న గుండె జబ్బులు 1వ స్థానానికి, 22వ స్థానంలో ఉన్న చక్కెర వ్యాధి 5వ స్థానానికి, హార్ట్ అటాక్ 16 నుంచి 15కు మారాయని, గత 26వ సంవత్సరాల్లో చక్కెర వ్యాధి 174 శాతం పెరుగుదలతో, గుండె జబ్బులు 104 శాతంతో ప్రపంచంలోనే పై స్థాయిలో వున్నట్లు కూడా ఈ సంస్థ తన నివేదికలో ప్రస్తావించింది. ఈ మధ్యన చక్కెర వ్యాధి చిన్నపిల్లలకు కూడా సంక్రమించటం ఆందోళనకరం కాగా, ఈ వ్యాధిగ్రస్తులు 60 శాతం మహిళలే కావడం గమనార్హం! దీనికి కారణం పట్టణీకరణ, జీవన శైలిలో మార్పులు, ఆహారపు అలవాట్లేనని కూడా ఈ సంస్థ ధృవీకరించింది.

శీఘ్రమౌతున్న పట్టణీకరణను తగ్గించాల్సింది పోయి, 2014లో ఏర్పాటైన మోదీ ప్రభుత్వం 100 పట్టణాల చొప్పున దశలవారీగా స్మార్ట్ సిటీలుగా మార్చుచున్నది. 2030 నాటికి దాదాపు 50 శాతం ప్రజలు పట్టణాల్లో నివసించాలని (రోగగ్రస్తులుగా) ఆశిస్తున్నది. భారత్ లాంటి గ్రామీణ వ్యవస్థ, వ్యవసాయ సంబంధ వృత్తులున్న దేశాన్ని, గ్రామాల్ని అభివృద్ధి చేసే పథకాలు రూపొందించాలి. కాని, దీనికి భిన్నంగా జరగడానికి గల కారణాలు, పట్టణాల్లోనైతే, మౌలిక సదుపాయాల కల్పన పేరున భారీగా నిధులను కేటాయించవచ్చని, అట్లైతేనే విదేశాల్నుంచి పెట్టుబడులు వస్తాయని, మెగా ప్రాజెక్టులకు రూపకల్పన జరుగుతున్నది. ఇలాంటి ప్రాజెక్టుల ద్వారానే పాలకులకు వ్యక్తిగత రాబడి పెరుగుతుందనేది అచ్చుకెక్కని సత్యం! నిజానికి గ్రామాల్లో విద్య, వైద్య సదుపాయాల్ని (ఇప్పుడున్నాయిగా అనేవారున్నారు) ఆధునాతనపరిచి నాణ్యతతో అందిస్తే, పట్టణీకరణకు అడ్డుకట్ట పడుతుంది. తోడుగా వ్యవసాయ రంగాన్ని, సంబంధిత ఇతర రంగాల్ని, కులవృత్తుల్ని ప్రేరేపిస్తే, ఉపాధి అవకాశాలు కూడా మెండుగా వుంటాయి. కాని, భిన్నంగా గ్రామీణ భారతం మొత్తం పట్టణాలపైననే ఆధారపడేలా పథక రచన చేయడం రోజు రోజుకూ ఎక్కువైపోయింది. పట్టణాలపై ఖర్చు చేసే దాంట్లో 10-20 శాతాన్ని గ్రామాలపై చేసినా, ఓ దశాబ్దకాలంలో దాదాపు దేశంలోని ఆరు లక్షల గ్రామాలు బాగుపడతాయి. కాని ఇది జరగడంలేదు.

గత మూడు దశాబ్దాలుగా ఈ ప్రక్రియ గ్లోబలీకరణతో ఊపందుకోవడం, ప్రపంచ స్థాయి బ్యాంకులు ఈ రకమైన మౌలిక (ఇన్‌ఫ్రా) సదుపాయాలకే అప్పులిస్తాననడంతో, రియల్ ఎస్టేట్ రంగం, దీంతోపాటు ఆటోమొబైల్ రంగం ఊపందుకున్నాయి. బ్యాంకులన్నీ అప్పులివ్వడంలో ముందంజలో ఉండడంతో, జనాలు ఎగబడి తీసుకోవడం, కొన్ని వర్గాల జీతాల్ని అనూహ్యంగా పెంచడంతో ఇవి మరింత జోరునందుకున్నాయి. రోడ్లు బాగుంటేనే ఆటోమొబైల్ సంస్థలు వికసిస్తాయని, పట్టణాలతోపాటు రోడ్ల వెడల్పును ముందేసుకున్నాయి. దీన్ని కలల ప్రపంచంగా చూపడంతో, ఈ అప్పుల్ని తట్టుకోలేక తనువులు చాలిస్తున్నవారు వున్నారు. అభివృద్ధినంతా కేంద్రీకరించి, రాష్ట్ర రాజధానులపైన ఖర్చుపెట్టడం మొదలైంది. హైదరాబాద్ నగరంలో ట్రాఫిక్ రద్దీని తగ్గించడానికి, చేపట్టాల్సిన పథకాలకు భిన్నంగా నివారణోపాయాలంటూ, చంద్రబాబు ఫ్లైఓవర్లకు శ్రీకారం చుట్టాడు. ఇవి అనుకున్న లక్ష్యాన్ని సాధించక పోగా, అనేక కొత్త సమస్యల్ని తెచ్చి నగర అందాల్ని నాశనం చేసాయి. తర్వాత వచ్చిన వైఎస్‌ఆర్ మెట్రోకు శ్రీకారం చుట్టి మొత్తం హైదరాబాద్‌ను బంధించే పథక రచన చేశాడు. కాలం కలిసిరాక, ఆయన పోవడం, తెలంగాణ ఉద్యమం తోడుకావడంతో నత్తనడకన ప్రారంభమైన మెట్రో ఓ కొలిక్కి వచ్చింది. ఉద్యమకాలంలో మెట్రోను నిరసించిన కెసిఆర్ దీన్ని ఓ మణికంఠంగా భావిస్తున్నాడు. ఈ సంధి కాలంలో ఎల్ అండ్ టి నష్టాలకు గురయ్యానని, తెలంగాణ ప్రభుత్వం రూ.3,700 కోట్లు ఇవ్వాలని అంటున్నది. దీంతో కూడా కెసిఆర్‌కు లాభసాటి కాకపోవడంతో, 19 కూడళ్లలో స్కైవేల రూపకల్పనకు రూ.20 వేల కోట్లతో పథక రచన జరిగింది. ఇవి కూడా కెబిఆర్ పార్కు వద్ద, పరేడ్ గ్రౌండ్ బైసన్ పోలో దగ్గర, సికింద్రాబాద్ కంటోన్మెంట్ గార్డెన్ దగ్గర వివాదాస్పదంగా మారాయి.

ఇవన్నీ పూర్తయితే హైదరాబాద్ ట్రాఫిక్ ఫికర్ లేకుండా హాయిగా సుందరంగా వుంటుందనేది నాయకుల ఉవాచ! పోతే ఢిల్లీ అనుభవాలుగాని, ఇతర మెట్రో అనుభవాలుగాని గుర్తించని నాయకులు వీటినే అతి అభివృద్ధికరం అని ప్రచారం చేస్తున్నారు. గతంలో హైదరాబాద్ పరిస్థితేంటి, ప్రస్తుతం ఎందుకు ఇలా దిగజారింది. కారణాలేంటి, నివారణ చర్యలేంటి అనే అంశాల జోలికి పోకుండా, అభివృద్ధి అనే మంత్రదండాన్ని వాడుతూ వుంటారు. ఒకప్పటి హైదరాబాదు, 500 పార్కులతో, సిటీ ఆఫ్ లేక్స్‌తో అలరారింది. 2000 సం.నాటి హైదరాబాద్ మెట్రో లెక్కల ప్రకారమే 20,400 హెక్టర్ల వైశాల్యంగల నీటి ఆవాస ప్రాంతాలున్నట్లు, ఇందులో 190 చెరువుల విస్తీర్ణం ఒక్కొక్కటి 10 హెక్టార్లకు పైనేనని తేలింది. ఇవన్నీ పట్టణీకరణతో అక్రమణకు గురయ్యాయి, అవుతూనే వున్నాయి. మూసీ వరదలకు అడ్డుకట్టగా 1920లో నిర్మించిన ఉస్మాన్‌సాగర్, 1927లో నిర్మించిన హిమాయత్‌సాగర్‌లు కనుమరుగు కాబోతున్నాయంటే ఆశ్చర్యం కాకమానదు. విజ్ఞాన్ జ్యోతి ఇంజనీరింగ్ కాలేజీ, జవహర్‌లాల్ టెక్నలాజికల్ విశ్వవిద్యాలయం సర్వే ప్రకారం 2000 సం.లోనే హిమాయత్ నీరు తాగే యోగ్యం లేదని తేల్చింది. కారణం, చుట్టూ ఏర్పడిన పరిశ్రమలు, విద్యాసంస్థలు, హార్టికల్చర్ ఫాంలు- ఇవి విడుదల చేసే వ్యర్థాలు నీటిని పూర్తిగా కలుషితం చేస్తున్నాయి. ఈ విధానం ఇలాగే కొనసాగితే 2036 నాటికి హైదరాబాద్ ముఖచిత్రం నుంచి హిమాయత్‌సాగర్ కనుమరుగౌతుందని వీరి నివేదిక తేల్చింది.

నిర్మాణ దశలోనే అమరావతి ఇలాంటి సవాళ్ళనే ఎదుర్కోబోతున్నది. మొన్నటి గ్రీన్ ట్రిబ్యునల్ ఆదేశాలను చూస్తే భవిష్యత్తు బాధాకరంగానే వుంటుందని అవగతమౌతున్నది. హైదరాబాద్ మెట్రోకు తానే బీజాలు వేసానని ప్రకటించుకున్న బాబు, అమరావతికి అదే సొబగును తీసుకురావాలని చూస్తుంటే, ఈ ప్రాజెక్టుల ద్వారా ఎంతగా వెనకేసుకోవచ్చోనని అనిపిస్తున్నది. కేంద్రం కూడా ఆం.ప్రకు ప్రత్యేక హోదాను కాదని అమరావతిని స్మార్ట్‌సిటీగా గుర్తించడం చోద్యం కాదా! ఉద్దానం కిడ్నీ సమస్యలు పట్టని బాబుకు అమరావతి నిర్మాణమైతే, విజయవాడ, గుంటూరు, తెనాలి, ఇబ్రహీంపట్టణాల్ని కలిపి పంచవటి (అయిదు నగరాలు)గా అభివృద్ధి చేయాలని చూడడం వింత కాకపోవచ్చు! ఇది జరిగితేనే కదా, కార్పొరేట్ హాస్పిటల్స్ విరాజిల్లేది.

మరోసారి హైదరాబాద్‌ను నెమరువేసుకుంటే, 1940 ప్రాంతంలోనే ముత్యాల నగరంగా, కాలుష్య రహిత నగరంగా, భిక్షగాళ్లు, నేరస్థులులేని నగరంగా, దొంగతనాలు లేని నగరంగా విరాజిల్లేది. ప్రపంచంలో అప్పులంటూ తెలియకుండా అభివృద్ధి చెందిన నగరం. కాని, దీనికి భిన్నంగా పోటీపడి, హైదరాబాద్ రూపురేఖల్ని మారుస్తూ ఊపిరి ఆడకుండా చేస్తూ తాత్కాలిక ప్రయోజనాల్ని ఆశించి, దీర్ఘకాలిక రోగగ్రస్త నగరంగా మార్చివేస్తున్నారు. ఇప్పటికే పటాన్‌చెరువు ప్రాంతంలోని ఫార్మాసిటికల్ కంపెనీల వ్యర్థాలు ఆ ప్రాంత చెరువుల్లోని చేపల్ని బలిగొంటున్న కథనాల్ని చూస్తున్నాం. కెటిఆర్ లెక్కల ప్రకారం 12 వేల ఎకరాలకుపైగా భూముల్లో విస్తరించబోతున్న 'ఫార్మాహబ్' ఇంకెంత విపత్తును కల్గిస్తుందో ఊహించడం కష్టమే. కాంక్రీట్ జంగిల్‌తో, సెల్లార్ల నిర్మాణంతో, విస్తరించిన రోడ్లతో భూమిలోకి కనీసం రెండు శాతం కూడా వర్షపు నీరు ఇంకడం లేదని మెట్రలాజికల్ డిపార్టుమెంట్లు చెపుతున్నాయి. దీంతోపాటు రేడియేషన్ పెరుగుతున్నది అనుభవిస్తూనే వున్నారు. ఒకసారి కాప్రా ప్రాంతంలోని జవహర్‌నగర్ డంప్ యార్డ్‌కు చూస్తే మన నగర సొగసుల మురికి, చెత్తా ఎంత ఘాటైనవో తెలుస్తుంది. కెటిఆర్, కెసిఆర్ ఆ ప్రాంతానికి పోతే (ప్రతి రోజు 4,500 మెట్రిక్ టన్నుల డంపింగ్ జరుగుతుంది) ఎంత బాగుంటుందో!

ఈమధ్యన ఎల్‌ఇడి వెలుగులంటూ గోల పెరిగింది. విద్యుత్ ఆదా అయితే కావచ్చుగాని, భూగోళమంతా రాత్రుల్లో ఈ వెలుతురుతో 2.2 శాతం చొప్పున సంవత్సరానికి ఉష్ణోగ్రత పెరుగుతున్నదని, క్యాన్సర్, డయాబెటిస్, తీవ్రమైన మానసిక ఒత్తిడి పెరుగుతున్నదని సైన్సు అడ్వాన్సు పత్రిక తెలిపింది. పెట్టుబడి శక్తులు ఏది ఉత్పత్తి చేస్తే దాన్ని 'ఓహో' అంటూ కొని తెచ్చి వినియోగించడం తప్ప వాటి దుష్ఫలితాలు భవిష్యత్తులో ఎలా వుంటాయో ఏనాడూ ప్రభుత్వాలు పట్టించుకోవడంలేదు. పోనీ ఈ అభివృద్ధి నమూనాలు ఎంతకాలం సేవలందిస్తాయంటే ఎవరూ చెప్పరు. ఇపుడు నిర్మితమౌతున్న మెట్రో ఎన్ని సంవత్సరాలు సేవలందిస్తుందో లెక్కలేదు. ఢిల్లీ, ముంబాయి, కోల్‌కతా, బెంగుళూర్‌తో సహా ఈ మెట్రో అక్కడి ట్రాఫిక్ కడగండ్లను తీర్చలేదనేది మనవారు గుర్తించడంలేదు.

మనం బాగా అభిమానించి, మన దేశమంటే, అభిమానం కలిగి, ఇప్పటికే బిలియన్ డాలర్ల సహాయాన్ని అందించిన బిల్ గేట్స్ నవంబర్ 17, 18 తేదీలలో భారత్‌ను, ఆంధ్రప్రదేశ్‌లోని విశాఖపట్టణాన్ని సందర్శించారు. ఆ సందర్భంగా మాట్లాడుతూ, "విమర్శ కోసంకాదు గాని, దేశ ఆర్థిక ఆదాయానికి అనుగుణంగా, విద్య, వైద్యంపై ఖర్చు చేయడం లేదని, దీంతో పిల్లల రెండో పుట్టిన (వెయ్యి రోజులు) రోజునాటికి అందాల్సిన పౌష్టికాహారం, పరిశుభ్రమైన నీరు అందక పెరుగుదలనే కాదు, బుద్ధిమాంద్యత కూడా తోడై ఉందని, భారత్‌కన్నా తక్కువ ఆదాయం గల దేశాలు జిడిపిలో 3 శాతంపైగా వీటిపై ఖర్చుచేస్తుంటే, సనాతన దేశంగానే భారత్ భావిస్తూ, కేవలం ఒక శాతం మాత్రమే ఖర్చుచేస్తున్నది.." అంటూ, అన్నమాటలు మన మోదీతో సహా బాబులాంటి నాయకులు ఎంతమేరకు స్వీకరించారోగానీ, వారి వీపులపై చరిచిన విషయాన్ని గుర్తించడంలేదు. ఎందుకంటే, మనవారికి తాగేనీటికన్నా సెల్‌ఫోన్లు, నీటి రీఛార్జింగ్ పాయింట్లు చాలా ముఖ్యం. నీరంటే కొని తాగొచ్చు, సెల్‌ఫోన్లు అమ్ముడుపోవాలంటే చార్జింగ్ పాయింట్లు అవసరమెంతో మన నాయకులు గుర్తించినట్లుగా ఏ నాయకులు గుర్తించరు కాబట్టి. అందుకే వీరు పట్టణీకరణ మార్గాన్ని ఎంచుకున్నారు.

- డా. జి.లచ్చయ్య | సెల్: 94401 16162

# ఇవాన్ కా వచ్చే ఆ వంక.. అంతరిక్ష రైలు ఈ వంకా!

## వీరాజీయం

హైదరాబాదు ఇంటర్నేషనల్ కన్వెన్షన్ సెంటర్ "హెచ్ఐసిసి"కి అలాగే హెచ్ఎమ్ఆర్ అంటే హైదరాబాదు మెట్రో రైల్‌కి చెందిన ఇరవై నాలుగు స్టేషన్లకి పండుగ కళ వచ్చేసింది. రెండువేల సంవత్సరంలో అమెరికా అధ్యక్షుడు బిల్‌క్లింటన్‌కి రెండువేల ఆరు సంవత్సరంలో జార్జ్‌బుష్‌గారికి ఎర్రతివాచి పరచిన హైదరాబాదు అప్పుడు ఎంత సందడి చేసిందో ఇప్పుడు నవంబరు చివరి వారంలో అమెరికా అధ్యక్షుని సలహాదారు ట్రంప్‌గారి మొదటి భార్య కుమార్తె - విశ్వ ఔత్సాహిక పారిశ్రామికవేత్తల శిఖరాగ్ర సభల సంయుక్త నిర్వాహకురాలు అయిన అందాల తరుణీమణి "ఇవాంకాట్రంప్" రాకకి కూడా అంతకు రెట్టింపు హంగామా సందడి చేసింది గవర్నమెంటు. ఎంకి పెళ్లి సుబ్బి చావుకి వచ్చింది అని నిత్యనూతనంగా హైదరాబాదు సిటీలో స్థానికులకి, వచ్చే చుట్టాలకి కనబడే ముష్టివాళ్ల వింతలు మాత్రం లేవు పాపమొ పుణ్యమొ? వాళ్లని హుష్‌కాకి చేసేశారు! కేసీఆర్ జీనియస్‌కి వచ్చిన బ్రహ్మాండమయిన ఐడియా, ఇవాంకా సుందరి గౌరవార్థం 'ఫలకనుమా అందాల స్వర్గ-మందిరం-లో-ఈ మహావిశ్వంలోనే అతి పెద్దదయిన భోజనాల బల్ల మీద విందు - అందులో హై బిర్యానీ పసందు సమకూర్చి - సకల జనులను అచ్చెరువు పరచుట ఒక ప్రత్యేక అధ్యాయం. అంతేనా? ఎనభై - కొంతమంది కోటి అని కూడా కోస్తున్నారు లక్షల జనాభా వున్న జంట నగరాలలో 'కుక్కభా' ఐదు లక్షలుంటుందని అధికారిక లెక్కలు చెబుతున్నాయి. కానీ సభల ప్రాంతం విందు వినోదాల విడిది ప్రాంతంలో మాత్రం సశునక సందడి లేకుండా చేశారు. ఎలా చేశారో? ఇదే ఫార్ములా ఊరంతా అప్లై చెయ్యకూడదా.. అంటారు కొందరు ఆశాజీవులు - అదిసరే, ఇంత చేసినా ఓ వెర్రిబాగుల కుక్క అతిథుల మధ్యకి తోక ఊపుకుంటూ వచ్చేసింది - చచ్చినంత కల కాశారు దాన్ని అవతలకి ఎత్తుకుపోవడానికి - (బిర్యాని మహిమభాయ్ అన్నాడో కొంటి కోణంగి-) ఆరువందల ఇరవయ్ ఐదు చదరపు కిలోమీటర్ల వైశాల్యం గల మహానగరంలో ఇవాంకా తిరుగాడాలని ప్రభుత్వం అనుకున్న ప్రాంతాన్ని రంగు రంగేలీగా ముస్తాబు చేశారు-'రోడ్లా'? అవి? 'చెక్కుతద్దాలా'? అన్నట్లు - చేశారు.. 50 కోట్లు రోడ్లమీద ఓ విడతకి పెడితే వారం తిరిగేసరికి హుష్‌కాకి అయిపోయాయి. ఐదువందల కోట్లు మంజూరయిన శిఖరాగ్ర సభల్లో అందం ఇనుమడిమ్పుడానికి కారణం పైకమే.

వనితాసాధికారక సమరోత్సాహం. 150 దేశాల నుంచి రెక్కలు కట్టుకుని వాలిన ప్రతినిధులలో యాభై రెండుశాతం భామమణులే. మందీమార్బలంలో కూడా కొప్పులే ఒప్పుల్ కుప్పలు! - అసలు ఈ అంకుర పారిశ్రామిక వేత్తల కోసమే భారత పిఎం నరేంద్రుడు వస్తున్నాడు గనుక, మెట్రోకి కూడా "సారు" చేతనే (కేసీఆర్ కేటీఆర్‌లు భద్రంగా చూస్తూ ఉండగా రిబ్బను కత్తిరించే పని చేయించుకుందామనుకున్నారు. ఏది ఏమైతేనేమి? పోచంపల్లి సిల్కు కాటన్ చీరలు స్టాకులు అన్ని రకాలు ఖాళీ అయ్యాయి. దేశదేశాలలో ఇప్పుడు తాజ్‌మహలు జాగాలో చార్మినారు బొమ్మలు షోకేసులకి ఎక్కాయి. ఎలక్ట్రానిక్స్ టెక్నాలజీ పిచ్చిపిచ్చిగా పెరిగిపోయిన స్మార్ట్ కాలం గనుక జనాలకి మీడియా పండుగ చేసింది. - మనవాళ్లు 550 మంది ఆడపిల్లల్ని వాలంటీర్లుగా ముస్తాబు చేసి పెట్టారు. హైదరాబాద్ నగరంలో విందు వినోదాలు ఆరగించిన విశ్వ ఔత్సాహిక పారిశ్రామిక వేత్తల మూన్నాళ్ల మురిపాలు ముచ్చట్లు అన్నీ టిఫిన్ సెంటర్లలో మిర్చి బజ్జీ తింటూ సామాన్య జనం చెప్పుకున్నారు. బుల్లితెర మీద అట్టహాసంగా ఇవంకా షో పనిలో పనిగా, తాజా ప్రపంచ సుందరి మానుషి చిల్లర్‌ని, టోకుగా తిలకించారు. రవి గాననిచో కవి -ఆ కవికూడా గానని చో -క్లోస్డ్ సర్క్యూట్ కెమెరాలు - గుట్టు రట్టుగా చూపించేస్తాయి. రోజులు మారేయ్ - నిజమే, శ్రీమతి ఇవంక మీద ఈగ, మోదీజీ మీద దోమ వాలకుండా చూడాల్సిందే కాని, అల్లా చూడ్డానికి, అమెరికా నుంచి వందమంది వేగుల వాళ్లు భద్రతా సిబ్బంది నెల రోజులు ముందే దిగబడి - కోవాలు మేవాలు బై ది బై బిర్యాని మేయడం మొదలెట్టారు. "ప్రైస్"ని ఎంత 'ప్రెస్సు చేస్తే' అంత పంతం పెరుగుతుంది వాళ్లకి. సీసీ కెమేరాలని పోలీసు బాస్ కార్యాలయంలో మోనిటర్ చెయ్యక తప్పదుగా... అక్కడ నుంచి లాగేసి - గుట్టు రాటు చేసేశారు మీడియాసురులు. బ్రేవో! శిఖర సభలలో 150 దేశాల ప్రతినిధుల కలకలం అటు సద్దు మనిగినా - ఇవతల అంతరిక్ష రైలు పండుగ దినదిన ప్రవర్ధమానమై పర్యాటక మనోరంజితమై... అవునుమరి!, దేవుడా దేవుడా ఎప్పుడొస్తుంది దేవుడా.. అంతరిక్ష రైలుబండి మన నెత్తిమీద కూతపెట్టి కదుల్తుందా? అంతరిక్ష నిర్ధామ రైలు ఏడ? పరమ శివుడా, అంటూ జనాలు ఎదురుచూస్తున్న హెచ్ఎమ్మార్ అంటే హైదరాబాద్ మెట్రో రైలు కదిలింది. ప్రొటోకాల్ అంటూ అరుస్తున్న పెద్దలందర్నీ వెళ్లిపోయిన స్టేషన్ని మరచిపోయినట్లు మరచిపోయి మియాపూర్ నుంచి - జనగణ మానసోల్లాసంగా జేగీయమానంగా కదిలింది నయా రైలు - నగరం పండుగ చేసుకుంది. నిజానికి అమెరికా మంత్రిత్వ శాఖ మహిళల విభాగం, మన నీతి అయోగ్‌లు సంయుక్తంగా ఏర్పాటు చేసిన జిఇఎస్ సమారోహానికి మెట్రోకి ఏమీ సంబంధం లేదు - బాదరాయణం అన్నట్లు "నమోయన సంబంధం" మాత్రమే. మళ్లీ ప్రధాని దొరకొద్దా... ఇప్పటికే - రెడీ అయిపోయి తెగ "డ్రెస్ రిహార్సెల్స్" చేసేస్తున్న - గగన శకటం రాదా? గగన పుష్పమా? అని తిడుతున్నారు పురజనులు వారిని చూడ వచ్చిన ఉభయ రాష్ట్ర బంధువులు కూడా- ఉమ్మడి రాజధానిలో కూతపట్టిన ఈ రైలుకి ఖర్చు కిలోమీటరుకు 250 కోట్ల రూప్యములు మాత్రమే అయ్యింది- మియాపూర్ నుంచి నాగోల్‌కి వున్న ముప్ఫై కిలోమీటర్ల దూరం గగనమార్గంలో ఎగిరే ఈ రైలు



'అడ్డం'లనుంచి క్రిందకి చూసినా ముచ్చటే - ఆ దృశ్యాల్ని చూసినా "వవ్"... క్రింద నడుస్తూ ద్విచక్ర వాహనాల మెడ ఎలాగ్ చూడలేం- ప్రాణాలకు తెగిస్తే తప్ప. అంత ట్రాఫిక్ - సీత నుంచే లంక కాలింది అన్నట్లు ఈ పద్నాలుగువేల కోట్ల రూపాయల "ఐరావతాన్ని" - ప్లాన్ చెయ్యాల్సివచ్చింది. 2004 నాటి ఐడియా, 2012 ఏప్రిల్ 12 నాటికి భూమి పూజకి నోచుకున్నది... ఆనక, కలలు కన్నాము. పీడకలలు తొలిగాయి.

ప్రస్తుతానికి హైదరాబాద్ రోడ్ల మీద 50 లక్షల వ్యక్తిగత వాహనాల వినియోగం ఉంది. ప్రతి రోజూ 80 లక్షల ట్రిప్పుల మేర మోటారు వాహనాల మీద ప్రజలు ప్రయాణాలు చేస్తున్నారు. ఇందులో ప్రభుత్వ సదుపాయాల ద్వారా జరుగుతున్న రాకపోకలు కేవలం 40 శాతం మాత్రమే కనుక మాస్ రాపిడ్ ట్రాన్సిట్ సిస్టమ్ (ఎమ్ఆర్టీఎస్) మొదటి దశలో మెట్రోకు 72 కి.మీ. దూరం రూపకల్పన చేశారు. ఇందులో 3 ఎక్కువ జనసమ్మర్ధమైన ప్రాంతాలను ఎంచుకున్నారు. చివరికి ప్రభుత్వ ఆధ్వర్యంలో ఉండేలా ప్రాజెక్టు రూపకల్పన చేశారు. మూడు కారిడార్‌లు - 1 (మియాపూర్-ఎల్‌బి నగర్)ను 'ఏ' అన్నారు. కారిడార్-2 (జెబిఎస్-ఎంజిబిఎస్) 'బీ', కారిడార్ -3 నాగోల్-హైటెక్ సిటీ) రూటూ 'సి' అన్నారు. ఇప్పటికి, ఈ పులుసుతో ఈ ముద్ద దిగితే చాలు అన్నట్లు - మెట్రో కల నిజమయింది. మొత్తం ఏరియాలో పదిహేను శాతం రోడ్లు వుంటే తప్ప చాలని మహానగరంలో పదిశాతం రోడ్లు మాత్రమే వాహనయోగ్యమైనవి ఉన్నాయి. నాలుగువేల బస్సులు మాత్రమే తిరుగుతున్నాయి. ఆటోగతప్రాణులైపోయారు విద్యార్థులు, ఉద్యోగులు. అద్సరే, ప్రస్తుతానికి, ఇంటికొచ్చిన చుట్టాలు పక్కాలు - మెట్రోని వాళ్ల లిస్టులో ముందు ఎట్టేసుకుని - అత్తారింటికి దారేది? అన్నట్లు - మెట్రో ఉత్సాహం ప్రదర్శిస్తున్నారు. చూతమూ మెట్రో వింతలూ - అంటూ... "కానీ అంతా మయసభ అనుకో - ఇలా చూస్తో వుంటే అలా స్టేషను వచ్చింది".. "మెట్లు తిరపతే.. ఎస్కలేటర్లు అవో మాయా సోపానాలు" అంటూ ముచ్చట్లు చెప్పుకుంటూ - మీ పిల్లల్ని అల్పాచమానం గట్రా ఇంటిదగ్గరే చేయించి తీసుకుపొండి - ఆనక ఇజ్జతఘర్‌లు వెతుక్కుంటూ పోవాలంటే భయం వేస్తుంది - అని హెచ్చరిక ఇరవై సెకన్లు "ఆగుద్ది" పైగా ఆడపిల్లలే తోల్తున్నారంట - అంటూ మొదటి రోజు లక్ష మంది ఎక్కి తిరిగి వచ్చి టిఫిన్ సెంటర్ల మీద పడి పండుగ చేసుకుంటే - మర్నాడు లక్షన్నర మంది -

కానీ మీరుండే పేటకి దగ్గర స్కూటరు, కారు వేసుకుపోయారో - మళ్లీ మీరు జాయ్‌రైడ్ పూర్తి చేసుకుని తిరిగి వచ్చేసరికి మీ బండ్లు పోలీసులు ఎత్తుకుపోయే ప్రమాదం ఉంది. ఇరవయ్ నాలుగు స్టేషన్లకి పన్నెండు చోట్ల - ఏ స్టేషన్‌కి అందాక వెళ్లే బస్సులు - గిస్సులు లేవు. 'ప్లతోర్మ్' మీద నో డస్ట్ బిన్లు. మోదీ గారికి 'కోపంక్' వస్తుంది - ఏదైనా క్రింద పడేస్తే అన్నాడో కళాశాల భామ. బెజావాడ, గుంటూరు నుంచి కూడా అన్నట్లు తెనాలి నుంచి కూడా మనవాళ్లు - కొంచెం బాధగా మొహం పెట్టుకొని వస్తున్నారు. పనిలోపనిగా మెట్రో చూసేద్దామని. - ఉమ్మడి రాజధాని- అన్నారు గదా... మా చుట్టాలు అంతా ఉమ్మడి పౌరులు గనుక మేము కూడా అందరు పౌరులతో హ్యాపీ అన్నారు కొందరు మెట్రో విజిట్ చేసుకొని వచ్చి - మాకు తెల్లారిలేస్తే వస్తాం - మాకు ఖమ్మం, వరంగల్ లాంటి ఊళ్లకి పోయినా - వేరు అన్న ఫీలింగు రాదు - అన్నాడో ఆంధ్రా ఫ్రెండు - ఇంతెకీ రియల్ ఎస్టేటు తేజీ అవుతూందా? అని అడిగాడు -రాజమండ్రి బిల్డర్ బాబాయ్. తెల్దు - వెనుకటికి - జట్కాలు వచ్చి ఎడ్లబండ్ల పొట్టకొట్టే - బస్సులొచ్చి బండ్లవాల్ల పొట్టకొట్టే -- ఆటోలొచ్చి రిక్షావాల్ల కూడు కొట్టే - ఆనక టాక్సీలొచ్చి ఆటోల తోక కత్తిరించే అని పాటలు పాడేవాళ్లు - ఇప్పుడు రోజుకో రెండు మూడు లక్షల మంది "ఆటో ఆటో వస్తావా అన్నా" అని ... - అడగరు -సాఫ్ట్వేర్ కంపనీలు స్మార్ట్‌కార్డులు సిబ్బందికి కొని చ్చేస్తే? అమ్మో!

మెట్రో స్టేషన్లకి - మినీ బస్సులు వెయ్యాలి - షేరు ఆటోలు షేరు టాక్సీలు వుండాలి అంటున్నారు తెల్లారగట్ల లేచి పొట్ట చేతబట్టుకుని - ఎచటికిపోతావంటే? ఊరవతలకి అనే లక్షలాది యువజనులు. వీళ్లంతా స్మార్ట్‌కార్డులు అంటే సీజన్ టిక్కెట్లు కొనేస్తారేమో?.. కల నిజమాయెగా.. కోరిక తీరగా... గగనయనమూ హాయిహాయిగా..

సింగ్ ఎ సాంగ్ అండ్ లివ్ లాంగ్!

veeraji.columnist@gmail.com

## ఉత్తరాయణం

### వేధింపులు ఆపాలి

ఎన్నికల వేళ హామీల వర్షం కురిపించి అధికారంలోకి వచ్చిన రాజకీయ పక్షాలు ఆ తరువాత ప్రజల సంక్షేమాన్ని పట్టించుకోవడం లేదు. నిధుల లేమితో బాధపడుతున్న రాష్ట్రంలో పొదుపు పాటించకుండా ఆర్భాటానికి ఎక్కువగా నిధులు వెచ్చిస్తున్నారు. జిఎస్‌టి వంటి విధానాలు సామాన్యులకు ఇబ్బందులు కలిగిస్తున్నాయి. ఇలాంటి వాటిని ప్రశ్నిస్తే అధికార పక్షానికి చెందిన నాయకులు వేధింపులు, దౌర్జన్యాలకు పాల్పడుతున్నారు. ఈ వైఖరి మారాలి. ప్రజాశ్రేయస్సుకోసం పనిచేసేవారిని ప్రోత్సహించాలే తప్ప వారిపై ఆగ్రహం ప్రదర్శించకూడదు.

-వై.శేషగిరిరావు, రాజమండ్రి

### జగన్ వైఖరి మారాలి

ఆంధ్రప్రదేశ్ ప్రతిపక్ష నేత జగన్మోహన్‌రెడ్డిపై ఎంతో బాధ్యత ఉంది. అధికారపక్షాన్ని కట్టడి చేసి ప్రజాసమస్యల పరిష్కారానికి ఆయన కృషి చేయాల్సి ఉంది. అయితే పదేపదే ఆ బాధ్యతను మరచి పిడివాదాన్ని వినిపిస్తున్నారు. పార్టీ ఫిరాయించినవారి రాజీనామా కోసం ఎక్కువ సమయం వెచ్చిస్తున్నారు. దీనికన్నా ప్రజల్లోకి వెళ్లి వారి సమస్యల పరిష్కారంపై పోరాడుతూ వారికి దగ్గరయ్యేందుకు ప్రయత్నించడం మంచిది. రాజకీయ పరిణతితో వ్యవహరిస్తేనే ప్రజల ఆదరణ లభిస్తుంది. ఫిరాయించిన వారి వ్యవహారాన్ని ప్రజలు చూసుకుంటారు.

-టి.చక్రపాణి, ఏలేశ్వరం

### లౌకికవాదులు ఏమయ్యారు?

భావప్రకటన స్వేచ్ఛ, లౌకికవాదం అంటూ బీఫ్ ఫెస్టివల్స్‌ను సమర్థించేవారు, ఉగ్రవాదుల మరణిస్తే సంతాపం వ్యక్తం చేసే వారు, గణేశ నిమజ్జనాన్ని విమర్శించేవారు, దేశభద్రతకు సవాలు విసిరే రోహింగ్యాలకు ఆహ్వానం పలికే వారు ఈ దేశంలో లౌకికవాదులు. ఎందుకో కొన్నిరోజులుగా వారు మౌనం పాటిస్తున్నారు. తమిళనాడులో అప్పులు తీర్చలేక ఓ కుటుంబం నిప్పంటించుకుని ఆహుతైంది. వారి బలవన్మరణం అందర్నీ విచలితుల్ని చేసింది. కానీ మన కుహనా లౌకికవాదులను కదలించలేకపోయింది. దేశానికి సమస్యలు తెచ్చిపెట్టేవారికి మద్దతుగా నోరువిప్పే ఈ కుహనా మేధావులు పేదల పక్షాన నోరు విప్పకపోవడం ఇవాళ కొత్తకాదు. ఇది అన్యాయం.

-వి.ఆర్.ఆర్.ఎ.రాజు, హైదరాబాద్

### హామీలు మరచిన ప్రభుత్వం

ఇంటికో ఉద్యోగం ఇస్తామని అధికారంలోకి వచ్చిన టిఆర్ఎస్ ప్రభుత్వం ఇప్పుడు మాట మార్చింది. ఆ మాట తాను అనలేదని కెసిఆర్ ప్రకటించడం బాధాకరం. తెలంగాణ వస్తే దళితుడిని ముఖ్యమంత్రిని చేస్తానన్న ఆయన ఆ తరువాత భిన్నంగా ప్రవర్తించారు. ఇప్పటివరకు ప్రభుత్వం ప్రకటించిన పథకాలన్నీ ఆర్భాటాలే. కార్యరూపంలో అవి నత్తనడకే నడుస్తున్నాయి. ప్రభుత్వ వైఖరిపై కాంగ్రెస్ నేత వి.హనుమంతరావు చేస్తున్న విమర్శలకు అర్థం ఉంది. ఎన్నికల వేళ ప్రజలకు ఇచ్చిన హామీల అమలుకు కేసీఆర్ ప్రాధాన్యం ఇవ్వాలి

-మహమ్మద్ షరీఫ్, సికింద్రాబాద్

# రిగ్గింగ్ వారికి రివాజు

**● కొత్త అధ్యక్షుడెవరో ముందే తెలిసిపోయింది**
**● నాడు పటేల్, మొరార్జీకీ ఇలాగే జరిగింది**
**● కాంగ్రెస్ సంస్థాగత ఎన్నికలపై మోదీ వ్యంగ్యాస్త్రాలు**



గుజరాత్‌లోని సురేంద్రనగర్‌లో ఆదివారం నిర్వహించిన ఓ ర్యాలీలో ప్రధాని నరేంద్ర మోదీని సత్కరిస్తున్న బీజేపీ నాయకులు, కార్యకర్తలు

సురేంద్రనగర్ (గుజరాత్), డిసెంబర్ 3: కాంగ్రెస్ అధ్యక్షుడిగా రాహుల్ గాంధీ ఎన్నికకు ముహూర్తం సమీపిస్తున్న నేపథ్యంలో ఆ పార్టీపై ప్రధాని నరేంద్ర మోదీ తీవ్ర పదజాలంతో విరుచుకుపడ్డారు. సంస్థాగత ఎన్నికల్లో కూడా రిగ్గింగ్‌కు పాల్పడిన ఘనత కాంగ్రెస్ పార్టీదేనంటూ యద్దేవా చేశారు.

సాధారణంగా పార్టీ అధ్యక్ష పదవికి పోటీ జరిగిన తర్వాతనే ఎన్నికల ఫలితం వెల్లడి కావాల్సి ఉంటుందని, కాని కాంగ్రెస్ పార్టీ విషయంలో ఆ పార్టీ కాబోయే అధ్యక్షుడెవరో ముందుగానే తెలిపోయిందంటూ వ్యంగ్యోక్తి విసిరారు. ఆదివారం నాడిక్కడ జరిగిన ఓ ర్యాలీలో మాట్లాడిన మోదీ 'సొంత పార్టీలోనే ప్రజాస్వామ్య విధానాలను అవలంబించనప్పుడు దేశంలో ప్రజాస్వామ్య విలువలను మీరేవిధంగా కాపాడగలుగుతారు' అని మోదీ కాంగ్రెస్‌ను ఉద్దేశించి అన్నారు. 'కాంగ్రెస్ పార్టీ అధ్యక్ష పదవికి త్వరలోనే ఎన్నికలు జరుగుతున్నాయి, వాటి ఫలితమేమిటో మీ అందరికీ ముందే తెలుసు' అని మోదీ అన్నప్పుడు జనంలో హర్షధ్వానాలు చెలరేగాయి. మోదీ ప్రశ్నకు జవాబిచ్చిన ప్రజలు పార్టీ అధ్యక్ష పదవి రాహుల్ గాంధీకే దక్కుతుందంటూ జవాబిచ్చారు కూడా. జనంలో ఉన్న ఉత్సాహాన్ని అందిపుచ్చుకున్న మోదీ మరింత ముందుకెళ్లా, మొదట్నుంచీ కూడా కాంగ్రెస్ పార్టీలో ఎన్నికలు ఈ తరహాలోనే జరుగుతున్నాయని అన్నారు. దేశ ప్రధానిగా ఎవరు బాధ్యతలు చేపట్టాలన్న పరిస్థితి వచ్చినప్పుడు జవహర్‌లాల్ నెహ్రూ కంటే కూడా సర్దార్ పటేల్‌కే ఎక్కువ ఓట్లు వచ్చాయని గుర్తుచేసిన మోదీ, 'ఆ ఎన్నికల్లో రిగ్గింగ్ జరిగింది. పటేల్ ఓడిపోయారు. నెహ్రూయే గెలిచారు' అని ఆరోపించారు. మురార్జీ దేశాయ్ విషయంలో కూడా ఇలాంటి పరిస్థితే ఎదురైందని పేర్కొన్న మోదీ మొదట్నుంచీ కూడా కాంగ్రెస్ పార్టీ నేతలకు ఘనమైన రిగ్గింగ్ చరిత్రే ఉందని అన్నారు. ఈ సందర్భంగా కాంగ్రెస్ నాయకుడు షెహజాద్ పూనేవాలా పేరును ప్రస్తావించిన మోదీ, కాంగ్రెస్ పార్టీ ఎన్నికల ప్రక్రియలో రిగ్గింగ్ విధానాన్ని ఆయన వెలుగులోకి తెచ్చారని అన్నారు. అయితే ఇలాంటి పరిస్థితి తలెత్తినప్పుడు సహనమే మంత్రంగా కాంగ్రెస్ పార్టీ దానిని దాటుకుంటూ వచ్చిందని, ఆ విధంగా పూనేవాలా నోరు మూయించిందని అన్నారు. అంతేగాకుండా, అన్ని వాట్సప్ గ్రూపుల ద్వారా పూనేవాలాకు నిద్రలేకుండా చేశారని, ఒక రకంగా చెప్పాలంటే ఆయనను ఏకంగా పార్టీయే బహిష్కరించిందని మోదీ అన్నారు. గుజరాత్ ఎన్నికల గురించి ప్రస్తావిస్తూ, 'బావిలో నీళ్లున్నపుడే బకెట్ నిండుతుంది. పార్టీలోనే ప్రజాస్వామ్యం లేనప్పుడు దేశంలో ప్రజాస్వామ్య విలువలను ఏ విధంగా ఆచరించగలుగుతారు' అని కాంగ్రెస్‌పై మరోసారి విరుచుకుపడ్డారు. 182 స్థానాలు కలిగిన గుజరాత్ అసెంబ్లీకి ఈ నెల 9, 14 తేదీల్లో రెండు దశల్లో ఎన్నికలు జరుగుతున్న విషయం తెలిసిందే.

బరూస్‌లో జరిగిన మరో ఎన్నికల ర్యాలీలో మాట్లాడిన మోదీ, కుల మత ప్రాతిపదికన సమాజాన్ని చీల్చేందుకు కాంగ్రెస్ పార్టీ ప్రయత్నిస్తోందని ఆరోపించారు. అన్నదమ్ముల మధ్యే గోడలు కట్టాలని చూస్తోందని కాంగ్రెస్ పార్టీపై చెలరేగిన మోదీ ఆ పార్టీ ఉద్దేశాల గురించి గుజరాత్ ప్రజలకు బాగానే తెలుసునన్నారు. అవసరానుగుణంగా రంగు మార్చడం అన్నది కాంగ్రెస్ పార్టీ నైజమని అన్నారు. వ్యూహాత్మకంగా సమాజాన్ని చీల్చి ఎన్నికల్లో లబ్ధి పొందడమే కాంగ్రెస్ ఏకైక లక్ష్యమంటూ మోదీ విరుచుకుపడ్డారు.



# చబహార్ రేవు ప్రారంభం

**● చైనా-పాక్‌లకు ఇది కౌంటర్ చెక్**
**● పాక్‌తో నిమిత్తం లేకుండానే భారత్ వాణిజ్యం**

టెహరాన్, డిసెంబర్ 3: భారత్-ఇరాన్ దేశాలు సంయుక్తంగా నిర్మించిన అతిపెద్ద చబహార్ రేవు తొలిదశను ఇరాన్ ప్రధాని హుస్సేన్ రౌహానీ ఆదివారం ప్రారంభించారు. దీనివల్ల అఫ్ఘానిస్తాన్, మధ్య ఆసియా దేశాలకు పాకిస్తాన్‌తో నిమిత్తం లేకుండా వ్యాపార వాణిజ్య కార్యకలాపాలకు మార్గం సుగమం అవుతుంది. అఫ్ఘానిస్తాన్, ఇరాన్‌లకు తమ భూభాగం మీదుగా భారత్ వస్తువుల ఎగుమతిని పాక్ అనుమతించకపోవడంతో ఈ రేవు నిర్మాణానికి సంబంధించి ఇరాన్-భారత్‌ల మధ్య ఒప్పందం కుదిరింది. దీని తొలిదశ ప్రారంభమైన నేపథ్యంలో ఇది పూర్తి 2018 చివరి నాటికి అందుబాటులోకి వస్తుందని భారత్ ఇప్పటికే ప్రకటించింది. పాకిస్తాన్‌లో గ్వాదర్ రేవు నిర్మాణంలో చైనా పూర్తి స్థాయిలో సహకరిస్తున్న నేపథ్యంలో చబహార్ రేవు నిర్మాణానికి భారత్-ఇరాన్ దేశాలు శ్రీకారం చుట్టాయి. దీని నిర్మాణంలో భారత్ క్రియాశీల పాత్ర పోషిస్తోంది.

# పాక్ ఎన్నికల్లో సయీద్ పోటీ?

## కాశ్మీర్ పోరాటాన్ని ఆపేదిలేదంటూ కవ్వింపు



లాహోర్, డిసెంబర్ 3: తొమ్మిదేళ్ల క్రితం భారత వాణిజ్య నగరం ముంబయిపై జరిగిన ఉగ్రదాడికి కుట్రదారుగా భావిస్తున్న హఫీజ్ సయీద్ సారథ్యంలోని జమాత్ ఉద్ దవా పార్టీ వచ్చే ఏడాది జరగనున్న పాకిస్తాన్ సాధారణ ఎన్నికల్లో పోటీ చేయబోతోంది. ఇందుకు సంబంధించిన రాజకీయ సంకేతాలను హఫీజ్ సయీద్ అందించారు. అయితే మిల్లీ ముస్లింలీగ్ పేరుతోనే తాము ఎన్నికల్లో పోటీ చేస్తామని, దీన్నో రాజకీయ పార్టీగా ఎన్నికల కమిషన్ ముందు నమోదు చేసుకుంటామని సయీద్ వెల్లడించారు. 2008లో జరిగిన ముంబయి ఉగ్రదాడికి సారథ్యం వహించిన లష్కరే తోయిబా కీలక సంస్థగా భావిస్తున్న జమాత్ ఉద్ దవాపై నిషేధం అమలులో ఉన్న విషయం తెలిసిందే. ఇప్పటికీ సయీద్‌ను అంతర్జాతీయ ఉగ్రవాదిగా అమెరికా, ఐక్యరాజ్య సమితి ప్రకటించాయి. ఇక్కడి పార్టీ ప్రధాన కార్యాలయంలో మీడియాను ఉద్దేశించి మాట్లాడిన సయీద్ 2018 సంవత్సరాన్ని కాశ్మీరీలకే అంకితం చేస్తున్నామని ప్రకటించారు. ఎలాంటి ఇబ్బందులు ఎదురైనా కాశ్మీరీల పోరాటానికి మద్దతు కొనసాగిస్తామని స్పష్టం చేశారు. కాశ్మీర్‌పై నోరెత్తకుండా భారత్ తమపై ఒత్తిడి తెస్తోందని పేర్కొన్న ఆయన పరోక్ష దౌత్యం వల్లే కాశ్మీర్ లక్ష్యానికి విఘాతం కలుగుతుందని పాకిస్తాన్ ప్రభుత్వానికి స్పష్టం చేశారు. తమను పాకిస్తాన్‌లో, హురియత్ నేతలను భారత్‌లో నిర్బంధించడం వెనుక అంతర్జాతీయ కుట్ర ఉందన్నారు. కాశ్మీరీల లక్ష్యాన్ని దెబ్బతీయడానికే ఇలా చేస్తున్నారని గృహ నిర్బంధం నుంచి తాను విడుదల కావడం భారత్‌కు తీవ్ర ఆగ్రహాన్ని తెప్పించిందని సయీద్ పేర్కొన్నారు. కాశ్మీరీలపై దాడులను ఆపనంతవరకు తమ పోరాటం ఆగే ప్రసక్తి లేదని, మరింతగా దీన్ని తీవ్రతరం చేస్తామని తెలిపారు.

# మాటలే తప్ప.. చేతలేవి?

**● హామీలతోనే సరిపెడుతున్న మోదీ**
**● గుజరాత్‌లో మహిళల భద్రతకు దిక్కులేదు**
**● ప్రధానిపై విరుచుకుపడ్డ రాహుల్**



న్యూఢిల్లీ, డిసెంబర్ 3: ప్రధాని నరేంద్ర మోదీ కేవలం వాగ్దానాలతోనే కాలక్షేపం చేస్తున్నారని కాంగ్రెస్ ఉపాధ్యక్షుడు రాహుల్ గాంధీ తీవ్రస్వరంతో ధ్వజమెత్తారు. గుజరాత్‌లో మహిళలకు భద్రత లేదని పేర్కొన్న ఆయన రోజుకో ప్రశ్న కార్యక్రమంలో భాగంగా ఆదివారం ఐదో ప్రశ్నను మోదీని లక్ష్యించి సంధించారు. గుజరాత్‌లో మహిళల భద్రత అన్నది ఆందోళన కలిగిస్తోందని పేర్కొన్న రాహుల్ గాంధీ, తన ప్రశ్నలకు మోదీ జవాబు చెప్పాలని డిమాండ్ చేశారు. ఇచ్చిన వాగ్దానాలను నిలబెట్టుకోవడంలో మోదీ సర్కారు పూర్తిగా విఫలమైందని రాహుల్ ధ్వజమెత్తారు. గుజరాత్ మహిళలకు భద్రతా లేదు, అక్షరాస్యత లేదు, కనీసం వారి ఆరోగ్యానికి అవసరమైన పౌష్టికాహారం కూడా అందుబాటులో లేదని రాహుల్ ట్వీట్ చేశారు.

ఈ మహిళా శక్తిని ప్రభుత్వం దోపిడీ చేస్తోంది తప్ప వారి రక్షణ, భద్రతకు ఎలాంటి చర్యలూ చేపట్టడం లేదని అన్నారు. అంగన్‌వాడీల నుంచి ఆశా కార్మికుల వరకు ప్రతి మహిళలోనూ నిరాశా, నిస్పృహలు కనిపిస్తున్నాయని పేర్కొన్న రాహుల్ 'గుజరాత్ మహిళల సంక్షేమం విషయంలో మోదీ సర్కార్ హామీలతోనే కాలక్షేపం చేస్తోంది. వాటిని అమలు చేయాలనే ఉద్దేశం దానికి ఎంత మాత్రం లేదు' అని అన్నారు. మహిళల భద్రత విద్య ఆరోగ్యానికి సంబంధించిన వివరాలను కూడా ఆయన ఈ సందర్భంగా ప్రస్తావించారు. మహిళల అక్రమ రవాణాలో మూడో స్థానంలో, యాసిడ్ దాడుల్లో ఐదో స్థానంలో, మైనర్ బాలికలపై అత్యాచారాల్లో గుజరాత్ పదో స్థానంలో ఉందని పేర్కొన్న రాహుల్, దీన్నిబట్టి రాష్ట్ర మహిళల సంక్షేమాన్ని మోదీ సర్కార్ ఎంతమాత్రం పట్టించుకోవడం లేదన్న విషయం స్పష్టమవుతోందన్నారు. బాలిక విద్య విషయంలో గుజరాత్ 20వ స్థానంలో ఉందని, 2001-11 మధ్య కాలంలో మహిళల అక్షరాస్యత 70.3 శాతం నుంచి 57.8 శాతానికి ఎందుకు పడిపోయిందని మోది ప్రశ్నించారు. అలాగే ప్రసవ సమయంలో మహిళల మరణాల రేటు కూడా మిగతా రాష్ట్రాలతో పోలిస్తే ఆందోళనకరంగా ఉందని అన్నారు. ప్రభుత్వ పాఠశాలు, విద్యా సంస్థలను పణంగా పెట్టి ప్రధాని మోదీ విద్యా వ్యాపారాన్ని మొదలుపెట్టారని రాహుల్ తీవ్రస్వరంతో ఆరోపించారు. భారీగా ఫీజులు పెంచి విద్యార్థుల భవిష్యత్తును దెబ్బతీస్తున్నారన్నారు. గత 22 సంవత్సరాలుగా గుజరాత్ బీజేపీ పాలనలోనే ఉందని, రాష్ట్రం అన్ని విధాలుగా అనేక రంగాల్లో వెనుకబడిపోవడానికి దారితీసిన పరిస్థితులపై మోదీ సర్కార్ ప్రజలకు జవాబు చెప్పాల్సిన అవసరం ఉందన్నారు.

# దివ్యాంగ సేవకులకు పురస్కారాలు

**ఆంధ్రభూమి ప్రతినిధి**

న్యూఢిల్లీ, డిసెంబర్ 3: ఆంధ్రా, తెలంగాణ రాష్ట్రాల్లో దివ్యాంగులకు సేవలు అందించిన పలుపురు వ్యక్తులు, సంస్థలకు జాతీయ దివ్యాంగ పురస్కారాలు అందజేశారు. జాతీయ దివ్యాంగుల దినోత్సవాన్ని పురస్కరించుకుని ఆదివారం కేంద్ర సామాజిక న్యాయ మంత్రిత్వ శాఖ ఢిల్లీలోని విజ్ఞాన్ భవన్ నిర్వహించిన కార్యక్రమంలో ఈ పురస్కారాలను ప్రదానం చేశారు. రాష్ట్రపతి రామ్‌నాథ్ కోవింద్ చేతుల మీదుగా అవార్డులను అందజేశారు. దివ్యాంగుల ఉపాధి అవకాశాలకోసం కృషి చేస్తున్న హైదరాబాద్‌కు చెందిన యూత్ జాబ్స్ ఫౌండేషన్‌కు, సికింద్రాబాద్‌కు చెందిన దేవ్నార్ ఫౌండేషన్ ఫర్ బ్లైండ్ సంస్థలకు పురస్కారాలు దక్కాయి. దేవ్నార్ వ్యవస్థాపకుడు సాయిబాబా గౌడ్ అవార్డును అందుకున్నారు. చిత్తూరు జిల్లా కొంగారెడ్డిపల్లికి చెందిన కేవి శిరీష, కరీంనగర్ జిల్లా చిర్తకుంటకు చెందిన సి.సాయికృష్ణకు అవార్డులు లభించాయి. రోల్ మోడల్ అవార్డుల విభాగంలో సికింద్రాబాద్‌కు చెందిన కె.శేషగిరిరావు, ఆదిలాబాద్‌కు చెందిన ఆకుల రోహిత్‌కు అవార్డులు దక్కాయి. దివ్యాగులకు అనుకులంగా ఉండే విధంగా పరిసరాలను తీర్చిదిద్దిన శ్రీకాకుళం సర్వశిక్షా అభియాన్ జిల్లా ప్రాజెక్టు అధికారికి కూడా అవార్డు లభించింది. దివ్యాంగులకు అవసరమైన పరికరాలకోసం పరిశోధనలు చేస్తున్న హైదరాబాద్‌కు చెందిన బిశ్వజిత్‌రాయ్, ఆశ దాస్, విజయకుమార్ అలీషాలకు కూడా పురస్కారాలు లభించాయి. దివ్యాంగుల సంక్షేమ అవార్డును ఈ ఏడాదికి మెడ్ ఇండియా వ్యవస్థాపకుడు, తమిళనాడుకు చెందిన పద్మశ్రీ డా. టీఎస్ చంద్రశేఖర్ అందుకున్నారు. ఈ కార్యక్రమంలో కేంద్ర సామాజిక న్యాయ శాఖ మంత్రి థవర్‌చంద్ గెహ్లాట్ పాల్గొన్నారు.

# మరో 'గఘ'న యానం

**● చంద్రయాన్-2కు సిద్ధమవుతున్న ఇస్రో**
**● పూర్తి స్వదేశీ పరిజ్ఞానంతో రోవర్ నిర్మాణం**




న్యూఢిల్లీ, డిసెంబర్ 3: భారత అంతరిక్ష పరిశోధనా సంస్థ (ఇస్రో) మరో కీలక ప్రయోగానికి సన్నద్ధం అవుతోంది. విశ్వసాధంలో సంపన్న దేశాలకు చెందిన పరిశోధనా సంస్థలతో పోటాపోటీగా దూసుకుపోతున్న ఇస్రో చంద్రయాన్-2లో భాగంగా చంద్రుడిపైకి వెళ్లేందుకు సన్నద్ధమవుతోంది. అనతికాలంలోనే అంతరిక్ష పరిశోధనల్లో నిరుపమాన స్థాయికి చేరుకున్న ఇస్రో ఉపగ్రహ ప్రయోగాల్లోనూ, అలాగే మార్స్ మిషన్ ద్వారానూ తన సత్తాను చాటుకుంది. తాజాగా మరో చారిత్రక అడుగు వేయబోతోంది. భారతదేశ చరిత్రలో తొలిసారిగా చంద్రుడిపైనే అడుగుపెట్టేందుకు సన్నద్ధం అవుతోంది. 2013లో యూ-2 రోవర్‌ను చంద్రుడి ఉపరితలంపైకి చైనా విజయవంతంగా ప్రయోగించగలిగింది. ఇప్పుడు ఇస్రో కూడా 2018 మార్చి చివరి నాటికి మొట్టమొదటి లూనార్ రోవర్‌ను చంద్రయాన్-2లో భాగంగా ప్రయోగించేందుకు సిద్ధమవుతోంది. చంద్రగ్రహ శోధన విషయంలో భారత్ చేపట్టిన తొలి అడుగు ఇదే కానప్పటికీ చంద్రుడ్ని అన్ని కోణాల్లోనూ పరిశోధించి అక్కడి పరిస్థితులను కరతలామలకం చేసుకునే దిశగా వేయబోతున్న బలమైన అడుగుగానే ఈ తాజా ప్రయోగ సంకల్పాన్ని పరిగణించాల్సి ఉంటుంది. 2008లో ఇస్రో తొలిసారిగా చంద్రయాన్-1ను ప్రయోగించింది. ఈ రోవర్ చంద్రుడి చుట్టూ పరిభ్రమించి అక్కడి నీటి ఆనవాళ్లతోపాటు ఎన్నో కొత్త అంశాలను వెలుగులోకి తెచ్చింది. అయితే 2008 నవంబర్‌లో ఈ వ్యోమనౌక చంద్రుడిని ఢీకొని దాని పరిభ్రమణలో గల్లంతయింది. అయితే అమెరికా అంతరిక్ష పరిశోధనా సంస్థ (నాసా) ప్రయత్నం ఫలితంగా గత ఏడాది ఇది మళ్లీ కనిపించింది. తాజాగా మూడు వ్యోమనౌకలను చంద్రయాన్‌లో భాగంగా ఇస్రో బృందం సిద్ధం చేస్తోంది. వీటిలో ఒకటి చంద్రుడి ఉపరితల కక్ష్యలో తిరిగే ఆర్బిటర్ కాగా, రెండోది మూన్‌లాండర్. దీని ద్వారా ఈ రోవర్ చంద్రుడి ఉపరితలంపై దిగగలుగుతుంది.

# జనవరి 30 నుంచి బడ్జెట్ సమావేశాలు

**31న లోక్‌సభలో ఆర్థిక సర్వే ● ఫిబ్రవరి 1న ఆర్థిక బడ్జెట్**
**ఎన్డీయేకు ఇదే ఆఖరి పూర్తిస్థాయి బడ్జెట్**



**ఆంధ్రభూమి ప్రతినిధి**

న్యూఢిల్లీ, డిసెంబర్ 3: పార్లమెంట్ బడ్జెట్ సమావేశాలు వచ్చే ఏడాది జనవరి 30 నుంచి ప్రారంభంకానున్నాయి. జీఎస్టీ అమలులోకి వచ్చిన తరువాత మొదటి వార్షిక బడ్జెట్ కాగా, ఎన్డీయే ప్రభుత్వానికి ఇదే చివరి బడ్జెట్ కానుంది. ఈ మేరకు సాధరణ బడ్జెట్ వివరాలను అధికార వర్గాలు వెల్లడించాయి. వచ్చే ఏడాది జనవరి 30 నుంచి పార్లమెంట్ బడ్జెట్ సమావేశాలు ప్రారంభం కానుండగా, అదేరోజు లోక్‌సభ, రాజ్యసభ, ఉభయ సభలను ఉద్దేశించి రాష్ట్రపతి రామ్‌నాథ్ కోవింద్ తొలిసారిగా పార్లమెంట్ సెంట్రల్ హాల్‌లో ప్రసంగించనున్నారు. జనవరి 31న ఆర్థిక సర్వేను కేంద్ర ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీ లోక్‌సభ ముందు పెట్టనున్నారు. వచ్చే ఏడాది ఆర్థిక బడ్జెట్‌ను ఫిబ్రవరి 1న పార్లమెంట్‌లో ప్రవేశపెట్టనున్నారు. గతంలో వార్షిక బడ్జెట్‌ను ప్రతి ఏడాది ఫిబ్రవరి 28న పార్లమెంట్‌లో ప్రవేశపెట్టే సాంప్రదాయన్ని ఈ ఏడాది నుంచి కేంద్ర ప్రభుత్వం పక్కన పెట్టిన విషయం తెలిసిందే. ప్రతి ఏడాది వార్షిక బడ్జెట్‌ను ఏప్రిల్ 1నుంచి అమలులోకి తీసుకురావలన్న ఉద్దేశంతో కేంద్రం ఫిబ్రవరి మొదటి వారాంలోనే పార్లమెంట్‌లో వార్షిక బడ్జెట్‌ను ప్రవేశపెట్టే కొత్త సంప్రాదాయానికి నాంది పలికింది. అలాగే గతంలో మాదిరి వార్షిక బడ్జెట్, రైల్వే బడ్జెట్ వేర్వేరుగా కాకుండా వార్షిక బడ్జెట్‌లోనే రైల్వే బడ్జెట్‌ను కలిపి సమర్పిస్తుంది. అయితే శీతాకాల పార్లమెంట్ సమావేశాలు ఈ నెల 15 నుంచి ప్రారంభమై, వచ్చే ఏడాది జనవరి 5తో ముగియనున్నాయి. ఈ పరిస్థితుల్లో శీతాకాల, సాధారణ బడ్జెట్ సమావేశాల మధ్య నెలరోజులు కూడా విరామం ఉండటం లేదు. 2018-19 ఏడాదికి కేంద్రం సమర్పించే ఈ సాధారణ బడ్జెట్‌తోనే ఎన్డీయే ప్రభుత్వం 2019 ఎన్నికలకు వెళ్లాల్సి ఉంటుంది. 2019లో ఎన్నికల షెడ్యూల్ అమలులోకి వచ్చే పరిస్థితుల్లో పరిమిత కాలం అవసరమైన ప్రభుత్వం వ్యయంకోసం ఓట్-ఆన్-అకౌంట్ ఆమోదం పొందిన అనంతరం కొత్తగా వచ్చే ప్రభుత్వం పూర్తిస్థాయి బడ్జెట్‌ను ఎన్నికల అనంతరం ప్రవేశపెడతుంది. 2014లో యూపీఏ కాలంలో ఓట్ ఆన్ అకౌంట్‌ను అప్పటి ఆర్థిక మంత్రి ఫిబ్రవరి నెలలో పార్లమెంట్‌లో ప్రవేశపెట్టగా, అనంతరం ఎన్డీయే ప్రభుత్వం అధికారంలోకి వచ్చాక అదే ఏడాది ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీ జూలైలో పూర్తిస్థాయి బడ్జెట్‌ను సమర్పించారు.

# భూగర్భాన్ని తోడేస్తున్నారు!

**అడుగంటిపోతున్న జలాలు ● ఇబ్బడి ముబ్బడిగా మైనర్ ఇరిగేషన్ ప్రాజెక్టులు ● తాజా సర్వేలో వెల్లడి**



న్యూఢిల్లీ, డిసెంబర్ 3: దేశంలో భూగర్భ జలాలు అడుగంటిపోతున్నాయని అవిశ్రాంతంగా వీటిని వినియోగించడంవల్ల తీవ్రస్థాయిలోనే నీటి ఎద్దడి పరిస్థితి తలెత్తే ప్రమాదం ఉందని తాజాగావెలుగుచూసిన వాస్తవాలు స్పష్టం చేస్తున్నాయి. ఉపరితల జలాలపై కాకుండా దేశవ్యాప్తంగా రైతాంగం భూగర్భ జలాలపైనే ఆధారపడుతున్నారని, అదే విధంగా భూగర్భ జలాల వినియోగంపై ఆధారపడ్డ పథకాల సంఖ్య కూడా 2006-14 మధ్యకాలంలో విపరీతంగా పెరిగిపోయిందని ఈ నివేదిక వెల్లడించింది. భూగర్భ జలాలు అడుగంటిపోకుండా ఉండాలంటే రైతుల వినియోగానికి ఉపరితల జలాలను అందుబాటులోకి తెచ్చే కార్యక్రమాలను అందుబాటులోకి తెచ్చే కార్యక్రమాలను విస్తృతం చేయాలని స్పష్టం చేసింది. ఉపరితల జలాల వినియోగానికి సంబంధించిన పథకాల కంటేకూడా గొట్టపు బావుల వంటి భూగర్భ జలాల వినియోగ పథకాలు భారీగా పెరిగిపోవడం వల్ల ఈ పరిస్థితి తలెత్తిందని వివరించింది. జాతీయ స్థాయిలో భూగర్భ జలాలకు సంబంధించిన పథకాలు విపరీతంగా పెరిగిపోతున్నాయని, అదే క్రమంలో ఉపరితల జల వినియోగ పథకాలు తగ్గుముఖం పట్టినట్టుగా తెలిపింది. దీనినిబట్టి రైతులు పూర్తిగా భూగర్భ జలాలపై ఆధారపడి తమ వ్యవసాయ అవసరాలు తీర్చుకుంటున్నట్లు స్పష్టమవుతోందని తెలిపింది. ముఖ్యంగా మైనర్ ఇరిగేషన్ పథకాల విషయంలో భూగర్భ జలాలపైనే రైతులు ఆధారపడ్డారని వెల్లడించింది. ఇందుకు కారణం-మైనర్ ఇరిగేషన్ ప్రాజెక్టుల సంఖ్య గణనీయంగా పెరిగిపోవడమేనని వెల్లడించింది. 2006-07 సంవత్సరంలో 21 మిలియన్ల మైనర్ ఇరిగేషన్ నిర్మాణాలుంటే 2013-14 నాటికి వీటి సంఖ్య 21.7 మిలియన్లకు పెరిగిందని తెలిపింది. ఉత్తరప్రదేశ్‌లోనే అత్యధిక స్థాయిలో 38లక్షల మైనర్ ఇరిగేషన్ పథకాలు అమలవుతున్నాయని, రెండో స్థానంలో మహారాష్ట్ర, మూడవ స్థానంలో మధ్యప్రదేశ్, నాలుగో స్థానంలో తమిళనాడు ఉన్నాయని తెలిపింది. దేశవ్యాప్తంగా అమలవుతున్న మైనర్ ఇరిగేషన్ పథకాల్లో 50 శాతం ఈ రాష్ట్రాల్లోనే ఉన్నాయని వివరించింది. 33 రాష్ట్రాలు / కేంద్ర పాలిత ప్రాంతాల్లో 10 రాష్ట్రాల్లో పది లక్షలకు పైగా మైనర్ ఇరిగేషన్ పథకాలు అమలవుతున్నాయని, ఎనిమిది రాష్ట్రాల్లో లక్ష నుంచి పది లక్షలకు వరకు వీటి సంఖ్య ఉందని తెలిపింది. మిగిలిన 15 రాష్ట్రాలు / కేంద్ర పాలిత ప్రాంతాల్లో లక్షకంటే తక్కువగానే మైనర్ ఇరిగేషన్ పథకాలు అమలవుతున్నాయని తెలిపింది.

# శాంతి-ఉగ్రవాదం పొసగవు

**పాక్‌తో చర్చలపై బీజేపీ ● ఫరూక్ ప్రతిపాదనకు తిరస్కృతి**

జమ్ము, డిసెంబర్ 3: పాకిస్తాన్‌తో చర్చలు జరపాలంటూ నేషనల్ కాన్ఫరెన్స్ అధ్యక్షుడు ఫరూక్ అబ్దుల్లా చేస్తున్న వాదనను బీజేపీ తిరస్కరించింది. భారత్‌లోనూ, సరిహద్దుల్లోనూ ఉగ్రవాద కార్యకలాపాలకు పాల్పడుతున్న పాక్‌తో శాంతి చర్చల ప్రసక్తే లేదని స్పష్టం చేసింది. 'ఒకపక్క ఉగ్రవాదానికి పాల్పడుతున్న దేశంతో శాంతి చర్చలు ఏవిధంగానూ పొసగవు' అని కాశ్మీర్ బీజేపీ ప్రతినిధి అనిల్ గుప్తా స్పష్టం చేశారు. అయితే శాంతి చర్చలకు భారత్ సిద్ధంగా ఉన్నా అందుకు విముఖంగా ఉన్నది పాకిస్తానేనన్న వాస్తవం తెలిసినా ఫరూక్ అబ్దుల్లా ఈ ప్రతిపాదన చేయడం ఎంతమాత్రం సహేతుకం కాదని ఆయన అన్నారు.

# చెప్పేదొకటి.. చేసేదొకటి

**పాక్ ఉగ్ర వాదులను నిరోధించక పోవడంపై అమెరికా మండిపాటు**

వాషింగ్టన్, డిసెంబర్ 3: ఉగ్రవాద నిరోధన విషయంలో పాకిస్తాన్ అందిస్తున్న సహాయ సహకారాలు ఎంతమాత్రం సంతృప్తికరంగా లేవని అమెరికా ఆరోపించింది. తాలిబన్, హక్కానీ నెట్‌వర్క్‌లను అదుపు చేయడంలో పాక్ ప్రభుత్వం ఎలాంటి విజయమూ సాధించలేదని, ఈ రెండు ఉగ్రవాద సంస్థలూ పాక్ గడ్డపై తమ కార్యకలాపాలను కొనసాగిస్తూనే ఉన్నాయని సీనియర్ వైట్‌హౌస్ అధికారి ఒకరు స్పష్టం చేశారు. అంతర్జాతీయ ఉగ్రవాది హాఫీజ్ సయీద్‌ను గృహ నిర్బంధం నుంచి విడుదల చేయడం ఉగ్రవాద నిరోధనలో పాకిస్తాన్ వైఫల్యానికి ప్రత్యక్ష నిదర్శనంగా తెలిపారు.




# వడ్డీ రేట్లు తగ్గకపోవచ్చు

- యథాతథంగా కొనసాగే అవకాశం
- ద్రవ్యోల్బణం పెరుగుతుందనే భయమే కారణం
- ఆర్థిక రంగ నిపుణుల అంచనా
- 5,6 తేదీల్లో భేటీ కానున్న ఎంపీసీ

ముంబయి, డిసెంబర్ 3: రిజర్వ్ బ్యాంక్ (ఆర్‌బీఐ) ఈసారి కూడా కీలక వడ్డీ రేట్లను మార్చకుండా యథాతథంగా కొనసాగించే అవకాశాలు ఉన్నాయి. వరుసగా అయిదు త్రైమాసికాలు దిగజారిపోయిన స్థూల జాతీయోత్పత్తి (జీడీపీ) సెప్టెంబర్‌తో ముగిసిన త్రైమాసికంలో తిరిగి పుంజుకోవడంతో ద్రవ్యోల్బణం నియంత్రణపైనే ఆర్‌బీఐ కేంద్రీకరిస్తుందని నిపుణులు భావిస్తున్నారు. జీడీపీ పుంజుకోవడం వల్ల ఆర్‌బీఐపై వడ్డీ రేట్లను తగ్గించాలనే ఒత్తిడి తగ్గుతుందని వారు పేర్కొంటున్నారు. అయితే జీడీపీ తిరిగి పుంజుకోవడం, దేశ సావరిన్ రేటింగ్‌ను మూడీస్ పెంచడం వల్ల నెలకొన్న సానుకూల సెంటిమెంట్‌ను మరింత పెంచేందుకు వడ్డీ రేట్లను తగ్గించాలని దేశీయ కార్పొరేట్ సంస్థలు ఇప్పటికీ డిమాండ్ చేస్తూనే ఉన్నాయి. 2017-18 సంవత్సరం అయిదో ద్వై-మాసిక ద్రవ్య విధాన ప్రకటనను చేయడానికి ఆర్‌బీఐ గవర్నర్ ఉర్జిత్ పటేల్ అధ్యక్షతన మానిటరీ పాలసీ కమిటీ (ఎంపీసీ) ఈ నెల 5,6 తేదీలలో సమావేశం కానుంది. ఈ



కమిటీ తీసుకున్న నిర్ణయాలను 6వ తేదీ (బుధవారం) వెల్లడిస్తారు. అక్టోబర్‌లో జరిగిన సమీక్షా సమావేశంలో ఎంపీసీ బెంచ్‌మార్క్ వడ్డీ రేట్లను మార్చకుండా యథాతథంగా ఉంచింది. వడ్డీ రేట్లను తగ్గిస్తే ద్రవ్యోల్బణం పెరుగుతుందేమోననే భయంతో వాటిని తగ్గించలేదు. ఈ ఆర్థిక సంవత్సర వృద్ధి రేటు 6.7 శాతం ఉంటుందని అంచనా వేసింది. ఆర్‌బీఐ ఆగస్టులో బెంచ్‌మార్క్ వడ్డీ రేట్లను 0.25 శాతం తగ్గించింది. దీంతో కీలక వడ్డీ రేట్లు ఆరు సంవత్సరాల కనిష్ట స్థాయి అయిన ఆరు శాతానికి తగ్గాయి. ఆర్‌బీఐ వరుసగా రెండోసారి రెపో రేట్ లేదా షార్ట్ టర్మ్ వడ్డీ రేట్లను మార్చకుండా యథాతథంగా ఉంచుతుందని బ్యాంకుల నిర్వాహకులు, ఆర్థిక రంగ నిపుణులు భావిస్తున్నారు. రానున్న నెలల్లో ద్రవ్యోల్బణం పెరిగే అవకాశం ఉన్నందున ఆర్‌బీఐ వడ్డీ రేట్లను తగ్గించకపోవచ్చని వారు పేర్కొంటున్నారు. 'ఆర్థిక వ్యవస్థలో ద్రవ్య చలామణి చాలా తక్కువగా ఉంది. డిపాజిట్ రేట్లు ఎక్కువగా ఉన్నాయి. ద్రవ్యోల్బణం పెరుగుతుందనే భయాందోళనలు నెలకొని ఉన్నాయి. అందువల్ల ఆర్‌బీఐ వడ్డీ రేట్లను యథాతథంగా కొనసాగించే అవకాశం ఉంది' అని యూనియన్ బ్యాంక్ మేనేజింగ్ డైరెక్టర్, కార్యనిర్వహణ అధికారి (సీఈఓ) రాజ్‌కిరణ్ రాయ్ జి పేర్కొన్నారు. ఆర్‌బీఐ 2017-18 ఆర్థిక సంవత్సరం అంతా కూడా వడ్డీ రేట్లను మార్చకుండా యథాతథంగా కొనసాగిస్తుందని భావిస్తున్నట్టు గ్లోబల్ ఫైనాన్షియల్ సర్వీసెస్ మేజర్ నోమురా పేర్కొంది.

# మార్చినాటికి మూలధన సేకరణ

## ఎనిమిది ప్రభుత్వ రంగ బ్యాంకుల నిర్ణయం

న్యూఢిల్లీ, డిసెంబర్ 3: కేంద్ర ప్రభుత్వం ప్రకటించిన రూ. 2.11 లక్షల కోట్ల రీక్యాపిటలైజేషన్ పథకంలో భాగంగా ఎనిమిది ప్రభుత్వ రంగ బ్యాంకులు (పీఎస్‌యూలు) నాలుగు నెలల్లోగా మార్కెట్ నుంచి మూలధనాన్ని సేకరించుకోవాలని నిర్ణయించినట్లు అధికార వర్గాలు తెలిపాయి. కొన్ని బ్యాంకులు ఇప్పటికే కేంద్ర ఆర్థిక మంత్రిత్వ శాఖ నుంచి అనుమతి పొందాయని, మరికొన్ని బ్యాంకులు ప్రైవేటు ప్లేస్‌మెంట్ ద్వారా కాని, రైట్స్ ఇష్యూ ద్వారా కాని మూలధనాన్ని సేకరించడానికి కేంద్ర ఆర్థిక మంత్రిత్వ శాఖ నుంచి అనుమతి పొందే ప్రక్రియను నడుపుతున్నాయని ఆ వర్గాలు వివరించాయి. అయితే చాలా బ్యాంకులు క్వాలిఫయిడ్ ఇన్‌స్టిట్యూషనల్ ప్లేస్‌మెంట్ (క్యూఐపి) మార్గంలో మూల ధనాన్ని సేకరించడానికి ప్రాధాన్యత ఇస్తున్నాయని ఆ వర్గాలు వెల్లడించాయి. మార్కెట్ నుంచి మూల ధనాన్ని సేకరించే విషయంలో పంజాబ్ నేషనల్ బ్యాంక్ అగ్ర స్థానంలో ఉంది. ఈ బ్యాంకు మార్కెట్ నుంచి రూ. 5వేల కోట్లను సేకరించబోతోంది. బ్యాంక్ ఆఫ్ బరోడా, బ్యాంక్ ఆఫ్ ఇండియా, యూనియన్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, అలహాబాద్ బ్యాంక్, ఆంధ్ర బ్యాంక్ కూడా తమ వాటాల విక్రయం ద్వారా మూలధన సేకరణకు కసరత్తు చేస్తున్నాయని ఆ వర్గాలు తెలిపాయి. నిరర్థక ఆస్తుల (ఎన్‌పిఏల) భారంతో కుంగిపోతున్న ప్రభుత్వ రంగ బ్యాంకులను బలోపేతం చేయడానికి కేంద్ర ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీ అక్టోబర్‌లో అసాధారణ స్థాయిలో రూ. 2.11 లక్షల కోట్ల ప్యాకేజీని ప్రకటించారు. రెండు సంవత్సరాల కాలంలో ఈ ఆర్థిక సాయాన్ని అందజేస్తారు. 2015 మార్చిలో రూ. 2.75 లక్షల కోట్లు ఉన్న ప్రభుత్వ రంగ బ్యాంకుల పాడు రుణాలు లేదా నిరర్థక ఆస్తులు 2017 జూన్ నాటికి రూ. 7.33 లక్షల కోట్లకు పెరిగిపోయాయి. కేంద్రం ప్రకటించిన ప్రత్యేక ప్యాకేజీలో భాగంగా రూ. 1.35 లక్షల కోట్లకు రీ-క్యాపిటలైజేషన్ బాండ్లను జారీ చేస్తారు.

**బ్యాంకుల్లోని ప్రభుత్వ వాటాలను విక్రయించడం ద్వారా రూ. 58వేల కోట్లను సేకరిస్తారు. ఈ విధానం ప్రకారం ప్రభుత్వ రంగ బ్యాంకుల్లోని ప్రభుత్వ వాటా 52 శాతానికి తగ్గిపోతుంది. బ్యాంకులు రానున్న రెండేళ్లలో ఇంద్రధనుస్ పథకం కింద రూ. 18వేల కోట్లను పొందుతాయని కూడా జైట్లీ ప్రకటించారు. 2015లో ప్రకటించిన ఇంద్రధనుస్ పథకం ప్రకారం, ప్రభుత్వ రంగ బ్యాంకులకు ప్రభుత్వం నాలుగేళ్ల కాలంలో రూ. 70వేల కోట్ల సాయం చేస్తుంది. బ్యాంకులు తమ స్వంతంగా మార్కెట్ నుంచి రూ. 1.1 లక్షల కోట్లను సేకరించుకోవలసి ఉంటుంది. ఈ రెండింటి వల్ల బ్యాంకులు తమ మూలధన అవసరాలను తీర్చుకోవలసి ఉంటుంది.**

బ్యాంకుల్లోని ప్రభుత్వ వాటాలను విక్రయించడం ద్వారా రూ. 58వేల కోట్లను సేకరిస్తారు. ఈ విధానం ప్రకారం ప్రభుత్వ రంగ బ్యాంకుల్లోని ప్రభుత్వ వాటా 52 శాతానికి తగ్గిపోతుంది. బ్యాంకులు రానున్న రెండేళ్లలో ఇంద్రధనుస్ పథకం కింద రూ. 18వేల కోట్లను పొందుతాయని కూడా జైట్లీ ప్రకటించారు. 2015లో ప్రకటించిన ఇంద్రధనుస్ పథకం ప్రకారం, ప్రభుత్వ రంగ బ్యాంకులకు ప్రభుత్వం నాలుగేళ్ల కాలంలో రూ. 70వేల కోట్ల సాయం చేస్తుంది. బ్యాంకులు తమ స్వంతంగా మార్కెట్ నుంచి రూ. 1.1 లక్షల కోట్లను సేకరించుకోవలసి ఉంటుంది. ఈ రెండింటి వల్ల బ్యాంకులు తమ మూలధన అవసరాలను తీర్చుకోవలసి ఉంటుంది.

ఈ పథకం కింద ప్రభుత్వం గత మూడున్నరేళ్లలో రూ. 51,858 కోట్లను ప్రభుత్వ రంగ బ్యాంకులకు విడుదల చేసింది. మిగిలిన రూ. 18,142 కోట్లను రానున్న రెండేళ్లలో విడుదల చేస్తుంది.



# మొబైల్ యాప్స్‌తో ప్రజల చెంతకు పాలన

- తెలంగాణ ప్రభుత్వ శాఖల్లో విరివిగా వినియోగం
- సమస్యలకు పరిష్కారం.. వేగవంతంగా లావాదేవీలు

ఆంధ్రభూమి బ్యూరో

హైదరాబాద్, డిసెంబర్ 3: ప్రభుత్వ పరిపాలనలో మొబైల్ యాప్‌ల పాత్ర క్రమేణా కీలకం కాబోతోంది. రోజు రోజుకీ కొత్త కొత్త యాప్‌ల ఆవిష్కరణ జరుగుతోంది. దీంతో ప్రజల చెంతకు పాలన, సేవలు మరింత వేగంగా అందుతున్నాయి. సేవల విభాగంలో తలెత్తే అనేక సమస్యలకు పరిష్కారాలు లభిస్తుండడమే కాకుండా డిజిటల్ లావాదేవీలు వేగవంతంగా జరిగేందుకు అవకాశం కలిగింది. ముఖ్యంగా లావాదేవీలు, చెల్లింపుల్లో పారదర్శకత ఉండడం వల్ల అనేక శాఖలు అవినీతిని అరికట్టే దిశగా యాప్‌ల ద్వారా సేవలను అందించేందుకు ముందుకు వస్తున్నాయి. ప్రతి ఒక్కరికి స్మార్ట్ ఫోన్లు ఉండడం వల్ల యాప్‌ల వినియోగం సులభమైంది. ప్రభుత్వ శాఖలు ప్రారంభించిన యాప్‌ల పట్ల ప్రజల నుంచి కూడా విశేష స్పందన వస్తోంది. తెలంగాణ ప్రభుత్వంలో ఇప్పటికే ఎం-వాలెట్ పేరుతో రాష్ట్ర రవాణా శాఖ (ఆర్టీఏ), మై-జీహెచ్ఎంసి పేరుతో జీహెచ్ఎంసి, హవాక్ ఐ పేరుతో సిటీపోలీస్ ప్రారంభించిన యాప్‌ల పట్ల ప్రజల నుంచి అద్భుత స్పందన వచ్చింది. ఎం-వాలెట్ అనేది గత ఏడాది మార్చి 30న వాహన రిజిస్ట్రేషన్ డాక్యుమెంట్లను ఆన్‌లైన్‌లో భద్రపర్చేందుకు ప్రారంభించింది. ఈ యాప్‌ను స్మార్ట్ ఫోన్‌లో డౌన్‌లోడ్ చేసుకోవడం ద్వారా వాహనం తాలుకు డాక్యుమెంట్లను వెంట తీసుకెళ్లే అవసరం ఉండదు. పోలీసులు, ఆర్టీఏ అధికారుల తనిఖీల్లో ఈ యాప్ ద్వారా డాక్యుమెంట్‌ను అప్పటికప్పుడు చూపించేందుకు ప్రభుత్వం అధికారికంగా అనుమతించింది. ఎం-వాలెట్‌ను ప్రస్తుతానికి 20 లక్షల మంది వినియోగిస్తుండగా, ప్రతిరోజు కనీసం 3 వేల మంది కొత్తగా రిజిష్టర్ చేసుకుంటున్నారు. అంతే కాకుండా వాహన ఈ-చలాన్లను ఎం-వాలెట్‌కు అనుసంధానం చేయడం ద్వారా ఎప్పటికప్పుడే చలాన్ల విధింపు మొత్తం సమాచారం రావడంతో వాహనాదారులు చెల్లించేందుకు చాలా సులభంగా మారింది. ఇలా అనుసంధానం చేయడం వల్ల దాదాపు రూ.కోటి మొత్తం చలాన్ల రూపంలో చెల్లించారని ఆయా వర్గాల సమాచారం. హైదరాబాద్ సిటీ పోలీసు ప్రారంభించిన హవాక్ ఐ యాప్‌కు కూడా ప్రజల నుంచి అద్భుతమైన స్పందన లభించింది. ప్రస్తుతం హైదరాబాద్ సిటీ వరకే పరిమితమన ఈ యాప్‌ను తెలంగాణలోని 9 పోలీసు కమిషనరేట్లకు విస్తరిస్తున్నారు. హైదరాబాద్ నగర పోలీసు కమిషనర్ సమాచారం మేరకు హవాక్ ఐ యాప్‌ను 9 లక్షల మంది వినియోగిస్తున్నారు. ప్రతి రోజు ఒక్క హైదరాబాద్ కమిషనరేట్‌కు ఈ యాప్ ద్వారా 70 ఫిర్యాదులు అందుతున్నాయి. అలాగే ఈ ఏడాది జూలై 15న జీహెచ్ఎంసి మైజిహెచ్ఎంసి పేరుతో యాప్‌ను ప్రారంభించింది. జీహెచ్ఎంసి పరిధిలో ఈ యాప్‌ను 3 లక్షల మంది వినియోగిస్తున్నారు. ప్రజలకు మెరుగైన సేవలు అందించేందుకు ఈ యాప్‌ను విడుదల చేసింది. ఆస్తి పన్ను, ట్రేడ్ లైసెన్స్ ఫీజు, జనన, మరణ ధృవీకరణ పత్రాల డౌన్‌లోడ్, పౌర సంబంధిత సమస్యలను వివరించేందుకు వీలుగా ఈ యాప్‌ను జీహెచ్ఎంసి రూపొందించింది. ఈ యాప్ ద్వారా ఇప్పటి వరకు 90 వేల ఫిర్యాదులు అందాయి. ఈ ఏడాది జూన్ 1న తెలంగాణ ప్రభుత్వం టి-వాలెట్‌ను ప్రారంభించింది. ప్రభుత్వ, ప్రైవేటు డిజిటల్ చెల్లింపులు చేసుకునేందుకు ప్రజలకు అనువుగా ఈ యాప్‌ను రూపొందించారు. ప్రస్తుతం ప్రారంభమైన మెట్రో స్మార్ట్ కార్డ్ వినియోగదారులు కూడా ఈ వ్యాలెట్ ద్వారా నగదును లోడ్ చేసుకుని తద్వారా మెట్రో టిక్కెట్లను కొనుగోలు చేసుకోవచ్చని ప్రభుత్వ వర్గాలు చెబుతున్నాయి. గత ఆరు నెలల్లో ఈ యాప్‌ను 3 లక్షల మంది వినియోగదారులు నమోదు చేసుకోగా రూ.75 కోట్ల లావాదేవీలు నిర్వహించినట్లు అధికార వర్గాల సమాచారం. త్వరలో మరికొన్ని ప్రభుత్వ శాఖల్లో కూడా ఈ తరహా యాప్‌లను ప్రారంభించి సేవలను మరింత సులభంగా ప్రజలకు అందించేందుకు ప్రయత్నిస్తున్నాయి. ★



# కేటీపీపీలో ఉద్యోగాల పేరిట నిరుద్యోగులకు టోకరా!

- రూ. 6 కోట్ల మేర వసూళ్లు చేసిన దళారులు!
- నకిలీ నియామక పత్రాలతో నమ్మబలికే వైనం
- లబోదిబోమంటున్న బాధితులు

భూపాలపల్లి రూరల్, డిసెంబర్ 3: వెలుగులు అందించే కాకతీయ థర్మల్ విద్యుత్ ప్రాజెక్టులో ఉద్యోగాల వస్తే తమ జీవితాల్లో వెలుగులు వస్తాయని దళారులను నమ్మిన నిరుద్యోగుల బతుకుల చీకటిమయంగా మారుతున్నాయి. కొంతమంది రాజకీయ నాయకులు, దళారులు కేటీపీపీలో ఉద్యోగాలు ఇప్పిస్తామంటూ నిరుద్యోగులను నుంచి లక్షల్లో రూపాయాలు వసూలు చేస్తు మోసం చేస్తుండగా, ఇందుకు సంస్థలోని కొంతమంది ఉద్యోగుల అండదండలు ఉన్నట్లు ఆరోపణలు వినవస్తున్నాయి. భూపాలపల్లి చెల్పూర్ కేటీపీపీలో 11 వందల మెగావాట్ల ప్లాంటులో ఉద్యోగాల భర్తీ ప్రక్రియ పరీక్ష విధానంతో పాటు నిర్వాసితులకు కోటా ప్రకారం టీఎస్‌జెన్‌కో సంస్థ చేపడుతుంది. ఉద్యోగాల కోసం వేలాది మంది ప్రయత్నాలు చేస్తుండడంతో నిరుద్యోగులను నమ్మిస్తున్న దళారులు మోసాలకు పాల్పడుతున్నారు. భూ నిర్వాసితుల కోటాలో ఉద్యోగానికి ఒక రేటు, పరీక్షలో ఉద్యోగం రాకున్న ఇంతరేటు అంటూ నిరుద్యోగులకు గాలం వేసి ఉద్యోగాల పేరుతో అందినకాడికి దండుకుంటున్నారు. నిరుద్యోగులు డబ్బులు ఇచ్చి ఉద్యోగం కోసం ఒత్తిడి తేవడంతో దళారులు ఏకంగా నకిలీ నియామాకపు పత్రాలను అందజేస్తుండడం, తీరా అవి నకిలీవిగా తేలడంతో బాధితులు లాబోదిబోమంటున్న సంఘటనలు చోటుచేసుకుంటున్నాయి. కేటీపీపీలో ఎలక్ట్రీషియన్, జూనియర్ అసిస్టెంట్, సెక్యూరిటీ గార్డు, సీఎల్ మెయింటెనెన్స్ ఇలా ఒక్కో పోస్టుకు ఒక్కో ధర నిర్ణయించిన దళారులు ప్లాంట్‌లోకి తీసుకెళ్లి తిప్పి చూపిస్తూ నిరుద్యోగులను నమ్మబలుకుతూ డబ్బులు వసూలు చేస్తు టోకరా వేస్తున్నారు.



గత కొన్నేళ్లుగా నిరుద్యోగులను మోసం చేస్తూ వస్తున్న దళారులు కేటీపీపీలోని అధికారుల పేరుతో ఉద్యోగం నియామకపు పత్రాలు అందించారు. ఏకంగా ఉద్యోగంలో చేరే తేదీ, సమయం సైతం నకిలీ నియాకపు పత్రాల్లో ముద్రించి 20 మంది నిరుద్యోగులకు అందించారు. 15 మే, 16 మే 2017 పేరిట ఉద్యోగంలో జాయినింగ్ తేదీ, సమయం ముద్రించి నిరుద్యోగులకు అందించడంతో అక్కడికి వెళ్లిన వారికి అసలు నియాకపు పత్రాలు కావని తేలింది. దీంతో బాధిత నిరుద్యోగుల్లో ఆందోళన మొదలై నేటివరకు విషయం బయటికి పొక్కలేదు. విషయం బయటకు వస్తే తాము ఇచ్చిన డబ్బులు తిరిగి వస్తాయో రావో అనే ఆందోళన బాధితుల్లో మొదలైంది. నకిలీ నియామకపు పత్రాలు అందిన 20 బాధితులతో పాటు వివిధ ప్రాంతాలకు చెందిన మరో 2 వందల మంది బాధితులు ఉన్నట్లు తెలుస్తోంది. ఒక్కొక్కరి వద్ద ఒక్కో రేటుతో రూ. 2 లక్షల నుంచి రూ. 5 లక్షల చొప్పున సుమారు రూ. 6 కోట్లు వసూలు చేసినట్లు సమాచారం. నకిలీ నియాకపు పత్రాలుగా తేలినా నేటికీ బాధితులు పోలీసులను ఆశ్రయించనట్లు తెలుస్తోంది. బాధితుల్లో పోలీసు కుటుంబానికి చెందిన ఒక నిరుద్యోగి ఉన్నట్లు సమాచారం. ఇందులో కొందరు రాజకీయ నేతల ప్రమేయం ఉండడంతోనే దళారుల నుంచి డబ్బులు రాబట్టుకోలేక పోలీసులను ఆశ్రయించలేక బాధితులు ఆందోళనలో ఉన్నట్లు భోగట్టా. ఈ వ్యవహారంలో వరంగల్ రూరల్ జిల్లా పరకాల మండలం చర్లపల్లికి చెందిన ఒక కేటుగాడు కీలక పాత్ర పోషించి కేటీపీపీలోని మరో ముగ్గురు వ్యక్తులు కలిసి ఈ నకిలీ నియామకపు పత్రాలను సృష్టించినట్లు తెలుస్తోంది. ప్లాంట్‌లోకి అనుమతి లేనిదే మీడియాను సైతం లోనికి రానివ్వని అధికారులు దళారులు ప్లాంట్‌లోకి అత్తారింటికి వెళ్లి వచ్చే చందంగా రెడ్ కార్పెట్ పరుస్తున్నారా అనే అనుమానాలు వ్యక్తమవుతున్నాయి. ప్లాంట్‌కు వచ్చే వ్యక్తుల కదలికలను సీసీ కెమెరాల ద్వారా నిశితంగా పరిశీలించే యాజమాన్యం దళారులు వచ్చి యథేచ్ఛగా ప్లాంటులో తిరుగుతున్నా పట్టించుకోవడం లేదనే ఆరోపణలు వినిపిస్తున్నాయి. జెన్‌కో విజిలెన్స్ అండ్ ఎన్‌ఫోర్స్ అధికారులు హైదరాబాద్ కేంద్రంగా పనిచేస్తుండడంతో ఇక్కడ ఇలా జరుగుతోందని, విజిలెన్స్ ఎన్‌ఫోర్స్‌మెంట్ అధికారులు, పోలీసులు విచారణ జరిపి మరిన్ని విషయాలు బహిర్గతం అయ్యే అవకాశాలు ఉన్నాయని బాధితులు వాపోతున్నారు. ఈ విషయంపై కేటీపీపీ సీఈ మంగేష్‌కుమార్‌ను ఫోన్‌లో సంప్రదించేందుకు ప్రయత్నించగా స్పందించలేదు.

# సన్నగిల్లిన ఉపాధి..ఆపై శ్రమ దోపిడీ

- 'వర్ధీ' బీడీల తయారీతో రూ. కోట్లలో నష్టపోతున్న కార్మికులు
- సర్కారు ఖజానాకూ భారీగానే గండి

ఆంధ్రభూమి బ్యూరో

నిజామాబాద్, డిసెంబర్ 3: బీడీ కట్టలపై 80 శాతం వరకు క్యాన్సర్ గుర్తు బొమ్మలను ముద్రించాలనే ఆంక్షలు...నెలల తరబడి వెంటాడిన పెద్ద నోట్ల రద్దు ప్రభావం...జీఎస్‌టీ పరిధి నుండి అసలేమాత్రం మినహాయింపు ఇవ్వకపోవడం వంటి కారణాలతో బీడీ పరిశ్రమ అంతకంతకూ కుచించుకుపోయి కార్మికులకు ఉపాధి సన్నగిల్లుతోంది. ఇప్పటికే పై కారణాలతో అనేక చిన్న కంపెనీలు మూతబడగా, పెద్ద కంపెనీలు సైతం పని దినాలను తగ్గించివేశాయి. నెలలో కనీసం 20 రోజుల పాటు కార్మికులకు బీడీలు చుట్టే పని లభించడం గగనకుసుమంగా మారింది. దశాబ్దాల కాలం నుండి ఇదే వృత్తిపై ఆధారపడి జీవనాలు వెళ్లదీస్తున్న లక్షలాది కుటుంబాలు ప్రస్తుత విపత్కర పరిస్థితులను అధిగమించి పొట్ట పోసుకునేందుకు నానా అవస్థలు ఎదుర్కొంటున్నారు. ఒకప్పుడు ఇంటి పట్టునే ఉంటూ రోజుకు సేరు బీడీలు చేస్తూ ఇంటిల్లిపాదినీ పోషించినవారు, ప్రస్తుతం చేసేందుకు పని లభించక శరీరం సహకరించని స్థితిలోనూ గత్యంతరం లేక ఉపాధి హామీ, ఇతరాత్ర కూలీ పనుల కోసం పరితపించాల్సి వస్తోంది. ఇలాంటి పరిస్థితుల్లోనూ కొన్ని బీడీ కంపెనీల యాజమాన్యాలు తమ ధన దాహాన్ని మాత్రం వీడలేకపోతున్నాయి. అడ్డదారుల్లో పయనిస్తూ కార్మికులను శ్రమ దోపిడీకి గురిచేస్తున్నాయి. ఇటు కార్మికులనే కాకుండా, అటు ప్రభుత్వ ఖజానాకు సెస్సు రూపంలో చెల్లించాల్సిన ఆదాయానికి కూడా భారీ మొత్తంలో గండి కొడుతున్నారు. 'వర్ధీ' బీడీల తయారీని పెద్దఎత్తున ప్రోత్సహిస్తూ అక్రమ మార్గంలో ధనార్జనను సాగిస్తున్నారు.

రాష్ట్రంలో బీడీ పరిశ్రమకు కేంద్ర బిందువుగా నిలుస్తున్న నిజామాబాద్‌తో పాటు మెదక్, కరీంనగర్, ఆదిలాబాద్ తదితర జిల్లాలలో ఈ వర్ధీ దందా కారణంగా లక్షలాది మంది కార్మికులు తీవ్రంగా నష్టపోవాల్సి వస్తోంది. అసలే బీడీ పరిశ్రమ సంక్షోభంలో కూరుకుపోయి పనులు లభించడం మృగ్యంగా మారడంతో అనేక మంది తమ కుటుంబ పోషణ కోసం నానా అగచాట్లకు గురవుతున్నారు. ఇదే అదనుగా ఇటీవలి కాలంలో వర్ధీ బీడీల తయారీని జోరుగా సాగిస్తున్నారు.

ప్రభుత్వం బీడీ కార్మికులకు జీవన భృతి కింద నెలకు వేయి రూపాయల పెన్షన్‌ను అందిస్తుండగా, వర్ధీ బీడీలు చుట్టే కార్మికులు ఆ లబ్ధికి కూడా నోచుకోలేకపోతున్నారు. వీరికి పీఎఫ్ సదుపాయం వర్తించని కారణంగా పెన్షన్‌లకు అనర్హులుగా పరిగణిస్తున్నారు. సమగ్ర కుటుంబ సర్వేలో బీడీ కార్మికులుగా పేర్లు నమోదు చేసుకుని ఉంటే, వారు వర్ధీ బీడీలు చుట్టే వారైనప్పటికీ పెన్షన్ సదుపాయాన్ని కల్పిస్తున్నామని పేర్కొంటున్నప్పటికీ ఇంకా వేలాది మందికి పెన్షన్‌లు మంజూరు కాలేదు.

వర్ధీ బీడీల రూపంలోనే పలు కంపెనీలే గుట్టుగా రోజుకు దాదాపు 4 కోట్ల వరకు బీడీలను తయారు చేయిస్తున్నట్టు తెలుస్తోంది. ఇది వరకు బీడీ కార్మిక సంఘాల నాయకులు, కార్మిక శాఖ అధికారులు జిల్లాలో దాడులు చేసిన సందర్భంగా, ఓ బీడీ కంపెనీ వర్ధీ తయారీని ప్రోత్సహిస్తున్న వైనం గుట్టు రట్టయింది. సదరు ఒక్క కంపెనీయే ఎక్కడికక్కడ ఏజెంట్లను నియమించుకుని రోజుకు రెండు కోట్ల బీడీలను వర్ధీ రూపంలో చుట్టిస్తున్నట్టు తేటతెల్లమైంది. ఇలా వర్ధీ పేరిట కార్మికులకు నిర్ణీత రుసుము చెల్లించకుండా అరకొర వేతనాలను అందిస్తూ శ్రమ దోపిడీకి పాల్పడుతున్నారు. వేయి బీడీలకు అధికారికంగా కార్మికులకు అన్ని భత్యాలు కలుపుకుని సుమారు 180 రూపాయల వేతనంతో పాటు పీఎఫ్, ఈఎస్‌ఐ సదుపాయాలను యాజమాన్యాలు కల్పిస్తాయి. అందుకు భిన్నంగా వర్ధీ బీడీలు చుట్టించడం ద్వారా కేవలం 120 రూపాయల వేతనంతోనే సరిపెడుతున్నారు. ఈ లెక్కన కార్మికులు 4 కోట్ల బీడీల తయారీపై వేతనం రూపంలోనే రోజుకు 40 లక్షల రూపాయల వరకు కోల్పోవాల్సి వస్తోంది. అంతేకాకుండా పీఎఫ్, ఈఎస్‌ఐ వంటి సదుపాయాలకు దూరమవుతున్నారు.

ప్రభుత్వానికి పన్ను రూపంలో వేయి బీడీలకు దాదాపు 18 రూపాయల చొప్పున లెక్కిస్తే 9 లక్షల రూపాయల ఆదాయానికి గండి పడుతోంది.

ఒక్కరోజుకే ఇంత పెద్దఎత్తున బీడీ యాజమాన్యాలకు అడ్డదోవన ఆదాయం సమకూరుతుండగా, కార్మికులు మాత్రం శ్రమ దోపిడీకి గురికావాల్సి వస్తోంది. ఈ తతంగం అనునిత్యం కొనసాగుతున్నప్పటికీ, సంబంధిత సెంట్రల్ ఎక్సైజ్, కార్మిక శాఖల అధికారులెవరూ స్పందిస్తున్న దాఖలాలు కనిపించడం లేదు. ఈ వ్యవహారంపై ప్రభుత్వం పకడ్బందీగా దృష్టిసారిస్తే అటు ఖజానాకు చేరాల్సిన ఆదాయాన్ని పెద్ద మొత్తంలో రాబట్టుకోవడంతో పాటు బీడీ కార్మికులకు న్యాయం చేసినట్లవుతుందని పలువురు సూచిస్తున్నారు.

# మొహం చాటేసిన సీసీఐ

**పెరిగిన పత్తి ధరతో కొనుగోళ్లకు దూరం ★ పత్తి మార్కెటింగ్‌లో వ్యాపారులదే ఆధిపత్యం**

ఆంధ్రభూమి బ్యూరో

ఆదిలాబాద్,డిసెంబర్ 3: ఈ ఏడాది పత్తి వ్యాపారంలో భారత కాటన్ కార్పొరేషన్ (సీసీఐ) వెనకడుగు వేయడంతో వ్యాపారులదే ఆధిపత్యం కొనసాగుతోంది. కనీస మద్దతు ధర క్వింటాలుకు రూ.4320 ప్రకటించగా ఆదిలాబాద్, బోథ్, భైంసా మార్కెట్‌లో వ్యాపారులు కనీస మద్దతు ధరకంటే అధికంగా ధర చెల్లించి కొనుగోళ్ళు చేపట్టడంతో వ్యాపార రంగంలో సీసీఐ మొహం చాటేస్తోంది. సీసీఐ కొనుగోళ్ళు జరిపితే పత్తి ధర మరింత పెరుగుతుందని ఆశించిన రైతులకు ఈసారి భంగపాటే ఎదురవుతోంది. ఈ ఏడాది ఆదిలాబాద్ ఉమ్మడి జిల్లాలో 26 పత్తి కొనుగోలు కేంద్రాలు ప్రారంభిస్తామని భారత కాటన్ కార్పొరేషన్ ప్రకటించగా ఉమ్మడి జిల్లాల్లో పది మాత్రమే మొక్కుబడిగా కొనుగోళ్ళు ప్రారంభించి చేతులెత్తేసింది. ఆదిలాబాద్‌లో 3 కేంద్రాలు, ఇచ్చోడలో 1, బోథ్‌లో 3 కేంద్రాలు, గుడిహత్నూర్‌లో 1, ఇంద్రవెల్లిలో 1, జైనథ్‌లో ఒక కేంద్రం ఏర్పాటు చేసింది. పత్తి తేమ శాతం పడిపోవడంతో నాణ్యత బాగుందని చెప్పి వ్యాపారులు మార్కెట్‌లో రైతుల నుండి భారీగా కొనుగోళ్ళు చేపట్టారు. ఆదిలాబాద్ జిల్లాలో సీసీఐ నామ్‌కేవాస్తేగా కొనుగోళ్ళు చేపట్టడంపై రైతుల నుండి అసంతృప్తి వ్యక్తమవుతోంది. పత్తి వ్యాపారంలో పోటీ పెరగాలంటే సీసీఐ రంగంలో ఉంటేనే పత్తికి గిట్టుబాటు ధర లభిస్తుందని రైతులు పేర్కొంటున్నారు. ఈ ఏడాది గులాబి పురుగు తెగులు సోకి ఆశించిన స్థాయి కంటే 30 శాతం దిగుబడులు తగ్గి రైతులు నష్టపోగా మార్కెట్‌లో గిట్టుబాటు ధర మామూలుగానే ఉంది. కాటన్ వ్యాపారంలో బేళ్ల ధర పెరగడంతో పత్తి ముడిసరుకుకు కూడా క్రమంగా ధర పెరుగుతోంది. క్వింటాలుకు రూ.4500 నుండి 4600 వరకు ధర పలుకుతుందని పేర్కొంటున్నారు. నెల రోజుల క్రితం వాతావరణ పరిస్థితుల కారణంగా పత్తిలో తేమ శాతం 20 నుండి 25 శాతం ఉండగా ప్రస్తుతం 8 నుండి 14 వరకు మాత్రమే పత్తిలో తేమశాతం నిర్ధారణవుతోంది. దీంతో వ్యాపారుల మధ్య పోటీ పెరగడంతో రైతుకు కొంతమేరకు లాభం చేకూరుతోంది. ఇటీవల అంతర్జాతీయ మార్కెట్‌లో పత్తి ధరలు పుంజుకోవడంతో వ్యాపారులు పోటీపడి మరి ధరను పెట్టేందుకు ముందుకు వస్తున్నారు. ఆదిలాబాద్ జిల్లాలో శనివారం వరకు 8 లక్షల 92 వేల క్వింటాళ్ళ పత్తి కొనుగోళ్ళు జరిగితే సీసీఐ ఆలస్యంగా రంగంలోకి దిగి కేవలం 320 క్వింటాళ్ళ కొనుగోళ్లు మాత్రమే చేపట్టింది. ఉమ్మడి జిల్లాలో ఇప్పటివరకు 16 లక్షల క్వింటాళ్ళ పత్తి వ్యాపారం జరిగితే సీసీఐ మొక్కుబడిగా వెయ్యి క్వింటాళ్ళలోపే కొనుగోళ్ళు జరిపి చేతులు దులుపుకోవడం గమనార్హం.



ఆదిలాబాద్ మార్కెట్‌యార్డులో విక్రయించడానికి రైతులు తెచ్చిన పత్తి

# గొప్ప శాస్త్రవేత్తలుగా ఎదగాలి

## మంత్రి శిద్దా రాఘవరావు పిలుపు

ఆంధ్రభూమి బ్యూరో

ఒంగోలు, డిసెంబర్ 3: శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానాన్ని వినియోగించుకుని గొప్ప శాస్త్రవేత్తలుగా ఎదగాలని రాష్ట్ర అటవీ శాఖ మంత్రి శిద్దా రాఘవరావు పిలుపునిచ్చారు. ఆదివారం ఒంగోలులోని రైజ్ ఇంజనీరింగ్ కళాశాలలో 25వ జాతీయ బాలల సైన్స్ కాంగ్రెస్-2017ను మంత్రి ప్రారంభించారు. ఈసందర్భంగా ఆయన మాట్లాడుతూ రాష్ట్ర ప్రభుత్వం శాస్త్ర సాంకేతిక రంగానికి పెద్దపీట వేస్తోందన్నారు. రాష్ట్రంలోని తిరుపతి నగరంలో 550 కోట్లు, రాజమండ్రిలో 25 కోట్లు, విశాఖపట్నంలో 30 కోట్ల రూపాయలతో శాస్త్ర సాంకేతిక కేంద్రాలను ఏర్పాటు చేసేందుకు చర్యలు తీసుకున్నామన్నారు. రాష్ట్రస్థాయిలో 25వ జాతీయ బాలల కాంగ్రెస్ -2017ను రెండు రోజుల పాటు ఒంగోలు నిర్వహిస్తున్నట్లు చెప్పారు. ఈ సందర్భంగా 13 జిల్లాల నుండి 30 నుండి 40 స్టాల్స్‌ను ఏర్పాటు చేశారన్నారు. సుమారు 125 పరిశోధన ప్రాజెక్టులను విద్యార్థులు తయారుచేశారన్నారు. స్టాల్స్‌లో విద్యార్థులు తయారుచేసిన ప్రాజెక్టులు ఎంతగానో ఆకట్టుకున్నాయన్నారు. దీనిద్వారా విద్యార్థులు తమలోని నైపుణ్యానికి పదునుపెట్టి కొత్త విషయాలను కనుగొనాలన్నారు. శాస్త్ర సాంకేతిక రంగాన్ని వినియోగించుకుని ప్రజలకు అనేక సౌకర్యాలు కల్పించడం జరిగిందన్నారు. వాతావరణంలో మార్పులు, వర్షాలు, పిడుగులు, ప్రమాదాలను ముందుగా గుర్తించడానికి సాంకేతికతను ఉపయోగిస్తున్నామన్నారు. ముఖ్యమంత్రి శాస్త్ర సాంకేతిక రంగాన్ని వినియోగించుకుని కమాండ్ కంట్రోల్ ద్వారా అధికారుల పనితీరును స్వయంగా పర్యవేక్షిస్తున్నారని తెలిపారు. రాష్ట్రంలో రహదారులు, ప్రాజెక్టుల నిర్మాణాలను డ్రోన్ల ద్వారా పర్యవేక్షిస్తున్నారన్నారు. వ్యవసాయ రంగంలో వేసిన మొక్కలను ఒక ఫొటో తీసి యాప్‌లో ఉంచినట్లైతే దాని స్థితిగతులను వెంటనే తెలియజేస్తుందన్నారు. విద్యార్థులు తలుచుకుంటే ఎలాంటి పనినైనా సాధిస్తారన్నారు. రాబోయే రోజుల్లో ప్రతి జిల్లాలో శాస్త్ర సాంకేతిక కేంద్రాన్ని ఏర్పాటు చేసేందుకు చర్యలు తీసుకుంటామన్నారు. రెండు రోజులపాటు జరిగే జాతీయ బాలల సైన్స్ కాంగ్రెస్‌ను విజయవంతం చేయాలని మంత్రి శిద్దా కోరారు.



ఇస్రో గురించి మంత్రి శిద్దాకు వివరిస్తున్న శాస్త్రవేత్తలు

# నేడు రాహుల్ నామినేషన్

## కాంగ్రెస్ అధ్యక్షుడిగా ఎన్నిక లాంఛనమే

న్యూఢిల్లీ, డిసెంబర్ 3: కాంగ్రెస్ అధ్యక్ష పదవికి యువనేత రాహుల్ గాంధీ సోమవారం నామినేషన్లు దాఖలు చేయబోతున్నారు. పార్టీ అధినేత్రి సోనియా, మాజీ ప్రధాని మన్మోహన్ సింగ్ సహా సీనియర్ నేతల సమక్షంలో ఆయన నామినేషన్ పత్రాలు దాఖలు చేస్తారు. ఆదివారం పొద్దుపోయే వరకూ కాంగ్రెస్ అధ్యక్ష పదవికి ఇతరులెవరూ నామినేషన్‌లు దాఖలు చేయక పోవడంతో రాహుల్ ఎన్నిక లాంఛనంగానే మారింది. వరుసగా 19 సంవత్సరాలు పార్టీకి సారథ్యం వహించిన తన తల్లి సోనియా స్థానే ఈ పదవిని రాహుల్ చేపడతారు. మొత్తం నాలుగు సెట్లు నామినేషన్ పత్రాల్ని రాహుల్ దాఖలు చేస్తారని పార్టీ వర్గాలు తెలిపాయి.

# కాపులకు అరచేతిలో వైకుంఠం: తులసిరెడ్డి

ఆంధ్రభూమి బ్యూరో

విజయవాడ, డిసెంబర్ 3: రాష్ట్రంలో కాపు, తెలగ, బలిజ, ఒంటరి కులాల వారికి బీసీ(ఎఫ్) కింద 5 శాతం రిజర్వేషన్లు కల్పించినట్లు, అది అమలుకానున్నట్లు చంద్రబాబు భ్రమలు కల్పించడం, ఆ కులాలకు చెందిన కొందరు చెక్కభజన చేయడం హాస్యాస్పదంగా ఉందని పీసీసీ అధికార ప్రతినిధి తులసిరెడ్డి ఓ ప్రకటనలో విమర్శించారు. ఇది అరచేతిలో వైకుంఠం చూపించడం మినహా మరేమీ కాదన్నారు. మొత్తం రిజర్వేషన్లు 50 శాతానికి మించి ఇచ్చే అధికారం రాష్ట్ర ప్రభుత్వాలకు లేదన్నారు. మన రాష్ట్రంలో ఇప్పటికే 50 శాతం రిజర్వేషన్లు ఉన్నాయని, రిజర్వేషన్లు 50 శాతం మించితే సుప్రీం కోర్టు కొట్టివేస్తుందన్నారు. మొత్తం రిజర్వేషన్లు 50 శాతం మించకూడదని సుప్రీంకోర్టు తీర్పు చెప్పిందన్నారు. ఒకవేళ కేంద్ర ప్రభుత్వం రాజ్యాంగ సవరణ చేసి 9వ షెడ్యూలులో చేర్చి పార్లమెంట్ చట్టం చేసినా సుప్రీం కోర్టు ధర్మాసనం సమీక్ష జరుపుతుందని, దీన్నిబట్టి చూస్తే చంద్రబాబు కాపు, తెలగ, బలిజ, ఒంటరి కులాల వారికి అరచేతిలో వైకుంఠం చూపినట్లు భ్రమింపజేస్తున్నారని తులసిరెడ్డి ధ్వజమెత్తారు.

# భగ్గుమన్న గిరిజనులు

- వాల్మీకి, బోయలను ఎస్టీల్లో చేర్చడంపై ఆందోళన
- 'అనంత'లో మంత్రి కాలవ ఇల్లు ముట్టడి



అనంతపురంలో తన ఇంటిని ముట్టడించిన గిరిజన ఐక్య వేదిక నాయకులతో మాట్లాడుతున్న మంత్రి కాలవ శ్రీనివాసులు

ఆంధ్రభూమి బ్యూరో

అనంతపురం, డిసెంబర్ 3: రాష్ట్రంలోని వాల్మీకి, బోయలను ఎస్టీ జాబితాలో చేరుస్తూ మంత్రి వర్గం నిర్ణయించడం పట్ల గిరిజనులు భగ్గుమన్నారు. ఈ మేరకు ఆదివారం అనంతపురం నగరంలోని రాష్ట్ర గృహ నిర్మాణ శాఖ మంత్రి కాలవ శ్రీనివాసులు ఇంటి ముట్టడికి యత్నించారు. మరోవైపు వాల్మీకి, బోయలను ఎస్టీల్లో చేర్చడాన్ని అభినందిస్తూ ఆయా సంఘాల నేతలు మంత్రి కాలవ శ్రీనివాసులుకు కృతజ్ఞతలు చెప్పడానికి ఆయన ఇంటికి చేరుకున్నారు. ఈ సమయంలో గిరిజనులు కూడా రావడంతో తీవ్ర ఉద్రిక్తత నెలకొంది. అయితే పోలీసులు సకాలంలో స్పందించి మంత్రి ఇంట్లోకి చొచ్చుకుపోవడానికి యత్నించిన గిరిజనులను అడ్డుకున్నారు. తొలుత గిరిజన ఐక్యవేదిక ఆధ్వర్యంలో ఉదయం నగరంలోని అంబేద్కర్ విగ్రహం వద్ద నిరసన కార్యక్రమం చేపట్టిన ఆందోళనకారులు, అక్కడి నుంచి ర్యాలీగా మంత్రి ఇంటి వద్దకు చేరుకున్నారు. ఈ సందర్భంగా 'వియ్ వాంట్ జస్టిస్' అంటూ పెద్దఎత్తున నినాదాలు చేశారు. అనంతరం మంత్రి ఇంట్లోకి చొచ్చుకుపోవడానికి ప్రయత్నించడంతో పోలీసులు వారిని అడ్డుకున్నారు. రిజర్వేషన్ల శాతాన్ని పెంచకుండా వాల్మీకులను ఎస్టీల్లో ఎలా చేరుస్తారంటూ గిరిజన నాయకులు, గిరిజన విద్యార్థి సంఘం నేతలు ప్రశ్నించారు. దీంతో స్పందించిన మంత్రి కాలవ మాట్లాడుతూ ప్రస్తుతం ఎస్టీలకు ఎలాంటి నష్టం వాటిల్లకుండా ప్రభుత్వం చర్యలు తీసుకుంటుందన్నారు. ఇప్పటికే రాష్ట్రంలో పల్స్ సర్వే(ప్రాధికార సర్వే) ద్వారా సేకరించిన సమాచారం మేరకు కుల గణన వివరాలన్నీ ప్రభుత్వం వద్ద ఉన్నాయని, ఎస్టీల జాబితా కూడా ఉందన్నారు. ఎస్టీలకు 18 శాతానికి రిజర్వేషన్లు వర్తించేలా చర్యలు చేపడుతున్నామన్నారు. బీసీలకు, గిరిజనులను నష్టం వాటిల్లకుండా కేంద్ర ప్రభుత్వాన్ని ఒప్పించి, రాజ్యాంగంలోని 9వ షెడ్యూల్‌లో చేర్పించి, రిజర్వేషన్లను 55 శాతం వరకూ పెంచేలా రాష్ట్ర ప్రభుత్వం కృషి చేస్తుందని వివరించారు. ఇక బోయ, వాల్మీకులు మంత్రి కాలవను ఘనంగా సన్మానించారు.

# ఉరేసుకున్న నిరుద్యోగం

## ఉస్మానియా పీజీ విద్యార్థి మురళి ఆత్మహత్య

- ఈ చదువు తన వల్ల కావట్లేదంటూ సూసైడ్ నోట్
- విద్యార్థి సంఘాల ఆందోళన.. ఉద్రిక్తత
- 50లక్షలు పరిహారం ఇవ్వాలని డిమాండ్
- పరిస్థితి అదుపులోనే ఉందన్న సీపీ శ్రీనివాసరావు



ఆత్మహత్యకు పాల్పడిన మురళి

ఆంధ్రభూమి బ్యూరో

హైదరాబాద్, డిసెంబర్ 3: ఉస్మానియా యూనివర్సిటీలో పీజీ విద్యార్థి ఆత్మహత్య తీవ్ర ఉద్రిక్తతకు దారితీసింది. ఓయూలోని మానేరు హాస్టల్‌లో ఎమ్మెస్సీ మొదటి సంవత్సరం విద్యార్థి మురళి ఆదివారం ఉరేసుకుని ఆత్మహత్య చేసుకున్నాడు. సిద్దిపేట జిల్లా జగదేవ్‌పూర్ మండలం దౌలాపూర్‌కు చెందిన మురళి మానేరు హాస్టల్ రూమ్ నెం.159లో ఉంటూ చదువుకుంటున్నాడు. అయితే నిరుద్యోగం కారణంగానే మురళి ఆత్మహత్యకు పాల్పడినట్టు తెలుస్తుండగా, సూసైడ్ నోట్‌లో మాత్రం 'ఈ చదువు నావల్ల కావట్లేదు.. నేను చనిపోతున్నా.. నన్ను క్షమించండి' అంటూ రాసి ఉంది. విద్యార్థి ఆత్మహత్య సంఘటన ఓయూలో ఒక్కసారిగా ఉద్రిక్తతకు దారితీసింది. విద్యార్థి సంఘాలు భగ్గుమన్నాయి. పోలీసులు విద్యార్థి మృతదేహాన్ని గాంధీ ఆసుపత్రికి తరలిస్తుండగా అడ్డుకున్నారు. దీంతో పోలీసులు, విద్యార్థుల మధ్య తోపులాట జరిగింది. ఓయూ యాజమాన్యం నిర్లక్ష్యంవల్లే మురళి ఆత్మహత్యకు పాల్పడ్డాడని, ఇందుకు యాజమాన్యమే బాధ్యత వహించాలని డిమాండ్ చేశారు. మృతుని కుటుంబానికి రూ.50 లక్షలు పరిహారం చెల్లించాలని విద్యార్థి సంఘాలు డిమాండ్ చేశాయి. పోలీసులు భారీగా మోహరించి మృతదేహాన్ని గాంధీ ఆసుపత్రికి తరలించారు. ఈస్ట్‌జోన్ డీసీపీ ఎస్ఎస్ రాజు నేతృత్వంలో ఓయూలో గట్టి బందోబస్తు చేపట్టారు. ఎన్‌సిసి గేటు మూసేసి నిషేధాజ్ఞలు విధించారు. ఇలావుండగా ఓయూలో పరిస్థితి అదుపులోనే ఉందని నగర పోలీస్ కమిషనర్ వి శ్రీనివాసరావు తెలిపారు. ఓయూలో ఎమ్మెస్సీ చదువుతున్న మురళీ చదువు ఒత్తిడి వల్ల ఆత్మహత్యకు పాల్పడినట్టు తెలుస్తోందని కమిషనర్ వివరించారు. క్లూస్ టీం సంఘటనా స్థలానికి వెళ్లిందని, ఈస్ట్‌జోన్ డీసీపీ, ఇతర సిబ్బంది ఓయూలోనే ఉన్నారని పరిస్థితిని సమీక్షిస్తున్నారని అన్నారు. మురళి ఆత్మహత్య చేసుకుంటున్నట్టు సూసైడ్ నోట్‌లో పేర్కొన్నాడని, విద్యార్థి మృతిపై రాజకీయం చేయొద్దని శ్రీనివాసరావు సూచించారు.




మురళి ఆత్మహత్య చేసుకున్న విషయం తెలిసిన వెంటనే ఓయూలోని మానేరు హాస్టల్‌కు చేరుకుని ఆందోళన చేస్తున్న విద్యార్థులు

# ఆ తీర్మానం చెల్లదు

- మంజునాథ కమిషన్ ప్రతినిధుల నివేదికకు చట్టబద్ధత లేదు
- కాపు రిజర్వేషన్లపై న్యాయస్థానాలను ఆశ్రయిస్తాం
- ఏపీ బీసీ సంక్షేమ సంఘం నేత శంకరరావు వెల్లడి

గుంటూరు, డిసెంబర్ 3: కాపులకు 5 శాతం బీసీ రిజర్వేషన్ వర్తింపచేస్తూ శాసన సభ, మండలిలో చేసిన తీర్మానాలు చెల్లవని ఏపీ బీసీ సంక్షేమ సంఘం నేతలు అన్నారు. ఇందుకు నిర్దేశించిన జస్టిస్ మంజునాథ కమిషన్ చైర్మన్ అధికారికంగా ప్రభుత్వానికి నివేదిక సమర్పించాల్సి ఉండగా అలాంటివేమీ లేకుండా ఒకరిద్దరు ప్రతినిధులు ఇచ్చిన నివేదిక ఆధారంగా ఎలా తీర్మానం చేస్తారని సంఘం రాష్ట్ర అధ్యక్షుడు కేశన శంకరరావు ప్రశ్నించారు. ఆదివారం గుంటూరులో బీసీ యువజన సదస్సు నిర్వహించారు. ఈసందర్భంగా శంకరరావు మాట్లాడుతూ సాంఘిక వెనుకబాటుతనం ఉందని ముగ్గురు సభ్యుల నివేదికలో తేల్చకుండానే, మంత్రి మండలి తీర్మానంలోనూ అలాంటి అర్హత ఉందని చెప్పకుండా చట్టసభల్లో లేనివి ఉన్నట్లు తీర్మానాలు చేయడం రాజ్యాంగ నిబంధనలకు విరుద్ధమని అన్నారు. ముగ్గురు సభ్యుల వ్యక్తిగత అభిప్రాయాలను ప్రామాణికంగా తీసుకుని కమిషన్ చైర్మన్‌ను పక్కనపెట్టి తీసుకునే చర్యలు న్యాయసమ్మతం కాదన్నారు. చైర్మన్ అభిప్రాయాన్ని పరిగణనలోకి తీసుకున్న తరువాతే మెజారిటీ, మైనారిటీ సభ్యులనే ప్రస్తావనకు రావాలన్నారు. కమిషన్ చైర్మన్ నివేదిక పంపడంలో జాప్యం జరిగిందనే కుంటిసాకు సరైంది కాదన్నారు.

ప్రభుత్వం నియమించిన చైర్మన్ అభిప్రాయంతో ప్రమేయం లేకుండా ఆగమేఘాలపై రాజకీయ లబ్ధి కోసం హైడ్రామా నడిపారని ఆయన ఆరోపించారు. జస్టిస్ మంజునాథ కమిషన్ నివేదిక బయటపడితే అసలుకే మోసం వస్తుందనే భయంతో ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు కుట్రపూరితంగా బీసీలకు అన్యాయం చేశారని ఆరోపించారు. దీనికి వ్యతిరేకంగా క్షేత్రస్థాయిలో న్యాయస్థానాల్లో బీసీలం పోరాడతామని స్పష్టం చేశారు.

## 1వ పేజీ తరువాయి

### 'దేశం'లో బీసీ సెగ!

రిజర్వేషన్ నిర్ణయంతో వారు కూడా పార్టీపై ఆగ్రహం వ్యక్తం చేస్తుండటం నాయకత్వానికి ఇబ్బందికరంగా మారింది. ఇక తెలంగాణకు చెందిన పార్టీ ఎమ్మెల్యే, గత ఎన్నికల్లో తెలంగాణ ముఖ్యమంత్రి అభ్యర్థిగా నాయకత్వమే ప్రకటించిన ఆర్ కృష్ణయ్య కూడా కాపు రిజర్వేషన్‌పై తిరుగుబాటు బావుటా ఎగురవేయడం పార్టీకి సంకటంగా పరిణమించింది. కేవలం రాజకీయ ప్రయోజనాల కోసమే ఏపీ ప్రభుత్వం కాపులకు రిజర్వేషన్ ప్రకటించిందని, దీన్ని తాము అడ్డుకోవడంతో పాటు బీసీ సంఘాల్లో చైతన్యం తెస్తామని ఆయన ప్రకటించారు. గత రెండేళ్ల నుంచి ఏపీలో పర్యటిస్తూ కాపులకు రిజర్వేషన్లు ఇస్తే రాష్ట్రం అగ్నిగుండం అవుతుందని మాచర్ల సభలో హెచ్చరించిన విషయం తెలిసిందే. తాజా పరిణామాల నేపథ్యంలో ఆయన ఏపీలో బీసీ ప్రజాప్రతినిధులతో సమావేశాలు నిర్వహించేందుకు సన్నాహాలు చేస్తున్నారు. అటు కాపు రిజర్వేషన్‌పై గతంలోనే కోర్టుకెళ్లిన బీసీ యునైటెడ్ ఫ్రంట్ అధ్యక్షుడు పాలూరు రామకృష్ణయ్య ఈ నెల 10న గుంటూరులో బీసీ గర్జన నిర్వహించనున్నారు. ఇప్పటికే కృష్ణయ్య వర్గానికి చెందిన ఏపీ బీసీ సంక్షేమ సంఘం అధ్యక్షుడు కేశన శంకరరావు నేతృత్వంలో రిజర్వేషన్‌కు వ్యతిరేకంగా ఆందోళన కార్యక్రమాలు మొదలయ్యాయి. శనివారం నాటి పరిణామాల తీవ్రత గమనించి.. బీసీల ఆందోళనను తగ్గించి, వారిని శాంతపరిచేందుకు టీడీపీ నాయకత్వం బీసీ మంత్రులను రంగంలోకి దింపింది. వారి మాట బీసీ సంఘాలు ఎంతవరకూ వింటాయో చూడాలి.

### సంబరాలొద్దు

ఆయన హైదరాబాద్ నుంచి మంత్రులు, ఎమ్మెల్యేలు, పార్టీ సీనియర్లతో టెలికాన్ఫరెన్స్ నిర్వహించారు. పార్టీ వర్గాల సమాచారం ప్రకారం.. కాపు రిజర్వేషన్ ప్రకటన అనంతర పరిణామాలపై బాబు సమీక్షించారు. రిజర్వేషన్ ప్రకటించి పార్టీ చిత్తశుద్ధి చాటుకుందని ముద్రగడ పద్మనాభం సహా కాపు నేతలంతా వ్యాఖ్యానించిన నేపథ్యంలో, దానికి సంబంధించి పార్టీకి చెందిన కాపు నేతలెవరూ సంబరాల లాంటివి చేసుకోవద్దని సూచించారు. మన పనులు మరొకరికి ఇబ్బందికరంగా, సమస్యలు తీసుకురాకుండా ఉండాలని వ్యాఖ్యానించారు. కాపులను మనమెప్పుడూ ఓటుబ్యాంకుగా చూడలేదని, వారి పేదరికం చూసే తాను ఎవరూ అడగకుండానే రిజర్వేషన్ కల్పిస్తామని ప్రకటించానన్నారు. కాపులకు రిజర్వేషన్ ఇచ్చినందువల్ల బీసీలకు ఉన్న రిజర్వేషన్లకు ఎలాంటి ఇబ్బందీ ఉండదని, కాపులకు వేరే కేటగిరిలో ఇచ్చినందున ఎవరూ ఆందోళన చెందవద్దన్న సంకేతాలిచ్చే బాధ్యత బీసీ మంత్రులే తీసుకోవాలని ఆదేశించారు. మంత్రులు యనమల రామకృష్ణుడు, అచ్చెన్నాయుడుకు బాధ్యతలు అప్పగించి, లోకేష్ పర్యవేక్షించాలని, టీడీ జనార్దన్ వీరందరితో సమన్వయం చేసుకోవాలని ఆదేశించారు. 'మనది బీసీల పార్టీ. మనకు బీసీలే పునాది. వాళ్లకు అన్యాయం జరిగే ఏ పనీ మనం చేయం. కాపులకు రాజకీయ రిజర్వేషన్లు ఇవ్వనందున బీసీల రాజకీయ ప్రయోజనాలకు వచ్చే ప్రమాదమేదీ ఉండదు. ఈ విషయాన్ని మీరు బీసీల వద్దకు తీసుకువెళ్లి, వారిని శాంతపరచాలి' అని సూచించారు. కాపులకు రిజర్వేషన్‌ను వ్యతిరేకిస్తూ మాట్లాడిన పార్టీ ఎమ్మెల్యే ఆర్ కృష్ణయ్య ప్రకటనల పైనా చర్చించారు. కాపు రిజర్వేషన్‌పై పార్టీలో అందరితో చర్చించిన తర్వాతే మేనిఫెస్టోలో పెట్టామని, ఇప్పుడు దానికి వ్యతిరేకంగా మాట్లాడటం మంచిదికాదన్నారు. తెలంగాణకు చెందిన కృష్ణయ్యకు ఇక్కడేం పని అని చంద్రబాబు ప్రశ్నించారు. ఇతర రాష్ట్రాలకు చెందిన వారంతా వారి రాష్ట్రాల సమస్యలను చూసుకుంటే మంచిదని వ్యాఖ్యానించారు. కొన్ని పార్టీలు, నేతలు తమ రాజకీయ లబ్ధి కోసం కులాలను రెచ్చగొడుతున్నాయని, వారి పట్ల అప్రమత్తంగా ఉండాలని సూచించారు. జిల్లాల్లో జరుగుతున్న పరిణామాలను మీరంతా ఎప్పటికప్పుడు పరిశీలించి, పార్టీకి నష్టం జరగకుండా చొరవ తీసుకోవాలని చంద్రబాబు ఆదేశించారు.

### పోలవరంపై విచారణ ...

కోసమేనని ప్రతిపక్షం చేసిన ఆరోపణలపై ఇప్పుడు కేంద్రం కూడా ప్రశ్నిస్తోందన్నారు. చంద్రబాబుకు ఈ విషయాలు తెలియవా? అని ఆయన నిలదీశారు. రూ. 1600 కోట్లు పట్టిసీమ కోసం, రూ. 1800 కోట్లు పురుషోత్తపట్నంకు కేటాయించారని, ఒడిశా ముఖ్యమంత్రి నవీన్ పట్నాయక్ ప్రధానికి రాసిన లేఖలో పట్టిసీమ ప్రాజెక్ట్ గురించి ప్రస్తావించారని, ఈ ప్రాజెక్టులు సరిపోతాయని, ఇక పోలవరం అక్కరలేదని ఆయన లేఖలో పేర్కొన్నారని గుర్తుచేశారు. ట్రాన్స్‌ట్రాయ్ కంపెనీ పనిచేయడం లేదని భావిస్తే ఆ కంపెనీతో మాట్లాడి కాంట్రాక్ట్ నుంచి తప్పించాలని డిమాండ్ చేశారు. ఆనాడు వైఎస్‌ఆర్ పోలవరం పనులు చేయడం లేదని టీడీపీ నేత నామా నాగేశ్వరరావు కంపెనీ వారిని పిలిచి మాట్లాడి పనుల నుంచి తప్పించారన్నారు. ముఖ్యమంత్రి ఇకనైనా పోలవరంపై నిజాలను ప్రజలతో పంచుకోవాలని హితవు పలికారు. లెక్కలు బయటపెడితే జైలుకు వెళ్తారని బీజేపీ అధికార ప్రతినిధే హెచ్చరించినా చంద్రబాబు కళ్లు తెరవడం లేదని విమర్శించారు. పోలవరంపై చంద్రబాబు శ్వేతపత్రం ప్రకటించాలని డిమాండ్ చేశారు. రాష్ట్రం గత మూడేళ్లలో రూ. 2.16 లక్షల కోట్లు అప్పులు చేసిందని, ఈ నిధులన్నీ ఎక్కడికి వెళ్లాయో లెక్కలు చెప్పాలని కోరారు. ఇక జస్టిస్ మంజునాథ నివేదిక వివరాలు లేకుండా కమిషన్ రిపోర్టుకు చట్టబద్ధత ఏమేరకు ఉంటుందని ప్రశ్నించారు. చంద్రబాబు చట్టాలపై గౌరవం లేకుండా వ్యవహరిస్తున్నారని ఉండవల్లి ఆరోపించారు.

### మహిళలూ బహుపరాక్!

రేప్ చేశారు. ఆరు కేసుల్లో తాత లేదా తండ్రి లేదా సోదరుడు లేదా కుమారుడు, 29 కేసుల్లో కుటుంబ సభ్యులు, 44 కేసుల్లో బంధువులు, 361 కేసుల్లో ఇరుగుపొరుగువారు ఉన్నారు. తెలంగాణలో 1278 అత్యాచార కేసులకు 1254 కేసుల్లో తెలిసిన వారే అత్యాచారానికి ఒడిగట్టినట్లు ఎన్‌సిఆర్‌బి ప్రకటించింది. ఇందులో 1 కేసుల్లో రక్తసంబంధీకులు, 127 కేసుల్లో కుటుంబ సభ్యులు, 155 కేసుల్లో బంధువులు, 355 కేసుల్లో ఇరుగుపొరుగువారు మహిళలపై అత్యాచారం చేశారు. మహరాష్ట్రలో 4189 కేసులు నమోదు కాగా, మిజోరంలో అతితక్కువ 23 కేసులు నమోదయ్యాయి. మధ్యప్రదేశ్‌లో మొత్తం నమోదైన 4882 అత్యాచార కేసుల్లో 4789 మందిపై అత్యాచారానికి పాల్పడింది తెలిసిన వారే. కాగా, 35 మంది మహిళలు తాత, తండ్రి, సోదరుడు, కొడుకు చేతుల్లో అత్యాచారానికి గురైన వారున్నారు. 108 మంది సమీప బంధువులచే అత్యాచారానికి గురవ్వగా, 157 మంది మహిళలు బంధువులు, మరో 1115 మంది మహిళలు ఇతరులచే అత్యాచారానికి గురైన వారు. అదేవిధంగా ఉత్తరప్రదేశ్‌లో నమోదైన 4816 అత్యాచార కేసుల్లో 4803 మంది మహిళలు తెలిసిన వారితో, 27 మంది మహిళలు తాత, తండ్రి, సోదరుడు, కొడుకులచే అత్యాచారానికి గురయ్యారు.

154 మంది మహిళలు కుటుంబ సభ్యుల చేతిలో మోసపోగా, 441 మంది మహిళలు సమీప బంధువులు, మరో 1851 మంది మహిళలు ఇతరులచే చెరచబడ్డారు. అత్యాచార బాధితుల్లో 4189 మంది మహిళలు మహరాష్ట్రలో ఉండగా, వీరిలో 4126 మంది తెలిసిన వారి చేతుల్లో, 96 మంది మహిళలు తాత,తండ్రి, సోదరుడు, కొడుకుచే అత్యాచారానికి గురికాగా, 151 మంది సమీప బంధువులు, 683 మంది మహిళలు ఇతరుల చేతిలో అత్యాచారానికి గురయ్యారు. రాజస్థాన్‌లో 3656 మంది మహిళలు అత్యాచారానికి గురికాగా, 3626 మంది మహిళలపై తెలిసిని వారు అత్యాచారానికి పాల్పడ్డారు. 147 మంది మహిళలు తాత, తండ్రి, సోదరుడు, కొడుకుచే అత్యాచారానికి గురికాగా, 139 మంది మహిళలపై కుటుంబ సభ్యులు అత్యాచారానికి పాల్పడ్డారు. 269 మంది మహిళలు సమీప బంధువులు, 704 మంది మహిళలు కామాంధులచే అత్యాచారానికి గురయ్యారు. అదేవిధంగా కేంద్ర పాలిత ప్రాంతమైన లక్ష్యద్వీప్‌లో కేవలం ఐదుగురు మహిళలు తెలిసిన వారి చేతుల్లోనే అత్యాచారానికి గురై దేశంలో అతితక్కువ కేసులతో మంచి రాష్ట్రంగా నిలిచింది.

# చట్టసభల్లో బీసీలకు కోటా

## చట్టం చేయాలని కేంద్రాన్ని కోరదాం

- పదోన్నతుల్లోనూ రిజర్వేషన్లు
- ప్రధాని వద్దకు అఖిలపక్షం
- బీసీ ప్రజాప్రతినిధుల భేటీలో టీ.సీఎం కేసీఆర్ ప్రకటన

ఆంధ్రభూమి బ్యూరో

హైదరాబాద్, డిసెంబర్ 3: చట్టసభల్లో బీసీలకు రిజర్వేషన్లు కల్పించాలని తెలంగాణ రాష్ట్రం తరపున కేంద్రాన్ని కోరనున్నట్టు ముఖ్యమంత్రి కె చంద్రశేఖర్‌రావు వెల్లడించారు. ఈ అంశంపై కేంద్రంపై వత్తిడి తీసుకరావడానికి రాష్ట్రం నుంచి అఖిలపక్షాన్ని ఢిల్లీకి తీసుకెళ్లి ప్రధానమంత్రిని కలుస్తామన్నారు. తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన కొత్తలోనే చట్టసభల్లో బీసీలకు రిజర్వేషన్లు కల్పించాలని శాసనసభలో తీర్మానం చేసామని ముఖ్యమంత్రి గుర్తు చేసారు. బీసీల సంక్షేమం-అభివృద్ధి కోసం తీసుకోవాల్సిన చర్యలపై శాసనసభ కమిటీ హాలులో ఆదివారం అన్ని పార్టీలకు చెందిన ఎంపీలు, ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీలతో ముఖ్యమంత్రి సమావేశం నిర్వహించారు. బీసీల సంక్షేమం కోసం ఇంకా చేపట్టాల్సిన కార్యక్రమాలు, చేయాల్సిన చట్టాలు, తీర్మానాలు, జారీ చేయాల్సిన ఉత్తర్వులపై క్షుణ్ణంగా చర్చించి రాష్ట్ర ప్రభుత్వానికి నివేదిక సమర్పించాలని ముఖ్యమంత్రి కోరారు. విస్తృతంగా చర్చించడానికి మూడు రోజుల పాటు అన్ని పార్టీలకు చెందిన బీసీ ప్రజాప్రతినిధులు సమావేశం కావాలని సూచించారు. బిసి ప్రజాప్రతినిధులు కోరిన విధంగా చట్టాలు తేవడానికి, ఉత్తర్వులు జారీ చేయడానికి ప్రభుత్వం సిద్ధంగా ఉందని ముఖ్యమంత్రి స్పష్టం చేసారు. ప్రస్తుతం బీసీల కోసం అమలు చేస్తున్న విధానాలలో ఏమైనా లోపాలు ఉంటే సవరించుకోవడానికి కూడా తమకు ఎలాంటి భేషజాలు లేవని ముఖ్యమంత్రి అన్నారు. సమాజంలో సగభాగాని కంటే అధికంగా ఉన్న బలహీన వర్గాలు అన్ని రంగాల్లో అభివృద్ధి సాధించాలన్నదే ప్రభుత్వ లక్ష్యమన్నారు. అంతిమంగా కొట్లాడి సాధించుకున్న తెలంగాణ రాష్ట్రంలో బీసీలకు మేలు జరగాలని, వారి భవిష్యత్‌కు బంగారు బాటలు వేయాలన్నదే తన లక్ష్యమని ముఖ్యమంత్రి అన్నారు.

బీసీల అభ్యున్నతి కోసం ఎలాంటి చర్యలు తీసుకోవాలనే విషయంలో ఆ వర్గానికి చెందిన ప్రజా ప్రతినిధులు కూలంకశంగా చర్చించి ప్రభుత్వానికి సిఫారసు చేస్తే వాటిని నూరుకు నూరు శాతం చిత్తశుద్ధితో అమలు చేస్తామని ముఖ్యమంత్రి ప్రకటించారు. బీసీల కోసం విధానాలు, పథకాల రూపకల్పనలో భవిష్యత్‌లో వాటిని ఎవరూ తొలగించలేనంత పకడ్బందీగా రూపొందించుకుందామన్నారు. అభివృద్ధి చెందిన దేశాల్లో ప్రభుత్వాలు మారినప్పటికీ విధానపరమైన విషయాలల్లో స్థిరత్వం ఉంటుందని, అయితే భారతదేశంలో మాత్రం విధానపరమైన స్థిరత్వం లేకపోవడమే ప్రధాన లోపమని ముఖ్యమంత్రి అభిప్రాయపడ్డారు. బీసీల అభ్యున్నతి కోసం రాష్ట్ర పరిధిలో ఉన్న అన్ని అంశాలపై సానుకూలంగా నిర్ణయాలు తీసుకోవడానికి రాష్ట్ర ప్రభుత్వం సిద్ధంగా ఉందన్నారు. స్థానిక సంస్థల్లో రిజర్వేషన్లు అమలు చేసుకుందామన్నారు. బిసి పారిశ్రామిక వెత్తలను ప్రోత్సహించడానికి టిఎస్‌ఐఐసి కేటాయించే భూముల్లో బీసీలకు రిజర్వేషన్ కల్పిస్తామని ముఖ్యమంత్రి హామీ ఇచ్చారు. ఇంకా బీసీలకు ఏం చేయాలో కొత్త పథకాలు రచించాలన్నారు. అన్ని కుల సంఘాలతో సమావేశాలు నిర్వహించండని సూచించారు. అన్ని విషయాల్లో ఆచరణీయమైన మార్గాన్ని ప్రజా ప్రతినిధులు సూచించాలని ముఖ్యమంత్రి అన్నారు. బీసీల అభివృద్ధి సంక్షేమం కోసం ప్రభుత్వం ఇప్పటికే అనేక చర్యలు తీసుకుందన్నారు.

# విద్యాశాఖలో పదోన్నతులు ఎన్నడో!

## జాక్టో ఆవేదన

ఆంధ్రభూమి బ్యూరో

విజయవాడ, డిసెంబర్ 3: రాష్ట్ర విద్యాశాఖలో దీర్ఘకాలంగా ఖాళీగా ఉన్న వివిధ కేడర్ల పోస్టులను పదోన్నతుల ద్వారా భర్తీ చేయాలని ఆదివారం నాడిక్కడ గాంధీ మున్సిపల్ హైస్కూల్‌లో జరిగిన ఉపాధ్యాయ సంఘాల సంయుక్త కార్యాచరణ సమితి 'జాక్టో' రాష్ట్ర స్టీరింగ్ కమిటీ సమావేశం ప్రభుత్వాన్ని డిమాండ్ చేసింది. సర్వీస్ రూల్స్ విషయంలో అధికారుల నిర్లక్ష్యం వల్ల హైకోర్టు స్టేటస్‌కో విధించిందని, దీనివల్ల ఉపాధ్యాయులు నష్టపోతున్నందున అడ్‌హాక్ పద్ధతిలో పదోన్నతులు చేపట్టాలని నాయకులు కోరారు. సీపీఎస్ విధానాన్ని రద్దుపరచి ఫ్యామిలీ పెన్షన్, గ్రాట్యుటీ జీవోలను అమలుపరచాలని, ఉర్దూ, లాంగ్వేజ్ పండిట్ వ్యవస్థను రద్దుచేసి అన్నీ ఉన్నత పాఠశాలల్లో స్కూల్ అసిస్టెంట్ పోస్టులుగా ఉన్నతీకరణ చేపట్టాలని, పెండింగ్‌లో ఉన్న పీఆర్సీ బకాయిలతో పాటు కరవు భత్యాలు మంజూరు చేయాలని, నూతన పీఆర్ కమిషన్‌ను ఏర్పాటు చేయాలని, ఎస్సీ, ఎస్టీలకు పదోన్నతుల్లో రిజర్వేషన్ జీవో-2 ప్రకారం భర్తీ చేయాలని, స్కూల్ అసిస్టెంట్ పరీక్షలు ఆబ్జెక్టివ్ తరహాలో కాకుండా పాత పద్ధతిలోనే నిర్వహించాలని, ఖాళీగా ఉన్న జిల్లా విద్యాశాఖాధికారి పోస్టులను తక్షణం భర్తీ చేయాలని, రూ.398ల వేతనంతో పనిచేసిన కాలానికి ఇంక్రిమెంట్లు మంజూరు చేయాలని, కోరింది. వారికి నెలనెలా రెగ్యులర్ జీతాలు చెల్లించాలని, ఎయిడెడ్ టీచర్లకు హెల్త్‌కార్డులు మంజూరు చేయాలని, బడ్జెట్ కంట్రోల్‌తో నిమిత్తం లేకుండా జీతాలను 010 పద్దు ద్వారా చెల్లించాలని, వొకేషనల్ టీచర్లకు గతంలో పనిచేసిన సర్వీస్‌ను పెన్షన్‌గా పరిగణించాలని జాక్టో సమావేశం కోరింది.

టెస్టుల్లో అత్యధిక డబుల్ సెంచరీలు చేసిన భారత బ్యాట్‌మెన్ జాబితాలో సచిన్ తెండూల్కర్, వీరేందర్ సెవాగ్ సరసన కోహ్లీకి చోటు దక్కింది. వీరంతా తలా ఆరు డబుల్ సెంచరీలు సాధించారు. కాగా, ప్రపంచ టెస్టు క్రికెట్‌లో ఎక్కువ డబుల్ సెంచరీలు చేసిన బ్యాట్స్‌మెన్‌లో సచిన్, సెవాగ్‌తో పాటు మర్వన్ అటపట్టు (శ్రీలంక), జావేద్ మియందాద్ (పాకిస్తాన్), యూనిస్ ఖాన్ (పాకిస్తాన్), రికీ పాంటింగ్ (ఆస్ట్రేలియా)తో కలిసి కోహ్లీ సంయుక్తంగా ఐదో స్థానాన్ని ఆక్రమించాడు. వీరంతా ఆరేసి డబుల్ సెంచరీలు చేశారు. ఈ జాబితాలో సర్ డొనాల్డ్ బ్రాడ్‌మన్ (ఆస్ట్రేలియా) అగ్రస్థానాన్ని ఆక్రమించాడు. అతని ఖాతాలో 12 టెస్టు డబుల్ సెంచరీలు ఉన్నాయి. కుమార సంగక్కర (శ్రీలంక) 11, బ్రియాన్ లారా (వెస్టిండీస్) 9 డబుల్ సెంచరీలతో వరుసగా రెండు, మూడు స్థానాల్లో కొనసాగుతున్నారు. వారీ హమ్మండ్ (ఇంగ్లాండ్), మహేల జయవర్ధనే (శ్రీలంక) చెరి ఏడు డబుల్ సెంచరీలతో నాలుగో స్థానాన్ని పంచుకుంటున్నారు.



# క్రీడ

# కోహ్లీ మరో 'డబుల్'

## రికార్డు సృష్టించిన భారత కెప్టెన్
## భారత్ 7 వికెట్లకు 536 డిక్లేర్డ్
## శ్రీలంకతో చివరి, మూడో టెస్టు

న్యూఢిల్లీ, డిసెంబర్ 3: హోం గ్రౌండ్ ఫిరోజ్ షా కోట్లా మైదానంలో భారత కెప్టెన్ విరాట్ కోహ్లీ రికార్డు డబుల్ సెంచరీ సాధించి, భారత్‌కు భారీ స్కోరు అందించాడు. దీనితో ఏడు వికెట్లకు 536 పరుగుల వద్ద భారత్ తొలి ఇన్నింగ్స్‌ను డిక్లేర్ చేసింది. శ్రీలంకతో జరుగుతున్న చివరి, మూడో టెస్టులో రెండో రోజు ఆటను నాలుగు వికెట్లకు 371 పరుగుల ఓవర్‌నైట్ స్కోరుతో కొసాగించిన భారత్ 500 పరుగుల వద్ద రోహిత్ శర్మ వికెట్ కోల్పోయింది. ఐదో వికెట్‌కు కోహ్లీతో కలిసి 135 పరుగులు జోడించిన అతను 102 బంతుల్లో 65 పరుగులు చేశాడు. లక్షన్ సండాకన్ బౌలింగ్‌లో వికెట్‌కీపర్ నిరోషన్ డిక్‌విల్లా క్యాచ్ పట్టడంతో అతని ఇన్నింగ్స్‌కు తెరపడింది. రవిచంద్రన్ అశ్విన్ నాలుగు పరుగులకే ఔట్‌కాగా, 287 బంతులు ఎదుర్కొని, 25 ఫోర్లతో 243 పరుగులు చేసిన కోహ్లీని లక్షన్ సండాకన్ ఎల్‌బిగా ఔట్ చేశాడు. వికెట్లకు అడ్డంగా దొరికిపోయిన కోహ్లీ బంతి తొలుత బ్యాట్‌కు తగిలి ఉంటుందని నమ్మాడు. దీనితో ఔట్‌నట్టు అంపైర్ ప్రకటించడంపై అభ్యంతరం వ్యక్తం చేస్తూ రివ్యూను కోరాడు. అందులో అతను బంతికి, స్టంప్స్‌కు మధ్య నిలిచినట్టు స్పష్టం కావడంతో పెవిలియన్ చేరక తప్పలేదు. కాలుష్య సమస్య ఉందంటూ లంక క్రికెటర్లు కొంత సేపు ఆటకు అంతరాయం కలిగించడం కోహ్లీ ఏకాగ్రతను దెబ్బతీసింది. ఆ క్రమంలోనే అతను ఔటయినట్టు కనిపిస్తున్నది. కాగా, 127.5 ఓవర్లలో భారత్ ఏడు వికెట్లకు 523 పరుగులు చేసింది. ఈ దశలో ఇన్నింగ్స్‌ను డిక్లేర్ చేస్తున్నట్టు కోహ్లీ ప్రకటించాడు. అప్పటికి వృద్ధిమాన్ సాహా 9, రవీంద్ర జడేజా 5 పరుగులతో నాటౌట్‌గా ఉన్నారు.

అనంతరం మొదటి ఇన్నింగ్స్‌ను మొదలు పెట్టిన శ్రీలంక, రెండో రోజు ఆటను నిలిపి వేసే సమయానికి 44.3 ఓవర్లలో 3 వికెట్లకు 131 పరుగులు చేసింది. మహమ్మద్ షమీ వేసిన ఇన్నింగ్స్ మొదటి బంతికే వృద్ధిమాన్ సాహాకు క్యాచ్ ఇచ్చి దిముత్ కరుణరత్నే ఔటయ్యాడు. 14 పరుగుల వద్ద ధంజయ డి సిల్వ కూడా వెదరిగాడు. ఒక పరుగు చేసిన అతను ఇశాంత్ శర్మ బౌలింగ్‌లో ఎల్‌బి అయ్యాడు. అనంతరం మాజీ కెప్టెన్ ఏంజెలో మాథ్యూస్ (57 నాటౌట్), కెప్టెన్ దినేష్ చండీమల్ (25 నాటౌట్) మరో వికెట్ కూలకుండా జాగ్రత్త పడ్డారు.

డబుల్ సెంచరీ హీరో కోహ్లీ

## లారాను అధిగమించి..

టెస్టుల్లో కెప్టెన్‌గా అత్యధిక డబుల్ సెంచరీలు సాధించిన ఆటగాళ్ల జాబితాలో బ్రియాన్ లారా రికార్డును టీమిండియా కెప్టెన్ విరాట్ కోహ్లీ అధిగమించాడు. నాగపూర్ టెస్టులో డబుల్ సెంచరీ చేసినప్పుడు, కెప్టెన్‌గా ఐదు డబుల్ సెంచరీలతో లారా రికార్డును కోహ్లీ సమం చేసిన విషయం తెలిసిందే. శ్రీలంకతోనే న్యూఢిల్లీ ఫిరోజ్ షా కోట్లా మైదానంలో జరుగుతున్న చివరి, మూడో టెస్టు మొదటి ఇన్నింగ్స్‌లో మరోసారి డబుల్ సెంచరీతో కదంతొక్కిన అతను లారా రికార్డును బ్రేక్ చేశాడు. కాగా, కెప్టెన్‌గా సేవలు అందిస్తున్నప్పుడు నాలుగేసి పర్యాయాలు డబుల్ సెంచరీలు చేసిన డొనాల్డ్ బ్రాడ్‌మన్, మైఖేల్ క్లార్క్, గ్రేమ్ స్మిత్ ఇప్పుడు సంయుక్తంగా మూడో స్థానంలో నిలిచారు.

మ్యాచ్ మొదటి రోజు శనివారం ఆట ముగిసే సమయానికి 156 పరుగులు చేసిన 29 ఏళ్ల కోహ్లీ ఆదివారం ఉదయం అదే ఊపును కొనసాగించాడు. కెరీర్‌లో 63వ టెస్టు ఆడుతున్న అతను సురంగ లక్మల్ బౌలింగ్‌లో రెండు పరుగులు చేయడం ద్వారా డబుల్ సెంచరీని పూర్తి చేశాడు. అతని 243 పరుగుల స్కోరులో 25 బౌండరీలు ఉన్నాయి. 287 బంతులు ఎదుర్కొన్న అతను 135 డాట్ బాల్స్ ఆడాడు.

వినోద్ కాంబ్లీ తర్వాత, రెండు వరుస టెస్టుల్లో డబుల్ సెంచరీలు చేసిన రెండో భారతీయుడిగా కోహ్లీ పేరు రికార్డు పుస్తకాల్లో చేరింది. కోహ్లీసహా ఈ ఫీట్‌ను ప్రపంచ టెస్టు క్రికెట్‌లో కేవలం నలుగురు మాత్రమే ఉండడం విశేషం. డొనాల్డ్ బ్రాడ్‌మన్ (ఆస్ట్రేలియా/ ఇంగ్లాండ్‌పై) మూడు పర్యాయాలు వరుస టెస్టుల్లో డబుల్ సెంచరీలు చేసి, ఎవరికీ అందనంత ఎత్తుకు ఎదిగాడు. వాలీ హమ్మండ్ (ఇంగ్లాండ్/ న్యూజిలాండ్‌పై), వినోద్ కాంబ్లీ (భారత్/ ఇంగ్లాండ్‌పై), గ్రేమ్ స్మిత్ (దక్షిణాఫ్రికా/ ఇంగ్లాండ్‌పై), ఇప్పుడు కోహ్లీ (భారత్/ శ్రీలంకపై)

## స్కోరుబోర్డు

**భారత్ తొలి ఇన్నింగ్స్** (ఓవర్‌నైట్ స్కోరు 90 ఓవర్లలో 4 వికెట్లకు 371) : మురళీ విజయ్ స్టంప్డ్ నిరోషన్ డిక్‌విల్లా బి లక్షన్ సండాకన్ 155, శిఖర్ ధావన్ సి సురంగ లక్మల్ బి దిల్‌రువాన్ పెరెరా 23, చటేశ్వర్ పుజారా సి సదీర సమరవిక్రమ బి లాహిరు గామగే 23, విరాట్ కోహ్లీ ఎల్‌బి లక్షన్ సండాకన్ 243, అజింక్య రహానే స్టంప్డ్ నిరోషన్ డిక్‌విల్లా బి లక్షన్ సండాకన్ 1, రోహిత్ శర్మ సి నిరోషన్ డిక్‌విల్లా బి లక్షన్ సండాకన్ 65, రవిచంద్రన్ అశ్విన్ సి దిల్‌రువాన్ పెరెరా బి లాహిరు గామగే 4, వృద్ధిమాన్ సాహా 9 నాటౌట్, రవీంద్ర జడేజా 5 నాటౌట్, ఎక్‌స్ట్రాలు 9, **మొత్తం (127.5 ఓవర్లలో 7 వికెట్లకు) 536 డిక్లేర్డ్.**

**వికెట్ల పతనం:** 1-42, 2-78, 3-361, 4-365, 5-500, 6-519, 7-523.

**బౌలింగ్:** సురంగ లక్మల్ 21.2-2-80-0, లాహిరు గామగే 25.3-7-95-2, దిల్‌రువాన్ పెరెరా 31.1-0-145-1, లక్షన్ సండాకన్ 33.5-1-167-4, ధనంజయ డి సిల్వ 16-0-48-0.

**శ్రీలంక తొలి ఇన్నింగ్స్:** దిముత్ కరుణరత్నే సి వృద్ధిమాన్ సాహా బి మహమ్మద్ షమీ 0, దిల్‌రువాన్ పెరెరా ఎల్‌బి రవీంద్ర జడేజా 42, ధనంజయ డిసిల్వ ఎల్‌బి ఇశాంత్ శర్మ 1, ఏంజెలో మాథ్యూస్ 57 నాటౌట్, దినేష్ చండీమల్ 25 నాటౌట్, ఎక్‌స్ట్రాలు 6, **మొత్తం (44.3 ఓవర్లలో 3 వికెట్లకు) 131.**

**వికెట్ల పతనం:** 1-0, 2-14, 2-75.

**బౌలింగ్:** మహమ్మద్ షమీ 11-3-30-1, ఇశాంత్ శర్మ 10-4-44-1, రవీంద్ర జడేజా 14.3-6-24-1, రవిచంద్రన్ అశ్విన్ 9-3-28-0.



మాస్క్‌తో లంక కెప్టెన్ దినేష్ చండీమల్

## ఇంత కాలుష్యమా?

### ఆడేందుకు లంక క్రికెటర్ల నిరాకరణ

న్యూఢిల్లీ, డిసెంబర్ 3: దేశ రాజధాని న్యూఢిల్లీలో వాయు కాలుష్యం తీవ్ర స్థాయిలో ఉందంటూ వచ్చిన వార్తలను గమనించారో లేక నిజంగానే అసౌకర్యానికి గురయ్యారో తెలియదుగానీ భారత్‌తో జరుగుతున్న చివరి, మూడో టెస్టు మ్యాచ్ రెండు రోజు ఆటకు శ్రీలంక క్రికెటర్లు రెండు పర్యాయాలు ఆటంకం కలిగించారు. మాస్కులతో మైదానంలోకి దిగారు. క్రికెట్ చరిత్రలోనే వాయు కాలుష్యం పేరుతో మొట్టమొదటిసారి ఆటకు అంతరాయం ఏర్పడడానికి కారణమయ్యారు. ఇన్నింగ్స్‌లో 123వ ఓవర్‌ను వేసే బాధ్యతను మీడియం పేసర్ లాహిరు గామగే తీసుకున్నాడు. మూడు బంతులు వేసిన తర్వాత, నాలుగో బంతికి ఉపక్రమిస్తూ, హఠాత్తుగా తన నిర్ణయాన్ని మార్చుకున్నాడు. వాయు కాలుష్యం కారణంగా తాను తీవ్ర అసౌకర్యానికి గురవుతున్నట్టు చెప్పాడు. లంక కెప్టెన్ దినేష్ చండీమల్ అతనికి మద్దతునిచ్చాడు. ఫీల్డ్ అంపైర్లు జోల్ విల్సన్, నిగెల్ లాంగ్‌తో కొంత సేపు చర్చించారు. లంక ఆటగాళ్ల అభ్యంతరాన్ని థర్డ్ అంపైర్ డేవిడ్ బూన్‌కు ఫీల్డ్ అంపైర్లు తీసుకెళ్లారు. కొంత సేపు మాట్లాడిన తర్వాత, బూన్ సూచనపై ఆటను కొనసాగించాలని చండీమల్ నిర్ణయించాడు. మొత్తం మీద ఈ వ్యవహారం వల్ల మధ్యాహ్నం 12.32 నంచి 12.49 వరకు, 17 నిమిషాల పాటు ఆటకు అంతరాయం ఏర్పడింది. ఏకాగ్రత కోల్పోయిన భారత కెప్టెన్ విరాట్ కోహ్లీ ఆతర్వాత కొద్ది సేపటికే ఔటయ్యాడు. మరో నాలుగు ఓవర్ల తర్వాత అదే సమస్య మరోమారు తెరపైకి వచ్చింది. ఆ ఓవర్‌లో ఐదు బంతులు వేసిన సురంగ లక్మల్ వాయు కాలుష్యంతో ఊపిరి సరిగ్గా తీసుకోలేకపోతున్నానని పేర్కొంటూ మైదానాన్ని విడిచిపెట్టాడు. దీనితో ఆ ఓవర్‌లో మిగిలిన ఒక బంతిని దిల్‌రువాన్ పెరెరా వేశాడు. 128వ ఓవర్‌ను లక్షన్ సండాకన్ మొదలుపెట్టి ఐదు బంతులు వేశాడు. ఆ సమయంలో, మైదానంలో పది మంది ఫీల్డర్లే ఉన్నారంటూ చండీమల్ మరోసారి ఆటకు అంతరాయం కలిగించాడు. అంపైర్‌తో మళ్లీ చర్చకు ఉపక్రమించాడు. పరిస్థితిని గమనించిన కోహ్లీ తీవ్ర అసహనానికి గురయ్యాడు. శ్రీలంక ఆటగాళ్లు రెండోసారి ఆటకు అంతరాయం కలిగించడంతో ఆగ్రహించిన అతను, ఇన్నింగ్స్‌ను డిక్లేర్ చేస్తున్నట్టు ప్రకటించాడు. ఇంతకీ నిజంగానే వాయు కాలుష్యం వల్ల లంక ఆటగాళ్లకు ఇబ్బందులు తలెత్తాయా? లేక భారత బ్యాట్స్‌మెన్ విజృంభణకు అడ్డుకట్ట వేయడానికి వీలుగా, సాధ్యమైనంత ఎక్కువ సమయాన్ని వృథా చేయడమే లక్ష్యంగా ఈ ఎత్తుగడను అనుసరించారా? అన్న ప్రశ్నలు తలెత్తుతున్నాయి.

## షాన్ మార్ష్ అజేయ శతకం

### ఆస్ట్రేలియా 8 వికెట్లకు 442 డిక్లేర్డ్
### ఇంగ్లాండ్‌తో రెండో యాషెస్ టెస్టు

అడెలైడ్, డిసెంబర్ 3: ఇంగ్లాండ్‌తో జరుగుతున్న రెండో టెస్టు మ్యాచ్ మొదటి ఇన్నింగ్స్‌ను ఆస్ట్రేలియా ఎనిమిది వికెట్లకు 442 పరుగుల వద్ద డిక్లేర్ చేసింది. షాన్ మార్ష్ అజేయ సెంచరీతో రాణించడంతో ఆసీస్‌కు ఈ స్కోరు సాధ్యమైంది. మొదటి రోజు మాదిరిగానే రెండో రోజు ఆటకు కూడా వర్షం వల్ల ఆటంకం కలిగింది. తొలి రోజు 81 ఓవర్ల ఆట జరగ్గా, నాలుగు వికెట్లకు 209 పరుగులు చేసిన ఆస్ట్రేలియా, ఆ ఓవర్‌నైట్ స్కోరుతో రెండో రోజు ఆటను కొనసాగించింది. షాన్ మార్ష్ 231 బంతులు ఎదుర్కొని 126 పరుగులు చేసి నాటౌట్‌గా నిలవగా, టిమ్ పైన్ 102 బంతుల్లో 57, పాట్ కమిన్స్ 90 బంతుల్లో 44 పరుగులు చేశారు. కెరీర్‌లో తొలి టెస్టు ఆడుతున్న ఇంగ్లాండ్ బౌలర్ క్రెగ్ ఓవర్టన్ 105 పరుగులకు మూడు వికెట్లు పడగొట్టాడు. స్టువర్ట్ బ్రాడ్ 72 పరుగులిచ్చి రెండు వికెట్లు కూల్చాడు.

అనంతరం బ్యాటింగ్‌కు దిగిన ఇంగ్లాండ్ రెండో రోజు ఆటను వర్షం కారణంగా నిలిపివేసే సమయానికి 9.1 ఓవర్లలో మార్క్ స్టోన్‌మన్ (18) వికెట్ కోల్పోయి 29 పరుగులు చేసింది.

**సంక్షిప్త స్కోర్లు**

**ఆస్ట్రేలియా మొదటి ఇన్నింగ్స్:** 149 ఓవర్లలో 8 వికెట్లకు 442 డిక్లేర్డ్ (డేవిడ్ వార్నర్ 47, ఉస్మాన్ ఖాజా 53, స్టీవెన్ స్మిత్ 40, పీటర్ హ్యాండ్స్‌కోమ్ 36, షాన్ మార్ష్ 126, టిమ్ పైన్ 57, జేమ్స్ ఆండర్సన్ 1/74, స్టువర్ట్ బ్రాడ్ 2/72, క్రిస్ వోక్స్ 1/84, క్రెగ్ ఓవర్టన్ 3/105).

**ఇంగ్లాండ్ మొదటి ఇన్నింగ్స్:** 9.1 ఓవర్లలో వికెట్ నష్టానికి 29.



షాన్ మార్ష్ 123 నాటౌట్

## టీసీఎల్‌కు 'హీరా' మద్దతు

హైదరాబాద్, డిసెంబర్ 3: క్రికెట్‌లో కొత్తగా రంగ ప్రవేశం చేసిన టి-10 ఫార్మాట్‌కు హీరా గ్రూప్ సంస్థ మద్దతు ప్రకటించింది. యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్ (యూఏఈ)లో ఈనెల 14 నుంచి 17వ తేదీ వరకు జరిగే టి-10 క్రికెట్ లీగ్ (టీసీఎల్) టోర్నమెంట్‌కు టైటిల్ స్పాన్సర్‌గా వ్యవహరిస్తున్నది. ఆదివారం జరిగిన ఒక కార్యక్రమంలో టోర్నమెంట్ వివరాలను ప్రకటించారు. ఒక్కో జట్టుకు 10 ఓవర్లు ఉండే, ఈ 90 నిమిషాల మ్యాచ్‌లు ప్రేక్షకులను ఉర్రూతలూగిస్తాయనడంలో సందేహం లేదు. ఒక రకంగా దీనిని క్రికెట్‌లో విప్లవాత్మక మార్పుగా పేర్కొవచ్చు. దక్షిణాసియాకు చెందిన పంజాబీ లెజెండ్స్, పాకిటూన్స్, మరాఠా అరేబియన్స్, బెంగాల్ టైగర్స్, టీమ్ శ్రీలంక క్రికెట్, కేరళ కింగ్స్ ఈ టోర్నీలో పాల్గొంటాయి. శ్రీలంక మాజీ కెప్టెన్ కుమార సంగక్కర, పాకిస్తాన్ మాజీ కెప్టెన్లు మిస్బా ఉల్ హక్, షాహిద్ అఫ్రిదీ, భారత మాజీ ఓపెనర్ వీరేందర్ సెవాగ్, ఇంగ్లాండ్ వన్డే, టి-20 కెప్టెన్ ఇయాన్ మోర్గాన్, బంగ్లాదేశ్ స్టార్ ఆల్‌రౌండర్ షకీబ్ అల్ హసన్ వంటి హేమాహేమీలు టీసీఎల్‌లో ప్రేక్షకులను అలరించడానికి సిద్ధంగా ఉన్నారు. యుఏఈలో చారిత్రక నేపథ్యం కలిగిన షార్జా క్రికెట్ స్టేడియం ఈ పోటీలకు ఆతిథ్యమిస్తుంది. క్రికెట్ విలువలకు వినోదపు సొబగులను కూడా అద్దే టి-10 క్రికెట్ టోర్నమెంట్‌కు టైటిల్ స్పాన్సర్‌గా ఉండడం ఎంతో ఆనందంగా ఉందని హీరా గ్రూప్ వ్యవస్థాపకుడు, చీఫ్ ఎగ్జిక్యూటివ్ డాక్టర్ నౌహెర షేఖ్ అన్నారు. ఒక వ్యాపర సంస్థగా ఎప్పుడూ వినూత్నమైన ఆలోచనలకు మద్దతునిస్తామని, అది తమ వ్యాపార విధానమని ఆయన పేర్కొన్నారు. టి-10 ఫార్మాట్ గురించి విన్న తర్వాత, దానిపై తన బృందంతో కలిసి చర్చించామని, ఫుట్‌బాల్, హాకీ మాదిరిగానే 90 నిమిషాల నిడివిగల క్రికెట్ మ్యాచ్‌లకు విశేష స్పందన వస్తుందన్న నమ్మకం తమకు కుదిరిందని తెలిపారు.

టి-10 ఫార్మాట్‌కు రూపకల్పన చేసి, టీసీఎల్‌కు చైర్మన్‌గా వ్యవహరిస్తున్న యూఏఈ క్రికెట్ బోర్డు సభ్యుడు షాజీ ఉల్ ముల్క్ కూడా టోర్నమెంట్ విజయవంతమవుతుందని ధీమా వ్యక్తేశారు. కాలంతోపాటు మారాల్సిన అవసరం ఉందని ఆయన స్పష్టం చేశారు. క్రికెట్ అభిమానులకు ఇంత కంటే మంచి వినోదాన్ని అందించలేమని వ్యాఖ్యానించారు. కొన్ని నెలల పాటు విస్తృతంగా చర్చించి, ఎన్నో అంశాలను పరిగణలోకి తీసుకున్న తర్వాత టీసీఎల్ నిర్వహణపై ఒక అవగాహనకు వచ్చినట్టు చెప్పారు. వినోదం కేవలం మైదానికే పరిమితం కాకుండా, మైదానం వెలుపల కూడా నాలుగు రోజుల పాటు ఒక ఉత్సవంగా కొనసాగే టీసీఎల్‌ను యుఏఈ క్రికెట్ బోర్డు ఆధ్వర్యంలో జరుగుతుంది. అంతర్జాతీయ క్రికెట్ మండలి (ఐసీసీ) ఇప్పటికే దీనికి అనుమతినిచ్చింది. టోర్నమెంట్‌లో ప్రతి జట్టు ప్రవేశం ఒక అద్భుత నేపథ్యంలో ప్రారంభమవుతుంది. సినీ తారలు, ఆటగాళ్లు కనువిందు చేస్తారు. కళా ప్రదర్శనలు అభిమానులను మంత్ర ముగ్ధులను చేయడం ఖాయం. ఈ కార్యక్రమంలో డబ్ల్యూడబ్ల్యూఈ రెజ్లింగ్ ఐకాన్ 'ది గ్రేట్' ఖలీ, హీరా గ్రూప్ సభ్యులు కూడా పాల్గొన్నారు.



యూఏఈలో ఈనెల 14 నుంచి 17 వరకు జరిగే టి-10 క్రికెట్ లీగ్ (టీసీఎల్) టోర్నమెంట్ వివరాలను ఆదివారం హైదరాబాద్‌లో జరిగిన ఒక కార్యక్రమంలో ప్రకటిస్తున్న స్టార్ రెజ్లర్ 'ది గ్రేట్' ఖలీ, హీరా గ్రూప్ సంస్థ వ్యవస్థాపకుడు, చీఫ్ ఎగ్జిక్యూటివ్ అధికారి డాక్టర్ నౌహెర షేక్, టోర్నీ చైర్మన్ షాజీ ఉల్ ముల్క్ తదితరులు

**ఇండోర్ ఆర్చరీ వరల్డ్ కప్‌లో**

## దీపికకు కాంస్యం

బ్యాంకాక్, డిసెంబర్ 3: ఇండోర్ ఆర్చరీ వరల్డ్ కప్ స్టేజ్-2లో భాగంగా మహిళల రికర్వ్ విభాగంలో భారత ఆర్చర్ దీపిక కుమారి కాంస్య పతకం సాధించింది. మూడో స్థానానికి జరిగిన పోటీలో ఆమె రష్యాకు చెందిన సయానా సిరెపిలొవాను 7-3 తేడాతో చిత్తుచేసింది. మిగతా ఆర్చర్లు విఫలం కావడంతో, భారత్ ఈ ఒక్క పతకంతోనే సరిపుచ్చుకోవాల్సి వచ్చింది.

## అండర్-19 కెప్టెన్‌గా పృథ్వీ షా

న్యూఢిల్లీ, డిసెంబర్ 3: వచ్చే ఏడాది న్యూజిలాండ్‌లో జరిగే అండర్-19 క్రికెట్ ప్రపంచ కప్ చాంపియన్‌షిప్‌లో పాల్గొనే భారత జట్టుకు సంచలన ఆటగాడు పృథ్వీ షా నాయకత్వం వహించనున్నాడు. 16 మంది సభ్యులతో కూడిన జట్టును జాతీయ జూనియర్ సెలక్షన్ కమిటీ ఎంపిక చేసిందని భారత క్రికెట్ నియంత్రణ బోర్డు (బీసీసీఐ) ఆదివారం విడుదల చేసిన ఒక ప్రకటనలో తెలిపింది. ఈ టోర్నమెంట్ జనవరి 13 నుంచి ఫిబ్రవరి 3వ తేదీ వరకు జరుగుతుందని ఆ ప్రకటనలో పేర్కొంది. ఇప్పటి వరకూ మూడు పర్యాయాలు ఈ టోర్నమెంట్‌ను కైవసం చేసుకున్న భారత్ నాలుగోసారి విజేతగా నిలిచేందుకు శ్రమించనుంది. ఆస్ట్రేలియా కూడా భారత్‌తో సమానంగా మూడు సార్లు అండర్-19 వరల్డ్ కప్‌ను గెల్చుకుంది.

## నిలకడ లేకుంటే కష్టమే

### హాకీ వరల్డ్ లీగ్‌లో నేడు జర్మనీతో భారత్ మ్యాచ్

భువనేశ్వర్, డిసెంబర్ 3: హాకీ వరల్డ్ లీగ్ ఫైనల్ టోర్నమెంట్‌లో భాగంగా రియో ఒలింపిక్స్ కాంస్య పతక విజేత జర్మనీని ఢీ కొంటున్న భారత్ కొన్ని జాగ్రత్తలు తీసుకోవాల్సిన అవసరం ఉంది. నిలకడ లేకపోతే, సమస్యలు తప్పవని స్పష్టం కావడంతో, జరిగిన పొరపాట్లు పునరావృతం కాకుండా చూసుకోవాలి. డిఫెండింగ్ చాంపియన్, విశ్వ విజేత ఆస్ట్రేలియాతో జరిగిన మ్యాచ్‌ని డ్రా చేసుకున్నప్పటికీ, తర్వాతి మ్యాచ్‌ని ఇంగ్లాండ్ చేతిలో 2-3 తేడాతో ఓటమిపాలైన విషయం తెలిసిందే. సోమవారం జర్మనీతో జరిగే మ్యాచ్ కోసం అన్ని జాగ్రత్తలతో భారత్ సిద్ధం కావాల్సి ఉంది. పొరపాట్లు పునరావృతమైతే మరోసారి పరాభవం తప్పదు.

### స్పెయిన్ చిత్తు

బెల్జియంతో జరిగిన గ్రూప్ మ్యాచ్‌లో స్పెయిన్ చిత్తయింది. బెల్జియం ఐదు గోల్స్ సాధించగా, స్పెయిన్ ఒక్క గోల్ కూడా చేయలేకపోయింది. నెదర్లాండ్స్, అర్జెంటీనా మధ్య జరిగిన మ్యాచ్ డ్రాగా ముగిసింది. ఇరు జట్లు చెరి మూడు గోల్స్ సాధించాయి.




Printed and Published from Vijayawada by K.Sudhakar on behalf of Deccan Chronicle Holdings Limited at Deccan Chronicle Holdings Press, No.C 3 & 4, Patamata, Industrial Estate, Vijayawada. Chief Editor T.V.Ravi Reddy, Phones:2555284,2555185,2555287 Regd. No.AP/VJA/41/51/2000. RNI Registration No.52743/90

ఆంధ్రభూమి

సాహితి

సోమవారం
4 డిసెంబర్ 2017

email:
sahiti@andhrabhoomi.net

# పద్యానికి పాలకడలి.. ముళ్లపూడి

"శ్రీలు పొంగునట్టి పాలకడలి బిడ్డ
తెలుగు గడ్డ మనకు వెలుగు గడ్డ
అఖిల భారతాంబ కందాల వీణరా
తెలివి కలిగి మెలగు తెలుగు బిడ్డా"

– అంటూ తెలుగు నేల ఔన్నత్యాన్ని చిన్ని ఆటవెలది పద్యంలో ఎలుగెత్తి చెప్పిన కవి శ్రీ ముళ్ళపూడి సచ్చిదానంద మూర్తిగారు. ప్రపంచ తెలుగు మహాసభల పుణ్యమా అని ప్రభుత్వమూ, ప్రపంచమూ 'తెలుగు తెలుగు తెలుగే తెలుగు, తెలుగో తెలుగు' అంటూ జపం చేస్తున్నాయి. మన తెలుగు వైభవం తేజరిల్లాలి, తెలంగాణ సాహిత్య వైభవం తెలియచెప్పాలి అని తహతహలాడుతున్న వేళ, తెలంగాణ ప్రాంతంలో సుమారు 50 సంవత్సరాల పాటు తన సాహిత్య పరిమళాలతో ప్రజను నిద్రలేపిన కవి ముళ్ళపూడి సచ్చిదానందమూర్తిగారు. ఈనాడు తెలుగు మహాసభల సందర్భమూ, డిసెంబర్ 2న వారి వర్ధంతి కూడా కావటాన మరోసారి వారిని, వారి సాహిత్యాన్నీ స్మరించుకునే ప్రయత్నం ఈ చిన్న వ్యాసం.

1929 సెప్టెంబర్ 29, భాద్రపద అమావాస్యనాడు కృష్ణా జిల్లాలోని పెదముక్తేవిలో జన్మించారు వీరు. ముళ్ళపూడి అన్నపూర్ణమ్మ, లక్ష్మీ నరసింహంగారలు వీరి తల్లిదండ్రులు. ఆర్థికంగా చాలా ఇబ్బందులనుభవించిన కుటుంబం వీరిది. కానీ, ఆ భౌతిక దారిద్ర్యం వీరి మనసులకి అంటుకోలేదు. ఇంటికి వచ్చిన వారిని అన్నం తినకుండా పంపేవారు కాదట వీరి తల్లి, సార్థక నామధేయురాలు అన్నపూర్ణమ్మ. వీరి హైస్కూల్ విద్య పెదముక్తేవిలోనే సాగింది. ఆ తరువాత చిన్న ఉద్యోగం చేస్తూ ప్రైవేటుగా చదువుకున్నారు. వివిధ కారణాంతరాలవల్ల తెలంగాణ ప్రాంతానికి వచ్చి స్థిరపడిపోయినారు. మోమిన్‌పేటలోని ప్రభుత్వ పాఠశాలలో ఉపాధ్యాయునిగా వృత్తి జీవితం మొదలుపెట్టిన వీరు శంషాబాద్, మానుకోట, నారాయణ్‌ఖేడ్, సంగారెడ్డి, నల్లగొండలలో తమ విధిని నిర్వర్తిస్తూ, చివరికి సంగారెడ్డిలోనే స్థిరపడినారు. స్వభావరీత్యా హాస్యశీలి, చతురులు. మామూలు సంభాషణల్లోనూ తమ చతురతతో నవ్విస్తూండేవారు. ఈ చతురత మనకి వారి రచనల్లోనూ వ్యక్తమవుతుంది.

బాల్యంలో పెదముక్తేవిలోని ముముక్షుజన మహాపీఠంతో వీరి కుటుంబానికి ఉన్న సాన్నిహిత్యం, కుటుంబంలో సమాజంపట్ల ఉన్న సహాయానుభూతి, సంస్కారం, అంతర్లీనంగా ఉన్న ఆధ్యాత్మికత, వేదాంత దేశికుల శిష్యరికం, అనుభవించిన ఆర్థిక దారిద్ర్యం వీరి వ్యక్తిత్వాన్ని చెక్కాయని చెప్పవచ్చు. ఎంతటి ఇబ్బందికర పరిస్థితుల్లో ఉన్నప్పటికీ ఈ లౌకిక బాధలేవీ ఎవరికీ తెలియనిచ్చేవారు కాదు. అందరి యోగక్షేమాలు తెలుసుకుని ఆదరించటం, ఆదుకోవడం చాలా 'సహజంగా' చేసేవారు. ఇప్పటికీ ఎంతోమంది వారి విద్యార్థులమనీ, ఈ స్థితిలో ఉండడానికి కారణం వారేననీ చెప్తూంటారు. స్వర్గీయ శేషేంద్ర గారన్నట్లు "మార్దవానికి సొంత ఊరు, మాధుర్యానికి తేనెపట్టు, సత్యనిష్ఠురతకు శరణాలయము" వీరి వ్యక్తిత్వం.

> **ఈనాటి పౌరులకు ఉద్బోధ చేస్తూనే, చిన్న చిన్న ఆటవెలది పద్యాలలో ఈనాటి సమాజంమీద, రాజకీయవేత్తలమీద, అవినీతిపరులమీద అధిక్షేపంతో కూడిన వ్యంగ్యోక్తులు విసిరారు. శేషేంద్ర గారన్నట్లు "మార్దవానికి సొంత ఊరు, మాధుర్యానికి తేనెపట్టు, సత్యనిష్ఠురతకు శరణాలయము" ముళ్లపూడివారి వ్యక్తిత్వం.**

పెదముక్తేవి శ్రీ కృష్ణాశ్రమ రెండవ గురువుగారైన శ్రీ సీతారామ యతీంద్రులవారితో కలిసి ఆటల్లోలా ఆశువుగా పద్యాలు చెప్పటంతోనే వీరి కవిత్వం మొదలైందని చెప్పవచ్చు. శ్రీ మూర్తిగారు, శ్రీ లక్ష్మణదాసుగారు, శ్రీ సీతారామ యతీంద్రులవారు కలిసి తమని తాము 'సచ్చిదానంద లక్ష్మణస్వామి' కవులుగా, కవిత్రయంగా పేర్కొంటూ పిన్నలను, పెద్దలను తమ పద్యాలతో ఆనందింపజేసేవారు. అలా.. మొదలైన వీరి సాహితీ ప్రస్థానం తన మనసులోని ప్రతి భావాన్నీ కావ్య రూపంలోనో, కథారూపంలోనో వ్యక్తం చేసేవరకూ వచ్చింది. వీరు వృత్తిరీత్యా అనేక ప్రదేశాలు మారుతూ వచ్చారు. ఎక్కడ జీవిస్తే అక్కడి సంస్కృతిని జీర్ణింపచేసుకొని, దానికి అనువుగా జీవితం సాగించారు. ఆయా ప్రాంతాలలో కొలువైన దేవీదేవతల పేరుమీద శతకాలు వెలయించారు కూడా. శంషాబాద్‌లో ఉండగా 'వెండికొండ పావురాలు', నల్లగొండలో ఉండగా 'యాదగిరి పారిజాతం', మానుకోటలో ఉన్నప్పుడు 'కురవి వీరభద్ర శతకం', 'పనిమనిషి కథల సంపుటి', చివరగా సంగారెడ్డిలో 'భవానీ సంస్తుతి', 'మూర్తిగారి మాట', వచన కవితా సంపుటి 'మహాభియానం', సాహిత్య విమర్శకు కరదీపికగా 'సుహృల్లేఖల సంగీత సాహిత్య సంచారిణీ' వంటి గ్రంథాలను రచించారు. వీరి తొలి ముద్రిత రచన 'తెలుగుబిడ్డ' శతకం 1964లో వెలువడింది. తిరిగి 2006లో ద్వితీయ ముద్రణ పొందింది. "ఒక తెలుగు పిల్లవాడు నా దగ్గరికి వస్తే నేను ఏమి చెబుతాను?" అని ప్రశ్నించుకొని వ్రాసినది అని వారే చెప్పుకొన్నారు. ఆటవెలదిలో రచించిన తెలుగు బిడ్డను గురించి చెప్తూ– 'అక్షరాస్యులైన తెలుగుబిడ్డలందరూ ఆనందించాలనే ఆకాంక్షతో, వారికే నా భావాలను ప్రత్యక్షము చేయాలనే ఆవేదనతో ఆటవెలది నొకతెను పిలుచుకొని తెలుగు సోదరుల యెదుట ఆడించాను, పాడించాను" అంటారీ కవి. 132 పద్యాలతో, 'తెలివి కలిగి మెలగు తెలుగుబిడ్డ' అనే మకుటంతో ఉన్నది ఈ శతకం. ఒక పద్య కావ్యం అని చెప్పవచ్చు. తెలుగు బిడ్డల్ని – "పాలమీద నురగ పసిపాప రావయ్య / కొట్టనయ్య నిన్ను తిట్టనయ్య / పంచదార కలిపి పాఠాలు చెప్పెద"నంటూ పిలిచారు. ప్రపంచ తెలుగు మహాసభలకు మన రాష్ట్రం సమాయత్తమవుతున్న ఈ సందర్భంగా ఈ 'తెలుగుబిడ్డ' శతకాన్ని ఒకసారి అవలోకిద్దాం.

తెలుగు గడ్డను ప్రశంసించటంతో మొదలైన ఈ శతకంలో వీరు మొదట మాతృభూమికి వందనం చేస్తూ, తానెవరు? ఎలా ఎవరికి, ఏమి చెప్పాలనుకుంటున్నారో నాలుగు చిన్న పద్యాలతో చెప్పారు. మాతృదేశ కీర్తనతో ప్రారంభమైన ఈ శతకంలో సమాజ రీతులు, నీతులు, మారిన మారుతున్న సంస్కృతులూ, విషప్రభావాలు, రాజకీయాలు, మానవ మనస్తత్వాల చిత్ర విచిత్ర గతులూ.. ఈవిధంగా సాగిపోతుంది.

**"మాతృదేవిపైన – మాతృభూదేవిపై
మాతృభాష ఎడల – మమత పెంచు
కన్నవారలన్న – మిన్న స్వర్గము కన్న"** అంటూ ఈ తెలివిని (గ్రహింపు) కలిగి ఉండమని 'జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ' అనే రామాయణ సూక్తిని తేటయైన తెలుగులో అందించారు. ఈ సూక్తిని తెలియజేస్తూనే–

**'రమణి భారతాంబ – రత్నగర్భయనెడి
పేరు మోసెనిపుడు బీదరాలు
ఎంతమంది దొంగ లీయిల్లు దోచిరో'** అంటూ బాధపడతారీయన. ఈ బాధను వ్యక్తం చేస్తూనే తన మనసులోని ఆవేదన–

**"కన్న నేలపైకి కాల్దువ్వు దుష్టుల / గత్తికొక్క కండ గాగ తరిగి /కాకి మూక కేసి కడుగుకో చేతులు"** అంటూ శత్రు సంహారమే కాని, శిక్షలతో సరికాదని ఉద్బోధించారు. తెలుగు బిడ్డల్లో ధైర్యాన్ని నింపారు. మరో పద్యంలో వక్రీకరింపబడిన మన చరిత్ర, చరిత్ర పాఠాల్లో దర్శనమిస్తున్న వైనాన్ని–

**"ఆర్యులనుచు కొందరార్యేతరులంచు
కట్టుకథల గోడ – కట్టిరెవరో
ఇట్లు మనల చీల్చి – ఇల్లెల్ల దోచిరి"** అంటూ ఆందోళన చెందారు. అందుకే–

**భరత ఖండమనెడి బంగారు మేడలో
గదులు పది పదేను – గలవు గాని
ఉన్న వారలందరొక కుటుంబమువారె"**– తెలివి కలిగి మెలగుమని ఉద్బోధించారు. విడి విడి గదులలో ఉన్నంత మాత్రాన విడి కుటుంబాలు కావని, కాకూడదని, తెలివి కలిగి మసలుకోమని హెచ్చరించారు. ఇలా ఈనాటి పౌరులకు ఉద్బోధ చేస్తూనే, చిన్న చిన్న ఆటవెలది పద్యాలలో ఈనాటి సమాజంమీద, రాజకీయవేత్తలమీద, అవినీతిపరులమీద అధిక్షేపంతో కూడిన వ్యంగ్యోక్తులు విసిరారు. అందుకే శ్రీ గిడుగు వేంకట సీతాపతిగారు– దీన్ని గురించి చెప్తూ "ఈ శతకములోని పద్యములు బొత్తిగా చిన్న పిల్లలకు గాక కాస్త చదువు నేర్చిన బాల బాలికలకు సులువుగా బోధపడగలవు. అందులో గల భావము, హాస్యము, ధ్వని వారు తెలుసుకోగలరు" అన్నారు. ఈ పద్యం చూడండి.

**"గద్దెమీదనున్న గార్దభములనైన
పొట్టకొరకు జనులు పొగడుచుండ్రు
వేశ్య జాతి కంటె విలువేమి వారికి"**

అంటూ ఈనాటి సమాజంలో భట్రాజుల పొగడ్తలను, వాటితో పొద్దుపుచ్చేవారిని వేశ్యలతో పోల్చారు. పొగడ్తలంటే అంత అసహ్యం మరి. రాజకీయాలు, రాజకీయుల గుర్తించి చెప్తూ–

**"నమ్మబల్కవలయు– నమ్మరాదెవరిని
తండ్రిగాని – కన్నతల్లిగాని
ప్రథమ సూత్రమిద్ది రాజకీయాలలో"** – ఈనాటి రాజకీయాలను కళ్ళకు కట్టినట్లే ఉంది కదూ అలాగే–

**"నేను రాజునగుదు – నీవు మంత్రివగుము
ప్రథమ పురుష మనకు బంటులనెడి"**– వింత స్వార్థం మెలిసింది అంటారు. నేటి స్వార్థపూరిత రాజకీయాలకు ప్రతీక ఈ పద్యం. సామ్యవాదం అంటూ ప్రజలను మభ్యపెట్టు సోషలిస్టులను గూర్చి, సోషలిజం గూర్చి కవి అభిప్రాయాలను చూడండి.

**"ఉన్నవాడు పెరిగె ఊరంత పొట్టతో
గంజి లేక నేల కఱచె నొకడు
సోషలిజము కంఠశోషాయె నిజముగా"** – అంటూ సమాజంలో కనిపిస్తున్న సత్యాన్ని పద్యంలో మన కళ్ళముందు నిలబెట్టారు. 'కవయః క్రాంత దర్శినః' అంటారు. నేటి విశ్వవిద్యాలయాల తీరును 1960ల్లోనే ఎండగట్టారు వీరు– **"విద్యలేదు విశ్వవిద్యాలయాలలో / నేతి బీరలోన నేయి లేదు / పేరు గొప్ప గాని యూరేమొ దిబ్బరా"** అంటూ, **'కవుల వ్రాతలెల్ల కాలానికెరుకరా'** అంటూ ఆ మాటని నిజం చేసుకున్నారు.

**"లోకమందు తిరిగి లోక ధోరణి చూడు
పుస్తకాలు చదువ – బోధపడదు"** అంటూ అసలైన విద్యను లోకము కాలమే నేర్పగలవు, జీవన గమనంలో మనల్ని మనం వెతుక్కుంటూ వెళ్ళడమే అసలైన విద్య అని చెప్పకనే చెప్పారు. ఇదే బ్రహ్మచర్యాశ్రమము– దేశ సంచారము. ఆ తరువాతే స్నాతకోత్సవం. నేటి సమాజంలో వేళ్ళూనుకున్న అసమానతలను వెక్కిరిస్తూ– కులమువల్ల పోయేదీ, వచ్చేదీ ఏదీ లేదని తెలుసుకొమ్మని హితవు పలికారు.

**"ఎట్టి కులమునందు – పుట్టిననేమాయె
బుద్ధి వలయు నాత్మశుద్ధి వలయు
నందనారు శివుని– ముందుగా జేరడా"** అంటూ కులములోని హెచ్చు తగ్గులు దేనికీ కారణాలు కావని, "గుణము బట్టి ధరణి–కులము లేర్పడు"నని తెలిపినారు.



ఈనాటి వ్యవస్థలో మనకి కనిపిస్తున్న మరొక పెద్ద లోపం– విద్యావ్యవస్థది. ఈమధ్య ఒక కవి 'గురుదోషం పట్టింది మన సమాజానికి' అన్నారు. అలా– అసలు గురువంటే– "తనదు బ్రతుకు మాట– తలపెట్టకెపుడును / జాలి బ్రతుకు నిలుపు జ్యోతి గురువు / వాని గానకున్న బ్రతుకంధకారమె" అంటూ చెప్పిన పద్యం భ్రష్టుపట్టిన విద్యా వ్యవస్థలోని గురువులకి, నిజమైన గురువుమీద ఏ మాత్రం గౌరవముందని విద్యార్థులకి అందరికీ చురకయే.

ఈ విధంగా సాగిపోయిన ఈ 'తెలుగుబిడ్డ' శతకాన్ని స్థూలంగా పరిశీలిస్తే వ్యష్ఠి నుండి సమిష్టికి, పరమేష్ఠి వరకు ఎదిగిన తీరు గోచరమవుతుంది. **"ఆటపాటలన్న ఆసక్తి గద నీకు / ప్రేమతోడ నిపుడు పిలిచినాను / ఆటవెలదితోనే ఆడింతు పాడింతు"** అంటూ మొదలుపెట్టి, లోకమంతా తిప్పి చూపి– చివరికి,

**"అన్ని బలములుండి ఏమాయె కర్ణుండు
దైవబలము లేక ధరను గూలె
బలములందు దైవబలమది గొప్పరా"** అంటూ నిష్కామ కర్మ చేయమనే గీతాసారంతో శతకాన్ని ముగించారు.

"పద్యాల మనుగడకే ముళ్ళబాటలేర్పడినపుడు మల్లెబాటలు కల్పించారు శ్రీ మూర్తిగారు" అన్న జివియస్ గారి వాక్కులు అక్షర సత్యాలు. వారి మాటల్లోనే–

"తెలుగు భాష నాది – తెలుగువాడను నేను" అని గర్విద్దాం. తెలుగు గడ్డను 'అఖిల భారతాంబ కందాల వీణను' మోగిద్దాం.

**– ఆర్. సరిత, 9032220412**

---

## జంట పక్షులమై..

మన మాటల చూపులు
మొదటిసారి కలిసినప్పుడే
నీ రెక్కల్ని చూశాను
ముడుచుకుని
భయంభయంగా సర్దుకుంటూండగా
అస్తిత్వాన్ని దాచుకోలేక
సంకోచంగా అటూ ఇటూ కదులుతుండగా..

ఎగిరే వాంఛని
ఈకలుగా మొలిపించుకొన్న రెక్కలు
ఎంతందమైనవి!
ఎంత శక్తి దాగుంది వాటిలో!

ప్రియమైన పాలపిట్టా
సందేహించకు
రెక్కల్ని విప్పారనివ్వు

చిటికెన వేలు పట్టుకుని నేనొచ్చింది
నీ రెక్కల్ని కత్తిరించడానిక్కాదు
నీతో కలిసి ఎగరడానికి.

**– నవీన్‌కుమార్
9951979399**

---

## ఎగిరెళ్లిపోవాలి

ఎగిరెళ్లిపోవాలి
అప్పుడప్పుడూ.. వున్నచోటునుండి.

చెట్టుమీంచి
పక్షులు ఎగిరెళ్లిపోయినంత
నిశ్శబ్దంగా
గాలికి మబ్బు దొంతరలు
దొర్లిపోయినంత
అలవోకగా ఏటివాలులో
పడవ ప్రయాణిస్తున్నంత
సునాయాసంగా ఎగిరెళ్లిపోవాలి
వున్నచోటనే వుండి
చుట్టూ పరికిస్తే ఏముంది?
భూమి పళ్లెరం మీద
ఆకాశం గాజు గిన్నెను
ఎవరో బోర్లించినట్టే వుంటుంది
దానికింద గాలాడని గాజు ఈగల్లా
నువ్వూ నేనూ
ఎగిరెళ్లిపోవాలి అప్పుడప్పుడూ
చూపుకే అందనంత
సుదూర తీరాలకు
వాయువేగాన్ని మించిన మనోవేగంతో
బంగారు వర్ణపు సన్నని కమ్మచ్చు
కిరణాల ఎండ పొడలో
సూర్యస్నానం చేస్తూ ఎగిరెళ్లిపోవాలి!
ఆకాశాన్ని నీలిరంగు బెలూన్ని చేసి
దీర్ఘ శ్వాసి ఎవడో
అదేపనిగా వూదుతున్నట్టు
గుండెలనిండా
ఆత్మవిశ్వాసపు శాసతో ఎగిరెళ్లిపోవాలి!
అరక దున్నిన
నల్లరేగడి మడి చెక్కలో
కురిసిన తొలగరి జల్లుకు
ఎగసిన భూ సుగంధాన్ని
ముక్కుపుటాలనిండా ఆఘ్రాణిస్తూ
ఎగిరెళ్లిపోవాలి అప్పుడప్పుడూ.

***

ఎప్పటినుండి ఈదుతోందో
బుల్లి బాతుపిల్ల
సరస్సును అదే పనిగా
చిన్ని తెడ్లలాంటి
ఆ ఎర్రని కలువరేకుల పాదాలను చూసి
చెరువు
తన విశాల వర్తులాకారపు విస్తీర్ణాన్ని
చిన్నకుంటగా దగ్గరకు తీసుకుంది
అడవికే ఆలివ్ గ్రీన్ దుస్తులు తొడిగిన



అన్నల ప్లీనరీ సమావేశంలా
కొండ చరియ పక్క
కొలనులో గుమిగూడిన
ఈ ఎర్రకలువల
రహస్య మంతనాలేమిటో!

ఎప్పట్నుంచి వేటాడుతోందో
ఎన్ని చేపపిల్లల్ని ఆరగించిందో
ఇక చాలనుకుందో ఏమో
దొరువు ప్రక్కన
సిమెంటు స్తంభం మీద
ఎగరడానికి సిద్ధంగా వున్న
గరుత్మంతునిలా
రెక్కలను నల్లని గొడుగుల్లా విప్పదీసి
ఎండకు ఆరబెట్టుకుంటుందో
చిలకబాతు –
గొప్ప దేహ చింతతో
కొండంత దుఃఖాన్ని
గుండెల్లోనే దిగమింగుకున్నట్టు
రాత్రంతా గుట్టమీద కురిసిన
ధారాపాత వర్షం
తెల్లారేసరికి గుట్ట దిగువన
దిగులు మడుగు కట్టింది.
ఏటవాలు ఎదురు వానజల్లుకు
మట్టిలో కట్టిన మదురుగోడ
తడిసి కాసింత మెత్తబడ్డట్టు
మనసూ మెత్తబడింది.

అక్కడితో
ఎగిరివచ్చిన పని పూర్తయింది.

**– శిఖామణి, 9848202526**

---

## ఈ నేల

తెల్లని మల్లెల సువాసనలందించింది
పచ్చని చేమంతుల పూబంతుల
అందాలను పంచింది
గులాబీ పరిమళాల గుబాళించింది
పత్రహరితం నింపి చెట్ల ఆకుల నీడనిచ్చింది
అందమంటే తెలిపింది ఆనందమంటే తెలిపింది

పంచవెన్నెల రామచిలుకలు
తీయని పాటల కోయిలమ్మలు
వేకువ కువకువల పిచ్చుకలు,
మేల్కొలిపే కొక్కరలు
నింగినెగిరే సోయగమై పరవశ భావ
పరంపరలందించింది
కుంటలు, చెరువుల చల్లదనాలు
గలగల పారే నదీనదాలు
ఉత్తుంగతరంగ ఉల్లాసోల్లాసాలు
అనంతసాగరంపై మనోవిహంగపు



నవ భావనై మురిపించింది

ద్వైతాద్వైత మనోగతాల పరిచయాలు
విశిష్టాద్వైత, వివిధ మత మానవ
సమ్మిళిత సంఘాలు
ప్రజాతీర్పుల మానవహిత సంబంధ
బాంధవ్యాలు
జనన మరణాల జాగరూకతలు నేర్పింది

వర్ణ వైషమ్యాలొద్దని
వర్ణ విభేదాలుండొద్దని, జాతి వివక్ష కూడదని
వయో పరిపక్వత వంటి
వర్ణ సమన్వయం నేర్పింది
భావ సమన్వయమంటి
వర్ణ సముచ్చయాన్నిచ్చింది
ఈ నేల విజ్ఞానం
ఈ నేల వైకల్ప కల్పిత సాంగత్యం
ఈ నేల నాది, ఈ నేల నీది
ఆకాశంలో ఒంటరి కాదు గుంపులో పిడికిలి!
సంగీత శాస్త్రాల, జానపద వరాల
గొంతెత్తు గీతం
అందులో ప్రతి స్వరం నేనే
అందులో ప్రతి అక్షరం నేనే
నా దేశం భారతదేశం
నా దేశం భవ్య సందేశం

**– కొండపల్లి నీహారిణి
9866360082**

---

# నడివయసు ప్రణయ కాంక్ష- నడచివచ్చిన సదవకాశం

'పెళ్లాముతో కాపురము చేసేటప్పుడు ఆయన ఒక్క రోజు భార్యతో కలిసిమెలిసి లేడు. ఎప్పుడూ పెళ్లాన్ని కొట్టడమో, తిట్టడమో! అంతేకాని చిలకా గోరువంకలాగా వుండేవాళ్లుకారు. ఏమో అన్యోన్యము లేదని చెప్పితే వాళ్లకిద్దరు పిల్లలు ఎలా కలిగారు? అదో గాలిపాటు!

ఇలాంటి దంపతులు ఎందరో వుంటారు. సంసారంలో సామరస్యం లేకపోయినా దైహిక అవసరాలకోసం కాపురాలు నడుస్తూ వుంటాయి. ఇలాంటి భర్త ఒకాయనకు ముప్ఫై రెండో ఏట భార్య పోయింది. అప్పుడే మూడేళ్ళు గడిచిపోయాయి. ఇప్పుడు పెద్దవాడికి పన్నెండు సంవత్సరాలు, రెండో పిల్లవాడికి తొమ్మిది సంవత్సరాలు.

శ్రీ చింతా దీక్షితులుగారి కథ 'రైలు బండిలో ప్రేమ' అనే కథానికలో యిదీ వాతావరణం. దీక్షితులుగారి పేరు తలుచుకోగానే– 'కటీరావు కథలు' గుర్తుకు వస్తాయి. బాల సాహిత్యంలో పాటలు వెనకటికి వస్తాయి. బాల వాఙ్మయ బ్రహ్మ, కథక చక్రవర్తి వంటి బిరుదులు సంతరించుకున్న వీరు ఆధునిక కథా సాహిత్యం తెలుగులో 1910లో ప్రారంభం అయింది అనుకుంటే– తరువాత దశాబ్దంలో విరివిగా రచనలు చేసి ప్రజాదరణ పొందారు. వీరి 'లక్క పిడతలు' కేవలం గేయమే క ఆదు, కథలు కూడా అటువంటివే. womens emancipation స్త్రీజనోద్ధరణను ప్రయోగంగా కథలు వ్రాసినారు. స్త్ర విషయంలో 'చలం' దారి వేరు, వీరి దారి వేరు. చలం– మునిమాణ్యం– దీక్షితులు వీరు ముగ్గురూ స్త్రీ హృదయాన్ని అర్థం చేసుకుని పల్లవించిన పథాలు మూడు దారులలో నడుస్తాయి. అప్పటి సాంఘిక ప్రతిపత్తిని దృష్టిలో ఉంచుకుని వీటిని సమీకరణం చేయవలసి వుంటుంది. కథలోనికి వస్తే, ఆ నడి వయసు మనిషి 'ద్వితీయం' చేసుకోవలసిన స్థితిని బంధువులు ఆమోదించలేదు. 'అతనికి భూములున్నాయా, చదువులున్నాయా ఎవరైనా పిల్లను ఇవ్వటానికైనా!' అని రచయిత తాళం వేస్తారు. అయినా అటువంటి మనిషి రైలు ప్రయాణం చేస్తూ ఒక 'విశ్వస్య'ను చూచి ఆకర్షితుడవుతాడు. రైలు ప్రయాణంలో రకరకాల మనుషులు తారసపడతారు. వారిని రచయిత వర్ణించే పద్ధతి కూడా బహు యోగ్యంగా ఉంటుంది. 'సన్న గ్లాస్కో అద్దకపు చీర ధరించి, మోచేతులు దాటివచ్చు జాకెట్లు తొడిగి, రెండు పాళ్ల పిన్నులను గుచ్చి, సన్నని బంగారు గాజుల జత ముంజేతుల కలంకార మగునట్లు చేసి, నిష్కలంక వదన బింబముతో వెన్నారుతూ నవ నాగరికత విద్యార్థి తడవ తడవకూ వలపు క్రీగంటి చూపులు తన పైబడినవని యెరింగియు, ఎరగనట్లు భ్రమించజేయుతూ, కిరస్తానీ సోద




రీమణులను తలపునకు దెచ్చు నాగలీక ప్రౌఢ వితంతు వొకటి–

**ఇదీ వర్ణన**

ఈమె దృష్టిని ఆకర్షించడంకోసం అప్పారావు (కథకుకడి పిలిచే వ్యక్తి పేరు ఇది) పద్య పఠనం చేస్తాడు. రైలు పొడుగునా ఆమె చర్లన గమనిస్తూ వుంటాడు. ఆమె రాజమహేంద్రపురం స్టేషన్‌లో దిగిపోతూ వుండగా– తన టిక్కెట్టు ఏలూరు వరకూ వున్నా ఖాతరుచేయకుండా అప్పారావు కూడా రైలునుంచి అమాంతం కిందికి దిగిపోతాడు. ఆమె సామానుపెట్టె బయటకు తనే లాగి ప్లాట్‌ఫాంమీద కూలీని కూడా ఏర్పాటుచేస్తాడు.

ఆమెకు 'నాళంవారి సత్రానికి' బండి కట్టిస్తాడు. ఈ బండి ప్రయాణంలోనే ఆమెతో చనువుగా మాటాలడి ఆమె కథను అంతా తెలుసుకుంటాడు. 'తలుచుకుంటే దుఃఖం చేటు! నమ్ముతారో లేదో కాని సరిగ్గా అచ్చంగా మీ రూపమే. అది బతికి వుంటేఇన్ని పాట్లు నాకెందుకు సంభవిస్తాయి' అని నిట్టూరుస్తూ తన గోడు చెప్పుకుంటాడు. ఆమె తన వర్తమాన స్థితి తెలుసుకున్న తరువాత అతనికి కొంత ఊరట కలిగినట్లు అయింది. ఆమెను 'సుబ్బారాయుడు' అనేవాడు పెళ్లి చేసుకుంటానని, తీరా చివరి క్షణంలో అందుకు అనుకూలమయిన పరిస్థితులు లేవని ఆమెకు అయిదు రూపాయలు పంపి రాజమండ్రి వెళ్లమని ఉత్తరం వ్రాస్తాడు. అదీ ఆమె ఇక్కడకు రావడానికి కారణం. 'ఇక నన్ను చూసేవారెవరు? ఏకాకినై ఇలా తిరగవలసిందే.. నా బతుకు ఇలా అయిపోయింది' అంటూ ఆమె (నర్సాంబి ఆమె పేరు) విలపిస్తూ వుంటే, అప్పారావు ధైర్యం కూడగట్టుకుని 'మీరు విచారించకండి. ఏకాకిగా వుండవలసిన కర్మ ఏమిటి, నేను బతికి వుండగా! మీకు అభ్యంతరం లేకపోతే.. అంటాడు. తన చదువు, సాహిత్యం, వ్యాపారం చేయాలనే పూనిక ఎరుక పరుస్తాడు. అంత దుఃఖంలోనూ, నర్సాంబను నవ్వించి సత్రంలో ఒకే గదిలో ఉండి ఆమెతో వివాహ ఒప్పందం కుదుర్చుకుంటాడు. అప్పారావు మళ్లీ తన వూరు కాకినాడ వెళ్లి పిల్లవాళ్లకు తగు ఏర్పాట్లు చేసి వాళ్లను ఊరడించి తిరిగి రాజమండ్రి చేరుకున్నాడు. వాళ్ళు ముందుగా నిర్ణయించుకున్నట్లు, అప్పారావు-నర్సాంబలకు రాజమహేంద్రవరం తోటలో పెళ్లి జరిగింది. ఇద్దరు కొత్త దుస్తులు ధరించి 'మహదాశీర్వచనం' అందుకున్నారు. ఎలాగైతేనేమి వొక పెళ్లి జరిగినది. కాదు.. రెండు కుటుంబాలు నిలబడ్డవి అని కథను ముగింపు చేస్తాడు. వీరేశలింగంగారి ప్రసక్తి కథలో రాకపోయినా, వివాహం రాజమండ్రిలో జరగడం– అందుకు వితంతు పునర్వివాహం అవడంవల్ల ఈ కథకు వారి అభిప్రాయాల అనుకూలత, ఆచరణ స్పష్టం. సాంఘిక సంస్కణకు సాక్ష్యంగా నిలిచే కథ ఇది.

**– శ్రీవిరించి, 09444963584**

# సింధు నాగరికతలో ఓ ప్రేమకథ

28 -పులిగడ్డ విశ్వనాథరావు

''ఆమెకు పెళ్లి కాబోతోందా? ఎప్పుడు? అడిగాడు అజోడా ఏం తెలియనట్టు.

''ముహూర్తం నిశ్చయం కాలేదనుకుంటా'' అంది మాజా.

''ఇంకేం! పిలిపించవచ్చు కదా! ముహూర్తం నిశ్చయం అయ్యేలోగా ఆమె మన భవంతి అలంకరణ పూర్తిచేయగలుగుతుంది''.

తల్లిదండ్రులు ఒకరి మొహం ఒకరు చూసుకున్నారు. అతడి మాటల వలన అతడు తమ దారిలోకి వస్తున్నాడనే ఆశ కలిగింది.

''అలాగే! లీబోతో మాట్లాడాక నిర్ణయానికి రావడం వీలవుతుంది'' అన్నాడు హనోడా. అజోడా తన గదికి వెళ్లాడు.

హనోడా భార్యతో ''మోరీని కొద్దిరోజులు పనిలో పెట్టుకుంటే ఫర్వాలేదనుకుంటా. వీడు ఇంటిలో ప్రేమాయణం ఎలాగూ జరపలేడు కదా! దాంతోబాటు అది బంకో సంబంధాన్ని స్వీకరించకపోయినా తిరస్కరించలేదే. మనం ఒత్తిడి చేస్తే బంకోను చేసుకుంటుందేమో!'' అన్నాడు.

''మన అమ్మాయి సంతోషం కూడా ముఖ్యమే. మీరన్నట్టు మనింటిలో వాళ్లు ప్రేమ వ్యవహారం ఎలాగూ జరపలేరు. అందులోనూ మనం ఓ కన్ను వేసి ఉంచవచ్చు.''

''అందుకే లీబతో మాట్లాడి మోరీని పనిలోకి రప్పిస్తాను''.

''మోరీ పని చేపట్టిందంటే మన భవంతిని చూడడానికి రెండు కళ్ళు చాలవు. గోదా మురిసిపోతుంది.

ఆ రోజు మాగీర్ ఇంటిలో అజోడా మోరీని కలిశాడు.''

''ఏవండీ, మీరంత ఉల్లాసంగా ఉన్నారు? ఏదైనా శుభవార్తా?'' అడిగింది మోరీ.

''శుభవార్తే మోరీ. అక్క గోదా, బావా పిల్లలు కొండమీద ఉత్సవానికి వస్తున్నారు.''

''మీ సంతోషమే నా సంతోషం.''

''నీకు తెలుసా?''

''ఆమె చక్కగా పాడుతుంది, నృత్యం చేస్తుంది. దాంతోబాటు పరిసరాలు శుభ్రంగా, కళాత్మకంగా ఉండాలని కోరుతుంది. మా భవంతి ఈమధ్య కాంతిహీనంగా మారింది. ఆమెకు అది నచ్చదన్నది నిజం. అందుకు నువ్వే భవంతిని బాగుచేయగలవనే భావన నాకే కాదు అమ్మా నాన్నలకు కూడా కలిగింది. ఇదివరకు నియమించిన వ్యక్తికి కళాదృష్టి లేదని నేనే మాన్పించా.''

''నన్ను మరల పిలుస్తారా ఏమిటి?''

''తప్పకుండా పిలుస్తారు. నువ్వు మా అక్కను దగ్గరగా చూడగలుగుతావు''/

''అది సరే కాని అంత రాద్ధాంతం అయాక నన్ను పిలుస్తారా అని?''

''తప్పకుండా పిలుస్తారు. నాన్నగారు మీ నాన్నకి ఇవాళో రేపో నిన్ను పంపమని కబురు



చేయవచ్చు.

''మీరు రమ్మంటే రాక తప్పుతుందా, దొరగారు?''

''దీంట్లో నాకు మన ప్రయోజనం కనబడుతోంది. మన వివాహానికి అమ్మా నాన్నలని ఒప్పించమని నేను అక్కను వేడుకుంటా?''

''ఆమె ఒప్పుకుంటుందా?''

''ఆమెకు నేనంటే ప్రాణం. రెండోది నీ అపురూప సౌందర్యం, నృత్యగానం చూసిందంటే నాలాగే ఆమె కూడా నీకు అమ్ముడుపోతుందేమో''

''చాల్లెండి, మీ కబుర్లు. ఆమె స్త్రీ, మీరు పురుషులు''.

''నేను పురుషుడిని అని నువ్వు ఎలా చెప్పగలవు? మన పెళ్లి కాందే'' అన్నాడు అజోడా పరాచింగా.

''ఛీ పోండి మీరూ మీ కొంటె మాటలూను'' అని ఆమె అతడిని జడతో బుగ్గమీద సుతారంగా కొట్టింది.

''నన్ను కొట్టడానికేనా ఇవాళ జడ వేసుకొచ్చావు?'''' అని ఆమె బుగ్గల్ని పుణికి ఇలా అన్నాడు.

''సరే, నేను ఆమెను ఒత్తిడి చేస్తే ఆమె వాళ్ళను ఒప్పించగలదని నాకు ఆశ ఉంది. ఆ ప్రయత్నం కూడా చేయడంలో ఏ హానీ లేదు కదా!

''సరే, అలాగే దొరగారు. మీరెలా చెబితే అలా చేస్తా. మీ చేతిలో కీలుబొమ్మని కదా!''

''కీలుబొమ్మ కాదు, అపరంజి బొమ్మ''.

''మీ ఇల్లు బంగారంగారు.. నన్ను ఊపిరి తీసుకోనీండి..'' అంది ఆమె అతడి కబంధ హస్తాల నుంచి వేరవుతూ.

మర్నాడు కబురు అందగానే లీబో కూతురు మోరీకి కబురు చెప్పి ''ఇన్నాళ్ళ సెలవులకి కూడా నీకు జీతం ఇస్తారట. నువ్వు భవంతని వాళ్లకు నచ్చేలా ముస్తాబు చేస్తే పారితోషికం కూడా ఇవ్వవచ్చు'' అన్నాడు.

''ఆ పని అయిపోయాక నాకు శాశ్వత సెలవే కదా!''

''వాళ్ళు యజమానులు. వాళ్ళ సేవ చేయడం మన విధి. వాళ్ళు ఎన్నడూ మనకు అన్యాయం చేయరని నాకు నమ్మకం ఉంది''

''మరి నృత్యగాన పాఠశాలలో నా ఉద్యోగం మాటేమిటి? నాకు అది మానాలని లేదు, నాన్నా. నేను వాళ్ళింటిలో పని చేస్తూ సాయంకాలం అక్కడ నృత్యగానం నేర్పుతాను.

''వారితో మాట్లాడు తల్లీ, వారేమంటారో అలా చేయి'' అన్నాడు లీబో.

''ఔనమ్మా. మనం వాళ్ళ ఉప్పుతింటున్నాం. అందుకు వాళ్ళ ఆదేశానుసారం మనం నడవాలి'' అంది మోరీ తల్లి.

ఆ రోజే భవంతికి వెళ్లింది మోరీ. హనోడా లేడు. కానీ అజోడా, మాజా ఆమెకోసం ఎదురుచూస్తున్నారు. ''రా మోరీ రా. బాగున్నావు కదా'' అని మాజా పలకరించింది.

''మీ చలవ వలన బాగున్నా అమ్మగారు'' అంటూ ఇద్దరికీ వంగి దండం పెట్టింది.

''అమ్మాయిగారు, అల్లుడుగారు, పిల్లలు వస్తున్నారని తెలిసి చాలా సంతోషించా అమ్మగారు. భవంతి త్వరలో పిల్లల కేరింతలతో మారుమోగుతూ కళకళాడుతుంది''

''ఔను మోరీ. వాళ్ళకోసం కళ్ళల్లో వత్తులు పెట్టుకుని ఎదురుచూస్తున్నాం. మా అక్కను నువ్వు చూశావా?'' అని అజోడా అడిగాడు.

''రెండేళ్ళ క్రితం కొండమీద ఉత్సవంలో చూశా చిన్నయ్యగారూ. అంతమంది జనంలో, చంటిబాబుగారిని ఎత్తుకుని ఉన్నారు''.

- ఇంకాఉంది

## నేర్చుకుందాం

శ్రీ కృష్ణ శతకములోని పద్యము



**పరుసము సోకిన యినుమును**
**వరుసగ బంగారమైన పడువున జిహ్వన్**
**హరి ! నీ నామము సోకిన**
**సురవందిత! నేను నటుల సులభుడ కృష్ణా!**

భావం: స్పర్శవేది ఇనుమునకు సోకితే ఇనుము బంగారమైనట్లుగా ఓ శ్రీహరి నీ శుభనామము నా నాలుకను తాకగానే నేను కూడా సుళువుగా మోక్షార్హుడనవుదును. పరుసముసోకి లోహంబు పసిడియైన పగిది అని రుక్మాంగద చరిత్రము చెప్పినట్లుగా మంగళములకు మంగళము నిఖిల వేదవల్లికి నిత్యఫలము చిన్మయ స్వరూపము శ్రీకృష్ణనామము శ్రద్ధతో గాని హేలగా గాని ఒకసారి నామసంకీర్తన చేసిన మాత్రం చేతనే అది నరులను ఉద్ధరిస్తుంది. కనుక శ్రీకృష్ణ నామము పరుసవేది.

## మాటాట : 1505

నిర్వహణ: సుధామ

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | ■ | ■ | 3 |
| | ■ | | ■ | 4 | | |
| 5 | | ■ | 6 | | ■ | |
| ■ | ■ | 7 | ■ | | ■ | ■ |
| 8 | ■ | 9 | | ■ | 10 | 11 |
| 12 | | | ■ | 13 | ■ | |
| | ■ | ■ | 14 | | | |

**ఆధారాలు**

అడ్డం:
1. తెలుగుల అమరగాయకుడు
4. నిప్పు
5. కంటకము
6. హాని,బడలిక
9. చిన్న పొద, డొంక
10. ఆకుల నరము ,చీపురు పుల్ల
12. డప్పు కొట్టి చేయు ప్రకటనము
14. ఆనందం ఇది అటూ ఇటూ కవితాసంపుటి వెలయించారు గోపాల చక్రవర్తి

నిలువు:
1. తుమ్మెద
2. సంవత్సరము
3. అభ్యంగనము
4. గాలి
7. అతికించినది, సరిపడు
8. కుండ
11. వేగానికి వ్యతిరేకం
13. పడవ

మాటాట - 1504 సమాధానం

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 భో | జ | 2 రా | జు | ■ | ■ | 3 ప్తా |
| పా | ■ | శి | ■ | 4 య | ము | డు |
| 5 వ్ | పు | ■ | 6 ఆ | శ | ■ | గు |
| ■ | ■ | 7 ప | ■ | స్సు | ■ | ■ |
| 8 ఆ | ■ | 9 రు | వ్వ | ■ | 10 బూ | 11 బూ |
| 12 కి | లు | గు | ■ | 13 గు | ■ | డి |
| లి | ■ | ■ | 14 మ | రి | యా | ద |

## పంచాంగం

సోమవారం 4 డిసెంబర్ 2017

శ్రీ చాంద్రమాన హేమలంబ నామ సం॥
దక్షిణాయనం, హేమంత ఋతువు, మార్గశిరమాసం, కృష్ణపక్షం
తిథి: బహుళ పాడ్యమి రా.7.39
నక్షత్రం: రోహిణి ఉ.8.16
వర్జ్యం: మ.1.29 నుండి 2.58 వరకు
దుర్ముహూర్తం: మ.12.24 నుండి 01.12 వరకు,
తిరిగి మ.02.48 నుండి 03.36 వరకు
రాహుకాలం: ఉ.7.30 నుండి 9.00 వరకు

## రాశిఫలం



- గౌరీభట్ల దివ్యజ్ఞాన సిద్ధాంతి

- **మేషం (అశ్విని, భరణి, కృత్తిక 1పా.)**
  సమయస్ఫూర్తి అవసరం. నిరుత్సాహంగా కాలం గడుస్తుంది. ఇతరులకు అపకారం కలిగించే పనులకు దూరంగా నుండుట మంచిది.
- **వృషభం (కృత్తిక 2, 3, 4పా., రోహిణి, మృగశిర 1, 2పా.)**
  మనోల్లాసాన్ని పొందుతారు. సోదరులతో వైరమేర్పడకుండా మెలగాలి. తలచిన కార్యాలకు ఆటంకాలెదురవుతాయి.
- **మిథునం (మృగశిర 3, 4 పా., ఆరుద్ర, పునర్వసు 1, 2, 3పా.)**
  తోటివారితో విరోధమేర్పడకుండా జాగ్రత్త వహించుట మంచిది. వ్యాపార మూలకంగా ధననష్టం కలిగే అవకాశాలున్నాయి. కుటుంబ విషయాలందు అనాసక్తితో వుంటారు.
- **కర్కాటకం (పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్రేష)**
  పిల్లలపట్ల ఎక్కువ పట్టుదలతో నుండుట అంత మంచిది కాదు. చెడు పనులకు దూరంగా నుండుట మంచిది. మనోద్వేగానికి గురి అవుతారు.
- **సింహం (మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**
  బంధు, మిత్రులతో కలుస్తారు. నూతన గృహ నిర్మాణ ప్రయత్నం చేస్తారు. ఆకస్మిక ధనలాభంతో ఋణబాధలు తొలగిపోతాయి. కుటుంబ సౌఖ్యముంటుంది.ఆటంకాలుంటాయి.
- **కన్య (ఉత్తర 2, 3, 4పా., హస్త, చిత్త 1, 2 పా.)**
  తలచిన కార్యాలన్నియు విజయవంతంగా పూర్తి చేసుకోగలుగుతారు. బంధు, మిత్రుల మర్యాద మన్ననలను పొందుతారు. అనారోగ్య బాధలుండవు. సహ ఉద్యోగులకు సహకరించే అవకాశం లభిస్తుంది.
- **తుల (చిత్త 3, 4పా., స్వాతి, విశాఖ 1, 2, 3పా.)**
  ఆర్థిక ఇబ్బందులను ఎదుర్కొంటారు. కుటుంబంలో మార్పులు కోరుకుంటారు. ఒక మంచి అవకాశాన్ని జారవిడుచుకుంటారు.
- **వృశ్చికం (విశాఖ 4 పా., అనూరాధ, జ్యేష్ఠ)**
  ఋణప్రయత్నాలు తొందరగా ఫలిస్తాయి. స్థానచలన సూచనలుంటాయి. శుభకార్యాల మూలకంగా ధనవ్యయం అధికమవుతుంది.
- **ధనుస్సు (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.,)**
  కుటుంబ పరిస్థితులు సంతృప్తికరంగా నుంటాయి. ఆకస్మిక ధనలాభంతో ఋణబాధలు తొలగిపోతాయి. సమాజంలో మంచి పేరు సంపాదిస్తారు. ఇతరులు మిమ్మల్ని ఆదర్శంగా తీసుకొనుటకు కృషి చేస్తారు.
- **మకరం (ఉత్తరాషాఢ 2, 3,4పా., శ్రవణం, ధనిష్ఠ 1, 2పా.)**
  క్రొత్త కార్యాలు ప్రారంభిస్తారు. మానసికానందాన్ని పొందుతారు. ప్రతి విషయంలో వ్యయ, ప్రయాసలు తప్పవు. ధననష్టమేర్పడే అవకాశముంది.
- **కుంభం (ధనిష్ఠ 3, 4పా., శతభిషం, పూర్వాభాద్ర 1,2, 3పా.)**
  ధైర్య సాహసాలు కలిగియుంటారు. సూక్ష్మబుద్ధితో విజయాన్ని సాధిస్తారు. మీ పరాక్రమాన్ని ఇతరులు గుర్తిస్తారు. శతృబాధలు తొలగిపోతాయి.
- **మీనం (పూర్వాభాద్ర 4 పా., ఉత్తరాభాద్ర, రేవతి)**
  విదేశయాన ప్రయత్నాలకు అనుకూలంగా వుంటుంది. ప్రయాణాలెక్కువ చేస్తారు. మెలకువగా నుండుట అవసరం. స్థానచలనమేర్పడే అవకాశాలుంటాయి. ఋణలాభం పొందుతారు.

## మంచిమాట

### వర్ణాశ్రమ ధర్మాలు

అపౌరుషేయాలైన వేదములు మంత్రద్రష్టలైన ఋషులచే పూర్ణమయిన అనంతము నుండి గ్రహింపబడి తమ స్మృతి పథం లో నిక్షిప్తపరుచుకొని తరతరాలకు అందించబడిని వేదవ్యాసులు వాటిని లిఖించి మానవాళికి మహోపకారం చేసారు. సర్వకాల సర్వావస్థల యందు ఎంతో నియమనిష్ఠలతో తమ జీవితాలను క్రమశిక్షణకు అంకితం చేసి వేద నిధిని కాపాడుకుంటూ వచ్చిన ఋషి పుంగవులకు ఎంతో ఋణపడి ఉంది. మనభారతజాతి.

నక్షత్రకాంతి తమపై ప్రసరించుచుండగా నదీప్రవాహములో నడుములోతు నీటిలో నిలబడి వేదాలను అధ్యయనం చేయుట ఒక తపస్సు. సర్వభోగాలను త్యజించి ప్రకృతి యే భగవంతుడనే సత్యాన్ని కనుగొనుటకు నిత్యం శ్రమించారు. ప్రకృతిని అనేక దేవతా స్వరూపాలుగా భావన చేసి మానవుని ఉనికిని శాశ్వతం చేసారు. జ్ఞానమనే సంస్కారాన్ని మానవుడిలో నిక్షిప్తం చేశారు. నాగరికతకు నేపథ్యం వేదజ్ఞానమే. అనుటలో సందేహించవలసిన అవసరంలేదు.

ఈర్ష్యాపరులైన కొందరు తమ ప్రాబల్యము నిలుపుకొనుటకు అసుర ప్రవృత్తితో వేద విజ్ఞానాన్ని చిన్న చూపు చూసేలా ప్రచారం చేయుట జరిగినది. కాని అవి కాలగమకములోని నిలబడలేదు. భగవంతుని ప్రసాదమైన వేదములనుండి జనించిన పురాణ ఇతిహాసములు. ఉపనిషత్తులు మనకు ఎన్నో దైవారాధనా ప్రక్రియలను అందించినవి. ఈనాడు దేవాలయములో నెరవేర్చు అనేక అర్చనా విధానములు, క్రతువులు అత్యంత మహిమాన్విత వాటి యొక్కప్రాధాన్యత , మహిమ ఎంతో నియమనిష్టలతో నెరవేర్చు ఆగమ శాస్త్ర ఉద్దండులైన పండిత పూజారులకు మాత్రమే అవగతము. అటువంటి శాస్త్ర బద్ధులైన పండితోత్తములు మాత్రమే అర్చకులుగా అర్హులు. అపుడే వాటి ఫలితముప్రజలందరికి సంపూర్ణముగా లభిస్తుంది. కులముతో సంబంధము లేకుండా ఎవరైతే అటువంటి వైదిక, ఆగమ పరంపరలో వస్తారో వారే ఈ ప్రవృత్తికి సంపూర్ణఅర్హులు. ఇక కుల ప్రస్థాపన నేరుగా మన సనాతన ధర్మములో ఎక్కడా లేదు. వర్ణాశ్రమ ధర్మాలు మాత్రము నిర్దేశించబడ్డాయి. గీతలో భగవానుడు చెప్పినట్లు.

చాతుర్వర్ణం............ మవ్యయమ్॥ గుణములను బట్టి తాము చేపట్టే కర్మలను అనుసరించి నాలుగు వర్ణములుగా మానవులు విభజింపబడ్డారు. త్రిగుణముల ఆధారముగా సత్యప్రధానమైన శమము, దమము, తపము ఎవరైతే అనుసరిస్తారో వారు బ్రహ్మజ్ఞానులు. రజోగుణ ప్రధానమైన శౌర్యమును అనుసరించువారు క్షత్రియులు. తేజమును అనుసరించువారు వైశ్యులు. తమోగుణప్రధానమైన సేవాభావము గలవారు శూద్రులు. కొంతమంది స్వార్థపరులు ఈ వర్ణములను కులము గా మార్చి సమాజమును భ్రష్టుపట్టించిరి. వేదాధ్యయనమునకు , క్షాత్ర లక్షణములకు ఎంతో త్యాగము, తెగువ, క్రమశిక్షణ అవసరం. అటువంటి కఠోరమైన శిక్షణలను పాటించలేని సోమరులు , భోగలాలసులు వాటిని సాధించలేక వర్ణవిమర్శజేయుట పరిపాటి. తుదకు అసూయాద్వేషముతో వర్ణ సంకరము చేయుటకు సృజియించిన ఈ చాతుర్వర్ణ వ్యవస్థలో మానవుడనేవాడు ఎవడైనా ఆయా గుణములను సాధనచేసి తదనుగుణవర్ణములలో ప్రవేశించవచ్చు. అశక్తుడయినచో ఆ వర్ణమునుండి నిష్క్రమించవచ్చు. అంతియే గాని పుట్టుకతోనే వర్ణము నిర్ధారించబడదు. జన్మనా జాయతే శూద్రాః కర్మణా జాయతే ద్విజః అని స్మృతి. పుట్టకతో అందరూ శూద్రులే. నియమనిష్టలతో భోగత్యాగాలు చేసి వేదాధ్యయనము చేయుచూ లౌకిక విషయాసక్తులు కాని వారు ద్విజత్వమును పొందుదురు. బ్రహ్మజ్ఞానము గల ఈ ద్విజులు మిగిలిన వర్ణముల వారికి దిశానిర్దేశము చేసేవారు. సత్వగుణ ప్రధానమైన బ్రహ్మజ్ఞాని సకల శాస్త్రాలను సృజించగలశక్తిగలవాడై సమాజ సుఖసంతోషాలతో మనుగడ సాగించుటకు తగిన ప్రణాళిక వేయగలడు. స్త్రీపురుష సంయోగమే మరొక జన్మకు కారణము తప్పకులము కాదు. చరిత్రలో రాజ్యములేలిన రాజులందరూ క్షత్రియ కులము వారు కాదు. త్రిగుణములను బట్టి రాజులయినారు. వేదాలను అధ్యయనము చేసిన బోయలు బ్రహ్మజ్ఞానులైనారు. పరమ నైష్టికుడైన కౌశికునకు ధర్మవ్యాధుడు ధర్మబోధ చేసి బ్రహ్మజ్ఞాని అయినాడు. కావున చక్కని సమాజమునకు వర్ణాశ్రమధర్మములు ఎంతో ముఖ్యము. వీటికంటే సర్వజనీనము, సరళసుసమ్మతము అయిన ధర్మాచరణ ఎంతో ముఖ్యం. అదియే మన భరతజాతికిక్షేమ రక్ష.

- వారణాశి వెంకట సూర్యకామేశ్వరరావు

## శ్రీ సాయి లీలామృతం



- జంగం శ్రీనివాసులు 837 489 4743

91

వస్తూనే 'బాబా నాపై నన్ను గిట్టని వారు మంత్రప్రయోగం చేశారు ఇపుడు బాగుంటాను. మరికొద్ది సేపటికీ పిచ్చివానిగా మారిపోతుంటాను. అందరూ నన్ను అసహ్యించుకొంటున్నారు. నేను ఎంతో మంది వైద్యుల దగ్గరకు వెళ్లాను. ఎంతో భూతవైద్యుల దగ్గరకు కూడా వెళ్లాను. కాని ఎవరూ నన్ను బాగుచేయలేదు''అన్నాడు.

బాబా నెమ్మది గా ఇటు రా చే సైగ చేశారు. అతడు వచ్చి బాబా దగ్గరగా కూర్చున్నాడు.

''చూడు అనుమానం అనేది పెద్ద జబ్బు. ఇది అందరిలోను కొద్దిగానో గొప్పగానో ఉంటుంది. కాని పరిస్థితులను విశ్లేషణగా చూసినపుడు మనం ఎవరికీ చెడు చేయకుండా ఉన్నప్పుడు, అంతా భగవంతుని దే భారం అనుకొన్నప్పుడు ఈ భయాలు, అనుమానాలు కలగడం మానేవేస్తాయి. నీవు పిచ్చి వాడివి కాదు. నీలో మంచి ఆలోచనా జ్ఞానముంది. నీవు ఇతరులకు ఎంతో సాయం చేస్తావు. అట్లా సాయం చేసే నీకు ఎవరూ మంత్రప్రయోగం చేయరు. అట్లా చేస్తే నేను చూస్తూ ఊరుకొంటానా చెప్పు. నిన్ను నేను అనుక్షణమూ కాపాడుతుంటాను'' ఇక్కడే నాలుగు రోజులు ఉండు. ఈ మహిల్సాపతి ఇంట్లో నాలుగు రోజులు ఉండు. ఇతనితో పాటు తిరుగు అపుడు చూడు నీ ఆరోగ్యం గురించి ఆ తరువాత మనం మాట్లాడుకుందాం ఏమి సరేనా?'' అని అడిగారు బాబా.

'సరే బాబా మీరు చెప్పినట్లే నాలుగు రోజులు ఉంటాను. మీరు వెళ్ల అనేదాక వెళ్లను 'అని చెప్పాడు.

అతడు రెండురోజులకే నాకు అంతా బాగుంది బాబా అనుగ్రహం దొరికింది అందుకే అంతా బాగుంది అని చెప్పేవాడు. నలుగురి సాయం చేస్తూ తాను కూడా బాబా భజనలు చేస్తూ ఉండిపోయాడు.

అట్లానే చాలామంది కి బాబా అనారోగ్యాలను దూరం చేసేవాడు. కొందరికీ ఊది ప్రసాదం ఇచ్చేవారు. మరికొందరికి చేతిలో ఉన్న పండునో,ఫలమో ఇచ్చేవారు. ఫలానా మందు అని మాత్రం ఎపుడూ ఇవ్వలేదు. కాని బాబా దగ్గరకు ఏ సమస్యతో వచ్చినా అది దూరమయ్యేది. వచ్చినవారు ఎంతో సంతోషంతో ఉండేవారు.

మరోసారి భీమాజీ పాటిల్ అనే ఆయనకు క్షయరోగం వచ్చింది. అతనికి బాగా రక్తపు వాంతులు అయ్యేవి. వైద్యులు ఆయన్ను పరీక్షించి ఇక ఈ జబ్బు తగ్గదు ఆశ వదిలేసుకోమని చెప్పారు. ఎన్నాళ్ళు బతికే అదే ఎక్కువ అనుకోమని చెప్పేశారు. పాపం భీమాజీపాటిల్ భార్య సీతమ్మకు ఎంతో బాధ వేసింది. అందరి దేవుళ్లకు మొక్కుకుంది. రోజు ఖణ్ణిల్లున దగ్గుతున్న భర్తను చూసి మరింత ఆవేదన చెందేది. ఒకరోజు ఆమె స్నేహితురాలు శిరిడీ



గురించి బాబా గురించి చెప్పింది. వెంటనే బాబా కోసం ముడుపు కట్టి బాబా నీవుమమ్ములను రక్షించాలి అని మొక్కుకుంది. ఆ రోజు రాత్రి ఆమెకు కలలో బాబా కనిపించారు. అతడిని ఆమె కలలోనే మొక్కుకుంది. బాబా మరేంఫర్లేదు. మీ రు నా దర్శనానికి రండి అని కల వచ్చింది. వెంటనే ఆమె మధ్యరాత్రిలో మేల్కొని తన కల గురంచి చెప్పింది.

వెంటనే భర్త సహకారంతో శిరిడీ ప్రయాణం ఆ దంపతులిద్దరూ చేశారు. శిరిడీలో దిగిన వెంటనే భీమాజీపాటిల్ దగ్గు తగ్గినట్టుగా అనిపించింది. ఆమెకూడా దాన్ని గ్రహించింది. మనసులోనే బాబాకు నమస్కరించి బాబా దర్శనం చేసుకొంది. తన బాధలను బాబాతో చెప్పింది.ఆయన వారికి అభయం ఇచ్చారు.

ఆ తరువాత ప్రతిరోజు స్నానం చేసి బాబాదగ్గరకువచ్చేది . అక్కడి వారితో కలసిమెలసి తిరుగుతూ ఉండేది. వారి ద్వారా అక్కడే స్థిర నివాసం మేర్ప ర్చుకొన్నారు. కొద్దిరోజుల్లో నే బాబా ఏమీ మందులు,మాకులు చెప్పకముందే క్రమంగా భీమాజీపాటిల్‌కు రక్తపు వాంతులు తగ్గపోయాయి. ఒకరోజు ఆ దంపతులిద్దరూ వచ్చి

'బాబా మీరే మమ్మల్ని కరుణించారు'అని నమస్కారం చేశారు.

'బాబా ఎన్నో ఏళ్లనుంచి నేను ఈ వాంతులతో సతమతమవుతున్నాను. ఎన్నో మందులు మింగాను నా పూర్వ జన్మ పాపంవల్ల ఈ జబ్బు వచ్చిందేమో అని అనుకొన్నాను.కాని మీ దర్శనంతోనే ఈ జబ్బు తగ్గుముఖం పట్టింది. నా పూర్వజన్మ పాపాన్ని కూడా మీరే దూరం చేశారు. మీ వల్లనే నా ఆరోగ్యం బాగయ్యింది ' అని పదేపదే నమస్కరించాడు భీమాజీపాటిల్.

-ఇంకాఉంది

రచనలు పంపవలసిన చిరునామా: ఎడిటర్, ఆంధ్రభూమి దినపత్రిక,
36, సరోజినీదేవి రోడ్, సికింద్రాబాద్-500 003

## మన పండుగలు

# సంస్కృతీ ప్రతిబింబాలు

***మానవ జీవితం ముఖ్యంగా ప్రకృతిపై ఆధారపడి వుంటుంది. ఈ ప్రకృతిలోని మార్పులను జ్యోతిషశాస్త్రం ఆధారంగా గుర్తించి, గ్రహ నక్షత్రాదుల ప్రభావాలను పరిశీలిస్తూ, కాలానుగతికమైన పండుగలను ధర్మశాస్త్రం నిర్ణయిస్తుంది. ప్రకృతిలో వచ్చే మార్పులకు అనుగుణంగా తమను తాము తీర్చిదిద్దుకోవడం పండుగల ఏర్పాటులో ముఖ్యమైన ఉద్దేశం. నోములు, వ్రతాలు, ఉత్సవాలు, పర్వాలు, పండుగలు అంటూ వాటికి మనం పేర్లు పెట్టుకుంటున్నాం. ఈ దేశంలో సంవత్సరం మొత్తం ఏదో రూపంలో ఏదో ఒక పర్వం నిర్వహిస్తూనే వుంటారు.***

పండుగలను నిర్వహించడంలో తెలుగువారికి అందులోనూ తెలంగాణ ప్రాంతం వారికి విశిష్టమైన సంప్రదాయాలు, ఆచార వ్యవహారాలు వున్నాయి. తెలుగువారు నిర్వహించుకునే పండుగలను సాధికారికంగా చర్చించుకుంటూ తెలంగాణ ప్రాంతానికి ప్రత్యేకమైన కొన్ని పండుగలను, వాటిని నిర్వహించే విధానాలు, ఆచార సంప్రదాయాలను పరిశీలించే ప్రయత్నం చేద్దాం.

మాసాలపరంగా ఆలోచిస్తే మన పండుగల్లో మొట్టమొదటి చైత్రశుద్ధ పాడ్యమినాడు నిర్వహించే 'ఉగాది' పండుగ. తెలుగువారికే ఇది ప్రత్యేకమైన పండుగ. ఈరోజు ఆరు రుచులతో కూడుకున్న వేప పువ్వు పచ్చడిని ఆరగించిన తర్వాతనే మిగిలిన పనులు ప్రారంభిస్తాము. ప్రకృతికి నమస్కరించే తెలుగువారి మొదటి పండుగ ఇది.

సంక్రాంతి తెలుగువారు నిర్వహించుకునే మరో ప్రత్యేకమైన ప్రకృతికి అనుగుణమైన ఉత్సవం. సూర్యుని సంక్రమణాన్ని అందులోను ఉత్తరాయన్ని ఆనందించే పండుగ ఇది. ఆంధ్ర, తెలంగాణలోను ముగ్గులతో గృహ ప్రాంగణం అలంకరించుకోవడం, గంగిరెద్దుల సంబరాలు, కోళ్ల పందేలు, పతంగులు ఏగరేయడం చేస్తారు. పత్తి, నూనె, నెయ్యి, జీలకర్ర వంటి వస్తువులతో నోములు నోచుకుంటారు. భోగి మంటలు, గోదా కళ్యాణాలు, కనుమనాడు పశువులకు పూజ చేయడం తెలుగువారి సంప్రదాయంలోని వైశిష్ట్యం. శ్రావణ మాసంలో పూర్ణిమనాడు చేసుకునే ఉత్సవం రాఖీ పూర్ణిమ సోదరులకు వారి చెల్లెళ్లకు రాఖీలు కట్టి ఆత్మీయతను పంచుకుంటారు. ఇది కుటుంబ వాతావరణంలో ఆనందాన్ని, అనుబంధాన్ని పెంచడంవల్ల ఈ పండుగకు విశేషమైన గుర్తింపు తెలుగువారికి కూడా ఏర్పడింది.

హోళికోత్సవం ప్రకృతికి సంబంధించిన మరో గొప్ప ఉత్సవం. దీనిని వసంతోత్సవం అంటారు. రంగులు చల్లుకోవడం, ముందురోజు కామదహనం వుంటుంది. కాముడు అంటే మన్మథుని భావాలను అంటే కోరికలను దహనం చేసే విధానం ఈ పండుగలోని అంతరార్థం. ఈ పండుగలు కాక మిగిలిన పండుగల్లో పూర్తిగా దైవభావన మిళితమై వుంటుంది. శ్రీరామనవమి, హనుమత్ జయంతి, నృసింహ జయంతి, తొలి ఏకాదశి, వ్యాసపూర్ణిమ (గురుపూర్ణిమ), వినాయకచవితి, దసరా నవరాత్రి ఉత్సవాలు, దీపావళి, కార్తీక దీపోత్సవాలు, దత్త జయంతి, ముక్కోటి ఏకాదశి, రథసప్తమి మొదలైన ఉత్సవాలన్నీ దైవాలకు అనుబంధంగా నిర్వహించుకునే పండుగలు.

శ్రీరామనవమి చైత్రశుద్ధ నవమినాడు తెలంగాణలోని భద్రాచలంలో కళ్యాణోత్సవం, తెలుగు ప్రాంతాల్లో వాడవాడలా సీతారాముల కళ్యాణం నిర్వహిస్తారు. వసంత నవరాత్రుల చివరి రోజున శ్రీరాముని పూజించడం, ఆయన భావాలు స్వీకరించడం ఈ పండుగలో ముఖ్య ఉద్దేశం. హనుమత్ జయంతి చైత్ర పూర్ణిమనాడు నిర్వహిస్తారు.

వైశాఖ మాసంలో శుద్ధ చతుర్దశి నాడు నృహింహ జయంతి తెలుగు ప్రాంతాల్లో ముఖ్యంగా తెలంగాణలో అత్యధికంగా నృసింహ క్షేత్రాలుండడంవల్ల దేవాలయాలలో నిర్వహిస్తారు. ఆషాఢ శుద్ధ ఏకాదశి నాడు విష్ణు దర్శనం చేస్తున్నారు. పవిత్ర నదుల్లో స్నానాలు చేయడం ఉపవాసాలుండడం తెలుగువారు నిర్వహిస్తున్న విధి. ఆషాఢ పూర్ణిమ నాడు వ్యాసపూర్ణిమను గురుపూర్ణిమగా నిర్వహించి తమ గురువులను సన్మానిస్తూ, సాయిబాబా, దత్తాత్రేయ, దక్షిణామూర్తి, హయగ్రీవ స్వాములకు పూజలు నిర్వహిస్తారు.

ఆషాఢమాసంలో తెలంగాణలో బోనాల ఉత్సవాన్ని నిర్వహించి గ్రామదేవతలైన అమ్మవార్లకు నైవేద్యంగా భోజనాన్ని, తొట్టెలను సమర్పించడం పోతురాజు విన్యాసాలు నిర్వహిస్తారు. స్త్రీలు సామూహికంగా బోనం కుండలను తలపై పెట్టుకుని వాటిపైన దీపాలు వుంచుకుని అమ్మవారికి గుడికి వెళతారు. శ్రావణమాసంలో స్త్రీలు మంగళవారాల్లో మంగళ గౌరీ వ్రతాలు, రెండవ శుక్రవారం వరలక్ష్మీ వ్రతాలను ఆనందంగా జరుపుకుంటారు. ఈ మాసంలో వనభోజనలకు వెళ్లే సంప్రదాయం కూడా వున్నది.

భాద్రపద మాసంలో శుద్ధ చవితినాడు వినాయక చవితి ఉత్సవాన్ని తెలుగు ప్రాంతాల్లో వైభవంగా నిర్వహిస్తారు. బాల గంగాధర్ తిలక్ ప్రభావంతో స్వాతంత్ర్య సమర కాలం నుంచి వాడవాడల్లో గణపతి హోమాలు, అన్నదానాలు భజనలు ఈ ఉత్సవంలో నిర్వహిస్తున్నారు. అనంత పద్మనాభ చతుర్దశినాడు వినాయక నిమజ్జనం కూడా ప్రత్యేక ఉత్సవంగా చేస్తున్నారు.

భాద్రపద మాసంలో కృష్ణపక్షంలో పితృపక్షాలు నిర్వహించడం సంప్రదాయం. అమావాస్యనాడు మరణించిన పెద్దలకోసం అనేక రూపాల్లో బ్రాహ్మణులకు దానధర్మాలు ఆచరించే సంప్రదాయం తెలుగువారిలో కొనసాగుతున్నది. భాద్రపద మాసంలో అమావాస్యనాడే తెలంగాణ ప్రాంతంలో బతుకమ్మ పండుగ ఆడే సంప్రదాయం కనిపిస్తుంది. పుష్పాలతో బతుకమ్మను తయారుచేసి, దానిపై పసుపుతో గౌరమ్మను చేసిపెట్టి అందరూ ఒకచోట చేరి మధ్యలో వుంచి చుట్టూ తిరుగుతూ చేసే ఉత్సవం తెలంగాణకు తలమానికమైన పండుగ ఇది. ఒకరకంగా అరోమా థైనపీ (పుష్పవాసనలతో కూడిన వైద్యం. భాద్రపద అమావాస్య నుంచి ఆశ్వీజ శుద్ధ అష్టమి (దుర్గాష్టమి) వరకు పండుగ నిర్వహిస్తారు. తొమ్మిదవ నాడు సద్దుల బతుకమ్మగా భావనచేసి 9 రకాల సద్దులను (పిండి వంటలను) నైవేద్యంగా సమర్పిస్తారు. గౌరమ్మకు స్వాగతం, వీడుకోలు ఈ తొమ్మిది రోజుల్లో చెబుతారు.

ఆశ్వీజ మాసం ప్రారంభం నుంచి తొమ్మిది రోజులు శరన్నవరాత్రులు తెలుగు ప్రాంతాల్లో నిర్వహించి చాలామంది దీక్షాపరులై అమ్మవారిని వేర్వేరు రూపాల్లో పూజిస్తారు. చండీహోమాలు, ఆయుధ పూజ, సామూహిక అన్నదానాలు, పదవరోజు పాల పిట్ట దర్శనం, జమ్మి చెట్టుకు పూజ చేస్తారు.

శివునికి ప్రీతికరమైన కార్తీక మాసంలో అభిషేకాదులు, దీపోత్సవాలు అన్ని ప్రాంతాల్లో ఆధ్యాత్మిక చైతన్య మాసంగా నిర్వహిస్తారు. గురువు ప్రాదాన్యం విస్తరించడంవల్ల దత్తాత్రేయ జయంతిని మార్గశిర పౌర్ణమి నాడు కోరల పూర్ణిమగా చేస్తారు. ఈరోజు దత్త ఆరాధన చేస్తారు. కొన్ని వంటకాలను కుక్కలకోసం చేసి పెడితే నరక బాధలుండవని ఒక భావన. జంతువులపై చూపే ప్రేమ కూడా ఈ పండుగలో అంతర్భాగమే.

కాల పరిణగణనలో తెలుగువారిది చాంద్రమానం. వైకుంఠ ఏకాదశి సౌరమానం ప్రకారం జరిపే పండుగ. ధనుర్మాసం మొదలైన తర్వాత శుక్ల పక్షంలో వచ్చే ఏకాదశి వైకుంఠ ఏకాదశిగా నిర్ణయిస్తారు. ఇది మార్గశిరంలో, పుష్యంలోగాని వస్తుంది. వైష్ణవులకు, రామానుజ, మాధ్వ మతస్తులకు ఇది చాలా ముఖ్యమైనది. ఉత్తర ద్వారం నుంచి వైకుంఠ వాసుడైన విష్ణువు యొక్క రూప దర్శనంవల్ల మోక్ష ప్రాప్తి అనే భావనవల్ల ఈ పర్వదినాన్ని భక్తితో జరుపుకుంటారు. మాఘమాసంలో శ్రీపంచమి, రథసప్తమి, భీష్మైకాదశి, శ్రీపంచమిన అమ్మవారు పుట్టిన రోజుగా భావించగా, రథసప్తమినాడు సూర్యునికి ప్రత్యేక పూజలు నిర్వహిస్తారు. భీష్మైకాదశినాడు విష్ణుపూజలు చేస్తారు. ఇక ఈ మాసంలో నిర్వహించే ఉత్సవం మహాశివరాత్రి. తెలుగువారు భక్తి శ్రద్ధలతో, ఉపవాసాలతో, రుద్రాభిషేకాలతో, జాగారాలతో శివుని కళ్యాణాలను నిర్వహిస్తారు.

***ప్రకృతికి అనుగుణంగా జీవించడం, మనసును ప్రశాంతంగా ఉంచుకునేందుకు దైవపూజలు నిరంతరం చేస్తుండడం, అందరితో ఆనందంగా గడపడం, అందరికీ పండుగల సమయాల్లో ఆహారాదులు, ధనం, వస్తువులను పంచుకుంటూ వుండడం, ఉన్నతిని కోరుకుంటూ వుండడం తెలుగువారి పండుగల నిర్వహణలో ముఖ్య ఉద్దేశం. ఆ ఆనందాన్ని మరింతగా కొనసాగిస్తూ, వానిలోని చిన్నచిన్న దోషాలను పరిహరిస్తూ ముందుకు వైజ్ఞానికంగా కొనసాగాలని ఆశిద్దాం.***

**- డాక్టర్. సాగి కమలాకర శర్మ**
అసిస్టెంట్ ప్రొఫెసర్
తెలుగు శాఖ, ఉస్మానియా విశ్వవిద్యాలయం



***పండుగలు జరుపడంలో స్త్రీలదే ప్రముఖ పాత్ర అయినా ఆబాలవృద్ధులూ పాల్గొంటుంటారు. స్త్రీలు అధికసంఖ్యలో ఐకమత్యంతో పాల్గొని చురుకుగా చేసే పండుగల్లో బోనాలు, బతుకమ్మ, గొబ్బెమ్మ లు అగ్రస్థానంలో నిలుస్తాయి. శ్రావణమంగళ, శుక్రవారాల్లో నోచే నోములకూ ప్రముఖస్థానమే.***





# ప్రాణులన్నీ పరమాత్మ రూపాలే



## శ్రీకృష్ణామృతం

చరణ శ్రీ

"అదికాదుకృష్ణా మాకు నీతోడి కూర్చుని ఆటలు ఆడుతూ పాటలు పాడతూ చల్ది తినాలని ఉంది 'అన్నారు వారు. వారు అనుకొన్నప్రకారం తమ తమ ఇండ్లల్లో చల్ది మాకు ప్రత్యేకంగాచేసి ఇవ్వమని వారి తల్లులను అడిగారు. పిల్లలు సరదా పడుతున్నారు కదా అని వారి అమ్మలంతా రకరకాల పిండి వంటలు కూడా చేసి ఇచ్చారు. పెరుగన్నాలు, చిత్రాన్నాలు, రకరకాల వంటలు చేసి కావళ్లల్లో పెట్టివారికి ఇచ్చారు.

వీరు ఇంకా తూర్పున సూర్యుడు బయలు దేరక ముందే గోపబాలురు అంతా తమ పశువులను తోడ్కొని అడవికి బయలుదేరారు. కృష్ణయ్యకూడా నెమలి పింఛాన్ని ధరించి వారితో తన చల్దిని చంక తగిలించుకొని బయలుదేరాడు.

సౌకుమార్య సంపన్నుడైన శ్రీకృష్ణుని యశోదమ్మ తల్లి బంగారు నగలతో అలంకరించింది. బృందావనంలోని బాలలందరినీ వారి వారి తల్లులు కృష్ణుణ్ణే అలంకరించుతున్నామనుకొన్నారు. వారి దగ్గర ఉన్న బంగారు నగలను అలంకరిస్తూ అందరికీ నెమలిఫించాన్ని ధరింపచేశారు. వారంతా కూడా కృష్ణుని పోలిన కృష్ణుల్లా ఉన్నారు. కృష్ణుడే ఇన్ని అవతారాలు దాల్చాడా సర్వం కృష్ణమయం అన్నట్లుగా పట్టు పీతాంబరాలు ధరించి మొలకు బంగారు మొలతాడు కట్టి పాదాలు బంగారు మంజీరాలు దాల్చి మెడలో పులిగోరు గొలుసులు ధరించి చేతులకు కంకణాలు, వంకీలు, మురుగులు దాల్చి వారు అడుగులు వేస్తుంటే వారి మంజీరాలనుంచి వచ్చే ధ్వని అప్సరసలు నాట్యం చేస్తున్నట్టుగా ఉంది. అందరూ అమ్మలు వారి వారి పిల్లలను చూసుకొని మురిసిపోతూన్నారు. పిల్లలంతా తమను తాము కృష్ణునితో పోల్చుకుని పొంగిపోతున్నారు. అంతా కలసి కావడులు భుజాన తగిలించుకుని అడవి బాట పట్టారు. అందరూ ఉల్లాసంగా ఎగురుతూ,దుముకుతూ దారిలో చెట్ల ఆకులను తుంపుతూ కాయలు కోస్తూ పూవులు తెంపి ముందువాళ్లమీద పోసి దేవతలు ఆకాశంనుంచి పుష్పవృష్టి గురిపిస్తున్నారని చెబుకుంటూ వెళ్తున్నారు.

⁂

వారిని చూస్తున్న విరించి పెళ్లున నవ్వాడు. 'నారదా చూడు వారి కోరిక. వారిపై దేవతలు పుష్పవృష్టి కురిపిస్తున్నారట' అన్నాడు.

అవునుమరి శ్రీకృష్ణుడే వారి చెంత నిలిచి నడుస్తుంటే దేవతలే ఎందుకు బ్రహ్మసరస్వతులే పూలు చల్లడానికి వచ్చారు కదా' అంది సరస్వతీ దేవి నవ్వుతూ.

నారదుడు వారిద్దరినీ పట్టించుకున్నట్టు లేడు. ఆయన కృష్ణుడినే చూస్తున్నాడు. ఆనంద తన్మయత్వంలో మునిగిపోయాడు.

⁂

కృష్ణబృందం ముందుకు వెళ్తూ దారిలో వచ్చే చెలమలను, చెరువులను తటాకాలనుచూస్తూ ఉన్నారు. వారికి దారిలో పువ్వులు పరిచారా అన్నట్టున చెట్లను చూశారు. వాటి మధ్యమధ్యలో పెద్ద పెద్ద వృక్షాలను చూశారు. చల్లని పచ్చని పెరిగిన పైరును చూశారు.

"కృష్ణా కృష్ణా ! ఇక్కడ చూశావా ఎంత బాగుందో పచ్చని తివాచి పరిచినట్టు లేదా చూడు. "అన్నాడు గోపాలుడు.

"అవును కృష్ణా! ఎంత బాగుందో ఈవైపు చూడు ఎంత బయలుప్రదేశం పచ్చగా గడ్డి మొలిచి ఉందో ఇక్కడైతే మన పశువులు చక్కగా గడ్డితింటూ రాత్రి దాకా ఉండగలవు. మనం ఇక్కడే ఈ వృక్షాలను ఊయలలు కట్టి ఊగనూ వచ్చు. ఇక్కడే ఉందాం కృష్ణా! అన్నాడు నరసింహుడు.

"కృష్ణా నోరు తెరువుతెరువు... "అంటూ నోరు తెరిపించేసి తాను దోసిలితో తెచ్చిన నీటిని ఆ కృష్ణుని నోట్లో పోసేశాడు. 'రుచి చూశావా కృష్ణా తియ్యగా కొబ్బరి నీరు లాగా ఉన్నాయి. కదా మనం ఇక్కడే వుందాం గోపాలా.. "అన్నాడు సుధాముడు.

ఇలా అందరూ అక్కడే ఉండడానికి ఉత్సాహం చూపారు.

" మీయిష్టమే నా ఇష్టం. కనుక మీరు ఎక్కడ ఉండమంటే అక్కడే ఉంటాం. మరి ఇంకే ఆ కావడులు దించండి. ఇక ఆడుకొందా. "

"ఓ గోవుల్లారా! మీరంతా ఇదిగో ఈ కనబడే ప్రదేశంలో గడ్డి తినండి మేము మీ చెంతనే ఉంటూ ఆడుకుంటాం. అందరం కలసి సాయంత్రం ఇంటికి వెళ్దాం"అన్నాడు కృష్ణుడు అందరూ రణగొణ ధ్వనులు చేస్తూ కేకలు వేస్తూ కేరింతలు కొడుతూ ఆగారు. భుజాన ఉన్న కావిడులు దించాడు. వెంటవెంటనే చెట్లు ఎక్కేస్తున్నారు. పువ్వులు తెంపి వాసన చూస్తున్నారు..

అంతలో "కృష్ణా! మనం ఆడుకుంటూ ఈ పశువులను మరిచిపోతావేమో. ఇవి ఎటైనా వెళ్లిపోతే ఎలా చేద్దాం"అన్నారు.

అవునౌను అంటూ దిగాలు గా కూర్చున్నారు.

"ఓయి మీకు ఈ దిగులెందుకు కృష్ణుడు ఏదైనా చేస్తాడులే. మరేంఫర్లేదు"అన్నాడు రాముడు.

"సరే పదండి వాటికి చెప్దాం. అవి వింటాయి "అంటూ అందరూ ముందుకు వెళ్లారు. అందరికన్నా కృష్ణుడు వెళ్లాడు. అక్కడ పడి ఉన్న ఎండిన కట్టెనొకదానిని తీసుకొన్నాడు. ఆ నిలిచి వున్న పశువుల చుట్టూరా ఒక గీత గీశాడు.

'ఓ గోవత్సముల్లారా ఇదిగో ఈ గిరి ని దాటి వెళ్లకండి సుమా మేము ఇక్కడే ఉంటాం. మీవైపు మేము. మావైపు మీరు చూస్తూ ఉందాం. ఏమంటారు"అన్నాడు కృష్ణుడు.

ఆ పశువులన్నీ తలలూపాయి. కృష్ణా! కృష్ణా అవి తలలూపాయి. ఇక నీ మాట కాదని అవి ఎటూ పోవు. మనం నిశ్చింత. నీకు చెబితే చాలు. నీవు మా మాట వింటేచాలు. మాకు బోలెడంత నిశ్చింత. అన్నాంతా ఒకేసారి .

★★★

# సాంగత్యంతోనే సచ్ఛీలత

మనం చేసే సాంగత్యమే మన ఉన్నతికి దుస్థితికి కారణమౌతుంది. ఈ ప్రపంచంలో సజ్జన సాంగత్యం, దుర్జన సాంగత్యం అని రెండు రకాలు. లోకంలో సజ్జనులు తక్కువగాను, దుర్జనులు ఎక్కువగాను ఉంటుంటారు. సజ్జన సాంగత్యం చేయాలని సకల శాస్త్రాలను చెబుతున్నాయి. దుర్జనుల వల్ల సమాజానికి భయోత్పాతాలు ఏర్పడితే సజ్జనుల వల్ల సమాజాభివృద్ధి కలుగుతుంది. గాడిద గంధపు వాసన గుర్తె రగునట్లే దుర్జనులకు సజ్జనుల చెప్పే సూక్తులు, వారి చేష్టలు వీరికి తెలియవు. సహజంగా మంచి వారైనా సహవాస దోషం వల్ల చెడువానిగా మారిపోతాడు. ఇహంలో సుఖాన్ని అనంతరం ముక్తిని ప్రసాదించేది సజ్జన సాంగత్యమే. మనలో స్నేహం కోసం ప్రాణాలర్పించే వాళ్లు కొందరైతే తమ సర్వస్వం ధారపోయడానికి సిద్ధ పడి వారు మరికొందరున్నారు.

కుచేలుడు ప్రేమతో పట్టుకొచ్చిన అటుకులను ఎంతో ప్రీతిగా ఆరగించిన శ్రీకృష్ణుడు అతనికి అడగకుండానే అష్టైశ్వర్యాలనుప్రసాదించాడు. అర్జునుడు, కృష్ణుడు మంచి స్నేహి తులు. బంధువులు అది వేరే సంగతి. కాని, యుద్ధానికి వెళ్లేముందు కృష్ణుని దగ్గరకు వచ్చిన అర్జున దుర్యోదనులు సాయం అడగడానికి వచ్చి విజ్ఞత కనబర్చినవాడు మేధావి అర్జునుడే కనిపిస్తాడు. వారిద్దరి స్నేహం వల్ల అర్జునునిలో కృష్ణభక్తి, కృష్ణసామర్థ్యం పై సరియైన అవగాహన కలిగించు కున్న వారలో అర్జునునితెలివి కని పిస్తుంది. కర్ణుడు, శకునితో స్నేహం చేసిన దుర్యోధనుడు దైవాని కన్నా మనుష్యులను నమ్మడం మంచిదను కొంటారు. దుర్యోధనుడు నీళ్లలో దాగడం చూసి కృష్ణుడి సైన్యాన్ని కోరి కొరివి తెచ్చుకున్నాడా అనిపిస్తుంది. మంచి సహవాసం బుద్ధి మాంద్యా న్ని తొలగిస్తుంది. నిర్భీతిగా మన చేత నిజాన్ని పలికిస్తుంది. పాపాన్ని పోగొడుతుంది. సంఘంలో గౌరవ మర్యాదలు తెచ్చి పెట్టి మనకీర్తిని విశ్వవ్యాప్తం చేస్తుంది. అందుకే ఆచితూచి స్నేహం చేయాలి. స్నేహం చేయ మన్నారు

***- దూరి వెంకటరావు***



# తెలియజెప్పేవారే గురువు

## పురాణ వ్యక్తులు - పూర్వజన్మలు



జడభరతుడు వెళ్లడానికి సమాయత్తమైయ్యాడు. రహూగణుడు సాష్టాంగప్రణామం చేస్తూ "స్వామి! మీరు నాకు జ్ఞాన బోధ చేయండి. నేను ఈ మమకారబంధనాలను వదిలించుకొని పరమాత్మవైపు అడుగులు వేసేటట్లు చేయండి "అని పదేపదే వేడుకున్నాడు.

"స్వామీ నేను చాలా తప్పు చేశాను. మీలాంటివాని చేత నేను పల్లకీ మోయించుకున్నాను.నన్నుక్షమించండి"అన్నాడు. జడభరతుడు చిన్నగా నవ్వాడు.

"స్వామి మీ నవ్వుకు కారణం నాకు తెలియడం లేదు'అన్నాడు.

'ఏంలేదు. నీవెప్పుడూ నేను మోసాను మోసాను అంటున్నావు. నేనెప్పుడూ నిన్ను మోయలేదు. నువ్వు ఎప్పుడూ నా చేత మోయబడలేదు కదా అని నవ్వాను'అన్నాడు.

'అదేంటి స్వామి'అన్నాడు రహూగణుడు.

"నువ్వు పల్లకీలో కూర్చున్నావు. పల్లకీ నిన్నుమోసింది అనుకొంటే ఆ పల్లకీని బోయిల భుజాలు, ఆ భుజాలను వక్షాలు, కడుపు, కాళ్లు , చివరకు పాదాలు మోస్తున్నాయి. పాదాలను భూమి మోస్తోంది. భూమిని ఆదిశేషుడు మోస్తున్నాడు. శేషుడిని కాలమూ, కాలాన్ని సూర్యచంద్రాదులు, ఆ సూర్యచంద్రులను ఆకాశం మోస్తోంది. ఆకాశమంటే శూన్యమే కదా. ఆ ఆకాశం కింద నువ్వు నేను ఉండి ఆకాశాన్ని మోస్తున్నాం. అంటే శూన్యాన్ని మోస్తున్నామన్నమాట.

ఇదంతా కర్మానుక్రమణికగా జరిగిపోతోంది. దానికి మనం కర్తలు, కర్మలను క్రియలమూ అసలు కానేకాదు. ఇది తెలుసుకొంటే చాలు"అన్నాడు భరతుడు.

రహూగణునికి విచిత్రమైన ఆనందం వేసింది. 'స్వామి ఇంతకాలానికి నాకు జ్ఞాన బోధ చేసే గురువు దొరినట్లే 'అన్నాడు.

పూర్వకాలంలో బుభడనే గురువు అందరికీ అన్ని విద్యలూ నేర్పించేవాడు. అందరూ అంతో ఇంతో అన్నిటినీ నేర్చుకునేవారు. కాని నిదాఘుడు అన్న శిష్యుడు మాత్రం అద్వైతాన్ని నేర్చుకునేవాడే కాదు. వానికి ఎలాగైనా అద్వైతం బోధించాలని బుభడు అనుకొనేవాడు. ఇంతలో నిదాఘుడు విద్యాధ్యయనం పూర్తి చేసుకొని గృహస్థాశ్రమానికి వెళ్లాడు. గురువు శిష్యుని ప్రేమానురాగాతిశయంగా శిష్యుని వదలకుండా అప్పుడప్పుడూ వచ్చి జ్ఞానబోధ చేస్తుండేవాడు. కాని గురువును గుర్తుపట్టేవాడే కాదు.

ఎన్నోవిధాలుగా చెప్తున్నా పట్టించుకోని నిధాఘుని దగ్గర గురువు వచ్చాడు. సన్యాసి లాగా ఉన్నావు అని అన్నం తిందువు రమ్మని పిలిచాడు. గురువుకు భోజనం పెట్టి 'అయ్యా భోజనం రుచిగా ఉందా. మీ కడుపు నిండిందా 'అని అడిగాడు.

దానికి గురువు 'ఆకలి దాహం అనేవి దేహధర్మాలు కదా. తృప్తి, సుఖం అనేవి మనోధర్మాలు. నువ్వు దైహికపరంగా ఆలోచిస్తే కడుపు నిండడం అనేది కల్ల కదా ఇపుడు తింటే మరికొద్దిసేపటికి మళ్లీ ఆకలి వేస్తుంది. దానికి ఎపుడు తృప్తి కలుగుతుంది. ఈ తృప్తి, సుఖం అనేవి మనోధర్మాలు' అని ఇంకా ఏదో చెప్పబోతుంటే నిదాఘుడు అడ్డు పడ్డాడు. నేను ఏదో ఆకలితో నకనకలాడుతున్నావని అన్నం పెట్టాను నీవు వేదాంతం మాట్లాడుతున్నావు. ఇది ఏమీ నాకు అక్కర్లేదుసుమా అని మంచి మాటలతో నిదాఘుడు చెప్పాడు. కాని, ఆ గురువు ఇంకా ఏదో చెప్ప బోతున్నాడు. వద్దన్నా వదలడం లేదని నిదాఘుడు విసుగును కనబర్చాడు. కాని గురువు వెళ్లకపోయేసరికి బలప్రయోగం చేయాల్సి వస్తుందని ఇక వెళ్లు అని గురువును గుర్తుపట్టకుండానే బలవంతంగా పంపించివేశాడు.

***- రాయసం లక్ష్మి***

# కృష్ణకు ఆట జీవన సాఫల్య పురస్కారం





అమెరికాలో తెలుగు సంస్థగా పేరుగన్న 'ఆట' (అమెరికన్ తెలుగు అసోసియేషన్) ప్రతి సంవత్సరం ప్రతిష్టాత్మకంగా అందిస్తున్న జీవన సాఫల్య పురస్కారాన్ని ఈసారి నటశేఖర కృష్ణకు అందించనున్నారు. నవంబర్ 26 నుండి డిసెంబర్ 23 వరకు జరుగనున్న ఆట కార్యక్రమాల్లో కృష్ణకు ఈ పురస్కారాన్ని అందజేయనున్నామని అధ్యక్షులు కరుణాకర్ అశిరెడ్డి తెలిపారు. మన మూలాలు, మన భాష, సంస్కృతి, సంప్రదాయాలు మర్చిపోకూడదనే ఉద్దేశ్యంతో రెండున్నర దశాబ్దాల నుండి ఈ విధమైన కార్యక్రమాలను చేస్తున్నామని, ముగింపు వేడుకలకు పలువురు ప్రముఖులు హాజరుకానున్నారని, 23న సూపర్‌స్టార్ కృష్ణకు పురస్కారాన్ని అందజేయనున్నామని ఆయన తెలిపారు. కార్యక్రమంలో తమ్మారెడ్డి భరద్వాజ, లోహిత్, మధుసూదన్ కోడూరు, అనిల్ బొద్దిరెడ్డి, భువనేష్ భూజాల, సురేందర్‌రెడ్డి తదితరులు పాల్గొని విశేషాలను తెలిపారు.



# 'ఒక్క క్షణం' టీజర్

అల్లు శిరీష్, సురభి, సీరత్‌కపూర్ ప్రధాన తారాగణంగా వి.ఐ.ఆనంద్ దర్శకత్వంలో లక్ష్మీనరసింహా ఎంటర్‌టైన్‌మెంట్స్ పతాకంపై చక్రి చిగురుపాటి రూపొందిస్తున్న చిత్రం 'ఒక్క క్షణం'. ఈ సినిమాకి సంబంధించిన టీజర్‌ను ఆదివారం హైదరాబాద్‌లో హీరో శిరీష్ విడుదల చేశారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ ఓ మంచి కథను తీసుకొని ఈ చిత్రాన్ని అద్భుతంగా రూపొందించారని, థ్రిల్లర్‌గా సాగే సైన్స్ ఫిక్షన్ చిత్రంగా రూపొందిన ఇందులో పార్లర్ లైఫ్, కొత్త కథాంశంతో కనిపిస్తుందని తెలిపారు. శ్రీనివాస్ అవసరాల ఓ కీలకమైన పాత్రలో నటిస్తారని, అన్ని టెక్నికల్ హంగులన్నీ హైలెట్‌గా ఉంటాయని తెలిపారు. ఎక్కడికిపోతావు చిన్నవాడా సమయంలోనే ఈ కథను నిర్మాతకు చెప్పానని, జీవా పాత్రలో ఫర్ఫెక్షన్ కోసం శిరీష్ హార్డ్‌వర్క్ చేశారని, ప్రేమకు, డెస్టినికి మధ్య పోరాటంలో ఈ సినిమా సాగుతుందని దర్శకుడు వి.ఐ. ఆనంద్ అన్నారు. ఆద్యంతం ఉత్కంఠభరితంగా సాగుతూ ప్రేక్షకులకు సరికొత్త థ్రిల్ అందిస్తుందని ఆయన తెలిపారు. కార్యక్రమంలో సీరత్‌కపూర్, అబ్బూరి రవి తదితరులు పాల్గొని సినిమా విశేషాలు తెలిపారు. ఈ చిత్రానికి కెమెరా శ్యాం కె. నాయుడు, సంగీతం మణిశర్మ, ఎడిటింగ్ చోటా కె. ప్రసాద్, మాటాలు అబ్బూరి రవి, నిర్మాత చక్రి చిగురుపాటి, దర్శకత్వం వి.ఐ. ఆనంద్.

# తెలుగులో సన్నీలియోన్





హాలీవుడ్ స్టన్నింగ్ బ్యూటీ సన్నీలియోన్ కథానాయికగా తెలుగులో నటిస్తోంది. ఇండియన్ కల్చర్ బ్యాక్ డ్రాప్ చారిత్రత్మక యుద్ధ నేపథ్యంలో ఈ చిత్రాన్ని వి.సి వడివుడయాన్ దర్శకత్వంలో రూపొందిస్తున్నారు. స్టీవ్స్ కార్నర్ పతాకంపై హోమ్స్ స్టీఫెన్ రూపొందిస్తున్న ఈ చిత్రంలో నవదీప్, నాజర్ కీలక పాత్రల్లో నటిస్తున్నారు. ఈ సినిమా కోసం సన్నీలియోన్ కత్తి యుద్ధం, గుర్రపు స్వారీ లాంటి విద్యలు నేర్చుకుని వున్నారు. భారీ బడ్జెట్‌తో తెరకెక్కుతున్న ఈ చిత్రం కోసం సన్నీలియోన్ ఏకంగా 150 రోజులు కాల్షీట్లు ఇవ్వడం విశేషం. దాదాపు 70 నిమిషాల గ్రాఫిక్స్ వుండే ఈ సినిమాను తెలుగు, మలయాళ, తమిళ, హిందీ భాషల్లో రూపొందిస్తారు. త్వరలో టైటిల్ ప్రకటించనున్నారు. ఇప్పటి వరకు తన ఇమేజ్‌ను పూర్తి స్థాయిలో ఉపయోగించే సినిమా ఇది అవుతుందని, యాక్షన్ సీన్స్‌లో నటించాలన్న తన కల ఈ సినిమాతో నెరవేరుతుందని, వచ్చే ఏడాది ఫిబ్రవరి నుంచి రెగ్యులర్ షూటింగ్ ప్రారంభం కానుందని నటి సన్నీలియోన్ తెలిపారు. ప్రస్తుతం చిత్రానికి ప్రీ ప్రొడక్షన్ కార్యక్రమాలు జరుగుతున్నాయి.

# ఏప్రిల్‌లో 'రోబో2'



రజనీకాంత్, శంకర్ కాంబినేషన్‌లో తాజాగా రూపొందించిన 'రోబో2.0' సినిమాపై భారీ అంచనాలే వున్నాయి. ఆ అంచనాలకు తగిన విధంగా ఈ చిత్రం ఇండియన్ సినిమాల్లో 450 కోట్ల రూపాయల భారీ బడ్జెట్‌తో హైటెక్నికల్ హంగులతో హాలీవుడ్ స్థాయిలో రూపొందింది. బాలీవుడ్ హీరో అక్షయ్‌కుమార్ విలన్‌గా విభిన్నమైన పాత్ర పోషిస్తుండగా, కథానాయికగా అమీజాక్సన్ నటిస్తోంది. తెలుగు, తమిళ హిందీ భాషల్లో రూపొందిన ఈ సినిమాకు సంబంధించిన షూటింగ్ పూర్తి చేసి పోస్ట్ ప్రొడక్షన్ కార్యక్రమాలు శరవేగంగా జరుపుతున్నారు. వచ్చే సంవత్సరం ఏప్రిల్‌లో ప్రపంచ వ్యాప్తంగా విడుదల కానుంది. ఈ చిత్రంలో ఇంకా సుభాష్ పాండే, ఆదిల్ హుసేన్, కళాభవణ్ షాజాన్, రియాజ్ ఖాన్ తదితరులు నటించగా, కెమెరా: నీరౌషా, సంగీతం: ఎ.ఆర్ రహెమాన్.



# 'ఇంద్రసేన' విజయోత్సవం

వైవిధ్య కథలను ఎంచుకొంటూ తెలుగులో తనకంటూ ఓ గుర్తింపు సాధించాడు విజయ్ ఆంటోని. తాజాగా ఆయన 'ఇంద్రసేన'గా తెలుగు ప్రేక్షకుల ముందుకు వచ్చాడు. శ్రీనివాసన్ దర్శకత్వంలో ఎస్.కె.ఆర్. ఫిలిమ్స్ పతాకంపై నీలం కృష్ణారెడ్డి అందించిన ఈ చిత్రం విడుదలైన సంగతి తెలిసిందే. సినిమాకు సంబంధించిన విజయోత్సవ వేడుక ఆదివారం హైదరాబాద్‌లో జరిగింది. ఈ సందర్భంగా రచయిత భాష్యశ్రీ మాట్లాడుతూ ఇంత మంచి విజయాన్ని అందుకున్నందుకు ఆనందంగా ఉందని, రెండు పాటలు బాగున్నాయని అందరూ చెబుతున్నారని అన్నారు. భిన్నమైన కథతో తెలుగు ప్రేక్షకుల మనసులను విజయ్ ఆంటోని ఆకట్టుకున్నారని ఆయన అన్నారు. తనను ఆదరిస్తున్న తెలుగు ప్రేక్షకులకు కృతజ్ఞతలని, ఈ సినిమాలో తాను రెండు పాత్రల్లో నటించానని, అన్నదమ్ముల మధ్య ఉన్న అనుబంధం నేపథ్యంలో తెరకెక్కిన ఈ సినిమాలో భావోద్వేగాలు ప్రేక్షకులను ఆకట్టుకుంటున్నాయని హీరో విజయ్ ఆంటోని తెలిపారు. మంచి పాత్ర ద్వారా తెలుగు ప్రేక్షకులకు పరిచయమైనందుకు సంతోషంగా ఉందని కథానాయిక డైనా చంపిక అన్నారు. ఇంద్రసేన కుటుంబమంతా కలిసి చూడదగిన చిత్రమని, అన్నదమ్ముల అనుబంధ నేపథ్యంలో వైవిధ్యంగా తెరకెక్కిన ఈ చిత్రం మరింత విజయాన్ని అందుకోనున్నదని నిర్మాత నీలం కృష్ణారెడ్డి తెలిపారు. కార్యక్రమంలో సినిమా యూనిట్ పాల్గొని విశేషాలు తెలిపారు.

# మహేష్ కొత్త సినిమా

మహేష్‌బాబు ప్రస్తుతం కొరటాల శివ దర్శకత్వంలో 'భరత్ అను నేను' అన్న చిత్రంలో నటిస్తున్న సంగతి తెలిసిందే. సినిమాకు సంబంధించిన షూటింగ్ పూర్తి కావస్తోంది. జనవరికల్లా సినిమా పూర్తిచేయనున్నారు. మహేష్‌బాబు 25వ చిత్రం ఫిబ్రవరి నుండి మొదలుకానున్నదని తెలుస్తోంది. వంశీ పైడిపల్లి ప్రస్తుతం ఈ చిత్రానికి సంబంధించిన ప్రీ ప్రొడక్షన్ కార్యక్రమాల్లో బిజీగా ఉన్నారు. సాంకేతిక నిపుణుల ఎంపిక, నటీనటుల ఎంపిక జరుగుతోంది. దాదాపు మూడు పాటలను ఫైనలైజ్ చేశారు. ఎక్కువ భాగం షూటింగ్ యుఎస్ బ్యాక్‌డ్రాప్‌లో జరగనున్నది. మహేష్‌బాబు సిల్వర్‌జూబ్లీ సినిమా కావడంతో ప్రేక్షకుల్లో భారీ అంచనాలు నెలకొన్నాయి. చిత్రంలో హీరోయిన్ ఎవరనేది ఇంకా ఫైనల్ కాలేదు.

## తెలుగు చిత్రసీమ

# హద్దులు దాటుతోంది..!

సినిమా అనగానే ఇప్పుడు వస్తున్న ఏదో నాలుగు పాటలు, నాల్గు ఫైట్లు, కాస్త కామెడీ వున్న సినిమాలు కాదు. ఒకప్పుడు ఎన్టీఆర్, ఎఎన్నార్ లాంటి ప్రముఖ నటులు నటించిన పౌరాణిక సినిమాలైన 'పాతాళభైరవి', 'సువర్ణ సుందరి'లాంటి చిత్రాలు హిందీలో రీమేక్ చేయబడి జాతీయ స్థాయిలో అఖండ విజయాన్ని సాధించి వాటికున్న సత్తాను చాటుకున్నాయి. ఇదంతా 1950, 1960 సం.లో జరిగిన విషయం. అదే విధంగా ఇప్పుడు దర్శకులు రాజమౌళి 'బాహుబలి' సినిమాను రెండు భాగాలుగా తీసి తెలుగు చిత్ర పరిశ్రమను అందనంత ఎత్తుకు తీసుకుపోయారు. ఇప్పటి హీరోలతో ఇలాంటి సినిమాలు చేయించడం కష్టమనుకోకుండా ప్రభాస్, రానా, రమ్యకృష్ణ, అనుష్క, తమన్నాలను ఆయన అనుకున్న విధంగా మలచుకుని సినిమా ప్రపంచ వ్యాప్తంగా జనాల్లోకి తీసుకెళ్లి ఔరా అనిపించుకున్నారు రాజమౌళి. బాహుబలి-2లో వున్న ప్రతి పాటా ఒక అద్భుతమైన అర్థంతో కూడిన పాటలు అవి. ఆ పాటల్లో సాహిత్యం, మాధుర్యం చెప్పలేం. నటీనటుల నటన అమోఘం.

ప్రభాస్, రానాలు గడ్డాలు, మీసాలు తల వెంట్రుకలు భారీగా పెంచేసుకుని సినిమా చిత్రీకరణ పూర్తయ్యే వరకు చాలా ఓపికగా ఉండటం ఒక తీపి అనుభూతి. 'బాహుబలి-2' చిత్రాన్ని ప్రేక్షకులు ఆదరించే తీరును బట్టి ఈ సినిమాలో 2వేల కోట్లు వసూలు చేసిందంటే ఆశ్చర్యమేమీ లేదు.

తెలుగు చిత్ర పరిశ్రమలో గత కొంతకాలం చోటుచేసుకున్న గొప్ప పరిణామాలు తెలుగు సినిమా వైభవాన్ని పూర్వవైభవం దిశగా తీసుకెళ్తున్నాయి. గత ఏడాది 2016 సం.లో జాతీయ అవార్డుతో 'శతమానం భవతి' ఉత్తమ ప్రజారణ పొందిన చిత్రగా ఎంపిక కావడం, పెళ్లిచూపులు చిత్రం రెండు జాతీయ అవార్డులు పొందటం, ఈ చిత్రానికి ఉత్తమ మాటల రచయితగా తరుణ్ భాస్కర్ అవార్డును గెలుచుకోవడం, 2015 సం.లో బాహుబలి (ది బిగినింగ్) జాతీయ ఉత్తమ చిత్రంగా ఎంపికై తెలుగు సినిమా చరిత్రలో పెద్ద సంచలనం సృష్టించింది. అలాగే బాహుబలి-2 ఒక్క తెలుగులోనే కాక హిందీ, ఇంగ్లీషు, తమిళ భాషల్లో విడుదల చేయడం గొప్ప సాహసం. 9వేల థియేటర్స్‌లో విడుదల చేయడం అంటే మామూలు విషయం కాదు.

తెలుగు సినిమా మార్కెట్ దినదినాభివృద్ధి చెందుతోంది. తెలుగు సినిమా పరిశ్రమను అంచనా వేయలేని పరిస్థితులు ఉన్నాయి. ఒకప్పుడు అగ్ర కథానాయకులు, నాయికలు నటించిన సినిమాలు మాత్రమే 100కోట్ల రూపాయలు వసూళ్లు చేసేవి. ఇప్పుడు అటువంటి పరిస్థితి ఏమీ కనిపించడంలేదు. పూర్తిగా అంచనాలు తలకిందులయ్యాయి. ఇపుడు మన తెలుగు దర్శకులు తీసిన సినిమాలు, విడుదలకు ముందే ఇతర ప్రాంతీయ భాషల్లోకి రీమేక్ చేయబడి అన్ని భాషల్లోనూ ఒకేసారి విడుదల చేయడంవలన భారీ స్థాయిలోనే వసూళ్లు చేస్తూ వున్నాయి.

మన తెలుగు చిత్ర పరిశ్రమ కేవలం ఉభయ తెలుగు రాష్ట్రాల్లో విడుదల చేయడమే కాకుండా రీమేక్ చేయడంవల్ల ప్రాంతీయ ముద్రను చెరిపేసుకుంటోంది. ఇప్పుడిప్పుడే తెలుగు చిత్ర పరిశ్రమ తన పూర్వ వైభవాన్ని సంతరించుకుంటోంది.

కాశీనాథుని విశ్వనాథ్‌గారికి అతి గొప్పదైన దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు రావడం, చిన్న చిన్న సినిమాలకు కూడా జాతీయ వేదికలపై అవార్డులు వస్తూండడంతో ప్రపంచ సిని పరిశ్రమ వర్గాల దృష్టి మన తెలుగు చిత్ర పరిశ్రమవైపు పడుతున్నాయి. తెలుగు సినిమా ఒక వెలుగు వెలిగిపోతోంది. ప్రపంచ వ్యాప్తంగా మన తెలుగు సినిమా ప్రకాశించబోతోందని ఈ పరిణామాలు చూస్తే అర్థమయిపోతుంది.

ఏరంగంలో అయినా ఆత్మవిశ్వాసంతో, పట్టుదలతో కష్టపడితే చరిత్ర తిరగరాయవచ్చు. ఒకప్పటి పూర్వ వైభవాన్ని ఇప్పుడు తీసుకురావచ్చు. ప్రస్తుతం తెలుగు చిత్ర పరిశ్రమలో జరుగుతుంది ఇదే. యువ దర్శకులు, రచయితలు ఒకప్పటి దర్శకులకు, రచయితలకు తామేమీ తక్కువ కాదని నిరూపిస్తున్నారు. అదే బాటలో యువ హీరోలు కూడా ఇప్పటి జనరేషన్‌కు తగినట్లే కాకుండా పౌరాణిక జానపద యుద్ధ విన్యాసాలున్న సినిమాలు కూడా మేం చేయగలమని నిరూపిస్తున్నారు. ఇదంతా ఒక ఎత్తు అయితే భారతీయ సినీ పరిశ్రమలో అత్యున్నత పురస్కారం దాదాసాహెబ్ ఫాల్కే అవార్డును కళాతపస్వి కె.విశ్వనాథ్ పొందడం తెలుగువారికి గర్వకారణమైంది. తెలుగు సినిమాకు ఘన చరిత్ర ఉన్న సంగతి గతంలో దాదా అవార్డు అందుకున్న బి.ఎన్.రెడ్డి, జయరాజ్, ఎల్.వి.ప్రసాద్, ఎ.ఎన్. ఆర్, డి.రామానాయుడు వంటివారితో ద్విగుణీకృతమైంది. వారితోపాటు విశ్వనాథ్ ఇప్పుడు చేరారు. ఆయనకు ఆలస్యంగా వచ్చినా సరైన గౌరవం దక్కిందని తెలుగువారు ఆనందపడుతున్నారు. ఆయన గొప్ప దర్శకుడే కాక మంచి నటుడు. ఈ అవార్డు దక్కడంతో మరోమారు జాతీయ వేదికపై తెలుగు చిత్ర పరిశ్రమ పేరు మారుమోగింది. ఒకప్పుడు దక్షిణాది సినిమా అంటే కేవలం తమిళ సినిమా అనే ఉద్దేశ్యం ఉండేది. తమిళ సినీ రంగంలో పేరుమోసిన బాలచందర్, భారతీరాజా, శంకర్‌లాంటివాళ్ళతోపాటుగా కమల్‌హాసన్, రజనీకాంత్ లాంటి అగ్రనాయకులు ఉండేవారు. తెలుగు పరిశ్రమ ప్రాంతీయ హద్దుల వరకు మాత్రమే పరిమితమైంది. రాజమౌళి తీసిన బాహుబలి చిత్రం ఆ పరిధుల్ని దాటి రాష్ట్రాలు దాటి తెలుగు సినీ పరిశ్రమ గొప్పతనాన్ని నిరూపించింది.

ఏది ఏమైనా తెలుగు పరిశ్రమ 70వ దశకం నాటి సినిమాలు రూపొందించిన నిర్మాతలు, దర్శకులు, కథానాయకులు ఎంత గొప్ప సినిమాలు తీసి పేరు ప్రఖ్యాతులు గడించారో, నేటి తరం దర్శకులు, నిర్మాతలు, హీరోలు కూడా అలాంటి సినిమాలు తీసి తెలుగు చలనచిత్ర పరిశ్రమ ప్రపంచంలోనే నెంబర్‌వన్ స్థానంలో ఉండేలా ప్రయత్నాలు చేయాలి.

**- శ్రీనివాస్ పర్వతాల**





మిలాద్ ఉన్ నబీ సందర్భంగా శ్రీనగర్‌లో ఆదివారం ప్రదర్శన నిర్వహిస్తున్న ముస్లిం బాలికలు


Estd. 1938

# ఆంధ్రప్రభ

www.prabhanews.com

Journalism first!



నేటి మీ కపిల్‌చిట్స్ తో సభ్యత్వం
ఓ మంచి ఆర్థిక నేస్తంతో బంధుత్వం
KAPIL GROUP
Visit Us: www.kapilchits.com
36
కపిల్ చిట్స్
కపిల్ చిట్స్ మీ కలలకు సాకారం



సంపుటి: 60 • సంచిక: 329 • సోమవారం 4 డిసెంబర్ 2017 • విజయవాడ ❋ పేజీలు: 22 • వెల: 5.00 • Published from: Vijayawada | Kurnool | Hyderabad | Guntur | Rajahmundry | Visakhapatnam | Tirupati | Karimnagar | Suryapet | Anantapur | Nellore | Nizamabad


**ముహూర్తం** శ్రీ హేవళంబి నామ సంవత్సరం, దక్షిణాయణం, హేమంతఋతువు, మార్గశిర మాసం, తిథి: బహుళ పాడ్యమి రా. 7.56 వరకు, అనంతరం విదియ; నక్షత్రం: రోహిణి ఉ. 8.32 వరకు, అనంతరం మృగశిర; అమృతకాలం: రా. 10.35 నుండి 12.05 వరకు; వర్జ్యం: మ. 1.46 నుండి 3.15 వరకు; దుర్ముహూర్తం: మ. 12.11 నుండి 12.55 వరకు, తదుపరి మ. 2.23 నుంచి 3.08 వరకు; రాహుకాలం: ఉ. 7.30 నుండి 9.00 వరకు; యమగండం: ఉ.10.30 నుండి 12.00 వరకు

## చంద్రబాబు బృందం దక్షిణ కొరియా పయనం

# పెట్టుబడులే లక్ష్యం

**3 రోజులు.. 50 కంపెనీలు**

**6 ద్వైపాక్షిక భేటీలు... 3 ఎంవోయూలు**

**గ్రూపు సమావేశాలు.. రోడ్ షోలు... బిజినెస్ సెమినార్లు**





**అమరావతి, ఆంధ్రప్రభ:** ముఖ్యమంత్రి నారా చంద్ర బాబునాయుడు బృందం మూడు రోజులపాటు (డిసెంబర్ 4,5,6తేదీలలో) దక్షిణ కొరియాలో పర్యటించేందుకు ఆది వారం రాత్రి బయలుదేరి వెళ్లింది. పెట్టుబడులే ప్రధాన లక్ష్యంగా ముఖ్యమంత్రి పర్యటన కొనసాగనుంది. ఆదివారం రాత్రి 8గంటలకు ఢిల్లీ నుండి బయలుదేరిన ముఖ్యమంత్రి బృందం భారతకాలమానం ప్రకారం నేటి తెల్లవారుజామున 2.20నిమి షాలకు సియోల్ చేరుకోనుంది. తొలుత భారత రాయబారి విక్రమ్ దొరై స్వామితో ముఖ్యమంత్రి సమావేశం కానున్నారు. అనంతరం 6.15నిమిషాలకు కియా మోటర్స్ ప్రతినిధులతో భేటీ అవుతారు. అదే విధంగా 6.50నిమిషాలకు దాసన్ నెట్ వర్క్ చైర్మన్ నామ్ మెయిన్ వూ, 7గంటలకు జూసంగ్ ఇంజ నీరింగ్ సీఈవో చుల్ జూ, ఇరిటెక్ సీఈవో కిమ్‌దే హూన్, 8.30 నిమిషాలకు లొట్టే కార్పొరేషన్ సీఈవో వాంగ్ కాగ్జూతో ముఖ్య మంత్రి బృందం సమావేశం అవుతుంది. ఈ పర్యటనలో దాదాపు 50 కంపెనీలతో ఆయన ప్రత్యక్షంగానూ, పరోక్షం గానూ సమావేశాలు నిర్వహించనున్నారు. ఈ పర్యటనతో రూ.13,500 కోట్ల మేర పెట్టుబడులు ఏపీకి వచ్చే అవకాశం ఉంది. దక్షిణ కొరియాలో పెట్టుబడుల ఆకర్షణే ప్రధానాంశంగా ముఖ్యమంత్రి సియోల్, బూసన్ నగరాల్లో పర్యటించ నున్నారు. కియా మోటార్స్ హెడ్ క్వార్టర్స్‌ను సందర్శించి, బిజినెస్ సెమినార్లో పాల్గొంటారు. కృష్ణపట్నం పోర్టుతో భాగ స్వామ్యానికి సంబంధించిన మరో బిజినెస్ సెమినార్‌లో ముఖ్య మంత్రి పాల్గొంటారు. ముఖ్యంగా, బూసన్ సిటీలో పూసన్ న్యూపోర్టు కంపెనీ, మేకిన్ ఇండియా సెంటర్, నాక్-శాన్ నేషనల్ ఇండస్ట్రియల్ కాంప్లెక్స్, మయోంగ్జీ ఫ్రీ ఎకనమిక్ జోన్ సందర్శిస్తారు. కొరియా కార్ల దిగ్గజనం 'కియా', దాని అను బంధ సంస్థలు మొత్తం కలిపి రూ.13,500 కోట్ల పెట్టుబడులతో అనంతపురం జిల్లాలో అల్ట్రా మెగా ఇంటిగ్రేటెడ్ ఆటోమొబైల్ ప్రాజెక్టును నెలకొల్పుతోంది. ఈ స్ఫూర్తితో రాష్ట్రానికి మరిన్ని పెట్టుబడులు ఆకర్షించేందుకు ముఖ్యమంత్రి ఈ యాత్ర తల పెట్టారు. ముఖ్యమంత్రి బృందంలో ఆర్థిక శాఖా మంత్రి యన మల రామకృష్ణుడు, వాణిజ్యం, పరిశ్రమలు, ఆహారశుద్ధి శాఖల మంత్రి అమరనాథరెడ్డి, ప్రభుత్వ సలహాదారు డాక్టర్ పరకాల ప్ర భాకర్, సీఎంవో కార్యదర్శి జి సాయిప్రసాద్, పరిశ్రమల శాఖ కార్యదర్శి సాల్మన్ ఆరోకియా రాజ్, ఈడీబీ సీఈవో జాస్తి కృష్ణకిశోర్, ఏపీఐఐసీ ఏండీ అహ్మద్ బాబు ఉన్నారు.

**ముఖ్యమంత్రి పర్యటన సాగేదిలా..**

డిసెంబర్ 4న ఎస్సెట్జ్ గ్రూపుతో ఏపీఈడీబీ అనంత పురంలో ఏర్పాటు చేయనున్న వరల్డ్‌క్లాస్ స్మార్ట్ ఇండస్ట్రియల్ సిటీ ఏర్పాటుకు సంబంధించి ఎంవోయు కుదుర్చుకోనున్నారు. ఇండస్ట్రియల్ పార్క్, లాజిస్టిక్ పార్క్, వేర్ హౌసింగ్, కమర్షి యల్ స్పేస్, హౌసింగ్, గోల్ఫ్ కోర్స్ ఇందులో భాగంగా ఉంటాయి. ఇందులో 29 కంపెనీల భాగస్వామ్యం అవుతాయి. వీటితోపాటు మరో 10 కంపెనీలు కూడా తమ భాగస్వామ్యాన్ని అందించేందుకు ఆసక్తి చూపిస్తున్నాయి. కియా మోటార్స్‌కు సంబంధించి 17 అనుబంధ సంస్థలతో ఏపీఐఐసీ, ఈడీబీ అవగాహన ఒప్పందాలు

➪ 2వ పేజీలో...



## భారత జాతీయ కాంగ్రెస్‌కు యువ సారథి!

• నేడు నామినేషన్

• హస్తినకు నేతల క్యూ

7



## గర్భిణీ హత్య!

• ప్రియుడే యముడు

• చంపేసి పూడ్చివేత

**డోన్, కెఎన్ఎన్:** ప్రేమికుడే కాల యముడైన ఉదంతం డోన్ పట్టణం లో చోటుచేసుకుంది. డోన్ పట్టణం లోని మెహ్‌తాజ్ గార్మెంట్ షాపులో కొండపేటలో నివసిస్తున్న రమిజా (21) పనిచేస్తోంది. షాపు యజమాని కుమారుడు రషీద్‌బాషా అలియాస్ సిద్దు వైష్ణవి డిగ్రీ కళాశాలలో చదువు తున్నాడు. రమిజ, సిద్దులు గత కొంత కాలంగా ప్రేమించుకుంటున్నారు. వీరి ప్రేమ వ్యవహారం చివరకు రమి జా 8 నెలల గర్భవతి అయ్యేవరకూ వచ్చింది. దీంతో గతంలో పోలీసు స్టేషన్‌లో కూడా

➪ 7వ పేజీలో...

## రెచ్చగొడుతున్నారు... జర జాగ్రత్త!



• అప్రమత్తంగా ఉండండి

• ఏ వర్గానికీ ఇబ్బంది లేకుండా కాపు కోటా • నిబంధనల ప్రకారమే అసెంబ్లీలో బిల్లులు

• బీసీ రిజర్వేషన్లలో కోత లేదు

• ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీలతో టెలీకాన్ఫరెన్స్‌లో చంద్రబాబు

**అమరావతి, ఆంధ్రప్రభ :** కాపు రిజర్వే షన్లపై కొన్ని పార్టీలు రాజకీయ లబ్ధి కోసం కుటిల యత్నాలు చేస్తూ కులాలను రెచ్చగొట్టే పనిలో ఉన్నాయని, వీటి పట్ల అప్రమత్తంగా ఉండాలని తెలుగుదేశం పార్టీ నేతలకు ముఖ్యమంత్రి చంద్ర బాబునాయుడు సూచించారు. కాపు రిజర్వేషన్ల ప్రకటన అనంతర పరిణామాలపై ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు ఆదివారం హైదరాబాద్ లోని తన క్యాంపు కార్యాలయం నుంచి మంత్రు లు, ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీలతో టెలీకాన్ఫరెన్స్ నిర్వహించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లా డుతూ ఏ వర్గానికీ

➪ 2వ పేజీలో...



## సర్వత్రా ఉత్కంఠత మంజునాథ్ నివేదిక నేడు

• బహిరంగపరచాలని పార్టీల డిమాండ్

**అమరావతి, ఆంధ్రప్రభ :** కాపులకు సంబంధించిన మంజునాథ్ కమిషన్ వ్యవ హారం ప్రస్తుతం రాష్ట్రంలో హాట్‌టాపిక్‌గా మారింది. ఎక్కడ చూసినా దీనిపైనే చర్చిం చుకుంటున్నారు. ఉన్న ఫలంగా కమిషన్ నివేదికరావడమేమిటీ ? అసలేం జరిగిం దంటూ ఒకరినొకరు ఆరా తీస్తున్నారు. అసలు మంజునాథ్ తన నివేదికలో ఏం చెప్పారో

➪ 3వ పేజీలో...

## బియ్యం వద్దంటే.. చిరుధాన్యాలు

• పాత రేషన్ కార్డుల స్థానంలో కొత్తవి

• గ్రామసభల్లో అర్హులకు కొత్త కార్డులు

• జనవరి నుంచి పంచదార పంపిణీ

• ఇక విలేజ్ మాల్స్‌గా రేషన్ దుకాణాలు

• ప్రజా పంపిణీ వ్యవస్థలో సమూల మార్పులు



**అమరావతి, ఆంధ్రప్రభ :** ప్రజా పంపిణీ వ్యవస్థలో సమూల మార్పులు తీసుకువచ్చేందుకు ప్రభుత్వం సన్నా హాలు ప్రారంభించింది. ఇప్పటి వరకు రేషన్ దుకాణాలుగా చెలామణి అవుతున్న వాటిని విలేజ్‌మాల్స్‌గా మార్చేందుకు ప్రణాళికలు సిద్ధం చేస్తోంది. అంతేకాకుండా రేషన్ పంపిణీ లో అవకతవకలను నివారించేందుకు మరింత పకడ్బందీ చర్యలు చేపట్టాలని భావిస్తోంది. కొత్తగా ఏర్పాటు చేయనున్న విలేజ్ మాల్స్‌లో రేషన్‌తోపాటు వివిధ రకాల నిత్యావసరా లను ప్రజలకు అందుబాటులో ఉంచాలని ప్రభుత్వం నిర్ణ యించింది. 20 శాతం సబ్సిడీతో నిత్యావసరాలను ప్రజలకు అందేలా ప్రణాళికలు రూపొందిస్తోంది. వాల్ మార్ట్, బిగ్ బజార్, రిలయన్స్ లాంటి ప్రముఖ సంస్థలతో ప్రభుత్వం సంప్రదింపులు జరుపుతోంది. అయితే సంప్రదింపులు ఇంకా కొలిక్కి రావాల్సిన అవసరం ఉంది. సాధ్యమైనంత త్వరలో రాష్ట్రవ్యాప్తంగా ఈ విలేజ్ మాల్స్‌ను ప్రజలకు అందుబాటు లో తీసుకురావాలని యోచిస్తోంది. ప్రస్తుత ప్రభుత్వ నియ మ, నిబంధనల ప్రకారం మూడు నెలల్లో ఒక్కసారైన లబ్ధి దారుడు రేషన్ తీసుకున్నట్లయితే కార్డు రద్దు చేసేవారు. అయితే ప్రభుత్వం తాజాగా ఆ విధానానికి స్వస్తి పలకనుంది. రేషన్ వద్దు అనుకునేవారు కార్డును

➪ 7వ పేజీలో...



## ఇక గ్రామాలకూ ఎల్ఈడీ వెలుగులు

• 35 లక్షల వీధి దీపాల ఏర్పాటు • వేగవంతానికి రన్‌రేట్ మెకానిజం • సర్పంచ్‌లూ వ్యక్తిగత బాధ్యత తీసుకోండి • సీఎం, మంత్రి డ్యాష్ బోర్డులతో అనుసంధానం • గ్రామీణాభివృద్ధిశాఖ మంత్రి లోకేష్

3

## ఔరా..!




## కక్షిదారునికి సుప్రీం సారీ!

• ఒకే జడ్జి.. ఒకే కేసు.. రెండు వేర్వేరు తీర్పులు • దశాబ్దకాలంగా జాప్యంపై విచారం



**న్యూఢిల్లీ:** క్రిమినల్ కేసు విచారణ చేప ట్టడంలో ఒక దశాబ్ద కాలానికి పైగా జాప్యం చోటు చేసుకున్నందుకు ఓ కక్షి దారునికి సుప్రీం కోర్టు క్షమాపణ చెప్పిం ది. ఒకే దానికి సంబంధించిన రెండు వేర్వే రు కేసుల్లో హైకోర్టు జడ్జీ ఒకరు రెండు విరు ద్ధమైన తీర్పులు ఇచ్చిన కారణంగానే జాప్యం తలెత్తిందని సర్వోన్నత న్యాయ స్థానం నిర్మొహమాటంగా అంగీకరిం చింది. కేసుకు సంబంధించి ఒక తీర్పులో ముమ్మందు దర్యా ప్తును నిరాకరించిన జడ్జీ మరో తీర్పులో దర్యాప్తు చేపట్టాలని ఆదేశించడంతో ఇది ఒక న్యాయపరమైన చిక్కును సృష్టించిం దని సుప్రీం కోర్టు వ్యాఖ్యానించింది. న్యాయ వివాదాల్లో చిక్కుకుపోయిన ఆ కేసు 2009లో సర్వోన్నత న్యాయస్థానానికి చేరుకుంది. తన సొంత సోదరులే తన దుకాణాన్ని అక్రమంగా స్వాధీనం చేసుకు న్నారంటూ 2004లో ఫిర్యాదు చేసిన మహిళ చనిపోవడంతో చట్టబద్ధంగా ఆమె ప్రతినిధి ఒకరు సదరు కేసుకు ప్రాతినిధ్యం వహిస్తున్నారు. అలాంటి ఒక గందర గోళం చివరకు క్రిమినల్ విచారణ ప్రారంభించడంలోనూ దశాబ్దానికిపైగా జాప్యానికి దారి తీయడం పట్ల మేం క్షమాపణ చెబుతున్నాం అని జస్టిస్ ఆర్.కె.అగర్వాల్,

➪ 7వ పేజీలో...



## ప్రియుడి కోసం.. కన్నతల్లి కిరాతకం

• నాలుగేళ్ల కుమార్తెపై చిత్రహింసలు

8 లో

## కదులుతున్న డీసీఎంలో గర్భవతిపై లైంగిక దాడి

• మాన రక్షణ కోసం వాహనం నుంచి దూకేసి ప్రాణం తీసుకుంది

7 లో

# పెట్టుబడులే లక్ష్యం!

(మొదటిపేజీ తరువాయి)

కుదుర్చుకోనున్నాయి.

డిసెంబర్ 5న బూసన్, ఏపీఐఐసీ మధ్య ఎంవోయూ జరిగే అవకాశం ఉంది. డిసెంబరు 5,6 తేదీల్లో 2 రోడ్ షోల్లో ముఖ్యమంత్రి పాల్గొంటారు. డిసెంబరు 5న బూసన్ సిటీలో కొరియా భారత రాయభారి కార్యాలయం, ఏపీ ప్రభుత్వంతో కలిసి బిజినెస్ సెమినార్ నిర్వహిస్తారు. 5న ఎంబసీతో కలిసి ఏపీ ప్రభుత్వ బృదం బిజినెస్ సెమినార్‌లో పాల్గొంటుంది.

డిసెంబర్ 6న కియా మోటార్స్‌తో కలిసి మరో బిజినెస్ సెమినార్ జరుగుతుంది. ఈ పర్యటనలోనే కియా మోటార్స్ హెడ్ క్వార్టర్స్ సందర్శించి వైస్ ఛైర్మన్ హయాంగ్ కియున్‌లీతో భేటీ అవుతారు. 6న కియా మోటార్స్‌తో కలిసి సియోల్‌లో బిజినెస్ సెమినార్‌లో పాల్గొంటారు.



### 6 ద్వైపాక్షిక సమావేశాలు

ఆటోమొబైల్ దిగ్గజం కియా వైస్ ఛైర్మన్, లొట్టె కార్పొరేషన్ ప్రెసిడెంట్‌లతో ముఖ్యమంత్రి బృందం సమావేశం కానుంది. ఈ సందర్భంగా 90కి పైగా వివిధ బిజినెస్ యూనిట్స్‌పై చర్చించనున్నారు. వీటిలో క్యాండీ తయారీ, బేవరేజెస్, హోటల్, ఫాస్ట్ ఫుడ్, రిటైల్, ఫైనాన్సియల్ సర్వీసెస్, హెవి కెమికల్స్, ఎలక్ట్రానిక్స్, ఐటీ, కనస్ట్రక్షన్, పబ్లింగ్స్, ఎంటర్‌టైన్‌మెంట్ వంటివి ఉన్నాయి. అలాగే కోకం కంపెనీ లిమిటెడ్ సీఈవోతో జరిగే భేటీలో ఎనర్జీ మేనేజ్‌మెంట్ సిస్టమ్, లిథియమ్ పాలిమర్స్ బ్యాటరీస్ వంటి అంశాలపై చర్చించనున్నారు. ఓసీఐ కంపెనీ లిమిటెడ్ ప్రెసిడెంట్‌తో నిర్వహించనున్న సమావేశంలో గ్రీన్ ఎనర్జీ కంపెనీ, పెట్రో అండ్ కోల్ కెమికల్స్, ఇనార్గానిక్ కెమికల్స్, రెవెన్యూ ఎనర్జీ ప్రోడక్ట్స్‌లపై చర్చిస్తారు. యంగ్ వన్ కంపెనీ ఛైర్మన్‌తో నిర్వహించనున్న భేటీలో లీడింగ్ గ్లోబల్ మాన్యుఫాక్చరర్-అవుడ్డోర్ అథ్లెటిక్ క్లాతింగ్, టెక్స్‌టైల్స్, ఫుట్‌వేర్ అంశాలపై భేటీ కానున్నారు. కొరియాలో ఆటోమొబైల్ మాన్యుఫాక్చరర్స్ అసోసియేషన్ మేనేజింగ్ డైరెక్టర్‌తో కూడా ఆయన ప్రత్యేకంగా భేటీ కానున్నారు.

### గ్రూపు మీటింగ్స్

ఈ పర్యటనలో భాగంగా ముఖ్యమంత్రి పలు సంస్థలతో గ్రూపు సమావేశాలు నిర్వహించనున్నారు. వీటిలో 17 కియా అనుబంధ సంస్థల ప్రతినిధులతో ఆటోమొబైల్ పరిశ్రమల ఏర్పాటుపై చర్చించనున్నారు. అలాగే కియాకు అనుబంధంగా ఉన్న మరో 27 టూ టైర్, త్రీ టైర్ సంస్థల ప్రతినిధులతో ఇదే ఆటోమొబైల్ పరిశ్రమల స్థాపనపై చర్చించనున్నారు. ఇవేకాకుండా దక్షిణ కొరియా ప్రభుత్వ ప్రతినిధులతో ప్రత్యేకంగా సమావేశాలు నిర్వహించనున్నారు. బూసన్ కాన్సులేట్ జనరల్ జియాంగ్ టెక్ మిన్, బూసన్ మెట్రో పాలిటన్ సిటీ మేయర్ సుహ్ బైంగ్సూలతో ఆయన ప్రత్యేకంగా సమావేశం కానున్నారు.

### 3 ఎంవోయూలు

దక్షిణ కొరియా పర్యటనలో భాగంగా ముఖ్య మంత్రి మూడు ఎంవోయులను కుదుర్చుకోనున్నారు. వీటిలో ఇప్పటికే రెండు ఎంవోలు ఖరారుకాగా మరొకటి జరిగే అవకాశం ఉంది. వీటిలోఅనంతపురంలో ఏర్పాటు చేయనున్న వరల్డ్‌క్లాస్ స్మార్ట్ సిటీ ఏర్పాటుపై ప్రాపర్టీ కంపెనీ అయిన ఎస్సెట్జ్‌గ్రూపుతో ఏపీఈడీబీ ఎంవోయూ, కియో మోటార్స్ 17 అనుబంధ సంస్థలతో ఏపీఐఐసీ, ఈడీబీ అవగాహన ఒప్పందం ఇప్పటికే కుదిరాయి. ఇక బూసన్, ఏపీఐఐసీ మధ్య ఎంవోయూ ఒక్కటే ఖరారు కావాల్సి ఉంది. ఇది కూడా ఈ పర్యటనలో జరిగే అవకాశం ఉంది.

### రోడ్ షోలు - బిజినెస్ సెమినార్లు - 2

5న ఎంబసీతో కలిసి ఏపీ ప్రభుత్వం బిజినెస్ సెమినార్‌లో పాల్గొంటారు. 6న కియా మోటార్స్‌తో కలిసి సియోల్‌లో బిజినెస్ సెమినార్‌లో పాల్గొంటారు.

### ఏపీలో బూసన్ తరహా ఇండస్ట్రీయల్ సిటీ

ఆంధ్రప్రదేశ్‌లో అన్ని అనుకూలతలు ఉన్న ఏదైనా ఒక ప్రాంతంలో కొరియన్ సిటీ ఏర్పాటుచేస్తామని ముఖ్యమంత్రి ఇప్పటికే ప్రకటించారు. సమగ్ర ప్రతిపాదనలతో వస్తే అవగాహన ఒప్పందాలు కూడా చేసుకుందామని ముఖ్యమంత్రి చెప్పారు. నిర్దిష్ట ప్రతిపాదనలతో పెట్టుబడులు పెట్టేందుకు ముందుకొచ్చిన వారందరికీ సత్వర అనుమతులిచ్చి తగిన సహకారం అందిస్తామని హామీ ఇచ్చారు. పరిశ్రమల స్థాపనకు అవసరమయ్యే అనుమతులు సులభంగా అందించడమే కాకుండా, భూములు, నీరు, నిరంతర విద్యుత్తు, ఇతర రాయితీలు ఇచ్చి ప్రోత్సహిస్తామని ముఖ్యమంత్రి చెప్పారు. బూసన్‌లో ఉన్న మొత్తం 3 వేల కంపెనీలు వచ్చినా అందరికీ ఇక్కడ అపార అవకాశాలు ఉన్నాయని ముఖ్యమంత్రి చెప్పారు.

### కియా కంపెనీ రాకతో మరిన్ని కంపెనీలు క్యూ

పెద్ద సంఖ్యలో పరిశ్రమలు పెట్టిందుకు ముందుకువస్తే ప్రభుత్వపరంగా అన్ని విధాలా ప్రోత్సాహం కల్పించేందుకు ప్రభుత్వం సిద్ధంగా ఉంది. ఏపీలో పెట్టుబడులకు ఉన్న అనేక సానుకూలతలను చూసి ఇప్పటికే పలు కొరియన్ కంపెనీలు ముందుకొచ్చాయి. దక్షిణ కొరియాకు చెందిన చిన్న కార్లదిగ్గజం కియా అనంతపురంలో ప్లాంట్ ఏర్పాటు చేస్తోంది. దానికి అనుబంధంగా మరో 39 అనుబంధ సంస్థలు ముందుకు వచ్చాయి. అదే బాటలోనే దక్షిణ కొరియా నుండి మరిన్ని సంస్థలు ఇక్కడ పెట్టుబడులు పెట్టడానికి ఆసక్తి చూపుతున్నాయి. ఈ మధ్యనే దక్షిణ కొరియా కాన్సుల్ జనరల్ జియోంగ్ డ్యూయెక్ మిన్ నేతృత్వంలో పారిశ్రామికవేత్తల బృందం ఒకటి ఏపీలో పర్యటించింది. ఏయే రంగాల్లో పెట్టుబడులకు అవకాశాలున్నాయో సమగ్రంగా అధ్యయనం చేసింది. ఈ రాష్ట్రంలో భూముల లభ్యత, రాయితీలు, సహకారం, అనుమతులిచ్చే విధానం తదితర అన్ని అంశాలను క్షేత్రస్థాయిల తెలుసుకుని ఈ బృందం సంతృప్తి చెంది వెళ్ళింది. ఎలక్ట్రిక్ స్టీల్, లాజిస్టిక్స్, నిర్మాణరంగం, ఫైనాన్స్, ఆటోమొబైల్ కాంపోనెంట్స్, హెవీ ఎక్విప్‌మెంట్ మాన్యుఫ్యాక్చరింగ్, ఎలక్ట్రానిక్ కాంపోనెంట్స్, బ్యాటరీ, మీట్ ప్రాసెసింగ్, లిక్కర్స్, షిప్ బిల్డింగ్, మెడికల్, మెరైన్ అక్విప్‌మెంట్ రంగాల్లోపెట్టుబడులు పెట్టేందుకు కొరియన్‌కంపెనీలు సిద్ధంగా ఉన్నాయి. ఏపీలో ఓడరేవుల అభివృద్ధి, నైపుణ్యాభివృద్ధి అంశాలలో మనం కొరియా సహకారాన్ని కోరుతున్నాం.

## దక్షిణ కొరియా పర్యటన పూర్వాపరాల నేపథ్యం

దక్షిణ కొరియాతో ఏపీకి అనేక అంశాలలో సామీప్యత ఉంది. జనాభాపరంగా దక్షిణ కొరియా, ఆంధ్రప్రదేశ్ రెండూ సమానంగానే ఉన్నాయి. అలాగే విస్తీర్ణంలో దగ్గరదగ్గరగా ఉంటాయి. దక్షిణ కొరియాలో ఉన్నట్లే ఏపీలోకూడా సుదీర్ఘ తీర ప్రాంతం ఉంది. దక్షిణ కొరియా ఎలాగైతే వేరుపడిందో ఇక్కడ కూడా అదేవిధంగా ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ నుండి ఆంధ్రప్రదేశ్ వేరుచేయబడింది. ఎలాగైతే దక్షిణ కొరియా స్వల్పకాలంలోనే సొంతకాళ్ళపై నిలబడగలిగిందో, అలానే ఇక్కడ కూడా రెండేళ్ళ కాలంలోనే రెండంకెల వృద్ధి రేటుతో నవ్యాంధ్ర నిలబడింది. అక్కడ ఆ దేశం ఎలాగైతే పారిశ్రామికంగా అభివృద్ధి సాధించి స్ఫూర్తిదాయకంగా నిలిచిందో, పెట్టుబడులను ఆకర్షిస్తూ ఆంధ్రప్రదేశ్ కూడా అదే బాటలో పయనిస్తోంది. ఏపీని రెండో రాజధానిగా మార్చుకోవాలని పలు కొరియన్ కంపెనీలు ఇటీవల అమరాతి విజిట్ చేసిన సందర్భంలో ఇవే అంశాలను ముఖ్యమంత్రి ఆయా కంపెనీల ప్రతినిధులకు సూచించారు.

ఇండస్ట్రియల్

# రెచ్చగొడుతున్నారు... జర జాగ్రత్త!

(మొదటిపేజీ తరువాయి)

అన్యాయం జరగకుండా కాపు లకు రిజర్వేషన్లు కల్పించామని స్పష్టం చేశారు. కాపు రిజర్వేషన్లకు సంబంధించిన డిమాండ్లు చాలా కాలంగా ఉందని, ఎన్నికల మేనిఫెస్టోలో పొందుపరిచిన విధంగా ఈ హామీని నెరవేర్చి మాట నిలుపుకున్నామన్నారు. నిబంధనల ప్రకారమే కాపు రిజర్వేషన్ల బిల్లును అసెంబ్లీలో ప్రవేశపెట్టామన్నారు. బీసీ కమిషన్‌లోని మెజార్టీ సభ్యులు ఇచ్చిన నివేదిక ఆధారంగా కాపు రిజర్వేషన్లపై నిర్ణయం తీసుకున్నామన్నారు. కాపు రిజర్వేషన్లకు, బీసీ రిజర్వేషన్లకు ఎలాంటి సంబంధం లేదన్నారు. బీసీల రిజర్వేషన్‌లో ఎలాంటి కోత లేకుండా కాపులకు రిజర్వేషన్లు కల్పిస్తామని స్పష్టంగా చెప్పామని, ప్రస్తుతం అదే నిర్ణయం తీసుకున్నామన్నారు. బీసీలకు ఎటువంటి అన్యాయం జరగలేదని ముఖ్యమంత్రి స్పష్టం చేశారు. బీసీల అభ్యున్నతికి తెలుగుదేశం పార్టీ ఎప్పుడూ కట్టుబడి ఉంటుందని తెలిపారు. కాపులను, బీసీలను తమ పార్టీ ఏనాడూ ఓటు బ్యాంకుగా భావించలేదన్నారు. ఈ సందర్భంగా బీసీ సంఘ నేత ఆర్.కృష్ణయ్య ప్రభుత్వంపై విమర్శలు చేస్తున్నారని పలువురు ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీలు ముఖ్యమంత్రి దృష్టికి తీసుకువెళ్ళారు. తెలంగాణాలో కొన్ని కులాలను బీసీ జాబితా నుంచి తొలగించినా మౌనంగా ఉన్న ఆయన, ఇప్పుడు దురుద్దేశపూర్వకంగా వ్యవహరిస్తున్నారని తెలిపారు. దీనిపై స్పందించిన ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు నేతలను సమన్వయం చేసుకోవాల్సిన అవసరం ఉందని, అనవసరంగా ఎవరూ వ్యాఖ్యలు చేయవద్దని నిర్దేశించారు.

కాపు రిజర్వేషన్లపై బీసీ సంఘాల ఆందోళన, మంజునాథ్ వివాదంపై ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు పార్టీ నేతలకు పలు సూచనలు చేశారు. కాపు రిజర్వేషన్లపై జిల్లాల్లో జరుగుతున్న పరిణామాలను ఎప్పటికప్పుడు గమనించి తన దృష్టికి తీసుకురావాలని ఆదేశించారు. నేతలతో సమన్వయం చేసుకునే బాధ్యతను మంత్రులు కళా వెంకట్రావు, అచ్చెన్నాయుడు, ఎమ్మెల్సీ టీడీ జనార్దన్‌లకు అప్పగించారు.

## డోన్, పత్తికొండ స్థానాల్లో టీడీపీ విజయం ఖాయం



బహిరంగ సభలో ప్రసంగిస్తున్న కేఈ.కృష్ణమూర్తి

**డోన్, కెఎన్ఎన్:** రానున్న 2019 ఎన్నికలలో డోన్, పత్తికొండ నియోజక వర్గాల్లో కేఈ కుటుంబం విజయం సాధించడం ఖాయమని రాష్ట్ర ఉప ముఖ్యమంత్రి కేఈ కృష్ణమూర్తి అన్నారు. ఆదివారం కర్నూలు జిల్లా ప్యాపిలీ పట్టణంలో ఏర్పాటు చేసిన బహిరంగ సభలో ఆయన మాట్లాడుతూ డోన్ నుండి కేఈ ప్రతాప్‌ను, పత్తికొండ నుండి కేఈ శ్యాంబాబులు పోటీ చేస్తారని, ఈ రెండు నియోజకవర్గాల్లో తెలుగుదేశం పార్టీ జెండాను ఎగురవేయడం ఖాయమని ఆయన అన్నారు. పత్తికొండ నియోజకవర్గం వైకాపా అభ్యర్థిగా ప్రకటించిన వారికి ఎటువంటి ఫ్యాక్షన్ లేదని చెప్పడం విడ్డూరంగా ఉందన్నారు. వారి కుటుంబం మొదటి నుండే ఫ్యాక్షన్ కుటుంబమని అన్నారు. ఇప్పుడు ఫ్యాక్షన్‌కు మాకు ఎటువంటి సంబంధంలేదని చెప్పడం ప్రజలు గమనిస్తున్నారన్నారు. ఎవరు ఎన్ని పాదయాత్రలు చేసినా, ప్రజలను ఏవిధంగా మభ్యపెట్టినా రాబోయే ఎన్నికలలో తెలుగుదేశం పార్టీకి ప్రజలు బ్రహ్మారథం పడతారని భరోసా వ్యక్తం చేశారు. ఈ కార్యక్రమంలో రాజ్యసభ్యుడు టీజీ వెంకటేష్, జిల్లా టీడీపీ అధ్యక్షుడు సోమిశెట్టి వెంకటేశ్వర్లు, ప్రధాన కార్యదర్శి వై.నాగేశ్వరరావుయాదవ్, జిల్లా కోఆపరేటివ్ సంఘం అధ్యక్షుడు మల్లికార్జునరెడ్డి, డోన్ ఎంపీపీ లక్ష్మీదేవి, ధర్మారం సుబ్బారెడ్డి, మార్కెట్‌యార్డు ఛైర్మన్ మురళీకృష్ణగౌడ్, మున్సిపల్ వైస్ ఛైర్మన్ కేశన్నగౌడ్, కొత్తకోట శ్రీను, వెంకటనాయునిపల్లె శ్రీను, తిమ్మయ్యయాదవ్, వలసల రామకృష్ణ, నాయకులు, కార్యకర్తలు తదితరులు పాల్గొన్నారు.

## పోలవరాన్ని కేంద్రం చేపడితే
# నల్లేరు మీద నడకే

● చంద్రబాబు ఊహల నుంచి బయటకు రావాలి ● ప్రజలకు నిజాలు చెప్పి శ్వేతపత్రం విడుదల చేయాలి ● పోలవరం వైఎస్ ప్రాజెక్టే: ఉండవల్లి




విజయవాడలోని మీట్ ది ప్రెస్‌లో మాట్లాడుతున్న ఉండవల్లి

**అమరావతి, ఆంధ్రప్రభ**: పోలవరాన్ని కేంద్ర ప్రభుత్వం చేపట్టినట్లయితే నల్లేరుమీద నడకలా సాగేదని, ఇప్పుడు పోలవరాన్ని ఏంచేస్తారో అర్థం కావటంలేదని మాజీ పార్లమెంట్ సభ్యుడు ఉండవల్లి అరుణ్‌కుమార్ ఆవేదన వ్యక్తం చేశారు. ఆదివారం విజయవాడలో మీట్ ది ప్రెస్ కార్యక్రమంలో మాట్లాడుతూ చంద్రబాబు ప్రభుత్వం రూ.2.16లక్షల కోట్లు ఖర్చు పెట్టారని, అందులో రూ.96వేల కోట్లు పాత రుణం అయితే రూ.1.20 లక్షల కోట్లు ఎవరికిచ్చారని ప్రశ్నించారు. చంద్రబాబు ఊహల నుంచి బయటకి రావాలని పోలవరం విషయంలో ప్రజలకు నిజాలు చెప్పాలని, ఒక శ్వేతపత్రం విడుదల చేయాలన్నారు.

విభజన సమయంలో ఏపీకి కంటితుడుపు చర్యగా పోలవరం జాతీయ హోదా, రాయితీ ప్రకటించారని పోలవరం పూర్తయితే రాష్ట్రంలోని 80శాతం కెనాల్ ఇరిగేషన్ పరిధిలోకి వస్తుందన్నారు. ఇది వైయస్ ప్రాజెక్టని, కేంద్రం అనుమతి లేకుండానే 2005లో వైయస్ పోలవరం ప్రారంభించారన్నారు. అప్పుడు అధికసంఖ్యలో ఎంపీలు ఉండటంతో ధీమాగా ముందుకు వెళ్లారని, పోలవరం అనుమతి, పర్యవేక్షణ బాధ్యతలు తనమీద పెట్టారన్నారు. తాను కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యుడిగా ఉండటంతో ఢిల్లీలోని కేంద్ర మంత్రులను కలిసి పోలవరం విషయంలో ముందుకెళ్లేవిధంగా చర్యలు తీసుకున్నామన్నారు. 2014లో పోలవరాన్ని జాతీయప్రాజెక్ట్‌గా ప్రకటించారని, నిర్వాసితులకు పరిహారం కూడా ప్రాజెక్టులో భాగం చేశారన్నారు. కాసుల కక్కుర్తికోసమే కేంద్రం నుంచి ప్రాధేయపడి పాతరేటుకే తీసుకుందన్నారు. ప్రభుత్వం పోలవరాన్ని తామే కడతామని నీతీఆయోగ్‌కు విన్నవించిందని, దాంతో 2014లో అంచనా ప్రకారమే నిధులు ఇస్తామని, అంచనాలు పెరిగితే ఇవ్వమని కేంద్రం ఆనాడు చెప్పిందని, అంచనాలు పెరిగితే చంద్రబాబు తన సొంత నిధులు ఏమన్నా ఇస్తారా, రాష్ట్ర ప్రభుత్వ ఖజానా ఇస్తుందా అంటూ ప్రశ్నించారు. కేంద్రం చేపట్టిన ప్రాజెక్టులు నత్తనడక నడుస్తున్నాయనే రాష్ట్రప్రభుత్వం చేపట్టిందన్న ప్రశ్నకు మిగతా రాష్ట్రాలల్లో గిరిజన ప్రాంతాలు, కొండప్రాంతాలు అధికంగా ఉన్నాయని, దాంతో ఆలస్యమవుతోందని, కానీ పోలవరం ఆ కోవలోకి రాదన్నారు.

పోలవరం విషయంలో దర్యాప్తు జరిపితే జైలు కెళతారని బీజేపీ నేత చేసిన వ్యాఖ్యలు సరైనవేనని, కేంద్రం దగ్గర పూర్తి ఆధారాలున్నాయన్నారు. పోలవరానికి టెండర్ల విషయంలో వెబ్‌సైట్‌లో వివరాలివ్వలేదని, ఆఖరి రోజు పేపర్లో రూ.1,300 కోట్లు అని వెబ్‌సైట్‌లో రూ.1,400 కోట్లని పెట్టారని, కాంట్రాక్టు ఎవరో ముందే ఫిక్స్ అయ్యారని నేను చెప్పటంలేదని కేంద్రమే చెప్పిందన్నారు. పోలవరాన్ని ఇప్పుడు కేంద్రానికి ఇస్తామనటం హాస్యాస్పదనమని, బాబుకు ఎవరు సలహాలు ఇస్తున్నారో అర్థంకావటంలేదని, చిన్న చిన్న తప్పులకు దొరికిపోతున్నారని చెప్పారు. పోలవరం కాంట్రాక్ట్ మాజీ ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్ రెడ్డి హయాంలో ఇవ్వటం జరిగిందని, పట్టిసీమకు రూ1660కోట్లు, పురుషోత్తం పట్టణానికి రూ.1800 కోట్లు ఖర్చు పెట్టే బదులు పోలవరాన్నే తక్కువ ఖర్చుతో పూర్తిచేయొచ్చన్నారు. గతంలో వైయస్ పనులు అనుకున్న సమయానికి చేయటం లేదని నామా నాగేశ్వరరావు కంపెనీని తప్పించారని, ఇప్పుడు ట్రాన్స్‌ట్రాయ్‌ని తప్పించడం కొత్తేమీ కాదని, కాని ఆ కంపెనీ యజమానులు కేంద్రమంత్రి నితిన్ గడ్కరిని ఇంటి దగ్గర కలిసి ఫిర్యాదు చేశారన్నారు. రాష్ట్రానికి ఇస్తానన్న ప్యాకేజీ ఏంటో ఎవరికీ తెలియదని, పోలవరం ముంపు మండలాలను ఏపీలో కలిపితేనే సీఎంగా ప్రమా ణ స్వీకారం చేస్తానన్న మాటల్లో వాస్తవం లేదన్నారు. డబ్బిస్తే ఓట్లేస్తారన్న భ్రమ వద్దని, జనరల్ ఎన్నికల్లో అలా జరగదని ఉండవల్లి అన్నారు.

### కాపు రిజర్వేషన్ బిల్లు లీగల్‌గా చెల్లదు

ఏపీ అసెంబ్లీలో చేసిన కాపు రిజర్వేషన్ బిల్లు లీగల్‌గా చెల్లదని, కమిషన్ ఛైర్మన్ మంజునాథ్ రిపోర్టు ఇవ్వకుండా, ముగ్గురు ఇచ్చిన నివేదికలు తీసుకొని అసెంబ్లీ ఆమోదించడం, కేంద్రానికి పంపడమేంటని ప్రశ్నించారు. తాను సంతకం, ఆమోద ముద్ర వేయలేదని స్వయంగా జస్టిస్ మంజునాథ్ తెలిపారన్నారు. ప్రభుత్వం రాజమండ్రి పుష్కరాల సమయంలో 20మంది మృతిచెందిన ఘటనపై కమిషన్ వేశారని, ఆవిధంగా పలు విషయాల్లో పలు కమిషన్లు వేశారని, కమీషన్ ఛైర్మన్‌లు ప్రభుత్వానికి అనుకూలంగా లేకపోతే ఆయన్ని తప్పించి మరొకరిని నియమిస్తారని, నియంత స్వభావానికి అలవాటు పడినప్పుడు ఎన్ని కమిషన్లు వేసినా ప్రయోజనం లేదన్నారు. పార్టీ ఎమ్మెల్యేల వలసలనే ఆపలేని జగన్ ఒరిస్సా, ఛత్తీస్‌ఘడ్ రాష్ట్రాలను పోలవరం విషయంలో రెచ్చగొడతారనటం ఊహాగానాలేనన్నారు. సీఎం చంద్రబాబుకు పెద్ద బలహీనత ఉందని, అవినీతి కామన్ అయిపోయిందన్నారు. రాహుల్ గాంధీ రాజకీయాల్లో ఉండక తప్పదని, ఆయనకు అవినీతి మచ్చ లేదని, మంచివాడన్నారు.

## అధికారం లోకి వస్తే పగలే 9 గంటల విద్యుత్

● వైఎస్ఆర్ బీమాతో అన్నదాతను ఆదుకుంటాం ● పెండింగ్ ప్రాజెక్టులన్నీ పూర్తిచేస్తాం ● కర్నూలు జిల్లా ఎర్రగుడి సదస్సులో జగన్



రైతు సదస్సులో ప్రసంగిస్తున్న వైకాపా అధినేత జగన్. హాజరైన అన్నదాతలు

**కర్నూలు, కెఎన్ఎన్ బ్యూరో:** చంద్రబాబునాయుడు నాలుగు సంవత్సరాల పాలనలో రైతులు దారుణంగా మోసపోయారని వైకాపా అధినేత వైఎస్ జగన్ ఘాటుగా విమర్శించారు. వైకాపా అధికారంలోకి వస్తే రైతులను అన్నివిధాలా ఆదుకుంటామని జగన్ హామీ ఇచ్చారు. మృతిచెందిన రైతు కుటుంబానికి నేరుగా వైఎస్ఆర్ బీమా పథకం కింద రూ.5లక్షల నగదు మృతుని భార్యకు అందిస్తామన్నారు. అదేవిధంగా అప్పుల కోసం వేధించే వారిపై అవసరమైతే చట్టాన్ని తీసుకువచ్చి, రైతు కుటుంబాలను ఆదుకుంటామని భరోసా కల్పించారు. ధరల స్థిరీకరణ నిధితో పాటు అత్యవసర నిధుల కింద కూడా ప్రత్యేక నిధులను కేటాయిస్తామని, నకిలీ విత్తన కంపెనీలపై చట్టాన్ని తీసుకువస్తామని జగన్ చెప్పారు. నకిలీ విత్తనాల కంపెనీలలో స్పీకర్ హస్తం ఉన్నట్లు ఆరోపణలు వస్తున్నాయని, ఈ వ్యవహారంలో పత్తిపాటి పుల్లారావు మొదలుకొని నారా లోకేష్ వరకు సంబంధాలు ఉన్నట్లు జగన్ ఆరోపించారు. వైకాపా అధికారంలోకి వస్తే ఉదయమే 9 గంటలు ఉచిత విద్యుత్ కల్పిస్తామని, జలయజ్ఞం కింద పెండింగ్‌లో ఉన్న సాగునీటి ప్రాజెక్టులన్నీ పూర్తిచేస్తామని హామీ ఇచ్చారు. కర్నూలు జిల్లాలో చివరి రోజు ప్రజా సంకల్పపాదయాత్రలో భాగంగా ఆదివారం జొన్నగిరి మండలం ఎర్రగుడి గ్రామ సమీపంలో ఏర్పాటు చేసిన రైతు సదస్సులో జగన్ పాల్గొని రైతులనుద్దేశించి ప్రసంగించారు. నాలుగు సంవత్సరాల కాలంలో పంటల విస్తీర్ణం తగ్గిపోయి పంటలకు గిట్టుబాటు ధరలు లేక రైతులు తీవ్ర ఆర్థిక సంక్షోభంలో ఇరుక్కుపోయారని ఆవేదన వ్యక్తం చేశారు. రాష్ట్రం 12శాతాన్ని జీడీపీ సాధిస్తే ఎందుకు అభివృద్ధి చెందలేదని ప్రశ్నించారు. 12శాతం అభివృద్ధి సాధిస్తే 2019, 2022, 2050 నాటికి నంబర్ వన్ రాష్ట్రంగా చేరుస్తానని ఎందుకు బాబు చెప్పుతున్నారని నిలదీశారు. బాబు అబద్దాలు చెప్పిందే చెప్పి నిజమనే ప్రయత్నం చేస్తున్నారని, రాష్ట్రం కరవు కాటకాలలో రైతులు అల్లాడిపో తుంటే ఇన్‌పుట్ సబ్సిడీ రాకుండా చేసి కేబినెట్ సమావేశాలతో రైతులను మోసం చేస్తున్నారని విమర్శించారు.

కంది, మినుము, పెసర, మిర్చి, టమోటా, ఉల్లి వంటివి ఏ పంట వేసినా గిట్టుబాటు ధర వచ్చిందా అని రైతులను ప్రశ్నించారు. గోదావరి, కృష్ణా నదుల అనుసంధానంతో పట్టిసీమను నిర్మించి రాయలసీమకు నీళ్లు ఇస్తానన్న బాబు చెంబు నీళ్లు అయిన ఇచ్చారా అని ప్రశ్నించారు. నదుల అనుసంధానం పేరుతో ఏదో సాధించిన్నట్లు బాబు గ్లోబల్ ప్రచారం చేస్తూ ప్రజలను మభ్యపెడు తున్నారని విమర్శించారు. పట్టిసీమ ప్రాజెక్టును 90శాతం పూర్తి చేసింది దివంగత వైయస్ఆర్ రాజశేఖర్‌రెడ్డినేనని చెప్పారు. పోలవరం ప్రాజెక్టు పూర్తి చేస్తే రాష్ట్రం మొత్తం సస్యశ్యామలం అవుతుందని జగన్ అన్నారు.

పోలవరం ప్రాజెక్టుపై లేనిపోని ఆరోపణలు చేస్తూ కేంద్రంను నిందించడం బాబుకు తగదన్నారు. నాగార్జునసాగర్ కుడి కాలువకు నికర జలాల కింద 140 టిఎంసిలతో పాటు 11లక్షల ఎకరాలకు సాగునీరు ఇవ్వాల్సి ఉన్నా బాబు నాలుగు సంవత్సరాల పాలనలో ఒక్కచుక్క నీరైనా ఇచ్చారా అని రైతులను జగన్ ప్రశ్నించారు. టిడిపి ప్రభుత్వం రూ.180 కోట్లు చెల్లించకుండా పులిచింతల ప్రాజెక్టు నిర్మాణం చేయకుండా రైతులను మోసం చేస్తున్నదని చెప్పారు. పోతిరెడ్డిపాడు హెడ్ రెగ్యులేటర్ ద్వారా 44 క్యూసెక్కుల నీటిని దివంగత వైయస్ఆర్ పాలనలోనే నీటి కేటాయింపులు జరిగాయన్నారు. 15శాతం పనులను చంద్రబాబు నాయుడు పనులను పూర్తి చేయకుండా నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నారని విమర్శించారు. పోతిరెడ్డిపాడు పూర్తి అయితే గాలేరు నగరి, హంద్రీ-నీవా, కెసి కెనాల్, తెలుగుగంగ, వెలుగోడు, వంటి అన్ని ప్రాజెక్టుల్లో నీటిని నిల్వ చేసుకొనే అవకాశం వుందన్నారు. ముఖ్యమంత్రి చంద్రబాబు ప్రాజెక్టుల పేరుతో అంచనాల వ్యయాన్ని పెంచి కాంట్రాక్టర్లతో కమీషన్‌లు దండుకుంటున్నారని ఆరోపించారు. ప్రజల ఆశీసులు వుంటే తిరిగి నాన్న వైయస్ఆర్ స్వప్నమైన రాజన్న రాజ్యాన్ని తీసుకువస్తానని జగన్ రైతులకు భరోసా ఇచ్చారు.

ఈ సదస్సులో వైకాపా రైతు సంఘం అధ్యక్షుడు నాగిరెడ్డి, శిల్పా చక్రపాణిరెడ్డిలు అధ్యక్షత వహించగా ఎమ్మెల్యేలు గౌరు చరితారెడ్డి, బుగ్గన రాజారెడ్డి, సాయి ప్రసాదరెడ్డి, బాల నాగిరెడ్డి, గుమ్మనూరు జయ రాం, ఐజయ్య, మాజీ మంత్రి శిల్పా మోహన్‌రెడ్డి, గౌరు వెంకటరెడ్డి, బివై రామయ్య, గంగుల ప్రభాకరరెడ్డి, హఫీజ్‌ఖాన్, కంగాటి శ్రీదేవి, పరిగెల మురళీకృష్ణతదితరులు పాల్గొన్నారు.

### 7న పోలవరానికి వైకాపా బస్సు యాత్ర

ఆంధ్ర రాష్ట్రానికి జీవనాడి అయిన పోలవరం ప్రాజెక్టు విషయంలో రాష్ట్రప్రభుత్వం వ్యవహరిస్తున్న తీరును ప్రజలకు వివరించేందుకు వైయస్సార్ కాంగ్రెస్ పార్టీ ఈనెల 7న పోలవరం సందర్శన యాత్ర నిర్వహించాలని ఆపార్టీ అధ్యక్షుడు వైఎస్ జగన్మోహన్ రెడ్డి నిర్ణయించారు. ఈమేరకు కేంద్ర పార్టీ కార్యాలయం ఆదివారం మీడియాకు ఒక లేఖ విడుదల చేశారు. ఈ యాత్రలో పార్టీకి చెందిన ఎంపీలు, ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీలు, పార్టీ సీనియర్ నాయకులు పాల్గొంటారన్నారు. ఈ ప్రాజెక్టు నిర్మాణ విషయంలో రాష్ట్ర ప్రభుత్వం ఒక పథకం ప్రకారం చేతులెత్తేస్తూ దానికి శాశ్వతంగా సమాధికట్టేలా వ్యవహరిస్తోందని ఆ లేఖలో పేర్కొన్నారు. ఈ నేపథ్యంలో ఈ దుర్మార్గ వైఖరిని ప్రజల కళ్ళకు కట్టినట్లు వివరించడానికి, పోలవరం ప్రాజెక్టు నిర్మాణాన్ని ముందుకు తీసుకువెళ్ళేలా ఒత్తిడి చేయడానికి వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నిర్ణయించినట్లు వివరించారు. రాష్ట్రానికి జీవనాడి అయిన పోలవరం ప్రాజెక్టు నిర్మాణాన్ని దివంగత ముఖ్యమంత్రి డాక్టర్ వైఎస్ రాజశేఖరరెడ్డి ప్రారంభించి, అనుమతులు తీసుకువచ్చారన్నారు. అంతేకాకుండా కుడి, ఎడమ కాలువల నిర్మాణం దాదాపు 70 నుంచి 80 శాతం మేర పూర్తిచేశారన్నారు. అటువంటి ముఖ్యమంత్రి వైఎస్ఆర్ వారసులుగా ఆ ప్రాజెక్టు నిర్మాణ ఆవశ్యకతను ఆంధ్రప్రదేశ్ ప్రజలందరికి తెలియజేయాలని వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ భావిస్తున్నట్లు పేర్కొన్నారు. చంద్రబాబునాయుడు ఈ ప్రాజెక్టు నిర్మాణ విషయంలో పూటకో మాట మారుస్తూ శాశ్వతంగా సమాధి కట్టేందుకు కుట్రలు పన్నుతున్నారన్నారు. కాంట్రాక్టర్ల నుంచి కమీషన్లు దండుకుని తీరా ఇప్పుడు వదిలేసేందుకు పన్నాగం పన్నారని అన్నారు. వైఎస్ఆర్‌కాంగ్రెస్ పార్టీ మొదటినుంచి ఈ ప్రాజెక్టు నిర్మాణ విషయంలో చంద్రబాబు తీరును పదేపదే చెబుతూ వచ్చిందన్నారు. ఇందులో భాగంగానే సీనియర్ నాయకుల పోలవరం యాత్రను రూపకల్పన చేయడం జరిగిందని ఆ లేఖలో పేర్కొన్నారు.

## కాశీలో శారదాపీఠం శాఖా భవనం ప్రారంభం

● దేశ వ్యాప్తంగా హిందూధర్మ ప్రచారమే లక్ష్యం

**విశాఖపట్నం, కెఎన్ఎన్ బ్యూరో:** దేశవ్యాప్తంగా హిందూధర్మాన్ని పూర్తి స్థాయిలో ప్రచారం చేయడమే విశాఖ శారదాపీఠం లక్ష్యమని పీఠాధిపతి స్వరూపానందేంద్రసరస్వతి మహాస్వామి తెలిపారు. ధర్మ పరిరక్షణ నలుదిశలా వ్యాపింపచేయాలన్న శుభసంకల్పంతో శారదాపీఠం శాఖాభవనాన్ని కాశీ క్షేత్రంలో నూతనంగా ఏర్పాటు చేశారు. ఈ నూతన భవనాన్ని ఆదివారం స్వరూపానందేంద్ర చేతులు మీదుగా ప్రారంభించారు. ఈ సందర్భంగా స్వామీజీ మాట్లాడుతూ వారణాసి క్షేత్రంలో నివసించే దండిస్వాములకు ఇక మీదట ప్రతీవారం యతిబిక్ష నిర్వహించాలని నిర్ణయించామన్నారు.

కాశీ క్షేత్రంలో ఒక యతికి బిక్ష పెడితే వెయ్యి మంది వేద పండితులకు భిక్షపెట్టిన ఫలితం లభిస్తుందని స్వరూపానందేంద్ర పేర్కొన్నారు. దత్తజయంతి నేపథ్యంలో పీఠం ప్రాంగణంలో విశేష పూజా కార్యక్రమాలు నిర్వహించారు. ఈ కార్యక్రమంలో కాశీ వాసులతో పాటు శారదాపీఠం ట్రస్టీ రొబ్బి శ్రీనివాస్, పీఠం ధర్మాధికారి కామేశ్వర శర్మ, ఆస్థాన పండితుడు కృష్ణ శర్మ, హరిద్వార్‌లో ఆంధ్రా అశ్రమం మేనేజింగ్ ట్రస్టీ వి.వి.సుంద రశాస్త్రి, వివిసీతారమం, ప్రముఖ న్యాయవాది వై.నీల లోహిత శాస్త్రి , కాశీ కరివేణ సత్రం మేనేజర్ శ్రీనివాస్ తదితరులు పాల్గొన్నారు. నూతన శాఖాభవనం ప్రారం భోత్సవం శారదాపీఠం ఉత్తర పీఠాధిపతి కిరణ్‌కుమార్ శర్మ ఆధ్వర్యంలో జరిగింది.



# ఇక గ్రామాలకూ ఎల్ఈడీ వెలుగులు

**• 35 లక్షల వీధి దీపాల ఏర్పాటు • వేగవంతానికి రన్ రేట్ మెకానిజం • సర్పంచ్‌లూ వ్యక్తిగత బాధ్యత తీసుకోండి • గ్రామీణాభివృద్ధిశాఖ మంత్రి లోకేష్**

**అమరావతి, ఆంధ్రప్రభ:** పల్లెల్లో ఎల్ఈడీ వీధి దీపాల ఏర్పాటును వేగవంతం చేయడానికి రన్‌రేట్ మెకానిజం ఎంతైనా అవసరమని పంచాయతీరాజ్, ఐటీ శాఖల మంత్రి నారా లోకేష్ స్పష్టం చేశారు. ప్రస్తుతం గ్రామాల్లో ఎన్ని ఎల్ఈడీ వీధి దీపాలున్నాయి? ఎన్ని కొత్తగా వేశారు? సమయం వారీగా, గ్రామాల వారీగా, కరెంటు స్థంభాల వారీగా ఏర్పాటు చేసే సంస్థల ప్రతిభను మెరుగు పరచడానికి రన్‌రేట్ మెకానిజం దోహదపడుతుందని లోకేష్ అన్నారు. ఆదివారం ఆయన సంబంధిత అధికారులతో టెలీకాన్ఫరెన్స్ నిర్వహించారు. ఈసందర్భంగా మంత్రి లోకేష్ మాట్లాడుతూ, ఎల్ఈడీ వీధి దీపాల ఏర్పాటు కార్యక్రమాన్ని పట్టణ ప్రాంతాల్లో విజయవంతంగా అమలుచేశామన్నారు. ఇప్పుడు ఈ వినూత్న పథకం ఫలాలను గ్రామాలకు అందజేయాలని నిశ్చయించామ న్నారు. పట్టణ ప్రాంతాల్లో ఎల్ఈడీ వీధి దీపాల పథకంలో దేశంలో నెంబర్‌వన్‌గా ఏపీ స్థానం దక్కించుకుందన్నారు. ఇంధన ఆదా ద్వారా ఆర్థిక లబ్ధితో ప్రజా జీవన ప్రమాణాల మెరుగుకు శ్రీకారం చుట్టామన్నారు. ఇందులో భాగంగానే గ్రామీణ ప్రాంతాల్లో కూడా ఎల్ఈడీ వీధి దీపాల ఏర్పాటుకు సన్నాహాలు చేస్తున్నట్లు వివరించారు. రాష్ట్రంలోని 110 పురపాలక పట్టణాలు, నగరపాలక సంస్థలు ఎల్ఈడీ విద్యుత్తు దీపాల ఏర్పాటు వల్ల 133 మిలియన్ యూనిట్ల విద్యుత్తు ఆదా చేయడం జరిగిందన్నారు. ఫలితంగా రూ.86 కోట్ల మేర ఆయా సంఘాలు ఆర్థిక లబ్ధి పొందాయన్నారు. ఇప్పుడు ఇంధ న పొదుపు, సామర్థ్యం ఫలాలను గ్రామీణాంధ్రప్రదేశ్‌కు అందజేయాలని పంచాయతీరాజ్ గ్రామీణాభివృద్ధి శాఖ కృతనిశ్చయంతో ఉందని, ఎల్ఈడీ బల్బుల కార్యక్రమంలో ప్రధానమైన మూడో వైర్(థర్డ్ వైర్) ఏర్పాటును యుద్ధప్రాతిపదికన పూర్తి చేయాలని ఇంధన శాఖను కోరారు. ఎల్ఈడీ వీధి దీపాలను అమర్చడం ద్వారా గ్రామీణ ప్రజల జీవన ప్రమాణాలు మెరుగుపరచాలన్నదే ముఖ్యమంత్రి ధ్యేయమని మంత్రి స్పష్టం చేశారు. రాష్ట్ర ఆర్థికాభివృద్ధిలో గ్రామీ ణాభివృద్ధిది కీలకపాత్ర అన్నారు. గ్రామీణ వికాసానికి ప్రభుత్వం గ్రామాలలో, గిరిజన గూడేల్లో పెద్ద ఎత్తున మౌలిక సదు పాయాల ప్రాజెక్టులను చేపట్టిందని, సిమెంటు రోడ్లు నిర్మిస్తోందని వివరిం చారు. గ్రామీణ ప్రాంతాల్లో పర్యావరణ పరిరక్షణకు, సాం ఘిక, ఆర్థిక ప్రయోజనాల కోసం ఎల్ఈడీ వీధి దీపాలు దోహదపడ తాయని లోకేష్ అన్నారు. కొత్త వీధి దీపాలతో, కొత్త సిమెంట్ రోడ్లతో గ్రామాలు కొత్త శోభను సంతరించుకుంటాయన్నారు. కేంద్రీయ నియంత్రిత, సమన్వయ వ్యవస్థలో ప్రపంచ స్థాయి సాంకేతికతను తీసుకురావాలని, గ్రామాలలో ఎల్ఈడీ కార్యక్రమానికి ఇదెంతో దోహద పడుతుందని అన్నారు. ఈ కార్యక్రమాన్ని సీఎం డ్యాష్ బోర్డు, తన డ్యాష్ బోర్డుతో అనుసంధానించి, ఎప్పటికప్పు డు పని తీరు వివరాల తాజా సమాచార అంచనాకు సహకరించాల న్నారు. సీఎం కోర్ డ్యాష్ బోర్డులో, మంత్రి డ్యాష్ బోర్డులో ఎన్ని దీపాలు వెలిగితే అంత మేర పని జరిగినట్లు నిర్ధారణకు వస్తారని చెప్పారు. పంచాయతీరాజ్, గ్రామీణాభివృద్ధి శాఖ ముఖ్య కార్యదర్శి జవహర్ రెడ్డి మాట్లాడుతూ మూడో వైరు ఏర్పాటు ఏపీ ప్రాంతంలో ఎంత అవసరమో మీ సేవ కేంద్రాల్లో రిజిస్టర్ చేసుకోవాలని, తద్వారా యుద్ధప్రాతిపదికన మూడో వైరు ఏర్పాటులో డిస్కంలకు సహకరించాలని పంచాయతీ రాజ్, గ్రామీణాభివృద్ధి కార్యదర్శులను ఆదేశించామని చెప్పారు. గ్రామాలలో ఎల్ఈడీ వీధి దీపాల ఏర్పాటులో మూడో వైరు కీలకమని మంత్రి అధికారులకుచెప్పారు. దీని ఏర్పాటు చేసేందుకు ఉత్పన్నమయ్యే సమస్యలను ముందుగానే పరిష్కరించుకోవాలని సూచించారు. లైన్ క్లియర్ సమస్యలను పంచాయతీరాజ్, ఏపీ సీడ్‌కో, ఇంధన శాఖ సమన్వయంతో పరిష్కరించుకోవాలని, వీటి ఏర్పాటుకు వారం ముందే మూడో వైరు వేయాలని అధికారులను మంత్రి ఆదేశించారు. ఒకేసారి ఎల్ఈడీ వీధి దీపాల ఏర్పాటు కోసం సంస్థకు సహకరించాలన్నారు. సమన్వయం చేసుకోవడానికి జిల్లా స్థాయి బృందాలను నియమించాలని, గ్రామాలలో దీపాలను అమర్చే సమయంలో నోడల్ ఆఫీసర్లతో కలిసి పనిచేయాలని ఆయన ఆదేశించారు. సీసీఎంఎస్, డ్యాష్‌బోర్డు నిత్య పర్యవేక్షణలో వీధి దీపాలు ఒకేసారి వెలగడం, ఒకేసారి మలిగిపోయే విధంగా చూడా లన్నారు. డిసెంబర్ 1 నుంచి 15 దాకా రోజుకు వెయ్యి ఎల్ఈడీ బల్బులను అమర్చడాన్ని ఈఈసీఎల్ లక్ష్యంగా పెట్టుకుందని, ఆ తరువాత రోజుకు 6 వేల లైట్లు ఏర్పాటు చేస్తారన్నారు. ఎల్ఈడీ వీధి దీపాల సరఫరాకు ఈఈఎస్ఎల్ ఒక సమగ్ర ప్రణాళికతో ముందుకు రావాలని మంత్రి లోకేష్ సూచించారు. వాస్తవంగా విక్రేతలు ఎన్ని దీపాలు సరఫరా చేయగలుగుతున్నారు అనే అంశాన్ని దృష్టిలో ఉంచుకోవాలని చెప్పారు. మండల స్థాయిలో విద్యుత్తు సమస్యలు తలెత్తి ఎల్ఈడీ లైట్లు సరిగా పనిచేయని పక్షంలో ఆటోమేటిక్‌గా సరిచేసే విధానం ఉండాలన్నారు. పంచాయతీ కార్యదర్శి, ఎంపీ డీవో, డీపీవో, పంచాయతీరాజ్ విభాగం లైన్ మెన్, డిస్కంల ఏఈ, ఏడీఈలో సోపాన క్రమంలో అపరిష్కృత ఫిర్యాదులను ఈ విధానంలో పరిష్కరించాలని చెప్పారు. ఎల్ఈడీ విద్యుత్తు దీపాలు నిర్దేశిత సమయాల్లో వాటంతట అవే వెలిగి, అవే మలిగిపోయేలా ఉండేందుకు పరిశీలించాలని, సీసీఎంఎస్ బాక్సులతో విద్యుత్తు ఆదా ఎలా చేస్తున్నారో అలాగే ఆటోమేటిక్‌గా వీధి దీపాలు ఆన్/ఆఫ్ అయ్యేలా చూడాలని కోరారు. మూడో వైరులేని ప్రాంతాల్లో ఆ వైరును బిగించే పనులను త్వరితగతిన చేపట్టాలన్న మంత్రి ఆదే శాలకు ఇంధన శాఖ, ఐ అండ్ ఐ, సీఆర్‌డియే ముఖ్య కార్యదర్శి అజయ్ జైన్, ఏపీ ట్రాన్స్‌కో సీఎండీ విజయానంద్ స్పందిస్తూ ఇప్ప టికే ఇంధన మంత్రి ఇందుకు సంబంధించి డిస్కంలను ఆదేశిం చారని చెప్పారు.



ఈ టెలీకాన్ఫరెన్స్‌లో పంచాయతీరాజ్, గ్రామీణాభివృద్ధి శాఖ ముఖ్య కార్యదర్శి జవహర్ రెడ్డి, ఇంధన శాఖ, ఐఅండ్ఐ, సీఆర్‌డీఏ ముఖ్యకార్యదర్శి అజయ్ జైన్, ఐటీ శాఖ ముఖ్య కార్యదర్శి విజయా నంద్, ఏపీ ట్రాన్స్‌కో జేఎండీ, ఇన్‌ఛార్జీ సీఎండీ ఏపీఎస్.పి.డిసిఎల్ దినేష్ పరుచూరి, ఏపీ.ఇ.పిడిసిఎల్ సీఎండీ హెచ్.వై.దొర, పంచా యతీరాజ్ కమిషనర్ బి.రామాంజనేయులు, నెడ్ క్యాప్ వి.సి.కమలా కర్ బాబు, పంచాయతీరాజ్ నోడల్ అధికారి పరదేశి కుమార్, భారత ప్రభుత్వ సంస్థ ఇఇఎస్ఎల్ ప్రతినిధి శశికాంత్ పాల్గొన్నారు.

## సర్వత్రా ఉత్కంఠత

# మంజునాథ్ నివేదిక నేడు

(మొదటిపేజీ తరువాయి)

తెలుసుకోవాలని కూడా అంతా ఆసక్తిగా ఎదురు చూస్తున్నారు. కమిషన్ నివేదిక కోసం ఇంతకాలం వేచి చూసిన ప్రభుత్వం అసెంబ్లీ సమావేశాల ముగింపు రోజునే ఎందుకు హడావిడిచేసి, నివేదికను తెప్పించి,సభలో ఆమోదింపజేసిందనే అంశంపై కూడా ఊహాగానాలు నడుస్తున్నాయి. కొద్ది రోజులుగా పోలవరం వ్యవహారం వివాదాస్పదంగా మారిన నేపథ్యంలోనే ఒక్కసారిగా కాపులకు సంబంధించిన మంజునాథ్ కమిషన్ నివేదికను ఎందుకు తెరపైకి తీసుకొచ్చారనే సవా లక్ష ప్రశ్నలు ప్రజల మెదళ్లను తొలుస్తున్నాయంటున్నారు. మంజునాథ్ తీరా నివేదిక అందజేసే సమయానికి ఇబ్బందికర పరిస్థితులు తలెత్తడంతో విషయం వివాదాస్పదంగా మారిందంటున్నారు.ఈ నేపథ్యంలో బీసీ కమిషన్ చైర్మన్ జస్టిస్ మంజునాథ్ తన నివేదికను సోమవారం రాష్ట్రప్రభుత్వ ప్రధాన కార్యదర్శి దినేష్‌కుమార్‌కు సమర్పించేందుకు రంగం సిద్ధం చేశారు. కాపుల రిజర్వేషన్‌కు సంబంధించి ప్రభుత్వంగతంలో మంజునాథ్‌ను చైర్మన్‌గా నియమిస్తూ కమిషన్ ఏర్పాటు చేసిన సంగతి తెలిసిందే. అయితే కమిషన్‌లోని నలుగురు సభ్యుల్లో ముగ్గురు సభ్యులు మంజునాథ్‌తో సంబంధం లేకుండానే నివేదికను ప్రభుత్వానికి అందజేయడం, నివేదిక ఆధారంగా ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు శనివారం క్యాబినెట్ సమావేశంలో చర్చించి,అసెంబ్లీలో చర్చకు పెట్టి ఏకగ్రీవంగా బిల్లు ఆమోదించడం చకచకా జరిగి పోయిన సంగతీ తెలిసిందే. అయితే మంజునాథ్ మాత్రం సభ్యులిచ్చిన నివేదికపై సంతకం చేయలేదు. కనుక ఆ నివేదిక చెల్లదంటున్నారు. కొంత మంది సభ్యులు సమర్పించిన నివేదిక చట్ట సమ్మతం కాదని మంజునాథ్ మీడియా ఎదుట స్పష్టం చేసిన సంగతీ తెలిసిందే. కాపులకు సంబంధించి తానెటువంటి నివేదికను ఇంకా ప్రభుత్వానికి సమర్పించలేదని కూడా మంజునాథ్ కీలక వ్యాఖ్యలు చేశారు.అయితే తానిచ్చే నివేదికే కమిటీ తుది నివేదిక అవుతుందని కూడా మంజునాథ్ స్పష్టం చేయడంతో ఈ విషయం సర్వత్రా చర్చనీయాంశంగా మారింది. వాస్తవానికి కమిషన్ నివేదిక సెప్టెంబర్‌లోనే పూర్తయిందని, తానివ్వబోయే నివేదిక ఏపీలోని అన్ని వర్గాల వారికి ఆమోదయోగ్యంగా ఉంటుందని మంజునాథ్ చెప్పడంతో అసలు ఆ నివేదికలో ఏముందనే విషయం తెలుసుకోవాలని ఆత్రుత అందరిలో వ్యక్తమవుతున్నది.

ఇలా ఉంటే ఆయన స్వయంగా తయారు చేసి,సంతకం చేసిన నివేదికను కమిషన్ సభ్యులు కృష్ణమోహన్ ద్వారా సచివాలయానికి పంపించేందుకు ఏర్పాట్లు చేసినట్లు సమాచారం.. తొలుత మంజునాథ్ సభ్యులందరితో కలిసి ముఖ్యమంత్రిని కలిసి,నివేదిక సమర్పించాలని భావించారు. కానీ ఏమైందో ఏమో తెలియదు కాని కొంత మంది సభ్యులు మాత్రమే వెళ్లి తమ సంతకాలతో కూడిన నివేదికను ముఖ్యమంత్రికి అందజేశారు. దీంతో ఒకింత అసహనానికి గురైన మంజునాథ్ తన నివేదికను సోమవారం ప్రభు త్వ ప్రధాన కార్యదర్శి లేదా సంబంధిత బీసీ సంక్షేమ శాఖ కార్యదర్శికి అందజేసేం దుకు సిద్ధమవుతున్నారు. ముఖ్యమంత్రి విదేశీ పర్యటనకు వెళ్లిన నేపథ్యంలో నివేదికను ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి అందజేసేందుకు సోమవారం ఉదయమే కృష్ణమోహన్‌ను సచివాలయానికి పంపేందుకు నిర్ణయించినట్లు తెలిసింది. ఒక వేళ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి అందుబాటులో లేకుంటే మాత్రం బీసీ సంక్షేమ కార్యదర్శికి అందజేసే అవకాశం ఉందంటున్నారు. కాగా కాపు రిజర్వేషన్లకు రాష్ట్రప్రభుత్వం ఇప్పటికే ఆమోదం తెలిపిన విషయం తెలిసిందే. కాపు,బలిజ,తెలగ, ఒంటరి కులాలకు బీసీల జాబితాలో చేర్చి,5 శాతం రిజర్వేషన్లను కల్పించాలని సభలో బిల్లును కూడా ప్రవేశపెట్టింది. అసెంబ్లీ కూడా దీనిని ఏకగ్రీవంగా ఆమోదించింది.ఈ ఈనేపథ్యంలో సోమవారం మంజునాథ్ నివేదిక సమర్పణపై జనాల్లో ఉత్కంఠత నెలకొన్నది. కమిషన్ చైర్మన్ సంతకం ప్రాధ్బలం లేకుండానే సభ్యులు ప్రభుత్వానికి నివేదిక ఇవ్వడంపై విమర్శలు వెల్లువెత్తుతున్నాయి.ఇప్పటికే వైసీపీ వంటి కొన్ని పార్టీలు ఈ వ్యవహారంపై మండిపడుతున్నాయి. మంజునాథ్ కమిషన్ నివేదికను బట్టబయలు చేయాలని కూడా డిమాండ్ చేస్తున్నాయి. ప్రభుత్వం కావాలనే తనకు అనుకూలమైన సభ్యుల చేత నివేదిక తెప్పించుకుని,సభలో ఆమోదించుకుందనే విమర్శలున్నాయి.ఈ వ్యవహారంపై పెద్ద ఎత్తున చర్చ నడుస్తున్న నేపథ్యంలో ముఖ్యమంత్రి విదేశీ పర్యటనకు వెళ్లిపోవడంపై కూడా ఆసక్తికరమైన చర్చ జరుగుతోంది.బీసీ కమిషన్ చైర్మన్‌గా మంజునాథ్ పదవికాలం గతంలోనే ముగిసింది.అయితే దాన్ని ప్రభుత్వం మళ్లీ పొడిగించింది. కేవలం కాపుల రిజర్వేషన్ల అంశంపై విచారణ జరిపేందుకు మాత్రమే ప్రభుత్వం ఆయన పదవీ కాలాన్ని మళ్లీ పొడిగించిందంటున్నారు.ఇక ఈసారి మరోసారి ఆయన పదవీకాలాన్ని పొడిగించే అవకాశాలు ఉండకపోవచ్చంటున్నారు. దీంతో కొత్త బీసీ కమిషన్ చైర్మన్‌గా కొంతమంది పేర్లను కూడా ప్రభుత్వం పరిశీలిస్తున్నట్లు సమాచారం.

# కాపు రిజర్వేషన్ చారిత్రాత్మక నిర్ణయం

**• జగన్ మైండ్‌సెట్‌ను మార్చుకోవాలి • మండలి విప్ డొక్కా మాణిక్యవరప్రసాద్**



**అమరావతి, ఆంధ్రప్రభ:** కాపులకు రిజర్వేషన్ కల్పించడం రాష్ట్ర రాజకీయాల్లో చారిత్రాత్మక నిర్ణయమని శాసనమండలి విప్ డొక్కా మాణిక్యవరప్రసాద్ పేర్కొన్నారు. మండలి విప్‌గా బాధ్యతలు స్వీకరించిన అనంతరం ఆదివారం గుంటూరులోని ఆయన కార్యాలయంలో తొలిసారిగా ఏర్పాటు చేసిన విలేకరుల సమావేశంలో మాణిక్యవరప్రసాద్ మాట్లాడుతూ చంద్రబాబు పాదయాత్ర సందర్భంగా కాపులకిచ్చిన హామీని నిలబెట్టుకున్నారని కృతజ్ఞతలు తెలిపారు. బీసీలకు నష్టం వాటిల్లకుండా వ్యూహాత్మకంగా రిజర్వేషన్ బిల్లును శాసనసభ, శాసనమండలిలలో ఆమోదం పొందే విధంగా సీఎం సఫలీకృతులయ్యారన్నారు. బీసీలు, కాపులు రిజర్వేషన్లను సానుకూలంగా స్వాగతించాలన్నారు. ఎన్నోఏళ్లుగా పెండింగ్‌లో ఉన్న కాపు రిజర్వేషన్ సమస్యకు ముఖ్యమంత్రి మంచి పరిష్కారం చూపారన్నారు. మంజునాథ్ కమిషన్ సిఫారసుల మేరకే ముఖ్యమంత్రి కాపులకు రిజర్వేషన్ కల్పించాలని కేబినెట్‌లో ఆమోదించి, అనంతరం ఉభయ సభల్లో బిల్లును ప్రవేశపెట్టి ఆమోదింపజేయడం జరిగిందన్నారు. కాపు రిజర్వేషన్లపై విపక్ష వైకాపా తమ నిర్ణయాన్ని ప్రకటించలేకపోవడం దురదృష్టకరమన్నారు. ఎన్ని పాదయాత్రలు చేసినా సమస్యలు అసెంబ్లీకి చేరాల్సిందేనన్నారు. ప్రజాసమస్యలను ప్రతిబింబించేందుకు ప్రధాన కేంద్రమైన అసెంబ్లీ సమావేశాలను బహిష్కరించడం శోచనీయ మన్నారు. ఇప్పటికైనా జగన్ తన మైండ్‌సెట్‌ను మార్చుకోకపోతే ప్రజల విశ్వాసాన్ని కోల్పోయే ప్రమాదముందన్నారు.

## వాల్మీకులను ఎస్టీల్లో చేర్చేందుకు

# కేంద్రంపై ఒత్తిడి తెస్తాం

**• మంత్రి కాల్వ శ్రీనివాసులు**



**అనంతపురం న్యూటౌన్, కెఎన్ఎన్:** వాల్మీకి బోయలను ఎస్టీలలో చేర్చేందుకు కేంద్ర ప్రభుత్వంపై ఒత్తిడి తెస్తామని రాష్ట్ర సమాచార పౌరసంబంధాలు, గృహ నిర్మాణ శాఖ మంత్రి కాల్వ శ్రీనివాసులు పేర్కొన్నారు. ఆదివారం ఇక్కడ మంత్రి నివాసంలో పలువురు వాల్మీకి బోయ నాయకులు మంత్రిని కలిశారు. అనంతరం మంత్రి విలేకరులతో మాట్లాడుతూ ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు తన పాదయాత్రలో అడుగడుగునా వాల్మీకి బోయల దుస్థితిని చూసి చలించి, ఆనాడే తమ పార్టీ అధికారంలోకి వచ్చిన తర్వాత రాష్ట్రంలోని వాల్మీకి బోయలను ఎస్టీలుగా గుర్తించేందుకు తగు చర్యలు తీసుకుంటామన్నారన్నారు. ఆ హామీ మేరకే ఎన్ని రకాల ఒత్తిడిలు వున్నా, రాజకీయపరమైన ఒత్తిడులు వున్నా.. ఒక సాహసోపేతమైన నిర్ణయం తీసుకున్నారన్నారు. అత్యంత శాస్త్రీయంగా, చట్టబద్ధంగా, సమగ్రంగా అధ్యయనం చేయించిన తర్వాత, రాష్ట్ర ఎస్సీ, ఎస్టీ కమిషన్ సిఫార్సును తీసుకున్న తర్వాత అసెంబ్లీలో ఈమేరకు తీర్మానం చేశారన్నారు. ఈ సామాజిక వర్గం పట్ల ముఖ్యమంత్రికి, తెలుగుదేశం పార్టీకి వున్న చిత్తశుద్ధిని ప్రపంచానికి తెలియజేసేందుకు తానే స్వయంగా అసెంబ్లీలో తీర్మానాన్ని ప్రవేశపెట్టానన్నారు. వాల్మీకి బోయలను ఎస్టీలలో చేర్చాలని కేంద్ర ప్రభుత్వానికి తీర్మాన రూపంలో కోరడం హర్షణీయమన్నారు. సంవత్సరంలో ఒకసారి ఆశ్వయాజ శుద్ధ పౌర్ణమి మహర్షి వాల్మీకి జయంతిని పండుగగా అందరూ జరుపుకుంటారని, అయితే నిన్నటి (శనివారం) అసెంబ్లీ తీర్మానం ద్వారా మరోసారి పండుగ వాతా వరణాన్ని సృష్టించారన్నారు.

వాల్మీకి బోయలను ఎస్టీలలో చేర్చే దిశగా ముఖ్యమంత్రి చేయూత, సహకారం, కృషి వుందన్నారు. ఆయన మార్గదర్శికంలోనే రాష్ట్రంలోనే కాకుండా కేంద్రంలో కూడా వాల్మీకి బోయ సామాజిక వర్గం తమ హక్కులను సాధించుకుంటుందన్నదానిపై ఎలాంటి సందేహం లేదన్నారు. ఎన్ని ఇబ్బందులు ఎదురైనా తామందరం ఐకమత్యంగా కేంద్ర ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చి తమ హక్కులను సాధించుకుంటామన్నారు. అనంతరం వాల్మీకి బోయలు మంత్రిని సన్మానించి, కేక్ కట్‌చేసి తినిపించి, సంబరాలు జరుపుకున్నారు. ఈ కార్యక్రమంలో జడ్పీ చైర్మన్ పూల నాగరాజు, మార్కెట్ యార్డు చైర్మన్ ఆదినారాయణ తదితరులు పాల్గొన్నారు.

# విద్యార్థులు శాస్త్రవేత్తలుగా ఎదగాలి

**• మంత్రి శిద్దా రాఘవరావు**



**ఒంగోలు ఎడ్యుకేషన్, కెఎన్ఎన్:** రాష్ట్రంలో శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానాన్ని వినియోగించుకుని విద్యార్థులు గొప్ప శాస్త్రవేత్తలుగా ఎదగాలని, రాష్ట్ర అటవీ, పర్యావరణ, శాస్త్ర సాంకేతిక శాఖా మంత్రి శిద్దా రాఘవరావు అన్నారు. ఆదివారం ఒంగోలులోని రైజ్ ఇంజనీరింగ్ కాలేజీలో 25వ జాతీయ బాలల సైన్స్ కాంగ్రెస్ - 2017 ను మంత్రి ప్రారంభించారు. తొలుత కాలేజీ ఆవరణలో మహాత్మాగాంధీ విగ్రహాన్ని ఆవిష్కరించారు. అనంతరం స్టాల్స్‌ను, ప్రాజెక్టులను పరిశీలించారు. కాలేజీ ఆడిటోరియంలో జ్యోతి ప్రజ్వలన చేసి అబ్దుల్‌కలాం చిత్రపటానికి పూలమాలలు వేసి నివాళులర్పించారు. కార్యక్రమానికి ఏపీ శాస్త్ర సాంకేతిక సలహా మండలి సభ్యులు కృష్ణమూర్తి అధ్యక్షత వహించారు. ఈ సందర్భంగా మంత్రి శిద్దా రాఘవరావు మాట్లాడుతూ రాష్ట్ర ప్రభుత్వం శాస్త్ర సాంకేతిక రంగానికి పెద్దపీట వేస్తుందన్నారు. దీనికి ముఖ్యమంత్రి అత్యంత ప్రాధాన్యత ఇస్తున్నారన్నారు. మొత్తం 13 జిల్లాల నుంచి 40 స్టాల్స్‌ను ఏర్పాటుచేశారని, దాదాపు 134 పరిశోధన ప్రాజెక్టులు ఎంతగానో ఆకట్టుకున్నాయన్నారు. దీనిద్వారా విద్యార్థులు తమలోని నైపుణ్యానికి పదునుపెట్టి కొత్త విషయాలను కనిపెట్టాలన్నారు. రాష్ట్రంలో శాస్త్ర, సాంకేతిక రంగాన్ని వినియోగించుకుని ప్రజలకు అనేక సౌకర్యాలు కల్పించడం జరిగిందన్నారు. వాతావరణంలో మార్పులను తెలుసుకోవడం, వర్షాలు, పిడుగులు, ప్రమాదాలను ముందుగా గుర్తించి తెలియజేసేందుకు సాంకేతిక రంగాన్ని ఉపయోగిస్తున్నామన్నారు. రాష్ట్ర ముఖ్య మంత్రి శాస్త్ర సాంకేతిక రంగాన్ని వినియోగించుకుని కమాండ్ కంట్రోల్ ద్వారా అధికారుల పనితీరు స్వయంగా తెలుసుకుంటున్నారని తెలిపారు. రాష్ట్రంలో రహదారుల నిర్మాణం, ప్రాజెక్టుల నిర్మాణాలను డ్రోన్ల ద్వారా పర్యవేక్షిస్తున్నారన్నారు. వ్యవసాయ రంగంలో వేసిన మొక్కలను ఒక ఫొటో తీసి యాప్‌లో ఉంచినట్లయితే దాని స్థితిగతులను వెంటనే తెలియజేస్తుందన్నారు. విద్యార్థులు తలచుకుంటే ఎలాంటి పనినైనా సాధిస్తారన్నారు. రాబోయే రోజుల్లో ప్రతి జిల్లాలో శాస్త్ర సాంకేతిక కేంద్రాన్ని ఏర్పాటు చేయడానికి చర్యలు తీసుకుంటామన్నారు. రెండురోజుల పాటు జరిగే జాతీయ బాలల సైన్స్ కాంగ్రెస్‌ను విజయవంతం చేయాలని కోరారు. ఈ కార్య క్రమంలో ఎమ్మెల్సీ కరణం బలరామకృష్ణమూర్తి, జిల్లా కలెక్టర్ వినయ్‌చంద్, ఒంగోలు శాసనసభ్యులు దామచర్ల జనార్ధన్‌రావు, జిల్లా సంయుక్త కలెక్టర్ ఎస్.నాగలక్ష్మి, రైజ్ ఇంజనీరింగ్ కాలేజీ చైర్మన్ రంగమన్నార్, వైస్ చైర్మన్ శిద్దా వెంకటేశ్వరరావు, సైన్స్ కాంగ్రెస్ రాష్ట్ర పరిశీలకులు గీతా విశ్వనాధన్, డీఈఓ విజయభాస్కర్ పాల్గొన్నారు.

# ప్రధాన కమిషన్ కార్యాలయాలకు భవనాల కేటాయింపు

**అమరావతి, ఆంధ్రప్రభ:** రాష్ట్ర పునర్వ్యవస్థీకరణ చట్టంలో గుర్తించబడిన పలు రాజ్యాంగబద్ధ సంస్థల ప్రధాన కమిషన్ కార్యాలయాలు రాజధాని అమరావతి ప్రాంతంలో ఏర్పాటుకు మార్గం సుగమం అయింది. హైదరాబాద్‌లో కొనసాగుతోన్న సుమారు పలు కమిషన్ కార్యాలయాలు విజయవాడలో రహదారులు భవనాల శాఖ నూతనంగా నిర్మించిన భవన సముదాయంలో ఏర్పాటుకు సన్నాహాలు చేస్తోంది. ఆర్‌అండ్‌బీ శాఖ నిర్మించిన ఈ నూతన భవనాన్ని ప్రభుత్వం స్వాధీనం చేసుకుని అందులో కమిషన్ కార్యాలయాలను నెలకొల్పనుంది. ఈ భవనంలో ప్రధాన కమిషన్లైన పబ్లిక్ సర్వీసు కమిషన్‌కు 25 వేల చదరపు అడుగులు మొదటి అంతస్తులో కేటాయించింది. అలాగే ఏపీ మానవహక్కుల కమిషన్‌కు 5 వేల అడుగులు, మహిళా కమిషన్‌కు 2 వేల అడుగులు, ఆంధ్రప్రదేశ్ అడ్మినిస్ట్రేటివ్ ట్రిబ్యునల్‌కు 12 వేలు, నూతనంగా ఏర్పడనున్న ఆంధ్రప్రదేశ్ లోకాయుక్తకు 5 వేలు, రాష్ట్ర ఎన్నికల సంఘానికి 5 వేలు కేటాయించింది. అదేవిధంగా ఎస్సీ, ఎస్టీ కమిషన్‌కు 2 వేలు, ఏపీఈఆర్సీ 5 వేలు, వినియోగదారుల పరిరక్షణ సంస్థ, బాలల హక్కుల పరిరక్షణ సంస్థ, సాంఘిక సంక్షేమశాఖ సలహా మండలి, స్టేట్ ఆర్కైవ్స్‌లకు ఈ భవనంలో కేటాయించారు. అతితక్కువ కాలంలో అధునాతన సాంకేతిక పరిజ్ఞానంతో నిర్మించిన ఈ భవనంలోని ఐదు అంతస్తులో మూడంస్తుల్లో వివిధ కమిషనల్లకు కార్యాలయాల కోసం బ్లాకులను కేటాయించగా, మరో రెండంతస్తులు రిజర్వులో ఉంచారు. కమిషన్లకు కేటాయించిన విస్తీర్ణాన్ని మరికొంత పెంచాలంటూ పలు కమిషన్ల అధికారులు రాష్ట్ర ప్రభుత్వం దృష్టికి తీసుకొచ్చినట్లు తెలుస్తోంది. రాష్ట్ర విభజన జరిగిన మూడున్నరేళ్ల అనంతరం నేటికీ హైదరాబాద్‌లో పనిచేస్తోన్న ఈ కమిషన్ల కార్యాలయాలన్నీ రాజధాని అమరావతి బాట పట్టనున్నాయి. మానవహక్కుల ప్రభుత్వ ఉత్తర్వుల మేరకు కమిషన్ అధికారులు రహదారులు భవ నాల శాఖ నిర్మించిన నూతన భవనాన్ని పరిశీలించి, ఆ భవనం కమిషన్ ఏర్పాటు కు అనువుగా ఉంటుందని రాష్ట్ర ప్రభుత్వానికి తెలిపారు. దీనిలో భాగంగా ఆ భవనంలో హెచ్‌ఆర్సీకి 5 వేల చదరపు అడుగులు కేటాయించడం జరిగింది. ఇదిలా ఉంటే ప్రస్తుతం రాష్ట్ర మానవ హక్కుల కమిషన్‌కు పాలకమండలి లేకపోవడంతో నూతన పాలకవర్గం నియామకానికి ప్రభుత్వం నోటిఫికేషన్ జారీ చేసే అవకాశముంది. అలాగే లోకాయుక్తకు కూడా నోటిఫికేషన్ వెలువరించాల్సిఉంది.

## దమ్ముంటే సకాలంలో

# సాగునీటి ప్రాజెక్టులు పూర్తి చేయండి

**• పోలవరం ప్రాజెక్టు నిర్మాణ పూర్తి బాధ్యత కేంద్రానిదే • ఓబీసీ చైతన్య సభలో ఎమ్మెల్సీ సోము వీర్రాజు**



**హిందూపురం టౌన్, కెఎన్ఎన్:** ఆంధ్రప్రదేశ్‌లోని ప్రస్తుతం అధికార పార్టీలో రాయలసీమకు చెందిన నాయకులు దద్దమ్మలని, ఏనాడూ రాయలసీమ అభివృద్ధిపై ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడి దృష్టికి తీసుకెళ్లే వారు కరవయ్యారని బీజేపీ ఎమ్మెల్సీ సోము వీర్రాజు పేర్కొన్నారు. ఆదివారం హిందూపురంలో భారతీయ జనతా పార్టీ ఓబీసీ మోర్చా బీసీ చైతన్య మహాసభను కంచి కామాక్షి కల్యాణ మండపంలో నిర్వహించారు. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథులుగా ఎమ్మెల్సీతో బీజేవైఎం రాష్ట్ర అధ్యక్షుడు విష్ణువర్ధన్‌రెడ్డితో పాటు మాజీ ఎమ్మెల్యే పార్థసారథి, ఓబీసీ మోర్చ రాష్ట్ర అధ్యక్షుడు మధుసూదన్, పార్టీ అధికార ప్రతినిధి సత్యనారాయణ, జిల్లా అధ్యక్షుడు అంకాల్‌రెడ్డి, బీజేవైఎం రాష్ట్ర ఉపాధ్యక్షుడు పిడి పార్థసారథి, ఓబీసీ మోర్చ జిల్లా అధ్యక్షుడు అమర దేవేంద్ర, పార్లమెంట్ ఇన్‌చార్జ్ రాజశేఖర్‌లు పాల్గొన్నారు. ఈ సందర్భంగా సోము వీర్రాజు, విష్ణువర్ధన్‌రెడ్డిలు మాట్లాడుతూ కేంద్రప్రభుత్వం మన రాష్ట్ర అభివృద్ధికి ఎంతగానో సహకరిస్తుంటే పోలవరం ప్రాజెక్టు పనులలో అధికార పార్టీకి చెందిన నాయకులు కమీషన్‌లకు కక్కుర్తిపడి చేతులు ఎత్తివేయడం దురదృష్టకరమన్నారు. ఇప్పటి వరకు 60 శాతం పోలవరం ప్రాజెక్టు పనులు పూర్తి అయ్యిందంటే అందుకు ప్రధాన కారణం కేంద్ర ప్రభుత్వమేనన్నారు. రాష్ట్రానికి కేంద్ర ప్రభుత్వం ద్వారా నిధులను తీసుకువచ్చి అభివృద్ధి చేయాల్సిందిపోయి కొంత మంది అధికార పార్టీకి చెందిన నాయకుల స్వార్థం కోసం అభివృద్ధికి ఆటంకం కలిగిస్తూ కేంద్ర ప్రభుత్వంను నిందించడం సిగ్గుచేటన్నారు. పోలవరం ప్రాజెక్టు నిర్మాణ బాధ్యత పూర్తిగా కేంద్ర ప్రభుత్వానిదేనన్నారు. ఏ ఒక్క నాయకు డు అయిన రాయలసీమ అభివృద్ధిపై సియం దృష్టికి తీసుకెళ్ళారా అని ప్రశ్నించారు. తెలుగు గంగ, హంద్రీ నీవా ప్రాజెక్టుల గురించి ఏ రోజైనా జెసి దివాకర్‌రెడ్డి మాట్లాడారా అని మండిపడ్డారు. బిసిలకు మంత్రి పదవి ఇస్తారు కాని అధికారం మాత్రం ఇవ్వరన్నారు. 2019 ఎన్నికలలో ఆంధ్రప్రదేశ్‌లో బీజేపీ ఎవరికి మద్దతు ఇస్తే వారే అధికారంలోకి వచ్చే స్థాయికి ఎదుగుతారన్నారు. ముందుగా పట్టణంలో స్థానిక బిజెపి నాయకులు రమేష్‌రెడ్డి, ఆదర్శకుమార్, వరప్రసాద్, టికెబాబు, ఉదయ్‌కుమార్‌ల ఆధ్వర్యంలో శ్రీకంఠపురం నుంచి ఎన్‌టిఆర్‌సర్కిల్, అంబేద్కర్ సర్కిల్ మీదుగా సభ ప్రాంగణం వరకు భారీ ఎత్తున ద్విచక్ర వాహన ర్యాలీ నిర్వహించారు. ఈ కార్యక్రమంలో బిజెపి నాయకులు, కార్యకర్తలు పెద్ద ఎత్తున పాల్గొన్నారు.

## ఏనుగుల దాడిలో

# మరో వ్యక్తి మృతి

**డి.హీరేహాళ్, కెఎన్ఎన్:** అనంతపురం, డి.హీరేహాళ్, మండలంలో మురడి గ్రామంలో అడవి ఏనుగుల దాడిలో మురడికి చెందిన హేమకాంత్(45) మృతి చెందాడు. అడవి ఏనుగులు గ్రామ సమీపంలో వచ్చాయని విషయం తెలుసుకున్న గ్రామ ప్రజలు చూస్తుండగానే అకస్మాత్తుగా ఏనుగులు వెనుతిరిగి జనాలపై దాడి చేయడంతో హేమకాంత్ అనే వ్యక్తి ఏనుగుల దాడిలో మృతి చెందాడు. ఇతనికి ఇద్దరు కుమార్తెలు, ఇద్దరు కుమారులున్నారు.

## ఏపీ భవన్‌లో

# ముగిసిన క్రీడా, స్వర సంబరాలు



**న్యూఢిల్లీ, ఆంధ్రప్రభ :** స్ఫూర్తిని, సమైక్య భావాన్ని పెంపొందించడానికి క్రీడలు ఎంతగానో ఉపకరిస్తాయని ఢిల్లీలోని ఆంధ్రప్రదేశ్ భవన్ రెసిడెంట్ కమిషనర్ ప్రవీణ్ ప్రకాష్ అన్నారు. తెలుగు వారి కోసం 3 రోజులుగా భవన్‌లో నిర్వహిస్తున్న షటిల్ బ్యాడ్మింటన్ పోటీల్లో గెలుపొందిన విజేతలకు ఆయన ప్రశంసా పత్రాలు, నగదు బహుమతులు ప్రదానం చేశారు. కేటగిరీల వారీగా నిర్వహించిన పోటీల్లో 138 మంది పాల్గొని సత్తా చాటారు.

**గాన గంధర్వుడికి అపూర్వ స్వర నివాళి**

పద్మ విభూషణ్ మంగళంపల్లి బాల మురళీకృష్ణకు ఢిల్లీవాసులు ఘనంగా స్వరాంజలి ఘటించారు. టీమ్ ఏపీ భవన్-మంగళంపల్లి ఫౌండేషన్ ఆధ్వర్యంలో రెండు రోజుల పాటు జరిగిన కార్యక్రమాలు ఆద్యంతం సంగీత ప్రియులను అలరించాయి. కేంద్ర సమాచార కమిషనర్ మాఢభూషి శ్రీధర్ రెండో రోజు ముఖ్య అతిథిగా పాల్గొని ఆ మహనీయుని సంగీత జీవితంలోని ముఖ్య ఘట్టాలను పవర్ పాయింట్ ప్రజెంటేషన్ రూపంలో ప్రదర్శించారు. అనంతరం శ్వేతామూర్తి ఆలపించిన కీర్తనలు, హైదరాబాద్‌కు చెందిన డి.వి. మోహనకృష్ణ సంగీత కచేరీలు, ముక్కవల్లి రామకృష్ణ రాగా లు, మేళకర్తలపై విశ్లేషణ సంగీత ప్రియుల మది దోచుకున్నాయి.

# తప్ప తాగి దొరికిపోయిన కమెడియన్

**హైదరాబాద్, ఆంధ్రప్రభ :** తప్పతాగి కారు డ్రైవ్ చేస్తూ హైదరాబాద్ జూబ్లీ హిల్స్‌లో పోలీసులకు చిక్కాడు సినీ హాస్య నటుడు నవీన్. మద్యం తాగి వాహనం నడిపిస్తున్న అతను పోలీసులను తప్పించుకునేందుకు కారు కిందకు దూరాడు. అయితే అతడ్ని గుర్తించి ఆల్కహాల్ పరీక్షలు నిర్వహించారు. మద్యం తాగి వాహనం నడుపుతున్నట్లు పోలీసులు గుర్తించారు. ఈ ఘటనకు సంబంధించి నవీన్‌పై కేసు నమోదు చేసి అతడి వాహనాన్ని సీజ్ చేసినట్లు సమాచారం. ప్రస్తుతం పలు చిత్రాలలో నటిస్తున్న కమెడియన్ నవీన్ జబర్దస్త్ టీవీ షోలో కూడా పాల్గొన్నారు. గోపిచంద్ హీరోగా వచ్చిన ఆక్సిజన్ సినిమాలో నవీన్ నటించాడు. ఇదిలా ఉంటే.. పబ్బుల్లో ఫుల్లుగా ముందుకొట్టిన యువతులు ఖరీదైన కార్లను నడుపుతూ పోలీసులకు పట్టుబడ్డారు. సైనిక్‌పురికి చెందిన సంజన అనే యువతి ఫుల్లుగా మందుకొట్టి కారు డ్రైవ్ చేయసాగింది. సంజనకు బ్రీత్ ఎనలైజర్‌తో పరీక్షించగా.. 93 ఆల్కహాల్ పర్సంటేజీ నమోదైంది. కుమారి అనే మరో యువతిని పరీక్షించగా 89 వాతం ఆల్కహాల్ పర్సంటేజ్ ఉన్నట్లు నిర్ధారణైంది. డ్రంకెన్ డ్రైడ్ తనిఖీల్లో 26 మందిపై కేసులు నమోదు చేసి 14 కార్లు, 6 బైకులను పోలీసులు సీజ్ చేశారు.

# కాపు రిజర్వేషన్లపై బాబుకు చిత్తశుద్ధి లేదు

**• ప్రత్యేక హోదా, రైల్వేజోన్, పోలవరం అంశాల్లో సీఎం ఫ్లాపే • ఒంగోలు, నెల్లూరు, తిరుపతి వైకాపా ఎంపీల విమర్శ**



**నెల్లూరు (కార్పొరేషన్), కెఎన్ఎన్:** కాపు రిజర్వేషన్లపై ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడుకు చిత్తశుద్ధి లేదని, ప్రకటనలతో సీఎం నిత్యం ప్రజలను మోసం చేస్తున్నారని, ఒంగోలు, నెల్లూరు, తిరుపతి ఎంపీలు వైవీ సుబ్బారెడ్డి, మేకపాటి రాజమోహన్ రెడ్డి, వరప్రసాద్‌లు పేర్కొన్నారు. ఆదివారం నెల్లూరులో వైసీపీ కార్యాలయంలో ఏర్పాటుచేసిన విలేకరుల సమావేశంలో వారు మాట్లాడారు. ఒంగోలు ఎంపీ వైవీ సుబ్బారెడ్డి మాట్లాడుతూ ప్రత్యేక హోదా, రైల్వే జోన్, పోలవరం విషయాలలో చంద్రబాబు అట్టర్ ఫ్లాప్ అయ్యారని విమర్శించారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు రెండు రాష్ట్రానికి చెందిన హామీలను నెరవేర్చలేదన్నారు. 2019కి కూడా పోలవరాన్ని నిర్మించలేమని చంద్రబాబు చెబుతున్నారన్నారు. చంద్రబాబు అడుగడుగునా ప్రజలను మోసం చేస్తున్నారన్నారు. నెల్లూరు ఎంపీ మేకపాటి రాజమోహన్‌రెడ్డి మాట్లాడుతూ పోలవరం రైల్వే జోన్ ప్రత్యేక హోదాలను చంద్రబాబు క్రమేపీ నీరుగార్చారన్నారు. ఇది చాలా విచారించాల్సిన విషయమన్నారు.

పోలవరం బాబు హయాంలో పూర్తవుతుందా లేదా అన్నది అనుమానంగా ఉంద న్నారు. రూ. 1.20 లక్షల కోట్లు చంద్రబాబు అప్పు తెచ్చి తాత్కాలిక కార్యక్రమాలు చేశారన్నారు. తాత్కాలిక సెక్రటరీయేట్ నిర్మించారని రూ. 10 వేల కోట్ల నిధులు నీరు-చెట్టు కార్యక్రమానికి ఖర్చు చేశారన్నారు. ఇప్పటివరకు ప్రతిపక్షాలను పోలవరం విషయంలో చంద్రబాబు పట్టించుకోలేదన్నారు. తమ రాజీనామాల వల్లే పోలవరం, ప్రత్యేక హోదా వస్తుందను కుంటే రాజీనామాలు చేయడానికి ఏ క్షణంలోనైనా తమ వైసీపీ ఎంపీలు సిద్ధంగా ఉన్నామన్నారు. తిరుపతి ఎంపీ వరప్రసాద్ మాట్లాడుతూ విభజన చట్టం ప్రకారం దుగరాజుపట్నం ఓడరేవు ఫేస్-1 పనులు 2018కి పూర్తి కావాల్సి ఉందన్నారు. కాని ఇప్పటికి అక్కడ శంకుస్థాపన కూడా జరగలేదన్నారు. గాలేరు నగరి పూర్తి చేయలేదన్నారు. కారణం ఈ ప్రాజెక్టుకు స్వర్గీయ వైఎస్ఆర్ శంకుస్థాపన చేసి ఉండడమేనన్నారు. చంద్రబాబు వైసీపీలో గెలిచిన ఎమ్మెల్యేలను ఫిరాయింపులకు ప్రోత్సహించి తన మంత్రి వర్గంలో మంత్రి పదవులు ఇచ్చి అనైతిక కార్యక్రమాలకు శ్రీకారం చుట్టారన్నారు. ఈసమావేశంలో వైసీపీ జిల్లా అధ్యక్షుడు కాకాణి గోవర్ధన్‌రెడ్డి, వైసీపీ ఎమ్మెల్యేలు తదితరులు పాల్గొన్నారు.

# పార్టీ మారే ఆలోచన లేదు

**• వైకాపాకు దూరంగా ఉన్నా • అరకు పార్లమెంట్ సభ్యురాలు కొత్తపల్లి గీత**



**విశాఖపట్నం, కెఎన్ఎన్ బ్యూరో:** తాను పార్టీ మారబోతున్నట్లు గత కొంత కాలంగా ప్రచారం జరుగుతుందని అయితే తాను ఏ పార్టీలోనూ చేరే ఆలోచన, అవకాశం లేదని అరకు పార్లమెంట్ సభ్యురాలు కొత్తపల్లిగీత స్పష్టం చేశారు. ఆదివారం ఏపీ వర్కింగ్ జర్నలిస్టుల ఫెడరేషన్ ఏర్పాటు చేసిన కార్యక్రమంలో ముఖ్య అతిథిగా ఆమె పాల్గొని మాట్లాడారు. తాను వేరే పార్టీలో చేరే అవకాశాలు లేవని గతంలోనే మీడియాకు పలు సందర్భాల్లో స్పష్టం చేశానన్నారు. అయినప్పటికీ తాను సైకిల్ ఎక్కబోతున్నట్లు, మరో పార్టీలో చేరే ఆలోచనలో ఉన్నట్లు మీడియాలో కథనాలు వస్తున్నాయని తాను ఎప్పటికి వేరే పార్టీలో చేరబోనని మరోసారి మీడియా ఎదుట స్పష్టం చేస్తున్నట్లు ప్రకటించారు. అయితే తాను ఎంపిగా గెలిచిన వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీకి వేర్వేరు కారణాలతో కొంత దూరంగా ఉన్న మాట వాస్తవమేనన్నారు. తనను గెలిపించిన ప్రజలకు పూర్తి స్థాయిలో సేవలందించడమే తనకు ప్రధానమని కాబట్టి ప్రజా సమస్యల పరిష్కారమే ధ్యేయంగా ముందుకు సాగుతున్నట్లు వివరించారు. ఇప్పటి వరకు పార్లమెంట్‌లో సుమారు 543 అంశాలకు సంబంధించి తాను ప్రస్తావించానన్నారు. పార్టీలతో సంబంధం లేకుండా ప్రజలకు సంబంధించిన అనేక డిబేట్లలో పాల్గొన్నట్లు తెలిపారు. సమాజాభివృద్ధిలో జర్నలిస్టుల పాత్ర అత్యంత కీలకమని కాబట్టి తాను పార్లమెంట్ పరిధిలో పర్యటించినప్పుడు ముందుగా కొన్ని అంశాలు వారితో చర్చించిన తరువాతే తదుపరి నిర్ణయం తీసుకుంటామన్నారు. జర్నలిస్టుల సమస్యలు పరిష్కరించాల్సిన బాధ్యత ఆయా ప్రభుత్వాలదేనన్నారు. కార్యక్రమంలో వర్కింగ్ జర్నలిస్టుల ఫెడరేషన్ రాష్ట్ర కార్యదర్శి గంట్ల శ్రీనుబాబు, నగర అధ్యక్షులు పి.నారాయణ్ తదితరులు పాల్గొన్నారు.

ఆంధ్రప్రభ సారస్వత వేదిక

# సాహితీగవాక్షం

## తెలుగు మాటలు



ఉరుతర గద్య పద్యోక్తుల కంటె
సరసమై పరగిన జానుదెనుంగు
చర్చింపగా సర్వ సామాన్యమగుట
గూర్చెద ద్విపదలు గోర్కి దైవార
తెలుగు మాటలనంగ వలదు వేదముల
కొలదియకా జూడు డిలనెట్టులనిన
బాటి తూమునకును బాటి యౌనేని
బాటింప సోలయు బాటియ కాదె
అల్పాక్షరంబుల ననల్పార్థ రచన
కల్పించుటయె కాదె కవి వివేకంబు.

\- పాల్కురికి సోమనాథుడు

## తెలుగు భాషామ తల్లి



పరిపూర్ణ పావనాంభస్తరంగోద్వేగ
గౌతమీ గంభీర గమనమునకు
ఆలంపురీ నందనారామ విభ్రాజి
మల్లోల ఫలరాజమధుర రుచికి
ఆంధ్రీకుమారీ సమాయుక్త పరిపూత
తుంగా పయస్సు మాధుర్యమునకు
ఖండశర్కర జాతి ఖర్జూర గోక్షీర
ద్రాక్షా దియుత రామ రసమునకును
అమృత నిష్యంది వల్లకీహ్లాదమునకు
రాగిణీ దివ్య సమ్మోద రాగమునకు
తేనె తేటల నవకంపు సోనలకును
సాటియగును మా తెలుగు భాషామతల్లి

\- సురవరం ప్రతాపరెడ్డి

## ఆంధ్రుడా!



ఏ భాషరా నీది ఏమి వేషమురా
ఈ భాష ఈ వేషమెవరి కోసమురా
ఆంగ్లమందున మాటలాడ నేర్చగనే
సంతోషపడియెదవు సంగతేమిటిరా!
దేశభాషలయందు తెలుగు లెస్సయటంచు
తెలుగు బిడ్డా! ఎపుడు తెలుసుకొందువురా!
తెలుగు బిడ్డవురోరి!తెలుగు మాట్లాడుటకు
సంకోచపడియెదవు సంగతేమిటిరా.
అన్యభాషలు నేర్చి ఆంధ్రంబురాదంచు
సకిలించు ఆంధ్రుడా, చావవెందుకురా!

\- కాళోజీ నారాయణరావు

## నీరాజనము

లక్ష్య లక్షణ రూప కల్పనల యందు
ఆంధ్ర సారస్వతాన నవ్యంపురుచులు
ప్రబల చేసెడి తావక ప్రాభవమున
కంకితంబయ్యె నా హృదయంబు సుకవి!
దేశమే నీవుపాసించు దేవదేవి
అవనియంతయు ప్రేమమయంబు నీకు
మధుర మధురము తెనుగు నీ మాతృభాష
ధన్యుడవు నీవు నీ పుట్టు ధన్యమయ్యె!
భావకవితా ప్రపంచాన భామినులును
మాతృపీఠమునందు సమ్మానలగుట
నీవు చూపు నుదాత్తమౌ నేర్పుగాన
అందుకొనుమయ్య మత్ప్రీతి వందనంబు
కళల సౌందర్యమారాధకంబు నీకు
ప్రకృతి లావణ్యమౌ నీకు పరమ ప్రియము
కావ్యఫలముల నాంధ్రుల కాంక్ష దీర
కోసి యిత్తువు ప్రేమతో కోవిదేంద్ర!



\- దేవులపల్లి రామానుజరావు

## అమృతవల్లి తెలుగు



తెలుగువారి యిల్లె తెలుగుదేశంబౌను
తెలుగు వాణి అచట పలుకు చుండు
పంచదార కన్న పనస తొనల కన్న
తేనెకన్న మనదు తెలుగు మిన్న
తెలుగు వెలది పలుకు తీయని పలుకులు
వినినయంత రాగధునులు దూకు
తెలుగు పలుకు కన్న తీయని దున్నదా?
తెలుగులోనె పాడవలెను పాట.
గాన యోగ్యమని జగాన ఖ్యాతినిగన్న
దెంత మధుర మీ- అజంత భాష!
కటుత లేని బాస, కమనీయ యగు బాస
యాస యున్నయపుడే అగును బాస

\- దాశరథి

## మన మాతృభాష తెలుగు



శాతవాహనుల ఏల్బడిలో
తొలి అడుగువేసింది తెలుగు
కాకతీయుల గొడుగు నీడలో
కదను తొక్కింది తెలుగు
కృష్ణరాయల పాలనలో
పడగెత్తి నిలిచింది తెలుగు
నవీనయుగాన వివిధ రీతులకు
నాంది పలికింది తెలుగు.
మన మాతృభాష తెలుగు
మన రక్తఘోష తెలుగు
గోదావరి కృష్ణ తుంగభద్రానదులు
పారుసలిల క్షీరధారలే సాక్షిగా
ప్రఖ్యాత భాష తెలుగు
అత్యంత ప్రాచీన తెలుగు

\- ఆచార్య సి.నారాయణరెడ్డి

## తేట తేనెల చిలుకు పలుకు నా తెలుగు



తేట తేనెల చిలుకు పలుకు నా తెలుగు
రాజహంసల కులుకు తళుకు నా తెలుగు
అద్భుత సంస్కృతి విరియు రెమ్మ నా తెలుగు
అమృతధారల కురియు అమ్మ నా తెలుగు
ఆ తెలుగుకు అభివందనం
అనురాగ వల్లికి చందనం...శ్రీచందనం.

\- వడ్డేపల్లి కృష్ణ

# ప్రతీకలు కవితా నిర్మాణపు పనిముట్లు కావాలి!

**తెలుగులో, సింబాలిజంతో పాటు డాడాయిజం, సర్రియలిజం, లాంటి ఆధునిక తాత్విక భావనలతో ప్రభావితులై శ్రీశ్రీ, బైరాగిలాంటి కవులు అద్భుత కవిత్వం రాశారు. పట్టాభి వచన కవితల దుడ్డుకర్రలతో పద్యాల నడుం విరగ్గొడతా ననడం, శ్మశానల్లాంటి నిఘంటువులు, సర్పపరిష్వంగం నుండి తెలుగు భాష కవిత్వం బయటపడాలని శ్రీశ్రీ భావించడాలు అన్నీ పరదేశీయ సాహితీరూపాల (forms) ప్రభావితాలేనని వేరే చెప్పనక్కరలేదు.**

కవిత్వం చదవబోతున్నపుడైనా నీలో మెత్తదనం ఉండాలి.

వెలితిగా ఉన్న ఆకాశం నిండా.../మెలమెల్లగా విస్తరిస్తున్న మేఘంలాంటి దిగులుండాలి./నిజానికి, కవిత్వాన్ని సమీక్షించినపుడైనా/మనందరి ఏకైక హృదయాన్ని సమీపించేరహస్యం గురించి /నీకు నీదైన వెదుకులాగ ఉండాలి.... అంటారు...కవి బివివి ప్రసాద్...నిజమే కవిత్వం చదివేటపుడు నీదైన వెదుకులాట ఉండాలి. దీన్నే నేను లో చూపు అన్నాను. ( insight)ఈ లోచూపు ఉండబట్టే ఫ్రెంచి కవుల్లో ప్రతీకవాదం (symbolism)పుట్టుకొచ్చింది. ముఖ్యంగా statementకవితలు, వర్ణనాత్మక (Discription)కవితలు చదివి బోర్‌కొట్టిన ఫ్రెంచికవులు moodsను sensationsపుట్టించేకవితలు రాయాలన్నారు. అదిsymbolic poetryవల్లనేసాధ్యమని భావించారు. 1885లో jean moreasప్రతీకవాదాన్ని ప్రవేశపెట్టాడు. దీంతో ఛార్లెస్ బోధలేర్, ఫాల్వర్లయిన్, ఆథర్ రింబాడ్, మల్లార్మే లాంటి కవులు తమ కవితల్లో ప్రతీకలు గుప్పించి సంచలనం సృష్టించారు. STYLISHకవిత్వం రాశారు. అందుకే సింబాలిజంలో....

1. Stylistic, thematic,philosophic poetic movement ఒకదాన్ని ముందుకు తెచ్చారు.
2. మతసాంఘిక, నీతి విలువలను పక్కన పెట్టారుTraditional formsను తిరస్కరించారు.
3. కవిత్వంలో ప్రతీకలను, కొత్త కొత్త అభివ్యక్తులను, అబ్బురపరిచే శైలీ విన్యాసాలను, సరికొత్త ప్రతీకలను ప్రయోగించారు.
4. ప్రతీకలు ఎన్ని రకాలుగా ఉండవచ్చో రూపనిర్మాణంలో వాటి ప్రాముఖ్యత ఏమిటో తెలియజేశారు.

ప్రపంచం నివ్వెరపోయింది. ఎపుడూ పాతపద్ధతులలోనే కవిత్వం రాయాలని అరిగిపోయిన అలంకార శాస్త్రాలనే follow కావాలనే నియమాలను బద్ధలు కొట్టడమేగాకIndividualism in literature, liberty in artఅన్న నినాదంతో వారు చెలరేగిపోయారు. దీంతో ఒకకళాత్మక జగత్తు అతిలోకసుందరంగా ఆలోచనాత్మకంగా, అనుభూతిమయంగా మారిపోయింది. అంతేకాదు మార్మికత, తాత్వికతల తాలూకు ఆలోచనలు చేయడానికి సృజనకారులు, కళాకారులు ప్రయత్నించారు. మన తెలుగులో, సింబాలిజంతో పాటు డాడాయిజం, సర్రియలిజం, లాంటి ఆధునిక తాత్విక భావనలతో ప్రభావితులై శ్రీశ్రీ, బైరాగిలాంటి కవులు అద్భుత కవిత్వం రాశారు. పట్టాభి వచన కవితల దుడ్డుకర్రలతో పద్యాల నడుం విరగ్గొడతా ననడం, శ్మశానల్లాంటి నిఘంటువులు, సర్పపరిష్వంగం నుండి తెలుగు భాష కవిత్వం బయటపడాలని శ్రీశ్రీ భావించడాలు అన్నీ పరదేశీయ సాహితీరూపాల (forms) ప్రభావితాలేనని వేరే చెప్పనక్కరలేదు. వెయ్యేళ్లు రాజ్యమేలిన పద్యం ఇప్పుడు పత్రికల్లో ఎక్కడా కనిపించదు. అలాగే వచన కవితల్లో...వర్ణనల కన్నా నినాదాల కన్నా ప్రతీకలు ఇమేజరి, దృశ్యాలను కవితామయం చేసే టెక్నిక్‌లే పెరిగిపోయాయి. శ్రీశ్రీ, తిలక్, గుంటూరు శేషేంద్రశర్మల కవితానిర్మాణపద్ధతులను తర్వాత తరం కవులు బాగా వంటబట్టించుకున్నారు. ఏతావాతా చెప్పొచ్చేదేమిటంటే ఇప్పుడు కొత్తగా కవిత్వం రాస్తున్న కవులు, కవయిత్రులు, ప్రతీకలు ఎన్నివిధాలుగా కవితా నిర్మాణాల్లో చోటుచేసుకుంటున్నాయో గమనించాలి...చక్కని వచన కవితలు రాయాలనుకునే వారు కవితా సంపుటాలను...లేదా వివిధ కాలాల్లో , వివిధ దేశాల్లో వచ్చిన కవితలను వాటి నిర్మాణ కళానేపథ్యాన్ని బాగా చదవాలి. ఎన్ని మాటలు నేర్చుకుంటే అంత బాగా పాటలు రాయవచ్చు అని ఆత్రేయ అన్నట్టు ఎంత బాగా కవిత్వం చదివితే, విమర్శలు చదివితే, సమీక్షలు చదివితే...అంత బాగా, గొప్పగా కవితలు రాయవచ్చు. మన తెలుగులో కట్టమంచి కవిత్వతత్వ విచారం, శేషేంద్రశర్మ కవిసేన మానిఫెస్టో లాగేMoreasలాంటి ఫ్రెంచి కవులుsymbolist manifestation లో ప్రతీకవాద కవిత్వం ఎలా ఉండాలో చెప్పారు. les fleurs dumal, the flowers of evil లాంటి ప్రతీకవాద కవితా సంకలనాల్లోsymobolic poetryని అత్యద్భుత అభివ్యక్తి ప్రతీకల కలనేతగా శిల్పీకరించారు. ఇప్పుడు మనకవులు, రచయితలు రాసే వచన కవిత్వంలో అక్కడక్కడా ప్రతీకవాద ఛ్ఛాయలు లేకపోలేదు. చాలామంది కవులు, కవయిత్రులు అందమైన ప్రతీకలు తమ కవితల్లో ఉపయోగిస్తున్నారు. అంటే అదిsymbolismకవిత్వ ప్రభావమే...ఇప్పుడు ఎప్పటిలాగే పాదముద్రల్ని సింబల్‌గా ఉపయోగిస్తూ,దాని చుట్టూ ఉన్న దృశ్యాలను అనుభూతి సన్నివేశాలను, మానవ నైజాన్ని, జీవితంలోని సంఘటనలను, కష్టాలను, బాధలను, సంవేదనలను, అందమైన పదబంధాలతో అద్భుతకవితగా శిల్పీకరించిన కవి ప్రభాకర్‌జైని...ఆయన రాసిన పాదముద్రలు కవితలోsymbolic expressions చూద్దాం.

**నేనొక రోజు నిదురించి మంచి కలగన్నాను/ఆ కలలో../ దేవుడూ నేను కలసి నడుస్తున్నాం సముద్రపు ఒడ్డున/దేవుడితో కలసి నడుస్తున్నానేమో, చిత్రంగా/ నా జీవితంలోని సంఘటనలన్నీ/అలవోకగా నా ముందు ప్రత్యక్షమయ్యాయి...**అంటూ మొదలవుతుంది పాదముద్రలు కవిత...ఇలాంటి కవితను గతంలోmark halliday లాంటి కవులురాసినా...ఎత్తుగడ ఇలా ఉండదు. ఆయన ఒక స్త్రీlegs poem

### కవిత్వం-డిక్షన్-17



అంటూ కవిత రాసినా అందులోcontentకు కవితకు పొంతన ఉండదు. కాని ప్రభాకర్ జైని రాసిన పాదముద్రలు నిజంగానేsymbolic expressionకు ప్రతీకగా నిలుస్తుంది. అయితే ఇక్కడ దేవుడు కవి కలలో నడుస్తున్నారు. ఎక్కడ సముద్రపు ఒడ్డులో...ఇక్కడ సముద్రం కష్టాలకు ప్రతీకంటూ ధ్వనింపచేయడం కూడా జైని కవితానిర్మాణంలో ఒక టెక్నిక్ అనే చెప్పాలి. జీవితంలోని సంఘటనలన్నీ అలవోకగా తన ముందు ప్రత్యక్షమయ్యాయని కవి చెబుతున్నాడు. అంటే కలలో దేవుడితో పాటు నడుస్తున్నాడు గనుక జీవితంలోని కష్టాల తాలూకు సంఘటనలన్నీ కవికి ప్రత్యక్షమయ్యాయి. ఇక్కడ హాల్ పెరల్స్ తమ స్వప్న సందేశం అన్న గ్రంథంలో అనేక ప్రతీకలను ఉటంకిస్తూ కలలకు భాష్యం చెప్పారు. కవి కూడా పాదముద్రలు నడకలు సముద్రం...ఇలా ప్రతీకల కవితా సామాగ్రితో కవితలో తాను చెప్పబోయే content(వస్తువు)ను ఎలా కవిత్వంగా శిల్పీకరిస్తున్నాడో పాఠకుడికి ముందుగానే చెప్పక ఒకsymbolic moodను క్రియేట్ చేస్తున్నాడు. వచన కవితా పితామహుడు కుందుర్తి చెప్పినnarrative poetic method అన్నమాట...తర్వాత...ఏం జరిగింది?

**సైకత వీధుల్లో స్పష్టంగా రెండు జతల అడుగు జాడలు.../నావీ...దేవుడివి.../ నా జీవితమంతా నా తోడుగా నాతో పాటు/ నడచిన/ భగవంతుడికి వినమ్రుణ్ణయ్యి నమస్కరించాను.** /అంటూ ఈ కవి రెండు జతల అడుగు జాడలను తనవీ దేవుడివి అంటూ...అడుగుజాడలతో poemను symbolise చేశాడు. ఇక్కడ మరో విషయం మనం గుర్తించాలి. కొన్ని ప్రతీకలు వస్తుతత్వాన్ని స్ఫురింపజేస్తాయి. మరి కొన్నిcompareచేస్తాయి. ఇంకొన్ని expression skillsగా ఉపయోగపడతాయి. ఇక్కడ జీవితమంతా తన తోడుగా తనతో పాటు నడచిన దేవుడి అడుగు జాడలని చెప్పడంతో కవి తను చెప్పబోయే పాదముద్రలకుcontentను అభివ్యక్తితో పాటు ప్రతీకాత్మకం చేశాడు. కవితా నిర్మాణంలో ఇదొక ఆకర్షణీయమైన టెక్నిక్. అయితే తనతోపాటు నడిచాడు. కావున భగవంతుడికి వినమ్రుడినై నమస్కరిస్తున్నాడు కవి. తర్వాత ఏం జరిగింది? సినిమాటిక్‌లో ఒక సీన్ తర్వాత మరొక సీన్‌లో ఉత్కంఠత కలిగించే టెక్నిక్(screen play)ప్రదర్శించినట్టు ఈ దర్శక కవి... ముందేమి చెప్పబోతున్నాడో తెలియదు.

**అలా నడిచి నడిచి జీవితపు చరమాంకాలని/తడిమి చూసుకుంటుంటే.../నా జీవనయానంలో కొంత మేరకు పాదముద్రలు/ఒక్కరివే పడ్డాయి..కనబడ్డాయి.../ తరచి చూస్తే, తడిమి చూసుకుంటే/ అవి నేనొంటరినయి, కష్టాల బరువును మోస్తూ/ పయనించిన, కటిక చీకటి రోజుల స్మృతులు.../** అంటూ...వస్తువులోని విషయాన్ని (content)హఠాత్తుగా మలుపు తిప్పాడు కవి? ఇక్కడ మనం రెండు విషయాలు గమనించాలి. ఒకటి...

**అలా నడిచి నడిచి...**అనడంలో కుందుర్తిnarrative poetic methodను ఉపయోగించడం...మొకటి...

పాదముద్రలు ఒక్కరివే పడ్డాయి...కనబడ్డాయి...

అంటూ ...దేవుడి ప్రతీకలను తుడిచేయడం ...ఇక్కడ.

symbolism is often recognised as the source of the modern artistic temper as characterised by formal experimentation and alienation from society. అన్న సింబాలిజం poetry manifestation నిర్వచించినట్టు ప్రభాకర్ జైని దేవుడనే tradition symbolను ఉపయోగించుకుని modern artistic temperలో poemను మలుపు తిప్పడానికి ప్రయత్నించాడు. అంతేకాదు పాదముద్రలు ఒక్కడివే పడ్డాయి. కనపడ్డాయి అంటూ కవితా పాదాన్ని మెస్మరిజం చేశాడు. అది కవి కన్ను ప్రిజమ్ అయినపుడే కవిత్వం మెస్మరిజం (తిలక్) అవుతుందనడానికి..జైని ఉపయోగించిన ఈ కవితా నిర్మాణ పద్ధతి (పడ్డాయి...కనపడ్డాయి) నిదర్శనం. వాస్తవానికి పడ్డాయి అన్న పదం లేకుండా కనబడ్డాయి అన్నా అర్థమేం చెడదు. కాని ప్రతీకవాద కవితా నిర్మాణంలో బోదలేర్ మొదలు మల్లార్మే వరకు చాలామంది ఇలాంటిsyntax cutting poetic methodsను ఉపయోగించి కవితా నిర్మాణంలో మెరుపులు చిందించారు. అలాగేformపాటు content(వస్తువును) presentationలో శిల్ప శోభితం కావాలన్నది ప్రతీకాత్మక కవితకు ప్రాణస్పందనలాంటిది.

అవి నేనొంటరినయి...కష్టాల బరువును మోస్తూ.../పయనించిన కఠిక చీకటి రోజుల స్మృతులు,/ అంటే జ్ఞాపకాలన్న మాట...అందుకే..ఇక్కడ దేవుడిని రెండో పక్షం చేశాడు కవి. అంటే ఎవరి కష్టాలకు వారే కారకులన్నమాట. దేవుడి పాదముద్రలు ఏమైనట్టు? కవి కలలో నడిచి వెళ్లానని ముందే చెప్పాడు గనుక...ఆ రహస్యం అడగకూడదు.

**నాకు కోపం వచ్చింది కినుకతో/నిన్ను నమ్ముకుని నడిచిన నన్ను/ కష్టాల్లో వదిలేశావు, ఒంటరిని చేశావు కదయ్యా/ ధర్మమా నీకు, న్యాయమా నీకిది...అని/ దేవుణ్ణి నిలదీశాను/ దేవుడు నవ్వాడు/ నవ్వులో విషాదం నిండుగా పొంగింది.** అంటూ మళ్లీ దేవుడి ప్రస్థానం తీసుకువస్తాడు కవి. దీన్నేpoeticమెస్మరిజం అంటారేమో... ఈకవి ఇండియాలో పుట్టాడు గనుక తన fatalistic viewsనేpoetic viewsగా అంటే వస్తుగతం చేయడమన్న మాట. పాశ్చాత్య సింబాలిజం వేరు భారతదేశంలాంటి .దేవుళ్లు..కులానికో దేవుడు( ఈ దేవుళ్లంతా ఆయా కులాల రస్తీ పురుషులకు ప్రతీకలు..కింది కులం...యల్లమ్మకు...యల్లమ్మే దేవతవుతుంది. అగ్రకులం లక్ష్మికి...లక్ష్మి దేవతవుతుంది) అలాగేformవిషయంలో అనుకరించినా వస్తువు విషయంలో వారి scientificఅప్రోచ్‌ను,thematicపద్ధతులను మన కవులు పూర్తిగా అనుకరించలేదనే చెప్పాలి. దేవుని నవ్వులో విషాదం నిండుగా పొంగింది..అనడంలో కవి keen observation కనిపిస్తుంది. అంతేకాదు కవిత ముగింపును ఎంత చక్కగా చేశాడో చూడండి.

**అపార ప్రేమతో నన్ను స్పృశించి/లేదు నాన్నా కష్టకాలంలో నిన్నొదిలి పోలేదు/ అప్పుడూ అవ్యాజానురాగం పంచాను నీకు/ కష్టాల్లో ఉన్న నువ్వు నన్ను మరచి/ గమనించలేదె కానీ.../అప్పట్లో నిన్ను నేను నాభుజాల మీద మోసుకు తిరిగాను/అందుకే నీకు నీ అడుగుజాడలే కప్పించలేదు/ అక్కడ కన్పించిన పాదముద్రలు నావని గుర్తించలేదు/**అని అన్నాడు. **నా అల్పత్వానికి నేను కరిగి నీరయి/కన్నీళ్లో పాదాభిషేకం చేస్తే/చిరునవ్వుతో అక్కున చేర్చుకున్నాడు దేముడు నన్ను**..అంటూ కవితను అందంగా ముగిస్తాడు ప్రభాకర్ జైని. ఇక్కడ కష్టాల్లో దేవుడిని మరచిపోయాడు అన్న కవి వాక్కు పూర్తీగా, ఆశ్చర్యాన్ని కవితా ప్రియులకు కలిగిస్తుంది. ఎందుకంటే కష్టాలు ఉన్నపుడే దేవుణ్ని తలచుకుంటాము(కుంతి దేవి కృష్ణుణ్ని కష్టాలివ్వమని కోరింది అందుకేగా)

అయితే ఇక్కడ కవిత్వంలో వ్యతిరేకార్థం చెబితేనే కొత్తగా చెప్పినట్టు, ఆకాశపుటెడారిలో శ్రీశ్రీకి, కాళ్లు తెగిన ఒంటెలాగ జాబిల్లి కనిపించినట్టు, కాళ్లు తెగిన అన్నది కొత్త అభివ్యక్తి. అలాగే అందుకే దేవుడు భుజాల మీద మోసుకు తిరగడం వల్ల నీకు నీ అడుగుజాడలే కనిపించలేదు అన్నాడు. నడక కష్టానికి, భుజం సుఖానికి ప్రతీకలనుకుంటే చివరకు పాదముద్రలు ఎవరివో అర్థమవుతాయి. కన్నీళ్లతో పాదాభివందనం చేయడం కూడా గ్రీకువిషాదంలో ఒక భాగం purityకి కన్నీళ్లు symbolsగా వారు ఉపయోగిస్తారు. ఇలా ఈ కవిత మొత్తం narrative method(కుందుర్తి చెప్పిన కవితా నిర్మాణ పద్ధతుల్లో ఒకటి)లో నడిచింది. వాస్తవానికి footprintకవితకు స్వేచ్ఛానువాదమని ప్రభాకర్ జైని చెప్పకున్నా అతని కవితాత్మpoetic style, symbolic expressionఅద్భుతం, 5వేల ఇంగ్లీష్ నవలలు చదివిన ఈ కవి, ఇలాంటి కవితలే రాస్తాడు. కవిత్వమంటే ప్రాణప్రదంగా భావించే ప్రభాకర్ జైనీలాంటి కవుల నిబద్ధతలను దార్శనికతను, నిజాయితీని, ప్రతిభావ్యుత్పత్తులను, నేటి యువ కవులు గమనించి వారిని ఆదర్శంగా తీసుకొని మంచి కవితలు రాయడానికి ప్రయత్నిస్తారని ఆశిద్దాం.

\- బిక్కి కృష్ణ
8374439053

# హక్కుల కోసం చేసే పోరాటంలో 'గెలుపు చిరునామా'

దేశంలోని ప్రతిపౌరుడికి రాజ్యాంగం ప్రసాదించిన స్వాతంత్ర్య ఫలాలను అనుభవించే హక్కు ఉంది. అలాగే స్వేచ్ఛతో, సమానత్వంతో ఆత్మగౌరవ సహితంగా బ్రతుకుతూ అస్థిత్వాన్ని కాపాడుకునే హక్కూ ఉంది. కాని అది కేవలం కొన్ని వర్గాలకే పరిమితం కావడం విచారకరం. ఇది దివ్యాంగుల గురించి మాట్లాడుకుంటున్న సందర్భం కాబట్టి వారి పట్ల సభ్యసమాజం వ్యవహరిస్తున్న తీరును కూడా కాస్త పరిశీలనాత్మకంగా చూడవలసి ఉంది. అరకొర సౌకర్యాలు దివ్యాంగుల ఆత్మగౌరవాన్ని నిలబెట్టేవిగా లేవన్నది జగమెరిగిన సత్యం. అంగవైకల్యం గలవారు అనునిత్యం అవహేళనలకు, అవమానాలకు, నిర్లక్ష్యానికి , నిరాదరణకూ గురికావడమే గాక అణచివేతలను, దోపిడీలను అనుభవించవలసి వస్తున్నది.

ఇటువంటి అమానుషమైన విషయాల పట్ల తీవ్రంగా స్పందించి, ప్రత్యేక ప్రతిభావంతుల సమస్యల్ని కవితా వస్తువులుగా స్వీకరించిన కవి బిల్ల మహేందర్. ఆయన దివ్యాంగులు ఎదుర్కొంటున్న సవాళ్లపై వివిధ సందర్భాలలో స్పందించి 'గెలుపు చిరునామా' అనే కవితా సంపుటిని వెలువరించాడు. ఆ కవితలను సందర్భానుసారంగా ఇప్పుడు సమీక్షించుకోవడం అవసరంగా భావిస్తున్నాను. వికలాంగుల పట్ల వివక్షను కూడా జర గడాన్ని నిరసిస్తూ 'మీలో ఒక్కరిగా' అనే కవితలో ఇలా అంటాడు కవి. **'మీకులాగే మాకు/ మా అమ్మానాన్నలు/పెట్టిన పేరు లేదా? కుంటోడా, గుడ్డోడా అంటూ/ అయిందానికి కాని దానికి/ మాలోపాన్ని సాకుగా చూపి/ ఎందుకు హేళన చేస్తున్నారు''** అని ధర్మబద్ధంగా నిలదీస్తున్నాడు. సాటి మనిషి అంగవైకల్యం కారణంగా బాధపడుతుంటే, సానుభూతితో సాయపడకపోగా సూటిపోటి మాటలతో చిత్రవధ చేయడం మానవత్వమేమని పించుకుంటుందా? ఇటువంటి సందర్భాన్ని ఉటంకిస్తూ 'మాకు ఆత్మగౌరవం కావాలే' కవితలో...



**''గతజన్మ పాపం లేదు/పుణ్యం లేదు/ విధిరాసిన రాత కాదు/ ఆ బ్రహ్మ గీసిన గీత అంతకన్నా కాదు''**..అంటూ శాస్త్రీయంగా ఆలోచించమని సభ్యసమాజాన్ని సున్నితంగా మందలిస్తున్నాడు. అదే సందర్భంలో దివ్యాంగులకు తమ మనస్సులోని న్యూనతాభావాన్ని వదలించుకోవాలని సూచిస్తున్నాడు. ఇదే కవిత చివరి పంక్తుల్లో అన్నింటికన్నా మిన్నగా వారికేం కావాలో తెలియజేస్తూ....**''అందుకే మాకిప్పుడు/మీ చేతన కావాలే/అన్నిటికన్నా మిన్నగా/మా ఆత్మగౌరవం కావాలే''** అంటాడు. ఆత్మగౌరవంతో బ్రతికే హక్కు ప్రతి వ్యక్తికీ ఉందనే విషయాన్ని విస్మరించవద్దని వేడుకోవడం వెనుక ఉన్న ఆవేదననే బుద్ధిజీవులైన ప్రతి ఒక్కరూ అర్థం చేసుకోవలసింది. 'మీలో ఒక్కరం' అనే కవితలో వ్యంగ్యాన్ని, ధ్వనిని మేళవించి సున్నితమైన రీతిలో పాఠకుల మనస్సుపై చురకపెడతాడు.

**'మీలా వెలుగుల్ని చూడకున్నా/చీకట్లోనే వెలుగుల్ని సృష్టించుకుంటాం/ గొంతెత్తి మాట్లాడకున్నా/సైగలతో మా భావాలను స్పష్టంగా పలికిస్తుంటాం/చెవులారా వినలేకున్నా/మీ పెదాల కదలికలను లయబద్ధంగా వింటాం''** అంటూ.. అవయవాలు సరిగా ఉన్నవారికన్నా, అంతకు మించే చేసి చూపగలమనే ఆత్మవిశ్వాసాన్ని ప్రకటిస్తున్నాడు. సామాన్య మానవుడు తన కంటితో చూడగలిగిన వెలుగుల్ని చూపులేనివారు చూడలేకపోవచ్చుగాని, వారికి చీకట్లోనే కాంతిని సృష్టించుకునే దివ్యశక్తి ఉందంటాడు. మూగవారు సైతం సైగల భాషలో భావాన్ని బోధపరచగల సామర్థ్యాన్ని కలిగి ఉంటారని, చెవిటివారు తమ చూపుద్వారా పెదవుల కదలికలను పరిశీలిస్తూ స్పష్టంగా వినగలుగుతారని, వారి సామర్థ్యాన్ని సాధారణ వ్యక్తికన్నా అతీతమైనవనీ నిర్ధారిస్తాడు. ఇంకా ఈ కవిత ముగింపు పంక్తుల్లో...**''మీలా చక్కగా నడవలేకున్నా/ మా నడతలో మాత్రం/ ఏ వంకరలు లేకుండా నడుస్తుంటాం''** అంటూ దివ్యాంగుల పట్ల అమానుషంగా ప్రవర్తించేవారికి చురకలంటిస్తాడు. 'నావాదం' అనే కవితలో కవి తానే చెప్పుకున్నట్టు అంగవైకల్యాన్ని అనుభవిస్తూ, పోగొట్టుకున్న ఆత్మగౌరవం కోసం, కోల్పోతున్న అస్థిత్వం కోసం తన వాదనను, ఓ వేదంగా, ఓ ఆయుధంగా, ఓ ఆత్మవిశ్వాస పతాకంగా ప్రత్యేక ప్రతిభావంతుల హక్కులకోసం పోరాడుతున్నాడు. తన నాదానికి, వాదానికి సహకరించమని నివేదిస్తున్నాడు. ఆఖరుగా 'ఎర్రటి సూర్యులం' అనే కవితలో...

**'దయచేసి ఇక మాపై జాలిచూపులు విసరకండి/చేతనైతే మా హక్కుల సాధనలో/ మీ చేయూతనందించండి/మా అడుగులో అడుగై నిలబడి/ మాగొంతులో గొంతుకై నినదించండి'** ..అంటూ సకలజనులకూ పిలుపునిస్తున్నాడు. ధర్మబద్ధమైన తన పోరాటం మనందరి సహకారంతో విజయవంతం కావాలని కోరుకుందాం.

\- పోతగాని సత్యనారాయణ
9441083763

# భావతరంగాలలో వ్యాసపరంపరలు

ప్రకృతి ప్రేమికులు, ఆత్మీయ అనుబంధాల మధ్య పెరిగినవారు రచయితలైతే వారికి భాష పట్ల అభిమానముతోడైతే వారి ప్రసంగాలు గాని, వ్యాసాలు గాని పదుగురిని అమితంగా ఆకట్టుకుంటాయి. ఈ లక్షణాలన్నీ ఉన్న రచయిత్రి డా॥అరుణా వ్యాస్. ఆమె ఇప్పటికే వివిధ అంశాలను తీసుకొని పదివరకు గ్రంథాలను వెలువరించి పలువురు ప్రశంసలు అందుకొని ఉన్నారు. అలాగే ప్రతిభావంతురాలిగా కీర్తిని పొంది ఉన్నారు. ఆమె రేడియోలో 'భావనా' అనే కార్యక్రమంలో శ్రోతలకు వినిపించిన మంచిమాటలను వ్యాసరూపం ఇప్పుడు పాఠకులకు 'సాహితీ దీపికలు' పేరుతో అందించారు. ఆమెకు సంప్రదాయాల పట్ల గౌరవం మెండుగా వుంది. మానవసంబంధాలు సవ్యంగా సాగాలనే కోరిక బలంగా ఉంది. అందుకే ఆమె ఏది రాసినా అటువంటివి నిండుగా కనిపిస్తాయి. అరుణావ్యాస్ వ్యాసాలలో అభ్యుదయమూ కనిపిస్తుంది. ఇది అవసరమైనది కూడా. 'ప్రచార సాధనాలలో స్త్రీ' అనే పేరుతో ఉన్న పేరుతో



ఉన్న వ్యాసంలో అనేక విషయాలను చర్చించి చివరలో 'కాలం వేగంగా పరిగెడుతూ అనేక మార్పులు తెచ్చింది. స్త్రీల జీవన విధానంలోనూ మార్పు వచ్చింది. ఎంతో తెలివిని తమ స్వంతం చేసుకున్నారు స్త్రీలు. దురదృష్టవశాత్తూ ఆ స్పార్క్ ఆ మెరుపు మీడియాలో కనపడకపోవడం విచారించదగ్గ విషయం. దీన్ని స్త్రీలే ప్రతిఘటించాలి అంటారు అరుణావ్యాస్. ఒక్క మీడియా అనే కాదు ఏరంగంలోనైనా స్త్రీలను తగిన రీతిగా గౌరవించని ఒక చెడు సంస్కృతి కనిపిస్తున్న సందర్భాలున్నాయి. ఏదైనా ఈ వ్యాసంలో స్త్రీలు ప్రతిఘటించాలని పిలుపునివ్వడం అరుణావ్యాస్ అభ్యుదయ భావాలకు అద్దం పడుతుంది.

తరిగిపోతున్న మానవసంబంధాల పట్ల, విచ్ఛిన్నమౌతున్న ఉమ్మడి కుటుంబాట పట్ల, కన్నతల్లులనే సరిగా చూడని బిడ్డలుండటం పట్ల అరుణావ్యాస్ తీవ్రవేదనను వ్యక్తం చేస్తారు 'అమ్మ అన్నది ఒక కమ్మని మాట' అనే వ్యాసంలో. ఈ వ్యాసంలో స్త్రీలు అనుభవిస్తున్న నరకమయ జీవితాల్ని చూపిస్తారు. ఈ రచయిత్రిలో ఒక అద్భుతమైన ఒక తాత్విక చింతన కూడా మనకు కనిపిస్తుంది. ''అనంతమూ, అమేయమూ, అనశ్వరమూ అయిన ఈ విశ్వమంతా చైతన్యంతో నిండి వుంది. ఈచైతన్యం ప్రకృతిలో కలిసి రచించిన ఈ జగత్తు 'ఏకోహం బహుస్యామ్' అన్న రీతిలో అభివ్యక్తమవుతుంది. ఇందులోంచి నాదం పుట్టింది. ఇది అనేక రూపాలు సంతరించుకొని బహుముఖీనంగా వెలువ డింది'' అంటూ నాదం పుట్టుకను దాని గురించిన వివరాల్ని తనదైన తాత్వికతతో చెపుతారు 'సునాద వినోదిని' అన్న పేరుతో రాసిన వ్యాసంలో. 'పండుగొచ్చిందమ్మ పెద్ద పండుగొచ్చింది' అనే వ్యాసంలో సంక్రాంతి పండుగ గురించిన విషయం సమగ్రంగా వివరించారు. 'ఈ సాహితీ దీపికలు' వ్యాస సంపుటిలో మొత్తం 21 వ్యాసాలున్నాయి. ఏ వ్యాసానికావ్యాసం ఒక ప్రత్యేకమైనదే. ఈ ప్రపంచమంతా ఓ పెద్ద కుటుంబమే, జగతికి ఆడదే ఆధారం, మమతల కోవెల, న్యాయాన్యాయము తెలుసును. జగముల, జ్ఞానదీప్తికి చిరునామా వంటివ్యాసాలు ఈ సంపుటిలో చూడవచ్చు. తెలుగు, సంస్కృతం, ఆంగ్లం వంటి భాషల్లో రచయిత్రి నిష్ణాతురాలవడం వల్ల, వ్యాసాల్లో తెలుగు, సంస్కృతం, ఆంగ్లభాషల్లో ఉన్న సాహిత్య , తాత్విక, విజ్ఞాన గ్రంథాల్లోని ప్రామాణికంగా సందర్భోచితంగా ఉపయోగించుకున్నారు అరుణావ్యాస్. అందువల్ల ఈ వ్యాసాల వల్ల అనేక విషయాలు పాఠకులకు అవగతమవుతాయి.

''ఈనాడు జీవిస్తున్న మనమంతా మనవాళ్ల తీపి గుర్తులమే. ఆత్రేయ గారన్నట్లు ''పోయినోళ్లు అందరూ మంచోళ్లు. ఉన్నోళ్లు పోయినోళ్ల తీపిగురుతులూ'' మహామహులు ఏర్చి కూర్చిన ఈ జ్ఞాపకాల దొంతర మధ్యవెలిగే ప్రకాశంతో మనం భావిని చూడాలి!! అంటారు, తీపిగురుతుల విలాసం అనే వ్యాసంలో. ఆమె చెప్పే విధానం, ఆమెకే స్వంతం అని అనక తప్పదు. ఆ రీతిగా చెపుతారీ వ్యాసాల్లో ఏవిషయాన్నైనా! స్వంత లాభం కొంత మానుకో, తనకోపమే తన శత్రువు, కలిసి బతకడంలో వన్నెచిన్నెలు, కాలచక్రభ్రమణం, నిర్దేశించే నిర్ణయాలు వంటి వ్యాసాలు ఆలోచింపజేస్తాయి. ఇటువంటి మంచి విషయాలు అనేకం ఈ పుస్తకంలో లభిస్తాయి. బుద్ధుడు, రామానంద తీర్థులు, శ్రీరాముడు, బలి, కర్ణుడు, ఇలా అనేకమంది త్యాగధనుల గురించి ఒక వ్యాసంలో చెపుతారు అరుణావ్యాస్. తెలుగు భాష గురించిన వ్యాసం, మనిషి జీవనాధారం గురించిన వ్యాసం ఈ పుస్తకానికి వన్నెలద్దాయి. మొత్తం మీద అరుణావ్యాస్ ఒక మంచి వ్యాస సంపుటిని అందించారని చెప్పవచ్చు.

పేజీలు:-62, వెల-40రూపాయలు, ప్రతులకు:
నవచేతన బుక్‌హౌస్, గిరిప్రసాద్ భవన్,
బండ్లగూడ(నాగోల్) జి.ఎస్.ఐ.
పోస్టు, హైదరాబాద్-500068,
తెలంగాణ. ఫోన్. 24224453154.

\- నియోగి
9553037519

## సాహిత్య వార్తలు

### డా॥అద్దేపల్లి స్మృతి సంచికకు రచనలకు ఆహ్వానం

డా॥అద్దేపల్లి రామమోహనరావుగారి తొలి వర్ధంతి సందర్భంగా మల్లెతీగ సాహిత్య వేదిక 'అద్దేపల్లి జ్ఞాపకాలను స్మరించుకుందాం' శీర్షికతో స్మృతి సంచికను అచ్చేయాలని సంకల్పించింది. కనుక సాహితీమిత్రులు, కవులు, అద్దేపల్లి అభిమానులు, తమ కవితల్ని, వ్యాసాల్ని, స్మృతిగీతాల్ని, ఆయనతో వున్న అనుబంధాన్ని రాసి పంపాలని ఆహ్వానిస్తున్నాం. మీ రచనల్ని కలిమి శ్రీ మల్లెతీగ సాహిత్య వేదిక 41-20/3-24, మన్నవవారి వీధి, కృష్ణలంక, విజయవాడ-520013. చిరునామాకు డిసెంబర్ 15లోగా అందేలా పంపాలి. వివరాలకు 9246415150నంబరులో సంప్రదించగలరు.

\- కలిమిశ్రీ, అధ్యక్షులు
మల్లెతీగ సాహిత్యవేదిక

### తెలంగాణ భాష దేశ్యపదాలు ఆవిష్కరణ

కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత డాక్టర్ నలిమెల భాస్కర్ రచన ''తెలంగాణ భాష దేశ్యపదాలు'' వ్యాస సంపుటి ఆవిష్కరణ కార్యక్రమం డిసెంబర్ 9, ఉదయం పది గంటలకు కరీంనగర్ ఫిలిమ్ భవన్‌లో సాహితీ సోపతి ఆధ్వర్యంలో జరుగుతుంది. ముఖ్య అతిథిగా ఆచార్య ఎన్.గోపి, అతిథులుగా నగునూరి శేఖర్, అన్నవరం దేవేందర్, ఎం. నారాయణ శర్మ, బూర్ల వెంకటేశ్వర్లు తదితరులు పాల్గొంటారు.

\- కూకట్ల తిరుపతి
9949247591

# బుల్లెట్ రైలు వద్దంటే ఎడ్లబండే గతి



మీరు కొట్టుకుంటేంటే వారు ఆనందిస్తారు

**● సమాజంలో చీలిక తేవడంలో మీరే నంబర్ వన్ ● ప్రజలు కొట్టుకుచస్తుంటే సంబరాలు చేసుకుంటారు ● పార్టీ ఎన్నికలను సైతం రిగ్గింగ్ చేసిన ఘనత మీదే : కాంగ్రెస్‌పై మోడీ ధ్వజం**

**అహ్మదాబాద్:** బుల్లెట్ రైలు వ్యతిరేకించేవారు ఎడ్ల బండిలో ప్రయాణించాలి. మాకెలాంటి అభ్యంతరం లేదు. ప్రజలు కొట్టుకుచస్తున్నా ఆ పార్టీ మాత్రం వెన్న తింటూ ఆనందిస్తుంది. పార్టీలో ప్రజాస్వామ్యం పాటించని వారు దేశంలో ప్రజాస్వామ్యాన్ని ఎలా అమలు చేస్తారు? గుజరాత్ అసెంబ్లీ ఎన్నికల ప్రచార సభల్లో ప్రధానమంత్రి నరేంద్ర మోడీ కాంగ్రెస్ పార్టీపై కనీవినీ ఎరుగని రీతిలో విమర్శనాస్త్రాలు సంధించారు. ఆఖరికి కాంగ్రెస్ అంతర్గత వ్యవహారమైన పార్టీ అధ్యక్ష పదవికి జరిగే ఎన్నికలను సైతం మోడీ విడిచి పెట్టలేదు. సంస్థాగత ఎన్నికలను సైతం రిగ్గింగ్ చేసిన చరిత్ర కాంగ్రెస్‌దిగా ఆయన ఎద్దేవా చేశారు. ఎన్నికల ప్రక్రియను నిలదీసిన కాంగ్రెస్ యువనేత షెహజాద్ పూనావాలను పనికట్టుకొని మరీ ప్రశంసించారు. ఈ సందర్భంగా అప్పట్లో ప్రధానమంత్రి పదవికి జవహర్‌లాల్ నెహ్రూ ఎన్నికైన వైనాన్ని మోడీ ప్రముఖంగా ప్రస్తావించారు.

బుల్లెట్ రైలు ప్రాజెక్టును వ్యతిరేకించేవారు ఎడ్ల బండిలో ప్రయాణించాలని ప్రధాని నరేంద్ర మోడీ అన్నారు. భారుచ్ జిల్లాలో ఏర్పాటు చేసిన ఒక బహిరంగ సభలో ఆయన ఆదివారం ప్రసంగిస్తూ బుల్లెట్ రైలు ప్రాజెక్టుపై తమ ప్రభుత్వానికి మద్దతు ఇవ్వని కాంగ్రెస్ పార్టీపై మండిపడ్డారు. జపాన్ ఇంటర్నేషనల్ కార్పొరేషన్ ఏజెన్సీ నిర్మించ తలపెట్టిన ముంబాయి - అహ్మదాబాద్ హై స్పీడ్ రైల్ కారిడార్ వల్ల గుజరాత్‌కు పెద్ద ఎత్తున ఉపాధి అవకాశాలు వస్తాయని ప్రధాని తెలిపారు. అది భారుచ్‌లో ఏ స్థాయిలో ఉపాధి అవకాశాలు కల్పిస్తుందో ఊహించండి. బుల్లెట్ రైలుకు సిమెంట్ ఎక్కడి నుంచి వస్తుంది.. ఇనుము ఎక్కడి నుంచి వస్తుంది.. కార్మికులు ఎక్కడి నుంచి వస్తారని నేను మిమ్మల్ని ప్రశ్నిస్తున్నాను అని మోడీ సభికులతో అన్నారు. అదంతా వచ్చేది భారత్ నుంచే కాదా? దాన్ని కొనుగోలు చేసేది ఎవరు? జపాన్. అలాంటప్పుడు అదొక పెద్ద ఒప్పందం కాదా అని ప్రధాని ప్రశ్నించారు.

కాంగ్రెస్ అధికారంలో ఉన్నప్పుడు భారుచ్‌లో శాంతి, భద్రతల పరిస్థితి మీకు గుర్తుందా? కర్ఫ్యూలు, హింస ఇక్కడ సర్వసాధారణంగా ఉండేది అని బహిరంగ సభను ఉద్దేశించి మోడీ అన్నారు. బీజేపీ దాన్ని మార్చివేసింది. ఒక్క భారుచ్‌లోనే కాదు.. గుజరాత్ అంతటా పరిస్థితిని మార్చివేసింది అని ప్రధాని చెప్పారు.2019 నాటికి నిర్మాణం పూర్తి చేసుకోనున్న ఐక్యతా విగ్రహం వలన భారుచ్‌లో పర్యాటకం వృద్ధి చెందుతుందని మోడీ తెలిపారు. తన ప్రసంగం చివర్లో అభివృద్ధి చెందిన దేశాలకు దీటుగా గుజరాత్ అభివృద్ధి చెందడంలలో తాను సహాయ సహకారాలు అందిస్తానని ప్రధానమంత్రి హామీ ఇచ్చారు.

కాంగ్రెస్ పార్టీ కులం, మతం ప్రాతిపదికగా సమాజాన్ని విభజించాలనుకుంటున్నదని ప్రధానమంత్రి నరేంద్ర మోడీ ఆరోపించారు. ఈ నెల తొమ్మిదవ తేదీన అసెంబ్లీ మొదటి విడత ఎన్నికలు జరుగనున్న తరుణంలో మోడీ తన సొంత రాష్ట్రంలో ఎన్నికల ప్రచారాన్ని తిరిగి ప్రారంభించారు. ఈ సందర్భంగా ప్రతిపక్ష కాంగ్రెస్‌పై విరుచుకుపడ్డారు. ఈ సందర్భంగా భారుచ్ జిల్లాలో ఏర్పాటు చేసిన ఒక బహిరంగ సభలో ఆయన ప్రసంగిస్తూ కాంగ్రెస్ పార్టీ గురించి గుజరాత్ ప్రజలకు బాగా తెలుసునని అన్నారు. కాలానుగుణంగా అది రంగులు మారుస్తుందని, సోదరుల మధ్య విభేదాల గోడ సృష్టిస్తుందని మోడీ విమర్శించారు. ఒక కులం మరో కులంతో, ఒక మతం మరో మతంతో గొడవపడేలా కాంగ్రెస్ పార్టీ చేసిందని ఆయన ఆరోపించారు.వారు మిమ్మల్నిపరస్పరం గొడవపడ్డంలో నిమగ్నమయ్యేలా చేస్తారు. మీరు మరణించవచ్చు కానీ కాంగ్రెస్ మలై (వెన్న) తింటుంది అని మోడీ నిందించారు.

## పార్టీలో లేని ప్రజాస్వామ్యం దేశానికి ఎలా ఇస్తారు?

మీ ఇంట్లో (పార్టీ) ప్రజాస్వామ్యం లేనప్పుడు దానిని దేశంలో ఎలా పాటిస్తారని ప్రధానమంత్రి నరేంద్ర మోడీ కాంగ్రెస్ పార్టీని ప్రశ్నించారు. సురేంద్రనగర్ జిల్లాలో ఏర్పాటు చేసిన బహిరంగ సభలో ప్రసంగిస్తూ త్వరలో కాంగ్రెస్ పార్టీ అధ్యక్ష పదవికి జరిగే ఎన్నికను ఆయన ఎద్దేవా చేశారు. సంస్థాగత ఎన్నికలను రిగ్గింగ్ చేసిన చరిత్ర కాంగ్రెస్ పార్టీకి ఉందని విమర్శించారు. పార్టీ అధ్యక్ష పదవికి జరిగే ఎన్నికల్లో ఫలితం ఏమిటనేది ప్రతి ఒక్కరికి తెలుసని ప్రజలను ఉద్దేశించి ప్రధాని అన్నారు. పనిలోపనిగా ఆ పదవి కాంగ్రెస్ ఉపాధ్యక్షుడు రాహుల్ గాంధీనే వరిస్తుందనే మాటను సభికులు చెప్పేలా చేశారు. అప్పట్లో దేశ ప్రధానమంత్రిని నిర్ణయించడానికి కాంగ్రెస్ పార్టీ సమావేశమైనప్పుడు జవహర్‌లాల్ నెహ్రూ కన్నాసర్దార్ పటేల్‌కు ఎక్కువ ఓట్లు వచ్చాయి. కానీ ఆ ఎన్నికను రిగ్గింగ్ చేశారు. దాంతో నెహ్రూ గెలిచారు. మొరార్జీ దేశాయ్‌కి కూడా ఇదే జరిగింది. ఎన్నికలను రిగ్గింగ్ చేసిన చరిత్ర వారిది అని మోడీ మండిపడ్డారు.కాంగ్రెస్ నేత షెహజాద్ పూనావాలా పేరును ప్రధాని ప్రస్తావించారు. ఆయన ఎన్నికల ప్రక్రియను ప్రశ్నిం చారని, ఎన్నికల్లో రిగ్గింగ్ జరగవచ్చని ఆరోపించాని మోడీ తెలిపారు. వారు అదే పనిగా సహనం, సహనం, సహనం.. లాంటి పదాలను గొణుగుతుంటారు. కానీ ఈ యు వకుడు మాట్లాడుకుండా ఉండడానికి ఆ పార్టీ ఒక శాసనం చేసింది. ఆయన్ను అన్ని వాట్సప్ గ్రూప్‌ల నుంచి తొలగిం చింది. ఆ పార్టీ ఆయన్ను సమష్టిగా బహిష్కరించిందిఅని ప్రధా న మంత్రి ఆరోపించారు. గుజరాత్‌లో ఒక సామెత ఉంది.. బావిలో నీళ్ళుంటేనే బక్కెట్‌ను నింపగలమని. అలాగే మీ ఇంట్లో (పార్టీ) ప్రజాస్వామ్యం లేనప్పుడు దానిని మీరు దేశంలో ఎలా అమలు చేస్తారు అని మోడీ కాంగ్రెస్‌ను నిలదీశారు.

# నైపుణ్యాభివృద్ధే దివ్యాంగులకు ఉపాధి

**రాష్ట్రపతి రామ్‌నాథ్ కోవింద్**



**న్యూఢిల్లీ:** అంతర్జాతీయ దివ్యాంగుల దినోత్సవం సందర్భంగా దేశ రాజధాని న్యూఢిల్లీలోని విజ్ఞాన్‌భవన్‌లో ఆదివారం నాడు జరిగిన కార్య క్రమంలో రాష్ట్రపతి రామ్‌నాథ్ కోవింద్ ముఖ్య అతిథిగా పాల్గొని మాట్లాడారు. ''రాష్ట్రీయ ప్రరోద్యోగి సంస్థాన్, కురుక్షేత్ర్ సహకారంతో కేంద్ర ప్రభుత్వం శారీరక, బధిర, అంధులైన దివ్యాంగ యువకుల మధ్య జాతీయస్థాయి ఐటీ పోటీలు నిర్వహించింది. ఇందులో విజేతలైన వారు వియత్నాంలో తాజాగా నిర్వహించిన అంతర్జాతీయ పోటీల్లో వ్యక్తిగత విభాగంలో మనదేశానికి మూడు పతకాలు తెచ్చారు. ఇది చాలా చాలా సంతోషకరమైన విషయం. యువత, దివ్యాంగుల్లో ఐటీ నైపుణ్యం పెంపొందించేందుకు రాష్ట్రస్థాయిలోను అలాంటి పోటీలు నిర్వహించాలని రాష్ట్రప్రభుత్వాలను కోరుతున్నారు' అని రాష్ట్రపతి కోవింద్ వివరించారు. అయితే, దివ్యాంగుల అభివృద్ధి కోసం కేంద్ర ప్రభుత్వం ఎన్నో కార్యక్రమాలు చేపడు తోం దన్నారు. అంతేకాకుండా నైపుణ్యాభివృద్ధి పథకం ద్వారా 2022 నాటికి 25 లక్షల మంది దివ్యాంగులకు ఉపాధి లభించనుందని ఆయన పేర్కొన్నారు. ఇక దివ్యాం గులకు సేవలందిస్తున్న స్వచ్ఛంద సంస్థలు, వివిధ రంగాల వారికి ఈ సందర్భంగా రాష్ట్రపతి చేతుల మీదుగా అవార్డులు ప్రదానం చేశారు. తెలంగాణకు చెందిన దేవ నార్ ఫౌండేషన్ నిర్వాహకులు సాయిబాబాగౌడ్ అవార్డు అందుకున్న వారిలో ఉన్నారు.

# రూపానీకి ఓటమి భయం

**కాంగ్రెస్ నేతలపై లాఠీచార్జిపై రాహుల్ విమర్శలు**



**న్యూఢిల్లీ:** గుజరాత్ ముఖ్యమంత్రి విజయ్ రూపానీపై కాంగ్రెస్ ఉపాధ్యక్షుడు రాహుల్ గాంధీ తీవ్ర స్థాయిలో విరుచుకుపడ్డారు. కాంగ్రెస్ నేతలు, కార్యకర్తలపై లాఠీ ఛార్జ్ చేయించడాన్ని తప్పుబట్టారు. రూపానికి ఓటమి భయం పట్టుకుందని.. అందుకే హింసను ప్రేరేపిస్తూ లాఠీలకు పనిచెబు తున్నారని మండిపడ్డారు. గుజరాత్ అసెంబ్లీ ఎన్నికల్లో ఓడిపోతామనే భయంతోనే బీజేపీ కాంగ్రెస్ నేతలకు దాడులకు పాల్పడుతోందని ఆరోపించారు. అవినీతితో కూరుకుపోయిన షా యుగానికి తెరప డనుందనే రూపాని లాఠీలపై ఆధారపడ్డారని ఆగ్రహం వ్యక్తం చేశారు. రూపానీ తీరు చూస్తుంటే1980 లో వచ్చిన హిందీ సినిమా షాన్ లో విలన్ పాత్ర పోషించిన కుల్‌భూషన్ ఖర్బాండ గుర్తుకువస్తున్నారని ట్విట్టర్ ద్వారా పేర్కొన్నారు.శనివారం రాజ్‌కోట్‌లో కాంగ్రెస్ కార్యకర్తలు బ్యానర్ కట్టడాన్ని బీజేపీ కార్యకర్తలు అడ్డుకోవడంతో ఇరువర్గాల మధ్య ఘర్షణ జరిగింది. ఈ ఘటనలో కాంగ్రెస్ రాజ్‌కోట్ (పశ్చిమ) అభ్యర్థి ఇంద్రానిల్ రాజ్‌గురు సోదరుడు దివ్యానిల్ రాజ్‌గురు తీవ్రంగా గాయ పడ్డారు. దీంతో ఇంద్రానిల్, మిథుల్ దొంగ్లా సహా పలువురు కాంగ్రెస్ నేతలు,కార్యకర్తలు బీజేపీ నుంచి పోటీ చేస్తున్న ప్రస్తుత సీఎం రూపానీ ఇంటిముందు నిరసనకు దిగారు. బీజేపీ కార్యకర్తల దాడిపై రూపానీ వివరణ ఇవ్వాలని నినాదాలు చేశారు. రూపానీ నివాసం వద్దకు భారీగా చేరుకున్న కాంగ్రెస్ నేతలను అక్కడి నుంచి పంపించడం పోలీసులకు తలకు మించిన భారం కావడంతో లాఠీలకు పనిచెప్పారు. కాంగ్రెస్ అభ్యర్థి ఇంద్రనీల్, మిథుల్ తో పలువురుపై లాఠీ చార్జి చేశారు. ఈ నేపథ్యంలో రాహుల్ గాంధీ విజయ్ రూపానిపై విరుచుకుపడ్డారు.

# ఫిబ్రవరి 1న కేంద్ర బడ్జెట్

**న్యూఢిల్లీ:** వస్తు సేవల పన్ను (జిఎస్‌టి) అమల్లోకి వచ్చిన తరువాత సభలో ప్రవేశపెట్టనున్న తొలి వార్షిక బడ్జెట్ ఆర్థికమంత్రి అరుణ్‌జైట్లీ ఫిబ్రవరి1న ప్రవేశ పెట్టనున్నట్టు అధికార వర్గాలు తెలిపాయి. పార్లమెంటు బడ్జెట్ సమావేశాలు వచ్చే ఏడాది జనవరి నెలాఖరు 30న ప్రారంభ మవుతాయన్నారు. అయితే అదేరోజు రాష్ట్రపతి కోవింద్ పార్లమెంటును ఉద్దేశించి ప్రసంగిస్తారని తెలిపారు. తరువాతరోజు జనవరి 31న ఆర్థికసర్వేను సభలో ప్రవేశపెడతారు. ఫిబ్రవరి 1న ఆర్థికమంత్రి వార్షిక బడ్జెట్‌ను సభలో ప్రవేశపెడతారని అధికారులు తెలిపారు. బడ్జెట్‌ను సభలో ప్రవేశపెట్టే విషయంలో ప్రధాని మోడీ విప్లవాత్మక నిర్ణయాలు తీసుకున్నారు. అందులోభాగంగా ఈ ఏడాది బడ్జెట్‌ను ఫిబ్రవరి1న సభలో ప్రవేశపెట్టారు. అదేవిధంగా రైల్వేబడ్జెట్ ను ప్రత్యేకంగా ప్రవేశపెట్టే సంప్రదాయానికి స్వస్తి పలికి సాధారణ బడ్జెట్‌తోపాటు రైల్వే బడ్జెట్‌ను అదేరోజు ప్రవేశపెడతారని అధికారులు తెలిపారు.

# 9లక్షల మంది సబ్సిడీ విరమణ

**● సీనియర్ సిటిజన్‌ల ఔదార్యం ● రైల్వేశాఖకు రూ.40కోట్ల లాభం**



**న్యూఢిల్లీ:** రైల్వేశాఖలో సీనియర్ సిటిజన్లు తమ సబ్సిడీలను స్వచ్ఛందంగా వదులుకునే విషయమై కేంద్రం పథకాన్ని తీసుకొచ్చింది. దేశ వ్యాప్తంగా ఈ పథకానికి మంచి ఆదరణ లభించింది. సుమారు 9.39 లక్షల మంది సీనియర్ సిటిజన్లు తమ సబ్సిడీని వదులుకునేందుకు ముందుకొచ్చారు. వీరి వల్ల రైల్వే శాఖకు రూ.40కోట్ల మేర లాభం వస్తుందని అధికారులు వివరించారు. స్వచ్ఛంద సబ్సిడీ విరమణ పథకాన్ని కేంద్ర ప్రభుత్వం గతేడాది తీసుకొచ్చింది. సీనియర్ సిటిజన్ అయినా మొత్తం డబ్బులు చెల్లించి టికెట్టు తీసుకునేందుకు 9.39 లక్షల మంది ముందుకు వచ్చారు. సీనియర్ సిటిజన్లు 50శాతం రాయితీ సొమ్మును రైల్వేశాఖకు తిరిగి ఇస్తున్నారు. రవాణా వ్యవస్థపై భారం పడుతుండటంతో కేంద్రం ఈ పథకాన్ని తీసుకొచ్చింది. దేశ వ్యాప్తంగా ఉన్న సీనియర్ సిటిజన్లు రూ.1,500 కోట్లను సబ్సిడీ రూపంలో వినియోగించుకుంటున్నారు. ఈ ఏడాది జూలై 22 నుండి అక్టోబర్ 22 వరకు 2.16లక్షల మంది పురుషులు, 2.67 లక్షల మంది మహిళలు సబ్సిడీని వదులుకున్నారు. దీంతో పాటు 2.51 లక్షల మంది పురుషులు, 2.05లక్షల మంది మహిళలు 50 శాతం సబ్సిడీని వినియోగించు కోబోమని ప్రకటించారు. మొత్తంగా మూడు నెలల కాలంలో 9.39లక్షల మంది సబ్సిడీ వదులుకునేందుకు నిర్ణయించుకున్నారని అధికారులు వివరించారు. 2016లో చూడగా, మూడు నెలల కాలంలో 4.68లక్షల మంది సబ్సిడీ పథకాన్ని వినియోగించుకోలేదు. వీరిలో 2.35లక్షలు పురుషులు ఉండగా, 2.33 లక్షలు స్త్రీలు ఉన్నారు. ఏడాది కాలంలో వీరి సంఖ్య రెట్టింపు అయ్యింది.

# కరెంట్ సరిగ్గా రావడంలేదా?

**● సప్లయర్‌ను మార్చుకోండి ● టెలికమ్ తరహాలో కరెంటు సంస్కరణలు ● యాక్టు సవరణకు కేంద్రం కసరత్తు**

**న్యూఢిల్లీ:** వినియోగదారులు ఇకపై టెలికమ్ సర్వీసులను మార్చుకున్నట్టుగానే విద్యుత్ సరఫరాదారులను మార్చుకోవచ్చు. ప్రస్తుతం అమల్లో ఉన్న విద్యుత్ యాక్టునకు ప్రతిపాదిత సవరణ జరిగిన అనంతరం ఇది సాధ్యమవుతుందని కేంద్ర మంత్రి ఆర్.కె.సింగ్ తెలిపారు.విద్యుత్ యాక్టునకు మేము పెద్ద ఎత్తున సవరణ తీసుకువస్తున్నాము. అది క్యారేజ్ మరియు కంటెంట్ బిజినెస్‌లో సైతం విభజనను తీసుకువస్తుంది. ముసాయిదా ప్రతి మరో వారం రోజుల్లో నా దగ్గరకు వస్తుంది. పార్లమెంట్ బడ్జెట్ సమావేశాల్లోనే దానిని ప్రవేశపెట్టి ఆమోదింపజేసుకోవడానికి మేం ప్రయత్నిస్తున్నాం అని విద్యుత్ మరియు సంప్రదాయ ఇంధన శాఖా మంత్రి వెల్లడించారు.ఆ విభజన సరికొత్త వ్యవస్థకు మార్గం చూపుతుంది. టెలికమ్ సర్వీసుల తరహాలోనే తమ ప్రాంతంలో వేర్వేరు విద్యుత్ సర్వీసు ప్రొవైడర్లను ఎంచుకునే వెసులుబాటు వినియోగదారులకు లభిస్తుంది. దీని గురించి మరింత వివరిస్తున్నట్టుగా ఒకసారి ఆ యాక్టు సవరణకు నోచుకున్న తర్వాత డిస్కమ్‌లలో పంపిణీ మరియు సరఫరా విభాగాల విభజన కోసం ఒక రోడ్ మ్యాప్ రూపకల్పన కోసం రాష్ట్ర ప్రభుత్వాలతో సంప్రదింపులు జరుపుతాము. విద్యుత్ సరఫరా విభాగంలో ఒకటి కన్నా ఎక్కువ కంపెనీలకు ఫ్రాంచైజీ ఇవ్వడంద్వారా విద్యుత్ సరఫరాలో గుత్తాధిపత్యాన్ని తొలగిస్తామని సింగ్ తెలిపారు.

# పొగాకు ఆరోగ్యానికి హానికరం

**● ప్యాకెట్లపై కొత్త ఫోటో ప్రచురించే దిశగా అడుగులు ● టోల్‌ఫ్రీ నెంబర్‌తో వ్యసనపరులకు సలహాలు**

**న్యూఢిల్లీ :** పొగాకు ఆరోగ్యానికి హానికరంతో పాటు దాని వల్ల వచ్చే దుష్పరిణామాలను ఇప్పటికే కేంద్రం పలు ప్యాకెట్లపై ముద్రిస్తున్నది. పాత చిత్రాన్ని తొలగించి, మరో చిత్రాన్ని రూపొందించి వేయడంతో పాటు ధూమపానానికి వ్యతిరేకంగా జాతీయ టోల్‌ఫ్రీ నెంబర్ ప్యాకెట్‌పై ముద్రించడానికి కేంద్రం సన్నాహాలు చేస్తున్నది. 1800 227787 నెంబర్ పొగాకు ఆధారిత ప్యాకెట్లపై ముద్రిస్తారు. ధూమపానానికి బానిసైన వారు విముక్తి పొందడానికి పై నెంబర్‌కు ఫోన్ చేసి సలహాలు సూచనలు పొందొచ్చు. 2015 సెప్టెంబర్‌లో పొగాకు ఆరోగ్యం ఎంత నష్టపోతుందో చూపే చిత్రాన్ని వ్యాపారులు ప్యాకెట్‌పై 85 శాతం ప్రచురించాలని కేంద్ర వైద్య ఆరోగ్య శాఖ నిర్ణయించింది. 2016, ఏప్రిల్ 1 నుండి ఇది అమల్లోకొచ్చింది. ప్యాకెట్లపై ఆరోగ్యానికి సంబంధించిన చిత్రం వేసినా వ్యసనపరుల్లో మార్పు రావడం లేదని గ్రహించింది. ఈ మేరకు ప్రజల్లో అవగాహన కల్పించే దిశగా కేంద్రం అడుగులు వేస్తున్నది. ప్యాకెట్‌పై మొత్తం వేయాలా..? కొద్దిమేరే ప్రచురించాలా అనే దానిపై చర్చలు జరుగుతున్నాయని, పొగాకు సేవించే వారి వద్ద నుండి సలహాలు తీసుకోవడానికి బృందం వెళ్లనుందని ఓ అధికారి తెలిపారు. 2009-10 ఉన్న జనాభా ప్రతిపాదికన ధుమపానం చేసే వారి శాతం 34.6 నుండి 2016-17కి కేవలం ఆరు శాతం (28.6)కి తగ్గిందని ఓ సంస్థ జూన్‌లో సర్వే రిపోర్టు విడుదల చేసింది. దేశ వ్యాప్తంగా అయితే సుమారు 81లక్షలకు తగ్గినట్టు సర్వేలో వెల్లడైంది.

# భారతీయ చిత్రానికి చైనా అవార్డులు

**గౌరు చిత్రానికి పురస్కారాల పంట**




**ముంబయి:** భారతీయ బాలల చిత్రం గౌరు చైనా అవార్డులను గెలుచుకుంది. చిల్డ్రన్స్ ఫిల్మ్ సొసైటీ, ఇండియా(సీఎఫ్‌ఎస్‌ఐ) అండగా నిర్మితమైన గౌరు: జర్నీ ఆఫ్ కరేజ్ గత మాసం నిర్వహించిన 13వ చైనా అంతర్జాతీయ బాలల చలన చిత్రోత్సవంలో రెండు పురస్కారాలను పొందింది. బాల నటుడు రిత్విక్ సహోర్ ఉత్తమ నటనకు పురస్కారాన్ని పొందగా, అదే చిత్రానికి గాను గాయక నటీమణి ఇలా అరుణ్ ఉత్తమ నటి పురస్కారాన్ని పొందాని సీఎఫ్‌ఎస్‌ఐ ఒక ప్రకటనలో పేర్కొంది. భారత్ నుంచి ఏకైక ఎంట్రీగా గౌరు ఎంపికయ్యింది. ఆ చిత్రం చైనా చలనచిత్రోత్సవంలో ఒకటి కన్నా ఎక్కువగా పురస్కారాలు గెలుచుకుందని ప్రకటన పేర్కొంది. రామ్‌కిషన్ ఛోయల్ దర్శకత్వంలో రాజస్థాన్‌లో చిత్రీకరణ జరుపుకున్న గౌరు చిత్రం 13 సంవత్సరాల గౌరు అనే బాలుని కథ చెబుతుంది. జబ్బుపడిన బామ్మను తానెప్పుడూ చూడని ఆమె స్వగ్రామానికి స్వయంగా తీసుకువెళ్లడానికి గౌరు నానాతంటాలు పడతారు. పెద్దలు ఎంత చెప్పినా వినకుండా బామ్మతో గౌరు సాగించే ప్రయాణం ఎడారి గుండా సాగుతుంది.

# పశువుల వధకు కేంద్రం గ్రీన్‌సిగ్నల్

**నిషేధిస్తూ జారీ చేసిన ఉత్తర్వు ఉపసంహరణ**

**న్యూఢిల్లీ:** మార్కెట్లలో వధించడం కోసమని పశువుల క్రయ విక్రయాలను నిషేధిస్తూ జారీ చేసిన ఉత్తర్వును ప్రభుత్వం శనివారం ఉపసంహరించుకుంది. పశువుల జనాభా పెరిగిపోతుందంటూ రైతులు ఫిర్యాదు చేయడానికి తోడు వయసు మళ్ళిన పశువులను ఇష్టానుసారంగా పంట పొలాల్లో వదిలివేస్తుండడం వల్ల పంటలు పాడైపోతున్న తరుణంలో కేంద్ర ప్రభుత్వం ఈ నిర్ణయం తీసుకుంది. అంతేకాక సదరు ఉత్తర్వు మాంసం విక్రయంపై ప్రభావం చూపింది. ప్రభుత్వం ఒక నోటిఫికేషన్ జారీ చేసిన అనంతరం పాత నోటిఫికేషన్‌ను ఉపసంహరించుకుంది. దీంతో వధించడం కోసమని పశువుల క్రయ విక్రయాలు సులభతరమవుతాయి.

జంతువుల పట్ల కాఠిన్యాన్ని నిలువరించే దిశగా ఈ ఏడాది మే నెలలో ఆ ఉత్తర్వు జారీ అయింది. కానీ కేంద్రం తీసుకున్న చర్య పట్ల పలు రాష్ట్రాలు అభ్యంతరం లేవనెత్తడంతో అది జాతీయ స్థాయి వివాదానికి దారి తీసింది.

# ప్రైవేటీకరణ దిశగా సౌదీ

**● 300 బిలియన్ డాలర్ల సంస్థల విలీనం! ● సౌదీ రాజు మహ్మద్ బిన్ సల్మాన్ నిర్ణయం**



**దుబాయ్ :** సౌదీ అరేబియా రాజు మహ్మద్ బిన్ సల్మాన్ తనదైన శైలిలో దేశ ఆర్థిక వ్యవస్థను మార్చే దిశగా అడుగులు వేస్తున్నారు. సుమారు 300 బిలియన్ డాలర్ల విలువైన ప్రభుత్వ రంగ సంస్థలను ప్రయివేటీకరించేందుకు నిర్ణయించుకున్నారు. దీనికి సంబంధించి 19 నెలలుగా అంతర్గత కసరత్తు కొనసాగించినట్టు తెలుస్తున్నది. ఇది ఇప్పటికప్పుడే సాధ్యం కాదని పలువురు బ్యాంకర్లు, పెట్టుబడిదారులు, ఆర్థిక రంగ విశ్లేషకులు భావిస్తున్నారు. దీనికి సంబంధించి న్యాయపరమైన కొన్ని చర్యలు తీసుకోవాల్సి ఉంటుందని, తరుచూ ప్రభుత్వ రంగ విభాగాల్లో మార్పులు వస్తుంటాయని దీంతో పెట్టుబడిదారుల్లో కూడా ఆందోళన నెలకొంటుందని పలువురు భావిస్తున్నారు. చాలా మంది పెట్టుబడిదారులతో పాటు రాజ వంశీయులు ఇప్పటికే అవినీతికి పాల్పడటంతో ఆర్థిక వ్యవస్థలో అనిశ్చితి నెలకొంది. ప్రయివేటీకరణ విషయమై నవంబర్‌లో మంత్రులతో పాటు ఉన్నతాధికారులు సౌదీ రాజుతో సమావేశం అయ్యారు. ప్రయివేటీకరణ కోసం చాలా సమయం పడుతుందని సౌదీలోని బ్యాంకర్లు అభిప్రాయపడుతున్నారు. 2030 కల్లా దేశ వ్యాప్తంగా కొత్త ఆర్థిక వ్యవస్థ రూపొందించేలా అడుగులు వేస్తున్నట్టు తెలుస్తున్నది. దేశ వ్యాప్తంగా ఉన్న నిరుద్యోగ సమస్యను ప్రారదోలడానికి సన్నాహాలు చేస్తున్నారు. ఆయిల్ ధర తగ్గించేదిశగా కొత్త ఒరవడులుకు శ్రీకారం చుడుతున్నారు. ప్రయివేటీకరణతో ఆర్థిక వ్యవస్థ మెరుగుపడుతుందని భావించినా దీనికి చాలా కాలం పాటు విశ్లేషణ అవసరం ఆర్థికవేత్తలు అంటున్నారు.

# పేట్రేగిపోతున్న పాకిస్థాన్

**ఢిల్లీ:** భారత్ సరిహద్దు వెంబడి పాకిస్థాన్ తరచూ కవ్వింపు చర్యలకు తెగబడుతోంది. జమ్మూ కాశ్మీర్లోని నియంత్రణరేఖ (లైన్ ఆఫ్ కంట్రోల్) ఎల్‌ఓసీ వద్ద పాకిస్థాన్ సైన్యం కాల్పుల విరమణ ఒప్పందాన్ని తుంగలోతొక్కి తరచూ కాల్పులకు పాల్పడి తన ద్వంద్వ వైఖరిని బయటపెడుతోంది. ఈ ఏడాది పాకిస్థాన్ కాల్పుల విరమణ ఒప్పందాన్ని ఉల్లంఘించి 720సార్లు కాల్పులకు పాల్పడిందని కేంద్ర హోం మంత్రిత్వశాఖ వెల్లడించింది. ఈ ఏడాది పాకిస్థాన్ మరీ బరితెగించి వ్యవహరిస్తుందని కేంద్ర హోంమంత్రిత్వశాఖ అధికారులు తెలిపారు.

## ఉగ్రవాదంపై పాకిస్థాన్ ఉదాసీనత: అమెరికా

**వాషింగ్టన్:** ఉగ్రవాదంపై పోరాటంలో పాకిస్థాన్ ఉదాసీనంగా వ్యవహరిస్తోందని అమెరికా ఆందోళన వ్యక్తం చేసింది. ఉగ్రవాదం అణచివేసేందుకు పాకిస్థాన్ చెప్పుకోదగ్గ చర్యలు తీసుకోవటం లేదని శ్వేతసౌధం అధికారులు పాకిస్థాన్‌పై ఆక్షేపణ వ్యక్తం చేశారు. అమెరికా అంతర్జాతీయ ఉగ్రవాదిగా ప్రకటించి పదిలక్షల రివార్డు ప్రకటించిన ముంబై పేలుళ్ల సూత్రధారి జమాత్ ఉద్ దవా ఉగ్రవాద సంస్థ అధినేత హాఫీజ్ సయీద్‌ను పాకిస్థాన్ గృహనిర్బంధం నుంచి విడుదల చేయటంపై అమెరికా అసంతృప్తి వ్యక్తం చేసింది. ఐదేళ్లపాటు హక్కానీ ఉగ్రవాదుల చెరలో మగ్గిపోయి చిత్రహింసలకుగురైన కెనడా, అమెరికా దంపతులను విడుదల చేయటంలో పాకిస్థాన్ సహకరించిన విషయం వాస్తవమే అన్నారు.

## పాక్ ఎన్నికల్లో ఉగ్రవాది హాఫీజ్ పోటీ

**ఇస్లామాబాద్:** ముంబై పేలుళ్ల సూత్రధారి లష్కరే తొయిబా, జమాత్ ఉద్ దవా ఉగ్రవాద సంస్థల చీఫ్ హాఫీజ్ సయీద్ పాకిస్థాన్‌లో 2018లో జరగనున్న ఎన్నికల్లో పోటీ చేయను న్నాడు. అమెరికా హాఫీజ్‌ను అంతర్జాతీయ ఉ గ్రవాదుల జాబితాలో చేర్చటంతోపాటు పది లక్షల డాలర్లు రివార్డును ప్రకటించింది. ఈనేపథ్యంలో హాఫీజ్ సయిద్‌ను పాకిస్థాన్లో ఆ దేశ ప్రభుత్వం గృహనిర్బంధంలో ఉంచింది. పదినెలలుపాటు హాఫీజ్ గృహని ర్బం ధంలోనే ఉన్నాడు. నవంబరులో గృహనిర్బంధం గడువు ముగియటంతో పాక్ ప్రభుత్వం న్యాయస్థానాన్ని ఆశ్రయించగా అతనిపై సాక్ష్యాలు లేనందున విడు దలచేయాలని కోర్టు ఆదేశించింది. దీంతో అతడిని పాక్ గృహనిర్బంధం నుంచి నవంబర్ 24న విడుదల చేసింది. గృహనిర్బంధం నుంచి బయటకు వచ్చిన వెంటనే హాఫీజ్ భారత్ పై తన అక్కసు వెళ్లగక్కాడు.

# సముద్ర వ్యాపార దిశగా ఇరాన్ అడుగులు

**● 340 మిలియన్ డాలర్లతో ఓడరేవు ● చాబహార్ పోర్టు నిర్మాణం ప్రారంభం ● ఆర్థికాభివృద్ధి దిశగా అడుగులు ● ఇరాన్ అధ్యక్షుడు హసన్ రౌహానీ ● హాజరైన పలు దేశ ప్రతినిధులు**



**టెహ్రాన్ :** సముద్ర మార్గం ద్వారా వ్యాపారాన్ని మరింత అభివృద్ధి పరిచే దిశగా ఇరాన్ అడుగులు వేస్తున్నది. దీనిలో భాగంగా ఇరాన్ అధ్యక్షుడు హసన్ రౌహానీ ఆదివారం చాబహార్ పోర్టు నిర్మాణానికి శంకుస్థాపన చేశారు. అరేబియా సముద్ర మార్గాన ఇది నిర్మాణం కానుంది. గల్ఫ్, ఓమన్ దేశాలతో కలిసి అభివృద్ధి బాట వేయడానికి ఇరాన్ శ్రీకారం చుట్టింది. పక్కన ఉన్న పాకిస్థాన్ ఓడ రేవు కంటే ఇది మూడింతలు పెద్దిగా ఉండనుంది. 340 మిలియన్ డాలర్లు ఖర్చుపెట్టడానికి ప్రభుత్వం నిర్ణయించుకుంది. రెవ్యూలేటరీ గార్డ్ అఫ్లియేటెడ్ కంపెనీతో ఇరాన్ సర్కార్ రేవు నిర్మాణానికి ఒప్పందం చేసుకుంది. ఇరాన్‌లోని అతిపెద్ద కాంట్రాక్టు కంపెనీగా దీనికి పేరు ఉంది. ఖాటమ్ అల్ అన్బియా కంపెనీకి నేతృత్వం వహిస్తారు. ఈ ప్రాజెక్టు నిర్మాణంలో మరికొన్ని సబ్ కాంట్రాక్టు కంపెనీలు దీనికి కింద పని చేస్తాయి. ఇందులో భారత్‌కు సంబంధించిన కంపెనీలు కూడా రెవ్యూలేటరీ గార్డ్ అఫ్లియేటెడ్ కంపెనీ నీడన పని చేయడానికి ఒప్పందం చేసుకున్నాయి. సంవత్సరానికి 8.5 మిలియన్ టన్నుల సరుకు దిగుమతి చేసుకునే విధంగా ఈ పోర్టు నిర్మాణం కానుంది. గతంలో ఉన్న పోర్టు ఏడాదికి కేవలం 2.5 మిలియన్ టన్నుల సరుకు మాత్రమే దిగుమతి చేసుకునేందుకు వీలుండేది. ఐదు ప్రధాన వంతెనలు నిర్మిస్తున్నారు. ఇందులో రెండు వంతెనల ద్వారా కంటెయినర్‌లు కలిగిన కార్గో నౌకలను అనుమతిస్తారు. ఈ వంతెనల వద్ద లక్షటన్నుల కెపాసిటీ ఉన్న ఓడలు కూడా వచ్చేలా నిర్మాణం చేపడుతున్నారు. దీనికి హిందు మహాసముద్రం లింక్ ఉంటుంది. ప్రత్యర్థి దేశమైన పాకిస్థాన్ గ్వాదర్ పోర్టు నిర్మిస్తున్నది. ఇది కేవలం ఇరాన్‌కు 80 కిలోమీటర్ల దూరంలో ఉంటుంది. చైనా ఆర్థిక సాయం చేయడంతో పాకిస్థాన్ నిర్మిస్తున్నది.

శంకుస్థాపన చేసిన అనంతరం ఇరాన్ అధ్యక్షుడు హసన్ రౌహానీ మాట్లాడారు. ఓడరేవు ఏర్పాటు చేయడంతో దేశ ఆర్థికాభివృద్ధి ఎంతో మెరుగుపడుతుందని అన్నారు. పొరుగు రాష్ట్రాలతో సఖ్యతతో పాటు బంధం బలపడుతుందని ఆయన ఆశాభావం వ్యక్తం చేశారు. అభివృద్ధిలో కలిసిమెలిసి ముందుకు వెళ్లాలని కోరారు. ఇతర పోర్టుల నుండి ఇక్కడి వచ్చి ఆర్థికాభివృద్ధి పొందొచ్చని అధ్యక్షుడు వివరించారు. గ్వాదర్ పోర్టుకు కూడా తమ వంతు సహాయ సహకారాలు అందిస్తామని హామీ ఇచ్చారు. పోర్టును రోడ్డు, రైలు మార్గాలకు అనుసంధానం చేసేలా ప్రణాళికలు రచిస్తున్నామని, దీనికి కూడా త్వరలో అంకురార్పణ చేస్తామని వివరించారు. సరుకు రవాణా వ్యవస్థ మరింత మెరుగుపడేలా చూస్తామని ఈ సందర్భంగా ఆయన తెలిపారు. మధ్య ఆసియా దేశాలతో కలుపుకుని పోయేలా ప్లాన్ చేస్తున్నట్టు తెలిపారు. రష్యా ద్వారా తూర్పు, ఉత్తర ఐరోపాను కలిపేలా మార్గాన్ని రూపొందిస్తామని తెలిపారు. ఈ శంకుస్థాపన కార్యక్రమంలో ఇండియా, ఖతర్, ఆఫ్ఘనిస్తాన్, పాకిస్థాన్‌తో పాటు పలు దేశాల ప్రతినిధులు పాల్గొన్నారు.

- చాబహార్ పోర్టు ఏర్పాటు భారత్ దేశానికి ఎంతో ఉపయోగపడుతుందని సుష్మాస్వరాజ్ అభిప్రాయపడ్డారు. మధ్య ఆసియా దేశాలతో వ్యాపారాన్ని మరింత అభివృద్ధి చేసుకోవడానికి ఈ పోర్టు ఎంతో సహాయం పడుతుందని అన్నారు. ప్రత్యర్థి పాకిస్థాన్‌కు బైపాస్‌గా ఉపయోగపడుతుంది. గతేడాది చాబహార్ పోర్టు అభివృద్ధి, రైలు, రోడ్డుతో అనుసంధాన చేయడానికిగాను 500 మిలియన్ డాలర్లతో అభివృద్ధికి భారత్ అంగీకరించింది. గత నెలలో ఆఫ్ఘనిస్తాన్ ద్వారా ఇరాన్ పోర్టుకు 1,30,000 టన్నులు గోధుమలు ఎగుమతి చేయడానికి ప్రణాళికలు రచించింది. చాబహార్‌లో అంతర్జాతీయ విమానాశ్రయం ఉంది. నేవీతో పాటు ఏయిర్ ఫోర్స్ వ్యవస్థ కూడా పట్టణంలో నిర్మితమై ఉంది.
- చాబహార్ పోర్టు మొదటి దశ అనేది ఇరాన్‌లోని సిస్తాన్-బలూచిస్తాన్ ఆగ్నేయ ప్రావిన్స్‌లో ఉంది. ఇరాన్, ఆఫ్ఘనిస్థాన్, మధ్య ఆసియా దేశాలను కలుపుతూ నిర్మాణం ఉంటుంది. భారత్ దేశ పశ్చిమ తీరానికి సులభం చేరుకోవచ్చు. పాక్ వెళ్లడానికి బైపాస్‌గా ఉపయోగపడుతుంది.
- 2016, మేలో ప్రధాని నరేంద్రమోడీ త్రైపాక్షిక సంబంధాల్లో భాగంగా రవాణా వ్యవస్థ మెరుగుపర్చడానికి టెహ్రాన్‌లో ఒప్పందం చేసుకున్నారు. ఇండియాకు చాబహార్ పోర్టు ముఖద్వారంగా ఉండనుంది. ఇండియా, ఇరాన్, ఆఫ్ఘనిస్థాన్‌తో పాటు పలు దేశాలకు సరుకులు, ప్రయాణికుల కోసం సౌకర్యార్థంగా ఉంటుంది.
- ఇరాన్ సరిహద్దును తాకుతూ నాలుగు ప్రధాన ఆఫ్ఘనిస్థాన్ నగరాలను కలుపుతూ జరంజ్-డెలారామ్ రహదారిని న్యూ ఢిల్లీ నుండి పూర్తి చేసింది.
- ఇరాన్‌లోని జహేదాన్ రైలు వ్యవస్థ ఏర్పాటుకు 1.6 బిలియన్ డాలర్లు భారత్ ఆర్థికసాయం అందిస్తున్నది. ఈ రైలు వ్యవస్థ అనేది తుర్కెమినిస్థాన్ ఉత్తర మస్‌హద్‌తో కనెక్ట్ ఉంటుంది. దీంతో పాటు దక్షిణ ఆఫ్ఘనిస్థాన్‌లోని బఫ్క్-మస్‌హద్ కలుపుతుంది.
- కేంద్ర షిప్పింగ్ శాఖ మంత్రి మసుఖ్ మాండవీయ భారత్ తరుపున చాబహార్ పోర్టు శంకుస్థాపనలో పాల్గొన్నారు.

Andhraprabha business 2017

# బిజినెస్

## ఫోర్డ్ ముస్తాంగ్ సూపర్‌కార్ షో 2017

**హైదరాబాద్ :** ఫోర్డ్ ముస్తాంగ్ కెనిన్ బాల్ క్లబ్, కార్‌క్రాఫ్ట్ భాగస్వామ్యంతో..ఎంఎజీ మహవీర్ గ్రూపు, ఆటమ్, ఎల్వేస్ డ్రై, పెరారా ముంబైలు కలిసి హైదరాబాద్‌లో రెండవ ఎడిషన్ సూపర్ కార్ షో 2017ను హైదరాబాద్‌లో ఆవిష్కరించారు. ఈ కార్యక్రమం లో 10,000 బీహెచ్‌పీలకు చెందిన ఆలీవ్‌బిస్ట్రో జుబ్లీహిల్స్‌లో దూసుకుపోయింది. కెనిన్‌బాల్ క్లబ్ విషయానికి వస్తే దేశంలోనే సూపర్‌కారు యజమానుల చేత ఏర్పాటు చేయబడింది. ఈ సభ్యుల వదకద ఫెరారీ, లాంబోర్గి, ఆస్లిన్ మార్టిన్, ఫోర్చ్బ్, ఎంఎంజీ మాసరేటి లాంటి రేసింగ్ కార్లుంటాయి. దేశవ్యాప్తంగా సుమారు 300 మంది సభ్యులున్నారు. కాగా ఇప్పటి వరకు ఢిల్లీ, చండీగఢ్, బెంగళూరు, ఇటలీ, దుబాయితో పాటు ప్రస్తుతం హైదరాబాద్‌లో 75



సూపర్‌కారు ఈవెంట్స్ నిర్వహించారు. ఈ ర్యాలీకిముందు కెనాన్‌బాల్ బృందం రేసర్లకు స్థానిక ట్రాఫిక్ నిబంధనలతో పాటు భద్రత గురించి వివరించారు. సూపర్‌కార్ డ్రైవ్ పాల్గొన్న మనోజ్ కశ్యప్ మాట్లాడుతూ.. ఈ షోలో పాల్గొన్నం దుకు సంతోషంగా ఉందని భవిష్యత్తులో జరిగే కారు షోలో పాల్గొంటామన్నారు. ఈ షో ద్వారా బాధ్యతాయుతమైన డ్రైవింగ్‌తో పాటు ప్రజల భద్రతను దృష్టిలో ఉంచుకొని కార్ల యజమానులు డ్రైవ్ చేయాలనేసందేశం ఇచ్చినట్లు చెప్పారు. హైదరాబాద్‌లో ఈ రేసింగ్ జరగడం ఇది రెండవసారి.

## తెలంగాణలో పెట్టుబడులు పెట్టండి

- ఆస్ట్రేలియా బిజినెస్ ఫోరంకు టి హోంమంత్రి విజ్ఞప్తి



**హైదరాబాద్, ఆంధ్రప్రభ:** తెలంగాణలో పెట్టుబడులు పెట్టాలని హోంమంత్రి నాయిని నరసింహారెడ్డి ఆస్ట్రేలియాలో స్థిరపడిన తెలంగాణ వాసులకు పిలుపునిచ్చారు. పారిశ్రామిక ప్రగతికి అవసరమైన అన్ని రకాల సదుపాయాలను తెలంగాణ ప్రభుత్వం కల్పిస్తుందని తెలిపారు. హైదరాబాద్‌లో అభివృద్ధికి అద్భుతమైన అవకాశాలు ఉన్నాయని వివరించారు. తెలంగాణ బిజినెస్ కౌన్సిల్ ఫర్ ఆస్ట్రేలియా సిడ్నిలో ఏర్పాటు చేసిన కార్యక్రమంలో నాయిని నర్సింహారెడ్డి పాల్గొన్నారు. ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన అనేక అంతర్జాతీయ సంస్థలు హైదరాబాద్ కేంద్రంగా కార్యకలాపాలను విస్తరించుకుంటున్నాయని హోంమంత్రి వివరించారు. తెలంగాణ ప్రభుత్వం కొత్త సాంకేతికతను అందిపుచ్చుకోవడంలో ముందుందని తెలియచేశారు. పారిశ్రామిక ప్రగతికి ఎంతగానో ప్రోత్సాహకాలను ఇస్తుందని వివరించారు. పెట్టుబడులకు తెలంగాణ అన్ని విధాలుగా అనువైందని పేర్కొన్నారు. నిపుణులైన మానవ వనరులకు తెలంగాణలో కొరత లేదని, పరిశ్రమలకు కావలసిన భూమి, నీరు, విద్యుత్ వంటి సౌకర్యాలు అందుబాటులో ఉన్నాయని నాయిని నరసింహరెడ్డి తెలియచేశారు. కొత్తగా 500 పరిశ్రమలకు భూకేటాయింపులు జరిపామని, దాదాపు 8,200 ఎకరాల్లో ఫార్మాసిటీని ఏర్పాటు చేయబోతున్నామని, కాకతీయ ఇంటిగ్రేటెడ్ మోగా టెక్స్‌టైల్ పార్కు, సిరిసిల్ల అపెరల్ పార్కుతో పాటుగా నిజామాబాద్, గద్వాల, ఖమ్మం సంగారెడ్డిలో మెగా ఫుడ్ పార్కులను ఏర్పాటు చేస్తున్నామని తెలియచేశారు. ఐటి రంగంలో తెలంగాణ దూసుకుపోతుందన్నారు. దేశ విదేశీ పెట్టుబడులు ఆకర్శించడంలో తెలంగాణ ముందుందన్నారు. తెలంగాణ బిజినెస్ కౌన్సిల్ ఫోరం ఆస్ట్రేలియా అధ్యక్షులు అశోక్ మరం, సందీప్ మునగాల, నల్లా ప్రవీణ్ రెడ్డి, కపిల్ కాట్పెల్లీ, ప్రదీప్ సేరి, ప్రదీప్ తెడ్ల, రామ్ గుమ్మడివాలి, గోవర్దన్ సుమేష్‌రెడ్డి పాల్గొన్నారు.

## జాక్వార్ విస్తరణ

- 2022 నాటికి బిలియన్ డాలర్ల టర్నోవర్
- ప్రపంచవ్యాప్తంగా 15 స్టోర్లు ప్రారంభం




**న్యూఢిల్లీ :** బాత్ ఫిట్టింగ్. సానిటరీ దిగ్గజం జాక్వార్‌గ్రూపు వచ్చే 2022 నాటికి బిలియన్ డాలర్లటర్నోవర్ లక్ష్యంగా పెట్టుకుంది. కంపెనీ ప్రాడక్టు పోర్టుపోలియోను విస్తరించనుంది. దీంతో పాటు గ్లోబల్ మార్కెట్లో కాలుమోపబోతోంది. జాక్వార్ వరల్డ్‌పేరుతో గ్లోబల్ మార్కెట్లో కూడా ఎంట్రీ ఇవ్వబోతోంది. ఏకంగా ప్రత్యేకంగా 15 స్టోర్‌లను కూడా ప్రారంభించబోతోంది. ప్రస్తుతం జాక్వార్ 40 దేశాల్లో తమ ప్రాడక్టును విక్రయిస్తోంది. వచ్చే ఆర్థిక సంవత్సరానికి అంతర్జాతీయ విక్రయాలు 50 మిలియన్ డాలర్ల సాధించాలని లక్ష్యంగా పెట్టుకుంది. అలాగే గ్లోబల్ మార్కెట్లో స్థిరపడాలనుకుంటున్నట్లు కంపెనీ గ్రూపు డైరెక్టర్ వ్యవస్థాపకుడు రాజేశ్ మెహ్రా చెప్పారు. ప్రస్తుతం దుబాయి, వియత్నాం, సింగపూర్, ఆడిస్ అబా, ఇథోపియాలలో 15 షోరూంలను ప్రారంభించాలనుకుం టున్నామని.. ప్రస్తుతం పనులు జరుగుతున్నాయని, వీటితో పాటు టునిసియా, దక్షిణాఫ్రికా, ఇరాన్,టాంజానియా, మలేషియా,శ్రీలంక, గునియా, నైజీరియా, ఉగాండా, ఐవరీ కోస్ట్‌లలో షోరూంలకు ప్రణాళికలు రూపుదిద్దుతున్నట్లు చెప్పారు. తమ లక్ష్యం బ్రాండ్‌ను గ్లోబల్ మార్కెట్లకు విస్తరించాలనుకుంటున్నట్లు ఆయన చెప్పారు. డీలర్లు, డిస్ట్రిబ్యూటర్లు జాక్వార్ మినీవరల్డ్‌ను ఏర్పాటు చేస్తారని ఆయన తెలిపారు. ఈ ఆర్థిక సంవత్సరం రూ.3,500 కోట్లు, 2020 నాటికి రూ.5,000 కోట్ల టర్నోవర్ లక్ష్యానికి చేరుకుంటామని ఆయన వివరించారు. బిలియన్ డాలర్లకు ఎప్పుడు చేరుతారని ప్రశ్నించగా.. 2022 నాటికి అని స్పష్టం చేశారు. బాతింగ్ సెగ్మెంట్‌తో పాటు టైలింగ్ సెక్షన్‌లో కూడా ఎంట్రీ ఇచ్చి ఎల్ఈడీ ప్రాడక్టును ఉత్పత్తి చేస్తోంది. తమ వ్యాపారాన్ని మరింత విస్తరించడానికి గత ఏడాది జులైలో జాక్వార్ గ్రూపు దక్షిణ కొరియాకు చెందిన జాయ్ ఫర్ లైఫ్‌లో మెజారిటి వాటాలను టేకోవర్ చేసింది.

### విదేశీ పెట్టుబడులు




## ఓఎన్‌జీసీలో 18శాతం వాటాలు విక్రయించండి

- చమురుక్షేత్రాలను కాదు
- వాటాలు విక్రయిస్తే ఖజానాకు రూ. 41వేల కోట్ల ఆదాయం
- ఉద్యోగుల మనోభావం ఇది

**ప్రస్తుతం పీఎస్‌యు కంపెనీల్లో అత్యధిక లాభాలను ప్రభుత్వానికి అందిస్తున్న కంపెనీ ఏదంటే ఖచ్చితంగా ఒఎన్‌జీసీ అని చెప్పవచ్చు. అయితే ఒఎన్‌జీసీ చేతిలో ఉన్న 11 చమురు సహజవాయువు క్షేత్రాలను ప్రైవేట్ కంపెనీలకు విక్రయించాలని ప్రభుత్వం చూస్తోంది. దీనిపై కంపెనీకి చెందిన ఉద్యోగులతో పాటు ఎగ్జిక్యూటివ్‌లు కూడా ప్రభుత్వంపై మండిపడుతున్నారు. ప్రభుత్వానికి ఒఎన్‌జీసీలో 68.07 శాతం వాటాలున్నాయి. వాటిలో 18 శాతం వాటాలను విక్రయిస్తే ప్రభుత్వానికి ఏకంగా రూ.41వేల కోట్ల ఆదాయం సమకూరుతుంది. దీంతో పాటు 11 చమురు క్షేత్రాలు ప్రభుత్వం చేతిలో ఉంటాయి.**




**న్యూఢిల్లీ :** కేంద్రప్రభుత్వానికి చెందిన కీలకమైన చమురు సహజవాయువు క్షేత్రాలను పప్పు బెల్లాలా ప్రైవేట్ కంపెనీలకు ధారాదత్తం చేసి పీఎస్‌యు కంపెనీలను నిలువునా ముంచుతున్నారని ఒఎన్‌జీసీకి చెందిన ఎగ్జిక్యూటివ్‌లు వాపోతున్నారు. దీని బదులు ప్రభుత్వం ఒఎన్‌జీసీ (ఆయిల్ అండ్ నేచురల్ గ్యాస్ కార్పొరేషన్)లో 18 శాతం వాటాలు .. ప్రభుత్వానికి ఒఎన్‌జీసీలో మొత్తం 68.07 శాతం వాటాలున్నాయి. వాటిలో 18 శాతం విక్రయిస్తే ప్రస్తుతం ఉన్న మార్కెట్ ధరల ప్రకారం రూ.41వేల కోట్లు ప్రభుత్వానికి ఆదాయం సమకూరుతుందని ఉద్యోగులు చెబుతున్నారు. దీనికి బదులు ఒఎన్‌జీసీకి చెందిన 11 చమురు సహజవాయువు క్షేత్రాల్లో పెట్టుబడిపెట్టిన దాంతో పోల్చుకుంటే ఇది చాలా చాలా ఎక్కువన్నారు. కాగా ప్రభుత్వం ఒఎన్‌జీసీకి చెందిన 11 చమురు సహజ వాయువు క్షేత్రాల్లో 60 శాతం వాటాలను విక్రయించాలనే ఆలోచనలో ఉంది.

తాజా పరిణామాల నేపథ్యంలో పేరు వెల్లడించడానికి ఇష్టపడని ఒఎన్‌జీసీకి చెందిన పలువురు ఉద్యోగులు, అధికారులతో పాటు ఎగ్జిక్యూటివ్‌లు కూడా తాజాగా ప్రభుత్వం 11 చమురుక్షేత్రాలను విక్రయించడం పట్ల తీవ్ర అసంతృప్తి వ్యక్తం చేస్తున్నారు. కాగా డైరెక్టర్ జనరల్ ఆఫ్ హైడ్రోకార్బన్స్ (డీబీహెచ్) కంపెనీకి చెందిన 11 చమురు క్షేత్రాలను గుజరాతాలోని అతి పెద్ద నాలుగు చమురు క్షేత్రాలు వాటిలో కాలోక్, అంకలేశ్వర్, గంగాధర్, సంతాల్‌లను ప్రైవేట్ రంగానికి చెందిన కంపెనీలకు అప్పగించి పెద్దెత్తున ఉత్పత్తి పెంచాలనుకుంటున్నాయి. కాగా ఉద్యోగులు చెప్పేదేమింటంటే ఒఎన్‌జీసీకి ఉత్పత్తి పెంచేసామర్థ్యం లేదని భావిస్తే.. కంపెనీని ప్రైవేట్‌పరం చేయవచ్చుననన్నారు. తాజాగా ప్రభుత్వం ఆలోచన చూస్తే ఇప్పటి వరకు దేశంలో అత్యధిక లాభాలను ఆర్జిస్తున్న ప్రభుత్వరంగానికి చెందిన కంపెనీ ఏదంటే ఖచ్చితంగా ఒఎన్‌జీసీ అని చెప్పవచ్చునని.. దీన్ని ప్రభుత్వం ఎయిర్ ఇండియా స్థాయికి తీసుకురావాలని చూస్తోందని ఉద్యోగులు గరం గరం అయ్యారు.

ప్రభుత్వం పెట్టుబడుల ఉపసంహరణ లక్ష్యాన్ని సాధించుకోవాలనుకుంటే ఒఎన్‌జీసీలో ప్రభుత్వం తన వాటాలను 50 శాతం కంటే ఒక శాతం తగ్గించుకోవచ్చునని, అదే సమయంలో ప్రైవేట్ రంగంలో అత్యుత్తమ యాజమాన్యంతో నిర్వహిస్తున్న కంపెనీ (ఒఎన్‌జీసీ) యధావిధిగా కొనాసాగుతుందని వారు అంటున్నారు.

ప్రపంచవ్యాప్తంగా చూస్తే మన దేశంలోని చమురు సహజవాయువు నిల్వలు 0.3 శాతం ఉంటాయి. అయితే గ్లోబల్ ఔట్‌పుట్‌లో 0.6 శాతం ఒఎన్‌జీఎస్ ఉత్పత్తి చేస్తోందని మరో అధికారి వెల్లడించారు. ప్రభుత్వ వాదన ఏమిటంటే ప్రభుత్వ రంగానికి చెందిన చమురు క్షేత్రాల్లో ఉత్పత్తి భారీగా పడిపోతోందన్న వాదనను వీరు తోసిపుచ్చుతున్నారు. అందుకే ప్రభుత్వం ఈ చమురు క్షేత్రాలను ప్రైవేట్ పరంచేయాలని చూస్తున్నట్లు.. ప్రభుత్వం తమ వాదనను సమర్థించుకుంటోంది. ఒఎన్‌జీసీ అధికారులు చెప్పేదేమిటంటే గత దశాబ్దాల కాలం నుంచి చమురు క్షేత్రాల్లో ఉత్పత్తి కొనసాగుతున్నా.. ఇంకా ఉత్పత్తి చేతికొస్తోందని చెబుతున్నారు. పెట్రోలియం మంత్రి ధర్మేంద్రప్రధాన్ కూడా పలు బహిరంగ సభల్లో ఒఎన్‌జీసీలో చమురు క్షేత్రాల్లో ఇప్పటి వరకు నిలిచిపోయినా.. ఉత్పత్తి తిరిగి పుంజుకుంటోందని చెప్పారని వారు గుర్తు చేశారు. మరో అధికారి మాట్లాడుతూ కేజీ-డీ6 చమురు క్షేత్రంతో పాటు రాజస్థాన్‌లోని బర్మార్ చమురు క్షేత్రాల్లో నిపుణులను రప్పించి ఉత్పత్తి పెంచుకోవచ్చు కదా అని ప్రశ్నించారు. ప్రభుత్వం విక్రయించుకోవాలన్న చమురు క్షేత్రాలు 8-10 సంవత్సరాల పాతవి.. కాబట్టి ఉత్పత్తి గణనీయంగా తగ్గముఖం పడుతుందని వారు వివరిస్తున్నారు. కేజీ-డీ6 బ్లాకు అతి పెద్ద సహజవాయువు క్షేత్రమని, పెద్ద మొత్తంలో సహజవాయువు ఉత్పత్తి అయ్యేదని, సహజ వాయువు ఉత్పత్తిలో పదవ వంతు ఇక్కడి నుంచేవస్తోందని, ఏడేళ్ల క్రితం బ్రిటిష్‌కు చెందిన బీపీ పీఎల్‌సీ రంగంలో దిగిన తర్వాత సీన్ రివర్స్ అయ్యిందని చెప్పారు. మరో అధికారి ఒక ఉదాహరణ ఇస్తూ.. పశ్చిమ తీరాన ఉన్న పన్నా/ముక్తా, టావోలీ సహజవాయువు క్షేత్రాలను ఒఎన్‌జీసీ నుంచి 1990లో తీసుకొని ఎన్‌రాన్ కార్పొరేషన్, రిలయన్స్ ఇండ స్ట్రీస్‌కు కట్టబెట్టాయని చెప్పారు. ఎన్‌రాన్ దివాలా తీసిన వెంటనే ఈ చమురు క్షేత్రాలను బ్రటిన్ చెందిన బీజీ గ్రూపు నిర్వహించింది. ప్రస్తుతం రాయల్ డచ్ షెల్ నిర్వహిస్తోంది. కాగా ప్రస్తుతం ఇక్కడకూడా ఉత్పత్తి పడిపోయిందని చెప్పారు. దీంతో భాగస్వాములు ఈ చమురు క్షేత్రాలను వదులుకోవాలని చూస్తున్నాయన్నారు.

ప్రస్తుతం డిజీహెచ్ ఆలోచన ఏమిటంటే ప్రభుత్వరంగానికి చెందిన చమురు సహజ వాయువు క్షేత్రాలు ఒఎన్‌జీసీ, ఆయిల్ ఇండియాచేతిలో ఉన్న వాటిలో 60 శాతం వాటాలను ప్రైవేట్ కంపెనీలకు విక్రయించాలని చూస్తున్నాయి. ఈ ప్రైవేట్ కంపెనీలు అంచనా కంటే ఎక్కువ ఉత్పత్తి చేస్తాయని ప్రభుత్వం భవిస్తోంది. కాగా మొత్తం 15 చమురు సహజవాయువు క్షేత్రాల్లో 11 ఒఎన్‌జీసీ చేతిలో ఉండగా.. నాలుగు మాత్రం ఆయిల్ ఇండియా చేతిలో ఉన్నాయి. ఈ క్షేత్రాల్లో 791.2 మిలియన్ టన్నుల ముడిచమురు 333.46 బిలియన్ క్యూబిక్ మీటర్లు సహజ వాయువును గుర్తించారు.

మరో ఎగ్జిక్యూటివ్ మాట్లాడుతూ చట్ట ప్రకారం పీఎస్‌యు కంపెనీలకు చమురు క్షేత్రాలను కట్టబెట్టాలి కాబట్టి పనికి రాని ఒట్టిపోయిన చమురుబావులను కట్టబెట్టి వాటిలో పెట్టుబడులు పెట్టారని, అటు తర్వాత బడ్జెట్‌లో ఎలాంటి నిధులను కేటాయించలేదని, ఇలాంటి పరిస్థితుల్లో కొత్త చమురు బావుల అన్వేషణ ఎలా కొనసాగుతుంది, ఉత్పత్తి ఎలా పెంచుకోగలుగుతామని ఆయన ప్రశ్నించారు. ప్రైవేట్ కంపెనీలతో పాటు విదేశీ కంపెనీలు భారత్ చమురు క్షేత్రాలపై ఆసక్తి కనబర్చని సమయంలో తమకు చమురు క్షేత్రాలు కేటాయించినవన్నారు. మొత్తం 202 చమురు క్షేత్రాల్లో 141 చమురు క్షేత్రాలు 10 సంవత్సరాల కంటే తక్కువ కాలానికి చెందినదని, ప్రస్తుతం ఇక్కడ ఏడాది ప్రాతిపదికన చూస్తే ఉత్పత్తి క్రమంగా పుంజుకుంటోందని.. సుమారు 44 చమురు క్షేత్రాలు ఒఎన్‌జీసీ, ఓఐఎల్‌కు చెందినవి ఉత్పత్తి పెరిగినట్లు గుర్తించడం జరిగిందని.... టెక్నిలక్ సర్వీస్ మోడల్‌తో పనిచేస్తే ఉత్పత్తి పెరుగుతుందని ఒఎన్‌జీసీ సిబ్బంది అంటున్నారు. ఇక తుది నిర్ణయం తీసుకోవాల్సింది మాత్రం కేంద్రంలోని మోడీ సర్కార్ మాత్రమే!

## వృద్ధిరేటు 6.5 శాతం

- 2017-18 ఆర్థిక సంవత్సరం



**న్యూఢిల్లీ :** ప్రముఖ ఆర్థికవేత్త మాజీ నీతిఆయోగ్ వైస్ చైర్మన్ అరవింద్ పనగారియా ఈ ఆర్థిక సంవత్సరం స్థూల దేశీయోత్పత్తి లేదా జీడీపీ 6.5 శాతం కంటే ఎక్కువనే నమోదు కావచ్చునని అంచనా వేశారు. సూక్ష్మ ఆర్థిక వ్యవస్థ సంకేతాలు చూస్తే గత మూడేళ్ల నుంచి స్థిరంగా ఉన్నాయని కరెంటుఖాతాలోటు ఒక శాతం లోపే ఉందని.. అదే సమయంలో ద్రవ్యోల్బణం కూడా అదుపులో ఉందని వివరించారు. ఈ ఏడాది జులై 1 నుంచి అమల్లోకి వచ్చిన వస్తుసేవల పన్ను (జీఎస్టి)వల్ల సరఫరా చెయిన్‌లో కొత్త ఇబ్బందులు ఎదురైనాయన్నారు. ఈ ఆర్థిక సంవత్సరం మొదటి త్రైమాసికంలో జీడీపీ వృద్ధిరేటు 5.7 శాతంగా నమోదైందని. అయితే ఈ ఆర్థికసంవత్సరం రెండవ త్రైమాసికంలో ఆర్థిక వ్యవస్థ కోలుకుందని, జీడీపీ వృద్ధిరేటు క్రమంగా పుంజుకొని 6.5 శాతానికి ఎగబాకిందని ఆయన పిటిఐకి ఇచ్చిన ఇంటర్వ్యూలో చెప్పారు. ఇటీవల గోల్డ్‌మన్ సాచ్స్ విడుదల చేసిన నివేదికను బట్టి చూస్తే భారత ఆర్థిక వ్యవస్థ వచ్చే ఆర్థిక సంవత్సరం 2018-19లో జీడీపీ వృద్ధిరేటు 8 శాతానికి దూసుకుపోయే సత్తా ఉందని చాటిచెప్పిందని ఆయన గుర్తు చేశారు. వరుసగా గత ఐదు త్రైమాసికాల నుంచి క్షీణిస్తూ వస్తున్న వృద్ధిరేటు, తిరిగి గాడినపడుతోందన్నారు.తయారీ రంగం పుంజుకోవడంతో పాటు కొత్త పన్ను వ్యవస్థ జీఎస్టీలోని లోటుపాట్లను ప్రభుత్వం పరిష్కరిస్తున్న నేపథ్యంలో ఈ ఆర్థికసంవత్సరం జులై - సెప్టెంబర్ త్రైమాసికంలో జీడీపీ వృద్ధిరేటు 6.3 శాఆనికి ఎగబాకిందన్నారు.ఆర్థిక వ్యవస్థను బలోపేతం చేయడానికి ద్రవ్యలోటు లక్ష్యాన్ని సడలిస్తారా అని ప్రశ్నించగా.. వ్యక్తిగతంగా తన అభిప్రాయం తీసుకుంటే తన అంచనా ప్రకారం ఆర్థికమంత్రి కానీ, ప్రధానమంత్రి కానీ ఆర్థికక్రమశిక్షణతో రాజీపడేతత్వం కాదన్నారు. కేంద్రంలోని మోడీ ప్రభుత్వం .. గతంలో మాదిరిగానే వచ్చే ఏడాది ఫిబ్రవరి సమర్పించే బడ్జెట్ ప్రజాకర్షక బడ్జెట్‌గా ఉంటుందా అని ప్రశ్నించగా.. తన అంచనా ప్రకారం ప్రజాకర్షక బడ్జెట్ ప్రకటించాలనుకుంటే .. ఒక్కసారికి మాత్రమే రాయితీలు ప్రకటించాలని.. దీర్ఘకాలం పాటు ఇస్తూ పోతే జాతి ప్రయోజనాలు దెబ్బతింటాయని, తర్వాత రాయితీలు ఉపసంహరిస్తే.. రాజకీయంగా కూడా ప్రభుత్వానికి ఇబ్బందులేనని ఆయన అన్నారు.దీనికి ఆయన ఒక ఉదహరణ చెబుతూ ఎన్‌ఆర్‌ఈజీఏ ను దేశంలోని అతి పేద 200 జిల్లాల నుంచి అన్నీ జిల్లాలకు విస్తరించడంతో పాటు అప్పటి యూపీఏ ప్రభుత్వం 2009 పార్లమెంటు ఎన్నికలకు ముందు కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులకు వేతనాలు పెంచడం, దీంతో పాటు భూసేకరణ చట్టం, ఆహార భద్రత చట్టం లాంటివి తీసుకొచ్చి దీర్ఘ కాలంలో దేశ ఆర్థిక వ్యవస్థను దెబ్బతీస్తాయన్నారు.

## రిటైల్ ద్రవ్యోల్బణం మరింత పైపైకి

- నవంబర్ రిటైల్ ద్రవ్యోల్బణం 4%



**న్యూఢిల్లీ :** రాబోయే నెలల్లో రిటైల్ ద్రవ్యోల్బణం మరింత పైపైకి పోతుందని ఆర్థిక వేత్తలు అభిప్రాయ పడుతున్నారు. దీనికి ప్రధాన కారణం ఆర్థిక వ్యవస్థ క్రమంగా గాడిలో పడ్డంతో పాటు రాష్ట్రస్థాయితో పాటు కేంద్రస్థాయిలో వేతన కమిషన్ సిఫారసులు అమలు కాబోవడమేనని వివరించారు. ఈ ఏడాది ప్రారంభంలో ధరలు ఒత్తిడి తక్కువగా ఉందని.. దీనికి ప్రధాన కారణం డిమాండ్ తగ్గడంతో పాటు పెద్దనోట్ల రద్దు ప్రభావం కూడా రిటైల్ ద్రవ్యోల్బణంపై కనిపించిందని చెబుతున్నారు. ఇక నుంచి రిటైల్ ద్రవ్యోల్బణం మాత్రం క్రమంగా పుంజుకుంటుందని వారు అభిప్రాయపడుతున్నారు. ఆహార, ఇంధనం ద్రవ్యోల్బణం క్రమంగా పెరగడంతో దాని ప్రభావం అక్టోబర్ నెల రిటైల్ ద్రవ్యోల్బణం స్పష్టంగా కనిపించింది. అక్టోబర్ నెలలో రిటైల్ ద్రవ్యోల్బణం ఏడు నెలల గరిష్ఠానికి ఎగబాకి 3.58 శాతానికి చేరిన విషయం తెలిసిందే. జపాన్‌కు చెందిన ఫైనాన్షియల్ సర్వీసెస్ కంపెనీ నోమురా అంచనా ప్రకారం జీఎస్టి వల్ల ధరలు స్వల్పంగా పెరిగాయని పేర్కొంది. మొత్తానికి ఆహార ద్రవ్యోల్బణం రిజర్వుబ్యాంకు అంచనా వేసినట్లు నవంబర్ నెలలో నాలుగు శాతం దాటిపోతుందని అంచనా వేసింది. గ్లోబల్ ఫైనాన్షియల్ సర్వీసెస్ దిగ్గజం మోర్గాన్ స్టాన్లీ కూడా ఇదే అభిప్రాయాన్ని వ్యక్తం చేసింది. రాష్ట్రస్థాయిలో ఇంటిభత్యాలు, పెంచడంతో పాటు కేంద్రం కూడా వేతన కమిషన్‌లో ఇంటి అద్దె భత్యాలను సవరించడంతో దాని ప్రభావం రిటైల్ ద్రవ్యోల్బణం ఖచ్చితంగా పడుతుందని స్పష్టం చేసింది. ఆహార పదార్థాల ధరలు పెరగడంతో తమ అంచనా ప్రకారం రిటైల్ ద్రవ్యోల్బణం వచ్చే ఏడాది జూన్ నాటికి 5.3 శాతానికి ఎగబాకి.. వచ్చే ఏడాది చివరి నాటికి 4.4 శాతానికి చేరుకోవచ్చునని మోర్గాన్ స్టాన్లీ పరిశోధన పత్రంలో వివరించింది. ఇదే అభిప్రాయాన్ని యూబీఎస్ రిసెర్చి కూడా వ్యక్తం చేసింది. రిటైల్ ద్రవ్యోల్బణం క్రమంగా పుంజుకుంటుందని.. ఇది ప్రభుత్వానికి ఆందోళన కలిగించేఅంశమేనని ముడి చమురు ధరలతో పాటు ద్రవ్యలోటు రెండు ఆర్థిక వ్యవస్థకు సంక్లిష్టమైనవేనని పేర్కొంది. ముడి చమురు విషయానికి వస్తే భారత్ దిగుమతులపై ఆధారపడి ఉంటుంది కాబట్టి, ముడి చమురు ధరలు పెరిగితే దాని ప్రభావం ఆర్థిక వ్యవస్థపై పడుతుందని.. ఉదాహరణకు ఈ ఆర్థిక సంవత్సరంలో బ్రెంట్ ముడి చమురు బ్యారల్ 60 డాలర్లకు చేరితే ద్రవ్యోల్బణం పెరుగుతుంది.. అదే సమయంలో సర్దుబాటు కూడా చేయవచ్చు. అయితే ఒక వేళ ఇవే చమురు ధరలు 70-75 వాలర్లు పీపా చేరితే మాత్రం రిటైల్ ద్రవ్యోల్బం చుక్కలనంటుతుందని వివరించింది. డన్ బ్రాడ్‌స్ట్రీట్ నివేదకి ప్రకారం ఒక వేళ ముడి చమురు ధరలతో పాటు ఇండస్ట్రియల్ మెటల్ ధరలు పెరిగితే (ప్రపంచవ్యాప్తంగా) దాని ప్రభావం రిటైల్ ద్రవ్యోల్బణంపై ఖచ్చితంగా ఉంటుందని స్పష్టం చేసింది. డి అండ్‌బి అంచనా ప్రకారం రిటైల్ ద్రవ్యోల్బణం 4.2 నుంచి 4.4 శాతం మధ్యలో ఉంటుందనిటోకు ద్రవ్యోల్బణం ఈ ఏడాది నవవబర్‌లో 3.6% నుంచి 3.7% వరకుఉండొచ్చునని అభిప్రాయపడింది.

## వడ్డీరేట్లు యధాతథం?

- ఆర్థికవేత్తల అంచనా
- 6న ఆర్‌బీఐ ద్రవ్యసమీక్ష

**న్యూఢిల్లీ :** ఈ నెల 6వ తేదీన బుధవారం నాడు జరగ నున్న రిజర్వుబ్యాంకు ద్వైమాసిక ద్రవ్యపరపతి సమీక్షలో కీలకవడ్డీరేట్లలో ఎలాంటి మార్పులుండకపో వచ్చు. ద్రవ్యో ల్బణాన్ని అదుపులో ఉంచడానికి ఆర్‌బీఐ వడ్డీరేట్ల జోలికి పోకపోవచ్చునని ఆర్థికవేత్తలు అభిప్రాయపడ్డారు. వరుసగా ఐదు త్రైమాసికాల తర్వాత జీడీపీ వృద్ధిరేటు క్యూ2లో 6.3 శాతానికి పెరగడంతో వడ్డీరేట్లు తగ్గించాలని ఆర్‌బీఐపై ఒత్తిడి కూడా తగ్గుతుం దని వారు అంటున్నారు. అయితే భారత్ కార్పొరేట్లు మాత్రం యధావిధిగా వడ్డీరేట్లు తగ్గించాలని డిమాండ్ చేస్తున్నాయి. దేశ సావరిన్ రేటింగ్‌ను పెంచుకోవడానికి ఇదే మంచి అవకాశమని, వడ్డీరేట్లు తగ్గించాలని డిమాండ్ చేస్తున్నాయి. ఇదిలా ఉండగా మానిటరీ పాలసీ కమిటీ (ఎంపీసీ) ఆర్‌బీఐ గవర్నర్ ఉర్జిత్‌పటేల్ నేతృత్వంలో ఈ నెల 5,6 తేదీల్లో జరగనుంది. వడ్డీరెట్లు పెంచడమా, తగ్గించడమా అనేది ఈ నెల ఆరవ తేదీన తేలిపోతుంది. ఈ ఏడాది అక్టోబర్‌లో జరిగిన పరపతి సమీక్షలో రిజర్వుబ్యాంకు వడ్డీరేట్ల తగ్గింపు జోలికిపోలేదు. దీనికి ప్రధాన కారణం ద్రవ్యోల్బణం క్రమంగా పుంజుకుం టోందని కారణం చెప్పి తప్పించుకుంది. దీంతో పాటు ఈ ఆర్థిక సంవత్సరం జీడీపీ వృద్ధిరేటు లక్ష్యాన్ని కుదించి 6.7 శాతానికి సవరించింది. కాగా సెంట్రల్ బ్యాంకు లేదా



ఆర్‌బీఐ చివరగా వడ్డీరేట్లను ఆగస్టులో 0.25 శాతం తగ్గించి 6 శాతానికి సవరించింది. దీంతో వడ్డీరేట్లు ఆరు సంవత్సరాల కనిష్ఠానికి దిగివచ్చాయి.

బ్యాంకర్లతో పాటు బ్యాంకింగ్ రంగానికి చెందిన నిపుణులు కూడా ఆర్‌బీఐ రెండవ సారి వడ్డీరేట్ల పెంపుజోలికి పోతదని .. దీనికి ప్రధానకారణం రాబోయే నెలల్లో ద్రవ్యోల్బణం పెరగుతుందన్న కారణం చెబుతాయని వారు అంచనా వేస్తున్నారు. యూనియన్ బ్యాంకు ఆఫ్ ఇండియా ఎండీ, సీఈవో రాజ్‌కిరణ్ రాయ్ జి మాట్లాడుతూ వడ్డీరేట్లలో మార్పు ఉండదని,.. బ్యాంకింగ్ వ్యవస్థలో ద్రవ్యం చాలా తక్కువగా ఉందన్నారు. డిపాజిట్ రేట్లు కూడా క్రమంగా పెరుగుతున్నాయని.. దీంతో పాటు క్రమంగా ద్రవ్యోల్బణం కూడా పెరుగుతోందన్నారు. గ్లోబల్ ఫైనాన్షియల్ సర్వీసెస్ దిగ్గజం నోమురా స్పందిస్తూ.. జీఎస్టి రేట్లు తగ్గించడం వల్ల ఔట్‌పుట్ ధరలు స్వల్పంగా పెరిగాయి. ఇన్‌పుట్ వ్యయం ఒత్తిడి కూడా క్రమంగా పెరుగుతోందన్నారు. దీని ప్రభావం ఆహారద్రవ్యోల్బణంపై పడి రిటైల్ ద్రవ్యోల్బణం పెరుగుతుం దని, నవంబర్ నెల రిటైల్ ద్రవ్యోల్బణం ఆర్‌బీఐ అంచనా 4 శాతం కంటే మించిపోతుందని తెలిపింది. తమ అంచనా ప్రకారం ఆర్‌బీఐ వచ్చే ఏడాది 2018 మొత్తానికి వడ్డీరేట్ల పెంపుజోలికి పోవని తాజా నివేదికలో వివరించింది. టోకు ధరల ఆధారిత ద్రవ్యోల్బణం అక్టోబర్ లో ఆరు నెలల గరిష్ఠా నికి 3.59 శాతానికి ఎగబాకిందని,, అదే రిటైల్ ద్రవ్యోల్బణం ఏడు నెలల గరిష్ఠానికి అక్టోబర్‌లో 3.58 శాతానికి చేరిందని గుర్తు చేసింది.

ఇదిలా ఉండగా ఫిక్కీ మాత్రం ... ప్రస్తుతం వడ్డీరేట్లు తగ్గించడానికి పరిస్థితులు అనుకూలంగా ఉన్నాయని.. ఈజ్ ఆఫ్ డూయింగ్ బిజినెస్‌లో భారత్ మంచి ర్యాంకును సాధించింది. మూడీస్ భారత్ రేటింగ్‌ను అప్‌గ్రేడ్ చేసింది. ప్రభుత్వం బ్యాంకులకు మూలధనం సమకూరుస్తా మని ప్రకటించాయని గుర్తు చేసింది. ఆర్థిక వ్యవస్థను బలోపేతం చేయడానికి ఆర్‌బీఐ వడ్డీరేట్లు తగ్గించడానికి ఇదే సరైన సమయమని ఫిక్కీ ప్రెసిడెంట్ పంకజ్ పటేల్ ఒక ప్రకటనలో తెలిపారు. వరుసగా గత ఐదు త్రైమాసికాల నుంచి తిరోగ మనబాట పట్టిన భారత ఆర్థిక వ్యవస్థ క్యూ2లో కోలుకొని 6.3 శాతానికి ఎగబాకిందని, తయారీరంగం గాడిన పడ్డంతో పాటు కొత్తగా అమల్లోకి తెచ్చిన జీఎస్టి సమస్యలనుంచి క్రమంగా గట్టెక్కుతున్నామని పటేల్ చెప్పారు. క్రెడిట్ రేటింగ్‌ఏజెన్సీ ఇక్రా మాత్రం ఆర్‌బీఐ వడ్డీరేట్లలో ఎలాంటి మార్పు చేయదని యధాతథంగా ఆరు శాతానికి పరిమితం చేస్తుందని అంచనా వేస్తుంది.. దీనికి ప్రధాన కారణం రిటైల్ ద్రవ్యోల్బణం తిరిగి పుంజుకుంటోందని గుర్తు చేస్తోంది.

## ఆర్‌బీఐ సమీక్ష కీలకం

### ఈ వారం మార్కెట్...

**ముంబై :** ఈ వారం స్టాక్ మార్కెట్లకు కీలకం కాబోతున్న అంశాల విషయానికి వస్తే రిజర్వుబ్యాంకు ద్వైమాసిక ద్రవ్యపరపతి సమీక్ష ప్రధానంగా చెప్పుకోవచ్చు. ఎందుకంటే సెప్టెంబర్‌తో ముగిసిన త్రైమాసానికి జీడీపీ గణాంకాలు మార్కెట్లను ఉత్సాహపర్చలేకపోయాయని మార్కెట్ నిపుణులు అభిప్రాయపడుతున్నారు. కాగా సెంట్రల్ బ్యాంకు లేదా ఆర్‌బీఐ ఐదవ ద్వైమాసిక విధాన సమీక్ష డిసెంబర్ 6న జరగనుంది. ఈ సమీక్షా సమావేశంలో ఆర్‌బీఐ కీలక వడ్డీరేట్లను యధావిధిగా కొనసాగించే అవకాశాలున్నాయని మార్కెట్ నిపుణులు అభిప్రాయపడుతు న్నారు. దీంతో పాటు గుజరాత్, హిమాచల్ ప్రదేశ్‌లో జరుగనున్న శాసనసభ ఎన్నికలు కూడా ఇన్వెస్టర్ల సెంటిమెంట్‌పై ప్రభావం చూపుతుందని చెబుతున్నారు. గుజరాత్ ఎన్నిలకపై ఇన్వెస్టర్లు ఆసక్తి చూపుతున్నారు. ఎందుకంటే ప్రధానమంత్రి నరేంద్రమోడీ సొంతరాష్ట్రం గనుక. కాగా గుజరాత్ ఎన్నికలు ఈ నెల 9-14 తేదీల్లో జరగనున్నాయి. ఇక గత ఐదు త్రైమాసికాల నుంచి రివర్స్‌గేర్‌లో పయనించిన జీడీపీ వృద్ధిరేటు ఈ ఆర్థికసంవత్సరం రెండవ త్రైమాసికానికి వృద్ధిరేటు 6.3 శాతానికి ఎగబాకింది. తయారీ రంగం పుంజుకోవడంతో పాటు కొత్తగా అమల్లోకి వచ్చిన జీఎస్టి కష్టాలు క్రమంగా తగ్గముఖం పట్టడమేనని దీనికి కారణమని నిపుణులు చెబుతున్నారు. కాగా అంతకు ముందు అంటే జూన్ త్రైమాసికంలో 5.7శాతంగా నమోదైంది. మోడీ ప్రభుత్వం పగ్గాలు చేపట్టిన తర్వాత అతి తక్కువ వృద్ధిరేట ఇదే. కాగా 2016-17 ఆర్థికసంవత్సరం రెండవ త్రైమాసికంలో వృద్ధిరేటు 7.5 శాతంగా ఉంది. క్యూ2 జీడీపీ గణాంకాలను బట్టి చూస్తే పెద్దనోట్ల రద్దుతో పాటు జీఎస్టి అమల్లోకి వచ్చిన తర్వాత ఆర్థిక వ్యవస్థ పట్టాలు తప్పింది. ప్రస్తుతం తిరిగి గాడిలో పడుతోంది. ఇక నుంచి వృద్ధిరేటు క్రమంగా పుంజకుం టుందని నిపుణులు చెబుతున్నారు. అయితే మధ్యకాలికానికి మాత్రం ఇన్వెస్టర్లు జాగ్రత్తగా ఉండాలని సూచిస్తున్నారు. పెరుగుతున్న ముడిచమురు ధరలతో పాటు ద్రవ్యోలోటు కూడా అంచనాలను మించిపోతోందని వారు గుర్తు చేస్తున్నారు. దీంతో పాటు ఒక వేళ యూఎస్ ఫెడ్ రిజర్వువడ్డీరేట్లు పెంచితే మాత్రం మార్కెట్ సెంటిమెంట్ బాగా దెబ్బతింటుందని హెచ్చరిస్తున్నారు. గత వారం బీఎస్ఈ ఏకంగా 846.30 పాయింట్లు, నిఫ్టీ 267.90 పాయింట్లు క్షీణించాయి.



కాంగ్రెస్ పార్టీ చరిత్రలో మరో అధ్యాయం ప్రారంభం కాబోతున్నది. నెహ్రూ-గాంధీ కుటుంబం నుంచి నాలుగో తరానికి చెందిన నాయకుడిగా రాహుల్ గాంధీ పార్టీ పగ్గాలు స్వీకరించే ఘడియలు సమీపిస్తున్నాయి. స్వాంత్ర్యానంతరం భారత జాతీయ కాంగ్రెస్‌కు 17వ అధ్యక్షుడిగా ఎన్నిక కానున్నారు. పార్టీ అధ్యక్ష బాధ్యతల నుంచి సోనియా వైదొలగనున్న క్రమంలో వారసుడి ఎంపికకు ఎన్నిక ప్రక్రియ మొదలైంది. అధ్యక్ష పదవికి నేడు రాహుల్ నామినేషన్ దాఖలు చేయనున్నారు. ఎన్నికల తంతు ముగిసి, యువరాజు పట్టాభిక్తుడు కావడం ఖాయమని కాంగ్రెస్ వర్గాలు స్పష్టం చేస్తున్నాయి. ఇదే జరిగితే భారత రాజకీల్లో చారిత్రక నేపథ్యం కలిగిన కాంగ్రెస్ పార్టీకి అధ్యక్షుడైన యువ నాయకుడిగా రాహుల్ గాంధీ చెరగని ముద్ర వేసినట్లు అవుతుంది. తన తండ్రి రాజీవ్ గాంధీ తర్వాత పార్టీకి యువసత్వాలు చేకూర్చే మహత్తర అవకాశం కూడా రాహుల్‌కే దక్కుతుంది.



**జననం:** 19 జూన్ 1970 - ఢిల్లీ
**తల్లిదండ్రులు:** రాజీవ్‌గాంధీ, సోనియా గాంధీ
**విద్యాభ్యాసం:** కొలంబియాస్కూల్ (ఢిల్లీ), డూన్ స్కూల్ (డెహ్రాడూన్). సెయింట్ స్టీఫెన్స్ కాలేజీ (ఢిల్లీ), హార్వర్డ్ వర్సిటీలో ఎం.ఎ. ట్రినిటి కాలేజీ, కేంబ్రిడ్జిలో ఎం.ఫిల్ (1995)

# భారత జాతీయ కాంగ్రెస్‌కు యువ సారథి!

### పార్టీ అధ్యక్ష పదవికి నేడు రాహుల్ నామినేషన్.. ఎన్నిక లాంఛనమే!

## బయోడేటా...

**క్రీడలు :** ఫ్లయింగ్, రైఫిల్ షూటింగ్, స్క్వాష్, స్విమ్మింగ్, స్కూబా డైవింగ్.
**వృత్తి నేపథ్యం:** గ్రాడ్యుయేషన్ పూర్తయిన తర్వాత, లండన్‌లోని మేనేజ్‌మెంట్ కన్సల్టేషన్ సంస్థ మోనిటర్ గ్రూప్‌లో పనిచేశారు. 2002లో ముంబైలోని టెక్నాలజీ ఔట్ సోర్సింగ్ కంపెనీ బ్యాకప్స్ సర్వీసెస్ ప్రైవేట్ లిమిటెడ్ డైరెక్టర్లలో ఒకడిగా ఉన్నారు.
**రాజకీయ నేపథ్యం:** ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ ఉపాధ్యక్షుడిగా, ఇండియన్ యూత్ కాంగ్రెస్, నేషనల్ స్టూడెంట్స్ యూనియన్ ఆఫ్ ఇండియాకు చైర్‌పర్సన్‌గా బాధ్యతలు. యూత్ కాంగ్రెస్ విస్తరణలో కీలకపాత్ర. 2013లో పార్టీ ఉపాధ్యక్షుడిగా నియామకం. పార్లమెంటు సభ్యుడిగా: 2004, 09, 14లో అమేథీ లోక్‌సభ స్థానం నుంచి పోటీ.. విజయం.



భారత రాజకీయ చరిత్రలో నెహ్రూ-గాంధీ కుటుంబంలోని నాలుగోతరానికి చెందిన వ్యక్తి రాహుల్ గాంధీ. ప్రస్తుతం కాంగ్రెస్ పార్టీకి జాతీయ ఉపాధ్యక్షుడిగా ఉన్నారు. యూత్ కాంగ్రెస్, నేషనల్ స్టూడెంట్స్ యూనియన్ చైర్‌పర్సన్‌గా కూడా వ్యవహరిస్తున్నారు. రేపో, మాపో పార్టీ అధ్యక్షపగ్గాలు స్వీకరించబోతున్నారు. ఇంతకుమునుపు ఈయన అఖిల భారత కాంగ్రెస్ కమిటీకి ప్రధాన కార్యదర్శిగా కూడా విధులు నిర్వర్తించారు. ప్రస్తుతం అమేథీ లోక్‌సభ స్థానం నుంచి పార్లమెంటుకు ప్రాతినిధ్యం వహిస్తున్నారు. పార్టీ పదవుల కోణంలో చూస్తే, రాహుల్ నెంబర్ టూ స్థానంలో ఉన్నారు. కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యుడిగా కూడా కొనసాగుతున్నారు. భారత రాజకీయ చరిత్రలో, కీలక నేపథ్యం కలిగిన కుటుంబ వారసత్వం రాహుల్ గాంధీకి బలీయమైన నేపథ్యం. ఆయన ముత్తాత పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ స్వతంత్ర భారత్‌కు తొలి ప్రధాని. అలాగే రాహుల్ నానమ్మ ఇందిరా గాంధీ మొదటి, ఏకైక మహిళా ప్రధానిగా చరిత్ర కెక్కారు. శక్తివంతమైన, ప్రభావిత మహిళగా ఇందిర ప్రపంచ గుర్తింపు పొందారు. అదేవిధంగా రాహుల్ తండ్రి రాజీవ్‌గాంధి కాంగ్రెస్ పార్టీ జాతీయ అధ్యక్షుడిగా, ప్రధానమంత్రిగా సేవలు అందించారు. ఆయన తల్లి సోనియా గాంధీ ప్రస్తుతం జాతీయ కాంగ్రెస్ అధ్యక్షురాలిగా ఉన్నారు. త్వరలో పార్టీ పగ్గాలు చేపట్టనున్న రాహుల్, కాంగ్రెస్‌కు మరో యువనేతగా, భవిష్యత్ ఆశాకిరణంగా అవతరించనున్నారు.



గాంధీ కుటుంబం వారసుడిగా రాహుల్ 19 జూన్ 1970న ఢిల్లీలో జన్మించారు. దివంగత, మాజీ ప్రధానమంత్రి రాజీవ్ గాంధీకి ప్రథమ సంతానం. ఈయన తల్లి సోనియా ఇటలీకి చెందిన వ్యక్తి అయినప్పటికీ, ఆ తర్వాత భారత పౌరసత్వం పొందారు. రాహుల్ బాల్యం దేశ రాజధానిలోనే గడిచింది. ప్రాథమిక విద్యాభ్యాసం ఢిల్లీలోని సెయింట్ కొలంబియా స్కూల్‌లో ప్రారంభమైంది. ఆ తర్వాత 1981-83లో డెహ్రాడూన్‌లోని డూన్ స్కూల్‌లో విద్యను అభ్యసించాడు. అనూహ్య సంఘటనలు కొన్ని రాహుల్ గాంధీపైనా, ఆయన కుటుంబంపైనా తీవ్ర ప్రభావం చూపింది. 1984 అక్టోబర్ 31న ఇందిరాగాంధీ హత్య.. ఆ తర్వాత

## బాల్యం... విద్యాభ్యాసం...

రాజీవ్‌గాంధీ రాజకీయ ప్రవేశం.. ప్రధానిగా ఎన్నిక.. వంటి పరిణామాలు వారి కుటుంబాన్ని ప్రభావితం చేశాయి. సిక్కు కమ్యూనిటీకి చెందిన అతివాదుల నుంచి బెదిరింపు హెచ్చరికలు రావడంతో, భద్రతాపరమైన ఆందోళనలు ఎదురయ్యాయి. సోనియా, రాజీవ్‌తోపాటు పిల్లలుగా ఉన్న రాహుల్, ప్రియాంక ప్రాణాలకు ముప్పు ఏర్పడింది. దీంతో వీళ్లిద్దరు కొంతకాలం ఇంటివద్దే విద్యాభ్యాసం చేయాల్సి వచ్చింది.

1989లో రాహుల్ ఢిల్లీలోని సెయింట్ స్టీఫెన్స్ కాలేజీలో చేరారు. అయితే మొదటి సంవత్సరం ముగిసిన తర్వాత, హార్వర్డ్ యూనివర్సిటీకి మారాల్సి వచ్చింది. రెండేళ్ల తర్వాత అంటే 1991లో దురదృష్టవశాత్తు రాజీవ్ గాంధీ హత్యకు గురయ్యాడు. ఎల్టీటీఈ ఆత్మాహుతి దాడికి బలయ్యారు. ఈ క్రమంలోభద్రతా కారణాల రీత్యా హార్వర్డ్ నుంచి ఫ్లోరిడాలోని రొలిన్స్ కాలేజీకి రాహుల్ మకాం మార్చాల్సి వచ్చింది. 1994లో అక్కడ గ్రాడ్యుయేషన్ పూర్తిచేశారు. అప్పటి వరకు రాహుల్ గాంధీ ఎవరన్న విషయం సెక్యూరిటీ సిబ్బందికి, యూనివర్సిటీ ఉన్నతాధికారులకు మాత్రమే తెలిసేది. 1995లో ట్రినిటీ కాలేజీ ఆఫ్ కేంబ్రిడ్జ్ నుంచి ఎంఫిల్ పూర్తిచేశారు. 2004లో మొదటిసారి తన ప్రేమాయణం గురించి యువరాజు పెదవి విప్పారు. తనకు స్పానిష్ ప్రియురాలు ఉందని, ఆమెపేరు వెరొనిక్ కర్టెల్లి అని చెప్పారు. వెనిజులాలో నివశిస్తున్న ఆమె ఆర్కిటెక్ట్ అని తెలిపారు. మళ్లీ ఆ తర్వాత ఎప్పుడూ ఈ ప్రస్తావన చేయలేదు.

## రాజకీయ ప్రస్థానం...



2014 మార్చిలో రాహుల్ తన రాజకీయ రంగప్రవేశంపై ప్రకటన చేశారు. అదే యేడాది మేలో జరిగిన సార్వత్రిక ఎన్నికల్లో యూపీలోని అమేథీ నియోజకవర్గం నుంచి పోటీచేసి గెలుపొందారు. ఒకప్పుడు ఆయన తండ్రి రాజీవ్ గాంధీ ఈ స్థానానికి ప్రాతినిధ్యం వహించారు. ఆ తర్వాత అక్కడ సోనియా పాగా వేశారు. కొడుకు కోసం అమేథీ నుంచి పొరుగునే ఉన్న రాయ్‌బరేలీకి చేరుకున్నారు. ఆ సమయంలో యూపీలో గడ్డుపరిస్థితిని ఎదుర్కొంటున్న కాంగ్రెస్ 80 లోక్‌సభస్థానాలకు గాను పదింటిని మాత్రమే నెగ్గింది. కాంగ్రెస్ పెద్దలు, భాగస్వామ్య పార్టీలు రాహుల్ కంటే ప్రియాంకవైపే మొగ్గుచూపాయి. ఇందిరా గాంధీ చరిష్మా ప్రియాంకకు మాత్రమే ఉందని, జనాకర్షక నాయకురాలిగా ఎదిగే సమర్థత ఉందని పేర్కొన్నాయి. అయితే, సోనియా మాత్రం ఆమెను ప్రత్యక్ష రాజకీయాలకు దూరంగా ఉంచారు. రాహుల్ ఎంట్రీతో నెహ్రూ-గాంధీ కుటుంబం నుంచి యువతరం భారతీయ రాజకీయాలకు పరిచయమైంది.

## 2014 టఫ్ వార్...

ప్రధానమంత్రి అభ్యర్థిగా కాంగ్రెస్ పార్టీ రాహుల్‌ను ప్రకటించింది. దీంతో 2014 సార్వత్రిక ఎన్నికలు అటు కాంగ్రెస్‌కు, ఇటు రాహుల్ గాంధీకి ప్రతిష్టాత్మకం అయ్యాయి. అమేథీ నుంచి ముచ్చటగా మూడోసారి రాహుల్ బరిలోకిదిగారు. ఆమ్ ఆద్మీ పార్టీకి చెందిన కుమార్ విశ్వాస్, బీజేపీ నుంచి స్మృతి ఇరానీ నుంచి గట్టిపోటీ ఎదురైంది. అయినప్పటికీ 1,07,903 ఓట్ల ఆధిక్యంతో కాంగ్రెస్ ఉపాధ్యక్షుడు ఘన విజయం సాధించారు. అయితే, ఈ ఎన్నికల్లో దేశవ్యాప్తంగా వెల్లడైన ఫలితాలు కాంగ్రెస్‌కు చేదు అనుభవాన్ని మిగిల్చాయి. చరిత్రలో ఎన్నడూ లేనంతగా అతి తక్కువ సీట్లకు పరిమితం అయింది. కానీ,అమేథీ విజయం వ్యక్తిగతంగా రాహుల్ భవితవ్యానికి అండనిచ్చింది. 40 ఏళ్లుగా అమేథీ ప్రజలు గాంధీ కుటుంబం పట్ల విధేయతను చూపుతున్నా, రాహుల్ మాత్రం ఇక్కడి ప్రజలకు చేసిందేమీ లేదని, అభివృద్ధిని విస్మరించారని అటు ప్రతిపక్షాలు, ఇటు మీడియా కోడై కూశాయి. అయినా ప్రజలు మాత్రం తమ విశ్వాసాన్ని మరోమారు చాటుకున్నారు.

### స్వాతంత్ర్య అనంతరం...

## జాతీయ కాంగ్రెస్ అధ్యక్షులు

మొదటి అధ్యక్షుడు ఉమేష్ చందర్ బెనర్జీ

మొదటి మహిళా అధ్యక్షురాలు సరోజినీ నాయుడు

| సంవత్సరం | అధ్యక్షులు |
|---|---|
| 1947 | జె.బి. కృపాలని |
| 1948 | పి. సీతారామయ్య |
| 1949 | |
| 1950 | పి.డి. టండన్ |
| 1951 | జవహర్‌లాల్ నెహ్రూ |
| 1952 | |
| 1953 | |
| 1954 | |
| 1955 | యు.ఎన్. ధేబార్ |
| 1956 | |
| 1957 | |
| 1958 | |
| 1959 | ఇందిరా గాంధీ |
| 1960 | నీలం సంజీవ రెడ్డి |
| 1961 | |
| 1962 | |
| 1963 | |
| 1964 | కె. కామరాజ్ |
| 1965 | |
| 1966 | |
| 1967 | |
| 1968 | ఎస్. నిజలింగప్ప |
| 1969 | |
| 1970 | జగ్జీవన్ రామ్ |
| 1971 | |
| 1972 | ఎస్.డి. శర్మ |
| 1973 | |
| 1974 | |
| 1975 | డి.కె. బర్వా |
| 1976 | |
| 1977 | |
| 1978 | ఇందిరా గాంధీ |
| 1979 | |
| 1980 | |
| 1981 | |
| 1982 | |
| 1983 | |
| 1984 | |
| 1985 | రాజీవ్ గాంధీ |
| 1986 | |
| 1987 | |
| 1988 | |
| 1989 | |
| 1990 | |
| 1991 | |
| 1992 | పి.వి. నర్సింహా రావు |
| 1993 | |
| 1994 | |
| 1995 | |
| 1996 | సీతారాం కేసరి |
| 1997 | |
| 1998-2017 | సోనియా గాంధీ |



అలనాటి ప్రియురాలు వెరొనిక్‌తో రాహుల్ (ఫైల్ ఫోటో)

## వృత్తి నేపథ్యం...

గ్రాడ్యుయేషన్ తర్వాత లండన్‌లోని మోనిటర్ గ్రూపు సంస్థలో మూడేళ్ల పాటు పనిచేశారు. మేనేజ్‌మెంట్ గురు మైఖేల్ పోర్టర్స్ కన్సల్టింగ్ సంస్థలో మెళకువలు నేర్చుకున్నాడు. 2002 చివరలో తిరిగి భారత్‌కు వచ్చిన తర్వాత, ముంబయికి చెందిన టెక్నాలజీ ఔట్‌సోర్సింగ్ కంపెనీ అయిన బ్యాకప్స్ సర్వీసెస్ ప్రైవేట్ లిమిటెడ్‌కు డైరెక్టర్‌గా బాధ్యతలు చేపట్టారు.

## రాజకీయ ప్రస్థానంలో కీలక ఘట్టాలు...



- 2004లో ఉత్తరప్రదేశ్‌లోని అమేథి లోక్‌సభ నియోజకవర్గం నుంచి తొలిసారి పార్లమెంటుకు ఎన్నిక.
- 2006లో సోదరి ప్రియాంకతో కలిసి రాయ్‌బరేలి నియోజకవర్గంలో సోనియా తరపున ప్రచారం.
- 2007 ఉత్తరప్రదేశ్ అసెంబ్లీ ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ ప్రచారసారధిగా బాధ్యతలు. సెప్టెంబర్‌లో యూత్ కాంగ్రెస్, నేషనల్ స్టూడెంట్స్ యూనియన్ (ఎన్‌ఎస్‌యూఐ)కి ప్రధాన కార్యదర్శిగా నియామకం. రాహుల్ నేతృత్వంలో రెండు లక్షల నుంచి 25 లక్షల చేరిన సభ్యత్వాలు.
- రాజకీయాల్లో యువతకు ప్రాధాన్యమిచ్చేందుకు కృషి. 2008లో ఢిల్లీలోని తన నివాసంలో యువ నేతలకు ఇంటర్వ్యూలు. యూత్ కాంగ్రెస్ మేధావుల బృందంలోకి 40 మంది ఎంపిక.
- 2009లోక్‌సభ ఎన్నికల్లో తిరిగి అమేథీ నుంచి విజయం. ఆరు వారాలపాటు దేశవ్యాప్తంగా సుడిగాలి ప్రచారం. దాదాపు 125 ఎన్నికల ప్రచార సభల్లో పాల్గొని ప్రసంగించారు.
- జాతీయ రహదారి ప్రాజెక్టుల్లో నిర్వాసితులైన రైతుల తరపున పోరాటం చేసినందుకు ఆయనను ఉత్తరప్రదేశ్ పోలీసులు 11 మే 2011న భట్టపర్సాల్ గ్రామం వద్ద అరెస్టు చేశారు.
- 2012 ఉత్తరప్రదేశ్ అసెంబ్లీ ఎన్నికల్లో సుమారు రెండు నెలలపాటు ప్రచారం. 200 ర్యాలీలు నిర్వహించారు. ఆనాటి ఎన్నికల్లో కేవలం 28 సీట్లకే కాంగ్రెస్ పరిమితం అయింది. 2007 ఎన్నికలతో పోల్చుకుంటే ఆరు సీట్లు అదనంగా సాధించి, నాలుగో స్థానంలో నిలిచింది.
- 14ఏళ్ల సుదీర్ఘ విరామం తర్వాత ఇండియా-పాకిస్తాన్ జట్ల మధ్య జరిగిన క్రికెట్ మ్యాచ్‌ను వీక్షించేందుకు తన సోదరి ప్రియాంకతో కలిసి రాహుల్ గాంధీ పాకిస్తాన్ వెళ్లారు.
- 19 జనవరి 2013న జైపూర్‌లో జరిగిన కాంగ్రెస్ పార్టీ సదస్సులో కాంగ్రెస్ పార్టీ ఉపాధ్యక్షుడిగా రాహుల్ ఎంపికయ్యారు. పార్టీలో నెంబర్ టూగా నిలిచారు.
- 27 సెప్టెంబర్ 2013న నాటి పధాని మన్మోహన్ సింగ్‌కు, యూపీఏ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సంచలన వ్యాఖ్యలు. నేర చరిత నేతలను ఎన్నికల్లో పాల్గొనకూడదన్న సుప్రీం ఆదేశాలకు విరుద్ధంగా ఆర్డినెన్స్ తీసుకురావడాన్ని యువనేత ఆక్షేపించారు.
- 2014లో మూడోసారి అమేథీ నుంచి పార్లమెంటుకు ఎన్నిక. ఈ ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీకి ఘోరప్రభావం ఎదురైంది.



మృతదేహాన్ని వెలికి తీస్తున్న పోలీసులు, వైద్యులు



హత్య చేసిన ప్రేమికుడు సిద్ధు

# గర్భిణీ హత్య!

(మొదటిపేజీ తరువాయి)

ఫిర్యాదు చేసుకున్నారు. దీంతో ఇరువురిని పోలీసులు మందలించి పంపించారు. కాగా గత నెల 20న మండల పరిధిలోని ఎర్రగుంట్ల గ్రామ సమీపంలో రమిజాను హత్య చేసి పూడ్చిపెట్టిన విషయం ఆలస్యంగా వెలుగులోకి వచ్చింది. గతనెల 27న రమిజా తల్లి లక్ష్మీదేవి అర్బన్ పోలీసు స్టేషన్‌లో ఫిర్యాదు చేయగా పోలీసులు మిస్సింగ్ కేసు నమోదు చేసి దర్యాప్తు చేపట్టగా రమిజాకు చిన్న అనే వ్యక్తితో వివాహం జరిగిందని, వారికి ఒక కుమారుడు జన్మించాడని తెలిసింది. అయితే వారిరువురి మధ్య మనస్పర్థలు రావడంతో విడాకులు పొంది ఎవరికి వారే జీవనం సాగిస్తున్నారని,. ఈ నేపథ్యంలో సిద్దు అనే యువకుడితో ప్రేమవ్యవహారం కొనసాగించి, చివరకు హత్యకు గురైందని పోలీసులు తెలిపారు. సమాచారం తెలుసుకున్న సీఐ శ్రీనివాసులు, ఎస్సై వి.శ్రీనివాసులు, ఏఎస్సై గోపాల్, పోలీసులు రామాంజనేయులు, నాగన్న, ఆర్ఐ వెంకటేశ్వర్లు, డాక్టర్ బాల చంద్రారెడ్డి, సుంకన్న, వీఆర్వో రామాంజనేయులు తదితరులు హత్య జరిగిన స్థలానికి చేరుకొని పూడ్చిన రమిజా మృతదేహాన్ని వెలికితీసి పోస్టుమార్టం చేసి అనంతరం ఆ ప్రాంతంలో ఖననం చేశారు.

- మాన రక్షణ కోసం వాహనం నుంచి దూకేసి ప్రాణం తీసుకుంది

# కదులుతున్న డీసీఎంలో గర్భవతిపై లైంగిక దాడి

**హైదరాబాద్, ఆంధ్రప్రభ :** డీసీఎం వ్యానులో ప్రయాణిస్తున్న గర్భవతిపై ఇద్దరు వ్యక్తులు అత్యాచారానికి యత్నించడంతో వారి నుంచి తప్పించుకునేందుకు కిందకు దూకిన మహిళ మృతి చెందిన ఘటన ఇది. తూప్రాన్ మండలం రావెల్లి శివారులోని 44వ జాతీయ రహదారిపై జరిగిన ఈ ఘటన ఆలస్యంగా వెలుగులోకి వచ్చింది. మెదక్ జిల్లా తుప్రాన్ మండలం రాంవెల్లి పంచా యతీలోని పోతురాజు పల్లికి చెందిన రేగొండ, కళావతి(35) దంపతులు పాత బట్టల వ్యాపారం చేస్తూ జీవనం కొనసాగిస్తున్నారు. శనివారం పాతబట్టలు విక్రయించేందుకు కళావతి మేడ్చల్ జిల్లా కొంపల్లికి తన కుమార్తె శిరీషతో కలిసి వెళ్లింది. వ్యాపారం ముగించుకుని శనివారం రాత్రి తూప్రాన్‌వైపు వెళుతున్న డీసీఎం వ్యాన్ ఎక్కింది. ఈ క్రమంలో డీసీఎంలోని ఇద్దరు వ్యక్తులు కళావతిపట్ల అసభ్యంగా ప్రవర్తించడమే కాకుండా అత్యాచారానికి యత్నించారు. కళావతి దిగాల్సిన ప్రాంతంలో డీసీఎం వ్యాను ఆపకుండా వెళ్తుండటంతో భయాందోళనలకు లోనైన ఆమె వారి నుంచి తప్పించుకునేందుకు కదులుతున్న వ్యాను నుంచి బయటకు దూకింది. వ్యానులో ఉన్న వ్యక్తులు అరకిలోమీటరు దూరం వెళ్లిన తర్వాత కళావతి కూతురు శిరీషను దింపి వెళ్లిపోయారు. శిరీష తిరిగి తన తల్లి దగ్గరకు వచ్చేసరికి అపస్మారక స్థితిలో పడి ఉంది. దీంతో శిరీష సమీపంలోని డాబా వద్దకు వెళ్లి జరిగిన విషయం చెప్పింది. అక్కడికి చేరుకున్న స్థానికులు పోలీసులకు సమాచారం అందించారు. అప్పటికే కళావతి మృతి చెందింది. ఆమెకు నలుగురు పిల్లలు ఉన్నారు. మృతురాలు ప్రస్తుతం ఏడు నెలల గర్భవతి.

# బియ్యం వద్దంటే.. చిరుధాన్యాలు

(మొదటిపేజీ తరువాయి)

ఇతర ప్రయోజనాల నిమిత్తం వాడుకునే సౌలభ్యాన్ని కలిగిస్తూ నిర్ణయం తీసుకుంది. దీంతో ఎన్టీఆర్ వైద్య సేవలు, ఆదాయ ధృవీకరణకు వినియోగించుకునే వెసులుబాటు కలగనుంది. రాష్ట్రవ్యాప్తంగా ఇప్పటి వరకు 1.42 కోట్ల తెల్ల రేషన్ కార్డులు ఉండగా వాటి స్థానంలో కొత్త కార్డులను జారీ చేయాలని ప్రభుత్వం నిర్ణయించింది. గతంలో జారీ చేసిన రేషన్ కార్డులపై మాజీ ముఖ్యమంత్రులు రోశయ్య, కిరణ్ కుమార్ రెడ్డిల ఫోటోలు ఉన్నాయి. తాజాగా జారీ చేసే కార్డులపై ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు ఫోటోను ముద్రించనున్నారు. ఇప్పటికే కొత్త రేషన్ కార్డుల ముద్రణ బాధ్యతను ఒక సంస్థకు ప్రభుత్వం అప్పగించింది. ముద్రణ సకాలంలో పూర్తయితే జనవరిలో జరుగనున్న జన్మభూమి గ్రామ సభల్లో ఈ కొత్త రేషన్ కార్డులను పంపిణీ చేసే అవకాశాలున్నాయి. అంతే కాకుండా ఇప్పటి వరకు రాష్ట్ర వ్యాప్తంగా రేషన్‌కార్డు కోసం దరఖాస్తు చేసుకున్న వారిలో అర్హులను గుర్తించి జన్మభూమి గ్రామ సభల్లో పంపిణీ చేయనున్నారు. సుమారు 3 లక్షల తెల్లకార్డులు మంజూరు చేసే అవకాశాలు ఉన్నట్లు అధికార వర్గాలు చెబుతున్నాయి. ఇది ఇలా ఉంటే కేంద్ర ప్రభుత్వం ఈ ఏడాది ఏప్రిల్‌లో రేషన్ దుకాణాల ద్వారా పంపిణీ చేస్తున్న పంచదారపై సబ్సిడీని నిలిపివేసింది. దీంతో రాష్ట్రవ్యాప్తంగా చక్కెర పంపిణీ నిలిచిపోయింది. అయితే ప్రజల నుంచి వస్తున్న విజ్ఞప్తులను పరిగణలోకి తీసుకున్న ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు రేషన్ దుకాణాల్లో యధావిధిగా పంచదారను పంపిణీ చేయాలని నిర్ణయం తీసుకున్నారు. దీంతో రానున్న జనవరి నుంచి అరకేజీ పంచదార పంపిణీ చేయనున్నారు. ఈ నిర్ణయం వల్ల ప్రభుత్వంపై ఏడాదికి రూ.196 కోట్ల అదనపు భారం పడనుందని అధికారులు చెబుతున్నారు. అదే విధంగా కేజీ ఒక్క రూపాయికే పంపిణీ చేస్తున్న బియ్యం పక్కదారి పడుతుండడంతో దీనిని నివారించేందుకు ప్రత్యామ్నయాలపై ప్రభుత్వం దృష్టి సారించింది. బియ్యం వద్దనుకునే లబ్ధిదారుడికి ఆ విలువకు సరిపడా చిరుధాన్యాలను పంపిణీ చేయాలని నిర్ణయం తీసుకుంది. బియ్యం స్థానంలో రాగులు, సజ్జలు తదితర చిరుధాన్యాలను లబ్ధిదారుడికి అందించాలని భావిస్తున్నారు. బియ్యం సబ్సిడికి సంబంధించిన లెక్కలు తేల్చే పనిలో పౌరసరఫరాల శాఖ అధికారులు నిమగ్నమ య్యారు. మరో వారం పది రోజుల్లో బియ్యం ధరను ప్రభుత్వం ప్రకటించే అవకాశాలు ఉన్నాయి.

అలాగే ఈ-పోస్ విధానంలో ఉత్పన్నమవుతున్న సాంకేతిక సమస్యలను అధిగమించేందుకు చర్యలు చేపట్టింది. తరచు సర్వర్లు పనిచేయక లబ్ధిదారులు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. ఇదే విషయంలో పలు సందర్భాల్లో ప్రజాప్రతినిధులు సీఎం చంద్రబాబు దృష్టికి తీసుకువెళ్లారు. సర్వర్ల సామార్థ్యాన్ని పెంచడంతో పాటు, సాంకేతిక సమస్యలు ఉత్పన్నం కాకుండా తగిన చర్యలు తీసుకుంది. వేలి ముద్రలు పడకపోయినా ప్రత్యామ్నాయంగా బియ్యం ఇచ్చేందుకు చర్యలు తీసుకున్నారు. ఈ మార్పులతో రేషన్ పంపిణీ విధానంపై ప్రజలలో సంతృప్తి శాతాన్ని మరింత పెంపొందించే విధంగా ప్రభుత్వం చర్యలు చేపట్టింది.

# సుప్రీం సారీ!

(మొదటిపేజీ తరువాయి)

జస్టిస్ సంజయ్ కిషన్ కౌల్‌తో కూడిన ధర్మాసనం పేర్కొంది. మహిళ చేసుకున్న అప్పీళ్ళను అనుమతించింది.

ఉత్తరాఖండ్‌లో రూర్కీకి చెందిన శ్యామ్ లత హరిద్వార్ ఎస్ఎస్పీకి రాతపూర్వక ఫిర్యాదు చేశారు. తాను తన దుకాణాన్ని వారికి అద్దెకు ఇచ్చినట్టుగా పేర్కొంటూ తన ఇద్దరు సోదరులు పత్రాలు, సంతకాలను ఫోర్జరీ చేశారని ఆమె ఆరోపించారు. దాంతో మహిళ సంతకాలను ఫోర్జరీ చేసి ఒక అద్దె రసీదును తయారు చేసి దాని తాలూకు నకలును ఆమె ఇంటివద్ద వదిలి వెళ్ళారని ఆరోపిస్తూ ఆమె సోదరులపై ఒక క్రిమినల్ కేసు నమోదైంది.

మరోవైపు తనను దుకాణం నుంచి ఖాళీ చేయకుండా నిలువరించాలని అభ్యర్థిస్తూ ఆమె సోదరులు ఒక సివిల్ సూటు దాఖలు చేశారు.

ఫిర్యాదుపై పోలీసులు దర్యాప్తు చేపట్టారు. సంతకాలు సరిపోల్చడం కోసం సోదరుడు దాఖలు చేసిన అద్దె రసీదులను

ఒక నిపుణుడికి పంపించాలని అభ్యర్థిస్తూ దర్యాప్తు అధికారి(ఐవో) సివిల్ కోర్టుకు దరఖాస్తు చేసుకున్నారు.

అయితే అందుకు అనుమతి నిరాకరించిన సివిల్ కోర్టు.. ఒక చేతిరాత నిపుణుడు సంతకాన్ని ఫొటోలు తీసేందుకు అంగీకరించింది.

అయితే ఆగ్రాలో ఫొరెన్సిక్ ల్యాబరేటరీకి చెందిన ఒక నిపుణుడు ఫొటోలు తీయడం కోసం కోర్టుకు చేరుకోగా అందుకు అనుమతించడానికి కోర్టు నిరాకరించింది. ఫలితంగా సంతకాలు ఫోర్జరీకి గురయ్యాయని చెప్పడానికి ఎలాంటి ఆధారంలేదని పేర్కొంటూ తుది నివేదికను ఐవో సమర్పించారు.

ఐవో తుది నివేదికపై అభ్యంతరం లేవనెత్తిన సదరు మహిళ అదే సమయంలో ఒక చేతిరాత నిపుణుడు సంతకాన్ని ఫొటోలు తీయడానికి సివిల్ కోర్టు అనుమతి నిరాకరించడాన్ని సవాల్ చేస్తూ ఒక సెషన్స్ కోర్టును ఆశ్రయించింది. మహిళ చేసుకున్న అభ్యర్థనను అనుమతించిన సెషన్స్ కోర్టు యావత్ కేసు రికార్డును రూర్కీ జ్యుడీషియల్ మేజిస్ట్రేట్‌కు పంపించాలని ఆదేశించింది. తద్వారా అవసరమైన ఫొటోలు తీసుకోవచ్చు. అలాగే మున్ముందు దర్యాప్తు చేపట్టడం జరుగుతుందని పేర్కొంది.

సెషన్స్ కోర్టు ఇచ్చిన ఆదేశాన్ని ఆమె సోదరుడు హైకోర్టులో సవాల్ చేశారు. అదే సమయంలో ఐవో తుది నివేదికపై ఆమె లేవనెత్తిన అభ్యంతరాలను స్వీకరించిన జ్యుడీషియల్ మేజిస్ట్రేట్ మున్ముందు దర్యాప్తునకు ఆదేశించారు. జ్యుడీషియల్ మేజిస్ట్రేట్ ఇచ్చిన ఆదేశాన్ని సైతం ఆమె సోదరుడు ఉత్తరాఖండ్ హైకోర్టులో సవాల్ చేశారు.ప్రస్తుతం రెండు పిటిషన్లు హైకోర్టు ముందుకు వచ్చాయి. రెండింటిపైన వరుసగా విచారణ చేపట్టిన జడ్జీ 2006లో అదే తేదీన రెండు వేర్వేరు తీర్పులు వెలువరించారు.



ఒక తీర్పులో సెషన్స్ కోర్టు ఉత్తర్వును హైకోర్టు సవరించింది. అంతేకాక నిర్ధారించిన తేదీన వివాదాలతో పాటుగా మహిళ సంతకాన్ని ఫొటోలు తీసుకోవడానికి ఒక చేతిరాత నిపుణుడితో పాటుగా సివిల్ కోర్టు ఎదుట హాజరుకావాలని ఐవోను ఆదేశించింది. ఒక విధంగా చూస్తే ఈ తీర్పు పోలీసులు మున్ముందు దర్యాప్తు చేపట్టడానికి అనుమతించింది.

అయితే రెండవ తీర్పులో కేసులో మున్ముందు దర్యాప్తు చేపట్టాలంటూ పోలీసులను ఆదేశిస్తూ జ్యుడీషియల్ మేజిస్ట్రేట్ ఇచ్చిన ఆదేశాన్ని హైకోర్టు జడ్జీ తోసిపుచ్చారు. ఈ కేసును నిర్ణయిస్తున్న సందర్భంగా హైకోర్టు ఇచ్చిన పరస్పర విరుద్ధమైన ఆదేశాలు అయోమయాన్ని కలిగిస్తున్నాయనడంలో ఎలాంటి సందేహం లేదని సర్వోన్నత న్యాయస్థానం ధర్మాసనం పేర్కొంది. హైకోర్టు తన తొలి తీర్పులో సంతకాలకు సంబంధించిన ఫొటోలు తీయడానికి చేతిరాత నిపుణుడిని అనుమతించడం సహజ పర్యవసానమని, దానర్థం మున్ముందు దర్యాప్తు చేపట్టాలని ధర్మాసనం తెలిపింది. జ్యుడీషియల్ మేజిస్ట్రేట్ ఇచ్చిన ఉత్తర్వును తిరస్కరిస్తూ హైకోర్టు ఇచ్చిన రెండవ తీర్పు ఏ మాత్రం అవసరం లేదని సర్వోన్నత న్యాయస్థానం స్పష్టం చేసింది.

## రోడ్డు ప్రమాదాల నివారణకు

# రహదారి భద్రతా ప్రాజెక్టుపై కసరత్తు

**• నిపుణులతో ప్రభుత్వం సంప్రదింపులు • ప్రపంచ బ్యాంక్ నుంచి నిధుల సమీకరణ • సీఎం అధ్యక్షతన రహదారి భద్రతామండలి • సీఎస్ అధ్యక్షుడిగా లీడ్ ఏజెన్సీ • నోడల్ ఆఫీసర్లుగా 18 మంది డీఎస్పీలు • 2020 నాటికి 15 శాతం మరణాల తగ్గింపే లక్ష్యం • సమగ్ర రహదారి భద్రతకు ఆడిటింగ్**

**అమరావతి, ఆంధ్రప్రభ** : రాష్ట్రంలో జరుగుతున్న రోడ్డు ప్రమాదాల నివారణకు ప్రభుత్వం భారీగా కసరత్తు ప్రారంభించింది. ఇందుకోసం ఒక సమగ్ర రహదారి భద్రతా పథకాన్ని ప్రభుత్వం ప్రతిపాదించింది. రాష్ట్రంలో రోడ్డు ప్రమాదాల పెరుగుదలను దృష్టిలో ఉంచుకుని రోడ్డు భద్రతా నిపుణులతో సంప్రదింపులు జరిపి, రవాణా శాఖ ఒక సమగ్ర రోడ్డు భద్రతా ప్రాజెక్టును ప్రతిపాదించింది. ఈ ప్రాజెక్టులో మంచి డ్రైవర్లు, సురక్షితమైన వాహనాలు, మెరుగైన ట్రాఫిక్ నిర్వహణ, ప్రమాదానికి ప్రతిస్పందన, రహదారి పెట్రోల్ యూనిట్లను స్థాపించడం, రోడ్డు ఇంజనీరింగ్‌కు సంబంధించిన పనులు చేయడం, బ్లాక్‌స్పాట్స్ తొలగించడం, రహదారి భద్రతా పరికరాలను మెరుగుపర్చడం వంటి చర్యలు తీసుకోవాలని ప్రతిపాదించారు. ఇందుకోసం వేల కోట్లతో అంచనాలు రూపొందిస్తున్నారు. అయితే ఈ ప్రాజెక్టు కోసం ప్రపంచ బ్యాంక్ నుంచి నిధులను సేకరించాలని నిర్ణయించి, ఆమేరకు చర్యలు కూడా తీసుకున్నారు. ప్రస్తుతం ఇందుకు సంబంధించిన చర్చలు పురోగతిలో ఉన్నాయని అధికారులంటున్నారు. ఈ ప్రాజెక్టును చేపట్టడం ద్వారా రహదారి మరణాలను 2020 నాటికి 15 శాతం తగ్గించవచ్చని భావిస్తుంది. అదే విధంగా అన్ని ప్రభుత్వ, ప్రైవేట్ ట్రామా కేర్ సదుపాయాలను ట్రామా కేర్ సెంటర్లుగా ప్రకటించాలని కూడా నిర్ణయించారు. తగిన ప్రదేశాల్లో ప్రయాణీకుల ఉపయోగం కోసం బోర్డుల ద్వారా ట్రామా కేర్ సెంటర్ల సమాచారాన్ని తెలియజేసేలా చర్యలు తీసుకోవాలని ఇటీవల ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు అధికారులను ఆదేశించడం కూడా జరిగింది. రాష్ట్రంలో రహదారి ప్రమాదాలు నివారించడానికి పెద్ద ఎత్తున భద్రతా కార్యక్రమాలు, అవగాహన ప్రచార కార్యక్రమాలను నిర్వహించాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఈ కార్యక్రమాలను ముఖ్యమంత్రి స్వయంగా సమీక్షిస్తున్నారు. రహదారి భద్రతను మరింత మెరుగుపర్చేందుకు అన్ని సంబంధిత విభాగాలకు ముఖ్యమంత్రి నుంచి ఆదేశాలు వెళ్లాయి. జిల్లా స్థాయి రహదారి భద్రతా కమిటీలకు పునరుత్తేజం కల్పిస్తున్నారు. ఇక నుంచి ప్రతి నెలా సమావేశాన్ని తప్పకుండా నిర్వహించి, జిల్లాల్లో రహదారి భద్రతను మెరుగుపర్చేందుకు చర్యలు తీసు




కోవాలని తాజాగా ముఖ్యమంత్రి సంబంధిత అధికారులను ఆదేశించడంతో అధికారులు ఆ దిశగా చర్యలు తీసుకుంటున్నారు. అందులో భాగంగా ముఖ్య మంత్రి నారా చంద్రబాబునాయుడు అధ్యక్షులుగా, రోడ్డు రవాణా శాఖా మంత్రి అచ్చెన్నాయుడు ఉపాధ్యక్షులుగా ఆంధ్రప్రదేశ్ రహదారి భద్రతా మండలిని ఏర్పాటు చేశారు. ఇందులో మరికొంతమందిని సభ్యులుగా కూడా నియమించినట్లు సమాచారం. రహదారి భద్రతపై సుప్రీంకోర్టు ఆదేశాల మేరకు రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి అధ్యక్షుడిగా, 24 మంది అధికారులతో రాష్ట్ర భద్రతా మండలికి సహకారం అందించడం కోసం తాజాగా ఒక లీడ్ ఏజెన్సీని కూడా ఏర్పాటు చేశారు. ఈ లీడ్ ఏజెన్సీ రహదారి భద్రతపై నిర్ణయాలు తీసుకోవడానికి తరచూ సమావేశాలు నిర్వహి స్తుంటుంది. రహదారి భద్రత నిబంధనలను ఉల్లంఘించే వారిపై కఠిన చర్యలు తీసుకోవాలని నిర్ణయించారు. పోలీస్, రవాణా శాఖాధికారులు రహదారి భద్రతకు సంబంధించిన విషయాల అమలుపై దృష్టిపెడతారు.

రెడ్ లైట్ జంపింగ్, వేగంగా ప్రయాణించడం, సరుకు రవాణాలో ఓవర్‌లోడ్ చేయడం, వస్తువులను రవాణా చేసే వాహనాలలో ప్రయాణికులను ఎక్కించడం, డ్రైవింగ్‌లో మొబైల్ ఉపయోగించడం, మత్తు పదార్థాలు సేవించి, డ్రైవింగ్ చేయడం, హెల్మెట్ లేకుండా డ్రైవింగ్ చేయడం, సీటు బెల్టు లేకుండా డ్రైవింగ్, తదితర నిబంధనల ఉల్లంఘనకు సంబంధించి కఠినంగా వ్యవహరించాలని నిర్ణయించారు. కాగా ఈ ఏడాది ఇప్పటివరకు ఇందుకు సంబంధించి లక్షల కేసులను నమోదు చేశారు. 2017 ఏప్రిల్ 28 నుంచి రవాణాశాఖ ప్రతి జిల్లాలో ప్రత్యేక రహదారి భద్రతా దళాల ను ఏర్పాటు చేసింది. 2017 అక్టోబర్ 31వరకు రహదారి భద్రత ఉల్లంఘనకు సంబంధించి 1,55,253 కేసులు నమోదు చేశారు. మద్యం సేవించి వాహనాలు నడిపేవారు వేగంగా నడిపే అపరాధాలపై జరిమానా విధించడానికి బదులు ప్రాసిక్యూషన్ అమలు చేస్తున్నారు. అలాగే రహదారి భద్రతను ఉల్లంఘించిన వారికి మేజిస్ట్రేట్లు 3 నుంచి 5 రోజుల వరకు శిక్ష విధించాలని కూడా నిర్దేశించారు. ఈ విధమైన ప్రాసిక్యూషన్లు రహదారి భద్రతా చట్టాలను ఉల్లంఘించిన వారిపైన గట్టి ప్రభావం చూపిస్తాయని భావించి ప్రభుత్వం ఆ దిశగా చర్యలు తీసుకుంది. ఇందుకోసం పోలీస్ డిపార్ట్‌మెంట్ తరుపున 18 మంది డీఎస్పీలను రాష్ట్రంలో రోడ్డు భద్రతా కార్యకలాపాల ను సమన్వయం చేయడానికి, పరిస్థితిని పర్యవేక్షించడానికి నోడల్ ఆఫీసర్లుగా ప్రభుత్వం నియమించింది. కాగా సమగ్ర రహదారి భద్రతకు ఆడిటింగ్‌ను కూడా నిర్వహించాలని ప్రభుత్వం నిర్దేశించింది. రవాణా శాఖ రాష్ట్రంలోని జాతీయ రహదారుల సమగ్ర రహదారి భద్రతా ఆడిట్‌ను చేపట్టింది. రహదారుల్లో ప్రతి ప్రదేశానికి సంబంధించిన లోటు పాట్లు, వాటికి సంబంధించి తీసుకోవాల్సిన దిద్దుబాటు చర్యలు తీసుకున్నారు. రవాణాశాఖ పోలీస్‌శాఖ, ఆర్అండ్‌బి, విభాగం, విద్యా సంస్థలకు సంబంధించిన రోడ్డు భద్రత నిపుణులు ఆ సమాచారాన్ని రూపొందించారు. ఇప్పటికే మూడు జిల్లాలకు సంబంధించిన ఆడిట్ రిపోర్టులు ఎన్‌హెచ్ఎఐ కి సరిదిద్దడానికి పంపించారు. మరో ఆరు జిల్లాలకు సంబంధించిన నివేదికలు పూర్తయ్యే దశలో ఉన్నాయి. మిగిలిన నాలుగు జిల్లాలకు సంబంధించిన ఆడిట్స్ ను కూడా త్వరలోనే ప్రారంభించేందుకు అధికారులు చర్యలు తీసుకున్నారు. ఈనెలాఖరు కల్లా అన్ని జిల్లాల్లో సమగ్ర రహదారి భద్రతా ఆడిట్‌ను పూర్తి చేయాలని ప్రభుత్వం నుంచి ఆదేశాలున్నాయి.

అదే విధంగా రాష్ట్రంలోని అన్ని రాష్ట్ర,జాతీయ రహదారులపై 'బ్లాక్ స్పాట్స్' గుర్తింపు, సరిదిద్దడానికి శాఖల మధ్య సమన్వయం అత్యంత కీలకంగా భావించి, ఆ దిశగా చర్యలు తీసుకుంటున్నారు. రాష్ట్రంలో 1013 బ్లాక్‌స్పాట్స్‌ను గుర్తించడం జరిగింది. వీటిలో 951 బ్లాక్ స్పాట్స్‌ను ఇప్పటికే సరిదిద్దామంటున్నారు. సరిదిద్దిన బ్లాక్‌స్పాట్స్ జాబితాను కూడా రవాణా శాఖాధికారులకు పంపించారు. వారిని సంబంధిత విభాగాలతో సంప్రదింపులు జరిపి ఈ సవరణల ప్రభావాన్ని అధ్యయనం చేయమని కోరడం జరిగింది. జిల్లా రహదారి భద్రతా సంఘాల సభ్యులైన రవాణా, పోలీస్, ఆర్అండ్‌బి, మెడికల్ అండ్ హెల్త్ విభాగాల అధికారులు వాటి ప్రభావిత అధ్యయన నివేదికలను సరిదిద్దిన తర్వాత తనిఖీ చేసేలా చర్యలు తీసుకుంటున్నారు. బ్లాక్ స్పాట్స్‌లో ప్రమాదాలు తగ్గించడానికి తగిన జోక్యం కోసం ఇప్పటికే ఆర్అండ్‌బి అధికారులకు నివేదికలు పంపారు. రవాణా, పోలీస్, ఆర్అండ్‌బి విభాగాలు తీసుకున్న ముందస్తు జాగ్రత్తల వల్ల ప్రమాదాలు, మరణాల సంఖ్యలో ఈ సంవత్సరం సెప్టెంబర్ నాటికి గత సంవత్సరంతో పోలిస్తే తగ్గుదల కనిపించిందంటున్నారు.

# విజయమే లక్ష్యం

**• వైకాపా రాజకీయ శిక్షణలో ధర్మాన**



**విశాఖపట్నం, కెఎన్ఎన్:** రాబోయే ఎన్నికల్లో విజయాన్ని సాధించడమే లక్ష్యంగా ముందుకు సాగాలని మాజీ మంత్రి, వైకాపా రాష్ట్రనాయకుడు ధర్మాన ప్రసాదరావు పేర్కొన్నారు. ఆదివారం విశాఖపట్నంలోని ఆటోనగర్ సమీపంలోని గ్రీన్ సిటీ ఫంక్షన్ హాల్‌లో ప్రారంభించిన బూత్ కమిటీ నాయకుల రాజకీయ శిక్షణా కార్యక్రమంలో ఆయన ప్రధాన ప్రసంగం చేశారు. జరగబోయే సార్వత్రిక ఎన్నికలకు సిద్ధం కావడంతో పాటూ విజయాన్ని అందిపుచ్చుకునే దశగా సాగాల్సి ఉందన్నారు. అందుకే క్షేత్ర స్థాయిలో రాజకీయ శిక్షణా తరగతులను నిర్వహించేందుకు పార్టీ అధినేత వైఎస్ జగన్ మోహన్ రెడ్డి పిలుపునిచ్చారని పేర్కొన్నారు. అధికార పార్టీ అవినీతిని ప్రజల ముందుకు తీసుకు వెళ్లడం అత్యంత ముఖ్యమైన అంశమని చెప్పారు. వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అధికారం చేజిక్కించుకునే వరకూ ప్రతి కార్యకర్తా శ్రమించాలన్నారు. పార్టీ కేంద్ర కమిటీ నాయకుడు, రాజ్య సభ సభ్యులు విజయసాయి రెడ్డి మాట్లాడుతూ పార్టీ పటిష్టతకు అవసరమైన విధంగా పార్టీ బలోపేతం కావాల్సి ఉందన్నారు. ఇందులో భాగంగానే బూత్ స్థాయి నాయకులకు శిక్షణ ఇచ్చేందుకు సిద్ధం అయినట్లుగా వెల్లడించారు. పార్టీ జెండాను ఆవిష్కరించిన అనంతరం ప్రారంభించిన శిక్షణా శిబిరంలో పార్టీ విశాఖ పార్లమెంట్ అధ్యక్షుడు తైనాల విజయ్ కుమార్, అనకాపల్లిపార్లమెంట్ అధ్యక్షుడు గుడివాడ అమర్నాథ్, విశాఖ అధ్యక్షులు డాక్టర్‌విజయ ప్రసాద్ మళ్ల తదితరులు మాట్లాడారు. కార్యక్రమంలో పార్టీ నాయకులు కరణం ధర్మశ్రీ, నాగిరెడ్డి, తిప్పల గురుమూర్తి రెడ్డి, పక్కి దివాకర్, కొయ్య ప్రసాదరెడ్డి తదితరులు పాల్గొన్నారు.

## అసెంబ్లీలో ఒక్క బీసీ నాయకుడు

# మాట్లాడలేదు

**• అధికారంలోకి రావడానికే బాబు కాపు రిజర్వేషన్ హామీ • ఓబీసీ సంఘ ప్రతినిధి సాంబశివరావు**



**అమరావతి, ఆంధ్రప్రభ:** ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీలో కాపు రిజర్వేషన్ బిల్లు సమయంలో బీసీలకు మద్దతుగా ఒక్క బీసీ నాయకుడు కూడా మాట్లాడలేదని, వచ్చే ఎన్నికల్లో టీడీపీకి బీసీలు బుద్ధిచెబుతారని ఓబీసీ రౌండ్ టేబుల్ సమావేశంలో పలువురు వక్తలు అభిప్రాయపడ్డారు. ఆదివారం విజయవాడలో జరిగిన రౌండ్ టేబుల్ సమావేశంలో ఓబీసీ సంఘ ప్రతినిధి సాంబశివరావు మాట్లాడుతూ దేశంలోనే సీఎం చంద్రబాబు లాంటి కుటిల రాజకీయ నాయకుడు మరొకరు లేరని మండిపడ్డారు. కాపుల రిజర్వేషన్ విషయంలో ఇప్పటివరకు ఎవ్వరూ సాహసించలేదని, అధికారంలోకి రావడానికి చంద్రబాబు కాపు రిజర్వేషన్ హామీ ఇచ్చారని ఆగ్రహించారు. రాష్ట్రంలోని ఏ రాజకీయ పార్టీ బీసీల గురించి పట్టించుకోవటంలేదని ఆవేదన వ్యక్తంచేశారు. వైసీపీ ముద్రగడ వెనుక ఉండి రైలుని తగుల పెట్టిందని విమర్శించారు. కాపులను బీసీల్లోకి చేర్చడం ద్వారా బీసీలు, ఎంబీసీలకు ఎక్కువ నష్టమన్నారు. బీసీల్లోని ఏబీసీడీ వర్గీకరణ స్థానిక సంస్థ ఎన్నికల్లో అమలయ్యేలా కృషిచేయాలన్నారు. ఈసమావేశంలో జాతీయ అత్యంత వెనుకబడిన తరగతుల కమిటీ చైర్మన్ యు.వి చక్రవర్తి, రిటైర్డ్ జడ్జి కంచర్ల విజయ్ కుమార్, డివిజనల్ పంచాయితీ రాజ్ అధికారి జి. చంద్రశేఖర్‌రావు తదితరులు పాల్గొన్నారు.

## దంపతులఆత్మహత్యాయత్నం

# అడ్డుకున్న పోలీసులు

**• వాహనాల తనిఖీలో సూసైడ్ నోట్ లభ్యం**





**ములుగు, కెఎన్ఎన్ :** దంపతులు ఆత్మహత్యాయత్నానికి పాల్పడుతుండగా వారిని గుర్తించి వారికి కౌన్సెలింగ్ ఇచ్చినట్లు ములుగు సీఐ సాయిరమణ ఆదివారం తెలిపారు. రవీందర్- శ్వేత దంపతులు రాజమండ్రిలో రెస్టారెంట్ నడుపుతుండగా వ్యాపారంలో నష్టాలు రావడంతో ఎటుపాలుపోలేని పరిస్థితిలో వారి కుమార్తె శ్వేత తల్లిగారి ఇంటి వద్ద వదిలిపెట్టి కారులో బయలుదేరి ములుగు మీదుగా హైదరాబాద్‌కు వెళ్తున్న క్రమంలో సీఐ సాయిరమణ ములుగు వద్ద వాహనాలు తనీఖీ చేస్తుండగా శ్వేత పర్సులో సూసైడ్ నోటు లభించింది. దీంతో వారిని పోలీస్ స్టేషన్‌కు తరలించి పూర్తి వివరాలు సేకరించి ప్రతి సమస్యకు చావు పరిష్కారం కాదని ధైర్యం చెప్పి కౌన్సెలింగ్ ఇచ్చినట్లు సీఐ తెలిపారు.



## విశ్వ బ్రాహ్మణులు సంఘటితం కావాలి

**• ఫెడరేషన్ చైర్మన్ కనకాచారి పిలుపు**

**అమరావతి, ఆంధ్రప్రభ :** రాష్ట్రంలోని విశ్వ బ్రాహ్మణులంతా సంఘటితం కావాలని రాష్ట్ర విశ్వ బ్రాహ్మణ ఫెడరేషన్ చైర్మన్ సింహాద్రి కనకాచారి పిలుపునిచ్చారు. ఆదివారం ఇక్కడ జరిగిన రాష్ట్ర విశ్వ బ్రాహ్మణ సమాలోచన సమన్వయ కమిటీ సమావేశంలో ఆయన మాట్లాడారు. విశ్వబ్రాహ్మణులు రాజకీయంగా, ఆర్థికంగా, సామాజికంగా ఎదిగేందుకు పక్కా ప్రణాళికతో ముందుకు పోవాలన్నారు. ఇందుకోసం రాష్ట్రంలోని వివిధ స్థాయిల్లో కొనసాగుతున్న విశ్వ బ్రాహ్మణ సంఘాలన్నింటినీ ఒకే గొడుకు కిందకు తీసుకొచ్చేందుకు కృషి జరుగుతుందన్నారు. విశ్వ బ్రాహ్మణులు ఉన్నారని, వారిని అన్ని రంగాల్లో అభివృద్ధి చేసేందుకు ఫెడరేషన్ పలు సంక్షేమ కార్యక్రమాలు అమలుచేస్తోం దన్నారు. వాటిని అంతా సద్వినియోగం చేసుకోవాలన్నారు. రాష్ట్రం నలుమూలల నుంచి తరలివచ్చిన విశ్వబ్రాహ్మణులతో రాష్ట్ర,జిల్లా కమిటీలను ఏర్పాటు చేశారు. ఈ కార్యక్రమంలో ఫెడరేషన్ డైరెక్టర్లు గోడె నర్సింహాచారి, దశరథాచారి., ఎం.సత్యనారాయణ, ఏలూరు కోటేశ్వరరావు, విశ్వ బ్రాహ్మణ సంఘం రాష్ట్ర నాయకులు జవ్వాది రుద్రయ్య, డాక్టర్ సుధాకర్, పెదబాబు, కూర్మాచారి, దేవ్ చంద్రశేఖర్, గోవర్ధన్ శాస్త్రీ, శంకర్ నాని, వేణు తదితరులు పాల్గొన్నారు.

## ఆంధ్రప్రభ ఎఫెక్ట్

## గుంటూరులో ఈఎస్ఐ ఆసుపత్రికి

# వీడనున్న గ్రహణం


ఈఎస్ఐ ఆసుపత్రికి గ్రహణం

**• ఆసుపత్రి నిర్మాణానికి 11 ఎకారల భూమి కేటాయింపు • కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు కలెక్టర్ కోన సిఫారసు**

**అమరావతి, ఆంధ్రప్రభ:** గుంటూరులో ఈఎస్ఐ ఆసుపత్రి నిర్మాణానికి గ్రహణం అనే శీర్షికతో ప్రచురితమైన వార్తకు ప్రభుత్వ యంత్రాంగం స్పందించింది. కార్మికశాఖకు చెందిన 11 ఎకరాల భూమిని ఆసుపత్రి నిర్మాణానికి కలెక్టర్ కోన శశిధర్ ప్రభుత్వానికి సిఫార్సు చేయడంతో గ్రహణం వీడనుంది. రాష్ట్ర విభజన అనంతరం నవ్యాంధ్రప్రదేశ్ రాజధాని అమరావతి ప్రాంతంలో ఆధునిక వసతులతో వంద పడకల ఆస్పత్రిని ఏర్పాటు చేసేందుకు కేంద్ర ప్రభుత్వం గ్రీన్ సిగ్నల్ ఇచ్చింది. కేంద్ర కార్మిక రాజ్యబీమా కార్పొరేషన్ 2015లో గుంటూరులో ఆసుపత్రి ఏర్పాటుకు ఆమోదం తెలిపింది. సుమారు 100 కోట్లతో నిర్మించే ఈ ఆసుపత్రి ప్రకాశం, నెల్లూరు, గుంటూరు జిల్లాల్లోని 50 వేల మంది పైగా కార్మికులకు అంతర్జాతీయ ప్రమాణాలతో మెరుగైన వైద్యారోగ్య సౌకర్యాలు కలిగించనుంది. ఐతే అప్పటి నుంచి ఆసుపత్రి నిర్మాణానికి స్థలాన్ని కేటాయించకపోవడంతో ఈ విషయం మరుగున పడింది. తొలుత అంకిరెడ్డిపాలెం, గోరంట్లలో స్థలాన్ని కేటాయించారు. ఐతే ఈ స్థలాలపై వివాదాలు, ఆసుపత్రికి అనువుగా లేనందు వలన ఉన్నతాధికారుల కమిటీ తిరస్కరించింది. దీంతో ఆస్పత్రికి స్థల కేటాయింపు జాప్యం చోటు చేసుకుంది. దీనిపై ఆంధ్రప్రభలో ప్రత్యేక కథనం ప్రచురించడంతో స్పందించిన గుంటూరు కలెక్టర్ కోన శశిధర్ నగరంలోని బొంగరాలబీడు వద్ద నున్న రాష్ట్ర కార్మికశాఖకు చెందిన 13 ఎకరాల స్థలాన్ని గుర్తించారు. అందులో రెండెకరాలు రాష్ట్ర కార్మికశాఖ అవసరాల కోసం కేటాయించి, మిగిలిన 11 ఎకరాలను ఈఎస్ఐ ఆసుపత్రి నిర్మాణానికి ఉపయోగించుకోవాలని రాష్ట్ర కార్మికశాఖ ప్రత్యేక ప్రధాన కార్యదర్శి నీరబ్‌కుమార్‌ప్రసాద్, సీసీఎల్ఏ, ఇన్సూరెన్స్ మెడికల్ సర్వీసెస్ సంచాలకులు డాక్టర్ విజయ్‌కుమార్, కేంద్ర కార్మిక రాజ్యబీమా సంస్థ మెడికల్ కమిషనర్ కటారియాకు సిఫారసు లేఖలు పంపారు. దీనిపై రాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు, ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి దినేష్‌కుమార్, కార్మికశాఖ ప్రత్యేక ప్రధాన కార్యదర్శి నీరబ్‌కుమార్ ప్రసాద్, కార్మికశాఖామంత్రి పితాని సత్యనారాయణ ప్రత్యేక దృష్టి సారించి ఈఎస్ఐ ఆసుపత్రి నిర్మాణానికి చొరవ చూపాల్సి ఉంది. కలెక్టర్ సిఫారసు చేసిన స్థలాన్ని ఆమోదించి కేంద్ర ప్రభుత్వం మంజూరు చేసిన వంద కోట్ల వ్యయంగల ఈఎస్ఐ ఆసుపత్రి నిర్మాణానికి తక్షణం చర్యలు తీసుకోవాల్సి ఉంది. కలెక్టర్ కోన శశిధర్ కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు పంపిన లేఖలో మరో విషయాన్ని కూడా సూచించారు. కార్మికశాఖకు చెందిన ఖాళీగా ఉన్న 11 ఎకరాల భూమిని ఆక్రమించేందుకు పలువురు ప్రయత్నించినట్లు లేఖలో పేర్కొన్నారు. కోట్లాది రూపాయలు విలువచేసే ఈ స్థలం ఆక్రమణలకు గురికాకుండా ఈఎస్ఐ ఆస్పత్రి నిర్మాణానికి ఉపయోగించుకుంటే గుంటూరు, ప్రకాశం, నెల్లూరు జిల్లాల్లోగల వేలాదిమంది కార్మికులకు అంతర్జాతీయ ప్రమాణాలతో మెరుగైన వైద్యసాయం అందే అవకాశముంది. ఆసుపత్రి నిర్మాణంలో కాలయాపన జరిగితే విలువైన కార్మికశాఖ భూమి ఆక్రమణలకు గురికావడంతోపాటు కేంద్రప్రభుత్వం ఆస్పత్రిని వేరే రాష్ట్రాలకు బదిలీ చేసే అవకాశముంది. ఈ ఆసుపత్రి నిర్మాణం వలన 300 మందికి ప్రత్యక్షంగా, మరో వెయ్యి మందికి పరోక్షంగా ఉద్యోగ, ఉపాధి అవకాశాలు లభించనున్నాయి.

## ప్రియుడికోసం

# కన్నతల్లి కిరాతకం

**• నాలుగేళ్ల బాలికను చిత్రహింసలు**

**హైదరాబాద్, ఆంధ్రప్రభ:** హైదరాబాద్ మహానగరంలో ఓ కన్నతల్లి ఘాతుకానికి పాల్పడింది. నాలుగేళ్ల కూతురిని చిత్రహింసల పాల్జేసింది. అక్రమ సంబంధానికి అడ్డుగా ఉందని ప్రియుడితో కలిసి ఆమె ఈ దుశ్చర్యకు తెగబడింది. బాలికను కాలుతున్న పెనంపై కూర్చోబెట్టడంతో బాలిక శరీరం, కాళ్లు బొబ్బలు లేచాయి. దీనికి తోడు వారు బాలికను వదిలించుకునేందుకు ఓ పథకం రచించారు. ఆ ఇద్దరూ తీవ్రగాయాలతో ఉన్న బాలికను తీసుకుని శనివారం రాత్రి నాంపల్లిలోని పోలీసు భరోసా కేంద్రానికి వెళ్లారు. గాయాలతో ఉన్న అనాధ బాలిక తమకు దొరికిందని కట్టుకథ చెప్పారు. అక్కడ ఉన్న చైల్డ్ సేవ్ లైఫ్ అధికారులు పోలీసులకు ఫిర్యాదు చేద్దామని చెప్పి వారిని గోపాలపురం పోలీస్‌స్టేషన్‌కు తీసుకువెళ్లారు. పోలీసుల విచారణలో బాలిక అనాధ కాదని, వారి కూతురేనని తేలింది. దీంతో వారిద్దరినీ ఎస్ఆర్ నగర్ పోలీస్‌స్టేషన్‌కు తరలించారు. బాలికను చిత్రహింసలకు గురిచేశారని చైల్డ్ సేవ్ లైఫ్ అధికారులు ఇచ్చిన ఫిర్యాదు ఆధారంగా ఆ ఇద్దరిపై పోలీసులు కేసు నమోదు చేశారు. బాలికను యూసఫ్‌గూడలోని శిశువిహార్‌కు తరలించారు. బాలికను చిత్రహింసలకు గురిచేసిన జంటది శ్రీకాకుళంగా పోలీసులు గుర్తించారు. శ్రీకాకుళం జిల్లాకు చెందిన లలితకు వివాహమై రూప అనే నాలుగేళ్ల కూతురు ఉంది. అదే జిల్లాకు చెందిన ప్రకాశ్‌కు వివాహమై ముగ్గురు పిల్లలున్నారు. వీరిద్దరి మధ్య అక్రమ సంబంధం ఉండటంతో కొన్ని నెలల క్రితం పారిపోయి హైదరాబాద్ చేరుకున్నారు. భార్యాభర్తలమని చెప్పి ఎస్ఆర్ నగర్ పరిధిలో మకాం పెట్టారు. బాలిక తమ సంబంధానికి అడ్డుగా ఉందనే వారు ఈ ఘాతుకానికి పాల్పడ్డారని పోలీసుల విచారణలో వెల్లడైంది.

## ఏపీ రిజర్వాయర్లలో పెరిగిన నీటిమట్టం

**అమరావతి, ఆంధ్రప్రభ :** ప్రభుత్వం నీటి వనరుల అభివృద్ధికి తీసుకున్న చర్యల వల్ల ఈసారి ఆంధ్రప్రదేశ్‌లోని పలు రిజర్వాయర్లలో గణనీయంగా నీటిమట్టాలు పెరిగాయంటున్నారు. అయితే ఏపీలోని నీటి మట్టాలతో పోలిస్తే తెలంగాణాలోని రిజర్వాయర్లలో నీటి మట్టాలు గణనీయంగా తగ్గాయని కేంద్ర జలవనరుల శాఖ తాజాగా ప్రకటించింది. ఆంధ్రప్రదేశ్‌లోని పలు రిజర్వాయర్లలో మాత్రం నీటి మట్టం పెరిగిందని తెలిపింది. .నీటి మట్టం పెరగడానికి రాష్ట్రప్రభుత్వం నీటి వనరుల అభివృద్ధికి తీసుకున్న చర్యలే ప్రధాన కారణమంటున్నారు. జలసిరికి హారతి కార్యక్రమం ద్వారా వాన నీటిని ఎక్కడికక్కడ ఒడిసి పట్టి, భూగర్భ జలంగా మార్చడంతో పెద్ద ఎత్తున నీటి నిల్వలు పేరుకుపోయాయి. ఇదే విషయాన్ని గతంలోనే కేంద్ర జలవనరుల శాఖ ప్రకటించింది.

# యువజన యాత్రకు ఘనస్వాగతం

**• 7న గుంటూరులో బహిరంగ సభ • డీవైఎఫ్ఐ రాష్ట్ర కార్యదర్శి యం. సూర్యారావు**




**అమరావతి, ఆంధ్రప్రభ:** గుంటూరులో ఈ నెల 7న జరిగే యువజన యాత్ర ముగింపు బహిరంగసభను జయప్రదం చేయాలని డివైఎఫ్ఐ రాష్ట్ర కార్యదర్శి సూర్యారావు పిలుపునిచ్చారు. నాణ్యమైన విద్య, ఉపాధి అవకాశాలు ప్రధాన డిమాండ్‌గా డివైఎఫ్ఐ, ఎస్ఎఫ్ఐ ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కమిటిలు సంయుక్తంగా చేపట్టిన 'రాష్ట్ర యువజన యాత్ర' అదివారం విజయవాడ చేరుకుంది. ఈ యాత్రకు విద్యార్థులు, యువకులు ఘన స్వాగతం పలికారు. ఈ సందర్భంగా సూర్యారావు మాట్లాడుతూ రాష్ట్ర వ్యాప్తంగా మూడు బృందాలు 'రాష్ట్రయువజన యాత్ర'ను ప్రారంభించడం జరిగిందన్నారు. ఉత్తరాంధ్ర రాజయమండ్రిలో నవంబరు 24న ప్రారంభమైన యువజన యాత్ర ఈ నెల 7న గుంటూరులో జరిగే బహిరంగ సభతో ముగుస్తుందని తెలిపారు. ఇప్పటికే కొస్తాలో ప్రారంభమైన మొదటి బృంద యాత్ర విశాఖపట్నంలో ముగిసిందని, రాయలసీమలో జరుగుతున్న యాత్ర ఈ నెల 13న కడపలో ముగుస్తుందన్నారు. ప్రతి జిల్లాలోని ప్రధాన నగరాలలోని విద్యాలయాలు, వసతిగృహాలు, క్రీడా మైదానాలు, కోచింగ్ సెంటర్లు, కూడళ్లలో యాత్ర ద్వారా విద్యార్థులను, యువజనులకు విద్య, ఉపాధి, ఉద్యోగ అవకాశాలపై అవగాహన కల్పిస్తున్నమనితెలిపారు. ఉద్యోగాలు లేక నిరుద్యోగులు ఆత్మహత్యలు చేసుకుంటుంటే, ప్రభుత్వ విద్యాలయల్లో నాణ్యమైన విద్య అందక కార్పొరేట్ విద్యాలయలలో చేరి ఒత్తిడితో విద్యార్థులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారని సూర్యారావు ఆవేదన వ్యక్తం చేశారు. నోటిఫికేషన్లు లేక రాష్ట్రంలో 34 లక్షల మంది నిరుద్యోగంతో బాధలు పడుతున్నారన్నారు. ఎన్నిల హామీల్లో నిరుద్యోగభృతి ప్రకటించిన ప్రభుత్వం ఇప్పటి వరకు భృతి ఇవ్వలేదని ఆగ్రహం వ్యక్తం చేశారు. 2016 ఫిబ్రవరి అసెంబ్లీలో 20,250 పోస్టులు భర్తీ చేస్తామని ప్రకటించిన ప్రభుత్వం ఒక నోటిఫికేషన్ కూడా ఇవ్వలేదన్నారు. ఏపీపీఎస్సీ ద్వారా ఉద్యోగాల భర్తీ చేయాల్సి ఉండగా ఇంత వరకు ఒక్క నోటిఫికేషన్ కూడా ఇవ్వలేదని ఆందోళన వ్యక్తం చేశారు. రెగ్యూలర్ పోస్టులతో పాటు బ్యాక్ లాగ్ పోస్టులు కూడా భర్తీ చేయడం లేదన్నారు. ప్రభుత్వ ఖాళీలు నింపకపోగా ఉన్న పరిశ్రమలు మూసేసి నిరుద్యోగుల జీవితాలతో ఆటలాడుకుంటున్నారని ఆరోపించారు. పంచాయతీ కార్యదర్శి, విఆర్ఎ, విఆర్ఒ పోస్టులను అవుట్ సోర్సింగ్ ద్వారా భర్తీ చేస్తామని ప్రకటించడం సరికాదని నోటిఫికేషన్లు ఇచ్చి శాశ్వత ప్రతిపాదికన వాటిని భర్తీ చేయాలి సూర్యారావు డిమాండ్ చేశారు. యువజన యాత్రలు ముగిసిన అనంతరం విద్యార్థి, యువజన సమస్యల పరిష్కారం కొరుతూ ప్రభుత్వనికి వినతి పత్రం అందజేసామని తెలిపారు. ఈ యాత్రలోడివైఎఫ్ఐ, ఎస్ఎఫ్ఐ నాయులు వై.రాము, ప్రవీణ్, కోటి, నాగేశ్వరరావు, ఆశోక్, ఆనిల్, లెనిన్ తదితరులు పాల్గొన్నారు.

## రాష్ట్రంలో పెరిగిన

# చలితీవ్రత

**అమరావతి, ఆంధ్రప్రభ:** రాష్ట్రంలో ఉష్ణోగ్రతలు పడిపోతున్నాయి. దీంతో చలి తీవ్రత పెరుగుతోంది. అంధ్రా కశ్మీర్‌గా పేరొందిన విశాఖమన్యంలో కూడా చలితీవ్రత అధికంగా పెరిగింది. లంబసింగిలో 7 డిగ్రీలు, చింతపల్లిలో 9డిగ్రీలు కనిష్ట ఉష్ణోగ్రలు నమోదయ్యాయి. అలాగే పలు చోట్ల పొగమంచు దట్టంగా అలుముకుం టోంది. దీంతో ఎదురెదురుగా వచ్చే వాహనాలు కనిపించకుండా పోతుండ డంతో వాహనదారులు లైట్లు వేసుకుని వెళ్లాల్సి వస్తుంది.చలి తీవ్రత రోజు రోజుకు పెరుగుతుండడంతో ముఖ్యంగా పిల్లలు,వృద్ధులు గజగజ వణికిపోతున్నారు. తెల్లారి ఉదయం 5 గంటల నుంచే పొగమంచు అలుముకుంటోంది. దీంతో ఇబ్బందికర పరిస్థితులు ఏర్పడుతున్నాయి. ఈ సందర్భంగా వాహన రాకపోకలకు ఇబ్బందులు తలెత్తుతున్నాయి. కొన్ని చోట్ల ఉష్ణోగ్రతలు 10 డిగ్రీలకు పడిపోతుండడం గమనార్హం. తుఫాన్ ప్రభావం కొంత ఆంధ్రప్రదేశ్ ఉన్నప్పటికీ పెద్దగా ప్రభావం ఉండదంటున్నారు. అయితే రాయలసీమ,కోస్తాంధ్రలో అక్కడక్కడ కొద్దిపాటి జల్లులు కురిసే అవకాశం ఉందని వాతావరణ శాఖాధికారులు తెలిపారు.

## దివ్యాంగుడ్ని ముంచేసిన

# గొలుసుకట్టు వ్యాపారం

**• న్యాయం కోసం ఢిల్లీ చేరిన ఒంగోలువాసి**

**న్యూఢిల్లీ, ఆంధ్రప్రభ :** గొలుసుకట్టు వ్యాపారాల మాయలో చిక్కుకుని నిలువునా మోసపోయిన ఓ దివ్యాంగుడు న్యాయం కోసం ఢిల్లీ చేరుకున్నాడు. ప్రకాశం జిల్లా, ఒంగోలుకు చెందిన సురేష్ దివ్యాంగుడు. రెండేళ్ల కిందట మల్టీ లెవల్ మార్కెంటిగ్ బిజినెస్ చేసే ముఠా వేసిన వలలో సురేష్ చిక్కుకున్నాడు. వియర్డ్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ కార్పొరేషన్ లిమిటెడ్ సంస్థ పేరుతో షేక్ మీరావలి సురేష్‌ను సంప్రదించాడు. ఈ సంస్థ అలహాబాద్ కేంద్రంగా నడుస్తోందని నమ్మబలికాడు. సురేష్‌తో పాటు 40 మందిని ఏజెంట్లుగా చేర్చుకున్నాడు. ఏజెంట్ల ద్వారా ప్రజల నుంచి రూ. 12 కోట్ల రూపాయలు సేకరించాడు. సురేష్ తన టార్గెట్ ప్రకారం జనం నుంచి 24 లక్షలు సేకరించి షేక్ మీరావలి దోసిట్లో పోశాడు. రెండేళ్ల తర్వాత ఆ సొమ్ముకు రెండింతలు చెల్లిస్తామని నమ్మబలికిన కంపెనీ గుట్టుచప్పుడు కాకుండా బోర్డు తిప్పేసి బిచాణా ఎత్తేసింది. దీంతో డబ్బు కట్టిన జనం సురేష్‌పై ఒత్తిడి తెచ్చారు. గత్యంతరం లేని పరిస్థితుల్లో సురేష్ తండ్రి నుంచి వారసత్వంగా వచ్చిన ఆస్తిని అమ్మి జనానికి డబ్బు చెల్లించాడు. 2014లో ఒంగోలు పోలీస్ స్టేషన్‌లో సదరు సంస్థపై కేసు పెట్టినా ప్రయోజనం లేకపోయింది. దీంతో ఏం చేయాలో పాలుపోని సురేష్ కుటుంబ సభ్యుల సహకారంతో ఢిల్లీ చేరుకున్నాడు. ఎలాగైనా ప్రధాన మంత్రి నరేంద్ర మోడీని కలిసి న్యాయం కోసం అర్థిస్తానని సురేష్ తెలిపాడు. తనలా మరెవరూ మోసపోకూడదని బాధితుడు సురేష్ ఆవేదన వ్యక్తం చేశాడు.



రజనీకాంత్



# ఏప్రిల్‌లో 2.0.

రజనీకాంత్, దర్శకుడు శంకర్ కలయికలో తెరకెక్కుతున్న చిత్రం 2.0. లోగడ వీరిద్దరి కలయికలో వచ్చిన సూపర్‌హిట్ చిత్రం రోబోకు ఇది సీక్వెల్. ఇప్పటికే దీనిపై భారీ అంచనాలు నెలకొన్న నేపథ్యంలో అందుకు తగ్గట్టుగానే భారీ బడ్జెట్‌తో, అత్యున్నత సాంకేతిక పరిజ్ఞానంతో లైకా ప్రొడక్షన్స్ సంస్థ ఈ చిత్రాన్ని నిర్మిస్తోంది. ఎమీజాక్సన్ హీరోయిన్‌గా నటిస్తుండగా, బాలీవుడ్ నటుడు అక్షయ్‌కుమార్ ప్రతినాయకుడిగా కనిపించబోతున్నారు. తెలుగు, తమిళ, హిందీ భాషల్లో రూపొందుతున్న ఈ చిత్రం షూటింగ్ పార్ట్ పూర్తిచేసుకుని, ప్రస్తుతం నిర్మాణానంతర కార్యక్రమాలను జరుపుకుంటోంది. వచ్చే ఏడాది ఏప్రిల్‌లో ప్రపంచవ్యాప్తంగా ఈ చిత్రాన్ని విడుదల చేసేందుకు సన్నాహాలు చేస్తున్నామని లైకా ప్రొడక్షన్స్ క్రియేటివ్ హెడ్ రాజు మహాలింగం తెలిపారు.

ఈ చిత్రంలోని ఇతర ముఖ్యపాత్రల్లో సుధాంశుపాండే, ఆదిల్‌హుసేన్, కళాభవన్ షాజాన్, రియాజ్‌ఖాన్ తదితరులు తారాగణం. ఈ చిత్రానికి సినిమాటోగ్రఫీ: నిరవ్‌షా, సంగీతం: ఎ.ఆర్.రెహమాన్, ఎడిటింగ్: ఆంటోని, సమర్పణ: సుభాష్‌కరణ్, నిర్మాణం: లైకా ప్రొడక్షన్స్, కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: శంకర్.

# సూపర్‌స్టార్ కృష్ణకు ఆటా జీవనసాఫల్య పురస్కారం



ఆటా (అమెరికన్ తెలుగు అసోసియేషన్) ప్రతీ రెండేళ్లకోమారు ఇండియాకు వచ్చి వేడుకలను నిర్వహిస్తున్న సంగతి తెలిసిందే. ఈ పర్యాయం కూడా తెలుగు నేలకు వచ్చి పలు అంశాలపై అవగాహనా సదస్సులు, ఉచిత వైద్య శిబిరాలు వంటి పలు సేవా కార్యక్రమాలకు శ్రీకారం చుట్టింది. నవంబర్ 26 నుంచి జరుగుతున్న ఈ వేడుకలు డిసెంబర్ 23న ముగియనున్నాయి. ఆ రోజు ఉదయం 5కె రన్‌తో మొదలయ్యే ఈ ముగింపు ఉత్సవంలో సాయంత్రం పలు సాంస్కృతిక కార్యక్రమాలు జరగనున్నాయి. పలువురు ప్రముఖులు పాల్గొనే ఈ ఉత్సవంలో సూపర్‌స్టార్ కృష్ణకు ఆటా జీవనసాఫల్య పురస్కారం ప్రదానం చేయనున్నట్లు ప్రస్తుత అధ్యక్షుడు కరుణాకర్ అసిరెడ్డి, కాబోయే అధ్యక్షుడు పరమేష్ భీమిరెడ్డి తెలిపారు.



# విధికీ, ప్రేమకు మధ్య పోరాటం

అల్లు శిరీష్, సురభి, సీరత్ కపూర్ ముఖ్య పాత్రల్లో నటిస్తున్న చిత్రం 'ఒక్క క్షణం'. అవసరాల శ్రీనివాస్ మరో కీలక పాత్రను పోషిస్తున్నారు. నిర్మాత చక్రి చిగురుపాటి లక్ష్మీ నరసింహా ఎంటర్‌టైన్‌మెంట్స్ పతాకంపై ఈ చిత్రాన్ని నిర్మిస్తున్నారు. సైన్స్ ఫిక్షన్ కథతో దర్శకుడు వీఐ ఆనంద్ 'ఒక్క క్షణం' సినిమాను రూపొందించారు. ఈ చిత్ర టీజర్ విడుదల కార్యక్రమం హైదరాబాద్ ప్రసాద్ ల్యాబ్‌లో జరిగింది. ఈ కార్యక్రమంలో పాల్గొన్న అల్లు శిరీష్ మాట్లాడుతూ...'ఇదొక సైన్స్ ఫిక్షన్ కథ. థ్రిల్లర్ తరహాలో సాగుతుంది. ఇంతమంచి కథను నా దగ్గరకు తీసుకొచ్చారు నిర్మాత చక్రి. ఆయనకు నా కృతజ్ఞతలు. శ్రీరస్తు శుభమస్తు తర్వాత మరో మంచి సబ్జెక్ట్ తో సినిమా చేస్తున్నాను. కథకు తగినట్లు నిర్మాత ఖర్చు పెట్టారు. ఎక్కడా వెనకాడకుండా సినిమాను నిర్మించారు. థ్రిల్లర్ కథతో వెళ్తూనే సమాంతరంగా మన జీవితాలను చూపిస్తుంది. వీఐ ఆనంద్ గారు ప్రతిభను తెరపై చూస్తారు. ఇక ఈ ఏడాది వచ్చిన భిన్నమైన సినిమాలన్నింటినీ ప్రేక్షకులు ఆదరించారు. ఇది టీజర్ మాత్రమే. సినిమాలో అన్ని అంశాలను చూస్తారు.' అన్నారు. దర్శకుడు వీఐ ఆనంద్ మాట్లాడుతూ...'ఎక్కడికి పోతావు చిన్నవాడా చిత్రీకరణ సమయంలో చక్రికి ఈ కథ చెప్పాను. ఆయనకు నచ్చి శిరీష్ దగ్గరకు తీసుకెళ్లారు. జీవా పాత్రలో శిరీష్ ఆకట్టుకుంటాడు. పాత్రలో పర్‌ఫెక్షన్ కోసం చాలా కష్టపడ్డాడు. విధి, ప్రేమకు మధ్య జరిగే పోరాటమే ఈ కథ. ఆద్యంతం ఉత్కంఠభరితంగా సాగుతూ ఆకట్టుకుంటుంది.' అన్నారు. మాటల రచయిత అబ్బూరి రవి మాట్లాడుతూ...'దర్శకుడు వీఐ ఆనంద్ గారితో నాకిది మూడో సినిమా. ఆయన ముందు కథ సిద్ధం చేసుకుని...దానికి కథనంలో పూర్తి మెరుగులు దిద్దుతారు. అందుకే ఆనంద్ చిత్రాల్లో స్క్రీన్‌ప్లే చాలా బాగుంటుంది.' అన్నారు. మంచి చిత్రంలో పనిచేసే అవకాశం ఇచ్చిన దర్శక నిర్మాతలకు నాయికలు సురభి, సీరత్ కపూర్ కృతజ్ఞతలు తెలిపారు. సృజనాత్మకంగా పనిచేసిన అనుభవాన్ని సినిమా ఇచ్చిందన్నారు.



సన్నీలియోన్

# ఇంద్రసేన బాగుందంటున్నారు



'బిచ్చగాడు' చిత్రంతో టాలీవుడ్ మార్కెట్ పెంచుకున్న నటుడు విజయ్ ఆంటోనీ. విలక్షణమైన కథలు ఎంచుకునే ఈ తమిళ నటుడు తెరపైకి వచ్చిన తాజా చిత్రం 'ఇంద్రసేన'. డైనా చంపిక, మహిమా చౌదరి నాయికలుగా నటించారు. ఇటీవలే ప్రేక్షకుల ముందుకొచ్చిన ఈ చిత్రానికి ప్రేక్షకాదరణ దక్కుతోందని అంటున్నారు యూనిట్ సభ్యులు. ఎన్‌ఆర్‌కే ఫిలింస్ పతాకంపై నీలం లక్ష్మి సమర్పణలో నీలం కృష్ణారెడ్డి ఈ చిత్రాన్ని నిర్మించారు. జి. శ్రీనివాసన్ దర్శకత్వం వహించారు. హైదరాబాద్ ప్రసాద్ ల్యాబ్స్‌లో 'ఇంద్రసేన' విజయోత్సవం నిర్వహించారు. ఈ సందర్భంగా కథానాయకుడు విజయ్ ఆంటోనీ మాట్లాడుతూ...'తెలుగు కథానాయకుడి లాగే నన్ను ఆదరిస్తున్నారు. 'బిచ్చగాడు' విజయం తర్వాత ఊహించనంతగా మా చిత్రాలకు స్పందన వస్తోంది. నా చుట్టూ ఏం జరుగుతుందో నమ్మలేకపోతున్నాము. 'ఇంద్రసేన'కు అన్ని థియేటర్‌ల నుంచి రెస్పాన్స్ బాగుంది. మంచి చిత్రాన్ని చేశారంటూ ప్రశంసలు దక్కుతున్నాయి. మీ ఆదరణ మరిన్ని సినిమాలు చేసేందుకు ప్రోత్సాహాన్ని ఇస్తోంది. ఈ చిత్ర విజయంలో ఎంతోమందికి భాగముంది. వాళ్లందరికీ కృతజ్ఞతలు.' అన్నారు. ఈ కార్యక్రమంలో నాయిక మహిమా, నిర్మాత నీలం కృష్ణా రెడ్డి, దర్శకుడు జి శ్రీనివాసన్ తదితరులు పాల్గొన్నారు.

# మా సిల్వర్ జూబ్లీ వేడుకలు



మూవీ ఆర్టిస్ట్స్ అసోసియేషన్ 25వ వసంతంలోకి అడుగుపెట్టిన నేపథ్యంలో ఆ సంస్థ సిల్వర్‌జూబ్లీ వేడుకలను ఘనంగా నిర్వహించేందుకు సన్నాహాలు చేస్తోంది. ఇందులో భాగంగా హైదరాబాద్‌లో ఏర్పాటుచేసిన పాత్రికేయుల సమావేశంలో అధ్యక్షుడు శివాజీరాజా మాట్లాడుతూ, 24 ఏళ్ల కిందట చిరంజీవిగారు స్థాపించిన మా 25వ ఏట అడుగుపెట్టడం చాలా సంతోషంగా ఉంది. ఈ సందర్భంగా ఐయామ్ విత్ మా అనే నినాదంతో సిల్వర్‌జూబ్లీ వేడుకలను కన్నుల పండువగా నిర్వహించబోతున్నాం. అందుకు టాలీవుడ్ సెలబ్రిటీలంతా కలిసి వస్తున్నారు. చిరంజీవి, బాలకృష్ణ నాగార్జున, వెంకటేష్‌లను సంప్రదించగానే ఎక్కడికైనా రావడానికి సిద్ధంగా ఉన్నామని భరోసా ఇచ్చారు. మహేష్‌బాబు, రామ్‌చరణ్, ఎన్టీఆర్‌లు కూడా సపోర్ట్ ఇస్తామన్నారు. వాళ్లందరి సహకారం ఉండటం వల్లనే ఈరోజు మా ఈ స్థాయిలో ఉంది. ఈ రెండేళ్ల పాటు వేడుకలను ఘనంగా నిర్వహించడానికి ప్లాన్ చేశాం అన్నారు.

ప్రధాన కార్యదర్శి నరేష్ మాట్లాడుతూ, ఈ నెల 10న కర్టన్ రైజర్ ఫంక్షన్‌ను నిర్వహించబోతున్నాం. సూపర్‌స్టార్ కృష్ణ, రెబల్‌స్టార్ కృష్ణంరాజుల చేతులమీదుగా ఈ వేడుక జరగనుంది. సీనియర్ నటీమణులు జయసుధ, రోజారమణి తదితరులను ఘనంగా సన్మానించనున్నాం అని చెప్పారు. ఇదే వేదికపై నటుడు రాళ్లపల్లి, సీనియర్ పాత్రికేయుడు గుడిపూడి శ్రీహరి, నటుడు శివబాలాజీలను మా తరపున ఘనంగా సత్కరించారు. ఈ కార్యక్రమంలో ఎగ్జిక్యూటివ్ వైస్ ప్రెసిడెంట్ శ్రీకాంత్, కోశాధికారి పరుచూరి వెంకటేశ్వరరావు, ఇంకా బెనర్జీ, ఏడిద శ్రీరామ్, హేమ, సురేష్ కొండేటి, సురేష్, ఉత్తేజ్, అనితాచౌదరి, గీతాసింగ్ తదితరులు పాల్గొన్నారు.

దక్షిణభారత సాంస్కృతిక చారిత్రక యుద్ధ నేపథ్య కథాంశంతో తెరకెక్కనున్న ఓ చిత్రంలో సన్నీలియోన్ కథానాయికగా నటించనుంది. నవదీప్, నాజర్‌లు ఇందులో కీలక పాత్రలను పోషించనున్నారు. తెలుగు, తమిళ, మలయాళ, హిందీ భాషల్లో రూపొందించబోయే ఈ చిత్రానికి వి.సి.వడివుడయన్ దర్శకత్వం వహించనుండగా, స్టీవ్స్‌కార్నర్ పతాకంపై పోన్స్ స్టీఫెన్ నిర్మించనున్నారు. వచ్చే

# తెలుగులో యుద్ధం చేస్తోంది

ఏడాది ఫిబ్రవరి నుంచి ఈ చిత్రం రెగ్యులర్ షూటింగ్ మొదలుకానుంది. ప్రస్తుతం ప్రీ ప్రొడక్షన్ పనులు, సెట్ నిర్మాణ పనులు శరవేగంగా జరుగుతున్నాయి. ఈ చిత్రం కోసం సన్నీలియోన్ కత్తియుద్ధం, గుర్రపుస్వారి, కొన్ని యుద్ధ కళలనుం నేర్చుకోనున్నారు. ఆంధ్రప్రదేశ్‌కు చెందిన ఓ ప్రముఖ శిక్షకుడు ముంబైలో సన్నీలియోన్‌కు శిక్షణ ఇవ్వనున్నారు. ఈ చిత్రం కోసం సన్నీలియోన్ 150 రోజుల కాల్షీట్స్ ఇచ్చినట్లు చిత్రబృందం తెలిపింది. బాహుబలి, 2.0. చిత్రాలకు గ్రాఫిక్స్ వర్క్ చేసిన సంస్థలు ఈ చిత్రానికి కూడా పనిచేయనున్నాయి. 70 నిమిషాల గ్రాఫిక్స్ ఉంటాయని సమాచారం. కాగా ఈ చిత్రం గురించి సన్నీలియోన్ మాట్లాడుతూ, ఇప్పటివరకు నాకున్న ఇమేజ్‌ను ఇది పూర్తిస్థాయిలో మార్చే సినిమా అవుతుందన్న నమ్మకం ఉందన్నారు. యాక్షన్ సీక్వెన్స్‌లలో నటించాలన్నది నా కల. అది ఈ సినిమాతో నెరవేరుతున్నందుకు ఆనందంగా ఉందని చెప్పారు. ఇలాంటి ఒక అద్భుతమైన కథ కోసం ఎన్నాళ్ల నుంచో ఎదురుచూశానని, ఎప్పట్నుంచో ఒక స్ట్రయిట్ తెలుగు చిత్రం చేయాలనుకుంటున్నాను. ఆంధ్రప్రదేశ్, తెలంగాణ, కేరళ, తమిళనాడులలో నాకు అభిమానులు బాగా ఉన్నారు అని అన్నారు.

# కొంటె యువత సరదాలు



నిఖిల్

కన్నడ సూపర్ హిట్ ఫిల్మ్ కిరిక్ పార్టీ...తెలుగులో 'కిర్రక్ పార్టీ' పేరుతో అనువాదమవుతోంది. నిఖిల్ కథానాయకుడిగా నటిస్తున్నారు. నిఖిల్‌కు ఇది 15వ చిత్రం కాగా...ఈ చిత్ర ఫస్ట్ లుక్‌ను నిర్మాతలు శనివారం విడుదల చేశారు. శరన్ కొప్పిశెట్టి దర్శకత్వంలో ఏకే ఎంటర్‌టైన్‌మెంట్స్ ఈ చిత్రాన్ని నిర్మిస్తోంది. సంయుక్తహెగ్డే, సిమ్రన్‌ఫర్జీనా నాయికలుగా నటిస్తున్నారు. 'కిర్రక్ పార్టీ' సినిమాకు దర్శకుడు సుధీర్ వర్మ స్క్రీన్‌ప్లే అందిస్తుండగా....మరో దర్శకుడు చందూ మొండేటి సంభాషణలు రాయడం విశేషం. ఇప్పటికే 70 శాతం చిత్రీకరణ పూర్తయింది. కళాశాల నేపథ్యంతో సాగే ఈ చిత్రంలో కొత్త నటీనటుల కోసం క్యాస్టింగ్ కాల్ ఇచ్చారు. వేలల్లో దరఖాస్తులు వచ్చాయి. వాళ్ల నుంచి కొంతమందిని ఎంపిక చేశారు.

ఈ చిత్రానికి సంగీతం - అజనీష్ లోకనాథ్, ఛాయా గ్రహణం - అద్వైత గురుమూర్తి, ఎడిటింగ్ - ఎంఆర్ వర్మ, ఆర్ట్ - అవినాష్, సహ నిర్మాతలు - అజయ్ సుంకర, అభిషేక్ అగర్వాల్, నిర్మాత - సుంకర రామబ్రహ్మం

# అడ్డంకులు దాటి ముందుకెళ్లే యువత

గంగాధర్, రేణుక, హరీష్ వినయ్, హారిక, వైజాగ్ ప్రసాద్ ప్రధాన పాత్రల్లో నటిస్తున్న చిత్రం 'ఆకలి పోరాటం'. రామ్ సాయి గోకులం క్రియేషన్స్ ఈ చిత్రాన్ని నిర్మిస్తోంది. ఆనంద్ సాగర్ దర్శకుడు. అన్ని కార్యక్రమాలు పూర్తి చేసుకున్న 'ఆకలి పోరాటం' ఈ నెల 8న విడుదలకు సిద్ధమవుతోంది. ఈ సందర్భంగా చిత్ర దర్శకుడు ఆనంద్ సాగర్ మాట్లాడుతూ...'నలుగురు కొత్త నటీనటులకు మరో నలుగురు అనుభవం ఉన్న నటులను తీసుకున్నాం. ఇలా కథలో కొత్తా పాత కలయిక ఉంటుంది. కొత్త వాళ్లు ఎలా నటిస్తారని ఆందోళనను వైజాగ్ ప్రసాద్ లాంటి సీనియర్ నటులు లేకుండా చేశారు. కొత్త వాళ్లలకు నటించడంలో జాగ్రత్తలు చెబుతూ ప్రోత్సహించారు. చదువుకున్న యువతీ యువకులు ఉద్యోగాల కోసమే చూడకుండా స్వశక్తితో వ్యాపారం చేసి జీవనాధారం పొందుతుంటారు. ఇలా ఎదుగుతున్న వాళ్ల జీవితాల్లో ఓ వ్యక్తి అలజడి సృష్టిస్తాడు. ఆ సందర్భం నుంచి తప్పించుకుని జీవితంలో ఎదిగిన యువత కథే మా చిత్రం. మా ప్రయత్నం అందరికీ నచ్చుతుందని ఆశిస్తున్నాం.' అన్నారు. నిర్మాత వీర రాఘవులు మాట్లాడుతూ...'మాకు వేదికలపై మాట్లాడటం రాదు కానీ...మరో కొత్త చిత్రాన్ని నిర్మించే ధైర్యం ఉంది. ఆకలి రాజ్యం ఆడియో విజయవంతమైన నేపథ్యంలో చిత్రానికీ ప్రేక్షకాదరణ దక్కుతుందని భావిస్తున్నాం.' అన్నారు.



గంగాధర్, రేణుక, హరీష్ వినయ్

# కుటుంబ కథాచిత్రమ్ ట్రైలర్ విడుదల



భాస్కర్ గ్రూప్ ఆఫ్ మీడియా సమర్పణలో నందు, శ్రీముఖి, కమల్ కామరాజు ప్రధాన పాత్రల్లో నటించిన చిత్రం 'కుటుంబ కథా చిత్రమ్'. దాసరి భాస్కర్ యాదవ్ నిర్మాత. వీఎస్ వాసు ఈ చిత్రానికి దర్శకత్వం వహించారు. అన్ని కార్యక్రమాలు పూర్తి చేసుకున్న తెరపైకి వచ్చేందుకు సిద్ధమవుతోంది. నిర్మాత మల్కాపురం శివకుమార్ ఈ చిత్రాన్ని పంపిణీ చేస్తున్నారు. 'కుటుంబ కథా చిత్రమ్' ఈ నెల 15న విడుదలకు సిద్ధమవుతోంది. ఈ సందర్భంగా చిత్ర ట్రైలర్‌ను హైదరాబాద్ ప్రసాద్ ల్యాబ్స్ లో విడుదల చేశారు. అనంతరం దర్శకుడు వీఎస్ వాసు మాట్లాడుతూ...'సినిమా ఇంత వ్యయంలో చేయాలని నిర్మాతలు ఆంక్షలు పెట్టారు. ఈ శరతుల మీద చిత్రాన్ని రూపొందించాం. నటీనటులు బాగా సహకరించారు. నందూ, కమల్ కామరాజు నిజ జీవితంలోనూ హీరోలే. చిన్న చిత్రమైనా అనుకున్న సమయానికి చేయగలుగుతున్నాం అంటే వాళ్ల క్రమశిక్షణ వల్లే. ప్రేక్షకులకు కొత్త అనుభూతిని అందించే సినిమా అవుతుంది.' అన్నారు. నటుడు నందూ మాట్లాడుతూ...'ఇలాంటి మంచి కథను నా దగ్గరకు తీసుకొచ్చిన దర్శకుడికి కృతజ్ఞతలు. ప్రతి సన్నివేశాన్ని ఆస్వాదించాం. ఈ చిత్రంతో మాకు నటులుగా సంతృప్తి దొరికింది. అందుకే డబ్బు కంటే ఎక్కువ ప్రాధాన్యమిచ్చి నటించాం.' అన్నారు. పంపిణీదారులు మల్కాపురం శివకుమార్ మాట్లాడుతూ..'దర్శకుడు నా దగ్గరకు వచ్చి సినిమా గురించి చెప్పారు. ముందు డిస్ట్రిబ్యూషన్ వద్దనుకున్నా...ట్రైలర్ టీజర్ పోస్టర్‌లు చూశాక పంపిణీకి ముందుకొచ్చాం. ఎప్పుడూ స్టార్ హీరోల సినిమాలు మాత్రమే కాదు. ఇలాంటి చిన్న చిత్రాలనూ ప్రోత్సహించాలని భావించాను. విడుదలకు నోచుకోకుండా ఎన్నో సినిమాలు ల్యాబ్‌లో మగ్గిపోతున్నాయి. చిన్న చిత్రాల పంపిణీకి ముందుకొస్తే ఇలాంటి పరిస్థితి ఉండదు. ఓ కొత్త తరహా కథను దర్శకుడు ఇందులో చూపిస్తున్నాడని ఆశిస్తున్నాను. రెండు తెలుగు రాష్ట్రాల్లో ఈ నెల 15న చిత్రాన్ని విడుదల చేసేందుకు ప్రయత్నాలు చేస్తున్నాం.' అన్నారు.

## ముఖానికి మాస్క్‌లతో...

కోట్లాను పొగ మంచు కప్పేయడంతో ఆదివారం లంచ్ విరామం తర్వాత లంక ఆటగాళ్లు ముఖానికి మాస్క్‌లతో మైదానంలోకి ఫీల్డింగ్‌కు దిగారు. కాలుష్యం ఎక్కువగా ఉండడంతో మాథ్యూస్, చండిమాల్ సహా ఆటగాళ్లంతా మాస్క్‌లతో కనిపించారు. మంచు దట్టంగా అలముకోవడంతో రెండు సార్లు ఆటను కొద్ది నిమిషాల పాటు ఆపేశారు. ఫాస్ట్ బౌలర్లు గమగె, లక్మల్ తమ తమ ఓవర్ పూర్తి కాకుండానే మైదానాన్ని వీడి వెళ్లారు. ఓ దశలో లంక 10 మంది ఆటగాళ్లతోనే ఆడింది. బౌలింగ్ పరిస్థితులతో తమ బౌలర్లు సంతృప్తితో ఉన్నారని.. విరాట్ ఇన్నింగ్స్ డిక్లేర్ చేశాడు.



## మా ఆటగాళ్లు వాంతి చేసుకున్నారు

**• లంక కోచ్ నిక్ పొథాస్**

కోట్లా మైదానంలో కాలుష్యం ఎక్కువగా ఉందని, తమ ఆటగాళ్లు మైదానం నుంచి డ్రెస్సింగ్ రూమ్‌కొచ్చి వాంతి చేసుకున్నారని లంక కోచ్ నిక్ పొథాస్ అన్నాడు. లక్మల్ డ్రెస్సింగ్ రూమ్‌లో వాంతి చేసుకున్నాడని చెప్పాడు. వైద్యులు అతనికి పరీక్షలు చేశారని తెలిపాడు. ''డ్రెస్సింగ్ రూమ్‌లో ఆక్సిజన్ సిలిండర్లు ఉన్నాయి. ఆడేప్పుడు ఆటగాళ్లు శ్వాసకు సంబంధించి ఇబ్బందులు పడడం సాధారణం. కానీ లక్మల్ ఆగకుండా వాంతి చేసుకున్నాడు. ఇలాంటి పరిస్థితి ఎదురుకావడం ఇదే తొలిసారి. కాలుష్యానికి సంబంధించి ఎక్కువగా నిబంధనలు లేవు. రేపటి మా భవిష్యత్ రిఫరీ చేతిలోనే ఉంది. ఆయనతో ఈ రాత్రి సమావేశమవుతాం. రేపు కూడా ఇలాగే ఉంటే నిర్ణయం కొత్తగా ఉండొచ్చు'' అని పొథాస్ చెప్పాడు.

మరోవైపు లంక జట్టు వైఖరిని బీసీసీఐ తప్పుపట్టింది. దీన్ని పెద్ద సమస్యగా చూపాలని ప్రయత్నిస్తోందని ఆరోపించింది. ''మైదానంలోని 20 వేలమంది ప్రేక్షకులకు, భారత ఆటగాళ్లకు లేని సమస్య లంక క్రికెటర్లకు ఎందుకొచ్చింది'' అని బోర్డు తాత్కాలిక అధ్యక్షుడు ఖన్నా ప్రశ్నించారు.



**17**

ఆరు డబుల్ సెంచరీలను విరాట్ 17 మాసాల కాలంలో పూర్తి చేశాడు. ఇవన్నీ కెప్టెన్‌గానే సాధించాడు.

# డబుల్ నంబర్ 6

**• కోహ్లి రికార్డు ద్విశతకం • భారత్ 536-7 డిక్లేర్డ్**

**• ఎదురీదుతున్న లంక • కాలుష్యంతో మ్యాచ్‌కు పదే పదే అంతరాయం**

**రెండో రోజూ భారత్‌కు ఎదురు లేదు. లంక బౌలర్లు తేలిపోయిన వేళ.. కోట్లాలో కోహ్లి సేన జోరు మరింత పెరిగింది. కెప్టెన్ విరాట్ కోహ్లి, రోహిత్ శర్మ చెలరేగిపోయారు. బౌండరీలు, సిక్స్‌లతో విజృంభించారు. 15 వేలమంది ప్రేక్షకులను అలరిస్తూ సొంత మైదానంలో విరాట్ రికార్డు ద్విశతకం సాధించాడు. నాగ్‌పూర్ టెస్టులో ఐదో డబుల్‌తో లారాను అందుకున్న విరాట్.. కెప్టెన్‌గా ఆరో డబుల్‌తో విండీస్ దిగ్గజాన్ని అధిగమించాడు. ఆదివారం రెండో రోజు ఆటలో అనేక నాటకీయ సంఘటనలు చోటు చేసుకున్నాయి. వాతావరణ కాలుష్యం... మ్యాచ్‌కు పదే పదే అంతరాయం కలిగించింది. కోహ్లి అద్వితీయ బ్యాటింగ్... రికార్డు ద్విశతకం మజాను ప్రేక్షకులు తృప్తిగా ఆస్వాదించకుండా కాలుష్యం కమ్మేసింది. భారత్ అర్థాంతరంగా 536-7 స్కోరు వద్ద ఇన్నింగ్స్ డిక్లేర్ చేయాల్సిన పరిస్థితి తలెత్తింది. తొలి ఇన్నింగ్స్ ఆరంభించిన లంక పరుగుల ఖాతా తెరవకుండానే వికెట్ కోల్పోయింది. ఆట ఆఖరుకు 131-3తో నిలిచింది. మాథ్యూస్, కెప్టెన్ చండిమాల్ పోరాడుతున్నారు.**



**న్యూఢిల్లీ:** కెప్టెన్ విరాట్ కోహ్లి (243, 287 బంతుల్లో, 25 ఫోర్లు), డబుల్ సెంచరీ చేయడంతో టీమ్‌ఇండియా రెండో రోజు ఆదివారం తొలి ఇన్నింగ్స్‌ను 536-7 వద్ద డిక్లేర్ చేసింది. వెంటనే మొదటి ఇన్నింగ్స్ ఆరంభించిన లంక.. ఆట ఆఖరుకు 3 వికెట్లు కోల్పోయి 131 పరుగులు చేసింది. మాథ్యూస్ (57 బ్యాటింగ్, 118 బంతుల్లో, 8 ఫోర్లు, 2 సిక్స్), చండిమాల్ (25 బ్యాటింగ్, 81 బంతుల్లో, 3 ఫోర్లు) ఆడుతున్నారు. భారత్.. ఉదయం ఓవర్ నైట్ స్కోరు 371-4తో ఇన్నింగ్స్ కొనసాగించింది. ఆట ఆరంభానికి ముందు అందరి చర్చ కోహ్లి రికార్డు డబుల్ గురించే. అప్పటికి ఆ రికార్డుకు విరాట్ మరో 44 పరుగుల దూరంలో నిలిచాడు. టీమ్‌ఇండియా జోరు ఆరంభమైంది. పరుగుల వరద మొదలైంది. తొలి సెషన్లోనే విరాట్ ఆ డబుల్‌ను అందుకున్నాడు. తొలి రోజు ఆట చివర్లో సందకన్... విజయ్, రహానేలను ఔట్ చేసి తమకు అనుకూలంగా మ్యాచ్‌ను మలుపు తిప్పాడని భావించిన లంక బౌలర్ల ఆశలు అడియాసలే అయ్యాయి. విరాట్‌కు రోహిత్ శర్మ (65, 102 బంతుల్లో, 7 ఫోర్లు, 2 సిక్స్) తోడవడంతో లంక బౌలర్ల పరిస్థితి మరింత దిగజారింది. కోహ్లి మిడ్‌వికెట్ మీదుగా పుల్‌షాట్‌తో రెండు పరుగులు సాధించి టెస్టుల్లో ఆరో డబుల్ సెంచరీని అందుకున్నాడు. భారత్ స్కోరు 450 పరుగులు దాటింది. ఆ వెంటనే రోహిత్.. బౌలర్ తలపై నుంచి ఓ సొగసైన బౌండరీ సాధించి టెస్టుల్లో ఎనిమిదో అర్థసెంచరీ పూర్తి చేశాడు. సరిగ్గా లంచ్ విరామానికి ముందు రోహిత్.. సందకన్ విసిరిన వైడ్ బాల్‌ను వెంటాడి ఔటయ్యాడు. ఆ బంతి రోహిత్ బ్యాట్ కింది అంచును తీసుకొని కీపర్ డిక్వెల చేతిలో వాలింది. సందకన్ ఇది మూడో వికెట్. కోహ్లి, రోహిత్ కలిసి ఐదో వికెట్‌కు 135 పరుగులు జత చేశారు.

**కమ్మేసిన కాలుష్యం:** మైదానం అంతటా ఉదయం నుంచి కాలుష్య మంచు తెరలు కమ్మేశాయి. దీంతో సూర్యుడు లంచ్ తర్వాత ముఖం చాటేశాడు. దీంతో ఆట 13 నిమిషాల పాటు ఆగిపోయింది. తిరిగి ఆట మొదలైన వెంటనే భారత్.. అశ్విన్ (4) వికెట్‌ను కోల్పోయింది. రెండో సెషన్‌ను కోహ్లి 225 పరుగులతో ఆరంభించాడు. వ్యక్తిగత అత్యుత్తమ స్కోరు 235 పరుగులను దాటాడు. ఆపై కోట్లాలో వ్యక్తిగత గరిష్ట స్కోరును నమోదు చేశాడు. ఆటకు అంతరాయంతో ఏకాగ్రత దెబ్బతిన్న విరాట్.. వెంటనే సందకన్ బౌలింగ్‌లో ఎల్బీడబ్ల్యూ ఔట్‌గా వెనుదిరిగాడు. అంపైర్ ఔటివ్వగానే విరాట్ సమీక్ష కోరాడు. అంపైర్ నిర్ణయం సరైందేనని సమీక్షలో తేలడంతో కోహ్లి పెవిలియన్ చేరాడు. జడేజా (5 నాటౌట్), సాహా (9 నాటౌట్) ఆడుతున్నపుడు లక్మల్ ఓ ఓవర్లో 5 బంతులే వేసి మైదానం నుంచి బయటకు వెళ్లిపోయాడు. ఆ బంతిని పెరీరా వేశాడు. గమగె, లక్మల్ బయటకు వెళ్లిపోవడంతో లంక చివర్లో 10 మందితోనే ఆడింది. అప్పటికే వికెట్ల దగ్గర హెల్మెట్‌కు బంతి తాకడంతో సమరవిక్రమ విశ్రాంతి తీసుకుంటున్నాడు. బౌలింగ్ పరిస్థితుల గురించి లంక కోచ్ పొథాస్, భారత్ కోచ్ రవి మధ్య చర్చలు జరిగాయి. వీరిద్దరు ఓ అవగాహనకు రాలేకపోయారు.

ఇంతలో లంక సబ్‌స్టిట్యూట్ ఒకరు మైదానంలోకి వస్తుండాన్ని గమనించిన కోహ్లి.. ఇన్నింగ్స్‌ను డిక్లేర్ చేశాడు. తమ బౌలర్లు వెనకాడకుండా బౌలింగ్ చేస్తారన్న ధీమాతో ఆ నిర్ణయం తీసుకున్నాడు. అందుకు తగినట్లుగానే పేసర్ షమి తొలి బంతికే కరుణరత్నేను ఔట్ చేశాడు. షమి ఆఫ్ స్టంప్ వెలుపల వేసిన బంతి కరుణరత్నే బ్యాట్ అంచును తీసుకొని కీపర్ సాహా చేతిలో వాలింది. ఇషాంత్ నిప్పులు చెరిగే బంతితో డిసిల్వాను ఔట్ చేశాడు. దీంతో 14 పరుగులకే 2 వికెట్లు కోల్పోయి లంక కష్టాల్లో పడింది. సమరవిక్రమ గైర్హాజరీలో ఓపెనర్‌గా దిగిన పెరీరా (42, 54 బంతుల్లో, 9 ఫోర్లు) మూడో వికెట్‌కు మాథ్యూస్‌తో కలిసి 61 పరుగులు జోడించి జడేజా బౌలింగ్లో వెనుదిరిగాడు. చివరి సెషన్లో షమి, ఇషాంత్ విజృంభించి బౌలింగ్ చేస్తూ ఉంటే భారత ఫీల్డర్లు క్యాచ్‌లు నేలపాలు చేశారు. స్లిప్‌లో కోహ్లి, ధావన్ క్యాచ్‌లు జారవిడిచారు. 4వ వికెట్‌కు మాథ్యూస్, చండిమాల్ అజేయంగా 56 పరుగులు జోడించారు.



షమికి సహచరుల అభినందన

### స్కోరుబోర్డు

**భారత్ తొలి ఇన్నింగ్స్:** విజయ్ (స్టంప్డ్) (బి) సందకన్ 155, ధావన్ (సి) లక్మల్ (బి) పెరీరా 23, పుజారా (సి) సమరవిక్రమ (బి) గమగె 23, కోహ్లి (ఎల్బీ) (బి) సందకన్ 243, రహానే (సి) డిక్వెల (బి) సందకన్ 1, రోహిత్ (సి) డిక్వెల (బి) సందకన్ 65, అశ్విన్ (సి) పెరీరా (బి) గమగె 4, సాహా నాటౌట్ 9, జడేజా నాటౌట్ 5, ఎక్స్‌ట్రాలు 8, మొత్తం (127.5 ఓవర్లలో 7 వికెట్లకు) 536 డిక్లేర్డ్

**వికెట్ల పతనం:** 1-42, 2-78, 3-361, 4-365, 5-500, 6-519, 7-523

**బౌలింగ్:** లక్మల్ 21.2-2-80-0, గమగె 25.3-7-95-2, పెరీరా 31.1-0-145-1, సందకన్ 33.5-1-167-4, డి సిల్వ 16-0-48-0.

**శ్రీలంక తొలి ఇన్నింగ్స్:** కరుణరత్నే (సి) సాహా (బి) షమి 0, పెరీరా (ఎల్బీ) (బి) జడేజా 42, డి సిల్వ (ఎల్బీ) (బి) ఇషాంత్ 1, మాథ్యూస్ బ్యాటింగ్ 57, చండిమాల్ బ్యాటింగ్ 25, ఎక్స్‌ట్రాలు 6, మొత్తం (44.3 ఓవర్లలో 3 వికెట్లకు) 131, **వికెట్ల పతనం:** 1-0, 2-14, 3-75

**బౌలింగ్:** షమి 11-3-30-1, ఇషాంత్ 10-4-44-1, జడేజా 14.3-6-24-1, అశ్విన్ 9-3-28-0.

## క్రీడాప్రభ



## పృథ్వీ షాకు పగ్గాలు

**• అండర్ 19 ప్రపంచకప్‌లో భారత జట్టుకు సారథ్యం**

**న్యూఢిల్లీ:** ముంబై వర్ధమాన తార పృథ్వీ షా... 2018 ఐసీసీ అండర్ 19 క్రికెట్ ప్రపంచకప్‌లో భారత జట్టుకు సారథ్యం వహిస్తాడు. ఈ విషయాన్ని బీసీసీఐ ఆదివారం ప్రకటించింది. ''ఐసీసీ అండర్ 19 క్రికెట్ ప్రపంచకప్‌లో ఆడే అండర్ 19 జట్టును జాతీయ జూనియర్ సెలెక్షన్ కమిటీ ఎంపిక చేసింది. 16 జట్లు పోటీ పడే ఈ టోర్నీ న్యూజిలాండ్‌లో జనవరి 13 నుంచి ఫిబ్రవరి 3వ తేదీ వరకు జరుగుతుంది'' అని బోర్డు ఓ ప్రకటనలో తెలిపింది. బెంగళూరులో డిసెంబరు 8 నుంచి 22 వరకు శిక్షణ శిబిరం నిర్వహిస్తారు. గత టోర్నీలో భారత్ అండర్ 19 జట్టు రన్నరప్‌గా నిలిచింది. 2000, 2008, 2012తో ట్రోఫీ గెలిచింది. గత ఏడాది బంగ్లాదేశ్‌లో జరిగిన ఫైనల్లో విండీస్ చేతిలో భారత్ ఓడింది.

**అండర్ 19 జట్టు:** పృథ్వీ షా (కెప్టెన్), సుబ్‌మన్ గిల్ (వైస్ కెప్టెన్), మంజోత్ కల్రా, హిమాంశు రాయ్, అభిషేక్ శర్మ, రియాన్ పరాగ్, ఆర్యన్ జుయల్ (వికెట్ కీపర్, హర్విక్ దేశాయ్ (వికెట్‌కీపర్), శివమ్ మవి, కమలేశ్ నగర్‌కోటి, ఇషాన్ పొరేల్, అర్షదీప్ సింగ్, అనుకుల్ రాయ్, శివ సింగ్, పంకజ్ యాదవ్. **స్టాండ్‌బైస్:** ఓం భోస్లే, రాహుల్ చచర్, నినద్ రత్వా, ఉర్వి పటేల్, ఆదిత్య ఠాక్రే.

## సగర్వంగా 'అర్జున' కోరతా



**న్యూఢిల్లీ:** తానిపుడు సగర్వంగా ప్రతిష్టాత్మక అర్జున అవార్డు కోసం దరఖాస్తు పెట్టుకుంటానని ప్రపంచ వెయిట్ లిఫ్టింగ్ చాంపియన్‌షిప్‌లో స్వర్ణం గెలిచిన సైఖోమ్ మీరాబాయి చాను తెలిపింది. తెలుగుతేజం కరణం మల్లేశ్వరి తర్వాత 48 కిలోల విభాగంలో చాను పసిడి కైవసం చేసుకున్న సంగతి తెలిసిందే. ''ఇపుడు సగర్వంగా అర్జున అవార్డుకు దరఖాస్తు చేస్తా. ఈ అవార్డును మంత్రిత్వశాఖ ఇవ్వకుండా ఉండటానికి నాకు కారణాలు కనిపించడం లేదు. 2015లో గ్లాస్గోవ్‌లో రజతం సాధించినపుడు నాకు అర్జున రాకపోవడం బాధనిపించింది. ఇపుడు స్వర్ణం సాధించాను. వచ్చేఏడాది రాష్ట్రపతి నుంచి పురస్కారం అందుకుంటానన్న బలమైన విశ్వాసం నాలో ఏర్పడింది. మా గ్రామంలో అందరూ నన్ను అర్జున అవార్డీ మీరాబాయి చానుగా చూడాలనుకుంటున్నారు'' అని చాను తెలిపింది.

## జర్మనీతో నేడు భారత్ ఢీ

**భువనేశ్వర్:** నిలకడ లోపించిన భారత హాకీ జట్టు సోమవారం జర్మనీతో తలపడనుంది. తొలి మ్యాచ్‌లో ప్రపంచ చాంపియన్ ఆస్ట్రేలియాను నిలువరించిన భారత్... రెండో పోరులో 2-3తో ఇంగ్లండ్ చేతిలో ఓడి విశ్వాసం సన్నగిల్లి ఉంది. జర్మనీ కూడా ఉదాసీనతకు తావివ్వని జట్టు కావడంతో పూల్ బిలో తదుపరి పోరు టీమ్‌ఇండియాకు అగ్నిపరీక్షే. ఈ పోరులో గెలిస్తే నాకౌట్లోకి విశ్వాసంతో అడుగు పెట్టవచ్చు. ఆదివారం జరిగిన పూల్ ఏ మ్యాచ్‌లో బెల్జియం 5-0తో స్పెయిన్‌ను చిత్తు చేసి పూల్‌లో అగ్రస్థానంలో నిలిచింది.



రాత్రి 7నుంచి స్టార్ స్పోర్ట్స్‌లో

## పోరాడుతున్న విండీస్

**• బ్లండెల్ సెంచరీ • కివీస్ 520-9 డిక్లేర్డ్**

**వెల్లింగ్టన్:** న్యూజిలాండ్‌తో తొలి టెస్టులో వెస్టిండీస్ పోరాడుతోంది. రెండో ఇన్నింగ్స్‌లో ఓపెనర్ బ్రాత్‌వైట్ (79 బ్యాటింగ్, 186 బంతుల్లో, 7 ఫోర్లు, 1 సిక్స్), హెట్‌మియర్ (66, 89 బంతుల్లో, 8 ఫోర్లు, 2 సిక్స్) అర్థసెంచరీలతో రాణించడంతో ఆదివారం మూడో రోజుఆట ఆఖరుకు విండీస్ 2 వికెట్ల నష్టానికి 214 పరుగులు చేసింది. తొలి ఇన్నింగ్స్‌లో 520 పరుగుల భారీ స్కోరు సాధించిన కివీస్ కంటే ఇంకా 172 పరుగులు వెనుకబడి ఉంది. విండీస్ తొలి ఇన్నింగ్స్‌లో 134 పరుగులు చేసింది. ఉదయం ఓవర్‌నైట్ స్కోరు 447-9తో తొలి ఇన్నింగ్స్ కొనసాగించిన కివీస్.. బ్లండెల్ (107 నాటౌట్, 180 బంతుల్లో,, 13 ఫోర్లు, 1 సిక్స్) అజేయంగా సెంచరీ సాధించడంతో 520-9 స్కోరు వద్ద ఇన్నింగ్స్ డిక్లేర్ చేసింది.

## మార్ష్ అజేయ సెంచరీ

**• ఆసీస్ తొలి ఇన్నింగ్స్ 442-8 డిక్లేర్డ్ • ఇంగ్లండ్ 29-1**

**అడిలైడ్ టెస్టు ఆసక్తికరంగా మారుతోంది. ఇప్పటికి రెండు జట్లలో ఎవరివైపూ మ్యాచ్ మొగ్గు చూపనప్పటికీ... యాషెస్ తొలి డేనైట్ టెస్టుపై ఆస్ట్రేలియా క్రమంగా పట్టు బిగిస్తోంది. మొదటి రోజు నిలదొక్కుకోవడానికి ప్రాధాన్యం ఇచ్చిన స్మిత్ సేన.. రెండో రోజు షాన్ మార్ష్ అజేయ సెంచరీ సాధించడంతో భారీ స్కోరు సాధించి ఇంగ్లండ్‌కు సవాలు విసిరింది. ఆట ఆఖరుకు ఇంగ్లండ్ ఓ వికెట్ కోల్పోయి పోరాడుతోంది. వర్షం కారణంగా ఆదివారం ఆట పూర్తిగా సాగలేదు.**



షాన్ మార్ష్ (126 నాటౌట్)

### స్కోరుబోర్డు

**ఆస్ట్రేలియా తొలి ఇన్నింగ్స్:** 442-8 డిక్లేర్డ్

**ఇంగ్లండ్ తొలి ఇన్నింగ్స్:** కుక్ బ్యాటింగ్ 11, స్టోన్‌మన్ (ఎల్బీ) (బి) స్టార్క్ 18, విన్స్ బ్యాటింగ్ 0, ఎక్స్‌ట్రాలు 0, మొత్తం (9.1 ఓవర్లలో వికెట్‌కు) 29

**వికెట్ల పతనం:** 1-29

**బౌలింగ్:** స్టార్క్ 5-1-13-1, హాజెల్‌వుడ్ 4-2-16-0, కమిన్స్ 0.1-0-0-0.

**అడిలైడ్:** మిడిలార్డర్ బ్యాట్స్‌మన్ షాన్ మార్ష్ (126 నాటౌట్, 231 బంతుల్లో, 15 ఫోర్లు, 1 సిక్స్) అజేయ సెంచరీ చేయడంతో ఆస్ట్రేలియా.. యాషెస్ సిరీస్ రెండో టెస్టు తొలి ఇన్నింగ్స్‌ను 442-8 వద్ద డిక్లేర్ చేసింది. డేనైట్ టెస్టులో ఆసీస్‌కిదే అత్యధిక స్కోరు.

వర్షం వల్ల ఆట ఆగిపోయే సమయానికి ఇంగ్లండ్ వికెట్ కోల్పోయి 29 పరుగులు చేసింది. ఆసీస్ స్కోరుకు ఇంకా 413 పరుగులు వెనకబడి ఉంది. మరో 9 వికెట్లు చేతిలో ఉన్నాయి. టాస్ గెలిచి ఫీల్డింగ్ ఎంచుకున్న జోరూట్ ఎత్తుగడ ఇంగ్లండ్‌కు కలిసి రాలేదనే చెప్పాలి. మరోవైపు జట్టులోకి షాన్ మార్ష్ వివాదాస్పద ఎంపిక మాత్రం ఆసీస్‌కు కలిసి వచ్చింది. స్మిత్ ఔటైన తర్వాత ఆరో స్థానంలో బ్యాటింగ్‌కు దిగిన మార్ష్... దిగువ వరుస బ్యాట్స్‌మెన్‌తో విలువైన భాగస్వామ్యాలు నమోదు చేశాడు. 231 బంతులు ఎదుర్కొన్న మార్ష్ గత పదేళ్లలో ఏ ఇతర ఆసీస్ బ్యాట్స్‌మన్‌కు సాధ్యంకాని రికార్డును సొంతం చేసుకున్నాడు. మార్ష్ తొమ్మిదో నంబర్ బ్యాట్స్‌మన్ కమిన్స్‌తో కలిసి 8వ వికెట్‌కు ఏకంగా 99 పరుగులు జోడించాడు. హ్యాండ్స్‌కాంబ్‌తో ఐదో వికెట్‌కు 48, పైనెతో ఆరో వికెట్‌కు 85, స్టార్క్‌తో ఏడో వికెట్‌కు 17 పరుగులు జోడించాడు. 9వ వికెట్‌కు అజేయంగా లియోన్ (10 నాటౌట్)తో కలిసి 32 పరుగులు జత చేశాడు. ఓవర్టన్ (3-84)కు మూడు వికెట్లు, బ్రాడ్ (2-72) రెండు వికెట్లు లభించాయి. ఓవర్‌నైట్ స్కోరు 209-4తో మధ్యాహ్నం ఇన్నింగ్స్ కొనసాగించిన ఆసీస్ రెండో రోజు మరో 4 వికెట్లు కోల్పోయి 233 పరుగులు జోడించి 442 పరుగుల వద్ద ఇన్నింగ్స్ డిక్లేర్ చేసింది. వెంటనే తొలి ఇన్నింగ్స్ ఆరంభించిన ఇంగ్లండ్ 29 పరుగుల వద్ద మొదటి వికెట్ కోల్పోయింది. స్టోన్‌మన్ (18).. స్టార్క్ బౌలింగ్‌లో ఎల్బీడబ్ల్యూ ఔట్‌గా వెనుదిరిగాడు. కుక్ 11, విన్స్ పరుగులేమీ లేకుండా క్రీజులో ఉన్నారు.

Vaccum Therapy లింగవర్ధక యంత్రం
లింగం చిన్నదని నిరాశ ఎందుకు?
అమెరికా ఏజెన్సీ FDA వారి అభిప్రాయం ప్రకారం Vaccum Therapy లింగవర్ధక యంత్రం మరియు ఔషధాల ద్వారా పురుషుడు తన చిన్న లింగాన్ని 75 రోజులలో 7 నుండి 8 అంగుళాల పొడవు, లావు, గట్టిగా, శక్తివంతంగా మరియు దృఢంగా చేసుకొనవచ్చును. మరియు తన ఇష్టానుసారం శృంగార సమయాన్ని పొడిగించుకోవచ్చును. శీఘ్రస్కలనం, నపుంసకత్వం, లింగము వదులుగా ఉండుట, చిన్నగా ఉండుట, సన్నగా ఉండుటను తొలగించుకోవడంకోసం 30 రోజుల ఔషధం.
ఇంటి దగ్గరకే ఔషధం తెప్పించుకోండి
08943212076

Printed & Published by **MOOTHA GOUTAM** on behalf of Andhra Prabha Publications Ltd., and Printed at Andhra Prabha Publications Ltd., Part no 75, Opp: Time Hospital, Ashok Nagar, Vijayawada - 520010.
Editor: Mootha Goutam, Responsible for News selection under PRB ACT. RNI Regd No. 3464/59.

fb/prajasakti, www.prajasakti.com

# ప్రజాశక్తి

సిటీ

ప్రతి అక్షరం ప్రజల పక్షం

Published from Vijayawada, Visakhapatnam, Kurnool, Tirupathi, Rajamahendravaram, Srikakulam, ongole and Ananthapuramu

సంపుటి : 37 సంచిక : 335 | విజయవాడ, సోమవారం 04 డిసెంబర్ 2017 | 12 + 12 పేజీలు వెల : 4.00



## కంచ ఐలయ్య అరెస్టు

- ఖమ్మంలో ఐదు గంటల పాటు ఉద్రిక్తత

8





టెస్టుల్లో 6వ ద్విశతకం చేసిన అనంతరం అభివాదం చేస్తున్న భారత్ కెప్టెన్ విరాట్ కోహ్లి. శ్రీలంకతో మూడో టెస్టులో కోహ్లి 243 పరుగులు (287 బంతుల్లో 25 ఫోర్లు) చేశాడు.

12

# పోలవరం ఎందుకిలా..?

## పొంతన లేని మాటలు • పోలవరంలో రాష్ట్ర సర్కారు పల్టీలు

**ప్రజాశక్తి - అమరావతి బ్యూరో**

పోలవరం ప్రాజెక్టుపై రాష్ట్ర సర్కారు మాటలకు, ఆచరణకు పొంతనలేని పరిస్థితి ఏర్పడింది. 2018కల్లా ప్రాజెక్టు పూర్తి కావడం ఖాయమంటూ పదేపదే చేసిన ప్రకటనలు సాకారం కావాలంటే ఖర్చు చేయాల్సిన మొత్తంలో నామమాత్రం కూడా చంద్రబాబు సర్కారు ఇప్పటి వరకు వ్యయం చేయలేదు. ప్రభుత్వ లెక్కల ప్రకారమే ఈ మూడేళ్లలో చేసిన ఖర్చు అక్షరాల 3500 కోట్ల రూపాయలు మాత్రమే! జాతీయహోదా ప్రకటనతో కేంద్ర పూర్తి చేయాల్సిన నిర్మాణ పనులను తామే చేస్తామంటూ రాష్ట్ర సర్కారు తీసుకున్న తరువాత అంచనాలు భారీగా పెరగడం, చేసిన ఖర్చులోనూ అవకతవకలూ, జరుగుతున్న తప్పులను వేలెత్తిచూపిన అధికారులకు జరిగిన స్థానచలనాలు ఈ వ్యవహారంలో ఎన్నో అనుమానాలను రేకతిస్తున్నాయి. కేంద్ర ప్రభుత్వం కూడా సకాలంలో నిధులు విడుదల చేయకపోవడం, అడుగడుగునా ఆటంకాలు కలిగిస్తుండటంతో పోలవరం పూర్తికావడం ప్రశ్నార్థకంగా మారింది.

**అంచనాలు ఎందుకు పెరిగాయి?**

పోలవరం ప్రారంభమైనప్పటి నుంచి ప్రభుత్వం, అధికారులు అనుసరిస్తున్న విధానాలు అన్నీ అనుమానాలకే తావిస్తున్నాయి.



అంచనా వ్యయాన్ని ఎందుకు పెంచాల్సి వచ్చిందన్న దానిపై స్పష్టత కనిపించడం లేదు. స్పిల్‌వే పనుల్లో కొంత పనులకు టెండర్ పిలిచిన తరువాత మళ్లీ 1395 కోట్ల నుంచి 1483 కోట్లకు ఎందుకు పెరిగిందన్న విషయమై ప్రభుత్వంతో పాటు, అధికారులు జవాబు చెప్పడం లేదు. చట్టంలోనే పోలవరాన్ని పూర్తి మిగతా 2లో

ప్రత్యేక కథనాలు 2, 3 పేజీలలో

- 2010-11 నాటికి ప్రాజెక్టు అంచనా రూ.16010.45 కోట్లు
- 2017 నవంబర్ నాటికి ఖర్చు రూ.12567.22 కోట్లు
- జాతీయ ప్రాజెక్టు ప్రకటించక ముందు వ్యయం రూ.5135.87 కోట్లు
- జాతీయ ప్రాజెక్టుగా ప్రకటించిన తర్వాత ఖర్చు రూ.7431.35
- పోలవరం ప్రాజెక్టు అథారిటీ ద్వారా రాష్ట్ర ప్రభుత్వానికి విడుదలైన నిధులు రూ.4329.06 కోట్లు
- రాష్ట్ర ప్రభుత్వానికి కేంద్రం రీయింబర్స్ చేయాల్సిన మొత్తం రూ.3102.29 కోట్లు

## బ్లేమ్ గేమ్ ఆడుతున్నారు

- టిడిపి అవినీతి వ్యవహారం బిజెపి చేతిలో ఉంది
- చంద్రబాబు ఎందుకు నోరెత్తడం లేదు
- మాజీ ఎంపి ఉండవల్లి



2

## చట్టాన్ని పూర్తిగా ఉల్లంఘించారు

- మాజీ ఎంపి మిడియం బాబూరావు
- పునర్నిర్మాణానికి అవసరమైన చర్యలు లేవు



2

## ఎన్ని అడ్డంకులు సృష్టించినా పూర్తి చేస్తాం

- జలవనరులశాఖ మంత్రి దేవినేని ఉమా



2

## పాలస్తీనాకు ద్రోహం

- జెరూసలేంను ఇజ్రాయిల్ రాజధానిగా గుర్తించిన అమెరికా
- ఇది అత్యంత ప్రమాదకరం : అబ్బాస్

**రమల్లా/గాజా:** జెరూసలేం నగరాన్ని ఇజ్రాయిల్ రాజధానిగా గుర్తించి తమ దౌత్య కార్యాలయాన్ని అక్కడికి తరలించాలన్న అమెరికా నిర్ణయం మధ్యప్రాచ్యంలో శాంతి, సుస్థిరతలకు తీవ్ర విఘాతం కలిగిస్తుందని పాలస్తీనా అధ్యక్షుడు మహ్మూద్ అబ్బాస్ హెచ్చరించారు. సౌదీ అరేబియా, జోర్డాన్, ఈజిప్ట్, ట్యునీషియా, కువైట్, కతార్ తదితర దేశాల నేతలకు ఈ విషయాన్ని ఆయన వివరించారు అమెరికా నిర్ణయంపై ఆయన వివిధ అరబ్ దేశాల నేతలతో పలుమార్లు చర్చించారు. దీనితో పాటు ఫ్రాన్స్, ఐరోపా దేశాల కూటమి (ఇయు), ఇస్లామిక్ కాన్ఫరెన్స్, అరబ్‌లీగ్ తదితర దేశాల కూటమి నేతలతో కూడా ఆయన చర్చించారు. అమెరికా నిర్ణయం ఈ ప్రాంతంలో అనూహ్య పరిణామాలకు దారి తీస్తుందని ఆయన ఆందోళన వ్యక్తం చేశారు.

**మీడియా కథనాలు**

జెరూసలేం నగరాన్ని ఇజ్రాయిల్ రాజధానిగా గుర్తించాలని మిగతా 9లో



ఇస్రో బాహుబలిగా పేరొందిన జిఎస్‌-ఎల్‌వి పనితీరును వివరిస్తున్న షార్ ప్రతినిధి విశ్వనాథశర్మ

## శాస్త్ర, సాంకేతిక రంగానికి పెద్ద పీట

- టెక్నాలజీ వినియోగించుకుని విద్యార్థులు శాస్త్రవేత్తలుగా ఎదగాలి
- అటవీ శాఖ మంత్రి శిద్దా రాఘవరావు
- ఒంగోలులో 25వ జాతీయ బాలల సైన్స్ కాంగ్రెస్ ప్రారంభం

**ప్రజాశక్తి - ఒంగోలు కలెక్టరేట్**

రాష్ట్ర ప్రభుత్వం శాస్త్ర, సాంకేతిక రంగానికి పెద్ద పీట వేసిందని, టెక్నాలజీని వినియోగించుకుని విద్యార్థులు గొప్ప శాస్త్రవేత్తలుగా ఎదగాలని రాష్ట్ర అటవీ, పర్యావరణ, శాస్త్ర సాంకేతిక శాఖ మంత్రి శిద్దా రాఘవరావు పేర్కొన్నారు. ఒంగోలులోని రైజ్ ఇంజినీరింగ్ కళాశాలలో ఆదివారం రాష్ట్రస్థాయి 25వ జాతీయ బాలల సైన్స్ కాంగ్రెస్‌ను ఆయన ఆదివారం ప్రారంభించారు. తొలుత కళాశాల ఆవరణలో ఏర్పాటు చేసిన మహాత్మా గాంధీ కాంస్య విగ్రహాన్ని మంత్రి ఆవిష్కరించారు. అనంతరం విద్యార్థుల ఎగ్జిబిట్లను పరిశీలించి వాటి వివరాలను విద్యార్థులను అడిగి తెలుసుకున్నారు. తర్వాత రైజ్ సెమినార్ హాలులో జరిగిన కార్యక్రమానికి రాష్ట్ర శాస్త్ర సాంకేతిక మండలి మెంబర్ కన్వీనర్ బివిఎ.కృష్ణమూర్తి అధ్యక్షత వహించారు. కార్యక్రమంలో భారత మాజీ రాష్ట్రపతి ఎపిజె అబ్దుల్ కలాం చిత్రపటానికి మంత్రి పూలమాల వేసి నివాళులు అర్పించారు. ఈ సందర్భంగా విద్యార్థులను ఉద్దేశించి రాఘవరావు మాట్లాడుతూ.. ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు రాష్ట్రంలో శాస్త్ర సాంకేతిక రంగానికి అత్యంత ప్రాధాన్యత మిగతా 9లో

## ఓయూ విద్యార్థి ఆత్మహత్య

- ఘటనపై పలు అనుమానాలు
- సూసైడ్ నోట్ తారుమారు చేసినట్లు ఆరోపణలు
- డిఎస్పీ వాయిదా పద్దందుకే మనస్తాపం
- భౌతికకాయాన్ని తరలించకుండా అడ్డుకున్న విద్యార్థులు

**ప్రజాశక్తి - హైదరాబాద్ బ్యూరో**

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎమ్మెస్సీ మొదటి సంవత్సరం చదువుతున్న మురళి ఆత్మహత్యకు పాల్పడ్డాడు. ఈ ఘటన ఆదివారం క్యాంపస్‌లో కలకలం రేపింది. మానేరు హాస్టల్ రూం నంబరు 159కు సమీపంలోని బాత్‌రూంలో ఉరేసుకున్నాడు. అయితే మురళి మెడకు బిగించినట్లు ఉన్న సన్నటి వైరుకు షూ లేస్ ముడి వేసి ఉండడం, ఆ వైరు అవతలి వైపున మేకుకు కట్టి ఉండడం పలు అనుమానాలకు తావిస్తోంది. దీంతో అసలిది ఆత్మహత్యేనా అన్న అనుమానం కలిగించేలా ఉంది. సాయంత్రం సుమారు 3.30 గంటల ప్రాంతంలో బాత్ రూంకు వెళ్ళిన మురళి ఎంతసేపటికీ బయటకు రాకపోవడంతో, అక్కడున్న ఇతర విద్యార్థులకు అనుమానం వచ్చి డోర్ పగుల గొట్టి మిగతా 9లో

# కంపెనీ మేత



- పశుగ్రాసంలోనూ పిపిపి
- మెగా క్షేత్రాలు
- రైతుల భూములు ప్రైవేటుకు
- కౌలు చెల్లించనున్న సర్కారు
- పచ్చగడ్డి పెంపకం, ప్రాసెసింగ్
- ఉత్పత్తి చేసిన ఫీడ్ మొత్తానికీ ప్రభుత్వ గ్యారంటీ
- 'అధికార' ఔత్సాహికులకు పండగ

**ప్రజాశక్తి ప్రత్యేక ప్రతినిధి- అమరావతి**

అన్ని రంగాల్లోనూ ప్రభుత్వ, ప్రైవేటు భాగస్వామ్యం (పిపిపి)ను ప్రవేశపెడుతున్న చంద్రబాబు సర్కారు మరో అడుగు ముందుకేసి పశుగ్రాసంలోనూ అదే విధానాన్ని చొప్పించింది. పచ్చ గడ్డి ఉత్పత్తిలో రైతుల పాత్రను తొలగించి ప్రైవేటు కంపెనీలను ఆహ్వానించి అపరిమితమైన ప్రోత్సాహకాలిస్తోంది. ప్రతిపాదిత పిపిపి ఫార్ములా పాడి రైతుల కోసమేనని పేర్కొంది. వేసవిలో పశు గ్రాసానికి కొరత లేకుండా ముందస్తు ఏర్పాట్లు చేస్తున్నామని వెల్లడించింది. మెగా పశుగ్రాస క్షేత్రాలు నెలకొల్పుతోంది. రాయితీపై రైతులకు గడ్డిని సరఫరా చేస్తామంది. పిపిపి ప్రశుగ్రాసంపై సర్కారు విడుదల చేసిన జీవోఆర్‌టి నెం.323లో ప్రైవేటుకు పెద్ద పీట వేసింది. సర్కారు 2015లోనే పశుగ్రాస విధానాన్ని ప్రతిపాదించగా నిరుడు జులైలో దానికి సంబంధించి జీవోఆర్‌టి నెం.169 జారీ చేసింది. పిపిపి పద్ధతిలో పశుగ్రాస క్షేత్రాలు నెలకొల్పేందుకు మార్గదర్శకాలిచ్చింది. దానికి కొనసాగింపుగా తాజాగా వెలువరించిన ఉత్తర్వుల్లో పిపిపి విధానాన్ని మరింత విస్తరించింది.

**30 వేల ఎకరాలు**

రాష్ట్ర వ్యాప్తంగా 30 వేల ఎకరాల్లో పచ్చగడ్డిని పెంచి ఆరు లక్షల టన్నులు ఉత్పత్తి చేయాలని లక్ష్యంగా నిర్ణయించింది. పశుసంవర్ధక శాఖ పరిధిలో ఔట్‌సోర్సింగ్, స్కీం వర్కర్లుగా పని చేస్తున్న ఎంపిడిఇఎ, గోపాలమిత్ర, పశుమిత్రలు గ్రామాల్లో తిరిగి పచ్చగడ్డి పెంపకానికి కావాల్సిన భూములను కౌలుకు ఇచ్చే రైతులను గుర్తిస్తారు. జిల్లా స్థాయిలోని ప్రభుత్వ కమిటీలు నిర్ణయించిన కౌలును భూములిచ్చే రైతులకు ప్రభుత్వమే చెల్లిస్తుంది. కౌలు సమయం ఒక సీజను లేక సంవత్సరం ఉంటుంది. రైతుల నుంచి కౌలుకు తీసుకున్న భూములను ప్రైవేటు కంపెనీలకు అప్పగిస్తారు. సదరు కంపెనీలు ఆ భూముల్లో పచ్చగడ్డి పెంచుతాయి. పెంచిన పచ్చగడ్డిని రవాణాకు, నిల్వ చేసేందుకు అనుకూలంగా సైలేజి (ముక్కలు ముక్కలుగా ప్యాకింగ్) పద్ధతిలో ప్రాసెస్ చేస్తాయి. కంపెనీలు ఉత్పత్తి చేసిన మేత మొత్తానికీ సర్కార్ గ్యారంటీ ఇచ్చింది. కిలో పచ్చగడ్డి ఉత్పత్తికి రూ.1, ప్రాసెసింగ్‌కు రూ.3 వెరసి రూ.4గా నిర్ణయించింది. ప్రాసెస్ చేయని గడ్డిని కంపెనీ కిలో రూ.1కి అమ్ముకుకే వెసులుబాటు ఇచ్చింది. మిగిలి పోయిన లేక అవసరానికి మించి ఉత్పత్తి చేసిన పచ్చగడ్డిని రూ.4కు సర్కారే కొనుగోలు చేస్తుంది. పాల ఉత్పత్తిదారులకు రూ.2పై మిగతా 9లో

నేటి మీ కపిల్‌చిట్స్ తో సభ్యత్వం ఓ మంచి ఆర్థిక నేస్తంతో బంధుత్వం
Visit Us: www.kapilchits.com
కపిల్ చిట్స్
కపిల్ చిట్స్ మీ కలలకు సాకారం

Simhadri TMT
world class steel bars
Now Available For Cities At :
Avail Special Offers For Projects

40 నిముషాలు పట్టే క్యాన్సర్ 'రేడియోథెరపీ' చికిత్స 4 నిముషాలలోనే..
నాగార్జున క్యాన్సర్ సెంటర్
కానూరు, విజయవాడ-7.
టోల్ ఫ్రీ : 1800 123 0066

అధిక దిగుబడులు పొందడానికి అగ్నీ వాడండి
డీలర్స్ మరియు సేల్స్ ఏజెన్సీస్ సంప్రదించండి
Varsha Bioscience and Technology India Pvt Ltd

'చర్మ'వ్యాధులతో బాధలా? కాన్స్టిట్యూషనల్ హోమియోపతితో సరైన పరిష్కారాలు.
• సోరియాసిస్
• ఎగ్జిమా
• చర్మం పొడిబారటం
• జుట్టు రాలుట/బట్టతల
హోమియోకేర్ ఇంటర్నేషనల్
టోల్ ఫ్రీ 1800 108 1212
కన్సల్టేషన్ ఉచితం 955 000 1199
తెలంగాణ | ఆంధ్రప్రదేశ్ | కర్ణాటక | తమిళనాడు | పుదుచ్చేరి

## వాయు'గండం'

ప్రజాశక్తి- విశాఖపట్నం ప్రతినిధి

ఆగ్నేయ బంగాళాఖాతంలో దక్షిణ అండమాన్‌కు ఆనుకుని ఏర్పడిన అల్పపీడనం ఆదివారం నాటికి తీవ్ర అల్పపీడనంగా బలపడినట్లు భారత వాతావరణశాఖ ప్రకటించింది. దీనికి అనుబంధంగా 5.8 కిలోమీటర్ల ఎత్తులో ఉపరితల ఆవర్తనం కొనసాగుతోందని తెలిపింది. తీవ్ర అల్పపీడనం 24 గంటల్లో వాయుగుండంగా మారుతుందని, తర్వాత మరో 48 గంటల్లో తీవ్ర వాయుగుండంగా మారుతుందని భారత వాతావరణ శాఖ హెచ్చరించింది. ఇది ఉత్తర తమిళనాడు-దక్షిణ కోస్తాంధ్ర తీరానికి 3 లేదా 4 రోజుల్లో చేరుకుంటుందని తెలిపింది.



**పరిశీలన**

ఒంగోలులో 25వ జాతీయ బాలల సైన్స్ కాంగ్రెస్ ప్రారంభోత్సవం సందర్భంగా హైరేంజ్ టెలిస్కోప్‌ను అటవీ శాఖ మంత్రి శిద్ధా రాఘవరావు, ఎమ్మెల్సీ కరణం బలరామకృష్ణమూర్తి ఆదివారం పరిశీలించారు.

## పోలవరం అంకెల గారడీ

ప్రజాశక్తి - అమరావతి బ్యూరో

సజావుగా సాగాల్సిన పోలవరం పనులు అంకెలగారడీగా మారుతున్నాయి. నిధులు విడుదల చేయడంలో మోడీ ప్రభుత్వం వేగం చూపించడం లేదన్న ఆరోపణలు వ్యక్తమవుతున్నాయి. జాతీయ హోదా ప్రకటించడానికి ముందు 5135 కోట్ల రూపాయలను రాష్ట్ర ప్రభుత్వం ఖర్చు చేయగా, మిగిలిన దాదాపు 11 వేల కోట్ల కోట్ల రూపాయలను తాము భరించనున్నట్లు వెల్లడించింది. 2014 ఏప్రిల్ నుంచి జరిగిన ఖర్చును మాత్రమే భరించనున్నట్లు కేంద్రం ప్రకటించింది. అయితే ఈ ప్రాజెక్టు నిర్మాణ అంచనా తాజాగా 42 వేల కోట్లకు చేరుకోవడం, పెరిగిన మొత్తం ఇవ్వడంపై కేంద్ర ప్రభుత్వం నుండి సానుకూల సంకేతాలు లేకపోవడంతో రాష్ట్ర ప్రభుత్వం ఆందోళన వ్యక్తం చేస్తోంది. పోలవరం ప్రారంభమైన కొత్తల్లో ఎఐబిపి ద్వారా నిధులు కేటాయించిన కేంద్ర ప్రభుత్వం తరువాత జాతీయ హోదాతో నిధులు ఇస్తామని ప్రకటించింది. ఎఐబిపి ద్వారా 2008 నుంచి 2014 మార్చి వరకు 3658 కోట్లు విడుదల చేసింది. జాతీయ హోదా వచ్చిన తరువాత గత ఏడాది నవంబర్ వరకు 3133 కోట్లు విడుదల చేసింది. ఇందులో పోలవరం అథారిటీ ఏర్పడిన తరువాత 2916 కోట్లు విడుదల చేసింది. పోలవరం కోసం తాజాగా 5810 కోట్లు ఇవ్వాలని కేంద్రం నిర్ణయించగా, అందులో 3349 కోట్లు విడుదల చేసింది. మరో వెయ్యి కోట్లు ఇస్తామని చెప్పినప్పటికీ ఇంకా విడుదలకు నోచుకోలేదు. దీనికోసం రాష్ట్ర ప్రభుత్వం ఎదురుచూస్తోందని అధికారులు చెబుతున్నారు. మరోవైపు రాష్ట్ర ప్రభుత్వం చేస్తున్న ప్రకటనలు అయోమయానికి గురిచేస్తున్నాయి. కేంద్రం చెబుతున్న లెక్కల మేరకు పోలవరానికి వచ్చేది ఐదారు వేల కోట్ల కన్నా ఎక్కువ ఉండదని అధికారులు అంచనా వేస్తున్నారు. అయితే పూర్తి చేసేందుకు ఇంకా 30 నుంచి నలభై వేల కోట్లు కావాల్సి ఉంటుందని అంటున్నారు. ఈ నిధులు ఎక్కడి నుంచి ఎలా వస్తాయన్నదే ఇప్పుడు సమాధానం లేని ప్రశ్నగా మారింది.

## ఎన్ని అడ్డంకులు సృష్టించినా పూర్తి చేస్తాం

### దేవినేని ఉమా

ప్రజాశక్తి - అమరావతి బ్యూరో

ప్రాజెక్టును చట్ట ప్రకారం నిర్మిస్తున్నామని, ఎన్ని అడ్డుంకులు సృష్టించినా ఆపేది లేదని రాష్ట్ర జలవనరులశాఖ మంత్రి దేవినేని ఉమామహేశ్వరరావు అన్నారు. బయట కూర్చుని ప్రాజెక్టుపై రాళ్లువేయడం కంటే అక్కడకు వచ్చి పనులు పరిశీలించాలని ఆయన అన్నారు. కొద్దిమంది కావాలని ఉద్దేశపూర్వకంగా పోలవరంపై లేనిపోని ప్రచారం చేస్తున్నారని అది వాస్తవం కాదని తెలిపారు. చంద్రబాబు ముఖ్యమంత్రి అయిన తరువాతనే ప్రాజెక్టు పనులు ముందుకు సాగాయని, అతి తక్కువకాలంలో 45 సార్లు పనులు పరిశీలించారని, 27 నేరుగా అక్కడకు వెళ్లి వచ్చారని ఆయన పేర్కొన్నారు. ఒక ప్రాజెక్టుపై ఇంతటి దృష్టిపెట్టిన ముఖ్యమంత్రి మరొకరు లేరని మంత్రి అన్నారు. నిధుల విషయంలో అన్నీ చట్టప్రకారం చేసుకుపోతున్నామని చెప్పారు. కావాలని విమర్శలు చేయడం సరికాదని వివరించారు. ప్రాజెక్టు విషయంలో ముఖ్యమంత్రి చంద్రబాబు ప్రధాని మోడీతో మాట్లాడతారని, సమస్యలన్నీ పరిష్కారం అవుతాయని తెలిపారు.

## బ్లేమ్ గేమ్ ఆడుతున్నారు

### టిడిపి, బిజెపి తీరుపై మాజీ ఎంపి ఉండవల్లి

ప్రజాశక్తి - అమరావతి బ్యూరో

పోలవరం ప్రాజెక్టు విషయంలో తెలుగుదేశం, బిజెపి ప్రభుత్వాలు బ్లేమ్ గేమ్ ఆడుతున్నాయని మాజీ ఎంపి ఉండవల్లి అరుణ్‌కుమార్ తెలిపారు. పోలవరం ప్రాజెక్టు అనేది ప్రజలకు సంబంధించినదని, సొంతింటి వ్యవహారంలా మాట్లాడుతున్నారని ఆగ్రహాన్ని వ్యక్తం చేశారు. ఈ ప్రాజెక్టులో అవినీతి జరిగిందనేది అక్షర సత్యమని, ఈ వ్యవహారం బిజెపి దగ్గర ఉందని, అవసరమైనప్పుడు చంద్రబాబును నొక్కేస్తారనీ పేర్కొన్నారు. అవినీతి లేకపోతే చంద్రబాబు ఎందుకు నోరెత్తడంలేదో చెప్పాలన్నారు. ప్రాజెక్టు పనుల్ని ఆపే హక్కు ఎవరికీ లేదన్నారు. ఆదివారం ఆయన ప్రజాశక్తికి ప్రత్యేక ఇంటర్వ్యూ ఇచ్చారు.

**చంద్రబాబు జైలుకెళ్లడం ఖాయం**

పోలవరం విషయంలో అవినీతి జరిగిందని, అంచనాలు పెంచేశారని పేర్కొన్నారు. బిజెపి కూడా ఖర్చులు పెంచారని చెప్పడంలో వాస్తవం లేదన్నారు. '2014 లెక్కల ప్రకారం డబ్బులు చెల్లిస్తామనడం హాస్యాస్పదం. అన్ని ప్రాజెక్టులకు ఇదే పద్ధతి అనుసరిస్తోందా. ఇదెక్కడి న్యాయం. నిజంగా పోలవరం పూర్తవుతుందనే నమ్మక లేకనే చంద్రబాబు పట్టిసీమ, పురుషోత్తపట్నం ప్రాజెక్టులు చేపట్టారు. కేంద్రం లెక్కల్లో ఈ రెండు ప్రాజెక్టులూ లేవు. కేంద్రం ఇచ్చిన నిధులు వాటికి ఖర్చు చేయడం వల్లే లెక్కలు చెప్పలేకపోతున్నారు. ఇప్పుడు వీటిపై కాగ్ లెక్కతేలిస్తే చంద్రబాబు జైలుకెళ్లడం ఖాయం. అసలు చంద్రబాబు ఎందుకు మాట్లాడాలి. కేంద్రం డబ్బులిస్తుంది. అధికారులు ఖర్చు చేస్తున్నారు. చంద్రబాబుకు ఎందుకు ఉలుకో అర్థంకావడంలేదు' అని అన్నారు

రూ.1660 కోట్లతో పట్టిసీమ, 1800 కోట్లతో పురుషోత్తపట్నం లిఫ్టులు కట్టడం వెనుక జరిగిన అవినీతిని చంద్రబాబు ప్రజలకు వివరించాలన్నారు. 'ఎపి ప్రజల్ని బిజెపి పాలకులు అసలు మనుషులుగానే చూడటం లేదు. లేకపోతే స్పెషల్ కేటగిరీ ఇవ్వాలని ప్రతిపాదన పెట్టి ఆమోదించిన బిజెపి ఇప్పుడు ఎందుకు అమలు చేయడం లేదు. దీనిపై చంద్రబాబు ఎందుకు ప్రశ్నించడం లేదు. అదే సమయంలో పోలవరం ముంపు మండలాల ఆర్డినెన్స్ పెట్టారు. స్పెషల్ కేటగిరీ ఆర్డినెన్స్‌ను బిజెపి ఎందుకు ప్రతిపాదించలేదు. దీనికి సమాధానం చెప్పాలి. మిత్రపక్షంగా ఉన్న తెలుగుదేశం దీని గురించి మాట్లాడటం లేదు. పోలవరం ప్రాజెక్టును ఎన్నికల ప్రాజెక్టుగా మార్చుకున్నారు కనుకనే దీనిపై రాద్ధాంతం చేస్తున్నారు. చంద్రబాబు కూడా చేసిన ఖర్చుల వివరాలిస్తే సమస్య ఉండదు. మోడీ కూడా చంద్రబాబును తొక్కిపెట్టి ఉంచుతున్నారు. గుజరాత్ ఎన్నికల తరువాత చంద్రబాబుపై కేంద్రం ఏదో ఒక యాక్షన్ తీసుకోవచ్చు. ఆయన వ్యవహారం మొత్తం గుప్పిట్లో ఉండబట్టే బిజెపి నాయకులు ఇష్టం వచ్చినట్లు మాట్లాడుతున్నారు. చంద్రబాబు మాత్రం ఎవరినీ నోరెత్తొద్దని వారి నాయకత్వానికి చెబుతున్నారు. టిడిపి, బిజెపికి రాజకీయంగా చెడింది కనుకనే ఈ వ్యవహారం బయటకు వచ్చింది.' అని ఉండవల్లి పేర్కొన్నారు. విభజన సమయంలో ఇచ్చిన హామీ ఒక్కటి కూడా నెరవేరలేదన్నారు. ఎడ్యూలు 9, 10 ఆస్తుల సమస్య అలాగే ఉందన్నారు. పోవలరం చుట్టూ రాజకీయ వ్యవహారాన్ని నడుపుతున్నారని, ప్రజల సమస్యల్ని పక్కనపెట్టారని ఆయన ఆందోళన వ్యక్తం చేశారు.

> "' కొత్తగా పిలిచిన టెండర్లలోనూ గోల్‌మాల్ ఉంది. పేపరు ప్రకటనలో ఒక అంచనా, షెడ్యూలులో ఒక అంచనా ఇచ్చారు. దీన్ని కేంద్ర ప్రభుత్వ అధికారి అమర్‌జీత్‌సింగ్ ప్రశ్నించారు. దానికి సమాధానం చెప్పుకోలేక చంద్రబాబు నానా యాతన పడుతున్నారు. బిజెపి కూడా ఎందుకు ఈ ప్రాజెక్టుపై అంత రాద్ధాంతం చేస్తుందో అర్థం కావడం లేదు. పనులు ఆపమని కేంద్రం చెప్పకపోయినా చంద్రబాబు పనులు ఆపినట్లు వార్తలొస్తున్నాయి. ఇది చట్ట విరుద్ధం. ప్రాజెక్టు ఆపితే నష్టం వాటిల్లుతుంది. అతుకుల బొంతగానే ప్రాజెకు మిగిలిపోతుంది'
>
> - ఉండవల్లి అరుణ్ కుమార్"

## చట్టాన్ని పూర్తిగా ఉల్లంఘించారు

### మాజీ ఎంపి మిడియం బాబూరావు

ప్రజాశక్తి - అమరావతి బ్యూరో

పోలవరం ప్రాజెక్టు ప్రాంతం, ముంపు మండలాల్లో పునర్నిర్మాణం, పునరావాసానికి అసరమైన చర్యలేవీ ప్రభుత్వం ఇంతవరకు తీసుకోలేదు. పూర్తి చట్ట విరుద్ధంగా ప్రాజెక్టు నిర్మిస్తోంది. చట్టం ప్రకారం పునరావాసులను తరలించిన తరువాతే నిర్మాణాలు మొదలుపెట్టారు. ప్రభుత్వం ముందుగానే ప్రాజెక్టు చేపట్టి నీటి నిల్వ చేయడం ద్వారా బలవంతంగా గ్రామాలను ఖాళీ చేయించాలనే ఆలోచన చేస్తోంది. దీనివల్ల పునరావాసులకు ఇవ్వాల్సిన డబ్బును మిగుల్చుకోవచ్చనే ఆలోచన చేస్తోందని భద్రాచలం మాజీ ఎంపి డాక్టర్ మిడియం బాబూరావు అన్నారు. పోలవరం ప్రాజెక్టు పరిధిలో పునరావాసం, పునర్నిర్మాణంపై ఆయన ప్రజాశక్తికి ప్రత్యేక ఇంటర్వ్యూ ఇచ్చారు.

**స్థల సేకరణ చేయలేదు**

చట్ట ప్రకారం పునర్నిర్మాణం కోసం చేయాల్సిన పనులేవీ చేయలేదు. పోలవరం, దేవీపట్నం మండలాల్లో 12 గ్రామాల్లో 1300 ఇళ్లు ఇప్పటికీ పూర్తి చేయేలదు. దాదాపు 400 గ్రామాల్లో 83 వేల ఇళ్లు కట్టాలంటే ఎంతకాలం పడుతుందో ప్రభుత్వమే సమాధానం చెప్పాలి. కనీసం పునరావాసానికి అవసరమైన భూమిని కూడా ఇంతవరకూ సేకరించలేదు. 2018 నాటికి నీటిని నిల్వ చేస్తామంటున్నారు. అంటే గ్రామాలన్నీ మునిగిపోవాలని చంద్రబాబు చెబుతున్నారా.

**పునరావాసం కోసమే 1.06 లక్షల ఎకరాలు**

పునరావాసం కోసం మొత్తం 1.06 లక్షల ఎకరాల భూమి సేకరించాల్సి ఉంది. ఇంతవరకు సేకరించలేదు. వాటిల్లో కాలనీలూ కట్టలేదు. ఈ రోజు వరకూ 24 వేల ఎకరాలు సేకరించారు. నిర్మించిన అతికొద్ది ఇళ్లూ నాసిరకంగా ఉంటున్నాయి. పునరావాసం అంటే అంతకు ముందున్న గ్రామంలో సదుపాయాలన్నీ నూతనంగా నిర్మించేచోట కల్పించాలి. కానీ రోడ్లు కూడా వేయలేదు. మంచినీటి సదుపాయం లేదు. విద్యుత్ కనెక్షన్లూ ఉండటం లేదు. ప్రజలను తీవ్ర ఇబ్బందులు పెడుతున్నారు.

**గిరిజనులకు భూమికి భూమి ఇవ్వాలి**

గిరిజన ప్రాంతాల్లో వారిని తరలించాల్సొస్తే వారికి భూమి కి భూమి ఇవ్వాలని చట్టం చెబుతోంది. ప్రభుత్వం మాత్రం వారికి ఎంతో కొంత ముట్టజెప్పి వారిని బయటకు పంపించేద్దామనుకుంటున్నారు. ఇది సరైన పద్ధతి కాదు. గిరిజనులు ఒక ప్రత్యేక జీవన విధానం ఉంటుంది. చట్టం ప్రకారం వారికి న్యాయం చేయాలి. పునరావాసం కల్పించాలి. అలా కాకుండా ముందుగానే ప్రాజెక్టు నిర్మిస్తామంటే ప్రజలను నట్టేట ముంచటమే అవుతుంది.

## పోలవరం ఎందుకిలా..?

(మొదటిపేజీ తరువాయి)

చేసేందుకు అంగీకరించిన కేంద్రం పోలవరం ప్రాజెక్టు అథారిటీని స్వయంగా ఏర్పాటుచేసింది. పోలవరంపై ఏ నిర్ణయం తీసుకోవాలన్నా కూడా అథారిటీ అనుమతి తప్పనిసరి అంటూ తేల్చిచెప్పింది. కొత్త టెండర్లు పిలవాలన్నా, నిధులు ఖర్చు చేయాలన్నా కూడా పిపిఎ అనుమతి తప్పనిసరి. అయితే ఈ నిబంధనలకు రాష్ట్ర ప్రభుత్వం అడుగడుగునా ఉల్లంఘిస్తూనే ఉందన్న విమర్శలు పెరుగుతున్నాయి. తాజాగా వివాదానికి కారణమైన 1300 కోట్ల రూపాయల టెండర్‌ను కూడా అథారిటీ అనుమతి లేకుండానే పిలిచారని కేంద్రం చెబుతోంది. స్పిల్‌వే ఒక్కటే కాదు, 16వేల కోట్ల రూపాయల పోలవరం ప్రాజెక్టు కాస్తా 50 వేల కోట్లు దాటింది. 60 వేల కోట్లకు చేరుతుందన్న అంచనాలు వినిపిస్తున్నాయి. అసలు కేంద్రం చేతిలో ఉన్న ప్రాజెక్టుకు రాష్ట్ర ప్రభుత్వం టెండర్లు ఎలా పిలుస్తోంది? ఎందుకు పిలుస్తోందన్న అనుమానాలకు సమాధానాలు లభించడం లేదు. కేవలం కేంద్రంపై వత్తిడి పెంచి పనులు వేగవంతం చేయించుకోవాల్సిన తరుణంలో రాష్ట్ర సర్కారు ఈ విధంగా ఎందుకు వ్యవహరిస్తోందో అర్థం కావడం లేదన్న వ్యాఖ్యలు అధికారవర్గాల నుండే వినిపిస్తున్నాయి.

**ప్రజ్ఞ**

సమాధానాలు 11లో

1. కెన్యా నూతన అధ్యక్షులు?
2. మిస్ సుప్రనేషనల్ 2017 విజేత?
3. వరల్డ్ డయాబెటిస్ డేను ఎప్పుడు నిర్వహిస్తారు?
4. దివ్యాంగుల కోసం ప్రత్యేకం క్యాంపెన్ ఏర్పాటు చేస్తున్న రాష్ట్రం?
5. ఇన్ఫోసిస్ నూతన ఎమ్‌డి?

# పోలవరానికి జాతీయ హోదాలో మెలిక

ప్రజాశక్తి - అమరావతి బ్యూరో

2014లో రాష్ట్రం విడిపోయిన సమయంలో పోలవరం ప్రాజెక్టును తామే వంద శాతం ఖర్చు చేసి పూర్తి చేస్తామని కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది. అయితే ఈ ప్రకటనలోనే ఒక మెలిక పెట్టింది. 2010-11 అంచనాల మేరకేనంటూ ట్విస్ట్ ఇవ్వడం విశేషం. అంటే కేవలం 16 వేల కోట్ల రూపాయల అంచనాలకే తాము పరిమితమవుతున్నట్లు కేంద్రం స్పష్టం చేసింది. ఈ ట్విస్ట్‌ను కొన్ని రోజులపాటు రాష్ట్ర ప్రభుత్వం గమనించలేక... కేంద్రాన్ని పొగడ్తలతో ముంచెత్తింది. గుర్తించిన తరువాత కూడా దీనిపై స్పందించని చంద్రబాబు సర్కారు అంచనాలను ఇష్టానుసారంగా పెంచేసింది. కొత్త భూసేకరణ, పునరావాస చట్టం వల్ల నిర్వాశితులకు భారీగా నిధులు ఇవ్వాల్సి వస్తోందని చెప్పిన రాష్ట్ర ప్రభుత్వం అంచనాలను పలు దఫాలుగా పెంచేశారు. ఇదే సమయంలో పాత 16 వేల కోట్ల రూపాయల అంచనాలకే తాము పరిమితమవుతామని కేంద్రం తేల్చిచెప్పేసింది. జాతీయహోదాలో మెలిక పెట్టినప్పుడే గట్టిగా డిమాండ్ చేసి ఉంటే పరిస్థితి మరోలా ఉండేదోనన్న అభిప్రాయం వ్యక్తమవుతోంది.

**పునరావాసంకు నిధులు ఎలా?**

దీంతో భూసేకరణ, పునరావాస వ్యయాన్ని ఎవరు భరించాలన్న దానిపై సందిగ్ధత వీడడంలేదు. ప్రస్తుత ఆర్థిక పరిస్థితి నేపథ్యంలో కేంద్రం కూడా భారీ నిధులను భరించే పరిస్థితిలో లేదని అధికారులు చెబుతున్నారు. రాష్ట్రంలో కూడా ఆర్థిక పరిస్థితి ఇలాగే ఉండడంతో వేల వేల కోట్లు ఎలా భరిస్తుందన్న ప్రశ్నలు ఉత్పన్నమవుతున్నాయి. ఈ నేపథ్యంలో పోలవరం నిర్మాణాన్ని పూర్తి చేయడం అసాధ్యమన్న భావాన్ని కూడా సీనియర్ అధికారులు బాహాటంగానే వ్యక్తం చేస్తున్నారు. భూసేకరణ, నిర్వాశితులకు పునరావాసం వ్యయాన్ని తాము ఇచ్చేది లేదని అనేక సందర్భాల్లో కేంద్రం తేల్చిచెప్పినా.. చంద్రబాబు ఎన్నడూ ప్రశ్నించలేదు. కేవలం ఒకటి రెండు లేఖలు కేంద్రానికి రాసి అధికారులు చేతులు దులుపుకొన్నారు. పునరావాస నిధులను రాష్ట్రం భరించే పరిస్థితి లేదన్నది కూడా అందరికీ తెలిసిన విషయమే. విచిత్రమేమిటంటే ఎక్కడ ఇటువంటి వాస్తవాలు చెప్పాల్సి వస్తుందోనన్న భయంతో ఇరిగేషన్ అధికారులు మీడియాతో మాట్లాడడమే మానేసారు. ఇతర రాష్ట్రాల సమస్యలు కూడా పోలవరాన్ని వేధిస్తున్నాయి. ఈ ప్రాజెక్టును కేంద్రమే పూర్తిచేయాలని విభజన చట్టంలో ఉన్నప్పటికీ, అందుకు అవసరమైన చర్యలు మాత్రం కనిపించడం లేదు. పోలవరంపై సుప్రీం కోర్టులో దాదాపు ఆరు కేసులు, ఒడిషా, రాష్ట్ర హైకోర్టుల్లో ఒక్కో కేసు, కేంద్ర గ్రీన్ ట్రిబ్యునల్‌లో రెండు కేసుల చొప్పున పెండింగ్‌లో ఉన్నాయి. వాటిని త్వరగా పరిష్కరించేందుకు కేంద్రం జోక్యం చేసుకోవాల్సి ఉన్నప్పటికీ ఆ విధమైన స్పందన కనిపించడం లేదు. అవి పరిష్కారమైతే తప్ప పోలవరం ముందుకు సాగే అవకాశాలు లేవు. అలాగే చత్తీస్‌గఢ్, ఒడిషాల్లోని ముంపు ప్రాంతాల్లో నిర్వహించాల్సిన పబ్లిక్ హియరింగ్ కూడా చాలా సంవత్సరాలుగా జరగడం లేదు.



**కేంద్రానికి ఇచ్చేస్తే మంచిది**

పోలవరం ప్రాజెక్టు సకాలంలో పూర్తి కావాలంటే నిర్మాణ బాధ్యతను కేంద్రానికి అప్పగిస్తే మంచిదని గతం నుంచి ఉన్నతాధికారులు తేల్చిచెబుతున్నారు. దీనివల్ల స్థానికంగా విమర్శలు కూడా తప్పించుకోవచ్చునని వారు స్పష్టం చేశారు. అయితే దీనిని ముఖ్యమంత్రి చంద్రబాబు, ఇరిగేషన్ మంత్రి దేవినేని ఉమా పెడచెవిన పెట్టారు. విభజన అనంతరం పోలవరాన్ని జాతీయ ప్రాజెక్టుగా ప్రకటించడంతోపాటు తామే స్వయంగా పూర్తి చేస్తామని కేంద్రం స్పష్టం చేసింది. అయితే ముఖ్యమంత్రి మాత్రం దీనికి అంగీకరించక తామే పనులు కొనసాగిస్తామని, నిధులు కేంద్రం ఇస్తే సరిపోతుందని పేర్కొంది. ఆ తరువాత కాలంలో పనుల తిరోగమనం, నిధుల వ్యయంలో అసంబద్ధ విధానాల కారణంగా కేంద్రం అనేక సార్లు తీవ్ర స్థాయిలో అసంతృప్తి వ్యక్తం చేసింది. చివరకు పోలవరం అథారిటీ కూడా రాష్ట్ర ఇంజనీర్ల వైఖరిపై అసహనం వ్యక్తం చేసింది. ఈ నేపథ్యంలోనే కేంద్రానికి ప్రాజెక్టు నిర్మాణ బాధ్యత ఇచ్చేయాలని తాము గతంలో చేసిన సూచనలను పాత అధికారులు గుర్తు చేస్తున్నారు. 2015లోనే లిఖిత పూర్వకంగా ఈ సూచన వచ్చినట్లు సీనియర్ ఇరిగేషన్ అధికారి ఒకరు వెల్లడించారు.

**రాజీ ధోరణి ఎందుకు**

పోలవరంపై రాష్ట్ర ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాన్ని కూడా అనేక మంది తప్పుపడుతున్నారు. నిధులు ఇవ్వకపోయినా కేంద్రంపై ఎదురుదాడి చేసేందుకు ముఖ్యమంత్రి వెనుకాడడంపైనా వారు సందేహాలు వ్యక్తం చేస్తున్నారు. కేవలం వచ్చే ఎన్నికల కోసమే రాజీ ధోరణి అవలంభిస్తున్నారని ఉన్నతాధికారి ఒకరు వ్యాఖ్యానించారు.

ఇప్పటికే ప్రత్యేక హోదా, రాజధాని, బకాయిల చెల్లింపులు వంటి వాటిపై రాజీ విధానాన్నే అవలంభిస్తున్న రాష్ట్ర ప్రభుత్వం తాజాగా పోలవరంపైనా ఇదే విధానం అనుసరించడం సరికాదని వారు తేల్చి చెబుతున్నారు. నిజంగా పోలవరంపై రాష్ట్రం ఎదుర్కొంటున్న అపవాదును తొలగించుకోవాలనుకుంటే నిర్మాణ బాధ్యతను కేంద్రానికి ఇచ్చేస్తే సరిపోతుందని వారు స్పష్టం చేస్తున్నారు.

**వంశధారకు ప్రతీకారంగానే**

ఇటీవల వంశధార ప్రాజెక్టు నిర్మాణంపై ఒడిషా ప్రభుత్వానికి ఎదురుదెబ్బ తగిలింది. ఈ ప్రాజెక్టుకు వ్యతిరేకంగా ఒడిషా ప్రయత్నించినప్పటికీ, ట్రిబ్యునల్‌లో ఆంధ్రాకు అనుకూలంగా తీర్పు వచ్చింది. దీనిని జీర్ణించుకోలేకపోయిన ఒడిగా ప్రతీకారంతో పోలవరంపై అభ్యంతరాలను మళ్లీ తెరపైకి తీసుకువచ్చింది. తాజాగా దీనివల్ల రాష్ట్రానికి తీరని అన్యాయం జరుగుతుందని, అందువల్ల పోలవరాన్ని అడ్డుకోవాలని కేంద్రంపై వత్తిడి తీసుకువచ్చింది. ఈ నేపథ్యంలోనే కొత్త టెండర్ల పేరుతో పనులను నిలిపివేయాలని కేంద్రం ఆదేశించడం విశేషం. అయితే ఒడిషాతో మాట్లాడి పనులకు అభ్యంతరం లేకుండా చూడాలని కేంద్రం వద్దకు వెళ్లాలని రాష్ట్ర ప్రభుత్వం భావిస్తోంది.

**ప్రత్యేకం**

# ఎన్నికల బిల్లు

- హడావుడిగా తెచ్చిన ప్రభుత్వం
- టిడిపి ఆఫీసు నుంచి అసెంబ్లీకి..
- నంబరు లేకుండానే పాసైన బిల్లు

ప్రజాశక్తి - అమరావతి బ్యూరో

కాపు రిజర్వేషన్లపై ప్రభుత్వం ప్రవేశపెట్టిన బిల్లు కేవలం రాజకీయ బిల్లుగానే ఉందనే అనుమానాన్ని టిడిపికి చెందిన కాపు సామాజికవర్గ ఎమ్మెల్యేలు వ్యక్తం చేస్తున్నారు. ఈ బిల్లు పెట్టడం, ఆమోదించడం చకచకా సాగిపోయాయి. దీనిపై ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు అసెంబ్లీలో కూడా వివరణ ఇచ్చారు. వాస్తవానికి రిజర్వేషన్లు ఇవ్వాలనుకుంటే కమిషన్ నివేదికను వెంటనే రప్పించుకుని గతేడాదే ఇవ్వొచ్చని, కానీ కమిషన్ నివేదికను ఉద్దేశపూర్వకంగానే ఆలస్యం చేసి చివరకు రాజకీయంగా వాడుకునేందుకు ఇప్పుడీ బిల్లు అసెంబ్లీలో పెట్టారనే అభిప్రాయం అధికారపార్టీ ఎమ్మెల్యేల్లోనే వ్యక్తమవుతోంది. ఈ బిల్లును గవర్నర్‌కు పంపి అక్కడ నుండి రాష్ట్రపతికి పంపించాల్సి ఉంటుంది. అయితే అక్కడ ఆమోదం అంత తేలిక కాదని తెలిసింది. ఇప్పటికే గుజరాత్‌లో పటేళ్ల వ్యవహారం పెండింగ్‌లో ఉంది. కాపు రిజర్వేషన్లను ఆమోదిస్తే గుజరాత్‌లోనూ ఇవ్వాల్సి వస్తుందంటున్నారు.

బిల్లును శనివారం ఉదయం ప్రత్యేక క్యాబినెట్లో చర్చించి అప్పటికప్పుడు అసెంబ్లీలోకి తీసుకున్నారు. నిబంధనల ప్రకారం ప్రభుత్వం ఏదైనా బిల్లునుగానీ, చట్టానికి సవరణలుగానీ పెట్టాలంటే దాని వివరాన్ని ముందు సభకు పరిచయం చేయాలి. దీన్ని స్పీకర్ ఆమోదిస్తారు. ఆ వెంటనే దీన్ని శాసనసభ అధికారులు ప్రత్యేకంగా వారి సొంత ప్రెస్‌లో ముద్రించి బిల్లుకు నంబరు కేటాయిస్తారు. దాన్ని మళ్లీ సభ్యుడు టేబుల్‌పై ఉంచిన సమయంలో స్పీకర్ అనుమతి మేరకు ప్రతిపాదిస్తారు. ఆ సమయంలో స్పీకర్ ఫలానా బిల్లు అనీ, నంబరు సహా స్పష్టంగా పేర్కొంటారు. దానికి సభ్యులు అనుమతి లభిస్తే వెంటనే నిబంధనల ప్రకారం బిల్లు పాసైందని స్పీకర్ ప్రకటిస్తారు. మరునాడు బిల్లు నంబరుతో సహా అసెంబ్లీ అధికారులు గెజిట్ పబ్లికేషన్ ఇస్తారు. కాపు రిజర్వేషన్ బిల్లుకు ఇటువంటి ప్రక్రియ ఏమీ లేదు. బిల్లుకు నంబరు లేకుండా స్పీకర్ పాస్ చేయడం అంత సబబు కాదని సీనియర్ సభ్యులు వ్యాఖ్యానించారు. అసెంబ్లీలో బిల్లు ఏ నంబరుతో అనుమతి పొందిందో అది రికార్డవుతుందని, దీనికి భవిష్యత్తులో ఇబ్బంది రావొచ్చని అంటున్నారు. నంబరు లేకుండా బిల్లును ఆమోదించడం ఇటీవలి కాలంలో ఎప్పుడూ లేదంటున్నారు. బిల్లును గవర్నర్‌కు పంపే సమయంలో వరుస క్రమంలో బిల్లు నంబరు యాడ్ చేసి తాము ముద్రిస్తామని అధికారులు చెబుతున్నారు.

**వేలాది బిల్లుల పెండింగ్**

ప్రస్తుతం అనుమతి పొందిన బిల్లును గవర్నర్‌కు పంపిస్తారు. అక్కడ న్యాయాధికారులు వాటిలో పేర్కొన్న చట్టాలపై పరిశీలన చేసి అంతకుముందున్న సుప్రీం కోర్టు తీర్పులను పరిగణనలోకి తీసుకుని అనుమతిస్తారు. అక్కడ అభ్యంతరాలు వ్యక్తమైతే మళ్లీ తిప్పి పంపిస్తారు. ఆ అభ్యంతరాల మేరకు తగన సవరణలతో మళ్లీ పంపించాల్సి ఉంటుంది. అప్పుడు గవర్నర్ సంతృప్తి చెందితే, దాన్ని రాష్ట్రపతి ఆమోదానికి పంపిస్తారు. రాష్ట్రపతి కార్యాలయంలోని న్యాయవిభాగానికి కేంద్ర హోంశాఖ ద్వారా బిల్లు వెళ్లాల్సి ఉంటుంది. అక్కడ పరిశీలన చేసి రాష్ట్రపతి కార్యాలయ న్యాయ విభాగానికి పంపిస్తారు. అక్కడ వారు పూర్తిస్థాయిలో పరిశీలించి చట్టాలకు లోబడి ఉంటేనే అనుమతిస్తారు. ఇప్పటికే రాష్ట్రపతి కార్యాలయంలో పెండింగ్‌లో ఉన్న బిల్లులు వేల సంఖ్యలోనే ఉన్నాయి. ఇటువంటి రాజకీయ పరమైన బిల్లులను పెద్దగా అంగీకరించకపోవచ్చని నిపుణులు అభిప్రాయపడుతున్నారు. కాపు బిల్లును అంగీకరిస్తే దేశంలో నాలుగైదు రాష్ట్రాల్లో అనేక సమస్యలు వస్తాయని, వాటన్నిటినీ దృష్టిలో పెట్టుకుని రాష్ట్రపతి కార్యాలయం వ్యవహరిస్తుందని వారు పేర్కొంటున్నారు.

**సంక్షిప్తం**

## ఇక రెగ్యులర్ డిఇవోలు

**అమరావతి బ్యూరో:** రాష్ట్రప్రభుత్వం ఇక రెగ్యులర్ జిల్లా విద్యాశాఖ అధికారుల(డిఇవో)ను నియమించనుంది. ఇందుకు సంబంధించిన ఫైల్‌కు విద్యాశాఖ మంత్రి గంటా శ్రీనివాసరావు ఆమోదం తెలపనున్నారు. రాష్ట్రంలోని 13 జిల్లాల్లో విజయనగరం జిల్లాకు మాత్రమే రెగ్యులర్ డిఇవో ఉన్నారు. మిగిలిన 12 జిల్లాలు ఇన్‌చార్జ్‌ల పాలనలో సాగుతున్నాయి. దీంతో పాఠశాల విద్యాశాఖ పాలన కుంటుపడింది. రెండు నెలల క్రితం రెగ్యులర్ డిఇవోలను నియమించేందుకు ప్రభుత్వం చర్యలు తీసుకుంది. ఈ పోస్టుల భర్తీలో అక్రమాలు జరిగాయనే ఆరోపణలు రావడంతో మానవ వనరుల అభివృద్ధి శాఖమంత్రి గంటా శ్రీనివాసరావు నిలిపివేశారు.

## అశాస్త్రీయ పరీక్షా విధానం రద్దు

### ఎపి విద్యాపరిరక్షణ కమిటీ డిమాండ్

ప్రజాశక్తి-అమరావతి బ్యూరో

సంస్కరణల పేరుతో సమ్మేటీవ్ పరీక్షల్లో అశాస్త్రీయ, అసంబద్ధమైన విధానాల్ని ప్రభుత్వం ప్రవేశపెడుతోందని ఎపి విద్యాపరిరక్షణ కమిటీ ఆందోళన వ్యక్తం చేసింది. వెంటనే ఈ విధానాన్ని రద్దు చేయాలని డిమాండ్ చేసింది. ఆబ్జెక్టివ్ తరహాలో ముద్రించిన ప్రశ్నాపత్రాల్ని తక్షణమే రద్దు చేయాలని కోరింది. కమిటీ కన్వీనర్ రమేష్ పట్నాయక్ అధ్యక్షతన రాష్ట్రస్థాయి సమావేశం విజయవాడలోని ఎపిటిఎఫ్ కార్యాలయంలో ఆదివారం జరిగింది. విద్యాసంవత్సరం మధ్యలో ఎవరినీ సంప్రదించకుండా ఆబ్జెక్టివ్ తరహాలో నిర్వహించాలని విద్యాశాఖ ఏలా నిర్ణయం తీసుకుంటుందని నాయకులు ప్రశ్నించారు. పాత విధానంలోనే వివరణాత్మక పరీక్షలను నిర్వహించాలని కోరుతూ సోమవారం నుంచి అన్ని జిల్లా విద్యాశాఖ అధికారులకు వినతిపత్రాలు అందజేస్తామని వెల్లడించారు. ఈ కార్యక్రమంలో ఎపిటిఎఫ్ అధ్యక్షులు జి హృదయరాజు, డిటిఎఫ్ రాష్ట్ర అధ్యక్షులు పి కృష్ణయ్య, పిడిఎస్‌యు ప్రధాన కార్యదర్శి ఎ రవిచంద్ర తదితరులు పాల్గొన్నారు.

## ముంపు- పునరావాసం

| | |
|---|---|
| ముంపు మండలాలు | 8 |
| పునరావాసం కల్పించాల్సిన ప్రాంతాలు | 371 |
| ఇప్పటి వరకూ కల్పించినవి | 14 |
| పునర్నిర్మాణ ప్రాంతాల ఏర్పాటు | 14 |
| తరలించాల్సిన కుటుంబాలు | 98818 |
| తరలించిన కుటుంబాలు | 3346 |
| తరలించాల్సిన ప్రజలు | 192259 |
| తరలించిన ప్రజలు | 8727 |
| ముంపులో ఎస్సీ కుటుంబాలు | 25782 |
| గిరిజన కుటుంబాలు | 9437 |
| ఇప్పటివరకూ ఆర్‌అండ్‌ఆర్‌కు ఖర్చు | రూ.3957.77 కోట్లు |

### 60,258 ఎకరాలు పెండింగ్

ప్రాజెక్టు కోసం 1,62,739.53 ఎకరాలు సేకరించాల్సి ఉండగా ఇప్పటి వరకూ 1,02,481.18 ఎకరాల్ని సేకరించారు. ఇంకా 60.258.35 ఎకరాలు సేకరించాల్సి ఉంది.

### నాబార్డు ద్వారా రూ.23814 కోట్లు

నాబార్డు నుండి నిధులు ఇప్పించేందుకు ఆగస్టు 16న కేంద్ర క్యాబినెట్ అంగీకరించింది.

దీని ప్రకారం(కోట్లలో)

| | |
|---|---|
| 2016-17 | 2414.70 |
| 2017-18 | 3400 |
| 2018-19 | 9000 |
| 2019-20 | 9000 |
| **మొత్తం** | **23814** |

## 'మహాత్మ గాంధీ'పై విద్యార్థులకు పోటీలు

**అమరావతి బ్యూరో :** జాతిపిత మహాత్మ గాంధీపై వివిధ అంశాల్లో పోటీలు నిర్వహించాలని విద్యాశాఖ అధికారులకు ఎస్‌సిఈఆర్‌టి డైరెక్టర్ ఎం రాజ్యలక్ష్మి శనివారం మెమో జారీ చేశారు.

# గడువులోగా అసాధ్యమే!

### గతంలోనే స్పష్టం చేసిన మసూద్ అమ్మద్ కమిటీ

**ప్రజాశక్తి-అమరావతి బ్యూరో**

పోలవరం ప్రాజెక్టు గడువులోగా పూర్తి కావడం అసాధ్యమని, ప్రధాన పనులు, కాలువల పనులు, రాష్ట్ర జలవనరుల శాఖ పేర్కొంటున్న లక్ష్యాలు వాస్తవాలకు విరుద్ధంగా ఉన్నాయని కేంద్రం నియమించిన మసూద్ అహ్మద్ కమిటీ గతంలోనే ఆక్షేపించింది. ఎపి జలవనరుల శాఖ ఇస్తున్న నెలవారీ నివేదికల్లో చేసిన పనికి, ఖర్చుకూ పొంతన కనబడటం లేదని నివేదికలో పేర్కొంది. ఎంత పని జరిగిందో చెబుతూ ఆ పని పరిమా ణాన్ని, ఆ పనికి చెల్లించే ధరతో హెచ్చువేసి ఆ మేరకు ఖర్చు చేసినట్లు లెక్కలు చూపిస్తున్నారని తెలిపింది. వాస్తవంగా ఎంత ఖర్చయ్యిందో చెప్ప డం లేదని పేర్కొంది. ఎడమ కాలువ నిర్మాణంలో ఎన్నో సవాళ్లున్నాయని, కుడి కాలువలో అనేక చోట్ల మట్టి సరిగా లేకపోవడం వల్ల లైనింగు పనులు పకడ్బందీగా చేయాల్సి ఉంటుందని స్పష్టం చేసింది. 2018 మార్చి నాటికి 349 కట్టడాల పనులు పూర్తి చేయాలన్నది లక్ష్యమని, ప్రస్తుత పని తీరుతో పోలిస్తే ఈ లక్ష్యం వాస్తవ విరుద్ధమని తెలి పింది. రైల్వే లైను దాటే చోట పనులకు సంబం ధించి ప్రతిపాదనల్ని రైల్వే అధికారులకు సమర్పిం చాల్సిన ఉందని పేర్కొంది. రోజు వారీ చేయాల్సిన పనుల లక్ష్యం ఎక్కువగా ఉన్నందున స్పిల్ వే నిర్మా ణం పూర్తి చేయడం కష్టసాధ్యమని వెల్లడించింది. భూ సేకరణ, పునరావాస భారమే మొత్తం ప్రాజెక్టులో కీలక ప్రభావం చూపబోతోందని పేర్కొంది.



స్పిల్‌వే పనులకు శంకుస్థాపన చేస్తున్న చంద్రబాబు (ఫైల్)

## పదే పదే టెండర్లు రద్దు

**ప్రజాశక్తి - అమరావతి బ్యూరో**

పోలవరం స్పిల్‌వే నిర్మాణానికి 2004 డిసెంబరులో టెండర్లు పిలిచి 2005 మార్చిలో రూ.663.80 కోట్ల విలువతో మధుకాన్, సన్‌హైడ్రో సంస్థకు పనులు అప్పగించారు. 2005 డిసెంబరులో ఎర్తకమ్‌రాక్‌ఫిల్ డ్యాంకు టెండర్లు పిలిచి 2006 ఆగస్టులో 889.91 కోట్ల విలువతో సిఆర్18జిఒ-బిఎస్‌సిపిఎల్ సంస్థకు పనులు అప్పగించారు. 2009 ఆగస్టులో టెండర్లను ప్రీక్లోజ్ చేశారు. మళ్లీ 2009 సెప్టెంబరు 2న టెండర్లు పిలిచినా జూన్ 2010లో టెండర్లు తెరిచారు. ఎవరూ టెండర్లు దాఖలు చేయలేదు. 2011 జూన్‌లో మరోసారి టెండర్లు ఆహ్వానించారు. 2012 ఫిబ్రవరిలో మరలా రద్దు చేశారు. 2012 ఏప్రిల్‌లో టెండర్లు పిలిచారు. 2013 మార్చిలో టెండర్లు ఆమోదించారు. అప్పట్లో దీన్ని 14.0555 శాతం తక్కువకు ట్రాన్స్‌ట్రాయ్ దక్కించుకుంది. పనులు చేయలేకపోవడంతో 2017 అక్టోబర్ 16న ట్రాన్స్‌ట్రాయ్ టెండర్ నుండి కాంక్రీటువర్కు, లైనింగ్ పనుల్ని తొలగించారు. ఈ పనులు చేయడానికి ఈ నెల 15లోగా కొత్త ఏజెన్సీని ఎంపిక చేయనున్నారు. ఇక్కడే కేంద్ర ప్రభుత్వం అభ్యంతరం వ్యక్తం చేసింది.

# పోలవరంపై పల్టీలు

**ప్రజాశక్తి-అమరావతి బ్యూరో**

పోలవరం ప్రాజెక్టుకు సంబంధించి టెండర్ల వ్యవహారంలో రాష్ట్ర ప్రభుత్వం వ్యవహరించిన తీరు అంతా అసంబద్ధంగానే ఉంది. హెడ్‌వర్క్సుతో పాటు స్పిల్‌వే, స్పిల్ ఛానల్‌కు సంబంధించి ఎక్కడా పారదర్శకంగా వ్యవహరించలేదని స్పష్టంగా అర్థమవుతోంది. కమీషన్ల కోసమే ట్రాన్స్‌ట్రాయ్ సంస్థను పక్కనబెట్టి మరో సంస్థకు పనులు అప్పగించినట్లు కేంద్ర జలవనరులశాఖ కార్యదర్శి రాసిన లేఖ బట్టి తెలుస్తోంది. తొలుత పోలవరం ప్రాజెక్టు అంచనా వ్యయాన్ని రూ.16,010.45 కోట్ల నుంచి రూ.58,319.06 కోట్లకు పెంచుతూ రాష్ట్ర ప్రభుత్వం కేంద్రానికి ప్రతిపాదనలు పంపించి, వీటిని ఆమోదించక ముందే రాష్ట్ర జలవనరులశాఖ అధికారులపై ఒత్తిడి తెచ్చింది. పెంచిన ధరల మేరకు పోలవరం హెడ్ వర్క్సు పనుల్లో 1395.30 కోట్ల విలువైన పనుల్ని ముందే ఎంపిక చేసిన కాంట్రాక్టర్లకు దక్కేలా 18 రోజుల స్వల్పకాలిక వ్యవధితో టెండర్ నోటిఫికేషన్ జారీ చేయించింది. రాష్ట్ర ప్రభుత్వం తీసుకున్న ఈ విధానం నచ్చకపోవడం వల్లే కేంద్ర జలవనరులశాఖ కార్యదర్శి అమర్జీత్ సింగ్ నవంబర్ 27న రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి దినేష్‌కుమార్‌కు లేఖరాశారు. అత్యంత ప్రధానమైన పనులకు కనీసం 45 రోజుల వ్యవధితో కూడిన టెండర్‌ను నిర్వహిస్తే ఎక్కువ కాంట్రాక్టు సంస్థలు, వేగంగా పనులు చేసే కాంట్రాక్టు సంస్థను ఎంపిక చేయవచ్చని సూచించారు. వాస్తవాల్ని పరిగణనలోకి తీసుకోకుండా స్వల్పకాలిక టెండర్ నోటిఫికేషన్ జారీ చేయడం రాష్ట్ర ప్రభుత్వ తొందరపాటు చర్యకు తార్కాణంగా పేర్కొన్నారు. టెండర్ నోటిఫికేషన్ నవంబర్ 16న జారీ చేస్తే 22 వరకు ఈ - ప్రొక్యూర్‌మెంట్ వెబ్‌సైట్‌లో డాక్యుమెంట్లను అప్‌లోడ్ చేయకపోవడం ఏమిటని కేంద్రం ప్రశ్నించింది. ప్రాజెక్టు సకాలంలో పూర్తి చేయడంపై పోలవరం ప్రాజెక్టు అథారిటీ (పిపిఎ) నిర్మాణాత్మకమైన ప్రణాళిక ఖరారు

### డొల్లతనం బట్టబయలు

పోలవరం భూసేకరణ చేయకుండా, నిర్వాసితులకు పునరావాసం కల్పించకుండా 42 మీటర్ల ఎత్తులో కాఫర్ డ్యాంను ఎలా నిర్మిస్తారని గతంలోనే మసూద్ హుస్సేన్ కమిటీ రాష్ట్ర ప్రభుత్వ డొల్లతనాన్ని బయటపెట్టింది. ప్రాజెక్టు నుంచి నీటిని ఏడాది ముందుగా అందుకోవడానికి కాఫర్ డ్యాం ఎత్తును 31 మీటర్ల నుంచి 42 మీటర్లకు పెంచుతామని చేసిన ప్రతిపాదన అమలులో ప్రభుత్వానికి చిత్తశుద్ధిలేదని తేల్చిచెప్పింది. స్పిల్‌వేతో పాటు, కుడి, ఎడమ కాలువల్ని వచ్చే ఏడాది జూన్ నాటికి పూర్తి చేస్తామని ప్రభుత్వం చెబుతున్న మాటలకు, పనులు జరుగుతున్న తీరుకు పొంతన లేదని నిలదీసింది. ప్రాజెక్టు పనుల పర్యవేక్షణకు జాతీయ జలవనరుల అభివృద్ధి సంస్థ (ఎన్‌డబ్ల్యుడిఎ) డిజి మసూద్ హుస్సేన్ అధ్యక్షతన నిపుణుల కమి టీని కేంద్రం నియమించింది. ప్రతి మూడు నెలలకోసారి ప్రాజెక్టు పనులను పరిశీలించి, కేంద్రానికి నివేదిక ఇవ్వడం ఈ కమిటీ విధి.



చేసే వరకు టెండర్ ప్రక్రియను నిలుపుదల చేయాలని సూచించారు.

**గప్‌చుప్‌గా**

కేంద్ర జలవనరులశాఖ తీసుకున్న నిర్ణయాలకు విరుద్ధంగా సిఎం చంద్రబాబు రాష్ట్ర అధికారులపై పదేపదే ఒత్తిడి తీసుకొచ్చారు. పోలవరం ప్రాజెక్టులో మిగిలిన కాంక్రీట్ పనులు రూ.1393 కోట్లకు టెండర్లను పిలిచారు. స్పిల్‌వేలోని బ్లాక్ నంబర్ సున్నా నుంచి 35 దాకా అనుబంధ పనులు స్టిల్లింగ్ బేసిన్, ఆప్రాన్, స్పిల్ వే మీద బ్రిడ్జికి ఒక టెండర్, స్పిల్ చానల్‌లో చానల్ నంబర్ 356 నుంచి 2920 దాకా మిగిలిపోయిన మట్టి తవ్వకం పనులకు, చానల్ నంబర్ 356 నుంచి 1540 దాకా సీసీ బ్లాకు/లైనింగ్ పనులకు మరో టెండరు పిలిచారు. కనీసం నవంబర్ 22 నాటికి కూడా ఈ - టెండర్ నోటీసు ప్రభుత్వ వెబ్‌సైట్‌లో కనిపించలేదని కేంద్రం లేఖలో పేర్కొంది. ఈ అంశాలన్నింటనీ పరిగణనలోకి తీసుకుంటే టెండరు ప్రక్రియను కొనసాగించడం సరికాదని లేఖలో రాశారు. స్పిల్‌వే, స్పిల్ చానల్‌లో మిగిలిన కాంక్రీట్, మట్టి తవ్వకం పనులకు సంబంధించి రూ. 1395 కోట్ల అంచనాలతో పిలిచిన రెండు టెండర్ల విషయంలో ముందుకు వెళ్లొద్దంటూ సిఎస్ దినేశ్‌కుమార్‌ను కోరారు. వాస్తవానికి ఈ టెండర్లను డిసెంబర్ 4న తెరవాలని జలవనరులశాఖ నిర్ణయించింది. ఎగువ కాఫర్ డ్యాం పనులు ప్రారంభించేందుకు సిద్ధమైన తరుణంలోనే వాటిపై ఎన్‌హెచ్‌పిసి అధ్యయనం చేశాక ఆ నివేదిక ఆధారంగా డిజైన్లను రూపొందించి పనులు చేపట్టాలంటూ లేఖ రాశారు. ఇప్పుడు టెండరు ప్రక్రియను ఆపాలంటూ లేఖ రాశారు.

**టెండర్లలో ఐదారు సంస్థలే**

రాష్ట్రంలో టిడిపి అధికారంలోకి వచ్చిన తర్వాత సాగునీటి ప్రాజెక్టులకు నిర్వహిస్తున్న టెండర్ల తీరుపై ఉన్నతాధికారులు ఎప్పటికప్పుడు అసంతృప్తి వ్యక్తం చేస్తూనే ఉన్నారు. కేవలం ఐదారు కాంట్రాక్టు సంస్థలు మాత్రమే టెండర్లలో పాల్గొంటూ కుమ్మక్కై అదనపు ధరలకు పనులను చేజిక్కించుకుంటున్నాయనే విమర్శ ప్రభుత్వంపై ఉంది.

హంద్రీ-నీవా సుజల స్రవంతి, కుప్పం బ్రాంచి కెనాల్, వంశధార ప్రాజెక్టు రెండో దశ, గాలేరు- నగరి తొలిదశ, కొండవీటి వాగు వరద మళ్లింపు టెండర్ల సమయంలోనూ కొన్ని సంస్థలు మాత్రమే టెండర్లు దక్కించుకున్నాయి.

### అంతా అయోమయం

ప్రాజెక్టు పనుల్ని సబ్ కాంట్రాక్టర్‌కు అప్పగించాలనే ఉద్దేశంతో అక్టోబర్ 13న కేంద్ర జలవనరులశాఖ మంత్రి నితిన్ గడ్కరీని సిఎం చంద్రబాబు బృందం నాగపూర్‌లో కలిసింది. కాంక్రీట్ పనులు లక్ష్యం మేరకు జరగడం లేదని, 2018కి గ్రావిటీ ద్వారా, 2019కి సంపూర్ణంగా ప్రాజెక్టును పూర్తి చేయాలన్న లక్ష్యంతో స్పిల్‌వే, స్పిల్ చానల్‌లో కొంత భాగానికి టెండర్లు పిలుస్తామని వివరించింది. దీనిపై గతంలో ప్రధాన కాంట్రాక్టు సంస్థ ట్రాన్స్‌ట్రాయ్ 14 శాతం మైనస్ టెండర్లను కోట్ చేసిందని, ఆ మొత్తానికే తాము పరిమితమవుతామని, కొత్త ధరలను ఆమోదించేంది లేదంటూ గడ్కరీ స్పష్టం చేశారు. అయితే కాంక్రీట్ పనుల కోసమే టెండర్లను పిలుస్తున్నందున, మైనస్ 14 శాతానికి మించి అయ్యే వ్యయాన్ని రాష్ట్ర ప్రభుత్వమే భరిస్తుందని సిఎం బృందం వివరించింది. కొన్ని పనులను సబ్ కాంట్రాక్టర్‌కు అప్పగిస్తే ప్రధాన కాంట్రాక్టు సంస్థ ట్రాన్స్‌ట్రాయ్‌తో న్యాయ, సాంకేతికపరమైన ఇబ్బందులు తలెత్తుతాయేమోనని అప్పుడే గడ్కరీ సందేహాన్ని వ్యక్తం చేశారు. పనులు జాప్యం అవుతున్నందున ప్రధాన కాంట్రాక్టు సంస్థకు 60సి నోటీసులు అందజేసినట్లు సిఎం బృందం చెప్పింది. అయితే ఆ సందర్భంలో గడ్కరీకి వివరించిన అంశాలు కాకుండా రాష్ట్ర ప్రభుత్వం టెండర్ ఈ - ప్రొక్యూర్‌మెంట్‌లో అప్‌లోడ్ చేయకుండా ఏకపక్షంగా మరో కాంట్రాక్టర్‌కు పనులు అప్పగించడాన్ని నిర్ధారించిన కేంద్రం, పనుల్ని ఆపాలని నిర్ణయించింది. అలాగే అక్టోబర్ 25న గడ్కరీ వద్ద జరిగిన రాష్ట్ర జనవనరులశాఖ మంత్రి దేవినేని ఉమామహేశ్వరరావు జరిపిన సమావేశం మినిట్స్‌ను కూడా రాష్ట్రానికి పంపారు. స్పిల్ వే, స్పిల్ చానల్‌కు సంబంధించి మిగిలిన రూ.1395.30 కోట్ల మేర పనులను పూర్తి చేసేందుకు నవంబర్ 1న టెండర్లను పిలిచింది.

### పనులకు వెచ్చించిన ఖర్చు (కోట్లలో)

| | అగ్రిమెంటు విలువ | ఖర్చు | వ్యయశాతం |
|---|---|---|---|
| హెడ్‌వర్కు | 5891.56 | 2079.89 | 36.41 |
| కుడిప్రధాన కాలువ | 1940.42 | 1730.14 | 91.00 |
| ఎడమ ప్రధాన కాలువ | 1807.86 | 1055.77 | 59.90 |
| **మొత్తం** | **9639.84** | **4865.81** | **51.44** |



### ప్రాజెక్టు అంచనా ఇలా పెరిగింది ...

2005-05 అంచనా విలువ రూ.10151.04 కోట్లు కాగా 2010లో వేసిన అంచనాల ప్రకారం 16010 కోట్లకు పెరిగింది. 2013-14 నాటికి రూ.58319.06 కోట్లకు చేరుకుంది. (కోట్లలో)

| | 2005-06 | 2010-11 | 2013-14 | పెరుగుదల | శాతం |
|---|---|---|---|---|---|
| కుడి ప్రధాన కాలువ | 1273.82 | 2135.08 | 3656.14 | 1521.06 | 71.24 |
| ఎడమ ప్రధాన కాలువ | 856.55 | 1471.99 | 4960.83 | 3488.84 | 237.02 |
| హెడ్‌వర్కు | 3931.53 | 6600.56 | 11637.98 | 5037.42 | 76.32 |
| పవర్‌హౌస్ | 2195.55 | 2868.40 | 4205.66 | 1337.26 | 46.66 |
| భూసేకరణ, పునరావాసం | 1893.59 | 2934.42 | 33858.45 | 30924.03 | 1053.84 |
| **మొత్తం** | **10151.04** | **16010.45** | **58319.06** | **42308.61** | **264.26** |

## ఈ ఏడాదిలో ఇలా... !

**ప్రజాశక్తి-అమరావతి బ్యూరో**

- మే 26 : ఎపి ప్రభుత్వ అభ్యర్థన మేరకు పోలవరం ప్రాజెక్టు నిర్మాణ బాధ్యతల్ని అప్పగిస్తున్నట్లు రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి కేంద్ర జలవనరుల శాఖ కార్యదర్శి అమర్జీత్ సింగ్ లేఖ రాశారు.
- జూన్ 22: పోలవరంపై ఖర్చు చేసిన రూ.3800 కోట్లు తిరిగి చెల్లించాలని, పర్యావరణ అనుమతులు మూడేళ్లు పొడిగించాలని కేంద్ర మంత్రులకు ముఖ్యమంత్రి చంద్రబాబు కోరారు.
- జులై 02: ప్రాజెక్టుకు సంబంధించిన ఐదు అంశాల్ని పరిశీలించేందుకు గుప్తా, భార్గవ, జల వనరుల శాఖ ఇఎన్‌సిలతో కేంద్రం మరో కమిటీని ఏర్పాటు చేసింది.
- ఆగస్టు 20: పోలవరానికి రూ.58,319 కోట్లు అవసరమని రాష్ట్ర ప్రభుత్వం కొత్త అంచనాలను కేంద్రానికి సమర్పించింది.
- ఆగస్టు 27: పోలవరం నిధుల బాధ్యత తనదేనని ముఖ్యమంత్రి చంద్రబాబు నిర్వహించిన సమీక్షలో వెల్లడించారు.
- సెప్టెంబర్ 24: పెండింగ్‌లో ఉన్న రూ2,800 కోట్ల నిధులిచ్చేందుకు కేంద్ర జలవనరుల శాఖ అంగీకరించింది.
- సెప్టెంబర్ 23: సవరించిన అంచనాల్ని ఆమోదించాలని కేంద్ర మంత్రి అరుణ జైట్లీని ముఖ్యమంత్రి కోరారు.
- అక్టోబర్ 22: నర్మద కంట్రోల్ అథారిటీ కార్య నిర్వాహక సభ్యుడు సిన్హా ఆధ్వర్యంలో కేంద్రం మరో కమిటీని నియమించింది.
- అక్టోబర్ 28: కేంద్రంతో కొంత ఇబ్బంది ఉందని, కేంద్రంతో మరో సారి చర్చిస్తామని సిఎం చంద్రబాబు వెల్లడించారు.
- అక్టోబర్ 30: కాంట్రాక్టర్‌కు మార్చబోమని, ఆ నిర్మాణ సంస్థతోనే పనులు కొనసాగిస్తూ కొన్ని పనులకు 60-సి నిబంధన వర్తింపజేస్తామని పోలవరం సమీక్షలో సిఎం స్పష్టం చేశారు.
- నవంబర్ 01: ప్రాజెక్టు అంచనా రూ.58,319 కోట్లకు పెరిగిందని, ఇప్పటికి రూ.12,465 కోట్లలో 50.48 పనులు పూర్తి చేశామని, కేంద్రం నుంచి రూ.4325 కోట్లు తెచ్చామని, అడ్వాన్సుగా రూ.3వేల కోట్లు ఖర్చు చేశామని, దీంట్లో రూ.2300 కోట్లు కేవలం భూ సేకరణకే చెల్లించామని మంత్రి మండలి వెల్లడించింది.
- నవంబర్ 07: పోలవరానికి జాతీయ హోదా ఇవ్వడానికి గల కారణాలు తెలుపుతూ కేంద్రం కౌంటర్ దాఖలు చేయనందువల్ల సుప్రీం కోర్టు ఆగ్రహాన్ని వ్యక్తం చేస్తూ రూ.25 వేల జరిమానా విధించింది.
- నవంబర్ 07: కాఫర్ డ్యాం పనుల్ని ఆపాలని రాష్ట్రానికి కేంద్ర జలవనరుల శాఖ లేఖ రాసింది. అసలు అవసరమో లేదో ముందు తేల్చాలని కోరింది. నిర్మాణ పనుల పరిశీలన కమిటీ ఏర్పాటు చేయాలని ఎన్‌హెచ్‌పిసికి సూచించింది. క్షేత్రస్థాయిలో పనుల్ని నిలిపేయాలని ఆదేశించింది.
- నవంబర్ 10: ప్రాజెక్టు హెడ్ వర్క్ కాంట్రాక్టర్ రోజు వారీ ఖర్చుల కోసం ఏర్పాటు చేసిన స్పెషల్ ఇంపెక్ట్ అమౌంట్‌ను రూ.25 కోట్ల నుంచి రూ.150 కోట్లకు పెంచుతూ కేంద్ర జలవనరుల శాఖ కార్యదర్శి శశిభూషణ్ కుమార్ ఉత్తర్వులు జారీ చేశారు.
- నవంబర్ 12: పోలవరం పూర్తి బాధ్యత తమదేనని బిజెపి జాతీయ ప్రధాన కార్యదర్శి రామ్ మాధవ్ తిరుపతిలో నిర్వహించిన ఓ సమావేశంలో వెల్లడించారు.
- నవంబర్ 14: పోలవరానికి సంబంధించిన ఎటువంటి వివాదాలనైనా సుప్రీం కోర్టు విచారిస్తుందని నేషనల్ గ్రీన్ ట్రిబ్యునల్ (ఎన్జీటి) స్పష్టం చేసింది. పోలవరం ప్రాజెక్టు అథారిటీ సిఇఒ హోదాను తగ్గించాలని నితిన్ గడ్కరీకి చంద్రబాబు లేఖ రాశారు.
- నవంబర్ 21: అక్టోబర్‌లో అందించిన రూ.979 కోట్లకు అదనంగా రూ.318 కోట్లు చెల్లించేందుకు కేంద్ర ఆర్థిక శాఖ ఆమోద ముద్ర వేసింది.
- నవంబర్ 22: ఇప్పటికే రూ.12,567 కోట్లతో 51.44 శాతం పనుల్ని పూర్తి చేశామని విజయవాడలో నిర్వహించిన రైస్ కాన్‌క్లేవ్‌లో చంద్రబాబు ప్రకటించారు.
- నవంబర్ 29: నీతి అయోగ్ వైస్ చైర్మన్ సూచన మేరకే పోలవరం ప్రాజెక్టు నిర్మాణ బాధ్యతల్ని రాష్ట్ర ప్రభుత్వానికి అప్పగించారని అసెంబ్లీలో చంద్రబాబు వెల్లడించారు.

# తొలి అంచనా రూ.129 కోట్లు

**ప్రజాశక్తి -అమరావతి బ్యూరో**

పోలవరం ప్రాజెక్టును 1941లో వెంకటకృష్ణ అయ్యంగార్ ఆధ్వర్యాన 150 టిఎంసిల సామర్థ్యంతో ప్లాను చేశారు. 1942-44 మధ్య ప్రాథమిక సర్వేలు పూర్తి చేసి స్థలాన్ని ఎంపిక చేశారు. అప్పట్లో జె.ఎల్.సావేజ్, డాక్టర్ కార్ల్ తెర్జాఘి, ఎస్.ఓ.హార్పర్, సర్ ముర్డాక్ మెక్‌డోనాల్డ్ అనే నలుగురు ఇంజనీరింగ్ నిపుణులతో కమిటీ వేశారు. 1942లో ప్రాథమిక సర్వేలు, 1951లో సమగ్ర సర్వేల అనంతరం రూ.129 కోట్ల అంచనాతో ప్రాజెక్టును నిర్మించాలని నిర్ణయించారు. అనంతరం అడుగు ముందుకు పడలేదు.

1953లో వచ్చిన భారీ వరదలు, విశాఖ స్టీలుప్లాంటు నీటి అవసరాలను దృష్టిలో పెట్టుకుని 1970లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నివేదికను తయారు చేసింది. 1976లో ప్రాజెక్టు ఇన్వెస్టిగేషన్ కోసం ఇరిగేషన్ విభాగంలో కొత్త సర్కిల్‌ను ఏర్పాటు చేసింది. 1978లో తుది నివేదికను తయారు చేసింది. 1980లో గోదావరి ట్రిబ్యునల్ ప్రాజెక్టు నిర్మాణానికి అనుమతిచ్చింది. శంకుస్థాపన చేసిన ప్లానులు ప్రారంభం కాలేదు. ప్రస్తుతం పశ్చిమగోదావరి జిల్లా పోలవరం మండలం రామాయంపేట గ్రామంలో దీన్ని నిర్మిస్తున్నారు. ఈ ప్రాజెక్టు వల్ల 7.20 లక్షల ఎకరాలకు సాగునీరు అందుతుంది. 23.50 లక్షల ఎకరాల కృష్ణా, గోదావరి డెల్టా ఆయకట్టు స్థిరీకరణ జరుగుతుంది. 540 గ్రామాల్లో 28.50 లక్షలమందికి తాగునీరు, 80 టిఎంసిలు కృష్ణానదికి మళ్లింపు, వీటివల్ల మరో ఎనిమిది లక్షల ఎకరాలకు అదనపు నీటి సదుపాయం లభిస్తుందని ప్రభుత్వం అంచనా వేసింది. విశాఖపట్నం నగరానికి తాగునీటి అవసరం తీర్చడంతో పాటు 960 మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తి సాధ్యమతుంది.

**2454 మీటర్లతో రాక్‌ఫిల్ డ్యాం**

గోదావరి సహజ ప్రవాహం ఉన్న ప్రాంతంలో 2454 మీటర్ల పొడవుతో ఎర్త్ కమ్ రాక్‌ఫిల్ డ్యాంను నిర్మిస్తున్నారు. డ్యాంకు అడుగున 300 మీటర్ల వెడల్పుతో ఇది నిర్మితమవుతుంది. పైకి వచ్చేప్పటికి 15 మీటర్లు మాత్రమే ఉంటుంది. రాక్‌ఫిల్ డ్యాం అడుగుభాగంలో డయాఫ్రం వాల్‌ను నిర్మించి దానిపైన గోడ కడుతున్నారు. ఇది నదిలో అడుగుభాగంలో 40 మీటర్ల నుండి 100 మీటర్ల లోతు ఉంది. డయాఫ్రం వాల్ గోడ 1.5 మీటర్ల వెడల్పుతో 1427 మీటర్ల పొడవున నిర్మిస్తున్నారు. నది సహజమార్గంలో నిర్మించే రాక్‌ఫిల్ డ్యాంకు కుడిభాగంలో +45.72 మీటర్ల ఎత్తుతో 1118.40 మీటర్ల పొడవున దీన్ని నిర్మిస్తున్నారు. గరిష్టంగా 50 లక్షల క్యూసెక్కుల వరదనీరు ప్రవహించే విధంగా ప్లాను చేశారు.

**భారీ ఎత్తున తవ్వకాలు**

స్పిల్‌వే నిర్మాణానికి కావాల్సిన పునాది కోసం 165.5 లక్షల క్యూబిక్ మీటర్ల మట్టిని తవ్వారు. 3.89 లక్షల క్యూబిట్ మీటర్ల కాంక్రీటు వేశారు. అప్రోచ్‌ఛానల్, స్పిల్‌ఛానల్‌కు 776 లక్షల క్యూబిక్ మీటర్ల మట్టిని తవ్వాల్సి ఉండగా సోమవారం వరకు 449.80 లక్షల క్యూబిక్ మీటర్ల మట్టిని తవ్వారు. విద్యుత్ ఉత్పత్తి కేంద్రానికి 118 లక్షల క్యూబిక్ మీటర్ల మట్టిని తవ్వాల్సి ఉండగా 94 లక్షల క్యూబిక్ మీటర్ల మట్టిని మాత్రమే తవ్వారు. విద్యుత్ కేంద్రం నుండి విడుదలయ్యే నీటిని నదిలో కలిపేందుకు వీలుగా నిర్మించనున్న టెయిల్‌రేస్ ఛానల్‌ను పూర్తి చేశారు.

### హెడ్‌వర్క్సులో ప్రాజెక్టుకు వచ్చిన నిధులు

- జాతీయ ప్రాజెక్టుగా ప్రకటించక ముందు వ్యయం రూ.5135.87 కోట్లు
- ప్రకటించిన తరువాత అయిన వ్యయం రూ.7431.35 కోట్లు
- మొత్తం వ్యయం(ప్రారంభం నుండి అక్టోబర్ 2017 వరకు) రూ.12,567 కోట్లు
- కేంద్ర ప్రభుత్వం నుండి రావాల్సింది రూ.3102.29 కోట్లు

**జాతీయ హోదా వచ్చాక విడుదలైన నిధులు(కోట్లలో)**

| విడుదల తేదీ | మొత్తం |
|---|---|
| 21.4.2015 | 245 |
| 19.8.2015 | 98.50 |
| 31.8.2015 | 1.50 |
| 28.3.2016 | 290 |
| 4.4.2016 | 200 |
| 31.8.2016 | 100 |
| 27.12.2016 | 1981.54 |
| 31.3.2017 | 433.16 |
| 21.9.2017 | 979.36 |
| **మొత్తం** | **4329.06** |

హడావిడి కాపు బిల్లు వెనుక

# దృష్టి మళ్లించే వ్యూహం?

**ప్రజాశక్తి - అమరావతి బ్యూరో**

పోలవరం విషయంలో జరిగిన అవినీతి వ్యవహారం నుండి బయటపడేందుకే రాష్ట్ర ప్రభుత్వం హడావిడిగా కాపు రిజర్వేషన్ బిల్లును ప్రవేశపెట్టిందని సీనియర్ రాజకీయవేత్తలు విశ్లేషిస్తున్నారు. రాష్ట్రంలో కీలకమైన సమస్య ముందుకొచ్చిన సమయంలో దాన్ని డైవర్ట్ చేసేందుకు కొత్త ఎత్తులు వేస్తూ ప్రజల ఆలోచనల్ని మరలిస్తున్నారనీ చెబుతున్నారు. పోలవరంలో జరిగిన అవినీతి వ్యవహారంలో కేంద్రం అనేక ప్రశ్నలు వేసింది. వాటికి సమాధానం చెప్పాల్సిన చంద్రబాబు దాన్నుండి తప్పుకునేందుకు కాపు బిల్లును పెట్టారనే అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తున్నారు. కాపు రిజర్వేషన్లపై నివేదిక సిద్ధమయ్యిందని రెండు నెలల క్రితమే బిసి కమిషన్ ఛైర్మన్ మంజునాథ ప్రకటించారు. ఆయన ప్రకటించిన తరువాత రెండుసార్లు క్యాబినెట్ సమావేశాలూ జరిగాయి. అప్పటి నుండి బయటపెట్టని నివేదికను పోలవరం వ్యవహారం నడుస్తున్న సమయంలో హడావిడిగా తీసుకొచ్చి పెట్టారు. చట్ట ప్రకారం కమిషన్ నియమితమయ్యింది. ఛైర్మన్ సంతకం లేకుండా చెల్లుబాటు కాదు. అన్నీ తెలిసినా తెలుగుదేశం ప్రభుత్వం హడావిడిగా నివేదికను క్యాబినెట్లో పెట్టడం, ఆమోదించడం, అసెంబ్లీలో బిల్లుకు ఆమోదముద్ర వేయడం చకచకా జరిగిపోయాయి. నెంబరు లేకుండా కాపు రిజర్వేషన్ బిల్లును పాస్ చేయడం పలు అనుమానాలకు తావిస్తోంది. అలాగే ఇటీవల కృష్ణానదిలో పవిత్ర సంగమం వద్ద బోటు మునిగి 22 మంది చనిపోయారు. దీన్నుండి రాష్ట్ర ప్రజలు తేరుకోకముందే నంది అవార్డుల్ని ప్రకటించారు. ఒకవైపు రాష్ట్రం మొత్తం బాధలో ఉండటంతోపాటు, మృతదేహాలకు కనీస సంస్కారాలు కూడా జరగకముందే మూడేళ్ల నంది అవార్డులు ప్రకటించడం కూడా ప్రజల దృష్టిని మళ్లించడానికేనన్న వాదనలు వినిపిస్తున్నాయి. గోదావరి పుష్కరాల సమయంలో తొక్కిసలాట జరిగి 21 మంది చనిపోయిన విషయం తెలిసిందే. అప్పుడు కూడా రాష్ట్ర ప్రజలు ఈ సంఘటన నుండి తేరుకోక ముందే రాజధాని మాస్టర్‌ప్లాను విడుదల చేయించారు.

**విలేజ్‌మాల్స్ సమయంలోనూ అదే తంతు**

రేషన్ దుకాణాల్ని రిలయన్స్‌కు అప్పగించేందుకు టెండర్ల ప్రక్రియ నడస్తున్న సమయంలోనే రాష్ట్రంలో కంచ ఐలయ్య వ్యవహారం ముందుకొచ్చింది. దీన్ని రెచ్చగొట్టింది కూడా టిడిపికి చెందిన ఎంపి టి.జి.వెంకటేష్, పలువురు ఎమ్మెల్యేలే. విలేజ్‌మాల్స్ వల్ల గ్రామాల్లో దుకాణాలు లేకుండా పోతాయి. దీనివల్ల వాటిపై ఆధారపడి బతికే ఆర్యవైశ్య సామాజికవర్గానికి చెందిన వారందరూ ఉపాధి కోల్పోతారు. ప్రజలకు ధరలు అందుబాటులో ఉంచేందుకు అప్పటి ప్రభుత్వం వ్యూహాత్మకంగా రేషన్‌దుకాణాలు తీసుకొచ్చింది. దీనివల్ల మార్కెట్లో వస్తువుల ధరలు నియంత్రణలో ఉండేవి. విలేజ్‌మాల్స్ వల్ల మార్కెట్ శక్తులు విజృంభిస్తాయి. పట్టణాల్లో ఉండే కొద్దిమంది లాభపడతారు. అయితే ఈ టెండర్ల ప్రక్రియ జరుగుతున్నంతకాలం ఆర్యవైశ్యుల ఆలోచనలు అటువైపు మళ్లకుండా ఐలయ్య వ్యవహారం చుట్టూ నడిపారు. అయితే రిలయన్స్ టెండర్లు ముగిసి షాపుల్ని అప్పగించాక ఐలయ్య వ్యవహారంపై నోరెత్తడం మానేశారు. దీని వెనుక కూడా టిడిపి కుట్ర ఉందనే అనుమానాలు వ్యక్తమవుతున్నాయి.

అక్షరం

ప్రజాశక్తి

www.prajasakti.com

facebook/prajasakti, twitter/prajasakti

4 విజయవాడ

సోమవారం 4 డిసెంబర్ 2017



ఈ మధ్యన ఎటు జూసిన ఎన్నెన్నో చోద్యమ్ములు
విద్యాధిక వర్గంలో వింతవింత దృశ్యమ్ములు
టెంకాయల లంచంతో దేవునికి పిటీషన్లు
తలనీలాలిస్తామని తిరుగులేని అగ్రిమెంట్లు

– గజ్జెల మల్లారెడ్డి



## నడక మంచిదే!

చిన్నప్పటినుండీ నడుస్తూనే ఉన్నాను
పల్లెటూరోడ్ని కదా
కాలికి బలపం కట్టుకొని తిరగడం
బాగా అలవాటయింది
చెప్పుల్లేకుండానే
తుళ్లూరు హైస్కూలుకు ఐదేళ్లపాటు నడిచాను
పల్లేరుగాయలే గుచ్చుకొన్నాయో
తుమ్మముళ్లే ఇరిగాయో
గాయపడ్డ పాదాలతోనే నడిచాను
మట్టిమనిషిని కదా
ఎర్రటెండలో బుసకమట్టి
నా పాదాల్ని ముద్దాడుతున్నా
నడుస్తూనే ఉన్నాను
మట్టిస్పర్శను నరనరాన ఎక్కించుకోడానికి
పాదాలే ఆధారమయ్యాయి
బ్రతికున్నామనడానికి నిర్వచనం కదలిక
అదీ కాళ్లతోనే కదా

★★★

ఇప్పుడూ ఊరిలోని పని వలసెళ్లిపోయాక
పనిలేనోళ్లందరూ కాలిబాట పట్టారు
నడిచొచ్చిన నగరపు ఆనవాళ్లతో
కుక్కలు ఈడ్చుకెళుతుంటే
వాటి వెంట నడవలేక నడుస్తున్నారు
కాళ్లకింద మట్టీ తరిగిపోయాక
ఎగుడు దిగుడు డబ్బు రాసులమీద
కొత్త నడక నేర్చుకొంటున్నారు
పెరిగిన దేహాల్ని
కొలతల్లో ఇముడ్చుకోడానికి
పొలాలగట్ల మీంచి
సిమెంటు రోడ్లమీదకు ఎక్కారు

★★★

ఇప్పుడు ఎవరెవరో ఎక్కడెక్కడో
నడక యాత్రలు మొదలు పెడుతున్నారు
కోర్కెల ముడుపుల్ని మూటగట్టుకొని
దూరదూర తీరాల మనుషుల ముందు మోకరిల్లుతున్నారు
నడిచిన దారుల్నిండా
పచ్చదనం పులుముతామంటూ
నడుస్తున్న పాదాలు నడుస్తుండగానే
కుర్చీలుగా మారాలని
వాళ్ల సరికొత్త నడకలు మొదలు పెట్టారు
ఆరోగ్యమవ్వాల్సిన నడక
ఏ బాట పడుతుందో
తిరిగి తిరిగి ఏ గమ్యం చేరుతుందో!

– బండ్ల మాధవరావు

# ఆధునిక విమర్శకు శాస్త్రీయ దృక్పథం

నివాళి

విమర్శకుడుగా, సమీక్షకుడుగా, నవలాకారుడుగా, కథకుడుగా, కవిగా ఆర్ఎస్ సుదర్శనం (రాచకొండ సుబ్బు సుదర్శనం) ఎనలేని పేరు ప్రఖ్యాతులు గడించారు. ప్రాచ్య పాశ్చాత్య విమర్శనా సిద్ధాంతాల్ని క్షుణ్ణంగా ఆకళింపు చేసుకున్న విఖ్యాత విమర్శకులు. వీరు డిసెంబర్ 13, 1927లో జన్మించారు. ప్రధానోపాధ్యాయునిగా, ఆంగ్లోపన్యాసకులుగా పనిచేశారు. తర్వాత అనంతపురం ప్రభుత్వ కళాశాలల్లో పనిచేశారు. చివరకు విద్యాశాఖాధికారిగా ఉద్యోగ విరమణ చేశారు. 2001 డిసెంబర్ 14న కన్నుమూశారు. సుదర్శనం భార్య ఆర్. వసుంధరా దేవి మంచి రచయిత్రిగా మన్ననలు అందుకున్నారు.

'అనుబంధాలు', 'మళ్లీ వసంతం', 'అసుర సంధ్య', సంసార వృక్షం', అనే నవలల్ని రాశారు సుదర్శనం. వీటిని సుదర్శనం తాత్విక వివేచనకు మంచి ఉదాహరణగా తీసుకోవచ్చు. జీవించడం నుంచి విలువలు, వ్యక్తిత్వం సిద్ధిస్తాయి అనే దృక్పథంతో సుదర్శనం మళ్లీ వసంతం రాశారు. 'కాలం తెచ్చిన మార్పు', 'మధుర మీనాక్షి', కథా సంపుటాలు వెలువరించారు. 'మధుర మీనాక్షి' కథ వారి కథానికా శిల్పనైపుణ్యానికి గీటురాయి. ఈ కథ 'నిశాంతం' అనే తాత్విక కావ్యం ద్వారా మనకు కవిగా సుదర్శనం పరిచయమయ్యారు.

సుదర్శనం 'సాహిత్యంలో దృక్పథాలు', 'సమాజం –సాహిత్యం', 'సాహిత్యం నేపథ్యం', 'నూరు సమీక్షలు' అనే నాలుగు గ్రంథాలు విమర్శకు సంబంధించినవి. ఈ గ్రంథాల్ని నిశితంగా అధ్యయనం చేస్తే సుదర్శనం విమర్శను ముఖ్యంగా సైద్ధాంతిక విమర్శ అని, అనువర్తిత విమర్శ అని రెండు విధాలుగా వర్గీకరించవచ్చు. 'సాహిత్యంలో దృక్పథాలు' అనే గ్రంథం అనువర్తిత విమర్శలోకి వస్తుంది. మిగతా మూడు గ్రంథాల్లో సైద్ధాంతిక విమర్శ చోటుచేసుకుంది. తెలుగు సాహిత్య విమర్శలో ఆయన తన కంటూ ప్రత్యేకమైన విశిష్టమైన స్థానాన్ని సంపాదించుకున్నారు.

1968లో 'సాహిత్యంలో దృక్పథాలు' అనే వ్యాససంపుటిని వెలువరించారు. భారతి, ఆంధ్రపత్రిక మొదలైన పత్రికల్లో ప్రచురితమైన వ్యాసాల్ని గ్రంథంగా తెచ్చారు. దీనికి సాహిత్య అకాడమీ బహుమతి వచ్చింది. కవి దృక్పథాన్ని బట్టి కావ్యతత్త్వ పరిశీలన జరగాలని సుదర్శనం ఈ సంపుటిలో నొక్కి వక్కాణించారు. దీనిలో అల్లసాని పెద్దన, గురజాడ, ఉన్నవ లక్ష్మీనారాయణ, విశ్వనాథ సత్యనారాయణ, గోపీచంద్, చలం, బుచ్చిబాబు, రాచకొండ విశ్వనాథశాస్త్రి, జివి కృష్ణారావు, నోరి నర్సింహాశాస్త్రి లాంటి పదిమంది ప్రముఖుల గురించి విమర్శ వ్యాసాలు రాశారు.



సాధారణంగా ప్రబంధాన్ని విమర్శచేసేటప్పుడు మన విమర్శకుల ప్రబంధ లక్షణాలతో అన్వయం చేస్తూ పరిశీలించారు. ఇక్కడ సుదర్శనం దానికి భిన్నంగా దృక్పథానికి ప్రాముఖ్యం ఇచ్చారు. మనుచరిత్రలో పెద్దన తాత్త్విక దృక్పథాన్ని అనుసరిస్తూ శృంగారసం కంటే శాంతిరసానికే ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చారని తెలిపారు. వరూధిని, ప్రవరుడు, స్వరోచి పాత్రల్ని ఎంతో నైపుణ్యంతో విశ్లేషించారు. గురజాడ 'కన్యాశుల్కం'పై లెక్కలేనన్ని విమర్శ వ్యాసాలు సుదర్శనం రాశారు. గిరీశంలోని మంచిని పాఠకులకు చూపించడానికి ప్రయత్నించారు. తెలుగు సాహిత్యాన్ని పాశ్చాత్య సాహిత్యంతో తులనాత్మకంగా వివేచన చేశారు. ఉన్నవ వారి 'మాలపల్లి' నవలను పరిశీలనాత్మకంగా విపులీకరించారు. విశ్వనాథ గురించి లోతైన విమర్శ చేశారు. విశ్వనాథ రచనల్లో 'ఏకవీర' గొప్ప నవలని అన్నారు. 'వేయి పడగలు'లో విశ్వనాథ వ్యవస్థనే మూలాదర్శంగా ప్రతిపాదించటం వల్ల ఆయన స్థాయి కొంత దిగజారిందని ఉన్నది ఉన్నట్లు స్పష్టం చేశారు. విశ్వనాథ సంప్రదాయవాదే తప్ప ఆధ్యాత్మికవాది కాదు. ఆయన సాహిత్యం చదివితే హిందూ ధర్మ వికాసం అర్థం కాకపోగా, హైందవధర్మంలోని బోలతనం మాత్రమే తెలుస్తుందని సుదర్శనం ఘాటుగా విమర్శించారు. విశ్వనాథ వారి శైలినీ, ప్రతిభను కొనియాడుతూనే, ఆయన ఆలోచన విధానాన్ని, భావ జాలాన్ని ఏకరువు పెట్టారు. రచయిత సృష్టించిన సాహిత్యంలో ఆయన జీవితం ఎంతవరకూ ప్రతిఫలించింది అనేది సుదర్శనం విడమరిచి చెప్పారు. గోపీచంద్ స్త్రీ పాత్ర ప్రాముఖ్యమున్న నవలలు రాయడం వెనుక దాగివున్న మర్మాన్ని విడమరిచి చెప్పారు. స్త్రీ వ్యక్తిత్వాన్ని చూపడంలో గోపీచంద్ విజయాన్ని సాధించారని ప్రశంసించారు. పండిత పరమేశ్వరశాస్త్రి వీలునామాలోని లోపాల్ని సోపపత్తికంగా మనముందు ఉంచారు. 'చలం తాత్వికుడు కాడు. దార్శనికుడిగా పరిణత చెందిన కాల్పనికవాది' అని చలం గురించి తీర్పు చెప్పారు. గోపీచంద్, బుచ్చిబాబు, రావిశాస్త్రి నవలల్లో సిగ్మండ్ ఫ్రాయిడ్, ఆడ్లర్ ప్రవేశపెట్టిన మనో వైజ్ఞానిక శాస్త్ర సిద్ధాంతాల ప్రభావం ఎలా ఉందో చాలా చక్కగా తెలియజేశారు. 'అసమర్థుని జీవిత యాత్ర', 'చివరకు మిగిలేది', 'అల్పజీవి' నవలల్ని తనదైన నూతన విమర్శ పంథాలో విశదీకరించారు.

సాహిత్యంలో దృక్పథాలు అనే గ్రంథం తెలుగు సాహిత్య విమర్శలో ప్రముఖమైన స్థానాన్ని ఆక్రమించింది. సుదర్శనం లోతైన పరిశోధన చేసి ఎంతోమందికి మార్గదర్శి అయ్యారు. వీరికి సాహిత్యం పరిజ్ఞానంతో పాటు తాత్త్విక చింతనా వివేచన కూడా ఉంది. ఆంగ్ల సాహిత్యతో పాటు ఇతర శాస్త్రాలపై కూడా పాండిత్యం ఉంది. ఒక రచయిత దృక్పథాన్ని పరిగణనలోకి తీసుకోకుండా విమర్శ చేస్తే అది మంచి విమర్శ కాదనీ, అంతేకాక అలాంటి విమర్శ ఎక్కువ కాలం సాహిత్యలోకంలో నిలవదని తన అభిప్రాయాన్ని కుండబద్దలు కొట్టినట్లు తెలిపారు.

1983లో వచ్చిన 'సాహిత్య నేపథ్యం' కూడా విమర్శకు సబంధించినదే. సుందర్శనం తాను రాసిన నూరు గ్రంథ సమీక్షల్ని 1987లో ఒక గ్రంథంగా ప్రచరించారు. 1964 నుంచి 1984 సంవత్సరాల మధ్య అంటే రెండు దశాబ్దాల్లో ఈ నూరు సమీక్షలు రాశారు, ఈ సమీక్షలు భారతి, ఆంధ్ర పత్రిక, ఆంధ్ర ప్రభ పత్రికల్లో ప్రచురించబడ్డాయి. ప్రతి రచయిత, విమర్శకుడు తప్పనిసరిగా చదవవలసిన గ్రంథం ఇది. మంచి ఎక్కడ ఉన్నా ప్రశంసించారు. తప్పు ఎక్కడున్నా నిశితంగా విమర్శించారు. కావలిపాటి విజయలక్ష్మి రచన 'కాలచక్రం' గురించి చెపుతూ 'అలవోకగా రచించినట్లు కనిపించే ఈ నవలలో చక్కని శిల్ప దాగివుంది.' అని కీర్తించారు. నవలలు ఎలా చదవాలి, ఎలా అర్థం చేసుకోవాలి అనే అంశాల్ని గురించి మంచి వివేచన చేసి నవలా విమర్శకు మార్గదర్శకులు అయ్యారు. కవిత్వాన్ని కూడా సమీక్ష చేశారు. దిగంబర కవిత్వాన్ని విశ్లేషిస్తూ వాళ్లకు మునుగుపేర్లు ఎందుకు కావలసి వచ్చాయో అని ఆధిక్షేపించారు. 'కృష్ణ పక్షం' భావ కవితకూ, 'మహాప్రస్థానం' అభ్యుదయం కవితకూ వేగుచుక్క లైనట్లే శేషేంద్ర 'నాదేశం– నా ప్రజలు' కావ్యం తెలుగు కవిత్వాన్ని కొత్త దారుల్లో నడిపిస్తుందని అన్నారు. తెలుగు విమర్శనా రంగంలో సుదర్శనం తనకంటూ ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకున్నారు. విమర్శలో కొత్తకొత్త ఆలోచనలు రేకెత్తించారు. ఈ విషయం ఎవరూ కాదనరు. అంతమాత్రం చేత ఆయన చేసిన ప్రతి విమర్శ ప్రామాణికం అని చెప్పడానికి వీలులేదు. తన దృక్పథంలో రాజీపడకుండా చెప్పదలచుకున్నది సూటిగా చెప్పడం ఆయనకు వెన్నతో పెట్టిన విద్య. మొత్తం మీద ఆయన తెలుగు సాహిత్య విమర్శకు అందించిన సూత్రాలు మార్గదర్శకాలని ఘంటాపథంగా చెప్పవచ్చు.

- ప్రొఫెసర్ వెలమల సిమ్మన్న



## పగలు – రాత్రి

ఆ ఒంటరి ఇంటిని
కావల్సినవాళ్లకు
చీకటి మాత్రమే
చాలా స్పష్టంగా చూపిస్తుంది

కురుస్తున్న ఆకాశంతో సహా
గదుల్లోకి వచ్చి వెచ్చదనాన్ని పుచ్చుకొని
వెళ్లిపోతున్న ఒక్కొక్కరూ
వెనక్కి తిరిగి చూడకపోవడంలో
ఏదో ఆంతర్యం దాగే ఉంటుంది!

అన్ని చూపులూ
అవనతమైపోయినచోట
గదుల్లో మిగిలిన వాళ్లతో హా నిశ్శబ్దం
మూగగా రోదిస్తుంది

చీకటి మెల్లగా జారుకున్నాక
పక్కనే ఏరు ప్రవహించడం తప్ప
సంగతేమీ లేదు...!

– పాయల మురళీకృష్ణ
94410 26977

## ఆహ్వానం

ఈ పేజీలో ప్రచురణార్థం రచయితల నుంచి సాహిత్య వ్యాసాలను, సాహిత్య విమర్శలను ఆహ్వానిస్తున్నాం. వ్యాసాలను కంపోజు చేసి పంపేవారు సాఫ్ట్ కాపీని, పిడిఎఫ్‌ని కలిపి పంపాలి. సమకాలీన రచనలపై విమర్శనాత్మక వ్యాసాలకు ప్రాధాన్యం ఉంటుంది. సమీక్ష కోసం పుస్తకాలను పంపేవారు రెండు కాపీలను పంపాలి. సంక్షిప్త పరిచయాలు ప్రజాశక్తి ఆదివారం అనుబంధం స్నేహలో, వివరణాత్మక సమీక్షలు అక్షరం పేజీలో ప్రచురిస్తాం. పుస్తకాలను, వ్యాసాలను కింది చిరునామాకు పంపాలి.

అక్షరం, ప్రజాశక్తి సాహిత్య పేజీ, ప్రజాశక్తి కార్యాలయం, ఎంబి విజ్ఞాన కేంద్రం, గవర్నరుపేట, విజయవాడ – 2.
prajasavvadi@gmail.com

# సిరాచుక్కల అంబరం.. కథా నీలాంబరం...

రైటర్స్ మీట్

ముంబైలో సుధాకర్ ఉణుదుర్తి ఫ్లయిట్ ఎక్కారు. చెన్నైయిలో మురారి గారి ఫ్లయిట్ టేకాఫ్ అయ్యింది. కావలిలో కృష్ణజ్యోతి సింహపురి క్యాచ్ చేశారు. భూతం ముత్యాలు నల్గొండ బస్‌లో టిక్కెట్ కొట్టించారు. అల్లం రాజయ్య మంచిర్యాలలో బ్యాగ్ తగిలించుకున్నారు. అన్వర్ వరంగల్ నుంచి సీదా రస్తా పట్టారు. కుమార్ కూనపరాజు రొయ్యల చెరువుల్ని వదిలిపెట్టి ప.గో నుంచి ఎకో స్పోర్ట్‌ని పరుగు పెట్టించారు. సిటీలో ఉన్న సాథీలంతా ఓలా క్యాబ్ కోసం వేళ్లు కదిలించారు. అందరి సూట్‌కేసులూ హైదరాబాద్ అంబేద్కర్ ఓపెన్ యూనివర్సిటీకి చేరాయి. నిద్ర ఎవరికి కావాలి? పుల్కాలు పెరుగున్నం ఎవరికి కావాలి? వెచ్చగా ఉన్న ఆ రాత్రి నలుపు ఎవరికి కావాలి? రచయితలతో మాటలు కావాలి. ఒక 'హేయ్ ..!' 'గురూ..' అన్న పలకరింపు కావాలి. నవ్వు నవ్వుగా భుజం చరుపు కావాలి. అరే మీరా అన్న ఆశ్చర్యం. పక్కపక్కన తనలాంటి వాళ్లతో కలిసి నిలబడటంలో ఆనందం. పసునూరి రవీందర్ లాంటి సాహిత్య అకాడమీ పురస్కార గ్రహీతలు, స్త్రీ వాదాన్ని సరికొత్త దృక్పథంతో విస్తృతంగా వినిపిస్తున్న అపర్ణ తోట, వస్తూనే కొత్త ఎత్తుగడతో, కొత్త చూపుతో కథలు రాస్తున్న రిషి శ్రీనివాస్, రెండు పదుల కథలను రాసిన కృష్ణజ్యోతి. అందరూ ఒకేచోట... భుజాలు రాసుకుంటూ ...భుజం తట్టుకుంటూ ...

### భిన్నత్వంలో ఏకత్వం

వాదనలు, సిద్ధాంతాలు వేరు కావచ్చు. కానీ ఆరోగ్యకరమైన వాతావరణంలో వారందరూ ఒకరినొకరు గౌరవించుకుంటూ వారి వారి గొంతులను వినిపిస్తూ మధ్యలో ఛలోక్తులు, సరదా సంభాషణలతో ఒకరినొకరు ఉత్సాహ పరుచుకుంటూ ఆద్యంతం కనిపించని క్రమశిక్షణను పాటించటం నేను ఈ రెండురోజులూ చూశాను.

భగవంతం, పూడూరి రాజిరెడ్డిని చూస్తూ ఉండటం.. వాళ్ళు మాట్లాడేది వింటూ ఉండటం గొప్ప ఆనందాన్నిస్తుంది. గత ఏడాది వీళ్ళిద్దరినీ సూర్యలంకలో విన్నాను. ఈసారి వీళ్ళతో పాటు ఇంకో ఇద్దరు బోనస్ . అపర్ణ తోట, చైతన్య పింగళి. వీళ్ళిద్దరినీ వింటున్నప్పుడు అసూయ కలిగింది. ఎంత సాహిత్యాన్ని చదివితే, ఎన్ని జీవితాల్ని చూస్తే ఆ స్పష్టతతో మాట్లాడగలరు వీరు? వీళ్ళు నేర్చుకున్నదాంట్లో ఒక శాతం నేను నేర్చుకోగలనా అనిపించింది.



రైటర్స్ మీట్ 2017కి హాజరైన రచయితలు, రచయిత్రులు

### రాయడానికి ముడిసరుకు

కథ ఎలా రాయాలి? ఎందుకు రాయాలి? ఎప్పుడు రాయాలి? ఎవరికోసం రాయాలి? ఇవన్నీ ప్రశ్నలు కావు. చర్చలూ కావు. ఒకరితో ఒకరు పరిచయం కావటం. ఒకరిని ఒకరు ప్రోత్సహించుకోవటం. ఉరుకుల పరుగుల జీవితపు మధ్య విరామంలో కథలు రాయటానికి కావల్సిన కాస్త ముడిసరుకును ఇక్కడ్నించి మోసుకుపోవటం ఈ కలయిక ఉద్దేశం అని నాకు అనిపించింది.

### అనుభవాలు.. అనుభూతులు

మహేష్ కత్తి ప్రసంగించినంత సేపూ ఒక ఉద్వేగం కలిగింది. రమణమూర్తిగారి 'వర్తమాన ప్రపంచ కథ' మీద మాట్లాడినప్పుడు.. ఆదిత్య కొర్రపాటి లాంటి ఒక యువకుడు విమర్శను దీక్షగా సాధన చేస్తున్నాడని తెలిసినప్పుడు.. డిజిటల్ మాధ్యమంలో సాహిత్యాన్ని సుస్థిరపరచటానికి అనిల్ అట్లూరి గారి సలహాలు విన్నప్పుడు అబ్బురం కలిగింది. రిక్షా నుంచి పుస్తకం దాకా భూతం ముత్యాలుగారి ప్రయాణం గొప్ప ప్రేరణ కలిగించే విషయం. ఉణుదుర్తి సుధాకర్ గారి సముద్ర ప్రయాణ అనుభవాలు, రిషి శ్రీనివాస్ ఆర్పీ పట్నాయక్ గొంతుతో పాడిన పాట.. తాత్వికతను ఒక్క వాక్యంలో ఉదహరించిన భగవంతం.. ఏ రంగు మెదడులో అంటుకుంటుందో ఆ రంగు కథలు రాస్తానని చెప్పిన మనోజ్.. రాయాలని అనిపిస్తే రాసేయ్యటమే.. దానికి చర్చలు ఎందుకన్న కాశిరాజు.. కథ రాయటానికి ఉత్ప్రేరకం పాఠకులే.. వాళ్ళు తగ్గుతున్నారన్న మహి.. మొదటిరోజు లాల్చీతో, రెండవ రోజు హూడితో కనిపించి ఆశ్చర్యపరిచిన పసునూరి రవీందర్.. చెన్నయి నుంచి ఈ సమావేశాల కోసం వచ్చిన మురారిగారు చెప్పిన కొన్ని రహస్యాలు.. అల్లం రాజయ్యగారి గదిలో కొంతసేపు కూర్చుని మాట్లాడిన మాటలు.. మిత్రులిచ్చిన పుస్తకాలు, వరంగల్ అన్వర్ గారి స్నేహం, రెహానా మాట్లాడినంత సేపూ కలిగిన భావోద్వేగం, ఎవరికీ ఎటువంటి అసౌకర్యం కలగకూడదని ఖదీర్ తీసుకున్న అతి జాగ్రత్తల వల్ల మహి, కాశి, విజయ్ పడిన అవస్థ; జిమ్మీ (ఇతని కోసం ఒక కథ రాయాలి) మౌనంగా పనులు చేసే విధానం.. ఎన్ని జ్ఞాపకాలు? ఇంకా ఆ హేంగోవర్ అలానే ఉంది. ఒక్కటే నాకు వ్యక్తిగత లోటు.. షూటింగ్ కారణంగా వెంకట్ సిద్ధారెడ్డి ఈ మీట్‌కు రాలేకపోవటం.

దైనందిన జీవితంలో ఉండే పీడన, నలుగు బాటు, భయాలు, ఆందోళనలు... వీటన్నింటినీ కాసేపు పక్కన పెట్టి కుదురుగా కూర్చుని రాయాలంటే... ఇలాంటి సమావేశాలు తరచూ జరగాలి.. కలుస్తూ ఉండాలి. రాసే వాళ్ళు రీఫ్రెష్ అవ్వాలి. నవ్వుకోవాలి, ప్రోత్సహించుకోవాలి. ఫేస్‌బుక్‌లోనో, ఎవరో చెప్పింది వినో పెంచుకునే అకారణ ద్వేషాలు సమసిపోవాలంటే... ఇటువంటి కలయికల్లోనే సాధ్యం. అక్షరం ఉజ్జీవంగా ఉండాలంటే కలం కుదురుగా ఉండాలి. అటువంటి కలం పట్టిన చేతులన్నింటినీ ఒకచోట చేర్చి.. చప్పట్లు కొట్టించిన ఖదీర్, సురేష్ ద్వయానికి జేజేలు.

తుదకు తన కుదురును చేరిన నిమ్మళం. అంబేద్కర్ స్మరణకు నీలం. దళిత సాహిత్యపు చేతనకు నీలం. అక్షరానికి ధాతువైన సిరాకు కృతజ్ఞతగా నీలం. కథను విస్తారం చేయడానికి నీలం. విశ్వంబరను చేయడానికి నీలం.

కార్తీకమాసం అంతా కుల భోజనాలతోనూ, వన భోజనాలతోనూ కిటకిటలాడుతున్నప్పుడు .... రాసే వాళ్ళందరినీ ఒక కులం కింద జమకట్టి.. చక్కటి సాహిత్య చర్చలతో మృష్టాన్న భోజనం పెట్టడం ఖదీర్‌కే చెల్లింది. రాసే కుతూహలం ఉన్న నాలాంటి వాళ్లకు ఇక్కడ రెండ్రోజుల గ్లూకోజ్ ఎక్కించబడింది. ఇప్పటికే బాగా రాసి, ఇంకా రాస్తున్న వాళ్లకు కొత్తవాళ్ళను కలిసి ఆలోచనలు పంచుకునే ఆటవిడుపు లాంటివి ఈ రెండు రోజులు.

### కలాలు కలిస్తే..

'రచయితల మధ్య పొసగదు' అన్న వాళ్ళు ఇక్కడికొచ్చి చూడాలి. 35 మంది రచయితలు. అల్లం రాజయ్య, ఖదీర్‌బాబు, కుప్పిలి పద్మ, కోడూరి విజయకుమార్, కుమార్ కూనపురాజు, టైటానిక్ సురేష్ లాంటి సీనియర్లు .... చైతన్య పింగళి..

– కె. కుమార్
9550772771

## సమాచారం

### జనరంజక కవి ప్రతిభా పురస్కారాలు

మూడేళ్లుగా జన రంజక కవి ప్రతిభా పురస్కారాలందిస్తున్న 'రావి రంగారావు సాహిత్య పీఠం' 2017లో కూడా ఈ పురస్కారాల కోసం కవిత్వ గ్రంథాలను ఆహ్వానిస్తోంది. స్పష్టంగా, సూటిగా సమాజ కేంద్రంగా ఉండే జనరంజక కవిత్వ గ్రంథాలు ఒక్క ప్రతి పంపితే చాలు. ఎంపికైన పుస్తకం కవికి ఒక్కక్కొరికి రూ.రెండు వేల నగదు, శాలువా, జ్ఞాపికతో గుంటూరు, బృందావన్ గార్డెన్స్, శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయ ప్రాంగణంలోని అన్నమయ్య కళావేదిక మీద ఫిబ్రవరి 9 శుక్రవారం సాయంత్రం 6 గంటలకు జరిగే సభలో సత్కారం జరుగుతుంది. 2013 నుంచి 2017 వరకు ప్రచురించబడిన పద్య, గేయ, వచన కవిత్వ గ్రంథాలను డిసెంబర్ 31లోపు పంపించాలి. చిరునామా : నర్రా ప్రభావతి, కన్వీనర్, రావి రంగారావు సాహిత్య పీఠం, 101, శంఖచక్ర నివాస్, అన్నపూర్ణ నగర్, 5వ లైను తూర్పు, గోరంట్ల, గుంటూరు– 522034. సెల్ : 9247581825.

### ఉమ్మడిశెట్టి త్రిదశాబ్ది పురస్కారానికి ఆహ్వానం

ప్రతిష్టాత్మకమైన 'ఉమ్మడిశెట్టి సాహితీ అవార్డు' త్రిదశాబ్ది పురస్కారం–2017 కోసం కవుల నుంచి కవితా సంపుటాలను ఆహ్వానిస్తున్నాం. అవార్డు పరిశీలన కోసం 2017లో ప్రచురణ పొందిన కవితా సంపుటాలను మాత్రమే పంపించాలి. ఎంపికైన ఉత్తమ కవితా సంపుటికి రూ.3 వేల నగదుతోపాటు అవార్డు 'త్రిదశాబ్ది ఉత్సవం'లో కవికి షీల్డ్‌తో సత్కారం ఉంటుంది. డిసెంబర్ 21 లోపు 4 ప్రతులను కింది చిరునామాకు పంపాలి.

– డాక్టర్ ఉమ్మడిశెట్టి రాధేయ, అవార్డు వ్యవస్థాపకులు,
13–1–606–1, షిర్డినగర్, రెవెన్యూ కాలనీ,
అనంతపురం–515001. సెల్ : 9985171411

### అవినీతి వ్యతిరేక ఉద్యమ కవితల పోటీ

అంతర్జాతీయ అవినీతి వ్యతిరేక దినోత్సవం సందర్భంగా ఆమ్ ఆద్మీ పార్టీ రాష్ట్ర శాఖ సౌజన్యంతో 'అమరావతి సాహితీమిత్రులు' సంస్థ అవినీతి వ్యతిరేక ఉద్యమ కవితల పోటీ నిర్వహిస్తోంది. 24 లైన్లకు మించని వచన కవిత కాని, గేయం కాని, తేటగీతి/ ఆటవెలది / కందం 6 పద్యాలు కాని పంపించాలి. స్థూలంగా విషయం అవినీతి వ్యతిరేకత. కవిత్వ శిల్పం కూడా అవసరం. ప్రథమ బహుమతిగా 5 వేలు, ద్వితీయ బహుమతిగా 3 వేలు, త తీయ బహుమతిగా 2 వేలు, నాలుగు 500 రూ.ల ప్రత్యేక బహుమతు లుంటాయి. అంతర్జాతీయ అవినీతి వ్యతిరేక దినోత్సవం డిసెంబర్ 9న ఉదయం గుంటూరులో బ్రాడీపేట సర్వీస్ హెల్త్ అర్గనైజేషన్ సమావేశ మందిరంలో జరిగే కవి సమ్మేళనంలో బహుమతి ప్రదానం ఉంటుంది. కవితల్ని డిసెంబర్ 5లోగా 'అమరావతి సాహితీమిత్రులు, 101, శంఖుచక్ర నివాస్, అన్నపూర్ణ నగర్ 5వ లైను తూర్పు, గోరంట్ల, గుంటూరు– 522034' కు పంపాలని కోరుతున్నాం.

– డాక్టర్ రావి రంగారావు
9247581825

### డాక్టర్ అద్దేపల్లి స్మృతి సంచికకు రచనల ఆహ్వానం

నిరంతర కవితా యాత్రికుడు, ప్రపంచీకరణనూ, గ్లోబలైజేషన్‌నూ పల్లె, పట్టణంలో పరిగెడుకుంటున్న వైనాన్ని కవిత్వపు ఖడ్గచాలనంతో కలవరపెట్టినవాడూ, కొత్త పాళీలకు పదును పెట్టినవాడూ, రెండు తెలుగు రాష్ట్రాలూ మరచిపోలేని సాహిత్య సమ్మోహనుడు డాక్టర్ అద్దేపల్లి రామమోహనరావు. ఆయన తొలి వర్ధంతి సందర్భంగా మల్లెతీగ సాహిత్యవేదిక 'అద్దేపల్లి జ్ఞాపకాలను స్మరించుకందాం' శీర్షికతో స్మృతిసంచికను అచ్చేయాలని సంకల్పించింది. కనుక సాహితీ మిత్రులు, కవులు, అద్దేపల్లి అభిమానులు, తమ కవితల్ని, వ్యాసాల్ని, స్మృతి గీతాల్ని, ఆయన ఉన్న అనుబంధాన్ని రాసి పంపాలని ఆహ్వానిస్తున్నాం. రచనల్ని కలిమిశ్రీ, మల్లెతీగ సాహిత్య వేదిక, 41–20/3–24, మన్నవవారి వీధి, కృష్ణలంక, విజయవాడ–520 013 చిరునామాకు డిసెంబరు 15లోపు అందేలా పంపాలి. వివరాలకు : 92464 15159

– కలిమిశ్రీ
అధ్యక్షులు, మల్లెతీగ సాహిత్య వేదిక

### నేడు 'మీడియా – సినిమా – టీవి' పుస్తకావిష్కరణ

చొప్పర బాలకోటయ్య రచించిన 'మీడియా–సినిమా–టీవి' పుస్తకావిష్కరణ సభ 4–12–2017 సోమవారం ఉదయం 10 గంటలకు జరగనుంది. విశాఖపట్నంలోని ఆంధ్రా విశ్వవిద్యాలయం పొలిటికల్ అండ్ సైన్స్ గ్యాలరీలో సభ జరుగుతుంది. పుస్తకాన్ని ఆచార్య మేడిపల్లి రవికుమార్ ఆవిష్కరిస్తారు. ఎయు విసి ఆచార్య గొల్లపల్లి నాగేశ్వరరావు, రిజిస్ట్రార్ ఆచార్య వెలగపూడి ఉమామహేశ్వరరావు తదితరులు పాల్గొంటారు.

– డాక్టర్ పేటేటి ప్రేమానందం



# వెచ్చని చలికాలం

శీతాకాలమంటేనే.. ఎముకలు కొరికే చలి.. దుప్పటిలోంచి బయటకు రావాలంటే అమ్మో! మరి ఎలా?! ఆఫీసులకు, కాలేజీలకు వెళ్లక తప్పదు కదా! చలికాలం అని బయటకు వెళ్లకుండా ఉండలేం. అందుకే చలి మన దరికి చేరకుండా, ఫ్యాషన్‌గా కనిపించాలనుకునే అమ్మాయిలకోసం ఆధునిక డిజైన్‌లతో రకరకాల ఉన్ని స్వెట్టర్‌లు మార్కెట్లోకి వచ్చేసాయి. చలికాలంలో వెచ్చని ఫ్యాషన్‌ను మీరూ ప్రయత్నం చేయండి!



## మీ కోసం

ఉల్లిపాయను మొత్తగా నూరి, ఆ ముద్దతో బ్రష్‌ను ఉపయోగించి పళ్ళను తోమితే దంత సమస్యలు తగ్గుతాయి.

## జీవన సౌరభం

విజేతల జీవితాలు చదివితే వారినుంచి కేవలం సందేశం మాత్రమే అందుతుంది. కానీ, ఓడిన వారి జీవితాలు చదివితే గెలుపు ఆలోచనలు వస్తాయి.

## 'జీవన'పై మీ స్పందన

'జీవన' పేజీలు మీకెలా అన్పిస్తున్నాయి? ఇంకా ఏం కావాలని కోరుకుంటున్నారు?
మీ కుటుంబసభ్యుల, మిత్రుల, బంధువుల స్పందన ఎలా ఉంది? 'ప్రజాశక్తి' కార్యాలయానికి రాయండి.
మీ సూచనలు, సలహాలు మాకు తెలియజేయండి.

మా చిరునామా: జీవన, ప్రజాశక్తి దినపత్రిక, హౌస్ నెం : 7-30-4, ఆకులవారి వీధి, గవర్నర్ పేట, విజయవాడ-2, ఇ మెయిల్ jeevanapageps@gmail.com
ఫోన్ నెం. 9490099006 మీ స్పందనను 12-6 గంటల వరకు ఫోనులో చెప్పవచ్చు. ఆదివారం సెలవు.

# కష్టం విలువ తెలపండి

**ఒ**కప్పటికీ ఇప్పటికీ కష్టంలో అనేక తేడాలు వచ్చాయి.

ఒకప్పుడు కష్టం ఎలా ఉండేదంటే..

- తినడానికి సరైన తిండి దొరక్కపోవడం, ఆపదలో ఆదుకునేవారు లేకపోవడాన్ని అప్పట్లో కష్టంగా భావించేవారు.
- రాత్రనక, పగలనక చదివినా ఉద్యోగం రాకపోవడాన్ని కష్టంగా అనుకునేవారు.
- పెళ్లైన స్త్రీలైతే భార్యకి భర్తపోరు, అత్తపోరు ఉండటాన్ని కష్టంగా భావించేవారు.
- ఇటు ఏడు తరాలు, అటు ఏడు తరాలు చూసి ఆడపిల్లలకు సంబంధాలు వెతకడమంటే అప్పట్లో కత్తిమీద సామే.
- ఆరుగాలం కష్టపడినా రైతుకి పంట చేతికి రాకపోవడాన్ని పెద్ద కష్టంగా భావించేవారు.
- ఇంటిల్లిపాది ఒక్కరి సంపాదనతో బ్రతకడం వల్ల ఇల్లు గడవడమే చాలా కష్టమయ్యేది. చాలీచాలని జీతాలు ఇలా కష్టాలంటే ఒక స్థాయిలో ఉండేవి. మిగతావాటికి చాలా వరకు సర్దుకుపోయేవారు. సరిపెట్టుకునేవారు.

**ప్రస్తుత కష్టాలు**

ప్రస్తుత కష్టానికి అనేక రూపురేఖలు మారిపోయాయి. పరీక్ష తప్పితే కష్టం, అమ్మ తిడితే కష్టం, నాన్న కొడితే కష్టం, పాఠాలు నేర్పే గురువు అరిస్తే కష్టం, సరైన చీర కొనకపోతే కష్టం..!

ఇప్పటివారి కష్టాలకు కారణం ఒక్కటే..

- అనుకున్నది దొరికితే.. కష్టం లేనట్లే ఇప్పటి వారు భావిస్తారు.
- నేటి యువత పిన్నీసు దొరక్కపోయినా, ప్రాణం పోయేంత కష్టం వచ్చినట్లు బాధ పడిపోతున్నారు.
- అప్పట్లో మనసు చాలా బలంగా ఉండేది. ఎందుకంటే అప్పటివారు చిన్ననాటి నుంచి కష్టాలు చూసి పెరిగేవారు.
- ప్రస్తుతం కష్టం అంటే ఏంటో తెలియకుండా తల తాకట్టుపెట్టయినా పిల్లలు కోరిందల్లా వాళ్ల కాళ్లముందు తల్లితండ్రులు పెడుతున్నారు.
- ఇప్పటి పిల్లల్లో మానసిక బలం తగ్గిపోబట్టి వాళ్లకిప్పుడు ప్రతిదీ కష్టమే.
- అంతెందుకు మొన్న కర్ణాటకలో ఒక ఐఏఎస్ ఆఫీసర్, కోస్తాంధ్రలో ఒక ఐపిఎస్ ఆఫీసర్, సినిమా హీరోలు, ఎంతోమంది సబ్‌ఇన్స్పెక్టర్లు, ఐఐటీ స్టూడెంట్స్, మెడికోస్ కూడా మానసికి ఒత్తిడి తట్టుకోలేక ఆత్మహత్యలు చేసుకున్నారు.
- ఇప్పటి కొత్తతరం పెద్దలకి చెప్పేది ఏంటంటే చదవండి చదివించండి. దానితోపాటే పిల్లలకు కష్టపడడం కూడా నేర్పండి.
- "మేము పడుతున్న కష్టం చాలు, పిల్లలెందుకు కష్టపడాలి". అని అనుకోవడం చాలా పెద్ద పొరపాటు! మనం ఎంత కష్టపడుతున్నామో తెలియజేస్తూ పిల్లలను పెంచాలి.
- అప్పుడే వారికి కష్టం విలువ తెలుస్తుంది. జీవితంలో వారు మంచి స్థాయిని చేరుకోవడానికి పునాది అవుతుంది.



# హీరో కొత్త స్కూటర్!

**మ**న దేశంలో తక్కువ సామర్థ్యం ఉండే ద్విచక్రవాహనాల మార్కెట్లో హీరో మోటోకార్ప్ ఆధిపత్యం చెలాయిస్తోంది. అయితే, స్కూటర్ల విషయానికి వస్తే హోండా, టీవీఎస్, సుజుకి వరుసగా అగ్రస్థానంలో ఉన్నాయి. స్కూటర్ల సెగ్మెంట్లో ఎలాగైనా రాణించేందుకు కొత్త స్కూటర్లను ప్రవేశపెట్టడానికి హీరో ఆసక్తికనబరుస్తోంది. అందులో భాగంగానే హీరో మోటోకార్ప్ సరికొత్త 125సీసీ స్కూటర్‌ను మార్కెట్లోకి విడుదల చేయడానికి సిద్ధమైంది. ఈ స్కూటర్ పియాజియో వెస్పా, యమహా ఫ్యాసినో స్కూటర్లకు గట్టి పోటీనివ్వనుంది. హీరో 125సీసీ స్కూటర్ రెట్రో స్టయిల్ డిజైన్‌లో రానుంది. ఈ అప్ కమింగ్ స్కూటర్ పట్టణ ప్రాంత యువ కొనుగోలుదారులను టార్గెట్ చేయనుంది. ప్రస్తుతం హీరో మోటోకార్ప్ ఎడ్జ్, డ్యూయెట్, ప్లెజర్ వంటి స్కూటర్లను విక్రయిస్తోంది. అయితే హీరో సంస్థ 125సీసీ స్కూటర్ గురించి ఎలాంటి సాంకేతిక వివరాలను వెల్లడించలేదు. ఇది యూత్‌కు బాగా మ్యాచ్ అవుతుంది. యువతను అట్రాక్ట్ చేయడానికి అధునాతన ఫీచర్లను హీరో ఇందులో జోడించింది. ధర విషయానికి వస్తే, వెస్పా, ఆక్టివా వంటి మోడళ్లకు గట్టి పోటీనిచ్చే ధరతో విపణిలోకి ప్రవేశపెట్టే అవకాశం ఉంది. ★



**మారుతున్న పరిస్థితులకనుగుణంగా మేనేజ్‌మెంట్ విద్య కూడా కొత్త పుంతలు తొక్కుతోంది.. ప్రతి రంగంలోనూ కార్పొరేట్ సంస్కృతి విస్తరిస్తుండడంతో.. సంబంధిత విభాగాలను నిర్వహించడానికి స్పెషలైజ్డ్ మ్యాన్ పవర్ అవసరం పెరుగుతోంది.. మార్కెటింగ్, ఫైనాన్స్, హెచ్ఆర్, ఆపరేషన్స్ మేనేజ్‌మెంట్‌తోపాటు.. మారుతున్న అవసరాలకనుగుణంగా మరెన్నో స్పెషలైజేషన్స్‌కు రూపకల్పన జరుగుతోంది. అలాంటి వినూత్న స్పెషలైజేషన్స్‌లో ఒకటి.. హాస్పిటల్ మేనేజ్‌మెంట్.. ఇది ఇటీవలి కాలంలో ప్రాచుర్యం పొందుతోంది. అన్ని రంగాల అవసరాలనూ దష్టిలో ఉంచుకుని పలు రకాల వినూత్న స్పెషలైజేషన్స్ ఎంబీఏ కోర్సులో అందుబాటులోకి వచ్చాయి.. వాటిల్లో రూరల్ మేనేజ్‌మెంట్, ఎంటర్‌ప్రెన్యూరల్ మేనేజ్‌మెంట్, హాస్పిటాలిటీ- టూరిజం, ఇన్ఫర్మేషన్ సిస్టమ్స్, ఇన్సూరెన్స్ అండ్ రిస్క్ మేనేజ్‌మెంట్, అగ్రి బిజినెస్, ఇంటర్నేషనల్ బిజినెస్ మేనేజ్‌మెంట్ వంటివి ప్రముఖమైనవి. ఈ క్రమంలో హెల్త్ కేర్ అవసరాలకనుగుణంగా రూపొందించిన కోర్సు.. హాస్పిటల్ మేనేజ్‌మెంట్/ అడ్మినిస్ట్రేషన్ లేదా హెల్త్‌కేర్ మేనేజ్‌మెంట్.**




# హాస్పిటల్ మేనేజ్‌మెంట్/ హెల్త్ కేర్ మేనేజ్‌మెంట్‌లో

## అపార అవకాశాలు

ప్రస్తుతం అధిక శాతం ఆస్పత్రుల్లో డాక్టర్లు మాత్రమే.. సంబంధిత నిర్వహణ బాధ్యతలను పర్యవేక్షిస్తున్నారు. ఈ అంశంలో వారికి ఎటువంటి ప్రొఫెషనల్ డిగ్రీ లేదా నాలెడ్జ్ లేకపోయినప్పటికీ.. అనుభవ పూర్వక అవగాహన, పరిశీలన ద్వారా మాత్రమే ఈ బాధ్యతలను నిర్వహిస్తున్నారు. దీంతో తమ ప్రాథమిక విధి అయిన.. ట్రీట్‌మెంట్, సర్జరీ వంటి బాధ్యతలతోపాటు.. రోగులకు తమ విలువైన సమయాన్ని కేటాయించలేపోతున్నారు. కాబట్టి ఇటువంటి నిర్వహణా పరమైన విభాగాల నుంచి వైద్యులను మినహాయించి.. ఆస్పత్రులలోని సంబంధిత విభాగాల నిర్వహణ దిశగా.. ప్రొఫెషనల్ నాలెడ్జ్ ఉన్న నిపుణులను తయారు చేయాలన్న ఉద్దేశంతో.. హెల్త్‌కేర్/ హాస్పిటల్ మేనేజ్‌మెంట్ కోర్సులకు రూపకల్పన జరిగింది.




### విధులు

ఇతర పరిశ్రమల్లోని మేనేజ్‌మెంట్ ప్రొఫెషనల్స్ మాదిరిగానే హాస్పిటల్/ హెల్త్‌కేర్ మేనేజ్‌మెంట్ అభ్యర్థుల విధులు ఉంటాయి. తేడా ఏమిటంటే.. హెల్త్ కేర్ మేనేజ్‌మెంట్ అభ్యర్థుల విధులన్నీ హాస్పిటల్ నేపథ్యంలో ఉంటాయి. హాస్పిటల్ నిర్వహణ, సిబ్బంది నియామకం, పరిపాలన సంబంధ విధులు, వివిధ విభాగాల మధ్య సమన్వయం, ఆరోగ్య సేవల మూల్యాంకనం, తదితర బాధ్యతలను వీరు నిర్వహిస్తారు. ఒక్క మాటలో చెప్పాలంటే.. హాస్పిటల్ దక్షతను పెంచడంతోపాటు నాణ్యమైన వైద్యాన్ని అందించడంలో అనుసంధానకర్తలుగా పని చేస్తారు.

### ఏయే అంశాలు బోధిస్తారు?

ఈ కోర్సులో ఉండే సబ్జెక్టులన్నీ కూడా ఇతర (జనరల్) ఎంబీఏ డిగ్రీ మాదిరిగానే ఉంటాయి. హాస్పిటల్స్ అవసరాలను దష్టిలో ఉంచుకుని హాస్పిటల్ మేనేజ్‌మెంట్ కోర్సును రూపొందించారు. తేడా ఏమిటంటే హెల్త్‌కేర్ రంగానికి ఎంత వరకూ అవసరమో అంత వరకూ మాత్రమే సిలబస్‌లో ప్రస్తావన ఉంటుంది. ఉదాహరణకు మర్కంటైల్ లా విభాగాన్ని తీసుకుంటే.. అందులో ఉండే అన్ని అంశాలను బోధించకుండా.. హెల్త్‌కేర్ రంగానికి అవసరమైన చట్టాలు, నిబంధనల వంటి అంశాల వరకే సిలబస్ పరిమితమవుతుంది. ఉదాహరణ : ఆర్గాన్ ట్రాన్స్‌ప్లాన్‌టేషన్ లా. రెండేళ్ల ఈ కోర్సు.. నాలుగు సెమిస్టర్లుగా ఉంటుంది. సంబంధిత అంశాలపై హాస్పిటల్స్‌లో ప్రాక్టికల్ శిక్షణనిస్తారు. ఈ కోర్సులో ఆర్గనైజేషన్ అండ్ మేనేజ్‌మెంట్ ప్రాసెస్, అకౌంటింగ్, హెల్త్‌కేర్ ఎకనామిక్స్, క్వాంటిటేటివ్ టెక్నిక్స్, ఐటీ ఫర్ హెల్త్‌కేర్, హాస్పిటల్ ప్లానింగ్ అండ్ ప్రాజెక్ట్ మేనేజ్‌మెంట్, హెల్త్‌కేర్ లాస్, ఫైనాన్షియల్ మేనేజ్‌మెంట్, కమ్యూనికేషన్ అండ్ రిపోర్ట్ రైటింగ్, మెడికల్ టూరిజం, క్వాలిటీ మేనేజ్‌మెంట్, ఆపరేషన్స్ రీసెర్చ్, ఎంటర్‌ప్రెన్యూషిప్ అండ్ కన్సల్టెన్సీ, హెల్త్ కేర్ టెక్నాలజీ అండ్ ఫార్మాస్యుటికల్ మేనేజ్‌మెంట్, రిస్క్ అండ్ డిజాస్టర్ మేనేజ్‌మెంట్ వంటి అంశాలను ఆయా సెమిస్టర్ల వారీగా బోధిస్తారు.






### ప్రత్యేక లక్షణాలు తప్పనిసరి

ముఖ్యంగా సేవా దృక్పథంతో విధులు నిర్వహించాలనుకునే వారికి ఈ స్పెషలైజేషన్ సరిగా సరిపోతుంది. ఇతర రంగాలతో పోల్చితే హెల్త్ సెక్టార్ విభిన్నమైంది. దీంతో సాధారణ ఎంబీఏ మాదిరిగా కాకుండా ఈ స్పెషలైజేషన్‌ను ఎంచుకోవాలంటే మాత్రం కొన్ని రకాల స్కిల్స్ తప్పనిసరి. గంటల తరబడి పని చేసేందుకు వీలుగా ఓర్పు చాలా అవసరం. వివిధ అవసరాల రీత్యా హాస్పిటల్స్‌కు వచ్చే వారిని రిసీవ్ చేసుకోవడంతో పాటు మార్గదర్శకం చేయడానికి చక్కని కమ్యూనికేషన్ స్కిల్స్, సేవాభావం కలిగి ఉండాలి. పరిస్థితులకనుగుణంగా సమయస్ఫూర్తిగా నిర్ణయం తీసుకునే చాతుర్యం, వివిధ విభాగాలను సమన్వయం చేసే నాయకత్వ లక్షణాలు వంటివి ఉంటేనే ఈ రంగాన్ని కెరీర్‌గా ఎంపిక చేసుకోవచ్చు.

### కోర్సులు

హెల్త్ కేర్ మేనేజ్‌మెంట్ అవసరాన్ని గుర్తించిన పాశ్చాత్య దేశాల్లోని యూనివర్సిటీలు/ ఇన్‌స్టిట్యూట్‌లు చాలా కాలం నుంచే ఈ తరహా కోర్సులను ఆఫర్ చేస్తున్నాయి. మన దేశంలో మాత్రం కొన్ని సంవత్సరాల క్రితమే హాస్పిటల్ మేనేజ్‌మెంట్ కోర్సులకు అంకురార్పణ జరిగింది. ఈ స్పెషలైజేషన్‌లో డిప్లొమా నుంచి, బ్యాచిలర్, పీజీ ఇలా వివిధ స్థాయి కోర్సులు అందుబాటులో ఉన్నాయి. ఈ విభాగంలో పీజీ చేస్తేనే చక్కని అవకాశాలు ఉంటాయని నిపుణులు పేర్కొంటున్నారు. పీజీ స్థాయిలో.. ఎంబీఏ/ ఎంఎస్సీ రెండు విధాలుగా అందుబాటులో ఉంది. అధిక శాతం యూనివర్సిటీలు ఎంబీఏ స్పెషలైజేషన్‌గా హస్పిటల్ మేనేజ్‌మెంట్ కోర్సును ఆఫర్ చేస్తున్నాయి. ఏదైనా డిగ్రీ పూర్తి చేసిన అభ్యర్థులు (ఫైన్ ఆర్ట్స్, ఓరియెంటల్ లాంగ్వేజెస్ మినహా) ఈ కోర్సుకు అర్హులు. ఆయా ఇన్‌స్టిట్యూట్‌లు నిర్వహించే రాత పరీక్ష ద్వారా ప్రవేశం ఉంటుంది. కొన్ని యూనివర్సిటీలు మెడికల్ బ్యాగ్రౌండ్ ఉన్న అభ్యర్థులకు అడ్మిషన్స్ సమయంలో ప్రాధాన్యతనిస్తున్నాయి.

### విపరీతమైన డిమాండ్

ఇతర రంగాలతో పోల్చితే భిన్నమైన సెక్టార్ కావడంతోపాటు 24×7×365 సేవలు అందించాల్సి ఉంటుంది. కొంత కాలంగా వైద్య రంగం శరవేగంగా అభివృద్ధి సాధిస్తోంది. ప్రస్తుతం టైర్-1 పట్టణాలకు పరిమితమైన.. కార్పొరేట్ సంస్థలు తమ వైద్య సేవలను.. టైర్-2, 3 పట్టణాలకు కూడా విస్తరింపజేస్తున్నాయి. కాబట్టి హాస్పిటల్ మేనేజ్‌మెంట్ సంబంధిత కోర్సులు చేసిన అభ్యర్థులకు విపరీతమైన డిమాండ్ ఉంటోంది. ఒక్క మాటలో చెప్పాలంటే.. కోర్సు పూర్తయ్యాక ఏ ఒక్క అభ్యర్థి కూడా ఉద్యోగం లేకుండా ఖాళీగా లేడని కచ్చితంగా చెప్పొచ్చు. అంతేకాకుండా కేంద్ర ప్రభుత్వం ప్రారంభించిన వివిధ ఆరోగ్య పథకాల కారణంగా రాబోయే కాలంలో దాదాపు 7 లక్షల మంది మెడికల్- అనుబంధ ప్రొఫెషనల్స్ అవసరం ఉంటుంది. కాబట్టి ఈ కోర్సు పూర్తి చేసిన వారి అవకాశాలకు ఎటువంటి ఢోకా లేదని చెప్పొచ్చు.

### కెరీర్

సాధారణంగా ఎంబీఏ-హెల్త్ కేర్/ హాస్పిటల్ అడ్మినిస్ట్రేషన్/ మేనేజ్‌మెంట్ కోర్సు పూర్తి చేసిన అభ్యర్థులు మేనేజర్ హోదాలో కెరీర్‌ను ప్రారంభిస్తారు. తర్వాత అనుభవం, స్కిల్స్ ఆధారంగా సీనియర్ మేనేజర్, డిప్యూటీ జనరల్ మేనేజర్, జనరల్ మేనేజర్, జూనియర్ వైస్ ప్రెసిడెంట్, వైస్ ప్రెసిడెంట్, సీనియర్ వైస్ ప్రెసిడెంట్, చీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ (సీఈఓ) హోదా వరకూ చేరుకోవచ్చు. పే-ప్యాకేజ్ విషయానికొస్తే.. రూ.5 నుంచి 6 లక్షల రూపాయల వార్షిక వేతనంతో కెరీర్ ప్రారంభమవుతుంది. తర్వాత చేరుకున్న హోదాను బట్టి నెలకు రూ.5 లక్షల వరకూ కూడా సంపాదించే అవకాశం ఉంటుంది.

### ఐటీ కంపెనీలు

ప్రస్తుతం అన్ని హాస్పిటల్స్‌లోని ప్రతి విభాగం కంప్యూటరీకరణ చేయడంతో.. సంబంధిత సాఫ్ట్‌వేర్ రూపొందించడం కోసం హెల్త్‌కేర్ మేనేజ్‌మెంట్ అభ్యర్థులను ఐటీ కంపెనీలు నియమించుకుంటున్నాయి. ఈ కోర్సు పూర్తి చేసిన వారికి వివిధ కార్పొరేట్ హాస్పిటల్స్, క్లినిక్స్, రిహాబిలిటేషన్ సెంటర్స్, హెల్త్ కేర్ ఆర్గనైజేషన్స్, హెల్త్ ఇన్సూరెన్స్ కంపెనీలు, మెడికల్ కాలేజ్‌లు, నర్సింగ్ హోమ్స్, ఫార్మాస్యుటికల్స్‌లో అవకాశాలు ఉంటాయి. వివిధ సాఫ్ట్‌వేర్ కంపెనీలు కూడా ఎంబీఏ-హెల్త్ కేర్/ హాస్పిటల్ అడ్మినిస్ట్రేషన్ పూర్తి చేసిన అభ్యర్థులను రిక్రూట్ చేసుకుంటున్నాయి. బీపీఓ రంగంలో.. అమెరికా తదితర దేశాలు ఇన్సూరెన్స్ క్లెయిమ్స్, సంబంధిత వ్యవహారాలను అవుట్ సోర్సింగ్ రూపంలో భారత్‌కు అందజేస్తున్నాయి. ఈ నేపథ్యంలో బీపీఓ రంగం కూడా అవకాశాలకు వేదికగా నిలుస్తుంది. మన దేశంలోని ఇన్సూరెన్స్ కంపెనీలు కూడా థర్డ్ పార్టీ విషయాల పర్యవేక్షణ కోసం హెల్త్ కేర్ మేనేజ్‌మెంట్ అభ్యర్థులను రిక్రూట్ చేసుకుంటున్నాయి. విదేశాల్లోను కూడా వీరికి అవకాశాలు ఉంటాయి. ★

### ఆఫర్ చేస్తున్న ఇన్‌స్టిట్యూట్‌లు

**అపోలో ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హాస్పిటల్ అడ్మినిస్ట్రేషన్-హైదరాబాద్**
**వెబ్‌సైట్ :** www.apolloiha.ac.in
**అపోలో ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హెల్త్ కేర్ మేనేజ్‌మెంట్-హైదరాబాద్**
**వెబ్‌సైట్ :** www.apolloihcm.ac.in
**నిజామ్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్-హైదరాబాద్**
**వెబ్‌సైట్ :** http://nims.ap.nic.in
**ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ పబ్లిక్ ఎంటర్‌ప్రైజెస్-హైదరాబాద్**
**వెబ్‌సైట్ :** www.ipeindia.org
**దక్కన్ స్కూల్ ఆఫ్ మేనేజ్‌మెంట్-హైదరాబాద్**
**వెబ్‌సైట్ :** www.dshm.co.in
**యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాద్**
**వెబ్‌సైట్ :** www.uohyd.ac.in

---

గ్రూప్స్, ఇతర పోటీ పరీక్షల ప్రత్యేకం

# ఆంధ్రప్రదేశ్ - ప్రణాళికలు

విజేత



ఎస్.ఎం.సువర్ణకుమార్
డివిజనల్ అకౌంట్స్ ఆఫీసర్, ఏలూరు.
సెల్ : 9441169869

## ఇండియన్ ఎకానమి

### పదో పంచవర్ష ప్రణాళిక (2002-2007)

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి సంబంధించి 11వ ప్రణాళిక 2007-12 కాలానికి అమలయ్యింది. పదో పంచవర్ష ప్రణాళికా లక్ష్యాలు నాలుగు. అవి.. తలసరి ఆదాయంలో, స్థూల రాష్ట్ర ఆదాయంలో వివిధ రంగాలలో అభివృద్ధి సాధించడం, జనాభా పెరుగుదలలో అదుపు, సంపూర్ణ అక్షరాస్యత సాధించడం. ఈ లక్ష్యాలను దృష్టిలో ఉంచుకుని రాష్ట్ర ప్రభుత్వం వివిధ రంగాలకు కేటాయింపులు చేసింది.

ఈ ప్రణాళిక మొత్తం వ్యయం రూ.46611.83 కోట్లు కాగా సమాజిక రంగానికి అత్యధికంగా 28.24 శాతం కేటాయింపులు చేశారు. నీటిపారుదల రంగానికి 23.27 శాతం, విద్యుత్ రంగానికి 15.34 శాతం గ్రామీణాభివృద్ధికి 9.87 శాతం నిధులు కేటాయించారు. ఈ ప్రణాళికలో నీటిపారుదల రంగానికి అధిక ప్రాధాన్యత ఇవ్వడం వల్ల భారీ, మధ్య తరహా ప్రాజెక్టుల ద్వారా 0.70కి లక్షల హెక్టార్ల భూమికి, చిన్నతరహా నీటివనరుల ద్వారా 0.184 లక్షల హెక్టార్ల భూమికి మొత్తం మీద 0.892 లక్షల హెక్టార్ల భూమికి నీటి వసతులను కల్పించారు.

✧ ఈ ప్రణాళికలో భాగంగా కోటి ఎకరాల నీటిపారుదల కల్పనకు 21 లక్షల ఎకరాలకు నీటి సదుపాయాల స్థిరీకరణకు 'జలయజ్ఞం' (హరితాంధ్రప్రదేశ్ లక్ష్యంగా) ప్రారంభమయ్యింది.

✧ తొమ్మిదో ప్రణాళికలు రాష్ట్ర తలసరి ఆదాయం రూ.15,500 కాగా పదో ప్రణాళికలో ఇది రూ.24,400గా నమోదయ్యింది.

✧ ఈ ప్రణాళిక పూర్తయ్యేసరికి ఆహార ధాన్యాల ఉత్పత్తి 169 లక్షల టన్నులకు చేరింది.

✧ గ్రామీణ పేద కుటుంబాల జీవన ప్రమాణాలను, జీవన నాణ్యతను మెరుగుపరిచేందుకు ఉద్దేశించిన వెలుగు, డ్వాక్రా పథకాలను విలీనం చేసి 2005-06లో ఐకెపిగా మార్పు చేశారు.

✧ అసైన్డ్ భూములను పేదలకిచ్చి, అభివృద్ధి పరిచేందుకు, బీడుపడిన భూముల్ని బాగుచేసి, వాటిని వ్యవసాయ యోగ్యంగా తీర్చిదిద్దేందుకు ఇందిర ప్రభ పేరుతో సమగ్ర భూ అభివృద్ధి పథకాలను 2004లో ప్రారంభించారు.

✧ గ్రామీణ, పట్టణ ప్రాంతాలలోని ప్రజల జీవన స్థితిగతులను మెరుగు పరిచేందుకు 2006లో ఇందిరమ్మ పథకం ప్రారంభించారు. పాఠశాలలు, పౌష్టికాహారం, విద్యుత్, మంచినీరు, ఫించన్లు, రహదారి సదుపాయాలు, ఇళ్ల నిర్మాణం వంటి అంశాలలో మౌలిక సదుపాయాలను కల్పించేందుకు ఇందిరమ్మ పథకం ఉద్దేశించింది.

✧ స్వయం సహాయక బృందాలకు 2004లో పావలా వడ్డీ పథకం (సంవత్సరానికి మూడు శాతం) 2004లో ప్రారంభించారు. పదో ప్రణాళికలో 5.73 లక్షల స్వయం సహాయక బృందాలు ఉన్నాయి.

✧ ఉద్యోగ, ఉపాధి అవకాశాలు లేక నిరుద్యోగ యువత కోసం స్వయం ఉపాధి కోసం రాజీవ్ యువశక్తి పథకాన్ని 2004లో ప్రారంభించారు. దీనిలో భాగంగా యువతకు శిక్షణ ఇవ్వడం, ఋణాలు అందించడం వంటి వాటిలో ఆర్థిక స్థోమతను పెంచేందుకు సహాయపడతారు.

✧ గ్రామీణ ప్రాంతాల్లో నివసించే ప్రజలకు ప్రభుత్వ సేవలను, ప్రభుత్వ కార్యక్రమాల్లో లభించే ప్రయోజనాలను దగ్గర చేయడమే లక్ష్యంగా 'రాజీవ్ ఇంటర్నెట్ విలేజ్' కార్యక్రమాన్ని 2004 ఆగస్టులో ప్రారంభించారు.

✧ గ్రామీణ, పట్టణ ప్రాంతాల మధ్య అంతరాన్ని తొలగించేందుకు ఉద్దేశించిన 'పురా' పథకాన్ని ఆంధ్రప్రదేశ్ 'మిర్యాలగూడ'లో ప్రవేశపెట్టారు.

✧ 2004 సెప్టెంబర్ 1 తర్వాత నియమితులైన ప్రభుత్వ సిబ్బందికి 'కంట్రిబ్యూటరీ పింఛన్' పథకాన్ని రాష్ట్రంలో అమలు చేశారు.

### పదో పంచవర్ష ప్రణాళిక - సమీక్ష

పదో పంచవర్ష ప్రణాళికను సమీక్షించగా అనేక అంశాలలో ఈ ప్రణాళిక విజయవంతమైంది. మరికొన్ని అంశాల్లో వైఫల్యం చెందినట్లు అవగతమవుతుంది.

### విజయాలు

✧ ప్రణాళిక నిర్దేశించిన లక్ష్యాలను చాలా వరకూ సాధించింది. జీఎస్‌డిపి వృద్ధి రేటు 7.42 శాతం కాగా వ్యవసాయ వృద్ధి రేటు 5.48 శాతం, పారిశ్రామికరంగ వృద్ధి రేటు 8.37 శాతం, సేవలరంగ వృద్ధి రేటు 8.3 శాతం నమోదయ్యింది.

✧ తలసరి ఆదాయం తొమ్మిదో ప్రణాళిక కాలంలో రూ.15.585 నమోదుకాగా అది పదో ప్రణాళికా కాలానికి రూ.24,234కు పెంచగలిగారు.



✧ వ్యవసాయం, నీటిపారుదల రంగాల్లో గణనీయమైన అభివృద్ధి సాధించారు. 16 లక్షల ఎకరాలకు అదనంగా సాగునీరును ఈ ప్రణాళికా కాలంలో అందించగలిగారు.

✧ ఐటి రంగం బాగా అభివృద్ధి చెంది విస్తరించింది. ఈ ప్రణాళికా కాలంలో 44,941 కోట్ల రూపాయల సాఫ్ట్‌వేర్ ఎగుమతులు చేయగలిగారు. సాఫ్ట్‌వేర్ ఉద్యోగుల సంఖ్య 2,51,786కు చేరుకుంది.

### వైఫల్యాలు

✧ ప్రణాళికాంతానికి అక్షరాస్యత 61.9 శాతం పెరిగినా దేశంలో రాష్ట్రం స్థానం 23 గానే నిలిచింది.

✧ ఒక సంవత్సర కాలంలో ప్రతి వెయ్యి మంది శిశువులలో మరణించే వారిని అనగా శిశుమరణాల రేటును 45కు పరిమితం చెయ్యాలని లక్ష్యంగా నిర్దేశించగా ఇది 57 కే పరిమితం అయ్యింది.

✧ పట్టణ ప్రాంతాలతో దారిద్ర్య రేఖ కింద నివశించే ప్రజలను 15 శాతానికి తగ్గించాలని ఈ ప్రణాళిక నిర్దేశించగా అధికారిక అంచనాల ప్రకారం ఇది 28.3 శాతంగా నమోదయ్యింది.

✧ జనాభా నియంత్రణలో నిర్దేశించుకున్న లక్ష్యం సాధించడంలో వైఫల్యం చెందారు. లక్ష్యం 0.9 శాతం కాగా తగ్గించగలిగింది 1.3 శాతం మాత్రమే.

✧ రాష్ట్రంలో వివిధ ప్రాంతాల మధ్య అనేక అంశాలలో ముఖ్యంగా ఆదాయం, పారిశ్రామిక, ఆరోగ్య రంగాలలో ప్రాంతీయ, ఉప ప్రాంతీయ వ్యత్యాసాలు ఏర్పడ్డాయి.

మొత్తం మీద పదో పంచవర్ష ప్రణాళిక భౌతిక లక్ష్యాల సాధనలో విజయం సాధించి సాంఘిక లక్ష్యాలలో వైఫల్యం చెందింది.

★

---

# ఉద్యోగాలు

## ఎన్‌జీఆర్‌ఐలో 35 పోస్టులు

హైదరాబాద్‌లోని నేషనల్ జియోఫిజికల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్ (ఎన్‌జీఆర్ఐ).. వివిధ ప్రాజెక్టుల్లోని 35 ఖాళీల భర్తీకి దరఖాస్తులు కోరుతోంది.

**ఈ పోస్టు పేరు-ఖాళీలు :** ప్రాజెక్ట్ అసిస్టెంట్ లెవెల్ (II)-25; ప్రాజెక్ట్ సైంటిస్ట్ (ఆర్-I)-10.
**స్టైపెండ్:** ప్రాజెక్ట్ అసిస్టెంట్ లెవెల్ (II)-రూ.25,000; ప్రాజెక్ట్ సైంటిస్ట్ (ఆర్-I) -రూ.48,200.
**అర్హతలు:** ప్రాజెక్ట్ అసిస్టెంట్ లెవెల్ (II) పోస్టులకు కనీసం 55 శాతం మార్కులతో సంబంధిత విభాగంలో మాస్టర్స్ డిగ్రీబీ ప్రాజెక్ట్ సైంటిస్ట్ (ఆర్-I) పోస్టులకు పీహెచ్‌డీ (జియోఫిజిక్స్). వీటితోపాటు నిబంధనల మేర ఉద్యోగానుభవం.
**వయసు:** ప్రాజెక్ట్ అసిస్టెంట్ లెవెల్ (II) పోస్టులకు 30 ఏళ్లుబీ ప్రాజెక్ట్ సైంటిస్ట్ (ఆర్-I) పోస్టులకు 40 ఏళ్లు మించకూడదు. రిజర్వేషన్లు వర్తిస్తాయి.
**ఎంపిక:** వాకిన్ ఇంటర్వ్యూ.
**దరఖాస్తు విధానం:** ఆన్‌లైన్.
**దరఖాస్తుకు చివరి తేదీ:** డిసెంబర్ 4, 2017.
**వాకిన్ ఇంటర్వ్యూ తేదీ:** డిసెంబర్ 21, 2017.
**వాకిన్ ఇంటర్వ్యూ వేదిక:** సీఎస్ఐఆర్-నేషనల్ జియోఫిజికల్ రీసెర్చ్ ఇన్‌స్టిట్యూట్, ఉప్పల్ రోడ్, హైదరాబాద్-500007.
**వెబ్‌సైట్ :** www.ngri.org.in

## దక్షిణ మధ్య రైల్వేలో 21 స్పోర్ట్స్ కోటా ఉద్యోగాలు

సికింద్రాబాద్‌లోని దక్షిణ మధ్య రైల్వే ప్రధాన కార్యాలయం.. 21 స్పోర్ట్స్ కోటా ఖాళీల భర్తీకి దరఖాస్తులు కోరుతూ ప్రకటన విడుదల చేసింది.

**క్రీడా విభాగాల వారీ ఖాళీలు :** అథ్లెటిక్స్ (పురుషులు)-3; అథ్లెటిక్స్ (మహిళలు)-4; బ్యాడ్మింటన్ (మహిళలు)-1; బాస్కెట్‌బాల్ (పురుషులు)-2; బాక్సింగ్ (పురుషులు)-1; హ్యాండ్‌బాల్ (మహిళలు)-2; ఖోఖో (పురుషులు)-1; టెన్నిస్ (పురుషులు)-1; వాలీబాల్ (పురుషులు)-2; వాలీబాల్ (మహిళలు)-1; వెయిటిలిఫ్టింగ్ (పురుషులు)-2; హాకీ (పురుషులు)-1.
**వేతనం:** రూ.5,200-రూ.20,200.
**అర్హతలు:** పదోతరగతితోపాటు ఐటీఐ/ఇంటర్మీడియెట్ ఉత్తీర్ణత. అలాగే సంబంధిత క్రీడా విభాగంలో అంతర్జాతీయ/జాతీయ/అంతర్రాష్ట్ర/రాష్ట్ర/విశ్వవిద్యాలయ స్థాయి పోటీల్లో ప్రాతినిథ్యం వహించి ఉండాలి లేదా ప్రథమ/తృతీయ స్థానం పొంది ఉండాలి.
**వయస్సు:** 2018, జనవరి 1 నాటికి 18-25 ఏళ్ల లోపు ఉండాలి.
**ఎంపిక:** క్రీడల్లో సాధించిన విజయాలు, మార్కుల మెరిట్, పర్సనాలిటీ టెస్ట్ ఆధారంగా ఎంపిక చేస్తారు.
**దరఖాస్తు రుసుం:** రూ.500బీ ఎస్సీ/ఎస్టీ/మహిళ/మైనార్టీ/ఆర్థికంగా వెనకబడిన కేటగిరీల అభ్యర్థులకు రూ.250.
**దరఖాస్తు విధానం:** ఆఫ్‌లైన్.
**దరఖాస్తులు చేరడానికి చివరి తేదీ:** డిసెంబర్ 27, 2017.
**వెబ్‌సైట్:** www.scr.indianrailways.gov.in, www.indianrailways.gov.in ★

## కిడ్నీ వ్యాధితో వ్యక్తి మృతి

ప్రజాశక్తి- కోటబొమ్మాళి (శ్రీకాకుళం జిల్లా)

శ్రీకాకుళం జిల్లా కోటబొమ్మాళి మండలం జగన్నాథపురానికి చెందిన ఎస్.గోవిందరావు(45) కిడ్నీ వ్యాధితో బాధపడుతూ ఆదివారం మృతి చెందాడు. సకాలంలో వైద్యం అందకపోవడం వల్లే ఆయన మృతి చెందాడని కుటుంబసభ్యులు ఆరోపిస్తున్నారు. కుటుంబసభ్యుల కథనం ప్రకారం.. గోవిందరావు కొన్నాళ్లుగా కిడ్నీ వ్యాధితో బాధపడుతున్నాడు. ప్రతి నెలా శ్రీకాకుళంలోని ఒక ప్రయివేటు ఆస్పత్రిలో చికిత్స పొందుతున్నాడు. ఆదివారం తీవ్ర అనారోగ్యానికి గురి కావడంతో స్థానిక ప్రభుత్వ ఆస్పత్రికి తీసుకెళ్లారు. అక్కడ వైద్యుల్లేకపోవ డం, ఉన్న సిబ్బంది పట్టించుకోకపోవడంతో పరిస్థితి విషమించి మృతి చెందాడు. సమయానికి వైద్యమందిస్తే బతికివాడని వారు వాపోయారు.



కన్నీటి వీడ్కోలు
పశ్చిమగోదావరి జిల్లా ఏలూరులో ఆదివారం అనసూయ భౌతికకాయాన్ని భుజాలపై మోస్తున్న మహిళా నేతలు రమాదేవి, కుటుంబ సభ్యులు



అంతిమ యాత్ర
విజయవాడ కృష్ణలంకలో ఆదివారం కోటయ్య అంతిమ యాత్రలో పలువురు నేతలు, కార్యకర్తలు, బంధువులు పాల్గొన్నారు.

# అనసూయకు కన్నీటి వీడ్కోలు

- ఆశ్రం ఆసుపత్రికి భౌతికకాయం అప్పగింత
- నమ్మిన సిద్ధాంతం కోసం కడవరకూ నిలిచిన ధీశాలి : పి.మధు
- బివి రాఘవులు ప్రభృతుల సంతాపం

ప్రజాశక్తి - ఏలూరు

ఏలూరులో శనివారం కన్నుమూసిన సిపిఎం సీనియర్ నేత అన్నే అనసూయ (92)కు పార్టీ శ్రేణులు, వివిధ పార్టీల నేతలు, బంధువులు కన్నీటి వీడ్కోలు పలికారు. ఆదివారం ఉదయం సిపిఎం రాష్ట్ర కార్యదర్శి పి.మధు తదితరులు ఆమె భౌతికకాయం వద్ద నివాళులర్పించారు. పలు ప్రజా సంఘాలకు చెందిన మహిళా నేతలు ఆమె భౌతికకాయాన్ని మోసుకొచ్చి వ్యాన్‌పై ఎక్కించి ఘనమైన అంతిమ వీడ్కోలు పలికారు. ఆదివారం ఏలూరులోని శాంతినగర్ నుంచి ప్రారంభమైన అనసూయ అంతిమయాత్ర టిటిడి కళ్యాణ మండపం, బస్టాండు సెంటర్, ఫైర్‌స్టేషన్, జ్యుట్‌మిల్లు, వసంతమహల్ సెంటర్ మీదుగా పవర్‌పేటలోని సిపిఎం జిల్లా కార్యాలయానికి చేరుకుంది. అక్కడ కొద్దిసేపు నివాళు లర్పించిన అనంతరం కర్రల వంతెన సెంటర్, పాత బస్టాండు, రైల్వేస్టేషన్ మీదుగా ఆశ్రం ఆసుపత్రికి చేరుకుంది. అనసూయ తాను జీవించి ఉండగా తీసుకున్న నిర్ణయం మేరకు, శనివారం రాత్రి ఆమె నేత్రాలను విజయవాడలోని ఎల్‌వి ప్రసాద్ ఐ ఇనిస్టిట్యూట్ వైద్యులు సేకరించారు. అంతిమయాత్ర ముగిసిన తర్వాత ఆమె భౌతికకాయాన్ని ఆశ్రం ఆసుపత్రికి బంధువులు అప్పగించారు.



అనసూయ భౌతికకాయం వద్ద పి.మధు నివాళి

### నమ్మిన సిద్ధాంతం కోసం కడవరకూ నిలిచిన ధీశాలి : పి.మధు

నమ్మిన సిద్ధాంతం కోసం కడవరకూ నిలబడిన ధైర్యశాలి అన్నే అనసూయ అని సిపిఎం రాష్ట్ర కార్యదర్శి పి.మధు అన్నారు. ఆదివారం అనసూయ నివాసం వద్ద సిపిఎం పశ్చిమగోదావరి జిల్లా (డెల్టా) కమిటీ కార్యదర్శి బి.బలరాం అధ్యక్షతన జరిగిన సంతాప సభలో మధు మాట్లాడారు. దేశ స్వాతంత్ర్యాన్ని కాంక్షిస్తూ జాతీయోద్యమ బాటలో పయనించిన అనసూయ జీవితం అందరికీ ఆదర్శప్రాయమని అన్నారు. అన్నే వెంకటేశ్వరరావు, అనసూయ దంపతులు నమ్మిన సిద్ధాంతం కోసం నిలబడిన ఆదర్శమూర్తులని కొనియాడారు. అనసూయ ఆశయాలకు పునరంకితమై, వాటిని ముందుకు తీసుకెళ్తామని శపథం చేయడమే నిజమైన నివాళి అని అన్నారు. డబ్బు సంపాదనే రాజకీయంగా మారిన ప్రస్తుత పరిస్థితుల్లో నమ్మిన సిద్ధాంతం కోసం నిలబడటమే కాకుండా కుటుంబాన్ని తీర్చిదిద్దిన ఘనత అనసూయ ప్రత్యేకతని అన్నారు. ఐద్వా రాష్ట్ర ప్రధాన కార్యదర్శి రమాదేవి మాట్లాడుతూ.. తుదిశ్వాస విడిచే వరకూ ఆశయాల కోసం పాటుపడిన మహోన్నత వ్యక్తి అనసూయ అని అన్నారు. రాష్ట్రంలోనే పార్టీ తాలుకా మహిళా కార్యదర్శిగా పనిచేసిన వారిలో అనసూయ మొదటి వారని గుర్తు చేశారు. వ్యవసాయ కార్మిక సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి వి.వెంకటేశ్వర్లు మాట్లాడుతూ.. భూస్వామ్య వ్యవస్థ బలంగా ఉన్న రోజుల్లో ఒక మహిళ ఉద్యమ నేతగా ఎదగడం, కూలి, భూ పోరాటాలు చేయడం గొప్ప విషయమని అన్నారు. ఎపి రైతుసంఘం రాష్ట్ర అధ్యక్షులు వై.కేశవరావు మాట్లాడుతూ.. అనసూయ చిన్నవయసులోనే ఉద్యమ పథాన పయనించారని అన్నారు. వృద్ధాప్యంలోనూ పాదయాత్రలో పాల్గొని తన దీక్షాదక్షతను చాటుకున్నారన్నారు. సిపిఎం పశ్చిమగోదావరి జిల్లా (అప్‌ల్యాండ్) కమిటీ కార్యదర్శి చింతకాయల బాబూరావు మాట్లాడుతూ.. ఈ నెల 5న ఏలూరులో అన్నే అనసూయ సంస్మరణ సభ నిర్వహిస్తున్నట్లు ప్రకటించారు. సభలో సిపిఎం సీనియర్ నేత, మాజీ శాసనసభ్యులు ఆర్.సత్యనారాయణరాజు (ఆర్ఎస్), జుత్తిగ నరసింహమూర్తి, అనసూయ కుటుంబ సభ్యులు పాల్గొన్నారు.

### రాఘవులు ప్రభృతుల సంతాపం

అనసూయ మృతికి సిపిఎం పొలిట్‌బ్యూరో సభ్యులు బివి రాఘవులు, సిపిఎం సీనియర్ నేత జక్కా వెంకయ్య, తెలంగాణా రాష్ట్ర కార్యదర్శి తమ్మినేని వీరభద్రం, ఆ రాష్ట్ర కార్యదర్శివర్గ సభ్యులు బి.వెంకట్, ఐఎఫ్‌టియు రాష్ట్ర అధ్యక్షులు ప్రసాద్, జెడ్‌పి మాజీ ఛైర్మన్, టిడిపి నాయకులు యర్రా నారాయణస్వామి, ఎంఎల్‌సి రాము సూర్యారావు, ఎంసిపిఐ నేత కాటం నాగభూషణం, మహిళా ఉద్యమ నేత సంకు మనోరమ తదితరులు సంతాపం తెలిపారు.

# కోటయ్య అంతిమ యాత్ర

**వామపక్ష నేతల ఘన నివాళి**

ప్రజాశక్తి - విజయవాడ అర్బన్ ప్రతినిధి

సిపిఐ(ఎంఎల్) కేంద్ర కంట్రోల్ కమిషన్ సభ్యులు, ఎపి రైతు కూలీ సంఘం రాష్ట్ర కార్యదర్శి కోటయ్య(80)కు (కొప్పుల మోహనరెడ్డి) పలువురు ఘనంగా అంతిమ వీడ్కోలు పలికారు. ఈ నెల ఒకటిన గుండెపోటుతో మృతిచెందిన కోటయ్య అంతిమయాత్ర ఆదివారం నిర్వహించారు. తొలుత కృష్ణలంకలో నివాసం వద్ద ఉంచిన ఆయన భౌతిక కాయాన్ని పలువురు నేతలు సందర్శించి పూలమాలలు వేసి నివాళులర్పించారు. సిపిఎం రాష్ట్ర కార్యదర్శి పి.మధు, రాష్ట్ర కార్యదర్శి వర్గ సభ్యులు వై.వెంకటేశ్వర్లు (వైవి), వి.కృష్ణయ్య, రాష్ట్ర కమిటీ సభ్యులు బి.తులసీదాసు, పశ్చిమ కృష్ణా జిల్లా కార్యదర్శి వర్గ సభ్యులు దోనేపూడి కాశీనాథ్, సిపిఐ(ఎంఎల్) కేంద్ర నాయకులు గుర్రం విజయ కుమార్, పి.జస్వంత రావు, మధు, రాష్ట్ర నాయకులు సింహాద్రి జాన్సీ, జాస్తి కిషోర్, ముప్పాళ్ల భార్గవశ్రీ, విజయవాడ సెంట్రల్ నియోజక వర్గ ఎమ్మెల్యే బొండా ఉమామహేశ్వరరావు, సిపిఐ విజయవాడ నగర కార్యదర్శి దోనేపూడి శంకర్, జిల్లా నాయకులు నార్ల వెంకటేశ్వరరావు, సిపిఐ(ఎం) రాష్ట్ర కార్యదర్శి వెంకటరెడ్డి, కాటం నాగభూషణం, సిపిఐ (ఎంఎల్ లిబరేషన్) నాయకులు బి.హరినాథ్, కె.ప్రసాద్, సమతా పార్టీ మాజీ జాతీయ అధ్యక్షులు వివి.కృష్ణారావు, పారిశ్రామిక వేత్త కోగంటి సత్యం తదితరులు ఆయన భౌతిక కాయాన్ని సందర్శించి నివాళులర్పించారు. అనంతరం విజయవాడ కృష్ణలంకలోని ఆయన స్వగృహం నుంచి పండిట్ నెహ్రూ బస్టాండ్ సెంటర్ మీదుగా స్వర్గపురి వరకు అంతిమయాత్ర జరిపి అక్కడ అంత్యక్రియలు నిర్వహించారు.



కోటయ్యకు నివాళులర్పిస్తున్న వామపక్ష నేతలు

## పాఠశాలల్లో సిబ్బందిపై తీవ్ర పనిభారం

**ఎన్‌జిఓ రాష్ట్ర అధ్యక్షులు అశోక్‌బాబు**

ప్రజాశక్తి-గుంటూరు

పాఠశాల విద్యలో పెరిగిన విద్యార్థులు, ఉపాధ్యాయుల సంఖ్యకు అనుగుణంగా సిబ్బంది సంఖ్యను పెంచటం అత్యవసరమని ఎపి ఎన్‌జిఓ రాష్ట్ర అధ్యక్షులు అశోక్‌బాబు పేర్కొన్నారు. ఆదివారం గుంటూరు ఎన్‌జిఓ హోంలో నిర్వహించిన ది స్కూల్ ఎడ్యుకేషన్ సర్వీసెస్ అసోసియేషన్ 35వ కార్యవర్గ సమావేశంలో ముఖ్య అతిథిగా పాల్గొని మాట్లాడారు. 1980 నాటి ఉపాధ్యాయుల సంఖ్యకు అనుగుణంగా నియమించిన సిబ్బందే నేటికీ కొనసాగుతున్నారని తెలిపారు. ఒక్కొక్క జిల్లాలో 10 వేల మందికిపైగా టీచర్లు, 6 లక్షల మందికిపైగా విద్యార్థులు ఉన్నారని చెప్పారు. ఉపాధ్యాయులకు పరిపాలనా పరమైన సేవలు అందించటం ప్రస్తుతం ఉన్న సిబ్బందిపై తీవ్ర పనిభారం పెంచుతోందన్నారు. బోధనేతర సిబ్బంది సమస్యలపై త్వరలో విద్యాశాఖ మంత్రి దృష్టికి తీసుకెళ్లి సమస్యల పరిష్కారానికి కృషి చేస్తానని హామీ ఇచ్చారు. మిర్చియార్డు ఛైర్మన్ మన్నవ సుబ్బారావు, పాఠశాల విద్య గుంటూరు ఆర్‌జెడి కెవి.శ్రీనివాసులురెడ్డి మాట్లాడారు.

## 5న మీటర్ రీడర్ల చలో విజయవాడ

ప్రజాశక్తి - నెల్లూరు

పీస్ రేటు రద్దు చేసి సమానపనికి సమాన వేతనం అమలు చేయాలని డిమాండ్ చేస్తూ ఈనెల 5న చలో విజయవాడ కార్యక్రమాన్ని చేపడుతున్నామని విద్యుత్ మీటర్ రీడర్ల ఎస్‌పిడిసిఎల్ కమిటీ ప్రధాన కార్యదర్శి హజరత్ వలి చెప్పారు. ఆదివారం నెల్లూరులోని సిఐటియు ఆఫీసులో జరిగిన విలేకర్ల సమావేశం జరిగింది. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ.. ఐదేళ్ల నుంచి విద్యుత్ సంస్థలో మీటర్ రీడర్లుగా పీస్ రేటు పద్ధతిలో పనిచేస్తున్నామన్నారు. నెలకు రూ.5 వేలకు మించి రావడం లేదని ఆవేదన వ్యక్తం చేశారు. . ప్రమాదంలో చనిపోయిన మీటర్ రీడర్ల కుటుంబానికి రూ.10 లక్షలు ఎక్స్‌గ్రేషియా ఇవ్వాలన్నారు. అర్హులైన వారిని సబ్‌స్టేషన్‌లో షిఫ్టు ఆపరేటర్లుగా నియమించాలని డిమాండ్ చేశారు. 5న జరిగే చలోవిజయవాడకు మీటర్ రీడర్లు తరలిరావాలని పిలుపునిచ్చారు.

## 12, 13 తేదీల్లో దేశవ్యాప్త సమ్మె

- బిఎస్ఎన్ఎల్ అసోసియేషన్ అఖిల భారత ప్రధాన కార్యదర్శి కె.సెబాస్టిన్

ప్రజాశక్తి- శ్రీకాకుళం సిటీ

బిఎస్ఎన్ఎల్ సంస్థలో ప్రయివేటీకరణ విధానాలను వ్యతిరేకిస్తూ ఈ నెల 12, 13 తేదీల్లో దేశవ్యాప్త సమ్మె చేపడుతున్నట్లు సంచార్ నిగమ్ ఎగ్జిక్యూటివ్ అసోసియేషన్ అఖిల భారత ప్రధాన కార్యదర్శి కె.సెబాస్టిన్ తెలిపారు. శ్రీకాకుళంలో ఆదివారం జరిగిన సర్కిల్ ఎగ్జిక్యూటివ్ సమావేశంలో ఆయన మాట్లాడారు. బిఎస్ఎన్ఎల్‌లోని అన్ని సంఘాలతో పాటు అధికారులు, ఉద్యోగులు సమ్మెలో భాగస్వామ్యమవుతారని తెలిపారు. కేంద్ర ప్రభుత్వ కార్పొరేట్ విధానాలతో బిఎస్ఎన్ఎల్ మనుగడ ప్రశ్నార్థకమైందని ఆవేదన వ్యక్తం చేశారు. ప్రయివేటీకరణ దిశగా ప్రభుత్వం అడుగులు వేస్తుండడంతో సంస్థ నష్టాల్లో కూరుకుపోతోందని తెలిపారు. ఫలితంగా ఈ సంస్థలో యువతకు ఉద్యోగావకాశాలు మృగ్యమయ్యాయన్నారు. ప్రయివేట్ ఆపరేటర్లకు ఇస్తున్న స్వేచ్ఛ బిఎస్ఎన్ఎల్‌కు కేంద్రం ఇవ్వడం లేదని తెలిపారు. టెలికాం రంగంలో ఆపరేటర్లందరూ నష్టాల్లో ఉన్నారని, వారితో పోల్చుకుంటే బిఎస్ఎన్ఎల్ కొంత మెరుగ్గా ఉందన్నారు. సెల్ టవర్లకు ప్రత్యేక కంపెనీ ఏర్పాటు చేయాలన్న కేంద్ర ప్రభుత్వ నిర్ణయాన్ని సంస్థలో పనిచేస్తోన్న 1.81 లక్షల ఉద్యోగులు ముక్తకంఠంతో వ్యతిరేకిస్తున్నారని తెలిపారు. ఈ నెల 15, 16 తేదీల్లో భువనేశ్వర్‌లో నిర్వహిస్తున్న అసోసియేషన్ జాతీయ వర్కింగ్ కమిటీ సమావేశంలో నూతన కార్యవర్గం ఎన్నిక జరగనుందన్నారు. కేంద్ర ప్రభుత్వ కార్మిక వ్యతిరేక విధానాలు, సంస్థ మనుగడకు తీసుకోవాలని చర్యలపై ఈ సమావేశంలో చర్చిస్తామని తెలిపారు. సమావేశంలో అసోసియేషన్ రాష్ట్ర అధ్యక్ష, కార్యదర్శులు ఎ.విశ్వనాథం, ఉమామహేశ్వరరావు, రాష్ట్ర ప్రతినిధులు సిహెచ్. వెంకటరావు, రవికుమార్‌రెడ్డి పాల్గొన్నారు.



సమావేశంలో మాట్లాడుతున్న కె.సెబాస్టిన్

## ధరలకనుగుణంగా మెనూ ఛార్జీలు

**మిడ్ డే మీల్స్ సంఘం రాష్ట్ర కార్యదర్శి రమాదేవి**

ప్రజాశక్తి-చిత్తూరు అర్బన్

ప్రభుత్వ పాఠశాలల్లో మధ్యాహ్న భోజనం వంటి పెడుతున్న వంటమ్మలకు కనీస వేతనం అమలు చేసి, పెరిగిన ధరలకు అనుగుణంగా మెనూ ఛార్జీలు పెంచాలని ఎపి మధ్యాహ్న భోజన కార్మికుల సంఘం రాష్ట్ర కార్యదర్శి రమాదేవి అన్నారు. ఆదివారం స్థానిక సిఐటియు కార్యాలయంలో మధ్యాహ్న భోజన కార్మికుల చిత్తూరు జిల్లా కమిటీ సమావేశాన్ని నాగరాణి అధ్యక్షతన నిర్వహించారు. ఈ సందర్భంగా రమాదేవి మాట్లాడుతూ.. రాష్ట్రంలోని అనేక జిల్లాల్లో నెలల తరబడి వంటమ్మల గౌరవవేతనం, బిల్లులు పెండింగ్‌లో ఉన్నాయని, బడ్జెట్ విడుదల చేసి పెండింగ్ బకాయిలను చెల్లించాలని డిమాండ్ చేశారు. వారిపై రాజకీయ వేధింపులు అరికట్టాలన్నారు. సమావేశంలో సిఐటియు జిల్లా అధ్యక్షులు చైతన్య, నాయకులు గణపతి మధ్యాహ్న భోజన కార్మికుల సంఘం జిల్లా కమిటీ నాయకులు పాల్గొన్నారు.

## నాణ్యమైన విద్య ప్రభుత్వ బాధ్యత

ప్రజాశక్తి - విజయవాడ అర్బన్

నాణ్యమైన విద్య, నిరుద్యోగ సమస్యను పరిష్కరించాలని కోరుతూ ఎస్ఎఫ్ఐ, డివైఎఫ్ఐ ఆధ్వర్యంలో జరుగుతున్న రాష్ట్ర యువజన యాత్ర ఆదివారం విజయవాడలోని సెంట్రల్ జోన్‌కు చేరుకుంది. జాతాకు ఎస్ఎఫ్ఐ నాయకులు సోమేశ్వరరావు, కోటి, మహేష్, సుమంత్, డివైఎఫ్ఐ నాయకులు నాగేశ్వరరావు, ప్రవీణ్, స్వామిలు స్వాగతం పలికారు. ఈ సందర్భంగా డివైఎఫ్ఐ రాష్ట్ర కార్యదర్శి ఎం.సూర్యారావు, ఎస్ఎఫ్ఐ రాష్ట్ర కార్యదర్శి వై.రాము మాట్లాడుతూ.. ఎన్నికల సమయంలో ముఖ్యమంత్రి అనేక హామీలిచ్చి ప్రస్తుతం వాటిని విస్మరించారన్నారు. విద్యా రంగాన్ని అభివృద్ధి చేస్తామని చెప్పి అధికారంలోకి వచ్చాక విద్యను కార్పొరేటీకరణ చేశారని, ప్రభుత్వ పాఠశాలలు, హాస్టళ్లను మూసివేస్తున్నారని తెలిపారు. నిరుద్యోగ యువతకు ఉపాధి అవకాశలు కల్పిస్తామని చెప్పి ఒక్క ఉద్యోగాన్ని కూడా ఇవ్వలేదని విమర్శించారు. ఇప్పటికైనా ప్రభుత్వం నిరుద్యోగ సమస్యను గుర్తించి ఉద్యోగ ఖాళీలను భర్తీ చేయాలని కోరారు. కార్యక్రమంలో పలువురు విద్యార్థి సంఘ నేతలు పాల్గొన్నారు.

## 'చింతలపూడి'లో సిపిఎం పాదయాత్ర

**చట్టాలకు లోబడే జల్లేరు రిజర్వాయర్ నిర్మించాలని డిమాండ్**



పాదయాత్రను జెండా ఊపి ప్రారంభిస్తున్న రవి

ప్రజాశక్తి-బుట్టాయగూడెం (పశ్చిమగోదావరి)

చింతలపూడి ఎత్తిపోతల పథకం కోసం చేపట్టిన జల్లేరు రిజర్వాయర్ నిర్మాణం ఏజెన్సీ చట్టాలకు లోబడే ఉండాలని, పరిహారం ఇచ్చాకే పనులు చేపట్టాలని సిపిఎం అప్‌ల్యాండ్ జిల్లా కార్యదర్శివర్గ సభ్యులు ఎ.రవి ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. పశ్చిమగోదావరి జిల్లా జీలుగుమిల్లి మండలం అంకన్నగూడెంలో జల్లేరు రిజర్వాయర్ ముంపు గ్రామాల నిర్వాసితుల సమస్యలు పరిష్కరించాలని కోరుతూ సిపిఎం ఆధ్వర్యాన రెండ్రోజుల పాదయాత్రను ఆయన ఆదివారం ప్రారంభించారు. పాదయాత్రనుద్దేశించి రవి మాట్లాడుతూ జల్లేరు రిజర్వాయర్ నిర్మాణంలో ప్రభుత్వం షెడ్యూల్డ్ ప్రాంతాలను ముంపునకు గురి చేస్తోందని విమర్శించారు. రిజర్వాయర్ వల్ల ఎన్ని గ్రామాలు ముంపునకు గురవుతాయో నేటికి అధికారులు ప్రకటించకపోవడాన్ని బట్టి నిర్వాసితులకు పరిహారం అందజేయకుండానే నివాసాల నుండి బయటకు పంపేందుకు ప్రభుత్వం కుట్ర పన్నుతోందన్నారు. జిల్లా కార్యదర్శి వర్గ సభ్యులు తెల్లం రామకృష్ణ మాట్లాడుతూ ఈ రిజర్వాయర్ నిర్మాణంలో ఎల్‌టిఆర్ 1/70 కోర్టు వివాదంలో ఉన్న భూములు అధికంగా ఉన్నాయని చెప్పారు. ఆ భూములకు కోర్టు నుంచి ఉత్తర్వులు వచ్చిన తరువాతే భూ సేకరణ చేయాల్సి ఉండగా అధికారులు మాత్రం భూ సేకరణ ప్రక్రియను వేగవంతం చేయడం కోర్టు ధిక్కారమని అన్నారు. అనంతరం అంకన్నగూడెం, జగన్నాథపురం తదితర గ్రామాల మీదుగా పాదయాత్ర సాగింది.

**ప్రజ్ఞ**

**జవాబులు**

1. ఉహురు కెన్యట్టా
2. జెన్నీ కిమ్ ( దక్షిణ కొరియా)
3. డిసెంబరు 3
4. తెలంగాణ
5. సలిల్ పరేఖ్

## 13న 'ఉక్కు' బహిరంగ సభ

**హాజరుకానున్న సీతారాం ఏచూరి**

ప్రజాశక్తి - కడపఅర్బన్

ఉక్కు పరిశ్రమ ఉద్యమాన్ని ఉధృతం చేసేందుకు ఉక్కు సాధన కమిటీ, ఎస్ఎఫ్ఐ, డివైఎఫ్ఐ ఆధ్వర్యంలో ఈ నెల 13న కడపలో పెద్ద బహిరంగ సభ నిర్వహిస్తున్నామని ఉక్కు సాధన కమిటీ కన్వీనర్ బి.నారాయణ తెలిపారు. ఆదివారం డివైఎఫ్ఐ జిల్లా కార్యాలయంలో విలేకరుల సమావేశం నిర్వహించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ.. ఐదు రోజులుగా నిర్వహిస్తున్న జాతాను పరిశీలిస్తే ప్రజల నుంచి విశేష స్పందన కనబడుతుందని తెలిపారు. బహిరంగ సభకు మాజీ ఎస్ఎఫ్ఐ అఖిల భారత ప్రధాన కార్యదర్శి, మాజీ రాజ్యసభ సభ్యులు సీతారం ఏచూరి హాజరవుతారని చెప్పారు. రాయలసీమలోని ఉద్యమ నాయకులు, ఎస్ఎఫ్ఐ, డివైఎఫ్ఐ నాయకులు ఇందులో భాగస్వాములవుతున్నారని, ఉక్కు సాధన కోసం ఏర్పాటు చేసిన జెఎసి నాయకులూ హాజరవుతారని తెలిపారు. బహిరంగ సభ రాబోయే కాలంలో ఉక్కు ఉద్యమాన్ని మరింత తీవ్రతరం చేయడానికి దోహదబడుతుందని చెప్పారు. భారీ బహిరంగ సభకు విద్యార్థులు, యువకులు, ప్రజలు, ఉద్యమ నాయకులు, కార్యకర్తలు పెద్దఎత్తున హాజరై జయప్రదం చేయాలని పిలుపునిచ్చారు.

## వాల్మీకులను ఎస్టీల్లో చేర్చొద్దు

**మంత్రి కాలవ ఇంటి ముందు గిరిజన సంఘాల ఆందోళన**

ప్రజాశక్తి- అనంతపురం కలెక్టరేట్/నెల్లూరు

వాల్మీకులను ఎస్టీ జాబితాలో చేర్చొద్దని అనంతపురంలోని రాష్ట్ర సమాచార శాఖ మంత్రి కాలవ శ్రీనివాసులు ఇంటి ముందు ఆదివారం పెద్ద ఎత్తున ఆందోళన చేశారు. ప్రభుత్వానికి వ్యతిరేకంగా పెద్ద ఎత్తున నినాదాలు చేశారు. ఈ సందర్భంగా గిరిజన సంఘాల నాయకులు కేశవనాయక్, రామచంద్రనాయక్, పరుశురాం నాయక్, శివశంకర్ నాయక్ మాట్లాడుతూ.. సామాజికంగా, ఆర్థికంగా, ఉద్యోగ పరంగా బాగా అభివృద్ధి చెందిన వాల్మీకులను ఎస్టీ జాబితాలో చేర్చడం రాజ్యాంగ విరుద్ధమని అన్నారు. ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ఏకపక్ష నిర్ణయం గిరిజనులకు నష్టదాయకమన్నారు. ప్రభుత్వం ఈ నిర్ణయాన్ని వెంటనే వెనక్కు తీసుకోకపోతే రాష్ట్ర వ్యాప్త ఆందోళన చేస్తామని హెచ్చరించారు. మంత్రి కాలవ శ్రీనివాసులు ఆందోళనకారుల వద్దకొచ్చి మాట్లాడారు. గిరిజనులకు ఎలాంటి నష్టం వాటిల్లకుండా ప్రభుత్వం వాల్మీకులను ఎస్టీ జాబితాలో చేర్చిందన్నారు. బోయ, వాల్మీకులను గిరిజనులలో చేర్చే చర్యలను తక్షణమే నిలిపివేయాలని గిరిజన సంఘం రాష్ట్ర, జిల్లా అధ్యక్షులు దివారి ప్రభాకర్, ఇండ్ల రవి డిమాండ్ చేశారు.

సదస్సు

# పెన్షన్ భిక్ష కాదు హక్కు

- జనవరి 7న పెన్షన్ సాధనకు రాష్ట్ర సదస్సు



సమావేశంలో మాట్లాడుతున్న యుటిఎఫ్ గుంటూరు జిల్లా అధ్యక్షులు నాగమల్లేశ్వరరావు

ప్రజాశక్తి-గుంటూరు

పెన్షన్ బిక్ష కాదని, హక్కు అని యుటిఎఫ్ గుంటూరు జిల్లా అధ్యక్షులు కె.నాగమల్లేశ్వరరావు అన్నారు. బ్రాడీపేటలోని కొరటాల మీటింగ్ హాల్లో ఉద్యోగుల పెన్షన్ సాధన కమిటీ రాష్ట్రస్థాయి సన్నాహక సమావేశం వేపాడ సత్యన్నారాయణ అధ్యక్షతన ఆదివారం నిర్వహించారు. సదస్సులో నాగమల్లేశ్వరరావు మాట్లాడుతూ.. ప్రస్తుతం ఏపిలో పెన్షన్ సాధన కోసం పోరాటాలు నడుస్తున్నాయని, వాటిల్లో విద్యుత్ ఉద్యోగులూ పాల్గొనాలని కోరారు. పార్లమెంట్‌లో పియఫ్ఆర్‌డి బిల్లు యుపిఎ2 హయాంలో ఆమోదం పొందిందని, దీనికి లెఫ్ట్ పార్టీలు మినహా మిగిలిన అన్ని రాజకీయ పార్టీలూ మద్దతుగా ఓటేసి ఉద్యోగులకు పెన్షన్ లేకుండా చేశాయని గుర్తు చేశారు. దీనికి వ్యతిరేకంగా దేశంలో 14 సార్వత్రిక సమ్మెలు జరిగాయని చెప్పారు. 2004కు ముందు నియామకం పొందిన ఉద్యోగులకు పెన్షన్ ఉందని, ఉద్యోగులందరూ పెన్షన్ సాధించుకునే వరకూ అలుపెరగని పోరాటం చేయాలని పిలుపునిచ్చారు. బిసి ఉద్యోగుల సంక్షేమ సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి పరిశ వెంకటేశ్వరరావు మాట్లాడుతూ.. సంఘాలకు అతీతంగా విద్యుత్ ఉద్యోగులందరూ పోరాడాల్సిన అవసరం ఉందన్నారు. ముస్లిం మైనార్టీ విద్యుత్ ఉద్యోగుల సంక్షేమ సంఘం రాష్ట్ర అధ్యక్షులు షేక్ సుభానిసాహెబ్ మాట్లాడుతూ.. ప్రభుత్వం చేయాలనుకున్న అన్నీ చేస్తోందని, ఉద్యోగులకు ప్రయోజనకరమైన పెన్షన్ మాత్రం ఇవ్వట్లేదని అన్నారు. సిఐటియు జిల్లా కార్యదర్శి కె.బాబుప్రసాద్ మాట్లాడుతూ.. ఉద్యోగుల పెన్షన్‌ను షేర్ మార్కెట్లో పెట్టి, ఉద్యోగుల జీవితాలతో జూదం ఆడుతుందన్నారు. సదస్సులో యునైటెడ్ ఎలక్ట్రిసిటీ ఎంప్లాయీస్ యూనియన్ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి సిహెచ్ నాగబ్రహ్మాచారి, నాయకులు కామేశ్వరరావు, చలపతిరావు, సుబ్బారెడ్డి, రాజు, వీరాంజనేయులు, ప్రసాద్ తదితరులు పాల్గొన్నారు. అనంతరం లక్కనం రాజు కన్వీనర్‌గా, సత్యనారాయణ కో-కన్వీనర్‌గా మరో 13 మందితో ఎపి విద్యుత్ ఉద్యోగుల పెన్షన్ సాధన కమిటీని ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు. జనవరి 7న రాష్ట్ర స్థాయి సదస్సు, ఈలోగా జిల్లా స్థాయి సదస్సులు నిర్వహించాలని, సమావేశాలు జరిపి జిల్లా స్థాయి కమిటీలను ఎన్నుకోవాలని సదస్సులో తీర్మానించారు.

సంక్షిప్తం

### సర్వరాయసాగర్‌కు నీటిని విడుదల చేయాలి

**కడప** : సర్వరాయసాగర్, వామికొండ రిజర్వాయర్‌కు నీళ్లు తక్షణం వదలాలని, కొండాపురం, రామచంద్రనగర్ ప్రాంతాల వాసులు ముంపునకు గురికాకుండా కాపాడాలని కడప ఎంపి అవినాష్‌రెడ్డితో పాటు పలువురు ఎమ్మెల్యేలు కలెక్టర్ బాబూరావునాయుడిని కోరారు. ఆదివారం కలెక్టర్ బంగ్లాలో కలెక్టర్‌ను కలిసి సమస్యలను వివరించారు.

### గ్యాస్ ధరలను తగ్గించాలని రాస్తారోకో

**విజయనగరం టౌన్** : గ్యాస్ ధరల పెంపునకు నిరసనగా ఆదివారం విజయనగరం కలెక్టరేట్ జంక్షన్ వద్ద సిపిఎం ఆధ్వర్యాన రాస్తారోకో జరిగింది. ఈ సందర్భంగా సిపిఎం జిల్లా కార్యదర్శి తమ్మినేని సూర్యనారాయణ మాట్లాడుతూ పెంచిన గ్యాస్ ధరలను తగ్గించకపోతే రానున్న కాలంలో ప్రజా ఉద్యమాన్ని మరింత తీవ్రతరం చేస్తామన్నారు.

### టీచర్ల సమస్యలపై ప్రభుత్వ తాత్సారం

**ఆనందపురం, విశాఖ** : ఉపాధ్యాయుల సమస్యల పరిష్కారంలో రాష్ట్ర ప్రభుత్వం తాత్సార వైఖరిని అవలంబిస్తోందని యుటిఎఫ్ రాష్ట్ర కార్యవర్గ సభ్యులు జి.ప్రభాకర్‌వర్మ అన్నారు. ఆదివారం విశాఖ జిల్లా వేములవలసలోని జిఎస్ఎన్ ఫంక్షన్ హాల్‌లో సంఘం జిల్లా మహాసభలు ప్రారంభమయ్యాయి.

### కాపులకు బిసి రిజర్వేషన్‌పై రాద్ధాంతమా : కళా

**శ్రీకాకుళం అర్బన్** : కాపులకు బిసి రిజర్వేషన్‌పై కావాలనే కొందరు రాద్ధాంతం చేసేందుకు ప్రయత్నిస్తున్నారని మంత్రి కిమిడి కళావెంకటరావు విమర్శించారు.

### ఏనుగుల దాడిలో ఇద్దరు మృతి

**డీ.హీరేహాళ్(అనంతపురం)** : అనంతపురం జిల్లాలో ఏనుగుల దాడులు కొనసాగుతున్నాయి. ఏనుగుల దాడిలో శనివారం ఒకరు మృతి చెందగా ఆదివారం మరొకరు మృతి చెందారు.

## బిజెపి ఎంపి ప్రతాప్ సింహ అరెస్టు

**మైసూర్ :** బిజెపికి చెందిన కర్ణాటక ఎంపి ప్రతాప్ సింహను పోలీసులు అరెస్టు చేశారు. మైసూర్‌కు సమీపంలోని హన్సూర్‌లో హనుమాన్ జయంతి ఉత్సవాల సందర్భంగా అనుమతించిన మార్గాన్ని ఉల్లంఘించినందుకు ఆయనతో పాటు ఆయన మద్దతు దారులను కూడా కస్టడీలోకి తీసుకున్నట్లు పోలీసులు తెలిపారు. హనుమాన్ జయంతి, ఈద్ మిలాద్ ఉత్సవాలు ఒకేసారి రావడంతో పట్టణంలో నిషేధ ఉత్తర్వులు విధించామని పోలీసులు చెప్పారు. హన్సూర్ మత పరంగా చాలా సున్నితమైన ప్రాంతం కావడంతో నిషేధపు ఉత్తర్వులు విధించారు. తనను అరెస్టు చేయడం పట్ల ప్రతాప్ సింహ స్పందిస్తూ పోలీసులను తీవ్రంగా విమర్శించారు.



**సాధికారిత కోసం**
ప్రత్యేక ప్రతిభావంతుల సాధికారిత అవార్డుల బహుకరణ కార్యక్రమానికి హాజరయ్యేందుకు న్యూఢిల్లీలోని విజ్ఞాన భవన్ వద్ద రోడ్డు దాటుతున్న ప్రత్యేక ప్రతిభావంతులు



**నిరసన**
ఓఖీని జాతీయ విపత్తుగా ప్రకటించడానికి కేంద్రం నిరాకరించిన నేపథ్యంలో శిథిలమైన కరకట్టలను పునర్నిర్మించాలని, పునరావాస కేంద్రాలను ఏర్పాటు చేయాలని డిమాండ్ చేస్తున్న కేరళలోని చెల్లనమ్ గ్రామవాసులు

# కంచ ఐలయ్య అరెస్టు

- అడ్డుకున్న జీఎంపిఎస్, సిపిఎం కార్యకర్తలు
- ఖమ్మంలో ఐదు గంటల పాటు ఉద్రిక్తత

ప్రజాశక్తి - హైదరాబాద్ బ్యూరో

గొర్రెల, మేకల పెంపకందార్ల సంఘం(జిఎంపిఎస్) రాష్ట్ర ద్వితీయ మహాసభకు ముఖ్యఅతిథిగా వచ్చిన ప్రముఖ రచయిత, ప్రొఫెసర్ కంచ ఐలయ్యను ఖమ్మం, సిపిఎం జిల్లా కార్యాలయం వద్ద పోలీసులు అరెస్టు చేశారు. ఐలయ్యను జీపులో తరలిస్తుండగా సిపిఎం, జిఎంపిఎస్ కార్యకర్తలు అడ్డుకున్నారు. వారిని పోలీసులు పక్కకు గుంజేసి ఐలయ్యను కూసుమంచి పోలీస్‌స్టేషన్‌కు తీసుకెళ్లారు. అనంతరం అక్కడి నుంచి హైదరాబాద్‌కు తరలించారు. ఆదివారం ఉదయం 9 గంటలకు సిపిఎం, ఖమ్మం జిల్లా కార్యాలయానికి ఐలయ్య వచ్చారు. దీంతో అక్కడకు భారీఎత్తున పోలీసులు వెళ్లారు. ఎసిపి గణేష్ సిపిఎం కార్యాలయంలోకి వెళ్లి పార్టీ రాష్ట్ర కమిటీ సభ్యులు నున్నా నాగేశ్వరరావు, జిల్లాకమిటీ సభ్యులు వై.విక్రమ్‌తో చర్చలు జరిపారు. ఐలయ్య సభకు వెళ్తే వైశ్యులు ఆందోళనకు దిగుతారన్న సమాచారం ఉందని, అందుకే అతన్ని హైదరాబాద్‌కు తిరిగి పంపాలని చెప్పి వెళ్లారు. దీంతో స్థానిక కార్పొరేటర్ అఫ్రోజ్ సమీనాతో కలిసి వారు ఖమ్మం సిపి తఫ్సీర్ ఇక్బాల్‌ను కలిశారు. బహిరంగ సభకు వచ్చేలా ఐలయ్యను అనుమతించాలని కోరారు. అందుకు సిపి నిరాకరించారు. దీంతో ఐలయ్యను బహిరంగ సభ వద్దకు తీసుకువెళ్లేందుకు సిపిఎం, జీఎంపి ఎస్ కార్యకర్తలు, నాయకులు ర్యాలీగా బయలుదేరారు. ఈ క్రమంలోనే పోలీసులు బలవంతంగా ఐలయ్యను అదుపులోకి తీసుకున్నారు. అరెస్టు చేసి జీపులో తరలిస్తుండగా... కార్యకర్తలు రోడ్డుకు అడ్డంగా పడుకున్నారు. ఐలయ్యను విడుదల చేయాలంటూ నినాదాలు చేశారు. ఉదయం తొమ్మిది గంటల నుంచి మధ్యాహ్నం రెండుగంటల వరకు సిపిఎం కార్యాలయం ఎదుట భారీ సంఖ్యలో పోలీసులు మోహరించారు. దీంతో పరిసర ప్రాంతాల్లో తీవ్ర ఉద్రిక్త వాతావరణం నెలకొంది.

తనను అరెస్టు చేయడం పూర్తిగా అప్రజాస్వామిక చర్య అని ఐలయ్య ఈ సందర్భంగా మీడియాతో అన్నారు. సిపిఎం రాష్ట్ర కమిటీసభ్యులు నున్నానాగేశ్వరరావు, జిల్లాకార్యదర్శి వర్గసభ్యులు యర్రా శ్రీకాంత్ మాట్లాడుతూ ప్రభుత్వం కావాలనే అక్రమ అరెస్టులకు పురిగొల్పుతోందన్నారు.



కంచ ఐలయ్యను అరెస్టు చేస్తున్న పోలీసుల్ని అడ్డుకుంటున్న జీఎంపిఎస్, సిపిఎం కార్యకర్తలు

## రైల్వే సబ్సిడీ వదులుకున్న 9.39 లక్షల సీనియర్ సిటిజన్లు

### ప్రభుత్వానికి రూ.40 కోట్ల మిగులు

**న్యూఢిల్లీ :** రైల్వే శాఖ పిలుపుమేరకు సుమారు 9.39 లక్షల మంది సీనియర్ సిటిజన్లు రైల్వే టిక్కెట్‌పై సబ్సిడీని వదులుకున్నారు. దీంతో రైల్వే శాఖకు ఏటా రూ.40 కోట్లు మిగలనున్నాయి. ఆర్థిక భారాన్ని తగ్గించుకునేందుకు గతేడాది రైల్వే శాఖ 'గివ్ అప్' అనే కార్యక్రమం కింద సీనియర్ సిటిజన్లు స్వచ్ఛందంగా సబ్సిడీని పూర్తిగా వదులుకోవచ్చని ప్రకటించింది. ఈ ఏడాది దీనికి కొద్దిగా మార్పులు చేస్తూ సగం సబ్సిడీని కూడా వదులుకోవచ్చని తెలిపింది. అయితే ఈ ఏడాది 50 శాతం సబ్సిడీని కూడా వదులుకోవచ్చని తెలిపింది. దీంతో సీనియర్ సిటిజన్లలో 2.16 లక్షల మంది పురుషులు, 2.67 లక్షల మంది మహిళలు సబ్సిడీని పూర్తిగా వదులుకోగా, 2.51 లక్షల మంది పురుషులు, 2.05 లక్షల మంది మహిళలు 50 శాతం సబ్సిడీని వదులుకున్నారు. ప్రస్తుతం సీనియర్ సిటిజన్లకు టిక్కెట్‌పై సబ్సిడీ ఇచ్చేందుకు రైల్వే శాఖ ప్రతియేటా రూ.13 వేల కోట్లను కేటాయిస్తున్న సంగతి తెలిసిందే.

## హైకోర్టు ఆదేశాలతో సమ్మెను నిలిపేసిన తమిళనాడు నర్సులు



**చెన్నయ్ :** వేతనాలు పెంచాలని, రెగ్యులరైజ్ చేయాలని డిమాండ్ చేస్తూ సమ్మెకు దిగిన తమిళనాడు ప్రభుత్వ ఆసుపత్రుల్లోని నర్సులు హైకోర్టు ఆదేశాల నేపథ్యంలో మధ్యలోనే సమ్మెను నిలిపివేసి విధుల్లోకి చేరారు. ప్రభు త్వ నర్సులకు కల్పిస్తున్న సౌకర్యాలనే తమకూ కల్పించాలని డిమాండ్ చేస్తూ నవంబర్ 27 నుంచి సుమారు మూడు వేలమంది నర్సులు నగరంలోని గ్రామీణ ఆరోగ్య డైరక్టరేట్ ఎదుట నిరసనకు దిగిన సంగతి తెలిసిందే. ప్రస్తు తం రూ.7500గావున్న వేతనాన్ని స్వల్పంగా పెంచుతామని ప్రభుత్వం ప్రకటించినప్పటికీ తమ డిమాండ్లను పూర్తిగా పరిష్కరించేవరకూ సమ్మెను కొనసాగిస్తామని ప్రకటించారు. ఓఖీ తుఫానుని కూడా లెక్క చేయకుండా వరుసగా రెండు రోజులు సమ్మెను కొనసాగించారు. అయితే ఈ సమ్మె చట్ట విరుద్ధమని హైకోర్టు ఆదేశించడంతో వారు వెనక్కి తగ్గాల్సి వచ్చింది. వేత నాలు సరిపోకపోతే ఉద్యోగాలు మానేయాలని హైకోర్టు ప్రధాన న్యాయ మూర్తి వ్యాఖ్యానించడంతో నవంబర్ 30లోపు వారు మళ్లీ విధుల్లోకి చేరాల్సి వచ్చింది.

## ఫిర్యాదు దారునికి సుప్రీం క్షమాపణ

**న్యూఢిల్లీ :** కేసు విచారణలో దశాబ్దకాలం పైగా జాప్యం చోటుచేసుకోవడం వల్ల ఫిర్యాదుదారుని సుప్రీం కోర్టు క్షమాపణ కోరింది. హైకోర్టు న్యాయమూర్తి ఒకే రోజు సంబంధిత రెండు వేర్వేరు కేసుల్లో వైరుధ్యంతో కూడిన ఆదేశాలు జారీ చేయడం వల్ల కేసు విచారణలో జాప్యం జరిగిందని పేర్కొంది. న్యాయమూర్తి ఉత్తర్వు 'చట్టాన్ని తికమకపెట్టేది'గా ఉందని, దీనిపై దర్యాప్తు చేయాలని కోరామని సుప్రీంకోర్టు తెలిపింది. తన షాపును సోదరులు కొల్లగొట్టారని, ఈ విషయమై న్యాయం చేయాలని కోరుతూ ఉత్తరాఖండ్ రూర్కీ నివాసి శ్యామలత 2004లో కోర్టును ఆశ్రయించింది. హై కోర్టు తీర్పు గందరగోళంగా ఉండటంతో ఈ కేసు 2009లో సుప్రీ కోర్టు చేరింది. ప్రస్తుతం ఆమె మరణించింది. హై కోర్టు తీర్పులో నెలకొన్న గందరగోళం కారణంగా నేర విచారణలో ఆలస్యం అయ్యిందని అందుకే క్షమించాలని జస్టిస్ ఆర్‌కె అగర్వాల్, సంజయ్ కిషన్ కుషల్ ధర్మాసనం వివరణ ఇచ్చింది.

## రోజుకి 38...ఏడాదికి 48 వేల మంది

### భారత్‌లో పని ప్రదేశాల్లో మరణాలపై బిఎస్‌సి నివేదిక

**న్యూఢిల్లీ :** భారత్‌లోని పని ప్రదేశాల్లో సంభవించే వివిధ ప్రమాదాల్లో మరణిస్తున్నవారి సంఖ్య ఇతర అభివృద్ధి చెందిన దేశాలతో పోల్చుకుంటే చాలా ఎక్కువగా వుందని బ్రిటీష్ భద్రతా మండలి(బిఎస్‌సి) తన నివేదికలో వెల్లడించింది. దేశవ్యాప్తంగా రోజుకి సగటున 38 మంది కార్మికులు, ఏడాదికి 48 వేల మంది కార్మికులు వివిధ రంగాల్లో మరణిస్తున్నట్లు నివేదిక పేర్కొంది. బ్రిటన్, ఇతర అభివృద్ధి చెందుతున్న దేశాలతో పోలిస్తే ఇది 20 రెట్లు ఎక్కువ అని తెలిపింది. ముఖ్యంగా నిర్మాణ రంగంలో అధిక మరణాలు చోటుచేసుకుంటున్నట్లు తెలిపింది. అంతర్జాతీయ కార్మిక సంస్థ(ఐఎల్‌ఒ) సమాచారం సహాయంతో ఈ నివేదికను రూపొందించింది. తాజాగా భారత్‌లో బిఎస్‌సి కార్యకలాపాలను ప్రారంభించింది. చెన్నయ్‌లోని ఎన్‌ఐఎస్‌టి సంస్థతో కలసి పరిశ్రమల్లో భద్రత, ఆరోగ్యంపై శిక్షణా కార్యక్రమాలను స్వచ్ఛందంగా నిర్వహించనుంది.

## ఢిల్లీ మెట్రోకు చార్జీల దెబ్బ

**న్యూఢిల్లీ :** ఢిల్లీ మెట్రో చార్జీలను వరసగా పెంచడం వల్ల ప్రయాణీకులు తగ్గడమే కాకుండా, గత సంవత్సరంతో పోల్చుకుంటే ఇప్పుడు ఢిల్లీ మెట్రోలో కూడా స్మార్ట్ కార్డుల అమ్మకాలు తగ్గిపోయాయి. ఆర్‌టిఐ సమాచారం మేరకు గత సంవత్సరం జులై, ఆగస్టు, సెప్టెంబర్, అక్టోబర్ నెలల్లో మెట్రో రోజుకు సరాసరి 15వేల 650 కార్డులను అమ్మింది. ఈ సంవత్సరం ఇప్పటి వరకు 12 వేల 250 కార్డులను మాత్రమే అమ్మగలిగింది. కాగా, గణాంకాల ప్రకారం గత సంవత్సరం అక్టోబర్ (69.9శాతం) నుండి ఈ సంవత్సరం అక్టోబర్(70.84 శాతం) వరకు స్వల్పంగా స్మార్ట్ కార్డుల వినియోగదారుల శాతం పెరిగింది. అమ్మకాల్లో పెరుగుదల లేనప్పటికీ స్మార్ట్ కార్డు వినియోగదారులు పెరిగారని ఢిల్లీ మెట్రో రైలు కార్పొరేషన్(డిఎంఆర్‌ఎస్) పేర్కొంది. ఏప్రిల్ నుండి స్మార్ట్ కార్డులు తిరిగి చెల్లించక్కర్లేనటువంటి కొత్త నిబంధనలను గుర్తించింది. తగ్గడానికి ఇది ఒక కారణంగా పేర్కొంటుంది. 2016వ సంవత్సరంలో జులై, ఆగస్టు, సెప్టెంబర్, అక్టోబర్‌లో వరుసగా 16వేలు, 16వేల500, 15వేల200, 14వేల900 స్మార్ట్ కార్డులను అమ్మింది. ఈ సంవత్సరం అదే నెలల్లో 12వేల900, 12వేల400, 11వేల700, 12వేల అమ్మకాలు చేసింది. ఈ గణాంకాల ప్రకారం నెలకు 3వేల నుండి నాలుగు వేల స్మార్ట్ కార్డుల వ్యత్యాసం ఉంది.

## ఫిబ్రవరి 1న కేంద్ర బడ్జెట్

### జనవరి 30 నుంచి పార్లమెంట్ బడ్జెట్ సమావేశాలు

**న్యూఢిల్లీ :** కేంద్ర ఆర్థికమంత్రి అరుణ్‌జైట్లీ 2018-19 వార్షిక బడ్జెట్‌ను ఫిబ్రవరి 1న పార్లమెంట్‌లో ప్రవేశపెట్టనున్నారు. జనవరి 30 నుంచి బడ్జెట్ సమావేశాలు ప్రారంభం కానుండగా, అదేరోజు ఉభయసభలను ఉద్దేశించి రాష్ట్రపతి రామ్‌నాథ్‌కోవింద్ ప్రసంగిస్తారు. మరుసటిరోజు జనవరి 31న ఆర్థిక సర్వేను సభ ముందుంచుతారు. ఫిబ్రవరి 1న ఆర్థికమంత్రి వార్షిక బడ్జెట్‌ను పార్లమెంట్‌కు సమర్పిస్తారని అధికారవర్గాలు తెలిపాయి. ఫిబ్రవరి చివరి రోజున బడ్జెట్‌ను ప్రవేశపెట్టే గత సంప్రదాయాన్ని 2017-18 ఆర్థిక సంవత్సరం నుంచే మార్చేశారు. అంతేగాక రైల్వే బడ్జెట్‌ను సాధారణ బడ్జెట్‌లో కలిపేశారు. అయితే, బడ్జెట్ ప్రతిపాదనలు మాత్రం గతంలోలాగే ఏప్రిల్ 1 నుంచి అమలు చేస్తారు. జీఎస్టీ అమలులోకి వచ్చిన తర్వాత ఇదే మొదటి బడ్జెట్. మోడీ ప్రభుత్వపు పూర్తిస్థాయి చివరి బడ్జెట్ కూడా ఇదే.

## జస్టిస్ లోయా మృతిపై న్యాయవిచారణకు పలువురు మాజీ అధికారుల డిమాండ్



**న్యూఢిల్లీ :** 2014లో అనుమానాస్పద పరిస్థితుల్లో మరణించిన సుప్రీంకోర్టు న్యాయమూర్తి బ్రిజ్‌గోపాల్ హరికిషన్ లోయా మృతిపై న్యాయవిచారణ జరిపించాలని పలువురు పౌర అధికారులు డిమాండ్ చేశారు. ప్రభుత్వంలో వివిధ స్థాయిల్లో సేవలందించిన దాదాపు 32 మంది మాజీ ఉన్నతాధికారులు ఈ మేరకు సుప్రీంకోర్టు ప్రధాన న్యాయ మూర్తి, ముంబయి హైకోర్టు ప్రధాన న్యాయమూర్తికి వేర్వేరుగా వినతిపత్రాలను సమర్పించారు. లోయా మృతిపై న్యాయవిచారణ జరిపించాలంటూ నౌకాదళ మాజీ అధిపతి అడ్మిరల్ లక్ష్మీనారాయణ్ రామ్‌దాస్ ప్రధాన న్యాయమూర్తి దీపక్‌మిశ్రాకు రాసిన లేఖను వారు తమ వినతిపత్రంలో ప్రస్తావిస్తూ దీనిపై న్యాయవ్యవస్థ నిష్క్రియా పరత్వానికి చెబుతున్న కారణాలు విస్మయం కలిగిస్తున్నాయ న్నారు. లోయా మృతిపై దర్యాప్తు కోరుతూ ముంబయి హైకోర్టు మాజీ న్యాయమూర్తి బిహెచ్ మర్లేపల్లి , ఢిల్లీ హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి ఎపి షా, లాటూర్ బార్ అసోసియేషన్, ఢిల్లీ ముఖ్యమంత్రి అరవింద్ కేజ్రీవాల్, బిజెపి మాజీ నేత అరుణ్ శౌరి, సిపిఎం పార్టీ నేతలు చేసిన విజ్ఞప్తులను కూడా వారు ఈ సందర్భంగా ప్రస్తావించారు. బిజెపి ప్రస్తుత అధ్యక్షుడు అమిత్‌షా నిందితుడిగా వున్న సోహ్రాబుద్దీన్ షేక్ బూటకపు ఎన్‌కౌంటర్ కేసు విచారణ జరుగుతున్న సమయంలో జస్టిస్ లోయా మరణించిన విషయం తెలిసిందే. ఆయన మృతిపై కుటుంబ సభ్యులు పలు అనుమానాలను లేవనెత్తినట్లు గత నెల 20న కారవాన్ పత్రిక తన వార్తా కథనంలో వెల్లడించింది. అయితే తన తండ్రి మృతిపై తమ కుటుంబ సభ్యులెవరికీ అనుమానాలు లేవని జస్టిస్ లోయా కుమారుడు అనుజ్ లోయా ముంబయి హైకోర్టుకు చెప్పినట్లు తెలుస్తోంది.

## బీజేపీ పాలనలో మహిళలు నిర్లక్ష్యానికి గురయ్యారు



**న్యూఢిల్లీ :** కాంగ్రెస్ ఉపాధ్యక్షుడు రాహుల్‌గాంధీ ప్రధాని మోడీకి ఐదో ప్రశ్న సంధించారు. గుజరాత్‌లో 22 ఏండ్ల బీజేపీ పాలనలో మహిళలకు రక్షణ లేదని, అన్ని అంశాల్లోనూ నిర్లక్ష్యానికీ, దోపిడీకి గురవుతున్నారని రాహుల్ అన్నారు. మహిళలకు విద్య, వైద్యం, పోషకా హారాన్ని అందించడంలో బీజేపీ ప్రభుత్వం విఫలమైందని రాహుల్ ట్వీట్ చేశారు. అంగన్‌వాడీ, ఆశా వర్కర్లు బీజేపీ పాలనలో నిరాశకు గురయ్యారని రాహుల్ అన్నారు. గుజరాత్ అసెంబ్లీ ఎన్నికల సందర్భంగా రాహుల్‌గాంధీ ట్విట్టర్ ద్వారా ప్రధాని మోడీకి రోజుకో ప్రశ్న వేస్తున్న సంగతి తెలిసిందే. శనివారం రాహుల్ తన నాలుగో ప్రశ్నలో గుజరాత్ విద్యారంగంలో వెనకబడిందని, బీజేపీ పాలనలో ఆ రాష్ట్రం దేశంలో 26వ స్థానంలోకి చేరుకున్నదని అన్నారు.

## మార్చిలోనే సిబిఎస్ఇ పరీక్షలు

### పుకార్లపై ప్రభుత్వ వివరణ

**న్యూఢిల్లీ :** సిబిఎస్ఇ బోర్డు 10, 12వ తరగతి వార్షిక పరీక్షలు వచ్చే ఏడాది మార్చిలోనే జరుగుతాయని ప్రభుత్వం స్పష్టం చేసింది. ఫిబ్రవరిలో ఈ పరీక్షలు నిర్వహిస్తారంటూ వచ్చిన పుకార్లపై కేంద్ర మానవ వనరుల అభివృద్ధి శాఖ(హెచ్‌ఆర్‌డి) ఆదివారం ఈ ప్రకటన విడుదల చేసింది. పరీక్షల నిర్వహణ, మూల్యాంకనంలో నాణ్యత పెంచేందుకు ఫిబ్రవరిలో పరీక్షలు నిర్వహించాలనే ప్రతిపాదన సిబిఎస్ఇ నుంచి గతంలో వచ్చిందని, అయితే హెచ్‌ఆర్‌డి శాఖ దాన్ని తోసిపుచ్చిందని అధికారులు తెలిపారు.

## తుపాకీతో బెదిరించి బాలికపై సామూహిక లైంగిక దాడి

### ఘటనను వీడియో తీసి బెదిరింపు

**లక్నో :** ఉత్తరప్రదేశ్‌లో మహిళలపై అఘాయిత్యాలకు అంతులేకుండా పోతోంది. తుపాకీ చూపి బెదిరించి బాలికపై సామూహిక లైంగికదాడికి ఒడిగట్టారు ముగ్గురు దుర్మార్గులు. హమీపూర్ జిల్లా మజ్‌గాన్ గ్రామంలో చోటు చేసుకున్న ఈ ఘటన ఆలస్యంగా వెలుగులోకొచ్చింది. పోలీసులు ఆదివారం తెలిపిన వివరాల ప్రకారం.. గ్రామానికి చెందిన ఓ బాలిక(17) వారం రోజుల కిందట చేను వద్దకు వెళ్లింది. అదే ప్రాంతానికి చెందిన ముగ్గురు యువకులు.. ఆమెను తుపాకీతో బెదిరించి అఘాయిత్యానికి ఒడిగట్టారు. ఘటనను వీడియో తీశామని, ఎవరికైనా చెబితే సోషల్ మీడియాలో పోస్టు చేస్తామని బెదిరించారు. ఈ ఘటనపై పోలీసులకు ఫిర్యాదు చేసేందుకు బాధితురాలి కుటుంబీకులు తొలుత సాహసించలేదు. కానీ, శనివారం ధైర్యం చేసి మజ్‌గాన్ పోలీస్‌స్టేషన్‌లో ఫిర్యాదు చేశారు. పోలీసులు కేసు నమోదు చేసుకొని ఒక నిందితుడిని అరెస్టు చేశారు. మిగిలిన వారిని పట్టుకొనేందుకు మూడు బృందాలు గాలిస్తున్నాయని ఎస్పీ దినేశ్‌కుమార్ వెల్లడించారు. నేషనల్ క్రైమ్ రికార్డ్స్ బ్యూరో(ఎన్‌సీఆర్‌బీ) ఇటీవల వెల్లడించిన గణాంకాల ప్రకారం అత్యధిక నేరాలు ఉత్తరప్రదేశ్‌లోనే జరుగుతున్నాయి. దేశంలోని మొత్తం నేరాల్లో ఒక్క యూపీలోనే 9.5 శాతం కేసులు నమోదైనట్టు వెల్లడైంది. అటు లైంగికదాడుల కేసుల్లోనూ యూపీ రెండో స్థానంలో(4,816) ఉంది. మధ్యప్రదేశ్ 4,882 కేసులతో మొదటి స్థానంలో నిలిచింది.

## పాట్నాలో మత కలహాలు

**బీహార్ :** మిలాద్-ఉన్-నబి సందర్భంగా నిర్వహించిన ప్రదర్శనపై కాల్పులు జరిపిన ఘటన బీహార్ రాజధాని పాట్నాలో ఘర్షణలకు దారి తీసింది. ఈ ఘటనకు సంబంధించి పది మందిని పోలీసులు అరెస్టు చేసినట్లు అధికారులు తెలిపారు. పాట్నాలోని ఫుల్వారి షరీఫ్ ప్రాంతంలో శనివారం నిర్వహిస్తున్న ప్రదర్శనపై బైక్ మీద వచ్చిన కొంతమంది దుండగులు తుపాకీతో కాల్పులు జరిపారు. దీంతో ఆగ్రహానికి లోనైన కొంతమంది సమీపంలోని వాహనాలు, దుకాణాలపై దాడి చేశారు. కొన్ని ఇళ్లకు నిప్పు పెట్టడం ఘర్షణలకు దారి తీశాయి. దీంతో రంగంలోకి దిగిన పోలీసులు శాంతిభద్రతలను అదుపులోకి తెచ్చేందుకు కృషి చేశారు. ఈ ప్రయత్నంలో కొంతమంది పోలీసులు కూడా గాయపడినట్లు అధికారులు వివరించారు.

## జీవిత భాగస్వామిని ఎంచుకునే స్వేచ్ఛ లేదా..? : బృందాకరాత్

**న్యూఢిల్లీ :** కేరళలో జరుగుతున్న కులాంతర, మతాంతర వివాహాలపై దర్యాప్తునకు జాతీయ దర్యాప్తు బృందం(ఎన్ఐఎ) ఆసక్తి చూపడం పట్ల సీపీఐ(ఎం) పొలిట్‌బ్యూరో సభ్యురాలు బృందాకరాత్ తీవ్ర అభ్యంతరం వ్యక్తం చేశారు. ఇప్పటికే కేరళలో 89 జంటలపై ఎన్ఐఎ దర్యాప్తు జరిపినట్టు బృందాకరాత్ పేర్కొన్నారు. సీపీఐ(ఎం) అధికారిక వారపత్రిక పీపుల్స్ డెమొక్రసీ తాజా సంచికలో ఈ అంశంపై బృందాకరాత్ వ్యాసం ప్రచురితమైంది. కులాంతర, మతాంతర వివాహాలను ప్రోత్సహించడంలో ప్రభుత్వం ఉదారంగా వ్యవహరించాల్సి ఉండగా, దర్యాప్తునకు ఆదేశించడమేమిటని ఆమె ప్రశ్నించారు. ఉగ్రవాదంపై దర్యాప్తు జరపాల్సిన ఎన్ఐఎను వివాహాలపై పరిశోధనకు ఉపయోగించడాన్ని ఆమె తప్పుపట్టారు. హిందూ యువతులను లవ్ జిహాద్‌లో భాగంగా ముస్లిం యువకులు పెండ్లిళ్లు చేసుకొని వారిని ఐఎస్ఐఎస్‌లోకి చేర్పిస్తున్నారన్న ఆరోపణలపై ఎన్ఐఎ దర్యాప్తు జరుపుతున్న విషయం తెలిసిందే. కేరళకు చెందిన అఖిల(24) ఇస్లాం మతం స్వీకరించి హదియాగా పేరు మార్చుకొని షఫీన్ జహాన్‌ను వివాహమాడగా, ఆమె తల్లిదండ్రులు అభ్యంతరం వ్యక్తం చేశారు.

## ఇది..ప్రజలకు, బీజేపీకి మధ్య జరుగుతున్న పోరు : హార్దిక్

**సూరత్ :** గుజరాత్‌లో ప్రజలకు, బీజేపీకి మధ్య ఎన్నికల పోరు నెలకొందని, ఈ పోరులో ప్రజలు గెలుపొందాలని పాటీదార్ ఆందోళన నాయకుడు హార్దిక్ పటేల్ పిలుపునిచ్చారు. సూరత్‌లో ఆయన చేపట్టిన రోడ్ షోలో మాట్లాడుతూ సభలకు జనం పెద్ద సంఖ్యలో హాజరవుతున్నా రని, దీనిని బట్టి అధికార బీజేపీపై ప్రజలు తీవ్ర ఆగ్రహంతో ఉన్నారన్న సంగతి తేలిపోయిందని అన్నారు. పటేల్ సామాజిక వర్గమంతా కాంగ్రెస్‌కు ఓటేయాలని ఆయన కోరారు. అటు వర్తక, వ్యాపారపరంగా, ఇటు రాజకీయపరంగా దక్షిణ గుజరాత్‌లోని సూరత్ ప్రాంతానికి ఎనలేని ప్రాధాన్యత ఉంది. ఇక్కడ 16 అసెంబ్లీ స్థానాల్లో గెలుపు ఓటముల్ని పాటీదార్ సామాజిక వర్గం ప్రభావితం చేయగలదు. బీజేపీకి వ్యతిరేకంగా సూరత్ చుట్టుపక్కల ప్రాంతంలో హార్దిక్ పటేల్ పెద్ద ఎత్తున ఉద్యమం నడిపాడు. దీంతో డిసెంబరు, 2015 మున్సిపల్ ఎన్నికల్లో పాటీదార్లు కాంగ్రెస్ వైపు మొగ్గుచూపారు.

ప్రత్యేకం

## ఉత్తర భారతాన్ని కబళిస్తున్న కాలుష్య భూతం

### కళ్లకు కట్టిన ఐరోపా ఉపగ్రహ ఛాయాచిత్రాలు

**న్యూఢిల్లీ :** ఉత్తర భారతాన్ని ప్రధానంగా దేశ రాజధాని హస్తినను చుట్టుముట్టి కబళిస్తున్న కాలుష్య భూతాన్ని ఐరోపా రోదసీ సంస్థకు చెందిన ఉపగ్రహం తన కెమెరాలో బంధించింది. ఉపగ్రహం చిత్రీకరించిన ఛాయాచిత్రాలను సంబంధిత అధికారులు శుక్రవారం ఇక్కడ విడుదల చేశారు. ఈ చిత్రాలలో ప్రస్తుత సీజన్‌లో దేశ రాజధాని ప్రాంతాన్ని, ఉత్తర భారతాన్ని చుట్టుముట్టిన కాలుష్య తీవ్రత కళ్లకు కడుతోంది. భూవాతావరణాన్ని పరిశీలించేందుకు తొలిసారిగా ఐరోపా రోదసీ సంస్థ (ఇఎస్ఎ) పంపిన సెంటినియల్ -5పి ఉపగ్రహం ఈ చిత్రాలను చిత్రీకరించింది.

గత నెల 6వ తేదీ నుండి 14వ తేదీ వరకూ దేశ రాజధానిని పీడించిన వాయు కాలుష్యం తరహాలో ప్రస్తుతం ఉత్తర భారతాన్ని చుట్టుముట్టిన కాలుష్యానికి వాతావరణంలో పెరిగిన తేమ, నెమ్మదించిన గాలి, గాలిలోని కలుషిత పదార్థాలతో పాటు నగర సరిహద్దుల్లో రైతులు తమ సాగు భూముల్లో ఎండిన పంట మొదళ్లను దగ్ధం చేయటం వల్ల ఏర్పడిన వాయు కాలుష్యం కూడా కారణమేనని నిపుణులు చెబుతున్నారు.



### ఢిల్లీ టెస్టుపైనా ప్రభావం

**న్యూఢిల్లీ :** భారత్, శ్రీలంక జట్ల మధ్య ఇక్కడి ఫిరోజ్‌షా కోట్లా మైదానంలో జరుగుతున్న మూడో టెస్టుకు కాలుష్యం అంతరాయం కలిగించింది. పొగమంచు, కాలుష్యం కారణంగా ఫీల్డింగ్ చేయలేకపోతున్నామని శ్రీలంక జట్టు పదేపదే మ్యాచ్ అధికారులకు ఫిర్యాదు చేశారు. మైదానంలో కాలుష్యపు తీవ్రత ఎక్కువగా వుందని శ్రీలంక ఆటగాళ్లు పేర్కొన్నారు. మాస్కులు ధరించి శ్రీలంక ఆటగాళ్లు మైదానంలోకి దిగారు. ఊపిరి తీసుకునేందుకు చాలా ఇబ్బంది పడుతున్నామంటూ అంపైర్లకు పదే పదే లంక క్రికెటర్లు అప్పీల్ చేశారు. లంక క్రీడాకారులు ఈ విధంగా పదే పదే ఫిర్యాదు చేస్తుండటంతో 25 నిమిషాలు పాటు ఆటను నిలిపివేశారు. మొదటిసారి 17 నిమిషాలు, రెండోసారి 5 నిమిషాలకు పైగా మ్యాచ్‌ను అధికారులు నిలిపివేశారు. లంక క్రికెటర్లు పదేపదే ఆటను కొనసాగించేందుకు అయిష్టం చూపుతుండడంతో టీమిండియా కోచ్ రవిశాస్త్రి సైతం అంపైర్లతో మాట్లాడారు. శ్రీలంక ఆటగాళ్ల ఫిర్యాదుతో ఏకాగ్రత కోల్పోయిన కోహ్లీ వికెట్ సమర్పించుకున్నాడు. ఆ తరువాత కూడా శ్రీలంక ఫిర్యాదు చేయడంతో లంకేయులు ఫీల్డింగ్ చేసేందుకు ఇబ్బంది పడితే మేం ఫీల్డింగ్ చేస్తామంటూ కోహ్లీ ఆగ్రహం వ్యక్తం చేశాడు.

సంక్షిప్తం

### గుజరాత్ అసెంబ్లీ ఎన్నికల్లో ఓటు రసీదు యంత్రాలు

**న్యూఢిల్లీ :** గుజరాత్ అసెంబ్లీ ఎన్నికల్లో అన్ని పోలింగ్ కేంద్రాలలోనూ ఇవిఎంలతో పాటు, ఓటు రసీదు యంత్రాలను పూర్తిస్థాయిలో ఏర్పాటు చేస్తున్నట్లు ప్రధాన ఎన్నికల కమిషనర్(సిఇసి) ఎకె జోతి చెప్పారు. రాష్ట్రంలో ఈ నెల 9, 14 తేదీల్లో శాసనసభకు ఎన్నికలు జరగనున్నాయి. మొత్తం 189 స్థానాలలోని 50,264 పోలింగ్ కేంద్రాలలో ఇవిఎంలతో పాటు ఓటు రసీదు యంత్రాలను కూడా ఏర్పాటుచేస్తామని ఆయన ఆదివారం ఇక్కడ నిర్వహించిన మీడియా సమావేశంలో వివరించారు.

### జర్నలిస్టుపై బిజెపి కార్యకర్తల దాడి

**బెంగళూరు :** కర్నాటక తుంకూర్‌లో అక్రమ మైనింగ్ కేసులో రిపోర్టింగ్ చేస్తున్న ఓ టెలివిజన్ జర్నలిస్టుపై శనివారం బిజెపి కార్యకర్తలు దాడి చేశారు. బిజెపి కార్యకర్తలపై జర్నలిస్టు ఇచ్చిన ఫిర్యాదు మేరకు కర్నాటక పోలీసులు ఆదివారం కేసు నమోదు చేశారు. శనివారం ఉదయం బిజెపి కార్యకర్తలు నిర్వహించిన మీడియా సమావేశం అనంతరం ఈ ఘటన చోటుచేసుకుంది.

### నిరాడంబర నేపథ్యంపై జాలి పడనక్కర్లేదు : మన్మోహన్

**సూరత్ :** తన నిరాడంబరమైన కుటుంబ నేపథ్యాన్ని చూసి ప్రజలు జాలి పడాలని తాను కోరుకోవడంలేదని మాజీ ప్రధాని మన్మోహన్ సింగ్ అన్నారు. ఈ విషయంలో నరేంద్ర మోడీకి తాను పోటీ కాదని కూడా చెప్పారు. తన కుటుంబానికి అండగా ఉండేందుకు గుజరాత్‌లోని రైల్వే స్టేషన్‌లో టీ అమ్మేవాడినంటూ మోడీ తరుచూ తన నేపథ్యాన్ని చెప్పుకోవడంపై విలేకరులు అడిగిన ఒక ప్రశ్నకు మన్మోహన్ పైవిధంగా సమాధానమిచ్చారు.

### ఈక్వెడార్‌లో భూకంపం

**క్వీటో :** దక్షిణ అమెరికా దేశమైన ఈక్వెడార్‌లో ఆదివారం భూకంపం సంభవించింది. రిక్టర్‌స్కేల్‌పై భూకంప తీవ్రత 6.0గా నమోదైందని యూఎస్ జియోలజికల్ సర్వే అధికారులు తెలిపారు. బహియా డె కరాక్వెజ్ నగరానికి సమీపంలో 25కిలోమీటర్ల లోతులో భూకంప కేంద్రాన్ని గుర్తించినట్టు అధికారులు తెలిపారు. ఎలాంటి ప్రాణ, ఆస్థి నష్టం సంభవించలేదన్నారు.

## వలసలపై తప్పుకున్న అమెరికా

**ఐక్యరాజ్యసమితి :** వలసలు, శరణార్థుల వ్యవహారాలకు సంబంధించిన ఐక్యరాజ్య సమితి ఒప్పందం నుండి తాము తప్పుకుంటున్నట్లు అమెరికాలోని డొనాల్డ్ ట్రంప్ సర్కారు ప్రకటించింది. ఈ ఒప్పందం తమ విధానాలకు విరుద్ధంగా వున్నందున తాము దీని నుండి తప్పు కుంటున్నట్లు ఐరాసలో అమెరికా దౌత్య ప్రతినిధి ఐరాస ప్రధాన కార్యదర్శికి తెలిపారని అమెరికా ప్రభుత్వం ఒక ప్రకటనలో వివరించింది.



**ముంపు**

సముద్ర నీటి మట్టం క్రమేపీ పెరగడంతో మియామి. జకర్తా తీరం వెంబడి కొన్ని ప్రాంతాలు ముంపునకు గురౌతున్నాయి. ముంపునకు గురైన ఇండోనేషియాలోని ఓ ప్రాంతంలోని వంతెన కింద నుంచి స్థానిక ప్రజలు ఇలా నడుచుకుంటూ వెలుతున్నారు.

## 2018 పాక్ ఎన్నికల్లో హఫీజ్ పోటీ

**లాహోర్ :** పాక్ పార్లమెంట్‌కు వచ్చే ఏడాది జరగనున్న సార్వత్రిక ఎన్నికల్లో పోటీ చేయనున్నట్లు జమాత్ ఉద్ దవా సంస్థ అధినేత, ముంబయి దాడుల సూత్రధారి హఫీజ్ సయీద్ ప్రకటించారు. మిల్లి ముస్లింలీగ్ (ఎంఎంఎల్) పేరిట తాము రాజకీయ కూటమిని రిజిస్టర్ చేసి, అభ్యర్థులను బరిలోకి దించుతామని ఆయన ఆదివారం ఇక్కడ నిర్వహించిన మీడియా సమావేశంలో ప్రకటించారు. భారతీయ సేనలతో పోరాడుతున్న కాశ్మీరీలకు తన మద్దతును కొనసాగిస్తామన్నారు. కాశ్మీరీల గొంతు నొక్కుతున్న భారత్, పాకిస్తాన్ ప్రభుత్వంపై వత్తిడి తెచ్చేందుకు ప్రయత్నిస్తోందని విమర్శించారు. భారత్‌తో దొడ్డిదారి దౌత్యం కాశ్మీర్ అంశానికి చేటు చేస్తుందని తాను పాక్ ప్రభుత్వాన్ని హెచ్చరిస్తున్నానన్నారు.

పాకిస్తాన్‌లో తనను, భారత్‌లో హురియత్ నేతలను నిర్బంధించటం అంతర్జాతీయ అజెండాలో భాగమేనని ఆరోపించారు. తనను గృహనిర్బంధం నుండి విడుదల చేయటం పట్ల భారత్ ఆగ్రహంతో వుందన్న సయీద్ కాశ్మీరీలపై దాడులు, దౌర్జన్యాలు ఆపకపోతే తాము పోరాటాన్ని మరింత ఉధృతం చేస్తామని, భారత్ మృత్యుఘోషను వినాల్సి వుంటుందని హెచ్చరించారు. తనను ఐరాస ప్రకటిత ఉగ్రవాదుల జాబితా నుండి తొలగించాలంటూ ఆయన పిటిషన్ దాఖలు చేశారు.

## ఆఫ్ఘన్‌లో బాంబు పేలుడు

**కాబూల్ :** ఆఫ్ఘనిస్తాన్ తూర్పు ప్రాంతంలోని నాన్‌ఘర్ ప్రావిన్స్‌లో ఆదివారం ఉదయం మోటార్‌సైకిల్ బాంబు పేలిన ఘటనలో కనీసం ఐదుగురు మరణించినట్లు అధికారులు చెప్పారు. రాజధాని జలాలా బాద్‌లోని సాకర్ స్టేడియం ముందు ఆదివారం ఉదయం జరిగిన ఈ పేలుడులో మరో ఎనిమిది మంది గాయపడ్డారని ప్రావిన్షియల్ గవర్నర్ ప్రతినిధి అతావుల్లా ఖోగ్యానీ వివరించారు. ప్రభుత్వ అనుకూల ర్యాలీ ముగిసిన కొద్దిసేపటికే ఈ పేలుడు సంభవించిందని ఆయన వివరించారు. అయితే ఈ పేలుడుకు తామే బాధ్యత వహిస్తున్నట్లు ఇప్పటి వరకూ ఏ ఉగ్రవాద సంస్థా ప్రకటించలేదు.

## నేపాల్‌లో వాతావరణ సదస్సు

**ఖాట్మండు :** వాతావరణ మార్పుపై నాలుగు రోజులపాటు జరగనున్న అంతర్జాతీయ సదస్సుకు నేపాల్ ఆతిథ్య మివ్వనున్నది. హిందూకుష్ పర్వతశ్రేణిపై వాతావరణ మార్పులు చూపుతున్న ప్రతికూల ప్రభావాలను ప్రపంచ దృష్టికి తెచ్చే లక్ష్యంతో వాతావరణ మార్పుల అంతర్జాతీయ సదస్సు నిర్వహిస్తున్నట్లు నేపాల్ ప్రభుత్వం తెలిపింది. ఈ సదస్సును నేపాల్ అధ్యక్షురాలు వైద్యదేవి భండారీ ప్రారంభిస్తారు. వాతావరణ మార్పుల దుష్ప్రభావాన్ని తట్టుకుని మెరుగైన భవిత వైపు అడుగులే వేసేందుకు అవసరమైన మార్గాలను చర్చించే లక్ష్యంతో ఈ సదస్సును నిర్వహిస్తున్నట్లు నేపాల్ ప్రభుత్వం ఒక ప్రకటనలో తెలిపింది. ఇన్షియేటివ్ ఆఫ్ ఇంటర్నేషనల్ సెంటర్ ఫర్ ఇంటిగ్రేటెడ్ మౌంటెన్ డెవెలప్‌మెంట్ (ఐసిఐఎంఒడి)లో జరిగే ఈ సదస్సుకు వివిధ దేశాలకు చెందిన దాదాపు 200 మందికి పైగా ప్రతినిధులు హాజరవుతారు. వీరిలో ప్రముఖ శాస్త్రవేత్తలు కూడా వుంటారని ఐసిఐఎంఒడి డైరెక్టర్ జనరల్ డా.డేవిడ్ మోల్డెన్ వివరించారు.

# ప్రపంచ పార్టీలతో విస్తృత సహకారం

### చైనా కమ్యూనిస్టు పార్టీ సంసిద్ధత

**బీజింగ్ :** ప్రపంచ వ్యాప్తంగా వివిధ దేశాలలో వున్న రాజకీయ పార్టీలతో స్నేహపూర్వక సహకారాన్ని విస్తరించు కునేందుకు తాము సిద్ధంగా వున్నామని చైనా కమ్యూనిస్టు పార్టీ (సిపిసి) కేంద్ర కమిటీ సభ్యుడు, ప్రభుత్వ సలహాదారు యాంగ్‌జీచీ చెప్పారు. ఇక్కడ జరుగుతున్న ప్రపంచ రాజ కీయ పార్టీల సదస్సులో ఆదివారం జరిగిన ముగింపు కార్య క్రమంలో ఆయన ప్రసంగిస్తూ మానవాళికి మెరుగైన భవిత కల్పించటానికి, మెరుగైన ప్రపంచ నిర్మాణానికి ప్రపంచ వ్యాప్తంగా వున్న అన్ని రాజకీయ పార్టీలతో సహకరించేం దుకు సిపిసి సిద్ధంగా వుందన్నారు. సదస్సు ప్రారంభంలో అధ్యక్షుడు సీ జిన్‌పింగ్ చేసిన ప్రసంగాన్ని ఆయన ప్రస్తా విస్తూ విశ్వ ప్రగతిని ప్రోత్సహించేందుకు ప్రపంచ వ్యాప్తంగా వున్న అన్ని రాజకీయ పార్టీలతో కలిసి పనిచేయాలన్న సిపిసి కృత నిశ్చయాన్ని పునరుద్ఘాటించారు. అధ్యక్షుడు సీ జిన్‌పింగ్ చేసిన కీలక ప్రసంగంతో పాటు సిపిసి చేస్తున్న కృషికి అంతర్జాతీయ సమాజం నుండి ప్రశంసలు లభించా యని ఆయన చెప్పారు. శాంతియుత ప్రపంచ నిర్మాణానికి, విశ్వాభివృద్ధికి, ప్రపంచ క్రమాన్ని పరిరక్షించాల్సిన చారిత్రక బాధ్యతలను రాజకీయ పార్టీలు, ఆయా పార్టీలనేతలు నిర్వహించాలని ఆయన పిలుపునిచ్చారు. సదస్సు ముగింపు లో రాజకీయ పార్టీల ప్రతినిధులు 'బీజింగ్ ఇన్షియేటివ్' పేరిట ఒక సంయుక్త ప్రకటనను జారీ చేశారు. ప్రపంచ రాజకీయ పార్టీలతో సిపిసి నిర్వహించిన ఈ సదస్సును వ్యవస్థీకృతం చేయటంతో పాటు ప్రపంచ వ్యాప్తంగా విస్తృత ప్రాతినిధ్యంతో ఇది ఉన్నత స్థాయి చర్చా వేదికగా మారాలని ఇన్షియేటివ్ ప్రతిపాదించింది.



బీజింగ్‌లో ఆదివారం ప్రపంచ రాజకీయ పార్టీల నేతలతో నిర్వహించిన సమావేశం ముగింపు సభలో ప్రసంగిస్తున్న చైనా కమ్యూనిస్టు పార్టీ పొలిట్‌బ్యూరో సభ్యులు యాంగ్ జీయేచీ

**రష్యా, చైనా సంయుక్త విన్యాసాలు**

చైనా వాయవ్యంగా ఉన్న నింజియా హుయి స్వయం పాలిత ప్రాంతంలో చైనా సాయుధ పోలీసులు, రష్యన్ నేషనల్ గార్డులు ఆదివారం ఉగ్రవాద నిరోధక విన్యాసాలను ప్రారంభించారు. ఈ నెల 13 వరకు విన్యాసాలు కొనసాగ నున్నాయి. రెండు దేశాల మధ్య మైత్రీ సహకారం విస్తరణతో పాటు, కార్యాచరణ మార్పిడులు లక్ష్యంగా కార్యకలాపాలు కొనసాగుతాయని చైనా సాయుధ పోలీసు అధికారి ఒకరు మీడియాకు చెప్పారు. ఉగ్రవాదుల బెడదను, దాడులను ఉమ్మడిగా ఎదుర్కోవడానికి అవసరమైన శక్తి సామర్థ్యాలను పెంపొందించుకోవటం కూడా ఈ విన్యాసాల లక్ష్యమని ఆ యన వివరించారు. ఇవి ఏ దేశాన్నీ ఉద్దేశించినవి కావని స్ప ష్టం చేశారు. దాదాపు 64 మంది సిబ్బంది పాల్గొంటున్న ఈ విన్యాసాలు నింజియా రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో కొన సాగుతాయని అధికార వార్తా సంస్థ సిన్హువా వెల్లడించింది.

## పన్ను సవరణల బిల్లుకు సెనేట్ ఆమోదం

**వాషింగ్టన్ :** అమెరికా అధ్య క్షుడు డొనాల్డ్ ట్రంప్ ప్రతిపాదిం చిన పన్ను సంస్కరణల బిల్లును అమెరికన్ సెనేట్ శనివారం 51-49 ఓట్ల మెజార్టీతో ఆమోదిం చింది. తాజా బిల్లులో పొందు పర్చిన ప్రతిపాదనల ప్రకారం బడా వ్యాపా రులు, ధనికులకు పన్నుల తగ్గింపుతో పాటు సాధారణ అమెరికన్లపై విధించే పన్నుల్లో భారీ మార్పులు చోటు చేసు కోనున్నట్లు తెలుస్తోంది. 80వ దశకం తరువాత అమెరికా పన్ను చట్టాల్లో భారీ మార్పుగా చెబుతున్న ఈ చట్టం అమలులోకి వస్తే ప్రస్తుతం దేశంపై వున్న 20 లక్షల కోట్ల డాలర్ల రుణభారానికి పదేళ్ల కాలంలో మరో 1.4 లక్షల కోట్ల డాలర్ల రుణం జత చేరుతుంది. ఈ రుణాల ద్వారా దేశ ఆర్థిక వ్యవస్థలో భారీ మార్పులతో పాటు, ఆర్థిక ప్రగతికి మరింత బలం సమకూరు తుందని అధికార రిపబ్లికన్ పార్టీ చెబుతోంది. ఈ బిల్లుకు ఆమోదముద్ర పొందటం ద్వారా ఉద్యోగ, కార్మిక కుటుంబాలకు భారీ పన్ను రాయితీలు కల్పిస్తామన్న హామీని నెరవేర్చటంలో ఒక అడుగు ముందుకు వేశామని ట్రంప్ ఆదివారం ఉదయం ఒక ట్వీట్‌లో పేర్కొన్నారు.



సెనేట్ సభ్యులతో ట్రంప్

**రిపబ్లికన్ల సంబరాలు**

సెనేట్‌లో ఈ బిల్లుకు ఆమోదం లభించటంతో రిపబ్లికన్ పార్టీ నేతలు సంబరా లలో మునిగి తేలారు. తాజా బిల్లులో ప్రతిపాదిస్తున్న పన్ను రాయితీలు అమెరికన్ కంపెనీలకు మరింత ప్రోత్సాహకరంగా వుంటాయని, ఆర్థిక ప్రగతికి దోహదపడ తాయని వారు ఆనందం వ్యక్తం చేసారు. ఈ బిల్లు ద్వారా అమెరికాను మరింత పోటీదారుగా మార్చే అవకాశం ఏర్పడిందని, విదేశాలకు తరలిపోతున్న ఉద్యోగావ కాశాలను రక్షించుకునే వెసులుబాటుతో పాటు మధ్యతరగతి వర్గానికి స్వాంతన చేకూరుతుందని సెనేట్‌లో రిపబ్లికన్ పార్టీ నేత మిచ్ మెక్ కానెల్ వ్యాఖ్యానించారు.

## హోండూరాస్‌లో నిరసనల వెల్లువ

**తెగుసిగల్పా (హోండూరాస్) :** అధ్యక్ష ఎన్నికల్లో అక్ర మాలు జరిగాయంటూ వెల్లువెత్తిన నిరసనలు హింసాత్మ కంగా మారి ముగ్గురి మృతికి దారి తీయటంతో హోండూ రాస్ సైన్యం దేశవ్యాప్తంగా కర్ఫ్యూ విధించింది. గత ఆది వారం జరిగిన అధ్యక్ష ఎన్నికలలో విజేత ఎవరన్న విషయం తేలకపోవటంతో దేశవ్యాప్తంగా నిరసనలు వెల్లువెత్తాయి. ఎన్నికల ఫలితాలను హైజాక్ చేసేందుకు ప్రభుత్వం ప్రయ త్నిస్తోందంటూ ప్రతిపక్ష నేతలు తీవ్ర విమర్శలు గుప్పిం చారు. అధ్యక్షుడు జువాన్ ఆర్లండో హెర్మాండెజ్ ఓట్ల లెక్కిం పు ఫలితాలను తారుమారు చేసి తనకు అనుకూల ఫలి తాలు పొందేందుకు కుట్ర పన్నారని, ఆయన ప్రత్యర్థి, టీవీ స్టార్ సాల్వడార్ నర్సల్లా విమర్శించారు. హోండూరాస్ అధ్య క్ష ఎన్నికల సంక్షోభంపై అంతర్జాతీయంగా తీవ్ర ఆందోళన వ్యక్తమవుతోంది. అల్లర్లను అణచివేసేందుకు సాయంత్రం 6 గంటల నుంచి సైన్యం కర్ఫ్యూ విధించింది. కర్ఫ్యూ అమలు లోకి రావడానికి అంటే సాయంత్రం 6 గంట లకు ముందే నిత్యావసరాలను కొనుగోలు చేసుకునేందుకు ప్రజలు సూపర్ మార్కెట్ల ముందు బారులు తీరారు. కర్ఫ్యూ ప్రారం భానికి ముందే ఇంటికి చేరుకునేందుకు ఆయా సంస్థల ఉద్యోగులు, కార్మికులు బస్సులు, రైళ్ల కోసం పరుగులు తీసారు. అధ్యక్ష ఎన్నికల ఓట్ల లెక్కింపులో తొలుత నర్సల్లా 5 శాతం ఓట్లతో ఆధిక్యత ప్రదర్శించినప్పటికీ ఒక్క రోజు నిలిపివేత అనంతరం ప్రారంభమైన లెక్కింపులో ఫలితాలు తారుమారు కావటం అందరినీ తీవ్ర విస్మయానికి గురిచేసింది.

ఓట్ల లెక్కింపులో అక్రమాలు చోటు చేసుకున్నాయంటూ విపక్షాలు నిరసనలకు పిలుపునివ్వటంతో దేశవ్యాప్తంగా వివిధ నగరాలలో నిరసనలు హోరెత్తాయి. ఓట్లను తిరిగి లెక్కించాలని నర్సల్లా డిమాండ్ చేయటంతో అధికార పార్టీకి, ఎన్నికల అధికారులకు మధ్య ప్రతిష్టంభన ఏర్పడింది. ఎన్నికల కమిషన్ ఓట్లన్నింటినీ తిరిగి లెక్కించేందుకు తగిన సమయం, అవకాశం కల్పించాలని, ఈ లోగా ప్రజలెవరూ హింసకు పాల్పడవద్దని అమెరికా రాయబార కార్యాలయం ఉన్నతాధికారి ఒకరు ట్విట్టర్‌లో హోండూరాస్ ప్రజలకు విజ్ఞప్తి చేశారు.

మొదటి పేజీ తరువాయి

## పాలస్తినాకు ద్రోహం

అమెరికా అధ్యక్షుడు ట్రంప్ నిర్ణయించినట్లు అమెరికన్ మీడియా శుక్రవారం తన వార్తా కథనాలలో వెల్లడించింది. ఈ నిర్ణయాన్ని ట్రంప్ బుధవారం అధికారికంగా ప్రకటించే అవకాశముందని పేర్కొంది. అయితే ప్రస్తుతం టెల్ అవీవ్‌లో వున్న అమెరికా రాయబార కార్యాలయాన్ని జెరూసలేం నగరానికి తరలించే నిర్ణయాన్ని ఆయన వాయిదా వేసుకునే అవకాశం వున్నట్లు మీడియా తెలిపింది.

**తీవ్రంగా స్పందించిన హమాస్**

అమెరికా నిర్ణయం ఏ మాత్రం సమర్థనీయం కాదని, దాన్ని అమలు చేసేందుకు అమెరికా పూనుకుంటే, సమర్థవంతంగా ఎదుర్కొనేందుకు అందరూ ఒక్కతాటిపైకి రావాలని హమాస్ ఒక ప్రకటనలో పాలస్తీనా ప్రజలకు పిలుపునిచ్చింది. అమెరికా తన నిర్ణయాన్ని అమలు చేసేందుకు ప్రయత్నిస్తే అది జెరూసలెంపై క్రూరమైన దాడే కాక, దానిపై ఆధిపత్యాన్ని ఇజ్రాయిల్‌కు ధారాదత్తం చేయటమే అవుతుందని, పాలస్తీనా ప్రజలపై యూదుల నేరాలను కప్పిపుచ్చటమే అవుతుంద'ని హమాస్ తన ప్రకటనలో ధ్వజమెత్తింది. అమెరికా ఎటువంటి నిర్ణయం తీసుకున్నా, జెరూసలేం నగరం పాలస్తీనా అరబ్, ఇస్లామిక్ భూభాగం అన్న వాస్తవాన్ని ఏ మాత్రం మార్చలేదని హమాస్ స్పష్టం చేసింది. అమెరికా తన నిర్ణయాన్ని అమలు చేయకుండా అడ్డుకునేందుకు అరబ్, ఇస్లామిక్ దేశాల నేతలు, ప్రజలు ఒక్కతాటిపైకి వచ్చి ఉద్యమించాలని హమాస్ పిలుపునిచ్చింది.

అమెరికా నిర్ణయాన్ని తీవ్రంగా ఖండించిన పాలస్తీనా విముక్తి సంస్థ (పిఎల్ఓ) కార్యవర్గ సభ్యురాలు, సమాచార, సాంస్కృతిక విభాగం అధిపతి హనన్ అష్రవి ఈ నిర్ణయం ఈ ప్రాంతం మొత్తాన్ని తీవ్ర అస్థిరతకు గురి చేస్తుందని, ప్రస్తుతం కొనసాగుతున్న శాంతి ప్రక్రియకు తీవ్ర విఘాతం కలిగిస్తుందని అన్నారు. ఈ ప్రాంతం వ్యవహారాల్లో జోక్యం చేసుకునేందుకు అమెరికాను అనర్హురాలిగా చేయటంతో పాటు కొత్త తరహా ఉగ్రవాదానికి ఆజ్యం పోస్తుందని ఆమె ఆందోళన వ్యక్తం చేశారు.

## శాస్త్ర, సాంకేతిక రంగానికి పెద్ద పీట

ఇస్తున్నారన్నారు. స్టాల్స్‌లో విద్యార్థులు తయారు చేసిన ప్రాజెక్టులు ఆకట్టుకున్నాయన్నారు. శాస్త్రసాంకేతిక రంగాన్ని వినియోగించుకొని వాతావరణంలో మార్పులు ముందుగా తెలుసుకోవటం, వర్షాలు, పిడుగులు, ప్రమాదాలను ముందుగా గుర్తించి తెలియజేసే సమాచారాన్ని ప్రజలకు అందిస్తున్నామన్నారు. రాష్ట్రంలో రహదారుల నిర్మాణం, ప్రాజెక్టుల నిర్మాణాలను డ్రోన్ల ద్వారా పర్యవేక్షిస్తున్నారని, వ్యవసాయ రంగంలో వేసిన ఒక మొక్కను ఫొటో తీసి యాప్‌లో ఉంచితే దాని స్థితిగతులను వెంటనే తెలియజేస్తుందని పేర్కొన్నారు. రాబోయే రోజుల్లో ప్రతి జిల్లాలో శాస్త్ర సాంకేతిక కేంద్రాన్ని ఏర్పాటు చేయటానికి చర్యలు తీసుకుంటామన్నారు. కార్యక్రమంలో ఎమ్మెల్సీ కరణం బలరామకృష్ణమూర్తి, కలెక్టర్ వి.వినయ్‌చంద్, చెడ్పీ చైర్మన్ ఈదర హరిబాబు, ఒంగోలు ఎమ్మెల్యే దామచర్ల జనార్ధనరావు, జెసి ఎస్.నాగలక్ష్మి, జెసి-2 డి.మార్కండేయులు, 25వ జాతీయ బాలల సైన్స్ కాంగ్రెస్ పరిశీలకులు డాక్టర్ గీతా స్వామినాథన్, డిఇఒ విజయభాస్కర్, డిఆర్‌డిఎ పీడీఎంఎస్ మురళి, స్టెప్ సిఇఒ బి.రవి తదితరులు పాల్గొన్నారు.

## 'కంపెనీ' మేత

సర్కారు అమ్ముతుంది. గతేడాది ఇచ్చిన జీవోలో కంపెనీలు ఉత్పత్తి చేసిన పచ్చగడ్డిలో 25 శాతానికి ప్రభుత్వం హామీ ఇవ్వగా తాజా జీవోలో మొత్తం ఉత్పత్తి అయిన గ్రాసాన్నీ సర్కారే కొనుగోలు చేస్తామంది. కంపెనీ పచ్చగడ్డి ఉత్పత్తి చేసిన వెంటనే 50 శాతం సొమ్మును సర్కారు చెల్లిస్తుంది. మిగిలిన 50 శాతం నిధులనూ గ్రాసం అమ్ముడయ్యాక చెల్లిస్తామంది.

**చేతులు మారుతున్న ముడుపులు**

గతంలో పచ్చగడ్డి పెంచేందుకు నేరుగా రైతులను సర్కారు ప్రోత్సహించింది. గడ్డి విత్తనాలను, చాఫ్ కట్టర్‌ల వంటి పరికరాలను రాయితీపై ఇచ్చింది. ఇప్పుడు రైతుల నుంచి భూములు లీసుకు తీసుకొని ప్రైవేటు కంపెనీల చేతుల్లో పెడుతోంది. పశుగ్రాస ఉత్పత్తిలో రైతులను, ఔత్సాహిక పారిశ్రామిక వేత్తలను, స్వచ్ఛంద సంస్థ (ఎన్‌జివో)లను ప్రోత్సహిస్తున్నామని చెపుతున్నా ఆచరణలో కంపెనీ సేద్యం సాగుతుందన్న ఆందోళనలు వ్యక్తమవుతున్నాయి. ఈ వ్యవహారంలో అధికారపార్టీకి చెందిన 'ఔత్సాహికులకు' రూ.కోట్లల్లో ఆయాచిత లబ్ధి చేకూరుతోందని, భారీగా ముడుపులు చేతులు మారుతున్నాయని విమర్శలు వెల్లువెత్తాయి.

# బిసిలు, కాపులను ఓటు బ్యాంకుగా చూడలేదు

### టెలికాన్ఫరెన్స్‌లో ముఖ్యమంత్రి చంద్రబాబు



**ప్రజాశక్తి - అమరావతి బ్యూరో**

బిసి, కాపులను తానెప్పుడూ ఓటు బ్యాంకుగా చూడలేదని ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు అన్నారు. కొరియా పర్యటనకు వెళ్లే ముందు ఆయన మంత్రులు, పార్టీ నాయకులతో టెలికాన్ఫరెన్స్ నిర్వహించారు. ఈ సందర్భంగా చంద్రబాబు మాట్లాడుతూ రాజకీయ లబ్ధికోసమే కొన్ని పార్టీలు కులాల్ని రెచ్చగొడుతున్నాయన్నారు. రాష్ట్రంలో పరిస్థితుల్ని ఎప్పటికప్పుడు సమన్వయం చేసుకోవాలని టిడిపి రాష్ట్ర అధ్యక్షులు కళా వెంకట్రావు, మంత్రి అచ్చెన్నాయుడు, ఎమ్మెల్సీ టి.డి.జనార్ధన్‌కు బాధ్యతలు అప్పగించారు. ఏ వర్గానికీ అన్యాయం జరగకుండా కాపులకు రిజర్వేషన్లు కల్పించామన్నారు. చాలాకాలంగా ఉన్న డిమాండును నెరవేర్చామని, ఇచ్చిన మాటకు కట్టుబడ్డామని పేర్కొన్నారు. బిసిలకు రిజర్వేషన్లలో కోత పెట్టకుండానే కాపులకు రిజర్వేషన్లు ఇస్తామని గతంలోనే చెప్పామని, ఇప్పుడు చేశామని పేర్కొన్నారు. దీనివల్ల బిసిలకు అన్యాయం జరగదన్నారు. తెలంగాణాలో కొన్ని కులాల్ని బిసి జాబితా నుండి తొలగించినప్పుడు మాట్లాడని ఆర్.కృష్ణయ్య ఇప్పుడు మాట్లాడటం సరికాదన్నారు.

**సిఎం కొరియా పయనం**

అనంతరం ముఖ్యమంత్రి చంద్రబాబు కొరియా పర్యటనకు బయలుదేరి వెళ్లారు. అర్ధరాత్రి రెండుగంటలకు సియోల్‌లో దిగుతారు. మూడురోజులపాటు అక్కడ పర్యటిస్తారు. సియోల్, బూసన్ నగరాల్లో పర్యటిస్తారు. ఈ సందర్భంగా కియో మెటార్స్‌కు సంబంధించి 17 సంస్థలతో ఒప్పందాలు చేసుకోనున్నారు. డిసెంబర్ 5న బూసన్, ఎపిఐఐసి మధ్య ఒప్పందం జరుగనుంది. 5,6 తేదీల్లో రోడ్‌షోలోనూ పాల్గొననున్నారు. డిసెంబర్ 6న కియోమోటార్స్ హెడ్ క్వార్టర్స్‌ను సందర్శిస్తారు. సిఎంతోపాటు ఆర్థిక మంత్రి యనమల రామకృష్ణుడు, పరిశ్రమలశాఖ మంత్రి అమరనాథరెడ్డి, ప్రభుత్వ సలహాదారు పరకాల ప్రభాకర్, సిఎంఒ ముఖ్య కార్యదర్శి సాయిప్రసాద్ తదితరులు పర్యటనలో పాల్గొంటారు.

# ఓయూ విద్యార్థి ఆత్మహత్య



ఆత్మ హత్య చేసుకున్న మురళి



ఆందోళన చేస్తున్న విద్యార్థులు

(మొదటిపేజీ తరువాయి)

చూడగా అప్పటికే మరణించినట్టు గుర్తించారు. విద్యార్థులు తెలిపిన వివరాల ప్రకారం.. సిద్దిపేట జిల్లా జగదేవ్‌పూర్ మండలం దౌలాపూర్ గ్రామానికి చెందిన మురళి ఓయూలో ఎమ్మెస్సీ ఫిజిక్స్‌లో మెటీరియల్ సైన్స్ చదువుతున్నాడు. తల్లి, అక్క, చెల్లెలు ఉన్నారు. గతంలోనే మురళి తండ్రి మరణించారు. బిఎస్సీ బిఇడి పూర్తి చేసిన అతను, డిఎస్సీతో పాటు ఇతర పోటీ పరీక్షలకు సన్నద్ధమ వు తున్నాడు. ఓయూ పీజీ ఎంట్రన్స్‌లో ఫిజిక్స్‌లో యూనివర్శిటీ టాపర్‌గా నిలిచాడు. ఇంట్లో ఆర్థిక పరిస్థితులు అంతంతమా త్రమే కావడంతో ఎలాగైనా ప్రభుత్వ ఉద్యోగం సంపాదించాలనే పట్టుదలతో ప్రభుత్వ నోటిఫికేషన్ల కోసం చాలాకాలంగా ఎదురు చూస్తున్నట్టు విద్యార్థులు చెబు తున్నారు. ఉద్యోగ ప్రకటనల జాప్యంతో మనస్థాపానికి గురైన మురళి ఆత్మహత్యకు పాల్పడి ఉంటాడని విద్యార్థులు అంటున్నారు. మురళి మరణవార్త విన్న విద్యార్థులు పెద్ద సంఖ్యలో మానేరు హాస్టల్‌కు చేరుకున్నారు. దీంతో పోలీసు బలగాలు మానేరు హాస్టల్ వద్ద పెద్ద ఎత్తున మొహరిం చాయి. తెలంగాణ మలి దశ ఉద్యమంలో తొలి అమరుడు శ్రీకాంత్ చారి వర్ధంతి ఆదివారం జరగటం, సోమవారం హైదరాబాద్‌లో కొలువుల కొట్లాట సభ జరుగనున్న నేప థ్యంలో ఓయూ విద్యార్థి మురళీ ఆత్మహత్య ప్రధాన చర్చనీ యాంశమయింది. మురళి భౌతిక కాయాన్ని తెలం గాణ జేఏసీ చైర్మన్ ప్రొ.కోదండరాం, నాయకులు రఘు, ప్రొఫెసర్ పురుషోత్తం, టీమాస్ కన్వీనర్ జాన్‌వెస్లీ, రిటైర్డ్ జడ్జి చంద్రకుమార్, విద్యార్థి సంఘాల నేతలు సందర్శిం చారు.

**సూసైడ్ నోట్‌పై అనుమానాలు**

బాత్‌రూమ్‌లో దొరికినట్టుగా భావిస్తున్న సూసైడ్ నోట్‌ను పోలీసులు తారుమారు చేసినట్టు విద్యార్థులు అనుమానిస్తున్నారు. పోలీసులు చూపెడుతున్న సూసైడ్ నోట్‌కు, మురళి రికార్డు బుక్‌లోని రైటింగ్‌కు చాలా తేడా ఉందని విద్యార్థులు అంటున్నారు. రెండు పేజీలున్న సూసైడ్ నోట్‌లో పేజీలు వేర్వేరు రంగులో ఉండడం అనుమానాలకు మరింత బలాన్ని చేకూర్చుతోంది. పోలీసులు చూపిస్తున్న సూసైడ్ నోట్‌లో 'ఈ చదువులు నా వల్ల కావడం లేదు, పిచ్చి లేస్తుంది. ఇంకా ఇలాగే ఉంటే పిచ్చోణ్ని అయిపోతాను..' అంటూ రాసి ఉండడంపై అనుమానాలు వ్యక్తమవు తున్నాయి.

**హాస్టల్లో దాక్కొన్న విసి**

మురళి భౌతిక కాయాన్ని సందర్శించేందుకు ఓయు విసి ప్రొఫెసర్ రామచంద్రం అక్కడకు రావడంతో విద్యార్థులంతా ఒక్కసారిగా విసి గో బ్యాక్ అంటూ పెద్ద ఎత్తున నినాదాలు చేశారు. కొందరు విసిపై చెప్పులు విసిరారు. దీంతో భయభ్రాంతులకు గురైన విసి అక్కడ నుంచి పరుగుతీసి హాస్టల్ గదుల్లో దాక్కొన్నారు. అనంతరం విద్యార్థి సంఘాల నాయకులు, ప్రొఫెసర్ల సహాయంతో ఆయన మురళీకి నివాళులర్పించారు. విద్యార్థి కుటుంబానికి ప్రభుత్వం నుంచి న్యాయం జరిగేలా చూస్తానని విసి హామీ ఇచ్చారు.

**సమగ్ర విచారణ చేపట్టాలి :కోదండరాం**

మురళీ ఆత్మహత్యపై సమగ్ర విచారణ చేపట్టాలని టిజెఎసి చైర్మన్ ప్రొఫెసర్ కోదండరాం ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. విద్యార్థులపై నిర్లక్ష్యంగా వ్యవహరించడం ప్రభుత్వానికి తగదని ఆయన హితవు పలికారు. మురళి భౌతిక కాయాన్ని సందర్శించిన అనంతరం ఆయన మీడియాతో మాట్లాడుతూ.. డీఎస్సీ వాయిదా కారణంగానే మనస్థాపానికి గురై ఆత్మహత్యకు పాల్పడినట్టుగా తెలుస్తోందన్నారు. తెలంగాణ రాష్ట్రంలో విద్యార్థుల ఆవేదన, అశాంతిని, అలజడిని ప్రభుత్వం సీరియస్‌గా అర్థం చేసుకోవాలన్నారు. విద్యార్థులు కోరినట్టుగా మురళీ కుటుంబాన్ని ప్రభుత్వం ఆదుకోవాలన్నారు.

## ప్రపంచ తెలుగు మహాసభలపై నేడు విజయవాడలో సభ

**ప్రజాశక్తి-అమరావతిబ్యూరో**

ఈనెల 15 నుంచి 19 వరకు హైదరాబాద్‌లో నిర్వహించనున్న ప్రపంచ తెలుగు మహాసభల వివరాల్ని వెల్లడించడానికి విజయవాడ ప్రెస్‌క్లబ్‌లో సోమవారం సాయంత్రం సభా కార్యక్రమాన్ని ఏర్పాటు చేసినట్లు అభ్యుదయ రచయితల సంఘం (అరసం) కృష్ణాజిల్లా కార్యదర్శి కొండపల్లి మాధవరావు ఆదివారం ఒక ప్రకటనలో తెలిపారు. ఈ కార్యక్రమంలో ప్రపంచ తెలుగు మహాసభల సన్నాహక కమిటీ తరపున పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయ ఉపకులపతి డాక్టర్ ఎస్వీ సత్యనారాయణ, తెలంగాణ రచయితల సంఘం వేదిక కార్యదర్శి జూలూరి గౌరీశంకరరావు పాల్గొంటారని ఆయన తెలిపారు. కవులు, రచయితలు, తెలుగు భాషాభిమానులందరూ ఆహ్వానితులేనని ఆయన పేర్కొన్నారు.

## ప్రభుత్వ నిర్ణయంతో ప్రజల మధ్య చిచ్చు : రఘువీరా

**ప్రజాశక్తి-మడకశిర రూరల్ (అనంతపురం)**

ప్రభుత్వం పూర్తి స్థాయిలో అధ్యయనం చేయకుండా రిజర్వేషన్ల నిర్ణయాన్ని ప్రకటించి ప్రజల మధ్య చిచ్చురేపుతోందని పిసిసి అధ్యక్షులు ఎన్.రఘువీరారెడ్డి విమర్శించారు. అనంతపురం జిల్లా మడకశిర మండలంలో ఆదివారం నిర్వహించిన ఇందిరమ్మ రాజ్యం - ఇంటింటా సౌభాగ్యం కార్యక్రమంలో పాల్గొన్న ఆయన విలేకరులతో మాట్లాడారు. కాపులను బిసిల్లో, బోయలను ఎస్టీలో చేర్చేందుకు ప్రభుత్వం వేసిన కమిటీ పూర్తి నివేదిక ఇంకా రాలేదన్నారు. నివేదిక ఇవ్వకుండానే రిజర్వేషన్ల మార్పు పేరుతో ప్రభుత్వం హడావేడి చేయడం ఎందుకని ప్రశ్నించారు. ఓట్ల కోసం ఇలాంటి నిర్ణయాలు తీసుకోవడం సరికాదన్నారు. పోలవరం ప్రాజెక్టు అంశాన్ని నీరుగార్చేందుకే ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు రిజర్వేషన్ల ప్రక్రియ అంశం లేవనెత్తేడాన్నారు. ప్రజలు దీనిని గమనించాలని ఆయన కోరారు.

## వికలాంగులకు బడ్జెట్‌లో పెద్దపీఠ

### మంత్రులు కెఇ, సునీత

**ప్రజాశక్తి - కర్నూలు కలెక్టరేట్**

రానున్న బడ్జెట్‌లో వికలాంగుల సంక్షేమానికి పెద్దపీఠ వేయనున్నట్లు రాష్ట్ర మంత్రులు కెఇ.కృష్ణమూర్తి, పరిటాల సునీత ప్రకటించారు. ఆదివారం కర్నూలు ఎస్‌ఎపి క్యాంపు మైదానంలో అంతర్జాతీయ వికలాంగుల దినోత్సవం రాష్ట్రస్థాయి వేడుకలను ఘనంగా నిర్వహించారు. ఈ కార్యక్రమానికి వికలాంగుల కార్పొరేషన్ చైర్మన్ కోటేశ్వరరావు అధ్యక్షత వహించారు. ముఖ్య అతిథులుగా డిప్యూటీ సిఎం కెఇ కృష్ణమూర్తి, రాష్ట్ర స్త్రీ శిశు, వికలాంగుల సంక్షేమ శాఖ మంత్రి పరిటాల సునీత, ఎంపీలు టిజి వెంకటేశ్, బుట్టారేణుక, ఎపిఎస్ఐడిసి చైర్మన్ కెఇ ప్రభాకర్‌లు హాజరయ్యారు. కెఇ.కృష్ణమూర్తి మాట్లాడుతూ అర్హులైన వికలాంగులందరికీ ప్రభుత్వ సంక్షేమ పథకాలను అమలు చేస్తున్నామని తెలిపారు.



# సమ్మర్‌కు '2.0'

రజనీ కాంత్, డైరెక్టర్ శంకర్ కాంబినేషన్‌లో రూ.450 కోట్లతో అత్యంత ప్రతిష్టాత్మకంగా రూపొందుతోన్న సినిమా '2.0'. రోబోకు ఇది సీక్వెల్. ఈ సినిమాను ఈ ఏడాది దసరాకు విడుదల చేయాలని ముందుగా భావించారు. కానీ అదే టైమ్‌లో అజయ్ దేవ్‌గన్, పరిణీతి చోప్రా, టబు తదితరులు నటించిన 'గోల్‌మాల్ ఎగైన్' చిత్రం విడుదలైంది. ఈ సమయంలో '2.0'ను విడుదల చేస్తే నష్టం జరిగే అవకాశం ఉందని భావించి విజువల్ ఎఫెక్ట్స్ పనులు పూర్తి కాలేదని అందువల్ల అన్ని పూర్తి చేసి జనవరి 25న విడుదల చేస్తామని ఈ సినిమా నిర్మాణ సంస్థ లైకా ప్రొడక్షన్ అప్పట్లో ప్రకటించింది. ఆ తేదీని కూడా ఇప్పుడు మార్చేసింది. ఈ సారి నిర్దిష్టం తేదీని ప్రకటించలేదు గానీ వచ్చే ఏడాది ఏప్రిల్‌లో విడుదల చేస్తామని లైకా ప్రొడక్షన్స్ క్రియేటివ్ హెడ్ రాజు మహాలింగం ఆదివారం తెలిపారు. ఏప్రిల్ 27న విడుదలయ్యే అవకాశం ఉంది. మార్వెల్ స్టూడియోస్ నిర్మించిన 'అవెంజర్స్: ఇన్ఫినిటీ వార్' కూడా ఏప్రిల్ 27నే విడుదల చేయనున్నారు. త్రీడీ టెక్నాలజీతో '2.0' సినిమా తీసుకొస్తున్నామని అందుకే మళ్లీ విడుదల వాయిదా అయిందని చెప్పుకొచ్చారు.

నిర్ణయించిన షెడ్యూల్ ప్రకారం నవంబర్‌లో టీజర్‌ను విడుదల చేస్తామని సంస్థ గతంలోనే తెలిపింది. ఇక రజనీకాంత్ పుట్టినరోజు సందర్భంగా ఈనెల 12న ట్రైలర్ విడుదల చేస్తామని వెల్లడించారు.

ఇందులో బాలీవుడ్ హీరో అక్షయ్ కుమార్ విలన్‌గా ఓ విభిన్నమైన పాత్ర పోషిస్తుండగా, ఎమీ జాక్సన్ హీరోయిన్‌గా నటిస్తోంది. తెలుగు, తమిళ్, హిందీ భాషల్లో రూపొందింది.

## సన్నీలియోనే కత్తి యుద్ధాలు

సన్నీలియోనే అంటే మనకు గుర్తొచ్చేది ప్రత్యేక గీతాలు. ఈ మధ్య రాజశేఖర్ హీరోగా వచ్చిన 'గరుడవేగ'లో ప్రత్యేక గీతం చేసి అభిమానులను అలరించింది. ఇప్పుడు కత్తి యుద్ధం, గుర్రపు స్వారీ, కొన్ని యుద్ధ కళలను నేర్చుకోబోతుందట. ఆంధ్రప్రదేశ్‌కు చెందిన ఒక ప్రముఖ ట్రైనర్ ఈ కళలను ముంబైలో సన్నీలియోనేకు ట్రైనింగ్ ఇవ్వనున్నారు. ఇదేంటి...ఐటెమ్ గీతానికి ఇన్నోటి అవసరమా? అంటే...ఈ సారి సన్నీ చేసేది ప్రత్యేక గీతం కాదు. మహిళా ప్రాధాన్యమున్న సినిమా. అదీ తెలుగులోనే. చారిత్రాత్మక నేపథ్యంలో ఈ చిత్రం రూపొందబోతుంది. వి.సి.వడివుడయన్ దర్శకత్వంలో స్టీవ్స్ కార్నర్ పతాకంపై పోన్స్ స్టిఫెన్ ఈ చిత్రాన్ని నిర్మిస్తున్నారు. నవదీప్, నాజర్ కీలకపాత్రలు పోషించనున్నారు.

భారీ బడ్జెట్‌తో తెరకెక్కనున్న ఈ చిత్రం కోసం సన్నీలియోనే ఏకంగా 150 రోజుల కాల్షీట్స్‌ను దర్శకనిర్మాతలకు ఇవ్వడం బట్టి సినిమాపై ఆమెకున్న నమ్మకం తెలుస్తోంది. 'బాహుబలి' చిత్రాలకు గ్రాఫిక్స్ వర్క్స్ చేసిన సంస్థలు ఈ చిత్రానికి కూడా పనిచేయనున్నారు. సినిమాలో దాదాపు 70 నిమిషాల గ్రాఫిక్స్ ఉంటాయని చెబుతున్నారు. తెలుగు, తమిళ, మలయాళ, హిందీ భాషల్లో రూపొందనున్న ఈ చిత్రంలో టైటిల్‌ను త్వరలోనే వెల్లడించనున్నారు.

సన్నీలియోనే మాట్లాడుతూ "ఇప్పటివరకూ నాకున్న ఇమేజ్‌ను పూర్తిస్థాయిలో మార్చే సినిమా అవుతుందన్న నమ్మకం ఉంది. యాక్షన్ సీక్వెన్స్‌లో యాక్ట్ చేయాలన్నది నా కల. అది ఈ సినిమాతో నెరవేరుతున్నందుకు ఆనందంగా ఉంది. దర్శకుడు వి.సి.వడివుడయన్ కథ చెప్పిన మరుక్షణం నుండే ఈ సినిమా కోసం సిద్ధమవుతున్నాను. వచ్చే ఏడాది ఫిబ్రవరి నుండి రెగ్యులర్ షూటింగ్ ప్రారంభవ్వనుంది' అని తెలిపింది.



సన్నీలియోనే

## అనుక్షణం ఉత్కంఠగా సాగే కథ

అల్లు శిరీష్



చక్రి చిగురుపాటి, సీరత్ కపూర్, అల్లు శిరీష్, సురభి, వి. ఆనంద్

అల్లు శిరీష్, సురభి, సీరత్ కపూర్ హీరో హీరోయిన్లుగా నటించిన సినిమా 'ఒక్క క్షణం'. వి.ఐ. ఆనంద్ దర్శకత్వం వహిస్తున్నారు. లక్ష్మీ నరసింహ ఎంటర్‌టైన్‌మెంట్స్ పతాకంపై రూపొందుతోంది. చక్రి చిగురుపాటి నిర్మిస్తున్నారు. ఆదివారం ప్రసాద్ ల్యాబ్ ప్రివ్యూ థియేటర్‌లో ఈ సినిమా టీజర్‌ను ఆవిష్కరించారు.

శిరీష్ మాట్లాడుతూ 'ఉత్కంఠగా సాగే కథ ఇది. లవ్, రొమాన్స్, ఎంటర్‌టైన్‌మెంట్‌తో సాగుతుంది. ఆనంద్ చక్కగా తెరకెక్కించారు. లవ్, రొమాన్స్, ఎంటర్‌టైన్‌మెంట్‌కి కమర్షియల్ యాంగిల్‌ని కలపడం అందరికీ రాదు. కానీ ఆనంద్ ఆ పనిని చాలా చక్కగా నిర్వర్తించారు. ఆయన కథ మీద ఎక్కువ కసరత్తులు చేశాకే సెట్స్ మీదకు తీసుకొచ్చారు. నేను ప్రేమించే అమ్మాయి ప్రాణాల మీదకొస్తే ఫేట్‌తోనైనా, డెస్టినీతోనైనా చివరికి చావుతో అయినా పోరాడతాను అని టీజర్‌లో చెప్పిన డైలాగ్‌తో కథేంటో తెలుస్తుంది. అది శాంపిల్ మాత్రమే. సినిమాలో ఇంకా సస్పెన్స్ ఉంది. మణిశర్మ సంగీతం ప్లస్ అవుతుంది. దర్శకుడి మార్క్ చూపించే సినిమా ఇది' అని తెలిపారు.

దర్శకుడు ఆనంద్ మాట్లాడుతూ 'గతేడాది నవంబర్‌లో హీరోకి, నిర్మాతకు ఈ కథ చెప్పా. నన్ను నమ్మి నాతో ట్రావెల్ చేశారు. జీవా అనే పాత్ర పండించడానికి శిరీష్ తనకు మించిన ఎఫర్ట్ పెట్టాడు'అని అన్నారు.

అబ్బూరి రవి మాట్లాడుతూ 'సినిమా చూస్తున్నప్పుడు ఒక్క క్షణం మిస్ అయినా తర్వాత ఏం జరుగుతుందో అన్న ఉత్కంఠ ప్రేక్షకుల్ని వెంటాడుతుంది' అని అన్నారు.

తనకు ఇది మంచి పాత్ర అని అందుకే చేశారని సీరత్ కపూర్ చెప్పింది.

నిర్మాత చక్రి మాట్లాడుతూ 'అన్ని పనులు వేగంగా జరుగుతున్నాయి. త్వరలోనే సినిమాను విడుదల చేస్తాం. అందరికీ నచ్చే సినిమా అవుతుంది. కథకు అనుగుణంగా టైటిల్ పెట్టాం' అని చెప్పారు.

## 'ఐ యామ్ విత్' నినాదంతో 'మా' సిల్వర్ జూబ్లీ వేడుకలు



నరేశ్, శ్రీకాంత్, గుడిపూడి శ్రీహరి, రాళ్లపల్లి శివాజీ రాజా

మూవీ ఆర్టిస్టు అసోయేసియేషన్ (మా) ఏర్పడి 25 వసంతాలు పూర్తి చేసుకుంది. ఈ సందర్భంగా సిల్వర్ జూబ్లీ వేడుకలు నిర్వహించేందు సన్నాహాలు చేస్తున్నారు. దీనికి సంబంధించిన వివరాలను ఎఫ్.ఎన్ .సి.సి కల్చరల్ సెంటర్‌లో ఏర్పాటు చేసిన మీడియా సమావేశంలో కార్యవర్గం వెల్లడించింది. ఇదే వేదికపై సీనియర్ నటుడు రాళ్లపల్లి, సీనియర్ పాత్రికేయలు గుడిపూడి శ్రీహరి, నటుడు శివ బాలాజీలను 'మా' సత్కరించింది.

'మా' అధ్యక్షుడు శివాజీ రాజా మాట్లాడుతూ '24 ఏళ్ల కిందట చిరంజీవి స్థాపించిన 'మా' దిగ్విజయంగా 25 సంవత్సరంలోకి అడుగు పెట్టడం చాలా సంతోషంగా ఉంది. ఈ సందర్భంగా 'ఐ యామ్ విత్ 'మా" నినాదంతో సిల్వర్ జూబ్లీ వేడుకలను ఘనంగా చేస్తున్నాం. అందుకు టాలీవుడ్ సెలబ్రిటీలంతా కలిసి వస్తున్నారు. చిరంజీవి , బాలకృష్ణ నాగార్జున, వెంకటేష్ అండగగానే ఏక్కడికైనా రావడానికి సిద్ధంగా ఉన్నామని భరోసా ఇచ్చారు. మహేష్ బాబు, రామ్ చరణ్, ఎన్టీఆర్ కూడా మద్దతు తెలిపారు. ఈ వేడుకలకు శుభ సూచికంగా 'గోల్డేజ్ హోమ్'ను ఏర్పాటు చేయబోతున్నాం. వయసు మళ్లిన పేద కళాకారులకు ఇది ఎంతో ఉపయుక్తంగా ఉంటుంది. తెలంగాణ రాష్ట్రంలో జరిగే తెలుగు మహాభలకు మద్దతు తెలుపుతున్నాం' అని అన్నారు.

జనరల్ సెక్రటరీ నరేష్ మాట్లాడుతూ ఈనెల 10న కర్టయిన్ రైజర్ ఫంక్షన్ పార్క్ హయత్‌లో ఏర్పాటు చేసినట్టు చెప్పారు.

సీనియర్ నటుడు రాళ్లపల్లి మాట్లాడుతూ 'ప్రస్తుతం పోటీ ప్రపంచంలో నాకు అవకాశాలు తగ్గాయి. అయినా సంతోషం. పరిశ్రమకు కొత్త నీరు వస్తోంది. ప్రతిభ ఉన్న కళాకారులు వెలుగులోకి వస్తున్నారు. కళాకారుడంటే నిత్య విద్యార్థి. అలా కష్టపడితేనే ఇక్కడ రాణించగలం' అని పేర్కొన్నారు.

## ఆది, తాప్సీ జోడీ





ఆది పినిశెట్టి ఒక పక్క హీరోగా, మరో పక్క ప్రతినాయకుడిగా మెప్పిస్తున్నాడు. 'సరైనోడు', 'నిన్ను కోరి'లో విలన్‌గా చేశాడు. ప్రస్తుతం 'అజ్ఞాత వాసి', 'రంగ స్థలం 1985' చేస్తున్నాడు. తాజాగా ఆయన హీరోగా మరో సినిమాలో చేస్తున్నాడు. హీరో హీరోయిన్లుగా 'గుండెల్లో గోదారి'తో తెలుగు ప్రేక్షకుల్లో స్థానాన్ని సంపాదించుకున్న ఆది పినిశెట్టి, తాప్సీ జోడీ మళ్లీ మరోసారి మెప్పించబోతున్నారు. కోన వెంకట్ సమర్పణలో ఈ సినిమా రూపొందనుంది. 'లవర్స్' ఫేమ్ హరి దర్శకత్వం వహించనున్నారు. ఎం.వి.వి సినిమా, కోన ఫిలిమ్ కార్పొరేషన్ సంస్థలు సంయుక్తంగా నిర్మిస్తున్నాయి. ఈనెల 21న తేదీ నుంచి రెగ్యులర్ షూటింగ్ ప్రారంభం కానుంది.

ఈ చిత్రానికి స్క్రీన్ ప్లే : కోన వెంకట్, కెమెరా : తోట రాజు (అర్జున్ రెడ్డి ఫేమ్), కళ : చిన్న, సంగీతం : గోపీసుందర్, కూర్పు : ప్రవీణ్ పూడి, నిర్మాత: ఎం.వి.వి.సత్యనారాయణ, కథ–దర్శకత్వం: హరి.

## ఈ అభిమానం ఇలాగే కొనసాగాలి

– విజయ్ ఆంటోని



భాషా శ్రీ, విజయ్ ఆంటోని, మహిమ

"మొదటి సినిమా నుంచీ తెలుగు ప్రేక్షకులు సొంత మనిషిలా నన్ను ఆదరిస్తున్నందుకు ధన్యవాదాలు. ఈ అభిమానం ఇలాగే కొనసాగాలని కోరుకుంటున్నాను. పదేళ్ల తర్వాత నేను కనిపించినా ఇదే ప్రేమ చూపిస్తారనే నమ్మకం ఉంది" అని విజయ్ ఆంటోని అన్నారు.ఆయన హీరోగా చేసిన తాజా చిత్రం 'ఇంద్రసేన'. అన్నదమ్ముల సెంటిమెంట్‌పై రూపొందిన ఈ సినిమా ఇటీవల విడుదలైంది. ఆర్. స్టూడియోస్, విజయ్ ఆంటోని ఫిల్మ్ కార్పొరేషన్ పతాకంపై జి.శ్రీనివాసన్ దర్శకత్వంలో రాధికా శరత్‌కుమార్, ఫాతిమా విజయ్ ఆంటోని సంయుక్తంగా నిర్మించారు. హైదరాబాద్‌లోని ప్రసాద్ ల్యాబ్స్‌లో ఈ చిత్రం సక్సెస్‌మీట్ ఆదివారం నిర్వహించారు. ఈ కార్యక్రమంలో హీరో విజయ్ ఆంటోని, హీరోయిన్ మహిమ, రచయిత భాషా శ్రీ పాల్గొన్నారు.

విజయ్ అంటోని మాట్లాడుతూ "సినిమాకు స్పందన బావుంది. మహిమ పాత్ర గుర్తుండిపోతుంది. నిర్మాత అత్యధిక థియేటర్లలో సినిమాను విడుదల చేశారు. భాష్యశ్రీ నా ఇంటి మనిషిలాంటివాడు. నా ప్రతి సినిమానూ ఆయన సొంత సినిమాగా భావించి పనిచేస్తున్నారు" అని చెప్పారు.

మహిమ మాట్లాడుతూ 'నా పాత్ర ప్రేక్షకులకు బాగా రీచ్ అయింది. చాలా మంది ప్రత్యేకంగా ఫోన్లు చేసి ప్రశంసిస్తున్నారు. భవిష్యత్తులో ఇలాంటి పాత్రలు మరిన్ని చేయాలని ఆశిస్తున్నాను' అని పేర్కొన్నారు. నిర్మాత మాట్లాడుతూ 'సినిమా విజయం సాధించడం ఆనందంగా ఉంది. సినిమా చూసిన వారందరూ బావుందని మెచ్చుకుంటున్నారు' అని చెప్పారు.

## 25 ఏళ్ల తర్వాత



లిజీ

అలనాటి తార, దర్శకుడు ప్రియదర్శన్ మాజీ భార్య లిజీ మళ్లీ వెండితెరపై కనిపించబోతుంది. ఈమె కెమెరాకు దూరమై సుమారుగా 25 ఏళ్లు అవుతుంది. ఇప్పుడు మళ్లీ పవన్ కల్యాణ్, దర్శకుడు త్రివిక్రమ్ సంయుక్తంగా నిర్మిస్తున్న నితిన్ చిత్రంలో లిజీ కీలక పాత్రలో నటించనుంది. ఈ విషయాన్ని లిజీ ఫేస్‌బుక్ ద్వారా ఆదివారం వెల్లడించింది.

'నేను మళ్లీ సినిమాల్లో నటిస్తానా? లేదా? అని చాలా మంది అడుగుతున్నారు. 25 ఏళ్ల తర్వాత మళ్లీ సినిమాల్లోకి వస్తున్నాను. పవన్ కల్యాణ్, త్రివిక్రమ్ నిర్మాతలుగా వ్యవహరిస్తున్న చిత్రంలో ఓ కీలక పాత్రలో నటిస్తున్నాను. నితిన్, మేఘా ఆకాశ్ జంటగా నటిస్తున్నారు. కృష్ణ చైతన్య దర్శకత్వం వహిస్తున్నారు.'చాలా కాలం తర్వాత న్యూయార్క్‌లో జరుగుతున్న చిత్రీకరణలో కెమెరా ముందుకు వచ్చాను. భయంగా అనిపించింది కానీ థ్రిల్లింగ్‌గా ఉంది. ఈ అనుభవాన్ని మిస్ అయ్యాననే చెప్పాలి. అమెరికాలో సినిమా తొలి షెడ్యూల్‌ను పూర్తిచేశాం. రెండో షెడ్యూల్ కునూర్‌లో చేయనున్నాం. 2018లో ఈ సినిమా ప్రేక్షకుల ముందుకు రాబోతోంది. నటనకు స్వస్తి చెప్పకముందు తెలుగులో ఎనిమిది సినిమాలు చేశాను. అందులో ఆరు సూపర్ హిట్టయ్యాయి. నిజాయతీగా చెప్పాలంటే తెలుగు చిత్ర పరిశ్రమను వదిలి వెళ్లినందుకు చాలా బాధపడ్డాను." అని చెప్పింది.

## కాలేజీలో 'కిర్రాక్ పార్టీ'

వరుస విజయాలతో దూసుకుపోతున్న యువ హీరో నిఖిల్. 'ఎక్కడకి పోతావు చిన్నవాడా', 'కేశవ' తర్వాత ఆయన హీరోగా చేస్తోన్న సినిమా 'కిర్రాక్ పార్టీ'. ఇది కన్నడలో విజయం సాధించిన చిత్రం. తెలుగులో కూడా అదే పేరుతో రీమేక్ చేస్తున్నారు. ఈ చిత్రం ఫస్ట్‌లుక్ తన ట్విట్టర్ అకౌంట్ ద్వారా విడుదల చేశాడు నిఖిల్. 'ఇటీవల కొన్ని కొత్త తరహా థ్రిల్లర్స్ చేశాను. ఇప్పుడు మాస్ యూత్ టైమ్. ఫుల్ కాలేజీ ఎంటర్‌టైన్‌మెంట్. ఇంజనీరింగ్ అండ్ పోస్టుగ్రాడ్యుయేట్ విద్యార్థులతో 'కిర్రాక్ పార్టీ' అని ఈ పోస్టులో పేర్కొన్నాడు. కాలేజీ కాంపస్‌లో తన స్నేహితుల భుజాలపై ఉన్న స్టిల్‌ను తన అభిమానులతో పంచుకున్నాడు. ఇందులో నిఖిల్ కాలేజీ లీడర్‌గా కనిపించబోతున్నాడు. కాలేజీ నేపథ్యంలో రూపొందుతోన్న ఈ సినిమాకు శరన్ కొప్పిశెట్టి దర్శకత్వం వహిస్తున్నాడు. ఏకే ఎంటర్‌టైన్‌మెంట్స్ బ్యానర్‌లో రామబ్రహ్మం సుంకర నిర్మిస్తున్నాడు.




నిఖిల్

## కోట్లు కుమ్మరించిన మేం ఏమైపోవాలి?



'జవాన్' దర్శకుడు బీవీఎస్ రవి

'జవాన్' సినిమా విడుదలైన రోజే పైరసీ వచ్చేస్తోందని, దాని వల్ల నిర్మాతలు, పంపిణీదారులు తీవ్రంగా నష్టపోతున్నారని ఆ చిత్ర దర్శకుడు బీవీఎస్ రవి ఆవేదన వ్యక్తం చేశాడు. 'జవాన్' చిత్రం పైరసీ రూపంలో రావడంపై రవి మాట్లాడిన ఓ వీడియోను వీడియోను నిర్మాణ సంస్థ సామాజిక మాధ్యమంలో పోస్టు చేసింది. సాయి ధరమ్ తేజ్, మెహరీన్ ఈ చిత్రంలో హీరో హీరోయిన్లుగా చేశారు. అరుణాచల్ క్రియేషన్స్ సంస్థ నిర్మించింది. దిల్‌రాజు సమర్పించారు.

చాలా కష్టపడి చేసిన సినిమాకు మంచి ప్రశంసలు లభిస్తున్నా ఆ ఆనందం ఎంతో కాలం నెరవేరలేదన్నారు రవి. ఈ సినిమా కోసం నిర్మాత డబ్బు కుమ్మరించారని, యూనిట్‌లోని ప్రతి విభాగం వారు రక్తం చిందించి తీశామని చెప్పారు. మంచి ఓపెనింగ్స్ వచ్చాయి కానీ విడుదలైన రోజు మాట్నీ షోకే పైరసీ వచ్చేసిందని ఆవేదన వ్యక్తం చేశారు.

"సినిమా వ్యాపారం 10–20 శాతం లాభాలతో నడుస్తుంటుంది. పంపిణీదారులు, థియేటర్ యజమానులు. ఇలా చాలా మంది ప్రేక్షకుడికి మంచి అనుభూతిని ఇవ్వాలని ఎంతో శ్రమించి, డబ్బులు పోగు చేసుకుని ఖర్చు పెడుతుంటారు. ప్రతి వృత్తికి విలువ ఇస్తున్నారు. సినిమా వృత్తికి ఇవ్వరు ఎందుకు? మాకూ కుటుంబాలు ఉన్నాయి. పైరసీ అనే రోగం బాగా వ్యాపించిపోతోంది. దీన్ని ప్రోత్సహించడం చాలా పాపం. కంప్యూటర్లు, ఫోనుల్లోనే సినిమా చూసేస్తున్నారు. ఇది కాదు కదా సినిమా అంటే.. అదో అనుభూతి. కోట్లు కుమ్మరించిన మేం ఏమైపోవాలి?" అని ఆగ్రహం వ్యక్తం చేశారు.

పైరసీ వచ్చేస్తే కలెక్షన్స్ తగ్గిపోతాయని తమ అందరి జీవితాలు రోడ్లపైకి వచ్చేస్తాయన్నారు. హీరోలు తమ కోసం భాగస్వాములుగా మారుతున్నారని, కలెక్షన్స్ వస్తే డబ్బులు తీసుకుంటున్నారని చెప్పారు. ప్రతీ శుక్రవారం తమ గుండెలు పగిలిపోతున్నాయని, శుక్రవారం మ్యాట్నీకే పైరసీ వచ్చేస్తే తాము ఏం చేయాలని, ఈ కళ చచ్చిపోతోందన్నారు. "టూరిస్ట్ బస్సుల్లో పైరసీలు వేసేస్తున్నారు. బస్సు కండీషన్ బాగుందా? అని ప్రభుత్వం ప్రశ్నిస్తే సరిపోతుందా? పైరసీ వీడియోలు వేస్తున్న డ్రైవరు, కండక్టర్, బస్సు యజమానులను ఏం అనాలి? మనదేశంలో పైరసీ నిబంధనలు చాలా ఉన్నాయి. చూసిన వారిని, చేసిన వారిని కఠినంగా శిక్షిస్తున్నారు. దయచేసి పైరసీని ప్రోత్సహించకండి' అని విజ్ఞప్తి చేశారు.



# రూపాయి

గతంలో బ్యాంకుల నుంచి ఖాతాదారుల ప్రత్యేక అభ్యర్థనపై అవసరాలకు రుణాలు తీసుకునే పద్ధతి మాత్రమే ఉండేది. ఖాతాదారుడి తిరిగి చెల్లింపు, ఆర్థిక సామర్థ్యాలు ఆధారంగా బ్యాంకులు వివిధ రుణాలు అందజేసేవి. బ్యాంకులు కంప్యూటర్ ఆధారిత సేవలు అందించడం మొదలయ్యాక.. క్రెడిట్ కార్డు రుణాలు బాగా ప్రచారంలోకి వచ్చాయి. క్రమేణా వీటి వినియోగం బాగా పెరుగుతూ వస్తోంది. వాణిజ్యరంగంలోనూ క్రెడిట్ కార్డుల ప్రాధాన్యత అంతకంతకు పెరుగుతోంది. ఇలాంటి పరిస్థితుల్లో కొత్తగా క్రెడిట్‌కార్డు వాడటం మొదలుపెట్టేవారు కార్డు వినియోగం విషయంలో కచ్చితంగా కొన్ని జాగ్రత్తలు పాటించాలి.

# క్రెడిట్ కార్డు వాడుతున్నారా?!

జేబులో డబ్బు తీసుకొని వెళ్లే రోజులు పోయాయి. నిర్ణీత మొత్తానికి మించి, నగదు కొనుగోళ్లు అనుమతించని నిబంధనలు ఉన్నందున వీలైనంత వరకూ క్రెడిట్, డెబిట్ కార్డుల ద్వారానే కొనుగోళ్లు చేయాల్సిన పరిస్థితిని కల్పిస్తోంది. అవసరానికి చేతిలో డబ్బు లేకపోయినా.. మన అవసరం తీర్చేందుకు క్రెడిట్‌కార్డు ఉపయోగపడుతుంది. అయితే, ఏదైనా కొనడానికే క్రెడిట్ కార్డు అనే అపోహ చాలామందిలో ఉంటుంది. కానీ, ఇది పూర్తిగా నిజం కాదు. క్రెడిట్ కార్డును జాగ్రత్తగా వినియోగించుకోవాలి. వాడుక తెలియాలి. లేదంటే లాభం కంటే నష్టమే ఎక్కువ.

## లాభాలేంటి?!

జేబు నుంచి తీసి డబ్బు ఖర్చు పెట్టి, కొనుగోలు చేయాల్సిన అవసరం లేకుండా.. కార్డుతో కొంటే, దాదాపు 45-60 రోజుల వరకూ వ్యవధి దొరుకుతుంది. దీనివల్ల మీపై అప్పటికప్పుడు ఆర్థిక భారం ఉండదు. ఇలా వ్యవధి దొరకడం వల్ల మీ బడ్జెట్‌ను కాస్త సర్దుబాటు చేసుకునేందుకు వీలవుతుంది. మీ దగ్గర ఉన్న మొత్తం కన్నా అధికంగా ఖర్చు చేయాల్సిన పరిస్థితుల్లో ఇది ఎంతో అనుకూలంగా ఉంటుంది.

ప్రయోజనాల మాటున కొన్నిసార్లు ఇబ్బందులూ ఉంటాయి. కచ్చితంగా వాటిపై అవగాహన ఉండాలి.

## వినియోగించే ముందు

ఏదో ఒక క్రెడిట్ కార్డు అని తీసుకోవడం ఎప్పుడూ సరికాదు. ఎక్కడ ఏ కార్డును వాడుతున్నామన్నదీ ముఖ్యమే. మీరు తరచూ ఎక్కడ కార్డు వాడుతున్నారన్నది ముందుగా అవగాహన ఉండాలి. మీ ఖర్చులకు తగ్గట్టుగా.. ఏ కార్డు రాయితీలు, నగదు వెనక్కి వంటి ప్రయోజనాలు అందిస్తుందో తెలుసుకోవాలి. ప్రయాణాలు ఎక్కువగా చేసేవారు, హోటళ్లు, రెస్టారెంట్లలో రాయితీలను ఇచ్చే కార్డులను తీసుకోవడం కలిసొస్తుంది. ఎక్కువగా కొనుగోళ్లు చేసేవారు డిస్కౌంట్లను అందించే కార్డులను తీసుకోవాలి.

## కార్డు పరిమితి

సాధారణంగా ఎంత మేరకు ఖర్చు చేస్తారో.. ఆ మేరకే కార్డు ఉండేలా చూసుకోవాలి. అవసరం లేకున్నా.. అధిక పరిమితి ఉన్న కార్డును తీసుకోవడం వల్ల ఏదైనా మోసపూరిత లావాదేవీలు జరిగినప్పుడు ఎక్కువ మొత్తంలో నష్టపోవాల్సి రావచ్చు. అంతేకాకుండా.. అధిక పరిమితి ఉంటే.. అనవసరంగా ఎక్కువ ఖర్చు చేసే ప్రమాదమూ ఉంది. అర్హత ఉంటే.. అవసరాన్ని బట్టి, పరిమితిని పెంచుకునే వెసులుబాటు ఎప్పుడూ ఉంటుంది.

## రాయతీలు, బీమాలు

క్రెడిట్ కార్డు కంపెనీలు కొన్ని హోటళ్లు, కారు అద్దెకు ఇచ్చే సంస్థలు, షాపింగ్ మాళ్లల్లో కొన్ని ప్రత్యేక ఒప్పందాలు కుదుర్చుకుంటాయి. ఇక్కడ మీరు కార్డును వాడినప్పుడు రాయితీల ప్రయోజనాలను పొందేందుకు అవకాశం ఉంటుంది. కొన్నిసార్లు ఈ రాయితీల వల్ల పెద్ద మొత్తంలో మిగిలే అవకాశం ఉంది. కాబట్టి, మీరు వాడుతున్న కార్డు ఏయే సంస్థలతో ఒప్పందం కుదుర్చుకుందో ఒకసారి తెలుసుకోండి. ప్రస్తుతం చాలా క్రెడిట్ కార్డులు తమ ఖాతాదారులకు రకరకాల బీమా పాలసీల సౌకర్యాన్ని కల్పిస్తున్నాయి. ముఖ్యంగా ప్రయాణ బీమా పాలసీలను అందిస్తున్నాయి. మీరు ఎక్కడికైనా ప్రయాణిస్తున్నప్పుడు... ముందుగానే క్రెడిట్ కార్డు సంస్థను ఆ విషయాలు అడిగి తెలుసుకోవాలి.

## నగదు, రివార్డు పాయింట్లు

క్రెడిట్‌కార్డు ద్వారా ఏదైనా ఖరీదైన వస్తువు కొనుగోలు చేసినప్పుడు ఆయా కంపెనీలు రాయతీలు ప్రకటిస్తుంటుంది. అసలు ఖరీదులో 5, 10 శాతం నగదును తిరిగి మన అకౌంట్‌కు బదిలీ చేస్తుంది. ఇలా



నగదు వెనక్కి రావడం అంటే.. ఆ మేరకు మీ ఖర్చు తగ్గినట్లే కదా! సాధారణ పద్ధతిలో కొనుగోలు చేసినప్పుడు ఎలాంటి రాయితీలు, డిస్కౌంట్లు ఉండకపోవచ్చు. కానీ, కార్డు ద్వారా కొన్నప్పుడు మీకు వచ్చే నగదు వెనక్కి, రాయితీల్లాంటివి లాభంగానే చెప్పుకోవచ్చు.

మనం కొనుగోలు చేసిన మొత్తాన్ని బట్టి, క్రెడిట్‌కార్డు కొన్ని రివార్డు పాయింట్లను కేటాయిస్తుంది. కార్డు వాడిన ప్రతిసారీ ఎన్నో కొన్ని రివార్డు పాయింట్లు ఖాతాలో జమవుతాయి. ఇవి నిర్ణీత సంఖ్యకు చేరిన తర్వాత నగదుగా మార్చుకోవచ్చు. లేదా ఏదైనా వస్తువులు కొనుగోలు చేయవచ్చు. కార్డును ఉపయోగిస్తున్నందుకు ఏదైనా ఫీజులు చెల్లించాల్సి వచ్చినప్పుడు ఈ రివార్డు పాయింట్లను అందుకు ఉపయోగించుకొని, మనపై భారం లేకుండా చూసుకోవచ్చు.

అంతేకాకుండా, ఖర్చులకు క్రెడిట్ కార్డునే వాడటం వల్ల బడ్జెట్‌ను సులభంగా ప్రణాళిక వేసుకునేందుకు వీలవుతుంది. బిల్లును చూడగానే నెలకు ఎంత ఖర్చు చేశామన్నది సులభంగా తెలుస్తుంది. ఇందులో అనవసర ఖర్చులు అనుకున్నవి, వచ్చే నెలలో తగ్గించుకునేందుకు ప్రయత్నించవచ్చు. ఇలా ఖర్చులను నియంత్రించుకునే దిశగా అడుగులు వేయవచ్చు.

## వడ్డీరేటు ఇలా!

సాధారణంగా వ్యక్తిగత రుణాలతో పోలిస్తే.. క్రెడిట్ కార్డులు అందించే రుణాలపై 2-3 శాతం అధిక వడ్డీ ఉంటుంది. కొన్నిసార్లు కొత్తగా కార్డు తీసుకున్న వారికి తక్కువ వడ్డీకే రుణాన్ని అందించవచ్చు. లేదా కొన్నాళ్లపాటు 'సున్నా' శాతం వడ్డీకే అప్పు ఇవ్వవచ్చు. ఇలాంటివేమైనా అవకాశాలున్నాయేమో గమనించాలి. వీటిని వాడుకొని, 'సున్నా' వడ్డీ వ్యవధిలోపు అప్పు తీర్చేందుకు ప్రయత్నించాలి. అధిక వడ్డీ ఉన్న వాటిని వీలైనంత తొందరగా వదిలించుకోవాలి. తక్కువ వడ్డీకి వచ్చే రుణాలతో అధిక వడ్డీ అప్పులను తీర్చేయాలి. ఏ నెలా వాయిదాలు చెల్లించకుండా ఉండకూడదు. ఇది మన చెల్లింపుల చరిత్రనూ, క్రెడిట్ స్కోరునూ ప్రభావితం చేస్తుంది.

**- చైతన్య**

---

**హలో.. మేము మీ బ్యాంకు నుంచి మాట్లాడుతున్నాం... మీ కార్డు నెంబరు.. చివరి నాలుగు అంకెలు ఇవే కదా..?! మీ ఖాతాలోని చివరి మూడు సంఖ్యలు చెబుతాం.. సరిచూసుకోండి.. అంటూ.. ఫోన్లు ఇటీవల కాలంలో చాలామందికి వస్తున్నాయి. వీటికి స్పందిస్తే.. మీ కార్డు/ ఖాతా నుంచి డబ్బు మాయమైనట్లే..**

# బ్యాంకు ఫోనా? జాగ్రత్త!

నిజానికి ఏ బ్యాంకూ తన ఖాతాదారులకు ఎట్టి పరిస్థితుల్లోనూ ఫోన్ చేయదు. మెయిల్ పంపదు. ఈ విషయాన్ని బ్యాంకు పలుసార్లు ఎస్ఎంఎస్‌ల రూపంలోనూ, మెయిళ్ల రూపంలోనూ చెబుతూనే ఉంటుంది. కానీ, చాలామంది బ్యాంకు ఇచ్చే ఈ సూచనలను పట్టించుకోవడం లేదు. ఎవరైనా ఫోన్ చేసి, మీ వివరాలు అప్‌డేట్ చేస్తున్నాం.. లేకపోతే మీ కార్డు/ఖాతా నిలిచిపోతుంది అని చెప్పగానే.. వారు అడిగిన వివరాలన్నీ పూసగుచ్చినట్లు చెప్పేస్తుంటారు. ఇది ఏమాత్రం మంచిదికాదని ప్రతి ఒక్కరూ గుర్తుంచుకోవాలి.

బ్యాంకులు తమ ఖాతాదార్ల లావాదేవీల రక్షణకు ఎప్పటికప్పుడు పలు జాగ్రత్తలు తీసుకుంటుంటాయి. ఎవరైనా ఖాతాదారుడికి అనుమానిత మెయిళ్లు,




ఫోన్‌లు వెళ్లినట్లు సందేహం వస్తే.. ఆయా ఖాతాదారుల డెబిట్ / క్రెడిట్ కార్డులను బ్లాక్ చేసి, బ్యాంకు శాఖను సంప్రదించి, కొత్త కార్డులు తీసుకోవాల్సిందిగా సమాచారాన్ని పంపిస్తున్నాయి. ఇది కేవలం ఖాతాదారులు మోసపోకుండా కాపాడేందుకే అని బ్యాంకులు చెబుతున్నాయి. అయితే, కొన్నిసార్లు ఇలా అకస్మాత్తుగా కార్డులను బ్లాక్ చేయడం వల్ల ఖాతాదారులు ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. ఇలాంటప్పుడు వీలైనంత తొందరగా బ్యాంకు శాఖను సంప్రదించి కొత్తకార్డు తీసుకోవడం మినహా ప్రత్యామ్నాయం లేదు.



**ఇలా చేయాలి**

డెబిట్/క్రెడిట్ కార్డుకు సంబంధించిన వివరాలు ఎట్టి పరిస్థితుల్లోనూ బహిర్గతం చేయకూడదు. కార్డు నెంబర్లు, సీవీవీ, కాలపరిమితి ఎప్పుడు ముగుస్తుంది? వ్యక్తిగత రహస్య సంఖ్య (పిన్)ను ఎవరికీ చెప్పొద్దు. మీ మొబైల్‌కు వచ్చిన వన్‌టైమ్ పాస్‌వర్డ్ (ఓటీపీ) విషయంలో మరింత జాగ్రత్తగా ఉండాలి. ఆన్‌లైన్ షాపింగ్‌లో బిల్లు చెల్లించేటప్పుడు ఈ విషయాలే కీలకం. కాబట్టి, ఎవరైనా ఫోన్ చేసి ఈ వివరాలు అడిగితే వెంటనే ఫోన్ పెట్టేయడమే శ్రేయస్కరం. కార్డు పోయినట్లు గుర్తిస్తే ఆలస్యం చేయకండి. బ్యాంకును సంప్రదించి, వెంటనే కార్డును బ్లాక్ చేయాలి. ★

---

## 'రూపాయి'కి మీరూ రాయండి!

బ్యాంకు, పోస్టాఫీసు, షేర్ మార్కెట్, మ్యూచువల్ ఫండ్స్, ఎల్ఐసీ, ఇతర బీమాపథకాలు, ఇన్‌కంటాక్స్ వంటి ఆర్థిక విషయాలపై మీరూ మీ అనుభవాలను 'రూపాయి' ఫీచర్‌కి పంపండి. సంబంధిత విషయాలపై సలహా, సూచనల్ని తెలియజేయండి. ఏవైనా సందేహాలు ఉంటే రాయండి.



**మా చిరునామా**

రూపాయి, జీవన, ప్రజాశక్తి తెలుగు దినపత్రిక,
హౌస్ నెం : 27-30-4, ఆకులవారి వీధి, గవర్నర్ పేట, విజయవాడ-2.
ఇ మెయిల్ - jeevanapageps@gmail.com
ఫోన్ నెం. 9490099006

---

## జత చేయండి




పిల్లలూ..! పక్కనున్న బొమ్మలో అంకెలున్నాయి కదా..! వాటితోపాటు బొమ్మలు కూడా ఉన్నాయి. మీరు ఆ బొమ్మల్ని కూడి, పక్కనున్న అంకెలతో జత చేయండి.!

## పొడుపు కథ

నల్లని నాగి, తెల్లని తిమ్మ, పచ్చని పాడి. బావ నోట్లో వసంతం.

## జోక్ :

తండ్రి : ఏరా పరీక్ష ఎలా రాశావు?
కొడుకు : బాగా రాశాను నాన్నా..!
తండ్రి : ఏంట్రా నీ కాన్ఫిడెన్స్..?
కొడుకు : వందకు వంద వస్తాయని చెప్పాగా..! ఇంకా నామీద డౌటా..!?
తండ్రి : నేను నమ్మను" కొడుకు : నువ్వు నమ్మవనే తెలుసు. అందుకే ఆన్సర్ షీట్ తీసుకొచ్చా.




# కోటి డిగ్రీల సూరీడు



సూర్యుని దగ్గర పదార్థం ఘన, ద్రవ, వాయు రూపాలలోనే కాకుండా "ప్లాస్మా" అనే నాలుగో రూపంలోకి మారిపోతుంది. ఇక్కడ పదార్థ సాంద్రత నీటి సాంద్రతకు వందరెట్లు అధికం. ఈ సూర్య కేంద్రానికి పైనవున్న పొరలు, వాయువులు సలసల కాగుతుంటాయి. ఇక్కడ పరమాణువుల్లో ఎలక్ట్రానులు, ప్రోటానులు, న్యూట్రానులు ఇంకా ఇతర భాగాలు ఒక పొందికలో అమరి ఉంటాయి. కాని 'ప్లాస్మా'లో అవన్నీ కలిసిపోయి ఏకసదృశంగా తయారవుతాయి. ఇలాంటి ప్లాస్మానుండి ఒక్కోసారి కేవలం 'ప్రోటానులు' ప్రవాహసదృశంగా పైకి వస్తుంటాయి. సూర్యుని పైభాగాన మనకు ప్రకాశవంతంగా కనిపించే పొరను 'ఫోటో స్ఫియర్' అంటారు. దాని పై పొర ఎర్రని రంగులో ఉండడం వల్ల దాన్ని 'క్రోమో స్ఫియర్' అంటారు. ఈ రెండు పొరలపై భాగాన కాంతిశిఖ ఉంటుంది. సూర్యగ్రహణ సమయంలో మాత్రమే ఈ శిఖ స్పష్టంగా కనిపిస్తుంది. దాన్ని 'కరోనా' అంటారు. ఒక విచిత్రమేమిటంటే, సూర్యుని కేంద్రంలో కోటిన్నర డిగ్రీల వేడి వుంటుంది. ఉపతలం మీద సుమారు 6000 డిగ్రీలకు తగ్గుతుంది. కాని ఇంకా బాహ్య పొరలకు వచ్చేసరికి ఉష్ణోగ్రత పెరుగుతుంది. ఫోటోస్ఫియర్‌లో 11000 డిగ్రీలు, క్రోమో స్ఫియర్‌లో 18000 డిగ్రీలు, కరోనాలో 27,00,000 డిగ్రీల



ఉష్ణోగ్రత ఉంటుంది. మనం భూమిమీద ఉష్ణోగ్రత 44 డిగ్రీల సెంటిగ్రేడుకు మించి పెరిగితే ఉష్ణతాపం భరించలేము. భూమిపై ఉష్ణోగ్రతను సూర్యునిలోని ఉష్ణోగ్రతలతో పోల్చి ఆలోచించండి ఎంత వేడి కదా! ★

---

## అంకుల్‌తో సెల్ఫీ



నా పేరు లత. నేను ఐదవ తరగతి చదువుతున్నా. మా అమ్మవాళ్లతో కలిసి శుక్రవారం షాపింగ్‌కు వెళ్లా. షాపు బయట జోకర్‌లా ఉండే పెద్ద బొమ్మ ఉంది. అది పాప ఇటురా అని పిలుస్తుంది. నేను బొమ్మ దగ్గరకు వెళ్లా. నేను దానిని తదేకంగా చూస్తున్నా. అప్పుడు అమ్మ.. ఇక్కడే ఆడుకుంటుండు నీకు డ్రస్ కొనితెస్తాం అంటూ.. షాపులోకి వెళ్లింది. భలే ఉంది ఈ బొమ్మ అంటూ నేను అలానే నిలబడిపోయా. ఆ బొమ్మ నేనెలా చేస్తే అలానే చేస్తోంది. అప్పుడు నాకు గమ్మత్తుగా అనిపించింది. అక్కడే చాలాసేపు బొమ్మతో ఆడుకుంటున్నా. కొంచెంసేపు తర్వాత అక్కడకు వచ్చిన అమ్మ నాకు చెప్పింది. ఇది బొమ్మ కాదురా! దీనిలోపల ఒక మనిషి ఉన్నాడని. కానీ నేను చాలాసేపు నమ్మలేదు. తర్వాత బొమ్మలో నుంచి మాటలు వినిపించాయి. నిజమే తల్లి నేను మనిషినే అని. అప్పుడుగానీ నేను నమ్మలేదు. బొమ్మలోపల ఒక అంకుల్ ఉన్నాడని, బొమ్మలా నటిస్తున్నాడని తెలిసి చాలా జాలేసింది. పాపం రోజంతా నిలబడే ఉండాలి. అక్కడికి వచ్చివెళ్లే పిల్లలను ఆడిస్తుండాలి. అంకుల్‌తో నేను సెల్ఫీ తీసుకున్నా. ఆ సెల్ఫీ నా ఫ్రెండ్స్ అందరికి చూపా. తర్వాత అమ్మ నాకు మంచి డ్రస్ కొనిచ్చింది. నేను సంతోషంగా ఇంటికి బయల్దేరా. స్కూల్‌కెళ్లిన తర్వాత అందరికీ బొమ్మ అంకుల్‌తో తీయించుకున్న సెల్ఫీ చూపా. అందరూ భలే ఉంది అన్నారు. నాకు చాలా సంతోషం అనిపించింది.

## పిల్లల్లారా.. రారండి!!



హాయ్ పిల్లలూ!
మీలో చాలా టాలెంట్ ఉంది కదూ! మీకు పాటలొచ్చు. బొమ్మలొచ్చు, బోల్డన్ని ఆటలొచ్చు. మేజిక్కులొచ్చు. అలాగే కథలూ రాస్తారు కదూ?!. మాకెలా తెలుసంటారా? అసలు పిల్లలంటేనే.. క్రియేటివ్ కిడ్స్‌కదా?! చక్కగా చదువుకుంటూనే ఆటలు, పాటలతో మీరంతా అదరగొట్టేస్తారని మాకు తెలుసు. అందుకే మీరు వేసిన బొమ్మలు, కార్టూన్లు, రాసిన బుల్లిబుల్లికథలు వేసిన నాటకాలు ఇంకా మీరు కనిపెట్టిన సైన్స్ సంగతులు, మీరు చూసొచ్చిన కొత్త ప్రదేశాలగురించి చిన్నారి పేజీలో పంచుకోండి. వాటిని మీపేరుతో, మీ ఫొటోతో ప్రచురిస్తాం. నిజమా?! అని ఆశ్చర్యంపోకండి. నిజమే. అందుకే మీలోదాగి ఉన్న ఏ టాలెంట్ గురించి అయినా మాకు రాసి పంపండి. ఇంకెందుకు ఆలస్యం...
పెన్ను, పెన్సిల్, బ్రష్‌తో రెడీ అయిపోండి.

**చిరునామా**

చిన్నారి, జీవన, ప్రజాశక్తి తెలుగు దినపత్రిక,
హౌస్ నెం : 27-30-4, ఆకులవారి వీధి, గవర్నర్ పేట, విజయవాడ-2.
ఇ మెయిల్ - jeevanapageps@gmail.com



- 536/7 వద్ద తొలి ఇన్నింగ్స్ డిక్లేర్
- శ్రీలంక మొదటి ఇన్నింగ్స్ 131/3
- అర్థ సెంచరీతో అదుకున్న మాథ్యూస్
- అత్యధిక టెస్టు ద్విశతకాలు చేసిన కెప్టెన్‌గా ప్రపంచ రికార్డు

## టెస్టు డబుల్ సెంచరీల్లో

# కోహ్లి సిక్సర్

**ఢిల్లీ :** విరాట్ కోహ్లి మరోసారి డబుల్ సెంచరీతో కదంతొక్కడంతో శ్రీలంకతో జరుగుతున్న మూడో టెస్టులో భారత్ తొలి ఇన్నింగ్స్‌లో భారీ స్కోరు సాధించింది. తొలి ఇన్నింగ్స్‌ను ఏడు వికెట్ల నష్టానికి 536 పరుగుల వద్ద డిక్లేర్ చేసింది. కోహ్లి 243 పరుగులు చేసి ఏడో వికెట్‌గా అవుటయ్యాడు. కోహ్లి కెరీర్‌లో ఇది 6వ టెస్టు ద్విశతకం. భారత జట్టు ఇన్నింగ్స్ డిక్లేర్ అనంతరం శ్రీలంక జట్టు బ్యాటింగ్‌కు దిగి రెండోరోజు ఆట నిలిపివేసే సమయానికి మూడు వికెట్ల నష్టానికి 131 పరుగులు చేసింది. మాథ్యూస్ (57) పరుగులతోనూ, చండీమాల్ (25) పరుగులతోనూ నాటౌట్‌గా వున్నారు.

ఆదివారం ఉదయం రెండు వికెట్ల నష్టానికి 376 పరుగుల ఓవర్‌నైట్ స్కోరుతో భారత జట్టు తన మొదటి ఇన్నింగ్స్‌ను కొనసాగించింది. కోహ్లి 156 పరుగుల వ్యక్తిగత స్కోర్‌తో, రోహిత్ శర్మ 6 పరుగులతో ఆటను ప్రారంభించారు. వీరిద్దరూ లంచ్ విరామం వరకు మరో వికెట్ పడకుండా జాగ్రత్తగా ఆడుతూ భారతజట్టు భారీ స్కోర్ సాధించేందుకు తోడ్పడ్డారు. అయితే జట్టు స్కోరు 500 వద్ద రోహిత్ ఐదో వికెట్‌గా అవుటయ్యాడు. 102 బంతులు ఆడిన రోహిత్ రెండు సిక్స్‌లు, ఏడు ఫోర్లతో 65 పరుగులు చేశాడు. ఈ టెస్టులో కోహ్లి మరో డబుల్ సెంచరీ సాధించాడు. . రెండో రోజు ఆటలో సురంగ లక్మల్ వేసిన ఇన్నింగ్స్ 107.6వ బంతికి రెండు పరుగులు తీసి కెరీర్‌లో ఆటగాడిగా, కెప్టెన్‌గా ఆరో ద్విశతకం పూర్తి చేసుకున్నాడు. ఈ డబుల్ సెంచరీతో కలిపి టెస్టుల్లో మొత్తం ఆరు డబుల్ సెంచరీలు కోహ్లి సాధించినట్లయ్యింది. సొంత మైదానంలో కోహ్లి మరింత దూకుడు ఆడుతూ త్రిశతకం దిశగా దూసుకెళ్తున్న కోహ్లిని సందకన్ వేసిన 125.3వ బంతికి ఎల్బీగా అవుట్ చేశాడు. ఈ సిరీస్‌లో రెండో టెస్ట్‌లోనూ కోహ్లి డబుల్ సెంచరీ సాధించిన విషయం తెలిసిందే. కోహ్లి డబుల్ సెంచరీ సాధించడంతోపాటు మరికొన్ని రికార్డులను తన ఖాతాలో వేసుకున్నాడు.

కాలుష్యం కారణంగా లంక క్రీడాకారులు ఇబ్బంది పడుతూ ఆటకు అంతరాయం కలిగిస్తున్న క్రమంలో కోహ్లి మొదటి ఇన్నింగ్స్‌ను డిక్లేర్ చేశాడు. ఆ సమయానికి భారత జట్టు ఏడు వికెట్ల నష్టానికి 536 పరుగులు చేసింది. ఇన్నింగ్స్ డిక్లేర్ చేసే సమయానికి వికెట్ కీపర్ వద్ధిమాన్ సాహా (9), రవిచంద్రన్ అశ్విన్ (5) పరుగులతోనూ బ్యాటింగ్ చేస్తున్నారు.

భారత జట్టు మొదటి ఇన్నింగ్స్ డిక్లేర్ అనంతరం శ్రీలంక బ్యాటింగ్‌కు దిగింది. ఇన్నింగ్స్ తొలి బంతికే మహ్మద్ షమి శ్రీలంక ఓపెనర్ దిముతు కరుణరత్నె (0)ను డకౌట్ చేశాడు. రెండో వికెట్ లంక స్కోరు 14 వద్ద ధనంజయ డిసిల్వ (1)ను ఇషాంత్ ఎల్బీ రూపంలో అవుట్ చేశాడు. దీంతో శ్రీలంక జట్టు కేవలం 14 పరుగులకే రెండు వికెట్లను కోల్పోయి కష్టాల్లో పడింది. ఈ క్రమంలో పెరీరాకు మాథ్యూస్ తోడై మరో వికెట్ పడకుండా జాగ్రత్త పడ్డారు. వీరిద్దరూ భారత బౌలర్లను సమర్థవంతంగా ఎదుర్కొంటూ లంక స్కోర్‌ను ముందుకు తీసుకెళ్లారు. అర్థశతకానికి దగ్గర్లో వున్న పెరీరా (42)ను 18.4వ బంతికి రవీంద్ర జడేజా ఎల్బీగా అవుట్ చేశాడు. అప్పటికి లంక స్కోరు మూడు వికెట్ల నష్టానికి 75 పరుగులు మాత్రమే. ఈ తరువాత ఫీల్డర్ల మిస్ క్యాస్‌ల కారణంగా నిలదొక్కుకున్న మాథ్యూస్, చండీమాల్ సహాయంతో జట్టు స్కోర్‌ను 100 పరుగులకు దాటించాడు. వీరిద్దరూ రెండోరోజు ఆట ముగిసే సమయానికి మరో వికెట్ పడకుండా జాగ్రత్తగా ఆడి రెండో రోజు ఆట నిలిచిపోయే సమయానికి మాథ్యూస్ (57) పరుగులతోనూ, చండీమాల్ (25) పరుగులతోనూ నాటౌట్‌గా నిలిచారు.

### కోహ్లి ఖాతాలో కొత్త రికార్డులు ...

- అత్యధిక టెస్టు ద్విశతకాలు (6) చేసిన కెప్టెన్‌గా కోహ్లి సరికొత్త రికార్డు నెలకొల్పాడు. ఇంతకుముందు జట్టు సారథిగా వెస్టిండీస్‌కు చెందిన బ్రయాన్ లారా (5) ద్విశతకాలు చేసిన కోహ్లి తుడిచిపెట్టాడు.
- కోహ్లికి చేసిన 243 పరుగులు టెస్టుల్లో అత్యధిక వ్యక్తిగత పరుగులు. ఇప్పటి వరకూ కోహ్లి అత్యధిక వ్యక్తిగత పరుగులు 235 మాత్రమే.
- భారత్ తరపున ఇప్పటివరకు సచిన్ టెండూల్కర్ (6), వీరేందర్ సెహ్వాగ్ (6)లు మాత్రమే అత్యధిక టెస్టు ద్విశతకాలు చేశారు. తాజాగా వీరి సరసన కోహ్లి చేరాడు.
- అలాగే వరుసగా రెండు టెస్టుల్లోనూ ద్విశతకాలు చేసిన రెండో భారత క్రికెటర్‌గా కోహ్లి నిలిచాడు. 1993లో వినోద్ కాంబ్లీ కూడా వరసగా రెండు టెస్టుల్లోనూ ద్విశకతాలు చేసాడు.
- అత్యధిక టెస్టు ద్విశతకాల జబితాలో కోహ్లి ఆరోస్థానంలో వున్నాడు. బ్రాడ్‌మాన్ 12 ద్విశతకాలతో ఈ జాబితాలో మొదటిస్థానంలో వున్నాడు.



ఓవరాల్ ఛాంపియన్ ట్రోఫీ జట్టుతో బంగ్లాదేశ్ జట్టు సభ్యులు

## స్పెషల్ టోర్నీ విజేత బంగ్లాదేశ్

- ద్వితీయ స్థానంలో భారత్
- ముగిసిన ఆసియా కప్ ఒలంపిక్స్

**ప్రజాశక్తి-అనంతపురం స్పోర్ట్స్**

డిఫెండింగ్ ఛాంపియన్ బంగ్లాదేశ్ మరోసారి స్పెషల్ ఒలంపిక్ టోర్నీ విజేతగా నిలిచింది. ఆదివారం అనంతపురం క్రీడా గ్రామంలోని ఆర్‌డిటి క్రికెట్ మైదానంలో జరిగిన లీగ్ మ్యాచుల్లో భారత జట్టు శ్రీలంక జట్టుపై విజయం సాధించి ద్వితీయ స్థానంలో నిలిచింది. అనంతపురం రూరల్ రూరల్ డెవలప్‌మెంట్ ట్రస్టు (ఆర్‌డిటి) క్రీడా మైదానం కేంద్రంగా రెండ్రోజుల పాటు జరిగిన స్పెషల్ ఒలంపిక్స్ ఆసియా కప్ ఆదివారం ముగిసింది. సన్నాహక పోరులో ఆర్‌డిటి జట్టుపై బంగ్లాదేశ్ జట్టు విజయం సాధించి టోర్నీలో బంగ్లాదేశ్ ఎదురులేని జట్టుగా నిలిచి ఓవరాల్ ఛాంపియన్‌గా నిలిచింది. ఆదివారం జరిగిన తొలి మ్యాచ్‌లో భారత్, శ్రీలంక జట్లు తలపడ్డాయి. టాస్ గెలిచిన శ్రీలంక జట్టు ఫీల్డింగ్ ఎంచుకుంది. బ్యాటింగ్‌కు దిగిన భారత్ జట్టు నిర్ణీత 20 ఓవర్లలో 199 పరుగులు చేసి 3 వికెట్లు కోల్పోయింది. జట్టులో అనంతపురానికి చెందిన రాజు కుళ్లాయప్ప చెలరేగి 18 బంతుల్లో 2 సిక్సర్లు, 6 బౌండరీలతో 42 పరుగులు చేశాడు. మిగిలిన బ్యాట్స్‌మెన్లలో సురేష్ 34, జాక్సన్ 23 పరుగులు చేశారు. శ్రీలంక జట్టు నిర్ణీత 20 ఓవర్లలో 103 పరుగులకే పరిమితమైంది. ఆ జట్టులో నేతిన 25 పరుగులు చేసి టాప్ స్కోరర్‌గా నిలిచారు. భారత జట్టు బౌలర్లలో సురేష్ 3 వికెట్లు, టోనీ థామస్, హరీష్ ఠాకూర్, బుపేందర్ సింగ్, ప్రవత్ బరాల్ తలో 2 వికెట్లు తీశారు.

**మరో మ్యాచ్ గెలిచిన బంగ్లా**

మధ్యాహ్నం జరిగిన సన్నాహక మ్యాచ్‌లో బంగ్లా జట్టు, ఆర్‌డిటి జట్లు తలపడ్డాయి. టాస్ గెలిచిన ఆర్‌డిటి జట్టు ఫీల్డింగ్ ఎంచుకుంది. బ్యాటింగ్ దిగిన బంగ్లాదేశ్ జట్టు నిర్ణీత 15 ఓవర్లులో ఒక వికెట్ కోల్పోయి 113 పరుగులు చేసింది. అనంతరం ఆర్డీటీ జట్టు 15 ఓవర్లులో 132 పరుగులు చేసి 9 వికెట్లు కోల్పోయింది. జట్టులో రాజు కుళ్లాయప్ప ఆరు సిక్సర్లు, రెండు ఫోర్లతో ఒంటరి పోరు చేసి 44 పరుగులు సాధించాడు. బంగ్లాదేశ్ బౌలర్లలో షమీమ్ పట్వారి, సోహన్ అలాం, హసీమ్ షేక్ లు చెరో 2 వికెట్లు తీశారు.

## 'అర్జున' అందుకోవాలి



**న్యూఢిల్లీ :** అర్జున అవార్డును అందుకుని తన చిరకాల స్వప్నాన్ని సాకారం చేసుకోవాలని వుందని వెయిట్ లిఫ్టర్ మీరాబాయి చాను తెలిపింది. 'అర్జున అవార్డుకు చాలా గర్వంగా దరఖాస్తు చేస్తాను. మంత్రిత్వ శాఖ నా దరఖాస్తును తిరస్కరించడానికి నాకు ఏ కారణం కనిపించడంలేదు' అని మీరా పేర్కొంది. ఇటీవల అమెరికాలో ప్రపంచ వెయిట్ లిఫ్టింగ్ చాంపియన్‌షిప్‌లో 48 కేజీల విభాగంలో మీరా స్వర్ణం సాధించింది. 22 ఏళ్ల భారత నిరీక్షణకు తెరదించింది. అంతకు ముందు 1994, 1995ల్లో భారత్ నుంచి కరణం మల్లీశ్వరి స్వర్ణం సాధించింది. మల్లీశ్వరి తరువాత ప్రపంచ చాంపియన్‌షిప్‌లో స్వర్ణం సాధించిన రెండో భారతీయురాలిగా మీరాబాయి రికార్డుల్లో నిలిచింది. ఈ చాంపియన్‌షిప్ ఫైనల్లో మొత్తం 194 కేజీల బరువు మోసి మీరా నూతన జాతీయ రికార్డు కూడా నెలకొల్పొంది.

'2015 కామెన్వెల్త్ గేమ్స్‌లో రజతం సాధించినా నాకు అవార్డు దక్కలేదు. ఈ ఏడాది ప్రపంచ చాంపియన్‌షిప్‌లో స్వర్ణం సాధించడంతో నాకు ఖచ్చితంగా అవార్డు వస్తుందని భావిస్తున్నాను' అని మీరా తెలిపింది. అర్జునఅవార్డు గ్రహీత మీరాబాయి చానును చూడాలని నా గ్రామం అతృతగా ఎదురుచూస్తోందని అని ఆమె తెలిపింది.

## అండర్-19 కెప్టెన్‌గా పృథ్వీషా

**న్యూఢిల్లీ :**అండర్-19 క్రికెట్ ప్రపంచకప్ 2018లో పాల్గొనే భారత జట్టు కెప్టెన్‌గా పృథ్వీ షా ఎంపికయ్యాడు. న్యూజిలాండ్‌లో జరిగే ఈ కప్ కోసం భారత క్రికెట్ కంట్రోల్ బోర్డు (బిసిసిఐ) 15 మందితో జట్టును ఆదివారం ప్రకటించింది. ఇటీవల కాలంలో బ్యాటింగ్‌లో అద్భుత ప్రదర్శన చేస్తున్న పృథ్వీషాను కెప్టెన్‌గా ఎంపిక చేశారు. వచ్చే ఏడాది జనవరి 13 నుంచి ఫిబ్రవరి 3 వరకు జరిగే ఈ టోర్నీలో మొత్తంగా 16 జట్లు పాల్గొననున్నాయి. భారత్ తన తొలి మ్యాచ్‌లో జనవరి 14న ఆస్ట్రేలియాతో తలపడుతుంది. ఈ నెల 8 నుంచి 22 వరకూ బెంగళూరులో జరిగే శిక్షణ శిబిరంలో భారత జట్టు పాల్గొంటుంది. ముంబయి జట్టు తరపున రంజీ ట్రోఫీలో పాల్గొంటున్న షాకు, బెంగాల్ తరపున ఆడుతున్న ఇషాన్ పోరెల్‌కు ఈ నెల 12 నుంచి శిబరంలో పాల్గొనేందుకు బిసిసిఐ అనుమతి ఇచ్చింది.

అండర్-19 కప్‌ను భారత్ ఇప్పటి వరకూ మూడు సార్లు గెలుచుకుంది. రెండేళ్ల క్రితం బంగ్లాదేశ్‌లో జరిగిన టోర్నిలో భారత్ రన్నరప్‌గా నిలిచింది. 2000, 2008, 2012 ప్రపంచకప్‌ల్లో విజేతగా నిలిచింది.

ఎంపిక చేసిన భారత్ అండర్-19 జట్టు : పృథ్వీషా (కెప్టెన్), శుబ్మన్ గిల్ (వైస్ కెప్టెన్), మాన్‌జోత్ కర్లా, హిమంషు రానా, అభిషేక్ శర్మ, రియాన్ పరాగ్, అర్యాన్ జుయల్ (వికెట్ కీపర్), హర్విక్ దేశాయి (వికెట్ కీపర్), శివం మావి, కమలేష్ నాగర్కోటి, ఇషాన్ పోరెల్, అర్షదీప్ సింగ్, అనుకుల్ రాయ్, శివ సింగ్, పంకజ్ యాదవ్.

## 7 నుంచి రాష్ట్రస్థాయి హాకీ పోటీలు

- లోగో ఆవిష్కరించిన మంత్రి కొల్లు రవీంద్ర



**ప్రజాశక్తి - మచిలీపట్నం (కృష్ణాజిల్లా)**

కృష్ణాజిల్లా మచిలీపట్నంలోని ఆంధ్ర కళాశాలలో ఈ నెల 7 నుంచి 10వ తేదీ వరకు జరగనున్న మోట మర్రి హరిత మెమోరియల్ ఎపి 8వ సీనియర్ మహిళలు, 6వ సబ్ జూనియర్ బాలబాలికల రాష్ట్రస్థాయి హాకీ ఛాంపియన్‌షిప్ పోటీలు జరగనున్నాయి. ఈ మేరకు లోగోను మంత్రి కొల్లు రవీంద్ర ఆదివారం ఆవిష్కరించారు. అనంతరం ఆయన మాట్లాడుతూ.. మచిలీపట్నంలో తొలిసారిగా మహిళా హాకీ టోర్నమెంట్ నిర్వహించడం అభినందనీయమన్నారు. హాకీ కృష్ణాజిల్లా సంఘం ఇక్కడ టోర్నీ ఏర్పాటు చేయడం వల్ల మహిళల్లో హాకీ క్రీడ పట్ల ఆసక్తి పెరుగుతుందని తెలిపారు. రాష్ట్రంలోని 13 జిల్లాల నుంచి సీనియర్, జూనియర్ క్రీడాకారులు 350 మంది రానున్నారని తెలిపారు. ఎమ్మెల్సీ బచ్చుల అర్జునుడు మాట్లాడుతూ.. చదువుతోపాటు క్రీడలకు బందరు పట్టణం పూర్వకాలం నుంచి ప్రాచుర్యం పొందిందన్నారు. ఎంతోమంది క్రీడాకారులు ఇక్కడ నుంచి వచ్చారన్నారు. క్రికెట్ ప్రథమ కెప్టెన్ బందరు వాసేనని గుర్తుచేశారు. కార్యక్రమంలో మున్సిపల్ చైర్మన్ మోటమర్రి బాబాప్రసాద్, హాకీ అసోసియేషన్ కార్యదర్శి ఎస్.రామకృష్ణ, సంయుక్త కార్యదర్శులు ఎస్.యోగానంద్, డి.వాసు, కోచ్ శ్రవణం హరికృష్ణ పాల్గొన్నారు.

## కొనసాగుతున్న బ్యాడ్మింటన్ పోటీలు

**ప్రజాశక్తి-తెనాలి (గుంటూరు)**

గుంటూరు జిల్లా తెనాలిలో నిర్వహిస్తున్న జాతీయస్థాయి సబ్‌జూనియర్ బ్యాడ్మింటన్ పోటీలు హోరాహోరీగా సాగుతున్నాయి. రెండో రోజు పోటీల్లో భాగంగా సింగిల్స్ అండర్-13 బాలుర విభాగంలో 16, బాలికల విభాగంలో 16, డబుల్స్ అండర్-13 బాలుర విభాగంలో 22, సింగిల్స్ అండర్-15 బాలు విభాగంలో 32, సింగిల్స్ అండర్-15 బాలికల విభాగంలో 32 మ్యాచ్‌లు, డబుల్స్ అండర్-15 బాలుర విభాగంలో-17, బాలికల విభాగంలో 6 మ్యాచ్‌లు నిర్వహించారు. ఆదివారం క్రీడలను రాష్ట్ర సాంఘిక సంక్షేమ శాఖ మంత్రి ఆనందబాబు, అర్జున అవార్డు గ్రహీత జ్యోతి సురేఖ పరిశీలించారు. పోటీల్లో 28 రాష్ట్రాల నుండి 144 టీమ్‌లు పాల్గొనడం, తల్లిదండ్రులు సైతం వచ్చి వారిని ప్రోత్సహిస్తుండడం గొప్ప విషయమని మంత్రి పేర్కొన్నారు.

## మార్కాపురంలో అరుదైన శస్త్ర చికిత్స



**ప్రజాశక్తి-మార్కాపురం (ప్రకాశం)**

ప్రకాశం జిల్లా మార్కాపురం ప్రభుత్వ ఏరియా వైద్యశాలలో అరకొర సౌకర్యాలే ఉన్నా.. వైద్యులు, సిబ్బంది చాకచక్యంతో ఓ మహిళ ప్రాణాలు కాపాడారు. శస్త్ర చికిత్స నిర్వహించి కడుపులో ఉన్న కణితులను తొలగించడంతో ఆ మహిళ ప్రాణపాయం నుంచి బయటపడింది. మార్కాపురం మండలం బొడిచెర్లకు చెందిన 35 ఏళ్ల పద్మావతికి గర్భసంచిలో కణితులు ఉన్నాయి. ఆమె కడుపులో తరచూ నొప్పి వస్తుండటంతో వైద్యులను సంప్రదించింది. పరీక్షల అనంతరం ఆమె కడుపులో గర్భసంచికి కణుతులు పెరుగుతున్నట్లు వైద్యులు నిర్ధారించారు. మూడు కణితులు సుమారు 5 కిలోలకు పైగా ఉన్నట్లు తెలుసుకున్నారు. వీలైనంత త్వరగా తొలగించకపోతే ఆమె ప్రాణానికి ముప్పు తప్పదని వైద్యులు హెచ్చరించారు. పద్మావతి కుటుంబీకులు ఒంగోలు, గుంటూరులోని పెద్దాసుపత్రుల్లో చూపించారు. శస్త్ర చికిత్సకు లక్షల్లో ఖర్చవుతుందని తెలుసుకున్న ఆమె పేదరికంలో ఉండటంతో అంత వ్యయం భరించలేమని స్వగ్రామానికి తిరిగి వచ్చేశారు. శస్త్ర చికిత్సల్లో డాక్టర్ పగడాల లక్ష్మిరెడ్డి దిట్ట అని తెలుసుకుని వెంటనే ఆయన్ను సంప్రదించారు. బాధితురాలికి సంబంధించిన రిపోర్టులను డాక్టర్ పరిశీలించి, ఆమె ఆర్థిక పరిస్థితి తెలుసుకుని శస్త్ర చికిత్స చేస్తానని హామీ ఇచ్చారు. వెంటనే మార్కాపురం ప్రభుత్వ ఏరియా వైద్యశాలలో చేర్పించారు. ఆదివారం ఉదయం శస్త్ర చికిత్సను డాక్టర్ పగడాల లక్ష్మిరెడ్డి విజయవంతంగా పూర్తి చేశారు. ఈ చికిత్సలో మత్తు డాక్టర్ నారాయణ, మరో డాక్టర్ తులసి చైతన్యలతో పాటు వైద్యశాల సిబ్బంది సహాయడ్డారు. ప్రస్తుతం పద్మావతి ఆరోగ్యంగా ఉంది.

## కాపు రిజర్వేషన్ బిల్లు చెల్లదు

- నియంతలు ఎన్ని కమిషన్లు వేసినా ఫలితం శూన్యం
- మాజీ ఎంపి ఉండవల్లి అరుణ్ కుమార్

**ప్రజాశక్తి-అమరావతి బ్యూరో**

మంజునాథ కమిషన్ నివేదిక ఇవ్వకుండా ముగ్గురిస్తే కాపు రిజర్వేషన్లను అసెంబ్లీ ఆమోదించడం, కేంద్రానికి పంపడం ఏంటని మాజీ ఎంపి ఉండవల్లి అరుణ్ కుమార్ ప్రశ్నించారు. విజయవాడ ప్రెస్ క్లబ్‌లో ఆదివారం నిర్వహించిన మీట్ ది ప్రెస్‌లో ఆయన మాట్లాడారు. నివేదిక ఇవ్వకుండా అసెంబ్లీలో పెట్టినంత మాత్రాన ఆ బిల్లు చెల్లదన్నారు. నియంత స్వభావానికి అలవాటు పడినప్పుడు ఎన్ని కమిషన్లు వేసినా ప్రయోజనం లేదన్నారు. పోలవరం అనేది వైఎస్ రాజశేఖర్‌రెడ్డి ప్రాజెక్టేనని ఉద్ఘాటించారు. కేంద్ర అనుమతితో సంబంధం లేకుండా 2005 లోనే వైఎస్ రాజశేఖర్‌రెడ్డి పోలవరం ప్రాజెక్టును ప్రారంభించారన్నారు. పోలవరం ప్రాజెక్ట్ జాతీయ ప్రాజెక్ట్ అని, చంద్రబాబును ఎవరు కట్టమన్నారని ప్రశ్నించారు. పోలవరం కాంట్రాక్టర్ ముందుగానే ఫిక్స్ అయ్యారని, అందుకే వెబ్ సైట్ లో పూర్తి వివరాలు పెట్టలేదన్నారు. కాసుల కక్కుర్తి కోసమే కేంద్రంతో ప్రాధేయపడి పాతరేటుకు తీసుకున్నారన్నారు. కేంద్రానికే అప్పజెప్పేస్తామని చంద్రబాబు చెప్పడం హాస్యాస్పదంగా ఉందన్నారు. పోలవరం విషయంలో విచారణకు ఆదేశిస్తే జైలుకెల్తారని బిజెపి నేత చేసిన వ్యాఖ్యలు సరైనవేనని, కేంద్రం దగ్గర పూర్తి ఆధారాలున్నాయని వెల్లడించారు. పట్టిసీమ వద్దని మొత్తుకున్నామని, పట్టిసీమ, పురుషోత్తపట్నం ప్రాజెక్టులకు ఖర్చుపెట్టిన డబ్బును పోలవరానికి వెచ్చిస్తే తక్కువ ఖర్చుతో అయిపోయేదని తెలిపారు. విభజన చట్టంలోని హామీల అమలులో మూడేళ్ళలో కేంద్రం రాష్ట్రానికి ఏమిచ్చిందో చెప్పాలన్నారు. పోలవరం స్పిల్ వే, ఎర్త్ కం డ్యామ్ పనులు మూడు శాతమే మాత్రమే పూర్తయ్యాయని, పట్టిసీమ, పురుషోత్తపట్నం పనులన్నింటినీ కలుపుకొని 50 శాతం పైన పుర్తయ్యాయని ప్రభుత్వం చెప్పుకుంటోందని తెలిపారు. రూ.2.16 లక్షల కోట్ల అప్పు ఎవరికి ఖర్చు చేశారో చెప్పాలన్నారు. తమ పార్టీ ఎమ్మెల్యేలనే ఆపలేని ప్రతిపక్ష నేత ఒరిస్సా, ఛత్తీస్ ఘడ్ రాష్ట్రాలను రెచ్చగొడతారనడం ఉహాగానాలేనన్నారు. చంద్రబాబు ఇక నైనా మారకపోతే ప్రజలు నష్టపోవడం ఖాయమన్నారు.

# విజ్ఞానం, వినోదాల విందు వైజాగ్ ఫెస్ట్



భారీగా తరలివచ్చిన విశాఖవాసులు

- ఆలోచింపజేసిన సైన్స్ అండ్ టెక్ ఎగ్జిబిషన్
- ఆకట్టుకున్న సాంస్కృతిక కార్యక్రమాలు
- సాహిత్య గోష్టిలో పేలిన మాటల తూటాలు

**ప్రజాశక్తి- విశాఖపట్నం ప్రతినిధి**

విశాఖపట్నంలో ఆంధ్రా యూనివర్సిటీ ఇంజినీరింగ్ మైదానంలో నిర్వహిస్తున్న వైజాగ్ ఫెస్ట్-2017 మూడోరోజు ఆదివారం విజ్ఞానం, వినోదాల విందుగా మారింది. రకరకాల స్టాల్స్, విజ్ఞానం పెంచే సైన్స్ అండ్ టెక్ ఎగ్జిబిషన్, వినోదం, ఉల్లాసాన్ని కలిగించే సాంస్కృతిక సంబరాలతో పాటు ప్రపంచీకరణ - సంస్కృతిపై జరిగిన సాహిత్య గోష్టిలో మాటలు తూటాలు పేలాయి. రచయిత ప్రొఫెసర్ చందు సుబ్బారావు, సాహితీకారుడు, విమర్శకుడు మేడపల్లి రవికుమార్, వెలుగు రామినాయుడ్ని, సి.ఉమామహేశ్వరరావు సాహిత్య గోష్టిలో ప్రపంచీకరణ విధానాలపై విరుచుకుపడ్డారు. వైజాగ్‌ఫెస్ట్‌లో భాగంగా తొలుత లఘు చిత్రం(షార్ట్‌ఫిల్మ్) థియేటర్‌ను గ్రేటర్ విశాఖ మున్సిపల్ కార్పొరేష్ (జివిఎంసి) కమిషనర్ ఎం.హరినారాయణన్ ప్రారంభించారు. ఈ సందర్భంగా హిస్టరీ ఆఫ్ ద వైజాగ్, స్టిల్ లెర్నింగ్, మేక్ ఇన్ ఇండియా, లవ్ జర్నీ, ఐ హేట్ మై లైఫ్, ఇట్స్ యు, హెల్తీ ఇండియా, విన్నావా భానుమతి, జ్ఞాపకం, కళారంగం అనే అంశాలపై షార్ట్‌ఫిల్మ్‌లను ప్రదర్శించారు. అనే అంశాలపై షార్ట్‌ఫిల్మ్‌లు ప్రదర్శిచడం, పైగా ఉచిత ప్రవేశం పెట్టడంతో యువత అధిక సంఖ్యలో పాల్గొని వీక్షించారు. జనవిజ్ఞాన వేదిక (జెవివి) మూఢనమ్మకాలపై ప్రదర్శించిన ఇంద్రజాల ప్రదర్శనలు సందర్శకులను ఆకట్టుకున్నాయి. వివిధ సైన్సు ప్రాజెక్టులపై ఆయా విద్యార్థుల వివరణలను ఆసక్తిగా ఆలకించారు. ప్రభుత్వరంగ పెవిలియన్‌లో స్టీల్‌ప్లాంట్, జివిఎంసి, పోర్టు, ఎల్ఐసి వంటి స్టాల్స్ ఆకర్షణీయంగా వివరణాత్మకంగా ఉండటంతో ఆసక్తి ఆలకించారు.

మూడోరోజు ఆదివారం కావడంతో సాయంత్రం నాలుగు గంటల నుంచే వైజాగ్ ఫెస్ట్ జనంతో కిటకిటలాడింది. ముఖ్యంగా 26 ఈవెంట్స్‌లో వేసిన సాంస్కృతిక కార్యక్రమాలు వీక్షకులను ఆద్యంతం అలరించాయి. ప్రజానాట్య మండలి ఆధ్వర్యంలో చేసిన దేశ భక్తి గేయం, పోర్టు కేథలిన్ పాఠశాలకు చెందిన విద్యార్థులు ఆంధ్ర రాష్ట్ర ప్రాశస్త్యాన్ని తెలుపుతూ వేసిన కూచిపూడి నృత్యం ఆకట్టుకుంది. ఈ సందర్భంగా సీనియర్ పాత్రికేయుడు, ప్రముఖ రచయిత నల్లి ధర్మారావును వైజాగ్ ఫెస్ట్ కార్యదర్శి అవధానుల అజశర్మ, సినీ దర్శకులు సి.ఉమామహేశ్వరరావు, స్టార్ మేకర్ సత్యానంద్, డిసిపి రవికుమార్ మూర్తి కళాకారులను సత్కరించారు. సాంస్కృతిక వేదికపై నృత్యం చేసిన ప్రతి ఒక్కరికీ మెమోంటోతో పాటు సర్టిఫికెట్లను అందించారు.

**ఏటా వైజాగ్ ఫెస్ట్ నిర్వహించాలి : జివిఎంసి కమిషనర్**

విశాఖపట్నంలో ప్రతి ఏటా వైజాగ్ ఫెస్ట్‌ను నిర్వహించాలని జివిఎంసి కమిషనర్ ఎం. హరినారాయణన్ కోరారు. షార్ట్‌ఫిల్మ్ థియేటర్‌ను ప్రారంభించిన ఆయన ఫెస్ట్ ఏర్పాట్లు బాగున్నాయని కితాబి చ్చారు. క్రమశిక్షణతో ఫెస్ట్ నిర్వహించడం ఆనందదాయకమన్నారు. అనంతరం బుక్‌ఫెస్ట్, ప్రభుత్వరంగ పెవిలియన్, సైన్సు ఎగ్జిబిషన్‌లను తిలకించారు. వైజాగ్‌ఫెస్ట్ షార్ట్ ఫిల్మ్‌కు ముఖ్యఅతిథిగా పాల్గొన్న ప్రముఖ సినీ దర్శకుడు అంకుశం ఫేమ్ సి.ఉమామహేశ్వరరావు మాట్లాడుతూ లఘుచిత్రా లనేవి యువత తమ భావాలను, సామాజిక అంశాలను ప్రదర్శించే కాన్సెప్ట్‌ను అలవరుచుకోవాలని, కమర్షియల్ సినిమాల గాడిలో పడకుండా జాగ్రత్తపడాలని కోరారు.



## గుంటూరులో హీరో వెంకటేష్ సందడి

**ప్రజాశక్తి-గుంటూరు సిటీ ప్రతినిధి**

గుంటూరులో సినీ హీరో విక్టరీ వెంకటేష్ సందడి చేశారు. నగరంలోని లక్ష్మీపురం మెయిన్ రోడ్డులో షాపింగ్‌మాల్‌ను ఆదివారం ఆయన ప్రారంభించారు. ఈ సందర్భంగా వెంకటేష్ మాట్లాడుతూ.. నమ్మకానికి చిరునామ సిఎంఆర్ షాపింగ్‌మాల్ అన్నారు. రాజమండ్రిలో చందన బ్రదర్స్‌గా ప్రారంభమై సిఎంఆర్‌గా అవతరించి 40 ఏళ్లుగా విశేష ప్రజాదరణ పొందటం అభినందనీయమన్నారు. సిఎంఆర్ 14వ శాఖను గుంటూరులో ప్రారంభించటం సంతోషంగా ఉందన్నారు. కార్యక్రమంలో మంత్రి చింతకాయల అయ్యన్నపాత్రుడు, రాష్ట్ర మహిళా కమిషన్ చైర్‌పర్సన్ నన్నపనేని రాజకుమారి, ఏపి టెక్స్‌టైల్స్ ఫెడరేషన్ అధ్యక్షుడు బూసిరెడ్డి మల్లేశ్వరరెడ్డి, సిఎంఆర్ షాపింగ్‌మాల్ చైర్మన్ మావూరి వెంకటరమణ, గుంటూరు పశ్చిమ నియోజకవర్గ ఎమ్మెల్యే మోదుగుల వేణుగోపాల్‌రెడ్డి, ఎంవిఆర్ షాపింగ్‌మాల్ డైరెక్టర్లు మావూరి బాలాజీ, రాజేశ్వరి, భారతి సోప్‌వర్క్స్ అధినేత అరుణాచలం మాణిక్యవేలు పాల్గొన్నారు.

# పంటకు ముందే గిట్టుబాటు ధర

- వైసిపి అధినేత జగన్
- కర్నూలు జిల్లాలో ముగిసిన యాత్ర



రైతు ఆత్మీయ సమ్మేళన సభకు హాజరయిన రైతులు, మహిళలు అభిమానులు

**ప్రజాశక్తి - కర్నూలు ప్రతినిధి**

తమ పార్టీ అధికారంలోకి రాగానే, పంట వేసే ముందే గిట్టుబాటు ధర ప్రకటించి రైతులను ఆదుకుంటామని వైసిపి అధినేత వైఎస్ జగన్‌మోహన్‌రెడ్డి హామీ ఇచ్చారు. ఆయన చేపట్టిన ప్రజాసంకల్పయాత్ర ఆదివారం కర్నూలు జిల్లాలో ముగిసింది. అంతకుముందు ఎర్రగుడి గ్రామంలో ఏర్పాటు చేసిన రైతు ఆత్మీయ సమ్మేళన కార్యక్రమంలో జగన్ మాట్లాడారు. రాష్ట్రంలో వ్యవసాయం గిట్టుబాటు కాక రైతుల ఆత్మహత్యలు చేసుకునే పరిస్థితి ఏర్పడందని, చంద్రబాబునాయుడే ఓ పెద్ద దళారీగా మారారని విమర్శించారు. హెరిటేజ్ కోసం వ్యవసాయ ఉత్పత్తుల ధరలను తగ్గించి వేస్తున్నారని ఆరోపించారు. చంద్రన్న బీమా పేరుతో ఆర్భాటం చేస్తున్న ప్రభుత్వం రైతుకు ఎక్కడా బీమా ఇవ్వట్లేదని తెలిపారు. తాము అధికారంలోకొస్తే చనిపోయిన ప్రతి రైతుకు బీమా అందేలా వైఎస్ఆర్ బీమాను తీసుకొస్తామన్నారు. రైతు పండించిన పంటలకు గిట్టుబాటు ధర రాకపోతే రైతులు ఎలా బతకగలరని ప్రశ్నించారు. టిడిపి సర్కారు దళారీ వ్యవస్థను మరింత రెట్టింపు చేస్తోందని విమర్శించారు. దేశంలోని మిగతా ప్రాంతాల్లో 7.2 శాతం అభివ ద్ధి రేటు చూపిస్తుంటే.. చంద్రబాబు మాత్రం 12 శాతం అంటూ అసత్యాలు చెబుతున్నారని మండిపడ్డారు. నిజంగా 12 శాతం అభివ ద్ధి జరిగి ఉంటే.. ప్రపంచంలో మనమే అగ్రస్థానంలో ఉన్నట్లని తెలిపారు. చంద్రబాబు సీఎం అయ్యాక ఒక్క పంటకైనా గిట్టుబాటు ధర ఉందా అని ప్రశ్నించారు. పట్టిసీమలో నీళ్ల పోసి, ప్రకాశం బ్యారేజీ వద్ద 50 టీఎంసీలు సముద్రంలో విడిచిపెడితే ఫలితం ఏముంటుందన్నారు. పులిచింతల ప్రాజెక్టు పై తెలంగాణ లేఖలు రాస్తున్నా, ఆ వివాదాన్ని పరిష్కరించడం లేదన్నారు. దీంతో 45 టీఎంసీల నీరు అందుబాటులోకి రాకుండా పోయింది. ప్రాజెక్టు కాంట్రాక్టర్లను కమీషన్ల కోసం వాడుకుంటున్నారని మండిపడ్డారు. కరువు నుంచి రైతులను ఆదుకునేందుకు రూ.2వేల కోట్లతో కరువు నిధిని ఏర్పాటు చేస్తామని చెప్పారు. అంతకు ముందు పత్తికొండ నియోజక వర్గం తుగ్గలి మండలం మదనంతాపురం నుంచి ప్రారంభమైన యాత్ర అనం తపురం జిల్లా సరిహద్దుకు అర కిలోమీటరు దూరంలోని చెరువుతండా వరకు సాగింది. పాదయాత్రలో జగన్ వెంట వైసిపి కర్నూలు పార్లమెంటు నియోజకవర్గ అధ్యక్షులు బివై రామయ్య, ఎమ్మెల్యేలు సాయిప్రసాద్‌రెడ్డి, గుమ్మనూ రు జయరాం, బాలనాగిరెడ్డి, గౌరుచరితారెడ్డి, ఐజయ్య, అనంతపురం మాజీ ఎంపి అనంతవెంకట్రామిరెడ్డి, రాష్ట్ర ప్రధాన కార్యదర్శి గౌరువెంకట్‌రెడ్డి, నాయకులు పాల్గొన్నారు.

Published and Printed by Paturu Ramaiah on behalf of Prajasakti Printers & Publishers Private Limited from D.No.27-30-4,Akulavari Street,Governarpet, Vijayawada, Krishna Dt., and Printed at Prajasakti Printers & Publishers Private Limited, D.No.14-12-19, Krishna Nagar, Tadepalli (M), Guntur Dt., Editor : Paturu Ramaiah, Ph : 2577248, email:editorprajasakthi@gmail.com, RNI Regd.No. 15795/68

సోమవారం
4•12•2017
హైదరాబాద్
• వెల.5 రూ.
• సంపుటి 7 • సంచిక 177
• పేజీలు : 16 + (24/16)

# నమస్తే తెలంగాణ

మన రాష్ట్రం • మన పత్రిక

WWW. NTNEWS.COM
/NTDAILYONLINE

PUBLISHED FROM HYDERABAD | KARIMNAGAR | WARANGAL | KHAMMAM | NALGONDA | MAHABUBNAGAR | NIZAMABAD




## చట్టసభల్లో బీసీలకు రిజర్వేషన్ల కోసం

# ఢిల్లీకి అఖిలపక్షం

- పార్లమెంటులో బిల్లు కోసం ఒత్తిడితెస్తాం
- కేంద్రంలో బీసీ సంక్షేమశాఖ ఏర్పాటు చేయాలి
- బీసీల అభ్యున్నతి కోసం అద్భుతబాటలు వేద్దాం
- అందరితో చర్చించి విధానాలు రూపొందించండి
- మీరు సిఫారసు చేయండి.. నేను అమలు చేస్తా
- బీసీ ప్రజాప్రతినిధుల సమావేశంలో సీఎం కేసీఆర్
- సీఎం దృక్పథం అద్భుతం: బీసీ ప్రజాప్రతినిధుల ప్రశంస
- చరిత్రలోనే ఇలాంటి సమావేశాల్లేవు: ఆర్ కృష్ణయ్య
- బీసీల సమస్యలకు శాశ్వత పరిష్కారం: కే లక్ష్మణ్



బీసీల సంక్షేమం, అభివృద్ధికి తీసుకోవాల్సిన చర్యలపై ఆదివారం అసెంబ్లీ కమిటీ హాల్‌లో ఏర్పాటుచేసిన బీసీ ప్రజాప్రతినిధుల సమావేశంలో మాట్లాడుతున్న ముఖ్యమంత్రి కే చంద్రశేఖర్‌రావు. చిత్రంలో స్పీకర్ మధుసూదనాచారి, బీసీ సంక్షేమ శాఖ మంత్రి జోగు రామన్న కూడా ఉన్నారు.

**హైదరాబాద్, నమస్తే తెలంగాణ:**

చట్టసభల్లో బీసీలకు రిజర్వేషన్లు అమలుచేయడం కోసం పార్లమెంట్‌లో చట్టం తీసుకురావలసిన అవసరం ఉన్నదని ముఖ్యమంత్రి కల్వకుంట్ల చంద్రశేఖర్‌రావు అన్నారు. ఇందుకోసం తెలంగాణ రాష్ట్ర పక్షాన కేంద్రానికి విజ్ఞప్తి చేయనున్నట్టు ఆయన స్పష్టం చేశారు. తెలంగాణ రాష్ట్రంగా ఆవిర్భవించిన తొలినాళ్లలోనే చట్టసభల్లో బీసీలకు రిజర్వేషన్లు కావాలని శాసనసభలో తీర్మానం చేసిన విషయాన్ని ఆయన గుర్తుచేశారు. తెలంగాణలోని అన్ని పార్టీలూ చట్టసభల్లో బీసీలకు రిజర్వేషన్లు కావాలని కోరుకుంటున్నాయని, దీన్ని తెలంగాణ రాష్ట్ర డిమాండ్‌గా కేంద్రం ముందుంచుతామని చేశారు. ఇందుకోసం రాష్ట్రం తరపున అఖిలపక్షాన్ని ఢిల్లీకి తీసుకెళ్లి ప్రధానమంత్రిని కలిసి ఒత్తిడి తీసుకొస్తామని తెలిపారు. వెనుకబడిన వర్గాల అభ్యున్నతి కోసం కేంద్ర ప్రభుత్వంలో బీసీ సంక్షేమశాఖను ఏర్పాటు చేయవలసిన అవసరం ఉన్నదని ఆయన అభిప్రాయపడ్డారు. పదోన్నతుల్లో కూడా బీసీలకు రిజర్వేషన్లు కల్పించాలని కేంద్రాన్ని కోరనున్నట్లు సీఎం కేసీఆర్ చెప్పారు. బీసీల సంక్షేమం-అభివృద్ధి కోసం తీసుకోవాల్సిన చర్యల గురించి ఆదివారం అసెంబ్లీ కమిటీహాలులో జరిగిన బీసీ వర్గాలకు చెందిన ప్రజాప్రతినిధుల సమావేశంలో ఆయన పాల్గొన్నారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ బీసీల అభ్యున్నతికోసం అద్భుత బాటలు వేద్దామని అన్నారు. ఈ దిశగా ప్రభుత్వం ఇప్పటికే అనేక కార్యక్రమాలను అమలుచేస్తున్నదని, ఇంకా అనేక చర్యలు తీసుకోవాల్సిన అవసరం ఉన్నదని ముఖ్యమంత్రి కేసీఆర్ అన్నారు. బీసీలకు సంబంధించి రాష్ట్ర పరిధిలో ఉన్న అన్ని అంశాలపైనా సానుకూలంగా నిర్ణయాలు తీసుకోవడానికి ప్రభుత్వం సిద్ధంగా ఉన్నదని స్పష్టంచేశారు. అభివృద్ధి చెందిన దేశాల్లో ప్రభుత్వాలు మారినప్పటికీ విధానపరమైన విషయాల్లో స్థిరత్వం ఉంటుందని, కానీ భారతదేశంలో విధానపరమైన స్థిరత్వం లేకపోవడం ప్రధాన లోపమని సీఎం అన్నారు. బీసీల కోసం విధానాలు, పథకాలు రూపకల్పన చేసే సందర్భంలో భవిష్యత్తులో వాటినెవ్వరూ తొలిగించలేనంత పకడ్బందీగా రూపొందించాలని సీఎం కోరారు. ఎంబీసీలు, సంచార జాతులను కూడా పైకి తీసుకొనిరావాల్సిన

మిగతా 2వ పేజీలో



కాళేశ్వరం ఎత్తిపోతల ప్యాకేజ్-8లో భాగంగా నిర్మాణంలో ఉన్న అండర్‌గ్రౌండ్ పంప్‌హౌస్

## కొద్దిరోజుల్లో కాళేశ్వరం ప్రాజెక్టు ప్రస్థానం మొదలు

# 15న డ్రైరన్

పరీక్షకు సిద్ధమైన భారీ మోటర్

**హైదరాబాద్, నమస్తే తెలంగాణ:**

రాష్ట్ర సాగునీటిరంగ ముఖచిత్రాన్ని సమూలంగా మార్చివేయనున్న కాళేశ్వరం ఎత్తిపోతల పథకంలో కీలక ప్రక్రియలు మొదలయ్యేందుకు సమయం ఆసన్నమైంది. రికార్డు సమయంలో ప్రాజెక్టును పట్టాలెక్కించిన సర్కారు.. పనుల్ని శరవేగంగా కొనసాగించడంతో అనుకున్న సమయంలో పూర్తవుతున్నాయి. డిసెంబర్ చివరికల్లా ఎల్లంపల్లి నుంచి మిడ్‌మానేరువరకు నీటి తరలింపునకు అనుగుణంగా పనులు పూర్తవుతుండటంతో మోటర్లను ప్రారంభించేందుకు అధికారులు రంగం సిద్ధంచేశారు. ఇందులో అత్యంత కీలకమైన ప్యాకేజీ-8లోని పంపుహౌజ్‌లో భారీ మోటర్ డ్రైరన్‌కు అధికారులు ఏర్పాట్లుచేశారు. గతంలో నల్లగొండ జిల్లాలో ఎలిమినేటి మాధవరెడ్డి ప్రాజెక్టును మొదలుపెట్టినపుడు ఆసియాలోనే అతి పెద్ద లిఫ్టు పథకంగా అభివర్ణించారు. ఇందులో ఒక్కో మోటరు 600 క్యూసెక్కుల నీటిని ఎత్తిపోసే సామర్థ్యం ఉన్నవి. ఆ తర్వాత కల్వకుర్తి ఎత్తిపోతల పథకంలో 30 మెగావాట్ల సామర్థ్యం

మిగతా 12వ పేజీలో

# యలమందహాసం

## ఈనుతున్న సబ్సిడీ గొర్రెలు.. పెరుగుతున్న పిల్లజీవాలు

### 24.24% సంతతి వృద్ధి.. సంబురాల్లో గొల్ల, కుర్మలు

**మేడ్చల్ జిల్లా, నమస్తే తెలంగాణ ప్రతినిధి:**

'మాకు రెండు యూనిట్లు మంజూరయ్యాయి. 42 గొర్రెలిచ్చారు. చాలా గొర్రెలు ఈనడంతో 35 పిల్లలు కొత్తగా మందలో చేరాయి. నా మందలో ఒక్క గొర్రె కూడా చనిపోలేదు. కొన్ని గొర్రెలు రెండు పిల్లలేయటంతో నాకు మస్తు సంతోషంగా ఉన్నది. గొర్రెలకు సుస్తీ చేస్తే మంద దగ్గరికే మందులొస్తున్నాయి. డాక్టర్లు వస్తున్నారు. నిజంగా మా జీవాల కాపర్లు ప్రభుత్వానికి రుణపడి ఉంటారు'.. ఇవి మేడ్చల్ జిల్లా కీసర మండలం బోగారం గ్రామానికి చెందిన దుర్గం వెంకటేశ్ మాటలు. జీవాల మందలో సరికొత్త సందడి మొదలైంది. గొల్ల, కుర్మల ఇండ్లలో ఆనందం షురూ అయింది. ప్రభుత్వం సబ్సిడీపై ఇచ్చిన జీవాల మందలోని జీవాలు ఈనుతుండటంతో గొర్రెల కాపరులు సంతోషంగా ఉన్నారు. రాష్ట్రంలో మాంసం ఉత్పత్తులను పెంచటంతోపాటు గొర్రెల పెంపకంపై ఆధారపడి జీవిస్తున్న కుటుంబాల జీవన ప్రమాణాలను పెంచాలనే లక్ష్యంతో ప్రభుత్వం 75% సబ్సిడీతో అమలు చేస్తున్న 'గొర్రెల యూనిట్ల పంపిణీ పథకం' ఫలితాలిస్తున్నది. జీవాల కాపర్ల జీవితాల్లో కొత్త వెలుగులు

మిగతా 6వ పేజీలో

**మేడ్చల్ జిల్లాలో**
పంపిణీ చేసిన యూనిట్లు **1,942**
గొర్రెల సంఖ్య: **38,840**
ఐదున్నర నెలల్లో జన్మించినవి **9,413**



తన మందలో రెండేసి పిల్లలు వేసిన గొర్రెపిల్లలతో కీసర మండలం భోగారం గ్రామానికి చెందిన కఠారి కిష్టయ్య, గ్రామస్థులు

# నిఘానీడలో రిజిస్ట్రేషన్లు



## నేటి నుంచి తెలంగాణకు ప్రత్యేక సర్వర్

- మరింత పారదర్శకంగా రిజిస్ట్రేషన్ ప్రక్రియ
- రాష్ట్ర సర్కారు చర్యలతో సాంకేతిక సమస్యలకు శాశ్వత పరిష్కారం
- ఉద్యోగసంఘాల విజ్ఞప్తితో వీడియో చిత్రీకరణ తాత్కాలికంగా వాయిదా!

3







# ప్రాణాలతో ప్రయోగాలు

## ఆర్థిక అవసరాలే ఆసరాగా ఔషధసంస్థల దందా



వరంగల్ ఎంజీఎంలో చికిత్స పొందుతున్న క్లినికల్ ట్రయల్స్ బాధితుడు సురేశ్

- 25 - 30 ఏండ్ల వారికి ఎర
- సర్కార్ సీరియస్
- నేడు జమ్మికుంటకు విచారణ కమిటీ రాక
- నాలుగు ల్యాబ్‌లకు నోటీసులు

12

## కేంద్ర బడ్జెట్ ఫిబ్రవరి 1న!

- జీఎస్టీ అమలు తర్వాత జైట్లీ తొలి పద్దు
- 2019 ఎన్నికలకు ముందు ఎన్డీయే చివరి పూర్తిస్థాయి బడ్జెట్

5



# ఢిల్లీకి అఖిలపక్షం

మొదటిపేజీ తరువాయి...

అవసరమున్నందున వారితో కూడా చర్చించాలని కోరారు. రాజకీయాలకు అతీతంగా ప్రజాప్రతినిధులు అన్ని కులాల అభిప్రాయాలు తెలుసుకొని ప్రభుత్వానికి దిశానిర్దేశం చేయాలని సూచించారు. రాష్ట్రం ఏర్పడిన తర్వాత ప్రభుత్వం బీసీల అభివృద్ధి కోసం చేపట్టిన కార్యక్రమాలను సీఎం కేసీఆర్ వివరించారు. ఆయన ప్రసంగంలోని ముఖ్యాంశాలు ఆయన మాటల్లోనే..

**సమిష్టిగానే నిర్ణయాలు**

'సమున్నత లక్ష్యం కోసం తెలంగాణ సాధించుకున్నం. అన్ని వర్గాలూ అన్ని రంగాల్లో అభివృద్ధి చెందాలి. ఎవరూ ఆత్మన్యూనతతో ఉండడానికి వీల్లేదు. అంతా ఆత్మవిశ్వాసంతో బతకాలె. అందరికీ అవకాశాలు రావాలె. ఎవరి పెత్తనం కిందో మరొకరు బతకాల్సిన అవసరం లేదు. ఇందుకనుగుణంగానే భవిష్యత్తు తెలంగాణ నడవాలె. బలహీన వర్గాల కోసం ఇప్పుడు సరైన బాట వేయాల్సిన అవసరం ఉన్నది. సగభాగానికి పైగా ఉన్న బీసీల కోసం ప్రజాప్రతినిధులు రెండుమూడు రోజులపాటు సమయం వెచ్చించి, లోతుగా అధ్యయనం చేసి విధానాల రూపకల్పన చేయాలె. అన్ని కులసంఘాలతో చర్చించి ప్రభుత్వానికి నివేదిక ఇవ్వండి. బీసీ ఫైనాన్స్ కార్పొరేషన్, ఎంబీసీ కార్పొరేషన్లు ఎలా పనిచేయాలి? స్వయంఉపాధి పథకాల స్వరూపం ఏ విధంగా ఉండాలో సూచించండి. ప్రభుత్వ విధానాల్లో ఏవైనా లోపాలుంటే మార్చుకోవడానికి మాకు ఎలాంటి భేషజాలు లేవు. కొట్లాడి తెచ్చుకొన్న తెలంగాణలో అంతిమంగా బీసీలకు మేలు కలుగాలన్నదే నా తపన. మీరు ఇచ్చిన నివేదికనే ప్రభుత్వం ఆదేశంగా తీసుకొని అమలు చేస్తుంది. అనుకున్నట్లుగానే తెలంగాణకు మంచి ఆదాయ వనరులున్నయి. ఉమ్మడిఏపీలో 23 జిల్లాలకు కలిపి ఏడాదికి లక్షా 25వేల కోట్ల రూపాయలు ఖర్చు చేసిన్రు. ఇప్పుడు ఒక్క తెలంగాణలోనే అంత ఖర్చు పెడుతున్నం. ఇదంతా రాష్ట్రంలోని పేదరికాన్ని నిర్మూలించడానికి ఉపయోగపడాలె. పరిపాలనా సౌలభ్యంకోసం చిన్న జిల్లాలు కూడా ఏర్పాటు చేసుకున్న తర్వాత ప్రతి కుటుంబాన్నీ పట్టించుకునే వెసులుబాటు కలిగింది. మీరు చర్చించిన అంశాలపై స్పష్టత వచ్చిన తర్వాత అసెంబ్లీలో కూడా ఒకరోజు చర్చ పెడుతం. అసెంబ్లీలోనే విధానపరమైన నిర్ణయాలు ప్రకటిద్దాం. బీసీల విషయంలో రాజకీయాలు లేవు. అన్ని పార్టీల ప్రతినిధులు ఒకేవిధంగా కోరుకొంటున్నరు. ఉన్నంతలో బీసీలకోసం ఎంత ఉన్నతంగా పనిచేయగలమన్నదే ఇక్కడ ప్రధానాంశం. కేవలం ప్రభుత్వమే ఖ్యాతి పొందాలనుకోవడం లేదు. అన్ని పార్టీలు కలిసి సమిష్టిగా తీసుకొన్న నిర్ణయాలని ప్రజలకు చెప్దాం. దీంతో ప్రజలకు మంచి సందేశం వెళ్తుంది.'

**కులాల గుర్తింపు సమస్య తీరాలి**

'కొన్ని కులాలకు ధ్రువీకరణ సర్టిఫికెట్లు ఇచ్చే విషయంలో ఇబ్బందులు ఉన్నయి. ప్రభుత్వ లబ్ధి అందుకొనే విషయంలో కొన్ని కులాల మధ్య ఘర్షణలు ఉన్నయి. హాస్టళ్లలో పిల్లలు చేరకుండా రెసిడెన్షియల్ వైపు మొగ్గు చూపుతున్నారు. ఇలాంటి అన్ని విషయాల్లో ఆచరణ సాధ్యమైన మార్గాన్ని ప్రజాప్రతినిధులు సూచించాలె. తెలంగాణ ఏర్పడే నాటికి రాష్ట్రంలో బీసీల కోసం కేవలం 19 మాత్రమే రెసిడెన్షియల్ స్కూళ్లు ఉండేవి. తెలంగాణ వచ్చిన తర్వాత కొత్తగా 123 రెసిడెన్షియల్ స్కూళ్లు స్థాపించుకున్నం. వీటి ద్వారా 91,520 మంది బిసి పిల్లలకు అత్యున్నత ప్రమాణాలతో కూడిన విద్య అందుతున్నది. వీటి సంఖ్యను ఇంకా పెంచడానికి ప్రభుత్వం సిద్ధంగా ఉన్నది.'

### అన్ని కులాలకూ అండదండలు

'సమైక్య రాష్ట్రంలో హైదరాబాద్‌లో కల్లు దుకాణాలు మూసివేస్తే.. గీతకార్మికులు ఉపాధి కోల్పోయారు. తెలంగాణ వచ్చిన వెంటనే కల్లు దుకాణాలు పునరుద్ధరించినం. దీనివల్ల హైదరాబాద్‌లోని వారికే కాకుండా గ్రామాల్లోని గీత కార్మికులకు కూడా మేలు కలిగింది. అత్యంత దయనీయ స్థితిలోకి కూరుకుపోయి ఆత్మహత్యలే శరణ్యమైన చేనేత కార్మికులకు అండగా ఉండడానికి ప్రభుత్వం అనేక చర్యలు తీసుకున్నది. రూ.1200 కోట్ల వ్యయంతో కార్యక్రమాలు అమలు చేస్తున్నది. పవర్‌లూమ్‌లను వందశాతం ప్రభుత్వఖర్చుతో ఆధునీకరిస్తున్నం. 50 శాతం సబ్సిడీతో నూలు, రసాయనాలు అందిస్తున్నాం. నేత కార్మికులు తయారు చేసిన ఉత్పత్తులను ప్రభుత్వమే కొనుగోలు చేస్తున్నది. వరంగల్‌లో టెక్స్‌టైల్ పార్కు పెట్టడం వల్ల వలసలు పోయిన వారు తిరిగి సొంత గడ్డకు వస్తున్నరు. సిరిసిల్లలో కాటన్ టు గార్మెంట్ పద్ధతిలో వస్త్ర పరిశ్రమను విస్తరిస్తున్నం. ఈ చర్యల వల్ల చేనేత కార్మికుల జీవితంలో మార్పు వస్తున్నది. రజకులకు అవసరమైన చేయూత అందిస్తం. నాయీబ్రాహ్మణులకు ఆధునిక సెలూన్లు ఏర్పాటు చేసుకోవడానికి అవసరమైన ఆర్థిక సహాయం అందిస్తం. విశ్వబ్రాహ్మణుల కులవృత్తులను ప్రోత్సహించడానికి రూ.250 కోట్లతో కార్యక్రమాలు అమలు చేస్తం.' అని సీఎం కేసీఆర్ ప్రజాప్రతినిధులకు వివరించారు.



ఆదివారం అసెంబ్లీ కమిటీ హాల్‌లో బీసీ చట్టసభల సభ్యులతో నిర్వహించిన సమావేశంలో మాట్లాడుతున్న ముఖ్యమంత్రి కే చంద్రశేఖర్‌రావు. చిత్రంలో మండలి చైర్మన్ స్వామిగౌడ్, అసెంబ్లీ స్పీకర్ మధుసూదనాచారి, మంత్రులు జోగు రామన్న, ఈటల రాజేందర్, ఎంపీలు కే కేశవరావు, బండారు దత్తాత్రేయ, ఎమ్మెల్యే కే లక్ష్మణ్ ఉన్నారు

**మార్కెట్ కమిటీల్లో రిజర్వేషన్లు అమలు చేశాం**

'బీసీల కోసం కల్యాణలక్ష్మి కార్యక్రమం అమలు చేస్తున్నం. దీనివల్ల పేదింటి ఆడపిల్లల పెండ్లి బాధ తప్పింది. మార్కెట్ కమిటీల్లో రిజర్వేషన్లు పెట్టడం వల్ల రాష్ట్రంలో 50 మంది బీసీలు మార్కెట్ కమిటీలకు చైర్మన్లు కాగలిగారు.బీడీ కార్మికులకు భృతి ఇవ్వడం వల్ల ఎక్కువమంది బీసీలు, అందులోనూ పద్మశాలీలకు ఎక్కువ మేలు కలిగింది. అత్యంత వెనుకబడిన వర్గాల కోసం ఎంబీసీ కార్పొరేషన్ ఏర్పాటు చేసుకున్నం. వాటి ద్వారా బ్యాంకులతో సంబంధం లేకుండా నేరుగా ఆర్థిక సహాయం అందించే పథకాలకు రూపకల్పన చేయండి. చెప్పులు కుట్టుకునే వృత్తి తప్ప మిగతా వృత్తిదారులంతా బీసీలే. వారి వృత్తిలో వారికి నైపుణ్యం ఉన్నప్పటికీ సరైన ప్రోత్సాహం, ఆర్థిక చేయూత లేక సతమతమవుతున్నరు. అందుకే మనుగడ సాధ్యమయ్యే కులవృత్తులను, చేతివృత్తులను ప్రోత్సహించాలని నిర్ణయించుకొన్నం. స్థానిక సంస్థల్లో రిజర్వేషన్లను అమలు చేసుకుందాం. బీసీ పారిశ్రామికవేత్తలను ప్రోత్సహించడానికి టీఎస్ఐఐసీ ఇచ్చే భూముల్లో రిజర్వేషన్లు కల్పిస్తాం.'

**తెలంగాణ గొర్రెల కాపరులు దేశంలోనే సంపన్నులవుతరు**

'75శాతం సబ్సిడీపై గొర్రెల పంపిణీ కార్యక్రమం చేపట్టినం. పథకం ప్రారంభించిన నాలుగు నెలల సమయంలోనే 29.50లక్షల గొర్రెల పంపిణీ జరిగింది. పంపిణీ చేసిన గొర్రెలకు మరో 10 లక్షల పిల్లలు పుట్టినయి. ఇప్పటికి లక్షా 41వేల కుటుంబాలకు గొర్రెల పంపిణీ జరిగింది. మొత్తం 7.30 లక్షల కుటుంబాలకు గొర్రెల పంపిణీ చేస్తం. దేశంలోకెల్లా తెలంగాణలోని గొర్రెల కాపరులే అత్యంత ధనవంతులు అవుతరు. గొల్ల, కురమల జీవితంలో గొప్ప మార్పు వస్తున్నది. 100 శాతం సబ్సిడీపై చేపల పంపిణీ చేపట్టినం. మత్స్యకారులకు ఉపయోగకరంగా ఉండే విధంగా రూ.5వేల కోట్లతో మత్స్యపరిశ్రమను అభివృద్ధి చేస్తున్నం.' అని సీఎం కేసీఆర్ తెలిపారు. ఈ సమావేశంలో శాసనమండలి చైర్మన్ స్వామిగౌడ్, అసెంబ్లీ స్పీకర్ మధుసూదనాచారి, మండలి డిప్యూటీచైర్మన్ విద్యాసాగర్, మంత్రులు జోగు రామన్న, ఈటల రాజేందర్, పద్మారావు, తలసాని శ్రీనివాస్‌యాదవ్, ప్రభుత్వ విప్‌లు బీ వెంకటేశ్వర్లు, గంపగోవర్ధన్, ఎంపీలు బండారు దత్తాత్రేయ, కే కేశవరావు, డీ శ్రీనివాస్, రాపోలు ఆనంద భాస్కర్, బూర నర్సయ్యగౌడ్, బీబీ పాటిల్, అన్ని పార్టీలకు చెందిన ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీలు, బీసీ సంక్షేమశాఖ ముఖ్య కార్యదర్శి అశోక్ కుమార్, ఆర్థికశాఖ ముఖ్య కార్యదర్శి రామకృష్ణ, అసెంబ్లీ కార్యదర్శి నర్సింహాచార్యులు పాల్గొన్నారు. బీసీ ప్రజాప్రతినిధుల సమావేశం ప్రారంభానికి ముందు టీఆర్ఎస్ పార్టీకి చెందిన మంత్రులు, ఎమ్మెల్యేలు, ఎంపీలు, మండలి డిప్యూటీ చైర్మన్ నేతివిద్యాసాగర్, అసెంబ్లీ డిప్యూటీ స్పీకర్ పద్మాదేవేందర్‌రెడ్డి గన్‌పార్క్‌కు వెళ్లి తెలంగాణ అమరవీరులకు నివాళులు అర్పించారు.

**రెసిడెన్షియల్ స్కూళ్లతో ఈర్ష్య కలుగుతున్నది: రాపోలు ఆనందభాస్కర్**

తెలంగాణ ప్రభుత్వం స్థాపించిన రెసిడెన్షియల్ స్కూళ్లు గొప్పగా నడుస్తున్నాయని కాంగ్రెస్ రాజ్యసభ సభ్యుడు రాపోలు ఆనందభాస్కర్ అభిప్రాయపడ్డారు. తాను నవోదయతోపాటు అనేక పాఠశాలలు సందర్శించానని, అన్నింటిలోకెల్లా తెలంగాణ ప్రభుత్వం నడుపుతున్న రెసిడెన్షియల్ స్కూళ్లు చాలా గొప్పగా నడుస్తున్నాయని చెప్పారు. ఈ రెసిడెన్షియల్ స్కూళ్లలో చదివే పిల్లలను చూసి మిగతావారు ఈర్ష్య పడే విధంగా పరిస్థితి తయారైందని అన్నారు. బీజేపీ ఎమ్మెల్యే కే లక్ష్మణ్ కూడా రెసిడెన్షియల్ స్కూళ్లు బాగా నడుస్తున్నాయని, వాటి సంఖ్య పెంచాలని ముఖ్యమంత్రిని కోరారు.

**సీఎంకు లక్ష్మణ్, కృష్ణయ్య కృతజ్ఞతలు**

బీసీల సంక్షేమం, అభివృద్ధిపై ప్రత్యేకంగా సమావేశం నిర్వహించినందుకు ఎమ్మెల్యేలు కే లక్ష్మణ్, ఆర్ కృష్ణయ్య ముఖ్యమంత్రి కేసీఆర్‌కు కృతజ్ఞతలు తెలిపారు. బీసీల అభ్యున్నతి కోసం అవసరమైన నిర్ణయాలు తీసుకోవడానికి ఏర్పడిన మంచి అవకాశంగా ఈ సమావేశాన్ని వారు అభివర్ణించారు. వీరిద్దరితో పాటు సమావేశంలో పాల్గొన్న మరికొంతమంది ప్రజాప్రతినిధులు కూడా పలు సూచనలు చేశారు.

# అణగారిన వర్గాల జీవితాల్లో వెలుగు

- బీసీల అభివృద్ధే సీఎం కేసీఆర్ లక్ష్యం
- మరో రెండురోజులపాటు సమావేశం
- మంత్రి ఈటల రాజేందర్
- 44 ఏండ్ల బీసీ ఉద్యమ చరిత్రలో ఇలాంటి సమావేశాలు చూడలేదు
- టీటీడీపీ ఎమ్మెల్యే ఆర్ కృష్ణయ్య

**హైదరాబాద్, నమస్తే తెలంగాణ:**

అణగారిన వర్గాలకు చెందిన ప్రజల జీవితాల్లో వెలుగులు నింపడమే సీఎం కేసీఆర్ నేతృత్వంలోని టీఆర్ఎస్ ప్రభుత్వ లక్ష్యమని ఆర్థికశాఖ మంత్రి ఈటల రాజేందర్ తెలిపారు. అన్నమో రామచంద్రా అంటున్న బీసీలను అభివృద్ధి చేయడమే బీసీ ప్రజాప్రతినిధుల ఆశయమని పేర్కొన్నారు. బీసీల సమస్యలపై పూర్తిస్థాయిలో చర్చించి సీఎం కేసీఆర్‌కు నివేదిస్తామని ప్రకటించారు. ఆదివారం అసెంబ్లీ కమిటీ హాల్‌లో బీసీ చట్టసభల సభ్యులతో సీఎం కేసీఆర్ సమావేశం నిర్వహించారు. సమావేశం వివరాలను మంత్రులు ఈటల రాజేందర్, జోగు రామన్న మీడియాకు వెల్లడించారు. బీసీ ప్రజాప్రతినిధుల సమావేశంలో ప్రధానంగా పదిరకాల సమస్యలను గుర్తించామని ఈటల తెలిపారు. మరో రెండురోజులపాటు సమగ్రంగా చర్చించి నివేదిక ఇవ్వాలని సీఎం కేసీఆర్ సూచించారన్నారు. ప్రతిపక్షాలు ప్రస్తావించిన వాటిపై గత ప్రభుత్వాలు, ముఖ్యమంత్రుల్లా అహంకారపూరిత ధోరణిలో కాకుండా ప్రజల కోణంలో సీఎం కేసీఆర్ సానుకూల దృక్పథంతో స్పందించారన్నారు. ఇప్పుడు వేసే పునాది భవిష్యత్ తరాలు హర్షించే విధంగా, మార్గదర్శకంగా ఉండాలన్నదే సీఎం కేసీఆర్ లక్ష్యమన్నారు. ఉద్యమ నేతగా తెలంగాణలో 85 శాతం అణగారిన వర్గాలు ఉన్నాయని సీఎం కేసీఆర్ ఆనాడే ప్రస్తావించారన్నారు. వారి సమస్యల పరిష్కారానికి బీసీ ప్రజాప్రతినిధులతో సమావేశం ఏర్పాటు చేయడం శుభపరిణామన్నారు. ఈ సమావేశంలో వృత్తులను మూడురకాలుగా విభజించామన్నారు. మొదటిది జీఎస్‌డీపీకి ఉపయోపడేవని.. వృత్తి ద్వారా సంపద సృష్టించే వారిని గుర్తించి రూ.ఐదు వేల కోట్లు కేటాయించామన్నారు. దీనిలో భాగంగానే గొర్రెలు, చేపల పంపణీ చేశామన్నారు. రెండోది సర్వీస్ ఓరియెంటెడ్ అని.. వీరిలో రజకులు, నాయీబ్రాహ్మణులు ఉంటారన్నారు. వీరికి ఇప్పటికే ప్రభుత్వం వాషింగ్ మిషన్లు, ఆర్థిక సహకారం అందిస్తున్నామని తెలిపారు. మూడోది అంతరించిపోతున్న వృత్తులని, వీటిపై మరో రెండు రోజులపాటు సమగ్రంగా చర్చించి నివేదిక ఇవ్వాలని సీఎం కేసీఆర్ సూచించారన్నారు. నివేదిక ఆధారంగా జీవోలు, చట్టాలు తీసుకొస్తామని సీఎం ప్రకటించారని తెలిపారు. చట్టసభల్లో కూడా రిజర్వేషన్లు కావాలని బీసీ ప్రజాప్రతినిధుల సమావేశం తీర్మానం చేసిందని పేర్కొన్నారు. దీనిపై అఖిలపక్షాన్ని ప్రధాని వద్దకు తీసుకెళ్తామని సీఎం చెప్పారని వెల్లడించారు. కేంద్రంలో ఓబీసీ మంత్రిత్వశాఖను ఏర్పాటు చేయాలని, కేంద్ర బడ్జెట్ పెంచాలన్నారు. బీసీలకు సంబంధించి తెలంగాణ రాష్ట్రమే అందరికీ ఆదర్శంగా ఉండేలా కార్యక్రమాలు చేసుకుందామని సీఎం కేసీఆర్ చెప్పారన్నారు. విద్య, వైద్యానికి ఆర్థికసహాయం అందించే పథకాలపై సమగ్రంగా చర్చించి డిసెంబర్, జనవరి నెలల్లో లబ్ధిదారులకు అందేవిధంగా చర్యలు తీసుకుంటామన్నారు.



ఆదివారం బీసీ ప్రజాప్రతినిధులతో జరిగిన సమావేశం వివరాలను మీడియాకు వెల్లడిస్తున్న మంత్రి ఈటల రాజేందర్. చిత్రంలో మంత్రి జోగు రామన్న, ఎంపీలు బూర నర్సయ్యగౌడ్, బీబీ పాటిల్, ఎమ్మెల్సీ ఆకుల లలిత, ఎమ్మెల్యేలు శ్రీనివాస్‌గౌడ్, గంగుల కమలాకర్, ఆర్ కృష్ణయ్య, లక్ష్మణ్ తదితరులు ఉన్నారు.

### బీసీ మంత్రిగా ఉండటం నా అదృష్టం

**బీసీలు,** ఎంబీసీలపై చర్చించి తీర్మానం చేసి ఇవ్వాలని సీఎం కేసీఆర్ సూచించారు. ఇలాంటి మంచి సమావేశాన్ని నిర్వహించినందుకు సీఎంకు ధన్యవాదాలు. సీఎం కేసీఆర్ మంత్రివర్గంలో బీసీ సంక్షేమశాఖ మంత్రిగా ఉండటం నా అదృష్టం. నూతన రాష్ట్రంలో అణగారిన బీసీ వర్గాలను పైకి తీసుకురావడానికి చేపట్టాల్సిన కార్యక్రమాలపై చర్చించి నివేదిక ఇస్తామన్నారు.

**- జోగు రామన్న, అటవీ, బీసీ సంక్షేమశాఖల మంత్రి**

### బీసీలకు సీఎం కేసీఆర్‌పై విశ్వాసం పెరిగింది

**జనాభాలో** 54 శాతం ఉన్న బీసీ వర్గాలకు చెందిన ప్రజాప్రతినిధులతో ఏనాడు సమావేశాలు నిర్వహించలేదు. చరిత్రలో కూడా ఇలాంటి సమావేశాలు జరుగలేదు. పంచాయతీరాజ్ చట్టం ఆమోదానికి ఒకరోజు ప్రత్యేక అసెంబ్లీ సమావేశాలు పెట్టాలని అనుకున్నారు. కానీ బీసీ సమస్యలపై చర్చించి తీర్మానాలు చేయడానికి మరో రోజు కూడా సమావేశాలను పొడిగిస్తామని సీఎం కేసీఆర్ ప్రకటించారు. బీసీలకు సీఎం కేసీఆర్‌పై విశ్వాసం మరింత పెరిగింది. **- టీఆర్ఎస్ ఎమ్మెల్యే వీ శ్రీనివాస్‌గౌడ్**

### బీసీ సమస్యలకు శాశ్వత పరిష్కారం

**బీసీల** సమస్యలకు శాశ్వత పరిష్కారం చూపడానికి సీఎం కేసీఆర్ ఈ సమావేశాన్ని ఏర్పాటు చేశారు. విద్య, ఉద్యోగ, సంక్షేమ పథకాలు, రాజకీయంగా బీసీలకు సముచిత వాటా తదితర అంశాలపై చర్చించాం. బీసీల్లోని 113 కులాలకు పూర్తిస్థాయిలో న్యాయం జరిగే విధంగా వివిధ సంఘాల సలహాలు తీసుకోవాలి.

**- బీజేపీ ఎమ్మెల్యే కే లక్ష్మణ్**

### అన్ని పార్టీలను పిలువడం సంతోషకరం

**అన్ని** పార్టీలకు చెందిన బీసీ ప్రజాప్రతినిధులతో సమావేశం ఏర్పాటు చేయడం సంతోషకరం. చట్టసభల్లో రిజర్వేషన్లు కల్పించడానికి అఖిలపక్షాన్ని ఢిల్లీకి తీసుకవెళ్లాలి.

**- కాంగ్రెస్ ఎమ్మెల్సీ ఆకుల లలిత**

### బీసీల పట్ల సీఎం కేసీఆర్ నిబద్ధతకు నిదర్శనం

బీసీల ప్రగతికి రాష్ట్ర ప్రభుత్వం చేపడుతున్న చర్యలు చూస్తే ముఖ్యమంత్రి కే చంద్రశేఖర్‌రావుకు బీసీల పట్ల ఉన్న నిబద్ధత తెలుస్తున్నదని మాజీ ఎమ్మెల్యే శ్రీరాం భద్రయ్య, బీసీ సంక్షేమ సంఘం అధ్యక్షుడు జాజుల శ్రీనివాస్‌గౌడ్, రజక సంఘం రాష్ట్ర నాయకుడు కొండూరి సత్యనారాయణ ఆదివారం పేర్కొన్నారు. ఈ మేరకు వారు వేర్వేరు ప్రకటనలు విడుదల చేశారు.

### ఇలాంటి సమావేశాలు చరిత్రలో లేవు

**నేను** బీసీ సమస్యలపై 44 ఏండ్లుగా పోరాడుతున్నా. ఇలాంటి సమావేశాలను ఏనాడూ చూడలేదు. సమావేశం పెట్టడం గొప్ప విషయం. బీసీ సమస్యలపై ప్రత్యేకంగా చర్చ జరిపి పరిష్కరిద్దామని హామీ ఇచ్చారు. గతంలో ఏ ప్రభుత్వం కూడా బీసీ సమస్యలపై స్పందించలేదు. సీఎం కేసీఆర్ బాగా స్పందించారు. ఒక్కరోజులో సమస్యలకు పరిష్కారం దొరకదని.. మూడురోజులపాటు చర్చించి నిర్ణయం తీసుకోమని సీఎం సూచించారు. సమగ్రంగా చర్చించి.. ఏకగ్రీవంగా ఇచ్చే తీర్మానాలపై వెంటనే జీవోలు, అవసరమైతే చట్టాలు తెస్తామన్నారు. సీఎం కేసీఆర్‌కు కృతజ్ఞతలు చెప్తున్నా. బీసీ ఉద్యమ చరిత్రలో బీసీల సమస్యలపై ఒక ముఖ్యమంత్రి బీసీ ప్రజాప్రతినిధులతో సమావేశాన్ని ఏర్పాటు చేయగా ఎప్పుడూ చూడలేదు. బీసీవర్గాల సమస్యల పరిష్కారం కోసం మేం అనేక ఉద్యమాలు చేశాం. అసెంబ్లీని ముట్టడించాం.. లోపలికి సైతం చొచ్చుకువచ్చాం.. అయినా సమస్యలపై ముఖ్యమంత్రులు సానుకూలంగా స్పందించలేదు. సీఎం కేసీఆర్ బీసీలపై అసెంబ్లీలో ప్రకటించిన విధంగా ప్రజాప్రతినిధులందరితో సమావేశం ఏర్పాటు చేయడం గొప్ప విషయం. ఇది బీసీలకు శుభపరిణామం. బీసీలకు రూ.10వేల కోట్లతో సబ్‌ప్లాన్ ఏర్పాటు చేయాలి. జనాభా ప్రాతిపదికన బీసీలకు గురుకులాలు ఏర్పాటు చేయాలి. ఫీజు రీయింబర్స్‌మెంట్‌లో ఎస్సీ, ఎస్టీల మాదిరిగానే ర్యాంకులతో సంబంధంలేకుండా పూర్తి ఫీజును చెల్లించాలి. చట్టసభల్లో బీసీలకు రిజర్వేషన్లు, క్రీమీలేయర్ ఎత్తేయడం, ఓబీసీ మంత్రిత్వశాఖ ఏర్పాటు ఇలా.. కొన్ని అంశాలు కేంద్రానికి సంబంధించినవి ఉన్నాయి. వీటిపై మరోసారి అసెంబ్లీలో చర్చించి తీర్మానం చేసి కేంద్రానికి పంపుదామని సూచించాం. దీనికి సీఎం కేసీఆర్ అంగీకరించారు.

**- టీడీపీ ఎమ్మెల్యే ఆర్ కృష్ణయ్య**

**ముహూర్తం**

సూర్యోదయం: 6.35 గంటలకు

సూర్యాస్తమయం: 5.37 గంటలకు

హేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, హేమంతరుతువు, మార్గశిరమాసం, కృష్ణపక్షం, పాడ్యమి సాయంత్రం 5.32 వరకు, తదుపరి విదియ, నక్షత్రం: రోహిణి ఉదయం 6.23 వరకు, తదుపరి మృగశిర, అమృతఘడియలు: రాత్రి 7.40 నుంచి 9.16 వరకు, రాహుకాలం: ఉదయం 7.58 నుంచి 9.21 వరకు, దుర్ముహూర్తం: ఉదయం 11.44 నుంచి మధ్యాహ్నం 12.28 వరకు, తిరిగి మధ్యాహ్నం 2.41 నుంచి 3.25 వరకు, వర్జ్యం: ఉదయం 11.16 నుంచి మధ్యాహ్నం 12.52 వరకు.

**లోకం పోకడ**




కూడబెట్టుకున్న అక్రమాస్తుల్ని నేరుగా ఇంటికి రవాణా చేసుకున్నాడట!

# బీసీల కోసం ఏం చేస్తున్నాం.. ఇంకా ఏంచేయాలి!

- బీసీల అభివృద్ధికి వివిధ అధ్యయన కమిటీల నివేదికలు
- సమావేశంలో ప్రజాప్రతినిధులకు అందజేత
- వృత్తులు, కులాలవారీగా వర్గీకరణ
- రాష్ట్రంలో బీసీ కుటుంబాలు 53 లక్షలు, జనాభా 1.87 కోట్లు!

**హైదరాబాద్, నమస్తే తెలంగాణ:** రాష్ట్రంలో వెనుకబడిన కులాల జనాభాను, కుటుంబాల సంఖ్య, వీరి అభివృద్ధికి తీసుకోవాల్సిన చర్యలపై వివిధ అధ్యయన కమిటీలు నివేదికలను రూపొందించాయి. ఆదివారం జరిగిన సమావేశంలో వీటిని బీసీ ప్రజాప్రతినిధులకు అందజేశాయి. నివేదిక ప్రకారం ఆయా కులాలను సాధారణీకరించి ఆరురకాలుగా వర్గీకరించాయి. కులాలవారీగా అభివృద్ధి నమూనాను సమగ్రంగా రూపొందించాయి. ఆయావర్గాల అభివృద్ధికి ఏం చేయాలి? ఏం చేస్తున్నామనే వివరాలను నివేదికల్లో పొందుపరిచాయి. ఈ నివేదికల ప్రకారం.. రాష్ట్రంలో బీసీ కులాలకు చెందిన 53,11,620 కుటుంబాల్లో 1,87,75,358 మంది ఉన్నారు. సమగ్ర కుటుంబ సర్వేలో, ఇతర అందుబాటులో ఉన్న లెక్కల ప్రకారం సుమారు 8 లక్షల కుటుంబాలకు చెందిన 30.41 లక్షల జనాభాకు సంబంధించి క్షేత్రస్థాయిలో కులాలను గుర్తించాల్సి ఉన్నది. ఇతరాల కింద ఉన్న వీరికి కచ్చితమైన కుల వర్గీకరణ కోసం పౌరసరఫరాలశాఖ, స్కాలర్‌షిప్, పెన్షన్, డాటాబేస్‌లతో ఆధార్ సంఖ్య ఆధారంగా గుర్తించాలని నివేదికల్లో పేర్కొన్నారు.

ముఖ్యంగా వృత్తిపై ఆధారపడిన కులాలకు ఆయా వృత్తుల్లో నైపుణ్యం పెంచి, వృత్తిలో కొనసాగడానికి తీసుకోవాల్సిన చర్యలు, ప్రత్యామ్నాయ ఉపాధి మార్గాలు, బ్యాంకులతో సంబంధంలేకుండా వ్యక్తిగతంగా, సంఘాలపరంగా ఆర్థిక సహకారం అందించాలని ఈ నివేదికలు ప్రతిపాదించాయి. ఈ మేరకు ఇప్పటికే రాష్ట్రంలో తెలంగాణ గ్రామీణ ఆర్థిక స్వావలంబనకు స్వామి రామానందతీర్థ గ్రామీణ సంస్థ ద్వారా గ్రామీణ వృత్తివిద్యలో నైపుణ్యశిక్షణ ఇస్తున్నారు. ఈ సంస్థ ఏడాదికి 8 వేలమందికి శిక్షణ ఇస్తున్నది. దీన్ని వెనుకబడిన కులాల వృత్తివిద్య నైపుణ్యాల అభివృద్ధి కేంద్రంగా మార్చి, కులవృత్తిదారులకు శిక్షణ ఇస్తే వారి ఆదాయాన్ని పెంపొందించవచ్చునని తెలిపాయి.

**బీసీ కులాల అభివృద్ధికి అధ్యయన నివేదికలు చేసిన ప్రతిపాదనలు:**

- గొర్రెల కాపరుల కోసం.. ప్రభుత్వం 75 శాతం సబ్సిడీతో గొర్రెల పంపిణీ చేపట్టింది. గొర్రెల మేత కోసం యూనిట్లు పెంచాలని, మార్కెట్ వ్యవస్థను బలోపేతం చేయాలి.
- చేపలు పట్టే వారికోసం.. వందశాతం సబ్సిడీతో చేప పిల్లల పంపిణీ చేపట్టాలి. అన్నిరకాల చెరువులు, కుంటలపై ఆయా మత్స్యకార సంఘాలకే అధికారాలు అప్పగించాలి. మత్స్యకారుల్లో చదువుకున్న పిల్లల కోసం చేప విత్తనాల పెంపకం కేంద్రాల ఏర్పాటుకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు సబ్సిడీ అందించాలి.
- గీత కార్మికుల కోసం.. సొంత భూముల్లేని ప్రాంతాల్లో సొసైటీ సభ్యత్వాల సంఖ్య ఆధారంగా చెరువు గట్లపైన ఈత వనాల పెంపకానికి జాగా ఇవ్వాలి. నీర మార్కెటింగ్ కోసం ఆధునిక పద్ధతులు అవలంబించాలి.
- చేనేతరంగాన్ని బలోపేతం చేసేందుకు నిరుద్యోగ యువకులు వస్త్రవ్యాపారం చేసుకోవడానికి బీసీ కార్పొరేషన్ ద్వారా 50 శాతం సబ్సిడీపై రూ.5 లక్షల వరకు రుణ సౌకర్యం కల్పించాలి. ప్రపంచవ్యాప్తంగా ఆధునిక డిజైన్ల పరిశోధన, ఈ వృత్తిలోని పేదలకు ప్రత్యామ్నాయ ఉపాధి అవకాశాల కోసం ఆర్థిక సహకారం అందించాలి.
- 2.80 లక్షల కుటుంబాలున్న విశ్వబ్రాహ్మణులు ఐదు వృత్తుల్లో కొనసాగుతున్నారు. వీరిలో 2 లక్షల కుటుంబాలు దీనాతి దీనమైన స్థితిలో ఉన్నాయని గుర్తించారు. వీరికి వృత్తులవారీగా స్కిల్ డెవలప్‌మెంట్ సెంటర్లు ఏర్పాటుచేసి శిక్షణ ఇవ్వాలి. స్వర్ణకారులకు పోలీసుల వేధింపుల నుంచి రక్షణ, వడ్రంగులకు ఫారెస్ట్ అధికారుల వేధింపుల నుంచి రక్షణ, శిల్పులకు నాణ్యమైన రాయి క్వారీల కేటాయింపు, వృత్తిలో కొనసాగని వారికి ప్రత్యామ్నాయ ఉపాధి కోసం రూ.లక్ష ఆర్థిక సహకారం అందించాలి.
- రజకుల అభివృద్ధి కోసం ధోబీఘాట్‌ల నిర్మాణం, వాటికి ఉచిత విద్యుత్, బోర్, ఫెన్సింగ్లు ఏర్పాటు చేయాలి. కర్ణాటక రాష్ట్రంలో మాదిరిగా రూ.5 కోట్లతో ఎలక్ట్రికల్ వాషింగ్ మిషన్లు, డ్రైయింగ్ మిషన్, ప్రెసింగ్ మిషన్, ఒక షిఫ్టుకు 500 మంది వృత్తి చేసుకోవడానికి హాలు, ఇస్త్రీ చేయడానికి గదులు నిర్మించి ఇవ్వాలి.
- నాయీ బ్రాహ్మణుల కోసం.. గ్రామం నుంచి పట్టణాల వరకు ఆధునిక క్షౌరశాలల ఏర్పాటుకు ఆర్థికసాయం అందించాలి. కుమ్మరి వృత్తిదారులకు కుండల తయారీకి చెరువులోని బంకమట్టిని తీసుకునే హక్కు కల్పించడంతోపాటు ఆధునిక పరికరాలు అందించాలి. దూదేకుల వృత్తిని కొనసాగిస్తున్న వారికి ఆధునిక పరుపులు, అనుబంధ ఉత్పత్తులను తయారుచేసే యంత్రాలను సబ్సిడీపై అందించాలి. బోయల అభివృద్ధికి ప్రభుత్వం ప్రత్యేక కార్యక్రమాలు రూపొందించాలి.
- వడ్డెర వృత్తిదారులకు పరికరాలపై సబ్సిడీ ఇవ్వాలి. ఇఎండీ లేకుండా రూ.కోటి విలువైన పనిఇచ్చే అవకాశం కల్పించాలి. మేదర కులాల వారికి ఆధునిక ఉపకరణాల వినియోగాన్ని ప్రోత్సహించాలి. ఉప్పర/ సగర కులస్తులకు వృత్తికి అవసరమైన పరికరాల కొనుగోళ్లలో సబ్సిడీలు అందించడంతో పాటు ప్రభుత్వ కాంట్రాక్టులలో రూ.కోటి వరకు నామినేషన్ ద్వారా సొసైటీలకు పనులు అప్పగించాలి.
- మాంసం దుకాణాలు పెట్టుకొనే ఆరెకటికలకు ఆర్థిక సహకారం అందించి, సబ్సిడీపై పరికరాలు అందించాలి. నాన్‌వెజ్ మార్కెట్లలో మడిగలు కేటాయించాలి.
- మేదరి కులస్థుల కోసం అడవుల్లోఅంతరించిపోతున్న వెదుర్లు పెంచడానికి 15 నుంచి 20శాతం స్థలాలను కేటాయించాలి. హరితహారంలో భాగంగా ఇక్కడ మొక్కలు పెంచాలి.
- రాష్ట్రంలో వృత్తిని కోల్పోయిన 94 కులాలకు చెందిన 1,94,353 కుటుంబాల్లోని 6,95,652 మంది అగమ్యగోచర స్థితిలో ఉన్నారు. వీరంతా కులవృత్తులు కొనసాగించడానికి, ప్రత్యామ్నాయ ఉపాధి సౌకర్యాల కల్పనకు ఆర్థికసాయం అందించాలి. ప్రత్యామ్నాయ ఉపాధి కల్పన, స్కిల్ డెవలప్‌మెంట్ కోసం నిధులు కేటాయించాలి. వీరి విద్యాభివృద్ధికి ప్రత్యేక గురుకులాలు ప్రోత్సహించాలి. బాలిక విద్యపై ప్రత్యేక శ్రద్ధ పెట్టి, ప్రత్యేక నిధులు కేటాయించాలి.
- సంచార జాతుల వారు.. వర్షాకాలం మినహా ఏడాదంతా ఊరూరు తిరిగి భిక్షాటన చేసి బతుకుతున్నారు. రేషన్ కార్డు, ఆధార్‌కార్డు, చిరునామా కూడా లేక ఈ కుటుంబాలు దుర్భర దారిద్ర్యంలో బతుకుతున్నాయి. వీరిని సర్కారు అత్యవసరంగా పట్టించుకోవాలి. వీరి సంక్షేమానికి ప్రత్యేక బడ్జెట్‌ను కేటాయించి, ప్రత్యేక అధికారిని నియమించాలి
- 24 కులాలుగా ఉన్న ఆశ్రిత కులాల వారిని గుర్తించి బీసీ'ఏ' గ్రూప్‌లో చేర్చడంతోపాటు ప్రత్యేక నిధులు కేటాయించాలి. వీరి సంక్షేమం కోసం ప్రత్యేక అధికారిని నియమించి, ప్రత్యేక అభివృద్ధి కార్యక్రమాన్ని రూపొందించాలి.

**వృత్తులవారీగా బీసీకులాల వర్గీకరణ**

| వృత్తులవారీగా బీసీ కులాలు | కుటుంబాల సంఖ్య | జనాభా |
|---|---|---|
| వృత్తులు కొనసాగిస్తున్న కులాలు | 35,50,986 | 1,24,41,529 |
| వృత్తిని కోల్పోయిన నిరుపేద కులాలు | 1,94,353 | 6,95,652 |
| సంచార కులాలు | 42,420 | 1,50,672 |
| ఆశ్రిత కులాలు | 29,569 | 85,827 |
| వ్యవవసాయ ఆధారిత, ఇతర కులాలు | 6,94,292 | 23,60,678 |
| ఇతర కులాలు (కులాల పేర్లు పేర్కొననివి) | 8,00,000 | 30,41,000 |
| మొత్తం బీసీ కులాలు | 53,11,620 | 1,87,75,358 |

## కనురెప్పే కాటేసింది!

### బాలికపై సవితితండ్రి లైంగికదాడి

**బంజారాహిల్స్:** కన్నకూతురిలా చూసుకోవాల్సిన ఓ సవితి తండ్రి అమానుషంగా వ్యవహరించాడు. వావి వరుస మరిచి లైంగికవేధింపులకు పాల్పడ్డాడు. హైదరాబాద్ యూసుఫ్‌గూడ సమీపంలో ఉంటున్న ఓ వ్యక్తి ఇటీవల భార్యకు తెలియకుండా మరో పెండ్లి చేసుకున్నాడు. ఆమెకు అప్పటికే పన్నెండేండ్ల కూతురు ఉన్నది. ఆమెను లైంగికంగా వేధించాడు. ఈ విషయాన్ని గుర్తించిన స్థానికులు షీ టీమ్స్‌కు ఫిర్యాదుచేశారు. సవితి తండ్రి నుంచి బాలికను రక్షించిన వారు ఆమెను చైల్డ్‌లైన్ అధికారులకు అప్పగించారు. ఆ బాలిక.. సవితి తండ్రిపై ఫిర్యాదు చేయడంతో బంజారాహిల్స్ పోలీసులు కేసు నమోదుచేశారు. బాలికను నింబోలిఅడ్డాలోని బాలికా సంరక్షణ కేంద్రానికి తరలించారు.

# కన్నతల్లి కర్కశత్వం!

### కాలుతున్న పెంకపై కూతుర్ని కూర్చోబెట్టి పైశాచికం

### వివాహేతర సంబంధానికి అడ్డుగా ఉన్నదని ఘాతుకం



ఎస్సార్‌నగర్ పోలీసుల అదుపులో నిందితులు వై నారాయణ, లలిత మహాపాత్రో

**అమీర్‌పేట్:** నవమాసాలు మోసి.. పేగు తెంచుకొని జన్మనిచ్చిన కూతురిపై ఓ తల్లి కిరాతకంగా వ్యవహరించింది. వివాహేతర సంబంధానికి అడ్డొస్తున్నదని కాలుతున్న పెంకపై కూర్చొబెట్టి పైశాచిక ఆనందం పొందింది. ఈ హృదయ విదారకర ఘటన హైదరాబాద్ ఎస్సార్‌నగర్ పోలీస్‌స్టేషన్ పరిధిలో శనివారం జరిగింది. ఒడిశాకు చెందిన లలిత మహాపాత్రో (25)కు నాలుగేండ్ల కూతురు ఉన్నది. ఆమె భర్తతో కలిసి ఉండటం లేదు. గతంలో శ్రీకాకుళంలో ఇచ్ఛాపురంలో పనిచేస్తుండగా వై నారాయణతో ఆమెకు పరిచయం ఏర్పడింది. ఆ క్రమంలోనే వారి మధ్య సాన్నిహిత్య పెరిగింది. వీరిద్దరూ గతేడాది ఎస్ఆర్‌నగర్‌లోని వెస్ట్ శ్రీనివాస్‌కాలనీకి వచ్చారు. పద్మావతి హాస్టల్‌లో లలిత వంటమనిషిగా, నారాయణ వాచ్ మెన్‌గా పనిచేస్తున్నాడు. తమ ఏకాంతానికి అడ్డుగా ఉన్నదని ఆ చిన్నారిని కాలుతున్న పెంకపై కూర్చోబెట్టారు. మంటల వేడికి ఆ పాప అరువడంతో చుట్టుపక్కలవారు రావడంతో కూతురిని దవాఖానకు తీసుకెళ్తానని చెప్పి వెళ్లిపోయింది. నాంపల్లిలోని భరోసా సెంటర్‌కు వెళ్లి ఆ చిన్నారి తన కూతురు కాదని బుకాయించింది. లలితపై అనుమానం వచ్చిన భరోసా సిబ్బంది విషయాన్ని చైల్డ్‌లైన్‌కు తెలిపారు. వారు ఎస్సార్‌నగర్ పోలీసుల దృష్టికి తీసుకుపోగా వారి విచారణలో అసలు విషయాన్ని ఒప్పుకొని అంగీకరించింది. తమకు అడ్డుగా ఉండటంవల్లే వదిలించేకునేందుకు భరోసా సెంటర్‌కు తీసుకెళ్లానని చెప్పింది. తీవ్రగాయాలైన బాలికను చైల్డ్‌లైన్ అధికారులు దవాఖానకు తరలించి చికిత్స అందిస్తున్నారు. చైల్డ్‌లైన్ అధికారుల ఫిర్యాదుమేరకు తల్లిని, మారుతండ్రిని పోలీసులు అరెస్ట్‌చేశారు.



కాలుతున్న పెంకపై కూర్చోబెట్టడంతో తీవ్రంగా గాయపడిన బాలిక




హైదరాబాద్ బోయిన్‌పల్లి మార్కెట్‌లో ఆదివారం ఈ-సేవ శిక్షణ తరగతులను జ్యోతిని వెలిగించి ప్రారంభిస్తున్న మంత్రి హరీశ్‌రావు. చిత్రంలో ఎమ్మెల్యేలు ముత్తిరెడ్డి యాదగిరిరెడ్డి, ఆల వెంకటేశ్వర్‌రెడ్డి తదితరులు

## ఇక అన్ని మార్కెట్లలో ఈ-నామ్

- ఈ-నామ్ విధానంతో దళారీ వ్యవస్థకు చెక్
- టెక్నాలజీని అందిపుచ్చుకోవాలి
- అక్రమాలకు పాల్పడితే సహించం
- వ్యవసాయ, మార్కెటింగ్‌శాఖలో ఈ-సేవలపై శిక్షణను ప్రారంభించిన మంత్రి హరీశ్‌రావు

**హైదరాబాద్, నమస్తే తెలంగాణ:** రాష్ట్రంలోని అన్ని మార్కెట్లలో 2018 వానాకాలం పంట నాటికి ఈ-నామ్ వ్యవస్థను అమలుచేయాలని మార్కెటింగ్‌శాఖ మంత్రి హరీశ్‌రావు అధికారులను ఆదేశించారు. ఈ-నామ్ విధానం వల్ల మార్కెట్లలో దళారీ వ్యవస్థ పోతుందని, రైతులకు గిట్టుబాటు ధర వస్తుందని పేర్కొన్నారు. హైదరాబాద్ బోయిన్‌పల్లి మార్కెట్‌లో ఆయన ఆదివారం ఈ-సేవ శిక్షణ తరగతులను ప్రారంభించారు. ఈ-నామ్‌పై అవగాహన పెంచేందుకు, అమలు చేసేందుకు ఈ-సేవ శిక్షణ తరగతులు నిర్వహిస్తున్నామని, ఆరురోజులపాటు కొనసాగుతాయని చెప్పారు. ఈ-నామ్ ద్వారా పోటీతత్వం పెరుగాలని, మద్దతు ధర తెలుసుకోవాలని రైతులకు సూచించారు. 46 మార్కెట్లలో ఈ-నామ్ ఉపయోగిస్తున్నామని, అనేక కొత్త సంస్కరణలు ప్రవేశపెట్టామని మంత్రి వివరించారు. ఈ-నామ్ వినియోగంలో నిజామాబాద్ మార్కెట్ దేశంలోనే మొదటిస్థానంలో నిలిచిందని గుర్తుచేశారు. ప్రతి ఒక్క లావాదేవీ ఆన్‌లైన్‌లో జరిగేలా చర్యలు తీసుకోవాలని అధికారులను ఆదేశించారు. మార్కెటింగ్‌శాఖకు సీఎం కేసీఆర్ అధిక నిధులు కేటాయించారని తెలిపారు. వ్యవసాయ మార్కెట్‌లో అక్రమాలకు పాల్పడితే సహించేది లేదని మంత్రి హరీశ్‌రావు హెచ్చరించారు. ప్రతి మండలానికి ఒక గోదాము చొప్పున, రాష్ట్రవ్యాప్తంగా 18 లక్షల టన్నుల సామర్థ్యమున్న గోదాములు నిర్మించినట్టు తెలిపారు. హైదరాబాద్‌లో 'మన కూరగాయల స్టాల్స్'ను ఏర్పాటు చేయటం వల్ల స్వచ్ఛమైన కూరగాయలు ప్రజలకు అందుబాటులోకి వచ్చాయని చెప్పారు. నల్లగొండలో బత్తాయి, నిమ్మ మార్కెట్లను వారంరోజుల్లో ప్రారంభించనున్నట్టు వెల్లడించారు. వ్యవసాయ, మార్కెటింగ్‌శాఖలో టెక్నాలజీని బాగా వినియోగిస్తున్నారని, అధికారులు అద్భుతంగా పనిచేస్తున్నారని మంత్రి హరీశ్‌రావు అభినందించారు. మార్కెటింగ్‌శాఖలో రైతుల ముసుగులో ట్రేడర్లు హమాలీలతో దాడులు చేయిస్తారని, వారిని గుర్తించి లైసెన్స్ రద్దు చేయాలని అధికారులకు సూచించారు. కార్యక్రమంలో ఎమ్మెల్యేలు ముత్తిరెడ్డి యాదగిరిరెడ్డి, ఆల వెంకటేశ్వర్‌రెడ్డి, మార్కెటింగ్ కమిటీ చైర్మన్‌తోపాటు పలువురు అధికారులు పాల్గొన్నారు.

# దివ్యాంగుల అభ్యున్నతికి ప్రత్యేకచర్యలు

- రిజర్వేషన్ల పెంపునకు కృషి చేస్తాం.. దివ్యాంగుల హక్కులను పరిరక్షిస్తాం
- డిప్యూటీ సీఎం మహమూద్ అలీ, మంత్రి తుమ్మల నాగేశ్వర్‌రావు ప్రకటన
- మెట్రోలో ప్రత్యేక వసతులు కల్పిస్తామన్న సీఎండీ ఎన్వీఎస్ రెడ్డి
- ఘనంగా ప్రపంచ దివ్యాంగుల దినోత్సవం




హైదరాబాద్ రవీంద్రభారతిలో ఆదివారం ప్రపంచ దివ్యాంగుల దినోత్సవ కార్యక్రమంలో మాట్లాడుతున్న డిప్యూటీ సీఎం మహమూద్ అలీ. చిత్రంలో మంత్రి తుమ్మల నాగేశ్వర్‌రావు, రాష్ట్ర వికలాంగుల కార్పొరేషన్ చైర్మన్ డాక్టర్ కేతిరెడ్డి వాసుదేవరెడ్డి, ఎస్సీ కార్పొరేషన్ చైర్మన్ పిడమర్తి రవి, సినీ దర్శకుడు అనిల్ రావిపూడి, సినీ నటి జీవిత తదితరులు



నాగిళ్ల రాజిరెడ్డిని బెస్ట్ సోషల్ వర్కర్ అవార్డుతో సత్కరిస్తున్న డిప్యూటీ సీఎం మహమూద్ అలీ, మంత్రి తుమ్మల

**హైదరాబాద్, నమస్తే తెలంగాణ/కూకట్‌పల్లి/తెలుగు యూనివర్సిటీ:**

దివ్యాంగుల అభ్యున్నతికి రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేక చర్యలు తీసుకుంటున్నదని డిప్యూటీ సీఎం మహమూద్‌అలీ పేర్కొన్నారు. ప్రభుత్వం ప్రతిష్ఠాత్మకంగా చేపట్టిన డబుల్ బెడ్‌రూం ఇండ్లల్లో దివ్యాంగులకు ప్రాధాన్యం కల్పిస్తామన్నారు. ఆదివారం హైదరాబాద్ రవీంద్రభారతిలో దివ్యాంగుల, వయోవృద్ధుల సంక్షేమశాఖ ఆధ్వర్యంలో ప్రపంచ దివ్యాంగుల దినోత్సవం నిర్వహించారు. ఈ కార్యక్రమంలో డిప్యూటీ సీఎం మహమూద్ అలీ మాట్లాడుతూ.. దివ్యాంగులు పురోగతితోనే బంగారు తెలంగాణ సాధ్యమని పేర్కొన్నారు. వికలాంగులకు ఆరు శాతం రిజర్వేషన్లు పెంచేలా సీఎంతో చర్చించి అమలుకు కృషి చేస్తామన్నారు. అనంతరం మంత్రి తుమ్మల నాగేశ్వర్‌రావు మాట్లాడుతూ.. ముఖ్యమంత్రి కే చంద్రశేఖర్‌రావు రాష్ట్రంలో అన్ని వర్గాల ప్రజల సమస్యలను పరిష్కరిస్తున్నారని తెలిపారు. దివ్యాంగుల హక్కుల పరిరక్షణకు ప్రభుత్వం కట్టుబడి ఉందన్నారు. ఆసరాపథకం కింద దాదాపు 5 లక్షల మంది దివ్యాంగులకు ప్రభుత్వం నెలకు రూ.1500 పెన్షన్‌ను పంపిణీ చేస్తున్నదని తెలిపారు. దివ్యాంగుల క్రీడల కోసం ప్రభుత్వం ప్రతి జిల్లాకు లక్ష రూపాయలు కేటాయించిందన్నారు. మామిడిపల్లిలో 10 ఎకరాల స్థలంలో దివ్యాంగుల కోసం ప్రత్యేక ఐటీ పార్కు ఏర్పాటు చేయనున్నట్టు మంత్రి తెలిపారు. దివ్యాంగుల కోసం ప్రత్యేక వాహనాలు అందిస్తున్నామని తెలిపారు. రూ.8 కోట్ల వ్యయంతో దివ్యాంగుల కోసం సర్కార్ ఉపకరణాలను పంపిణీ చేసిందన్నారు.

**దివ్యాంగులది స్వచ్ఛమైన మనస్సు**

దివ్యాంగులది స్వచ్ఛమైన మనస్సు అని నటి జీవిత పేర్కొన్నారు. దివ్యాంగుల సంక్షేమం కోసం ఎంతో కృషి చేస్తున్న సీఎం కేసీఆర్‌కు ప్రతి ఒక్కరూ సహకరించాలని కోరారు. సినీ దర్శకుడు అనిల్ రావిపూడి మాట్లాడుతూ.. అదృష్టం అనేది ఎవరికి ఎదురుపడదని.. దాన్ని అందిపుచ్చుకోవాలని సూచించారు. దివ్యాంగుడిని ప్రధానపాత్రదారుడిగా పెట్టి సినిమా తీసే అవకాశం తనకు రావడం అదృష్టంగా భావిస్తున్నట్టు తెలిపారు.

**సబ్సిడీ రుణాలు**

దివ్యాంగులు ఆత్మగౌరవంతో జీవించేలా రాష్ట్ర ప్రభుత్వం అన్ని చర్యలు తీసుకుంటుందని వికలాంగుల సహకార సంస్థ చైర్మన్ డాక్టర్ కేతిరెడ్డి వాసుదేవ రెడ్డి తెలిపారు. దివ్యాంగులను పెళ్లి చేసుకునే వారికి ఇచ్చే ప్రోత్సాహక బహుమతిని కూడా రాష్ట్ర ప్రభుత్వం పెంచిందని పేర్కొన్నారు. వారికి ప్రభుత్వం సబ్సిడీ రుణాలను అందిస్తున్నదన్నారు. మెట్రో రైల్ ఎండీ ఎన్వీఎస్ రెడ్డి మాట్లాడుతూ.. హైదరాబాద్ మెట్రోరైల్‌లో దివ్యాంగులకు ప్రత్యేక వసతులు కల్పించినట్టు చెప్పారు. మెట్రో ప్లాట్‌ఫాంపై బ్రెయిలీ లిపిలో గాడ్ ఏర్పాటు చేశామని.. వీల్‌చైర్ ప్లాట్‌ఫాంపైకి చేరేలా ర్యాప్‌లను రూపొందించినట్టు తెలిపారు. కార్యక్రమంలో రాష్ట్ర దివ్యాంగులు, వయోవృద్ధుల సంక్షేమశాఖ కార్యదర్శి ఎం జగదీశ్, కమిషనర్ బీ శైలజ, రాష్ట్ర వికలాంగుల కార్పొరేషన్ చైర్మన్ డాక్టర్ కేతిరెడ్డి వాసుదేవరెడ్డి, ఎస్సీ కార్పొరేషన్ చైర్మన్ పిడమర్తి రవి, సినీ దర్శకుడు అనిల్ రావిపూడి, సినీ నటి జీవిత, ఉత్సవాల నిర్వహణ కమిటీ సభ్యులు పాల్గొన్నారు. అనంతరం మెట్రో ఎండీ ఎన్వీఎస్‌రెడ్డిని మంత్రులు సన్మానించారు.

**రాజిరెడ్డికి బెస్ట్ సోషల్ వర్కర్ అవార్డు ప్రదానం**

వికలాంగుల సంక్షేమానికి కృషి చేస్తున్న వికలాంగుల సంక్షేమ సంఘం రాష్ట్ర అధ్యక్షుడు, టీఆర్ఎస్ సీనియర్ నాయకడు నాగిళ్ల రాజిరెడ్డిని మంత్రులు మహమూద్ అలీ, తుమ్మల నాగేశ్వర్‌రావు బెస్ట్ సోషల్ వర్కర్ అవార్డుతో సత్కరించారు. ఈ సందర్భంగా నాగిరెడ్డి మాట్లాడుతూ గత 30 ఏండ్లుగా వికలాంగుల సంక్షేమానికి కృషి చేస్తున్న తనను రాష్ట్ర ప్రభుత్వం గుర్తించి అవార్డు ప్రదానం చేయడం సంతోషంగా ఉందన్నారు.

## బీసీ సంక్షేమానికి సర్కారు ప్రాధాన్యం

### బడ్జెట్‌లో రూ.5240.28 కోట్లు కేటాయింపు

**హైదరాబాద్, నమస్తే తెలంగాణ:** బీసీల సంక్షేమానికి రాష్ట్ర ప్రభుత్వం అత్యధిక ప్రాధాన్యమిస్తున్నది. గతంలో ఎన్నడూ లేని విధంగా 2017-18 ఆర్థిక సంవత్సరంలో బీసీ సంక్షేమం, అభివృద్ధి కోసం రూ.5240.28 కోట్లు నిధులు కేటాయించింది. ఎంబీసీ కార్పొరేషన్ ద్వారా వెనుకబడిన కులాల అభ్యున్నతి కోసం ప్రభుత్వం రూ.వెయ్యి కోట్లు కేటాయించి.. ఇప్పటి వరకు రూ.304 కోట్లు విడుదల చేసింది. బీసీలకు ఇప్పటి వరకు కేటాయించిన నిధులు, ఖర్చుకు సంబంధించిన వివరాలను ప్రభుత్వం బీసీ ప్రజాప్రతినిధులకు అందజేసింది. బీసీ కులాల్లోని చిన్నారులు పాఠశాల స్థాయినుంచే మెరుగైన విద్యను పొందేందుకు జ్యోతిబాపూలే గురుకులాలను సమర్థంగా నిర్వహిస్తున్నది. రాష్ట్రం ఏర్పడక ముందు 2014 జూన్ 2 నాటికి 95 బీసీ గురుకులాలు ఉండగా, 2016-17లో అదనంగా 4 గురుకులాలను ఏర్పాటు చేశారు. 2017-18 విద్యా సంవత్సరంలో 119 బీసీ గురుకులాలను ఏర్పాటు చేసి బీసీ విద్యార్థులకు ఉన్నత ప్రమాణాలతో విద్యను అందిస్తున్నది. రాష్ట్రవ్యాప్తంగా నాణ్యతా ప్రమాణాలతో 450 సంక్షేమ వసతి గృహాలను నిర్వహిస్తున్నారు. మహాత్మా జ్యోతిబాపూలే బీసీ ఓవర్సీస్ విద్యానిధి పథకం ద్వారా ఏటా 300 మంది బీసీ విద్యార్థులు విదేశాల్లో చదువుకునేందుకు ప్రభుత్వం ఒక్కో విద్యార్థికి రూ.20 లక్షల ఆర్థిక సాయమందిస్తున్నది. 2017-18 విద్యాసంవత్సరానికి గాను ప్రభుత్వం రూ.20 కోట్లు విడుదల చేసింది. ఆన్‌లైన్లో నమోదు చేసుకున్న 207 మందిని త్వరలోనే ఇంటర్వ్యూ నిర్వహించి ఎంపిక చేయనున్నారు. బీసీ కార్పొరేషన్ ఫెడరేషన్ల ద్వారా 2015-16 ఆర్థిక సంవత్సరానికి సంబంధించిన బకాయిల చెల్లింపునకు ప్రభుత్వం రూ.102.08 కోట్ల నిధులను విడుదల చేసింది. ఇప్పటి వరకు ప్రభుత్వం బీసీ కార్పొరేషన్‌కు రూ.7,193కోట్లు, రజక ఫెడరేషన్‌కు రూ.1.93కోట్లు, భట్రాజు ఫెడరేషన్‌కు రూ.30లక్షలు, విశ్వబ్రాహ్మణ ఫెడరేషన్‌కు రూ.5.09కోట్లు, కుమ్మరి మిషన్ ఫెడరేషన్ రూ.6.79కోట్లు, మేదర ఫెడరేషన్‌కు రూ.1.21కోట్లు, గీతకార్మికుల కార్పొరేషన్‌కు రూ.1.40కోట్లను ప్రభుత్వం కేటాయించింది.



ఆదివారం నెక్లెస్‌రోడ్‌లోని పీపుల్స్‌ప్లాజా వద్ద దివ్యాంగుల అవగాహన వాక్‌ను ప్రారంభిస్తున్న అసెంబ్లీ స్పీకర్ మధుసూదనాచారి

## వికలాంగులకు అన్ని విధాలుగా చేయూత

### శాసనసభ స్పీకర్ మధుసూదనాచారి

### నెక్లెస్‌రోడ్‌లో వికలాంగుల అవగాహన నడక

**ఖైరతాబాద్:** తెలంగాణ కీర్తి కిరీటంలో దివ్యాంగులు కలికితురాళ్లుగా వెలుగొందుతారని అసెంబ్లీ స్పీకర్ సిరికొండ మధుసూదనాచారి పేర్కొన్నారు. ప్రపంచ వికలాంగుల దినోత్సవం సందర్భంగా నెక్లెస్‌రోడ్‌లోని పీపుల్స్‌ప్లాజాలో అఖిల భారత వికలాంగుల హక్కుల వేదిక అధ్యక్షుడు, డిసేబుల్డ్ అవేర్‌నెస్ వాక్ కో-ఆర్డినేటర్ కొల్లి నాగేశ్వర్‌రావు ఆధ్వర్యంలో వికలాంగుల నడకను నిర్వహించారు. ఈ కార్యక్రమానికి స్పీకర్ మధుసూదనాచారి, రాష్ట్ర మంత్రి జోగురామన్న ముఖ్య అతిథులుగా హాజరయ్యారు. సీఎం కేసీఆర్ అన్నివర్గాల ప్రజలను ఆదుకుంటున్నారని, ప్రతిఒక్కరూ అంకితభావంతో వికలాంగులకు చేయూతనివ్వాలని వారు పిలుపునిచ్చారు. వికలాంగుల కోసం ప్రభుత్వం బెంగళూరులో ఓ సాఫ్ట్‌వేర్ సంస్థతో ఒప్పందం చేసుకొని వారికి ప్రత్యేక శిక్షణ ఇప్పించాలని సంకల్పించారన్నారు. కార్యక్రమంలో ఏపీవీసీసీ మాజీ చైర్మన్ పీ సాయిబాబా, సరస్వతీ ఉపాసకుడు దైవజ్ఞశర్మ, హెచ్‌పీసీఎల్ రీజనల్ మేనేజర్ సీహెచ్ శ్రీనివాస్, హెలెన్ కెల్లర్ ఇన్‌స్టిట్యూట్ చైర్మన్ లయన్ పీ ఉమర్‌ఖాన్, డాక్టర్ వంశీ రామరాజు, శ్రీ విద్య స్పెషల్ స్కూల్ కార్యదర్శి శాంతి వెంకట్ పాల్గొన్నారు.

# రిజిస్ట్రేషన్లపై కెమెరా కన్ను

- తెలంగాణకు ప్రత్యేక సర్వర్ ఏర్పాటు
- సర్వర్ డౌన్ ముచ్చటే లేదు
- ఇక మరింత పారదర్శకంగా రిజిస్ట్రేషన్ ప్రక్రియ
- రాష్ట్రవ్యాప్తంగా 144 సబ్‌రిజిస్ట్రేషన్, 12 జిల్లా రిజిస్ట్రార్, ఆరు డీఐజీ కార్యాలయాల్లో అమలు

**ప్రత్యేకప్రతినిధి, నమస్తే తెలంగాణ:** రాష్ట్రంలోని అన్ని రిజిస్ట్రేషన్ కార్యాలయాలు సోమవారం నుంచి కెమెరాల నిఘా కిందకు వచ్చేస్తున్నాయి. ఇప్పటికే ప్రయోగాత్మకంగా హైదరాబాద్ చిక్కడపల్లి సబ్‌రిజిస్ట్రార్ కార్యాలయంలో కెమెరాల నిఘాలో రిజిస్ట్రేషన్లు నిర్వహిస్తున్న రాష్ట్ర సర్కారు.. దీన్ని రాష్ట్రవ్యాప్తంగా అమలుచేసేందుకు సర్వం సిద్ధంచేసింది. రిజిస్ట్రార్ కార్యాలయాల్లో అవినీతి అక్రమాలకు చెక్ పెట్టేందుకు, రిజిస్ట్రేషన్ ప్రక్రియలో మరింత పారదర్శకతను తీసుకొచ్చేందుకు ముందడుగు వేసింది. ఈ మేరకు రిజిస్ట్రేషన్ కార్యాలయంలో సబ్‌రిజిస్ట్రార్ ముందు, వెనుక ఒక్కో కెమెరాను అమర్చారు. రాష్ట్రంలో రిజిస్ట్రేషన్ల కోసం ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ అండ్ కమ్యూనికేషన్ (ఐటీ అండ్ సీ) డిపార్టుమెంట్ ఆధ్వర్యంలో గచ్చిబౌలి స్టేట్ డాటా సెంటర్‌లో ప్రత్యేక సర్వర్‌ను ఏర్పాటుచేశారు. ఇప్పటివరకు ఆంధ్రప్రదేశ్, తెలంగాణ రాష్ట్రాలకు కలిపి ఉమ్మడిగా ఉన్న సర్వర్‌ను ఇప్పుడు వేరుచేశారు. కొత్త సర్వర్‌కు మొత్తం డాటాను అనుసంధానం చేసే పని దాదాపుగా పూర్తయింది. దీనికోసం స్థిరాస్తుల రిజిస్ట్రేషన్లకు శుక్రవారం సెలవు ప్రకటించిన విషయం తెలిసిందే. నాటి నుంచి మూడురోజులపాటు యుద్ధప్రాతిపదికన డాటా బదిలీ చేపట్టారు. సోమవారం నుంచి రాష్ట్రంలోని అన్ని రిజిస్ట్రేషన్ కార్యాలయాలు కెమెరాల నిఘా కిందకు వస్తున్నాయి. సాఫ్ట్‌వేర్, హార్డ్‌వేర్ల మార్పువంటి పనులను స్టాంపులు, రిజిస్ట్రేషన్‌శాఖ జాయింట్ కమిషనర్ వేముల శ్రీనివాసులు పర్యవేక్షిస్తున్నారు. కొత్తగా వెబ్ కెమెరాలు, స్కానర్లు, ప్రింటర్లు, ప్రత్యేక సర్వర్, డెడికేటెడ్ లైన్లతో రిజిస్ట్రేషన్ల ప్రక్రియ మరింత వేగంగా జరుగనున్నది. రాష్ట్రవ్యాప్తంగా ఉన్న 144 సబ్‌రిజిస్ట్రేషన్ కార్యాలయాలు, 12 జిల్లా రిజిస్ట్రార్ కార్యాలయాలు, ఆరు డీఐజీ కార్యాలయాల్లో ఇండియన్ రైల్వేకు చెందిన రెయిల్‌టెల్ సాఫ్ట్‌వేర్ సంస్థ డెడికేటెడ్ లైన్లను ఏర్పాటుచేసింది. ఇందుకోసం రాష్ట్రప్రభుత్వం రెయిల్‌టెల్‌కు ఏడాదికి రూ.1.20 కోట్లు చెల్లించనుంది. ఇంతవరకు లీజ్డ్ లైన్ల వల్ల తరుచూ సాంకేతిక సమస్యలు తలెత్తేవి. కానీ డెడికేటెడ్ లైన్ల ఏర్పాటుతో ఈ సమస్యకు శాశ్వత పరిష్కారం లభించినట్టేనని అధికారులు చెప్తున్నారు. ప్రస్తుతం 90శాతం రిజిస్ట్రేషన్ కార్యాలయాలు అద్దె భవనాల్లోనే ఉన్నాయి. అవికూడా ఇరుకుగా ఉండటం, ఆ శాఖలో కొన్నిపోస్టులు ఖాళీగా ఉండటం వల్ల ఇప్పటికిప్పుడు వీడియో చిత్రీకరణను అమలుచేసి సీడీ ఇవ్వడం సాధ్యంకాదని పలు ఉద్యోగసంఘాల నాయకులు ఆ శాఖ కమిషనర్‌కు నివేదించారు. దీంతో తాత్కాలికంగా వీడియో చిత్రీకరణను వాయిదా వేసినట్టు తెలిసింది. కొత్త భవనాల నిర్మాణం, ఖాళీల భర్తీ పూర్తయిన వెంటనే వీడియో చిత్రీకరణ అమలుచేయాలని ఉద్యోగసంఘాల విజ్ఞప్తిని ఉన్నతాధికారులు పరిగణనలోకి తీసుకున్నట్టు సమాచారం.

**ఆధునీకరించడంపై ఉద్యోగసంఘాల హర్షం**

ఉమ్మడి ఏపీ నిర్లక్ష్యానికి గురైన సబ్‌రిజిస్ట్రార్ కార్యాలయాలను రాష్ట్ర ప్రభుత్వం ఆధునీకరించడంపై రిజిస్ట్రేషన్‌శాఖ ఉద్యోగసంఘాలు హర్షం వ్యక్తంచేశాయి. ప్రభుత్వ చర్యలు రిజిస్ట్రేషన్ ప్రక్రియలో వేగాన్ని పెంచి, మరింత పారదర్శకతను తీసుకొస్తాయని రాష్ట్ర టీజీవో కోశాధికారి గోన విష్ణువర్ధన్‌రావు, ఉపాధ్యక్షుడు సామల సహదేవ్, రిజిస్ట్రేషన్‌శాఖ ఉద్యోగసంఘాల అధ్యక్షుడు స్థితప్రజ్ఞ, హైదరాబాద్ టీఎన్జీవో అధ్యక్షుడు ముజీబ్ చెప్పారు.

## రజకుల సంక్షేమానికి రూ.250 కోట్లు

### ప్రస్తుత బడ్జెట్‌లో నిధులు కేటాయించిన సర్కారు

### ఆధునిక పద్ధతుల్లో వృత్తి నిర్వహణకు పథకాలు

**హైదరాబాద్, నమస్తే తెలంగాణ:** రాష్ట్రంలోని రజకుల సంక్షేమానికి సర్కారు 2017-18 బడ్జెట్‌లో రూ.250 కోట్లను కేటాయించింది. ఈ మేరకు ఆధునిక పద్ధతుల్లో వారి వృత్తిని కొనసాగించేందుకు సహకారాన్ని అందించేలా పథకాలను రూపొందించింది. తెలంగాణ ప్రభుత్వం గతంలో నిర్వహించిన సమగ్ర కుటుంబ సర్వే ప్రకారం.. రాష్ట్రంలో 2,51,398 రజక కుటుంబాలు ఉండగా.. జనాభా 8,66,243గా ఉన్నది. రాష్ట్రవ్యాప్తంగా 2,862 గుర్తింపు పొందిన రజక సంఘాలలో 6 95,496 మంది సభ్యులు ఉన్నారు. బడ్జెట్‌లో కేటాయించిన నిధుల్లో.. ఆర్థిక సహాయం అందించే పథకాలకు రూ.180 కోట్లు కేటాయించారు. మొదటి దశలో రూ.126 కోట్లు, రెండో దశలో 56 కోట్లను వెచ్చించాలని ప్రణాళిక రూపొందించారు. వృత్తి నైపుణ్యాన్ని పెంపొందించేందుకుగాను రూ.20 కోట్లను కేటాయించారు. మిగిలిన రూ.50 కోట్లతో ఆధునిక దోబీ ఘాట్ల నిర్మాణంతో పాటు 75 ఆధునిక యంత్రాలతో లాండ్రీలను ఏర్పాటు చేయాలని నిర్ణయించారు. అయితే ఇందుకు సంబంధించి లబ్ధిదారుల ఎంపిక ప్రక్రియను కూడా పూర్తి చేశారు. మొదటి దశలో 612 సంఘాలను ఎంపిక చేయగా... వాటి ద్వారా 9,168 మంది రజకులు లబ్ధి పొందనున్నారు. రెండోదశలో 262 సంఘాల ద్వారా మరో 3,925 మంది లబ్ధి పొందనున్నారు. వ్యక్తిగతంగా ఆర్థిక సహాయాన్ని అందించే పథకానికిగాను 13,093 మంది లబ్ధిదారులను ఎంపిక చేశారు. ఆధునిక దోబీ ఘాట్లు, లాండ్రీల ద్వారా మరో 5127 మంది లబ్ధి పొందనున్నారు.

## రేషన్ డీలర్లకు మరో అవకాశం

- డీడీలు కట్టేందుకు నేటి సాయంత్రం వరకు గడువు
- హర్షం వ్యక్తంచేసిన రేషన్‌డీలర్లు
- మంత్రి ఈటల హామీతో సమ్మె విరమిస్తున్నట్టు ప్రకటన

**హైదరాబాద్, నమస్తే తెలంగాణ:** రాష్ట్ర పౌరసరఫరాలశాఖకు డీడీలు చెల్లించేందుకు రేషన్ డీలర్లకు ప్రభుత్వం సోమవారం సాయంత్రం ఆరుగంటల వరకు అనుమతినిచ్చింది. సాంకేతిక సమస్యల కారణంగా కొందరు డీలర్లు డీడీలు చెల్లించలేకపోయారని రాష్ట్ర రేషన్ డీలర్ల సంక్షేమ సంఘం అధ్యక్షుడు బత్తుల రమేశ్ సహా 18 జిల్లాల అధ్యక్ష కార్యదర్శులు ఆదివారం పౌరసరఫరాల శాఖ మంత్రి ఈటల రాజేందర్‌కు వివరించారు. మరో రోజు అవకాశం కల్పించాలని వేడుకోవడంతో చివరి అవకాశంగా సోమవారం కూడా డీడీలు చెల్లించే అవకాశం కల్పించారు. ఈ విషయాన్ని సంఘం అధ్యక్షుడు బత్తుల రమేశ్ మీడియాకు తెలిపారు. గౌరవ వేతనాల విషయంలో చర్చించేందుకు సీఎం కేసీఆర్ వద్దకు తమను తీసుకెళ్తానని మంత్రి ఈటల హామీ ఇచ్చారని చెప్పారు. డీడీలు చెల్లించడంతోపాటు సోమవారం నుంచి రేషన్ దుకాణాలు తెరుస్తామని స్పష్టంచేశారు. ప్రభుత్వం నుంచి స్పష్టమైన హామీ వచ్చినందునే సమ్మెను విరమిస్తున్నామని ప్రకటించారు. రేషన్‌డీలర్లకు సర్కారు ఇచ్చిన గడువు శనివారంతో ముగిసింది. రాష్ట్రవ్యాప్తంగా మొత్తం 16,200 రేషన్ డీలర్లు ఉండగా.. శనివారం వరకు 13,303 డీలర్లు సరుకుల కోసం డీడీలు చెల్లించారు. మిగతా వారు కూడా డీడీ కట్టేందుకు సిద్ధంగా ఉన్నప్పటికీ సాంకేతిక సమస్యలు తలెత్తాయి. డీలర్లకు కలిగిన అసౌకర్యాన్ని జిల్లాల జాయింట్ కలెక్టర్లు సైతం ఉన్నతాధికారుల దృష్టికి తీసుకొచ్చారు. ప్రభుత్వం మరోరోజు అవకాశం కల్పించడం పట్ల డీలర్లు డీడీలు చెల్లించేందుకు మార్గం సుగమమైంది.

# విస్మరణ నుంచి.. పునఃస్మరణ వైపు

- ప్రపంచ తెలుగు మహాసభల్లో తెలంగాణ సాహిత్య విశ్వరూపం
- ఇకపై ఏటా మహాసభల నిర్వహణ
- సాహిత్య అకాడమి చైర్మన్ నందిని సిధారెడ్డి
- పాల్కురికి వారసత్వం అందుకోవాలి: సీఎంవో ఓఎస్డీ దేశపతి
- ఘనంగా తెరసం మహాసభలు



ఆదివారం తెలుగువర్సిటీలో తెలంగాణ రచయితల సంఘం మహాసభలో మాట్లాడుతున్న తెలంగాణ సాహిత్య అకాడమి చైర్మన్ నందిని సిధారెడ్డి. చిత్రంలో మీడియా అకాడమి చైర్మన్ అల్లం నారాయణ, నమస్తే తెలంగాణ సంపాదకుడు కట్టా శేఖర్‌రెడ్డి, ఆంధ్రజ్యోతి ఎడిటర్ కే శ్రీనివాస్ తదితరులు

**తెలుగు యూనివర్సిటీ:** ప్రజల సాహిత్యంగా వచ్చిన తెలంగాణ సాహిత్య వైభవాన్ని సాక్ష్యాధారాలతో రానున్న ప్రపంచ తెలుగు మహాసభల్లో నిరూపించబోతున్నామని తెలంగాణ సాహిత్య అకాడమి చైర్మన్ డాక్టర్ నందిని సిధారెడ్డి అన్నారు. తెలంగాణ రచయితల సంఘం మహా సభలు ఆదివారం తెలుగు విశ్వవిద్యాలయంలో ఘనంగా జరిగాయి. తెలంగాణ సాహిత్యవికాసం, వివిధ ప్రక్రియల ఆవిర్భావ వికాసాలు అనే అంశంపై వక్తలు ప్రసంగించారు. ఈ సభకు ముఖ్యఅతిథిగా హాజరైన నందిని సిధారెడ్డి మాట్లాడుతూ తెలంగాణలో సృజనాత్మకత, పరిశోధన రెండు సమాంతరంగా జరుగాల్సిన అవసరం ఉన్నదని అభిప్రాయపడ్డారు. దశాబ్దాలుగా తెలంగాణ భాష వివక్షకు గురైందని, యుగాలవారిగా ప్రస్తుతించిన తెలుగు సాహిత్య చరిత్రలో శివకవుల యుగం తప్ప ఎక్కడా తెలంగాణకు ప్రాధా న్యం లేదని విమర్శించారు. ఆ వివక్షను సరిచేసే బాధ్యతను తెలంగాణ రచయితల సంఘం స్వీకరించడం అభినందనీయమన్నారు. ఇకపై ప్రతి సంవత్సరం తెలంగాణ తెలుగు ప్రపంచ మహాసభలను నిర్వహిస్తామని ప్రకటించారు. సీఎంవో ఓఎస్డీ దేశపతి శ్రీనివాస్ మాట్లాడుతూ పాల్కురికి సోమన్న తెలంగాణ పలుకుబడుల భాషను 12వ శతాబ్దంలోనే కావ్యభాషగా మలిచిన ఘనుడని కొనియాడారు. ద్విపద లాంటి ప్రజల జానపద ఛందస్సులను మేటిగా నిలబెట్టిన పాల్కురికి వారసత్వం అందిపుచ్చుకోవాలని పిలుపునిచ్చారు. మీడియా అకాడమి చైర్మన్ అల్లం నారాయణ మాట్లాడుతూ సమ్మక్క సారలమ్మలను, రుద్రమదేవిని ఆరాధించే వైరుధ్య సంస్కృతి తెలంగాణలో ఉన్నదని, జీవన్మరణ పోరాటాలు తెలంగాణ గడ్డపైనే కనపడుతాయని వివరించారు. నమస్తే తెలంగాణ పత్రిక సంపాదకుడు కట్టా శేఖర్‌రెడ్డి మాట్లాడుతూ మహాభారతానికి సంబంధించిన మూల ప్రతులను సంస్కృత, హిందీ, ఇంగ్లీష్ భాషలలో అధ్యయనం చేసినప్పుడు వాటిద్వారా తెలంగాణ ఘనతను, ఉనికిని తెలియజెప్పే విశేషాలు అనేకం వెలుగులోకి వచ్చాయని పేర్కొన్నారు. తెలింగ అన్న పదం తెలంగాణ ప్రాంతీయులను తెలియజేప్పేదేనని ఆయన స్పష్టంచేశారు. తెలంగాణ అస్తిత్వ చరిత్రను పునర్నిర్మించాలని, దానికోసం పత్రికలు, రచయితలు, చరిత్రకారులు, మేధావులు ఐక్యంగా కృషిచేయాలన్నారు. ఆంధ్రజ్యోతి ఎడిటర్ కే శ్రీనివాస్ మాట్లాడుతూ తెలంగాణ ఐటీ హబ్‌తో సమన్వయం చేసి తెలుగుభాషను గూగుల్ ద్వారా అర్థవంతంగా అంతర్జాతీయ స్థాయిలో వినియోగించుకునే దిశగా అడుగులు వేయాలన్నారు. సాక్షి ఈడీ కే రామచంద్రమూర్తి మాట్లాడుతూ తెలంగాణలో నిరంతరం కవిత్వం పరవళ్లు తొక్కుతున్నదని, కథా సాహిత్యం, నవల, నాటకం వంటి ప్రక్రియలు ప్రభావాత్మకంగా వస్తుండటం హర్షించతగ్గ విషయమని చెప్పారు. తెలుగువర్సిటీ వీసీ ఆచార్య ఎస్వీ సత్యనారాయణ మాట్లాడుతూ సాహిత్య, సాంస్కృతిక ఉద్యమాలు ఇక్కడి ప్రజల ఆకాంక్షలుగా వర్ధిల్లుతున్నాయని అన్నారు. తెలంగాణ సాహిత్యం, సంస్కృతి చరిత్ర ఇతర భాషలలోకి అనువాదం కావాలని భాషా సాంస్కృతిక శాఖ సంచాలకుడు మామిడి హరికృష్ణ చెప్పారు. తెలంగాణ రచయితల సంఘం అధ్యక్షుడు డాక్టర్ నాళేశ్వరం శంకరం అధ్యక్షత జరిగిన సమావేశంలో తెరసం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి డాక్టర్ వీ శంకర్, ఉపాధ్యక్షులు ఘనపురం దేవేందర్, హైదరాబాద్ శాఖ అధ్యక్షుడు కందుకూరి శ్రీరాములు పాల్గొన్నారు. ఈ సందర్భంగా పలు పుస్తకాలను ఆవిష్కరించారు. తెలంగాణ సాహిత్యం వివిధ ప్రక్రియల ఆవిర్భావ వికాసాలు అనే అంశంపై సదస్సు, కవి సమ్మేళనం జరిగాయి.



*ఎమ్.ఆర్.పి. పన్నులు అన్నీ కలుపుకుని. జీఎస్‌టి కారణంగా ధర తగ్గింపు.



నీవు పూలను తెంపేయగలవు, కానీ వసంతాగమనాన్ని అడ్డుకోలేవు.

**పాబ్లో నెరుడా**

## ప్రపంచ తెలుగు మహాసభలు

సీ|| భాగ్యనగరమందు బాసిల్ల తెనుగెంతొ
సభలు జరుప సంతసించె మనసు|
తెలుగు భాషకున్న తేజమ్ములన్ గాంచ
గొప్ప కవులు యిచటి కొచ్చిరనగ|
కనని వినని యట్టి కార్యక్రమాల్జూసి
కవుల కలములెన్నొ కవితలల్లె|
చంద్రశేఖరు తీరు చైతన్యమున్ గూర్చ
జయజయధ్వానాలు చేసిరిచట!

ఆ.వె|| తెలుగు పూర్వకవుల దీటైన చందముల్
నేటితరము జూసి నేర్చుకొనగ
భళిరభళిరయంచు బహుజనాల్ మెచ్చంగ
విశ్వ తెలుగు సభలు విభమమందు||

సీ|| మాతృభాషకున్న మాధుర్య మొప్పార
బడులలోన తెలుగు పరిమళించు|
ప్రభుత్వ నిర్దేశ్యమ్ము బహుమేళ్ళు కలిగించు
ప్రాభవమ్ము హెచ్చు ఫలితమిచ్చు|
తెనుగు పద్య మరయ దేశఖ్యాతిని పెంచు
భావిజీవిత మెల్ల ప్రగతి పొందు



తెలుగు కవుల దివ్య దేశఖ్యాతిని పెంచు
భావి జీవిత మెల్ల ప్రగతి పొందు
తెలుగు కవుల దివ్య దేశాభిమానంబు
తేట తెల్లమగును తెలియు జగతి|

ఆవె|| కీర్తి శేషులైన కీర్తి తెచ్చిన వారి
కీర్తి పంచమనకు కీర్తి కలుగు|
విశ్వ తెలుగు సభల వైశిష్ట్య పంథాలు
విశ్వవ్యాప్తి చెందు వెలయు ఘనత|

చం|| భలెభలె యంచు నీ సభల ప్రాంగణ మెల్లయు మారుమోగ్రగా
పలుపలు దేశ కోవిదులు పాదము లెట్టిరి మోదమంద్రిగా
వెలయగ తెల్గు వెల్గులిట వేయగ ముద్రలు హృదయ సీమలన్
తలచును ముఖ్యమంత్రికి ప్రధానము చేసిరి దీవెనాక్షతల్||

**– అక్కినేపల్లి వేణుగోపాల్‌రావు, 8217816246**

## జాతరొస్తున్నది

ఇప్పుడు మళ్ళా అమ్మ చంకనెక్కి
గోరుముద్దలు మింగుతున్నట్టున్నది

ఉగ్గుపాలతో రంగరించిన పదాలన్నీ
స్వేదగ్రంథుల గుండా ఉప్పొంగి
పరిమళమవుతున్నట్టుగా ఉన్నది

మలినమంతా పులిమేసుకొని
నా తనమై నన్ను ఆరేసుకున్నట్టుగా ఉన్నది

జోలపాటై జోపుచ్చిన పాట
పజ్జొన్న చేలమీద అలల్ అలల్ గా
తేలివచ్చి నన్ను చుట్టేస్తున్నట్టుగా ఉన్నది

కాముడు పదాలు గొబ్బెమ్మ పాటలు
సామూహిక చప్పట్ల దరువుల్లోంచి
కాళ్ళను చుట్టేస్తున్నట్టుగా ఉన్నది

జీవం భాషై
భాష జీవమై



ఈ నేల నిండా అగరు ధూపమై
పరుచుకుంటున్నది

మళ్ళా అమ్మొస్తున్నది
పసితనానికి పలుకుల కానుకిచ్చిన
అమ్మ భాష జాతరొస్తున్నది

**– చెమన్, 9440385563**



## తేజాల మాగాణం

నవీనగానం–నా తెలంగాణం!
మలయమారుత మసొంటి
మాండలిక మాగాణం.. నా తెలంగాణం!
కమ్మనైన మన భాష.. అమ్మచేతి గోరుముద్ద!
తరతరాల మన సంస్కృతి.. తాటిల్లతల పసిడి ముద్ద!!
తంగేడు గునకపూల.. బంగారు బతుకమ్మ!
గుండె నిండ ప్రేమున్న.. గుమ్మడి పూ గుమ్మ!!
గా క్రీస్తు పుట్టక ముందే
గీడ 'కోటి లింగాల కాడ
శాతకర్ణి కోట కట్టిండు!
కవిగా తనకు తగిన గౌరవం దక్కలేదని
గుణిగిన గుణాఢ్యుడు కోపంతో
కావ్యహోమం చేసిండు!
మిగిలిన 'బృహత్కథ'ను 'హాలుడు'
'గాథాసప్తశతి'గా రాసిపెట్టిండు!
శాతవాహనుల సంస్కారాన్ని
సమస్త లోకానికి చూపెట్టిండు!
ఏ మాటనైనా మంత్రంలా వదిలిన
'ఎములాడ' భీమకవి మన అన్ననే!..
కన్నడంలో ఆదికవియై కూసున్న
పంపకవి మన అన్ననే!
జాను తెనుగును ద్విపదల్లో కుమ్మరిస్తూ
తెలంగాణను జాగృతం చేసిన సోమన్న మన అన్ననే!
చేతి గంటాన్ని చెరుకు రసంలో ముంచి
భాగవతాన్ని మందార మకరందంలా
అందించిన పోతన్న మన అన్ననే!..
దుష్ట రజాకార్ల–నిజాం నిరంకుశ పాలనలో
దురపిల్లే తెలంగాణ స్వేచ్ఛకై
'నా తెలంగాణ–కోటి రత్నాల వీణ' అని
గొంతెత్తిన దాశరథి మన అన్ననే!
ప్రజల బాధల్ని తన 'గొడవ'గా గొంతెత్తి
కసిగా కైతల్ని విసిరిన
'కాళన్న' మన అన్ననే!
అన్నలందరికీ 'శణార్తి'!
వారి ఆశయాలే మనకు స్ఫూర్తి!!
తెలంగాణకు తేజోదీప్తి!!!

**– డాక్టర్ వడ్డేపల్లి కృష్ణ, 9246541699**



## నా చర్మం కింద

నా చర్మం కింద సమస్త విశ్వం నిక్షిప్తమై ఉంది..
నా దేహం గురించి తెలిసిన మనుషులు
దానికి విచిత్రమైన పేర్లు పెట్టుకున్నారు!
అంతేకాదు, దానిలో కొన్ని భాగాలకు
వారివారి పేర్లను పెట్టుకుంటూ..
మానవ ఆకృతిపై వారు చేసే ప్రయాణంలో
నా దేహాన్ని విచ్ఛేదిస్తూ, గీతలతో లిఖిస్తూ..
దహిస్తూ, సమాధి చేస్తున్నారు..!
వాటినన్నిటినీ నా చర్మపు పైపొర కంబళీలో
మూటగట్టుకొని మోసుకుపోతుంటాను.

సామాన్యుని పలుకుకి కూడా అందని మాటలలా
ఆ ప్రజలు నా ఒంటి భాగాలను చూపిస్తుంటారు
సూక్ష్మదర్శిని యొక్క భూతద్దం నుంచి
చూసే గాజుపలకల్లా.. కళాకృతుల్లా..
గోడలకు వేళ్లాడే అజ్ఞాత భూ భాగ పటాల్లా
పింగాణీ, గాజు, లేదా ప్లాస్టిక్ జీవ నమూనాలలా
ఆఖరికి,
ఫార్మాల్డిహైడ్‌ద్రావకంలో భద్రపరిచే మాంసఖండాలలా
ఆ ప్రజలు నా ఒంటి భాగాలను చూపిస్తుంటారు..

కాని నా శరీరపు లోతుల్లో
కండరాలు స్నాయువులు, నరబంధాలకన్నా లోతులలో
ఆ మనుషులెవరికీ తెలియని
నాదైన స్వారూపం దాగి వుంది
అది విశ్వాన్ని ఆవరించేటంత విశాలమైనది
నా చర్మం కింద నివసించేటంత సూక్ష్మమైనది...

**ఆంగ్ల మూలం: మహమ్మద్ జాహిద్**
**తెలుగు సేత: మెర్సీ మార్గరెట్**

# బాటలు వేసిరి మన కవులే

అనేక ప్రక్రియలకు ఆద్యుడై, స్వతంత్ర పురాణ నిర్మాతయై, 'ఆదికవి' అనే మాటకు ప్రత్యక్ష నిదర్శనమైన కవి మన తెలంగాణలోనే జన్మించినాడు. మొట్టమొదటి 'సంస్కృతాంధ్ర కవితా పితామహ' అన్న బిరుదు వహించిన అమాత్యశేఖరుడు ఈ గడ్డ మీదనే ప్రభవించినాడు. మొదటి 'వచనాలను' తెలుగులో వెలువరించిన కవీంద్రుడు ఇక్కడనే పుట్టినాడు.

పురాణాలను ఆంధ్రీకరించడం ప్రారంభమైందీ ఇక్కడనే. తొట్ట తొలి రామాయణం ఊపిరిపోసుకున్నది తెలంగాణలోనే. మొదటి సంకలన గ్రంథం తెలంగాణలోనే వన్నెలద్దుకున్నది. నాటక సాహిత్యానికి ప్రేరణనిచ్చిన గ్రంథ రచన ఈ నేలలోనే ఆవిర్భవించింది.

ప్రబంధ సాహిత్యం ప్రభవించిందీ ఈ సీమలోనే. తొలి సంయుక్త రచనకు భూమికగా నిలిచినదీ ఈ తెలంగాణే. కావ్యాన్ని విజ్ఞాన సర్వస్వంగా మలిచిన తొలి ప్రయత్నం చేసిన సహృదయ కవీంద్రులూ ఇక్కడివారే. తొలి అచ్చ తెలుగు కావ్యానికి ఆయువుపట్టు ఈ భూమి. మొదటి చారిత్రక రచనను జగతికందించిన తెలుగు రచయిత మనవాడే. భర్తృహరి సుభాషితాలను మొదటిసారి తెలుగులోకి అనువాదం చేసిన కవీంద్రుడూ తెలంగాణలో జన్మించిన వాడే. రేడియోలో తొలి ప్రసంగం చేసిన గౌరవం తెలంగాణ వక్తదే. తెలుగు సినిమాకు మొదటి పాట రాసిన ప్రతిభ మన వాళ్ళదే. ఉర్దూ గజల్‌ను, రుబాయీలనూ తెలుగు వాళ్ళకు పరిచయం చేసిన కవి వతంసులూ ఇక్కడివారే. అంతెందుకు? సంస్కృతానికి అమ్మ, తెలుగుకు అమ్మమ్మా అయిన ప్రాకృత భాషలో తొలి కవితా సంకలనం విడుదలచేసిన శాలివాహన హాల చక్రవర్తి కూడా ఇక్కడి వాడే!

పై అంశాలన్నీ పరిశీలించినప్పుడు ఆశ్చర్యం, ఆనందం, గర్వం కలుగుతాయి. తొలి శిలాశాసనం మొదలు ఇప్పటివరకు అత్యధిక సాహిత్య ప్రక్రియలకు తెలుగులో ఆద్యులైన మహనీయ కవులెందరో మనకు సాక్షాత్కరించి మనసులను పులకరింపజేస్తారు. వేల సంవత్సరాల సాహిత్య చరిత్రను ఒక్కసారి మననం చేసుకున్నప్పుడు ఈ విషయం తేటతెల్లమై ప్రతి తెలంగాణ బిడ్డ గుండె పొంగిపోతుంది.

తరతరాలుగా సాగిన వలస పాలన పుణ్యమాని తెలంగాణ భాష, సంస్కృతి, సాహిత్యం, ప్రతిభ, చరిత్ర... సమస్తమూ నిర్లక్ష్యానికి, ఉపేక్షకూ గురై, ఉనికినే విస్మరించే ప్రమాదంలో పడ్డాయి. తెలంగాణ ఆవిర్భావంతో అన్నిరంగాల్లో దిద్దుబాటు చర్యలు మొదలైనై. మసి అంటిన మాణిక్యాలు–పులు కడిగిన ముత్యాలుగా ఒక్కొక్కటే బయటపడుతున్నాయి. ఇప్పుడు ప్రపంచ తెలుగు మహాసభలు ఈ గడ్డ మీద జరుగుతుండటంతో తెలుగు సాహిత్యంలో మన స్థానమేదో సింహావలోకనం చేసుకునే అవకాశం అరచేతిలో ఉసిరిగాయ తీరున మనకు దక్కింది. వందల సంవత్సరాల నుంచి తెలంగాణ భూమి కోసం, భుక్తి కోసం, ఉనికి కోసం, ఊపిరి కోసం పోరాటం చేస్తూనే ఉన్నది. పరిశీలించి చూస్తే



సాహిత్యంలో కూడా ఇటువంటి ధోరణి కనిపిస్తుంది. ఆకాశమంత ఆవేశం–సముద్రమంత ప్రతిభావ్యుత్పత్తులతో తెలుగులో అనేక ప్రక్రియలను ప్రారంభించి నిజమైన ఆది కవిగా శాశ్వత కీర్తినార్జించిన పాల్కురికి సోమనాథ కవీంద్రుడు మొదలు నిన్నమొన్నటి కాళోజీ, దాశరథి, సినారె... నేటి ఆచార్య ఎన్.గోపి, నందిని సిధారెడ్డి, వనపట్ల సుబ్బయ్య దాకా ఈ స్వభావం మనకు కనిపిస్తుంది. ఈ నడుమ ఎన్నో ఎన్నెన్నో మైలురాళ్లు మన కవులు నిలబెట్టిపోయినారు. ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా ఆ మహనీయులను ఒక్కసారి గుర్తుచేసుకోవడం ఎంతైనా అవసరం.

> తెలుగు భాషా సాహిత్యాలను సుసంపన్నం చేసి, ఆ వినీలాకాశంలో చెరగని ధ్రువతారలై వెలుగులీనిన సాహితీవతంసులెందరో మన తెలంగాణకు సంబంధించిన వారు కావడం మనమంతా గర్వంగా చెప్పుకోదగిన అంశం. వీళ్ళ గురించి, వీళ్ళ సాహిత్యం గురించీ శ్రద్ధ వహించి, ముందుతరాలకు అందిచడం మన విధి.

సంస్కృతం దేవ భాష అని, సంస్కృత సమాస భూయిష్టమైనదే శిష్టభాష అని, అనువాద రచనే అసలు రచనని, వైదిక సంప్రదాయమే విశిష్టమైనదని, గిరిగీసుకొని, రాజాస్థానాల పంజరాల్లో బంగారు చిలుకగా బంధించిన మెరుగు తెలుగును–జాను తెనుగని నిరూపించి, స్వతంత్ర పురాణాన్ని (బసవ పురాణం)–ప్రజలు పాడుకోగలిగే ద్విపదలో నిర్మించి, పండిత పామరుల నీరాజనాలందుకున్న అసలైన మహాకవి, 'ఆదికవి' పాల్కురికి సోమనాథుడు. అంతమాత్రం చేత తన ప్రతిభ సామాన్యమైందిగా భావించనవసరం లేదని నిరూపిస్తూ–సంస్కృతం, కన్నడం, మరాఠీ, తమిళ, హిందీ భాషల్లో పద్యరచన చేసిన అసమాన ప్రతిభా సంపన్నుడు సోమనాథుడు. సంస్కృతం నుంచి అనువాదం చేయడం కాదు. తన రచనలను సంస్కృత భాషలోకి అనువదించేటట్లు చేసిన (ఉదాహరణ కావ్యం) ఘనుడాయన.

ఇక కాకతీయ సామ్రాజ్య సంక్షేమానికి, విస్తరణకు, పటిష్టతకూ తన జీవితాన్ని అంకితం చేసిన శివదేవయ్యమంత్రి గొప్ప సాహితీవేత్త అన్న సంగతి చాలా తక్కువమందికి తెలుసు. 'సంస్కృతాంధ్ర కవితా పితామహుడు'గా బిరుదు వహించిన శివదేవయ్య విశిష్ట రచనలు పురుషార్థసారము, శివదేవధీమణి శతకము.

'స్తుతి వచనాలు' అనే గద్య ప్రక్రియకు తెలుగులో శ్రీకారం చుట్టిన సత్కవీంద్రుడు కృష్ణమాచార్యులనే భక్త శిఖామణి. ఈయన మహబూబ్‌నగర్ జిల్లాలో జన్మించి, సింహగిరికి చేరి, అక్కడ స్వామివారి అనుగ్రహంతో నాలుగు లక్షల వచనాలు రాసినాడనేది ఐతిహ్యం– (ప్రస్తుతం 62 మాత్రమే లభ్యం) తర్వాత ఈ కవిని ప్రతాపరుద్ర చక్రవర్తి అభిమానించి ఆదరించి అగ్రహారాన్ని (కనకగిరి) ప్రదానం చేసినాడు. కృష్ణమాచార్యుల సింహగిరి వచనాలు తెలుగులో తొలి వచనాలు.

అల్లసాని పెద్దన తొలి ప్రబంధకర్త అని, ఆంధ్ర కవితా పితామహుడని బిరుదుగాంచినాడన్న ప్రచారంలోనే తెలుగు వాళ్ళంతా మునిగిపోయి ఉన్నారు. కానీ, అంతకుముందే అంటే 15వ శతాబ్ది ప్రారంభంలోనే ఎనుముల పల్లి పెద్దనామాత్యుడు 'చిత్రభారతం' అనే ప్రబంధాన్ని రచించి, చిత్తాబుఖానుకు అంకితం గావించినాడు. మార్కండేయ పురాణాన్ని అనువాదం చేసి, పురాణాంధ్రీకరణకు శ్రీకారం చుట్టిన మారన మన తెలంగాణలో జన్మించినవాడే. గన్నయ మహాసేనానికి ఆప్తమిత్రుడై అతనికే ఈ కావ్యాన్ని అంకితం చేసిన మారన తిక్కన మహాకవి శిష్యుడుగా ప్రసిద్ధుడు. ఓరుగల్లులో జీవించినవాడు.

వాల్మీకి రామాయణాన్ని తెలుగులోకి తర్జుమా చేసిన కీర్తి కూడా మన తెలంగాణ కవులదే. గోన వంశస్థుడైన బుద్ధారెడ్డి రాయచూరు సీమను పరిపాలించిన ప్రముఖుడు. అది ఒకప్పటి హైదరాబాద్ రాష్ట్రంలో భాగం. బుద్ధారెడ్డి కాలంలో కాకతీయ సామ్రాజ్యంలో అంతర్భాగం. ఆ సత్కవీంద్రుడు ద్విపదలో తన తండ్రి విఠల రంగనాథుని పేర 'రంగనాథ రామాయణం' రాసి నుతికెక్కినాడు. తెలుగులో ఇదే తొలి రామాయణం కావడం గమనార్హం.

తెలుగు ఛందశ్శాస్త్రాన్ని సంస్కృతంలో వివరించిన విశేష శేముషీ సంపన్నుడు గౌరన. దేవరకొండ ప్రాంతానికి చెందిన ఈ కవీంద్రుని లక్షణ శాస్త్రానికి 50 ప్రామాణిక గ్రంథాలున్నాయి. ఈయన ఋగ్వేదం ఆధారంగా రచించిన హరిశ్చంద్రోపాఖ్యానం సుప్రసిద్ధమై నాటక శైలికి అత్యంత సమీపంగా ఉండటం వల్ల అది తదనంతరకాలంలో నాటకాలుగా రూపుదిద్దుకున్నది. అందులో హరిశ్చంద్రుని భార్య పేరు 'చంద్రమతి'గా నామకరణం చేసిందీ గౌరనే.

సంస్కృత సమాస భూయిష్ట రచనే విశిష్టమనుకునే కాలంలో అచ్చంగా తెలుగులో కావ్యాన్ని రచించి మచ్చలేని కీర్తితెచ్చుకున్న పొన్నగంటి తెలగన తెలంగాణ కవి. ఇప్పటి పటాన్‌చెరువు (సంగారెడ్డి జిల్లా) ఆయన జన్మస్థలం. 16వ శతాబ్దికి చెందిన ఈ కవి తన 'యయాతి చరిత్రము' కావ్యాన్ని ఇబ్రహీం కులీకుతుబ్ షా వద్ద మంత్రిగానున్న అమీనుఖానుకు అంకితమొనర్చినాడు.

13 శతాబ్ది చివర జీవించి ఉన్న కుమార రుద్రుడు, మల్లికార్జునభట్టు, అయ్యలభట్టు, హుళక్కి భాస్కరునితో కలిసి భాస్కర రామాయణ నిర్మాణం ఒక చారిత్రక విశేషం. ఆ కాలంలోనే సంయుక్త రచనకు శ్రీకారం చుట్టిన ఈ కవులు ప్రశంసనీయులే కదా. ఈ కవి చతుష్టయం కాకతీయ సామ్రాజ్యవాసులు. అదేవిధంగా భర్తృహరి సుభాషితాలను తెలుగువాళ్ళకందించిన మొదటి కవి ఎలకూచి బాలసరస్వతి మహబూబ్‌నగర ప్రాంతం వాడు. మొట్టమొదటి చారిత్రక రచన అందించిన ఏకామ్రనాథుడు (ప్రతాప చరిత్ర) ఓరుగల్లు నివాసి. అంతేకాదు తొలి సినీ గీతం భక్తప్రహ్లాద కోసం రాసిన చందాల కేశవదాసు తెలంగాణ ప్రముఖ కవి, వాగ్గేయకారుడు. తమ్మెర (నల్గొండ)లో జీవించిన ఈ భక్త శిఖామణి 19వ శతాబ్దికి చెందినవాడు. రేడియోలో తొలి ప్రసం గం చేసిన ఆదిరాజు వీరభద్రరావు 'పరిశోధన భీష్ముడుగా' పేరు గాంచినవాడు. ఆయన పుట్టింది ఖమ్మం జిల్లాలో–జీవితమంతా గడిపింది హైదరాబాద్‌లో.

ఈ విధంగా తెలుగు భాషా సాహిత్యాలను సుసంపన్నం చేసి, ఆ వినీలాకాశంలో చెరగని ధ్రువతారలై వెలుగులీనిన సాహితీవతంసులెందరో మన తెలంగాణకు సంబంధించిన వారు కావడం మనమంతా గర్వంగా చెప్పుకోదగిన అంశం. వీళ్ళ గురించి, వీళ్ళ సాహిత్యం గురించీ శ్రద్ధ వహించి, ముందు తరాలకు అందించడం మన విధి. రాష్ట్ర ప్రభుత్వం, సాహిత్య అకాడమీ ఈ విషయం మీద దృష్టిపెట్టడం అభినందనీయం.

**– దోరవేటి, 9866251679**

## గుండెల నిండా పండుగ

గంగా నదిలా
తెలుగుభాషను నిలబెట్టాలి
మన ఔన్నత్యాన్ని ప్రపంచ పటంపై ఎగురేయాలి!
తొలి తోవ.. తొలి సాళ్ళు..
మనింటి భాషా పండుగ
గుండెల నిండా తెలుగు పండుగ..!

ఊటెండి పోతున్న చెలిమకు
శస్త్ర చికిత్సలు చేయాలి
తడారిపోతున్న జీవభాషకు
గుండె తడిని అద్దాలి
నాగరికతకు నీరే పునాది
వికాసానికి మాతృభాషనే ఉగాది!

ఒకనాడు పిలవని పెండ్లికి పూజారులం
ఇవ్వాళ లగ్నపత్రిక, లగ్గం మనదే..
తలదోర్ణం తలువాలు మనవే
ఆహ్వానాలు అతిథులం మనమే
సకినాలు సంబురాలు మనవే!

భాష నడకను తెలియజేస్తే
యాస మన స్థితిని చూయిస్తది
పలుకుబడులు ప్రభల్ని వెలిగిస్తే
నుడికారాలు మన ఉన్నతిని పట్టిస్తాయి
జాతియాలే మాగాణులై
మనల్ని సుసంపన్నం చేస్తాయి..!

తరతరాల ఖ్యాతి, కీర్తిని
ఆకాశ శిఖరంపై ఎగురేద్దాం..
త్యాగాన్ని వైభవాన్ని
అణవణువు ఘనంగా చాటుదాం..
ఇంటింటా ఊరూరా ఆకాంక్షలే అఖండ దీపంగా
దునియా గర్వపడేలా నిలుపుదాం..!

సాహితీ మూర్తులే
మహాసభల తోరణాలు
చరిత్ర సంస్కృతి మొగురాలే
ప్రపంచ పండుగ పందిరి గుంజలు
వీర వనితల విజయగాథలే
మన చరితల వైభవాలు
ప్రజాకవుల త్యాగాలే.. ఆత్మగౌరవ పతాకాలుగా
ప్రపంచ తెలుగు మహాసభలై సాగుదాం
గుండెల నిండా తెలుగు పండుగను నింపుదాం..!

**- వనపట్ల సుబ్బయ్య, 9492765358**

# తెలుగు పరాయీకరణపై ప్రశ్నలు

భాషా శాస్త్రవేత్తలు భాష పుట్టుక, కాలమాన మార్పులు తదితర భౌతిక విషయాలను విశ్లేషించగలరేమో కానీ, ఇతర భాషల ఆధిపత్యంలో ఒక భాష ఎలా ఛిన్నాభిన్నమవుతుందో భాషా, సమాజ ప్రేమికులు మాత్రమే పసిగట్టగలరు. ఈ నేపథ్యంలో తెలుగు భాషా పరిస్థితిని పరామర్శిస్తూ జయధీర్ తిరుమలరావు రాసిన వ్యాస పరంపర 'భాషావరణం'. ఇందులోని 46 వ్యాసాలు ఏప్రిల్ 2008 నుంచి డిసెంబర్ 2012 వరకు చూపు శీర్షికన 'నడుస్తున్న చరిత్ర' మాసపత్రికలో వచ్చాయి. శీర్షిక పరిమితులకు లోబడినట్లు కాకుండా రచయిత ఎత్తుకున్న అంశంపై స్వతంత్రంగా వ్యవహరించారు. అందుకే ఇవి పత్రికా వ్యాసాలుగా కాకుండా రచయిత భాష పట్ల సమర్పించిన ఒక పరిశోధక గ్రంథంగా కనిపిస్తాయి.



జన సామాన్య భాషగా బతికిన తెలుగును ఆర్య భాష అయిన సంస్కృతంతో నింపి, దాని సహజ రూపాన్ని దూరం చేశారని, ఇలా వాడుక తెలుగును సామాన్యుడికి అర్థంకాని స్థాయికి తీసుకెళ్లి పండితులు తెలుగు సాహిత్యాన్ని తమ గుప్పిట్లో పెట్టుకున్నారనీ, జనం కళలు, భాష, సాహిత్యాన్ని న్యూనతాభావంలోకి నెట్టేశారనీ ఈ వ్యాసాలు ఆరోపిస్తాయి. ఆంగ్లం విషయ పరిజ్ఞాన సముపార్జనకు పరిమితం కాకుండా యావత్ తెలుగు జాతి జీవన రీతుల్నీ, వాటి మూలాల్నీ ధ్వంసం చేస్తున్న విధానాన్ని ప్రతిఘటించాల్సిన అవసరాన్ని ఈ వ్యాసాలు గుర్తుచేస్తాయి.

భూస్వామ్య రాచరిక మత వ్యవస్థకు సంకేతమైన సంస్కృతాన్ని, సామ్రాజ్యవాద సంస్కృతిని విస్తరింపజేస్తున్న ఆంగ్ల భాషాధిపత్యాన్ని ప్రశ్నిస్తూ, తెలుగు భాష మనుగడ కోసం ప్రజలను ఆలోచించేలా చేయాలనేది తన వ్యాసాల ప్రధాన ఉద్దేశమని రచయిత పరిచయ వాక్యాల్లో పేర్కొన్నారు.

పరభాషల దాడుల వల్ల తెలుగువారు స్వాభావికంగా తెలుగు వానిగా లేడు. వాడు పాళీపండితుడు, వాడు నిరంతరం సంస్కృత పండితుడు. నివసిస్తున్న సమాజం సంస్కృత భూయిష్ట సమాజం. ఇంత జరిగినా భాషా శాస్త్రవేత్తలు భాషా పరిణామానికి సామాజిక, సాంస్కృతిక, రాజకీయ అంశాలు దోహదపడుతాయన్న దృష్టికోణాన్ని విస్మరించారని రచయిత మన నాలుకపై పరభాష పొరలా!'అని ప్రశ్నించారు. అన్నిరకాల యాసలు, మాండలికాలు, వ్యవహార భాషలు, వృత్తుల భాషలు భాషా వ్యవస్థలో అనివా ర్య విభాగాలని వాటిని 'అపభ్రంశాలు'గా భ్రమ పడకూడదని హితవు పలికారు.

1963లో తెలుగు నానుడి కూటమి వారు అచ్చేసిన 'తెలుగా, ఆంధ్రమా?' అనే 68 పేజీల పుస్తకం, అదే రచయిత రాసిన 340 పేజీల 'నుడి, నానుడి' ప్రస్తావన ఈ వ్యాసాలకు వన్నె తెచ్చింది. ఈ రెండు పుస్తకాల రచయిత 'వాగరి'. 1992లో చనిపోయిన వాగరి అసలు పేరు బి.సత్యానందం. అది సంస్కృత పదం కాబట్టి బంగారయ్యగా పేరు మార్చుకున్నట్టు తిరుమలరావు రాశారు. బంగారయ్య తెలుగును చుట్టేసిన సంస్కృతాన్ని తూర్పారబట్టారు. 'తెలుగు చరిత్రకారులు పరిశోధకులు కారు, వారు చాటింపుదారులు. వారు చేసేపని నారు ఒకచోట నుంచి తీసి మరొకచోట నాటడం. తెలుగును తీసి ఆంధ్రమును నాటాలి. తెలుగు నాడును ఆంధ్రప్రదేశమును మొల ఎయ్యాలి. తెలుగు జాతిని ఆంధ్ర జాతిగా మార్చాలి. ఇంతకు మించి ఏమీ చేయలేదు'. 'తెలుగునాటిలోని బడులలో తెలుగు అనే పేరున పిల్లలకు నేర్పింపబడుతూ ఉండినది తెలుగు లిపిలోని సమస్క్రుతము' అని పలికిన బంగారయ్య వాదన మూడు వ్యాసాల్లో వివరించబడింది.

> 'భాషావరణం' పద బంధంలోనే విస్తృత అర్థం ఉన్నది. భాష అనగానే అక్షరమాల, లిపి, శాస్త్రాల గిరిగీసుకోక-భాషతో సమాజానికీ జీవనానికీ ఉన్న లెంకలన్నీ ఇందులో చర్చించబడినాయి. సంప్రదాయవాదుల నుంచి, కార్పొరేట్‌శక్తుల నుంచి, తల్లి నుడి కాపాడుకోవాలని ఉద్బోధించాయి.

'భాషావరణం' పద బంధంలోనే విస్తృత అర్థం ఉన్నది. భాష అనగానే అక్షరమాల, లిపి, శాస్త్రాల గిరిగీసుకోక–భాషతో సమాజానికీ జీవనానికీ ఉన్న లెంకలన్నీ ఇందులో చర్చించబడినాయి. సంప్రదాయవాదుల నుంచి, కార్పొరేట్‌శక్తుల నుంచి, తల్లి నుడి కాపాడుకోవాలని ఉద్బోధించాయి. వ్యాసాలు కొనసాగించేందుకు రచయిత భాషతో బంధం గల పత్రికారంగం, పాఠశాల వ్యవస్థ విద్యాహక్కులను కూడా తడమక తప్పలేదు. కొన్ని వ్యాసాలు పేరుకు భాషతో మొదలై సాహిత్య చర్చలోకి జారిపోయాయి. ఈ సంపుటి బొమ్మిడాల శ్రీకృష్ణమూర్తి ఫౌండేషన్, గుంటూరు వారి ఆర్థిక సహాయంతో ప్రచురించబడింది. రూపకల్పన ఆకర్షణీయంగా ఉంది.

**- బి.నర్సన్, 9440128169**

## నూరేళ్ల ఓయూ సందర్భంలో వంద కలాలు, గళాలకు స్వాగతం

వందేళ్ల ఉస్మానియా విశ్వవిద్యాలయం తన వందేళ్ల ప్రస్థానంలో తెలుగునేలలో ఎన్నో ధిక్కార కలాలకు, గళాలకు జన్మనిచ్చింది. ఈ సందర్భంగా 2017 డిసెంబర్ 5న ఆర్ట్స్ కాలేజీ రూమ్ నెం. 57లో ఉదయం 10 గంటల నుంచి 'వంద కలాలు, గళాల కవాతు'ను ఓయూ సాహిత్యవేదిక నిర్వహిస్తున్నది. ప్రొఫెసర్ సూర్యాధనుంజయ్ అధ్యక్షతన జరుగు సభలో డాక్టర్ కేవీ రమణాచారి, డాక్టర్ నందిని సిధారెడ్డి, ప్రొఫెసర్ ఎస్వీ సత్యనారాయణ, అల్లం నారాయణ, డాక్టర్ అయాచితం శ్రీధర్ పాల్గొంటారు. స్వాగతోపన్యాసం ప్రొఫెసర్ సీహెచ్ గోపాలరెడ్డి, ఆత్మీయ వచనం ప్రొఫెసర్ రవీందర్. ఈ సభలో ఉస్మానియా పూర్వ విద్యార్థులైన కోవెల సుప్రసన్నాచార్య, కెకె రంగనాథాచార్యులు, వరవరరావు, ముదిగంటి సుజాతారెడ్డి, అంపశయ్య నవీన్, గద్దర్, ఎన్.గోపి, అమ్మంగి వేణుగోపాల్, నాళేశ్వరం శంకరం, దేవరాజు మహారాజు, సుంకిరెడ్డి నారాయణరెడ్డి, జయప్రభ, ఎన్.వేణుగోపాల్, దేశపతి శ్రీనివాస్, కె.శ్రీనివాస్, వేముల ఎల్లయ్య, యాకూబ్, గోరటి వెంకన్న, సి.కాశీం, బోయి విజయభారతి, షాజహానా, కె.లావణ్య, త్రివేణి, సిల్మానాయక్, గంట జలంధర్‌రెడ్డి, బెల్లి యాదయ్య, తైదల అంజయ్య, భూపాల్, నలిమెల భాస్కర్, పోరంకి దక్షిణామూర్తి, పరమాత్మ, ఇల్లిందల సుజాత తదితర వందమంది ప్రముఖులు పాల్గొంటారు. ఈ వందేండ్లలో ఉస్మానియా బిడ్డలుగా సాహిత్య, కళారంగాల్లో సృజనశీలురైన ప్రతి ఒక్కరికీ ఆహ్వానం.

వివరాలకు: 9885937740, 9491124112

**- శివరాత్రి సుధాకర్, నిర్వహణ కమిటీ కన్వీనర్, మహేందర్ బర్ల, కో-ఆర్డినేటర్ ప్రతాప్ గోపగళ్ల, అమలాశ్రీ, బత్తుల లింగయ్య, బోళ్ల ప్రవీణ్‌కుమార్ కో-కన్వీనర్లు.**

## 'తెలంగాణ భాషా దేశ్య పదాలు' ఆవిష్కరణ సభ

డాక్టర్ నలిమెల భాస్కర్ రచన 'తెలంగాణ భాషా దేశ్య పదాలు' వ్యాస సంపుటి ఆవిష్కరణ సభ 2017 డిసెంబర్ 9న ఉదయం 10 గంటలకు కరీంనగర్ ఫిలిం భవన్‌లో జరుగుతుంది. ముఖ్య అతిథిగా ఎన్.గోపి, అతిథులుగా నగునూరి శేఖర్, అన్నవరం దేవేందర్, ఎం.నారాయణశర్మ, బూర్ల వేంకటేశ్వర్లు హాజరవుతారు. కూకుట్ల తిరుపతి ఆహ్వానం పలుకుతారు.

**- సాహితీ సోపతి**

Printed and Published by **Damodar Rao Divakonda**, on behalf of Telangana Publications Pvt Ltd, Printed at Telangana Publications Pvt. Ltd, S.No.437, Near Velama Kalyana Mandapam, Devara Yamjaal, Shamirpet Mandal, Dist: Medchal - 500 078, Published At Telangana Publications Pvt Ltd. 8-2-603/1/7,8,9. Krishnapuram, Road No.10, Banjara Hills, Hyderabad, 500 034, Telangana State. Editor: **Katta Shekar Reddy.** Ph: +91 40 2329 1999, Fax: +91 40 2333 4242, 040-23291118, Toll Free: 1800 425 3666. RNI No. TELTEL/2011/37693.

# పొగాకు ఉత్పత్తులపై టోల్‌ఫ్రీ నంబర్

## వ్యసనం నుంచి బయటపడాలనుకునే వారికి ఉచిత సహకారం



**న్యూఢిల్లీ, డిసెంబర్ 3:** పొగాకు ఉత్పత్తులపై కొత్త ఫొటోలు, హెచ్చరిక సందేశాలతోపాటు టోల్ ఫ్రీ నంబర్‌ను కూడా ముద్రించాలని కేంద్రప్రభుత్వం యోచిస్తున్నది. పొగాకు వ్యతిరేక ప్రచారాన్ని విస్తృతపరుచడంలో భాగంగా జాతీయ పొగాకు వ్యసన విరమణ నంబర్ 1800 227787ను ప్రవేశపెడుతున్నట్టు అధికారులు చెప్పారు. ఈ నంబర్ ద్వారా పొగాకు వ్యసనం నుంచి బయటపడాలనుకునే వారికి ఉచిత సహకారం అందించడంతోపాటు సూచనలు ఇవ్వనున్నారు. 1 ఏప్రిల్ 2016 నుంచి ఆరోగ్య సంబంధ హెచ్చరికలను పొగాకు ఉత్పత్తుల ప్యాకెట్ పైభాగంలో కనిపించేలా ముద్రించాలని 2015లో కేంద్ర వైద్యారోగ్యశాఖ తయారీదారులను ఆదేశించింది. 'వినియోగదారులపై పొగాకు ఉత్పత్తుల ప్రభావం ఎంత తీవ్రంగా ఉంటుందో తెలియజెప్పే ప్రచార చిత్రాలు, ఫొటోలతోపాటు హెచ్చరిక సందేశాలను ఇంతకాలం ప్రచారం చేశాం. ఈ ప్రయత్నాలు ఏ మేరకు ఫలితాలను ఇస్తున్నాయో తెలుసుకోవాలని భావిస్తున్నాం. మా శాఖ తరపున అధికారుల బృందం ప్రజల వద్దకు వెళ్లి వారి అభిప్రాయాలను తెలుసుకుంటారు' అని వైద్యారోగ్య శాఖ ఉన్నతాధికారి ఒకరు తెలిపారు. దేశంలోని వయోజనుల్లో పొగాకు వినియోగం ఆరు శాతం తగ్గిందని జూన్‌లో విడుదల చేసిన ప్రపంచ వయోజన పొగాకు సర్వే-2 (జీఏటీఎస్-2) వెల్లడించింది. 2009-10లో 34.6శాతంగా ఉన్న వయోజన వినియోగదారుల సంఖ్య 2016-17 నాటికి 28.6 శాతానికి తగ్గింది. ఈ నివేదిక ప్రకారం 81లక్షల మంది పొగాకు వినియోగదారులు తగ్గారు.

# కక్షిదారుకు సుప్రీంకోర్టు క్షమాపణ

- న్యాయం చేయడంలో 13 ఏండ్ల జాప్యం
- కక్షిదారు వారసులకు అనుకూలంగా తీర్పు



**న్యూఢిల్లీ, డిసెంబర్ 3:** ఒక దుకాణం అద్దె కేసులో కక్షిదారుకు న్యాయం చేయడానికి 13 ఏండ్లు పట్టినందుకు సుప్రీంకోర్టు క్షమాపణ చెప్పింది. ఒకే అంశంపై వేర్వేరుగా దాఖలైన రెండు పిటిషన్లపై ఉత్తరాఖండ్ హైకోర్టు న్యాయమూర్తి ఒకే రోజు సంక్లిష్టమైన ఆదేశాలు జారీచేయడంతో కక్షిదారుకు న్యాయం చేయడంలో ఆలస్యమైందని జస్టిస్ ఆర్కే అగర్వాల్, జస్టిస్ సంజయ్ కిసాన్ కౌల్ ధర్మాసనం పేర్కొన్నది. సదరు దుకాణాన్ని ఆమె వారసులకు అప్పగించాలని తీర్పు చెప్పింది. ఉత్తరాఖండ్‌లోని రూర్కీ వాసి శ్యామ్‌లత తన దుకాణాన్ని తన ఇద్దరు సోదరులు ఆక్రమించారని 2004లో హరిద్వార్ ఎస్సెస్పీకి ఫిర్యాదు చేశారు. సెషన్స్ కోర్టుకెళ్లి తనకు అనుకూలంగా ఆదేశాలు తెచ్చుకున్నారు. దీన్ని సవాల్ చేస్తూ ఆమె సోదరులు ఉత్తరాఖండ్ హైకోర్టులో పిటిషన్ దాఖలు చేశారు. ఈ రెండు అంశాలను పరిశీలించిన ఉత్తరాఖండ్ హైకోర్టు 2006లో తదుపరి కేసు విచారణ సాగించాలని పోలీసులను ఆదేశించింది. మరో పిటిషన్‌పై హైకోర్టు.. జ్యుడీషియల్ మేజిస్ట్రేట్ కోర్టు ఆదేశాలను పక్కనబెట్టాలని ఆదేశించింది. దీనిపై 2009లో సదరు శ్యామ్‌లత సుప్రీంకోర్టును ఆశ్రయించారు.

# మనవాళ్లు ఎవరో చెప్పేస్తుంది!

## వందల డీఎన్‌ఏలను పోల్చే సాఫ్ట్‌వేర్‌ను అభివృద్ధి చేసిన శాస్త్రవేత్తలు



**న్యూయార్క్, డిసెంబర్ 3:** ఒక వ్యక్తి డీఎన్‌ఏ పరీక్ష ఫలితం రావాలంటే దాదాపు ఐదు రోజుల సమయం పడుతుంది. ఆ డీఎన్‌ఏను ఇతర డీఎన్‌ఏలతో పోల్చి చూడడానికి ఏకంగా వారాల సమయం పడుతుంది. ఈ సమయాన్ని గణనీయంగా తగ్గిస్తూ.. విభిన్న డీఎన్‌ఏలను పరిశీలించి జన్యుక్రమం సమానంగా ఉన్నవాటిని నిమిషాల్లో గుర్తించే సాఫ్ట్‌వేర్‌ను అమెరికా శాస్త్రవేత్తలు అభివృద్ధి చేశారు. ఇది క్యాన్సర్ చికిత్స, కణజాలం, అవయవ మార్పిడి చికిత్సకు సహాయపడుతుందని చెప్తున్నారు. క్యాన్సర్‌కు మెరుగైన చికిత్స అందుబాటులోకి తేవడంలో కీలకపాత్ర పోషిస్తుందని పేర్కొంటున్నారు. ఇందులో భాగంగా వీరు 'మిన్‌అయాన్' అనే పరికరాన్ని రూపొందించారు. ఏటీఎం కార్డు పరిమాణంలో ఉండే ఈ పరికరం డీఎన్‌ఏలోని జన్యుక్రమాన్ని విశ్లేషిస్తుంది. దానిని కంప్యూటర్‌కు అనుసంధానించినప్పుడు అప్పటికే డేటాబ్యాంక్‌లో నిల్వచేసి ఉన్న డీఎన్‌ఏ రిపోర్టులతో సరిపోల్చుతుంది. దాదాపు సమానంగా ఉన్న డీఎన్‌ఏలను గుర్తించి నివేదిక ఇస్తుంది. తమ సాఫ్ట్‌వేర్ ఒక వ్యక్తి డీఎన్‌ఏను దాదాపు 300 డీఎన్‌ఏలతో సరిపోల్చగలదని, నిమిషాల్లో ఫలితాన్ని ఇస్తుందని కొలంబియా శాస్త్రవేత్తల బృందం చెప్తున్నది.





# ఫిబ్రవరి 1న 'జీఎస్టీ బడ్జెట్'

- అందులో కేవలం ప్రత్యక్ష పన్నుల ప్రస్తావన మాత్రమే
- జీఎస్టీ రాకతో ఎక్సైజ్, కస్టమ్స్, సర్వీస్‌ట్యాక్స్ మాయం
- 2019 ఎన్నికలకు ముందు ఎన్డీయే చివరి పూర్తిస్థాయి బడ్జెట్ ఇదే

**న్యూఢిల్లీ, డిసెంబర్ 3:** వస్తుసేవల పన్ను (జీఎస్టీ) అమలు తర్వాత భారతదేశపు తొలి కేంద్ర బడ్జెట్‌ను వచ్చే ఫిబ్రవరి 1న పార్లమెంటులో ప్రవేశపెట్టే అవకాశముంది. జనవరి 30న పార్లమెంటు బడ్జెట్ సమావేశాలు ప్రారంభం కానుండగా, తొలిరోజు పార్లమెంటు ఉభయ సభలనుద్దేశించి రాష్ట్రపతి ప్రసంగిస్తారు. జనవరి 31న సమగ్ర ఆర్థికసర్వే పార్లమెంటు ముందుకు రానున్నది. ఆ తర్వాతి రోజు అంటే ఫిబ్రవరి 1న జీఎస్టీతో కూడిన తొలి కేంద్ర బడ్జెట్‌ను ప్రభుత్వం ప్రవేశపెట్టనుంది. బ్రిటిష్ పాలననుంచి ఫిబ్రవరి మాసాంతంలో బడ్జెట్ ప్రవేశపెట్టడం ఆనవాయితీకాగా, 2017 సంవత్సరానికిగాను భిన్నంగా కేంద్రబడ్జెట్‌ను తొలిసారిగా ఫిబ్రవరి 1న పార్లమెంటు ముందుంచింది. ఏప్రిల్ నుంచి ఆయా పథకాలు అమల్లోకి రావడానికి తగినంత సమయం ఉండనందునే బడ్జెట్‌ను నెలరోజుల ముందే ప్రవేశపెట్టినట్లు ప్రభుత్వం ప్రకటించింది. అలాగే శతాబ్దకాలంగా ప్రత్యేకంగా ప్రవేశపెడుతున్న రైల్వేబడ్జెట్‌ను కూడా కేంద్ర ప్రభుత్వం సాధారణ బడ్జెట్‌తోపాటే ప్రవేశపెట్టింది. డిసెంబర్ 15తో ప్రారంభమయ్యే పార్లమెంటు శీతాకాల సమావేశాలు జనవరి 5తో ముగియనుండగా, జనవరి 30న బడ్జెట్ సమావేశాలు ప్రారంభం కానున్నాయి. నెలరోజుల్లోనే పార్లమెంటు శీతాకాల, బడ్జెట్ సమావేశాలు జరుగడం ఇదే ప్రథమం. ఫిబ్రవరి1న కేంద్ర ప్రభుత్వం ప్రవేశపెట్టనున్న బడ్జెట్.. 2019 ఎన్నికలకు ముందు బీజేపీ నేతృత్వంలోని ఎన్డీయే ప్రభుత్వం ప్రవేశపెట్టబోయే చివరి పూర్తిస్థాయి బడ్జెట్ అవుతుంది. 2019లో ఓట్-ఆన్-అకౌంట్ బడ్జెట్‌ను మాత్రమే ప్రభుత్వం ప్రవేశపెట్టనుంది. ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీకి ఇది వరుసగా ఐదవ బడ్జెట్.

**బడ్జెట్‌లో ఇక ప్రత్యక్ష పన్నుల ప్రస్తావన మాత్రమే**

ఈ ఏడాది జూలై 1నుంచి జీఎస్టీ అమల్లోకి వచ్చినప్పటికీ అప్పటికే ప్రారంభమైన 2017-18ఆర్థిక సంవత్సరానికి మాత్రం సాధారణ బడ్జెట్ ప్రకారం కస్టమ్స్ డ్యూటీ, సెంట్రల్ ఎక్సైజ్, సర్వీస్ ట్యాక్స్ వంటివి అలాగే ఉండిపోయాయి. వాస్తవానికి జీఎస్టీ అమల్లోకి వచ్చాక ఎక్సైజ్ డ్యూటీ, సర్వీస్‌ట్యాక్స్ రద్దయ్యాయి. ఈ మార్పులన్నీ వచ్చే బడ్జెట్‌లో చోటుచేసుకోనున్నాయి. ఆర్థిక మంత్రి అరుణ్‌జైట్లీ అధ్యక్షతన జీఎస్టీ కౌన్సిల్ పన్ను రేట్లను ఖరారు చేస్తున్న నేపథ్యంలో ఈసారి కేంద్ర బడ్జెట్‌లో ఎక్సైజ్, సర్వీస్ ట్యాక్స్, లెవీలకు సంబంధించి ప్రతిపాదనలేవీ ఉండబోవని అధికారులు చెబుతున్నారు. అయితే ప్రత్యక్ష పన్నులు, కస్టమ్స్ డ్యూటీతో సంబంధం లేని ఆదాయపన్ను, కార్పొరేట్ ట్యాక్స్ వంటివి ప్రభుత్వ నూతన పథకాలతోపాటు బడ్జెట్‌లో ఉండే అవకాశముందని సమాచారం.

## టెస్టుకో రేటు.. ఫీజు సపరేటు

# వైద్యో నారాయణో 'సిరి'



- ల్యాబ్‌లతో ఒప్పందంతో టెస్టుల మీద టెస్టులు రాస్తున్న వైద్యులు
- ప్రతి పరీక్షకు ఫీజులో 20 నుంచి 30శాతం వరకు కమీషన్ వసూలు
- రెఫరల్ మెడికల్ టెస్ట్‌ల పేరుతో దందా
- బెంగళూరులోని ఐవీఎఫ్, డయాగ్నస్టిక్ కేంద్రాలపై దాడులతో బయటపడ్డ అవినీతి కుంభకోణం
- రూ.100 కోట్ల నల్లధనం వెలికితీశామని ప్రకటించిన ఐటీ

**బెంగళూరు, డిసెంబర్ 3:** 'వైద్యో నారాయణో హరి' అంటూ వైద్యులను దైవంతో పోలుస్తారు. కానీ కొంతమంది వైద్యులు రక్తపిపాసులుగా మారుతున్నారు. రోగులను పీల్చిపిప్పిచేస్తున్నారు. రోగి వస్తే చాలు.. ఉన్నకాడికి దోచుకుందామని ఆలోచిస్తున్నారు. కన్సల్టేషన్ ఫీజులు పుచ్చుకుంటూనే.. ల్యాబ్‌ల నుంచి వచ్చే కమీషన్ల కోసం 'కొంచెం సందేహం' ఉందంటూ లేనిపోని టెస్టులు రాస్తున్నారు. అప్పటికే ల్యాబ్‌లతో చేసుకున్న ఒప్పందం ప్రకారం కమీషన్ రూపంలో రూ.కోట్లు సంపాదిస్తున్నారు. ఢిల్లీలో డెంగీతో బాధపడుతున్న ఓ ఏడేండ్ల బాలిక ఇటీవల ప్రైవేటు దవాఖానలో మృతిచెందగా, దాదాపు రూ.18 లక్షల బిల్లు వసూలు చేశారు. కమీషన్ల కోసం కక్కుర్తి పడటంతోనే ఇలాంటి దారుణాలు చోటుచేసుకుంటూనే ఉన్నాయి. కర్ణాటక ఆదాయపన్నుశాఖ అధికారులు బెంగళూరులో ఐవీఎఫ్, డయాగ్నస్టిక్ కేంద్రాలపై దాడులు చేయగా భారీ కుంభకోణం బయటపడింది. రూ.వందకోట్ల మేర నల్లధనాన్ని బయటపడ్డట్టు అధికారులు ప్రకటించారు. వైద్యులు, ల్యాబ్‌ల ఒప్పందం ప్రకారం డబ్బు పంపిణీ జరుగుతున్నదని తేల్చారు. బెంగళూరులోని రెండు ఇన్ విట్రో ఫర్టిలైజేషన్ (ఐవీఎఫ్), ఐదు డయాగ్నస్టిక్ కేంద్రాల్లో మూడురోజులుగా తనిఖీలు చేపట్టిన ఐటీ అధికారులు రూ.1.4కోట్ల నగదు, 3.5కేజీల బంగారు నగలతోపాటు విదేశీ కరెన్సీ, విదేశీ బ్యాంకు ఖాతా బుక్కులను స్వాధీనం చేసుకున్నారు. ల్యాబ్‌ల తనిఖీ సమయంలో వెల్లడించని ఆదాయం రూ.100 కోట్ల వరకు ఉంటుందని అధికారులు ప్రకటించారు. ఒక ల్యాబ్ రెఫరల్ ఫీజు కింద డాక్టర్లకు రూ.200 కోట్ల మేర వెల్లడించని ఆదాయం చెల్లిస్తున్నదని తేల్చారు.

**ప్రతి పరీక్షకో లెక్క.. చెల్లింపులు పక్కా**

అనారోగ్యంతో దవాఖానలకు వస్తున్న రోగులకు డాక్టర్లు వివిధ ఆరోగ్య పరీక్షలు చేసుకోవాలని రెఫర్ చేస్తున్నారు. ఒక్కో టెస్టుకు రెఫర్ చేసినందుకుగాను వైద్యులు వివిధ పద్ధతుల్లో డయాగ్నస్టిక్ సెంటర్ల నుంచి కమీషన్ పొందుతున్నారని ఓ సీనియర్ అధికారి తెలిపారు. 'ల్యాబ్‌కు ల్యాబ్‌కు మధ్య కమీషన్‌లో తేడాలు ఉన్నాయి. సాధారణంగా ఎంఆర్‌ఐ పరీక్ష కోసం డాక్టర్లు 35 శాతం (ఫీజులో) కమీషన్ పొందుతున్నారు. సీటీస్కాన్, ఇతర పరీక్షలకు 20శాతం వరకు కమీషన్ అందుకుంటున్నారు. దీని కారణంగానే మార్కెట్లో వైద్య ఖర్చులు భారీగా పెరుగుతున్నాయి' అని ఆయన చెప్పారు. రెఫరల్ ఫీజును అడ్వాన్స్ నగదు చెల్లింపు, పక్షం లేదా నెలకు ఒకేసారి నగదు చెల్లింపుతోపాటు మొత్తం నాలుగు పద్ధతుల్లో వైద్యులు పొందుతున్నారని తేల్చారు. కొన్ని సందర్భాల్లో ఈ ఫీజును చెక్కుల రూపంలోనూ అందజేస్తూ.. ల్యాబ్‌లు నిర్వహిస్తున్న ఖర్చుల పుస్తకంలో దాన్ని 'ప్రొఫెషనల్ ఫీజు'గా నమోదుచేస్తున్నారని గుర్తించారు. డాక్టర్లు స్వయంగా డయాగ్నస్టిక్ కేంద్రాలకు వెళ్లకుండా, కనీసం రోగులను పరీక్షించకుండా, రిపోర్టులు రాయకపోయినా.. అక్కడి సిబ్బంది ఈ పనులన్నీ చేస్తూ.. టెస్ట్‌లకు రెఫర్ చేస్తున్నట్టు డాక్టర్ సంతకం చేస్తుండటంతో భారీ కమీషన్ పొందుతున్నారని అధికారులు తెలిపారు. కొన్ని ల్యాబ్‌లలో పనిచేస్తున్న ఉద్యోగులు కమీషన్ ఏజెంట్లుగా మారి డాక్టర్లకు కమీషన్ డబ్బు పంపిణీ చేస్తున్నారు. దీంతోపాటు వైద్యుడికి ఓ చీటీ అందజేస్తారు. అందులో రోగి పేరు, రెఫర్ చేసిన వైద్యుడి పేరు, రోగి ఏం పరీక్ష చేసుకున్నారు, ఏ రోజు చేసుకున్నారు, ఎంత బిల్లు అయ్యింది, డాక్టర్‌కు ఇచ్చే కమీషన్ ఎంత.. వంటి పూర్తి వివరాలతో కూడిన చీటీని కూడా అందజేస్తున్నారని తనిఖీల్లో బయటపడిందని ఐటీ అధికారులు వివరించారు.

# ఇక కాంగ్రెస్ సారథి రాహుల్

## నేడు నామినేషన్ వేయనున్న యువనేత.. ఎన్నిక లాంఛనమే



**న్యూఢిల్లీ, డిసెంబర్ 3:** కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడిగా రాహుల్‌గాంధీ ఏకగ్రీవంగా ఎన్నిక కానున్నారు. సోమవారం ప్రస్తుత పార్టీ అధ్యక్షురాలు సోనియాగాంధీ, మాజీ ప్రధాని మన్మోహన్ సింగ్ తదితరులతో కలిసి పార్టీ అధ్యక్ష పదవికి నామినేషన్ దాఖలు చేయనున్నారు. సోమవారం మధ్యాహ్నంతో నామినేషన్ల గడువు ముగియనున్న నేపథ్యంలో రాహుల్ ఒక్కరే నామినేషన్ దాఖలు చేస్తారని భావిస్తున్నారు. దీంతో ఆయన ఎన్నిక లాంఛనం కానున్నది. కాంగ్రెస్ అధ్యక్షుడిగా రాహుల్ ఎన్నికైనట్లు సాయంత్రానికి ఏఐసీసీ ప్రకటన జారీచేసే అవకాశం ఉన్నది. 19 ఏండ్లుగా పార్టీ అధ్యక్షురాలిగా కొనసాగిన తల్లి సోనియాగాంధీ నుంచి ఆయన బాధ్యతలు స్వీకరించేందుకు రంగం సిద్ధమైంది. వివిధ రాష్ట్రాల పీసీసీలకు 90 సెట్ల నామినేషన్ పత్రాలు పంపామని, కానీ ఇప్పటివరకు ఒక్క సెట్ కూడా తమ వద్దకు చేరలేదని ఏఐసీసీ ఎన్నికల రిటర్నింగ్ అధికారి ముళ్లపల్లి రామచంద్రన్ చెప్పారు. పార్టీ వర్గాల సమాచారం ప్రకారం రాహుల్ గాంధీ నాలుగు సెట్ల నామినేషన్లు దాఖలు చేస్తారని తెలుస్తున్నది. సోనియాగాంధీ, మన్మోహన్ సింగ్, గులాంనబీ ఆజాద్, ఏకే ఆంటోనీ, అహ్మద్ పటేల్, పార్టీ పాలిత రాష్ట్రాల సీఎంలు నామినేషన్ పత్రాలపై ప్రతిపాదకులుగా సంతకాలు చేయనున్నారు. అక్బర్ రోడ్డులోని ఏఐసీసీ ప్రధాన కార్యాలయంలో వివిధ రాష్ట్రాల కాంగ్రెస్ ప్రతినిధి బృందాలు కూడా రాహుల్‌ను పార్టీ అధ్యక్షుడిగా ప్రతిపాదిస్తూ నామినేషన్లు దాఖలు చేసేందుకు ఇప్పటికే ఢిల్లీకి చేరుకున్నాయి. రాహుల్‌కు మద్దతుగా పార్టీ ప్రధాన కార్యదర్శులు, వర్కింగ్ కమిటీ సభ్యులు, రాష్ట్రాల పీసీసీలు, అనుబంధ సంస్థలు వేర్వేరుగా నామినేషన్ పత్రాలు దాఖలు చేస్తాయని ఏఐసీసీ కమ్యూనికేషన్స్ ఇన్‌చార్జీ రణ్‌దీప్ సూర్జేవాలా తెలిపారు. కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడి ఎన్నిక ప్రజాతంత్రయుతంగా సాగుతున్నదా? లేదా? అన్నది సమస్య కాదని, దీనిపై కేంద్ర ఎన్నికల కమిషన్ పర్యవేక్షణ ఉంటుందన్నారు.

# 'పాన్'తో ఆధార్ అనుసంధానానికి మరో ఆరు నెలల గడువు: కేంద్రం యోచన

**న్యూఢిల్లీ, డిసెంబర్ 3:** ఒకవేళ సుప్రీంకోర్టు అనుకూలంగా తీర్పు చెబితే పౌరులు తమ ఆధార్ కార్డులతో పాన్ కార్డుల అనుసంధానానికి కేంద్రం మూడు నెలల నుంచి ఆరు నెలల గడువు ఇవ్వనున్నది. ఆ తర్వాత అనుసంధానించని పాన్ కార్డులన్నీ రద్దవుతాయని కేంద్ర ప్రభుత్వ అధికారి ఒకరు తెలిపారు. ప్రస్తుత గడువు ఈ నెలాఖరుతో ముగియనున్నది. ఈ గడువును 2018 మార్చి నెలాఖరు వరకు పొడిగించేందుకు సిద్ధంగా ఉన్నట్లు ఇప్పటికే సుప్రీంకోర్టుకు కేంద్రం తెలిపింది. గత నెల వరకు దేశంలోని 33 కోట్ల పాన్ కార్డుల్లో 13.28 కోట్ల కార్డులు మాత్రమే ఆధార్‌తో అనుసంధానం అయ్యాయని ఆయన చెప్పారు. పన్ను ఎగవేత కోసం అక్రమ మార్గాల్లో రూపొందించిన డూప్లికేట్ పాన్ కార్డులను తొలగించేందుకే 'ఆధార్'తో 'పాన్' కార్డుల అనుసంధాన ప్రక్రియ చేపట్టామని తెలిపారు. తద్వారా బినామీ లావాదేవీలకు చెక్ పెడుతామన్నారు. అదనపు గడువు ముగిసిన తర్వాత అనుసంధానంకాని పాన్ కార్డులు రద్దవుతాయని కేంద్ర ఆదాయం పన్నుశాఖ అధికారి స్పష్టంచేశారు. నూతన పాన్ కార్డుకు, ఐటీ రిటర్న్స్ దాఖలుకు 'ఆధార్'ను తప్పనిసరి చేస్తూ కేంద్రం నిర్ణయించిన సంగతి తెలిసిందే.

# విద్యుత్ సరఫరాదారును మార్చుకునే అవకాశం

- బడ్జెట్ సమావేశాల్లో పార్లమెంట్‌లో బిల్లు

**న్యూఢిల్లీ:** టెలికం సర్వీసును మార్చుకుంటున్నట్టుగానే విద్యుత్ సరఫరాదారును కూడా మార్చుకునే అవకాశాన్ని వినియోగదారులకు కల్పించాలని కేంద్రం యోచిస్తున్నది. ఈ మేరకు విద్యుత్ చట్టంలో మార్పులుచేసే బిల్లును పార్లమెంట్ బడ్జెట్ సమావేశాల్లో ప్రవేశపెట్టబోతున్నామని కేంద్రమంత్రి ఆర్కే సింగ్ వెల్లడించారు. 'విద్యుత్ పంపిణీ, సరఫరా వ్యాపారాన్ని విభజించే బిల్లులను విద్యుత్ శాఖ రూపొందిస్తున్నది. మరో వారం రోజుల్లో ముసాయిదా నా వద్దకు వస్తుంది. బడ్జెట్ సమావేశాల్లో బిల్లును ప్రవేశపెట్టేందుకు ప్రయత్నిస్తాం. ఈ విభజన ద్వారా తమకు కావాల్సిన సరఫరాదారును ఎంచుకునే అవకాశం వినియోగదారులకు లభిస్తుంది' అని మంత్రి తెలిపారు. బిల్లు ఆమోదం తర్వాత ఈ విధానం అమలుకు కార్యాచరణను రూపొందిస్తామని, తద్వారా విద్యుత్ సరఫరా రంగంలో గుత్తాధిపత్యానికి తెరపడుతుందని ఆయన వివరించారు. 'ఈ విధానం వల్ల విద్యుత్ రాయితీలు నేరుగా రైతులకు చేరుతాయి. సరఫరా మెరుగుపడుతుంది. 2019 మార్చి నాటికి 24గంటల నిరంతర విద్యుత్ సరఫరాను అందించే ప్రతిపాదనను క్యాబినెట్ ముందుకు తెస్తాం' అని సింగ్ పేర్కొన్నారు.

# క్షతగాత్రులను రక్షిస్తే రూ.2000 నగదు

- కేంద్రపారా జిల్లా కలెక్టర్ వెల్లడి

**కేంద్రపారా (ఒడిశా):** రోడ్డు ప్రమాదాల్లో క్షతగాత్రులను సకాలంలో దవాఖానకు తరలించి ప్రాణాలు కాపాడిన వారికి రూ.2000 నగదు బహుమతి ఇవ్వనున్నట్లు ఒడిశాలోని కేంద్రపారా జిల్లా కలెక్టర్ జీ రేఘు పేర్కొన్నారు. రక్షించిన వారికి సర్టిఫికెట్ కూడా అందజేస్తామని తెలిపారు. రోడ్డు ప్రమాదాల్లో మరణాల తగ్గింపును ప్రోత్సహించేందుకు ఈ పథకం అమలు చేస్తున్నామని తెలిపారు. కేంద్రపారా జిల్లా పరిధిలో ఏటా రోడ్డుప్రమాదాల్లో 400 మంది మృతి చెందుతుండగా, సకాలంలో దవాఖానలకు తరలించేవారు లేక అత్యధికులు చనిపోతున్నట్లు అధికారులు గుర్తించారు.

# గుజరాత్‌లో మహిళలపై నేరాలు పెరిగిపోయాయి

- బీజేపీ పాలనలో అందరూ అసంతృప్తిగా ఉన్నారు
- ప్రధాని మోదీపై రాహుల్ ఫైర్

**న్యూఢిల్లీ, డిసెంబర్ 3:** గుజరాత్‌లో మహిళలపై నేరాలు పెరిగిపోయాయని, వీటిని నిరోధించడంలో ప్రభుత్వం విఫలమైందని కాంగ్రెస్ ఉపాధ్యక్షుడు రాహుల్‌గాంధీ అన్నారు. ప్రధాని మోదీ లక్ష్యంగా రోజుకో ప్రశ్నను సంధిస్తున్న రాహుల్ ఆదివారం ట్విట్టర్‌లో గుజరాత్ మహిళలపై జరుగుతున్న నేరాలను ప్రశ్నించారు. 'మహిళల అక్రమ రవాణాలో గుజరాత్ ఎందుకు మూడో స్థానంలో ఉంది. యాసిడ్ దాడులు ఐదో స్థానం, మైనర్ బాలికలపై లైంగికదాడుల్లో 10వ స్థానంలో ఉంది. మహిళలపై నేరాల్లో అహ్మదాబాద్, సూరత్ నగరాలు దేశంలోనే టాప్ 10 నగరాల్లో ఉన్నాయి. ఎందుకిలా ఉన్నాయి' అని రాహుల్ ప్రశ్నించారు. గుజరాత్ అసెంబ్లీ ఎన్నికల్లో ఓడిపోతానని సీఎం విజయ్ రూపానీకి భయంపట్టుకుందని, అందుకే ఆయన హింసకు పాల్పడుతున్నారని రాహుల్ విమర్శించారు. శనివారం రాజ్‌కోట్‌లో బ్యానర్లు కట్టేవిషయంలో జరిగిన ఘర్షణలో కాంగ్రెస్ అభ్యర్థి ఇంద్రనీల్ రాజ్‌గురు, ఆయన సోదరుడు గాయపడ్డారని, దీనికి నిరసనగా ఆందోళనకు దిగిన కాంగ్రెస్ కార్యకర్తలపై సీఎం రూపానీ పోలీసులతో లాఠీచార్జి చేయించారని ఆరోపించారు.

**బీజేపీలోనే అంతర్గత ప్రజాస్వామ్యం లేదు: కాంగ్రెస్**

బీజేపీలోనే అంతర్గత ప్రజాస్వామ్యం లేదని, మోదీ, అమిత్ షా మాత్రమే పార్టీలో రాజ్యమేలుతున్నారని కాంగ్రెస్ ఆరోపించింది. కాంగ్రెస్‌లో అంతర్గత ప్రజాస్వామ్యం లేదన్న మోదీ వ్యాఖ్యలను ఖండించిన ఆ పార్టీ మీడియా విభాగం ఇంచార్జి రణ్‌దీప్ సూర్జేవాలా.. అద్వానీ, మురళీ మనోహర్ జోషి, ఆనందీబెన్, యశ్వంత్‌సిన్హా వంటి నాయకుల్ని పక్కన బెట్టిన బీజేపీలో ప్రస్తుతం ఏ రకమైన ప్రజాస్వామ్యం పరిఢవిల్లుతున్నదని ప్రశ్నించారు.

# కాంగ్రెస్ అధ్యక్ష ఎన్నికల్లో రిగ్గింగ్

- మీ పార్టీలోనే ప్రజాస్వామ్యం లేదు.. దేశంలో ఎలా అమలు చేస్తారు?
- వారు సమాజాన్ని చీల్చేందుకు యత్నిస్తున్నారు
- కాంగ్రెస్‌పై ప్రధాని మోదీ విమర్శల దాడి



సురేంద్రనగర్ ఎన్నికల సభలో మాట్లాడుతున్న మోదీ

**బారుచ్/ సురేంద్రనగర్, డిసెంబర్ 3:** ఉత్తరప్రదేశ్ స్థానిక ఎన్నికల్లో ఈవీఎంల ట్యాంపరింగ్ జరిగిందని కాంగ్రెస్ ఆరోపణలు చేసిన నేపథ్యంలో ఆ పార్టీ అధ్యక్ష ఎన్నికను అస్త్రంగా చేసుకుని ప్రధాని నరేంద్రమోదీ విరుచుకుపడ్డారు. సంస్థాగత ఎన్నికల్లో రిగ్గింగ్‌కు పాల్పడే చరిత్ర కాంగ్రెస్ పార్టీకి ఉన్నదని తీవ్రస్థాయిలో ధ్వజమెత్తారు. గుజరాత్ అసెంబ్లీ ఎన్నికల సందర్భంగా ఆదివారం నిర్వహించిన పలు ఎన్నికల ప్రచార సభల్లో ఆయన ప్రసంగించారు. 'మీ సొంత పార్టీలోనే ప్రజాస్వామ్యం లేకపోతే.. దేశంలో దాన్ని ఎలా అమలు చేస్తారు? కాంగ్రెస్ అధ్యక్షునిగా ఎవరు ఎన్నికవుతారో ముందే నిర్ణయమైపోయింది' అని రాహుల్‌గాంధీని ఉద్దేశించి పేర్కొన్నారు. గుజరాత్ ప్రభుత్వం ప్రతిష్ఠాత్మకంగా చేపట్టిన బుల్లెట్ రైలు ప్రాజెక్టుపై కాంగ్రెస్ విమర్శలను ప్రధాని గట్టిగా తిప్పికొట్టారు. 'బుల్లెట్ రైలుతో మీకు సమస్య ఉంటే.. ఎడ్ల బండ్లలో తిరుగండి' అని విమర్శించారు. 'కాంగ్రెస్ గురించి గుజరాత్ ప్రజలకు బాగా తెలుసు. కాంగ్రెస్ తన రంగులను ఎప్పటికప్పుడు మారుస్తుంది. సోదరుల మధ్య గోడ కడుతుంది. ఒక కులంతో మరో కులానికి.. ఒక మతంతో మరో మతానికి మధ్య చిచ్చుపెడుతుంది' అని విమర్శించారు. హార్దిక్ పటేల్, జిగ్నేశ్ మేవానీ, అల్పేశ్ ఠాకూర్ వంటి కుల నాయకులతో కాంగ్రెస్ పొత్తుపెట్టుకోవడంపై మాట్లాడుతూ 'వారు (కాంగ్రెస్) మిమ్మల్ని కొట్లాటల్లో నిమగ్నమయ్యేలా చేస్తారు. మీరు ఒకవేళ చనిపోయినా కాంగ్రెస్ నాయకులు మలాయ్ తింటారు. అయితే గుజరాత్‌లో బీజేపీ అధికారంలోకి వచ్చిన రోజు నుంచే ఈ రోగాలన్నీ నయమైపోయాయి' అని పేర్కొన్నారు.

# పాటిదార్లలో చీలిక!

- బీజేపీవైపు పాతతరం
- హార్దిక్ వెంట యువత

**సూరత్, డిసెంబర్ 3:** గుజరాత్ అసెంబ్లీ ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీకి మద్దతు పలికిన పాటిదార్ అనామత్ ఆందోళన్ సమితి (పాస్) కన్వీనర్ హార్దిక్ పటేల్ వెనుక యువతరం నిలుస్తున్నా.. పాతతరం పాటిదార్లు మాత్రం ఇప్పటికీ బీజేపీకి మద్దతుదారులుగానే ఉన్నారు. వారు హార్దిక్‌ను తమ నాయకుడిగానే గుర్తించడం లేదని చెప్తున్నారు. బీజేపీ అసంతృప్త శ్రేణులు, నేతలు మాత్రమే ఆయనకు మద్దతునిస్తున్నారని, కొన్ని ప్రాంతాల్లో మాత్రమే హార్దిక్‌కు మద్దతు ఉన్నదని విశ్లేషకులు అభిప్రాయపడుతున్నారు. పాటిదార్లు మూకుమ్మడిగా నిర్ణయాలు తీసుకుంటారని విశ్లేషకులు చెప్తున్నారు. హార్దిక్ సభలకు హాజరయ్యే భారీ జన సందోహం పోలింగ్ కేంద్రాల్లో ఏ మేరకు ఓటుగా మారుతుందన్నది ప్రశ్నార్థకంగా మారింది. హార్దిక్‌కు వ్యతిరేకంగా లీకైన సెక్స్ సీడీ వల్ల ఆయనకు భారీగా సానుభూతి చేకూరుస్తుందని అక్షత్ పటేల్ అనే వ్యక్తి వ్యాఖ్యానించారు. ఇక ఆదివారం సూరత్‌లో నిర్వహించిన మోటార్‌బైక్‌ల రోడ్‌షోకు వేల మంది యువత హాజరయ్యారు. 'జై సర్దార్, జై పాటిదార్' అని నినదించారు. గుజరాత్‌లో ఈ దఫా బీజేపీ ఓటమి ఖాయం అని, ప్రజలదే విజయమని పేర్కొన్నారు.

# ఘజియాబాద్‌లో ఎన్‌ఐఏ-పోలీస్ సోదాలు

- బృందంపై రాళ్ల దాడి, కానిస్టేబుల్‌కు గాయాలు

**న్యూఢిల్లీ:** ఆర్‌ఎస్‌ఎస్ నాయకుడు రవీందర్ గోసెయిన్ హత్య కేసు విచారణలో భాగంగా జాతీయ దర్యాప్తు బృందం (ఎన్‌ఐఏ), ఉత్తరప్రదేశ్ పోలీసుల బృందం ఆదివారం ఘజియాబాద్‌లో సోదాలు నిర్వహించింది. ఈ సమయంలో వారికి ప్రజల నుంచి తీవ్ర ప్రతిఘటన ఎదురైంది. స్త్రీ, పురుషులతో కూడిన ఒక మూక పోలీసులపై రాళ్లదాడికి దిగింది. ఈ దాడిలో కానిస్టేబుల్ తెహజీబ్‌ఖాన్‌కు గాయాలయ్యాయి. ఆత్మరక్షణ నిమిత్తం పోలీసులు గాలిలోకి కాల్పులు జరిపారు. శని, ఆదివారాల్లో మీరట్ జిల్లాలోని అక్రమ ఆయుధ సరఫరాదారులను పట్టుకొని ప్రశ్నించినట్టు ఎన్‌ఐఏ ప్రతినిధి తెలిపారు. అనంతరం ఆదివారం ఉదయం ఘజియాబాద్‌లోని నహలీ గ్రామానికి చెందిన అనుమానితుడు మలూక్ ఇంటివద్ద సోదాలు నిర్వహించినట్టు చెప్పారు.

# 'ఓఖీ'ని జాతీయ విపత్తుగా ప్రకటించలేం

- కేంద్రమంత్రి ఆల్ఫోన్స్ కన్నంథనం వెల్లడి

**తిరువనంతపురం:** కేరళ, తమిళనాడు, లక్షద్వీప్ ప్రాంతాల్లో తీవ్ర ప్రభావం చూపిన ఓఖీ తుఫాన్‌ను జాతీయ విపత్తుగా ప్రకటించలేమని, అన్నిరకాల సహాయక చర్యలు చేపడుతున్నామని కేంద్ర మంత్రి ఆల్ఫోన్స్ కన్నంథనం ప్రకటించారు. ఆదివారం తిరువనంతపురంలో కేరళ సీఎం పినరాయి విజయన్ అధ్యక్షతన నిర్వహించిన ఉన్నతస్థాయి సమావేశానికి ఆయన హాజరయ్యారు. కేంద్ర ప్రభుత్వం ఇప్పటికే అవసరమైన నిధులను రాష్ట్ర ప్రభుత్వానికి అందజేసిందని చెప్పారు. 'ఓఖీ తుఫాన్‌ను జాతీయ విపత్తుగా ప్రకటించాలని రాష్ట్ర ప్రభుత్వం నుంచి మాకు విజ్ఞప్తి అందింది. కేంద్రం వద్ద అలాంటి పథకమేదీ లేదు' అని స్పష్టంచేశారు. తుఫానుకు సంబంధించి తమకు ఎటువంటి ముందస్తు హెచ్చరికలు అందలేదని కేరళ ప్రభుత్వం చేసిన విమర్శలను ఆయన ఇంతకుముందే తిప్పికొట్టారు. గత నెల 28, 29 తేదీల్లో కేంద్ర ఏజెన్సీలు స్పష్టమైన హెచ్చరికలు జారీచేశాయని పేర్కొన్నారు.

**మహారాష్ట్ర, గుజరాత్ దిశగా ఓఖీ..**

తమిళనాడు, కేరళ, లక్షదీప్ ప్రాంతాలను అతలాకుతలం చేసిన ఓఖీ తుఫాను.. రానున్న రెండురోజుల్లో మహారాష్ట్ర, గుజరాత్ తీర ప్రాంతాల వైపు కదులుతుందని, ఆ తర్వాత బలహీనపడుతుందని జాతీయ విపత్తు నిర్వహణ సంఘం పేర్కొన్నది. మత్స్యకారులు చేపలవేటకు వెళ్లొద్దని హెచ్చరికలు జారీచేసింది. తుఫాను కారణంగా కేరళలో మరణించిన వారి సంఖ్య 19కి చేరింది. కర్ణాటకలో ఆదివారం 3 ఇండ్లు కూలిపోగా, చెట్లు కూలిపోయాయి.

**అండమాన్ సముద్రంలో మరో వాయుగుండం!**

**చెన్నై:** ఓఖీ తుఫాను తర్వాత తమిళనాడుకు మరో ముప్పు పొంచి ఉన్నది. దక్షిణ అండమాన్ సముద్రంలో ఏర్పడిన అల్పపీడనం మరో 24 గంటల్లో వాయుగుండంగా మారి తమిళనాడుపై ప్రభావం చూపే అవకాశం ఉన్నదని చెన్నై వాతావరణ విభాగం వెల్లడించింది. రానున్న 48 గంటల్లో వాయుగుండం తీవ్రరూపం దాల్చే అవకాశం ఉన్నట్టు పేర్కొన్నది.

# తెలివితేటలతో ఉన్నత శిఖరాలకు చేరుకోవాలి

- దివ్యాంగులకు రాష్ట్రపతి సూచన

**న్యూఢిల్లీ, డిసెంబర్ 3:** తాము దివ్యాంగులమని బాధపడవద్దని, బుద్ధి, తెలివితేటలతో ఉన్నతస్థానాలకు ఎదుగాలని రాష్ట్రపతి రామ్‌నాథ్ కోవింద్ సూచించారు. అంతర్జాతీయ దివ్యాంగుల దినోత్సవం సందర్భంగా ఢిల్లీలో నిర్వహించిన ఓ కార్యక్రమంలో ఆయన మాట్లాడారు. చాలా మంది దివ్యాంగులు బాధపడుతూ కూర్చోలేదని, ఉన్నత శిఖరాలను అధిరోహించారని చెప్పారు. పర్వత అధిరోహికురాలు అరునిమాసిన్హా, పారా ఒలింపికులు దీపా మాలిక్, కేఎం మైయప్పన్ ఇలా ఎంతో మంది ఉన్నత స్థానాలకు ఎదిగారని తెలిపారు. స్వచ్ఛంద సేవకురాలు టిఫనీ బ్రార్ జీవితం అందరికీ ఆదర్శనీయమని గుర్తుచేశారు. దివ్యాంగులను ఆదుకోవడానికి, వారికి సాధికారత కల్పించడానికి ప్రభుత్వం కృషిచేస్తున్నదని తెలిపారు. ఈ సందర్భంగా 14 క్యాటగిరీల్లో దివ్యాంగులకు రాష్ట్రపతి జాతీయ అవార్డులను అందజేశారు.



దివ్యాంగుల దినోత్సవం సందర్భంగా జాతీయ అవార్డును అందిస్తున్న రాష్ట్రపతి కోవింద్

## హార్దిక్ సెక్స్ సీడీ నేపథ్యంలో..

# సూరత్‌కు ఎన్సీడబ్ల్యూ బృందం

**న్యూఢిల్లీ:** పాటిదార్ ఆందోళన్ అధినేత హార్దిక్‌పటేల్‌కు చెందినట్టుగా భావిస్తున్న సెక్స్ సీడీలో కనిపిస్తున్న యువతితో మాట్లాడేందుకు జాతీయ మహిళా కమిషన్ (ఎన్సీడబ్ల్యూ) చైర్‌పర్సన్ రేఖాశర్మ బృందం ఆదివారం రాత్రి సూరత్ బయలుదేరి వెళ్లింది. 'యువతికి ఉద్యోగం, డబ్బు ఇస్తామని హామీ ఇచ్చి లైంగిక దోపిడీకి పాల్పడ్డారు. హార్దిక్ పటేల్‌పై కేసు నమోదు చేయండి' అంటూ సీడీతోపాటు అందిన లేఖపై ఎన్సీడబ్ల్యూ విచారణ చేపట్టింది. 'బాధితురాలు బృందంతో మాట్లాడాలనుకుంటే అవకాశం ఇస్తాం. ఆమె భయపడితే.. ఆమె తరపున మరెవరైనా మాట్లాడవచ్చు' అని ఎన్సీడబ్ల్యూ అధికారులు తెలిపారు.

# మద్యం.. అతివేగం.. ప్రాణం తీసింది

- పార్క్‌చేసిన మరో కారును ఢీకొని పల్టీ కొట్టిన కారు
- బీటెక్ విద్యార్థి దుర్మరణం, మరో ముగ్గురికి తీవ్రగాయాలు
- జూబ్లీహిల్స్‌లో శనివారం అర్ధరాత్రి ఘటన



ప్రమాదంలో నుజ్జునుజ్జయిన కారు

ప్రమాదంలో మృతిచెందిన జతిన్‌వర్మ

**బంజారాహిల్స్:** నగరం నడిబొడ్డున శనివారం అర్ధరాత్రి మద్యం మత్తులో అతివేగంగా వెళ్తున్న ఓ కారు రోడ్డు పక్కనే పార్క్ చేసిన మరో కారును ఢీకొని, అదుపుతప్పి పల్టీ కొట్టిన ప్రమాదంలో ఓ బీటెక్ విద్యార్థి దుర్మరణం చెందాడు. ఈ ప్రమాదంలో మరో ముగ్గురు విద్యార్థులకు గాయాలయ్యాయి. హైదరాబాద్ గచ్చిబౌలిలోని లుంబినీ స్ప్రింగ్స్ విల్లాస్‌లో నివాసం ఉంటున్న ముదునూరి సాయి జతిన్‌వర్మ (20) గీతం యూనివర్సిటీలో బీటెక్ చదువుతున్నాడు. తమిళనాడులోని సత్యభామ యూనివర్సిటీలో ఇంజినీరింగ్ చదువుతున్న సాయికార్తీక్, ఎం రోహణ్, నిఖిల్‌తో కలిసి జతిన్‌వర్మ శనివారం రాత్రి బంజారాహిల్స్ రోడ్ నంబరు 2లోని పార్క్ హయత్ హోటల్‌లో ఓ ఫంక్షన్‌కు వెళ్లారు. అర్ధరాత్రి దాటిన తర్వాత హోటల్ నుంచి ఎకో స్పోర్ట్స్ కారు (ఏపీ 09 సీవీ 5256)లో జూబ్లీహిల్స్ చెక్‌పోస్టు మీదుగా జూబ్లీహిల్స్ రోడ్ నం 45 వైపు బయలుదేరారు. సాయికార్తీక్ కారు నడుపుతుండగా ముందు సీట్లో జతిన్‌వర్మ, మిగతా ఇద్దరు వెనుక కూర్చున్నారు. అతివేగంగా వెళ్తున్న కారు రాష్ట్ర మహిళా ఆర్థిక సహకార సంస్థ కార్యాలయం వద్ద అదుపుతప్పింది. రోడ్డుపక్కన పార్క్ చేసి ఉన్న స్కోడా కారును ఢీకొని, గాల్లోకి లేచి పల్టీ కొట్టింది. జతిన్‌వర్మ, నిఖిల్‌కు తీవ్ర గాయాలుకాగా, మిగిలిన ఇద్దరికి స్వల్ప గాయాలయ్యాయి. క్షతగాత్రులను స్థానికులు అపోలో హాస్పిటల్‌కు తరలించారు. చికిత్సపొందుతూ ఆదివారం తెల్లవారుజామున 2.30 గంటల ప్రాంతంలో జతిన్‌వర్మ మృతి చెందాడు. పార్క్ హయత్‌లో విందులో స్నేహితులంతా మద్యం తాగారని, కారు నడుపుతున్న సాయికార్తీక్‌కు బ్రీత్ అనలైజర్ పరీక్షలు చేయగా మద్యం తాగినట్టు తేలిందని చెప్పారు.

# ఘట్‌కేసర్‌లో 292 కిలోల గంజాయి పట్టివేత



ముగ్గురి నుంచి గంజాయి స్వాధీనం చేసుకున్నట్టు చూపుతున్న పోలీసులు

**హైదరాబాద్ సిటీబ్యూరో/ ఘట్‌కేసర్, నమస్తే తెలంగాణ:** రూ.36 లక్షల విలువైన 292 కిలోల మేలురకం శీలావతి గంజాయిని మేడ్చల్ జిల్లా ఘట్‌కేసర్ వద్ద ఎక్సైజ్ అధికారులు ఆదివారం పట్టుకుని.. ముగ్గురిని అరెస్టు చేశారు. ఈ మేరకు మల్కాజిగిరి ఎక్సైజ్ సూపరింటెండెంట్ ప్రదీప్‌రావు, రంగారెడ్డి జిల్లా డిప్యూటీ కమిషనర్ ఖురేషీ మీడియాకు వివరాలను వెల్లడించారు. ఖమ్మం జిల్లాకు చెందిన శ్రీధర్ విశాఖపట్నం పరిసర ప్రాంతాల్లో గంజాయి కొనుగోలు చేసి హైదరాబాద్‌తో పాటు ఢిల్లీ, ముంబై, గోవా తదితర ప్రాంతాలకు సరఫరా చేస్తున్నాడు. కొంతమంది కారు డ్రైవర్లను నియమించుకుని ట్రిప్పుకు రూ.5వేలు చెల్లిస్తున్నాడు.విశాఖపట్నం నుంచి హైదరాబాద్ మీదుగా మహారాష్ట్రకు గంజాయిని తరలించేందుకు ప్రయత్నించాడు. సమాచారం అందుకున్న మల్కాజిగిరి ఆబ్కారీ అధికారులు.. ఘట్‌కేసర్ ఔటర్ రింగ్‌రోడ్డు వద్ద మూడు వేర్వేరు కార్లలో తరలిస్తున్న 292 కిలోల గంజాయి ప్యాకెట్లను పట్టుకున్నారు. ప్రధాన నిందితుడు శ్రీధర్‌తోపాటు అతడికి సహకరించిన తూర్పుగోదావరి జిల్లాకు చెందిన వీర్రాజు, రమణారావును అరెస్టు చేశారు. గంజాయి తరలిస్తున్న మూడు కార్లను సీజ్ చేశారు.

# 600 కిలోల గంజాయి స్వాధీనం

**హైదరాబాద్, నమస్తే తెలంగాణ:** హైదరాబాద్‌లోని డీఆర్‌ఐ ప్రధాన కార్యాలయానికి అందిన సమాచారంతో ఏపీలోని విశాఖపట్నంలో 600 కిలోల గంజాయిని ఆదివారం అధికారులు స్వాధీనం చేసుకున్నారు. అక్రమ రవాణాకు పాల్పడుతున్న నేరగాళ్లను పట్టుకునేందుకు డీఆర్‌ఐ అధికారులు.. సముద్రమార్గం గుండా దేశంలోకి విదేశీ సిగరెట్లను రవాణా చేస్తున్న ముఠాను శనివారం పట్టుకున్నారు. తాజాగా ఏపీలోని పడేరు నుంచి వరంగల్‌కు తరలిస్తున్న 600 కిలోల గంజాయిని విశాఖపట్నంలో పట్టుకున్నారు. గంజాయిని సీజ్ చేసిన అధికారులు, నిందితులను అదుపులోకి తీసుకొని విచారిస్తున్నారు. పట్టుబడ్డ గంజాయి విలువ రూ.60 లక్షల ఉంటుందని అడిషనల్ డైరెక్టర్ జనరల్ ఎంకేసింగ్ తెలిపారు.





గన్‌పార్క్‌లోని అమరవీరుల స్థూపం వద్ద శ్రీకాంతాచారి చిత్రపటానికి నివాళులర్పిస్తున్న మంత్రులు ఈటల , జోగు రామన్న, డిప్యూటీ స్పీకర్ పద్మా దేవేందర్‌రెడ్డి, ఎంపీ నర్సయ్యగౌడ్, ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీలు, ఇతర నేతలు

## శ్రీకాంతాచారి చిరస్మరణీయుడు

- అసెంబ్లీ స్పీకర్, శాసనమండలి చైర్మన్

**హైదరాబాద్, నమస్తే తెలంగాణ:** ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం కోసం తన ప్రాణాలు త్యాగంచేసిన కాసోజు శ్రీకాంతాచారి చిరస్మరణీయుడని అసెంబ్లీ స్పీకర్ మధుసూదనాచారి, శాసనమండలి చైర్మన్ స్వామిగౌడ్ పేర్కొన్నారు. తెలంగాణ మలిదశ ఉద్యమంలో బలిదానం చేసుకున్న నల్లగొండవాసి కాసోజు శ్రీకాంతాచారి ఎనిమిదో వర్ధంతి సందర్భంగా ఆదివారం హైదరాబాద్ గన్‌పార్క్‌లోని అమరవీరుల స్థూపం వద్ద ఆయనకు వారు నివాళులర్పించారు. తెలంగాణ రాష్ట్ర సాధనలో శ్రీకాంతాచారి వంటి ఎంతోమంది త్యాగాలున్నాయని వారు కీర్తించారు. కార్యక్రమంలో ఎమ్మెల్సీ శ్రీనివాస్‌రెడ్డి, ఎంబీసీ కార్పొరేషన్ చైర్మన్ తాడూరి శ్రీనివాస్, మహాత్మాజ్యోతిరావు పూలే ఉత్సవాల కమిటీ చైర్మన్ కుందారం గణేషాచారి, బీసీ సంక్షేమ సంఘం రాష్ట్ర అధ్యక్షుడు జాజుల శ్రీనివాస్‌గౌడ్, విశ్వబ్రాహ్మణ సంఘం నాయకులు లాలుకోట వెంకటాచారి, నేరెళ్ల గురుచరణ్‌చారి, పీ రంగాచారి, వీ నర్సింహాచారి, వినోద్‌కుమార్, న్యాయవాది ఉపేంద్రచారి, బీసీ కుల సంఘాల నాయకులు పాల్గొన్నారు.

**శ్రీకాంతాచారికి మంత్రులు, ఎమ్మెల్సీలు, ఎమ్మెల్యేల నివాళి**

గన్‌పార్క్‌లోని అమరవీరుల స్థూపం వద్ద తెలంగాణ అమరవీరుడు శ్రీకాంతాచారికి ఆర్థికశాఖ మంత్రి ఈటల రాజేందర్, బీసీ సంక్షేమశాఖ మంత్రి జోగు రామన్న నివాళులర్పించారు. అసెంబ్లీ నుంచి గన్‌పార్క్ వరకు మంత్రులతో పాటు ఎమ్మెల్సీలు, ఎమ్మెల్సీలు ర్యాలీగా వెళ్లి నివాళులర్పించారు. శ్రీకాంతాచారి అమర్ రహే అంటూ నినాదాలు చేశారు. కార్యక్రమంలో ఎంపీ బూర నర్సయ్య, ఎమ్మెల్సీలు కర్నె ప్రభాకర్, నేతి విద్యాసాగర్, శంభీపూర్‌రాజు, పూల రవీందర్, గంగాధర్‌గౌడ్, లక్ష్మీనారాయణ, బీ వెంకటేశ్వర్లు, ఎమ్మెల్యేలు గంగుల కమలాకర్, వినయ్, శ్రీనివాస్‌గౌడ్ తదితరులు పాల్గొన్నారు.

## ప్రజల వద్దకు తెలుగు మహాసభల సమాచారం

- బస్టాండ్లు, రైల్వే స్టేషన్లలో అన్ని వివరాలు
- ఆన్‌లైన్ ద్వారా తెలంగాణ కవులు.. పండితుల సమాచారం

**హైదరాబాద్, నమస్తేతెలంగాణ:** ప్రపంచ తెలుగు మహాసభలకు సంబంధించిన సమస్త సమాచారం ప్రజలకు అందుబాటులోకి వచ్చింది. ఆదివారం నుంచి బస్‌స్టాండ్లలో, రైల్వే స్టేషన్లలో కియోస్కీల ద్వారా నిరంతర సమాచారం అందించేందుకు ప్రత్యేక కేంద్రాలు ఏర్పాటుచేశారు. తొలిదశలో మహాత్మాగాంధీ బస్‌స్టేషన్, జూబ్లీబస్‌స్టేషన్, నాంపల్లి, సికింద్రాబాద్ రైల్వేస్టేషన్లలో ఈ సమాచార కేంద్రాలను అందుబాటులోకి తెచ్చారు. ప్రపంచ తెలుగు మహాసభల మొత్తం సమాచారాన్ని ఒకేచోట చేర్చి ఆన్‌లైన్ సిస్టమ్ ద్వారా ప్రసారం చేస్తారు.తెలంగాణ సాహిత్య అకాడమి చైర్మన్ నందిని సిధారెడ్డి సారథ్యంలోని కోర్ కమిటీ సభ్యులు ప్రభుత్వ సలహాదారు కేవీ రమణాచారి, తెలుగు విశ్వవిద్యాలయం ఉపకులపతి ఎస్వీ సత్యనారాయణ, రాష్ట్ర గ్రంథాలయ పరిషత్తు చైర్మన్ అయాచితం శ్రీధర్, అధికార భాషా సంఘం చైర్మన్ దేవులపల్లి ప్రభాకరరావు ఆదివారం సమావేశమై ఈ సమాచార వ్యవస్థను పరిశీలించి అందుబాటులోకి తెచ్చారు. ప్రజలు సమూహంగా ఉండే అన్ని ప్రదేశాలలో ఈ ప్రసారాలు జరుగుతాయి. మహాసభలు జరుగుతున్న వేదికలు, అక్కడికి వెళ్లేందుకు మార్గాలు, చర్చించే అంశాలు, వక్తలపేర్లు తదితర అంశాలన్నింటినీ ఈ వ్యవస్థ ద్వారా ప్రసారం చేస్తారు. దీనితోపాటు తెలుగుభాష చరిత్ర, పరిణామక్రమం, తెలంగాణ కవులు, పండితుల సమాచారం..వారు తెలుగుభాషకు అందించిన అపురూప కానుకలు, తెలుగుభాషకు తెలంగాణే పుట్టినిల్లు అని చెప్పేందుకు ఉన్న శాసనాల సారాంశాన్ని ఈ సమాచార వ్యవస్థ ద్వారా ప్రజలకు అవగాహన కల్పిస్తారు.

## నేడు విజయవాడలో సన్నాహక సమావేశం

**హైదరాబాద్ సిటీబ్యూరో, నమస్తే తెలంగాణ:** ప్రపంచ తెలుగు మహాసభలకు సంబంధించిన సన్నాహక సమావేశం సోమవారం విజయవాడ నగరంలో జరుగనున్నది. తెలంగాణ రాష్ట్రప్రభుత్వం నిర్వహించే ప్రపంచ తెలుగు మహాసభల్లో ఆంధ్ర ప్రాంత కవులు, రచయితలు, విమర్శకులు, పండితులు పాల్గొనాలని ఈ సమావేశంలో ఆహ్వానిస్తారని తెలంగాణ సాహిత్య అకాడమి కార్యదర్శి ఏనుగు నర్సింహారెడ్డి ఒక ప్రకటనలో తెలిపారు. సోమవారం ఉదయం 10 గంటలకు హనుమాన్‌పేటలోని విజయవాడ ప్రెస్‌క్లబ్‌లో నిర్వహించే సన్నాహక సమావేశంలో తెలుగు భాషాభిమానులు, సాహితీవేత్తలు పాల్గొనాలని కోరారు. సమావేశంలో ప్రపంచ తెలుగు మహాసభల ప్రాధాన్యం, ప్రత్యేకతలను తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షుడు ఆచార్య ఎస్వీ సత్యనారాయణ, తెలంగాణ బీసీ కమిషన్ సభ్యుడు జూలూరు గౌరీశంకర్ వివరిస్తారని తెలిపారు.

## 'ఇనామ్‌దార్ అర్చకుల హక్కులు పరిరక్షించాలి'

**హైదరాబాద్:** తెలంగాణ దేవాలయ సర్వీస్ ఇనామ్‌దార్ అర్చకుల హక్కులను పరిరక్షించాలని తెలంగాణ దేవాలయ ఇనామ్‌దార్ అర్చకుల సమాఖ్య విజ్ఞప్తి చేసింది. ముఖ్యమంత్రి కేసీఆర్‌ను కలిసి తమ సమస్యలను నివేదించాలని నిర్ణయించింది. తరతరాలుగా భూములను అనుభవిస్తున్న అర్చకులకు రక్షణ కల్పించాలని ఆదివారం అర్చకభవన్‌లో జరిగిన తెలంగాణ దేవాలయ సర్వీస్ ఇనామ్‌దార్ల సమావేశంలో ప్రతినిధులు కోరారు. సమావేశంలో తెలంగాణ దేవాలయ సర్వీస్ ఇనామ్‌దార్ల అర్చక సమాఖ్యను ఏర్పాటుచేశారు. మారేపల్లి రవికుమారాచార్యులను కన్వీనర్‌గా.. ఎన్ కృష్ణయ్యశర్మను గౌరవాధ్యక్షులుగా, రత్నామాచార్యులను గౌరవ సలహాదారులుగా.. నరేంద్రాచారిని ప్రధాన కార్యదర్శిగా, కే ప్రసాదాచార్యులను కోశాధికారిగా ఎన్నుకున్నారు.

## అటవీశాఖలో బదిలీలకు అనుమతివ్వాలి

**హైదరాబాద్, నమస్తే తెలంగాణ:** అటవీశాఖలో చాలాకాలంగా నిలిచిపోయిన కిందిస్థాయి ఉద్యోగులు, అధికారుల బదిలీలకు అనుమతినివ్వాలని జూనియర్ ఫారెస్ట్ అధికారుల సంఘం ప్రభుత్వాన్ని కోరింది. ఆరేడేండ్లుగా క్షేత్రస్థాయిలో బదిలీలు జరుగకపోవడం వల్ల ఉద్యోగులు ఉత్సాహంగా పనిచేసే వాతావరణం కోల్పోతున్నారని పేర్కొన్నది. ఆదివారం మంచిర్యాల జిల్లా జన్నారం గ్రామంలో సంఘం రాష్ట్ర అధ్యక్షుడు నాగేంద్రబాబు అధ్యక్షతన జూనియర్ ఫారెస్ట్ అధికారుల సమావేశం జరిగింది. గతంలో ఎన్నడూ లేనివిధంగా కిందిస్థాయి నుంచి ఉన్నత ఉద్యోగుల వరకు పదోన్నతులు కల్పించినందుకు సీఎం కేసీఆర్, అటవీశాఖ మంత్రి జోగు రామన్నకు సమావేశం కృతజ్ఞతలు తెలిపింది. ఇదే తరహాలో అన్నిస్థాయిల్లో బదిలీలు చేసి అందరికీ న్యాయంచేయాలని ప్రభుత్వాన్ని కోరుతూ సమావేశం తీర్మానించింది.

# రాష్ట్రంలో పెట్టుబడులు పెట్టండి

- ఎన్నారైలకు హోంమంత్రి నాయిని పిలుపు



ఆస్ట్రేలియాలో నిర్వహించిన తెలంగాణ బిజినెస్, కల్చరల్ ఫోరం సమావేశంలో రాష్ట్ర హోం మంత్రి నాయిని నర్సింహారెడ్డికి జ్ఞాపిక అందజేస్తున్న తెలంగాణ ఎన్నారైలు

**హైదరాబాద్, నమస్తే తెలంగాణ:** తెలంగాణలో పెట్టుబడులు పెట్టాలని ఎన్నారైలకు రాష్ట్ర హోంమంత్రి నాయిని నర్సింహారెడ్డి పిలుపునిచ్చారు. ఆదివారం ఆస్ట్రేలియాలో ఏర్పాటు చేసిన తెలంగాణ బిజినెస్ కల్చరల్ ఫోరం సమావేశంలో ఆయన ముఖ్య అతిథిగా పాల్గొని ప్రసంగించారు. అభివృద్ధిని చూసి గ్లోబల్ టెక్నాలజీ, ఆపిల్, గూగుల్‌లాంటి సంస్థలు హైదరాబాద్‌కు వస్తున్నాయని, రాష్ట్రం కొత్త టెక్నాలజీలను అమలుపర్చడంలో ముందుందని పేర్కొన్నారు. రాష్ట్రంలో పరిశ్రమల కోసం నిపుణులైన మానవ వనరులు, అంతరాయంలేని విద్యుత్తు, నీటి సరఫరా వంటి సౌకర్యాలు అందుబాటులో ఉన్నాయని వివరించారు. టీఆర్‌ఎస్ సర్కారు ప్రవేశపెట్టిన టీఎస్ ఐపాస్ విప్లవాత్మకమైన పారిశ్రామిక విధానమని తెలిపారు. ఈజ్ ఆఫ్ డూయింగ్ బిజినెస్‌లో తెలంగాణ ప్రథమస్థానంలో ఉందన్నారు, కొత్తగా 500 పరిశ్రమలకు భూకేటాయింపులు చేశామని ప్రకటించారు. తొలిదశలో 8,200 ఎకరాల్లో ఫార్మాసిటీని అభివృద్ధి చేస్తామని పేర్కొన్నారు. రాష్ట్ర ప్రభుత్వం చేపడుతున్న చర్యలతో తెలంగాణలో పరిశ్రమలు నెలకొల్పేందుకు పారిశ్రామికవేత్తలు ఆసక్తిచూపుతున్నారని అభిప్రాయపడ్డారు. కాకతీయ ఇంటిగ్రేటెడ్ మెగాటెక్స్‌టైల్ పార్కు, సిరిసిల్ల అప్పారెల్ పార్కుతోపాటు నిజామాబాద్, గద్వాల, ఖమ్మం, సంగారెడ్డిలో మెగా ఫుడ్ పార్కులను ఏర్పాటు చేస్తున్నామని పేర్కొన్నారు. ఐటీరంగంలో తెలంగాణ దూసుకుపోతున్నదని చెప్పారు. రాష్ట్ర పోలీసుశాఖకు ప్రపంచవ్యాప్తంగా గుర్తింపు తెచ్చేలా చర్యలు తీసుకొంటున్నట్టు నాయిని వివరించారు. శాంతిభద్రతల్లో నూతన సాంకేతిక విధానాన్ని అమలుచేస్తున్నామని, షీటీమ్స్ ద్వారా మహిళలకు భరోసా కల్పిస్తున్నామని పేర్కొన్నారు. అత్యున్నత సాంకేతిక పరికరాలతో సిబ్బంది విధులు నిర్వహించేందుకు ఏటా రాష్ట్ర బడ్జెట్ నుంచి భారీగా పోలీస్‌శాఖకు నిధులు కేటాయిస్తున్నామని చెప్పారు. ఆస్ట్రేలియాలో నివసిస్తున్న వ్యాపారవేత్తలను హైదరాబాద్ సహ రాష్ట్రంలోని ఇతర ప్రాంతాల్లో పెట్టుబడులు పెట్టేలా ప్రోత్సహించాలని తెలంగాణ బిజినెస్ కౌన్సిల్ ఫోరం (టీబీసీఫ్) ప్రతినిధులకు హెచ్‌ఎంసీ స్టాండింగ్ కమిటీ సభ్యుడు శ్రీనివాస్‌రెడ్డి పిలుపునిచ్చారు. కార్యక్రమంలో టీఆర్‌ఎస్ నేత మహమ్మద్ ఆజమ్ అలీ, తెలంగాణ బిజినెస్ కౌన్సిల్ ఫోరం ఆస్ట్రేలియా అధ్యక్షుడు అశోక్ మరం, సందీప్ మునగాల, నల్లా ప్రవీణ్‌రెడ్డి, కపిల్ కాట్పెల్లీ ప్రదీప్ సేరి, ప్రదీప్ తెడ్ల, రామ్ గుమ్మడివాలి, గోవర్ధన్ సుమేఘరెడ్డి, వాసు తాట్కూర్, ప్రమోద్, ప్రశాంత్, డేవిడ్ రాజు, మిథున్ పాల్గొన్నారు.

# అసత్యాలు తేలిపోతున్నయ్.. తెలుగు వెలిగిపోతున్నది

మన సారస్వతానికి మంచిరోజులు • మన భాషావైభవం చాటేందుకే మహాసభలు

తెలంగాణ రాష్ట్ర అధికార భాషా సంఘం అధ్యక్షుడు దేవులపల్లి ప్రభాకరరావు



**నమస్తే తెలంగాణ, హైదరాబాద్ సిటీబ్యూరో:**

తెలంగాణ ఏర్పడితే తెలుగు నిరాదరణకు గురవుతుందన్న అసత్య ప్రచారం తేలిపోయిందని, ఇవాళ తెలంగాణ తెలుగు మాగాణంగా అత్యంత వైభవంగా వెలిగిపోతున్నదని తెలంగాణ అధికార భాషాసంఘం అధ్యక్షుడు దేవులపల్లి ప్రభాకరరావు అన్నారు. తెలంగాణలో తెలుగు భాష ప్రత్యేకత, సాహిత్య వికాస విశిష్టతలను చాటుతూ, భాషాభివృద్ధికి మార్గాలను అన్వేషించే విధంగా విశ్వవ్యాప్తంగా ఉన్న తెలుగువాళ్లందరినీ ఒకే వేదికపైకి తీసుకొచ్చి అయిదురోజుల పండుగను జరుపుకొంటున్నామని ఆయన తెలిపారు. ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా ఈ సభల కోర్ కమిటీ సభ్యుడయిన దేవులపల్లి నమస్తే తెలంగాణతో మాట్లాడుతూ తెలుగుకు నిన్న జరిగిన ద్రోహం, నేడు అందుతున్న తోడ్పాటు, రేపు జరుగాల్సిన కృషిని వివరించారు.

**తొలి భాషా ప్రయుక్త రాష్ట్రం (ఉమ్మడి ఆంధ్రప్రదేశ్)లో తెలుగు అభివృద్ధికి జరిగిన కృషి?**

ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు కోరుతున్నప్పుడు మనకొక తెలుగు రాష్ట్రం ఏర్పడితే తెలుగు భాషాభివృద్ధి జరుగుతుందన్నారు ఆంధ్ర నాయకులు. ఆంధ్రప్రదేశ్ ఏర్పాటైంది కానీ.. తెలుగు అధికార భాషగానే లేదు. రాష్ట్రం ఏర్పాటైన పదేండ్లకు (1966లో) ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి తెలుగును అధికార భాషగా ప్రకటిస్తూ చట్టం చేశారు. అదికూడా తెలంగాణ బిడ్డ పీవీ నరసింహారావు ముఖ్యమంత్రిగా ఉన్నాడు కాబట్టి సాధ్యమైంది. పీవీ నరసింహారావు తెలుగు భాషపట్ల అభిమానం ఉన్నవాడు కావడం వల్లే తెలుగుకు అధికారభాష హోదా దక్కింది. ఆయన నిర్ణయం ఇష్టంలేని ఆంధ్ర నాయకులు తెలుగు భాషను అధికారభాషగా చలామణి కానీయలేదు. అందువల్లనే తెలుగు భాషను అధికార భాషగా చట్టం చేసిన ఎనిమిదేళ్లకు అధికార భాషా సంఘాన్ని ఏర్పాటు చేశారు. వావిలాల గోపాలకృష్ణయ్య తొలి అధ్యక్షుడు. 2 జూన్ 2014న తెలంగాణ ఏర్పాటయ్యే నాటికి 15 మంది అధికార భాషా సంఘం అధ్యక్షులుగా పనిచేశారు. వారిలో ముగ్గురు మాత్రమే తెలంగాణ వారు.

**తెలుగు తప్పనిసరి వల్ల ప్రయోజనాలేమిటి?**

సీఎం కేసీఆర్ తెలుగుభాషకు పూర్వవైభవం కోసం చేపడుతున్న కార్యక్రమాలు చాలా గొప్పగా తోస్తున్నాయి. అధికారంలోకి వచ్చిన రెండేండ్లలోనే అధికార భాషాసంఘాన్ని ఏర్పాటు చేశారు. ఉర్దూని రెండవ అధికార భాషగా చేర్చుతూ చట్టం చేశారు. మూడున్నరేండ్లకే ప్రపంచ తెలుగు మహాసభలు నిర్వహిస్తున్నారు. మొదటి తరగతి నుంచి ఇంటర్మీడియట్ వరకు తెలుగు భాషను ఒక సబ్జెక్టుగా చదవడం తప్పని సరిచేస్తూ చట్టం చేశారు.ఈ నిర్ణయం వల్ల అందరూ తెలుగును చదువుతారు. ఫలితంగా తెలుగు అధికార భాషగా మనగలుగుతుంది. చాలా మంది తెలుగు చదువలేనివారు.. ఆంగ్లం, ఇతర మాద్యమాల్లో ఉన్నవాళ్లంతా తెలుగు నేర్చుకుంటారు. తద్వారా అధికార భాషగా తెలుగును మరింత బాగా అమలు చేయడానికి కూడా ఈ నిర్ణయం దోహదపడుతుంది. తెలుగు భాషపట్ల తెలంగాణ ముఖ్యమంత్రి కల్వకుంట్ల చంద్రశేఖర్‌రావు ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో ఏ ముఖ్యమంత్రి చూపని శ్రద్ధ, ఆసక్తి చూపిస్తున్నారు. ఆయన ముఖ్యమంత్రి కాగానే కాళోజీ, దాశరథి పేరుతో సాహిత్య పురస్కారాలను ప్రతిఏటా ప్రదానం చేయాలని నిర్ణయించారు. గ్రంథాలయాలను మళ్లీ పునరుద్ధరించేందుకు కృషిచేస్తున్నారు.

**తెలుగుభాష ఈ దుస్థితిలో ఉండటానికి కారణం?**

సంస్కృతి, చరిత్రకు భాష ప్రాతిపదికవంటిది. దీనిని సంరక్షించుకుంటేనే మన భాష సుసంపన్నమవుతుంది. ఈతరానికి తెలుగు రాదు. తెలుగంటే చిన్నచూపు వుండటం వల్లనే చాలా మంది తెలుగుకు దూరమవుతున్నారు. గత పాలకులు కేవలం మాటలతో సంతృప్తి చెందారు. నేడు ఎక్కడ చూసినా తెలుగు కనబడని దుస్థితి వుంది. తెలుగులో బోర్డులు తప్పనిసరిగా ఉండాలనే నిబంధనతో ప్రైవేటు సంస్థలు కూడా ధోరణి మార్చుకుంటాయి.

**తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం అయితే తెలుగుకు ప్రమాదమన్న ప్రచారం ఎందుకు జరిగింది?**

తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమానికి వ్యతిరేకంగా జరిగిన ప్రచారంలో ఇదీ ఒకటి. తెలంగాణలో తెలుగు భాష, తెలుగు సారస్వతం నిరాదరణకు గురవుతాయని, చిన్నచూపు చూస్తారనే తప్పుడు ప్రచారంచేశారు. నిజానికి 1969 ఉద్యమంలోనే ఈ ప్రచారం జరిగింది. తెలంగాణ ఏర్పడితే తెలుగు లేకుండాపోయి, గుజరాతీ, మర్వాడీ, ఉర్దూ, సింధీ, పంజాబీ భాషల వాళ్ల ప్రాతినిధ్యం పెరుగుతుందని ప్రచారం చేశారు. ఆ రోజుల్లో నేను విద్యార్థిని. తెలంగాణను కోరుకునేవాళ్లంతా ఆ ప్రచారాన్ని వ్యతిరేకించారు. వాళ్లలో నేనొకడిని. నాటి కవులు, రచయితలకు కాళోజీ ఒక స్ఫూర్తి. ఆయన ఒక్కరే మద్దతు పలికారు.

**తెలుగు మహాసభల ద్వారా సమాజానికి ఏ సందేశం ఇవ్వాలని ప్రభుత్వం భావిస్తుంది?**

తెలంగాణలో సారస్వతం లేదన్న మాటకు సమాధానంగా ఎందరో కవులను పరిచయం చేస్తూ, మన సాహితీ వైభవాన్ని ప్రపంచానికి చాటేందుకు ఈ మహాసభలు నిర్వహిస్తున్నారు. తెలంగాణలో తెలుగు వైభవం ఏమిటో చాటిచెప్పేందుకు అనేక వ్యాసాలు, వందల పుస్తకాలను ప్రచురిస్తున్నారు.

## యలమందహాసం

మొదటిపేజీ తరువాయి...

నిండుతున్నాయి. మేడ్చల్ జిల్లాలో ఇప్పటివరకు 1,942 మంది అర్హులకు 38,840 గొర్రెలను పంపిణీచేశారు. ప్రస్తుతం ల్యాంబింగ్ (గొర్రెల ఈత సీజన్) కావటంతో జిల్లావ్యాప్తంగా 9,413 పిల్లలు జన్మించినట్టు జిల్లా పశుసంవర్ధకశాఖ అధికారుల సర్వేలో తేలింది. కేవలం ఐదున్నర నెలల్లోనే 24.24% జీవాల సంతతి వృద్ధి చెందటంతో లబ్ధిదారులు సంబురపడుతున్నారు. గొర్రెల పెంపకం ప్రత్యేక ప్యాకేజి కింద ఒక్కొక్కరికి సుమారు 20 ఆడ గొర్రెలను, ఒక పొట్టేలును పంపిణీ చేస్తారు. వీటి విలువ రూ.1.25 లక్షలు. ఇందులో 25% (రూ. 31,250) లబ్ధిదారుడు భరిస్తే, 75% (రూ.93,750) ప్రభుత్వం సబ్సిడీ ఇస్తుంది. ఈ పథకం కింద మేడ్చల్ జిల్లాలో ఇప్పటికే 38వేల గొర్రెలను పంపిణీచేశారు. ఈ 20 గొర్రెలను లబ్ధిదారులు జాగ్రత్తగా పెంచుకుంటే ఏడాదిలో సుమారు 27 పిల్లలకు జన్మనిస్తాయి. ఇందులో సగం మగపిల్లలు పుట్టే అవకాశం ఉన్నది. ఈ పిల్లలు మంచి బరువు వచ్చిన తర్వాత మార్కెట్‌లో విక్రయిస్తే కనీసం రూ.70వేల నుంచి రూ. 80వేల వరకు ఆదాయం వస్తుంది. జీవాలను విక్రయించేందుకు మేడ్చల్ మార్కెట్‌లో అవసరమైన సదుపాయాలు కల్పించేందుకు చర్యలు తీసుకుంటున్నామని అధికారులు చెప్పారు.

**మేడ్చల్ జిల్లాలో పంపిణీ చేసిన గొర్రెల యూనిట్లు, కొత్తగా జన్మించిన పిల్లల వివరాలు మండలాలవారీగా...**

| మండలం పేరు | లబ్ధిదారుల సంఖ్య | పంపిణీ చేసిన గొర్రెలు | జన్మించిన గొర్రెల వివరాలు | రెండేసి పిల్లలు వేసిన గొర్రెలు | వృద్ధి శాతం |
|---|---|---|---|---|---|
| మేడ్చల్ | 374 | 7480 | 2153 | 19 | 28.78 |
| ఘట్‌కేసర్ | 448 | 8960 | 2132 | 24 | 23.79 |
| శామీర్‌పేట్ | 594 | 11880 | 2981 | 1 | 25.09 |
| కీసర | 359 | 7180 | 1562 | 3 | 21.75 |
| దుండిగల్ | 130 | 2600 | 492 | 1 | 18.92 |
| బాచుపల్లి | 27 | 540 | 81 | 0 | 15.00 |
| కాప్రా | 10 | 200 | 12 | 0 | 6.0 |
| మొత్తం | 1942 | 38,840 | 9413 | 46 | 24.24 |

### జీవాల కాపర్లకు జీవమొచ్చింది

గొర్రెల పెంపకం వృత్తిని నమ్ముకొని జీవిస్తున్న జీవాల కాపలదార్లకు గొర్రెల పంపిణీ పథకంతో మళ్లీ జీవమొచ్చింది. అన్నివర్గాల ప్రజల జీవన ప్రమాణాలను పెంచేందుకు సీఎం కేసీఆర్ అనేక సంక్షేమ కార్యక్రమాలకు శ్రీకారం చుట్టారు. ప్రభుత్వం సుమారు నాలుగు వందల కోట్ల రూపాయలతో గొర్రెల పంపిణీ పథకానికి శ్రీకారం చుట్టింది. గొల్ల, కురుమలకు ఉపాధి కల్పించటంతోపాటు రాష్ట్రంలో మాంసం కొరతను తీరుస్తుంది.



–చామకూర మల్లారెడ్డి, మల్కాజ్‌గిరి ఎంపీ

### పటిష్ఠంగా అమలుచేస్తున్నాం



గొర్రెల యూనిట్ల పంపిణీ పథకాన్ని పటిష్టంగా అమలుచేస్తున్నాం. ముఖ్యంగా గ్రామ శివారుల్లో తొట్లు నిర్మించటం, సబ్సిడీపై పశుగ్రాసం విత్తనాల సరఫరా, ఫారెస్ట్ భూముల్లో గొర్రెలను మేపుకొనే వెసులుబాటు కల్పించాం. జిల్లాలో ఇప్పటి వరకు 80% యూనిట్లను పంపిణీ చేశాం. గొర్రెలకు వైద్యం చేసేందుకు ప్రభుత్వం జిల్లాకు రెండు సంచార వైద్య వాహనాలను కేటాయించింది. ఈ వాహనాల్లోని వైద్యులు మంద దగ్గరికెళ్లి సుస్తీ చేసిన గొర్రెలకు వైద్యం అందిస్తున్నారు.

– ఎంవీ రెడ్డి, మేడ్చల్ జిల్లా కలెక్టర్



సమావేశంలో మాట్లాడుతున్న ఎస్సీ కమిషన్ చైర్మన్ పిడమర్తి రవి

## ఎస్సీ వర్గీకరణ బిల్లును పార్లమెంట్‌లో ప్రవేశపెట్టాలి

- రాష్ట్ర ఎస్సీ కమిషన్ చైర్మన్ పిడమర్తి రవి

**కంటోన్మెంట్, నమస్తే తెలంగాణ:** ఎస్సీ వర్గీకరణ బిల్లును వచ్చే పార్లమెంట్ సమావేశాల్లో ప్రవేశపెట్టాలని రాష్ట్ర ఎస్సీ కమిషన్ చైర్మన్ పిడమర్తి రవి డిమాండ్ చేశారు. ఎస్సీ వర్గీకరణపై కేంద్రం కాలయాపన తగదన్నారు. సికింద్రాబాద్‌లోని బాలమ్‌రావులో ఆదివారం జరిగిన రాష్ట్ర కమిటీ సమావేశంలోఆయన మాట్లాడారు. టీఎమ్మార్పీఎస్, మాదిగ జేఏసీల సంయుక్త ఆధ్వర్యంలో ఢిల్లీలో ఈ నెల 27, 28, 29 తేదీల్లో ధర్నా నిర్వహించనున్నట్టు రవి తెలిపారు. తాము అధికారంలోకి వచ్చిన 100 రోజుల్లోనే ఎస్సీ వర్గీకరణ తెస్తామని బీజేపీ హామీ ఇచ్చి మూడున్నరేండ్లయినా అమలుచేయడం లేదని టీఎమ్మార్పీఎస్ వ్యవస్థాపక అధ్యక్షుడు ఇటుక రాజుమాదిగ విమర్శించారు. సమావేశంలో టీఎమ్మార్పీఎస్ గౌరవ అధ్యక్షుడు సింగిరెడ్డి రామేశ్వర్‌మాదిగ, మాదిగ జేఏసీ రాష్ట్ర అధ్యక్షుడు రాయగంటి రామదాస్ మాదిగ, హైదరాబాద్ జిల్లా ఇంచార్జి ఈరంగారి రాములు మాదిగ, గ్రేటర్ అధికార ప్రతినిధి ఇటుక గోపి మాదిగ, జిల్లా ప్రధాన కార్యదర్శి సంద్రపాటి నాగరాజుమాదిగ, లూక మాదిగ, సీహెచ్ నానిమాదిగ తదితరులు పాల్గొన్నారు.

**దమ్ముంటే నిరుద్యోగులతో సభను నడిపించు: పిడమర్తి**

**తార్నాక:** కొలువులకై కొట్లాట సభ ముమ్మాటికి రాజకీయ నిరుద్యోగుల కోసమేనని ఎస్సీ కార్పొరేషన్ చైర్మన్ పిడమర్తి రవి అన్నారు. ప్రొఫెసర్ కోదండరాం చేస్తున్న ఉద్యమానికి అసలైన నిరుద్యోగులను పోగుచేసుకొని సభ నిర్వహించుకోవాలే తప్ప ప్రతిపక్షాల అవసరం ఏముందని ఆదివారం తార్నాకలో మీడియా సమావేశంలో ప్రశ్నించారు. ఇది ముమ్మాటికీ రాజకీయ పదవుల కోసం కొట్లాట అని, కోదండరాం మాయలో పడి విద్యార్థులు ఎవరూ హైదరాబాద్‌కు రావొద్దని రవి పిలుపునిచ్చారు.

## కొలువులపై ప్రతిపక్షాల ఆరోపణలు అర్థరహితం

- టీఆర్‌ఎస్ డెన్మార్క్ అధ్యక్షుడు శ్యాంబాబు ఆకుల

**హైదరాబాద్, నమస్తే తెలంగాణ:** ఏడాదిలోపే లక్ష కొలువులను ప్రభుత్వం భర్తీ చేస్తామని చెపితే ప్రతిపక్షాలు విమర్శించడం అర్థరహితమని టీఆర్‌ఎస్ డెన్మార్క్ అధ్యక్షుడు శ్యాంబాబు ఆకుల ధ్వజమెత్తారు. ఈ మూడున్నరేండ్లలోనే జరుగుతున్న అభివృద్ధి పనులు ప్రతిపక్షాలకు కనిపించడం లేదా అని ఆదివారం విడుదల చేసిన ప్రకటనలో ప్రశ్నించారు. రైతులకు 24 గంటల కరంట్, మిషన్ కాకతీయ ద్వారా చెరువుల పునరుద్ధరణ, మిషన్ భగీరథతో ఇంటింటికీ మంచినీరు, కేసీఆర్ కిట్లు, కల్యాణలక్ష్మి, గురుకులాల ఏర్పాటు, హైదరాబాద్ మెట్రో వంటి కార్యక్రమాలు ప్రతిపక్షాలకు కనిపించడం లేదా అని ప్రశ్నించారు.

## 16న మాదిగ అమరవీరుల సంతాప సభ



సమావేశంలో మాట్లాడుతున్న ఎమ్మార్పీఎస్ రాష్ట్ర అధ్యక్షుడు యాతాకుల భాస్కర్

**ఉస్మానియా యూనివర్సిటీ:** దండోరా ఉద్యమంలో ఇటీవల మృతిచెందిన దర్శనాల భారతి, హరికృష్ణ, చిలుక ప్రభాకర్‌లతోపాటు గతంలో అమరులైన పొన్నాల సురేందర్, దామోదర్, మహేశ్‌ల సంస్మరణార్థం ఈ నెల 16న మాదిగ అమరవీరుల సంతాపసభ నిర్వహించనున్నట్టు ఎమ్మార్పీఎస్ (టీఎస్) రాష్ట్ర అధ్యక్షుడు యాతాకుల భాస్కర్, కార్యనిర్వాహక అధ్యక్షుడు వంగపల్లి శ్రీనివాస్ తెలిపారు. ఓయూలోని ఈసీఈ ఆడిటోరియంలో ఆదివారం నిర్వహించిన ఎమ్మార్పీఎస్ (టీఎస్), అనుబంధ సంఘాల రాష్ట్ర విస్తృతస్థాయి సమావేశంలో వారు మాట్లాడారు. ఇందిరాపార్క్‌లో నిర్వహించనున్న ఈ సభకు మాదిగలంతా తరలిరావాలని పిలుపునిచ్చారు. సమావేశంలో ఎమ్మార్పీఎస్ జాతీయ అధ్యక్షుడు సుంకపాక దేవయ్య, ప్రధాన కార్యదర్శి మేడి పాపయ్య, కోర్ కమిటీ సభ్యులు మేకల నరేందర్, అల్లార రత్నయ్య, గొడ్ల మోహన్‌రావు, కొండ్ర శంకర్, జున్ను కనకరాజు, బొడ్డు రామన్న, ఎంఎస్‌ఎఫ్ నాయకులు కొల్లూరి వెంకట్, అలెగ్జాండర్, కొంగరి శంకర్, వరిగడ్డి చందు, తప్పెట్ల ప్రవీణ్, నర్సాని రమేశ్, తిరుమలేశ్ తదితరులు పాల్గొన్నారు.



ఆస్ట్రేలియాలో దీక్షాదివస్‌లో పాల్గొన్న ఎన్నారైలు

## ఆస్ట్రేలియాలో ఘనంగా దీక్షాదివస్

**హైదరాబాద్ నమస్తే తెలంగాణ:** ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర సాధనే ధ్యేయంగా ఎనిమిది ఏండ్ల క్రితం అప్పటి ఉద్యమనేత, సీఎం కేసీఆర్ చేపట్టిన 'దీక్ష'ను గుర్తుచేసుకుంటూ ఆస్ట్రేలియాలోని సిడ్నీలో టీఆర్‌ఎస్ ఆస్ట్రేలియా ఉపాధ్యక్షుడు వైస్ ప్రెసిడెంట్ రాజేశ్ రాపోలు, న్యూవేల్స్ ఇంచార్జి విక్రమ్ కటికనేని ఆధ్వర్యంలో దీక్షాదివస్‌ను నిర్వహించారు. కార్యక్రమానికి హజరైనవారు కూడా తెలంగాణ ఉద్యమంలో తమ జ్ఞాపకాలను గుర్తుచేసుకొని కేసీఆర్ పోరాటపటిమను కొనియాడారు. విక్రమ్ కటికనేని మాట్లాడుతూ.. రాష్ట్రం సిద్ధించిన తరువాత తెలంగాణ రాష్ట్ర అభివృద్ధికి కేసీఆర్ చేస్తున్న కృషిని, ప్రవేశపెడుతున్న పథకాలను వివరించారు. ఈ కార్యక్రమంలో నాయకులు ప్రవీణ్ పిన్నమ, పరశురామ్ మోత్కుల, జస్వంత్ కొడరపు, రవి ధూపాటి, మాధవ్ కటికనేని, సాగర్‌రెడ్డి, లక్ష్మణ్, రవి, రవీందర్‌రెడ్డి, ఇస్మాయిల్, అరుణ్, రజినీకాంత్, దినేశ్ పాల్గొన్నారు. దీక్షాదివస్ నిర్వహించిన సిడ్నీ నాయకులకు టీఆర్‌ఎస్ ఆస్ట్రేలియా అధ్యక్షుడు నాగేందర్‌రెడ్డి కాసర్ల అభినందించారు.

జిందగీ పేజీపై మీ అభిప్రాయాలు, సలహాలు తెలియజేయండి.
zindagi@ntdaily.news
www.ntzindagi.com
/nt.zindagi

హైదరాబాద్
సోమవారం 4 డిసెంబర్ 2017
WWW.NTNEWS.COM


**ఒకరితర్వాత ఒకరు ఇంట్లోవాళ్లంతా కళ్ల ముందే మరణిస్తుంటే దిక్కుతోచని స్థితి. వేలాది రూపాయల విలువచేసే కంపెనీ షేర్లు అమాంతం పడిపోతే చుట్టూ పరుచుకున్న చిమ్మచీకటి. ఆమెకు జీవితం మీద ఆశ, ఆసక్తి రెండూ పోయాయి. కానీ ఆ ఆటుపోట్లను తట్టుకుని ఒక్కోమెట్టు తిరిగి నిర్మించుకున్నారు. ఆవిరైన ఆశలకు కొత్త జీవం పోసుకుని వ్యాపార జీవితాన్ని నిలబెట్టుకున్నారు. పతనానికి చేరువైన సంస్థ పగ్గాలు చేపట్టి వేలకోట్లకు విస్తరింపజేశారు. ఎనిమిదేండ్లలోనే అత్యంత ధనవంతురాలిగా అవతరించి విజేతగా నిలిచారు. కేవలం మహిళా లోకానికే కాదు వ్యాపారంలో ఎదగాలనుకునే వారందరికీ స్ఫూర్తి థెర్మాక్స్ గ్రూపు చైర్‌పర్సన్‌గా సేవలందించిన అనూ అగా సక్సెస్‌మంత్ర.**



సక్సెస్ మంత్ర

# వ్యాపార కీర్తి.. సేవా స్ఫూర్తి

**అనూ అగా ఫోర్బ్స్ భారతీయ జాబితాలో ఎనిమిదో స్థానం సంపాదించుకున్న ధనవంతురాలిగానే అందరికీ తెలుసు. కానీ ఆ ఎదుగుదల వెనుక ఆమె అనుభవించిన కష్టాల చిట్టా ఉందంటే అతిశయోక్తికాదు. కళ్ల ముందే తండ్రి, భర్త, కొడుకు, అత్త అందరూ పోయారు. దీంతో అనూ కుటుంబమే కాదు.. థెర్మాక్స్ గ్రూప్ కూడా దిక్కు తోచని స్థితిలో పడిపోయింది. కంపెనీని నడిపిస్తున్న భర్త హఠాన్మరణం పాలైనపుడు దిక్కుతోచని స్థితిలో ఉన్నా.. సంస్థ పగ్గాలు చేపట్టి దానిని వేల కోట్లకు విస్తరింపజేసిన ఘనత ఆమెది.**

### వరుస కష్టాలు

అనూ పుట్టింది సంపన్న కుటుంబంలోనే. కానీ ఆమె ఎదుర్కొన్న కష్టాలు మాత్రం మామూలువి కావు. 1996 వరకు ఆమె ఓ సాధారణ మహిళే. అను తండ్రితో కలిసి భర్త రోహింగ్టన్ అఘా 40 ఏండ్ల క్రితం ఆరంభించిన సంస్థ.. థెర్మాక్స్ గ్రూప్. బాయిలర్లను తయారుచేసే ఇంజినీరింగ్ సంస్థ అది. కొన్నేండ్లలోనే సంస్థ గొప్ప ప్రగతి సాధించింది. ఐతే 1996లో గుండెపోటు వల్ల రోహింగ్టన్ హఠాన్మరణం పాలయ్యారు. అప్పటికి కంపెనీ బాధ్యతలన్నీ ఆయనే చూసుకుంటున్నారు. దీంతో ఆమెకు దాని గురించి ఏమీ అవగాహన లేదు. పోనీ తండ్రి అయినా చూస్తాడనుకుంటే ఆయన అంతకుముందే మరణించారు. అదేం విచిత్రమో రోహింగ్టన్ చనిపోయిన కొన్ని రోజులకే అతని తల్లి (అను అత్త) కూడా ప్రాణాలు విడిచింది. ఈ బాధ చాలదన్నట్లు ఇంకో ఏడాది గడిచేలోపు 25 ఏండ్ల అనూ పెద్ద కొడుకు యాక్సిడెంట్లో చనిపోయాడు. రోహింగ్టన్ చనిపోయిన ఏడాదే థెర్మాక్స్ గ్రూప్ పబ్లిక్ ఇష్యూకు వెళ్లింది. చక్కటి పనితీరు ఉన్న కంపెనీ కావడంతో షేర్ ధర రూ. 400 వరకు ఉండేది. అయితే ఆయన మరణంతో సమర్థులైన నిర్వాహకులు కరువై సంస్థ షేరు రూ. 36కు పడిపోయింది!

### వ్యక్తిగత జీవితం, కెరీర్

అనూ అగా ఆగస్టు 3, 1942లో ముంబాయిలో ఒక పార్సీ కుటుంబంలో జన్మించారు. ముంబైలోని సెయింట్ జేవియర్స్ కాలేజీలో బీఏ ఎకానమిక్స్ చదివారు. ఆ తరువాత ప్రఖ్యాత టాటా ఇనిస్టిట్యూట్ ఆఫ్ సోషల్ సైన్సెస్‌లో వైద్యం మానసిక సామాజిక సేవలో పోస్ట్‌గ్రాడ్యుయేషన్ చేశారు. అలాగే పుల్‌బ్రైట్ స్కాలర్‌గా ఉండడంతో పాటు నాలుగు నెలలపాటు అమెరికాలోనూ చదివారు. పెండ్లి తర్వాత 1985లో థెర్మాక్స్ గ్రూపులో చేరి ఉద్యోగ కెరీర్‌ను ప్రారంభించారు. ఆ తర్వాత 1991 నుంచి 96 వరకు హెచ్‌ఆర్ హెడ్‌గా పనిచేశారు. భర్త రోహింగ్టన్ అకాల మరణంతో థెర్మాక్స్ బాధ్యతలు చేపట్టి చైర్‌పర్సన్‌గా 2004 వరకు పనిచేశారు. ఆ తర్వాత పదవీ విరమణ చేసి కూతురు మెహర్ పుడుంజీకి బాధ్యతలు అప్పగించారు.

### సవాలును అధిగమించి..

అనూ థెర్మాక్స్ బాధ్యతలు చేపట్టే నాటికి ఆమెకు సంస్థ గురించి పైపైన మాత్రమే తెలుసు. సంస్థలో పనిచేసిన అనుభవం ఉన్నప్పటికీ అంత పెద్ద బాధ్యతలు నిర్వర్తించడం మాత్రం తొలిసారే. తప్పనిసరి పరిస్థితుల్లో కన్నీటిని దిగమింగి బాధ్యతలు చేపట్టారు. తమ కుటుంబానికి కంపెనీలో 62 శాతం షేర్స్ ఉండటంతో అనూ సంస్థ చైర్‌పర్సన్ అయ్యారు. అంత పెద్ద బాధ్యతలు తలకెత్తుకోవడం ఆమెకు సవాలే అయింది. పైగా సంస్థ దిశానిర్దేశం లేకుండా సాగుతున్నది. ఈ స్థితిలో మరొకరైతే ఆ ఆటుపోట్లకు తట్టుకోలేక చేతులెత్తేసేవారు. కానీ అను దృఢంగా నిలబడ్డారు. ఒత్తిడిని తట్టుకోవడం కోసం యోగాతో ముందు తాను స్థిమిత పడ్డారు. ఆ తర్వాత సంస్థలో అస్తవ్యస్థ వ్యవస్థను సరిచేశారు. నిర్వహణ ఖర్చులు తగ్గించుకునేందుకు కొందరు ఉద్యోగుల్ని తొలగించాలన్న కఠిన నిర్ణయాలు కూడా తీసుకున్నారు. కొన్ని సంస్థలతో మాట్లాడి పెట్టుబడులు రాబట్టారు. అనుభవజ్ఞులతో ఒక ప్రత్యేక టీం ఏర్పాటు చేసి.. వారి ఆలోచనల్ని అమలు చేసి సంస్థను మళ్లీ పట్టాలపైకి ఎక్కించారు. తను కంపెనీ బాధ్యతలు చేపట్టిన తర్వాత 2004 నాటికి థెర్మాక్స్ గ్రూప్ విలువ రూ. 3 వేల కోట్లకు పైనే అంటే ఆమె ఎనిమిది ఏండ్లలో ఎంత కష్టపడి పనిచేశారో అర్థం చేసుకోవచ్చు. ఆ ఏడాది అనూ సంస్థ నుంచి తప్పుకుని.. తన కూతురు మెహరును చైర్‌పర్సన్‌ను చేశారు. 2007లో ఫోర్బ్స్ ప్రకటించిన భారతీయ ధనవంతుల జాబితాలో అనూ ఎనిమిదో స్థానం సంపాదించారు.

> “ఏడాది వ్యవధిలో భర్త, కొడుకు చనిపోయినపుడు ఎంత బాధపడ్డానో చెప్పలేను. ఆ సమయంలో నా మీద నేను జాలిపడుతూ, ఏడుస్తూ కూర్చోవడమా.. లేదా ధైర్యంగా పోరాడటమా? అని ఆలోచించాను. తర్వాత రెండో మార్గాన్నే ఎంచుకున్నాను. ఆ సమయంలో ‘విపాసన’ అనే ధ్యాన కార్యక్రమం నాలో మార్పు తెచ్చి.. నన్ను శక్తిమంతురాలిగా మార్చింది. సాహసోపేత నిర్ణయాలు తీసుకుని సంస్థను నిలబెట్టాను. సంస్థ నుంచి తప్పుకున్నాక సమాజం కోసం ఏదైనా చేయాలనిపించి సేవా కార్యక్రమాల్లో అడుగు పెట్టాను” అని ఓ సందర్భంలో తన పట్టుదల గురించి బయటపెట్టారు అనూ అగా. మనిషికి విజ్ఞానమే కాదు.. మానసిక స్థైర్యం చాలా అవసరం అని అనూను చూస్తే తెలుస్తుంది. .



### సామాజిక సేవవైపు పయనం

వ్యాపార బాధ్యతలకు దూరమయ్యాక అనూ ఊరికే కూర్చోలేదు. సామాజిక సేవపై దృష్టిపెట్టారు. థెర్మాక్స్ సోషల్ ఇనిషియేటివ్ ఫౌండేషన్ ఏర్పాటు చేసి పేదలకు పెద్ద ఎత్తున నాణ్యమైన విద్య అందిస్తున్నారు. సమాజసేవలో భాగంగా ఈమె పుణెలో అత్యంత పేదలైన పిల్లల కోసం విద్యాసంస్థలు, వారికి కావాల్సిన కనీస సౌకర్యాలను అందించేందుకు వివిధ ప్రాంతాలలో సేవా సంస్థలను స్థాపించారు. దీంతోపాటు ఆమె ఇతర సేవా సంస్థలకు కూడా తన మద్దతునిస్తుంటారు. అలాగే ఆమె చైర్‌పర్సన్‌గా కొనసాగిన థెర్మాక్స్ ఇండియా సంస్థ తన సమాజ సేవా కార్యక్రమాలకు సంస్థ ఆదాయంలోనుంచి ఒక శాతం సేవా సంఘాలకు విరాళాలుగా అందజేస్తుంటారు.

### ప్రభుత్వ గుర్తింపు

అనూ అగా పలు సంస్థల్లో సభ్యులుగా ఉన్నారు. కమిటీ ఆన్ పర్సనల్ పబ్లిక్ గ్రీవెన్సెస్. లా అండ్ జస్టిస్ సభ్యురాలు (2012–2014) (2014 ప్రస్తుతం), సభ్యురాలు, పార్లమెంటరీ ఫోరం ఆన్ చిల్డ్రన్ (2012–14), సభ్యురాలు, మహిళల సాధికారత కమిటీ (2012–2013), సభ్యురాలు, కమిటీ ఆన్ కామర్స్ (ఆగస్టు–డిసెంబర్–2012). సేవారంగంలో అనూ చేస్తున్న కృషిని గుర్తించి భారత ప్రభుత్వం 2010లో పద్మశ్రీ పురస్కారం అందజేసింది. 2012లో అనూ రాజ్యసభ సభ్యురాలిగానూ నామినేట్ అయ్యారు. ప్రస్తుతం ఆమె ‘టీచ్ ఇండియా’ చైర్‌పర్సన్‌గా కొనసాగుతున్నారు.

## ఉన్నత ప్రమాణాలే లక్ష్యం



**ప్రభుత్వ పాఠశాలల్లో ఉన్నత ప్రమాణాలతో కూడిన విద్య, సౌకర్యాలు లేకపోవడంతో ప్రైవేట్ పాఠశాలలకు విద్యార్థులు తరలి వెళ్లడాన్ని మనం చూస్తూనే ఉన్నాం. అయితే ఈ పద్ధతిని మార్చేందుకు భావితరాలకు నాణ్యమైన విద్యను అందించేందుకు ఓ ఎన్జీఓ కృషి చేస్తున్నది.**

2014లో ప్రపంచ విద్యా నివేదికలో భారత్ స్థానం 168. నాణ్యమైన చదువు లేకపోవడంతో ఉన్నత విద్యను అభ్యసించినా ఉద్యోగాలు లేని దుస్థితి చూసి ‘ది ఎడ్యుకేషన్ అలియన్స్ (టీ)’ అనే ఎన్జీఓ గ్రామాల బాట పట్టింది. భావితరాలకు ఉన్నత ప్రమాణాలతో కూడిన విద్యను అందించేందుకు స్వచ్ఛందంగా కదిలింది. దీని వ్యవస్థాపక సీఈఓ అమితవ్ విర్మాని. టీ బృందం ప్రస్తుతం ఢిల్లీ వేదికగా పనిచేస్తున్నది. వీళ్ల బృందంలో నిపుణులైన ఉపాధ్యాయులు ఉన్నారు. వీరు స్వచ్ఛందంగా ప్రభుత్వ పాఠశాలలకు వెళ్లి విద్యార్థులకు ప్రత్యేకంగా పాఠాలు బోధిస్తున్నారు. అంతేకాకుండా పట్టణాల్లోని అర్బన్ ప్రాంతాల్లో, మురికివాడల్లో, గ్రామాల్లో ఇంటింటికీ తిరిగి ఉన్నత ప్రమాణాలతో కూడిన విద్య, ప్రభుత్వ పాఠశాలల ఉపయోగం గురించి పిల్లలకు, తల్లిదండ్రులకు అవగాహన కల్పిస్తున్నారు. ప్రభుత్వ స్కూళ్లలో సౌకర్యాలు సరిగా లేవని, నాణ్యమైన విద్య అందండం లేదని.. చాలా మంది తల్లిదండ్రులు తమ పిల్లలను ప్రైవేట్ పాఠశాలలకు పంపుతున్నారు. ఈ విధానానికి స్వస్తి పలుకాలని టీ ఎన్జీఓ కృషి చేస్తున్నది. వీరు చేస్తున్న మంచి పనిని పలువురు అభినందిస్తున్నారు.

## చిట్లిన జుట్టుకి..



- బటర్‌ని కరిగించి అందులో రోజ్‌వాటర్ మిక్స్ చేసి తలకు పట్టించాలి. దానికి షవర్ క్యాప్ పెట్టుకొని గంట సేపు అలాగే ఉంచాలి. ఆ తర్వాత షాంపూతో తలస్నానం చేయాలి. ఈ ప్యాక్‌ని వారంలో ఒకసారి వేసుకుంటే జుట్టు డ్యామేజ్ అవ్వడం తగ్గుతుంది.
- మిల్క్ పౌడర్‌లో ఆలివ్ ఆయిల్ కలిపి పేస్ట్‌లా చేయాలి. ఈ మిశ్రమాన్ని తలకు రాసి గంట సేపటి తర్వాత గోరువెచ్చని నీటితో తలస్నానం చేయాలి. ఇలా రెగ్యులర్‌గా చేయడం వల్ల మంచి ఫలితం ఉంటుంది.

# సీకేడీ ప్రమాదకరమా?



అడుగండి చెబుతా

**నా వయసు 56 సంవత్సరాలు. సివిల్ కాంట్రాక్ట్ పనులు చేస్తుంటాను. వృత్తిలో భాగంగా వివిధ రాష్ట్రాలకు తిరుగుతుంటాను. ఈ కారణంగా నెలలో రెండు మూడు వారాలు బయటే భోజనం చేస్తుంటాను. ఈ మధ్య నేను బలహీనంగా ఉన్నట్లు అనిపిస్తున్నది. వీపు దిగువ భాగంలో నొప్పి ఉంటున్నది. డాక్టర్‌ను సంప్రదించి పరీక్షలు చేయిస్తే సీకేడీ ఉన్నట్టుగా నిర్ధారించారు. అసలు ఇది ఎలాంటి వ్యాధి? ఎందుకు వస్తుంది? దయచేసి వివరించగలరు.**

**కె. ఆర్. జనార్దన్, సికింద్రాబాద్**

సీకేడీ అంటే క్రానిక్ కిడ్నీ డిసీజ్. ఇది తీవ్రమైన కిడ్నీ సంబంధిత వ్యాధి. శారీరక శ్రమ ఏమాత్రం లేని జీవనశైలి, ఆహారపు అలవాట్లలో లోటుపాట్ల వల్ల ఈ వ్యాధి వస్తుంది. డయాబెటిస్, హైబీపీ కూడా ఇందుకు మరో కారణం. తరుచుగా మూత్రసంబంధిత ఇన్ఫెక్షన్లు రావడం, మూత్రపిండాల్లో రాళ్లు, మద్యపానం, పొగతాగడం, స్థూలకాయం వంటి ఇతర కారణాల వల్ల కూడా ఈ వ్యాధి రావచ్చు. తరుచుగా తలనొప్పి రావడం, ఎక్కువ సార్లు మూత్రానికి వెళ్లాల్సి రావడం, అకారణంగా అలసట, కడుపులో వికారం, వాంతులు, వీపు దిగువ భాగంలో నొప్పి, చర్మం పై దురదలు, ఏకాగ్రత లోపించడం వంటి లక్షణాలు కనిపిస్తాయి. అయితే ఇవన్నీ కూడా వ్యాధి బాగా ముదిరిన సందర్భాల్లోనే కనిపించే లక్షణాలు. ఇవి కనిపించే నాటికి తిరిగి కోలుకోలేనంతగా కిడ్నీలు పాడైపోయి ఉంటాయి.

మొదట్లో మందులతో రక్తపోటు అదుపు చేయడం, రక్తంలో కొలెస్ట్రాల్, ట్రైగ్లిజరాయిడ్ శాతాన్ని తగ్గించడానికి మందులు వాడాల్సి ఉంటుంది. ఇక మూత్ర పిండాలు పూర్తిగా పనిచేయని స్థితిలో మిగిలిన కేవలం రెండు దారులు ఉంటాయి. ఒకటి తరచుగా డయాలసిస్ చేస్తుండడం, కిడ్నీ మార్పిడి.. డయాలసిస్‌ను శాశ్వత పరిష్కారంగా చెప్పలేం. ఇది తాత్కాలికంగా మూత్ర పిండాలు చేసే పనిని చేసే ప్రక్రియ. దీని ద్వారా శరీరంలో వ్యర్థాలు పేరుకు పోకుండా చెయ్యడం మాత్రమే సాధ్య పడుతుంది కానీ మూత్రపిండాలను పనిచేయించడం కుదరదు. ఇక కిడ్నీ మార్పిడికి కుటుంబసభ్యులు లేదా ఎవరైనా దాతలు తమ కిడ్నీలలో ఒకటి దానం చెయ్యడానికి సిద్ధపడడం, లేదా బ్రెయిన్ డెడ్ వారి నుంచి అవయవ దానం ద్వారా కిడ్నీని సేకరించి కిడ్నీ మార్పిడి చెయ్యడం మంచిది.

మీ పరిస్థితిని డాక్టర్‌తో చర్చించి మీకు ఎలాంటి చికిత్స అవసరమవుతుందో తెలుసుకొని దానికి కావల్సిన ఏర్పాట్లు చేసుకోవడం మంచిది.



**డాక్టర్ బి. సూర్యప్రకాశ్**
**సీనియర్ నెఫ్రాలజిస్ట్**
**యశోద హాస్పిటల్స్**
**హైదరాబాద్**



# అద్భుతం.. అవకాడో!

**బటర్‌తో కూడిన నిర్మాణం కలిగి ఉండడం వల్ల అవకాడో ఫ్రూట్‌ను నేచర్స్ బటర్ అని పిలుస్తారు. విలువైన పోషకాలను కలిగిన ఈ పండు.. ఆరోగ్యానికి, చర్మానికి చాలా మంచిది. దీనిలోని ఔషధ గుణాలకు ఇతర పదార్థాలను జత చేస్తే మరిన్ని లాభాలున్నాయంటున్నారు నిపుణులు.**

- చర్మాన్ని, గోళ్లని, జుట్టును మృదువుగా ఉంచే బి, సి, ఇ, కె విటమిన్లతో పాటు అమినో ఆసిడ్లు, ఒమేగా–3 ఫ్యాటీ ఆసిడ్లు అవకాడో పండులో ఉంటాయి. దీన్ని ఫేషియల్ మాస్క్‌గా వేసుకుంటే చర్మాన్ని మెరుగుపరుస్తుంది.
- యాంటీ బ్యాక్టీరియల్ లక్షణాలు కలిగి ఉన్న తేనెను అవకాడోతో కలిపి తీసుకొంటే మరింత అద్భుతమైన ప్రభావం ఉంటుంది.
- బాగా పండిన అవకాడోను నలిపి, 1 లేదా 2 టేబుల్ స్పూన్ల తేనెను కలుపాలి. ఈ మిశ్రమాన్ని ముఖంపై సున్నితంగా పూసి, ఇరువై నిమిషాల పాటు ఆరనిచ్చి సాధారణ నీటితో కడిగేయాలి.
- నీటి శాతం ఎక్కువగా ఉండే కీరదోసతో అవకాడోది సూపర్ కాంబినేషన్. ఇది చర్మానికి మరింత చలువ చేసి, తేమను అందజేస్తుంది.
- అవకాడో గుజ్జును కీరదోస రసంతో కలిపి ఆ మిశ్రమాన్ని ముఖంపై రుద్దాలి. పదిహేను నిమిషాల తర్వాత గోరు వెచ్చని నీటితో కడిగేయాలి. ఇలా వారానికి ఒకసారి చేస్తే ఫలితం కనిపిస్తుంది.
- పోషకాల నెలవైన అరటి పండును, అవకాడోతో కలిపి తీసుకొంటే చర్మసమస్యలు దరిచేరవు. వీటిలో ఉండే యాంటీ ఆక్సిడెంట్లు ప్రమాదకర బ్యాక్టీరియాపై పోరాడుతాయి.
- బాగా కలిపిన అవకాడో గుజ్జులో అరటి పండు ముక్కలు వేసి నలపాలి. ఈ మిశ్రమాన్ని ముఖానికి పూసి పదిహేను నిమిషాల తర్వాత గోరువెచ్చని నీటితో కడిగేయాలి. ప్రతిరోజూ ఈ పద్ధతిని ఉపయోగిస్తే.. కొద్దికాలంలోనే మార్పును గమనించవచ్చు.
- చర్మాన్ని తేమగా ఉంచడంలో పెరుగులో ఉండే ప్రో–బ్యాక్టీరియా ఉపయోగపడుతుంది. మొటిమలకు కారణమయ్యే బ్యాక్టీరియాను నిర్మూలిస్తుంది. అవకాడోతో కలిపి తీసుకొంటే మరింత ప్రభావవంతంగా పనిచేస్తుంది.
- చిదిమిన అవకాడో గుజ్జుకు తాజా పెరుగును కలుపాలి. ఆ మిశ్రమాన్ని ముఖానికి మాస్క్‌లా వేసుకోవాలి. ఇరువై నిమిషాల తర్వాత సాధారణ నీటితో కడిగేయాలి. రోజూ ఇలా చేయడం వల్ల చర్మం నిగారింపును పొందుతుంది.




# HOW TO SCORE FULL MARKS IN INTER!

## Jr. CHEMISTRY

**Junior Inter Chemistry preparation can be done chapter wise and topic wise by using the following guidelines. More focus has to be put on the subtopics mentioned under each chapter.**

- From Atomic structure more focus has to be given on Bohr's postulates and limitations, hydrogen spectrum,quantum numbers their significance, Planck's quantum theory, Paulie's rule, Aufbau rule, Hunds rule, Photoelectric effect, blackbody radiations, differences between absorption and emission spectrum, Bohr- de Broglie concept, shapes of orbital's and electronic configuration of Cr and Cu.
- From Periodic classification more focus has to be given on classification of elements in to s, p, d and f blocks, Ionisation potential and factors affecting on IP, EN, periodic properties, lanthanide contraction, types of elements, types of radii and position of an element in the periodic table.
- From Chemical bonding more focus has to be given on codepect of hybridisation,VSEPR theory,MOT,hydrogen bond , dipole moment, sigma, pi-bonds, covalent bond, ionic bond, dative bond and formal charge.
- From States of matter more focus has to be given on Ideal gas equation, Graham's law of diffusion and related problems, Daltons law of partial pressure and related problems, deduction of gas laws, postulates of kinetic theory of gas, problems on kinetic energy, molecular velocities and related problems.
- From Stoichiometry more focus has to be given on balancing equation in acidic and basic medium, empirical and molecular formula and related problems, oxidation states, types of reactions (displacement, redox reaction ,comproportionation and disproportionation reactions), numerical problems based on mole concept and problems based on M,N,m and X.
- Form Thermo dynamics more focus has to be given on Hess's law and its applications, types of heat of reactions, relation between and, relation between and, first law of thermodynamics, second and third law of thermodynamics, prediction of spontaneity in terms of and.
- From Chemical equilibrium more focus has to be given on Le chatelier's principle and applications, types of equilibria, characteristics of equilibrium, law of equilibrium, relation between and.
- From Acids and Bases more focus has to be given on Lew is theory of acids and bases, Bronsted theory of acids and bases conjugate acid- base pair, and problems, nature of aqueous solution of , and , ionic product of water, buffer solutions and related problems and common ion effect.
- From Hydrogen and its compounds more focus has to be given on preparation and properties of , temporary and permanent hardness of water, types of hydrides, position of hydrogen in the periodic table, uses of and D2O.
- From s-block elements more focus has to be given on biological importance of and , plaster of Paris, preparation of NaOHby Castner-kellner process, preparation of by solvay process, uses of and NaCl, properties of , uses of cement,slaked lime and plaster of Paris and composition of cement.
- From p-block elements more focus has to be given on preparation,properties and structure of diborane, Borax bead test, structure of diamond and graphite, silicates, silicones, composition of water gas, producer gas and zeolites. uses of and
- From organic chemistry more focus has to be given on preparations and chemical properties of alkenes, alkynes and benzene, isomerism, IUPAC names, conformation isomerism, mesomeric effect, hyperconjugation, and inductive effect and reaction conversions.
- From Environmental chemistry more focus has to be given on COD, BOD, DO, TLV, acid rain, green house effect, depletion of ozone layer, defluoridation techniques, green chemistry.
- There are three sections in IPE question paper. Section I contains 10 very short answer question without choice. Section II contains 8 short answer questions in which 6 must be attempt. Section III contains 3 long answer questions in which 2 must be attempt.
- Long answer questions will come from Atomic structure, Periodic Table and Chemical bonding (or) Organic Chemistry.
- Short answer questions are frequently asking from the chapters States of Matter, Stoichiometry, Hydrogen and its Compounds, IA,IIA, IIIA,IVA, Thermodynamics and Chemical Equilibrium.
- Very Short answer questions are asking from all the chapters except Atomic Structure and Periodic Table.
- The most Important point is Student must work on solved and unsolved numerical problems, Organic conversions and Very Short answer questions from Telugu Academy text book to get 100% marks.



## Jr. ZOOLOGY

- In intermediate first year zoology eight units are present.
- In previous intermediate public examinations some units are given more importance. So that if the students complete those chapters in the beginning of their preparation, they can score more marks easily. Here the details are

| UNIT NAME | NO.OF VSAQS | NO. OF SAQS | NO.OF LAQS | TOTAL MARKS |
|---|---|---|---|---|
| Diversity of Living World | 1 | 1 | Nil | 6 |
| Structural Organisation in Animals | 2 | 2 | 1 | 12 |
| Animal Diversity –I | 1 | 1 | Nil | 6 |
| Animal Diversity –II | 1 | 1 | Nil | 6 |
| Locomotion and reproduction | 1 | 1 | Nil | 6 |
| Biology in Human welfare | 1 | 1 | 1 | 14 |
| Periplaneta Americana | 1 | 2 | 1 | 10 |
| Ecology and Environment | 2 | 1 | 1 | 16 |
| **Total** | **10** | **8** | **3** | **76** |

- 2 SAQs and 1 LAQ are extra choice questions.
- Total marks are 76. Student requires to attempt 60 marks only.

**Unit- I :**
- **Diversity of Living World:** 6 marks (1 SAQ, 2 VSAQs)
- This chapter includes the basics of zoology. Students can easily understand these topics and complete with in the short duration. One SAQ (4 marks) and one VSAQ (2 marks) are given

**UNIT-II :**
- **Structural Organisation in Animals:** 10 marks (1 LAQ and2 VSAQs(or) 2 SAQs & 1 VSAQ)
- This unit enables the children to learn basic structure of animals. In previous year (2015-16) examination more importance was given student need some extra time to complete this unit. 1 LAQ & 1 VSAQ or 2 SAQs & 1 VSAQ can be expected from this chapter

**UNIT-III:**
- **Animal Diversity –I:** 6 marks (1 SAQ & 1 VSAQ)
- This unit explains the classification of animal kingdom. Comparative study is required for this chapter. 1 SAQ and 1 VSAQ can be expected from this unit.

**UNIT-IV:**
- **Animal Diversity – II :** 6 marks 1 SAQ & 1 VSAQ
- Comparative study makes this unit easy. 1 SAQ and 1 VSAQ can be expected from this unit.

**UNIT-V:**
- **Locomotion and Reproduction:** 6-8 marks (1 SAQ & 1 or2 VSAQs)
- This is an easy chapter for the student. He can complete this unit very quickly. 1 SAQ and 1 or 2 VSAQs can be expected.

**UNIT- VI:**
- **Biology in Human Welfare:** 12-14 marks (1 LAQ & 1 SAQ & 1 VSAQ or 2 VSAQs)
- This is the most important unit in Junior Zoology syllabus the student need to complete this unit in the beginning of their preparation. 1 LAQ can be expected from the life cycle of parasites, 1 SAQ can be expected from TDA abuse and 1 VSAQ may be given. Sometimes instead of 1 SAQ, 2 VSAQs may be given.

**UNIT-VII:**
- **Periplaneta Americana:** 10 marks (1 LAQ and 1 VSAQ)
- This is also an important unit. 1 LAQ can be expected from the anatomy and physiology of the cockroach. 1 VSAQ is also given.

**UNIT- VIII:**
- **Ecology and Environment** 12 -14 marks (1 LAQ, 1 SAQ, 1 VSAQ or1 LAQ, 2 VSAQs)
- This is a vast unit, Student requires lot of time to complete this. More importance is given in previous examinations. 1 LAQ, 1 SAQ, 1 VSAQ or 1 LAQ, 2 VSAQs, may be expected.

## Jr. MATHEMATICS-IA

- Mathematics IA consists of number of formulae. So the student must concentrate more on formulae.
- Trigonometry is to be prepared not only for IPE, also useful for competitive exams.
- Out of 10 topics, if the student practices 4 chapters (mathematical induction, matrices, product of vectors, properties of triangles); the student will secure 70% marks
- If the student prepares two more chapters i.e, addition of vectors, Functions ,inverse Trigonometry functions he/she will secure 85% marks
- The student must concentrate on all the VSAQ's for securing 100% marks.
- Formulae must be kept in boxes.

**General Instruction.**
- Avoid over writings and strikings .
- Before writing the answer the student must mention sections and question numbers.
- Diagram must be drawn wherever necessary.



## Jr. BOTANY

**JUNIOR INTER IPE WEIGHTAGE OF MARKS**

| UNIT | VSAQS | SAQS | LAQS | TOTAL |
|---|---|---|---|---|
| Diversity in the living world | 3(6marks) | 2(8marks) | nil | 14 |
| Structural organisation in plants- Morphology | 2(4marks) | nil | 1(8marks) | 12 |
| Reproduction in plants | nil | 1(4marks) | 1(8marks) | 12 |
| Plant systematics | 1(2marks) | 1(4marks) | nil | 6 |
| Cell: structure and functions | 3(6marks) | 2(8marks) | nil | 14 |
| Internal organisation of plants | 1(4marks) | 2(8marks) | | 12 |
| Plant Ecology | 1(2marks) | 1(4marks) | | 6 |
| Total | | | | 76 |

- The syllabus in junior inter Botany comprises of 13 chapters under 7 units
- All the chapters are equally important for studying though the weight age is given
- A review of the previous question papers in IPE gives an idea of the type of questions

**I) Diversity in the living world**
- Regarding SAQs the student may go through the important contents like taxonomical aids, binomial nomenclature, characters of chrysophytes, dinoflagellates, euglenoids, economic importance of algae, fungi and bryophytes, difference between red algae and brown algae, scope of botany.

**II) Structural organization in plants**
- Root stem modifications and types of racemose inflorescences should be studied for LAQs. A continuous practice of drawing diagrams is required to score high

**III) Reproduction in plants**
- SAQs and LAQs are important from this unit Process of fertilization, structure of embryo sac, microsporangium, post fertilization changes are important for LAQs.

**IV) Plant systematics**
- All VSAQs and SAQs are to be studied. We can expect at least 1 VSAQ and 1 SAQ.

**V) Cell: structure and functions**
- A through preparation of SAQs is very important Structure of mitochondria, Chloroplast, nucleus, ER, Prokaryotic cell, cell theory , inter phase, types of chromosomes, structure of nucleic acid and protein, events of prophase-I are some important concepts to concentrate upon

**VI) Internal organization of plants**
- The students should practice these diagrams as they are time taking and requires a lot of patience to produce a perfect diagram of dicot stem/root or monocot stem/root. Well labelled diagrams should be presented to secure full marks. Types of meristems, differences between lenticels and stomata, cork cambium, annual rings are important concepts for SAQs.

**VII) Plant Ecology**
- Types of hydrophytes, morphological and anatomical adaptations of hydrophytes, and xerophytes, primary and secondary succession, ecological services like pollinators, carbon fixation are to be studied for SAQs.



## Jr. PHYSICS

- With the intermediate board exams fast approaching, here are some guidelines to the students to score full marks in the exam.
- **Regarding junior inter Physics preparation, the syllabus may be divided into three units**

a) First unit consists of Physical word, units& measurements, motion in a straight line, motion in a plane, laws of motion, Work-Power-Energy and centre of mass. The approximate weightage for this unit is 30Marks to 32Marks
b) Second unit consists of system of particles and Rotatory motion (excluding centre of mass), Gravitation, oscillations, Mechanical properties of solids, and fluids. Its weightage is approximately 22Marks to 24Marks.
c) Third unit consists of Thermal properties of matter, Thermodynamics and Kinetic theory of gases. Its weightage is around 20Marks to 22Marks.

- **The Intermediate Physics question paper has three sections**

a) First section has 10 very short answer questions (VSAQ). Students has to answer all the 10 questions without choice. Each question carries 2 marks.
b) Second section has 8 short answer questions (SAQ) out of which student has to answer 6 questions each question carries 4M
c) Third section has three long answer questions (LAQ)out of which 2 questions are to be answered. Each question carries 8 Marks.
d) Long answer questions mostly come from the three different units mentioned above. As a part of long answer question there may be a numerical problem which will be based on the same concept as the question.
e) In the short answer questions they may give one or two numerical problems. Mostly problems will be from motion in a straight line, motion in a plane, work-power-energy, system of particles, oscillations, surface tension, gas laws, kinetic theory of gases. A student has to emphasize on the above chapters to answer the problems otherwise they can utilize the choice in the second section.
f) Generally, most of the students lose marks in the first section (VSAQ). To score full marks in VSAQ all the VSAQ type equations given at the end of the chapter in academy text book should be learnt perfectly. But there is possibility of getting one or two skill oriented questions which a student can answer by reading textual content thoroughly which will be helpful even for JEE MAINS
g) A student can score above 50 marks if they are through with I and III units

**General Instructions to answer the Paper**
- Hand writing must be legible
- Questions should be numbered accurately. Preferably they are to be answered in the same order as in the question paper.
- Try to complete answering the question paper with in 2hrs40 minutes. Re check the questions in the last 20minutes
- All the numerical problems should consist of formula and final answer should be followed by units which carry marks.
- Diagram should be drawn where ever it is necessary. In representing a vector quantity arrow mark has to be represented without fail.
- If time permits it is good to answer extra questions. A question with more marks will be considered for evaluation.



**P. SHARANI**
Director
Narayana
Group of Educational Institutions

## Sr. ZOOLOGY

As final intermediate exams are fast approaching, you need to know, how to prepare for the examination and secure 60/60 in zoology.

The Question paper has 3 sections one with very short answer Questions (10 questions each 2 marks). Short Answer Questions (6 Questions each 4 marks) and Long Answer Question (2x8=16 marks).

There will be no choice for section- A While choice will be there for section B and C for section- B Question are given and you can answer any 6, While for section C 3 Questions are given and you can Answer any 2

Let us see which chapters must be thoroughly prepared for answering long answer question you can expect long answer question from

1) Human physiology and anatomy – Body fluids and Circulation, Excretory products and their elimination and Reproductive system
2) Genetics

Short answer Questions Musculo-Skeletal system Nerve control and coordination maximum possibilities is chapter immune system Applied Biology Organic Evolution one diagram question will be asked (LAQ of tooth/ VSAQ of Kidney/ Ts of spinal cord/ Pelvic girdle)

Very Short Answer Questions can be asked from any chapter, but more important are

1) Digestion and Absorption
2) Musculo skeletal system
3) Reproductive system and
4) Reproductive health,
5) Organic Evolution and Applied Biology

Bear in mind VSAQs can be asked from every chapter, but because, you write the answer only in two or three sentences, learning all gives you right away twenty marks and you are sure to pass the exam.

Key points is preparing for Exam are:

1) Learn diagrams perfectly for answering long answer questions.

You will not only impress the examiner but also learn to write the answer easily more over marks are allotted for neat, well labelled diagrams

2) Short answer question showed not be just 3 or 4 sentences. If you should be awarded 4 marks for a question you must write at least 8 to 10 sentences for it (a paragraph)

3) Very short answer – All of them must be attempted

Your answer should be salient, precise to the point is 3 or 4 sentences. So follow the above instruction and get full marks is zoology.

You must remember unlike junior intermediate, senior intermediate does not have 'improvement' exam. So whatever are your efforts are directly reflected in your results so put all your efforts to score the maximum marks.

## Sr. CHEMISTRY

**Senior Inter Chemistry preparation can be done chapter wise and topic wise by using the following guidelines. More focus has to be put on the subtopics mentioned under each chapter.**

From Solid states more focus has to be given on Bragg's equation, types of Semi conductors, Schottky and Frenkel defect, crystalline and amorphous solids, voids, crystal arrangement, density of units cell.

From Solutions more focus has to be given on concentration terms (problems), Raoults law and related problems, types of deviations, Osmotic pressure, Isotonic solution.

From Chemical kinetics more focus has to be given on rate of reaction and factors effecting on rate of reaction ,differences between order and molecularity, collision theory Postulates, define the terms 1) activation energy 2) threshold energy, order definition, examples of different types of orders and problems based on first order and zero order reaction.

From Electro chemistry more focus has to be given on Galvanic cell explanation, EMF problems,Nernst equation and related problems, Faraday's laws and related problems, fuel cells, batteries, Kohlrausch law and related problems, electrolysis process, anode and cathode reactions, molar conductance and equivalent conductance.

From Surface chemistry more focus has to be given on differences between physical adsorption and chemical adsorption, catalysis and types of catalysis, emulsions and types of emulsions,auto catalysis, Gold number and related problems, Tyndall effect, Brownian movement, colloidal solutions and examples, flocculation value and related problems.

From Metallurgy more focus has to be given on differences between ores and minerals, roasting , calcination, smelting, froth floatation process, Baeyer's process and Serpeck's process, gangue, flux, slag, zone refining and vapor phase refining, poling, magnetic separation, leaching, liquation and extraction of Zn, Copper &Al.

From d-block and complex compounds more focus has to be given on Werner's theory, Isomerism, IUPAC names, magnetic moment, colour property, Lanthanide contraction, variable oxidation states, composition of alloys, VBT.

From P- block elements more focus has to be given on preparations and properties of , preparations and properties of , preparation of by Haber's process, properties of NH3 , preparation of by contact process, oxy acids of chlorine, oxy acids of sulphur, oxy acids of phosphorous, oxides of nitrogen, oxides of phosphorous, oxides of sulphur, hydrolysis reactions of .structures of P4O6& P4O10 , Interhalogen compounds preparation& structures.

From Noble gases more focus has to be given onuses of noble gases ,preparations and properties and structure of .

From Polymers more focus has to be given on definition of terms, monomer units of polymers,
natural rubber, condensation polymers and addition polymers, ,
biodegradable polymers and examples.

From Biomolecules more focus has to be given on vitamins, hormones, essential and non-essential amino acids, structure of glucose, nucleosides, nucleotides and peptides.

From Chemistry in Everyday life more focus has to be given ondefinitions and examples of Antacid, Antihistamine, Analgesics, Antimicrobials, Antibiotics, Antiseptics, Disinfectants, Antifertility drug, Artificial sweetening agents, Food preservatives, Soaps and Detergents.

From Organic chemistry more focus has to be given on named reactions, conversions, Phenol preparations and properties and acidic nature of Phenols,preparations and properties of aldehydes and ketones,basic nature of amines, reactions and IUPAC Names .

ƾ There are three sections in IPE question paper. Section I contains 10 very short answer question without choice. Section II contains 8 short answer questions in which 6 must be attempt. Section III contains 3 long answer questions in which 2 must be attempt.

ƾ Long answer questions will come from Electro Chemistry and Chemical Kinetics, VIA and VIIA and organic chemistry

ƾ Short answer questions will come from the chapters solutions, Solid State, Surface Chemistry, Complex Compounds, Biomolecules, Metallurgy, Noble Gas ,VA and Polymers.

ƾ Student must read all very short answer questions, solved and unsolved numerical problems from Telugu Academy text book to get 100% marks.



## Sr. PHYSICS

- With the intermediate board exams fast approaching here are some guidelines to the students to score full marks in the exam.
- **Second year Physics syllabus may be basically divided into three units**

a) First unit consists of Waves, Ray optics, Wave Optics. Weightage for these chapters is around 18 marks.
b) Second unit consists of Electric charges and fields, Electric potential and capacitance, current Electricity, moving charges and magnetism, magnetism and matter, Electromagnetic Induction, Alternating currents, EM waves. The Weightage for above topics is around 32 marks to 34 marks.
c) Third unit consists of Dual nature of mater, atoms, nuclei, semi-conductor device and communication systems. Its weightage is approximately 24 marks to 26 marks.

- **The intermediate physics question paper has three sections**

a) First section has 10 very shot answer questions (VSAQ)without choice. Students has to answer all the 10 questions. Each question carries 2 marks.
b) Second section has 8 short answer questions (SAQ) out of which student has to answer 6 questions. Each equation carries 4Marks.
c) Third section has three long answer question (LAQ) out of which 2 questions are to be answered. Each questions carried 8Marks
d) Long answer questions mostly come from the three different units mentioned above As a part of long answer question there may be a numerical problem which will be based the same concept as the question.
e) In the short answer questions they may give one or two numerical problems. Mostly problems will be from capacitance and potential, current electricity, Electromagnetic induction, A.C Circuits Dual nature of mater. A student has to emphasize on the above chapters to answer the problems otherwise they can utilize the choice in the second section.
f) Generally, most of the students lose marks in the first section (VSAQ) To score full marks in VSAQ all the VSAQ type questions given at the end of the chapter in academy text book should be learnt perfectly. But there is possibility of getting one or two skill oriented questions which a student can answer by reading textual content thoroughly which will be helpful even for JEE MAINS.

**General Instructions to answer the Paper**
- Handwriting must be legible.
- Questions should be numbered accurately Preferably they are to be answered in the same order as in the question paper
- Try to complete answering the question paper with in 2hrs 40 minutes. Recheck the question in the last 20minutes.
- All the numerical problems should consist & formula and final answer should be followed by units which carry marks.
- Diagram should be draw where ever it is necessary.
- In representing a vector quantity arrow marks has to be represented without fail
- If time permits it is good to answer extra questions. A questions with more marks will be considered for evaluation.

## Sr. BOTANY

**VSAQs:** Read from all chapters
**SAQs:** Chapter -1 Transport in plants -1
Chapter -2 Mineral nutrition -1
Chapter -3 Enzymes – 1
Chapter -4 Photosynthesis – 1
Chapter -6 Plant growth and Development – 1
Chapter – 8 Viruses – 1
Chapter – 9 Genetics – 1
Chapter – 10 Molecular biology – 1
Chapter – 12 Biotechnology and its applications -1
Total Questions =9
**LAQs :** Chapter -4 Photosynethesis - 1
Chapter -5 Respiration – 2
Chapter – 11 Biotechnology – 2
Chapter -13 Strategies for enhancement in food production-2
Total Questions -7

**Diagram based questions -1**
- Practice – Chloroplast , Lac-operon diagrams
- The syllabus in Senior Inter Botany comprises of 14 Chapters under 6 units:
- A review of the previous question papers in IPE gives an idea of the type of questions

**UNIT-I: Plant Physiology**
- **Transport in plants :** Ascent sap in tall trees, Plasmolysis, Transpiration is a necessary evil are important contents
- **Mineral Nutrition:** Root nodule formation, Synthesis of Amino acids are important concepts
- **Enzymes:** Co-Factors, Types of Inhibitions are important concepts Photosynthesis, Respiration lesions are important for LAQs and SAQs
- **Hormones:** Auxins, Gibberellins, Cytokinins seed dormancy are important concepts

**UNIT-II: Bacteria: Important for VSAQs**
- **Viruses :** Are important for SAQs and VSAQs

**UNIT-III: Genetics:**
- Testcross, Back cross, co-dominance incomplete dominance are the important concepts

**UNIT-IV: Molecular Biology**
- Genetic code, Difference between DNA and RNA Griffith experiment, Meselson and stahl experiment are the important concepts

**UNIT-V: Bio technology**
- Biotechnology principles and processes is important for LAQs, Biotechnology application lesson is important for SAQs and VSAQs.
- Transgenic plants, BT cotton, pest resistant plants, Bio-safety issues are the important concepts

**UNIT-VI:**
- Strategies for enhancement in food production is important for LAQs
- Plant hybridisation, tissue culture are the important concepts
- Microbes in human welfare is important for VSAQs

## సుడోకు

డైలీ సుడోకు 61 సమాధానం



డైలీ సుడోకు -62

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 5 | | | 2 | | 6 | | |
| 2 | | 7 | | | | | 8 | |
| | 1 | | 6 | | | | | |
| | | 1 | 8 | | | 3 | 4 | |
| | | | 1 | | 2 | | | |
| | 9 | 8 | | | 6 | 1 | | |
| | | | | | 4 | | 5 | |
| | 3 | | | | | 8 | | 7 |
| | | 6 | | 9 | | | 3 | |

1. నిలువుగా, అడ్డంగా ప్రతివరుసలోనూ 1 నుంచి 9 వరకు అంకెలను నింపాలి.
2. ఒకసారి రాసిన అంకెను మరోసారి నింపకూడదు.
3. ప్రతి గడిలోనూ నింపిన అంకెను మళ్లీ నింపకూడదు.

సమాధానం రేపటి సంచికలో

## Jr. MATHEMATICS-IB

- Mathematics IB basically divided into two parts

**I. Geometry II.Calculus**
- The weightage as per the board for geometry is 48 marks and for calculus is 49 marks.
- Students are strictly instructed to attempt 97 marks.
- Out of 11 topics in IB if the student practices 3 topics, (straight lines, pair of straight lines, application of differentiation) he/she will secure 73% marks.
- If the student prepares 2 more topics (locus, transformation of axes) he/she will secure 81% marks.
- For securing 100% marks the student must prepare all the VSAQ's
- Generally, most of the students make mistakes particularly from the two topics they are (errors & approximation, limits, straight lines) he/she should be careful while attempting questions from these topics.
- Formulae must be kept in boxes.
- Extra care is needed in the simplification.
- All the VSAQ's must be written is sequence for having the impression from the valuer.
- Have all the possibilities to complete the exam within 2.30 hours. Use the rest of time to verify the answer script.
- Prepare Text Book VSAQS from worked out Examples, Exercise I roman questions.

**General Instruction.**
- Avoid over writings and strikings .
- Before writing the answer the student must mention sections and question numbers .
- Diagram must be drawn wherever necessary.

## Sr. MATHEMATICS-IIA

- Logical thinking is needed for solving the problems .
- The following chapters are very helpful to secure marks easily.
- Out of 10 topics if the student prepare the following chapters he/she will secure 73% marks.
- The chapter names are
  - Quadratic equations
  - Theory of equations
  - Binomial theorem
  - Probability
  - Random variables
  - Partial Fractions
  - Demoivre's Theorem
- If the student prepare 1 more topic i.e, Permutations and combinations he/she will secure 90% marks.
- For securing 100% marks the student must prepare all the VSAQ's.
- Formulae must be kept in boxes.

**General Instruction.**
- Avoid over writings and striking.
- Before writing the answer the student must mention sections and question numbers.
- Diagram must be drawn wherever necessary.

## Sr. MATHEMATICS-IIB

- Mathematics IIB basically divided into two parts
  I. Geometry
  II.Calculus
- The weightages per the board for geometry is 51 marks and for calculus is 46 marks.
- Students are strictly instructed to attempt 97 marks.
- Out of 8 topics in IIB if the student practices 4 topics (circles, integration, definite integration, differential equations) ,he/she will secure 90% marks.
- For securing 100% marks the student must prepare all the VSAQ's.
- For securing the best mark in IIB, the student has to practice all the formulae especially from calculus.
- Generally, most of the students make mistakes particularly from the two topics they are parabola & definite integrals(areas) he/she should be careful while attempting questions from these topics.
- Formulae must be kept in boxes.
- Extra care is needed in the simplification.



- All the VSAQ's must be written in sequence for having the impression from the valuer.
- Have all the possibilities to complete the exam within 2.30 hours. Use the rest of time to verify the answer script.
- Prepare Text Book VSAQS from worked out Examples, Exercise I roman questions.

**General Instructions.**
- Avoid over writings and striking .
- Before writing the answer the student must mention sections and question numbers.
- Diagram must be drawn wherever necessary.



## మెట్రోలో ఎంపీ జితేందర్‌రెడ్డి

**అమీర్‌పేట, నమస్తే తెలంగాణ:** మెట్రోరైలు రూపంలో నగర ప్రజలకు అత్యుత్తమ రవాణా వ్యవస్థ అందుబాటులోకి వచ్చిందని మహబూబ్‌నగర్ ఎంపీ జితేందర్‌రెడ్డి పేర్కొన్నారు. ఆదివారం ఆయన అమీర్‌పేట నుంచి నాగోల్ వరకు మెట్రోలో ప్రయాణించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ ఢిల్లీలో పార్లమెంట్ సమావేశాలకు హాజరయ్యేందుకు వెళ్లినప్పుడు ట్రాఫిక్ కారణంగా గంటన్నరకు పైగా సమయం పట్టేదని, దీంతో తనతోపాటు చాలా మంది ఎంపీలు మెట్రోరైలుపై ఆధారపడుతామని చెప్పారు. హైదరాబాద్ బ్రాండ్ ఇమేజీని మరింతగా పెంచేలా మన మెట్రో రూపుదిద్దుకున్నదన్నారు. మెట్రోకు నగర ప్రజల నుంచి అపూర్వ స్పందన వస్తుండడంపై హర్షం వ్యక్తంచేశారు.

## పదిరోజుల్లో స్మార్ట్‌బైక్ సవారీ

**హైదర్‌నగర్:** మెట్రోరైలు ప్రయాణికులు స్టేషన్ నుంచి తమ గమ్య స్థానాలకు చేరేందుకు హైదరాబాద్ బైస్కింగ్ క్లబ్ (హెచ్‌బీసీ) తీసుకొచ్చిన స్మార్ట్‌బైక్‌లు పది రోజుల్లో అందుబాటులోకి రానున్నాయి. ఆరోగ్యంతోపాటు, కాలుష్యాన్ని తగ్గించే లక్ష్యంతో సైక్లింగ్‌ను ప్రోత్సహిస్తున్న హెచ్‌బీసీ ఇప్పటికే హెచ్‌ఎంఆర్‌ఎల్‌తో కలిసి మియాపూర్ మెట్రోస్టేషన్ వద్ద స్మార్ట్‌బైక్‌లను ప్రదర్శనకు ఉంచింది. ప్రస్తుతం ఫీడర్‌స్టేషన్ల పనులు కొనసాగుతున్నాయని, వారం రోజుల్లో రిజిస్ట్రేషన్లు ప్రారంభిస్తామని హెచ్‌బీసీ చైర్మన్ డీవీ మనోహర్ 'నమస్తే తెలంగాణ'తో చెప్పా రు. ఆదివారం ఆయన మియాపూర్ మెట్రో స్టేషన్ వద్ద స్మార్ట్‌బైక్‌లను పరిశీలించి మాట్లాడారు. ప్రస్తుతం మూడు మెట్రోస్టేషన్లలో బైక్‌లు ఉంచామని, మరో నాలు గు స్టేషన్లు కలిపి పదిరోజుల్లో ఏడు స్మార్ట్ బైక్ కేంద్రాలను అందుబాటులోకి తీసుకొస్తామన్నారు. ఒక్కో కేంద్రంలో పది సైకిళ్లను ఉంచుతామన్నారు. జనవరి చివరినాటికి 300 సైకిళ్లతో నగరవ్యాప్తంగా 30 స్మార్ట్ బైక్ కేంద్రాలను ప్రారంభిస్తామని చెప్పారు. దశల వారీగా వంద కేంద్రాలకు విస్తరిస్తామన్నారు. ప్రస్తుతం అధునాతన జర్మనీ టెక్నాలజీ సహాయంతో తయారైన బైక్‌లను దిగుమతి చేసుకుంటున్నామని, మూడు నెలల్లో నగరంలోనే వీటిని తయారు చేయనున్నట్టు తెలిపారు. స్మార్ట్‌బైక్‌ల వినియోగానికి తాము జారీ చేయబోయే స్మార్ట్‌కార్డుతో ప్రపంచవ్యాప్తంగా 120 దేశాల్లో స్మార్ట్‌బైక్‌లను పొందే వెసులుబాటు కల్పిస్తున్నామన్నారు.






ఐదురోజులు గడుస్తున్నా మెట్రోరైలులో ప్రయాణికుల సంఖ్య ఏమాత్రం తగ్గడం లేదు. మొదటిరోజు రెండు లక్షల మంది ప్రయాణించగా, ఆ తర్వాత రెండు రోజులు లక్షన్నరకు మించి ప్రయాణించారు. శనివారం 2.10 లక్షల మంది, ఆదివారం ఏకంగా రికార్డుస్థాయిలో 2.11 లక్షల మంది మెట్రోను ఆశ్రయించారు. రైల్వే స్టేషన్లు, రైళ్లు జనంతో కిక్కిరిసి పోయాయి. స్టేషన్ల ఆవరణలో ఉన్న పార్కింగ్ ఏరియాల్లో బైక్‌లు, కార్లు నిలిపి మెట్రోలో ప్రయాణించారు. - హైదరాబాద్ సిటీబ్యూరో, నమస్తే తెలంగాణ



మియాపూర్‌లోని మెట్రో స్టేషన్ సమీపంలో ఏర్పాటు చేసిన గ్రీనరీలో స్థానికుల సందడి

# పిక్నిక్‌స్పాట్ @ మెట్రో

## వీకెండ్స్‌లో మెట్రో ప్రయాణానికి మొగ్గు.. సాయంత్రం మియాపూర్ స్టేషన్ గ్రీనరీలో సందడి

**హైదర్‌నగర్:**

వీకెండ్స్‌లో కుటుంబ సభ్యులతో సహా బయటికి వెళ్లాలనుకునే వారు మెట్రోరైలులో ప్రయాణానికి మొగ్గుచూపుతున్నారు. పచ్చదనం మధ్య సేదతీరాలనుకునేవారు మెట్రో స్టేషన్ల వద్ద ఏర్పాటు చేసిన గ్రీనరీకి చేరుతున్నారు. మొత్తంగా మెట్రోమార్గం హైదరాబాదీలకు సరికొత్త పిక్నిక్‌స్పాట్‌గా మారింది. ఆఫీస్‌లు బంద్ ఉన్నా శని, ఆదివారాల్లో మెట్రో స్టేషన్లన్నీ రద్దీగా ఉండడం.. సెలవు రోజైనా రైళ్లన్నీ కిక్కిరిసి ప్రయాణిస్తుండడమే ఇందుకు నిదర్శనం. చిన్నాపెద్దా తేడా లేకుండా మెట్రో ప్రయాణాన్ని ఆస్వాదిస్తున్నారు. ముఖ్యంగా మియాపూర్, అమీర్‌పేట, సికింద్రాబాద్, నాగోల్ స్టేషన్లు నిత్యం రద్దీగా ఉంటున్నాయి. మియాపూర్ స్టేషన్ పరిసరాలు పచ్చదనంతో నిండి ఉండడంతో పిక్నిక్ స్పాట్‌గా మారింది. పరిసర కాలనీలవారితోపాటు.. వివిధ ప్రాంతాల నుంచి ప్రజలు మియాపూర్ వరకు మెట్రోలో ప్రయాణించి, పచ్చదనం మధ్య కాసేపు సేదదీరి తిరిగి వెళ్లిపోతున్నారు. ఈ మధుర క్షణాలను తమ సెల్‌ఫోన్లలో బంధించుకుంటున్నారు.

### కుటుంబమంతా ఆనందించాం



ప్రారంభమైనప్పటి నుంచి మెట్రో ప్రయాణం కోసం ఎదురుచూస్తున్నాం. సెలవు రోజు కావడంతో ఈరోజు కుటుంబం అంతా వచ్చాం. మాలాగే చాలా మంది తరలి రావడంతో రైళ్లు కిక్కిరిసిపోయాయి. అయినా ఎంతగానో ఆస్వాదించాం. కాలుష్యానికి దూరంగా, వేగంగా, నగర అందాలను చూస్తూ ప్రయాణం సాగింది. మా పిల్లలు చాలా ఎంజాయ్ చేశారు.

- సుదర్శన్ రెడ్డి

### మెట్రో సూపర్



మెట్రో రైలు సూపర్. ట్రాఫిక్, కాలుష్యం, ప్రమాదాల బారి నుంచి నగరవాసులను రక్షిస్తుంది. మేం సికింద్రాబాద్ నుంచి మియాపూర్‌కు కేవలం అర గంటలో వచ్చేశాం. బస్సుల్లో అయితే ట్రాఫిక్‌తో గంటల తరబడి ఇబ్బంది ఉండేది. మా హయంలో మెట్రో ప్రారంభమైందని భవిష్యత్ తరాలకు గొప్పగా చెప్తాం. పరిశుభ్రంగా నిర్వహించుకుందాం.

-సౌమ్య

### జ్ఞాపకాలను పదిలపరుచుకున్నా



మెట్రో రైలులో మొదటిసారి ప్రయాణించడం ఎంతో ఆనందాన్నిచ్చింది. నా తొలి ప్రయాణ జ్ఞాపకాలను సెల్‌ఫోన్‌లో బంధించుకొని ఆన్‌లైన్‌లో షేర్ చేసుకున్నా. కాలుష్యానికి దూరంగా, అందుబాటు ధరతో ఏసీ ప్రయాణం బాగా అనిపించింది. అన్ని స్టేషన్లను మియాపూర్ స్టేషన్‌లా పచ్చదనంతో తీర్చిదిద్దితే మరింత ఆకర్షణీయంగా మారుతుంది.

- శ్రీకాంత్

## మెట్రోరైలులో పటిష్ఠ భద్రత

### భయానక వాతావరణం సృష్టించొద్దు: ఎండీ ఎన్వీఎస్ రెడ్డి



**హైదరాబాద్ సిటీబ్యూరో, నమస్తే తెలంగాణ:** హైదరాబాద్ మెట్రోరైలులో పటిష్ఠ భద్రత ఏర్పాటు చేశామని ఎండీ ఎన్వీఎస్ రెడ్డి స్పష్టంచేశారు. మెట్రోరైలులో బాంబు కలకలం పేరుతో కొన్ని టీవీ చానళ్లు చేసిన హడావుడిలో నిజం లేదని తెలిపారు. అమీర్‌పేట ఇంటర్‌చేంజ్ స్టేషన్‌లో ఒక వ్యక్తి బ్యాగు మరిచిపోయాడని, దానిని అతనికి అప్పగించినట్టు చెప్పారు. ప్రజలు భయపడాల్సిన అవసరం లేదన్నారు. స్టేషన్లు, రైళ్లు, డిపోల్లోని ప్రతి అంగుళంపై నిఘా ఉన్నదని వివరించారు. ప్రయాణికుల ప్రాణాలతోపాటు, ఆస్తి నష్టం జరుగకుండా జాగ్రత్తలు తీసుకున్నామన్నారు. ఒక్కో స్టేషన్లో 63 నుంచి 70 సీసీ కెమెరాలతోపాటు 2,100 మంది సెక్యూరిటీ ఫోర్స్‌ను ఏర్పాటు చేశామన్నారు. స్టేషన్లలోకి ఎంట్రీ అయ్యేటప్పుడు ఆటోమేటిక్ ఫేర్ కలెక్షన్ మెషిన్స్ వద్ద మెటల్ డిటెక్టర్లను ఏర్పాటు చేసి ప్రయాణికులను తనిఖీచేసి పంపుతున్నారని చెప్పారు. లగేజీ స్కానర్లతోపాటు వ్యక్తిగత సిబ్బంది ప్రయాణికుల కదలికలను ఎప్పటికప్పుడు పరిశీలిస్తున్నారని వివరించారు. అనుమానాస్పద వ్యక్తులు, వస్తువులు కనబడితే క్షణాల్లో సమాచారం అందుతుందన్నారు. నిఘా కెమెరాల కంటికి చిక్కిన ప్రతి దృశ్యాన్ని పర్యవేక్షించడానికి స్టేషన్లవారీగా సెక్యూరిటీ ఏర్పాటుతోపాటు డిపోల్లో ప్రత్యేక టెక్నాలజీ, కమాండ్ కంట్రోల్ సెంటర్ ఉన్నదని తెలిపారు. ప్రమాదం జరిగే సంకేతాలు అందజేసిన వెంటనే ఎక్కడికక్కడ చర్యలు తీసుకుంటారన్నారు.


తెలంగాణ రాజపత్రము
విశేష పత్రము
అధికారిక ప్రకటన

MMD నెం. 25. మేడ్చల్ - మల్కాజిగిరి సోమవారం, 27-11-2017

ఫారం - సి. ప్రకటన
(10 ఎ వినహాయింపు ఇవ్వబడిన చట్టంలోని సెక్షన్ 11 (క్రింద) (4/12 నియమము చూడుము)
తెలంగాణ ప్రభుత్వం, రెవిన్యూ శాఖ

తెలంగాణ ప్రభుత్వం/జిల్లా కలెక్టర్, మేడ్చల్-మల్కాజిగిరి జిల్లా గారి ఆదేశానుసారం మేడ్చల్-మల్కాజిగిరి జిల్లా ఘట్‌కేసర్ మండలం, మేదారం గ్రామంలో ఉన్న భూమి విస్తీర్ణం ఎ. 19-25 గుంటలు ప్రజా ప్రయోజనం నిమిత్తం అనగా నల్లగొండ జిల్లా బీబీ నగర్ మండలం అనంతారం గ్రామం ఎర్రకుంట మత్తడి నుంచి నల్లగొండ జిల్లా బీబీ నగర్ మండలం ముఖ్రాంపల్లి గ్రామం పరిధిలోని మొండి కతువ వరకు "ఫీడర్ ఛానల్ పొడిగింపు కోసం" అవసరమై ఉన్నదని భావించడమైనది. కావున పై ప్రాజెక్టు కోసం మేడ్చల్-మల్కాజిగిరి జిల్లా ఘట్‌కేసర్ మండలం మేదారం గ్రామంలో విస్తీర్ణం కొంచెం అటు ఇటుగా ఎ. 19-25 గుంటలు భూమి వివరములు ఈ క్రింద చూపిన విధంగా భూసేకరణ నిమిత్తం నోటిఫికేషన్ జారీ చేయడమైనది.

షెడ్యూల్
జిల్లా: మేడ్చల్-మల్కాజిగిరి మండలము: ఘట్‌కేసర్ గ్రామము: మేదారం

| క్రమ సంఖ్య | సర్వే నెం. | సేకరించవలసిన విస్తీర్ణం | పేరు/చిరునామా (భూమికి సంబంధించిన వ్యక్తుల వివరాలు) |
|---|---|---|---|
| 1 | 1 | 0.06½ 0.02½ | చింతల సత్తి రెడ్డి తం. లింగారెడ్డి ఉరెల్లి రాం రెడ్డి తం. ఉరెల్లి చిల్కా రెడ్డి ఉరెల్లి సోమిరెడ్డి తం. చిల్కా రెడ్డి ఉరెల్లి నర్సిరెడ్డి తం. చిల్కా రెడ్డి |
| 2 | 2 | 0.25 | ఎ. కొండల్ రెడ్డి [illegible] |
| 3 | 3 | 2-18 | [illegible] |
| 4 | 5 | 0-05 0-05 1-21 | [illegible] |
| 5 | 6 | 0-03 | [illegible] |
| 6 | 83 | 0-13 | బి. రాజి రెడ్డి [illegible] |
| 7 | 84 | 0-05 0-04 | [illegible] |
| 8 | 102 | 0-12 0-28½ 0-09½ | [illegible] |
| 9 | 103 | 1-07 | [illegible] |
| 10 | 107 | 0-04 | [illegible] |
| 11 | 108/అ | 0-26½ | [illegible] |
| 12 | 108/ఆ | 0-25½ | [illegible] |
| 13 | 110 | 0-16 | [illegible] |
| 14 | 155 | 0-20 | [illegible] |
| 15 | 157 | 1.39 | [illegible] |
| 16 | 158 | 2.03 | ఎ.శ్రీనివాస్ రెడ్డి తం. కాశీనాథ్ రెడ్డి వై బాలమణి భర్త రాం రెడ్డి |
| 17 | 160 | 0.03 | వి.శ్రీకాంత్ రెడ్డి తం. రాం చంద్రారెడ్డి వి. శ్రీ చరణ్ రెడ్డి తం. రాం చంద్రారెడ్డి |
| 18 | 175 | 0.11 | [illegible] |
| 19 | 181 | 0.04 | [illegible] |
| 20 | 182 | 0.02 | [illegible] |
| 21 | 187 | 0.06 | [illegible] |
| 22 | 188 | 0.05 | [illegible] |
| 23 | 189 | 0.07 | [illegible] |
| 24 | 191 | 0.03 | [illegible] |
| 25 | 194 | 1.03 | [illegible] |
| 26 | 197 | 0.04 | [illegible] |
| 27 | 229 | 1.08 | [illegible] |
| 28 | 231 | 0.15 | [illegible] |
| 29 | 232 | 0.17 | [illegible] |
| 30 | 159 | 0.38 | వై. రామిరెడ్డి తం. ఎల్లారెడ్డి వై. బాలమణి భర్త రాంరెడ్డి |
| మొత్తము | | 19.25 | |

ఇట్టి ప్రకటన భూ సేకరణ పునరావాస, పునరావాస కల్పనలో పారదర్శకత మరియు హేతుబద్ధమైన పరిహారాన్ని పొందే హక్కు (తెలంగాణ సవరణ) చట్టం, 2016 (చట్టం నెం. 21/2017) ద్వారా సవరించబడిన భూసేకరణ పునరావాస, పునరావాస కల్పనకు పారదర్శకత మరియు హేతుబద్ధమైన పరిహారాన్ని పొందే హక్కు చట్టం 2013, సెక్షన్ 11(1) (కేంద్ర చట్టం నెం. 30/2013) ప్రకారం దీనితో సంబంధం కలిగిన వ్యక్తులు అందరికి తెలియజేయుటకు గాను ఈ నోటిఫికేషన్ జారీచేయడమైనది.
భూమియొక్క ప్లాన్ మరియు వివరములు జిల్లా కలెక్టరు, మేడ్చల్-మల్కాజిగిరి మరియు రెవిన్యూ మండలాధికారి, కీసర డివిజన్, మేడ్చల్-మల్కాజిగిరి వారి కార్యాలయములో ఉంచడమైనది. సంబంధిత వ్యక్తులు ఏదైనా పనిదినములలో కార్యాలయ వేళలలో తనిఖీ చేసుకోవచ్చును. తెలంగాణ ప్రభుత్వం / జిల్లా కలెక్టర్, మేడ్చల్-మల్కాజిగిరి గారు మరియు - సముచిత ప్రభుత్వం రెవిన్యూమండలాధికారి, కీసర గారిని మరియు వారి సిబ్బందిని ఇట్టి భూ సేకరణకు సంబంధించి సెక్షన్ 12 ప్రకారం పైన తెలిపిన భూములలో ఏదైనా ప్రదేశములో ప్రవేశించి తవ్వడానికి సంబంధిత సర్వే భూమి కొలతలు తీసుకొనుటకు మరియు ఇతర్వాది పనులు చేయుటకు అధికారం ఇవ్వడమైనది.
సదరు చట్టంలోని 11 (4) అనుసరించి కలెక్టర్ గారి అనుమతిలేకుండా షెడ్యూలులో ప్రకటించిన భూములకు సంబంధించి క్రయవిక్రయాలు లేదా ఏ విధమైన లావాదేవీలు జరుపరాదని తెలియచేయడమైనది.
సదరు చట్టంలోని సెక్షన్(15) అనుసరించి ప్రతిపాదిత భూ సేకరణపై ఏదైనా అభ్యంతరాలుగాని, ఆక్షేపణలుగాని ఉన్నట్లయితే సేకరణలో ఉన్న భూమితో ఎలాంటి సంబంధం ఉన్న వ్యక్తులైనా, పరిహారం నిర్ణయం కోసం జరిపే సంప్రదింపుల వల్ల ప్రభావితులైన వారెవరైనా ఈ ప్రకటన ప్రచురించిన తేదీ నుంచి అరవై (60) రోజుల లోపల జిల్లా కలెక్టరు / అధీకృత అధికారి గారికి లిఖితపూర్వకంగా దాఖలుచేసుకోవచ్చును.

డా॥ యం.వి. రెడ్డి, ఐ.ఎ.ఎస్.
జిల్లా కలెక్టర్, మేడ్చల్ - మల్కాజిగిరి జిల్లా





మంత్రి ఈటల రాజేందర్‌కు జ్ఞాపికను అందజేస్తున్న సబ్బండ కళల సాంస్కృతిక సమాఖ్య ప్రతినిధులు

## యాదవులు, కురుమల అభివృద్ధికి ప్రభుత్వం కృషి

### ఆర్థిక మంత్రి ఈటల రాజేందర్

**తెలుగుయూనివర్సిటీ:** యాదవులు, కురుమల అభివృద్ధికి సీఎం కేసీఆర్ ఆధ్వర్యంలోని రాష్ట్ర ప్రభుత్వం కృషిచేస్తున్నదని ఆర్థికశాఖ మంత్రి ఈటల రాజేందర్ పేర్కొన్నారు. భక్త కనకదాస్ జయంతిని ఆదివారం సబ్బండ కళల సాంస్కృతిక సమాఖ్య ఆధ్వర్యంలో హైదరాబాద్ రవీంద్రభారతిలో నిర్వహించారు. కార్యక్రమంలో మంత్రి ఈటల రాజేందర్ పాల్గొని మాట్లాడారు. కురుమలు, యాదవులు ఐకమత్యంగా ఉంటూ అభివృద్ధి సాధించాలని సూచించారు. భక్త కనకదాస్ గొప్ప సేవా తత్పరుడని, ఆయన జీవిత చరిత్రను వెలుగులోకి తెచ్చి నేటి తరానికి పరిచయం చేయాల్సిన అవసరం ఉన్నదన్నారు. కార్యక్రమంలో ఎమ్మెల్సీ నారదాసు లక్ష్మణ్‌రావు, సమాఖ్య అధ్యక్షుడు తాడూరి గోపీనాథ్, మాజీ కార్పొరేటర్ దేవర కరుణాకర్, ఉత్సవ కమిటీ చైర్మన్ వైద్యనాథప్ప జగన్నాథ తదితరులు పాల్గొన్నారు.

## ఈ సదువు నావల్ల ఐతలేదు

- ఓయూలో పీజీ విద్యార్థి బలవన్మరణం
- 'సారీ అమ్మా' అంటూ సూసైడ్ నోట్
- రాజకీయం చేయొద్దు: వీసీ
- సమగ్ర దర్యాప్తు చేస్తున్నాం: సీపీ



మురళి (ఫైల్)

**హైదరాబాద్ సిటీబ్యూరో/ఉస్మానియా యూనివర్సిటీ, నమస్తే తెలంగాణ:** 'ఈ స్టడీ నా వల్ల కావట్లేదు. పిచ్చిలేస్తుంది. ఇంకా ఇలాగే ఉంటే పిచ్చోనైపోత అని భయంగా ఉంది. నా వల్ల అస్సలు కావట్లేదు.. అందుకే వెళ్లిపోవాలని డిసైడ్ ఐన. ఐ యామ్ సారీ అమ్మా' అంటూ సూసైడ్ నోట్ రాసి ఓయూ పీజీ విద్యార్థి మురళి(24) ఆత్మహత్య చేసుకున్నారు. ఈ ఘటన ఆదివారం ఉస్మానియా యూనివర్సిటీలో సంచలనం రేకెత్తిచ్చింది. మురళి ఆత్మహత్యను తమ రాజకీయ ప్రయోజనం కోసం వాడుకోవాలని కొందరు కుట్రపన్నారు. అయితే సూసైడ్ నోట్ బయట పడడం.. అందులో మరణానికి గల కారణాలను స్పష్టంగా పేర్కొనడంతో కుట్రదారులు ఖంగుతిన్నారు. అయినా అమాయకులైన విద్యార్థులను రెచ్చగొడుతూ హంగామా చేస్తూ, ఉద్రిక్త పరిస్థితులను సృష్టించారు. సమయస్ఫూర్తితో వ్యవహరించిన ఓయూ విద్యార్థులు పరిస్థితిని అవగాహన చేసుకొని సూసైడ్ నోట్ ఆధారంగా పోలీసులకు సహకరించారు. మురళి కుటుంబాన్ని ఆదుకోవాలని ప్రభుత్వాన్ని కోరారు. ఆత్మహత్య ఘటనను రాజకీయం చేయొద్దని ఓయూ వైస్ ఛాన్స్‌లర్ రాంచంద్రం సైతం కోరారు. సంఘటనకు సంబంధించి పోలీసులు తెలిపిన వివరాల మేరకు..
సిద్దిపేట జిల్లా జగదేవ్‌పూర్ మండలం దౌలాపూర్‌కు చెందిన మురళి ఓయూ సైన్స్ కళాశాలలో ఎమ్మెస్సీ ఫిజిక్స్(నానో సైన్సెస్) మొదటి సంవత్సరం చదువుతున్నాడు. మానేరు హాస్టల్‌లోని రూం నంబర్-159లో ఉంటున్నాడు. శనివారం రాత్రి నుంచి మురళి కనిపించలేదు. ఆదివారం ఉదయం కూడా హాస్టల్‌కు రాకపోవడంతో అతని రూమ్మేట్స్ తెలిసినవారిని వాకబు చేశారు. హాస్టల్ భవనంలోని మొదటి అంతస్థులో ఉన్న బాత్‌రూం లోపలి నుంచి గడియ పెట్టి ఉండడం, ఎంతకీ తీయకపోవడంతో ఆదివారం సాయంత్రం 4 గంటల ప్రాంతంలో విద్యార్థులకు అనుమానం వచ్చింది. తలుపులపై నుంచి చూడగా లోపల మురళి ఉరివేసుకొని విగతజీవిగా కనిపించాడు. సమాచారం తెలుసుకున్న ఓయూ విద్యార్థులు పెద్దఎత్తున్న మానేరు హాస్టల్ వద్దకు చేరుకున్నారు. ఓయూ పోలీసులు ఘటనా స్థలానికి చేరుకొని మృతదేహాన్ని గాంధీ దవాఖానకు తరలించేందుకు ప్రయత్నించగా.. వీసీ వచ్చేవరకు కదలనీయబోమని విద్యార్థులు స్పష్టం చేశారు. దీంతో పోలీసులు వారిని సముదాయించే ప్రయత్నం చేశారు. విషయం తెలుసుకున్న వీసీ రాంచంద్రం అక్కడకు వచ్చి విద్యార్థులతో మాట్లాడారు. మురళి ఆత్మహత్యపై పోలీసులు విచారణ జరుపుతున్నారని, ఈ విషయాన్ని రాజకీయం చేయొద్దని విజ్ఞప్తిచేశారు. ఈ ఘటనపై సమగ్ర దర్యాప్తు జరుపుతున్నట్టు హైదరాబాద్ పోలీస్ కమిషనర్ శ్రీనివాసరావు తెలిపారు. విద్యార్థుల సమక్షంలోనే వీడియోగ్రఫీ చేశామని, మురళి గదిని సోదాచేయగా సూసైడ్ నోట్ దొరికిందని చెప్పారు.

# సంబురాల్లో అర్చకులు, ఉద్యోగులు

- సీఎం కేసీఆర్ పేరిట ఆలయాల్లో అర్చనలు
- దేవాదాయశాఖలో వేతన వ్యవస్థ అమలుపై సర్వత్రా హర్షం

**హైదరాబాద్, నమస్తే తెలంగాణ:** దేవాదాయశాఖలోని అర్చకులు, ఉద్యోగులలో ఆనందోత్సాహాలు వెల్లివిరుస్తున్నాయి. సీఎం కేసీఆర్ ఇచ్చిన హామీ ప్రకారం ప్రభుత్వ ఉద్యోగులతో సమానంగా అర్చకులు, ఉద్యోగులకు వేతన వ్యవస్థ ఏర్పాటుతోపాటు 2015- పీఆర్సీ అమలు చేయడంపై వారందరూ సంబురాలు జరుపుకుంటున్నారు. సీఎం కేసీఆర్, ఆయన కుటుంబసభ్యుల పేరిట ప్రత్యేక పూజలు నిర్వహిస్తున్నారు. వరంగల్‌లోని ప్రఖ్యాత వేయి స్తంభాల గుడి, భద్రకాళి దేవాలయం, మన్నెంకొండ శ్రీ వేంకటేశ్వరస్వామి దేవాలయం, నల్లగొండలోని శ్రీ సీతారామచంద్రస్వామి వంటి దేవాలయాల్లో ప్రత్యేక పూజలు చేసినట్టు అర్చక సమాఖ్య నాయకులు తెలిపారు. ముఖ్యమంత్రి కే చంద్రశేఖర్‌రావు ఆదేశాల ప్రకారం సెప్టెంబర్ నుంచి దేవాదాయశాఖ కార్యదర్శి శివశంకర్ సారథ్యంలో అధికారులు 646 దేవాలయాల్లోని 5,625 మంది ఉద్యోగులకు పే స్కేల్స్ అమలుకు కృషిచేస్తున్నారు. తొలిదశలో 500 మంది అర్చకులకు, 900 మంది ఉద్యోగులకు వేతనాలు బ్యాంక్ ద్వారా చెల్లించారు. దేవాదాయశాఖ మంత్రి అల్లోల ఇంద్రకరణ్‌రెడ్డి బ్యాంక్ అధికారులకు ఇటీవల రూ.10 కోట్లు అందజేసిన విషయం తెలిసిందే. రాష్ట్ర బడ్జెట్‌లో రూ.50 కోట్లు దేవాదాయశాఖలోని ఉద్యోగుల జీతభత్యాల కోసం కేటాయించారు. ఇందులో మొదటిదశగా రూ.36.50 కోట్లు విడుదల చేశారు. సోమ మంగళవారాల్లో మరో రెండువేల మంది అర్చకులకు, ఉద్యోగులకు పే స్కేల్స్ అందజేయనున్నారు. వారి బ్యాంక్ ఖాతాల్లో జీతభత్యాలు జమకానున్నాయి. ఐదు వేల మంది ఉద్యోగుల కోసం వేతనవ్యవస్థ ఏర్పాటుకు దేవాదాయశాఖ అధికారులు కృషిచేస్తున్నారు.

**నిబంధనల ప్రకారం అర్చక ఉద్యోగులందరికీ వేతనాలు**

అర్చకులు సీఎం కేసీఆర్‌పై పూర్తిగా భరోసాతో ఉండాలి. ప్రభుత్వం చట్టం ప్రకారం, నిబంధనల మేరకే వేతన వ్యవస్థను ఏర్పాటుచేసింది. ప్రభుత్వ ఉద్యోగులతో సమానంగా వేతనాలు అందించడమనే సహసోపేత చర్య. ఈ ప్రక్రియను అర్చకులు, ఉద్యోగులు స్వాగతించాలి.

– గంగు ఉపేంద్రశర్మ, తెలంగాణ రాష్ట్ర అర్చక సమాఖ్య

### కొన్ని సమస్యలుంటాయి.. పరిష్కరించుకుందాం



646 దేవాలయాల్లోని ఐదు వేల మంది ఉద్యోగులకు అర్చకులకు పే స్కేల్స్ నిర్ధారించడం మామూలు విషయం కాదు. కొన్ని సమస్యలు ఎదురవుతాయి. వాటిని తర్వాత పరిష్కరించుకుందాం. దశలవారీగా అందరికీ వేతనాలు అందుతాయి. సాంకేతిక సమస్యలు వచ్చినట్లయితే పరిష్కరించేందుకు అధికారుల కమిటీ ఎప్పుడూ సిద్ధంగా ఉంటుంది. రాష్ట్ర ప్రభుత్వం ఇచ్చిన సదవకాశాన్ని అర్చకులు సద్వినియోగం చేసుకోవాలి.

– కేవీ రమణాచారి, రాష్ట్ర బ్రాహ్మణ సంక్షేమ పరిషత్తు చైర్మన్



ప్రభుత్వ చీఫ్ విప్ పాతూరి సుధాకర్‌రెడ్డిని సన్మానిస్తున్న ఉపాధ్యాయ సంఘం నాయకులు

## వేతనాల పెంపుపై మోడల్ స్కూల్ ఉపాధ్యాయుల హర్షం

- ఎమ్మెల్సీలకు సన్మానం

**హైదరాబాద్, నమస్తే తెలంగాణ:** రాష్ట్రంలోని మోడల్ స్కూల్‌లో గంటల లెక్కన పనిచేస్తున్న ఉపాధ్యాయుల వేతనాన్ని పెంచినందుకు ఉపాధ్యాయ సంఘం ప్రతినిధులు రాష్ట్ర ప్రభుత్వానికి కృతజ్ఞతలు తెలిపారు. తమకు రూ.7,500 నుంచి రూ.14 వేలకు తమ వేతనం పెంచేందుకు కృషిచేసిన చీఫ్ విప్ పాతూరి సుధాకర్‌రెడ్డి, ఎమ్మెల్సీ పూలరవీందర్‌ను ఉపాధ్యాయ సంఘాల ప్రతినిధులు ఆదివారం సన్మానించారు. ఈ కార్యక్రమంలో సంఘం నేతలు నాగరాజు, ప్రశాంత్, శ్రీనివాస్, అలీఫ్ తదితరులు పాల్గొన్నారు.



# ఆర్థిక అవసరాలే ఆసరాగా...

## అంతా హై టెక్నాలజీతో నిర్వహణ
## క్లినికల్ ట్రయల్స్‌లో వెలుగుచూస్తున్న బాగోతాలు

**హైదరాబాద్, నమస్తే తెలంగాణ:**

పేదరికం, అమాయకత్వాన్ని ఆసరాగా చేసుకొని ఔషధ ప్రయోగాల ముఠాలు పేదల ప్రాణాలతో చెలగాటమాడుతున్నాయి. ఆర్థిక ఇబ్బందులతో ఎంతోమంది పేదలు ఈ ముఠాల ఉచ్చులో చిక్కుతున్నారు. ఇటీవల కరీంనగర్ జిల్లాలో వెలుగు చూస్తున్న ఘటనలు కలవరపాటుకు గురిచేస్తున్నాయి. వరుస సంఘటనలతో ప్రభుత్వం అప్రమత్తమైంది. ఇప్పటికే ఈ ఘటన బాధితులకు వైద్య సహాయం అందించడంతోపాటు బాధ్యులపై చర్యలకు ఆర్థికశాఖ మంత్రి ఈటల రాజేందర్ ఆదేశించిన విషయం తెలిసిందే. రాష్ట్రంలో చర్చనీయాంశమైన ఔషధ ప్రయోగాల ముఠా ఉచ్చులోకి పేదలు ఎలా పడుతున్నారో తెలుసుకొనేందుకు 'నమస్తే తెలంగాణ' ప్రయత్నించటంతో ఆసక్తికర విషయాలు వెలుగుచూశాయి.

**ఆర్థిక ఇబ్బందులే కారణం**

ఔషధ ప్రయోగాలకు బలవుతున్న వారిలో ఎక్కువమంది ఆర్థిక కష్టాలతోనే ఇందుకు అంగీకరిస్తున్నట్టు తెలుస్తున్నది. ప్రయోగం తర్వాత అస్వస్థతకు గురైనా ఇంట్లో చెప్పటం లేదు. అలా చెప్తే కుటుంబసభ్యులు ఏమంటారోనన్న భయంతో బాధితులు ప్రాణాల మీదకు తెచ్చుకొంటున్నారు. స్థానికంగా ప్రయోగాలు చేస్తే ఇబ్బందులు వస్తాయని అక్రమార్కులు చెన్నై, బెంగళూరు వంటి నగరాలకు తీసుకెళ్తున్నారు. ఒక ప్రయోగాన్ని విడతలవారీగా చేస్తున్నప్పుడు నిర్దేశిత కాల వ్యవధిలోగా ఆ వ్యక్తి మరో ప్రయోగానికి వెళ్లకూడదు. చాలామంది డబ్బు ఆశతో గడువులోపే మరో ప్రయోగానికి వెళ్తున్నారు. ప్రాణాల మీదకు తెచ్చుకుంటున్నారు.ఒక ఔషధ ప్రయోగానికి ఒప్పుకొంటే తొలి దశలో రూ.వెయ్యి నుంచి రూ.2వేలు మాత్రమే ఇస్తారు. ప్రయోగం పూర్తయిన తర్వాతే మిగిలిన మొత్తం చెక్ రూపంలో అందుతుంది. ఈ లోగా అత్యవసరమైతే దళారులు చెక్కులోనూ 5 నుంచి 10% కమిషన్ తీసుకుని మిగిలింది ముట్టజెప్తున్నారు.

**అంతా హై టెక్నాలజీతో నిర్వహణ**

ఔషధ ప్రయోగాలకు వ్యక్తులను ఆకర్షించే ప్రక్రియలో దాదాపు 40 వాట్సప్ గ్రూపులు పనిచేస్తున్నాయి. ఒక వ్యక్తిని ప్రయోగానికి తీసుకెళ్తే దళారీకి సదరు కంపెనీ తొలిదశ స్క్రీనింగ్ పరీక్షకే రూ.500 వరకు కమీషన్ ఇస్తుంది. ప్రయోగం పూర్తయితే రూ.5వేల వరకు కమీషన్ దక్కుతుంది. కాసుల కక్కుర్తితో కొందరు దళారులు అమాయకుల జీవితాలను బలిపెడుతున్నారు. జిల్లాల నుంచి వ్యక్తులను వివరాలు సేకరించి వారిని డబ్బుఆశజూపి ఒప్పిస్తున్నారు. వాళ్లందరినీ హైదరాబాద్‌కు రమ్మంటున్నారు. ఇక్కడి నుంచి గుట్టుచప్పుడు కాకుండా చెన్నై, బెంగళూరు, గోవా, పుణే, ముంబై, ఢిల్లీ ఇతర నగరాల్లో ఔషధ ప్రయోగాలకు పంపుతున్నట్టు తెలుస్తున్నది. ఇటీవల జమ్మికుంటలో జరిగిన ఘటనను చూస్తే అక్కడ రైలు మార్గం ఉండటంతో ఇతర ప్రాంతాలకు రవాణా సులువు కావటంతో ఎక్కువగా ఆ ప్రాంతంలోని వారిని టార్గెట్ చేస్తున్నారు.



**30 ఏండ్లలోపు నిరుద్యోగులే టార్గెట్**

ఔషధ ప్రయోగాలకు ఒప్పుకొంటున్నవారిలో 30 ఏండ్లలోపు నిరుద్యోగులే ఎక్కువగా ఉంటున్నారని తెలుస్తున్నది. ప్రధానంగా 25 నుంచి 30 ఏండ్ల వారినే దళారులు టార్గెట్ చేస్తున్నారు. బీటెక్, డిగ్రీలు పూర్తిచేసి ఉద్యోగాల వేటలో ఉండి, ఆర్థిక ఇబ్బందుల్లో కూరుకుపోయిన యువకుల అవసరాలను దళారులు ఆసరాగా చేసుకొంటున్నారు. వయస్సులో ఉన్నందున కొంత రక్తం తీసుకొని ప్రయోగాలు చేసినంత మాత్రాన ఏమీకాదంటూ వారిని మభ్య పెడుతున్నారు. యువకులు సైతం తమ అవసరాలకు ఇంటి నుంచి డబ్బు తెచ్చుకోలేక ఇలాంటి వాటిని ఆశ్రయిస్తున్నారని, నెలల తరబడి హైదరాబాద్‌లోనే మకాం వేయటంతో కుటుంబసభ్యులకు ఈ విషయాలు తెలియటం లేదని ఔషధ వాలంటీర్లుగా పనిచేస్తున్న కొందరు తెలిపారు.

### అవగాహన పెంచుతున్నాం

ఔషధ ప్రయోగాలపై ప్రజల్లో మరింత అవగాహన పెంచాల్సి ఉన్నది. ఇప్పటికే ప్రభుత్వం తరపున అవగాహన కార్యక్రమాలు నిర్వహిస్తున్నాం. ఔషధ ప్రయోగాల్లో నిబంధనల ఉల్లంఘనను నియంత్రించేందుకు రిటైర్డ్ జడ్జి జస్టిస్ గోపాల్‌రెడ్డి అధ్యక్షతన కమిటీ ఏర్పాటైంది. కమిటీ నివేదిక రాగానే తగిన చర్యలు తీసుకుంటాం.

–వాకాటి కరుణ, కమిషనర్, కుటుంబ సంక్షేమశాఖ



### ఔషధ ప్రయోగాలు చేయాల్సింది ఎలా?

- అసరమైన పరీక్షలన్నీ చేసి ఆరోగ్యవంతులనే ఎంపికచేయాలి. ప్రయోగం ఎందుకు చేస్తున్నారో, దీనివల్ల తాత్కాలికంగా కలిగే దుష్ఫలితాలేమిటో నిపుణులు వివరించాలి. అదంతా వీడియోలో చిత్రీకరించాలి.
- ప్రయోగం వ్యవధి 24 గంటలు, 48 గంటలు, 72 గంటలు ఉంటుంది. అది జరిగినన్ని రోజులూ ప్రయోగశాలలోనే ఉండాలి. భోజన, వసతులన్నీ వారివే.
- కుటుంబసభ్యులను సంప్రదించి ఇష్టప్రకారమే ఒప్పుకున్నట్టు సంతకం చేయాలి.
- ప్రయోగంలో వినియోగించే మాత్రను బట్టి రక్త నమూనాలను సేకరిస్తారు. సాధారణంగా మొదట 10 నిమిషాలకోసారి, ఆరుగంటల అనంతరం 20 నిమిషాలకోసారి, ఆ తర్వాత అర్ధగంట, గంట.. ఇలా నిర్దేశిత కాల వ్యవధుల్లో నమూనాలు సేకరిస్తారు. ఒక వ్యక్తి శరీరం నుంచి 350 మి.లీ. కంటే ఎక్కువ రక్తాన్ని సేకరించకూడదు.
- ప్రయోగం జరుగుతున్నంతసేపూ వైద్యుడు పర్యవేక్షించాలి.
- అనారోగ్యానికి గురైనా, మృతి చెందినా నష్టపరిహారం చెల్లించాలి.
- ప్రయోగంలో 40-60 మంది స్వచ్ఛంద ఔషధస్వీకర్తలు పాల్గొంటారు. వీరందరికీ బృందంగా బీమా చేయిస్తారు. అనుకోని పరిస్థితుల్లో మృతి చెందితే బీమా సొమ్ము చెల్లిస్తామని అవగాహన పత్రంలోనే రాస్తారు.
- ప్రతి ప్రయోగశాలకూ విలువల పరిరక్షణ ఎథిక్స్‌కమిటీ ఉండాలి. ప్రయోగానికి ముందు కమిటీలో చర్చించి అనుమతి పొందాలి. ఏదైనా అనర్థం జరిగితే నష్టపరిహారాల వ్యవహారాన్ని కూడా ఈ కమిటీయే పర్యవేక్షిస్తుంది.

**ఇప్పుడు జరుగుతున్నది ఇలా!**

- ఎంపిక చేసుకొనే వ్యక్తులు పూర్తి ఆరోగ్యంతో ఉన్నారో లేదో పట్టించుకోకుండానే ఔషధ ప్రయోగాలు చేసేలా దళారులను ప్రోత్సహిస్తున్నారు.
- తెలుగులో ఉన్నా 30, 40 పేజీలను ఐదారు నిమిషాల్లోనే చదివి సాంకేతిక పదాలను అర్థం చేసుకుని, లోతుపాతులను గ్రహించటం కష్టమే.
- కుటుంబసభ్యులతో సంప్రదించాలని చెప్తున్నారు కానీ ఆ పత్రాలను ఇంటికి తీసుకెళ్లటానికి అనుమతించటం లేదు.
- 99% మంది కుటుంబసభ్యులకు తెలియకుండానే ఈ ప్రయోగాల్లో పాల్గొంటున్నారు. పేదరికం, కుటుంబ ఆర్థిక పరిస్థితులు ఇందుకు కారణం. డబ్బు అవసరం కాబట్టి కుటుంబసభ్యులకు చెప్పామని, ఇష్టపూర్తిగానే పాల్గొంటున్నామని పేదలు సంతకం చేస్తున్నారు.
- ప్రయోగశాలల్లో ఉన్నన్నాళ్లు ఎవరితోనూ సంప్రదించటానికి వీలుండదు.
- ఒక వ్యక్తి శరీరం నుంచి 350 మి.లీ. కంటే ఎక్కువ రక్తాన్ని సేకరించకూడదు. కానీ అరలీటర్‌కు పైగానే తీసుకొంటున్నారు.

# ప్రాణాలతో ప్రయోగాలు

- ఔషధ కంపెనీల నిర్వాకాలు
- 25 నుంచి 30 ఏండ్ల వారికే ఎర
- సీరియస్‌గా తీసుకొన్న ప్రభుత్వం
- నేడు జమ్మికుంటకు విచారణ కమిటీ రాక
- నాలుగు ల్యాబ్‌లకు నోటీసులు



రక్తం కక్కుకున్న క్లినికల్ బాధితుడు సురేష్(ఫైల్)



మృతుడు నాగరాజు(ఫైల్)



వలంటీర్ చిలువేరు అశోక్ కుమార్(ఫైల్)

**జమ్మికుంట, నమస్తే తెలంగాణ:**

ఔషధ ప్రయోగాలు వికటిస్తున్నాయి. ఏజెంట్లు చెప్పే మాటలు నమ్మి, కంపెనీలు చూపే ప్రలోభాలకు లొంగి చాలామంది ఈ ఊబిలో చిక్కుకొంటున్నారు. అవసరాలకు డబ్బు అందుతుందన్న ఉద్దేశంతో అవగాహన లేకుండానే ఔషధ ప్రయోగాలకు ఒప్పుకొంటున్నారు. ఇలాంటివారి నుంచి ఎడాపెడా నిర్దేశిత ప్రమాణాలకు మించి రక్తం సేకరిస్తున్నారు. ఒకటికి మించి ప్రయోగాలు చేస్తున్నారు. దీనితో ఔషధ ప్రయోగాల్లో పాల్గొంటున్నవారికి ముప్పు వస్తున్నది. ఆరోగ్యం నాశనమవుతున్నది. చివరకు ప్రాణాలే పోతున్నాయి. కొందరు మతిస్థిమితం కోల్పోతున్నారు. నిజానికి మనుషులపై ఔషధ ప్రయోగాలు ఆషామాషీ వ్యవహారంకాదు. దానికి అనేక నిబంధనలుంటాయి. కొన్ని ప్రమాణాలు పాటించాలి. కానీ, దేశవ్యాప్తంగా వేల సంఖ్యలో ఉన్న ఫార్మా కంపెనీలు నిబంధనలు పాటించటం లేదు. ఇలాంటి ప్రయోగాలన్నీ కేంద్ర ప్రభుత్వ పరిధిలోని డ్రగ్ కంట్రోల్ జనరల్ ఆఫ్ ఇండియా పరిధిలో ఉండటం, రాష్ట్ర ప్రభుత్వాలకు ఎలాంటి అజమాయిషీ లేకపోవటంతో ఫార్మా కంపెనీలు ఇష్టారాజ్యంగా వ్యవహరిస్తున్నాయి. ఏజెంట్లను నియమించుకొని, వారి ద్వారా ఆర్థిక ఇబ్బందులున్నవారికి వల వేస్తున్నాయి. రాష్ట్రానికి చెందిన యువకులను బెంగళూరు, చెన్నై , ముంబై, పుణె, గోవా, ఢిల్లీ లాంటి ప్రాంతాలకు తీసుకెళ్లి, భాష తెలియనివారి మధ్య ఔషధ ప్రయోగాలు సాగిస్తున్నారు. కనీసం కుటుంబసభ్యులకు కూడా ఎటువంటి సమాచారం ఉండటం లేదు. ఔషధ ప్రయోగాలకు ఒప్పుకొంటున్నవారూ తమ కుటుంబసభ్యులకు ఈ విషయం చెప్పటం లేదు. తీవ్ర అనారోగ్య సమస్యలు తలెత్తి, ప్రాణాల మీదకు వచ్చినప్పుడే అసలు సంగతి బయటపడుతున్నది. ఇటీవల కాలంలో కరీంనగర్ జిల్లాలో జరిగిన వరుస ఘటనలు తీవ్ర కలకలమే సృష్టించాయి. జమ్మికుంట మండలం నాగంపేట గ్రామం నుంచి ఔషధ ప్రయోగాలకు వెళ్లిన నాగరాజు కొద్ది నెలల క్రితమే చనిపోయారు. చిలువేరు అశోక్‌కుమార్ మతిస్థిమితం కోల్పోయి, ఎర్రగడ్డ దవాఖానలో చికిత్స పొందుతున్నారు. తాజాగా శనివారం రాత్రి బోగ సురేశ్ అనే యువకుడు వాహనం నడుపుతుండగానే కండ్లు తిరిగి కిందపడ్డారు. రక్తం కక్కి స్పృహ కోల్పోవటంతో వరంగల్ ఎంజీఎం దవాఖానకు తరలించారు. ఆదివారం హుజూరాబాద్‌లోనూ మరో కేసు వెలుగుచూసింది. పలుసార్లు ఔషధ కంపెనీల ప్రయోగాల్లో పాల్గొన్న ఎర్రం దేవీప్రసాద్ మానసిక సమస్యలతో దవాఖానాల చుట్టూ తిరుగుతున్న వైనం బయటపడింది. 2006లో హైదరాబాద్‌లోని ఆక్సిస్ క్లినికల్ రీసెర్చి కేంద్రంలోనూ, అదే కేంద్రానికి చెందిన తార్నాకలోని ల్యాబ్‌లో ఆరుసార్లు, బాలానగర్‌లోని రెడ్డీస్‌ల్యాబ్‌లో రెండుసార్లు ఇలా మొత్తం ఇరవైసార్లు ఔషధప్రయోగాలకు వెళ్లినట్టు బాధితుడి కుటుంబసభ్యులు చెప్తున్నారు. చివరిసారిగా 2009లో చర్లపల్లిలోని విముడా క్లినికల్ రీసెర్చి కేంద్రానికి వెళ్లాడని, 2010లో రక్తపు వాంతులతో ఆరోగ్య సమస్యలు తలెత్తాయని కుటుంబసభ్యులు పేర్కొన్నారు. ఇలా వరుస సంఘటనలు జరుగుతుండటంతో రాష్ట్ర ప్రభుత్వం సీరియస్‌గా తీసుకొన్నది. మంత్రి ఈటల రాజేందర్ విచారణకు ఆదేశించారు. ఈ నేపథ్యంలో సోమవారం జమ్మికుంటలో ప్రత్యేక విచారణ కమిటీ పర్యటించనున్నది. ఔషధ ప్రయోగాల్లో నిబంధనల ఉల్లంఘనలపై ఇప్పటికే రాష్ట్ర ప్రభుత్వం రిటైర్డ్ జడ్జి జస్టిస్ గోపాల్‌రెడ్డి నేతృత్వంలో కమిటీని నియమించింది. ఈ కమిటీ అధ్యయనం కొనసాగుతున్నది. ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్న యువకులకు ఫార్మా కంపెనీలు ఎరవేస్తున్నట్టు తెలుస్తున్నది.

**నాగరాజు మృతితో కలకలం..**

జమ్మికుంట మండలం నాగంపేట గ్రామానికి చెందిన నాగరాజు తీవ్ర అనారోగ్యంతో గత జూన్ 2న మృతిచెందారు. మృతుడి బ్యాగులో బెంగుళూరుకు చెందిన ఓ ఔషధ కంపెనీ అగ్రిమెంటు పత్రాలను గుర్తించటంతో వ్యవహారం మరో మలుపు తిరిగింది. సదరు కంపెనీపై మృతుడి కుమారుడు శ్రీనివాస్ 16న జమ్మికుంట పోలీసులకు ఫిర్యాదుచేశారు. దర్యాప్తు చేస్తున్న పోలీసులు ఎఫ్‌ఎస్‌ఎల్ రిపోర్టు కోసం ఎదురుచూస్తున్నారు.

**మతిస్థిమితం కోల్పోయిన అశోక్‌కుమార్**

ఉద్యోగం కోసం జమ్మికుంట మండలం కొత్తపల్లి గ్రామం నుంచి హైదరాబాద్ వెళ్లిన చిలువేరు అశోక్‌కుమార్ రెండునెలల కిందట అనారోగ్యంతో ఇంటికి చేరుకున్నారు. అశోక్ బ్యాగులో ఫార్మా కంపనీల పత్రాలను గమనించిన కుటుంబసభ్యులు నిలదీశారు. నవంబర్ 27న బాధితుడి తల్లి కమల రెండు ఫార్మా కంపనీలపై పోలీసులకు ఫిర్యాదుచేశారు.

**రక్తం కక్కుకొని.. నడిరోడ్డుపై పడిపోయిన సురేశ్**

కొత్తపల్లి గ్రామానికి చెందిన సురేశ్ శనివారం రాత్రి బైక్‌పై వెళ్తుండగా, నడిరోడ్డుపై కండ్లు తిరిగి పడిపోయారు. రక్కం కక్కుకుని, స్పృహ కోల్పోయారు. స్థానికులు జమ్మికుంట ప్రభుత్వ దవాఖానకు, అక్కడ నుంచి వరంగల్ ఎంజీఎంకు తరలించారు. తాను క్లినికల్ ట్రయల్స్‌లో పాల్గొన్నట్టు బాధితుడు సురేష్ చెప్పారు. పక్కటెముకలు, కాళ్లు చేతులు నొప్పి పుడుతున్నాయని, బ్రషింగ్ చేస్తుంటే నోట్లో నుంచి రక్తం పడుతున్నదని, గుండెలో సూదులు గుచ్చుతున్నట్టుగా ఉన్నదని చెప్పారు.

### నేడు జమ్మికుంటలో విచారణ.. నాలుగు కంపెనీలకు నోటీసులు

కరీంనగర్ జిల్లాలో తీవ్ర కలకలం సృష్టించిన క్లినికల్ ట్రయల్స్ వ్యవహారాన్ని రాష్ట్ర ప్రభుత్వం సీరియస్‌గా తీసుకొంటున్నది. క్లినికల్ ట్రయల్స్‌లో పాల్గొన్న జమ్మికుంటకు చెందిన వంగర నాగరాజు మృతి చెందటం, ఏజెంటుగా వ్యవహరించిన చిలువేరు అశోక్‌కుమార్ మతిస్థిమితం కోల్పోవటం, తాజాగా శనివారంనాడు బోగ సురేశ్ అనే యువకుడు వాహనంపై కిందపడటం లాంటి వరుస సంఘటనల నేపథ్యంలో ప్రభుత్వం విచారణకు ఆదేశించింది. సోమవారంనాడు జమ్మికుంటలో ప్రత్యేక విచారణ కమిటీ పర్యటించనున్నది. మరోవైపు క్లినికల్ ట్రయల్స్ నిర్వహిస్తున్న నాలుగు ఫార్మా కంపెనీలకు కరీంనగర్ సీపీ కమలాసన్‌రెడ్డి ఆదేశాల మేరకు జమ్మికుంట సీఐ ప్రశాంత్‌రెడ్డి నోటీసులు జారీచేశారు. నాగరాజు మృతికి, చిలువేరు అశోక్‌కుమార్ మతిస్థిమితం కోల్పోయేందుకు కారణమని అనుమానిస్తున్న బెంగళూరుకు చెందిన లోటస్ ల్యాబ్, బోగ సురేశ్‌పై ప్రయోగాలు చేసిన రంగారెడ్డి జిల్లాలోని విన్‌టా ల్యాబ్స్, బెంగళూరులోని అపోటెక్స్ ల్యాబ్స్, హైదరాబాద్‌లోని జీవోక్ కంపెనీ ల్యాబ్స్‌కు నోటీసులు జారీచేశారు. సదరు కంపెనీల ప్రతినిధులు సోమవారం కరీంనగర్ సీపీ కమలాసన్‌రెడ్డి ఎదుట హాజరుకానున్నట్టు తెలుస్తున్నది.

### ఫిర్యాదులు చేస్తే కేసులు నమోదు



క్లినికల్ ట్రయల్స్‌లో మృతి చెందినట్టు బాధిత కుటుంబం ఫిర్యాదు చేసింది. ఎఫ్‌ఎస్‌ఎల్ నివేదిక కోసం ఎదురుచూస్తున్నాం. వాలం టీర్లుగా చెప్తున్న అశోక్‌కుమార్ మతిస్థిమితం తప్పారు. సురేశ్ రక్కం కక్కుకున్నారు. దవాఖానలో చికిత్స చేస్తున్నారు. ఇప్పటికే నాలుగు కంపనీలపై కేసులు పెట్టాం. బాధితులు ఫిర్యాదులు చేస్తే కేసులు పెడతాం.

–పింగిళి ప్రశాంత్‌రెడ్డి, జమ్మికుంట సీఐ

# 15న డ్రైరన్


మొదటిపేజీ తరువాయి...


ఉన్న మోటర్లతో నీటిని ఎత్తిపోస్తున్నారు. ఈ పథకంలో అన్ని మోటర్లను కలిపితే గరిష్ఠ డిశ్చార్జి సామర్థ్యం సుమారు నాలుగువేల క్యూసెక్కులు. కానీ కాళేశ్వరం పథకంలో రోజుకు రెండు టీఎంసీలను ఎత్తిపోసేలా మోటర్లను అమరుస్తున్నారు. గోదావరి నుంచి మేడారం, అన్నారం, సుందిళ్ల పంపుహౌజ్‌ల ద్వారా ఎల్లంపల్లికి నీటిని తరలించిన తర్వాత గ్రావిటీపై జలాలు మేడారం రిజర్వాయర్‌కు వస్తాయి. మేడారం రిజర్వాయర్ నుంచి 124 మెగావాట్ల సామర్థ్యం ఉన్న ఏడు మోటర్లతో నీటిని లిఫ్టు చేస్తారు. రామడుగు వరకు వచ్చిన ఆ నీటిని.. అక్కడి పంపుహౌజ్ నుంచి 139 మెగావాట్ల సామర్థ్యం ఉన్న ఏడు మోటర్ల ద్వారా ఎత్తి ఎస్సారెస్పీ వరద కాల్వలో పోస్తారు. దీంతో జలాలు మిడ్‌మానేరుకు చేరుతాయి. రామడుగు వద్ద ఉన్న పంపుహౌజ్‌లో బిగించిన 139 మెగావాట్ల సామర్థ్యం ఉన్న మోటర్‌కు ఈ నెల 15న డ్రైరన్ చేయనున్నారు. దీనికి సంబంధించి బీహెచ్‌ఈఎల్ అధికారులు, ఏజెన్సీతో కొన్నిరోజుల కిందటే అధికారులు సమావేశమై చర్చించి, కొద్దిపాటి పెండింగ్ పనులను ఆలోగా పూర్తిచేయాలని నిర్ణయించారు. మోటర్‌ను డ్రైరన్‌లో పరిశీలించి.. చిన్న చిన్న లోపాలుంటే వెంటనే సవరించుకుంటారు. ఇది విజయవంతమైతే నీటిని లిఫ్టు చేసేందుకు మోటర్ సిద్ధంగా ఉందన్నట్టు. రామడుగు పంపుహౌజ్‌లో బిగించే ఒక్కో మోటర్ ద్వారా సుమారు 3001 క్యూసెక్కుల డిశ్చార్జి ఉంటుంది. అంటే ఏడు మోటర్ల ద్వారా 21012 క్యూసెక్కులు (దాదాపు రెండు టీఎంసీలు) ఎత్తిపోయనున్నారు. ఇది ఆసియాలోనే రికార్డు. నెల వ్యవధిలోనే ఒక్కో మోటర్ బిగింపును పూర్తిచేసేందుకు అధికారులు కార్యాచరణ రూపొందించారు. మేడారం దగ్గర పంపుహౌజ్‌లో మోటర్ బిగింపు, డ్రైరన్ పూర్తయిన తర్వాత ట్రయల్‌రన్ (నీటిని లిఫ్టు చేయడం) కూడా చేయనున్నారు. ఇలా వచ్చే ఏడాది మార్చి నుంచి ఎల్లంపల్లి-మిడ్ మానేరు మార్గాన్ని సిద్ధం చేసుకొని.. జూన్‌లోగా మేడారం, అన్నారం, సుందిల్ల పంపుహౌజ్‌లోనూ మోటర్ల ట్రయల్‌రన్స్ పూర్తి చేసేందుకు అధికారులు ఏర్పాట్లు చేస్తున్నారు.

**యుద్ధ ప్రాతిపదికన పనులు**

కాళేశ్వరం పథకంలో భాగంగా గోదావరి జలాలను ఎత్తిపోసేందుకు మూడు బరాజ్‌లు, మూడు పంపుహౌజ్‌ల పనులు యుద్ధప్రాతిపదికన జరుగుతున్నాయి. బరాజ్‌లు పూర్తికాకున్నా... కొంతమేర పని అయినా రోజుకు రెండు టీఎంసీలను ఎత్తిపోసేలా నీటి లభ్యత ఉంటే చాలు. ఇప్పటికే ఆ దశ పనులు కూడా ఎప్పుడో పూర్తయ్యాయి. అంటే ఇక నీటిని ఎత్తిపోసేందుకు పంపుహౌజ్‌లు సిద్ధం కావాల్సి ఉంది. వచ్చే ఏడాది ఖరీఫ్‌లోనే జలాలను తరలించాలని సీఎం కేసీఆర్ స్పష్టమైన ఆదేశాలు జారీ చేసిన దరిమిలా మూడు షిఫ్టుల్లో 24 గంటలపాటు పనులు కొనసాగుతున్నాయి. దీంతో 2018 ఫిబ్రవరిలోనే మేడారం, అన్నారం, సుందిల్ల పంపుహౌజ్‌లను పూర్తి చేసేందుకు నీటిపారుదల శాఖ నిర్ణయించింది. ఈ మూడు పూర్తయితే గోదావరి జలాలను ఎల్లంపల్లికి తరలించవచ్చు. ఈలోగానే డిసెంబర్ నెలాఖరులోగానే ఎల్లంపల్లి నుంచి మిడ్‌మానేరు వరకు జలాల తరలింపు పనులు (ప్యాకేజీ-6 నుంచి 8 వరకు) పూర్తి చేయాలని ప్రభుత్వం గతంలోనే లక్ష్యాన్ని ప్రకటించింది. దీనిపై నీటిపారుదల శాఖ మంత్రి హరీశ్‌రావు పలుమార్లు సమీక్షించి, పనులు వేగంగా జరిగేలా సూచనలు చేశారు.

### నవంబర్ చివరినాటికి మూడు ప్యాకేజీల పనుల పురోగతి..

**ప్యాకేజి-6**

- **ఎల్లంపల్లి నుంచి మేడారం ట్యాంకు**

2.58 కిలోమీటర్ల అప్రోచ్ చానెల్‌లో 93%, 1.10 కిలోమీటర్ల గ్రావిటీ కాల్వలో 99%, 19.068 కిలోమీటర్ల టన్నెల్‌లో 95%, టన్నెల్ లైనింగ్ 73.5%, సర్జ్‌పూల్ 86.42%, పంపుహౌజ్ 98.23% మేర పూర్తయ్యాయి.

**ప్యాకేజి-7**

- **మేడారం ట్యాంకు నుంచి మిడ్ మానేరు**

1.95 కిలోమీటర్ల అప్రోచ్ చానెల్‌లో 35.9%, 22.48 కిలోమీటర్ల టన్నెల్‌లో 67%, లైనింగ్ 24% పూర్తయింది.

**ప్యాకేజి-8**

- **మేడారం ట్యాంకు నుంచి మిడ్ మానేరు**

5.750 కిలోమీటర్ల గ్రావిటీ కాల్వలో 33.5%, 9.266 కిలోమీటర్ల టన్నెల్‌లో 99.37%, టన్నెల్ లైనింగ్ 71.43%, సర్జ్‌పూల్ 94.37%, పంపుహౌజ్ పనులు 99 శాతం పూర్తయ్యాయి.

# జర్మనీ ఆర్థిక వ్యవస్థకు భారత్ దన్ను

- గతేడాది రూ.88 వేల కోట్ల ఆదాయాన్ని సృష్టించిన దేశీయ సంస్థలు
- వివిధ రంగాల్లో 27,400 ఉద్యోగాల కల్పన

**న్యూఢిల్లీ, డిసెంబర్ 3:** గతేడాది జర్మనీలో భారతీయ సంస్థలు దాదాపు రూ.87,506 కోట్ల (11.4 బిలియన్ యూరోలు) ఆదాయాన్ని, 27,400 ఉద్యోగాల్ని సృష్టించాయి. ఈ మేరకు దేశీయ పారిశ్రామిక సంఘం సీఐఐ-ఈవై-బెర్టెల్స్‌మన్ ఫౌండేషన్ అధ్యయనం చెబుతున్నది. కాగా, జర్మనీలోని భారతీయ కంపెనీల సీఈవోలు తెలిపిన వివరాల ప్రకారం ఇక్కడి సంస్థల ఆదాయంలో 40 శాతం మెటల్స్, 29 శాతం ఆటోమోటివ్స్ విభాగాల నుంచే వస్తున్నది. టాటా స్టీల్, హిందాల్కో ఇండస్ట్రీస్, సోనా ఆటోక్యాంప్ సంస్థలు ఈ రంగాల్లోని ప్రధాన భారతీయ సంస్థలుగా ఉన్నాయి. ఇక ఐటీ రంగం వాటా మాత్రం



9 శాతంగానే ఉన్నది. 2010 నుంచి గమనిస్తే పెట్టుబడులపరంగా సుమారు 140 భారీ ప్రాజెక్టులను భారతీయ కంపెనీలు జర్మనీలో తీసుకొచ్చాయి. 2010-2016 మధ్య భారతీయ విదేశీ ప్రత్యక్ష పెట్టుబడుల (ఎఫ్‌డీఐ)ను అత్యధికంగా అందుకున్న యూరప్ దేశాల్లో 96 ప్రాజెక్టులతో జర్మనీ రెండో స్థానంలో ఉంది. జర్మనీలోని ఆటోమోటివ్ ఇండస్ట్రీ, మెటల్, మెటల్ ప్రాసెసింగ్ ఇండస్ట్రీ, ప్రొఫెషనల్, టెక్నికల్, సైంటిఫిక్ సర్వీసెస్, కెమికల్, ఫార్మాస్యూటికల్ ఇండస్ట్రీ, ఎలక్ట్రానిక్స్, యంత్రాల తయారీ రంగాల్లో భారతీయ సంస్థలు పెద్ద ఎత్తున పెట్టుబడులు పెట్టాయి. కొత్తదనం, సాంకేతికతల వల్లే జర్మనీలో ఎక్కువగా పెట్టుబడులు పెడుతున్నామని ఇక్కడున్న భారతీయ కంపెనీలకు చెందిన సీఈవోల్లో 80 శాతం మంది తెలిపారు. కాగా, యూరోపియన్ యూనియన్ (ఈయూ) నుంచి బ్రిటన్ వైదొలుగడం (బ్రెగ్జిట్), ప్రాంతీయ మార్కెటింగ్‌పైనే జర్మనీలో భారతీయ సంస్థల భవిష్యత్ పెట్టుబడులు ఆధారపడి ఉంటాయని పలువురు సీఈవోలు అభిప్రాయపడ్డారు. ఈయూ నుంచి బ్రిటన్ వైదొలిగితే ఆ పెట్టుబడులు జర్మనీకి వచ్చే వీలుంది. ఈయూ దేశాలతో సత్సంబంధాల కొనసాగింపునకు భారతీయ కంపెనీలు తప్పక ఈ పని చేయాల్సిందే.

# ఇక రంగంలోకి ఎస్‌ఎఫ్‌ఐవో

- పెద్ద నోట్ల రద్దు తర్వాత అనుమానిత లావాదేవీలపై విచారణ
- 18 సంస్థలపై మొదలుకానున్న దర్యాప్తు

**న్యూఢిల్లీ, డిసెంబర్ 3:** పెద్ద నోట్ల రద్దు తర్వాత జరిగిన అక్రమాలపై ఇక తీవ్ర మోసాల దర్యాప్తు కార్యాలయం (ఎస్‌ఎఫ్‌ఐవో) అధికారులు రంగంలోకి దిగుతున్నారు. ఇప్పటికే అనుమానిత నగదు లావాదేవీలపై ఆదాయ పన్ను శాఖ అధికారులు నోటీసులతో విజృంభిస్తున్నది తెలిసిందే. వీటికి ఇప్పుడు ఎస్‌ఎఫ్‌ఐవో విచారణలు తోడవనున్నాయి. నల్లధనం, నకిలీ కరెన్సీల నిర్మూలనలో భాగంగా గతేడాది నవంబర్ 8వ తేదీ రాత్రి పాత 500, 1,000 రూపాయల నోట్లను రద్దు చేస్తున్నట్లు ప్రధాన మంత్రి నరేంద్ర మోదీ స్వయంగా ప్రకటించిన విషయం తెలిసిందే. కొత్తగా 500, 2,000 రూపాయల నోట్లను తీసుకొస్తున్నట్లు స్పష్టం చేసిన మోదీ.. రద్దయిన నోట్లను బ్యాంకులు, పోస్టాఫీసుల్లో డిపాజిట్ చేసి, అంతే విలువైన ఇతర కరెన్సీని పొందాలని ప్రజలకు సూచించారు. ఈ క్రమంలో భారీ స్థాయిలో అనుమానిత నగదు లావాదేవీలు జరుగగా, వీటితో ప్రమేయమున్న 18 సంస్థలపై విచారణ జరుపనున్నట్లు ఎస్‌ఎఫ్‌ఐవో సీనియర్ అధికారి ఒకరు తెలిపారు. ఇప్పటికే ఈ విషయంలో దాదాపు 2.24 లక్షల డొల్ల కంపెనీలపై చర్యలకు దిగిన కేంద్ర కార్పొరేట్ వ్యవహారాల మంత్రిత్వ శాఖ.. 3 లక్షలకు పైగా డైరెక్టర్లపై అనర్హత వేటు వేసిన సంగతి తెలిసిందే. ఈ నేపథ్యంలో పెద్ద ఎత్తున నగదు లావాదేవీలను జరిపినట్లు గుర్తించిన 18 సంస్థలపై విచారణకు దిగుతున్నామని ఎస్‌ఎఫ్‌ఐవోకు చెందిన సదరు సీనియర్ అధికారి చెప్పారు. కాగా, 56 బ్యాంకుల నుంచి సేకరించిన వివరాల ప్రకారం డీమానిటైజేషన్ నేపథ్యంలో సుమారు 50 వేల అనామక కంపెనీలు దాదాపు రూ.17,000 కోట్ల నగదును డిపాజిట్ చేశాయని, మళ్లీ ఆ మొత్తాన్నీ ఉపసంహరించుకున్నాయని కార్పొరేట్ వ్యవహారాల శాఖ మంత్రి పిపి చౌదరి తెలియజేసిన విషయం విదితమే. 58 వేల ఖాతాల ద్వారా ఈ లావాదేవీలను నిర్వహించాయని మంత్రి పేర్కొన్నారు. నిరుడు నవంబర్ 8కి ముందు ఎలాంటి బ్యాలెన్స్ లేకుండా ఖాతాను తెరిచిన ఓ సంస్థ.. పెద్ద నోట్ల రద్దు తర్వాత అందులో రూ.2,484 కోట్లను డిపాజిట్ చేసి, అనంతరం విత్‌డ్రా చేసుకుందని చెప్పారు.



# జయహో హైదరాబాద్

## అంతకంతకూ పెరుగుతున్న బ్రాండ్ ఇమేజ్ • అంతర్జాతీయ వేడుకలకు అసలుసిసలు వేదిక

### జీఈఎస్ విజయంతో ఇనుమడించిన ప్రతిష్ఠ • ప్రపంచ స్థాయికి భాగ్యనగరం సామర్థ్యం

హైదరాబాద్.. హైదరాబాద్.. హైదరాబాద్. ఇప్పుడు ప్రపంచం జపిస్తున్న పదమిదే. ప్రపంచ పారిశ్రామికవేత్తల సదస్సు (గ్లోబల్ ఎంటర్‌ప్రెన్యూర్‌షిప్ లేదా జీఈఎస్) విజయంతో భాగ్యనగరాన్ని వివిధ దేశాలు వేనోళ్ల పొగుడుతున్నాయి. అవును.. అంతకంతకూ పెరుగుతున్న బ్రాండ్ ఇమేజ్‌తో అంతర్జాతీయ వేడుకలకు అసలుసిసలు వేదిక మన రాజధాని నగరమే అవుతున్నది. నవంబర్ 28-30వ తేదీల్లో జరిగిన జీఈఎస్‌ను భారత్-అమెరికాలు సంయుక్తంగా నిర్వహించగా, 150 దేశాల నుంచి 1,500లకుపైగా ఔత్సాహిక వ్యాపార, పారిశ్రామికవేత్తలు, మదుపరులు, పర్యావరణ ప్రేమికులు దీనికి హాజరయ్యారు. అగ్రరాజ్యం ప్రతినిధి బృందానికి అమెరికా అధ్యక్షుడు డొనాల్డ్ ట్రంప్ సలహాదారు, ఆయన కుమార్తె ఇవాంకా ట్రంప్ సారథ్యం వహించిన విషయం తెలిసిందే. ఈ ఈవెంట్‌ను తెలంగాణ ప్రభుత్వం ఘనంగా నిర్వహించడంతో అన్ని దేశాల చూపు హైదరాబాద్ వైపునకు మళ్లింది. ఈ 8వ గ్లోబల్ సమ్మిట్‌కు భారత్ తొలిసారి ఆతిథ్యమివ్వగా, దక్షిణాసియా దేశాల్లోనే జీఈఎస్‌కు సరైన వేదికగా హైదరాబాద్ ఎంపికవ్వడం మరో విశేషం. దక్షిణాసియా ప్రాంతంలో అత్యుత్తమ కన్వెన్షన్ సెంటర్‌గా పేరున్న హైదరాబాద్ ఇంటర్నేషనల్ కన్వెన్షన్ సెంటర్ (హెచ్ఐసీసీ)లో జరుగగా, ఇది సూపర్ సక్సెస్ కావడంతో మరెన్నో అంతర్జాతీయ సదస్సులను ఇక్కడే నిర్వహిస్తే బాగుంటుందన్న అభిప్రాయాలను ఆసియాయేతర దేశాలూ వ్యక్తం చేస్తుండటం గమనార్హం. నిజానికి దేశంలో హైదరాబాద్ ప్రత్యేకతే వేరు. ఈ చారిత్రక నగరానికి 2000వ సంవత్సరంలో అప్పటి అమెరికా అధ్యక్షుడు బిల్‌క్లింటన్ రాగా, 2006లో మరో అమెరికా అధ్యక్షుడు జార్జ్ బుష్ కూడా విచ్చేశారు. ఇప్పుడు ఇవాంకా ట్రంప్ వచ్చారు. గడిచిన కొన్నేండ్ల కాలంలో జీఈఎస్ వంటి భారీ అంతర్జాతీయ వేడుక హైదరాబాద్‌లో జరిగిన దాఖలాలు లేవు. కానీ రాష్ట్ర ప్రభుత్వం చేపడుతున్న అభివృద్ధి కార్యక్రమాలతో, ముఖ్యంగా వ్యాపార రంగానికిస్తున్న అధిక ప్రాధాన్యత నేపథ్యంలో హైదరాబాద్ జీఈఎస్‌కు వేదికైంది. **- బిజినెస్ డెస్క్**

### సాహోరే.. కేసీఆర్



సమైక్య రాష్ట్రంలో మసకబారిన భాగ్యనగరం.. స్వరాష్ట్రంలో విశ్వనగరమైంది. నాలుగు కోట్ల మంది తెలంగాణ ప్రజల ఆకాంక్షను నెరవేర్చిన నాటి ఉద్యమ నేత.. నేటి ముఖ్యమంత్రి కేసీఆర్ చేస్తున్న అభివృద్ధితో గడచిన మూడున్నరేండ్ల కాలంలో హైదరాబాద్ బ్రాండ్ ఇమేజ్ ఖండాంతరాలను తాకింది. ఆ రంగం, ఈ రంగం అనే తేడా లేకుండా సకల రంగాలకు నెలవు.. కొలువు నేడు హైదరాబాదే. బహుళజాతి సంస్థలకు భారత్‌లో చిరునామా ఇదే. సులభతర వాణిజ్య విధానంలో దేశంలోనే ప్రథమ స్థానంలో నిలిచిన తెలంగాణ ప్రతిష్ఠను హైదరాబాద్ ఇనుమడింపజేస్తుండగా, తాజా జీఈఎస్‌ను రాష్ట్ర ప్రభుత్వం విజయవంతంగా నిర్వహించడంతో ఈ చారిత్రక నగరం.. విశ్వనగర ఖ్యాతిని ఆర్జించింది.



**1997-98లో హైదరాబాద్ ఐటీ ఎగుమతులు రూ.274 కోట్లుగా ఉంటే, ఇప్పుడవి రూ.85,000 కోట్లకుపైగా పెరిగాయి. ఇక్కడి ఐటీ ఉద్యోగుల సంఖ్య 4.30 లక్షలపైనే.**

**భారతీయ నగరాల్లో జీవన ప్రమాణాల ఆధారంగా అత్యుత్తమ నగరంగా హైదరాబాద్‌ను వరుసగా మూడో ఏడాది మెర్సర్ ఎంపిక చేయడం గమనార్హం.**



- మదుపరులను ప్రోత్సహించేందుకు, త్వరితగతిన ప్రాజెక్టులకు అనుమతులు లభించేందుకు తెలంగాణ స్టేట్ ఇండస్ట్రియల్ ప్రాజెక్ట్ అప్రూవల్ అండ్ సెల్ఫ్ సర్టిఫికేషన్ సిస్టమ్ (టీఎస్-ఐపాస్) విధానంను రాష్ట్ర ప్రభుత్వం అమల్లోకి తెచ్చింది.
- దేశంలో ఔషధ రంగ పరిశ్రమల రాజధానిగా హైదరాబాద్‌కు పేరుంది. దేశవ్యాప్తంగా తయారవుతున్న ఔషధాల్లో దాదాపు 30 శాతం ఇక్కడివే. ఫార్మా సిటీ క్లస్టర్‌తో మరిన్ని ఫార్మా కంపెనీలు రానున్నాయి.
- రక్షణ రంగ పరిశోధనా లాబొరేటరీలకూ దేశంలో ప్రధాన కేంద్రం హైదరాబాదే. ఏరోస్పేస్, డిఫెన్స్ ఇండస్ట్రీ హబ్‌గా ఎదుగుతున్న భాగ్యనగరంలో ఎఫ్-16 ఫైటర్ జెట్స్, అమెరికా అధ్యక్షుడు ప్రయాణించే హెలికాప్టర్ల క్యాబిన్లు తయారవుతున్నాయి.
- భారత్ డైనమిక్స్, ఎన్ఎండీసీ, ఎన్ఎఫ్‌సీ, ఈసీఐఎల్, హెచ్ఎఫ్ఎల్, స్పంజ్ ఐరన్ ఇండియా, మిశ్రధాతు నిగమ్, నేషనల్ ఫిషరీస్ డెవలప్‌మెంట్ బోర్డు, ఐఆర్‌డీఏ తదితర కేంద్ర ప్రభుత్వ రంగ సంస్థలకు, నియంత్రిత వ్యవస్థలకు చిరునామా హైదరాబాదే.
- ఇటీవలే ప్రారంభమైన హైదరాబాద్ మెట్రో ప్రాజెక్టు సైతం దేశంలోని ఇతర మెట్రో నగరాలతో పోల్చితే సాంకేతికంగా ఎంతో ప్రత్యేకమే. మౌలిక పెట్టుబడుల పరంగా విశ్వనగరానికి గొప్ప అవకాశాల్నే ఈ మెట్రో ప్రాజెక్టు అందించనుందని నిపుణుల అంచనా.
- హైదరాబాద్‌లోని చార్మినార్, బేగం బజార్‌లలో జరిగే వ్యాపారాలకు ప్రపంచ స్థాయి గుర్తింపుండటం విశేషం.

### 130 అమెరికన్ సంస్థలకు నెలవు




భారత్‌లో బహుళజాతి సంస్థల వ్యాపార విస్తరణలో హైదరాబాద్‌కున్న క్రేజ్ అంతా.. ఇంతా కాదు. ముఖ్యంగా అమెరికా సంస్థల చూపంతా కూడా భాగ్యనగరం వైపే. ఇక్కడ 130 అమెరికన్ కంపెనీలుండగా, మైక్రోసాఫ్ట్, గూగుల్, అమెజాన్, ఫేస్‌బుక్, ఆపిల్, ఉబర్, క్వాల్‌కమ్ వంటి దిగ్గజాలకూ ప్రధాన కేంద్రాలున్నాయి. రాబోయే రోజుల్లో ఇంకా చాలా అమెరికా సంస్థలు హైదరాబాద్‌లో కార్యాలయాలను ఏర్పాటు చేస్తాయని ఇండో-అమెరికన్ చాంబర్ ఆఫ్ కామర్స్ (ఐఏసీసీ) తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ చాప్టర్ చైర్మన్ శ్రీకాంత్ బాడిగ అంచనా వేశారు. ఇక హైదరాబాద్‌లోని దేశీయ దిగ్గజ సంస్థల విషయానికొస్తే.. ఆ జాబితా చాంతాడంత ఉంటుంది.1990వ దశకం నుంచే ప్రపంచ ఐటీ పటంలో హైదరాబాద్ విశిష్ఠ స్థానాన్ని దక్కించుకుంది.

### అమెరికా ఓటు విశ్వనగరానికే

భారత్‌లో జీఈఎస్‌ను నిర్వహించాలని అమెరికా నిర్ణయానికి వచ్చినప్పుడు నీతి ఆయోగ్.. దేశంలోని 8 నగరాలను సూచించింది. కానీ మీటింగులు, ఇన్సెంటివ్‌లు, కాన్ఫరెన్సులు, ఎగ్జిబిషన్లు నిర్వహించేందుకు అనువైన ఎంఐసీఈ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్, ఆహ్లాదకర వాతావరణం, ఔత్సాహిక, స్టార్టప్‌లకు అనువైన ప్రాంతం హైదరాబాదేనని తేలింది. దీంతో అగ్రరాజ్యం జీఈఎస్‌ను హైదరాబాద్‌లోనే నిర్ణయించాలని తేల్చింది. అందుకు తగ్గట్లే రాష్ట్ర ప్రభుత్వం ప్రపంచ శ్రేణి ఏర్పాట్లను చేసి ఆహుతులందరినీ విశేషంగా ఆకట్టుకున్నది. అగ్రరాజ్య అధ్యక్షుడు ట్రంప్, భారత ప్రధాన మంత్రి నరేంద్ర మోదీ సైతం మిక్కిలి సంతృప్తి వ్యక్తం చేశారు. మరోవైపు చాలామంది విదేశీ మదుపరులు హైదరాబాద్‌లో పెట్టుబడులకు ఇంకా ఆసక్తి కనబరుస్తున్నారు.

'ప్రపంచంలోని ప్రముఖ సంస్థలు అమెరికా తర్వాత ఎక్కడైనా తమ కార్యకలాపాలను పెద్ద ఎత్తున సాగిస్తున్నాయంటే అది హైదరాబాదే. మరే దేశంలోని నగరానికీ ఇంతటి ఆదరణ లేదు' **- తెలంగాణ ఐటీ, ఇండస్ట్రీ, కామర్స్ ముఖ్య కార్యదర్శి జయేశ్ రంజన్**

'హైదరాబాద్‌కు అంతర్జాతీయ సదస్సులు కొత్తేమీ కాదు. అయితే జీఈఎస్ నగర సామర్థ్యాన్ని మరింత పెంచింది. తెలంగాణలో అమెరికా పెట్టుబడులకు ఇది దోహదపడనుంది' **- ఐఏసీసీ తెలంగాణ, ఏపీ చాప్టర్ చైర్మన్ శ్రీకాంత్ బాడిగ**

'హైదరాబాద్‌కు జీఈఎస్ గొప్ప అవకాశం. ఇది హైదరాబాద్ బ్రాండ్ ఇమేజ్‌ను పెంచింది. మౌలిక సదుపాయాలు, నైపుణ్యం, పర్యావరణహిత విధానాలకు ఇక్కడ కొదవే లేదు. తెలంగాణ ప్రభుత్వ ఇన్వెస్టర్-ఫ్రెండ్లీ విధానాలు వృద్ధికి ఊతమిస్తున్నాయి' **- సీఐఐ తెలంగాణ చైర్మన్ వి రాజన్న**

# ఈసారి 6.5 శాతం పైనే

## దేశ జీడీపీపై పనగరియా అంచనా




**న్యూఢిల్లీ, డిసెంబర్ 3:** ఈ ఆర్థిక సంవత్సరం (2017-18) దేశ జీడీపీ 6.5 శాతానికిపైగా నమోదవుతుందని ప్రముఖ ఆర్థికవేత్త, నీతి ఆయోగ్ మాజీ వైస్ చైర్మన్ అరవింద్ పనగరియా అంచనా వేశారు. ద్రవ్యోల్బణం, కరెంట్ ఖాతా లోటు (సీఏడీ) అదుపులో ఉండటంతో గత మూడేండ్లుగా స్థూల ఆర్థిక పరిస్థితులను ప్రతిబింబించే సంకేతాలు స్థిరంగానే ఉన్నాయన్నారు. 'వస్తు, సేవల పన్ను (జీఎస్టీ) అమలుతో ఏర్పడిన ఇబ్బందుల వల్ల ఏప్రిల్-జూన్ త్రైమాసికం వృద్ధిరేటు మూడేండ్ల కనిష్ఠాన్ని తాకుతూ 5.7 శాతానికి దిగజారింది. అయితే పరిస్థితులు ఇప్పుడు చక్కబడుతున్నాయి. దీంతో ప్రస్తుత ఆర్థిక సంవత్సరం 6.5 శాతం, అంతకంటే ఎక్కువ వృద్ధిరేటు నమోదు కాగలదని పిస్తున్నది' అని పీటీఐకిచ్చిన ఇంటర్వ్యూలో పనగరియా ఆశాభావాన్ని వ్యక్తం చేశారు. ఈ జూలై-సెప్టెంబర్‌లో వరుస ఐదు త్రైమాసికాల మందగమనానికి చెక్ పెడుతూ జీడీపీ 6.3 శాతంగా నమోదైన విషయం తెలిసిందే. జీఎస్టీ సమస్యలు కొలిక్కి రావడంతో వ్యాపార, వాణిజ్య కార్యకలాపాలు గాడిలో పడ్డాయని కేంద్రం చెబుతున్నది. ఇదిలావుంటే దేశ ఆర్థిక వ్యవస్థను బలోపేతం చేయడంలో భాగంగా ద్రవ్యలోటు లక్ష్యాలను మోదీ సర్కారు వదిలేసిందా? అన్న ప్రశ్నకు పనగరియా బదులిస్తూ.. 'వ్యక్తిగతంగా ప్రధానిగానీ, ఆర్థిక మంత్రిగానీ ఆర్థిక క్రమశిక్షణకు దూరంగా వెళ్తారని తాను అనుకోవడం లేదు' అన్నారు. ఈ ఆర్థిక సంవత్సరానికిగాను ప్రకటించిన బడ్జెట్‌లోని ద్రవ్యలోటు అంచనాలో ఇప్పుడే 96 శాతం చేరుకోవడం.. జీడీపీలో ద్రవ్యలోటును 3.2 శాతానికే కట్టడి చేస్తామన్న లక్ష్యాన్ని దెబ్బతీసేలా ఉన్నది. ప్రభుత్వ ఆదాయం తగ్గి, ఖర్చులు పెరుగుతుండటంతో ద్రవ్యలోటు కూడా పెరుగుతూపోతున్నది. అయితే ఈ నాలుగు నెలల్లో ఆదాయం పెంచుకుని, వ్యయాన్ని తగ్గించి లక్ష్యాలను విజయవంతం చేస్తామన్న విశ్వాసాన్ని ప్రభుత్వ వర్గాలు వెలిబుచ్చుతున్నాయి.

### 9 శాతం అందుకోవాలి: బసు

ఈ జూలై-సెప్టెంబర్ త్రైమాసికంలో నమోదైన జీడీపీ గణాంకాలపట్ల మాజీ ప్రధాన ఆర్థిక సలహాదారు (సీఈఏ) కౌశిక్ బసు ట్విట్టర్‌లో అసంతృప్తి వ్యక్తం చేశారు. చమురు ధరలు తక్కువగా ఉన్నప్పటికీ 6.3 శాతం వృద్ధిరేటే నమోదైందన్నారు. నిరుడు జూలై-సెప్టెంబర్‌లో 7.5 శాతం వృద్ధిరేటు ఉన్న నేపథ్యంలో 2005-2008లోనైతే 9.5 శాతంగా ఉందని గుర్తుచేశారీ యూపీఏ ప్రభుత్వ హయాం సీఈఏ. కాగా, ఈ ఏడాది ఏప్రిల్-జూన్ వ్యవధిలో వృద్ధిరేటు 5.7 శాతానికే పరిమితమైన సంగతి తెలిసిందే. కేంద్రంలో నరేంద్ర మోదీ సర్కారు అధికారంలోకి వచ్చిన దగ్గర్నుంచి ఇదే అత్యంత కనిష్ఠ స్థాయి కావడం గమనార్హం. ఈ క్రమంలో జూలై-సెప్టెంబర్ జీడీపీ 6.3 శాతానికి పెరుగగా, ముమ్ముందు మరింత పెరుగుతుందన్న విశ్వాసం ప్రభుత్వ వర్గాల్లో కనిపిస్తున్నది.

# దేశంలో లక్ష స్టార్టప్‌లు: పాయ్

**ఉదయ్‌పూర్, డిసెంబర్ 3:** వచ్చే 7-8 ఏండ్లలో భారత్‌లో ఒక లక్ష స్టార్టప్‌లుంటాయని, వాటి విలువ 500 బిలియన్ డాలర్లపైనేనని, 3.25 మిలియన్ ఉద్యోగాలను అవి సృష్టిస్తాయని మణిపాల్ గ్లోబల్ ఎడ్యుకేషన్ చైర్మన్ టీవీ మోహన్ దాస్ పాయ్ అన్నారు. ఈ స్టార్టప్‌లు భవిష్యత్తులో భారత్ సమస్యలను పరిష్కరించడంలో కీలకపాత్ర పోషిస్తాయన్న విశ్వాసాన్నీ ఆయన వ్యక్తం చేశారు. ప్రస్తుతం దేశవ్యాప్తంగా 32,000 స్టార్టప్‌లున్నాయన్న ఆయన వచ్చే 7-8 ఏండ్లలో యేటా 7,000 స్టార్టప్‌లు పుట్టుకు రానున్నాయని అంచనా వేశారు. రాజస్థాన్ డిజిఫెస్ట్‌లో పాల్గొన్న ఆయన పీటీఐతో మాట్లాడారు. దేశంలోని యువత స్టార్టప్‌లపై అమితాసక్తిని ప్రదర్శిస్తున్నారని, హెల్త్‌కేర్, ఎడ్యుకేషన్, ఈ-కామర్స్ తదితర రంగాల్లో ఔత్సాహికులు స్టార్టప్‌లతో ముందుకు వస్తున్నారని చెప్పారు.

# అమ్మకాల్లో మళ్లీ మూడో స్థానానికి టాటా మోటార్స్

**న్యూఢిల్లీ, డిసెంబర్ 3:** దేశీయ ఆటోమొబైల్ సంస్థ టాటా మోటార్స్ మళ్లీ గాడిలో పడింది. గడిచిన కొన్ని సంవత్సరాలుగా నిరాశాజనక పనితీరు కనబరుస్తున్న సంస్థకు గత నెల అమ్మకాల విషయంలో భారీ ఊరటనిచ్చింది. దేశవ్యాప్తంగా అమ్ముడైన ప్యాసింజర్ వాహన విక్రయ జాబితాలో కంపెనీ నాలుగో స్థానం నుంచి మూడో స్థానానికి ఎగబాకింది. గడిచిన ఐదేండ్లుగా మూడో స్థానంలో కొనసాగిన మహీంద్రా అండ్ మహీంద్రాను వెనుకకు నెట్టి ఈ స్థానాన్ని కైవసం చేసుకున్నది. నవంబర్‌లో టాటా 17,157 యూనిట్ల విక్రయాలు జరుపగా, అదే మహీంద్రా 16,030 యూనిట్లను అమ్మింది. అంతక్రితం ఏడాది ఇదే నెలలో నమోదైన అమ్మకాలతో పోలిస్తే టాటా సేల్స్ 35 శాతం పెరుగగా, అదే మహీంద్రా 21 శాతం వృద్ధిని కనబరిచింది. ఈ మధ్య మార్కెట్లోకి విడుదల చేసిన నెక్సాన్ కాంపాక్ట్ ఎస్‌యూవీ, టియాగో హ్యాచ్‌బ్యాక్‌కు కొనుగోలుదారుల నుంచి విశేషన స్పందన లభించడం టాటా విక్రయాలు టాప్‌గేర్‌లో దూసుకుపోవడానికి దోహదపంది. ఇటీవల టాటా మోటార్స్ ఎండీ గ్యుంటర్ మాట్లాడుతూ.. నూతన వాహనాలను విడుదల చేయడం, సర్వీసింగ్ నెట్‌వర్క్‌లను మరింత విస్తరించడం కంపెనీకి కలిసొచ్చిందన్నారు. కంపెనీ ప్యాసింజర్ విభాగ ప్రెసిడెంట్ మయాంక్ పరేఖ్ మాట్లాడుతూ.. అమ్మకాలు పడిపోయి తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్న సంస్థను మళ్లీ గాడిలో పెడుతానన్న విశ్వాసాన్ని వ్యక్తం చేశారు. భారత ఆటోమొబైల్ తయారీదారుల సంఘం(సియామ్) వివరాల ప్రకారం టాటా మోటార్స్ మార్కెట్ వాటా 6.3 శాతంగా ఉంది. గతేడాదితో పోలిస్తే ఒక శాతం ఎగబాకింది.

# ఆర్బీఐ సమీక్షపై ఆధారం

- గుజరాత్, హిమాచల్ ప్రదేశ్ ఎన్నికల ప్రభావం
- మార్కెట్ కదలికలపై నిపుణుల అంచనా



**న్యూఢిల్లీ, డిసెంబర్ 3:** ఈ వారం దేశీయ స్టాక్ మార్కెట్లు రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా (ఆర్బీఐ) ద్రవ్యసమీక్ష ఆధారంగానే ట్రేడయ్యే వీలుందని నిపుణులు అంచనా వేస్తున్నారు. ఈ ఆర్థిక సంవత్సరం (2017-18) ఐదో ద్వైమాసిక ద్రవ్యపరపతి విధాన సమీక్ష ఈ నెల 6న జరుగనుంది. 'ఆర్బీఐ ద్రవ్యసమీక్షే ఈ వారం మదుపరుల పెట్టుబడులను నిర్దేశించగలదు' అని జియోజిత్ ఫైనాన్షియల్ సర్వీసెస్ రిసెర్చ్ హెడ్ వినోద్ నాయర్ అంటున్నారు. అయితే ఈసారి కీలక వడ్డీరేట్లను యథాతథంగానే ఉంచే అవకాశాలున్నట్లు తెలుస్తుండటంతో మదుపరులు లాభాల స్వీకరణకు దిగే వీలుందన్న అభిప్రాయాలూ వ్యక్తమవుతున్నాయి. ఇక ఈ జూలై-సెప్టెంబర్‌కుగాను గత వారం విడుదలైన జీడీపీ గణాంకాలు సూచీలపై ఏమాత్రం అనుకూల ప్రభావాన్ని చూపలేకపోయాయి. వరుసగా ఐదు త్రైమాసికాల మందగమనానికి చెక్ పెడుతూ జూలై-సెప్టెంబర్‌లో వృద్ధిరేటు 6.3 శాతంగా నమోదైన విషయం తెలిసిందే. అయినప్పటికీ మదుపరుల్లో పెట్టుబడుల ఉత్సాహం కరువైంది. ఇదిలావుంటే గుజరాత్, హిమాచల్ ప్రదేశ్ ఎన్నికల ప్రభావం కూడా మదుపరులపై ఉండొచ్చని, నిక్కీ సర్వీసెస్ పర్చేజింగ్ మేనేజర్స్ సూచీపైనా ఇన్వెస్టర్ల దృష్టి ఉంటుందని శామ్కో సెక్యూరిటీస్ వ్యవస్థాపక చీఫ్ ఎగ్జిక్యూటివ్ జిమీత్ మోదీ అంటున్నారు. దేశీయంగా రెండో అతిపెద్ద ఐటీ రంగ సంస్థ ఇన్ఫోసిస్‌కు కొత్త సీఈవో, ఎండీగా సలీల్ ఎస్ పరేఖ్ క్యాప్‌జెమినీ నుంచి వస్తుండటంతో ఆ సంస్థ షేర్లపై ఈ పరిణామం ప్రభావం ఉంటుందని కూడా నిపుణులు పేర్కొంటున్నారు. ఇక పోతే ఎప్పట్లాగే విదేశీ మదుపరుల పెట్టుబడులు, అంతర్జాతీయ మార్కెట్‌లో ముడి చమురు ధరలు, డాలర్‌తో పోల్చితే రూపాయి మారకం విలువ, ఆసియా, ఐరోపా మార్కెట్ల కదలికలు మార్కెట్ సెంటిమెంట్‌ను ప్రభావితం చేయనున్నాయి. గత వారం సెన్సెక్స్ 846.30 పాయింట్లు, నిఫ్టీ 267.90 పాయింట్లు నష్టపోయినది తెలిసిందే.

### 10,050-10,000 పాయింట్లు కీలకం

భారీ నష్టాల మధ్య గత వారం 10,200 స్థాయిని కోల్పోయిన నిఫ్టీ.. అమ్మకాల ఒత్తిడి కొనసాగితే ఈ వారం 10,000 పాయింట్ల దిగువకు చేరవచ్చన్న అంచనాలున్నాయి. అయితే సాంకేతికంగా 10,050-10,000 పాయింట్లు కీలకమని, ఈ శ్రేణి మధ్యే కొనుగోళ్ల మద్దతు లభించే వీలుందని నిపుణులు పేర్కొంటున్నారు.

### 5న షెల్బీ ఐపీవో

అహ్మదాబాద్‌కు చెందిన మల్టీ-స్పెషాలిటీ హాస్పిటల్ షెల్బీ ఐపీవో.. ఈ నెల 5 (మంగళవారం)న రానుంది. రూ.504 కోట్ల నిధుల సమీకరణే లక్ష్యంగా వస్తున్న ఈ ఐపీవో షేర్ల ధరల శ్రేణి రూ.245-248గా ఉంది. మూడు రోజుల పాటు జరిగే ఈ పబ్లిక్ ఇష్యూ.. డిసెంబర్ 7 (గురువారం)న ముగియనుంది.

### రూ.82,000 కోట్లు ఆవిరి

గత వారం స్టాక్ మార్కెట్‌లోని టాప్-10 సంస్థల్లో మారుతి సుజుకీ మినహా తొమ్మిదింటి మార్కెట్ విలువ పెద్ద ఎత్తున క్షీణించగా, రూ.81,804.34 కోట్లు ఆవిరైపోయింది. ముకేశ్ అంబానీ నేతృత్వంలోని రిలయన్స్ ఇండస్ట్రీస్ లిమిటెడ్ (ఆర్ఐఎల్) విలువ అత్యధికంగా రూ.25,110.60 కోట్లు పడిపోయి రూ.5,76,213.96 కోట్లకు పరిమితమైంది. అయినప్పటికీ టాప్-10 సంస్థల్లో ఆర్ఐఎల్ మార్కెట్ విలువే అగ్రస్థానంలో ఉంది. దేశీయ ఆటో రంగ దిగ్గజం మారుతి సుజుకీ మార్కెట్ విలువ మాత్రం రూ.3,620.43 కోట్లు ఎగబాకగా, దాని మొత్తం మార్కెట్ విలువ రూ.2,60,016.92 కోట్లుగా ఉంది.

### నవంబర్‌లో జోరుగా విదేశీ పెట్టుబడులు

గత నెలలో దేశీయ మార్కెట్లలోకి జోరుగా విదేశీ పెట్టుబడులు తరలివచ్చాయి. 8 నెలల గరిష్ఠాన్ని తాకేలా నవంబర్‌లో స్టాక్ మార్కెట్లలోకి రూ.19,700 కోట్ల పెట్టుబడులు తీసుకొచ్చిన విదేశీ పోర్ట్‌ఫోలియో మదుపరులు (ఎఫ్‌పీఐ).. రుణ మార్కెట్లలోకి రూ.530 కోట్ల పెట్టుబడులను పట్టుకొచ్చారు. దీంతో అటు స్టాక్, ఇటు రుణ మార్కెట్లలోకి వచ్చిన మొత్తం విదేశీ పెట్టుబడుల విలువ రూ.20,230 కోట్లకు చేరింది. ఇక ఈ ఏడాదిలో ఇప్పటిదాకా స్టాక్ మార్కెట్లలోకి వచ్చిన ఎఫ్‌పీఐ పెట్టుబడుల విలువ రూ.53,800 కోట్లుగా ఉంటే, రుణ మార్కెట్లలోకి వచ్చిన పెట్టుబడులు రూ.1.46 లక్షల కోట్లుగా నమోదయ్యాయి.



# అలరించిన ఇందూరు పేరిణీ నృత్యం

■ 390 మంది కళాకారులతో ప్రదర్శన

**వినాయక్‌నగర్:** ఇందూరు పేరిణీ నాట్యోత్సవం అట్టహాసంగా సాగింది. తెలంగాణ రాష్ట్ర భాషా సాంస్కృతిక శాఖ, తెలంగాణ జాగృతి సంస్థ ఆధ్వర్యంలో ఇందూరు పేరిణీ కళాకారుల సంస్థ, కళాభారతి సాంస్కృతిక సంస్థలు ఆదివారం నిజామాబాద్ కలెక్టరేట్ గ్రౌండ్‌లో నిర్వహించాయి. ప్రపంచ పేరిణీ నాట్య చరిత్రలో మొట్టమొదటి సారిగా 390మంది కళాకారులచే నిర్వహించిన మహాపేరిణీ నాట్యప్రదర్శన తెలంగాణ బుక్ ఆఫ్ రికార్డ్స్, స్టార్ బుక్ ఆఫ్ రికార్డ్స్, యునైటెడ్ బుక్ ఆఫ్ రికార్డుల్లో చోటుదక్కించుకుంది. కార్యక్రమంలో తెలంగాణ జాగృతి రాష్ట్ర ప్రధానకార్యదర్శి నవీనాచారి, నిజామాబాద్ మేయర్ ఆకుల సుజాత, టీఆర్‌ఎస్ జిల్లా అధ్యక్షుడు ఈగ గంగారెడ్డి, తెలంగాణ జాగృతి మహిళ అధ్యక్షురాలు అపర్ణ పాల్గొన్నారు.

# కవ్వాల్ టైగర్ జోన్‌లో చిరుత కళేబరం

■ అనారోగ్యంతో మృతి చెందినట్టు అధికారుల నిర్ధారణ
■ చెన్నూర్ మండలం సంకారంలో పశువులపై పులిదాడి



మంచిర్యాల జిల్లా కవ్వాల్ టైగర్‌జోన్‌లో లభ్యమైన చిరుతపులి కళేబరం

**జన్నారం రూరల్/చెన్నూరు రూరల్:** మంచిర్యాల జిల్లాలో ఒకచోట చిరుత కళేబరం లభ్యంకాగా, మరోచోట ఎద్దు, ఆవుపై పులి దాడిచేసిన ఘటనలు వెలుగుచూశాయి. కవ్వాల్‌టైగర్ జోన్‌పరిధిలోని మల్యాల ఈస్ట్ ధర్మరావుగూడబీట్‌లోని 351వ కంపార్ట్‌మెంట్‌లో చిరుత మృతిచెందిన సంఘటన ఆలస్యంగా వెలుగులోకి వచ్చింది. ఆదివారం చిరుత కళేబరాన్ని పరిశీలించిన కవ్వాల్ టైగర్‌జోన్ ఫీల్డ్ డైరెక్టర్ శరవణన్, డీఎఫ్‌ఓ రామలింగం మాట్లాడుతూ 3నుంచి 5 నెలల కిత్రం అనారోగ్యంతో మృతి చెంది ఉంటుందన్నారు. పశువైద్యుడు శ్రీకాంత్ పంచనామా నిర్వహించిన తర్వాత కళేబరాన్ని దహనం చేశారు. జిల్లాలోని చెన్నూర్ మండలం సంకారం అటవీ ప్రాంతంలో పెద్దపులి కదలికలు మళ్లీ మొదలైనట్టు తెలుస్తున్నది. గ్రామానికి చెందిన పశువులు శుక్రవారం అడవికి వెళ్లి తిరిగిరాలేదు. దీంతో కాపర్లు, గ్రామస్థులు సమీపంలో వెదుకగా ఎద్దు, ఆవు పులిదాడిలో మృతిచెందినట్టు గుర్తించి అధికారులకు సమాచారమిచ్చారు.



# శ్రీకాంతాచారి త్యాగం గొప్పది

■ విద్యుత్ శాఖ మంత్రి జగదీశ్‌రెడ్డి



మోత్కూరు మండలం పాడిచేడులో శ్రీకాంతాచారి విగ్రహానికి పూలమాల వేసి నివాళులర్పిస్తున్న మంత్రి జీ జగదీశ్‌రెడ్డి. చిత్రంలో శ్రీకాంతాచారి తల్లి శంకరమ్మ, ఎమ్మెల్యేలు గాదరి కిశోర్‌కుమార్, వేముల వీరేశం తదితరులు

**మోత్కూరు:** తెలంగాణ కోసం శ్రీకాంతాచారి చేసిన ప్రాణత్యాగం గొప్పదని విద్యుత్ శాఖ మంత్రి జీ జగదీశ్‌రెడ్డి అన్నారు. ఆదివారం యాదాద్రి భువనగిరి జిల్లా మోత్కూరు మండలం పాడిచేడు గ్రామంలో మలిదశ ఉద్యమ తొలి అమరుడు కాసోజు శ్రీకాంతాచారి ఎనిమిదో వర్ధంతి సందర్భంగా ఆయన విగ్రహానికి పూలమాల వేసి నివాళులర్పించారు. అనంతరం మంత్రి మాట్లాడుతూ శ్రీకాంత్ త్యాగం యావత్ రాష్ట్ర ప్రజలను ఉద్యమానికి పురికొల్పిందన్నారు. అమరుల త్యాగాలతో సాధించుకున్న రాష్ట్రాన్ని బంగారు తెలంగాణగా తీర్చిద్దేందుకు సీఎం కేసీఆర్ అహర్నిశలు కృషిచేస్తున్నారన్నారు. కార్యక్రమంలో ఎమ్మెల్సీ పల్లా రాజేశ్వర్‌రెడ్డి, రాష్ట్ర గిడ్డంగుల సంస్థ రాష్ట్ర చైర్మన్ మందుల సామేలు, ఎమ్మెల్యేలు గాదరి కిశోర్‌కుమార్, వేముల వీరేశం, టీఆర్‌ఎస్ రాష్ట్ర నాయకుడు కంచర్ల రామకృష్ణారెడ్డి, శ్రీకాంతాచారి తల్లిదండ్రులు కాసోజు శంకరమ్మ, వెంకటాచారి తదితరులు పాల్గొన్నారు.



జడ్చర్లలోని బాలికల వసతిగృహంలో వంటలను పరిశీలిస్తున్న మంత్రి లక్ష్మారెడ్డి

# ఉద్యోగాల పేరిట రాజకీయాలు తగవు

■ వైద్య ఆరోగ్యశాఖ మంత్రి లక్ష్మారెడ్డి

**జడ్చర్ల రూరల్:** ఉద్యోగాల పేరిట ప్రతిపక్షపార్టీలు రాజకీయాలు చేస్తూ యువత జీవితాలతో ఆడుకుంటున్నాయని వైద్య ఆరోగ్యశాఖ మంత్రి లక్ష్మారెడ్డి విమర్శించారు. మహబూబ్‌నగర్ జిల్లా జడ్చర్ల నియోజకవర్గంలో పలు అభివృద్ధి పనులకు ఆదివారం మంత్రి శంకుస్థాపన చేశారు. జడ్చర్ల కేకే నగర్‌లోని బాలికల వసతి గృహాన్ని తనిఖీ చేసి, విద్యార్థులకు అందిస్తున్న భోజనాన్ని పరిశీలించారు. అనంతరం మంత్రి విలేకరులతో మాట్లాడుతూ ఉద్యమ సమయంలో కానీ, రాష్ట్రం వచ్చిన తరువాత కానీ ఇంటికో ఉద్యోగం ఇస్తామని సీఎం కేసీఆర్ చెప్పలేదన్నారు. ప్రతిపక్షాలు స్వార్థ రాజకీయాల కోసం యువతను రెచ్చగొడుతున్నాయని మండిపడ్డారు. ఇప్పటివరకు వివిధశాఖల్లో 40వేల ఉద్యోగాలు భర్తీ చేశామని, మరో 40వేలు నోటిఫికేషన్ దశలో ఉన్నాయని మంత్రి తెలిపారు. ప్రతిపక్షాలు కోర్టుల్లో కేసులు వేయడం వల్ల 10వేల ఉద్యోగాలు పెండింగ్‌లో ఉన్నాయన్నారు.



కురుమ సంఘం సమ్మేళనంలో మాట్లాడుతున్న మంత్రి మహేందర్‌రెడ్డి. చిత్రంలో కరీంనగర్ జెడ్పీ చైర్‌పర్సన్ తుల ఉమ, ఎమ్మెల్యే సుధీర్‌రెడ్డి తదితరులు

# అన్నివర్గాల అభివృద్ధితోనే బంగారు తెలంగాణ

■ రవాణాశాఖ మంత్రి మహేందర్‌రెడ్డి
■ కుల సంఘాలకు చేయూతలో సీఎం కేసీఆర్ చొరువ భేష్: కర్ణాటక రవాణా మంత్రి రేణప్ప

**శామీర్‌పేట:** అన్నివర్గాల అభివృద్ధితోనే బంగారు తెలంగాణ సాధ్యమని రవాణాశాఖ మంత్రి పట్నం మహేందర్‌రెడ్డి అన్నారు. మేడ్చల్ జిల్లా శామీర్‌పేట మండలం అలియాబాద్‌లో ఆదివారం కురుమసంఘం రాష్ట్ర అధ్యక్షుడు ఎగ్గి మల్లేశం ఆధ్వర్యంలో 39వ దసరా–దీపావళి కురుమల ఆత్మీయ సమ్మేళనం నిర్వహించారు. మంత్రి మహేందర్‌రెడ్డి మాట్లాడుతూ కులవృత్తులను ప్రోత్సహించేందుకు సీఎం కేసీఆర్ కోట్లాది నిధులు ఖర్చుచేస్తున్నారన్నారు. కురుమ గొల్ల, యాదవుల అభివృద్ధికి రూ.5వేల కోట్లతో గొర్రెలను అందిస్తున్నామన్నారు. కర్ణాటక రవాణాశాఖ మంత్రి రేణప్ప మాట్లాడుతూ దేశంలోనే బీసీల, కురుమల సంక్షేమం కోసం పాటుపడుతున్న ఏకైక సీఎం కేసీఆర్ అని అభివర్ణించారు. ప్రభుత్వం చేపడుతున్న సంక్షేమ, అభివృద్ధి కార్యక్రమాలతో పాటు రిజర్వేషన్లను సద్వినియోగం చేసుకుని రాజకీయశక్తిగా ఎదగాలని పిలుపునిచ్చారు. ఎంపీ దత్తాత్రేయ మాట్లాడుతూ చదువుతోనే అభివృద్ధి సాధ్యమన్నారు. కార్యక్రమంలో ఎంపీ మల్లారెడ్డి, ఎమ్మెల్యే మలిపెద్ది సుధీర్‌రెడ్డి, మేయర్ బొంతు రామ్మోహన్, కరీంనగర్ జెడ్పీ చైర్‌పర్సన్ తుల ఉమ, ఎంపీపీల ఫోరం రాష్ట్ర అధ్యక్షుడు చంద్రశేఖర్‌యాదవ్ తదితరులు పాల్గొన్నారు.


BHEL
భారత్ హెవీ ఎలక్ట్రికల్స్ లిమిటెడ్
(భారత ప్రభుత్వ రంగ సంస్థ)
రామచంద్రాపురం, హైదరాబాద్-50 2032, తెలంగాణ, ఇండియా,
ప్రాజెక్ట్ ఇంజినీరింగ్ & సిస్టమ్స్ డివిజన్ (PE &SD)
ఫోన్: +9140 23184684/23185025, ఇ-మెయిల్: sunkubadari@bhel.in/prkhadilkar@bhel.in
ప్రాపంచిక ఆసక్తి వ్యక్తీకరణ
గ్లోబల్ కంపెనీల నుండి దిగువవాటి కొరకు BHEL ఆసక్తి వ్యక్తీకరణ (EOI) కోరుచున్నది

| క్ర. సం. | NIT వివరణ | NIT నెంబరు | దాఖలుకి చివరి తేది |
|---|---|---|---|
| 1 | మునిసిపల్ మరియు పారిశ్రామిక ఘన వ్యర్థము కొరకు గ్రేట్ ఫైర్డ్ టెక్నాలజీ బాయిలర్ సరఫరా | NIT_35794 | డిసెంబరు 20,2017 |

వివరాలకు చూడండి BHEL వెబ్‌సైట్: www.bhel.com టెండరు ప్రకటనల క్రింద మరియు CPP పోర్టలు www.eprocurement.gov.in.
ఏదేని సవరణ/ అనుబంధములు/ కాల పొడిగింపులుపై వెబ్‌సైట్లపైన మాత్రమే విడుదల చేయబడును. Dy.Manager/PE & SD




సూర్యాపేటలో మంత్రి జగదీశ్‌రెడ్డి సమక్షంలో టీఆర్‌ఎస్‌లో చేరిన 19వ వార్డు ప్రజలు



మహబూబ్‌నగర్ జిల్లా జడ్చర్లలో యువకులను టీఆర్‌ఎస్‌లోకి ఆహ్వానిస్తున్న మంత్రి లక్ష్మారెడ్డి



జగిత్యాల జిల్లా పెగడపల్లిలో బీజేపీ, కాంగ్రెస్ నాయకులకు కండువా కప్పుతున్న కొప్పుల ఈశ్వర్



మహబూబాబాద్ జిల్లా కొత్తగూడ వైస్ ఎంపీపీ పూల యాదగిరిని టీఆర్‌ఎస్‌లోకి స్వాగతం పలుకుతున్న ఎంపీ సీతారాంనాయక్

# టీఆర్‌ఎస్‌లోకి భారీగా చేరికలు

**నమస్తే తెలంగాణ నెట్‌వర్క్:** గులాబీ పార్టీలోకి ఆదివారం కూడా వలసలు కొనసాగాయి. ముఖ్యమంత్రి కేసీఆర్ సర్కార్ చేపడుతున్న అభివృద్ధికి ఆకర్షితులవుతున్న ప్రధాన పార్టీల నాయకులు, కార్యకర్తలు, ఇతరసంఘాల యువకులు పెద్దఎత్తున టీఆర్‌ఎస్‌లో చేరుతున్నారు. సూర్యాపేట జిల్లా కేంద్రంలోని 19వ వార్డుకు చెందిన 100 మంది దళితులు టీఆర్‌ఎస్‌లో చేరారు. వీరికి ఎస్సీ కులాల అభివృద్ధి శాఖ మంత్రి జగదీశ్‌రెడ్డి గులాబీ కండువా కప్పి పార్టీలోకి ఆహ్వానించారు. మహబూబ్‌నగర్ జిల్లా జడ్చర్లలో అభయ సేన యూత్, యువజన సంఘాల సభ్యులు మంత్రి లక్ష్మారెడ్డి సమక్షంలో టీఆర్‌ఎస్‌లో చేరారు. మహబూబాబాద్ జిల్లా కొత్తగూడ మండలంలో కాంగ్రెస్, టీడీపీలకు చెందిన 200 కుటుంబాలు టీఆర్‌ఎస్‌లో చేరాయి. వీరికి మానుకోట ఎంపీ సీతారాంనాయక్, టీఆర్‌ఎస్ రాష్ట్ర ప్రధాన కార్యదర్శి తక్కళ్లపల్లి రవీందర్‌రావు గులాబీ కండువా వేసి పార్టీలోకి ఆహ్వానించారు.

భద్రాద్రి కొత్తగూడెం జిల్లా లక్ష్మీదేవిపల్లి మండలం మాలపల్లికి చెందిన కాంగ్రెస్, సీపీఐ, టీడీపీలకు చెందిన 60 కుటుంబాలు ఎమ్మెల్యే జలగం వెంకటరావు సమక్షంలో, ఇల్లెందు మండలం సుదిమళ్ల పంచాయతీ ఆజాద్‌నగర్‌లో 78కుటుంబాలు ఎమ్మెల్యే కోరం కనకయ్య సమక్షంలో టీఆర్‌ఎస్‌లో చేరాయి. హైదరాబాద్‌లోని షేక్‌పేట డివిజన్‌లోని రిటైర్డ్ ప్రొఫెసర్ అర్జున్‌రెడ్డి, చంద్రశేఖర్‌రెడ్డి, విశ్రాంత పాస్‌పోర్టు అధికారులు కరుణాకర్, జ్యోతి ఎమ్మె ల్యే మాగంటి గోపీనాథ్ సమక్షంలో టీఆర్‌ఎస్‌లో చేరారు. నాగర్‌కర్నూల్ జిల్లా పదరలో టీడీపీ నాయకులు 50 మంది ఎమ్మెల్సీ రాములు నాయక్, ఎమ్మెల్యే గువ్వలబాలరాజు సమక్షంలో టీఆర్‌ఎస్ చేరారు. జగిత్యాల జిల్లా పెగడపల్లిలో దాదాపు 500 మంది బీజేపీ, కాంగ్రెస్ నాయకులు చీఫ్‌విప్ కొప్పుల ఈశ్వర్ సమక్షంలో టీఆర్‌ఎస్‌లో చేరారు. జనగామ జిల్లా పాలకుర్తి మండలం తొర్రూరుకు చెందిన 20 మంది కాంగ్రెస్ కార్యకర్తలు ఎమ్మెల్యే ఎర్రబెల్లి దయాకర్‌రావు సమక్షంలో టీఆర్‌ఎస్‌లో చేరారు. యాదాద్రి భువనగిరి జిల్లా చౌటుప్పల్‌లో ఛత్రపతి యూత్ ఆధ్వర్యంలో 500మందిని ఎమ్మెల్యే కూసుకుంట్ల ప్రభాకర్‌రెడ్డి టీఆర్‌ఎస్‌లోకి ఆహ్వానించారు. పెద్దపల్లిలో బీజేపీ, కాంగ్రెస్, టీడీపీ నుంచి 500 మంది నాయకులు, మాజీ సర్పంచులు, జెడ్పీటీసీలు, ఎంపీటీసీలు పెద్దపల్లి ఎమ్మెల్యే దాసరి మనోహర్‌రెడ్డి సమక్షంలో టీఆర్‌ఎస్‌లో చేరారు.



పెద్దపల్లిలో బీజేపీ, కాంగ్రెస్, టీడీపీ నాయకులను టీఆర్‌ఎస్‌లోకి ఆహ్వానిస్తున్న ఎమ్మెల్యే దాసరి మనోహర్‌రెడ్డి



జనగామ జిల్లా పాలకుర్తి మండలం తొర్రూర్‌లో ఎమ్మెల్యే ఎర్రబెల్లి సమక్షంలో టీఆర్‌ఎస్‌లో చేరుతున్న నాయకులు



కొత్తగూడెం జిల్లా ఇల్లెందు మండలంలో ఎమ్మెల్యే కోరం కనకయ్య సమక్షంలో టీఆర్‌ఎస్‌లో చేరిన ఆజాద్‌నగర్ వాసులు



కొత్తగూడెంలో టీఆర్‌ఎస్‌లో చేరిన వారితో ఎమ్మెల్యే జలగం వెంకటరావు



చౌటుప్పల్‌లో ఎమ్మెల్యే కూసుకుంట్ల సమక్షంలో టీఆర్‌ఎస్‌లో చేరిన ఛత్రపతి యూత్ సభ్యులు



రిటైర్డ్ ప్రొఫెసర్ అర్జున్‌రెడ్డికి కండువా వేస్తున్న జూబ్లీహిల్స్ ఎమ్మెల్యే మాగంటి



నాగర్‌కర్నూల్ జిల్లా పదరలో టీడీపీ నాయకులకు కండువా కప్పుతున్న ఎమ్మెల్సీ రాములు నాయక్, ఎమ్మెల్యే బాలరాజు



# దివ్యాంగుడికి రాష్ట్రపతి అవార్డు

■ రామ్‌నాథ్ కోవింద్ నుంచి అవార్డు అందుకున్న సాయికృష్ణ

**కొత్తపల్లి:** కరీంనగర్ జిల్లా కొత్తపల్లి మండలం చింతకుంటకు చెందిన మానసిక దివ్యాంగుడు సాయికృష్ణ ఆదివారం రాష్ట్రపతి రామ్‌నాథ్ కోవింద్ చేతుల మీదుగా అవార్డు అందుకున్నాడు. శాత్రాజు సుమతి, మనోహర్ దత్తపుత్రుడైన సాయికృష్ణ తిమ్మాపూర్ మండలంలోని ఎల్‌ఎండీ కాలనీ 'ఫ్రీడం ఫైటర్స్ ట్రస్ట్ స్కూల్'లో 'సెకండరీ బీ' లెవల్ చదువుతున్నాడు. ఇటీవల ఓపెన్ టెన్త్ పరీక్షలకు హాజరయ్యాడు. తండ్రి సహకారంతో స్వగ్రామంలో పేపర్ ప్లేట్ల తయారీ పరిశ్రమను నెలకొల్పాడు. పేపర్ ప్లేట్లు తయారుచేస్తూ పలువురికి ఆదర్శంగా నిలిచాడు. సామాజిక మాధ్యమాలపై మంచిపట్టు సాధించాడు.

# మహిళ కడుపులో 20కిలోల కణితి



**మహబూబ్‌నగర్ వైద్యవిభాగం:** మహబూబ్‌నగర్ జనరల్ దవాఖానలో వైద్యులు ఓ మహిళ కడుపులో నుంచి 20 కిలోల బరువున్న కణితిని తొలగించారు. మహబూబ్‌నగరలోని వేపూరుగేరికి చెందిన వెంకటమ్మ(50)కు ఆపరేషన్ చేసి, 20 కిలోల కణితితోపాటు, 24 లీటర్ల ద్రావణాన్ని తొలగించినట్టు డాక్టర్ పద్మ తెలిపారు.

# అభివృద్ధి పరుగులు..

పాలమూరుకు జలకళ ■ విద్యావంతుల కోసం ఐటీ కారిడార్ ■ నిరుపేదలకు 'డబుల్' వరం
జిల్లాకు కొత్తగా వైద్య కళాశాల ■ నేడు మహబూబ్‌నగర్‌కు మంత్రి కేటీఆర్ రాక





దివిటిపల్లి సమీపంలో నిర్మించిన డబుల్ బెడ్‌రూం ఇండ్లు.. మయూరీ నర్సరీలో కేటీఆర్ పర్యటన ఏర్పాట్లను పరిశీలిస్తున్న ఎమ్మెల్యే శ్రీనివాస్‌గౌడ్ తదితరులు

**మహబూబ్‌నగర్, నమస్తే తెలంగాణ ప్రతినిధి:** ఒకప్పుడు వలసల జిల్లాగా పేరొందిన పాలమూరు పరిస్థితి టీఆర్‌ఎస్ సర్కార్ వచ్చాక పూర్తిగా మారిపోయింది. ఉపాధి కోసం ఊరు విడిచి వెళ్లిపోయిన వారంతా తిరిగొచ్చారు. ఇప్పటికే జూరాల ప్రాజెక్టు, రిజర్వాయర్ల పరిధిలో చెరువులను నింపడంతో జిల్లాకు జలకళ సంతరించుకుంది. ఉమ్మడి జిల్లాలో చెరువులు, కుంటల కింద దాదాపు 35వేల ఎకరాలను ఈ ఏడాది సాగులోకి తీసుకువచ్చారు. సాగు, తాగునీటికి పెద్దపీటవేస్తున్న సర్కారు.. కరువు జిల్లాపై మరింత దృష్టి పెట్టింది. పాలమూరు కరువును కళ్లారా చూసిన కేసీఆర్.. ఇక్కడ ఉపాధిమార్గాలపై దృష్టి సారిస్తున్నారు. మిషన్ కాకతీయతో దాదాపు వెయ్యిచెరువులు మరమ్మతులు చేశారు. ఏండ్లనుంచి ఎండిపోయిన చెరువులు ఇప్పుడు నీటితో నిండి తొణికిసలాడుతున్నాయి. వలసలు వెళ్లిన రైతులు, కూలీలు ఇప్పుడు స్వగ్రామాల్లో వ్యవసాయం చేసుకుంటున్నారు. ఈ ఏడాది జూలైలో ప్రభుత్వం నిర్వహించిన రైతు సమగ్ర సర్వేలో ఉమ్మడి జిల్లా నుంచి దాదాపు 33 వేల మంది రైతులు, వ్యవసాయ కూలీ కుటుంబాలు సొంతూళ్లకు వచ్చినట్టు తేలింది. మరోవైపు నిరుపేదల సొంతింటి కల నెరవేరింది. జిల్లాల్లో పెద్ద ఎత్తున నిర్మిస్తున్నారు. జిల్లా కేంద్రంలోని క్రిస్టియన్‌పల్లిలో 310 మంది లబ్ధిదారులతో మంత్రి కేటీఆర్ సోమవారం సామూహిక గృహప్రవేశాలు చేయిస్తున్నారు. రూ.100 కోట్లతో 9.5 కిలోమీటర్ల మేర బైపాస్‌రోడ్డు నిర్మాణాన్ని చేపట్టనున్నారు. ఇక జిల్లాలోని మయూరీ పార్కు సర్వాంగసుందరంగా తయారైంది. ఈ పార్కులో ఏర్పాటు చేసిన జిమ్, సైక్లింగ్‌ను మంత్రి కేటీఆర్ ప్రారంభించనున్నారు. జాతీయ రహదారి వెంట ఐటీ పార్కు దాదాపు ఖరారైంది. పట్టణం చుట్టూ ఔటర్ రింగ్‌రోడ్డు పనులు సాగుతున్నాయి. కొత్తగా సమీకృత కలెక్టరేట్ భవనం మంజూరైంది. 2014కు ముందు జిల్లా కేంద్రంలో తాగునీటి పరిస్థితి చాలా అధ్వానంగా ఉండేది. 18 రోజులకోసారి నల్లానీరు వచ్చేదంటే పరిస్థితిని అర్థం చేసుకోవచ్చు. కానీ, నేడు పాలమూరు దాహం తీరుతున్నది. ఈ నెలాఖరుకు మిషన్ భగీరథ ద్వారా ప్రతి ఇంటికి మంచినీరు రానున్నది. జిల్లాలో ఇప్పటికిప్పుడు 483 గ్రామాలకు తాగునీటిని అందించేందుకు అంతా సిద్ధమైంది.

**నేడు జిల్లాకు మంత్రి కేటీఆర్**

మహబూబ్‌నగర్ జిల్లాలో సోమవారం పట్టణాభివృద్ధిశాఖ మంత్రి కేటీఆర్ పర్యటించనున్నారు. మయూరీ పార్కు నుంచి ఉదయం 10గంటలకు మంత్రి పర్యటన ప్రారంభం కానున్నది. దివిటిపల్లి శివారులో నిర్మిస్తున్న మెడికల్ కాలేజీ భవనం, నగరం శివారులోని బైపాస్ రోడ్డుకు, కొత్త కలెక్టరేట్ భవన నిర్మాణానికి మంత్రి శంకుస్థాపన చేయనున్నారు. క్రిస్టియన్‌పల్లిలో 310 డబుల్ బెడ్‌రూం ఇండ్లలో లబ్ధిదారులతో సామూహికంగా గృహ ప్రవేశం చేయించనున్నారు. మధ్యాహ్నం జిల్లా కేంద్రంలోని మున్సిపాలిటీ కార్యాలయ ఆవరణలో నిర్వహించే బహిరంగసభలో మంత్రి ప్రసంగిస్తారు.



ఆదివారం ముగ్గురు మావోయిస్టుల అరెస్టును చూపుతున్న ఏఎస్పీ రాహుల్‌హెగ్డే

# ముగ్గురు మావోయిస్టుల అరెస్టు

**ఏటూరునాగారం:** జయశంకర్ భూపాలపల్లి జిల్లాలో సీపీఐ(ఎంఎల్)సీపీ బాటకు చెందిన ముగ్గురు మావోయిస్టులను అరెస్టు చేసినట్టు ఏటూరునాగారం ఏఎస్పీ రాహుల్‌హెగ్డే ఆదివారం తెలిపారు. ఆయన తెలిపిన వివరాల ప్రకారం.. మంగపేట మండలం నర్సింహసాగర్ అటవీ ప్రాంతంలో సీఐ రఘుచందర్, మంగపేట ఎస్సై మహేందర్‌తోపాటు పోలీసులు ఆదివారం ఉదయం కూంబిం గ్ చేస్తున్నారు. ఆ సమయంలో అక్కడ సమావేశమైన సీపీఐ(ఎంఎల్) సీపీబాటకు చెందిన భూపాలపల్లి, మహబూబాబాద్, ఖమ్మం, కొత్తగూడెం జిల్లాల్లో పనిచేస్తున్న నాలుగు దళాలకు చెందిన 15 మంది పోలీసులను చూసి పారిపోయారు. వారిని వెంబడించిన పోలీసులకు ముగ్గురు మావోయిస్టుల చిక్కారు. ఘటనాస్థలంలో పెద్దఎత్తున ఆయుధాలు, మావోయిస్టుల సాహిత్యం స్వాధీనం చేసుకున్నట్టు రాహుల్‌హెగ్డే తెలిపారు. అరెస్టైనవారిలో పార్టీ జిల్లాక మిటీ సభ్యు డు, మంగపేట మండలం బుచ్చంపేటకు చెందిన ధర్మారపు యాక య్యా అలి యాస్ మోహన్, మంగపేట దళ డిప్యూటీ కమాండర్, పొదుమూరుకు చెందిన డ్రఅశోక్ అలియాస్ శ్రీకాంత్, ఏటూరునాగారం మండలం బుట్టాయి గూడెం గ్రామానికి చెందిన కావిరి నర్సింగరావు అలియాస్ దిలీప్ ఉన్నట్టు వెల్లడించారు.

# దేశం గర్వించే ప్రాజెక్టు కాళేశ్వరం

■ ఆర్థికశాఖ కార్యదర్శి సందీప్‌కుమార్ సుల్తానియా

**రామడుగు:** భారతదేశం గర్వించదగ్గ ప్రాజెక్టులలో కాళేశ్వరం ముందువరుసలో ఉంటుందని రాష్ట్ర ఆర్థికశాఖ కార్యదర్శి సందీప్‌కుమార్ సుల్తానియా తెలిపారు. ఆదివారం కరీంనగర్ జిల్లా రామడుగు మండలంలోని లక్ష్మీపూర్ శివారులో నిర్మిస్తున్న కాళేశ్వరం ఎనిమిదో ప్యాకేజీ పనులను పరిశీలించారు. ప్రత్యేక వాహనంలో సుమారు 140 మీటర్ల లోతులో నిర్మిస్తున్న పంపుహౌస్, టన్నెల్‌ను సందర్శించారు. అనంతరం ఆయన మాట్లాడుతూ, రైతుల భూములకు ఇబ్బంది కలుగకుండా భూమిలోపల ప్రాజెక్టు పనులు చేపట్టడం హర్షణీయమన్నారు. ప్రాజెక్టు అధికారులు ఎస్‌ఈ వెంకట్రాములు, ఈఈ నూనె శ్రీధర్, డీఈలు వసంతరావు, నర్సింగరావు ఆయన వెంట ఉన్నారు.

# 'డబుల్' సిక్సర్

**కెరీర్‌లో కోహ్లీ ఆరో ద్విశతకం**
**ఈ సిరీస్‌లో వరుసగా రెండోది**
**భారత్ తొలి ఇన్నింగ్స్‌లో 536/7 డిక్లేర్డ్**
**తొలి ఇన్నింగ్స్‌లో లంక 131/3**

**న్యూఢిల్లీ:** నాటకీయ పరిణామాలు.. ఆటగాళ్ల తిరుగుబాటు.. ముఖాలకు మాస్కులు.. ఎడతెరిపి లేకుండా సాగిన చర్చలు.. డాక్టర్ల పర్యవేక్షణ.. విరాట్ విధ్వంసం (287 బంతుల్లో 243, 25 ఫోర్లు) యథావిధిగా కొనసాగిన మూడో టెస్టులో భారత్ అందనంత ఎత్తులో నిలిచింది. బౌలర్ల నైరాశ్యం.. బ్యాట్స్‌మెన్ వైఫల్యం.. ఆటకు మచ్చ తెచ్చే కుయుక్తులు పన్నిన లంకేయులు.. టీమ్‌ఇండియా జోరును అడ్డుకోవడంలో మరోసారి విజయవంతంగా విఫలమయ్యారు. దీంతో 371/4 ఓవర్‌నైట్ స్కోరుతో ఆదివారం ఆట కొనసాగించిన భారత్ తొలి ఇన్నింగ్స్‌ను 127.5 ఓవర్లలో 7 వికెట్లకు 536 పరుగుల వద్ద డిక్లేర్ చేసింది. రోహిత్ శర్మ (65) అర్ధసెంచరీతో ఆకట్టుకున్నాడు. తర్వాత బ్యాటింగ్‌కు దిగిన లంక ఆట ముగిసే సమయానికి తొలి ఇన్నింగ్స్‌లో 44.3 ఓవర్లలో 3 వికెట్లు కోల్పోయి 131 పరుగులు చేసింది. మాథ్యూస్ (57), కెప్టెన్ చండిమల్ (25) క్రీజులో ఉన్నారు. చేతిలో ఏడు వికెట్లు ఉన్నా లంక 405 పరుగుల వెనుకంజలో ఉన్నది.

**ఆది నుంచే అదే జోరు**

లంకపై పూర్తి ఆధిపత్యాన్ని ప్రదర్శించిన భారత్ అదే జోరు కొనసాగించింది. పేలవమైన లంక బౌలింగ్‌ను తుత్తునియలు చేస్తూ ఓవర్‌నైట్ బ్యాట్స్‌మెన్ కోహ్లీ, రోహిత్‌శర్మ అలవోకగా పరుగులు కొల్లగొట్టారు. ఉదయం పూట పిచ్‌పై తేమను తమకు అనుకూలంగా మలుచుకోవాల్సింది పోయి లంక బౌలర్లు చెత్త బంతులతో పరుగులు సమర్పించుకున్నారు. ఇదే అదనుగా కోహ్లీ తనదైన శైలిలో దూకుడైన బ్యాటింగ్ కొనసాగించాడు. రోహిత్‌తో కలిసి కోహ్లీ ఆఫ్‌వ్యాలీ బంతులను అలవోకగా బౌండరీలకు తరలించాడు. ఈ క్రమంలో సందకన్ బౌలింగ్‌లో సిక్స్‌తో రోహిత్ వరుసగా ఐదో అర్ధసెంచరీని నమోదు చేసుకున్నాడు. మరోవైపు లహిరు గమాగే బౌలింగ్‌లో మిడ్ వికెట్ దిశగా షాట్ ఆడిన కోహ్లీ 238 బంతుల్లో డబుల్ సెంచరీ పూర్తి చేసుకున్నాడు. ఈ క్రమంలో తన అంతర్జాతీయ కెరీర్‌లో ఆరో సెంచరీ డబుల్ సెంచరీ నమోదు చేసుకున్నాడు. ఇన్నింగ్స్ మరింత జోరందుకుంటున్న తరుణంలో రోహిత్‌శర్మ..సందకన్‌కు దొరికిపోయాడు. దీంతో ఐదో వికెట్‌కు 135 పరుగుల భాగస్వామ్యానికి తెరపడింది.



రోహిత్ (65)

**లంకేయుల కుయుక్తులు**

భారత్ బ్యాట్స్‌మెన్‌ను కట్టడి చేయడంలో చేష్టలుడిగిపోయిన లంకేయులు వాతావరణ కాలుష్యాన్ని సాకుగా వాడుకున్నారు. ఇన్నింగ్స్ 123వ ఓవర్లో బౌలింగ్‌కు దిగిన లహిరు గమాగే అర్ధంతరంగా బౌలింగ్ ఆపేశాడు. గాలిలో ఆక్సిజన్ శాతం పడిపోయిందని ఆటకు వాతావరణం ఏ మాత్రం అనుకూలంగా లేదని లంక కెప్టెన్ చండిమల్ ..ఫీల్డ్ అంపైర్లతో వాదనకు దిగాడు. దీంతో ఆట 17 నిమిషాలు ఆగిపోయింది. అవాంతరం తర్వాత ఏకాగ్రత కోల్పోయిన అశ్విన్..గమాగే బౌలింగ్‌లో కీపర్ డిక్వెల్లాకు క్యాచ్ ఇచ్చి ఆరో వికెట్‌గా వెనుదిరిగాడు. గమాగేను అనుసరిస్తూ లక్మల్ కూడా పెవిలియన్ బాట పట్టాడు. దీంతో క్రీజులో ఉన్న కోహ్లీ ఓవైపు బ్యాటింగ్ చేసేందుకు ఆసక్తి ప్రదర్శించినా..లంక ఆటగాళ్లు ముఖాలకు మాస్కులతో అతి చేశారు. ఈ క్రమంలో సందకన్ బౌలింగ్‌లో కోహ్లీ వికెట్ల ముందు దొరికిపోయాడు. కాలుష్యాన్ని కారణంగా చూపుతూ లంకేయులు పదేపదే అవాంతరాలు సృష్టించడంతో విసుగెత్తిన కోహ్లీ..536/7 స్కోరు వద్ద ఇన్నింగ్స్‌ను డిక్లేర్ చేశాడు. పెవిలియన్ నుంచి ఒకింత కోపంగా చేతులు ఊపుతూ మేము ఫీల్డింగ్ చేస్తాం..మీరు బ్యాటింగ్‌కు దిగండి అంటూ సంజ్ఞలు చేయడం కనిపించింది.



**వికెట్లు టపాటపా**

స్కోరుబోర్డుపై పరుగుల ఖాతా తెరువకుండానే లంక వికెట్ కోల్పోయింది. షమీ వేసిన తొలి ఓవర్ మొదటి బంతికే ఓపెనర్ కరుణరత్నే (0) కీపర్ సాహకు క్యాచ్ ఇచ్చి వెనుదిరిగాడు. వికెట్లు పడగొట్టడానికి లంక బౌలర్లు కష్టపడ్డ చోటే భారత పేస్ ద్వయం షమీ, ఇషాంత్ నిప్పులు చెరిగే బంతులతో విజృంభించారు. ఇరువైపుల బంతిని స్వింగ్ చేస్తూ లంక బ్యాట్స్‌మెన్‌ను ముప్పుతిప్పలు పెట్టారు. ఈ క్రమంలో ఇన్నింగ్స్ ఆరో ఓవర్లో డిసిల్వా (1)..ఇషాంత్ బౌలింగ్‌లో వికెట్ల ముందు అడ్డంగా దొరికిపోయాడు. దీంతో 14 పరుగులకే రెండు వికెట్లు కోల్పోయింది. అప్పటికే క్రీజులో ఉన్న పెరెర (42)తో కలసి మాథ్యూస్(57 నాటౌట్) ఇన్నింగ్స్‌ను గాడిలో పడేసే ప్రయత్నం చేశాడు. వీరిద్దరు కలిసి మూడో వికెట్‌కు 61పరుగులు జోడించారు. ప్రమాదకరంగా మారుతున్న పెరెరను జడేజా..చక్కని బంతితో బోల్తా కొట్టించాడు. ఆ తర్వాత బ్యాటింగ్‌కు వచ్చిన కెప్టెన్ చండిమల్ (25 నాటౌట్)..మాథ్యూస్ భారత బౌలింగ్‌ను సమర్థంగా ఎదుర్కొన్నారు. ఎలాంటి అవకాశమివ్వకుండా స్కోరుబోర్డుకు పరుగులు జతచేశారు. వీరిద్దరు నాలుగో వికెట్‌కు 56 పరుగుల అజేయ భాగస్వామ్యాన్ని నెలకొల్పారు.



మాథ్యూస్ (57*)

శతకవీరా నీకు వందనం..
ద్విశతధీరా నీకు అభివందనం..
నీవో పరుగుల యంత్రం..
దాసోహం నీకు మైల్‌స్టోన్ మంత్రం..
నీవు ఆడితే ఓ విజయం..
నీవు నిలబడితే ఓ ప్రభంజనం..
వయసుకు మించిన పరిణతి..
శిఖరాన్ని మించిన ఆట..
ప్రపంచాన్ని జయిస్తున్న
'డబుల్' వేట..
సారథిగా సరిలేరు నీకెవ్వరూ..
ప్లేయర్‌గా సరిరారు నీకెవ్వరూ..
ఇక నిలువదు
ఏ రికార్డు మున్ముందు..
శతకాల అర్ధసెంచరీని మించావు..
క్రికెట్ దేవుడి దరి చేరుతున్నావు..
టన్నుల కొద్ది పరుగులు చేస్తున్నావు..
దిగ్గజాలను కనుమరుగు చేస్తున్నావు..
22 గజాల పిచ్‌పై
ఇంతకుముందెన్నడూ లేని
రికార్డులను తిరుగరాస్తున్నావు..
ఇప్పటికే రికార్డుల విన్నర్‌వి..
ఇప్పుడు 'డబుల్ సెంచరీల సిక్సర్'వి..
ఇక మిగిలింది భారత క్రికెట్‌కు
'నయా మాస్టర్'వి..
తన అడ్డా.. ఢిల్లీ గడ్డపై మరోసారి
డబుల్ శతకం బాదిన
భారత కెప్టెన్ విరాట్ కోహ్లీ..
మూడో టెస్టులో భారత్‌ను
తిరుగులేని స్థితిలో నిలిపాడు.



కోహ్లీ (243)

## రికార్డుల వీరుడు

- శ్రీలంకతో మూడో టెస్ట్‌లో భారత కెప్టెన్ విరాట్ కోహ్లీ అరుదైన రికార్డును సొంతం చేసుకున్నాడు. కెరీర్‌లో ఆరో డబుల్ సెంచరీ సాధించడం ద్వారా వెస్టిండీస్ దిగ్గజం బ్రియాన్ లారా(5)ను అధిగమించాడు. ఈ క్రమంలో ఓవరాల్‌గా అంతర్జాతీయ క్రికెట్లో కెప్టెన్‌గా అత్యధిక సెంచరీల రికార్డును తన పేరిట లిఖించుకున్నాడు.
- లంకతో డబుల్ సెంచరీ ద్వారా భారత దిగ్గజ క్రికెటర్లు సచిన్(6), సెహ్వాగ్(6) సరసన విరాట్ నిలిచాడు. భారత్ తరఫున అత్యధిక డబుల్ సెంచరీలు చేసిన బ్యాట్స్‌మన్‌గా సచిన్, సెహ్వాగ్‌ల రికార్డును తన 63 మ్యాచ్‌లోనే అందుకున్నాడు.
- వరుస టెస్ట్ మ్యాచ్‌ల్లో డబుల్ సెంచరీలు కొట్టిన రెండో భారత బ్యాట్స్‌మన్‌గా కోహ్లీ రికార్డుల్లోకెక్కాడు. ఇంతకుముందు 1993లో ఇంగ్లండ్(224)పై, జింబాబ్వే(227)పై వరుస టెస్ట్‌ల్లో మాజీ క్రికెటర్ వినోద్ కాంబ్లీ డబుల్ సెంచరీలు సాధించాడు.
- టెస్ట్ క్రికెట్ చరిత్రలో అత్యధిక డబుల్ సెంచరీలు కొట్టిన ఆరో బ్యాట్స్‌మన్‌గా కోహ్లీ కొనసాగుతున్నాడు. ఆస్ట్రేలియా గ్రేట్ బ్రాడ్‌మన్(12), సంగక్కర(11), లారా(9), వ్యాలీ హమ్మండ్(7), మహేల జయవర్దనే(7) విరాట్ కంటే ముందున్నారు.
- టెస్ట్ క్రికెట్ చరిత్రలో అతి తక్కువ రోజుల్లో (499 రోజులు) ఆరు సెంచరీల రికార్డును కోహ్లీ తన పేరిట లిఖించుకున్నాడు. ఈ క్రమంలో బ్రాడ్‌మన్(581) రికార్డును విరాట్ తుడిచిపెట్టాడు.
- ఒక క్యాలెండర్ సంవత్సరంలో అన్ని ఫార్మాట్లలో కలిపి అత్యధిక సెంచరీ(10)ల రికార్డును తొలి కెప్టెన్‌గా కోహ్లీ నెలకొల్పాడు. మరోవైపు ద్రవిడ్(2626) అత్యధిక పరుగుల రికార్డును విరాట్(2768*) అధిగమించాడు.
- ఒక క్యాలెండర్ ఇయర్‌లో అత్యధిక సెంచరీలు చేసిన బ్యాట్స్‌మన్‌గా సచిన్(12) తర్వాత కోహ్లీ(11) కొనసాగుతున్నాడు.

## స్కోరుబోర్డు

**భారత్ తొలి ఇన్నింగ్స్:** విజయ్ (స్టంప్) డిక్వెల్లా (బి) సందకన్ 155, ధవన్ (సి) లక్మల్ (బి) పెరెర 23, పుజార (సి) సమరవిక్రమ (బి) గమాగే 23, కోహ్లీ (ఎల్బీ) సందకన్ 243, రహానే (స్టంప్) డిక్వెల్లా (బి) సందకన్ 1, రోహిత్ (సి)డిక్వెల్లా (బి) సందకన్ 65, అశ్విన్ (సి) పెరెర (బి) గమాగే 4, సాహా 9 నాటౌట్, జడేజా 5 నాటౌట్; **ఎక్స్‌ట్రాలు:** 8; **మొత్తం:** 127.5 ఓవర్లలో 536/7 డిక్లేర్డ్. **వికెట్ల పతనం:** 1-42, 2-78, 3-361, 4-365, 5-500, 6-519, 7-523. **బౌలింగ్:** లక్మల్ 21.2-2-80-0, గమాగే 25.3-7-95-2, పెరెర 31.1-0-145-1, సందకన్ 33.5-1-167-4, డిసిల్వా 16-0-48-0.

**శ్రీలంక తొలి ఇన్నింగ్స్:** కరుణరత్నే (సి) సాహా (బి) షమీ 0, పెరెర (ఎల్బీ) జడేజా 42, డిసిల్వా (ఎల్బీ) ఇషాంత్ 1, మాథ్యూస్ 57 బ్యాటింగ్, చండిమల్ 25 బ్యాటింగ్; **ఎక్స్‌ట్రాలు:** 6; **మొత్తం:** 44.3 ఓవర్లలో 131/3; **వికెట్ల పతనం:** 1-0, 2-14, 3-75; **బౌలింగ్:** షమీ 11-3-30-1, ఇషాంత్ 10-4-44-1, జడేజా 14.3-6-24-1, అశ్విన్ 9-3-28-0.

## విరాట్ డబుల్ సెంచరీలు

| స్కోరు | ప్రత్యర్థి | వేదిక |
|---|---|---|
| 200 | వెస్టిండీస్‌పై (2016) | ఆంటిగ్వా, భారత్ గెలుపు |
| 211 | కివీస్‌పై (2016) | ఇండోర్, భారత్ గెలుపు |
| 235 | ఇంగ్లండ్‌పై (2016) | ముంబై, భారత్ గెలుపు |
| 204 | బంగ్లాదేశ్‌పై (2017) | హైదరాబాద్, భారత్ గెలుపు |
| 213 | శ్రీలంకపై (2017) | నాగ్‌పూర్, భారత్ గెలుపు |
| 243 | శ్రీలంకపై (2017) | ఢిల్లీ (ఫలితం రావాలి) |

# ముఖాలకు మాస్కులతో..



రెండో రోజు ఆటలో ఆసక్తికర పరిణామాలు చోటు చేసుకున్నాయి. భారత బ్యాట్స్‌మెన్ పరుగుల ధాటికి అప్పటికే కుదేలైన లంక ఆటగాళ్లకు కాలుష్యం రూపంలో ఓ అవకాశం దొరికింది. తోచిందే తడవుగా పక్కా ప్రణాళికను అమలు చేసింది. వాతావరణంలో కాలుష్యం తీవ్రత అధికంగా ఉందని, పీల్చుకోవడానికి చాలా కష్టంగా ఉందంటూ మూడు పర్యాయాలు ఆటకు అంతరాయం కల్గించారు. దీంతో దాదాపు అర్ధగంట ఆట ఆగిపోయింది. ఆటగాళ్లందరూ ముఖానికి మాస్కులు ధరించి ఆడారు. 140 ఏండ్ల సుదీర్ఘ క్రికెట్ చరిత్రలో ఇలా ఓ అంతర్జాతీయ మ్యాచ్‌లో ఆటగాళ్లు మాస్కులు పెట్టుకోవడం ఇదే తొలిసారి. కాలుష్యం తీవ్రతకు ఒకింత అస్వస్థతకు గురైన పేసర్లు గమాగే, లక్మల్ శ్వాస తీసుకోవడం కష్టంగా ఉందంటూ వెంటవెంటనే పెవిలియన్‌కు చేరుకున్నారు. ఓ దశలోనైతే లంకకు ఫీల్డింగ్ చేసేందుకు 11 మంది ఆటగాళ్లు కూడా సరిపోని పరిస్థితి ఏర్పడింది. మైదానంలో ఉన్న అంపైర్లతో చర్చలకు దిగిన లంక కెప్టెన్ చండిమల్..ఆటను నిలిపేయాలంటూ కోరాడు. జట్టు పరిస్థితిపై మాట్లాడేందుకు లంక మేనేజర్ అసనక గురుసిన్హా మైదానంలోకి వచ్చి అంపైర్లతో మాట్లాడాడు. ఆ వెంటనే టీమ్‌ఇండియా చీఫ్ కోచ్ రవిశాస్త్రి రావడంతో అసలు ఏం జరుగుతుందో గ్యాలరీల్లో ఉన్న ప్రేక్షకులకు అర్థం కాలేదు. అంతరాయల నడుమ ఏకాగ్రత కోల్పోయిన మనోళ్లు వికెట్లు సమర్పించుకున్నారు. పెవిలియన్‌లో ఉన్న కెప్టెన్ కోహ్లీ..ఇక చాలు వచ్చేయండంటూ బలవంతంగానే ఇన్నింగ్స్‌ను డిక్లేర్ చేశారు. మ్యాచ్ ముగిసిన అనంతరం లంక తాత్కాలిక కోచ్ నిక్ పోతాస్, భారత్ బౌలింగ్ కోచ్ భరత్ అరుణ్ మధ్య మాటల యుద్ధం జరిగింది. లక్మల్, ధనంజయ డిసిల్వా డ్రెస్సింగ్ రూమ్‌లో వాంతులు చేసుకున్నారని పోతాస్ అనగా, దాదాపు రెండు రోజులు బ్యాటింగ్ చేసిన కోహ్లీకి ఏం కానిది మీకు ఏమైందంటూ అరుణ్ విరుచుకుపడ్డాడు. మరి మూడో రోజు ఆటలో కాలుష్యం ఏ మేరకు మ్యాచ్‌ను ప్రభావితం చేస్తుందో చూడాలి.

## టాటా ఓపెన్ విజేత రుత్విక

**ముంబై:** హైదరాబాద్ అమ్మాయి గద్దె రుత్వికా శివానీ.. టాటా ఓపెన్ ఇండియా ఇంటర్నేషనల్ బ్యాడ్మింటన్ టైటిల్‌ను గెలుచుకుంది. ఆదివారం జరిగిన మహిళల సింగిల్స్ ఫైనల్లో రుత్విక 21-12, 23-21తో రియా ముఖర్జీపై గెలిచింది. 40 నిమిషాల పాటు జరిగిన ఈ మ్యాచ్‌లో రుత్విక స్ఫూర్తిదాయక పోరాటం చేసింది. తొలి గేమ్‌లో ప్రత్యర్థి నుంచి పెద్దగా పోటీ ఎదురుకాకపోయినా.. రెండో గేమ్‌లో రియా అద్భుతంగా ఆడింది. ఓ దశలో 17-14, 201-17 ఆధిక్యంలోకి వెళ్లినా రుత్వికా పట్టువిడవకుండా పోరాడింది. మూడు గేమ్ పాయింట్లను కాచుకుని చివరకు విజేతగా నిలిచింది. పురుషుల సింగిల్స్ ఫైనల్లో లక్ష్యసేన్ 21-15, 14-21, 19-21తో తమాసిన్ (థాయ్‌లాండ్) చేతిలో ఓడాడు.

## భారత అండర్-19 కెప్టెన్‌గా పృథ్వీ షా



**న్యూఢిల్లీ:** వచ్చే ఏడాది న్యూజిలాండ్‌లో జరిగే అండర్-19 ప్రపంచకప్ కోసం భారత్ జట్టును ఆదివారం ప్రకటించారు. మొత్తం 16 మంది బృందానికి ముంబై బ్యాట్స్‌మన్ పృథ్వీ షా నాయకత్వం వహించనున్నాడు. జనవరి 13 నుంచి ఫిబ్రవరి 3 వరకు ఈ టోర్నీ జరుగనుంది. వరల్డ్‌కప్ కోసం ఈనెల 8 నుంచి 22 వరకు బెంగళూరులో సన్నాహక శిబిరాన్ని నిర్వహిస్తున్నారు.

**జట్టు వివరాలు:** పృథ్వీ షా (కెప్టెన్), శుభమన్ గిల్, మన్‌జోత్ కల్రా, హిమాన్షు రానా, అభిషేక్ శర్మ, రియాన్ పరాగ్, ఆర్యన్ జుయల్, హర్విక్ దేశాయ్, శివమ్ మావి, కమ్లిష్ నాగర్‌కోటి, ఇషాన్ పోరెల్, అర్షదీప్ సింగ్, అంకుల్ రాయ్, శివ సింగ్, పంకజ్ యాదవ్. స్టాండ్‌బైస్: ఓమ్ భోస్లే, రాహుల్ చాహర్, నినద్ రాత్వా, ఉర్విల్ పటేల్, ఆదిత్య తాక్రే.

## దీపికకు కాంస్యం



**బ్యాంకాక్:** ఆసియా చాంపియన్‌షిప్‌లో పతకాల మోత మోగించిన భారత ఆర్చర్లు ఇండోర్ ప్రపంచకప్‌లో మాత్రం తేలిపోయారు. మహిళ విభాగంలో దీపిక కాంస్య పతకం గెలిచి కాసింత ఊరటనిచ్చింది. మహిళల రికర్వ్ కాంస్య పోరులో మూడో సీడ్ దీపిక 7-3తో సయానా సైరెంపిలోవా (రష్యా)పై గెలిచింది. పురుషుల రెండో రౌండ్‌లో టాప్‌సీడ్ అతాను దాస్ 3-7తో మటియో ఫిసోర్ చేతిలో కంగుతిన్నాడు. ఇతర విభాగాల్లో జయంత్ 7-3తో రాహుల్ బెనర్జీపై గెలిచినా.. రెండో రౌండ్‌లో 2-6తో కిమ్ జూ వన్ (కొరియా) చేతిలో ఓడాడు.

## చెన్నయిన్ గెలుపు

**పుణె/కేరళ:** మరో 8 నిమిషాల్లో మ్యాచ్ ముగుస్తుందనగా అద్భుతమైన గోల్ చేసిన చెన్నయిన్ ఎఫ్‌సీ.. ఐఎస్‌ఎల్‌లో 1-0తో పుణెపై గెలిచింది. ఇరుజట్లు గోల్ కోసం చెమటోడ్చగా చివర్లో చెన్నయిన్ ఆటగాడు హెన్రిక్ సెరేనో (82వ ని) గోల్ చేసి విజయాన్ని అందించాడు. ఇక కేరళ, ముంబై జట్ల మధ్య జరిగిన మ్యాచ్ డ్రా అయింది. కేరళ ఆటగాడు మార్క్ సిఫ్‌నియో ఆరంభంలోనే తమ జట్టుకు గోల్ (14వ ని) అందించగా...ముంబై ఆటగాడు బల్వంత్‌సింగ్ గోల్ (77వ ని)తో మ్యాచ్ డ్రాగా ముగిసింది.

## మార్ష్ మురిపించెన్

**442/8 వద్ద ఆసీస్ తొలి ఇన్నింగ్స్ డిక్లేర్డ్**



మార్ష్ (126*)

**అడిలైడ్:** ఇంగ్లండ్‌తో జరుగుతున్న యాషెస్ రెండో టెస్టులో ఆస్ట్రేలియా భారీ స్కోరు చేసింది. మిడిలార్డర్‌లో షాన్ మార్ష్ (231 బంతుల్లో 126 నాటౌట్; 15 ఫోర్లు, 1 సిక్స్) అజేయ శతకం సాధించడంతో ఆదివారం రెండో రోజు స్మిత్‌సేన తొలి ఇన్నింగ్స్‌ను 149 ఓవర్లలో 442/8 స్కోరు వద్ద డిక్లేర్ చేసింది. పింక్ బాల్ టెస్టులో ఆసీస్‌కు ఇదే అత్యుత్తమ స్కోరు కావడం విశేషం. 209/4 ఓవర్‌నైట్ స్కోరుతో ఆట కొనసాగించిన ఆసీస్ ఆరంభంలోనే హ్యాండ్స్‌కోంబ్ (36) వికెట్‌ను కోల్పోయింది. అయితే మార్ష్ యాంకర్ పాత్రతో ఇన్నింగ్స్‌కు వెన్నెముకగా నిలిచాడు. పైనీ (57)తో ఆరో వికెట్‌కు 85, కమిన్స్ (44)తో ఎనిమిదో వికెట్‌కు 99, లియోన్ (10 నాటౌట్)తో తొమ్మిదో వికెట్‌కు అజేయంగా 32 పరుగులు జత చేసి భారీ స్కోరును అందించాడు. ఈ క్రమంలో మార్ష్ కెరీర్‌లో ఐదో సెంచరీని పూర్తి చేశాడు. ఓవర్టన్ 3 వికెట్లు తీశాడు. డిన్నర్ తర్వాత బ్యాటింగ్‌కు దిగిన ఇంగ్లండ్ తొలి ఇన్నింగ్స్‌లో 9.1 ఓవర్లలో 29/1 స్కోరు చేసింది. కుక్ (11 బ్యాటింగ్), విన్సీ (0 బ్యాటింగ్) క్రీజులో ఉన్నారు. స్టోన్‌మెన్ (18) నిరాశపర్చాడు. వర్షం అంతరాయం కలిగించడంతో ఆటను తొందరగా ముగించారు.

## పోరాడుతున్న విండీస్

**రెండో ఇన్నింగ్స్‌లో 214/2**

**వెల్లింగ్టన్:** న్యూజిలాండ్‌తో జరుగుతున్న తొలి టెస్టులో వెస్టిండీస్ పోరాటం మొదలుపెట్టింది. 386 పరుగుల తొలి ఇన్నింగ్స్ లోటుతో ఆదివారం రెండో ఇన్నింగ్స్‌కు దిగిన కరీబియన్ జట్టు 66 ఓవర్లలో 2 వికెట్లకు 214 పరుగులు చేసింది. ఆట ముగిసే సమయానికి క్రెయిగ్ బ్రాత్‌వైట్ (79 బ్యాటింగ్), హోప్ (21 బ్యాటింగ్) క్రీజులో ఉన్నారు. పావెల్ (40), హెట్మెర్ (66) ఫర్వాలేదనిపించారు. ప్రస్తుతం విండీస్ ఇంకా 172 పరుగులు వెనుకబడి ఉంది. అంతకుముందు 447/9 ఓవర్‌నైట్ స్కోరుతో మూడోరోజు ఆట కొనసాగించిన న్యూజిలాండ్ తొలి ఇన్నింగ్స్‌ను 148.4 ఓవర్లలో 9 వికెట్లకు 520 పరుగుల వద్ద డిక్లేర్ చేసింది. లోయర్ ఆర్డర్‌లో టామ్ బ్లండెల్ (107) అజేయ శతకంతో చెలరేగిపోయాడు.



నల్లగొండ జిల్లా కేంద్రంలోని అంబేద్కర్ ఆడిటోరియంలో ఆదివారం వెయిట్ లిఫ్టింగ్ పోటీలను ప్రారంభిస్తున్న ఎంపీ గుత్తా సుఖేందర్ రెడ్డి, సాట్స్ చైర్మన్ వెంకటేశ్వర్ రెడ్డి, కలెక్టర్ గౌరవ్ ఉప్పల్, టీఎస్‌ఎఫ్‌డీసీ చైర్మన్ బండా నరేందర్‌రెడ్డి, మిర్యాలగూడ ఎమ్మెల్యే భాస్కర్‌రావు. 31 జిల్లాలకు చెందిన 300 మంది లిఫ్టర్లు ఈ పోటీలో పాల్గొంటున్నారు.



ఆదివారం ఢిల్లీలోని విజ్ఞాన్ భవన్‌లో జరిగిన కార్యక్రమంలో భారత రాష్ట్రపతి రామ్‌నాథ్ కోవింద్ చేతుల మీదుగా 'ఉత్తమ దివ్యాంగ క్రీడాకారుడు' అవార్డును అందుకుంటున్న అదిలాబాద్‌కు చెందిన ఆకుల రోహిత్. జాతీయ స్థాయి ఫ్లోర్‌బాల్, బేస్‌బాల్, బాస్కెట్‌బాల్ పోటీల్లో విశేషంగా రాణించిన రోహిత్.. 2013 ఆస్ట్రేలియాలో స్వర్ణం, రజతం నెగ్గాడు.

# చాబహార్ పోర్ట్ ప్రారంభం

- పాకిస్థాన్‌కు చెక్ పెట్టిన ఇండియా
- ఆఫ్ఘనిస్థాన్, మధ్య ఆసియా దేశాలకు సరుకు రవాణాకు సొంత మార్గం
- తొలి దశ ఓడరేవును ప్రారంభించిన ఇరాన్ అధ్యక్షుడు


ఇరాన్‌లోని చాబహార్ నౌకాశ్రయాన్ని ప్రారంభించేందుకు వచ్చిన ఆ దేశ అధ్యక్షుడు హసన్ రౌహానీ

**న్యూఢిల్లీ/టెహ్రాన్:** తొలి దశ నిర్మాణం పూర్తిచేసుకున్న చాబహార్ పోర్ట్ ఆదివారం ప్రారంభమైంది. హహీద్ బహెష్తీ పేరు పెట్టిన తొలిదశ ఓడరేవును ఇరాన్ అధ్యక్షుడు హసన్ రౌహాని లాంఛనంగా ప్రారంభించారు. ఆఫ్ఘనిస్థాన్, ఇరాన్‌లతో వ్యూహాత్మక వాణిజ్య రవాణాకు ఉపయోగపడేలా భారత్ నిర్మించిన తొలి ఓడరేవు ఇదే. భారత్-ఇరాన్-ఆఫ్ఘనిస్థాన్ త్రైపాక్షిక సంబంధాల్ని మరింత బలోపేతం చేసే దిశగా దీన్ని నిర్మించారు. తన ప్రాదేశిక జలాల గుండా సరుకు రవాణా ఓడల్ని అనుమతించబోనని పాకిస్థాన్ స్పష్టం చేయడంతో గల్ఫ్ ఆఫ్ ఒమన్‌లో భారత్ ఈ పోర్ట్ నిర్మాణాన్ని చేపట్టింది. ఆగ్నేయ ఇరాన్‌లోని సిస్తాన్-బలూచిస్థాన్ రాష్ట్రాల మధ్య చాబహార్ పోర్ట్‌ను నిర్మించారు. ఆదివారం జరిగిన కార్యక్రమంలో ఇరాన్ అధ్యక్షుడు హసన్ రౌహాని ప్రసంగిస్తూ... ఇరుగుపొరుగు దేశాల మధ్య ప్రాంతీయంగా సత్సంబంధాలు మరింత బలపడాలని ఆకాంక్షించారు. 'ఆశావహ పోటీ అందరికీ మంచిది. మేం మరిన్ని ఓడరేవులు రావాలని కోరుకుంటున్నాం. గ్వదర్ ఓడరేవు అభివృద్ధినీ స్వాగతిస్తున్నాం' అని చెప్పారు. ఈ ప్రారంభ కార్యక్రమానికి భారత్, ఖతర్, ఆఫ్ఘనిస్థాన్, పాకిస్థాన్ సహా 17 దేశాల 60మంది ప్రతినిధులు హాజరయ్యారని ఇరాన్ ప్రభుత్వ టీవీ చానెల్ తెలిపింది. అంతకు ముందు భారత విదేశాంగశాఖ మంత్రి సుష్మాస్వరాజ్, ఇరాన్ విదేశాంగ మంత్రి జావేద్ జరీఫ్ తెహ్రాన్‌లో శనివారం భేటీ అయ్యారు. చాబహార్ పోర్ట్ ప్రాజెక్టు అమలు తీరుపై వారు సమీక్షించారు.

**భారత్‌కు వ్యూహాత్మక వాణిజ్యకేంద్రం చాబహార్**

పాకిస్థాన్‌లో చైనా పెట్టుబడి పెట్టి నిర్మిస్తున్న గ్వదర్ పోర్ట్‌కు దీటుగా దానికి 80 కిమీ దూరంలోనే ఇరాన్‌తో కలిసి చాబహార్ పోర్ట్‌ను నిర్మించడం భారత్ వ్యూహాత్మకంగా తీసుకున్న చర్య. దీనివల్ల మిత్రదేశం ఇరాన్‌తో సఖ్యత నెరుపుతూనే పాక్, చైనా ప్రమేయం లేకుండానే ఆఫ్ఘనిస్థాన్, మధ్యాసియా దేశాలకు సరుకుల్ని మోసుకెళ్లగలగడంతోపాటు దీన్ని అత్యవసర సందర్భాల్లో సైనిక అవసరాలకు వాడుకోవడం ఈ వ్యూహంలోని కీలకాంశాలు. గత ఏడాది మేలో సంయుక్త భాగస్వామ్యంతో చాబహార్ ఓడరేవును నిర్మించాలని భారత్-ఇరాన్ ఒప్పందం కుదుర్చుకున్నాయి. తొలిదశ పోర్టు నిర్మాణానికి భారత్ 85మిలియన్ డాలర్లు (రూ.548కోట్లు) ఖర్చు చేసింది. ఇక పూరి స్థాయి పోర్టు నిర్మాణానికి 340 మిలియన్ డాలర్లు, నౌకాశ్రయానికి, రోడ్ల అనుసంధానానికి, రైలుమార్గాల నిర్మాణానికి మరో 160 మిలియన్ డాలర్లు (రూ.1032 కోట్లు) ఖర్చుచేస్తున్నది. ఈ రేవుపై పదేండ్లపాటు భారత్‌కు లీజ్ హక్కులు కూడా దక్కుతాయి. ఓడరేవుతోపాటు లింక్‌రోడ్లు, రైల్వేమార్గాల నిర్మాణానికి కూడా భారత్ ఆర్థికసాయం చేయనున్నది. ఐదు వారధి స్తంభాలను తొలిదశలో నిర్మించారు. లక్ష టన్నుల సామర్థ్యమున్న సరుకు రవాణా నౌకలు, కంటైనర్లు డాక్‌లోకి ప్రవేశించేందుకు వీలుగా రెండు వారధిస్తంభాల్ని రూపొందించారు. నెలరోజుల క్రితం ఒక నౌకలో లక్షా10వేల టన్నుల గోధుమల్ని చాబహార్ రేవు ద్వారా ఆఫ్ఘన్‌కు పంపిన భారత్ సరుకులు సకాలంలో గమ్యస్థానానికి చేరడంతో ఓడరేవు తొలిదశ ప్రారంభానికి సిద్ధమైనట్లు నిర్ధారణకు వచ్చింది. జనవరి చివరిలో మరో ఏడు నౌకల్లో గోధుమల్ని ఆఫ్ఘన్‌కు పంపాలని భారత్ నిర్ణయించింది. చాబహార్‌కు నౌకల ద్వారా, అక్కడి నుంచి ట్రక్కుల ద్వారా పశ్చిమ ఆఫ్ఘన్‌కు సరుకుల్ని చేరవేస్తారు. వచ్చే ఏడాదినాటికి పూర్తి స్థాయిలో చాబహార్ ఓడరేవు పూర్తికానున్న నేపథ్యంలో ప్రస్తుతానికి తొలి దశలోనే ఈ రూట్ ఏమేరకు ఉపయోగపడుతుందో సరిపోల్చుకోవడానికే ట్రయల్‌గా ఈ సరుకు రవాణా చేయనున్నట్లు అధికారులు తెలిపారు.


ఆదివారం రంగారెడ్డి జిల్లా మీర్‌పేటలోని టీకేఆర్ కళాశాల ఆవరణలో జరిగిన మహేశ్వరం ఎమ్మెల్యే తీగల కృష్ణారెడ్డి తల్లి తీగల పార్వతమ్మ దశదిన కర్మ కార్యక్రమానికి హాజరై పార్వతమ్మ చిత్రపటం వద్ద నివాళులర్పిస్తున్న ముఖ్యమంత్రి కే చంద్రశేఖర్‌రావు. తీగల కుటుంబంతో తనకు చాలా ఏండ్ల నుంచి అనుబంధం ఉందని ఈ సందర్భంగా సీఎం గుర్తు చేసుకున్నారు. కార్యక్రమంలో మండలి చైర్మన్ స్వామిగౌడ్, అసెంబ్లీ స్పీకర్ మధుసూదనాచారి, మంత్రులు ఈటల రాజేందర్, హరీశ్‌రావు, మహేందర్‌రెడ్డి, తుమ్మల నాగేశ్వర్‌రావు, పద్మారావు, ఎమ్మెల్యే శ్రీనివాస్‌గౌడ్, జీహెచ్‌ఎంసీ మేయర్ బొంతు రామ్మోహన్ తదితరులు పాల్గొన్నారు.

## కేవలం 3 నెలల్లో రైల్వేకు 40కోట్లు ఆదా

- సీనియర్ సిటిజన్స్ సబ్సిడీ వదులుకున్న ఫలితం

**న్యూఢిల్లీ:** సీనియర్ సిటిజన్స్(వృద్ధులు) సబ్సిడీ భారాన్ని తగ్గించుకోవడానికి రైల్వేశాఖ ప్రవేశపెట్టిన పథకం మంచి ఫలితాలను సాధిస్తున్నది. కేవలం మూడు నెలల వ్యవధిలో రైల్వేశాఖకు దాదాపు రూ.40కోట్లు ఆదా అయ్యాయి. తమకు అందిస్తున్న సబ్సిడీని సీనియర్ సిటిజన్స్ పూర్తిగా వినియోగించుకోవాలా? లేక వదులుకోవాలా? అన్న ఆప్షన్‌ను ప్రవేశపెడుతూ గతేడాది రైల్వేశాఖ నూతన పథకాన్ని తీసుకొచ్చింది. ఈ రెండు ఆప్షన్‌లలో ఏదీ ఎంచుకోవాలన్నది వారికే వదిలేసింది. దీంతో ఈ ఏడాది జూలై 22 నుంచి అక్టోబర్ 22 వరకు దాదాపు 9.37లక్షల మంది తమ సబ్సిడీని స్వచ్ఛందగా వదులుకున్నారు. ఇందులో 4.83లక్షల మంది పూర్తి సబ్సిడీని వదులుకోగా, 4.56లక్షల మంది సబ్సిడీలో సగభాగాన్ని వదులుకున్నారు. దీంతో రైల్వేశాఖకు దాదాపు రూ.40లక్షలు ఆదా అయ్యాయి. ఈ ఏడాది సగం సబ్సిడీని కూడా వదులుకునే సదుపాయాన్ని అందుబాటులోకి తీసుకురావడంతో సీనియర్ సిటిజన్స్ సంఖ్య పెరిగింది. సీనియర్ సిటిజన్స్‌లకు ఇస్తున్న రూ.1300కోట్ల సబ్సిడీ భారాన్ని తగ్గించుకోవడానికి రైల్వేశాఖ ఈ పథకాన్ని తీసుకొచ్చింది.

## ఉపగ్రహ చిత్రాల్లో ఢిల్లీ కాలుష్య పొగ

### విడుదల చేసిన యూరోపియన్ స్పేస్ ఏజెన్సీ



**న్యూఢిల్లీ, డిసెంబర్ 3:** గత నెల ఢిల్లీలో కాలుష్యపొగ తీవ్ర రూపం దాల్చిన విషయాన్ని ధ్రువీకరిస్తూ యూరోపియన్ స్పేస్ ఏజెన్సీ(ఈఎస్‌ఏ) ఉపగ్రహ చిత్రాలను విడుదల చేసింది. ప్రధానంగా నవంబర్ 10న కాలుష్య పొగ దట్టంగా కమ్ముకున్నట్లు ఈఎస్‌ఏ తెలిపింది. ఈఎస్‌ఏకు చెందిన సెంటినల్-5పీ ఉపగ్రహం ద్వారా ఈ చిత్రాలను తీసినట్లు పేర్కొంది. భూగ్రహంపై వాతావరణ మార్పులను ఈ ఉపగ్రహం పరిశీలిస్తుందని ఈఎస్‌ఏ ఉన్నతాధికారి జోసెఫ్ తెలిపారు. ఢిల్లీకి పొరుగున ఉన్న రాష్ట్రాల్లో కొయ్యకాళ్లను తగులబెట్టడం, గాలిలో అధిక తేమ ఉండటంతో నవంబర్ 6 నుంచి 14 వరకు కాలుష్య తీవ్రత అధికంగా ఉందని చెప్పారు. అంతేగాక బీహార్‌లోని పాట్నా, ఛత్తీస్‌గఢ్‌లోని రాయ్‌పూర్ ప్రాంతాల్లో ఉన్న పవర్ ప్లాంట్లు వెదజల్లుతున్న కాలుష్యం కూడా ఈ చిత్రాల్లో కనిపించిందని పేర్కొన్నారు. మరోవైపు పాత థర్మల్ పవర్ ప్లాంట్లు ఉద్గారాలను తగ్గించడానికి చర్యలు తీసుకోవాలని, నిబంధనలను ఈ నెల 7లోగా కచ్చితంగా అమలు చేయాలని కేంద్రప్రభుత్వం ఆదేశించింది.

## సముద్రపు పాచి నుంచి ఆవిర్భవించాం!



**లండన్, డిసెంబర్ 3:** సముద్రంలో ఉండే పాచి (స్పాంజి) మానవులతోపాటు, ఇతర జంతుజాతుల ఆవిర్భావానికి కారణమై ఉండొచ్చని బ్రిటన్ శాస్త్రవేత్తలు చెప్తున్నారు. వృక్షాల నుంచి వేరుచేస్తూ.. జీర్ణక్రియ, నాడీవ్యవస్థ వంటి అవయవ వ్యవస్థలతో కూడిన జంతువులు ఆవిర్భవించడంలో ప్రస్తుతం రెండు సిద్ధాంతాలు ప్రచారంలో ఉన్నాయి. సముద్రంలో ఉండే జెల్లీలు పరిణామం చెంది జంతుజాతులు విస్తరించాయని ఒక వర్గం శాస్త్రవేత్తలు చెప్తుంటే.. పాచి నుంచి పరిణామం చెందాయని మరో వర్గం వాదిస్తున్నది. తాజాగా బ్రిటన్‌లోని బ్రిస్టల్ యూనివర్సిటీకి చెందిన శాస్త్రవేత్తలు సముద్రపు పాచి మన పూర్వీకులని స్పష్టం చేస్తున్నారు. రెండేండ్లపాటు పలు జంతు జాతుల జన్యుక్రమాన్ని అధ్యయనం చేసి ఈ నిర్ధారణకు వచ్చారు. 'అవయవవ్యవస్థలను కలిగిఉన్న మొట్టమొదటి జీవుల నుంచే జంతు జాతులు ఆవిర్భవించాయి. ఈ విషయంలో స్పాంజి, జెల్లీ మధ్య కొనసాగుతున్న వివాదానికి మేం తెరదించాం. జన్యు విశ్లేషణ ద్వారా సముద్రపు పాచిని జంతుజాతుల పూర్వీకులుగా గుర్తించాం' అని పరిశోధక బృంద సభ్యుడు డేవిడ్ పిసాని తెలిపారు. వీరి పరిశోధన వ్యాసం కరెంట్ బయాలజీ జర్నల్‌లో ప్రచురితమైంది.

## 'పద్మావతి'పై నిర్ణయాధికారం సీబీఎఫ్‌సీదే

- ఇదే సరైన సంస్థ: షాహిద్‌కపూర్

**ముంబై:** 'పద్మావతి'పై నిర్ణయాధికారం సెంట్రల్ బోర్డు ఆఫ్ ఫిల్మ్ సర్టిఫికేషన్ (సీబీఎఫ్‌సీ) చేతిలో మాత్రమే ఉన్నదని, ఇదే సరైన సంస్థ అని నటుడు షాహిద్‌కపూర్ తెలిపారు. ఈ సినిమా త్వరలోనే విడుదలవుతుందని ఆదివారం ఆయన ఆకాంక్షించారు. సంజయ్‌లీలా భన్సాలీ దర్శకత్వం వహించిన ఈ చిత్రం ఈ నెల ఒకటో తేదీన విడుదల కావాల్సిఉండగా, ఇందులో చారిత్రక ఘటనలను వక్రీకరించారని రాజ్‌పుత్ సంఘాలతోపాటు పలువురు రాజకీయ నేతలు పద్మావతి చిత్రం విడుదలను అడ్డుకోవడం తెలిసిందే. ఈ నేపథ్యంలో పూర్తి వివరాలతో మళ్లీ దరఖాస్తు చేసుకోవాలని సీబీఎఫ్‌సీ కూడా ఆదేశించడంతో నిర్మాతలు సినిమా విడుదలను స్వచ్ఛందంగా నిలిపివేశారు. ఆదివారం ముంబైలో జరిగిన ఓ కార్యక్రమంలో పద్మావతి చిత్ర నటుడు షాహిద్‌కపూర్ మీడియాతో మాట్లాడుతూ ఉడ్తా పంజాబ్ సినిమా విషయంలోనూ సమస్యలు వచ్చాయన్నారు. పద్మావతి సినిమా నటి దీపికాపదుకొనేను చంపుతామని బెదిరించడం సరికాదని బాలీవుడ్ నటులు హృతిక్‌రోషన్, వరుణ్‌ధావన్, సోనాక్షి సిన్హా అన్నారు.


















# నోటిఫికేషన్స్

# ఈసీఐఎల్ లో 'ఇంజినీర్ ట్రెయినీ'

## ఎన్ఐఏబీలో

హైదరాబాద్‌లోని నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ యానిమల్ బయోటెక్నాలజీ (ఎన్ఐఏబీ)లో కింది ఖాళీల భర్తీకి నోటిఫికేషన్ విడుదలైంది.

**వివరాలు:**

**ఎన్ఐఏబీ బయోటెక్నాలజీ శాఖ పరిధిలో స్వతంత్రంగా పనిచేసే ప్రభుత్వరంగ సంస్థ.**

- సూపరింటెండింగ్ ఇంజినీర్ - 1, సెక్యూరిటీ ఆఫీసర్ -1, అసిస్టెంట్ మేనేజర్ ఆఫీస్ అండ్ ఎస్టేట్ -1, లైబ్రేరియన్ -1, ఫామ్‌మేనేజర్ - 1 ఖాళీ ఉన్నాయి.
- **దరఖాస్తు:** ఆన్‌లైన్‌లో
- **చివరితేదీ:** 2018, జనవరి 1
- హార్డ్‌కాపీలను దాఖలు చేయడానికి **చివరితేదీ:** 2018, జనవరి 5
- **వెబ్‌సైట్:** www.niab.org.in

## అసిస్టెంట్ ప్రొఫెసర్లు

**న్యూఢిల్లీలోని నేషనల్ స్కూల్ ఆఫ్ డ్రామాలో అసిస్టెంట్ ప్రొఫెసర్ పోస్టుల భర్తీకి నోటిఫికేషన్ విడుదలైంది.**



**వివరాలు:**

**నేషనల్ స్కూల్ ఆఫ్ డ్రామా ఒక స్వతంత్ర సంస్థ. ఇది కేంద్ర సాంస్కృతిక శాఖ పరిధిలో పనిచేస్తుంది.**

- అసిస్టెంట్ ప్రొఫెసర్ (క్లాసికల్ ఇండియన్ డ్రామా) - 1
- అసిస్టెంట్ ప్రొఫెసర్ (మ్యూజిక్) - 1
- అసిస్టెంట్ ప్రొఫెసర్ (లైట్) - 1
- అసిస్టెంట్ ప్రొఫెసర్ (మూవ్‌మెంట్) -1
- అసిస్టెంట్ ప్రొఫెసర్ (యాక్టింగ్) - 1
- **జీతం:** రూ. 15,600 - 39, 100 + గ్రేడ్ పే రూ. 5,400/-
- **అర్హతలు:** గుర్తింపు పొందిన యూనివర్సిటీ/సంస్థ నుంచి బీఏ డిగ్రీ, ఎన్ఎస్‌డీ డిప్లొమా ఇన్ డ్రమెటిక్/ సంబంధిత అంశంలో మాస్టర్ డిగ్రీలో సెకండ్ క్లాస్ ఉత్తీర్ణత. మంచి అకడమిక్ రికార్డు ఉండాలి.
- రెండేండ్ల రిసెర్చ్ లేదా ప్రొఫెషనల్ అనుభవం ఉండాలి. ఇంగ్లిష్/హిందీ రాయడం, మాట్లాడటంలో ప్రావీణ్యత ఉండాలి.
- **దరఖాస్తు:** ఆన్‌లైన్‌లో
- **చివరితేదీ:** డిసెంబర్ 14
- **వెబ్‌సైట్:** http://nsd.gov.in

## సీడబ్ల్యూసీలో

కేంద్ర జల వనరుల శాఖ పరిధిలోని సెంట్రల్ వాటర్ కమిషన్ (సీడబ్ల్యూసీ) స్కిల్డ్ వర్క్ అసిస్టెంట్, డ్రైవర్ పోస్టుల భర్తీకి అర్హులైన అభ్యర్థుల నుంచి దరఖాస్తులను ఆహ్వానిస్తున్నది.

**వివరాలు:**

కేంద్ర జలవనరుల శాఖ నదుల అభివృద్ధి, గంగా ప్రక్షాళన ప్రాజెక్ట్‌లో భాగంగా ఈ ఖాళీలను భర్తీ చేయనున్నారు.

- **మొత్తం పోస్టుల సంఖ్య:** 33
- **పోస్టు పేరు:** స్కిల్డ్ వర్క్ అసిస్టెంట్-32 ఖాళీలు
- **అర్హత:** గుర్తింపు పొందిన బోర్డు నుంచి మెట్రిక్యులేషన్/పదోతరగతి లేదా ఐటీఐలో ఉత్తీర్ణత.
- **పోస్టు పేరు:** డ్రైవర్-1 ఖాళీ
- **అర్హత:** గుర్తింపు పొందిన బోర్డు నుంచి పదోతరగతి/ఐటీఐ లేదా తత్సమాన పరీక్షలో ఉత్తీర్ణత. మోటార్ బోట్ డ్రైవింగ్ లైసెన్స్ ఉండాలి.
- **పే స్కేల్:** రూ. 5,200-20,200 + గ్రేడ్ పే రూ.1800/- (డ్రైవర్ పోస్టుకు రూ. గ్రేడ్ పే 1900/-)
- **ఎంపిక :** రాత పరీక్ష/స్కిల్ టెస్ట్
- **దరఖాస్తు :** ఆఫ్‌లైన్ ద్వారా. నిర్ణీత నమూనాలో దరఖాస్తులను నింపి, సంబంధిత పర్సనల్ అధికారికి పంపాలి.
- **చివరి తేదీ :** ఎంప్లాయ్‌మెంట్ న్యూస్‌లో వెలువడిన తేదీ నుంచి 30 రోజుల్లోగా దరఖాస్తులను పంపించాలి. పూర్తి వివరాలకు డిసెంబర్ 2-8న వెలువడిన ఎంప్లాయ్‌మెంట్ న్యూస్ చూడవచ్చు.
- **వెబ్‌సైట్:** www.cwc.gov.in

## ఈసీఐఎల్‌లో

**హైదరాబాద్‌లోని ఎలక్ట్రానిక్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా (ఈసీఐఎల్) జోనల్/బ్రాంచీల్లో ఖాళీగా ఉన్న గ్రాడ్యుయేట్ ట్రెయినీల భర్తీకి అర్హులైన ఇంజినీరింగ్ అభ్యర్థుల నుంచి దరఖాస్తులను ఆహ్వానిస్తున్నది.**




- **బీఈ/బీటెక్ అభ్యర్థులకు అవకాశం**
- **శిక్షణ అనంతరం ఉద్యోగం, మంచి జీత భత్యాలు.**
- **ఆన్‌లైన్‌పరీక్ష, ఇంటర్వ్యూ ద్వారా ఎంపిక**
- **చివరి తేదీ: డిసెంబర్ 22**

**వివరాలు:**

**ఈసీఐఎల్ డిపార్ట్‌మెంట్ ఆఫ్ అటామిక్ ఎనర్జీ పరిధిలో పనిచేస్తున్న సంస్థ. దీన్ని 1967 ఏప్రిల్ 11న ఏర్పాటు చేశారు.**

- **పనిచేసే ప్రదేశం:** హెడ్ క్వార్టర్ (హైదరాబాద్)తో పాటు దేశవ్యాప్తంగా ఉన్న ఈసీఐఎల్ ఆఫీస్‌లలో
- **మొత్తం పోస్టుల సంఖ్య:** 66 (జనరల్-33, ఓబీసీ-18, ఎస్సీ-10, ఎస్టీ-5)
- **విభాగాలవారీగా ఖాళీలు:** ఎలక్ట్రానిక్స్ కమ్యూనికేషన్-25, ఎలక్ట్రికల్ అండ్ ఎలక్ట్రానిక్స్-12, ఎలక్ట్రానిక్స్ అండ్ ఇన్‌స్ట్రుమెంటేషన్స్-3, కంప్యూటర్ సైన్స్-10, సివిల్-6, మెకానికల్-7, కెమికల్-3
- **అర్హత:** గుర్తింపు పొందిన యూనివర్సిటీ నుంచి ఎలక్ట్రానిక్స్ కమ్యూనికేషన్/టెలికమ్యూనికేషన్, ఎలక్ట్రానిక్స్, ఎలక్ట్రికల్ అండ్ ఎలక్ట్రానిక్స్, ఎలక్ట్రానిక్స్ అండ్ ఇన్‌స్ట్రుమెంటేషన్స్/కంట్రోల్ లేదా ఇన్‌స్ట్రుమెంటేషన్, కంప్యూటర్ సైన్స్/కంప్యూటర్, సివిల్, మెకానికల్, కెమికల్ ఇంజినీరింగ్‌లో 65 శాతం (ఎస్సీ, ఎస్టీలకు 55 శాతం) మార్కులతో బీఈ/బీటెక్ ఉత్తీర్ణత.
- **వయస్సు:** 2017 నవంబర్ 30 నాటికి 25 ఏండ్లకు మించరాదు. ఎస్సీ, ఎస్టీలకు ఐదేండ్లు, ఓబీసీలకు మూడేండ్లు, పీహెచ్‌సీ అభ్యర్థులకు పదేండ్లు వయోపరిమితిలో సడలింపు ఉంటుంది.
- **పేస్కేల్:** ట్రెయినింగ్ పీరియడ్‌లో రూ. 38,430/- (కన్సాలిడేటెడ్ పే). సంస్థ నిబంధనల ప్రకారం ప్రావిడెంట్ ఫండ్, లీవ్ తదితర సౌకర్యాలు ఉంటాయి. శిక్షణ పూర్తయిన తర్వాత ఇంజినీర్ హోదాలో మొదటి ఏడాదికి రూ. 47,780/-, రెండో ఏడాదికి రూ. 49, 210/-, మూడో ఏడాదికి 50, 690/- టెక్నికల్ ఆఫీసర్‌కు రూ. 52, 210/- చెల్లిస్తారు.
- **అప్లికేషన్ ఫీజు:** రూ. 500/- ఎస్సీ, ఎస్టీ, పీహెచ్‌సీ అభ్యర్థులకు ఫీజు లేదు.
- **ట్రెయినింగ్ పీరియడ్:** ఏడాది
- **ఎంపిక:** కంప్యూటర్ బేస్డ్ టెస్ట్, ఇంటర్వ్యూ
- ఆన్‌లైన్ రాతపరీక్ష ఆబ్జెక్టివ్ విధానంలో ఉంటుంది. 90 నిమిషాల్లో పూర్తిచేయాలి.
- రాతపరీక్షలో మెరిట్ ప్రకారం షార్ట్‌లిస్ట్ పొందిన అభ్యర్థులను పర్సనల్ ఇంటర్వ్యూ ద్వారా ఎంపిక చేస్తారు.
- ప్రొబేషనరీ పీరియడ్‌లో చూపిన ప్రతిభ ఆధారంగా దేశంలో ఎక్కడైనా పోస్టింగ్ ఇస్తారు.
- **దరఖాస్తు:** ఆన్‌లైన్ ద్వారా. ఆన్‌లైన్‌లో నిర్ణీత నమూనాలో ఫొటో, సంతకాన్ని అప్‌లోడ్ చేయాలి. వినియోగంలో ఉన్న ఈ-మెయిల్ ఐడీ, మొబైల్ నంబర్ ఎంటర్ చేయాలి. హాల్‌టికెట్, ఇంటర్వ్యూకు సంబంధించిన వివరాలను ఈ-మెయిల్ ఐడీ ద్వారా తెలియజేస్తారు.
- **పరీక్ష కేంద్రాలు:** హైదరాబాద్, వరంగల్, కరీంనగర్, అహ్మదాబాద్, బెంగళూరు, భోపాల్, భువనేశ్వర్, చండీగఢ్, చెన్నై, ఢిల్లీ, గువాహటి, జైపూర్, కోల్‌కతా, లక్నో, ముంబై, పాట్నా, త్రివేండ్రం, విజయవాడ, వైజాగ్, తిరుపతి, నాగ్‌పూర్, తిరుచ్చి, కొచ్చిన్, జబల్‌పూర్, రాయ్‌పూర్, రాంచీ, జమ్ము, బెల్గావి.
- **దరఖాస్తులకు చివరి తేదీ:** డిసెంబర్ 22
- **రాతపరీక్ష తేదీ:** 2018 జనవరి 7
- **వెబ్‌సైట్:** www.ecil.co.in

## సమ్మర్ ట్రెయినింగ్ ప్రోగ్రామ్

**అకాడమీ ఆఫ్ సైంటిఫిక్ అండ్ ఇన్నోవేటివ్ రిసెర్చ్ (ఏసీఎస్ఐఆర్) డా. ఏపీజే అబ్దుల్ కలాం సమ్మర్ ట్రెయినింగ్ ప్రోగ్రామ్ 2018 కోసం అర్హులైన అభ్యర్థుల నుంచి దరఖాస్తులను ఆహ్వానిస్తున్నది.**

**వివరాలు:**

**సీఎస్ఐఆర్ ల్యాబ్‌లలో ప్రఖ్యాత శాస్త్రవేత్తలతో కలిసి పనిచేయడానికి ఏఎస్ఐఆర్ ఈ అవకాశం కల్పిస్తుంది.**

- **అర్హతలు:** బీఈ/బీటెక్ మూడో సంవత్సరం చదువుతున్నవారు లేదా తత్సమాన కోర్సు చేస్తున్నవారు. లేదా ఎంఈ/ఎంటెక్, ఎమ్మెస్సీ లేదా తత్సమాన కోర్సు చేసేవారు లేదా ఇంటిగ్రేటెడ్ ఎమ్మెస్సీ/ఎంఈ/ఎంటెక్‌లో మూడో ఏడాది పూర్తయినవారు దరఖాస్తు చేసుకోవచ్చు.
- మొత్తం సీట్ల సంఖ్య - 20
- **కాలవ్యవధి:** 2 నెలలు 2018, మే - ఆగస్టు మధ్య
- **స్టయిఫండ్:** ప్రోగ్రామ్ సమయంలో నెలకు రూ. 25,000/- ఇస్తారు.
- **దరఖాస్తు:** వెబ్‌సైట్‌లో
- **చివరితేదీ:** 2017, డిసెంబర్ 31
- **వెబ్‌సైట్:** www.acsir.res.in

## న్యూక్లియర్ పవర్ కార్పొరేషన్‌లో

**కైగాలోని న్యూక్లియర్ పవర్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ (ఎన్‌పీసీఐఎల్)లో స్టయిఫండరీ ట్రెయినీ పోస్టుల భర్తీకి నోటిఫికేషన్ విడుదలైంది.**




**వివరాలు:**

**ఎన్‌పీసీఎల్ భారత ప్రభుత్వరంగ సంస్థ. ఇది అటామిక్ ఎనర్జీ డిపార్ట్‌మెంట్ పరిధిలోనిది.**

- స్టయిఫండరీ ట్రెయినీ/సైంటిఫిక్ అసిస్టెంట్ (హెల్త్ ఫిజిక్స్)
- ఖాళీల సంఖ్య - 3
- **అర్హతలు:** బీఎస్సీలో కనీసం 60 శాతం మార్కులతో ఉత్తీర్ణత. ఫిజిక్స్ ప్రధాన సబ్జెక్టుగా, కెమిస్ట్రీ/మ్యాథ్స్, స్టాటిస్టిక్స్, కంప్యూటర్స్/ఎలక్ట్రానిక్స్ సబ్జెక్టులుగా చదివి ఉండాలి.
- **వయస్సు:** 18 - 25 ఏండ్ల మధ్య ఉండాలి.
- సైంటిఫిక్ అసిస్టెంట్ బీ (మెకానికల్)
- ఖాళీల సంఖ్య - 1. ఇది హెచ్‌హెచ్ కేటగిరీలో ఉంది.
- **అర్హతలు:** మెకానికల్ ఇంజినీరింగ్‌లో మూడేండ్ల డిప్లొమా ఉత్తీర్ణత లేదా తత్సమాన కోర్సు ఉత్తీర్ణత.
- **వయస్సు:** 18 - 30 ఏండ్ల మధ్య ఉండాలి.
- **దరఖాస్తు:** నిర్ణీతనమూనాలో
- **చివరితేదీ:** డిసెంబర్ 21
- **వెబ్‌సైట్:** www.npcil.nic.in

## నేవల్ అకాడమీలో

**ఎజిమలలోని ఇండియన్ నేవల్ అకాడమీలో స్విమ్మింగ్ ట్రెయినర్ పోస్టుల భర్తీకి నోటిఫికేషన్ విడుదలైంది.**

- **పోస్టు:** స్విమ్మింగ్ ట్రెయినర్
- ఖాళీల సంఖ్య - 8
- ఈ పోస్టులను కాంట్రాక్టు ప్రాతిపదికన భర్తీ చేయనున్నారు. ఈ పోస్టులకు పురుషులు/మహిళలు దరఖాస్తు చేసుకోవచ్చు.
- **జీతం:** నెలకు రూ. 22, 500/ -
- **ఎంపిక:** ఇంటర్వ్యూ
- **ఇంటర్వ్యూతేదీ:** డిసెంబర్ 6
- **వెబ్‌సైట్:** http://ina.gov.in

## ఇండో జర్మన్ టూల్ రూంలో

**ఎంఎస్‌ఎంఈ టెక్నాలజీ సెంటర్ ఇండో జర్మన్ టూల్ రూంలో లాంగ్‌టర్మ్ కోర్సుల్లో ప్రవేశాల కోసం నోటిఫికేషన్ విడుదలైంది.**

**వివరాలు:**




**ఔరంగాబాద్‌లోని ఇండో జర్మన్ టూల్‌రూం ఎంఎస్‌ఎంఈ మంత్రిత్వశాఖ పరిధిలో పనిచేస్తుంది. కింది కోర్సులు జనవరి 2018 నుంచి ప్రారంభమవుతాయి. కోర్సులు ఔరంగాబాద్, నాగ్‌పూర్, పుణె, ముంబై సెంటర్లలో నిర్వహించనున్నారు.**

పోస్ట్ గ్రాడ్యుయేట్ డిప్లొమా కోర్సులు

- టూల్ డిజైన్ అండ్ క్యాడ్/క్యామ్
- మెకానికల్ ప్రొడక్ట్ డిజైన్, మెకట్రానిక్స్
- వీఎల్ఎస్ఐ, ఎంబెడెడ్ సిస్టమ్స్

పోస్ట్ డిప్లొమా కోర్సులు

- టూల్ డిజైన్ అండ్ క్యాడ్/క్యామ్
- టూల్ అండ్ డై మ్యానుఫ్యాక్చరింగ్
- ప్రొడక్ట్ డిజైన్, మెకట్రానిక్స్
- సీఎన్‌సీ మెషిన్ మెయింటెనెన్స్
- ఇండస్ట్రియల్ ఆటోమేషన్ అండ్ రోబోటిక్స్

అడ్వాన్స్ సర్టిఫికెట్ కోర్సులు

- టూల్ డిజైన్, క్యాడ్/క్యామ్/టూల్ అండ్ డై
- మ్యానుఫ్యాక్చరింగ్
- **దరఖాస్తు:** ఆన్‌లైన్‌లో
- **వెబ్‌సైట్:** www.igtr.aur.gov.in

అనుదినం... జనస్వరం

# నవతెలంగాణ

సోమవారం 4-12-2017

సమగ్ర తెలుగు దినపత్రిక

సంపుటి : 3 సంచిక : 336 | Published from Hyderabad, Rangareddy, Khammam, Karimnagar, Mahaboobnagar, Warangal | www.navatelangana.com | 12 + 16 పేజీలు వెల : 5.00




### బ్యాంకులకు రూ.8 లక్షల కోట్ల అప్పులు

# ఎగ్గొట్టిందెవరు

## వారి పేర్లు బయట పెట్టేందుకు కేంద్రం ఎందుకు చొరవ చూపదు..?

- బ్యాంకులకు పునర్ధనీకరణ ఎందుకు అవసరమైంది..?
- నల్లధనానికీ, అవినీతికీ వ్యతిరేకమన్న మోడీ మాటల్లోని నిజమెంత..?



ప్రభుత్వరంగ బ్యాంకులను పునరుత్తేజితం చేయడానికి కేంద్రంలోని మోడీ ప్రభుత్వం చొరవ చూపుతుందా..? బ్యాంకుల పునర్ధనీకరణ(రీ క్యాపిటలైజేషన్)పై కేంద్రం చేసిన ఇటీవలి ప్రకటన వెనుక దాగి ఉన్న కారణాలేమిటి..? ఓవేళ బ్యాంకుల వద్ద ప్రభుత్వం తగినంత డబ్బు అందుబాటులో ఉంచితే అది ఎవరికి మేలు చేయడానికి..? కార్పొరేట్ శక్తులకా..? రైతులకూ, పేద, మధ్యతరగతి ప్రజలకా..? అసలు బ్యాంకులకు ప్రభుత్వ సాయం ఎందుకు అవసరమైంది..? అందుకు కారణమెవరు..? బ్యాంకులకు రూ.8లక్షల కోట్ల అప్పులు ఎగ్గొట్టింది ఎవరు..? అది కేంద్రంలోని మోడీ ప్రభుత్వానికి తెలియదా..? తెలిస్తే వారి పేర్లు ఎందుకు బయట పెట్టడంలేదు..?




వివరాలు 9లో



### లోపాలు ఉంటే చెప్పండి..

# సరి చేసుకుంటాం

- మీ సూచనలను చిత్తశుద్ధితో అమలు చేస్తాం
- బీసీ ప్రజా ప్రతినిధులతో సీఎం కేసీఆర్
- బీసీల అభ్యున్నతే ప్రభుత్వ లక్ష్యం
- చట్ట సభలలో రిజర్వేషన్ల కోసం కేంద్రంపై ఒత్తిడి

నవతెలంగాణ బ్యూరో–హైదరాబాద్

"సమున్నత లక్ష్యం కోసం తెలంగాణ సాధించుకున్నాం.. ప్రభుత్వ విధానంలో ఏమైనా లోపాలు ఉంటే చెప్పండి.. వాటిని మార్చుకోవడానికి తమకు ఎలాంటి భేషజాలు లేవని ముఖ్యమంత్రి కె చంద్రశేఖరరావు అన్నారు. బీసీల అభ్యున్నతే ప్రభుత్వ లక్ష్యమన్నారు. రాజకీయాలకు అతీతంగా బీసీ వర్గాలకు చెందిన ప్రజా ప్రతినిధులు అన్ని కులాల అభిప్రాయాలను పరిగణలోకి తీసుకుని బీసీలు, ఎంబీసీలకు ఏం చేయాలో ప్రభుత్వానికి దిశా నిర్దేశం చేయాలన్నారు. బీసీ ఫైనాన్స్ కార్పొరేషన్, ఎంబీసీ కార్పొరేషన్ పని తీరు ఎలా ఉండాలి. స్వయం ఉపాధి పథకాల స్వరూపం ఎలా ఉండాలో సూచించాలన్నారు. బీసీ ప్రజా ప్రతినిధులు సూచించిన దాని ప్రకారం అవసరమైన చట్టాలు తేవడానికి, వాటి అమలుకు వెంటనే ఉత్తర్వులు జారీ చేయడానికి ప్రభుత్వం సిద్ధంగా ఉందన్నారు. బీసీల అభివృద్ధి – సంక్షేమం తీసుకోవాల్సిన చర్యలపై ఆదివారం బీసీ వర్గాలకు చెందిన మంత్రులు, ఎంపీలు, ఎమ్మెల్సీలతో అసెంబ్లీ కమిటీ హాల్లో సీఎం కేసీఆర్ సమావేశం నిర్వహించారు. ఈ సందర్భంగా ముఖ్యమంత్రి కేసీఆర్ మాట్లాడుతూ రాష్ట్రంలో అన్ని వర్గాలు అన్ని రంగాల్లో అభివృద్ధి చెందాలి. ప్రతి వర్గం ప్రజల జీవన ప్రమాణాల్లో మార్పు రావాలి. ఎవరూ ఆత్మన్యూనత భావంతో ఉండటానికి వీల్లేదు. అంతా ఆత్మవిశ్వాసంతో బతకాలి. ఎవరి పెత్తనం కిందో మరొకరు బతకాల్సిన అవసరం లేదు. అందరూ బాగుపడాలి. అందరూ సమానవకాశాలు పొందాలి. ఇందుకనుగుణంగానే బాటలు వేయాలన్నారు. జనాభాలో సగభాగం ఉన్న బీసీలకు ఏం చేస్తే అభివృద్ధి చెందుతారు. వారికి సంక్షేమం గురించి తీసుకోవాల్సిన విషయాలపై పార్టీలకు అతీతంగా బీసీ వర్గాలకు చెందిన మంత్రులు, ఎంపీలు, ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీలు రెండు రోజుల పాటు లోతుగా అధ్యయనం చేసి, కూలంకశంగా చర్చించి విధి, విధానాల రూపకల్పన చేయాలని సూచించారు. భవిష్యత్తులో వాటిని ఎవరూ తొలగించలేని విధంగా పకడ్బందీగా విధానాలను రూపొందించాలన్నారు.

**బీసీల అభివృద్దే ప్రభుత్వ లక్ష్యం**

సమాజంలో సగభాగం కన్నా అధికంగా బలహీన వర్గాలు అన్ని రంగాల్లో అభివృద్ధి చేయాలన్నదే ప్రభుత్వ లక్ష్యమని సీఎం చెప్పారు. బీసీల జీవన ప్రమాణాలు మరింతగా పెరగాలంటే మరింతగా పెరగాలంటే మరిన్ని ...9లో

# బిడ్డపై కర్కశత్వం

- వేడి పెనంపై కూర్చోబెట్టి.. కాళ్లకు వాతలు పెట్టి పైశాచికత్వం
- వివాహేతర సంబంధానికి అడ్డుగా ఉందనే...
- హైదరాబాద్‌లో ఆలస్యంగా వెలుగు చూసిన ఘటన
- శిశువిహార్‌కు చిన్నారి

నవతెలంగాణ – సిటీబ్యూరో

వివాహేతర సంబంధానికి అడ్డుగా ఉందనే నెపంతో చిన్నారి(4)పై తల్లి, ఆమె ప్రియుడు కర్కశత్వాన్ని ప్రదర్శించారు. వారిద్దరూ చిన్నారిని వేడిపెనంపై కూర్చోబెట్టి..కాళ్లకు వాతలు పెట్టి పైశాచికానందాన్ని పొందారు. ఈ ఘటన హైదరాబాద్‌లోని ఎస్ఆర్‌నగర్ పోలీస్‌స్టేషన్ పరిధిలో ఆదివారం ఆలస్యంగా వెలుగుచూసింది. ఎస్ఆర్‌నగర్ పోలీసుల వివరాల ప్రకారం..ఏపీలోని శ్రీకాకుళం జిల్లాకు చెందిన లలిత, ప్రకాశ్‌లకు వివాహేతర సంబంధముంది. ఈ క్రమంలోనే కొన్నినెలల కింద ఊరి నుంచి పారిపోయి హైదరాబాద్‌కు వచ్చారు. శ్రీనివాస్‌నగర్‌లోని ఓ హాస్టల్‌లో ఇద్దరూ పనికి కుదిరారు. లలిత వంట మనిషిగా, ప్రకాశ్ వాచ్‌మెన్‌గా పనిచేస్తున్నారు. లలితకు నాలుగేండ్ల కూతురు, ప్రకాశ్‌కు ముగ్గురు పిల్లలు ఉన్నారు. ఇటీవల తన దగ్గర ఉండాలంటే కూతుర్ని ...9లో

### జనభోజనాలు...

# జనతెలంగాణకు మార్గం

ఈ కొత్త సంస్కృతి దేశానికే ఆదర్శం కావాలి

- కులవ్యవస్థ ఉన్నంతకాలం భారత్ సూపర్‌పవర్ కాలేదు
- ప్రాణాలు తీస్తామనడం ప్రజాస్వామ్యమేనా :టీమాస్ కార్యక్రమంలో సీపీఐ(ఎం) పొలిట్‌బ్యూరో సభ్యుడు రాఘవులు

వివరాలు 9లో



### ఓయూలో

# విద్యార్థి ఆత్మహత్య

- డీఎస్సీ వాయిదా పడ్డందుకే మనస్తాపం
- సూసైడ్ నోట్ తారుమారు చేసినట్టు ఆరోపణలు
- సమగ్ర విచారణ జరపాలని కోదండరామ్ డిమాండ్
- భౌతికకాయాన్ని తరలించకుండా అడ్డుకున్న విద్యార్థులు



వివరాలు 9లో




# గర్భిణిపై లైంగికదాడికి యత్నం

- కదులుతున్న డీసీఎంలో ఘటన
- తప్పించుకునేందుకు దూకిన మహిళ
- తల పగిలి అక్కడికక్కడే మృతి
- మెదక్ జిల్లా తూప్రాన్‌లో ఘటన
- ఆలస్యంగా వెలుగులోకి..

నవతెలంగాణ–మనోహరాబాద్

డీసీఎంలో గర్భిణిపై ఇద్దరు దుండగులు లైంగిక దాడికి యత్నించారు. వారి నుంచి తప్పించుకునే క్రమంలో వెళ్తున్న డీసీఎం లోంచి ఆమె రోడ్డుపైన దూకేసింది. దీంతో తలపగిలి అక్కడికక్కడే చనిపోయింది. ఈ ఘటన ...9లో

# ప్రొఫెసర్ కంచ ఐలయ్య అరెస్టు



- జీఎంపీఎస్ సభకు వెళ్లకుండా నిలువరించిన పోలీసులు
- అరెస్టును అడ్డుకున్న కార్యకర్తలు
- ఖమ్మంలో ఐదు గంటల పాటు తీవ్ర ఉద్రిక్తత
- కావాలనే అరెస్టు చేస్తున్నారు: ఐలయ్య

వివరాలు 8లో

# ఫిబ్రవరి 1న కేంద్ర బడ్జెట్

- జనవరి 30 నుంచి పార్లమెంట్ బడ్జెట్ సమావేశాలు

**న్యూఢిల్లీ:** కేంద్ర ఆర్థికమంత్రి అరుణ్‌జైట్లీ 2018–19 వార్షిక బడ్జెట్‌ను ఫిబ్రవరి 1న పార్లమెంట్‌లో ప్రవేశపెట్టనున్నారు. జనవరి 30 నుంచి బడ్జెట్ సమావేశాలు ప్రారంభం కానుండగా, అదేరోజు ఉభయసభలను ఉద్దేశించి రాష్ట్రపతి రామ్‌నాథ్‌కోవింద్ ప్రసంగిస్తారు. మరుసటిరోజు జనవరి 31న ఆర్థిక సర్వేను సభ ముందుంచుతారు. ఫిబ్రవరి 1న ఆర్థికమంత్రి వార్షిక బడ్జెట్‌ను పార్లమెంట్‌కు సమర్పిస్తారని అధికారవర్గాలు తెలిపాయి. ఫిబ్రవరి చివరి రోజున బడ్జెట్‌ను ...9లో

కొక్కొరోకో..



...అప్పుడు అందరికీ స్వర్గం చూపిస్తాం..!!

# కటిక దారిద్ర్యంలో దేశం

**రాష్ట్రంలో సామాజిక భద్రత శూన్యం**

- కేసీఆర్ ఓ పిరికిపంద : సీపీఐ జాతీయ ప్రధాన కార్యదర్శి సురవరం
- సామాజిక న్యాయం ప్రాతిపదికన ఐక్యపోరాటం : తమ్మినేని
- సామాజిక పోరాటాలకు కలిసివస్తాం : టీపీసీసీ అధ్యక్షులు ఉత్తమ్‌కుమార్ రెడ్డి

నవతెలంగాణ–కరీంనగర్ టౌన్

దేశంలోని ప్రజలు కటిక దారిద్ర్యంలో మగ్గుతున్నారని సర్వేలే చెబుతుంటే జీడీపీ స్థాయి పెరిగిందంటూ కేంద్ర ప్రభుత్వం ప్రగల్భాలు పలుకుతోందని సీపీఐ ప్రధాన కార్యదర్శి సురవరం సుధాకర్‌రెడ్డి విమర్శించారు. సీపీఐ పోరుబాట ముగింపు సందర్భంగా కరీంనగర్ జిల్లా కేంద్రంలోని పూలే మైదానంలో ఆదివారం సాయంత్రం జరిగిన సభలో ఆయన మాట్లాడుతూ...పెద్దనోట్ల రద్దు, జీఎస్టీలాంటి నిర్ణయాల వల్ల అన్ని వర్గాలూ తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నాయని ఆందోళన వ్యక్తం చేశారు. నోట్ల రద్దు వల్ల ఒక్క పైసా నల్లధనం కూడా వెనక్కిరాలేదన్నారు. అమిత్‌షా కొడుకుకు చెందిన రూ.50వేల పెట్టుబడి మూడేండ్లకు రూ.50 కోట్లకు ఎలా పెరిగిందని ప్రశ్నించారు. హైదరాబాద్‌లో జరిగిన ప్రపంచ దేశాల సదస్సు వల్ల రాష్ట్ర ప్రజలకు ఒరిగింది శూన్యమన్నారు. తెలంగాణలో కేసీఆర్ సర్కారు మూడెకరాల సాగు భూమి, డబుల్ బెడ్‌రూం ఇండ్లు ఎంతమందికిచ్చిందో ప్రజలు గ్రహించాలన్నారు. రాష్ట్రంలో ...9లో



నవతెలంగాణ




అంతర్జాతీయ వికలాంగుల దినోత్సవం సందర్భంగా ఉత్తరప్రదేశ్‌లోని మోరదాబాద్‌లో నిర్వహించిన పరుగు పందెంలో ఉత్సాహంగా పాల్గొన్న వికలాంగులు

## పది నెలల్లో 724 సార్లు పాక్ కాల్పులు

- ఏడేండ్లలో ఇదే అధికం



**న్యూఢిల్లీ:** పాకిస్థాన్ ఈ ఏడాది 724సార్లు కాల్పుల విరమణ ఒప్పందాన్ని ఉల్లంఘించిందని కేంద్ర హోంశాఖ వెల్లడించింది. ఏడేండ్లలో ఇదే అత్యధికమని తెలిపింది. అంతర్జాతీయ సరిహద్దు(ఐబీ), జమ్మూ కాశ్మీర్‌లోని నియంత్రణ రేఖ(ఎల్‌వోసీ) వద్ద ఈ ఏడాది అక్టోబర్ వరకు పాక్ సైన్యం 724సార్లు కాల్పులకు పాల్పడింది. ఈ కాల్పుల్లో 12మంది పౌరులు,17మంది భద్రతా సిబ్బంది చనిపోయారు. 79మంది పౌరులు,67మంది సిబ్బంది గాయపడ్డారు. గతేడాది (2016) అక్టోబర్ వరకూ 449సార్లు పాక్ కాల్పులకు పాల్పడింది. కాల్పుల్లో 13మంది పౌరులు, 13మంది భద్రతా సిబ్బంది ప్రాణాలు కోల్పోయారు. 83మంది పౌరులు, 99మంది భద్రతా సిబ్బంది గాయపడ్డారు. భారత్‌-పాక్ మధ్య 2003లో కాల్పుల విరమణ ఒప్పందం జరిగింది. పాక్‌తో భారత్‌కు మొత్తం 3,323 కి.మీ. సరిహద్దు ఉండగా, అందులో 221 కి.మీ. ఐబీ, 740 కి.మీ. జమ్మూకాశ్మీర్ వద్ద ఎల్‌వోసీ.

## 2034లో మళ్లీ 'సూపర్‌మూన్'



**వాషింగ్టన్ :** ఆదివారం రాత్రి సూపర్ మూన్ వీక్షకుల్ని అలరించింది. 1948 తర్వాత వరుసగా 2016,17 ఏడాదుల్లో సూపర్‌మూన్ ఏర్పడటం విశేషం. గతేడాది నవంబరు 14న కనిపించిన సూపర్‌మూన్‌తో పోల్చితే, ఆదివారం నాటి సూపర్‌మూన్ పరిమాణంలో స్వల్ప తేడా ఉంది. పౌర్ణమి రోజు, చంద్రుడు భూమికి దగ్గరగా వచ్చినప్పుడు అత్యంత కాంతివంతంగా, పరిమాణంలో పెద్దదిగా చంద్రుడు ఆకర్షణీయంగా కనిపిస్తాడు. సైన్స్ పరిభాషలో ఈ ఘటనను పెరిజీ అంటారు. తదుపరి సూపర్‌మూన్ నవంబరు 25, 2034న ఏర్పడనున్నది.

### కేరళలో జరుగుతున్న వివాహాలపై

# ఎన్ఐఏ దర్యాప్తు పట్ల సీపీఐ(ఎం) అభ్యంతరం

**జీవిత భాగస్వామిని ఎంచుకునే స్వేచ్ఛ మహిళలకు లేదా..? : బృందాకరత్**



**న్యూఢిల్లీ:** కేరళలో జరుగుతున్న కులాంతర, మతాంతర వివాహాలపై దర్యాప్తునకు జాతీయ దర్యాప్తు బృందం(ఎన్ఐఏ) ఆసక్తి చూపడం పట్ల సీపీఐ(ఎం) పొలిట్‌బ్యూరో సభ్యురాలు బృందాకరత్ తీవ్ర అభ్యంతరం వ్యక్తం చేశారు. ఇప్పటికే కేరళలో 89 జంటలపై ఎన్ఐఏ దర్యాప్తు జరిపినట్టు బృందాకరత్ పేర్కొన్నారు. సీపీఐ(ఎం) అధికారిక వారపత్రిక పీపుల్స్ డెమోక్రసీ తాజా సంచికలో ఈ అంశంపై బృందాకరత్ వ్యాసం ప్రచురితమైంది. కులాంతర, మతాంతర వివాహాలను ప్రోత్సహించడంలో ప్రభుత్వం ఉదారంగా వ్యవహరించాల్సి ఉండగా, దర్యాప్తునకు ఆదేశించడమేమిటని ఆమె ప్రశ్నించారు. ఉగ్రవాదంపై దర్యాప్తు జరపాల్సిన ఎన్ఐఏను వివాహాలపై పరిశోధనకు ఉపయోగించడాన్ని ఆమె తప్పుపట్టారు. హిందూ యువతులను లవ్ జిహాద్‌లో భాగంగా ముస్లిం యువకులు పెండ్లిళ్లు చేసుకొని వారిని ఐఎస్ఐఎస్‌లోకి చేర్పిస్తున్నారన్న ఆరోపణలపై ఎన్ఐఏ దర్యాప్తు జరుపుతున్న విషయం తెలిసిందే. కేరళకు చెందిన అఖిల(24) ఇస్లాం మతం స్వీకరించి హదియాగా పేరు మార్చుకొని షఫీన్ జహాన్‌ను వివాహమాడగా, ఆమె తల్లిదండ్రులు అభ్యంతరం వ్యక్తం చేశారు. వీరి వివాహాన్ని కేరళ హైకోర్టు రద్దు చేయగా, షఫీన్ సుప్రీంకోర్టును ఆశ్రయించడంతో దీనిపై జాతీయస్థాయిలో చర్చ జరుగుతోంది. తనకు ఉన్నత విద్య పట్ల ఆసక్తి ఉన్నదని అఖిల చెప్పడంతో ఆమెను తమిళనాడు సేలెంలోని కళాశాలలో హోమియోపతి కోర్సులో చేర్చాలని సుప్రీంకోర్టు ఆదేశించింది. షఫీన్‌ను తాను ఇష్టపడే పెండ్లి చేసుకున్నట్టు అఖిల కోర్టుకు తెలిపారు. అయితే, వీరి వివాహంపై సుప్రీంకోర్టు ఇంకా తీర్పు ప్రకటించలేదు. తన జీవిత భాగస్వామిని ఎంపిక చేసుకునే స్వేచ్ఛ ఆమెకు ఉండాలని బృందాకరత్ తన వ్యాసంలో హితవు పలికారు. పురుషులతోపాటు మహిళలకు సమాన హక్కులు ఉంటాయని ఆమె ఈ సందర్భంగా గుర్తు చేశారు. మత సంకుచిత భావాలతో ఆమె హక్కులను నిరాకరించడం తగదని బృందాకరాత్ స్పష్టం చేశారు.

## తుపాకీతో బెదిరించి బాలికపై సామూహిక లైంగికదాడి

- ఘటనను వీడియో తీసి బెదిరింపు
- యూపీలో దారుణం

**లక్నో:** ఉత్తరప్రదేశ్‌లో మహిళల పై అఘాయిత్యాలకు అంతు లేకుం డా పోతోంది. తుపాకీ చూపి బెదిరిం చి బాలికపై సామూహిక లైంగిక దాడికి ఒడిగట్టారు ముగ్గురు దుర్మా ర్గులు. హమీపూర్ జిల్లా మజ్‌గాన్ గ్రామంలో చోటు చేసుకున్న ఈ ఘటన ఆలస్యంగా వెలుగులోకొచ్చింది. పోలీసులు ఆదివారం తెలిపిన వివరాల ప్రకారం.. గ్రామానికి చెందిన ఓ బాలిక(17) వారం రోజుల కిందట చేను వద్దకు వెళ్లింది. అదే ప్రాంతానికి చెందిన ముగ్గురు యువ కులు.. ఆమెను తుపాకీతో బెదిరించి అఘాయిత్యానికి ఒడిగట్టారు. ఘట నను వీడియో తీశామని, ఎవరికైనా చెబితే సోషల్ మీడియాలో పోస్టు చేస్తామని బెదిరించారు. ఈ ఘటనపై పోలీసులకు ఫిర్యాదు చేసేందుకు బాధితురాలి కుటుంబీకులు తొలుత సాహసించలేదు. కానీ, శనివారం ధైర్యం చేసి మజ్‌గాన్ పోలీస్‌స్టేషన్‌లో ఫిర్యాదు చేశారు. పోలీసులు కేసు నమోదు చేసుకొని ఒక నిందితుడిని అరెస్టు చేశారు. మిగిలిన వారిని పట్టుకొనేందుకు మూడు బృందాలు గాలిస్తున్నాయని ఎస్పీ దినేశ్‌కుమార్ వెల్లడించారు. నేషనల్ క్రైమ్ రికార్డ్స్ బ్యూరో(ఎన్సీఆర్‌బీ) ఇటీవల వెల్లడించిన గణాంకాల ప్రకారం.. అత్యధిక నేరాలు ఉత్తరప్రదేశ్‌లోనే జరుగుతున్నాయి. దేశంలోని మొత్తం నేరాల్లో ఒక్క యూపీలోనే 9.5 శాతం కేసులు నమోదైనట్టు వెల్లడైంది. అటు లైంగికదాడుల కేసుల్లోనూ యూపీ రెండో స్థానంలో(4,816) ఉన్నది. మరో బీజేపీ పాలిత రాష్ట్రం మధ్యప్రదేశ్ 4,882 కేసులతో మొదటి స్థానంలో నిలువడం గమనార్హం.

## గుజరాత్‌లో భారీ ఎత్తున మద్యం, నగదు పట్టివేత

**అహ్మదాబాద్:** గుజరాత్ అసెంబ్లీ ఎన్నికల నేపథ్యంలో మద్యనిషేధం అమలులో ఉన్న రాష్ట్రంలో ఏకంగా రూ 22 కోట్ల విలువైన 9.6లక్షల కోట్ల మద్యం, రూ 1.71 కోట్ల నగదు, రూ 8 కోట్ల విలువైన బంగారు ఆభరణాలను ఎన్నికల అధికారులు స్వాధీనం చేసుకున్నారు. ఎన్నికల బృందాలు పెద్ద ఎత్తున నగదుతో పాటు రూ 3.11 లక్షల విలువైన 35 కిలోల డ్రగ్స్, 3650 బ్రిటన్ పౌండ్లు, రూ.60,000 విలువైన థాయ్ కరెన్సీని స్వాధీనం చేసుకున్నాయి. గుజరాత్‌లో ఓటర్లను ప్రలోభ పెట్టేందుకు నల్లధనం ఉపయోగించడంపై కన్నేసేందుకు 100 మంది ఎన్నికల వ్యయ పరిశీలకులను ఈసీ నియమించింది. మరోవైపు బంగారం వ్యాపారాల లావాదేవీలకు సంబంధించిన 311 కిలోల బంగారాన్ని క్షుణ్ణంగా పరిశీలించిన అనంతరం అధికారులు విడిచిపెట్టినట్టు ఈసీ వర్గాలు వెల్లడించాయి. గుజరాత్ అసెంబ్లీ ఎన్నికల పోలింగ్ రెండు విడతలుగా ఈనెల 9, 14న జరగనున్న విషయం తెలిసిందే.

## బీజేపీ పాలనలో మహిళల పట్ల నిర్లక్ష్యం : రాహుల్

**న్యూఢిల్లీ:** కాంగ్రెస్ ఉపాధ్యక్షుడు రాహుల్‌గాంధీ ప్రధాని మోడీకి ఐదో ప్రశ్న సంధించారు. గుజరాత్‌లో 22 ఏండ్ల బీజేపీ పాలనలో మహిళలకు రక్షణ లేదని, అన్ని అంశాల్లోనూ నిర్లక్ష్యానికీ, దోపిడీకి గురవుతున్నారని రాహుల్ అన్నారు. మహిళలకు విద్య,వైద్యం, పోషకాహారాన్ని అందించడంలో బీజేపీ ప్రభుత్వం విఫలమైందని రాహుల్ ట్వీట్ చేశారు.

అంగన్‌వాడీ, ఆశా వర్కర్లు బీజేపీ పాలనలో నిరాశకు గురయ్యారని రాహుల్ అన్నారు. గుజరాత్ అసెంబ్లీ ఎన్నికల సందర్భంగా రాహుల్‌గాంధీ ట్విట్టర్ ద్వారా ప్రధాని మోడీకి రోజుకో ప్రశ్న వేస్తున్న సంగతి తెలిసిందే. శనివారం రాహుల్ తన నాలుగో ప్రశ్నలో గుజరాత్ విద్యారంగంలో వెనకబడిందని, బీజేపీ పాలనలో ఆ రాష్ట్రం దేశంలో 26వ స్థానంలోకి చేరుకున్నదని అన్నారు.

## గుజరాత్ ఎన్నికల్లో ఓటు రశీదు యంత్రాలు

- సీఈసీ ఎ.కె జ్యోతి

**న్యూఢిల్లీ:** గుజరాత్ అసెంబ్లీ ఎన్నికల్లో అన్ని పోలింగ్ కేంద్రాలలోనూ ఈవీఎంలతో పాటు ఓటు రశీదు యంత్రాలను పూర్తిస్థాయిలో ఏర్పాటు చేస్తున్నట్టు ప్రధాన ఎన్నికల కమిషనర్(సీఈసీ) ఎకె జ్యోతి చెప్పారు. ఆదివారం రాష్ట్రంలో 189 అసెంబ్లీ స్థానాలకు ఈనెల 9, 14 తేదీల్లో ఎన్నికలు జరగనుండగా.. ఫలితాలు 18న విడుద లవుతాయి. కాగా.. ఆదివారం నిర్వహించిన మీడియా సమావేశంలో ఆయన మాట్లాడుతూ.. మొత్తం 50,264 పోలింగ్ కేంద్రాలలో ఓటు రశీదు యంత్రాలను చేయనున్నట్టు ఆయన వివరించారు.

## దీనిని జాతీయ విపత్తుగా ప్రకటించలేం

- ఓఖీ తుఫాన్ తాకిడిపై కేంద్రం స్పందన



**న్యూఢిల్లీ :** ఓఖీ తుఫాన్ కేరళ, తమిళనాడు, లక్ష్యదీవులలో ప్రజల్ని హడలెత్తిస్తుంటే...ఇదేమంత పెద్ద విషయం కాదని కేంద్ర ప్రభుత్వం తేలిగ్గా తీసిపారేసింది. దీనిని జాతీయ విపత్తుగా ప్రకటించాల్సిన అవసరం లేదని ఆదివారంనాడు కేంద్ర ప్రభుత్వ వర్గాలు తెలిపాయి. ఆదివారంనాడు కేరళలో ఆ రాష్ట్ర ముఖ్యమంత్రి పినరయ్ విజయన్‌తో సమావేశం అనంతరం కేంద్ర మంత్రి ఆల్ఫోన్స్ కన్నన్‌థానమ్ మీడియాతో మాట్లాడుతూ, 'ఓఖీ' తుఫాన్‌ను జాతీయ విపత్తుగా ప్రకటించాలని తుఫాన్ ప్రభావిత రాష్ట్రాలు కోరాయని, కానీ అలాంటి అవసరమేమీ లేదని, దీనిని జాతీయ విపత్తుగా ప్రకటించాల్సిన అవసరం లేదని, నష్టనివారణా చర్యల కోసం రిలీఫ్ ఫండ్‌ను కేంద్రం విడుదల చేసిందని ఆల్ఫోన్స్ అన్నారు.

**దారిమార్చుకున్న 'ఓఖీ'**

తమిళనాడు, కేరళ రాష్ట్రాలకు అపార నష్టాన్ని మిగిల్చిన 'ఓఖీ' తుఫాన్ ఊహించని విధంగా మారిపోయింది. ప్రస్తుతం లక్షద్వీప్ వద్ద ఒక్కసారిగా ఇది బలహీనపడింది. అనూహ్యంగా దిశను మార్చుకుని గుజరాత్ తీరం వైపు నెమ్మదిగా కదులుతోంది. దీంతో జాతీయ వాతావరణ పరిశోధన శాఖ గుజరాత్‌కు వర్ష సూచన హెచ్చరికలు జారీ చేసింది. ప్రస్తుతం గంటకు 18 మైళ్ల వేగంతో కదులుతున్న ఓఖీ నేడు గుజరాత్ తీరాన్ని తాకే అవకాశం ఉంది. ప్రస్తుతానికైతే దక్షిణ గుజరాత్, ఉత్తర మహారాష్ట్ర తీర ప్రాంతాల్లో జాలర్లు అప్రమత్తంగా ఉండాలన్న హెచ్చరికలు అధికారులు జారీ చేశారు.

## ఇది..ప్రజలకు, బీజేపీకి మధ్య జరుగుతున్న పోరు

- సూరత్ రోడ్ షోలో హార్దిక్ పటేల్



**సూరత్ :** గుజరాత్‌లో ప్రజలకు, బీజేపీకి మధ్య ఎన్నికల పోరు నెలకొందని, ఈ పోరులో ప్రజలు గెలుపొందాలని పాటీదార్ ఆందోళన నాయకుడు హార్దిక్ పటేల్ పిలుపునిచ్చారు. సూరత్‌లో ఆయన చేపట్టిన రోడ్ షోలో మాట్లాడుతూ...రోడ్ షో కార్యక్రమాలకు, సభలకు జనం పెద్ద సంఖ్యలో హాజరవుతున్నారని, దీనిని బట్టి అధికార బీజేపీపై ప్రజలు తీవ్ర ఆగ్రహంతో ఉన్నారన్న సంగతి తేలిపోయిందని అన్నారు. పటేల్ సామాజిక వర్గమంతా కాంగ్రెస్‌కు ఓటేయాలని ఆయన కోరారు. అటు వర్తక, వ్యాపారపరంగా, ఇటు రాజకీయపరంగా దక్షిణ గుజరాత్‌లోని సూరత్ ప్రాంతానికి ఎనలేని ప్రాధాన్యత ఉంది. ఇక్కడ 16అసెంబ్లీ స్థానాల్లో గెలుపు ఓటముల్ని పాటీదార్ సామాజిక వర్గం ప్రభావితం చేయగలదు. బీజేపీకి వ్యతిరేకంగా సూరత్ చుట్టుపక్కల ప్రాంతంలో హార్దిక్ పటేల్ పెద్ద ఎత్తున ఉద్యమం నడిపాడు. దీంతో డిసెంబరు, 2015 మున్సిపల్ ఎన్నికల్లో పాటీదార్లు కాంగ్రెస్ వైపు మొగ్గు చూపారు. రెట్టింపు సంఖ్యలో మున్సిపల్ స్థానాల్ని కాంగ్రెస్ గెలుచుకుంది.

**సూరత్‌కు ఎన్సీడబ్ల్యూ ఛైర్‌పర్సన్**

హార్దిక్ పటేల్‌పై ఓ యువతి చేసిన లైంగిక ఆరోపణలపై జాతీయ మహిళా కమిషన్ (ఎన్సీడబ్ల్యూ) స్పందించింది. 24ఏండ్ల హార్దిక్ పటేల్‌పై ఫిర్యాదు అందిన క్రమంలో బాధితురాలిని స్వయంగా కలిసేందుకు ఎన్సీడబ్ల్యూ ఛైర్‌పర్సన్ రేఖా శర్మ సూరత్‌ను సందర్శిస్తారని సమాచారం. ఓ సీడీలో హార్దిక్ పటేల్ అభ్యంతరకరంగా కనిపించిన ఘటన అనంతరం ఆయనపై లైంగిక వేధింపుల ఆరోపణలు వెలుగుచూశాయి.





## ఎన్నికల్లో పోటీ చేస్తా : హాఫీజ్ సయీద్

**ఇస్లామాబాద్:** ముంబయి పేలుళ్ల కీలక సూత్రధారి, జమాత్‌-ఉద్‌-దావా (జేయూడీ) చీఫ్ హాఫీజ్ సయీద్ పాకిస్థాన్ ఎన్నికల్లో పోటీ చేయనున్నారు. గతనెల24న హాఫీజ్ గృహనిర్బంధం నుంచి విడుదలైన సంగతి తెలిసిందే. వచ్చే ఏడాది ఎన్నికల్లో సాధారణ ఎన్నికల్లో తాను పోటీ చేయనున్నట్టు హాఫీజ్ సయీద్ వెల్లడించారు. ఎంఎంఎల్ (మిలి ముస్లిం లీగ్) పార్టీ తరపున తాను పోటీ చేయనున్నట్టు ప్రకటించారు. అయితే, ఏ నియోజకవర్గం నుంచి బరిలోకి దిగుతారో మాత్రం వెల్లడించలేదు.

**'ఉగ్రసంస్థల నిర్మూలనలో పాక్ తీరు అసంతృప్తికరం'**

వాషింగ్టన్: ఉగ్రసంస్థల నిర్మూలనలో పాకిస్థాన్ నిర్లక్ష్యంగా వ్యవహరిస్తోందని అమెరికా అసంతృప్తి వ్యక్తం చేసింది. తాలిబన్లు, హక్కానీ నెట్‌వర్క్‌ను నాశనం చేసేందుకు పాక్ చెప్పుకోదగ్గ చర్యలేమీ తీసుకోలేదని వైట్‌హౌస్ సీనియర్ అధికారి ఒకరు తెలిపారు. ఉగ్రవాదులపై పోరులో పాక్ వైఖరి పట్ల అమెరికా అసంతృప్తిగా ఉందని ఆయన పేర్కొన్నారు. ముంబయి పేలుళ్ల ప్రధాన సూత్రధారి, జేయూడీ చీఫ్ హాఫీజ్ సయీద్‌ను విడుదల చేయడాన్ని అమెరికా వ్యతిరేకిస్తున్నట్టు తెలిపారు.

## న్యూయార్క్‌లో.. ఫుట్‌పాత్‌పైకి దూసుకెళ్లిన కారు

- ఒకరు మృతి, నలుగురికి గాయాలు



**వాషింగ్టన్:** న్యూయార్క్ నగరంలో ఓ కారు బీభత్సం సృష్టించింది. ఫుట్‌పాత్‌పైకి కారు దూసుకెళ్లిన ఘటన లో ఓవ్యక్తి మృతి చెందాడు. మరో నలుగురు తీవ్రంగా గాయపడ్డారు. వారిలో ఇద్దరి పరిస్థితి విషమంగా ఉన్నట్టు సమాచారం. క్షతగాత్రులను ఆస్పత్రికి తరలించి చికిత్స అందిస్తున్నారు. పరారీలో ఉన్న కారు డ్రైవర్ కోసం గాలిస్తున్నట్టు పోలీసులు తెలిపారు. ప్రమాదానికి గల కారణాలు తెలియరాలేదు.

## రష్యాలో భారీ అగ్ని ప్రమాదం

- ఏడుగురు మృతి

**మాస్కో :** రష్యాలోని కులుగా ప్రాంతంలో ఆదివారం భారీ అగ్ని ప్రమాదం సంభవించింది. ఈ ఘటనలో ఏడుగురు మృతి చెందారు. మృతుల్లో ఇద్దరు చిన్నారులు కూడా ఉన్నట్టు సమాచారం. క్షతగాత్రులను స్థానిక ఆస్పత్రికి తరలించి చికిత్స అందిస్తున్నారు. సమాచారం అందుకున్న అగ్నిమాపక సిబ్బంది ఘటనాస్థలికి చేరుకుని మంటను ఆర్పివేశారు. ప్రమాదానికి గల కారణాలు తెలియరాలేదు. ఘటనపై దర్యాప్తునకు ఆదేశించినట్టు అధికారులు తెలిపారు.

**సైబీరియాలోనూ...**

సైబీరియాలో ఓ ఇంట్లో అగ్ని ప్రమాదం జరిగింది. ఈ ఘటనలో ఐదుగురు చిన్నారులు మృతి చెందారు. ప్రమాదం జరిగిన సమయంలో కుటుంబ సభ్యులెవరూ ఇంట్లో లేకపోవడంతో చిన్నారులు చనిపోయినట్టు ప్రాథమిక విచారణలో వెల్లడయింది. స్థానిక అధికారులు తెలిపిన వివరాల ప్రకారం...నోవోసిబిస్క్ ప్రావిన్స్‌లోని స్టెప్‌నోయ్ గ్రామంలో అగ్నిప్రమాదం సంభవించింది. ఈ ఘటనలో ఐదుగురు పిల్లలు మృతి చెందారు. ప్రమాదానికి గల కారణాలు తెలియరాలేదు. ఈ ఘటనపై విచారణకు ఆదేశించినట్టు అధికారులు తెలిపారు.

# నైజీరియాలో ఆత్మాహుతి దాడి

- 17 మంది మృతి, 47 మందికి గాయాలు



**అబూజ:** నైజీరియాలో ఉగ్రవాదులు బీభత్సం సృష్టిం చారు. బయూ నగరంలో ఓ రద్దీ ప్రాంతాన్ని లక్ష్యంగా చేసుకొని ఆత్మాహుతి దాడికి పాల్పడ్డారు. మిలిటెంట్ల దాడిలో 17 మంది మృతి చెందారు. 47మంది తీవ్రంగా గాయపడ్డారు. క్షతగాత్రులను స్థానిక ఆస్పత్రికి తరలించి చికిత్స అందిస్తున్నారు. ఈ ఘటనకు బాధ్యత వహిస్తున్నట్టు ఏ ఉగ్రసంస్థ కూడా ప్రకటించుకోలేదు. అయితే, కొన్నేండ్ల నుంచి ఈ ప్రాంతంలో చొరబాటు కోసం బోకోహరామ్ మిలిటెంట్లు ప్రయత్నిస్తున్నారు. ప్రజల్లో భయాందోళనలు సృష్టించేందు కోసం విద్యాసంస్థలు, ఆస్పత్రులు, మార్కెట్లను లక్ష్యంగా చేసుకుని ఆత్మాహుతి దాడులకు పాల్పడుతున్నారు. బోకోహరామ్ మిలిటెంట్లే ఈదాడికి పాల్పడి ఉంటా రని అధికారులు, పోలీసులు అనుమానిస్తున్నారు. తాజా ఆత్మాహుతి దాడిలో ఇద్దరు మిలిటెంట్లు పాల్గొన్నట్టు సీసీ టీవీ ఫుటేజ్‌ల ద్వారా గుర్తించామని అన్నారు. కాగా, బోకోహ రామ్ చొరబాటుదారుల ఆకృత్యాలపై ఐక్యరాజ్యసమితి ఆందోళన వ్యక్తం చేసింది. బోకోహరామ్ మిలిటెంట్లు 2009 నుంచి జరిపిన దాడుల్లో 20వేల మృతి చెందారని, 17లక్షల మంది ప్రాణభయంతో ఇతర ప్రాంతాలకు తరలివెళ్లారని పేర్కొన్నది. 2015 నుంచి ఐఎస్‌కు అనుబంధంగా పని చేస్తూ తమ కార్యకలాపాలను విస్తరించుకున్న బోకోహరామ్ మిలిటెంట్ల ఏరివేత కోసం నైజీరియా ఆర్మీ ఏప్రిల్ నుంచి స్పెషల్ ఆపరేషన్ చేపట్టింది.




## ఈక్వెడార్‌లో భూకంపం

- రిక్టర్‌స్కేల్‌పై తీవ్రత 6.0గా నమోదు

**క్వీటో :** దక్షిణ అమెరికా దేశమైన ఈక్వెడార్‌లో ఆదివారం భూకంపం సంభవించింది. రిక్టర్‌స్కేల్‌పై భూకంప తీవ్రత 6.0గా నమోదైందని యూఎస్ జియోలజికల్ సర్వే అధికారులు తెలిపారు. బహియా డె కరాక్వెజ్ నగరానికి సమీపంలో 25కిలోమీటర్ల లోతులో భూకంప కేంద్రాన్ని గుర్తించినట్టు తెలిపారు. అయితే, భూకంపం కారణంగా ఎలాంటి ప్రాణ, ఆస్థి నష్టం సంభవించలేదని అధికారులు పేర్కొన్నారు. భూకంపం సంభవించిన ప్రాంతం రాజధాని క్వీటో నగరం నుంచి 200 కిలోమీటర్ల దూరంలో ఉంటుంది.

### అమెరికా, దక్షిణ కొరియా

# సంయుక్త సైనిక విన్యాసాలు

- ఉత్తరకొరియా ఆగ్రహం

**సియోల్:** అమెరికా, దక్షిణకొరియా దేశాలు కొరియా ద్వీపకల్పంలో సంయుక్తంగా సైనిక విన్యాసాలు నిర్వహించడం పట్ల ఉత్తరకొరియా తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేసింది. ఇటువంటి రెచ్చగొట్టే చర్యలతో అమెరికా అణుయుద్ధానికి తెరతీస్తుందని మండిపడింది. క్షిపణి ప్రయోగాలు చేయడం ఆపకపోతే యుద్ధానికి దిగాల్సి వస్తుందని శ్వేతసౌధం జాతీయ భద్రత సలహాదారులు హెచ్‌ఆర్. మెక్‌మాస్టర్ ఉ.కొరియాను హెచ్చరించిన మరుసటి రోజే ఆదేశం ఈవ్యాఖ్యలు చేయడం గమనార్హం. అమెరికా, ద.కొరియా సైన్యం సంయుక్త విన్యాసాలపై ఉ.కొరియా స్టేట్ మీడియా రొడాంగ్ ఓ ప్రత్యేక కథనాన్ని ప్రచురించింది. ' ఉ.కొరియాను రెచ్చగొడితే ఏ క్షణానైనా అణుయుద్ధానికి దిగే అవకాశంఉంది. ఉ.కొరియాను లక్ష్యంగా చేసుకొని యూఎస్‌-కొరియా విన్యాసాలు చేపట్టి వారి నాశనాన్ని వాళ్లే కొనితెచ్చుకుంటున్నారు. రెచ్చగొట్టే చర్యలతో ట్రంప్ ప్రభుత్వం అణుయుద్ధం కావాలని అడుక్కుంటుంది' అని ఉ.కొరియా తన కథనంలో పేర్కొంది. ఉ.కొరియాతో యుద్ధం చేయాల్సి వచ్చే పరిస్థితులు రోజురోజుకీ ఎక్కువగా కనిపిస్తున్నాయని మెక్‌మాస్టర్ వ్యాఖ్యలు చేశారు. దాదాపు రెండు నెలల విరామం తర్వాత ఉ.కొరియా బుధవారం హాసంగ్‌-15 క్షిపణిని ప్రయోగించిన విషయం తెలిసిందే. ఈ క్షిపణికి వార్‌హెడ్లను మోసుకెళ్లే సామర్థ్యమున్నదని, గతంలో తాము పరీక్షించిన క్షిపణుల కంటే హాసంగ్‌-15 ఎక్కువ దూరం, చాలా ఎత్తులో ప్రయాణించినట్టు ఉ.కొరియా ప్రకటించింది. ఉ.కొరియా ఈ క్షిపణి ప్రయోగాన్ని అమెరికా అధ్యక్షుడు డొనాల్డ్ ట్రంప్‌తో పాటు ద.కొరియా, జపాన్ దేశాలు తీవ్రంగా ఖండించాయి.



సైనిక విన్యాసాలు నిర్వహిస్తున్న అమెరికా, దక్షిణ కొరియా బలగాలు

### దక్షిణ కొరియాలో...

# పడవ, ఆయిల్ ట్యాంకర్ ఢీ



**13 మంది మృతి, ఇద్దరు గల్లంతు**

**సియోల్:** దక్షిణ కొరియాలో ఓ పడవ, ఆయిల్ ట్యాంకర్ ఢీ కొన్నాయి. ఈఘటనలో 13మంది మృతి చెందగా, మరో ఇద్దరు గల్లంత య్యారు. ప్రత్యేక సహాయక బృందాలు రంగంలోకి దిగి గల్లంతైన మృత దేహాల కోసం గాలింపు చర్యలు చేపట్టాయి. స్థానిక అధికారులు తెలిపిన వివరాల ప్రకారం...దక్షిణ కొరియాలోని ఇంచియాన్ నగరానికి సమీపంలో చేపల వేటకు వెళ్లిన పడవ, ఆయిల్ ట్యాంకర్ ఢీకొన్నాయి. పడవలో 22మంది ప్రయాణికులున్నట్టు అధికారులు తెలిపారు. ఈ ప్రమాదంలో 13మంది మృతిచెందారు. సహాయక బృందాలు ఏడుగురిని రక్షించాయి. గల్లంతైన మరో ఇద్దరి కోసం సముద్రంలో గాలిస్తున్నారు. ప్రమాదానికి గల కారణాలు తెలియరాలేదు.

## కేసుల దర్యాప్తునకు సహకరిస్తున్న ట్రంప్ ట్వీట్స్




**సీఐఏ డైరెక్టర్ పోంపియో**

**వాషింగ్టన్ :** అమెరికా అధ్యక్షుడు డొనాల్డ్ ట్రంప్ ట్వీట్స్‌పై సెంట్రల్ ఇంటెలిజెన్స్ ఏజెన్సీ (సీఐఏ ) డైరెక్టర్ మైక్ పోంపియో ప్రశంసలతో ముంచెత్తారు. సామాజిక మాధ్యమాల్లో ట్రంప్ చేస్తున్న ట్వీట్స్ నిఘా వర్గాల కేసుల దర్యాప్తునకు సహకరిస్తున్నాయని అన్నారు. సిమి వ్యాలీలో జరిగిన ఓ కార్యక్రమంలో సీఐఏ చీఫ్ పాల్గొన్నారు. ట్రంప్ చేస్తున్న ట్వీట్స్ కారణంగా కేసుల దర్యాప్తునకు ఏమైనా ఇబ్బందవుతున్నదా ? అని మీడియా ప్రతినిధులు అడిగిన ప్రశ్నకు పోంపియో పై విధంగా స్పందించారు. 'కమాండ్ కంట్రోల్‌కు సంబంధించిన వివరాలు ట్రంప్ ట్వీట్స్ ద్వారా మాకు తెలుస్తున్నాయి. ఓ దేశాధ్యక్షుడి హోదాలో ఉండి కూడా ట్రంప్ దేశ ప్రగతికి సంబంధించిన అంశాలను ట్విట్టర్‌లో ట్వీట్ చేస్తున్నారు. ఆయన ట్వీట్స్ కారణంగా పలుకేసుల దర్యాప్తుల్లో పురోగతి సాధించాం' అని పోంపియో అన్నారు. కాగా, ఇదే కార్యక్రమంలో పాల్గొన్న సీఐఏ మాజీ చీఫ్ లియోన్ పనెట్టా మాత్రం ట్రంప్ ట్వీట్స్‌ని విమర్శించారు. ట్రంప్ చేస్తున్న పలు ట్వీట్స్ కారణంగా సమాజంలో అసహన భావాలు పెరిగిపోతున్నాయని అన్నారు. జర్మనీకి చెందిన ఓ మితవాద సంస్థ ముస్లిం మనోభావాలను దెబ్బతీసేలా ట్వీట్ చేసింది. ఆ సంస్థ ట్వీట్‌ను ట్రంప్ షేర్ చేయడాన్ని లియోన్ తీవ్రంగా వ్యతిరేకించారు.

# పీఆర్ రోడ్లకు నాణ్యతా పరీక్షలు

**జనవరి నుంచి ప్రత్యేక కార్యాచరణ**

- సన్నద్ధమవుతున్న ఉన్నతాధికారులు
- ల్యాబ్‌లు, రిపోర్టులు ఇక ఎప్పటికప్పుడే
- క్షేత్రస్థాయి ఇంజినీర్లు, కాంట్రాక్టర్లకు సవాలే



**నవతెలంగాణ బ్యూరో-హైదరాబాద్**

రాష్ట్రంలో పంచాయతీరాజ్ రోడ్ల నిర్వహణను మరింత పటిష్టం చేసేందుకు రంగం సిద్ధమవుతున్నది. ఉన్నతాధికారులు ఈమేరకు గట్టి చర్యలు చేపట్టేందుకు సన్నద్ధమవుతున్నారు. పంచాయతీరాజ్ ఇంజినీరింగ్ శాఖ ఆధ్వర్యంలో క్షేత్రస్థాయి పనులను తనిఖీ చేసేందుకు ప్రణాళిక రూపొందుతున్నది. రాష్ట్ర వ్యాప్తంగా 30 జిల్లాల్లో ఆయా పథకాలు, ప్రాజెక్టుల కింద నిర్మించిన రోడ్ల నిర్మాణాల నాణ్యతను పరీక్షించాలని ఇంజినీరింగ్ విభాగం ఉన్నతాధికారులు నిర్ణయించారు. దీంతో చీఫ్ ఇంజినీర్లు పక్కా వ్యూహంతో ముందుకుపోయేందుకు నివేదికలు తెప్పించుకునే పనిలో పడ్డారు. ఈనేపథ్యంలో ఈ నెల 16న హైదరాబాద్‌లో ఆయా జిల్లాల ఎస్‌ఈలు, ఈఈలు, ఎఈల ప్రత్యేక సమావేశం నిర్వహించారు. ఇంజినీర్ ఇన్ చీఫ్ ఎం.సత్యనారాయణరెడ్డి, క్వాలిటీ కంట్రోల్ విభాగం చీఫ్ ఇంజినీర్ కె.తిరుపతిరెడ్డి ఈ సందర్భంగా క్షేత్రస్థాయి ఇంజినీర్లకు దిశానిర్దేశం చేశారు. రాష్ట్రంలో గత మూడున్నరేండ్లుగా నిర్మించిన రోడ్లకు సంబంధించి నాణ్యతా పరీక్షలు చేయాలని చెప్పారు. సీఆర్‌ఆర్, ఎంఆర్‌ఆర్, పీఎంజీఎస్‌వై, నాబార్డు పనులకు నాణ్యతా పరీక్షలు చేయనున్నారు. ఈసారి కొత్తగా ఎస్టిమేట్లను సైతం పరిశీలించనున్నారు. పనులు చేసేందుకు ప్రతిపాదనలను రూపొందించేస్థాయి నుంచే సక్రమంగా ఉండేలా చూసుకోవాలని పంచాయతీరాజ్ ఇంజినీరింగ్ యంత్రాంగం నిర్ణయించింది. దీంతో ఇది క్షేత్రస్థాయి ఇంజినీర్లు, కాంట్రాక్టర్లకు సవాల్ కానుందని చెప్పారు.

**ప్రస్తుత పరిస్థితి**

రాష్ట్రంలో మొత్తం 30 జిల్లాల్లో 69,500 కిలోమీటర్ల మేర రోడ్లు ఉన్నాయి. ఇందులో 3300 కిలోమీటర్ల మేర సీసీ రోడ్లు, 22,086 కిలోమీటర్లు బీటీ రోడ్లు, 11,759 కిలోమీటర్ల మేర కంకర రోడ్లు, 32,660 కిలోమీటర్ల మేర మట్టిరోడ్లతోపాటు ఇతరాలు ఉన్నాయి. గ్రామీణ రోడ్ల నిర్మాణం(సీఆర్‌ఆర్), గ్రామీణ రోడ్ల నిర్వహణ(ఎంఆర్‌ఆర్), ప్రధానమంత్రి గ్రామీణ సడక్ యోజన(పీఎంజీఎస్‌వై), నాబార్డు తదితర పథకాల కింద ఆయా రోడ్లను నిర్మించారు. ఆరు నెలల క్రితం జాతీయ గ్రామీణ ఉపాధి హామీ చట్టం పథకం కింద నిర్మించిన సీసీ రోడ్లను సైతం తనిఖీ చేయనున్నారు. ఈ పనుల్లో అవినీతి జరిగిందనే ఆరోపణలు వచ్చిన సంగతి తెలిసిందే. ఈ తరుణంలో గత మూడున్నరేండ్లుగా రాష్ట్రంలో దాదాపు రూ.4500 కోట్లతో గ్రామీణ రహదార్లను నిర్మించిన సంగతి తెలిసిందే.

**ఎలా చేయనున్నారు ?**

రోడ్ల నిర్మాణాలు నిబంధనల మేరకు జరిగాయా ? లోపాలు ఉన్నాయా ? మార్గదర్శకాలను ఏమైనా ఉల్లంఘించారా ? తదితర అంశాల ఆధారంగా నాణ్యతా పరీక్షలు చేయనున్నారు. జనవరి నుంచి కార్యాచరణ ప్రారంభం కానుంది. ఇందుకోసం ప్రత్యేక ప్రణాళికను తయారుచేస్తున్నారు. తొలుత రాష్ట్రంలో ఎన్ని రోడ్లు ఉన్నాయి, వాటి నిర్మాణం ఎప్పుడు జరిగింది, ప్రస్తుత పరిస్థితి, నాణ్యతా ప్రమాణాలు, ఎస్టిమేట్లు, రిపోర్టులు తదితర విషయాలకు సంబంధించి ఆయా జిల్లాల ఎస్‌ఈలనుంచి నివేదికలు తెప్పించుకుంటున్నారు. ఆన్‌లైన్ ద్వారా రోడ్ల నాణ్యతా పరీక్షల అసైన్‌మెంట్లను చేయనున్నట్టు తెలిసింది.

**చేయబోయేదేంటి ?**

రోడ్ల నాణ్యత కోసం ల్యాబోరేటరీలు ఏర్పాటు చేయాలని ఇంజినీర్లు, కాంట్రాక్టర్లకు ఇంజినీర్ ఇన్ చీఫ్ సత్యనారాయణరెడ్డి, చీఫ్ ఇంజినీర్ తిరుపతిరెడ్డి ఆదేశాలు ఇచ్చారు. రోడ్ల నిర్మాణ ప్రాంతంలో ల్యాబోరేటరీ ఏర్పాటు చేయడం, అందుకు అవసరమైన సాంకేతిక సిబ్బందిని సమకూర్చుకోవడం, టెక్నికల్ ఇంజినీర్లను నియమించుకోవడం తదితర పనులు కచ్చితంగా కాంట్రాక్టర్లే చేయాల్సి ఉంది. క్షేత్రస్థాయి ఇంజినీర్లు ఆమేరకు జాగ్రత్తలు తీసుకోవాలి. పరీక్షలు కిలోమీటర్ల వారీగా నిర్వహించడం, నాణ్యతా ప్రమాణాలు సరిగ్గా ఉన్నాయా ? లేదా ? తదితర విషయాలు ఈసందర్భంగా పరీక్షిస్తారు. 100 శాతం మేర నాణ్యత కనపడితేనే స్థానిక ఏఈ గాని, డీఈ గాని నాణ్యతా సర్టిఫికెట్ జారీచేస్తారు. వెంటనే నాణ్యత రిపోర్టులు తయారీ చేసి ఎస్‌ఈ ద్వారా చీఫ్ ఇంజినీర్‌కు పంపిస్తారు. రోడ్డు మూల మలుపులు, కల్వర్టులు, పీఐ వాల్యూ, అదనపు వెడెల్పు, కెమెరా, రోడ్డుకు ఇరువైపులా పల్లాల పూడ్చివేత, కుంగిపోవడం తదితర అంశాలను సర్టిఫికెట్ జారీచేసే క్రమంలో పరిగణనలోకి తీసుకుంటారు. రోడ్ల నిర్మాణంలో మొరం, కంకర, బీటీని సైతం మార్గదర్శకాల మేరకు అంచనా వేస్తారు. ఇలా అనేక ప్రమాణాలను పరిశీలించనున్నారు. రోడ్ల నాణ్యత విషయంలో రాజీలేదని చీఫ్ ఇంజినీర్ తిరుపతిరెడ్డి 'నవతెలంగాణ'కు చెప్పారు. జనవరి నుంచి ప్రత్యేక తనిఖీలు ప్రారంభమవుతాయని అన్నారు. అన్ని రకాల రోడ్లకు నాణ్యతా పరీక్షలు నిర్వహించనున్నట్టు చెప్పారు. ఈసారి కొత్తగా ఎస్టిమేట్ల స్థాయి నుంచే తనిఖీలు చేయనున్నట్టు వివరించారు. పంచాయతీరాజ్ ఇంజినీరింగ్ విభాగంలో సీయూజీ సెల్‌ఫోన్ సిమ్‌లు ఇచ్చి నట్టు చెప్పారు. దాదాపు 1330 మంది ఇంజినీర్లకు వీటిని అంద జేసినట్టు తెలిపారు. పనిలో ఇబ్బందులు రాకుండా ఉండేందుకు ఒకే నెట్‌వర్క్‌ను ఎంచుకున్నట్టు అభిప్రాయపడ్డారు.

## నవతెలంగాణ విలేకరిపై దాడి

- వార్త ఎలా రాస్తావంటూ బెదిరింపు
- పత్తి వ్యాపారిపై కేసు నమోదు

**నవతెలంగాణ-చారకొండ**

పత్తి వ్యాపారి, అతని సోదరుడు 'నవతెలంగాణ' విలేకరిపై ఆదివారం దాడి చేశారు. దీనిపై స్థానిక పోలీసు స్టేషన్‌లో కేసు నమోదైంది. ఏఎస్ఐ భద్రీనాయక్ కథనం ప్రకారం..నవతెలంగాణ దినపత్రికలో చారకొండ మండల విలేకరిగా అక్కిశ్రీను విధులు నిర్వర్తిస్తున్నారు. మండలంలో పత్తి రైతులను దళారులు మోసం చేస్తున్నారంటూ గత శనివారం కథనం ప్రచురితమైంది. పత్తి వ్యాపారులు రాత్రి వేళల్లో తూకాలు వేస్తూ మోసాలకు పాల్పడుతున్న విధానాలపై కండ్లకు కట్టినట్టు రాశారు. దీన్ని జీర్ణించుకోలేని మండల పరిధిలోని జూపల్లికి గ్రామానికి చెందిన పత్తి వ్యాపారి నెండె భిక్షపతియాదవ్, అతని సోదరుడు సదరు విలేకరి శ్రీనుపై చేయి చేసుకున్నారు. కాలర్ పట్టుకుని దుర్భాషలాడారు. నీ అంతు చూస్తానని బెదిరింపులకు దిగారు. దీనిపై స్థానిక పోలీసు స్టేషన్‌లో శ్రీను ఫిర్యాదు ఆధారంగా పత్తి వ్యాపారి, అతని సోదరునిపై కేసు నమోదు చేసినట్టు ఏఎస్సై తెలిపారు.

## నేడు కొలువులకై కొట్లాట

**నవతెలంగాణ బ్యూరో - హైదరాబాద్**

ప్రభుత్వ రంగ సంస్థల్లో ఉన్న ఉద్యోగ ఖాళీలను ప్రకటించి, తక్షణమే నియామక ప్రక్రియ చేపట్టాలని డిమాండ్ చేస్తూ తెలంగాణ జేఏసీ ఆధ్వర్యంలో నిర్వహించ తలపెట్టిన కొలువులకై కొట్లాట సభ సోమవారం సరూర్‌నగర్‌లోని ఇండోర్ స్టేడియంలో జరగనుంది. ఉద్యోగాల భర్తీ కోసం క్యాలెండర్ విడుదల చేయాలని, స్థానిక పరిశ్రమల్లో తెలంగాణ బిడ్డలకే ఉద్యోగాలివ్వాలని , యువతకు నిరుద్యోగ భృతి చెల్లించాలని టీజేఏసీ డిమాండ్ చేస్తుంది. ఈ సభకు సీఎల్పీ ఉప నేత జీవన్‌రెడ్డి, టీటీడీపీ రాష్ట్ర అధ్యక్షులు ఎల్. రమణ, సీపీఐ(ఎం) రాష్ట్ర కమిటీ కార్యదర్శి తమ్మినేని వీరభద్రం, సీపీఐ రాష్ట్ర కార్యదర్శి చాడ వెంకట్‌రెడ్డి, బీజేపీ రాష్ట్ర అధ్యక్షులు కె. లక్ష్మణ్, నిరుద్యోగ జేఏసీ నేతలు, వివిధ ప్రజా సంఘాలు, కుల సంఘాల నేతలు పాల్గొంటారని టీజేఏసీ కార్యాలయం వర్గాలు తెలిపాయి.

## వికలాంగుల శాఖ విలీనానికి నిరసనగా...

**రవీంద్ర భారతి ముట్టడికి యత్నించిన వికలాంగులు**

- ముత్తినేని వీరయ్య సహా పలువురు నేతల అరెస్టు



**నవతెలంగాణబ్యూరో-హైదరాబాద్**

వికలాంగుల శాఖను మహిళా శిశుసంక్షేమ శాఖలో విలీనం చేయడాన్ని నిరసిస్తూ టీపీసీసీ వికలాంగుల విభాగం నేతలు ఆందోళన వ్యక్తం నిర్వహించారు. ఆదివారం రవీంద్రభారతిలో రాష్ట్ర ప్రభుత్వం అధికారికంగా నిర్వహించిన వికలాంగుల దినోత్సవాన్ని అడ్డుకునేందుకు యత్నించారు. వికలాంగుల సెల్ చైర్మెన్ ముత్తినేని వీరయ్య ఆధ్వర్యంలో ముట్టడికి ప్రయత్నించారు. వారిని పోలీసులు అడ్డుకుని అరెస్టు చేసి, గోపాల్‌పేట పోలీసుస్టేషన్‌కు తరలించారు. ఈ సందర్భంగా వీరయ్య మాట్లాడుతూ వికలాంగుల పట్ల ప్రభుత్వం నిర్లక్ష్యంగా వ్యవహరిస్తోం దన్నారు. వికలాంగుల సంక్షేమాన్ని విస్మరించడంలో భాగంగానే ఆ శాఖను మహిళా శిశు సంక్షేమ శాఖలో విలీనం చేసిందన్నారు. టీఆర్ఎస్ ఎన్నికల సమయంలో వికలాంగులకు ఇచ్చిన పది హామీలలో ఒక్క హామీ కూడా నెరవేర్చలేదని విమర్శించారు. వెంటనే వికలాంగుల శాఖ విలీనాన్ని ప్రభుత్వం ఉపసంహరించుకోవాలని డిమాండ్ చేశారు. నాయకులు దేశగానీ సతీష్‌గౌడ్, రాజారెడ్డి, వీరన్న, సురేష్, శంకర్‌నాయక్, రాములు నాయక్ తదితరులు పాల్గొన్నారు.

## వికలాంగులకు డబుల్ బెడ్‌రూం ఇండ్లు

- ప్రపంచ వికలాంగుల దినోత్సవ ఉత్సవాల్లో ఉప ముఖ్యమంత్రి మహమూద్ అలీ



**నవతెలంగాణ బ్యూరో - హైదరాబాద్**

ప్రభుత్వం చేపడుతున్న డబుల్ బెడ్‌రూం ఇండ్ల పంపిణీలో వికలాంగులకు ప్రాధాన్యం కల్పించేందుకు కృషి చేస్తున్నట్టు ఉప ముఖ్యమంత్రి మహమూద్ ఆలీ స్పష్టంచేశారు. ప్రస్తుతం ఉన్న 3 శాతం రిజర్వేషన్లను 6 శాతానికి పెంచే విషయమై ముఖ్యమంత్రి కేసీఆర్ దృష్టికి తీసుకెళ్తామని అన్నారు. ప్రపంచ వికలాంగుల దినోత్సవం సందర్భంగా వికలాంగులు, వయోవృద్ధుల సంక్షేమశాఖ ఆధ్వర్యంలో రవీంద్రభారతిలో ప్రభుత్వం రాష్ట్ర స్థాయి ఉత్సవాలను నిర్వహించింది. ఈ కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా ఉప ముఖ్యమంత్రి మహమూద్ ఆలీ హాజరై ప్రసంగించారు. వికలాంగుల సంక్షేమానికి ప్రభుత్వం కట్టుబడి ఉన్నదని చెప్పారు. వికలాంగుల సమస్యలు పరిష్కారమైతేనే బంగారు తెలంగాణ సాధ్యమన్నారు. అంతకుముందు స్త్రీ, శిశు , వికలాంగుల సంక్షేమశాఖ మంత్రి తుమ్మల నాగేశ్వర్‌రావు మాట్లాడుతూ విద్య, ఉపాధి రంగాల్లో వికలాంగులకు అవకాశం కల్పించేందుకు ప్రభుత్వం చిత్తశుద్ధితో పనిచేస్తున్నదని తెలిపారు. దివ్యాంగులకు హక్కులకు భద్రత కల్పించడానికి, అవసరాలను తీర్చడానికి, రాష్ట్ర బడ్జెట్‌లో కేటాయింపులు పెంచడానికి ప్రభుత్వం సిద్ధంగా ఉందని అన్నారు. వారు స్వశక్తితో సాధికారత సాధించేలా కృషి చేస్తున్నామని తెలిపారు. వికలాంగుల కోసం ప్రత్యేక వాహనాలు అందిస్తున్నామని చెప్పారు. వికలాంగులకు ప్రత్యేకంగా ఐటీ పార్కును నిర్మిస్తున్నట్టు తెలిపారు. ఇందుకు సీఎం కేసీఆర్ ఇటీవల మామిడిపల్లిలో 10 ఎకరాల భూమిని కేటాయించారని గుర్తుచేశారు. దీనిద్వారా ఐటీ రంగంలో వికలాంగులకు ఉపాధి కల్పించవచ్చని తెలిపారు. అనంతరం డెవలప్‌మెంట్ వెల్ఫేర్ అసోసియేషన్ ఆఫ్ బ్లైండ్ స్వచ్ఛంద సంస్థ ప్రధాన కార్యదర్శి చొక్కారావును ఉప ముఖ్యమంత్రి 'రోల్ మోడల్' పురస్కారంతో సత్కరించి జ్ఞాపికను బహుకరించారు. పలువురు వికలాంగులకు స్మార్ట్‌ఫోన్లు, ల్యాప్‌టాప్‌లు, కృత్రిమ అవయవాలను ప్రదానం చేశారు. దివ్యాంగుల కోసం మెట్రో స్టేషన్లలో ప్రత్యేక ఏర్పాట్లు చేసిన హైదరాబాద్ మెట్రోరైల్ ఎండి ఎన్‌వీఎస్ రెడ్డిని కూడా సన్మానించారు. కార్యక్రమంలో ఎస్సీ కార్పొరేషన్ చైర్మెన్ పిడమర్తి రవి, వికలాంగుల సహకార సంస్థ చైర్మెన్ కె.వాసుదేవరెడ్డి, మహిళా, శిశు, వికలాంగులు, వయోవృద్ధుల సంక్షేమశాఖ కార్యదర్శి ఎం.జగదీశ్వర్, డైరెక్టర్ శైలజ, దివ్యాంగులు, స్వచ్ఛంద సంస్థల ప్రతినిధులు, దివ్యాంగుల కోసం పనిచేసే సంస్థలు, కార్యకర్తలు భారీగా పాల్గొన్నారు.

## సమాన పనికి సమాన వేతనం

**ఐక్య ఉద్యమాలతోనే సాధ్యం: ఐఎఫ్‌టీయూ సదస్సులో వక్తలు**



**నవతెలంగాణ బ్యూరో - హైదరాబాద్**

ఐక్య ఉద్యమాలతోనే సమాన పనికి సమాన వేతనం సాధ్యమని పలువురు వక్తలు అన్నారు. సుప్రీం కోర్టు తీర్పు ప్రకారం సమాన పనికి సమాన వేతనం ఇవ్వాలని, కాంట్రాక్టు, ఔట్‌సోర్సింగ్ వర్కర్లను రెగ్యులరైజ్ చేయాలని డిమాండ్ చేస్తూ భారత కార్మిక సంఘాల సమాఖ్య (ఐఎఫ్‌టీయూ) తెలంగాణ రాష్ట్ర కమిటీ సదస్సు ఆదివారం బషీర్‌బాగ్ ప్రెస్‌క్లబ్‌లో నిర్వహించారు. ఈ సదస్సుకు సమాఖ్య రాష్ట్ర అధ్యక్షులు వి. కృష్ణ అధ్యక్షత వహించారు. ముందుగా మాజీ శాసన మండలి సభ్యులు కె. నాగేశ్వర్ మాట్లాడుతూ రాష్ట్రంలో 70నుంచి 80శాతం వరకు కాంట్రాక్టు, ఔట్‌సోర్సింగ్ ఉద్యోగులు, కార్మికులు పని చేస్తున్నారని చెప్పారు. కాంట్రాక్టు ఉద్యోగులు, కార్మికుల పర్మినెంట్ చేసే అంశాన్ని ప్రభుత్వం మానవీయ కోణంలో చూడాలని కోరారు. శ్రమను దోచుకోవద్దన్నారు. కార్మికులకు పీఎఫ్, ఇఎస్ఐ, కనీస సౌకర్యాలు కల్పించాలన్నారు. తెలంగాణ వస్తే కాంట్రాక్టు, ఔట్‌సోర్సింగ్ విధానమే ఉండబోదని, కార్మికులందరినీ క్రమబద్ధీకరిస్తామని ఇచ్చిన హామీని సీఎం నిలబెట్టుకోవాలని డిమాండ్ చేశారు. కనీసం సుప్రీం కోర్టు ఇచ్చిన తీర్పు ప్రకారం సమాన పనికి సమాన వేతనం అయినా అమలు చేయాలని డిమాండ్ చేశారు. రాష్ట్ర వ్యాప్తంగా నిర్బంధం కొనసాగుతోందన్నారు. ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలు ప్రభుత్వం దృష్టికి తీసుకొచ్చేందుకు వేదిక లేకుండా చేశారని ఆవేదన వ్యక్తం చేశారు. తెలంగాణ ధనిక రాష్ట్రమని సీఎం కేసీఆర్ పదేపదే చెప్పేవారని, ప్రజలందరూ ఆర్థికంగా అభివృద్ధి చెందకుండా, ధనిక రాష్ట్రం ఎలా అవుతుందన్నారు. నిజంగా ధనిక రాష్ట్రమైతే కార్మికులకు వేతనాలు పెంచడానికి ప్రభుత్వం మీనమేషాలు లెక్కించడం ఎందుకన్నారు. ఐఎఫ్‌టీయు రాష్ట్ర అధ్యక్షులు సూర్యం మాట్లాడుతూ కేసీఆర్ అధికారంలోకి రాక ముందు ఒకమాట, ఇప్పుడొక మాట మాట్లాడుతున్నారని చెప్పారు. ప్రజలకు ఇచ్చిన మాట నిలుపుకోవడంలో కేసీఆర్ విఫలమయ్యారని అన్నారు. కార్మిక శాఖ సమర్థవంతంగా పని చేయడం లేదన్నారు. అధికారులు ప్రభుత్వం తొత్తులుగా మారారని ఆవేదన వ్యక్తం చేశారు. ఐఎఫ్‌టియు రాష్ట్ర ఉపాధ్యక్షురాలు ఎస్ ఎల్ పద్మ మాట్లాడుతూ కస్తూర్బా పాఠశాలల్లో మౌలిక వసతులు లేక విద్యార్థులు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారని అన్నారు. ప్రభుత్వం ఉద్యోగాల కోసం విడుదల చేసే నోటిఫికేషన్లలో స్పష్టత ఉండడం లేదని విమర్శించారు. ఈ సదస్సులో ఐఎఫ్‌టీయు జాతీయ ప్రధాన కార్యదర్శి బి. ప్రదీప్, సహాయ కార్యదర్శులు జి. రామయ్య, కె. రాజన్న, టి. కృష్ణ తదితరులు పాల్గొన్నారు.

## వివక్ష లేని తెలుగు సమానత్వం కావాలి

**నందిని సిధారెడ్డి**

**నవతెలంగాణ - కల్చరల్ రిపోర్టర్**

అన్నిప్రాంతాల తెలుగు, సంస్కృతులు సమానమేనని, వివక్షకు గురైన తెలంగాణ ప్రాంత సంస్కృతి భాషను పునర్ లిఖించుకోవడానికే ప్రపంచ తెలుగు మహాసభలు అని తెలంగాణ సాహిత్య అకాడమీ అధ్యక్షుడు డాక్టర్ నందిని సిధారెడ్డి అన్నారు. తెలంగాణ రచయితల సంఘం ఆధ్వర్యంలో ఆదివారం తెలంగాణ సాహిత్య వికాసం సదస్సు తెలుగు విశ్వవిద్యాలయంలోని ఎన్టీఆర్ కళామందిరంలో ఆదివారం నిర్వహించారు. ముఖ్యఅతిథిగా పాల్గొన్న ఆయన మాట్లాడుతూ సృజనాత్మక, పరిశోధన ద్విపాస్యాలుగా తెలుగు భాషను అభివృద్ధి చేసుకోవాల్సిన అవసరం ఉందన్నారు. భాషా సాంస్కృతిక రంగాలలో తెలుగును సుస్థిరం చేయాలన్నారు. అన్ని ప్రాంతాల తెలుగు సమానమేనని భావించే ప్రయత్నం జరగాలన్నారు. అస్తిత్వ ముద్ర నిర్మాణం, ఆగమ భవిష్యత్ కోసం చరిత్ర పునర్ లిఖించుకోవాలని ఆయన సూచించారు. కీలకోపన్యాసం చేసిన ఆంధ్రజ్యోతి సంపాదకుడు కె.శ్రీనివాస్ మాట్లాడుతూ వేర్వేరు దృక్కోణాలలో ఆయా ప్రాంతాల వారీగా తెలుగుభాష, సంస్కృతుల చరిత్రలు ఉన్నాయన్నారు.

భాషాసంస్కృతుల విషయంలో తెలంగాణ తనను తాను దర్శించుకోవాలన్నారు. ప్రపంచ తెలుగు మహాసభలు సంబరాలుగా జరుపుకోవడం కన్నా భాష గురించి విస్తృత పరిశోధన, పదకోశాలు తయారు చేసుకోవాలన్నారు. వేర్వేరు ప్రాంతాల మాండలికాలను కలుపుకొని ఆంగ్ల పదాలను, సమానర్థాలను తెలుగులో రూపకల్పన చేయడం, గ్రంథాలయాల ఉనికిని పరిరక్షించుకోవడం లాంటివి తెలుగుభాష అభివృద్ధికి దోహదపడతాయన్నారు. ప్రెస్‌అకాడమీ చైర్మెన్ అల్లం నారాయణ, సాక్షి ఎడిటోరియల్ డైరెక్టర్ కె.రామచంద్రమూర్తి, నమస్తే తెలంగాణ సంపాదకుడు కట్టా శేఖర్‌రెడ్డి, తెలుగు విశ్వవిద్యాలయం ఉపకులపతి డాక్టర్ ఎస్వీ సత్యనారాయణ, సీఎం కార్యాలయ ప్రత్యేక అధికారి దేశపతి శ్రీనివాస్, సాంస్కృతిక డైరెక్టర్ మామిడి హరికృష్ణ పాల్గొన్న సభకు సంస్థ అధ్యక్షుడు డాక్టర్ నాళేశ్వరం శంకరం స్వాగతం పలికారు.

## పంచాయతీ ఎన్నికల్లో బ్యాలెట్ పేపర్ ఉపయోగించాలి: ఉత్తమ్

**నవతెలంగాణబ్యూరో -హైదరాబాద్**

ఈవీఎంలపై పలు అనుమానాలు వ్యక్తమవుతున్న నేపథ్యంలో రానున్న పంచాయతీ ఎన్నికలలో బ్యాలెట్ పేపర్ ఉపయోగించాలని టీపీసీసీ అధ్యక్షులు ఉత్తమ్‌కుమార్‌రెడ్డి డిమాండ్ చేశారు. పంచాయితీ ఎన్నికలు సాధారణ ఎన్నికలకు ముందే రానున్నాయని చెప్పారు. కాంగ్రెస్ పార్టీ కార్యకర్తలు, నాయకులు బూత్ స్థాయిలో పార్టీని బలోపేతం చేయడానికి చురుకుగా పనిచేయాలని కోరారు. ఆదివారం గాంధీభవన్‌లో సీనియర్ నేతలతో ఆయన సమావేశమయ్యారు. భారత ఎన్నికల కమిషన్ నిర్వహించిన ఓటర్ల నమోదు కార్యక్రమంలో పార్టీ కార్యకర్తలు చురుకుగా పాల్గొనాలని కోరారు. దీని పర్యవేక్షణ కోసం మాజీ ఎమ్మెల్యే మర్రి శశిధర్రెడ్డి నాయకత్వంలో కమలాకర్ రావు, శ్యామ్‌మోహన్, జి నిరంజన్‌లతో ఒక కమిటీని నియమించారు. కాంగ్రెస్ అధ్యక్షురాలు సోనియాగాంధీ జన్మదినం (డిసెంబర్9) సందర్భంగా కృతజ్ఞతా దినోత్సవం జరుపుతామని ఆయన చెప్పారు.

# ప్రొఫెసర్ కంచ ఐలయ్య అరెస్టు

**జీఎంపీఎస్ సభకు వెళ్లకుండా అడ్డుకున్న పోలీసులు**

- అరెస్టును అడ్డుకున్న జీఎంపీఎస్, సీపీఐ(ఎం) కార్యకర్తలు
- ఖమ్మంలో ఐదు గంటల పాటు తీవ్ర ఉద్రిక్తత
- కావాలనే అరెస్టు చేస్తున్నారు: కంచ ఐలయ్య



**నవతెలంగాణ-ఖమ్మం ప్రతినిధి**

ఖమ్మంలో జరుగుతున్న గొర్రెల, మేకల పెంపకందార్ల సంఘం(జీఎంపీఎస్) రాష్ట్ర ద్వితీయ మహాసభకు ముఖ్యఅతిథిగా వచ్చిన ప్రముఖ రచయిత, ప్రొఫసర్ కంచ ఐలయ్యను ఖమ్మంలోని సీపీఐ(ఎం) జిల్లా కార్యాలయం వద్ద పోలీసులు అదుపులోకి తీసుకున్నారు. ఐలయ్యను అరెస్టు చేసి జీపులో తరలిస్తుండగా సీపీఐ(ఎం), జీఎంపీఎస్ కార్యకర్తలు అడ్డుకున్నారు. వారిని పోలీసులు పక్కకు తోసేసి మరీ కూసుమంచి పోలీస్‌స్టేషన్‌కు ఐలయ్యను తీసుకెళ్లారు. అనంతరం అక్కడి నుంచి హైదరాబాద్‌కు తరలించారు.

ఆదివారం ఉదయం తొమ్మిది గంటలకు సీపీఐ(ఎం) ఖమ్మం జిల్లా కార్యాలయానికి ఐలయ్య వచ్చారు. దీంతో అక్కడకు భారీఎత్తున పోలీసులు వెళ్లారు. ఏసీపీ గణేష్ సీపీఐ(ఎం) కార్యాలయంలోకి వెళ్లి ఆ పార్టీ రాష్ట్ర కమిటీసభ్యులు నున్నా నాగేశ్వరరావు, జిల్లాకమిటీ సభ్యులు వై.విక్రమ్‌తో చర్చలు జరిపారు. ఐలయ్య సభకు వెళ్తే వైశ్యులు ఆందోళనకు దిగుతారన్న సమాచారం ఉందనీ, అందుకే అతన్ని హైదరాబాద్‌కు తిరిగి పంపాలని చెప్పి వెళ్లారు. దీంతో స్థానిక కార్పొరేటర్ అఫ్రోజ్ సమీనాతో కలిసి వారు ఖమ్మం సీపీ తఫ్సీర్ ఇక్బాల్‌ను కలిసి ఐలయ్యను బహిరంగసభకు వచ్చేలా అనుమతించాలని కోరారు. అందుకు సీపీ నిరాకరించారు. కానీ, ఆ తర్వాత ఐలయ్యను బహిరంగ సభ వద్దకు తీసుకువెళ్లేందుకు సీపీఐ(ఎం), జీఎంపీఎస్ కార్యకర్తలు, నాయకులు ర్యాలీగా బయలుదేరారు. ఈ క్రమంలోనే పోలీసులు బలవంతంగా ఐలయ్యను అదుపులోకి తీసుకున్నారు. అరెస్టు చేసి జీపులో తరలిస్తుండగా...కార్యకర్తలు రోడ్డుకు అడ్డంగా పడుకున్నారు. ఐలయ్యను విడుదల చేయాలంటూ నినాదాలు చేశారు. వారిని పోలీసులు పక్కకు తోసేశారు. ఏసీపీలు గణేష్, నరేష్‌రెడ్డి, సీఐలు నాగేంద్రాచారి, రాజిరెడ్డి, పలువురు ఎస్సైలు, భారీ సంఖ్యలో కానిస్టేబుళ్లు కలిసి ఐలయ్యను జీపులో ఎక్కించుకుని కూసుమంచి స్టేషన్‌కు తరలించారు. అక్కడి నుంచి హైదరాబాద్‌కు తరలించారు. ఉదయం తొమ్మిది గంటల నుంచి మధ్యాహ్నం రెండుగంటల వరకూ సీపీఐ(ఎం) కార్యాలయం ఎదుట భారీ సంఖ్యలో మోహరించిన పోలీసులు, మరోపక్క కార్యకర్తలతో పరిసర ప్రాంతాల్లో తీవ్ర ఉద్రిక్త వాతావరణం నెలకొంది.

**ఇది అప్రజాస్వామిక చర్య : కంచ ఐలయ్య**

తనను అరెస్టుచేయడం పూర్తిగా అప్రజాస్వామిక చర్యఅనీ, తన పుస్తకాన్ని సుప్రీంకోర్టుకూడా మద్దతిచ్చిందనీ, ఇటీవల తనను ఆర్యవైశ్యులు అడ్డుకున్న దాఖలాల్లేవని ప్రొ.కంచ ఐలయ్య అన్నారు. తనను పోలీసులు బలవంతంగా అరెస్టు చేయడాన్ని నిరసిస్తూ ఐలయ్య మీడియాతో మాట్లాడారు. తనను పోలీసులు ఉద్దేశపూర్వకంగానే తరుచూ అరెస్టు చేస్తున్నారన్నారు. తనజాతి ప్రజలు బహిరంగసభ పెట్టుకుంటే పాల్గొనడం తన నేరమా అని ప్రశ్నించారు. ఇది ముమ్మాటికీ రాజ్యాంగ విరుద్ధమేనన్నారు. సీపీఐ(ఎం) రాష్ట్ర కమిటీసభ్యులు నున్నానాగేశ్వరరావు, జిల్లాకార్యదర్శి వర్గసభ్యులు యర్రాశ్రీకాంత్ మాట్లాడుతూ ప్రభుత్వం పోలీసుల ద్వారా కావాలనే అక్రమఅరెస్టులకు పురిగొల్పుతోందన్నారు. ఖమ్మంలో ఎలాంటి అల్లర్లు జరక్కపోయినా ఐలయ్య వస్తే యాదవ, కురుమలకు ప్రభుత్వం చేస్తున్న దివాళాకోరు విధానాలను విడమరిచి చెపుతారనే ఉద్దేశ్యంతోనే ఇలా వైశ్యులు అల్లర్లుచేస్తారని డ్రామాలాడారని విమర్శించారు. ఐలయ్యఅరెస్టుపై ప్రభుత్వం తగిన మూల్యం చెల్లించక తప్పదన్నారు.


**ATHENA GLOBAL TECHNOLOGIES LIMITED**
(formerly known as Vjil Consulting Limited)
రిజిస్టర్డు ఆఫీస్: 3వ అంతస్తు, వెస్టర్న్ వింగ్, ఎన్‌సీసీ హౌస్, సర్వే నం.64, మధాపూర్, హైదరాబాద్-500 082.
**ప్రకటన**
SEBI (లిస్టింగ్ ఆబ్లిగేషన్స్ అండ్ డిస్‌క్లోజర్ రెగ్యులేషన్స్), 2015 యొక్క రెగ్యులేషన్ 29 మరియు 47ను అనుసరించి ఇందుమూలంగా ప్రకటన ఇవ్వడమేమనగా, 30 సెప్టెంబర్, 2017తో ముగిసిన రెండవ త్రైమాసికం కొరకు కంపెనీ యొక్క ఆడిట్‌చేయని ఆర్థిక ఫలితాలను పరిగణించుటకు మరియు ఆమోదించుటకు సోమవారం, 11 డిసెంబర్, 2017న కంపెనీ యొక్క బోర్డు ఆఫ్ డైరెక్టర్ల సమావేశం నిర్వహించబడును మరియు సమాచారం కంపెనీ మరియు స్టాక్ ఎక్స్ఛేంజ్ వెబ్‌సైట్‌పై కూడా అందుబాటులో ఉంటుంది.
సం/- ఎం. సత్యేంద్ర, మేనేజింగ్ డైరెక్టర్
ప్రదేశం: హైదరాబాద్ తేది: 01-12-2017

**CONCORD DRUGS LIMITED**
సర్వే నం.249, బ్రాహ్మణపల్లి గ్రామం, హాయత్‌నగర్ మండలం, రంగారెడ్డి జిల్లా- 501511, తెలంగాణ.
**ప్రకటన**
సెబీ (లిస్టింగ్ ఆబ్లిగేషన్స్ అండ్ డిస్‌క్లోజర్ రిక్వైర్‌మెంట్స్) రెగ్యులేషన్స్, 2015 యొక్క రెగ్యులేషన్ 47తో చదవబడు రెగ్యులేషన్ 29ను అనుసరించి ఇందుమూలంగా ప్రకటన ఇవ్వడమేమనగా 30.09.2017తో ముగిసిన త్రైమాసికం కొరకు ఆడిట్‌చేయని ఆర్థిక ఫలితాలను పరిగణించుటకు మరియు ఆమోదించుటకు కంపెనీ యొక్క రిజిస్టర్డు ఆఫీస్ వద్ద బుధవారం, 13.12.2017న ఉ.10.00గం.లకు కంపెనీ యొక్క బోర్డు ఆఫ్ డైరెక్టర్ల సమావేశం నిర్వహించబడును.
సదరు నోటీసు కంపెనీ యొక్క వెబ్‌సైట్ www.concorddrugs.in పై మరియు బీఎస్ఈ వెబ్‌సైట్ www.bseindia.com పై కూడా అందుబాటులో ఉంటుంది.
For Concord Drugs Limited సం/- ఎస్. నాగిరెడ్డి, డైరెక్టర్
ప్రదేశం: హైదరాబాద్, తేది: 01-12-2017. DIN: 01764665

**FENOPLAST LIMITED**
రిజిస్టర్డు ఆఫీస్: 306-308, వినోయ్ ట్రేడ్ సెంటర్, పాట్నీ సెంటర్, సికింద్రాబాద్-3
CIN: L25209TG1975PLC001942; www.fenoplast.com Email: info@fenoplast.com Ph: +91-40-27840322 Telefax :+91-40-27721739
**ప్రకటన**
సెబీ (లిస్టింగ్ ఆబ్లిగేషన్స్ అండ్ డిస్‌క్లోజర్ రిక్వైర్‌మెంట్స్) రెగ్యులేషన్స్, 2015 యొక్క రెగ్యులేషన్ 33ను అనుసరించి ఇందుమూలంగా ప్రకటన ఇవ్వడమేమనగా 30 సెప్టెంబర్, 2017తో ముగిసిన త్రైమాసికం మరియు అర్ధ వార్షికానికి ఆడిట్‌చేయని ఆర్థిక ఫలితాలను పరిగణించుటకు మరియు రికార్డుపై తీసుకొనుటకు కంపెనీ యొక్క రిజిస్టర్డు ఆఫీస్ వద్ద గురువారం, 14 డిసెంబర్, 2017న కంపెనీ యొక్క బోర్డు ఆఫ్ డైరెక్టర్ల సమావేశం నిర్వహించబడును. ... 04 డిసెంబర్, 2017 నుండి 16 డిసెంబర్, 2017 వరకు మూసివేయబడును.
For FENOPLAST LIMITED సం/- మేనేజింగ్ డైరెక్టర్
ప్రదేశం: సికింద్రాబాద్ తేది: 01-12-2017 DIN: 00160625

**OFFICE OF THE RECOVERY OFFICER, DEBTS RECOVERY TRIBUNAL-2 AT HYDERABAD**
1st Floor, Triveni Complex, Abids, Hyderabad-500001.
**R.P. NO. 1403 /2017 IN O.A. NO. 726/2017 (OLD OA NO. 517/2015)**
Indian Overseas Bank, Sainikpuri Branch, Secunderabad. ...Certificate Holder
Versus
M/s. ACCME Fashions ...Certificate Debtor
NOTICE OF DEMAND TO DEFENDANTS / CERTIFICATE DEBTORS
To
M/s. ACCME Fashions, Rep. by its Proprietor, Smt. M.Naga Parimala, 15-45, Balaji Nagar, Jawahar Nagar Village, Vidyanagar, Hyderabad-44. ...Defendant No.1
Take notice that R.P.No.1403/2017 IN O.A. No. 726/2017 (Old OA No.517/2015) has been forwarded by the Honourable Presiding Officer, Debts Recovery Tribunal-2, Hyderabad for recovery of an amount of Rs.15,35,684.48 (Rupees Fifteen lakhs thirty five thousand six hundred eighty four and paisa forty eight) plus interest and costs from you. You, the Defendants are hereby required to pay the amount of this notice by way of Demand Draft to be drawn in favour of "Debts Recovery Tribunal-2, Hyderabad" within 15 days from the date of publication of this notice. In case of default, steps will be taken under Rule 4 and 5 of the second schedule of Income Tax Act, 1961 and section 25 to 29 of Recovery of Debts Due to Banks & Financial Institutions Act, 1993.
Date: 21-11-2017 Place: Hyderabad (P.C.THOMAS) Recovery Officer-1 Debts Recovery Tribunal-2, Hyderabad

నవతెలంగాణ
దర్వాజ
హైదరాబాద్ 4
సోమవారం 4-12-2017

# సాహితీ సేద్యంలో ఆదిలాబాద్

ప్రజాఉద్యమాల స్ఫూర్తితో చైతన్యవంతమైనది ఉమ్మడి ఆదిలాబాద్ ప్రాంతం. తెలంగాణ ఉద్యమం జరుగుతున్న కాలంలో కవులు, రచయితలు అందించిన రచనలు ప్రజల్లో పోరాటదీప్తిని రగిలించాయి. దక్షిణ భారతానికి, ఉత్తర భారతానికి మధ్యన వారధిగా నిలిచినది ఈ ప్రాంతం. ఉత్తర తెలంగాణ జీవధారైన గోదావరి నది సవ్వడులు చదువుల తల్లి సరస్వతీ మాత కొలువైన బాసర నుండే వినిపిస్తున్నాయి.







**వన్నెతెచ్చిన సాహితీ ప్రముఖులు**

ఈ ప్రాంత ప్రజల కష్టాలకు, కన్నీళ్ళకు, సంతోషాలకు అక్షర రూపాన్నిచ్చారు సాహితీ సృజనకారులు. పద్యకావ్యాలు, శతకాలు, తత్త్వగీతాలు, పాటలు, నవలలు, కథలు, కవిత్వాలు, నానీలు, బుర్రకథలు, పల్లెటూరి ముచ్చట్లు, నాటికలు, ఆత్మకథలు, వ్యాసాల వంటి సాహితీ ప్రక్రియల్లో చేసిన రచనలు లభిస్తున్నాయి.

18వ శతాబ్దికి చెందిన మునిపంతులు జానపదశైలిలో రాసిన భారతం పద్యాలను నేటికి దేవాపూర్, కుచులాపూర్, బండల్ నాగపూర్‌లలో గ్రామీణులు పాడుకుంటున్నారు. ఆయన వారసత్వాన్ని ముందుకు తీసుకుపోవడంలో భాగంగా జిల్లాలోని ప్రాచీన పద్యసాహిత్యాన్ని అవగతం చేసుకోని రచనలు చేసిన పండితులున్నారు. అభినవపోతన బిరుదాంకితులు, ఆధునిక పద్యకవి వానమామలై వరదాచార్యులు (1912–1984). వరంగల్ జిల్లాలోని మడికొండ గ్రామంలో జన్మించిన స్థిరనివాసాన్ని మాత్రం చెన్నూరులో ఏర్పచుకున్నారు. సంస్కృతం, తెలుగు భాషల్లో పాండిత్యం కలవారు. 'పోతన చరిత్రము' రైతు బిడ్డ, కూలిపోయే కొమ్మ' రచనల ద్వారా పేరుపొందారు.

బహుముఖ ప్రజ్ఞావంతులు, బహుభాషాకోవిదులు, డా. సామల సదాశివ (1928–2012) అసిఫాబాద్ దహెగామ్ మండలంలోని తెనుగుపల్లెలో జన్మించారు. ఆదిలాబాద్ జిల్లా కేంద్రంలోనే స్థిరనివాసం ఏర్పరుచుకున్నారు. తెలుగు, సంస్కృతం, హిందీ, ఇంగ్లీష్, ఉర్దూ, ఫారసీ, మరాఠీ భాషలలో ప్రావీణ్యం పొందారు. తెలుగు సాహిత్యంలోని కావ్యాలు అర్థం కావాలంటే సంస్కృతం రావాలని, ఉర్దూ సాహిత్యంలోని మాధుర్యం తెలియాలంటే ఫారసీ రావాలని వాటిని నేర్చుకున్నారు. వాటి మూలాలను గ్రహించారు. ముప్పైకి పైగా రచనలు చేసినా 'యాది సదాశివ'గానే పేరొందారు. ప్రతిష్ఠాత్మకమైన కేంద్రసాహిత్య అకాడమీ అవార్డును పొందిన సాహితీ శిఖరమతడు.

దొరతనం మీద ధిక్కారపు స్వరం వినిపించి, అణచివేతకు గురౌతున్న దళితులకు అండగా నిలిచి, సామాజిక మార్పు కోసం నిరంతరం శ్రమించిన కలం యోధుడు గూడ అంజయ్య (1954–2016). మంచిర్యాల పరిధిలోని లింగాపూర్‌లో జన్మించినారు. ఉట్నూరు, హైదరాబాద్‌లలో ఆయన జీవన ప్రస్థానం సాగింది. 'ఊరుమనదిరా..' పాటలతో తెలంగాణ జానపదగేయసాహిత్యానికి ఊపునిచ్చారు. పాటలే కాకుండా కథలు, నవలలు, వ్యాసాలు, సినీగేయాలను కూడా రచించారు. ఆదివాసుల, దళితుల, బహుజనుల జీవితాలకు ఆయన రచనలు ఆనవాళ్ళు. ప్రజాపోరాటాల్లో పాల్గొని గళాన్ని వినిపించారు.

**కథా నవలల్లో...**

సామాజిక పరిశీలన, మానవీయ కోణంలో గమనించినట్లైతే ఎన్నో ఆసక్తికర ఆలోచింపజేసే అంశాలు కదలాడుతాయి. కొమరం భీం పోరాటం, ఇంద్రవెల్లి విషాదకరమైన ఘటన, సింగరేణి కార్మికుల పోరాటలు, రైతుల ఆక్రందనలు, మావోయిస్టుల భూపోరాటాలను ఈ ప్రాంత కథా నవల రచయితలు తమ రచనలకు నేపథ్యాలుగా స్వీకరించారు. అల్లం రాజయ్య 'వసంతగీతం, కొమరం భీమ్', పి.చంద్ 'శేషగిరి', వసంతరావు దేశ్‌పాండే 'అడవి, ఊరు, భూమి గుండ్రంగానే ఉంది', బి. మురళీధర్ 'నిరుడు కురిసిన కల', పులుగు శ్రీనివాస్ 'అడవి తల్లి సోంబాయి' నవలలు ఇక్కడి జీవనానికి ప్రతీకలుగా నిలిచాయి.

ఈ ప్రాంత సాహితీసేద్యంలో సృజనకారుల కొరతలేదు. విద్యాఫలాలు ఇప్పుడిప్పుడే అందుకుంటున్న తరాలున్నాయి. ఆధునిక జీవనశైలిని అలవర్చుకుంటు పడుతున్న వేదనలకు అక్షరరూపాన్నిస్తున్నారు. గోండు మహిళల రోజువారి అవస్థలను గోపిభాగ్యలక్ష్మి చిత్రీకరించిన కథ 'జంగుబాయి'. ఒక అమానవీయ దృశ్యాన్ని తన కథలో చూపించి జాతీయస్థాయిలో గుర్తింపు పొందింది. అన్ని భారతీయ భాషల్లోకి అనువాదమైంది ఈ కథ. అల్లం రాజయ్య 'సృష్టికర్తలు', ఫణికుమార్ 'గోదావరి గాథలు', బి.మురళీధర్ 'నెమలినార', సాహు కథలు, మెస్రం మనోహర్ 'ఇప్పపూలు', గోపగాని రవీందర్ 'ఉట్నూరు కథలు, ప్రయాణం, ' కథలతో పాటుగా, కిరణ్ వైద్య 'శికారి కథలు', మన్నెం ఏలియా, బి. వేణుగోపాల్‌ల కథలు ఆదిలాబాద్ ప్రజల మిశ్రమజీవనాన్ని పరిచయం చేస్తున్నాయి.




**పద్యగేయకావ్యాల్లో...**

ఉమ్మడి ఆదిలాబాద్ జిల్లాలో పద్యగేయకావ్యాలు, శతకాలు, తత్త్వాలు లెక్కకు మిక్కిలిగా వెలువడ్డాయి. మడిపెల్లి వీరయ్య 'విశ్వనాయక శతకం', మారుగొండ నర్సింహులు 'శ్రీనివాస శతకం', పొనకంటి రాజన్నకవి 'రామచంద్ర శతకం' నిర్మల శంకర శాస్త్రి 'నీలకంఠ భాష్యం', గోవిందుల శ్యామసుందరచారి 'సరస్వతీ శతకం', మడిపెల్లి భద్రయ్య 'శ్రీ జ్ఞాన సరస్వతీస్తవం', బొందిడి పురుషోత్తమరావు 'కళ్యాణ కుంతలము', కె. మురళీధర్ 'పల్లెశోభ', సత్యనారాయణగౌడ్ 'తెలంగాణ శతకం', పెండ్యాల కిషన్ శర్మ 'శ్రీవరద విజయం', ఉదారి నాగదాసు 'తత్త్వగీతాలు, తొడిశెట్టి రాములు 'ద్విపద రామాయణం', కోటగిరి నారాయణగౌడ్ 'మల్లిఖార్జున శతకం, ముద్దు రాజయ్య 'సాయి శతకం', ముత్యబోయిన మలయశ్రీ 'అమ్మభాష శతకం' వెలువడ్డాయి. ఇంకా యం.వి. పట్వర్ధన్, తుమ్మల మల్లారెడ్డి, మాడుగుల నారాయణమూర్తి, కోవెల శ్రీనివాసాచార్య, మాడుగుల భాస్కరశర్మ, మేకల రామస్వామి, ఏలేశ్వరం మాధవాచార్య, ముంజం జ్ఞానేశ్వర్, కురిమెల్లి లింగయ్య, గుండేటి యోగేశ్వర్, ఖుర్షీద్ అసర్, అమరవేణి రమణగౌడ్‌లు పద్య, శతక, ప్రక్రియల్లో రాసినవారు, రాస్తున్నవాళ్ళు ఉన్నారు.

**వచన కవిత్వంలో...**

ఇక్కడ వచన కవిత్వం దినదినాభివృద్ధిని సాధిస్తున్నది. ఈ ప్రాంత ప్రజాపోరాటాలకు తమ కవిత్వంతో సంఘీభావం తెలిపిన కవులున్నారు. ఆదివాసుల మరణాలకు స్పందించారు. మహిళలపైన జరుగుతున్న దాడులపైన, ప్రకృతి అందాలపైన అద్భుత కవితలను రాశారు. పద్యాలను, గేయాలను రాసిన కవులు కూడా వచన కవిత్వం రాయలేకుండా ఉండలేదు. ఆదివాసుల జీవనాన్ని పరిశోధన చేయడానికి వచ్చిన హైమన్‌డార్ఫ్ ఆదివాసుల ఆరాధ్యదైవం 'జంగుబాయి' గూర్చిన కవితను రాశారు.

ఉమ్మడి జిల్లా వ్యాప్తంగా తమ కవితలను సంకలనాలుగా ప్రచురించారు. దామెర రాములు తన కవితా సర్వస్వంకు 'దామెర కవిత'గా వెలువరించారు. అందులో 'నెత్తుటి వెన్నెల, కొర్రాయి, జయహె... తెలంగాణ', అప్పాల చక్రధార్ 'అవును నేను ఆదిలాబాదోన్నే, జలగ', మునిమడుగుల రాజారావు 'అనాగరిక గేయం, దు:ఖనది', తుమ్మల దేవురావ్ 'కచ్చురం, మట్టిపాదాలు', పత్తి శివప్రసాదు 'ఎరుపెక్కిన పత్తిపూలు', అంబటి నారాయణ 'తడి, నెత్తుటి మరకలు', సత్యనారాయణ గౌడు 'చిగురించిన తెలంగాణ ఆశ', ఉదారి నారాయణ 'అకుపచ్చని ఎడారి, యల్లైంది, మాగిపొద్దు,', గోపగాని రవీందర్ 'అంకురం, చిగురు, చెరగని సంతకం', జి.ఆర్ కుర్మే 'పునాది రాయి, తెలంగాణ, దమ్మపదం', తోకల రాజేశం 'చెమట చుక్కలు', నూటెంకి రవీంద్ర 'జాడ', అమరవేణి 'సంధించిన బాణం, సిరిపెల్లి బాపు 'వజ్ర సంకల్పం', తోటపెల్లి భూమన్న 'నా రేపటికై', కారం శంకర్ 'అశ్రుచైతన్యం, అక్షర శ్వాస', కమ్మల నర్సింహులు 'నిజ వాక్కులు', చరణ్‌దాస్ 'నెల పొడుపు', చందనగిరి దేవయ్య 'అమ్మ', యం.వి. పట్వర్ధన్ 'జనాంతర్గామి', కరాడి భూమన్న 'జంగల్', కరిపె రాజ్‌కుమార్ 'వనఝరీ', తుమ్మరి రామోహ్మన్‌రావు 'ప్రాణహిత, మువ్వలు' నల్లగొండ రమేష్, 'సరివన్నెల', వనపర్తి తిరుపతి 'గోడు', బోనగిరి రాజారెడ్డి 'విత్తనాల అలజడి', ఉషాకిరణ్, ఆశ కిరణ్‌ల 'రసఝరీ' వచన కవితా సంపుటాలు జిల్లా సాహిత్యాన్ని సుసంపన్నం చేశాయి.




చిందం ఆశన్న, రడాపు సంతోష్‌కుమార్, లింగాల రాజసమ్మయ్య, జాన పోశెట్టి, కొండగొర్ల లక్ష్మయ్య, జాధవ్ బంకట్‌లాల్, నెరెళ్ళ రంగాచార్య, నేరెళ్ళ హన్మంతు, భీం రెడ్డి, ఉదారి కవీశ్వరాచారి, తోట సదానందం, బోనగిరి రాజారెడ్డి, మడిపెల్లి హరనాథ్, హనుమాండ్లు, వర్తమాన సంఘటనల మీద మంచి కవిత్వం రాస్తున్నవారిలో కొందరు.

**సాహితీ సంస్థల కృషి...**

జిల్లావ్యాప్తంగా సాహిత్యం వెలుగులోకి రావడానికి ప్రధానంగా సాహితీ సంస్థల కృషి ఎనలేనిది. ముఖ్యంగా తెలంగాణ రచయితల వేదిక అందించిన స్ఫూరి చాలా విలువైనది. తెరవే జిల్లా శాఖ సంపాదకత్వంలో 'తండ్లాట', 'ఎల్గడి' కవితా సంకలనాలు వచ్చాయి. ప్రజల అకాంక్షలకు ఆ కవుల కవితలే అందుకు నిదర్శనమైనాయి. ఆదిలాబాద్ జిల్లా కేంద్రంలో 'ఉదారి నాగదాసు స్మారక సంస్థ' ఆధ్వర్యంలో గత రెండు దశాబ్దాలుగా యువకవుల కోసం ప్రతియేట కవిసమ్మేళనం నిర్వహించి బహుమతులను ప్రదానం చేస్తున్నారు ఉదారి నారాయణ కుటుంబ సభ్యులు.

> జిల్లావ్యాప్తంగా సాహిత్యం వెలుగులోకి రావడానికి ప్రధానంగా సాహితీ సంస్థల కృషి ఎనలేనిది. ముఖ్యంగా తెలంగాణ రచయితల వేదిక అందించిన స్ఫూరి చాలా విలువైనది. తెరవే జిల్లా శాఖ సంపాదకత్వంలో 'తండ్లాట', 'ఎల్గడి' కవితా సంకలనాలు వచ్చాయి. ప్రజల అకాంక్షలకు ఆ కవుల కవితలే అందుకు నిదర్శనమైనాయి. ఆదిలాబాద్ జిల్లా కేంద్రంలో 'ఉదారి నాగదాసు స్మారక సంస్థ' ఆధ్వర్యంలో గత రెండు దశాబ్దాలుగా యువకవుల కోసం ప్రతియేట కవిసమ్మేళనం నిర్వహిస్తున్నారు.

నిర్మల్ కేంద్రంగా నిర్మల్ కల్చరల్ ట్రస్ట్, డాక్టరు అప్పాల చక్రధారి స్థాపించిన 'కావేరి ఫౌండేషన్'ల ద్వారా సాహితీచైతన్యం కల్గిస్తున్నారు. ఉట్నూరు కేంద్రంగా గోపగాని రవీందర్ వ్యవస్థాపక అధ్యక్షులుగా 'ఉట్నూరు సాహితీ వేదిక'ను స్థాపించారు. ఈ వేదిక నుండి 'ఉట్నూరు కవిత 2015, ఉట్నూరు సాహితీ సంచిక, ఉట్నూరు సాహితీ కెరటాలు' సంకలనాలు వెలువడ్డాయి. అసిఫాబాద్ కేంద్రంగా మాడుగుల నారాయణమూర్తి ఆధ్వర్యంలో' అసిఫాబాద్ కవుల సంఘం'తో సాహితీ కార్యక్రమాలను చేస్తున్నారు. బోనగిరి రాజారెడ్డి నేతృత్వంలో 'యువకళాసమితి సాహితీ సంస్థ', వారు 'కాలం నవ్వుతుంది', యం.వి. పట్వర్ధన్ ఆధ్వర్యంలో మంచిర్యాల కేంద్రంగా 'సాహితీ సంరక్షణ సమితి'వారు 'సాహితీ విపంచి' పేరుతో నాలుగు సంకలనాలు వెలువరించడం అభినందనీయం. ఇంకా తెలుగు సాహితీ సదస్సు' ఆధ్వర్యంలో సామల సదాశివ గారిపైన, వానమామలై వరదాచార్యుల శత జయంతి సందర్భంగా స్మృతి సంచికలను వెలువరించారు.




**సంస్కృతి, సంప్రదాయాలపైన రచనలు**

జిల్లాలో మొదట్లో ఆదివాసి గోండు రాజుల పాలన సాగింది. అప్పుడు అంతగా అభివృద్ధి చెందని ఈ ప్రాంతంలో కనీసం రహదారుల సౌకర్యం కూడా లేదు. కవ్వాల్ అభయారణ్యం ప్రభావంతో వన్యప్రాణుల సంచారం ఉండేది. అయినప్పటికీ అడవి జంతువులు, దట్టమైన అడవుల్లో స్థావరాలను ఏర్పాటు చేసుకొని ఆదివాసులు జీవనం సాగించేవారు. క్రమంగా అవి గిరిజన గూడాలుగా రూపాంతరం చెందాయి. ప్రగతికి నోచుకొని గిరిపుత్రుల అభివృద్ధి కోసం పాలకులు చేసిన కృషి, గిరిజనుల్లో విద్య ప్రభావంతో క్రమంగా వారి జీవన విధానంలో మార్పును తెచ్చాయి. దీనికి తోడు మంచిర్యాల నుంచి ఆదిలబాద్ వరకు కవ్వాల్ అభయారణ్యం మీదుగా వేసిన రోడ్డు ప్రగతికి బాట వేసింది. దేశంలో అనేక జాతులు, కులాలు ఉన్నప్పటికి ఆదివాసులకంటూ ప్రత్యేకమైన సంస్కృతి, సంప్రదాయాలు కలిగి ఉన్నారు. వీరిలో గోండులు, నాయకపోడు, తోటి, మన్నెవార్, పర్ధాన్, కొలామ్, ఎరుకల, లంబాడ, కోయ, అంధ్ తదితర తెగల వారున్నారు. ఒక్కొక్క తెగ జీవన విధానం విభిన్నం. ఆదివాసుల పండుగలను, దేవతలను ఆరాధించటం పట్ల ఆసక్త చూపుతారు. కాలనుగుణంగా ప్రకృతి సంపదకు రక్షణ కల్పించాలని వేడుకుంటూ దేవతలను పూజిస్తారు. ఆ వివరాలతో కూడినదే మెస్రం మనోహర్ రాసిన 'గోండి సంస్కృతి, నాగోబా మహత్యం', మాడుగుల నారాయణ మూర్తి రాసిన 'గోండుల భాషా సంస్కృతులు–తెలుగు రచయితల కృషి', అంకం రాములు 'నిర్మల్ చరిత్ర, మడిపెల్లి భద్రయ్య 'మన ఆదిలాబాద్', ఉదారి నారాయణ 'లోగిలి' లాంటివి కన్పిస్తాయి.




ఈ రచనల్లో ఉమ్మడి ఆదిలాబాద్ జిల్లా వైవిధ్యం తొణికిసలాడుతున్నది. తెలంగాణ కాశ్మీర్ ఆదిలాబాద్ అని దామెర రాములు ఓ కవితలో అభివర్ణించారు. ఈ జిల్లా సాహిత్యంపైన అనేక పరిశోధనలు జరుగవలసి ఉన్నది. ఉమ్మడి ఆదిలాబాద్ జిల్లాలో గొప్ప సాంస్కృతిక వైభవం వ్యాప్తి చెందడం ఆనందకరం. ఈ ప్రాంత మాండలిక పదాలు, మాటల సొగసులు ప్రత్యేకమైనవి. వాటిని గూర్చిన పరిశోధనలు చేపట్టాలి. తెలంగాణ తెలుగు సాహిత్యం మరింత వికసించడానికి ఈ రచనలు దోహదం చేస్తున్నాయి. ఇది ఆదిలాబాద్ సాహిత్యానికి సంబంధించి ఓ విహంగ వీక్షణం మాత్రమే. తరచి చూస్తే అనేక పరిశోధనా గ్రంథాలకు తగిన విస్తృతి, వైశాల్యం ఉన్న సాహిత్యం అపారం.

**– గోపగాని రవీందర్, 9440979882**

---

## ముఖం తుడుచుకుంటుంది నగరం

పరిచిన తారుటద్దంలో  
ముఖం చూసుకుంటూ మెరిసిన నీలాకాశం  
కళ్ళు భ్రమిసే లోకం  
పిల్లర్లచుట్టూ పెనవేసుకున్న రైన్ బోలు  
పార్కింగ్ స్థలాల్లో కుర్చీలపై కూర్చున్న రంగోలి బతుకమ్మలు  
ఫ్లైయోవర్ గోడలపై వాలి పురివిప్పిన నెమళ్ళు  
దారిపొడువునా నక్షత్ర జలపాతాలు



చేతికందిన చీపురుకట్టకు  
రంగుడబ్బాల్లో ముంచిన కుంచకు  
విరామ సమయం లేదు  
అదంతా హైవే  
వర్షం పడిన ఆనవాళ్ళు,  
డివైడర్ల వంతెన కింద నిద్రిస్తున్న  
చెత్తకుప్పలు, మట్టి బెడ్డలన్నీ ఆకుపచ్చని పీఠభూములైనాయి

ఆమని రాకను తెలుపుతున్నట్టుంది నగరం  
పెళ్ళిబాజాలు, సన్నాయిమేళాలు  
సంగీత విభావరుల పలకరింపులు  
పూలచెట్ల గుసగుసలు

మేము మా వాడల్లో  
మామూలుగానే ఉన్నాం  
మధ్యతరగతి ముసుగులో  
ఆ వచ్చే ఆమనేదో  
ఈవంకో ఆవంకో నెలవంకై  
ఆవలితీరపు ప్రవాసం నుండి ఇంటికొచ్చిన పెనిమిటిలా  
మాటిమాటికి వస్తే బాగుండు  
వరదలా చొరబడి  
ఈ నగర గల్లీలన్నీ తిరిగితే బాగుండు

ఇక్కడందరు సూర్యుళ్ళవడానికి  
ఈ మట్టిని పట్టుశాలువలతో సన్మానించడానికి!

**– అరుణ నారదభట్ల, 9705015207**

---

## సైద్ధాంతికత కళవైపు నడిచే కవిత 'చేనుగట్టుపియానో'

సమకాలీనంగా వస్తున్న కవిత్వాన్ని పరిశీలిస్తే ముఖ్యంగా రెండు ప్రశ్నలు వస్తాయి. ఏది కవిత్వం అవుతుంది? ఎలా కవిత్వంగా రూపు దిద్దుకుంటుంది. మొదటి ప్రశ్నకు ఉరామరికగా సమాధానం వెతుక్కుంటే ఒక కవిలో వైవిధ్యమైన ఇతివృత్తాలు వస్తువులు కారణం. రెండవది అతనిలోని సామాజిక దృష్టి లేదా సామాజిక దృష్టితో కళాకాంతులు, అంతో ఇంతో తాత్విక దృష్టి కారణం. వర్తమానంలో వస్తున్న కవులను చదివినప్పుడు మొదటి ప్రశ్న రావడానికి కారణం ఇప్పుడు కవిత్వ సమాజం కూడా అనేక లక్షణాలతో వుంది. ప్రధానంగా సామాజికోద్వేగంతో వచ్చిన అంశాలు, కుల, మత, వర్గ, ప్రాంత అస్తిత్వాలకు నిలబడడం వల్ల ఏ కవిలో అయినా, కవిత్వంలో అయినా వస్తు వైవిధ్యం ఎక్కువ. నిజానికి సాంకేతికంగా ఇది చిత్తానికి సంబంధించిన ప్రశ్న. సైద్ధాంతిక దృష్టికన్నా సామీప్య సంఘటన, అనుభవం, అనుభూతి కవిని ఎక్కువగా వెంబడిస్తాయి. ఒక దశలో చెప్పుకుంటే సైద్ధాంతికత జ్ఞానసంబంధమైంది. సమీపంలోని సంఘటన జ్ఞానం కన్న అనుభవాన్నే ఇస్తుంది. జ్ఞానం అవగాహననిస్తుంది, దృశ్యం అనుభవాన్నిస్తుంది. ఈ రెంటినీ ఆనుకున్న చింతన అనుభవాన్ని బట్టి, అనుభూతిని బట్టి కళవైపుకో, తాత్త్వికతవైపుకో నడిపిస్తుంది. అందువల్ల వస్తువు, ఇతివృత్తం, జ్ఞానం వీటన్నిటి కన్నా చింతన బలమైంది. ప్రసాదమూర్తి కవిత్వం ఈ అనుక్రమానికి దగ్గరగా కనిపిస్తుంది.

వస్తువును తీసుకోవడంలోని కొత్తదనం, దాన్ని జ్ఞానం లోకి వంచుకోవడంలోని అనుభవం, కళగా, తాత్త్వికముఖంగా తీర్చిదిద్దడంలోని చింతన ఈ విషయాన్ని నిరూపిస్తాయి. 'కలనేత' నుంచి ఆయనలో కళ ఉన్నప్పటికి అందులో పూలే, అంబేడ్కర్ లాంటి వాళ్ళ సైద్ధాంతిక దృష్టిని అవగాహనలోకి తెచ్చుకున విధం, ఆ తరువాత సంపుటాల్లో దు:ఖాన్ని తీసుకొచ్చిన తీరు– కొల్లేటిపై రాసిన కవిత్వంలో సమకాలీన సంఘటనలను కవిత్వం చేసిన తీరులో అయనలో సైద్ధాంతికత కంటే చింతనే ఎక్కువగా కనిపిస్తుంది. కాని చెళ్ళున చరచి అణచివేతను పటంగట్టి చూపే మెరుపు మాత్రం తాజా సంపుటి 'చేనుగట్టు పియానో' దాకా మాసిపోలేదు. అయితే ఈ ప్రయాణంలో ప్రసాదమూర్తి వ్యంగ్యం నుంచి కళదాక, తాత్త్విక ధారదాక చేరుకున్నారని మాత్రం అర్థమౌతుంది. ఈ నిర్ధారణకోసం ఆయన వాక్యాల్లోని అభివ్యక్తిని గమనించాలి.

1. "నా దేశం తన రుతువుల్ని మార్చుకున్నట్టుంది/ వసంతం వస్తుంది కదా అని/ ఒళ్ళంతా కొమ్మలు సాచి నిల్చుంటే/ పూత మీదే నిషేధం కూత కూస్తూ చీకటివాలింది/ అయినా దేహమంత ఆకుపచ్చని దాహార్తి రగులుతూనే ఉంది" –(నాదేశం నారుతువు)

2. "నువ్వు వీథుల్లో నడుస్తున్నప్పుడు/ విగ్రహం నీ వెనుకే నడుస్తున్నట్టు అనిపిస్తుంది/ దాని నీడ చీకటి పులిలా/ గాండ్రించి నీ మీద పడుతుంది/ విగ్రహం నుండి ఇసుక పొరలు పొరలుగా నీ మీద రాలుతుంది/ అప్పుడు నువ్వు కడుపుకొట్టిన నదులు తెరలు తెరలుగా నవ్వుతాయి/ విగ్రహంలో రాళ్ళు నీ కండల్లో బద్దలవుతాయి/ నువ్వు కొల్లగొట్టిన కొండలు/ నీ ఒంట్లోంచి ఎండల్లా బయట పడుతాయి/ విగ్రహం ఒళ్ళంతా ఇనుప ఊచలు గోళ్ళలా మొలుస్తాయి" –(విగ్రహం–79)

ఈ వాక్యాలు బలమైన సైద్ధాంతిక పునాదిలోంచి వచ్చినవే. కాని వ్యక్తం గుణంలో కళ, తాత్వికత, భౌతిక సంఘటన, దానివెనుక ఉన్న సంఘటన ఒకటయ్యాయి. మానసికంగా ఈ అంశాలన్నిటి ఏకీకరణ (psychic synchronisation) జరిగింది ఇక్కడ. ఈ మానసిక ఏకీకరణ గురించి యూంగ్ తన ఉమ్మడి అచేతనలో చెప్పాడు.

the acausal connection of two or more psychic and physical henomena

(రెండు లేదా అంతకంటే ఎక్కువ మానసిక మరియు శారీరక దృగ్విషయాల అకారణ సంబంధం)

రెండవభాగంలో మానసిక ఏకాత్మకత ప్రత్యక్షంగా ఉంది. మొదటి దానిలో ఇది కళారూపంలో ధ్వనిగతంగా ప్రవర్తిస్తుంది. సాహిత్యంలో ఈ మానసిక ఏకీకరణను గురించి వర్డ్స్ వర్త్ బహుమూర్తి మత్వం (multipersonality)లో చెప్పాడు. ఆయన కవిత్వంలో ఈ విషయాన్ని urRehaman (యు.ఆర్.రెహమాన్) విశ్లేషించారు. మొదటి వాక్యాలన్నీ ధ్వనిగతమైనవి ధ్వని సంబంధమైన భాష (elliptical language) ఇందులో కనిపిస్తుంది. ఇందులో ప్రతీకల ద్వారా అంశం వ్యక్తమైంది. 'నిషేధం, దాహార్తి రగలడం' లాంటివి భౌతిక స్ఫృహను వ్యక్తం చేస్తున్నాయి. కొమ్మలు, రుతువులు, వసంతం ఇవన్నీ ప్రతీకలు. రెండవ వాక్యాలన్నీ మానసిక ప్రతిచర్యల బింబాలు. మానసిక ప్రతిఫలనం ఈ వాక్యాల్లో ఎక్కువ. వర్డ్స్ వర్త్ చెప్పిన విభ్రమం (hallucination), ఇక్కడ కనిపిస్తుంది. కాని ఇవన్నీ సైద్ధాంతికంగా వాస్తవ దృశ్యాన్ని సమర్థిస్తాయి. ఇక్కడ ప్రసాదమూర్తి సందర్భాన్ని ఎంత జాగ్రత్తగా కవిత్వం చేస్తున్నారో అర్థమవుతుంది.



చేనుగట్టు పీయానో, ప్రసాదమూర్తి కవిత్వం, పేజీలు :143, మూల్యం.100/-, ప్రతులకు : డా॥బి.ఆర్.వి.ప్రసాదమూర్తి. కేరాఫ్ కె.రాజేశ్వరీ దేవి, జవహర్ నవోదయ విద్యాలయ, గచ్చిబౌలి,హైదరాబాద్–500107

సడలని సైద్ధాంతిక, సామాజిక దృష్టి ఆధునిక కళగా పరిణమిస్తున్న సందర్భాన్ని చెప్పే వాక్యాలివి. ఎప్పుడైనా (పే.17), క్యాంపస్ (పే.27), నాక్కాస్తా చెప్పండి(44), తస్మాత్ జాగ్రత్త (పే.62) మొదలైన కవితలన్నీ ఇలాంటివే. 'చేనుగట్టు పియానో' కూడా ఒకింత చివరి వాక్యాలు ఇలాంటివే. వ్యక్తుల స్మృతులు, సహ ప్రయాణంలో అనుభూతిని చెప్పే కవితలూ ఉన్నాయి. ఇప్పుడు మీరు (పే.28), ఆ ఉదయానికి నమస్కారం (పే32) వీటిలో మొదటిది వ్యక్తుల జ్ఞాపకాలను, రెండవది సహానుభూతిని మోసేవి. వీటిలో నాస్టాల్జియా, అనుభూతి తప్ప సైద్ధాంతికతలు లేవు. సముద్రంతో సాయంత్రం (38పే), చిటారు కొమ్మ (85పే), ఆ ఊరు చూడాలి(103) లాంటి అనుభూతి పారమ్యం అంటిన కవితలు. వర్షం అందుకు మరొక బలమైన ఉదాహరణ. కురిసిన ఒక వర్షానికి సాధారణంగా ఒక కవితకు వస్తువయ్యేంత శక్తిలేదు. కేవలం అనుభూతి, కొన్ని ప్రతీకలు దాన్ని జీవితానికి ముడిపెట్టి కవిత్వం చేశాయి.

"తపోభంగం చేసిన తడి రాత్రిని శిక్షిద్దామని/ కసిదీరా వర్షాన్ని కావులించుకుంటూ ఇంటికి వెళ్ళాను/ పక్కమీద మల్లె చెట్టు ఫక్కుమంటే/ ఇంటి కప్పు మీద చివరి చినుకుల సంతకం చేసి/ వాన వెలిసిపోయింది/ నిన్న రాత్రి ఇంతకు వర్షం కురిసి నట్టా/ నేనే వర్షమైనట్టా?" – (వర్షం–పే.108)

సైద్ధాంతికత, స్వభావానుగతమైన అనుభూతి స్పందన, సంవేదన, సృజనశీలత పెనవేసుకున్న కవిత్వం 'చేనుగట్టు పియానో' –ఈ మధ్యకాలంలో మానసిక సంవేదన కవిత్వంలో ఎక్కువ. ప్రసాదమూర్తిలోనూ అది అంతే పాళ్లలో ఉంది. సమకాలీనంగా అంది వచ్చి స్పందించిన అంశాలనన్నింటినీ కవిత్వంచేసే సందర్భాలు ఇప్పుడెక్కువ. అన్ని సందర్భాలను కవిత్వం చేసే విషయంలో సిద్ధాంతమూ కళ, తాత్త్వికతవైపు నడుస్తుంది. ప్రసాదమూర్తి కవిత అందుకు నిదర్శనం. బహుశ: ఆయనొక్కడే కాదు కూడా.

**– ఎం.నారాయణ శర్మ**

---

### రేపు ఓయూ సాహిత్య వేదిక

నూరేళ్ళ ఓయూ సందర్భంగా వంద కలాలు, గళాలకు స్వాగతం పలుకుతోంది ఓయూ సాహిత్య వేదిక. ఈ నెల 5వ తేదీ హైదరాబాద్ ఉస్మానియా విశ్వవిద్యాలయం, ఆర్ట్ కాలేజీ, రూం నెం.57లో ఉదయం 10 గంటలకు ప్రారంభమయ్యే ఈ సభలో ప్రొ॥సి.హెచ్. గోపాల్‌రెడ్డి, ప్రొ॥సూర్యాధనంజయ్, ప్రొ॥రవీందర్, డా॥కేవీ రమణాచారి, డా॥నందిని సిధారెడ్డి, ప్రొ॥ఎస్వీ సత్యనారాయణ, అల్లం నారాయణ, డా॥అయాచితం శ్రీధర్, ప్రొ॥కోవెల సుప్రసన్నాచార్య, కె.కె.రంగనాథాచార్యులు, వరవరరావు, ముదిగంటి సుజాతారెడ్డి తదితరులు పాల్గొంటారు.

### 'తెలంగాణ భాష దేశ్య పదాలు' ఆవిష్కరణ

కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత డాక్టర్ నలిమెల భాస్కర్ రచన 'తెలంగాణ భాష దేశ్య పదాలు' వ్యాస సంపుటి ఆవిష్కరణ కార్యక్రమం ఈ నెల 9వ తేదీ ఉదయం 10గంటలకు కరీంనగర్ ఫిలిమ్ భవన్‌లో సాహితీ సోపతి ఆధ్వర్యంలో జరుగుతుంది. ఆచార్య ఎన్. గోపి, నగునూరి శేఖర్, అన్నవరం దేవేందర్, ఎం.నారాయణశర్మ, బూర్ల వేంకటేశ్వర్లు తదితరులు పాల్గొంటారు.

**– కూకట్ల తిరుపతి, 99492 47591**

### బొల్లోజుబాబాకు ఇస్మాయిల్ పురస్కారం

ఈ నెల 10 తేదీన సాయంత్రం 4.30 గంటలకు కాకినాడ రోటరీ సమావేశ మందిరంలో బొల్లోజు బాబాకు ఇస్మాయిల్ కవిత్వ పురస్కార ప్రదానం జరుగుతుంది. ఈ సభలో అద్దేపల్లి జ్యోతి, దాట్ల దేవదానం రాజు, ఆకెళ్ళ రవి ప్రకాష్, శిఖామణి, వాడ్రేవు వీరలక్ష్మీదేవి పాల్గొంటారు.

### బాల కథామంజరి కథల పోటీ

సాహితీ కిరణం, వి.బి.ఆర్. సోషల్ హెల్త్ ఫౌండేషన్ సంయుక్తంగా నిర్వహించే ఈ పోటీలో బాలలకు సులభంగా గ్రహింపుకు వచ్చే సరళమైఎన తెలుగులో చక్కటి కథలను రాసి పంపవలసిందిగా రచయిత(త్రు)లను ఆహ్వానిస్తున్నారు. పోటీకి పంపించే కథలు చేతి రాతతో అయితే 6 పేజీలు (ఎ4 సైజు), డిటిపి చేసినవైతే 3 పేజీలు వుండాలి. డిసెంబర్ 31వ తేదీలోపు సాహితీకిరణం, 11–13–154, రోడ్ నెం.3, అలకాపురి, హైదరాబాద్ – 500102 చిరునామాకు పంపాలి. ఇ మెయిల్ : sahithikiranam@gmail.com. వివరాలకు : 040–20060181

**– పొత్తూరి సుబ్బారావు**

### రచనల పోటీకి ఆహ్వానం

నెలవంక నెమలీక సాహిత్య మాసపత్రిక, మహేంద్రభారతి సంయుక్త నిర్వహణలో 'గంగిశెట్టి స్మారక మహేంద్రభారతి పురస్కృతి' కి గ్రంథాలను, కీ.శే.చెన్నరాయకిషోర్ పురస్కారం కోసం కవితలను ఆహ్వానిస్తున్నారు. పోటీకి ఆధునిక సాహిత్యం, ప్రాచీన సాహిత్యంపై మౌలిక విమర్శనా గ్రంథాలు పంపాలి. రచనలను డిసెంబర్ 30వ తేదీలోపు గంగిశెట్టి స్మారకమహేంద్రభారతీ పురస్కృతి, ఎడిటర్, నెలవంకనెమలీక సాహిత్యమాసపత్రిక, 15 –140, పి అండ్ టి కాలనీ, శ్రీకోదండరామనగర్, దిల్‌సుఖ్ నగర్, హైదరాబాద్ –500060 చిరునామాకు పంపాలి. వివరాలకు : 9866171648

రంగం ఏదైనా మహిళ తనదైన ముద్ర వేస్తుంది. అధికారంలో ఆమె ఉంటే... క్షేత్ర స్థాయిలో మార్పు కచ్చితంగా వస్తుంది. కానీ ఆమె పని చేసేందుకు అన్నిచోట్లా అడ్డంకులు. గెజిటెడ్ ఆఫీసర్ నుంచి... ఐఏఎస్ అధికారి దాకా... ఎవ్వరికీ తిప్పలు తప్పడం లేదు. పురుషాధిపత్యం ఓవైపు.. ప్రజాప్రతినిధులు ఒత్తిళ్లు మరోవైపు. కొన్నిచోట్ల కుల దురహంకారం కూడా కాపు కాస్తుంది. వెరసి అధికారులు ప్రజలకు మేలు చేయాలంటే పల్లేరు మీద నడక. అలాంటి ప్రయాణమే చేశారీ యువ అధికారి కొత్త శ్రీప్రియ.



# పల్లేరు మీద నడక...

మహబూబ్‌నగర్‌లో పుట్టి పెరిగిన శ్రీప్రియది మధ్య తరగతి కుటుంబం. తండ్రి జిల్లా పరిషత్‌లో సూపరింటెండెంట్‌గా పనిచేశారు. తల్లి జిల్లా ప్రభుత్వ ఆస్పత్రిలో ఫ్యామిలీ ప్లానింగ్ సూపర్‌వైజర్‌గా పనిచేశారు. ఆమెకు ఒక అక్క. అన్న. దళిత కుటుంబంలో పుట్టినా ఆత్మగౌరవంతో బతకడం నేర్పించాడు తండ్రి. అన్యాయానికి వ్యతిరేకంగా పోరాడాలని బోధించాడు. జిల్లా కేంద్రంలోనే ఇంటర్ దాకా చదివిన శ్రీప్రియ.. మెడిసిన్ చేయాలనుకున్నది. కానీ వెటర్నరీలో సీటు వచ్చింది. ఏం చేయాలన్న డైలమా. 'దానికంటే అగ్రికల్చర్ చేస్తే కనీసం వ్యవసాయానికి ఎంతోకొంత మేలు చేసిన వ్యక్తివవుతావు' అని సూచించాడు తండ్రి.

**వ్యవసాయంపై ఆసక్తితో...**

నిజానికి తనకు వ్యవసాయ నేపథ్యం లేదు. అయినా క్షేత్రస్థాయిలో పనిచేయాలన్న ఆసక్తితో రాజేంద్రనగర్‌లోని అగ్రికల్చరల్ యూనివర్సిటీలో బీఎస్సీ అగ్రికల్చర్‌లో చేరింది. మొదటి ఏడాదంతా మెడిసిన్ రాలేదన్న బాధ వెంటాడింది. ఈ బాధతో దేనిమీద ఏకాగ్రత పెట్టకపోతే... రెంటికి చెడ్డ రేవడి అవుతాననుకుంది. ద్వితీయ సంవత్సరం నుంచి కేంద్రీకరించింది. ప్లాంట్ పాథాలజీలో ఎమ్మెస్సీ కూడా చేసింది. విత్తనాలు వేయడం దగ్గరనుంచి పంట చేతికొచ్చేదాక స్టూడెంట్ దగ్గరుండి చూసుకోవాలి. ఆ క్రమమే ఆమెలో ఆసక్తిని రేపింది. కలుపు తీయడం, బురద పొలాల్లో దిగి పనిచేయడం... ఆమెను మూలాల్లోకి తీసుకెళ్లినట్టయ్యింది. ఆ తరువాత ఆరు నెలల పాటు ఓ రైతును పూర్తిగా అబ్జర్వ్ చేయాల్సి ఉంటుంది. కాలేజీలో ఎంత చదివినా... ఫీల్డ్‌లో ఉండే సమస్యలు వేరు. వాటిని దగ్గరగా తెలుసుకునే అవకాశం ఆమెకు మరింత నిబద్ధతతో పనిచేసేందుకు అవకాశం కల్పించింది.

**ఎక్స్‌టెన్షన్‌లో టెన్షన్...**

2006లో పీజీ పూర్తయ్యింది. ఏడాదిపాటు ప్రయివేటు సెక్టార్‌లో పనిచేసింది. 2009లో జడ్చర్లలోని ల్యాబ్‌లో ఉద్యోగం. తరువాత వ్యవసాయాధికారిగా ఆలేరుకు బదిలీ. వ్యవసాయం వెన్నెముక అని చెప్పుకుంటాం. కానీ రైతుకు గౌరవం ఉండదు. వ్యవసాయానికి ప్రాధాన్యం ఉండదు. ఏడాదికి ఒక్కసారి రైతు చైతన్య యాత్రలు. ఆ తరువాత పట్టించుకున్న పాపాన పోవు ప్రభుత్వాలు. డిపార్ట్‌మెంట్‌కి ఆఫీసులు ఉండవు. అధికారులకు వాహనాలుండవు. 50 ఏండ్లుగా ఉన్న విధానాలు. కొత్తదనం లేదు. ఓవైపు కార్పొరేట్ రోజురోజుకూ అభివృద్ధి చెందుతోంది. కానీ ప్రభుత్వం మాత్రం దానిని అందిపుచ్చుకుని, కార్పొరేట్‌కు పోటీనిస్తూ రైతును ప్రోత్సహించే పనిలో వెనుకబడిపోతోంది. వ్యవసాయంలో ప్రభుత్వం కంటే.. రైతే చాలా అప్‌డేట్ అయ్యాడు. వీటన్నింటినీ అర్థం చేసుకున్న ఆమె... ప్రభుత్వ పథకాలను రైతులకు చేరవేసేందుకు ప్రయత్నించింది. మండలంలోని బహదూర్‌పేట్, కొల్లూర్ రెండు గ్రామాలు దత్తత తీసుకున్నది. అధికారిగా తన పరిధిలోని గ్రామాలన్నీ చూస్తూనే ఈ రెండు గ్రామాలపై ప్రత్యేక శ్రద్ధ పెట్టింది. ఆ గ్రామాల్లో గతంలో పత్తి మాత్రమే పండించేవాళ్లు. దగ్గరుండి ఆరుతడి పంటలు వేయించింది. రైతులను సమన్వయం చేస్తూ సంఘాలు ఏర్పాటు చేసుకునేలా కృషి చేసింది. నాన్‌పెస్టిసైడ్ మేనేజ్‌మెంట్ చేసేలా ప్రోత్సహించింది.



ఉత్తమ అధికారిగా వరుసగా అవార్డులు అందుకుంటూ...

**పనితోనే సమాధానం...**

జడ్చర్లలోని ల్యాబ్‌లో పనిచేసినప్పుడు ఎలాంటి వివక్ష లేదు. ఎందుకంటే అక్కడినుంచి బయటికి ఎక్స్‌పోజ్ అయ్యే అవకాశమే లేదు. ఎక్స్‌టెన్షన్‌లోకి వచ్చేసరికి.. సహోద్యోగుల నుంచి ఇబ్బంది. మహిళా ఉద్యోగి అనగానే తక్కువ చేసి చూస్తారు. బాగా పనిచేస్తే 'ఎక్కువగా ఫోకస్ అవుతున్నావ'ంటారు. పని చేయకుండా ఉంటే 'ఏం చేయడం లేదు' అని రిపోర్టులు ఇస్తారు. నిజానికి పని తప్పించుకునే స్వభావం కాదామెది. అందుకే అడుగడుగునా తక్కువ చేయాలని చూడటం, డీఫేమ్ చేయడం మొదలయ్యింది. అన్నింటికీ తన పనితోనే సమాధానం చెప్పిందామె.



భర్త, కొడుకుతో కలిసి...

**పురుషాధిపత్యం...**

మహిళ అంటే... ఇంట్లో తాము చెప్పినట్టు విని, పడి ఉండే బానిస. ఆమె అధికారి అయితేనేం ఓ చులకనభావం. ఎంపీటీసీ, సర్పంచ్ స్థాయి ప్రజాప్రతినిధులు బాగా తాగి వచ్చి... 'పంటనష్టం అందరికి రాస్తావా? లేదా?' అని బెదిరింపులు. 'రేపటినుంచి ఇక్కడ ఎట్లా పనిచేస్తావో చూస్తాం' అని హెచ్చరికలు. ఉద్యోగితో మాట్లాడం రాదు. ఉద్యోగి అనే విషయం పక్కకు పెడితే మహిళతో ఎలా మాట్లాడాలో కూడా తెలియని ప్రజాప్రతినిధులు. ఆ బెదిరింపులకు భయపడలేదు. మరో మహిళా అధికారితో ఇలా మాట్లాడకుండా పాఠం చెప్పాలనుకుంది. పోలీస్ స్టేషన్‌కు వెళ్లింది. కేసు నమోదు చేయకుండా మూడు గంటలు కూర్చోబెట్టారు. చివరకు 'కాంప్రమైజ్ చేస్తం మేడం' అని పంపించే ప్రయత్నం చేశారు. కేసు పెడితే తప్ప కదలనని చెబితే అప్పుడు కేసు నమోదు చేశారు. 'కేసు పెట్టి ఉద్యోగానికి ఎట్లా వస్తుందో చూస్తాం' అని మళ్లీ బెదిరింపులు. 'ఎన్ని రోజులు భయపడతాం ఇట్ల. ఏం జరిగితే అది జరిగింది. కేసు పెట్టి పారిపోతే ఏముంది?' అని వెరవకుండా మళ్లీ ఫీల్డ్‌కు వెళ్లింది. ఆ కేసు ఫలితం... ఇప్పుడు డివిజన్‌లో ప్రతి మహిళా అధికారితో గౌరవంగా మాట్లాడుతున్నారు. అందుకే 'ఇబ్బందులు పెడితే... పడుతూ కూర్చోవద్దు. ప్రతిఘటన ఎవరో ఒకరు మొదలు పెట్టాలి' అంటుందామె.

**జెండర్ కాదు.. అధికారం మాత్రమే...**

స్థానిక ప్రజాప్రతినిధులయితే మారారు. కానీ ఎమ్మెల్యేస్థాయి ప్రజాప్రతినిధుల్లో మార్పు రాలేదు. తమ పార్టీవాళ్లకు అన్ని పథకాలు వర్తింపజేయాలంటారు. వర్షాలతో పంట నష్టం అందరికీ రాయాలని డిమాండ్ చేస్తారు. 'అదెట్లా సాధ్యం? అర్హులకు మాత్రమే రాస్తాం' అంటే... 'ఈ అధికారి మాకు వద్దు. వేరే ప్రాంతానికి బదిలీ చేయాలం'టూ ఒత్తిళ్లు. ఇక్కడ జెండర్ పనిచేయదు. ప్రజాప్రతినిధి స్థానంలో మహిళ ఉన్నా ఇలాగే ప్రవర్తిస్తారు. ఇక్కడ ఈ ప్రజాప్రతినిధి, ఇంకోచోటికి పోతే మరో వ్యక్తి. 'బదిలీ చేస్తావుంటే ఎందుకు వెళ్లిపోవాలి?' అని ప్రశ్నించుకుంది. 'మీకేం ప్రాబ్లం చెప్పండి. నచ్చకపోతే... ఏది నచ్చలేదో చెప్పండి. కరెక్ట్ చేసుకునే ప్రయత్నం చేస్త. లేదంటే ఆ బదిలీ ఆపమని చెప్పండి' అని అడిగింది. 'నాకు తెలియదమ్మా ఏడీఏ రాస్తే నేను సైన్ చేసిన. అయినా నువ్వు కేసులు బాగపెడ్తవంట కదా! నామీద కూడా కేస్ పెట్టు. దళిత్‌వి కదా కాబట్టి అట్రాసిటీ కేసు పెట్టు' సలహా ఇచ్చారా ప్రజాప్రతినిధి. 'నిజంగా కులం పేరుతో దూషిస్తే పెడతా. కానీ గతంలో వాళ్ల నన్ను మహిళగా తక్కువ చేసి మాట్లాడారు కాబట్టి పెట్టాను. కులం పేరుతో ఎందుకు పెడతా?' అని కొట్లాడింది. అయినా వారిలో స్పందన లేదు. ట్రిబ్యునల్‌కు వెళ్లింది. తాను చేసిన ఫీల్డ్ వర్క్‌కు సంబంధించిన డేటు డే డాక్యుమెంటేషన్ ఆధారాలిచ్చింది. బదిలీ ఆగింది.

> "మహిళలు లేకుండా వ్యవసాయం అసాధ్యం. అంత పనిచేస్తున్నా... మహిళలు ఎక్కడా ఫోకస్ అవ్వడం లేదు. అసలు మహిళలు రైతులుగానే గుర్తింపబడరు. కెపాసిటీ బిల్డింగ్ అనే ప్రోగ్రామ్స్ ఉంటాయి. అక్కడికి మహిళా రైతులే రారు. ఏదైనా చెప్పినప్పుడు పురుష రైతులు పాటించేదానికంటే... మహిళలు కచ్చితంగా అమలు చేస్తారు. మంచి ఫలితాలు తీసుకొస్తారు. అందుకే మహిళా రైతుల కోసం కెపాసిటీ బిల్డింగ్ ప్రోగ్రామ్స్ ఏర్పాటు చేయాలి."

**వెక్కిరింతలు... బదిలీలు...**

పథకం ఏదైనా అంతకుముందు ఎంపీటీసికి నాలుగు, సర్పంచ్‌కు రెండు.. ఎక్స్‌ట్రా... ఎక్స్‌ట్రా పంపకాలు. ఇక ట్రాక్టర్స్ లాంటి పెద్ద వస్తువులైతే... ఎమ్మెల్యే స్థాయిలో పైరవీలు. వాటన్నింటినీ బ్రేక్ చేసింది. మొదట అప్లై చేసుకున్న రైతులకే మొదట ఇవ్వడం. ఇక్కడే ఆ ప్రజాప్రతినిధులకు మళ్లీ ఆగ్రహం వచ్చింది. 'ప్రభుత్వమే మాది. మేం చెప్పినవాళ్లకు ఇవ్వవా?' అన్న కోపం. 'పొద్దున లేస్తే కష్టపడే రైతులు పది సార్లు తిరుగుతున్నరు. వాళ్లకు ఇవ్వకపోవడం దారుణం' అని ఆమె అంటే... 'లోకంల నువ్వొక్కదానివే ఉద్యోగం చేస్తున్నవా?' అని వెక్కిరింతలు. రోజుకు నాలుగైదు గంటల ప్రయాణం చేసి, ఇంటికి వచ్చి పిల్లలను చూసుకోవడానికి కూడా ఉండదు. అయినా నిబద్ధతతో పనిచేయాలంటే చేయనిచ్చే పరిస్థితి లేదు. ఉత్తమ అధికారిగా మూడేండ్లలో మూడు అవార్డులు తీసుకున్నది. 2017 ఆగస్టున మళ్లీ అవార్డు అందుకున్నదామె. అదే ఆ ప్రజాప్రతినిధికి నచ్చలేదు. తనను ఎదిరించిన వ్యక్తి, ట్రిబ్యునల్‌లో తనకు వ్యతిరేకంగా కేసు ఫైల్ చేసిన వ్యక్తి తన ముందే అవార్డులు తీసుకుంటుందా. మళ్లీ బదిలీ చేయాలంటూ ఒత్తిళ్లు మొదలయ్యాయి. ఫలితం.. ఇప్పుడు డిప్యుటేషన్ మీద వరంగల్ ల్యాబ్‌కు పంపించారు. 'నా కుటుంబం ఉన్న చోటకే వచ్చినందుకు, నా కొడుకును చూసుకునే అవకాశం ఉన్నందుకు సంతోషంగా ఉంటుంది. కానీ మంచిగా పనిచేసినందుకు... బదిలీ చేయడం బాధిస్తోంది. అధికారులకు స్వేచ్ఛగా పనిచేసే అవకాశం ఇవ్వాలి' అని ఆవేదనతో అంటోందామె.

కట్ట కవిత

## సాహిత్య, సంగీత కళాకారిణి

Women of the day



రేడియో వినే అలవాటు ఉన్న వారికి 'సృష్టిలో తీయనిది స్నేహమేనోయీ' అంటూ ఆహ్లాదంగా వినిపించే లలితగీతం గుర్తుండే ఉంటుంది. ఆ పాటను సుమధురంగా పాడినవారు ఇంద్రగంటి జానకీబాల. కవి, రచయిత్రిగానే కాదు సంగీత, సాహిత్య రంగాల్లో తనదైన శైలితో ఎంతో మంది అభినందనలు అందుకుంటున్నారు ఇంద్రగంటి జానకీబాల. కవయిత్రి, రచయిత్రి, ఆకాశవాణి లలిత సంగీత కళాకారిణిగా ఆమె సుపరిచితం. మెట్టినంట సాహిత్య పరిమళాలు ఆమెకు ఎంతో ఉపకరించాయి. ఎన్నో పరిశోధన గ్రంథాలను ఆమె వెలువరించారు.

రాజమండ్రిలో జన్మించిన జానకీబాల తల్లిదండ్రులు సూరి రామచంద్రశర్మ, లక్ష్మీనరసమాంబ. తణుకులోని సీతామహాలక్ష్మి జిల్లాపరిషత్ బాలికోన్నత పాఠశాలలో విద్యాభ్యాసాన్ని పూర్తిచేశారు. ఆ తర్వాత ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థలో ఉద్యోగంలో చేరారు. ఆకాశవాణిలో లలిత సంగీత కళాకారిణిగా జానకీబాల సుపరిచితం. సీతామహాలక్ష్మి జిల్లా పరిషత్తు బాలికోన్నత పాఠశాలలో తల్లి లక్ష్మీనరసమాంబ సంగీతం టీచరుగా పనిచేసేవారు. జానకీబాల ఆమె వద్ద సంగీతం అభ్యసించడం ప్రారంభించారు. క్రమంగా ఆకాశవాణి విజయవాడ కేంద్రంలో పలు కార్యక్రమాల్లో లలిత సంగీతాన్ని ఆలపించారు. లలితగీతమాలిక, శివాక్షరమాల పాడి కేసెట్లుగా విడుదల చేశారు. ఈటీవీ2లో 'పాటల పాలవెల్లి' కార్యక్రమాన్ని నిర్వహించారు. తెలుగు సినిమా పాటలపై 'పదలహరి' సంగీత కార్యక్రమాన్ని రేడియో స్పందనలో నిర్వహించారు.

జానకీబాల కవయిత్రిగా, రచయిత్రిగా, పరిశోధకురాలిగా అనేక గ్రంథాలు రచించారు. సినీనేపథ్య గాయనుల జీవిత విశేషాలతో కూడిన పరిశోధన గ్రంథం 'కొమ్మా కొమ్మా కోయిలమ్మా' ప్రచురించారు. 'కరిగిన హరివిల్లు', 'విశాల ప్రపంచం', 'వెన్నెలమెట్టి', 'ఆవలితీరం', 'నీలిరాగం', 'నిజానికి అబద్దానికి మధ్య', 'మాత బంధం', 'సజలనేత్రి', 'కనిపించేగతం', 'రాగ పల్లకి' ఇలా ఎన్నో నవలలు ఆమె రచించారు. జానకీబాల ఆరు కథాసంపుటాలను, పన్నెండు నవలలను, ఒక కవిత్వసంకలనాన్ని ప్రచురించారు. అనేక నాన్‌ఫిక్షన్ నవలలు కూడా రచించారు. అంతేకాదు పలు సావనీర్లకు, పుస్తకాలకు, సంకలనాలకు జానకీబాల సంపాదకత్వ బాధ్యతలు వహించారు.

తెలుగు సాహిత్యంలో సుప్రసిద్ధులైన ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి కొడుకు కవి, విమర్శకుడు ఇంద్రగంటి శ్రీకాంతశర్మని పెండ్లి చేసుకున్నారు. వారి కొడుకు ఇంద్రగంటి మోహనకృష్ణ సినీదర్శకుడు సంగీత, సాహిత్యరంగాల్లో కృషిచేసిన జానకీబాలను పలు పురస్కారాలు వరించాయి. 'కనిపించే గతం' నవలకు గాను పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం నుంచి ఉత్తమ రచయిత్రి పురస్కారం అందుకున్నారు. ❄

## హెర్బల్ నూనెలు...



ఇంట్లోనే స్వయంగా హెర్బల్ నూనెలను తయారు చేసుకోవచ్చు. సహజ సిద్ధమైన సౌందర్యసాధనాలు వాడటం వల్ల ఎలాంటి సమస్యలు ఉండవు. అయితే హెర్బల్ నూనెలను ఎలా తయారు చేసుకోవాలో తెలుసుకుందాం!

- సగం కప్పు కొబ్బరి నూనెలో రెండు మందార పువ్వులను వేసి పది నిమిషాలు మరిగించాలి. నూనె ఎరుపు రంగు వచ్చాక.. దించి చల్లారాక మందార పువ్వులను బయటకు తీసేయాలి. ఆ తర్వాత నూనెను ఒక డబ్బాలోకి వడపోసుకుంటే సరిపోతుంది.
- కరివేపాకు రెబ్బలు రెండు, రెండు చెంచాల మెంతులను తీసుకొని ఒక కప్పు కొబ్బరి నూనెలో కలిపి బాగా మరిగించుకోవాలి. ఈ మిశ్రమాన్ని ఓ బాటిల్‌లో భద్రపరుచుకుంటే సరిపోతుంది.
- బాదం నూనె, కొబ్బరి నూనె, ఆలివ్ నూనె, పొద్దుతిరుగుడు నూనెను సమపాళ్ళల్లో తీసుకోవాలి. వీటిని అన్నింటినీ ఒక పాత్రలో పోసుకొని విటమిన్ ఈ ట్యాబ్‌లెట్స్ కలపాలి. ఈ మిశ్రమాన్ని జుట్టుకు 30 నిమిషాలు పట్టించి గోరు వెచ్చటి నీటితో కడిగితే సరిపోతుంది.
- ఒక కప్పు కొబ్బరి నూనెలో చిన్న సైజు కలబంద ముక్కను, మల్లెపువ్వు ఆకులను వేసి ఓవెన్‌లో పది నిమిషాలు పెట్టాలి. అంతే సహజ సిద్ధమైన కండీషనర్ రెడీ!

ఈ నూనెలు వాడటం వల్ల ఎలాంటి సైడ్‌ఎఫెక్ట్సు వుండవు. వీలైనంత వరకు హెర్బల్ నూనె ఉపయోగించడం వల్ల ఆరోగ్యానికి, అందానికి మేలు చేస్తుంది. ❄

## మీ చేతులకు పనిచెప్పండి..!

**సెల్ఫ్ డిఫెన్స్**

**మహిళలను విలాసవస్తువులుగా చూపించే పురుషాధిక్య సమాజంలో మనం ఉన్నాం. సినిమాలు, సీరియల్స్‌లోనే కాదు గేమ్‌షోలలోనూ ఆడవారిని అనమానపరిచే వ్యాఖ్యలు, దాడులు ఎక్కువగా కనిపిస్తున్నాయి. ఇలాంటి పరిస్థితుల్లో మహిళలు ఒంటరిగా కనిపిస్తే మగవాడు దాడులకు పాల్పడే ప్రయత్నం చేస్తాడు. మహిళల మెడలోని గొలుసులను, భుజానికి వేసుకునే హ్యాండ్ బ్యాగ్‌లను ఎక్కువగా దొంగలు టార్గెట్ చేస్తారు. ఒంటరిగా వెళ్తున్న మహిళలను హగ్ చేసుకుని వేధించే ప్రయత్నం దుండగులు చేస్తారు. తమను రక్షించుకోవడం, తమ వద్ద ఉన్న విలువైన వస్తువులను కాపాడుకోవడం రెండూ మహిళలు నేర్చుకోవాలి. దొంగలైనా, దుండగులైనా ఎలాంటి దాడులైనా సరై తమ చేతులనే ఆయుధాలుగా చేసుకుని వారికి తగిన బుద్ధి చెప్పాలి.**



1

నడుచుకుంటూ వెళ్తున్న అమ్మాయి హ్యాండ్ బ్యాగ్‌ను వెనుక నుంచి వచ్చిన వ్యక్తి పట్టి లాగాడు. వెనకవైపు నుంచి ఎవరో బలంగా బ్యాగ్ లాగినట్టు తెలియగానే ఏ మాత్రం భయపడవద్దు. మీరు వెనక్కి తిరుగుతూనే మీ చేతిని ఎత్తి బ్యాగ్ పట్టుకుని లాగుతున్న వాడి చేతి మీదుగా వేసి వాడి చేతిని లాక్ చేయాలి. బ్యాగ్ లాగడానికి ప్రయత్నంచిన దొంగ మీ చర్యతో ఎటు కదలలేక బిత్తరపోతాడు.



2

ఇదే అనువుగా మీ శరీరంలోని బలమంతా ఉపయోగించి ఆ వ్యక్తి ముఖంపై ఒక షాట్ ఇస్తే చాలు. వెనువెంటనే అటాక్ చేసే మీ టెక్నిక్స్ మీ బలాన్ని రెట్టింపు చేస్తాయి. మిమ్మల్ని మీరు కాపాడుకోవడానికి ఇవి ఎంతో ఉపయోగపడుతాయి.

ఒంటరిగా కనిపించే మహిళల వస్తువులు దోచుకోవాలన్నా.. వేధించాలన్నా భయపడేలా మీ చేతులకు పనిచెప్పాలి. రోడ్డుపై ఒంటరిగా నడిచేసమయంలో చేతులు ఖాళీగా ఉంచుకోండి(సెల్‌ఫోన్‌తో బిజీగా ఉంటున్నారు) ఏ వైపు నుంచి సమస్య వచ్చినా వెంటనే మీరు అలర్ట్ కావాలి.

మహిళలను వేధించడానికి అనువైన సమయం కోసం ఎదురుచూసే వారు కొందరుంటారు. ఇక్కడ ఒంటరిగా కనిపించిన అమ్మాయిని కౌగిలించుకునే ప్రయత్నం చేస్తున్నాడు. వదులు.. వదులు అంటూ పెనుగులాడుతారు. కానీ, సెల్ఫ్ డిఫెన్స్ టెక్నిక్స్ తెలిసిన వారు వెంటనే అలర్ట్ అయిపోతారు. మీ రెండు చేతుల బొటనవేళ్లను ఎదుటివ్యక్తి కండ్లపై పెట్టి రఫ్ చేయాలి.



3

సున్నితమైన కంటిపై ఒత్తిడి కలగగానే వెంటనే ఆ వ్యక్తి మిమ్మల్ని వదిలేసి మంటగా ఉన్న తన కండ్లను రక్షించుకునే ప్రయత్నం చేస్తూ కిందికి వంగుతాడు. ఈ కాస్త సమయం చాలు మీరు ఆ వ్యక్తి నుంచి మిమ్మల్ని మీరు రక్షించుకోవడానికి. అయితే ఆ వ్యక్తిని వదిలేయవద్దు. మరోసారి ఎవరినీ వేధించకుండా గట్టిగా బుద్ధి చెప్పి పోలీసులకు పట్టించాలి.



4



ఎన్. లక్ష్మీ రవి,
ఇంటర్నేషనల్ గోల్డ్ మెడలిస్ట్,
రుద్రమదేవి సెల్ఫ్ డిఫెన్స్,
గాంధీనగర్, హైదరాబాద్.
9490239170,
9949039049



## 12, 13 తేదీల్లో దేశవ్యాప్త సమ్మె

- బిఎస్ఎన్ఎల్ అసోసియేషన్ అఖిల భారత ప్రధాన కార్యదర్శి కె.సెబాస్టిన్

**శ్రీకాకుళం :** బిఎస్ఎన్ఎల్ సంస్థలో ప్రయివేటీకరణ విధానాలను వ్యతిరేకిస్తూ ఈ నెల 12, 13 తేదీల్లో దేశవ్యాప్త సమ్మె చేపడుతున్నట్లు సంచార్ నిగమ్ ఎగ్జిక్యూటివ్ అసోసియేషన్ అఖిల భారత ప్రధాన కార్యదర్శి కె.సెబాస్టిన్ తెలిపారు. శ్రీకాకుళంలో ఆదివారం జరిగిన సర్కిల్ ఎగ్జిక్యూటివ్ సమావేశంలో ఆయన మాట్లాడారు. బిఎస్ఎన్ఎల్‌లోని అన్ని సంఘాలతో పాటు అధికారులు, ఉద్యోగులు సమ్మెలో భాగస్వామ్యమవుతారని తెలిపారు. కేంద్ర ప్రభుత్వ కార్పొరేట్ విధానాలతో బిఎస్ఎన్ఎల్ మనుగడ ప్రశ్నార్థకమైందని ఆవేదన వ్యక్తం చేశారు. ప్రయివేటీకరణ దిశగా ప్రభుత్వం అడుగులు వేస్తుండడంతో సంస్థ నష్టాల్లో కూరుకుపోతోందని తెలిపారు. ఫలితంగా ఈ సంస్థలో యువతకు ఉద్యోగావకాశాలు మృగ్యమయ్యాయన్నారు. ప్రయివేట్ ఆపరేటర్లకు ఇస్తున్న స్వేచ్ఛ బిఎస్ఎన్ఎల్‌కు కేంద్రం ఇవ్వడం లేదని తెలిపారు. టెలికాం రంగంలో ఆపరేటర్లందరూ నష్టాల్లో ఉన్నారని, వారితో పోల్చుకుంటే బిఎస్ఎన్ఎల్ కొంత మెరుగ్గా ఉందన్నారు. సెల్ టవర్లకు ప్రత్యేక కంపెనీ ఏర్పాటు చేయాలన్న కేంద్ర ప్రభుత్వ నిర్ణయాన్ని సంస్థలో పనిచేస్తోన్న 1.81 లక్షల ఉద్యోగులు ముక్తకంఠంతో వ్యతిరేకిస్తున్నారని తెలిపారు. ఈ నెల 15, 16 తేదీల్లో భువనేశ్వర్‌లో నిర్వహిస్తున్న అసోసియేషన్ జాతీయ వర్కింగ్ కమిటీ సమావేశంలో నూతన కార్యవర్గం ఎన్నిక జరగనుందన్నారు. కేంద్ర ప్రభుత్వ కార్మిక వ్యతిరేక విధానాలు, సంస్థ మనుగడకు తీసుకోవాలని చర్యలపై ఈ సమావేశంలో చర్చిస్తామని తెలిపారు. సమావేశంలో అసోసియేషన్ రాష్ట్ర అధ్యక్ష, కార్యదర్శులు ఎ.విశ్వనాథం, ఉమామహేశ్వరరావు, రాష్ట్ర ప్రతినిధులు సిహెచ్.వెంకటరావు, రవికుమార్‌రెడ్డి పాల్గొన్నారు.

## చట్టాన్ని పూర్తిగా ఉల్లంఘించారు

- మాజీ ఎంపి మిడియం బాబూరావు

**అమరావతి :** పోలవరం ప్రాజెక్టు ప్రాంతం, ముంపు మండలాల్లో పునర్నిర్మాణం, పునరావాసానికి అసరమైన చర్యలేవీ ప్రభుత్వం ఇంతవరకు తీసుకోలేదు. పూర్తి చట్ట విరుద్ధంగా ప్రాజెక్టు నిర్మిస్తోంది. చట్టం ప్రకారం పునరావాసులను తరలించిన తరువాతే నిర్మాణాలు మొదలుపెట్టారు. ప్రభుత్వం ముందుగానే ప్రాజెక్టు చేపట్టి నీటి నిల్వ చేయడం ద్వారా బలవంతంగా గ్రామాలను ఖాళీ చేయించాలనే ఆలోచన చేస్తోంది. దీనివల్ల పునరావాసులకు ఇవ్వాల్సిన డబ్బును మిగుల్చుకోవచ్చనే ఆలోచన చేస్తోందని భద్రాచలం మాజీ ఎంపి డాక్టర్ మిడియం బాబూరావు అన్నారు. పోలవరం ప్రాజెక్టు పరిధిలో పునరావాసం, పునర్నిర్మాణంపై ఆయన ప్రజాశక్తికి ప్రత్యేక ఇంటర్వ్యూ ఇచ్చారు.

**స్థల సేకరణ చేయలేదు**

చట్ట ప్రకారం పునర్నిర్మాణం కోసం చేయాల్సిన పనులేవీ చేయలేదు. పోలవరం, దేవీపట్నం మండలాల్లో 12 గ్రామాల్లో 1300 ఇళ్లు ఇప్పటికీ పూర్తి చేయేలదు. దాదాపు 400 గ్రామాల్లో 83 వేల ఇళ్లు కట్టాలంటే ఎంత కాలం పడుతుందో ప్రభుత్వమే సమాధానం చెప్పాలి. కనీసం పునరావాసానికి అవసరమైన భూమిని కూడా ఇంతవరకూ సేకరించలేదు. 2018 నాటికి నీటిని నిల్వ చేస్తామంటున్నారు. అంటే గ్రామాలన్నీ మునిగిపోవాలని చంద్రబాబు చెబుతున్నారా.

**పునరావాసం కోసమే 1.06 లక్షల ఎకరాలు**

పునరావాసం కోసం మొత్తం 1.06లక్షల ఎకరాల భూమి సేకరించాల్సి ఉంది. ఇంతవరకు సేకరించలేదు. వాటిల్లో కాలనీలూ కట్టలేదు. ఈ రోజు వరకూ 24 వేల ఎకరాలు సేకరించారు. నిర్మించిన అతికొద్ది ఇళ్లూ నాసిరకంగా ఉంటున్నాయి. పునరావాసం అంటే అంతకు ముందున్న గ్రామంలో సదుపాయాలన్నీ నూతనంగా నిర్మించేచోట కల్పించాలి. కానీ రోడ్లు కూడా వేయలేదు. మంచినీటి సదుపాయం లేదు. విద్యుత్ కనెక్షన్లూ ఉండటం లేదు. ప్రజలను తీవ్ర ఇబ్బందులు పెడుతున్నారు.

**గిరిజనులకు భూమికి భూమి ఇవ్వాలి**

గిరిజన ప్రాంతాల్లో వారిని తరలించాల్సొస్తే వారికి భూమి కి భూమి ఇవ్వాలని చట్టం చెబుతోంది. ప్రభుత్వం మాత్రం వారికి ఎంతో కొంత ముట్టజెప్పి వారిని బయటకు పంపించేద్దామనుకుంటున్నారు. ఇది సరైన పద్ధతి కాదు. గిరిజనులు ఒక ప్రత్యేక జీవన విధానం ఉంటుంది. చట్టం ప్రకారం వారికి న్యాయం చేయాలి. పునరావాసం కల్పించాలి. అలా కాకుండా ముందుగానే ప్రాజెక్టు నిర్మిస్తామంటే ప్రజలను నట్టేట ముంచటమే అవుతుంది.

## ధరలకనుగుణంగా మెనూ ఛార్జీలు

**చిత్తూరు :** ప్రభుత్వ పాఠశాలల్లో మధ్యాహ్న భోజనం వంటి పెడుతున్న వంటమ్మలకు కనీస వేతనం అమలు చేసి, పెరిగిన ధరలకు అనుగుణంగా మెనూ ఛార్జీలు పెంచాలని ఎపి మధ్యాహ్న భోజన కార్మికుల సంఘం రాష్ట్ర కార్యదర్శి రమాదేవి అన్నారు. ఆదివారం స్థానిక సిఐటియు కార్యాలయంలో మధ్యాహ్న భోజన కార్మికుల చిత్తూరు జిల్లా కమిటీ సమావేశాన్ని నాగరాణి అధ్యక్షతన నిర్వహించారు.

# పోలవరానికి జాతీయ హోదాలో మెలిక

**అమరావతి:** 2014లో రాష్ట్రం విడిపోయిన సమయంలో పోలవరం ప్రాజెక్టును తామే వంద శాతం ఖర్చు చేసి పూర్తి చేస్తామని కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది. అయితే ఈ ప్రకటనలోనే ఒక మెలిక పెట్టింది. 2010-11 అంచనాల మేరకేనంటూ ట్విస్ట్ ఇవ్వడం విశేషం. అంటే కేవలం 16 వేల కోట్ల రూపాయల అంచనాలకే తాము పరిమితమవుతున్నట్లు కేంద్రం స్పష్టం చేసింది. ఈ ట్విస్ట్‌ను కొన్ని రోజులపాటు రాష్ట్ర ప్రభుత్వం గమనించలేక... కేంద్రాన్ని పొగడ్తలతో ముంచెత్తింది. గుర్తించిన తరువాత కూడా దీనిపై స్పందించని చంద్రబాబు సర్కారు అంచనాలను ఇష్టానుసారంగా పెంచేసింది. కొత్త భూసేకరణ, పునరావాస చట్టం వల్ల నిర్వాశితులకు భారీగా నిధులు ఇవ్వాల్సి వస్తోందని చెప్పిన రాష్ట్ర ప్రభుత్వం అంచనాలను పలు దఫాలుగా పెంచేశారు. ఇదే సమయంలో పాత 16 వేల కోట్ల రూపాయల అంచనాలకే తాము పరిమితమవుతామని కేంద్రం తేల్చిచెప్పేసింది. జాతీయహోదాలో మెలిక పెట్టినప్పుడే గట్టిగా డిమాండ్ చేసి ఉంటే పరిస్థితి మరోలా ఉండేదోనన్న అభిప్రాయం వ్యక్తమవుతోంది.

**పునరావాసంకు నిధులు ఎలా?**

దీంతో భూసేకరణ, పునరావాస వ్యయాన్ని ఎవరు భరించాలన్న దానిపై సందిగ్ధత వీడడంలేదు. ప్రస్తుత ఆర్థిక పరిస్థితి నేపథ్యంలో కేంద్రం కూడా భారీ నిధులను భరించే పరిస్థితిలో లేదని అధికారులు చెబుతున్నారు. రాష్ట్రంలో కూడా ఆర్థిక పరిస్థితి ఇలాగే ఉండడంతో వేల వేల కోట్లు ఎలా భరిస్తుందన్న ప్రశ్నలు ఉత్పన్నమవుతున్నాయి. ఈ నేపథ్యంలో పోలవరం నిర్మాణాన్ని పూర్తి చేయడం అసాధ్యమన్న భావాన్ని కూడా సీనియర్ అధికారులు బాహాటంగానే వ్యక్తం చేస్తున్నారు. భూసేకరణ, నిర్వాశితులకు పునరావాసం వ్యయాన్ని తాము ఇచ్చేది లేదని అనేక సందర్భాల్లో కేంద్రం తేల్చిచెప్పినా.. చంద్రబాబు ఎన్నడూ ప్రశ్నించలేదు. కేవలం ఒకటి రెండు లేఖలు కేంద్రానికి రాసి అధికారులు చేతులు దులుపుకొన్నారు. పునరావాస నిధులను రాష్ట్రం భరించే పరిస్థితి లేదన్నది కూడా అందరికీ తెలిసిన విషయమే. విచిత్రమేమిటంటే ఎక్కడ ఇటువంటి వాస్తవాలు చెప్పాల్సి వస్తుందోనన్న భయంతో ఇరిగేషన్ అధికారులు మీడియాతో మాట్లాడడమే మానేసారు. ఇతర రాష్ట్రాల సమస్యలు కూడా పోలవరాన్ని వేధిస్తున్నాయి. ఈ ప్రాజెక్టును కేంద్రమే పూర్తి చేయాలని విభజన చట్టంలో ఉన్నప్పటికీ, అందుకు అవసరమైన చర్యలు మాత్రం కనిపించడం లేదు. పోలవరంపై సుప్రీం కోర్టులో దాదాపు ఆరు కేసులు, ఒడిషా, రాష్ట్ర హైకోర్టుల్లో ఒక్కో కేసు, కేంద్ర గ్రీన్ ట్రిబ్యునల్‌లో రెండు కేసుల చొప్పున పెండింగ్‌లో ఉన్నాయి. వాటిని త్వరగా పరిష్కరించేందుకు కేంద్రం జోక్యం చేసుకోవాల్సి ఉన్నప్పటికీ ఆ విధమైన స్పందన కనిపించడం లేదు. అవి పరిష్కారమైతే తప్ప పోలవరం ముందుకు సాగే అవకాశాలు లేవు. అలాగే చత్తీస్‌గఢ్, ఒడిషాల్లోని ముంపు ప్రాంతాల్లో నిర్వహించాల్సిన పబ్లిక్ హియరింగ్ కూడా చాలా సంవత్సరాలుగా జరగడం లేదు.



**కేంద్రానికి ఇచ్చేస్తే మంచిది**

పోలవరం ప్రాజెక్టు సకాలంలో పూర్తి కావాలంటే నిర్మాణ బాధ్యతను కేంద్రానికి అప్పగిస్తే మంచిదని గతం నుంచి ఉన్నతాధికారులు తేల్చిచెబుతున్నారు. దీనివల్ల స్థానికంగా విమర్శలు కూడా తప్పించుకోవచ్చునని వారు స్పష్టం చేశారు. అయితే దీనిని ముఖ్యమంత్రి చంద్రబాబు, ఇరిగేషన్ మంత్రి దేవినేని ఉమా పెడచెవిన పెట్టారు. విభజన అనంతరం పోలవరాన్ని జాతీయ ప్రాజెక్టుగా ప్రకటించడంతో పాటు తామే స్వయంగా పూర్తి చేస్తామని కేంద్రం స్పష్టం చేసింది. అయితే ముఖ్యమంత్రి మాత్రం దీనికి అంగీకరించక తామే పనులు కొనసాగిస్తామని, నిధులు కేంద్రం ఇస్తే సరిపోతుందని పేర్కొంది. ఆ తరువాత కాలంలో పనుల తిరోగమనం, నిధుల వ్యయంలో అసంబద్ధ విధానాల కారణంగా కేంద్రం అనేక సార్లు తీవ్ర స్థాయిలో అసంతృప్తి వ్యక్తం చేసింది. చివరకు పోలవరం అథారిటీ కూడా రాష్ట్ర ఇంజనీర్ల వైఖరిపై అసహనం వ్యక్తం చేసింది. ఈ నేపథ్యంలోనే కేంద్రానికి ప్రాజెక్టు నిర్మాణ బాధ్యత ఇచ్చేయాలని తాము గతంలో చేసిన సూచనలను పాత అధికారులు గుర్తు చేస్తున్నారు. 2015లోనే లిఖిత పూర్వకంగా ఈ సూచన వచ్చినట్లు సీనియర్ ఇరిగేషన్ అధికారి ఒకరు వెల్లడించారు.

**రాజీ ధోరణి ఎందుకు**

పోలవరంపై రాష్ట్ర ప్రభుత్వం అనుసరిస్తున్న విధానాన్ని కూడా అనేక మంది తప్పుపడుతున్నారు. నిధులు ఇవ్వకపోయినా కేంద్రంపై ఎదురుదాడి చేసేందుకు ముఖ్యమంత్రి వెనుకాడడంపైనా వారు సందేహాలు వ్యక్తం చేస్తున్నారు. కేవలం వచ్చే ఎన్నికల కోసమే రాజీ ధోరణి అవలంభిస్తున్నారని ఉన్నతాధికారి ఒకరు వ్యాఖ్యానించారు. ఇప్పటికే ప్రత్యేక హెూదా, రాజధాని, బకాయిల చెల్లింపులు వంటి వాటిపై రాజీ విధానాన్నే అవలంభిస్తున్న రాష్ట్ర ప్రభుత్వం తాజాగా పోలవరంపైనా ఇదే విధానం అనుసరించడం సరికాదని వారు తేల్చి చెబుతున్నారు. నిజంగా పోలవరంపై రాష్ట్రం ఎదుర్కొంటున్న అపవాదును తొలగించుకోవాలనుకుంటే నిర్మాణ బాధ్యతను కేంద్రానికి ఇచ్చేస్తే సరిపోతుందని వారు స్పష్టం చేస్తున్నారు.

**వంశధారకు ప్రతీకారంగానే**

ఇటీవల వంశధార ప్రాజెక్టు నిర్మాణంపై ఒడిషా ప్రభుత్వానికి ఎదురుదెబ్బ తగిలింది. ఈ ప్రాజెక్టుకు వ్యతిరేకంగా ఒడిషా ప్రయత్నించినప్పటికీ, ట్రిబ్యునల్‌లో ఆంధ్రాకు అనుకూలంగా తీర్పు వచ్చింది. దీనిని జీర్ణించుకోలేకపోయిన ఒడిగా ప్రతీకారంతో పోలవరంపై అభ్యంతరాలను మళ్లీ తెరపైకి తీసుకువచ్చింది.

తాజాగా దీనివల్ల రాష్ట్రానికి తీరని అన్యాయం జరుగుతుందని, అందువల్ల పోలవరాన్ని అడ్డుకోవాలని కేంద్రంపై వత్తిడి తీసుకువచ్చింది. ఈ నేపథ్యంలోనే కొత్త టెండర్ల పేరుతో పనులను నిలిపివేయాలని కేంద్రం ఆదేశించడం విశేషం. అయితే ఒడిషాతో మాట్లాడి పనులకు అభ్యంతరం లేకుండా చూడాలని కేంద్రం వద్దకు వెళ్లాలని రాష్ట్ర ప్రభుత్వం భావిస్తోంది.

# అనసూయకు కన్నీటి వీడ్కోలు

- ఆశ్రం ఆసుపత్రికి భౌతికకాయం అప్పగింత
- నమ్మిన సిద్ధాంతం కోసం కడవరకూ నిలిచిన ధీశాలి : పి.మధు
- బివి రాఘవులు ప్రభృతుల సంతాపం



అనసూయ భౌతికకాయం వద్ద పి.మధు నివాళి

**ఏలూరు :** ఏలూరులో శనివారం కన్నుమూసిన సిపిఎం సీనియర్ నేత అన్నే అనసూయ (92)కు పార్టీ శ్రేణులు, వివిధ పార్టీల నేతలు, బంధువులు కన్నీటి వీడ్కోలు పలికారు. ఆదివారం ఉదయం సిపిఎం రాష్ట్ర కార్యదర్శి పి.మధు తదితరులు ఆమె భౌతికకాయం వద్ద నివాళులర్పించారు. పలు ప్రజా సంఘాలకు చెందిన మహిళా నేతలు ఆమె భౌతికకాయాన్ని మోసుకొచ్చి వ్యాన్‌పై ఎక్కించి ఘనమైన అంతిమ వీడ్కోలు పలికారు. ఆదివారం ఏలూరులోని శాంతినగర్ నుంచి ప్రారంభమైన అనసూయ అంతిమయాత్ర టిటిడి కళ్యాణ మండపం, బస్టాండు సెంటర్, ఫైర్‌స్టేషన్, జ్యూట్‌మిల్లు, వసంతమహల్ సెంటర్ మీదుగా పవర్‌పేటలోని సిపిఎం జిల్లా కార్యాలయానికి చేరుకుంది. అక్కడ కొద్దిసేపు నివాళులర్పించిన అనంతరం కర్రల వంతెన సెంటర్, పాత బస్టాండు, రైల్వేస్టేషన్ మీదుగా ఆశ్రం ఆసుపత్రికి చేరుకుంది. అనసూయ తాను జీవించి ఉండగా తీసుకున్న నిర్ణయం మేరకు, శనివారం రాత్రి ఆమె నేత్రాలను విజయవాడలోని ఎల్‌వి ప్రసాద్ ఐ ఇనిస్టిట్యూట్ వైద్యులు సేకరించారు. అంతిమయాత్ర ముగిసిన తర్వాత ఆమె భౌతికకాయాన్ని ఆశ్రం ఆసుపత్రికి బంధువులు అప్పగించారు.

**నమ్మిన సిద్ధాంతం కోసం కడవరకూ నిలిచిన ధీశాలి : పి.మధు**

నమ్మిన సిద్ధాంతం కోసం కడవరకూ నిలబడిన ధైర్యశాలి అన్నే అనసూయ అని సిపిఎం రాష్ట్ర కార్యదర్శి పి.మధు అన్నారు. ఆదివారం అనసూయ నివాసం వద్ద సిపిఎం పశ్చిమగోదావరి జిల్లా (డెల్టా) కమిటీ కార్యదర్శి బి.బలరాం అధ్యక్షతన జరిగిన సంతాప సభలో మధు మాట్లాడారు. దేశ స్వాతంత్ర్యాన్ని కాంక్షిస్తూ జాతీయోద్యమ బాటలో పయనించిన అనసూయ జీవితం అందరికీ ఆదర్శప్రాయమని అన్నారు. అన్నే వెంకటేశ్వరరావు, అనసూయ దంపతులు నమ్మిన సిద్ధాంతం కోసం నిలబడిన ఆదర్శమూర్తులని కొనియాడారు. అనసూయ ఆశయాలకు పునరంకితమై, వాటిని ముందుకు తీసుకెళ్తామని శపథం చేయడమే నిజమైన నివాళి అని అన్నారు. డబ్బు సంపాదనే రాజకీయంగా మారిన ప్రస్తుత పరిస్థితుల్లో నమ్మిన సిద్ధాంతం కోసం నిలబడటమే కాకుండా కుటుంబాన్ని తీర్చిదిద్దిన ఘనత అనసూయ ప్రత్యేకతని అన్నారు. ఐద్వా రాష్ట్ర ప్రధాన కార్యదర్శి రమాదేవి మాట్లాడుతూ.. తుదిశ్వాస విడిచే వరకూ ఆశయాల కోసం పాటుపడిన మహోన్నత వ్యక్తి అనసూయ అని అన్నారు. రాష్ట్రంలోనే పార్టీ తాలుకా మహిళా కార్యదర్శిగా పనిచేసిన వారిలో అనసూయ మొదటి వారని గుర్తు చేశారు. వ్యవసాయ కార్మిక సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి వి.వెంకటేశ్వర్లు మాట్లాడుతూ.. భూస్వామ్య వ్యవస్థ బలంగా ఉన్న రోజుల్లో ఒక మహిళ ఉద్యమ నేతగా ఎదగడం, కూలి, భూ పోరాటాలు చేయడం గొప్ప విషయమని అన్నారు. ఎపి రైతుసంఘం రాష్ట్ర అధ్యక్షులు వై.కేశవరావు మాట్లాడుతూ.. అనసూయ చిన్నవయసులోనే ఉద్యమ పథాన పయనించారని అన్నారు. వృద్ధాప్యంలోనూ పాదయాత్రలో పాల్గొని తన దీక్షాదక్షతను చాటుకున్నారన్నారు. సిపిఎం పశ్చిమగోదావరి జిల్లా (అప్‌ల్యాండ్) కమిటీ కార్యదర్శి చింతకాయల బాబూరావు మాట్లాడుతూ.. ఈ నెల 5న ఏలూరులో అన్నే అనసూయ సంస్మరణ సభ నిర్వహిస్తున్నట్లు ప్రకటించారు. సభలో సిపిఎం సీనియర్‌నేత, మాజీ శాసనసభ్యులు ఆర్.సత్యనారాయణరాజు (ఆర్ఎస్), జుత్తిగ నరసింహమూర్తి, అనసూయ కుటుంబ సభ్యులు పాల్గొన్నారు.

**రాఘవులు సహా పలువురు సంతాపం**

అనసూయ మృతికి సిపిఎం పొలిట్‌బ్యూరో సభ్యులు బివి రాఘవులు, సిపిఎం సీనియర్ నేత జక్కా వెంకయ్య, తెలంగాణా రాష్ట్ర కార్యదర్శి తమ్మినేని వీరభద్రం, ఆ రాష్ట్ర కార్యదర్శివర్గ సభ్యులు బి.వెంకట్, ఐఎఫ్‌టియు రాష్ట్ర అధ్యక్షులు ప్రసాద్, జెడ్‌పి మాజీ ఛైర్మన్, టిడిపి నాయకులు యర్రా నారాయణస్వామి, ఎంఎల్‌సి రాము సూర్యారావు, ఎంసిపిఐ నేత కాటం నాగభూషణం, మహిళా ఉద్యమ నేత సంకు మనోరమ తదితరులు సంతాపం తెలిపారు.

### హడావిడి కాపు బిల్లు వెనుక

# దృష్టి మళ్ళించే వ్యూహం?

**అమరావతి :** పోలవరం విషయంలో జరిగిన అవినీతి వ్యవహారం నుండి బయటపడేందుకే రాష్ట్ర ప్రభుత్వం హడావిడిగా కాపు రిజర్వేషన్ బిల్లును ప్రవేశపెట్టిందని సీనియర్ రాజకీయవేత్తలు విశ్లేషిస్తున్నారు. రాష్ట్రంలో కీలకమైన సమస్య ముందుకొచ్చిన సమయంలో దాన్ని డైవర్ట్ చేసేందుకు కొత్త ఎత్తులు వేస్తూ ప్రజల ఆలోచనల్ని మరలిస్తున్నారనీ చెబుతున్నారు. పోలవరంలో జరిగిన అవినీతి వ్యవహారంలో కేంద్రం అనేక ప్రశ్నలు వేసింది. వాటికి సమాధానం చెప్పాల్సిన చంద్రబాబు దాన్నుండి తప్పుకునేందుకు కాపు బిల్లును పెట్టారనే అభిప్రాయాన్ని వ్యక్తం చేస్తున్నారు. కాపు రిజర్వేషన్లపై నివేదిక సిద్ధమయ్యిందని రెండు నెలల క్రితమే బిసి కమిషన్ ఛైర్మన్ మంజునాథ ప్రకటించారు. ఆయన ప్రకటించిన తరువాత రెండుసార్లు క్యాబినెట్ సమావేశాలూ జరిగాయి. అప్పటి నుండి బయటపెట్టని నివేదికను పోలవరం వ్యవహారం నడుస్తున్న సమయంలో హడావిడిగా తీసుకొచ్చి పెట్టారు. చట్ట ప్రకారం కమిషన్ నియమితమయ్యింది. ఛైర్మన్ సంతకం లేకుండా చెల్లుబాటు కాదు. అన్నీ తెలిసినా తెలుగుదేశం ప్రభుత్వం హడావిడిగా నివేదికను క్యాబినెట్లో పెట్టడం, ఆమోదించడం, అసెంబ్లీలో బిల్లుకు ఆమోదముద్ర వేయడం చకచకా జరిగిపోయాయి. నెంబరు లేకుండా కాపు రిజర్వేషన్ బిల్లును పాస్ చేయడం పలు అనుమానాలకు తావిస్తోంది. అలాగే ఇటీవల కృష్ణానదిలో పవిత్ర సంగమం వద్ద బోటు మునిగి 22 మంది చనిపోయారు. దీన్నుండి రాష్ట్ర ప్రజలు తేరుకోకముందే నంది అవార్డుల్ని ప్రకటించారు. ఒకవైపు రాష్ట్రం మొత్తం బాధలో ఉండటంతోపాటు, మృతదేహాలకు కనీస సంస్కారాలు కూడా జరగకముందే మూడేళ్ల నంది అవార్డులు ప్రకటించడం కూడా ప్రజల దృష్టిని మళ్లించడానికేనన్న వాదనలు వినిపిస్తున్నాయి. గోదావరి పుష్కరాల సమయంలో తొక్కిసలాట జరిగి 21 మంది చనిపోయిన విషయం తెలిసిందే. అప్పుడు కూడా రాష్ట్ర ప్రజలు ఈ సంఘటన నుండి తేరుకోక ముందే రాజధాని మాస్టర్‌ప్లాను విడుదల చేయించారు.

**విలేజ్‌మాల్స్ సమయంలోనూ అదే తంతు**

రేషన్ దుకాణాల్ని రిలయన్స్‌కు అప్పగించేందుకు టెండర్ల ప్రక్రియ నడుస్తున్న సమయంలోనే రాష్ట్రంలో కంచ ఐలయ్య వ్యవహారం ముందుకొచ్చింది. దీన్ని రెచ్చగొట్టింది కూడా టిడిపికి చెందిన ఎంపి టి.జి.వెంకటేష్, పలువురు ఎమ్మెల్యేలే. విలేజ్‌మాల్స్ వల్ల గ్రామాల్లో దుకాణాలు లేకుండా పోతాయి. దీనివల్ల వాటిపై ఆధారపడి బతికే ఆర్యవైశ్య సామాజికవర్గానికి చెందిన వారందరూ ఉపాధి కోల్పోతారు. ప్రజలకు ధరలు అందుబాటులో ఉంచేందుకు అప్పటి ప్రభుత్వం వ్యూహాత్మకంగా రేషన్‌దుకాణాలు తీసుకొచ్చింది. దీనివల్ల మార్కెట్లో వస్తువుల ధరలు నియంత్రణలో ఉండేవి. విలేజ్‌మాల్స్ వల్ల మార్కెట్ శక్తులు విజృంభిస్తాయి. పట్టణాల్లో ఉండే కొద్దిమంది లాభపడతారు. అయితే ఈ టెండర్ల ప్రక్రియ జరుగుతున్నం తకాలం ఆర్యవైశ్యుల ఆలోచనలు అటువైపు మళ్లకుండా ఐలయ్య వ్యవహారం చుట్టూ నడిపారు. అయితే రిలయన్స్ టెండర్లు ముగిసి షాపుల్ని అప్పగించాక ఐలయ్య వ్యవహారంపై నోరెత్తడం మానేశారు. దీని వెనుక కూడా టిడిపి కుట్ర ఉందనే అనుమానాలు వ్యక్తమవుతున్నాయి.

## కోటయ్య అంతిమ యాత్ర

- వామపక్ష నేతల ఘన నివాళి

**విజయవాడ :** సిపిఐ(ఎంఎల్) కేంద్ర కంట్రోల్ కమిషన్ సభ్యులు, ఎపి రైతు కూలీ సంఘం రాష్ట్ర కార్యదర్శి కోటయ్య(80)కు (కొప్పుల మోహనరెడ్డి) పలువురు ఘనంగా అంతిమ వీడ్కోలు పలికారు. ఈ నెల ఒకటిన గుండెపోటుతో మృతిచెందిన కోటయ్య అంతిమయాత్ర ఆదివారం నిర్వహించారు. తొలుత కృష్ణలంకలో నివాసం వద్ద ఉంచిన ఆయన భౌతిక కాయాన్ని పలువురు నేతలు సందర్శించి పూలమాలలు వేసి నివాళులర్పించారు. సిపిఎం రాష్ట్ర కార్యదర్శి పి.మధు, రాష్ట్ర కార్యదర్శి వర్గ సభ్యులు వై.వెంకటేశ్వర్లు (వైవి), వి.కృష్ణయ్య, రాష్ట్ర కమిటీ సభ్యులు బి.తులసీదాసు, పశ్చిమ కృష్ణా జిల్లా కార్యదర్శి వర్గ సభ్యులు దోనేపూడి కాశీనాథ్, సిపిఐ(ఎంఎల్) కేంద్ర నాయకులు గుర్రం విజయ కుమార్, పి.జస్వంత రావు, మధు, రాష్ట్ర నాయకులు సింహాద్రి జాన్సీ, జాస్తి కిషోర్, ముప్పాళ్ల భార్గవశ్రీ, విజయవాడ సెంట్రల్ నియోజక వర్గ ఎమ్మెల్యే బొండా ఉమామహేశ్వరరావు, సిపిఐ విజయవాడ నగర కార్యదర్శి దోనేపూడి శంకర్, జిల్లా నాయకులు నార్ల వెంకటేశ్వరరావు, సిపిఐ(ఎం) రాష్ట్ర కార్యదర్శి వెంకటరెడ్డి, కాటం నాగభూషణం, సిపిఐ (ఎంఎల్ లిబరేషన్) నాయకులు బి.హరినాథ్, కె.ప్రసాద్, సమతా పార్టీ మాజీ జాతీయ అధ్యక్షులు వివి.కృష్ణారావు, పారిశ్రామిక వేత్త కోగంటి సత్యం తదితరులు ఆయన భౌతిక కాయాన్ని సందర్శించి నివాళులర్పించారు. అనంతరం విజయవాడ కృష్ణలంకలోని ఆయన స్వగృహం నుంచి పండిట్ నెహ్రూ బస్టాండ్ సెంటర్ మీదుగా స్వర్గపురి వరకు అంతిమయాత్ర జరిపి అక్కడ అంత్యక్రియలు నిర్వహించారు.

## అప్పుల బాధతో రైతు ఆత్మహత్య

**నవతెలంగాణ - ముప్కాల్**

అప్పుల బాధతో రైతు ఆత్మహత్య చేసుకున్నాడు. ఈ ఘటన నిజామాబాద్ జిల్లా ముప్కాల్ మండలంలో ఆదివారం జరిగింది. ఎస్ఐ విజయ్‌నారాయణ్ వివరాల ప్రకారం.. ముప్కాల్ మండలం నాగంపేట్ గ్రామానికి చెందిన చాకలి దశరథ్(52)కు రెండెకరాలుంది. అందులో వరి సాగుచేశాడు. దిగుబడిరాక తీవ్రంగా నష్టపోయాడు. సాగుకోసం, కుటుంబ అవసరాల రీత్యా చేసిన అప్పు రూ.3లక్షల వరకు ఉంది. వీటిని ఎలా తీర్చాలనే మనోవేదనకు గురయ్యాడు. ఈక్రమంలో ఆదివారం తన పొలంలో చెట్టుకు ఉరేసుకున్నాడు. కుటుంబీకుల ఫిర్యాదుమేరకు కేసు దర్యాప్తు చేస్తున్నట్టు, మృతదేహాన్ని పోస్టుమార్టానికి తరలించినట్టు ఎస్ఐ తెలిపారు. మృతునికి భార్య, ఇద్దరు కుమారులు ఉన్నారు.

### అవినీతికి వ్యతిరేకంగా

## నేడు జిల్లాల్లో ఏసీబీ అధ్వర్యాన ర్యాలీలు

**నవ తెలంగాణ, ప్రత్యేక ప్రతినిధి**

అవినీతికి వ్యతిరేకంగా రాష్ట్రంలోని అన్ని జిల్లా కేంద్రాలలో అవినీతి నిరోధక శాఖ అధ్వర్యాన సోమవారం ర్యాలీలు నిర్వహిస్తున్నారు. ఈ మేరకు హైదరాబాద్ నగరంతో పాటు వివిధ జిల్లాల ఏసీబీ ఇన్‌ఛార్జిలు ర్యాలీలకు ఏర్పాట్లు జరిగాయి. ఇందుకు ఆయా ప్రభుత్వ శాఖలకు చెందిన అధికారులు, సిబ్బందితో పాటు స్థానిక పాఠశాలలు, కళాశాలల విద్యార్థులను కూడా ఈ ర్యాలీలో భాగస్వాములను చేస్తున్నట్టు అధికారులు తెలిపారు. ఆదివారం నుంచి 9వ తేదీ వరకు రాష్ట్రంలో అవినీతి వ్యతిరేక వారోత్సవాలను నిర్వహిస్తున్నట్టు రాష్ట్ర ఏఈసబీ డైరెక్టర్ జనరల్ జె.పూర్ణచంద్రరావు ప్రకటించిన విషయం తలెఇసిందే. ఇందులో భాగంగానే పెద్ద ఎత్తున ప్రజల్లో అవగాహనను పెంచడానికి అవినీతికి వ్యతిరేకంగా చైతన్య పరచడానికి ఈ ర్యాలీలను నిర్వహిస్తున్నామని ఏసీబీ అధికారులు తెలిపారు. ఇందుకు అవసరమైన కరపత్రాలు, పోస్టర్లు, బ్యానర్లనుఉ పెద్ద ఎత్తున అన్ని జిల్లాలకు పంపిణీ జరిగినట్టు అధికారులు వివరించారు. వారత్సవాల భాగంగా అవినీతికి వ్యతిరేకంగా విద్యార్థిని విద్యార్థులకు వ్యాసరచన , వక్తృత్వ పోటీలు కూడా నిర్వహిస్తున్నామని వారు తెలిపారు. ర్యాలీ ఏర్పాట్ల గురించి ఏసీబీ డీజీ తమ జిల్లాల అధికారులతో మాట్లాడి తగిన సూచనలు, సలహాలను ఆదివారం ఇచ్చారు. ఇదిలా ఉంటే అవినీతిని కట్టడి చేసినప్పుడే రాష్ట్ర అభివృద్ధి మరింత పటిష్ట మవుతుందని , దానికి సంబంధించిన సమాచారాన్ని తమకు అందచేసిన వారి వివరాలు, వారి పేర్లను అత్యంత గోప్యంగా ఉంచడం జరుగుతుందని ఈ సందర్భంగా పూర్ణచంద్రరావు తెలిపారు.

# ఉత్తర భారతాన్ని కబళిస్తున్న కాలుష్య భూతం

**న్యూఢిల్లీ :** ఉత్తర భారతాన్ని ప్రధానంగా దేశ రాజధాని హస్తినను చుట్టుముట్టి కబళిస్తున్న కాలుష్య భూతాన్ని ఐరోపా రోదసీ సంస్థకు చెందిన ఉపగ్రహం తన కెమెరాలో బంధించింది. ఉపగ్ర హం చిత్రీకరించిన ఛాయాచిత్రాలను సంబంధిత అధికారులు శుక్రవారం ఇక్కడ విడుదల చేశారు. ఈ చిత్రాలలో ప్రస్తుత సీజన్‌లో దేశ రాజధాని ప్రాంతాన్ని, ఉత్తర భారతాన్ని చుట్టుముట్టిన కాలు ష్య తీవ్రత కళ్లకు కడుతోంది. భూవాతావరణాన్ని పరిశీలించేందుకు తొలిసారిగా ఐరోపా రోదసీ సంస్థ (ఇఎస్ఎ) పంపిన సెంటినియల్ -5పి ఉపగ్రహం ఈ చిత్రాలను చిత్రీకరించింది.



గత నెల 6వ తేదీ నుండి 14వ తేదీ వరకూ దేశ రాజధానిని పీడించిన వాయు కాలుష్యం తరహాలో ప్రస్తుతం ఉత్తర భారతాన్ని చుట్టుముట్టి న కాలుష్యానికి వాతావరణంలో పెరిగిన తేమ, నెమ్మదించిన గాలి, గాలిలోని కలుషిత పదార్థాలతో పాటు నగర సరిహద్దుల్లో రైతులు తమ సాగు భూముల్లో ఎండిన పంట మొదళ్లను దగ్ధం చేయటం వల్ల ఏర్పడిన వాయు కాలుష్యం కూడా కారణమేనని నిపుణులు చెబుతున్నారు.

## ప్రపంచ పార్టీలతో విస్తృత సహకారం

- చైనా కమ్యూనిస్టు పార్టీ సంసిద్ధత

**బీజింగ్ :** ప్రపంచ వ్యాప్తంగా వివిధ దేశాలలో వున్న రాజకీయ పార్టీలతో స్నేహపూర్వక సహకారాన్ని విస్తరించు కునేందుకు తాము సిద్ధంగా వున్నామని చైనా కమ్యూనిస్టు పార్టీ (సిపిసి) కేంద్ర కమిటీ సభ్యుడు, ప్రభుత్వ సలహాదారు యాంగ్‌జీచీ చెప్పారు. ఇక్కడ జరుగుతున్న ప్రపంచ రాజ కీయ పార్టీల సదస్సులో ఆదివారం జరిగిన ముగింపు కార్య క్రమంలో ఆయన ప్రసంగిస్తూ మానవాళికి మెరుగైన భవిత కల్పించటానికి, మెరుగైన ప్రపంచ నిర్మాణానికి ప్రపంచ వ్యాప్తంగా వున్న అన్ని రాజకీయ పార్టీలతో సహకరించేం దుకు సిపిసి సిద్ధంగా వుందన్నారు. సదస్సు ప్రారంభంలో అధ్యక్షుడు సీ జిన్‌పింగ్ చేసిన ప్రసంగాన్ని ఆయన ప్రస్తా విస్తూ విశ్వ ప్రగతిని ప్రోత్సహించేందుకు ప్రపంచ వ్యాప్తంగా వున్న అన్ని రాజకీయ పార్టీలతో కలిసి పనిచేయాలన్న సిపిసి కృత నిశ్చయాన్ని పునరుద్ఘాటించారు. అధ్యక్షుడు సీ జిన్‌పింగ్ చేసిన కీలక ప్రసంగంతో పాటు సిపిసి చేస్తున్న కృషికి అంతర్జాతీయ సమాజం నుండి ప్రశంసలు లభించా యని ఆయన చెప్పారు. శాంతియుత ప్రపంచ నిర్మాణానికి, విశ్వాభివృద్ధికి, ప్రపంచ క్రమాన్ని పరిరక్షించాల్సిన చారిత్రక బాధ్యతలను రాజకీయ పార్టీలు, ఆయా పార్టీలనేతలు నిర్వహించాలని ఆయన పిలుపునిచ్చారు.

### వక్ఫ్ భూముల స్వాధీనానికి

# సీబీఐ విచారణకు ఆవాజ్ డిమాండ్

**నవతెలంగాణబ్యూరో-హైదరాబాద్**

అన్యాక్రాంతమైన 57 వేల ఎకరాల వక్ఫ వక్ఫ్‌భూముల సంబంధించి హైకోర్టు న్యాయమూర్తి పర్యవేక్షణలో సీబీఐచే విచారణ జరిపించాలని ఆవాజ్ రాష్ట్ర శాఖ డిమాండ్ చేసింది. వక్ఫ్‌బోర్డుకు చెందిన వేలాది ఎకరాల భూములు ఎవరు కబ్జా చేశారో వక్ఫ్‌బోర్డు అధికారులకు, ప్రభుత్వ పెద్దలకు తెలిసినప్పటికీ విచారణ జరిపించి వాటిని స్వాధీనం చేసుకోవడంలో విఫలమవుతున్నారని ఆవాజ్ రాష్ట్ర శాఖ ఉపాధ్యక్షులు మహ్మద్ అబ్బాస్ ఆరోపించారు. కోట్ల విలువైన వక్ఫ్‌భూములను ఉమ్మడి రాష్ట్రంలో రాష్ట్రాన్ని పాలించిన పాలకులు వందలాది ఎకరాల భూములను ప్రభుత్వ, ప్రయివేటు భూములంటూ రికార్డులు సృష్టించి డాక్యుమెంట్లను తారుమారు చేసి కాజేశారని, హైదరాబాద్ శివారు ప్రాంతంలో ఉన్న వందలాది ఎకరాల మిగిలివున్న వక్ఫ్ భూములను పరిరక్షిస్తామని హామి ఇచ్చిన తెలంగాణ సర్కార్ కూడా చేతులెత్తేసిందన్నారు. విలువైన భవంతులు, ఇండ్లు, స్థలాలు, భూములను కౌలుకు ఇవ్వడం ద్వారా వచ్చే ఆదాయంతో ముస్లిం పేద కుటుంబాలకు ఆడపిల్లల పెండ్లిలు, విద్య, వ్యాపారం తదితర కనీస అవసరాలు అందకుండా పోతున్నాయన్నారు. ప్రభుత్వం ఇప్పటికైనా స్పందించి హైకోర్టు న్యాయమూర్తి పర్యవేక్షణలో సీబీఐచే విచారణ జరిపించి అక్రమార్కుల చేతుల్లో ఉన్న విలువైన భూములు, ఇతర ఆస్తులకు విముక్తి కల్పించాలని అబ్బాస్ డిమాండ్ చేశారు.

# సమ్మె విరమించిన రేషన్ డీలర్లు

**నవతెలంగాణబ్యూరో-హైదరాబాద్**

కమీషన్లు పెంపు, ఇతర డిమాండ్లను పరిష్కరించాలని కోరుతూ గత మూడు రోజులుగా సమ్మె చేస్తున్న రేషన్ డీలర్లు ఆర్థిక, పౌరసరఫరాల శాఖ మంత్రి ఈటల రాజేందర్ ఇచ్చిన హామితో ఆందోళనను విరమించారు. చాలీ చాలని కమీషన్లతో రేషన్ షాపులు నడపడం తమకు కష్టంగా మారింది. నష్టాలతో షాపులు నడపలేము, కమీషన్లు పెంపుతో పాటు తమ డిమాండ్లను పరిష్కరించాలని కోరుతూ తెలంగాణ రాష్ట్రంలోని 18.700 రేషన్ డీలర్లు గత మూడు రోజులుగా సమ్మెకు దిగారు. అయితే రేషన్ డీలర్లవి గొంతెమ్మ కోర్కెలు తీర్చేందుకు ప్రభుత్వం సిద్ధంగా లేదని సీఎం స్పష్టం చేస్తూ డిసెంబర్ నెలకు సంబంధించి షాపుల్లో సరుకులు నింపేందుకు డీడీలు వెంటనే చెల్లించమనండి, డీడీలు చెలించమని వారు మొండికేసిన పక్షంలో కొత్త డీలర్లను నియమించండని సీఎం మూడు రోజుల క్రితం పౌరసరఫరాల శాఖ కమిషనర్ సీవీ ఆనంద్‌కు ఆదేశించారు. సీఎం ఆదేశంతో రాష్ట్ర వ్యాప్తంగా 16,700 మంది డీలర్లు శనివారం సాయంత్రం వరకు డీడీలు చెల్లించారు. ప్రభుత్వం తమను తొలిగించినా భయ పడేదిలేదంటూ మిగిలిని రెండువేల మంది ఆదివారం సాయంత్రం వరకు కూడా డీడీలు చెల్లించకుండా మొండికేశారు. అయితే ఆదివారం రాత్రి మంత్రి ఈటల రేషన్ డీలర్ల సంక్షేమ సంఘం సభ్యులను తన నివాసానికి పిలిపించి చర్చలు జరిపారు. మీ న్యాయమైన డిమాండ్లను సానుకూలంగా పరిష్కరించేందుకు ప్రభుత్వం సిద్ధంగా ఉందని, వెంటనే డీడీలు చెల్లించి సరుకులు తెప్పించుకొండని విజ్ఞప్తి చేశారు. మీ న్యాయమైన డిమాండ్ల పరిష్కారం కోసం తన వంతు కృషి చేస్తానని, త్వరలో సీఎంతో ముఖాముఖిగా మాట్లాడిస్తానని హామి ఇవ్వడంతో డీలర్లు సమ్మె విరమిస్తున్నట్టు మంత్రికి హామి ఇచ్చారు. డీడీలు చెల్లించని రెండు వేల మంది సోమవారం డీడీలు చెల్లించి వినియోగదారులకు సరుకులు అందజేస్తారని సంక్షేమ సంఘం అధ్యక్షులు బత్తుల రమేష్ మంత్రి ఈటలకు హామి ఇచ్చారు.

# తెలుగు వెలుగు



భూతం ముత్యాలు

1975 ఏప్రిల్ 12న ప్రపంచ తెలుగు తొలి మహాసభలకు అంకురార్పణ జరిగింది. వారం రోజులపాటు తెలుగు ఖ్యాతిని ప్రపంచ దశదిశల విస్తరించి ఉన్న తెలుగు వారి మనసులో తొలిపొద్దు పొదలు విచ్చుకోనేల బీజం వేసింది. డిసెంబర్ 15న జరగబోయే తెలుగు మహాసభలకు 42 వసంతాలు పూర్తి చేసుకుంటూ అర్ధ శతాబ్ది వైపు అడుగులు వేస్తున్నది. నాడు సమైక్య రాష్ట్రమైన నేడు విడివడి తెలంగాణ, ఆంధ్రప్రదేశ్‌గా మార్పు చెందిన పది కోట్ల తెలుగు వారు తెలుగు జాతిగా వినతికెక్కారు. దేశంలో అత్యధికులు మాట్లాడే భాష హిందీ, తర్వాత తెలుగు కావటం శుభపరిణామం. అభివద్ధిలో, స్వాభిమానం కలిగిన రాష్ట్రాలున్నప్పటికీ అక్షరాస్యతలో దేశంలో కేరళ ముందు వరుసలో ఉన్నది. "తెలుగదేల ఎన్న దేశంబు తెలుగు దేశభాషలందు తెలుగు లెస్స" అన్నాడో కవి. తెలుగు భాష చూస్తే ప్రస్తుతం ప్రాచీన హోదా దక్కించుకొని తన ఘన కీర్తిని చాటుకున్నది. ఈ నేలపై క్రీ.పూ. నుండే తెలుగు తన ఉనికిని నిలుపుకుంటూ వస్తున్నది. ఆనాటి సాహితీ చరిత్ర లిఖిత ఆధారాలు అలభ్యం. అయితే బౌద్ధుల త్రిపీటకాలు, బౌద్ధుల జాతక కథలు మౌర్యుల కాలంలో భారత్ సందర్శించిన మెగస్తనీస్ ఇండికా గ్రంథ రచన ద్వారా భారతీయ జీవనంతోపాటు తెలుగు వైభవం మనకు కొంతవరకైనా లభించడం ముదావాహం. క్రీ.పూ. ఒకటవ శతాబ్దికి చెదిన శాసనంలో తంబయ్య అనే మాట మొదటి తెలుగు మాటగా గుర్తించారు. క్రీ.శ. 575 కడప జిల్లా ఎర్ర గుడిపాడులో లభించిన పూర్తి తెలుగులో ఉన్న మొదటి శాసనం. ఆంధ్ర ప్రాంతంలోని శాసనాలు ప్రాకత సంస్కృత భాషలో ఉండేవి. అయితే వాటిలోని వ్యక్తులు గ్రామాలు మాత్రం ఆరవ శతాబ్దానికి ముందు తెలుగు భాష తెలంగాణ, ఆంధ్రప్రదేశ్‌లోనే కాక తమిళనాడు, కర్నాటక, మహారాష్ట్ర, ఒరిస్సా, బెంగాల్, మధ్యప్రదేశ్‌లో అత్యధికులు మాట్లాడే వారని గుర్తించారు. ఇంకా మన దేశానికి ఆవల మారిషస్, మలేషియా, శ్రీలంక, సింగపూర్, మయన్మార్, దక్షిణాఫ్రికా, ఇంగ్లాండ్, కెనడా, ఆస్ట్రేలియా, అమెరికా మొదలగు దేశాలలో కూడా తెలుగువారు ఉన్నారు. తెనుగు తెలింగా అని కూడా పిలవడం కద్దు, తొమ్మిదవ శతాబ్దికి చెందిన పంపకవి కందంలో తెలుగు కనిపిస్తుంది. తదనంతరం శాసనాలలో తర్వోజా పద్యాలను ఉపయోగించారు. శాతవాహనుల నుంచి తెలుగు భాష రూపాంతరం చెందుతూ కాకతీయుల కాలానికి ఒక కొత్త రూపు దాల్చింది. ఆనాటి కవిత్రయం కాక పాల్కురికి సోమనాధులు పండితా రాజ్య చరిత్ర, బసవపురాణం, బమ్మెర పోతన భాగవతం, శ్రీకష్ణదేవరాయలు ఆముక్త మాల్యద, శ్రీనాధుని శంగార నైషధం, హరవిలాసం, బోగిణి దండకం మొదలగు రచనలు అష్ట దిగ్గజాల రచనలు చేమకూర వెంకట కవి, రామరాజ భూషణుడు, రంగాజమ్మ, మొల్ల, గోనా బుద్ధారెడ్డి సాహిత్యాన్ని తమ కవిత్వాలలో పొందుపరచారు. యోగివేమన ప్రజల భాషకు పట్టం కట్టి శతకంలో వందల ఆటవెలది పద్యాలు రచించారు. ఆధునిక యుగంలో కందుకూరి, గురజాడ, సినారే, సురవరం ప్రతాప్‌రెడ్డి, కాళోజి, దాశరధి తమదైన శైలిలో తెలంగాణ యాసకు పట్టం కట్టారు. తెలుగు తేనె + అగు .. తెలుగు అని నన్నయ ...సారమతి.. తెనుగునన్, నన్నే చూడుని కుమార సంభవంలో రెండు తెలుగు ప్రయోగాలున్నాయి. మును ....తేనుం .....జాను తెనుంగున్..., పాల్కురికి సోమనాధుడు ఒక చోట ఉరుతర... జానూదెనుంగు... తిక్కన భారతంలో ఒక్క చోట హదయ.. దెనుంగు అని తెనుగు శబ్దాన్ని మనం చూడవచ్చు. ఈ తెనుగు శబ్దం దిక్కును బట్టి వచ్చిందని అభిప్రాయం. తెనుగు దేశ్యా ధమని దిగ్వాచి అని ఘంటి జోఘి సోమయాజి అభిప్రాయం. తెనుగు శబ్దంలోని తెన్ దిక్కు అనే అర్థం. ద్రావిడ పదాంశం అని ద్రావిడ వ్యుత్పత్తి పద కోశంలో చెప్పారు. తెలుగు భాషలోని తెన్ శబ్దం నేటి వ్యవహారం నుండి తొలగిపోయింది కానీ తెమ్మెర, తన్నేరు, టెంకాయ, తీరు, దారి తెన్ను మొదలగు సమా సాల్లో నిలిచి ఉన్నది. సాధారణంగా ఒక భాష రూపొందే ప్రాథమిక దశలో ఆ భాషకు పేరు పెట్టడం జరగదు. ఈ నాటికి గిరిజన తెగల భాషలకు లిపి లేదు. ఒక భాష ఆసమాజంలోనే, ఆ ప్రాంతం వారు దానికి దగ్గరలో ఉండే మరో ప్రాంతం వారి ని సూచించ బడి వచ్చినప్పుడు అనగా తూర్పు, పడమ ర, ఉత్తరం, దక్షిణం, సూచించడం కద్దు. ప్రాచీన ద్రవిడ భాషా సమా జంలోని వారు దక్షిణ ప్రాంతంలోని వారిని తెన్ అని పిలవడం నేటికీ ఉన్నది. అ లా తెనుగు, తెలుగుగా ఏర్ప డి ఉంటుంది. ఒక ప్రాంతా నికి అక్కడే 37 కి.మీ. దూరంలో ఉన్న మరో ప్రాంతానికి భాషా ఉచ్ఛరణలో తేడా కనిపిస్తుంది. ఈ తేడానే ప్రాంతీయ మాండలికం అంటారు. తమిళలు వారికి ఉత్తరం వైపున ఉన్న వారిని వాడుగర్ అని పిలుచుకుంటారు. కన్నడిగులు కూడా తెలుగు వారిని, తెలింగా అని తేలికగా పిలవడం తెలుగు అయినట్టు చెబుతారు. ఏది ఏమైనప్పటికీ తెలి+ అగు.. తెలుగు/తిలల వల్లే గోవులు ఉన్న దేశం తెలుగు /తెల్ + అగు/తల్లైంగులని బర్మాలో తెలుగు వారిని పిలుస్తారు. ఋగ్వేదంలోని ఐతరేయ బ్రాహ్మణంలో తెలుగు ప్రస్తావన ఉంది. (7-13-18) ఇంతటి ఘన చరిత కలిగిన తెలుగు డిసెంబర్ 15న ప్రపంచ మహా సభలు జరుపుకోవడం మనదరికీ గర్వకారణం.

సెల్ : 7013996709

# ఆంధ్ర పితామహుడు మాడపాటి హనుమంతరావు

**తెలంగాణ తేజాలు**



డా॥టి.గౌరీశంకర్

నిజాం నిరంకుశ పాలనలో అణగారిపోయి, నిద్రాణావస్థలో ఉన్న తెలంగాణ ప్రాంతానికి కొత్త ఊపిరులూది, మేల్కొలిపిన వైతాళికులలో మాడపాటి హనుమంతరావు అగ్రగణ్యులు. ఆ కాలంలో ఇక్కడి తెలుగు భాషను 'తెలంగీ -భేడంగీ' (ఒక ఆకారంలేని భాష) అని ఆనాటి అధికారులు ఎగతాళి చేసే సమయంలో తెలంగాణలో తెలుగు భాషా సాంస్కృతిక పునరుజ్జీవనానికి జీవితాన్ని అంకితం చేసిన వ్యక్తి హనుమంతరావు. గ్రంధాలయోద్యమం, సంఘ సంస్కరణ, వయోజన విద్య, స్త్రీ విద్య, మహిళాభ్యుదయం, సాహిత్య వికాసం, సాంస్కృతికాభివృద్ధి వంటి అనేక ఉద్యమాలలో పాల్గొని, తెలుగు జాతి ప్రగతికి పాటుపడినవారు మాడపాటి వారు. ప్రజలలో రాజకీయ చైతన్యాన్ని రగుల్కొలిపి, వారిని ఉద్యమోన్ముఖుల్ని చేసిన ఉదాత్త నాయకుడు హనుమంతరావు. ఆయన ప్రత్యక్షంగా రాజకీయాలలో పాల్గొనకపోయినా, ఎందరో రాజకీయ నాయకులను తయారు చేసిన నిస్వార్థ సేవా పరాయణులు. అందుకే 'ఆంధ్రా పితామహుడు' అని ప్రజలందరి చేత కీర్తింపబడ్డాడు. ఆనాటి రాష్ట్రంలోని తెలుగువారి చేతనే గాక కన్నడిగులు, మరాఠీలు, ముస్లింలు-సమస్త ప్రజల చేత గౌరవాదరాభిమానాలు అందుకున్నాడు. సౌమనస్యం, మృదుస్వభావం, నిరాడంబరత, నీతీ నిజాయితీ, క్రమశిక్షణ, సత్ప్రవర్తన వంటివి ఆయనలోని విశిష్ట గుణాలు. వీరిని మనవారు అటు జాతీయ స్థాయిలో, భారత రాజకీయాలలో కీలకపాత్ర పోషించిన 'గోపాలకృష్ణ గోఖలే'తో పోల్చటం వీరి వ్యక్తిత్వాన్ని తెలియజేస్తుంది. మాడపాటి హనుమంతరావు 1885 జనవరి 22వ తేదీన కృష్ణాజిల్లా నంది గామ తాలూకా కొప్పునూరు గ్రామంలో జన్మిం చారు. తండ్రి వెంకటప్పయ్య, తల్లి వెంకటసు బ్బమ్మ. తండ్రి ఆ గ్రామ కరణంగా పని చేశా రు. హనుమంతరావు అయిదేండ్ల వయసులో ఉండగానే తండ్రి మరణించాడు. దాంతో సూ ర్యాపేటలో మేనమామ దగ్గర పెరిగారు. 1899లో ఉర్దూ మిడిల్ పరీక్ష పాసై, ఆ తరు వాత హన్మకొండ ఉన్నత పాఠశాలలో చేరి మ ద్రాసు విశ్వవిద్యాలయ మెట్రి క్యులేషన్ పరీక్ష ఉత్తీర్ణులయ్యారు. 1904లో వరంగల్ జిల్లా వి ద్యాశాఖాధికారి కార్యాలయంలో నెలకు రూ. 40 జీతంతో 'మీర్‌మున్షీ' (హెడ్ గుమాస్తా) ఉద్యోగం ఎనిమి దేండ్ల పాటు చేశారు. ఆ తరువాత హైదరాబాద్ వెళ్లి, ప్రభుత్వ శాసనసభా విభాగంలో అనువాదకుడిగా అయిదేండ్లు పనిచే శారు. ఆ సమయంలోనే పట్టుదలతో ప్రైవేటుగా చదివి, న్యాయశా స్త్రంలో పట్టభద్రులయ్యారు. 1917 నుంచి న్యాయవాద వృత్తిని చేప ట్టి ఇరవై ఏండ్లపాటు ఆ వృత్తిలో కొనసాగాడు. ఇది ఆయన జీవితం లో గొప్ప మలుపును తీసుకొచ్చింది. చిన్నతనంలోనే హనుమంత రావు.. కందుకూరి వీరేశలింగం పంతులు సంఘ సంస్కరణో ద్యమానికీ, కొమర్రాజు వెంకటలక్ష్మణరావు సాహిత్యోద్యమానికీ, నాటి జాతీయోద్యమంలో భాగమైన వందేమాతరోద్యమానికీ అత్యంత ప్రభావితుడయ్యాడు. వీటి ఫలితంగానే ఆయన నాటి హైదరాబాద్ సంస్థానం లోని ఉద్యమాలకు ఊతంగా నిలిచాడు.

తెలుగు భాష పట్ల ఆయనకు అపారమైన అభిమానం. ఒకసారి హిందూ సంఘ సంస్కరణ సభ' 1921 నవంబర్ 12వ తేదీ రాత్రి హైదరాబాద్‌లోని వివేకవర్ధనీ ఉన్నత పాఠశాల సభా మందిరంలో జరుగుతుంది. పూణె మహిళా విశ్వవిద్యాలయ సంస్థాపకుడు దొండే పంత్ కార్వే దీనికి అధ్యక్షత వహించాడు. వక్తలు ఉర్దూ, మరాఠీ, కన్నడ భాషలలో మాట్లాడారు. మాడపాటి వారు తమ మాతృభాష అయిన తెలుగులో మాట్లాడారు. ఆయన మీద ఉన్న గౌరవంతో అక్కడ ఉన్నవారు ఆయన ప్రసంగాన్ని విన్నట్టు నటించారు. మరొక నాయకుడు తెలుగులో మాట్లాడుతుంటే అభ్యంతరం చెప్పారు. తెలుగులో మాట్లాడరాదని అవమానించారు. ఇందుకు మాడపాటి వారు చివాల్న లేచి సమావేశం నుంచి వెళ్లిపోయాడు. తెలుగువారి వ్యక్తిత్వాన్ని నిరూపించడానికి ఆ రాత్రికి రాత్రే తెలుగువారంతా కలిసి 'నిజాం రాష్ట్ర ఆంధ్ర జన సంఘం' అన్న దానిని స్థాపించారు. దానికి మాడపాటి వారిని కార్యదర్శిగా నియమించారు. 1923లో హన్మకొండలో ఏర్పడిన ఈ కేంద్ర సంఘం కొద్ది కాలంలోనే రాష్ట్ర వ్యాప్తంగా యాభై స్థానిక సంఘాలుగా విస్తరించింది. 1930లో జోగిపేటలో సురవరం ప్రతాపరెడ్డి అధ్యక్షతన ప్రథమాంధ్ర మహాసభ జరిగింది. నాటి నుండి 1945 దాకా ప్రతి ఏటా ఈ మహాసభలు జరిగాయి. 1935లో సిరిసిల్లలో జరిగిన మహాసభకు హనుమంతరావు అధ్యక్షత వహించారు. ఆ రోజులలో ప్రజలలో రాజకీయ చైతన్యం కలిగించడానికీ, భాషా సాంస్కృతికాభిమానం వారిలో పెంపొందించడానికీ గ్రంధాలయాలు ప్రధాన కేంద్రాలుగా పని చేశాయి. 1904 జనవరి 26న హన్మకొండలో శ్రీ రాజరాజనరేంద్ర గ్రంథాలయ భవనం శంకుస్థాపన చేయించారు. 1912 నాటికి దానిని పూర్తిస్థాయిలో అభివృద్ధి పరిచారు. 1914-15లో శ్రీకృష్ణదేవ రాయాంధ్ర భాషా నిలయానికి కార్యదర్శిగా పనిచేశారు. అంతకుముందే 1912లో డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డిని ఆహ్వానించి గ్రంథాలయ స్వంత భవనానికి ప్రారంభోత్సవం జరిపించారు. హైదరాబాద్‌లోని గౌలిగూడ ప్రాంతంలో 'బాలసరస్వతీ గ్రంథాలయం' నాంపల్లిలోని ఎత్తయిన గుట్టమీద 'వేమన గ్రంథాలయం' స్థాపనలో, వాటి అభివృద్ధిలో మాడపాటి వారు ముఖ్యభూమికను పోషించారు. ఆనాటి ప్రభుత్వం వాక్ స్వాంతత్ర్యాన్నీ, పత్రికాస్వేచ్ఛను అణచివేస్తుంటే అందుకు నిరసనగా ఆంధ్రమహాసభ ఆందోళన చేపట్టింది. క్రమంగా పౌరహక్కుల పరిరక్షణకు పూనుకొని, ప్రజలను సంఘటితపరచింది. ప్రజలు తమ హక్కులను గుర్తించేటట్టు చేసింది. ప్రజా సమస్యలపై కరపత్రాలు అచ్చువేసి, పుస్తకాలు ప్రచురించింది. 'ఆంధ్రమహాసభ' సంస్థాన ప్రజలలో గొప్ప సంచలనాన్ని సృష్టించింది. మహిళా సభలను జరుపుతూ స్త్రీలలో చైతన్యాన్ని రగిలించింది. ఆనాడు మాడపాటి వారు స్త్రీ విద్యా విషయికంగా చేసిన కృషి ప్రత్యేకించి పేర్కొనదగినది. 1926లో హైదరాబాద్‌లోని నారాయణగూడ ప్రాంతంలో ఆంధ్రబాలికోన్నత పాఠశాలను స్థాపించి, తెలుగు మాధ్యమంలో బోధనను నడిపించారు. అది ఈనాటికీ వెలుగొందుతున్నది. రావు బహద్దూరు వెంకట్రామారెడ్డి మహిళా కళాశాల ఏర్పాటులో కూడా మాడపాటి వారి ప్రమేయం ప్రముఖమైంది. మాడపాటి వారు తెలుగు, ఉర్దూ, ఇంగ్లీషు భాషలలో మంచి ప్రావీణ్యాన్ని గడించారు. ఫారసీ, మరాఠీ భాషలలో కూడా పరిచయం ఉంది. ఆయా భాషలలో పలు రచనలు చేశారు. తెలుగులో నవలలు, కథలు రాశారు. తెలంగాణలో 'నీలగిరి పత్రిక', 'గోల్కొండ పత్రిక', 'దేశబంధు', 'సుజాత' వంటి వార్తా పత్రికలు, ఇతర పత్రికలు మాడపాటి వారి తోడ్పాటుతోనే పెంపొందాయి. 'ముషీరె-దక్కన్' అనే ఉర్దూ పత్రికకు ఆయన చాలాకాలం సంపాదకీయాలు రాశారు. 'తెలంగాణ ఆంధ్రోద్యమం', 'రోమన్ సామ్రాజ్య చరిత్ర', 'క్షేత్రకాలపు హిందార్యులు', 'గారీ ఖాల్డీ జీవితం', 'రాజ్యాంగ సంస్కరణలు' మొదలైన గ్రంథాలు రచించారు. 'పర్షియన్ కవుల'పై పలు వ్యాసాలు రచించారు. బంకించంద్ర ఛటర్జీ 'ఆనంద మఠం' నవలను తెనిగించారు. వివిధ తెలుగు, ఉర్దూ పత్రికలలో కథలు, కథానికలు రాశారు. వీటిలో కొన్నింటిని 'మల్లికాగుచ్ఛ ము' అనే పేరుతో ప్రచురించారు. 1946లో మాడపాటి హనుమంతరా వు షష్టి పూర్తి ఉత్సవం జరిగింది. హైదరాబాద్‌లో కడప కోటిరెడ్డి, కొండా వెంకట రంగారెడ్డి వంటి ప్రముఖుల ఆధ్వర్యంలో ఈ సభలు ఎంతో ఘనంగా జరిగాయి. ఈ సందర్భంగా 'హనుమంతరాయ సంచిక' పేరుతో ప్రత్యేక సంచికను వెలువరించారు. వివిధ ప్రదేశాలలో సత్కార సభలు జరిపి, సన్మాన పత్రాలు సమర్పించారు. ప్రజలు విరాళాలు అందించారు. ఆ సొమ్ము లో అధికభాగం ఆయన మహిళా విద్యాలయాలకే వినియోగించారు. మిగిలిన మొత్తంతో 'ఆంధ్ర చంద్రికా గ్రంథమాల'ను స్థాపించి, దాని పక్షాన 'ప్రాచీనాంధ్ర నగరములు', 'రాజకీయ పరిజ్ఞానం', 'నిజాం ఆంధ్రోద్యమం' వంటి పుస్తకాలను అచ్చొత్తించారు. ఆయన తన జ్ఞాపకాలతో 'ఆంధ్రోద్యమ చరిత్ర' రాశారు. 1951 నుంచి 1954 వ రకు మాడపాటి హనుమంతరావు హైదరాబాదు నగర కార్పొరేషన్ కు మూడుసార్లు మేయర్‌గా పనిచేశారు. 1958లో ఆంధ్రప్రదేశ్ శాసన మండలికి తొలి అధ్యక్షుడై, ఆరేండ్లు సభా కార్యక్రమాలను నిరాటంకంగా నిర్వహించారు. 1955లో భారత ప్రభుత్వం ఆయ నకు 'పద్మభూషణ్' బిరుదునిచ్చి గౌరవించింది. ఈ బిరుదు పొందిన తొలి తెలుగు వ్యక్తి ఇతనే కావడం గమనార్హం. 1956 నవంబర్ 4వ తేదీన ఉస్మానియా విశ్వవిద్యాలయం గౌరవ డాక్టరేట్-డి.లిట్‌ను ప్రదానం చేసింది. ఆ విశ్వవిద్యాలయం సెనేట్‌లో శాశ్వత సభ్యులుగా ఉన్నారు. ఆయన గౌరవార్థం ఆయన పేరిట అక్కడ బంగారు పత కాన్ని ఏర్పాటు చేశారు. 1965లో 'హైదరాబాదు కో-ఆపరేటివ్ యూనియన్'కు కార్యదర్శిగా ఉన్నారు. 'సహకారోద్యమ' వ్యాప్తికి పాటు పడినందుకుగాను, మాడపాటి వారికి 'సహకార రత్న' అనే బిరుదునిచ్చారు. 'జీవరక్ష ప్రచారిణీ సంఘం', 'హిందూ మత సంస్కార సంఘం', 'ఆది హిందూ సేవాసమితి' మొదలైన వాటితో వారికి సంబంధం ఉండేది. 'ఆర్య సమాజం', 'బ్రహ్మ సమాజం', 'దివ్యజ్ఞాన సమాజాల'తో కలిసి పనిచేశారు. ఆ రోజుల్లో ఆయన చేపట్టని ఉద్యమమే లేదు, ఆయన చేయూత నివ్వని సంస్థయే లేదు. నిమ్నకులాల వారికే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చి, వారిని ముందుంచే వారు. 'ఆంధ్ర మహిళా సభ'కు మాడపాటి వారి సతీమణి మాణిక్యమ్మ నాల్గవ అధ్యక్షురాలుగా ఎన్నికై సమర్థంగా దానిని నడిపించారు. ఇంతటి ఉదాత్త చరిత్ర కలిగిన మాడపాటి హనుమంతరావు 1970 నవంబర్ 11వ తేదీన, తన 86వ యేట కన్ను మూశారు. ఆనాటి కౌన్సిల్‌లో ప్రతిపక్ష నాయకుడైన మగ్దూం మొహియుద్దీన్ 'తన ఉన్నతాదర్శాలతో, త్యాగాలతో ఏ ఒక్క పార్టీ అభిమానాన్నేగాక ఆయన యావదాంధ్రుల అభిమానాన్ని చూరగొన్నారు' అని మాడపాటి హనుమంతరావును ప్రస్తుతించారు.

సెల్ : 9440969130

# తెలంగాణ సామాజిక కవి కాళోజీ



దూలం యల్లయ్య

"వివక్ష ఎక్కడున్నా వ్యతిరేకించాడు. మంచి ఎక్కడున్నా స్వాగతించాడు. అన్యాయం, అణచివేతలపై తిరగబడ్డాడు. తనవాదనలతో తెలంగాణేతరుల మనసులను కూడా గెలుచుకున్నాడు. ఈ నేల సాంస్కృతిక వారసత్వంలో నుండి ఎదిగిన ఆ మహా కవి "కాళోజీ" కాళోజీ నిరంతర ఉద్యమజీవి. తన కాలంలో జరిగిన అనేక ఉద్యమాల్లో పాల్గొన్నాడు. ప్రతి విషయాన్ని ప్రశ్నించాడు. స్వాతంత్ర్య ఉద్యమంలోనూ పాల్గొన్నాడు. రజాకార్లను ఎదిరించి జైలు జీవితం గడిపాడు. నిజాం రాజునూ ఎదిరించాడు. తెలంగాణ ప్రత్యేక రాష్ట్రం కోసం పోరు చేశాడు. తన కోసం కాకుండా ఇతరుల బాగు కోసం పోరాడాడు.

తాడిత, పీడిత ప్రజల గుండెల్లో నిలిచిన కవి కాళోజీ. మాటలలో, చేతలలో, ఆలోచనలలో, వేష భాషలలో, ప్రవర్తనలో తెలంగాణ స్వరూపం కనిపిస్తుంది. కాళోజీ జీవితం ఆదర్శవంతమైంది. అతడు ప్రజాకవి. ప్రజల పక్షం వహించి కవిత్వం చెప్పాడు. ఆయన ఒక 'జీవనది', ఒక స్వాప్నికుడు అన్ని ప్రజాతంత్ర ఉద్యమాల్లో పాల్గొన్నాడు. ఆయన రచనలను పరిశీలిస్తే మనకు విశాలమైన, విస్తృతమైన మానవ ప్రపంచం కనబడుతుంది. కాళోజీ అనగారిన హక్కులు కోల్పోయిన ప్రజల పక్షం వహించాడు.

మొదటి ప్రపంచ యుద్ధంతోపాటు నేను భూమి మీద పడిన అంటూ 9.9.1914న కర్ణాటక ప్రాంతంలోని "రట్టహళ్లి" అనే ఊర్లో పుట్టాడు. ఇది బీజాపూర్ జిల్లాలో ఉంది. కాళోజీ చిన్నతనంలో వారి కుటుంబం కొన్నేండ్లు మహారాష్ట్రంలోని "సాయరాం" అనే గ్రామంలోనూ, కొంతకాలం తెలంగాణలోని ఇల్లందు తాలుకా కారెపల్లి గ్రామంలోనూ నివసించింది. వారి తండ్రి కాళోజీ రంగరామ, తల్లి రమాబాయమ్మ. వీరి అన్న గారు రామేశ్వరరావు ప్రముఖ ఉర్దూ కవి. వీరింట్లో ఉర్దూ, మరాఠీ భాషల వాతావరణం ఉండేది. కాళోజీ అన్న రామేశ్వరరావు న్యాయశాస్త్రం చదవడానికి హైదరాబాద్ వెళ్లాల్సి వచ్చింది. దాంతో కాళోజీ పాతబస్తీలోని కామహల్లా కాన్గి బడిల సెకండ్ ఫారంలో చేరాడు. తరువాత సుల్తాన్ బజారులో రెసిడెన్సీ మిడిల్ స్కూల్లో చేరాడు. ఉన్నత విద్య కోసం 1934 ఏప్రిల్ నెలలో వరం గల్ కాలేజియేట్ హైస్కూల్‌లో ఇంటర్మీడియట్‌లో ప్రవేశం చాడు. 1939లో "లా" పూర్తి చేశాడు. 1940లో గవిచర్ల గ్రామానికి చెందిన రుక్మిణిని వివాహం చేసుకున్నాడు.

కవిగా ఎదగడానికి కొంత నేపథ్యం ఉంటుంది. అలాగే బాల్యంలో గని వాతావరణం, విద్యార్థి దశలో విద్యా వాతావరణం, కాళోజీకి మరాఠి, ఉర్దూ, ఇంగ్లీషు, తెలుగు భాషా సాహిత్యాలలో పరిచయం కలగడానికి తోడ్పడ్డాయి. చిన్నప్పుడు కాళోజీకి సాహితీ సంపన్నులైన గార్లపాటి రాఘవరెడ్డి అనే గురువుగారితో పరిచయమైంది. వారి పరిచయం ఆత్మీయంగా మారింది. గురువు గారి శిక్షణలో గురు లఘువుల కలయికల్ని గుర్తెరిగాడు. అలా మాత్ర చందస్సులో గేయాల్ని అలవోకగా రాయడం అలవడింది. అందుకే "గురువు సుప్రసాదిత/ రాఘురాఘవ శక్తి ప్రసక్తి" అని గురు లఘువులు అనే కవితతో గురువు గారికి కవితానీరాజనాలు అందించాడు. అనంతరం అవనిపై జరిగే అవకతవకలు ఆవేదన కలిగించగా గేయాలు కవితలు రాసి ఉపన్యాస ధోరణితో సభల్లో వినిపించడం మొదలు పెట్టాడు. కాళోజీ రాసిన వాటిలో అణా కథలు (1940), నా భారతదేశ యాత్ర (1941 బ్రెయిన్ పోర్టు రచించిన రెబల్ ఇండియా పుస్తకానికి అనువాదం). కాళోజీ కథలు (1943), 'పార్థివ వ్యయం (1946), నా గొడవ (1953), తుది విజయం మనది నిజం (1942), నా గొడవ పురాతన వసంతం (1966), నా గౌరవ పరాభవ గ్రీష్మం (1966), నా గొడవ పరాభవ వర్షం (1966), నా గొడవ పరాభవ శరత్తు (1966), నా గొడవ పరాభవ హేమంతం (1966), నా గొడవ పరాభవ శశిరం (1967), జీవనగీత (1968 ఖలీల్‌క్రిబ్రాన్ రచించిన ద పోయెటిక్ అనువాదం), తెలంగాణ ఉద్యమ కవితలు (1969), నా గొడవ (యువభారతి-1974), నా గొడవ (1975-77) ఇది నా గొడవ (కాళోజీ ఆలుకత-1995), బాపూ! బాపూ!! బాపూ!!! (1995) మొదలైనవి ప్రచురితమయ్యాయి.

సమాజంలో ఉన్న తేడాలను ఆయన "వ్యత్యాసాలు" అనే గేయంలో ప్రస్తావించాడు. మానవులంతా ఒకే విధంగా పుట్టిన, జీవన విధానంలో మాత్రం వారి మధ్య అనంతమైన వ్యత్యాసం కనిపిస్తుంది.

**1) అన్నపు రాసులు ఒక చోట / ఆకలి మంటలు ఒక చోట.**

సమాజంలో కొన్ని చోట్ల అన్నపురాసులుంటాయి. కొన్ని చోట్ల ఆకలి మంటలుంటాయి. ఇది సమాజంలోని ఒక వ్యత్యాసం. అన్నపు రాసులున్న చోట ఆకలి ఉండదు. అన్నపు రాసులున్న ధనవంతులకు తింటే అరిగించుకునే శక్తి ఉండదు. అయినా వారి దగ్గర అన్నం రాసులుగా ఉంటుంది. నిజానికి పేదలు ఆకలితో అల్లాడుతుంటారు. అయినా వారికి అన్నం ఉండదు. అవసరం ఉన్నవారు ఆకలి మంటలతో మాడుతుంటే, అవసరం లేని వారి దగ్గర అన్నపురాసులు మూలుగుతుండడమే సమాజంలోని ఒక వ్యత్యాసం.

**2) హంసతూలిక లొకచోట / అలిగిన దేహాలొక చోట**

కొంతమంది ధనికులు హంసతూలికా తల్పాల మీద శయనిస్తారు. అయినా వారికి నిద్రరాదు. ఎందుకంటే వారు శారీరకంగా పనిచేయరు గనుక, కానీ పగలంతా ఎండనకా, వాననకా పనిచేసి అలసిపోయిన పేదలకు పడుకోడానికి పడక ఉండదు. గోనెపట్టా కూడా ఉండదు. నేలమీదనే పడుకోవాలి అంటూ కాళోజీ సమాజంలో ఉన్న వ్యత్యాసాన్ని వివరించారు. సమాజ గొడవను తన గొడవగా చేసుకొని నాగొడవ పేరుతో అనేక కవితలు రాసి వాటిని ఎనిమిది సంపుటాలుగా వెలువరించారు. ప్రాంతీయ దృక్పథం, దేశీయ దృక్పథం అంతర్జాతీయ దృక్పథం కలిగిన కాళోజీ నిజానికి అంతర్జాతీయ కవి, నిరంకుశ రాజ్యాలమీద తన జీవితాంతం కత్తిగట్టి పోరాడినవారు కాళోజీ. అందుకే రాజకీయాలలో ప్రజా ఉద్యమాలలో మమేకమైన కాళోజీ కవిత్వాన్ని తెలుగు నాట ప్రజలు ఆదరించారు. రజాకార్లపై ఆయన కోపాన్ని పరాకాష్టకు చేర్చిన కవిత 'కాటేసి తీరాలే'. ఇందులోని కసి తెలంగాణ ప్రజలందరిది.

**"మన పిల్లలను చంపి మనల బంధించిన**
**మానవాధములను మండలాధీశులను**
**మరిచిపోకుండ గురుతుంచుకోవాలె**
**కాలంబు రాగానె కాటేసి తీరాలె.**

సాహిత్యంలో భాషనుపయోగించే కాళోజీకి కచ్చితమైన అభిప్రాయాలున్నాయి. ఆయన దృష్టిలో భాష రెండు రకాలుగా ఉంటుంది. ఒకటి "బడిపలుకుల భాష" రెండవది జనం మాట్లాడే "పలుకుబడుల భాష". ఒక రకంగా చెప్పాలంటే మొదటిది గ్రాంధిక భాష, రెండవది వ్యావహారిక భాష. ఈ వ్యవహారిక భాషయే జీవభాష. ఏ భాషకైనా జీవధాతువు మాండలికమే. "రెండున్నర జిల్లాలదే దండి భాష అయినప్పుడు.

**తక్కినోళ్ల యాస**
**తొక్కినొక్క బద్దప్పుడు**
**ప్రత్యేకంగా రాజ్యంపాలు**
**కోరడం తప్పదు**

అంటూ కాళోజీ ఆంధ్ర ప్రాంతపు భాషావాదులను హెచ్చరించాడు. కాళోజీ రాసిన జీవనగీతకు 1968లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంచే ఉత్తమ అనువాద రచన అవార్డు, బూర్గుల రామకృష్టారావు అవార్డు, 1972లో భారత ప్రభుత్వంచే స్వాతంత్ర్య సమరయోధుడిగా తామ్ర పత్రంతో సన్మానం అందుకున్నాడు. మొదటి ప్రపంచ తెలుగు మహాసభల వేదికల్లో సన్మానం అందుకున్నాడు. 1992లో భారత ప్రభుత్వం నుంచి పద్మవిభూషణ్ పురస్కారం మరెన్నో సన్మానాలు, పురస్కారాలు అందుకున్నారు. తన చావు తర్వాత తన భౌతిక దేహం వైద్య విద్యార్థుల పరిశోధనకు ఉపయోగపడాలని ఆశించాడు. 13.11.2002 నాడు మరణించాడు. బతుకంతా దేశంగా, ప్రజలుగా, ఉద్యమాలుగా బతికిన ప్రజాకవి కాళోజీ నారాయణ. తన సామాజిక జీవితం ఆయనిచ్చిన స్ఫూర్తి ముందుతరాలకు శక్తినిస్తుంది. ఆయన జీవితం, కవిత్వం భావితరాలకు ఆదర్శం.

సెల్ :9849722127

# యువతను జాగరూకత చేయాలి



వినోద్‌కుమార్ స్తుద్దాల

"చదవక ముందు కాకరకాయ చదివిన తర్వాత కీకరకాయ"అన్న చందంగా ప్రస్తుత పరిస్థితులు తయారయ్యాయి. ఒకప్పుడు 'విద్య లేనివాడు వింత పశువు' అన్నారు. కానీ నిజానికి నేటి పరిస్థితులు ఆ ఆలోచన తప్పని రుజువు చేస్తున్నాయి. ఇది నేటి విద్యావిధానంలో లోపాలు, ఆధునికత పేరుతో అనేక విశంఖల ధోరణులు, అరచేతికందిన సాంకేతిక పరిజ్ఞానం దుర్వినియోగం, చిన్న సమస్యలకు 'పరిష్కారం లేదు' అనుకునే భ్రమ, తాత్కాలిక ఆలోచనలు, కోరికలు ఇత్యాధి అనేక పరిస్థితుల్లో సమాజంలో పతనమవుతున్న విలువలను బహిర్గతం చేస్తున్నాయి. ముఖ్యంగా ప్రాచీన కాలం నుండి వచ్చిన ఉమ్మడి కుటుంబ వ్యవస్థ చిన్నాభిన్నం కావటంతో కుటుంబంలో మానసిక స్థైర్యం, తోడ్పాటు, ప్రోత్సాహం కరువై ఎవరి జీవన ప్రయాణం వారికే గగనమైన ప్రస్తుత 'బిజీ'వనంలో ఒకరి బాధలు మరొకరికి పట్టింపులేనివిగా తయారవడమే గాక సంబంధాలు, సాన్నిహిత్యాలు, గౌరవాలు, ప్రాధాన్యతలు అన్నీ క్షీణిస్తున్నాయి. వాస్తవానికి నేటి పల్లెల్లో ఎన్నో కష్టనష్టాలను అనుభవించినా, జీవనాన్ని సాగిస్తూ కుటుంబాలను ఒంటిచేత్తో ఒడ్డుకు చేర్చిన అనేకమంది కనిపిస్తుండగా మరొకవైపు అందుకు విరుద్ధంగా చిన్న సమస్యలకే (పరీక్ష తప్పామని, అమ్మానాన్న తిట్టారని, ప్రేమ విఫలమైందని..) విలువైన జీవితాలను తణప్రాయంగా కోల్పోతూ తల్లిదండ్రులకు గుండెకోత మిగులుస్తున్న యువతను జాగరూకత చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది. చదువుతోపాటు క్రీడలు, వ్యాపారాలు, కళలతోపాటు అనేక ఉపాధి మార్గాలు ఉండగా మానసిక దఢత్వం కోల్పోతూ క్షణికావేశంలో తీసుకుంటున్న తీవ్ర చర్యలు కుటుంబంపైన తీవ్రంగా, అటు సమాజంపై దీర్ఘకాలంపాటు దుష్ప్రభావాన్ని చూపుతున్నాయి. అలాగే ఒకప్పటి కంటే ఇప్పుడు సమాజంలో స్వేచ్ఛ విస్తతమైంది. చిన్న కుటుంబాలు పెరగడం వల్ల పర్యవేక్షణ తగ్గింది. అదే సమయంలో తల్లిదండ్రులను కూడా లెక్కచేయని తత్వం పెరుగుతున్నది. దీంతో నియంత్రణ, పర్యవేక్షణ లేని స్వేచ్ఛను దుర్వినియోగం చేస్తున్న యువత చెడు వ్యసనాలకు దగ్గరవుతూ (ఆల్కహాలు, డ్రగ్స్, అసాంఘిక కార్యకలాపాలు ) తమ విలువైన జీవితాన్ని బుగ్గిపాలు చేసుకుంటున్న దష్టాంతాలు అనేకం కనిపిస్తున్నాయి. పెద్దల ఎడల గౌరవం లేకపోవడం, గురువుల పాత్ర క్షీణించటం, అన్నీ అరచేతిలో అందిస్తున్న అంతర్జాలం అందుబాటులోకి రావడం, డబ్బు ప్రభావం పెరిగిపోవడం, పాశ్చాత్య ధోరణుల అనుకరణ, నాసిరకం, నాణ్యతలేని చదువులు ఇలా అనేక రకాల కారణాల వల్ల నేటి విద్యార్థి, యువత తీవ్ర ప్రభావానికి లోనై జీవనంలో ఒడిదుడుకులు ఎదుర్కొంటున్నారు. ముఖ్యంగా పాఠశాల స్థాయి నుంచి విద్యార్థులపై గురువులకుండే ప్రత్యేక శ్రద్ధ పర్యవేక్షణ తగ్గుతున్నది. ప్రభుత్వాలు, అధికార గణం, పాఠశాల, కళాశాల యాజమాన్యాలు పాఠ్యాంశాల పూర్తి పరీక్షల నిర్వహణ లక్ష్యంగా పనిచేస్తున్నారే కానీ విద్యార్థిలో గుణాత్మక మార్పు, మంచి వ్యక్తిత్వం, నడవడిక కలిగేలా కషి చేయడం లేదు. అంతేకాక పాఠ్యాంశాన్ని ఎంతగా గ్రహించారని తెలుసుకోవాల్సిన విషయాన్ని పస లేని పరీక్ష పద్ధతులతో వారిని మరింత ఆందోళన చెందేలా చేస్తున్నారు. సమాజంలో అక్రమార్కులపై ఏహ్యాభావం తగ్గుతున్నదా అనే భావన కలుగుతున్నది. ఎందుకంటే ఒకప్పుడు అక్రమార్కులు, దుర్గుణాలు గల వారిని ఆమడ దూరంలో ఉంచిన సమాజం నేడు అవసరాల రీత్యా వ్యవహరిస్తున్న తీరు అందుకు అద్దం పడుతున్నది. దీనికి ఏ ఒక్కరినో నిందించి కూడా ప్రయోజనం లేదు. స్వార్థ చింతన విపరీతంగా పెరిగిపోయిన ప్రస్తుత తరుణంలో విలువల పతనం అంతకంతకూ క్షీణిస్తున్నది. వద్ధుల సంరక్షణ భారంగా భావించడం, అక్రమాలకు అవినీతికి దాసోహం కావటం, సమన్వయం లోపించటం, గౌరవాలు క్షీణించడం, బాధ్యత మరచిన స్వేచ్ఛ వంటివి పెరిగిపోతున్నాయి. ఇలాంటి విపత్కర పరిస్థితుల్లో విలువైన జీవితాశయ నిర్మాణం కోసం పాఠశాల స్థాయి నుండే విద్యార్థులకు, యువతకు జీవితం విలువలను పరస్పర గౌరవాన్ని, సమన్వయాన్ని, ఒడిదుడుకులను ఎదుర్కొనే నైపుణ్యాన్ని నేర్పించాలి.

సెల్ : 9908312949

# పర్యావరణ దార్శనికుడు అంబేద్కర్



గాదె వెంకటేష్

పర్యావరణ పరిరక్షణ అవశ్యకతను సహజవనరుల, సామాజిక న్యాయ అవినాభావ సంబంధాన్ని ఎవ్వరూ పట్టించుకోని కాలంలోని అంబేద్కర్ గుర్తించాడు. పర్యావరణం గురించి మాట్లాడని రోజుల్లోనే, పర్యావరణ పరిరక్షణ విత్తనాలను రాజ్యాంగంలో ఆర్టికల్ 21, 48ఏ, 51ఏ(జి)లో నాటిన దార్శనికుడు అంబేద్కర్. ప్రపంచంలో పర్యావరణానికి సంబంధించిన విషయాలు చేర్చిన మొదటి రాజ్యాంగం కూడా మనదేకావడం మరో గొప్పవిషయం. ఇప్పుడు పర్యావరణ పరిరక్షణ, సామాజిక న్యాయం ఈ రెండు ప్రపంచవ్యాప్తంగా ముఖ్యమైన చర్చనీయాంశాలుగా మారాయి. అందుకే సామాజిక న్యాయం పర్యావరణ పరిరక్షణ పదాలు పలుచనయ్యాయి. దళితులు, గిరిజనులు, వెనుకబడిన తరగతులకు ప్రకృతి, పర్యావరణంతో విడదీయరాని సంబంధం ఉంటుంది. అభివృద్ధి, పర్యావరణ రక్షణ అనేవి ఒక దేశ మనుగడ నాణానికి గల రెండుముఖాలు. ప్రపంచ ఆరోగ్య సంస్థ అంచనా ప్రకారం మనం పర్యావరణ సమతుల్యాతను పాటించడం ద్వారా ప్రపంచంలో యేట 13 మిలియన్ల చావులను నివారించవచ్చు. పర్యావరణపు హాని వల్ల ఆరోగ్యంకోసం ప్రతి సంవత్సరం భారతదేశంలో ఖర్చుపెట్టే 7 బిలియన్స్ డాలర్ల డబ్బు వేరే అవసరాలకు వాడుకోవచ్చు. ఇప్పటి వరకు ప్రత్యక్షంగానో, పరోక్షంగానో, పర్యావరణ కాలుష్య నియంత్రణ చట్టాలు దాదాపు 200 వరకు చేయబడ్డాయి. అందులో మొదటిగా "The shore Nuisance (Bombay and colabal Act 1853), Ô C²>± National Green Tribunal Act, 2010 గా చెప్పవచ్చు. వాస్తవానికి పర్యావరణ రక్షణకు నేరుగా 1947 కు ముందు ఏ చట్టాలు లేవు. భారత శిక్షాస్మృతి (ఐపీసీ) ప్రతిపాదికన, ఆహార పదార్థాల అపరిశుద్ధం, నీటిచౌర్యం వాతావరణాన్ని కలుషితంచేయడం నేరస్మృతి చట్టం(సీపీసీ) ద్వారా ప్రజాహాని, ప్రజా ఆరోగ్యానికి సంబంధించిన విషయాలను పరిష్కరించడానికి ప్రభుత్వం ప్రయత్నించేది. చాలా పర్యావరణానికి సంబంధించిన కేసులను ఐపీసీ, సీపీసీ ఆధారంగా చేసుకొని కోర్టులు తీర్పునిచ్చేవి.

1972కు ముందు పర్యావరణానికి సంబంధించినవి దాదాపు 31 చట్టాలు ఉండేవి. ఆ చట్టాలన్ని చాలా మట్టుకు అభివృద్ధిని దృష్టిలో ఉంచుకొని చేసినవే, కాలుష్య నియంత్రణ పరిగణలోకి తీసుకొని చేసినవికావు. ఆరవ పంచవర్ష ప్రణాళికలో పర్యావరణ పరిరక్షణ ప్రణాళికలు రూపొందించారు. దాని ఫలితంగానే 1974లో నీటి (కాలుష్య, నివారణ, నియంత్రణ)చట్టం తీసుకొచ్చింది అప్పటి కేంద్రప్రభుత్వం. ఈ చట్టాన్ని అమలు పరచడంలో భాగంగానే పర్యావరణ కాలుష్య నియంత్రణ మండలిలు 1974లో ఏర్పాటు చేయబడ్డాయి. కానీ నియంత్రించడంలో విఫలమయ్యాయి. అటవీ చట్టం 1980 వాయు (కాలుష్య, నివారణ, నియంత్రణ) చట్టం 1981లో అమలులోకి వచ్చాయి. 1986 ముందు వాయు, నీటికి సంబంధించిన చట్టాలు శిక్షకు సంబంధమైనవిగానే ఉండేవి, నివారణ చర్యలకు సంబంధమైనవిగా ఉండేవి కావు. పర్యావరణ పరిరక్షణ చట్టం 1986 తీసుకొచ్చింది. 1991 వరకు ఉన్న అన్ని చట్టాలు దాదాపు నియంత్రణ విధానంగా ఉన్నందున, 1991లో "లిబిలిటీ ఇన్సూరెన్స్ యాక్ట్" చేయడం జరిగింది. స్టాక్‌హోం ఒప్పందాలను గౌరవిస్తూ కేంద్రప్రభుత్వం 1976లో 42వ రాజ్యాంగ సవరణ ద్వారా ఆదేశ సూత్రాల్లో భాగమైన 48-ఏ వాతావరణాన్ని, అడవులను, సామాజిక అడ వులను అభివృద్ధి పరిచి, వన్యప్రాణుల పరిరక్షణా భారాన్ని వహించాలని సవరించడం జరిగింది. ఈ సవరణలు చేయ డానికి వీలయేటట్లు రాజ్యాంగంలో వెసులుబాటు కల్పించడం నిజంగా రాజ్యాంగ నిర్మాత ముందుచూపుకు నిదర్శనం. 7వ షెడ్యూల్‌లో 17-ఏ కింద అడవులు ఉమ్మడి (కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల) ఆస్తుల జాబితాలోకి వచ్చాయి (మొదట్లో రాష్ట్ర పరి ధిలో ఉండేవి). అందువల్ల రాష్ట్రంతోపాటు, పార్లమెంటు కూడా అడవులపై శాసనం చేసే అధికారం వచ్చింది. ఈ మార్పుల కారణంగా ఒకే విధమైన విధానం కోసం 1980లో కేంద్ర ప్రభుత్వం అటవీ, పర్యావరణ మంత్రిత్వ శాఖ (ఎంఓఈఎఫ్)ను ఏర్పాటు చేసింది. ఎంవోఈఎఫ్ మార్గదర్శకంలో కాలుష్య నియంత్రణ మండలిలు పనిచేసేటట్టు పార్లమెంట్ చట్టం తెచ్చింది. ప్రభుత్వం అటవీ సంరక్షణ చట్టం (1980)ని, 1988లో సవరించింది. ప్రభుత్వం జాతీయ అటవీ విధానాన్ని అడవుల సంరక్షణ, అటవీ ప్రాంత వాసుల అవసరాలను దృష్టిలో ఉంచుకొని చేసింది. 1972 వన్యప్రాణుల సంరక్షణా చట్టంలో 42వ సవరణ ద్వారా వన్యప్రాణులతోపాటు అడవులను కాపాడాలని మార్పుచేసింది. సహజ సంపదను అందరు సమానంగా వాడుకోవడం ద్వారా ప్రజలు తమ తమ ఆర్థిక స్థితిగతులను వృద్ధి చేసుకుంటారని అంబేద్కర్ ఆధ్వర్యంలోని న్యాయనిపుణులు ఆనాడే భావించారు. ఒక మనిషి ఆర్థికంగా బలపడాలంటే సహజ వనరులు చాలా అవసరం. సహజ వనరులు అందరి సొత్తు. అధికరణలు 51ఏ(జి) (42వ సవరణ) యాక్ట్ 1976 ద్వారా ప్రకృతి పరిసరాలైన అడవులను, సరస్సులను, వన్యప్రా ణులను, ఇతర జీవులను సంరక్షించుకోవాలని సవరించడం జరిగింది. దీని ద్వారా రాజ్యాంగం రెండు ముఖ్యమైన విషయా లు చెబుతుంది. ఒకటి పర్యావరణాన్ని కాపాడాల్సిన వృద్ధి చే యాల్సిందిగా రాజ్యానికి లక్ష్యం నిర్దేశిస్తూనే ప్రతి పౌరుడు అందుకు బాధ్యత వహించాల్సిందేనని హెచ్చరిస్తుంది. ఇప్పుడు న్న పరిస్థితులలో 48-ఏ, 51ఏ (జి) చాలా ముఖ్యం. ప్రభుత్వం మరొక అడుగు ముందుకేసి పర్యావరణ పరిరక్షణను వేగవంతం చేయడానికి కింది విధంగా రాజ్యాంగంలో సవరణలు తెచ్చింది. 7వ షెడ్యూల్‌లో 17-ఏ, 20-ఏతోపాటు 17-బి వన్యప్రాణులు, పక్షుల రక్షణను చేర్చారు. 11వ కొత్త షెడ్యూల్‌ని 73వ సవరణ చట్టంలో భాగంగా 1992 సం॥లో చేర్చడం జరిగింది. ఈ షెడ్యూల్‌లో ఆర్టికల్ 243(జి)లో ఎనిమిది (8) కొత్త (2, 3, 6, 7, 11, 12, 15 & 24) పర్యావరణ పరిరక్షణ, వాడకం సంబంధించిన ప్రకరణలుని చేర్చారు. ఈ షెడ్యూల్ ద్వారా పంచాయతీలకు భూసంరక్షణ నీటి వినియోగం, అడవులు, సామాజిక అడవుల పెంపకం తాగునీరు వంటచెరు కు పసుగ్రాసం మొదలగువాటిని పర్యావరణాన్ని దృష్టితో అప్ప గించడం జరిగింది. 12వ షెడ్యూల్‌లో ఎనిమిదవ (8)ది గా పట్టణ అడవులు, పర్యావరణ పరిరక్షణ, జీవావరణ సంబంధిత విషయాలు చేర్చడం జరిగింది. ఈ సవరణ ద్వారా చట్టం చేసే అధికారం కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు వికేంద్రీకరించబడింది. అది లిస్ట్-1, 2, 3లుగా పేర్కొనబడింది. జీవించే హక్కుకి న్యాయస్థానం చలన శీలతతో కొత్త అర్థాన్ని అన్వయించిన తీరు ఆర్టికల్-14, 19(6), 21లు విశ్లేషిస్తాయి. సుప్రీం కోర్టు మేనకా గాంధీ వాజ్యంలో ( ఎయిర్ 1978 ఎస్సీ 597) జీవించే హక్కు అంటే అది ఆరోగ్యవంతమైన పర్యావరణంలో జీవించడం అని ఒక విప్లవాత్మకమైన అసలైన అర్థాన్ని చెప్పి ఆర్టికల్ 21కి సరైన రూపమిచ్చింది. రత్నం మున్సిపాలిటీ (వీఎస్) వర్ధిచంద్‌లో పరోక్షంగా (ఆర్టికల్ 1980 ఎస్సీ 1622) ప్రత్యక్షంగా, జీవించే హక్కు అంటే అది 'అర్థవంతమైన జీవితమని' అన్వయించి చెప్పడం ద్వారా రాజ్యాంగం రాసిన నిపుణుల ఉద్దేశాలను సరిగ్గా వడిసి పట్టుకున్నారని చెప్పవచ్చు. 1987లో పర్యావరణానికి సంబంధించి 13 తీర్పులు వెలుబడ్డాయి.

ప్రజల ఆర్థిక్థితులు మారడానికి సహజ సంపద ఉపయోగపడుతుందని నమ్మాడు అంబేద్కర్. ఈ దేశంలోని పెట్టుబడిదారులు, ఆధిపత్య కులాల సొంతం కాకుండా అందరికీ సమతుల్యంగా అందేటట్టు పర్యావరణ పరిరక్షణ, పొదుపుగా వాడాలని అంబేద్కర్ ఆశించాడు. రాజ్యాంగంలో అంబేద్కర్ వేసిన విత్తనాలు ఇప్పుడు పెరిగి వివిధ పర్యావరణ చట్టాల రూపంలో ప్రయోజన ఫలాలను అందిస్తున్నాయి. పాలకుల స్వార్థం వల్ల ఈ చట్టాలు సరిగా అమలవుతలేవనేది నిర్వివాదాంశం. ఈ సామాజిక మార్పుకు ఇదొక ఆధారమని నమ్మి రాజ్యాంగంలో పర్యావరణ పరిరక్షణ విత్తనాలు నాటిన దార్శనికుడు అంబేద్కర్. పాలకులు తీసుకున్న నిర్ణయాలు, కింద వున్న పేదలకు (ఎస్సీ, ఎస్టీ, బీసీ, మైనార్టీలకు) లబ్ధి చేకూరాలంటే భూమి, నీరు, అడవులపై వాటా, హక్కు ఉండాల్సిందే. భూమి లేనప్పుడు వ్యవసాయ మొదలైన సబ్సిడీలు ఎవరికోసం? నీటి వసతిలేని దళితులకు పోరంబోకు భూములను పంచడం వల్ల ప్రయోజనం శూన్యమే. ఆర్థిక అసమానతలకు, సహజ వనరుల వాటాకు గల అవినాభావ సంబంధాన్ని గుర్తించిన అంబేద్కర్, రాజ్యాధికారం బ్లాంక్ చెక్ అయితే సహజ వనరులు దాని విలువను నిర్ణయిస్తాయని నమ్మిన పర్యావరణ ప్రేమికుడు.

సెల్ : 9849722127

## ఈ పేజీ మీ అందరిది

ఇక్కడ వ్యక్తమయ్యే అభిప్రాయాలు వ్యాసకర్తల వ్యక్తిగతం. నవతెలంగాణ అభిప్రాయాలు కానవసరం లేదు. 4000 క్యారెక్టర్ల లోపు ఉన్న వ్యాసాలకు ప్రాధాన్యత ఉంటుంది. ఎట్టి పరిస్థితుల్లోను 6000 క్యారెక్టర్లకు మించకుండా పంపించండి. వివిధ ప్రజాసమస్యలపై రాసిన వ్యాసాలకు ప్రాధాన్యత ఉంటుంది. వ్యాస రచయితలు వారి ఫొటో, సెల్‌నెంబర్ ఇవ్వాలి.

- ఎడిటర్

**మీ రచనలు పంపవలసిన చిరునామా :**

email: vedika@ navatelangana.com Postal Addres: M.H.Bhavan,plot No,21/1, Azamabad, Near RTC Kalayana mandapam,Hyderabad500020.
Ph:27665420,27673787,9490099077/78.
Fax:040-27652228

# ఆఫ్రికన్ల జీవితాలకు ప్రతిబింబాలు



















**ప్రపంచ సినీ చరిత్రలో ఆఫ్రికన్ చిత్రాలకే కాదు ఆఫ్రికన్ నేపథ్య చిత్రాలకూ ఓ ప్రత్యేక స్థానం ఉంది. ఆఫ్రికన్ల బతుకు చిత్రానికి ప్రతిబింబంగా నిలిచే రీతిలో ఇతర దేశ దర్శక, నిర్మాతలు కూడా ఎన్నో చిత్రాలను రూపొందించారు. ఈ చిత్రాలు సైతం విశేష ప్రేక్షకాదరణ పొంది వరల్డ్ బాక్సాఫీస్ వద్ద సత్తా చాటాయి. నవ్య, వైవిధ్య కథ, కథనాలతో తెరకెక్కి ప్రేక్షక లోకాన్ని మెప్పించిన కొన్ని ఆఫ్రికన్ నేపథ్య చిత్రాల గురించి ఈ వారం అందిస్తున్న స్పెషల్ షో..**

షో

## క్వీన్ ఆఫ్ కాట్వే

ఉగాండాకు చెందిన చెస్ క్రీడాకారిణి ఫియోనా మియుసి జీవితాన్ని ప్రతిబింబించే బయోగ్రాఫికల్ చిత్రమిది. ఉగాండాలోని కాట్వే ప్రాంత మురికి వాడల్లో ఉండేఓ కుటుంబంలో జన్మించిన ఫియోనా పదేండ్ల పాటు అత్యంత దుర్భరమైన పరిస్థితులను ఎదుర్కొంది. అనేక సమస్యలతో పోరాడుతూనే చెస్‌లో రాణిస్తుంది. ఉగాండా మహిళల జూనియర్ ఛాంపియన్‌షిప్‌లో 3 సార్లు గెలుపొందింది. అలాగే చెస్ ఒలంపియాడ్‌లో నాలుగు సార్లు ఉగాండా దేశం నుంచి ప్రాతినిధ్యం వహించింది. అంతేకాదు చెస్ చరిత్రలోనే ఒలంపియాడ్ టైటిల్‌ను గెలుచుకున్న తొలి ఉగాండా మహిళాగా ఫియోనా మియుసి రికార్డు సృష్టించింది. అత్యంత స్ఫూర్తివంతమైన ఆమె జీవితం తెరపైకి ఎక్కి మంచి ఆదరణ పొందింది. ఈ చిత్రాన్ని భారతీయ దర్శకురాలు మీరానాయర్ రూపొందించడం విశేషం. గతేడాది విడుదలైన ఈ సినిమా విమర్శకులు ప్రశంసలందుకోవడంతోపాటు టొరంటో అంతర్జాతీయ చిత్రోత్సవంలో ప్రదర్శితమైంది. ఫియోనాగా మదీనా నల్వాంగ నటన అబ్బుర పరుస్తుంది.

## ది సీజ్ ఆఫ్ జాడోట్విల్లే

డెక్లన్ పవర్ రాసిన 'ది సీజ్ ఎట్ జోడోట్విల్లే: ది ఐరిష్ ఆర్మీ ఫర్గాటెన్ బ్యాటిల్' అనే పుస్తకం ఆధారంగా తెరకెక్కిన చిత్రమిది. యునైటెడ్ నేషన్‌లో శాంతి కోసం కోంగో పట్టణంలో 1961 సెప్టెంబర్‌లో చేపట్టిన 'పీస్ కీపింగ్ మిషన్'లో ఐరీష్ ఆర్మీ పాత్రను, ఆర్మీ పోరాటాన్ని తెలియజేస్తుంది. ఐరీష్ ఆర్మీ అధికారుల నిర్ణయాలు ఎలాంటి ప్రభావాన్ని చూపించాయనేది ఈ చిత్రంలో ప్రతిబింబించింది. హిస్టారికల్ వార్ డ్రామాగా తెరకెక్కిన ఈ చిత్రాన్ని దర్శకుడు రిచీ స్మిత్ 2016లో రూపొందించారు. ఆద్యంతం నాటకీయంగా సాగే ఈ చిత్రం విశేషంగా ఆదరణ పొందింది. ఇందులో జామీ డోర్నన్, మార్క్ స్ట్రాంగ్, మైఖేల్ పెర్స్‌బ్రాంట్, డానీ సపనీ, జసోన్ ఓ మారా ప్రధాన పాత్రల్లో నటించి మెప్పించారు.

## బీస్ట్స్ ఆఫ్ నో నేషన్

ఒక బాలుడు సైనికుడిగా ఎదిగిన వైనాన్ని తెలిపే చిత్రమిది. అగు అనే ఓ చిన్న కుర్రాడు పశ్చిమ ఆఫ్రికా దేశంలో నివసిస్తుంటారు. వారున్న ప్రాంతంలో ఎప్పుడూ యుద్ధ వాతావరణం నెలకొని ఉంటుంది. తమ ప్రాంతాన్ని కాపాడటం కోసం పోలీసులు యుద్ధం చేస్తుంటారు. దీని కోసం పిల్లలను సైతం బలవంతంగా సైనికులుగా మారుస్తారు. ఈ క్రమంలో అనేక ఇబ్బందులు, హింసలకు గురిచేస్తుంటారు. తుపాకీ పట్టి ప్రత్యర్థులను చంపేందుకు శిక్షణ ఇస్తారు. మరి అలా తుపాకి పట్టిన అగు అనే కుర్రాడు భయపడే స్థితి నుంచి భయపెట్టే స్థితికి ఎలా ఎదిగాడు. ఎదిగే క్రమంలో అతని శారీరక, మానసిక సంఘర్షణ ఏంటన్నది ఆసక్తికరం. బాల సైనికుడి స్ట్రగుల్‌ను తెలియజేసే ఈ వార్ డ్రామా చిత్రాన్ని దర్శకుడు కారీ జోజి ఫుకునాగా రూపొందించారు. 2015లో విడుదలైన ఈ చిత్రం విశేష ఆదరణతోపాటు విమర్శకుల ప్రశంసలందుకుంది. వెనిస్, టొరంటో వంటి పలు అంతర్జాతీయ ఫిల్మ్ ఫెస్టివల్స్‌లోనూ ప్రదర్శితమై, పలు అవార్డులను సొంతం చేసుకుంది. ఇందులో చైల్డ్ సోల్జర్ అగు పాత్రలో అబ్రహం అట్టా నటన మంత్రముగ్ధులను చేస్తుంది.

## ద గన్‌మన్

మాజీ సైనికుడైన జిమ్ టెర్రీర్ ప్రస్తుతం కిరాయి హంతకుడిగా పనిచేస్తుంటాడు. అందులో భాగంగా అతని దగ్గరికి కోంగో మైనింగ్ మినిస్టర్‌ను హత్య చేసే పని వస్తుంది. ఓ కార్పొరేట్ కంపెనీ అధినేత ఈ పనిని జిమ్‌కు అప్పగిస్తాడు. తను అనుకున్న ప్రకారం ఆ మంత్రిని చంపేస్తాడు జిమ్. కొన్నాళ్ళ తర్వాత తన వృత్తిని మానేస్తాడు. కానీ ప్రత్యర్థులు జిమ్‌ను వెంబడిస్తారు. ఈ నేపథ్యంలో జిమ్ చేసే పోరాటమే ఈ చిత్రం. యాక్షన్ థ్రిల్లర్‌గా రూపొందిన ఈ సినిమాను పియర్ మోరెల్ రూపొందించారు. జిమ్ పాత్రలో సీయన్ పెన్న్ నటన ఆద్యంతం ఆకట్టుకుంటుంది. 2015లో విడుదలైన ఈ చిత్రం క్రిటికల్‌గా ఆకట్టుకుంది.

## థింగ్స్ ఆఫ్ ది ఎయిమ్‌లెస్ వండర్

19వ శతాబ్దంలో పశ్చిమ ఆఫ్రికలో ఓ తెల్లజాతీయుడు పర్యటిస్తుంటాడు. అనుకోకుండా ఓ దట్టమైన అడవిలో తప్పిపోతాడు. తాను ఎక్కడ ఉన్నాడో కనిపెట్టేందుకు ప్రయత్నిస్తాడు. ఈ క్రమంలో అడవిలో ఓ నల్లజాతి యువతి కనిపిస్తుంది. ఆమెతో కాసేపు గడిపిన తర్వాత అనుకోకుండా ఆమె మాయమవుతుంది. 20వ శతాబ్దంలో విదేశీ న్యూస్ కరెస్పాండెంట్ నైట్ క్లబ్‌లో ఓ వేశ్యను కలుస్తాడు. ఆమెతో రాత్రి గడుపుతాడు. ఆ మరుక్షణం ఆమె కనిపించకుండా పోతుంది. ఆమె కనిపించకుండా పోవడానికి గల కారణమేంటనేది కనుగొనేందుకు అతను ఏం చేశాడు. 19వ శతాబ్దానికి, దీనికి ఉన్న సంబంధమేంటనేది సినిమా. కివూ రురు హోజా దర్శకత్వంలో రూపొందిన ఈ చిత్రం 2015లో విడుదలై మంచి ఆదరణ పొందింది. రామథన్ బిజిమనా, జస్టిన్ ముల్లికిన్ అద్భుతంగా నటించారు.

## ది గుడ్ లై

సుడాన్ దేశంలో జరిగిన సివిల్ వార్ కారణంగా వేల మంది ప్రజలు నిరాశ్రయులవుతారు. ఎంతో మంది హత్యాకాండకు బలవుతారు. సుమారు 3600 మంది అక్కడి నుంచి పారిపోయి రక్షిత ప్రాంతం కోసం ప్రయాణం సాగిస్తారు. 15ఏండ్ల పాటు వేల మైళ్ళు ప్రయాణించిన తర్వాత చివరికి అమెరికాకు చేరుకుంటారు. కొంత మంది సహకారంతో అమెరికాలో సెటిలైన తర్వాత వారి జీవితం ఎలా సాగింది. వాళ్లు ఎదుర్కొన్న ఆటుపోట్లు ఏంటనేది సినిమా. ముగ్గురు సుడాన్ శరణార్థులను ప్రధాన పాత్రలుగా తీసుకుని యదార్థ సంఘటనల ఆధారంగా దర్శకుడు ఫిలిప్ ఫాలర్డియు ఈ చిత్రాన్ని రూపొందించారు. ప్రేక్షకుల హృదయాలను కదిలించిన ఈ చిత్రం 2014లో విడుదలై విశేష ప్రేక్షకాదరణ పొందింది. ప్రధాన పాత్రల్లో రీస్ విథర్స్పూన్, జెరు డునీ, ఆర్నేల్డ్ ఓకేంమ్గా ఇమ్మాన్యుయల్ జల్ నటించి అలరించారు.

## టింబక్టు

టింబక్టు సమీపంలో పురాతన నగరంలోని ఏడారి ఇసుక దిబ్బల్లో పశువుల కాపరి కిడనె, తన భార్య సతిమా, కూతురు టోయా, తోటి కాపరి ఇస్సాన్‌తో కలిసి శాంతియుతమైన జీవితం గడుపుతుంటాడు. ఈ తరుణంలో అక్కడ టెర్రరిస్టుల నుంచి ఇబ్బందులెదురవడం ప్రారంభమవుతుంది. వారి నిబంధనల ప్రకారం నడుచుకోవాల్సిన పరిస్థితులుంటాయి. ఈ క్రమంలో కిడనే ఫ్యామిలీ మనుగడ కోసం చేసే పోరాటం సినిమాలో ఆసక్తికరం. మంచి సందేశాన్ని దర్శకుడు అబ్దేరామానే సిసోకో చమత్కారంగా, వినోదాత్మకంగా తెరకెక్కించారు. 2014లో విడుదలైన ఈ సినిమా విశేష ఆదరణ పొందింది. ప్రధాన పాత్రలో ఇబ్రహీం అహ్మద్ దిట్ పినో, టౌలౌ కికి, లల్యా వాలెట్, మెహిదీ అగ్‌ల నటన ఆకట్టుకుంటుంది. ఈ చిత్రం కేన్స్‌లో ప్రదర్శితమై జ్యూరీ అవార్డునందుకుంది. అలాగే ఆస్కార్‌కు నామినేట్ అయ్యింది. ఆఫ్రికా అకాడమీ అవార్డులను సొంతం చేసుకుంది.

## మండేలా : లాంగ్ వాక్ టు ఫ్రీడమ్

దక్షిణాఫ్రికా అధ్యక్షుడిగా ఎన్నికైన నల్లజాతీయుడు నెల్సన్ మెండేలా జీవితం ఆధారంగా రూపొందిన చిత్రమిది. గ్రామీణ నిరుపేద కుటుంబంలో జన్మించిన మండేలా లాయర్‌గా పనిచేసిన అనంతరం ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్‌లో జాయిన్ అవుతాడు. అత్యంత దుర్భర పరిస్థితులను ఎదుర్కొంటున్న తమ దేశ ప్రజల బతుకులను మార్చాలని సుదీర్ఘ కాలం పాటు అలుపెరగని పోరాటం చేశారు. ఆనాటి నియంత పాలనపై తిరుగుబాటు చేశారు. ఈ క్రమంలో మండేలా ఎదుర్కొన్న స్ట్రగుల్స్‌ను ప్రతిబింబించే చిత్రమిది. మొదటసారి దక్షిణాఫ్రికాలో ప్రజాస్వామ్య పద్ధతిలో జరిగిన ఎలక్షన్లలో అధ్యక్షుడిగా ఎన్నికై రికార్డు సృష్టించారు. అత్యంత స్ఫూర్తివంతమైన మండేలా జీవితాన్ని అంతే అద్భుతంగా దర్శకుడు జస్టిన్ చాడ్విక్ తెరపై ఆవిష్కరించారు. 2013లో విడుదలైన ఈ చిత్రం విమర్శకుల ప్రశంసలందుకుంది. మండేలా పాత్రలో ఎడ్రిస్ ఎల్బా నటించి మెప్పించారు.

## జులు

ఇద్దరు పోలీసులు అలీ సోఖేలా, బ్రియాన్ ఎప్కీన్ ఓ తెల్లజాతీయురాలి హత్యకు సంబంధించిన కేసును విచారిస్తుంటారు. ఈ క్రమంలో వాళ్ళు అక్కడ చట్టవిరుద్ధంగా జరిగే మద్యం వ్యాపారాన్ని, వీధి బాలలు కిడ్నాప్‌లు, అక్రమాయుధాల వ్యాపారానికి గల కారణాలను కనిపెడతారు. ఈ క్రమంలో వాళ్ళు తెలుసుకున్న నిజాలేంటనేది సినిమాలో ఆసక్తికరం. ఆఫ్రికాలో జరిగే అక్రమ వ్యాపారాలకు ప్రతిరూపంగా ఈ చిత్రాన్ని దర్శకుడు జెరోమ్ సాలే 2013లో రూపొందించారు. ఈ సినిమా మంచి ప్రశంసలందుకుంది. పోలీస్ అధికారులుగా ఓర్లాండో బ్లూమ్, ఫారెస్ట్ విట్టేకర్ అద్భుతంగా నటించారు.

## హీట్ స్ట్రోక్

ఓ రీసెర్చ్ సైంటిస్ట్ తన భార్య, కూతురుతో కలిసి విహార యాత్రలో భాగంగా ఆఫ్రికన్ ఏడారులకు బయలు దేరుతాడు. అక్కడ కొన్ని రోజులు సరదాగా గడుపుతాడు. తన కూతురుతో కలిసి కారులో ప్రయాణిస్తున్నప్పుడు ఒక ఆయుధాల వ్యాపారిని చూస్తాడు. వారి మధ్య గొడవ కావడంతో ఆ వ్యాపారి సైంటిస్ట్‌ను చంపేస్తాడు. దీంతో తన కూతురితో కలిసి సైంటిస్ట్ భార్య ఆఫ్రికన్ ఏడారిలో మనుగడ కోసం సాగించిన పోరాటమే ఈ చిత్రం. ఆద్యంతం ఉత్కంఠభరితంగా సాగే ఈ చిత్రాన్ని దర్శకుడు ఎవెలిన్ పుర్సెల్ రూపొందించారు. 2013లో విడుదలైన ఈ సినిమా మంచి ఆదరణ పొందింది. ముఖ్య పాత్రల్లో స్టెఫెన్ డార్ఫ్, స్వెట్లానా మెట్కినా, మైసీ విలియమ్స్ తమదైన నటనతో ప్రేక్షకులను మెస్మరైజ్ చేశారు.

# నవచిత్రం

## ఏప్రిల్‌లో రోబో 2.0


రజనీకాంత్

రజనీకాంత్, అమీజాక్సన్ హీరో,హీరోయిన్లుగా అక్షయ్ కుమార్ విలన్‌గా శంకర్ దర్శకత్వంలో '2.0' చిత్రం తెరకెక్కుతున్న విషయం విదితమే. ఈ చిత్రం రిలీజ్ డేట్ మరోసారి వాయిదా పడింది. జనవరిలో విడుదల చేయాల్సిన సినిమాను ఏప్రిల్‌లో రిలీజ్‌కు ప్లాన్ చేస్తున్నారు. ఈ సందర్భంగా నిర్మాత, లైకా ప్రొడక్షన్ క్రియేటివ్ హెడ్ రాజు మహాలింగం మాట్లాడుతూ, 'సూపర్‌స్టార్ రజనీకాంత్, గ్రేట్ డైరెక్టర్ శంకర్ కాంబినేషన్‌లో వచ్చిన 'రోబో' ప్రపంచ వ్యాప్తంగా సంచలనం సృష్టించింది. మళ్ళీ ఇదే కాంబినేషన్‌లో 'రోబో' చిత్రానికి సీక్వెల్‌గా రూపొందుతున్న '2.0' చిత్రంపై భారీ అంచనాలు నెలకొన్నాయి. ఆ ఎక్స్‌పెక్టేషన్స్‌కి తగ్గట్టుగానే భారతీయ సినిమాల్లోనే 450 కోట్ల రూపాయల భారీ బడ్జెట్‌తో, హై టెక్నికల్ వాల్యూస్‌తో హాలీవుడ్ స్థాయిలో ఈ చిత్రాన్ని నిర్మిస్తున్నాం. ఈ చిత్రంలో బాలీవుడ్ స్టార్ హీరో అక్షయ్‌కుమార్ విలన్‌గా ఓ విభిన్నమైన పాత్ర పోషిస్తున్నారు. తెలుగు, తమిళం, హిందీ భాషల్లో రూపొందుతున్న ఈ చిత్రం షూటింగ్ పూర్తి చేసుకుని, ప్రస్తుతం పోస్ట్ ప్రొడక్షన్ వర్క్ శరవేగంగా జరుపుకుంటోంది. ఈ చిత్రాన్ని వచ్చే ఏడాది ఏప్రిల్‌లో ప్రపంచ వ్యాప్తంగా విడుదల చేస్తున్నాం' అని అన్నారు.

## మేం అనుకున్న తేదీలకు కట్టుబడి ఉన్నాం : బన్నీవాసు

మహేష్‌బాబు నటించిన 'భరత్ అను నేను', అల్లు అర్జున్ నటిస్తున్న 'నా పేరు సూర్య–నా ఇల్లు ఇండియా' చిత్రాలు వచ్చే ఏడాది ఏప్రిల్ 27న విడుదల చేయనున్నట్టు నిర్మాతలు ఇప్పటికే ప్రకటించారు. ఈ నేపథ్యంలో రజనీకాంత్ '2.0' సైతం ఏప్రిల్‌లోనే విడుదల చేయబోతున్నట్టు తాజాగా ప్రకటించడంతో నిర్మాత బన్నీవాసు సోషల్ మీడియా ద్వారా లైకా ప్రొడక్షన్‌కు ఓ విన్నపం తెలియజేశారు. "2.0' చిత్రాన్ని మేం గౌరవిస్తున్నాం. కానీ ఆ సినిమా విడుదల తేదీ మార్పు అనేది ప్రాంతీయ భాషా చిత్రాలపై చాలా ప్రభావం చూపుతుంది. 'నా పేరు సూర్య..'ను నిర్మిస్తున్న నేను, 'భరత్ అనే నేను'ను నిర్మిస్తున్న దానయ్య కలిసి డేట్ ఇష్యూస్‌పై తెలంగాణ, ఏపీకి చెందిన నిర్మాతల మండలి, ఎగ్జిబిటర్ అసోసియేషన్‌తో చర్చిస్తున్నాం. మేం అనుకున్న తేదీలకు కట్టుబడి ఉన్నాం. ఇది ప్రాంతీయ భాషా చిత్రాలకు ఉపయోగపడుతుందని భావిస్తున్నాం. రిలీజ్ విషయంలో మీరు మరోసారి ఆలోచించాలి' అని బన్నీవాసు పేర్కొన్నారు.

## కుటుంబ ప్రేక్షకులు మెచ్చిన ఇంద్రసేన


నీలం కృష్ణారెడ్డి, విజయ్ ఆంటోని, మహిమా, భాష్యశ్రీ

విజయ్ ఆంటోని, మహిమా, డయానా చంపిక హీరోహీరోయిన్లుగా జి.శ్రీనివాసన్ దర్శకత్వంలో రూపొందిన తమిళ చిత్రాన్ని నిర్మాత కృష్ణారెడ్డి తెలుగులో 'ఇంద్రసేన'గా విడుదల చేశారు. ఈ సినిమా ఇటీవల రిలీజైన నేపథ్యంలో ఆదివారం ఏర్పాటు చేసిన ప్రెస్‌మీట్‌లో విజయ్ ఆంటోని మాట్లాడుతూ, 'చాలా తక్కువ టైమ్‌లోనే తెలుగు ప్రేక్షకులు నాపై ఇంత ప్రేమాభిమానాలను చూపించడం చాలా ఆనందంగా ఉంది. వారిని అలరించే సినిమాలు తీసేందుకు ప్రయత్నిస్తున్నా. 'ఇంద్రసేన' మంచి ఫ్యామిలీ ఎంటర్‌టైనర్. అన్ని వర్గాల నుంచి మంచి స్పందన లభిస్తోంది. సినిమా గురించి పాజిటివ్‌గా మాట్లాడుకుంటున్నారు. ముఖ్యంగా ఫ్యామిలీ ఆడియెన్స్ బాగా ఆదరిస్తున్నారు. నిర్మాత నీలం కృష్ణారెడ్డి జెంటిల్‌మెన్. సినిమాను బాగా ప్రమోట్ చేశారు. ఆయనతో మున్ముందు కూడా పనిచేయాలనుకుంటున్నా. నా బ్లాక్‌బస్టర్స్ సినిమాలకు భాష్యా శ్రీ మంచి మాటలు, పాటలు అందించి విజయంలో భాగమయ్యారు. దర్శకుడు శ్రీనివాసన్‌కిది తొలి చిత్రమైనా మంచి కథాంశంతో తెరకెక్కించారు. సినిమాకు సపోర్ట్ చేసిన రాధికా శరత్ కుమార్, మా కథానాయికలకు కృతజ్ఞతలు' అని అన్నారు. 'ఇంత పెద్ద విజయాన్ని అందించిన తెలుగు ఆడియెన్స్‌కు ధన్యవాదాలు' అని నిర్మాత తెలిపారు. భాష్యా శ్రీ చెబుతూ, 'మంచి సినిమాలతో తెలుగు ప్రేక్షకులకు వినోదాన్ని పంచి విజయ్ ఆంటోని మంచి మార్కులు కొట్టేశారు. ఈ సక్సెస్‌తో నిర్మాత నీలం కృష్ణారెడ్డి సైతం మంచి పేరు తెచ్చుకున్నారు. నేను రాసిన మాటలు, పాటలకు మంచి స్పందన లభించింది. ముఖ్యంగా 'వజ్రమా..' పాట నాకు మంచి పేరును తెస్తుంది' అని చెప్పారు. 'మంచి పాత్రలో నటించే అవకాశం ఇచ్చిన దర్శక, నిర్మాతలకు థ్యాంక్స్. నా పాత్రకు మంచి ప్రశంసలు దక్కుతున్నాయి. విజయ్ ఆంటోని రెండు పాత్రల్లో తమదైన నటనతో మెప్పించారు. సినిమాలో బ్రదర్ సెంటిమెంట్ బాగా వర్కౌట్ అయ్యింది. సినిమాను మరింత పెద్ద హిట్ చేయాలని కోరుకుంటున్నా' అని మహిమా చెప్పారు.



తాప్సీ

ఆది పినిశెట్టి, తాప్సీ జంటగా ఓ చిత్రం రూపొందుతోంది. దీనికి కోన వెంకట్ సమర్పకులుగా వ్యవహరిస్తుండగా ఎం.వి.వి.సినిమా, కోన ఫిల్మ్ కార్పొరేషన్ పతాకాలపై ఎం.వి.వి. సత్యనారాయణ నిర్మిస్తున్నారు. 'లవర్స్' ఫేమ్ హరి దర్శకత్వం వహిస్తున్నారు. ఈ సినిమా గురించి చిత్ర బృందం తెలియజేస్తూ, 'విభిన్నమైన కథాంశంతో రూపొందుతున్న చిత్రమిది. యాక్షన్ ఎంటర్‌టైనర్‌గా హైదరాబాద్, వైజాగ్, విజయవాడ నేపథ్యంలో తెరకెక్కనుంది. డిసెంబర్ 21న సినిమా రెగ్యులర్ షూటింగ్ ప్రారంభం కానుంది. 'సరైనోడు', 'నిన్నుకోరి' లాంటి చిత్రాల్లో విలక్షణమైన పాత్రలు పోషించి, ఇప్పుడు 'రంగస్థలం', 'అజ్ఞాతవాసి' చిత్రాల్లోనూ మంచి పాత్రలు పోషిస్తున్న ఆది పినిశెట్టి హీరోగా ఈ చిత్రం రూపొందడం విశేషం. తాప్సీ ఓ కథానాయికగా నటిస్తుండగా మరో ప్రముఖ హీరోయిన్ కూడా ఇందులో నటించేందుకు అవకాశం ఉంది. హీరో హీరోయిన్ల పాత్రలు చాలా వైవిధ్యంగా ఉంటాయి' అని తెలిపింది.

## ఒక్క క్షణం.. సైన్స్ ఫిక్షన్ థ్రిల్లర్


సీరత్ కపూర్, అల్లు శిరీష్, సురభి

అల్లు శిరీష్, సురభి, సీరత్ కపూర్ నాయకానాయికలుగా అవసరాల శ్రీనివాస్ కీలక పాత్రలో విఐ ఆనంద్ దర్శకత్వంలో రూపొందుతున్న చిత్రం 'ఒక్క క్షణం'. లక్ష్మీ నరసింహ ఎంటర్‌టైన్‌మెంట్స్ పతాకంపై చక్రి చిగురుపాటి నిర్మిస్తున్నారు. ఈ చిత్ర టీజర్‌ను ఆదివారం హైదరాబాద్‌లో హీరో శిరీష్ విడుదల చేశారు. ఈ సందర్భంగా ఏర్పాటు చేసిన ప్రెస్‌మీట్‌లో ఆయన మాట్లాడుతూ, 'ఇంత మంచి కథను నా దగ్గరకు తీసుకొచ్చిన నిర్మాత చక్రికి ధన్యవాదాలు. సినిమా కోసం ఆయన చాలా ఖర్చు పెట్టారు. 'శ్రీరస్తు శుభమస్తు' తర్వాత ఇంత మంచి కథతో విఐ ఆనంద్ దర్శకత్వంలో సినిమా చేయడం చాలా ఆనందంగా ఉంది. థ్రిల్లర్‌గా సాగే సైన్స్ ఫిక్షన్ చిత్రమిది. పార్లల్ లైఫ్‌ని తెలియజేస్తుంది. ఈ ఏడాది కొత్త కథలతో వచ్చిన సినిమాలను తెలుగు ప్రేక్షకులు బాగా ఆదరించారు. ఈ చిత్రాన్ని కూడా ఆదరిస్తారని నమ్ముతున్నా. శ్రీనివాస్ అవసరాల కీలక పాత్రలో మెప్పిస్తారు. సురభి, సీరత్ కపూర్ పాత్రలు ఆకట్టుకుంటాయి. శ్యామ్ కె నాయుడు కెమెరా పనితనం, మణిశర్మ సంగీతం, అబ్బూరి రవి మాటలు, చోటా కె. ప్రసాద్ ఎడిటింగ్ సినిమాకు హైలైట్‌గా నిలుస్తాయి. ఇది కేవలం టీజర్ మాత్రమే సినిమాలో అన్ని అంశాలుంటాయి. అందరినీ అలరిస్తుందని నమ్ముతున్నా' అని అన్నారు. 'నేను రూపొందించిన 'ఎక్కడికి పోతావు చిన్నవాడా' టైమ్‌లోనే చక్రికి ఈ కథను చెప్పా. కథ విని ఓకే చేసిన చక్రి, శిరీష్‌కు ధన్యవాదాలు. జీవా పాత్రలో శిరీష్ బాగా నటించారు. పర్‌ఫెక్షన్ కోసం చాలా హార్డ్ వర్క్ చేశారు. ప్రేమకు, డెస్టినీకి మధ్య పోరాటం నేపథ్యంలో సాగే చిత్రమిది. ఆద్యంతం ఉత్కంఠభరితంగా ఉంటూ ప్రేక్షకులను మైమరపిస్తుంది' అని దర్శకుడు వి ఐ ఆనంద్ అన్నారు.

## సూపర్‌స్టార్ కృష్ణకు జీవిత సాఫల్య పురస్కారం..


పరమేష్ భీంరెడ్డి, తమ్మారెడ్డి భరద్వాజ్, కరుణాకర్ అసిరెడ్డి

సూపర్ స్టార్ కృష్ణను 'ఆటా' (అమెరికా తెలుగు అసోసియేషన్) జీవిత సాఫల్య పురస్కారంతో సత్కరించనుంది. 1990లో ప్రారంభించబడిన 'ఆటా' ప్రతి రెండేండ్లకోసారి ఇండియాలో వేడుకలను నిర్వహిస్తుంది. అందులో భాగంగా గత నెల 27 నుంచి ఈ నెల 23 వరకు హైదరాబాద్‌లో ఈ ఉత్సావాలు జరుగు తున్నాయి. ఈ సందర్భంగా ఆదివారం ఏర్పాటు చేసిన ప్రెస్‌మీట్‌లో 'ఆటా' గౌరవ సలహాదారు తమ్మారెడ్డి భరద్వాజ మాట్లాడుతూ, 'తెలుగు సంస్కృతిని కాపాడటం కోసం 'ఆటా' చేస్తున్న సేవాలు అభినందనీయం' అని అన్నారు. 'అమెరికాలో స్థిరపడిన తెలుగువారి పిల్లలు, మన మూలాలు, మన భాష, మన సంస్కృతిసాంప్రదాయాలు మర్చిపోకూడదనే ఉద్దేశ్యంతో రెండున్నర దశాబ్దాల క్రితం ప్రారంభించిన ఈ 'ఆటా' ఇప్పుడు మహా వృక్షంలా ఎదిగింది. ఇప్పుడు ఇదే పేరుతో కొన్ని డూప్లికేట్ సంస్థలొచ్చాయి. వాటి వల్ల కన్‌ఫ్యూజ్ కావద్దు. సూపర్ స్టార్ కృష్ణగారిని 'ఆటా' జీవిత సాఫల్య పురస్కారంతో ఈ నెల 23న సత్కరించనున్నాం' అని 'ఆటా' ప్రస్తుత అధ్యక్షులు కరుణాకర్ అసిరెడ్డి, పరమేష్ భీంరెడ్డి తెలిపారు.

## చారిత్రాత్మక యుద్ధ నేపథ్య చిత్రంలో..

సన్నీలియోన్ కథానాయికగా వి.సి.వడివుడయన్ దర్శకత్వంలో స్టీవ్స్ కార్నర్ పతాకంపై పోన్స్ స్టీఫెన్ ఓ చారిత్రాత్మక చిత్రాన్ని నిర్మిస్తున్నారు. ఈ సందర్భంగా సన్నీ లియోన్ మాట్లాడుతూ, 'ఇప్పటి వరకు నాకున్న ఇమేజ్‌ను పూర్తి స్థాయిలో మార్చే సినిమా ఇది. యాక్షన్ సీక్వెన్స్‌ల్లో నటించాలన్న నా కల నెరవేరబోతోంది' అని అన్నారు. 'సౌత్ ఇండియన్ కల్చర్స్ బ్యాక్‌డ్రాప్‌లో ఉండే చారిత్రాత్మక యుద్ధ నేపథ్య చిత్రమిది. సన్నీ పాటు నవదీప్, నాజర్ కీలక పాత్రలు పోషిస్తున్నారు. సినిమా కోసం సన్నీ కత్తియుద్ధాలు, గుర్రపు స్వారీ, కొన్ని యుద్ధ కళలను నేర్చుకోనున్నారు. తెలుగు, తమిళం, హిందీ, మలయాళం భాషల్లో భారీ బడ్జెట్‌తో తెరకెక్కే ఈచిత్రంలో 70 నిమిషాల గ్రాఫిక్స్ ఉంటాయి. ఫిబ్రవరి నుంచి రెగ్యులర్ షూటింగ్ జరుగుతుంది' అని చిత్ర యూనిట్ చెప్పింది.


సన్నిలియోన్

# జనభోజనాలు.. జనతెలంగాణకు మార్గం

**ఈ కొత్త సంస్కృతి దేశానికే ఆదర్శం కావాలి**

- కులవ్యవస్థ ఉన్నంతకాలం భారత్ సూపర్‌పవర్ కాలేదు
- ప్రాణాలు తీస్తామనడం ప్రజాస్వామ్యమేనా
- టీమాస్ కార్యక్రమంలో సీపీఐ(ఎం) పొలిట్‌బ్యూరో సభ్యుడు రాఘవులు
- కుల,మతాలకతీతంగా కుటుంబ సమేతంగా హాజరు



**నవతెలంగాణ బ్యూరో - హైదరాబాద్**

టీమాస్ నిర్వహించిన జనభోజనాలు కార్యక్రమం జనతెలంగాణకు మార్గం సుగమం చేయాలని సీపీఐ(ఎం) పొలిట్‌బ్యూరో సభ్యుడు బివి రాఘవులు చెప్పారు. తెలంగాణ సంస్కృతిని ముందుకు తీసుకెళ్లాలని అన్నారు. తెలంగాణ సామాజిక ప్రజాసంఘాల ఐక్యవేదిక (టీమాస్) ఆధ్వర్యంలో ఆదివారం హైదరాబాద్‌లోని ఇందిరాపార్క్‌లో కుల భోజనాలకు వ్యతిరేకంగా మహాత్మాజ్యోతిబాపూలే, అంబేద్కర్ వర్థంతి సందర్భంగా జనభోజనాలు కార్యక్రమాన్ని నిర్వహించింది. జనభోజనాలు కార్యక్రమానికి విశేష స్పందన లభించింది. ఇందిరాపార్క్‌కు కుటుంబ సమేతంగా వేలాదిమంది తరలివచ్చారు. ఈ సందర్భంగా రాఘవులు మాట్లాడుతూ వన భోజనాలు, కులభోజనాలు, పార్టీల వారీగా భోజనాల ఏర్పాటు చూశామని, కానీ కొత్తతరహాలో జనభోజనాలు నిర్వహించడం అభినందనీయమని అన్నారు. మిత్రులు దావత్‌లు చేసుకుంటారని చెప్పారు. జనభోజనాలు కార్యక్రమం కుల,మత భోజనం కాకుండా గొప్ప మార్పునకు దారితీస్తుందని అన్నారు. ఈ కొత్త సంస్కృతి దేశానికే మార్గదర్శకం కావాలని ఆకాంక్షించారు. మతాంతర వివాహం చేసుకున్నా, భర్త మతంలోకి మారిన వారిని ఇబ్బందులకు గురిచేస్తున్నారని విమర్శించారు. బలవంతంగా మతమార్పిడి జరిగిందని వారిని కోర్టుల చుట్టూ తిప్పుతున్నారని ఆగ్రహం వ్యక్తంచ ఏశారు. నచ్చిన వివాహం చేసుకోకూడదా, నచ్చిన మతంలోకి వెళ్లకూడదా?అని ప్రశ్నించారు. ఎవరిని పూజించాలో, ఎవరిని పూచించకూడదో సంఘ్‌పరివార్ శక్తులు నిర్ణయిస్తున్నాయని చెప్పారు. ఇది మానవ సమాజం అనిపించుకోదని విమర్శించారు. కులాంతర వివాహం చేసుకుంటే, నచ్చని పనులు చేస్తే ప్రాణాలు తీస్తామనడం ప్రజాస్వామ్యమేనా?అని ప్రశ్నించారు. పద్మావతి సినిమా విడుదల చేయొద్దని రాద్ధాంతం చేస్తున్నారని అన్నారు. తీస్తే థియేటర్లను ధ్వంసం చేస్తామని బెదిరిస్తున్నారని చెప్పారు. ఎలా తీయాలన్నది తీసేవారి ఇష్టమని, చూడ్డం, చూడకపోవడం చూసే వారి ఇష్టమన్నారు. సినిమా ఎలా తీయాలో, ఎలా తీయకూడదో, ఎలా చూడాలో, ఎలా ఆడాలో వారే నిర్ణయిస్తున్నారని చెప్పారు. ఇది ప్రజాస్వామిక సమాజం ఎలా అవుతుందని ప్రశ్నించారు. ఏ కులం అయినా, ఏ మతం అయినా సమానంగా బతికే స్వేచ్ఛను కల్పించాలన్నారు. అలా ఉండకపోతే మానవులం కాదని, మానవత్వం అనిపించుకోవదని అన్నారు. సమానత్వం కోసం స్ఫూర్తితో టీమాస్ పనిచేస్తోందని చెప్పారు. జనభోజనాలతో జనతెలంగాణకు మార్గం సుగమం చేయాలని సూచించారు. చైనా, అమెరికా అభివృద్ధి అయ్యాయని, భారత్ సూపర్‌పవర్ కావాలని ప్రధాని మోడీ చెప్తుంటారని అన్నారు. దేశంలో కులవ్యవస్థ ఉన్నంతకాలం భారత్ సూపర్‌పవర్ కాలేదని, అయ్యే సమస్యే లేదని చెప్పారు. సమాన గౌరవం, సమాన హోదా ఉంటే సూపర్‌పవర్ అవుతుందని అన్నారు. కులనిర్మూలనకు కృషి చేయాలన్నారు. కుల అసమానతలు, దుర్మార్గాలను రూపుమాపాలని అన్నారు. మతసామరస్యం కాపాడాలని కోరారు. సమసమాజం ఏర్పడాలని, దోపిడీరహిత సమాజం కావాలన్నారు. అప్పుడే నిజమైన జన తెలంగాణ ఆవిర్భవించినట్టవుతుందని చెప్పారు. సమాజంలో ఎక్కడైనా కులాలు, మతాల పేరుతో అన్యాయం జరిగితే ఆ బాధితులకు అండగా నిలబడాలని కోరారు.

**భోజనంలోనూ కులముంటది : గద్దర్**



భోజనంలోనూ కులవ్యవస్థ ఉంటుందని ప్రజా గాయకుడు, టీమాస్ నేత గద్దర్ అన్నారు. కులాన్ని బట్టి భోజనముంటుందని చెప్పారు. నేడు బువ్వ పెట్టే రైతన్న ఏడుస్తున్నాడని అన్నారు. అందరికీ భోజనం అందే రోజులు రావాలన్నారు. కమ్యూనిస్టులు ఏకం కావాలని, కమ్యూనిస్టు పార్టీలు విలీనం కావాలని, ఐక్య సంఘటన నిర్మించాలని కోరారు.

**అందరికీ మూడు పూటలా తిండి దొరకాలి : ఎల్ రమణ**



అందరికీ మూడు పూటలా తిండి దొరికాలని టీటీడీపీ అధ్యక్షుడు ఎల్ రమణ అన్నారు. కులాలు, మతాలకు అతీతంగా జన భోజనాలు నిర్వహించడం గొప్ప కార్యక్రమమని చెప్పారు. ఏ స్థాయిలో ఉన్నా, ఏ హోదాలో ఉన్నా సమానత్వం కోరుకోవాలన్నారు. భోజనం ప్రతి జీవికీ అందాలని అన్నారు. లక్షల కోట్ల రూపాయల బడ్జెట్‌ను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రవేశపెడుతున్నా పేదలకు ఆ ఫలాలు అందడం లేదన్నారు.

**కులాన్ని కూకటివేళ్లతో పెకిలించాలి : విమలక్క**



కులాన్ని కూకటివేళ్లతో పెకిలించాలని టీమాస్ నాయకురాలు విమలక్క అన్నారు. అతని కులం గొప్ప, తన కులం గొప్ప అనుకుంటూ పోతే సామాజిక న్యాయం రాదన్నారు. విభజించు పాలించు పాలకుల కుట్రలకు ఎవరూ బలికావొద్దని కోరారు.

**మనది మనిషికులం : మాదాల రవి**



తమది ఒకే కులమని, మనిషి కులమని సినీనటుడు మాదాల రవి అన్నారు. ఒకే మతమని, అదే మానవత్వమని చెప్పారు. ఇవాంక ట్రంప్ కోసం రోడ్లు వేయడం అభివృద్ధి అవుతుందా?అని ప్రశ్నించారు. లాల్ నీల్ జెండాలు కలిసి విప్లవశంఖం పూరించాలని కోరారు.

**6న సామాజిక న్యాయంపై సదస్సులు : జాన్‌వెస్లీ**



ఈనెల 6న అంబేద్కర్ వర్థంతి సందర్భంగా రాష్ట్రవ్యాప్తంగా మండల, పట్టణ, జిల్లా కేంద్రాల్లో సామాజిక న్యాయం సాధించడం కోసం సెమినార్లు, సదస్సులు నిర్వహిస్తామని టీమాస్ కన్వీనర్ జాన్‌వెస్లీ చెప్పారు. జ్యోతిబాపూలే, అంబేద్కర్ వర్ధంతుల సందర్భంగా నవంబర్ 28 నుంచి ఈనెల 6 వరకు సామాజిక చైతన్య కార్యక్రమాలు నిర్వహిస్తున్నామని అన్నారు. అందులో భాగంగానే ఆదివారం జనభోజనాలు నిర్వహించామన్నారు. ఈనెల 10న తమ కార్యాలయంలో వామపక్ష పార్టీల నాయకులతో సమావేశం నిర్వహిస్తున్నామనిఎం సీపీఐ(యూ) రాష్ట్ర కార్యదర్శి తాండ్రకుమార్ చెప్పారు. ఈ కార్యక్రమంలో సీపీఐ(ఎం) కేంద్ర కమిటీ సభ్యుడు చెరుపల్లి సీతారాములు, సామాజిక ఉద్యమ నేత జెబి రాజు, ఎస్‌వికె కార్యదర్శి ఎస్ వినయకుమార్, సియాసత్ సంపాదకులు జహీరుద్దీన్ అలీఖాన్ తదితరులు ప్రసంగించారు. ఈ కార్యక్రమంలో సీపీఐ(ఎం) రాష్ట్ర కార్యదర్శి తమ్మినేని వీరభద్రం, మాజీ ఎమ్మెల్సీ కె నాగేశ్వర్, మాజీ ఎమ్మెల్యేలు నంద్యాల నర్సింహ్మారెడ్డి, మస్కు నర్సింహ్మా, సీనియర్ జర్నలిస్టు పాశం యాదగిరి, టీపీఎస్‌కే కన్వీనర్ జి రాములు, ప్రొఫెసర్లు పీఎల్ విశ్వేశ్వరరావు, పిల్లలమర్రి రాములు, మురళీమనోహన్, భూక్యా భంగ్యా, తెలంగాణ లోక్‌సత్తా నాయకులు మన్నారం నాగరాజు, వీవర్స్ డెవలప్‌మెంట్ ఫౌండేషన్ అధ్యక్షుడు దాస్ సురేష్, టీమాస్ నాయకులు ఆర్ శ్రీరాంనాయక్, భూపతి వెంకటేశ్వర్లు, స్కైలాబ్ బాబు, కొండవీటి సత్యవతి, దేవి, పాపయ్య మాదిగ, సినీ దర్శకుడు ప్రేంరాజ్ తదితరులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా కుల, మతాంతర వివాహాలు చేసుకున్న ఆదర్శ జంటలను వేదికపైకి ఆహ్వానించి పుష్పాలు అందించి ప్రత్యేకంగా అభినందించారు.

## బిడ్డపై కర్కశత్వం

మొదటిపేజీ తరువాయి

వదిలేయాలని లలితపై ప్రకాశ్ ఒత్తిడి పెంచాడు. ఈ క్రమంలో తన సంబంధానికి అడ్డుగా ఉందనే కారణంతో ప్రియుడితో కలిసి చిన్నారిని చిత్రహింసలకు గురిచేసి వేడివేడి పెనంపై కూర్చోబెట్టింది. దాంతో తీవ్రంగా గాయపడిన ఆ చిన్నారి పిరుదులు కాలిపోయాయి. కాళ్లకు వాతలు పెట్టారు. పసిపాప ఆ బాధను తట్టుకోలేక తల్లడిల్లుతున్నా అట్లాగే ప్రవర్తించారు. దీంతో పాపకు తీవ్రగాయాలు అయ్యాయి. వారం కింద ఇది జరిగింది. ఎలాగైనా చిన్నారిని వదిలించుకోవాలని నిర్ణయించుకున్న ఆ ఇద్దరు చిన్నారిని తీసుకొని శనివారం రాత్రి నాంపల్లిలోని భరోసా కేంద్రానికి వెళ్లారు. తీవ్రమైన గాయాలతో ఉన్న ఈ చిన్నారి సికింద్రాబాద్ రైల్వేస్టేషన్‌లో తమకు దొరికిందని భరోసా సెంటర్‌లోని అధికారులకు చెప్పారు. అక్కడు ఉన్న చైల్డ్‌లైఫ్ అధికారులు గోపాలపురం పోలీసులకు ఫిర్యాదు చేద్దామని అక్కడికి లలిత, ప్రకాశ్‌ను తీసుకెళ్లారు. పోలీసుల విచారణలో బాలిక అనాథకాదని, లలిత కూతురని తేలింది. బాలికను వదిలించుకునేందుకే తల్లి నాటకమాడుతున్నట్టు పోలీసులు నిర్ధారించారు. దీంతో లలిత, ప్రకాశ్‌ను ఎస్ఆర్ నగర్ పోలీస్‌స్టేషన్‌కు తరలించారు. చిన్నారిని యూసుఫ్‌గూడ శిశువిహార్‌కు తరలించారు. చిన్నారిపై అమానుషంగా ప్రవర్తించిన లలిత, ప్రకాశ్‌పై ఎస్ఆర్‌నగర్ పోలీసులు కేసు నమోదు చేసుకుని దర్యాప్తు చేపట్టారు.

## యువకుడిపై 20 సార్లు క్లినికల్‌ట్రయల్స్

- రెడ్డిల్యాబ్‌లో ప్రయోగించారని హుజురాబాద్‌వాసి వెల్లడి
- బాధితుడికి తరచూ పిట్స్, మానసిక సమస్యలు

**నవతెలంగాణ-హుజూరాబాద్**

ఔషధ ప్రయోగానికి బలై తరచూ ఫిట్స్‌రావడం, మానసికంగా కుంగిపోతున్న హుజూరాబాద్ పట్టణానికి చెందిన మరో బాధితుడి ఉదంతం ఓ సామాజిక కార్యకర్త చొరవతో ఆదివారం వెలుగులోకి వచ్చింది. సుమారు 20మార్లు ఔషధ ప్రయోగానికి గురై ఆ యువకుని బతుకు ఛిద్రమైంది. బాధితుని తల్లిదండ్రులు తెలిపిన వివరాల ప్రకారం...కరీంనగర్ జిల్లా హుజురాబాద్ పట్టణంలోనిమామిండ్లవాడ గ్యాస్‌గోదాము ప్రాంతానికి చెందిన ఎర్రం రాజమౌళి, ఆండాలు దంపతులకు ఒక్కగానొక్క కుమారుడు దేవిప్రసాద్(32) ఉన్నాడు. దంపతులిద్దరూ గతంలో పట్టణంలోనే పెండ్లిండ్లకు వంటలు చేసుకుంటూ జీవనోపాధి పొందేవారు. ఉపాధి రీత్యా పదేండ్లుగా హైదరాబాద్‌లోనూ జరిగే పెండ్లిండ్ల వంటలు చేయడానికి వెళ్తూ వస్తున్నారు. ఈ క్రమంలో వారి దూరపు బంధువు, హైదరాబాద్‌లో ఉండే నిరంజన్ ఫార్మాకంపెనీల ఔషధ ప్రయోగంలో పాల్గొన్నాడు. తనపై ప్రయోగించిన మందు విషయం, వచ్చిన డబ్బుల గురించి దేవిప్రసాద్‌కు చెప్పాడు. ఔషధ ప్రయోగంలో పాల్గొంటే డబ్బులు వస్తాయని పురిగొల్పాడు. ఆర్థిక పరిస్థితి అంతంతమాత్రంగానే ఉన్న దేవిప్రసాద్ డబ్బుల కోసం 2006 నుంచి 2009 మధ్య ఏకంగా 20మార్లు తనపై ఔషధ ప్రయోగం చేయించుకున్నాడు. ప్రతి ప్రయోగానికి అతనికి ఆయా కంపెనీలు రూ.5వేల నుంచి రూ.10వేల వరకు చెల్లించాయి. అందులో ముఖ్యంగా హైదరాబాద్ తార్నాకలోని యాక్సెస్ ల్యాబోరేటరీకి చెందిన కంపెనీలలో 15 సార్లు, బాలానగర్‌లోని రెడ్డిల్యాబ్‌లో ఐదుసార్లు అతనిపై ఔషధ ప్రయోగాలు జరిగాయి. 2009 నుంచి దేవిప్రసాద్ తరుచూ అనారోగ్యానికి గురవటం మొదలైంది. రెండేండ్లుగా ఫిట్స్ రావటం, అది ఇటీవల బాగా ముదరటంతో మతిస్థిమితం సరిగా లేక తీవ్ర అనారోగ్యంతో బాధపడుతున్నాడు. దేవిప్రసాద్ విషయమై తెలుసుకున్న పట్టణానికి చెందిన సామాజిక కార్యకర్త సాబీర్ అలీ ద్వారా ఈ ఫార్మా దారుణం వెలుగులోకి వచ్చింది.

## ఫిబ్రవరి 1న కేంద్ర బడ్జెట్

మొదటిపేజీ తరువాయి

ప్రవేశపెట్టే గత సంప్రదాయాన్ని 2017-18 ఆర్థిక సంవత్సరం నుంచే మార్చేశారు. అంతేగాక రైల్వే బడ్జెట్‌ను సాధారణ బడ్జెట్‌లో కలిపేశారు. అయితే, బడ్జెట్ ప్రతిపాదన లు మాత్రం గతంలోలాగే ఏప్రిల్ 1 నుంచి అమలు చేస్తారు. జీఎస్టీ అమలులోకి వచ్చిన తర్వాత ఇదే మొదటి బడ్జెట్. మోడీ ప్రభుత్వపు పూర్తిస్థాయి చివరి బడ్జెట్ కూడా ఇదే.

## గర్భిణిపై లైంగికదాడికి యత్నం

మొదటిపేజీ తరువాయి

మెదక్ జిల్లా 44వ జాతీయ రహదారిపై శుక్రవారం రాత్రి జరిగింది. స్థానికులు, కుటుంబసభ్యుల వివరాల ప్రకారం..తూప్రాన్ మండలం రావెల్లి గ్రామ పరిధిలోని పోతిరెడ్డిపల్లికి చెందిన కళావతి (35) దంపతులు పాతదుస్తుల వ్యాపారం చేస్తూ జీవనం గడుపుతున్నారు. కళావతి ప్రస్తుతం గర్భిణి. రోజువారీలాగే శుక్రవారం ఉదయం కళావతి తన కూతురు శిరీష(8)తో కలిసి సికింద్రాబాద్‌లో బట్టలు అమ్మేందుకు వెళ్లింది. బట్టలు అమ్మాక తిరిగి ఇంటికెళ్లేందుకు వారిద్దరూ తూప్రాన్ వైపు వెళ్లే డీసీఎం ఎక్కారు. మండల పరిధిలోని తైదలబండ దగ్గర డీసీఎంను ఆపాలని డ్రైవర్‌ని కళావతి కోరింది. కానీ, అక్కడ వాహనం ఆపకుండా వేగం పెంచాడు. డ్రైవర్‌కు తోడుగా ఉన్న మరోవ్యక్తి ఆమెపై లైంగికదాడికి యత్నించాడు. తప్పించుకునే క్రమంలో ఆమె రోడ్డుపై దూకేసింది. నిందితులు చిన్నారిని కొంత దూరాన దింపి వెళ్లారు. చిన్నారి వెంటనే జరిగిన ఘటనను స్థానికులకు తెలిపింది. అక్కడున్నవారు వెళ్లి చూసేలోపే ఆమె తలపగిలి చనిపోయి రోడ్డుపై కనిపించింది. ప్రమాదవశాత్తు కిందపడి మృతి చెందినట్టు పోలీసులు కేసు నమోదు చేసినట్టు సమాచారం.

## ఓయూలో విద్యార్థి ఆత్మహత్య

**నవతెలంగాణ - సిటీబ్యూరో/ఉస్మానియా యూనివర్సిటీ**

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎమ్మెస్సీ ఫిజిక్స్ ఫస్టియర్ చదువుతున్న మురళి ఆదివారం ఆత్మహత్య చేసుకున్నాడు. మురళి ఉద్యోగాల భర్తీ ఆలస్యం అవ్వటంతోనే ఆత్మహత్య చేసుకున్నాడని, అతను రాసిన సూసైడ్‌నోట్‌ను పోలీసులు మార్చేశారని ఆరోపిస్తూ విద్యార్థులు ఆందోళనకు దిగారు. మురళి మృతదేహాన్ని చూసేందుకు వచ్చిన ఓయూ వీసీ రామచంద్రంను విద్యార్థులు అడ్డుకున్నారు. 'వీసీ గో బ్యాక్' అంటూ వెంబడించారు. దీంతో అక్కడ తీవ్ర ఉద్రిక్తత నెలకొంది. మురళి మృతదేహాన్ని జేఏసీ ఛైర్మెన్ కోదండరామ్, టీమాస్ కన్వీనర్ జాన్‌వెస్లీ, తదితర ప్రొఫెసర్లు సందర్శించారు. ఓయూ విద్యార్థులు, పోలీసులు, బంధువుల వివరాల ప్రకారం...సిద్దిపేట జిల్లా, జగదేవ్‌పూర్ మండలం, దౌలాపూర్ గ్రామానికి చెందిన మురళి ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఎమ్మెస్సీ ఫిజిక్స్‌లో మెటీరియల్ సైన్స్ చదువుతున్నాడు. మురళి తండ్రి మరణించగా, తల్లి, అక్క, చెల్లెలు ఉన్నారు. ఇప్పటికే బీఎస్సీ బీఈడీ పూర్తిచేయడంతో డీఎస్సీతోపాటు ఇతర పోటీ పరీక్షలకు సన్నద్ధమవుతున్నాడు. ఉస్మానియా విశ్వవిద్యాలయం పీజీ ఎంట్రెన్స్‌లో ఫిజిక్స్‌లో యూనివర్సిటీ టాపర్‌గా నిలిచాడు. ఇంట్లో ఆర్థిక పరిస్థితులు అంతంత మాత్రమే కావడంతో ఎలాగైనా ప్రభుత్వం ఉద్యోగం సంపాదించాలనే పట్టుదలతో ఉద్యోగ నియామకాలకు ప్రభుత్వం వేసే నోటిఫికేషన్ల కోసం చాలాకాలంగా ఎదురు చూస్తున్నాడు. ఈ క్రమంలో ఉద్యోగాల భర్తీ ఆలస్యం అవుతుండటంతో మురళి తనుండే మానేరు హాస్టల్ రూమ్ నెంబర్ 159కు సమీపంలోని బాత్‌రూంలో ఆత్మహత్య చేసుకున్నాడు. బాత్రూమ్‌కు వెళ్లిన మురళి ఎంతకీ బయటకు రాకపోవటంతో తోటివిద్యార్థులు డోర్‌పగులగొట్టి చూడగా మురళి ఉరేసుకుని కనిపించాడు. తాడు సన్నటి వైరుకు, షూస్ లేస్‌కు ముడి వేసి ఉండటం, ఈ తాడు తానున్న భాగానికి అవతలి వైపున మేకుకు కట్టి ఉండటం పలు అనుమానాలకు తావిస్తున్నది. మురళి ఆత్మహత్య విషయాన్ని విద్యార్థులు పోలీసులకు సమాచారం ఇచ్చారు. మురళి మరణవార్త విన్న విద్యార్థులు పెద్ద సంఖ్యలో మానేరు హాస్టల్‌కు చేరుకున్నారు. అక్కడ ఉద్రిక్త పరిస్థితులు చోటుచేసుకోకుండా పోలీసు బలగాలను అక్కడ పెద్దఎత్తున మోహరించారు. ఇదిలా ఉండగా మురళి ఆత్మహత్య చేసుకున్న ఆదివారం తెలంగాణ మలి దశ ఉద్యమంలో తొలి అమరుడు శ్రీకాంత్‌చారి వర్ధంతి కావడం, సోమవారం హైదరాబాద్ సరూర్‌నగర్ స్టేడియంలో జేఏసీ ఆధ్వర్యంలో కొలువుల కొట్లాట సభ జరగనున్న నేపథ్యంలో మురళి మరణించడం సంచలనం రేపింది. అతని భౌతికకాయాన్ని తెలంగాణ జేఏసీ ఛైర్మెన్ ప్రొఫెసర్ కోదండరామ్, జేఏసీ నాయకులు రఘు, ప్రొఫెసర్ పురుషోత్తం, టీమాస్ కన్వీనర్ జాన్‌వెస్లీ, సహదేవ్, రిటైర్డ్ జస్టిస్ చంద్రకుమార్, వివిధ విద్యార్థి సంఘాల నేతలు సందర్శించారు.

**సూసైడ్ నోట్‌పై అనుమానాలు**

మురళి ఆత్మహత్య ప్రదేశం వద్ద దొరికినట్టుగా భావిస్తున్న సూసైడ్ నోట్‌ను పోలీసులు తారుమారు చేసినట్టు విద్యార్థులు అనుమానిస్తున్నారు. పోలీసులు చూపెడుతున్న సూసైడ్ నోట్‌కు, మురళి రికార్డు బుక్‌లోని రైటింగ్‌కు చాలా తేడా ఉన్నట్టు విద్యార్థులు ఆరోపించారు. మురళి సూసైడ్ నోట్ రెండు పేజీలుండగా, ఈ రెండు పేజీల కలర్‌లో కొంత తేడా కన్పించడం, సూసైడ్ నోట్ తారుమారు జరిగిందన్న అనుమానాలకు మరింత బలం చేకూరుతున్నది. అంతేకాకుండా సూసైడ్ నోట్ అంతా ఇంగ్లీషులో రాస్తూనే తెలుగులో చదువుకోడానికి వీలుండేలా రాయడంపైనా అనుమానాలు రేకెత్తిస్తున్నాయి. బీఎస్సీ, బీఈడీ చదువుకుని, యూనివర్సిటీ ఎంట్రెన్స్‌లోని ఫిజిక్స్ విభాగంలో టాపర్‌గా నిలిచిన మురళీ ఒకవేళ సూసైడ్ నోట్ రాస్తే పూర్తిగా ఇంగ్లీషులో ఉండే అవకాశం ఉన్నట్టు విద్యార్థులు భావిస్తున్నారు. కానీ, పోలీసులు చూపిస్తున్న సూసైడ్ నోట్‌లో 'ఈ చదువులు నా వల్ల కావడం లేదు. పిచ్చి లేస్తున్నది. ఇంకా ఇలాగే ఉంటే పిచ్చోణ్ని అయిపోతాను అంటూ' ఇంగ్లీష్‌లో రాసి ఉండటంపై విద్యార్థులు అనుమానాలను వ్యక్తం చేస్తున్నారు.

**ఉరుకులు పరుగులు పెట్టిన వీసీ ...**

మురళి భౌతిక కాయాన్ని సందర్శించేందుకు వీసీ రామచంద్రం అక్కడకు రాగా...'వీసీ గో బ్యాక్' అంటూ విద్యార్థులు పెద్దఎత్తున నినాదాలు చేశారు. ఈ సమయంలో కొందరు వీసీపై చెప్పులు విసిరారు. విద్యార్థుల ఆగ్రహానికి, తనపై చెప్పులు విసిరేయడం వంటి చర్యలతో భయభ్రాంతులకు గురైన వీసీ అక్కడ ఉరుకులు, పరుగులు తీసి గదుల్లో దాక్కున్నారు. ఎట్టకేలకు కొంతమంది చొరవతో మురళి భౌతికకాయాన్ని సందర్శించారు. మురళీ కుటుంబానికి ప్రభుత్వం తరపున తగిన న్యాయం జరిగేలా చూస్తానని వీసీ హామీఇచ్చారు.

**సమగ్ర విచారణ చేపట్టాలి : ప్రొఫెసర్ కోదండరామ్, జేఏసీ ఛైర్మన్**

మురళి ఆత్మహత్యపై సమగ్ర విచారణ చేపట్టాలని టీ జేఏసీ ఛైర్మెన్ ప్రొఫెసర్ కోదండరామ్ ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. విద్యార్థులపై నిర్లక్ష్యంగా ఉండటం ప్రభుత్వానికి తగదని ఆయన హితవు పలికారు. మురళి భౌతిక కాయాన్ని సందర్శించిన అనంతరం ఆయన మీడియాతో మాట్లాడుతూ.. పదే పదే డీఎస్సీ వాయిదా పడటం కారణంగానే మురళి మనస్థాపానికి గురై ఆత్మహత్య చేసుకున్నట్టు తెలుస్తోందన్నారు. రాష్ట్రంలో విద్యార్థుల ఆవేదన, అశాంతిని, అలజడిని ప్రభుత్వం సీరియస్‌గా అర్థం చేసుకోవాలన్నారు. విద్యార్థులు కోరినట్టుగా మురళి కుటుంబాన్ని ప్రభుత్వం ఆదుకోవాలని డిమాండ్ చేశారు.

## బ్యాంకులకు రూ.8 లక్షల కోట్ల అప్పులు ఎగ్గొట్టిందెవరు

**నవతెలంగాణ డెస్క్**

బ్యాంకింగ్ వ్యవస్థ పనితీరులో వచ్చిన మార్పుల వల్ల దేశంలో ఇప్పుడు నిరర్థక ఆస్తుల(ఎన్‌పీఏ) సమస్య తీవ్రస్థాయికి చేరుకున్నది. అయితే, ఏవి ఎన్‌పీఏలన్నది తేల్చి చెప్పడం సంక్లిష్టంగా తయారైంది. రుణగ్రహీతలకు అప్పుల పునరుద్ధరణ విషయంలో బ్యాంకులు అనుసరిస్తున్న విధానంలో స్పష్టత లేకపోవడమే అందుకు కారణం. కంపెనీల నిర్వహణలో సాధారణంగా ఎదురయ్యే ఒడిదుడుకులను తట్టుకొని నిలిచేందుకు వీలుగా అప్పులను పునరుద్ధరిస్తున్నారా..? లేదా ఎంతకీ చెల్లించలేకపోయిన పాత అప్పులను పునరుద్ధరిస్తున్నారా అన్నది స్పష్టమైతే..బ్యాంకుల వద్ద పేరుకుపోయిన ఎన్‌పీఏల మొత్తం విలువ ఎంతన్నది తెలుతుంది. నిరర్థక ఆస్తుల వల్ల చతికిలపడ్డ బ్యాంకులకు రూ.2.11 లక్షల కోట్లమేర పునర్ధనీకరించనున్నట్టు కేంద్ర ప్రభుత్వం ఈ ఏడాది అక్టోబర్‌లో ప్రకటించింది. దాంతో, బ్యాంకులు తిరిగి ఎప్పటిలాగే అప్పులు ఇచ్చేందుకు వీలవుతుందని కేంద్రం తెలిపింది. ఉదార ఆర్థిక విధానాలు అమలులోకి రాకపూర్వం కంపెనీల నిర్వహణ కోసం అవసరమైన స్వల్పకాలిక రుణాలను వాణిజ్య బ్యాంకులు ఇచ్చేవి. ఐడీబీఐ, ఐఎఫ్‌సీఐ, ఎస్ఎఫ్‌సీవంటి ప్రత్యేక ఆర్థిక సంస్థలు మాత్రమే దీర్ఘకాలిక రుణాలను మంజూరు చేసేవి. పరిశ్రమలను ప్రోత్సహించడంలో భాగంగా స్వల్పకాలిక రుణాలకన్నా దీర్ఘకాలిక రుణాలపై తక్కువ వడ్డీలను వసూలు చేసేవారు. ఆ విధానంలో వ్యాపార సంస్థలు,పరిశ్రమలు ఎక్కువగా వాణిజ్య బ్యాంకులపై ఆధారపడేవి. అప్పులు తిరిగి చెల్లించని కంపెనీలను బ్యాంకులు స్వాధీనం చేసుకునేవి. ఈ విధానంలో సూత్రరీత్యా ఎన్‌పీఏలకు అవకాశముండేదికాదు. ఉదార ఆర్థిక విధానాలు వచ్చిన తర్వాత బ్యాంకింగ్ వ్యవస్థ పనితీరులోనూ మార్పు వచ్చింది. ఐడీబీఐలాంటివి బ్యాంకులుగా మారాయి. వాణిజ్య బ్యాంకులు కూడా దీర్ఘకాలిక రుణాలివ్వడం ప్రారంభించాయి. రుణాలు పొందిన కంపెనీల్లో కొన్ని స్వీయ నిర్వహణా లోపాల వల్ల చతికిల బడటంతో ఎన్‌పీఏల సమస్య మొదలైంది.

ఎన్‌పీఏ సమస్య అధికం కావడానికి పలు కారణాలు న్నాయి. అందులో ఒకటి: కంపెనీలు తాము ఏ ప్రాజెక్టుల కోసం రుణాలు పొందుతున్నాయో, వాటి కోసం మాత్రమే కాకుండా తమ ఇతర వ్యాపారాలకు నిధులను మళ్లించడమనేది ఓ కారణం. ఇందుకు ప్రముఖ ఉదాహరణ విజయ్‌మాల్యా..ఈయనకు లిక్కర్ వ్యాపారం,వైమానిక రంగం(కింగ్‌ఫిషర్ ఎయిర్‌లైన్స్) సహా పలు వ్యాపారులుండేవి. పలు బ్యాంకులకు దాదాపు రూ.9000 కోట్లమేర అప్పులు ఎగ్గొట్టి లండన్‌కు చెక్కేశాడు. ప్రభుత్వ పెద్దల సిఫారసులతో పలు కంపెనీల యజమానులు పెద్దమొత్తాల్లో రుణాలు పొంది తిరిగి చెల్లించలేకపోవడం మరో కారణం. ఉదార ఆర్థిక విధానాలకు కారణమైనవాళ్లే ఆశ్రిత పెట్టుబడిదారులనూ ప్రోత్సహించారు. యూపీఏ హయాంలో బయటపడ్డ 2జీ స్కాం అందుకు ఓ ఉదాహరణ. ఆ స్కాంతో సంబంధమున్నవాళ్లు తమ బినామీ కంపెనీలకు బ్యాంకుల నుంచి పొందిన వేలకోట్ల రూపాయలను తిరిగి చెల్లించలేకపోయారు. ఇక కొందరు ముందస్తు ప్రణాళికతోనే, ఉద్దేశపూర్వకంగానే నామమాత్రంగా ఏదో ఒక కంపెనీ పెట్టి బ్యాంకులను నమ్మించి పెద్దమొత్తాల్లో అప్పులు పొందుతారు. వీరిలో ఎక్కువభాగం అధికార పార్టీలకు, ఆయా పార్టీల అధినేతలకు సన్నిహితులు, బంధువులై ఉండటం గమనార్హం. వీరు ఎక్కువగా ప్రభుత్వరంగ బ్యాంకుల నుంచే కోట్లాది రూపాయల రుణాలను పొంది, ఆ తర్వాత కొంత కాలానికి కంపెనీలను మూసేసేవారు. చూడటానికి ఆ కంపెనీలు నష్టాల వల్ల మూతపడినట్టుగా కనిపిస్తుంది.

వాస్తవంగా జరిగేది మాత్రం అందుకు భిన్నం. బ్యాంకుల నుంచి పొందిన రుణాల మొత్తాన్ని తమకు సంబంధించినవారి వేరే కంపెనీలకు మళ్లిస్తారు లేదా తమ ఇతర అవసరాల కోసం వాడుకుంటారు. మూతపడ్డ కంపెనీల నుంచి జప్తు చేయడానికి బ్యాంకులకు అక్కడ ఏమీ మిగిలి ఉండదు. దాంతో, ఆ కంపెనీలకు బ్యాంకులిచ్చిన అప్పులన్నీ ఎన్‌పీఏలుగా రికార్డవుతాయి. బ్యాంకుల జాతీయక రణకు ముందు వ్యవసాయ రంగానికి అప్పులిచ్చేం దుకు ఆర్థిక సంస్థలే లేని పరిస్థితి. జాతీయకరణ తర్వాత బ్యాంకుల నుంచి రైతులు అప్పులు పొందడం ప్రారంభమైంది. కరువు,కాటకాల నుంచి వ్యవసాయ రంగాన్ని రక్షించుకునేందుకు తగినన్ని అప్పులిచ్చి ఆదుకోవాలన్న రైతు సంఘాల డిమాండ్‌తో 18 శాతంమేర ఈ రంగానికి ఇవ్వాలని ప్రభుత్వ,ప్రయివేట్ బ్యాంకులకు కేంద్ర ప్రభుత్వం నిబంధన విధించింది. అయితే, ఆమేరకు అప్పులివ్వ డంలో బ్యాంకులు విఫలమవుతున్నాయి. పలు బ్యాంకు లు దొడ్డిదారిన లెక్కలు చూపుతూ ఆర్‌బీఐకి నివేదికలు సమర్పిస్తున్నట్టు వెల్లడైంది. వ్యవసాయం లాభసాటి కాదు, అందువల్ల రైతులకు రుణాలిస్తే వాటిని తిరిగి రాబట్టుకోవడం కష్టమంటూ కార్పొరేట్ అనుకూల శక్తులు ప్రచారం సాగించడం కూడా అందుకు కారణం. ఇటీవల పలు అధ్యయనాల్లో తేలింది మాత్రం అందుకు విరుద్ధంగా ఉండటం గమనార్హం. బ్యాంకుల వద్ద రికార్డయిన నిరర్థక ఆస్తుల్లో సింహభాగం కార్పొరేట్ సంస్థల వల్లేనని స్పష్టమైంది. దాంతో, అన్నం పెట్టే రైతుకు మొండి చేయి చూపుతూ ఉద్దేశపూర్వక ఎగవేతదారులైన కార్పొరేట్లను గత యూపీఏ ప్రభుత్వంతోపాటు, ప్రస్తుత ఎన్‌డీఏ ప్రభుత్వం ప్రోత్సహిస్తోందన్న విమర్శలు రైతు సంఘాల నుంచి వస్తున్నాయి. ఉద్దేశపూర్వకంగా బ్యాంకులకు అప్పులు ఎగ్గొట్టిన ఉదంతాలు రైతుల వైపు నుంచి మనకు కనిపించవు. వారు పొందేది కూడా కొద్ది మొత్తాలేనన్నది గమనార్హం. రైతులు పంటలు పండించేది కేవలం తమ కోసంకాదు. అది తప్పనిసరి సామాజిక అవసరాల కోసం. మార్కెట్ వ్యవస్థలో లోపాల వల్ల రైతులకు గిట్టుబాటు ధర లభించకపోవడం, ప్రకృతి విపత్తుల వల్ల రైతులకు ఎదురయ్యే కష్టానష్టాలవంటివాటికి సమాజమే బాధ్యత వహించాలి. పలు అంచనాల ప్రకారం దాదాపు రూ.8 లక్షల కోట్లు బ్యాంకుల వద్ద నిరర్థక ఆస్తులు(ఎన్‌పీఏ) పేరుకుపోయినట్టు తెలుస్తోంది. ఇందులో దాదాపు 75 శాతంమేర కార్పొరేట్ సంస్థలవేనన్నది అంచనా.

అంటే ఆమేరకు కార్పొరేట్ సంస్థలు బ్యాంకుల నుంచి తీసుకున్న అప్పులను తిరిగి చెల్లించకుండా ఎగ్గొట్టాయన్న మాట. దాదాపు 50శాతంపైగా ఉద్దేశపూర్వక ఎగవేతలేనని పరిశీలకులు చెబుతున్నారు. అంటే..తమకు ఇతర వ్యాపారాల్లో వచ్చిన నష్టాలను పూడ్చుకునేందుకు కార్పొరేట్ సంస్థలు తాత్కాలికంగా బినామీ కంపెనీలను సృష్టించి బ్యాంకులను మోసం చేశాయన్నది స్పష్టమవుతోంది. అయితే, కార్పొరేట్లు ఎగొగట్టిన లక్షల కోట్ల రూపాయలు ఎక్కడికీ పోలేదన్నది గమనార్హం. ఆ డబ్బంతా దొడ్డిదారిలో వారి జేబుల్లోకే చేరిందన్నది అర్థం చేసుకోవాలి. ఈ నేపథ్యంలో ఇటీవల మోడీ నేతృత్వంలోని కేంద్ర ప్రభుత్వం ప్రకటించిన బ్యాంకుల పునర్ధనీకరణ(రీక్యాపిట లైజేషన్)కు సంబంధించి పలు ప్రశ్నలకు సమాధానాలు చెప్పాల్సి ఉన్నది. నల్లధనానికీ, అవినీతికీ వ్యతిరేకమని ప్రచారం చేసుకుంటున్న మోడీ ప్రభుత్వం ఎగవేతదారుల పేర్లు బయటపెట్టేందుకు ఎందుకు వెనకాడు తున్నది..? ఓవేళ ప్రస్తుతమున్న ఆర్‌బీఐ నిబంధన లు అడ్డంకిగా భావిస్తే వాటిని సవరించేం దుకు పార్లమెంట్‌కు అధికారమున్నది.

ఉనికిలో ఉన్న చట్టాలను సాకుగా చూపి తప్పించుకుంటానంటే ఇక కుదిరేపని కాదు. చట్టాలను మార్చుకునేందుకు అధికారం ఉండి కూడా ఎవరిని కాపాడేందుకు ఆ పని చేయడంలేదన్న ప్రశ్నలు వస్తాయి. అంతేకాదు, ఎగవేతదారులు ఎవరో గుర్తించినపుడు వారి ఆస్తులు జప్తు చేయాలి. ప్రభుత్వరంగ బ్యాంకులకు అప్పులు ఎగ్గొట్టడమంటే అది ప్రజల సొమ్ము దోచుకోవడమే అవుతుంది. పేదల కోసం అమలు చేయాల్సిన సంక్షేమ పథకాలకు నిధులు లేవని చెబుతున్నవారు పెద్దల విషయంలో ఉదాసీనంగా ఎందుకు వ్యవహరిస్తున్నారన్నది ప్రజా సంఘాలు, సామాజికవేత్తల నుంచి వస్తున్న ప్రశ్న..

## లోపాలు ఉంటే చెప్పండి.. సరి చేసుకుంటాం

మొదటిపేజీ తరువాయి

చర్యలు తీసుకోవల్సిన అవసరం ఉందన్నారు. అభివృద్ధి చెందిన దేశాల్లో ప్రభుత్వాలు మారినప్పటికీ విధానపరమైన విషయాల్లో స్థిరత్వం ఉంటుంది. కాని భాతరదేశంలో విధానపరమైన స్థిరత్వం లేకపోవడం ప్రధాన లోపమన్నారు. పరిపాలన సౌలభ్యం కోసం చిన్న జిల్లాలు ఏర్పాటు చేసినందువల్ల ప్రతి కుటుంబాన్ని పట్టించుకునే వెసులుబాటు కలిగింది. కాబట్టి మంచి పథకాలు, విధానాలు తీసుకువస్తే బీసీల అభ్యున్నతికి అద్భుతంగా బాటలు నిర్మించే అవకాశం ఉందని సీఎం తెలిపారు. ఉమ్మడి రాష్ట్రంలో 23 జిల్లాలకు కలిపి ఏడాదికి రూ. లక్షా 25 వేల కోట్లు ఖర్చు చేశారు. కాని ఇప్పుడు తెలంగాణ రాష్ట్రంలోనే అంతేమొత్తంలో ఖర్చు చేస్తున్నామని సీఎం చెప్పారు.

**ఆర్థిక స్థోమత లేక సతమతం**

చెప్పులు కుట్టుకునే వృత్తి మినహా మిగతా వృత్తుదారులంతా బీసీలే ఉన్నారు. వారిలో వృత్తి నైపుణ్యం ఉన్నప్పటికీ సరైన ప్రోత్సహం, ఆర్థిక స్థోమత లేక వారంతా సతమతమవుతున్నారని తెలిపారు. కుల వృత్తులు, చేతి వృత్తులను ప్రోత్సహించాల్సిన అవసరం ఉందని చెప్పారు. హైదరాబాద్‌లో కల్లు దుకణాలను పునరుద్ధరించడం వల్ల గీత కార్మికులకు ఎంతో మేలు జరిగిందన్నారు. అలాగే చేనేత కార్మికుల సంక్షేమానికి రూ. 1200 కోట్ల వ్యయంతో కార్యక్రమాలు చేపట్టామన్నారు.

**గొర్రెల కాపరులే అత్యంత ధనవంతులు**

గొర్రెల కాపరులకు 75 శాతం సబ్సిడీపై 29.50 లక్షల గొర్రెల పంపిణీ చేసాం.. పంపిణీ చేసిన నాలుగు నెలల్లోనే 10 లక్షల గొర్రె పిల్లలకు జన్మనిచ్చాయన్నారు. ప్రస్తుతం తెలంగాణ రాష్ట్రంలో గొర్రెల కాపరులే అత్యంత ధనికులైయారని సీఎం చెప్పారు. అదేవిధంగా మత్స్య పరిశ్రమను కూడా అభివృద్ధి చేశామన్నారు. ఈ సమావేశంలో అసెంబ్లీ స్పీకర్ మధుసూధనాచారి, శాసనమండలి చైర్మెన్ స్వామిగౌడ్, మంత్రులు జోగు రామన్న, ఈటల రాజేందర్, తలసాని శ్రీనివాస్ యాదవ్, పద్మారావు, టీఆర్ఎస్ పార్టీ ఎంపీలు, ఎమ్మెల్యేలు, ఎమ్మెల్సీలు, కాంగ్రెస్ పార్టీ నుంచి ఎమ్మెల్సీలు ఆకుల లలిత, సంతోష్‌కుమార్, టీడీపీ నుంచి ఆర్ కృష్ణయ్య, బీజేపీ పార్టీ నుంచి బండారు దత్తాత్రేయ, డాక్టర్ లక్ష్మణ్ పాల్గొన్నారు.

**మూడు రకాలుగా వృత్తుల వర్గీకరణ**

చేతి వృత్తులను మూడు రకాలుగా వర్గీకరిస్తున్నట్టు ఆర్థిక శాఖమంత్రి ఈటల రాజేందర్ తెలిపారు. సేవా వృత్తులు, ఆదరణకు నోచుకొని వృత్తులు, కులాల వారీగా వృత్తులను వర్గీకరిస్తున్నట్టు తెలిపారు. వృత్తుల ఆధునీకరించి రాబోవు తరాలకు మంచి పునాది వేస్తామన్నారు. సమావేశం అనంతరం మంత్రి విలేకరులతో మాట్లాడారు. చట్ట సభలలో రిజర్వేషన్ల అమలు కోసం మరోసారి అసెంబ్లీలో తీర్మానం చేస్తామన్నారు. అఖిలపక్షానికి ప్రధాని దగ్గరి తీసుకువెళ్లేందుకు సీఎం కేసీఆర్ సుముఖంగా ఉన్నారని చెప్పారు. కేంద్రంలో ప్రత్యేకంగా బీసీ మంత్రిత్వ శాఖను ఏర్పాటు చేసే విధంగా రాష్ట్ర ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వంపై ఒత్తిడి తీసుకువస్తామన్నారు. బీసీల అభివృద్ధి కోసం ప్రత్యేకంగా ఒక డాక్యుమెంట్‌ను రూపొందించి, అందులో చేర్చిన పథకాలను ఈ నెల నుంచే అమల్లోకి తీసుకువచ్చేందుకు కృషి చేస్తామన్నారు. బీజేపీ ఎమ్మెల్యే లక్ష్మణ్ మాట్లాడుతూ డిక్కీ తరహాల్లో బీసీల కోసం బిక్కీని ఏర్పాటు చేయాలని విజ్ఞప్తి చేశారు. ఎస్సీ, ఎస్టీ తరహాల్లో బీసీలకు ఫీజు రీయంబర్స్‌మెంట్ విధానాన్ని అమలు చేయాలన్నారు. ఆర్ కృష్ణయ్య మాట్లాడుతూ బీసీలను ఆర్థికంగా, రాజకీయంగా అభివృద్ధి చేయాలన్నారు. ఎమ్మెల్సీ ఆకుల లలిత మాట్లాడుతూ బీసీ ఫెడరేషన్లను మరింత బలోపేతం చేసి వృత్తిదారులను ఆదుకోవాలన్నారు.

**రిజర్వేషన్ల కోసం కేంద్రంపై ఒత్తిడి**

చట్ట సభల్లో బిసిలకు రిజర్వేషన్లు కల్పించేందుకు చట్టం చేయాలని కేంద్రంపై ఒత్తిడి చేస్తామని సీఎం తెలిపారు. పదోన్నతుల్లో కూడా రిజర్వేషన్లు కల్పించాల్సిన అవసరం ఉందన్నారు. ఇందుకోసం తెలంగాణ అఖిలపక్షాన్ని ప్రధాని దగ్గరకు తీసుకువెళుతామన్నారు. కేంద్ర ప్రభుత్వంలో బీసీ డిమాండ్లపైన, బీసీల అభ్యున్నతి కోసం తీసుకునే పథకాలపై త్వరలోనే అసెంబ్లీలో ఒక రోజు పూర్తి స్థాయి చర్చ చేపట్టాలని ముఖ్యమంత్రి అసెంబ్లీ స్పీకర్‌కు విజ్ఞప్తి చేశారు. అనంతరం అవసరమైన తీర్మానాలు, చట్టాలు, జీవోలను విడుదల చేస్తామన్నారు. బీసీ పారిశ్రామిక వేత్తలను ప్రోత్సహించడానికి టీ.ఎస్.ఐ.ఐ.సీ. ఇచ్చే భూముల్లో బీసీలకు రిజర్వేషన్ కల్పిస్తామని సీఎం వెల్లడించారు.

## కటిక దారిద్ర్యంలో దేశం

మొదటిపేజీ తరువాయి

వ్యవసాయ సంక్షోభం నెలకొందని, ఈ ఖరీఫ్‌లోనే రైతులు రూ.20 లక్షల కోట్ల మేర నష్టపోయారని ఆందోళన వ్యక్తం చేశారు. రైతు ఆత్మహత్యలను అనారోగ్య మరణాలుగా చూపడం దారుణమన్నారు. రైతులకు గిట్టుబాటు ధర, కార్మికుల కూలి పెంపు, కనీస వేతనం, సామాజిక భద్రతకు ప్రభుత్వం తీసుకున్న చర్యలు ఏమీలేవని వివరించారు. అబద్ధాల్లో ప్రథములు సీఎం కేసీఆరేనని అన్నారు. ప్రజలు, ప్రజా సంఘాలు, ఎర్ర జెండాల ఉద్యమాలంటే కేసీఆర్‌కు భయమని, ఆయన కంటే పిరికిపంద మరొకరు లేరని విమర్శించారు. తెలంగాణకు వ్యతిరేకంగా పని చేసిన ఇతర పార్టీ ఎమ్మెల్యేలకు పదవులిచ్చారని గుర్తు చేశారు. మూడున్నరేండ్లలో 23 మంది ఎమ్మెల్యేలు, 12 మంది ఎమ్మెల్సీలను అప్రజాస్వామికంగా తమ పార్టీలో చేర్చుకున్నారని చెప్పారు. 'మేము కక్కిన ఎంగిలి కూడును తింటారా' అని సీపీఐ ఎమ్మెల్యేను టీఆర్ఎస్‌లో చేర్చుకోవటంపై అన్నారు. నిజాం రాజును పొగడటం అంటే తెలంగాణ సమాజాన్ని అవమాన పర్చడమేనని విమర్శించారు. ఇందుకు క్షమాపన చెప్పాలని డిమాండ్ చేశారు. సీపీఐ(ఎం) రాష్ట్ర కార్యదర్శి తమ్మినేని వీరభద్రం మాట్లాడుతూ... సామాజిక న్యాయం ప్రాతిపదికన కలిసివచ్చే వారితో ఐక్యపోరాటాలు చేస్తామన్నారు. సామాజిక సమానత్వం, ఆర్థిక న్యాయం, సాంస్కృతిక సమానత్వం, రాజకీయాధికారం కోసం రానున్న కాలంలో పోరాటాలు ఉధృతం చేస్తామన్నారు. బంగారు తెలంగాణ వద్దని, బతుకు తెలంగాణ కావాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేశారు. విద్య, వైద్యం, భూములు కార్పొరేట్ శక్తుల చేతుల్లోకి వెళ్తున్నాయని ఆందోళన వ్యక్తం చేశారు. కాంట్రాక్టు, అవుట్ సోర్సింగ్ ఉద్యోగులను పర్మినెంట్ చేస్తామన్న హామీని కేసీఆర్ విస్మరించారని విమర్శించారు. సామాజిక తెలంగాణ సాధన కోసం రానున్న కాలంలో టీఆర్ఎస్‌ను గద్దెదించక తప్పదని హెచ్చరించారు. టీపీసీసీ అధ్యక్షులు ఉత్తమ్‌కుమార్‌రెడ్డి మాట్లాడుతూ...ఎస్సీ, ఎస్టీ, బీసీ, మైనార్టీల అభివృద్ధి కోసం కమ్యూనిస్టు పార్టీలు చేస్తున్న పోరాటాలకు మద్దతిస్తామని, వారితో కలిసి పనిచేస్తామని అన్నారు. రుణమాఫీ వల్ల రైతులకు మేలు చేకూరలేదని, వడ్డీల భారం పెరిగిందని అన్నారు. విద్యార్థులకు ఫీజు బకాయిలు, సంక్షేమానికి నిధులు ఖర్చు చేయకపోగా, కాంట్రాక్టర్లకు మాత్రం గతేడాది రూ. 20వేల కోట్లు చెల్లించారని తెలిపారు.

మైనార్టీలకు 12 శాతం రిజర్వేషన్లు ఇవ్వకుంటే ఓట్లడగవద్దని సీఎం కేసీఆర్‌కు సూచించారు. సభ ప్రారంభానికి ముందు ర్యాలీ నిర్వహించి, తిమ్మాపూర్ మండలం అల్గునూర్ వద్ద పైలాన్‌ను ఆవిష్కరించారు. ఈ సభలో ఎంసీపీఐ(యు) జాతీయ కార్యదర్శి గౌస్, సీపీఐ జాతీయ కార్యదర్శులు డి. రాజా, డాక్టర్ కె.నారాయణ, ఆర్ఎస్‌పీ నాయకులు జానకిరాం, ఫార్వర్డ్‌బ్లాక్ పార్టీ రాష్ట్ర కార్యదర్శి బండ సురేందర్ రెడ్డి, ప్రజాయుద్ధనౌక గద్దర్, గాయకులు విమలక్క, టీపీసీసీ ఉపాధ్యక్షులు పొన్నం ప్రభాకర్, శ్రీధర్ బాబు, కాంగ్రెస్ మహిళా అధ్యక్షులు నేరెళ్ల శారద, టీడీపీ రాష్ట్ర అధ్యక్షులు ఎల్. రమణ, నాయకులు పెద్దిరెడ్డి, డీసీసీ అధ్యక్షులు కటకం మృత్యుంజయం, వివిధ పార్టీల నాయకులు పాల్గొన్నారు.

| సెన్సెక్స్ ▼317 | నిఫ్టీ ▼104 | డాలరుకు రూపాయి విలువ | బంగారం(10.గ్రా) | వెండి (కేజీ) | కోడిగుడ్లు | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 32,832 | 10,121 | 64.45 | రూ. 29,807 | రూ. 41,800 | హైదరాబాద్ 410 | ఒక్కగుడ్డుకు 4.70 | వరంగల్ 410 | |
| | | | | | విజయవాడ 412 | చెన్నై 460 | ముంబయి 455 | |

శుక్రవారం మార్కెట్లు ముగిసిన సమయానికి

## ఆర్బీఐ పాలసీ సమీక్షపైనే దృష్టి..



**నవతెలంగాణ, బిజినెస్ డెస్క్:** దేశీయ స్టాక్ మార్కెట్లకు ఈ వారం ఆర్బీఐ పాలసీ సమీక్ష సమావేశం దిశనిర్దేశం చేయనుందని విశ్లేషకులు పేర్కొంటున్నారు. అలాగే ఈ నెల 9న జరిగే గుజరాత్ తొలి విడత ఎన్నికలు కూడా స్టాక్ మార్కెట్లకు కీలకంగా మారనున్నాయని చెబుతున్నారు. వీటితో పాటు ప్రపంచ మార్కెట్ల పోకడ, దేశీ, విదేశీ పెట్టుబడుల సరళి, అంతర్జాతీయ మార్కెట్లో ముడిచమురు ధరల గమనం, డాలరుతో రూపాయి మారకం కదలికలు వంటివి ప్రధాన సూచీల గమనాన్ని నిర్దేశిస్తాయని తెలిపారు. జులై-సెప్టెంబర్లో జీడీపీ వృద్ధి రేటు మెరుగైనప్పటికీ గడిచిన వారం మదుపర్లలో విశ్వాసాన్ని నింపలేకపోయింది. మరోవైపు ప్రభుత్వ ప్రతికూల నిర్ణయాల వల్ల ద్రవ్య లోటు తారాస్థాయికి చేరడం కూడా మార్కెట్లను నష్టాల బాట పట్టించాయి. ఈ నేపథ్యంలో శుక్రవారం బీఎస్ఈ సెన్సెక్స్ 316.41 పాయింట్లు క్షీణించి 32,832.94 పాయింట్లకు పడిపోయింది. అలాగే ఎన్ఎస్ఈ నిఫ్టీ 104.75 పాయింట్లు తగ్గి 10,121.80 వద్ద ముగిసింది. కాగా డిసెంబర్ 1తో ముగిసిన వారంలో సెన్సెక్స్ 846.30 పాయింట్లు నష్టపోయింది. మరోవైపు ఎన్ఎస్ఈ నిఫ్టీ కూడా 267.90 పాయింట్లు దిగజారింది. దీంతో ఈ వారం దేశీయ స్టాక్ మార్కెట్లు బుల్లిష్ కొనసాగిస్తాయో లేదో వేచిచూడాల్సిన అంశం..

**ఆర్బీఐ సమీక్ష..**

రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా (ఆర్బీఐ) మానిటరీ పాలసీ కమిటీ(ఎంపీసీ) మంగళవారం (5న) సమావేశం కానుంది. బుధవారం(6న) ముగియనున్న ఈ సమావేశానికి ఆర్బీఐ గవర్నర్ ఊర్జిత్ పటేల్ అధ్యక్షత వహిస్తారు. ఈ ద్వైమాసిక పాలసీ నిర్ణయాలు బుధవారం వెలువడనున్నాయి. గత పాలసీ సమీక్షలో వడ్డీ రేట్లకు కీలకమైన రెపో రేటును 6 శాతం వద్దే కొనసాగించేందుకు నిర్ణయించింది. ఇదిలా ఉంటే ద్రవ్యోల్బణం భయాల నేపథ్యంలో ఈసారి కూడా పాలసీ రేట్లను ఆర్బీఐ యథాతథంగా కొనసాగించే వీలున్నట్టు ఆర్థిక నిపుణులు భావిస్తున్నారు. ఈ నేపథ్యంలో ఇన్వెస్టర్లు ఇటువైపు దృష్టి సారించే అవకాశం ఉందని మార్కెట్ వర్గాల అంచనా. నవంబర్ నెలకు చెందిన దేశీయ సేవల రంగం పనితీరును మంగళవారం (5న) మార్కిట్ ఎకనామిక్స్ సర్వే వెల్లడించనుంది. అక్టోబర్ నెలలో ఈ రంగం నాలుగు నెలల గరిష్టానికి చేరింది. మరోవైపు డిసెంబర్ 5న అమెరికా తయారీయేతర పర్చేజింగ్ మేనేజర్ ఇండెక్స్ వివరాలు వెల్లడికానున్నాయి. ఈ గణాంకాల నేపథ్యంలో ఇన్వెస్టర్లు ఆచితూచి వ్యవహరించనున్నారని విశ్లేషకులు అంచనా వేస్తున్నారు.

## 2025 నాటికి లక్ష స్టార్టప్‌లు..



**న్యూఢిల్లీ:** భారత్‌లో వచ్చే ఏడెనిమిదేండ్లలో లక్షకు పైగా స్టార్టప్ సంస్థలు ఏర్పాటు కానున్నాయని మణిపాల్ గ్లోబల్ ఎడ్యుకేషన్ చైర్మెన్ టీవీ మోహన్‌దాస్ పాయ్ అన్నారు. వీటి ఏర్పాటు ద్వారా దాదాపు 32.5 లక్షల (3.25 మిలియన్ల) మంది ఉపాధి పొందుతారని, వాటి విలువ 500 బిలియన్ డాలర్లకు చేరుతుందని తెలిపారు. భారతీయులు ఎదుర్కొంటున్న చాలా సమస్యలకు స్టార్టప్ సంస్థలు పరిష్కారం చూపుతాయని వివరించారు. 'ప్రస్తుతం దేశవ్యాప్తంగా 32వేల స్టార్టప్ సంస్థలు ఉండగా, ప్రతి ఏడాది 7వేల సంస్థలు కొత్తగా వస్తున్నాయని పేర్కొన్నారు.

# గుత్తాధిపత్యం దిశగా టెలికాం రంగం!

- పోటీని తట్టుకోలేక సంస్థల విలీనాల బాట
- చివరికి రేసులో మిగిలేవి 4-5 సంస్థలేనా!
- అదే జరిగితే వినియోగదారులకిక కష్టాలే
- ఆవేదన వ్యక్తం చేస్తున్న చిన్న కంపెనీలు



**నవతెలంగాణ, వాణిజ్య విభాగం:** దేశీయ టెలికాం రంగంలో క్రమంగా గుత్తాధిపత్య వాతావరణం నెలకొంటోంది. రిలయన్స్ జియో దేశీయ మార్కెట్లోకి వచ్చి సరిగ్గా 14 నెలలు కావొస్తోంది. అతి తక్కువ కాలంలోనే ఈ సంస్థ టెలికాం రంగంలో భారీ సంచనాలకు కేరాఫ్ అడ్రస్‌గా నిలిచింది. వస్తూనే ఉచిత వాయిస్, డేటా ఆఫర్లంటూ టెలికాం సంస్థల మైండ్ బ్లాక్ చేసే కార్యాచరణతో ముందుకొచ్చింది. ఏకంగా యుద్ధం ప్రకటించినంత పనిచేసింది. చివరికి రిలయన్స్ వ్యూహాత్మక ఆటలో ఎయిర్‌సెల్, టెలినార్, రిలయన్స్ కమ్యూనికేషన్స్, టాటా టెలిసర్వీసెస్ లాంటి సంస్థలు నిలదొక్కుకొనేందుకు నష్టాలలో ఎదురీదుతున్నాయి. మరోవైపు దిగ్గజ ఆపరేటర్లు సైతం మార్కెట్‌ను నిలుపుకొనేందుకు తీవ్ర ఒత్తిడి ఎదుర్కొంటున్నాయి. చిన్న సంస్థలు బడాబాబులను ఢీకొట్టడానికి విలీనాలే శరణ్యమన్న రీతిలో ముందుకు సాగుతున్నాయి. ఈ నేపథ్యంలోనే వొడాఫోన్, ఐడియా దిగ్గజ సంస్థలు విలీన బాటపట్టాయి. ఎయిర్‌టెల్ సైతం టాటా టెలిసర్వీసెస్‌ను విలీనం చేసుకుంది. అలాగే ఎయిర్‌సెల్ కొనుగోలుపై చర్చలు జరుపుతుంది. కాగా అంతకు ముందు ఎయిర్‌సెల్, రిలయన్స్ కమ్యూనికేషన్స్ విలీనం కావాలని చర్చలు జరిపాయి. కానీ తర్వాత ఇది రద్దయింది.

**స్థిరీకరణ దిశగా అడుగులు...**

దేశీయ టెలికాం రంగంలో స్థిరీకరణ దిశగా వేగంగా పావులు కదులుతున్నాయి. కన్సాలిడేషన్‌తో భారతీ ఎయిర్‌టెల్ ఒకవిధంగా లబ్ది చెందిందని ఇటీవల ఎయిర్‌టెల్ చైర్మెన్ సునిల్ మిట్టల్ తెలిపారు. ఒక విధంగా చెప్పాలంటే రిలయన్స్ జియోని ఎదుర్కొనే విషయంలో ఎయిర్‌టెల్ తన శక్తిని మొత్తం దారపోస్తుందన్న విషయంలో డౌట్ అక్కర్లేదు. కానీ ఎయిర్‌టెల్ ఒక్కటితో ఇది సాధ్యం అవ్వటం లేదన్నది సమాచారం. దీంతోనే ఎయిర్‌టెల్ ఇతర సంస్థలతో కలిసి అవకాశం ఉన్న ప్రతిదాన్ని వాడుకునేందుకు కూడా వెనుకడటం లేదు. ఈ సయమంలోనే రిలయన్స్ జియోకి గట్టి పోటినిచ్చేందుకు ఎయిర్‌టెల్ పెట్టుబడులు, విలీనాలు చేపట్టే అంశంలో కూడా వెనక్కి తగ్గడం లేదు. ఇదిలా ఉంటే జియో వల్ల ఏర్పడిన ధరల యుద్ధంతో టెల్కోల రెవెన్యూలు, లాభాలు, నగదు నిల్వలు అంతకంతకు దెబ్బతిన్నాయి. కాగా ఈ సంస్థలు ప్రతి త్రైమాసికంలో నష్టాలనే ప్రకటిస్తూ వస్తున్నాయి. అయితే ఈ పర్వం ఇప్పటికీ కొనసాగుతుండటం విశేషం. రిలయన్స్ కమ్యూనికేషన్స్ అధినేత అనిల్ అంబానీ ఇటీవల ఒక సమావేశంలో టెలికాం మార్కెట్ గుత్తాధిపత్య ధోరణుల దిశగా సాగుతోందని ఆందోళన వ్యక్తం చేశారు. ఒకప్పుడు డజను పైగా కంపెనీలుండగా..ప్రస్తుతం ఆరుకి తగ్గిపోయాయనీ, దాదాపు అంతర్జాతీయ సంస్థలన్నీ వెళ్లిపోయాయని ఆయన పేర్కొన్నారు. ఇదే సమయంలో మార్కెట్లో క్రమంగా పోటీ తగ్గిపోయి, గుత్తాధిపత్య ధోరణి నెలకొనే ముప్పు పొంచి ఉందని ఆయన ఆవేదన వ్యక్తం చేశారు. అయితే తక్కువ ధరలతో సర్వీసులు అందించడం కస్టమర్లకు మంచిదే, కానీ అవి టారిఫ్ నిబంధనలకు అనుగుణంగా ఉన్నాయో లేదోననేదే అతిపెద్ద సవాల్‌గా మారిందని పలువురు నిపుణులు అంచనా వేస్తున్నారు. ఇంతటి తీవ్రత నేపథ్యంలో టెలికాం రంగంలో అంతిమంగా మిగిలేది..ఆ నలుగురైదుగురే అన్నది ఆయా వర్గాలు అభిప్రాయం. అయితే ఈ ధోరణి వల్ల రానున్న రోజుల్లో వినియోగదారులకు నష్టం కలిగే అవకాశం ఉందని వారు చెబుతున్నారు.

రేసులో మిగిలిన సంస్థలు కూడబలుక్కొని ఎంత ధరల నిర్ణయిస్తే అంత వినియోగదారులు చెల్లించాల్సిన దుస్థితి రావొచ్చని వారు చెబుతున్నారు.

**కొండెక్కిన 75000 కొలువులు**

జియో ప్రవేశం టెలికాం రంగాన్ని ఒక కుదుపు కుదిపేసింది. ఇందులో భాగంగా 2017 మార్చి తర్వాత టెల్కోల మధ్య విలీనాలు, కొనుగోలు ప్రక్రియలు ఊపందుకున్నాయి. ఐడియా, వొడాఫోన్ భారీ విలీన నేపథ్యం, టాటా టెలి సర్వీసెస్ వైర్‌లెస్ బిజినెస్‌ను భారతీ ఎయిర్‌టెల్ టేకోవర్ చేసుకోవడం లాంటివి చూడొచ్చు. ఇదిలా ఉంటే గత ఏడాది నుంచి ఈ రంగంలో ఉద్యోగాల కోత భారీగా నమోదైంది. దాదాపు 75,000 ఉద్యోగాలు హాంఫట్ అయ్యాయని సమాచారం. మరోవైపు వొడాఫోన్, ఐడియా దిగ్గజ సంస్థల విలీనంతో భవిష్యత్తులో ఉద్యోగాల కోత అనివార్యం కావడంతో పాటు ఖాళీల భర్తీ చేపట్టేందుకు ఈ సంస్థలు ముందుకు రాకపోవచ్చునని విశ్లేషకులు అంచనా వేస్తున్నారు.

**పెట్టుబడులు రైటాఫ్**

రిలయన్స్ జియో ఉచిత ఆఫర్ల వెల్లువ టెలికాం కంపెనీలను భారీగా దెబ్బతీసింది. అది ఇప్పటికీ కొనసాగుతోంది. ఇక జియో ఎంట్రీతో టెలికాం కంపెనీలు దాదాపు 50 బిలియన్ డాలర్ల వరకు పెట్టుబడులను రైటాఫ్ చేసినట్టు భారతీ ఎయిర్‌టెల్ చైర్మెన్ సునిల్ మిట్టల్ ఇటీవల ఒక ఆంగ్ల పత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో ఆవేదన వ్యక్తం చేశారు. ఇన్ని కోట్ల మేర పెట్టుబడుల రైటాఫ్‌కు ప్రధాన కారణం జియో ఫ్రీ కాల్స్, డేటా ఆఫర్లేనని తెలిపారు. దీనికితోడు టెలికాం రంగం రూ.8 లక్షల కోట్ల రుణాలతో కొట్టుమిట్టాడుతున్న సంగతి తెలిసిందే. అయితే టెలికాం ఇండస్ట్రీలో వేగంగా జరిగిన కన్సాలిడేషన్‌తో భారతీ ఎయిర్‌టెల్ లబ్ధి పొందిందని చెప్పిన మిట్టల్.. వొడాఫోన్, ఐడియాలు విలీనం శుభపరిణామమేనని అన్నారు. ఇదే సమయంలో తాము ప్రస్తుతం ఎయిర్‌సెల్‌ను కొనుగోలు చేసే ప్రక్రియపై చర్చలు జరుపుతున్నట్టు తెలిపారు.







## మోసం చేయడంలో కేసీఆర్ సిద్ధహస్తుడు

- కాంగ్రెస్ ప్రజాగర్జనలో మాజీ ఎంపీ ఎస్. జైపాల్‌రెడ్డి
- కాంగ్రెస్‌తో పెట్టుకున్న వాళ్లు బతికిబట్టకట్టలేదు : ఎమ్మెల్యే రేవంత్‌రెడ్డి

**నవతెలంగాణ-మహబూబ్‌నగర్‌ప్రతినిధి/అచ్చంపేట**

మోసం చేయడంలో రాష్ట్ర ముఖ్యమంత్రి కేసీఆర్ సిద్ధహస్తుడని మాజీ పార్లమెంటు సభ్యులు ఎస్.జైపాల్‌రెడ్డి విమర్శించారు. నాగర్‌కర్నూల్ జిల్లా అచ్చంపేట మండల కేంద్రంలో కాంగ్రెస్ ఆధ్వర్యంలో ప్రజాగర్జన ఆదివారం నిర్వహించారు. ఈ సందర్భంగా జైపాల్‌రెడ్డి మాట్లాడుతూ.. దళితులకు కేసీఆర్ ఇచ్చిన హామీల్లో ఒక్కటీ అమలు చేయలేదన్నారు. ఇచ్చిన మాట మరిచి తన ఇంట్లోనే నలుగురికి ఉపాధి కల్పించి మిగితావారికి మొండి చేయి చూపారని విమర్శించారు. రాష్ట్రం ఏర్పడ్డ తర్వాత ఏ సామాజిక వర్గం కూడా సంతోషంగా లేదన్న విషయాన్ని కేసీఆర్ గుర్తెరుగాలన్నారు. ఎమ్మెల్యే రేవంత్‌రెడ్డి మాట్లాడుతూ..అచ్చంపేట పట్టణానికి గబ్బిలంలా పట్టిన గువ్వల బాల్‌రాజును వదిలించుకోవాల్సిన సమయం దగ్గరలోనే ఉందన్నారు. ప్రజాగర్జనకు తరలివస్తున్న కాంగ్రెస్ కార్యకర్తలను పోలీసులు అడ్డుకోవడం దారుణమన్నారు. రాష్ట్రంలో సభలు పెట్టుకునే హక్కు కూడా లేదా అని ప్రభుత్వాన్ని ప్రశ్నించారు. ఇప్పటివరకూ కాంగ్రెస్ లక్ష్యంగా పనిచేసిన వారెవరూ బతికి బట్ట కట్టలేదన్నారు. తెలంగాణ పోరులో అమరులైన పోలీసు కిష్టయ్య, శ్రీకాంతాచారి లాంటివారంతా బీసీలేనన్న విషయాన్ని కేసీఆర్ గుర్తించుకోవాలని గుర్తు చేశారు. బీసీ, ఎంబీసీల గురించి ఏనాడైనా చర్చించారా అని ఆయన ప్రశ్నించారు. జిల్లాలో దొరల గడికి వారసుడైన జూపల్లి కృష్ణారావుకు మంత్రి పదవి ఇచ్చావుగానీ తెలంగాణ పోరాటంలో అగ్ర భాగాన నిలిచిన శ్రీనివాస్‌గౌడ్‌ను కేబినెట్‌లో ఎందుకు చేర్చుకోలేదో సీఎం ప్రజలకు చెప్పాలన్నారు. బీసీలను కరివేపాకువలే వాడుకోవాలని చూస్తే వచ్చే ఎన్నికల్లో టీఆర్ఎస్‌ను బొంద పెడతారని హెచ్చరించారు. కాంట్రాక్టుల పేరుతో తమ బంధువులకు వేల కోట్ల రూపాయలు కట్టబెడుతూ బడుగు, బలహీన వర్గాల పిల్లలకు చెల్లించాల్సిన ఫీజు రీయింబర్స్‌మెంట్‌లో కూడా కోతలు పెడుతున్నారన్నారు. కార్యక్రమానికి ఎమ్మెల్యేలు డీకే అరుణ, రేవంత్‌రెడ్డి, సంపత్‌కుమార్, వంశీచంద్‌రెడ్డి, ఎమ్మెల్సీ కూచుకుళ్ల దామోదర్‌రెడ్డి తదితరులు హాజరయ్యారు.

## మానుకోటలో 144 సెక్షన్

### నగారాభేరి, ఉడుంపట్టు, తుడుందెబ్బ నాయకుల అరెస్టు

**నవతెలంగాణ-మహబూబాబాద్ క్రైం**

మహబూబాబాద్ పట్టణం ఆదివారం నిర్బంధాలు, అరెస్టులతో వేడెక్కింది. నగారాభేరి, ఎల్‌హెచ్‌పీఎస్, ఉడుంపట్టు, తుడుందెబ్బ నాయకులను అరెస్టు చేశారు. ఆదివాసీలు, లంబాడీలు ఆదివారం వేర్వేరుగా ఆత్మగౌరవ సభలను ఆదివారం మహబూబాబాద్‌లోని గాంధీపార్కులో నిర్వహించాలనుకున్నారు. ఇరు సంఘాల వారు ఒకే వేదికను ఎంచుకోవటంతో పోలీసులు ఎవ్వరికీ అనుమతి ఇవ్వలేదు. పట్టణంలో పోలీసులు 144 సెక్షన్ విధించారు. రోడ్లపై ఇద్దరి కంటే ఎక్కువ మంది కన్పిస్తే అరెస్టు చేశారు. అరెస్టయిన వారిలో గుగులోత్ హరినాయక్, భూక్య బాలునాయక్, భూక్య రామోజీనాయక్, బోడ లక్ష్మణ్, గుగులోత్ భీమా, గుగులోత్ మంగిలాల్, గుగులోత్ కిషన్‌నాయక్, మాలోతు ఆలనాయక్, దారవత్ వాసునాయక్, తేజావత్ సూర్య, మాలోతు మంగ్యాతినాయక్, నూనవత్‌రాధ, మాలోతు కవిత తదితరులున్నారు.

**9న హైదరాబాద్‌లో లంబాడీల లడాయి : ఎల్‌హెచ్‌పీఎస్ రాష్ట్ర ఆర్గనైజర్ సెక్రటరీ రామోజీనాయక్**

ఎన్ని నిర్బంధాలకు గురిచేసినా భయపడేది లేదు. ఈనెల 9న హైదరాబాద్‌లోని నిజాం కాలేజ్ గ్రౌండ్‌లో భారీ ర్యాలీ, బహిరంగ సభను నాలుగు లక్షల మందితో నిర్వహిస్తాం. కొంతమంది మాయమాటలు నమ్మి ఎస్టీ జాబితా నుంచి లంబాడీలను తొలగించాలనడం అవివేకం.

**ఎస్టీ జాబితా నుంచి లంబాడీలను తొలగించాలి : ఉడుంపట్టు**

రాజ్యాంగ బద్ధంగా రాష్ట్రపతి ఆమోదం లేని లంబాడీలను ఎస్టీ గుర్తింపు జాబితా నుంచి తొలగించాలని ఉడుంపట్టు నాయకులు మా దిని శ్రీనివాస్, పాశం నరేష్‌లు డిమాండ్ చేశారు. ఆదివాసీల బహిరంగ సభను పోలీసులు కుట్రపూరితంగా అడ్డుకున్నారని ఆరోపించారు.

# తెలుగు గొప్పదనాన్ని...
# సాంస్కృతిక కళారూపాల్లో చూపుతాం

**ప్రపంచ తెలుగు మహాసభల్లో 25 కళారూపాలను ప్రదర్శన**

- శాస్త్రీయ కళారూపాలతో పాటు జనపదాలకూ ప్రాధాన్యం
- 15 నుంచి ఐదు రోజుల సాంస్కృతిక పండగ
- ఇతర దేశాలు, రాష్ట్రాల కళాకారులకూ అవకాశం
- 'నవతెలంగాణ'తో తెలంగాణ భాషా,సంస్కృతిక శాఖ సంచాలకులు మామిడి హరికృష్ణ

**సాహిత్యానికి, జానపదాలకు నిలయమైన తెలంగాణ రాష్ట్రంలో ఈనెల 15 నుంచి 19 వరకు ప్రపంచ తెలుగు మహాసభలు జరగబోతున్నాయి. తెలంగాణ సాంస్కృతిక కళారూపాలను ప్రపంచవ్యాప్తంగా చాటిచెప్పేందుకు ఈ మహాసభలు వేదికకాబోతున్నాయి. శాస్త్రీయ నృత్యాలతో పాటు గ్రామీణ ప్రాంతాల్లోని కళారూపాలను ఇక్కడ ప్రదర్శించబోతున్నారు. ప్రతి కళారూపంలోనూ తెలంగాణ భాషా, సంస్కృతి, వైభవాన్ని చాటి చెప్పేందుకు తెలంగాణ రాష్ట్ర భాషా, సాంస్కృతిక శాఖ సన్నద్ధమైంది. ఈ మేరకు ఇప్పటికే అన్ని ఏర్పాట్లు కూడా పూర్తి చేసుకున్నది. తెలంగాణతో పాటు ఇతర రాష్ట్రాలు, దేశాలకు చెందిన సుమారు ఐదు వేల మంది కళాకారుల ప్రదర్శనలకు రెడీ అయింది. ఈ నేపథ్యంలో ఈ మహాసభల్లో సాంస్కృతికశాఖ పాత్ర, కార్యక్రమాలపై తెలంగాణ భాషా, సాంస్కృతిక శాఖ సంచాలకులు మామాడి హరికృష్ణ.. నవతెలంగాణ ప్రతినిధి గంట్ర నవీన్‌తో పంచుకున్నారు. ఆ విశేషాలు మీకోసం...**

**నవతెలంగాణ: కార్యక్రమాలు ఎక్కడెక్కడ ఏమేమీ ఉంటాయి..?**

**మామిడి హరికృష్ణ:** ప్రధానంగా సాంస్కృతిక కార్యక్రమాలు కొన్ని ప్రత్యేక వేదికలపై ఏర్పాటు చేశాం. రవీంద్రభారతి, లలిత కళాతోరణం, ప్రియదర్శిని ఆడిటోరియంలో ఏకకాలంలో సాంస్కృతిక కార్యక్రమాలు నిరంతరం జరుగుతాయి. ఉదయం 11 గంటలకు మొదలై, రాత్రి 10-10:30గంటల వరకూ ప్రదర్శనలు కొనసాగుతాయి. వీటిలో జనపద ప్రదర్శనలన్నీ లలిత కళాతోరణంలోనే ఉంటాయి. ఇక్కడే సాంస్కృతిక కళాసారథి ప్రదర్శలుంటాయి. శాస్త్రీయ సంగీతం, శాస్త్రీయ నృత్యం, పేరిణి, కూచిపూడి, భరతనాట్యం లాంటివి ఉంటాయి. అత్యున్నత స్థాయి నృత్యరూపకాలు, నాటికలను కళాకారులు ఈ ఐదురోజుల్లో ప్రదర్శిస్తారు.

**నవతెలంగాణ: పిల్లల కోసం ప్రత్యేకంగా ఏమైనా ఏర్పాట్లు చేశారా..?**




**మామిడి హరికృష్ణ:** మహాసభల్లో బాలల కోసం 'బాలోత్సవం' నిర్వహిస్తున్నాం. పిల్లలకు భాషా, సాహిత్యం వంటి కార్యక్రమాలపై చర్చ లేకుండా కేవలం తెలుగుభాష ఔన్నత్యం తెలిపేలా కళారూపాలు ప్రదర్శించేలా ఏర్పాట్లు చేస్తున్నాం. దీనిలో తెలంగాణ వైభవాన్ని చాటిచెప్పేలా డ్యాన్సు బ్యాలేలు, నృత్యరూపాలు ఉంటాయి. బాలల ప్రతిభ ప్రదర్శన కోసం బాలోత్సవం ఏర్పాటు చేశాం.



**నవతెలంగాణ: ఇతర దేశాలు, రాష్ట్రాల నుంచి కళాకారులు వస్తున్నారా..?**

**మామిడి హరికృష్ణ:** ఇతర దేశాలు, రాష్ట్రాల నుంచి వచ్చే కళాకారులకు ఐదు రోజుల పాటు ప్రభుత్వం తరపున వసతి, భోజన సౌకర్యాలను కల్పిస్తున్నాం. ఐదురోజుల పాటు అన్ని వేదికల్లో ఇతర రాష్ట్రాలు, దేశాలకు సంబంధించిన కార్యక్రమాలు పెట్టాం. ప్రత్యేకంగా వారి కళారూపాలు, ప్రదర్శనల కోసం సమయాన్ని కేటాయిస్తున్నాం. విదేశీ కళాకారులు ఎక్కువగా నృత్యరూపాలు, సోలో ప్రదర్శలు చేయనున్నారు. కళారూపాలను ప్రదర్శించిన కళాకారులకు నిబంధనల ప్రకారం గౌరవవేతనం అందిస్తాం.

**నవతెలంగాణ: మహాసభల్లో ఎన్ని కళారూపాలు ప్రదర్శించబోతున్నారు.?**

**మామిడి హరికృష్ణ:** రాష్ట్రంలో మొత్తం 56 కళారూపాలను గుర్తించాం. వీటిలో ప్రదర్శన చేయగలిగే సామర్థ్యమున్న 25 కళారూపాలను ఈ మహాసభల్లో ప్రదర్శించబోతున్నాం. జానపద కళాకారులు, చిందుయక్షగానం, ఒగ్గుడోలు, ఒగ్గుకథ, బైండ్లడప్పు, కొమ్ము కోయ నృత్యం, లంబాడి నృత్యం, గుస్సాడీ, కిన్నెరలు, హరికథ, బుర్రకథ, శారద కథలు తదితర ప్రదర్శలుంటాయి.

**నవతెలంగాణ: ఇతర కార్యక్రమాలు ఏమేమి ఉంటాయి..?**

**మామిడి హరికృష్ణ:** తెలుగు మహాసభల్లో ఐదు రోజుల్లో ప్రత్యేకంగా ఒకరోజు సినీ సంగీత విభావరి ఏర్పాటు చేశాం. రవీంద్రభారతిలోని మరో వేదికలో తెలుగు భాషా థీమ్‌తో ఫొటో ఎగ్జిబిషన్ ఉంటుంది. ఇంకో వేదికపై లఘు చిత్రాల ప్రదర్శలు ఉంటాయి. ఈ ఐదు రోజుల పాటు సాంస్కృతిక పండుగను నిర్వహిస్తాం.

## మహాసభల్లో భాషా, సాంస్కృతిక శాఖ పాత్ర..?



**మామిడి హరికృష్ణ:** తెలంగాణ సాంస్కృతిక వైభవం, తెలంగాణ సాహిత్యం, భాష యొక్క గొప్పతనాన్ని, సాంస్కృతిక కళారూపాల ద్వారా తెలిపే పండుగ ప్రపంచ తెలుగు మహాసభలు. ఐదు రోజుల పాటు జరిగే ఈ వేడుకల్లో ప్రధాన భూమిక మా శాఖ పోషించబోతున్నది.ఎల్‌బీస్టేడియంలో ప్రారంభం, ముగింపు వేడుకలు ప్రత్యేకంగా ఉండబోతున్నాయి. సాంప్రదాయ స్వాగత కార్యక్రమాలూ ఉంటాయి. కొన్ని వేల ఏండ్ల నుంచి వస్తున్న తెలంగాణ, తెలుగు ప్రస్తానాన్ని ఈ మహాసభల్లో కళారూపాల ద్వారా వివరిస్తాం. తెలంగాణ చరిత్ర, ఉద్యమాన్ని మహాసభల్లో ప్రపంచానికి తెలియజేస్తాం. తెలంగాణ సాహిత్య అకాడమీ ఈ మహాసభల నిర్వహణను చూస్తున్నది. మహాసభల నిర్వహణ కోసం ఇప్పటికే రూ.50కోట్లు ప్రభుత్వం కేటాయించింది.

## కళారూపాల్లో సాయుధపోరాటాన్ని ప్రదర్శిస్తున్నారా..?

**మామిడి హరికృష్ణ:** తెలంగాణ సాయుధ పోరాటం 40 ఏండ్ల చరిత్రనే. కానీ ఏండ్ల నాటి తెలంగాణ ఉద్యమ చరిత్రను ఇక్కడ ప్రదర్శించబోతున్నాం. తెలంగాణ చరిత్ర, ఉద్యమం అన్నీ కళారూపాల్లో ఉంటాయి. వీటికోసం ప్రత్యేకంగా రాయించినవీ ఉన్నాయి...చేయించినవీ ఉన్నాయి. ఈ కార్యక్రమాల్లో పాల్గొనే వారు ముందుగా రిజిస్ట్రేషన్ చేయించుకోవాలి. దాన్ని కమిటీ పరిశీలించి, ప్రదర్శనకు అవకాశం ఇస్తున్నది. మహాసభల్లో ఎక్కువ మంది కళాకారుల ప్రదర్శనలకు అవకాశమిచ్చి ఉత్సవ వాతావరణాన్ని కల్పిస్తాం.



# అణగారిన వర్గాల ఐక్యతే అంబేద్కర్‌కు అసలైన నివాళి

సి.శ్యామ్‌కుమార్ (శ్యామ్ కే ఉడ్)

> సమాజంలో మహిళలందరి కోసం ఆలోచించి పరిష్కారంగా హిందూ కోడ్ బిల్లు రూపొందించి, ఆ బిల్లు పార్లమెంట్‌లో పాస్ కాకపోతే కేంద్ర మంత్రి పదవిని త్యజించి నిరసన తెలియజేసి ఉద్యమం వైపునకు దిక్సూచిగా నిలిచాడు. 1932లో సైమన్ కమిషన్ ఆనాడు దళితులకు ప్రత్యేక నియోజకవర్గాలను ఏర్పాటు చేయడం కోసం నియమించబడింది. అప్పటి నాయకులు కొందరు ఈ కమిషన్‌ను తీవ్రంగా వ్యతిరేకించారు. స్వాతంత్ర్య పోరాటంలో ప్రముఖులుగా పేరొందిన వారు నిరాహార దీక్షలకు సైతం దిగారు. ఇలా సివిల్ వార్ సృష్టించి దళితుల్ని, అంబేద్కర్‌ను అంతం చేస్తారేమో అన్నంతగా భయాందోళనకు గురిచేసి తన పంతం నెగ్గించుకున్నారు. అంబేద్కర్ కొట్లాడి సాధించిన ప్రత్యేక నియోజకవర్గాలను దక్కకుండా చేశారు. అంతకుముందు రౌండ్ టేబుల్ సమావేశాలకు అంబేద్కన్‌ను 25శాతంగా ఉన్న దళితులకు ప్రతినిధిగా ఆహ్వానించడాన్ని జీర్ణించుకోలేని కొందరు నిరాహార దీక్ష పేరుతో దళితులపై తమ ముద్ర వేసే ప్రయత్నం చేశారు. సివిల్ వార్‌కి పరిష్కారంగా అంబేద్కర్ రిజర్వేషన్లను ముందుకు తీసుకొచ్చారని మనం గమనించాలి.

1949 నవంబర్ 26న బాబాసాహెబ్ డా॥బీమ్‌రావ్ రాంజీ అంబేద్కర్ రాసిన రాజ్యాంగం పార్లమెంట్‌లో ప్రవేశపెట్టి ఆమోదింపబడింది. 1956 డిసెంబర్ 6న ఆ వైతాళికుడు తాత్విక శిఖరం, ప్రపంచ మేధావి భౌతికంగా చనిపోయాడు. 1889 ఏప్రిల్ 14న రత్నగిరి జిల్లాలో బీమ్‌రావ్, రమాబాయి దంపతులకు జన్మించిన అంబేద్కర్ 65 ఏండ్లు మాత్రమే జీవించాడు. గాంధీజీ 78, నెహ్రూ 74, పటేల్ 75 ఏండ్లు జీవించి గాంధీ పరోక్షంగా, మిగతా వారు ప్రత్యక్షంగా అధికారం అనుభవించారు.

ఈసందర్భంగా రాజ్యాంగ రచనకు రెండు సంవత్సరాల 11 నెలల 18 రోజులు శ్రమించి మానసిక ఒత్తిడిని సామాజికంగా, సిద్ధాంతపరంగా ఒంటరితనాన్ని భరిస్తూ మేధస్సుతో రాజ్యాంగ రచన పూర్తి చేశారు అంబేద్కర్. అందరికీ ఓటు హక్కు కల్పించేందుకు సోకాల్డ్ మేధావులతో మొట్టమొదటి పోరాటం చేశాడు. అప్పటి ప్రపంచాన్ని పరికించి చూస్తే అమెరికా నల్లజాతివారికి ఓటు హక్కు లేదు. అమెరికాలో 1945 వరకు మహిళలకు ఓటు హక్కు లేదు. అయినా స్వాతంత్ర్య అనంతరం అందరికీ ఓటు హక్కు ఉండాలనే అంబేద్కర్ వాదనతో అప్పటి కాంగ్రెస్ నాయకులను తన విజన్‌తో ఒప్పించారు. 395 ఆర్టికల్స్ 8 షెడ్యూల్స్ 22 భాగాలతో రాజ్యాంగాన్ని స్వేచ్ఛా స్వాతంత్ర్య, సమానత్వం, లౌకిక ప్రజాస్వామ్యం పునాదులుగా నిర్మించి ఇచ్చారు. కానీ అప్పటి నుంచి ఇప్పటి వరకు రాజ్యాంగాన్ని ఏ స్ఫూర్తితో అమలు చేస్తున్నారు? అనే ప్రశ్నకు ఇప్పటి రాజకీయాలు, సామాజిక పరిస్థితులు జవాబుగా మిగిలి వెక్కిరింపుగా గోచరిస్తున్నాయి.

అంబేద్కర్ 6 డిసెంబర్ 1956న మరణించే నాటికి తన జీవితంలో అనేక సభలు, సమావేశాలలో తను నడిపిన పత్రికలు, రచించిన వ్యాసాలు, పుస్తకాల ద్వారా ఎంతో విలువైన సందేశాలు, సిద్ధాంతాలు చీకట్లో ఉండిపోయిన, ఉంచబడిన అనేక సత్యాలను వెలుగులోకి తీసుకొచ్చాడు. ఆ మహానుభావుడు సంపూర్ణ సమాజం కోసం సమసమాజ నిర్మాణం కోసం అహర్నిశలు శ్రమ పడి మేధస్సుతో పరిపూర్ణ పరిష్కారాలు ఈ దేశానికిస్తే ఎక్కువమంది అంబేద్కర్‌ను ఒకానొక సామాజిక సమూహానికి ఎందుకు అంటగడుతున్నారనేది అర్థం కాని ప్రశ్న. సమాజంలో మహిళలందరి కోసం ఆలోచించి పరిష్కారంగా హిందూ కోడ్ బిల్లు రూపొందించి, ఆ బిల్లు పార్లమెంట్‌లో పాస్ కాకపోతే కేంద్ర మంత్రి పదవిని త్యజించి నిరసన తెలియజేసి ఉద్యమం వైపునకు దిక్సూచిగా నిలిచాడు. 1932లో సైమన్ కమిషన్ ఆనాడు దళితులకు ప్రత్యేక నియోజకవర్గాలను ఏర్పాటు చేయడం కోసం నియమించబడింది. అప్పటి నాయకులు కొందరు ఈ కమిషన్‌ను తీవ్రంగా వ్యతిరేకించారు. స్వాతంత్ర్య పోరాటంలో ప్రముఖులుగా పేరొందిన వారు నిరాహార దీక్షలకు సైతం దిగారు. ఇలా సివిల్ వార్ సృష్టించి దళితుల్ని, అంబేద్కర్‌ను అంతం చేస్తారేమో అన్నంతగా భయాందోళనకు గురిచేసి తన పంతం నెగ్గించుకున్నారు. అంబేద్కర్ కొట్లాడి సాధించిన ప్రత్యేక నియోజకవర్గాలను దక్కకుండా చేశారు. అంతకుముందు రౌండ్ టేబుల్ సమావేశాలకు అంబేద్కన్‌ను 25శాతంగా ఉన్న దళితులకు ప్రతినిధిగా ఆహ్వానించడాన్ని జీర్ణించుకోలేని కొందరు నిరాహార దీక్ష పేరుతో దళితులపై తమ ముద్ర వేసే ప్రయత్నం చేశారు. సివిల్ వార్‌కి పరిష్కారంగా అంబేద్కర్ రిజర్వేషన్లను ముందుకు తీసుకొచ్చారని మనం గమనించాలి. ఆయుధాలు లేని బతుకులకు కావాల్సిన కనీస అవసరమైన కూడు, గుడ్డ, ఆవాసంతో పాటు అంటరానితనమనే అగాధంలో చావు, బతుకుల మధ్య పడి చచ్చి బతుకుతున్న తన జాతిని అప్పటికీ, ఇప్పటికీ కులపరంగా అల్ప సంఖ్యాకులైన ఆధిపత్య కులాల చేతిలో అంతం కాకూడదని రిజర్వేషన్లను అడ్డంపెట్టి చరిత్ర సృష్టించారు అంబేద్కర్. 1956లో రిజర్వేషన్లు ఉపయోగించుకొని ఆఫీసర్ స్థాయి ఉద్యోగాలు పొందిన వారి పద్ధతిని చూసి అంబేద్కర్ కన్నీటి పర్యంతమయ్యాడు. తాత్కాలిక ఉపశమనంగా ఆధిపత్య కులాన్ని విద్యా, ఉద్యోగాలతో ఎదుర్కోవాలని ఆశించిన అంబేద్కర్ మాకు మంచి మంచి ప్రమోషన్లు, మంచి ప్రదేశాల్లోకి బదిలీ కావాలని లాబియింగ్‌తో వెంపర్లాడుతున్న దళిత జాతి ఆఫీసర్లను చూసి ఏడ్చాడు. "పే బ్యాక్ టు ది సొసైటీ" అనే సూత్రాన్ని చెప్పాడు.

సివిల్ వార్ నివారణకు తన జాతి మనుగడకు ప్రతిపాదించిన రిజర్వేషన్లను ఈనాటికీ దళితులు అవి మాత్రమే పూర్తి పరిష్కార మార్గంగా, సామాజిక ముక్తి మార్గంగా ఎంచుకోవడం అభ్యుదయవాదులు జీర్ణించుకోలేని అంశం. ఎందుకంటే దేశ జాతీయ సంపదలో ప్రభుత్వ ఉద్యోగుల సంపద 2శాతం. ఈ రెండు శాతంలో 15శాతం అంటే దేశ సంపదలో 0.3శాతం ఎస్సీలకు, 0.13శాతం ఎస్టీలకు దేశ సంపదలో వాటా కోసం నేడు పోరాటాలు చేస్తున్నారు. దేశ సంపదలో 98శాతం పెత్తందారీ కులాల గుప్పిట్లో ఉన్నా జనాభా పరంగా అధికంగా ఉన్న ఎస్సీ, ఎస్టీలు వ్యవసాయ భూమి, పరిశ్రమ, ఖనిజ వనరుల ఎగుమతి, దిగుమతులు, వాణిజ్యం, ప్రభుత్వ కాంట్రాక్ట్ లైసెన్స్‌డ్ సప్లై, వ్యాపారం, ప్రైవేటు సెక్టార్, డిఫెన్స్, న్యాయస్థానాలు, సైన్స్ అండ్ టెక్నాలజి, ఓడరేవు, ఆయిల్ (చమురు క్షేత్రాలు) గ్యాస్ ఫీల్డ్, నౌక నిర్మాణం, ఔషధ తయారీ, టెలిఫోన్, సెల్‌ఫోన్ టెలివిజన్, కెమికల్, విద్యుత్ స్పెషల్ ఎకానామిక్ జోన్స్, సిమెంట్ ఫిల్మ్, స్కూల్స్, ఇంజనీరింగ్, మెడికల్, వస్త్ర, కేబుల్, పౌల్ట్రీ, పాడి అడవులు, పట్టు, పత్రికా, చేపలు, కుటీర, బ్యాంకింగ్ ఇలాంటి 99శాతం రంగాల్లో ప్రవేశం దొరకని నేటి దళితులు ఇంకా తాత్కాలిక ఉపశమనంగా ముందుకొచ్చిన రిజర్వేషన్ల కోసం కొట్లాడుతూనే ఉన్నారు. మరోపక్కన సామాజిక పోరాటాల్లో వస్తున్న మార్పులను తమ పోరాటాలకు ఉపయోగించుకోలేక పోతున్నారు. ఆ రోజు ఎస్సీ ప్రత్యేక నియోజకవర్గాలకు వ్యతిరేకంగా దీక్షకు దిగడంతో అంబేద్కర్ డిఫెన్స్‌లో పడిపోరాడు. ఆ రోజు దళితుల పరిస్థితులు అలాంటివే కానీ ఈ రోజు అన్ని రకాలుగా పోరాటాల్లో ఎత్తులకు పై ఎత్తుల్లో ముందుండాల్సిన దళితులు, బీసీలను ఆధిపత్య వాదులు తొక్కిపట్టగలిగారంటే పైన చెప్పిన ఆదాయ రంగాల్లో దళితులు, గిరిజనులు, బీసీలు, మైనార్టీలు కనీసంగా ఎంట్రీకి నోచుకోకపోవడమే. ముఖ్యంగా అణగారిన వర్గాల్లో ఐక్యత లోపించడంతోనే ఇలాంటి పరిణామాలు ఎదుర్కోవాల్సిన పరిస్థితి ఏర్పడింది. 62వ అంబేద్కర్ వర్ధంతిని పురస్కరించుకొని బడుగు, బలహీన వర్గాలూ, సామాజిక, అభ్యుదయ వాదులు ఐక్యత సాధించి ప్రత్యేక ఉద్యమం నిర్మించకపోతే ఈనాటి ధన ప్రవాహపు ఎన్నికల్లో కొట్టుకుపోవడంతో పాటు ఉనికి కోల్పోయి, మరో కోణంలో ఆర్థిక అంటరానితనానికి గురికావాల్సి వస్తుంది.

**సెల్ : 9440445441**

---

# దళితుల దరిచేరని సంక్షేమం

వనం నాగయ్య

దళితులకు ఎంతో చేస్తున్నామంటూ ఆర్భాటపు ప్రచారాలు చేస్తున్న తెలంగాణ సర్కారు ఆచరణలో మాత్రం వారికి సంక్షేమం మాటే తెలియకుండా చేస్తున్నది. 'గత ప్రభుత్వాలు దళితులకేం చేశాయ్.. నిరుద్యోగ యువతకు రూ.లక్ష రుణానికి కేవలం 10శాతం సబ్సిడీ ఇస్తే సరిపోతుందా? అందుకే దళితుల అభివృద్ధి జరగలేదు. ఇకనుండి వారి సంక్షేమం కోసం ప్రత్యేక కార్యాచరణ రూపొందించాం. రూ.లక్ష రుణానికి బ్యాంకుతో సంబంధం లేకుండా ఏకండా 80శాతం సబ్సిడీ ఇస్తాం.. రానున్న కాలంలో దళితులు తలెత్తుకుని జీవించేలా అర్హత ఉన్న ప్రతి దళిత కుటుంబానికీ ప్రభుత్వమే డబుల్‌బెడ్‌రూం ఇల్లు కట్టిస్తుంది. అసలు భూమిలేని వారికి కుటుంబానికి మూడెకరాల భూమిని కొనుగోలు చేసిస్తాం. ఎంత ఖర్చైనా వెనుకాడం..' ఇదీ బడ్జెట్ ప్రసంగంలో సీఎం కేసీఆర్ ఆవేశంగా పలికిన మాటలు. ఈ మాటలు చెప్పి మూడేండ్లు దాటింది. కానీ కార్యాచరణ మాత్రం గడపదాటలేదు. ఖమ్మం, భద్రాద్రి జిల్లాల్లో అత్యంత పేదరికంలో బతుకీడుస్తున్న దళితులకు సర్కారు చెప్పిన సంక్షేమం మచ్చుకైనా కనిపించలేదు.

### 18వేల మంది దరఖాస్తులు-ఒక్కరికీ దక్కని రుణం

భారీ సబ్సిడీ మాటలు నమ్మిన నిరుపేద దళితులు మూడేండ్ల క్రితం ఎస్సీ కార్పొరేషన్ రుణాల కోసం దరఖాస్తులు చేసుకున్నారు. 21మండలాల్లో 18వేల మంది దరఖాస్తులు చేసుకుంటే వారిలో 1,325మందిని మాత్రమే అర్హులంటూ లాటరీ ద్వారా ఎంపిక చేశారు. ఇది జరిగి మూడేండ్లు కావస్తున్నా నేటికీ ఒక్కరంటే ఒక్కరికీ గ్రౌండింగ్‌కాలేదు. తొలుత బ్యాంకులతో సంబంధం లేదన్న ప్రభుత్వం లబ్దిదారుల ఎంపిక తరువాత బ్యాంకులనుండి అంగీకారం తెచ్చుకోవాలన్నారు. కాగా బ్యాంకులు మాత్రం కాన్సెంట్ ఇవ్వాలంటే లక్షకు రూ.20వేలు డిపాజిట్ చేయాలంటున్నారు. దీంతో ప్రభుత్వం చెప్పిన సబ్సిడీ రుణాలు కలగానే మారాయి. కొందరు తిప్పలు పడి కాన్సెంట్ తెచ్చుకున్నా వారికి జీఎస్టీ పన్ను పేరిట 18నుండి 28శాతం వరకూ పన్ను విధించి నిరుద్యోగులకు టోకరా వేస్తున్నారు. కార్పొరేషన్ రుణాల్లో దళారులు ప్రవేశించి లక్షకు రూ.10వేలు అడుగుతున్నారు. ఇలా జీఎస్టీ, దళారుల ప్రమేయంతో కొనుగోలు చేసిన సరుకు సరిపోకపోవడం వల్ల లబ్దిదారులకు ఇబ్బందిగా మారింది.

### అందనంత దూరంలో మూడెకాల భూ పంపిణీ




సమస్యలు పరిష్కరించాలని ఆందోళన చేస్తున్న కేవీపీఎస్ నాయకులు

అర్హులైన దళితులు ప్రతి కుటుంబానికీ మూడెకరాల పంపిణీ చేసి తీరతామన్నారు. అనంతరం పథకం మూలకు నెట్టారు. జిల్లాలోని 21 మండలాల్లో సుమారు 37వేల మంది అసలు భూమిలేని దళితులున్నారు. వీరిలో పంపిణీ చేయాల్సిన మూడెకరాలు కేవలం ఏడు మండలాల్లోనే నామమాత్రంగా 99 మందికి పంపిణీ చేశారు. ముఖ్యంగా కూసుమంచి మండలం నర్సింహులగూడెం గ్రామంలో, ముదిగొండ మండలం అమ్మపేట, ఎడవల్లి, తిరుమలాయపాలెం మండలం కొక్కిరేణిగ్రామం, రఘునాథపాలెం మండలం ఈర్లపూడి గ్రామం, కొణిజర్ల మండలం గుబ్బగుర్తి గ్రామం, వైరా మండలం



రహదారి పక్కన దహనం చేస్తున్న దళితులు

వల్లాపురం గ్రామం, చింతకాని మండలం చింతకాని గ్రామాల్లోనే కేవలం 99మందికి మాత్రమే 263 ఎకరాలు మాత్రమే పంపిణీ చేశారు. కూసుమంచి మండలం నేలపట్ల గ్రామంలో సర్కారు నిర్లక్ష్యంతో రైతులు ఐదెకరాలు దళితులకు ఇచ్చినట్టే ఇచ్చి గిట్టుబాటు ధర దక్కలేదన్న కారణంతో మళ్లీ వెనక్కు తీసుకున్నారు.

### శ్మశాన వాటిక లేదూ-డబుల్ బెడ్‌రూం ఇల్లులేదు

1235జీవో ప్రకారం ప్రతి గ్రామంలో దళితవాడకు కనీసం రెండెకరాల భూమి కేటాయించాల్సిన బాధ్యత ప్రభుత్వంపై ఉంది. కానీ ఆ దిశగా చర్యలు తీసుకున్న దాఖలాల్లేవు. జిల్లాలో 425 గ్రామాలుండగా అందులో 350 గ్రామాల్లో శ్మశానం లేక రోడ్డుపక్క, చెరువు కట్టల పక్కన, కాల్వ కట్టల పక్కన మృతదేహాలను ఖననం చేయాల్సిన దుస్థితి నెలకొంది. డబుల్ బెడ్‌రూం ఇండ్ల పేరుచెప్పి కాలయాపన చేస్తున్నారే తప్ప దళితులకు అందిన దాఖలాల్లేవు. జిల్లా వ్యాప్తంగా అసలు ఇల్లులేని దళితులు కనీసం17వేల మందికి పైగా ఉన్నారు. వీరిలో మంత్రి తుమ్మల దత్తత గ్రామంలో తప్ప మిగతా 4 నియోజకవర్గాల్లో ఎక్కడా డబుల్ బెడ్‌రూం ఇండ్లు అందజేసిన దాఖలాల్లేవు. దళితవాడలు వీధిలైట్లు, డ్రైనేజీలు, అంతర్గత రహదారులు, పారిశుధ్యం లేక దళితులు కారుచీకట్లో జీవిస్తున్నారు. ఎక్కడా సరైన రహదారులు లేవు.

### వేళ్లూనుకున్న కులవివక్ష...

జీవో నెంబర్ 105, 128ల ప్రకారం పౌరహక్కుల దినాన్ని పాటించాల్సిన అవసరం ఉన్నా అధికారులు ఆ దిశగా ఏ ఒక్క గ్రామంలోనూ దళితులను చైతన్యపరిచిన దాఖలాల్లేవు. కూసుమంచి, తిరుమాలాయపాలెం మండలాల్లో దళిత, గిరిజన ప్రజాప్రతినిధులపై యధేచ్ఛగా కులవివక్ష కొనసాగుతోంది. కూసుమంచిలో బోనాల సందర్భంగా దళిత ఉపసర్పంచ్ గోపి వెంకన్నను బోనాలు ప్రారంభించే సమయంలో తీవ్రమైన అవమానానికి గురిచేశారు. తిరుమలాయపాలెం మండలం దమ్మాయిగూడెం గ్రామంలో గిరిజన సర్పంచ్ బానోత్ జ్యోతిని జాతీయ జెండా సాక్షిగా అవమానించారు. అక్కడ అగ్రకులానికి చెందిన ఉపసర్పంచ్ జ్యోతి ఆవిష్కరించాల్సిన జాతీయజెండాను వీఆర్వో చేత ఆవిష్కరించి వివాదాన్ని లేవనెత్తడమేకాక, తీవ్రంగా అవమానించారు. దీనిపై సర్పంచ్ జ్యోతి కన్నీటి పర్యంతమయ్యారు. సదరు ఉపసర్పంచ్‌పై చర్యలు తీసుకోవాలని మానవహక్కుల కమిషన్, ఎస్సీ, ఎస్టీ కమిషన్, జిల్లా ఎస్పీ, కలెక్టర్, డీఎస్పీ తదితరులకు పలువిధాలుగా ఫిర్యాదులు, ఆందోళనలు చేపట్టినా బాధితురాలికి ఏమాత్రం న్యాయం దక్కకుండా చేశారు. ఖమ్మం రూరల్ మండలం దారేడు గ్రామ దళిత సర్పంచ్ సీతారాములు తన సిబ్బందిలో సైడ్ కాల్వలు తీస్తుండగా అదే గ్రామానికి చెందిన అగ్రకులస్తుడు, కులం పేరుతో తిట్టి, అవమానించాడు. ఈఘటనలో కేసులుపెట్టి, ఆందోళన చేసినా పోలీసులు కనీసం కేసు కూడా నమోదుచేయడానికి ముందుకు రాలేదు.

**సెల్ : 9490099343**

#### ఎస్సీకార్పొరేషన్ రుణాలివ్వాలి

ఎస్సీ నిరుద్యోగులకు ప్రభుత్వం 80శాతం సబ్సిడీ ఇస్తానని మాటలు చెప్పి మాయచేసింది. మూడేండ్లుదాటినా నేటికీ ఒక్కరంటే ఒక్కరికి కూడా రుణాలు ఇవ్వలేదు. జిల్లాలోని ఇండ్లులేని నిరుపేదలకు డబుల్ బెడ్‌రూం ఇండ్లు ఇచ్చిన దాఖల్లాలేవు. మూడెకరాల మాటలేదు. ఇలా అన్నింటా సర్కారు దళితులను మోసం చేసింది. ప్రభుత్వం చేస్తున్న నిర్లక్ష్యం కారణంగా ఉపాధి కల్పన కలగానే మిగిలింది. ఇకనైనా ప్రభుత్వం స్పందించి రుణాలివ్వాలి.

**నందిపాటి మనోహర్, కేవీపీఎస్ జిల్లాకార్యదర్శి**

---

# అరిష్టం ముసుగులో అంటరానితం

## ఊరిమధ్యలో డబుల్‌బెడ్ రూం ఇండ్ల నిర్మాణానికి ససేమిరా

బోల లక్ష్మణ్

భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించి 70 ఏండ్లు అవుతున్నా, ఇప్పటికీ మనిషిని మనిషిగా గౌరవించే సంస్కృతికి అలవాటు పడకపోగా.. కులం పేరిట వివక్ష చూపే దుస్థితి కొనసాగడం శోచనీయం. జయశంకర్ భూపాలపల్లి జిల్లా వెంకటాపూర్ మండలంలోని పాలంపేటలో దళితులకు డబుల్ బెడ్‌రూం ఇండ్లు ఊరి మధ్యలో నిర్మించేందుకు వీల్లేదని సదరు గ్రామ పెత్తందారులు నిర్ణయించారు. అందుకు గ్రామ పంచాయతీ వత్తాసు పలికింది. దళితులు బొడ్రాయికి ఎగువన ఉంటే అరిష్టం కలుగుతుందని నమ్మబలుకుతూ.. వారిని ఊరి నుంచి మళ్లీ వెలివాడలోకి పంపే ప్రయత్నం జరిగింది. దళితులు ఐక్యంగా కదలడంతో మళ్లీ యథావిధిగా తొలుత కేటాయించిన స్థలంలోనే డబుల్‌బెడ్‌రూం ఇండ్ల నిర్మాణానికి అంగీకారం తెలిపారు. ఏదేమైనా ఇప్పటికీ కుల వివక్ష చూపించడం సిగ్గుచేటు.

పాలంపేటలో 2,500 జనాభా ఉంది. అందులో 200 దళిత కుటుంబాలు జీవిస్తున్నాయి. అయితే వీరికి ఏండ్లుగా పక్కా ఇండ్లు లేక పూరిగుడిసెల్లోనే మగ్గుతున్నారు. చుక్కతెగిపడ్డట్లు వచ్చిన డబుల్‌బెడ్ రూం ఇండ్ల జాబితాలో ఆ గ్రామంలోని పలువురు నిరుపేద దళిత, గిరిజనులకు అవకాశం దక్కింది. గ్రామానికి 45 డబుల్‌బెడ్ ఇండ్లు మంజూరయ్యాయి. అందులో 35 మంది దళితులు, ఆరుగురు గిరిజనులు, ముగ్గురు బీసీలు ఉన్నారు. ఈ ఇండ్ల నిర్మాణం కోసం మూడు నెలల కింద పాలంపేట గ్రామంలోని ఐబీ గెస్ట్‌హౌస్ వద్ద గల ఖాళీ స్థలాన్ని పరిశీలించారు. రెవెన్యూ అధికారులు సర్వే చేసి 3 ఎకరాల భూమి అందు బాటులో ఉందని చెప్పారు. ఆ స్థలం గతంలో రాళ్ల రప్పలతో నిండిపోయి ఉండేది. దీంతో లబ్దిదారులు ఆ స్థలాన్ని సొంత ఖర్చుతో చదును చేసుకున్నారు. కొంతమంది గ్రామ పెత్తందార్లు ఇది జీర్ణించుకోలేక పోయారు.




దళితులకు డబుల్ బెడ్ రూం ఇండ్ల కోసం కేటాయించిన భూమికి మండల రెవెన్యూ అధికారుల సమక్షంలో భూమి పూజ నిర్వహించారు. దాన్ని ములుగు సబ్‌కలెక్టర్ వీపీ గౌతమ్, కలెక్టర్ మురళి సైతం పరిశీలించారు. దీంతో సదరు డబుల్‌బెడ్ రూం ఇండ్ల లబ్దిదారులు స్థలాన్ని చదును చేసుకున్నారు. అందుకోసం రూ.లక్షా 70వేలు ఖర్చు చేశారు. దళితులకు ప్రధాన రహదారి సమీపంలో స్థలం కేటాయించడం కంటగింపుగా మారడంతో ఆ స్థలం గ్రామ కంఠం భూమిగా తేల్చారు. ఇదంతా అయిపోయిన వెంటనే, ఆ స్థలంలో రామాలయం నిర్మించాలని ఆలోచన ఆ ఊరి పెత్తందారుల్లో కలిగింది. దళితులు గ్రామ నడిబొడ్డున ఉండటం గిట్టకే అలా చేశారని పాలంపేట గ్రామానికి చెందిన దళిత యువకుడు పుల్యాల రమేష్ ఆవేదన వ్యక్తం చేశారు. ఇదీ స్థానికంగా ఉన్న ఇతర కులాల అక్కసుకు నిదర్శనంగా చెప్పుకోవచ్చు.

### వెలివాడకు పంపేందుకే 'అరిష్టం' నాటకం



పాలంపేటలోని ఇండ్ల లబ్దిదారులు(ఎస్సీలు)

దళితులను వెలివాడలోనే ఉంచాలనే సంకుచిత భావంతో పాలంపేట గ్రామానికి చెందిన కొంతమంది పెత్తందార్లు ఇలా వ్యవహరించారు. దానికి గ్రామ పంచాయతీ వత్తాసు పలికింది. దళితులకు ఇచ్చే స్థలంలో రామాయలం నిర్మించాలని తీర్మానించింది. ఇలా చెబితే దళితుల నుంచి తిరుగుబాటు వచ్చే అవకాశం ఉందని, దళితులకు కేటాయించిన ఇండ్లకు దిగువన బొడ్రాయి ఉందని, ఎగువన ఇండ్ల నిర్మాణం చేపట్టడం అరిష్టమని ప్రచారం చేశారు. దాంతో కొంతమంది దళితులు సైతం ఆందోళనకు గురయ్యారు. వివక్షకు భక్తి రంగుపులిమే ప్రయత్నం దండిగానే జరిగింది. అయితే గ్రామం మధ్యలో నిర్మాణాలు చేసుకోవద్దనే కుట్ర దాగి ఉందని దళితులకు అర్థమైపోయింది. దీనిపై కలెక్టర్ మురళికి బాధితులు ఫిర్యాదు చేయడంతో విచారణకు ఆదేశించారు. మీడియాలో చర్చనీయాంశంగా మారడంతో వరంగల్ సీనియర్ సివిల్ జడ్జీ అనిరోస్ క్రిష్టియన్ పాలంపేట గ్రామాన్ని సందర్శించారు. గ్రామస్తులతో సమావేశమై వివక్ష చూపించడం చట్ట రీత్యా నేరమని, శాంతియుతంగా సమస్య పరిష్కరించుకోవాలని హితబోధ చేశారు. దీంతోపాటు దళిత సంఘాలు, సామాజిక శక్తులు సైతం దళితులకు మద్దతుగా గళం విప్పాయి. ఫలితంగా దళితులు కోరుకున్న స్థలంలోనే డబుల్‌బెడ్ రూం ఇండ్ల నిర్మాణం చేపట్టేందుకు నిర్ణయం తీసుకున్నారు. అంతిమంగా వివక్షను దళితులు ఐక్యంగా ఎదుర్కోవడం అభినందనీయం. అదే సమయంలో నేటికీ ఇంకా కుల వివక్ష కొనసాగించడం శోచనీయం. అది జాతి చైతన్యానికి అవరోధం వంటిదనే ఆలోచన ప్రతి ఒక్కరిలో రేకెత్తాలి. అందుకు కారణమైన పెత్తందారీతనం పోకడలు పూర్తిగా అంతమయ్యే వరకు సామాజిక పోరాటాలు కొనసాగించాల్సిందే.

**సెల్ :9494617640**

#### ఊరి మధ్యలో ఉంటే అరిష్టమన్నారు



ఊరి మధ్యలో దళితులు ఉంటే అరిష్టమన్నారు. మాకు ఎన్నో ఏండ్ల తర్వాత ఇండ్లు ఇస్తున్నరు. ఇప్పుడు గ్రామానికి చెందిన కొంతమంది ఇతర కులాలోల్లు మా ఇండ్లు ఊరి మధ్యలో ఉండేందుకు ఇష్ట పడతలేరు.

**మాట్ల సరోజన (పాలంపేట)**

#### ఇంకా వివక్ష చూపడం దారుణం



నేను పీజీ చదివినా. మేం ఇతర కులాల ఇంటికి వెళ్తే నిలబడే మాట్లాడాలే. ఇంకా వివక్ష చూపడం దారుణం. ఈ వివక్షను ఐక్యంగా ఎదుర్కొంటున్నం.

**చాలిగంటి శ్రీకాంత్(పీజీ విద్యార్థి)**

#### గ్రామ సభ తీర్మానం లేకనే సమస్య

దళితులకు మొదట కేటాయించిన ఐబీ గెస్ట్‌హౌస్ స్థలంలోనే డబుల్‌బెడ్ రూం ఇండ్లను నిర్మించేందుకు అభ్యంతరాలు తొలిగిపో యాయి. గ్రామసభ తీర్మానం లేకుండా అక్కడ పనులు ప్రారంభించడంతో ఇబ్బంది కలిగింది. ఇప్పుడు ఆ సమస్య లేదు. దళితులకు కేటాయించిన స్థలంలో యథావిధిగా ఇండ్ల నిర్మాణం చేపడతామని అధికారులు హామీనిచ్చారు.

**పోగుల శ్రీకాంత్, ఎస్ఐ, వెంకటాపూర్**



# రుత్వికకు టైటిల్

## ఇండియా ఇంటర్నేషనల్ చాలెంజర్

**ముంబయి :** బీడబ్ల్యూఎఫ్ ఇండియా ఇంటర్నేషనల్ చాలెంజర్ టోర్నమెంట్‌లో తెలుగమ్మాయి గద్దె శివాని టైటిల్ గెల్చుకుంది. ఫైనల్స్‌లో మరో భారత షట్లర్ రియా ముఖర్జీపై 21-12, 23-21తో విజయం సాధించింది. పరుషుల సింగిల్స్ ఫైనల్స్‌లో లక్ష్యసేన్ పోరాడి ఓడాడు. తాయ్‌లాండ్ ఆటగాడు తమ్మాసిన్ చేతిలో 15-21, 21-14, 21-19తో పరాజయం పాలయ్యాడు.



టీ10 లీగ్ విశేషాలను మీడియాతో పంచుకోవటానికి ఏర్పాటు చేసిన సమావేశంలో రెజ్లింగ్ ఐకాన్ గ్రేట్ ఖాళి, హీరా గ్రూప్ సీఈఓ డా. నౌహీరా షేక్ తదితరులు.

# చిన్న ఫార్మాట్, భలే వినోదం

## యూఏఈలో 14 నుంచి టి10 లీగ్

**హైదరాబాద్ :** క్రికెట్ ప్రేమికులను అలరించటానికి టి10 క్రికెట్ లీగ్ (టీసీఎల్) రాబోతోంది. ఈ నెల 14 నుంచి 17వరకు యూఏఈలో జరగనున్నది. ఎమిరేట్స్ క్రికెట్ బోర్డు, టీటెన్ స్పోర్ట్స్ సంయుక్తంగా ఆరంభిస్తోన్న లీగ్‌లో భారత మాజీ ఓపెనర్ వీరెంద్ర సెహ్వాగ్ సహా పలువురు దిగ్గజ ఆటగాళ్లు సందడి చేయనున్నారు. షార్జా క్రికెట్ స్టేడియంలో జరగనున్న లీగ్‌లో ఆరు ఫ్రాంచైజీలు పాల్గొంటున్నాయి. కాగా హైదరాబాద్‌కు చెందిన హీరా గ్రూప్ టైటిల్ స్పాన్సర్‌గా వ్యవహరిస్తుండటం విశేషం.

# జర్మనీ X భారత్

## హాకీ ప్రపంచ లీగ్ ఫైనల్

**భువనేశ్వర్ :** హాకీ ప్రపంచ లీగ్ ఫైనల్‌లో భారత్ ఆడిన రెండు పూల్ పోరుల్లో ఒకటి డ్రా చేసుకోగా, మరో మ్యాచ్‌లో ఓడింది. నేడు తుది లీగ్ మ్యాచ్‌లో జర్మనీతో తలపడనున్నది. పూల్‌లో మెరుగైన స్థానం దక్కాలంటే జర్మనీపై భారత్ గెలిచి తీరాలి. శనివారం ఇంగ్లాండ్‌తో మ్యాచులో చేజేతులా ఓడిన భారత్ నేటి పోరులో తప్పిదాలకు తావివ్వకుండా పోరాడాలని చూస్తోంది. ఆదివారం జరిగిన హాకీ పోరుల్లో స్పెయిన్‌పై బెల్జియం 5-0తో గెలుపొందగా, నెదర్లాండ్ 3-3తో అర్జెంటీనాతో డ్రా చేసుకున్నది.

# పుణె పరాజయం

## చెన్నై చేతిలో 1-0తో ఓటమి ఐఎస్ఎల్

**పుణె :** సొంతగడ్డపై రెండో ఓటమి మూటగట్టుకున్నది. ఐఎస్-ఎల్ పోరులో చెన్నయన్ ఎఫ్‌సీ 1-0తో పుణె ఎఫ్‌సీని ఓడించింది. చెన్నై తరఫున ఏకైక గోల్ హెన్రిక్ సెరెనో 81వ నిమిషంలో సాధించాడు. సమఉజ్జీలైన ఇరు జట్లు హోరాహోరీగా తలపడటంతో గోల్స్ నమోదు కాకుండానే మ్యాచ్ ముగుస్తుందనుకున్నా.. సింగిల్ గోల్‌తో చెన్నై గెలుపొందింది. కేరళ బ్లాస్టర్స్, ముంబయి సిటీల మధ్య జరిగిన మరో మ్యాచ్ 1-1తో డ్రా అయింది.

# షాన్ మార్ష్ అజేయ సెంచరీ

## ఆసీస్ తొలి ఇన్నింగ్స్ 442/8 డిక్లేర్డ్

### యాషెస్ రెండో టెస్టు

**అడిలైడ్ :** ఇంగ్లాండ్‌తో యాషెస్ రెండో టెస్టులో కంగారూలు భారీ ఆధిక్యంలో కొనసాగుతున్నారు. తొలి రోజు నాల్గు వికెట్లు కోల్పోయి, ఓవర్‌నైట్ స్కోరు 209తో రెండో రోజు ఆట కొనసాగించింది ఆతిథ్య జట్టు. తొలి రోజు ఖవాజా, స్మిత్‌లు భారం మోయగా రెండో రోజు ఆ బాధ్యతను షాన్, టిమ్‌లు చేబూనారు. షాన్ మార్ష్ (126 నాటౌట్) శతకంతో అదరగొట్టగా ఆసీస్ స్కోరు బోర్డు జోరందుకున్నది. టిమ్ పైనే (57) హాఫ్ సెంచరీతో ఆకట్టుకున్నాడు. యాషెస్ చరిత్రలో తొలి సారి ఫ్లడ్ లైట్ల వెలుతురులో మొదలైన మ్యాచ్‌లో టాస్ గెల్చిన ఇంగ్లాండ్ కంగారూలకు బ్యాటింగ్ అప్పగించినా.. వికెట్ల వేటలో సత్తా చూపలేకపోయింది. పాట్ కమిన్స్ (44), టిమ్ పైనేల వికెట్లు కూల్చిన అరంగేట్ర పేసర్ ఓవర్టన్ ఇంగ్లాండ్ జట్టుకు కాస్త ఊరటనిచ్చాడు. ఎనిమిది వికెట్ల నష్టానికి 442 పరుగులు చేసిన ఆసీస్ ఇన్నింగ్స్ డిక్లేర్ చేసి ఇంగ్లాండ్‌ను బ్యాటింగ్‌కు ఆహ్వానించింది. ఓపెనర్ మార్క్ స్టోన్‌మన్ (18) ఎల్బీగా వెనుదిరగగా కుక్, జేమ్స్‌లు అజేయంగా కొనసాగుతున్నారు. రోజు ముగిసే సరికి వికెట్ నష్టానికి 29 పరుగులతో ఇంగ్లాండ్ తొలి ఇన్నింగ్స్ కొనసాగుతోంది.




రెండో రోజు కోహ్లి సేనదే ఆధిపత్యం. బ్యాటుతో, బంతితో తిరుగులేని ప్రదర్శన చేస్తోన్న టీమ్ ఇండియా ఫిరోజ్ షా కోట్లా మైదానంలో మ్యాచ్‌పై పట్టు బిగించింది. రికార్డుల వీరుడు కోహ్లి ఊహించినట్టుగానే లంకేయులపై ద్విశతక తాండవం చేశాడు. నాటకీయ పరిణామాల మధ్య 536 పరుగులతో తొలి ఇన్నింగ్స్ డిక్లేర్ చేసిన భారత్ లంకను బ్యాటింగ్‌కు వచ్చిన కాసేపట్లోనే దెబ్బకొట్టింది. అయితే తుది సెషన్‌లో కాస్త పుంజుకున్న శ్రీలంక, ఆట ముగిసే సమయానికి 405 పరుగుల వెనుకంజలో ఉన్నది. క్రీజులో కొనసాగుతోన్న మాథ్యూస్, చండిమాల్‌లు.. బ్యాటింగ్‌కు అనుకూలిస్తున్న పిచ్‌పై నేడు భారత బౌలర్లను ఏ మేరకు ఎదుర్కొంటారో చూడాలి.

# ద్విశతక సారథి

## ఆరో డబుల్ సెంచరీ చేసిన విరాట్ కోహ్లి

**అర్థ శతకంతో ఆకట్టుకున్న రోహిత్ శర్మ**

**భారత్ తొలి ఇన్నింగ్స్ 536/7 డిక్లేర్డ్**

**రెండో రోజు ఆట ముగిసే సమయానికి శ్రీలంక 131/3**

**భారీ ఆధిక్యంలో కొనసాగుతోన్న టీమ్ ఇండియా**

ఉదయం 9.30 నుంచి స్టార్‌స్పోర్ట్స్‌లో ప్రసారం

**నవతెలంగాణ-న్యూఢిల్లీ**

ఫిరోజ్ షా కోట్లా మైదానంలో రెండో రోజూ భారత్‌దే పైచేయి. సిరీస్ విజయంపై కన్నేసిన కోహ్లి సేన తొలి రోజు గెలుపునకు పునాది వేయగా రెండో రోజు అదే దూకుడు కొనసాగించింది. శ్రీలంకతో టెస్టు సిరీస్‌లో రికార్డులు నెలకొల్పటమే పనిగా పెట్టుకున్న భారత సేనాని, తుది టెస్టులో మరో డబుల్ సెంచరీతో చెలరేగాడు. విరాట్ కోహ్లి (243, 287 బంతుల్లో 25 ఫోర్లు) ద్విశతక దూకుడుకు రోహిత్ శర్మ (65, 102 బంతుల్లో 7 ఫోర్లు, 2 సిక్స్‌లు) అర్థ శత కంతో అండగా నిలిచాడు. నాటకీయ పరిణామాలతో ఇన్నింగ్స్ డిక్లేర్ చేసింది టీమ్ ఇండియా. తొలి ఇన్నింగ్స్ తొలి బంతికే శ్రీలంక ఓపెనర్ దిముత్ కరుణరత్నెను బోల్తా కొట్టించిన పేసర్ మహమ్మద్ షమి లంకేయులకు భారత బౌలింగ్ సత్తాను మరోసారి రుచి చూపాడు. రెండో రోజు ఆటముగిసే సమయానికి మూడు వికెట్ల నష్టానికి 131 పరుగులు చేసింది శ్రీలంక జట్టు. సీనియర్ బ్యాట్స్‌మన్ ఎంజెలో మాథ్యూస్, లంక సారథి దినేశ్ చండిమాల్ నేటి ఆట కొనసాగించనుండటం లంకకు ఊరటనిచ్చే అంశం. నేడు బంతితో సమరం చేయనున్న భారత్.. తొలి ఇన్నింగ్స్‌లో లంకను స్వల్ప స్కోరుకే పరిమితం చేయాలన్న సంకల్పంతో ఉన్నది.

**కోహ్లి అ'ద్వితీయ' ద్విశతకం :** జామ్తాలో డబుల్ సెంచరీతో లంకేయుల పతనాన్ని శాసించిన కోహ్లి, కోట్లాలో వరుసగా రెండో ద్విశతకం అందుకు న్నాడు. కోహ్లి, రోహిత్‌లు క్రీజులో నిలువగా, ఓవర్‌నైట్ స్కోరు 371 పరుగులతో రెండో రోజు బ్యాటింగ్ కొనసాగించింది భారత్. తొలి పది ఓవర్లలో 21 పరుగులే పిండుకున్న కోహ్లి, ఆపై రోహిత్ శర్మ అండతో రెచ్చిపోయాడు. చూడచక్కని షాట్లు కొడుతూ డబుల్ సెంచరీ దిశగా దూసుకెళ్లాడు. అంది వచ్చిన ఏ అవకాశాన్ని వదల్లేదు. అద్వితీయ బ్యాటింగ్ శైలితో అలరించిన పరుగుల యంత్రం 238 పరుగుల్లో డబుల్ సెంచరీ మార్కు ముద్దాడాడు. 113వ ఓవర్ దిల్‌రువన్ వేసిన చివరి బంతిని సిక్సర్‌గా మలచిన హిట్‌మ్యాన్ రోహిత్ శర్మ అర్థ సెంచరీ పూర్తి చేసుకున్నాడు. మరి కాసేపు లంక బౌలర్ల సహనాన్ని పరీక్షించిన రోహిత్ లంచ్ బ్రేక్‌కు ముందే సందకన్ బౌలింగ్‌లో డిక్‌వెల్లాకు క్యాచ్ ఇచ్చాడు. భారత్ రివ్యూ కోరినా ఫలితం లంకేయులకు అనుకూలంగా వచ్చింది. వ్యక్తిగత స్కోరు 65 పరుగుల వద్ద రోహిత్ క్రీజును వదిలాడు. అయితేనేం కోహ్లికి ఓ ఎండ్‌లో సపోర్టు ఉంటే చాలు తన పని తనదే! ఏడో స్థానంలో బ్యాటింగ్‌కు దిగిన స్పిన్నర్ అశ్విన్ తోడుగా కోహ్లి లంక బౌలర్ల భరతం పట్టాడు. 121 ఓవర్ గమగె వేసిన తొలి బంతిని బౌండరీ దాటించి టెస్టు కెరీర్లో అత్యధిక వ్యక్తిగత స్కోరు అందుకున్నాడు. అయితే ఎండ్‌లో అండగా ఉంటాడనుకున్న అశ్విన్ గమగె బౌలింగ్‌లో పెరీరా చేతిలో క్యాచ్ ఔటయ్యాడు. రంగంలోకి దిగిన వికెట్ కీపర్ వృద్ధిమాన్ సాహా కోహ్లికి జత కలిశాడు. ఈ ఇద్దరూ వికెట్ కాపాడుకుంటూనే సింగిల్స్‌తో స్కోరు బోర్డును కదిలించే ప్రయత్నం చేశారు. తొలి రోజు మురళీ విజయ్ వికెట్ తీసుకున్న లెఫ్టార్మ్ స్పిన్నర్ లక్షన్ సందకన్‌కే ఆదివారం కోహ్లి వికెట్ దక్కింది. అప్పటికే లంక బౌలర్లు వాతావరణం సరిగాలేదని ఆటకు అంతరాయం కలిగిస్తుండటంతో సహనం కోల్పోయిన కోహ్లి సందకన్ వేసిన బంతిని అంచనా వేయటంలో పొరబడ్డాడు. రివ్యూలో సైతం కోహ్లి అవుట్ అని తేలటంతో త్రిశతకం చేస్తాడనుకున్న రన్ మెషీన్ నిరాశగా మైదానం వీడాడు. అప్పటికి టీమ్ ఇండియా స్కోరు 523 పరుగులు. జడేజా (5 నాటౌట్), సాహా (9 నాటౌట్) అజేయంగా క్రీజులో కొనసాగుతుండగా 536 పరుగుల వద్ద భారత్ తొలి ఇన్నింగ్స్ డిక్లేర్ చేసింది.

**లంకకు ఆదిలోనే దెబ్బ:** భారీ పరుగుల ఛేదనలో బరిలోకి దిగిన దినేశ్ చండిమాల్ సైన్యానికి ఆదిలోనే చుక్కెదురు. ఓపెనర్ దిముత్ కరుణరత్నెను పేసర్ షమి తొలి బంతికే బలిగొన్నాడు. సాహా పట్టిన అద్భుతమైన క్యాచ్‌తో కరుణరత్నె డకౌట్‌గా పెవీలియన్ బాటపట్టాడు. మరో ఓపెనర్ దిల్‌రువన్ పెరీరా క్రీజులో కుదురు కుంటుండగా వన్ డౌన్‌లో వచ్చిన ధనంజయ డిసిల్వ ఇషాంత్ బౌలింగ్‌లో ఎల్‌బిడబ్ల్యూగా వెనుదిరిగాడు. సీనియర్ ఆటగాడు మాథ్యూస్ జతగా పెరీరా కాసేపు క్రీజులో నిలిచాడు. క్రమంగా బలపడుతోన్న ఈ జోడీని జడేజా విడదీశాడు. పెరీరా (42, 54 బంతుల్లో 9 ఫోర్లు) ఎల్‌బీడబ్ల్యూ కాగా క్రీజులోకొచ్చిన లంక కెప్టెన్ దినేశ్ చండిమాల్ మాథ్యూస్‌కు సహకారం అందించాడు. చండిమాల్ సహకారంతో అర్థ సెంచరీ మార్కు దాటాడు మాథ్యూస్. వెలుతురు సరిగా లేని కారణంగా ఆటను ముగిస్తున్నట్టు అంపైర్లు ప్రకటించారు. రెండోరోజు ఆట ముగిసే సమయానికి ఎంజెలో మాథ్యూస్ (57 బ్యాటింగ్), దినేశ్ చండిమాల్ (25 బ్యాటింగ్) అజేయంగా నిలిచారు.






## బాబోయ్ కాలుష్యం

దేశరాజధాని ఢిల్లీలో భారత్, శ్రీలంకల సిరీస్ మూడో టెస్టు రెండో రోజు ఆటకు కాలుష్యం ఆటంకం కలిగించింది. క్రికెట్ మైదానంలో ఎన్నడూ లేనిది కాలుష్యం కారణంగా మ్యాచ్ నిలిపి వేసే పరిస్థితి నెలకొన్నది. లంచ్ తర్వాత లంక బౌలర్లు శ్వాస సమస్యతో ఇబ్బంది పడటంతో మ్యాచ్‌కు అంతరాయం కలిగింది. దీంతో అంపైర్లు కలుగజేసుకుని మ్యాచ్ కాసేపు నిలిపి, ఆటగాళ్లకు మాస్కులు పంపిణీ చేశారు. ఆపై ఆటను కొనసాగించిన లంకేయులు తాము ఈ పరిస్థితిలో ఆడలేకపోతున్నామని పలుమార్లు ఆటకు అంతరాయం కల్గించటంతో ఆగ్రహించిన కోహ్లి, డ్రెస్సింగ్ రూం నుంచే ఇన్నింగ్స్ డిక్లేర్ చేస్తున్నట్టు ప్రకటించాడు.

**భారత్ తొలి ఇన్నింగ్స్ :** మురళీ విజయ్ (స్ట) నిరోశన్ డిక్‌వెల్లా (బి) లక్షన్ సందకన్ 155, శిఖర్ ధావన్ (సి) సురంగ లక్మల్ (బి) దిల్‌రువన్ పెరీరా 23, చటేశ్వర్ పుజారా (సి) సదీర సమర విక్రమ (బి) లహిరు గమగె 23, విరాట్ కోహ్లి ఎల్‌బిడబ్ల్యూ (బి)లక్షన్ సందకన్ 243, అజింక్య రహానె (స్ట) నిరోశన్ డిక్‌వెల్లా (బి) లక్షన్ సందకన్ 1, రోహిత్ శర్మ (సి) నిరోశన్ డిక్‌వెల్లా (బి) లక్షన్ సందకన్ 65, రవిచంద్రన్ అశ్విన్ (సి) దిల్‌రువన్ పెరీరా (బి) లహిరు గమగె 4, వృద్ధిమాన్ సాహా నాటౌట్ 9, రవీంద్ర జడేజా నాటౌట్ 5, ఎక్స్‌ట్రాలు 8, **మొత్తం : (127.5 ఓవర్లలో 7 వికెట్లకు) 536 డిక్లేర్డ్.**

**వికెట్ల పతనం :** 1-42, 2-78, 3-361, 4-365, 5-500, 6-519, 7-523

**బౌలింగ్ :** సురంగ లక్మల్ 21.2-2-80-0, లహిరు గమగె 25.3-7-95-2, దిల్‌రువన్ పెరీరా 31.1-0-145-1, లక్షన్ సందకన్ 33.5-1-167-4, ధనంజయ డిసిల్వ 16-0-48-0.

**శ్రీలంక తొలి ఇన్నింగ్స్ :** తిలకరత్నె (సి) సాహా (బి)షమి 0, దిల్‌రువన్ పెరీరా ఎల్‌బీడబ్ల్యూ (బి) జడేజా 42, ధనంజయ డిసిల్వ ఎల్‌బీడబ్ల్యూ (బి) ఇషాంత్ 1, మాథ్యూస్ బ్యాటింగ్ 57, చండిమాల్ బ్యాటింగ్ 25, ఎక్స్‌ట్రాలు 6, **మొత్తం : ( 44.3 ఓవర్లలో 3 వికెట్లకు) 131.**

**వికెట్ల పతనం :** 1-0, 2-14, 3-75

**బౌలింగ్ :** షమి 11-3-30-1, ఇషాంత్ 10-4-44-1, జడేజా 14.3-6-24-1, రవిచంద్రన్ అశ్విన్ 9-3-28-0.

**1** అంతర్జాతీయ క్రికెట్‌లో కెప్టెన్‌గా ఆరు డబుల్ సెంచరీలు చేసిన తొలి క్రికెటర్ కోహ్లి. రెండో టెస్టులో లారా ఐదు ద్విశతకాల రికార్డును సమం చేసి, మూడో టెస్టులో సరికొత్త రికార్డు నెలకొల్పాడు.

**243** కోట్లా మైదానంలో టెస్టుల్లో అత్యధిక వ్యక్తిగత స్కోరును విరాట్ కోహ్లి అందుకున్నాడు (గత టాప్ స్కోరు 235)

**3** భారత్ తరఫున టెస్టుల్లో ఆరు డబుల్ సెంచరీలు చేసిన మూడో ఆటగాడిగా కోహ్లి రికార్డులకెక్కాడు. ఆ జాబితాలో ఉన్న సచిన్ టెండూల్కర్, వీరెంద్ర సెహ్వాగ్‌ల సరసన నిలిచాడు.

**2** టెస్టుల్లో వరుసగా రెండు డబుల్ సెంచరీలు చేసిన వినోద్ కాంబ్లీ రికార్డునూ కోహ్లి సమం చేశాడు

Printed and Published by Nandayala Narsimha Reddy On behalf Of Navatelangna Printers Private Limited, Printed At M.H Bhavan, 1st Floor, Plot No. 21/1, Azamabad Near Rtc Kalyana Mandapam, Baghlingampally, Hyderabad-500020,Telangana State, Published at Navatelangana Printers Private Limited, M.H Bhavan,1st Floor No.21/1, Azamabad, Near Rtc Kalyana Mandapam, Baghlingampally, Hyderabad-500020, Telangana State Editor : S.Veeraiah.Tel Tel/2014/59462.